# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుటకేర్పడిన

సచిత్రమాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

తృతీయ సంపుటము.

**1930—1931.**

లోధ్రముద్రణాలయము

మదరాసు.

# వ్యాసముల అకారాది సూచి


గృహలక్ష్మి
S.A.SERVICE

GRIHALAKSHMI
ESTD. 1928
LADIES' HOME MAGAZINE

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు
డాక్టరు. కే యన్. కేసరి

మహావాక్యము
యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః ।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియా ॥

PRINTED AT LODHRA PRESS
సంపుటము 3 ] మార్చి, 1930 [సంచిక ౧.
EGMORE, MADRAS

# విషయసూచిక

త్రివర్ణచిత్రములు



ఛాయాచిత్రములు




PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# ఆంధ్రులనాంధ్రులు ప్రోత్సహింపక మరెవరు—?




నూతన విద్యుచ్ఛక్తియంత్ర సహాయముచే శాస్త్రోక్త పద్ధతి శ్రేష్ఠమైన ముక్కద్దములు తయారుచేసి ప్రజామోదము పడసిన రాధాబ్రదర్సు, ఆంధ్రులే కాబట్టి ప్రోత్సహించుడు.

**రాధాబ్రదర్సు** 175 బ్రాడ్వే, మదరాసు.

**Radha Bros. Broadway, Madras.**

---

దేశసేవాదీక్ష ప్రతివారి కుండ వలయునని భరతమాత ఆతుర పడుచున్నది.




కనుకనే మదరాసు పెన్సల్ ఫాక్టరి వారు తమ శక్తివంచనలేక దేశసేవ చేయుచున్నారు.

## మదరాసు పెన్సల్ ఫాక్టరి

పోస్టుబాక్సు నెం 86, మదరాసు.

**Madras Pencil Factory, Madras.**

## గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సంII చందా. రు. 4.

విడి పత్రిక. అ. 6

మాదిరి పత్రిక కోరు వారు 6 అణాల స్టాంపులను పంపవలెను

ప్రకటన రేట్లు

| | | |
|---|---|---|
| నెలకు | ఒక పుటకు. | రు. 15 |
| నెలకు | ½ పుటకు. | రు. 10 |
| నెలకు | ¼ పుటకు. | రు. 7 |

6 నెలలకు పైగా ప్రకటించువారికి నూటికి 12½ వంతున కమీషను మినహాయింపబడును.

మేనేజరు

గృహలక్ష్మి

తపాలాపెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

## గృహలక్ష్మి

చందాదారులకు విజ్ఞప్తి

చందాదారులు మా కార్యాలయమునకు వ్రాయు జాబులయందు తమ చందా నెంబరు వ్రాయవలెను. లేనిచో ప్రత్యుత్తరము లిచ్చుటకు సాధ్యము కానేరదు. 3-వ తేది లోపల పత్రికలు చేరనివారు తమయూరి తపాలు వారికి తెలియచేయవలయును.

—మేనేజరు—

చందా నెంబరు గృహలక్ష్మి కవరు కాగితముపై విలాసమునకు ముందున్నది.

# చందాదారులకు

గృహలక్ష్మి ప్రతిమాసము మొదటి తేదీని చందాదారులకు అతిజాగ్రత్తగ పంపుచుందుము. చేరనిచో 7-వ తారీఖులోపుగనే మాకు తెలుపుచు వారి వారి తపాలాఫీసులో కూడా రిపోర్టు చేయవలెను. 7-వ తేదీ తరువాత చేరలేదని వ్రాయుచో తిరిగిసంచిక పంపజాలము.

—సంపాదకుడు

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమండ్రినుంచి యిట్లువ్రాయుచున్నారు—

"నాసోదరి బహిష్ఠియందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమునులేదు. మాస్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజిస్ట్రేటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరాకుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.—

"నేను మీకేసరికుటీరం "లోధ్రను" సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రియందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి. నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలలకొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్ల నొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండు సీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు, ఎం. ఎ. ఆనర్సు 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయం నుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

## లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాటింపవలసిన అవసరము లేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు, బెంగుళూరు ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు అవుషధములవల్ల గుణములేనందున తమ "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు ఆశ్చర్యమైన గుణము యిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ ఔషధమును నా రోగులకు వాడెదను."

శ్రీమతి కే. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర'వలన నాకు మిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గు నయమైనది."

శ్రీమతి మిసస్సు ఏ. దేవదాసు అమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిర్జాబుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు—

"మీవద్దకొన్న 'లోధ్ర' నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీలకిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

### కేరళవనితలు

శ్రీమతి ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములు ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ 'లోధ్ర'ను కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్మకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన వారము రోజులలోనే గారడివిద్యవతుగ మందు పనిచేసెను. దానిప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మాచెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసస్సుకర్తగారు, కోరోలి అమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"పది సంవత్సరములుగ పుట్టుకుట్టువ బాధపడుచుంటిని. దానిని మీలోధ్ర అత్యద్భుతముగ వారణచేసెను."

# రజోదర్శిని

తిమ్మసముద్రము
ఆర్యా. 28—5—29

"........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్ర తించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను. చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

చందమామ రావే జాబిలి రావే
కొండెక్కి రావే కోటివేలు తేవే
బండెక్కి రావే బంతిపూలు తేవే
తేరుమీద రావే తేనెతెట్టె తేవే
పరుగెత్తి రావే పాలువెన్న తేవే
పల్లకిలో రావే పనసపండు తేవే
అన్నీని తేవే అబ్బాయికియ్యవే
నట్టింట బెట్టువే నా మాట వినవే.

# గృహలక్ష్మి.



## స్వవిషయము

The thought of Past years in me doth breed
Perpetual benediction.

—*Wordsworth.*

పరమేశ్వరుని కృపాకటాక్షమునను, ఆంధ్రమహాజనుల ఆదరణాతిశయమునను గృహలక్ష్మికి రెండు సంవత్సరములు నిండినవి. మూడవ వత్సరము ప్రారంభమైనది. తన అనిమిత్తహాసమునకు అవ్యక్తమధురభాషణములు తోడుచేసియు, ఎత్తుకొనుమనుటకుసూచనగ కైదోయిఅల్లార్చుదానికి కాళ్లకుఎదురువచ్చుటలు జతకల్పియు మూడేండ్లబిడ్డ తన మాతాపితల మానసాబ్జమును వికసింప జేయునట్లే మూడవయేడు జొఱబడిన గృహలక్ష్మిపత్రికాపుత్రికయు సనాతనసంప్రదాయనిర్వహణము ప్రోత్సహించుటకు సాందృష్టికములగు నేటిసమస్యల సమాలోచనము తోడుచేసియు, తనకు తులసీదళములగు విదుషీరత్నములవ్యాసములకు వశ్యవాక్కులును స్త్రీవిద్యాభిమానులునునగు పండితుల రచనములు అనుప్రాసములుగ నొనర్చియు మహాంధ్రమండలికి మానసాబ్జవికసనాపాదియై వెలయునట్లు సర్వమును కదలజేయ కాలమూర్తికి నమస్కారము చేయుచున్నాము.

వత్సరారంభమున అంతవఱకు చేసిన దానినొకమాఱు సింహావలోకనముగావించుకొనుటయు, ముందుచేయవలసినదానినిగూర్చి ఆలోచించుకొనుటయు సహజము. ఆంధ్రస్త్రీల సమగ్రాభివృద్ధికి చేతనైనదోహదము చేయుటకే మే మీపత్రిక ప్రారంభించితిమి. ఈ ఆశయమును మే మీ రెండువత్సరములుగ ఎంతవఱకు నిర్వహింప గలిగితిమో నిర్ణయింపవలసినవారు గృహలక్ష్మిపాఠకులు. భారతదేశమున హుటాహుటినడలతో పోవుచున్న స్త్రీయుద్యమమునకు ఆంధ్రస్త్రీలు శక్తివంచనలేక సర్వవిధముల సాయపడుచున్నారను

టకు గృహలక్ష్మి దర్పణమైయున్నదని మాత్రము మేము చెప్పగలము. ఇంతవఱకు ప్రచురించుచున్న గృహవైద్యము, గానము, కథలు-కబుర్లు, లోకవార్తలు, వనితాలోకము, పుష్పచయము మొదలగు శీర్షికలకుతోడు ఇప్పుడు క్రొత్తగ రంగసీను, సౌందర్యపోషణ, డైరి, బాలవిజ్ఞానశాఖ అను నాలుగుశీర్షికల జేర్చితిమి. 'రంగసీను' అను శీర్షికక్రింద నాటకలోకమున సినీమాలోకమున నడచు స్త్రీలకుసంబంధించిన విషయములనేర్చి కూర్చుచుందుము. 'సౌందర్యపోషణ'అను శీర్షికక్రింద స్త్రీలు తమ సహజసౌందర్యమును చెడకుండ కాపాడుకొనుటకును దానికి క్రొత్తఅందము కూర్చుటకును వలయు జ్ఞానము నొసగు విషయములను వివరించుచుందుము. 'డైరి' అను శీర్షికక్రింద దినదినము జరుగు వృత్తాంతములలో స్త్రీలకుసంబంధించినవి చేర్చుచుందుము. మా పాఠకులీ నూతన శీర్షికల సంభావింతురని ఎంచుచున్నాము. 'బాలవిజ్ఞానశాఖ'అను శీర్షికక్రింద ప్రత్యేకము బాలబాలికలకు పనికివచ్చు సంగతులను సమకూర్చుచుందుము. తమ యాజమాన్యమున నిర్వహింపబడుచున్న పాఠశాలలలో 'గృహలక్ష్మి'పత్రికను ప్రవేశపెట్టి మాకు సర్వవిధముల తోడుపడుచున్న ఆంధ్రదేశమందలి స్థానికసంస్థలనిర్వాహకు లీమాప్రారంభమును అభిమానింతురని భావించుచున్నాము.

గృహలక్ష్మి పత్రికయొక్క ఆవశ్యకతను, అది ఆంధ్రస్త్రీల అభివృద్ధికై చేయుచున్న కృషిని ప్రస్తావించి ప్రశంసించుచు లేఖలువ్రాసి ఉత్సాహదీప్తిని; విరివిగ చందాదారులను సమకూర్చి ఆర్థికపుష్టిని; మనోహరములగు వ్యాసములనువ్రాసి సారస్వతపుష్టిని కల్గించి మాయుద్యమమునకు ఇంతవఱకు చేదోడు వాదోడు అయిన ఉదారులగు ఆంధ్రసోదరసోదరీమణుల నీ సమయమున కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచు ఇక ముందుగూడ 'గృహలక్ష్మి'ని వారు తమ ఆదరణాభిమానములకు తావలముగునట్లుచేసి పత్రికనింకను సర్వాంగసుందరముగ వెలువరించుటకు వీలుకలిగింతురుగాకయని వినీతభావముతో వేడుకొనుచున్నాము.

పెద్దలఆశీర్వాదమున గృహలక్ష్మి ప్రారంభించిన గడియ మంచిదియైనది. తెలుగు పత్రికలకు సాధారణముగ సంభవించు బాలారిష్టములేవియు గృహలక్ష్మిని తాకలేదు. అది నానాటికి విస్తరించి 'ఇంతింతై వటుడింతయై మఱియుదానింతై' అను వాక్యమునకు తార్కాణమై నవనవోన్మేషమగు దివ్యకళతో తేజరిల్లునట్లు ఈశ్వరశక్తి అనుగ్రహించినది. ఈ అనుగ్రహవిశేషమున గలిగిన ఆనందము మా హృదయమునందు పారవశ్యముపొంతబోవని కార్యశ్రద్ధను పూరించునట్లును, చిరసంకల్పితములయ్యు కారణాంతరములచే కార్యరూపమునకు రాక తక్కిన మాతలపులు పచేళిమములగునట్లు చేయగను అమోఘవాక్కులగు పెద్దలాశీర్వదింతురుగాక!

So many worlds, So much to do
So little done, Such things to be.

—*Tennyson.*

# అబలలయెడ అన్యాయములు

శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు

ఏజాతి పురుషులను సేవించుటలో తన్ను తాను బలిదాన మొనర్చుకొనుచున్నదో, ఏజాతి వారిసుఖదుఃఖముల కొరకు తన సర్వస్వ మర్పింప సంసిద్ధయగుచున్నదో అట్టి స్త్రీజాతిని వారు కేవలము ఆటవస్తువువలె యెంచుటయేగాక వారిని యిష్టమువచ్చినట్టి కష్టపరంపరలకులోను గావింపుచున్నారు. ఈస్త్రీజాతికూడ భగవంతుని సృష్టియె యను మాట వారు మరచుచున్నారు గాబోలు! వారి శరీరముగూడ రక్తమాంసములతో నిర్మింపబడినదనియు, వారికిని హృదయము, ఆత్మ, మంచిచెడ్డల నాలోచించుకొనుశక్తి, సుఖదుఃఖములననుభవించు ఓర్పుకలదనుభావమే వారికి బొడకట్టదు కాబోలు! ఏజాతి తమ్ము హృదయపూర్వకముగ ప్రేమించి, తానుదారుణయాతనల ననుభవించుచు తమకు సుఖము చేకూర్ప ప్రయత్న మొనర్చుచున్నదో అట్టి జాతికి అన్యాయము లొనర్చుట న్యాయముకాదను సంగతిని వారు మరచిరి. అనేకవిషయములలో పురుషుడు స్త్రీని విసర్జించుట మనము నిత్యమును చూచుచునేయున్నాము. పురుషుడు స్త్రీవలన అనేకములగు పనులగావించుకొనుచున్నాడు. దాసీవృత్తికి పాల్పడచేయుచున్నాడు. ఇంతయేల? నీచాతినీచమగుపనులకుగూడ ప్రేరేపించుచున్నాడు. ఎన్నడైనను స్త్రీ పురుషుని భావములకు విరుద్ధముగ మాటలాడెనన్న ఆమెకు ప్రాయశ్చిత్తము యింటినుండి వెడలగొట్టుటయే. దీనికి కారణము పురుషుడు యింటియజమానిఅగుటయే. దోషమెవరిదైనను భర్తయిష్టమగునంతవరకే భార్యకింటనిలువనీడ కొంచె మనిష్టతకలైనన్న భార్య యింట నిలువజాలదు. ఈవిషయములో ఎవరికిని యేమి చెప్పుటకును అధికార ముండబోదు. పురుషుడు ప్రభువు, దేవత, రక్షకుడు, తన ఇచ్ఛవచ్చినమచ్చున చేయగల సమర్థుడు. అగ్నిని సాక్షిగ నొనర్చుకొని, పవిత్రమగు వైదికమంత్రపఠన మొనర్చి స్త్రీని సహధర్మిణిగ నొనర్చుకొంట కేవలము నాటకాభినయమాత్రమునకేనా? లేక, వివాహము లీలామాత్రమగు బొమ్మలపెండ్లియా? భార్యాపరిత్యాగమనగా కేవలజీర్ణవస్త్రపరిత్యాగమా? స్త్రీజాతి పరాధీనమైయుండుటయేగదా వీనికంతకును కారణము. స్త్రీ అస్వతంత్ర, అబల. పురుషుడే స్వతంత్రుడు, బలవంతుడు.

పురుషుని అత్యాచారములు, అన్యాయములేకాదు తుదకు చెప్పుదెబ్బలుకూడ స్త్రీ నవ్వుముఖమున ననుభవింప వలసివచ్చుచున్నది. ముఖమున లేశమాత్రము విచారముగాని, దుఃఖముగాని కాన్పించుట కధికారముగూడ ఆమెకులేదు. భర్త దైవమనుటయే ఇందుకు కారణము. క్రూరుడు దుర్మార్గుడునగు భర్తచే పలుబాధలపడుచున్న ఒకసోదరి యొకానొకపుడు యిట్లనిజెప్పెను. "సోదరీ! నాకొరకు నాకెట్టిచింతయు లేదు. కాని పిల్లలముఖము చూచిన తరుగనిచింత నామనమున తలుగుచున్నది. ఇట్టి యింట అన్నపానీయముల విసర్జించి వీధి వీధుల బిచ్చమెత్తి పొట్టపోసికొంటయే మేలనుపించుచున్నది." ఎన్నికష్టముల ననుభవించి యుండుటచేతనోగదా ఆమెహృదయమునుండి యిట్టిదీనభాషణములు వెడలినవి?

పురుషుడు అరువది సంవత్సరములు అతిక్రమించినవాడైనను సరే, భార్య చనిపోయిన వెంటనే ఆశవమింటనుండి కదలీకదలకమునుపే వివాహమునకు సంసిద్ధుడగుచున్నాడు. ద్వితీయకళత్రస్వీకార మొనర్చుకొంట పురుషునకు ఉచితమనికూడ పురాణములు ఘోషించుచున్నవి; కాని స్త్రీయన్ననో తనకు పది సంవత్సరముల బాల్యప్రాయమప్పుడు వైధవ్యదుఃఖము కల్గినను పునర్వివాహ మొనర్చుకొనుటకు వీలులేదు. పురుషుడు పురుషుడగుటయు స్త్రీ స్త్రీ యగుటయు ఇట్టి అన్యాయమునకు కారణము.

ఇంత నిరసనభావము కనిపించుచున్నను, యింత అవమానము జరుగుచున్నను యిట్టి దుర్నీతులు నడచుచున్నను స్త్రీజాతి యింకను మౌనమవలంబించి యున్నదేల? హిందూ స్త్రీలు అశిక్షితలౌటయేకాదు దీనికి ముఖ్యకారణము. శిక్షితలగు బాలికలు నేటికాలమున వివాహమునకేల అనిష్టలగుచున్నారు? కఠినమగు బాధలచే కృశించి, తుదకు బలవంతముగ ప్రాణత్యాగముజేసి తమహృదయజ్వాలను శాంతమొనర్చుకొనుచున్నారే? ఇట్టి కఠోరకర్మ పురుషుని అత్యాచారము వల్లనేగదా? పురుషు డిట్టిపనికి జబాబుదారీ గాడా ?

భారతస్త్రీజాతి మేలుకొన్నగాని భారతదేశోద్ధరణ కాజాలదని అనేకులు సభలలో బల్లలగ్రుద్ది గంభీరోపన్యాసముల నిచ్చుచున్నారు. భారతస్త్రీజనాభివృద్ధికి భర్త, సోదరుడు అడ్డుపడుచుండ ఆమె మేల్కొనుట ఎట్లు? స్త్రీలెన్నడైన గుమ్మముదాటి ఈవలికి వచ్చిరన్న పురుషులు వారిని ఆశ్చర్యముగ చూచెదరు. వింతజీవులవలె వారికి తోచును గాబోలు! ఉదారపురుషులు కొందఱు స్త్రీ లివతలకు వచ్చుట కడ్డగింపరు; కాని వారి వెంట దాదులనైనను, సేవకులనైనను పంపెదరు. స్త్రీలను తమవెంటగొనివెళ్లుట వారి ధర్మశాస్త్రములలో నిషేధము. వారిశాస్త్రములు రెండుధర్మములను బోధించుచున్నవి. స్త్రీలను నమ్మకుమనుట మొదటిది; వారిని శక్తిహీనలని తలచుమనుట రెండవది.

కొందరు పురుషులు తమ భార్యలను వెంటదీసికొని యేబీచ్ ఒడ్డునకో షైక్ వెడలుట కూడ నేటికాలములో మనము చూచుచున్నాము. సిగరెట్ను కూడ భార్య

నోటిలో పెట్టెదరు. వేషములందన్నిట పాశ్చాత్యదేశజుల అనుసరణమే; కాని యొక పాశ్చాత్యయువతి తమ స్త్రీలను సందర్శించినచో విద్యాగంధము లేని వీరు ఏమి చేయ గలరో మాత్రము వారూహింపరు. పాశ్చాత్యులవలె ఉల్లాసముగ నుండవలయునను కోర్కెయే కాని వారివలె స్త్రీజనాభ్యుదయము కావింతమనుచింత ఈషణ్మాత్రమైనను మనవారికి లేదు. అనేకులగు పురుషులు స్త్రీ శిక్షావిషయమునందు కొల్లలుగ వ్యాసముల వ్రాసెదరు. ఉపన్యాసముల గావించెదరు. కాని అందు సారమేమియునుండదు. వారు చెప్పున దొకటి చేయున దొకటి. వారి వారి వాక్కులకును, ఆచరణమునకును భూమ్యా కాశములకుందు అంతరమువంటి అంతరముకలదు. అనేకములగు వ్యాయామములు ఫుట్ బాల్, టెన్నీస్, మొదలగు ఆరోగ్యము నభివృద్ధిపరచు ఆటలనాడుచున్నను బాలుర ఆరోగ్యము బాగుగనుండుటలేదు. కారణమేమి? స్త్రీల ఆరోగ్యము బాగుండదు. వారివారి ఆరోగ్యమును పెంపొందించు కొనుటకు మార్గములులేవు. తల్లు లనారోగ్య వతులుగనున్నపుడు వారి సంతానము మాత్ర మెట్లు బలవంతులయ్యెదరు? భూమి యెట్లుం డునో దానిసారము అట్లేయుండును. ఇందుదోషమెవరిది? ఎన్నడును గుమ్మముకదలి ఈవలకురాకుండ స్త్రీలను యింటియందే నిర్బంధించియుంచు పురుషులది కాదా?

# కరుణజూడుము మమ్ముల కంసవైరి!

శ్రీమతి యనమండ్ర భీమాయమ్మగారు

మురళిచేతను ధరియించి ముదముగొలుపు
గాన మొనరింప గోవుల గాచుకొనుచు
చిన్నదౌ పొన్నపైనున్న వెన్నదొంగ
కరుణజూడుము మమ్ములకంసవైరి!
గాలిసోకిన మాత్రాన గాసిజెంద
భయములేకను తటమున బాల్యమందు
ఫణిని మర్దించి విడిచితి భళిర కృష్ణ!
కరుణజూడుము మమ్ముల కంసవైరి!
చెలిమికాడైన నీదుకుచేలునొద్ద
పృథుకతండులముల ప్రథితమైన
భక్తిచేకొని కాచిన భవ్యకృష్ణ!
కరుణజూడుము మమ్ముల కంసవైరి!
పంతమొనరించి బలిమిని పట్టితెచ్చి
సభలో దుష్టుడు భంగంబుసలుపు నెడల
కృష్ణ! యనివేడ గావవే కృష్ణనీవు
కరుణజూడుము మమ్ముల కంసవైరి!
రెండుచక్రంబులును బొజ్జమెండుగాగ
భాసురాకారుడౌ శకటాసురుండు
వచ్చినను వానిజంపవే? పద్మనాభ!
కరుణజూడుము మమ్ముల కంసవైరి.




## శ్రీమతి సుభద్రమ్మ

కొత్తపల్లి లక్ష్మయ్యగారు

శ్రీమతి సుభద్రమ్మగారు ఆంధ్రనాటకకళోద్ధారకుడగు శ్రీవనారస గోవిందరావు గారి పంచమపుత్రిక. ఈమె బెజవాడ నగరమున 27-8-1911 తేదీని జనించెను. ఈమె కంటె పెద్దలగు తమ నలుగురిపుత్రికలకువలెనే ఐదుఏండ్లు నిండుట తోడనే గోవిందరావు




రామ పాత్ర

(సంపూర్ణ రామాయణ నాటకము)






సత్యవంతు నివేషము.

(సావిత్రి నాటకము)

గారు ఈమెకును అక్షరాభ్యాసము గావించి భీమవరములో రాయప్రోలు సోమనాథశాస్త్రి గారివద్ద రెండుసంవత్సరములు విద్యచెప్పించెను. ఆసంవత్సరములలో ఈమె అమరము, ఆంధ్రనామసంగ్రహము మొదలగునవి బాగుగనేర్చి మంచి అర్థజ్ఞానమును సంపాదించెను.


మన్మధుని పాత్ర
(కుమారవిజయ నాటకము)

కారణాంతరములచే శ్రీమతి సుభద్రమ్మగారు అప్పటికి ఆచదువు మానివేయవలసివచ్చెను. అనంతర మామె శ్రీమాన్ కోమాండూరి వీరరాఘవాచార్యుల వారియొద్ద సంగీతవిద్య నభ్యసింపసాగెను. ఈమె 1918 లో అనగా తనకు ఏడేండ్లప్రాయమున ప్రహ్లాదుడు, కృష్ణుడు, కుశుడు, లవుడు మున్నగు వేషములు వేయుటకుప్రారంభించి అచిరకాలముననే రంగాభినయమున స్తుతింపదగిన అభినివేశము సంపాదించెను. నాటకకళాభిజ్ఞులచే మంచి మన్ననల నొందెను. ఈమెకు పదునైదేండ్లు నిండిన వెనుక అనగా 1926 లో (మార్చినెల) శ్రీ ఆర్. వెంకోజీరావుగారికిచ్చి గోవిందరావుగారు తమ స్వగ్రామమగు పొలసానిపల్లెలో పెండ్లిగావించిరి. వివాహమై సంసారము చేయుచున్నను ఈ విదుషి తన అభిమానవిద్యయగు పాత్రాభినయమున వ్యాసంగము మానలేదు. సత్యవంతుడు విష్ణువు, నారదుడు, కృష్ణుడు, మన్మధుడు మొదలగు పురుషపాత్రములను ధరించి, అభినయించి ఈమె పేరుప్రతిష్ఠల నార్జించినది. ఈమెకు స్త్రీవేషములు వేయుటకంటె పురుషవేషములను ధరించి అభినయించుటయందు అభిలాషోన్నతిగలదు. శ్రీమతి సుభద్రమ్మగారు నాలుగు వివిధనాటకములయందు అభినయించిన పురుషపాత్రలచిత్రములు ఇచ్చో ప్రచురించి యున్నాము. ఈమె కంఠము మిగుల శ్రావ్యమైనది. పాత్రధారణము, అభినయము ప్రశస్తముగ నొప్పును. ఈమెకు 1927 లో నొక పుత్రుడును, 1929 లో మఱియొకపుత్రుడును కలిగిరి. ఈమె గృహకార్యనిర్వహణమున ఇసుమంతయైన అశ్రద్ధచూపక అందు పూర్ణతృప్తినందుచుండుటకు తోడు తండ్రిగారిచే నిర్వహింపబడుచున్న సురభినాట్యమండలికి తననాట్యకళాకౌశల్యముచే ఎనలేనికీర్తిని సంపాదించుచున్నది.


విష్ణుపాత్ర
(దశావతారనాటకము)

# చిత్ర ప్రశ్న

శ్రీమతి పాణకా రమణమ్మగారు



పాణకా రమణమ్మగారు

౧

1. హిందూదేశములోని ప్రసిద్ధమైన ఒకనది.
2. కృష్ణునికి ప్రియమైన నాదమునిచ్చు వస్తువు.
3. చంద్రకాంతిని సహింపని పుష్పరాజము.

వీనికి ఒక్కొక్కదానికి మూడేసి అక్షరములుగల నామము ఒకదానిక్రింద మఱియొకటి వ్రాసినచో అడ్డముగా చదివినను, క్రిందికి చదివినను సమానపదములుగ నుండవలయును. అవియేవి ?

☞ ఇట్టివానియందు రుచిగల 'గృహలక్ష్మి' పాఠకురాండ్రు ఈప్రశ్నకు జబాబు ఆలోచించి మాకు లేఖాముఖమున మార్చి 10-వ తేదీలోపున తెలుపుదురు గాక !

# శ్రీమతి వి. సరస్వతిగారికి

శ్రీమతి ఇల్లిందల సరస్వతిసీతారామ్ గారు

అమ్మా! మీరు వ్రాసిన "సుశీల-పాతివ్రతము" అనువ్యాసము చూచితిని. శ్రీస్వామిరామతీర్థగారు వ్రాసిన వ్యాసమును ముద్దా విశ్వనాథముగారు అనువాదించిరేగాని, ఆవ్యాసమునకు వారు కర్తలుకారు. ఈవిషయమును ఉచితజ్ఞులగు గృహలక్ష్మిసంపాదకులు మీజ్ఞప్తికి కెలయించియే యున్నారు. ముద్దా విశ్వనాథముగారిని వ్యక్తిపరముగా మీరు విమర్శించుట సమంజసముగా లేదు. రాజునకు ప్రజలయెడల వాత్సల్యమధికము. వారిని ఏవిధముననయినను సంతోషపరుచుటయే అతని యాశయము. అదియే తనకర్తవ్యమని రాజు తలచెను. అట్లుచేయుట దుష్కార్యమని రాజు అనుకొనలేదు. ఇక సుశీలయన్ననో సుఖదుఃఖములను, స్వీయపరకీయములను సమముగా జూడగల స్త్రీరత్నము.

శ్లో. సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ................

శ్లో. దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే.

మానవుని అత్యుత్తమమైన ఆదర్శము ఇదియేనని శ్రీభగవద్గీత ఘంటాపథముగా జాటుచున్నది. శ్రీస్వామిరామతీర్థగారు ఈఆదర్శమునే తమవ్యాసమునందు ప్రతిష్ఠింపదలచిరి. ఇతరవిషయముల నిందు చర్చించుట వారియుద్దేశముకాదు. ఇట్లు వ్రాసినందులకు నన్ను క్షమించి మీయభిప్రాయము తెలిపెదరుగాక !

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! ఏమిపెండ్లిండ్లు! ఏమి ఊరేగింపులు! ఏమి కోలాహలము! అన్నివస్తువులకు ధరలు లేచిపోయినవి. గుడ్డల దుకాణములలో సరుకు ఖాళీఅయినది. మార్కెటులో కూరలు శూన్యము. మాసినగుడ్డలతో మాగిపోతున్నామని మొత్తుకొనుచున్నా చాకలివాండ్రు లగ్నసరి అని గుడ్డలుతుకుట మానుకొని పల్లకీమోతలతో పరువు లెత్తుచున్నారు. ఇక భజంత్రీల గడబిడ సరేసరి. చంకనుండెడి పొడులు వంకెనువేసి తాళములతో మునిగితేలుచున్నారు. వంటలవారి, పురోహితబ్రాహ్మణులవారి ఆర్జన, అడావిడి చెప్పనక్కరలేదు. కానిమ్ము ఎన్నాళ్లీరొద. దీనితర్వాత వీరందఱికి సుఖసుప్తియే గదా! మేళతాళము లింకా కొంతకాలము జీవించియున్నను పల్లకీలకు మాత్రము పూర్తిగా సెలవే. ఇక పెండ్లిండ్లకు వెళ్లివచ్చెడి పేరంటాండ్రకు బొత్తిగా తీరుబడిలేదు. ఇల్లుమఱచిపోయినారంటే సందేహములేదు పెండ్లి, జోడుపెండ్లిండ్లు, పెండ్లిపై పెండ్లి, పెండ్లిలో పెండ్లి. కార్తికమార్గశిరమాసములలో రైలువారికి రాబడి ముక్కాలుమువ్వీసము ఈ పెండ్లివారి నుండియే మదరాసుదక్షిణమహారట్టా రైల్వే కంపెనీవారు క్రిస్టమసుదినములలో కన్నయీ లగ్నసరిలో ఈపెండ్లిప్రయాణికులకు తక్కువచార్జీలు యేర్పాటుచేసిన ప్రజలకు చాల ఉపకారముచేసిరని కీర్తింపబడెడి వారే; కాని వారాపుణ్యమునకు పాలుపడ లేదు.

అయితే యీ పెండ్లిండ్ల ప్రళయములో నాకు తగిలిన పేరంట మొకపెండ్లిదే కాని యీ పెండ్లిండ్లసందడివలన నేను పొందినంత శ్రమ, నిద్రనష్టము మఱియొకరు పొందియుండరు. ఏమందురా? గొప్పరాజవీధిలో మాయిల్లు. మఱియు రాజబాటనానుకొనియే మాయింటి గోడ. చలికి వెఱచి, చూచుటకు విసిగి ఇంటిలో దట్టమైన దుప్పటి ముసుగుబెట్టుకొని పడుకొనినను ఆ మొడతెగని యూరేగింపుల మంగళతూర్యరవములు చెవులలో దూరకుండ నేమి చేయగలను? కాన పెండ్లిండ్లు విరివిగా జరిగిన మార్గశీర్షమాసమంతయు సుఖదమైన సుప్తి నెఱుగను. క్రిందటి వారములో ఒకనాటిరాత్రి ఓపికపట్టుకొని వచ్చిన యూరేగింపు నెల్ల చూడవలెనని సంకల్పించుకొంటిని. నా పంతము చెల్లలేదు. అఱగంటలో అయిదు వూరేగింపులు వచ్చెను. ఒక ఊరేగింపుచూచి లోనికి

వచ్చి మంచముపై మేనువాల్చితినో లేదో మరల నింకొక పెండ్లివారి యూరేగింపులోని పెద్దబూరగల బూరటింపు చెవులు చిల్లులు వడజేసెడిది. మరల దానిని చూచివచ్చునప్పటి కింకొకదాని బం,భం, బూ, బూ, అను ధ్వనులు వినవచ్చెడివి. ఎంతచూడగల వేడుకలైనను ఒకటి రెండయిన ముచ్చటగాని రే యెల్ల నదియే రౌద్రమైన విసుగే కాకుండ అసహ్యముగూడ గలుగుట ఆశ్చర్యమా! ఇఁక చూడజాలనని పంతము విడిచి పడుకొంటిని. కాని విరామ మెఱుగని మేళతాళములవలన నిద్రకుమాత్ర మవకాశము లేకపోయినది. ఆబక్కనాడేగాదు. మార్గశీర్ష మంతయు నిట్టి జాగారముల తోడనే గడచినది. అమావాస్య వచ్చినది. "నేడమావాస్య. రాబోవునది శూన్యమాసము. ఇక మేళతాళముల గొడవ యుండదు; ఈ నాడైన సుఖముగా నిద్రింత"మని పడుకొంటిని; కాని ఆ రాత్రి కూడా నాగాలేదు. ఒక వూరేగింపురానే వచ్చినది. ఆ పిల్ల మూడేండ్లు నిండియునిండని పసికూన. కట్టుకొనిన క్రొత్తపరికిణి యెత్తియెత్తి దులుపుకొనుచు, తొడుగుకొనిన పట్టుచొక్కాను పట్టిపట్టి చూచుకొనుచు బొమ్మల పెండ్లిండ్లలోని బొమ్మవలె కూర్చున్నది. పెండ్లికొడుకో పదేండ్లవాడు. నిద్రచే తూగుచున్నాడు. మతిమాలిన తలిదండ్రులు తమపై వైచిన సంసారభారము నా బాలదంపతులెఱుగరుగా? బహుశః యీ వైవాహికోత్సవము గూడ వారికి జ్ఞాపకముండదు. కాని యీ తంతువలన కలుగబోయెడి కష్టనష్టములకు మాత్రము వారు బాధ్యులు. అకటా! ఎట్టి ఘోరతరాన్యాయము. తలచిన మనస్సు క్షోభజెందుచున్నది. దానితరువాత మఱినాలుగుదినముల కొకయూరేగింపు వచ్చుచున్నది. ఆ వధూవరులిరువ్రురు సరిగా యెనిమిదేండ్లవారు. పిల్లవాడు నల్లమొఖమల్‌లాగు కోటు వేసికొని యున్నాడు. పిల్లకొక పెద్దచీర చుట్టబెట్టి పొదలకమ్మవలె కూర్చుండ బెట్టినారు. ఆ బాలిక యీ చీరలోబడి చిక్కములో పిట్టవలె కొట్టుకొనుచున్నది. రానున్న శాసనమువలని భయముచే సనాతనధర్మపరులలో కొంతసంస్కారము కలిగినది. ఏమన తిథిదోషములు, వారపు పట్టింపులు, శూన్యము, మౌఢ్యమాదిగాగల నిషేధములు యీయేటి పెండ్లిండ్లలో కానరావు. ఆపద్ధర్మముగా యీసంస్కారమునకు శాస్త్రి యొప్పినదట. పాపము మన శాస్త్రములు చాలమంచివి. ఎవరి కేమీలుగావలెననినను దానికనుగుణ్యమగు నుదాహరణశ్లోకమును జూపి పూర్వాచారపరాయణుల రక్షించును. ఆ కల్పవృక్షము ప్రాపున వారుచేయుని సాహసములేదు. పసిబాలలకు పరిణయములు చేసిరి. కసుగందులను గూర్చుండబెట్టి గర్భాదానమంత్రములను వల్లెవేయించిరి. పానుపు వేయించిరి. మిథునవిడియము లిప్పించిరి. బొమ్మ నప్పగింపజేసిరి. ఇట్టివివాహము లొకటియా? రెండా? మాసములలో నుత్తమమైన యీ శుక్లసంవత్సరమార్గశిరమాస

మంతయు నిట్టి శిశువివాహములతో కళంకితమై పోయినది. మన మంగళాద్రి నృసింహుడేమి; తిరుపతి వేంకటేశ్వరుడేమి; సింహాద్రియప్పన్నయేమి యీమాసములో తమ సన్నిధానమున నెన్ని శిశుకల్యాణములు జరిపించిరో లెక్కలేదు. రాళ్లు దేవుళ్లయిన రాసులు మ్రింగవా యని వేమనయోగీంద్రుడు సందేహించినట్టుగనే యీ శిశువివాహములలో దేవుళ్లు రాళ్లయినారు. లేకున్న ఆయాస్వామివారల సన్నిధానమున తల్లిదండ్రు లిట్టి యక్రమ వివాహములు జరుప గలిగియుందురా ?

కల్పలతా! నాకీపెండ్లిండ్ల గడబిడచూచిన మనవారిమౌఢ్యమునకు మహా శ్చర్యమగుచున్నది. చేజిక్కి పసిబిడ్డలకు వివాహములు చేసినంత మాత్రమున శారదాచట్టమునుండి వీరెట్లురక్షింపబడిరి? ఇక సృష్టి ఆగిపోవునా? ఆడుపిల్లలు పుట్టరా? పెండ్లిండ్లుకావా? అయ్యో? ఎంత చేదస్తులు. 'మనమీపిల్లలకు వివాహము చేసినమాత్ర మున నేమైనది? ఎట్లుకావలసినదట్లగు' నని వీరేల స్థిమితహృదయులు కారాదు? పాపము! తమ తమ ఆతురతకొఱకు పసిబిడ్డలగొంతులు కోయుచున్నారుగదా! కల్పలతా! ఏస్త్రీల యభ్యుదయముకొఱకై యీ శారదాచట్టము సృష్టింపబడినదో ఆస్త్రీల నీరెండుమూడుమాసములలో జరిగిన యక్రమపువివాహముల క్లేశ మర్ధశతాబ్దము పీడించును. ఇప్పు డవిమర్శకముగా పెండ్లి చేయబడిన యీ బాలదంపతులు పెద్దవారైన వెనుక అప్పుడు జరుగుచున్న ప్రౌఢవివాహముల గని కుతూహలమత్తులై తమ దాంప త్యములను చిందఱవందఱ చేసికొనినచో నప్పు డీవరమశ్రోత్రియులగు తలిదండ్రులేమి చేయుదురో? నేడు నవనాగరికులు నై తము 'కూడునా, కూడదా' యని శంకింపుచున్న 'డైవోర్సుచట్టము'ను ఆనా డీశ్రోత్రియసంఘమువారే ఆడుబిడ్డల ఘోషచూడలేక ఆహ్వానింపవలసి వచ్చునేమో గదా? దేశకాలపాత్రములను గుర్తింపక తొందర పడుట యెందును లాభకారిగాదు. నేడు శిశువివాహములకు సహాయభూతులై శారదా చట్టమునకు వ్యతిరేకప్రచారముగావించుచున్న శ్రోత్రియులమన్యు లీవిషయమును గమ నింపకుండుట విచారకరమే గాదు ముందున కపాయకరముగూడ నగును సుమా.

కాని విశ్వరక్షకుడైన పరమేశ్వరుని ఈశిశువధూవరులకెట్టి బాలారిష్టములు కలుగ కుండ రక్షింపుమని ప్రార్థించుటకంటె మనమిక నిప్పుడేమిచేయగలము ?

కల్పలతా ! నేను జనవరిమాసమున వ్రాసిన లేఖలో నుదాహరించిన గీతా శ్లోకము తారుమారుగా నున్నది. అది యిట్లుండవలెను.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే."

భావపురి }
౫-౨-౩౦ }

మిత్రురాలు
శా ర ద.

# సాశ్రుస్మృతి

శ్రీమతి వెలువోలు వసంతాదేవిగారు

అలముకొనెన్ దిశావలయమందుఁ దమోభయకాళరాత్రి, చం
చలలఘుతారహారములు సైతము క్షీణములై నశించె; వి
చ్చలవిడిగాఁ బ్రవాతములు చండవిహారము సల్పుచుండె; నా
కలవియె మార్గముంగనఁగ? హా! పిత! నన్నిటు లొంటిడించితే.

ప్రతిసాయంసమయంబునన్ గృహబహిర్భాగమ్మునందున్ లతా
తతిక్రిందన్ నిలుచుండి హాసవిలసత్ వాత్సల్యనిష్యందమౌ
ప్రతివాక్యంబున "నీవివాహ మొనరింపంగా విచారమ్ము; త
ల్లి! తదన్యమ్మిఁక నేమి" యందువది చెల్లింపంగరావేలకో?

కానకకన్నకూతురవు కల్గినబిడ్డలయందు శేషవై
'నేనిఁక నెట్లు నీహృదయనిర్మలవాంఛలు తీర్తు' నంచుఁ గే
లూఁచుచు బుజ్జగించెదవహో! పిత! నీవిపుడేల కోపివై
నీనగుమోముచూపవవనిన్ ననువంటి హతాశకల్గునే?

సుకమో దుఃఖమొ తీరిపోయినది యీశూన్యావనిన్ నాకు; నే
మిఁక విద్యాపతనోత్సుకత్వము, వివాహేచ్ఛాప్రసంగంబు ల
వ్విఁక నెట్లో చను లాంఛనంబులయి యంతే! ఏల! యీదేహమే
యిఁకభారంబయిపోయె భూమికిని; దండ్రీ! నీవు లేకున్కి-చేన్.

సంతతావ్యాజవాత్సల్యసాంద్రసీమ,
ఘనఘనాఘనశ్యామలాఖండకాంతి,
నీదువదనమ్ము హాసవినిర్మలంబు
మఱతునే? తండ్రి! జన్మజన్మములకేని.

# కమల పెండ్లి

జమ్మి శేషగిరిరావు గారు బి. ఎ, యల్. టి.

## ౧

"అమ్మా! బావ వచ్చేడు!" అంటూ రామారావు వీధులోంచి పరుగెత్తుకు లోపలికి వచ్చేడు. అప్పుడే బావిదగ్గిర బట్టలుతుకుకొని దొడ్డివసారాగోడకు మడిబట్ట లారగడుతూ వున్న సోమిదేవమ్మ గబగబ వీధిచావిడిలోకివచ్చి, యెదురుగా కనబడే తన వకవేలువిడిచిన మేనల్లుడిని చూసి "ఎప్పుడూ రావడం? ఎక్కడనుంచీ?" అంటూ పృచ్ఛచేసింది. ఇంతట్లోకే పశువులపాక దొడ్డిలో గొబ్బెళ్లు పెట్టి పూజచేసుకుంటూ వున్న కమలదగ్గర కెళ్లి — రామారావు కొంటెపిల్లాడు కనక — ఆమెతో "కమలా! బావవచ్చేడు" అని రవంతముక్కా వూదేశాడు. అప్పటికి కమల — ఎనిమిదేళ్ల బాలిక — ఏమిచేస్తూందంటే గొబ్బిళ్ల మీద పసుపూ కుంకుమా పువ్వులూ పెట్టి

సుబ్బిగొబ్బెమ్మా! సుబ్బణ్ణియ్యావే!
చేమంతిపువ్వంటీ చెల్లెల్నియ్యావే!
తామరపువ్వంటీ తమ్ముణ్ణియ్యావే!
మల్లేపువ్వంటీ మొగుణ్ణియ్యావే!

అంటూ పాటలు పాడుకొంటూంది. "బావ" అన్నమాట వినగానే ఆమె ఆపాటలకి స్వస్తి చెప్పింది. ఎక్కడలేని లజ్జా, మోహాన్ని ఉట్టిపడగా, తన నాలుగేళ్ల తమ్ముడూ ముందుకు తొయ్యగా, ఎల్లాగయితేనేం వీధిసావిట్లోకి వచ్చిచేరింది కమల. చూసింది నరసింహాన్ని.

## ౨

విశ్వనాథ శాస్త్రిగారికి అయినవల్లిలో అరవైయెకరాల మాగాణీ వుంది. ఏదో అన్నవస్త్రాలకి లోపంలేకుండా పాడీపంటా, అయిదారు పాడిఆవులూ, రెండుమూడు గేదెగొడ్లూ, వక పెద్దధాన్యపుగాదీ వున్నాయి. దీనికి తోడు గ్రామంలో 'శాస్తుర్లు' గారంటే అందరూ చెవి కోసుకుంటారు. వారిమాటంటే నిప్పులోనైనా వురుకుతారు, నీళ్లల్లో దిగమంటే దిగుతారు. అంటే అంత పలుకుబడి వుందన్నమాట 'శాస్తుర్లు' గారికి. ఆయన వేదాధ్యయనపరులున్నూ నిష్ఠానియమమూ పూర్తిగా వుందనీ ఆయన భార్య పేరే చెబుతోంది. ఇంక పురాతనఆచారాలకీ వ్యవహారాలకీ లోటేమిటి?

మొన్న అక్టోబరు వకటో తారీఖునుంచీ 'శాస్తుర్లు' గారికి మనస్సులో ఆందోళన హెచ్చయింది. ఫాల్గుణమాసందాటితే పద్ధానుగోఏడు వచ్చేదాకా పిల్లకి పెళ్లిచెయ్యడానికి వీలులేదు. వడసారం పిల్లకి

యిప్పుడు ఎనిమిదోయేడు. ఇంతవరకూ సనాతనధర్మప్రకారం "అష్టవర్షా భవేద్గౌరీ–నవవర్షా చ రోహిణీం" అన్నట్టు ఎనిమిదేళ్లూ నిండింతర్వాత పెళ్లి చేయవచ్చునుగదా అని వూరుకున్నాడు. గాని ఇంతట్లోకే తన పుట్టిమి మునిగిపోయిందో అన్నట్లు హారవిలాసశారదాగారు అతిత్వరితంగా తమ "బాల్యవివాహనిషేధక బిల్లు"ను శాసనసభలో ప్రవేశపెట్టి శాసనం చేయించేరు. ఇటువంటి పూర్వాచారపరాయణులందరి మీదా కత్తిగట్టి నట్లుంది శారదాగారు.

విశ్వనాథశాస్త్రిగారు పదిరోజులనుంచీ మరీ యేమీ తోచక తిరుగుతున్నారు. కమలకు తగిన వరుడు ఎక్కడా దొరకడంలేదు. అసలే వైదిక కుటుంబము. అందులో 'శాస్తుర్లు'గారికీ సోమిదేవమ్మగారికీ ఏకపుత్రిక కమల. తమ కేదో ఇంత తినడానికి వున్నది కదా! ఏ బీద వైదిక బ్రాహ్మడికో కట్టబెట్టగూడదా అంటారేమో! అల్లాకాదు. ఇకముందు శారదాగారి హయాములో అయ్యే వివాహాలన్నీ స్వయంగా వరుడు కన్యాన్వేషణమూ, కన్య వరాన్వేషణమూ–ఇత్యాది సూత్రాలతో కూడుకొని కన్యలూ వరులూ–కాబోయే వధూవరులై –ఏ కాలేజీగ్రౌండ్సులోనో, ఏ తియ్యమామిడిగున్నలనీడల్లోనో తమతమ మనోగతాభిప్రాయాలు వెలిబుచ్చుకుని మరీ చెబుతోంటారు పురోహితులకో లేక తల్లిదండ్రులకో తమకు పెళ్లి చెయ్యమని. అయితే యింకా వకటో ఏప్రిలుదాకా శారదాగారి హయాము రాలేదుకదా, మన 'శాస్తుర్లు'గారు కూడా పూర్వపు ఫక్కీనే వరాన్వేషణ ప్రయత్నాలు చేస్తున్నారు.

ఎటువంటి వారికయినా పెరటిలోని కల్పతరువు వెతకినా కనబడదంటారు. అల్లాగ్గా మన 'శాస్తుర్లు' గారి దృక్పథములో నరసింహము పడలేదు. ఎన్ని ప్రయత్నాలన్నా చేశారు 'శాస్తుర్లు'గారు. కోనసీమ అంతా వెదికేరు. చివరకు విసుగెత్తి వూరుకుందామనుకొన్నారు. 'మన కమలకి కళ్యాణం తోసుకొస్తే వరుడు వాడంతట వాడే వచ్చి "మామయ్యా! మీ పిల్లని పెళ్లి చేసుగుంఛానని నన్నడుగుతాడు" అని మనస్సమాధానం చేసుగున్నారు.

ఇంతలో నరసింహము వచ్చేడు క్రిస్టమసు సెలవులికిముందు అయినవల్లి.

## 3

ఇప్పుడు నరసింహానికి పదిహేడేళ్లు. ఇతను రాజమండ్రీలో జూనియరు ఇంటరులో చదువుతున్నాడు. బళ్లో మార్కులు బాగా వస్తోండడం చేత అతిగౌరవంగా చూస్తుంటారు ఇతణ్ణి విద్యార్థులూ, ఉపాధ్యాయులూను. ఆర్ట్సు కాలేజీ విద్యార్థిసంఘమువారి మీటింగులలో బాల్యవివాహ విషయము చర్చకువచ్చింది. కొందరు శారదాగారిని కొనియాడి బాల్యవివాహాలు నిషేధించాలని వాదించేరు. కొందరు సనాతనులని ప్రశంసించి శారదాగారి బిల్లుని ఖండించేరు. అందులో నరసింహం మొదటి వారిలోనే చేరేడు.

నరసింహముది ఉప్పలగుప్తం కాపురము. తండ్రి గతించేడు. తల్లి వక్కరిత. కొడుకుతో కూడా పట్నవాసపు కాపురము చేయలేక పూర్వీకులు ఏర్పరచిన గ్రామనివాసమే చేస్తూ ఎట్లాగో శాయకష్టపడి జీవయాత్ర గడుపుతోంది. అల్లాచేసి తన కొడుక్కి చదువుకి చాలినంత డబ్బు పంపుతోంది. అయితే నరసింహం అయినా చాలా మంచిపిల్లవాడు. దుబారా ఖర్చులుచేసి యెరగడు. మితవ్యయముతో కాలక్షేపము చేస్తాడు. ఏదురభ్యాసాలులేవు. తినడం, చదువుకోవడం, ఆడుకోవడం తప్ప అల్లరి చిల్లరి వేషాలువేసేవాడు కాడు. కనుకనే తండ్రి ఏమీగడించి యివ్వక పోయినా తల్లియొక్క దయవలన ఏలాగో రాజమండ్రీబస్తీలో పెద్దచదువు చదువమొదలుపెట్టిసాడు. కాని క్లాసులు దాటినకొద్దీ జీతములు హెచ్చాయి పుస్తకములకు తిండికి డబ్బుసరిపోక యిబ్బందులు పడుతున్నాడు.

నరసింహము సోమిదేవమ్మకు వకవేలువిడిచిన మేనల్లుడు. అంటే నరసింహము తండ్రిన్నీ సోమిదేవమ్మ తండ్రిన్నీ అన్నదమ్ముల కొడుకులు. నరసింహము తండ్రిపోయి నాలుగేళ్లయింది. అప్పుడు చూచిందే గాని సోమిదేవమ్మ యీ మధ్య మళ్లీ చూడ్లేదు నరసింహాన్ని. అప్పుడప్పుడు వుత్తరాలవల్ల మాత్రం క్షేమం తెల్సుకుంటూండేది.

ఎందుకు వచ్చాడో నరసింహం అయినవల్లి? అతని సహాధ్యాయి వకడు అయినవల్లి కాపురం అవడంచేత తాను సెలవులకు యింటికి వెళుతూ నరసింహాన్నికూడా వకరోజు తనతో గడపమన్నాడు. తన బంధువులనుకూడా చూడవచ్చుననుకొని బయల్దేరేడు నరసింహం. వీథిలోనే కనపడిన పిల్లవాడిని పోల్చుకపట్టి నరసింహం "అత్తయ్య ఏంచేస్తోంది?" అని అడిగేసరికి యిసకలో ఆడుకొంటూన్న రామారావు లోపలికి పరుగెత్తుకువెళ్లి మాతృదేవతతో "అమ్మా! బావవచ్చాడే" అని సహజమృదులత్వం వెదజల్లే మాటల్తో విన్నవించడం మొదలే చెప్పేముగదా.

ఒకగంటసేపు పిచ్చాపాటీ కబురులు చెప్పుకుంటూ సోమిదేవమ్మ గడిపింది. నరసింహం కొంచెం చిక్కినాడనీ, హోటలుభోజనం సరిగాలేదనీ, చదువువేడనీ, ఏమేమో మాటలతో తన అభిమానాన్ని కనబరిచింది సోమిదేవమ్మ.

ఇంతట్లోనే వచ్చారు 'శాస్త్రుల్లు' గారు ఇంట్లోకి—పంచాంగం చంకని పెట్టుకొని, చెప్పులజోడు చప్పుడుచేసుకుంటూను—ఎవరికో పెళ్లిముహూర్తాలుపెట్టి, పెట్టి.

భోజనాలవేళ ప్రారంభమైంది శారదాబిల్లుపైచర్చ. అక్కడ కాలేజీలో ఎంతకఠినముగా వాదించేడో అంతకంటె ద్విగుణీకృతకాఠిన్యముతో వాదించేడు నరసింహము 'శాస్త్రుల్లు' గారితో. "నోరెరుగని పిల్లలకు పెళ్లిళ్లు చేయకూడదని" నరసింహమూ, "అయితే సనాతనధర్మం వదులుకోవడమేనా?" అని 'శాస్త్రుల్లు' గారూ—పట్టింపులుపడ్డారు. చివరకు భోజనంచెడింది. 'శాస్త్రుల్లు' గారు ప్రస్తుతపు నవీననాగరికత విద్యాధికులగు యువకుల అనాచారవ్యవహారములూ మొదలైన వాటిమీద తమకువుండే సహజమైన అసహనాన్ని చూపుతూ తీవ్రముగా మాట్లాడి తమ సనాతనఛాందసం అంతా ఒక్కుమ్మడిని క్రుమ్మరించేరు. పైగా కోపం ఎక్కువైపోయి పులుసూ అన్నం పూర్తిచేయకుండా ఉత్తరాపోశనం పట్టేశారు. శారదాగారే ఎదురుగా ఉంటే ఏంచేసేవారో!

అంతట్లో నరసింహం నీళ్లునమలడం ప్రారంభించి ఏదో అత్తగారికి కష్టంకలగకుండా వుండేటందుకు కొంచెంభుజించేడు. వెంటనే తన తల్లిమాట జ్ఞాపకమువచ్చి సాయింత్రానికి వుప్పలగుప్తం చేతుకున్నాడు.

అకారణంగా 'శాస్త్రుల్లు' గారికి నరసింహంమీద కోపంవచ్చింది. సోమిదేవమ్మ వానికి కమల నిద్దామని ప్రసక్తి తెచ్చేసరికి మండిపడుతూ "శారదాబిల్లును ఆమోదించే ఆవెర్రివెధవకు నాపిల్ల నివ్వను" అన్నాడుశాస్త్రి.

కాని, భార్య శాంతవచనాలచేత కొంచం శాంతించి 'మాఘమివకటి అడ్డువచ్చిందిగాని లేకపోతే మాఘమాసంలోనే చేసేద్దుముగా' అంటూ జవాబిచ్చాడు. మెల్లిగా దారిలోకివచ్చి సంబంధాలన్నీ ఒకటొకటిగా ఏకరువు పెట్టేడు. ఇందులో కట్నాలగొడవ వకటి. పోనీ లౌక్యవ్యవహారపద్ధతిని కట్నం యిద్దామన్నా బొత్తిగా ఏమాత్రపు ఆస్తిఅయినా లేక కట్నాలుమాత్రం ఒకటిదాటి రెండుమూడువేలువరకూ

అడుగుతున్నారు కొందరు. ఏమిచేయగలడు శాస్త్రి? కొడుకు ఒక్కడేగదా! కూతురూ ఒక్కర్తే. లేక లేక వృద్ధాప్యంలో కలిగిన వారి యిద్దరుపిల్లలున్నూ. వీరిపెళ్లిళ్లు సలక్షణంగా చేద్దామని వుంది మనస్సులో. యేంజేస్తాడు? విధియెట్లావున్నదో?

౫

మర్నాడు బయల్దేరేడు శాస్త్రి సోమదేవమ్మచే ప్రేరేపింపబడి. ఉప్పలగుప్తం చేరేడు పదిగంటలయ్యేసరికి. నరసింహము అప్పుడే గ్రామంలో యెవరితోనో మాటలాడ్డానికి వెళ్లేడు. ఇంట్లో తల్లి ఒక్కర్తే వున్నది. ఆ వితంతో ప్రసంగించేడు శాస్త్రి. ఆమె అందరివలె గాక తన పుత్రుని యిష్టమన్నది. భోజనముల వేళకు నరసింహం వచ్చి శాస్త్రిగారిని చూచి ఉచితమర్యాదలు చేశాడు శాస్త్రిగారికి. భోజనసమయంలో యేమీ గలభా కాలేదు. ఈమారు తాంబూలం సేవిస్తూ శాస్త్రిగారు వూదేరు రవంత ముక్కాను. కనులనిచ్చి అయిదురోజులూ పెళ్లిచెయ్యడానికీ సైకిలు, కంచం, వెండిచెంబు, పట్టుబట్టలు రిస్టువాచీ, చేతిగొలుసు వగైరా లాంఛనములన్నీ జరపడానికీ బియ్యే బియ్యల్ ప్యాసయ్యేవరకూ చదువు చెప్పించడానికీ సంకల్పించుకున్నానని చెప్పేరు శాస్త్రిగారు. నరసింహానికి ఏమనడానికీ తోచిందికాదు. ఇప్పుడు ఎనిమిదేండ్ల పిల్లను చేసుకోవడమా? తన పట్టుదల ప్రకారము పద్ధానుగేళ్లు వచ్చినతర్వాత ఆపిల్లను కాని ఇంకోపిల్లనుకాని చేసుకోవడమా? ఎప్పుడో అంటే లాభంలేదు. ఇప్పుడే జరగాలి. ఇప్పుడు పెళ్లిచేసుకుంటే బియ్యే బియల్ వరకూ తనకు దమ్మిడీ ఖర్చులేకుండా చదువు గడిచిపోతుంది. కాని తన పట్టుదల వ్యర్థమవుతుంది. పెళ్లిచేసుకోడో? ఇంటరుక్లాసు పూర్తికావడం కష్టం. ధనసహాయ్యం చేసేవారు లేరు. పోనీ ఉద్యోగమేదయినా సంపాదిస్తామంటే సాహుకారు గుమస్తాల నిమిత్తం, ఎలిమెంటరీ స్కూలుమాష్టరుల నిమిత్తం ఆఖరుకు కొన్ని ఆఫీసులలో అటెండరుపనుల నిమిత్తం కూడా బియ్యేలు జొరబడుతూన్న యీ రోజుల్లో ఇంటరువాడిని చూచేదాతయేడీ? ఉద్యోగము దొరక్క పిత్రార్జితపు ఆస్తిలేక తన తల్లిని పోషిస్తూ, తన జీవితం గడుపుకోవడం ఎట్లు? ఇదే సమస్య - చాలాగట్టిసమస్య. 'మననం' లో పడింది వ్యవహారం.

౬

చాలా తీవ్రంగా ఆలోచించేడు నరసింహం. వుప్పలగుప్తపు దేవాలయంలోకెళ్లి స్వామిసన్నిధిని నాలుగు గంటలదాకా సాగిలబడివున్నాడు ఆలోచిస్తూను. ఎవరెవరు ఏలాగున చెప్పారో అన్నీ ఆలోచించుకొని చివరకు నాలుగు గంటలకి లేచేడు. శాస్త్రిగారిపిల్లను చేసుకోవడానికే యేర్పరచుకున్నాడు.

ఉన్నతవిద్యాభిలాషయే నరసింహంపట్టుదలను జయించింది. శాస్త్రిగారికి సహజబుద్ధియొక్క గౌరవము తెలిసింది. తాను దూషించినప్పటికి నరసింహం తన్ను గౌరవించి తన కోరకు పట్టుదల వదలుకొన్నాడని విని సంతోషించేరు శాస్త్రిగారు. వెటనే అయినవల్లిచేరి సోమిదేవమ్మతో చెప్పేరు. ఆవిడ మొగం చేటంతయింది నిజంగా తనకు నరసింహం అల్లుడవుతాడంటేను.

నరసింహము స్నేహితులందరికీ తెలియడానికయినా అవకాశం లేకుండా మొన్న మార్గశిర మాసములోని ఆఖరులగ్నానికే అయింది నరసింహంపెళ్లి.

నరసింహమూ కమలా దంపతులయినారు. వారికి:—

" శ్రీయను మించు మించొలయ సేవకచాతకలోక మోదసం
ధాయకుడై యుదారకగుణారసవృష్టి దురాపతాపముల్
వాయగజేయుచున్ సకలవాంఛితసస్యము లుల్లసిల్లగా
జేయుచు వేంకటాద్రినివసించు ఘనుం డిడుగాత భద్రముల్."

# భోజన పదార్థములు

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి. ఏ (సారస్వతసమాజము)

దేహధారణమునకు అవసరమగు సమస్తవస్తుసంతతియును ఆహారమనబడును. మనము పీల్చుగాలియు, త్రాగునీరును, తినుపదార్థములును గూడ ఆహారముగా పరిగణింపవలెను. అనుక్షణమును మనముచేయు పనివలన దేహమునందలి అణువులు (Cells) ఎన్నో చెడి పోవుచున్నవి. వానిని మరమ్మతుచేసి శరీరమును ఆరోగ్యవంతముగను, శక్తివంతముగను, సుందరముగను చేయుటకు వలసిన ద్రవ్యము ఆహారరూపమున మనము లోనికి తీసికొనుచున్నాము. ఆహారముయొక్క ఆవశ్యకతగాని, ఉపయోగముగాని ఎఱుంగనివారు ఆబాలగోపమునందెవరు నుండరు.

శరీరారోగ్యమును కాపాడునది ఆహారమేయని యింతకుముందే చెప్పియున్నాను. ఆరోగ్యమును కాపాడుకొనుట ప్రతిజీవికిని ప్రధానకర్తవ్యము. కర్మక్షేత్రమగు భూమిపై మానవజన్మము నెత్తించుటలో కర్మదేవతల యుద్దేశము మనచే సత్కార్యాచరణ చేయించి పురుషార్థసంగ్రహణ మొనరించి ముక్తిమార్గావలంబులుగా జేయుటయే. ఈదృఢవ్యవసాయమునకు శరీరము ఉపకరణము. ఉపకరణమెంత నిశితముగనున్న కార్యమంత ఫలవంతముగనుండును. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' అను ఆర్యవాక్కున ఈసత్యము గోచరించుచున్నది. దాని నాలించి పాటించి మనపూర్వులు చిరంజీవులును, నిశితమేధావులునై సృష్టియొక్క సత్యములను మనకు చాటినారు. వారు గైకొనిన ఆహారము శరీరధారణమునకు మాత్రము యోగ్యముగా నుండినది. జిహ్వాచాపల్యము వారియెడ లేదు. మనకు సేవకుడుగా నుండుటకై సృష్టింపబడిన జిహ్వాకు వారాధిపత్యము నీయలేదు.

కాని ఇప్పుడీస్థితి తారుమారైనది. మనము రుచిలోలురమైతిమి. జిహ్వ ఆధిపత్యమును వహించి మంచిచెడ్డలనేమరి కేవలరుచ్యపదార్థములనే కోరుచున్నది. అవి దేహమునకు హానికరములేకానిమ్ము. మనము తినుట మానుటలేదు. ఇది తప్పని తెలిసియు వానిని వర్జించుటలేదు. అలవాటు అని సాకు చెప్పుటతో కొందరు తృప్తినొందుచున్నారు. ఇట్టి దురవస్థ మనలో నానాటికి హెచ్చుచున్నది. ఇందుమూలమున ఆరోగ్యమును కలిగించవలసిన ఆహారము అనారోగ్యకరమును, రోగాంకూరమును, దుఃఖప్రదమును అగుచున్నది. దేనిని ఆదియందు సుఖదమని తలంచినారో అది మన అజ్ఞానమువలన, లోలత్వమువలన దుఃఖప్రదముగా మారినది.

కనుక చిన్న పెద్ద లందరకును ఆహారముయొక్క ఆవశ్యకతను గూర్చియు సదాహారమునుగూర్చియు తెలియజెప్పుటయే ఈ వ్యాసావళి యుద్దేశము. సదాహారమువలన

ఆరోగ్యము వృద్ధినొంది జీవితము పరిపూర్ణవికాసవంతముగ నగును. మానవజీవితము యొక్క యుద్దేశము అతనిశక్తులన్నియు సంపూర్ణముగ వికసించుటయును, తన్మూల ముగ జన్మసాఫల్యమును బడయుటయునై యున్నది.

## ఆహారము చేయు పనులు

మానవుని సమస్త అవస్థలయందునుగూడ శరీరములోని ఏదో యొకకోశము పని చేయుచునే యున్నది. శ్వాసకోశమును, జీర్ణకోశమును, రక్తప్రసరణవివరణమును నిరం తరము పనిచేయుచునే యున్నవి. తాకినపుడు శరీరమును, చూచినపుడు కండ్లును, విని నపుడు చెవులును, ఆయాపనులు చేసినపుడు ఆయాయింద్రియములును పనిచేయుచునే యున్నవి. ఏదైనవస్తువు పనిచేసినచో అది అరిగిపోవుట లోకప్రసిద్ధము. అట్లే దేహము పనిచేసినపుడు దానియందున్న అణువులును అరిగి నశించుచున్నవి. ఈవిషయమున దేహ మును గృహముతో పోల్చ వచ్చును. ఉపయోగించుట వలన ఇంటిగోడలు మొదలగునవి ఏటేట పాడగుచుండును. దాని నెప్పటికప్పుడు బాగుచేయించుట అవసరము. అట్లే దేహ మునకును మరమ్మతు అవసరము. ఈ మరమ్మతునకు అవసరమగు వస్తువులు ఆహారము మూలమున లభించుచున్నవి.

మనమేపనిచేసినను కొంతశక్తి వ్యయపరచుచున్నాము. ఈవ్యయశక్తియొక్క రూపమే మనదేహమునందలి వేడిమి. కనుక ఆహారమువలన పనిచేయుటకు వలసిన శక్తి కూడ చేకూరుచున్నది. కనుక ఆహారముచేయు పనులు:

1. శరీర మెదుగుటకును, మరమ్మతు చేయుటకును కావలసిన సామగ్రినొసంగుట.
2. పనిచేయుటకు కావలసిన శక్తిని జనింపజేయు సామగ్రులను చేకూర్చుట.

## శరీరనిర్మాణమునకు వలయు సామగ్రి

దేహమును గేహముతో పోల్చుదురు. ఈసామ్య మనేకవిషయములలో పోలును. ఇంటిని నిర్మించుటకు యజమాని యిటుకలు, కలప, సున్నము, ఇసుక మొదలగు వస్తు వుల నెన్నింటినో చేకూర్చును. కాని అంత మాత్రమున కార్య సానుకూల్యము జరుగదు. తెచ్చిన సామగ్రులను ఉపయోగించుటకు వడ్రంగి, తాపీవాడు, కూలీలు మొదలగు వారెందరో కావలెను. అట్లే శరీరము వృద్ధినొందుటకుగాని బాగుపడుటకుగాని నిర్మాణ సామగ్రి కొంతయవసరము. దానిని ఉపయోగించి పనిచేయుటకు పనివాండ్రు కూడ కా వలసియున్నారు. మాంసకృత్తులు, చక్కెర, పిండి పదార్థములు, కర్బనము, నత్రజనిత ములు మొదలగునవి నిర్మాణసామగ్రినిర్మాతలను ప్రాణకృత్తులు అందురు. ఈ ప్రాణ వైటమిన్సు కృత్తులకు ఆంగ్లమున (Vitamins) అనిఅందురు. ఇవి ప్రాణధారణమునకు ఆవశ్యకములగుటచే వీనికీపేరు వచ్చినది.

## నిర్మాణసామగ్రి

శరీరమునందలి ధాతువరమును పరీక్షించి చూడగ అందు ఈక్రింది మూలద్రవ్యములు గోచరించును. ప్రాణవాయువు, కర్బనము (Carbon), నత్రజని (Nitrogen), ఉదజని (Hydrogen), సున్నము (Calcine), భాస్వరము (Phosphorus), సోడియము (Sodium), హరితము (Chlorine), అయొడీను (Iodine), లోహము (Iron) మొదలగునవి.

ఇవియన్నియు మూలద్రవ్యములుగా (Elements) ఉన్నపుడు శరీరము జీర్ణించుకొనలేదు. ఇవి ఇతరద్రవ్యములతో కలసి సంయోగములుగనున్నపుడు మాత్రమే జీర్ణములగును. కాల్షియము మనకు అవసరము. కాల్షియమును ధాతురూపమున తింటిమా దేహమునకు మేలుచేకూరుటకు బదులు హానిగలుగును. అటులే ఇనుపరజను ఎంత తిన్నను పని జరుగదు. బొగ్గుకూడ అట్టిదే. కనుక మనము తినుపదార్థములు ఆయామూలద్రవ్యములను సంయోగరూపమున గలిగినవై యుండవలెను. మనము తిను వానిలో పప్పుగింజలలో మాంసకృత్తులును, వరిలో చక్కెరయును, నేతిమజ్జిగలలో క్రొవ్వు పదార్థములును (అనగా కర్బనము, ఉదజనిగల సంయోగము), పండ్లలో కాల్షియము, ఇనుము మొదలగు నిరింద్రియపదార్థములు నున్నవి. వీనినిగూర్చి మఱియొకభాగమున వివరించెదను.

## ప్రాణకృత్తులు

ఆహారపదార్థములగుండ లభించిన శరీరనిర్మాణసామగ్రి నుపయోగించి పని చేయు ప్రాణకృత్తులుగూడ ఆహారపదార్థములందే ఉన్నవి. పదార్థమును బట్టి వీని గుణమును, సాంద్రతయును మారుచుండును. బచ్చలి, తోటకూర మొదలగు ఆకు కూరలలో ఉన్నంత విరళముగ ఇవి ఎండిన కాయధాన్యములలో నుండవు. ఉన్నమట్టునకైనను గింజయందంతను సమముగనుండవు. వరిగింజలలో ప్రాణకృత్తుల సంఖ్య అల్పము. ఆ యల్ప సంఖ్యకూడ బియ్యపుగింజలో నుండక తవుడులోమాత్రమున్నవి. అందుచే తెల్లగ అరగదంచిన బియ్యమును, మరబియ్యమును గూడ ప్రాణకృత్తులు లేకయుండును.

ఈవిధముగ ఆహారపదార్థములు మనకు కావలసిన శరీరనిర్మాణసామగ్రిలోను, ప్రాణకృత్తులలోను వివిధవిధముల భేదించి యున్నవి. రాబోవు వ్యాసమున మనము తిను వస్తువులలో వేని యందేయేపదార్థములున్నదియును వివరముగ చూతము.

# కుటుంబజీవనము: స్త్రీ స్వాతంత్ర్యము

మల్లీడి పెరుమాళ్లయ్యగారు

అనాదినుండియు స్త్రీ బానిసవలె గణింపబడుచుండెను. బానిస స్థితినుండి వివాహ సంస్థవరకువచ్చుసరికి చాలకాలము పట్టియుండును. వివాహము మానవులకు మిక్కిలి పవిత్రమగు సంస్థ. వివాహసంస్థలేనిదే మానవజాతి యభివృద్ధికాంచియుండదు. కుటుంబ బాంధవ్యములులేనిదే మానవునకు సౌఖ్యజీవనముండదు. సాంఘికజీవితము పెంపొందదు. కుటుంబజీవనమే ప్రతిష్టగల ప్రభుత్వమునకు సహితము ఆధారభూతము. ఇట్టి కుటుంబ జీవనమును నశింపజేయునదిగాని, నశింపజేయుటకు యత్నించు యితర యుద్దేశముగాని రాక్షస సాంప్రదాయము. సత్ప్రవర్తన, పవిత్రహృదయము, వికసితబుద్ధిగల యొకకాంతను ప్రేమించి ఆమెతో సుఖజీవనమును బడయుటయే పురుషుని యాశయము. అదేవిధిని ప్రతిష్టగల పురుషుని ప్రేమకు, సదాదరణకు గురియై ప్రేమపూరితమగు జీవితమును గడపుట ప్రతిబాలికయొక్కయు సహజమైనకోరిక. ఇదియే వివాహోద్యమమునకర్థము. పవిత్రప్రేమ వివాహము లేనిదే సాధారణముగా పెంపొందనేరదు. ప్రేమపూరితమగు నొక యువతి హృదయసామ్రాజ్యమునకు సార్వభౌముడై యుండుట పురుషునికోరిక. తనప్రేయసి తన శ్రీలన్నిటికి రాణియైయుండుటయు నాతడు వాంఛించును. అట్టి సమభావము, పరస్పర గౌరవము గలిగినప్పుడే మానవులు సంతృప్తిబడయ గలుగుదురు. ఒక స్త్రీయొక్క పవిత్ర ప్రేమను సంపాదింపగలిగినప్పుడే, పురుషు డానందము పొందగలుగును. అట్టి పురుషుడు కడుపేదరికము ననుభవించుచున్నను తన జీవితమునందు కృతార్థుడు కాగలుగుచున్నాడు.

ఒక గ్రంథమునందిట్లు వ్రాయబడియున్నది. బ్రహ్మదేవుడు ప్రపంచమును సృజించి సర్వసుందరమగు ప్రకృతిచే లోకమునలంకరించెను. స్త్రీపురుషుల నిరువురను ప్రకృతిమధ్య సృజించెను. అప్పుడే ప్రకృతి సుందరముగను, కడుమనోహరముగను ఉండెను. తదుపరి పురుషుడు తాను బలాఢ్యుడననియు, ధైర్యశాలిననియు స్త్రీ సుందరవతియగు నబలయనియు, తన ప్రేయసియనియు తనలోభావించుకొనెను. నాటినుండియు స్త్రీని తన నుండి విభజించెను. కాని సృష్టియందుమాత్రము స్త్రీపురుషు లిరువురకును సమానమైన హక్కులు కలవు. ప్రకృతియందలి యానందము వారిరువురును సమానముగా అనుభవించునట్లు సృష్టికర్త యుద్దేశించెను. ప్రకృతియందు స్త్రీపురుషులిరువురకును సమానముగ సహజములగు కొన్ని శక్తులు ప్రసాదింపబడెను. అందుచే నేడు పురుషునకు గల హక్కులన్నియు స్త్రీకికూడ సత్వసిద్ధమైయున్నవి. పురుషుడు స్త్రీని వివాహమాడుట కేవలము తనకొఱకుగాక స్త్రీకొఱకనియును తెలిసికొనవలసి యున్నది. మానవస్వభావమునందు

సహితము యిరుపక్షములయందును సమబుద్ధియున్ననేగాని స్త్రీపురుషుల మధ్య ప్రేమానురాగము లభివృద్ధి పొందనేరవు. ఒకయువతియును, యువకుడును ప్రకృతిప్రేరితమై సహజముగ జనించుప్రేమచే నొండొరులను ప్రేమించుకొనుచున్నారని యూహించుకొందము. అప్పుడు వారిరువురియందును సమభావము లుండితీరవలయును. అట్టి సమయమందు వారిరువురును యెవరికివారు సంపూర్ణమగు హక్కులుగల యజమానులు. ఆసందర్భమున మరియొకవ్యక్తి "నేను తండ్రిని, గృహయజమానిని, నాయాజ్ఞ ప్రకారము మీరు ప్రవర్తింపవలయును" అని చెప్పుట క్రూరస్వభావము. ఆయువతీ యువకుల నిశ్చలప్రేమలతను త్రుంచుటకు మూడవవాని కెట్టి హక్కునులేదు. హక్కు కలదను భావమును అమానుషమనియు, నిరంకుశమనియు చెప్పనగును.

కొందరు పతులు తమ సతులను హృదయపూర్వకముగ ప్రేమించియు, వారి పాతివ్రత్యమునందు పూర్ణవిశ్వాసము కలిగియు, వారికి తమతో సమానమగుహక్కుల నీయనొల్లరు. భర్తకు తాను దాసినను నిరంతరభయభావముతో వర్తించు భార్య జీవితము కొంతవఱకు నూహింతము. అట్టి స్త్రీలయందు బానిసబుద్ధి యధికముగ నుండును. స్వతంత్రమైనయోచనశక్తి గలిగియుండినగాని విజ్ఞానము కలుగదు. వ్యక్తి స్వాతంత్ర్యము ఉండిననేగాని అట్టి యోచనాశక్తి కలుగదు. ఆత్మవికాసమునకు తోడ్పడు యోచనలేక భర్తలకు తాము కేవలము దాసికలమని ఉద్దేశించు స్త్రీలకు జనించు పిల్లలెట్లుందురో నూహింపదగును. వారి కెట్టిశిక్షణ యిచ్చుటకును తల్లులకు తెలియదు. కనుకనే పురుషుడు స్త్రీని ఒక స్వతంత్రవ్యక్తిగ గ్రహించుటవలన కుటుంబములోని జీవితవికాసమున కెంతయు తోడ్పడుననుట. సహజమానవప్రేమను గ్రహింపజాలని ధనవంతుని దివ్యభవనములకంటె ప్రేమపూరితములగు నిరుపేదల కుటీరములు మానవ నివాసయోగ్యములు. నేటి సంఘము ధనవంతునకు అర్థములేని యాధిక్యత నారోపించుచున్నది. మానవుడు కృతార్థజీవితుడగుటకు ధనవంతుడు కావలసిన అవసరములేదు. శాంతిసౌఖ్యములను పొందకలిగిన జీవితము కృతార్థత పొందును. ధనాధికారములతో జీవితమునకు పనిలేదు. సరళహృదయము కలిగి, జీవితవికాసము కాంచు మానవుడే ధన్యుడు. "నీ భార్యను వికసితపుష్పమువలె గ్రహింపుము. ఆమె నీకు సుగంధము నీయగలదు"యని యొకచో వ్రాయబడి యున్నది. ఇట్టి భావము సౌఖ్యమును చేకూర్చును. పవిత్రప్రేమకల హృదయమునకు భార్యాభర్తల వయస్సుతో సంబంధములేదు. ప్రేమకు యౌవనము వార్ధక్యము అను భేదముండదు. నిశ్చలప్రేమ క్రమవికాసము పొందును. స్వేచ్ఛలేని జీవితము వికసింపజాలదు. ప్రతిగృహమునందును స్వేచ్ఛ, సమబుద్ధి యుండిననే గాని అనురాగము, విజ్ఞానము, ఆనందము, జీవితమునకు లభింపవు. ఈ విషయమును పురుషులును, స్త్రీలును గ్రహింతురు గాక!




# శ్రీ వేణుగోపాల కర్పూర హారతి

(దశావతార భరితమగు మనోహర గేయము)

శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మ గారు

("కమలామనోహరా" అను జావళీవరుస)

కర్పూర హారతి గైకొమ్ము వేణుగోపాల బాల!—కర్పూ

౧. దర్పకజనకా! నిన్ను నామదిని
నేర్పుతోడ నుతియింతున్,
కడు, గొప్పగాను బూజింతున్, ఏ
తప్పుచేసి నేనెరుఁగన్, నా
యప్ప! యెల్లప్పుడుఁ దలఁతు ॥క.

౨. వాసిగాను శ్రీవసుదేవునిగృహా
వరమందున జన్మించి, యా
కంసచర్యలాలించి, యా
హింసకు నతిత్వరద్రుంచి
ధరపాలన చేసిన ధర్మశీల! ॥క.

౩. అఘుని యెంచక సోమకుఁడెంతయు
నిగమంబుల హరియింపన్,
జగమంత నిన్నుఁబ్రార్థింపన్, ఆ
నిగమంబుల గ్రహియింపన్
సొగసైనమత్స్యరూపముఁదాల్పవె? ॥క.

౪. మందరధరమలసంద్రజలంబున
సుందరగతి మునుఁగఁగన్, సుర
బృందము రాక్షసగణమున్, "గో
వింద! పాహి"యని వేడన్
నీవు కూర్మరూపముఁదాల్పవె? ॥క.

౫. కనకాక్షుం డలనాఁడు
ధరనంతయుఁ జాపవిధానన్,
జనహేయుఁడు దొంగిలి పఱువన్ ఆ
కనకాక్షుని తును మాడన్
కనకాంబర! కిటిరూపముదాల్పవె? ॥క.

౬. బాలుని నీభక్తుని ప్రహ్లాదునిఁ
బాపభయం బరిలేక,
పలుబాములు పెట్టిన జనకున్,
పరమాత్మ! వేగమే తునుమన్
నరసింహరూపమది తాల్తువౌర ॥క.

౭. బలిరాజౌరా! యింద్రపదంబును
బాలింపఁగ మదిఁగోరి
వరధర్మాత్ముండనఁబరఁగన్, నా
బలిని నధోగతుఁజేయన్,
పరమాత్మ! నీవు వామనుఁడవైతి ॥క.

౮. పాపంబనునది తలఁపకేమది
ప్రలంబాది దానవులు
పలుబాములు పెట్టఁగ జనులన్
నాప్రలంబాదుల హరింపన్
భవనాశ! నీవు బలరాముఁడైతి ॥క.

౯. నీతి విహీనము రాజలోకమును,
నిరువదియొకపరిఁదునిమి
నిరుపద్రవయగు భూదేవిన్
నిజభక్తి కాశ్యపున కిచ్చి
నెగడితివిగావ? భృగురామరూపా! ॥క.

౧౦. రావణాదులను బరిమార్పంగను
రాజవంశమునఁబుట్టి
రఘురామ నామమునఁబరఁగి
రణభూమిని రాక్షసవరులన్
పరిమార్చితౌర? కరుణార్ద్రహృదయ ॥క.

౧౧. బుద్ధరూప! జనులకు నీ వెన్నో
బుద్ధులు గఱపితివౌరా! నీ
శుద్ధరూపుఁగొని యాడన్ ఏ
బుద్ధిమంతునకుఁదరమా? నీ
యొద్దఁజేర్చి కాపాడు వేగ ॥క.

౧౨. కలిరూపాత్మక! జగన్నియంతా!
లలియాజగత్త్రిలిలో
కల మానవలోకమును
బలితంపుమాయాలోముంచి
జలజాక్షు నాటలాడించుచుంటి ॥క.



# స్వర్గీయ శ్రీ కమలాసనాదేవి

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

వంగదేశమునఁ గల వివిధనారీసమితులలో బాయినాన్ అను గ్రామమునఁగల సమితికి అధ్యక్షురాలుగనుండి చిరకాలము నారీసేవ యొనర్చి నారీజాతి కాదర్శప్రాయమగు జీవితముగల శ్రీ కమలాసనాదేవినిగూర్చి వ్రాయుటకు సంతోషవిచారములు గలుగుచున్నవి.

ఈమె వంగదేశమున బాయినాన్ అను గ్రామమునం దుదయమందెను. జన్మము మొదలు మరణించువఱకును ఈమె యనవసరముగ నేరికినిభయమందినదిగాదు. నారీలోకమంతయు నిట్లేయున్నచో నికనెందును స్త్రీలకు "భీరు" అనుపదమున కవకాశమే లేకయుండెడిది. "స్త్రీయనఁగ కోమలముగను, వినయవతిగను, గాంభీర్యముగలదిగను నుండవలయు" నని యీమె యెపుడును జెప్పుచుండెడిది. ఈ వాక్యార్థము పూర్ణముగ నీమెయందుఁగాంచఁగలిగినాము. అత్యంతదుఃఖసమయములందు నీమె మోమునందు మ్లానత్వముండెడిదిగాదు. ఈమె యొనరించు నుచితాచారమును శ్వశురగృహమందలివారును, పితృగృహమునందలి వారు ననుసరించెడివారు. శిల్పకర్మ, చదువుట, వ్రాయుట, గృహకర్మ, భక్తి, దయ, వ్రతపూజ, లజ్జ, దాసదాసీజనదాక్షిణ్యము ప్రయత్నించి బాలికలకు నేర్పవలెనని యీమె వ్రాసినది. ఈమె తన జీవితమునందు క్రియాపూర్వకముగ నీపనుల నొనరించినది.

వివాహమునకుఁ బూర్వ మీమెకు శివపూజ యత్యాచారముగ నుండెడిది. ఈమె యత్తవారింటనుండఁగాఁ దనపిల్లలను బోషించుకొనుటయేగాక యిద్దఱు నితరుల శిశువులను సయితము స్తన్యదానముచేఁబోషించెడిది. అందఱును విశాలమైన యీమె గుణములనుజూచి ముగ్ధులయ్యెడివారు. ఈమె వృద్ధులకు బంధుప్రాయముగనుండి వారికి భారతభాగవతాది గ్రంథముఁ జదివి వినిపించుచుండెడిది. పుట్టుకదొట్టి యీమె యేరితోడను మరణించు దనుక కలహించి యెఱుఁగదు. ఈమె వివాహమునకు బూర్వము పుట్టినింట సకలకార్యముల నెఱవేర్చిన పిదప రాత్రి కిరసనాయిలు దీపమునొద్ద గూర్చుండి యధ్యయనము చేయుచుండెడిది. ఈవిషయ మేరికిని దెలియదు. ఒకనాఁడీమె యర్ధరాత్రి నాల్గువైపుల పుస్తకముల నిడి యేమియో వ్రాయుచుండ తండ్రిచూచి యేమియుఁ బలుక

రింపక మఱునాఁడు విషయము దెలిసికొనఁగోరి కూఁతునడిగెను. అప్పుడామె "సతీత్వ మాహాత్మ్యము" అను తాను వ్రాయుచున్న పుస్తకము జూపెను. ఆమె యాపుస్తకమును ప్రకటించునపుడు "విభుని చరణకమలములయందు మనసునిల్పి యీనిర్జనప్రదేశమున నీపుస్తకమును రచించితి"నని వ్రాసికొన్నది. ఈగ్రంథమైన పిదప నీమె "వన్యసందేశము, స్వర్గారోహణము, సుభద్ర, సతీత్వమాహాత్మ్యము (ద్వితీయభాగము)" అనుపుస్తకముల రచించినది.

తన నివాసమగు పల్లీగ్రామమున బాలికాబాలకులు పాఠశాలలకేఁగక తిరుగుచుండ వారి ననునయపూర్వకముగ లాలించి వారి జననీజనకుల సమ్మతిమీఁద "స్వర్గీయ అసితరంజనచట్టోపాధ్యాయ, ఎం.ఏ;ఎం.యల్;" నిర్మితమై జీతములు లేక యుచితముగ విద్య నిచ్చెడి పాఠశాల కంపెడిది. ఈ విధముగ నీమె ప్రోత్సాహమువల్ల విద్యాభ్యాస మొనర్చి యభివృద్ధినందిన వారు నేఁడెందఱోగలరు. వివాహమైన తర్వాత సామాన్యస్త్రీలవలె కేవల మలంకారముల యందత్యంతమైన ఇష్టము చూపకయుండెడిది. కాని శుభ్రమైన వసనముల మాత్ర మామె ధరించుచుండెడిది.

విధికృతమువల్ల నీమె సుదీర్ఘమైన రోగముచేఁ బీడింపబడి గత కార్తికసప్తమి బృహస్పతివారమునందు ఇహలోకమును వీడెను. ఈమె జన్మము, వివాహము, మృత్యువును భగవంతుఁడు బృహస్పతివారమునందే నిర్ణయించెను.

—"వంగలక్ష్మి" నుండి.

# విశ్రమించిన దేశాభివృద్ధియెట్లు?

శ్రీ శేషాద్రి రమణకవులు.

తనయుల రణరంగమునకు నర్పించిన యానాటి దేశాభిమానపటిమ
పతులతో సంగరక్షితిలోన మడిసిన యానాటి వీరవిహారగరిమ
పిఱికిబంటులకైన బీరమెక్కించిన యానాటి విక్రమానూనకలన
వీరసంతతి గని విశ్వసించి మనిచిన యానాటి మాతృధర్మానురక్తి

తలఁచి పూర్వపురాణకాంతాచరిత్ర
వాఙ్మయంబుఁ జిత్రించు వాంఛలుడిగ
ఆధునికయానవతము వినోదాదికమున
విశ్రమించిన దేశాభివృద్ధియెట్లు?

# ప్రాణనాయకి

## వేలాల సుబ్బారావుగారు

### ౧

"సోమా! నీకిదివరకు ఎన్నిసార్లో నానిశ్చయాన్ని తెలియజేసి ఉన్నానుకదా. మరల మరల ఎందుకు నన్నీలాగు బలవంత పరుస్తావూ?"

"నీలాటి విదుషీరత్నం ఈలాగుదైన్యాన్నిపొంది పడుతూవున్న బాధనుచూడలేకా, పురుషులు మన విషయమైచేసే దౌర్జన్యాలను సహించలేకానూ. వాళ్లు పంతంబట్టినలాగు ఈమాదిరి దుండగాలు చేస్తూ వుంటే మనంవాటినన్నిటినీ చూస్తూ, భరిస్తూ చచ్చినలాగు పడివుండాలా ఏమి?"

"సోమా! పంతాలకూ, హఠాలకూ కాలంకాదిది. వానిని అవలంబించడం మూర్ఖులలక్షణం. అందరమూకలిసి బాగుగా నాలోచించుకొని ఏమార్గాన్ని అవలంబించడంవల్ల ఈ ప్రస్తుత నవీననాగరికతాప్రభావ సంజనితనవనవోన్మేషఝంఝామారుతంతో జిక్కి ఊగులాడుతూవున్న మన జీవికానౌకను సురక్షితంగా ఈ సంసారసాగరాన్ని దాటించి గట్టుకుచేర్పించగలమో ఆమార్గం స్వీకరించాలి. పురుషులు మనవిషయమై వారివిషయమై మనమూ హఠదురాగ్రహాలను బూని పరస్పరం దౌర్జన్యాలను చేసుకొంటూఉన్నామని అనుకోడంకూడా సరియైనదికాదు. ఎవరెన్ని యేలాటిప్రయత్నాలు చేస్తూవున్నా సమస్తమూ వారి వారి భాగ్యానుసారం జరిగిపోతూవుంటుంది. అట్టిచో విపత్తికలిగినప్పుడు తొందరపడిన లాభంలేదు. ఆలాటి సమయాన్ని ధైర్యమూ, శాంతమూ ఆశ్రయించడమే మంచిది."

"జానకీ! నీమాటలునాకు బొత్తుగా సరిపడడంలేదు. నాకే నీలాటి అవస్థసంభవించి ఉన్నట్లయితే మొన్న ఈనడుమ మనమద్రాసుకాంతలుచేసిన వివాహవిచ్ఛేదపు తీర్మానానికి ప్రథమతాంబూలం పుచ్చుకొని ఉండేదాన్ని ఈపాటికి. ఇంతమాత్రం ధైర్యంచేయలేకపోతే ఇకమనం సంపాదించిన ఈడిగ్రీలెందుకూ? తగలెయ్యనా? మనంనేర్చుకొన్నదానిమూలాన్ని మనకే ఉపకారం కలక్కపోతే ఇక పరోపకారమేమిటీ మండేది? నీలాటి పట్టభద్రలే తెగించి ఈలాటి పురుషులని గడ్డి దినిపించకపోతే ఇక తక్కినగుంటలేమిటే చేసేది? ఓ అంటే నారానిదిక్కుమాలినపక్షులు."

"సోమా! అత్యంతదీనావస్థలో ఉన్ననూ నాకిపుడు నీమాటలు కొంచెం నవ్వును తెప్పిస్తున్నాయి. విద్యవలన మనుష్యులు పొందదగినది ఐహికాముష్మికసౌఖ్యం. కాని ఆముష్మికచింత ఇప్పుడు బొత్తిగా ఎగిరిపోయింది. మొన్న మనమద్రాసు కామినులుచేసిన పరిష్కారంవిషయమై వారిని అనవలసిన పనిలేదు. అది సమయప్రభావం, కాలప్రవాహం మహావేగవంతమైంది. అందులోపడకుండా, పడి కొట్టుకొనిపోకుండా తప్పించుకోడానికి శక్యంకాదు ఎవరికీ. ప్రస్తుతం పాశ్చాత్యులు అధికారపదములో వుండడంచేత వారిపద్ధతులు మనలను భ్రమింపజేయకమానవు. వారితళుకుబెళుకులు మనధీరులనే అంధులనుగా చేస్తూఉంటే అంగనలమాటేంచెప్పాలీ? మనుజునకు అభిప్రాయాలు బాల్యయౌవనవృద్ధావస్థలలో వేరువేరుగా ఉంటాయి.

ఎవరికివారు తాముతలపెట్టిందే ఉత్తమమనీ, దాని ప్రకారమే నడుచుకొనితీరాలనీ, పట్టుబట్టుతూవుంటారు కాని మొదటి రెండుదశలలోని అభిప్రాయాలకంటే, పరిపక్వదశయందలి అభిప్రాయమే సంఘాభివృద్ధికి శ్రేయస్కరమని అందరూ ఒప్పుకొంటారు. పాశ్చాత్యుల ప్రస్తుతావస్థ బాల్యందాటి యౌవనంలోపడుతూ వుంది. కాని భారతీయదశ పరిపక్వావస్థనుండి అధఃపతనాన్ని పొందింది. పడుతూవుండగా పడినతరువాత చుట్టూ ఆవరించుకొన్న నానావిధకుసంస్కారాలు అసలు సభ్యతనురూపుమాపినాయి కాబట్టే ఇప్పటి మన వారికి ఇతరుల తళుకుబెళుకులు భ్రమలను కలుగచేస్తూ ఉన్నాయి; కాని ఈలాటిమారపుకొండలనువు భ్రమలలో పడకుండా కుసంస్కారాలను తొలగించుకొన్నామూ అంటే చాలు. మరల మనసభ్యతాసూర్యుని ముందు పరులతళుకుబెళుకుమిణుగురుపురుగులు కంటికేకానరావు. సోమా! మనం నేర్చినవిద్యవలన మనకు ఉపకారంకలగడంలేదని భావించడమూ వెర్రితనమే. దేనిచేతగాని తాత్కాలికలాభంకలక్కపోతే అది దానిదోష మనడానికి వీలులేదు. మంచిచెడ్డల దెలియజేసి బాగును అవలంబింపజేసేదేవో అదేవిద్యకాని పైపూతలవలన మనసును ఆకర్షింపజేసి అనుచితకార్యాల్లో ప్రవేశపెట్టేది విద్యకాదు సుమీ! మొదలు అమృతప్రాయంగావుండి చివరకు విషంగా పరిణమించేవి కొన్నీ, మొదలే విషంగావుండి అంతానికి అమృతప్రాయంగామారేవి మరికొన్నీనీ. ఈ రెండురకాల కార్యాలనూ బాగాగుర్తించాలి. అదే మనంసంపాదించిన విద్యకుఫలం. భారతీయసభ్యతకూ, పాశ్చాత్యసభ్యతకూ స్వర్గపాతాళాల అంతరముంది చూడు. వారిదేశం వేరూ, మనదేశంవేరూ; వారిమతాలు వేరు, మనమతాలు వేరూ; వారిఆచారవ్యవహారాలు వేరూ, మన ఆచారవ్యవహారాలు వేరు; వారిసంప్రదాయాలు వేరు,- మనసంప్రదాయాలు వేరు; వారి యాహారపానాదులు వేరు, మన యాహారాదులు వేరు; వారిప్రస్తుతపురాజకీయపరిస్థితి వేరు, మనదాస్యపరిస్థితి వేరు; వారిఆదర్శాలు వేరు, మన ఆదర్శాలు వేరు. ప్రతివిషయంలో వేరువేరుగాఉన్న మనం వారినిఅనుకరించాలని కోరుకోడం ఎంత ఉచితమో ఆలోచించు. సోమా! మనుష్యజాతి పొందదగినసమస్తమునూ పొందడానికి కావలసిన సౌకర్యాలన్నీ మన సభ్యతలో ఉన్నాయి. వాటినన్నింటిని మరల పైకిదీసుకొని రావడమే మనకర్తవ్యం. దానివలన విద్యాగంధంలేని మనసోదరీమణులకేకాదు సమస్తప్రపంచానికీ మేలవుతుంది. ఇక స్త్రీపురుషులు పరస్పరం అవమానపరచుకొనవలసిన అవసరంఏమి? ప్రకృతినియమాలనుబట్టి మనమందరమూ నడుచుకోవలసిందేకాని మనమీద పురుషులును, వారిమీద మనమూ దురాగ్రహాలను బెట్టుకొని ప్రకృతివిరుద్ధంగా మెలగడం మనతరం కాదు. కేవలం హాస్యాస్పదం."

"జానకీ! క్షమించు. నీ మనోదార్ఢ్యం గుర్తింపక మనదేశంలోని విద్యావంతులనేకులు పాశ్చాత్య రీతులను ఆమోదించుచుండడంచేత, మీదు మిక్కిలి ఆనటవిటాగ్రేసరుడుగారే నీపేరనేమో వ్రాసియుండడం చేత తిన్నగ విచారింపకుండా ఏమేమోచెప్పి నీమనసుకు బాధకలిగించేను. నీవిపుడు చెప్పినసంగతులూ గమనించదగినవే."

"ఇందులో నిన్ను క్షమించవలసిందేమున్నది, సోమా! నీకు తోచిన అభిప్రాయం నీవు వెల్లడిస్తే నామదిలోని ఉద్దేశం నేను తెలియపరచేను. ఇంతమాత్రంచేతనే మనసుకు నొప్పికలుగునా? పాశ్చాత్యులనుండి మనం నేర్చుకొనదగిన విషయా లనేకములున్నాయి. కాదనుట నాతరంకాదు. కాని ఆధిపత్యంపొందిఉన్న కారణాన్ని వారినీతినియమాలనన్నిటినీ స్వీకరించితీరాలి అనేనిర్బంధంలేదు. బాగా ఆలోచించూ. మనదేశంమీద విదేశీయుల ఆక్రమణమున్నది. లేకుండా ఉండినకాలంలో—అత్యంతప్రాచీన కాలంలో— మానపూర్వు లాచరించుచుండిన నీతులూ, రీతులూ, వ్యవహారాలూ, అప్పటి సాంఘిక నియమాలూ మిక్కిలి ఉత్కృష్టమైనవి. అవికేవలమూ భారతీయ సంఘోపయోగములేకాదు-సార్వదేశిక సంఘోపయోగములని నాతాత్పర్యం. ప్రస్తుతం మనవారిలో అవివేకులు వారిననుసరించడానికి కారణం ఇప్పుడే

చెప్పేనుగదా! ఒకరిమాట ఎందుకూ? జాలంధరువెళ్లడానికిపూర్వం నాయుద్దేశాలూ ఆలాగే ఉండేవి. స్వకీయ వస్తుయోగ్యతాఅనభిజ్ఞతయే అందులకు ముఖ్యకారణం; కాని చింతలేదు. ఎవరి ఆచారవ్యవహారాలను అనుకరించాలనని మనవాళ్లు ఉవ్విళ్లూరుతూ ఉన్నారో ఆపాశ్చాత్యులు మనప్రాచీనులాచరించియుండిన వాటినే అవలంబిస్తూ ఉన్నారు. కాని కొన్నిఅతిశయాలతో, కొన్ని అతిక్రమణాలతో, కొన్నిలోపాలతోను. ఈఅతిశయాలు మొదలైనవి కలగడానికికారణం పాశ్చాత్యులిప్పుడు ప్రయోగావస్థలో ఉండడమే. అవలంబించి ఉన్నవానిమూలంగా క్రమక్రమంగా లాభనష్టాలు బయల్పడకపోవు. అప్పుడు నష్టముగలిగించే వాటిని వదిలి లాభదాయకములైనవాటిని గ్రహింపకనూపోరు. అంతలో మనమూ మనకర్తవ్యం కొంతవరకు నెరవేర్చుకొందుమేని చివరకందరకులభించేది మన ప్రాచీనులదశయే. దురభిమానంలేదు. ఇది సాహార్దికాభిప్రాయం."

"ఎవరో లోపలనుంచి పిలుస్తున్నారు."

'జానకీ' అనిలోపలనుండి మరలవినరా—

"కమలాంబగారు లాగున్నది."

"అవును. మాఅత్తగారే. నేను లోపలికివెళ్లి వస్తాను. కూర్చొనిఉండు."

"కూర్చోడంకాదు. నేనిప్పుడు హి. యు. సాకు వెళ్లాలి. సాయంకాలం క్లబ్బునుంచి ఇంటికి వెడుతూ మళ్లీకలుస్తానులే. నీవీస్థలాలకు రావడం బొత్తుగా మానేశావుకదా జానకీ! మనవాళ్లందరు నిన్నెంతో తలుచుకొంటూవుంటారు."

"సోమా! కానీ! రాత్రిగడచిపోదూ!"

అని జానకి లోపలికి వెళ్లగానే సోమావతి హిందూయువతీ సంఘములోజరుగు మీటింగునకై వెళ్లిపోయింది.

## ౨

"There is a Divinity that shapes our ends,
Rough—hew them how we will."

అని ఆంగ్లేయ కవికులసార్వభౌముడు వచించినలాగు మనమెన్ని విధాల ప్రయత్నం చేస్తున్నప్పటికీ వాటినన్నింటి తప్పుడు మార్గాలకు బట్టించి మన భాగ్యచక్రాన్ని త్రిప్పుతూఉండే దైవికశక్తి ఒకటిఉంది అన్నిటినీమించి. ఇందులకు తార్కాణంగా సమస్తయోగ్యతలను గలిగి ఉండియు అనేకులు దారిద్ర్యదేవతా సుపుత్రులై ఉండడం, ఎందులకూ కొరగాని వారు శ్రీసంపన్నులై ఆనందాల తేలుతూ ఉండడం మనం తరుచుగా చూస్తునే ఉన్నాము. ప్రస్తుతం ఒక మంచి జమీందారీఎస్టేటుకు రశీవరుగా ఉన్న పెన్షనుడ్ డిప్టీకలెక్టర్ రామేశ్వరరావుగారికి ఒక్కతేకూతురు జానకి - స్వదేశమందేకాక విదేశాలలో కూడా పేరు ప్రతిష్ఠల పొందుతూఉన్న రాఘవరావు M.A., Mus. M; M.O.D.S; గారి ధర్మపత్ని – మామగారు సర్కారు వారిచ్చే పెన్షను అనుభవిస్తూ ఉన్న ఒక హైకోర్టుజడ్జి—కాని, పిశినిగొట్టుకాదు—మహోఉదార స్వభావం కలవాడు అన్ని విధాలానూ—వీరినామధేయం సుందరరావు. ఇక ఈమె అత్తగారో సాక్షాత్తు లక్ష్మీదేవి. చదువునేర్చిన కోడలిని జూచి చీదరించుకొంటూ మహారాణిగారనీ, దొరసానిగారనీ సంబోధనలతో ఎత్తి పొడుస్తూఉండే అత్తగార్లవలె గాక కోడల్ని తన కడుపున గన్న కూతురులాగు జూచుకొనే దొడ్డ ఇల్లాలు.

బంధు వర్గం, పెనిమిటి మొదలగు వారిమాట అలాగు ఉండగా స్వయం జానకి మద్రాసు విశ్వవిద్యాలయానికి అలంకారభూతలైన పట్టభద్రలలో ఒకతె. ఇంతేకాదు. ఆసేతుహిమాలయం హైందవబాలికా విద్యాపీఠాల్లో ప్రసిద్ధికెక్కి ఉన్న పంజాబులోని జాలంధరునగిరస్థకన్యామహావిద్యాలయనామకరత్న సంస్కారకర్మాగారంనుండి సంస్కృతినిబొంది వెల్వడిన రత్నాలలో ఒకతెకూడాను. రూపమందేమైన దక్కువా? సౌందర్యాధిదేవతావిలాసభవన మీమె సుకుమారశరీరం. కమలాయతలోచన యగు నీ సువర్ణ గాత్రిని జూచు వృద్ధదంపతులందరూ "హా! మాకీలాటి పుణ్యములపంట లభింపదాయె"నని తమ భాగ్యాన్ని నిందించుకొంటూ ఉంటారు. అకస్మాత్తుగా క్షణమాత్రమైన జాలు. ఈ గులాబీపువ్వును చూడడంతటస్థించిన యువకుల నేత్రాలు ఫొటోగ్రాపు లెన్సులయొక్కయు, హృదయఫలకాలు నెగేటివ్ ప్లేట్లయొక్కయు ధర్మాల నవలంబిస్తూ ఉంటాయి.

ఈలాగు ఇహలోకసౌఖ్యాలను అనుభవించడానికి గావలసిన సాధనసామగ్రులన్నీ ఈమెదగ్గర పుష్కలంగా ఉన్నప్పటికీ పాపమీ జవ్వనికాలాటి భాగ్యంలేదని ఇంతవరకు సోమావతితో మాట్లాడినదానిని బట్టి చదువరులు గ్రహించే వుంటారు. దీనికి హేతువేమిటీ? నామట్టుకు నేను పైనవ్రాసిన 'There is a Divinity' ఇత్యాదివాక్యాలసారాంశమే హేతువనుకొంటాను. కాని లౌకికంలో మనమీలాగుకల్పించుకో వచ్చు అదే కారణాన్ని.

రామేశ్వరరావు సుందరరావు లిద్దరూ విద్యాధికులగుటే కాక వీరి ఆశయాలుకూడా చాలా విశాలమైనవే. కావున తమ సంతానాలకు మంచి విద్య పట్టు బడడానికి కావలసిన సదుపాయాలన్నింటిని చేశారు. రాఘవరావుకు చిన్నప్పటినుంచి సంగీతం అంటే మహాప్రేమ. ఇతని నోటివెంట అప్రయత్నంగానే వెడలుతూ ఉంటాయి రాగాలాపాలన్నీ వేళాపాళాలేకుండా ఎల్లప్పుడూ. సకలవిధాలా ఇతని పురోభివృద్ధినే అభిలషిస్తూ ఉన్నతండ్రి ఇతనికి సంగీతమందున్న అభిరుచిని గనిపెట్టి దాన్నికూడా పెంపొందించుకొనడానికికావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు. సూక్ష్మబుద్ధిగల కొమారుడు శ్రద్ధతో రెండువిద్యలలో పరిశ్రమ సలుపుతూ క్రమంగా 17 ఏండ్లునిండునప్పటికి అటు మెట్రిక్ ప్యాసయి ఇటు సంగీతంలో చాలా వరకు గడతేరేడు. భావిజీవితంలో అనేకపరివర్తనాలను కలుగజేసిన ఇతని నాటకసమాజప్రవేశం ఈ సమయమందే ఘటించింది. నటుల వేష పరివర్తనాలవలె యువకులజీవితాలను సైతం చిత్రవిచిత్రంగా మార్చి వేస్తుంటాయి ఈ నాటకరంగాలు. దేశమందలి లౌకికనైతికస్థితులలోగల లోపాలవలన వీని మూలకంగా లాభం పొందినవారికంటే నష్టపడిన వారే ఎక్కువమంది. వీనికి గలుగవలసినంత జనాదరణసహితమైన గౌరవము కలుగక బోవుటకూ ఈ లోపాలే కారణాలు. కాని మన రాఘవరావుకు మాత్రం తాత్కాలికనష్టం ఏమీ కలుగలేదు. క్రమంగా రెండు సంవత్సరాలు దాటేసరికి ఇంటర్మీడియేటుసర్టిఫికేట్లుతోబాటు నాటకరంగంమీద సర్టిఫికేట్లు, పతకాలూ గూడా లభించేయి. అదిగాక స్వదేశంలోని తక్కిన నాటకరంగాలతో సరిసమానమైన స్థితిలోనికి గొనితెచ్చి కీర్తిసన్మానాలపొందవలె ననే దృఢమగు అభిలాషఒకటి పుట్టింది ఇతని మనసులో. ఈకోంకను పూర్తిచేసుకో డానికి స్వదేశమంతగా సాధ్యంకానందున విదేశంపోవలెనని నిశ్చయించుకొని అందులకు ప్రయత్నంచేయ సాగేడు. కాని ఒక ఆటంకంవల్ల అప్పటికాకోర్కెను వెనుక బడవేయవలసి వచ్చింది. ఈ సంవత్సరమే ఇతనికి జానకితో వివాహమైంది. పెన్షన్దార్లిద్దరూ సహాధ్యాయులూ బాల్యస్నేహితులునై యుండడం జానకీరాఘవుల వివాహ మింత తలవని తలపుగా చెయ్యడానికి కారణం. వివాహంనాటికి జానకికి 15 ఏండ్లు

ఆరో ఫారంలో చదువుతూ ఉంది. ధనం గలవారిబిడ్డలు కావడంచేత ముందుముందు విద్యాభివృద్ధి నిమిత్తం ఏవిధమైన లోటుపాటులుండవనే నిశ్చయంతో వివాహం మాత్రం చేసివేశారు. కాని రాఘవరావుకు విదేశగమనాభిప్రాయంపోలేదు.

వివాహమై ఒకసంవత్సరం గడచిన తరువాత జానకికూడా మద్రాసుకేవచ్చి చదవడమారంభించింది. వీరి సహవాసం మూలాన్ని విద్యాభివృద్ధికేమాత్రం ఆటంకం కలక్కపోవడం. అలాగు ఉండగా వారికది తోడ్పాటే కలుగజేసింది. ఉత్తమశిక్షితయగు నీభామిని విద్యావిషయమై కావలసిన సమస్తసహాయాన్నీ భర్తవలన గైకొనుచు దమ ఇద్దరి చదువుకేమాత్రం హానికలుగక ఉండేలాగున మెలగుతూ వచ్చింది. మరియు మద్రాసువంటి నగరంలో విద్యాసంపన్నులైన యువతీయువకులు అనుభవింపగల నానావిధాలైన సౌఖ్యాల నుండియు వీరు వంచితులుగా ఉండలేదు. దేశహితానికనీ, సంఘాభివృద్ధికనీ నగరంలో ఏర్పడి ఉన్న సమాజాలలో వీరికీ ఉంది ప్రవేశం. కాని ఎచటికి పోయినప్పటికి భార్యాభర్తలిరువురు జంటబాయకుండా వుండేవారు. ఈలాటి ఆనందభోగాలతో మరి రెండు వర్షాలు రెండునిముషాల్లాగు గడిచిపోయినాయి. రాఘవరావు బి. ఎ; లో, జానకి ఇంటర్మీడియేటులో జయమును పొందేరని బంధుమిత్రాదుల కందరికి అపరిమిత సంతోషం గలిగినప్పుడు ఇక అసలు వారికి గలిగిన ఆనందానికి పరిమితి వున్నదా ? అనంతరం రాఘవరావు ఇంగ్లండుపోవలెనని మరల పట్టుపట్టి ఆ విషయమై తనభార్యతో అనేకసార్లు ప్రస్తావంచేశాడు. ఎందువల్లనో ఆమె మనసునకది సమాధానంగా లేకపోయినప్పటికి పెనిమిటికనుకూలంగానే సమ్మతినిస్తూ వచ్చింది. తుదకేలాగయితే నేం ? తలిదండ్రులను, భార్యనూ, తక్కిన సమగ్రబంధువర్గాన్నీ సమాధానం చేసికొని యూరోపుకు ప్రయాణమై వెళ్లిపోయినాడు.

## 3

రాఘవరావు వెళ్లిపోయిన తరువాత ఒకటి రెండు నెలలపర్యంతం అతని ఎడబాటువల్ల కలిగిన వ్యాకులంచేత జానకి విమనస్కయై ఏమీ తోచకుండా ఉంటూవచ్చింది. కాని విద్యాభివృద్ధి యెడల గల దృఢానురాగం ఈమె చింతలను పారదోలి కర్తవ్యపరాయణనుగా జేసింది. అక్కడ నూతనప్రదేశావలోకనకౌతూహలం చేతా, మీదు మిక్కిలి నాట్యనాటకకళాపారంగతుడు కావలయుననే ఉత్కట ఉత్సాహంచేతా రాఘవుని గూడా భార్యనువదలుటవలనకలిగిన దుఃఖమంతగా బాధించింది కాదు. భార్య భారతవర్షంలో, పతి పరదేశంలో వారి వారిమనోరథాలు ఫలింపజేసుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. పరస్పరలిఖితప్రేమపత్రాలు చేతులకందగా వానిని జదువుకున్నంత సేపూ కలిగే అన్యోన్యస్మరణాల వలన ఉదయించే ఆవేగంమూలాన్ని మనస్సులు పరిపరివిధాల పోతూవున్నప్పటికీ తుదకేలాగో వాటిని జిక్కబట్టుకొని యథాప్రకారం తమ తమ విధులను నెరవేర్చుకొంటూనే వచ్చేరు. జీవితమధ్యకాలంలో సంభవించే అనేకవిధములైన ఘోరములనుండి దూరగులై సుఖంగా కాలం గడపడానికని పరమదయాళుడగు ఈశ్వరుడు మఱుపనే మహౌషధాన్ని ప్రసాదించినాడు నిర్బలహృదయాన్వితమైన మానవజాతికి. దినక్రమేణ కలిగిన ఇట్టి విస్మరణమే వీరిని మరల కార్యతత్పరులనుగా జేసింది. ఉచితకాలంలో నిచట మద్రాసు విశ్వవిద్యాలయాన్నుంచి బి.ఎ. పట్టాన్ని సంపాదించినది జానకి. అక్కడ రాఘవరావు M.A, Mus. పట్టాలను బొంది M.O.D.S. బిరుదాన్ని గూడా గైకొన్నాడు.

స్వచ్ఛమైన నీటిబిందువు మలినప్రదేశములోబడి అపవిత్రమై పోతుందనీ, కాగెడు ఇనుపరేకుమీద మాయమైపోవుననీ, సముద్రములోబడి ముత్తెమౌతుందనీ భర్తృహరి వచించియున్నాడు. ఇదే ప్రకారం విద్యకూడా ఆశ్రయోపాధిని బట్టి అనేకవిధాలుగా మారుతూవుంటుంది. స్వార్థపరుడూ, లోభాగ్రేసర

చక్రవర్తి అయిన ఒక న్యాయాధిపతియందు ప్రవేశించి విస్పష్టమైన న్యాయాన్ని అన్యాయంగా, అన్యాయాన్ని న్యాయంగా నతనికి జూపిస్తూ ఉంటుంది ఇదేవిద్య. ఆశాపాశాలలో గట్టువడి ఉచితానుచితములను మరచిన అజ్ఞానాంధుడైన యొక వర్తకుని కుంభోదరమందు దూరి సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా పలికిస్తూ వుంటుంది నిరాఘాటంగా, నిస్సంకోచంగా, తొణుకూ బెణుకూ లేకుండా యిదేవిద్య. దురాచారుడూ దుస్స్వభావుడూ కుక్షింభరుడూనైన ఏ పురోహితుని యొక్కయో, లేక ఏ ఉపదేశకుని యొక్కయో తలకెక్కి ధర్మాన్ని అధర్మంగా, అధర్మాన్ని ధర్మంగా శ్రోతలకు బోధించేలాగు ఆతనిని ప్రేరేపిస్తూంది ఇదేవిద్య. విశుద్ధమైన అంతఃకరణగల ఒకమహానుభావుడు లోకోపకారానికైన మంచి యంత్రావిష్కారం చెయ్యాలనని ప్రయత్నిస్తూఉంటే తద్విపరీతస్వభావుడైన తస్కరసార్వభౌముడు లోకుల కొంపలను తీయడానికి పనికివచ్చు యంత్రావిష్కరణానికి ప్రయత్నిస్తూవుంటాడు అదేవిద్యాప్రభావాన్ని. సన్మార్గుడైన భూమిపాలకుడు తన ఏలుబడిలో ఉన్న ప్రజలందరూ ఐకమత్యంతో సౌఖ్యంగా కాలంగడుపుతూ అభివృద్ధిపొందడానికి దగిన ఉపాయాలను అవలంబిస్తూ ఉంటే అందులకు విపరీతవర్తనంగల భూపాలనామకుడు ఐకమత్యాన్ని అడవులబాలు జేసి గర్దభాండాలవంటి సౌఖ్యాలతో, ఆకాశప్రసూనాలవంటి అభివృద్ధులతో లోకులందరూ త్రాహి త్రాహి యని భగవంతుని దలచుకొనేలాగునచేసి తాను మాత్రం స్వోదరపూరణం చేసుకొంటూ ఉంటాడు అదేవిద్యాసహాయాన్నీ. పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదనినట్లు విద్యవలన అసలు స్వభావం మారదు. పైగా ఉన్నదాన్ని మరింత బలమైనదాన్నిగా జేస్తూవుంటుంది. ఈ విద్యను చాటు జేసుకొని తన ప్రకృతిని మరింతనిపుణంగా ఉపయోగించుకొంటూఉంటాడు మనుజుడు. కారణాంతరసంయోగంచేత శుద్ధప్రకృతిపరివర్తితదశను బొందినప్పటికీ తత్కారణనిర్గమనమైనవెంటనే మరల శుద్ధత్వం బొందడమూ సహజమే. ఇందులకు జానకీ రాఘవు లిద్దరూ ఉదాహరణాలే.

జానకి నైజంగా ఉత్తమస్వభావం కలది. కాలేజీలలో చదువుతూ ఉండిన కాలంలో ఈమె మెలగుతూవచ్చిన సంఘప్రభావంచేత, అభ్యసించే విద్యామహిమచేతా ఈమె ఆచారవ్యవహారాలన్నీ వేరుగానే ఉండేవి. కాని ఈ కథ వ్రాయునాటికి అవన్నీ బొత్తిగా మారిపోయినాయి. చదువుకొనే రోజులలో ఈమె యువతీయువకసంఘాలకు వస్తూపోతూ ఉండేదని ఇదివరకే సూచించి యున్నాను గదా. డిగ్రీ చేతికందేసమయానికి దక్షిణప్రాంతంలో సుప్రసిద్ధులని ప్రసిద్ధిబొందిన వక్త్రినులలోనొకతె అనేపేరు గాంచినది ఈమె. ఎక్కడ స్త్రీసమాజాల ఉత్సవాలైనా ఈమెకుగూడా పెలిగ్రాపు ఆహ్వానాలు వస్తూ వచ్చేయి. తగినంత అవకాశము లేకపోవడంచేత కొందరిప్రార్థనలనూ దిరస్కరించవలసివచ్చిందిగదా అని చింతిస్తూకూడా ఉండేది అప్పుడప్పుడు. ఇక మద్రాసునగరంలో ఈమెకు దెలియకుండా జరిగే సభలు ఉండేవేకావు. మిస్. సోమావతి ఈమె చిరస్నేహితురాలు. సోమ జూనియర్‌లో ఈమె సీనియర్ క్లాసులో (ఇంటర్) ఉండగా వీరిద్దరికీ స్నేహం కుదిరింది. అదిమొదలుకొని అక్కచెల్లెళ్లలాగు ఎడబాయకుండా విద్యాభ్యాసముచేసి ఇద్దరూ పైకివచ్చేరు. ఈడూ, జోడూ, స్వభావాలూ కలిసినమైత్రి వీరిది. ఒకరి సౌఖ్యాన్ని గురించి ఒకరు శ్రద్ధతీసుకొంటూఉంటారు.

చదువుతూ వున్నంతకాలం జానకిపాశ్చాత్యులనే అనుకరిస్తూ వుండేదని వ్రాసియున్నాను. అలాగు వుండకవిధిలేదు. వంట బట్టినభాష విదేశీయం. మీదు వేషభాషలుగూడా దాని కనుకూలంగానే వుండేవి. “ హిందువులంత కృతఘ్నులూ, హిందువులంత అసత్యవాదులూ ప్రపంచమందలి మరి ఏజాతిలోనులేరు. అందులోబ్రాహ్మణులు ప్రత్యక్ష బ్రహ్మరాక్షసులు. స్త్రీలకూ శూద్రులకూ చదువే పనికిరాదని బోధించిన ధూర్తులు. వీరల పురాణాలన్నీ రంకుపురాణాలే. సోమపానం పేరుపెట్టుకొని సారాయి తప్పదాగి మత్తి

తప్పిపోయిఉన్నసమయంలో ప్రేలినప్రలాపాలు వీరి వేదాలు. ధర్మాధర్మాలను నిరూపించే యాజ్ఞవల్క్యుడు లాటిధర్మశాస్త్రకర్తకు గొడ్డుమాంసం ఉంటేనేగాని మెతుకుదిగేదికాదు గొంతులోకి. వీళ్ల దేవుళ్లందరూ జారశిఖామణులే. ఇన్ని అనర్థాలూ, ఇన్ని అవకతవకలూ, ఇన్నిదుర్నీతులూ, ఇన్ని దుండగాలూ ఉన్నజాతి కాబట్టే చివరకు పాతాళానికి పోయేగతిపట్టింది. మాకీలాటి దౌర్భాగ్యపు జాతిలో పుట్టేమనుకోడానికే తలవంపుగా ఉంటుంది. మనవంటి అనాథలమీద గనికరించి ప్రభువుపంపిన భాగ్యదేవతలాగు ఆంగ్లేయ పరిపాలనం లభించబట్టి దక్కివున్నాంగాని లేకపోయిన యెడల ఏశూలంమీదనో, ఏకాష్టంమీదనో, ఏ గంగలోనో బడి చెల్లుకొని ఉండేవాళ్లమే ఈపాటికి. దైవవశాన్ని మనకులభించిన ఈ అమూల్యమైన అవకాశాన్ని చేతులనుండి జారపోనీక సంపూర్ణమైన లాభంపొంది తీరాలి........"

ఈలాటి సారాంశాలతోడనే నిండి వుంటూవుండేవి సాధారణంగా ఈమె స్వదేశం స్వజాతి అభివృద్ధికని పేరుబెట్టి ఆకాలంలో యువతీయువకులతో కిటకిటలాడుతూఉండే వ్యాఖ్యానశాలల్లో వినిపిస్తూ వచ్చిన లెక్చర్లన్నీని. ఇది ఈ ముగ్ధకన్యకల దోషం లేశమాత్రం కాదు. ప్రస్తుతం ఆసేతుహిమాలయ పర్యంతభారతవర్షంలో ప్రచారంలో ఉన్న విద్యాప్రభావం. గొప్ప గొప్ప కాలేజీలనేపేరుతో హైందవుల జ్ఞానాన్ని అభివృద్ధిచేసి వారి భాగ్యాభాగ్యాలను నిర్ణయించడానికనీ, కోట్లకొలది దేశీయద్రవ్యరాసులతో నిర్మింపబడియున్న ఈ విద్యాపీఠములలో ఉపయోగింపబడే పఠనీయగ్రంథాలన్నీ, విదేశీయుల కీర్తిప్రతిష్ఠలనూ వారి వీర్యశౌర్యసాహసములనూ, వారి యాచారవ్యవహారములనూ పొగడుతూఉంటాయి; కాని హిందూ దేశానికి సంబంధించినదేమీ ఆగ్రంథాల్లోఉండదు. ఉండకపోయినా చింతలేదు. మీదు మిక్కిలి ఈ పఠనీయ గ్రంథాలలోని స్వదేశీయనిరసనాలు బాలికాబాలకులకు మనసులందు ప్రవేశించి తమవారి యెడల విపరీతభావాలను గలిగించడానికి కారణాలవుతూ ఉంటాయి. వింత వింత వస్తుప్రదర్శనశాలలకూ విశాలగ్రంథాలయములకూ ఈ నవనీతకోమలాంతఃకరణులైన బాలికాబాలకులబృందముల నడిపించుకొని పోయి అచట వారికి జూపించి బోధించేదేమటీ? కార్నివాలిస్, క్లైవ్, మన్రో, నెయిల్ విగ్రహాలూ వారువారుగావించియున్న ఘనకార్యములూ. ఈలాటి గ్రంథములను బఠించుటవలన, నీలాటి ఉపదేశాల నాలకించుటవలన నిశ్చయంగా స్వదేశ, స్వమత స్వధర్మాలమీద వెగటూ విదేశంమీద విధర్మాలమీద అనురాగం కలుగకమానదు. దిక్కుమాలినన్ని మనదేశానికి జెందిన గ్రంథాలున్నాయి. వాటిని జదువ గూడదా అంటారేమో అవన్నీ పఠనీయగ్రంథాల్లోరావు. ఆ వున్నవీ విదేశీయులభిక్షాలే. వాటిలో నూటికి 99 పాళ్లు విదేశీయుల విద్యాజ్ఞానాల గానాలాపాలతో, అసలు గ్రంథములలోని కొరవలు కొరతలను ప్రదర్శించే ఉపోద్ఘాతాలతో ఆరంభమై అనువాదకుల విశ్వాసాలకూ, ఉద్దేశాలకూ అనుకూలంగా ఉండే లెక్కలేని టీకాటిప్పణీలతో ముగింపునుబొందుతూవుంటాయి. వీటిని పఠించుటవలననూ కొంచె మించుమించుగా పైనవ్రాసిన పరిణామమే లభిస్తూవుంటుంది పాఠకులకు; కాని వాటినైనా జూడడానికి అవకాశం దొరకాలికదా. పరీక్షాగ్రంథపఠనాలతోనే పెద్దలు తలపునకువస్తూవుండగా ప్రాణాలుఎగిరి పోతూవుంటాయి. ఇక దక్కినవాని జూచేదేమిటీ? పరీక్ష పూర్తిఅయిన మర్నాటినుంచీ (రిజల్ట్సు ఇంకా రెండునెలలకుగాని బయటబడవు) నౌకరీలకోసం సర్క్యూట్లతో సరిపోతుంది. పరీక్షలో ప్యాస్ కాకపోయిన మళ్లీ వేరొక కాలేజిలో సుఖజీవనం చేయనేవచ్చు. లేక కర్మంజాలక ఉత్తీర్ణమైన యెడల ఏ ఉద్యోగిప్రభువు వారి అండనో ఆశ్రయించి తిట్లకు వెరువక, కొట్లకు బరవక, శాపాలకు చెదరక, దిగదుడుపులకు బెదరక, అవమానాలకు జంకక, అపహాస్యాలకు గొంకక బండలాగుబనిచేస్తూ ఉంటే సూర్యుడు ఎటు బుట్టి ఎటు

అస్తమించేది గూడా తెలియకుండా గడచిపోతుంది ఐహికజీవితజాలం యావత్తునూ. కాబట్టి స్వకీయ గ్రంథాల్లోని మంచి చెడుగుల గురించి తెలుసుకోవడానికి అవకాశమే దొరకదు మనవారికి. ఈ హేతువు చేతనే దక్షిణమందున్నంతవరకూ జానకి పాశ్చాత్యనాగరికతాశిష్యురాలుగనే ఉంటూవచ్చింది; కాని తరువాత జరిగిన ఒకఘటనంవలన ఈమె జీవితంబొత్తుగా మారిపోయింది. ఈమె బి.ఎ. ప్యాసయిన సంవత్సరమే రామేశ్వరరావుగారు కుటుంబసమేతంగా కాశ్మీరం పోవడం తటస్థించింది. అంతవరకు ప్రతిఎండాకాలంలో ఉదకమండలంవంటి ఏ శీతలప్రదేశానికో బోయి గడుపుతూ ఉండేవారు. కాని ఈతడవ కాశ్మీరప్రయాణం పెట్టుకొన్నారు. భూలోకస్వర్గమనదగిన కాశ్మీరమండలి నందనవనతుల్యమగు తద్రాజధాని శ్రీనగరంలో ఒక విశాలసుందరమైన హౌసుబోటునందు వాసంగుదుర్చుకొని మూడునెలలపర్యంత మచట దర్శనీయ స్థలాల నవలోకిస్తూ దివ్యసౌఖ్యాలనుభవించి మరల గృహోన్ముఖులై వీరు ఇతిహాసప్రసిద్ధంబైన మార్తాండమందిరం, తక్షశిలా, లాహోర్, అమృతసరం మున్నగు ప్రదేశాల మీదుగా జాలంధరు నగరం చేరేరు. ఈపట్టణం కన్యామహావిద్యాలయానికి ప్రసిద్ధికెక్కినదని ఈమె అదివరకూ చాలాపర్యాయాలు విని ఉండెనుకాని చూడడంమాత్రం సంభవించినదికాదు. అచట దిగి ఆ మహావిద్యాలయమును చూచుటకుబోయినప్పుడు ఆ సంస్థయొక్క ప్రథమదర్శనమే ఆమె మనసు నాకర్షించింది. కొంతకాల మక్కడనే వసించి ఆర్యలలనలసాంగత్యసౌఖ్యమనుభవింపవలెనని ప్రబలమగుకోరికజనింప దానిని దండ్రికి దెలియబరచింది. అతడునూ అందుల కామోదించి యామెనక్కడనే దిగవిడిచి తక్కినవారితో స్వదేశంవచ్చి చేరేడు. ఆ ఉండడం ఉండడం ఈమె అక్కడ రెండేండ్లపర్యంతమున్నది. అచట ఈమె గావించిన ఆర్షగ్రంథపఠనంచేత ఈమె కంతకు బూర్వముండిన అభిప్రాయాలనేకములు మారిపోయినాయి. పశ్చిమపూర్వవిద్యలసమ్మేళనమున నీమెయందొక అపూర్వనిశ్చయం జనించినది. ఆనిశ్చయంయొక్క స్వరూపం కొంతవరకు మొదటి ప్రకరణంలోని సోమవతీసల్లాపాన్నుంచే కనుగొనవచ్చును.

## ౪

కన్యాగురుకులవాసంచేతనూ, ఆర్యావర్తభ్రమణంచేతనూ దానుసంపాదించిన అనుభవాన్ని స్వదేశమందలి సోదరసోదరీమణులకు నివేదించి ఉపకారజనితపుణ్యంతోబాటు కీర్తిగౌరవాలను పొందవలెననే మహాఉత్సాహంతో జానకి మద్రాసునగరానికి దిరిగివచ్చింది. కాని విధినియతి వేరొకలాగు ఉండినది. సంగీతకళానిధియై, నాటకరంగకుశలుడై భారతీయనాటకసంస్థలను మహోన్నతదశలోనికి దీసుకొని రావాలననే ఉత్కటాభిలాషతో లండన్ నగరంజేరిన రాఘవరావు నాలుగుసంవత్సరాలు గడచుననగా స్వకర్తవ్యపరాఙ్ముఖుడు కావడమే ఇచట అతనిధర్మపత్ని విఫలమనోరథయగుటకు కారణము. కార్యసిద్ధికి ఇంద్రియనిగ్రహమావశ్యకం. అందులో రాఘవరావు తలపెట్టినటువంటి కార్యానికి అత్యంతావశ్యకం. ఈ విషయమందే ఇతడు దెబ్బదిన్నది. దీనిలో మెలకువగలిగి ప్రవర్తించియుండినయెడల నిజముగ నితడుతలపెట్టినకార్యం నిరభ్యంతరముగ నెరవేరి తరువాత స్వదేశానికిగూడా మేలుగూర్పజాలియుండేదేకాని జయాపజయాలు మనచేతిలోనివికావు. కృష్ణమిశ్రుడు వచించినలాగు కేవలదృష్టిప్రసారాలే చాలు స్త్రీపురుషుల మనసులను గలతపెట్టడానికి. అట్లాంటప్పుడు ఎట్టిబాంధవ్యం లేని యువతీయువకులు స్పర్శనచుంబనాలింగనకరపీడనాదుల నిరాటంకంగా నెరవేర్చుకొంటూ ఇతరులెవరైన నడిగినచో తాము కేవలం అన్నచెల్లెండ్రవలె మెలగుచున్నామని చెప్పడం ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది. మొదలుమొదలిట్టివారిస్నేహం సోదరీసోదరభావంతోనే ఆరంభం గావచ్చును; కానినిరంతరసాహచర్యంవలన గాలాంతరమున దట్టిభావం ఉండడం దుర్ఘటమే కాక అసంభవంకూడాను.

ఈసోదరీసోదరభావం ఎంత సూక్ష్మంగా పరివర్తనం పొందుతూ ఉన్నదీ వీరు గ్రహింపనేజాలరు. వైజయింతీవిలాసకారుడు వచించినలాగు యువతీయువకుల నిరంతరసహవాసంమూలాన్ని వజ్రసన్నిభమైన మానసం లోహమై, గ్రావమై, దృఢదారువై, తరుణవృక్షమై, ఫలమై, పూవై, అందలిమకరందమై, నీరమై, అంతకంటె పలచని పెట్రోలియమై హృదయాగ్నిచే భగ్గుమనలేచిన జ్వాలాసమూహంలోబడి సోదరీసోదరభావమూ, నయమూ, భయమూ, సిగ్గూ, భిడియం, ధర్మం, కర్మం అన్నిఒక్కపెట్టున భస్మంకాకుండా వుండడం నైసర్గికానికి కొంతవిరుద్ధమే. ఈలాటి నైసర్గికవిరుద్ధాలే ఘటిల్లుచో తత్కారకులైన శుక, ఋష్యశృంగుల మూలంగా భారతవర్షంయొక్క భావి పండినదన్నమాటే.

స్వదేశమందలి యువతీయువకుల సంఘాలలో నిర్భయంగా మెలగనేర్చిన రాఘవరావువంటి వానికిగూడా ఇంగ్లండుచేరిన మొదటినెలలో అచటిస్త్రీల విశృంఖలవృత్తిజూచి కొంచెంసంకోచంగలుగుతూ వచ్చింది; కానిఒకనెలగడచేసరికి అదిమాయమైంది. ఇతనికిగల సూక్ష్మబుద్ధి, చాకచక్యం, సంగీతమందలి నేర్పు, నాట్యమందలినైపుణ్యాం, కలియగలుపుదనం అన్నీకలిసి కొన్నివారాలకే ఇతనికపరిమితమైన స్నేహితులనూ, స్నేహితురాండ్రనూ జేకూర్చిపెట్టేయి. ఇంగ్లండులోని ప్రధాననగరాలన్నింటిలో హైందవ సంగీతనాట్యకళావిశారదుడని పేరు మోగిపోయింది. ఆర్టులో, మ్యూజిక్‌లో మాస్టర్ డిగ్రీలనుబొందేడు. ఆక్సఫోర్డుయూనివర్సిటీ డ్రమాటిక్ సొసయిటీవారు మెంబరుపదవినిచ్చి సన్మానించారు. నాలుగుఏండ్లు పూర్తిగావచ్చేయి. ఇదేసమయాన్ని హిందూదేశానుంచివచ్చిన మిస్. లలితఅనే యువతియొకతె ఇదే క్షేత్రంలో బనిజేయుచుండిన కారణాన్ని దైవికంగా వీరిద్దరికీ నేస్తమైంది.

కొన్నాళ్లపర్యంత మిద్దరూ ఆక్సఫర్డువారు ప్రదర్శించే హిందూనాటకాల్లో నాయికా నాయకుల పాత్రలుధరిస్తూవచ్చేరు. ఇక్కడ ఈలాగు ఉండగా పారిస్ నగరాన్నుంచి రాఘవరావుకు మరొక ఆహ్వానంవచ్చింది. అచటి ఒక సుప్రసిద్ధ ఫిల్మ్ ప్రొడ్యూసింగ్ కంపెనీ ప్రొప్రయిటరు ఇతనికి నెలకు రెండువేల ప్రాంకు లిచ్చే ఏర్పాటుమీద హిందూపురాణాలకు జెందిన ఫిల్ములకు నాయికానాయకుల వేషాల దాల్చు నిమిత్తం లలితనుగూడ దీసికొని రావలసిందని కోరేడు. ఇక గావలసిందేమిటీ? నాట్యనాటక కళాభివృద్ధితో బాటు ద్రవ్యార్జనంగూడా లభించిందని సంతోషంగా పారిస్‌కు ప్రయాణమై వెళ్లేడు లలితను వెంటబెట్టుకొని.

ఆక్స్‌ఫోర్డులోనైతేనేం, పారిస్‌లోనైతేనేం లలితారాఘవు లిద్దరూ సాధారణంగా నాయికా నాయకుల పాత్రలనే ధరిస్తూవచ్చేరు. కాబట్టి మనస్సులలో మొదలు ఆలాటి వాంఛలు లేకపోయినప్పటికీ, పాత్రాభినయానికిగాను ఆయాసమయాల్లో స్పర్శన, ఆలింగన, చుంబనాదులనూ తప్పని సరిగా చేసికోవలసి వచ్చేది. సాధారణంగా నాటకకంపెనీలలో నాయికానాయకుల వేషాలను ధరించేది పురుషులే అయినప్పటికీ చిరకాలం అట్టిపాత్రల దాల్చుచుండుటచేతనే కావచ్చును వారిద్దరికి ఒకవిధమైన అనురాగంమాత్రం ఏర్పడుతుంది. అట్టిసమయంలో నిండుయౌవనంలో ఉన్నస్త్రీపురుషులమీద ఆలాటి వేషధారణ ప్రభావం మరింత ప్రబలంగాపడినదంటే ఆశ్చర్యమేముందీ? లలితారాఘవులస్నేహం దినకర్మాన్ని అభివృద్ధియైనకొలదీ పైనవచించిన స్పర్శనచుంబనాదులు కేవలంనాటకరంగాల్లోనేకాక పార్కురంగాల్లో, హోటల్‌రంగాల్లో హాలిడేరిజార్ట్‌రంగాల్లో ఇంతఎందుకూ అట్టికార్యాలకు అవకాశందొరికే సకలరంగాల్లోకూడా జరుగుతూ వచ్చేయి. తరువాత క్రమంగా ఒకరినివిడచి యొకరికి ఉండడానికే కష్టమనిపిస్తూవచ్చింది. లలితపై

వ్యామోహం బొడిన మొట్టమొదటిదినం జానకీ స్మరణ మితన్ని మహాబాధించింది. ఆనాడు ఆ సాధ్వి యెడల కౄరుడై యిలాంటి ద్రోహం చేయడం మహాపాతకమని యతని అంతరాత్మ బోధనల వలన కలిగిన హృదయవేదనలచేత కళ్ల నీళ్ల పర్యంతం గూడా అయింది. కాని మరునాడు లలితను కలిసికొన్నప్పుడు ఆమెతో యథాప్రకారం ప్రేమసల్లాపాలాడేడు. ఆరంభదినమందు అణుమాత్ర స్వరూపంతో ఉదయమందిన లలితావిషయికవ్యామోహం దిన దినాభివృద్ధిపొందుతూ తుదకు మహాపర్వతపరిమాణం గాంచినలాగు ఇందులకు విపరీతక్రమాన్ని మొదట కొండంతలుగనుండిన ధర్మపత్నీవిషయికఅనుతాపం క్షీణిస్తూ క్షీణిస్తూ చివరకు అణువై పరమాణువైఅంతర్ధానం పొందింది. లలితాదత్తఉపగూహనచ్చుంబనహాసీయహాసివిలాస భోగాలముందు దూరమందలి భార్యాస్మరణం రవంతైనా పనిచేసిందికాదు. ఆఖరుకు ఇంద్రియాల పాశవికబలానికి వివేకబలం లొంగిపోయింది. తరువాత నచటి యొక వివాహపు చట్టప్రకారం Miss లలితా Mrs రాఘవలలితగా మారిపోయింది. ఈ విషయమై సమస్తమూ యింటివారికి తెలియబరచి జానకికి ఆమె ఇష్టంవచ్చినలాగున ఉండవచ్చుననికూడా వ్రాశాడు. కన్యాగురుకులవాసానికి బూర్వమే ఇది సంభవించి యుండినచో ఈమె యేలాగు నడుచుకొనియుండెడిదో తెలియదు. కాని ఈ సమయాన్ని మాత్రము మగని వ్యవహారం యెడల నత్యంతదుఃఖితయయ్యు ధైర్యమవలంబించి ఆదర్శికభారతీయ రమణీవ్రతనీతుయే ధరించుటకు నిశ్చయించుకొన్నది. దుర్వ్యసనానిమగ్నులై కృతఘ్నులూ, దురహంకారులూనైనపతులు తామే సర్వస్వతంత్రులమని నిరసిల్లుతూ అత్యాచారములజేయ గడగినప్పటికీ వాటి నన్నింటి కడుపున బెట్టుకొని ఓర్పుతో నెంకువతో వానికి గావింపవలసిన ప్రతివిధానముల సలుపుచు చివరకు తమ సతీత్వ ప్రభావంచేత తమ కార్యనిర్వాహణకుశలతచేత తమ్ము, తమవారలను తమ వంశములను నుద్ధరించుకొని కీర్తిగడించిన తల్లులగన్న దీ భారతవర్షము. నిజానికి పాతివ్రత్యరక్షణార్థం సుకుమారశరీరాలను అవలీలగా నగ్నిహోత్రునకర్పించి బలిదానమొనర్చిన సతీమణుల అభిదానస్వర్ణాక్షరపంక్తులు హైందవఇతిహాసములో దప్ప మరియే ఇతిహాసములో దొరకవు. మా యంతటి సభ్యశిరోమణులే లేరని చంకలు గొట్టుకొనుచు ఆధునికపాశ్చాత్యసభ్యత మొన్న మొన్న కన్నులు తెరిచింది. కాని ఆర్యసభ్యతకు ఆదేలేదు. అనేక విద్యలలో విఖ్యాతికెక్కి కొమ్ములు దిరిగిన విద్వాంసులనేకులు ఒక్కమాదిరిగా మీనమేషాలు లెక్కిస్తున్నారు. ఆర్య సభ్యతయొక్క ఆదిని కనిపెట్టడానికి వీరితరం కావడంలేదు. ఈ మధ్యకాలంలో ఎన్ని సభ్యతలో రంగస్థలం ప్రవేశించి నాట్యమాడి మరల తెరలోనికి పోయినాయి. కాని ప్రస్తుత ఇతిహాసానికి గోచరం కాని అత్యంతప్రాచీనకాలంనుండి ఇంతవరకూ నిలచి ఉన్నది హైందవార్యసభ్యత ఒక్కటే. ఇందులకు హేతువేమిటి? భారతీయకాంతాంతత్నాలే. సంఘనిర్మాణానికి, సంఘబలానికి, సంఘస్థితికి ఉత్తమసతులే కారణం. గృహిణి లేనిచో గృహమేమిటి? మనుజమాత్రులమైన మనం అల్పజ్ఞులము. కష్టసుఖాలు దైవాధీనాలు. ఎవరినిమిత్తంచేతనైనా కష్టాలు కలిగిన ధైర్యముతో, నేర్పుతో, శాంతంతో వాటిని దొలగించుకొని నిలుపుకొంటే కాపురాలు నిలుస్తాయి; కాని మగని వెడలనడచి, బిడ్డలను బారదోలి, తాను బరుగెత్తి ఇంకోచోట చేరితేనా? అక్కడకూడా ఈలాగే సంభవిస్తే—జానకియొక్క స్నేహితురాండ్రందరూ వచ్చి ఎవరికి దోచిన సలహాను వారిస్తూ వచ్చేరు. మొట్ట మొదట సోమూజానకీల సంభాషణం ఈలాటి ఒక సందర్భంలో జరిగిందే. ఈమె కావించుకొన్న నిశ్చయానికి విరుద్ధంగా ఎవ రెన్నివిధాల వాదించినప్పటికీ వారల వాక్యాలు ఈమె మనసును ద్రిప్పడానికి చాలేయికావు. భారతమందు బుట్టిన భారతీయవిదుషి భారతీయ స్త్రీత్వమునుంచి దూరం గావడానికి సమ్మతించిందికాదు. కలంకరహితమైన ఆర్యజాతిని అనాదికాలాన్నుంచీ నేటివరకూ నిలిపినదీ, నిలిపేదీ ఈలాటి సాధ్వీతిలకాలే.

౫

కాలవశాన్నో లేక హిందువుల దుష్కర్మవశాన్నో ప్రస్తుతం అధోగతిపాలై ఉన్నప్పటికీ పూర్వ మొక సమయమున ఆధ్యాత్మికవిద్యయందు ఉన్నతశిఖర మధిరోహించి సమస్తప్రపంచమునకూ గురుభూతమై యుండినదీ భారతవర్షము. అతిశయాలకు బోక ఉచితరీతి ఐహికానందాల ననుభవిస్తూ ఆత్మజ్ఞానాన్ని పొందడమే భారతీయ సభ్యతయొక్క పరమావధి. కాబట్టి ప్రాచీనమహర్షులు రాజకీయ, ధార్మిక, సాంఘిక నియమాల నన్నింటినీ పరమావధి ప్రాప్తి నిమిత్తం చేయవలసిన ప్రయత్నాలకు అనుకూలంగా ఉండి నిశ్శ్రేయస సిద్ధికి దోడుపడే వానిగా నిర్మించుకొనిరి కాని అన్యథా కాదు. ఈ కాలమందలి సభ్యతయొక్క పరమావధి ఐహికసుఖప్రాప్తి కేవలం—కాబట్టి ఇప్పటివారి నియమాలన్నీ దాని కనుకూలంగానే చేయబడి ఉన్నాయి. పైనవ్రాసిన రాజకీయాదులలోని ఒక్కొక్క విషయానికీ ఆత్మజ్ఞానప్రాప్తి కవసరమైన ప్రయత్నాలకూ గల సంబంధాన్ని వివరించి వ్రాయాలనంటే అప్రస్తుత ప్రసంగ మధికమౌతుంది; కాబట్టి ఆ విషయాన్నిగురించి యోచించి చూచుకొనుట జదువరులకే వదలుతాను. ధార్మిక, సాంఘిక, నియమాలలో ప్రధానస్థాన మివ్వదగినది వివాహపు కట్టుబాటు - దీనియొక్క బలాబలము మీదనే, దీనియొక్క పవిత్రాపవిత్రల మీదనే, దీనియొక్క గురుత్వాగురుత్వముల మీదనే, దీనియొక్క పాలనాహేలనముల మీదనే సమగ్రసంఘస్థితి ఆధారపడిఉన్నది. ఇది రవంత పటుత్వం తప్పినయెడల లేక లేశమాత్రం మలినత్వం పొందినయెడల సంఘంకూడా శిథిలమై, అపభ్రంశమై, సంకరమై పోవడం నిశ్చయం. ఈలాటి సంకరాలచేత నపవిత్రములై జీవనం సలుపుతూ ఉన్న సంఘాలెన్నో ఇప్పుడు మనకళ్లయెదుట ఉన్నాయి. సంకరజాతులకు పరమావధి ప్రాప్తి ఉండనీయండి. అధోగతి మట్టుకు తప్పక లభిస్తుంది. పరిమితరీతి ప్రాపంచికసౌఖ్యాలను అనుభవిస్తూ, ఆత్మజ్ఞానలబ్ధియందే ముఖ్యంగా ధ్యానంగలిగిన సతీపతులు తత్సంబంధములైన వ్రతదీక్షానుష్ఠానాది ధార్మిక కార్యాలలో నిమగ్నులై నిరంతర ప్రయత్నములను జేస్తూ నియతాహారవిహారులై సాత్వికగుణప్రధానులై లోకసంస్కృతి కొరకు సంతానముల బడయుచూ, ఆ మరణాంతం ఎడబాయక ఆత్మశాంతిని గలిగి చివరకు శరీరాలను వదలుతూ వచ్చేరు కాని, ఆధునికనాగరికతావలంబుల్లాగు ఐహికపాశవికసౌఖ్యాన్నే పరమావధిగా బెట్టుకొని నాస్తికులై, భక్ష్యాభక్ష్య వివక్షలేక సర్వభక్షకులై, మాదకద్రవ్యద్రవ సేవలమూలమున శరీరాలు నుదించిపో ఇష్టంవచ్చినంతకాలం కలసివుండి కామోద్రేకం శాంతించినతోడనే ఏదోరవంత నెపంగల్పించుకొని విడిపోవుచూ, అవసరమైతే ఎనుబది ఏళ్ల ప్రాయమందైనా మరల నంట గట్టుకొంటూ జీవనమంతా మహా ఆర్భాటంగాబుచ్చి తుదకంతసమయాన్ని కూడా అశాంతితో దేహముల వదలు నవీననాగరికతా ఉపాసకులవలె, నశించలేదు. ఈ వివాహసంస్థయొక్క ప్రాధాన్యాన్ని బాగాగుర్తెరిగి ఉండడంచేతనే ప్రాచీనకాలమందలి మహర్షులు గుణకర్మస్వభావాలు, కులశీలాలు, తక్కిన శుభలక్షణాలు అన్నీఅనుకూలంగా ఉంటేనే, అలాటి వధూవరులకే గార్హస్థ్యధర్మం విధించేరు; కాని ఆధునికసంఘనిర్మాణానికై కంకణాలు గట్టుకొని ఉన్నమహర్షులు స్వేచ్ఛాప్రణయదేవత నొకదాన్ని సృష్టించి దానిముందు పూర్వోక్త కులశీలాదులను బలి ఇప్పించేరు. వాటికన్నింటికీ స్వాహా అయిపోయింది. కులశీలాలు గంగలో ఇడనీ, గుణకర్మస్వభావాదులు బావిలో నురకనీ, శుభలక్షణాదులు సముద్రంలో గూలనీ, పరవాలేదు - స్వేచ్ఛాప్రణయదేవత ప్రత్యక్షమైనజాలు. ఆ దేవికి తృప్తిగలిగే వరకూ హాయిగా స్త్రీపురుషులు కలిసి ఉండవచ్చు; చల్లబడడంతోటే మళ్లీ ఎవరికి వారే యమునా తీరే కావచ్చును. ప్రాచీనులుకూడా గాంధర్వం స్వీకరించారంటారేమో. ఆ గాంధర్వానికీ ఈ గీర్వాణానికీ చాలా భేదముంది. అదిసంఘ నిష్పాదకం, ఇది సంఘవిచ్ఛేదకం. దైవోపహతులైన భర్తలు దమ్ము నిరసించినగాని ద్యజియించినగాని శకుంతలా, దమయంతీ, సీతా మున్నగు సతులు వ్రతనియమధారిణులై యనేకకష్టముల సహించి మరల తమతమ పతులనే చేపట్టేరు గాని మొద



"అడవుల మేతమేసి మన మన్యులకెన్నడు నెగ్గుసేయ కి
క్కడ విహరింతుమమ్మ..."

— బమ్మెర పోతన.

హారికి తిలోదకాలిప్పించి మరివకరినీ వారూ కాకపోతే ఇంకొకరిని గ్రహింపలేరు. వీరూ స్వేచ్ఛా ప్రణయం చేత ప్రియులను చేపట్టిన వారే. కాని ఆ కాలపు సభ్యతయొక్క ఆదర్శమే వేరుగ నుండెడిదని చెప్పి యున్నాను గదా. ఈ ప్రాచీననవీన స్వేచ్ఛాప్రణయాలకు సంక్రాంతి పేర్కొందగిన కొన్నంత తారతమ్యం ఉంది. ఈ ఆధునిక స్వేచ్ఛాప్రణయావిర్భావప్రభావంచేతనే లలితాంబగారితో రాఘవుని మంగళకార్యం సంపన్నమైంది. మొద లీమె కులగోత్రాలేమిటో, పుట్టుపూర్వోత్తరాలేమిటో విచారించ వలసినంత అవసరమే కలిగిందికాదు ఇతనికి. సాక్షాత్కరించిన నూతనస్వేచ్ఛాప్రణయదేవతానామక అంజనశైలవినిర్గతగాఢాంధకారవినష్టీకృతజ్ఞానచక్షువైన రాఘవున కప్పుడు తన హస్తపాశాల్లో జిక్కిఉన్న లలితాకోమలగాత్ర స్పర్శనజనితసౌఖ్యందప్ప మరొకటి గోచరించినదే కాదు. ఇక అడిగేదేమిటి? కాని కాలక్రమంగా కులగోత్రాదులగురించి ఏమీ తెలియక బోయినప్పటికీ ఈమె పూర్వేతిహాసం కొంచెం బయటపడింది. కలకత్తాలోని వేశ్యలవ్యాపారి ఒకడు కుల్లూ, చంబా ప్రాంతాలనుండి వెంటబెట్టుకొని వచ్చిన ఒక అనాథబాలిక లలిత. తలిదండ్రులెవరైందీ తెలియదు. ముందు ముందు లక్షలకొలది ధనాన్ని ఆర్జించి తన నెత్తిని బరిగిస్తుందనే పుట్టెడాశతో పాపమీ వ్యాపారి ఈలాటి గౌరవనీయ వృత్తివల్లనే సంగ్రహించిన వేలకొలది రూపాయలను వ్యయం చేసి సంగీతనాట్యకళాదుల్లో మంచి ప్రావీణ్యం కలిగేలాగు జేశాడు. కాని మంచివ్యక్తి వచ్చిన రెండుమూడు సంవత్సరాల కల్లా కలకత్తా ఆర్యసమాజంవారి నాశ్రయించి వారుచేసిన భగీరథప్రయత్నం వలన ఈమె ఆ వ్యాపారి జాలంనుంచి తప్పించుకొని సామాజికుల సలహామీద అజ్మీర్ నగరం చేరింది. ఏలాగైనా ఈమెను ఉద్ధరించాలననే సదుద్దేశంతో సమాజంవారు రాజపుటానా యందలి ఒక ధనాఢ్యుడైన రయీసునకిచ్చి పెళ్లిచేశారు; కాని రయీసుగారిపై మోజు ఒకసంవత్సరంలోనే పాతబడిపోవడంవల్ల వానికె నామంబెట్టిపోయి బొంబాయిచేరి అక్కడ స్వయంగానే వ్యాపారంజరిగించుకొంటూ వచ్చింది తగినంత తెలివిగలది కావడంచేత. బొంబాయినివాసకాలమందే ఈమెకు యూరోపియన్ నర్తకీల సహవాసంచేకూరింది. పిదప కొన్నాళ్లకు వారిలో నొకరితోగలసి పశ్చిమభూమిఖండం ప్రవేశించింది. అక్కడ మిస్ లలితా నామంతో సభ్యసమాజాలలో, బాల్సుల్లో, సినిమా ఫిల్మ్‌ప్రొడ్యూసింగ్ కంపెనీలలో డాన్సులలో ఎక్కడజూచిన తానేఅయి సకలవిధాలా ద్రవ్యార్జన చేస్తూవచ్చిన కాలంలో మన రాఘవరావుతో నేస్తంకుదిరింది; కాని తిరుగేకాలు ఒకచోట నిలిచి ఉండడం కష్టం. ఒకటి రెండేండ్లయినా గడచెనో లేదో రాఘవునకించుక ఆరోగ్యంతప్పిఉన్న సమయాన్ని నతనికి స్వస్తివినిపించి నవీనమకరందాస్వాదనం చేయడానికో చేయించడానికో మరొక ప్రదేశానికి వెళ్లిపోయింది. యౌవనమదంచేత కన్నూమిన్నూ తెలియకుండా తిరుగులాడే యువకులను నిద్రనుంచి మేలుకొలిపే వీలాటి ఘటనాలే. లలిత వెళ్లిపోయిన తరువాత నితనివ్యాధి మరింత పెరగడం మొదలెట్టింది. దానిని జూచి ఇతడామె నిమిత్తమే వ్యామోహంపెట్టుకొని ఈలాగు కృశించిపోతూ ఉన్నాడని ఆతని మిత్రులందరూ అనసాగేరు; కాని యదార్థకారణం అదికాదు. స్వేచ్ఛాప్రణయదేవతాకారణాన్ని అనుగ్రహాలెంత త్వరలో ఉద్భవిస్తాయో విగ్రహాలూ అంత త్వరలోనే అవిర్భవిస్తాయి. లలిత గావించిన ద్రోహం మూలాన్ని విరాగమందిన ఇతని మనస్సులో ఇప్పుడామెకులవమాత్రమైనా అవకాశంలేదు. కాని అదిమొదలుకొని ఇతనిని అనుతాపంలో ముంచి శరీరాన్ని కంపింపచేస్తూ ఉన్నది జానకియొక్కయ మాయికమనోహరస్వరూపం. ఆస్వరూపాన్ని దలచుకొని దలచుకొని ఏడ్వనిదినమూ, కలవరింపని రాత్రీ, వేడిసిట్టూర్పువదలని ప్రహరమూ, అనుతాపమొంది హాయనని ఘడియ, స్మరించని నిమేషమూ లేదు. ఇదే యతని రోగమెక్కువగా దినక్రమమున గృశించి పోవుటకు కారణము. అటుతరువాత నతనికా విదేశములో నుండుటకే మనసొప్పలేదు. కావున అచటనుండి బయలుదేరి బొంబాయిచేరి మహాలక్ష్మీవాడలో నొక

సామాన్యభవనాన్ని అద్దెకు తీసుకొని అక్కడే ఒకమాదిరిగ ఏకాంత వాసంచేస్తూ వచ్చినాడు. ఎవరో ఇద్దరు ముగ్గురికి దప్ప దానటకు వచ్చిన వార్తమిత్రుల కందరికీ తెలియపరచలేదు. తాను దనఅర్ధాంగి యెడల గావించిన ద్రోహానికిది తగిన శిక్ష భగవంతుడే విధించినాడని శాంతంతో దాని ననుభవిస్తూ కాలంగడప నెంచుకొన్నాడేకాని ఇంటికి దన వార్తను దెలియబరచుటకు సాహసించిన వాడుకాడు. ఈలాగు కొన్నినెలలు గడచుసరికి రోగం మరింత మిక్కుటమైపోయింది. అనుభవజ్ఞుడైన డాక్టరొకడు ప్రతిరోజూ వచ్చిచూస్తూ ఒకమందు పట్టలేదని దానిని మార్చి వేరొకమందు నుపయోగిస్తూ తన శక్తినంత వినియోగించి పనిచేస్తున్నప్పటికీ లాభం లేశమాత్రమైనా కనుపించడంలేదు. తుదకు ఆ వైద్యునకూ ధైర్యం సన్నగిల్లిపోయింది. ఒకనాడతడు రాఘవుని మిత్రులను అవతలికి తీసికొనిపోయి రోగియొక్క వ్యాధి తన శక్తికి మించి పోతున్నదనీ, ఇక నొకటిరెండు వారాలు తిరుగుసరికి ఇతని స్థితియేమగునో తెలియదనీ, మంచి యౌవనంలో ఉండే ఏ ఆరోగ్యవంతమైన శరీరాన్నుంచి అయినా నెత్తురుతీసి దాని నీతని దేహంలో ప్రవేశపెడితే ఒకవేళ బ్రతికితే బ్రతుకవచ్చుననీ తెలియచేశాడు. దానిని విని ఆ స్నేహితులకూ గాభ్రా డాయికాపు. ఇంతవరకూ ఇంటికి దన వార్తనెరిగింపవలదని అతనిచే నివారింప బడియున్న యా మిత్రులిరువురూ ఇక గాలహరణం చేసినచో ఎటుబోయి ఎటు వచ్చునో యను భయంతో నితనికి దెలియచేయకయే మద్రాసుకు తంతివార్త నంపేరు. రాఘవునికై తపిస్తూ ఉన్న తలిదండ్రులకూ భార్యకూ ఆ వార్త ఆనందదాయకం హృదయవిదారకం గూడా అయింది. ఆనాడే వారందరూ సపరివారంగా బొంబాయికి ప్రయాణమై వెళ్లిపోయినారు.

.....................................................................................

డాక్టరు మహానిపుణుడు. అత్యంతచాకచక్యంతో అపరేషను చేసి యౌవనవంతమైన శరీరరక్తాన్ని రాఘవరావుదేహంలో బ్రవేశపెట్టేడు. వారానికల్లా రోగం తిరుగుముఖమైంది. అపాయం దప్పిపోయిందని అందరూ సంతోషించేరు. చదువరులారా! ప్రాణరక్త మెవరిచ్చిందీ గ్రహించేరా? సాధ్వి జానకి. ఇందుకు కృతజ్ఞతాసూచకంగా నత డామెను 'ప్రాణనాయకీ' అనిపిలుస్తూ ఉంటాడుఎల్లప్పుడూ.

## 'శిథిలంపు జీవనము'

శ్రీమతి పి. అప్పలనరసమ్మగారు

పుట్టిపెరిగి సుఖమ్మునెఱుగక
కాలమంతయు గడపుచుంటివి
అడివిలోపల పూసిపెరిగిన
మల్లెపూవు వలెన్.
భరతనారీమణుల పిలిచి
పిప్పిచేసిన సంఘమే నీ
సౌఖ్యజీవనమునకు భంగము
సంఘటించినది.

పరుగులెత్తే కాలమున మన
ప్రాతకట్టులు తెగని గొలుసులు
బిగుసుకొనునేకాని తెగుటకు
రోజులేదేమో?
అమృతమూర్తివి చెల్లి! నీశిథి
లంపుజీవము మామనములలో
బ్రదికినన్నిదినాలు రగులుచు
వెలుగుచుండెడిని.

# గుఱ్ఱమును గూర్చి

తాతకృష్ణమూర్తిగారు బి. యె; యల్. టి.

వినోదపాఠము

పుల్లయ్య అను ఒకానొక కొంటెబాలుడు గుఱ్ఱమును గూర్చి వ్రాసిన క్రింది కాంపోజిషను ఎల్లరు చదువదగి యుండుటచే ఈ పత్రికలో ప్రచురించుచున్నాను:—

"గుఱ్ఱము గాడిదజాతి జంతువులలో నొకటి. గేదెవలె దానికి కొమ్ములుండవు. కాని, స్వాములవారి పాంకోళ్లవంటి టక్కుటక్కులాడు డెక్కలుండును. దానికి నాలుగు మూలలను మంచము కోళ్లవలె నాలుగు కాళ్లుండును—ఇనుపనాళ్లతోనున్న రాళ్లవంటి డెక్కలతో! గుఱ్ఱమునకు బలమంతయు వెనుక కాళ్లలోనే యుండును.

ముఖమున కెదురుగా దానికి నిడుపైన పెద్దతోక యుండును. సహజముగా పెరుగనిచ్చిన యెడల తోక ముచ్చటగా పిల్లల జడవలె యెదిగి వ్రేలాడుచు, పట్టి యీడ్వవలెనని బుద్ధి పుట్టించును. కాబట్టి కొందరు తోకను పొట్టిగా కత్తిరించెదరు.

తోక పొడుగును పట్టి, గుఱ్ఱములలో రకము లేర్పడును. పొట్టితోక గుఱ్ఱమును స్వారీగుఱ్ఱ మందురు. పొడుగుతోక గుఱ్ఱమును పోనీ అందురు. మధ్యరకముతోక గుఱ్ఱమును జట్కాగుఱ్ఱ మందురు. ఇంకా తెల్లగుఱ్ఱము, నల్లగుఱ్ఱము, ఎఱ్ఱగుఱ్ఱము, బొల్లి గుఱ్ఱము, పంచకళ్యాణిగుఱ్ఱము, పెద్దగుఱ్ఱము, చిన్నగుఱ్ఱము, తట్టగుఱ్ఱము, ఢంకాగుఱ్ఱము, ఆటగుఱ్ఱము, గుడ్డిగుఱ్ఱము, కుంటిగుఱ్ఱము, గుగ్గిళ్లగుఱ్ఱము, నీటిగుఱ్ఱము, తాపులగుఱ్ఱము, అని అనేక రకముల గుఱ్ఱములుండును. బగ్గెబగ్గెలున్న పెద్దపులివంటి గుఱ్ఱమును జీబ్రా అందురు. మా స్కూలులో ఉమామహేశ్వరరావును శంఖుగూతి గుఱ్ఱమందురు.

అన్నిటికన్న హిందూదేశములో జట్కాగుఱ్ఱములే జాస్తీ. అవి ముందుకూ, వెనుకకూ, కూడా నడవగలవు. ఒక్కొక్కప్పుడవి రోడ్డుమీద అడ్డముగా కూడ నడుచు చుండును—గిరగిరమని గుండ్రముగా తిరుగుచుండును—దారిపోయే మనుష్యుల మీదికి దుముకుచుండును.

పూర్వము మనదేశములో రాజకుమారులందరికిని కీలుగుఱ్ఱము లుండెడివి. వాటికి రెక్కలుండెడివి కాబట్టి సప్తసముద్రములను దాటుచుండెడివి.

గుఱ్ఱము మిక్కిలి దుష్టస్వభావము కల జంతువు. వీపుమీద సవారీచేయుటకు ముచ్చటపడు బాలురను మోసముచేసి క్రిందపడ వేయుటే దానికి ముఖ్యలక్షణము. అది

గాక మూతిపళ్లు రాలునట్లది వెనకకాళ్లతో తన్నగలదు; లేదా వెక్కిరించునట్లు పండ్లిగిలించి, పైబడి కఱవగలదు.

తక్కిన జంతువులవలె గుఱ్ఱము పనికివచ్చే జంతువు కాదు. మన పూర్వుల కాసంగతి తెలియక గుఱ్ఱములను శ్రద్ధగాపెంచి, వాటికి దంతధావనము కూడా చేసెడి వారు. అందుకనే, మావాళ్లు నన్నొకక్కొక్కప్పుడు "ఏమిరా! ఇంతసేపును నీవేమి రాచ కార్యము చేయుచుంటివి? పెద్దగుఱ్ఱమునకు పళ్లుతోముచుంటివా?" అని అడుగుచుందురు. ఇంట్లో గుఱ్ఱమున్న యెడల ఉపయోగము తక్కువేకాని ఉలవలఖర్చు యెక్కువ. ఎక్కి తిరుగుదామంటే దాని మీదినుంచి పడి, కాళ్లుచేతులు విరుచుకుంటామేమో అని భయము. బండికి కట్టినా ప్రయోజనములేదు. మీదు మిక్కిలి యెంత చక్కని బండి అయినా మా పురోజులలో ముక్కలవక తీరదు. కిమిడిలో రాజుగారి గుఱ్ఱమొకమాటు బగ్గీతో సహా చెఱువులోకి దుమికినదట!

కాని, కొంతటి పెళ్లిలో పెండ్లికొడుకును కూచోబెట్టుటకు గుఱ్ఱము పనికివచ్చును. వైద్యులు కొందరు, గుఱ్ఱపు చెమటతో అశ్వగంధ లేహమును చేసెదరు. పూర్వము మనరాజులు అశ్వమేధయాగమని యేదో పండుగ చేసుకొని గుఱ్ఱములను చంపి తినెడివారు.

మొత్తముపైని గుఱ్ఱము గాడిదకంటె నిరుపయోగమైన జంతువు. అందుకనే, మనవాళ్లు తరుచుగ మొగపిల్లడిని తిట్టవలసివచ్చినప్పుడు "ఓరి గాడిద! ఓరి పశువ! పెద్ద అడ్డగాడిద లాగున్నావు కదా బుద్ధిలేదూ?" అనెదరు; కాని "ఓరి గుఱ్ఱమా!" అని తిట్టరు. ఆడపిల్లని మట్టుకు, "యేపైన గుఱ్ఱమువంటి పిల్ల!.. ఇంకా పెళ్లిలేదు" అనెదరు.

## "జన్మసార్థకమగుగాదె—జగతియందు"

శ్రీమతి జామిశెట్టి వేంకటరత్నమ్మగారు

అవనిలో సర్వసామర్థ్య మమరి మనము
నంత యోచించి నడచెడు కాంతలకును
హరిహరుల దివ్యచరితంబు లనవరతము
స్మరణజేసి తరించెడు తరుణులకును
కారణములేని కార్యముల్ గలుగబోవు
జననమొందించి నయ్యది జరుపుసతుల
పుడమి జడియించుకుమ్మరి పురుగురీతి
మలినమిసుమంతచొరనీక మనెడువారి

యేలపుట్టితిమోకార్య మెద్దిగలదొ
జన్మసార్థకమగుగాదె జగతియందు
బరగవినుచుండివారల బరమభక్తి
జన్మసార్థకమగుగాదె జగతియందు
దైవమెద్దియో జేయింప దలచిమనల
జన్మసార్థకమగుగాదె జగతియందు
సారమింతయులేని సంసారజలధి
జన్మసార్థకమగుగాదె జగతియందు

# విడాకుల చట్టము

## ౧

## శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

భారతదేశదాంపత్యధర్మము ప్రపంచముననెల్ల ఖండములవారిచేతను ఎల్లజాతులవారిచేతను సత్యోత్తమమైనదని యెన్నబడుచున్నది. విడాకులచట్టమను పేరు వినినంతనే పవిత్రవాంఛాపూరితమైన భారతనారీహృదయము ప్రకంపితమగుచున్నది. పతిని దైవముగ జూచుస్త్రీలు హైందవజాతియందుతప్ప మరొకట లేరు. ఇతరజాతి స్త్రీలకు పతి స్నేహితుడో, అభివృద్ధికాంక్షకుడో, ఆచార్యుడోగాని దైవమనుభావ మెన్నడును లేదు. సతులను క్రూరముగ హింసించు పతులు లేరని నేననజాలనుకాని అత్యల్పమగు నట్టివారిచరిత్రల మనమునందిడుకొని ఇట్టి శాసనము గావించి ప్రశాంతమగు హైందవదాంపత్యసాగరమున భయంకరబడబానలము నుద్భవింపజేయుట నాకెంతయు నసమ్మతము. అఖండభోగలాలసులగు నమెరికావారిదేశమున ఈచట్టమువలన నెన్నియో సంసారములు విచ్ఛేదములై పోవుచున్నవి. హైందవులు ఇంకను క్షేమకరమగు అవిభక్తకుటుంబపద్ధతిని విడనాడలేదు. అవిభక్తకుటుంబపద్ధతి జీవించియుండునంతవరకు సతిని చావగొట్టుచుండ అత్తమామలు అన్నదమ్ములు చూచుచు నూరకుండునంతటి కఠినరాక్షసులింకను హైందవులు కాలేదని స్త్రీలోకమునకు మనవిచేయుచు ఈచట్టమును ప్రతిఘటింపవలయునని ప్రార్థించుచున్నాను.

## ౨

## శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మగారు



బులుసు లక్ష్మీనరసమ్మగారు

శారదాచట్టము శాసనసభలోఁ బ్రవేశపెట్టఁబడుటయేగాక తత్సభవారిచే నంగీకరింపఁబడిన సంగతియును, ప్రభుత్వమువా రట్టిచట్టమును "ఏప్రెల్" మాసమునుండి యమలులోనికి వచ్చునట్లు తీవ్రముగా శాసించుటయును సర్వజనవిదితము. అట్టిచట్ట మపూర్వసంస్కర్తల కానంద మొసఁగుచున్నను శిష్టాచారులకును వృద్ధులకును నీచని మనఃక్షోభము గలిగించుచున్నది. అయిననేమి సేయగలరు? ఇట్టి స్థితిలో "పులిమీద పుట్రలాగున" విడాకుల చట్టమును గూడ శాసనసభలోఁ బెట్టనుంకించుట కడుంగడు చిత్రముగాను శోచనీయముగాను నున్నది. ఇట్టి చట్టమును శాసనసభలోఁ బ్రవేశపెట్టవలసినంత అగత్యము దేశమునకేమి సంభవించినది? శారదాచట్టమును బ్రవేశపెట్టుటకు గొంతయావశ్యకత లేకపోలేదు. మన భారతదేశము పరమపవిత్రము. అందుఁ బుట్టిన మనకు నమంత్రకములును, అసాక్షికములునగు వివాహములు ప్రాచీనకాలమునుండియు జరిగియుండుట లేదు. పూతములగు వేదమంత్రములతోడను, బ్రహ్మపూతుడగు అగ్నిదేవుని సాక్షిగాను మనవివాహములు శిష్టాచారములై యున్నవి. అట్టియాచారముల నణఁగద్రొక్కి యపవిత్రములగు

విదేశాచారముల ననుకరించుట మనకు శ్రేయోదాయకమగు పనికాదని వారియొక్క అసమ్మతిని పూర్ణ స్ఫూర్తిగాఁ దెల్పుచు విరమించుచున్నాను.

## 3

## శ్రీమతి కొంగర అన్నపూర్ణమ్మగారు

వివాహము ధర్మార్థకామమోక్షములను సాధించుకొఱకేర్పడినది; కాని విడాకులకొఱకుగాదు. ప్రాచ్యఖండవాసులు వివాహమును మోహాపేక్షతోఁ జూడక ఐహికాముష్మికసుఖంబుల కేర్పడిన యొకపవిత్ర కార్యముగ నెంచిరి. ప్రపంచమం దన్నిఖండములలో భారతఖండము వివాహబంధములోను పతివ్రతాత్వము లోను నతికెక్కి మిన్నగాంచినది. భరతభూమియందిట్టి విడాకులచట్టమును ప్రవేశపెట్టి వివాహకార్యము నపవిత్రము జేయ నెంచుట చాలవిషాదకరమగుసంగతి. పాశ్చాత్యులువివాహమును మతవిధిగ నెంచరు. విడాకుల చట్టములతో ఇంగ్లాండు అమెరికా మున్నగు దేశీయులు బడుచున్నకష్టనష్టములను బరికించుచున్న మనమేల అట్టి చట్టమును తెచ్చిపెట్టుకొనవలయును? భారతనారీమణులు ప్రేమనిధానములు. వారికి విడాకుల చట్ట మనవసరము. (అయినను మనదేశమున ఇదివరకే కొన్ని వర్ణములయందు విడాకులిచ్చుకొనుట యుండనే యున్నది.) హిందూయువతుల పవిత్రభావములను నిర్మూలించు నీ విడాకులచట్టమున కిప్పుడేమి ప్రత్యేకావసరముగలిగినది? ఉన్నతవిద్యావంతులగు సోదరీమణులు పాశ్చాత్యులనుండి నేర్వదగిన మంచియంశములనే సేకరించి సంఘమును బాగుజేయవలయునుగాని వారిననుకరించి విడాకులచట్టమును మాత్రము శాసనరూపముగ కొనిరాతగదని నా అభిప్రాయము. ఆర్థికసంపదయందన్నిదేశములకన్న వెనుకబడియున్న మనకు ఈడైవర్సు కోర్టులకు గూడ ధనమెక్కడనుండి వచ్చును? ఇట్టి చట్టమును గొనితెచ్చి విద్యాధికులగు సోదరసోదరీమణులు హిందూవివాహధర్మము నపవిత్రము జేయకుందురుగాక.

## ౪

## శ్రీమతి కో. రాజరాజేశ్వరమ్మగారు

మన స్త్రీలకు మగడు త్రాగుబోతైనను, వికలాంగుడైనను, కుష్ఠరోగియైనను, పుట్టుగ్రుడ్డివాడైనను, పిచ్చివాడైనను అతనితోడ సంసారము చేయవలసినదనుట గొప్ప అన్యాయముగ నున్నది. అట్టిసందర్భములలో ఒకన్యాయస్థానమందు భర్తయొక్క లోపములబుజువుపర్చుకొని వివాహవిమోచనమును గావించుకొనుటకు ఒకశాసన మవసరమనినేను మనవిచేయుచున్నాను. హైందవనారీమణుల అభివృద్ధికై మనసోదరులు ఇప్పటి కాలమున చేయూత యొసగుచుండుటనుగూర్చి మనము మిక్కిలి సంతోషించవలసియున్నది. ఇట్టిసమయమందు మన పురోభివృద్ధికి ఆటపట్టగు కొన్ని నూతనశాసనములు మనకు సత్వరము కావలసియున్నవి. వాటిని చర్చించి అమలులోకి వచ్చునటుల చేయగలందులకు మనసోదరులగు పురుషరత్నములను వినయముతో ప్రార్థించు చున్నాను. అట్టిశాసనములలో వివాహవిచ్ఛేదకచట్టమును అమలులోకివచ్చునటుల కృషిచేయవలసియున్నది. ఇట్టిశాసనము బరోడాశాసనసభలో అంగీకారమును పొందినటుల ఒకానొక వార్తాపత్రికయందు చదివినటుల జ్ఞాపకముగలదు. కనుక ఇందువిషయమై ఆంధ్రసోదరీమణులందరు తరుచు పత్రికలకు వ్యాసములు వ్రాయుచు ఆందోళనసల్పగలందులకు అతివినయముతో ప్రార్థించుచున్నాను. ఈలాటి స్త్రీల వ్యాసములకు చోటిచ్చుటకు గృహలక్ష్మిపత్రికారాజము కంకణముకట్టుకొన్నదిగాన ఇందుకు సంబంధించిన వ్యాసములు, తమతమ అభిప్రాయములు ఆ పత్రికయందు ప్రకటించెదరని కోరెదను.

శ్రీ

## శ్రీమతి అద్దంకి అనసూయా దేవి గారు



అద్దంకి అనసూయాదేవిగారు

భారతమహిళలు కొందరు విడాకులశాసనమును కావలయునని కోరుచుండిరి. ఈశాసనమువలన గలుగు ఆనర్థము లనేకములు గలవు. అనేకధర్మములకు గట్టువడి అగ్నిసాక్షిగ వివాహమాడిన దంపతులు యేదోఒకమనో వైకల్యమువలన వివాహబంధమును వదలుకొనుట చాల శోచనీయము. వివాహబంధము తెంచుకొనుటవలన వారిబిడ్డలగతి ఏమగునో ఆలోచింపవలసినది. ఆంగ్లేయ సోదరీమణులనుంచి మనవారుగ్రహించినది వివాహవిచ్ఛేద శాసనమేగాని, అట్టియాచారమువలన వారెంతటి యిక్కట్టులకు లోనగుచున్నారో సూక్ష్మగ్రాహులగు నారీరత్నము లాలోచింపనవసరము లేదా? అటులయిన కొరగాని భర్తలభించినను, వాడెట్టి అవినీతిపరుడైనను, అతను భార్యనుచూడక సానివాడల దిరుగుచున్నను భార్య అతని నాశ్రయించుకొని యుండవలసినదేనా యని ప్రశ్న పుట్టకపోదు. దానికి నాయొక్క చిన్నమనవి. మనశాస్త్రములయందు స్త్రీపురుషు లిరువురకును సమాన గౌరవస్వాతంత్ర్యము లొసగియున్నారు. ఇద్దరికిని దాంపత్యధర్మమునందును సమానధర్మములున్నవి. అట్టిగౌరవస్వాతంత్ర్యములను రానురాను పురుషుడు నిరాటంకముగ సాగించుకొనుచు స్త్రీని తనచేతి కీలుబొమ్మవలె నొనర్చి తన స్వేచ్ఛను మరింతవడిగా సాగించుచున్నాడు. మహాశక్తివంతమగు పవిత్రశక్తిస్వరూపమును గుప్తపరచిన వెంటనే పురుషులు కొందరు పవిత్రాదర్శములు కోలుపోయి పవిత్రమార్గాచరణమునందు పాల్గొనుటకు తగిన ధీశక్తిలేక తమకుగల స్వేచ్ఛను యిష్టమువచ్చినట్లు ఉపయోగించుకొని మిక్కిలి దుర్వ్యసనములకు దాసులై అవినీతిపరులగుటయేగాక స్త్రీలను ఆమార్గమునకే లాగుచుండిరి. ఈపద్ధతి మార్పునొందవలయును. స్త్రీలు పురుషులవలెనే సమానస్వాతంత్ర్య గౌరవములను కోరుట చాల ఆవశ్యకము. అట్టిస్వాతంత్ర్యము నెట్లు పొందించవలెననెడి విచారణ చేయవలసియున్నది. భర్తకు ఇష్టము లేకున్న భార్యను విడుచుట లేదా? అటులనే సమానవ్యక్తిత్వముగల మనమేల చేయరాదుఅనెడి దురూహతో మాత్రము మనమట్టి విచారణచేసి భారతజాతి నీతిమతాచారములనెల్ల పతనము చేయగల డైవర్సుబిల్లును కోరరాదు. స్త్రీలకు పాతివ్రత్యము పురుషులకు ఏకపత్నీవ్రతము అత్యంతపవిత్రములయినవి. పురుషులకు ఏకపత్నీవ్రతము లేక అట్టి ధర్మమిదివరకే సగము సన్నగిల్లినది. ఈబిల్లువలన సంపూర్ణముగ సన్నగిల్లును. కావున నారీలోకోద్ధరణకై కృషిసల్పు మహానీయులిట్టి శాసనమునకై పరుగు పెట్టుటకన్న పురుషులను ఏకపత్నీవ్రతులుగ చేయుజాలు పరస్త్రీవిసర్జనచట్టము, మద్యపాననిషేధశాసనము మొదలగునవి నేర్పరచి వారి నైతికజీవనము ఉత్తమపథముల బట్టింపవలయును. ఇట్టిశాసనములకు భారతీయులందఱు ఆమోదించెదరనుటకు సందియము లేదు. ఇట్టి చట్టముల వలన ప్రతివ్యక్తియు, ప్రతికుటుంబమును, ప్రతిదేశమును

బాగుపడును. దీనికి శాస్త్రములు సైతము ఆమోదించును. ప్రతివ్యక్తికిని తగిన తేజోబలపరాక్రమధైర్యస్థైర్యము లలవడును. అప్పుడు భారతదేశము సాటిదేశములలో తారకలలోని చంద్రునివలె ప్రకాశించును. అంతట విడాకులచట్టమునకు గల అగత్యము లేకనే పోవును.

## ౬
## శ్రీమతి సి. రుక్మిణీబాయిగారు


పి. రుక్మిణీబాయిగారు

వివాహవేదికయందు మంత్రోచ్చారణ చేయుచు అగ్నిసాక్షిగా అష్టదిక్పాలుర ఎదుట పరిణయమాడిన భర్తను విడనాడుట న్యాయమా? స్త్రీలయి జన్మించిన తరువాత ఏదో ఒక పురుషుని అండనుండి కష్టసుఖముల బడయుట న్యాయమా? భర్తదుష్టుడైనంతమాత్రమున భార్యకేమి లోపమున్నది? ఆమె పతివ్రతామాహాత్మ్యమేమగును? తొల్లి కుష్ఠుచే పీడింపబడు కౌశికధర్మపత్ని నర్మద గ్రహమార్గము నరికట్టలేదా? అనసూయ తన్ను పరీక్షింప వచ్చిన త్రిమూర్తులను బాలకులుగ చేయలేదా? పరనారీలోలుడగు రావణుని తొల్లి వేదవతికన్య బంధుమిత్రపరివారసహితముగ నాశనముచేయలేదా? ఇట్టి నారీమణుల జాతియందు పుట్టిన భారతస్త్రీలు విడాకులచట్టమును కోరుట పాశ్చాత్యనాగరికతచే వ్యామోహితులగుటచేతనే అనుట నిశ్చయము. భారతనారీమణులు తమ మానప్రాణములు అగ్నిసాక్షిగా పరిణయమాడిన భర్తకే ధారాదత్తము చేయుదురు. అట్టివానితో నామె విడివడుటకు సహించజాలదు. కావున మనదేశమున కిట్టి చట్టము ఎంత మాత్రము అవసరములేదు.

## ౭
## శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు

చెన్నపురియందు చెన్నరాష్ట్రస్త్రీవిద్యాసాంఘికసంస్కరణసభ జరిగి యందు స్త్రీలు విడాకుల చట్టతీర్మానమును తెచ్చిననాటనుండి దేశమంతయు నట్టుడికినట్లుడుకుచున్నది. ఇందాశ్చర్యకరమగు విషయమేమున్నదో తెలియరాకున్నది. ఇది మన దేశములో క్రొత్తా? పురుషులేకార్యమును జేసినను వింతలేదు. కాని స్త్రీలనగానే ప్రతివిషయమూ వింతగనూ, నాశ్చర్యముగనూ గన్పట్టుచుండును. ఎందరు పురుషులు తమ భార్యలెంతసౌందర్యవతులైననూ, విద్యావతులైననూ, సచ్ఛీలలైననూ, సుగుణరాసులైననూ, పతివ్రతామతల్లులైననూ కొంచమైననూ గణింపక, వారి విషయములో నిసుమంతయైననూ సానుభూతిలేక, అంతరాత్మ అనునది లేక, ధర్మమునైనను లెక్కింపక వివాహకాలమందు చేసిన ప్రమాణమునైననూ పాటింపక, తా మగ్ని

సాక్షిగాఁ బాణిగ్రహణము చేసికొనిన భార్యయందు; భర్తయే తమకు రక్షకుఁడు, దేవుఁడు, సమస్తమూ నని తలంచి పవిత్రమైన మనస్సుతో గాఢమగు ప్రేమతో తమను నమ్మి, తమపాలఁబడిన అమాయికలగు ముగ్ధాంగనలగు, తమ ప్రియభార్యలయందు; అర్ధాంగలక్ష్ములయందు సామాన్యముగా మానవుల కుండవలసిన జాలి, భూతదయ అయిననూ లేక తాము తప్ప నికయే యాధారమునూ లేక తమ పాలంబడిన యా పసిబాలికలు తామంత నిర్దయులై విడిచిపెట్టినతర్వాత వారిగతి యేమగునో యను నాలోచన కొంచమైనను మనస్సునందు లేక యతినిర్దయులై క్రూరులై తమ యింటనుండు నొక వస్తువునైననూ వదలిపెట్టుటకుండు పాటి సందేహమైననూ లేక యతిసులభముగా వదలివేసి మరునాడు మొదటిపెండ్లికన్న కట్టింపుకట్నము తీసికొని మరియొక భార్యను పరిణయమాడు పురుషులు గల మనదేశములో నిప్పుడు స్త్రీలు విడాకులన్న నింతయాశ్చర్యమెందులకు? ఇప్పుడు స్త్రీలుకోరు విడాకులచట్టము పురుషులవలె నంతద్రోహులుగా నుండవలయుననికాదు. ప్రకృతిధర్మము ననుసరించియే స్త్రీ లట్టివారు కారు. అందునను పాతివ్రత్యధర్మములో ప్రఖ్యాతిగాంచిన భారతనారీమణులా అట్టివారగుట? వారు కోరునదేమన భర్త కుష్టువాడుకాని, త్రాగుబోతుగాని, జారుఁడుకాని, దుష్టుఁడుగాని అగుచో నట్టివానితోడనే సంసారము చేయుటకు తన కిష్టము లేనప్పుడు నిర్బంధము లేకుండగలందులకును, తిరిగి వివాహమాడ కోరికయున్నచో నాడుట కవకాశము కలిగియుండుటకును, మరియు నిష్కారణముగా భార్యలను వదలిపెట్టు పురుషులకు బుద్ధిచెప్పుటకును, తమ పక్షము బలముగానుండుటకును, నవసరమగునప్పు డుపయోగించుకొనుటకును మాత్రమే గాని పాశ్చాత్త్యులవలె ఈదినముననే యొక పురుషుని వివాహమాడి మరునాడే విడిచిపెట్టవలయుననిగాదు. ఈ విడాకుల చట్టము మన దేశమునందలి క్రైస్తవులలో నున్నది. మహమ్మదీయులలో నున్నది. కాని మన హిందూపురుషు లంత సులభముగా వారిలో పురుషులుగూడా విడాకులిచ్చుచున్నట్లు గానరాదు. ఇక స్త్రీల సంగతి వేరేచెప్పనేల? ఈ విషయమైన తీర్మానమును బెజవాడలో జరిగిన ఆంధ్రరాష్ట్రస్త్రీలవిద్యాసాంఘికసంస్కారణసభలో కూడా పెట్టవలయునని చాలామంది తలంచిరి గాని శారదాబిల్లుకొరకే తహతహపడుచున్న యీసమయములోనే యీబిల్లునుకూడా నమలులో పెట్టమని కోరుట యంతమంచిదిగాదని యూరకుండిరి. ప్రస్తుతపు మనదేశమునందలి స్థితిగతులను బట్టి చూడ నీ చట్ట మావశ్యకమనియే పలువురకు తోచుచున్నది. నాకూ నట్లే గన్పట్టుచున్నది.

౮

## శ్రీమతి కొడాలి సీతారామదేవిగారు

ఈ చట్టమునను సరించి స్త్రీలకుపురుషులకు వలెనే స్వేచ్ఛ లభించుననియు, ఒకభర్త తనభార్యను వీడనాడినయెడల నామెకు యెటుబోవుటకును దారిలేకుండుననియు పుట్టినింటికేపోయిన భూలోకనరకము ననుభవించుననియు యీ చట్టముక్రింద ఆమె యింకొకనితో స్వర్గసుఖము ననుభవించవచ్చుననియు కొందఱివాదన. కానియిదిసరికాదు. పాశ్చాత్యపద్ధతులనే యనుకరించి వారి యాచారముల నవలంబించినయెడల స్త్రీలకు యిహపరములందు సౌఖ్యమునిచ్చునట్టిదియు యిహమునందు శాశ్వతమైన యశస్సునుకలుగజేయునట్టిదియును నైన పతివ్రతాధర్మము దూరమగును. ఒకగృహములో వివాహమైన కొలదిసంవత్సరములకు భార్యాభర్తలకు కలహము జరిగినదనుకొందము. వారికి సంతానమున్నదనుకొందము. భార్య భర్తను వదలి మఱియొకనిని చేపట్టును. భర్తకూడ మఱియొకతెను వివాహమాడును. అప్పుడు సంతానముగతియేమి? ఎన్నియోకష్టములు పడవలయును గదా? దానికిగూడ కొన్నిచట్టము లేర్పఱచబడుననుకొనినను ముందు భారతదేశములోని కుటుంబజీవనము తారు

మారగుట నిస్సందేహము. ఇదియొకయనర్థకమని చెప్పవచ్చును. ఈచట్టముక్రింద శిశుహత్యనుకూడయవకాశమున్నదని నాయూహ. ఎట్లన సంతతిగల దంపతులు విడిపోవునప్పుడుతమసంతతిని సంరక్షించుట కష్టమని వారిని హత్యగావించవచ్చును. కామముచేగలిగిన కోర్కెలను నెఱవేర్చుకొనుటకీచట్టము బాగుగనుపయోగపడును గాని యిహపరములను సాధించుట కనువగుకీర్తిని మనస్సును స్వాధీనము చేసికొనుటకుపయోగపడదు. కీర్తిశేషులైన లాలా లజపతిరాయిగారు యేదేశములో నీచట్టముండునో ఆదేశములో వేశ్యావృత్తిరోజీవనముగ నుండుననియు హత్యలు దురాచారములు ప్రబలుననియు వ్రాసిరి. ఇది ముమ్మాటికిని సత్యము. ఈ చట్టమును కోరుచున్నవారి మతమున స్త్రీపురుషసంబంధము కామముమీద ఆధారపడుటయేగాక వివాహబంధము దానిని నెఱవేర్చుకొనుటకు జరిగిన యొడంబడిక యగును. దానికిని భారతవివాహధర్మమునకునున్న భేదము హస్తిమశకాంతరము. భారతభూమిని వివాహము యిహపరముల కుద్దేశింపబడినది గాని యొక యిహమునకే గాదు. అట్టిదానిని విడాకులచట్టముచే మార్పనెంచుట కొఱవితో తలగోకికొనుటయె యగునని నానమ్మకము.



కోడాలి సీతారామదేవిగారు

## ౬

## శ్రీమతి ఆచంట మంగళాంబగారు

మన భారతదేశమున విడాకులచట్టమొకటి ప్రవేశపెట్టవలయుననుకాంక్ష కొంతమంది స్త్రీల మనసును కల్లోలపరచుచున్నట్లు పత్రికలమూలమున తెలియుచున్నది. స్త్రీలకు అబలలన్నపేరు కొన్ని విషయములలో కొంతవరకు సార్థకనామమని తోచుచున్నది. బలములేనిది అబలఅని పూర్వపు పండితుల అభిప్రాయమేమో గాని మనోపుష్టితక్కువైతే నేఅబలలని నా అభిప్రాయము. ఎట్లనిన మన దేశములో బుద్ధికుశలతగల స్త్రీలు లేరని కాదు నేననునది. మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి, గోషనార మొదలగు మేధావతులగు స్త్రీలు ఉద్భవించి తమ కీర్తిని చిరస్థాయిగ భారతదేశమున నెలకొల్పి స్వర్గస్థులైరి; కాని ప్రస్తుతపరిస్థితులలో మన దేశమున అట్టి స్త్రీ లెచ్చటను ఉన్నట్లు కాన్పించదు. ఇంతకు నేను చెప్పబోవునదేమనగా ఆ మనోదార్ఢ్యము తక్కువగుటవలననే పొరుగింటి పుల్లకూరరుచి అన్నట్లు అన్యదేశాచారమైన వివాహపద్ధతిని భారతస్త్రీలు కోరుచున్నారని. ఇట్లు కోరుట శ్రేయోదాయకము కాదు. ఇదియునుంగాక "పంచేంద్రియోన్మాదంబున్ బనమార్చి బుద్ధిలతకుఁ మారాకుహత్తించి" అని బమ్మెర పోతనామాత్యుడు వచియించినట్లు బుద్ధిని కోరికలలో పోయినంతదూరము పోనీయక సాధ్యమైనంతవరకు వశమునందుంచుకొని ఆత్మవిచారణసల్పి న్యాయమై ధర్మబద్ధమైన దాని నవలంబించి ఉన్నదానితో తృప్తి

పొందుట యీ లోకమునందు సుఖము; పరలోకమునందు మోక్షము. కనుక ఎన్నివిధముల ఆలోచించినను విడాకులచట్ట మనునది మన స్త్రీలు కోరుట పాంచిసంప్రదాయమును, శ్రేయస్కరమును కాదు. భర్తలెన్నివిధముల నిర్బంధించినను వానితోనే అవస్థపడవలయునా అని కొందరు స్త్రీలడుగవచ్చును. మళ్లీచేసుకున్న మొగుడును బాధపెట్టిన అప్పుడుచేయునదేమియు లేక మళ్లీ మొదటిగతియేయగునుకదా? దీనికి తెగుదలయెప్పటికి? కావున వివాహపునర్ధుచట్టమువల్ల సుఖమున్నదనుకొనుట కేవలము భ్రమయేకాని వేరుకానేరదని నానిశ్చితాభిప్రాయము.

## ౧౦

## శ్రీమతి అయ్యదేవర బాలా త్రిపుర సుందరమ్మగారు



అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

చెన్నపురియందు చెన్నరాష్ట్రస్త్రీవిద్యాసాంఘికసంస్కరణ సభలో విడాకుల చట్టతీర్మానము ప్యాసైనప్పటినుండియు దేశమునందు కొంత కలవరము హెచ్చినది. కారణము దేశమునందు శారదాచట్టము గొడవ తీవ్రముగా నున్నది. ఇటువంటి సందిగ్ధావస్థలోనే మరల విడాకులచట్టము కూడా పెట్టినచో అనేకావస్థలకు లోనుగావలసివచ్చును. అదియునుగాక బాల్యవివాహములు రద్దుపరచు శారదాచట్టము అమలులోనికిరానున్న సమయమున విడాకులచట్టమునకు అవసరము లేదని నామనవి. ఏలయన ఇదివరకు అనగా బాల్యవివాహములు ఆచారములై ఉన్నప్పుడు భార్యాభర్తలన్యోన్యానురాగవిషయములలో కొరతపడియుండి అనేకవిఘాతములకు లోనైన కుటుంబము లనేకములు ఉండినవి. అప్పుడిట్టి విడాకులచట్టమున్నను కొంతవర కుపయోగమయ్యెడిదేమో; కాని నేడన్ననో అట్లుగాదు. ఇంతటినుంచిజరుగు [శారదాచట్టము మూలమున] వివాహము లెట్లయిన వధూవరులు యుక్తాయుక్తవిచారులై, జ్ఞానపరివర్తనులై, ఒకరిగుణములొకరు తెలిసికొను వయసునందే జరుగును. తమతమ భావిభాగ్యోదయపురోభివృద్ధిగమనింపవలసిన బాధ్యత వారి పైననే యుండును. ముందటికాలమునందువలె ఇతరులపై నాధారపడవలసిన అగత్యము లేదు; కావున విడాకులచట్టమునకు ఇప్పుడు తొందరయయిన ఆవశ్యకత లేదు. ఉన్నదన్నప్పటికిని కొంతకాల మీ వివాహపరిస్థితులను (శారదాచట్టము వచ్చినతదుపరి) కూడ చూచిన అనంతరము నీ విడాకులచట్టము అవుసరమయిన ఆలోచించవచ్చును; కాన హిందూధర్మశాస్త్రములొప్పని, ఆర్యసంప్రదాయము లంగీకరింపని పాశ్చాత్యసంప్రదాయముల అనుకరణమగు విడాకులచట్టము ప్రస్తుతము అనవసరమనియే తోచుచున్నది.

☞ పై మాసమున మఱికొందఱు మహనీయురాండ్ర అభిప్రాయముల వెలువరింతుము.

— సంపాదకుడు.

# — స్వాప్నిక ప్రియ —

వెమ్మరాజు రాజగోపాలముగారు బి. ఏ., సారస్వతసమాజము

౧

ఆయతమైన యీజగము నంతయు ముంచిన పండువెన్నెలం
గాయుచునుండె రేవెలుగు; కాంతలతానవకుంజపుంజముల్
తీయని వాసనల్ జిలికె; శ్రేయద శాంతివరింపగా ప్రహ
ర్షాయుతచిత్తయై ప్రకృతి హాయిగ కన్నులుమూసి కూర్కెడున్.

౨

తెలతలలాడు వెండినునుదారము తీసిన రీతి చంద్రికా
విలసితమౌచు నందరుగు వేణిక యొండు; తదీయతీరమం
దలరగ నిల్చియున్న లలితాంగినొకర్తును కాంచి యెవ్వరో
తెలియగ కోరి యందుజని తిన్నగ నిల్చితి నామె యున్నెడన్.

౩

ఆమెయి శ్వేతమేఘశకలావళివీడి వెలుంగు పూర్ణిమా
సోము విధాన, మేల్ముసుగు సుంతసడల్చి విలోకనప్రభా
స్తోమసుధాతరంగముల సొంపెసలారెడి కన్నుదోయి న
న్నామె బహూకరించె; యెవరామెయు? నాప్రియురాలె చూడగా.

౪

మఱచి సమస్తదుఃఖములు, మానవకోటి నడంచు భారముల్
మఱచి యసహ్యవేదనలు, మానస మేర్చెడు మర్మఖేదముల్
యిరువుర మొక్క కౌగిటనె; యీనరలోకనితాంతచింతలున్
సురిఁగి విలుప్తమై చనగ సోలితి మాగతియేగె యామముల్.

౫

ప్రేమగడించి యొండొరుల వేల్లితహస్తము లంత నేడకో
ఆమెయు నేను వేపయానమై యటుపోవగబోవ నెన్నొ ఆ
రామనదీనదావళులు, రమ్యతలంబులు, నూత్నదేశముల్
మేము భ్రమించినార మటుమీదట నొక్కట మేలుగాంచితిన్.




డాక్టరు యస్. శేషగిరిరావుగారు, యల్. ఐ. యమ్.

సాధారణముగ బిడ్డలకు జ్వరము, అజీర్ణము - అందువలన గలుగు వ్యాధులు, మలబద్ధకము, దానిచే కలుగు యుపద్రవములు, గ్రహణి, ఈడ్పులు, క్రిములుచేయు ఉపద్రవములు, చర్మరోగములు మొదలగునవి కలుగుట తరచు కనుచున్నాము. ఇట్టివ్యాధులకు శిశుపోషణమున పూర్ణానుభవముగల ముసలమ్మలు ఏదో ఇంత వాము నలిపియో ఏదో ఇంత ఆకుపసరు పిండియో శిశువులను అట్టివ్యాధులనుండి రక్షించుటయు మనము కనుచున్నాము. ఇటువంటి సులభసాధ్యములగు అనుభవ యోగములు కొన్ని ప్రత్యేకము సేకరించియు, కొన్ని వైద్యగ్రంథములనుండి క్రోడీకరించియు ఈ క్రింద వివరించుచున్నాను.

### జ్వరములకు

అతివసచూర్ణమును 10 మొదలు 20 గోధుమగింజలయెత్తు వరకు తేనెతో ఇవ్వనగును.

గోరోజనమును చనుబాలతో నిచ్చిన బిడ్డలకు దోషజ్వరము నివర్తించును.

పారిజాతపుచెట్టు ఆకుల రసము బిడ్డల జ్వరములను హరించును

మండూకబ్రహ్మి ఆకును వెచ్చజేసి మోతులువేసి తేలిక కషాయము కాచి యిచ్చిన బిడ్డలజ్వరము కట్టును.

ములుగోరింటచెట్టు ఆకురసము తేనెతో గాని, పంచదారపాకముతో గాని యిచ్చిన జ్వరము నివర్తించును.

రెడ్డివారినానుబాలుచెట్టు చూర్ణము జ్వరములు కట్టును.

వేపాకు, మాక్షికమను తేనె, నెయ్యి ఒకటిగచేసి ధూపమువేసిన జ్వరము యొక్క వేగము శీఘ్రముగ హరించిపోవును.

తుంగముస్తలు, కరకపువ్వు, అతివస వీనిని సమభాగములుగ చూర్ణముచేసి తేనెతో కలిపి పసిపిల్లలకు నొసంగిన వాంతి, దగ్గు,జ్వరము హరించును. లేక అతివస చూర్ణముచేసి తేనెతో నొసంగిన పిల్లలయొక్క అతిసారము జ్వరము హరించును.

కర్కాటకశృంగి, అతివస, పిప్పళ్లు వీని చూర్ణమునైనను; అతివసచూర్ణమునైనను తేనె కలిపి శిశువుల కొసంగిన వారికిగల దగ్గు, జ్వరము, వాంతులు నశించును.

## కాసములకు

ఉస్తిపండు లేక వేరు నేతిలోవేసి కాచి యానేతిని బిడ్డలకు ఉగ్గుపెట్టిన దగ్గు హరించును.

బిడ్డలకు రాత్రివేళ కర్పూరతైలము వెచ్చజేసి రొమ్మునకు పూసిన శమించును.

కుక్కతులసి ఆకురసము బిడ్డలకిచ్చిన దగ్గులు హరించును. మోతాదు పూటకు 120 చుక్కలు చొప్పున దినమునకు 2 పూటలు నియ్యవలెను.

కుప్పింటాకురసము వేపనూనెలో కలిపి బిడ్డలనాలుకకుపూసిన వాంతి కలిగి శ్లేష్మమును పడునట్లు చేయును. దగ్గు నిమ్మళించును.

కోరింతచెట్టు ముదురుకాడలలోనుండి తీసినపాలు (చొన) బిడ్డలకు వచ్చెడు కోరింత దగ్గును పోగొట్టును.

నల్లతులసి అకురసములో తేనెకలిపియిచ్చిన బిడ్డలకు గొంతుకలో ధ్వని వగర్పు గలదగ్గు నిమ్మళించును.

గారపండు తేనెతో నరుగదీసి యిచ్చిన బిడ్డలదగ్గు శ్లేష్మము, హరించును.

తమలపాకురసములో తేనె గలిపిపోసిన బిడ్డలదగ్గులు, శ్లేష్మము హరించును.

తమలపాకులకు ఆముదము చరిమి వెచ్చజేసి రొమ్ముపైన ఆకుమీద ఆకును దళసరిగ వేసిన బిడ్డలదగ్గు, వగర్పు అణగును.

నల్లవావిలి ఆకురసము బిడ్డల దగ్గును పోగొట్టును.

వసను నీళ్లతో గంధముతీసి బిడ్డలరొమ్మునకు పట్టించిన దగ్గు, శ్లేష్మము హరించును.

వెల్లుల్లిదండను మెడలో కట్టిన బిడ్డల ఉక్కిసదగ్గు నయమగునని జనవాక్యము.

సదాప ఎండినయాకుల పొగవేసిన బిడ్డలదగ్గు నెమ్మదించును.



# సౌందర్యము—సద్గుణములు

శ్రీమతి జ్ఞానాంబ గారు

మనోహరమును నాకర్షకమునగు స్వరూపమునందందరికి నభిమానమున్నది; కాని యాకర్షకస్వరూపమును గలుగజేయు ముఖ్యసాధనములను గూర్చి మాత్ర మందరికి తెలియదు. ధనగౌరవములయందాకర్షణము లేదు. మంచి బలారోగ్యములు, సమర్థత, సంతోషము వీనియందే యాకర్షణమున్నది; కావున శారీరకాభివృద్ధిని కోరువారెల్లరు నిజమగు సౌందర్యమునకువలయు సద్గుణములను సంపాదింపవలయును. సుస్వరూపమును ప్రసాదింపగల మూలసూత్రములు మూడు కలవు. అందు మొదటిది మనోభావముల నభివృద్ధిచేసి యుక్తమార్గమున నడపుట. రెండవది శరీర వ్యాయామము. మూడవది క్రమమగు పథ్యము. ఈ మూడును ఒకదాని కొకటి సహాయకారులును ముఖ్యావశ్యకములునై యున్నవి. దుస్తులు, భూషణములు వట్టి యాభాసములే. సౌందర్యమున కివి ముఖ్యమైనవి కానేరవు. సౌందర్యమును బలమును కలిగించుటకు మనస్సునకుగల బాధ్యత నిస్సంశయముగా ప్రధానమైనదై యున్నది. మనోప్రాబల్యము ముఖలక్షణములను మార్చుచున్నది. శరీరముయొక్క అర్హాధర్మముల నడ్డగించుటకును అభివృద్ధిచేయుటకును దానికి శక్తియున్నది. కనుకనే వారివారిపనుల ననుసరించి వారి వారి ముఖములు రూపములు మారుచుండును. ప్రత్యేకమగు భావనాబలమువలన నీ మార్పు కలుగుచున్నది. ఎవరికిని ప్రత్యేకముగ నొక గురుతుతో గూడినముఖము లేదు. ఆతురత ఆందోళనము వీనివలన నొసట ముడుతలు కలుగును. కోపమువలన కన్నులు నోరు భయంకర రూపమును ధరించును. భయము, ద్వేషము, అసూయ, ఈ గుణములవలన రక్తప్రసారము కలతజెంది శరీరపోషణము తగ్గి యారోగ్యము చెడిపోవును. కోపమువలన గుండె మిక్కిలి యెక్కువగా కొట్టుకొనును. భయము వలన హృదయస్పందనము (గుండెకొట్టుకొనుట) ఆగిపోవును. దుఃఖమును కష్టమును కలిగించు

తలంపులవలన జీర్ణవ్యాపారము పాడగును. దీనిని బట్టి మనస్సుయొక్క స్థితిగతులు రక్తాభిసారమును నాటంకెపెట్టి యక్రమపరచుననియు, నందుమూలమున ననేకనష్టములు కలుగుననియు తేలుచున్నది. కనుక మన మనోభావములను స్వాధీనపరచుకొని శరీర మందలి ప్రతియవయవమును పోషణమును, బలమును పొందునట్లు చూడవలయును. రక్తాభిసారము క్షీణించుటయు, శరీరము క్షీణించుటయు నొకటియేగాన జాగ్రతగ నుండ వలయును. (ప్రకృతి)

# దంతములు—సౌందర్యము

ఎంత సుందరవదనమునకైనను పాచిపట్టినపండ్లు అందవికారము నాపాదించును. అందవికారమును గొనితెచ్చుటయే కాదు జీర్ణకోశమునకు సంబంధించిన అనేకరోగములకు అవి ఆహ్వానకర్తలు కాగలవు. పిప్పిపండ్లు, పాచిపట్టినపండ్లు ఆరోగ్యమును భంగించునవి గావున దంతములను అతిశుభ్రముగ నుంచుకొనవలయును. హిందువుల మగు మనము పడుకనుండి లేచినతోడనే దంతధావనముచేయుట అవశ్యాచారమై యున్నది. ఇది యెంతయు మంచి ఆచారము. పడుకొనబోవునపుడుకూడ పండ్లు తోముకొనుట అవశ్యము అవలంబింపవలసిన ఆచారము. ఏమందురా? మాటలాడుట, నవ్వుట, ఏదైన పదార్థములను తీసికొనుట మొదలగు పనులు చేయుచున్నంతకాలమును నోటినుండి 'సెలైవా' (నోటియందు ఊరెడు నీరు) ఊరుచు దంతశుద్ధికి కొంతవరకు తోడుపడుచుండును. మనము నిద్రించునపుడట్లుకాదు. 'సెలైవా' ఊరుట తగ్గియుండును; గావున అప్పుడు పండ్లసందున యిఱుకుగొను పదార్థశకలములు పులిసి బాక్టీరియా రోగమునకు మార్గము ఏర్పఱచును. కావున పండుకొనబోవునపుడు పండ్లసందున ఎట్టి పదార్థము ఇఱుకుకొని ఉండకుండ ధారాళముగ నీటితో పుక్కిలించుట, దంతముల పాచి పూర్తిగ తొలగిపోవుటకు కుంచెవలె నమలిన దంతకాష్ఠముతో తోముట విధిగ చేయునాచారము అలవఱచుకొనవలయును. దంతముల కంటియుండు సున్నితమగు చర్మము సురిఁగిపోకుండులాగున వానిని తోముకొనునపుడు క్రిందనుండి పైకి తోమవలెను, ప్రక్కవాటున ఎన్నడును తోమరాదు. తోమినతరువాత కూడ పండ్లసందున ఇంక నేమైన చిక్కియున్నట్లుండెనేని ఒక చెంబుడు నీళ్లలో ఒక టీస్పూను (చెమ్చాడు) బైకార్బొనేటు ఆఫ్ సోడాను వైచి ఆ నీళ్లతో పుక్కిలించి ఉమియవలయును. ఈ విధుల ననుసరించుచో దంతములు తెలుపెక్కి తేటుదేఱి ఆరోగ్యవర్ధకములగుటకు తోడు కొత్తలావణ్యమును కొనితేగలవు. మందహాసము చేసినపుడు పలికిబాఱు దంతములు మరబియ్యపుగింజలవలె ధవళధవళములైయుండుచో వదనవికాసముచేసి ఎంతటిఅందమును గొనితెచ్చునో అనిర్వాచ్యముగదా!

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కు పలుకులు

కారుపల్లి కోదండరామయ్యగారు

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు శ్రమచేసి సేకరించిపంపిన పిల్లలసంభాషణములను 'తొక్కుపలుకులు' అను మనోహరమగు శీర్షికక్రింద ప్రచురింపుచు గృహలక్ష్మిపత్రిక ౨-వ సంపుటము ౧౧-వ సంచికలో ఏతత్పత్రికా సంపాదకులు ఇట్లు వ్రాసియున్నారు. "సంభాషణరూపముననుండు పిల్లల అవ్యక్త మధుర భాషణములు ఇట్టివి దేశమున పరశ్శతములుగనున్నవి. కాని వానిలో కొన్నిటికైనను ఇంకను అక్షర రూపము చేకూఱలేదు. ముద్రణసౌకర్యములు సమకూడియున్న ఈ దినములలోకూడ వానిని వాగ్రూపముననే యుంచుటపాడిగాదు. కావున అట్టివానియందు రుచిగలవారు వానిని సేకరించి 'గృహలక్ష్మి'పత్రికాముఖమున లోకమునకు చేకూర్ప ప్రార్థించుచున్నాము." ఈ వాక్యములచదివి ఉత్సాహినై నేను సేకరించిన క్రింది తొక్కుపలుకులు గృహలక్ష్మిముఖమున ఆంధ్రలోకమున కర్పించుకొనుచున్నాను. ప్రశ్నోత్తర పూర్వకముగనుండి వచ్చిన మాటలే తిరుగవచ్చుచునుండు ఈ పలుకులు తలయేఱుగొనకయే చిన్నపిల్లలు ఉల్లాసపూర్వకముగ కంఠస్థ మొనర్చుకొన జాలియున్నవి. జాతికి ప్రత్యేకసంపదఅనదగిన ఈ తరగతి బాలసాహిత్యము విస్మృతిగహనము పాలుకాకుండ అర్హప్రకాశము నీయసంకల్పించిన గృహలక్ష్మిపత్రికాధిపతులను కొనియాడుచు వారికీ యుద్యమమునందు యథాశక్తి నితోడ్పడుదురు గాకయని ఆంధ్రమహాజనులను హెచ్చరించుచున్నాను.

కాలువకుపోదాం
వస్తావా?
ఏ కాలువ?
రాజుకాలువ—
ఏ రాజు?
అడవిరాజు—
ఏ అడవి?

చెట్టడవి—
ఏ చెట్టు?
సొరచెట్టు—
ఏ సొర?
మంచిసొర—
ఏ మంచి?
కాయమంచి—

ఏ కాయ?
గెరిటికాయ—
ఏ గెరిటె?
ఉక్కుగెరిటె—
ఏ ఉక్కు?
నీముక్కు—

౨. పాటలు

# జోలపాటలు

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారిచే సంపాదితము

రాములవారిమీద
శ్రీరామ! రఘురామ! శృంగారరామ!
చారువిక్రమరామ! చంద్రముఖరామ!
భక్తిజనదారిద్ర్య భంజనుడ! రామ!
ముక్తిదాయక! రామ! మునివంద్య! రామ!
శివువిల్లువిరచిన శృంగారరామ!
అట్టె సీతను చెట్టపట్టినరామ!
ధరణిజపతి! రామ! దశరథరామ!
పట్టంబుచేకొన్న పట్టాభిరామ!
శ్రీకృష్ణులవారిమీద
ఎవ్వరేనాస్వామి నవ్వుల్లతండ్రి
శంఖచక్రాలతో జన్మించినాడు
నవ్వుముఖముతో నాతండ్రి! కృష్ణా!
పువ్వుటుయ్యాలలోను పొంగియూగుమురా
నిద్రపో నిద్రపో నీలవర్ణుండా!
బలభద్రుతమ్ముడా! హరి! నిద్రపోరా
నిద్రకువెయ్యేండ్లు నీకువెయ్యేండ్లు
నందగోపకుమార! నవనీతచోరా!
మందరగిరిధరా! మాధవ! కృష్ణా!
ఏడువకునాతండ్రి! యేడువకుకృష్ణా!
పాడియూచెదనిన్ను బాలగోపాల!

౩. నీతికథ

# అసూయ కూడదు

శ్రీమతి మాడభూషి చూడమ్మ గారు

ఒకపల్లెలో ఒక బీద బ్రాహ్మణుడు ఉండువాడు. అతనికి లేక లేక ఇద్దరు పుత్రులు గల్గిరి. మొదటి పిల్లవానికి నాగమ్మ అనియు రెండవ వానికి కృష్ణమ్మ అనియు నామకరణము చేసిరి. పెరిగినతరవాత కూడ నాగమ్మ నాగమ్మగానే ఉండెను. ఎవరైన ఎదురై హాస్యమునకు పలుకరించిన వెకిలినవ్వునవ్వుచు చేతిలోని వస్తువునట్టె విడిచి తెల్లపోవుచుండెనన్న హాని తెలివి తేటలు స్పష్టముగ ఊహింపవచ్చును. పెద్దకాలమునకు ముద్దుగ బుట్టిన వారగుటచేత నెట్లో దొర్లి యావెట్టినాగమ్మ కాతండ్రి యొకవనితారత్నమును పెండ్లి చేసెను.

ఆగ్రామమునకాయనయొక్కడే వైదికవృత్తివలన జీవించుటచే పేరిశాస్త్రి పోటీలేని భిక్షాధికారియై లక్షాధికారివలె సుఖజీవనము చేయుచుండెను. కొంతకాలమునకాయన కాలముచేసెను. నాగమ్మ యిల్లుదిద్దవలసివచ్చెను. తల్లి ముదుసలి. భార్య

తెలివితేటలమూలమున తల్లి యాలోచనతో నాగేశ్వరశాస్త్రి తండ్రిలేని లోపము లేకుండ తమ్ముడికి వివాహాముగావించెను. "పువ్వుపుట్టగనే పరిమళించు" నన్నట్లు కాపురమునకు వచ్చినదే కృష్ణశాస్త్రిభార్య కాపురము వేరుగావించెను. గ్రామమందలి పౌరోహిత్యము, ఆబ్దీకపుభోజనములు, అక్షయపాత్రయును వారికిగలయాస్తి కనుక ఆ యూరునున్న గృహాముల వరుసను పంచుకొనిరి. నాగరాజు "భవతి భిక్షాందేహి" యనునంతనే దోసిలినిండ నిచ్చెడు నిల్లాండ్రు కృష్ణప్పనుచూచి మూతులు విరచెడివారలు. ఏలనగా ముదుసలి తల్లిని విడిచి భార్యతో వేరు పోవడమే యిందులకు కారణము. తలిదండ్రుల నిరసించినవానిని దూషించు నాచార మిప్పటికిని పల్లెటూళ్లయందు గలదు. కృష్ణయ్య భార్యకిది కిట్టలేదు. తన గౌరవలోపమున కాయత్తయు బావయు కారణమని వారి నతికఠినముగ తిట్టియు శాప మొసంగియు, కనుపించిన వారందరితోను చెప్పుచుండెడిది. నాగశర్మ యిదియంతయు గాంచి తమ్ముని శ్రేయము గోరినవాడగుటచేత తానాయూరు వదలి యొందైన పోవ సమకట్టి యావార్త తల్లికెరిగించెను. తల్లియు సంతోషించి మన మవతలికి పోతి మా యావెట్టిపాడెకట్ట భార్య పోరుడిగి సుఖించును. నాయనా త్వరగా నేదో గ్రామము నివాసయోగ్యమగునది చూడుమనెను. ఏలుటకూళ్లుగానము గాని యెత్తుకు తినుట కూళ్లులేవా? యని యడగగా భార్య ముందు మీరేదేని యూరుపోయి చూచి వచ్చిన పిదప నందరము పోదమనిచెప్పి, దారిబత్తెమునకని యొకపూటకు దధ్యన్నము కట్టియిచ్చెను. మధ్యాహ్నము వకగంటవరకు నడచి చెట్టునీడయు జలాశయమును గానరా నాతడానీడ నాశ్రయించి నిదురించెను. ఆకాసారము దేవశాస్త్రి విహారస్థానమగుటచే నియమితకాలమున శాస్త్రీలుచేరి జలకమాడి, నిదురించుచున్న బ్రాహ్మణుని, చెట్టున వ్రేలాడు నన్నపుమూటను గాంచి దివ్యదృష్టిని యావిప్రుని తలంపెరిగి జాలిజెంది, యాయన్నమును దిని యామూట యందొక పాత్ర కట్టిరి. కొంతసేపటి కాభూసురుడు మేల్కాంచి యాకాలనియమానుష్టానమును (సాయంసధ్య) దీర్చి యన్నమునకై చూడ నామూటలో గిన్నెయుండెను. కారణము లేని కార్యముండదనుచు ఆతడు పరమేశ్వరా దీనివలన నాయాకలిదీరుగాక యనెను. వెంటనే పంచభక్ష్యపరమాన్నసహిత మైనఅన్నము ఆచిన్నిపాత్ర యొసంగెను. తృప్తిగ భుజించి తనతల్లి కావార్త తెలుప త్వరితగతి నిల్లు చేరెను. ఆరాత్రి ఇంట వారిసంతోషమునకు పారములేదు. మరుచటిదిన మావిశేషము గ్రామవాసుల కందరికిఁ దెలుప నిశ్చయించి ఊరివారందరిని బిలిచి సంతుష్టిగ భోజనములచే మెప్పించిరి. ఆగ్రామ మండలి జన మాదిన మా విశేషమే చెప్పుకొనుచు ఆశ్చర్యాంబుధి నోలలాడిరి. ఆరాత్రి కృష్ణయ్య భార్య నిద్దురబోలేదు. తోడికోడలు గౌరవింపబడుట

చూచి సహించలేకపోయెను. ఈసున రోసముగల్గి భర్త చెంతజేరి తనకొకటి అట్టిగిన్నె సంపాదించి యివ్వవలయుననియు, లేకున్న తానురిబోసికొనియో, నూరిబైట నూతబడియో ప్రాణములు వదలెదననియు పట్టుబట్టెను. అంత ప్రాణము విసిగి ఆతడు యెట్టకేలకు పయనమాయెను. పయనమునకుముందు అన్నవద్దకేగి గిన్నెను సంపాదించిన కథనంతయు నెరిగి తానుగూడ నటులగావించెను. కృత్రిమకార్యగాములకు నిమరయు, నిర్మలమనముమందునా? ఒకయుత్తరీయముగప్పుకుని యరమోడ్పుతో చూచుచుండెను. దేవతాస్త్రీలు యప్పటియట్ల వారి నియమప్రకారము సరిగవచ్చి యాకొలనిలో స్నానమాడి యాచెట్టునీడల విశ్రమించి మన కృష్ణమూర్తిని గాంచిరి. ఆలోచనాపరతంత్రుడై వారాయన్న మెప్పుడు తిందురా తనకెప్పుడట్టిపాత్ర మొసంగుదురా యనుచు తలచుచు వారి శృంగారమునకు ముగ్ధుడగుచుండెను. అప్సరసలు వానినిగాంచి తమ దివ్యదృష్టిని పరికించి వీనికి తగిన పనిచేయవలయునని యెంచి యెప్పటి యట్ల నొకపాత్రనందుంచి దిగికేగిరి. వెంటనే సంతోషస్వాంతమున మైమరచి తానును సంపాదింపగలిగితి గదా యనెడు గర్వము త్వరపెట్ట యొక్కనిమిషముననే ఆతడు యిల్లుచేరి యాఫలిత మర్ధాంగి కెఱిగించెను.

గొప్పతనము గౌరవమే ప్రధానముగ నెంచిన నాయిల్లాలు ఆపాత్రమహిమ మెరుగకయే మరుచటిదిన మాయూరివారందరిని భోజనముల కాహ్వానించినది. కృష్ణశర్మ సంపాదన కందరును సంతోషించి నాగేశ్వరునింటికిరాక ఇంత నత్తిసరు మెతుకులదిని తరువాత విచారించిన మహానీయులందరు గూడ సీతని పిలుపునకు హాజరైరి.

ఆయూరి బ్రాహ్మణోత్తములు మణీదారు మొదలగు పెద్దమనుష్యులు సకాలమునకువచ్చి వరుసలుదీర్చి కూర్చుండిరి. చీనిచీనాంబరధారులై వనితారత్నములు బాలబాలికలు గుణుగుచుండ యిదిగో తెస్తున్నారు, అదిగో తెచ్చిరని సమాధానములు చెప్పుచు నిటు నటు కూర్చుండబెట్టుకొని భోజనము వడ్డించెడు పళ్లెముగాదేమని యనుకొనుచుండిరి.

కృష్ణమూర్తిదంపతులు పట్టుపుట్టంబుల ధరించి యొయ్యారముగ నాపాత్రమహిమను తనయన్న చెప్పలేదన్నలోటు కృష్ణశర్మతీర్ప నిశ్చయించి తానాపాత్రకొరకెంతో కష్టపడితినని దేవలోకమునకు పోతినని తనకు విమానము వచ్చెనని యెన్నో విచిత్రముల నేకరవుపెట్టి యాగిన్నెనందఱకు చూపిరి. కృష్ణశర్మ శక్తికి యందరాశ్చర్యనిమగ్నులైరి.

పిదప నాగిన్నెను జనమధ్యమున యొకవిశాల ప్రదేశమునందుంచి పాత్రమాతృప్తిగ వడ్డించమ్మా యనిరి. అందుండి తళతళ కాంతులు మెరయ కుప్పతిప్పలుగ మంగల

కత్తులు బయలువెడలి వరుసగ నందరినియొక్క ముహూర్తకాలమునకు తలబరువులవదల్చి క్రొత్తగచేరినస్వాములవారినిగ చేసెను. ఆదృశ్యమునుగని కృష్ణదంపతులు చకితనేత్రులై సిగ్గున నిలిచిరి. హాహాకారావములతో కొందరు పారిపోయిరి.

స్త్రీబృంద మల్లకల్లోలముగ కోలాహలముచేయగా నందఱమధ్యను నాగశర్మ భార్య యిట్లని స్తుతింప నాకత్తు లాస్త్రీ జోలికి రాకుండనుండెను.

భర్తృపాదంబులెనమ్మి బరగితేని పరమపురుషుని నమ్మి భజించితేని
పెద్దవారల నెప్పుడు పూజించితేని భయముకొల్పెడియాపద బాయుగాక !

అసూయాపరవశత్వ మెంత హానికరమైనది ?

౪. ఆరోగ్యము

## పసిబిడ్డ ఆజ్ఞలు

### ఆకుండి వేంకటశాస్త్రిగారు

ఆరోగ్యవంతముగ పెరుగగోరు పసిబిడ్డ తనతల్లికి ఈపది ఆజ్ఞల నిచ్చుచున్నది:—

1. నీవు నానోటి నెన్నడును ముద్దుపెట్టుకొనకుము.
2. నాముఖముపై నీవు ఎన్నడును తుమ్మకుము; దగ్గకుము.
3. నాకు త్రాగుటకు కాచి చల్లార్చి వడపోసిన పరిశుభ్ర జలమునిమ్ము.
4. నీవు నాకు పాలనిచ్చు సమయమున సంతోషచిత్తముతో నుండుము.
5. జీర్ణమగు పదార్థములనే నాకు పెట్టుచుండుము.
6. ప్రతిదినము నాఒడలు తోమి కడగి చక్కగ స్నానము చేయింపుము.
7. ధరించుటకు కాలానుగుణ్యముగ పరిశుభ్రమైన ఉడుపులనిమ్ము.
8. నాకు ప్రత్యేకమైన మెత్తని శయ్యనిమ్ము.
9. శుభ్రమైన గాలి ధారాళముగ ప్రవేశించుటకు అవకాశమునిచ్చు కిటికిటీలు గల గదిలో నాపడుక నేర్పాటుచేయుము.
10. ముద్దు ముచ్చటలకొఱకు నాకెన్నడును నిద్రాభంగము చేయకుము.

౫. పద్యము

## బాలికలకు

### వేంకట శాస్త్రి కవులు

ఓసుకుమారలార ! యిటు లూరక కాలము వ్యర్థపుత్తు రే
లా ? సుమనోహరమ్ములు విలాసమయమ్ములు మోహనమ్ము లై
వాసన లీనుచున్నవి నవప్రసవమ్ములు కోర్కిదీరఁగాఁ
గోసికొనుండు మాలికలు గూర్చికొనుండు ముదంబు నెందుచున్.

ఆ యుదయాద్రి నిల్చిన నవారుణబింబము మోహసంగతిన్
వేయికరంబులన్ బ్రణయినిన్ గిలిగింతలు పెట్టుచున్న యీ
తీయని వేళనే మనసుదీరగఁ గోసికొనుండు పుష్పముల్;
పోయిన దానికిన్ వగపుఁ బూనిన నేమిఫలంబు వాటిలున్?
కాలము పక్షముల్ పరచి గాఢరయంబునఁ బోవుచున్న దో
బాలికలార! మీఁది కెగఁబ్రాఁకుచునుండినవాఁడు సూర్యుఁ; డా
భీలతరాంధకారపదవీపరికల్పితకాళరాత్రి యు
న్మీలితమృత్యుదృష్టి నరుదేరక మానదు నిర్దయమ్ముగన్.
చెలువముతోడ నేఁడు వికసించిన పుష్పము రేపు వాడి రే
కులు విడిపోవ రాలిపడు; కోమలులార! వయోవికాసముల్
తొలఁగకమున్నె చిత్తములతోఁ బ్రియకాంతుల కర్పణమ్ముగా
నలరుల దండ లల్లి యుపహారము లిం డనురాగసంపదన్.

౬. బుద్ధిపరీక్ష

## పొడుపు కథలు

### వల్లమాడి దశరథ రామయ్య గారు

[ఇవి బాలురయు, బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనవి. కావున ఈ పొడపు కథలకు విడుపులు స్వతంత్రముగ నాలోచించి బాలబాలికలు మార్చి 10_వ తేదీలోపున లేఖాముఖమున మాకు తెలియజేయ కోరెదము.—సంపాదకుడు.]

1. నన్ను కలిగియుండనివారు కావలెనని కోరరు. ఉన్నవారు పోవలెనని కోరి నను పోవను. నన్ను గెలిచినవారు నన్ను కలిగియుండరు. నన్ను ఓడినవారును గెలిచిన వారును విచారమునే పొందుదురు. ఒకరు బయట, మిగిలినవారు లోపల. అంతే భేదము. నే నెవరు?

2. ఒకరిమెడలో మాత్రముపడి చనిపోవువఱకు ఇరువురను బంధించునది ఏది?

3. నేను బండితో వచ్చి బండితో వెళ్లుదును. నే నున్నందువల్ల బండికి ప్రయోజనములేదు. కాని నేను లేనిది బండి వెళ్లలేదు. నే నెవరు?

4. తీసిన కొద్ది పెరుగున దేది?

5. నీదై యుండి యితరులుకూడా వాడుకొనునది యేది?

6. పేరు చెప్పగనే పోవునది ఏది?

7. మనము కావలెనని కోరి దానిని పొందగనే మనము కలిగియున్నామని తెలిసికొనలేని దేది?

8. నేను కలుసుకొనుట వలన భాగింతును. భాగించుట వలన కలుసుకొందును. నే నెవరు?

౭. బాలవాఙ్మయవిమర్శనము

# గీతామంజరి

(ఐదు భాగములు)

ఆంధ్ర శేషగిరిరావుగారు బి. ఏ. (సారస్వతసహాయకుడు)

ఇంతవఱకు సాధారణముగ ఆంధ్రవాచకపుస్తకములలో వచనభాగము విస్తరించి యుండుటయు, వాచకమునకు చివర ఏవో కొన్ని పద్యములు లాంఛనార్థము ఉంచబడుటయు నాచారమైయున్నది. కంఠస్థ మొనర్చుకొనుటకు అనువైయుండుటను, రాగముతీయవలెననెడు బాలుర సహజాభిలాషను పెంపొందింప జాలియుండుటను పద్యము గద్యముకంటె పిల్లలకు చిత్తాకర్షణీయముగ నుండుననుసత్యమును ఆయా వాచకములను వ్రాసిన పెద్దలు గ్రహించినట్లు పొడగట్టదు. కాని ఇటీవల కొందఱు విద్యాధికు లీ సత్యమును బాగుగ ఆకళించి తత్పరిపోషణమునకు కొన్ని పద్యవాచకములను ప్రచురించియున్నారు. అందు శ్రీయుతులు వేంకటపార్వతీశ్వరకవులు రచియించి ప్రచురించిన బాలగీతావళులును; శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు రచియింపించి ప్రచురించిన గీతామంజరులును ప్రథమమున పేర్కొనదగినవి. ప్రస్తుతము గీతామంజరుల పరామర్శింతము.

ఇవి మొదటితరగతి మొదలు ఐదవతరగతివఱకు అక్కఱకు వచ్చునట్లు ఐదు భాగములుగ రచియింపబడినవి. రచయితలు శ్రీయుతులు చింతా దీక్షితులు; వేదుల సత్యనారాయణశాస్త్రి. ఇందు శ్రీయుత చింతాదీక్షితులు ఆంగ్లాంధ్రసారస్వతనిష్ణాతుడు; నిత్యవ్యవహారమున బోధనాపద్ధతుల లోతును బాతును పరికించియున్న పరికించుచున్న ఉపాధ్యాయుడు; ఆంగ్లమున R. L. Stevenson వలె ఆంధ్రమున కొంతవఱకు ప్రత్యేకము బాలవాఙ్మయసృష్టికి దోహద మొనర్చిన ఉచితజ్ఞుడు; 'ఆడవె ఆడవె అమ్మణ్ణి', 'వచ్చిముద్దియవే వరహాలతల్లి' 'బాజాలురా నాన్న బాజాలు' మొదలగు ప్రతిపదరసనిష్యందములగు బాలగీతములను ప్రచురించి పెద్దల ప్రశంసల నందినప్రోఢ. ఇక రెండవవారగు శ్రీయుత వేదుల సత్యనారాయణశాస్త్రి గుంటూరు కళాశాలాంధ్రపండితుడు; పలుకుపలుకున భావమాధుర్యము జాలువార్చు కవితాత్మగలవాడు; ఆధునికయుగమున ఆంధ్రకవితాసరస్వతికి పరువము పరిమళముగల పద్యపుష్పముల సమర్పణచేయుచున్న సంఖ్యావంతుడు. ఇట్టివారుభయులును ఏకీభవించి పరిశ్రమించి ఆంధ్రదేశమున ప్రాథమికవిద్యావ్యాప్తికి విపులప్రయత్నము నడచుచున్న ఈ దినములలో ఇట్టి మనోహరపద్యవాచకములను రచియించి ఆంధ్రుల కర్పించుట సమ్మాననార్హమగు విషయము.

ఇట్టి వాచకములందలి పాఠములు బాలుర వయోభివృద్ధితో పాటు విషయముల యందును, తద్వివరణమునందును క్రమాభివృద్ధి నందుచుండవలయును. ఈ గ్రంథముల కర్త లీవిషయమును బాగుగ గుర్తెఱింగిరనుట కొక నిదర్శనము చూపెదను. 'నక్షత్రముల'ను గూర్చిన పాఠము మూడవభాగమునందును, ఐదవభాగమునందును కూడగలదు. ఈపాఠములందు ఆయాపాఠములను పఠించువారి వయస్సునకు తగిన విషయములు ప్రస్తరింపబడినవి. పరికింపుడు. గీతామంజరి మూడవ భాగము. పుట 15

అమ్మ! యెవ్వరో యాకాశమందుఁ జిత్ర
చిత్రమగు ముగ్గులుంచిరి; చిన్నచిన్న
చుక్కలెల్లెడఁ బెట్టిరి సొంపుగాగ
పిండితోడనో ముత్యాలగుండతోనో.

తెల్లనౌ చందమామతో నల్లమబ్బు
లెల్ల దోబూచులాడుచు మెల్లఁగాను
కలువపతినుండి వెన్నముద్దలనుదీసి
కూడియాడెడు వెన్నెల కుప్పలాట.

ఇఁక గీతామంజరి ఐదవభాగము పుట 13 పరికింపుడు.

మొదటనొక్క చుక్క పొడుచు నేమూలనో
మినుకుమనుచు మంచు బిందువోలెఁ,
జూచుచుండ మిన్ను చుక్కలమయమౌను
మిరపతోటపూసి విరిసినట్లు.
ఆదియంతు లేని యాకాశమందున
రెక్కలెల్ల నొక్క రీతి వెలుఁగ
నొక్కమూలనుండి లెక్కింపవలెఁ జుఁ
దలఁతుగాని గుఱుతు దప్పిపోదు.

చీఁకటులకెంతొ సాయంబుజేయునట్టి
నల్లమబ్బేమి పాపమొనర్చెకో నెనో
మినుకుమినుకున చీఁకట్ల మెరయుగాని
మబ్బులిన చుక్కలన్నియు మాయమగును.
సూదిమోపుటకును చోటైన లేకుండ
మింటచుక్కలన్ని మెరయుచుండ
నాన్న యిరవదేడునక్షత్రముల పేళ్లె
యెపుడుఁ జెప్పు నాకదేమొగాని.

ఈరెండు గీతములును బాలురేపలికినట్లు (ఉత్తమపురుషలో) వ్రాయబడినవి. మూడవతరగతిలో చదువు విద్యార్థి లేతమనమునకు పరిశీలనాశక్తి యుండనేరదు. కావుననే ఆతనికి ఆకాశమున అనంతముగ కనిపించు చుక్కలు నిత్యము ముంగిట తాను చూచు ముగ్గుచుక్కలైనవి. ఆవిద్యార్థి బుద్ధి అప్పటి కింకను క్రీడాచాపల్యమునుండి విడివడి యుండదు. కావుననే ఆతనికి నల్లమబ్బులు చంద్రునితో దోబూచులు, వెన్నెలకుప్ప ఆటలు ఆడుచున్నట్లుతోచినది. ఐదవతరగతి బాలునకు అట్లుగాక వయస్సుతో బుద్ధియు పెరుగును కావున ఆతనికి చుక్కలు నిత్యము తాను ముంగిట చూచు ముగ్గుచుక్కలుగాక అప్పుడప్పుడు అక్కడక్కడ తాను చూచు తోటమిరపపండ్ల పోలికలైనవి. ఇప్పటి కాతని బుద్ధి క్రీడాచాపల్యమునుండి విడివడి విషయవిచారమునకు దొరకొనును. కావుననే ఆతనికి చుక్కలను చూచి ఊరకుండుటతో తృప్తిలేక వానిని లెక్కింప ఉత్సాహముపుట్టినది; ఇన్నినక్షత్రములుండగా తన తండ్రి ఇరువదియేడింటినామములు మాత్రమే చెప్పుటేమి అను జిజ్ఞాసకల్గినది. మూడవతరగతివిద్యార్థికి చంద్రునితో ఆటలాడుచున్నట్లు తోచిన మబ్బులు ఐదవతరగతివిద్యార్థికి చుక్కలుచూడనొల్లని పాపపువస్తువులుగ

తోచుట వారి వయోవ్యత్యాసమునకు అనుగుణముగ నున్నది. గీతామంజరుల రచనమున విద్యార్థుల చిత్తముయొక్క క్రమవికాసము గుర్తింపబడినదనుటకు ఈ ఒక్కనిదర్శనము చాలును.

గీతామంజరులు మొదటిభాగమున (అది మిక్కిలిచిన్నపిల్లలకు ఉద్దిష్టమైనదగుట) విద్యార్థులు తమ చిన్నతనమునందు లాలన ఎఱిగిన మాతృదేవియొక్క ముఖమున విను జోలపాటలు; తోడబుట్టినతోడులతో నాడుకొనునపుడు నేర్చుకొను ఆటపాటలు మాత్రమే కూర్పబడినవి. రెండవభాగమున ఇట్టి పాటలకుతోడు బుద్ధిని పరీక్షించు పొడుపుకథలు కూడ జేర్పబడినవి. మూడవ నాలగవ ఐదవ భాగములందు విద్యార్థులకు సుపరిచితములగు జంతువులను గూర్చియు వృక్షములను గూర్చియు పాఠములు వ్రాయబడినవి. ఇట్టిపాఠములు తెలిసిన దానినుండి తెలియని దానితో బాలురకు పరిచయము చేయుటకును, క్రమాభివృద్ధి గాంచు వారి భావనాబలమును పెంచి పోషించుటకును సమర్థములై యున్నవి; గృహజీవనము, నీతివర్తనము—ఇవి విద్యార్థులను భావికాలమున మంచిసంసారులుగను పౌరులుగను చేయునవిగావున—వీనిని గూర్చి కొన్ని పాఠములు ప్రత్యేకించి వ్రాయబడియున్నవి. ఇట్లు విషయప్రాశస్త్యముతో నలరారు ఈపుస్తకములు ఉత్తరసర్కారులలో ఉత్తమతరగతిముద్రణమునకు పేరుకెక్కిన రాజమండ్రి సరస్వతిపవర్‌ప్రెస్సులో ముద్రింపబడుట పదియాఱువన్నెబంగారమునకు పద్మరాగముతోడి సంపర్కలబ్ధి సమకూడినట్లయినది. విషయప్రాశస్త్యమునకు విలువ కల్పించుచు, ముద్రణాసౌందర్యమునకు మురువుదీర్చుచు ఈవాచకములందలి చిత్రపటములు చెన్నలరుచున్నవి. ఇందలి మేలెంచి పాఠశాలాధికారులు వీనిని అర్హప్రచారము లోనికి గొనిరా ప్రార్థింతును.

## ప్రశంస

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

క్రనువిందుగూర్చు చక్కని చిత్రపఠముల కాలవాలంబుగా నలరినావు,
మిన్నకుండిన స్త్రీల మేల్కొల్పి వారిచే మంచివ్యాసములు వ్రాయించినావు,
కవికుమారులువ్రాయు కమ్మనిపద్యముల్ ప్రకటించి సత్కీర్తిబడసినావు,
క్రొత్తపోకడలతో క్రొత్తరూపంబుతో క్రొత్తదారిని బోవగోరినావు,

నీవు జన్మించి రెండేళ్లు నిండెనపుడె
అంచితంబగు కీర్తినార్జించినావు,
తెనుగురమణుల కొఱతలు దీర్చినావు,
తగిన రూపంబు గృహలక్ష్మి! తాల్చినావు.



## 152 సంవత్సరములు జీవించిన పురుషుడు :—

ఆంగ్లావనియందలి ష్రాపుషైరులోని ష్రూజుబరీ దగ్గరఉన్న ఆల్బరుబరీయందు థామసుపార్ అని యొకడు వసించుచుండెను. ఆతడు తనకు ఎనుబదిఏండ్లు వచ్చు వఱకు అవివాహితుడుగనే యుండెను. ఎనుబదిఏండ్లకాలమున ఆతడు పెండ్లిచేసికొనెను. ఆ భార్యవలన ఒక కుమారుని, ఒక కుమార్తెను గాంచెను. ఆతడు 122 ఏండ్లునిండగా తిరిగి వివాహము చేసికొనెను. 152 సంవత్సరములు జీవించి ఆతడు గతమాసమున కాలముచేసెను, అతడు ఇక రెండుమాసములకు చనిపోవుననగా అతని నొకసారి లండనునగరమునకు కొనివచ్చిరి. అత డంతకుమున్నెన్నడును జన్మస్థలము వీడినవాడు కాడు. అగుటచే నాతని కానూతనప్రదేశ సందర్శనము సంభ్రమము పుట్టించెను. మరణకాలమున డాక్టరులు ఆతని శరీరమును పరీక్షించి యిట్లుచెప్పిరి. "ఇతని మెదడు మంచిస్థితిలోనే ఉండెను. అగుటనే ఇతడు మరణకాలము సమీపించినను ఇరువది సంవత్సరములుగా గ్రుడ్డివాడైయుండినను చక్కగ వినగలిగియు, చెప్పినదానిని బాగుగ గ్రహింపగలిగియు నుండెను." మహనీయులకుగాని ఎందు ఖననము లభింపదో అట్టి వెస్టుమినిస్టరుఅబీ నం దాతనిక ళేబరము పాతిపెట్టిరి. అచటి రాతిమీద "పదిమంది ఆంగ్లమహారాజుల క్రమపరిపాలనములను చూచినవాడు" అను వాక్యమును చెక్కించిరి.

## 11 ఏండ్ల బాలిక టెన్నిసు పందెములలో గెలుపునొందుట:—

పదునొకండు వత్సరముల బాలికయగు మార్గరెటువుడ్ కాక్ అనునామె అలహాబాదు హైకోర్టు టెన్నిసుపందెములందు గెల్పు బిరుదమునందెను. ఈమెతో సహకారిణియై ఖలీపుల్లాగారు టెన్నిసు ఆటను ఆడిరి. ఇంత పిన్నవయస్సు బాలిక ఇదివర కెన్నడును టెన్నిసు ఆటలలో బిరుదుగట్టిన మేటియగుట కనివిని యుండలేదు. ఈమెకు పోటీపందెములో వచ్చిన బహుమానము మాత్రముగాక న్యాయమూర్తులైన దళాలుగారొక ప్రత్యేకబహుమతి నొసంగిరి. మరొకరు ఇంకొక ప్రత్యేకబహుమానము నొసంగిరి.

## ఈగల అభివృద్ధి :—

ఒక్కొక్క ఈగ తన జీవితకాలమున 20,000 పిల్లలనుపెట్ట గలదని అంచనావేయబడెను. ఈ 20,000 పిల్లలును తమ జీవితకాలమున ఒక్కొక్కటి 20,000 పిల్లలను పెట్టునుగదా. దీనినిబట్టి ఒక శాస్త్రవేత్త ఈగల అభివృద్ధి నిట్లు అంచనావేసి చెప్పుచున్నాడు. మార్చి ఇరువదియవ తేదీని గల ఒక్క ఈగ ఏప్రియలు

ఇరువదినాలుగవ తేదీకి మూడువందల ఈగలను సాకును. అవి మే మాసము ఇరువదియెనిమిదవ తేదీకి మూడువందలకు మూడువందలరెట్లు అనగా 90,000 అగును. అవి జూలై నెల రెండవ తేదీనాటికి 27,000,000 అగును; ఆగష్టు ఎనిమిదవతారీఖునాటికి 8,100,000,000 అగును.

## కొబ్బరిచెట్టుమీద 5 రోజులు ఉన్న పిచ్చివాడు :—

కాలికట్టు పిచ్చిఆసుపత్రిలో మలాపపురము నివాసియగు ఉన్నియన్ అనునొక పిచ్చివాడు ఉండెను. అప్పటప్పట రోగుల స్థితిగతుల తెలిసికొనుటకు ఆసుపత్రిలో వారిని తూచుటవాడుక; కాబట్టి ఇతరరోగులతో పాటు ఉన్నియన్ కూడ తులామానముదగ్గరకు తీసికొనివచ్చిరి. అచ్చట డాక్టరులు ఆంగ్లమున 'వెయింగు' (Weighing) (తూచు) అని మాట్లాడుకొనుచుండిరి. ఉన్నియనుకు ఇంగ్లీషురాదు. అతని మాతృభాషయగు మళయాళమున "వెయింగు" అనగా ఉరితీయుట అని అర్థము. అందుతో ఉన్నియన్ చాలభయపడి 'మీరు నన్ను ఉరితీయలేరు' అని పెద్దకేకలు వేయుచు పరిగెత్తుకొనిపోయి దగ్గరఉన్న ఒక కొబ్బరిచెట్టు ఎక్కి దానిముచ్చులో కూర్చుండెను. అట్లాతడు తమకంటె ఆకాశమునకు డెబ్బది అడుగుల చేరువను ఉపస్థితుడై ఉండగా క్రిందనున్నడాక్టరులు, తదితరులు నిర్ఘాంతపోయి నిలబడిపోయిరి. ఇది జరిగినది ఒకానొక లక్ష్మివారమున. కొంచెము సేపు ఉన్నతరువాత క్రిందనున్నవారు అతనిని దింపవలెనని తలపోసిరి. కాని ఎవరైన చెట్టు ఎక్కుట చూచి ఆతడు క్రిందికి దుమికి ప్రాణములు విడుచునేమో నని భయపడి అట్టి తలపులను మానివైచిరి. విధి విరామములు లేక రాత్రింబవళ్లు చెట్టుక్రిందకొందరు కాపుకాయుచుండిరి. ఇట్లు రోజులు గడుచుచుండెను. పిచ్చివాడు మాత్రము దిగిరాలేదు. ఆముచ్చులో ఎట్లో చోటుచేసికొనియుండెను. ఆహారపానీయములకు అతనికి లోటులేకుండెను. ఏమన కొబ్బరికాయలను కోసి వానిని తన పండ్లతో పీకి ఒలిచి నీళ్లుత్రాగి, కొబ్బరి తినుచుండెను. ఇట్లుండ ఈ వింతచూచుటకు జనులు విశేషముగ వచ్చి కొంత దూరమునచెట్టుచుట్టును మూగుచుండిరి. కాని చెట్టుక్రిందికి మాత్రము ఎవరును పోకుండిరి కొబ్బరికాయలు విసిరి పిచ్చివాడు తమ తలలు పగులగొట్టునేమో నను భయముచేత. ఈ పిచ్చివానిని క్రిందికి గొనివచ్చుట ఎట్లు అనునది అచ్చటి డాక్టరులకు ఒకగొప్పసమస్యగానుండెను. మండలవైద్యశాఖాధికారికూడ వచ్చెను. ఆతనికి ఏమియు పాలుపోక జిల్లాకలెక్టరుగారికి వర్తమానించెను. కలెక్టరుగారువచ్చిరి. చెట్టు ఎక్కి కూర్చున్న పిచ్చివానిని ఏమియుచేయలేక కలెక్టరుగారు చుట్టు మూగియున్న జనులమీద 144-వ శెక్షను ప్రయోగించి అక్కడ జనము మూగకుండునట్లు నిషేధించిరి. అనంతర మా అధికారులు అతిదీర్ఘముగ ఆలోచించి పిచ్చివాడు క్రిందపడుచో ప్రాణాపాయకరమగు దెబ్బతగులకుండుటకై చెట్టుచుట్టును కొంతదూరము కొంతఎత్తున ఒక పెద్దవలపన్నిరి. ఉన్నతాసనముమీద ఉపస్థితుడై ఉన్న పిచ్చివాడిది చూచెను. 'ఓవెర్రి వెంగలప్పలారా! మీవలలో పడుటకు నేను చేపను కాను.' అని అరచుచు వాడు క్రిందికిదుమికెను. వలదాటి ఆవలపడెను. ఆతని తొడలు విటిగిపోయెను. ఇది మంగళవారము మధ్యాహ్నము జరిగెను. అనగా వాడా చెట్టుమీద ఐదురోజులున్నాడన్నమాట. దుమికిన ఒకగంటకు వాడు ప్రాణములువిడిచెను.

## చిలుకలవలన జ్వరము :—

ఎలుకలవలన ప్లేగు, దోమలవలన మలేరియా కలుగునట్లే చిలుకలవలన ఒక విధమైన జ్వరముకలుగుచున్నదనియు, దానివలన కొందఱు మరణించిరనియు ఇంగ్లండులో ప్రవాదము పుట్టినది. ఈకారణమున పలువురు తమ పెంపుడుచిలుకలను చంపివేయుచున్నారు. దయార్ద్రహృదయులగు కొందఱు వానిని జంతుప్రదర్శనశాలలకు పంపివేయుచున్నారు. బర్మింగుహ్యాములో నొకవైద్యుడు ఒక్కసారిగా తన పదిహేను చిలుకలను చంపివేసెను.

# వనితాలోకము

**శ్రీమతి వై. జానకమ్మగారు:—**



వై. జానకమ్మగారు

ఈమె టైపు రైటరు వ్యాపారస్థులగు వై. నారాయణగారి తనయ. వయస్సు పదునొకండు వత్సరములు మాత్రమే. ఆంధ్రాంగ్ల భాషలలో వయస్సుకు మించిన పరిచితి సంపాదించిన వివేకవతి. ఈమె గానకళయందును మంచి ప్రజ్ఞ నార్జించి పరీక్షలలో జయముకాంచినది. విశేష మేమన ఈ కన్య తండ్రిగారికితగిన కుమార్తెయై గడచిన క్రిష్టమసువారమున మదరాసునందు జరిగిన పార్కు వేడుకలయందు బిజోయి టైపురైటరు ప్రదర్శనముగావించినది. ఆ ప్రదర్శమున ఆంగ్ల, తమిళభాషలటైపు యంత్రములను చురుకుగనుపయోగించి ప్రేక్షకమహాజనులచే మెప్పులందినది. ఈమె ఈ విషయమున భావికాలమునందు మంచిపేరు సంపాదించుననుటలో సందేహమునకు తావులేదు.

**శ్రీమతి అన్నపూర్ణాబాయిగారు:—**

కొంతకాలము బొంబాయి కార్పొరేషను మేయరుగానుండిన డాక్టరు దేశముఖ్ గారిసతి. ఈమధ్యజరిగిన హిందూమహిళాసమాజమువారి పదునొకండవ వార్షికోత్సవ సందర్భమున ఈమె అధ్యక్షురాలుగా నుండినది.

**శ్రీమతి డి. యి. జూలియన్ కన్యగారు:—**

గుడియట్టములో నూతనముగా స్థాపింపబడిన అమెరికను మిషను ఆసుపత్రిలో ప్రధానవైద్యురాలుగా నియమింపబడినది.

శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు:—


కె. రామసుబ్బమ్మగారు

ఈమె రెడ్డికులమునకు చెందినది. కడప మునిసిపలు సంఘసభ్యురాలుగా నియమింపబడినది. పురపారిశుద్ధ్య సంఘములందు సభ్యురాలుగానున్న రెడ్డికాంత ఈమె ఒక్కతియే అని తెలియుచున్నది.

శ్రీమతి యమ్. జానకికన్య:—

కాలికట్టులో గౌరవన్యాయాధికారిణిగా నియమింపబడినది. ఆనగరమునందలి పిచ్చిఆసుపత్రికి అప్పుడప్పుడు పోయి అందలి మంచి చెడ్డలను అరయుచుండుటకు గవర్నమెంటు వారీమెను కోరియున్నారు.

శ్రీమతి మార్గరెటు యఫ్. బార్బరు కన్య:—

కాలికట్టు మునిసిపలు సంఘసభ్యురాలుగా నియమింపబడినది.

శ్రీమతి పి. చినలక్ష్మమ్మగారు:—

అనంతపురము మండల విద్యాసంఘములో సభ్యురాలుగా నియమింపబడినది.

శ్రీమతి పి. సుశీలబాయిగారు:—

మద్రాసునందలి హిందూస్త్రీ సంఘసభ్యురాలు. కలకత్తాయందలి చిత్తరంజన పరిషత్తువారు నిర్వహించిన అఖిలభారతదేశీయ వ్యాసరచన పరీక్షలో ప్రథమ బహుమానము గాంచినది. వ్యాసవిషయము 'స్త్రీయుద్యమమున హిందూస్త్రీయొక్క స్థానము' అనుదానినిగూర్చి. గ్రామోద్ధరణ విషయములందు ఈవిదుషికి అభిరుచిమెండు. శ్రీయుత ఆర్కాటు రంగనాథమొదలియారువారు మంత్రిత్వము వహించినపుడు గ్రామపునరుద్ధరణమునుగూర్చి వారేర్పఱచిన వ్యాసముల పోటీపరీక్షలో ఈమె పాల్గొనెను.


పి. చినలక్ష్మమ్మగారు

శ్రీమతి జోషి కన్యగారు:—

వెస్టరన్ ఇండియను స్టేట్సుఏజెన్సీకి చెందినది. ఇంగ్లండున ఉన్నతవిద్య బడయు నవకాశము కల్పించుచు నీమెకు ఇండియాగవర్నమెంటువారు విద్యార్థినీవేతనము నిచ్చియున్నారు.



## తమలపాకులు ఈయనందుకు కొట్టిచంపుట:——

అహమ్మదు పకీరునకు ముప్పది సంవత్సరములు. అతని భార్య పదునేడు వత్సరముల పడుచు. పకీరునకు భార్యపై ఇష్టము లేకుండెను. ఇట్లుండ ఒకనాడు ఆతడు భార్యను తనకు తమలపాకులు చుట్టి ఇమ్మని అడిగెను. ఇచ్చుటలో ఆమె కొంచెము ఆలశ్యము చేసెను. అందుమీద అహమ్మదు ఆగ్రహముతో భార్యను బాదెను. ఆబాదుల కా అబల అసువులబాసెను. ఇది ప్రాసిక్యూషనుకథ. ఆలిపూర్‌లో విచారణ జరుగుచున్నది.

## భార్యరోగమునకు భర్త ఆత్మహత్య చేసికొనుట:——

బ్రిగాడియర్ జెరార్డు క్రిష్టియను అను సైనికోద్యోగి ఉచితజ్ఞుడు కావున తన భార్యను అత్యంతము ప్రేమించియుండెను. ఇట్లుండ విధివశమున భార్య జబ్బుపడెను. తాను గాఢముగ ప్రేమించిన ఇల్లాలు రోగగ్రస్తయగుటతోడనే ఆతడు అతివైక్లబ్యము నొందెను; భరింపలేక నోటియందు రివాల్వరు కాల్చుకొని చనిపోయెను. రోగార్తులగు భర్తలకొఱకు ప్రాణములను తృణప్రాయముగ నర్పించిన భార్యల నామములను కొల్లలుగ పేర్కొనవచ్చును; కాని భార్యలకొఱకు ప్రాణములిచ్చిన బ్రిగాడియర్ జెరార్డువంటి పురుషులు కోటికొకరైన దొరకుట సందేహము. ఆత్మభార్యయందు దేవీస్వరూపముగాంచిన ఈసైనికోద్యోగి చిరస్మరణీయుడు; స్వార్థపరులగు పురుషులలో తప్పబుట్టిన మహనీయుడు.

## ప్రజ్ఞారక్షితశీలయగు యువతి:——

కిరణబాలదాసి భాంగోర నివాసిని. ఆమెకు పదునేడేండ్లు. ఆమె భర్త వర్తకసరళిని తఱుచు కలకత్తాకుబోవుచుండువాడు. జతీరామునాస్కరు అను దుష్టుడు వారి పొరుగువాడు అట్టిసమయములందు కిరణబాలదాసి ప్రవర్తనము చెడమార్గములకు త్రిప్ప ప్రయత్నము చేయుచుండువాడు. కిరణ బాలమాత్రము లొంగలేదు. ఇట్లుండ ఆమె ఒంటరిపాటుననున్న సమయమున జతీరాముడు దౌర్జన్యముచేయ నుంకించెను. అందుతో ఆమెకు కోపము పెచ్చెత్తి ధైర్యము తెచ్చుకొని పీటతో నాతనిని కొట్టెను. జతీరామునకు గట్టిదెబ్బలు తగిలినవి. ఆస్పత్రిలో పడవేసినారు. అందుండిగాయములు మాన్చుకొని అతడు మూడుమాసములకుగాని బయటపడలేదు. ఈలోగా ఈవిషయము కోర్టునకెక్కినది. ఆలిపూర్ సబ్‌కలెక్టరువారీకేసు విచారించి

జతీరామునకు ఆరుమాసముల కఠినవఱకము విధించుచు తీర్పులో కిరణబాలదాసి నిట్లు ప్రశంసించెను. "ప్రజ్ఞాబలముచే మానము కాపాడుకొన్న ఈబాలామణిప్రవర్తనము విధివశమున సమాసన్ని వేశములు గల్గుచో మేలుబంతిగనుంచుకొని ధైర్యముతో వర్తించి వంశమునకు అనూనయశము కొనివత్తురుగాక అని వంగ యువతులను హెచ్చరించుచున్నాను."

## "మగ వొల్లని సతి":—

శ్రీమతి రాజకుమారి పదితొమ్మిదివత్సరముల పడుచు. లాహోరునగరమునకళాశాలలో బి.యే సీనియరు తరగతియందు చదువుచున్న తనభర్త అమరదాసు అనువానిపై ఫిర్యాదుచేసి నగరన్యాయాధికారియొద్ద రాజకుమారి ఇట్లు చెప్పెను. "నేనొక మర్యాదవంశమునకు చెందినదానను. అమరదాసునకును నాకును 1923-వ సంవత్సరము అక్టోబరు 12-వ తేదీని వివాహము జరిగినది. వివాహము అయిన తరువాత రెండుసంవత్సరముల వఱకు నేను నాభర్తతో అత్తవారింటనుంటిని. ఆకాలమున నాతలిదండ్రులే నాకు కావలసిన ధనము, నగలు, బట్టలు, తదితరములగు వస్తువులు పంపుచుండిరి. పంపిన వానినెల్ల నామామగారు చల్లగ అందుకొని తమ స్వాధీనములోనే ఉంచుకొనుచువచ్చిరి. రెండుసంవత్సరములు గడచిన తరువాత నామామగారు, అత్తగారు, భర్త నన్ను బాధించుచు అగౌరవము చేయజొచ్చిరి. లేనిపోనిసాకులు కల్పించి నన్ను తఱుచు పుట్టింటికి తోలివేయుచుండిరి. తఱుచు నాభర్త నాతలితండ్రులను ధనముకొఱకై నిర్బంధించుచుండెను. నన్ను వారు పెట్టుబాధలకు నామనస్సు క్రమముగా వికారమునొందెను. అందుతో నాకు శరీరమున ఏదో రుగ్మత ప్రారంభమయ్యెను. అంతట మాఅత్తవారు నాకు క్షయరోగము తగిలినదని చెప్పుచు వారియింటినుండి తఱిమివైచిరి. నాతలిదండ్రులు నన్ను గొప్పగొప్ప డాక్టరులకు చూపి పరీక్షచేయించిరి. వారందఱు నాకు అట్టిరోగ మేదియులేదని నిరూపించిచెప్పిరి. ఇంతలో నాఅత్తగారు నాభర్తకు తిరిగి వివాహముచేసిరి. నాధనమంతయు వారు అపహరించిరి. నన్నుఏలుకొనుటకు నిరాకరించిరి. మనోవృత్తియిచ్చుటకైనను అంగీకరింపలేదు. నాకు రావలసిన 'స్త్రీ ధనమును' ఇచ్చివేయుటకును, నాకు మనోవృత్తి కల్పించుటకును 1929-వ సంవత్సరము ఆగస్టుమాసము 18-వ తేదీని నేను నోటీసు ఇచ్చితిని. నాభర్తదానిని పాటించలేదు. నోటీసుతీసివేసికొనుచో నన్నుతిరిగి నాభర్త ఏలుకొనునని నామామగారు నాతండ్రితో చెప్పగా అట్లేచేసితిమి. కాని నాభర్త నన్నుతిరిగి పరిగ్రహింపలేదు. కావున కోర్టువారు నాభర్త నాకు నెలకు నలువదిరూపాయిలు మనోవృత్తియొసగునటుల ఉత్తరువు దయచేయ ప్రార్థించుచున్నాను."

## పండ్రెండేండ్లకు రెండు పెండ్లిండ్లతో మరణము:—

కెయిరా మండలమునందలి నడియాడువాసియగు మనియాల్ గిరిధరలాలు భట్టుగారు తనరోగిష్టి కుమారునకు పండ్రెండేండ్ల బాలునకు ఇదివఱకే ఒకసారి వివాహమైయున్నవానికి తిరిగి వివాహముచేయ ప్రయత్నపడుచుండెను. ఇదితెలిసికొని అచ్చటి యువజనసమితివారు ఆందోళనముచేసి పెండ్లికాకుండ ఆగబట్టుటకు కోర్టు ఇంజక్షను తెప్పించిరి. అయినను భట్టు తనపట్టు విడువలేదు. బరోడా సంస్థానమునకు కొమరుని తీసికొనిపోయి అతనిని, అతనిరోగమును ఇచ్చి ఒక వధువునకు వివాహముచేసెను. కట్టుకున్న కాంతలను విధవలనుగా జేయు మహత్కార్యమునకే భారతభూమి కవతరించిన ఆ పండ్రెండేండ్ల బాలుడు రెండవ వివాహమైన కొలదికాలముకే ఊర్ధ్వలోకమునకు వేంచేసెను. ఇప్పుడు బొంబాయి హైకోర్టువారు కోర్టును ధిక్కరించినాడని భట్టుపై కేసుపెట్టి విచారించుచున్నారు.



తాంబూలము:విరుద్ధవస్తువులు :—

14-1-30—వ తేదీనాటి 'కౌమోదకి' పత్రికలో 'ఇంటిమందులు' అను శీర్షిక క్రింద తాంబూలమునుగూర్చి వ్రాసినవిషయములలో దిగువ నుదాహరించినవి ముఖ్యముగ గమనింపదగియున్నవి.—

"పాలు, వెలగపండు, పనస, ఆమ్లములుగానుండు ఫలములు, అరటిపండ్లు, ఇక్షుఖండములు, ఘృతము, తేనె, నారికేళము ఇవి తాంబూలముతో విరోధించును; కనుక వీనిని మెసవిన నుత్తరక్షణమునందే తాంబూలమును సేవింపగూడదు. ఈ విరుద్ధవస్తుసంయోగజనితవిషము మహాక్రూరమై మనుజులను హింసించును. తాంబూలమువేసికొనుచు నట్లనే ప్రాణములను త్యజించినవారలు అనేకులుగలరు. అట్టివారియొక్క కష్టములేని నిష్కారణమరణములకు కారణమేమి యుండవచ్చునని యాలోచించుచున్నవారలు సూక్ష్మముగ బరికించినచో ఇట్టి విరుద్ధములే సంప్రాప్తములైయుండునేమో ఎవరూహింపగలరు. మఱియు భుజించియు, నిద్ర నుండిలేచియు, స్నానమొనర్చియు, వాంతిజేసికొనియు నుండునట్టివారలు గడియసేపు నిదానించిగాని తాంబూలచర్వణమున కుపక్రమింపజనదు."

పాలు:విద్యార్థులు :—

'ది సౌతుఇండియనుమెడికలుయూనియను' వారి మాసపత్రికలో డాక్టరు టి. బి. ఓర్; డాక్టరు జెరాల్డువెయిటను అనువారలిట్లు వ్రాయుచున్నారు.—

"మీగడతీసినవికాని తీయనివికాని అయినపాలు పుచ్చుకొనుచో విద్యార్థులు పొడుగుగానెదుగుటయు తూకమున పెంపొందుటయు కల్గునని కనుగొనబడినది. తొమ్మిదిమొదలు పదునాలుగుసంవత్సరముల వయస్సుగల బాలురకు దినమునకు ఒక్కొక్కరికి అర్థశేరు పాలిచ్చితిమి. ఇట్లు ఎనిమిదిమాసములుచేయగా వారు పాలుపయోగించని బాలురకంటె పొడుగుగాను పుష్టిగాను ఎదిగిరి. పాలయొక్క గుణమేకలదని ప్రకటింపబడు బిస్కత్తులను కొందఱికి ఇచ్చితిమి. అవి వారికెట్టి క్రొత్తపుష్టిని కొనిరాలేదు. పాలుపయోగించినపిల్లలు పొడుగున, పుష్టియందు పెంపొందుటకుతోడు మంచిఆరోగ్యవర్ద్ధేహముతో నొప్పిరి. తేజస్సుకలమొగము, నలుపెక్కి నిగనిగలాడు తలవెండ్రుకలు, ఉద్దీపితోత్సాహము కలిగి విలసిల్లిరి. ప్రపంచమున ముందుకువచ్చిన జాతులన్నియు పుష్కలముగ పాలుత్రాగుటకు అలవాటుపడినవారే యను సత్యమున కీవిషయము పోషణమిచ్చుచున్నది."

ఆంధ్రవిశ్వవిద్యాలయప్రాచ్యవిద్వత్పరీక్షలు: స్త్రీలదుస్థితి:—

'ఒకవిద్యాభిలాషిణి' ఫిబ్రవరిమాసము 11–వ తేదీనాటి ఆంధ్రపత్రికలో నిట్లు ప్రకటించుచున్నది.—

"ఈమధ్య కొందఱు భాషాభిమానులు ఆంధ్రపత్రికయందు ప్రయివేటు విద్యార్థులకష్టములను వివరించి ప్రయివేటువిద్యార్థు లిరువదియైదుసంవత్సరములకు లోపువయసున పరీక్షలకు అర్హులు కారను నిబంధనను తీసి వేయవలయునని ప్రకటించుచు కృషిసలుపుచున్నారు. ఈ సందర్భమున మా స్త్రీలదుస్థితినికూడ ముఖ్యముగా తెలుపుకొనవలసియున్నది. ఆంగ్లేయపరీక్షలకువలె గాక ప్రాచ్యవిద్వత్పరీక్షలకు ప్రత్యేకముగా పరీక్షకు పోవుటకు అనుగ్రహించినందులకు భాషావ్యాప్తిని గురించి ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి సరళహృదయమును కొనియాడవలసియే యున్నది. కాని అందులో 25 సంవత్సరములు దాటినగాని ప్రయివేటుగా విద్వాన్ శిరోమణి పరీక్షల కర్హులు కారని యుండుటచే మిగుల అసంతృప్తికరముగా నున్నది. పురుషులకిది వర్తించినను స్త్రీల కీనిబంధన పూర్తిగా పనికిరాదని వ్రాయ సాహసించుచున్నాను. ఏలయన 25 సంవత్సరములు వచ్చు సరికి సామాన్యముగా స్త్రీలు 4, 5 గురు సంతానమును గని తమ యౌవనమును, దానితోబాటు బుద్ధిబలమును, చదువుకొనుట కవకాశమును పూర్తిగా కోల్పోవుచున్నారనుట సత్యదూరము కాజాలదు. అట్టి పరిస్థితులలో నామె విద్యావ్యాసంగముచేయుట కెట్టి వీలును లేదు. పల్లెటూళ్లలోని స్త్రీలు ప్రాచ్యవిద్యాభ్యాసము చేయుట కవకాశములుకలవు. కాని అట్టివారికి పరీక్షలకు చదువవలెనను కోరికయున్నను వారు పట్టణములకు బోయి మగవారితోపాటు సమముగా పరీక్షలకు కూర్చుండుటకు మనస్కరించుటలేదు. ఒకచో నందుల కిష్టపడినను తల్లిదండ్రులు భర్తయు దాని ననుమతింపరు. కాన 10 మంది విద్యార్థినిలుగల ప్రతిచోటను వారికి ప్రత్యేకముగా సెంటర్ల నేర్పరచి స్త్రీవిద్యను పోషింతురని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిని కోరుచున్నాను. ఈ పైవిషయములను, ముఖ్యముగా వయోనిర్ణయనిబంధనను గుఱించి స్త్రీవిద్యయెడ అభిమానముగల ఉదారహృదయులును, మా ఆంధ్రమహిళాసభవారును, తదితరవిదుషీమణులును తగు శ్రద్ధవహించి పూర్తిగా కార్యము కొనసాగువరకు కృషిసలిపి స్త్రీవిద్య నభివృద్ధి గావింతురని ప్రార్థించుచున్నాను."

రామమోహనుడు : స్త్రీయుద్యమము:—

బ్రాహ్మసమాజశతవార్షికోత్సవసందర్భమున పశ్చిమగోదావరిమండల తిలక నగరమగు ఏలూరునందలి స్త్రీప్రార్థనాసమాజమువారిచే ప్రకటింపబడిన శ్రీమతి సత్తిరాజు శ్యామలాంబగారిచే విరచితమగు కరపత్రమునుండి క్రిందిభాగము లుద్ధృతములు:—

"రామమోహనుని కాలమునాటి స్త్రీలస్థితి ఆ కాలములోని స్త్రీలకు తమ ప్రాణమును రక్షించుకొనుటకైనను సంఘములో స్వాతంత్ర్యము లేనిదై యుండెను. భర్తచనిపోయిన భార్య సతి యనఁబడు సహగమనము చేయవలసినదే. పురుషులు నిరంకుశస్వాతంత్ర్యపరులై పెక్కుమందిని పెండ్లి యాడుటయును అట్టి పురుషునితోపాటు భార్యలందరును సహగమనము చేయవలసి యుండుటయు నాటిఘోరము. పసికూనలను కూడా మేళతాళములతో నూరేగించి బలవంతముగా కాళ్ళను చేతులను కట్టివైచి వద్దని విపరీతముగా నేడ్చుచున్నను భర్తయొక్క మృతకళేబరముతోపాటు చితిలో పడవేసి ఆమెపై పెద్ద దుంగలను దాపి పైకిలేచి రానివ్వక ఘోరమగు ఆర్తనాదముపైకి వినబడకుండ బాజాలను వాయించి ప్రాణములను తీసెడు యీ ఘోరదురాచారము మన దేశమందు తప్ప మరియే యితర మొఱటుదేశమునందును ఉన్నట్లు వినము. కరుణాస్వరూపుడగు రామమోహను డీ దురంతమునుండి దేశము నుద్ధరించుటకు బద్ధకంకణుడై యనేకసభలను గావించి ప్రజలకు ప్రబోధించి అనేకుల సంతకములతో కూడిన మహజరులను ఈ బలవన్మరణముల నాపవలసినదని గవర్నమెంటుకు పంపించెను. అట్టితరి దేశమంతయు నాయనపై తిరుగబడిరి. ఇప్పు డీబాల్యవివాహమును నిషేధించు చట్టమును చేయించిన శ్రీ హరవిలాసశారదాగారిని మనపూర్వాచారపరాయణు లెట్లు నిందిం

చుచు హుంకరించుచున్నారో చూడుడు. అట్టి తరి నూరు సంవత్సరముల క్రిందట దేశమం దింతవిద్యావ్యాప్తిలేని కాలములో కేవల మూర్ఖత్వముతో నిండియున్న దినములలో గాఢాంధకారమున గొప్ప సర్చిలైటువలె యీ సంస్కరణము దేశమును తారుమారు కావించి యెట్టి సంఘర్షణము కావించియుండునో యోచించుడు. అట్టితరి మేరుధీరుడగు శ్రీరామమోహనుడు నిశ్చలుడై నిలిచి ఘోరసమరము సలుప సాగెను. మతవిషయికసంస్కరణము కావించి బ్రహ్మోపాసనామందిరమును కలకత్తానగరమున నిర్మించి దేశమున కనేకరక్షణోపాయముల కావించెను. పిమ్మట ఢిల్లీపాదుషా రాయలవారిని స్వంతపనిమీద ఇంగ్లండు దేశమునకు పంపించెను. దాని నవకాశముగా గైకొని రాయలవారు సీమదేశమున కరిగి సతి అను స్త్రీల పాలిటి బలవన్మరణము నాపివేయు చట్టమును కావించెను. పిమ్మట దేశీయుల దురదృష్టమువల్ల కొద్ది రోజులలోనే ఆ మహామహుడు అచ్చటనే తన భౌతికదేహమును చాలించెను. ఇట్టి పుణ్యమూర్తికి భారత స్త్రీలెట్టి కృతజ్ఞత చూపవలసియున్నదో ఊహింపజాలము.

ప్రార్థనాశీల:—

ఉత్తేజకరములగు దిగువపంక్తులు 10-వ తేదీనాటి 'ధర్మసాధని' నుండి గ్రహింపబడినవి.—

"ఇంగ్లాండులోని ఒకానొకభాగ్యవతి గాలిమార్పు నిమిత్తము తానున్న పట్టణమును వదలి సముద్రపు టొడ్డు ప్రదేశమునకు బోవ సంకల్పించి యుండెను. తా పయనమగుటకు పూర్వము భోజనపదార్థములతో బండ్లను నింపి బరువును పెంచవద్దని ఆమె తన భృత్యులతో గట్టిగా చెప్పెను. ఏర్పాటు చేసికొన్న ప్రకారము ఆమె తన పరిజనముతోడను కావలసిన వస్తుసామగ్రితోడను బయలుదేరి సముద్రతీరస్థమగు ఆరోగ్యప్రదేశమునకు జనుచుండెను. మార్గమధ్యమున బరువును మోయజాలక గుఱ్ఱములు అలసిపోవుచున్నట్లు ఆ యజమానురాలికి తోచెను. అపుడామె బండ్లలోనున్న వస్తువులను పరిశీలింప దొడగెను. అపుడామెకు భోజ్యపదార్థములు కనుపించెను. యజమానురాలు వద్దని నుడివినను రహస్యస్థలమునందు పదిలముచేసి పనివాండ్రు కొన్ని ఖాద్యవస్తువులను తమ వెంట తీసికొని వచ్చుచుండిరి. ఇపుడు ఆగుట్టు బయల్పడినది. యజమానురాలు ఉగ్రురాలై సేవకులను పిలిచి యిపు డీ పదార్థముల దీసి యిచ్చట పాఱవేయు డనిన ఒక పనికత్తె 'అమ్మా! ఈ వస్తువుల నిచ్చోట వ్యర్థముగా మట్టి పాలు చేయ నేల? అదిగో గ్రామ మొకటి సమీపించుచున్నది. నే నీపదార్థముల నచట నెవరికైన నిత్తును. దయచేసి కొంచెముసేపు ఓపిక పట్టుడు' అని వేడుకొనెను. గ్రామము రాగనే ఆ భృత్యురాలు ఆ ఖాద్యవస్తువుల నెల్ల తీసికొని ఒకటి రెండిండ్లు దాటి ఒక గృహమున ప్రవేశించెను ఆందు చినిగిపోయిన మలినవస్త్రములను దాల్చి ఒక స్త్రీ చేతులు జోడించి ఈశ్వరుని ప్రార్థించుచుండెను. ప్రార్థన ముగియువరకు వేచియుండి ఆభృత్యురాలు తా దెచ్చిన భోజనవస్తువుల నెల్ల ఆ పేదరాలికి నొసగెను. నిరుపేదయగు ఆ స్త్రీకి తత్సమయమున కలిగిన సంతోషమునకును, కృతజ్ఞతకును, విశ్వాసమునకును మేర లేదు. తనకు ఆహారద్రవ్యములను తెచ్చి యిచ్చిన మగువను జూచి "అమ్మా! నాభర్త దీర్ఘకాలము వ్యాధిచే పీడితుడై యిటీవలనే మృతిజెందెను. ఆయన చికిత్స నిమిత్తమును ఉపచారమునిమిత్తమును నా సర్వస్వమును ధారపోసితిని. నా దేహములోని రక్తమాంసములగూడ ఆయన సేవకై యర్పించి చర్మము ఎముకలతో నే నిట్లు నిలిచియున్నాను. ఆహారద్రవ్యములు అన్నియు పూర్తిఅయ్యెను. నేడు ఉపోష్యము చేయవలసిన స్థితి సంభవించినది. భగవంతుని గూర్చి 'తండ్రీ! నేడు నేను తిండిలేక మాడవలయును. లేదా ఏ అనాధ శరణాలయములోనో ప్రవేశింపవలయును. ఇవి నీ కిష్టము గానిచో అన్నము నొసంగి యీ దినము నాప్రాణము కాపాడుము' అని కన్నీరు కాల్వలు గట్ట ప్రార్థించితిని. పరమపిత యీ దీనురాలి ప్రార్థన నాలకించి సమృద్ధిగా నాకు ఆహారమును దయచేసి యున్నాడు. ఆహా! ఆయన కారుణ్యము అపారముగదా" అనెను. ఈశ్వరుని దయ యందు ఆ బీదరాలి కెట్టి విశ్వాసము? ఇట్టి సరళవిశ్వాసమే మనుష్యులను తరింపజేయునది. భగవంతుని దయాపరత్వమునందు నమ్మకము కలిగింప జాలని దర్శనశాస్త్రములేల? విజ్ఞానచర్చ లేల? ఈశ్వరకారుణ్యమునందు దృఢవిశ్వాసముగలవారు ధన్యులు."

# మాంటినిగ్రో స్త్రీలు

మాంటినిగ్రో ఆల్బేనియా, సెర్బియా, హెర్జిగోవినా దేశములనడుమ ఎడ్రియాటిక్ సముద్రమునకు కొంచెమవలనున్న చిన్నదేశము. ఆదేశము బహువత్సరములు పారతంత్ర్యమున మ్రగ్గినది. పర్వతబహుళమైన దేశమగుట అందలి ప్రజలు దృఢకాయులును, శ్రమకోర్చెడు వారునైయున్నారు. ఆ దేశపు పురుషులు స్వదేశస్వాతంత్ర్య సంపాదనార్థము పడినకష్టములు పరశ్శతములు. ఈ విషయమున ఆ దేశపుస్త్రీలు పురుషులకు చేసిన తోడ్పాటు స్తుత్యాతీతమై యున్నది. గృహకార్యనిర్వహణమునకు తోడు పెద్దపెద్దబరువులను మోయుట, భూమిదున్ని వ్యవసాయముచేయుట మొదలగు వానిని నిర్వహించుచు పురుషులు తమ శక్తినంతటిని యుద్ధప్రశంసలయందే గడపునట్లు ఆ దేశపుస్త్రీలు చేసిరి. పురుషుడనగా ఆ దేశమున యుద్ధముచేయు ఒకానొక యంత్రము. పురుషునికంటె స్త్రీ ఏ విషయమునను లొచ్చుకాదను సత్యము ఆ దేశమున బాగుగ ఆచరణమున నున్నది. యుద్ధకార్యములను మాత్రము పురుషునకు వదలి ఆ దేశపుస్త్రీ మిగిలిన సకలకార్యములను తానే చక్కబెట్టును. చర్చికిపోవునప్పుడును, ఒకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు ఏదైన భారమగు సామానుగొనిపోవునపుడును తప్ప మిగిలిన సమయములందు అచ్చట స్త్రీలు బయట కానరారు. మాంటినిగ్రోదేశపు న్యాయశాస్త్రము ప్రకారము హత్యానేరము తప్ప మిగత ఎట్టినేరములును స్త్రీలపై మోపుటకు వీలులేదు. భార్యచేసిన నేరములకు భర్తయు, కూతురుచేసినవానికి తండ్రియు, చెల్లెలుచేసినవానికి సోదరుడును జవాబుదారులై యుందురు. ఇది లెస్సగనేయున్నది. ఏమందురా? ఇంతకుముందు చెప్పినట్లు ఆ దేశమున పురుషులు అవసరము వచ్చినపుడు యుద్ధముచేయుట తప్ప మిగిలిన ఏకార్యమును చేయ



మైలీనా రాణి
మాంటినిగ్రోస్త్రీల సౌందర్యము అంగసౌష్ఠవము జాతీయములగు దుస్తులు ఈమెకడ కాంచనగును.

నక్కఱలేదు. సహజముగ తాము చేయు కార్యములనేగాక పురుషులు చేయు పనులను కూడ తామే నిర్వహించి శక్తికిమించి పనిచేసి కొద్దికాలముననే శరీరపాటవమును పోగొట్టుకొను స్త్రీలవిషయమున ఈమాత్రపు బాధ్యత పురుషులు వహించుట లెస్సయే.

మాంటినిగ్రో స్త్రీలు వ్యవసాయమునందు శ్రద్ధ ఉత్సాహము కలవారు. తమది సారవంతమైన దేశము కాకపోయినను ఆదేశపుస్త్రీలు కష్టపడి భూమినిచీల్చి పంటలపండింతురు. అడుగునేలనైనను వారు ఊరికే ఉంచరు. అచ్చట ఒక్క బంగాళా దుంపనైనవిత్తి పండించెదరు. కొండ అంచులు, లోయలుకూడ ఆ స్త్రీలు మడులుగ నుపయోగింతురు. ఇంతకష్టపడినను వారికి కడుపునిండ ఆహారము దొరుకుట దుస్తరమే.

మాంటినిగ్రో స్త్రీలు వీరవనితలు. వారు సమస్తకార్యములను తాముచేసి యుద్ధకార్యములకు బంపిన పురుషులు అందు వెనుకంజవైచిరేని అట్టివారికి తమ దుస్తులనొసగి కత్తిపట్టిన ఆతనిచేత కదురునుంచి మఱికొన్నికనురులతో వారిని బాది దేశమునుండి తఱిమివేయుదురు.




కొంచము గుదుస్తులు

ఇతర ఐరోపా దేశీయ స్త్రీలవలె మాంటినిగ్రో స్త్రీలు ఆడంబరమగు దుస్తులు ధరింపరు. జుబ్బా, జుబ్బాపైన చేతులులేని పొట్టిజాకట్టు, (బుటెదారి పనిచేయబడియుండును) నడుమున సిల్కుబట్ట ఇవి ఆదేశపుస్త్రీల దుస్తులు.

మాంటినిగ్రో దేశస్థుల ఇండ్లు సాధారణముగ ఒక అంతస్థునే కలిగియుండును. పశువులను పెంచువారియిండ్లుమాత్రము రెండంతస్థులు కలిగియుండును. క్రిందిఅంతస్థున పశువులును పైఅంతస్థున ప్రజలును నివశింతురు. ఇంటికి పొగపోవు గొట్టములు ఉండవు. పర్వతబహుళమైన దేశమగుట సాఫీయైనరోడ్లులేవు. తపాలు మోటారులు కొనిపోవును.

ఆదేశమున అవివాహితలగువారు ఎఱ్ఱనిశిరోభూషణమును తాల్తురు. వివాహానంతరము నల్లనిశిరోభూషణమును ధరింతురు. ఆ దేశమున నీరు ఆవునేతికంటె కూడ అధికమగు విలువతో చూడబడును. నూతులు తక్కువ; ఉన్నను అవి పాతాళలోకమునకు మార్గము చూపుగోతులు మాత్రమే. మాంటినిగ్రోయందు కొన్నికొన్ని తావులలో జలమే దొరకదు. కావుననే దాడివెడలువారాదేశమును జయించుట బహుకష్టముగానుండినది మంచుకరిగించుకొని మంచినీరుగాఉపయోగింతురు.

# డైరి

జనవరి: 21:—శ్రీమతి వంగల వాణీబాయిగారు (శ్రీ వంగల శివరామయ్యగారి సతి) 1929-వ సంవత్సరము జూలై మాసారంభమున భర్తగారితో యూరపు ఖండమునకు వెళ్లి ఇటలీ, స్విడ్జర్లాండు, ఫ్రాన్సు, హాలండు, జర్మనీ, బెల్జియము, ఇంగ్లాండు, స్కాట్లండు, ఐర్లాండు మున్నగు దేశములను చూచి హిందూదేశమునకు ప్రయాణమై వచ్చి బొంబాయి చేరిరి.

,, 22:—బొంబాయినగరమున శ్రీమతి సరోజనీదేవిగారి అధ్యక్షతక్రింద జరుగుచున్న నాలుగవ అఖిల భారత మహిళాసభవారు స్త్రీ జనాభివృద్ధికి తోడ్పడు పెక్కు తీర్మానములు గావించిరి.

,, 23:—బ్రాహ్మసమాజ శతవార్షికోత్సవ సందర్భమున పశ్చిమగోదావరి మండలములోని మాధవరము నందలి ప్రార్థనసమాజములో శ్రీమతి బాలసీతారత్నమ్మగారి ఆధిపత్యమున స్త్రీల బహిరంగ సభ జరిగెను. సభలో అధ్యక్షురాలు అహింసనుగూర్చి కొన్ని పద్యములు చదివి ఉపన్యాసము గావించెను.

,, 24:—గవర్నరుగారి సతి మైలాపూరునందలి సేవాసదనము సందర్శించెను.

,, 25:—బరంపురములో నూతనముగా స్థాపింపబడిన 'యువతీనాటక సభ'వారు శ్రీకృష్ణతులాభార నాటకమును ప్రదర్శించిరి. ఇందు స్త్రీలు స్త్రీపురుషపాత్రములను పురుషులు పురుష పాత్రలను ధరించిరి. ఇందు మిస్. యం. ఎన్. రాజితం అనునామె సత్యభామ పాత్రను ప్రశంసనీయముగ నిర్వహించెను.

,, 26:—సంపూర్ణస్వాతంత్ర్యోత్సవదినము. ఆసందర్భమున ఢిల్లీనగరమున ఆర్యసమాజభవనమున జరిగిన మహిళాసభకు రెండువేలమంది స్త్రీలు వచ్చిరి.

,, 27: —

,, 28:—బెల్లామీకన్య అను ఐరోపాదేశస్థురాలు తన స్నేహితుడగు డాక్టరు షా అను హిందూదేశస్థునితో నాట్యమాడ లండనులోని ట్రొకెండురెస్టారెంటునకుబోవ అచ్చటి యజమానులు నల్ల వానితో నాట్యమాడు కొఱకైనచో ఆమెను రానీయమనిరి. బెల్లామీకన్య ఈ విషయమును వెంటనే లేఖాముఖమున శ్రీరాణీగారికి తెలియజేసెను.

,, 29:—కొచ్చినుసంస్థానపు సీనియరు రాణీగారగు శ్రీవళియఅమ్మగారు తమ ఎనుబదితొమ్మిదవఏట మరణించిరి.

,, 30:—కొంతకాలమునకుముందు హిందూదేశమునకు వైస్రాయిగానున్న లార్డురీడింగుగారి భార్యపరమ పదించెను.

,, 31—యుద్ధమువలదని 60 00 000 అమెరికను స్త్రీలును, 18 00 000 జపాను స్త్రీలును సంతకము చేసి ఆ మహజరును లండనులో జరుగనున్న నౌకాదళనిర్ణయసభ కందచేయుటకు అమెరికను, జపాను స్త్రీలు ముగ్గురు లండనుచేరిరి.

—పడుపువృత్తి నిర్మూలనపుబిల్లు మదరాసుశాసనసభలో అధికసంఖ్యాకులచే ఆమోదింపబడెను.

ఫిబ్రవరి: 1:—గూడూరు నివాసులు శ్రీ టి. వేంకటకృష్ణయ్యగారి (ఎం. ఏ. బి. ఇ. డి.) భార్యయు విద్యా

పతియునగు సౌ॥ సూర్యకాంతమ్మగారు పదునేడేండ్ల బాల్యప్రాయమున నిన్న ఉదయము 9 గంటల 20 నిమిషములకు ఇహలోకము వీడిరి.

ఫిబ్రవరి 2:—నైజాము ప్రభుత్వమువారు హైద్రాబాదులోనున్న మహబూబియా బాలికా పాఠశాల భవన నిర్మాణమునకై 1,78,900 రూపాయిలను మంజూరుచేసిరి.

,, 3:—రాజమండ్రి పురపాలక సంఘమువారి సన్మానపత్రమునకు ప్రత్యుత్తరమిచ్చుచు శ్రీ గవర్నరుగారు ఆంధ్రస్త్రీలకు ప్రత్యేక మొక కళాశాల నిర్మించువిషయము ఆంధ్రవిశ్వవిద్యాలయాభివృద్ధితో సంబంధించి యుండునని చెప్పిరి.

,, 4:—మద్రాసు సంగీతపరిషత్తువారు క్వీను మేరీసుకళాశాలలో బి. యే. తరగతిలో కూడ సంగీత మొకవిషయముగ నేర్పఅచవలయునని ప్రధానమంత్రిగారిని సందర్శించి కోరిరి.

,, 5:—మద్రాసులో టెన్నిసునందు చాలా పేరుపడి గతమూడేండ్లనుండియు దక్షిణ ఇండియా చాంపియనుషిప్పు పందెములయందు జయముపొందియున్న ముల్లెను కన్య రైల్వే ఉద్యోగియగు హ్యూ ఆలను నెయిలరుగారిని వివాహమాడెను.

,, 6:—యుద్ధబహిష్కరణవాదినులగు స్త్రీలు మక్డొనాల్డుగారిని చూచిరి. లండను సభ జయప్రదముగ జరిగి వీరికి తోడ్పడగలదనియు, ఈ పనిని సాగించుచునే యుండవలెననియు,ఇట్టి సభలింకను జరుగవలసియున్నవనియు మక్డొనాల్డుగారనిరి.

,, 7:—శ్రీ గవర్నరుగారి సతి బెజవాడలో స్త్రీల ఇండియా సంఘమువారి భవనశంకుస్థాపనోత్సవము గావించెను.

,, 8:—అనంతపురములోని గవర్నమెంటువారి స్త్రీల బోధనాభ్యసన పాఠశాలాసారస్వతసంఘమువారి వార్షికోత్సవము సాయంకాలము 5 గంటలకు దత్తమండల కళాశాలా మందిరమున జరిగెను.

,, 9:—గ్వాలియరు సర్దారు పాఠశాలాధ్యక్షులగు పియర్సు అను ఐరోపాదేశీయుడు తన మతమును విడచి హిందూమతమును స్వీకరించి హిందూమతస్థులగు కీ. శే. యస్. జి. పరంజిపి వారి కుమార్తె అనసూయను వివాహమగుదురని 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక తెలుపుచున్నది.

,, 10:—తన భర్త లాలాదివాను చందుగారి ఆకస్మికమరణముచే గలిగిన దుఃఖమును భరింపలేక శ్రీమతి ప్రకాశదేవి (ఢిల్లినివాసిని) తన స్నానపుగదిలో రివాల్వరుతో ప్రేల్చుకొని ఆత్మహత్య గావించుకొన ప్రయత్నించెను. ఆహా! భారతస్త్రీల పతిప్రేమ!

,, 11:—తన అంగీకార వయోనిర్ణయపు బిల్లునకు సహాయము చేకూర్చుకొనుటకు హరసింగుగౌరుగారు నూతనఢిల్లీకి వచ్చిరి.

,, 12:—మద్రాసు కార్పొరేషనువారు శ్రీ సత్యమూర్తిగారు ప్రతిపాదించిన క్రింది తీర్మానమునామోదించిరి. "శిశుసంరక్షక సంఘాధ్యక్షురాలు సూచించిన జన్మనిరోధప్రచారము కూడదని ప్రతిఘటించుచుఅది కార్పొరేషనువారి విధులలోనొకటికాదనిఈసభవారుఅభిప్రాయపడుచున్నారు."

,, 13:—రాజమండ్రి పురమందిరమున కీ. శే. శ్రీ దామెర్ల రామారావుగారి పంచవార్షికస్మారక సభలో శ్రీమతి కృష్ణాబాయికన్యగారు బి. యె., యల్. టి, గంభీరోపన్యాసము గావించిరి.

,, 14:—రాజమండ్రిలోని గవర్నమెంటు స్త్రీల బోధనాభ్యసనపాఠశాల వార్షికబహుమానప్రసాద దినోత్సవము శ్రీ సి. వి. కృష్ణస్వామి అయ్యరువారి అధ్యక్షత క్రిందజరిగెను.

,, 15:—అనంతపురము స్త్రీసమాజమువారి వార్షికోత్సవము అనంతపురమండల న్యాయ్యాధికారియగు అమీరుద్దీనుగారి సతి సుల్తానాబేగమువారి అధ్యక్షతక్రింద జరిగెను.

,, 16:—కెనడాసినేటులో నార్మనువిల్సుగారి భార్య సభ్యురాలుగా నియమింపబడినది. సినేటుసభ్యత్వము వహించిన కెనడాస్త్రీలలో ఈమె ప్రథమురాలు.

17:—శ్రీమునగాల రాజావారు ఏలూరునందలి శ్రీ అన్నపూర్ణాదేవి విద్యాలయమునకు 100 రూపాయిల విరాళము వాగ్దానముచేసిరి.

18:—సీతానగరం యేస్టేటు జమీందారిణీగారగు వాడ్రేవు జగ్గయ్యమ్మారావుగారు జ్వరబాధితులై రాజమహేంద్రవరమున సాయంకాలము తమకు 52 సంవత్సరముల వయస్సున కాలధర్మము నొందిరి. తమ మరణశాసనములో 80 వేల రూపాయిలను బీద నియోగి బ్రాహ్మణవిద్యార్థుల సహాయార్థమును, 20 వేల రూపాయిల వేదవిద్యనేర్చుకొను విద్యార్థుల సహాయముకొఱకును ధర్మము చేసిరి.

,, 19—వంగదేశస్త్రీల నాల్గవ విద్యాసభ మోరుభంజి మహారాణీగారగు శ్రీమతి చారుదేవిగారు అధిపత్యమున కలకత్తాలో సాయంకాలము నాలుగు గంటలకు ప్రారంభమయ్యెను.

# గ్రంథవిమర్శనలు

పాటగాపాడదగిన ఛందమున వాక్సులలితశక్తిగల ఒకానొక పూర్వకవీశ్వరునిచే వ్రాయబడిన చక్కని శతకము. వేదాంతవిషయికజ్ఞానమును సులభముగ తెలిసికొనగోరువారీ శతకమును చదివినజాలును. విశేషవిద్యాగంధములేనిస్త్రీలుకూడ చదివి సులభముగ అర్థము చేసికొనజాలు తేలికశైలితో ఒప్పుచున్నది. పాటపణితిని వ్రాయబడియుండుటచే నిది వారు కంఠస్థమొనర్చుకొనుటకు అనువైయున్నది. ఇందలి మనోహరమగు శైలిని సులభగ్రాహ్యమగు విషయవివరణమును ప్రదర్శించుటకు నాలుగుపదముల ఉదాహరింతుము.

వేగిలేచినది మొదలు
సంసారస్థాగరంబున నీదుచు
నీ గుణము లొకవేళను
తలంపగదె మేలనుచు నారాయణా!

లాభలోభము బవిడిచి
యిహపరములను ఫలమ్మాసింపక
నీ భక్తులైనవారు
ధన్యులై నెగడెదరు నారాయణా!

ఆటలన్నియు రంకులు
నేనాడుమాటలన్నియు బొంకులు
పాటింపనితకైన
నున్నదేపాపంబు నారాయణా!

చిలుకపలుకులు పలికితి
నాకేమి తెలియుం దత్త్వరహస్యము
వలదు నను నేరమెంచ
సాధులకు నలినాక్ష నారాయణా!

చక్కని ఈ శతకమును శ్రీపెరంబూరు నటేశమొదలియారువారు వంచిముద్రణమున వెలయించినారు. గ్రంథము సైజు ఫూల్ స్కేపు, ఇరువదియైదు పుటలు. 1929—వ సంవత్సరమున ప్రకటితము. వెల 0-2-0 అణాలు. వలయువారు శ్రీపెరంబూరు నటేశమొదలియారు, 49, తులసింగమొదలివీథి, పెరంబూరు పోస్టు, మద్రాసు అని వ్రాయునది.

సనాతనధర్మ-ప్రశ్నోత్తరావళి:—

సనాతనధర్మమును సాధారణులకు బోధించుటకుగాను ప్రశ్నోత్తరముల రూపమున వ్రాయబడిన చక్కని గ్రంథము. ఇది ప్రథమవాచకము. ఇందు ధర్మము; వేదములు; వేదశాఖలు; ఉపవేదములు; వేదాంగములు; బ్రాహ్మణములు; ఆరణ్యకములు; ఉపనిషత్తులు; ధర్మశాస్త్రములు; ఇతిహాసపురాణములు; ఉపాంగములు; షడ్దర్శనములు; అవతారములు; ప్రాతఃకాలకృత్యములు; సంస్కారములు; జాతులు; ఆశ్రమములు; కాలము; సంప్రదాయభేదములు; శ్రాద్ధాచరణము; పుణ్యతీర్థములు; పర్వకాలములు; మూర్తిపూజ; అస్పృశ్యత; సదాచారము అను ఇరువదిమూడు విషయములనుగూర్చిన సమాచార మీ గ్రంథ

మున శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణప్రమాణయుక్త్యనుభవపూర్వకముగ సంగ్రథితమైయున్నది. ఆర్యసంప్రదాయములతో ప్రవేశపరిచయము కల్గించుకొనగోరువారు ముఖ్యముగ చదువదగిన గ్రంథము. డెమ్మీ సైజు 30 పుటలు. 1929-వ సంవత్సరమున ప్రచురితము. వెల 0-4-0 అణాలు. గ్రంథము వలయువారు గ్రంథ సంపాదకులగు క. మార్కండేయ శర్మగారికి, బృందావనము, కీల్ పాకు, మదరాసు అని వ్రాయవలెను.

# గ్రంథస్వీకారము

1. పశువైద్యవస్తుగుణదీపిక — యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారి; 2. విషాద సంసారము—ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు; 3. పశునేత్రచికిత్స—యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు; 4. శ్రీవిఘ్నేశ్వరచరిత్రము — గొబ్బూరు వెంకటానందరాఘవ రావుగారు; 5. పశువ్రణచికిత్స—యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు;—6. ప్రేమ— వెలువోలు సీతారామయ్యచౌదరిగారు.—ఈగ్రంథములను వందనములతో నందుకొంటిమి. కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

# పత్రికాపరిచయము

## వర్ణాశ్రమ:—

వర్ణాశ్రమ ధర్మములను ప్రబోధించుటకేర్పడిన మాసపత్రిక. సంపాదకుడు మోపిదేవి వేణుగోపాల రావుగారు. సాలుచందా 1-8-0 మాత్రము. విమర్శనార్థము మాకందిన మూడవసంచికలో వర్ణాశ్రమ, 'నస్త్రీస్వాతంత్ర్యమర్హతి,' మతద్రోహమా? కాదుమరేమిటి?, కాంగ్రెసునకు అల్టిమేటము, కాంగ్రెసునాయకులచర్య, వర్ణాశ్రమ వాదులకర్తవ్యము, నిరశనవ్రతము నేరముకాదా?, ఉపన్యాసకేసరి, ధర్మము, విశేష వితర్కాంశములు మొదలగు వ్యాసములు గలవు. తన ఆదర్శములను బాగుగ వెల్లడించుచున్నది. పత్రిక వలయువారు సంపాదకునిపేర బెజవాడకు వ్రాయునది.

## పుష్పాంజలి:—

సారస్వతసాంఘిక చరిత్రాత్మక పరిశోధక కథలు, వ్యాసములు, పద్యములు ప్రచురించుమాసపత్రిక. మొదటిసంచిక జనవరిమాసమున వెలువడినది. ఈ సంచికలో ౧. అమ్మకం -(కథ) సంపాదకుడు; ౨. అంజలి - (పద్యములు) శ్రీ వేంకట కాళిదాసకవులు; ౩. విమల - (కథ) శ్రీ వడ్డాది శేషగిరిరావు బి. యె. ౪. వియోగిని - (పద్యములు), కవికుమారుడు; ౫. ఉపగుప్త - శ్రీ వెంపటి నాగభూషణం; ౬. అస్పృశ్య మహర్షి; హరిదాసు - శ్రీ కొచ్చర్లకోట కామేశ్వరరావు; అను విషయములు గలవు. పత్రిక సంపాదకుడు. జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు. పత్రికయొక్క ఆశయములు "నేడు ప్రపంచవాఙ్మయమున చిన్నకథలు వ్రాయుట మహాశిల్పముగ నెన్నబడుచున్నది. ఇట్టి నవ్యశిల్పసౌభాగ్యమునకు మేముచితరీతి నాంధ్రభారతి కలంకారముగూర్ప యీ చిన్నికథల పత్రికను ప్రారంభించియున్నాము." పత్రిక డెమ్మీసైజున 24 పుటలు. సాలుచందా 0-12-0 అణాలు మాత్రము. తెలుగుపత్రికలలో ఇది మిక్కిలి చవకపత్రిక. వలయువారు పత్రికాప్రకటనకర్తలగు కర్పగం అండ్ కంపెని, 5, వీరాస్వామిపిళ్లె వీధి, మదరాసునకు వ్రాయవలెను.




ఆఫ్ఘనిస్థానము : ఘోషాపద్ధతి :—

'టైమ్సు ఆఫ్ ఇండియా' విలేఖరి యొకఁడు పెషావరునుండి ఇట్లు వ్రాయుచున్నాఁడు: "ఫ్రాంటియరు అడ్వొకేటు అను వార్తాపత్రికయొక్క కాబూలు విలేఖరి తెలిపిన దానిని బట్టి ఇప్పుడు ఆఫ్ఘనిస్థానమునకు రాజుగానున్న నాదిరిఖానుగారు తమ రాజ్యములోని స్త్రీలు ఘోషాపద్ధతి వదలివేయ వచ్చునని ఆదేశించియున్నారు. ఆ ఆజ్ఞప్తిననుసరించి అంతఃపురస్త్రీలుకూడ మోటారుకారులనెక్కి ఎట్టి మేలిముసుగును లేక నడివీధుల వెంట పోవుచున్నారు." వెనుకటి ఆఫ్ఘనురాజగు అమానుల్లాగారు ఇతర సంస్కరణములతోడు ఘోషాపద్ధతిని నిర్మూలనమునకు ప్రయత్నించి ఒక్కసంవత్సరము నిండినదో? లేదో? సంస్కరణములు కొనివచ్చినందులకు అమానుల్లా రాజ్యపదభ్రష్టుఁడైనాఁడు. అమానుల్లా అనంతరము రాజ్యమును పొందిన నాదిరుఖాను ఆసంస్కరణములనే తిరిగికొని వచ్చుట ఆశ్చర్యముగా నుండకమానదు. అయితే అమానుల్లా నాదిరుఖానుల సంస్కరణపద్ధతులయందు చాలవ్యత్యాసముగలదు. అమానుల్లాయందు సంస్కరణాభిలాష అగ్గలమై ఘోషాపద్ధతి విసర్జించుట నిర్బంధమొనర్చునట్లు చేసినది. ఆకారణమున సంప్రదాయపరులు అతనిని కక్కసించిరి. నాదిరుఖాను సంస్కరణమున ఇట్టి నిర్బంధములేదు. ఇష్టమున్నవారు ఘోషాపద్ధతి వదలివేయుటకు ఎంత అవకాశమున్నదో ఇష్టములేనివారు దానిననుసరించుటకును అంత అవకాశమున్నది. భారమంతయు ప్రజలపై పెట్టి లోకాభిప్రాయమెట్లు పోవుచున్నదో కనుగొనుచున్న వశీకృతచిత్తుఁడు నాదిరుఖాను. రేగులు తంగేళ్లుగ త్రొక్కుచు పరుగెత్తి బోర్లపడుటకంటె నిదానమున కూర్చుండి కార్యసానుకూలముచేసికొనుట క్షేమకరమను పద్ధతి అమానుల్లా నాదిరుఖానులచరిత్ర స్పష్టీకరించుచున్నది. నిదానముమీఁద కార్యములు నెఱవేర్చుకొనువాఁడు కావుననే నాదిరుఖాను నేఁడు అమానుల్లా తిరిగి ఆఫ్ఘనిదేశమునకు వచ్చుచున్నను ఎట్టి కంగారును పడకున్నాఁడు.

రాజ్యాంగవిధానమున ఎట్టి విప్లవములకు కారణభూతమైనను ఆఫ్ఘనిస్థానమున అచిరకాలముననే ఘోషాపద్ధతి నమసిపోవు సంచనలు సర్వత్ర చూపట్టుచునేయున్నవి.

కీ. శే. రీడింగు ప్రభ్వి:—

శ్రీ ఇర్విను ప్రభువుగారికి పూర్వము మనకు వైస్రాయిగానున్న రీడింగుప్రభువుగారి సతి (1930–వ సంవత్సరము) జనవరి ముప్పదవ తేదీని కాలప్రాప్తి నొందిన వార్త తెలుపుటకు మిక్కిలి విచారించుచున్నాము. ఆమె హిందూదేశమున నున్న దినములలో ఇచ్చటి సాంఘికపరిస్థితులను చక్కచేయ ఎక్కువగ పాటుబడినది. భారతదేశమున ఈమె ఆసుపత్రులకుగాను పదిలక్షుల పౌనులు వసూలుచేసినది. ఇవి అన్నియు ఆమహనీయురాలు తన అధికారపదవి ప్రజాక్షేమమునకు వినియోగించినదనుటకు ప్రబల నిదర్శనములు. ఆమె పవిత్రాత్మకు శాంతి ప్రసాదింప సర్వేశ్వరుని సంప్రార్థింతుము.

శ్రీ మల్లయ్యశాస్త్రిగారి కార్యదీక్ష:—

పండితులగువారు పూర్వాచారములను—అవి ఎంతటిదురాచారములైనను—విడనాడుటకు అంగీకరింపరు. విడనాడుచో తాము శ్రోత్రియ శిఖామణుల మనిపించు కొనుటకు వీలుచాలదను భయము వారిని పిశాచమువలె వేధించుచుండుటచేత దేశమాతయొక్క తపఃఫలముచేత సత్కృతుగ కొందఱు పండితులు అట్టిభయపిశాచమును పాఱద్రోలి దేశకళ్యాణమునకు మార్గము చూపు నవీనాచారములను స్వీకరించి ఆచరించి సంశయగ్రస్తులగు ప్రజల హృదయమున కార్యోత్సాహమును పూరింతురు. పర్లాకిమిడీ కళాశాల పండితులగు కావ్యతీర్థ బంకుమల్లి మల్లయ్యశాస్త్రిగారు సాంఘిక సంస్కరణములకు శాస్త్రములనుండి ప్రమాణములనెత్తి వ్యాసముల వ్రాసి ప్రజలకు చెప్పుచుండిరి. చెప్పినంత చేయగల ధీరశిఖామణులుగావున వారు ఇపుడు తమ బాలవితంతుపుత్రికలను శతావధాని వేమల సత్యనారాయణశాస్త్రిగారికిచ్చి పరిణయముచేసిరి. వివాహము శ్రోత్రియకుటుంబమునందు జరిగిన వితంతూద్వాహమగుటయు, శ్రోత్రియులగు పండితులనేకులు వివాహమునకు విచ్చేసి వధూవరుల నాశీర్వదించుటయు ఇచ్చో గమనింపదగిన విషయము. ఇందువలన నీయుడు వీరేశలింగము పంతులు పావన గౌతమీతీరమున ఎన్నడో నాటినసంస్కరణ బీజము ఇపుడు ఎట్లు మొలకెత్తి మొటికయై మ్రానై ఫలోన్ముఖమైనదో తెలియవచ్చును. శ్రోత్రియకుటుంబమున పుట్టుపుగన్నను పూర్వాచారశృంఖలములను కొనగోరచిదిమివైచివితంతుకన్యను వివాహమాడి యువకులకు ఆచరణతోకూడిన సందేశ

మిచ్చిన శ్రీయుత వేదుల సత్యనారాయణశాస్త్రిగారి సంస్కరణాభిలాషోన్నతికి జయవెట్టుచున్నాము. హిందూసంఘమును పీల్చి పిప్పిచేయుచున్న దురాచారములను కేవలము అక్షర విన్యాసము చేతనేగాక ఆచరణముచేతకూడ సంస్కరించుటకు దొరకొన్న శ్రీయుత బంకుమల్లిమల్లయ్యశాస్త్రిగారి కార్యదీక్షను కొనియాడుచున్నాము.

కడపమునిసిపాలిటి: శ్రీకోటిరెడ్డిగారిసతి:—

శ్రీకోటిరెడ్డిగారిసతి కడపమునిసిపాలిటి సభ్యురాలుగానున్నది. ఆహోదాలో ఆమె ఈమధ్య మునిసిపలుసంఘసభలో మునిసిపాలిటిక్రింద పనిచేయుచున్న ఆడపాకీవాండ్రు ప్రసవించినపిమ్మట నెలరోజులు పూర్తిజీతముమీద సెలవియ్యవలయునను తీర్మానము గొనివచ్చెను. తీర్మానము ఏకగ్రీవముగ అంగీకరింపబడెను. స్త్రీలకష్టసుఖములు స్త్రీలకే గాని తెలియవు. కావున స్థానికసంస్థలలో స్త్రీలకు కూడవలయునంత ప్రాతినిధ్యముండిన ఆయా సంస్థలక్రింద పనిచేయు కార్మికస్త్రీల కష్టసుఖములు పూర్తిగవిచారణకు వచ్చుటకు అవకాశముండును. శ్రీకోటిరెడ్డిగారిసతి తమ మునిసిపలుసంఘసభ్యత్వమువలన గలిగినపలుకుబడిని ప్రజాక్షేమకరవిషయములకు వినియోగించి యథాశక్తిని దేశకళ్యాణమునకు తోడుపడుచున్నందులకు హృదయపూర్వకముగ అభినందించుచున్నాము.

వంగశాసనసభ: స్త్రీస్వాతంత్ర్యము:—

హిందూదేశమునందలి వివిధరాష్ట్రములయందు సర్వవిధముల వంగరాష్ట్రము పురోభాగమున నడచుచున్నదని జనవాక్యము. అట్టిచో ఇతరరాష్ట్రీయశాసనసభలు స్త్రీలు శాసనసభ్యురాండ్రగుటకు సమ్మతించియుండ ఈ రాష్ట్రముయొక్క శాసనసభలో స్త్రీ స్వాతంత్ర్యతీర్మానము ఓడింపబడుట మిక్కిలి శోచనీయముగనున్నది. శ్రీ పి. ఎన్. గుహాగారు స్త్రీలు శాసనసభకుసభ్యురాండ్రుగ ఎన్నుకొనబడుటకు హక్కుండవలెనను తీర్మానమును ప్రతిపాదించుచునిట్లుపలికిరి. "వంగరాష్ట్రపుస్త్రీలు ఓటుచేయుటకు 1925—వ సంవత్సరమున హక్కు ఈయబడెను. ఇప్పుడు వారు శాసనసభలో సభ్యురాండ్రుగ ఎన్నుకొనబడుటకు అంగీకరించుట దానికి సవ్యఫలమగును." ప్రభుత్వము వారితరఫున హోముమెంబరు మోబర్లేగారు మాట్లాడుచు "ఇందు చాలకష్టములున్నవి. ఈ హక్కునుబట్టి కొందఱుస్త్రీలు ఎన్నికలకు నిలువవచ్చును. వారిసభలోనుండ నర్హులు కాని వారుగా నుండవచ్చును." ఈవాక్యములు ఎంత అశుచిప్రాపకములుగ నున్నవి? మున్నొకసారి అప్పుడు వంగరాష్ట్రపాలకుడుగానుండిన లిట్టను ప్రభువు హిందూస్త్రీలను

గుఱించి నీచముగ పలికియున్నాడు. దానికి ఆతనికి అప్పుడే దేశమంతయు తగినజబాబు నిచ్చియున్నది. ఆవాక్యములు ప్రస్తుతము మోబర్లేగారు పలికిన వానికంటె తీవ్రతరములే. అయినను మోబర్లేగారి వాక్యములనుకూడ ప్రతిఘటించి నిజము స్థాపింపవలసియున్నది. మానవతులగు వంగవనిత లిందులకు పూనుకొందురుగాక! స్త్రీలనిన ఇంత చులకనగ సంభాషించు మరభిమానమును మోబర్లేవంటి పురుషులు విడనాడుటకు ఎంతకాలముబట్టునో?

శ్రీ బుర్రా సత్యనారాయణగారు: ఆంధ్రస్త్రీ విద్యాసమస్య :—

యువకులగు ఆంధ్రనాయకులలో నాయకమణియు, ఆధునికవిద్యాసమస్యల ఆమూలచూడముగ అవగాహనమొనర్చుకొనిన అభిజ్ఞులును అగు శ్రీయుత బుర్రా సత్యనారాయణగారు (బి. యె. బి. యల్, అడ్వకేటు, మదరాసు) ఫిబ్రవరి 5 వ తేదీని బరంపురములో ఆంధ్రోద్యమమును గూర్చి ఉపన్యసించుచు ఆంధ్రస్త్రీల విద్యావిషయికసమస్యల నిట్లు ముచ్చటించిరి. "ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ముందుగ చేయవలసిన కార్యములలో ఆంధ్రదేశమున స్త్రీల కళాశాల స్థాపించుట యొకటి. ప్రస్తుతము మనదేశమున ఒక్కస్త్రీ కళాశాలయైనను లేదు. అట్టి కళాశాల స్థాపించుటలో మనము మిక్కిలి జాగ్రత్తగ నుండవలయును. ప్రస్తుతము గఱపబడు విద్యనే కాపీచేసిన లాభము లేదు. మనస్త్రీలకు బోధింపబడు విద్య వారికి సహజభూషణమగు లజ్జావినయమును పోకార్చునదిగ నుండరాదు. వారికి తగిన విద్యనే నేర్పవలసియున్నది. మద్రాసులోని క్వీనుమేరీకళాశాలలో సంగీతము ప్రవేశపెట్టవలయునను తీర్మానమును గొనివచ్చి మద్రాసు విశ్వవిద్యాలయము సినేటులో జయముపొందితిని. స్నాతకసభల సమయమున తత్కాలోచితములైన దుస్తులు స్త్రీలకు నిర్బంధమొనరించుట పాడిగాదు. సినేటులో సభికులాంధ్రు ఈ విషయమై తమ అసమ్మతి తెలిపినను విశ్వవిద్యాలయమువారు పాటింపలేదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఇట్టివిషయముల నన్నిటినిగూర్చియు పర్యాలోచించి అన్నివిధముల వారికి అక్కఱకు వచ్చువిద్యనే స్త్రీలకు నేర్పునట్లు జాగ్రత్తపడవలయును. స్త్రీలను ఆదర్శప్రాయులగుపౌరులను ప్రసవింపగల మహనీయురాండ్రుగ నొనర్పవలయును." శ్రీయుత సత్యనారాయణగారి ఈ హితబోధ అవశ్యాచరణీయమైనది. స్త్రీవిద్యాభిమాను లీవిషయమై విపులముగ చర్చింతురుగాక. ఆంధ్రవిశ్వవిద్యాలయనిర్వాహకవర్గములో ప్రవేశము, పలుకుబడిగల కార్యదక్షులు గావున శ్రీసత్యనారాయణగారు ఈ విషయమున తామే కార్యాచరణమునకు కడంగి ఆంధ్రస్త్రీజనములపాలిటి కార్వేపండితులగుదురుగాక యని కోరెదము.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక.

సంపాదకుడు,

డాక్టర్. కే. ఎన్. కేసరి.

ద్వితీయ సంపుటము.

**1929—1930.**

లోధ్ర ముద్రణాలయము
మదరాసు.

# వ్యాసముల అకారాదిసూచి

## ర

# విషయసూచిక

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS

# మార్చిమాసపు గృహలక్ష్మి

౧

"మార్చి నెలలో వెలువడిన 'గృహలక్ష్మి' పత్రికలో కడునూతన విషయములు గాంచి సంతసించితిని.. "

6-3-30
కాకినాడ } (సం) వీరుభొట్ల భాస్కరరావు

౨

మార్చి మాసము గృహలక్ష్మి నూతన వ్యాసాలంకృతయై సాక్షాత్కరించినది. ఆమెను ఎటుల ఆశీర్వదించవలయునో, ఆమెకెటుల సహాయము చేయవలయునో ఆలోచనా నిమగ్ననైయుంటిని. ఈడునకు చిన్ననైనను గృహలక్ష్మికంటె పెద్దనగుటవలన నాహృదయ పూర్వకముగా నాశీర్వాదములంద జేసెదను. గృహలక్ష్మి స్త్రీ జనోద్ధరణకై సల్పుకృషిని ప్రశంసించుటయే గాదు; నాశక్తి నంతయు నుపయోగించి తగు సహాయము చేసెదను."

12-3-30
తెనాలి } (సం) అద్దంకి అనసూయాదేవి.

౩

"గృహలక్ష్మి మాసపత్రికయొక్క మార్చి సంచిక మాకందినది. దీనితో మూడవ సంపుటము ప్రారంభమయినది. స్త్రీలకొఱకై ప్రత్యేకముగా నడుపబడు పత్రికలలో నగ్రగణ్యమైనదగు ఈపత్రికారాజము రెండు సంవత్సరములను నిర్విఘ్నముగా గడపి యిపుడు మూడవవత్సరమున నడుగుపెట్టుచున్నది. ఇట్టితరి తత్పత్రికాధిపతులకు మా అభివందనములనంద జేయుచున్నారము. రంగసీమ, సౌందర్యపోషణ, డైరి, బాలవిజ్ఞానశాఖ, అను మఱినాల్గు శీర్షికలక్రింద నూత్నవిజ్ఞాన విశేషముల నీ సంవత్సరారంభమునుండి చదువరులకు సందజేయ సంకల్పింపబడినదని తెలుపుటకు సంతసిల్లుచున్నాము. వెనుకటి సంచికలవలె నిదియు పద్యములు, వ్యాసములు, కథలు, కబుర్లు చిత్తరువులు మున్నగు వానితో విరాజిల్లుచు మనోహరముగానున్నది. విడాకుల చట్టమును గూర్చి పదుగురు నారీమణుల అభిప్రాయములను "గృహలక్ష్మి" ప్రకటించియున్నది. వీనిలో 2 మాత్రము అనుకూలము. తక్కిన 8 ప్రతికూలము. మొత్తముమీద దేశములో సమ్మతులనైకొన్నను అధిక సంఖ్యాకులగు స్త్రీలు చట్టమునకు ప్రతికూలురుగా నుందురనుట నిశ్చయము. అయినను ఒక్కవిషయము మాత్రము గమనార్హము. వివాహవిచ్ఛేదశాసనమునకు ప్రతికూలురుగా నుండువారు గూడ పవిత్రమయిన దాంపత్య ధర్మమును పాటింపక యేదోమిషమీద చొక్కాను తీసివేసినట్లు భార్యను విసర్జించెడు పురుషుల వైఖరిని తీవ్రముగా నిరసించుచున్నారు." —ధర్మసాధని; మార్చి 10

౪

The article "Prananayaki" in your Journal for March is a picture of every day occurrence described most impressively and strikingly in a simple language that will appeal to the readers' heart. It must be read by the youngsters both male and female. It will teach them a moral lesson to lead purer lives. I know of a few who have gone to England for study but who have gone astray morally and some of whom have deserted their legitimate wives. Your Journal contains very well-written articles by Andhra ladies. It must be read by every Telugu knowing person.

Chamarjapet, Bangalore city. (*Sd*) M. Chengiah Chetty Esq, B.A.

Retired Deputy Commissioner

---

# మార్చి పొడుపు కథలకు సమాధానములు

మార్చిమాసపు గృహలక్ష్మిలో శ్రీయుత వడ్లమూడి దశరథరామయ్యగారిచ్చిన పొడుపుకథలకు వరుసక్రమమున సమాధానములివి:—

| | | | |
|---|---|---|---|
| ౧. | వ్యాజ్యము | ౫. | పేరు |
| ౨. | మంగళసూత్రము | ౬. | నిశ్శబ్దము |
| ౩. | ధ్వని | ౭. | నిద్ర |
| ౪. | గొయ్యి | ౮. | కత్తెర. |

మేము కోరినట్లు మార్చి 10—వ తేదీ లోపున ఈ పొడుపుకథలకు సరియైన విడుపులు చెప్పిన బాలబాలికల నామములు (వారు ఎన్నో నెంబరు కథకు సమాధానము చెప్పినది ఆ నెంబరు వారి నామము తరువాతకుండలీకరణమున నిచ్చితిమి) వరుసక్రమమున క్రింద పేర్కొనుచున్నాము:—

1. కందుకూరు పద్మనాభ వెంకటరత్నమ్మగారు (౧, ౨, ౮) 2. హరి పద్మావతిగారు (౨) 3 ధారా వెంకటేశ్వర్లుగారు (౨) పది (సంవత్సరములు, ఫస్టుఫారము విద్యార్థి) 4. నాగలింగము సుందర సరోజినీ దేవిగారు (౧, ౨, ౪, ౫) (పదునొకండు సంవత్సరముల బాలిక) 5. కొంగర సత్యనారాయణగారు (౧, ౨, ౮) (తొమ్మిది సంవత్సరములు) 6. ఆచంట సూర్యారావుగారు (౨, ౪) పండ్రెండు సంవత్సరములు 7. చల్లా శ్యామలాదేవిగారు (౨, ౫, ౮) (ఫస్టు ఫారము విద్యార్థిని) 8. గుడిపాటి శకుంతలాదేవిగారు (౨) 9. కుప్పుస్వామిగారు (౨) 10 కొండేపూడి వేంకటచలపతి రావుగారు (౨) 11. కొత్తపల్లి శారదాంబగారు (౨, ౬) 12. పాకాలరత్నమూలగారు (౨, ౪) 13. వంకా వేంకటరామ సరస్వతిగారు (౨) (అయిదవ తరగతి) 14. పాకాల కనకరత్నముగారు (౨, ౪) 15. వరంగలు ఆంధ్రస్త్రీ బోధనాభ్యసన పాఠశాల విద్యార్థినులు (౨, ౩) 16. టి. బి. రంగాచార్యులు (౨, ౪) (ఫస్టు ఫారము విద్యార్థి) 17. వెల్లంకి సతీదేవిగారు (౧, ౨, ౪, ౫)

# మార్చి చిత్రప్రశ్నకు సమాధానము

మార్చిమాసపు గృహలక్ష్మిలో శ్రీమతి పౌణకా రమణమ్మగారు వ్రైచిన చిత్రప్రశ్నకు సమాధానము:—

య ము న

ము ర ళి

న ళి ని

మేము కోరినట్లు మార్చి 10–వ తేదీలోపున ఈ ప్రశ్నకు సరియైన సమాధానము తెల్పిన గృహలక్ష్మిపాఠకురాండ్ర నామములు వరుస క్రమమున దిగువ పేర్కొను చున్నాము:—

1. హరి వేంకటరమణమ్మగారు 2. పి. రత్నమణిగారు 3. శ్రీపాదన్న సూర్యకాంతమ్మగారు 4. కంచి మంగళమ్మగారు 5. వేదుల గౌరీసావిత్రిగారు 6. కొలచిన జగదీశ్వరమ్మగారు 7. అద్దంకి అనసూయాదేవిగారు 8. కొంగర అన్నపూర్ణమ్మగారు 8. రాధగారు 10. మొగసాటి అప్పలనరసమ్మగారు 11. రావులుకొల్లు సుబ్బకామాక్షమ్మగారు 12. నాగలింగము సరళాదేవిగారు 13. ధర్మవరము లక్ష్మీదేవమ్మగారు 14. మండపాటి సీతామహాలక్ష్మిగారు 15. యమ్. గౌరమ్మగారు 16. వాసిరెడ్డి లక్ష్మీదేవమ్మగారు 17. వద్దిపర్తి శకుంతలాదేవిగారు 18. సుసర్ల లక్ష్మీనరసమాంబగారు 19. రా. సుందరమ్మగారు 20. నరశెట్టి కామాక్షమ్మగారు 21. వె. వెం. నాగేశ్వరాంబగారు 22. వై. సుందరమ్మగారు 23. మన్నవ సరస్వతిగారు 24. ఎ. సరస్వతమ్మగారు 25. జె. సీతాబాయిగారు 26. కాశ్లసుబ్బమ్మగారు 27. కాశ్లూరిఅనసూయగారు 28. ఆలపాటి సీతమ్మగారు 29. చల్లా మంగళాంబగారు 30. రాయి సరస్వతమ్మగారు 31. శంకర రామాయమ్మగారు 32. మాడభూషి చూడమ్మగారు 33. చిన్నట్టి కమలమ్మగారు 34. సింహాద్రి సుమతీదేవిగారు 35. బృందావనము రాజ్యలక్ష్మితాయారుగారు 36. కొణిదెన సీతమ్మగారు 37. మలిపెద్ది నల్లమ్మగారు 38. జి. సరస్వతిగారు 39. చిత్తజల్లు కాంతామణిగారు 40. జి. అన్నపూర్ణమ్మగారు 41. పాకాల రత్నమాలగారు 42. బీరు రమణమ్మగారు 43. ఎ. సీతమ్మగారు 44. జామిశెట్టి వెంకటరత్నమ్మగారు 45. పాకాల కనకరత్నముగారు 46. పాకాల రత్నాబాయిగారు 47. వేమారెడ్డి మహాలక్ష్మమ్మగారు 48. చిల్లరిగి కృష్ణాబాయిగారు 49. ముక్కామల లక్ష్మీనరసమాంబగారు 50. వరంగలు ఆంధ్రస్త్రీ బోధనాభ్యసన పాఠశాల విద్యార్థినులు 51. నిమ్మలగెడ్డ జానకమ్మగారు 52. శ్రీరంగం కాంతామణిగారు (12 సంవత్సరముల బాలిక) 53. వి. యస్. మాలతిగారు (4వ ఫారము విద్యార్థిని) 54. కె. వైజయంతిగారు 55. పి. ద్రౌపదిగారు 56. వెల్లంకి సతీదేవిగారు 57. వంకా వెంకటరమణ సరస్వతిగారు (5–వ తరగతి విద్యార్థిని) 58. కర్రి కమలగారు 59. చెలసాని కాంతాంబగారు 60. పాలడుగుసముద్రాలదేవిగారు 61. శంకరవాసుదేవమ్మగారు 62. కొత్తపల్లి శారదాంబగారు.

# మీ సౌందర్యమును పెంపొందించుకొనుడు

మా స్త్రీ పోషకులకు

మీ ద్రవ్యము—తండ్రి, సోదరుడు, భర్త, కుమారుడు—మరెవరివద్దనున్నను సరియే, దానిని మీ దేహము నలంకరించుకొనుటకై యుపయోగింపుడు.



ధనమును నగలరూపముగ మార్చి మీ సౌందర్యమును పెంపొందించుకొనుడు.

సౌందర్యము, దానివిలువ యును మీకు బాగుగ తెలిసి యుండుటబట్టి మీధనము నూరక బ్యాంకునందు వృథా పోనీయ వలదు.

దానికి ప్రాణశక్తినిచ్చి మీతో ఐక్యతపొందించుట కను వగు మార్గము, దానిని ఆభరణ రూపమున దాల్చుటయే.

మాచే తయారగు నగలు విలువయందును, సొంపు ఆహ్లా దము ప్రతిపాదించుటయందును, ఎన్నటికిని తీసిపోవు.

మీరు ఒకసారి మావద్ద కొన్న, ఆవస్తువు మీకిచ్చు తృప్తి యనునది, మిమ్ములనేగాక మీ స్నేహితురాండ్రను సైతము ఎల్ల ప్పుడును మాషాపుకే ఆకర్షింప గలదు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి & కంపెని,

నగల వ్యాపారులు.

**25.** చైనాబజారు రోడ్డు, మదరాసు. **62,** గోవిందప్పనాయక్ వీధి.




# ఏప్రియలు ఒకటి



వచ్చిపడుచున్నది వచ్చిపడుచున్నదని పూర్వాచారపరాయణులు కళవళించిన ఏప్రియలు ఒకటి వచ్చిపడినది. అతిబాల్యవివాహములకు శారదామౌఢ్యము ఆరంభమైనది. శుక్రమౌఢ్యము గురుమౌఢ్యము మొదలగువానివలె నిది దినములతోడను మాసములతోడను వదలునదిగాదు. పదునాలుగుసంవత్సరములు పట్టి యుండును. పితృవాక్యపరిపాలనమునకు అలనాడు శ్రీరామచంద్రమూర్తి అరణ్యవాసము చేసినంతకాలము. క్రొత్తనీరువచ్చి పాతనీటిని కొట్టివేయునట్లు పదునాలుగుసంవత్సరముల పర్యంతమైన ఈ శారదామౌఢ్యము వచ్చి అల్పకాలపర్యంతములైన గురుశుక్రాదిమౌఢ్యములను పాతవానికొఱకు ప్రాకులాడు అత్యాచారపరులచే గూడ పాటింపనక్కఱలేనివిగా నొనర్చినది. ధర్మమో ధర్మమో అని షష్ఠిఘుడియలు పలవరించుచుండు పూర్వాచారపరులు ఏధర్మము నుపలక్షించి ఇట్టి సంస్కారము నవలంబించిరో ఎఱుంగగోరెదము.

పూర్వాచారప్రియులు పలుకులలో అందిపొందరాని ధర్మములనుగూర్చి పలవరింతురు; ఆచరణకై గతానుగతికమైన ఆచారమువంక ముల్లుచూపుదురు. అట్లేకానిచో ఈ నాలుగైదు మాసములుగ హిందూదేశచరిత్రమునందలి వివాహప్రకరణమున బుట్టిన ఉత్పాతములతో సమానములైన విడ్డూరములకు ఎడములేకనేపోవును. నిజామా

బాదజిల్లా కామారెడ్డి తాలూకా యందలి బీబీపేటగ్రామములో గంజినారాయణ సాహుకారిగారు తన పదమూడునెలలప్రాయపు శిశువును ఇరువదిఆరుసంవత్సరముల ప్రాయముగల ఆకులవీరయ్యగారికిచ్చి వివాహముచేసెను. మార్చి 6-వ తేదీ ప్రాంతమున ఢిల్లీనగరమున జరిగిన ఒకానొక వివాహములో పెండ్లికుమారుడు రెండేండ్లవాడని పత్రికలలో ప్రకటింపబడినది. ఇక పెండ్లికుమారునికంటె చిన్నదిగానుండు పెండ్లికూతురు వయస్సెంతయుండెనో? కోర్టువారు జోక్యముకలిగించుకొని ఉచితజ్ఞురాలగు తల్లిని సంరక్షకురాలినిగా నియమించి శారదాచట్టము అమలులోనికి వచ్చువఱకు నెలకొకసారి పిల్లను తెచ్చి తమకు చూపవలెనని ఆర్డరు చేయకుండినచో ప్రేమసింగు చనిపోయినతన దాయాదికూతురు నాలుగేండ్ల దానిని ఆఱేండ్లబాలునకిచ్చి మూల్తానులో వివాహము చేసి యుండునుగాదా? సిరాజ్‌గంజిదగ్గర ఆట్‌గేరియా గ్రామమున నొకడు తనకూతురు పుట్టిన ఇరువదియొక్కటవనాడు పురిటిశుద్ధిస్నానముతో బాటు వివాహమంగళస్నానమును గూడ చేయించి ఆమెను రెండుసంవత్సరముల బాలునకిచ్చి పెండ్లిచేసినాడు. నాసిక నుండి వినవచ్చుచున్న ఈ వైపరీత్యమును పరికింపుడు. ఒక పూర్వాచారపరాయణుడగు బ్రాహ్మణుడు శారదాచట్టము అమలులోనికి రానున్నందున 10 సంవత్సరముల వయస్సుగల నర్మదయను తనకుమార్తెను 40 సంవత్సరముల వయస్సుగల ఒక వికలాంగికి నిచ్చి వివాహ మొనర్ప నిశ్చయించుకొనెను. ఈ బాలిక దురవస్థను చూచి పక్కయింటి యందున్న కృష్ణ గడిగిల్ అనునతడు వివాహమును నిషేధించుచు ఇంజక్షను ఉత్తరువు నివ్వవలయునని జిల్లాజడ్జినికోరెను. కోర్టువారు ఇంజక్షను ఉత్తరు విచ్చుటచే పెండ్లిపీటల మీద కూర్చుండిన వధూవరులు మధుపర్కములతో కోర్టునకు తీసికొనిరాబడిరి. ఈ వివాహము మీ కుమార్తెకు సౌఖ్యములు కలుగజేయునా యని మాజిస్ట్రేటు కన్య తండ్రిని ప్రశ్నించెను. శారదాచట్టము త్వరలో అమలునకు రానున్నదనియు ఈ స్వల్ప వ్యవధిలోపుగ తగిన వరుని సంపాదించుట కష్టమగుట నిట్లుచేతిననియు అతడు చెప్పెను. అందుపై మేజిస్ట్రేటు వివాహమును నిషేధించుచు ఉత్తరు వొసగెను. ఇట్టి విడ్డూరపు పెండ్లిండ్లు ఈమధ్య హిందూదేశమున ఎన్నిజరిగినవో ఎన్నలేము.

ఈ వివాహముల సంరంభము దేశమునందు కలిగించిన అలజడి వర్ణింపనలవికాదు. 'టెలిగ్రాఫు ఆఫీసుకుబొమ్మ. అర్జెంటు టెలిగ్రామునకైన తంతి అందుబాటునలేదు. శారదావివాహముల ముహూర్తనిశ్చయములు, మార్పులు ఇత్యాదులు తంతివార్తల లోనే జరుగుచుండుటచేత. రైళ్లనుచూడుడు. పెండ్లిప్రయాణీకులతో పెట్టెలు క్రిక్కిరిసినవి.

మోటారుబస్సులేమి, ట్రాముకారులేమి, మోటారుకారులేమి లెక్కకుమీరిన వధూవరుల పాదసంస్పర్శచే పసుపుపారాణులతో ముద్రితములైనవి. మేళతాళములు లేకపోయినను, పాలకీ లేకపోయినను, తుదకు పురోహితులు లేకపోయినను వివాహములు జరిగిపోయినవి. బ్యాంకులలో సొమ్మంతయు సెలవైపోయినది.' అని జన్మభూమి వ్రాసినది అత్యుక్తిగాదు. కొన్నివివాహములు మంగళమేళములకు బదులు గ్రామఫోనులు సీనా రేకులమీద వాయిద్యములతోను చేయబడినవని ఒక విలేఖరి ఆంధ్రపత్రికలో వ్రాసినాడు. అందఱు పెండ్లిబాజాలకు కుదురుటచే ఆయుష్కర్మ చేయించుకొనుటకు మంగళవాంద్రు దొరుకుట ఏలూరుపట్టణమున దుస్తరముగానున్నదని సత్యాగ్రహి ప్రకటించినది. ఓహో! ఏమివిపరీతము? శారదారాజ్యశిష్టులై సనాతనధర్మపరులు ఈ పటుసాహసికృత్యములకుగడంగిరి. ఒళ్లు తెలియని పిఱికితనమునకు లొంగిపోయిన వారు ఇందలి యుక్తాయుక్తములను ఉచితానుచితములను సమాలోచింపజాలకపోయిరి. ఈ నాలుగైదుమాసములు దేశమున జరిగిన వివాహములు సనాతనధర్మముచే సమర్థనీయములని తాము గుండెపై చేతులువైచి చెప్పగలరాయని సనాతనధర్మపరులను మేము ప్రశ్నించుచున్నాము.

జరిగిన వివాహముల పద్ధతియేకాదు వానిసంఖ్యకూడ విడ్డూరము పుట్టించునదిగానే యున్నది. మార్చి మాసమున మిడ్నపూరులో పదివేల బాల్యవివాహములు జరిగినవి. అప్పరు సింధునందలి లార్కానా పట్టణములో మూడువందల పెండ్లిండ్లు. అందలి కామ్వర, పాదాద్కోట, మిరోఖాను తాలూకాలలో హద్దుపద్దులేని అతిబాల్యవివాహములు జరుగుటయు ఆకారణమున బాజాభజంత్రీలకు కఱవు ఏర్పడుటయు అందున కొన్నితావుల మంగళధ్వనులు లేకనే వివాహమంగళములు నిర్వర్తింప బడుటయు జరిగినది. చౌడంగా సబ్ డివిజనులో నాలుగువేల ఉద్వాహములు. రంగపురమున మూడువేలు. గూస్తియా డివిజనులో ఒక ఫాల్గుణమాసమున ఎనిమిదివేల పరిణయములు నడచినవి. దినాజ్ పూరులోని బలూరుఘట్ నందు గతమాసద్వయమున ఐదువేల వివాహములు జరిగినవి. నలుబది తొమ్మిదివేల జనసంఖ్యగల మచిలీపట్టణమున ఈ మధ్య తొమ్మిది వందల వివాహము లయినవి. వ్యాసము చిరాయగుచున్నదని చదువరులు చీదరించుకొందురని భయము పడియు, తఱుముకొని వచ్చుచున్న తలయేఱునకు జంకియు నిక తడవజాలక విరమించుచున్నాము.

శారదాబిల్లు శాసనసభలో చర్చింపబడుచున్నప్పుడు సనాతనధర్మపరులమను వారు కాలు కాలిన పిల్లులవలె కంగారుపడుచు 'బిల్లు చట్టమగుచో సత్యాగ్రహము చేతుము' అని సభలలో చాటిచెప్పిరి; పత్రికలలో తెగవేసి వ్రాసిరి. అయినను సంగీత

మునకు చింతకాయలు రాలలేదు. చేయబోయెడివారి సత్యాగ్రహమునకు శారదాబిల్లు చట్టము కాకుండనుండలేదు. వారు ధర్మపరులేయగుచో వాక్కుతోడను, వ్రాతయందును చాటినట్లు సత్యాగ్రహము చేయుటకు సంసిద్ధులై యుండవలసినది. అందుకు బదులు వారు భీరువులై శాసనమిచ్చిన గడువులోపల తమకూతుండ్లకు పెండ్లిండ్లుచేసి తమరుచేయగల సత్యాగ్రహమునకు సాధనములేకుండ చేసికొనిరి. ఇది కార్యశౌర్యమగునాయని పూర్వాచారప్రియులను మేము రహస్యమున ప్రశ్నింపుచున్నాము.

చట్టధిక్కారమునకు మోహాటించి నిలువగల మనోద్రఢిమ తమకడ ఇల్లమైనను వారు వాక్శౌర్యమును మాత్రము వల్లమాలినంత చూపియున్నారు. సనాతనధర్మసభలు చికిలింతఐశ్వర్యమువలె పొడచూపినవి. తీర్మానములు చేయబడినవి. పక్షపత్రికలు వారపత్రికలైనవి. క్రొత్తపత్రికలు తలయెత్తినవి. సనాతనధర్మమును ప్రబోధ మొనరించుటకు దినపత్రికస్థాపించుటకై మనరాజధానిలో ప్రయత్నములు చేయబడినవి. శ్రీ ఆర్యప్రకాశిక పత్రికా సంపాదకులగు శ్రీ జి. చిదంబరయ్యగారు జమ్మలమడుగునుండి వైస్రాయిగారికి శారదాచట్టము నిలుపు చేయవలసినదని జాన్యువరి పదునాలుగవ తేదీని బహిరంగలేఖ వ్రాసియున్నారు. తిరునల్వేలియందలి పూర్వాచారపరులు ఇండియా మంత్రిగారిపై ఈ చట్టము విషయమై దావాదాఖలు చేయ జనవరి పదమూడవ తేదీని తీర్మానించియున్నారు. మధురలో నొక లాయరుమహాశయుడు ఇందుకు ప్లెయింటుకూడ తయారుచేసినాడు. ఈ శాసనము అక్రమమని వ్యాజ్యమువేసి సిద్ధరింపవచ్చునని పి. ఆర్. గణపతి అయ్యరుగారు మున్నగువారు పత్రికలలో వ్యాసములు వ్రాసినారు. శారదాచట్టము అక్రమమని నిర్ణయించుటకు వేయబడు దావాకు అగు ఖర్చులకుగాను ఆచట్టమునకు వెలిచి చేయబడు వివాహముల సమయములందు కొంత కొంత సొమ్ము చందా వేయవలెనని విన్నపములు పత్రికాముఖమున ప్రజలకందించినారు. కాశీమహా పట్టణమున సనాతనధర్మసభలలో కబుర్లకు తోడు కొట్లాటలుకూడ నడచినవి. ఇట్లుండ సూక్ష్మబుద్ధిగల యొక మహానీయుడు ఏప్రియలు ఒకటి నుండి శారదాచట్టము అమలులోనికి వచ్చునుగదా మార్చి 31-వ తారీఖున ప్రారంభమై ఏప్రియలు మాసమున ముగింపునొందు వివాహములు అశాస్త్రీయములగునా అని చొప్పదంటుప్రశ్న వైచినాడు. ప్రథమదినమే ముఖ్యమైనది 31 వ తేదీని చట్టము అమలులోనికి రాకుండనే అది జరిగి పోవును గావున అట్టి వివాహము అశాస్త్రీయము కాదని ఒక అడ్వొకేటుగారు శిష్టాచారపరులకు అభయమిచ్చినారు. శారదాచట్టనిర్మూలనమునకై మార్చి 16-వ

తేదీ మొదలు 27–న తేదీ వఱకు ద్వాదశదినములు తంజావూరునందలి శ్రీబృహదీశ్వరాలయమున మహారుద్రజపము సాగింపబడినది. ఇట్టి తాటియాకు చప్పుళ్లచే శారదాశాసనశశమును తొలగింపవచ్చుపరిస్థితులకు రొమ్మువిఱిచి నిలువగల గుండెనిబ్బరముకాని, పదుగురాడుమాట పాటించు సంస్కారము కానిలేని—పూర్వాచారపరులు తలక్రిందులైనారు.

ఈకూటువనూరకు మొనకాడు యం. కె. ఆచార్యగారు. ఆయన రాజకీయముగ రంగు రంగు కోటులు ధరించుచున్న సీతాకోకచిలుక. సీత, సావిత్రి మొదలగు సతీరత్నముల సంతతివారగు భారత స్త్రీల సతీత్వమును గూర్చి అశుచిప్రాపకములగు సందేహములను శాసనసభలో వెల్లడించిన వాచాటుడు. మేమీవ్యాసము వ్రాయుచుండునప్పటికి శ్రీ ఆచార్యగారు శారదాచట్టమునకు ఎమెండుమెంటు తేనున్నారనియు వివాహవయస్సు పదునాలుగు సంవత్సరములనుండి పండ్రెండు సంవత్సరములకు తగ్గింపబడవచ్చుననియు వదంతులు పత్రికాముఖమున లోకమునకు చేకూఱుచున్నవి. ఈ వదంతులు నిజమై ప్రభుత్వమువారీయెమెండుమెంటునకు ఒప్పుకొనుచో అది ప్రభుత్వమువారికి పరాజయము అగునేమోకాని పూర్వాచారపరులకు విజయము మాత్రముకాదు. ఏమందురా? శారదాచట్టము విషయమున ప్రభుత్వమువారు దేశీయుల మతవిషయమున ఎట్టిజోక్యము కల్గించుకొనమను తమ ప్రాత అభిప్రాయమును మార్చుకొని వర్తించిరి. అట్లు వర్తించుటలో వారు సుదీర్ఘముగ నాలోచించియే చేసిరి. అట్టి విషయమును ఆచరణమున బెట్టుటకు జంకుచున్నారనగా అది వారికి మినహాయింపులేని పరాజయముకాదా? ప్రభుత్వమువారికి పరాజయమైనపుడు ఇది వారిప్రత్యర్థులగు శిష్టాచారపరులకెట్లు విజయముకాదని మీరడుగవచ్చును. శిష్టాచారపరులఇంట ఆడపుట్టువుగన్న పిల్లలకందఱకును నెలగుడ్డులకుసహా వివాహములైపోయినవి. ఇక ఈఎమెండుమెంటు ఎవరికోసము? శిష్టాచారపరులకు పుట్టబోవు ఆడపిల్లల కొఱకా? కావచ్చును. అప్పుడును ఈ ఎమెండుమెంటువలన లాభములేదే. మనదేశమున బాలికలు ప్రాయికముగ పండ్రెండు సంవత్సరములకే ఆగతార్తవలగుదురు. ఈవిషయము అంగీకారవయోనిర్ణయసంఘమువారి రిపోర్టునందు విస్తరించి విస్పష్టముగ వ్రాయబడియున్నది. ఎమెండుమెంటు ప్రకారమైనను పండ్రెండు సంవత్సరములు దాటినగాని పరిణయముచేయరాదు. ఎట్లైనను వివాహములు శిష్టాచారపరుల అభిప్రాయమున ధర్మేతరములేయగును.

శారదా శాసనము దేశక్షేమంకరమైనది. దాని ఆకారము వికృతము చేయ జూచుట పాడికాదు. దేశమునందలి స్త్రీలు దీనికి సుముఖముగనున్నారు. స్త్రీల సభల నెన్నిటనో శారదాశాసనము నామోదించుచు తీర్మానములు చేయబడినవి. ఆచార్యగారి ఎమెండుమెంటునకు ఒప్పుకోరాదని దేశమున సభలు చేయబడుచున్నవి. దేశమునందలి యువజన సంఘములవారు శారదాచట్టమును అమలు పఱచుటలో ప్రభుత్వము వారికి బాసటయై నిలిచియున్నారు. బాలికలుకూడ శారదాచట్టము నెడల సుముఖులై యున్నారు. ఏప్రియలు ఒకటిలోపున తనకు వివాహముగావింప జూచుచున్న కన్నతల్లిని విడనాడి గిరిబాలదాసియను పదియేండ్ల బాలిక తలపెట్టబడిన తన వివాహము తప్పించుకొనుటకై పినతండ్రి కడకు పారిపోయిన వృత్తాంతము పత్రికలందు చదివియు నిమ్నమునకు దోడగిలు నీరు నిలువరింప ప్రయత్నించు పిచ్చివాండ్రవలె, దుర్దమప్రవాహమునకు ఎదురీదదివురు చీమలవలె పూర్వాచారపరులు లోకాభిప్రాయమును అరికట్ట జూచుచున్నారు. కాని ఇక లాభములేదు. శ్రుతిమించి పోయినది.

ఏప్రియలు ఒకటి పూర్వాచారపరులగు తమిళసోదరులకు ఆంగ్ల సంప్రదాయమున 'ఆల్ ఫూల్సు దినము' కావచ్చును. ఆంధ్రులకది అట్టిదికాదు. ఆంధ్రులు సంస్కారప్రియులు. అది వారికి నూతనశకారంభదినము. శారదాచట్టమువిషయమున వంగరాష్ట్రమునందును తమిళరాష్ట్రమునందును ఉన్నంత విముఖత ఆంధ్రదేశమున కానరాదు. ఆంధ్రులకు నిన్న నూతనవత్సరారంభమైనది. నూతనవత్సరోత్సవముతో వారు శారదాచట్టప్రారంభోత్సవమును జరుపుకొన్నారు. శారదాచట్టముతోబాటు ప్రారంభమైన ప్రమోదూతనామ సంవత్సరము సంస్కారప్రియులగు ఆంధ్రులకు ప్రమోదమునిచ్చు దూతయగు గాకయని పరమేశ్వరుని మడిచేతులతో ప్రార్థించుచున్నాము.

# గృహలక్ష్మి

నామెర రాజగోపాలరావు గారు

వరశరచ్చంద్రికామనోహరతనొప్పి
సహజసౌందర్యగరిమ నీజగమునందు
భావగీతము లింపుగాఁ బాడుచుండి
సతులలోపల ఘనమగు నుతినిగనుచు
తరేఖనముల సరణిఁజూపి

పూత "లోధ్రా" వ్రతంబును జేతఁబూని
స్త్రీలపాలిటి దైవంబువోలె నిప్డు
డాంధ్రగృహంబులకు "లక్ష్మి" యవతరించె
నెదురుగాఁబోయిస్వాగతంబిచ్చి; వేగ
వెంటఁదోడ్కొనిరండమ్మ! వెలఁదులార.

# మడిబట్ట

మడిబట్ట అననేమియో తెలియని వారుండబోరు. మనుజుని శుచిత్వమునకు ముఖ్య పరికరమును, ఆతని ఆరోగ్యమునకు ప్రధాన వస్తువును అయిన నిర్మలవస్త్రము మడిబట్ట. కట్టివిడిచిన వస్త్రమును దాని మాలిన్యముపోవునట్లు విశుద్ధ జలమున ఉదికి ఎండ గాడ్పులచే ఆరనిచ్చి అటుపిమ్మట ధరించిన ఆరోగ్యముగను శుచిప్రదముగను ఉండునని మతవిధులను ఆరోగ్యసూత్రములను మంచినేర్పుతో మేళవించిన ఆర్యులు తమదినచర్య యందు మడిసూత్రమును ఇమిడ్చియుండిరి. మనముధరించు వస్త్రములందు శరీరమాలిన్యము కొంత, బయటతిరుగునపుడు రోడ్డుమీది మాలిన్యము కొంత, గాలితో కలిసియుండు క్రిమికీటకాదులు చేరుచుండును; కావున ఒకసారి ధరించి విసర్జించిన వస్త్రమును అందలి మాలిన్యముపోవునట్లు ఉప్పళించి ఉదికి సూర్యకిరణములచేతను గాలిలోను ఆరనిచ్చి ధరించు ఆచారము ఆరోగ్యవిధులలో అమోఘమైనదని ఆర్యులు ఎన్నియో వేలసంవత్సరముల క్రితము గ్రహించి ఆప్రకారము ఆచరించిరి. సూర్యకిరణములు, శుద్ధజలము, శుభ్రవాయువు ఈమూడును జీవకోటికి పరమేశ్వరుడనుగ్రహించిన పారిశుద్ధ్య పరికరములు. సమస్తరోగములను, సర్వపాపములను, సకలమైన పీడలను నశింపజేయుటకు ఈమూడు వస్తువులును అత్యంతము సమర్థములైయున్నవి. వేయేల? జీవకోటి యొక్క శరీరారోగ్యమునకు సంబంధించిన ప్రతి సూత్రమునందును ఈమూడును విడువరాని కూడికతో ఇమిడియే యున్నవి. ఇట్టి వస్తుత్రయముచే నిత్యము పవిత్రీకృతము చేయబడిన వస్త్రమునే 'మడిబట్ట' యని మతమునందే వైద్యమును ఆరోగ్యమార్గములను జతగూర్చిన ఆర్యులు తొలుదొల్త పిల్చుచుండిరి.

కాని కాలక్రమమున ఆర్యుల ఇతర ఆచారములతోపాటు ఇదికూడ ఆంతర్యమును గోల్పోయినది. ఆనాటి అట్టి మడిబట్ట నేడు మనవైదికశిఖామణులచేత చిక్కి ఎట్లు భ్రష్టమైనదో కొంచము వివరించి వ్రాయుదును. తెలుగుదేశమున ఈమడిబట్టకు నాలుగు విధములైన వస్త్రములు వాడుకయందున్నవి. (1) నూలుబట్ట (2) తడిబట్ట (3) పట్టుబట్ట (4) ధావళి.

## నూలుబట్ట

నూలు మడిబట్టయే తెలుగుదేశమున సర్వసాధారణమైనది. అయితే ఇందు ఒక సంగతి చూడవలసియున్నది. బయటపోవునప్పుడు కట్టుకొనుటకు పనికిరాక జీర్ణించి పోయినవి; పడినతూట్లతో ఇదియొక మోస్తరువలయో అనిపించునవి; వేసినమాసికలతో

పడవల పాత తెరచాపను స్ఫురింపజేయునవి; పట్టిన మాలిన్యముతో గొడ్డుచర్మమును తలపించునవి; వేయబడిన ఉత్తరపుకుట్లతో గంగిరెద్దు బొంతలను జ్ఞాపకముచేయునవి అయిన పాతబట్టలు తెలుగు వారి యిండ్లలో మడిబట్టలకు ప్రత్యేకింపబడియుండుట సర్వ సాధారణమైన విషయము. మడిబట్ట తడుపుటకు శుభ్రమైన జలముండవలయునను పట్టింపు మనవారికి లేదు. పనితీరుటకు ఎట్టిజలమైనను సరియే. తడిపినప్పుడైనను ఆ బట్ట నొక్కిపెట్టని వేయరు. పెట్టువేసిన ఆపాతబట్ట ఎక్కడ పెకలిపోవునో అన్నభయము. మడిబట్ట ఎంత పొట్టిగానున్న అంతమంచిదని అత్యాచారపరాయణులగు కొందఱు మహనీయుల అభిప్రాయము.

ఇక మడిబట్ట జాగ్రతచేయు పద్ధతిని చూతము. బల్లులుకూడ లోనికిపోవుటకు సందేహించు పొగగూళ్లు, చూరులు, పొయ్యిదగ్గిర గోడమీది మేకులు ఇవి మనగృహము లందు మడిబట్టలు సాధారణముగ ఉంచబడుతావులు. వంటయింట నిత్యము తయారగు పొగను పిసరంతేని బయటకు పోనీయక హాలాహలము మింగు శివునో అను నట్లు మడిబట్ట దానినంతయు లోగొనును. కఱుహూపము తనకు కలంకారి పనిచేయగా తారురంగును, పొగవాసనయు సంపాదించియుండు ఆ మడిబట్ట ధరించి ఆచారమున తమకు సాటిలేకుండ చరించుచుంటిమని మనవారు సంతోషించుచున్నారు.

మనయింట మడిబట్టలకు కలంకారీపని చేయునది ఒక గృహధూమమేకాదు. నేతి నూనిగిన్నెలను శుద్ధిచేయుట; నిప్పులమీద వెచ్చపెట్టబడిన నేతిగిన్నెను దింపుట; అది తోమి ఇదితోమి మాటిమాటికి కడుగబడుచుండు వంటలక్కచేతిని తుడుచుట ఇత్యాది వేనవేలు కార్యములు చేయుచు మడిబట్ట తనకుతానే కలంకారి పనిచేసికొనును.

ఇంతటి శుచిగల మడిబట్టను కట్టుకొనియున్నప్పుడు—కుడియెడమలు తెలియుని కుఱ్ఱపిల్లవాడువచ్చి ముట్టుకొనుచో తల్లికల్లెఱ్ఱజేసి మాతృప్రేమకు దూరురాలై వానిని బాదును; కార్యవ్యగ్రహృదయమై ఏమరుపాటును కోడలు తాకుచో అత్త ప్రొయ్యి నుండి వెడలు ధుంధుమారమును కప్పివేయు ధుమధుమలతో ఎసరుకంటె ఎక్కువగ మోతపెట్టును. ఈ మడిబట్టలవలన కొంచమేని శుచిత్వము ఆరోగ్యము కల్గుటలేదు సరికదా ఒకటికిరెండు తోడనునట్లు అనారోగ్యము, అశౌచములకుతోడు గృహశాంతికి భంగముకూడ కల్గుచున్నది. ఈగతలంతేని ప్రయోజనములేదు. కలుగవలసినంత హానికలుగుచున్నది. ఇట్టి మడిబట్టలకు మన గృహములందెంతకాల మింకను నిలువ స్థానముండునో?

తడిబట్ట, పట్టుబట్ట, ధావళి వీనినిగూర్చి పైమాసము వివరింతును.

# పతి సందర్శనము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

గీ. ద్యూతమున రాజ్యమే బోయి దుఃఖమునను
పాండవులు మానివృత్తితో పరమనియతి
గహనవాస మొనర్చెడి కాలమందు
తతమహాతపశ్శాలియౌ ధౌమ్యమౌని.

క. శతకుంభ(?)బను యజ్ఞము
నతిమోదంబునను జేయ నారంభవ్యా
వృతదీక్షకలిగి యుచితా
ర్హత పాండుసుతులగూడ రయమున బిలిచెన్.

గీ. పిలిచినను తోడనేవచ్చి భీమసేను
యాగసంరక్షణార్థంబు అచటనిలిపి
మిగిలినటువంటి వారెల్ల నొగిని లోని
కేగిరి ముదితహృదయపంకేజులగుచు.

క. వ్యాయామార్థము భీముడు
యాయాశ్రమముదరి విపులమగు బయలునకున్
పాయక నేగుట వాడుక
యైయుండుట నొక్కనాడు నటు లన్నతరిన్.

సీ. కఠినదరిద్రానగాసిల్లు కేశవదాసను నుత్తమభూసురుండు
తనమిత్రునింట నుపనయనభూరిమూహూర్తమును గన నాహూతుడయ్యె
సకుటుంబముగ తత్సాంద్రమహాటవీభూరిమార్గము బట్టిపోవుచుండ
నుపవాసగతభుక్తి కొక్కమనుజుగాని బోవగ తల్లిచే పొందుగాను

గీ. యచట నాజ్ఞప్తుడై ఘటోత్కచుడు చాల
కాలమందందుదిరిగి యకాననలోన
తుదకు ఈబ్రాహ్మణునిగాంచి ముదముతోడ
పొంచిపట్టుటకు నట నుంకించుచున్న.

చ. అరయ సవత్సధేనువుతో నాఁకొనియున్న మృగేంద్రముంగలన్
తొరలుచు బడ్డ ఎద్దువలె తొల్త భయాకులచిత్తవృత్తితో
చరణము లెత్తజాలక విచారముచేత విలోచనంబులన్
పొరిపొరినీరుగ్రమ్మ గనె పోడిమిదక్కి వడిఁ ఘటోత్కచున్.

గీ. తల్లియాజ్ఞచే ఘోరకృత్యంబొనర్ప
బూనిన ఘటోత్కచుండు విస్ఫూర్తిమెఱయ
సదయార్ద్రచిత్తాబ్జుఁడై సారసోక్తి
గుట్టువీడి యుప్పారుతో నిట్టులనియె.

క. "మీలోనొక్కరి నిచ్చిన
జాలును యువశిష్టులెల్ల సంతోషముతో
హేలాగతి బోవచ్చును
ఆలాగున కాని యెడల నందఱకెగ్గా."

సీ. అనవిని బ్రాహ్మణుండందు నెవ్వరిఁగూడ నిచ్చుట కాయెడ నిష్టపడక
లలిఘటోత్కచు పట్టుదలకాంచి మిక్కిలి భయమొందుచుండిన భార్యతోడ
"భయమేల మనకిక? పాండవులిట దరిగల"రని ధైర్యంబు గరపుచున్న
"అయ్యో! వారిప్పుడే అలధౌమ్యులనివాసవనికేగిరని యొక్కనటువు జెప్పె"

గీ. ననుచు తనపెద్దకొమరుండు పనవి పనవి
నేడ్చుచుండ చేయుపని యింకేమిలేమి
తుదకు తనవృద్ధజీవముల్ తోడర నీయ
సంచలింపక నెద నిశ్చయించె నంత.

సీ. "మతిపతివ్రతయన పతిమాత్రధర్మిణి కాన నాయసువులు వీనికిడుదు
సుమ్మని" బ్రాహ్మణి సూటిగానన జ్యేష్ఠుడపుడు "నా ప్రాణముల్ యిపుడె యిచ్చి
గురులరక్షించెద కొమరుమిగుల" ననె నట తక్క నిరువురు నటులె యనుచు
ఘోరసంవాదముల్ వారొనర్చుచుండ "జ్యేష్ఠుడెల్లపుడు నాకిష్టు"డనుచు

గీ. వృద్ధుఁ డాలింగనమొనర్చె పెద్దవాని;
వేగ బ్రాహ్మణియు "కనిష్ఠ విడువజాల"
ననుచు కౌగలించుకొనె; దుఃఖాబ్ధిమునిగి
చటులదీనత మధ్యముం డటమటించె.

క. “మాతాపితల కనిష్ఠుడ
నీతీరునవైతి, యేరి కిష్టుడనో?”యనన్
“భీతిలకుము నా కిష్టుడ
వోతండ్రీ!”యనియె నసురుడొప్పంగ నంతన్.

ఉ. అంతట మధ్యముండు పలలాశను వెంబడిబోవనెంచి ని
శ్చింతత తల్లిదండ్రులకు శీఘ్రమె మ్రొక్కి తదాశిషాళినా
ద్యంతమునొంది రక్కసునియాజ్ఞ దురంతపిపాసదీర్ప త
త్ప్రాంతజలాశయంబునకు బర్వుననేగి బిరానరామిచేన్.

సీ. “ఓమధ్యమా! మధ్యమా! మధ్యమా!” యని గట్టిగా నలిగి రక్కసుడు బిలువ
వ్యాయామముం జేయు వాయుపుత్రుండంత “వచ్చెదో హో”యంచు వచ్చుచుండ
“నే మధ్యముని బిల్వ నీతడెవ్వడొ వచ్చె”నని వెండి “మధ్యమా!”యనె నసురుడు
భీము డంతట“నోయి! నే మధ్యముడ”ననె. మండిపడుచు వాడు “మధ్యముడవె?”

గీ. యనఁ, “నవధ్యులలోన మధ్యముడ, గొప్ప
శక్తులలొ మధ్యముడ, నిల సర్వకార్య
ములలొ మధ్యముడను, పంచభూతములలొ
మధ్యముడ, భ్రాతలలొగూడ మధ్యముండ.”

గీ. ననిన భీముగా నావృద్ధు డట దలంచె;
నంత బ్రాహ్మణమధ్యముం డటకువచ్చె
నతని గొనిపోవుచుండిన యసురుగాంచి
సరవి భీముని వృద్ధుండు శరణుజొచ్చె.

చ. శరణమొసంగి పాలునకు చయ్యన రక్కసు బిల్చి వాని స
ద్వరకులగోత్రకార్యముల తథ్యమెఱింగి హిడింబిపుత్రుగా
నెఱిగియు తన్ను వాకొన “కిదేమిటి బాలు డవధ్యు డేను స
త్వరమునవత్తు” నంచనిన వాయుజుమాటలు నమ్మి బాలునిన్

సీ. విడిచి, “వే నావెనువెంటర” మ్మను పలాశినిగాంచి భీముడు చిఱునగవున
“నతివీర్యబలుని నే ననుసరింప” నటన్న “ననుజూచి నట్లంటి” వనె పలాశి
“నాపుత్రుడవటంచు నయమున బల్కితి” “యేమి? నీకొమరునా యేటిమాట?”
లని కోపమున బల్కె, “జనులు రాజులకు పుత్రులగుట నటులంటి, నలుక యేల?”

గీ. ననియె మారుతి, దానవుండంత "పొల్లు
మాటలింకేల? నాతోడ మరలిరాక
యున్న భయ ముపదేశించుచుంటి" ననుచు
"కాచుకొ" మ్మని తనయుగ్రఖడ్గ మెత్తె.

గీ. "నాదుదక్షిణబాహువే నాకునాయు
ధ"మన, "అరె? నాదుతండ్రికిం దప్ప యిట్టి
పల్కు లేరికిం దగ"దని బహువిధాల
నెంచి కోపాన మిగుల ఘోషించుచుండ.

సీ. "ఎవరయా నీతండ్రి? యెఱిగింపు శక్రుడా? శంభుడా? కృష్ణుడా? శక్తిధరుండ?
యముడా? మరియు వీరి కర్మిలిచుట్టమా? సముడా?" యని పరిహాసమ్మొనర్చి
పలుకుభీమునిజూచి "తులువా! వదరె"దంచు క్రుద్ధుడై యుద్ధసన్నద్ధుడయ్యె
నాతని నెదిరింపనాలస్యమగునంచు దితిజుండు మిగుల ప్రార్థించి భీము

గీ. ఇంటికినితోడుకొనిపోయి హృష్టమతిని
తల్లికిని మ్రొక్కి "అమ్మరో! బల్లిదుడగు
మనుజుదెచ్చితి ర"మ్మన దనుజకాంత
వేడ్కమై నాతనిం జంప వెలికివచ్చె.

ఉ. వచ్చి వృకోదరుంగని గుభాలున తత్పదపద్మయుగ్మ మం
దచ్చపుభక్తి వ్రాలి నయనాంబుజముల్ వికసింప పుత్రుతో
"దెచ్చితినంటి వీతనిన? దైవము నీకును నా"కటంచు వా
క్రుచ్చి "కుమార! నీజనకు కూర్మి పూజలు సల్పు"మంచనెన్.

గీ. దిగ్భ్రమంజెంది కాళ్లపై దిగ్గునబడి
"కరుణ రక్షింపు" మను ఘటోత్కచకుమారు
కౌగిలించి ముద్దాడుచు కౌతుకాన
దీవనలనిడి ప్రణయసందీప్తి మెరయ
వారి వీడ్కొని క్రమ్మఱవచ్చె భీము
డాశ్రమమునకు సంతోష మావహిల్ల.

(ఈఖండకావ్యము భాసమహాకవి నాటకము ననుసరించి వ్రాయబడినది.)

# కృతజ్ఞత

ఆలమూరు రాజగోపాలరావుగారు బి. యె.

౧

ఛీ. దిక్కుమాలిన దేవుడు చావెట్టాడు కాదని తన్ను తిట్టుకుంటూ యెఱ్ఱబాఱిన కళ్లనించి కారే కన్నీళ్ల కాల్వల్ని మాసి చినిగి చీలికలైన కొంగునద్దుకొని, కిందఒలికిపోయినబియ్యం కొంకిసన్నియేరుకొని, అల్లాగే నడవలేక ప్రాణావశిష్టమై ఏహ్యమై శరీరం ఉబికి పగిలి పగుళ్లమ్మట రక్తంచిమ్ముతూన్న తనభర్తను మెల్లిగానడిపించుకుంటూపోయింది. ఆనాడు క్షోణీపాతంలావర్షించింది. రోడ్లు మురుగెత్తిపోయాయి. కాని క్షుద్బాధ. ఆవెఱ్ఱి మరోవీధికి పోయింది. 'అమ్మా! ముష్టెయ్యమ్మా' అని అరిచింది. 'ఏం అమ్మీ! ఆవీధిని గుడ్డాళ్లకి కుంటాళ్లకే సంతర్పణచేస్తున్నారు పోరాదా? లేకపోతే కూలిచేసుకోరాదా?' అని ఆ యింట్లో అబ్బాయన్నాడు. 'నాయనా! వెడితే మమ్మల్ని చూశేవారెవరు? ఇంకా ఉన్న ముష్టాళ్లు మమ్మల్ని తొక్కేశారు. నా బియ్యంఅన్నీ ఒలికిపోయాయి. నాయినా! యిన్నాళ్లు కూలి చేసేవాన్ని. పక్షవాతొచ్చి చెయ్యిపోయింది. అతనికి చెప్పరాని జబ్బు. బాబూ!' అని కన్నీళ్లెట్టుకుంది. 'అన్నయ్యా! చెయ్యిలేదురా పాపం. అతనికి కుష్ఠురోగం. అయ్యో? రక్తంయెల్లాకారుతోందో చూడు' అని లోపలికిపరుగెత్తి వాళ్లమ్మనడిగి ఓపాతగుడ్డ యిన్నిబియ్యంవేసి వాళ్లని పంపేసి 'నారాయణ్ణారాయణా పగవాళ్లకైనా వద్దు బాబూ' అని అనుకుంటూ ఆ అబ్బాయిచెల్లెలు వెళ్లిపోయింది.

తోడిజీవాలికి దూరమై ఆహారానికి పరమశత్రువులై యేచెట్టో పుట్టో నిలవనీడచేసుకున్న ఆ దరిద్ర దంపతుల కానాడు నిజంగా సంక్రాంతి. అప్పటికి పన్నెండుగంటలయింది. జోలెలోబియ్యం చారెడైనాలేవు. ఆ యిద్దరు, వాళ్లనిచూసి ఉమ్మేశేవాళ్లని భరిస్తూ, మూసుమనిపన్న పెడమొహాలతో మొటికేసుకొళ్లల్ని తప్పించుకుంటూ పోయారు. ఆ వూరుబైటున్న వాళ్లచెట్టుకిందకిచేరి ఆ ముష్టిది తనభర్తకింత గంజికాచి కడుపునిండాపోసింది. మరితనకో?......

౨

అది శీతాకాలం. ఒకసాయంత్రం. ఎనిమిదిగంటలయింది. మంచు వర్షంలాకురుస్తోంది. పొగ మొహం మొహం కనపడకుండా కమ్మింది. ధనికులు బలమైన శాలువలుకప్పుకొని కుంపట్లదరినికూర్చొని నిద్రాదేవత సాహ్వానిస్తున్నారు. పగలల్లామేసిన పశుపక్ష్యాదులు సుఖసుషుప్త్యావస్థననుభవిస్తున్నాయి. మనవెఱ్ఱి మూడురాళ్లు పోగుచేసింది. ఇంతకంపయేరింది. పొయిచేసి మంటపెట్టింది. కుండఎక్కించిదించి పట్టెడన్నం అంతగంజి మొగుడికపోసింది. మిగిలినది ఆదొప్పలోనే తనూ ఒంచుకునితాగింది. ఇంతగడ్డితుక్కుమీద ఓచినికిచాప పరిచి కాస్త చలిమంటేసి ఆరోగిని పడుకోపెట్టింది పగిలి, చీమువరదలైన ఆపుళ్లపై యింతమన్నోచిగురాకులో వేసి. అతని బాధమాన్పడమేకద ఆపేనురాలి జీవితాదర్శం. అల్లాగే తనభర్తని చంటిపల్లను పెంచినట్లు పెంచుతూ దినాలు గడిపేది. అతన్నవ్వితే ఆ ఆడదానికి స్వర్గం. అతనికన్నీరు ఆమెకు నరకం. ఆతశ్శాంతికి అతనికి వెఱ్ఱినిద్రపట్టిపోయింది. రాత్రి పదిదాటింది. పన్నెండుదాటింది. కాని వెఱ్ఱికికంట్లో కునుకులేదు. ఎదురుగుండా తనదరిద్రం, పండినపొట్లకాయలాగున్న తనభర్తరోగం, ఆపైన చలిదేవతనిర్దయ ఒఖసారిగా దానికళ్లెదుట గజ్జెకట్టి తాండ

వించాయి. భావిజీవితం వెట్టికి ఉడికిపోతూన్న అగ్నిపర్వతమో, కలగుండుపడిన సముద్రమో లేక పడగవిప్పిన నల్లతాచోలాగ కనబడింది. అల్లాగే గుండె పాషాణం చేసుకుని చలిమంట వేస్తూ చేతులు కాచుకుంటూ చెట్టుకొరిగింది. కళ్లు మూసింది. తియ్యని నిద్ర. హృదయాల్ని పీల్చి పిప్పిచేసే విచారకీటకాలిపై ఒకమాటుగా మోహినీమంత్రం జల్లే నిద్ర. ప్రాణాల్ని వాటి నిత్యజీవితంలో కొంతసేపు వెయ్యంతస్తులపైకెక్కించి మైమరపించే నిద్ర. అయితే ఏం? అరఘంటలో ఘుమ్మన వెట్టి లేచింది. పక్కని చూసుకుంది. ఎక్కడా రక్తం చుక్కైనా లేదు. తనభర్త నిశ్చలనిద్రలో, అర్ధచంద్రకాంతుల్లో ప్రశాంతంగా పాయుతూన్న నిండునదిలా ఉన్నాడు. తనయిల్లు తను సరిదినట్లుగానే ఉంది. కాని హృదయానికి శాంతి కలగలేదు. చలిమంట జోతిచేసి ముఖంపైనున్న దుప్పటీ తొలగించి భర్తను చూసింది. సజీవుడై ఉన్నాడు. కదిపింది. 'అబ్బా' అని మూలుగుతూ పడుకొన్నాడు. తనభర్తనెవ్వరు చంపలేదని గ్రహించింది. తానున్నది తనచెట్టునీడే అని తెలుసుకుంది. కాని వెట్టి తలకాయో కాళ్లు చేసుకుంది, శరీరాన్ని స్పృశించుకుంది. భర్తతో ముష్టివాళ్ల సంతర్పణలోకెళ్లింది. పైగా తనభర్తను వాళ్లు తొక్కటం అతను రక్తమయమై పోవటం చూసింది.

## ౩

చలించి చితికిన హృదయానికి, భయపూరితమైన మనస్సుకూ, చీమచిటుక్కుమన్నా యుగాంతమే. వెట్టికి తనభర్తనిద్ర విషప్రాయమైపోయింది. అర్ధరాత్రి, కారుచీకటి, నిర్మానుష్యప్రదేశం, మౌనాకృతి వహించిన ప్రకృతి. ఇహ అక్కడది కెవ్వరు? చెట్టుమీద నిద్రించే పక్షులే తనతోడునీడనుకుంది. దూరాన్ని ఆ విశాల ఆకాశంమీద మిలమిల్లాడే నక్షత్రాలే తల్లిదండ్రులనుకుంటూ, వెయ్యి మొక్కులు మొక్కుకొని, తూర్పు రేఖలికెదురుచూస్తూ రాయిలా కూచుంది. కొంతసేపయింది. చలిమంట మెల్లిగా కునికింది. ఇంతలో కసి ఓ పుల్లతో ఆ నిప్పటూ యిటూ తోసింది. 'కెవ్వు' మని కేక వినపడిందేదో. వెట్టికి గుండె ఎగిరిపోయింది. త్రుళ్లిపడి లేచింది. రాత్రి మంచుకి తడిసి ఒళ్లంతా చిముతో దుర్గంధమయమై చలి భరించలేక ఎప్పుడో వచ్చి ఆ ఆరిపోతూన్న చలిమంట దగ్గర పడుకుంది అదో చిక్కిశల్యమైన ఓ చిన్నికుక్కపిల్ల. అది తన్ను రక్షించవచ్చిన దేవుడో దెయ్యమో అన్నట్లు దాన్ని వెట్టి ఒళ్లోకి తీసుకుంది. కొంగెట్టి దాని శరీరమంతా తుడిచింది. ఆ కుక్కపిల్ల భయంతో కూనైపోయి వెట్టి ఒళ్లో దూరి దాక్కుంది. ఆ ముసిలిదానికి జాలి కలిగింది. కుండడుగున మిగిలిన గంజి కాస్త వెచ్చపెట్టి ఆ కుక్కకోసింది. ఆత్రుతతో డొక్క లెగరేస్తూ ఒకనిమషంలో అది ఆగంజి తాగేసింది. తోకెత్తుకు పరుగెత్తుతూ ఒళ్లో దూరుతూ మొఱుగుతూ కఱవబోతూ రకరకాలగా ఆడుతూన్న ఆ కుక్కపిల్లని చూచుకుని ఎన్నాళ్లకో కన్నకొడుకుని చూచుకున్నట్లు ఆ తల్లి తన్ను తాను మఱిచిపోయింది.

## ౪

కూటికోసం కోటివిద్యలు. పక్షవాతం. కుష్ఠుజబ్బు. ఇహ కూలీనాలీ వాళ్లకి దూరం. మిగిలిందిక ఎక్కేగుమ్మం దిగేగుమ్మం. అదైనా చేతిలోపని కాదు. దానిక్కూడా కొంత ప్రతిభ కావాలి. అధ్యాత్మ రామాయణమో, తంబురాకొయ్యో, గుమ్మిడికాయ చెంబో, పొగడటంలో నేర్పో, ఏదీ కాకపోతే ఏ ఏడుకొండలవాడో అవసరం కదా. ఇవియేవీ చేతకాని ఆ కుంటిదానికి ఆ జబ్బుమనిషికి దినం గడవటం కష్టమనిపించక మానలేదు. పైగా ఒకటికి రెండు జోడు. ఆ కుక్కపిల్లొకటి. అయితే ఆ ముష్టిదానికి ఆ వీరముష్టి బరువుగా లేదు. తానైనా గంజిమాని ఆ కుక్కకు పోసేది. అదే తనకొడుకు, తన ఆనందం, తనజీవితఫలం అనుకుంది. బంతీ, బంతీ అంటూ ఆ కుక్క ఒకనిమషం లేకపోతే వెట్టి వెఱ్ఱెత్తినట్టు తిరిగేది. అది లేకపోతే వెట్టికి అన్నం సయించేది కాదు. అది నిద్రపోతే నే కాని తను పడుకునేది కాదు. వెట్టిభర్తకూడా ద్విగుణించిన ప్రేమతో తనగుడ్డలన్నీ బంతీకి కప్పుతూ తనకి ఊసు

పోకపోతే బంతినెత్తుకు ఆడిస్తూ తనపక్కలో పడుకోపెట్టుకొని తన శరీరందానికప్పగించి దానిమీద యీగ వాలనిచ్చేవాడుకాదు. బంతికూడా అల్లాగే వాళ్లతోపాటు కలో గంజో తాగుతూ వాళ్లకుండకికాపలా కాస్తూ కాకులు కుక్కలు రాకుండాకాపాడేది. ఆమొగుడూపెళ్లాం బంతికి కఱ్ఱపట్రావటం, లాంతరు మొయ్యటం, నీళ్లలోపడేసినవస్తువులు మునిగితియ్యటం, బండిలాగటం నేర్పేరు. బంతి వీధిలో ఓపక్కని లాంతరు, ఇంకోపక్కనిజోలీ కట్టినకఱ్ఱ నోటితో పట్టుకొస్తూంటేయింటింటివాళ్లు ఆతమాషాచూచి బియ్యం వేసేవారు. రాను రాను "అదిగో వెఱ్ఱివస్తోంది. అన్నంతినకపోతే యెత్తుకుపోతుంది" అని తల్లులు పిల్లల్ని దడిపించుడం పోయి "వెఱ్ఱీ! మా అబ్బాయి అన్నంతింటే కుక్క నాడిస్తావుకాదూ" అంటూ యిన్నిన్ని బియ్యంవేసి ఆబంతిఆటలు పిల్లల్తోటిబాటు వాళ్లూ చూస్తూ ఆనందిస్తూఉండేవారు. దానివల్ల ఆ బీద కుటుంబానికింత అన్నం శరీరం దాచుకునేందుకు కాస్తబట్టాదొరికేది. కొన్నాళ్లయేటప్పటికి వాళ్లున్నచెట్టుకింద రాటపాతుకొని రెండాకులుకప్పుకొని ఓ మేడకట్టుకున్నారు. ఇంకోసంవత్సరంలో వాళ్లదరిద్రంపోయి యెక్కడన్నాస్థిరంగా నివాసమేర్పరచుకొని ముష్టిమాని యేపంచనో ఓపళ్లదుకాణమో ఏదోవేసుకొని రోజుగడపుకోడానికి గాలిలో మేడలు కడుతూండేవారు.

౫

వేసవి. నిప్పుచెరుగుతూంది ఘూళుపు ఓచంపనికొడితే ఓచంపని అగ్నికణాలురాల్తున్నాయి. పక్షులు నీళ్లులేక కూలిపోతున్నాయి. ప్రపంచం ఉడుకెత్తిపోయింది. ఆదరిద్రులికి ఆపన్నశాలలోకాపరం దుర్భరమయిపోయింది. వడగాలికిభరించలేక ఊరుబైటున్న ఓపాడుదేవాలయంలోకిపోయి దేశంచల్లబడినతర్వాత తిరిగిరావచ్చునని వాళ్లనుకున్నారు. సాయంత్రం పెందలకడే భోంచేసి ఆముగ్గురుమెల్లిగా తమసామానంతా ఓగుడ్డలోమూటకట్టుకుని బయల్దేరారు. పుచ్చపువ్వులాటి చందమామ ప్రపంచాన్ని పాలలోముంచేశాడు. వీధిలో వచ్చేపోయేబళ్లకు దడిసి ఆ ముగ్గురూ మెల్లిగా రోడ్డుపక్కనే జనాన్ని తప్పించుకుంటూపోతున్నారు. చటుక్కున వెఱ్ఱి గుండెకొట్టుకుంది. కళ్లు చెఱువులైపోయాయి. దీర్ఘంగా శ్వాసవచ్చింది. ఆప్రదేశమంతా అగ్నిమయంగా కనిపించింది. తనముందగ్ని జ్వాలలుట్టిపడుతూన్నట్టు అనిపించింది. ఆనాడుతాను కల్లోచూసిన చోటు. భర్తరక్తమయమైనప్రదేశం. మనస్సు పరిపరివిధాలపోతుంది. 'ఢాం' అని చప్పుడయింది. అంతా దుమ్ముమయం. లబలబలాడుతూ చేపలా రక్తంలో దొర్లిపోతున్నాడు భర్త. పదడుగుల్లో గోడకితగిలి కృష్ణదాసు మోటారుబైసికిల్ పడిపోయింది. బంతీ అతని జబ్బపట్టుకు గురకెడుతోంది. పోలీసు వచ్చేడు. లాఠీకఱ్ఱతో బంతిని ఒఖదెబ్బతీశాడు. వెఱ్ఱి నేలకూలిపోయింది.

౬

డబ్బుకీ చట్టాలకీ దూరం. ఎంతకఠినచట్టాలైనా ఆదేవత ఎల్లాచెపితే అల్లావింటాయి. తాగుడు, వ్యభిచారం, కూనీ దానిపట్ల సద్గుణాలయిపోతాయి. ఇంక జమీందారైన కృష్ణదాసు కేంలోటు? తాను నిర్దోషిననీ, తాగలేదనీ, మోటారుసైకిలుమీదతాను వెడుతూంటే ఆముసలాడే ఖంగారుపడి సైకిలికడ్డంగాపడ్డాడని, పైగా ఆ ముసలిది కుక్కనిసూ్కకలిపిందని వాఙ్మూలంయిచ్చేడు. ఊళ్లో ఆనాడప్పుడక్కడున్నవాళ్లూ లేనివాళ్లూకూడా అల్లాగే సాక్ష్యంచెప్పేరు. సరే. ఇహనేంకావాలి? ఆవృద్ధుడిచావు ప్రత్యక్షప్రమాదము (clear accident) అన్నారు. కృష్ణదాసు నిర్దోషి అన్నారు. డబ్బులేని ఆదరిద్రురాలు కుక్క నిసూ్క కొలపటం తప్పన్నారు. వెఱ్ఱికి ఒకసంవత్సరం కఠినవఱకం అన్నారు.

౭

జైలులోజీవనం కొందఱికి చాలాసుఖమే. కొందఱికిమాత్రం మరణతుల్యం. వెఱ్ఱికో రెండూ లేదు. పనిచెపితేనవ్వేది, కొడితేనవ్వేది, అన్నంపెడితే మెతుకులు లెఖ్ఖపెట్టేది, గోడల్తో గహస్యాలుచెప్పేది, కాకుల్తో పోట్లాడేది, వెఱ్ఱిపాటలు పాడేది, వెఱ్ఱిమాటలు మాట్లాడేది. పైఅధికారులు చూశారు. ఇంకాపదిరోజులు చూశారు. నిజమేనన్నారు. వెఱ్ఱిని జైల్లోంచిపొమ్మన్నారు. ఓవరకు జైలులోంచి గెంటేరు.

౮

వెఱ్ఱి వీధివీధితిరిగేది. బంతీఅనియేడిచేది. ఎవళ్లేనా అన్నంపెడితే కుక్కకేసేది. రాత్రిళ్లు బంతీఅని కేకవేస్తూ తిరిగేది. శరీరం అస్తిచర్మమయం అయిపోయింది. ఓనాడు ఓకుక్క, పిల్లలు కనబడ్డాయి. కుక్కపిల్ల నెత్తుకొచ్చింది. కుక్కతరుముకొచ్చింది. కాని వెఱ్ఱిపిల్ల నివ్వలేదు. అదిచూసినవాళ్లు కుక్కను కొట్టితరవేశారు. వెఱ్ఱికి పిచ్చెక్కువై పోయిందని విచారించేరు.

వెఱ్ఱిఆకుక్కపిల్ల నెత్తుకునేది. ముద్దెట్టుకునేది. ఆడించేది. దాని మెడనిండా పువ్వులుకట్టేది. దానికిగుళ్లుగోపురాలుకట్టేది. పాలు లేనిపసికూన పదిరోజుల్లో చచ్చిపోయింది. వెఱ్ఱిమాత్రం దానికళేబరంవిడవలేదు. దుర్గంధం భరించింది. ఆ ఎముకలపోగు పట్టుకుతిరిగేది. ఓనాడు తనున్న చెట్టుదగ్గరి కొచ్చింది. తనయిల్లు నేలకూలి చీకిపోతూండటం చూసింది. ఘొల్లున ఏడిచింది. ఆఎముక లక్కడపడేసింది. కళ్లెఱ్ఱజేసింది. నిప్పెట్టి ఆపాకంటించింది. నాలుకలు సాచుకుంటూ తనమీదకొస్తూన్న అగ్నిజ్వాలలుచూసింది. ఇల్లు మసైపోయింది. పకపకనవ్వింది. గమ్మున వెనక్కితిరిగింది. వెళ్లిపోయింది.

౯

వెఱ్ఱి. ఓనాటిప్రొద్దున్న. శరీరంతూలిపోతూంది. ఊరి కుత్తరంగాపడిపోతూంది. తల జడలుకట్టిపోయింది. దీనంగా ఏడిచింది. బంతీఅని ఏడిచింది. నడుంవిరిగి, శల్యాలపోగై మరణోన్ముఖమైన బంతీకాళ్లకు చుట్టేసింది. గొల్లునేడిచింది. వెఱ్ఱి నిద్ర మేలుకుంది. తనబంతీని చూసుకుంది. మనసార కౌగలించుకుంది. కాళ్లకింద చూసుకుంది. తనభర్తని పాతినదిబ్బని గ్రహించింది. విఱిగినచెట్టులా నేలకూలింది. ఇంతవరకూ ఆదిబ్బకాస్తూన్న బంతీ కన్నీళ్లతో తల్లిదండ్రులకు తిలోదకములు విడిచి వెఱ్ఱిగుండెలమీద తలపెట్టుకప్రాణాలు విడిచింది.

# అరుంధతి

ఓలేటి సీతారామమూర్తిగారు

ఆమె యేదివ్యసల్లలితాంగియొ యిడు
పూతనీరాజనజ్యోతిభాతి చదల
వెలుఁగుచును దిరజల్లు క్రొందళుకులందుఁ
బావనత్వము లలిజాలువాఱుచుండు.
లేమనవ్విన నవ్వుల రేకలందుఁ
గలికిపలుచిన నవ్యదృగ్వల్లులందు
భామనుడివిన జిలిబిలి పలుకులందు
పారిపొంగుఁ బాతివ్రత్య వలపుటలలె!
గగనముననుండి యప్పుణ్యకాంతవల్కు
శోభనాక్షతలను జల్లుచుండి ప్రీతి

"నిత్యమాంధ్రకుమాజననీగృహములఁ
గలసతులు సాధ్వులౌదురుగాక" యనుచు.
"ఓయరుంధతీ! పావనజ్యోతి! నీ య
మేయపూతవర్చస్సులఁ బాయకెపుడు
బరపి మాపయి మాంగళ్యభాగ్య మొసఁగు"
మనుచుఁ బూజింతు రంగన లామె భక్తి.
కన్యకకుఁ దప్పక వివాహకాలమందు
నాయరుంధతిఁ జూపింతురార్యజనులు.
ఆమెవలె నామెయునుగూడ నైదువతన
మునఁ బ్రవర్తిల్లు సతతంబు ననెడియాశ.




డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

## కాసములకు

ధనియాలు, శర్కర వీనిని బియ్యపుకడుగుతో ఇచ్చిన కాసములు నివర్తించును.

*　　*　　*　　*　　*

కర్పూరవల్లిఆకు వెచ్చచేసి శిరసుమీద నుంచిన శిశువుల కఫము హరించును.

*　　*　　*　　*　　*

నల్లజీలకర్రను స్తన్యముతోగాని కర్పూరవల్లి స్వరసముతోగాని నూరి తలపైన పట్టువేసిన శిశువు కఫము, కఫజ్వరము హరించును.

*　　*　　*　　*　　*

యవక్షారము, అతివస, కర్కాటకశృంగి, పిప్పళ్లు, పుష్కరమూలము వీనిని చూర్ణముగావించి అందు తేనెగలిపి శిశువులకొసంగిన వారికిగల పంచకాసములు నశించును.

## అజీర్ణము

ఓమమురసము బిడ్డల అజీర్ణము, నీళ్లవిరేచనములు వీనిని కట్టును. (ఓమమునీళ్లు చిన్నబిడ్డలకు తులమెత్తు లేక తులమున్నర యివ్వవలెను.)

*　　*　　*　　*　　*

నేలవెలగచెట్టుఆకు రసము బిడ్డల అజీర్ణవిరేచనములు కట్టును.

*　　*　　*　　*　　*

పిన్నసదాపచూర్ణము బిడ్డల అజీర్ణము కడుపునొప్పి వీనిని హరించును.

*　　*　　*　　*　　*

బొక్కెనచెట్టు ఆకును వెచ్చజేసి తీసిన తేలికకషాయము ఇచ్చిన బిడ్డల అజీర్ణమును పోగొట్టును.

*　　*　　*　　*　　*

మునగచెట్టు. దీనిరసములో కొద్దిగ ఉప్పు కలిపి యిచ్చినబిడ్డల అజీర్ణము హరించును.

# నవ్వు తాలు

తాతకృష్ణమూర్తిగారు బి. యే; యల్. టి.

## లెక్కలు

ప్రైవేటు మాస్టరు—ఆలెఖ్క చెయ్యడానికి యింతగింజుకుంటున్నావేమి? చంటిపిల్లడికిస్తే అది సుళువుగా చేస్తాడు.

విద్యార్థి—అవునండి. చంటిపిల్లడుగా వున్నప్పుడు నేనూ చేసేవాడిని కాబోలండి యిలాటిలెఖ్కలు. ఇప్పుడు మరి, మీరూ చంటిపిల్లలు కారు—నేనూ కాను.

## సత్ప్రవర్తన

పరాయివాళ్లయింటికి వెళ్లినప్పుడు బుద్ధిగా నడుచుకునే విధం యేమిటో బోధపరుస్తూ తల్లి తనచిన్న కొడుకుతో "వాళ్లయింట తినుబడివస్తువులు యేమైనా చూసినా యిమ్మని యేడవకూడదు. వాళ్ల పిల్లల చేతుల్లో యేమైనా ఆటవస్తువులు వుంటే 'అమ్మా! నాకు అలాటివి కొనవూ?' అని నన్ను చికాకుపెట్ట కూడదు." అని చెప్పింది.

"అలాగేలే. తెలిసింది. నాకు కావలసినవస్తువ యేదిచూసినా వాళ్లని యిమ్మనిఅడగను; యేడవను; నీతో చెప్పను. సరేనా?—గప్‌చుప్‌గా వెంటనే లాక్కుంటాను."

## ఔషధప్రభావము

రోగివొంట్లో బాగాస్వస్థతగా వుండడం కనిపెట్టి, సంతోషించి డాక్టరు చిరునవ్వుతో "ఏం? నింపాదిగావున్నదా యీవాళ?" అని అడిగినాడు.

"మీకు పంపిన మందుసీసామీద వ్రాసివున్న ప్రకారం మూడేసి గంటల కొకసారి, ఔషధంపుచ్చు కున్నారుకదూ? వైద్యుడు చెప్పినట్లు తిన్నగా రోగి నడుచుకుంటే నిజంగా మందులు మాట్లాడగలవు! ఒక్కరోజులో మీకెంత గుణం కనిపించిందో చూడండి మరి?"

"సరిగా ఆ మందుసీసామీద వ్రాసివున్న ప్రకారమే చేశానండి. 'బిరడా ఊడతీయవద్దు.' అని స్పష్టంగా దానిమీద వ్రాసివున్నది."

## దయాళుడు

ఖైదీ—దిక్కులేనిపక్షిని మహారాజా! అన్యాయంగా నామీద ఈకేసు వచ్చింది. మీరే రక్షించాలి. నాకు తినిందికి తిండిలేదు; వుండిందికి యిల్లులేదు; మాట్లాడిందికైనా నాఅన్నబంధువుకాని, స్నేహితుడుకాని లేదు.

జడ్జీ—పాపం, నీహీనస్థితికి నాకు చాలావిచారంగా వుంది. ఈకేసులో సాక్షులు చెప్పినదాన్నిబట్టి నీమీద

నేరం యేమీ స్థిరపడలేదు. కాబట్టి, ఒకయేడుమాత్రం జెయిల్లో వుండడానికి నీకు శిక్ష వేస్తున్నాను. ఇల్లు, తిండి, బట్ట, స్నేహితులు—అన్నిలోపాలు తీరుతవి.

### ఉభయకళాప్రవీణత

"మావాడికి చిత్రలేఖనంలోనూ, కవిత్వంలోనూ కూడా సమానమైన అభిలాష ఉన్నదండి. ఏదో ఒక్కటి బాగాకృషిచేస్తే మంచిదేమో? ఈ రెండింట్లో మా వాడు యేదిఅభ్యసిస్తే బాగారాణిస్తుందని మీ అభిప్రాయం?"

"చిత్రలేఖనమే మేలని తోస్తుంది."

"కారణం? మీరు వాడి బొమ్మలేవైనా లోగడచూశారా యేమిటి?"

"లేదు. కాని, యీమధ్య యేదో పత్రికలో మీవాడిపేరుతోవున్న పద్యాలేవో చూశాను."

### చిత్రమైన జంతువు

రాత్రిపాఠశాల మాస్టరు—పెంటయ్యా! దీనికి తాత్పర్యంచెప్పరా:

"....................

తలతోక యనకయుండును

ఖలునకు విషమెల్లయడల గదరా సుమతీ?"

పెంటయ్య—'ఖలునకు' అనగా 'ఖలున' అనేజంతువుకు 'తలతోక యెనక యుండును' అంటే తలకాయి తోక యెనకాల ఉంటాదటండి!

### వచనము

ఉపాధ్యాయుడు—'ఒకవస్తువుం దెలుపు పదము ఏకవచనము; పెక్కువస్తువులం దెలుపు పదము బహువచనము.' ఉదాహరణము లియ్యగలవా?

విద్యార్థి—'ఒకటి' అను పదము ఏకవచనము. 'సేన, మంద' ఇట్టివి బహువచనములు.

### మరణశిక్ష

మాజిస్ట్రేటు—ఇదివరలో నీకు యెప్పుడైనా శిక్షపడివుండెనా?

సాక్షి—లేదు బాబయ్యా! కాని నేను చిన్నపిల్లడుగా వున్నప్పుడు నాకోసారి మరణశిక్ష తప్పిపోయిందట!

మాజిస్ట్రేటు—అంతచిన్నప్పుడు నువ్వుచేసిన నేరం యేమిటి?

సాక్షి—నేనేమీ నేరం చెయ్యలేదండి. జ్వరంతగిలి నేను బాధపడుతూవుంటే మావాళ్లుడాక్టరుగారిని తీసుకొచ్చేరు. ఆయన నానాడీ, అవీ చూసి "లాభంలేదు. న్యూమోనియా! ఇప్పటిస్థితిని పట్టిచూస్తే బాలుడు యింకొక పదిపన్నెండు గంటలలో మరణించక తీరదు." అనిచెప్పి ఔషధం యిచ్చి వెళ్లిపోయినాడు. భయపడి మావాళ్లు ఆమందు నాకు పొయ్యలేదట!

### వ్రాతపని

"మావాడికి దేనికీ తీరుబడి లేకుండావున్నది. వ్రాతపని రోజుకు రోజుకూ లావైపోతుంది."

"కవిత్వం చెప్పగలడా, యేమిటి? నవలలు రాస్తాడా, నాటకాలా, అండీ?"

"దస్తావేజులు! సబ్ రెజిస్ట్రారు కచేరిలో గుమాస్తాగా ఉన్నాడు కదండీ, మరి."

# ధైర్యవతి

పెమ్మరాజు రాజగోపాలము గారు బి. యే. (సారస్వత సమాజము

౧

శ్రీనాథుకృతికెక్కి చెలువొందునేది,
వీరాళిరుధిరంబు ధారగాబాఱి
చందనమటు మైనలందుకొనె నేది,
శౌర్యదేవత కేది జన్మస్థలంబు,
బ్రహ్మనాయుడు నేది పాలింపనలరె,
బాలచంద్రునివంటి బలువీరవరుడు
ప్రభవించుటను నేది పావనంబయ్యె,
ఆంధ్రమాతకు నేది యలరుభూషణము,
అటువంటి పల్నాడు నందొక్కపల్లె
భాసిల్లు విక్రమవల్లిచే మిగుల.

౨

ఆపల్లె నొకరాత్రి అత్యద్భుతంబు;
అది స్వర్ణశీర్షిక యగు వీరచరిత--
కవిలేఖినినిఅద్ది కదలింపజాలు,
పూరుషావళినద్ది పులకింపగలుగు,
కాంతలెల్లర నద్ది గర్వింపజేయు,
కాలవాహిని నద్ది కలియకేనలచె,
నమృతత్వమదిపొంది యవనిలోపలను
నమ్మనెంచిన మీరు నమ్మకుండినను
జరిగెనొక్కటి దాని సంతుష్టి వ్రాతు
నిజమటంచును నేను నెఱనమ్మియుంట.

౩

క్రమ్మె చీకటి మెల్లగను గ్రామమెల్ల;
జరుగనుండినదాని కురుసహాయముగ
బారుబారులుదీఱె బలుచుక్కలారాత్రి
భావిదృశ్యముగాంచ భావాలుమించ
అంతలోపలనయ్యె నర్ధరాత్రంబు.
ఊరిలోవారెల్ల నుత్సాహమొప్ప
నొక్కరిద్దరినింట నుంచుచు వేడ్క
బొమ్మలాటనుజూడ బోయిరయ్యెడను.

౪

అప్పుడు నాయూర నానందమొదవ
నొకరాచవారింట నొకక్షత్రియసతి
బాలింతరాలెద పసికందుజేర్చి
బుజ్జగించుచు నెన్నొ ముద్దులనిడుచు
భావిభాగ్యములెన్నొ పరిగణించుచును
అర్థములేకున్న నత్యాదరమున
నేమొ మొభాషించు చెంతెంతొ సపు
గృహములో నెవ్వారు లేకున్ననాను
బుడతతో నిశియిట్లు గడుపుచునుండె.

౫

అంత నార్గురుదొంగ లాయింటనాపు
కన్నంబుగావించి కలధనంబెల్ల

దోచుకుపోవంగ జూచుచెంతేని
శ్రమజెంది వీర్లామి సకలయత్నముల
జేయుచుండినదారి చేకూఱకుండె.
ఆకోటవలెనున్న నాయింటవారు
కన్నంబుగావింప కష్టంబటంచు
నెట్టకేలకుదారి నీక్షించి రదియు
మండువాగొట్టాని పట్టియొక్కొకరు
దిగి లోనజొఱబారు తెగువ బూనుటయె.

౬

పాలిచ్చినిసువుకి బాలెంతరాలు
జోలపాటలపాడి జోకొట్టుచుండ
నలుకుడునేదియో ఆలించెదాని
పరిశీలనముజేయు భావంబుతోడ
నిద్రబోయెడుపిల్ల నెమ్మదివీడి
చూఱవతో మండువా జొచ్చెయాపైన
బ్రాకుచుదిగుచున్న బల్లాంగగనియె.
ఆపరివర్తనం బదియేమొ కాని
మెఱుపుతళ్కునబోలె మెఱసి యాయువతి
అరిగె ఊవ్వనలోని కదియక్కజంబు.

౭

దొంగయు నేలపై దుమికినంతటనె
శరవేగమునవచ్చి క్షత్రియకాంత
కత్తితో నవ్వానికంఠంబు ద్రుంచె
నెత్తురెల్లెడజింద మిత్తిరౌద్రమున.
పైవార లీరీతి పరికింపలేక
వారెల్లరనుకొన్న తీరుగానపుడు
నొక్కరివెంబడి నొకడుగా దిగగ
రెండవచోరుండు మొండిధైర్యమున
కాలాహిసర్పంబు కాలునదన్ను
నెకలి నాక్రిందకు వ్రేలాడసాగె.

౮

పైకెత్తియున్నట్టి పటుఖడ్గమొకట
కప్పనొక్కటిబట్టి కబళింపగాను
జూచుచుపడగెత్తు త్రాచుగాతోప
ఇంకొకహస్తంబు నెత్తియూతనుగ
ఒక్కపాదముమండు నుద్రేకమొప్ప
సాచి రెండవదంత నాచివెన్కగను
చీర నంతట నెత్రు చిందంగసాగ
ధైర్యదేవత మేను దాల్చెనోయనగ
వీర మోహినినృత్యవిక్రమమనగ
నుఱుకు వానినిద్రుంప నుండెనచ్చటనె.

౯

ఉఱికె నొక్కడు వాని నఱికెచివ్వనను;
పడియెమూడవవాడు వధియించెవాని;
కూలెనాల్గవవాడు కొట్టెరెండింటిగ
అట్టులేక్రమముగా నందఱజంపి
ఘోరరూపముతోడ ధీరురాలామె
రక్తహస్తముతోడ రక్తాంగియగుచు
చండికకంటెను సాహసంబూని
జనవధాదాహంబు గను మారివోలె
వ్రాలునేమోదొంగ వ్రాలునాక్షణమె
చీల్చివైవగనుండె సిద్ధమైయచటె.

౧౦

ఒక్కరి గతి మరియొక రెఱుంగకను
దిగిగొట్టముననుండి తెగిరిచోరులును
ఒక్కడుమిగులక నక్కడాకరణి.

కానియయ్యెడల నాకాంతామతల్లి
యడుగునై ననుదీయ కట్టులే నిలచె
చెక్కడంబునఁబోలె నిశ్చేష్టయగుచు
నెత్తియుంచినకత్తి నెత్తియేపట్టి
పైనిగిడ్చినచూపు పైననేనిలపి
యింకవత్తురయేని ద్రుగింపదలచి.

౧౧

ఆదిశక్తియెకాని అదికాంతకాదు
మృత్యుదేవతకాని మెలతకాదామె
నాశయంత్రముకాని నాతికాదింక
ప్రళయచిహ్నముదాల్చె లలితరూపంబు
క్రూరఖడ్గముబూనె కోమలకరము
విమలసౌందర్యంబు వీరత్వమొందె
లావణ్యపుంజంబు రక్తంబుచిందె.

౧౨

ఎదుటగాబడువార లింకెందరైన
నాకొన్నఖడ్గంబు కాహారమొసగ
వేచియుండెనునామె వికృతాంగియగుచు;
ఉయ్యెలలోబిడ్డ యూహయేలేదు
పరిసరింబొక్కింత పరికింపదాయె
ఎన్నిగంటలునేగె నెన్నదొక్కింత
ఎంతటిరౌద్రంబొ యెన్నంగలేము
ఎంతటిధైర్యంబొ యెఱుగంగలేము
ఎట్టులశమియించు నెంతసేపటికొ
సమయసాహసమన్న చానదేయగును.

౧౩

తెల్లవాఱగజొచ్చె దిక్తటాంతముల
అంగనాసచ్ఛౌర్యయశవల్లినింపె
దనరారదొడగిన ధావళ్యకాంతి.
బొమ్మలాటయునంత ముగియంగనుండె.
విసువుటకొందరు ప్రేక్షకులపుడు
నేగుచుండిరెల్ల నిండ్లలోగూర్క
కోడలివిడియత్త కొడుకుతోవచ్చి
యాసక్తికూర్చున్న దప్పటిదాక
తెల్లవారుటగాంచి తీవ్రంబుజెంది;
క్షత్రియసుతుతోడ సాగె నాయమయు.

౧౪

ఇంటిగుమ్మముజేరి యెంతేనివడిని
తలుపుతలుపనుచు పిలచెనాతండు
మొద్దునిద్దరయందు మొఱవెట్టెనత్త
ఎంతయార్చిననేమి యెవ్వారాతలుపు
తీయరైరి స్నుష జాబీయనేలేదు
అందుచేక్షత్రియుం డనుమానమొంది
తలుపురంధ్రమునుండి తిలకింపనచట
కాగడావలెనుండె కాలుదీపంబు
కాళరాత్రియువోలె ఖడ్గంబునెత్తి
నెత్తురుమేనితో నిలచుండెసతియు.

౧౫

అదిచూచిభయమొంది యాశ్చర్యపడుచు
తల్లితోచెప్పియంతయునుజూపించె
ఆగంద్రగోళంబు నాలించియపుడు
నిరుగుపొరుగువార లేతెంచిరటకు
సాహసంబునజేసి జనులందరపుడు
నురుకవాటమునూడ్చి జొఱబాఱిరిల్లు;

ఎంతచప్పుడుచేసి యేమిజేసినను
కదలదుమెదలదు కాంతచిత్రంబు
ఆగొట్ట మందుండె నామెవీక్షణము.

౧౬

ఈసంకులముజూచి యేడ్వంగసాగె
పండుకొన్నట్టి యాపసికూనలేచి.
ఎట్టకేలకువార లెంతొయోచించి
యెదుటికేగగరాదు యీలాటిశఠిని
చేతిలోనటుకత్తి చెలగుచునుండ ;
కావున చాటుగా కత్తిలాగుటయె
చాలమంచిదటంచు చర్చించిరపుడు;
ఎవ్వరులాగెద రీకత్తియన్న
చెప్పువారలెకాని చేయలేరెవరు.

౧౭

క్షత్రియసతిభర్త స్వాంతంబులోన
చచ్చినచోరుల శవములజూడ
నేడ్చుచుండినపిల్ల నీక్షించుచుండ
కాళికవలెనున్న కాంతనుజూడ
నెట్టులోతీవ్రంబు నెగయుచువచ్చె-
అందుపై సతిజేరి యాకత్తినిటులె
వెనుకతట్టునబట్టి వింతగానపుడు
తల్లిని జలమింత జల్లవేయునియె,
తెప్పపాటుననిట్టి కృత్యంబుజరిగె
ముదిత యాసంస్పర్శ మూర్ఛిల్లెనొకట.

౧౮

వగచుచుండినబిడ్డ వడినెత్తెనొకరు
యింటిలోజొఱబడ్డ యీదొంగలకిది
శాస్తియనుచును బ్రశంసించిరొకరు;
రాచపౌరుషమిట్లు రంజిల్లెననుచు
మీసంబువడివ్రేసె మేటియింకొకడు
మనకాంతలిటువంటి పనులెన్నొ మునుపు
చేసియుండిరటంచు చెప్పెమరొకడు;
బాలెంతరాలను బడవైచియింట
నేగినారనితిట్టె వృద్ధుడింకొకడు.

౧౯

కాలంబు వ్యర్థంబు గావింపకటుల
నొకపాన్పుపయిజేర్చి యొయ్యారినతడు
వీవనతోమెల్ల విసరంగసాగ
కనుదమ్ములనువిచ్చె కలగాంచినటుల
"దొంగలెల్లరుగూడ ద్రుంగిరా"యనుచు
జిఱుసిగ్గువిభ్రమ చెలగంగనడిగె
"నీవిక్రమంబట్లు నెగడంగవారు
తెగిపోవకను నెట్లు మిగిలెద"రనుచు
ముంగురుల్సవరించె ముదమొందిభర్త;
మరలకన్నులమూసె మగువ సంభ్రమను.



# భోజన పదార్థములు

## II

విడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి. యె. (సారస్వతసమాజము)

### ప్రాణకృత్తులు

మనము భుజించు పదార్థములలో దేహము నిర్మాణమున కవసరములగు పదార్థములేగాక నిర్మాతలుకూడ నున్నవని క్రిందటిభాగమున నుడివియున్నాను. వీనియొక్కి మీకెట్లు తెలిసినదని చదువరులడుగవచ్చును. ఇవి కంటి కగుపించవు. ఇంతవరకును ఏ శాస్త్రజ్ఞుడుగాని వీనిని ప్రత్యేకముగా విడదీసి వాని గుణవర్ణనమును జేసియుండలేదు. కాని కొన్ని ప్రయోగములవలన వీనియునికిని సంశయదూరముగ జేసినారు. అట్టి ప్రయోగముల నొకటిరెంటి నీక్రిందవివరింతును.

పావురములు గింజలను తిని బ్రతుకును. పెంపుడుపావురములకు వడ్లగింజలను చల్లినచో నవి వానిని కొరికి, పైనున్న ఊకను వదలి లోని బియ్యపుగింజను తినును. ఇవి తిను బియ్యపుగింజలకు తవుడు ఉన్నది. మరబియ్యమునకు తవుండదు. అందుచేతనే అవి తెల్లగనుండును. ఆ తెల్లనిబియ్యమునుమాత్రమే ఆ పెంపుడుపావురముల కిడినచో అవి వానిని తినును. కాని కాలక్రమమున క్షీణించి ఆరోగ్యమును గోల్పోవును. అట్టివానికి తవుడుతో కలిపినగింజలను పెట్టినట్లయినా ఆరోగ్యమును తిరిగి పొందును. కాని ఆ తవుడును వేయించిపెట్టినచో నా పావురములు పునరారోగ్యమును పొందజాలవు.

ఈప్రయోగమువలన తేలిన యంశములు :—

i చేబియ్యము ఆరోగ్యకరము.

ii తెల్లబియ్యము అనారోగ్యకరము.

iii తవుడుతో కలిసిన తెల్లబియ్యము ఆరోగ్యకరము.

iv వేయించినతవుడుతో కలసిన తెల్లబియ్యమును అనారోగ్యకరమే.

కనుక తవుడులో ఆరోగ్యమునిచ్చు అదృశ్యవస్తువున్నదనియు, దానిని వేయించినతోడనే ఆవస్తువు నశించుచున్నదనియు విదితము. ఈ వస్తువు ఆరోగ్యమునకు ముఖ్యాధారముగ గన్పించుటచే దీనిని 'ప్రాణకృత్తు' అని పిలుచుచున్నారు.

ఇటులే పచ్చిపాలలోగూడ ప్రాణకృత్తులున్నవని తెలియనగును. మూతపెట్టి తగుమాత్రముగ కాచినపాలు పిల్లలకు ఆరోగ్యకరములు. వానినే మూతలేకుండ చాల వేడిగ కాచినచో అనారోగ్యకరములగును. ఎండిన పండ్లును, చాయపప్పులును గూడ ప్రాణకృత్తులు లేనివని తెలిసికొనవచ్చును.

సృష్టిలోని ప్రతివస్తువులోను ప్రాణకృత్తులు కొలదిగనో, గొప్పగనో ఉన్నవి. కాని మనము రుచికొఱకు వాని ననేకవిధములమార్చి వంటకములుగా చేయుటలో అదృశ్యములును, చంచలములునగు అమూల్యపదార్థములను నశింపజేయుచున్నాము. ఇది కేవలము అజ్ఞానకృతము.

## ప్రాణకృత్తులలో గల భేదములు

గృహనిర్మాణమున తాపీవాడు గోడలు కట్టునట్లును; వడ్రంగి దూలములను, తలుపులను, కిటికీలను చేసి అమర్చునట్లును; చాకలి వెల్లవేయునట్లును దేహమునందలి వివిధ భాగములను పోషించుటకు వివిధములగు ప్రాణకృత్తు లున్నవి. ఇవి ముఖ్యముగ నాలుగు తరగతులు.

## మొదటితరగతి ప్రాణకృత్తులు

ఇవి శరీరవృద్ధికిని, పునర్నిర్మాణమునకును, అంటురోగములనుండి శరీరమును గాపాడుటకును అవసరము. ఇవి లేనిచో రేచీకటి, కండ్లుఎఱుపు, క్షయ, ఉబ్బు మొదలగు వ్యాధులు కలుగును.

సూర్యరశ్మి పచ్చనిఆకులపై పడినపుడు వానిలో రసాయనికసంబంధములగు మార్పులు కొన్నికలుగును. ఆమార్పులవలన నీతరగతిప్రాణకృత్తులు కలుగును. అట్టి యాకులను తినినజంతువులు వీనిని జీర్ణించుకొని తమలో నుంచుకొనును. వానిపాలలో గూడ నివి విరివిగా చేరును. ఆపాలు త్రాగినవారికెల్లను మొదటితరగతి ప్రాణకృత్తులు లభించును. ఇటులే మానవులును బచ్చలకూర, తోటకూర, చుక్కకూర మొదలగు వానిని ప్రాణకృత్తులకు హానిలేకుండ పచనముచేసికొని తినుటవలన వానిని విరివిగా జీర్ణించుకొందురు. అట్టి స్త్రీలవద్దనుండు పాలలోగూడ నివి సమృద్ధిగనుండి వారి శిశువులకు ఆరోగ్యకరములగును. కాని కృత్రిమాహారప్రియులగు నేటినాగరికులు సరియగు ఆహారమును గొనుటలేదు. అట్టివారిపాలు ప్రాణకృత్సమృద్ధములు గాకపోవుటచే వారి శిశువులు ఆరోగ్యవిహీనులై రోగిష్ఠులై మృత్యుముఖులగుచున్నారు. సముద్రములందును, చెఱువులందును పెరుగు మొక్కలను తిను చేపలలోగూడ నీప్రాణకృత్తులున్నవి. కనుక

వాని నూనెలో గూడ నివియుండును. కందులు, పెసలు మొదలగునవి నాని మొలక లెత్తుసమయమున వానిలో నివియుండును. అట్టివానిని తినుటవలనగూడ నివి మనకు లభించును. పెండలము, కంద మొదలగు దుంపలు సూర్యరశ్మితగులని స్థలములలో పెరుగునుగాన వానిలో నీప్రాణకృత్తులుండవు.

చేపనూనెలు; (కాడ్లివరుఆయిలు మొదలగునవి) గ్రుడ్డులోని చందమామ; మాంసము; బచ్చల, తోటకూర, పొన్నగంటికూర మొదలగు ఆకుకూరలలోను; క్యాబేజి లోను; వెదురుచిగుళ్లలోను ఈ ప్రాణకృత్తులు విస్తారముగా నున్నవి. టమాటాలు (కాశీవంగ), మొక్కమొలచిన పప్పుగింజలు, రాగులు మొదలగు వానిలో నాతి విరివిగ నుండును; మీగడకట్టిన పాలలోను, కొబ్బరనూనె, కొబ్బర, చోళ్లు, గోధుమలు, చిక్కుడు, బఠాణీ మొదలగు వానిలో కొలదిగనుండును.

రెండవతరగతి ప్రాణకృత్తులు

ఇవి మేధస్సును, నాడులను సరియగుస్థితిలోనుంచును; కండరములను బలపఱచును; జీర్ణక్రియనుసరిజేసి యాకలికలిగించును; హృదయమును, కాలేయమును, మూత్రాశయమును చురుకుగా పనిచేయించును. ఈ ప్రాణకృత్తులు దేహమునకు ఎంతయు నవసరములు. ఇవి దేహమునందు నియమితసంఖ్యకు తగ్గియున్నచో అన్నము నెడ అరుచియును, మలబద్ధము, అజీర్ణము, కడుపునొప్పి, నిస్సత్తువ మొదలగునవియును పుట్టును. ఉబ్బుకూడ చూపవచ్చును. అంటువ్యాధులను నిరోధించుశక్తి తగ్గును.

మొదటితరగతి ప్రాణకృత్తులవలె రెండవతరగతివికూడ మొక్కలచేతనే తయారు చేయబడుచున్నవి. ఇందుకు సూర్యరశ్మియంతగా ముఖ్యముగాదు. గాలిలోనుండియును, భూమినుండియును వీనిని మొక్కలు తయారుచేయుచున్నవి. ఇవి మొక్కలయాకులలో కొలదిమాత్రముగ నున్నవి. వాని పండ్లలోను, గింజలలోను విరివిగానుండును. వానిని తినిన జంతువుల మెదడు, హృదయము, కాలేయము, మూత్రపిండములు మొదలగు వానిలోగూడ నివి విస్తారముండును. కావున మాంసాహారు లీభాగములను ముఖ్యముగ భుజింపవలెను. ఈ జంతువులనుండి లభించు పాలలోగూడ నివి యున్నవి. పక్షుల గ్రుడ్లలోగూడ నివి విరివిగానున్నవి.

రెండవతరగతి ప్రాణకృత్తులు విస్తారముగానుండు వస్తువులు: కాలేయము, గ్రుడ్లు, సజ్జలు, టమాటాలు మొదలగువానిలో విరివిగానున్నవి; ఆవుపాలు, గోధుమలు, రాగులు, చోళ్లు, బార్లీ, పచ్చజొన్నలు, తవుడు, పప్పుగింజలు, కొబ్బర, వేరుసెనగ,

నీరుల్లి, బచ్చల, తోటకూర, పొన్నగంటికూర, మెంతికూర మొదలగువానిలో మధ్య రకముగాను; పాలు, నేయి, మజ్జిగ, మాంసము, వెల్లుల్లి, బంగాళాదుంప, దోస, వంగ కాయ, బెండకాయ, నారింజ, నిమ్మపండు, బొప్పాయి మొదలగు వానిలో కొలదిగాను ఉన్నవి.

## మూడవతరగతి ప్రాణకృత్తులు

ఇవి జీర్ణకోశమును శుభ్రముగ నుంచును; పండ్లను, ఎముకలను గట్టిపఱచును; నెత్తురును సరియగు స్థితియందుంచి అంటురోగములను పాఱదోలును. ఇవి లేనిచో చర్మ వ్యాధులు (Scurvy) కలుగును.

పండ్లలోను, పచ్చని ఆకులలోను హెచ్చుగానున్నవి. పెసలు మొదలగువాని మొలకలలోగూడ సమృద్ధములు. జంతువుల కాలేయములోగూడ నివియుండును. పచ్చిఅనపగింజలలోను, బంగాళాదుంపలలోను, వెల్లుల్లిలోను, క్యాబేజిలోను, కాశీవంగ లోను, దోసకాయ, నిమ్మపండు, నారింజపండు, అనాస, బొప్పాయ, మామిడి, జామ పండ్లలోను నివి హెచ్చుగానున్నవి. చింతపండులోగూడ కొలదిగనున్నవి. దానిమ్మ, పుచ్చకాయలలోగూడ కొలదిమాత్రముగ నున్నవి. పాలలోగూడ వీని యునికి స్వల్పమే.

ఇవి ఏమాత్రము వేడితగిలినను నశించును. అందుచే మన వంటకములన్నిటిలోను చివరకు ఈప్రాణకృత్తులు మిగులుటలేదు. అందుచేతనే మనదేశమునందు చర్మవ్యాధులు విరివిగానున్నవి. చంటిపిల్లలకు ఆవుపాలను కాచిపోయుదురు. అందుచే వానియందున్న మూడవతరగతి ప్రాణకృత్తులు నశించుచున్నవి. ఇటులే డబ్బాపాలు, గ్లాక్సో, హార్లిక్సు మొదలగునవి యుపయోగించువారుకూడ వీనియందు కొరవడుదురు. అట్టి పిల్లలు ఆరోగ్యము చెడి బాలారిష్టముల పాలగుదురు. అట్టి వారికి కాశీవంగ, నారింజ, కమలా ఫలము మొదలగు పండ్లరసమునుగూడ పాలుత్రాగినతరువాత నిచ్చుచుండుట శ్రేయో దాయకము. మనము భుజించు వరి,జొన్న, గోధుమ మొదలగు ధాన్యములలో నీ ప్రాణకృత్తు లసలే లేవు. కావున మనదేశీయులు మూడవతరగతి ప్రాణకృత్తులుగల పై పదార్థములను సాధ్యమైనంతవరకు పచ్చివానినే తినుచుండవలెను.

## నాల్గవతరగతి ప్రాణకృత్తులు

ఇవి పండ్లను, ఎముకలను గట్టిపఱచును. ఇవి తగ్గియున్నచో పండ్లపటిమ తగ్గి త్వరలో నూడిపోవును. ఎముకలు గట్టిదనమును బాసి మూాతి, కడుపు ఊదుకొని కాళ్లుచేతులు ఈచుకొని కీళ్లుకదుములు కట్టుకొనేరోగమును (Rickets) ప్రబలజేయును.

ఇవి కాడ్లివరునూనెలో మిక్కిలి హెచ్చుగానున్నవి. చేపనూనెలో అంతకు కొంచెము తక్కువ. పాలలో స్వల్పముగనున్నవి. మంచినూనెను లోతులేని పళ్లెములలో బోసి యెండలో పెట్టియుంచినచో వానియందివి బయలుదేరును. ఒడలికి మంచినూనె పూసికొని ఎండలో కొంచెము సేపుండుటవలనగూడ నవి శరీరములో నుత్పత్తియగును. అసూర్యంపశ్యలగు వారికి ఈప్రాణకృత్తులు లభింపమిచే వారి ఎముకలు మెత్తబడి రోగమున కాస్పదములగును.

హితము

శాకాహారులగు భారతీయులకు ప్రాణకృత్తులు సులభముగలభించును. వారికివి యన్నియు సూర్యరశ్మినుండి ముఖ్యముగ దొరకును. కేవలము గంజినీళ్లతో కాలము గడుపు పాటకపుజనముగూడ బలిష్ఠులై యుండుటకిదే కారణము. వారొడలుదాచుకొనక ఎండయనక కొండయనక దేహములను చాలవరకు అనాచ్ఛాదితములుగానుంచుకొని తిరిగి పనిచేయుటచే సూర్యరశ్మి వారికి విరివిగా తగులును. అపుడు వారికి కావలసిన ప్రాణకృత్తులు లభించును. అట్టి గంజినీళ్లను సూర్యరశ్మికూడ కఱవగు శీతలదేశవాసులు త్రాగియున్నచో వారచిరకాలమున రోగులగుదురు.

శ్రీమంతులు సూర్యరశ్మి నోర్వజాలకపోవుటచే తల్లాభములను పొందలేకున్నారు. పోనీ శాకములు, పత్రములు నొసంగు లాభములనైన గొందురాయన్నచో నదియును లేదు. జిహ్వాచాపల్యమున వాని ననేకవిధముల మార్చి వండుదురు. తరుగుటలో కొన్ని ప్రాణకృత్తులు పోవును, కడుగుటలో మరికొన్ని పోవును, మూతపెట్టకుండ ఉడకబెట్టుటలో ఇకకొన్నిపోవును, చివరకు మిగిలినవి గట్టిపడి పంటికి కరకరలాడునట్లు వేయించుటలో పోవును. కావున వారికి వీనివలనగూడ లాభముచేకూరుటలేదు.

ఈ నష్టములను కూడదీయుభారము గృహిణిపైనున్నది. ఆమె శ్రమయనియెంచక ప్రాతమార్గములపై మూఢవిశ్వాసములను విసర్జించి ఆరోగ్యమును ప్రధానముగాగొని దేహమునకు మంచినిచ్చు వస్తువులనే వండిపెట్టవలెను. అట్లుచేయునపుడు ఏమరుపాటున గూడ మూతబెట్టుట మరువగూడదు. కూరలు కడిగిన నీరును, వార్చిననీరును పులుసు, చారు మొదలగు వాని నుపయోగించవలెనుగాని పారబోయరాదు. సాధ్యమైనంతవరకు కూరలు వార్చకూడదు. పిండకూడదు. వేపుడుకూరలను విషతుల్యములుగా భావించవలెను.

ఈసారి మాంసకృత్తులనుగూర్చియు నిరింద్రియలవణములనుగూర్చియు వ్రాయుదును.




# సౌందర్యము—సద్గుణములు

శ్రీమతి జ్ఞానాంబగారు

సౌందర్యసంపాదనకు మనశ్శుద్ధి మొదటిదై యున్నది. శరీరమును తగిన స్థితిలోనుంచుట రెండవది. ఘనమగు నభిప్రాయములను పవిత్రభావములను కలిగియున్నంత మాత్రమున చాలదు. అవి కార్యరూపమును ధరింపవలయును. స్థిరముగ వేరూని దైనికాభ్యాసములోనికి రావలయును. దినమునకు పదినిమిషములచొప్పున కొన్ని సామాన్యములగు కసరత్తులను చేయవలయును. ఇందువలన కండరబల మభివృద్ధియై ఆంతరంగికములును ప్రాణసంబంధములునగు నవయవములపై పనిచేయును. శరీరవ్యాయామమును బోధించు నే చిన్నిపుస్తకమైనను కొన్ని సామాన్యమైన కసరత్తులను తెలుపగలదు. ఈకసరత్తుల నభ్యసించునపుడు గాలినిదీర్ఘముగా లోనికి పీల్చుటయు, మెల్లగా బయటకు విడుచుటయు (ముక్కుతో) నావశ్యకము. బొత్తుగా నీరసపడి యుండువారు వెల్లకిలపరుండి ప్రతి కండరము యొక్కయు బిగువు సడలి సమగ్రశరీరము మృదువగునట్లు చేయవలయును. ఇట్లు కొంత సేపు ఉండవలయును. అపుడు నిద్రవచ్చునేని పోవచ్చును. శరీరము యొక్క బరువు మితిమీఱి యుండువారు వేడినీటి స్నానముచేసి బలమైన కసరత్తులు చేయవలయును. ఈ రెండు విషయములలోను అనగా బొత్తుగా నీరసించినట్టియు అమితమగు బరువు గలిగినట్టియు రెండు విషయములలోను యుక్తమగు పథ్యమే గుణమునిచ్చునదియై యున్నది. అనగా సరియగు తూనిక నిచ్చునదియై యున్నది. నీరసించియున్నవానికి బలము నిచ్చుటయు, అమితబరువుకలవానిబరువు తగ్గించుటయును యుక్తాహారధర్మములు. మూడవది పథ్యము. పథ్యమునకును రూపమునకును జనులు భావించుదానికంటె నెక్కువ దగ్గర సంబంధమున్నది. అనేకవిషయములలో వారివారి నైజము ననుసరించి కొన్నికొన్ని పదార్థములు మిగుల చెడ్డగుణముల నొదవించుచున్నవి. కొన్ని యాహారపదార్థములును పానీయములును విషతుల్యములై యున్నవి. కూడని పదార్థము తిని వానికి విరుగుడుగా భేదిమందు నుపయోగించుట కద్దు. ఇది జీర్ణాశయమును చెడగొట్టును గనుక మంచిపద్ధతి కానేరదు. కూడని పదార్థములను తిననేకూడదు. సామాన్యమును, స్వాభావికమునగు పథ్యమే యుత్తమోత్తమమగు పథ్యము. ఇట్టి పథ్యమువలననే సౌందర్యమును, దీర్ఘజీవితమును లభించును. సౌందర్యము, ముఖవర్చస్సు పరిశుభ్రతతో నారంభమగును. దృఢమైనట్టియు, మృదువైనట్టియు శరీరము పైనవర్ణింపబడిన మూడుసూత్రముల నభ్యసించినవారి సొమ్ముగాని యితరులది గాదు. ఎల్లపుడు నానందముగ నుండుట కభ్యసించినచో బలారోగ్యములు వర్ధిల్లును.

—ప్రకృతి.

# మేనరికము

సాహిత్య విద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

మన వివాహవిషయములలో భారతీయసంప్రదాయవిరుద్ధమును, సకలధర్మశాస్త్రవిరుద్ధమునగు నొక యాచారము దక్షిణహిందూదేశమున నందు నాంధ్రదేశమున మిక్కిలి ప్రబలియున్నది. అయ్యది మాతులకన్యాకరగ్రహణము. అనఁగా మేనరికము. ఈయాచారము ద్రావిడేతరులగు నాంధ్రులయందంతటను గలదు. మేనరికమును దప్పింపరాదని పట్టుదల వైశ్యులలో మిక్కిలి ప్రబలియున్నది. పరిశీలించి చూచినచో నీయాచారము ప్రాచీనమైనదికాదు కాన యర్వాచీనపరికల్పితాచారమనియే తోఁచుచున్నది.

శ్రుతిస్మృత్యాదులు ప్రభుసమ్మితములగు నిబంధనలు. అనఁగా నవి "ఈపనిచేయవచ్చును, ఈపనిచేయరాదు" అని శాసించును. రాజశాసనమువలె నవిగీచిన గీటును దాటవీలులేదు. అట్లైనను ధర్మపద్ధతులందుఁ గేవలమును నైరంకుశ్యములేదు. ఆనిబంధనలలో ననేకములగు గూఢార్థము లిమిడియున్నవి. చూడుఁడు. "సత్యంవద", "ధర్మంచర", "నపరదారాన్‌గచ్ఛేత్", "నసురాంపిబేత్" మొదలగు శ్రుతులు వెల్లడించుమంచిచే, నీతిచే, వానియందలి ప్రభుసమ్మితత్వము కప్పివేయఁబడుచున్నది. అద్దిసకలశ్రుతిస్మృతిపురాణములలోను వివాహమునకు యోగ్యులుకాని కన్యకలఁ బేర్కొనుచు నీక్రిందిరీతిని వివరింపఁబడినది—

పైతృష్వసేయీం భగినీం స్వస్రీయాం మాతురేవచ ।
మాతుశ్చభ్రాతుస్తనయాం త్యక్త్వా చాన్ద్రాయణంచరేత్ ॥
ఏతాస్తిస్రస్తు భార్యార్థే నోపయచ్ఛేత బుద్ధిమాన్ ।
జ్ఞాతిత్వేనానుపేయాస్తాః పతత్యభ్యుపయన్నధః ॥ —మనుః।

[మేనత్తకూతురును, తల్లియప్పచెల్లెండ్ర పుత్రికలను, మేనమామకూతురును, వివాహము చేసికొనఁగూడదు. ఎవరేని వివాహము చేసికొనినచో వారినివిడిచి చాంద్రాయణవ్రతము ప్రాయశ్చిత్తార్థము చేసికొనవలెను. మీఁదఁజెప్పఁబడిన ముగ్గురుకన్యకలును జ్ఞాతులు కనుక వారిని వివాహమాడరాదు. వారిని పెండ్లియాడిన వాఁడధఃపతితుండగును.]

గౌతముఁడు వివాహవిషయమై వ్రాయుచు, "అసమానప్రవర్తనైర్వివాహః, ఊర్ధ్వం సప్తమాత్ పితృబంధుభ్యః, మాతృబంధుభ్యః, పంచమాత్" అని నిరూపించెను. మనువును—

"అసపిండా చ యా మాతు రసగోత్రా చ యాపితుః।
సాప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి.........॥"

అని పితృసగోత్రయు సపిండయు, మాతృసగోత్రయు సపిండయునగు కన్యకను వివాహమాడరాదని చెప్పెను. పితృసంతానమున నేడవపురుషుని పర్యంతమును సాపిండ్యముండునని చెప్పంబడుటచే నెనిమిదవ పురుషాంతరమైన కన్యకనే పెండ్లియాడవలెను. మాతృవంశమున మాతృప్రపితామహుఁడు కూటస్థుఁడగుటవలన నతని సంతానమున నైదుపురుషాంతరములు సాపిండ్యముండును. కాన నావంశమున నాఱవ పురుషాంతరపు కన్యకనే వివాహమాడవలెను. నారదుఁడును, విష్ణువును, మరీచియు, ఆపస్తంబుఁడును మొదలగు వారందఱు నీపైరీతినే చెప్పిరి. మఱియుఁజాలస్మృతులలో

"పఞ్చమాత్సప్తమాద్ధీనాం యః కన్యాముద్వహేద్ద్విజః।
గురుతల్పీసవిజ్ఞేయః సగోత్రాంచైవముద్వహన్ ॥"
"బ్రహ్మహా సురాపగురుతల్పగ మాతాపితృయోని సంబంధాగస్తేన,
నాస్తిక నిందిత కర్మాభ్యాసి పతితాత్యాగ్య పతితనత్యాగినపతితాః॥" [గౌతమః]

అను రీతులఁజెప్పుటచే మీఁదిరీతిని బురుషాంతరములు దాటని కన్యలం బెండ్లియాడుట మహాపాతకమని చెప్పఁబడుచున్నది. ఇట్లు ధర్మశాస్త్రములనే జూపవలెనన్నఁ బెక్కులు లభించును. కాన విరమించుతును.

పురుషాంతరములు దాటని కన్యకలనే వివాహమాడినచో శోణితసంబంధము దూరముకాకుండుటవలన నట్టివారలకుఁగల శోణితశక్తి క్రమక్రమముగ సన్నగిల్లి వారలకుఁ గలుగు సంతానముకూడ దుర్బలమైపోవునను ముఖ్యాశయమునే మనంబున నిడికొని ధార్మికులగు మన శాస్త్రవేత్తలిట్లు నిబంధములనొనర్చిరి. అట్లుకాక పురుషాంతరములు దాటినవారితో శోణితస్పర్శ దూరమగుటచే వ్యత్యస్తములగుట మీఁది యనుపపత్తి వారియెడఁ గలఁజాలదు. పాశ్చాత్యసిద్ధాంతము కూడ నిదియేయైయున్నది.

కాని క్రమక్రమముగ నెట్లు వచ్చినదోకాని మాతులకన్యాకరగ్రహణాచారము ప్రబలిపోయినది. మనయాంధ్రదేశము మొదలగు స్వల్పదేశములలోఁగాక తక్కిన భారతీయభూభాగములలో మేనత్తకూతులకును, మేనమామ కూతులకునుగూడ సోదరీరూపవ్యవహారమేకలదుకాని మఱొక వ్యవహారము వాడుకలోను లేదు. అన్నిదేశములలోను లేని యీ యాచారమాంధ్రదేశమునందును, అందాంధ్రులయెడలను గలుగుటకు సాంసారికకారణములే తప్ప వేఱు కారణములు లేవని నాతలంపు.

ఇపుడులోకమున నతిబాల్యవివాహములు నిరాఘాటముగ జరుగుచున్నవి. తల్లిదండ్రులు వానివలనఁగల్గు బాధకముల నింకయొకింతయినను విచారింపక, తమ పిల్లనెట్లయినను గట్టపెట్టనిచోఁ బైవారువచ్చి యాస్తిగల యాసంబంధమును దన్నుకొనిపోవుదురని తలఁచి పిల్లని యెత్తునకుఁ గొన్నిరెట్లెక్కువధనము తూఁచి తమ సంబంధమును

జేయుదురు. వరశుల్కమున కాసించియే పిల్లవాని దలిదండ్రులా వివాహమున కంగీకరింతురు. అదే మాదిరిగ నాస్తిలేని మేనల్లునికిఁ బైవాడు పిల్లనీయనందున తన యక్కయో చెల్లెలలో పోరుపెట్టి యేడ్చి సాధించుటవలన, తనయొద్ద ధనములేక మేనల్లుఁడాస్తికలవాఁడగుటవలన నిట్లనేకకారణములవలన మేనటికము జరుగుచుండును. కావున నది యభిమానపూర్వకముగాని, ధనపూర్వకముగాని యగుచున్నది. వానికి ధర్మముతో నించుకంతయును బ్రయోజనములేదు. ఇట్టి వీరు మేనత్తకూఁతును వివాహమాడరాదనియు, నదియెనురుమేనటికమనియుఁ, బినతల్లి పెదతల్లులకుమార్తె లక్కసెల్లెండ్రగుదురనియు, నందుచే వారలను వివాహమాడఁగూడదనియు, ధర్మోద్ధరణమాచరించునట్లు పల్కుటేలనో? నిషేధమన్నింటికిని సమానమగునపుడు మేనటికమునే యంగీకరించి, తక్కిన వానిని విడుచుటలో హేతువేమి?

మాతులకన్యావివాహము ఘోరమని, అట్టివివాహమాడుట అధర్మమని, సకలధర్మశాస్త్రములును జెప్పుటచే నట్టి వివాహములను విడుచుట యుక్తము. ఈ యాచారము సనాతనమగునదికాదు. ఒక దృష్టాంతము—ఈ విషయముననే చూపుఁడు. సోదరీపుత్రికాకరగ్రహణము ధర్మశాస్త్రవిరుద్ధముకదా! అది ప్రాచీనాచారము కాదను నంశమందఱు నెఱింగినదేకదా? సోదరీపుత్రికకును, నిజపుత్రికకును భేదమంతగాలేదు. అట్టిసోదరీపుత్రికను వివాహమాడుట ఈనడుమనే ప్రారంభమైనది. అందులకు కారణము ధనము. అదియే పావనము. ఒకరట్టిదానికి దారితీసిరి. వెంటనే వారిని బహిష్కరింపక ధనాశచేఁ బదుగురు వారియింటికిఁబోవుచు, భుజించుచు నుండుటవలన రెండవ వారాదారినిబోవ వీలుకలుగు గదా! తొలుతటివారిని మొదటనే బహిష్కరించి యుండిన నెంతటి బాగుగనుండెడిది? ఊరకయుండుటంబట్టియే యది యిపుడాచారముగఁ బరిణమించుచున్నది కదా! దానిని నిరోధించువారెవరు? ఆరీతినే యీమేనటికముకూడ తానొకయాచారమై పోయినది. కాన భగినీసుతావివాహముభాతి మాతులకన్యావివాహముకూడ దూష్యమనియే యెఱుంగవలెను. మఱియు సమీపబంధుసంబంధములు చేసికొనుటవలనఁ గల్గు సాంసారికసామాన్యకష్టములు మగవారికంటె వనితలకెక్కువగఁ దెలియును. కావున వారీకష్టములఁదలఁచుకొని కొంచెముదూరమును, సాంప్రదాయికమునగు సంబంధమునే కూర్చుచుండఁ బ్రయత్నింపవలయును.

ఇప్పుడు మేనటికములు చేసికొనినవారు మనలోఁ జాలమంది యున్నారు. వారందఱును వారి భార్యలను విడిచిపెట్టివేయవలెనని నాయాశయముకాదు. కాని ధర్మశాస్త్రములంబట్టియు, బ్రాచీనాచారములంబట్టియు మేనటికము నిషిద్ధమగుటచే నింతటినుండియైనను మేల్కొని యట్టివివాహమును జరుగకుండఁ బ్రయత్నింపవలెనని విన్నవించుచున్నాను.

# రయితుబిడ్డ

## నరహరిశెట్టి వేంకటరత్నముగారు

పశ్చిమగోదావరిజిల్లాలోనిపూళ్ల: మధ్యాహ్నము రెండుగంటలవేళ: అదిఆషాఢమాసము పల్లెటూరు. ఆమె గట్టుపైనున్న గున్నమామిడిచెట్టుక్రింద పసికూనను మెత్తనిగుడ్డలపై పరుండపెట్టి అనటకూరుచుండి యున్నది. ఆమె ప్రక్కనే పదునైదేండ్లకుమారుడు ఆసీనుడైయున్నాడు. పదిఅడుగులదూరములో నొకతాటియాకులయిల్లు దానిప్రక్కనే గోడలేమియు లేక మొకరములపైననే యున్నపాక. సమీపముననే కంచెవేసియున్న గడ్డివాముదొడ్డికలదు. ఆమెకు ఎడమచేతివైపు చిన్నిచెఱువు. దానిగట్టుపైన అంటుమామిడిమొక్కలు, రెండుమూడు అరటిచెట్లు, నాలుగైదు కొబ్బరిమొక్కలు, సంగీతపుచెట్టు, మల్లెతీగెలు, తెల్లగన్నేరుచెట్లు, గుబురుగానున్న వేపచెట్లు, తాటిచెట్లు కలవు. గట్టుక్రిందనున్న పొలములో కొందరు స్త్రీలు వరుసగా నిలుచుండి మెత్తని తడినేలపై లేతవరియాకు ఊడ్చుచున్నారు వంచిననడుములు ఎత్తకుండగనే. ఆమె, ఆమెకుమారుడు గొంతెత్తి సన్నని మధురస్వరమున ఇట్లుపాడుచున్నారు:

ఈ గడ్డిపూవులే
ఈ దారిపొంతనే
అలసిపోనీవోయి
దేవా, దేవా!
నీ యిష్టమైన చో
నీ పూలదండలో
మెరసిపోనీవోయి
దేవా, దేవా!

—'శ్రావణి'నుండి.

తడినేలలో చెమటగార్చుచు పనిచేయుచున్న ఆ స్త్రీలు ఈ యిర్వురుపాడిన పదమును మరల ఆలపించుచుండిరి. వీరుపాడిన పాదమునే యొకసారి మరియొకసారి దాని తరువాతిపాదమును నవ్వుచు, నడుమనడుమ నొకరినొకరు వేళాకోళాముచేసికొనుచు, ఉత్సాహముతో, ఉద్విగ్నహృదయములతో నా ఊడ్పుకత్తెలు పాడుచున్నారు. ఈ పాటవలన కలిగే ఆనందములో వారు పనిచేయుచున్నమాట, పనివల్లకలిగే బాధ మరిచియేపోయినారు. నిమిషనిమిషమునకు ఇనుమడించుచున్న ఉద్వేగము, ఉత్సాహము వారికి మైమఱపు కలిగించినది. 'ఆకట్టయిల్లాయియ్యావో అమ్మా!' అనీ, 'ఆను యెంతలేతగావుందే మేలిమితీగెలాగు' అనీ, 'ఆయమ్మకి యేం వోపికే మనకీపాట నేర్పడానికి' అనీ, 'అల్లాటి కంఠం నాకేవుంటేనా' అనీ మధ్యమధ్య వారిలో గుసగుసలు మాత్రము బయలు దేరుచున్నవి.

ఇంతలో తొమ్మిదేండ్ల బాలుడు మణుగుబూరి పరపరనములుచు పరుగునవచ్చి 'అమ్మా! మన రవుడీ యెవరో మనిషిమీద భొంయిభొంయిమని మొరుగుతోంది' అన్నాడు.

ఆమె 'దాన్నియిల్లా తీసుకరాకపోయావా మరెందుకూరుకున్నావు?' అన్నది.

బాలుడు 'ఎంతపిలిచినా రాలేదమ్మా. గబగబా వెళ్లి గబాలున మెడపట్టుకొని బతిమాలాను కూడా రమ్మని. నేనురానుపో నీకెందుకూ అంటూవుందమ్మా!' అన్నాడు.

మళ్లా అందుకొని 'ఏయిరవుడీ! జాగ్రత్త, నీ పని పట్టిస్తా, పో, యింట్లోకిపో, అంటే భొంయి మనివచ్చి భొంయి నీ మణుగు బూరితినేస్తా జాగ్రత్త, అని మీదపడబోతే వచ్చేశానమ్మా' అని గంతులు వేయుచు, నవ్వుచు మణుగుబూరి నములుచునే పసిబిడ్డపరుగెత్తి

నీ పూల దండలో

మెరసిపో నీవయ్యా

దేవా, దేవా!

అని సన్నగా మెల్లగా తనలోతానే పాడుకొనుచు అచటనే కూరుచుండిపోయినాడు.

తల్లి ఆజ్ఞానువర్తియై పెద్దకుమారుడు రౌడీని తీసుకవచ్చుటకై పరుగునవెళ్లినాడు. అయ్యాని భయంకర మూర్తి అయినను చనవుతో బాలుడు దాని పట్టా పట్టుకొని అచటనున్నవానిని వెంటబెట్టుకొని తల్లిదగ్గరకు వచ్చినాడు.

ఆతడెవరో క్రొత్తవాడు. నవనాగరకుడు. మల్లెపూవువంటి తెల్లనివస్త్రములు; కండ్లకు బంగారు సులోచనములు; చేత నొకచక్కని చేకర్ర.

ఆమె లేచి నిలువబడి యింకను కుక్కను పట్టుకొనియేయున్న పుత్రునిజూచి వారిని తీసుకవెళ్లి యింటిలో కుర్చీ వేసి కూర్చోబెట్టిరా అన్నది.

ఆ నూతనపురుషుడు మారుమాటాడకనే బాలునివెంట వెళ్లి యింట నాసీనుడైనాడు.

రవుడీని కట్టివేసి వచ్చినపుత్రునితో 'తండ్రీ! వానితరువాత పాదములుకూడా వాళ్లకు నేర్పుతూవుండు; నేనిప్పుడేవస్తాను' అని పసిపాపదగ్గరనున్న కుర్రవానిని తీసుకొని, అదివరకు జారుముడివేసియున్న కేశములు విడదీసి మరలముడివేసి పయ్యెదసర్దుకొని ఆమె బయలుదేరినది.

చిన్నిబాలుడు: 'అమ్మా! ఈ మణుగుబూరి యేంచెయ్యనూ?' అన్నాడు.

తల్లి: 'అక్కడ పెట్టిరా. మళ్లీవచ్చేక తిందువుగాని' అన్నది.

ఆమె ముప్పదియేండ్ల లావణ్యవతి. చూపులకుఇరువదియేండ్ల యౌవనవతివలె కాన్పించును. చామన చాయ. పలుచని, బలిష్ఠమైన నునుపైనశరీరము. వదనమున సౌమ్యమైనతేజస్సు. వేషమున పల్లెటూరిపడుచువలె నుండినను ప్రకాశమైన మోము, వెన్నెలవెలుగులనేత్రములు, మృదుమధురమైన వాక్కు, మందగమనము యివన్నియు నామె సామాన్యరమణి కాదనియు, నామెలో అపూర్వమైన, అనిర్వాచ్యమైనశక్తి, తేజస్సు యేదో కలదని అపరిచితులకు తోచును.

మెల్లగా నామె చిన్నిబాలునితోవచ్చి 'అయ్యా! దాహమేమైనపుచ్చుకుంటారా?' అని అడిగినది.

ఆతడు అవనతవదనుడయియే ఏమోఆలోచించుచునే 'కొంచె మిప్పించండి' అన్నాడు.

ఆమె లోనికిజని శుభ్రమైన కంచుపాత్రనిండా చిక్కని గేదెమజ్జిగపోసి ఆతనికి స్వయముగానే యిచ్చినది. 'నీపేరేమిటి?' అని అదివరకే ప్రశ్నింపబడియుండుటచే నా బాలుడు 'ఊం——నాపేరా——మరి బాలచంద్రుడు' అనుచున్నాడు.

ఆతడు చిఱునగవుతో 'ఏ వూరి బాలచంద్రుడువయ్యా నీవు! చుక్కల్లోచంద్రుడు నీకేమవుతాడు.' అన్నాడు.

బాలుడు: 'నేనా పల్నాటి బాలచంద్రుణ్ణిఆండీ. చుక్కలు, చందమామ, కొంగలు, ఎద్దులు, మారావుడీ కుక్క అన్నీ మాచుట్టాలేనండీ, మా అమ్మ చెప్పింది' అన్నాడు.

అంతలో కంచుపాత్రతీసుకవచ్చిన తల్లి ఆ పలుకులు విని పాత్రనందించిన తర్వాత బాలునెత్తుకొని 'ఎవరు నేర్పినారయ్యా! ఈ చిట్టి బుద్ధులు? నువ్వు పల్నాటిబాలచంద్రుడవా?' అన్నది చిఱునగవుతో.

'అవు నమ్మా! నాన్నగారు నామీద పద్యాలు నేర్పారుకూడాను. ఆ పల్నాటిచంద్రుడే నువ్వు. బ్రహ్మనాయిడు నేను, ఐతమాంబ మీయమ్మ అన్నారు కూడాను నాన్నగారు'.

ఆమె ఆ ముద్దుపలుకులు విని వికసించిన హృదయముతో తేజోవంతములైన కళ్ళతో నవ్వుచు బాలుని శిరస్సు మూర్కొని 'అయ్యా! తమరేమి పనిమీద వచ్చినారో? మగవారు యింటిదగ్గరలేరు. ఇప్పుడే గంట క్రిందట ఆకుమళ్ళ చెరువుకేసి వెళ్లినారు. తమరు కూర్చుంటే ఒక అరగంట, గంటలో వారు వస్తారు. మీరు మాట్లాడివెళ్లవచ్చు' అన్నది.

అతడు: 'వారితో నాకేమియు ప్రత్యేకపు పనిలేదండి. వీలైతే దర్శనముచేసి వెళతాను. కేవలము అందుకనే కాదు నేనురావడము. రోడ్డుప్రక్కనే వొంటరిగావున్న యిల్లు, మీరిందాక యేదో పాడుతున్నారు, చాలా శ్రావ్యముగావుంది, విని చూచి పోదామని వచ్చాను. ఇంతలో దాహముకూడా అయింది.'

ఆమె: 'మాపాటలేమున్నవి లెండి! ఏవో పల్లెటూరిపదాలు. పనివాళ్లకు నేర్పితే వాళ్లుకూడా నేర్చుకొని ఆనందించుతారు కదా అని ఊసుపోక నేర్పుతున్నామే కాని——'

అతడు: 'అమ్మా! అల్లా అనకండి. పల్లపుఊళ్లలో మీసంగతి అనుకుంటూవుంటే విన్నట్టుజ్ఞాపకము. మీ భర్తగారు చాలావిద్యావంతులనీ, మీరుకూడా ఇంగ్లీషు, సంస్కృతము బాగా చదువుకున్నవారనీ అక్కడివారు చెప్పుకుంటూవుంటే విన్నా. అయినా ఆపాట పల్లెటూరిపాట యెల్లాఅవుతుందిలెండి, మీవంటి వారు పాడుతూవుంటే.'

ఆమె: 'ఏమండీ! అల్లా అంటారు మేము పల్లెటూరివాళ్లము కామా? మాతండ్రిగారు రైతు, భర్తగారు రైతు, చిన్నప్పటినుంచిపెరిగింది కేవలము పల్లెటూళ్లలో. కాస్తచదువుకున్నంతమాత్రానే బస్తీవాళ్లమై పోతామా?'

అతడు: 'దానికేమిలెండి. ఇందాక అబ్బాయి పద్యాలేవో నాన్నగారు నేర్పారన్నాడు ఏమైనా చదవమనండి. చిన్నపిల్లలు చదువంటే నాకు అమితమైనకోరిక.'

తల్లి: 'ఏది నాయనా! బాలచంద్రుడుపద్యాలు చదువు మీనాన్నగారు నేర్పినవి. వారు వింటారట' అని బాలుని క్రిందదింపినది.

బాలచంద్రుడు ఠీవిగానిలువబడి చేతులుముడుచుకొని:

"ఈ విశాలప్రపంచాన నింతదనుక
నెందరోపుట్టి గతియించిరేమిఫలము?
వీరులగువార లేనాటివారలైన
శాశ్వతులువారె కీర్తిరాజ్యమున నెపుడు.
శత్రువులగుండె లవియ దేశంబుకొఱకు
ఘోరముగబోరి పల్నాటివీరుడైన

బాలచంద్రుండు తన యెలప్రాయమందె
స్వర్గమున కేగి యెన్నేండ్లో జరిగిపోయె.
నాటి పల్నాటివీరు డొనర్చినట్టి
వేడినెత్తుటి మడుగు లానాడె యింకె;
అతనిచే కూలినట్టి యోధాళితనువు
లవనిగర్భంబుతో నాడె నైక్యమయ్యె.
పాడువడె నాటి పల్నాటిపౌరుషంబు;
చెరగె నావీరు విక్రమచిహ్నాలెల్ల;
గాని యీనాటికిని గూడ వానియశము
పులకరింపజేయు నాంధ్రులయొడళ్లు.
వీరుడగు బాలచంద్రుని విక్రమంబు
వేడ్క నానాడుజూచి పవిత్రమైన
నాగులేరిప్పుడును పలనాటియందు
నా యమృతశౌర్యగీతము లాలపించు.
వీరుడగు బాలకుం డుద్భవించినట్టి
వెలమకులమెల్ల విఖ్యాతి వెలయుచుండె.
అతని పదధూళిచే ధన్యమైన యట్టి
వీరమేడపి లోకైకవిదితమయ్యె.
అతని తలిదండ్రులై యెంతో యశముగనిరి
బ్రహ్మనాయుడు, నైతమాంబయు ధరిత్రి;
ఖిలముగా కెప్పటికిని వీరులసమాధి
శౌర్యసుమముల ధర్మవాసనల జిమ్ము."

—'గీతామంజరి' నుండి.

మధురమైన కంచువంటి కంఠమున పాడినాడు.

అతడు: 'శెబాష్! తెలివిగలపిల్లవాడవోయి. మీకు పేరుప్రతిష్ఠలు తెస్తాడు. అందులో సందేహము లేదు. ఏదైనా బడిలోకి పంపిస్తే క్రమమైనపద్ధతిగా విద్య నేర్చుకోవడానికి, రేపు ఏ బి. యే; ఎం. యే. ప్యాసవడానికి వీలుంటుందిగా, అల్లాచేయకపోయారూ?'

ఆమె: 'ఏమోలెండి. వీళ్లనిల్లాబ్రతుకనిస్తురూ! వాళ్లతండ్రిగారు—యిదివరకు ఆయన కాలేజీలో ప్రొఫెసరుగా పనిచేశేవున్నారు—యిప్పుడు మాపిల్లలకే ప్రొఫెసరైనారు. ఏదో పదిపుట్లనేల పండించుకుంటూ యీ

పొలముగట్లమీద వున్నవాళ్లనుకూడా పంచమబాలుర్లను పెంచామనీ, మేముపంచములమనీ వూరువారంతా బహిష్కరించేరు. ఇదీ వొకందుకు మంచిదే అనుకున్నాము. ఇక ఈ పిల్లవాణ్ణి బడిలో అడుగుపెట్టనిస్తారూ, ఆ మొనగాళ్లు?'

ఆతడు: 'ఓహో! అల్లాగటండీ? అయితేనేమిలెండి, ఏపిల్లవాడివల్ల మీరుచిక్కులు పడతారో, ఆపిల్లవాడి మూలంగానే మీరు శాశ్వతకీర్తిసొందుతారు. బాగావృద్ధిలోనికి వస్తాడు తప్పకుండా.'

ఆమె: 'కీర్తియెందుకులెండి. ఈ కుర్రవాడితోనే ఆఛాందసులకు బుద్ధి కరపించవలెనని మా మగవారి అభిప్రాయము. అందుచేతనే ఆయన స్వయముగా ప్రత్యేకశ్రద్ధతో ఈ పిల్లవాడికి విద్య చెప్పుతూఉంటారు. ఇద్దరిపిల్లల సూక్ష్మబుద్ధి, చురుకుదనము చూచి వాళ్లనాన్నగారు పట్టరాని సంతోషముతో ఇబ్సన్ నాటకములో చెప్పినట్లు Then you shall drive all the wolves out of the country, my boys! అంటూవుంటారు. అందరము నవ్వుకుంటాము.'

ఆతడు: 'అంతకంటే యేమికావాలండి మీకు? నిక్షేపమువంటిసంతానము; కోట్లధనముకంటే విలువైన విద్యాసంపత్తి. అయితే తోడేళ్లుఅంటున్నారు. ఎటువంటితోడేళ్లో నాకర్థముకాలేదు.'

ఆమె: (తెచ్చుకొనిన ఉద్రేకముతో) 'సంఘము: కొయ్యబారిన సంఘం. క్రూరమైనసంఘం. దట్టముగా ఒకప్రక్క అడివిపెరిగిపోయి అందులో తోడేళ్లు, యెలుగుబంట్లు స్థిరనివాసము యేర్పరుచుకుంటే కళ్లుమూసుకొని కొయ్యబొమ్మలవలె వూరుకున్నారు. ఇప్పటికే అవి చాలామట్టుకు నాశనముచేసినవి. ఇల్లాగే కళ్లు మూసుకుని పశువులాగా వూరుకుంటే ఈ పశువులనన్నింటినీ అవి తినివేస్తవి. ఇప్పుడా కారడవిని కొట్టివేసి ఆ క్రూరజంతువుల్ని—కొన్నిటిని నాశనము చేసి—కొన్నిటిని సముద్రములోనికి తరిమివేసి ఈదగలిగితే యీదుతవి లేకపోతే చస్తవి—మరలా దేశమంతా సస్యశ్యామలము చేయవలె.' అని తన వీరావేశముగాంచి తానే నవ్వుకొనినది.

బాలుడు: 'అమ్మా! అడివి నేనుకూడా కొట్టివేస్తా. మొన్న నాన్నగారు బ్రహ్మజెవుడుతుప్ప కొట్టివేస్తూవుంటే నేనుకూడా కొడవలిపట్టుకొని పరపరనరికివేశా. యేంఅమ్మా! నేనుకూడా నీతోరానా అడివి నరకడానికి?'

తల్లి: 'వత్తువుగానిలే నాయినా! నేను వెళ్ళేటప్పుడు—'(గంభీరవదనమున) 'అయ్యా! దేశమంతా మూర్ఖులు. నూటికి తొంబదితొమ్మండుగురు పరమపశువులు. ఎవ్వడైనా ఒక్కవ్యక్తి మానవుడుంటే ఆతడు నిద్రబోతూవుంటాడు. ఈ తొంబదితొమ్మండుగురే సంఘాన్ని, దేశాన్ని నడుపుచున్నారు. ఆ వొక్కడు తెలిశివుండికూడా పశువులలో చేరిపోతాడు. ఇదంతా మార్పుకావడానికి కొంతకాలము పడుతుంది—అయ్యా! లేకపోతే చూడండి. ఈ పసిబాలుణ్ణి చేరదీశామని ఈ మూర్ఖులకింత పట్టుఎందుకూ? అందరిలోనూ వెలిగే వెలుగు వొక్కటేఅని ఆ మూర్ఖులకు తెలియచెప్పితే మాత్రము తలకెక్కుతుందీ? సూర్యునికి కిరణములెల్లాగో మనముకూడా పరమేశ్వరుడి కల్లాగుఅని మా మగవారు అనేకవిధాల ఆ మూర్ఖులకు చెప్పిచూశారు. పశువులకు మనుష్యులమాటలేమి అర్థమవుతవి, పోనీ మీరేచెప్పండి?'

ఆతడు: "అవునండి. ప్రపంచము. ఎదురుచెప్పితే కష్టాలున్నమాట నిజమే. ఏమిచేస్తాము?"

ఆమె: 'ఏమండీ! మీరుకూడా అల్లాగేఅంటూరు. చూస్తూచూస్తూ విషము త్రాగమంటే యెల్లాగండీ? అల్లాగైతే కుక్కలకు, కాకులకు, మనుష్యులకు తేడాయేమున్నదీ? కొన్నివిషయాలలో ఈ మూర్ఖులకంటే కుక్కలు, కాకులు నయమనిపిస్తవి.—అయినా యిప్పుడేమనుకుంటే ప్రయోజనమేమున్నదిలెండి! చేసేరీతిగా

చేయవలెనుగాని. రేపు ఈ పత్రవాడే వాళ్లకళ్లు తెరిస్తే అప్పుడు మేలుకుంటారు.' తల్లి ఉద్రిక్తయై మాట్లాడుట గని అంతవఱకు పరాయత్తచిత్తుడైయున్న బాలుడు ఆమె చెంగుపట్టికొని 'అమ్మా! ఆయనతో ఎందుకే అంతకోపముగా మాటలాడుతున్నావు? రవుడీని తీసుకుగానా యేమిటి? అదే వెళ్లమనిచెపుతుంది. మనము చెప్పడమెందుకు?' అన్నాడు.

వా రిద్దరు నవ్వుచు:

అతడు: 'గడుసువాడవోయి, చంద్రా!'

ఆమె నవ్వుచు 'ఆయన వాళ్లవూరు పెద్దపట్టణం తీసుకువెళ్లి పెంచుకుంటారట వెళతావూ?'

బాలుడు: 'ఊఁ, నాకేఁ వెళ్లేదాకా. ఇక్కడైతే నాన్నగారిదగ్గర చదువుకుంటూ, కోతికొమ్మచ్చి ఆడుకుంటూ, నాపెంపుడు పొదకోడి నేమిచేయమంటావు? మరిదానితో ఎవరు పరిగెత్తుతారు—అమ్మా! నేనెళ్లితే పాప నెవరాడిస్తారు?'

తల్లి: 'రవుడీ ఆడిస్తుందిలే. లేకపోతే చందమామవస్తే అది ఆడిస్తుంది.'

బాలుడు: 'నేనూ చంద్రుడినేగా, నాకే యివ్వరాదూ? నేను తీసుకెళ్లి చిలకలకిస్తే అవి జాంకాయిలు పండువి పెడతయి. ఏంచక్కగా తిని మళ్లా నాదగ్గిరకొస్తాడు. మనతెల్లావు పాలిచ్చిపెంచి దానిదూడ, నేనూ, పాపాయి గంతులేస్తూ దాగుడుమూచి ఆడుకుంటాము.'

తల్లి: 'ఆటలో తల్లి యెవరుంటారు మరిమీకు?'

బాలుడు: 'మనసంగీతపుచెట్టుచిటారికొమ్మల్లో గూడుపెట్టిన కాకిపిల్లలతల్లి మాఆటలో తల్లి. అవన్నీ నీ కెందుకేమిటి? నీవు మాజతలే నన్నావుగా, నన్ను ఆయినతో వెళ్లిపొమ్మన్నావుగా.'

తల్లి: 'లేదయ్యా! అల్లా అనలేదు. నిన్ను నేను విడిచిపెడతానా ఆయన యివ్వమంటే మాత్రము. మనమందరమూ రేపు ప్రొద్దున్న దాగుడుమూచి ఆడుకుందాములే.' అతనివైపుతిరిగి 'అయ్యా! మీరు పాట విందామని వచ్చినట్లు కనిపిస్తుంది. అక్కడికి వెళుదాముకండి. పల్లెటూరిపాట ఎల్లావుందో చెపుదురుగాని.'

ముప్వురు బయటికి వచ్చినారు.

కోకిలరాగము. పెద్దకుమారుడు కళాయుక్తముగా మధురమందముగా, ఆగి ఆగి వీచుచున్న పెనుగాలి కెగయ జలతరంగములవలె నడుమ నడుమ కంఠము విసరుచు ఉత్సాహోద్వేగముతో, ఉన్మీల నేత్రములతో లేతఅరటిమువ్వలవంటి చేతులు ఊపుచు ఈరీతి పాడుచున్నాడు:

'ఈ చిన్ని సెల యేళ్ల
నీ కొండ కోననే
ఎండిపోనీ వోయి
దేవా! దేవా!
నీ యిష్టమైనచో
నీ ప్రేమ రాశిలో
నిండిపోనీ వోయి
దేవా! దేవా!

ఊదుప్వకత్తెలుకూడా అంత ఉత్సాహోద్వేగముతోనే మధ్య మధ్య బడలికచే గొంతు నొక్కి నొక్కి ప్రతిపదము ప్రతిధ్వనించుచున్నారు.

చిన్నబాలుడు పరుగునవెళ్లి పసిపాప ప్రక్కలో దాచివచ్చిన మణుగుబూరి పట్టుకొని: 'అమ్మా?'—అని ప్రశ్నాప్రకాశితమైన కనులతోనే అడిగి అనుమతిపొంది పసపస నమలుట మొదలు పెట్టినాడు.

ఆమె: 'అయ్యా! యిటుదయచేయండి' అని పసిపాపదగ్గర కాతని తీసికొని వెళ్లి అచట కూరుచుండ జేసి తానుకూడా రెండుబారలదూరములో పసిపాప ప్రక్కలో కూరుచుండి 'అయ్యా! మాకేమున్నది? రైతులకు భూదేవితల్లి పదివేళ్ల పచ్చగావుంటే చూడడమే పండుగ. పచ్చని పొలము బంగారురంగుగా మారిందాఅంటే సంక్రాంతిపండుగ వస్తుంది; యిక అప్పుడు పాటకజనమేమిటి, పక్కా రయితుబిడ్డ లేమిటి ఒళ్లు మరిచి పండుగ జరుపుకుంటారు. కొందరు కోడిపందాలు, కొందరు పొలిమేరమ్మకు వేటపోతులు, వచ్చే కూతుళ్లు, అల్లుళ్లు—యిదే రైతులకు పదివేలు. ఇకమేమో ఆసంక్రాంతి పదిరోజులు మామగవారి పెత్తనము క్రింద ప్రార్థనలు—పొలము బాగాపండించి వర్షములు సమృద్ధిగా కురిపించి తనసంతానాన్ని ప్రేమదృష్టితో ఆశీర్వదించినందుకు ఆపరమపితకు నమస్కారము—చేస్తాము. మాపనులుచూచి వాళ్ళు మేము పిచ్చివాళ్ల మంటారు. వాళ్ల క్రూరమైన నీచమైన కోడిపందాలు, అమ్మవారికి కల్లు వోరబోయిడము యిటువంటివి చూచి మేము చీకాకుపడతాము. ఏమున్నదండీ? మరీ ఈకాలవక్రింద వూళ్లలో తృణకాష్ఠజలసమృద్ధిగా వుండడము, ఈ పశువులను సరియైన త్రోవలో నడిపే పశువులకాపరిలేక పోవడమువల్ల కన్నుమిన్ను గానకుండా వున్నారు. ఏమైనా ఎంతచెడినా బస్తీవాళ్లకంటే చాలా మడుగులు వీళ్లు నయిపేలెండి. ఇప్పుడు కాక పోతే వొకప్పటికైనా మోక్షమున్నదని ఆశవొకటైనా వుంది.'

ఆతడేమో ఆలోచించుచు వినుచున్నవానివలె నంతదనుక కూరుచుండి 'అయితే యేమమ్మా! కడమా పొలాలేవీ అంత పచ్చగా వున్నట్టు కనిపించవు; ఈచుట్టుప్రక్కల అప్పుడే వూడ్చివేసినట్లు కనిపిస్తుంది. యేమి కారణము?' అన్నాడు.

ఆమె: 'చెప్పడము లేదండి. పొలము చక్కగా దుక్కిదున్ని జాగ్రత్తగా వొళ్లువంచి దమ్ముచేసి ముదురుగా వూడిస్తే భూమా పాడుకాదు. పంటా బాగాపండుతుంది. ఈ చుట్టూ పచ్చగా కనిపించేదంతా మనదే. దీన్ని దేవుడుచెర్వుపొలమంటాము; ఇది అరవయియొకరాల ఖండ్రిక. అందరికన్నా ముందుగా ముదురుగా వూడ్చవలెఅని మామగవారి పట్టు. ఈ యేడు అల్లాగే చేశాము. నిరుడు ఈకనిపించే అరుమడులూ చెఱకు వేయడమువల్ల కొంచెము చెల్లాచెదురైనయి. ముందు యీమడులు బాగుచేశి మరీ తర్వాత తక్కిన మడులు దమ్ముచేశాము. అదృష్టవశాత్తు నిరుడు చెఱుకుపంట సమృద్ధిగా పండింది: పదిరాళ్లు చేతులోమోగినయి. ఆపై సంవత్సరము— ఆయీశాన్యపుమూలగా యీతచెట్టువున్న గట్టు చూశారూ, అక్కడ సామర్లకోటఫారమునుంచి తెప్పించి క్రొత్తరకము అరటిచెట్లు వేశాము. ఓపికతో శ్రద్ధతో చెమటపూడ్చి యిద్దరమూకూడ అందులో పనిచేశాము. కన్నుచెదిరేటట్టుగా కంపెనీ చక్రకేళీగెలలు కాచినవి. ఇల్లాగే శ్రద్ధగా పనిచేసుకుంటే ఫలము దక్కుతుంది. మావూరి వాళ్లకు భూదేవిమాటే మరుపుకు వచ్చి మత్తెక్కి రెండురాళ్లు చేతులో వేసుకొని బస్తీమీదపడి నానాపాడు అవుతున్నారని చెప్ప లేదటండి. పొలమంటే హాయిగా మెల్లగా పనిచేసుకుంటే యెంతోదయతో అది ఫలితము చేతికందిస్తుంది. ఈకాస్త పని కూడా మాకైతు పోకిల్లాలకు భారమై పోతూంది. కోతలైన తర్వాత దంటుతడుపు పెట్టే పొలాలకు దంటుతడుపుపెట్టవలె, మెరకవేసిన ఒడ్డుమళ్ళు మరమ్మతు చేయవలె, గొర్రెల పెంటకట్టేదానికదీ, పాటి మట్టి పోయివలసినదానికదీ, మెరకపల్లాలు బాగుచేసుకోవడము, ఆకుమళ్ల చెరువు మెరకవేస్తే మళ్ళీత్రవ్వించ డము, చిదికిపోయినగట్లు మరలాపోసుకోవడము—ఒకటేమి టండీ వేయిన్నూరు పనులున్నవి భూదేవికి

చేస్తే. గట్లమైన జనుము, కంది వేస్తే పండుతుంది. పొలము గొడ్లుతొక్కి పాడుచేయకుండా కనిపెట్టి జాగ్రత్తచేసుకుంటే భూమి పాడవదు. ఇవన్నీ చిన్న విషయాలే. అందుచేతనే మరీయెక్కువ శ్రద్ధతో గమనించవలె. మామగవారు జాగ్రత్తగా యివన్నీ చూచుకుంటూరు. నాకూ పిల్లలకూ చదువు చెపుతారు. కోఆపరేటివు యూనియన్ పనిచూచుకుంటారు. ఇప్పుడు బిల్డింగు సొసయిటీ వొకటి పెట్టవలె అని ఈ నడుమనే ఇంగ్లండుకువ్రాసి నేషనల్ బిల్డింగు సొసయిటీవారి దగ్గరనుంచి యావత్తు భోగట్టా తెప్పించేరు. ఏదో యీ విధముగా క్రిందపడుతూ, మీదపడుతూ కాలము వెళ్లబుచ్చుతున్నాము.'

అతడు: 'అబ్బా! యెన్నివిషయాలు క్రొత్తవి తెలిసినవండీ యీరోజున. మీవంటి స్త్రీలుపదిమందివుంటే దేశము బాగుపడదటండీ?'

ఆమె: 'నాశక్తియేమున్నదండీ. ఆయన అన్నీశ్రద్ధతో నాకుబోధచేస్తూ వుంటారు. అవన్నీ మనసుకు పట్టించుకుంటాను. చేయగలిగినంతా సాయపడుతూ ఉంటాను.'

అతడు: 'అయితే యేమమ్మా! ఎంతతృప్తి, ఎంత ఆనందము ఈ పనుల్లో ఉన్నప్పటికీ యీనడిపేవిలో మానవపురుగు సంబంధము లేకుండా వుంటే లోకముతో సంబంధము తెగిపోయినట్లూ, వొంటరితనముగాను బెంగగాను ఉండదూ? మీరేమో, మీపొలాలేమో అయితే ప్రపంచమెల్లా నడుస్తూందో ఏమేమి రోజురోజుకి క్రొత్తవిశేషాలు జరుగుతూన్నవో తెలియకపోతే నడిసముద్రము మధ్యదీవిలో వున్నట్టు కష్టముగానూ, లోటుగాను అనిపించదూ?'

ఆమె: 'ప్రపంచపు సంగతులు తెలియకేమండీ? తెలుగులో ఆంధ్ర, కృష్ణా, ధర్మసాధనీ పత్రికలు; ఇంగ్లీషులో బొంబాయి టైమ్సువార పత్రిక, హిందూ వారపత్రిక, మాడరన్ రివ్యూ వస్తవి. ఇవి నన్ను, పిల్లలను, పనివాళ్లనుయెదట కూర్చోబెట్టుకొని ఆయన చదివి వినిపిస్తూ వుంటారు. ఇంకా విదేశాలనుంచికూడా పత్రికలు వస్తవిలెండి'.

అతడు: 'ఓఅల్లాగటండీ. అయితే కేవలము స్వర్గలోకమండీ మీది. ఏమేమి పత్రికలు వస్తవండీ, విదేశాలనుంచి.'

ఆమె: 'అమెరికానుంచి లిటరరీ డైజస్టు, ఫిజికల్ కల్చరు, ఎగ్రికల్చరిస్టు, ట్రూస్టోరీ; ఇంగ్లాండు దేశమునుంచి మాంచెస్టరుగార్డియను, అవుట్ లైను, టిట్ బిట్సు, టవున్ అండు కంట్రీహోమ్సు, ఆస్గొని పత్రికలు ఆదివారమునాడు ఫారిన్ మెయిలు రోజున వస్తూవుంటవి. ఏవో యివీ అవీ చదువుకుంటూ, కబుర్లుచెప్పుకుంటూ, మధ్య మధ్య పొలముపని చూచుకుంటూ—అన్నట్టు మరిచిపోయినాను పూలతోట చూపిస్తాను రండి' అన్నది.

ఆమెవెంట నాతడు, బాలచంద్రుడు బయలుదేరినారు. రెండు అడుగులువేసిన తర్వాత బాలచంద్రుడు పట్టుకొనిన తల్లిచిటికెనవ్రేలు వదలి రెండుగంతులువేసి ప్రత్యేకమేర్పరుపబడిన గూటిలోనున్న పొదకోడిని పట్టుకొనివచ్చి తల్లి కెదురుగావెళ్లి ఆమెనాపుజేసి కోడిరెక్కల విడదీసిపట్టుకొని 'అమ్మా! నాకుకూడా యిటువంటి రెక్కలే వుంటే నా చెట్లు ఎక్కకుండానే నేరేడిపళ్ళూ, తాటిపళ్ళూ, కొబ్బరిబొండాలూ కోసుకొచ్చి ఒక్కగంతులో నీకివ్వకపోయేనూ—అమ్మా! యింకా యేమిచేస్తానో తెలుసా? ఎప్పుడు

బెంగపుట్టితే అప్పుడే నాన్నగారిదగ్గిరికెళ్లి ఆనుమళ్ల చెరువులో వాల్తాను.' ఆమె చెంగుపట్టుకొని లాగుచు ఆమె కనులవంక చూచుచునె అన్నాడు.

అతడు: 'పోనీ నీపాదకోడిసెక్కి ఎగిరి రారాదూ మావూరికి త్రోవ చెపుతాను.'

బాల: 'అల్లాయెక్కియెగరడమే చేతవస్తేనా మీవూరువచ్చేదాకా నాకేమిపని; యీపాటికే లాహోరు వెళ్లి లజపతిరాయుని'

తల్లి: 'బాలా——'

బాల: 'లేదండి, పోనీలెండి, ఆగోజున లజపతిరాయి చచ్చిపోయాడని తెలియంగానే మాయమ్మ, మానాన్నగారు ఏడ్చారండీ. నేనుకూడా యేడ్చానండీ! పాపం,——'

తల్లి నవ్వుచు సంభాషణమార్చే యుద్దేశముతో 'నాయనా! పాదకోడిసెక్కి చందమామదగ్గిరికి వెళ్లరాదూ, నీకు పెద్దన్నయ్య అవుతాడుగా అతను' అన్నది.

బాల: 'అవునమ్మా! నిన్న చందమామ మేఘాలతో పరిగెత్తలేక వెనుకపడిపోతే మనమంతాచూచి నవ్వుకోలేదూ! ఏమి పిచ్చిఅన్నయ్యా! యింతేనానీపస అని చెప్పివద్దామనుకున్నాకూడాను——అమ్మా! అటు చూడు కొండమీద నల్లమబ్బులు ఎల్లా పరుగెత్తుతున్నయ్యో. వాటి తోటి సమానంగా భూమిమీద నేనూ పరిగెత్తగలను.'

నూతనుడు, ఆమెకూడా ఒకేసారి ఆకసము వంకజూచి:

ఆమె: 'ఎంతలో మబ్బులు క్రమ్మేసినయి'

అతడు: 'అవునండీ, ఈమాటల సందడిలో మనము చూడనేలేదు' అన్నాడు.

బాలచంద్రుడు గంతులు వేయుచు 'అమ్మా! చినుకులుపడుతున్నయ్యే'అని

'వా నా లు కు ర వా లి
వ రి చే లు పం డా లి
మా గ రి సె నిం డా లి
బు డు గో, బు డు గో!
మా దా సి దం పా లి
మా య మ్మ వం డా లి
మా బొ జ్జ నిం డా లి
బు డు గో, బు డు గో!

అనుచు పరుగెత్తి పోయినాడు.

చటాలున వెనుకకుతిరిగివచ్చి బాలచంద్రుడు: 'అమ్మా! వానకురిస్తే నేలంతా తడుస్తూవుంది; కొండ తడవలేదేమే?' అన్నాడు.

తల్లి: 'కొండతడవదు నాయనా! అక్కడ సూర్యుడుండి తడవకుండా కాపాడుతాడు.'

——మిగిలియున్నది.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కు పలుకులు

శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

ధిమిత ధిమిత—
ఏమిధిమిత?
పసుపుధిమిత—
ఏమిపసుపు?
వంటపసుపు—
ఏమివంట?
పిండివంట—
ఏమిపిండి?

తెలకపిండి—
ఏమి తెలక?
గొఱ్ఱె తెలక—
ఏమిగొఱ్ఱె?
పాలగొఱ్ఱె—
ఏమిపాలు?
జెముడుపాలు—
ఏమి జెముడు?

పాతజెముడు—
ఏమి పాత?
గోచిపాత—
ఏమిగోచి?
పట్టుగోచి—
ఏమిపట్టు?
చెంప పెట్టు—

౨. పాటలు

## నిశాప్రార్థనము

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు

మాపాలిదైవమా! మీపాలిధనమ!
మాపాలిభాగ్యమా! మాదుఫలంబ!
మాపాలిపెన్నిధి! మమ్మేలుప్రభువ!
మముగన్నతల్లియు మాతండ్రినీవె
మాగురుదైవంబు మాబంధుజనులు
మాగృహారామంబు మాధవ! నీవె
మిత్రులు పుత్రులు మించుసుఖములు
రాత్రియందీవని దలచితిమయ్య!
దినమెల్ల సుఖముగా దిరుగగజేసి
ఘనబుద్ధిబలమున పనుల జేయించి
మనసిచ్చినావయ్య! మముగన్నతండ్రి!
నెనరుతో దండముల్ సర్పింతుమయ్య!
రాతిరయ్యెనుసిదే రావయ్యతండ్రి!
ప్రీతితో మమ్మిపుడు పాలింపుమయ్య!
నిద్రాతిశయమున నొడలెఱుంగకను
ఇద్ధరిత్రిని మేను లింపుతో జేర్చి
మాప్రాణదేహముల్ మాధనంబులను
మాగృహారామముల్ మాబంధుజనుల

జాగ్రతతో గాచు దొరనీవయనుచు
నీవశముజేసితిమి నీవతోడయ్య!
జారచోరాదుల జేరంగనీక
క్రూరమృగంబుల బారిబడనీక
విషజంతువులు మమ్ము వీక్షింపనీక
విషరోగంబు మా వెరవు రానీక
కాచిబ్రోవవె తండ్రి! కరుణాసముద్ర!
బ్రోచి రక్షించవే బంగారుతండ్రి!
చిరునవ్వుముఖమున చిందులాడంగ
కనులయానందంబు కడువెల్లివిరియ
ముద్దుకారు ముఖంబు మిసమిసలాడ
యద్దంపుచెక్కిళ్లు యెంతయు వెలుగ

నిగనిగలాడెడు నీమేనిమెరుగు
ధగధగమని మీదువృక్కులదోప
మెరుగుబంగరువల్వ మేనిసొబగునకు
మెరుగివ్వ వెల్గెడి మేల్మిభూషణముల్
తేనెగారెడు మంచి తెలిపువ్వములను
బూనినహారంబు భుజములవ్రేల
గానలోలుండవై కడునింపుతోను
గానుపింపవె తండ్రి! కలలోనుమాకు
మానకనీవు మామానసంబునను
గానుపించుము దేవకరుణతోనెప్పుడు
దండంబు దండంబు ధర్మస్వరూప!
దండంబు దండంబు దయజూడుకృష్ణ!

### 3. బుద్ధిపరీక్ష

## యుక్తిలెక్క

శ్రీమతి పాణకా రమణమ్మగారు

[ఇది బాలురయు, బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనది. కావున ఈ యుక్తిలెక్కకు ఉత్తరము స్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడిన బాలబాలికలు ఏప్రియలు 10-వ తేదీలోపున లేఖాముఖమున మాకు తెలియజేయ కోరెదము. సంపాదకుడు

ఈ క్రింది చక్రములో ఎనిమిది గడులున్నవి. అంచులయందు ఏప్రక్క చూచినను అవి 3 గడులు వరుసగా వచ్చునట్లు ఏర్పాటు చేయబడి యున్నవి. చూడుడు.



ఏప్రక్క చూచినను 16 కాయలు ఉండునట్లు 56 గచ్చకాయలు ఆగడులలో పెట్టవలయును. మరల ఆగచ్చకాయలన్నియు పోగుచేసి వానిలోనుంచి 20 కాయలు తీసివేసి మిగిలిన 36 గచ్చకాయలును తిరిగి ఆగడులలో ఏప్రక్క చూచినను ఆ 16 సంఖ్యగల కాయలే ఉండునట్లు పెట్టవలయును. ఎట్లు?

# నమ్మి కొలిచినవారికి నాశము లేదు

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రిగారు

పాంచాలపురపాలకుఁడు, మృగయాలోలుఁడునగు దుర్జయుఁడు మృగయోచితపరికరంబులంబట్టి యనేకములగు బోయసైన్యముతో నరణ్యమును బ్రవేశించెను. వేఁట యారంభమయ్యెను. సైనికు లొకవంక, రాజొకదిక్కు సింహశార్దూలాది మృగనికాయంబుల రూపుమాపుచుండిరి. అట్టి సమయమున చండకుఁడను నొక సైనికుఁడు మృగముల నెమకుచుఁ బోవుచుండగా నాయరణ్యములో నొక స్థలమునఁ బాడుదేవాలయ మొకటి కనుపించెను. వెంటనేవాఁడు పోయి దానిఁదిలకించఁగా లోగుడిలో నొక శివలింగము పొడగట్టెను. మహాభక్తుఁడగు నాసైనికుఁ డాలింగమును నత్యాదరమున శిరమున నిడికొని రాజసన్నిధికిఁబోయెను. రాజు బోయవాండ్రు తన్నుఁబరివేష్టించి కొలుచుచుండ వేఁటబడలికచే నొక చెట్టుక్రింద నాసీనుఁడై యుండెను. అప్పుడు చండకుఁడు శివలింగమును దించి రాజునకు తనకది దొరికిన విధమును వివరించి "ఓ మహారాజా! నాకీ శివలింగమును బూజింపవలయునని కోరికపుట్టినది. ఎట్లు పూజింపవలయునో శలవీయఁగలందులకు వినయముతో వేడుచున్నాను." అని అడిగెను. రాజు సేవకుని భక్తివిశేషమున కచ్చెరువంది "చండకా! వినుము. నీవు ప్రతిదినము వేకువను మేల్కాంచి, కల్యకృత్యము నిర్వర్తించి; స్నానమునుచేసి, ధౌతవస్త్రముల ధరించి, అనంతరము శివలింగమును శుద్ధోదకముతో శుభ్రపరచి గంధమలందుము. పిమ్మట పురాణోక్తవిధినిఁ బూజింపుము. ఆసమయమున స్మశానభస్మను శివున కర్పింపుము. దానిచే శివుఁడు పరితృప్తుఁడగును. అట్లుచేసిన శివసాయుజ్యము నీయరచేతిలోనిదని నిశ్చయించుకొనుము." అని చెప్పెను. ఇట్లు రాజు చెప్పినమాటలు గురూపదేశముగాఁ దలంచి ప్రభువర్యునకు వందనశతము లర్పించి చండకుడు రాజుతో స్వగ్రామము చేరుకొనెను. నాఁటఁగోలె రాజు చెప్పిన ప్రకారము ననుదినము పూజఁజేయుచుండెను.

ఒకనాఁడు చండకుఁడు యథారీతిని బూజ కారంభించెను. చితాభస్మ నర్పించుటకై యాపాత్రను జూచెను. దానిలో భస్మ లేదు. అప్పుడు చండకునకు మతిపోయెను. ఏమి చేయఁగలడు? భస్మకై వెదుకనారంభించెను. ప్రొద్దుతిరిగి పోవుచున్నది. భస్మదొరుకుట లేదు. చుట్టుప్రక్కలఁగల గ్రామములుగూడ శోధించెను. ఎచ్చటను లభించుటలేదు. పూజఁజేయక భోజనము చేయఁడు. అది గురూపదేశము. గురూపదేశము నతిక్రమించిన సర్వము వ్యర్థముకదా? భగవంతునిపై భారముంచి విచారింపుచుండెను.

ఆబోయవాని భార్య సర్వోత్తమురాలు. భర్తను మించిన భక్తురాలు. ఆమె దీనాననుఁడగు భర్తనుజూచి "ప్రాణనాథా! యెందులకు ఖిన్నులై యున్నారు? దయతో శలవిచ్చిన ఈమీదాసి అందు పాల్గొనుటకు సిద్ధమయి యున్నది" అనెను. అనవుడు బోయవాఁడు "ప్రేయసీ! చితాభస్మ లేనందునఁ బూజయాగిపోయినది. ఏమియును దోఁచుటలేదు. అందుచే నిట్లు విచారించుచున్నాను. ఎచ్చటను లభింపదాయెను. ఏమి చేయఁగలను?" అనెను. నావుడు బోయెత "ప్రాణేశ్వరా! యిట్టి స్వల్పమున కింత విచారమేల? మీసేవకురాలున్నది కాదా? నేనొక యుపాయము చెప్పెద. వినుడు. కట్టెల సిద్ధముచేసి యొకచితిని చేర్చుడు. దాని కగ్నిఁదగిలింపుడు. ఆయగ్నిలో నాశరీరము శివప్రీతిగా నాహుతిఁ జేసెదను. నాభస్మను శివునకర్పించి కృతార్థతఁ జెందుడు" అని పలికిన ధర్మపత్నివాక్యము లాకర్ణించి చండకుఁడు ఆమె మనోధైర్యమున కచ్చెరువంది "ప్రాణేశ్వరీ! నీవు చాలఁజిన్నదానవు. సంతానములేదు. సంతతిలేనిచో సద్గతికి దూరులమగుదుము. మఱియొక యుపాయ మేదైన నరయుము." అని చెప్పెను. నావుఁడు బోయెత "నాథా! ఈ శరీరమునకు స్థిరత్వములేదు. రేపో నేఁడో నశించును. ఇట్టి తుచ్ఛశరీరమును భవనాశకుఁడగు పరమేశున కర్పించిన దాననే సద్గతిచేకూరును" అనిచెప్పెను. భార్యపలుకు లాలించి వాడు యెట్టకేలకు నామె చెప్పినయుపాయమునే యంగీకరించెను.

పిమ్మట చితినొకదాని సంసిద్ధపరచెను. అగ్ని నంటించెను. అంతనాతని ధర్మపత్ని పరమేశ్వరుని ధ్యానించుచు స్నానమొనర్చెను. శరీరమునకు పసుపు నలందికొని, గంధము పూసికొని, పుష్పమాలలచే నలంకరించుకొనెను. ముఖము పసుపుకుంకుమములచేఁ గలకలలాడు చుండెను. తరువాత నామె భర్తకు నమస్కరించి, చితికిఁ బ్రదక్షిణముచేసి చితిలోఁబడి భస్మమాయెను. ఆబోయవాఁడు ఆభస్మచే శివప్రీతి చేసెను. పిమ్మట శివుని ధ్యానింపఁ దొడంగెను. ధ్యానపరవశుఁడై మైమఱచెను. వెనుక జరిగిన సంగతి మరచిపోయెను. శివున కారగింపుకుఁ బ్రసాదము తెమ్మని భార్యను బిలిచెను. అప్పుడు భక్తపరాధీనుని యనుగ్రహమున నాతనిభార్య ప్రసాదము నొక పళ్లెరములో నుంచి భర్త సన్నిధి కేతెంచెను. చండకుఁ డాశ్చర్యమునొంది భక్తవత్సలుని విలాసమును వేనోళ్లఁ బొగడెను. పిమ్మట భార్యతోఁగలసి శివున కారగింపు చేసెను. భగవంతుని నమ్మికొలిచినవారి కెందును నాశములేదు. అట్టివారికి గలుగు కష్టములు వారి మనోద్రఢిమను పరీక్షించుటకు భగవానుడు కల్పించు విలాసములు.

౫. బోధనావిధానము

# రామం చదువు

ఆండ్ర రంగారావుగారు

కందకులేని దురద బచ్చలికివచ్చునా? కన్నతండ్రికే శ్రద్ధలేనపుడు మేనమామకు వచ్చినదా? చదువీడువచ్చిన రెండుసంవత్సరములవరకు ప్లీడరుగారి కుమారుడైన రామము నకు చదువేలేదు. తరువాత అక్షరాభ్యాసము చేసిరి. ఆతనికి యింటివద్దనే చదువు చెప్పుటకై ఒకఉపాధ్యాయుని నెలకు ఎనిమిది రూపాయిలపై నియమించిరి. ఒకదినమున రాముము అతనిస్నేహితుడును ఈక్రిందివిధమున మాట్లాడుకొనిరి.

"రామం! నీవు యింటివద్ద చదువు చెప్పించికొనుచున్నను నీకేమీ రాదేమి?"

"రాజూ! నీవేమోఅనుకొనుచున్నావుగాని నేను ఎందుకువచ్చిందిరా భగవంతుడా అని మాపంతులుగారిదగ్గిరకూర్చుంటున్నాను. కాని నేనేమీ పాఠాలు చదువుటలేదు. నాకెందుకు చదువు? నాకు సంవత్సరానికి రెండువేలరూపాయిలు వచ్చునని మామామ చెప్పగా విన్నాను. నాచేత చదివించలేక కోపమెక్కువయిపోయి మాపంతులు నన్ను కొట్టిన దెబ్బలకు నాశరీరము కాయలుకాచినది. బండతేరినది. ఇంకనన్నెన్ని కొట్టినా నాకు లక్ష్యములేకుండాపోయినది. నేను పాఠములు చదవను. కొట్టుటచేతతప్ప మఱియొక పద్ధతిచేత నాచే పాఠములు చదివించు నేర్పు ఆయనకులేదు. కొట్టిన నేను లెక్కచేయు వాడనుకాను".

"రామా! నీవు యీవిధముగాపాడగుటకు కారణం ఏమిటో చెప్పవూ?"

"రాజూ! నీకు నేను పాడగుచున్నట్లు కనిపించుచున్నదంతేకాని నాఅంతహాయిగా కాలముగడుపు పిల్లవాండ్రను చూపించు. ప్రొద్దున లేవగనే చద్దిభోజనము తరువాత తొమ్మిది గంటలవఱకు ఏగోళీకాయలో గోటీబిళ్లలో ఆడుకొనుట. పదిమొదలు పండ్రెండువరకు మాపంతులుదగ్గిర చదువు. పిమ్మటభోజనము. రెండుగంటలపర్యంతము నిద్ర. అప్పటినుంచి యూరిచుట్టు తిరుగుట. నాయిష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టుకొనుటకు మానాన్న నెలకు పదిహేనురూపాయిలు పంపించుచున్నాడు. మాపంతులు నాకు చదువు ప్రారంభించి సుమారు రెండువత్సరములైనది. కాని యిప్పటివరకు నాకు వాచకమేనియు సరిగా చదువుటరాదు. మొన్న పరీక్ష చేసెదనని పంతులు తెల్పినాడు. సరేనని కూర్చున్నాను. మాపంతులు ఏవేవో ప్రశ్నలు కురిపించినాడు. జబాబు చెప్పుటకు నాకేమన్నా వస్తేకదా?

పంతులు కళ్లెఱ్ఱచేశాడు. పళ్లు పటపటకొరికినాడు. కోదండరాముణ్ణితీసి క్రమపడ్డాడు. ఆయన చేయ్యే నొప్పిపెట్టినది. దెబ్బలంటే లక్ష్యములేకుండా పోయిన నాశరీరానికి బాధకలుగచేయగలడా?"

ఈవిధముగా రాము, రామంస్నేహితుడు వీధిలో నిలబడి మాట్లాడుకొనుచుండగా రోల్డు గోల్డు ఫ్రేముగల చలవ అద్దముల కళ్లజోడు, అంచులుకనిపించునట్లు మడతపెట్టి వల్లెవాటుగా వేసుకొన్న శెలంసిల్కు ఖండువా, చమటవల్ల శరీరమున కంటుకొనిపోయిన గ్లాస్గోమల్లు ఆఘారం, సైకిలుకట్టు కట్టిన కలకత్తాఅంచు మల్లుపంచె, కలకత్తావి సగము స్లిప్పర్సు ధరించి టక్కుటక్కుమని శబ్దముచేసికొనుచు వచ్చుచున్న పంతుల్ని చూచెను. "మా పంతులు వచ్చుచున్నాడోయి" అని రాజుతో చెప్పి రామంలోపలికి పరుగెత్తెను.

రామానికి తొమ్మిదోవత్సరంవచ్చినది. ఒకదినమున పంతులుగారు పెట్టుబాధల కోర్వజాలక రామం మామకేనియు తెల్పకుండనే తనతండ్రిని జేరుకొనెను. రామంతండ్రి వద్దకువచ్చి సుమారైదు నెలలాయెను. రామానికి ఎవరును చదువుచెప్పుటలేదు.

ఇట్లుండ ఒకదినమున గోష్పాదమంతజుట్టును, బిళ్లగోచీ గల పంచకట్టు, ఒక కబ్బా, ఒకబోడసరంఅంచు స్వదేశీఖండువా, చంకలో యొకమూటయు ధరించి సుమా రిరువదేండ్లవయస్సుగల యొక యువకుడు వెలవెలబోయిన ముఖముతో ప్లీడరుగారియిల్లు ప్రవేశించెను. ఖద్దరువస్త్రములయందుండు గౌరవమువలన ప్లీడరుగా రాయువకుని ఆసీనునిగాజేసి మిన్నకుండిరి. ఆయువకుడు తనగాథ నిట్లు చెప్పకొనెను.

"నేను బి. ఏ. చదువుచుండగా నాఅర్ధాంగి నన్నుబాసి దివికేగెను. పెళ్లాము పోవుటతోడనే పెండ్లికొడుకులగు భారతపురుషులజాతికే చెందినను నేను మనసార ప్రేమించిన భార్య చనిపోగా నాజీవితాంతమువఱకు తిరిగి వివాహముమాట తలపెట్టనని నాహృదయమున శపథము చేసికొంటిని. అప్పటినుండియు దేశాటనము చేయుచు భోజనము పెట్టుచోట భుజించుచు లేనిచోట మానుచుకాలము వెళ్లబుచ్చు చున్నాను."

వెదుకబోయిన తీగ యెదు రగుటచే ప్లీడరుగా రపరిమితానందుడై "మీపోషణ భారమంతయు నేను భరింపనున్నాను. నాకుమారునికి విద్యచెప్పు"డని యనేకవిధముల తెల్పగా యువకు డందుల కియ్యకొనెను.

మొదటి యెనిమిదిరోజులును రామమునకు క్రొత్తపంతులుగారు కథలును పాటలును చెప్పుచు అనేకవిధముల చదువనిన యిష్టము పుట్టునట్లు చేయ ప్రయత్నించెను.

కాని యీ ప్రయత్నము బూడిదలో పోసిన పన్నీరువిధమాయెను. మన పంతులుగారతనితో గోళీకాయలు, గూటీబిళ్లలు ఆడుట మొదలిడెను. సాయంకాలములందు పంతులు శిష్యుని తనకూడ తీసికొని వెళ్లుచు ప్రకృతిసౌందర్యమును చూపించుచు అతనికి ప్రకృతి శాస్త్రము నేర్పుచుండెను. కాని రామమునకిది చదువని తెలియదు పాపము. తెలిసినచో అదికూడ మానియుండునేమో! పాఠశాలకుపోవు బాలుర నాడుకొనుటకు పిల్చుచుండ వారు "మాకిదే యుద్యోగమనుకొంటివా? మేము చదువుకొనవలెను" అని చెప్పుచుండిరి. రామం ధనముతో పంతులుకూడ సినీమాలకు నాటకములకు పోవుచుండెను. పంతులితనితో ఇట్లు కాలక్షేపము చేయుచుండెనేగాని యితనికి చదువనిన ఇష్టము పుట్టించుటెట్లని మనస్సున పరిపరివిధముల కుందుచుండెను.

ఒకదినమున గురుశిష్యు లిద్దరు రెండు రూపాయిటిక్కెట్లను కొని సినీమాహాలులోనికి పోయికూర్చుండిరి. వారిప్రక్కనే వారింటికెదురుగా నున్న డాక్టరుగారు, వారి కుమారుడు కూర్చుండిరి. డాక్టరుగారితో వారికుమారుడు "నాన్నగారూ! రామంపంతులు రామండబ్బంతయు ఖర్చుచేయుచు అతనితో చిల్లరియాటలాడుచు చదువేమియు చెప్పక అతన్ని సర్వవిధముల పాడుచేయు చున్నాడు. పంతులు ఖద్దరుకట్టగానే అయిందా? చేసేవి గంగాస్నానాలు దూరేవి కుమ్మరిగుడిసెలు అన్నట్లు వారింటియందు రెండుపూటలూ సుష్టుకుర్తుగా భోజనముచేయుచుప్లీడరుగారి ధనము వృథాగా పాడుచేయు చున్నాడు." అని అనెను.

గురుశిష్యు లిద్ద రీమాటలు వినిరి. పంతులు యిప్పటికైనా రామం బాగుపడతాడేమోనని పరమానందం పొందెను. రామం ఆలోచనాసముద్రములో మునిగెను. సినిమాయందు దృష్టిలేదు. ఈపంతులుకు ఇచ్చుచున్న ధనమంతయు దుర్వినియోగమేకదా అని రామం గ్రహించెను. మొదటిపంతులే నయమని అతడు అనుకొనెను. సినీమా సమాప్తమయిన తోడనే వారు యిండ్లకు వెళ్లిరి.

పంతులుగా రుదయముననే శిష్యుని గోళీకాయలాడుకొనుటకై రమ్మని పిలచెను. శిష్యు డాటంకము చెప్పకుండా వెళ్లెను. ఆటప్రారంభమైనది. రామం గోళీకాయ చేతిలో పట్టుకొని నిలబడియుండెను. "అల్లాగు చూచెదవేమి? ఆడు"మని పంతు లనెను. "మీకు మాయింటియందు భోజనం పెట్టుట నాతో ఆడుకొనుటకా? నాకు చదువు చెప్పుటకా?" అని రామం అన్నతోడనే "ఎన్నిదినములకు కృతార్థుణ్ణైతిననిః హృదయములోని సంతోషమును పట్టజాలక నేలపైఁ జతికిలబడి పంతులు పట్టరాని సంతోషమున నవ్వుచుండెను.

రామాని కొనవ్వుముఖము చూచుట తోడనే కోప మపరిమితముగా వచ్చెను. "ఈ నిమిషము నుండియు మీారు నాకవసరములేదు. నాతో మీారు మాట్లాడకుడు." అని రామం యింటికివెడలి జరిగిన విషయము తండ్రి కెఱిగించెను.

పంతులుగారి ఈచర్య అంతయు నెందులకో కొంతవఱకు గ్రహించిన ప్లీడరుగారు పంతులుకొఱకు వెతకుట ప్రారంభించెను. ఆదినమునకు కనబడలేదు. మరునాడుదయమున ప్లీడరుగారు కోర్టునకు వెళ్లుచుండిరి. త్రోవలో భోజనములేకపోవుటచే నీరసముగానున్నను తనలో తాను నవ్వుకొనుచు వెళ్లుచున్న పంతులు అప్పుడు వారికంటబడెను. ప్లీడరుగారు పంతులుగారిని యెన్నియోవిధముల బ్రతిమాలి యింటికి తీసికొనివెళ్లిరి. పంతులుగారు తిరిగివచ్చి మూాడుమాసములైనది.

రామం శ్రద్ధతో చదువు మొదలిడెను. పంతులు అతగాని నొకవత్సరములోనే మూాడవఫారములో చదువగలుగునట్లుచేసెను. తల్లినిబట్టి పిల్లఅన్నట్లు గురువుగారి పూర్వాచారాలు ఖద్దరుబట్టలు రామానికిఅంకురించినవి. రామం మూాడవఫారములోజేరెను. ఈలోగా పంతులు ఆయుర్వేదం బాగాకృషిచేసెను. ఈవిధముగా అయిదువత్సరములు జరిగిపోయెను. రామం స్కూలుఫైనలు పరీక్షలో కృతార్థుడాయెను. గురువుగారివద్ద ఆయుర్వేదంనేర్చుకొనెను. ఊరియందుండువారి కందరకు నోట్లోనాలుకైనాడు. కుమారుడు ప్రయోజకుడాయెనని స్వతంత్రజీవనము చేయగలవిద్య నేర్చుకొనెనని ప్లీడరుగారు పట్టరాని పరమానందమును పొందెను. రామం ప్రాతఃకాలమున లేవగనే గురువుగారికి నమస్కరించి వీరిమూలముననేకదా నేనింతవాడ నయితినని అనుకొనుచుండును.

# ధర్మపత్ని

కందుకూరి రామభద్రరావుగారు

నలినగర్భుని వదనంబున వసియించి
  వేదగానము వినిపించె వాణి
వారిజనాభుని వక్షాన నివసించి
  శ్రీనివాసునిఁజేసె చెలియకమల
సర్వసంగత్యాగి సామేనుగైకొని
  మహిమాఢ్యుఁజేసె నుమాలలామ
సీతమ్మజేపట్టి శ్రీరామచంద్రుఁడు
  క్రూరదానవవంశహారియయ్యె
వారువీరేల? భువనైకవీరులెల్ల
పత్నులంగొని కీర్తిసంపన్నులైరి
మహిమనార్జింప, ధర్మంబు మహినినిలుప
ధర్మపత్నియ చూవె యుత్తమపథంబు.

# విడాకుల చట్టము

## ౧౧

### శ్రీమతి కోడాలి పరిపూర్ణ బాలామణిగారు

కొందఱు స్త్రీలీశాసనమునకై ఆందోళనజరుపుచున్నట్లు తెలియుచున్నది. అది మిగుల సంతాపకరమైన విషయము. అట్టి శాసనము పవిత్రమైన భారత భూమి కాచరణయోగ్యముకాదని నాయభిప్రాయము. బహుపతీత్వముగాని బహుపత్నీత్వముగాని దేశమున కనర్థదాయకములు. పక్షులలోనైన నిట్టి జ్ఞానమున్నది; కొన్ని పక్షులు విజ్జోడులైనచో తిరిగిజోడుకట్టవు. కాన స్త్రీలు వివాహవిచ్ఛేదనముకై బూనుటకంటె ఘోర పాతకము మఱియొకటి యుండబోదు. అట్లు శాసనమునకై యాందోళన జరుపుటకంటె నీచతమమైన కార్యము వేరొకటి యుండబోదు. వివాహవిచ్ఛేదనము చేసికొని స్త్రీలు మఱియొకనికొఱకు వెతకుకొందురా? అతనికాదని పిమ్మట మఱియొకరి కొఱకా? ఇట్లెందఱు? శాసనములో దీనికి హద్దేమి? క్షణభంగురమై తుచ్ఛమైనఈ జీవితమునకిన్ని పాట్లుపడవలయునా? యోచించి చూచినలోకములోనిత్యమేది?




కోడాలి పరిపూర్ణ బాలామణిగారు

యౌవనంబును, రూపంబు, జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములుగావె?

అని మనము వినలేదా? అట్టిచో దుర్నీతికి పాల్పడుట న్యాయమా? విద్య నీతికొఱకు గదా?

ఆ. వె. నీతిలేనివాని నిందింత్రు లోకులు
లేదు సేగి లాతి లేకయున్న

అని మనము వినమా? అదియటుండనిండు. శాసనమువలన పాతివ్రత్యభూషణమునకెట్టి ముప్పువాటిల్లునో ఒక్కసారి తలపోయుడు!

తే. గీ. అనపహార్యంబు, దేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు, గురుతరంబు
భామలకు బతిభక్తియ పరమమైన
భూషణం బిట్టివే పెరభూషణములు?

అని నేర్చి యుండలేదా? అట్టిభూషణము పోయినచో మనకిక కావలసినదేమి? వెండినగలచేతను బంగారు నగలచేతను శరీరమునలంకరించి తిరిగిన చాలునా? ఇది యిల్లాలులక్షణమగునా? మనకు భర్తయే ప్రియమని తలంచవలెను. కాని ఇట్టిపని న్యాయమగునా? భర్తకు మనమే ప్రియము. శాసనముచే ఏల పాతి వ్రత్యమును చౌకచేయవలయును?

సీ. ... ... ... ... హృదయ

సంతోషమునకు సంజననంబు భార్యయచూవె భర్తకు నొండ్లు గావుప్రియము.

అని పంచమవేదమైన భారతమున జదివితిమి. స్త్రీలు తలంచిన తాలైనను కలుగును. కాన పురుషుల మనసుల సంతసింపజేసి వివాహవిచ్ఛేదనమునకై జేయు యాందోళన మాని శాసనము లేకుండనే పురుషులనేక పత్నీవ్రతులై యుండునట్లు వారిని ప్రార్థించుచుండిన ఉభయులకు శ్రేయోదాయకమగునని నాయభిప్రాయము.

## ౧౨
## శ్రీమతి లలితకుమారి

ప్రస్తుతపరిస్థితులలో శారదాబిల్లు ప్యాసగుటచే కన్యకలు జ్ఞానావస్థయందే వివాహములు చేసుకొందురు. అట్టిచో ప్రేమానుబంధమును త్రెంచుకొని విడాకులు చెప్పనెడల అట్టి స్త్రీ సహజచంచలయని లోకము గ్రహింపక మానదు. మరియు చట్టపు సహాయము చూచుకొని కామాంధులు అబలలను వారిపతులనుండి విడదీయుట సంభవించును. పతికి సతిలోబడుట అతిబాల్యవివాహముబోలె పురానుగతసాంఘికదురాచారముగా పరిగణింపక ప్రకృతి సహజదాంపత్యపరమావధిగ ఎన్నుకొనవలెను. విడాకుల చట్టము హిందూ సంఘమునకు అనవసరమే కాక అనుపకారికూడను. విదేశములందు జరుగు విప్లవములు తెలిసి కూడ అత్యధిక నాగరికతాచిహ్నమగు ఈచట్టము అనాగరికులనబడు ఈదేశమువారికి అనర్థదాయకమే కాక ప్రబలసాంఘిక దౌర్జన్యకారకమగునేమోయనిశంక. పురుషులకుకూడ భార్యలతో విడాకులు చెప్పయోగ్యత ఉండరాదు.

## ౧౩
## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

భారతసాధ్వీమణుల కెప్పుడైనను ఏవిషయమందైనను స్వాతంత్ర్యము యుగయుగాలనుండియు వలసినంత కలిగియేయున్నది. ప్రస్తుతమున్నూ కలదు! ఈ స్వాతంత్ర్య మంతర్భూతమై వర్ధిల్లుచున్నది. ఇట్టియెడ స్వాతంత్ర్యము లేదని విచారించుట శోచనీయము; ఇప్పుడు విడాకులచట్టము నేర్పాటు చేసుకొనుటకు ఏవిషయమందైనను భర్తయెడ భార్యగాని భార్యయెడ భర్తగాని ఏదోయుభయులున్నూ దోషారోపణ యొకటి గావించుకొని స్వస్తిచెప్పుకొనుటకని తేలుచున్నది. ఇది వివాహధర్మమునకు తోడుపడు సంస్కరణ యనుట పరిహాసాస్పదము. ఈ విడాకుల చట్టము ఆర్థిక, మానసిక, రాజకీయాది మార్గములకైనను మన భారతీయులకు శ్రేయోదాయకమనిగాని గౌరవదాయకమనిగాని నుడువుట సాహసమనవచ్చును. ఏది ఎట్లున్నను ఈ విడాకులు ఆత్మకులేవుగదా! భారతదేశమునకు ఇప్పుడు విడాకులచట్టముయొక్క ఆవశ్యకత అవసరమనియు ముఖ్యమైనదనియు చెప్పజాలను. పుణ్యాత్ములగు భారతమానవతీమణులు ఈ విషయమును సూక్ష్మస్థూలదృష్టులతో బాగుగా పరిస్థితుల గమనించి మఱియు తీర్మానించెదరని తలంచెదను.

☞ పై మాసమున మఱికొందఱు మహనీయురాండ్ర అభిప్రాయముల వెలువరింతుము.

—సంపాదకుడు.

# "స్త్రీ అబల కాదు"

## ౧

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

[నెల్లూరు ప్రోగ్రెసివు యూనియనువారు ప్రతివత్సరమును ఆంధ్రస్త్రీలకు వ్యాసరచనమున పోటీపరీక్ష నొకదానిని నిర్వహించుచున్నారు. ఈపరీక్షకుగాను పంపబడు వ్యాసములలో నుత్తమమగుదానికి డాక్టరు. కే. యన్. కేసరిగారు ఒకస్వర్ణపతకమును ఇచ్చుచుండుట వాడుక. ఈవత్సరము పోటీవ్యాసము 'స్త్రీ అబల కాదు' అనువిషయమునుగూర్చి. ఇందుకు పండ్రెండుగురు స్త్రీలు పోటీచేసిరి. అందు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసము బహుమానార్హమని పరీక్షాధికారులు నిర్ణయించిరి. బహుమానము పొందిన ఆవ్యాసమిచ్చట పూర్తిగ ముద్రించుచున్నారము. మిగిలినవ్యాసములలోని ముఖ్యభాగములనెత్తి పైమాసము ప్రచురింతుము. శ్రేష్ఠతమమైన వ్యాసమువ్రాసి 'కేసరి స్వర్ణపతకమును' బహుమానమందిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిని ఈపట్టున మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. ఆమె పాండితీగరిమ మాకు సుపరిచితమైనది. ఆమెవ్రాసి పంపువ్యాసములు అక్షరము మార్చకుండనే అచ్చునకీయవచ్చునంతటి నిర్దుష్టములై యుండునని అనుభవముచే చేయెత్తి చెప్పుచున్నాము. శ్రీవరలక్ష్మమ్మగారి శైలిలో ఒకవిధమైన వేగమున్నది. అలతిపదములచే కూర్పబడిన చిన్నివాక్యములా వేగమునకు ముఖ్యపరికరములు. ఆమెకుగల వస్తుపరిశీలనాశక్తి ఆమె వ్యాసములందలి ప్రతివాక్యమున పొడగట్టుచుండును. శైలికి వ్యక్తిత్వము నీయగల సామర్థ్యము, వస్తువులను పరిశీలించుటలో అపూర్వమైనశక్తి, విషయములనుండి మంచినీతిని వడపోసి ప్రదర్శింపగల ప్రతిభ శ్రీవరలక్ష్మమ్మగారికి సహజగుణములు. అవి ఈవ్యాసమున బాగుగ ప్రదర్శితములైనవి. వ్యాసము ముగించుటలో ఈమె కొంత తొందరపాటు చూపించినను ఎత్తుగడ, నిర్వహణమును ప్రశస్తముగనున్నవి. పరీక్షాధికారు లీవ్యాసమునకు నూటికి నలుబదితొమ్మిది మార్కుల నిచ్చిరి. —సంపాదకుడు.]

చరాచరాత్మకంబగు విశాలసృష్టికి హేతువులు ప్రకృతి పురుషులు. పురుషుఁడన పరమాత్మ. ఆ పరమాత్మ స్వరూపముయొక్క సంకల్ప వికారమే ప్రకృతి. ఆ ప్రకృతియే మాయయనియు, శక్తియనియు వేదాంతశాస్త్రమున వచింపఁబడుచున్నది. శక్తియన నేమి? బలము.

శక్తియొక్క తోడ్పాటులేక జగము లుత్పాదింపఁబడుట లేదు, పెంపొందుట లేదు, లయమగుట లేదు. ఈవిశ్వమునందలి ప్రతిపరమాణువును శక్తిసహితమైయేయున్నది. సృష్టిస్థితిలయకారకులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులేమి, దేవేంద్రాది దిక్పాలకులేమి, శక్తిసహాయ

## శ్రీమతి బెసెంటమ్మ

స్త్రీ అబల కాదనుటకు ఆధునిక యుగమున ఈమె యొక్క ప్రబల నిదర్శనము. ఆమె ఎనుబదియేండ్లు నిండిన వృద్ధురాలు. ఎంతటి ప్రయాసమూలకమగు కార్యక్రమమైనను తలపెట్టినచో నిర్వహించి తీరవలసినదే. ఆమె కార్య దీక్ష విశ్రాంతి యెఱుగనిది. ఆమె నామము హిందూదేశమున గృహ నామమైయున్నది. ఆమె జీవితచరిత్ర గమనించువారు స్త్రీకి అబలయను పర్యాయపదము చెల్లదని అంగీకరించి తీరెదరు.

మునసే తమతమకృత్యముల దక్షతతో నిర్వర్తింపగలుగుచున్నారు. సూర్యచంద్రాది గ్రహములును పృథివ్యాపస్తేజోవాయురాకాశముల నెడి పంచమహాభూతములును శక్తి సహాయముననే నిజధర్మముల నెఱపుచున్నవి. ఈబ్రహ్మాండమునందలి స్థావరజంగమాత్మకంబగు సమస్తపదార్థములకును నిట్టి సామర్థ్య మొసఁగుచున్న యాశక్తియెయ్యది గలదో అదియే జగన్మాత, ఆదిశక్తి. శివునియిల్లాలు శివ. ఈమె శక్తికి అధిష్ఠానదేవత. ఈమె పెనిమిటి కర్థాంగమై దేహబలమును గూర్చుచున్నది. ధాతయిల్లాలు వాణి. ఈమె సమస్తవిద్యలకు అధిష్ఠానదేవత. ఈమె పెనిమిటి వాక్కున నిలిచి వాగ్బలమును జేకూర్చుచున్నది. విష్ణువునిల్లాలు రమ. ఈమె సంపద కధిష్ఠానదేవత. ఈమె పెనిమిటి మనఃపీఠమున నిల్చి మనోబలమును గలిగించుచున్నది. వ్యవహారసౌకర్యమునకై ముమ్మూర్తులు కల్పించి మూడభిధేయములఁ బిలువబడుచున్నను యీముగ్వురును మూడుమూర్తులా? కాదు. ఒక్కటే పరమాత్మస్వరూపము. మూడు మూర్తు లొక్కటైనపుడు ముగ్గురు దేవేరు లొక్కటియే గదా! కాన మనోవాక్కాయకర్మంబులకు బలంబు చేకూర్చెడి ప్రకృతి స్వరూపయగు జగన్మాతయు నఖండమే. ఆయఖండజ్యోతిర్మయస్వరూపమునుండి యుద్భూతమైన యొకానొకకళయే స్త్రీ.

కావుననే మనభారతవర్షమున స్త్రీశక్త్యంశసంభూతగా నెన్నబడుచున్నది. శక్తి యన బలమని యర్థముకదా. కాన శక్త్యంశసంభూతయగు స్త్రీ యబలయెట్లగును? కాదు. స్త్రీయొక్క యాత్మబలమనుపమానమైనది. ఒకప్పుడు స్త్రీయొక్క యాత్మబలము బొందితో స్వర్గమున కుద్గమింపగలిగెను. దివినుండి భువికి వాహినియై ప్రవహింపగలిగెను. సూర్యోదయముకాకుండ కాలము నరికట్టగలిగెను. ముమ్మూర్తుల ముద్దుబాలురగావింపగలిగెను. రాళ్లుశనగలు చేయజాలెను. దండధరునితోఁ బోరాడి భర్తృజీవములను గొనిరాగలిగెను. కనులజూడకనే సమస్తమును జూడగలిగెడుశక్తి, చెప్పకయే సర్వమును తెలిసికొనెడు సామర్థ్యము, నస్త్రశస్త్రప్రయోగము లేకయే యెదిరిని నిర్జింపజాలెడు మహామహిమము నాత్మశక్తిచే స్త్రీ సంపాదింపఁజాలెను. అహో! స్త్రీయొక్క యాత్మబలమెంత నిరుపమానము!

స్త్రీయొక్క కంఠమాధురిమయు వాక్సౌజన్యమును నసదృశములు. సర్వసంగపరిత్యాగులై కాఱడవులఁజేరి నిరుపవాసంబుల గడుసుతపంబులు సల్పెడు సంయమివర్యుల నిశ్చలచిత్తములను సైతము చలింపఁజేయఁ జాలినదనినచో స్త్రీయొక్క గానశక్తియొక్క బలీయత వేఱే వివరింపనేల? "శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధాధృతిః క్షమా". స్త్రీల

యందుండెడి సంపద, వాక్కు, స్మృతి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేనేయని భగవద్గీత యందు శ్రీకృష్ణభగవానుఁడు వాక్రుచ్చియున్నాఁడు. కాన శ్రీగీతావచనము ప్రకారము స్త్రీవాక్కునందు దేవాంశగలదు. దేవాంశగలవాక్కు స్త్రీకిఁ గలిగియుండ వాగ్బలమున స్త్రీ లబలలెట్లగుదురు? మృదులము, మధురము, మనోజ్ఞమునగు స్త్రీవాక్కు బహుసత్వము గలది. ఒకప్పుడు స్త్రీవాక్కు మృదులమై దీనజనులయెడ కరుణార్ద్రమై దీనజనోద్ధారక మగును. మఱియొకచో తీక్ష్ణమై యలసులగు దేశీయుల యుత్సాహము నుద్దీపింపఁజేయఁ జాలును. వేఱొకచో కఠినతమమై శత్రుహృదయవిదారణచణమగును. మఱొకచో శాంతమై ధర్మయుతమై మహాసభల ధర్మప్రసంగములఁజేయఁ జాలియుండును. ఒండొకచో లలితశృంగారభావసమన్వితమై రసికజనమనోభిరామమై యలరారును. స్త్రీయొక్క వాగ్బలిమి యెందును నిస్సత్వముగాదు. జనకునితో వాదించిన సులభ, యాజ్ఞ్యవల్క్యునితో వాదించిన మైత్రేయి, ఆదిశంకరునితో వాదించిన సరసవాణి, దండధరునితో ప్రసంగించిన సావిత్రి స్త్రీలవాక్పాటవమును నిరూపింపగల తార్కాణలుగదా!

దేహబలమునగూడ స్త్రీ లబలలుగారు. బలప్రదర్శన మనేక విధములుగనుండును. అందు సమరము సేయుటనునది బలనిరూపణ యందధికమైనది. పౌరాణికయుగమున నేమి, ఐతిహాసిక యుగమునందేమి, చారిత్రక యుగమునందేమి పెక్కుమంది స్త్రీలు యుద్ధముచేసినట్లు గ్రంథములవలన తెలిసికొనుచున్నాము. నేఁడు భారత దేశమునకట్టి యుద్ధావసరములు లేక పోవుటచే తారాబాయి, రుక్మాబాయివంటి బలవంతురాండ్రగు నారీమణులను వినోదార్థముగ సర్కసులలోఁగనుచున్నాము.

పౌరాణికయుగమున సత్యభామ నరకునితోఁబోరి దేహబలమున స్త్రీయబల కాదని నిరూపించెను. చారిత్రక యుగమునగూడ పెక్కుమంది నారీమతల్లు లశ్వారోహణగజారోహణాది విద్యలయందును, సాముగరిడీలయందును, శస్త్రాస్త్రప్రయోగములయందును నిపుణలై యుద్ధములు చేసినట్లు నిదర్శనము పెక్కులున్నవిగదా. కావున దేహబలమున స్త్రీయబలకాదు.

త్రికరణముల చేతనేగాక సత్వరజస్తమంబులనెడి త్రిగుణములచేతను స్త్రీయొక్క బలిమియల్పముగాదని నిరూపింపనగును. ఏది మనస్సుచే మనస్సును జ్ఞానబలముచే జయింపఁజాలునో యది సాత్వికబలము. అట్టి బలమునకు కాయముతో పనిలేదు. మైత్రేయియొక్క జయము, సులభయొక్క జయము, సరసవాణియొక్క జయము యిట్టి సాత్వికబలముతో లభ్యమైనది. మహాభారతములో చెప్పబడిన పతివ్రత దురహం

కారియగు కౌశికుని యహంకృతిని గుర్తించిన దిట్టి సాత్వికయుతమైన జ్ఞానబలము చేతనే. కుసుమముయొక్క శోభ చెడకుండనే భ్రమరము మకరందము నాస్వాదించునట్లు సాత్వికబలము మనుష్యుని శరీరము నొవ్వఁజేయకనే మనస్సును జయించి వశీకృతము గావించుకొనును.

అస్త్రశస్త్రాదిసాధనములచేత నొకరినొకరు జయించుట రాజసబలము. సత్యభామాది శూరనారీమణులు యుద్ధము చేసిన చందమిట్టి రాజసబలమునకుఁజెందినది.

తాటకాదియంగనల బలము తామసగుణయుతమైనది. ఈ తామసబలమునందు నెట్టి ధర్మసూక్ష్మతయు లేదు. కేవలము క్రౌర్యయుతమైన హింసయొక్క వికారమే తామసబలముయొక్క నైజము. త్రిగుణవికార సత్యమునందుగూడ స్త్రీ లబలలుగారను నది నిరూపించుటకే యీయంశము ప్రస్తావింపఁబడినది; కాని గర్హ్యమగు తమోబల విషయమున స్త్రీలబలలై యుండుటయే యొప్పు. ఇఁక యుగవిభాగముచే స్త్రీబలిమిని విచారింతము. వేదయుగమున స్త్రీ పురుషునితో సమానముగ బ్రహ్మవాదినియై వేదములను వేదాంతములగు నుపనిషత్తులనుకూడ రచియించెను. ఏకాగ్రతతో బ్రహ్మ విచారముసల్పి బ్రహ్మసాక్షాత్కారము బడసెను. అవివాహితమై వీరవైరాగ్యము ననుష్ఠించెను. తత్వజ్ఞయై మహాసభలలో తత్వప్రసంగములు గావించెను. సన్యసింపఁబోయెడి పెనిమిటితో శాస్త్రప్రసంగము గావించిన మైత్రేయియు, జనకుని సభలో యాజ్ఞవల్క్యునితో వాదించిన గార్గియు, జనకునితోఁ జర్చచేసిన సులభయు వేదయుగమునకుఁ జెందినవారే. వేదయుగస్త్రీయగు ఆత్రేయి సుమధురసామగానమునకుఁ జొక్కి పశుపక్ష్యాదిజంతుజాలముగూడ నాహారవాంఛమాని తన్మయతతో నిలునబడి పోయెనన స్త్రీ యొక్క వేదపఠనాబలిమి వేఱె వర్ణింపనేల?

పౌరాణికయుగమున స్త్రీ నిజపురుషునకును బరమాత్మకును నభేదము నుపలక్షించి యామహాప్రభావతచే యనేకమహామహిమంబుల జూపగలిగెను. అనసూయ, అరుంధతి, సుశీల, సీత మున్నగు మహాపతివ్రతల కాకరమైన కాలమదియే.

బౌద్ధయుగమున స్త్రీ యొక్కశక్తి మతిలోకమాఉజ్వలముగఁ బ్రజ్వలించెను. ఆనాడు స్త్రీ పురుషునితో సమానముగ శ్రమణియై భోగము లుజ్జగించి, శరీరాభిమానమును జంపుకొని, గురుశుశ్రూషలుచేసి, బౌద్ధమతగ్రంథములు పఠించి, తత్వదర్శినియై గౌతమబుద్ధుని యహింసామతమును బోధింపుచు నానాదేశములు పాదచారిణియై గ్రుమ్మరెను. ఆకాలమున సామాన్య స్త్రీలేగాక కాశీసుందరి, మాలిని, సంఘమిత్ర మున్నగు

రాజకుమారికలు కూడ సన్యాసినులై బౌద్ధమతవ్యాప్తికి మహోత్కృషి చేసిరి. అవివాహిత యగు కాశీసుందరి నిరుపమానశేముషికిని సౌందర్యమునకును మోహితులై రాజకుమారులు కొందఱామెను పరిణయమాడ నుత్సహించి గురువుకడ తత్వబోధలందుచున్న యామెను బలాత్కారముగ గొనిపోవ నంకించిరి. యోగశక్తిచే నామె మింటికెగసెను. అమ్మహాసామర్థ్యమునుగని రాజకుమారులు తమ యకృత్యమునకు సిగ్గిలి పశ్చాత్తాపతప్తహృదయులై యామెను క్షమింప వేడిరి. మాలినియను మఱియొక రాజకుమారి హిందూమతాభిమానియగు తండ్రిచే ప్రవాసశిక్ష వేయబడినదై తాను వెడలిపోవు సమయమున మహాసభలో వారము దినములు తత్వప్రసంగము సేయుటకు తండ్రిచే యనుజ్ఞవడసి ధర్మప్రసంగము చేసెను. విద్వద్వర్యుల తోడను, మంత్రిసామంతాదిమహాజనులతోడను బరివేష్టితుండగు తండ్రి సమక్షమున మాలిని చేసెన ధర్మప్రసంగమునకు సభ్యులు ముగ్ధులై పోయిరి. హింసాప్రాధాన్యమగు కర్మకాండతో నొప్పిన హిందూమతమును తుండెములుగా ఖండించి బౌద్ధమతము నందలి మహోదారతను వివరింపుచుండ ఆ సభాపరివేష్టితులగు పండితులలో నొక్కరికైన యామె వాదమును కాదను సామర్థ్యములేదాయె. అందఱామె వాదమునకు ముగ్ధులై తలలూపుచుండిరి. వారము దినముల యుపన్యాసము పూర్తియయ్యెను. ఎల్లరకును హిందూమతముపంను భక్తితొలగిపోయెను. బౌద్ధమతము నం దనురక్తిగలిగెను. మహాతత్వజ్ఞురాలగు నారాజకుమారికకడ తండ్రి మొదలుగా సమస్తసభాసదులును బౌద్ధమత దీక్షఁగొనిరి. ఒకరుగాదు. ఇద్దఱుగాదు. పదివేలమంది గృహస్థులను హిందూమతాభిమానులైన వారిని నొక్కమాఱుగా బౌద్ధమతమును స్వీకరింపఁజేయ జాలిన పాండిత్యగరిమ యెంత యుత్కృష్టమోగదా? అహో! ఎట్టి వాగ్మిని!

అశోకుని తనయయగు సంఘమిత్ర కేవలము తన దేశమున బౌద్ధమతప్రచారము గావించుటతో దృప్తిగనలేదు. ఆమె బౌద్ధశ్రమణులతోఁ గలిసి సుమిత్ర, జావా, చీనా, జపాను, సింహళము మున్నగు పలుదేశముల కేగి బౌద్ధమతమును వ్యాపింపఁజేసెను. గౌతమబుద్ధుని ప్రేమమయమగు నహింసాతత్వ మానాడు సంఘమిత్ర రమణీయ మంజులసుధామయోక్తుల మఱింత సొబగుదేఱి నానాదేశములఁ దనజయపతాకలను బ్రతిష్ఠింపఁగలిగెను. ఈ విధముగా బౌద్ధయుగపుస్త్రీ తన సేవాపరాయణతచే, నపూర్వత్యాగముచే, కార్యదీక్షచే, వైదుష్యసంపదచే, తత్వజ్ఞానముచే మనోవాక్కాయ కర్మంబుల స్త్రీ లబలలుగారని నిరూపింపఁ గలిగినది.

మహమ్మదీయయుగమున స్త్రీకి ఘోషా. అటు నిటు స్వేచ్ఛగా మసలుటకును జదువుటకును స్వాతంత్ర్యము లేదు. అయినను నూర్జహాను జహనారామున్నగు మొగలాయి రాజకుటుంబస్త్రీలు రాజ్యతంత్రములలోఁ బాల్గొని స్త్రీబుద్ధినైశద్యము సామ్రాజ్యములను బాలింపఁ జాలినదని చాటిరి. ఉయ్యేల లూచుహస్తములే సామ్రాజ్యముల బాలింపఁజాలునను సామ్యము వారివలన సార్థకమయ్యెను.

రాజపుత్రయుగమున స్త్రీయొక్క అపూర్వత్యాగము, క్షమాశీలత యనుపమానము. రజపుత్రకాంతలయొక్క బలప్రదర్శన మొకవిధమైనదిగాదు. అసాధారణమైన మతివిశేషము, అసదృశమైన కార్యదీక్ష, అజేయమైన సంగ్రామకుశలత, అపూర్వమైన ఆత్మార్పణము, అకుంఠితమైన దేశాభిమానము, అనితరమైన యాత్మగౌరవము నాదిగాగల యసామాన్యగుణములచే విరాజితమైనది రాజపుత్రయుగమునాటి నారీవ్యక్తి! ఆయుగపునారీమూర్తియందు స్త్రీయొక్క యంతఃశక్తులన్నియు నసమానముగాఁ బ్రకాశించినవి. ఉజ్వలమై దుర్నిరీక్ష్యమైన యాతేజోరేఖలు ఖండఖండాంతరములును నిప్పటికిని జోహారు లర్పించుచున్నవనినచో యారసపుత్ర నారీరత్నముయొక్క బలశౌర్యములు వేఱె వర్ణింపనేల?

పైనివర్ణితములైన బహువిధనిదర్శనములచే ప్రాచీనకాలమున స్త్రీ యేవిషయమునను ననగా త్రికరణములను, త్రిగుణములనుగూడ అబలకాదని విదితమయ్యెను. వర్తమానయుగమునందును స్త్రీ యబలగా నుండుటలేదు. రాజకీయముగను, సాంఘికముగను, విద్యావిషయమునను, నార్థికముగను, నైతికముగను, కళావిషయముగను గూడ నాధునికస్త్రీబలసంపన్నత యల్పముగాదనుటకు నేడు స్త్రీలు తీర్చుగుచున్న బహువిధ యుత్తమపరీక్షలు, నడుపుచున్న మహాసంస్థలు, చేయుచున్న మహత్కార్యములు, ఇచ్చుచున్న మహోపన్యాసములు, పొందుచున్న మహోన్నత పదవులే తార్కాణ. స్త్రీయొక్క భవిష్యమింతకంటె తేజోవంతమై సత్వవంతమై విరాజిల్లఁగలదు. ఇపుడు స్త్రీలకొనగూర్పఁబడుచున్న నవీనశాసనములు స్త్రీసామర్థ్యమును బహుముఖముల వికసింపఁజేయుటకు సాధనములు కాగలవు. అయితే స్త్రీ కబలయను పేరేలఁగలిగినది? ఈవిషయమింక విచార్యము. స్త్రీయొక్క బుద్ధిశక్తు లవకాశము లభించినచోట నుజ్వలముగాఁ బ్రజ్వలించినను నవి యథేచ్ఛముగా నెపుడునువిజృంభింపఁబడలేదు. పురుషుని స్వార్థమనీషయెప్పుడును స్త్రీప్రాబల్యమునడచివేయుటకే యత్నించినది. స్త్రీకి వేదకాలమున గల విద్యావైవాహిక స్వాతంత్ర్యము స్మృతులకాలమునలేదు. స్మృతులకాలమునగల స్వాతంత్ర్యము

పౌరాణిక కాలమున లేదు. పౌరాణిక కాలమునగల స్వాతంత్ర్యము చారిత్రక కాలమున లేదు. ఈవిధముగా యుగయుగమునను స్త్రీయొక్క సహజశక్తులు, బుద్ధివైశద్యము శాస్త్రవచనముల చేతను, మతవిధుల చేతను, సాంఘిక ములగు కట్టుబాటుల చేతను, ఆచార పాశముల చేతను, కుటుంబపరిస్థితుల చేతను, నవిద్యాప్రాబల్యము చేతను నణచి వేయఁబడు చుండెను. స్త్రీపురుషులమధ్య సమత్వధర్మముపోయి పాలకపాలిత పద్ధతియు, యజమాన బానిసీధర్మములును ప్రవేశించెను. ఇట్టిమర్భరనిర్బంధముల చే క్రమక్రమముగా స్త్రీ పురుషుని భోగోపకరణముగాను, జడపదార్థముగాను మాఱిపోయెను. దురతిక్రమణీయములగు నిట్టి నిర్బంధములు స్త్రీ వికాసావకాశమును నిరోధింపుచుండ నారీహృదయము దుర్బల మగుటలో నాశ్చర్యమేమి? కాని యిట్టి నిర్బంధ పరిస్థితులలోఁగూడఁ సమయము చిక్కి నప్పుడెల్ల స్త్రీయొక్క బుద్ధిబలముగాని, వాగ్బలముగాని, దేహబలముగాని పురుషు నకుఁ దీసిపోలేదు. ఎన్ని నిర్బంధవిధుల బద్ధపఱచినను స్త్రీశక్తిని పూర్తిగాఁ దుడిచి వేయుటకు ఎవరికిని సాధ్యము కాలేదు. అల్పముగానైన స్త్రీసామర్థ్యమును గుర్తింపకుండ నిరసించుటకు ధర్మశాస్త్రములకైన వీలుకాలేదు. స్త్రీసహాయము లేనిపురుషుఁడు నిస్సహా యుఁడు కావునన నేయువివాహితుడగు పురుషుని యర్ధశరీరుఁగా శాస్త్రములు వాకొని యున్నవి. "స్త్రీ పుంసయోరాత్మ శక్త్యోరైకత్వ సంపాదనం వివాహః" "ధర్మార్థకామ మోక్షాణాందారాః సంప్రాప్తి హేతవః" ఇత్యాది శాస్త్రవచనముల చేత స్త్రీయొక్క ప్రాముఖ్యత వివరింపఁబడినది. స్త్రీశక్తిగాని పురుషుని శక్తిగాని యేరియు పరిపూర్ణముగా దనియు, వివాహబంధముచే నీయుభయశక్తుల నేకీభవింపఁజేయుట చేతనే మానవశక్తి యొక్క పరిపూర్ణత యేర్పడుననియు పై శాస్త్రవచనముల తాత్పర్యమని చెప్పవచ్చును. కాన కాలక్రమమున బహువిధవిధినిషేధముల చే దేశమునకు, సంఘమునకు సంబంధించిన ఘనకార్యములకు స్త్రీ దూరము చేయఁబడినను స్వగృహమునందు స్త్రీయొక్క కార్యభార మమితముగనే యుండెను. స్వగృహమున స్త్రీపురుషున కాలోచనఁజెప్పునెడ మంత్రిణిగను, హితముగఱపునెడ నొజ్జగను, నుపచారములు సేయునెడ పరిచారికగను, శృంగారవిలసన మున గృహమునకుశోభ దెచ్చెడిలక్ష్మిగను, గృహచ్ఛిద్రముల సహించునెడ సహనవతియైన భూదేవతగను, భోజనభాజనాది సౌకర్యములు గలిగించునెడల దల్లిగను, భోగావసర మున రంభగను, సుఖోచితసంభాషణల యందానందమును గల్గించెడి మిత్రురాలుగను, ఆపద లనుభవించుతఱి నర్ధాంగిగను స్త్రీ వినియోగపడుచుండెను. ఇంతియేగాదు. దేవ గురుపితృపూజ, బంధుసత్కారము, అతిథియభ్యాగతసమారాధనము, గృహనిర్వాహ

కర్తవ్యము, శిశుపోషణాది బహువిధకార్య నిర్వాహములకుగూడ స్త్రీయే బాధ్యురాలు. ఇన్నికార్యభారములు తనశిరముపైఁగల నారీమణి యబలయగుటకు సాధ్యమా? గర్భధారణాది క్లేశములుగూడ నీశ్వరు డబలపైనే యిడెనుగదా.

అయినను సహజముగా కోమలహృదయయు, మృదులవచనయు, శిరీషకుసుమపేశలసదృశసుకుమారశరీరయునగు మనభారతమహిళకు బహుకాలముగా నబలయను నామము వాడుకయందుఁగలదు. ఈయబలానామముయొక్క ఉత్పత్తికి హేతువులు తొలుదొలుత పురుషునకు స్త్రీయందుండెడి ప్రేమయు, గౌరవమును, కారుణ్యమును కారణముగావచ్చును. కాని రానురా నీయబలాభిధేయము స్త్రీకి బంధహేతువై పోయినది. ఏమన? 'అబల' గదా యేమిచేయు ననుభావము మగవానికిని, 'అబల' ను నేనేమి చేయగలననుతలంపు స్త్రీకిని మనస్సున నాటిపోయినది. ఇందువలన స్త్రీయసనచులకన మగవానికిని, స్వసామర్థ్యమునం దవిశ్వాస మాడుదానికిని యేర్పడినది. బహ్వానర్థదాయకమగు నీయబలానామము స్త్రీజాతికిఁ గలిగించిన నష్టము కొంచెముగాదు. అయితే యీయబలానామము భారతదేశముననేగాని పశ్చిమఖండములలో లేదు. పాశ్చాత్యదేశములలో స్త్రీయొక్క యబలానామ మిదివరకే తుడిచివేయఁబడినది. ఆ దేశమునందలి స్త్రీ మతసాంఘికరాజకీయార్థికసారస్వతకళాద్యనేకవిషయములందు పురుషునితో సరితూగి, యొకచో మిన్నయై తనశక్తి సామర్థ్యములు పురుషునిశక్తి సామర్థ్యములకుఁ దక్కువగాదని నిరూపించియున్నది. కావుననే యాదేశమునందలి పురుషవరేణ్యులు స్త్రీయొక్కశక్తినిగూర్చి యిట్లు వ్రాకుచ్చియున్నారు. "* స్త్రీలు బుద్ధిమంతులైనచో వారొక గొప్ప శక్తికాగలరు.... స్త్రీయొక్క ఆశీర్వాదయోగముచే ప్రపంచమున నూతనశక్తి యావిర్భవించునని నా విశ్వాసము." హెన్రీఫోర్డు కోటీశ్వరునియొక్క యీ యభిప్రాయ మఖిల పశ్చిమఖండాభిప్రాయమని చెప్పనొప్పును.

నేటి భారతదేశావసరములుగూడ స్త్రీ యబలానామముయొక్క యనర్థకమును గుర్తింపవలసినదిగా నున్నవి. సర్వతోముఖముగా పునర్నిర్మాణమును గోరుచున్న భారతదేశమున స్త్రీయొక్క సహాయ మత్యవసరము. స్త్రీయొక్క సహాయములేక యేమతము గాని వ్యాప్తినందదు. ఏసాంఘికవ్యవస్థయుఁ జక్కఁబడదు. ఏసంస్కారముగాని ప్రచార

* కృష్ణాపత్రికలోని దాంపత్యధర్మము అను హెన్రీఫోర్డు అమెరికా కోటీశ్వరుని వ్యాసమునుండి గ్రహింపఁబడినది.

మునకురాదు. పశిథిలరాజ్యముగాని పునరుద్ధరింపఁబడదు. ఏపరాధీనదేశముగాని స్వాతంత్ర్యమును బడయుదు. కాని భారతమహిళ తనశక్తిని గుర్తింపక యింకను 'నబల' నను భావముతో నుండుట దేశపురోవృద్ధికి భంగకరము. ఎప్పుడు స్త్రీ పురుషునితోఁబాటు తన మనోధృఢిమను, ధీశక్తిని, వాగ్నైపుణిని, దేహబలమును దేశపురోభివృద్ధికి వినియోగించునో యప్పుడే యేదేశమైనను సత్వరాభివృద్ధిఁగాంచును. అయితే స్త్రీయందంతర్గర్భితమై నిద్రాణమైయున్న యీమహచ్ఛక్తిని జాగరిల్లఁజేయు కర్తవ్యము మాత్రము పురుషులది. మహాప్రభావముగల నీశక్తియే యుద్దీపించెనేని దానిఫలము సామాన్యముగాదు. అవకాశ మొసగినచో స్త్రీశక్తి రాజ్యముల నిర్మించును. రాజతంత్రముల నడుపును. యుద్ధములఁజేయును. శాస్త్రములరచియించును. కవితలల్లును. కళలఁబోషించును. ప్రసంగముల సల్పును. శూరులఁ బుట్టించును. జ్ఞానుల నుత్పాదింపఁజేయును. దేశభక్తుల ప్రసాదించును. పండితప్రకాండుల నొసంగును. కళాకోవిదుల సృష్టించును. అహా! స్త్రీమేధ కతీతమైన విషయ మెద్దిగలదు? సమస్తపదార్థయుత్పత్తికిని భూదేవతవోలె, సర్వమానవసృష్టికిని మాతృదేవతయగు స్త్రీదాస్థానము. యోగ్యయగు జననిగఅపుటయే బిడ్డకు మొదటిపాఠశాల. ఆమెపాడు పాటలే బిడ్డకు రెండవబోధనాలయము. శైశవమున నామె చెప్పెడినీతులు, నేర్పెడి వినీతవర్తనమే బిడ్డకు మూఁడవశిక్షణాలయము. మాతృత్వముయొక్క బాధ్యతను గుర్తెఱింగి తల్లి సుశిక్షనొసంగెనేని యాబిడ్డల భవిష్యమెంత యుచ్చముగనుండునో చెప్పవలెనా?

కాకతీయాంధ్రరాజ్యరమను బాలింపజాలినధీపటిమ, పల్నాటివీరపౌరుషము నుద్దీపింపఁజేయఁ జాలిన కార్యకౌశలము, జ్యోతిశ్శాస్త్రపారమునుగనుగొనజాలిన పాండిత్యగరిమ, గణితశాస్త్రమును విరచింపఁజాలిన మహామేధ, మహామునీషులకు సైతమకళఁజమునిపింపఁజాలిన జ్ఞానసంపత్తి, అసువులే తృణముగా వర్జింపఁజాలిన మహత్కార్యము, సమస్తభూతనిచయమునందును బరమాత్మను దర్శింపఁజాలిన పరమభక్తి, ఖండఖండాంతరవాసులెల్ల రాహ్వానింపఁ జాలిన వాగ్వైభవము, గల స్త్రీ యబలయా? కాదు. కావుననే యొక ఆధునికకవిశేఖరుఁడు స్త్రీసామర్థ్యము నిట్లుగానముసేయుచున్నాఁడు.

"చదువనేర్తురు పూరుషుల్ బలెసెశాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనలధనుర్వ్యాఖ్యాపారముల్ నేర్పుచో
నుదితోత్సాహముతోడ నేలఁ గలరీయుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదితల్ నేరగరానివిద్యగలదే? మున్దారనేర్పించినన్."



దేశభాషల మూలమున విద్యగఱపుట:—

ఈ విషయమును గూర్చి రాజమహేంద్రవరమునందలి గవర్నమెంటువారి ట్రెయినింగుకళాశాలాధ్యక్షులగు థాంప్సన్ (ఎం. ఏ) గారిట్లు పలుకుచున్నారు.—

"ఈ దేశములో ఇంగ్లీషును ప్రవేశపెట్టినది మెకాలేప్రభువు. ఈదేశీయులను ఇంగ్లీషులో పండితులను చేయవలెనని సంకల్పించినది యతడు. అప్పటి కతనికి తోచినయూహ అది. ఆకాలమున కది అనుకూలింపవచ్చును; కాని అనుభవమునుబట్టి చూచినను కాలమునుబట్టిచూచినను ఇంగ్లీషునకే ప్రధానమిచ్చుటయు, దానిమూలముననే విద్య నేర్పుటయు, ఈదేశీయులను అందే పండితులుకావలెనని కోరుటయు ఈకాలమునకు పనికిరానిసంగతి. ఈదేశస్థులకు అది మాతృభాషకాని కారణమున ఎంతతపస్సు చేసినను ఇంగ్లీషులో పాండిత్యము సంపాదింపజాలరు. ఇరవైసంవత్సరములనుండి నేను తమిళభాషలో కృషిచేయుచుంటిని. నా పరిచయము ఓనమాలదగ్గరనేయున్నది. ఇంగ్లీషుభాష ఇక్కడిపిల్లలకు సహజమైనభాషకాదు. అందువల్ల జ్ఞానాభివృద్ధికి అది ఆటంకము కలుగజేయుచున్నది. విద్యయొక్క ప్రయోజనము జ్ఞానమును సంపాదించుటయేకదా! తల్లిభాషమూలమున అయినచో జ్ఞానము గ్రహించుట అతిసులభము. పరభాషమూలమున విద్య నేర్పయత్నించుటవలన జ్ఞానము నశించిపోవుచున్నది. అదిగాక ఎన్నియేండ్లు తపస్సుచేసినను పరభాషలో పాండిత్యమబ్బుటలేదు. స్వభాష నశించిపోవుచున్నది. జ్ఞానోపార్జన పూజ్యమైనది; కావున ఇంగ్లీషులో వ్యవహారమునకు వలసినంత పరిజ్ఞానము చాలును. ఇతరవిద్యలన్నియు దేశభాషలలో నేర్పుటయే సహజపద్ధతియు సులభమార్గమునై యున్నది."

పై విషయమును గూర్చి సుప్రసిద్ధాంధ్రవిదుషి శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారిట్లు వచింపుచున్నారు.—

"దేశభాషలమూలమున చదువు చెప్పుటమాని అన్యభాషలో చదువుచెప్పుట తల్లి పాలనువిడిచి డబ్బాపాలతో బిడ్డను పెంచుటవంటిది. మనపిల్లలు ఇంగ్లీషువిద్యనభ్యసించుటకు మిక్కిలి కష్టపడుచున్నారు. వారికి దానిలో జ్ఞానమేమియు కలుగుటలేదు. దానిద్వారా నేర్చుకొనుచుండుటవల్ల ఇతరవిషయముల జ్ఞానమసలేలేదు. ఎప్పుడును ఇంగ్లీషుచదువే గనుక తల్లిభాషకు ప్రాముఖ్యమేలేదు. రెండువిధములను విద్యార్థికి భ్రష్టత్వమే కలుగుచున్నది. దేశభాషలవలన విద్యను బోధించినచో జ్ఞానము కరతలామలకము కాగలదు."

అందకత్తెలు: వారు సంపాదించు ధనము:—

'డెయిలీ న్యూసు' పత్రిక యిట్లు వ్రాయుచున్నది:—

"ఇంగ్లండుదేశమున ఫిల్ముల కై నటించు అందకత్తెలకు ఫిల్ములను తయారుచేయు కంపెనీలు చాల గొప్ప జీతముల నిచ్చును. ఏరల్ కరోల్ అను ప్రసిద్ధ ఫిల్ముస్రష్ట ఫిల్ము చేయుటకై నిర్దేశింపఁబడిన యొక నాటకములో నొకపాటకు పల్లవి పాడుటకు కొందఱు అందకత్తెలకు వారమునకు 15 పౌనులు మొదలు 70 పౌనులవరకు జీతమొసగును. అతడు ప్రపంచమునగల వివిధ దేశములలో అందమునకు పేరుపొందిన యువతుల నెన్నుకొని వారిలో తాను తయారుచేయు ఫిల్ముల కై నటించువారల కిట్టి గొప్ప వేతనముల నిచ్చును. ఇతడు నిర్మించిన "యెరల్ కరోల్ నాట్యశాల" గుమ్మముకడ ఈఫిల్ము నాట్యశాలలో ప్రపంచమున యందమునకు పేరుగాంచిన యువతీమణులు ప్రవేశింతురను ఫలకము నుంచెను. ఫిల్ముకొఱకై నటించుటకు వచ్చు సుందరీసమితిలో కొందఱి నెన్నుకొనుటకు వారి వారి యాట, పాటలలో నైపుణిని పరీక్షించుటకు పదునేను సారులు సమావేశములు జరుగును. ఒక్కొక్క సమావేశమునకు పదునేనుగురు యెన్నుకొనబడుదురు. ఎన్నుకొనబడిన వారి కొక్కరి కొకగది (అలంకరించుకొనుటకు దుస్తులు, ఆభరణాదులు సర్వము సిద్ధపఱచబడినది) యివ్వబడును. ఇట్టిగదులన్నిటిలో ప్రత్యేకమైన గది, స్త్రీలందఱిలో అధిక సౌందర్యవతియై ఆటపాటలలో నత్యధికముగ గణింపఁదగిన సౌందర్యఖని కొసంగఁబడును. ఆగదిద్వారముకడ "నాట్యకౌశలమునకు ప్రథమసోపానము" అను ఫలకముంచబడును. ఈ నాట్యశాలలో మొదట ప్రవేశించునపుడు ప్రతిసుందరియు తూచబడును. ఫిల్మునకై నటించుట కెన్నబడిన ప్రతిస్త్రీకిని యతిజాగరూకతతో ఆరోగ్యకరమును, పుష్టికరమునునగు ప్రత్యేకమైన విలువగల భోజన పదార్థాదులు సమకూర్చబడును. ఇందు ప్రతిస్త్రీయు దినమునకైదుసార్లు తనదంతములను తోముకొనవలసిన కఠినమైన నియమముగలదు. ఇందుజేరు ప్రతిస్త్రీయు, వారమునకు రెండుసార్లు సౌందర్యనఖుల సమావేశమునకు వెళ్లవలెను."

—ఆచంట వేంకటశాస్త్రి

స్త్రీపురుష సమానత్వము:—

కైకలూరు తాలూకా చోరంపూడి గ్రామమునందు సమావేశమైన తృతీయ అగ్నికులక్షత్రియ మహాసభలో ఏతత్సభాధ్యక్షులగు శ్రీయుత పెదశింగు వేంకటనారాయణ వర్మగారు తమ ప్రారంభోపన్యాసమున పైవిషయమును గూర్చి యిట్లు ముచ్చటించి యున్నారు.—

"లోకమున స్త్రీలెట్టినీతికి కట్టుబడియుండవలెనని పురుషులు కోరుదురో అట్టి నీతిని పురుషులును యెన్నడు జవదాటరాదు. స్త్రీలు పునర్వివాహమున కనర్హులైనప్పుడు పురుషునికిమాత్రమట్టియర్హత యేలకలుగవలెను? ఇదిగాక పురుషుడు యొక భార్యయుండగనే రెండవభార్యనుకూడ చేబట్టుట అమానుషము కాదా? హైందవ స్త్రీకి ప్రథమభర్తను విడనాడి క్రొత్తవానిని వివాహమాడుట ఎంతలజ్జాకరమో పురుషుడుకూడ తనప్రథమ భార్యను విడనాడుట కటుల పరితపించవలెను."

బాల్యవివాహనిరోధచట్టము:—

శ్రీమతి ఏ. రాజమ్మగారు మార్చిమాసపు 'స్త్రీధర్మ' పత్రికలోనిట్లు వ్రాయుచున్నారు:—

"ప్రకృతకాలంబున స్త్రీలు వారి స్థానముపొందవలసియున్న, వారికి విశేష సంఘసంబంధముగల విషయము బాల్య వివాహ నిరోధచట్టమే. పూర్వమందు స్త్రీలకు ప్రౌఢా వివాహమే ప్రచారమందుండెను. బాల్య వివాహము మిగులయరుదు. జగన్మాతయగు సీతాదేవికి మాత్రము బాల్య వివాహమని వర్ణించియున్నారు. అదియునప్పటి కార్యకారణముంబట్టి యట్లు జరిగియుండును. కర్మమే ప్రధానంబని వాదించిన మండనుండే భూభారతిని ప్రౌఢగానున్నపుడే వివాహమాడెను. అప్పటి స్త్రీలు తమ కిష్టముతేనన్న బ్రహ్మచారిణులై తమ యిష్టమున్న స్థలములకేగి ఋషులను సేవించి విద్యాపారంగతలగుచుండిరి. దీని కుత్తరరామచరిత్రలో ఆత్రేయీవనదేవతా సంవాదమే నిదర్శనము. ఒక గ్రంథమునేల? వేదములే దృష్టాంతములు. "ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి" "నాతిచరితవ్యా" "సఖాసప్తపదాభవ" అనువచనములు, "నాగృహమందు నీవు ప్రవేశించుము. నీయెడ సంతానోత్పత్తి చేయుదును" అను వేదమంత్రములు 7,8,10 ఏండ్ల బాలికల కర్థమై యెంతమంది నడచున్నారు. తొలుత ఆవధూవరులకు పురోహితుండు చెప్పినట్లు చిలుకపలుకులు పలికిరేగాని నూటికి ఒకరైన దానియర్థమెఱుంగరు. మనోవృద్ధిగాని బాలుర చేయుతప్పులు తప్పుగానెన్నబడనపుడు అట్టి పసికూనలకు భార్యా భర్తలనెడి మిథ్యాసంజ్ఞల నంటగట్టి స్వప్రయోజనాపరులగు పురుషులు తాము స్త్రీలోకమునకుం జేసిన మహాపరాధమును, నిరర్థకములగు శాస్త్రార్థములచే కప్పిపెట్టి తాము ధన్యులని తిరుగుచున్నారు. తమ యింద్రియాదులే తమ యాజ్ఞకు లోబడనపుడు, పరుల నెట్లు ఆజ్ఞాపింపగలుగుదురు? మహమ్మదీయ పరిపాలనకాలమందేర్పడిన విధులు శాస్త్రసమ్మతములగునా? ఈలాటి గగనకుసుమములను వికసింపజేయు పుణ్యాత్ములెట్టి విజ్ఞులో దైవమునకెఱుక. ఇపుడు లెజిస్లేటివ్ అసంబ్లీలో బ్రహ్మశ్రీ ఎం. కే. ఆచార్యులు వారేమి, దక్షిణ యిండియాలో బ్రహ్మశ్రీ టి. ఆర్. రామచంద్రయ్యర్ గారేమి మఱియు వ్యక్తురాలుకాని బాలికల వివాహమైనదను నెపముపెట్టి తారతమ్యజ్ఞానములేక పశువులవలె యాచిన్న బాలికలను విషయసుఖములకీడ్చు మహమ్మదీయ మహనీయులేమి 'మత' మను మిషజూపి, దురాచారమును సదాచారమనిపించవలయునని యత్నించుచున్నారు. భూలోకమీ యిండియాకన్న చాలపెద్దది. ఇట్టి యనేక దేశములుగలది. ఆదేశములలోనుండువారు హిందువులవంటి మనుష్యులే. అచ్చటి స్త్రీపురుషులిచ్చటివారివలె మానాభిమాన గౌరవములుగలవారే. ఈబాల్యవివాహరోగ మాదేశములయందేల వారికగా వ్యాపింపలేదు? అది యసహజము. శిశుహత్యతో సమానమైన కార్యముగనుక నాగరీకతగలవారు దాని నామోదింపలేదు. హిందూదేశములో కాలవైపరీత్యమువలన కలిగినదానిని విడువజాలక "తాతస్య కూపమితి క్షారం జలం కాపురుషాపిబంతి" యను సామితను మరచి జనులు కష్టభాజనులగుచున్నారు. ఆదురాచారమువలన రాజ్యమంత యీరీతి భ్రష్టుపడి స్త్రీపురుషసమూహములు క్షీణాయువులై, పలువిధరోగపీడితులై, అబలులై నశించుటను కనుగొని కొందరు తెలివిగల స్త్రీపురుషులు ఈదురాచారమెపుడు తొలగునా యని వేచియుండి, పరదేశీయుల పశ్చాత్తాపమునకు పాత్రులైన వీరినుద్ధరించుటకు కంకణబద్ధులై యాబుధులు శారదాఘునని మూలముగా నీవివాహ నిరోధచట్టమును కష్టముల కోర్చి సంపాదించిరి. స్వప్రయోజన భావముగలవారుతప్ప, యితరులీ ఘన కార్యమునకు వ్యతిరేకముగాం బలుకుదురా? ప్రప్రథమమున వివాహమందు స్త్రీ పురుషుల ధర్మ, సంబంధములు సమానముగా నేర్పడియున్నవి. అన్ని దేశములయందును వివాహములు రెండు విధములుగా విభజింపబడియున్నవి. మత సంబంధము, చట్ట సంబంధము, దేవతాప్రార్థన, హోమాదిక్రియలు మొదలగునవి మతమునకు చేరినవి. సాక్షులవలె బంధుప్రభృతులరావించి, అగ్నిని సాక్షిగా నేర్పఱచి, వధూవరులతో చెప్పించు మాటలు చట్టమునకు చేరినవి. ఇట్టి చట్టమునందలి మాటలా పిల్లలకెట్లు తెలియును? ఒక చిన్నపిల్లవానితో, మఱియొక చిన్నది చేసుకొన్న యొడంబడికకు చట్టసమ్మతమైన బలముండదని మూఢులకు కూడ తెలియును. అటులనే బొమ్మల పెండ్లిచేయు అజ్ఞాన బాలికనుదెచ్చి కూర్చుండబెట్టి చేసికొన్న పెండ్లి యొడంబడిక చట్టసమ్మతముకానేరదు. ఇట్టి

యన్యాయమును న్యాయమని చెప్పుట కెవరియుపన్యాసము లక్కరలేదు. ఎందరు పురుష మహాత్ములు, తమ భార్యలను బలాత్కారముగా చంపి యురిస్తంభమున వ్రేలాడలేదు. భార్యలమీద భర్తలు, భర్తలమీద భార్యలు దెచ్చిన యభియోగములెన్ని న్యాయస్థానమందుండలేదు. ఎంత యూడిగముఁజేసినను వారినిఁ దిఆకించక యష్టకష్టముల పాలొనరించి యా స్త్రీల ననుచితభాషలాడు అన్యకాంతాసక్తులెందరుగలరు? ఇట్టి ఘోరకృత్యము లెందువలన జరిగినవని బాల్యవివాహప్రోత్సాహకులకు తెలిసియుండియు, వారికర్థము కాక యుండినది కడుశోచనీయము. కర్మదేవతలూరక విడుచువారుగారు. మఱియొక జన్మమందట్టివారి కాడు జన్మములిచ్చి యీ యనుభవమునేర్పుదురు. గనుక నట్టి ఘనులు శారదాహోమునందుగాని, సేవాసదనమందుగాని ప్రత్యక్షముగా పోయిచూచినట్లైన స్త్రీల ఘోరస్థితివారికిఁదెలియును. వారికనెట్టిప్రయత్నంబులు చేసినను చట్టముమార్చలేరు. కనుక యికనైన నుదారబుద్ధిగలిగి స్త్రీల యభివృద్ధికి తోడ్పడెదరుగాక.”

**బరోడా రాజ్యము: బాల్య వివాహ శాసనము:—**

మార్చి 10-వ తేదీనాటి 'ధర్మసాధని' పత్రిక పైవిషయమును గూర్చి ఇట్లు ప్రచురించుచున్నది.

“సుప్రసిద్ధసంఘసంస్కారాభిమానులగు శ్రీ శాయాజీరావు గైక్వారుగారు బాల్యవివాహ శాసనమును తమ రాజ్యములో నిప్పటికి ౨౬ సంవత్సరముల క్రిందటనే ప్రవేశపెట్టిరి. తచ్ఛాసనము వలన తగినంత మేలు కలుగమింజేసి తిరగి గత సంవత్సరమది సవరింపబడెను. సవరింపబడిన శాసన ప్రకారము ౪ సంవత్సరములకు లోపుగా బాలురకుగాని ౯ సంవత్సరములకు లోపుగా బాలికలకు గాని వివాహము చేసినచో తద్వివాహము ప్రభుత్వము వారిచే వివాహముగా నంగీకరింప బడదు. అదియుగాక ౧౬ సంవత్సరములకు లోపుగా బాలురకును ౧౪ సంవత్సరములకు లోపుగా బాలికలకును వివాహము సలుపునట్టివారు జరిమానాకేగాక కారాగృహవాసశిక్షకుగూడ పాత్రులగుదురు. తాత్కాలికముగా కఠినముగా దోచినను కాలక్రమమున దేశమునకు మహోపకారము చేయగల యిట్టి ఉత్కృష్టసాంఘిక శాసనమును గావించిన గైక్వారు గారు నిశ్చయముగా ప్రశంసాపాత్రులు. చిరకాలాగతమగు సాంఘికాచారమును మార్పు చేయుటలో గల చిక్కులను గుర్తించి తమకు యుక్తమని తోచిన సందర్భములలో న్యాయస్థానము వారు ఈ శాసనమును కొందరు కొందరికి వర్తింపకుండ జేయవచ్చునని శాసన నిబంధనములలో పొందుపరుపబడెను. బరోడాదేశములో కుద్వాకుంబులను పేరిట నొక సంఘమువారు గలరు. తమదేవత ఆజ్ఞాపించిన సంవత్సరములో నిర్ణీతములయిన కొన్ని దినములలోనే గాని యితర సమయములందు వీరు తమ బిడ్డలకు వివాహముల జేయరట. ఒకప్పుడు ఒక్క రాత్రిలో రెండుమూడువేల వివాహములు జరుగుచుండును. ఒకటి, రెండు సంవత్సరముల బాలికలకుగూడ వివాహ మగుచుండును. తగిన సంబంధము దొరకనిచో పిల్ల నొకపుష్పగుచ్ఛమున కిచ్చి వివాహము చేయుదురనియు, వివాహానంతరము ఆగుత్తిని పారవేసి బాలికను వితంతు వయినట్లు భావించి తగిన సంబంధము దొరకగనే ఆమెకు పునర్వివాహమును సలుపుదురనియు చెప్పుదురు. ౧౯౩౨-వ సంవత్సరమునుండి యీ సంఘమువారు బాల్యవివాహశాసనమును తమకు వర్తింపకుండ చేయించుకొనిరి; కాని గత సంవత్సరము సవరణను పొంది నప్పటినుండి యీ శాసనమును వారికిగూడ ప్రభుత్వమువారు వర్తింప జేయుచున్నారు. అందుపై కుద్వాకుంబిసంఘమువారు వెనుకటి వలెనే శాసనమును తమకు వర్తింపకుండ జేయ వలయునని దొరతనము వారిని కోరిరి. కాని బ్రిటిషు ఇండియాలో నివసించుచున్న యీ సంఘమువారు శారదాచట్టమునకు లోబడి నడచుకొనవలసిన వారగుటచే తమ రాజ్యములో గూడ అట్టి శాసనమును వారికి వర్తింపకుండ జేయవలసిన యావశ్యకత తమ కేమియు కనుపించదని చెప్పి కుద్వాకుంబిసంఘమువారి విజ్ఞప్తిని ప్రభుత్వమువారు నిరాకరించిరి.”




## పురుష సంతానమునకు పరమక్రియ:—

'బైకార్బొనేటు ఆఫ్ సోడా' అనుదానినుపయోగమువలన గొడ్రాలితనము తొలగుటయేగాక పురుషసంతతియే కలుగునని జర్మను శాస్త్రజ్ఞుడొకడు పరిశోధనముల మూలమున కనుగొని యున్నాడు. ఈ విషయమున తాను 53 కేసులు పరీక్షించి యుంటిననియు, ఆకేసులలో 52 కేసులయందు ప్రత్యక్షఫలితము కనిపించినదనియు నాతడు చెప్పుచున్నాడు. మొదట నాతడు గొడ్డుమోతు ఆవులపై పరిశోధనల గావించెనట.

## సంయుక్తరాష్ట్రములలోని గొప్ప జలాంతర్గామి:—

అమెరికా ఖండములోని సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వము వారిచే నొక గొప్ప జలాంతర్గామి నిర్మింపబడినది. అది 371 అడుగుల పొడుగు. అందు ఎనమండుగురు ఉద్యోగులుందురు. ఎనుబదిమంది మనుష్యులు ఎక్కుటకు అది అనువైనది. తుపాకులు పెట్టియుంచుటకందు రెండు అంతస్థులు గలవు.

## 157 ఏట ఉద్యోగము కోరుట:—

కుర్దిజారో ఆఘా గారు. 157 ఏండ్లవయస్సు. సర్వదా ఆరోగ్యముగ నుండెను. రాత్రికాపలా పని జేయుటకు ఉద్యోగమిమ్మని ఫోర్డు కంపెనీలో దరఖాస్తు పెట్టెను.

## కట్టెలమ్మిన తావున పూవులమ్ముట:—

న్యూయార్కు పట్టణములోని ధనికుడగు నొక కుంపినీపత్రాల తరగరిదగ్గర పనిచేయుచుండిన పనికత్తె తుదకు ఆతని భార్యయయ్యెను. పదునేడు సంవత్సరములుగా ఏయింట ఆమె వాకలితుడచుట, పక్కలు ఎగుర వేయుట మొదలగు నీచపు కార్యములను చేసెనో ఆయింటియందే ఆమె ఇప్పుడు సర్వాధికారిణియై ఎనిమిది రోల్సురాయి మోటారుకారుల అనుభవము, ముప్పదిమంది సేవకులపై యాజమాన్యమును గలిగియున్నది. కట్టెలమ్మిన తావున పూవులమ్ముచున్నది. ఏబదిలక్షల పౌనులకు వారసురాలై యున్నది. చిత్రమేమనగా ఆమె సోదరుడు ఆయింట ఇంకను బట్లరుగానే యున్నాడు.

## క్రొత్త గ్రహము కనుగొనబడుట:—

హార్వర్డు యూనివర్సిటి అబ్జర్వేటరీ డైరక్టరులగు ప్రొఫెసరు హార్లో షేప్లీగారు ఇట్లు ప్రకటించుచున్నారు. అరిజోనాలోని ప్లాగుస్టాఫ్‌నందలి లోవెల్ అబ్జర్వేటరీవారు ఒక క్రొత్త గ్రహమును కనుగొనిరి. ఈ గ్రహము 'నెప్ట్యూను' గ్రహమునకు ఆవలనున్నది. పరిమాణమున భూగోళముకంటె పెద్దది యురేనసు గ్రహముకంటె చిన్నది. ఆంగ్లేయ ఖగోళశాస్త్రజ్ఞులు నూతనముగా కనుగొనబడిన గ్రహమునుగూర్చి అత్యుత్సాహముతోగూడిన పరిశోధనము సల్పుచున్నారు. ఖగోళశాస్త్రమున ఒక శతాబ్దముగ నింతటి ముఖ్య విషయమేమియు కనుగొనబడలేదని వారు చెప్పుచున్నారు. నూతనముగా కనుగొనబడిన ఈ గ్రహము యొక్క వ్యాసరేఖ 19,000 మైళ్లు పొడవుండునని అంచనావేయబడినది. ఈ గ్రహము భూమికిని యురేనసునకును మధ్యనున్నది. ఇది సాధారణ నేత్రములకు కనుపింపదు.

## 1930 లో విశేషమున్నదా?:—

మన చక్రవర్తి పుట్టినది 1865 సం ॥ మున. రాజ్యమునకు వచ్చినది 1910 సం ॥ మున. ఇప్పటికి రాజ్యకాలము 20 సం ॥ ములు. ఆయన వయస్సు 65 సం ॥ ములు. అన్నిటిని కలిపితే 3860. అమెరికా ప్రెసిడెంటు హూవరుపుట్టినది. 1874 సం॥ మున. ప్రెసిడెంటు పదవికి వచ్చినది 1929 సం॥ మున. ఇప్పటికి పదవికాలము 1 సం ॥ ము. ఆయన వయస్సు 56 సం ॥ ములు. అన్నిటిని కలిపితే 3860. జపాను చక్రవర్తి పుట్టినది 1901 సం ॥ మున. రాజ్యకాలమునకువచ్చినది 1927 సం ॥ మున. ఇప్పటికి రాజ్యకాలము 3 సం ॥ ములు. ఆయన వయస్సు 29 సం ॥ ములు. అన్నికలిపితె 3860. 3860 ని రెంటభాగింపగా వచ్చినది 1930. కావున ఏదైనను 1930 సం ॥ మున జరుగునేమో?

## భూమిలో అయిదురోజులున్న సాధువు:—

దక్కను ప్రాంతమునందలి నవాబ్ గంజిలో జరిగిన విషయమిది. కొంతకాలమునకు క్రితము ఒక సాధువు నవాబ్ గంజిపోయి అచ్చటి పోలీసుస్టేషనునకు ఎదుటనున్న ఒక సీనారేకుల ఖాళీగుడిసెలో విడిసెను. ఒకానొక బుధవారము రోజున ఆతడు కొందరితో భూమిలో పూడ్చిపెట్టినను తాను అయిదురోజు లుండగలనని చెప్పుచు తన విద్య వారు పరీక్షింపవలెనని కోరెను. ఆతని కోరిక ప్రకారము వారొకగొయ్యితీసిరి. అందు ఆ సాధువు యోగాసనమువైచి కూర్చుండెను. వేలకొలది జనులు ఈవింత చూచుటకు వచ్చిరి. అంతట సాధువు కూర్చున్న ఆగొయ్యిమట్టితో కప్పిరి. లోనికి గాలిపోవుట కెట్టిఅవకాశమును లేదు. అచ్చట మూగిన జనములలో నవాబుగంజి యందలి ప్రధానోపాధ్యాయుడు, సబ్ రెజిస్ట్రారు, మరికొందరు ఉద్యోగులు నుండిరి. అయిదురోజుల అనంతరము ఆదివారము నాడు ఆసాధును మట్టి ఎత్తి బయటికి తీసిరి. ఆతడు చిఱునవ్వు మొగముతో లేచినిలబడి కూడియున్న అశేషజనమునకు సంభ్రమాశ్చర్యములు కలిగించెను.

## ఏడాదిలో ఏవురు బిడ్డలు:—

జార్జిగార్డాను వాట్సు అనువాడు ఫ్రేజబర్గులో చేపలబట్టి జీవించువాడు. ఆతని భార్య ఇరువదినాలుగు సంవత్సరములది. ఆమె పండ్రెండు మాసములలో అయిదుగురు బిడ్డలను కన్నది. వత్సరారంభమున ఆమెకు కవలపిల్లలు పుట్టిరి. ఇప్పటి కామ్పన ముగ్గురు బాలికలు పుట్టిరి. అయిదుగురును ఆరోగ్యమున నున్నారు. బహుళ సంతానవతులకు రాజుగారిచ్చునసముకై పిటీషను పెట్టబడినది.

# వనితాలోకము

శ్రీమతి వి. రాజమ్మగారు:—



శ్రీమతి వి. రాజమ్మగారు

ఈయమ నంద్యాలవాస్తవ్యులును మైసూరు అగ్రికల్చరు డైరీ ఫారంకంపెనీ సూపరింటెంటుగారును నగు శ్రీయుత వి. ఆదిశేషయ్యనాయుడుగారి సతీమణి. విద్యావంతురాలు. మత, సాంఘిక, రాజకీయ వ్యాస రచనాపటిష్ఠురాలు.

మాడము తామురీసుగారు:—

ఐసులండు దేశమున ప్రధానామాత్య పదవి నిర్వహించుచున్నది. ప్రపంచమున నింకెక్కడను ప్రధానామాత్యపదవి స్త్రీలకు చెందలేదు. ఈమెయే యీయున్నత పదవిని బడయుటకు ప్రథమురాలు.

శ్రీమతి. జె. సీతాబాయిగారు:—

ఈమె విద్యాసుందరి. కృష్ణాకలక్టరేటులో ఉద్యోగముననున్నవారును, ఆంధ్రభాషాభిమానులును నగు శ్రీయుత జమ్మి శేషగిరిరావుగారి (బి. యే. యల్. టి) భార్య. ఆంధ్రమున ధారాళముగ వ్యాసములు వ్రాయగలదు.

మిస్. కె. ఎస్. రంగారావుగారు:—

ఎం. ఏ పరీక్షలో జయముగాంచినది. గ్రేటు బ్రిటనురాయలు జాగ్రాఫికలు సొసయిటీ సభ్యురాలుగ ఎన్నుకొనబడినది; కావుననే ఎఫ్. ఆర్. జి. ఎస్ అనుబిరుదము దాల్చుచున్నది. భారతస్త్రీలలో ఈఉన్నత పదవినందుటకీమెయె ప్రథమురాలు. ఈమెమదరాసు విశ్వవిద్యాలయమున పట్టముపొంది మేరీకళాశాలలో ఉపాధ్యాయినిగనుండి 1926-వ సంవత్సరమున ఇంగ్లాం



జె. సీతాబాయిగారు

దుపోయి లండను విశ్వవిద్యాలయమున భూగోళశాస్త్రమునందు పట్టమును పొంది బెడ్ఫర్డు కాలేజీయందు ఆశాస్త్రపరిశోధన గావించుచున్నది. ప్రస్తుతము మనరాజధాని ప్రధానామాత్యులగు డాక్టరు సుబ్బరాయనుగారి భార్యకీయమ తోబుట్టువు.

శ్రీమతి కె. యస్. మూర్తిబాయి గారు:—



కె. ఎస్. మూర్తిబాయిగారు

ఆంధ్రభాషయందు మంచిప్రవేశము గల విదుషి. వ్యాసరచనావ్యాసంగము న వ్యగ్రహృదయము కలదియైయున్నది.

శ్రీమతి చీమకుర్తి సత్యవతిగారు:—

ఈవిదుషీమణి వైశ్యలోకము నంతకు కీర్తిని సంపాదించి దేశప్రఖ్యాతిగాంచినట్టియు, వేదవేదాంతపురాణేతిహాస గూఢార్థ ప్రతిపాదకుండును, సంస్కృతాంధ్రాంగ్లేయ జర్మనీభాషా ప్రవీణుండును, బి.యే. బి. యెల్; డి. జి. డబ్లియు, సి. టి. యిత్యాది బిరుదాంకితుండును, కరింగాల్ జమీందారునగు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజుల వారిపౌత్రి. చిత్రలేఖనమందు ఆంధ్రరవివర్మయని విఖ్యాతిగాంచినట్టియు భక్తిసంబంధమగు కొన్ని గ్రంథములు రచించినట్టియు, శాంతమూర్తియని పేరుగాంచిన శ్రీయుత రామమోహనరావుగారి పుత్రిక. ఈమె జననియు కొన్ని నీతిదాయకములగు గ్రంథములరచించి నివురుగప్పిన నిప్పువలెనున్న ఆ. అన్నపూర్ణమ్మగారు. ఈమె మాతామహుడు తహశీలుదారుగానుండి కీర్తిజెందిన కొల్లిపర శ్రీరాములుగారు. ఈమె వంశీకులందరును విద్యావంతులై పేరుగన్నవారు. ఈమె 14-3-1895 తేది మద్రాసున మేనమామగారైనట్టియు, క్రిష్టియన్ కాలేజి ప్రొఫెసరుగానుండిన కొల్లిపర సీతారామయ్యగారి గృహమున జన్మించెను. 1904 వ సంవత్సరములో గుంటూరున వివాహము జరిగెను. ఈమె భర్తగారైన శ్రీయుత చీమకుర్తి బసవయ్య శ్రేష్ఠిగారి నెరుగని వారుగాని, వారిసత్కార్యదీక్షను తెలియని వారుగాని ఆంధ్రదేశముననుండరని తలంతుము. ఈమెవిద్య నేర్చుట ఆశ్చర్యకరమైన విషయము. 5—వ సంవత్సరము రాగానే తల్లి విద్య నేర్పదలచి యొకదినమున అక్షరములను చూపగా గుణింతములతోసహా అన్ని అక్షరములను ఒకమారే గ్రహించి మరునాటినుండియు ఏకాగ్రతమును గాంచినను కూడబలికి చదువుచుండెను. ఇదేవిధముగ నంతకంతకు ప్రతిపుస్తకమును చదువుటయు, తెలియనివి తల్లివద్ద గ్రహించుటయు యిట్లేదినక్రమమున

విద్య వృద్ధిగావించుకొనెను. అంతియేగాని! స్కూలునకేగి నేర్చిన విద్య గాదు. 5-వ సంవత్సరముననే పితామహులుగారు నేర్పిన భగవద్గీత ప్రథమోధ్యాయమును వేదమంత్రములను కొన్నింటిని కంఠస్థమొనర్చుకొని అపరిమిత జ్ఞాపకశక్తిని గనబరచెను. ఎప్పుడును యేదో వకటి చదువుచునే కాలముగడపుచుండెను. తలిదండ్రులతో కొన్ని కొన్ని మాటలు ఇంగ్లీషుతో మాట్లాడుచుండెను. ఎంతటిపాఠమైనను ఒకపరి నేర్చిన వచ్చుచుండెను. ఇంటిలోననే ఇంగ్లీషు, తెనుగు నభ్యసించెను. అక్షరజ్ఞాన మలవడినవాది యెట్టిపుస్తకమైనను తుదవరకు చదువనిదే తృప్తినొందకపోదు. చిన్నతనముననే ఫోటోలుతీయుట, చిత్రలేఖనము వ్రాయుట పూలుమొదలగు అల్లికపనులు సంగీతవిద్యతోపాటునేర్చెను. 10 సంవత్సరములప్పుడే స్వంతముగ పాటలు వ్రాయుట, కవనముజెప్పుట ప్రారంభించెను. స్నేహితురాండ్రకుగాని బంధువర్గమునకుగాని వ్రాయుజాబులు పద్యరూపకముగనే వ్రాయుచుండెను.



శ్రీమతి కుర్తి సత్యవతిగారు

ఆవయస్సుననే ఆమె 'భక్తిరసామృత' మను గ్రంథమునురచింపప్రారంభించెను. 11-వ సం॥ న విశాఖపట్నమున జరిగిన (Fine art) కళావిద్యా ప్రదర్శనములో చిత్రలేఖనము నందిమె సన్మానపత్రము (సర్టిఫికేట్) వడసెను. 1908 సం॥ గుంటూరున జరిగినవిద్యా ప్రదర్శనమున చిత్రలేఖనమునకును, కుట్టుపనులకును గౌరవ పతకము నొందెను. (Medal) 1910 సం॥ న వైశ్య స్త్రీల విద్యావిషయమై బందరులో యేర్పరచిన పరీక్షార్థమై "అబలా సచ్చరిత్రమాల, గజేంద్ర మోక్షము, కుమారీశతకము, భగవద్గీత, అర్థసహితముగ 15, అధ్యాయము మొదలగు 10 గ్రంథముల కంఠతావల్లించెను. 11-6-1917 వ తేది గుంటూరు స్త్రీసనాతనధర్మమండలి అష్టాదశవార్షికోత్సవమునకు అధ్యక్షురాలుగనుండి పండితురాండ్రైన బ్రాహ్మణ వైశ్య స్త్రీలచే మెప్పుగాంచెను.

1-1-20 తేదిన వరాహాపట్నమున శ్రీమతి బొప్పన మాణిక్యాంబగారిచే నెలకొల్పబడిన సచ్చిదానందాశ్రమ గ్రంథాలయస్థాపనకు స్త్రీలసభ కధ్యక్షతవహించి జయప్రదముగజరిపెను. 8-4-24సం॥ రాజమండ్రిలో శ్రీయుత నాళం రామలింగయ్యగారు స్థాపించిన వైశ్యసేవాసదనచతుర్థసంవత్సరవార్షికోత్సవమునకు అగ్రాసనాధిపురాలుగనుండి విద్యా

వంతులగు స్త్రీలందరిచే మెప్పుగాంచెను. 1925 సం॥ న గుంటూరున జరిగిన ఆర్య వైశ్య మహిళాసభకు శక్రిటరీగానుండి జయప్రదముగా సానుకూలముగావించె. 1926 సం॥న గుంటూరులో ఏర్పరచిన వైశ్యయువతీవిద్యాలయస్థాపనకు అధ్యక్షురాలుగనుండి వారి మన్నన వడసె. 3-12-29 సం॥ న మద్రాసున జరిగిన అఖిలభారతసనాతనధర్మసభ తోబాటు జరిగిన స్త్రీల సమావేశమునకు అధ్యక్షత వహించి గుంటూరునందిట్టి రత్నము లుందురని మేమెన్నడు తలపలేదని వారందరిచే ప్రశంసాపాత్రురాలయ్యెను. ఈమెకు బాల్యమాది భక్తిమార్గము మెండు. తనతోడిబాలికలనందరిని యొకచోటజేర్చి విద్య నేర్పుటయు ప్రార్థనా విధానమును నేర్పుటయు మొదలగునవియే యీమెయాటపాటలు. ఏకాంతముగ భగవంతుని ధ్యానించుచుండును. ఏకార్యమునైనను భక్తిచేతనే సాధింప గలమనుదృఢ నమ్మక మీమెకుగలదు. ఒకసమయమున భర్తగారికి ఆరోగ్యము సరిగాకుండగా స్వకీయారామమున 5 రోజులు యేకాంతముగ నుపవసించి, ఈశ్వరుని ధ్యానించియే తత్కార్య సిద్ధిగాంచెను. ఎట్టికష్టములోనైనను ధైర్యము, ఓర్పు శాంతము యీమెకు సహజగుణంబులు. ఈమె తన జననీ జనకులతోడను, భర్తగారితో డను అనేకదివ్యదేశములను, ఆశ్రమములనుదర్శించి ఆయాక్షేత్రముల విశేషలనువర్ణించు దివ్యక్షేత్రసందర్శనమను పద్యగ్రంథమును రచించెను. 20 సం॥ ప్రాయముననే 500 పద్యముల గ్రంథమును పూర్తిచేసెను. ఎచటకేగదలచినను భగవంతుని ధ్యానించి బయలుదేరుచుండును. ఈమె గుంటూరున స్థాపించిన శారదానికేతనమునకు కార్య దర్శినిగ కొంతకాలముండినది. బాలికలకు ప్రథమమున కొంతకాలము చిత్రలేఖనము నేర్పుచుండెను. ఈమెకు స్నేహితురాండ్రయందు వాత్సల్యము మెండు.

ఆర్యవైశ్య నారీమణులయందింతటి కవయిత్రిలేదనియే చెప్పవచ్చును. ఈమె తన భర్తగారొనర్చు సర్వధర్మ కార్యములయందును సహధర్మ చారిణియై తోడ్పడుచుండును. విభవసంవత్సర ఆశ్వియుజ మాసమున గుంటూరు అగ్రహారములో స్త్రీభజనసమాజము నొకదాని నేర్పరచి ప్రతివారము ననేకమంది స్త్రీలతో మధ్యాహ్నం 2 గంటలకే సమావేశమై 6 గంటలవరకు పూజ, పురాణము, తదుపరి భజన జరుగునట్లు యేర్పాటుజేసి నేటివరకును క్రమముగా జరుపుచున్నది. భారత భాగవత రామాయణాది గ్రంథముల నితర స్త్రీలచే చదివించి తాను అర్థముజెప్పుచు నొకపర్యాయము పూర్తిగావించెను. మంత్రపుష్పము, శ్రీసూక్తము మొదలగు స్త్రీలకుపయుక్తమైనవి స్వరసహితముగా వారికి నేర్పుచుండును. శుక్రవారమునాడు ఉదయమే శిరస్స్నానము, పూజ గావించుకొని భోజ నముచేసి 2 గంటలు మొదలు 6 గంటలవరకు భజన సద్గ్రంథకాలక్షేపములతో నాటిదినము సమాప్తము చేయుచుండును. శుక్రవారమున (అనగా వారమునకు ఒకదినమైనను) పూర్తిగ భగవత్కైంకర్యముగ గడుపుట ముఖ్యమైనపనియని యీమె భావించుచుండును.



## మాల్డను మహాత్మ్యము:—

మహాత్ముల కాలము దాటి పోలేదనియు, మహాత్ములను నమ్మువారు మన హిందూదేశములోనే గాక సభ్యదేశములని పిలువబడు పశ్చిమ దేశములలో గూడ గలరనియు మాల్డను పురములో జరుగుచున్న సంగతులు విశదము చేయుచున్నవి. మాల్డను పట్టణము అమెరికా దేశాంతర్గతమగు మెసాచెట్సు మండలములోనిది. ఇప్పటికి అరువది సంవత్సరముల క్రిందట ఫాదర్ ప్యాట్రిక్ పవర్ అను మతాచార్యు డొకడచట నుండెను. జీవించియున్న కాలములో నితడట్టి పేరు ప్రతిష్ఠలు గడించినట్లు కనబడదు. కాని, అతడు చనిపోయిన తరువాత ముప్పదిసంవత్సరముల కతని సమాధిని వెళ్ళిచూడగా నందుపైనున్న గరికె వాడు చూపక పచ్చగానుండెనట. దానికి చుట్టుపట్లనున్న సమాధుల మీది తృణము వెలవెలబాఱి యెండిపోవుచున్నట్టు కనిపించుచుండెనట. మరియు తత్సమాధి మీద పెట్టిన మైనపువత్తి దీపములు చల్లారిపోక వెలుగుచుండెనట. దానిని సందర్శించుటచే కొందరికి రోగనివారణము కూడ నయ్యెనట. ఈ సంగతుల నేదో యొక పత్రిక యిటీవల ప్రచురించి తత్సమాధి వైపునకు ప్రజలదృష్టిని మరలించెను. ఇక నప్పటినుంచి తండోపతండములుగా జను లాస్థలమునకు యాత్ర చేయసాగిరి. గ్రుడ్డివారు, కుంటివారు, మూగివారు, చెవిటివారు, పిచ్చివారు గుంపులు గుంపులుగా నచటికి మూగుచున్నారు. ఈ నడుమ 3 వారములలో ఎనిమిదిలక్షల జనులు సమాధిని దర్శించిరని తెలియుచున్నది. నాగరిక దేశమనియు, విద్యాసంపన్నమగు దేశమనియు పేరుగన్న అమెరికా దేశములో నీచిత్ర నాటకము జరుగుచున్నదని విన్నచో మనకు విస్మయము కలుగకమానదు. కాని మూఢత్వ మొకరి సొమ్ము? విద్యకును ఈ నమ్మకములకును గూడ సంబంధమున్నట్లు తోచదు. బుద్ధిమంతులగు వారు గూడ నిట్టివిషయముల నేలనో అతి సులభముగా నమ్ముచుందురు. హేతుజ్ఞాన బుద్ధి ప్రబలమైనగాని యీ నమ్మకములు వదలజాలవు. (ధర్మసాధని)

## తల పెట్టిన దుర్మార్గము తనకు భార్యనిచ్చినది:—

ఏడుసంవత్సరముల వయస్సుగల హాజీబాలాయను బెంగాలీబాలికను పతితజీవితమునుండి హార్గ్లీ జిల్లా మేజిస్ట్రేటగు జే. బి. కిండిర్సులీగారు సంరక్షించిరి. ఆ సంరక్షణవిధాన మిట బొందుపరపబడియున్నది. హాజీయను బాలికను పదునాలుగు సంవత్సరముల వయస్సుగల గోపాలఘోషుఅను నాతడు చెరపబోయెనని, యాతనిని మేజిస్ట్రేటు సెషన్సును బంప తీర్మానించెను. అచట విచారణ యొకదినము జరిగెను.

అంతట గోపాలునియొక్కయు బాలిక హాజీయొక్కయు తలిదండ్రులు వారిరువురికి పెండ్లిగావించుట కొప్పుకొనియుండిరనియు, అందుచే నీ యభియోగముఁ నుపసంహరించుకొనవలెననియు మేజిస్ట్రేటుగారికి ప్రార్థన గావింపబడెను. బాలుడు శిక్షింపబడినను, బాలికకు గలిగిన యప్రతిష్ఠ బోజాలదనియు, యిందులకు ఫలితముగా నా బాలిక పడుపువృత్తి నవలంబించుట సంభవనీయమనియు మనవిజేయబడెను. మేజిస్ట్రేటుగా రొప్పుకొనుటచే, రాజాగారి తరఫున నీ యభియోగమును ప్రభుత్వన్యాయవాది యుపసంహరించుకొనెను. కొంతకాలమునకు పిమ్మట, గుప్తిపారాయను గ్రామమున గోపాలునకును బాలికకును నుద్వాహము జరిగెను. నూతనదంపతులు కిండర్స్లీ గారిని సందర్శించిరి. వారు దంపతులకు తమ యాశీస్సుల నొసంగిరి.

"కోరితివి గావున చావుము":—

బారకపురమున, పంచుగోపాలజోలియ అనువాడు. ఆతని భార్య నోనిబాల. పదునెనిమిది సంవత్సరముల పడుచు. భర్త భార్య నెప్పుడును హింసపెట్టుచుండువాడు. భార్యఎట్లో ఓర్చియుండెడిది. ఒకనాడు ఆతడు భార్యను అత్యధికముగ హింసపెట్టెను. భార్యకు ఆబాధదుర్భరమై "ఇట్టి బాధపడుటకంటె చచ్చుట మంచిది" అని అనెను. ఆమాటకు కరుణాయత్తుడగుటకు బదులు నాతడు కోపమున కొండనుట్టి 'చావు కోరితివి కావున చావుము' అని చెప్పుచు పోటోకత్తితో భార్యమెడపై కొట్టెను. తలవేఱు మొండమువేఱు అయ్యెను. కేసు విచారణలోనున్నది.

భర్తతో ననుమరణము నొందిన ఆంగ్లయువతి:—

నిష్కలంకమైన పత్నీప్రేమ పంచత్వముతో ముగియదు. ఆంగ్లదేశమున కవెంట్రీ ప్రభువును కవెంట్రీ ప్రభ్వియు పొరపొచ్చములులేని అనోన్యదాంపత్యధర్మమున జీవించుచుండిరి. బహిరంగసభలలో కవెంట్రీ ప్రభువు తన భార్యనుగూర్చి 'ఆదర్శక గృహిణి' అని పలుసారులు పలికినాడు. కవెంట్రీ ప్రభువునకు జబ్బు చేసినది. అప్పుడు ప్రభ్వి వేయిచేతులతో నాతనికి ఉపచారములు చేసినది. అయినను ఈశ్వరాజ్ఞ అగుటచే నాతడు మార్చి 14-వ తేది శుక్రవారమునాడు దివంగతుడైనాడు. ప్రభ్విదుఃఖము చెప్పనలవికాదు. పఱుపుపై మేనుచేర్చి 'నాకు జీవించుటకు ఇష్టములేదు.' అనిచెప్పెను. మఱునాడామె మరణించెను. సహగమనాచారమునకు జన్మస్థానమగు హిందూదేశమున ఇట్టివి వార్తలుకావు. కాని లెక్కకుమీరిన విడాకులతో ఏదేశముయొక్క సంఘజీవనము కలుషితమైయున్నదో అట్టి ఆంగ్లదేశమునకు ఈవృత్తాంతము వార్త (News)యు, నిదివార్త (Message)నీయ గల వృత్తాంతమగుటయు నిశ్చయము.

"పసితనమున నాకు పెండ్లిచేయు తల్లిదగ్గఱకు నేనుపోను".—

నోయకుహాల్లిగ్రామమున గిరిబాలదాసియనుబాలిక. ఆమెకు పదిసంవత్సరములు. శారదాబిల్లు అమలులోకి రాకుండ ఆమెకు తల్లివివాహము చేయతలపెట్టెను. అంతపసితనమున వివాహముచేసికొనుటకు ఇష్టములేక ఇంటిదగ్గరయున్నచో తనకెట్లైన తల్లి వివాహముచేయక మానదని భయపడి గిరిబాల పినతండ్రిగారింటికి పారిపోయెను. అతడు పిల్లసంరక్షణవిషయమై నిర్ణయించ జిల్లాకోర్టులో పిటీషనుదాఖలుచేసెను. ఈలోగా తల్లితనపిల్ల నెత్తుకొని పోయిరని కేసుచేయుచు వారంటు పెట్టించెను. పిల్ల కోర్టుకుగొని రాబడెను. కోర్టులో గిరిబాల తల్లి చెంతకు పోవుట కిష్టములేక పినతండ్రి మెడలో వ్రేలాడుచుండెను. జిల్లాజడ్జి శారదాచట్టము వచ్చులోపల బాలికకుపెళ్లి చేయరాదని తల్లికి నోటీసుఇచ్చెను.

## డైరి

ఫిబ్రవరి : 20:—పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురము తాలూకాభివృద్ధి సంఘమువారి యాజమాన్యమున నిర్వహింపబడుచున్న ఆంధ్ర స్త్రీల పోటీపరీక్షలో శ్రీమతి మునునూరి జానకమ్మగారును (అంగలూరు) శ్రీమతి జి. సత్యవతిగారును (ట్రిప్లికేను) బంగరు పతకముల బడసిరి.

" 21 :—చెన్నపురి లలిత కళాసంఘమువారిచే 46-వ ప్రదర్శనము పార్కుటవును మెమోరియలు భవనమున ఏర్పాటు చేయబడెను. చెన్న రాష్ట్ర గవర్నరు సర్ స్టాన్లీగారు ఉదయము 8 గంటలకు ప్రదర్శన ప్రారంభోత్సవమును గావించిరి.

" 22 :—కలకత్తా కార్పొరేషనువారు ప్రయమరి విద్యను 6 సంవత్సరములు మొదలు 10 సంవత్సరములలోపు బాలబాలిక లందఱికి నిర్బంధముగ నేర్పుటకుగాను తీర్మానించిరి. ఇందునిమిత్తం ప్రభుత్వమువారు 35,000 రూపాయలు మంజూరు చేసిరట.

" 23 :—శ్రీమతి సరోజినీ దేవిగారు మీరతువెళ్లి అచ్చటి కళాశాలలో కీ. శే. లాలాలజపతి రాయిగారి చిత్రరువును బహిరంగ పరచిరి. మీరతు జయలునకేగి యచట నిర్బంధింపబడి యున్న మీరతు కుట్రకేసు నిందితులతో నొకగంటకుపైగా సంప్రదించిరి.

" 24 :—చెన్నపురమున ఆరోగ్య శిశువారము ప్రారంభము చేసిరి.

—పగలు 4 గంటలసమయము లక్కవరము భయంకరాగ్నికి చిక్కి ఇంచుమించుగ నగరమంతయు భస్మమైనది. ఆరుగురు కాలిచనిపోయిరి. శ్రీ అయ్నిపర్తి ప్రకాశరావుగారిసతీమణి తొమ్మిదిమాసములచూలాలు తన్ను పుట్టింటికి పిలువవచ్చిన తన సోదరుడు (బొల్లాప్రగడ సత్య నారాయణగారి కుమారుడు) ప్రమాదమున చిక్కుకొనగ రక్షింపనేగి ఆమెయు, అతడును, ఆమెనాలుగేండ్ల బాలికయు అగ్నిహోత్రున కాహుతియైరి. రాచకులమునకు చెందిన యింకొక స్త్రీ అగ్నిలోబడి మగణింపనున్న గేదెను విప్పుచు మరణించినది.

" 25 :—రాజమహేంద్రవరమున విక్టోరియాపురమందిరమున సాయంకాలము 5 గంటలకు దేశభాషలమూలమున విద్యనేర్పుట అను విషయమునుగూర్చి చర్చించుటకుగాను జరిగిన గొప్ప సభలో శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగా రొకఉపన్యాసము గావించిరి.

" 26 :—నాగపురమున యువజనసభలో శ్రీకమలాదేవి ఛట్టోపాధ్యాయ సతి ఉపన్యసించుచు దేశముకొరకు సర్వము సమర్పింప సంసిద్ధులుగండని సభ్యులను హెచ్చరించెను.

" 27 :—మిస్. కె. వి. రమణమ్మగారు కార్యదర్శినిగానున్న కాకినాడయందలి గౌతమ యువజన సంఘమువారు సమావేశమైరి.

" 28 :—టిల్యాను అను ప్రొఫెసరు భార్యను రంగూను పురమున గౌరవ మేజిస్ట్రేటుగ నియమించిరి. ఈ ఉద్యోగము బర్మా స్త్రీల కొసంగుట కిదియే ప్రథమము.

మార్చి 1 :—ఫిబ్రవరి 24-వ తేదీని ప్రారంభము చేయబడిన మద్రాసు గరలుగైడు వారము శ్రీబియ ట్రిక్సు స్టాన్లీ దొరసానివారి యాజమాన్యమున సమాప్తి నొందెను.

" 2 :—గుంటూరు నగరమందలి శారదా నికేతన షష్టమ వార్షికోత్సవము శ్రీ ఉయ్యూరు జమీం దారువారగు శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహదరుగారి అధ్యక్షత క్రింద జరిగెను.

" 3 :—చిత్రకోటయందు కలరా పొడచూపినపుడు స్థానిక సేవాశ్రమముయొక్క కార్యదర్శినియు, వంగస్త్రీయునగు శ్రీమతి నళినదేవి తన కూతుళ్లు, కొడుకుల సాయమున రోగగ్రస్తులకు రాత్రింబవళ్లు చేసిన సేవకై సదాసీబాజి పండాగారు బంగరు పతకము బహుమానము చేసిరి.

" 4 :—శ్రీ బి. ఎల్. మిత్తర్ సతిగారు ఢిల్లీ స్త్రీల సమితివారు ఢిల్లీకి 5 మైళ్ల దూరములో నున్న డక్కాయందు నడపనున్న గ్రామ పాఠశాల ప్రారంభోత్సవము జరిపిరి.

" 5 :—మలబారునందలి నంబూద్రి శాఖకు చెందిన అంతర్జనులు ఘోషాదురాచార నిర్మూలన మునకు గడంగిరి.

" 6 :—బెంగుళూరు వాస్తవ్యులగు శ్రీ యస్. యస్. సింహాగారు పశ్చిమ గోదావరిజిల్లా నరసా పురమున బాలికా పాఠశాలలో స్త్రీలకొఱకు ప్రత్యేక సభను గావించి సూర్యనమస్కార ములను సక్రమముగా చేయు విధమున్ను అందువల్ల గలిగెడి దేహపరిశ్రమయు వీటిని గూర్చి విపులముగా నుపన్యసించి వ్యాయామ ప్రదర్శనముగూడ గావించిరి.

" 7 :—మచిలీ పట్టణమునందలి స్త్రీల లేడీ యాపుటహిల్ గవర్నమెంటు సెకండరీ ట్రెయినింగు స్కూలునందు బహుకరణోత్సవము జరిగెను.

" 8 :—ఢిల్లీలో విదేశ వస్త్ర బహిష్కరణమును గూర్చి ప్రచారము చేయుట కొకస్త్రీల బహిరంగ సభ జరిగినది. మహాత్ముడు త్వరలో ప్రారంభింపనున్న స్వరాజ్య సత్యాగ్రహమున పాల్గొనుటకు స్త్రీలకుగూడ నవకాశ మొసగవలెనని ఆసభలో చాలమంది స్త్రీలు ప్రసంగించిరి.

" 9 :—శ్రీకాకుళములోని మద్యపాన నిషేధసంఘము వారి వార్షికోత్సవము జరిగెను. అప్పుడు శ్రీమతి మల్లెమడుగుల అమ్మగారు ఆసంఘమువారికి ఈ హితబోధ చేసిరి: "పురుషులకన్న ఎక్కువ నేర్పుతో జనులకు నచ్చచెప్పి త్రాగుడు మాన్పింపగలవారు స్త్రీలు; అయినను స్త్రీలీసంఘమునందు కాన్పించకుండుట శోచనీయము. ఇప్పుడు సభ్యులు తమ స్త్రీలను గూడ యిందు పనిచేయునట్లు చేయవలెను."

" 10 :—రిటైర్డు డిప్యూటీ కలక్టరుగారగు శ్రీ వి. రామస్వామి అయ్యరు వారి అధ్యక్షత క్రింద సమావేశమై చిత్తూరు పౌరులు ఇట్లు తీర్మానించిరి. "మిడిలు స్కూలుగ మార్చుటకు హామీనిచ్చుచో డాక్టరు వరదప్పనాయుడుగారి హిందూ బాలికా పాఠశాల గవర్న మెంటు మేనేజిమెంటున కిచ్చుటకు మేము ఒప్పుకొనుచున్నాము."

" 11 :—బొంబాయి స్త్రీలు జిన్నాహాలులో సమావేశమైరి. శ్రీమతి అవంతికబాయి గోఖేలుగారు అధ్యక్షతవహించిరి. మహాత్మునికి విజయముగోరుచు ప్రార్థనలు సలిపిరి.

" 12 :—గాంధిమహాత్ముని స్వరాజ్య సత్యాగ్రహ విజయ యాత్రా ప్రారంభదినము. సబర్మతి

ఆశ్రమమునుండి ఆతడు వెళ్లునపుడు స్త్రీలు దీవించి, కుంకుమతిలకము దిద్ది, హారతులిచ్చి పంపిరి. రాత్రి 10½ గంటలకు ప్రథమ సత్యాగ్రహ దళమువారు అస్లాలీగ్రామము చేరిరి. అది వరకెన్నడును ఘోషాపద్ధతిని వదలని స్త్రీలందఱునుగూడ ఘోషాను పరిత్యజించి వచ్చి మహాత్ముని సందర్శించిరి.

13 :—మద్రాసు నర్సుల పదియవ సాంవత్సరిక సభ శ్రీ వేంకటసుబ్బారావు సతి అధ్యక్షతను ఎగ్మూరునందలి నర్సెసు క్లబ్బున జరిగెను.

14 :—మద్రాసునందలి నుంగంబాకములోని విద్యోదయ పాఠశాల (బాలికలసాశ్రమ విద్యాలయము) సప్తమ వార్షికోత్సవము ప్రధాన న్యాయమూర్తులగు బీస్లీగారి అధ్యక్షత క్రింద జరిగెను.

15 —అనంతపురమునందలి స్త్రీల సెకండరీ ట్రెయినింగు స్కూలు విద్యార్థినిలు దత్తమండల కళాశాలా మందిరమున మండలకరగ్రాహి యస్ గోపాలస్వామి అయ్యంగారి అధ్యక్షతను కొన్ని ప్రదర్శనముల గావించిరి.

" 16 :—మహాత్ముడు సత్యాగ్రహదళముతో ఉదయము తొమ్మిదిగంటలకు బోరియావీ చేరెను. బోరియావీలో సభ జరుగబోవుటకు ముందుగా నొక వృద్ధాంగన ఖద్దరు బట్టను కట్టుకొని మహాత్ముని సన్నిధికి వచ్చెను. మిమ్ములనుచూచుటకే వచ్చితిని; గాని నాకు దృష్టిమాంద్యము ఉన్నది. మీ మొగము సరిగాకనబడదు. నేను కూడబెట్టగలిగిన యీ మూడు రూపాయలను స్వీకరింపగోరెదను." అని నుడువుచు సమర్పించినది.

" 17 :—మహారాష్ట్ర రాజ్యసంస్థాపకుడు-ఛత్రపతి శివాజి మహారాజుయొక్క 300-వ జయంత్యుత్సవ సందర్భమునందు రాజమహేంద్రవర పురమందిరమున జరిగిన బహిరంగ సభలో శ్రీమతి పులవర్తి కమలావతీ దేవిగారు శివాజి మహారాజుయొక్క భవానిపూజను గూర్చి క్లుప్తముగా మాటలాడిరి.

" 18 :—భవానిపురమున నూతన మహిళాసభ స్థాపింప బడెను.

—కీ. శే. యన్. బి. గుప్తాగారు తమ మరణ శాసనమున తమ తల్లిగారిపేర బారిసాల్ ఆస్పత్రిలో నొక వార్డుకట్ట ఇరువదియైదువేల రూపాయలనీయ వ్రాసిరని తెలియుచున్నది.

" 19 :—మధ్యాహ్నము మహాత్ముడు మున్నగువారు రానునుండి కనకపురమునకు వెళ్లుచుండగా దేహావాను అనునొక చిన్న గ్రామముకడ 105 ఏండ్ల వయసుగల నొక పూజ్యురాలు మహాత్ముని సందర్శించుటకు వచ్చెను. ఆమె మహాత్మునకు సాష్టాంగ నమస్కారమొనరించి మహాత్ముని ఫాలతలమున కుంకుమముతో తిలకమును తీర్చెను. "నాయనా నీవు శీఘ్రముగా విజయమును బడసిరమ్ము" అని ఆవృద్ధాంగన ప్రేమపూర్వకముగా నాశీర్వదించెను. "నేను మరల రాగలిగినచో విజయమును బడసియే వచ్చెదను; విజయము లభించనిచో నేను మరల రానేరాను" అని మహాత్ముడనెను. "మహానుభావుడవగు నిన్నాశీర్వదింప దగినంత యోగ్యత నాకులేదు; గాని నీవు తప్పక విజయుడవయ్యెదవను గట్టినమ్మకము మాత్రము నాకుకలదు" అని ఆమె నుడివెను.



శిశుహింసానివారణము:—

మార్చి పదునాలుగవ తేదీని మద్రాసు గవర్నమెంటు హౌసున బాన్క్వెటింగు హాలులో జరిగిన మద్రాసు జంతుహింసానివారకసంఘమువారి నలుబది తొమ్మిదవ సమావేశమునకు అధ్యక్షతవహించి శ్రీగవర్నరు ప్రభువుగారు వాయిలేని జంతువులను హింసించుట ఎంతటిపాపకార్యమో వివరించుచు జంతుహింసానివారణమునకై ఆ సంఘము వారు చేయుచున్న కృషిని శ్లాఘించిరి. ఆనాడు శ్రీ ప్రభువుగారిచ్చిన ఉపన్యాసము కటిక వారికి సయితము గుండెలు కరగించు కరుణారసముతోనిండియున్నది. భూతదయాపర ములగు ఉద్యమములయందు శ్రీవారికెట్టి అభిమానముగలదో ఆఉపన్యాసము సువ్యక్తము చేయుచున్నది. సాదృశ్యనిబంధనమై పొడమిన సంస్కారబోధమున మేమిచ్చో నొక్క విషయము చెప్పదలచితిమి. మద్రాసు యువజనసంఘమువారు తమ ఇరువది తొమ్మి దవ సమావేశమున మద్రాసునందలిబీడీఫ్యాక్టరీలయందు పిల్లవాండ్రు ఎట్టికడగండ్లగుడుచు చున్నారో వెల్లడించియున్నారు. గవర్నమెంటు కాణాచియగు మదరాసుమహానగరము నసే బీడీఫ్యాక్టరీల యందు పనిచేయుచుండునటువంటి శిశువుల దేహారోగ్యబలవీర్య ములను క్రుంగదీయబడుచుండగా తదితర ప్రాంతములందు వారిస్థితి ఇంకను దుర్భరముగా నుండుననుట వేఱె చెప్పకయే ఊహించుకొన అవకాశమున్న విషయము. భారతీ భార వహులగు శ్రీయుత గన్నవరపు సుబ్బరామయ్యపంతులుగారు ఈమధ్య కర్నూలునుగూర్చి విషయగర్భితమగు లేఖ నొకదానిని భారతిలో ప్రచురించియున్నారు. కర్నూలునందలి బీడీఫ్యాక్టరీలలో పనిచేయుచున్న బాలుర నారకయాతనలను వారు ఇట్లు అతికరుణకరముగ వర్ణించుచున్నారు. చూడుడు. "బీడీలకార్ఖానాలు ఈపురమున కొన్నిగలవు. వానిలో ౮ మొదలు ౧౬ ఏండ్లవఱకు వయసుగల బాలురు చాలమంది వేయింటికి మించియుందురు. అరకడుపున కయిన చాలనికూలికి పనిచేయుచున్నారు. వీరికి చదువుసున్న; శరీర పరి

శ్రమ బండిసున్న. ఇట్టి నికృష్టస్థితియందున్న వీరి కీకార్ఖానాలు వదలినచో జీవనోపాయమెట్లు? 'ఉభయభ్రష్టత ఉపరిసన్న్యాసము' అన్నట్లు ఏ అనుచితమార్గమునో అవలంబింపవలసివచ్చును. ఇప్పటి కుఱ్ఱవాండ్రేగదా భావిభారతదేశమునకు పట్టుగంబములు. అట్టివారు ఇట్టి దుస్థితినుండగాంచుట సహింపనశక్యము. ఈబాలురలో కొందఱికి నాలుగయిదు మణుగుల బరువుగల మ్రానితుండ్లను ఇనుపగొలుసుతో కాలికి బంధించియున్నారు. వీరుపనిచేయక పరువెత్తి పోవుదురట! అందులకని వీరికీశిక్ష. పశువులకేయిట్టి క్రూరశిక్ష నచ్చటచ్చట కనుచుందుము. ఇక్కడ మనుష్యులకు గూడ వ్యాపించినది. 'నాగరికత—నాగరికత' అనుమాట దిక్కులుమారు మ్రోగుచున్న ఈకాలమున నిట్టి క్రూరచేష్టలు దుస్సహములు. పురపాలకసంఘమువారు, ప్రభుత్వమువారు నీ విషయమును గమనించి దీనిని నశింపజేయు టత్యంతావశ్యకము. ఒకకార్ఖానాయజమాని ప్రజల ఆరోగ్యమునుపీల్చి పిప్పిచేయు బీడీలను సృష్టిచేయుటకై వీరినందఱిని పనికిమాలిన వారిని చేయుచున్నను తాను దేశసేవ చేయుచుంటినని సగర్వముగ చెప్పినాడు. ఇది ఎట్టిదేశసేవయో?" ఈపరిస్థితులను పాఱద్రోలి సుస్థితి వెలయించి శిశువుల బలారోగ్యములను పెంపొందింప వలసిన బాధ్యత ప్రజానాయకులపైనున్నది. హిందూదేశమునందలి వివిధరాష్ట్రములలో అనేకవిషయములయందు ముందడుగు వేయుచున్న వంగరాష్ట్రమున శిశుహింసానివారణసంఘమొకటి కలకత్తానగరమున ముప్పదిసంవత్సరములుగా పని చేయుచున్నది. కాని శిశుహింసానివారణసమస్యాపరిష్కారము సులభమైనదికాదు. అది బహుధనసాధ్యమైనది. బ్రిటీషు సామ్రాజ్యమునందలి మహాపట్టణములలో రెండవదియగు కలకత్తానగరమున ముప్పదిసంవత్సరములుగ నెలకొనియున్న శిశుహింసానివారణసంఘమునకే చాలినంతధనము లేకున్నది. 1922–వ సంవత్సరమున వంగశాసనసభలో శిశుసంరక్షకచట్టము తీర్మానింపబడినది. ఇప్పటికాచట్టము తీర్మానింపబడి ఎనిమిది సంవత్సరములైనను ఎన్నదగిన అభివృద్ధి కానరాదు; తలదాచుకొనుటకు వారికి తావీయగల సంస్థలులేమి శిశుయాచకుల విజృంభణ మరికట్టు క్లాజు ఆచరణయందు పెట్టబడకయేయున్నది. ఈపరిస్థితులలో కలకత్తా శిశుహింసానివారకసంఘమువారు సంరక్షింపబడినవారికి ఆశ్రయమిచ్చుటకు హాస్టలునిర్మింప అనంతప్రయత్నముచేయుచు అందులకు చందాలకై విన్నపము లంపుకొనుచున్నారు. మార్చి పదునొకండవ తారీఖున జరిగిన కలకత్తా శిశుహింసానివారణసంఘసమావేశమునకు అధ్యక్షతవహించి వంగరాష్ట్ర గవర్నరు సతి జాక్సను దొరసానిగారు ఇట్లు చెప్పిరి. "శిశుసంరక్ష సమస్య అతి ముఖ్యమైనది. నేటి శిశువులే భావిపౌరులు. వారుదేశమునకు ముఖ్యసంపద. జాగ్రతతో గూడిన వారి అభివృద్ధియే దేశసౌభాగ్యమునకు మూలము. కావున హాస్టలునిర్మాణ విషయమున ఎల్లరుచేతనైన సాయముచేయువలయును." గవర్నరుసతి చేసిన ఈవిన్నపమునకు పలుముఖములనుండి ప్రోత్సాహకరములగు ప్రత్యుత్తరములు వచ్చినవి. అచిరకాల

మునసే ఆమహానగరమున శిశువులకు ఆశ్రయమిచ్చు హాస్టలు నిర్మింపబడుననుటలో సందేహము లేదు. మనరాజధానియందెచ్చటను ఇట్టి ప్రయత్నముగానము. రాజధానీనగరమగు మద్రాసునందు శిశునివారకసంఘము పుట్టి నాలుగు సంవత్సరములు మాత్రమైనది. జంతుహింసానివారణసంఘసమావేశమునకు అధ్యక్షత వహించి కరుణపుట్టించు ఉపన్యాసమిచ్చి తమ భూతదయాపరత్వమును వెల్లడించిన శ్రీ మద్రాసు గవర్నరు గారీమధ్య శిశుహింసానివారక సంఘమునకు రాజపోషకులుగా చేరిరని వినుటకు సంతోషమగుచున్నది. ఆసంఘముయొక్క చతుర్థవార్షికోత్సవము ఏప్రియలు 3-వ తేదీని జరుగనున్నది. గవర్నరుగారి పోషకత్వమున ఆసంఘము శిశుహింసానివారణమునకు తీవ్రప్రయత్నములు గావించి శ్లాఘనీయమగు సంఘసేవ, దేశసేవ చేయునని నమ్ముచున్నాము.

"భర్తలను బహిష్కరింపవలెను":—

ఉత్తర మలబారునందలి తెల్లిచేరీయందు మార్చి 16-వ తేదీని తియ్యాసంఘమువారును బిల్లువారుసంఘమువారును సమావేశమైరి. సమావేశమునకు రెండువేలమంది సంఘీయులు వచ్చిరి. ఇతర సాంఘికసమావేశములందువలెనే ఈ సమావేశమునందును అంటరాని తనమును పోకార్చుట; దేవాలయమున ప్రవేశించుటకు అందఱికి అధికారమిచ్చుట మొదలగు తీర్మానములు చేసిరి. ఇందువిశేష మేమియులేదు. విశేషముగల తీర్మాన మొకటి చేయబడినది. గమనింపుడు. "కల్లుసారాయి త్రాగువారుకాని, అది తయారు చేయువారుగాని, ఆవస్తువులతో వర్తకము చేయువారుకాని అయిన తమ భర్తలను తియ్యాస్త్రీలు బహిష్కరింపవలెనని ఈసభవారు హెచ్చరించుచున్నారు." ఈ హెచ్చరిక అవలంబింపబడుచో తియ్యాసంఘమునకు కల్లుసారాయిలు దూరమైతీరును. స్త్రీలు పూర్తిగ తలంచినచో ఎట్టిదురాచారమునైన దూలింపగలరు. కావలసినది వారియందు అట్టి సంకల్పమును పూరింపగల ఉద్దీపనము. ఈవిషయమును స్త్రీలు బాగుగ ఆకళించినారు. శ్రీకాకుళములోని మద్యపాననిషేధసంఘమువారి వార్షికోత్సవ సందర్భమున మాట్లాడుచు శ్రీమతి మల్లెమడుగుల అమ్మగారు ఏమని పలుకుచున్నారో కనుడు. "పురుషులకన్న ఎక్కువనేర్పుతో జనులకు నచ్చచెప్పి త్రాగుడు మాన్పింపగలవారు స్త్రీలు." ఇది ముమ్మాటికి నిశ్చయము. కావున ఇకనైనను స్త్రీలుమేల్కొని సంస్కార ప్రబోధమునకు వలయుశక్తిని ప్రయత్నించి దేశమునకు కళ్యాణముగూర్ప హెచ్చరించుచున్నాము.

కీ. శే. ప్రేమిభాయి సౌ॥ పేరేపి సూర్యకాంతము సత్సంగనీ గారు—

ఈసత్సంగనీ సకల విద్యల కాటపట్టయిన విజయనగరమున 11-8-1912 తేదీ నాడు జన్మించి చెన్నపురియందు పెరిగి 'లేడీవెల్లింగ్డన్ ట్రెయినింగు' పాఠశాలయందు

ఆంగ్లము మున్నగు భాషలనేర్చుకొని 1919 సంవత్సరమున అనగా యేడువత్సరముల ప్రాయమున ఆగ్రా నగరమునందు రాధాస్వామి గురువర్యులచే నుపదేశమును బడసి యోగాభ్యాసము చేయుచుండెడి దీసాధ్వీలలామ. ఈమె యేడవ వత్సరమునుండియు సంగీతసాహిత్యము లభ్యసించుచు హిందీ, అరవము, ఆంగ్లము, ఆంధ్రము, సంస్కృతము మొదలగు భాషలయందు ప్రావీణ్యమును బడసి సహృదయుల మనంబుల రంజింపచేయుచుండెడిది. సంగీతసాహిత్య వేదిని. పాఠశాలయందు విద్య నభ్యసించు కాలములో ఆపాటలయందు బహుమతులను పొందినది. సంగీతము, గాత్రము, హార్మోనియము, పిడేలు మున్నగు వానియందు మిగుల పాండిత్యమును సంపాదించి పండితవర్యుల యొక్కయు, రాజకుటుంబములయొక్కయు మెప్పువడసి పేరువడసిన కాంతిపుంజము. మద్రాసు



కీ. శే. సూర్యకాంతముసత్సంగనీగారు

నందలి సంగీత సభలలో మెంబరుగా నుండెడిది. ఈమెకు జ్యోతిషము, సాముద్రికము, కుట్టుపని, బెత్తుపని, డ్రాయింగు మొదలయిన కళలయందు అసమానప్రావీణ్యము కలిగియుండెడిది. ఈమె 'చర్కా' మీద స్వయముగా ఎనిమిదవ యేటనుండియు నూలువడకి మగ్గములమీద నేయింపించి ఆవస్త్రములనేయుపయోగించు చుండిన స్వరాజ్యాభిలాషిణిగనుండెడిది. 1925-వ సంవత్సరము జూన్ మాసము 10-వ తేదిని పేరేపి. వేంకటసుబ్బయ్య M. A. B. ED. గారిని వివాహమైనది. ఈమె భిషగ్రాజవైద్య భాస్కర పండిత వేంకటేశ్వరరావు మాండలికగారి ఏకపుత్రిక. మహాజ్ఞానవతి. శాంతస్వభావము గలది. ఈసతీతిలకము 31-1-30 తేది శుక్రవారము ఉదయము చెన్నపురియందు 9-20 నిముషములకు పరమపదము పొందినది. ఈమె ఆత్మకు శాంతిచేకూరుగాక!

కీ. శే. కోపల్లె కృష్ణారావు పంతులు గారు:—

రాజమహేంద్రవరమునందలి గౌతమీగ్రంథాలయము; గుంటూరు నందలి శారదానికేతనము; బందరునందలి ఆంధ్రజాతీయ కళాశాల ఆంధ్రులు గొప్పగ చెప్పుకొనగలిగిన విద్యాసంస్థలు. అందు బందరునందలి ఆంధ్రజాతీయకళాశాలసంస్థాపనాచార్యులగు కీ. శే. కోపల్లె హనుమంతరావు పంతులుగారి పితృదేవులగు శ్రీకృష్ణారావుపంతులు గారు మార్చి 22-వ తేదీ మధ్యాహ్నము మూడుగంటలకు చనిపోయిరని వ్రాయుటకు చింతించుచున్నాము. వీరి జన్మస్థానము దివితాలూకా ఘౌరుపూడి. వీరికి 70 సంవత్సరములు

దాటినవి. మచిలీపట్టణమున చాలకాలము న్యాయవాదిగ పనిచేసి పేరుగాంచిరి. దేవరకోట యెస్టేటుకు సుమారు 30 సంవత్సరములు దివాన్‌గిరి చలాయించియుండిరి. దేవరకోట సంస్థానములో వీరి నామము స్మరించని గృహముగాని మానవుడుగాని యుండుననితోచదు. వీరు రైతునుగాని జమీన్‌దారునుగాని నష్టపరుపకయే సభ్యమార్గమున వ్యవహరించి న్యాయమూర్తులనిపించుకొనిరి. అపార వ్యవహారమున మునిగియున్నను ఎచటనైన సర్క్యూటుబోవుచు స్వహస్తము చేసుకొని భుజించెడివారు. నిగర్వశిఖామణులన్న వీరికే చెల్లును. వీరికి వ్యవసాయమన్నను తోటలు పెంచుట యన్నను మహాప్రీతి. జొరుపూడివద్ద గొప్పతోటను పెంచి సంవత్సరములో కొంతకాలమచటనే గడుపుచుండెడివారు. ఆ తోటను చూచినవారికి వీరి ఓపిక వెల్లడియగుచుండును. వీరు దివానుగానున్న కాలములో ఎస్టేటు గ్రామములనుండు వ్యాజ్యములు తక్కువయనియే చెప్పవచ్చును. వీరు మంచిముసాయిదాకర్తలని పేరెన్నికగాంచి యుండిరి. వీరికి వడ్రంగము పనికూడ బాగుగ తెలియును. తమపిల్లలకు కావలసిన సామానులను ఖాతా స్వయముగా జేసికొనెడివారని ప్రతీతికలదు. ఇంతవృద్ధాప్యములోను ఓపికవహించి వచ్చినవారికెల్ల సలహాజెప్పుచుండెడువారు. వీరికి ఆంధ్రఆంగ్లములయందు మంచి ప్రవేశముకలదు. రివిన్యూవ్యవహారములందు దిట్టలనియే ఎస్టేటు ల్యాండు ఆక్టుసవరణ సందర్భమున ప్రభుత్వమువారు వీరి నొకసభ్యునిగ నియమించిరి. ఈసత్పురుషుని మృతికి వగచుచు వీరికుటుంబమునకును మా సానుభూతిని తెలియజేయుచు వీరిఆత్మకు శాంతియొసంగ భగవంతుని ప్రార్థించుచున్నాము.

## గ్రంథస్వీకారము

1. ఆంధ్రహృదయము—న. వేంకటరత్నముగారు; 2. జానకీపతి శతకము—కొవ్వాలి వేంకటరాజేశ్వరరావుగారు; 3. భక్తిపథము—కవిరత్న నరసింహశర్మగారు; 4. భరతమాతృ శతకము—కల్లూరు అహోబలరావుగారు; 5. ఆరోగ్యాదర్శము—పుచ్చా వెంకట్రామయ్యగారు; 6. జప్తుచికిత్స—కొండిపర్తి వీరభద్రాచార్యులవారు; 7. సూర్యకిరణచికిత్స—పుచ్చా వెంకట్రామయ్యగారు; 8. యోగచికిత్స—చల్లా లక్ష్మినారాయణశాస్త్రిగారు; 9. మహాయోగము—పొత్తూరి రామరాజయోగిగారు; 10. నులబద్ధము—శ్రీమతి జ్ఞానాంబగారు; 11. ఆరోగ్య ప్రభాకరము—పుచ్చా వెంకట్రామయ్యగారు; 12. ఋషిజీవనప్రకాశము—యన్. హనుమయ్యగారు; 13. శ్రీరామ తీర్థస్వామి—చెరువు రామకృష్ణరావుగారు; 14. తత్త్వలక్ష్యార్ణవము—కృష్ణరాజయోగిగారు; 15. ఉపవాసచికిత్స—మరళూరు ఆర్యమూర్తిగారు; 16. నైపీయజలచికిత్స—పుచ్చా వెంకట్రామయ్యగారు; ఈగ్రంథములను వందనములతో నందు కొంటిమి. కాలక్రమమున విమర్శింపగల మనిమనవి.

# రజోదర్శిని

తిమ్మసముద్రము

ఆర్యా 28–5–29

"........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయము లేక విసిగి నాతో సంప్ర తించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివా రించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

## ఆర్షరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)

# విషయసూచిక

గాంచిన మొదటి ట్టు బాలికలు సంగీతమున [illegible] మొదటి [illegible] బాలికలు. హిందీ [illegible] ఉత్తీర్ణులైన మొదటిజట్టు బాలికలు. కుట్టుపనియందు [illegible] తొలిజట్టు బాలికలు) కామరాజు మైత్రేయిగారు; [illegible] సత్యవతమ్మగారు; రాయి [illegible] అమ్మాళ్ గారు; ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు; కాకాని శేషమాంబగారు; సీతాబాయమ్మగారు; [illegible] సౌందర్యము; గోడల [illegible] సౌందర్యము.

# గృహలక్ష్మీచందాదారులకు మనవి.

క్రిందఉదాహరింపబడిన చందానెంబర్లుగల చందాదారులకు చందాలు ఈ 1930–వ సంవత్సరము మే మాసపు సంచికతో ముగింపు గొనుచున్నవి. ఆయా చందానెంబర్లుగల గృహలక్ష్మీ చందాదారులు తిరిగి తమతమ చందాలను సంవత్సరమునకైనను, అర్ధసంవత్సరమునకైనను మనియార్డరు మూలమున మాకార్యాలయమునకు పంపుటగాని, లేకపోయిన సొమ్మును జూనుమాసపు సంచిక రాబట్టుకొనుటకు అనుజ్ఞాపత్రమునిచ్చుటగాని చేయవలసినదని వేడుకొనుచున్నాము. అట్లు మే నెల 25–వ తేదీలోపుగ మాకు మనియార్డరుకాని, వి.పీ. అనుజ్ఞాపత్రముగాని రానిచో జూనుమాసపుసంచిక వి. పి మూలమున చందాదారుల సన్నిధికి పంపుకొనగలము. వారు ఇంతవఱకు చందాదారులుగనుండి గృహలక్ష్మికి ఆర్థికపుష్టి నొనగూర్చి దాని క్రమనిర్వాహణమునకు తోడ్పడుచున్నట్లే ఇకముందు కూడ చేయుచు ఆ వి.పి.ని అభిమానింతురని గాఢముగ నమ్ముచున్నాము.

142, 173, 184, 186, 190, 198, 221, 262, 282, 375 414, 443, 454, 467, 486, 494, 495, 496, 497, 498, 499, 500, 501, 502, 503, 504, 505, 506, 507, 508, 509, 510, 511, 512, 513, 514, 515, 516, 517, 518, 519, 520, 521, 552, 523, 524, 525, 527, 528, 529, 530, 531, 533, 534, 538, 539, 540, 541, 561, 565, 983, 1010, 1014, 1017.

మే నే జ రు

గృహలక్ష్మి

పోస్టుబాక్సు నెం 752, ఎగ్మూరు, మదరాసు.

# ఏప్రిలుమాసపు యుక్తిలెక్కకు సమాధానము

ఏప్రిలుమాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి పొణకా కనకమ్మగారి యుక్తిలెక్కకు మేము కోరినట్లు ఏప్రిలు 10-వ తేదీలోపున సరియగు ప్రత్యుత్తరంబొసగిన గృహలక్ష్మి పాఠకురాండ్ర నామములు వరుసక్రమమున దిగువ పేర్కొనుచున్నాము.

1. కమలమ్మగారు (3-వ తరగతి); 2. ఎన్. వి. సుబ్బరత్నమ్మగారు; 3. గుంటూరి పుల్లారెడ్డిగారు; (2.వ ఫారము); 4. దువ్వూరి వెంకటరమణ సరస్వతిగారు (11 సం॥); 5. వి. రాజమ్మగారు; 6. గిరిజాబాయిగారు (11 సం॥); 7. పార్వతీబాయిగారు (11 సం॥); 8. ఈశ్వరమ్మగారు (11 సం॥); 9. సంజరమ్మగారు (12 సం॥); 10. ఎస్. ఎస్. అమ్మణ్ణిగారు (9 సం॥); 11. కానూరి రాఘవమ్మగారు; 12. వడ్లమూడి రామానుజంగారు (5.వ తరగతి); 13 కల్లూరి కౌసల్యగారు (5-వ తరగతి); 14. కోడాలి వెంకటనరసమ్మగారు (5-వ తరవతి); 15. కోడాలి లక్ష్మమ్మగారు (5-వ తరగతి); 16. గోగినేని రాఘవమ్మగారు (5.వ తరగతి); 17. మన్నవ వెంకటసుబ్బమ్మగారు (5.వ తరగతి); 18. కానూరి కమలాంబగారు (5-వ తరగతి); 19. కోడాలి అన్నపూర్ణమ్మగారు (5.వ తరగతి); 20. గోగినేని మహాలక్ష్మిగారు (5.వ తరగతి); 21. కానూరి వెంకట రంగనాయకమ్మగారు; 22. వీరపనేని చిట్టిగారు; 23. అట్లూరి విమలాదేవిగారు; 24. కోడాలి నారాయణమూర్తిగారు; 25. ఉప్పటూరి వెంకటసత్యనారాయణమూర్తిగారు; 26. త్రిపానూరి హనుమాయమ్మగారు; 27. కామిశెట్టి రామకృష్ణయ్యగారు (10-సం॥); ?8. శేషమ్మగారు (10 సం॥); 23. ఆర్. కోమలగారు (10 సం॥); 30 ఎస్. శేషావతమ్మగారు; 31. వేదుల గౌరీసావిత్రమ్మగారు; 32. వెలువల్లి ఉదయలక్ష్మిగారు; 33. గొల్లకోట కామేశ్వరమ్మగారు; 34. ఎన్. శకుంతలాగారు (10 సం॥); 35. తుమ్మలూరు జయశంకరమ్మగారు (3-వ తరగతి); 36. ముక్కామాల లక్ష్మీనరసమ్మగారు; 37. బుద్ది నాగేశ్వరమ్మగారు (11 సం॥); 33. ఘార్వాడ లక్ష్మీబాయమ్మగారు; 39. టి. రంగమ్మగారు; 40. అక్కరాజు అమ్మాయమ్మగారు; 41. డబ్లియు. రాజలక్ష్మిగారు (5-వ తరగతి); 42. ప్రత్తి సుశీలాగారు; 43. బి. భ్రమరాంబగారు; 44. దువ్వూరి నిత్యకళ్యాణమ్మగారు; 45. పరమాత్ముని అనసూయాదేవిగారు; 46. కె. సాంబశివరావుగారు (2. వ ఫారము, 9 సం॥); 47. గూడవల్లి శేషావతిగారు; (11 సం॥): 48. వట్టిపల్లి హనుమంతరావుగారు; 49. పాణకా వసుంధరాదేవిగారు (9 సం॥); 50. గూడవిల్లి సీతారత్నమ్మగారు (10 సం॥); 51. దిగుమర్తి గోపాలస్వామిగారు; 52. బోయిన సావిత్రమ్మగారు.

## కావలెను

### సత్యాగ్రహమున పాల్గొనుచున్న ఆంధ్రస్త్రీల ఛాయాచిత్రములు

దేశమాత పాదాంకములచెంత ప్రాణార్పణమొనర్చుటకైన సంసిద్ధలై సత్యాగ్రహసవరమున పాల్గొనుచున్న దేశారాధకురాండ్ర దివ్యచిత్రములను ప్రచురించి గృహలక్ష్మిని కృతార్థను చేయవలయునని ఉత్సాహపడుచున్నాము. అట్టివానిని సేకరింపగల మహాశయులు సేకరించి మాకడకుపంప పదింబదిగ ప్రార్థించుచున్నాము.

—సంపాదకుడు.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# రజోదర్శిని

తిమ్మాపురము

ఆర్యా 28—5—29

"..........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక కిసి. నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఏ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

## ఆర్షరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)




# హిందూదేశమున శిశుమరణములు



ఈనాటి శిశువే రేపు దేశాభివృద్ధికి పట్టుసారువ కాగల పౌరుడు. అగుటనే శిశువులు దేశమునకు ముఖ్యసంపద అని ప్రపంచమునందలి సమస్త దేశముల వారును అంగీకరించియున్నారు. అయితే కొందఱి ఈ అంగీకారము ఆముఖ్యసంపద పరిరక్షణమునకు పురికొల్పుమంత్రముగ నున్నది. మఱికొందఱు అంగీకరించుటతో తమపని తీరినదని అనుకొని శిశుసంపద విషయమై చీమతలయంతయైన శ్రద్ధను చూపక పల్లకుండుచున్నారు. ఇట్టి వారిలో భారత దేశీయులు అగ్రతాంబూలమును పొందతగిన పెద్దమనుష్యులైయున్నారు. చూడుడు: ఏబది రెండువారములుగల సంవత్సరములో ఒకవారమును వారు ఆరోగ్యశిశువారము అను నామమున పిలుచుచు ఆఏడుదినములును ఉత్సవములు, ఉపన్యాసములు, ప్రదర్శనములు, ప్రస్థానములు చేయుదురు. ఉత్సవములు తత్కాలికానందము నిచ్చుటతో సరి. ఉపన్యాసములందు ప్రస్తరింపబడు మహనీయవిషయములన్నియు ఉపన్యాసమందిరములందే గాలితో లీనమగును. పలుక బాఱుటకునోచని ఆప్రదర్శనములు కేవలప్రదర్శనములుగనే ఉండుచున్నవి. ఆరోగ్యశిశువారనిర్వహణసందర్భమున గావింపబడు శిశువుల ప్రస్థానములు వారి ఆరోగ్యము పెంచజాలినవిగా నుండుటలేదు సరికదా మీదు మిక్కిలి తుంచుచున్నవి. కాళ్లు చేతులు విఱుగద్రొక్కుకొని ఆరోగ్యశిశువారము అయినదనిపించి ఆయేటికి శిశువుల విషయములో తాము చేయగలిగినంతయు చేయతగి

నంతయు చేసితిమని భావించి మిగిలిన ఏబదియొక్క వారములును భారతీయులు చంకలు తాటించుకొనుట సంవత్సరము సంవత్సరమును పరిపాటియై ఉండుచున్నది.

ప్రజలుకాని, ప్రజానాయకులుగాని, ప్రభుత్వమువారుకాని ఈవిషయమును గమనించినట్లు గన్పట్టదు. భారతదేశమునందలి శిశుమరణములసంఖ్య ఒకపరి పరికించితిమేని గుండె నీరైపోవును. ప్రపంచమున ఏఒక్కదేశమునగాని శిశుమరణములసంఖ్య ఇంతటి హృదయవిదారకముగ లేదు. విపులప్రయత్నముచే ఇప్పటి శిశుమరణములసంఖ్య తగ్గింపబడనిచో కొన్నివందలసంవత్సరములలో భారతదేశమున 'భారతీయుడు' అనుపురుగు లేకుండ పోవుననుట అత్యుక్తిగాదు.

ప్రపంచమునందలి ముఖ్యపట్టణములలో వేయిమందికి ఏడాదికి ఎంతమంది శిశువులు మరణించుచున్నారో ఒకసారి చిత్తగింపుడు: బొంబాయి 450, కలకత్తా 317, అలహాబాదు 265, కెయిరో 247, మాస్కో 177, డబ్లిను 112, గ్లాస్గో 101, వియన్నా 98, బెర్లిను 92, పారిసు 89, బోస్టను 81, చికాగో 77, బర్మింగుహ్యాము 75, లండను 66, న్యూయార్కు 64. వీనినిబట్టి తెలియదగునదేమి? ఇతరదేశపు పట్టణములందలి శిశుమరణముల సంఖ్యకంటె భారతదేశమునందలి పట్టణములందు శిశుమరణములసంఖ్య మిక్కిలి హెచ్చుగానున్నదని. ఈ హెచ్చుదలకుగల కారణములేమి?

కారణముల నారయుటకు విశేషశ్రమపడనవసరములేదు; సూక్ష్మదృష్టి నుపయోగింపను అవసరములేదు. మాతృత్వము వహించు స్త్రీకి తగిన రక్షణలేమి, తల్లికి వికాసములేమి, ప్రజలయందు విద్యలేమి—అను ముఖ్యమగు మూడు లేములుకూడి హిందూదేశమున శిశుమరణముల ఎచ్చుదలను తెచ్చిపెట్టుచున్నవని విశేషశ్రమపడ నక్కఱలేకనే స్థూలదృష్టితోడనే గ్రహింపవచ్చును.

మాతృత్వము వహించు స్త్రీకి తగినరక్షణలేదు. తల్లినిబట్టి బిడ్డ. తల్లి బలహీనురాలగుచో బిడ్డయు బలహీనముగనే యుండుటసహజము. బలహీనమగు బిడ్డ చుట్టుముట్టాడురోగములకు సులభముగనే దాసోహముచేయును. హిందూదేశమున స్త్రీలు బలహీనలుగానున్నారు. అతిబాల్యవివాహములు, పసితనముననే గర్భము ధరించుట మొదలగు దురాచారములు ప్రబలియుండి భారతరమణి బలారోగ్యములను దిగదీయుచున్నవి. (శారదాచట్టము అమలులోనికివచ్చినది గనుక ముందీదుస్థితి కొంత తొలగవచ్చును.) పుట్టుకచేతనే బలహీనమైయున్న హిందూస్త్రీ గర్భవతిగానున్న సమయమునను, ప్రసూతమైనపుడును రోగదేవతకు తన్ను వరవుగ నమ్ముకొని చావుబ్రతుకులతో యుగి

తక్షణములు పుచ్చుచుండును. అమెరికాసంయుక్తరాష్ట్రములందు సంవత్సరమునకు ప్రసూతిరోగములచే 20,000 ఇరువదివేలమంది స్త్రీలు మరణించుచున్నారు. హిందూదేశముననో 60,000 అరువదివేలమందికి అధికముగనే మృత్యుముఖమున బడుచున్నారు. కనిపెంచుచున్న కాంత చనిపోయిన దనగానేమి? జాతిని పారంపర్యముగ వెలయించుటకు స్త్రీపురుషశక్తుల ప్రసాదించు ఒకదేవత నిర్గమించిన దన్నమాట. ఇందు మూలమున దేశమునకు ఒనగూడు నష్టము కొలదియిడరానిది. అయితే ఈనష్టము వెంటనే గుర్తింప బడ జాలినదికాదు. గుర్తింపబడు తాత్కాలికనష్టములుకూడ తక్కువవికావు. తల్లి చనిపోయినమీదట ఏమ్పడిపి ఆదరించి ఎత్తుకొని ఎడపిల్లను కడుపులో పెట్టుకొను వారెవరు? వేళమెఱిగి పాలుపోసి చంటిపిల్లను సాకువారెవరు? బాధ్యతగల పోషణకు మొగమువాచి చంటిపిల్ల చనిపోవును; ఎడపిల్ల ఆరోగ్యమును గోల్పోయి బ్రతికియు ప్రయోజనము లేనిదగును. చూలింతతనమున, బాలింతతనమున స్త్రీల ఆరోగ్యము తగినట్లు పరిరక్షింపబడునేని ప్రసూతిరోగములచే దేశమున ఇన్నిమరణములు ఉండ నేరవు; దేశమున ఏటేట గల్గుచున్న అరువదివేల ప్రసూతిమరణములలో తుదకు ముప్పదివేల మరణములనైన మనము కొంచము జాగ్రత్త తీసికొన్నచో లేకుండ చేయ వచ్చునని సుప్రసిద్ధ వైద్యులోకరు చెప్పుచున్నారు. హిందూదేశమున శిశుమరణముల సంఖ్య తగ్గింపవలయునన్నచో మాతృత్వము వహించుస్త్రీల సంరక్షణమున మున్ముందు జాగ్రత్త చూపవలయును.

అటుపిమ్మట తల్లికి వికాసము కల్గించు విషయమున విశేషశ్రద్ధ చూపవలయును. జాగ్రతచూపి ప్రసూతిరోగదేవత కరాళవదనమునుండి రక్షించినను ఆమెను అజ్ఞాన సింధువుగనే యుంచితిమేని కలుగగల విశేషప్రయోజనము కనిపింపదు. తాను గర్భవతిగా నున్నప్పుడు గాలివెలుతురుగల గదులలో ప్రశ్రమించుట; ఆరముగ్గినపండ్లు, పుష్టి కల్గించు కూరలు భుజించుట; కాచి వడపోసి శుభ్రము చేయబడిన జలమును మాత్రమే త్రాగుట మొదలగు ఆరోగ్యసూత్రములను అవలంబించు శ్రద్ధ—మలబద్ధము, తలనొప్పి, మొగము పొంగరించుట, పాదములు మెఱుగుచూపుట మొదలగు దుర్లక్షణములు కనిపించిన తోడనే రోగము రొష్టుచేసి వైద్యసాహాయ్యమును పొందుతెలివి హైందవ స్త్రీల హృదయమున వికసింపజేయవలయును. సాధారణముగ వారు ఆరోగ్యసూత్రములను అవలంబించుటలో అధికధనవ్యయమును భరింపవలసి యుండునను దుర్భ్రమకు లోనై యున్నారు. వికాసమును కల్గించి వారిహృదయములనుండి అట్టి దురభిప్రాయమును దూరముగా తఱిమివేయవలసియున్నది. తెచ్చినపాలపై మూతవేయుటకుగాని,

పెట్టు అన్నమును వేళపట్టునకు పెట్టుటకుగాని, మఱి ఇట్టివియేయగు శుచిసూత్రముల నవలంబించుటకుగాని కావలసినది క్రొత్తఖర్చుగాక కొంత శ్రద్ధమాత్రమే అను విషయమును స్త్రీల మనస్సున బట్టింపవలయును. అధికాధికమగు నేటి శిశుమరణముల సంఖ్య తగ్గించుటకు తల్లికి ఇట్టి వికాసము కల్గించుట యొకముఖ్యసాధనము.

మఱియొక ముఖ్యసాధనము ప్రజలలో విద్యను వ్యాపింపచేయుట. విద్యావంతములైన సంఘములలో శిశుమరణములు మిక్కిలి తక్కువగానున్నవి. క్రిందిలెక్కల నొకతూరి తిలకింపుడు: హిందూదేశమునందలి ప్రత్యేకసంఘములందు మహమ్మదీయులలో నూటికి ఇరువది ముగ్గురు చదువుకొనినవారున్నారు. వారిలో వేయింటికి 1919-వ సంవత్సరమున ముప్పది ఒక్కరును, 1925-వ సంవత్సరమున నలుబది యొక్కరును చనిపోయినారు. హిందువులలో నూటికి ముప్పదియిద్దఱు చదువుకొనినవారున్నారు. వారిలో వేయింటికి 1919-వ సంవత్సరమున ఇరువదియొనమండుగురును, 1925-వ సంవత్సరమున ముప్పదిఒక్కరును చనిపోయినారు. ఆంగ్లోయిండియనులు, ఐరోపాదేశీయులు వీరిలో నూటికి ఎనుబదిమంది చదువుకొనినవారున్నారు. వారిలో వేయింటికి 1919-వ సంవత్సరమున పదునేడుగురును, 1925-వ సంవత్సరమున పదునేనుగురును చనిపోయినారు. తేలిన సారాంశమేమి? విద్యావంతములగు ఆంగ్లోయిండియను, ఐరోపీయసంఘములలో సగటుమరణములసంఖ్య క్రమముగా తగ్గుచుండగా విద్యావ్యాప్తిలో వెనుకబడియున్న హిందూమహమ్మదీయసంఘములలో సగటుమరణముల సంఖ్య క్రమముగా హెచ్చుచున్నది. మరణములసంఖ్య తగ్గించుటకు విద్యావ్యాప్తియొక అమోఘసాధనమని సునిశ్చితమగుచున్నది. కావుననే బుద్ధిమదగ్రేసరుడు గోక్లేమహాశయుడు నిర్బంధప్రాథమికవిద్యావ్యాప్తికొఱకు నిద్ర, తిండి యెఱుగక ప్రాకులాడినాడు.

ప్రజాక్షేమమునకు శ్రీరామరక్షలనదగిన స్థానికసంస్థలు ఈ విషయమై మిక్కిలి శ్రద్ధ చూపవలసియున్నది. ప్రసూతిరోగముల ఆనుపానులెఱుంగుటలో అనుభవముగల మంత్రసాని, మాజికుల్లాంతరు సహాయమున శుచిసూత్రములను స్త్రీలకు బోధించు ఒక ఉపన్యాసకురాలు, ప్రజల కనురెప్పలను విప్పగల విద్యాలయము హిందూదేశమునందలి ప్రతికుగ్రామమునందును ఉండవలయును. ఏనాడీమూడును మన గ్రామములకు లభ్యమగునో ఆనాటినుండియు హైందవశిశువులకు మరణగండములు తగ్గిపోవును. అప్పుడు భారతమాత శిశుసంపదవిషయమున తోడిదేశములతో తులదూగుచు తిరుగగలదు. అట్టి శుభసమయముయొక్క ఆగమనము అచిరకాలముననే కలుగుగాక!

# శ్రీ తెల్లప్రోలు రాణీవారు తీసిన ఛాయాచిత్రములు




(ఆకిరిపల్లి) శ్రీ శోభనాచలపతి దేవాలయము

(మెట్లగట్టుపైనుండి ఎత్తినది)




(ఆకిరిపల్లి) శ్రీ శోభనాచలపతి
అశ్వావాహనముపై వేంచేయుట




(ఆకిరిపల్లి) శ్రీ శోభనా
చలపతిరథము

# రాణివాసమున స్త్రీల స్వేచ్ఛ

శ్రీమతి దివాకర్ల మాణిక్యాంబగారు

ప్రాచీనభారతవర్షమున రాణివాసపు స్త్రీలకెట్టి స్వాతంత్ర్యమును లేదని కొందఱు సంఘసంస్కారణాభిలాషులు చెప్పుచుండుట సత్యమునకు దూరమైయున్నది. మనయిండ్లలో నేడు స్త్రీలకుగల స్వేచ్ఛ కేవలపాశ్చాత్యసంఘధర్మములను బట్టి ప్రచారమునకు వచ్చినదికాదు.

ప్రాచీనధర్మవేత్త లందఱును స్త్రీలకు స్వాతంత్ర్య మీయరాదని శాసించినట్లు సరియైన తత్త్వమును తెలిసికొనకుండ ఇప్పటి సంఘసంస్కారు లనుట మిక్కిలి శోచనీయముగ నున్నది. వారు చర్విత చర్వణముగ 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అను మనుధర్మకారుని వాక్యమునే మూలసూత్రముగ నుగ్గడించుట అప్పటి స్త్రీల సంఘస్థితిని తెలిసికొనక చెప్పినమాటయై యున్నది.

ప్రాచీనకాలమున నంతఃపురమునందలి స్త్రీలు పురుషులతో మిక్కిలి కలసి మెలసి సంచరించెడివారనియు, పురుషులు అప్పటి స్త్రీలను ఈనడుమ వచ్చిన 'ఘోషా' పద్ధతి యందువలె కారాగృహములనుంచినట్లు నిర్బంధవిధానముల నుంచలేదనియు నిశ్చయించుటకు ప్రబలాధారములున్నవి. అందొక్కదానిని మాత్రమే యీదిగువఁ బేర్కొనుచున్నాను:

పదునొకండవశతాబ్దమున సోమదేవునిచే రచింపఁబడిన కథాసరిత్సాగరమను గ్రంథమునందు స్త్రీలను ఇండ్లలోపెట్టి తాళమువేసి పరపురుషుల కంటబడకుండ చేయు పద్ధతుల నేవగించుకొనుచుఁ జెప్పబడిన ప్రసంగమొకటియున్నది. ఒకప్పుడు నరవాహనదత్త చక్రవర్తి తనభార్యయగు రత్నప్రభాదేవితో నంతఃపురమునందుండగా నతని మిత్రులగు గోముఖాదిసచివోత్తములతనిని చూడవచ్చిరి. అప్పుడు ద్వారమున కావలియున్న స్త్రీ వారిని కొంతయడ్డు పెట్టఁబోగా దేవియగురత్నప్రభ యామెను నివారించి "ద్వారమిక నెల్లప్పుడు తెఱువఁబడియే యుండవలెను. ఆర్యపుత్రుని స్నేహితులు ఇందుప్రవేశించుటకు ఆటంకముండరాదు." అని భర్తనైపుతిరిగి ఇట్లుచెప్పెను.

"ఆర్యపుత్రా! ప్రసంగవశమున వచ్చినది కనుక నేను చెప్పుచున్నదానిని వినుము. నీతియే స్త్రీలను రక్షించునదికాని ఇట్టి నిబంధనలు కావు. శీలమే కులస్త్రీలను ఉత్తమ మార్గమున కాపాడవలెనుకాని వట్టి యీర్ష్యయు మోహమునుకావు. చపలచిత్తయైన స్త్రీని దైవమైనను చెడిపోకుండ రక్షింపఁజాలఁడు. మహోద్వేగమున బోవు నదినికాని, నారీమణినికాని యెవ్వడును నిలుపఁజాలడు". ఇట్లుచెప్పి యీవిషయమై తేటపడునట్లొక కథను చెప్పి తనమహోపన్యాసమునిట్లు పూర్తిచేసెను.

"కావున స్త్రీల రక్షింప నెవ్వరును సమర్థులుకారు. కులయువతులెప్పుడును నిజసత్త్వ పాశబద్ధమువలననే విశుద్ధవర్తనలయ్యెదరు. ఈర్ష్యావశులై పురుషులు వారిని నిర్బంధించుట దుఃఖమునకు మూలమగుచున్నది. అట్టి నిబంధములనున్న యువతులు అవ్వలి ప్రపంచ మనిన మిక్కిలి యౌత్సుక్యమునుజూప సంసిద్ధలై యుందురు."

విదుషీమణుల యుపయోగార్థము పై కథాభాగమునకు సంబంధించిన మూలము నందలి వాక్యములను క్రింద ఎత్తి చూపుచున్నాను.

రత్నప్రభ

ద్వారమేషాం నగోద్ధవ్య మిహ ప్రవిశతాంపునః
*    *    *    *    *
ఆర్యపుత్ర! ప్రసంగేణ వదామి తవ తచ్ఛృణు
నీతి మాత్రమహం మన్యే స్త్రీణాం రక్షానియన్త్రిణమ్
ఈర్ష్యా కృతోఽథవా మోహంకార్యం తేన న కించన
మహత్తరేణ రక్ష్యన్తే శీలేనైవ కులస్త్రియః
ధాతాపి నప్రభుః ప్రాయశ్చపలానాంతు రక్షణే
మత్తానదీచ నారీచ నియన్తుం కేన పార్యతే?
*    *    *    *
ఇతి జగతి నరక్షితుం సమర్థః క్వచిదపి కశ్చిదపి ప్రసహ్యానారీమ్
అవతితు సతతం విశుద్ధ ఏకః కులయువతీం నిజసత్త్వపాశ బద్ధః
ఏవంచ ఈర్ష్యానామ దుఃఖైక హేతుర్దోషః పుంసాంద్వేషదాయీ పరేషామ్
యోఽయం మా భూద్రక్షణా యాంగనానా మత్యౌత్సుక్యం ప్రత్యుతాసాం కరోతి.

—ఇతి కథా సరిత్సాగరః—రత్నప్రభాలమ్బకః.

ఇంచుమించు వేయేండ్లక్రితముగల పరిస్థితులను జూచి చెప్పిన సోమదేవుని పై వాక్యము లిప్పటికాలమునందలి స్త్రీలయెడగూడ చక్కగా సరిపోవునని పురుషులు గ్రహించుట సంఘమునకు మిక్కిలి శ్రేయస్కరము.

# అర్పణ

ఇందుకూరి సత్యనారాయణరాజుగారు

అదియుద్ధసమయం. పగలుకూడా వీధుల్లో జనప్రచారంలేదు. తలుపులు బిడా యించుకొని యిళ్లల్లోకూర్చుండేవారు ప్రజలు. ఊరంతా కళకాంతులులేక వెలవెలబోతూ వుంది. ఎప్పుడు శత్రువులు మీదవచ్చిపడతారో అనేభయమే ప్రతీవాళ్లకీ. ఏడ్చేపిల్లల్ని "యిదిగో పటాలంవస్తోంది. నోరుమూయ్" అని ఝడిపించేవాళ్లు తల్లులు.

రాత్రి సుమారు పదిగంటలవుతుంది. తలుపు ఘడియవేసుకొని లోపల చిట్టిని ఉయ్యాల్లోపండుకోపెట్టి జోలపాటలు నెమ్మదిగా పాడుతూ ఊపుతోంది నరసమ్మ. చిన్నమరది కాబోలు మడతమంచంమీద హాయిగా నిద్రపోతున్నాడు. హఠాత్తుగా వీధిలో తలుపుకొట్టిన చప్పుడు అయింది. పాపం ఆమె ఉలిక్కిపడింది. "ఎవరు చెప్మా యిట్లాంటి వేళ తలుపుకొట్టింది" అని అనుకొంది. మళ్లీ చప్పుడు అధికమయింది. "తలుపుతీయకపోతే బద్దలు కొట్టుకొని ప్రవేశిస్తాము" అనేమాటలు గంభీరంగా విని పించేయి. తత్తరపాటుతో పరుగెత్తుకువెళ్లి తలుపుతీసింది. తలుపుతీయంగానే పటాలం గబగబా లోపలకు ప్రవేశించింది. వాళ్లను చూడడంతోటే ఆమెకు గుండెలు ఝల్లు మన్నాయి. నోట్లోంచి మాటరాలేదు. నిశ్చేష్టితురాలైంది. అసహాయ. ఏంచేస్తుంది పాపం? యింట్లో మగవాళ్లులేరు. భర్త పటాలంలోజేరి స్వాతంత్ర్యసమరంలోకి పోయాడు. అయినా ధైర్యం చిక్కబట్టి అట్లాగే నిలబడిపోయింది. "దాహం" అని అరచేరు. తుందుడుకు చెందిన హృదయాన్ని గట్టిపరుచుకుంటూ, కంగారుగా, వంటయింట్లోకి జారబడి మంచినీళ్లుతెచ్చి కంపిస్తూఉన్న కరాలతో అందిచ్చింది పానీయం వాళ్లకు. "రెండుగంటల క్రిందట మీపటాలం యిలా వెళ్లిందట. యెచ్చటికి పోయిందో చెప్ప గలవా?" అని ప్రశ్నించేరు సేనాని ఆమెను.

తెల్లబోయిందామె అమాటలు వినడంతోటె. కత్తివేటుకన్నా నెత్తురు చుక్క లేదు మొహంలో. ఆవిడకు తెలుసుసైన్యం యెట్లావెళ్లిందో. తనప్రియుడూ, యింకా దేశ స్వాతంత్ర్యంకోసం ప్రాణాలని సమర్పించటానికి ఉద్యుక్తులైన యువకులూ ఉన్నారు ఆపటాలంలో. వారు యేమార్గంగుండా వెళ్లారోచెప్తే వీళ్లువాళ్లమీదపడి కట్టబోయే

స్వాతంత్రసాధాన్ని కూలదోస్తారనీ ఆమె తెలుసుకొంది. "నాలాంటివాళ్లనా అడగటం మా సైన్యాన్నిగూర్చి?" అని అంది మొట్టకేలకు.

"అవును. నీకు తెలుసును కాబట్టి అడుగుతున్నాము."

"మావాళ్లకు హానికలిగించేవిషయం మీకెట్లా చెప్తాననుకొన్నారు." అంది నరసమ్మ జంకూగొంకూలేకుండా.

"అలాగా! నీచేత బలవంతంగానైన చెప్పిస్తాచూడు." అని దబాయించేశు సేనాని.

"నేను అబలను. అబలలతో ఢీకొనే వీరులా మీరు?"

కొంచెం కోపంవచ్చింది సేనానికి—

"చెప్తావా? చెప్పవా? నీ అవస్థయేమవుతుందో ఊహించుకో! ఖాన్! గురిచూడు. అబద్ధం వచించేవంటే నిన్ను పేల్చేస్తాము."

భయకంపిత అయింది ఆమె. మెరపువలె ఆలోచనలు మానసికాంబరాన మెరసిపోయాయి. తాను ద్రోహంచేస్తే దేశపుస్థితి తలపోసింది. తన నాధునిసంగతి, స్వాతంత్రానికై తమ రక్తంతో దేశమాత పాదప్రక్షాళన చేయటానికి ఉంకించుకొన్న యితర యువకుల సంగతి జ్ఞాపకంవచ్చింది ఆమెకు. ప్రాణము బుద్బుదప్రాయమని ఆమె చింతించింది. నిమీలితనేత్రయై కొంచెంసేపు అక్కడ, అట్లే నిలబడిపోయింది. కొంతసేపటికి ఆవేశపూరితయై కనులువిప్పింది.

"తుపాకులు బారుపెట్టి ఉన్నాయి. నేను మళ్లీ ఆజ్ఞాపిస్తున్నా? నిజంచెప్పు."

జవాబులేదు.

"ఆఖరుసారి; మాట్లాడు?"

నిశ్శబ్దం.

అట్లా ఆమె కొయ్యలా నిలబడిపోయింది.

"ఢా" మ్మని శబ్దించింది......

భూదేవి ఆనందపారవశ్యంతో సాధ్వి, వీరవనిత, త్యాగస్వరూపిణి అయిన ఆమె భౌతికదేహాన్ని కౌగలించుకొంది.

## శారద లేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ!

అవును నేనుగూడ నదియే విషయమై యోచింపుచున్నాను. విచారించిచూడ ఈపెండ్లిండ్లరద్దుచట్టము నామోదించుటలో నామోదింపకుండుటలోగూడ యిబ్బందులే కనుపడుచున్నవి. ఇది శారదాచట్టమువలె సులభముగా నామోదింప దగినదికాదు. దీని నామోదించితిమా భారతమహిళల నిరుపమానశీలముచే సముపార్జితమైన జగద్వందిత కీర్తికి కళంక మొదవెడు పరిస్థితు లేర్పడవచ్చును. మఱియు అవమానము, క్లేశము, చింత, మున్నగు కష్టములకు స్త్రీ గుఱికావలసివచ్చును. కాదంటిమా? నిర్హేతుకముగా భర్తృపరిత్యాగినులైన స్త్రీల దుర్గతికి తరణోపాయము దోచకున్నది. కాన ఈ విడాకులచట్ట మొకవంక స్త్రీలకు ఆత్మహత్యాకరముగను నొకవంక ప్రాణదానకరముగను కనుపించు చున్నది. దీని నింకను నిదానించి విచారించ నగును.

ఒక రొకమంచి పనిని చేయుచున్నచో వారితో సరిదూగుటకు మనము యత్నించుట తప్పుగాదు. కాని చెడుగునకు గూడ పోటీబడుట యుక్తమనిపించుకొనునా? పురుషులు భార్యను పరిత్యజించుటయనుచితకృత్యమని మనమిప్పుడు భావింపుచున్నాము. భావనమేగాదు. అందులకు వారిని కఠినముగా నిందింపుచున్నాము. వారినట్లు మనము దూషింపుచు మనముగూడ నదియేపని కవకాశమును గోరుట సమంజసమగునా?

కల్పలతా! దాంపత్యముయొక్క పరమార్థము మహాత్మ్యాత్కృష్టమైనది. దానియొక్క లక్ష్యము కేవలము భోగలాలసతగాదు. కాన దాంపత్యధర్మమును కేవలము భౌతికదృష్టితోజూచి విషయతృప్తియే పరమావధిగానెంచి పెండ్లిపై పెండ్లిగోరుట ప్రశస్తమగు యోచనకాదు.

ఒక పార్శ్వమునకు వ్యాధిసోకినచో దానిని నివారించుటకు రెండవమార్గమునకు గూడ నా వ్యాధిని ప్రాకించుట వ్యాధి నివారణకు మార్గముగాదు. ఒకవంక పురుషు డొనరింపుచున్న దారాపరిత్యాగము అనుచితము నక్రమము సంఘవిచ్ఛిత్తికి కారణము పాపభూయిష్టమునై హిందూసంఘసౌష్టవమున కెనలేని యపకృతిగావింపుచున్నది. నేడు స్త్రీలకుగూడ నట్టియవకాశ మొసగినచో నాలోపము నివారణమగునని భావింపరాదు. బహుశా యిబ్బందియగును.

మానవజన్మ మెప్పుడును లోపరహితముగాదు. ఎంతమంచివారియందును నేదియో యొక లోపముండితీరును. అట్టిచో నెంతయన్యోన్యానురాగముగల సతీపతులయందైనను నెప్పుడో యొకప్పు డేదియోయొకప్పు డభిప్రాయ భేదములు గలిగి తీరును. అంతమాత్రమునకే ఆడుది మగనిని, మగవాడు పెండ్లమును మార్చుకొనుచో నిక నాసంసారములో సారస్యమేమున్నది? ఒకవేళ వాదసౌకర్యార్థమై విడాకులు పుచ్చుకొందురేయనుకొందము? అటులైనను వీరి కష్టము నివారణగాదు. ఏలనందువా మరల క్రొత్తగా కట్టుకొన్న ఆలుమగలలో మాత్రము పొరపొచ్చెములు పుట్టవని కంట్రాక్టేమున్నది? కాన కల్పలతా! ఇట్టి గంగాశంతనులసమయములతో దాంపత్యజీవనము నిర్విఘ్నముగా చెల్లదు. తమదాంపత్య జీవితమును సుఖమయముగాను, ఒడిదుడుకులు లేకుండునట్లును జరుపుకొనదలంచుచో స్త్రీపురుషు లిరువురు పరస్పరవిశ్వాసప్రేమలుగలిగి సౌహార్ద్రముతో నొకరిలోపముల నొకరు సైరణతో సవరించుకొని జీవితమును నడుపుకొనుటయే యుత్తమమార్గము. మఱియు విడాకులచట్టముచే మన సంఘము నెదుర్కొనబోవు మఱియొక కష్టముగూడ అపుడాలోచనీయము. మనదేశమున స్త్రీలకు సవతిబిడ్డల యెడగల యీర్ష్య సామాన్యమైనదిగాదు. ఇందువలన బాలబాలికలు పడుచున్న యిడుమలును సామాన్యమైనవిగావు. సవతిబిడ్డలను చూచి సహింపలేక స్త్రీలు కొందఱు విషప్రయోగాదిదుష్కృత్యములకు గూడ వెనుదీయకుండుట మన మనేకసమయములలో వినుచున్నాము. నేడు విడాకుల చట్టము నామోదించినచో బిడ్డలకు సవతితండ్రులుగూడ వచ్చెదరు. ఒక పురుషుని యాను పాశ్జలకులోబడియున్న స్త్రీయొక్క మాత్సర్యమే సవతిబిడ్డలయెడ నధికతరమైయుండగా స్వతంత్రుడగు మగవాడు సవతిసంతానము నెడల నింతకంటె నీర్ష్యాళువగుటకు నవకాశము గలదుగదా. కావున విడాకులచట్టముచే బిడ్డల సుఖస్థితి కష్టభూయిష్టమగును. మఱి ఆలుమగల సంసారమో నూతి ఒడ్డు బిడ్డ చందమున నెప్పటి కప్పుడు ప్రమాదకరమై యుండును. ఇక నట్టి సంసారములో స్థాయియెక్కడ? సుఖమేది? ప్రేమ కవకాశ మెచ్చట? అన్నియు మృగ్యము. గట్టిగ మాట్లాడిన భార్య లేచిపోవునేమో ననెడిభయము మగవానికిని మగడులేచిపోవునేమో ననెడి భయమాడుదానికిని కలుగుచుండ నిట్టి పితికి తనపు కాపురమెన్నాళ్లుసాగును. ఇట్టి దంపతులు యేమాత్రపు సౌఖ్యమనుభవింతురు. కాన విడాకులచట్టముచే హైందవ సంసారములకు విపరీతపరిస్థితి యేర్పడుట ఒకవిధముగా యోచింప నిక్కువమనేతలంపు గలుగుచున్నది. కాని మిత్రమా! నేనిట్లువ్రాయుటచేత తన కత్తి కెదురుకత్తిలేక భార్యయెడ నిరంకుశముగను నిర్దాక్షిణ్యముగను ప్రవర్తించెడి పురుషుల చెయిదములను నేను గుర్తింపలేదనిగాని, సమర్థింపుచున్నాననిగాని భావింప

కుము. తోటకూరలోని పురుగువలె స్త్రీ బహునీచముగా పురుషులచే విసరివేయబడు చున్నదని నాకు తెలియకపోలేదు. ఇందువలన మన స్త్రీలలో పెక్కురు ఆజన్మ దుఃఖముతో కుమిలిపోవుచున్నారనియు నేనెఱుగుదును. ఈవిషయము ప్రస్తావించునపుడు మన బంధుమిత్రులలోని స్త్రీలలో భర్తచే పరిత్యజింపఁబడినవారి నిర్వికారాకృతి నా మనోవీథిని పొడకట్టుచున్నది. ఆ అభాగినులెట్టి యపరాధము చేసినవారును కారు. వారి తలిదండ్రులు పుష్కలముగా ధన మీయజాలక పోవుటయో, వారు రూపవతులు కాక పోవుటయో, వారు విద్యాభిరతిగలవారగుటయో, వంధ్యలగుటయో, రోగగ్రస్తలగుటయో ఇవియే వారిని పరిత్యజించుటకు కారణములు. ఇందువారు గావించిన నేరమేమియు లేదు. అయినను వారు నిర్దాక్షిణ్యముగా భర్తలచే విడనాడబడి జీవచ్ఛవములవలె పుట్టినింట బడియున్నారు. నిజముగా నిట్టి క్రూరకర్మము తలంచినప్పుడు డైవోర్సుచట్టము నిప్పటి కిప్పుడు పుట్టిన బాగుండుననినంత మనస్సు భగ్గురుమనును. కాని మన ఆర్యసాంప్రదాయ ధర్మమునుబట్టియు, కుటుంబజీవితముయొక్క శాంతి నాశించియు, సంతానమునకు కలుగ బోయెడి యుపద్రవము నాలోచించియు నించుక వెనుక ముందులరయుట యవసరమగు చున్నది. కాన ప్రత్యేక పరిస్థితులలో అనగా బాలికగర్భాదానము కానట్టిదియు లేదా సంతానము లేనట్టిదియునై యుండి భర్త షండుడు, పిచ్చివాడు, కుష్ఠురోగి, దేశాంతరగతుడు నైనచో నట్టి బాలికకు పునర్వివాహ మొనర్పనగును. ఇదియే యాజ్ఞ వల్క్యస్మృతియందుదాహరితమైన ధర్మసూత్రము. ఇట్టి స్థితియందే స్త్రీకి పునర్వివా హార్హత నొసంగనగునని నాయభిప్రాయము. దీని కొప్పదేని జీవకళత్రునకు వివాహాధి కారము శాసనరీత్యా నిషేధింపబడనలెను; కాని యెట్టి మినహాయింపులు లేక విడాకుల చట్టము నామోదించుట మాత్రము ఉచితమార్గము కాదు. నేనిట్లు వ్రాయుటచే విడాకులచట్టము వచ్చినంతమాత్రముననే దంపతులెల్లరు కప్పలు తిప్పలుగా తెంపి ముడులు పెట్టుకొందురా, ఏమి నీ పిచ్చియూహయని నీవు నవ్వెదవేమో. కాదు. కాదు. అట్టి విషమస్థితి భారతదేశమున కింతలోరాదు. కాని త్రికరణములయందు వాక్క్రియల కంటె మనస్సునకే ప్రాధాన్య మెక్కువగదా. ఆమోదము మానసికకార్యము. ఇందే మన సదసద్వివేకముః వెల్లడికావలెను. నేడు భారతస్త్రీలు డైవోర్సుచట్టము నామోదించి నారనినచో ఆచరింపకపోయినను నామోదించినట్లే గదా? అందువలననే, భూతకాలమును పరిశీలించుము. భవిష్యము నాలోచించుము. వర్తమానము గుర్తింపుమని నిన్ను హెచ్చరించుట.

మిత్రురాలు
శారద

భావపురి }
౧౫-౮-౩౦ }

# విడాకుల చట్టము

## ౧౪

### శ్రీమతి బి. జ్ఞానాంబగారు

శ్లో॥ భర్తృభ్రాతృపితృజ్ఞాతి శ్వశ్రూశ్వశురదేవరైః
బంధుభిశ్చస్త్రియః పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః

—యాజ్ఞవల్క్యస్మృతి

స్త్రీలు భర్తల చేతను బంధువుల చేతను పూజింపఁబడఁదగిన వారని స్మృతులు సహస్రముఖములతో శాసించుచున్నను ప్రస్తుతము వారు బానిసలకంటె హీనముగాఁ జూడఁబడుచు సకలవిధముల హింసింపఁబడుచున్నారు. భర్తలయొక్క స్వలాభాపేక్షచే వారు తమ పవిత్రస్థానములఁగోల్పోయి నిర్జీవశిథిల శిలావిగ్రహములవలె అణచి పెట్టఁబడిన రబ్బరు బంతులవలె పూజాపునస్కారములు లేక స్వాతంత్ర్య విహీనలై కృశించిపోవుచున్నారు. వేయేల? త్రాగుబోతులును పరధనదారాసక్తులును మానవ రూపదానవులుసు అయిన భర్తృనామధారుల కఠోరదారుణహస్తములందుబడి ప్రతిసంవత్సరము వందల కొలది నారీమతల్లులు నిష్కారణముగాఁ దమప్రాణములఁగోల్పోవుచున్నారు. స్త్రీల నిట్టి భయంకర పరిస్థితులనుండి విముక్తలఁ గావించుటకు వివాహవిమోచన శాసనముకంటె ప్రబలసాధన మింకొకటి లేదని నాయభిప్రాయము కాని యీశాసన మాచరణలోనికి వచ్చిన యెడల స్త్రీలు స్వైరిణులయ్యెదరని కొందరు వాదింతురు. అది కేవలము భ్రమగాని ప్రమగాదు. స్వైరిణులు నీతినియమములకుఁ గాని సాంఘికధర్మములకుఁగాని రాజశాసనములకుఁగాని కట్టుపడి యుండఁ జాలరు. స్వైరిణు లెప్పటికిని స్వైరిణులే. పతివ్రతలట్లు గాదు, వారికిఁ బతియే గతి. వారు నిరంతరము

శ్లో॥ అశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః
నస్త్రీయాః పరివర్జ్యస్స్యా త్సతతందైవవత్పతిః—

అను మంత్రమును జపించుచునే యుందురు. అటులైనచో నికఁజట్టి మెందులకనియెదరేమో? గంపెడు పిల్లలున్నను ద్వితీయ వివాహామునకువ్విళ్లూరు భర్తలను— తప్పు లేకున్నను దండించు భర్తలను— త్రాగుబోతులై జూదరులై వేశ్యాదాసులై సంసారనిర్వహణమందసమర్థులై యున్న భర్తలను భయపెట్టి సక్రమపథగాములఁ గావించి మానవసంఘమందు తాముకూడా స్వతంత్రవ్యక్తుల మనిపించుకొనుటకు మాత్రమే స్త్రీ లీచట్టమును వాంఛించుచున్నారు. తప్పేమి?

## ౧౫

### శ్రీమతి ధర్మవరము లక్ష్మీదేవమ్మగారు

ఇంపైన దానిని ఆశించుటకునూ కంపైన దానిని నిరశించుటకునూ ప్రాణులకు సర్వసామాన్యమైన పుట్టుకతో కలిగిన హక్కులు. ఇట్టి సర్వసామాన్యమైన హక్కులకు హద్దు లేర్పరించుటయే సమాజహితము. ఇవియే చట్టములనియూ, నియమములనియూ అనబడును. వివాహనియమముకూడా ఇట్టి హద్దులలో చేరినదియే. అయినప్పటికినీ పురుషుడు మాత్రము కేవల స్వార్థపరుడై ఈహద్దులను అతిక్రమించి ముందునకు సాగిపోవుచున్నాడు. దీనివలన స్త్రీలకుసైతము పుట్టుకతో కల్గిన హక్కులు పోవుటయే కాక హద్దులు మాత్రము యెక్కువగు చున్నవి. సమానభాగస్థులయందు ఒకడు స్వార్థపరుడైన రెండవవానికి స్థలసంకోచము కల్గినట్లున్నది. హద్దులనుమీరి హక్కులనుమాత్రము అనుభవింపుచున్నట్టి పురుషులకు మాత్రము ఈ చట్టము విపరీతముగా తోచవచ్చును. రెండవది ఈచట్టమువలన స్త్రీలకుకూడా పుట్టుకతో వచ్చిన హక్కులు సమానములని తెలియనగును. కనుక న్యాయబుద్ధికి చూడ ఈ విడాకుల చట్టము కేవలము సంఘహితమునకై నియమింపవలెననుటయందేలాటి సంశయము కలుగదు.

వివాహమనునది ధర్మార్థకామమోక్షములకు గాను. ఇట్టి ఘనమైన కార్యభారమును వహించుటకు స్త్రీపురుషులు సమాన ప్రేమ బుద్ధి బలములు గలవారలై, తగ్గ మట్టుకు సమానవయస్కులునూ అయివుండ వలయును. అట్లు కాక కుష్ఠు, పాండు, క్షయ, మొదలగు క్రూర వ్యాధులు గలవారికినీ, మరియు యెందులకును తరము కాని అంగహీనులకును, బలహీనులకునూ, కేవలము ద్రవ్యాశకు లొంగిన తలిదండ్రులు కొందరు తమ చిన్న బిడ్డల నిచ్చి పెండ్లి చేసి తాము గడ్డనెక్కుచున్నారు. ఏలాటి పురుషుడైననూ సరే వానితో పిల్లలకు పుస్తెకట్టించిన కన్నెచెర బాయునట మగవారికి ఇట్టి చెరలు లేవు. ఇష్టమైన పెండ్లి చేసుకొన వచ్చును. లేకున్న లేదు. నిదానించి అయిననూ సరే, యేండ్లు గడచి వ్యర్థుడైననూ సరే, ఆడ పిల్లకు మాత్రము ఇట్టి హక్కులు లేవు. ఇట్టి బలవంత వివాహములకు లోబడిన బాలికలను పై వివరింప బడిన ఘనతర ధర్మార్థ కామ మోక్షములగు వివాహ నియమములను సాధించ మనిన విద్యాగంధ మెరుగని ఈ పసి బాలికలకు సాధ్యమా? ఇట్టి మగలను విడిచిన విపరీతము. ఆదరించుటకు అసాధ్యము. అన్నిటను సమానమైన యెద్దులను కట్టిన కాడిని మోయును గాని, ఒకటి బలహీనమైన యెడల కార్యము కుంటుబడి సఫలమగుటకు మారు విఫలమగును. అట్టి జతను విడదీయుటయే ఉత్తమము.



శ్రీమతి ధ. లక్ష్మీదేవమ్మగారు

ఈ చట్టమువలన పాతివ్రత్యమునకేలాటి భంగమునూ కలుగదు. నిజమైన పాతివ్రత్యము మనస్సు ననుసరించి యున్నది. అట్టిచో కల్మషరహితమైన ఏకమనస్కులగు స్త్రీలయొక్క శీలమును భంగపరచుటకు ఇట్టి చట్టములకు సాధ్యమా? కాదు. కనుక విడాకులచట్టము అవస్యము ఆదరింపవలయును.

**పై మాసమున మఱికొందఱు మహనీయురాండ్ర అభిప్రాయముల వెలువరింతుము.**

—సంపాదకుడు.

# నారీమంగళము

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తి గారు

ప్రాచీన భారతదేశమున స్త్రీకి విద్యాధ్యయమున నధికారముగలదు. మధ్యయుగమునఁ బరాధీనతాసంగమువల్ల నారీజాతి కవనతియు, అధఃపతనము నారంభమైనది. ఈవిధముగ నాఁటినుండియు భారతనారి సామాజికకఠోరశాసనమువల్లను శిక్షాభావమువల్లను, క్రమక్రమముగ కుసంస్కారపూర్ణమైన యాపదలందుఁబడి ఘోర దురవస్థల పాలగుచున్నది.

జగము పరివర్తనశీలము. కాలముగడువఁగా గడువఁగా వర్తమాన యుగమున నారీజాతియందుఁ గలిగిన జాగరణతరంగములవల్ల మాహృదయమున సంతోషచలనము గలిగినది. ఇతరదేశములనుబట్టి చూడ మనదేశమున నారీశిక్షయాశానురూపముగ లేదు. విద్యార్థిను లనేకు లొకవత్సరకాలము మాత్రము విద్యాభ్యాస మొనర్చి విద్యాలయమును విడచుచున్నారు.

స్త్రీశిక్షామార్గమున ననేక బాధలు.

౧. గతానుగతికత:—ఏమార్గము నెవరుత్రొక్కిన నదే యందఱు త్రొక్కుట. నూత్నవిషయపరిశీలన మనావశ్యకము.

౨. అవరోధప్రథ:—దీనిచే స్త్రీ లుచ్చశిక్ష నందుటకవకాశము లేదు.

౩. బాల్యవివాహములు:—అల్పవయసునందే వివాహములు చేయుటచేత ననేకులు విద్యను మానుట సంభవించుచున్న విషయమంద ఱెఱింగినదె.

౪. స్వాస్థ్యాభావము:—

ఏనారీసమితియుఁబైనఁజెప్పిన నాల్గు ప్రతిబంధకములవిషయమై యుపేక్షచేయుటకు శక్తిగలిగియుండలేదు. విశేషించి వంగదేశనివాసికి సాధారణముగనుండు స్వాస్థ్యావస్థ యెవరికి నవిదితమైయుండదు. మలేరియా, కలరా, ఇన్‌ఫ్లుయెంజా, యక్ష్మ, మొదలగు నానాప్రకారనృశంసరోగము లీసుజల, సుఫల, సస్యశ్యామల మైన మాతృభూమి యందుఁ బరిణతమైయున్నవి.

శిశువు జన్మించినదాది మృత్యుముఖమున ననేకపర్యాయములు పడుచుండును. ఇట్టి విపరీతమరణము లజ్ఞానమువల్లనే సంభవించును. దారిద్ర్యదూషితమైనపుడును, అనియమితఖాద్యవస్తువులవల్లను, అశిక్షితయగు లేక అపరిష్కారయగు ధాత్రీసాహాయ్యమువల్లను, సూతికాగారమున నానాప్రకారకుసంస్కారజనితదుర్వ్యవస్థవల్లను, బహుప్రసవములవల్లను, బాల్యవివాహములను విషఫలమువల్లను ఇట్టి సకలవిధామంగళ కార్యసహాయమువల్ల మనదేశమున మరణసంఖ్య యభివృద్ధియగుచున్నది. నారీజాతికి స్వాస్థ్యరక్షానియమ మవిదితమై యుండుటచేతనే దైనందినము మనయొక్క ఈజాతిక్షుద్ర

కాయము గలదిగనుక్షీణ ప్రాయము గలదిగను, దుర్బలవు స్త్రీష్కము గలదిగననగుచున్నది.

ఈ సకలామంగళము లిట్లుండ నుపరి మనలను దరిద్రము నిష్పీడన మొనరించుచున్నది. ప్రపంచమున నితరదేశముల దృష్ట్యా మనదేశమున దారిద్ర్యమెంత యెక్కువ యనువిషయకథనముచే నిపుడు సమయనష్టము గావింపఁజాలము. ఉపయుక్తాహారచికిత్సాభావములవల్ల నెన్నివందల శిశువులో యకాలమృత్యువు వాతఁబడుట చూచుచున్నాము. ఎంతమంది స్త్రీలకో స్వాస్థ్యభంగము గలుగుచున్నది. ఎన్నియో సంసారములు రోగాంధకారమునఁ బడుచున్నవి.

వర్తమానయుగమున మనము మహిళాశిక్షోన్నతికి, స్వాస్థ్యోన్నతికి యత్నింపవలెను. కార్యక్షేత్రము విస్తీర్ణమైనదిగాని కార్మికసంఖ్య యత్యల్పము. తథాపి ప్రకృతోద్యమము చేష్టాసహితమైన కార్యమునందు ప్రవృత్తమై నిరుత్సాహమునందఁజాలదు. జాతీయశిక్ష కున్నతి గల్పించుటకు నారీజాతి యెక్కువసహాయకారికాఁగలదు. మన నిరక్షరలైన, అశిక్షితలైన స్త్రీలకు శిక్షాదానము చేయవలయును. ఎవరినిగాని యస్పృశ్యులని దూరముగనుండు మనుట తగదు. అస్పృశ్యులు నిరక్షతవల్ల, అజ్ఞతవల్లఁగలిగినరోగమువల్లను, దుఃఖమువల్లను, దారిద్ర్యపీడనమువల్లను జగర్జరితులై యుందురు.

ప్రాచీనభారతజాతి నాదర్శముచేసికొని చదువుట, వ్రాయుట, వీనికిఁదోడుగ స్త్రీలు ప్రత్యేకముగ గృహకార్యము, పచనము, శిల్పము, చిత్రవిద్య, కారుకరణము, వ్యాయామము, స్వాస్థ్యరక్షణము, రోగిసేవ, సంగీతశిక్ష, సంతానపాలనము మొదలగునట్టి యత్యావశ్యక విషయములను నేర్చుకోవలయును. వంగదేశస్త్రీలు పచనమునఁగడు సమర్థలను విషయము సర్వవిదితము. కాని ఈపాకవిషయములో మనకుఁ దెలియని వైజ్ఞానికవిషయము లనేకములుగలవు. ప్రపంచము రసనతృప్త్యర్థ మొకరికంటె నొకరు గురుపాకమును ఖాద్యములను జేయుదురు. వానివల్ల రసనతృప్తిగలిగినను బరిణామములో శరీరమున కనేకనష్టములు గలుగును. అమెరికాలో ఖాద్యద్రవ్యములలోనేది యెంతపరిమాణము ఎంతపుష్టికరము అనువిషయమును గభీరగవేషణద్వారా నిశ్చయించి యన్నిభోజనశాలలోను నావస్తువును బ్రకటించిరను విషయమును వినుచున్నాము. తదనురూపముగ నాదేశీయు లాహారవ్యనిర్ణయముచేసికొని మిగుల బలశాలులును దీర్ఘకాయులును దీర్ఘజీవులును నగుచున్నారు.

ప్రాచీనభారతదేశము కళల కెక్కుడాదరము చూపినది. సంగీతము జీవికి భగవత్ప్రదమైన విశేషదానము. మాతాపితలు, కన్యాపుత్రులు సంగీతాలాపనచేసినచో

గృహసంసార మానందపూర్ణముగను మధురముగనుఉండును. కొందఱు భక్తులొక్కా కవుడు సుదీర్ఘకాలము ధ్యానమగ్నులైయుండియు భగవత్సాన్నిధ్యలాభమునందినారు గారు. కాని యొకసంగీతోచ్ఛ్వాసమువల్ల నట్టిలాభమునందఁగలము. సంగీతము జీవి మన మును రసమయముగను, స్నిగ్ధముగను జేయును. మఱియొక కళావిద్య చిత్రవిద్య. దీనితో మన ప్రాచీనభారతీయమహిళాగణమునకు విశేషపరిచయముగలదు. గార్హస్థ్యజీవన మున నానాప్రకారమైన యుత్సవాదులలోఁ బ్రాచీనాంగనాజనము గృహమును సుచిత్రము చేయుదురు. చిత్రవిద్య కల్పనాశక్తిని వృద్ధినందించును. మనోసౌందర్యమును గలుగ జేయును. చిత్రములు భాషాప్రకాశమును సైతముచేయఁగలవు. నేత్రములకు రూప గ్రహణశక్తిని బెంపొందించునదియుఁ జిత్రద్యయే.

ఈదేశమునఁ బూర్వము మహిళాగణము శిల్పవిద్యకు విశేషోత్కర్షముచూపినది. క్రమముగ దేశము దారిద్ర్యపూరితమైనది. లుప్తశిల్పములఁబునరుద్ధరించుటయు, దైన్యము నివారించుటయు మనకుఁగర్తవ్యము. దారిద్ర్యమువల్లనైన కఠోరఘాతప్రతిఘాతముల వల్ల నుపయోగకరములైన వానిలాభ మనేకులకుఁ బ్రాప్తించుటలేదు. కాని పరిశ్రమచేసి యనేకావశ్యకద్రవ్యములను నిర్మించి మన మర్థోపార్జనముచేయవలయును. విదేశీయులు శిల్పము, ఆటవస్తువులు మొదలగు సుఖకరములైన విషయము లనేకములు మనదేశమున వ్యాప్తిచేసి యెంతో ద్రవ్యము నార్జించుచున్నారు. దేశమందు సువిజ్ఞమైన నరనారీగణము సమవాయప్రథావలంబనద్వారా యీసకలకార్యములను బరిచాలనముచేయునట్లు దేశ వాసుల మనస్సులలోఁ బ్రచారముచేసి పంథానిర్దేశము చేయువలయును.

శిశుశ్రేయమును, నారీశ్రేయమును, దేశమునకు శ్రేయము. ఈవిశాలక్షేత్రమున నానావిధా కల్యాణ నివారణార్థము స్త్రీని గౌరవింపవలెను. ప్రథమతః నానావిధసాంక్రా మిక బాధా నివారణ నిమిత్తమైన జ్ఞానోపదేశము స్త్రీలకు లేనిచో జాతీయచేష్ట విఫల మగును. ఇంగ్లండు, జర్మనీ, మొదలగు దేశములందు వందలకొలఁది మహిళాసముతు లీకార్యమందే వ్యాపృతములైయున్నవి.

మఱియు స్త్రీయొక్క స్వాస్థ్యభంగమున కవరోధము మఱియొకకారణము. పెద్ద పెద్ద బజారులందును చిన్న చిన్నక్షుద్రమైన గల్లీలయందును జీవించెడి స్త్రీలకు, సూర్య తాపముగాని, ముక్తవాయుసేవనముగాని ప్రాప్తింపదు. స్త్రీలుస్వస్థముగను, సతేజము గను, సబలముగనునుండవలయునన్న నిత్యమును వ్యాయామముచేయువలయును. వంగ దేశమందలి నారీజాతి కున్నతి గల్పించుకొఱకై "సరోజనలినీ నారీమంగళసమితి" యందలి

సభ్యురాండ్రు సత్కార్యములిట్టివి చేయుచు నల్పకాలములోనే సమగ్రమైన వంగదేశమున నిట్టి సమితులు స్థాపించి అంతఃపురకాంతలకు సైతమిట్టి స్త్రీవిద్యోత్సాహమును బుట్టించి మహోపకారమును జేయుచున్నారు. ఇట్టిసమితులకు మాయాంతరంగికధన్యవాదములను శుభేచ్ఛను దెలుపుచున్నాము.

కావున భగినీగణమంతయు మనోవాక్కాయకర్మలచే సుశిక్షాలాభమునకు యత్నింపవలయును. భ్రాతృబృందము సైతము వారి వారి స్త్రీలయెడ దాక్షిణ్యము వహించి సుశిక్షాదానమునకై యత్నింపవలెను. స్త్రీశక్తిస్వరూపిణి. భద్రపురుషులును, మహిళాగణమును జీవనవిషయములో భేదాభేదము లెంచక యేకత్రసమావేశమై కార్యక్షేత్రమున నగ్రేసరత్వము వహింపవలెను. మాతృభూమియొక్క సేవావిషయములో నంద అను నేకహృదయముగను, నేకప్రాణముగను, నేకమనముగను ఉండి భారతీయమహామంత్రమును స్మరించు కోవలయును.

"సంగచ్ఛధ్వం, సంవదధ్వం, సంవోమనాంసి జానతాం"—

—"వంగలక్ష్మి" నుండి.

# గృహలక్ష్మి

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

సకలరసగుంఫనలతోడ చానలెల్ల
నూతనోత్సాహభావముల్ నూత్నకళలు
నెనయ జేయగా నవకాశమిచ్చినట్టి
వెలది గృహలక్ష్మి వేయేండ్లు వెలయుగాత!

ఆంధ్రదేశజలైనట్టి అంగనలకు
మధురరచనాసమన్వితమహితమైన
పత్రికారాజ మొకటియు బడయలేని
కొదువదీర్చుత గృహలక్ష్మి సదమలమతి.

కాల్పనికప్రౌఢిమందెల్పు కథలుకొన్ని
మేలిరచనల క్రొత్తసామెతలు గొన్ని
బుద్ధిశక్తుల నెంతయు వృద్ధిసేయు
స్వాదుపదయుక్తవ్యాసరాజములుగొన్ని

హృదయములయందుస్థిరశక్తులినుమడింప
నదరు బెదరును లేని ధైర్యమునకూడి
అతితరపటుత్వఘనమనీషాళి బెంచు
ప్రథితవిజ్ఞానయుత విమర్శనలుగొన్ని

నవ్యపద్ధతి లలితఛందములగూర్చి
ఉత్తమోత్తమపథముల నూర్జితగతి
ఆంధ్రవనితామణుల యశోవ్యాప్తిబొడు
శ్రావ్యతరభావగీతికాచ్ఛటలుగల్గి

కూర్మి చెలికత్తెయై తెన్గుకులసతులకు
గృహములందెల్ల గృహలక్ష్మిగృహములక్ష్మి
యై, కరముగూర్చి కలకాల మలరుగాత
పలువిధమ్ముల తానెయై ప్రబలుగాత!

# రయితుబిడ్డ

## నరహరిశెట్టి వేంకటరత్నముగారు

౧

మొకరములమీదనే ఆధారపడియున్న పాకలో నొకయెత్తుపీటపై నానూతనపురుషుడును, కొబ్బరియాకు చాపపై నామెయు, నామెయొడిలో బాలచంద్రుడును గూర్చుండియున్నారు. రెప్పపాటులోనే యావరించిన కారుమబ్బులు ఏనుగుతొండములవంటి నీటిధారలను జోరుమని గ్రుమ్మరించుచుండుటచే మడిలో పనిచేయుచున్న ఊడ్పుకత్తెలు ఎక్కడివారు అక్కడనే పారవైచి పెద్దకుమారుని మాటచొప్పున గలగలమని వచ్చి ఒక్కగంటలో యింటివసారాలోవచ్చి పడినారు. పసిపాపను గైకొని యాబాలకుడు తల్లియున్న పాకలోనికి జనినాడు. తల్లి రెండువ్రేళ్లతో తనక్రిందపెదవి నొక్కినది పుత్రునిరాకగాంచి. అదెందులకో బాలుడుగ్రహించినాడు. వెంటనే చంటిపిల్లనొకచో ఈతయాకుచాపపై గుడ్డలుపరచి పరుండబెట్టి వెళ్లి తల్లిప్రక్కనే ఆసీనుడైనాడాతడు. బాలచంద్రుడు తల్లియొడిలోనుండి లేచివెళ్లి చంటిపిల్లవద్ద కూరుచున్నాడు. వాన అటులనే జోరుమని కురియుచున్నది. నడుమనడుమ పెల్లుగా ఉఱుములు, తళుకుతళుకుమని మెఱుపులు.

తల్లి: 'మా పిల్లలకు వానఅంటే చాలాయిష్టమండీ. క్రొత్తవారు మీరున్నారని ఆగినారుగాని లేకపోతే ఈసరికి బట్టలన్నియు తడుపుకొనే వుంటారు. నామట్టుకు నాకుకూడా వానకురుస్తూవుంటే యెక్కడలేని సంతోషమూ, ఉత్సాహమూకలుగుతుంది. జోరుమని వానకురుస్తూవుంటే యేమో పరమేశ్వరుడే తనకరుణావృష్టి కురిపించుతూఉన్నాడా అనిపించుతుందండీ, అదేమోకాని'

అతడు: 'అవునమ్మా, వానలులేకపోయినా, సూర్యుడులేకపోయినా మనుష్యులగతి యేమయిపోవలసింది? అవిఉంటే పంటలు బాగాపండుతయి, పదిమంది కడుపునిండా భోంచేస్తారు.'

పెద్దవాడు: 'ఈమధ్య అమెరికావారు వానకురిపించే యంత్రము కనిపెట్టినారండీ మీకు తెలుసునో లేదో! ఆ యంత్రము పైకివెళ్లి అక్కడి గాలిలోవున్న సూక్ష్మమైన నీటిబిందువుల నన్నిటినీ చేరదీసి వర్షము కురిపిస్తుంది.'

బాలచంద్రుడు: 'దానిజోలి నాకెందుకన్నయ్యా! చల్లగా వానకురుస్తూవుంటే మన ముతకబట్టల్లో యెంతవెచ్చగా ఉంటుందోచూడు. కుంపటిదగ్గిర, చలిమంటదగ్గిరకూడా అంత హాయిగాఉండదు.'

నూతనుడు: 'అయితే యిందాకనే మిమ్మల్ని అడుగుదామనుకొని మీరేమనుకుంటారోనని అడుగలేదు; యింత నాజూకుదనము, చదువు వున్నటువంటివారు మీరుకూడా యిటువంటి మోటుగుడ్డలు వేసుకోవడము చూస్తే నాకు నవ్వువస్తుందమ్మా! మీరేమన్నాసరే. అల్లాగైతే మీరుస్వదేశీవారా యేమిటి?' అని పరిహాసాత్మకమైన నవ్వు నవ్వినాడు.

ఆమె: 'మేమే యేమిటి, మీరుమాత్రము స్వదేశీవారుకాదూ? మనము విదేశీవాళ్ల మెల్లాఅవుతాము యీ గడ్డమీదపుట్టి యీ గాలిలోపెరిగినవాళ్లము.'

అతడు: 'అదికాదండీ నేనన్నది. అయితేమీరు గాంధిగారిశిష్యులా యేమిటి అన్నమాట'.

ఆమె (నవ్వుచు): 'ఓహో, అదా మీ అర్థము. అల్లాగైతే ఒక విషయములో మేము గాంధిగారి శిష్యులమే, గుడ్డలు వేసుకోవడములో. మీవంటి వారినికూడా యీ మోటుకద్దరుబట్టలు వేసుకోమని బతిమాలుతాము. ఈ ముతకబట్టలు మనము వేసుకోవడమంటే పదిమంది కూడులేనివాళ్లకు అన్నముపెడుతున్నా మన్నమాట. మనదేశ మెంతబీదదేశమో మీకుమాత్రము తెలియదా యేమిటి? మావంటి ఆడవాళ్లు చెప్ప వలెనా.'

అతడు: 'అదియేమోకాని గాంధిమాటాడితే 'రాట్నం, రాట్నం' అని కలవరించడము చూస్తే నాకు నవ్వువస్తుంది.'

ఆమె: 'అవును మీవంటివారికి నవ్వురావడములో ఆశ్చర్యములేదు. విదేశీయులుకూడా అతని మహత్వము తెలుసుకొని పూజాదృష్టితో చూస్తూ ఉన్నప్పుడుకూడా. గాంధ్రుడు, గాంధ్రుడుకుని మీదపడేసింహాన్ని ఒక్కపోటుతో చంపే బలాఢ్యుడుకూడా పుండుపైవ్రాలి బాధకలిగించే ఈగలను పట్టుకోలేక పోతాడని మీకు తెలియని సంగతా? 'బలవంతమైనసర్పము చలిచీమలచేత జిక్కి చావదెసుమతీ' అని చిన్నప్పుడు చదువుకున్న సంగతి మరిచిపోయారూ?'

అతడు: 'ఎంత ఆలోచించినా నాకీ కద్దరు ధరించడ మెందుకో అర్థముకావమ్మా! మొన్నమొన్నటి వరకూ జర్మను మహాయుద్ధముతో దేశమంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది. మళ్లీ యీ నాన్ కోఆపరేషన్ బయలుదేరి దేశాన్నంతా శ్మశానము చేసివేస్తూంది. ఉద్యోగము చేసుకొని పదిడబ్బులు గడించి కుటుంబాలను పోషించేవాళ్లంతా ఉద్యోగాలు మానివేశారు. చదువుకునే పిల్లలు బళ్లు యెగకొట్టివేశారు. ఉన్న విలువగల బట్టలన్నీ తగలబెట్టుకొన్నారు. గాంధిగారి ఆజ్ఞఅయితే యిళ్లుకూడా తగలబెట్టుకొని అడవిలో జంతువులతో వుండమంటే వుండేటట్లు కనిపిస్తుంది వీళ్లంతా. చివరకేమయింది: ఉభయభ్రష్టుత్వము ఉపరి సన్యాసమూ. చిల్లిగవ్వకైనా పనిరాకుండా పోయారు వీళ్లంతా. ఎవరోగడుసువాళ్లు మాత్రము కాంగ్రెసు వసూలుచేసిన కోటిరూపాయలు వొడిలోపోసుకొని దారితీశారు. కడమవాళ్లు తెల్లమొగాలువేశారు. ఒకకథఉన్నది లెండి: బాగా బలిశివున్న వొకనక్క కటకటాలువున్న దొడ్డిలోని ద్రాక్షపళ్లు తినడానికి ప్రయత్నించిందట. లోపలికి ఎల్లావెళుతుంది, కటకటాలలోనుంచి దూరలేదు బలిశివున్న శరీరంతో. అందుకని మూడురోజులు ఉపవాసంచేసి బక్కచిక్కి కటకటాలలోనుంచి దూరి తృప్తిదీరా రోజుఅంతా ద్రాక్షపళ్లుతింది. మళ్ళాబలిశింది. బయటికి వద్దామంటే పట్టదు. మళ్ళా ఉపవాసముచేశి బక్కజిక్కి బయటపడింది. ఏమిప్రయోజనము? అల్లావుంది తుదకు ఎందుకూ చెల్లకుండాపోయారు. హాయిగా శాంతియుతముగా దేశముంటే ఈ నాన్ కోఆపరేషనేమిటి? బట్టలు తగలబెట్టుకోవడ మెందుకు? కడుపులోచల్ల కదలకుండా పడివుండలేక యీ గోలఅంతా యెందుకోవీళ్లకి?'

పెద్దకుమారుడు: 'నక్కకథకూ నాన్ కోఆపరేషనుకు సంబంధమేమిటో నాకర్థముకాలేదు. 'కడుపులో చల్ల కదలకుండా' వుండడమంటే: గాడిదలు, కుక్కలుచేశేపని అదే. వాటికి కావలసినదేమిటో తిని యిటు అటుదొర్లి 'ప్రపంచముతో నాకేమిపని' అన్నట్టు 'పుట్టింది, చచ్చింది' అంటూ అల్లాగుచస్తవి. మనమో

మనుష్యులము. జంతువులవలె ఎల్లా వుండగలము? అయితే యిక వాటికి మనకూ భేదమేమిటి? జీవతోన్నతి–రోజురోజుకి పౌన్నత్యముకోసము మానవులకు స్వభావసిద్ధముగానే పిపాసవుంది. ఆ పిపాస తీర్చుకోవడానికి, జీవతోన్నతి పొందడానికి ఎటువంటి కష్టమైనా పొందవలె. తాళ్లవలె రప్పలవలె మనమూరుకుండలేము. మనము సజీవులము. మన రక్తనాళలలో వేడినెత్తురు ప్రవహిస్తూ ఉన్నంతకాలము, మనలో దివ్యతేజస్సు వెలుగుతూ ఉన్నంతకాలము జంతువులవలె, తాళ్లవలె ఊరుకుండలేము. పైమెట్టు ఎక్కడానికి, చేతినుండిజారిపోయిన, లాగుకొనిపోబడిన స్వేఛ్ఛామృతముకోసం–ఆ జ్యోతికోసం పోరాటము జరుగుతుంది. జరగవలసిన అవసరము ముమ్మాటికిగలదు. ఏమో ఎవరో పరిపాలిస్తున్నారు, కాస్త తిండి పడవేస్తున్నారు పడివుండరాదా అని అనవలశింది మీవంటి వారు కాదు. వాళ్లు వేరేవున్నారు. జర్మనుయుద్ధమైంది. మళ్ళా ఈ పోరాటము అలజడియెందుకు పిచ్చివాళ్లు కాకపోతే అంటారా? మనుష్యులు, మనుష్యులు కత్తులు, తుపాకులుపట్టుకొని యుద్ధము చేయడము లేనంతమాత్రనే శాంతికలుగుతుందా! శాంతిఅంటే అదికాదు. యుద్ధము అయిపోయినంతమాత్రాన శాంతి దేశానికి లభించలేదు. అదిఆత్మలోనుంచి – సంస్కారమువల్ల ప్రసాదింపబడుతుంది. బహిఃప్రపంచము కొంతవరకూ దానికి సాయపడుతుంది. నిరవధికమైన శాంతిదేశానికి ప్రసాదించడానికే అమహాత్ముడీ యుద్యమాన్ని బయలుదేరదీశింది. ఇది ఒకానొక మహోత్కృష్టమైన సాధన ఆత్మోన్నతి కోసము, జీవితోన్నతి కొరకు. Spinoza చెప్పేడు ‘ For peace is not the absence of war .’ అమ్మా! నిన్న నాన్నగారు చెప్పేరు దానితరువాతి వాక్యమేమిటి?’

తల్లి: ‘ It is the virtue that is born of the vigour of the soul ’ అని Tacitus Politicus లోవుంది .’

బాలుడు: ‘అవును. అవును, వినండి మళ్ళాఒకసారి ‘ It is the virtue that is born of the vigour of the soul’ అన్నాడు Spinoz అనే ఒకగొప్ప డచ్చివేదాంతి. అంతే ప్రతిఆత్మ ఉన్నతినందవలె. అప్పుడు శాంతి. ప్రశాంతి. అంతవరకు కష్టము, సుఖము; ఆనందమూ, దుఃఖమూ ఏవీలేవు. అటువంటి a virtue ఆత్మోన్నతి కోసమే ఆ మహాత్ముడీ యుద్యమానికి ప్రాణముపోశింది. పరదేశీయుల పరిపాలనలో నిర్వీర్యులమై, నిస్తేజులమై, నిష్ఫలులమై ధర్మజ్ఞానము లేక పరమేశ్వరప్రసాదితమైన స్వాతంత్ర్యము గోల్పోయి యున్నజాతికి ఆత్మోన్నతి యెక్కడిదీ. లేకపోతే? ఇవన్నీ–యింకా మన ఊహకుకూడా అందని వెన్నోలోతుగా ఆలోచించియే ఆ మహాత్ముడు ఈ యుద్యమము బయలుదేందీశాడు. మనము విజయము పొందినప్పుడే ఆనాడు నిష్కారణముగ, నిర్విణ్ణులై, జలియనువాలాబాగులో ప్రాణములు గోల్పోయిన ఆ పరమభాగవతుల ఆత్మలు శాంతినందుతయి. ఆనాడే ఆదేశీయసోదరుల పవిత్రాత్మలు ఆనందధామము చేరుతయి. అంతవరకు మనకూ వారికీకూడా ముక్తిలేదు.’

అంతటి చల్లనివాతావరణమునగూడా ఉద్రేకముచే చెమటలు గార్చుచున్న పుత్రునిగని ఆమె చిఱునగవుతో ‘తండ్రీ! అంతతొందర పడకూడదు ఇతరులతో మాట్లాడేటప్పుడు. ప్రశాంతముగా వున్న చిన్నతటాకములో ఒకరాయిపడవేస్తే నీరంతా అల్లకల్లోలమైనట్లు, ఆయనేదో అనేటప్పటికి అంత ఉద్రేకంపొందినావు. అది సరికాదు. ఒక్కొక్కప్పుడు నేనుకూడా యీ విషయమైయే చాలాపరితాప పడుతూవుంటాను. మీ నాన్నగారో, ఆయన హృదయం సముద్రమువలె అనంతగంభీరమయినది. అందులో ఒక బెడ్డకాదు ఏనుగు దూకినను చలించక అటులేవుంటుంది. నీ దృష్టిలో ఆయాదర్శ ముంచుకోవలె. ఎవరితో ఎప్పుడెల్లా

మాట్లాడవలెనో కూడానీకు నాన్నగారు చెప్పేవున్నారు' అని మరల రెండుబ్రేళ్లతో తన పెదవి నొక్కుకొన్నది.

బాలుడేమియు మాటాడక చిఱునగవుతోడనే ఊరకున్నాడు.

బాలచంద్రుడు: 'కాంగ్రెసు సొమ్ము దొంగతనంగా తిన్నవాళ్లంతా రాంబొందులు కన్నా నీచులని నువ్వేచెప్పావు కాదమ్మా?'

తల్లి: 'అవునునాయనా, ఎంతోమంది మహాపతివ్రతలు దేశంకోసము, మానంకోసము గాంధీమహాత్ముడువచ్చి భిక్షుమెత్తితే ఒంటిమీదినగలు, కట్టుకునే బట్టలు, అన్నీతీసి, చివరకు మంగళసూత్రాలుకూడా తీసిఇచ్చి త్యాగము కనబరిచిన మహాత్యాగమూర్తులిచ్చిన ధనం హరించినవాళ్లు మనదృష్టిలో రాంబొందుల కంటే రాక్షసులకంటే నీచులు, క్రూరులు కారామరి? వాళ్లకు హృదయంలేదు. ఒకవేళ ఉన్నదా అది తాతితో చేయబడ్డదే. వారేమో ఈయన దృష్టిలో గడుసువారు. కమనీయ కీర్తులు, పాపం.'

అంతవఱకు వర్షమువైపు, ఆకసమువైపు చూచుచు ఆమెమాటలాలకించుచున్న అతడు: 'వాళ్లుఏమైతే మనకేమి లెండి. ఏదోమాటవరుస కన్నాగాని నేనుమాత్రము వాళ్లపని హర్షించుతానా? అంతమంది ముందు వెనకా చూడకుండా త్యాగముచేసిన సొమ్ము హరించారంటే - కాకపోతే నాసందేహమేమిటంటే అటువంటి దొంగలు, నీచులు-ఇందాక మీరే అన్నారుగా నూటికితొంబయితొమ్మండుగురు మూర్ఖులని-యిటువంటివాళ్లు యింతమందివుంటే ఒక్క గాంధిమహాత్ముడుకోటి- మీవంటివాళ్లు పట్టుదలగలవాళ్లు పట్టుమని పదిమందిలేరే యింతచిన్న సంఖ్యతో స్వరాజ్యం యెల్లావస్తుందా అని నా సంశయం. ఒకప్రక్క హిందువులు మహమ్మదీయులు, యింకొకప్రక్క బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు, మరొకప్రక్క పంచములు క్రైస్తవులు పోట్లాటలు. పోనీ యివిఅంత లెఖచేయతగినవి కావు అనుకుందామూ. మనము మాటాడేది ఒకభాష. ప్రక్కవాళ్లు మాటాడేది యింకొకభాష. ఒకరిభాష వొకరికి తెలియదు - దేశమంతా నూటతొంబయితొమ్మిది భాషలు, వేయిన్నూరు కులాలు, జాతులు - ఇన్నిటితో ఐక్యభావము ఎల్లాకలుగుతుందో నా కర్థము కాకుండా వుంది' అన్నాడు.

ఆమె: 'అయ్యో! యిదంతా పాతపురాణం. మూర్ఖులులేని దేశమేలేదు. ఫ్రెంచి రివల్యూషన్‌లో ద్రోహులులేరా? అమెరికాస్వాతంత్ర్య సంగ్రామములో కుచితులు లేకపోయినారా? రషియా స్వేచ్ఛాసమరములో కల్మషులగతియేమయినది? కాకపోతే వీళ్లందరినీ నడపటానికి శక్తిమంతులైన నాయకులు కావాలి. నాయకులు తాము చెప్పినమాట దాటకుండా వీళ్లనందరినీ తయారు చేసుకోవాలి. చీమలుచూడండి. వేనవేలు. లక్షలు వుంటవి. అవన్నీ నాయకుడు చెప్పినట్లే బారులుతీర్చి వెంట బయలుదేరుతవి. అంతటి సుజ్ఞానముకూడా మానవులలో మటుమాయమయిపోయింది. అదినేను సమర్థులైన నాయకులవల్ల పొందవలె. ఇక అనేకభాషలు, అనేకకులాలు ఉన్నవంటారా? నిజమే. ఏడువేలమైళ్లు దూరమునుండి వ్యాపారము నిమిత్తమువచ్చి అదివరకే వున్న డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచివాళ్లను, పీకంవేసి యేకచ్ఛత్రంగా నిరంకుశంగా పరిపాలిస్తూవున్న మహమ్మదీయులను మసిబూసి మారేడుగాయచేసి వేయలేదూ కంపెనీవారు? వారికి మనదేశభాషలేమైనారావే! మనదేశములోవున్న ఆచారాలు, కులాలు, వివిధజాతుల భావప్రవృత్తి (Psychology) అయినా బాగాయెరగరే వారు. అటువంటి పరిస్థితులలో మన భాషతెలియదు, మనకు బాటలైనా సరిగాలేవు. ఆరోజుల్లో, వారు రక్తమైనా ఎక్కువగా దేశానికి బలియిచ్చుకోకుండా దేశాన్నంతా జయించలేదూ!

మనమో ఈ దేశములోపుట్టి, ఈ దేశములోపెరిగి - మనభావప్రవృత్తి యెట్టిదో మనమెరుగుదుము- బాటలు క్రొత్తక్రొత్తపనికరాలుకూడా లభించివున్నాయి యిప్పట్లో. ఇట్టి పరిస్థితిలోనే మనదేశాన్ని మనము పొంద లేకపోతే యింకెప్పుడో ఎక్కడో ఎల్లాగో చేయగలుగుతామనేది కలలోనివార్త. ఒకప్రక్క-గాంధి, మరొక ప్రక్క అరవిందఘోషు యిద్దరు మహావీరశిఖామణులున్నారు. వీరినాయకత్వములో మనవారు ఒకహృద యంగా అయిపోయి ఒక్కతాడుమీద యేమిసాధించలేము?'

అతడు: 'అయితే కావచ్చు, ప్రస్తుతము నేనేమీ చెప్పజాలను. కాని - నిన్నగాక మొన్న కలకత్తా, ఢిల్లీ, లాహోరులలో మహమ్మదీయులు, హిందువులు కొట్టుకొని చచ్చినారు దానికేమి చెపుతారు?'

పెద్దకుమారుడు: 'అమ్మా! ఈసారి జవాబు నన్నుచెప్పనియ్యవే!—అయ్యా, యిటుచూడండి: మహ మ్మదీయులమధ్య హిందువులమధ్య కొట్లాటలు ఉండవలసినదే. బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు నడుమ సాంఘికసమరముకూడా ముఖ్యముగా వుండవలె. పంచములలోను క్రైస్తవులలోను కలవరముకూడా ముఖ్యముగావుండవలెననియే చెపుతాను. ఇవన్నీ యేమని చెపుతున్నవో చిత్తగించారా! దేశములో స్వాతం త్రేచ్ఛ, స్వేచ్ఛాసమరోత్సాహము వ్యాపించినదని. ఇంతవరకూ అడగివుడగి, అధఃపాతాళమున కణగిపోయి మట్టి తిన్నపాములవలె పడియున్న దేశీయులలో ఒకజాతికి యింకొకజాతికి యీసమరములు బయలుదేరిన వంటే సంచలనము కలిగినదన్నమాట. ఒకరికంటె ఒకరు జీవితోన్నతి బడయవలెనని కోరిక, పట్టుదల కలిగిన దన్నమాట. ఇంతవఱకు "సంధ్యావందనము నిరభ్యంతరముగా జరిగితేనే చాలు"నని కొందరు, "పొలంబాగా పండితే పదిపుట్లుధాన్యం బడిలోపడత"వని కొందరు "బ్రతికుంటే బలుసాకులైనా యేరుకుతినవచ్చు"నని మరి కొందరు, "ఏమిశాశ్వతం, బ్రతికే రెండురోజులు కడుపులోచల్ల కదలకుండా" అని యింతదాక నీరసన్నారే అల్లాగు కొందరు వైరాగ్యముతో సమస్తము సన్యసించిన సన్న్యాసులవలె ఆకాశమువంక చూస్తూ మీన మేషాలు లెక్కపెట్టుకొనుచూ రాజ్యము పరులచేతులలో బుద్ధిపూర్వకముగానే మనము పెట్టివేశాము. "వైరా గ్యము ఏదియెల్లాపోతే మనకెందు'కనే మనకొంపతీశారు, ఆనాడు దేశీయులు. ఇప్పుడో ఆ వైరాగ్యపువెర్రి వదిలింది. దేశముకాంక్ష మనస్ఫూర్తిగా కలిగింది. వేడిరక్తము ఉబికింది. నాళాలు బిగిసి శక్తిమంత మైనవి. చిన్నప్పుడు నేర్చుకున్న "నరుడు పౌరుషజీవితోన్నతికేగాని పుడమిపుట్టుట చచ్చిపోవుటకుగాదు" అనే వాక్యము సాధనలోపెట్టవలెననే సంకల్పముదయించిది. స్వాతంత్ర్యపు వాసనలు దేశమంతా వ్యాపించిపోయినవి. క్రొత్తనడక, క్రొత్తదృష్టి, క్రొత్తవిజ్ఞానము, సరిక్రొత్తదేశభక్తిన దేశీయప్రజలను వశపరచుకొన్నవి. అందు చేతనే ఈ కొట్లాటలు, పోట్లాటలు, ఒకరికంటె ఒకరుపైకి రావలెనని, ఒకరికంటె ఒకరు తమశక్తి చూపవలె నని, ఒకరికంటే ఒకరు తమదేశభక్తి యెక్కువగాప్రకటించవలెనని - పిపాసాగ్ని రేకెత్తి యిదివరకువున్న మందమతితనము, నిద్రమత్తు, వైరాగ్యము దగ్ధముచేసి దేశీయప్రజలలో వొక నూతనతేజను కలిగించింది. ఆ స్వాతంత్రేచ్ఛయొక్క, ఆ పౌరుషజీవితోన్నతికై పిపాసయొక్క రేఖలే, ప్రతిబింబాలే ఈ దేశములోని కల్లోలము, అలజడిన్నీ. ఈ కల్లోలము, ఈ సమరోత్సాము, రాబోయే గొప్పయుద్ధానికి - యుద్ధమంటే తుపా కులు, తుపాకులుపుచ్చుకొని యుద్ధము చేయడముకాదు - ఇది ఆధ్యాత్మిక సంగ్రామము. దానికి యివన్నీ ప్రథమసోపానములు. ఇప్పుడిది సాధనాసమయము. దేశీయులు శిక్షనొందుచున్నారు. వీటిమూలంగా ఫల సిద్ధి అందుకోవడానికి, తుదకు సమస్తముకూడా త్యాగముచేసి. 'అయితే కేవలము ఈపోట్లాటలు ఉత్తమ మైనవే అని నేను చెప్పడములేదు. వాటిలో మంచిఉన్నప్పీ,చెడుకూడాఉన్నదంటాను. ఆ కొద్దిదోషములు పోగొట్టుటకైయే సత్యాగ్రహము.

బ్రహ్మ ఆర్యసమాజములు, విశ్వభారతి పనిచేస్తున్నవి. వీటిమూలంగా దేశీయులలో శాంతిప్రయత్నము జరుగుతూ ఉన్నమాటనిజమే. అది తెలిసివుండియే నేను రెంటినిచూచిహర్షించుతాను. అసలే సంచలనము లేకపోతే, యేదో వొకరీతిగా, దేశీయులు కొన్నాళ్లకు రాళ్లవిగ్రహాలైపోతారు. సర్వము మంచికొరకే అనేపద్ధతిలో నివాణ్ణినేను. నాకుకావలసింది దేశములో ఉజ్జీవము, ఉత్తేజనము, స్వాతంత్ర్యపిపాస. ప్రస్తుతము మనకిది జయమువల్ల, అపజయమువలనాకూడా లభిస్తున్నవి. మొన్న బార్డోలీరైతుల సత్యాగ్రహ యుద్ధములోని విజయము దేశీయుల రక్తనాళములలో నూతనోత్సాహము, నూతనోత్తేజనము, స్వేచ్ఛాపిపాస, ప్రజ్వలింపజేసినవి. ఒకానొక నూతనబలము, వొళ్లుమరిపించే శౌర్యము, నొడలువుబికించే పట్టుదల ఆవేశించినవి ప్రజలలో. ఇక మనకు భయములేదు. ఇకమన హృదయాలలో నిరాశకు, నిర్వీర్యానికి చోటులేదు. ఆ దురదృష్టపుగోజులు గతించిపోయినవి. ఇప్పుడుగాలిలోకూడా ఆధ్యాత్మికసమరోత్సాహము ప్రసరించిపోయింది. నక్షత్రాలవరకు వ్యాపించి పోయింది. మనలను పరమేశ్వరుడు ప్రేమదృష్టులతో ఆశీర్వదించుచున్నాడు! అందులో అబద్ధములేదు.'

తల్లి! "బాగాచెప్పినావోయి, తండ్రీ. కాని మగవాడవైనందుకు నీగుణము పోయిందికాదు. మా స్త్రీలతోడ్పాటుసంగతి చెప్పినావే కాదేమి! సరోజినీదేవివంటి నాయకురాలు మనకున్నదంటే, వసంతా దేవివంటి సదమలమాతృదేశాసాధకురాలు మనభాగ్యమైతే, అన్నపూర్ణాదేవివంటి మహాత్యాగశీల, వీర వనిత మనలోనిదైతే మనకేమి కొరతవున్నదీ! ఆనాడు ఫ్రాన్సులో జోన్ ఆఫ్ ఆర్కు వీరావేశురాలు వున్నదీ అంటే మనదేశములో ఝాన్సీ లక్ష్మీబాయివంటి నిర్విక్రమపరాక్రమురాలు వెలిశినది. ఏనాటికైనా లక్ష్మి, సరస్వతి, పార్వతీ దేవులవలె పురుషులతోపాటు స్త్రీలుకూడా వుంటేనే త్వరలో దాస్యవిముక్తి కలుగుతుందన్నమాట మరిచిపోయినావు కామోసు! ఆనాడే విజయలక్ష్మి తనంతతానే వరిస్తుంది దేశాన్ని. అప్పుడు దేవతలు పూలవర్షము కురిపిస్తారు. పరమపితయైన జగన్నాథుడు హృదయపూర్వకముగా ఆశీర్వదించుతాడు"

బాలుడు చిఱునగవుతో 'అవునమ్మా! మరిచిపోయితిని. క్షమించు' అన్నాడు.

బాలచంద్రుడు 'అమ్మా! నేనుకూడా రావద్దే యుద్ధానికి'.

నూతనపురుషుడు ముసిముసి నవ్వునవ్వుచు 'నువ్వెవ్వరితో యుద్ధముచేస్తావోయి. నాతోచెయ్యరాదూ? లేకపోతే పోనీలే గాలితోచెయ్యి చూద్దాము,"

పెద్దకుమారుడు: "ఏమండీ, నేనూమాయమ్మ చెప్పినదానికేమంటారు"

బాలచంద్రుడు తెచ్చుకొనిన కోపముతో 'నేనిప్పుడు గాలితో కుస్తీపట్టి నేర్చుకుంటున్నా. పెద్దయ్యాక ఎవరు అడ్డువస్తే వాళ్ల మీదచేస్తాను' అన్నాడు.

నూతనుడు పెద్దబాలునివైపుచూచి 'ఏమనుటకేమున్నది? మీవంటివారికి యేమిజవాబు చెప్పగలను? నీకుచూస్తే పదిహేనుయేళ్లు లేవు; ఈ వుపన్యాసాలు ఎక్కడ నేర్చుకున్నావయ్యా?'

తల్లి: 'మావాడు కొన్నాళ్లు ప్లాటుఫారము లెక్చరులుకూడా యిచ్చాడులెండి; అప్పుడు బాగా తరిఫీయితుఅయ్యాడు.'

నూతనుడు: 'కాని యేమైనా మీవంటివారు పట్టణాలలోవుండి వుద్యోగాలు చేస్తూవుంటే యెంత కనుల్లపండువుగా వుంటుందీ! అప్పుడు కచేరీలలోను, ఉద్యోగాలలోను వున్న మాలిన్యమంతా వూడ్చిపెట్టుకు

పోతుంది. అప్పుడు మీచేతికింద పదిమంది బంట్రోతులు, ఆశ్రితులు కలకలలాడుతూ వుంటారు. ఏమైనా యిదేమో అడవిలాగు మనుష్యసంచారమైనా లేకుండా నొక్కతే వుండడమంటే నాకుమాత్రము-నిజము చెప్తున్నాను-కష్టముగానేవుంది. వచ్చి గంటన్నరకాలేదు యెల్లాగో బెంగగావుంది అప్పుడే.'

ఆమె: 'మాకు పల్లెటూళ్లే స్వర్గలోకం. ఆ వుద్యోగపు దర్జాలు, నౌకర్లు, చాకర్లు మా కెందుకులెండి, మీవంటి వారికిగాని. బస్తీల చెడుగాలి, యిరకాటము, హడావుడి మేము భరించలేము. మాకీ గొడ్లు, గోద, పాడి, పంట యిదే పదివేలు. స్వచ్ఛమైన నీటిలో హాయిగా స్వేచ్ఛగా తిరిగేమత్స్యాన్ని తీసుకువెళ్లి సింహాసనముమీద కూర్చోబెటితే దానికి బంగారము, వెండి, రత్నాలు, వేషభాషలు ఎందుకూ? మీదు మిక్కిలి వుక్కిరిబిక్కిరి అవుతుందికూడాను.'

నూతనపురుషుడు: 'ఇప్పటికే చాలా ఆలస్యమైంది. వానవెలిశిందికూడాను. నేనేమైనా తప్పులు మాటాడితే క్షమించండి. సెలవు పుచ్చుకుంటాను' అనిలేచినాడు.

ఆమె: 'మంచిది. నాయనా, వారి నంతవరకు పంపించరా' అని చంటిపిల్లను బాలచంద్రుని తీసికొని పొలము గట్టువైపు బయలుదేరినది. పొలములో నెప్పటివలెనే ఊడ్పుకత్తెలు ఊడ్చుచున్నారు. నూతనపురుషుడు పెద్దబోదెమీది తాటికట్టెలు జాగ్రత్తగా దాటి తుమ్మచెట్లగుంపువరకు వెళ్లినాడు.

ఇంతలో ఇంటియజమాని పెద్దసమారుడు కలిసివచ్చుటగని ఆమెలేచి మరల రెండువ్రేళ్లతో పెదవి నొక్కుకొన్నది. యజమానియునటులే పెదవి నొక్కుకొని నవ్వుచు 'రోడ్డుప్రక్కనే బోది బాగు చేయిస్తూ అతను మనయింటివైపురావడము చూశాను. కనిపెట్టినావుకదూ!' అన్నాడు.

ఆమె: 'తెలిశే మీదేవూరనికూడా అడగకుండానే పంపించివేశాను. మనరవుడే అందటికంటే ముందుగానే పసిగట్టిందిసుమండీ!' అన్నది.

# ప్రేమ

శ్రీమతి అ. శ్యామలాంబగారు

పరిణయం బాదిగ పరికింప మఱలంగ కనులార నాథునిగాంచు టెప్పుడో?
చాతుర్యఖనినని స్వామికి చెప్పక చేష్టల తెలియగా జేయు టెప్పుడో?
యేరికేనియు కోర్కెనెఱిగించి ప్రాణేశు చేరబిల్వుమటంచు చెప్పుటెట్లో?
దయయుంచి "భోగికి" తప్పకరమ్మని వయసురానట్టి నే వ్రాయుటెట్లో?
వచ్చునో? రాడో? ప్రాణేశువదనకమల
దర్శనంబబ్బు భాగ్యంబుననరునొక్కొ?
యనుచుయావనలజ్జాభయంబులతిగ
బెనయ తలచువధూటిదే ప్రేమయనగ.

# తప్తజీవి

తురగా వేంకటరామయ్యగారు

౧

ఆయెడారు నడువజాలక
నడరియా క్రోశించుదీనుం
డెవరో; గాంచితె నేటికైనను
ఈశ్వరా నీవు.

౨

ప్రబలమగు సుడిగాడ్పులకు న
బ్రంబు దాకెడు నిసుకవరదల
నెగసి సుడివడికుంభినింబడి
పొగిలిదుఃఖించుఁ

౩

అగ్గిమంటలఁ గ్రుమ్మరించెడు
బొగ్గరవు కొండలను నిలువగఁ
జెట్టుచేమయు లేకఁ గడుశో
షిల్లి తడబడెడిఁ

౪

కడుపుమంటలు నెండమంటలు
కాళ్లక్రిందుగ నగ్గిమంటలు
తలను పుట్టెడు బరువుగలదెటు
దాటగల డొక్కఁ

౫

మెండుకొను దాహమ్మునకునై
యెండమావుల వెంబడించుచు
నంతుగానక తృప్తినందక
హావురని యేడ్చుఁ

౬

గాలితోఁ నాకాశవీథుల
గలసిపోవుద మన్నఁగానీ
తలనుగల బరువులనుదింపే
దాతయే లేడు.

౭

అంతులేని యెడారులుంటే
యలవుఁదీర్చు రసాలవనములు
నాటడే “ధర్మాప్పరావీ”
నాడుగల్లినచోన్

౮

తరుణమిది దేవా! మహాప్రభో!
తప్తజీవనుడైన వీనిఁ
దేల్చుమీ భవదీయకరుణా
దివ్యవాహినులన్

# ఏడవమెట్టు

## శ్రీమతి ఎచ్. కావేరి బాయి గారు, బి. ఎ; యల్. టి.

౧

దేహారోగ్యమైనను, వ్యాధియైనను, మనస్సుయొక్క స్థితి ననుసరించి యుండును. వైద్యులనేకులు శరీరసంబంధమైన చిహ్నములను బట్టి రోగచికిత్స చేయుదురు. నాపద్ధతి యేమనగా ముఖలక్షణములను చూచి, వ్యాధికి మూలకారణమును, తెలిసికొనుట.


ఎచ్. కావేరి బాయి గారు

నాకు లండన్ నగరమందు గొప్ప ప్ర్యాక్టీస్ (Practice) కలదు. అనేకులు దినదినము రోగనివారణ నిమిత్తము, నాయొద్దకు వచ్చుటచే నొకనాడైనను నాకు విశ్రాంతికలుగుట కాస్పదము లేకుండెను. ఇట్లు నెక్కుకాలము గతించినపిమ్మట కొంత విశ్రమము పొందినంగాని నాదేహారోగ్యము నశించునని, భయపడితిని. లండన్ నగరమందు నాకు నిశ్చింత యుండదని తలచి యూరప్ ఖండములోని యితర స్థలములను చూడవలెనని నిశ్చయించితిని. ఇట్లుండ మనోహర విహారార్థమై ప్రయాణము చేయువారికి యేర్పాట్లు కలిగిన నావయొకటి బయలుదేరుటకు సిద్ధముగా నుండెను. ఆయోడలో నాకొక స్థలము నేర్పాటుచేసికొంటిని.

మేము బయలుదేరి యుత్తరసముద్రముమీద ప్రయాణము చేయుచుండగా కెరటములు, తుపానులచే పడవ యధికముగా నూగుచుండెను. సముద్రవ్యాధిచే పీడితులమై మేము మాక్యాబిన్ (Cabin) లను వదలకుంటిమి. పిమ్మట బాల్టిక్ (Baltic) ప్రవేశింపగానే నార్వే (Norway) తీరపు చీలికల, ద్వీపములమధ్య సముద్రము సరోవరమువలె నునుపుగానుండెను. హాయిగా నుండుటచేత క్యాబిన్లనుండి డెక్ (Deck) మీదకు వచ్చి తిరుగుచుంటిమి. మాతోడి ప్రయాణికు లెవ్వరెవ్వరో చూచుకొనుచు; సముద్రమును, ద్వీపములను, నార్వేతీరమును, పరీక్షించుచు కాలము గడుపుచుంటిమి.

ఒక క్యాబిన్నుండి యొక మంచము మోసికొని రాబడెను. ఆ మంచముమీద మిక్కిలి సౌందర్యవతియై పందొమ్మిదియేండ్ల వయసుగల బాలిక యొకర్తు రోగివలె పడియుండెను. నడుమునుండి క్రిందకు

యువతిశరీరము కప్పబడియుండెను. ఆమెను మోసికొనివచ్చి యామెకుపచారములు చేయుచుండిన స్త్రీ యొక ఇంగ్లీష్ రెడ్ క్రాస్ నర్స్ (English Red Cross nurse) వలెనుండెను. ఈమెయందు కళావిహీనత కలిగియుండుటయేకాక ముఖము ముడుచుకొన్నట్లుకూడ కనబడెను. బాలిక యెవరిని గమనింపక నీటివంక చూచుచుండెను. నేను కొంతయాగి రోగివైపుచూచితిని. అనేకు లట్లే చేసిరి. దాది నావంక క్షణమాత్రము చూచెను. అయితే నాచూపునందు కారణములేని పగయు, క్రోధమును కనబడెను. నేను నడచుట మరల నారంభించితిని. చీకటిపడగానే రోగిని దాది లోనికి కొనిపోయెను.

రెండవదినముకూడ చల్లనిగాలి కొరకు డెక్ మీదకు సాయంసమయమున వస్తిమి. రోగిని, దాది మంచము మీద తీసికొనివచ్చెను. వారు తెలిసికొనకుండునట్లు నేను షికారు చేయుచు వారిని గమనించుచుంటిని. గులాబివన్నెగొను తోడుగుటవలన బాలికరూపవిలాసములు మరింత తేజగిల్లుచుండెను. ఆమె యెప్పటి వలెనే పెడమొగముగా పరుండి యుండెను. అటు నిటు షికారుచేయుచు నామె సమీపమున నొకగడియ నిలిచితిని. ఏదో వస్తువు తెచ్చుటకై దాది యామెను విడిచి వెళ్లియుండెను. రోగి చటుక్కున నావంకకుతిరిగి యిట్లనెను:

"డాక్టర్‌గారు! మీతో నొకరహస్యము చెప్పవలెను. నన్ను మీరు పరీక్షించెదరా?"

"అమ్మా! నావకుచెందిన వైద్యులు మిమ్మును కనిపెట్టుచుండగా నన్నుపిలుచుట మంచిదా?"యంటిని.

"ఎందుచేత మీరు నాకు చికిత్సచేయరాదు?" అని ఆమె అనెను.

"అది ప్రొఫెషనల్ ఎటిక్వెట్ కాదం"టిని.

"ప్రొఫెషనల్ ఎటిక్వెట్ (Professional etiquette) అను దానినొకటి గట్టిగా పట్టుకొని మీ డాక్టర్లు మనస్సాక్షిలేనివారై యున్నారు. వ్యాధిగ్రస్థురాలైన యొక బీదబాలిక బాధయెట్లున్నను సరే, మీరు చూడకూడదా?"

"అమ్మా! నేనట్లు చేయరాదు. అయితేమిమ్మును చూచుచున్న వైద్యులు నాసహాయము కోరిన యెడల నేను వారికి సలహా నిచ్చెదను. కాని మీకేస్ (Case) నేను తీయకూడదు."

"వారు కోరి సెలవిచ్చినయెడల నన్ను పరీక్షించెదరా?" యని మరలనడిగెను.

"వారు నాకు సెలవిచ్చి, నాతో నుండవలె"నంటిని.

"లేదు, మిమ్ములను నేను వంటరిగా చూడవలెను."

ఇట్లు చెప్పునంతలో నర్సుతిరిగివచ్చుచుండెను.

"ఆమెను గురించి మీరు బహుజాగ్రతగా నుండవలెను. ఆమెకు తెలియని సంగతులుగాని, యామె కనిపెట్టని విషయములుకాని లేవు. మీరెట్టివారో యామెగ్రహించి యున్న"దని బాలిక యనెను.

దాదివచ్చి పగతోనిండిన చూపుతో నన్నొక్కసారి చూచెను. నేను మరల షికారు మొదలుపెట్టితిని. కొంతసేపైన వెనుక పడవయావత్తు దీపములతో వెలుగుచుండెను. ఓడనాయకుడు, నతని భార్యయు, రోగి చెంత కుర్చీలమీద కూర్చుండి సంభాషించుచుండిరి. నన్ను చూడగనే వారు రోగికి నన్ను పరిచయము (Introduce) చేసిరి.

"మేమిద్దర మిదివరకే కలిసి సంభాషించి యున్నా"మని బాలిక చెప్పెను.

మేమందరము కొంతకాలము కూర్చుండి మాట్లాడినపిమ్మట దాది రోగికి శాలువకప్పి లోపలికి కొనిపోయెను. భోజనమునకు వేళయగుటచేత నందరము చెదరిపోతిమి. నేను నాక్యాబిన్‌లోనికి వెళ్లి వస్త్రములు

మూర్చుకొని భోజనస్థలమునకు పోవుచుంటిని. దారిలో రోగిగది దాటవలసి వచ్చెను. అచ్చటికి వచ్చినప్పుడు గాజువస్తువు వేస్ (Vase) వంటిదేదో క్రిందబడి ఫెళ్లుమని పగిలిన శబ్దమువింటిని. అందుచే నొకింత తలుపు చెంత నిలిచితిని. ఎవరో యటు నిటు పరుగిడుటయు వెలుపల నొకరు నిలిచినట్లు గ్రహించి యిష్టపడక తలుపుసందులలో నుండి నన్ను చూచినట్లును తెలిసికొని నేను సాగిపోతిని. భోజనశాలకు వెళ్లుటకు నేను మెట్లు దిగుచుండగా రోగియాహారమును పళ్లెములో పెట్టుకొని దాది మెట్లెక్కుచుండెను. అచ్చట మేమెదురుపడిన వెంటనే నన్నామె కన్నులెత్రజేసి చూచెను.

భోజనము ముగిసినపిమ్మట పడుకొనుటకు పూర్వము చల్లనిగాలి ననుభవించుచు కొంతమంది డెక్ మీదనుంటిమి. నేను కట కటాలను పట్టుకొని నిలిచి చీకట్లు క్రమ్మిన నీటిని, ఆ కాసమును చూచు చుంటిని.

"ఏమండోయి! నేను వేడకుండ, మీ వెంటరాకుండ మీరు వ్యాధిగ్రస్థురాలిని చూడనన్నారట కదా?" యని యోడవైద్యుడడిగెను.

"అది వాస్తవమే" యంటిని.

"మీ మీద గట్టి విశ్వాసమేదో యొకటి యామెకు కలదు. పోనీ యామె కోరిక తీర్చరాదా?" యనెను.

"మీవెంటవచ్చి రోగిని చూచుటకు నాకభ్యంతరములే" దంటిని.

"రెండవ వారెవరు నుండరాదట. మీరు వంటరిగా వెళ్లవలెనట. నాప్రార్థనవిని మీరామెను తృప్తిపరచుదురుగాక" యని వైద్యుడు చెప్పెను.

"అందుకునేను సమ్మతింప"నని జవాబుచెప్పి ఆమెకేమి జబ్బంటారు?" అని ప్రశ్నించితిని.

"కాళ్లు పడిపోయినవి."

"అది కుదురునా?" యంటిని.

"నాకేమియు నమ్మకము లేదు."

"అయితే మీ బ్యాటరీ (Battery) నాకు వాడుకొనుటకు, దయచేసినయెడల నేనామెను పరీక్షించెదను."

## ౨

ఆమరువాటి యుదయమున, దాది నాయొద్దకు వచ్చి, "మీ రాకకు రోగి సిద్ధపడియున్న" దనెను.

నేను బ్యాటరీ పట్టుకొని బాలిక గదిలోనికివెళ్లితిని. నర్సచ్చటినుండి క్యాబిన్ నుండి పోవుచుండెను.

"ఒక నర్సయినను లేకుండ నేను మిమ్మును పరీక్షింపను. ఆమెను పిలువండి. బ్యాటరీనైనను నొకరు పట్టుకొనవలె" నని రోగితో నేనంటిని.

"లేదండి నేను మీతో సంభాషించునప్పు డెవరు నుండరాదు. బ్యాటరీ తెచ్చితిరా? అయితే నాకేమి వ్యాధియనెదరు?"

"మీ కేవ్యాధియు లేదు. ఇదంతయు నటన."

"చూచితిరా! ఆమె నిశ్చయముగానే గ్రహించినది. ఓడమీదనున్నవారందరు నాకు జబ్బని నమ్మిరి. మొట్ట మొదటలోనే మీరు షికారుచేయుచు నావంకచూచునప్పుడు మీరుమట్టుకు సందేహపడి నట్లు మాదాది గ్రహించినది. ఆమె సామాన్యురాలు కాదు. మీరు జాగ్రతపడవలెను. మీరు నిజముగా

నా గుట్టు తెలిసికొంటిరో లేక మే మూరికే యనుమానపడితిమో తేల్చుటకు మిమ్ములను వంటరిగా రమ్మనుట" యని బాలికచెప్పెను.

"ఈ వేషము, ఈనటనఎందుకు" అని ఆమెనడిగితిని. ఆమె యిట్లుజవాబిచ్చెను.

"మేము రష్యాదేశస్థులము. మా తండ్రి జర్మనీలో గొప్పవర్తకుడు. అతనికిప్పుడున్నది రెండవభార్య. నా మారుటితల్లి పెట్టుశ్రమల నోర్వలేక మాపెద్దతండ్రి దగ్గరకు తప్పించుకపోవలెనని మార్గము యూహించుచుంటిని. మాపెద్దతండ్రి జారుచక్రవర్తిగారి యాస్థానవైద్యుడు. ఆయ నొకసామంతరాజునకొనవలసినదే. వైద్యశిఖామణియని యాయన కీర్తిప్రపంచకమంతట నిండియున్నది. మీకుకూడ తెలిసియేయుండును. ఆయన కొకగొప్ప లేబొరేటరీ (Laboratory) యున్నది. క్యాన్సర్ (Cancer) వ్యాధికి మూలకారణము తెలిసికొనుటకు క్యాన్సర్ మైక్రోబ్లను పెంచుచుండును. ఎవరు బాగుచేయలేని రోగము నటించినచో మాపెద్దతండ్రియొద్దకు నన్ను పంపుదురని యూహించి యిట్లు వేషమువేసితిని. జర్మనీలో నెవరికిని నాజబ్బు కుదుర్చుట సాధ్యముకాకుండెను. అందుచేత దాదినిచ్చి నన్ను రష్యాకి వెళ్లుటకై సాగనంపిరి. ఇదిసంగతి."

ఈ చరిత్ర కట్టుకథ నాకు తోచెను. అయిన నామెకోరిక ప్రకారముగా నామె రహస్యము నెవరికి వెల్లడిచేయనని మాటఇచ్చితిని. ఓడవైద్యుడు నన్ను ప్రశ్నించి నప్పుడుకూడ నేదో యొకరీతిగా జవాబులు చెప్పితిని.

మాయోడ చివరకు సెంట్‌పీటర్స్ బర్గ్ (St. Petersburg, now Leningrad) చేరెను. ఎప్పటివలెనే దిగిపోవువారు ఎక్కెడివారు అడావిడి పడుచుండిరి. ఒకగొప్ప పరివారముతో నొక పెద్ద యధికారివంటి మహాపురుషుడొకడు పడవమీదకు వచ్చుచుండెను. ఆయన బాలికను కలిసికొని ముద్దు పెట్టెను. పరివారపు వారందరు నటునిటుప రుగులిడుచు బాలిక సామానులు యోడనుండి తీయుచుండిరి. దాది యొకయినుపపెట్టెను బహుజాగ్రతతో మోసికొనివచ్చుచుండెను. కొంతదూరము వచ్చినతరువాత బరువుచేత కాబోలు పెట్టెక్రిందపడి తెరచుకొని యందులోని కాగితములు చెల్లాచెదరుగా పడిపోయెను. ఆమె తొందరగా వానిని తీయుచుండెను. సహాయము చేయవలెనను యూహతో నేను కొన్నికాగితములను తీసితిని. తక్షణమే పట్టరాని కోపముతో నాచేతినుండి వానినీడ్చి గట్టిగా లాగుకొని పగతో నిండినచూపు నామీద నొకగడియ నిలిపెను.

ఇనుపపెట్టెలో విలువగల సొమ్ములు లేకుండ కాగితములుండుట యాశ్చర్యముగా నుండెను. మఱియు దాది నాదగ్గరనుంచి తీసికొనునంతలో నొక కాగితముమీద బాలికపేరును చూచితిని. ఆమె నాతో చెప్పినపేరదికాదు. దానిమీద "ఓల్గా" అనియుండెను. ఆపత్రములనుగురించి నేనాలోచించుచుండగా రోగి నన్నుపిలిచి తన పెద్దతండ్రికి ఇంట్రడ్యూస్ చేసెను.

ఆమహాపురుషుడు మిక్కిలి సంతసించినవానివలె నన్ను పొగడి యారాత్రి వారిభవనమున విందారగింప కోరెను. నేనెన్నివిధములుగా వెళ్లకుండునట్లు ప్రయత్నించినను వ్యర్థమయ్యెను. బాలికకూడ బ్రతిమాలుచుండెను.

"డాక్టర్ హాలిఫాక్స్‌గారు మీప్రఖ్యాతి నేను వినియుండలేదా? ప్రసిద్ధిగాంచిన వైద్యులిద్దరు కలిసికొనినప్పుడు—నాయింట మీకు గౌరముజరుగకతప్పదు. నా లేబొరేటరీని గురించి మీరు వినియేయుందురు. నేను క్యాన్సర్ మైక్రోబ్లను కృషిచేయు పద్ధతి మాచుట కిష్టములేదా?" యనెను.

ఏవైద్యున కిష్టముండదు? నేను సమ్మతించితిని.

## 3

సెంట్ పీటర్స్‌బర్గ్‌లో దిగినవారు కాక నావలోనున్న యితరులు కూడా కొందరు పట్టణమును చూచుటకు వెళ్లితిమి. చీకటి పడకముందు పడవకు తిరిగివచ్చి చేరి నేను నాకున్న దుస్తులలో మిక్కిలి విలువ గలవానిని ధరించి యా యధికారిభవనమున కేగితిని. ఆమందిరపు వైభవసౌందర్యములను వర్ణింపజాల. అచ్చటి దీపములు, తెరలు, పాన్పులు, తివాసీలు, కుర్చీబల్లలు చూచినయెడల నీజమిందారుడే రష్యా దేశపుచక్రవర్తియా యనునట్లుండెను. నేను వెళ్లునప్పటికి సేవకులు తప్పించి మరెవరును బయట కనబడలేదు. బంగారు జరీతో చేతిపని నలంకరించు ముఖమల్ షరాయి అంగీ తొడగిన సేవకుడొకడు నిశ్శబ్దముగా నన్ను కలిసికొనుటకువచ్చి వంగి నమస్కారముచేసి నన్నొకస్థలమునకు తీసుకవెళ్లి యది నా కొరకు సిద్ధపర్చబడిన గదియని చెప్పెను. సేవకుని వస్త్రములు నాయంబరములను తిరస్కరించుచున్నట్లుండెను. ఆయింటికి చెందిన స్త్రీపురుషులెట్లు వెలుగుచుందురో వారిమధ్య నేనెట్లు కనబడుదునో కదాయని కొంత సిగ్గుపడితిని. నేనున్న గది యతివిశాలమై నేను శ్రమతీర్చుకొనుటకు కావలసిన, సదుపాయములు కలిగి ప్రక్కన స్నానపుగది (bathroom) సహితముగా నుండెను. నేనొక సోఫామీదకూర్చుండి ఆమందిరములోనున్న విలువగల వస్తువులను చూచుచు చుట్టుకాల్చుచుండగా పట్టుగౌను చప్పుడు వినబడెను. ఎచ్చటనుండి వచ్చినదోగాని నా యెదుటమట్టుకు ఓల్గా యొకయప్సరసవలె మోహనీరూపము ధరించి నిలబడి యుండెను. నేను లేచి పలుకరించునంతలో మాట్లాడవలదని నాజ్ఞచేసి యొకజాబును నా చేతిలో పెట్టి దీనిని చదువు మని యదృశ్యమయ్యెను. నేనుజాబును విప్పిచదువగా నిట్లు వ్రాయబడియుండెను.

"ఇతరులకు మా మీద కరుణలేదు. ఇతరులకు దయ యనునది మేముచూపము. నీవు మా రహస్యములను కనిపెట్ట ప్రయత్నించితివి గనుక నీప్రాణములు తీయుచున్నాము. నీవు తప్పించుకొనుటకు మార్గము లేదు. ఈ భవనమందే కాక పట్టణమంతట మా గూఢచారులున్నారు. ఈ జమిందారుడు నా పెద్ద తండ్రి కాడు. మేమందరమును జరుగుచున్న పరిపాలన న్యాయచట్టములు మొదలైనవానిని నాశనము చేయుట కేర్పడిన సంఘస్థులము (Nihilists). మాలో నెవరైనా సంఘమును తృప్తిపరచని యెడల వారికి మరణముసిద్ధము. అయితే నీవునాకు చేసిన సహాయముకొరకై నిన్ను తప్పింపవలెనని ధైర్యచిత్తుడవైన యాంగ్లేయుడా! నాయభిలాష. నాకెంత యపాయము వచ్చునో నే నెరుగను. కాని నీకొక్క సలహానిచ్చెదను. నామాటప్రకారము నడిచితివా నీప్రాణములు దక్కవచ్చును. కాని నిశ్చయము మట్టుకు చెప్పలేను.

ఏమాత్రము ధైర్యము విడువకుము. నీయాపద నీవు గ్రహించిన ప్లేగుసూచనవలనైన వారు తెలిసికొనిరా యేయద్భుత కార్యమైనను నిన్ను రక్షింపజాలదు. కనుక వారందరితో నుల్లాసముగా సంభాషించుచు ముఖమునం దానందము కనపర్చుము. విందుకూటమునందు నాప్రక్కన కూర్చుండి నన్ను వరించువానివలె నాకు రహస్యములు చెప్పుచుండుము. వారు నీతో నేదియన్నను విశ్వసించిన వానివలెనుండుము. నీకేదైన నాశ్చర్యము కలిగించిన యెడల హృదయములోనున్న విస్మయముపైకి రానీయకుము. భోజనమైనపిమ్మట జమిందారుడు తనలేబొరేటరీని చూడరమ్మని నిన్నుపిలుచును. ఏమియు సందేహపడక యతని వెంటపొమ్ము. అయితే ఏడవమెట్టును గురించి జాగ్రతపడుము."

తెలివిమాలినవాడనై యట్లు మృత్యువు నోటబడితిని కదాయని నన్ను నేను శపించుకొంటిని. ఒక పావుగంటసేపు నాశరీరము కొయ్యబారెను. పిమ్మట జాబును తీసికాల్చివేసి దాని భస్మమును పాదము క్రిందత్రొక్కి బెట్టితిని. ఎంతవిలపించినను జరుగవలసిన కార్యము జరుగక మానదు. మరణము పొందవలసిన యెడల పిరికివానివలెగాక ధైర్య సాహసములతో నే మృత్యుదేవత నెదుర్కొందునని దృఢపరచుకొంటిని.

భోజనము వేళకు మొదటి నాకు మర్యాదలు సల్పిన సేవకుడు మరల నిశ్శబ్దముగావచ్చి నన్ను విందుశాలకు దోడ్కొనిపోయెను. అచ్చట జమిందారుడు నన్నెదుర్కొని నల్లని ముఖముల్ వస్త్రముల వలనను ప్రజ్వరిల్లుచున్న కెంపువజ్రాదులతోను మార్పొందిన దాదినినాకు "నాజమిందారిణి"యని ఇంట్రడ్యూస్ చేసెను.

"మనము చివరకు కలిసికొంటిమికదా! యని యామెచెప్పెను. ఆస్వరము ఆచూపు, "తుదకునాచేత జిక్కితివికదా?" యనునట్లుండెను.

అచటనుండిన స్త్రీ పురుషు లందరు ధరించిన యమూల్యమైన వస్త్రములు, నగలు వారిని గంధర్వుల వలె నలంకరించెను. వీరందరితో నన్నుగూర్చి పొగడి నానిమిత్తమే యంతటి విందు జరుగుచున్నట్లు జమిందారుడనెను.

అతిసౌందర్యవతియగు ఓల్గా దేవతాస్త్రీవలె నాప్రక్కనే కూర్చుండియుండెను. ఆమెమాట ప్రకారము నేను మధురవాక్యములతో నామెను వరించువానివలె నామె దిక్కువరిగి యితరులకు వినబడి వినబడకుండునట్లు సంభాషించుచుంటిని. ఇదంతయు జమిందారుడును దాదియు కనిపెట్టుచుండిరి.

భోజనము ముగిసినపిదప నితరు లనేకవిధములు కాలమును గడుపుచుండిరి. జమిందారుడు తన లేబొరేటరిచూచుటకు నన్ను రమ్మనెను. నామరణము నెదుర్కొనుటకు మారు మాటాడక బయలుదేరి వెళ్లితిని. ఆభవనము నందొకచీకటిసొరంగమువలె నొకసందుండెను. ఓల్గా దీపము పట్టుకొని మాముందునడచుచుండెను. ఎంతోదూరము నడువగా నొక తలుపుదగ్గర నిలిచితిమి. జమిందారుడు నన్నులోనికితోడ్కొనిపోయి "చూచితిరా? నా లేబొరేటరి" యనెను. అది విశాలమైనగది. బీరువాలతోను, మందులతోను మరిసామానులతోను నిండియుండెను. అవియన్నియుచూచిన పిదప గదిలో నొక చివరయుండిన యొక మంచమును చూపెట్టెను.

"నేనొకప్పుడాసక్తితో పనిచేయునప్పుడు రాత్రులలో కాలమేలాగు పోవుచున్నదో యెరుగను. మధ్య రాత్రియందు నాపడక గదికి వెళ్లలేక నిచ్చటనే రాత్రి గడ్పుట కీపడకయున్న" దనెను.

నేను దాని సమీపముగాపోయి, యచ్చట నొక పెద్దకిటికీనుండి వెలుపలి యంధకారమును చూచితిని. నాగుండెలు ఝల్లుమనునట్లుగా నాకిటికీ క్రిందనుండి, నీవానదియొక్క నల్లనిప్రవాహము పాఱుచుండెను. అటుతరువాత మేమందరము మరల వెలుపలికివచ్చి చీకటిసందు చేరితిమి.

"ఇక నేను క్యాన్సర్ మైక్రోబ్లను కృషిచేయు చిన్న చీకటిగదిని చూతమురండి"యని జమిందారుడు ముందుకుసాగెను. అతని ముందుగుండ నడచుచున్న బాలిక వెనుకకు తిరిగి "పెద్దనాన్న నాకుభయమగుచున్నది. ఈలాంతరుతీసికొని మీరేముందు నడువండి" యనెను.

జమిందారు డామె భీతికి మందలించి యిష్టములేక లాంతరుపుచ్చుకొని మొదట నడచెను. ఆ సందు చివర నొకతలుపు వచ్చెను. దానిని తెరచి "యిచ్చటినుండి దిగిపోవలె"నని చెప్పి జమిందారుడు ముందు దిగెను. ఓల్గా యాతని వెనుక దిగుచు "నొకటి, రెండు" యని బిగ్గరగా మెట్లను లెక్కించుచు నడుగులు వేయుచుండెను. "ఆరు" యని లెక్కింపగానే నన్ను వెనుకకు ద్రోసెను. తత్క్షణమే నేదోయొక బరువైన వస్తువు జారి యఘాధములోనున్న నీటిలోపడినట్లు చప్పుడు వినవచ్చెను. ఆమె త్రోపుకు మెట్లమీదనే కూర్చుండబడితిని. జమిందారుడును బాలికయు నదృశ్యమైరి. చీకటి యంధకారమయముగా నుండెను. నాదేహమంతయు భయకంపితమయ్యెను.

"ఆహా! యేడవమెట్టులేనేలేదు. ఆరవమెట్టునుండి పాతాళములోనే తెలియనివారు దిగుదురు. అచ్చట చీకటిలో ప్రవహించు నీవానది నల్లనిప్రవాహములోపడి ప్రాణము విడుచుటయే వీరు శత్రువులకు విధించినదండన. ఆహా! యెంతఘోరమరణము నాకుతప్పె" ననుకొంటిని.

అయినను సంతసించుటకాస్పదము లేదు. నేను సురక్షితముగా పోవుటకు మార్గమేది? చేతులు చాచి యన్నిదిక్కులుతడివి యేదైనా మార్గమున్నదా యని వెతికితిని. మేము వచ్చిన తలుపు గట్టిగా బిగియబడియుండెను. మరేదిక్కైనను తలుపులుండలేదు. సాఫుగా గోడయుండెను. నాతోవచ్చిన వారిరువురు

మరల మెట్లనెక్కలేదు. వారెటునుండి, యేరహస్యపు దారినుండి వెళ్లిపోయియుందురాయని విస్మయముచెందితిని. చివరకు నీటిలో నాకు చావుతప్పినను క్షుద్పిపాసమువలన నీస్థలమందే నేను జీవములు విడుతునుకదా యని దుఃఖించుచుంటిని.

ఇట్లుండగా నెవరో మాట్లాడునట్లు నాకు సమీపముగానే ధ్వని వినవచ్చెను. జమిందారుడు మరల నేనున్నస్థలమునకువచ్చి నేనేవిధమునైనను తప్పించుకొని యుండినయెడల కడదేర్పవలెనని కాబోలు యుద్దేశమును తెల్పుచుండెను. ఓల్గా యతడట్లు చేయకుండునట్లు ప్రత్యుత్తరములుచెప్పుచుండెను.

"అంత పెద్దచప్పుడు గుండెలు ఝుల్లుమనునట్లు మీరు, నేను వింటిమికదా యేమిటీ వెఱ్ఱిమీకు" అని ఓల్గా అనెను.

ఆధ్వనులాగిపోయెను. మాట్లాడినవారు వెళ్లిపోయిరి. అటుతరువాత కొంతసేపటికి నారవమెట్టు ప్రక్కన గోడవలెనుండినది. నిజముగా తలుపైయుండుటచేత దానినితెరచి ఓల్గా గుమ్మమునద్ద నిలువబడెను. చేతి సంజ్ఞచేసి తన వెంటరమ్మనెను. నేను వెళ్లితిని. మేము కొంతదూరము వెళ్లి మెట్లుదిగితిమి. చివరకు నదియొద్దు వచ్చెను.

"ధైర్యచిత్తుడైన యాంగ్లేయుడా నాప్రాణము నాచేతిలోపెట్టుకొని నిన్ను తప్పించితిని. ఆగవమెట్టునుండి నీవు నదియందే పడి యుందువు. నేనెంతో శ్రమతోను, సాహసముతోను యితరులకు తెలియకుండ నొకరాళ్లబస్తా నచ్చటనుంచి నిన్ను వెనుకకు త్రోయుచు కాలితో నాబస్తాను నీటిలో పడవేసితిని. జమిందారుడు నీవేపడిపోయినావని నమ్మెను. ఇక నీవు నీపడవకు సురక్షితముగావెళ్లు" మని నన్ను వీడుగొల్పి తనలాంతరుపట్టుకొని వెళ్లిపోయెను.

—(డాక్టరు క్లిఫర్డు హాలిఫాక్సు వారి Extracts from a Doctor's Diary అను గ్రంథములోని 'The Seventh Step' అనుకథకు అనువాదము.)

## చిత్రప్రశ్న

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

గీ

మొదటి రెండక్షరములు చేర్చగా 'చూచి' యనుటకర్థంబగు; ఆదితుదను
గలిగిన యక్షరములుగల్పి చదువగాదంతావళమున కర్థంబుదోచు;
పరికింప చివర యక్షరములు రెండును కొండకర్థంబుగా నుండియుండు;
మూడవయక్షరమును మాని చదివిన 'చూచిరి' యనసరిదోచు; మొత్త

మునను నాల్గక్షరంబులు బొందుపఱుప
గ్రామనామంబు నెల్లూరు సీమలోన—
తెలుపుడీ దీని నామంబు తెలివలార!
మీదు బుద్ధి పరీక్షింప మీటయిదియు.

☞ ఇట్టివానియందు రుచిగల 'గృహలక్ష్మి' చందాదారులాంధ్రులు ఈ ప్రశ్నకు జబాబు స్వయముగ నాలోచించి మాకు లేఖాముఖమున మే 10-వ తేదీలోపున తెలుపుదురుగాక! లేఖలో తమచందా నెంబరు తప్పక తెలుపవలెను.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపలుకులు

(సంపాదకురాలు) శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మగారు



ఏనుగమ్మాఏనుగు—
ఏ ఏనుగు ?
మదపుటేనుగు—
ఏ మదం ?
ఆముదం—
ఏ ఆముదం ?
చిట్టాముదం—
ఏం చిట్టి ?
నెయ్యిచిట్టి—
ఏం నెయ్యి ?
పేరి నెయ్యి—
ఏం పేరు?
గుళ్ల పేరు—

ఏంగుళ్లు ?
సరిగుళ్లు—
ఏంసరి ?
దాసరి—
ఏందాసరి?
దాసుదాసరి—
ఏందాసు ?
కాళిదాసు —
ఏంకాళి ?
భద్రకాళి—
ఏంభద్ర ?
తుంగభద్ర—
ఏతుంగ ?
పాలతుంగ—
ఏంపాల ?
బత్తెపాల—
ఏంబత్తె ?
చుక్కబత్తె—
ఏంచుక్క ?
చాదుచుక్క—
ఏంచాదు ?
బియ్యపుచాదు—

ఏంబియ్యం ?
పూచబియ్యం—
ఏంపూచ ?
అరటిపూచ—
ఏం అరటి ?
బొంతఅరటి—
ఏంబొంత?
కంబళిబొంత—
ఏంకంబళి ?
రత్నకంబళి—
ఏం రత్న ?
గోరురత్న—
ఏంగోరు ?
పులిగోరు—
ఏంపులి ?
పెద్దపులి—
ఏంపెద్ద ?
గోచిపెద్ద—
ఏంగోచి ?
పట్టుగోచి—
ఏంపట్టు ?
ముక్కుపట్టు—

## ౨. పాటలు

# ఆటపాటలు

(సంపాదకురాలు) శ్రీమతి జమ్మి సీతాబాయిగారు



జమ్మి సీతాబాయిగారు

౧

నావేళ్ల మట్టెలు
నాకాళ్ల గజ్జెలు
మోకాటి చిప్పలు
అబ్బబ్బ నడుము
ముత్యాల రవిక
రత్యాలరాగిడి
ఇదుగిదుగో.

౨

కాళ్లాగజ్జ కంకణమ్మ
వేగులచుక్క వెలగమొగ్గ
మొగ్గగాదు మోటకినీరు
నీరుగాదు నిర్మలబావి
బావిగాదు బచ్చలకూర
కూరగాదు కుమ్మరికడవ
యీడోజోడో వియ్యాపురాల
కాలుతీసి గట్టునపెట్టు.

౩

బండోయమ్మబండి
పదహారు కుచ్చులబండి
సుబ్బారాయుడుపెండ్లి
చూచి వద్దామురండి
ఆకువక్కలు తెండి
అడిగి వద్దామురండి
అమ్మన్నాకు బువ్వ
అరచేతిలో గవ్వ
అందఱూనీకుడిల్ల
కొప్పులో కోడిపిల్ల
బోగందాని కొప్పు
యెడంకాలుచెప్పు.

౪

నాలుగు స్తంభాలాట
నడిమికి తొడిమికి
తానక తప్పక
తనపేరేమంటే
పుట్టిమీదపొట్టి
కాకరకాయ బెల్లం.

౫

చెమ్మాచెక్క
చారడేసిమొగ్గ
అట్లుపొయ్యంగ
ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క
రంగులెయ్యంగ
ముత్యాల చెమ్మచెక్క
ముగ్గులెయ్యంగ
పగడాలచమ్మచక్క
పందిరెయ్యంగ
పందిట్లోమాఅన్న
పెళ్లిచెయ్యంగ
చాకలాడివాణికింద
జాజిపూలదండ
మోకీలదండ
ముత్యాలదండ
దండోదండ
దండోదండ

౬

ఆకువక్క సున్నంసుడి
అరిటా బొరిటా
టాంటపాకాయి
అత్తయ్య చెవులో
ముత్యాలు బోసి
కోడలి చెవులో
కొబ్బరిపెట్టి
తరుముకు రావే
బోగంపాప.

౭

బాలా బాలా
బరుకూబరుకూ
తన్నులు తింటే
తలకట్టూ.

## జోలపాట

(సంపాదకురాలు) శ్రీమతి ఆలపాటి సీతమ్మగారు

హాయిహాయనగాను ఆపదలు గడచు
చిన్నవారలగాచు శ్రీవేంకటేశు. హాయి

రావె రావె పిట్ట రత్నాలపిట్ట
కట్టుదేవే పిట్ట కనకణ్ణికొట్టు. హాయి

వాసాల మీఁదది మీసాలపిల్లి
అబ్బాయిచేతిది హంసల్లగిలక. హాయి

జోలపాపడికి జోడుంగరాలు
చిన్ని నాబిడ్డకు పమిడుంగరాలు. హాయి

చిన్నారి పొన్నారి చిఱుతడవు నీవు
పొన్నమానుమీఁదిచిన్నికృష్ణుఁడవు. హాయి

ఆడితే ముద్దమ్మ పాడితేముద్దు
అందఱికి అబ్బాయి అల్లారుముద్దు. హాయి

పకులరాటమ్మో ఇంటికందమ్మో
మాచిన్నిఅబ్బాయిమాకుఅందమ్మో. హాయి

ఉసిరికాయలతోట ఊరికందమ్మో
ఉత్తముఁడుఅబ్బాయిమాకుఅందమ్మో.హాయి

చిన్నారిపొన్నారి చిలుకవేనీవు
గున్నమామిడి మీది చిన్నికోకిలవే. హాయి
జోలల్లు పాడితే బాలలకు నిద్ర
నాగస్వరం పాడితే నాగులకునిద్ర. హాయి
జోలలకు జొన్నకూడు బాలలకు వరికూడు
ఏడ్చేటి అబ్బాయికిఎల్లావుల పాలు. హాయి
ఆయింటి సందులో ఈ యింటిసందులో
అలచందపూవలె మెరసెనబ్బాయి. హాయి
ఏడవకు ఏడవకు వెఱ్ఱిఅబ్బాయి
ఏడిస్తే నీకండ్లు నీలాలుకారు. హాయి
నీలాలుకారితే నేనోర్వలేను
పాలైనకారవే బంగారుకనుల. హాయి
ఊరెల్లతిరిగేటి ఓ ఊరుబిల్లా
ఊరుకున్నబ్బాయికి ఉగ్గెట్టిపోవె. హాయి
పాడెల్లతిరిగేటి ఓపల్లగాడ్దె
పండుకొన్నపాపనికి పాలిచ్చిపోవే. హాయి
రాకాసిరావణుని తాను అబ్బాయి
రాజును కొట్టేసి తారాజ్యమేలు. హాయి

3. బుద్ధి పరీక్ష

# యుక్తిలెక్క

శ్రీమతి కమలమ్మగారు

[ ఇది బాలురయు బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనది. కావున ఈయుక్తిలెక్కకు ఉత్తరముస్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడిన బాలబాలికలు మే 10-వ తేదిలోపున లేఖాముఖమున (ఉత్తరములో వారివయసు తెలుపవలెను) మాకుతెలియ జేతురుగాక ! —సంపాదకుడు]

ఈక్రిందచూపిన చిత్రములో 8 గుఱ్ఱపుగదులు ఉన్నవి. అందు ఏప్రక్కచూచినను 3 గదులు వరుసగా వచ్చునట్లు కట్టబడి యున్నవి. చూడుడు.

  

 

  

ఈగదులలో ఏప్రక్కచూచినను 12 గుఱ్ఱములు వచ్చునట్లు 32 గుఱ్ఱములు కట్టబడియుండెను. ఒకడు ఈ 32 గుఱ్ఱములతో 4 గుఱ్ఱములనుచేర్చి కట్టెను. అప్పుడును ఏప్రక్కచూచినను 12 గుఱ్ఱములే ఉండెను. క్రొత్తగా నాలుగు గుఱ్ఱములను కట్టిన మనిషి తన 4 గుఱ్ఱములకు మారుగా 8 గుఱ్ఱములను విప్పుకొనిపోయెను. తిరిగి ఏప్రక్కచూచినను (8 గుఱ్ఱములు తగ్గినను) 12 గుఱ్ఱములేఉండెను. ఎట్లు? 3 విధములును గదులు వ్రాసి చూపవలెను.

## ౪. పిట్టకథ

## కోడికథ

జమ్మి శేషగిరిరావుగారు

అనగా అనగా వొకవూరిలో ఒకకోడివుంది. దానికి నాలుగుపిల్లలువున్నాయి. ఆపిల్లల పేర్లు:—

1. "రావేగుమ్మాడీ.
2. రత్నగుమ్మాడీ.
3. పేరుపేర్లూ
4. పెద్దప్పదొరసానీ."

అని. తల్లికోడి రోజూ మేతకై వెళ్ళేటప్పుడు తననలుగురు పిల్లలనీ గుడిసెలోఉంచి తలుపువేసుకోమని చెప్పి మరీ మేతకి వెళ్ళేది.

మేతతీసుకొని తిరిగి యింటికిరాగానే

"రావేగుమ్మాడీ! తలుపుతియ్యావే!
రత్నగుమ్మాడీ! తలుపుతియ్యావే!
పేరుపేర్లూ! తలుపుతియ్యావే!
పెద్దప్పదొరసానీ! తలుపుతియ్యావే!"

అనిపిలిచేది. ఆమాట పిల్లలువిని తలుపు తీసేవి.

ఒకనాడు ఒక యెరికలవాడు యీసంగతి విన్నాడు. తల్లికోడి మేతకువెళ్ళగా చూసి గుడిసెదగ్గరకు వచ్చి తల్లి పిలిచినట్లుగానే పిలిచేడు. దాంతో ఆపిల్లలు పాపము తల్లేయనుకొని తలుపుతీశాయి. ఆపాళంగా ఆపిల్లలని ఎత్తుకొని పారిపోయ్యాడు. తల్లికోడి యింటికి వచ్చింది.

"రావేగుమ్మాడీ! తలుపుతియ్యావే" అంది. గుడిసెలో చప్పుడువినబడలేదు. "రత్నగుమ్మాడీ! తలుపు తియ్యావే!" అంది. ఇప్పుడూ చప్పుడులేదు. "పేరు పేర్లూ! తలుపుతియ్యావే, పెద్దప్పదొరసానీ! తలుపు తియ్యావే" అంది. గుడిసెలో అసలు చప్పుడేలేదు. తలుపుతోసుకొని లోపలికెళ్లి చూస్తే ఏముంది? ఏమీలేదు. అప్పుడు అదిఏడుస్తూ అడవిలోకెళ్లింది.

అక్కడ పార్వతీపరమేశ్వరులు భూమిపాలించడానికి వచ్చేరు. ఈతల్లికోడి ఏడుపువిని దగ్గిరకువచ్చి అడిగారు "ఎందుకు ఏడుస్తావు" అని. తనపిల్లల్ని ఎవరో ఎత్తుకుపోయారు అని చెప్పింది. అప్పుడు ఇన్నినీళ్లు మంత్రించియిచ్చి "వూరిబయట వకయెరకలవాడు వున్నాడు. వాడియింటికి వెళ్లి అక్కడ పెంట పోగు వుంటుంది. దానిమీద చల్లితే నీపిల్లలు వస్తాయి" అన్నారు.

అప్పుడు తల్లికోడి గబ గబ పరుగెత్తుకొని వెళ్లింది. ఆయెరకలవాడు ఆకోడిపిల్లల్ని చంపుకుతినేశి ఎముకలు పెంటమీద పారేశాడు. వాటిమీద నీళ్లుచల్లి తల్లికోడి

"రావేగుమ్మాడీ! బ్రతికిరావమ్మా!
రత్నగుమ్మాడీ! బ్రతికిరావమ్మా!
పేరుపేర్లూ! బ్రతికిరావమ్మా!
పెద్దప్పదొరసానీ! బ్రతికిరావమ్మా!"

అంటూ పాటపాడింది. పాడేసరికి ఆపెంటపోగులోంచి నాలుగు కోడిపిల్లలూ గున గునలాడుతూ వచ్చి తల్లిదగ్గరచేరాయి. ఎరకలవాడు చూస్తూవుండగానే అవి తల్లితోకూడా యింటికి వెళ్లిపోయాయి.

కథ కంచికివెళ్లింది. మనం యింటికివచ్చేం.

## ౫. నీతికథ

# సోమరితనము కూడదు

శ్రీమతి మాడభూషి చూడమ్మగారు

"కష్టేఫలీ" యనునది తెలుఁగుసామెతలలో నొకటి. ఎవరైనను కష్టపడి పనులను గావించినయెడల దానిఫలితమును సుఖముగ ననుభవింతురని దీనికర్థము. కష్టపడక సోమరితనమున కాలముఁ బుచ్చువారు వారిజీవితమంతయు సుఖములేని జీవయాత్ర చేయుచుందురు. జ్ఞానవిహీనములగు పశువులును, కీటకాదులునుగూడ యీనీతిని తమ ప్రవర్తనముచేత జూపుచున్నవి. అదును కనిపట్టి సేద్యముచేయనిచో నిత్యము మన మారగించుయాహారము దొరకదు. మనుజుడు నిత్యము యేదోయొక పరిశ్రమ చేయుచున్నగాని లోకతంత్రమునడవదు. మనపూర్వులు మేధాశాలురై సంఘవిభజన మనుపేరున నెన్నోవిషయములు బోధించి యొక్కొకకర్మ యొక్కొక్కరు చేయుచుండునటులను వారు దాని నభివృద్ధిపరచుచు దానియందు విశేషప్రకృతులు విశేషచిత్రగతులు గనుపరచునట్టి మేధాశాలురగునట్టును కట్టుదిట్టములు గావించిరి. నియమితకృత్యములఁజేయక వృథా కాలయాపనము గావించుచు సోమరియగు మనుజుడు దేహమును బంధువులను మిత్రులను కడకు యిఁగుపొరుగువారినిగూడ కష్టములపాలు గావించును. సోమరిని జడమగు యొక మొద్దుస్వరూపముగ బోల్పవచ్చును. కాని మొద్దువలన కొంతయుపయోగ మున్నది. ఈ సోమరివలన యుపయోగము లేకపోవుటయేకాక యెదిరివారికి బాధలు గూడకలవు. ఈ సంబంధమున చిన్నకథను చెప్పెదవినుడు.

ఒకయడవి దట్టమగుచెట్లచే నావరింపబడియున్నది. లేతచిగుళ్లచేతను పూగుత్తుల వలనను ఫలభారమున వంగియు చూచుటకందముగనే యున్నవి. పెద్దవృక్షముయొక్క చివరకొమ్మలలో తేనెటీగలు కొన్నిచేరి చెట్టునఁపట్టుకుని సుఖముగ కాలము పుచ్చుచున్నవి. ఆ పట్టువద్దకు దోమయొకటి తన సహజరాగాలాపమును చేయుచు నిటునటు తిరుగుచుండెను. అది చలికాలము. మంచుదిట్టముగ నాయడవినంతను గప్పి తనధవళత్వము నిరుమడింపచేయుచుండెను. చిన్నచెట్లను, రాళ్లగుట్టలను, కొమ్మలను, తుప్పలను యావరించి ప్రకృతి స్ఫటికాభరణాలంకృతమయ్యెనా యనునటుల యాపేరినమంచు దృగ్గోచరమగుచుండెను. ఈ చలిలో బైటకురాజాలక మక్షికసంతతి పట్టులోని గదులలో దూరి కాలమునుఁబుచ్చును. ఇటులనే వేసవికాలమంతయు కష్టపడి పూవులందలి మధువును చేకూర్చుకొని చలికాలమంతయు సుఖముగ నింటకూర్చుండును. ఇప్పుడే వానికి సంతానవృద్ధియు గలుగును. దోమ పనిలేకనే తిరుగుచు నీ పట్టు దగ్గరచేరి యిట్లుఅనెను.

"ఓ మంచియీగలార ! నేను చిరకాలమునుండి సంగీతము నేర్చితిని. గాత్రముతో జంత్రముపైని మంచిపాట పాడగలను. రాగాలాపనమందు యిచ్ఛగల మీరు నాపాటను, యాటను, పాటకు తగినటుల యాటను పరీక్షించి మీచిన్నబిడ్డలకు నేర్పింప యిచ్ఛగల దేని నన్నొక గురువునిగా నేర్పరచుకోవచ్చును. ఇందులకు మీావద్దనున్న మధువును నాకు గురుదక్షిణగ నివ్వవలెను. మీా పిల్లలనందరిని బాగా సంగీతవిద్యయం దారితేరిన వారినిగా నొనర్తును. ఇందువలన విశేషవిద్వాంసులై ధనమార్జించెదరు."

దానికి ఈగలు ఇట్లుచెప్పినవి. "ఓగాయక శిఖామణీ! దోమా! నీవునేర్చుకొన్న విద్య నీ సహజవిద్య. నీ విద్యవలన ప్రయోజనము నీకులేనట్టే మాకునువుండదు. ప్రయోజనరహితమగు విద్యవలన నేమిలాభము? నీవీవిద్యవలన యెదుటివారును గూడ బాధపడవలయునేకాని సౌఖ్యము ఇనుమంతయు లేదు. కనుక నిష్ఫలమగు విద్యకొరకు కష్టించి చలికాలముకొరకు నిలువచేసిన మాయాహారమును నీకొసంగజాలము. అవసరమగునప్పటికి వలయువస్తువుల నొసంగలేని నీవిద్య మాబిడ్డలకు చెప్పించి వారిని నీవంటిసోమరులుగాచేయజాలము. దయయుంచి యింతటినుంచియైన నీవీపనికిమాలిన విద్యనువీడి పాటుపడుము."

ఈమాటలువిని దోమ సిగ్గునుచెంది యింటికిపోయెను. కనుక కష్టపడి కొన్నిదినములు కూడబెట్టుకున్న తేనెతో ఆహారములేని చలికాలమంతయు సుఖించుచున్న ఈగలు యెంతనీతిని బోధించుచున్నవో చూడుడు. జ్ఞానమువలనయెరిగి చేతినిండ పనికలిపించి మనుజులనందరిని ప్రత్యేకవృత్తులలో ప్రవేశపెట్టి యావృత్తి వలన గలఫలము నా జాతివారనుభవించు నటులను ఒకరిఫలమొకరు యనుభవించుచు పరస్పరసహాయమొసంగుకొనుచు వివాదలులేక ఐకమత్యము నభివృద్ధిగావించుకొనుచు నుండవలయునని మన పెద్దలయూహ. కష్టపడలేనివాడు సోమరి. సోమరితాను యిడుమల బడుటయేకాక తన్నుచేరిన దగ్గిరవారినందరిని కష్టములుపాలుచేయును. మంచిఫల మనుభవింప లేకపోవును. కావున ప్రతిమనుజుడు యేదో పనిని చేబూని దాని ఫలమనుభవించును, ఎదిరివారికి గూడ తనవలన తనకార్యమువలన సహాయము గావించుచుండవలెను. ఈనీతి మనకా యీగ లొసంగినవిగదా?

# చలివేంద్రము చ్చట్లు

## శ్రీమతి కొప్పర్తి సత్యవతమ్మ గారు

### ౧

### చలివేంద్రవద్ద నొకవృద్ధబ్రాహ్మణుడు

చలివేంద్రవద్దకు యథాప్రకారము వేంకటనరసమ్మగారు భోజనముచేసి వెళ్లి బాటసారులకు దాహము ఇచ్చుచుండెను. మధ్యాహ్నము రెండుగంటలయ్యెను. భానుడు తీవ్రముగ ప్రకాశింపుచుండెను. వడగాడుపు విసరుచుండెను. అంత నొకవృద్ధబ్రాహ్మణుడు చలివేంద్రవద్దకు ఎట్లనో ప్రాణములు జేరవేసెను.

"అమ్మయ్యా! బ్రతికితిని. ఈ సత్రముపెట్టిన మహానుభావుని యిల్లు వెయ్యిళ్లైమొదలు కావలయును. ఈ వేసవికాలములో ఇంతకంటె చేయతగిన పుణ్యకార్యమేమున్నది?" అని తనలో అనుకొనుచు "ఎవరండీ సత్రములోను? దాహమగుచున్నది." అని ప్రకాశముగా పలికెను.

అంత వేంకటనరసమ్మగారు దయార్ద్రహృదయముతో ఆ వృద్ధబ్రాహ్మణుని ఆహ్వానించి ఒక ఇత్తడి చెంబుతో కాళ్లుకడుగుకొనుటకు నీళ్ళను, ఒక కంచుచెంబుతో దాహముతాగుటకు నీర్మజ్జిగయు నిచ్చెను. వృద్ధబ్రాహ్మణుడు కాళ్లుకడుగుకొని శ్రమవాసి దాహముతాగి సేదదేరెను. "అమ్మయ్యా! బ్రతికితిని. అమ్మా! మీకు ఎంతపుణ్యమండి" అని బ్రాహ్మణుడనెను.

"అయ్యా! విప్రోత్తమా! ఎక్కడికి పోవుచుంటిరోగాని ఎండ అతితీవ్రముగానున్నది. జరాభారమున అలసియున్న మీశరీరము ఈతీవ్రాతపమునకు తాళజాలదు. కావున ప్రొద్దువాటారువరకు ఇందు ఈ చిటి చాపమీద విశ్రమింపుడు."

బ్రాహ్మణుడు విశ్రమించి "అమ్మా! మీ ఇంటిపేరేమి?" అని అడిగెను.

"మా యింటిపేరెందుకులెండి."

"అమ్మా! మిమ్ములను చూచినను, మీరు చేయుచున్న పుణ్యకార్యమును తలచినను నాకు మహనీయురాలు డొక్కా సీతమ్మగారు జ్ఞాపకము వచ్చుచున్నారు. మన గోదావరిజిల్లాలలో ఆమె నామము వినని వారులేరు. మీరు ఆమెవంటి పుణ్యజీవనులైయున్నారు కావున తెలిసికొనవలెనని కుతూహలముగలిగి అడుగుచున్నాను."

"డొక్కా సీతమ్మగారు—ఆ తల్లి యెక్కడ? నావంటివారెక్కడ? ఆమెకును నాకును పోలికయే లేదు."

"అమ్మా! అట్లనరాదు. చేయగలంత పుణ్యమును తమరు చేయుచునేయున్నారు. కావుననే మీయింటి పేరు తెలిసికొనుటకు నేను కుతూహలపడుచున్నాను."

"అయ్యా! మా అత్తవారింటిపేరు గురిజాడవారు."

"అమలాపురములోని గురిజాడవారును మీ అత్తవారునుజ్ఞాతులా?"

"మా అత్తవారు అమలాపురమే."

"అట్లాగునా? మీ మామగారిపేరు?"

"సంపదరాయుడుగారు"

"ఓహో! సంపదరాయుడుగారా? వారిని నేను బాగాయెఱుగుదును. వారికొడుకులలో ఎన్నవవారు మీ భర్తగారు?"

"నా పెండ్లినాటికి రెండవవారు."

"ఆయనా? ఆయన్ని రామదాసు అని చెప్పుకునేవాళ్లు మాయింట్లో ఆడవాళ్లు."

"ఆయనేనండి నా కొంపతీస్త."

"ఆయనకు రెండవపెండ్లి అని చెప్పుచుండెడివారు. మొదటిభార్య ఎవరు?"

"ఎవరో ఎక్కడ? మా అక్కగారినే మొదట యిచ్చినారు. పెండ్లిఅయిన నెలరోజులకే ఆమె పెద్దలలో కలసినది. తరువాత నన్ను యిచ్చినారు. నేను ఆరుసంవత్సరములు కాపురముచేశాను. ఆనందముతో ఆరుసంవత్సరములు ఆరునిముషములట్లు గడచినవి. అప్పుడు మా వారికి గుంటూరులో పని. నెలకు ముప్పది యైదు రూపాయిలు జీతము. బ్రాడీపేటలో కాపురము. ఆరుసంవత్సరముల అనంతరము మా వారికి దేహములో కాయిలా ప్రవేశించినది. నెలరోజులు సెలవుపుచ్చుకొని వారిస్వగ్రామమగు అమలాపురమువచ్చినాము. వచ్చిన మూడవరోజుననే హంస లేచిపోయినది. అనాధనై పుట్టినింట ఇట్లు ప్రొద్దులు పుచ్చుచున్నాను."

"అమ్మా! సుకృతీగతాయుపని పెద్దలనుమాట ఊరకపోదు. ఆయనను దైవము ఎత్తుకొనిపోయినాడు. పాపము మీ ధర్మమేనా కాసినదికాదు. మీ మామగారగు సంపదరాయుడుగారి సంతానములో మంచితనమునకు మీవారు, రాశిపోసిన చెడ్డతనమునకు మీ పెద్దఆడుబిడ్డ. మంచివారికి మరణము ముందువచ్చును. కావున మీవారు వారిదారిని వారుపోయినారు. మీపెద్దఆడుబిడ్డమాత్రము అందఱి ఆయువు పోసుకొని ఉట్టిగట్టుకొనిఉండి అందఱిని ఆడిపోయుచున్నది. ఆ పాప మెప్పుడుపండునో!"

"అయ్యా! ఆమెసంగతి మనకెందుకులెండి. ఆమె బరువు మనమేమి మోసుకొన్నాము."

"అమ్మా! మీ హృదయము మంచిదికాబట్టి అట్లనుచున్నారు. ఆమె మంచిచెడ్డలు అమలాపురములో అందఱు ఎఱుగుదురు. పోనీలెండి. ఆమెసంగతి మనకెందుకు? తల్లీ! మీరుమాత్రము మంచిపని చేయుచున్నారు. విచారముతో ఒకచోట కూర్చుండి ఉండకుండా చలివేంద్రపెట్టి నీటికొఱకు గోటాపన ఎత్తివచ్చు బాటసారులకు చల్లని నీరుమజ్జిగ ఇచ్చి ప్రాణములు నిల్పుచున్నారు. మీకు ఎంతేని పుణ్యమువచ్చును. తల్లీ! ప్రొద్దుకొంచము వాటారినది. నేను పోవలసిన ఊరు ఇంకను చాలదూరమున్నది. పెందలకడనే పోయి వెలుగుండగనే ఉప్పుటేరు దాటవలసియున్నది. కావున పోయివస్తాను."

వృద్ధబ్రాహ్మణుడు వెడలిపోయెను. సూర్యాస్తమయమైనవెంటనే వేంకటనరసమ్మగారు చలివేంద్రమూసి సమీపముననేయున్న ఇంటికివెళ్లెను.

# స్త్రీ అబల కాదు

[ఈవిషయమునుగూర్చి నెల్లూరు ప్రొ॥గెసివుయూ॥నియనువారు ఏర్పఱచిన పోటీ పరీక్షకు వ్యాసములను పంపిన పం|్రెండుగురు అభ్యర్థినులలో బహుమానము పొందిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసము గతమాసము ప్రచురించియున్నాము. మిగిలిన పదునొకండుగురి వ్యాసములనుండియు పరీక్షాధికారు లిచ్చిన మార్కులనుబట్టి ఏర్పడిన క్రమమున కొన్ని కొన్ని భాగములను ఉద్ధరించి ప్రచురింపు చున్నారము. పరీక్షాధికారుల నిర్ణయించిన వరుస క్రమమున ఆరువ్యాసములనుండి ఈమాసమును మిగిలిన వానినుండి పైమాసమును ప్రచురింతుము.

—సంపాదకుడు]

## ౧

## శ్రీమతి శిఖరం కమలాంబగారు

సర్వలోకసృష్టికర్తయగు పరాత్పరుండు తాను సృష్టించిన పరమాణువు మొదలు మహామేరువు వఱకు గల యెల్ల చరాచరపదార్థములకును, ఆయావాని యుపయోగమునకుందగిన శక్తిని బ్రసాదించియున్నాడనుట మనకు ననుభవవేద్యమే. అన్ని జీవజాలములకుందగిన బలమును బ్రసాదించియున్న భగవంతుడు స్త్రీలను అనగా తమ రక్తమాంసములనుండి వేరుగా॥గొన్ని వ్యక్తులను కని పోషింపవలసియుండు స్త్రీలను—మాత్రము అబలలనుగా సృజించియుండునా? ఉండదు.

అయినను స్త్రీలు అబలలు; వారు శరీరబలముగాని, బుద్ధిబలముగాని, మనోబలముగాని లేనివారని వాడుట సామాన్యమైయున్నది. చాలకాలమునుండి యాచరణలోనున్న నిర్బంధములచేతను ప్రస్తుతము గోచరించుచున్న యజ్ఞానముచేతను, స్త్రీలుఅబలలని యనిపించుకొనుచున్నను స్త్రీలు సహజముగ అబలలా యని నిర్ణయింప వలసినచో స్త్రీపురుష శిశువులు జన్మించిన దాదిగా వారి వారి జీవితములో॥ బ్రకృతిసిద్ధమైయున్న బాధ్యతలను వివరించియు, విజ్ఞాన విషయమున స్త్రీ పురుషుల గ్రహణశక్తి మున్నగు విషయముల గుర్తెరింగియు, రోగములు తదితరములైన యాపదలు సంభవించినప్పుడు స్త్రీ పురుషుల చిత్తస్థైర్యము లెట్లుండునది తెలిసికొనియు మనమాలోచింపవలసియున్నది.

శిశువు జన్మించిన వెంటనే యేడ్చును గదా? శబ్దమునుబట్టి సంతానవతులగు ముసలమ్మలు శిశువును జూడకయే, యే శిశువైనది చెప్పగలరు. ఎట్లు చెప్పినారని అడుగగా 'ఆడుపిల్లయేడ్చినంత బిగ్గరగా మగపిల్లవాడేడ్వ॥జాల'డని చెప్పుదురు. శైశవమున మగపిల్ల వానికన్న నాడుపిల్లకే జీర్ణశక్తి యెక్కువ. మఱియు

వ్యాధులుకూడ మగపిల్లలకు వచ్చినంత తఱచుగా నాడుపిల్లలకురావు. కనుకనే పెద్దవారు ఆడుపిల్లల యాహారవిషయములోఁ గొంచెము హెచ్చుతక్కువలున్నను భయములేదందురు. మగపిల్లలకన్న నాడుపిల్లలే త్వరగా నెదుగుదురు. దేహములోఁదగిన పటుత్వములేకున్న నెదుగుఁబొడుగులుండవు కదా? పరుగెత్తుట, ఈతకొట్టుట, మొదలగు నాటలయందు బాలబాలికలిరువురు సమానముగనే కన్పట్టుచున్నారు. ఇటీవల బెంగళూరిలో బాలబాలికలకు జరిగిన యీతపందెములో బాలికయే గెల్చినదని కూడ వినుచున్నారము. స్త్రీలు బాల్యము దాటునప్పటికే వివాహితలై, గృహకార్యములను జక్కఁజేసికొనవలయును. గృహకార్యములనగా దంచుట, విసరుట, నీరుచేదుట, నీరుమోయుట—ఇట్టి పనులు బలములేనిచో వారికి జేయుటకు సాధ్యమగునా? ఇక వంటఁజేయుట, వడ్డించుట మొదలగునవి చేయునపుడు దినమునకు లెక్కలేని సారులు వంగి లేచుచుండవలయును. కడుపులో నొకపిల్లను, చంకలో నొకపిల్లను మోసికొనుచు నెత్తిమీద నిండు బిందెను బెట్టుకొని వచ్చుస్త్రీలను జూచుచున్నారము. ౧౦ సేర్ల బియ్యమునువండి ఆచెరవను అనాయాసముగా పొయ్యిమీదనుండి దించినట్టి ౧౫ యేండ్ల బాలికను జూచియున్నాను.

* * * * *

స్త్రీలు సహజముగా నబలలైనచో, నూటికి నేబదివంతు బాలమాతలతో నిండియుండు భరతఖండములో స్త్రీజాతి యిప్పటికే నామమాత్రావశిష్టమైయుండెడిది.

* * * * *

ధీబలమునసైతము బాలికలు బాలురకెంతమాత్రము దీసిపోవుటలేదు. ఒకయేడాది వయస్సుగల బాలికయు, నదేవయస్సుగల బాలుడును ఒకసారి యాడుకొనుచుండిరి. వారిరువురికి నప్పటికి మాటలుకూడ రావు. మద్దూరు చన్నపట్నపుఁ జెక్కపిడతలుగల రెండుతాటాకుపెట్టెలను వారికి కొనియీయగా బాలిక పిడతలనన్నిటిని తీసిచూచి వానినుపయోగపఱచవలసిన విధమును వెంటనేగ్రహించి పొయ్యిపెట్టి పొయ్యిమీద గిన్నెనుబెట్టి మూతమూసి యొకనిముసముంచి ప్రాతపేలికను దెచ్చి యాపిడతను దించినది. ఇంకొక పిడతమీద గుడ్డనుమూసి చిన్నగెరిటెను వేఱొక పిడతలోనుండి ముంచి తీసి గుడ్డపైనవేసి పొయ్యిమీదనుండి దించినపిడతలోనుండునది దానిలోఁబోసి యాగుడ్డను తీసివేసి చిన్నచెక్కలోటాలోనికి వంచి సమీపమునఁ గూర్చొని యాబాల చేయుపనులను జూచుచుండిన తాతగారికి నందిచ్చినది. బాలుడు చెక్కబుడ్లయొక్క రంగులను జూచుచు నొకదానితో నొకటి తాటించి విసరివేయుచు నాడుకొనుచుండెను. అనగా నంతకు ముందు తల్లి పాలుకాచి పంచదారవేసి వడియబోసి తనకు ద్రాగించుటను ఆబాలిక గ్రహించెనుగాని బాలుడు గ్రహించలేదన్నమాట. ఇటులనే చాలమంది బాలికలు బాలురకన్న త్వరగా విషయములను గ్రహించుచున్నారు. ఇప్పుడవకాశము లభించినకొలదిఁ బురుషులతో సమానముగా స్త్రీలు విద్య నేర్చుచున్నారు.

* * * * *

ఇక గృహిణులుగా నుండు స్త్రీల విషయము పరీశీలింతము. కుటుంబమనగా చిన్నరాజ్యమని చెప్పవచ్చును. రాజ్యములో నొక్కొక్క శాఖకు వేర్వేరుద్యోగస్థులుందురుగాని గృహరాజ్యమున ఆదాయమునకుఁ దగినటుల వ్యయముచేసి తగినంత ద్రవ్యమును నిలువఁజేయుచు ఆర్థికమంత్రివలెను; ఆరోగ్యసూత్రముల నెఱింగి బిడ్డలను పోషించుట, గృహనైర్మల్యము, శరీరనైర్మల్యము కలిగించుట, వస్త్రములను పరిశుభ్రముగా నుంచుట, రోగచికిత్సల నెఱింగియుండుట మున్నగునవి గ్రహించి వెజ్జురాలుగను; గృహమునందప్పుడప్పుడు పిల్లల మధ్య జరుగు చిన్నవ్యాజ్యములను నిజమెఱింగి తీర్మానించి శాంతిని గలిగించుచు

న్యాయాధిపురాలుగను; పనిపాటులవారు చేయు దొంగతనములు కనిపెట్టుచు రక్షకశాఖాధ్యక్షురాలుగను; బిడ్డల తెలివిని, శక్తిని, అభిరుచిని గమనించి తగిన విద్యనేర్పుచు నుపాధ్యాయినివలెను ప్రవర్తింపవలయును గదా? స్త్రీకి బుద్ధి బలము లేనిచో నీపనులన్నియు నెటుల నెరవేర్పగలదు?

ఇక మనదేశమున విద్యాగంధమెఱుగని స్త్రీలు పెక్కుమంది, భారత భాగవత రామాయణములలోని విషయములను పాటలరూపముగా నేర్చుకొని పాడుచుందురు. ఈ పాటల సహాయమున వారు పురాణేతిహాస జ్ఞానముగలవారై, యందలి నీతిని గ్రహించి, మహిమోన్నతులగు స్త్రీ పురుషుల నాదర్శముగఁ గైకొని ప్రవర్తించుచున్నారు. ఈపాటలు కొన్ని శతాధికములగు చరణములు కలిగినవిగను కొన్నివివిధరాగములతో పాడవలసినవిగనుఉన్నవి. ఇట్లు నేర్చుకొన్న పాటలను చదువురాని యీ స్త్రీలు జన్మపర్యంతము జ్ఞాపకముంచుకొని యుందురు. విద్యలేకయే యెంతెంతయో గొప్పపాటలభ్యసించి యుండుట స్త్రీల బుద్ధిచాకచక్యమును విశదపఱచుచున్నది. కాబట్టియే 'బుద్ధిశ్చాపిచతుర్గుణాం' అని పురుషులకంటె స్త్రీలు బుద్ధియందు నాలుగుపాళ్లెక్కువయని పెద్దలు వక్కాణించి యున్నారు.

## 3

## శ్రీమతి సీరిపి అచ్చమాంబగారు

పురుషుఁడు బలవంతుఁడని తలంచు ప్రతివిషయమునను స్త్రీ యాతనికిఁ దగ్గిపోలేదు. తల్లి బలవంతురాలైననే కుమారుఁడు బలవంతుఁడగుచున్నాఁడు. తల్లి ప్రజ్ఞావతియైననే కుమారుఁడు బుద్ధిమంతుఁడగుచున్నాఁడు. తల్లి దుష్టాత్మురాలై పతితయయ్యెనేని యామె పుత్త్రుఁడు సర్వసాధారణముగ సజ్జనుఁడు కాఁజాలఁడు. ప్రపంచమున వెలసిన యుత్తమపురుషులు, నాదర్శపురుషులు నెందఱోతల్లి సద్బోధముల కారణమున నట్టి యున్నతస్థితికి వచ్చిరి—వచ్చుచున్నారు—తప్పకవత్తురు. తల్లి యుగ్గుపాలతోఁ ద్రావించిన నీతివాక్యామృతబిందువులే కుమారుని హృదయమునఁ బదిలముగఁ గుదిరి యాతని పురోభివృద్ధికి సాధనములగుచున్నవి. వీరమాతలు తమకుమారులు వీరులు, శూరులు, విక్రమార్కులు కావలయునని జోలలయందు సహితము తమసంతతికి వీరులచరిత్రములే వెల్లడించుచు వారిశౌర్యమునే కీర్తించుచుండిరి. శివాజి కాతనితల్లి బాల్యమున వీరుల కథలే చెప్పుచుండెడిదఁట! కాన సర్వసాధారణముగాఁ బురుషుల సుగతికిఁగాని దుర్గతికిగాని స్త్రీలే కారకురాండ్రు. అట్టిచో స్త్రీలందఱు నబలలైయెననిక బలయుతులగు పురుషులెక్కడినుండి వచ్చిరి? ప్రపంచమున నెందఱు చక్రవర్తులు—నెందఱువీరయోధులు—నెందఱుకవులు—నెందఱు మత సంస్థాపనాచార్యులు--నెందఱు చిత్రకారులు వెలువడిరి? వీరినందఱును స్త్రీలేకదా ప్రపంచమునకుఁ బ్రసాదించినది? అట్టి ప్రతిభాఢ్యులను గనిన తల్లులను - వీరమాతలను అబలలనఁ జెల్లునా? ముమ్మాటికిని జెల్లదుగదా?

* * * * *

స్త్రీ శక్తిస్వరూపిణి. శక్తికల్పితమైన దీజగత్సృష్టి. పశుపక్ష్యాదులందుఁ గాన్పించుచున్న స్త్రీపురుషలింగ భేదములలో స్త్రీజాతియే కంఠస్వరమునందును - రూపలావణ్యమునందును - సహజపటుత్వమునందును బేరుఁ గాంచి మించుచున్నవనుటకు శారికాకీరమయూరగోగణములు నిదర్శనములు. ఇఁక ప్రబోధితలైన మర్త్య స్త్రీలమాట వేఱుగ నుడువనేల? దుష్యంతుని కొలువుకూటమునకు శకుంతలపోయి నిజపరిణయ వృత్తాంతము కథనము మూలమునఁ దన్నుఁగాఁదెల్పుకొను ఘట్టమునఁగలవి కాళిదాసు స్త్రీజాతినిట్లు వర్ణించి యున్నాఁడు.

# వైశ్యయువతీవిద్యాలయము, గుంటూరు



ఆంగ్లమున జయముగాంచిన మొదటిజట్టు బాలికలు



సంగీతమున ఉత్తీర్ణలైన మొదటిజట్టు బాలికలు

# వైశ్యయువతీ విద్యాలయము, గుంటూరు



హిందీతరగతియందు ఉత్తీర్ణులైన మొదటిజట్టు బాలికలు



కుట్టుపనియందు జయముగాంచిన తొలిజట్టు బాలికలు

* చ. అరయఁగ మానవేతరములై తగుజంతువులందు స్త్రీలలోఁ
గరము నిసర్గపాటవముఁ గన్పడఁ, జెప్పఁగనేల ప్రాజ్ఞలౌ
తరుణులమాట? తాఁ బరభృత ప్రకరం బితరద్విజాళి నం
బరము కేఁగుదాఁక బెనుపంగ నొనర్పదె కన్నబిడ్డలన్.

—అభిజ్ఞానశాకుంతలము.

దీనిఁబట్టి చూచినను స్త్రీప్రబలయనియే స్పష్టమగుచుండలేదా? ఎవ్విధమునఁ జూచినను స్త్రీపురుషులందు సమానత్వము సిద్ధము. ప్రాణి పురుషజన్మమెత్తి గడింపవలసిన యనుభవములు కొన్నియు, స్త్రీజన్మమెత్తి సంపాదింపవలసిన యనుభవములు కొన్నియుఁ గలవఁట్రదు. పురుషునకుసహజలక్షణమైన పౌరుషశక్తి యెట్టిదో స్త్రీకి సహనశక్తి యట్టిది. ఈ పౌరుషసహనశక్తు లలవఱచుకొనుటకై దేహధారు లీశ్వర సంకల్పము మేరకు స్త్రీపురుషజన్మములను దాము చేసెడి కర్మయోగమునుబట్టి కాలచక్రములో జనన మరణావస్థలకు లోనై పొందుచుందురని తత్త్వవేత్తలు వక్కాణించుచున్నారు. కావున స్త్రీపురుషులు సమానులే.

స్త్రీజాతియొక్క ప్రాశస్త్యమునుగూర్చి యాంగ్లభాషయం దీలోకోక్తియున్నది. "The hand that rocks the cradle rules the world." ఉయ్యెలనూఁగించు హస్తమే ప్రపంచమును పాలించును అని దీనిభావము. కాన స్త్రీయబలకాదు.

## ౪

## శ్రీమతి పురిటి సూర్యనారాయణమ్మగారు

పురుషులవలె స్త్రీలుకూడ శాస్త్రపరిశోధనలందును సర్వవస్తుసంశోధనలందును కడుంగడు నిపుణలు. క్రొత్తవిషయములను స్త్రీలుకూడ పురుషులవలెనే కనుగొనుచుందురు. ఇందులకు నిదర్శనము 19-వ శతాబ్దమందు ఇంగ్లండుదేశములో జననమొందిన హెర్తా అయర్టన్ అను వీరనారిమణియొక్క జీవిత చరిత్రము. హెర్తా అయర్టన్ గణితశాస్త్రమందు మిక్కిలిపేరు (స్త్రీత్రయమునుండి) గాంచినది. చిన్ననాటనే అబలయైనను శాస్త్రశోధన లొనరించి హృదయ స్పందనమును గుర్తించు ఒక యంత్రమును నిర్మించెను. కొంతకాలమైన యనంతర మానారీరత్నము ఋజురేఖ విభాగిని అను నొక యంత్రమునుకూడ కనిపెట్టగలిగెను. అంతటితో తృప్తినొందక ఆమె మరికొన్ని నూతనవిషయములనుకూడ పరిశోధించి రాయల్ సొసైటీవారి పొగడ్తను పాత్రురాలయ్యెను. ఆమెవలెనే మేరీక్యూరీ అను మరియొక పాశ్చాత్యవీరవనిత "రేడియమ్" అను వస్తువును మిక్కిలి ప్రయాసచే పరిశోధించి సూత్రములను నిర్మించు ప్రపంచమున ప్రజలందరెరుగునట్లు తెలియజేసెను. అత్తటి మేరీక్యూరీజూపిన శోధనకౌశలమును, చాతుర్యమును మిక్కిలి ప్రశంసనీయములు. ఇట్టివనితలెందరో ప్రపంచమున నుదయించిమానవకళ్యాణమునకును, మానవవిజ్ఞానమునకును, దేశసౌభాగ్యమునకును చేదోడు వాదోడై పాటుపడుచున్నారు. యంత్రపరిశ్రమలకు నిలయముగు అమెరికా దేశమున స్త్రీలు శాస్త్రపరిశోధన లొనరించి పలుతెఱంగులగు యంత్రసముదాయములను కనిపెట్టిన విధమును ప్రపంచ పత్రికలు వేనోళ్ల బొగడుచున్నవి. అబలలని భావింపబడు స్త్రీలు విజ్ఞానోపార్జన మొనరించి దేశీయసారస్వతాభివృద్ధికిని తన్మూలమున దేశోన్నతికిని చేయూత నొసంగుచుండుట ప్రత్యక్షప్రమాణము.

* * * * *

అబలులను కన్నతల్లిని అబలయనఁ జెల్లునా? పురుషులందరు ప్రబలులు, కావున పురుషులను గన్నతల్లి వారికంటె ప్రాబల్యముగలది యనుట సత్యము.

---

* కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలము పంచమాంకమున 'స్త్రీణాం అశిక్షితపటుత్వ...' అనుశ్లోకరాజముఁ గనుఁడు.

## ౫
## శ్రీమతి బి. లక్ష్మీనరసమ్మగారు

ఇపుడెందరు యువతీమణులు పురుషులవలె యెంత విద్య నార్జించుటలేదు? అట్లు విద్య నేర్చినవారు మగవారివలె శక్తిసామర్థ్యములు గలిగి వివిధములగు వ్యాపారములయందు మెలగుచుండుటలేదా? అటులైనచో నేల స్త్రీలనబలలనవలయును? అటులొనరించు టన్యాయముగాదా? విద్యలయందు స్త్రీలేమాత్రము పురుషులకన్న తీసిపోవనపుడు, ఆవిషయమునందు స్త్రీలనబలలనుటేమాత్ర ముచితముగాదు. స్త్రీలు మాత్రము పెద్ద పెద్ద పరీక్షలయందు తీర్ణలగుటలేదా? వారుమాత్రము లాపరీక్షలయందు గృతార్థులై న్యాయవాదినులగుటలేదా? స్త్రీలు విద్యాశాఖలయందుతనిఖీదారులుగను, అధ్యాపకులుగజేరి బాలబాలికలను అభివృద్ధినొందించుటయు, రాజకీయలౌకికవ్యాపారములయందుజేరి నందెంతయు కృతకృత్యలగుటలేదా? అట్టియెడ వారు వారికిగల శక్తిసామర్థ్యములు జూపుటలేదా? అట్లయినచో యిట్టి వ్యాపారములందు స్త్రీలు జూపుచున్న యబలత్వమేమి? లేక స్త్రీని యబలయనుటొక సామాన్యవాడుక పదమా? అటులై యుండవచ్చునేగాని విద్యావిధానము నందెంతమాత్రము స్త్రీ యబలయని యనుటకు వీలులేదు.

## ౬
## శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

స్త్రీలు ప్రసవించునపుడు వారు సర్వమును త్యజించి వారి ప్రాణములైనను లక్ష్యముచేయక శిశువులను లోకములోనికి తెచ్చుటయందే తత్పరలై యుండెదరు. స్త్రీలు వారి వారి సంసారములకు రాణులై వారియింటియందు యేకచ్ఛత్రాధిపత్యము వహించి యుందురు. అట్టితరి వారిని యబలలని యెవరన గలరు? సంసారము చక్కగ నిర్వహించుపట్ల స్త్రీలే తగినవారు. సాధారణముగ స్త్రీలు చదివినను, చదువకున్నను వారు సంసారము పట్ల చదివినవారే యగుదురు. ఇప్పుడు మనహిందూశాస్త్రప్రకారము పదియేండ్ల బాలికలకు వివాహముచేసి పదమూడు సంవత్సరముల లోపలనే, సంసారకూపమున పడద్రోయుచున్నాము. మనవారికి విద్యాభ్యాసమా యసలేలేదు. వారు పదమూడుఏండ్ల బాలికలైనను అతిచాకచక్యముతో సంసారమును చేయుదురు. ఆవయస్సుగల బాలకుని సంసారమును దిద్దమనిన వానికేమియు చేతగాదు. దీనివలన స్త్రీలు స్వాభావికముగ పురుషులకంటె తెలివిగలవారని తెల్లమగుచున్నది. సాధారణముగా తల్లిదండ్రులు బాలకులనుచూచునట్లు, బాలికలనుచూడరు. ఒకతండ్రితనకుమార్తెను కుమారుని యొకేపాఠశాలలోనే విద్యనభ్యసింపజేయుచున్నాడనుకొందము. వారిలో కుమార్తెవిద్యపూర్తిగాక పూర్వమే యామెకు వివాహ మొనరించును. బాలకుడన్నో చదివియేతీరవలెను. కావున వారుచదువుచునే యుందురు. దీనినిగ్రహించి బాలికలు తాముచదువు కొద్దిచదువును అతిశ్రద్ధతో పట్టుదలతో చదువుదురు. కావుననే స్త్రీకళాశాలలలో పరీక్షాఫలితములు పురుషులకళాశాలకంటెను యెక్కువగనుండును. దీనివలన స్త్రీలు పురుషులకంటె యెక్కువ పట్టుదలకలవారని తెలియుచున్నది.



శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

*  *  *  *  *

మన స్వాభావికములోని జంతుజాలములోని స్త్రీపురుషజాతిని చూచిన స్వాభావికముగ రెండింటికి యంతభేదము లేదని తెలియుచున్నది. ఇప్పుడు మనమొక యేనిన ఆవునుకాని పులినికాని చూచిన

వానికి నప్పుడుండు భీకరరూపము, రౌద్రమును పురుషజాతి మృగములకుండవు. స్వాభావికముగ వాటికి విచక్షణ జ్ఞానముండదు. మృగజాతికి సంసారమనియు, పిల్లలనియు వానికి ప్రేమలేదు. కావున స్త్రీమృగమే యీ పిల్లలు పెద్దవగువరకు వాటిని కాపాడి వదలివేయుచున్నది. మనుష్యజాతికిని మృగజాతికిని ఉండు భేదము విచక్షణ జ్ఞానమే! మనకు విచక్షణజ్ఞానము, ప్రేమయునుండుటవలన మనకు స్వాభావికమగు బలహీనము కలిగి నప్పుడు పురుషులు పోషించుచుండిరి. అదేయలవాటుగ స్త్రీగృహపరిశ్రమలయందు పాల్గొనుటయు, పురుషుడు యితర పరిశ్రమలయందు పాల్గొనుటయు నారంభమయ్యెను. అప్పటినుండియు మెల్ల మెల్లగా స్త్రీపురుషునికి లోనై యిప్పటి పరిస్థితులలోనికి వచ్చెను.

* * * * *

ఒక కుటుంబమునకు యశము రావలయుననిన యది స్త్రీమూలముననే వచ్చును. స్త్రీస్వభావమును బట్టి స్త్రీకి తగునట్టి పనులనే ఆమె చేయుచున్నది. వారి పరిశ్రమలు యేమాత్రము పురుషుల పరిశ్రమలకు తీసిపోవు. సంఘము, శాస్త్రములు, స్త్రీయొక్క సుకుమారమును యోర్పును వీటినిబట్టి యామెకు సంసారభాద్యత యెక్కువ కలిగినది. వారిపాలిటి పనులే యెక్కువ కష్టతరములైనవి. స్త్రీలే రాబోవుతరములను సృష్టించు వారు. ఎడ్వర్డ్ కార్పెంటరు (Edward Carpenter) యొక గ్రంథమందు " It is woman that maketh man " అని వ్రాసియున్నారు. సంఘము పురుషునియొక్క శరీరపుష్టిని చూచి వానికి శరీరకృషిచేసి ధనము నార్జించుట, సంసారమును పోషించుట మొదలగు భాద్యత మీద పెట్టెను. అయినను ఇప్పుడు కూలినాలి చేయు స్త్రీలు సుకుమారముగా నున్నారా? వారు పొట్టకూటికొఱకు పురుషులతో సమానముగ యెండయనక గాలియనక కృషిచేసెదరు. దీనివలన స్త్రీలుకూడ పురుషులవలె నన్నిపరిశ్రమలయందును వారికి సరియగు యవకాశములు కల్పించిన పురుషులతో సమానముగా నుందురని తెల్లమగు చున్నది.

పూర్వము జనకమహారాజు కుమార్తెయగు సీతాదేవి లేప్రాయంబున బంతితో ఆడుకొనుచుండెను. ఆబంతి యాటలో వెళ్లి శివచాపము దగ్గరపడెను. అప్పుడు, ఆమె యాచాపమును అవలీలగ తీసి యవతలనిడి, యాబంతిని తీసుకొనెను. అప్పుడు జనకమహారాజు ఆమె బలమునకు అచ్చెరువొంది యాచాపమును ఏరాజకుమారుడు యెత్తివిఱువగలడో వానికి సీతనిచ్చి వివాహమొనర్చెదనని చాటించెను. ఎందఱో రాజులు వచ్చి యాచాపమును యెత్తలేకయే మూర్ఛజెందిరి. తుదకు శ్రీరామచంద్రుడు వచ్చి శివుని విల్లు విఱిచి సీతను వివాహమాడెను. దీనివలన సీతాదేవి యోడిపోయిన యితరరాజకుమారులకంటెను బలము కలదని తెల్లమగుచున్నది. మనకాలములో తారాబాయి శాండోయొకతెయని చెప్పవచ్చును. ఈమె రామమూర్తిశాండో, కోడె రామమూర్తి వీరితో సమానముగ తన శరీరబలమును ప్రదర్శించినది. ఈమధ్య పాశ్చాత్యదేశములో జరిగిన కాలువ యీదులాట (Channel swimming) లో మొదటి బహుమానము పడసినది స్త్రీయే!

* * * * *

పురుషులు ధనము నార్జించిన దానిని సరియగు మార్గమున వ్యయముచేసి వాని సంసారమునకు శోభ తెచ్చునది స్త్రీయే! పురుషునియొక్క కీర్తికిని గౌరవమునకును గృహయాజమాన్యమునకు స్త్రీముఖ్యావసరము. ప్రతి విషయమునందును పురుషునకు స్త్రీసహాయముండిన యెట్టికష్టతరమైన పనులైనను సులభసాధ్యములగును. రష్యనుగ్రంథకర్తయు, రాజకీయ తత్వజ్ఞుడునుయగు కౌంటులియో టాల్‌స్టాయి (Count Leo Tolstoy) గారు ప్రాచీన స్త్రీలను గుఱించి యిట్లు వ్రాయుచున్నారు.

"A married woman has to work for her husband, from her youth to very old age; his demands on her, are the oriental ones of submission and labour. In consequence of this out-look women are strongly developed both physically and mentally; and though they are, as everywhere in the east, nominally in subjection they possess far greater influence and importance in family life than western women. The exclusion from humble life and inurement to heavy male labour give the women, all the more power and importance in the house hold." Count Leo Tolstoy's—Cossacks—page 24.

* * * * *

కాబట్టి యివి యన్నియు జూచిన యెడల స్త్రీలబలలు కారనియు, వారికి సరియగు నవకాశములు కల్పించిన పురుషులతో సమానులు కాఁగలరనియు విదితమగు చున్నది.

## ౭

## శ్రీమతి ఆచంట సత్యవతమ్మ గారు

సనాతనధర్మ మదికాదు. స్త్రీజాతి నబలలని తలఁచుటయే వారిధర్మమైన "అర్ధాంగి" అన్న పేరామె కెట్లువచ్చినది? పురుషుఁడే బలశాలియై స్త్రీఅబలయగుచో అర్ధాంగమబలముగను మిగిలినసగమును బలముగను యెట్లుండును?

* * * * *




శ్రీమతి ఆచంట సత్యవతమ్మ గారు

పార్వతిసతిగా ఉన్నంతవరకే స్త్రీ మార్దవరూపిణి కాని కాత్యాయనియై లోకకంటకులగు రాక్షసుల సంపాదించినప్పుడు అబలయేనా? ఏవీరుఁడును వ్రేలుతోనైన తాకలేని శివచాపము నవలీలవిరచి ఖ్యాతినొందిన శ్రీరామచంద్రుని సతీతిలకమగు సీత చిన్ననాటనే యాటలాడుకొను నవసరమున నామహాకోదండము నిటు నటు యెత్తి జరిపినట్లు పురాణగాధలందుఁ గలదు.

* * *

పురుషుఁడొక్క బయటనే పనిచేసి ధనముగడించి తెచ్చును కాని స్త్రీ చాలకార్యములు చేయవలసియున్నది. భర్త తెచ్చిన ధనమును తగురీతి యుక్తముగావెచ్చించి గణితశాస్త్రజ్ఞానమెరిగి భర్తకు ఖర్చువెచ్చములప్పగింపవలెను. పాకశాస్త్రమెరిగి శుచిరుచులతో వంటకము లొనరింపవలయును. శిశుపోషణనెరిగి కని సంతానమును ఆరోగ్యవంతులుగాను, దేశోపకారులుగను, సుగుణవంతులుగను తయారుఁజేయవలెను. పెద్దల నాదరింపవలెను. బంధువుల మర్యాదచేయవలెను. భర్తకుకీర్తి దేవలయును. ఇట్టి సమస్తకార్యనిర్వహణదక్షురాలగు స్త్రీని యబలయన చెల్లునా?

*   *   *   *

జ్ఞానోపేతులగు మానవజాతినివదలి తక్కిన ఉద్భిజ్జ, స్వేదజ, అండజ, జరాయుజములలో (మృగజాతి)ని అనుసరింతము. వృక్షజాతిలో ఫలపుష్పజాతి స్త్రీజాతియగును. ఆడతాడి పండ్లిచ్చును. మగబొబ్బాస యెందులకును బనికిరాదు. ఏతోటకైనను, ఏయింటికైనను ఫలపుష్పవృక్షములే యుపయోగకరములు, గౌరవస్థానమునుఁ బొందును. జంతుజాతిలో మగజాతి స్త్రీజాతిని గౌరవముగాఁజూచుచు వేటకానిపరము కానీయకరక్షించును. అనగా ఆ స్త్రీజాతి స్వప్రాణరక్షణము చేసికొనలేదని యర్థముకాదు. పురుషుడుండగా స్త్రీ ఆయాసపడుట పురుషజంతువులకు చిన్నతనము. పక్షజాతులుకూడనిట్లే. సృష్టిరహస్యమే యిట్టిస్వభావము. ఇట్టివ్యత్యాసములో నీచమెందున్నది?

సమస్తజీవులను పావనులఁజేయజాలిన గంగ, గౌతమి, సింధు, నర్మద, కృష్ణవేణి, కావేరి, తపతి, తుంగభద్ర, యమున మొదలగు విమలతోయములను పురాణములందు "స్త్రీ" నామకారిణులగనే వర్ణించియున్నారు. సౌందర్యదేవత స్త్రీయందే మూర్తీభవించియున్నది. స్త్రీప్రకృతిలో యనేక మహాద్భుతశక్తులిమిడియున్నవి.

నిజముగా స్త్రీలబలలుకారు. కాని పుట్టలోపెట్టిన మణివలె వారిప్రాభత్వము వారు ప్రకటించుకొనరు. ఒదిగి వినయముగా నుండుట వారిస్వభావము. గర్వముగా మేమేసబలులమని విఱ్ఱవీగుట ప్రాభత్వమునకొకలోపము. నిగురుఁగప్పిన నిప్పువలె తమతమ శక్తులనణచి, సమయమువచ్చినపుడు ప్రకాశించునదే నిజమైన పురుషత్వము. అట్టిదే స్త్రీలకుండును. పైకికనబడనంత మాత్రమున, స్త్రీఅబలయగునా? కాదు. బాహ్యప్రకృతికి స్త్రీఅబలవలెఁ దోచినను ఆత్మకట్టి భేదములులేవు. ఆత్మముఖ్యముకాని శరీరము ముఖ్యముకాదు. మానసికవృత్తిచే స్త్రీఅబలకాదు. సకలవిద్యలకెల్లను తల్లియగు సరస్వతి స్త్రీయైయుండగను, సమస్తసిరులకాకరంబగు ఆదిలక్ష్మి స్త్రీయనగను, సర్వలయకారిణియగు, కాళిశక్తి స్త్రీయైయుండగను, సర్వచరాచరజంగమస్థావరరూపప్రపంచోత్పత్తిదేవతయగు ప్రకృతి స్త్రీయైయుండగ నిఁక స్త్రీని అబలఅనగరాదు కదా?

# గోదావరి

శ్రీమతి టి. పుండరీక విరళ్ అమ్మాళ్ గారు

ధవునిఁబాసి విరాళికిఁ దాళలేక
హత్తి తాము దుర్వారవిపత్తినయిన
సైఁచి పతుల సమీపింత్రు సతులు జగతి
ఎచటనో సహ్యగిరుల జనించినాఁపె
రమ్యగోదావరీసరిద్రమణి వినరె
అడ్డువచ్చు కాంతారధరాధరముల
నిట్టెదాఁట నుపాయమూహింపవలసె
నప్పుడాత్మీయభర్త రత్నాకరుఁడని
యతనికలుషంబు నెంచక అమలవారి
పూరమగు తనరూపు విస్తారపఱచి
దూరమెంచక దుర్గమదుర్గపంక్తు
లెన్నిటినోదాఁటి వర్ధిల్లె నెంతొక్రి
వడసె వంగోపసాగర ప్రాంతభూమి
నొదిగె యాఁగోడవనము సమృద్ధిపఱచె.

# మడిబట్ట

## తడిబట్ట

ఆరవేసిన మడిబట్టతో మడిపనులు తప్ప ఇతరములగు ఇంటిపనులు చేయరాదు. కావునతడిబట్ట ధరించి ఇంటిపనులు, మడిపనులు ఒకచేతిమీదుగా చక్కబెట్టుదురు. తడి మడిబట్టలు కట్టుకొనునప్పుడు వానిని పిండనైనపిండరు. నీరు పూర్తిగ పోవునట్లు పిండినచో తడిబట్ట పోగుఆరి సర్వోత్రమగుమడికి పనికిరాదని వారిభయము. మగవారు ధరించు ఇట్టి బట్టకు 'కొల్లాయిగుడ్డ' అను పేటెంటు నామము వాడబడుచున్నది. సంధ్యావందనము చేయునపుడును, భోజనము చేయునపుడును ఈ కొల్లాయిగుడ్డ ఆచారపరులకు పాయరాని స్నేహితుడై ఉండుచున్నది. ప్రత్యేకము పురుషులకై పేటెంటు అయిఉన్న ఈ కొల్లాయి గుడ్డ అప్పుడప్పుడు స్త్రీలుగూడ మారు కట్టుకొనుటగలదు. ఆరోగ్యము పెంపొందించు టకు ఆదిని ఉద్దేశింపబడిన ఆచారము లిట్లు తడిగుడ్డలు ధరించుటలోనికి దిగి పదిరోగ ములపెట్టు అగు పడిశమును తెచ్చిపెట్టుచున్నది. అది చేయు హాని తెలిసియు తడి బట్ట కట్టుట మాననేరని మహనీయుల నేమనవలయునో తెలియకున్నది.

## పట్టుబట్ట

నూలుబట్టమడికంటె పట్టుబట్టమడి గౌరవమైనదని తలంచుచున్నారు. పట్టు యొక్క యుత్పత్తితెలిసినవారు మడికి నూలుకంటె పట్టు శ్రేష్ఠమైనదని తలంపరు. పట్టు పురుగులను చంపినగాని పట్టురానేరదు. అహింసాపరులు నూలువస్త్రమునే యెక్కువగ ప్రేమింతురు. పట్టువస్త్రముకు మడిగౌరవము మొదట యెట్లుకలిగినదో తెలియదుగాని ఆచారమందు అనాదిగనున్నది. వీటిలో రెండువిధములు పట్టువస్త్రములు—నారపట్టు, అసలుపట్టు. పట్టువస్త్రములను పురుగులను చంపి తయారు చేయుదురు. నారమడి పట్టుపంచలను గోగు, జనుము, అరటి, బలురక్కసి మొదలగు చెట్ల నారలనుండి తయారుచేయుచున్నారు.

నూలువస్త్రములకంటె నారవస్త్రములు గట్టిగనుండునుగాని పట్టువస్త్రములంతి మృదువుగను గట్టిగను ఉండవు. నూలువస్త్రము, నారవస్త్రము రెండును చెట్లకు సంబంధించి నవే. పట్టువస్త్రముమాత్రము పురుగులకు సంబంధించినది. కనుక నూలు గుడ్డకంటె పట్టు, నారగుడ్డలకు హెచ్చు పవిత్రత యెట్లుగలిగినదో తెలియకయున్నది. మడిబట్ట విషయములో మనవారు నారకు పట్టుకుగల భేదమును పాటించుటలేదు. ఈ రెండును యొకటిగానే భావించుచున్నారు. కలకత్తా నారమడిబట్టకును, బరంపురం పట్టుపంచలకును గల భేదమును మడినిపాటించువారు తెలుసుకొనుట మంచిది.

ఈరెండు విధములైన పట్టుబట్టలకు పూర్వాచారపరాయణులు ఒక అధికార పత్రమును (License) ప్రసాదించియున్నారు. ఈ బట్టలను కట్టుకొని భోజనముచేయకుండిన యెంతకాలమైనను యివి మడిగనే యుండును. సంధ్యావందనాదివైదికకార్యములు తీరినపిమ్మట పట్టుమడిబట్టను మడిచి సంచిలో మూటకట్టి వంకెకు తగిలింతురు. ఈవిధముగ బట్ట జీర్ణించి పోవువరకు వాడుకొనుచుందురు. ఇదియెంత చిన్నదైనను చాలును. పట్టుబట్టవెల అధికమగుటచే యింటిల్లపాదియు ఒకేపట్టుబట్ట స్త్రీపురుషులు వాడుచుందురు. తునకలైనపిమ్మట వెంకటేశ్వర్ల ముడుపులకు ఉపయోగింతురు.

### ధా వ ళి

ధావళి యను మడిబట్ట ముందుచెప్పిన బట్టలకంటె అతిపవిత్రమైనదని తలంతురు. దీనిని చచ్చిన గొర్రె, మేక మొదలగు జంతువుల వెంట్రుకలతో తయారుచేయుదురు. ధావళిని తడిపి ఆరవేయుటకంటె కచ్చుబట్టి ఒకతూరి విదిలించిన మాత్రముననే దాని యందుండు మలినముపోయి శుచికాగలదని పూర్వాచారపరాయణులు గట్టిగ వాదింతురు. దీనివైశాల్యము కొల్లాయిగుడ్డంత యుండును. బట్ట గరుకుగ నుండును. చర్మవ్యాధులుగల వైదికుల దురదలనుమాన్పుటకు మంచిమందు ధావళిబట్ట. ప్రతిదినము వాడకుండిన చిమటలుపట్టి చిల్లులు పడునని తలంచి ప్రతిదినము తప్పక వాడుచుందురు. ఇట్టి బొచ్చుబట్ట క్రిమికీటకాదులను శరీరమునుండి వెడలుమలినములను దాచియుంచుటకు అనుకూలమైనది. కనుకనే ద్రావకములు పడియగట్టుటకు గంబళిబట్ట శ్రేష్టముగ వాడెదరు! కాఫి డికాక్షన్ నిర్మలముగ నుండుటకు యీగుడ్డతోనే వడియబోసెదరు!

పూర్వాచారపరాయణులు ఆంతర్యము గోల్పోయిన ఇట్టివింతఆచారములను పట్టుకొని ఇంకను ఎంతకాలము ప్రాకులాడుదురో?

## అంపకము

చెలికాని సత్యనారాయణగారు

కండ్లనులుముచుకన్నీరు కాల్వగాగ
వెక్కి వెక్కి యేడ్చెదవేమి? వెట్టితల్లి!
నాన్నగారిని తమ్ముని నిన్నుఁజూడ
తరచుగాబంపుచుందును తప్పకుండ
పండుగకు నిన్నుయెట్లైన బట్టుపట్టి
త్రోడుకొనివత్తు నిజము నీతోడుసుమ్ము.

అశుభమగు కార్యమునుజేయకమ్మ! నీవు
తరుణికత్తవారిలెశాశ్వతముకదమ్మ!
అత్తమామలయాజ్ఞకు నణఁగియుండి
ఆడుపడుచులతోడ సఖ్యంబుగలిగి
పతిని నిత్యంబుసేవించి భక్తితోడ
వరలుచుండుము నీకుశుభంబుగల్గు.




# కాలినగాయము, వేణ్ణీళ్లబొబ్బ

డాక్టరు యస్. శేషగిరిరావుగారు L.I.M.

కాలినగాయము, వేణ్ణీళ్లబొబ్బ సాధారణముగ సంభవించు ప్రమాదములు. ఆ కారణమున మనము యీ అపాయములకు తగుచికిత్స తెలిసికొనియుండుట అత్యావసరము. ఈ ఆకస్మికముల చికిత్స సులభసాధ్యము కాదని మొదట తెలుసుకొనవలయును. ఏలన బలమైన వాటియందు విశేషచికిత్స చేయవలసిన అవసరములు కలుగుచుండును.

అయితే కొన్నిసూచనలు సహాయముగ నుండును. కాలుటయందు చర్మము ఎరుపగుటకలదు. గాయము తీవ్రమైన క్రిందనుండు రక్తవాహికలు, నరములు, కండరములు వీటికి చెరుపుకలుగుటకలదు. ఈ చెరుపు జాస్తి కల్గుసమయమున మానునపుడు విశేషమగు నొప్పి నిశ్చయముగనుండును. మచ్చలుకల్గును. చిన్నవియగు కాలిన గాయములవలన స్వల్పమైన నొప్పిబాధయే తప్ప యితరఅపాయములేదు. తీవ్రమైనవి అయినచో ప్రాణాపాయమగును. ముఖ్యమైన అపాయములు అఘాతము (అనగా అదురు, యిది తరచు ప్రమాదమును అనుసరించును.) వ్రణముమానునప్పుడు వివిధకారణములచే దుష్టమగుట. కాలినపిదప సంభవించు మరణములందు యీపై రెంటిలో ఏదో యొకటి కారణమైయుండును.

చికిత్స బోధించుటకు అనుకూలముగ నుండుటకై యీఆకస్మికములను మూడు తరగతులుగ విభజించుకొనిన మంచిది.

1. ఎఱుపుమాత్రము కల్గుట.
2. పొక్కు ఎక్కుట.
3. చర్మము, దానిక్రిందనుండు వాటికి చెరుపుకలుగుట.

ఈ మూడువిధములైన ప్రమాదములందును ప్రథమమున గమనింపవలసిన జాగ్రత్తలను కొన్నిముందు వివరించెదను. మండుచున్న వసనములతోయుండు వానిని మాచుట ఎప్పుడైన సంభవించెనేని వెంటనే మంటలు పైకెగయునట్లు వానిని పరుండచేసి పెద్దగొంగళికాని, కోటుగాని శరీరమునకు చుట్టి అతిత్వరితముగ మంటలను అణచివేయునది. ఇది తెలియనివారు ఆకస్మికముగా పుట్టినదిగులుచే బయటను, గాలియందును పరుగెత్తి మంటను మఱింతపెంచి ప్రాణములు కోల్పోవుటకలుగుచున్నది. ఈ ఆకస్మికములకు వెంటనే చికిత్సచేయుట అవసరము. అయితే తొందరపడి ఆలోచించక పిదప కష్టమును కలుగుచేయు ప్రక్రియలను చేయుటయు తప్పు. తప్పుచికిత్సచే వ్రణము దుష్టమగుటయు, అదిమానుట కష్టమగుటయు సంభవించకలదు.

బొబ్బలెక్కిన ప్రదేశములకు గాలి తగులకుండునట్లు చూడవలయును. దీనికై గాయముగల ప్రదేశములపై బోరిక్ ఆసిడ్ (Boricacid), బైకార్బనేటు ఆఫ్‌సోడా (Bicarbonate of soda) పిండి, పాలగుండ (Arrow root) చల్లనగును. అయితే వీటియందు కొన్నిటియుపయోగము పిదప శుభ్రపరచుటయందు కష్టమును కలుగచేయుచున్నవి. మరియొకచికిత్స—ఆలివునూనె (Olive oil), కారన్ఆయిల్ (Carron oil), అవిశనూనె (Linseed oil) ఉపయోగించుట. లేక బోరిక్ గాని యూకలిప్టస్ ఆయింటుమెంటుగాని(Boric or Eucalyptus ointment) కోల్డ్ క్రీమ్ గాని (Cold cream) వేస్లైన్ గాని (Vaseline) మొదలగు లేపములనుపయోగపరచుట. నూనెవస్తువులు మెత్తనిదూది (Lint) పై బాగుగ ప్రసరించగలవు. ఈపై తెలుపబడిన చికిత్సలలో ఏదిచేసినను పైన దూది, ఊలు పెట్టి తేలికగా కట్టవలయును.

ఈపై చికిత్సకంటె వెంటనే కాలినభాగమును వేణ్ణీళ్లయందు (Warm Water)—బోరిక్ఆసిడ్ (Boric acid) కలిసియున్న నీరు అయిన విశేషము—యుంచిన చాలామంచిది. యిది నొప్పిని తగ్గించును. వ్రణము త్వరగామానునట్లుచేయును. విశేషముగ కాలియుండిన ప్రదేశమునకు చికిత్సచేయుటకు ముందు మనుష్యునికి చికిత్సచేయవలయును. మొండెముపై చేతికంటె వెడల్పుగ కాలిన ప్రాణాపాయము కలుగవచ్చును. ముఖ్యమైన అపాయము అదురు (Shock). దీనియందు యెప్పటివలె మనుజునితల క్రిందనుండునటుల పండుకొనబెట్టుట, వేడిమి ముఖ్యముగ కరములకు పాదములకు కలుగజేయుట, వేడిపానీయములు యిచ్చుట మొదలగు చికిత్సలను చేయవలయును. తీవ్రమైన అపాయములయందు వెంటనే డాక్టరును పిలిపించవలయును. ఈ ప్రమాదములయందు ప్రాణహాని (24 గంటలకు లోపల) కలుగుట ముఖ్యముగ అదురుపాటు వలననే.

అన్నివిధములయిన నిప్పుగాయములందు ముఖ్యముగ కరపాదములయందు కలిగిన ప్రమాదములయందు నీరు అత్యుపయోగకరమైనది. ఉపయోగములు రెండు–ఆరోగ్యమైన క్రొత్తభాగములు కలుగుటయందు సహాయమొనర్చుట, నొప్పిని విశేషముగ మాన్పుట; అయితే యీ చికిత్సయందు కాలినభాగములను మనుజుడు కొన్ని సమయములందు కొన్నిగంటలు మరికొన్ని సమయములయందు దినములు ఉంచవలసియుండును. ఈప్రక్రియ కరపాదములయందు ముఖ్యముగ ఉపయోగము. ప్రక్రియయు అనుసరించుట సులభము. మొండెమునకు ప్రమాదము సంభవించినను ఈప్రక్రియ మంచిదే. శరీరముయొక్క శీతోష్ణస్థితి యెట్లున్న నీరు అటులనే యుండవలెను (సాధారణమున 100 డిగ్రీలు ఫారన్‌హీట్ Fahrenheat). గాలనుకు $1\frac{1}{2}$ అవున్సు చొప్పున బోరిక్ ఆసిడ్ నీటియందు కలుపవలెను. కాలినప్రదేశమునే గాక శరీరము పూర్తిగ ఈ నీటియందున్నను యేమియు చెడుపులేదు. యిటుల చికిత్సచేసిన నిప్పుగాయములు అతిశీఘ్రముగ ఆశ్చర్యముగ మానును.

## ఎఱుపుమాత్రముకల్గు గాయములు

బోరిక్ఆసిడ్ లేక జింక్ఆక్సైడ్ (Zinc oxide) 1 భాగము, 3 భాగములు పిండి కలిపిన పవుడరుగాని (Starch) చల్లునది.

యూకలిప్టసు లేక బోరికు ఆయింటుమెంట్లు లేక 1 అవున్సులో 10 చుక్కలు కార్బోలిక్ ఆసిడ్ (Corbolic acid) కలిపిన వేస్లైన్ (Vaseline) ఉపయోగకరమైనవి. సన్నటి లింటు (Lint) పై వీటిని పూసి ఉపయోగపరిచిన చికిత్స చేయునపుడు ఒక భాగమును చూచి మరియొకభాగమునకు చికిత్స చేయుటకు వీలుండును. లేకున్న గాయమునంతయు మూయకయుండుట తటస్థించును. చూర్ణము నుపయోగించినను లేపము నుపయోగించినను మందుపై దూదినుంచి చక్కగ కట్టవలయును.

బైకార్బనేట్ ఆఫ్ సోడా (Bicarbonate of Soda) అన్ని విధములయిన కాల్పులయందు చాలా ఉపశమనము కలుగజేయుచున్నది. దీనిని కలిపిన వేడినీటియందు లింటును ముంచి ఉపయోగపరచనగును.

లింటుపై నూనెయందు తడపబడిన పట్టును వేయవలయును.

కారన్ ఆయిల్ (Carron oil)—ఆలివునూనె (Olive oil) లేక అవిశెనూనె (Linseed oil) సున్నమునీరు (Lime water) సమముగ కలిపి వాడుట—చిరకాలమునుండియు వచ్చుచున్న ముఖ్యమైన చికిత్స. ఈసమయమున నూనెలు, క్రొవ్వు ఉపయోగించనగును.

పిక్రిక్ ఆసిడ్ (Picric acid) కలిసిన ద్రావకము — ఏవిధమైన కాలినగాయములకైనను సాధారణముగ ఉపయోగింపబడు మందు. పిక్రిక్ ఆసిడ్ 1 డ్రాము (Picric acid) ఆల్కహాలు—1అవున్సు (Absolute alcohol) పైదానికి వడపోసిన నీరు (Distilled water) 16 అవున్సులు అగువరకు కల్పునది. దీనిని వాడుటచే చేతులకు మరకలగును గనుక ఉపయోగించుటకు ముందు వేస్లైన్ (Vaseline) చేతులకు పూసుకొనిన మంచిది. లోషన్‌యందు ముంచబడి పిండబడిన లింటుపై యీ పిక్రిక్ ఆసిడ్ ద్రావకము వేసి పుండును కుళ్లిపోనీయకుండు ఊర్ణము (Antiseptic wool) వేసి కట్టు కట్టునది. ఈకట్టును 2, 3 దినము లుంచి జాస్తిగ వేడిగనుండు లోషన్ వేసి తడిపి తీసివేసి తిరుగ కట్టునది. తిరుగ కట్టుట 2, 3 దినములవర కుండక త్వరత్వరగా అవకాశము తగ్గించుచూ కట్టునది.

## పొక్కు ఎక్కుట

రెండవవిధమగు గాయములు మొదటిదానికంటె తీవ్రమైనవి. బొబ్బయు కలుగుచున్నది. పిక్రిక్ ఆసిడ్ ద్రావకము యిక్కడ యుపయోగించనగును. యింక కారన్ ఆయిల్, యితర ఆయింటుమెంట్లు వాడనగును. ఆయింటుమెంట్లు వాడుటచే కట్టు గాయమునకు అంటుకొనదనియే కాని గాయమును శుభ్రముగ నుంచుటకు వీలుండదు.

పుండును కుళ్లకుండజేయు ద్రావకమునందు ఒక గంటవరకు ఉంచబడినది గాని, ఉడికించబడినదిగాని అయిన కత్తెరతో బొబ్బను క్రింద కత్తిరించుట మంచిది. బొబ్బలను కత్తిరించిన పిదప వ్రణము అతిశుభ్రముగ నుండునటుల చూచు టత్యవసరము.

## చర్మము, దానిక్రిందనుండి వానికి చెఱుపుకలుగుట

మూడవవిధమగు గాయములందు గుడ్డ తునకలు యితర వస్తువులు జాగ్రతగా వేడిగనుండు లైసాల్ ద్రావకము, (1% lysol)బోరిక్ లోషనతో కడిగి పిదప వేడినీళ్లతో కుదిలించి కడుగునది. పిమ్మట పిక్రిక్ ఆసిడ్ ద్రావకముగాని ఆయింటుమెంట్లలో ఏదైనగాని పైచెప్పినవిధముగనే వేయనగును. ఈవిధమగు గాయములను వైద్యుడు చూచుచుండుట అత్యవసరము.

గొంతుయందు వేన్నీళ్లబొబ్బ కల్గిన చాల అపాయము. ఏలన స్వరపేటిక (larynx) యందు నెత్తురు చాలకూడుట, వాపు కలుగుట తటస్థించి శ్వాసోచ్ఛ్వాసములకు అడ్డము కలుగవచ్చును. ఈ ప్రమాదము అప్పుడే పొయ్యిమీదనుంచి దించబడిన గిన్నెయందుండు ఉడుకునీళ్లు బిడ్డలు తెలియక త్రాగుటచే సంభవించుచున్నది. ఇటువంటి సమయములయందు ఫ్లానలు (Flannel)ను వేడినీళ్లయందుముంచితీసి పిండి గడ్డమునకు క్రింద గొంతుక ప్రక్కభాగముల యందుంచవలయును. చన్నీళ్లుకాని, లేక మంచుగడ్డకాని (Ice) కొంచెము కొంచెముగ ఇచ్చుచుండవలయును. మనిషికి చల్లగాలి తగలకుండునటుల చూడవలయును.

పుండు అంచుకట్టుకొని నూకలునూకలుగా ఏర్పడునపుడు వ్రణముమానుట శీఘ్రమగుటకు వత్తడములు (Hot fomentations)యివ్వనగును. తీవ్రమైన కాల్పులయందు అనాకారము ఏర్పడుట (మచ్చలవలన) సంభవించును. యిటువంటి సమయములయందు శస్త్రచికిత్స అవసరమైయుండును.

కాలినగాయములు, వేణ్నీళ్ల బొబ్బలు వీని చికిత్సల అన్నిటియందు బలకరమైన ఔషధసేవ, మంచి గాలి, పుష్టినిచ్చు ఆహారము, విశ్రాంతి, యుండుట అత్యవసరము,

# గుంటకలగర

గుంటకలగరయను చిన్నమూలిక ఆంధ్రులకు చిరపరిచితమైన వనౌషధీరత్నము. ఇది ప్రతిగ్రామమునందును సులభముగ లభించునది. ప్రతియింటి దొడ్లలోను తోటల లోను పెంచకనే మొలుచు చిన్నమొక్క. ఇది చెమ్మనేలలయందు కోమలముగ పెరుగును. మెట్టభూములలో పెరుగు మొక్క గిటకపారి పొట్టిగ నుండును. మాగాణి గట్లలోను నీటికయ్యలలోను పెరుగు మొక్క కోమలముగను పొడవుగను యుండును. మలబారు ప్రాంతములలోని గుంటకలగర గోగు మొక్క లంతపొడవుగ నెదుగుచున్నది. వాటినుండి ధారాళముగ స్వరసమును పిండవచ్చును. ఈస్వరసము నల్లని సిరావలె ఉండును. ఇందువలన మూలికయందు లోహపదార్థమున్నదని తెలియుచున్నది. గట్టి నల్లరంగు గుడ్డలకు అద్దునప్పుడెల్లను రంగాజీలు లోహమును వాడెదరు. పురాతనపద్ధతి ప్రకారము సిరాలను తయారుచేయుటలో లోహపుముక్కలు అవశ్యకము అనగా కరక్కాయ, ఉసిరిగవరుగు, అన్నబేది, ఇనపచీలలు యీ నాలుగు వస్తువులను నీటి యందు ఊరవేసిన నల్లనిసిరా కాగలదు. ఈసిరానే మనపూర్వీకులు వ్రాయుటకు వాడుకొనుచుండిరి. ఈఊటచేతనే చాయపనివారు (రంగాజీలు) తెల్లటి వస్త్రములకు నల్లటిఅంచులను కట్టుచుండెడివారు. ఉసిరిగపచ్చడి, కరకపచ్చడి తొక్కి జాడీలకు నింపిన మరునాడే పచ్చళ్లు నలుపుతిరిగిపోవుట మనస్త్రీలకు తెలిసినవిషయమే. కనుక కరకఉశిరిగలయందుకూడ లోహపదార్థమున్నదని తెలుసుకొనవలయును. అన్నబేది యందుకూడ (Sulphate of iron) లోహమున్నది.

కనుక లోహపదార్థముగనులయందేకాక గుంటకలగర, కరక, తాండ్ర, ఉసిరిక మొదలగు వనమూలికలయందుకూడ ఉన్నదని గ్రహింపవలయును.

తెల్లవెంట్రుకలను నలుపుచేయుటకు తయారుచేయు ప్రతివస్తువునందు లోహము కలియుచున్నది. కనుకనే ఆయుర్వేదవేత్తలుకూడ తెల్లవెంట్రుకలను నలుపుచేయుటకు గుంటకలగరాకు రసమునే పలుమారు తైలాదిప్రయోగములయందు చేర్చిరి. కంటి జబ్బులకు, కంటిరెప్పలు నలుపుతిరుగుటకు గుంటగలగరస్వరసముతో వత్తులను తయారు చేసి యండబెట్టి నూనెతో దీపమును వెలిగించి కాటుకను తయారుచేయు పద్ధతి స్త్రీలకు తెలియని విషయముకాదు.

కవీశ్వరులు కుంతలములను వర్ణించునప్పుడెల్లను తుమ్మెదరెక్కలనే ప్రధానమైన ఉపమానముగ తెచ్చెదరు. తుమ్మెదకు సంస్కృతమున భృంగమనిపేరు. గుంటకలగరకు

కూడ భృంగమని పేరుకలదు. కంటిజబ్బులకు, తలనొప్పులకు, వెంట్రుకలు నలుపు తిరుగుటకు తయారుచేయు భృంగామలక భృంగరాజాది తైలములలో ముఖ్యముగ చేరు స్వరసములు గుంటకలగరరసము, ఉసిరిగరసము.

పాండు, కామెల, నంజు మొదలగు రక్తహీనతవలన కలుగు జబ్బులకు లోహమాండూరములనే ఆయుర్వేదవైద్యులు వాడెదరు.

ఆంగ్లవైద్యులుకూడ లోహసంబంధములగు ఔషధములనే ఇచ్చుచున్నారు.

రోగములకు వాడు లోహమును తయారుచేయుటలో కొంత కష్టమున్నది. లోహచూర్ణమును తయారుచేసి భావనలు, శుద్ధులుచేసి పిమ్మట పుటములను వేయవలయును. చాల జాగ్రతగ తయారుచేసినగాని లోహసింధూరము తయారు కాజాలదు. తయారు చేసినపిమ్మట కొంతకాలమునకుగాని వాడుటకు ఉపయోగపడదు.

ఇట్టి లోహమునకు బదులు గుంటకలగరను ఉపయోగింపవచ్చును. ఇది సులభసాధ్యమైనది. కావలసినప్పుడెల్లను వాడుకొనవచ్చును. ఒకవేళ మోతాదు హెచ్చుతక్కువలైనను ప్రమాదము లేదు. గుంటగలగరను ఔషధమువలె గాకుండ కూరగను, పచ్చడిగను తయారుచేసి భుజింపవచ్చును. దీని పచ్చడి రుచికరముగనుండి అరోచకమును పోగొట్టును.

గుంటగలగరజాతిలో మూడు జాతు లున్నవి. తెల్లటిపూలజాతి యెల్లప్రదేశములయందును లభించును. పచ్చపూలజాతి అరుదుగ దొరకును. నల్లపూలజాతి లభించుట లేదు. బెంగాలునందు సంయుక్తపరగణాలయందు ఇది లభించునటుల తెలియుచున్నది.

నల్లపూలు పూయు గుంటగలగరకు గుణమహాత్మ్యము యెక్కువగ చెప్పెదరు. అరుదుగ లభించు వస్తువునందు మనవారికి నమ్మకము ప్రేమ యెక్కువగనుండును. పెరటిచెట్టు మందుకు పనికిరాదను సామెత. హెరాళముగ లభించు ఓషధియందు నమ్మకము తక్కువగ నుండును. ఇది ప్రపంచధర్మమేగాని గుణమునందు తెల్లపూల గుంటగలకర యేమాత్రము తీసిపోదు.

శరీరముమీద పచ్చ పొడిపించుకొనువాడుక హిందూదేశమునందేగాక ఇతర దేశములందుకూడ వాడుకలో ఉన్నది. ఈ పచ్చపొడుచుటకు మనదేశములో గుంటకలగర రసమునే వాడెదరు. ఈరంగు యెంతకాలమైనను శరీరమందు నిలచియుండును.

—మిగిలియున్నది.



### శవమును బయటికీడ్చి నక్కలు హత్యను బయలుపెట్టినవి:—

డైమండు హార్బరుచెంతనున్న అషురాలిగ్రామమున జరిగిన వృత్తాంతము. ఉషాబాల పదునాఱు వత్సరముల బాలిక. ఆమె భర్త ఖగేంద్రనాథపాలు. పాతికవత్సరముల వాడు. భార్యాభర్తలిరువురును రవరవలతోఁగూడిన కాపురము చేయుచుండిరి. ఉన్నట్టుండి ఒకనాడు ఉషాబాల ఊరియందెచ్చటను కానరాలేదు. పొరుగుననున్న ఉషాబాల చుట్టములు ఈవిషయమై ఖగేంద్రనాథపాలుని ప్రశ్నించిరి. ఆమె ఎటు పోయినదో ఏమైనదో నాకు తెలియదని ఆతడు చెప్పెను. మఱునాఁడుదయమున ఉప్పుకాలువలో పాటు సమయమునందు నక్కలు రొంపిలోనుండి ఒక శవముయొక్క రెండుపాదములను బయటికి లాగుచుండుట గ్రామమువారు చూచిరి. రొంపిలోఁగుదికట్టపాతి దానికి శవమున కట్టివేసి పూడ్చివేసినసంగతి ఎల్లరకు తెలియవచ్చెను. అది ఉషాబాల శవముగా పోల్చబడెను. ఖగేంద్రనాథపాలుని అచ్చటకు తీసికొనివచ్చిరి. ఆతనిని శవమును బయటకు లాగుమనిరి. లాగుచు ఆతడు జరిగినసంగతి నిట్లు చెప్పెను. "మొన్నసాయంత్రము ఏదియో సందర్భమున కోపమువచ్చి నేనామెను చెంపపై గట్టిగ కొట్టితిని. అందుతో ఆమె అసువులు బాసెను. భయపడి ఆమె శవమునిచ్చట ఈబురదలో పడవైచితిని." ఆలిపూరుపోలీసు వారువిచారించుచున్నారు.

### పునర్జీవితుండగుట:—

పంజాబునందలి లిల్లపూరు జిల్లాయందొకయూర మోతీ అనబడు మాదిగవాఁడు ఉండెను. ఆతఁడొకపరి తన పర్ణకుటీరమందుఁ జెప్పులు కుట్టుకొనుచుండ నాతనివెనుక నొక నల్లనిత్రాఁచు పడగవిప్పి ఆతనిని వ్రేటువేయ చూచుచుండె. అదికనిపెట్టి దాని నాపవలెనని నొక మూడుకాళ్లబల్ల నాతఁడెత్తెనో లేదో; తృటిలోనాభుజంగ మాతనిని కాలిపై గఱచి వెంటనే అదృశ్యమాయెను. అతఁడు బాధచే హా హా రవములు సల్పుచుండ నిరుగుపొరుగువారు విచ్చేసిరి. ఆతఁడు స్పృహదప్పి పడిపోయెను. కొంతవడికి మోతీ మరణించెనని దహనకృత్యములు నెఱవేర్ప ఆతనిశవమును దహనవాటికి గొంపోయిరి. వారాశవమును గొంపోవుచుండ నొక సంయమి విచ్చేసి జరిగినదంతయు పూసగ్రుచ్చినటుల వారలచే నెఱింగి వారలతో దూరముగ దాను వైచిన గీతచుట్టు బయట నిశ్శబ్దముగ గూరుచుండుడని చెప్పి, తాను శవమును గీతలోపలనుంచి నొకపాత్ర నిండ నీరుదెప్పించి ఆజలమును దనపైనను శవముపైనను జల్లి శవముచెంత నాశీనుఁడై మంత్రోచ్చారణము గడంగెను. కొంతవడి కొకనల్లనిత్రాచు విచ్చేసి మోతీ శవముచెంతకు పోయి శిరమునువాల్చి విషమును గ్రహించి యంతర్ధానమయ్యెను. అనంతరము కొన్ని నిముసములకు మోతీ నిద్రనుండి లేచినట్లు లేచెను. చచ్చిన వానిని మంత్రబలముచే బ్రతికించిన నాయతీశ్వరుఁడు యిప్పుడే ఏగుదెంతునని చెప్పి మటుమాయమయ్యెను. తదుపరి వెతకినను గాన్పించలేదు. మోతీ యిప్పటికిని సజీవుడైతనపని చేసుకొనుచున్నాఁడు. ఇదంతయు కన్నులార గాంచినవారుగూడ నిప్పటికిని ఉన్నారు.

—మరకాని పరాత్పరరావు.

# వనితాలోకము

శ్రీమతి రాయి సరస్వతి అమ్మాళ్ గారు:—



రాయి సరస్వతిఅమ్మాళ్

తమిళ దేశమున వలస నెలకొన్న ఆంధ్ర రమణీమణులలో నొకతె. ఆంధ్రభాషయందు మంచి ప్రవేశము గలదు. నేమంత పురమునకు సమీపముననున్న ఒడుగత్తూరు అను గ్రామమునందలి బాలికా పాఠశాలయందు ఉపాధ్యాయినిగా ఉన్నది. గృహలక్ష్మిలోని బాలవిజ్ఞానశాఖకు వ్యాసములువ్రాయ వాగ్దానము చేసియున్నది.

శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు:— ఈమె శ్రీయుత ఉన్నవలక్ష్మీనారాయణగారి సతీరత్నము. లక్ష్మీనారాయణగారు 1921—వ సంవత్సరమున చెఱసాలకు పంపబడిన పదపడి ఈమె వారిస్థానమాక్రమించి ఆంధ్రదేశమునందు బ్రహ్మాండమగు ప్రచారముగావించి అనంతరము శారదానికేతనము ప్రారంభించినది. పూనాలోని కార్వేగారి స్త్రీ విశ్వవిద్యాలయమునకు సరిపోల్పదగిన సంస్థను నెలకొల్పి నిర్వహించుచున్నది. ఈ జగమెరిగిన బ్రాహ్మణి ప్రస్తుతము గాంధిమహాత్ముల వారి ఆదేశానుసారమున లవణ సత్యాగ్రహమునకు పూనుకొని గుంటూరు మండలమునందలి స్త్రీ దళమునకు నాయకత్వము వహించియున్నది.



శ్రీమతిఉన్నవ లక్ష్మీబాయమ్మగారు

శ్రీమతి కాళంగి శేషమాంబగారు:—ఈమె వైశ్యయువతి. గుంటూరు నివాసిని.



శ్రీమతి కాళంగిశేషమాంబగారు

వైశ్యయువతులకు విజ్ఞానాభివృద్ధిని చేయు తలపున ఈమె 1926-వ సంవత్సరమున గుంటూరునందు వైశ్యయువతీవిద్యాలయమును స్థాపించి నిర్వహించుచున్నది. ఈ సుప్రసిద్ధ విద్యాలయమును గూర్చిన చిత్రములు నాలుగు ఈమాసము వేఱొకచో ముద్రించి యున్నారము. శ్రీమతి కాళంగి శేషమాంబగారు వనితాలోకమునకు చేయుచున్న సేవను గమనించి పెద్దాపురమునందు కూడిన వైశ్యయువజన మహాసభవారు "మహిళా సేవాధురీణ" అనుబిరుదమును బంగారుపతకమును ఇచ్చిగౌరవించినారు. ఈమె దేశమాత పిలుపునాలించి లవణసత్యాగ్రహమున చేరిపనిచేయుచున్నది.

శ్రీమతి సీతాబాయమ్మగారు:—మద్రాసునందలి ఆంధ్రమహానాయకులలో నొకరును మొక్కవోని దేశాభిమానులును నగు శ్రీయుత వి. యల్. శాస్త్రిగారి తనయ. ఈమె బాగుగ చదువుకొన్నది. యోగ వ్యాయామము సూర్యనమస్కారవ్యాయామమువీనియందు ఈమె శ్రద్ధతోకృషి చేయుచున్నది. సుప్రసిద్ధులగు బులుసు రామజోగరావుగారు ఈవ్యాయామములందు ఈమెకు ఆచార్యులు. ప్రక్కపటమున ఈమె సూర్యభగవానుని చూచుట కవకాశమున్న ప్రశాంత స్థలమునకుబోయి సూర్యనమస్కారము గావించుట చూపబడియున్నది. శ్రీయుత పేరేపి వేంకటసుబ్బయ్య (ఎం. ఏ; బి. ఇ. డి) గారికిచ్చి ఈయమకు గతమాసమున వివాహము గావించిరి.



శ్రీమతి సీతాబాయమ్మగారు



### ఆవు విమానములో ప్రయాణము సల్పుట:—

అమెరికా ఖండమునందు సెంటులూయినగరమున ద్యోయానమునకు సిద్ధముగనున్న విమానములోనికి ఆవు నొకదానిని ఎక్కించిరి. విమానము ఐదువేల అడుగుల ఎత్తునకు పోయెను. గంటకు నూటముప్పదియైదు మైళ్ల వేగముననప్రయాణము చేయుచుండెను. ఆసమయమున ఆవుని పాలు పితికిరి. విమానయానమున ఆయావు ఎట్టికంగారును పడలేదు.

### ఒకే కాన్పున నలుగురు బిడ్డలు:—

శ్రీకాకుళం తాలూకా లుకులాం గ్రామములో రౌతు రామమ్మ అను కాపుస్త్రీ ఈమధ్య నలుగురు (రెండు కవలలు)పిల్లలను ప్రసవించెను. నలుగురు సజీవులై యున్నారు. జనులందరు వెళ్లి ఈవింతను చూచుచున్నారు.

(కళింగ)

### ముప్పదిరెండువేల అడుగుల పైకిపోయిన వైమానికురాలు:—

ఎలినార్ స్మిత్తు అనుకన్య. ఆమె వయసు పదునెనిమిదేండ్లు. ఆమె గొప్ప వైమానికురాలు. ఈమధ్య ఆకన్య విమానములో ముప్పదిరెండువేల అడుగుల ఎత్తునకు పోయెను. ఇంతకుక్రితము మార్వెల్ క్రాసన్‌కన్య ఇరువదినాలుగువేల ఆరువందల అడుగుల ఎత్తునకు పోయెను. అప్పటికి అంతఎత్తునకు పోయిన వైమానికురాలు ఆమె ఒకతియే. ఇప్పుడు ఎలినార్‌స్మిత్తు అంతకంటె ఎక్కువ ఎత్తునకు పోయి అధికకీర్తిని సంపాదించినది. ముప్పదిరెండువేల అడుగుల ఎత్తునకుపోయినను స్మిత్తుకన్యకు తృప్తికల్గక ఇంకను పైకిపోవలెనని చూచినది. కాని అచ్చట ఊపిరి ఆడలేదు. అందుచేత అమె చటాలున ఇరువది ఏడువేల అడుగులలోనికి జారి ఆపాయము కలుగకుండ క్రిందకు దిగినది.

### తట్టమ్మవారు పోసినను పెళ్లి చేసితీరెను:—

నెల్లూరు సమీపమున నొక గ్రామములోని వక కుటుంబీకుడు శారదాశాసనభీతిచే తన కుమార్తె వివాహము నిర్ధారణచేసికొని యుండెను. పెండ్లికి ముందురోజు కుమార్తెకు తట్టమ్మవారు సంప్రాప్తమైనది. శాసనభీతిచే వివాహమును నిలుపజాలక అమ్మవారు పోశియుండినను బిడ్డకు వివాహము గావించెనని తెలియుచున్నది.

(స్వతంత్ర)

### 10 ఏండ్ల మౌనవ్రతము:—

ఇంగ్లండునం దొకస్త్రీ పది వత్సరములు మాటలాడకుండనుండెను. ఈమె పేరు ఆనీపియ్యార్సన్. మాటలాడుటకు అవసరమున్నపుడు కాగితముపై వ్రాయుచుండెడిది.. రోగపీడితయైనపుడుకూడ ఈమె తన

మనోభావమును వ్రాసియే తెలిపెను. ఈ మౌనవ్రతమునకు కారణము తన ప్రక్కయింటియందున్న ఒక యువతిపై నింద కల్పించుటచే ఆయువతి మరణించుటయట.

**హిందువులు ఇస్లాము మతమున జేరుట:—**

1911-వ సంవత్సరారంభమునుండి 1921-వ సంవత్సరాంతమువఱకు హిందూదేశమునందలి 1,12,000 మంది హిందువులు బుద్ధిపూర్వకముగ మహమ్మదీయ మతమును స్వీకరించిరి.

**ఒక్క నిమిషమునకు యుద్ధవ్యయము:—**

ప్రపంచములోని సర్వమహారాజ్యములవారును యుద్ధవ్యయమునకై నిమిషమునకు పదమూడువేల రూపాయలు ఖర్చుపెట్టుచున్నారని బ్రిటిషు విదేశ రాజ్యాంగమంత్రియగు స్నోడనుగారు చెప్పుచున్నారు.

**గాడిదె నను తన్నుట నక్కను తొక్కుటవలె శుభప్రదము:—**

అలహాబాదులో ఉన్నతజాతికి చెందిన యొకరింట నిటీవల జరిగియుండిన వివాహములో వింతయాచార మొకటి గనుగొనబడెను. విడిదిలో ద్వారమువద్ద గాడిద యొకటి గానవచ్చెను. వరుడు వధువుయింటికి బయలుదేరునపుడు గాడిద నొకవానిని తన్నినచో శుభము కలుగగలదను నమ్మకము కొందరికి గలదని తెలియుచున్నది.

**వధూవరులను ఒడిలో పెట్టుకొని ఊరేగించిరి:—**

శారదాచట్టమునకు వెలిచి అలహాబాదులో చేయబడిన ఒకానొక వివాహములో వధూవరులు కేవలము శిశువులేయైనందున వియ్యంకులును, వియ్యపురాండ్రును వారిని ఒడిలో కూర్చుండబెట్టుకొని ఊరేగింపు సాగించిరి. అవస్థ.

**కాలు ఇన్సూరు చేయుట:—**

విన్‌ఫ్రెడ్ కొనహాన్ అనుయువతి తనకాలును 45000 డాలర్లకు ఇన్సూరు చేయించెను. ఇప్పుడు ఆకాలుకు దెబ్బ తగులుటచే కంపెనినుండి ఆ మొత్తమును పొందినది.

**అమెరికాలో కోటీశ్వరులు:—**

1914 లో అమెరికా సంయుక్తరాష్ట్రములందు 7000 మంది కోటీశ్వరు లుండినారు. ఆసంఖ్యలు అద్దులేకుండా పెరిగిపోయి ఇప్పుడు 40000 మంది కోటీశ్వరులైయున్నారు.

**అమెరికాలో బాల్యవివాహములు:—**

బాల్యవివాహముల కాణాచియని భారతభూమిని ఆక్షేపించిన మిస్ మేయో దేశమగు అమెరికాలో 16 సంవత్సరములకు లోబడిన వయసుగల బాలభార్యలు మూడులక్షల ఏబదివేలమంది కలరు. ఆ దేశమున బాల్యవివాహములపై మోజు పెరుగుచునేయున్నది. తగ్గించవలయునని ప్రభుత్వమువారు తంటాలు పడుచున్నారు. పెన్సిలువేనియాలో 16 సంవత్సరములకు లోబడిన వయసుగల బాలికల వివాహములు నిషేధింపబడినవి.

**పత్రికలనిచ్చు యంత్రము:—**

మద్రాసు సెంట్రలుస్టేషను లో ప్లాటుఫారము టిక్కట్టు ఒక మెషినులో అణావేసి నొక్కిలాగినచో లభించుట చాలమంది చూచియుందురు. జర్మనీలో పత్రికలనిచ్చుటకు యంత్రము కనుగొనబడినది. పత్రిక యొక్క మూల్యము అందుపడవైచి మీటలాగినచో పత్రిక బయటకు వచ్చును.

# మొరాకో స్త్రీలు

మొరాకోదేశము ఆఫ్రికాఖండములోనిది. ఆఖండమున వాయవ్యదిశను అట్లాంటిక్కి, మెడిటరేనియను సముద్రముల నంటియున్నది. విస్తీర్ణము 231,5000 చతురపు మైళ్లు. జనభా 6,000,000 మంది. ఫ్రెంచి, స్పానిషు, అరెబిక్, బెర్బరుభాషలు మాట్లాడబడుచున్నవి.



చూపులకందని సౌందర్యము

ఇవి బయటికి వచ్చునప్పుడు మొరాకో స్త్రీలు సర్వసాధారణము గ ధ రిం చు దుస్తులు. మొరాకోదేశపు స్త్రీలు ఇజారులు తొడుగుదురు. పురుషులు పొట్టి గౌనుల ధరింతురు.

భూమి వ్యవసాయమునకు అనుకూలమైనది. బార్లీధాన్యపు వ్యవసాయము బహుళము. సెబాయి లోయలో వేలకొలది యకరములలో ద్రాక్ష కృషి చేయబడుచున్నది. గోధుమ, చిక్కుడు, అవిశె, మొక్కజొన్న ఇవి ఇతరములగు పంటలు. ఖర్జూరము, నారింజ, నిమ్మ మొదలగు ఫలవృక్షములు సమృద్ధిగ గలవు. పెక్కు గుఱ్ఱములు, పశువులు, గొఱ్ఱెలు, మేకలు, ఒంటెలు ఇవి ఆ దేశమునందలి పశుసంపద. రాగి, సీసము, కాటుకరాయి, గంధకము, వెండి, బంగారము, పెట్రోలియము ఇవి ఆ దేశమునందలి ఖనిజములలో పేర్కొనదగినవి.

మొరాకోదేశీయుల నాగరికత అతిప్రాచీనమైనది. అయితే ఆదేశమున వ్రాతమూలకమైన విద్య విశేషముగ లేదు. కావుననే చదువుకొన్నవారిలో పెక్కురు ఇతరులకొఱకు ఉత్తరములువ్రాసి జీవించుచున్నారు. మతము మహమ్మదీయమతము. బహుభార్యాత్వము ఆచారమే. స్త్రీలకు ఘోషాపద్ధతి నిర్బంధము. వివాహవిచ్ఛేదమునకు అనుమతి సులువుగ దొరుకును.

వేదాంతులవలె మొరాకోదేశమునందలి మహమ్మదీయులు స్త్రీలను సకలదోషములకు ప్రథమభూమి యని తలంచుచు వారిని పాయరానిఘోషాపద్ధతియందుంచుదురు. మొరాకోదేశమున ఎండలు మెండైనను స్త్రీలు బయటికి పోవలసినచో శరీరము ఆపాదమస్తకము బట్ట కప్పుకొని పోవలసినదే.

లోహపాత్రలకంటె మట్టిపాత్రల వినియోగము ఆ దేశమున హెచ్చు. మృణ్మయపాత్రలనిర్మాణమున మొరాకోదేశీయులు సిద్ధహస్తులు. కుండ లమ్ముబజారును ఒకపరి పరి

కించిన విదేశీయులు వాని పనితనమునకు పరమాశ్చర్యమును పొందకమానరు.

మొరాకో స్త్రీలు సౌందర్యవతులు. వారి ముఖములు ఆకర్షణీయముగ నుండును. ధనవంతులగు స్త్రీలు వారి సహజసౌందర్యమునకు పట్టుబట్టలు కట్టుటచేవన్నెగూర్చుకొందురు. ఆపట్టు బట్టలు సరిగె తీగెల బుటేదారిపను లతో జిల జిల లాడుచుండును.

ఏకరీతి జీవనము మూలమున గలిగిన విరసము, విసుగుదల వీనిచేకూడ నక్కడిదంపతులు ఒండొరులకు విడాకు లర్పించు కొనవచ్చును. ఈసందర్భము లలో భార్య వివాహకాలమున తన పుట్టింటినుండి తెచ్చిన సమస్తవస్తువు లను తిరిగి పొందుటకు హక్కుగలిగి యుండును. ఇంతకు మించి ఎట్టిపరిహార మును పొందుటకును ఆమెకు ఆశకాని అవకాశముగానిలేదు. ఇట్లుభర్తలచే విడువబడిన స్త్రీలందఱును రొట్టెవ్యాపారము చేయుదురు. ఇతరులీవృత్తి పొంతకు పోవరు.



గోడలసందున కుములు సౌందర్యము మేడయొక్క వరండాలోనుంచి బహిఃప్రపంచమును చూచి నను మేలిముసుగు వేసికొనవలసినదే.

సేవకురాండ్రగుస్త్రీల స్థితి ఆదేశమున మిక్కిలి దుర్భరముగా నున్నది. అట్టి వారిజీవితమున సుఖమగు ఒక్కనిమిషముగాని, అట్టివారి ముఖమున ఒక్క హాసరేఖగాని ఉండనేర వనినచో అతిశయోక్తిగాదు. ఉదయాస్తమయములు ఆమె కాయకష్టములతో అవశయగుచుండును. మొరాకోస్త్రీలు తమసౌందర్య రక్షణమున జాగ్రత చూపవలయును. ఏమన ఏమాత్రము మగనికి అసహ్యముకల్గినను ఆమె నాతడు వెంటనే వదలివేయును; కాబట్టి మొరాకోస్త్రీ తన సౌందర్యమును పెంపొందించుటకు కండ్లకు సురమా విడువక పెట్టుకొనును. కాలివ్రేళ్లకు, చేతివ్రేళ్లకు వెంటవెంట గోరింట పెట్టుకొనును. ఎంత అందముండినసేమి? వారు బహిఃప్రపంచమును చూచుటకే ఎంతమాత్రము అవకాశము లేదు. స్త్రీలుండు తావులకు సాధారణముగ కిటికిటీ లుండవు. అట్టి తావులలో వారు షష్టిఘడియలు ఉండవలెను. బయటికివత్తురా దట్టమైన ముసుగు వేసికొనితీరవలెను.



భారత నారీమణులకు:—

స్వరాజ్యసమరమున స్త్రీలు నిర్వహింపవలసిన కార్యభారమునుగూర్చి గాంధీ మహాత్ముడు తన 'యంగుఇండియా' పత్రికలో నిట్లు వ్రాయుచున్నాడు:—

"ఈ సత్యాగ్రహసాధుసమరములో జేరుటకై సోదరీమణుల నేకుల త్యాతురభావముతో నుండుట శుభసూచనము. దీని వలన నా కొక సత్యము గోచరించినది. లవణ శాసనోల్లంఘన మెంతయుత్సాహకారణ మైనను స్త్రీజనమును దీనికర్పించుట వరహా నిచ్చి పక్క గొన్నట్లు నిష్ఫలమైన బేరమగును. వారీ మందలో బడి మాయమగుదురు. వారు దాహము గొని యున్న త్యాగమహిమ యందు లేదు. ఈ యహింసాయుద్ధము నందు స్త్రీజనము పురుషుల కంటె నధికమైన త్యాగము గావింప వలసి యున్నారు. స్త్రీలు దుర్బలలనుట దుష్టము. అది పురుషుడు స్త్రీజాతికి చేసిన మహాపరాధము. వారి యుద్దేశమున బలమనగా ఆత్మశక్తియే యైనచో నందు స్త్రీలు పురుషుల కంటె నెన్నియో రెట్లు మించిపోగలరు. స్త్రీల కాత్మస్ఫురణ విశేషము. స్వార్థత్యాగశక్తి యధికము. శ్రద్ధా సహన శక్తు లెక్కువ. ధైర్యగుణమునకు వారు పెట్టినది పేరు. స్త్రీ లేనిదే పురుషునకు ప్రపంచములో స్థానమే లేదు. అహింసయే మన భావిస్థితికి మూలకందమయ్యే నేని స్త్రీలే మన కాధారము. నేననేక సంవత్సరముల నుండి యీ భావమును వితర్కించుకొనుచుంటిని. ఆశ్రమ స్త్రీజనము పురుషులతో బాటు మమ్ముగూడ గొనిపొండని కోరినప్పుడు స్త్రీలకు ఉప్పు శాసనముసుల్లంఘించుట కంటె మహత్తరమైన కర్తవ్యము కలదని నా యంతరాత్మకు తోచినది. 1921 లో పురుషులు కల్లంగడుల యొద్దను, విదేశ వస్త్రముల దుకాణముల కడను చేసిన పికెటింగు తలచిన దానికంటె నెక్కువగా ఫలించినను తుదకు హింస పాటమరించుట వలన నా ప్రయత్నము విఫల మయ్యె నని తోచుచున్నది. మరల నా విషయమున జయము లభింప వలయు నన్నచో పికెటింగు ప్రారంభింప వలయును. అది చివరవరకును శాంతముగ జరుపగల్గినచో ప్రజలలో నపూర్వమైన ప్రబోధము గలుగ గలదు. అది నిర్బంధము చేత నెన్నటికిని గాదు. మనస్సు మారునట్లు తఱిమి సంస్కరణము చేయింపవలయును. మనస్సు పరివర్తింప జేసి సంస్కారము చేయుటలో నాడువారిని మించిన వా రెవ్వరు? మద మత్తతలను గూర్చు మద్యములును, విదేశ వస్త్రములును చిట్టచివరకు శాసనము వలననే బహిష్కరింప బడ వలయును. కాని యాశాసనము ప్రజలలో నప్రతిహతమైన యాందోళనము పుట్టినగాని బయటికి రాదు. ఈ సంస్కారములు రెండును జాతి కత్యావశ్యకములు గావని యెవ్వరును చెప్పజాలరు. కల్లు, సారా, నల్లమందు మున్నగునవి తదభ్యాసుల ధర్మప్రవృత్తిని నాశనము

నొందించును. విదేశవస్త్రములు దేశమున కర్థనాశనము గల్గించి, లక్షల కొలది జనులకు చేయు నోరు నాడ కుండ జేయును. ఈ దురభ్యాసముల వలని దుష్ఫలితములను వారి కుటుంబము లనుభవించుచున్నవి. తద్వారా స్త్రీలకు వాని వలని ఇక్కట్టులు విశదము. త్రాగుబోతుల భార్యలా పిశాచము తమ కులగౌరవమును, ధన ధాన్యముల నే రీతిని పాడుపెట్టినదో యెఱుంగుదురు. ఒకప్పుడు చూడఁ జక్కనై యున్న వారి యిండ్లిప్పుడు దరిద్రదేవతా నిలయములైనవి. మన దేశపు పల్లెలలో లక్షల కొలది స్త్రీలు పనిపాటలు లేక నానాకష్టముల పాలగుచుండుట వారికి స్వానుభవమే. చరఖాసంఘములో పురుషులు పదివేల మందియే యుండ స్త్రీలు లక్షమంది యున్నారు. భారతదేశ స్త్రీజన మీ సంస్కరణములను జేపట్టి నిర్వహింతురు గాక! అప్పుడు జాతీయ స్వాతంత్ర్య సంపాదనమునకు బురుషుల కంటె వారే యెక్కువగ దోడ్పడిన వారగుదురు. అప్పుడు వారికి మున్నెన్నడు నెరుగని క్రొత్తశక్తి, నూతన విశ్వాసము లభింప గలదు. విదేశవస్త్రవ్యాపారులును, తద్వస్త్రధారులును, మద్య వ్యాపారులును తదభ్యాసులును, స్త్రీ జనముల ప్రార్థనమును వినినంతనే వారి మనస్సులు కఱుగక మానవు. ఏది యెట్లున్నను స్త్రీలు పూర్వోక్త చతుర్వర్గములపై దౌర్జన్యము చేసి రనిగాని, చేయ దలపెట్టిరని కాని యెవ్వరును చెప్పజాలరు. ఈ యాందోళనమును కేవలము స్త్రీలు ప్రత్యేకముగ ప్రారంభించి నిర్వహించుటలో రమ్యత యున్నది. వారు సాధ్యమైనంత వరకు అవసరమైనచో పురుషుల సహాయమును బొందవచ్చును. కాని పురుషులు స్త్రీల కనుచరులై మాత్రమే యుండవలయును. ఈ యాందోళనములో, చదువుకొనిన వారైనను గాక పోయినను, స్త్రీ లెల్లరును వేలకొలదిగ బాల్గొన వచ్చును. విదుషీమణుల కిందు బీదలతో సహానుభూతి భజించుట కవకాశము కలిగి, బీదల దర్మార్థములు నశింపకుండ దోడ్పడ వచ్చును. విదేశవస్త్ర బహిష్కార సమస్యను వారు పరిశీలించి చూచినచో కద్దరు ప్రచారము వలననే యది సాధ్యమగునని సులభముగ దెలిసికొనగలరు. భారత దేశీయులెల్లరికిని గావలసిన వస్త్రములను మిల్లులపై తయారుచేయుట ఇప్పటిలో సాధ్యము కాదని మిల్లు యజమానులే యంగీకరించెదరు. కద్దరు ప్రచారము వలననే దగిన పరిస్థితు లేర్పడినచో లక్షల కొలది గ్రామములలో కోట్లకొలది కుటీరములలో దానిని సృష్టి చేయగలము. స్త్రీ జన మెల్లరును తమ కవకాశ మున్న ప్రతి నిమేషమును చేనూలు సృష్టికై వినియోగించి కద్దరు ప్రచారమున కనుకూలమైన పరిస్థితుల నేర్పఱచు భాగ్యము బడయుదురు గాక! కద్దరు సమస్యలో దేశమునకు గావలసినంత చేనూలు వడుకుటయే ముఖ్యము. కడచిన పది దినముల ప్రస్థానములో పని తొందరచేత కద్దరునే యుపయోగించవలసిన వాడనై దానివలన నిదివర కెన్నడు నెఱుఁగని ప్రయోజనమున్నదని తెలిసికొంటిని. కద్దరు నిజముగ నద్భుత మగు సాధనము. నా సహచరు లెల్లరును కేవల మాడుకొను చున్నట్లుగా పని యేమియు నాపక, దినమునకు నాలుగు గజముల గుడ్డకు సరిపడిన 12 వ నెంబరు నూలును వడుక గల్గినారు. కద్దరు కంటె సులభసాధనము మఱి యేదియును లేదు. ఈ మద్యపాన నిషేధ, విదేశవస్త్ర బహిష్కరణముల ధర్మప్రాబల్యము మహత్తరమైనది. వాని రాజకీయ ఫలితము గూడ తక్కువది కాదు. మత్తుపదార్థముల నిషేధముతో భారతదేశ ప్రజలకు 24 కోట్ల రూపాయలాదాయమగును. విదేశవస్త్ర బహిష్కారము వలన 60 కోట్ల రూపాయలు మిగులును, ఇవి జయము నొందినచో ఉప్పుచట్టము రద్దయిన దానికంటె నెక్కువ లాభము. ఇట్టి ధనలాభమే కాక వీని ధర్మప్రవృత్తి యతిలోక మైనది. కాని యీ పికెటింగులో మా సాహసము, మా యుత్సాహము ప్రకటించుట కనువు గలుగదని నా సోదరీమణులు ప్రశ్నింతురేమో? వారు మనఃపూర్వకముగ నీ మహాప్రయత్నమున నిమగ్నులయ్యెదరేని కావలసినంత యుత్సాహావేశములకు దావుండ

గలదు. ఈ యాందోళనమును నిర్వహింపక పూర్వమే కారాగృహప్రవేశము గూడ లభింప వచ్చును. ఈ ప్రయత్నములో వారవమానములను దెబ్బలను గూడ సహింప వలసి వచ్చుననుట యసంభవము గాదు. అట్టి బాధావమానముల సహించుట సోదరీజనములకు గర్వకారణముగావలయును. భారతదేశ పుణ్యాంగనల కట్టి కష్టములు గల్గినచో వారి యభీష్టము సత్వరముగనే చేకూరగలదు. భారత నారీలోకము నా ప్రార్థనము నంగీకరించినచో వారు సత్వరులై కార్యరంగమున కవతరింప వలయును. సర్వభారత దేశము నీ యత్నమునకు సంసిద్ధముగ లేనిచో సాధ్యమైన రాష్ట్రములవారే దీనిని గైకొందురుగాక! ఇతర రాష్ట్రముల కదియే మార్గదర్శక మగును.”

(కృష్ణాపత్రిక).

## కళావంతుల మాన్యములు:—

శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావుగారు పైవిషయమునుగూర్చి ఇట్లు పలుకుచున్నారు:—

డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు వ్యభిచారమే వృత్తిగాగల కులముండరాదనియు, కళావంతుల దేవాలయ సర్వీసుమాన్యములు శేరీలుగా మార్చగానే, వీరి ఆడపిల్లలకు అతిసులువుగా వివాహము లగుటకు వీలుండుననియు, ఒక బిల్లును ప్రవేశపెట్టి, చట్టముగా మార్పించగలిగెను. దీనివలన దేవాలయములు వానిలోకి వచ్చు భక్తులు బాగుపడుదురనుట కెట్టి సందేహము లేదుగాని, మన ముత్తులక్ష్మిరెడ్డిగారి ఆశయము నెరవేరునని నాకు తోచదు. ఈ వర్ణములోని స్త్రీలకు విద్య బాగుగా నేర్పినగాని, వివాహములు కానేరవు. ప్రస్తుతమం దీకులములోని మగవాండ్ర సుగుణపుంజములు అందరికిని తెలిసినవిషయమే. వీరి సర్వీసుమాన్యములు, శేరీలుగా మార్చినయెడల, యివియన్నియు తప్పక శీఘ్రకాలములోనే అన్యాక్రాంతములై పోవును. మా బ్రాహ్మణులు అపాత్రదానములచేతను, వివాహాది ఖర్చులచేతను అగ్రహారముల నమ్ముకొని యిప్పుడు బిచ్చ మెత్తు యెత్తుచున్నారో, ఆవిధముగనేవీరు యీమాన్యములు తెగనమ్ముటయు, తిరిగి వ్యభిచారవృత్తిలో ప్రవేశించుటయు జరుగును. వీరిలో కొందరు వివాహములు చేసికొనగలిగినను, వానిని వీరి భర్తల ముద్దులవలననో, తన్నులవలననో అన్యాక్రాంతములచేసి తీరెదరు. విద్యాగంధములేని ఆడదాని చేతిలో ఆస్తి నిలుచునా? కాబట్టి ప్రవేశపెట్టగానే, వీరు తమ మగవారి చేతనయినను భజనలు కావించుచు యీ సెర్వీసుమాన్యములను స్థిరముగా కుటుంబములోనుండునట్లు చేయవలసిన దని సలహాయిచ్చినప్పటికి వీరిలో కొంతమంది మగవాండ్రును, శాసనసభ్యులును సాంఘికశాస్త్రజ్ఞానముగాని, దూరదృష్టిగాని లేక చట్టమును ప్యాసుచేయించుకొనిరి. ఇప్పుడైనను, తొందరపడి మాన్యములను శేరీలుగ మార్పించుకొనక యే మగవాండ్రచేతనైనను నౌకరీ చేయించుకొనుటకు ధర్మకర్తల నంగీకరించునట్లు చేయుడు. లేదా అట్టి మార్పును దేవాదాయచట్టములో చేర్పించుడు. వీరు తక్కినవర్ణములలోని వారివలెనే వివాహములు చేసికొని పవిత్రజీవనము చేయవలెననియే మాయందరి కోరిక. ఇకముందు వివాహములు జరుగుచున్నను, వీరు లలితకళలవలననే జీవింపవలసి యున్నది. వీరిలో మగవాండ్రు త్రికరణశుద్ధిగ తమస్త్రీల గౌరవమును కాపాడవలెనన్న వారేల దేవాలయములలో భజనల చేయుచు, సెర్వీసు మాన్యములవచ్చు అయివజును పెట్టి తమపిల్లలకు విద్యాబుద్ధులు నేర్పకూడదు? వీరి స్త్రీలు తమ స్వాతంత్ర్యమును పోగొట్టుకొన నక్కరలేదు. వీరు పతివ్రతలుగా నుండి దైవసేవ జరిగింప దలచినను, అంతకంటె యుత్కృష్టమైనసేవ మరి యెక్కడనుండును? కాబట్టి దున్నపోతు యీనినదని ఒకరనగానే, దూడను కట్టివేయుమని మరికొందరన్నట్లు అనాలోచితముగ ఈ సర్వీసుమాన్యములను శేరీల క్రింద మార్చుకొనవలదని నా ప్రార్థన.”

స్త్రీల వారసత్వములు:—

ప్రమోదూతసంవత్సరపు ఆంధ్రపత్రిక ఉగాదిసంచికయందు 'స్త్రీలకు నవీనచట్టములు, వాని ప్రయోజనము' అను శీర్షికగల శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి ప్రశస్త వ్యాసమున స్త్రీల వారసత్వపుహక్కు-చట్టమునుగూర్చి ఇట్లు ప్రస్తావింపబడినది:—

"ఇక రెండవచట్టము స్త్రీల వారసత్వములు. ఇది ఆర్థికసంబంధమైనది. ఇది యింకను చట్టము కాలేదు. కాని ఆందోళన ప్రారంభమైనది. త్వరలో నీ శాసనముగూడ స్త్రీలకు రాగలదు. మనదేశమున వారసత్వముల విషయమున స్త్రీలకు గలుగుచున్న యన్యాయ మింతయంతకాదు. మన హిందూ న్యాయవాదచట్టములందు తండ్రియాస్తియందుగాని, పెనిమిటియాస్తియందుగాని స్త్రీకి స్వకీయమైన హక్కు లేదు. ఇందువలన నెన్నియో కుటుంబములందు కడుపునబుట్టిన కుమార్తెయుండగా తండ్రయాస్తి నెవడో జ్ఞాతివాడు వచ్చి తన్నుకొనిపోవుటయు, భర్తృవియోగ దుఃఖముచే దేహమనఃక్లేశములపాలై యల్లాడుచున్న భార్య యుండగా నెవడో అంతపొంతలదాయాది న్యాయముగా విగతభర్తృకకు జెందవలసిన యాస్తికధికారియై యామెకు భరణ మొసగునంతటివాడగుటయు తఱచుగా సంభవించుచున్నది. స్త్రీలవిషయమున నింతకంటె దురన్యాయము వేఱొండులేదు. కాని హిందూస్త్రీలయెడ తమ మతసాంఘికనిర్బంధము లెంత కఠినములుగా నున్నవో ఆర్థికవిషయములుకూడ నంత నిర్దయాత్మకముగనే యున్నవి కాన శారదాచట్టమువలన విద్యాలాభము పొందిన స్త్రీలు ముమ్మొందుగా నీ విషయమై కృషిచేయనగును."

వీరబసవరాయ చౌదరి:—

ఈ కమ్మయువకుడు 20–3–30 తేదీని వితంతుకన్యను వివాహమాడుటలో చూపిన ధైర్యసాహసములను మార్చిమాసపు 'రెడ్డిరాణి' పత్రిక ఇట్లు ప్రశంసించుచున్నది:—

"దేశీయులకు తూర్పుగోదావరిజిల్లా కమ్మసంఘమునుండి ఒక వీరయువకుని పరిచయపరుపగలందులకు మే మత్యుత్సాహభరితుల మగుచున్నాము. వీరబసవరాయ చౌదరి రాయవరముగ్రామనివాసులగు మ. రా. శ్రీ. కంటిపూడి సుబ్బరాయచౌదరిగారి జ్యేష్ఠపుత్రుడు. వయస్సు రమారమి 21 ఏండ్లు. మొన్ననే బి. యే. పట్టమును పొందినాడు. తూర్పుగోదావరిజిల్లా కమ్మసోదరులలో ఆతడు సానలుదీరిన జాతిరత్నము. సాంసారికజీవితము నిట్లు ఉత్కృష్టాచరణముతో ప్రారంభించుకొనిన మా మిత్రుడు ధన్యుడు. వీరబసవరాయ చౌదరి వరించిన కమలాదేవి ఆతనికి అనురూపవతియై యున్నది. ఆమె పదుమైదేండ్ల బాలిక. విద్యావతి. రూపవతి. వినయవతి. ఆమెతండ్రి మ. రా. రా. శ్రీ గోగినేని సీతారామయ్య చౌదరిగారు కృష్ణాజిల్లా నూజవీడు తాలూకాలో గొప్ప సంపన్నగృహస్థు. ఆయన వివేకమహితులనుటకు ఈకార్యమే నిదర్శనము. కమలాదేవి తల్లిగారుగూడ కొమార్తె పునర్వివాహము నంగీకరించి, పరమోత్సాహముతో తత్కార్యము నప్రమత్తురాలై, పరమోదాత్తమైన స్త్రీత్వమునకు, పరమపవిత్రమైన మాతృత్వమునకు ఆదర్శరమణియగుట స్తుత్యముగానున్నది. వీరబసవరాయ చౌదరి నారీలోకముయొక్క ఆసందమయాశీస్సులవలన నవశక్తిభరితుడై యున్నాడు. మా ధన్యవాదములుగూడ నతని కందించుచు ఆతని భవిష్యజ్జీవితమును ప్రకాశమానముగా చేయుటకు ఈశ్వరుని ప్రార్థించుచున్నాము. ఈసందర్భమున ఏలూరు, తత్ప్రాంతముల కమ్మసంఘీయులు-స్త్రీపురుషులు చూపిన శ్రద్ధాసక్తులను ప్రశంసింపకుండనుండజాలము. చాలమంది కమ్మనారీమణులు ఈ వివాహమహోత్సవమున పాల్గొని కులమువారికి మార్గదర్శకులైనారు. ఇది కమ్మసంఘమున వికసించుచున్న విజ్ఞానమునకు పరమ

నిదర్శనము. కమ్మసంఘమున ఇట్లు కొనలుసాగుచున్న నూత్నసంచలనము ఆసంఘముయొక్క అచిరోన్నతికి చక్కని సూచనగానున్నది."

### అఖిల భారత మహిళా సభాదృశ్యము:—

డాక్టరు బి. సి. ఆలివరు అనువారు అఖిలభారత మహిళాసభనుగూర్చి తన అభిప్రాయమును 'ది నేషనల్ క్రిస్టియను కౌన్సిలు రెవ్యూ"లో ఇట్లు వ్రాయుచున్నారు:—

"హిందూదేశమున ఇరువదిఎనిమిది సంవత్సరములుగ నుండుచున్న నావంటివారు నికవింతదృశ్యములను చూచుటకు ఆశపడరు. కాని హిందూదేశమునందలి వివిధప్రాంతములనుండి తోడి స్త్రీలకు సేవచేయు ఆదర్శముతో వచ్చిన నూరులకొలది స్త్రీలను చూచినప్పుడు నాకుగలిగిన ఉద్రిక్తభావమును వివరింపలేను; విడమర్చనులేను. ఇవి సాంఘికవిభేదములు ప్రబలియున్నదినములు. హిందూమహమ్మదీయ విభేదము, అంతిమ వర్ణములకును ఉత్తమజాతులకును మధ్యస్పష్టముగ నున్నది; వివిధజాతులనడుమ విరోధభావము. ఇట్టిసమయములో స్త్రీలు ఎట్టి విరసభావమునులేక హిందువు, మహమ్మదీయులు, పార్శీవారలు, క్రిష్టియనులు, అంతిమకులమువారు, గొప్పకులమువారు, ధనవంతులు, పేదవారు మొదలగు తేడపాళము లెంచక సమావేశమై స్త్రీవిద్యాభివృద్ధి, స్త్రీసంఘోద్ధరణముచేయు తలంపుతో ఇష్టపడి సేవచేయ తీర్మానించుకొని ఫలముపొంద దీక్షవహించినారు. కొనియాడదగిన విషయముగదా!"

### వరియన్నము: దానిలోని కొరత:—

ఏప్రియలు 18-వ తేదీనాటి 'రైతుపత్రిక' యిట్లు ప్రచురించుచున్నది—

వరిబియ్యపు అన్నమే ప్రధానద్రవ్యముగా నుండునట్టి ఆహారములో మాంసకృత్తులు మిక్కిలి దుర్బలముగ నుండుటయే గాక చాల తక్కువగా గూడ నుండును. ఇది మొదటిలోపము. ఈకొరతను పూర్తిచేయుటకు 3½ ఔన్సుల పప్పు కందిపప్పు లేక పెసరపప్పును, విస్తారముగా కాయగూరలను తినుచుండవలెను. 5 అళాకుల వరిఅన్నమునకు 1 అళాకు పప్పువంతున తినదగును. 1½ పైంటులుగాని 1 పైంటు పెరుగుగాని ముఖ్యముగా నుండవలెను లేదా 4 ఔన్సుల మాంసమును గాని 2, 3 గ్రుడ్లనుగాని తినవలెను. వరిఅన్నములో కొవ్వులు అసలేయుండవు. ఇది రెండవలోపము. దీనిని పూర్తిచేయుటకు వెన్ననుగాని నెయ్యిగాని నూనెనుగాని విస్తారముగా వాడుచుండవలెను. వెన్నలో విటమినులుండును గాన అది చాలశ్రేష్ఠము. రెండవరకము నెయ్యి. మూడవరకము నూనె. వరిఅన్నములో లవణములు గూడ చాల తక్కువగానే యుండును. ఇది మూడవ లోపము. దీనిని పూర్తిచేయుటకు తాజా ఆకుకూరలను పండ్లనుగాని లేక పాలనుగాని వాడవలెను. వరిఅన్నములో విటమినులు బొత్తిగా లేవు. ఇది నాల్గవలోపము. దీనిని పూర్తిచేయుటకు పాలు, వెన్న లేక నెయ్యి, పప్పు, తాజా ఆకుకూరలు మున్నగువానిని తినుచుండవలెను. కావున వరిఅన్నమును తినగోరువారు పప్పు, పాలు, వెన్న, శాకములు మున్నగువానిని గూడ ప్రతిపూటను విస్తారముగా తినుచుండిననే గాని శరీరమునకు కావలసిన మాంసకృత్తులు, కొవ్వు, లవణములు, విటమినులు మున్నగునవన్నియును సమృద్ధిగా లభింపవు. ఈరీతిగా వీని నన్నిటిని చేర్చి తినుచున్నచో ఆరోగ్యమును, బలమును, ఉత్సాహమును కలిగియుండుటకు కావలసినవన్నియుగూడ లభించును. అపుడు శరీరము బాగుగా వికసించును గాన కష్టపడి పనిచేయుటకు రోగములకు లొంగకుండుటకు అవసరమగుశక్తి లభించును.(పబ్లికు హెల్తుడిపార్టుమెంటు)

# నైరాశ్యము

పెన్మరాజు రాజగోపాలము గారు బి. యె., సారస్వత సమాజము

ఈమహావార్ధితీరాన; యేనొకడనె,
అలరుతల్పాన శయనించినటుల, నీవి
శాలసికతాతలాననమై వ్రాల; నుంటి;
కూలమును దాకి పైకి రాజాలకునికి
మరలు వారాశి కెరటాల కరణి, నామె
డందభావాలి పొడమి యడంగిపోవు
ప్రకటితముగాక గీతాళి పాడుకొనెద
వట్టిరాగాలు, అవి వార్ధిభంగతుంగ
వీచికావాద్యములలోన వీగిపోవు;
ఏయనూహ్యజగానకో యీధరిత్రి
విడిచిపోజూచు నా ప్రేమోడు కెడద కాని
విఱిగిపోయెను పక్షాలు, సురిగిపోయె
నాటిజవమెల్ల..................

# మేలుకొలుపు

శ్రీమతి లలితాకుమారిగారు

తెమ్మో యీ! బహుదాస్యజీవనదృఢా శ్లేషానువర్తీ! మనో
జ్ఞమ్ముల్ కోమలమైన మాతృవచనాఖండామృతశ్రీలు దూ
రమ్మందుండి వినంబడెన్; నయనపర్వమ్మైన మాత్రాకృతిన్
సమ్మోదమ్మున నాత్మ నిల్పి రణదీక్షన్ లెమ్ము, మేల్కాంచుమింకన్.

# గ్రంథస్వీకారము

1. భారతీయప్రబోధము—సాయం వరదదాసుగారు; 2. శ్రీగురుకులసుందరచరిత్ర—చిలుమూరు గురులింగశాస్త్రిగారు; 3. పురందరదాసుల చరిత్ర—ప్రొద్దుటూరు నరసింగరావు పంతులుగారు; 4. పశుపరీక్ష—జగన్నాథశర్మగారు; 5. విమలానందము—వడ్లపట్ల లలితాంబగారు; 6. అహింసాప్రబోధము—బాల సీతారత్నంగారు; 7. శ్రీసిద్ధేశ్వరీయము—ఆలూరు వాసుదేవయ్యగారు; 8. రుక్మిణీకళ్యాణము—పోతరాజు; 9. ధనమహిమ—ఆలూరు వాసుదేవయ్యగారు, 10. భజనకీర్తనలు:భక్తాంజలి—ఆచంట సత్యవతీదేవిగారు; 11. సునందిని—ఆచంట సత్యవతీదేవిగారు; 12. విమానయానము—మోచుకూరి విశ్వనాథముగారు; 13. ఆంధ్రభారత కవితావిమర్శనము—కోరాడ రామకృష్ణయ్యగారు; 14. 15. 16. 17. కమలావాచకములు 2, 3, 4, 5 తరగతులవి—సత్తిరాజు కామేశ్వరరావుగారు 18. నరసింహశతకము——శేషప్పకవి—ఈ గ్రంథములను వందనములతో నందుకొంటిమి. కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

# ఉద్బోధ

## శ్రీమతి వెలువోలు సవంతాదేవిగారు

౧

నీ రమణీయజీవితవినిర్మలభోగములెల్ల వీడఁగా
గోరఁగలేదు, ప్రాణము లకుంఠితయుద్ధముపం ద్యజింపఁగా
గోరఁగలేదు; బీదలకుఁ గూడునొసంగఁగఁజాలు ఖద్దరున్
ధారణమింతఁజేయు మనఁ దర్కముచేసెద వేల? సోదరీ!

౨

క్రించుతనంబుమాని పరికించుము దేశపు నాఁటినేటి తీ
రించుక, ఫ్రాన్సుదేశమున కేగెడి నీమజిలీ లవేడ? నీ
కొంచెపు దంతపుంబరిణఁగూర్చెడి చీర లవేడ? సీవిధిన్
వంచితవయ్యు నింత బలవంతపువంత మదేల? సోదరీ!

౩

దినదినమున్ దరిద్రదశ తీవ్రతదాల్చుచు దేశనాశ భీ
తిని జనియింపఁజేసెడిని; దీరికగల్గిన వేళలందు ఝు
మ్మని మధురస్వరంబు లొలయన్ భవదీయకరాంగుళీవిచా
లనమున శోభలొల్కఁగను, రాట్నము త్రిప్పఁగరాదె సోదరీ!

౪

ఏలవృథావివాదము లహీనవిధమ్మున నీ యమూల్యమా
కాలము వెళ్లబుచ్చెద వఖండఫలప్రదకార్యదీక్షలం
దేలిన నీదు పూర్వరమణీమణులట్ల మెలంగుచుండినన్
మేలగుఁగాదె? యిట్టి మిడిమేలపు జీవనమేల? సోదరీ!

౫

అంత మహాత్ముఁ డావయసునందటుగ్రీష్మముపందు నాంధ్రదే
శాంతముదాఁక నీకునయి యట్టిప్రచారము జేసిపోయె; నీ
కెంతటి రాతిగుండెగలదే? ధరియింపవు ఖద్దరెప్డు నీ
వింత తెఱంగుమాని కనవే కరణీయము వేగ సోదరీ!

ఆంధ్రపత్రిక ప్రమోదూత ఉగాదిసంచికనుండి.

# గ్రంథవిమర్శనము

## దాసబోధ:—

శ్రీశివాజ చక్రవర్తికి దేశికుడగు రామదాసస్వామి రచించిన లోకోత్తరగ్రంథములలో దాసబోధ ప్రథమ గణనీయము. ఇందు లోకోద్ధరణమునకు ఆత్మోద్ధరణమునకు మార్గము నిరూపింపఁబడినవి. మానవజీవితమునకు వలయు నీతులు చెప్పఁబడినవి. ఇంతియ కాక గురుసలవాసము జేసియేని గ్రహింపరాని యనేక వేదాంత రహస్యములు సహితము బహిరంగపఱుపఁబడినవి. రామదాసస్వామి ప్రపంచవ్యవహారమునందును వేదాంత శాస్త్రమునందును అఖండుఁడుగాన తన భావములన్నియు గ్రంథరూపమున వెలువరించి ప్రబుద్ధముగనుండి తన్నుఁదాను మఱచిన మహారాష్ట్రదేశమును మేలుకొలిపెను. దాసబోధరూపమున నాతఁడు దేశమున కొక యఖండ సందేశము నొసంగెను. ఈసందేశమును దొలుత పాటించి దాసబోధను నిత్యమును పారాయణగ్రంథముగఁ గైకొని లోకోద్ధరణమునకుఁ గడంగిన వారిలో శ్రీ ఛత్రపతి శివాజీ చక్రవర్తి ప్రథముఁడు. దాసబోధ రెండువందల యధ్యాయములుగ నున్న యొక యపూర్వగ్రంథము. మహారాష్ట్రభాషలో నీగ్రంథమున కెక్కుడు ప్రచారముగలదు. ఇందు 7746 పద్యములుగలవు. ఈగ్రంథము రచించుటకు శ్రీ రామదాసస్వామికి దాదాపు పది పండ్రెండు సంవత్సరములు పట్టియుండునని చరిత్రవిదుల తలంపు. ఇరువది నాలుగు సంవత్సరములు ఘోరతపస్సు గావించి యాత్మజ్ఞానము సంపాదించిన ధన్యుండు పండ్రెండు సంవత్సరములు కృషిచేసి వ్రాసినగ్రంథరత్న మెంత యోగ్యతగలదో చెప్పవలసిన యవసరములేదు. అట్టి మహనీయ గ్రంథము మహారాష్ట్రమునుండి అనేకభాషలలోనికి అనువాదితమయ్యెను. నేటికి ఆంధ్రమహాజనులకు అది చేకూరినది. దానిననువదించిన చక్రధరరావుగారును ప్రచురించిన శేషాద్రిరమణకవులును అమోఘముగ ఆంధ్రభాషా సేవచేసిరనుటలో ఆవంతేని సందియములేదు. భగవద్గీతవలె దాసబోధ నిత్యముపారాయణచేయదగిన యొక విలువగల గ్రంథరత్నము. అది సర్వకాల సర్వావస్థలలో మానవజీవితమునకు సరిపడును. అపూర్వమగు విజ్ఞానమును బ్రసాదించును. లోకోద్ధరణమునకుఁ ద్రోవఁజూపును. జాతియందడగియున్న ఆత్మాభిమానమును వేదాంతాభిరుచిని క్రొత్తలెత్తించును. కర్తవ్యశూన్యులుగనున్న మహారాష్ట్రుల యభ్యున్నతికిఁ బాత్రమైన ఈ గ్రంథరత్నము వాఙ్మయమున కొక యపూర్వరత్నమనుటకు సందియములేదు. ఆంధ్రీకరింపఁబడిన ఈ యపూర్వగ్రంథరత్నము ఆంధ్రదేశీయుల యభ్యున్నతికిఁ గారణము కాగలదనుటలో కాసంతేనియు సందియము లేదు. అక్షరాస్యుఁడగు ప్రతి ఆంధ్రుడును దీని ప్రతినొకదానిని తనదగ్గఱనుంచుకొనవలెనని హెచ్చరించుచున్నాము. ఈగ్రంథముండినగాని గ్రంథాలయములు సమగ్రము కానేరవు. గ్రంథము డెమ్మీ సైజున 850 పుటలు. గ్లేజు కాగితములు; రెండు చిత్రములు; క్యాలికో బైండు. గ్రంథకర్తయగు సమర్థ రామదాసస్వామి జీవితము, గ్రంథవిమర్శనము 150 పుటలలో ఆంధ్రకవిరత్నములగు శ్రీ శేషాద్రిరమణకవులు విపులీకరించియున్నారు. ఈగ్రంథరత్నము కాకతీయ గ్రంథమాలలో నాల్గవ కుసుమముగా వెలువడినది. వెల రు 4-0-0 మాత్రము. దొరకుచోటు కాకతీయ గ్రంథమాల, నందిగామ, కృష్ణాజిల్లా.

## ఆత్మసంయమము; అమితవిషయాసక్తి:—

ఆత్మసంయమము; అమితవిషయాసక్తి అను పేర లోకోత్తర పురుషులగు శ్రీ గాంధిమహాత్ములవారు బ్రహ్మచర్య ప్రభావమును తెలుపుచు వ్రాసిన గ్రంథమున కిది ఆంధ్రానువాదము. అనువాదకులు సుప్రసిద్ధులగు కూచి నరసింహముపంతులుగారు. వ్యక్తిత్వముగల శైలి వ్రాయగల ఆధునికాంధ్రగ్రంథకర్తలలో

శ్రీ కూచి నరసింహముగారొకరు. అగుటచే గాంధిమహాత్ములవారి శైలిలో ఈ గ్రంథము చదువుట కెంత యింపుగా నున్నదో శ్రీకూచి నరసింహముగారి శైలిలో ఈ అనువాదితగ్రంథము చదువుట కంతమనోహరముగ నున్నది. హిందూమతోద్ధారకులగు వివేకానందుల వారిగ్రంథములను కొన్ని భాషాంతరీకరించి ఇదివఱకే శ్రీ నరసింహముగారు భాషను పోషించియున్నారు. హిందూదేశోద్ధారకులను గాంధిమహాత్ములవారి ఈ గ్రంథమును ఇప్పుడు తెలిగించి యథారీతిని భాషను పోషించుచున్నారు. చక్కని గ్రంథము. ఎల్లరుచదువదగినది. 1928-వ సంవత్సరమున ప్రచురితము. పిఠాపురమునందలి శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితము. డెమ్మీసైజు వెల 0-9-0 (అనుబంధముతోకూడ) మాత్రము. వలయువారు గ్రంథకర్తగారిపేర పిఠాపురమునకు వ్రాయునది.

మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి:—

ఇది రాజమహేంద్రవరమున నెలకొన్న పల్లెటూరు గ్రంథమండలిలో పదమూడవ పుస్తకము. గ్రంథమండలి సంపాదకులు, గ్రంథకర్తలు శ్రీయుత ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు ఇంతకుముందు వినాయక సావర్కారు జీవితము చక్కని శైలిలో రచియించి జీవితచరిత్రములను రచించుటలో మంచి అనుభవము సంపాదించిన అభిజ్ఞులు. భారతనాయికామణియు; స్వధర్మ, స్వరాజ్యసంబంధముతో భారతరాజకీయాకాశమును వెలుగొందజేసిన అతులతారాప్రభయు; వైరివీరులకు సింహస్వప్నమునునగు మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయియొక్క వీరచరిత్రమును ఇట్టివారు రచించుట ఆంధ్రుల అదృష్టము. ఎంపైరుఇన్ ఏషియా, మీటింగురికార్డ్సు, పదునెనిమిదివందల ఏబదిఏడు, లక్ష్మీబాయిజీవితము. మొదలగు ఆంగ్లగ్రంథములను, హిందీగ్రంథములను, మహారాష్ట్రగ్రంథములను తీవ్రముగ పరిశోధించి శ్రీ శాస్త్రిగారీ గ్రంథమును రచియించినారు. ప్రతిపుటయు దేశభక్తిని ప్రేరేచి, స్త్రీ శక్తిని ప్రదర్శించుచున్నది. దేశభక్తులును, స్త్రీవిద్యాభిమానులును తప్పక చదువవలసిన గ్రంథము. దేశము వెలయించిన దివ్యరమణి భవ్యచరితము చదువనొల్లని వారుందురా? గ్రంథము క్రౌనుసైజున 200 పుటలు. వెల చందాదారులకు 0-10-0 అణాలు; ఇతరులకు 0-12-0 అణాలు. 1928-వ సంవత్సరమున ప్రచురితము. కాకినాడయందలి కాకినాడ ముద్రాక్షరశాలలో ముద్రితము. గ్రంథము వలయువారు గ్రంథమండలి సంపాదకులగు శ్రీ శాస్త్రిగారిపేర రాజమహేంద్రవరమునకు వ్రాయవలెను.

ప్రమోదూత సంవత్సర గంటల పంచాంగము:—

ఇది ముండూరు వీరభద్రసిద్ధాంతిగారిచే గుణింపబడినది. రాజమహేంద్రవరమునందలి రాజన్ ప్రెస్సునందు చిత్రపునాగరాజుగారిచే ముద్రింపబడినది. పంచాంగములందు కాలము సాధారణముగ ఘడియలు, విఘడియలు ఈ మానములందు తెలుపబడును. అట్లుగాక ఈ పంచాంగమును గుణించిన ముండూరు వీరభద్రసిద్ధాంతిగారు కాలమును గంటలు, నిముసములు ఈ మానమునందు తెలిపిరి. అగుటచే ఈ పంచాగము అందఱు సులభముగ చూచుకొనుటకు వీలుగనున్నది. ఇది రాజమండ్రి రాజవైద్య పొన్నాడ భాస్కరం అండ్ బ్రదర్సు వారిచే ప్రకటింప బడినది. వలయువారు 0-1-0 అణాబిళ్ల పోస్టుఖర్చులకుగాను పంపినచో ప్రకటనకర్తలనుండి ఉచితముగ బడయగలరు.

ప్రమోదూత సంవత్సర శ్రీరామచంద్ర డైరి:—

గీర్వాణాంధ్రయవన హూణభాషావిశారదులును దేశముఖ్ దేశపాండ్యాముఖ్తాదార్ జమీన్‌దార్ బిరుదాంకితులును నగు శ్రీ తడకమళ్ల సీతారామచంద్రరావుగారిచే గుణింపబడిన ప్రమోదూత సంవత్సరపంచాగము. చిన్నసైజున ముద్రింపబడినది. వలయువారికి ఉచితముగ నీయబడును. నైజాముఇలాకావారు శ్రీ జమీదారుగారిపేర బేతవోలుపోస్టు, సూర్యాపేట తాలూకా, నల్లగొండజిల్లా అనియు; బ్రిటీషు ఇలాకావారు జగ్గయ్యపేటపోస్టు, కృష్ణాజల్లా అనియు వ్రాయవలెను.

మార్చి: 20—శ్రీమతి ఇంద్రాణి బాలసుబ్రహ్మణ్యముగారు తమ బరంపురము మునిసిపలుసంఘ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చియుండిరని తెలియుచున్నది.

” 21:—బరంపురము చెంత శంకరపురమున పెండ్లిండ్ల ఊరేగింపు ఉత్సవములకు తయారుచేయబడుచున్న మందుసామాను ప్రేలుటవల్ల అచ్చట పనిచేయుచున్న ముగ్గురుస్త్రీలు అకస్మాత్తుగ చనిపోయిరి.

” 22:—కాకినాడయందలి గౌతమలాడ్జిలో శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు బొంబాయిలో జరిగిన అఖిలభారత మహిళాసభనుగూర్చి ఉపన్యసించిరి.

” 23:—శ్రీమతి కమలాదేవి ఛట్టోపాధ్యాయిపేర గాంధిమహాత్ములవారి సందేశము నంపిరి. "ఉత్సాహపూరితలైయున్న నా సోదరీమణులు ఒక్కింతకాలము ఓపికపట్టుచో దేశస్వాతంత్ర్య సంపాదనకొఱకైన ఈసమరములో వారి ఉత్సాహమునకు, త్యాగశీలమునకు సంపూర్ణావకాశము దొరకును."

” 24:—రాజకుమారిని సంరక్షించినసందర్భములో ప్రసిద్ధికెక్కిన ఘరగబహదూరుసింగు తన ఘూర్ఖా సోదరులను జాతీయోద్యమమున పాల్గొన విజ్ఞప్తినంపెను.

” 25:—శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు మద్రాసు సత్యాగ్రహ ప్రబోధమునకు పూనుకొనిరి.

” 26:—రాజమహేంద్రవరమున కీ. శే. వీరేశలింగము పంతులుగారు స్థాపించిన వితంతుశరణాలయమును శ్రీయుతులు ఎమ్. ఏ. ముత్తయ్యచెట్టిగారును; యు. మంగేశ్వరరావు ఎమ్. ఏ., ఎల్. టి. గారును దర్శించి అందు వితంతువుల యభివృద్ధినిమిత్తము జరుగుచున్న యేర్పాటులకు తమ యామోదమును వెలిబుచ్చుటయేగాక తమంతటతాముగా ముత్తయ్యచెట్టిగారు 150 రూపాయలను, మంగేశ్వరరావుగారు 5 రూపాయలను విరాళముల నొసగిరని తెలియుచున్నది.

” 27:—బరంపురము మహిళాసమాజమువారు వారి సమాజమందిరమున సభగావించి అందు శారదా చట్టమును మార్చకూడదని ఏకగ్రీవముగ తీర్మానించి ఆ తీర్మానమును తంతిమూలమున వైస్రాయి గారికి పంపిరి.

” 28:—కటకములో వకీలుగానున్న భాగీరథీ మహాపాత్రోగారి భార్య సరళాదేవిగారును, విశ్వభారతిలో పట్టమునుబడసిన కన్యా మాలతీదేవిగారును, కిశోరీమణిదేవిగారును సత్యాగ్రహము కొఱకు వలంటీరులను ధనమును చేర్చుటకు బరంపురము వచ్చిరి. ముగ్గురును ఘోషాకుటుంబములకు చేరినవారేయైనను స్వరాజ్యసంపాదనకొఱకు ఘోషాను పరిత్యజించిరి.

” 29:—ఏలూరుపురనివాసిని యగు శ్రీమతి చూడికుడితమ్మగారు తనతనయుని వివాహసందర్భమున అయిదువందలమంది పేదవారలకు అన్నదానము చేసెను.

:—తేజబహదరు సప్రూగారి తల్లి తమ 75-వ యేట అలహాబాదులో మరణించిరి.

” 30:—గుంటూరుపురమున సనాతనధర్మమండలియందు ఉదయము 8 గంటలకు స్వరాజ్యలక్ష్మీవ్రతముతో గుంటూరుమండల స్త్రీ సత్యాగ్రహదళప్రచారకార్యక్రమము ప్రారంభమయ్యెను.

:—మధ్యపరగణాల గవర్నరుగారు శ్రీమతి జె. యఫ్. మక్షేడనుసతి; శ్రీమతి జె. కె. ఆర్. కామాసతి; శ్రీమతి సుమతీబాయి దేవ్‌సతి వీరలను మూడవతరగతి న్యాయాధికారిణులుగ నాగపురముజిల్లాయందు నియమించెను. అచ్చటిస్త్రీ లిట్టి ఉద్యోగములపొందుట కిది ప్రథమము.

ఏప్రియలు 1:—మహారాష్ట్రస్త్రీసభ యాజమాన్యమున జిన్నాహాలునందు బొంబాయిస్త్రీలు సమావేశమైరి. అవంతికాబాయి గోఖలెగారు అధ్యక్షతవహించిరి. జమ్నలాల్ బజాజ్ గారు ఉపన్యసింపుచు హైందవవనితలు పారంపర్యముగా స్వతంత్రసమరములందు పాల్గొనిరనియు ఇప్పుడును మీరందరును దానిని నిలబెట్టవలెననియు చెప్పిరి. ఝాన్సిరాణిని ఈసందర్భమున నుదాహరించిరి. గుజరాతు విద్యాపీఠపు ప్రిన్సిపాలుగారు కాకాకలేల్కరుగారు ఈతరుణమున హైందవస్త్రీలు తమ పుత్రులను దేశసేవకును మధ్య రాగూడదనియు, సాహసమునకు పేరుపడసిన మహారాష్ట్రవనితల పుణ్యోదాహరణముల మనసునం దుంచుకొని వారివలెనే తమ కొడుకులను రణరంగమునకు పంపుచు అమోఘాశీస్సుల నొసగుడనియు నుబోధించిరి.

„ 2—:శ్రీయుత తుమ్మల బసవయ్యచౌదరిగారు రానున్న ధర్మసంగ్రామములో ఆత్మార్పణము చేయుటకు బయలుదేరిరి. వారితోపాటు వారి సహధర్మచారిణి శ్రీమతి దుర్గాంబగారును సంపూర్ణోత్సాహముతో సత్యాగ్రహమునకు బయలుదేరిరి. ఈయమ చరిత ఆంధ్రస్త్రీలోకమునకు విశేషించి కమ్మనారీమణులకును ఆదర్శప్రాయ మనుటలో సందియము లేదు.

„ 3:—అబిసీనియా చక్రవర్తినియు, ఇథోపియారాజు భార్యయునైన జేడిటూరాణి మరణించెను.

„ 4:—చిరకాలమునుండి గుండెజబ్బుతో తీసికొనుచున్న స్వీడనురాణి రోమునగరమున చనిపోయెను.

„ 5:—శ్రీమతి కమలాబాయి రాజారావుసతి, చంటిపిల్లతల్లి, క్రైస్తవమతమునకు చెందినది—బొంబాయి సేవాసదనమునకు ఇదివఱకు సూపరెండెంటుగా నుండినది— గాంధిమహాత్ముని ఆశ్రమమున జేరుటకు సికిందరాబాదునుండి సబర్మతికి పయనమైపోయెను.

„ 6:—మహాత్ముడు లవణసత్యాగ్రహమును దండిలో ప్రారంభము చేసెను.

„ 7:—ఆదవానిలో ఒక హిందూ కురవజాతిగృహస్థుడు తనయింట రెండు బాల్యవివాహములను గావించి ఊరేగింపుటుత్సవమును జరిపి శారదాశాసనమును ధిక్కరించెను.

„ 8:—లాహోరునగరమున సత్యాగ్రహమహాసభ కొకస్త్రీ గాజులతోనిండిన పెట్టె నొకదానిని పంపుచు ఇట్లు లేఖవ్రాసెను. "పురుషులు దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదింపజాలనిచో ఈగాజులను ధరించుటయే ఉత్తమము."

„ 9:—అహమ్మదాబాదు జయినుస్త్రీలు మతగురువుల ఎదుట ఇట్లు ప్రమాణము చేసిరి. "విదేశవస్త్రములను నేటినుండియు త్యజించెదము. నేటినుండి మధుపదార్థములను భుజింపము."

„ 10:—విశాఖపట్టణము జిల్లాలోని మడగోలు, వీరవల్లి సత్యాగ్రహులు మడగోలు వదలిపోవుటకు ముందు జమీందారీవంశమునకు చెందిన ఘోషాస్త్రీలు వారికొక విజ్ఞాపనపత్రమును సమర్పించిరి. అందు వారు తమవంశపు సాంఘికాచారమువలన తాము సత్యాగ్రహులతో రాలేకపోయినను తమ ఆత్మలు వారిపుడు సలుపబోవు స్వాతంత్ర్యసమరమునందే యున్నవని వచించిరి.

„ 11:—జలాల్పూరులో స్త్రీలు కోర్టులకును పోలీసుస్టేషనులకును వెళ్లి సత్యాగ్రహసైనికులు శాసనమును ధిక్కరించి చేసిన ఉప్పుపొట్లములను కొనెదరాయని ప్రభుత్వోద్యోగుల నడిగిరి.

:—సుప్రసిద్ధ దేశభక్తురాలగు శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మగారు (శ్రీ సంగం సీతారామయ్యగారి కోడలు) గుంటూరున లవణశాసనధిక్కారసమరమున పాల్గొనుటకు హైదరాబాదు నుండి బెజవాడమెయిలులో బయలుదేరెను.

„ 12:—తూర్పు, పడమరకృష్ణా వలంటీర్లు గంపలగూడెం కుమారరాజా కోటగిరి వేంకటకృష్ణారావుగారి నాయకత్వమున మధ్యాహ్నము మూడుగంటలను చిన్నాపురము విడచి కోనాపురమునకు ప్రయాణమైరి. వారు ఉత్సవముతో వెడలుచుండ శ్రీమతి తోట కామమ్మ అను 80

ఏండ్ల వృద్ధురాలు రాజాగారికిని, కొల్లిపర సూరయ్యగారికిని కుంకుమతిలకమిడి కర్పూర హారతి ఒసంగి ఆశీర్వదించెను.

" 13:—పశ్చిమగోదావరిమండలములోని చాగల్లునందలి ఆనందనికేతనాశ్రమమునుండి సత్యాగ్రహ దళము బయలుదేరెను. శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు ఎమ్. ఏ. గారి వృద్ధురాలగు తల్లి "నాయినలారా! మీరు వెళ్లుచున్న పని చేసికొని మరిరండు" అని హెచ్చరించిరి. సత్యాగ్రహులలో శ్రీ తల్లాప్రగడ నరసింహశర్మగారి సతీమణియగు శ్రీమతి విశ్వసుందరమ్మగారొకరు.

" 14:—లక్నోనగరమున శ్రీమతి కాంతీదేవి అవస్తిగారు ఉప్పుచేసిరి. అపుడచట 10000 మంది యుండిరి. ఆమె భర్తయగు జయదయాలు అవస్తిగారు నేటి మధ్యాహ్నమే 18 నెలలు శిక్ష వేయబడినను ఆమె వెనుదీయక సత్యాగ్రహ మొనరించెను.

:—శ్రీమతి మిత్తుబెను పెటిటుకన్యగారి నాయకత్వమున భీమరథులో 30 స్త్రీలు కల్లంగడుల దగ్గిర పికెటింగు చేయుచు కల్లుత్రాగువారిని 'మీరు మారక్తమును త్రాగుదురుగాని కల్లు త్రాగకుడు' అని హెచ్చరించిరి.

" 15:—చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారు చెన్నరాష్ట్ర స్త్రీలకొఱకు వెల్లూరులో నూతనముగ నిర్మించిన జయిలు సర్ ఉస్మానుగారిచే తెరవబడెను. స్త్రీలకొఱకు ప్రత్యేకముగ జెయిలు ఇంకే రాష్ట్రమునందును లేదు.

:—మీరటులో జరిగిన సభలో జ్యోతిప్రసాద్ రస్తోగులుగారిసతి ఇట్లు పలికెను. 'నాభర్తగారు రెండుసంవత్సరముల కఠినశిక్ష అనుభవించుచున్నారు. నా పెద్దకుమారుడు లవణసత్యాగ్రహిగా నున్నాడు. పదునాలుగేండ్ల వయసుగల నా రెండవకుమారునిగూడ వలంటీరుగ తరిబీయతు చేయుచున్నాను. నేనీదినమున స్వరాజ్యలవణమును 60 రూపాయిలకు విక్రయించితిని.'

" 16:—బొంబాయి యువకసంఘాధ్యక్షుడగు నారిమెనుగారిని కారాగృహమునకు బంపుటచే నేడు జరగిన యువకజనసభలో ఆపదవికి శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయిగారిని ఎన్నుకొనిరి.

" 17:—కాంగ్రెసు మహాసభాధ్యక్షుడగు పండిత జవహర్లాల్ నెహూృగారి శిక్షకు తమ అసమ్మతిని తెలుపుటకు అలహాబాదునగరమున రామ్‌బాగులో స్త్రీలసభ సమావేశమయ్యెను. పండితమోతీలాల్ నెహూృగారి సతి అధ్యక్షతవహించి గొప్ప ఉపన్యాసముగావించెను. ఉపన్యాసానంతరము ఆమె నిప్పులో కట్టెలను పెట్టి తనకుమారుడు ఏపనికై అరెస్టు చేయబడెనో ఆ పనినే తానుకూడ బహిరంగముగ చేయుచున్నానని చెప్పెను. ఆమె యిట్లుచెప్పుట చేత స్త్రీలలో ఉత్సాహము మేరమీరెను. చాలమంది స్త్రీలు సత్యాగ్రహము గావించుటకు పేర్లనిచ్చిరి.

—శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ, శ్రీమతి మున్సీసతి, పురుషోత్తమదాసుసతిగారల నాయకత్వమున కొందఱు బొంబాయి హైకోర్టులోని న్యాయవాదుల పఠనాగారములోనికి బోయి ఒకగంటలో ఉప్పుపొట్లముల నన్నిటిని 150 రూపాయిలకు అమ్మిరి.

" 18:—శ్రీమతి సరోజనీదేవిగారు 600 ఉప్పుపొట్లములను బొంబాయిలో మాండ్వేలో వర్తకులకు 10, 000 రూపాయలకు విక్రయించెను.

" 19:—జ్యోతిర్మయీ గంగూలి కన్యగారు తమలకులో 144–వ సెక్షను ఉల్లంఘించి బహిరంగ సభలో ఉపన్యసించెను. పోలీసువారు సభను చెదరగొట్టుటకు ప్రయత్నించిరి. ప్రజలలో చాలమందికి దెబ్బలుతగిలినవి.



స్వరాజ్యలక్ష్మిని గృహలక్ష్ములే ఉద్ధరింపవలెను.—

ఉద్రిక్తుడై ఇంద్రుడు దూర్వాసుని తిరస్కరించెను. దాని కామునీశ్వరుడు కసలి ఇంద్రుని స్వరాజ్యలక్ష్మి సముద్రమున బడునట్లు శపించెను. మునిశాపయుక్తిచే ఇంద్రుని రాచసిరి సముద్రమున గూలెను. అంతట ఇంద్రుడు భగవంతునొద్దకు పోయి ప్రార్థింపగా మందరాచలము మందయష్టిగా, దందశూకస్వామి తరువ్రాడుగా చేసి దేవతలు సముద్రమును ద్రచ్చుచో తిరిగి లక్ష్మిని బడయగలుగుదురని ఆతడు హితోపదేశము చేసెను. దేవత లట్లేచేసిరి. భగవంతుడు కార్యప్రయోగరక్షకు డదిరియుండెను. పుట్టిన హాలాహలమును పురహరుడు అల్లోనేరేడుపండువలె మ్రింగివైచెను. ఇంద్రునకు స్వరాజ్యలక్ష్మి చేపడియెను. ఎంబన్నలై భారతీయులు ఐకమత్యమను తాపసిని కాలదన్నిరి. దానికి కోపించి ఆతాపసి శాపవాక్యములు పలికెను. అందుమీద భారతీయుల స్వరాజ్యలక్ష్మి సముద్రాంతరముల కేగెను. నూటయేబది వత్సరములుగ వారిట్లు విగతలక్ష్మీవిలాసులై ఒప్పుదఱిగియుండి తిరిగి తమకు స్వరాజ్యలక్ష్మిని ప్రసాదింప పరమేశ్వరుని ప్రార్థించుచుండిరి. పరమేశ్వరుడు వీరి మొఱవిని గాంధినామమున భారతభూమిపై అవతరించినాడు. అహింసావ్రతము మందయష్టిగా, సత్యాగ్రహము తరువ్రాడుగా లవణసముద్రమును ద్రచ్చినచో స్వరాజ్యలక్ష్మిని తిరిగి పడయవచ్చునని అత డాదేశించినాడు. ద్రచ్చుటకు భారతీయులగు స్త్రీపురుషు లెల్లరు రావలయునని ఆతని ఆజ్ఞప్తి. అయితే నూటయేబది వత్సరములుగ ప్రభుత్వసేవ చేయుచు అర్థదాస్యమునకు, భావదాస్యమునకు అలవడి దివ్యత్వము గోల్పోయిన భారతపురుషులకంటె దివ్యత్వముగోల్పోవని స్త్రీలు విశేషముగ ద్రచ్చువారైననే స్వరాజ్యలక్ష్మి సత్వరముగ చేపడునని స్వాధీనారంభుడు గాంధి చెప్పుచున్నాడు. అదియునుగాక స్త్రీస్వరూపిణియగు స్వరాజ్యలక్ష్మిని సుకరముగ ఉద్ధరించుట స్త్రీలచేతనే యగునుకాని పురుషులచేత గాదు. పంకమగ్నమగు సామజము నుద్ధరించుటకు సామజమే కావలయునుగదా? హాలాహలమువంటి నిర్బంధవిధానము పొడసూపినను లోగాను సహనశీలము హరికడ నున్నది.

ఉ ద్ధ రిం చు ట కు న డు ము లు క ట్టి నా రు:—

సముద్రగతమైన స్వారాజ్యలక్ష్మిని గృహలక్ష్ములే ఉద్ధరింప వలంతులని మహాత్ముడు సత్యాగ్రహశంఖమును పూరించినతోడనే ప్రతిసీరమాటున ప్రసుప్తావస్థలోనున్న మహిళామణులు అంపతో మేల్కాంచి స్వరాజ్యలక్ష్మిని ఉద్ధరింప నడుములుకట్టినారు. సమానమైన హక్కులకై పురుషులతో ప్రతిస్పర్థించుచున్న స్త్రీలు మాతృదేశవిముక్తికై మాత్రము పురుషులతో ప్రతిస్పర్థించక ఎట్లుందురు? ఏప్రియలు 7-వ తేదీని అటులో మహాత్ముడు తనతో బాటు సత్యాగ్రహమొనరింప మూగియున్న స్త్రీలను "ఉప్పును తీసినచో మిమ్ములను ప్రభుత్వమువారు బందిఖానాకు పంపించెదరు. మీరు అందులకు సంసిద్ధలైయున్నారా?" అని ప్రశ్నించెను. "ఉన్నాము. ముమ్మాటికిని ఉన్నాము. మీ ఆజ్ఞలను తుచతప్పక నిర్వహింతుము." అని ఆకాంతారత్నములు కన్యాకుమారినుండి కైలాసశిఖరమునకు కబురంపునట్లు ఐక్యకంఠమున మహాత్మునకు ప్రత్యుత్తరమిచ్చినారు. అటు అతివ లిచ్చిన ఆప్రత్యుత్తరము రణదుందుభిధ్వానమై ఆసేతుహిమాచలపర్యంతమైన ఈ భారతభూమిలో గ్రామగ్రామమునుండియు రమణీమణులను బయలుదేరదీసి వారిని రణరంగమునకు దుమికించినది. గుజరాతులో అంబాలాల్ శారాబాయి; బొంబాయిలో కమలాదేవి,సరోజినీదేవి;పంజాబులో పార్వతీదేవి; తమిళములో జ్యోతిర్మయిగంగూలికన్య; అలహాబాదులో స్వరూపరాణి మొదలగువారు నాయకత్వమువహించి తాము ఝాన్సీలక్ష్మిబాయి తోబుట్టువులమైన సంగతి తోడిలోకమునకు తెలియజేయుచున్నారు. ఇతర రాష్ట్రపుస్త్రీలు ఇంతటి చొరవచూపి ఇంతింతనరాని కీర్తి నార్జించుచుండ భారతదేశమునందలి ప్రతిస్త్రీయుద్యమమునందును పురోభాగమున నడచు ఆంధ్రపురంధ్రీమతల్లులు ఇంట కూర్చుందురా? కూర్చుండరు. అదిగో బరంపురమునుండి బళ్లారివరకు దేశమునొకసారి పరకాయించుము. ఎండకన్నెఱుగని ఎలనాగలు పరదాపద్ధతి ప్రతిషేధించి బరంపురమున సత్యాగ్రహప్రచారము సాగించుచున్నారు. బొబ్బిలి మల్లమ్మగారి వీరత్వమును ప్రదర్శించిన మండలమునకు తిలకనగరమగు విశాఖపట్టణమున శ్రీ దిగుమర్తి జానకీదేవిగారు తాను తయారుచేసిన సత్యాగ్రహలవణమును భల్లూకముష్టిలో భద్రపఱచి పట్టవచ్చిన గవర్నమెంటుతాబేదారు పాపారాయని ప్రతిష్ట భ్రష్టమొనర్చినది. తూర్పుగోదావరిమండల ముఖనగరమగు కాకినాడలో సాంబమూర్తిగారి సతి సత్యాగ్రహము చేయుచున్నది, శ్రీ వేదాంతం కమలాదేవిగారు దేహారోగ్యము అనుమతించినచో ఈపాటికే చేసియుండును. పశ్చిమగోదావరిమండలమున శ్రీ తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు సోదరీసహితయై సత్యాగ్రహము సల్పుచున్నది. దీవించి కరవాలమిచ్చి ప్రాణేశ్వరుని ప్రథనరంగమునకు బంపిన వీరబాల మాంచాలనుపెంచిన మంచిసీమ గుంటూరున శ్రీ ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి నాయకత్వమున ప్రత్యేకము స్త్రీ సత్యాగ్రహదళ మొకటి

బయలుదేరి సంచారము సమాప్తినొందించి కార్యరంగమునకు దిగినది. విక్రమసింహపుర మండలమున శ్రీ ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు ఉప్పుచట్టము ధిక్కరించినది. కుమ్మరి ఆవములో ఇత్తడిముంతలు పుట్టించిన మంత్రకానివలె నిద్రాముద్రితమైయున్న మద్రాసుపట్టణములో సమరోత్సాహమును రగిలించిన ఆంధ్రకేసరికి శ్రీగుమ్మడిదల దుర్గాబాయమ్మగారు కాకినాడనుండి వచ్చి అండయైనిల్చి పనిచేసినది. శ్రీ ఆచంట రుక్మిణమ్మగారు అరవదేశములో సత్యాగ్రహశంఖమూది రవముపుట్టించుటలో రాజగోపాలాచారిగారికి తోడ్పడినది. ఇట్లెందఱిని పేర్కొనగలము?

శ్రీమతి జానకీదేవి వీరాంగన:—

ఎట్టిసమయములందును ఇంటిగడపదాటివచ్చుట ఎఱుగని మూసినముత్యములగు భారతమహిళలిట్లు ముందుకువచ్చి నిరాఘాటముగ ఉప్పుసత్యాగ్రహమొనరించుటతో ప్రభుత్వమువారికి ఉప్పందినది. వారి ఉద్యోగులకు కాళ్లుచేతులాడని కంగారుపుట్టినది. ఆ కంగారులో ఆ ఉద్యోగులు ఉచితానుచితజ్ఞానమును గోల్పోవుచున్నారు. ప్రాణాపాయస్థితిలో కూడ పరపురుషుడగు డాక్టరునకు చేయిచూపసందేహించు సచ్ఛీలముగల భారతస్త్రీరత్నములపై చేయివేయుటకు ఆ ఉద్యోగులు సందేహింపకున్నారు. బొంబాయిలో మూడు దినములలో ముప్పదివేలరూపాయిల సత్యాగ్రహలవణమమ్మిన దీక్షావతి కమలాదేవిని గవర్నమెంటువారితాబేదారొకడు ముట్టుకొనినాడు. బొంబాయివఱకు పోనేల? మన విశాఖపట్టణమున నడచిన క్రౌర్యమునుకాంచుడు. శ్రీదిగుమర్తి రామస్వామిగారును వారిసతీమణియు విశాఖపట్టణ సముద్రతీరమున లవణసత్యాగ్రహమును సాగించిరి. నిరోధించుటకు ప్రభుత్వమువారి ప్రతినిధులు వచ్చిరి. అందొకడు రామస్వామిగారి చేతిబొటనవ్రేలు విరుగునంత వంచెను. రామస్వామిగారి సతి శ్రీమతి జానకీబాయిగారు తమ భల్లూకముష్టిలో స్వరాజ్యలవణమును పట్టియుంచెను. సూపరెంటెండెంటు సాండర్సు అదిచూచెను. స్త్రీలను గౌరవించుట పుట్టుకతో నేర్చు ఆంగ్లజాతికిచెందిన వాడుగావున ఆతడు ఆఅతివహస్తమును ముట్టి ఉప్పుగైకొనుటకు ఉద్యమించలేక పోయెను. ఉండెనుగదా ఎట్టికకూర్తిపనియైన చేయుటకు ప్రక్కనుతాసిల్దారు పాపారాయుడు. ఆతనితో సాండర్సు 'ఉప్పుగైకొనుము' అని చెప్పెను. తాసిల్దారు ఆమెను ఉప్పునిచ్చివేయుమని కోరెను. "అరెస్టుచేసి నాకడనున్నఉప్పు స్వాధీనము చేసికొనుడు. అని ఆమె ప్రత్యుత్తరమిచ్చెను. అందుమీద నాతడు దుశ్శాసన నీతి నవలంబించి అభినవోత్పలకోమలమైన ఆమె చేయిపట్టి గుప్పిలివిప్ప ప్రయత్నపడెను. ఆవీరాంగన అనాదరమందస్మితముతో గుప్పిలిపట్టియే యుంచెను. సంతకములు చేయుటకు మాత్రము చాలియుండు ఆతనిచేయి సంకల్పబలమున పట్టబడిన ఆమె గుప్పిలి విప్పజాలెనా? విప్పజాలెనో, జాలనేలేదో అదికాదు మన ప్రస్తుతప్రశక్తి. తనరక్తములో రక్తమగు బిడ్డ, తనకు జన్మమిచ్చిన తల్లిదండ్రులు, తనప్రాణములో ప్రాణమగు

భర్త, తనతోబుట్టినతోడు పీరికితప్ప లాతివారికి అంటిముట్టరాని అనిందితశీల, పరమసాధ్వి అయిన స్త్రీచేతినుండి నీతివాటించునేర్పుగల బ్రిటీషుప్రభుత్వమువారి తాబేదారు ప్రభుత్వపక్షమున నాలుగువేల ప్రజలయెదుట బలవంతమున ఉప్పుగైకొనెను. మహాత్ముని సుగ్రీవాజ్ఞ ననుసరించి క్షమచే ఆమె దీనినోర్చెను; ప్రజలు రక్కసతాల్మివహించిరి. ఇంతటికఠిన దౌర్జన్యమునకు గుఱియైనను ఆవీరాంగన తనదీక్షను ఇసుమంతయేని సడలింపలేదు. తనభర్తగారు నిర్బంధింపబడిన సందర్భమున కోర్టులో వారితో నామె ఇట్లువచించెను. "నేనుపట్టుదలతో సత్యాగ్రహము సాగింతును. తర్వాలోనేమియ్యు చెఱసాలలో కలిసికొందును." ఏమి వీరత్వము! ఏమి దృఢదీక్ష! "వెఱతురా ఘోరకాకోళ విషముచేత?"

ప్రభుత్వమువారు ఏమిచెప్పెదరు?:—

ప్రభుత్వసేవకులు స్త్రీలపై అమానుషమగునిట్టి దౌర్జన్యమునకు దిగినచో భారతదేశమం దంతటను ప్రజాశక్తి ప్రజ్వలితముకాగలదని మహాత్ముడు చెప్పుచున్నాడు. చట్టధిక్కారముచేసి కూర్చిన ఉప్పును స్వాధీన మొనర్చుకొనుటకు గవర్నమెంటువారికి హక్కుగలదని మేమంగీకరింతుము. అయితే స్వాధీనపఱచుకొనుటలో సభ్యతవీడరాదని మామనవి. మగవానిచే స్త్రీహస్తమునుండి ఉప్పులాగించుట క్రౌర్యమునకు అవధి. కారాగారములందు సయితము ఆడుఖైదీలతో వ్యవహరించుటకు స్త్రీలగు వార్డనుల నియమించుట నాగరికప్రభుత్వముల పద్ధతి. మనప్రభుత్వమువారుకూడ నట్టిపద్ధతి నవలంబించియేయున్నారు. వెల్లూరులో స్త్రీలకొఱకు ప్రత్యేకము జయిలు ఏప్రియలు 15—వ తారీఖున తెఱచి మద్రాసు హోము మెంబరుగారు ఆడుఖైదీలకు ప్రత్యేకపుటేర్పాటుల గావింపవలసిన అవసరమును ఇటుకసున్నములతో చూపియున్నారు. అయితే ఆచూపుట ఫలమీయజాలని ప్రదర్శనము మాత్రమే అయినది. ఏమందురా? మఱిరెండురోజులకు పిదప ఏప్రియలు 17—వ తారీఖున విశాఖపట్టణమున శ్రీమతి జానకమ్మ పిడికిలి విప్పుటలో ప్రభుత్వమువారి ఉద్యోగపురుషుడు చేయిచేసికొనినాడు. దీనికి ప్రభుత్వమువారు ఏమిచెప్పుదురు?

స్త్రీ పోలీసులను పయోగింతురా?:—

బ్రిటీషు సాంఘికారోగ్యసభవారి భారతప్రతినిధులచే పంపబడిన విన్నపములప్రకారము స్త్రీపోలీసుల నేర్పాటుచేయు విషయములో ఏమిచేసితిరని మద్రాసుప్రభుత్వమువారిని శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు మొన్నజరిగిన శాసనసభలో ప్రశ్నింపగా దానికి హోము మెంబరుగారు "స్త్రీ పోలీసుల నేర్పాటు చేయవలసిన అవసరమురాలేదని పోలీసుఇన్స్పెక్టరు చెప్పుచున్నాడు" అని ప్రత్యుత్తరమిచ్చినారు. ఏమి? అవసరము రాలేదట. ఏప్రియలు 3—వ తేదీని మద్రాసునగరమున స్థానికమహిళాసభవారి యాజమాన్యమున జరిగిన ఘోషాస్త్రీల సభచెంత పోలీసుభటుల కాపలాపెట్టుటయు, సభలోపలకు పోలీసు

రిపోర్టరులు వలదువలదనివలుసారులు ప్రబోధింపబడియు చొరబడుటయు, పరపురుషునికన్నెత్తి చూడనొల్లని పరదాస్త్రీలు సభచాలించుకొని ఇండ్లకుబోవుటయు జరిగినది. ఏప్రియలు 13—వ తేదీని బొంబాయిలో ఒకపోలీసు ఉద్యోగి కమలాదేవిగారిని చేయిపట్టుకుగెంటెను. ఏప్రియలు 17-వ తేదీని విశాఖపట్టణమున శ్రీమతి జానకీదేవి పిడికిలి ప్రభుత్వోద్యోగి పాహారాయుఖు పట్టినాడు. ఏప్రియలు 25-వ తేదీని మద్రాసుహైకోర్టు బీచివద్ద శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారిని—వెనుక అసహాయోద్యమదినములలో చిత్తరంజనదాసు చిన్నారి కొడుకును చెయ్యినలిపి చంపిన పోలీసుఉద్యోగులకు సహోదరులగువారు తమచేతులతో గెంటినారు; కఱ్ఱలతో కొట్టినారు. స్త్రీపోలీసుల నుపయోగించుటకు ఇంతజరిగిన మీదటనైన అవకాశము కలిగినదని పోలీసుఇన్స్పెక్టరుజనరలు అంగీకరించునా? ఇకనైనను ఇట్టిఅమానుషములు జరుగకుండచేసి సభ్యలోకమువారి మన్ననబడయుటకు ప్రభుత్వమువారు స్త్రీపోలీసుల నుపయోగింతురా?

గాంధి మహాత్ముడు జాగ్రత పుచ్చుకొన్నాడు:—

ఉపయోగింతురో లేదో తెలియదుకాని ఉద్యమనాయకుడు మహాత్మగాంధిగారు మాత్రము ఇట్టి అమానుషములు జరుగకుండుటకు జాగ్రతపుచ్చుకొని ఇట్లు ఆదేశించుచున్నాడు "స్త్రీలుమాత్రము మడులను కాపాడుటకు పూనుకొనగూడదు. ఆ కాలము వచ్చినపుడు వారికిగూడ నేననుమతి నిచ్చెదను. కాని అది యింకను రాలేదు. ప్రస్తుతము స్త్రీలు విదేశవస్త్రముల దుకాణములవద్దను కల్లు సారా దుకాణములవద్దను పికెటింగు చేయుచుండవలెను. నూలు వడుకుచుండవలెను. భారతస్వాతంత్ర్యపాఠశాలలో స్త్రీలింకను అక్షరములనే నేర్చుకొనవలెను. స్వరాజ్యమునుగూర్చి తెలిసికొని దానిని బడయుటకు ప్రయత్నించుటయే ప్రాథమికవిద్య." స్త్రీలు సత్యాగ్రహలవణమును సంరక్షించుటకు పూనుకొనరాదనియు తమకు ప్రకృతి ప్రసాదించిన సౌజన్యము తోలకాదు ఉపదేశవాక్యములతో విదేశవస్త్రబహిష్కరణప్రచారమునందును, మద్యపాననిషేధప్రబోధమునందును తమ వ్యగ్రోత్సాహమును వ్యయపఱుపవలయునని మహాత్ముడు వారిని హెచ్చరించుచున్నాడు. ఈహెచ్చరిక తులసీదళమువలె తలదాల్చి భారతరమణులు విదేశపుబట్టల దుకాణములవద్దను, కల్లంగడులవద్దను పికెటింగు సాగించుచున్నారు. కఠినంపుదీక్షవహింప నాదేశము వచ్చునఱకు వారు ఇట్టి సామమార్గములనే అవలంబించి దేశమాత దాస్యవిమోచనమునకై పని చేయవలసియున్నది. గాంధీమహాత్ముని సతి కస్తూరిదేవి నాయకత్వమున ఈవిషయమున తుదివఱకు పనిచేయ నలుబదిమంది స్త్రీలు స్థిరసంకల్పలైయున్నారు. ఇతరతావులయందుకూడ స్త్రీలిట్టి స్థిరసంకల్పమునే ప్రదర్శించుచున్నారు.

"మా కెట్లు తె లి యు ను?":—

సచిన్‌సమీపముననున్న అంబుస్రగ్రామమునకు మహాత్ముడు పోయినపుడు అచ్చట కూడిన స్త్రీల నాతడు 'అమ్మా! కాంగ్రెసుసభాధిపతియగు జవహారీలాలు నెహ్రూ సంగతి తెలియునా?' అని ప్రశ్నించెను. దానికి ఆస్త్రీలు ఐక్యకంఠమున "మహాత్మా! మాకెట్లు తెలియును?" అని ప్రత్యుత్తరమిచ్చిరి. ఈ ప్రత్యుత్తరములో పురుషులు తమధర్మమును ఎట్లు మఱచియుండిరో విస్పష్టమగుచున్నది. పురుషులు స్త్రీలను ఇంటి నాలుగుగోడల సందున కట్టివైచుటకె పురుషులు; కాని లోకవిషయమును వారి చెవినివేయుటకు పురుషులు కారు. ఈసంగతి గమనించిన మహనీయుడుగావుననే మహాత్ముడు అప్పుడాసభలో నిట్లు చెప్పెను. "అమ్మా! అది మీకు తెలియనిచో మీతప్పు కాదు. ఇంతకాలమును మిమ్ము ఇంటికి కావలికత్తెలుగను, వంటలక్కలుగను, ఇల్లు తుడుచువారిగను, నీళ్లు తెచ్చువారిగను ప్రగ్గించిన మాపురుషులమహాపరాధము." ఇకనైనను పురుషులు మేలుకొని తామింతవఱకు చేయుచున్న మహాపరాధమునకు లెంపలువైచికొని స్త్రీలకు విద్య నేర్పియు, వార్తలుచెప్పియు సత్వరస్వరాజ్యసంపాదనకు అడ్డుపడుచున్న స్త్రీల అజ్ఞానమను వింధ్యపర్వతమును క్రుంగబెట్టుటకు అగస్త్యమహామునులగుదురుగాక! ఏవిషయమున ప్రశ్నించినను 'మా కెట్లుతెలియును?' అనకుండ 'మాకుతెలియును' అని భారత మహిళామణులు ఎప్పుడు పలుకనేర్తురో నాడు భారతదేశమున కళ్యాణభానూదయమగును.

ఉ ప శ్రు తి ఉ న్న ది:—

ఏప్రియలు 6—వ తేదీని మహాత్ముడు లవణశాసనధిక్కారము చేయుటకు సర్వోయత్తములు చేసికొని అరేబియా సముద్రతీరమునందలి దండి చేరెను. అదియే సమయమున బంగాళాఖాతము తీరమున కలకత్తానగరము చెంత హుగ్లీమహానదిలో సీమదేశము నుండి మనదేశమునకు 8500 టన్నుల ఉప్పును గొనివచ్చుచున్న కోగండేలు అను నావ మునిగిపోయెను. అరేబియా సముద్రతీరమున మహాత్ములవారిచే లవణశాసన ధిక్కారము చేయబడుటయు, బంగాళాఖాతము తీరమున విదేశపుటుప్పునావ గంగాప్రవేశమగుటయు కారణములేక ఎట్టికార్యమును జరుగని ఈసృష్టిలో ఏకసమయమున జరుగుట కేవలము కాకతాళీయము అగునా? మూఢనమ్మకముగలవారిగా మమ్ము కొందఱు భావింప సాహసించినను మేమీ కార్యసంభవము దైవనిర్దిష్టమనియు, ఆ విదేశపుటుప్పునావ గంగాప్రవేశ మగుటలోనైన నాదమున భారతదేశమున నిక విదేశపుటుప్పునకు తుదిచీటి వచ్చినదను ఉపశ్రుతి ఉన్నదనియు విశ్వసించుచున్నాము.

ఆంధ్రకేసరి చిత్తస్థైర్యము:—

గతదినమున తమ నాయకులగు దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు, గద్దె రంగయ్యనాయుడు, భాష్యంచెట్టిగార్లు కారాగృహమునకు పంపబడుటచే ఆనాడు సంపూర్ణమగు హరతాళమును గావించి మదరాసుపౌరులు ఏప్రియలు 22-వ తేది మంగళవారము సాయంత్రము ఆరుగంటలకు హైకోర్టుబీచికడ సమావేశమైరి. బ్రహ్మాండమగు సమావేశము. ఒక్కొక్క ఇసుకరేణువున కిద్దఱేసిమనుష్యుల చొప్పుననుండిరి. ఈజనసముద్రమును చూచి దాపుననున్న లవణసముద్రము ఉత్తరంగితమగుచుండెను. ఆసమావేశమునకు ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారు అధ్యక్షతవహించిరి. ఉపన్యసించుటకు లేచిరి. సహజమేఘనిస్వనస్వరమున ఉపన్యసింప నారంభించిరి. సభలో నిశ్శబ్దము విరాజమాన మగుచుండెను. నిక్కపొడుచుకొన్న చెవులతో ప్రజలు ప్రకాశముగారి పలుకులను వినుచుండిరి. ఇంతలో కొంతదూరమున జరుగుచున్న చిన్నసభనుండి చెంతనున్న పోలీసువారిపై ఎవరో దుండగీండ్రు రాళ్లువిసరుటయు, అందుమీద గవర్నమెంటువారి రౌతులు లాటీకర్రలతో చొరబడి ప్రజలనుకొట్టి సభను ఛిన్నాభిన్నము చేయుటయు జరిగినది. ఇంత భీభత్సము జరుగుచున్నను ప్రకాశముపంతులుగారి అధ్యక్షతను సమావేశమగుచున్న సభలో విశేషముగు అలజడి ఏమియు కలుగలేదు. ప్రకాశముపంతులుగారికి మద్రాసు పౌరులలోగల పలుకుబడికి ఇదియొక ప్రబలనిదర్శనము. గవర్నమెంటువారి రౌతులచే దెబ్బలుతిన్నవారి నలదఱిని ప్రకాశముపంతులుగారు సభవారికి చూపుచు వారి దెబ్బలను గూర్చి వివరించుచుండిరి. సమావేశమైన అశేషజనములో ప్రభుత్వమువారి దౌర్జన్యమును గర్హింపనివారుగాని దెబ్బలుతినినవారికొఱకు సానుభూతి నొందనివారుగాని లేరు. ఈ దెబ్బలలో పదిఏండ్ల బాలుడొకడు స్మృతితప్పి పడిపోయెననియు వానిని సార్జెంటొకడు తన గుఱ్ఱముమీద నైచికొనిపోయెననియు ప్రత్యక్షముగ చూచినవారు తమతో చెప్పగా ప్రకాశముగారావార్తను సభికులకు తెలిపిరి. అప్పుడు సభవారిని ఒక దుఃఖతరంగము ముంచెత్తెను. ఇంతలో మరియొకదుఃఖవార్త వినవచ్చెను. స్ఫోటకవ్యాధిచే బాధపడుచున్న ప్రకాశముపంతులుగారి రెండవకుమారుడు మైలాపురమున వారియింట పరమపదించెనని వినవచ్చెను. (ఈ వార్త సత్యముకాదు. ప్రకాశముగారి ద్వితీయపుత్రుడు హనుమంతరావు స్ఫోటకవ్యాధిచే బాధపడుచుండుటయు వ్యాధి తీవ్రదశలో నుండుటయు సత్యమేకాని మరణవార్త అసత్యము. ఆ బాలుడు పూర్ణపురుషాయుషజీవియై ఆంధ్రకేసరికి అనంతగీర్తిగౌరవములు తెచ్చునుగాక!) ఎట్టి వార్త! కడుపున పుట్టిన కుమారుడు మరణించెననువార్త. అట్టివార్త వినియు ఆంధ్రకేసరి ఉపన్యాసమును విరమించలేదు. ఆయన విశాలవదనమున ఒకించుకైన విన్నదనము చూపట్టలేదు; ఉగ్రసుందరనేత్రములందు బాష్పతోయకణమైన కనిపింపలేదు; గభీర

స్వరమునందు గద్గదిక పొడసూపలేదు. ఎప్పటితీరున ఉపన్యాసము సాగించెను. చెప్ప వలసినంతయు చెప్పెను. 'ఎట్టిసమయముసను అహింసను వీడవద్దు' అని హెచ్చరించి సభ ముగించెను. హృత్పిండమును చిదుపు దుఃఖవార్త వినియు చలింపని ఈ మేరుధీరుని లోకమునకు ప్రసాదించిన ఆంధ్రమాత ఎంతటిధన్య? గాంధిమహాత్ముని ఆదేశమును ఆలించి నెలకు ఐదువేలరూపాయిల ప్రాక్టీసు వదలి దేశసేవలో దేహముసుడయ్యించిన ఆతని త్యాగబుద్ధికి—సైమన్‌కమీషను బహిష్కారణసమయమున జరిగిన అల్లరులలో స్వాతంత్ర్యవాదులగు శ్రీమానులు గారకాయవాటము చూపగా తాను ముందుకువచ్చి గుండుదెబ్బకు గుండెవిఱచి నిలిచిన ఆతని ధైర్యగరిమకు ఇది మెఱుగుపెట్టుచున్నది. అతి లోకమైన ఇట్టి ధైర్యగరిమచూపిన ఆ త్యాగమూర్తి ఇప్పుడు సత్యరస్వరాజ్యప్రాప్తికి ప్రార్థనలు సలుపుటకు ఏకంతంపు నెలవగు కారాగారమున నున్నాడు. ప్రసుప్తమైయున్న మద్రాసునగరమును ప్రబోధించియే ఆతడు కారాగారమునకాలుపెట్టినాడు. 'అవురా ధీర చరిత్ర సంతతల సంఖ్యాత ప్రభావోన్నతుల్'.

కీ. శే. వేంకమ్మగారు:—

పెనుగొండ తాలూకాబోర్డు ప్రెసిడెంటుగారగు శ్రీయుత నారాయణగారి భార్య శ్రీమతి వేంకమ్మగారు తుంకూరు బంధువుల ఇంట పెండ్లికిపోయి వచ్చుచు త్రోవలో కలరావలన స్వర్గస్థురాలైనదని వినుటకు విచారించుచున్నాము. స్వయముసంతానము లేకపోయినను ఆసతీమణి బందుగులబిడ్డల నెందరినో చేరదీసి కడుపునబుట్టినవారికంటె హెచ్చుప్రేమతో పెంచి పోషించుచుండినది. గృహకార్య నిర్వహణమునందును అతిథి జన సత్కారమునందును ఈపూజ్యురాలు ఈమెకీమెయెసాటి యనునట్లు సంచరించుచుండి నది. వేంకమ్మగారి పవిత్రాత్మకు పరమశాంతి కలుగుగాక!

ఆంధ్రదేశమున నిర్బంధపరంపరలు:—

స్వాతంత్ర్యసంపాదనోద్యమమున గుజరాతురాష్ట్రమునకు తరువాత ఆంధ్రదేశమే అమితోత్సాహము చూపుచున్నది. ఈ దోషమునకుగాను ఆంధ్రభూమియందు నిర్బంధ దేవత నిరాఘాటవిహారము సల్పుచున్నది. ఉజ్జ్వలనిష్ఠానిధి బులుసు సాంబమూర్తి, నిర్మాణకార్యక్రమనిర్వహణపటిష్ఠుడు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యము, సమంచితవక్త చెఱుకువాడ నరసింహము, ధనైకవిశ్రాణనశూరుడు కాశీనాథుని నాగేశ్వరరావు, యుగంధర ప్రతిభుడు వెన్నేటి సత్యనారాయణ, శాణవిస్ఫుష్టరత్నము భోగరాజు పట్టాభిసీతా రామయ్య, ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశంపంతులు మొదలగు ఆంధ్రమహానాయకులు అహింసావ్రతదీక్షయందు చిదిమిపెట్టిన బంటులు—హృదయవచశ్శరీరములందు పుణ్యసుధా ప్రపూర్ణులైన మహాత్ముని మనసుకెక్కిన శిష్యులు—శ్రీకృష్ణజన్మస్థానమున కేగి యున్నారు. నిర్బంధవిధానముచే స్వాతంత్ర్యోద్యమము చల్లారునదికాదని వెనుకటిసంగ

తులు వెల్లడిచేసినవి. అయినను ప్రభుత్వమువారు అనుభవమూలకముననైన జ్ఞానమును సంపాదింపనొల్లకుండుట శ్రేయోమార్గముకాదు. శిరీషపుష్పములచే ఉరువజ్రమును భేదింపనగునా?

మహాత్ముడు అజాతశత్రుడు:—

మహాత్ముడు స్వరాజ్యప్రస్థానమున అనాఖ అనుగ్రామము వచ్చెను. ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టరు మహాత్ముని ఉపన్యాసము వ్రాసి గవర్నమెంటుకు రిపోర్టుజేయుటకు అచ్చటికి వచ్చెను. ప్రజలా పోలీసు ఉద్యోగికి ఆహారపదార్థములైనను దొరకనీయలేదు. త్రాగుటకు నీరమునైన లభింపకుండజేసిరి. ఓహో! ఏమి ఆకట్టు! గాంధిమహాత్ముని చెవియందీవార్త పడెను. ఆతనిమనము కరుణారసముతో దొకదొకలాడెను. ఆతడు ప్రజల నిట్లు ప్రబోధించెను. "గవర్నమెంటు ఉద్యోగులను పస్తుపెట్టుట నామతముగాదు. మనదేశమునకంతచేసిన డయ్యరుసేనాని నన్ను గుండుపెట్టి కాల్చినను ఆతనికా సమయమున పాముకఱచినచో ఆవిషమును నేను నోటితోపీల్చి ఆతని బ్రతికించుటకు ప్రయత్నింతును." తన్ను చంపవచ్చిన శత్రువు తనచేతచిక్కినను ఆతని కెట్టిహానియు చేయక పొసగమేలుచేసి పొమ్మను పుణ్యాత్ముడు అజాతశత్రువు తలపెట్టిన కార్యమునకు విపర్యాసము వాటిల్లునేని ప్రపంచమున ధర్మమనునది లేదనవలయును.

సిద్దిక్ మాత సమర్పణము:—

జపానీయు లొకవృత్తాంతమును చెప్పెదరు. ఒకప్పుడు వారిదేశమున యుద్ధము పొడసూపినదట. ఆ సంగ్రామములో ఒక వీరాంగన నలుగురిపుత్రులు వైరివీరులను చెండాడి తుదకు వీరస్వర్గ మలంకరించిరట. సంగ్రామభూమి కంపుటకు నాకు ఇంకను పుత్రులులేరే అని ఆవీరమతి విలపించినదట. ఇది కాళ్లులేని ఉత్తకట్టుకథ అనియు, నిట్టిది జరుగుట అసంభవమనియు మేమింతవఱకు భావించితిమి. తన ప్రాణములిచ్చి అయినను తన సంతానమునుగాపాడు తల్లిచేచేతల తనబిడ్డల నందఱిని సంగ్రామరంగమునకు నమసిపోవ బంపునా? పంపుననియు, అట్టివృత్తాంతము కాళ్లులేని ఉత్తకట్టుకథ కాదనియు మేమిప్పుడు తెలిసికొంటిమి. బొంబాయినగరమున సిద్దిక్ అను మహమ్మదీయయువకుడు లవణసత్యాగ్రహసంగ్రామమున ఉత్సుకుడయ్యెను. ప్రభుత్వమువారి శిక్షాబాణమునకు గురియై చెఱసాలకేగెను. ఒక్కడేకుగు ఈపుత్రునిపై పంచప్రాణములు బోటాగ్గి జరాకృశమైన దేహమును నిలుపుకొనుచున్న ఆతనితల్లి మరియనుబీబీ ఈవృత్తాంతమును ఆలించి ఆనందతరంగితహృదయై ఇట్లు పలికెను. "నాసుతుడు ఎప్పుడు కారాగృహమునకు పోవునా అని వేగిరపడుచుంటిని. దేశస్వాతంత్ర్యసంపాదనార్థము జరుగుచున్న ఈ మహాసంగ్రామమునకు సమర్పింప నాకు నూరుమంది పుత్రులు పుట్టియుండిన బాగుండియుండునుగదా అని ఆలోచించుచున్నాను. సిద్దిక్ జననమునొందినపుడు అతడు జాతీయ

స్వాతంత్ర్యసంగ్రామములో ప్రవేశించి ఇంతటి ప్రయోజకుడు కాగలడని నేను పలవరింప నైన లేను. ప్రభుత్వమువారు శిక్షించి ఇప్పుడు ఆతని ప్రయోజకత బయలు పెట్టినారు. ఇక నేను నిశ్చింతతో ప్రాణముల విడచెదను." భారతమహిళామణులలో మఱికొందఱు మరియనుబీబీలు బయలుదేరుచో స్వరాజ్యము నిమిషములమీద లెక్కలుకట్టుకొని వచ్చి వ్రాలునని చెప్పుటకు జ్యోతిషశాస్త్రపాండిత్య మనవసరము లేదు.

"గాజుల సంఘము":—

అసహాయోద్యమ దినములలో కొంతవఱకు మహాత్మునకు ప్రతిబంధపు పేరటాండ్రయియుండిన స్త్రీలిప్పుడు ఆతనికి బాసటమై నిల్చుచున్నారు. నిల్చుటయేగాదు. పారి పోవుచున్న పురుషులకు బుద్ధిచెప్పి నిలువరించుచున్నారు. స్వరాజ్యవ్రతదీక్షవహింప పౌరుషరహితులగు పురుషులకు గాజులను పంపి వారు దేశీయోద్యమమునకు ప్రోత్సాహము కల్గించుచున్నారు. భిత్తిబిడాలములగు శ్రీనివాసయ్యంగారు, సత్యమూర్తిగార్లకు వారు గాజులను పంపినట్లు సద్యోవార్తలు వినవచ్చుచున్నవి. అప్పటినుండి సత్యమూర్తిగారు విదేశవస్త్ర బహిష్కరణ విషయమున ముందుకు వచ్చుచున్నను అయ్యంగారు మాత్రము అయిపులేదు. అయిపుజాడలేని ఆయనగారి సంగతియేల? ఇదికనుడు—దేశీయ గాజుల సంఘము అనుపేరట ఢిల్లీలో నొక సంఘము నేర్పరచి పనిచేయుచున్న 100 మంది స్త్రీలు ఢిల్లీలో గడియారస్తంభము నొద్దను యితరచోట్లను విదేశవస్త్రముల దుకాణములవద్ద పికెటింగు ప్రారంభించిరి. ఈదుకాణములవద్ద విదేశవస్త్రములను కొనుటకు పురుషులెవరైన వచ్చినచో వీరు వారికి గాజుల నిచ్చుచుందురు. ఒక దుకాణమువద్దకు విదేశ వస్త్రములను కొనుట కొక పురుషుడు వచ్చెను. వెంటనే ఒక స్త్రీ అతనికి రెండుగాజుల నిచ్చెను. "విదేశవస్త్రములను బహిష్కరించుటకు తగిన ధైర్యము నీకు లేకపోయినచో నీవు యింటికిపోయి యీ గాజులను తొడుగుకొని ఘోషాస్త్రీవలె మేలిముసుగు వేసు కొనుము." అని చెప్పెను. ఆమె చేతికొక విదేశపు రిస్టువాచీయున్నది. "మీరు దానిని తీసివేయుకుండ నాకెటుల బోధింపబూనితిరి?" అని ఆతడడిగెను. ఆమె వెంటనే ఆ వాచిని పగులగొట్టి పారవేసెను. అతడుగూడ వెంటనే తనఒంటనున్న విదేశవస్త్రముల నన్నిటిని తీసివేసి ఖద్దరు కట్టుకొని తనబండిలో వెడలిపోయెను. ప్రజలందరును జయజయధ్వాను లొనరించిరి. ఇంకొక దుకాణమువద్ద నొక పోలీసుఉద్యోగి విదేశవస్త్రములను కొను టకు వచ్చెను. ఒక స్త్రీ రెండుగాజుల నిచ్చెను. అతడు తృణీకారముగా వానిని పగుల గొట్టి పారవేసెను. ఆమె వెంటనే ఒక కత్తినితీసి అతనికిచ్చి "మొదట దీనితో నన్ను పొడిచివేసి పిమ్మట విదేశవస్త్రములను కొనుము"అని చెప్పెను. అతడు నిర్ఘాంత పోయెను. "ఇటుపైని నేనెన్నడును విదేశవస్త్రములను కొనను"అని వాగ్దానము చేసి ఆతడు వెడలిపోయెను. ప్రబోధమతియగు స్త్రీ తలపెట్టినచో ఎవ్వరు మారకుందురు?

ఎలక్ట్రిక్ బంగారుగిల్టు, ఇమిటేషన్ రవలతో సమానముగు ఆభరణములు. చూచువారు అసల్ బంగారు, రవలతో చేయబడిన ఆభరణములని భ్రమించునట్లు దిగ్భ్రమ కలుగజేయును. 5 సంవత్సరములు గ్యారంటిగలది.



No. 1. ఇమిటేషన్ తెల్లరాళ్లతో చెక్కబడిన కొండతిరుగుడుబిళ్ల 1-8-0
బంగారుగిల్టు చేమంతిపువ్వు 0-12-0

No. 2. బంగారుగిల్టు అంసవరములదండ 7-0-0
కాలు "సవరములుదండ 6-0-0

No. 3. ఇమిటేషన్ తెల్లరవలఅడ్డిగె దీనిని అసల్ రవలఅడ్డిగయలె తీగలోగుచ్చబడి మోపువుంచినది 14-0-0
పుచ్చేరిసాదాఅడ్డిగె పతకముతో 2-12-0
చెయిన్ అడ్డిగె తెల్లరాళ్ల పతకముతో 6-0-0

No. 4. ఇమిటేషన్ తెల్లరాళ్లు చెక్కిన రవలగాజులు జత 1-కి 7-0-0
బంగారుగిల్టు సాదాగాజులు
ఇందులో అనేక మోస్తరులు గలవు. జత 1-కి 1-8-0

No. 5. ఇమిటేషన్ తెల్లరాళ్లు చెక్కబడిన జడనాగం అసల్ రవలవలె జ్వలించును 4-0-0
మూడువరుసలు గజ్జలుకట్టిన బంగారుగిల్టు కృష్ణజడ నాగరం 1-6-0

No. 6. ఇమిటేషన్ తెల్లరాళ్లు చెక్కిన మాటీలు జత 1-కి 3-0-0

No. 7. మల్లెపూవుల ఒడ్యాణము పెద్దదిగ చేయుటకును చిన్నదిగ చేయుటకును చిన్నగుండ్లు అమర్చబడి యున్నది.
సాదాగజ్జలుకట్టినఒడ్యాణము పెద్దది 5-0-0
చిన్నసైజు 4-0-0

No. 8. క్రొత్తమోస్తరు పాముమెలిక వలె గజ్జలుకట్టిన ఒడ్యాణము పెద్దది 6-0-0
చిన్నసైజు 5-0-0

ఇంకను ఇందులో వివరింపబడని ఆభరణములు యెన్నియో గలవు. కావలసి కోరి వ్రాయువారికి పంపబడును.

వెడ్లాక్ కంపెని, పార్కుటౌను, మదరాసు.



## మాటలాడు చిత్రపటములు!

ఈ చిత్రపటములు జర్మనీ దేశమున నవీనపరిశోధనల వలన గనిపెట్టబడినవి. అతినైపుణ్యముతో సెట్లో వీనికి ప్రాణమున్నట్లు తోపజేసిరి. ఈ పటముల నొకభాగమున నదిమినచో నతిచిత్రముగ ననేక విధములగు మాటలను పలుకును. పిల్లి యఱుచునట్లు కుక్క మొఱుగునట్లు పెద్దపులి గాండ్రించునట్లు పక్షులు పాడునట్లు బిడ్డ యఱచునట్లు మనుష్యులు మాట్లాడినట్లు, వివిధముగ వర్ణింపదరముగాని పలుకుల నెన్నిటినో పలుకును. ఇదివఱకెన్నడును కని విని యెఱుగని యాశ్చర్యము దీనియందు గలదు. వీనిని మీ చొక్కా జేబులలో నుంచుకొని యితరులు దిగ్భ్రమ జెందునట్లు, వారికి దెలియకనే యింద్రజాలమట్లు పలికింపవచ్చును.

అందమయిన మాట్లాడు 12 పటముల సెట్టు రు. 2-8-0 వి. పి. ఎస్ & కంపెని, పార్కుటవున్, మదరాసు.



## అద్భుతమైన చిన్న కుట్రపు మెషిన్

ఈ చిన్న సైజుకుట్టుమెషిన్ సీమలో తయారుచేయబడినది. దీనితో అందరును పెద్ద కుట్టుమిషన్‌లో కుట్టునట్లు ఇంటిలోవుండు స్త్రీలు బాలికలు అన్నివిధములైన కుట్టుపనుల సులభముగా చేయవచ్చును.

రకం పెద్దది 1-కి రు 7-0-0 పోస్టేజి. ర్పు 1-4-0 రకం చిన్నది 1-కి రు 3-0-0 పోస్టేజిఅ. 11

పి. కె. స్వామి & కంపెని, పార్కుటవున్, మదరాసు.

# ఉపాధ్యాయులు



టి. వి. సుందరరామయ్యగారు, వారి

సతీమణియు, శిశువులు, లోధ్రుడు,

లోధ్రిణియును.

మ-రా-రా-శ్రీ
డాక్టరు కే. ఎన్. కేసరిగారికి,
కేసరికుటీరము,
మదరాసు.

అయ్యా,

అత్యద్భుతమగు తమ 'లోధ్ర' వలన మాకుటుంబమునకొనగూడిన మేలును వర్ణింపనశక్యము. 13 వత్సరములుగ కాపురము చేయుచుండియు మాకు సంతాన భాగ్యము లేకుండెను. ఇక ప్రాప్తి లేదని ఆశ వదలుకొంటిని. హఠాత్తుగ తమ 'లోధ్ర' ను గూర్చివిని, ఒక బుడ్డిని కొని నాభార్యకిచ్చితిని. ఇపుడామెకిరువురు శిశువులు పుట్టినందులకు సంతోషించుచున్నాను. వారికి లోధ్రుడు లోధ్రిణి అని నామకరణము చేసితిని. ఇరువురును ఆరోగ్యముగనున్నారు.

టి. వి. సుందరరామయ్య
ఉపాధ్యాయుడు,
రేణిగుంట.

N. B. లోధ్ర అన్నిమందుల షాపులలో దొరకును.

# భూస్వామి




కే ఎల్. శర్మగారు, వారిభార్య,
బిడ్డ కేసరిబాయి.

డాక్టరు కే. ఎస్. కేసరిగారు

కేసరికుటీరము.

మదరాసు.

అయ్యా,

నాభార్య సంవత్సరము ఆరునెలలుగా కడుపు నొప్పితో బాధపడుచుండినది. అనేకమందు నువాడితిని, యింజెక్షనుల నిప్పించితిని గాని ప్రయోజనము లేకపోయెను. 20 దినములకు 'లోధ్ర' ను వాడగనే నొప్పి కొంతతగ్గెను. మరి 20 దినములకు వాడగా నొప్పి పూర్తిగపోయి, గర్భవతియైనది. నాల్గవ మాసము నుండి లోధ్రతోడ, గర్భరక్షకయు క్షీరబలాతైలము నిచ్చితిని. సకాలమున స్త్రీ ప్రజను సుఖ ప్రసవమైనది. కేసరిబాయియని శిశువునకు నామకరణముచేసినాను.

ఇట్లు

కే. ఎల్. శర్మ

భూస్వామి, ఒంగోలు

## నిష్పక్షపాతియగు ఇంగ్లీషు వైద్యురాలు



శ్రీమతి అన్నా తామస్ గారు

సూపరింటెండెంటు,

మెటర్నిటీ & చైల్డ్ వెల్ఫేరు,

బెంగళూరు.

హెల్త్ & ఇన్ఫెంట్సు వెల్ఫేర్

బెంగళూరు.

డా. కేసరిగారికి,

ఆర్యా,

ఇంగ్లీషు అవుషధములవల్ల గుణము లేనందున తమ 'లోధ్ర' ను నా సోదరికి వాడితిని. ఆమెకు ఆశ్చర్యమయిన గుణమునిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీద ఈయావుషధమును నారోగులకు వాడెదను.

ఇట్లు

డాక్టరు అన్నతామున్‌గారు

సుఖ కుటుంబము.



పండీత హనుమంతరావుగారు, వారి సతీమణి,

"శిశువు భీమకేసరి".

బెంగుళూరు.

డాక్టరు. కే. ఎన్. కేసరిగారికి,

కేసరి కుటీరము,

ఎగ్మూరు, మద్రాసు.

ఆర్యా,

గతవారము నా భార్య సుపుత్ర రత్నమును కనినందులకు చాల సంతసించి మీకు దెలియపఱచుచున్నాడను. మీ "లోధ్ర" యెల్లప్పుడును నా కుటుంబమున జ్ఞాపకముండును. నాభార్య గర్భముదాల్చిన వెనుక మీ "గర్భ రక్షక" వటిని వాడినందున చాల మేలు కలిగినది. మీరు వివరించిన విధముగ శిశువు బంగారువర్ణముగ నున్నాడు. "భీమకేసరి" యని శిశువునకు నామకరణము చేసితిని. నా కృతజ్ఞతను తమకెట్లు వెల్లడింపగలను? లోకమున జన సామాన్యమునకును, ముఖ్యముగ స్త్రీలకును మేలొనకూర్చుటకై, మీకు చిరాయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కల్గించునట్లు దైవమును ప్రార్థించుచున్నాడను.

పండిత. కే. హనుమంతరావు.

గవర్నమెంటు ట్రాన్సులేటరు.

## విషయసూచిక.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# రజోదర్శిని

తిమ్మసముద్రము

ఆర్యా 28—5—29

"..........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకోనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను. చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

ఆర్షరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)




# నృత్యము



శ్రీవిష్ణుమూర్తిని తాండవకృష్ణనామమునను, ఈశ్వరుని నటరాజనామమునను కొలుచు నేరుపుగల కళారసికులు భారతీయులు. కావుననే వారు నృత్యమును గణనాతీతకాలమునుండియు నొక లలితకళగా పరిగణించుచు ఏతత్కళాకృషికై ఒకకులమును దేవదాసికులమనుపేర ప్రత్యేక పఱిచి యున్నారు. ఆదేవదాసీలయెడ భారతీయులు మాన్యతఉంచి వారికి సుఖజీవనమును, కళాకృషికి అవసరమగు అవకాశమును కలుగుటకై మాన్యముల నొసగిరి. ఆదేవదాసీలు ఆజన్మము బ్రహ్మచారిణులై తమకులవిద్యయగు నృత్యమును భగవత్కైంకర్యమునకై పెచ్చుబెట్టుచు నియమబద్ధమైన జీవనము చేయుచుండిరి. కాని కలిపురుషునిసోదరుడగు కాలపురుషుడు ఆవేశించి వారిచే నియమబద్ధజీవితమునకు నివాపాంజలి ఇప్పించెను. అందుతో వారు స్వేచ్ఛావర్తనము స్వీకరించిరి. ఫలమేమి కలిగినది? మాన్యములుండినవి; కాని వారికి మాన్యతపోయినది. వారికులమునకు, వారికులవిద్యగా ఏర్పడిన నృత్యమునకు నైచ్యము ఆపాదితమైనది. కలిగిన సంస్కారావబోధమున దేవదాసీలనిన లోకము కంటగించుకొన సాగినది. లోకమువారి కంటగింపు, లోలోన తమవృత్తి యెడగలిగిన ఏవగింపు ఏకమై కళావంతులను వివాహసంస్కారమునకు ప్రేరేచినవి. ఇప్పుడువారిలో వివాహములు విరివిగా జరుగుచున్నవి. ఇదిసంతోషింపదగినవిషయమే. కాని బ్రహ్మచారిణులైవారింతవఱకు నిలుపుకొనివచ్చిన నాట్యకళయొక్క భవితవ్యమేమి? ఇకనది నశించిపోవలసినదేనా?

పోఁగూడదు. అట్టి ఉత్తమకళ నశించిపోకుండ పారంపర్యముగ వెలసియుండుటకు అనువైనమార్గము కళాప్రియులగు భారతీయులు అన్వేషించి అవలంబింపవలసియున్నది. అవలంబింపవలసిన అట్టిమార్గము ప్రతిభారతీయాంగనయు నాట్యకళాకృషి చేయుటయే అనిమాయభిప్రాయము.

ప్రతిస్త్రీయు నాట్యకళాకృషి చేయువలయునని చెప్పుట ప్రస్తుతపరిస్థితులలో చాల మందికి వింతగనుండునని మే మంగీకరింతుము. నృత్యవిద్య ప్రస్తుతము మిక్కిలినీచముగ పరిగణింపబడుచున్నది. కాని ఒకప్పుడది అనంతగౌరవము నందియుండినది. పురాణదంపతులగు పార్వతీపరమేశ్వరులు ఈకళను అభిమానించుటయేగాక వారు ప్రత్యేకముగ లాస్య తాండవములను నృత్యభేదములకు జనిస్థానములైయున్నారు. ఉష, ఉత్తర మున్నగు పౌరాణికరమణీమణులును; మాళవిక మొదలగు ఐతిహాసికమహిళామణులును ఈవిద్యను ఆదరముతో నేర్చిరి. స్త్రీలు నేర్వదగిన విద్యలలో నిదియొకటిగా మనశాస్త్రములు గొంతెత్తి చాటుచున్నవి. అదియునుగాక నాట్యకళ మనస్త్రీలకు క్రొత్తగాదు. వారు చిన్నతనముం ఆడు తొక్కుడుబిళ్లఆట ఒకమోస్తరు ఒంటికాలినృత్య మనదగును. ఒప్పులగుప్ప, చెమ్మచెక్క, వానావల్లప్ప, కోలాటము మున్నగు ఆటలయందుకూడ నాట్యకళాబీజము లున్నవి. కులపాలికలు నిత్యము మడిచేతులుకట్టుకొని చిన్నిఅంగలువైచుచు తులసికోటకు ప్రదక్షిణించుటలోఁగూడ నాట్యకళాబీజము కలదు. ఇట్లు మనస్త్రీలకు తెలియకయే నాట్యకళ వారిపరిచయభాగ్యము నందియున్నది. సంగీతమును కులస్త్రీలు నేర్చుచునేయున్నారు. అయినప్పుడిక సంగీతమునకు వేతనాంగములుమాత్రమేయగు నృత్యాభినయములను నేర్చుటకుమాత్రము వింతపడనేల? నృత్యకళ పురాణదంపతులు పార్వతీపరమేశ్వరులు పుట్టించినది; ప్రాక్తనభారతాంగనలు నేర్చినది; శాస్త్రములు సమ్మతించినది; ఆటపాటలతో మనఅంగనలకు పరిచయమగుచున్నది. కాగా ఇకదానిని మనస్త్రీలు అవలంబించుటలో సందేహింపనక్కఱలేదు.

సందేహింపక నృత్యకళ నవలంబింపవలయుననుటలో కులస్త్రీలు నాట్యాంగనలవలె బహిరంగముగనృత్యముచేయవలయుననికాని, పాశ్చాత్యస్త్రీలవలె అశుచిప్రాపకమగు నృత్యముచేయవలయుననికాని మాతలంపుగాదు. మతిమాలినగొడ్డులెవరైన నట్టు లవలంబింప నుపదేశించినను మతప్రవిష్టమగు మానసమునకు నోచిపుట్టిన భారతాంగనలట్టివిపరీత పద్ధతులకు కలలోఁగూడ ఒప్పుకోలేరు. అయితే ఇకమనస్త్రీలవలంబించుటకనువైననాట్య విధానమేది? పరమసుగుభక్తితో, పవిత్రమగుభావముతో వారు తమ లోపెరడులయందు మహాలక్ష్మీతులసిని ప్రార్థించుటలో పద్యములు పెట్టుటకు, పాటలుపాడుటకు, ప్రదక్షిణముసలుపుటకు, నమస్కారముగావించుటకు తన్మయత తెచ్చిపెట్టునృత్యమును తోడుచేయుటయే.

కులసతులు ఇట్లుఅవలంబించుటచే కళకు నేను పట్టియున్న నైచ్యముపోయి ఉచితగౌరవము ఘటిల్లును. ఆకళ ఇంటింట వెలయుటచే దానికి తగినపోషణము కలుగును. అది పారంపర్యముగ వెలయుటకు వీలును ఏర్పడును. స్త్రీలు నృత్యవిద్య నేర్చుటచే దానికి గౌరవము, పోషణము, పారంపర్యము కలుగుటయేగాక దానివలన స్త్రీలకొకమంచిప్రయోజనముకూడ కలుగును. అది ఏదియందురా? ప్రస్తుతసాంఘికపరిస్థితులలో మన స్త్రీలు బయటకువచ్చి టెన్నిసు మొదలైన ఆటలనాడి తమ దేహారోగ్యమును బాగుగా పెంపొందించుటకొఱకు ఉచితమైన వ్యాయామమును గొనన తగునవకాశములులేవు. కావున వారికి ఇంటియందే తగిన వ్యాయామమును కల్పింపవలసియున్నది. అందుకు ఉదయాస్తమయములందు తులసిపూజాకల్పములో నృత్యము మేళవించుట ప్రయోజనకారిగాగలదు. ఈ పద్ధతి నవలంబింతురేని మన స్త్రీలు లోపానుననున్న కళకు గౌరవము తెచ్చినవారును, దానికి పోషణమిచ్చినవారును, పారంపర్యమును ప్రసాదించినవారును అగుదురు. ఇట్టి పరార్థసంపాదనమునకు తోడు వారు స్వార్థమున తమ సర్వాంగకములకు పరిశ్రమను కల్పించు నొకానొక వ్యాయామపద్ధతిని కల్పించుకొనినవారును అగుదురు. కావున స్త్రీలు దీని నవలంబించునట్లు వృద్ధులు ఆదేశింతురుగాక; యువకులు ప్రోత్సహింతురుగాక! ప్రతి ఆర్యగృహమును నాట్యకళామందిరమై క్రాలుగాక!

# విదుల

ఆంధ్ర శేషగిరిరావు గారు బి. యె. సారస్వతసమాజము

కొడుకుఁ గాంచు రాచకూతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైన సమయ
మొదవె దడయుటింక నొప్పదు జనములు
నట్లుగాని పురుషుఁ డనరు నిన్ను.

—మహాభారతము.

పుట్టినది కత్తివలె కార్కశ్యమువహించు నేరుపు, కత్తితోడ ధర్మమువాటించు తెగువగల క్షత్రియకులమున. అందును విదుల వీరహృదయమునకు నోచిపుట్టినది. కాగా ఆమె కులధర్మమును కూలద్రోసి జీవితకాంక్షియై ప్రధనభూమినుండి పాఱివచ్చిన పుత్రుని ఎట్లు మన్నింపగలదు? మన్నింపనేరదు కావుననే ఆమె సింధురాజుతో యుద్ధమున ఓడి దీనుడై ఇంటికివచ్చి పడియున్న తనసుతుని సంజయుని తిలకించి ఇట్లు తిరస్కరించిపలికెను.

"నీవును ఒకవీరునివలె తలయెత్తి రాజ్యము వీరభోజ్యమని ఏమేమో వీరవచనములు పలుకుచు సింధురాజుపై ఎత్తివెళ్లితివి. జడిపింపబోయి జడిసివచ్చితివి. వీరమును విరమించి, పౌరుషమును పోనాడి పాఱివచ్చి నపుంసకనిరీతిని ఇంటబడి ఆయుశ్శేషమును వెళ్లద్రోయనిశ్చయించిన నీవు క్షత్రియాణినైన నాకడుపు చెఱుపబుట్టిన పురుగువుకాని

పుత్రుడవుకావు. ప్రాణసంశయదశ వచ్చినను పరాక్రమించుటయేగాని నడమ త్రిప్పియెఱుగని నీకొలముసాములు నీ ఈచేతకు ఘోఁడుఘోఁడున దుఃఖించుచున్నారు. అదిగో! చూడుము. ఇకనైనను పిఱికితనమును పోద్రోలి పితృపితామహాదిపరంపరాప్రాప్తమైన ధర్మమును పాలింప నడుముకట్టుము. కులోచితధర్మమును పాలించుటలో జయలక్ష్మిచే వరింపబడుటయో మృత్యుదేవతను వరించుటయో చేయుము. తండ్రితాతల చరిత్రలను తలపోసి యుద్ధమునకు కడంగుము. నిర్వీర్యుడవగు నిన్ను కొడుకుగా చెప్పుకొనుటకు నాకు సిగ్గగుచున్నది. క్షత్రియసతి ఎవ్వతియు నీవంటి పిఱికివానిని పుత్రునిగా బడయకుండుగాక!"

కుత్తుకబంటివఱకు పిఱికిమందు త్రాగిన సంజయునెడ విదులవీరవచనములు చెవిటికి సంకూదినట్లయ్యెను. మార్పులేనిమనమున అతడు తల్లిని ఇట్లు అడిగెను. "అమ్మా! నేను యుద్ధమున ప్రాణములు విడచినపిమ్మట నీకేసమస్తరాజ్యాధికార మొదవినను దాని వలన కలుగగల లాభమేమి?"

అందుమీఁద విదుల కోపవతియయ్యెను. తుటారించి తనయునితో నిట్లుపలికెను. "ఓరీ! పౌరుషహీనుడా! నేను చావుబ్రతుకులనుగూర్చి ఆలోచించుటలేదు. రాజ్యాధికారమును అభిలషించుటలేదు. ధర్మనాశనమునకు, కీర్తిభ్రంశమునకును వాపోవుచున్నాను. శక్తికొలది పరాక్రమముచూపక ప్రాణము బెల్లమువలె దాచుకొను నీవంటి క్షత్రియుడు చోరునికంటె అధముడు. పిఱికితనమెఱుగని పేరుగలకులమున బుట్టినవాడవగుట నీవు తిరిగి యుద్ధమునకు రాకమానవని సింధురాజుసైనికులు ఇంకను బెదరుచున్నారు. నీవది యెఱుగక గాజులు తొడుగుకొని అంతఃపురమున అటమటించుచున్నావు. ఎంత దాచిపెట్టినను ఎప్పుడో ఒకప్పుడు పోవునదియేకాని ఈదేహము ఏండ్లునుపూండ్లును ఉండునదికాదు. కావున సమరమునకు సమకొనుము. సింధురాజు రాజ్యమును ఆక్రమింపగా అన్నోదకములకు మొగమువాచి అహర్నిశములు పరితపించుచు బ్రతుకుటకంటె దుఃఖకరమైనవిషయము మఱియొకటిలేదు. ఉత్తమకులమున పుట్టితిని. ఉత్తమకులమును చొచ్చితిని. కాంతుడెంతయు గౌరవమునచూడ మెలగితిని. భక్తిపురస్సరమైన నీశుశ్రూషకు నోచితిని. ఇన్నిట నింతటి ప్రసిద్ధిగాంచి ఇక నవియన్నియు విడనాడి నేను విచారమున మ్రగ్గుచుండగా చూచినతరువాత నీప్రాణములు నిలిచి ఫలమేమి? కావున మనస్సు ఇనుముచేసికొనుము. కదనభూమికి నడువుము. సమ్యగ్జయమునుపొంది పెద్దలు నీకుపెట్టిన సంజయనామము సార్థకముచేసికొనుము. క్షత్రబంధువుమాత్రమవై శాశ్వతమైన అపకీర్తికూపమున బడిపోవకుము."

ఈవాక్యములు సంజయునకు వినిపించినవి. అయినను ఆతనికి వివేకము కలుగలేదు. కావుననే ఆతడు "తల్లీ! నీహృదయము అమోఘమము కాని రక్తమాంసమయము కాదు. అట్లీకాదేని ఏకపుత్రవిషయమున నీవింతటి కఠిననీతి నవలంబింపగలవా?" అని ప్రశ్నింప ఇంచుకయు సందేహింపకపోయెను.

విదుల ఈప్రశ్న విన్నది. అంతతో ఆమెకు కొలదిఇడరానికోపము వచ్చినది; వివరింపరానివిషాదము కలిగినది. ఆవేశమునొంది "ఓరీ! కులపాంసనుడా! క్షతమువలననే త్రాణముకావించుట ధర్మముగాగల క్షత్రియకులమున పుట్టియు నీవు మనయింటి పిల్లిసమ్మతము పలుకనోల్లని పిఱికిమాటలు పలుకుచున్నావు. కులధర్మము కూలద్రోయు నీవంటి కొడుకును కనటకంటె అంగన గొడ్డురాలైయుండుట మేలు. ఆలసింపక అనికిలేచి నిన్ను కనుటలో నేపడిన గర్భవేదన సఫలపఱచుటయో, పౌరుషహీనుడై ఇచ్చట నేపడియుండి బ్రతికియు చచ్చినవాడవగుటయో చేయుము. మాతృయావన వనకుఠారమవై పుట్టిన నీవు పురిటిలోనె సందుకొట్టి...ఛీ! నానోట అట్టిమాట అనిపింపకుము." అని ఆమె ఒత్తిపలికినది.

విదులపలికిన ఈ వీరవచనములకు కొయ్యలుకూడ ఉక్కెక్కి ఉలికిపడినవి. గుఱిచూచి తల్లివైచిన వాఙ్మయశరములు ఈమారు సంజయునకు మెఱుపుదెబ్బలవలె తగిలినవి. ఆతీక్ష్ణప్రభాక్షతములచే నాతడు ప్రాణములతోడిజన్మాంతరముపొందెను. అందుతో ఆతనికి అంతదనుక ప్రాణములమీద నిలచియున్న ఆశ కీర్తివైపుమొగ్గినది. తోడనే కవచముధరించి,కత్తిబట్టి, తుమికికొఱవివలె ప్రజ్వరిల్లుచు నాతడు ప్రధనభూమికి పరుగువెట్టెను. సమరరంగమునకు దుముకుచున్న సంజయునికాంచి అంతవఱకు విదులవిశాలవదనము పాదుకొనియున్న వైవర్ణ్యము విచ్చిపోయెను; ఆస్థానమున తీక్ష్ణమైన వికాసము తీగలువెట్టెను. ఇక అనంతరకథతో మనకు ప్రసక్తిలేదు.

ప్రసక్తింపవలసినది విదుల వీరత్వము. ఏక పుత్రవిషయమైనను ఆవీరమాతి ఎంతటి కాఠిన్యమువహించినదో! రాచకూతురు కొడుకునుగాంచుట ఎందులకు? వీరమాత అనిపించుకొనుటకేగదా? ధర్మార్పితమైన ఆ వీరాంగనహృదయమున ప్రేమకును, ధర్మమునకును, కొంచెమేని పోరాటము పొసగనేలేదు. తొలుతనే ఆమె ధర్మముదెస మ్రొల్లుచూపుటచే ప్రేమకు ప్రసక్తియే లేకపోయినది. ధర్మముకొఱకు భారతాంగన ప్రాణాధికమగు తన సంతానమును సమర్పించుటకైన జంకదు. ఆమెకు ధర్మముముందు; తరువాత తాను. వీరాంగన విదులచరిత్రము ఈవిషయము ఆరూఢముచేయుచున్నది.

ఉగ్రవైరివిజయియొండె మృతుండొండె
నాజిభూమి నెప్పుడగు దనూజుం
డపుడు గర్భదుఃఖ మతివకు సఫలత
బొందననితెలంతు పుడమియందు.

—మార్కండేయపురాణము.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! ఆసేతుశీతనగరపర్యంతమైన మనభారతావనియందంతట స్వరాజ్యోద్యమ మొక్క విధముగా విజృంభింతమై దిగ్భ్రమ గలుగ జేయుచున్నది. దేశనాయకు లెల్లను బందీకృతులైనారు. తుదకు మహాత్ముఁడుగూడ ప్రభుత్వవశగతుడైనాఁడు. అయినను భయములేదు; విచారములేదు. తల్లి బిడ్డ నాశీర్వదించి చెఱసాల కంపుచున్నది. భార్య భర్తను బందీకృతుడవుగమ్మని బహూకరించి వీడ్కొలుపుచున్నది. అహాహా! ఎందుల కీయుత్సాహము? చెఱసాల దివ్యభవనమా? చెఱసాలభోజనము దివ్యభోజనమా? కాదే! అయినను కష్టానుభవములకై వీరి కింతకుతూహలమేల? ఎందుల కీజనసముదాయమున కీయుద్యమముపై నింతప్రీతి? సత్యము త్యాగము అహింసయ నెడి సూత్రత్రయముచే నిర్మితమైన ఈమహోద్యమమునకు మహాపవిత్రుఁడును, సాధుమూర్తియునగు శ్రీమహాత్మా గాంధి తండ్రియనదగువాడును నగుటయే యీయుద్యమమునకింతపూజ్యతయు, వ్యాప్తియు గల్గుటకు కారణము.

లోకమెప్పుడును సంపదను లెక్కసేయదు. అధికారమును మన్నింపదు. బలమును గణింపదు. పాండిత్యప్రకర్షను చూడదు. సత్యమునే లక్షించును. త్యాగమునే హర్షించును. అహింసనే గౌరవించును. లోకైకపూజ్యుడగు మహాత్ముని యందీసుగుణము లెల్ల విరాజిల్లుచుండుటచేతనే నిఖిలప్రపంచ మాతని పూజించుచున్నది. ప్రేమించుచున్నది. ఆహా! ఇట్టి మహనీయవ్యక్తి పరమపావనమైన మన భారతదేశమున నుదయించుటయు, ఈపూజ్యచరితునకు మనము సమకాలికుల మగుటయు నాతని సత్యత్యాగఅహింసాత్మికమగు ధార్మికోద్యమమును కన్నులారగాంచగల్గుటయు నిజముగా మనభాగ్యమే.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే
శ్లో॥ యదా యదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం.

'ఏకాలమున ధర్మమునకు హానికలుగునో, అధర్మమునకు వృద్ధికలుగునో యప్పుడెల్ల నేను వచ్చుచున్నాను' అను శ్రీగీతావచనప్రకారము శ్రీమహాత్ముడు ఉదయించి యున్నాడు. తల్లి దుర్భరమగు గర్భక్లేశము ననుభవించుటవలననే పున్నమచంద్రునివంటి కుమారుని బడయగలిగినట్లు మనదేశము పరాధీనతాదిక్లేశము లనుభవించుటవలనచే యిట్టి మహాపురుషుని గాంచగల్గెను. పేదల ప్రోచుట, దీనుల రక్షించుట, పరాధీనుల బంధవిముక్తులను గావించుట ఎప్పుడును సజ్జనుల కర్తవ్యము. నేడు లోకైకపూజ్యుడగు మహాత్ముఁడుగూడ నిజదేశపు దుస్థితిగని దుఃఖాగ్రుడై నిట్టి మహాత్కార్యమును పూనుకొనినాడు. ఈమహాపర్వసమయమున నామహాత్ముని యుద్యమములోఁజేరి కార్యపరతంత్రులైనవారు ధన్యులు. వానరయూథములు రామకార్యమున పాల్గొని పావనమైనట్లు నేడు మహాత్ముని యుద్యమమున పాల్గొనిన వారెల్ల పునీతులగుదురు. నేటి యీధార్మికయుద్ధము బాహుబల

మునకు సంబంధించినదిగాదు. శస్త్రాస్త్రములతో గూడినదికాదు. కేవలము ప్రభుత్వముతో పోరాడుటే దీనిలక్ష్యముకాదు. దయాసత్యశౌచవిహీనమై విదేశవ్యామోహావల్లరు లందగిలి ఆత్మగౌరవమును గోల్పోయి కర్తవ్యములు మఱచియున్న భారతజాతికి చిత్త సంస్కారముగావించి కర్తవ్యపరాయణులఁజేయుటయే నేటి మహాత్ముని శాంతిసమరము యొక్క పరమార్థము. ఈధార్మికసమరములో భారతదేశమునందుదయించిన యేవ్యక్తియు చేరకయుండుటకు వీలులేదు. ఎవరు దీనికి దూరులగుదురో వారు ధర్మమునకు దూరులు; సత్యమునకు దూరులు; పరమాత్మునకే దూరులు. కల్పలతా! ఇట్టి సత్యమయమునగూడ ఆత్మోపలబ్ధిని బడయజాలనివారు నిజముగా సర్వదూరులగుట నిక్కముగదా! అయితే ఇందు మనస్త్రీల కర్తవ్యమేమి? అది యిపుడు మనము యోచింపవలసినమాట. కాని దీనికింతగా యోచించవలసిన పని ఏమి? రాముని వెనువెంటతరలిన సీతాసాధ్వీమణి చందమున ననవరతము మహాత్ముని యడగుజాడలనడచుచు పుత్రులును, భర్తయుగూడ బందీకృతులైనను నిరుత్సాహమనునది లేక చింతయనునదియెఱుగక దాదాపు అరువదేండ్లు సమీపించినను వ్యగ్రోత్సాహముతో కార్యరంగమున నిలిచి పనిచేయుచున్న బాపుజీ ప్రియపత్ని కస్తూరిబాయియే మనస్త్రీలకాదర్శము. మహాత్ముడు చెఱసాలకేగునపుడు భార్యకేమి చెప్పవలెదురనియడుగ "నేనేమియుచెప్పనక్కఱలేదు. ఆమె చాలధీరురాలు" అనెనట. నేడు భారతనారీమణులెల్ల రట్టిధీరురాండ్రుకావలెను. జిలుగువస్త్రములందును, నాగరికపుపరికరములందును, భోగద్రవ్యములందును మోహమును విడనాడుకొనవలెను. ఆత్మసమర్పణమునకు భారతసాధ్వి పేరుమోసినది. కష్టసహిష్ణుత నామెకు నేర్పవలసిన పని లేదు. త్యాగశీలత నామె వల్లెవేసినపాఠమే. ఆమెకు కావలసిన దెల్ల స్వాతంత్ర్యము. భారతదేశము బ్రిటిషుప్రభుత్వవశగతమైయున్నట్లు భారతసాధ్వి పురుషహస్తగతమై యున్నది. ఆపిడికిలి సడలెనా భారతమహిళ సామర్థ్యజ్యోతియొక్కయుజ్వలకాంతి దృగ్గోచరమగును. అదిగో! అపుడే కనుము. భర్తలయొక్కఆజ్ఞచే స్వతంత్రతనుబడసి కార్య క్షేత్రమున ప్రవేశించిన భారతమహిళామతల్లుల యుజ్వలనామములెట్లు పునఃపునఃపఠనీయములై తనరారుచున్నవో? ఆంధ్రదేశమున లక్ష్మీబాయమ్మ, మద్రాసురాజధానీనగరమున దుర్గాబాయమ్మ, గుజరాతిరాజ్యమున కస్తూరిబాయి, బొంబాయియందు కమలాదేవి ఛటోపాధ్యాయిని సరోజినీదేవులు, సంయుక్తరాష్ట్రములలో నెహ్రూకుటుంబపు అత్త కోడండ్రు యెట్లు కార్యశూరురాండ్రై విరాజిల్లుచున్నారో!

దుర్గాబాయమ్మగారిని నేను గతనవంబరునెలలో జరిగిన ఆంధ్రమహిళాసభలో గాంచితిని. వయసుపాతికేండ్లలోపు. మనిషి కొంచెము కుఱుచ. ఆకృతిలో ఇంచుక బొద్దు. మేఘగంభీరనినదమైన కంఠస్వరము. సుప్రసన్నాననములోని యుజ్వలతనుగాంచి రక్తరేఖాంచితమైన ఆమెనేత్రయుగళిలో యామె ధైర్యగాంభీర్యముల నేనప్పుడే చదివితిని.

ఆమె రెండుపన్యాసములను వింటిని. రెండింటియందును నామె శౌర్యరస ముట్టిపడునట్టులే భాషించెను. అబ్బో! అపరఝాన్సీరాజ్ఞి యనిపించుచున్నదే యనుకొంటిని. తదుపరి ఆంధ్రరాష్ట్రసభలో "భారతదేశమెన్నడును నొరులయాచించి యెఱుగదు. స్వాతంత్ర్యమునుగూడ యాచించదు. నిజప్రజ్ఞచేతనే బడయు" నని యామె పల్కినపల్కులు మాఅన్నగారు నాకెఱిగించిరి. అప్పుడు నేనిచ్చిన నామధేయ మీమెకుతగును అనుకొంటిని. నేనిట్లు తలంచిన కొలదిమాసములకే శ్రీదుర్గాబాయమ్మసోదరి రాజధానీనగరనాయకత్వము వహించి ధార్మికసమరము నడుపుటజూడ ఆశ్చర్యమగుచున్నది. సోదరికి జయమగుగాక! ధీరురాలగు దుర్గాబాయమ్మ నాయకత్వమువహించినది. అవకాశముగల చేడియలందు పాల్గొని యుద్యమము సాగించుచున్నారు. తదితరపల్లీపట్టణములందెల్ల యీయుద్యమమిట్లే సాగుచున్నది. దీనిని సాగించుచున్న సోదరీమణుల కార్యదీక్ష సంస్తవనీయమైనది. వారి కార్యపరతచే పేదలపెన్నిధియైన ఉప్పుగల్లు బంధవిమోచనమును బడయునేని, దుష్టమైన మద్యపానమడుగంటునేని, ఉప్పుగల్లుకు కొఱయైన దరిద్రులును; త్రాగుబోతులగు భర్తల వలన సంసారములుగుల్లయైపోవ తినతిండి, కట్టబట్ట లేకఅల్లాడు పేదకుటుంబినులును వారికి జే జే లర్పింతురు.

ఇంక నేకారణముచేనైన నీ ధార్మికోద్యమములోం జేరి సేవచేయజాలని సాధ్వుల కర్తవ్యమేమియో విచారింతము. ఏధర్మమునకైనను నేసత్యమునకైనను మనము నిక్కువముగా నర్పించవలసినది అంతఃకరణము. అంతఃకరణమే దానికీయబడదేని కన్నులుచూచుగాక! చెవులు వినుగాక! జిహ్వలు పలుకుగాక! చేయి చేయునుగాక! దానిలో సారస్యము లేదు. నిర్మలాంతఃకరణమే దాని కర్పితమయ్యెనేని నివియన్నియు నిబద్ధమైనను నాధర్మమునకు హానిలేదు. ఆసత్యమునకు చెఱుపులేదు. కాన మహాత్ముని ధార్మికోద్యమమును మనము మనస్ఫూర్తిగా నంగీకరించితిమేని యెవ్విధమైన తోడ్పడగల్గుదుము. చంద్రుని కొరకు నూలుపోగన్నసామ్యముండనేయున్నదిగదా. అది కేవలము సామెతయేగాదు. అఖిల భారతీయహృదయాకాశము షోడశకలాపరిపూర్ణుడై వెలయుచున్న మహాత్మాగాంధీ చంద్రుడుగూడ ఆనూలుపోగునే కోరుచున్నారు. రాట్నమువలననో తకిలీవలననో ఆనూలుపోగునైనసాధించి మహాత్మునికర్పించవలెనని, యానూలుచే నేయబడిన వస్త్రముల ధరించవలెని మనజన్మమే వ్యర్థము. కల్పలతా! నీవు రాట్నము పెట్టితివా; లేక తకిలీ నభ్యసించుచుంటివా? నా అభిప్రాయమైనచో రెంటిని నేర్చుకొనుటయే కర్తవ్యము. ఏది వీలైనపుడు దానిచే నూలునుదీయవచ్చును. నూలే మన ఆర్థికదాస్యవిమోచనమునకు పరమౌషధము.

భావపురి
౧౫-౫-౩౦.

మిత్రురాలు
శారద.



వడ్లమూడి వేంకటరత్నముగారు

౧. ఓ నారీమణీ! నీవు గృహద్వారమున కధికారిణివి గమ్ము. అచటివారియెడ రాణివలె మెలఁగుము.

—ఋగ్వేదము.

౨. పురుషులు కల్యాణము నభిలషించినచో గాంతల నెన్నఁడు నవమానపఱుప రాదు. స్త్రీలు పూజింపఁబడుచోట దేవతలు నసింతురు. వారవమానింపఁబడుతావున నెన్ని యుత్తమకర్మలును ఫలము నీయఁజాలవు.

—మనువు.

3. మానిని పురుషున కర్ధాంగి. ఉత్తమమిత్రము. ధర్మార్థకామములకు మూలము. ఆమె నవమానపఱచువాఁడు నశింపకపోఁడు.

—మహాభారతము.

౪. రమణి మహాటవినైనను క్రీడారామము సేయఁగలదు. ఆమెలేని సౌధరాజము లయినను భీకరకందరము లగును.

—రామాయణము.

౫. అనురాగవతియగు కామిని యమృతలత. అనురాగవిహీన గరళవల్లి.

—భర్తృహరి.

౬. నవఖండాధిపతియయినను కాంతావిహీనుఁడు భిక్షుకునికంటె దౌర్భాగ్యుఁడగును. పగలంతయుఁ జెమటలోడ్చి సంధ్యాకాలమునఁ దన కాంతామణి ముద్దుమొగమును గాంచి తనకష్టముల నొక్కుమ్మడి విస్మరించు కూలివాఁడు నింతకంటె లక్షగుణములు ప్రసన్నచిత్తుఁడుకాఁగల్గును.

—కూపర్.

౭. మానవుఁ డొంటరిగ నున్నంతకాల మతనికి స్వర్గమును కంటకాకీర్ణమగును. దేవకాంతల గీతములు, పక్షుల కలకిలారావములు, కుసుమముల మందహాసములు, మందసమీరముల యూఁపడింపులు, నిర్మలచంద్రికల మైపూఁతలు, సర్వము నతనిపాలిటి నీరసములే. ఆతనికి తోడుదొరకెనా? ఆతని ఆ దుఃఖమంతయు దూరమయి తీక్ష్ణ కంటకములు మనోహరకోరకము లగును.

—కాంబెల్.

౮. మందబుద్ధులగు కవులు కొందఱు కాంతలను విషమ్ములములనియు, విషసర్పములనియు, కాలపాశములనియు నేమేమో యందురు. మృతప్రాయయగు కవితాసతి కటాక్షాభాస మీకవిత. అసారమగు నీసంసారమున నెల్లవస్తువులను కష్టపడి సంపాదించుకొనవచ్చును. కాని సులక్షణయగు నారీమణియో పరమాత్మకృపారసములేక లభింపఁజాలదు. ఇట్టి కాంతామణిగల పురుషునకు దుఃఖము దుఃఖముగాదు. స్త్రీ చెప్పినట్లు నడచినచో నీప్రపంచమున స్వర్గమగునని నా తలంపు.

—పోప్.

౯. స్త్రీ పెంపుడుకుక్కకంటె నధికవిశ్వాసము గలది. ఓడకంబముకంటె నెక్కువ నిశ్చలతగలది. సౌధస్తంభముకంటె మిగుల దృఢమయినది. సముద్రమధ్యమున బుటకలు వేయువానికి దొరకిన యొడ్డుకంటె నెక్కువ ప్రియమయినది. వృద్ధజనకుని నేత్రములకుఁ గనబడు కనిష్టపుత్రునికంటె నెక్కువ సుందరమయినది. ప్రళయానంతరము నూత్నప్రభాభాసితమగు సుప్రభాతముకంటె నధికమగు తేజస్సుగలది. మరుదేశమధ్యమున డప్పికచే వికలుఁడగు మానవునకు లభించిన జలముకంటె మిగుల స్వాదువయినది.

—యంగ్.

౧౦. నేను స్త్రీమహాత్మ్యము నంగీకరించుటకుఁ గారణమామె సౌందర్యవతియని కాదు. నే నామెను ప్రేమించుట యామె అందుకొఱకుఁ బుట్టెనని కాదు. మఱి ఆమెను బూజించుటకు హేతువు మనుష్యునకు మనుష్యతత్వమును బూజించుట ధర్మమను తలంపు.

—లోవిల్.

౧౧. కామిని సౌందర్యముచే దర్పవతి యగును. పవిత్రగుణములచేఁ బ్రశంసనీయ యగును. లజ్జాశీలముచే దేవియగును.

—షేక్స్పియరు.

౧౨. రమణీమణి యుజ్వలనేత్రములయందు పరమాత్మ తన దీపద్వయము నుంచుకొన్నాఁడు. కనుకనే ప్రమాదపతితులెల్లరు తొలఁగిన తమమార్గము నాప్రకాశమునఁ దెలిసికొందురు.

—విలిస్.

౧౩. సుశీలయు, పుణ్యవతియు, సుందరియునగు స్త్రీతో సమానమగు వస్తువేదియు లోకమున లేదు.

—హంట్.

౧౪. తారకలాకాశమునకుఁ గవితలయినచోఁ బాలఁతుకలు పృథ్వికి కవితాసారములు. ప్రపంచసౌభాగ్యము వీరి కరములయందు గలదు.

—హర్ గ్రేవ్.

౧౫. పడఁతుక కోపము పరమాత్మకోపమని కవులందురు. కాని ఆవిషమస్మాత్కా-మినీ కోపమున నెప్పుడును గానంబడలేదు. ఆమె కోపించినపుడు కన్నెత్తి నావైపున కెన్నఁడును చూడదు. చూచినచో కోపాగ్ని ప్రేమరసమయి ప్రవహించునని ఆమె విశ్వాసము.

—సతే.

౧౬. పూఁబోఁడుల పుస్తకము ప్రపంచము. ఆమె ప్రపంచమునఁ దెలిసికొనునంత పుస్తకమువలనఁ దెలిసికొనదు.

—రూసో.

౧౭. నీవు శిలవగుదువా పరుసవేదివికమ్ము. వృక్షమవైనచో హరిచందనమవగుము. లేక మనుష్యుఁడవైతివా తొయ్యలిని ప్రేమించుము.

—విక్టర్ హ్యూగో.

౧౮. స్త్రీ పరమాత్మ చేతియొక్క గొప్పమాయ.

—ఆస్కార్ వైల్డు.

౧౯. పురుషున కర్ధాంగియగుటకుఁ బోఁతుక పుట్టినది. ఇది ప్రకృతి యుద్దేశము. ప్రకృతినియమములను పాలించుచు పడఁతి ఈశ్వరశాసనమును నెఱవేర్చుచున్నది.

—షిల్లర్.

౨౦. ప్రియా! రమ్ము, రమ్ము! నాయొద్దఁగూరుచుండుము. రాత్రి గడచినది. నలుదిక్కులు ప్రకాశమున వెలుఁగొందుచున్నవి. కాని నీవు లేక ప్రార్థనవాక్యములు నాముఖమునుండి వెడలుటలేదు. రమ్ము, నాయొద్దఁగూరుచుండుము. నాకొఱకు నీవును, నీకొఱకు నేనును ప్రార్థించుకొందము.

—విలక్ కన్నింగ్ హామ్.

౨౧. ఓసుకుమారీ! పురుషులను చక్కఁబఱచుటకు దేవుఁడు నిన్ను సృష్టించినాఁడు. నీవు లేకున్నచో మేము పశుప్రాయులమగుదుము. నీయందు లేనిది స్వర్గమునందేమి యున్నది? అద్భుతజ్యోతి, పవిత్రత, సత్యము, అనంతానందము, అమరప్రేమము సర్వము నీయందుఁగలవు.

—ఆట్వే.

౨౨. తండ్రికిఁదనపుత్రికయెడలఁగల ప్రేమనిరుపమానమైనది. కోమలిప్రేమయందు కామము లీనమయియుండును పుత్రప్రేమయందు లోభము ఛన్నమయియుండును. కాని పుత్రికాప్రేమ మట్టిదిగాదు. అట్టిప్రేమ మఱియొక్కచోటఁ గానరాదు.

—ఎడిసన్.

౨౩. పత్నీసృష్టి యందీశ్వరప్రకాశముగలదు. అదియొకమధురరసవాహిని. అందు పతి తన పిపాసనువారించుకొనును; తన చింతలనుండి ముక్తుఁడగును. పుణ్యవతియగు భార్య పరమాత్మ పరమకృపావిశేషము. ఆమె పతికి దేవి, సకలగుణరత్ననిధి, వజ్రము, ముత్యము, భాగ్యము. ఆమె స్వరమునందు మాధుర్యము, మందహాసమున నానందము తొణఁకుచుండును.

—జరమి టైలర్.

౨౪. నీస్వర్గము నీమాతృదేవి చరణతలమున నున్నది.

—మహమ్మదు.

౨౫. భారతవర్షధర్మము భారతపుత్రులమూలఁగాదు; పుత్రికల కృపావిశేషమున దాని యునికిగలదు. భారతరమణీమణులు తమధర్మమును వీడినచో భారతదేశ మీపాటికే నశించియుండును.

—దయానందస్వామి.

౨౬. కాంతను పవిత్రప్రేమతోఁ జూడవలయును. పరకాంతను పాపదృష్టితోఁ గాంచువాఁడు దేవునికోపమును రేపి తన నరకమార్గమును బాగుచేసికొనును.

—రామతీర్థస్వామి.

౨౭. కోమలి పవిత్రమూర్తి. ఉదారాశయ. ప్రేమవాహిని. ఆమె తన బాధ్యతను చక్కఁగ నెఱవేర్చును. తన విశ్వాసమును కాపాడుకొనును. తనధర్మమును నిర్వహించును. ఆమె గౌరవమునకు భంగము కలుగునపుడు తనప్రాణములనైన నర్పించి యామె గౌరవమును కాపాడుట పురుషులధర్మము.

—గాంధిమహాత్ముఁడు.

౨౮. స్త్రీలు కాళీమాతల యపరావతారములు. అంతటి దయావతి మఱియొకరు లేరు. మాతృతాభిన్నమామె యందొకించుకయు లేదు.

—రామకృష్ణ పరమహంస.

—హిందీమాసపత్రిక 'సరస్వతి' నుండి.





శ్రీమతి శాంతకుమారి

# నవ్వు తాలు

తాత కృష్ణమూర్తి గారు బి. ఏ; యల్. టి.

## హిందీభాష

భర్త—(భోజనం చేస్తూ) కూ: బడా మజాగావుంది. కాని, కారం కాస్త లావు.

భార్య—(పట్టెడు మిరపకాయపొడి తెచ్చి కూరమీద వేస్తూ) చాలునా? చూచుకోండి. ఆనక జాస్తి అయితే, కోపగించక!

భర్త— (నిర్ఘాంతపడి చూస్తూ) ఇదేమిటీ అన్యాయం? కారం యిదివరకే అధికంగావున్నదని ఘోష పెడుతూ వుంటే!

భార్య—సరి, నాకేం తెలుస్తుంది. అసంగతి? మీరు కొత్తగా హిందీభాష నేర్చుకోవడం, నా పీకలమీదికి వొచ్చినట్లున్నది. 'బడా' అన్న హిందీపదం విని,'లావ్' అన్నదికూడా హిందీలోనే అన్నా రను కున్నాను. 'కారం లావ్' అంటే, "తే, కారంగుండ తీసుకురా" అన్నారేమో, అనుకున్నాను.

## వయస్సు

"వాళ్ల అమ్మాయికి యెన్నేళ్లుంటాయి, అయితే?"

"ఏమో, యెవరికి తెలుసు? పెళ్లిమాటలకి వచ్చేవాళ్లతో 'పన్నెండేళ్లు దాటిపోయినాయి' అంటారు; మనంకాని అడిగితే 'ఏదమ్మా? శ్రావణానికి యెనిమిదోయేడు వస్తుంది' అంటారు."

## అప్పు వసూలు

"......అయితే, యియ్యనంటావా యేమిటి?"

"ఇయ్యనని చెప్తే వూరుకుంటావూ? దావాచేసి నన్ను కచేరీలకీడ్చి, ముక్కుపిండి, మరీ వసూలు చేస్తావు. అందుకనేగా యిస్తానంటున్నాను?"

## ఉన్నత విద్య

పెద్దమనిషి—ఎక్కడలేని డబ్బూ, మావాడి చదువుకోసం చాలకుండా వున్నది. ఈ బి. ఏ. చదువు కాదు గాని, నానాశ్రమగానూ వున్నదండి.

ప్రిన్సిపాల్—ఎందుకూ? మీవాడు అట్టే శ్రద్ధతీసుకొని చదువుతూవున్నట్టు కనిపించదే!

## సవరణ

శాస్త్రులుగారు—ప్రభువులు! తమరు విశదంకానిదేమున్నది? 'ప్రమాదో ధీమతామపి' అన్నాడు. ఎంతటి వాడికైనా ఒకప్పుడు కాలు జారుతుంది!

పంతులు—అంతేనా దాని అర్థం? సకలశాస్త్రములూ చదువుకొని విశేషంగా బుద్ధిజ్ఞానం సంపాదించిన తమబోటి పండితోత్తములకు, పొరబాట్లు తరుచుగా వస్తూవుంటవని చెప్పరాదూ?

## పోలిక

ఏడెనిమిదేండ్ల యీడుగల తన చిన్నకూతురు చిట్టిని వెంటబెట్టుకొని వెంకమ్మ ఒకరింటికి పసుపుకుంకానికి వెళ్లింది. స్త్రీలందరూ బాలుణ్ణి వుయ్యాల్లోవేసి, ఊస్తూ పాటలు పాడుతున్నారు. ఒక ఆవిడ "ఏదమ్మా, చిట్టీ! నీకు మంచిమంచి పాట వచ్చునట? ఒకపాట పాడవూ?" అన్నాది. గొంతుక సవరించుకొని, చిట్టి పాడుతూవుంది.

వెంకమ్మ—(గర్వముతో) మాపిల్లను సరిగా నాపోలికే వచ్చింది. అచ్చుతీసినట్లు కేవలం నాగొంతుకే దానికి వచ్చిందని, అందరూ అంటారు!

లక్ష్మీదేవి—అన్నను కాబోలు పాపం? పోనీ, యీనాటికైనా నీకునీగొంతుక వొదలిపోయింది. సంతోషించు!

## వేషగాంభీర్యము

తరిణయ్య—ఏమోయి, మాణిక్యం! నిన్నరాత్రి నాటకంలో నావేషం బాగుండెనా?

మాణిక్యం—నువ్వేనా యేమిటి, భేతాళుడు వేషం వేసినది?

తరిణయ్య—అవును. భయంకరంగా వుండెనా?

మాణిక్యం—లేకనేం? అసలు వేషం, విగ్గు, మొగానికి మసి యేమీ లేకుండానే నువ్వు మొన్న మధ్యాహ్నం మాయింటికి వచ్చినప్పుడు మాచిన్నవాడు నిన్నుచూచి జడుసుకొని 'అమ్మో! బూచివాడు. బ్రహ్మరాక్షసి. నన్నెత్తుకొపోతాడు కాబోలు?' అంటూ తల్లిదగ్గిరికి పోయి, నువ్వు వెళ్లిపోయేదాకా ఒకటే యేడుపట!

## ఉడికింపు

వంటబ్రాహ్మడు—(పెండ్లివిందులో వడ్డన చేస్తూ) ఏం!......తాతగారూ, పనసకాయ కూరంటే మీరు ఉడుకొక్కెస్తారట, యెందుకని?

తాతగారు—లేదోయి, యెవరన్నారో కాని? పనసకాయకూర యీవాళ యేమీ వుడకలేదే! నోట్లో పెట్టుకుంటే, పచ్చి పచ్చిగా కస్ కస్ మంటునే వుంది............నువ్వేనా, వంట?

## ఉత్తరము

"ఏమిటోయి, మహా దీక్షగా వ్రాస్తున్నావు?"

"ఉత్తరం"

"అంత తాపిగా, పట్టి పట్టి వ్రాస్తున్నావేమి?"

"మాఆవిడె గబ గబ చదవలేదు కాబట్టి!"

## ముక్కు తీరు

రామకృష్ణుడు నాలుగైదేండ్ల పెంకె బాలుడు. ఒకనాడు వాళ్లయింటికెవరో బంధువు వచ్చియుండెను. అతనికి గ్రహచార వశాత్తూ ముక్కు కేవలం బల్లపరపుగా అణచినట్లు వుండెను.

కొడుకును చేరదీసి తల్లి "నాయనా, రామం! మనయింటికి చుట్టం వచ్చివున్నాడు. ఆయనను చూసి ముక్కు వికృతంగా వున్నదని యేమీ పెంకెమాటలు అనకూడదు సుమా! జాగ్రత్త. బుద్ధిగా ఉండాలి. తెలిసిందా?" అని చెప్పింది.

రాత్రి భోజనాల వేళప్పుడు అందరూ పీటలమీద కూచున్నారు. దీపాలు కాంతిగా వున్నాయి. రామకృష్ణుడు మఠం వేసుకుని బుద్ధిగాపీటమీద మాటామంతీ లేకుండా అల్లరి చేయకుండా కూచున్నాడు. తల్లి మడికట్టుకుని వడ్డన చేస్తూవుంది.

అప్పుడు బాలుడు "అమ్మా, అమ్మా! మనచుట్టానికి ముక్కే లేదుకదా, ఆయన ముక్కుచూసి యేమీ అనవద్దు సుమా, అని నాతో యెందుకన్నావు?" అని అడిగినాడు.

## వర్షము

హోటలు వెయిటరు—సార్, సార్! పెద్దవర్షం వొస్తూవున్నదండి.

దొరగారు—అక్కర్లేదు! నేను దానికోసం ఆర్డరు యిచ్చివుండలేదే?

# యోగిని

తురగా వేంకటరామయ్యగారు

౧

శ్రీమదానందసామ్రాజ్యసింహపీఠి
నలరునట్టి భవద్రాజ్ఞి నయ్యు నేడు
దిటిపెమెత్తుచు వీధులఁదిరుగుచుంటి
నేమిప్రారబ్ధమో? దేవ! ఎఱుఁగనైతి.

౨

ఆయనంతపథమ్ముల నమలమేఘ
మందిరమ్ముల నినుగూడఁ దగుచునయ్యు
గ్రుంగుచుంటిని పాతాళకుహరమునకు
నాథ! నీమాయరథముతో నడువలేక.

౩

పూవునై నీమనోద్యానభూములందు
పరిమళశ్రీల వెదజల్లు భామనయ్యుఁ
గట్టెనై మండుచుంటినిఁ గాలపురుషు
హోమకుండాన నీదయ లేమి నాథ!

౪

ప్రణయకల్యాణమయభవద్భావవీధి
నమృతజీవితగీతావిహారినయ్యు
నీయరణ్యపథాల శోకించుచుంటి
నెపుడునాయాత్రవిందువో యీ మహాత్మ!

౫

భౌతికమ్మైన నాదేహపంజరమున
నీవు నిల్పిన కోకిల నేడదేమొ!
దుఃఖభరభగ్నకంఠమై క్రుంగుచుండ
నేలజూడవు క్రేఁగంటనేని; నాథ?

౬

ప్రణయసామ్రాజ్యపాలనాచణుడవయ్యు
నమృతజీవితభిక్షార్థినైన యబల
నీయనంతసుఖాంబుధి నిట్టవిడిచి
దాగి దోబూచులాడు టేధర్మమోయి!

౭

ఈభయంకరసాగరమేని నన్నుఁ
గలుపుకోదాయె, నడవులఁ గర్జలించు
సింగమేనియు గబళింపఁ జేరదాయె
భగ్నజీవితమేరికి భ్రాంతినిడును.

౮

పాపమో! పుణ్యమో! స్వప్నఫలమొ! ధ్రువమొ
చింతసేయని స్వచ్ఛందజీవి నేను
ప్రళయమెదురైన గానిమ్ము భయము లేక
అదనుమై నినుబట్టి తీరుదును; నాథ!




# అగ్నిదగ్ధరోగము

డాక్టరు యస్. శేషగిరిరావుగారు ఎల్. ఐ. యం.,

గతమాసపు గృహలక్ష్మియందు గృహవైద్యము అను శీర్షిక క్రింద కాలినగాయములు, వేణ్నీళ్లబొబ్బ అను తలపేరుతో ఆ రోగములకుగల పాశ్చాత్యచికిత్సావిధానమును వివరించితిని. ఈసంచికయందు ఆయుర్వేదచికిత్సావిధానమును వివరింతును. ఈ అగ్నిదగ్ధరోగమును ఆయుర్వేదవైద్యవేత్తలు 1. ప్లుష్టము, 2. అతిదగ్ధము, 3. దుర్దగ్ధము, 4. సమ్యగ్దగ్ధము. అని నాలుగువిధములుగ విభజించిరి.

అందు చర్మము కమలి వేరురంగును గల్గినయెడల నయ్యది ప్లుష్టమనియు— రక్తము, మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు మొదలగునవి బైటపడి జ్వరము తాపము దాహము మూర్ఛ వీనిని గల్గించినయెడ నయ్యది అతిదగ్ధమనియు— అగ్నిచే మిగుల బొబ్బలుపుట్టి చిరకాలమువరకు శమింపక బాధించుచుండిన నయ్యది దుర్దగ్ధమనియు—లోతైన మూలముగలిగి తాటిపండువర్ణముతో సమానవర్ణముగలదై బొబ్బలతో వ్యాపించినదై మిక్కుటమగు దాహముతో కూడియుండునది సమ్యగ్దగ్ధమనియు చెప్పబడును.

అగ్ని స్నిగ్ధరూక్షద్రవ్యముల నాశ్రయించిదహనము జేయును. మరియు నగ్నిచే తపింపబడిన తైలము సూక్ష్మమార్గమువలన (అనగా రోమకూపములవలన) త్వఙ్మాంసాది

సప్తధాతువులయందు ప్రవేశించి శీఘ్రముగ దహింపజేయును. కావున స్నేహదగ్ధమున అన్నిటికంటె విశేష వేదన గలుగును.

## అగ్నిదగ్ధరోగ చికిత్సావిధానము

ప్లుష్టాగ్నిదగ్ధవ్రణమునందు ఉష్ణకరములగు ఔషధముల లేపనము జేయవలయును.

దుర్దగ్ధవ్రణమునందు శీతకరములగు క్రియలనుగాని లేక ఉష్ణకరక్రియలను గాని జేసి పిదప ఘృతాదులయొక్క లేపనము, సేచనము మొదలగు శీతకరములగు క్రియలను జేయవలయును.

అతిదగ్ధవ్రణమునందు శిథిలమై వ్రేలుచుండు మాంసమును ఛేదించి శీతకరక్రియను వరిబియ్యపుపిండిని నల్లతుమికిపట్ట కషాయముతో చేర్చి నేతినిగలిపి లేపనము చేయవలయును.

సమ్యగ్దగ్ధమునందు వెదురుప్పు, మర్రి, చందనము, కావిరాయి, తిప్పతీగె వీటికల్కము నందు నెయ్యికలిపి కాచి లేపనముజేయవలయును.

## అగ్నిదగ్ధము—గృహవైద్యము

1. తవాక్షీరి, జువ్వి, రక్తచందనము, కావిరాళ్లు, తిప్పతీగె వీనిని సమభాగములుగ చూర్ణముగావించి నేతిలో కలిపిగాని, చిత్రికూరకషాయమున నేయిగలిపిగాని లేపనము చేయనగును.

2. యవలనుగాల్చి భస్మముగావించి నువ్వులనూనె లేక టెంకాయనూనె కలిపి అగ్నిదగ్ధములగు బొబ్బలు మొదలైన వ్రణములకు లేపనము జేసిన నవి నివృత్తియగుటయే గాక మాంసపూరితములై స్వస్థములగును.

3. రాళము (సిక్థము), సర్జరసము, జీలకర్ర వీటిని చూర్ణముచేసి నేతిలోకలిపి యందు తేనె, మైనమువైచి యామైనము కరుగువరకు కాచి సాంగశీతలమున గ్రహించి అగ్నిచే దగ్ధములైన వ్రణాదులకు లేపనముజేసిన నవి నివారణయగును.

4. అతిమధురము, లొద్దుగపట్ట, రాళము, మంజిష్ఠ, శ్రీగంధము, చాగవేళ్లు వీటిని సమభాగములుగ చూర్ణముచేసి యందు నెయ్యి తేనె మైనము వైచి సాంగశీతలమున గ్రహించి యగ్నిదగ్ధమున కలిగిన బొబ్బలు మొదలగువ్రణములకు లేపనముజేసిన యవి నశించును.

5. మైనము, దాసాని, నెయ్యి, యష్టిమధుకము, గటికె, పొన్నగంటి, పాలు, వావిలి, కురువేరు, మలాము గంధము, ఉత్తరేణి, సహదేవి (గరిటెకామ) ఇవి నిప్పువలన కాలిన వ్రణములను మాన్పును.

6. టెంకాయపాలనుండి అప్పుడే తయారుచేయబడిన తైలము లేపముచేయుటకు చాల ఉపయోగమైనది.

7. మామిడిఆకుల మసి అగ్నిదగ్ధములయందు విరివిగ వాడనగును.

8. నువ్వులను ఉడికించి కట్టుటయు, మెంతిఆకులను ఉడికించికట్టుటయు, బంగాళాదుంపలను నూరి దానితో పలాస్త్రీవేయుటయు సాధారణము. వీటిచే ఉపశమనము కలుగుచున్నది.

9. కారన్ ఆయిల్ (యిది చేయువిధము మే మాసపుగృహలక్ష్మియందు వివరించియున్నాము) దీనిని అటులనే వాడుటకంటె కరక్కాయ కల్కమునుకూడ కలిపి వాడిన చాలా ఉపయోగకరము.

## యోగములు

1. మంజిష్ఠాద్యఘృత (చక్రదత్త):— మంజిష్ఠ, రక్తచందనము, చాగవేరు సమభాగములుగ తీసికొని కల్కముచేసి నెయ్యికలిపి తయారుచేసి వ్రణముల కుపయోగించునది.

2. పటోలాదితైలము:—చేదుపొట్ల కషాయము లేక కల్కము వీటిలో ఆవనూనె చేర్చి కాచి లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణమునందలి నొప్పి, స్రావము, తాపము, బొబ్బలు తగ్గిపోవును.

అగ్నిదగ్ధమున సాధారణముగ మంట శమించుటకై చికిత్స, వ్రణరోపణచికిత్స తెలిసికొనియుండుట అవసరము. దీనికి పై చికిత్సలను అవలంబించవచ్చును. కాదేని క్రింద వివరింపబోవు ప్రత్యేకచికిత్సలను చేయనగును.

## మంటకు చికిత్స

1. జీలకర్రను కల్కముగావించి ఘృతమును పక్వముచేసి పిమ్మట నాఘృతంబున మంగకాయలోని గుజ్జు, సర్జరసము వీనినివైచి నిప్పుచే కాలినస్థలమున లేపనము చేయుచుండిన మంటతగ్గి పుండునుకూడ క్రమముగా మాన్చును.

2. క్రాగుచున్న తైలములో యవలనుబోసిన నవ్యాది నల్లగ మాడిపోవును. వానినితీసి చూర్ణముగావించి ఆ బొగ్గుచూర్ణమునుగాని, యాతైలముగాని యగ్నిదగ్ధమైన ప్రదేశంబున లేపనముచేసిన మంట హరించును.

3. కన్నెకోమలి యాకుపసరులో నూనెగలిపి కాలినచోట పూసిన మంట శమించును.

4. నిప్పుకాలుపు, వేడినీళ్లకాలుపువీనిపైన కోడిగుడ్డుసొన వేసిన మంట నయమగును. పుండు మానును.

5. టర్పెంటైనుతైలమును (Oil of Turpentine) కాలినచోట వెంటనేపూసిన మంట అణగును. పుండుగాకుండ జేయును.

6. నీలిమందు కాలినపుండుకు వేసిన మంట అణగును.

7. పెద్దబచ్చలి లేక బచ్చలి ఆకుల రసముగాని ఆకునూరిన ముద్దగాని కాలిన చోట పైనపూసిన మంటను మాన్పును.

8. బ్రాందిని కాలినచోట పోసిన పొక్కనివ్వక మంట (తాపము) ను నిమ్మళింప జేయును.

9. తేనెను కాలినచోట వెంటనేపూసిన నొప్పి శమించును.

## వ్రణము-చికిత్స

1. గోరింతచెట్టు కషాయమును పైనపోసిన కాలినపుండ్లు వేడినీళ్లవలన కలిగిన పుండ్లు మెదలగునవి మానును.

2. మొమ్మాయి కాలినపుండును వ్రణములను శుభ్రపఱచి మాన్పును.

3. సున్నపునీళ్లలో కొద్దిగ మంచినూనెగాని కొబ్బరినూనెగాని వేసి చేతితో కొట్టిన వెన్నవలె నురుగు బయలుదేరును. దానిని ఆరారగా పూసిన కాలినపుండ్లు మానును.

4. త్రిఫలములను (కరక్కాయ, తాడికాయ, ఉసిరికకాయ) కాల్చి చూర్ణించి తైలముతో చేర్చి లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము నివర్తించును.

## యోగములు

1. పథ్యాదిలేపము:—కరక్కాయ, బూరుగ, జీలకఱ్ఱ, అతిమధురము, మైనము, గుగ్గిలము వీటిని నూరిగాని, లేక ఆవునేతినిగాని లేపనముజేసిన అగ్నిదగ్ధవ్రణము నివర్తించు.

2. సుధాదిలేపము:—పాతసున్నమును పెరుగుమీఁది తేటలో నూరి లేపనము జేసిన తైలదగ్ధవ్రణము నివర్తించు.

3. చందనాదితైలము:—చందనము, మఱ్ఱిఊడల కొనలు, మంజిష్ఠ, అతిమధురము, ప్రపౌండరీకము, గరిక, రసకర్పూరము, ఆరెపువ్వు వీటి కల్కమునందు ఆవుపాలు నూనె చేర్చి తైలపక్వముగ కాచి లేపనముచేసిన అగ్నిదగ్ధవ్రణము తక్షణమునందే అంచుగట్టి మానును.

4. మధూచ్ఛిష్టాదితైలము:—మైనము, అతిమధురము, లొద్దుగ, గుగ్గిలము, చాగ, చందనము, మంజిష్ఠ వీని కల్కముచేసి అందు నెయ్యిచేర్చి కాచి లేపనమొనర్చిన అగ్ని దగ్ధవ్రణము అంచుగట్టి మానును.

## లోపలికి మందు

వ్రణమునకు చికిత్సచేయునపుడు లోపలికిని ఔషధములువాడుట మంచిది. ఈ క్రింద వివరింపబోవునవి సేవింపదగును.

1. లాంగలీఘృతము:—పసుపు, మ్రానిపసపు, మంజిష్ఠ, యష్టిమధుకము, లొద్దుగ పట్ట, కాయఫలము, కంపిల్లము, మేద, మహామేద, చెన్నచెర్లగడ్డ, పిప్పళ్లు, త్రిఫలములు, వేపఆకు యివియన్నియు ప్రత్యేకము 1 కర్షము (2 రూపాయలయెత్తు) కపిలగోవు యొక్క ఘృతము 1 ప్రస్థము (1 పడిలేక 2 శేర్లు) పాలు 2 ప్రస్థములు (2 పళ్లులేక 4 శేర్లు) యివియన్నియు నేకముగచేర్చి ఘృతపక్వముగ వండి అందు 2 పలములు (16 రూపాయలయెత్తు) మైనముచేర్చి సిద్ధపరచిన ఘృతమునుసేవించిన వ్రణము నివర్తించును.

2. ఆరెపువ్వును చూర్ణించి తెల్లఅగిశెవిత్తుల తైలముతో కలిపి పుచ్చుకొనిన అగ్నిదగ్ధవ్రణము నివర్తించును.

# సంఘజీవితము: స్త్రీస్థానము

మల్లాది పెరుమాళ్లయ్యగారు

సాంఘిక పరివర్తనమునననుసరించి సంఘజీవన మేర్పడుచున్నది. సంఘజీవితమే దేశచరిత్రగ వ్రాయబడుచున్నది. ఒకదేశముయొక్క నాగరికతగాని, కాలముయొక్క మార్పుగాని, మతముయొక్క వికాసముగాని సంఘజీవితమువలననే కలుగుచున్నది. ఈసంఘజీవితమందు స్త్రీ ప్రధానస్థానముకలిగియున్నది. మానవజీవిత చరిత్ర ప్రారంభించిన నాటినుండియు పరిశీలించి చూచినయెడల స్త్రీలయొక్క ఔన్నత్య స్థితియే, సంఘముయొక్క వికాసమును సూచించు చిహ్నముగా పరిగణింపబడుచున్నది. సంఘమునందు స్వతంత్రమగు సభ్యత స్త్రీలకుండవలయుననెడుభావము నేడే దేశచరిత్ర యందు చూచినను కాననగును. సంఘమునందు స్త్రీకి ప్రత్యేక వ్యక్తిత్వముకలదు. ఆవ్యక్తి త్వమును పురుషుడు గుర్తించిననేగాని సంఘజీవితవికాసముకలుగదు.

సహజమానవదృష్టితో పరిశీలించినయెడల, ప్రకృతియందు స్త్రీ సుందరాంగియై విరాజిల్లుచు, సౌఖ్యజీవితమునకు మూలమై యానందము నిచ్చుచున్నది. అందుచేతనే, కవులు తాము ప్రకృతియందు యనుభవించుచున్న సుందర దృశ్యము లన్నిటికంటెను స్త్రీని సౌందర్యవతిగా కొనియాడుదురు. మానవజీవితమునందు స్త్రీకిగల స్థానమును యొక చిత్రకారుడీవిధముగ నిరూపించుచున్నాడు. తాను వ్రాసిన చిత్తరువునందు ప్రపంచ మును సూచించుచు యొకపచ్చనిబయలుకలదు. సామర్థ్యముకల యొకపురుషుడు తన యాహారముకొరకు బయలు వెడలెను. ఒక కుందేటినిగాంచి దానిని చంపుటకు తన చేతనున్న విల్లునువంచి యంబులను విసరుచుండెను. ఆవేటకాని భార్యవెనుకనుండి ఒక్కొ క్కటిగా అంబులను పొదినుండితీసి భర్తకందించుచున్నది. ఈచిత్రకారునిభావము గంభీరమైనది. పురుషుడు తనజీవితయాత్రయందు స్త్రీవలన పొందుసహాయమును ఈ చిత్రముసూచించుచున్నది. పురుషునియొక్క జీవితమార్దవము స్త్రీ మోహమునందు భద్ర పరుపబడియున్నది. ఈమార్దవమును గ్రోలుటకే మానవులు ప్రాపంచికకష్టములను

లెక్కచేయక జీవితమునందు ఆశకలిగియుందురు. మిక్కిలి దరిద్రుడై తన యాలు బిడ్డలకు పట్టెడన్నము సంపాదింప శక్తిలేక సంఘముయొక్క ప్రాపంచకదృష్టియందు కడు హీనుడుగా ఎంచబడు మనుష్యుడు సహితము తనజీవితమందు ఆశకలిగి యెట్లో జీవించుటకు యత్నించుట మానవస్వభావము. అట్టి యాశకు స్త్రీయందు తనకుగల యనురాగమే బలమైనకారణము.

ఒక కట్టెలమ్మువాడు దినమంతయు శ్రమపడి సూర్యరశ్మికోర్చి అడవియందు కట్టెలుకొట్టి ఆబరువును మోసికొని గ్రామములోనికివచ్చి యింటింటికితిరిగి కట్టెలను నాలుగు లేక అయిదు అణాలకమ్మి పొద్దుగ్రుంకల సమయమునకు తనయింటికి ఆకలితో పోవును. ఆకట్టెలమ్మువాడు దినమంతయు యెండను శ్రమపడి తిండికొరకు ద్రవ్యము సంపాదించుకొనుచు న్యాయముగా ప్రవర్తించుచున్నను తోడిజనులీతనిని మనుష్యునిగా గుర్తింపరు. ఆతనికి సంఘమునందెట్టి గౌరవమునులేదు. ఇతని కష్టములను తెలిసికొను వారుండరు. అయినప్పటికిని యీకట్టెలమ్మువాడు తాను యింటికి వచ్చుచున్నప్పుడు తన గృహిణిని సమీపించుతరి మహానందము పొందును. తనను సంఘము గుర్తింపనప్పటికిని తనభార్యచే గౌరవింపబడి యాదరింపబడును. ఈపురుషుడు నిర్మలమైన యానందమును తన భార్యమూలముగా పొందుచున్నాడు. ఈతని ప్రపంచమంతయు తన గృహిణియందు అనుభవించ గలుగుచున్నాడు. మానవుని జీవితమందు స్త్రీయొక్క స్థానమెంత ప్రధానమైనదో మనము తెలిసికొందుము.

సంఘజీవితమునందిట్టి ప్రధానస్థానమలంకరించిన స్త్రీ వికాసముకలిగి వివేకముతో వర్తింపకలిగిన యెడల దేశమునకెట్టి యౌన్నత్యమును చేకూర్పనగునో మనమూహింపవచ్చును. మనదేశచరిత్రయందు పూర్వము స్త్రీలు యెంతటి వివేకవతులుగ నుండిరో మనకిదివరకే తెలియును. భారతవనితాలోకమందు ఒక్క వివేకవతిని ఉదాహరణముగా తీసికొందము. ప్రేమయొక్క సహజస్వరూపమును సూచించు శకుంతలయొక్క వివేకము వ్యక్తిత్వము పరిశీలించిన పూర్వపు కన్యలెట్టి విజ్ఞానము కలిగియుండిరో తెలియును. దుష్యంతుడు తన కొలువునందుండగా శకుంతలవచ్చి భార్యయగుతన్ను గైకొనుమని కోరినప్పుడు నిరాకరింపబడెను. అప్పుడా స్త్రీరత్నము చూపిన ధైర్యము, వివేకము, దూరదృష్టి వాదనానైపుణ్యము, మనమెరిగిన విషయములే!

కాని, నేడు భారతవనితాలోకము నిదురించుచున్నది. స్త్రీలు తమవ్యక్తిత్వమును గోలుపోయిరి. వారియందు స్వతంత్రతాభావము నశించినది. దేవాలయములలోని విగ్రహములవలె గృహములలో తమప్రపంచమంతయు నిముడ్చుకొని హిందూస్త్రీలు, సహజదృష్టిని గోల్పోయి మూఢమతులై కాలము గడపుచున్నారు. వారు వివేకశూన్యులై యుండుటచేతనే హిందూసంఘము, సాంప్రదాయము, ఆచారము మొదలగు మూఢభావములుకలిగి స్వభావసిద్ధమగు మానవస్వభావమును విశాలదృష్టిని గాంచకున్నది. అందుచే మనసంఘజీవితము కట్టుబడి నిర్జీవ మొందుచున్నది. సంఘముపేరట యాచరింపబడు మూఢవిశ్వాసములచే ప్రేరేపింపబడి మానవులకు సహజమైన సౌఖ్యజీవితమునకు దూరులై మనవారు తమజీవితములను స్తబ్ధపరచుకొనుచున్నారు. సంఘాచారములు, మతసాంప్రదాయములు వికాసమును గోల్పోయి శతాబ్దములనుంచి యొకేచోటనిలచి నిరంకుశముగ సంఘజీవితమునందు వ్యవహరించుచున్నవి. నిన్నటివరకు శారదాచట్టమునకు భయపడి దేశమునందు జరుపబడిన బాల్యవివాహము లెంతటి పరిహాసాస్పదములో బుద్ధిమంతు లూహింతురుగాక! ఇదియంతయు సాంప్రదాయమునందు, యాచారమునందు ఇమిడియున్న మూఢవిశ్వాసము. విజ్ఞానము ఒకచోటనిలచియుండునదికాదు. కాలముతో నిరంతరము పరుగిడుచు నూతన రూపములను దాల్చుచుండును. నూతనములైన ఈమార్పులు స్వతస్సిద్ధమగునవి. వికాసముచే కలిగిన మార్పులు మానవస్వభావమున కనుగుణముగనుండును. పూర్వాచారపరాయణులు వారిమనములను ఆవరించిన అంధకారమున (Mental Blindness) నూతనములగు మార్పులకు దావొసంగుట లేదు. స్త్రీలు తమస్వతంత్రబుద్ధిని గోల్పోవుటచేతనే సంఘముయొక్క యధికారము వారిపై నిరంకుశముగా చలాయింపబడుచున్నది. సంఘముయొక్క నిరంకుశములగు నిబంధనలకు స్త్రీలు బానిసలగుచున్నారు. అందుచే వారు బానిసగుణములు (Slave virtues) యదార్థములనియు బానిసబుద్ధి (Slave mentality) సహజమనియు యెంచుదురు. వీరికి స్వయంనిర్ధారణశక్తి (Self reliance), స్వేచ్ఛాభావము(Sense of freedom), ధైర్యగరిమ (Courage), మొదలవి లేవు. తల్లులు తమ బిడ్డలనుపెంచి పెద్దవారిగ చేయుటలో వారికి తమఉద్దేశములనే గఱపుదురు. సహజగుణములు, విశాలభావములు, సమత్వబుద్ధి, పిల్లలకు బోధింపజాలకుందురు. దీనినిబట్టియే సంఘస్థితి యేర్పడుచున్నది. ఈపరిస్థితులు సంఘముగ్రహించి వికాసమును బడయుగలుగు మార్గముల నవలంబించునుగాక!

# గృహిణి

శ్రీమతి సూరపనేని రామతులసీబాయిగారు

"అన్ని జన్మములలో మనుష్యజన్మము మేలయినది. ధన్యమయినది. అందు బురుషజన్మము యుత్తమము. స్త్రీజన్మము యధమము, బహుపాతకయుక్తము" అని తలంపబడుచున్నది. స్త్రీజన్మ మిట్లు నిరసింపబడుటకు వారి నిస్సహాయ నిస్సారతలే కారణము. అయినప్పటికి స్త్రీజాతి యన్నిటికిని ప్రధానము. ప్రధానమనుట కంటె నన్నిటికిని మూలాధారమనుటయే యెక్కువ సత్యము. "ధనమూల మిదంజగత్తనుట" యెంతసత్యమో "స్త్రీమూల మిదంధనం" మ్మనుట నంత సత్యమేగదా? ఈలోకమునగల సర్వసంసారతంత్రములకును సమస్తసౌఖ్యసంఘటనా విశేషములకును, సకలజీవన సాఫల్యములకును స్త్రీ లాద్యప్రకృతులు. కాని తత్సర్వ నాశనముగూడ స్త్రీవశమైయున్నది. కావున లోకభారమున జాలభాగము స్త్రీలపై మోపబడియున్నది. సంసారయాత్రయందు గలుగు మేలుకీడులకు స్త్రీలు విశేష బాధ్యురాండ్రు. సిరిసంపదలు స్త్రీనిబట్టి కలుగును. స్త్రీలేని గృహము తమోదూషితము. అందెన్నిదీపములైన వెలిగింపుడు; చీకటిపోదు. గృహిణియే లేనిచో ఈవిలాసములన్నియు వెలవెలబోవును. పాపము, పురుషున కెన్నియున్ననేమి? భార్యలేనిచో నతడు సన్యాసి యనిపించుకొనును. అతని జీవనకార్యములన్నియు వ్యర్థములు. కాబట్టి యఖిల ప్రపంచవ్యాపారమునకును స్త్రీ ప్రధానోపకరణమని తేలుచున్నదిగదా? అట్టిస్త్రీ యెంత విజ్ఞానవికాసమును, విద్యావివేకములును, వినయసౌశీల్యములును గలిగియుండవలెనో యూహింపుడు. కనినిబట్టి స్త్రీలు ధర్మాధర్మములు చక్కగా నెఱిగి సంచరింపవలయునని యేర్పడుచున్నది. స్త్రీలు తాము ప్రవర్తించవలసిన విధులను గ్రంథములవలనను గురువులవలనను పెద్దలవలనను గ్రహింపవలయును. పెద్దల గౌరవించుట, బీదల నాదరించుట కులకాంతల ముఖ్యధర్మము; అన్నిటికంటె పాతివ్రత్యము స్త్రీకి శిరోభూషణము. సహనమొక యుత్తమభూషణము. బంగారునగలతో విఱ్ఱవీగుట మానవతులకు మర్యాదగాదు. ఈనగలు శాశ్వతములుగావు. సద్గుణములను అలంకారములే శాశ్వతములు. పతివ్రతయగు స్త్రీకి ఇహపరసుఖములు సిద్ధించును. జనగౌరవము లభించును. సర్వేశ్వరుని అనుగ్రహము కుదురును. ఒకప్పుడు కష్టములు వచ్చుగాని తమంతటనవియే తొలగిపోవును. ఏస్త్రీ పతియే దైవమని నమ్మి యతనిని యనువర్తించుచుండునో యాస్త్రీకి సర్వశుభములు గుప్పిటలోనుండును. స్త్రీల సౌశీల్యభాగ్యములను గాపాడుటకు సహనగుణము ఎంతేని సాహాయ్యపడును. అత్తమామలు చెప్పు నట్లును; ఆడుబిడ్డలు; మఱదులు మనసుకష్టము జెందకుండునట్లును, పెనిమిటికి ఆనందము గలుగునట్లును సంచరింపవలయును. అత్తమామలు కోపించినను ఆడుబిడ్డలు తిట్టినను, భర్త కొట్టినను అయ్యవి తప్పులుగా భావింపకయు నితరులకు జెప్పకయు నుండవలయును. ఇట్టి అంతఃకరణశుచియే భర్తకు శృంగారముగా గాన్పించును. ఉదయమున లేచి ముఖప్రక్షాళనము చేసి తిలకముదిద్ది శుభ్రతకు వలయుసంస్కార మొనర్చుకొని భర్తకును, అత్తమామలకును తగు విహితకృత్యము లాచరించి తమపని గృహకృత్యములు నెరవేర్చుకొనవలయును. ఇట్టి బాహ్యాంతరశుచియే శృంగారమనదగును గాని కలిమికొలది ప్రాప్తించు వస్తురూపవిలాసముగాని, వ్యామోహకర వేషముగాని శృంగారమనదగునా? అయితే స్త్రీ ప్రకృతియందుండు నిట్టిధర్మమును సంగ

క్షించుటకు స్త్రీ కెంతజాగ్రత యవసరమో పురుషున కంతకంటె నెన్నియోమడుగులు జాగ్రత్త యవసరము. ఇట జాగ్రత్తయనగా కొట్టి తిట్టి బలాత్కరించి పురుషుడు స్త్రీచే సర్వదాస్యము చేయించుకొనుటగాదు. పడ లాగినచో కేశములు పెరుగునా? సంస్కారముచే నయ్యవి శోభిల్లును. కాబట్టి పురుషులు తమ స్త్రీల విషయమై జాగ్రత్తపుచ్చుకొనుటయన వారికి విహితోపదేశాదిసంస్కార మొసంగవలయుననుట. గృహిణీ మణియొక్క ప్రేమపూరితహృదయము భర్తకొక రాజ్యము. రాజు తనరాజ్య మెట్టిసంకటమున నున్నను, నెట్టి హీనతనుబొందియున్నను, నెట్టినిస్సారతకు బాల్పడినను, దానిని బాగుపఱచుకొనవలయునేగాని త్యజించుటయు, విరక్తిగొనుటయు, చిత్తక్షోభగాంచుటయు నతనికి దగవు. అట్లే భార్య పిచ్చిది (అమాయకురాలు) యైనను, ధనములేనిదియైనను, అందములేనిదియైనను నామెను తిరస్కరించి వెళ్లగొట్టుట పురుషున కధర్మము. మేము ధనవంతులమనియు, విద్యావంతులమనియు, వ్యవహారదక్షులమనియు, మాకు సాధ్యముకానిపని లేదనియు గర్వముతో ధనములేనిభార్యను వదలి క్రొత్తపెండ్లామును సంపాదించి వివాహముచేసికొనుట పురుషులకు ధర్మముగాదు. ధనము జగత్తునకు ప్రాణమనుట నిక్కమే. అయినను ధనమే సర్వసౌఖ్యములకు మూలమనుట చెల్లదు. అయినచో నీలోకమున ధనవంతులందఱును సుఖులైయుండిరా? బీదలందఱును దుఃఖితురా? కాదు. కష్టసుఖములందఱకును సమము. అయినచో ధనమువల్ల విశేషప్రయోజన మేమి? సుఖమున తృప్తిలోనున్నది. "చెప్పులిడుకొన్న కాళ్లకీక్షితితలంబు తోలుగప్పినచంద మైతోచునట్లు" తృప్తి యున్నచో సర్వసౌఖ్యములు చేకూరును. దృఢతరమగునట్టి ప్రమాణములు గన్పించుచున్నను, కొందఱు పెండ్లికొడుకులు ధనాశాపీడితులై యుత్తమకన్యల నొల్లక హెచ్చుకట్నములిడువారిని పెండ్లియాడి తమ మేలును అవమానించుకొనుచున్నారు. ధనము అపేక్షింపదగినదేయయ్యు యుత్తమస్త్రీయొక్క హృదయముకంటె అది హెచ్చు విలువగలదిగాదు. సరేకాని యిప్పుడు ధనముగలయువతికి ధనహీనుడు భర్తయైనను ఆమె చింతింప గూడదు. ధనహీనుడు తనకు భర్తయగుట యవమానముగ నెంచరాదు. కాని ప్రజలకు (తోడిపడుచులకు) చాల ఎక్కిరింపులు! అయిననేమి! మహారాజసుతయగు సావిత్రి భాగ్యహీనుడై యడవులవెంట ద్రిమ్మరు సత్యవంతుని వివాహమాడలేదా? ఆమె వివాహసందర్భమును తలచుకొనినచో ఈ వెక్కిరింపులవారికి సిగ్గు గలుగదు గాబోలు! సావిత్రికథ నొక్కసారి స్మరింపుడు.

అశ్వపతియనురాజుగలడు. ఆయన పత్నీసహితముగ తపములు వ్రతములు దానములుచేసి తత్ఫలముగ లేకలేక సావిత్రియను పుత్రికను బడసెను. ఆమెకు యుక్తవయస్సువచ్చెను. పుత్రికకు వివాహముకాలేదని తండ్రికి సందియముగానుండెను. వరునివెదకుచుండిరి. సావిత్రి సత్యవంతునికోరెను. ఇంతలో నారదుడువచ్చి యతనికి ధనములేదు; ఆయువులేదు; అనిచెప్పిపోయెను. తల్లిదండ్రులు విని సమ్మతిలేక యూరకుండిరి. సావిత్రి నిశ్చయముమాఱలేదు. అందుచేవారికి పరిణయమయ్యెను. సావిత్రీసత్యవంతు లత్యంతాన్యోన్యానురాగ విలసితులై యరణ్యవాసక్లేశ మెఱుగక సుఖముండిరి. కానికాలపురుషుడు సత్యవంతునిమరణమును సమీపింప జేసెను. అంతనతడు మరణించెను. యమభటులువచ్చిరి. ఆమెవారలను తరిమికొట్టెను. యముడేవచ్చెను. ఎందుకు? సావిత్రినివరముకోరుకొనుమనుటకు? ఆమె పతిభిక్షకోరెను. ఇచ్చియముడు వెళ్లెను. పురుషుడు సత్యవంతుడయ్యును తనమరణమునుండి తప్పించుకొనలేకపోయెను. సత్యవంతుడగు పురుషుని మరణమునుండి స్త్రీయొక్క పాతివ్రత్యమె కాపాడగల్గెను. అప్పటినుండివారు రాజ్యసంపదలతో తులతూగిరి. ధనము శాశ్వతముగాదు. స్త్రీలు పతినేదైవముగానమ్మి ధర్మాధర్మములు తెలిసి ప్రవర్తింపవలయును. అట్టి గృహిణులు అయిదువతనమును, పరువుమర్యాదలును, సర్వేశ్వరుని కృపయునుగలిగి వర్ధిల్లుదురు.

# నెచ్చెలికొకజాబు

శ్రీమతి జూలూరి తులశమ్మగారు

నెచ్చెలీ? నీవు వ్రాసినజాబునందలివిషయములు చూచితిని. సృష్టికర్తయగు దేవునిచే నన్నిజీవరాసులలోనను స్త్రీపుంసవ్యక్తులుత్పత్తిచేయఁబడినవి. ఈ యుభయవ్యక్తులకును ప్రేమసమానమే. మానవవ్యక్తియందు మాత్రము జ్ఞానమధికము. పైవ్యక్తులు రెండును తృప్తికొఱకు పోష్యపోషకనియమములతో నొక్కొక్క జంటగ నేర్పడినవి. పక్షులుసైతము ప్రసవదినములు వచ్చుటెఱింగి యెంతయో శ్రమనొంది పుడకల నేరితెచ్చి కులాయముల సదుపాయముగ నిర్మించుకొనుచుండును. అటులనే స్త్రీపురుషులు గృహస్థగృహిణులై యొక్కొక్కకుటుంబముగ నేర్పడి పాంథులకు ఛాయావృక్షములవలె నతిథ్యభ్యాగతబంధుమిత్రాదుల కాశ్రయభూతములగుచున్నారు. నీవు గృహిణివి కనుకనే గృహకార్యరచనాభారము నీయందున్నది. అతఁడు గృహస్థు కనుకనే పైనఁ బేర్కొనబడిన వారినందరిని ధనమార్జించి పోషించు భారమాతనియందున్నది. మీ యుభయుల ధర్మాచరణ ననుసరించియే సత్సంతానమును బడయగల్గుచున్నారు. సంసారవృక్షమునకు సత్సంతానమే సత్ఫలము, సత్కర్మాధికారియై, సర్వకార్యనియంతయై, ధనార్జనాతత్పరుఁడై, గృహభారధురంధరుఁడైన గృహస్థునకు నీవర్థాంగివి. అట్లన నతనిచే చేయబడిన సర్వకార్యములలోను నీకు సగపాలు స్వాతంత్ర్యముకలదన్న మాట విస్పష్టముగ బోధయగుచున్నది. ఐహికమటుండనిమ్ము. అధ్యాత్మికచింత నీచిత్తమునఁగలదేని యతనిచే నాచరింపఁబడి సత్కర్మఫలములయందు సగపాలు ఫలము నీకులభించునని మన హిందూధర్మములు ఘోషించుచున్నవి. వేయేల? దానోదకము నీవొసంగకున్న నీపతికి దానార్హతలేదనియు గూడనందు జెప్పబడియున్నది. ధర్మశాస్త్రములు తమకనుకూలముగ పురుషులచే వ్రాసికొనబడినవేయని నీవనుచుంటివా? నీవొక్కసారి చిత్తనిరోధమును గావించి పరికింపుము. అప్పుడు నీశక్తి, నీస్వాతంత్ర్యము, నీగౌరవము, యున్నతి, నీయాజమాన్యము, నీయున్నతాదర్శమునఁ బ్రతిబింబించును. అప్పుడు ధర్మశాస్త్రములయందు పురుషులు నీకెట్టి స్వాతంత్ర్య మొసఁగినదియును, తన్మూలమున నీకుగల గౌరవోన్న

తులును నీకే తేటపడగలవు. 'గృహిణీగృహముచ్యతే' యని పెద్దలెందు కనిరో యాలోచింపుము. ధనార్జనానత్కార్మాదిక్లేశముల సందఱుండగనే ధర్మోల్లంఘనము సేయని నీభర్త తన ధర్మమున నీకు సగపాలు పంచియిచ్చి సకలసౌఖ్యములతోపాటు సత్సంతానమును బ్రసాదించుటయేకాక తనప్రాణముకంటె నెక్కుడు జాగరూకతతో నిన్నును నీసంతానమును గంటికి రెప్పవలె గాపాడుచున్నాడు. అతఁడు కాపాడకున్న నాత్మశక్తివలన జీవింపలేమా యందువా? ప్రాజ్ఞుడగు భర్త కర్ధాంగివై, 'ఆత్మావై పుత్రనామాసి' యను వేదవచనానుసారమున భర్తకనురూపులగు పుత్రులంబడసి యుక్తరీతిని గృహకార్యభారము నెఱవేర్చు యువతికిని భర్తకును స్వర్గమిచ్చుటనున్నది? ఇంతకంటె యానందమేది? పురుషుడు ధర్మోల్లంఘనముచేసి తన భార్యయెడల ప్రేమగౌరవవిశ్వాసములు విడచి వెడలనడిచినను అతని యాస్తియందుగాని యుద్యోగమునందుగాని స్త్రీకి హక్కు కలదు. తన రాబడిలో నేదియొకొంత భార్య యుపాధికొఱకీయకతప్పదు. మరియొక స్త్రీని వివాహమాడినను పురుషుడు దానికిగూడ తృప్తినందక యిడుమలఁ బడుచుండును. ఇదివఱలో స్త్రీలకట్టి యిడుములు తటస్థించినప్పుడు భర్తయొసంగిన మనోవృత్తిని తీసికొని సంతానవతియైయుండెనేని బిడ్డలనెట్లో కష్టపడి పోషించుకొని యోగినివలె కాలముగడపుచు తన యమూల్యనిగ్రహశక్తిని లోకమున కాదేశప్రదముగ నొసంగుచుండెడిది. అట్లుగాక యిప్పుడు నీవడిగిన విడాకులవిషయము భర్తయొద్ద నీయిష్టము ననుసరించి తీసికొననెంచితి వనుమాట. అతని భర్తృత్వమునకు విడుదల కోరుచున్నావని తేలుచున్నది. భర్తృభార్యాసంబంధమునకు విడుదల భార్యకోరిన పక్షమున నామెజీవనోపాధినిచ్చుటకాతఁడు బాధ్యుడుకాడు. ఉపాధిలేని తరి యామె ఏమిచేయును? తనసంతతి సహితముగ బోయి యింకొకనివివాహమాడవలసివచ్చును. అతఁడు మొదటి వివాహములేనివాడైన నొకపక్షముగ నుండును. లేక నీతఁడుగూడ భార్యను విడచి సంతానము నామెకీయని వాడైన యితరదేశీయులవలె మీసంతానము, మాసంతానము, మనసంతానము అని ప్రస్తావింపవలసివచ్చును. ఇదివరకు పురుషులు పొందుచున్న వివాహసంబంధమగు నవస్థలు స్త్రీలుకూడ బొందవలసివచ్చును. కాలమునకు విపర్యయముకలదుగాని ధర్మమునకు విపర్యయములేదు. భార్యాభర్తలు ధర్మపాశముచే బంధింపబడిరిగాని త్రాటిచేగాదు. ఆబంధము జీవితాంతమువఱకట్లుండవలసినదే. ప్రేమపాశముకంటె ధర్మపాశ మధికముగాదనుచుంటివా? అదిసత్యమే. కాని కొంచెమాలోచింపుము. సతీపతుల చిత్తములు ప్రేమపాశబద్ధములైనచో తనయంగన చిత్తమొక్కడ నొచ్చునోయని భర్తయును, భర్త

భావము వ్యసనభాజనమగునేమోయని భార్యయును పరస్పరసంతోషములు భంగము గావించుకొనరు. అట్లుగాక ధనరూపవిద్యాదులలో దేనియందైన చిత్తము లగ్నమయ్యెనేని దానమోహనిబద్ధులై చక్కిలిగింతసంబమువలె క్షణికసుఖములకు పాల్పడిన వారికి అనంతరము మోహవిచ్ఛేదమగును. ధర్మపాశమున కచ్చుట నిల్చుటకు తావులేదు. పురుషుఁడు వాడియైన కత్తివలె తీవ్రస్వభావముకలవాఁడు. అతనికి ధైర్యస్థైర్యములు మెండు. యుక్తాయుక్త విచక్షణత, పౌర్వాపర్యవిచారణము, నిదానము, నిర్మలత, ఆర్జనయందాసక్తి, అందులకుగల యుక్తియుక్తులు అతనియందున్నవి. స్త్రీయన్ననో పుష్పకోమలశరీరముకలది. అందువలన భీరుత్వాదిలక్షణములు గలది. తమబుద్ధికౌశలమువలన యుద్ధాదులయందుబోరాడి భర్తకు బుత్రులకు జయముచేకూర్చిన, యుద్ధగ్రంథములరచించిన యువతీమణులెందరో గలరని వినుచుంటిమి. నీవట్లనియెద వేమియందువా పూర్వమట్టివారు గలరని నేను పైనవ్రాసియుంటినిగదా? రానురాను విద్యావిహీనత స్త్రీలలో ప్రబలి ఈ గతికి తెచ్చినది. దైవ ముభయవ్యక్తులయందును సమానప్రేమను జూపినాఁడు. ధీరతాధీరతలు స్త్రీపురుషులకు సమానముగ పంచి సహిష్ణుతాసహిష్ణుతలలో సహిష్ణుత స్త్రీలకును, అసహిష్ణుతపురుషులకును సమానముగబంచినాఁడు. పురుషునియందు సహిష్ణుత లేకపోవుటచేతనే వయోవృద్ధుడైనను అపత్నీకునకు సత్కర్మాచరణ కర్హతలేదను నెపముతో ముక్కుపచ్చలారని పసిపాపయగు పదియేండ్ల బాలికను వివాహమాడి తల్లిలేక నల్లాడు బిడ్డలపై నిసుమంతయైన జాలిలేకనే మేనత్తలయొద్దనో నాయనమ్మలయొద్దనో విడచి వివాహమై ముసలిముచ్చటలు మురియుచుండును. ఇంతియేకాక తల్లిలేని తనకూతు నొకనికి వివాహముచేసి యతనికూతునో సోదరినో తాను వివాహమాడి యందువలన గలిగిన యిక్కట్టులను సుఖముగ బరిగణించుచుండును. ఇదియే యతని సత్కర్మాచరణయందలి మొదటి ఫలితము. ఒకబిడ్డతల్లియైనను భర్తచనిపోయిన పిదప వారసు లాస్తియాక్రమించినను యెట్లెట్లో కష్టపడి బిడ్డనుపెంచి వృద్ధిలోనికి దెచ్చుచున్న స్త్రీలనెందరినో మనకన్నులారఁ జూచుచున్నాము. విషయలాలసుఁడగు పురుషుఁడు నాలుగైదు వివాహములు చేసికొని భార్యలను నిర్బంధించుచు లోకాపవాదములోనగుట చూచుచుండియు, స్త్రీయును భర్తవివాహబంధమునకు రాజీనామాయిచ్చి యింకొకని వివాహమాడి యచ్చటగూడ నిట్టి యవస్థలనే బొంది హాస్యాస్పదమగుటకంటె పైన వ్రాసినరీతిని భర్తచనిపోయిన స్త్రీవలెనే భార్యచనిపోయిన పురుషుఁడుగూడ నపత్నీకుడై యుండునటుల చట్టముకావలయునని కోరిన బాగుగ నుండును. పురుషునకు నలువదేడులు గడచినపిమ్మట భార్య చనిపోయినపక్షమున వివాహము చేసికొనుట



ప్రతిబింబము

తగదనియును, యొకవేళ చేసికొనినను వితంతువునే వివాహమాడవలయును గాని కన్యనుగాని పసిపాపనుగాని వివాహముచేసికొనఁ గూడదను నియమము కావలయునని కోరవలెను. ఇట్టి యమూల్యనియమము గలిగిన దేశమెంత సుఖవంతమైయుండును? లజ్జా వినయానతలై, వస్త్రావకుంఠలై, స్త్రీలువీరమాతలై, వీరపత్నులై వెలయుచుండుట పూర్వమునుండియు హిందూదేశస్త్రీలకు స్వభావమైయున్నది. హిందూవిదుషీమణులు పూర్వము ఉద్గ్రంథములరచించి గృహకృత్యముల నిర్వర్తించుచు అతిథ్యభ్యాగతులఁ బూజించుచు సర్వకార్యములయందు భర్తకు చేదోడు వాదోడగుచు సుఖసంపదల ననుభవించి కీర్తికాయముల దమజాతి నారీమణుల కాదర్శముగ నిటడించి పుణ్యాలోకముల నలంకరించిరి. ఇప్పుడుకూడ నట్టివిద్యావతులు లేకపోలేదు. పాశ్చాత్యవిద్యనభ్యసించుట వలన వారి యాశయములు పూర్వకాలపుస్థితిగతులను గ్రహించుట కిష్టపడవు.

ఇందలి స్త్రీల యాచారములును, సంప్రదాయములును నాదర్శప్రాయములై యుండ నితరదేశస్త్రీల యాచారసంప్రదాయముల నాదర్శముగ గైకొనుట కిష్టపడుట యెందులకు? 'స్వధర్మేనిధనం శ్రేయః॥ పరధర్మోభయావహః' అనునట్లు, భయావహమగు పరధర్మాచరణకంటె స్వధర్మమాచరించి చచ్చుటయైన మంచిదని ఈశ్లోకార్థము. గుణముగల్గిన పరధర్మముమాత్ర మేల గ్రహింపగూడదనియందువా? ఏధర్మమున గుణమున్నదో యాత్మశక్తి నుత్తేజితముచేసి పరికింపుము. తనసంతాన మధర్మపథముఁ జెందకుండ భద్రపరచు బాధ్యత పురుషునికంటె స్త్రీలయందధికముగనున్నట్లు భగవద్గీతయందు వ్రాయబడియున్నది "శ్లో. స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" స్త్రీ దుష్టురాలైన వర్ణసంతతియు సంకరమగునని దీనియర్థము. కావున స్త్రీ ఋజుమార్గగామిని, పరిశుద్ధురాలు కావలయును. తనకోడండ్రను, కూతులను, యిరుగు పొరుగువారిని అందరిని మంచిమార్గములోనికి తెచ్చు బాధ్యతస్త్రీ యందధికముగ నున్నట్లు తేటపడుచున్నది. మగవారి నడవడిని చక్కచేసికొనవలయునని యేధర్మశాస్త్రములయందును జెప్పలేదా యని యనుచున్నావా? చెప్పలేదు. ఈర్ష్యాళువులగు సామాన్యవ్యక్తులకు భేదము, ధనాశ గలదని చెప్పిన నొప్పుకొనవచ్చునుగాని దైవదత్తమగు మహాశక్తివలన వాజ్నిపుణులై మహర్షులు నిష్పాక్షికబుద్ధితో నాగమములు రచించిరి. అందు 'నానృతం వదేత్ నపరదారాంగచ్ఛేత్,' అనృతము వచింపఁగూడదు. అన్యస్త్రీని పొందగూడదు. అని పురుషునిగూర్చి వ్రాయఁబడియున్నది. ఈవిషయమును వారెఱుంగకుందురా? అయిననేమి? కొందరు కాముకులు ధర్మములకు విపరీతార్థముల గల్పించి యిది

కూడ ధర్మశాస్త్రములయందు గలదని యొకఁడొకరు నలుగురేసి స్త్రీలను పరిణయమై అరువది యేండ్లు గడచినను పసిపాపను వివాహమాడుట ఆస్త్రీలను నీచాతినీచముగ గాంచుచు యొకతెను విడచి, యింకొకతెను ప్రేమించుచు పరస్పరపీడవలన ప్రేమ యుతయు నీర్ష్యాక్రోధములుగ మారి వీరల సమర్థింపఁజాలక సన్యాసాశ్రమము గైకొని యందునగూడ భ్రష్టులైన వారెందరు లేరు? పురుషుఁడధర్మపరుఁడై స్త్రీని బాధింపవచ్చును గాని స్త్రీకియన్యగతి లేదాయని యనియెదవా? అట్టివారలను నీసత్ప్రవర్తనమువలన మంచి మార్గమునకు ద్రిప్పుభారము నీయందున్నది. కనుకనే నీవువారియభిప్రాయముననుసరింపకుము. నీమార్గమునకు వారిని మరలించుకొనుము. అదిసామముచేతనే ఫలింపగలదు. పురుషులకు పతనోత్పతనములు గలవు. స్త్రీ పతనమే కాకూడదు. ఒకవేళ పతనము గల్గినచో నుత్పతనమేలేదు. పైనవ్రాసిన ప్రమాణముల ననుసరించి వివాహమాడి కడకు విడనాడఁదలఁచిన నామొగతియేమగునని యడుగుట యొక నేరమైనట్లున్నదేయని యందువా? వారు స్వధర్మముల నెఱింగియు స్వాతంత్ర్యభావముచే ధర్మపథమునతిక్రమించి యందుకనువగు రీతుల గల్పించి స్వపక్షముగ సమర్థించుకొనుచుందురు. తమకు జ్ఞానదాయకమగు విద్యా పీఠమున కధిష్ఠాతయెవ్వరో యిహఫలసౌఖ్యదాయకనుగు తమదేహాత్పత్తికి కారణ మెవ్వరో సహధర్మిణియై సంతానోత్పాదనోపకరణమై యుభయలోకతారకమైనదెవ్వరో వారెఱుగరా? త్రికాలములయందు తాముపాసించుగాయత్రీమాత యెవ్వరో మనము వారికి బోధింపవలయునా?

హిందూస్త్రీలకుఁగల గౌరవాతిశయములను ఖండఖండాంతరములయందు వేనోళ్లఁ బొగడ్తగన్న కీర్తిని మలీమసముగావించునంతటిసాహసకృత్యము నుపసంహరించుట యెంతయుయుక్తము. అమెరికాఖండమునందలి చికాగోనగరమునందు వివేకానందస్వామి హిందూ స్త్రీధర్మములను గూర్చి యుపన్యసించినపుడు యందలి యమూల్యపాతివ్రత్య నియములు అచ్చట స్త్రీలు విని హిందూస్త్రీలలో నిట్టి పతివ్రతలు కలరాయని యచ్చెరువందలేదా! హిందూజాతి కేర్పడిన వివాహము ధర్మసిద్ధముగాని విదేశీయులవలె వ్యావహారికము కాదు. వ్యావహారికమనుకొనినంతకాలము దాంపత్యమేరీతిగనుండునో దేశ చరిత్రల నెఱింగిన నీకు నేను వేరుగచెప్పనక్కరలేదు.

కాబట్టి విడాకులనుపదము మనజాతియందు, మనభాషయందు యెట్టిస్థానమున నున్నదో రవంత నిదానించిచూచినయెడల నీకే బోధపడగలదు. భూదేవివలె శాంతిని వహించుటయే యిందుకు ప్రతీకారము. మనకిద్దరకుంగల మైత్రిమూలమున నీయుద్దేశమును తెల్పినటులనే నాయుద్దేశమునుకూడ తెల్పితినిగాని, వాదప్రతివాదములకు డీకొంటినని మాత్రము తలుపకుము. నాయభిప్రాయ మీయొక్క వ్యాసముతో సంపూర్ణమైనదని యనుకొనకుము.

# వీర నారి

## శ్రీమతి బి. జ్ఞానాంబ గారు

చంద్రనగర సైన్యాధిపతియగు చందనసింహుఁడు రాజాజ్ఞచే రణరంగమునకు వెడలుచుండ అంతఃపురమునుండి అతని భార్య శక్తిమతీదేవి దూతికచే నిట్లు కబురంపెను. "జీవితేశ్వరా! మాతృదేశ గౌరవము మీవీరబాహువులపై నాధారపడి యున్నది. దానిని మొక్కవోకుండఁ గాపాడుట మీముఖ్యకర్తవ్యము. ఎట్టికఠోరకష్ట సమయమందైనను కర్తవ్యమును విస్మరింపకుడు."

ఈసందేశము నాలకించినతోడనే చందనసింహుని మిత్రులెల్లరు పకపక నవ్వఁ జొచ్చిరి. ఒకఁడు "ఆడుదానికింత యధికచనవుకూడదు." అనియెను. ఇంకొకఁడు "ఇదికూడా ప్రణయసందేశమే కాబోలు" అనియెను. వేరొకఁడు "వట్టి అమాయికురాలు, యుద్ధమనగా నింటిలోఁగూర్చుండి వంటఁజేయుట యనుకొనినది" అనియెను. చందన సింహుని కాడువారియెడ నసలే విశ్వాసగౌరవములులేవు. పైగా మిత్రుల పరిహాసప్రసంగములచే నతని కరికాలుమంట నెత్తికెక్కెను. క్రోధకర్కశస్వరముతో నతఁడిట్లనెను.

"చేటీ! మీయజమానురాలి యాజ్ఞకు సదాకృతజ్ఞుఁడను. తెరమఱుఁగునఁ బ్రొద్దుపుచ్చు నాడువారు బహిరంగయుద్ధమునఁ బ్రాణములర్పించు మగవారికి వీరధర్మము లుపదేశింపవలసిన యవసరమింకను తటస్థింప లేదని మీయజమానురాలితో వచింపుము."

గజాశ్వముల ఘీంకారరవములతోఁబాటు వీరభటుల వీరాలాపములు మిన్నుముట్టినవి. తళ తళ మెరసిపోవుచున్న వాఁడి ఖడ్గములతోఁబాటు తలపుత్రైలు తాటికాయల వలె పైకెగసినవి. ఎడతెగకఁ బ్రవహించుచున్న రుధిరస్రవంతులలో వేలకొలది నిర్జీవ శరీరములు తేలియాడినవి. సుశిక్షితులైన శత్రుసైనికులు సంఖ్యాధికులగుటచేఁ జంద్ర నగరసైనికులకు జయాశ అంతరించెను. చందనసింహునికి నాలుగైదు తీవ్రగాయములు తగిలినవి. బుడ బుడఁ గారుచున్న రక్తముదిక్కుఁ జూచుకొనుచు నతఁడిట్లనుకొనెను.

"ఛీ, ఛీ. ఆడుదాని యధికప్రసంగమునకు మోసపోయి వృథాగానింతరక్తమును పాడొనరించితిని. దేశముసంగతి దేవుఁడెఱుఁగును. ప్రాణములుండిన బలుసాకుఁటని జీవింపవచ్చునుగదా?" ఇఁక చెప్పవలసిన దేమున్నది? ఉభయ సేనలు నిద్రాదేవిగాఢాలింగనమందు మైమరచి యున్నతఱి చందనసింహుఁడు మెల్లఁగా కాళ్లకు బుద్ధిఁజెప్పెను.

అదరుగుండెలతో, బెదరుచూపులతో, తడఁబడుచున్న కాళ్లుఈడ్చుకొనుచు చందన సింహు డంతఃపురమును సమీపించెను. కవాటము బంధింపఁబడి యుండుటచే రెండు మూడు పర్యాయములు బిగ్గరగాఁ బిలిచెను. కానిలోపలినుండి ప్రత్యుత్తరము రాలేదు. చందనసింహుఁడది చూచి మండిపడుచు "గాయముల బాధచే నిలువెల్లదహించుకొని పోవుచున్నది. త్వరగాఁ దలుపుఁదీయుఁడు. లేనిచో విరుగఁగొట్టివైచెదను. జాగ్రత్త." అని గర్జింపఁజొచ్చెను. కొంతసేపటి కొక పరిచారిక బయటికివచ్చి

"మహాప్రభూ! మన్నింపుడు. ఇవిగో, ఈవస్తువులను ధరించినఁగాని తమకుఁ బ్రవేశమునకు వీలు కలుగదఁట" అని యొకచీరెయు, రవికెయుఁ, గొంతపసపుముద్దయు నాతని యెదుటఁ బెట్టెను. వాటినిఁ గాంచినంతనే చందనసింహుని కభిమానోదయ మయ్యెను. స్వామిభక్తిపరాయణులైన తోడిసైనికులను శత్రువుల భీకరఖడ్గప్రహారముల కొప్పగించి వచ్చిన తనభీరుత్వమునకుఁ దానేలజ్జించెను. అతనికిప్పుడు గాయములబాధ బొత్తిగా యగపడుటలేదు. వీరావేశముతో నతఁడిట్లనుకొనెను.

"కంచుకచేలముల మూలమున దేవియొసరించిన యుపదేశ మమూల్యమైనది. ఖడ్గహస్తుఁడనగు నాకును కంకణహస్తయగు నామెకును తారతమ్య మంతగాఁగానిపించుటలేదు. విజయవంతుడనై యేతెంచితినేని దేవిదివ్యపరీరంభణము లభింపఁగలదు. లేదేని ముక్తికాంతామంగళపరిష్వంగము సిద్ధింపఁగలదు. ఎటులైన నొక్కటియే?"

ప్రళయసముద్రమువలె నుప్పొంగుచున్న శత్రుసేనలోఁ జొరఁబడి చందనసింహుడు విశృంఖల వీరవిహారమొనరించుచుండెను. నూతనోత్సాహప్రజ్వలితమైన యతని విక్రమధాటికాగఁజాలక శత్రుసేన యొకటి రెండుసారులు వెనుక కొదిగియు మరల విజృంభించెను. సంపూర్ణకవచధారియైన యోధుఁ డొకఁడాతనికి బాసటయై నిలిచి పగతురఁ బరిమార్చుచుండెను. చందనసింహుఁడాయోధుని పరాక్రమ నైశిత్యమున కచ్చెరువొంది తనలో "విలయరుద్రునివలె విరోధులనుక్కడఁగించుచు నితడు నాకొనరించున్న యుపకార మీజన్మములో మరువరానిది. ఇతఁడుండఁబట్టి సరిపోయినది. కాని లేనిచోఁ బగవారిదివరకే నన్నుఁబరిమార్చియుందురు." అనుకొనియెను. విశేష రక్తస్రావముచేఁ జందనసింహుని శక్తిక్రమముగా సన్నగిల్లుచుండెను. శిరోనేత్రములు గిరగిరఁదిరుగుచుండెను. పట్టుసడలుటచేఁ జేతిలో ఖడ్గము జారిపోవుచుండెను. శత్రుసైనికుఁ డొకఁ డీసమయముఁ గనిపెట్టి బల్లెముతో నతనివీపునఁ బొడిచెను. కవచధారియోధుడది చూచి తక్షణమే యచటికి లంఘించి గుఱ్ఱముపైనుండి పడిపోవుచున్న చందనసింహుని మెల్లగాఁ గ్రిందికి దింపి తొడలపైఁబరుండఁ బెట్టుకొని విచారగద్గదస్వరముతో

"నాధా?మీరు మీకర్తవ్యమును చక్కఁగా నిర్వహించితిరి. మీజీవితము పునీతమైనది. ఇఁకనేనును నాకర్తవ్యమును నిర్వహించు కొందును." అని వామహస్తమున మెరయుచున్న రక్తారుణకరవాలమును తననురమునఁ గ్రుచ్చుకొనెను. మూతలు పడుచున్న నేత్రముల నతికష్టముమీద విప్పి విస్మయపూర్ణదృష్టులతో యోధుని వీక్షించుచు చందనసింహుఁడిట్లు పలికెను.

"వీరనారీ! నీవేనా? శహభాష్. పురుషులకంటె స్త్రీలే శౌర్యవంతులని నేనిప్పుడు గ్రహిం...చి...తి...ని". అతని ప్రాణవాయువు లెగిరిపోయెను. శక్తిమతీదేవి ప్రాణవాయువులు వానిననుకరించెనని మేము వేరుగాఁ జెప్పనవసరములేదు.

# భోజనపదార్థములు

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి.ఏ. (సారస్వతసమాజము)

3

దేహముయొక్క నిర్మాణమునకవసరమగు పదార్థములను మూడువిధముల విభజింపవచ్చును.

1. మాంసకృత్తులు
2. నిరింద్రియలవణములు
3. ఉష్ణకరములు

వీనిలో నొక్కొకదానినిగూర్చియు, అవి మనకుచేకూర్చు పదార్థములనుగూర్చియు నీవ్యాసమున కొంతవరకు చదువుదము.

## మాంసకృత్తులు

నత్రజనియను మూలద్రవ్యము ఇందుండెడి ప్రధానవస్తువు. మనుష్యమాంసకృత్తులను భూతయద్దము క్రింద పరిశీలించి చూచినచో ప్రతిమాంసకృత్తునందును పదునెనిమిదిభాగములు గోచరించును. జంతువులందుండెడి మాంసకృత్తులకును మనుష్యమాంసపుకృత్తులకును నీభాగములసంఖ్యలో భేదమున్నది. అటులే శాకములందలి మాంసకృత్తులకును జంతుమాంసకృత్తులకును భేదమున్నది. కానిమనుష్యమాంసకృత్తులకును జంతుమాంసకృత్తులకును ఎక్కువపోలికయుండుటచే మానవుడు వానిని సులభముగా జీర్ణించుకొనగలుగుచున్నాడు. మనము తినినవస్తువులందలి మాంసకృత్తులు జీర్ణకోశమును జేరగనే యవి వివిధభాగములుగా చీలి మనుష్యమాంసకృత్తులుగా నేర్పడి రక్తమునందు ప్రవేశించి పనిచేయుటచే జీర్ణించిన దేహమునందలి యణువులను బాగుచేయుచున్నవి. దేహ మెదుగుటకుగూడ నివే సాయపడును. దేహము గోవగా ఎదిగెడి బాల్యమునందు మాంసకృత్సహితమగు నాహారము మిక్కిలి యవసరము. కాని సమస్తపదార్థములందలి మాంసకృత్తులు సులభజీర్ణములుగావు. కనుక వాడకీయబడువస్తువులు సులభముగ జీర్ణించు మాంసకృత్తులను గలిగియుండవలెను.

ఈక్రింది పదార్థములలోని మాంసకృత్తులు సులభముగ జీర్ణంపవు: తెల్లబియ్యము, మైదాపిండి, మొక్కజొన్న.

ఈక్రిందివి అటునిటుకాక యుండును: అన్నిరకములగు పండ్లు, కాయలు, చేబియ్యము, రాగులు, బఠాణీలు, గోధుమపిండి, చిక్కుడుగింజలు, సగ్గుబియ్యము, పప్పుదినుసులు, గింజలు, చోళ్లు.

ఈక్రిందివానియందలి మాంసకృత్తులు సులభముగ జీర్ణించును: మాంసము, చేపలు, గ్రుడ్లు, పాలు, పెరుగు, మీగడ, మజ్జిగ, పచ్చనియాకులు, చిగుళ్లు.

దీనినిబట్టి మనమనుదినమును భుజించుపదార్థములలో మిక్కిలిముఖ్యమగు బియ్యములోని మాంసకృత్తులు సులభజీర్ణములుగావని తేలినది. అట్టివానిని జీర్ణించుకొని వానియందలి మాంసకృత్తులను దేహముగ్రహించవలెనన్న వానివెంబడి సులభజీర్ణములగు పాలు, మజ్జిగ మొదలగువానినిగూడ తీసికొనవలెను.

## నిరింద్రియలవణములు

ఈ లవణములు మనదేహమునకెంతయు నవసరములు. శరీరమున ఇరువదియైదింట నొకపాలు వీనితో నేర్పడినది. ఇందు దాదాపిరువదియైదు మూలద్రవ్యములున్నవి. అందు కాల్షియము, పొటాసియము, సోడియము, లోహము, మెగ్నీషియము, మాంగనీసు, యశదము, రాగి, భాస్వరము, గంధకము, హరితము (క్లోరీను), అయొడీను ముఖ్యములు. అందు మొదటి యెనిమిదియును రక్తమును పులియజేయుగుణముగలవి.

చివరినాలుగును పులియనీయవు. మొదటిరకపు మూలద్రవ్యముల ప్రకోపమువలన రక్తము పులిసినచో ననారోగ్యమువచ్చి ప్రాణాపాయముగూడ రావచ్చును. అటులే చివరవి ప్రకోపించినను. కనుక నివియెల్లను తగు పాళ్లుగ నున్నపుడుమాత్రమే యారోగ్యము సరిగానుండును.

ఈ లవణములు ముఖ్యముగ నెముకలలోను, పండ్లలోను గూడును. రక్తములోను, కండరములలోను గూడ నివియుండి వానిచలనమునకు సాయపడుచున్నవి. ఊపిరితిత్తులు, హృదయము, ప్రేగులు మొదలగు వానిలో లవణములు తగ్గియున్నచో వానిపని సరిగాజరుగక అనారోగ్య మంకురించును.

అన్ని పదార్థములలోను ఈ లవణములన్నియు సమానముగనుండవు. కొన్నింటిలో ఆమ్లసంబంధమగు లవణములును, మరికొన్నింటిలో రెండవరకము లవణములును విరివిగానుండును. మాంసము, పప్పుదినుసులు, పిండివస్తువులు, గింజలు మొదలగువానిలో మొదటిరకపు వస్తువులు హెచ్చు. దుంపలు, పండ్లు మొదలగు వానిలో రెండవరకము హెచ్చు. గింజలలోలేని లవణములు వానియాకులలో నుండును. పాలలోమాత్రమివి యన్నియును కావలసినపాళ్లుగా నున్నవి. కనుక భోజనపదార్థములలో నివియన్నియు నుండునట్లు గృహిణి జాగ్రత్తతోచూచి వంటచేయుట యవసరము.

వీనిలో కొన్నింటినిగూర్చి ఇటకొంచెమువివరముగ చదువుదము.

1. కాల్షియము: ఇది ఎముకలను, పండ్లను గట్టిపరుచును. హృదయము సరిగాకొట్టుకొనునట్లు చేయును. రక్తము గాలికితగులగనే గడ్డకట్టినట్లు చేయును. కనుక దెబ్బతగిలినపుడు రక్తము నష్టముగాకుండ చేయును. ఇది పాలలోను, మజ్జిగలోను, గ్రుడ్లలోను, గింజలలోను, పండ్లలోను, ఆకులలోను ఉన్నది. తమలపాకులకు రాసికొను సున్నమున విస్తారమున్నది. పిల్లలతల్లులకు కాల్షియముగల ఆహారమవసరము. అదియున్నగాని పిల్లలదేహము సరిగా త్వరితముగా నెదుగదు. బాలింతరాండ్రు తములము వేయుటవలన కాల్షియమును, ప్రాణకృత్తును విస్తారము లభించును.

2. భాస్వరము: ఇదియును ఎముకలకును, పండ్లకును అవసరము. శరీరమునందలి కోశముల అభివృద్ధికి అవసరము. ఇది పాలు, మజ్జిగ, గ్రుడ్లు, చేపలు, మాంసము, పప్పులు, గింజలు, గోధుమలు, చొళ్లు, రాగులు, దోసకాయ మొదలగువానిలో నున్నది.

3. లోహము: ఇది నెత్తురులో విస్తారమున్నది. ఇది ప్రాణవాయువునుగ్రహించి నెత్తురునకు ఎఱ్ఱనిరంగు కలుగ జేయుచున్నది. దీనివలన నెత్తురునకు గడ్డకట్టుగుణమువచ్చుచున్నది. ఇనుము చాలినంతలేనిచో దెబ్బతగిలినపుడు నెత్తురుగడ్డకట్టక కారిపోవుచునే యుండును; పండ్లచిగుళ్లనుండి నెత్తురు కారును. ఇది గ్రుడ్లు, చేబియ్యము, ఉల్లిపాయ, పుచ్చకాయ, అరటికాయ, దోసకాయ, కాశీవంగ మొదలగువానిలో నున్నది.

4. సోడియము, *హరితము: ఈ రెండును కలసిన లవణమే ఉప్పు. ఉప్పు నెత్తురును శుభ్రముగా నుంచును, దేహమునకు కావలసిననీటి నుంచును. వివిధాంగములను సరిగాపనిచేయునట్లు చేయును. కేవలము మాంసభక్షకులకు లవణమవసరము లేదు. కాని శాకాహారులకు లవణమవసరమే. వరియన్నముతిను వారికిది స్వల్పముగా

* హరితమనునది యొకరకము వాయువు. దీనిరంగు ఆకుపచ్చన. అందుచేతనే దీనికీపేరు కలిగినది. ఇదిగాలి కన్న బరువు. జరిగిపోయిన అయిరోపాసంగ్రామమున జర్మనులీవాయువును సిలిండరులలో నొక్కియుంచి శత్రుసైనికులపైకి వదలిరి. అందువలన వారు ఉక్కిరిబిక్కిరియై చనిపోయిరి. ఇది మిక్కిలివిషవాయువు దీనినిపీల్చుటవలన ప్రాణాపాయమువచ్చును. అయొడీనుగూడ ఈతరగతిలోనిదే. దానిరంగు ఊదా. ఈ రెండును గూడ క్రిమినాశినులు.

చాలును. కాని మనవారువీనిని మితిమీరి తీసికొందురు. ఇందువలన మూత్రపిండములు హానినిపొందును. ధమనులు (నెత్తురుకాల్వలు) బిగువుతగ్గును. అగటిపండ్లు, ఖర్జూరము, అనాస, ఆకుకూరలు వీనియందు హరితము విరివిగానున్నది.

౫. అయొడీను: ఇది శోషరసమునకు (శోషరసమనునది ... ముఖ్యమగు రసములలో నొకటి. ఇదిచేయుపనికూడ చాలముఖ్యము) అవసరము. ఇది చాలినంతలేకున్నచో మెడమీద నొక రకముకంతి బయలుదేరును. ఇది కాడ్లివరునూనె, చేపనూనె, ఆకుకూరలు, పండ్లు మొదలగువానిలో చాలినంతయున్నది.

## ఉష్ణకరములు

ఇవి రెండువిధములు: i. క్రొవ్వులు. ii. కర్బనోదజనితములు.

ఈ రెండును శరీరమను ఇంజను నడచుటకు వలయునుష్ణమును జనింపజేయుటచే వీనికీపేరువచ్చినది. ఈ రెంటియందును బొగ్గు, ఉదజని ముఖ్యముగ నుండు మూలద్రవ్యములు.

క్రొవ్వు: ఇది తెల్లగనుండును. చర్మమునకు క్రింద ప్రతిజంతువునకును పొరవలె నుండును. శరీరమునందు ఎక్కడెక్కడ కొంచెము స్థలమున్న నక్కడ నిదిచేరుచుండును. దీనివలన శరీరమునకు నిగనిగ, అందము వచ్చును. ఇది అనుష్ణవాహికయగుటచే శరీరమునందలియుష్ణమును బైకిపోనీయదు. ఎక్కువగా క్రొవ్వుటవలన హృదయస్పందన మాటంకమగునుగాన హఠాన్మరణము కలుగును.

క్రొవ్వు రెండువిధముల నున్నది: ౧. జంతుసంబంధమైన క్రొవ్వు. ౨. వృక్షసంబంధమైన క్రొవ్వు. వెన్న, నేయి, చేపనూనె, కాడ్లివరునూనె మొదలగువానివలన వచ్చునది జంతుసంబంధమైన క్రొవ్వు. నువ్వులు, కొబ్బెర, వేరుసెనగ, అవిసె మొదలగునూనెవలన గలుగునది వృక్షసంబంధమైనక్రొవ్వు. జంతుసంబంధమైన నూనెలో మొదటితరగతి ప్రాణకృత్తులున్నవని క్రిందటిభాగమున వ్రాయబడినయంశమును మదినుంచిన వారికి ఈ రెంటిలోను జంతుసంబంధమైననూనెలే శ్రేష్ఠములని తెలియును.

కర్బనోదజనితములు: ఇవి యుష్ణకరములలో రెండవరకము. ఇంగు పిండిపదార్థములును, శర్కరయును జేరును. ఇది మనకు బియ్యము, గోధుమ, రాగులు, మొక్కజొన్న, శర్కర, బెల్లము మొదలగువానినుండి హెచ్చుగను; పప్పుదినుసులు, బంగాళాదుంప, పెండలము, కంద, చేమ మొదలగువానినుండి తగుమాత్రముగను; పండ్లు, ఆకుకూరలనుండి కొలదిగను దొరకును. పాలనుండికూడ స్వల్పముగ దొరకును.

ఇవి మనకు విరివిగ కావలెను. అందుకొరకు కర్బనోదజనితములు హెచ్చుగానున్నబియ్యము మొదలగు వానిని హెచ్చుగా తినినచో జీర్ణాశయమున నిది విరివిగాజేరి మాంసకృత్తులు, క్రొవ్వులు, నిరింద్రియలవణములు, ప్రాణకృత్తులు మొదలగువానిని శరీరము సరిగాగ్రహింపకుండునటులడ్డును. అందువలన శరీరమునకు కావలసిన పదార్థములన్నియు తగుపాళ్లుగా జేకూరవు. ఆంత్రములలో (పేగులలో) కర్బనోదజనితములు హెచ్చుగా జేరినచో అజీర్ణముచేసి నీళ్లవిరేచనములు మొదలగునవి కలుగును. ఇందువలన బలహీనత, బరువుతగ్గుట కలిగి రోగముల నిరోధింపగలశక్తి శరీరమునకు తగ్గును.

రెండవరక ప్రాణకృత్తులు సమృద్ధిగానున్నచో కర్బనోదజనితములను శరీరము సరిగాగ్రహింపగలశక్తిని కలిగియుండును.

## పాలు

పాలయొక్క ప్రాశస్త్యత మనపూర్వులకు తేటతెల్లము. అందుచేతనే వారు పంటకన్న ముందుగ పాడి నెంచి 'పాడి, పంట' యని వాడెడివారు. శరీరమునకుకావలసినయైదు పదార్థములును-మాంసకృత్తులు, క్రొవ్వు పదార్థములు, కర్బనోదజనితములు, నిరింద్రియలవణములు, ప్రాణకృత్తులు-దీనియందు ఉచితభాగములనుండుటచే భోజనపదార్థములందెల్ల క్షీరము అగ్రగణ్యము. అందుచేతనే దీనిని పెద్దలు అమృతమని వాడిరి.

చిన్నపిల్లలశరీరము సత్వరాభివృద్ధినొందును. అట్టివారికి క్షీరపానమెంతయు నవసరము. చంటిపిల్లతల్లులకుగూడ నిది మిక్కిలియవసరము. రోగులును, ముసలులును అనుదినము నొకయరసోలెడుపాలను త్రాగుట శ్రేయస్కరము. ఆరోగ్యవంతులుకూడ తరచు పయఃపానముచేయుట శ్రేయస్సాధనము.

క్షీరములు సర్వసద్గుణసముపేతములు. దీనియందలి మాంసకృత్తులు సులభజీర్ణములుగాన పప్పు మొదలగువానియందున్న మాంసకృత్తులు సులభముగ జీర్ణించుటకు సాయపడును. కర్బనోదజనితములును, క్రొవ్వును దీనియందు అనుకూలస్థితియందున్నవి. భాస్వరము కాల్షియము మొదలగు నిరింద్రియలవణములుగూడ దీనియందు విరివిగనున్నవి. ప్రాణకృత్తులలోగూడ నివి తీసిపోవు. కాని కృత్రిమాహారమును దినుచు, పచ్చికబయళ్లనిన నేమోయెఱుగక నగరములందుండు పశువులపాలలో ప్రాణకృత్తులు సమృద్ధములుగావు. పచ్చనిమేతమేసి ఎండలోతిరిగెడి పశువులపాలు ప్రాణకృత్తులను గలిగియుండును. అట్టివానిపాలను పిదికినవెంటనే పచ్చివానిని త్రాగినచో మూడవతరగతి ప్రాణకృత్తులుకూడ నుండును. కాచిన పాలయందివి నశించును. కాచిన పాలను త్రాగెడి పిల్లలకు ఫలరసములనిచ్చినచో నీప్రాణకృత్తు ఆవిధమున లభించును.

వెన్నతీసినపాలుగూడ ఆరోగ్యదములే. పెరుగు, మజ్జిగ మాంసకృత్తులుగలవి. ఆవుమజ్జిగ త్రాగినచో ప్రాణము తేరివచ్చును. పైత్యము హరించును. దాహము కట్టును. వెన్నయందు క్రొవ్వుపదార్థములును, మొదటితరగతి, నాల్గవతరగతి ప్రాణకృత్తులును ఉండును. తాజావెన్నను పిడతపై మూతపెట్టి కాచగా వచ్చిన నెయ్యిలో ప్రాణకృత్తులుండును. మూతతీసి కాచినచో ప్రాణకృత్తులు నశించును.

పాలలో ఆవుపాలు చాలమంచివి. మేకపాలలో మాంసకృత్తులును, క్రొవ్వుపదార్థములును హెచ్చు. గేదెపాలలో ఆరెండును అంతకన్న హెచ్చు. గొఱ్ఱెపాలు ఈ విషయమున అన్నిటికన్న మిన్న. ప్రాణకృత్తులు వీనియన్నింటియందును సమములే. ఆవుపాలలో మాత్రము రెండవతరగతి ప్రాణకృత్తులు కొంచెము హెచ్చు.

దీనినిబట్టి పాలయొక్క యావశ్యకత యూహింపవచ్చును. కాని పాడిపంటలతో విలసిల్లిన భారత భూమిలో నేడు పాలుకఱవైనవి. ప్రతిగ్రామమునందును గోభూమికొఱవడియున్నది. గోరాజులసలే యదృశ్యులైనారు. ఉన్నయావులును శల్యచర్మావశిష్టములై చూపట్టును. వేదాధ్యయనముచేయుచు శిష్యగణము వెంటరా గోమాతలను పచ్చికబయళ్లలోమేపుచు లలితశాద్వలాంకురములు నేరిచిదిని గోవత్సములకై సంతరించెడి భూసురశ్రేణిగాని, కోడెదూడపైగల మమకారముచే పాలుతీయుటమానిన కర్షకలోకముగాని నేడు కన్నుపొడుచుకొన్నను కన్పించుటలేదు. గోధూళిసమయమున చేతతెలకపిండిముక్కలు పట్టుకొని పాడియావుల రాకకై యెదురుచూచెడి యాంధ్రకుమారీకుమారులెందరున్నారు? గృహలక్ష్మీ! బూజుపట్టిపోవుచున్న తెలుగు సంప్రదాయములను పునరుద్ధరించి నీసంతానమునకు స్వేచ్ఛాభిలాష, ఇంటిపై ప్రీతి, కృషియెడ సుముఖత, పశువులయెడ ప్రేమ, దాస్యమునెడ విముఖత, ధర్మమునెడ లౌల్యము కలిగింపుము. అంతవరకు వారికి శరీరారోగ్యముగాని, మానసికవికాసముగాని కలుగజాలదు.

## బియ్యము

మనదేశమున బియ్యము ప్రధానభోజనపదార్థము. కొన్నిచోట్ల జొన్నలనుగూడ తిందురు. వీనివలననే మనకు కర్బనోదజనితములు లభించును. దీనియందు క్రొవ్వుపదార్థములును, నిరింద్రియలవణములును స్వల్పము. ఒకటవ, మూడవ, నాల్గవతరగతి ప్రాణకృత్తులుగూడ నత్యల్పముగ నున్నవి.

దీనియందు మాంసకృత్తులుగూడ అత్యల్పమే. కనుక దేహమునకు సరిపడిన మాంసకృత్తులు కావలసినచో అన్నము చాల తినవలెను. అందుచే ప్రేగులలోజరుగు జీర్ణక్రియ మందగించుట, అన్నాశయము సాగుట, మలబద్ధము కలుగుట సంభవించును.

తృణధాన్యములందెల్ల వడ్లు సర్వవిధముల వర్జనీయములు. జొన్నలింతకన్న మంచివి. గోధుమ లంత కన్నను శ్రేష్ఠము.

కలవులో అధికమాసమనునటులు బియ్యమనలే భోజనానర్హములని తెలిసియుండియు మనవారు విలాస ములకుబోయి వానిని కేవలము దూష్యములనుగా జేయుచున్నారు. దంపుడుబియ్యపుటన్నము తెల్లగ మల్లె పూవువలె నుండదని మరిబియ్యమును వాడుచున్నారు. బియ్యమునందెల్ల సారవంతమగుభాగము తవుడు, అది పూర్తిగపోయినగాని బియ్యము తెల్లబడవు. కనుక తెల్లబియ్యములో కర్బనోదజనితములుతప్ప మరే మియు నుండవు. ఇందువలన ఉబ్బు మొదలగుజబ్బు లంకురించును.

డెల్టాభూములలో వడ్లకన్న చెఱువులక్రిందపండిన వడ్లు ఎక్కువ సారవంతములు. ఏవియెట్లున్నను గోధుమపిండికూడ వరియన్నముతోపాటు కొలదిగతినుట యవసరము.

## గోధుమ

గోధుమ లన్నివిధముల వరిబియ్యముకన్న శ్రేష్ఠములు. కాని రుచికొరకు మనవారు వీనినిగూడ అనేక విధముల మార్చి పాడుచేయుచున్నారు. గోధుమలను విసరి అందున్న ఊకనుమాత్రము చెఱిగి మిగిలినభాగము లను దినుట సర్వవిధముల మంచిది. ఇందువలన గోధుమగింజలో మానవశరీరమున కనుకూలమగు పదార్థము లన్నియు మిగిలియుండి పుష్టిచేయును. కాని యీపిండి తెల్లగ కంటికింపుగ నుండదు. కనుక గోధుమలపైనున్న పొట్టును, తవుడునుగూడ బోవునట్లుచేసి తెల్లగానున్న మైదాపిండినిమాత్రము వాడుదురు. ఇందువలన గోధు మలందున్న కర్బనోదజనితములును, క్రొవ్వుపదార్థములునుమాత్రము మిగిలి తక్కినవస్తువులు పోవును.

గోధుమలు వేడిచేయును. కావున శీతలదేశములకెంతయు తగినవి. మనదేశమున వీనిని ఇతరములగు తృణధాన్యములతో కలిపి భుజింపవలెను. ఇవి కర్బనోదజనితములను, క్రొవ్వును మాంసకృత్తులను ఎక్కువగా గలిగియుండుటచే వరియన్నమువలె హెచ్చుగా తిననవసరములేదు. అందుచే అన్నాశయము నిండుటకుగాను కాయకూరలు తినుట చాల యవసరము. ఇందుతో పప్పుకూడ తినవగును. అట్టిభోజనము బలమును శక్తి నిచ్చును.

## జొన్నలు

జొన్నలు పుష్టిచేయుటలో గోధుమలకు తీసిపోవును. కాని వరిబియ్యముకన్న నెన్నిమడుంగులో హెచ్చు. వీనియందు క్రొవ్వుపదార్థములు గోధుమలలోకన్న హెచ్చు. వీనినిప్పటికిని కొందరు నిత్యము వాడుదురు.

## పప్పుదినుసులు

మినుములు, పెసలు, కందులు మొదలగునవి యిందువచ్చును. దీనియందు మాంసకృత్తులు హెచ్చు. కాని అవి సులభజీర్ణములు గావు. కావున పప్పును వరియన్నముతోను; పాలు, పెరుగు, మజ్జిగ మొదలగువాని తోను కలిపి భుజింపవలెను.

వీనిని పిండిక్రిందవిసరి రొట్టెలుగాజేసికొని తినుట యుత్తమమని కొందరిమతము. మనము సాధారణముగ ఉడకబెట్టి తిందుము. దినమునకు 12 తులములపప్పు తినవచ్చును. అంతకు మించినచో నది సరిగా జీర్ణము గాక మలాశయమునజేరి క్రిముల నుత్పత్తిజేసి ఆరోగ్యమును చెరుచును. వేయించిన పప్పుకన్న పచ్చిపప్పు వండుకొనుట మంచిది. వరియన్నమున రెండవరకము ప్రాణకృత్తులులేవనియు నందువలన ఉబ్బుజబ్బు అంకు రించుననియు చెప్పితిని. పప్పుదినుసులలో నీ ప్రాణకృత్తులు సమృద్ధములుగాన వరియన్నము తినువారికి పప్పు దినుసులు శ్రేయస్కరములు.

పప్పుగింజలను నానవేసి, మొలకలెత్తనిచ్చి తినినచో వానియందు మొదటి మూడుతరగతుల ప్రాణ కృత్తులును పూర్తిగనుండి శరీరమునకు మేలుచేయును. ఇట్లుచేయుట యెంతయు మంచిది,

## భోజనపదార్థములపట్టిక

మనము తినుపదార్థములలో దేనియందేమేమి యున్నవో కొందరు పరిశీలించి తెలిసికొనియున్నారు. ఇట్టిపరిశీలన అన్నిపదార్థములయెడను సమగ్రముగ జరుగలేదు. కాని జరిగినంతవరకును, నాకు తెలిసినంత వరకును ఈక్రిందనిచ్చుచున్నాను. దానిని చదువరులు జాగ్రత్తగ పరిశీలించి, తదనంతరమీయబడిన సంపూర్ణ అసంపూర్ణ భోజనపుపట్టికలనుగూడ నెమ్మదిగ గ్రహించి అనుదినము తీసికొనవలసిన యాహారపదార్థములను తదనుగుణముగ మార్చుకొనినచో నేనీవ్యాసమును వ్రాసినసార్థకతను బొందగలను. మీరు కష్టించి చదివిన ఫలితమును బడసి యాయురారోగ్యములను గాంచగలరు.

### 1. ఔన్సుబరువుగల వస్తువులోనున్న వివిధపదార్థములుసుగ్రాములలో

| వస్తువు. | మాంసకృత్తులు. | చమురులు. | కర్బనోదజనితములు | వానినుండి పుట్టు ఉష్ణము (కాలొరీలలో) | అందలి ఖనిజద్రవ్యములు. 100 పౌనుల బరువున్న మనిషికి కావలసినదానిలో 100కి: కాల్షియము. | భాస్వరము | ఇనుము. | ప్రాణకృత్తులు: మొదటితరగతి | రెండవతరగతి | మూడవతరగతి | నాల్గవతరగతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **తృణధాన్యములు** | | | | | | | | | | | |
| చేబియ్యము | 2.30గ్రా | 0.085 | 22.3 | 99 | 0.6 | 6.3 | 5.5 | V | X | — | ... |
| కడిగిన బియ్యము | 1.62 | 0.15 | 26.34 | 113 | ,, | ,, | ,, | — | — | — | ... |
| తెల్ల బియ్యము | 1.79 | 0.13 | 26.09 | 113 | ,, | ,, | ,, | — | V | — | ... |
| ఉప్పుడు బియ్యము | 1.84 | 0.22 | 26.11 | 114 | ,, | ,, | ,, | — | X | — | ... |
| గోధుమపిండి (పొట్టుతో విసరినది) | 3.90 | 0.54 | 20.35 | 102 | 2.7 | 6.3 | 6.3 | X | XX | — | ... |
| మైదాపిండి | 3.14 | 0.37 | 21.54 | 102 | | | | — | V | — | ... |
| బియ్యపు తవుడు | 3.52 | 3.52 | 17.61 | 116 | 4.80 | 40.0 | 40.0 | X | XX | — | ... |
| జొన్నలు | 2.9 | 1.17 | 19.7 | 101 | | | | X | XX | — | ... |
| చోళ్లు | 2.78 | 0.46 | 23.35 | 109 | | | | X | XX | — | ... |
| గంటెలు | 3.64 | 1.38 | 19.4 | 105 | | | | X | XX | — | ... |

V స్వల్పము.
X కొంచెము.
XX మధ్యమము
XXX సమృద్ధము

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పప్పు గింజలు. | | | | | | | | | | | |
| కందులు | 5,28 | 0.40 | 18.41 | 98 | 6.9 | 10.1 | 13.2 | X | XX | — | ... |
| పెసలు | 6.36 | 0.32 | 16.87 | 95 | ... | ... | | X | XX | — | ... |
| మినుములు | 6.84 | 0.33 | 17.81 | 101 | ... | ... | | X | XX | — | ... |
| వేరుసెనగపప్పు | 8.72 | 14. 78 | 3.96 | 184 | 4.4 | 12.8 | 5.6 | X | XX | — | ... |
| కొబ్బెర | 1.61 | 14.31 | 7.9 | 167 | ... | ... | | X | XX | — | ... |
| బాదముపప్పు | 6.5 | 16.89 | 5.5 | 200 | 11.00 | 10.80 | 8.00 | | | | |
| రాజాల చిక్కుడు | 2.66 | 0.11 | 6.45 | 37 | ... | | | X | XX | XX | ... |
| చిక్కుడు | 0.54 | 0.03 | 1.36 | 8 | ... | | | X | XX | XX | ... |
| బటానీలు (పచ్చివి) | 2.00 | 0.25 | 4.85 | 29 | 1.60 | 3.80 | 3.60 | XX | XX | XX | ... |
| ,, (ఎండినవి) | 1.85 | 0.17 | 4.75 | 28 | ... | | | X | XX | — | ... |
| పాలు మొదలగునవి. | | | | | | | | | | | |
| మనిషిపాలు | 0.42 | 1.5 | 0.75 | 18 | ... | | | X | X | X | ... |
| ఆవుపాలు | 0.94 | 1.02 | 1.36 | 18 | 6.2 | 2.4 | 0.5 | XXX | XX | X | X |
| మీగడ | 11.00 | 12.00 | 1.00 | 156 | 1.90 | 1.00 | 1.60 | XXX | X | ... | ... |
| పెరుగు | 1.4 | 1.00 | 0.80 | 18 | ... | | | XX | X | X | ... |
| మజ్జిగ | 0.85 | 0.14 | 1.36 | 9 | 5.5 | 2.6 | 0.60 | X | X | X | ... |
| వెన్న లేక నేయి | | 23.10 | | 208 | 0.8 | 0.3 | 0.6 | XXX | — | — | ... |
| గేదెపాలు | 1.35 | 2.18 | 1.24 | 30 | | | | XXX | X | X | X |
| మేకపాలు | 1.21 | 1.13 | 1.21 | 20 | | | | XXX | X | X | X |
| గొఱ్ఱెపాలు | 1.50 | 2.00 | 1.41 | 30 | | | | XXX | X | X | X |
| నూనెలు : | | | | | | | | | | | |
| కాడ్లివరునూనె | | 28.00 | | 252 | | | | XXX | V | ... | XXX |
| చేపనూనె | | 28.0 | | 252 | | | | XXX | V | ... | XXX |
| కొబ్బెరనూనె | | 28.0 | | 252 | | | | X | — | — | V |
| నువ్వులనూనె | | 28.0 | | 252 | | | | V | — | — | — |
| వేరుసెనగనూనె | | 28.00 | | 252 | | | | V | — | — | ... |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రత్తినూనె | ... | 28.00 | ... | 252 | ... | ... | ... | V | — | — | ... | |
| ఆవనూనె | ... | 28.00 | ... | 252 | ... | ... | ... | — | — | — | | |
| మధురవస్తువులు | | | | | | | | | | | | |
| బెల్లము | 0.08 | ... | 25.00 | 100 | ... | ... | | — | V | — | | |
| పంచదార | ... | ... | 28.30 | 113 | ... | ... | | — | — | — | | |
| తేనె | 0.11 | ... | 20 21 | 81 | ... | ... | | V | V | — | | |
| చెఱకుగడ | 0.42 | 0.16 | 6.20 | 28 | ... | ... | | ... | X | X | | |
| సగ్గుబియ్యము | 2.18 | 0.04 | 22.00 | 97 | ... | ... | | — | — | — | | |
| కూరగాయలు | | | | | | | | | | | | |
| వంకాయ | 0.34 | 0.09 | 1.44 | 8 | ... | ... | ... | ... | X | X | | |
| సీమవంకాయ | 0.20 | 0.03 | 1.27 | 5 | 0.7 | 0.7 | 1.00 | XX | XXX | XXX | | |
| దోసకాయ | 0.17 | 0.02 | 0.57 | 3 | ... | ... | ... | — | X | XX | | |
| తియ్యగుమ్మడి | 0.28 | 0.03 | 1.47 | 7 | ... | ... | ... | — | X | X | | |
| నూలుకోలు | 0.27 | 0.16 | 3.30 | 15 | ... | ... | ... | V | X | X | | |
| బెండకాయ | 0.57 | 0.33 | 1.70 | 12 | ... | ... | | — | X | X | | |
| ఆకుకూరలు | | | | | | | | | | | | |
| కాబేజి | 0.34 | 0 03 | 1.27 | 7 | 2.60 | 0.80 | 2.90 | XXX | XX | XXX | | |
| మట్టుబచ్చలి | 0.51 | 0.06 | 0.82 | 6 | 3.50 | 1.80 | 8.40 | XXX | XXX | XXX | | |
| చుక్కకూర | ... | ... | ... | ... | ... | ... | | | | ... | | వీనినిగూర్చి పరిశోధన చేయవలెను. |
| పెరుగుతోటకూర | ... | ... | ... | ... | ... | ... | | | | ... | | |
| చింతచిగురు | ... | ... | ... | ... | ... | ... | | | | ... | | |
| దుంపలు : | | | | | | | | | | | | |
| బంగాళాదుంప | 0.70 | 0.04 | 8.15 | 35 | 1.20 | 2.60 | 5.20 | V | X | — | | |
| ఉల్లిపాయ | 0.37 | 0.03 | 3.06 | 13 | 2.10 | ... | | V | XX | X | | |
| వెల్లుల్లి | 1.92 | 0.03 | 7.90 | 40 | ... | ... | | X | X | XX | | |
| పెండలము | 0.51 | 0.06 | 6.31 | 28 | ... | ... | | ... | X | X | | |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పండ్లు | | | | | | | | | | | |
| నిమ్మ,దబ్బ మొ॥ | 0.14 | 0.14 | 0.88 | 5 | 1.1 | ... | ... | ... | X | XXX | ... |
| నారింజ | 0.25 | 0.03 | 2.69 | 12 | 2.00 | 0.50 | 0.40 | X | X | XXX | ... |
| పచ్చిద్రాక్ష | 0.17 | 0.03 | 3.96 | 17 | 0.30 | 0.60 | 1.00 | — | X | V | ... |
| దానిమ్మ | 0.18 | ... | 0.19 | 2 | ... | ... | | ... | X | X | ... |
| జామి | 0.37 | 0.20 | 2.27 | 12 | ... | ... | | ... | X | X | ... |
| మామిడి | 0.04 | 0.32 | 5.20 | 23 | ... | ... | | X | — | XX | ... |
| పుచ్చ | 0.11 | 0.06 | 1.90 | 9 | ... | ... | | — | — | X | ... |
| అనాస | 0.11 | 0.09 | 2.75 | 12 | 1.10 | 0.80 | 1.40 | — | — | XX | ... |
| పంపరపనస | 0.23 | 0.06 | 2.96 | 13 | 1.20 | 0.50 | 0.80 | X | X | XXX | ... |
| బొప్పాయి | 0.16 | ... | 0.10 | 1 | ... | ... | | X | X | XX | ... |
| అరటి | 1.41 | 0.77 | 6.29 | 33 | ... | ... | | V | X | X | ... |
| ఆపిల్ | 0.09 | 0.06 | 3.54 | 15 | 0.30 | 0.30 | 0.60 | — | X | X | ... |
| చింతపండు | 0.39 | ... | 8.89 | 37 | ... | ... | | ... | X | X | ... |
| మేకమాంసము | 5.97 | 1.98 | ... | 42 | ... | ... | | V | X | V | X |
| కాలేయము | 6.11 | 1.70 | 0.76 | 43 | ... | ... | | XXX | XXX | X | X |
| కార్జములు | 4.54 | 1.36 | 0.06 | 31 | ... | ... | | XX | XX | ... | ... |
| మెదడు | 2.90 | 2.77 | ... | 37 | ... | ... | | X | XX | ... | ... |
| నాలుక | 4.41 | 5.43 | ... | 67 | ... | ,, | | O | X | ... | ... |
| చేప | 5.50 | 1.15 | ... | 32 | ... | ,, | | ... | X | ... | ... |
| గ్రుడ్డు | 3.79 | 2.97 | ... | 42 | ... | ,, | | XX | XXX | ... | X |

మనము భుజించు ఆహారమునందలి క్రొవ్వు, కర్బనోదజనితములును ఉష్ణకరములని నుడివియుంటిని. మాంసకృత్తులుకూడ కొంతవరకు ఉష్ణమును గలుగ జేయును. కాని వీనియందెల్ల క్రొవ్వు ఎక్కువయుష్ణమును కలిగించును.

1 గ్రాముక్రొవ్వు 9 కెలొరీల యుష్ణము నిచ్చును.

1 ,, కర్బనోదజనితము 4 ,, ,, ,,

1 ,, మాంసకృత్తు 4 ,, ,, ,,

కెలొరియన ఒకగ్రాముబరువుగల నీటియొక్క యుష్ణోగ్రతను డిగ్రీ సెంటిగ్రేడు హెచ్చింపగల యుష్ణమనియర్థము.

మనుజుడు నిద్రించుచున్నను, కదలుచున్నను, పనిచేయుచున్నను గూడ నతని యవయవములు కొలదిగనో గొప్పగనో కదలుచునే యుండును. అందుకు గావలసిన శక్తి ఏతత్కార్యాచరణమున నుద్భవించు యుష్ణమువలన గలుగుచున్నది. కనుక మానవునకవసరమగు యుష్ణము తను చేయు పనినిబట్టి యుండును. కట్టెలగొట్టువానికి కూర్చుండి వ్రాయువానికన్న నెక్కుడు ఉష్ణకరములవసరము. వ్రాయునపుడు నిద్రించునప్పటికన్న నెక్కుడు ఉష్ణమవసరము. అటులే వయోభేదము ననుసరించి కూడ యుష్ణకరముల పరిమాణము భేదించును. ఎదిగిన మనుష్యునకు కావలసిన యాహారములో దాదాపు సగభాగము ఎనిమిదేండ్ల పిల్లవానికి కావలెను. పదునారేండ్లవానికి ఎదిగినవానికి కావలసిన యాహారమంతయును గావలెను. ఇటులే పురుషులకు స్త్రీలకన్న నెక్కువ యాహారము కావలెను.

ఇట్లు కావలసిన యుష్ణ మొక్క మాంసకృత్తులవలనగాని, క్రొవ్వువలనగాని, కర్బనోదజనితములవలనగాని కలిగినచో లాభములేదు. ఇవియన్నియు తగుపాళ్లుగా నుండవలెను. మాంసకృత్తులవలన 3 60 మొదలు 400 కెలోరీలును, క్రొవ్వువలన 720 మొదలు 810 కెలోరీలును, కర్బనోదజనితములవలన 1440 మొదలు 1800 కెలోరీలును కలుగునట్లు ఆహారపదార్థములుండవలెను. అనగా మానవునకు కావలసిన యుష్ణత 2500 మొదలు 3000 కెలోరీలు. ఇదిగాక ఆహారము ప్రాణకృత్సమృద్ధమై యుండవలెను. అట్టియాహారమునే సంపూర్ణభోజనము అనవచ్చును. లేదేని దానిని అసంపూర్ణభోజనముగా గ్రహింపనగును. ఈక్రిందివిషయములు పరిశీలనార్హములు.

తినినయాహారములో పదవవంతు పారుబోవును.

క్రొవ్వులో సగభాగము నేయి, పాలు, పెరుగులనుండి గ్రహింపవలెను.

సంపూర్ణ, అసంపూర్ణభోజనములకు ఉదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాను. వానినిబట్టి అనుదినభోజనమునం దెట్టిపదార్థములకూడిక యుండవలెనో తెలియనగును.

## కూలివాని భోజనము

| భోజనపదార్థము. | పరిమాణము (ఔన్సు) | గ్రాములలో. | | | కెలోరీలు. |
|---|---|---|---|---|---|
| | | మాంస. | క్రొవ్వు. | కర్బనోదజ | |
| తెల్లబియ్యము ... ... ... | 25.0 | 44.75 | 3.75 | 658.5 | 2947 |
| పప్పు ... ... ... ... | 1.0 | 6.42 | 1.00 | 16.14 | 99 |
| నూనె ... ... ... | 0.1 | 0.00 | 2.80 | 0.00 | 25 |
| కాయకూరలు ... ... ... | 2.0 | 1.10 | 0.10 | 7.7 | 36 |
| మజ్జిగ ... ... ... ... | 10.0 | 8.50 | 1.40 | 13.60 | 101 |
| | 38.1 | 60.77 | 9.05 | 695.94 | 3208 |
| 10వ వంతు రద్దుపోను మిగిలినది | 3.8 | 6.8 | .9 | 69.59 | 321 |
| | 34.3 | 53.97 | 8.15 | 626.35 | 2887 |

### ఇందున్న లోటు.

మాంసకృత్తులు స్వల్పము. అధనము 90 గ్రాములుండవలెను.

క్రొవ్వు: " " "

కర్బనోదజనితములు: చాలహెచ్చు. 400 గ్రాములు చాలును.

ప్రాణకృత్తులు: అన్నిరకముల ప్రాణకృత్తులును చాలతక్కువ. కాని యితడు కష్టించి ఎండలో పనిచేయుగాన వానిని కొంతవరకు ఎండనుండి బడయగలుగుచున్నాడు.

## సామాన్య గృహస్థుని భోజనము

| భోజన పదార్థములు. | ఔన్సులలో (బరువు) | గ్రాములలో. | | | కెలోరీలు. |
|---|---|---|---|---|---|
| | | మాంస. | క్రొవ్వు. | కర్బనోద | |
| తెల్లబియ్యము ... ... ... | 25 | 44.75 | 3.75 | 658.5 | 2947 |
| పప్పు ... ... ... ... | 1.2 | 7.70 | 1.20 | 19.36 | 118 |
| నూనె ... ... ... ... | 1.0 | 0.00 | 28.00 | 0.00 | 250 |
| నేయి ... ... ... ... | 0.5 | 0.00 | 11.50 | 0.00 | 104 |
| కాయకూరలు ... ... ... | 6.0 | 2.00 | 0.50 | 8.60 | 47 |
| పెరుగు ... ... ... ... | 12.0 | 14.00 | 10.00 | 8.00 | 178 |
| | 45.7 | 68.45 | 54.95 | 694.46 | 3644 |
| 10 వ వంతు తగ్గగానిలచినది | 4.6 | 6.9 | 5.5 | 69.5 | 364 |
| | 41.1 | 61.5 | 49.5 | 625.0 | 32.80 |

### ఇందున్న లోటు.

మాంసకృత్తులు: క్రిందటికన్న హెచ్చు. కానియింకను తక్కువే.

క్రొవ్వు: క్రిందటికన్న చాలహెచ్చు. కానియింకను తక్కువే.

కర్బనోదజనితములు: చాలహెచ్చు.

అన్నము తగ్గించి కాయకూరలను, పండ్లను హెచ్చించవలెను. పాలుగాని హెచ్చుగాపెరుగుగాని త్రాగవలెను. పండ్లుగూడ అవసరమే.

ప్రాణకృత్తులు: రెండవరకము ప్రాణకృత్తులవసరము.

## సంపూర్ణభోజనము

| భోజనపదార్థములు. | అవున్సులు (బరువు) | గ్రాములలో: మాంస. | గ్రాములలో: క్రొవ్వు. | గ్రాములలో: కర్బనోద | కెలోరీలు. |
|---|---|---|---|---|---|
| చే బియ్యము ... ... ... | 8 | 18.40 | 0.68 | 177.4 | 789 |
| గోధుమపిండి (ఇంట విసరినది) ... ... | 00 | 39.00 | 5.40 | 203.5 | 10.18 |
| పాలు ... ... ... ... | 20 | 18.80 | 20.40 | 27.2 | 360 |
| నూనె ... ... ... ... | 1 | 0.00 | 28.00 | 0.00 | 252 |
| నేయి ... ... ... ... | 2 | 0.00 | 46.00 | 0.00 | 416 |
| పప్పు ... ... ... ... | 1 | 6.5 | .99 | 16.20 | 90 |
| మట్టుబచ్చలి ... ... ... | 10 | 5.1 | 0.60 | 8.20 | 60 |
| దుంపకూరలు (పెండలముగానికందగాని) | 8 | 4.4 | 0.36 | 31.80 | 148 |
| | 60 | 92.2 | 102.4 | 464.3 | 3133 |
| 10 వ వంతు రద్దుపోను నిలవ | 6 | 9.2 | 10.2 | 46.4 | 313 |
| | 54 | 83 | 92 | 418 | 2820 |

ఇందు ప్రాణకృత్తులును, తదితరపదార్థములును తగినపాళ్లుగానున్నవి. మాంసాహారియగువాఁడు బియ్యమును 6 అవున్సులకును, నేతిని 1.5 అవున్సులకునుతగ్గించి 2 అవున్సులమాంసమును తినుట శ్రేయస్కరము.

## బొమ్మపెండ్లి

### నన్నెచోడమహాకవి

తరుణులు చిల్కబొమ్మలును దంతపుబొమ్మలు మేలిగాజుబ
న్నరులును బ్రమానిచొప్పికలు నల్లడనోలినపేర్చి లీల జో
కుర బొమరిండ్లఁజేయు నగు గూళ్లునువండుచు బొమ్మపెండ్లి వా
సరముగఁ జేసియాడ నగజాత శివార్చనసేయునయ్యెడన్.

—కుమారసంభవము.



శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు

# గుంటకలగర

దీని సంస్కృతమున భృంగరాజ; భేకరాజమార్కవ; భృంగ; భృంగారక; రాజ మేష; భృంగార; కేశరంజన; మహానీల; భ్రంసనహా; కేశ్య; కేశప్రభాకర; కేశరాజ; కుంతలవర్ధన; పితృప్రియః, సుపర్ణ అని యందురు.

సంస్కృతనామములచే ఈ గుంటకలగర గుణములు కొన్ని తెలిసికొననగును. కేసరంజన అను నామముచే కురులకు రంజనము కలుగచేయుననియు అనగా నెరసిన వెంట్రుకలు దీని ఉపయోగముచే నల్లబడుననియు, కుంతలవర్ధనః అను నామముచే కుంతల ముల పెంపొందించుననియు తెలిసికొననగును.

పితృప్రియయనుట వల్లనేకాబోలు పిత్రార్చనకు గుంటకలగరపత్రము పవిత్ర మైనదిగా వాడబడుచున్నది. శ్రీభృంగరాజతులసిపత్రతృణానిచాయని తిథులలో చెప్పుదురు.

## సాధారణగుణము

పైత్యము, వేడిచేయును. దేహములోని మలము వెడలించును, మదము, పాండువు, కుష్ఠము, దురద, దగ్గు, జ్వరము, ఉబ్బు, ఉదరము, కఫము వీనిని హరించును. కండ్లకు చలువచేయును. వెండ్రుకలకు నలుపుదెచ్చును. బుద్ధిని ఆయుర్వృద్ధిని యిచ్చును. ఔషధ ములయందు సమూలము లేక ఆకులు లేక వేరు వాడుటగలదు.

## ఆకులు

ఆకురసము నొప్పిని తీయును. నీరును పీల్చును. ఈరసములో నూనెగలిపి కపాల మున మర్దనచేసిన తలనొప్పి హరించును.

అనుదినము ఉదయముపూట 3 చిగుళ్లు (దళములు) 3 మిరియపుగింజలుచొప్పున 15 లేక 20 దినములు తినిన మహాజ్వరము, అస్థిగతపురాణ అహికజ్వరములు, పాండువు మొదలగు రోగములు నయమగును.

ఆకురసము పుక్కిలించిన నోటి రసపుపట్టు సడలిపోవును.

సూర్యావర్తమునందు (ఒంటికణతతలనొప్పి) భృంగామలకతైలము నస్యముచేసిన మంచిది. గుంటకలగర స్వరసము, మేకపాలు సమభాగములు తీసికొని సూర్యపుటమిడి నస్యముగా ఉపయోగించిన శీఘ్రముగ వ్యాధి నివారణకాగలదు.

½ తులము గుంటకలగర స్వరసము మజ్జిగతోకాని నీటితోకాని తీసికొనిన సర్ప విషము విఱుగును.

నెలలోపిల్లలకు, మిక్కిలి చిన్నశిశువులకు 2 చుక్కలు స్వరసము తేనెతో ఇచ్చుట హిందూగృహములయందు ఆచారము. క్రిములుండిన ఆముదముతో ఇత్తురు. కర్ణశూలయందు స్వరసమువాడిన మిక్కిలి ఉపయోగకరము.

కామిలజ్వరము వీటియందు పసుపుపుష్పములు పూచు (తెల్లపుష్పములుపూచు దానికంటె యిది గుణవంతమైనది.) గుంటకలగర స్వరసము యివ్వబడుచున్నది.

ఆకులకషాయమును (2-4 ఔన్సులు) రక్తస్రావములయందు దినమునకు 2 మార్లు వాడుచున్నారు. దీనిచే చాలా ఉపయోగము కలుగుచున్నది.

ఆకులకల్కమును వృశ్చికదంశమునందు లేపనమున కుపయోగించుచున్నారు. నొప్పి వాపుయుండుప్రదేశమున చక్కగరుద్ది పిండికట్టునట్లు గట్టిగ కట్టవలయును. ఇటుల చేసిన ఆకల్కము విషమును లాగివేయును. ఈక్రమమునే గండమాలయందు, పురాణ చర్మవ్యాధులయందు అనుసరించవలయును.

ఆకులధూపము లేక ఆవిరి (ఆకులు, నీళ్లు) బట్టిన మూలబాధ నివారణయగును.

ఆకుస్వరసమును నువ్వులనూనె లేక కొంకాయనూనెతో కాచి తలకురాచుకొనిన కురులు నలుపెక్కును. వృద్ధినొందును.

మిరియాలను గుంటకలగరాకు రసముచేనూరి లేపనముచేసినను లేక మిరియాలు వరిబియ్యము వీటిని గుంటకలగరాకురసముచే నూరి లేపనముజేసినను ఒంటికణతతల నొప్పి నయమగును.

ఒకప్రస్థము గుంటగలగరరసము, 1 కుడవము నూనె, 1 పలము యష్టిమధుకము, 1 ప్రస్థము ఆవుపాలుపోసి స్నేహపాకమున పచనముగావించి ఉపయోగించిన నేత్ర రోగములన్నియు నశించును.

గుంటకలగర రసము, త్రిఫలములు, నల్లకలువ, సంబరేణు, మండూరము వీని యందు నూనెబోసి పాకముగాచి యభ్యంగనార్థము ఉపయోగించిన బట్టతల నశించి వెంట్రుకలు దట్టముగాను గుంపుగాను పెరుగును.

గురివెందగింజలను పొడిచేసి గుంటకలగరరసమున భావనచేసి యందు తైలమును పోసి యీతైలమున ఏలకులు, జటామాంసి, దేవదారు వీనిని కల్కముగావేసి పచనము జేసి అభ్యంగనార్థ ముపయోగించిన వెండ్రుకలు దట్టముగా పెరిగి శిరోరోగములు నశించును.

ఓమముతో యకృత్ వ్యాధులయందు దీనిని వాడుచున్నారు. పాండువున ఆకులను మిరియాలతోనూరి నిమ్మకాయంత 5 దినములు లేక 6 దినములు ప్రాతఃకాలమున పుల్లటిపెరుగు లేక మజ్జిగతోనిచ్చిన వ్యాధి నివారణయగును.

3 భాగములు గుంటకలగర, 1 భాగము మిరియములు కలిపి మాత్రలుచేసి దినమునకు 2 సార్లు యిచ్చుచుండిన ఉపదంశము మానును. ఉపదంశవ్రణములయందు క్షాలనమునకు గుంటకలగర మిక్కిలి ఉపయోగము.

—మిగిలియున్నది.

# పల్లెటూళ్లు

శ్రీమతి అయ్యగారి రుక్మిణమ్మగారు

నిజమైన మనదేశస్థితి తెలిసికొనవలెనన్న పల్లెటూళ్ల పరిస్థితులు దూరదృష్టితో పరిశీలించవలయును. హిందూదేశము చిన్న చిన్న పల్లెలతోటి గ్రామములతోటి నిండి యుండుటచేత మొత్తము పల్లెటూళ్ల జనసంఖ్య పట్టణముల జనసంఖ్యకంటె ఎక్కువగా ఉన్నది. దేశము ఏమాత్రము వృద్ధిలోకి తేవలెనన్నను మన నాయకులు ప్రచారము పల్లెలయందే చేయుచుండవలెను. ఒకానొక కాలమందు హిందూ దేశము దేశములన్నిటిలో అగ్రస్థానము వహించి యుండుట అందరెఱిగిన విషయమే. ఆకాలమందలి మనగ్రామపరిస్థితులు మంచిదశయందుండుటయే దీనికి కారణము. గొప్ప గొప్పవిద్యాపీఠములన్నియు పల్లెలయందే యుండెడివి. గొప్ప గొప్పపండితులు, కవిశ్రేష్ఠులు, వేదాంతులు గ్రామములయందే యుండెడివారు. ప్రస్తుతకాలపరిస్థితులుమారినవి. దేశము పరాధీనమైనది. అజ్ఞానమను అంధకారము పల్లెలయందు ప్రచండవిహారము సల్పుచున్నది.




శ్రీమతి అయ్యగారి రుక్మిణమ్మగారు

కాబట్టి ప్రస్తుతపరిస్థితులలో ముఖ్యముగా పల్లెటూళ్లను మార్చినగాని దేశము బాగుపడదు. పల్లెటూళ్లయందు ప్రబోధము గావించుటకు యూనివర్సిటీ డిగ్రీలను పొందిన విద్యార్థులు మహాత్మునివలె త్యాగవంతులై కష్టములకోర్చి గ్రామములందును, పల్లెలయందును నివసించుచు ప్రజలలో కలసి తిరుగుచు వారిదుష్ప్రవర్తనము మాన్పించుట యేగాక, వారి విద్యనుకూడ అభివృద్ధిచేయుటకు ప్రయత్నించవలెను. నిజమైన హిందూమతముయొక్క సారాంశములను మనగ్రామములందు వ్యాపింపచేయుటకు ఇట్టి విద్యార్థులుకావలసియున్నారు.

పల్లెటూళ్లలో ఏస్త్రీనిగాని ఏపురుషునిగాని చూదమన్నను విద్యావిహీనత అజ్ఞానములతో నిండియున్నారు. ప్రతికుటుంబములోను ఏబాలవితంతువో లేక భర్తచే

విడువబడిన అనాథస్త్రీయో, ఏఅసమానబాంధవ్యమో లేక బాల్యావివాహమో ఈ శతాబ్దమునందుకూడ చూచుచున్నాము. ఏస్త్రీతో ప్రసంగించిన మూఢత్వము, అజ్ఞాన సంబంధమైన ప్రశంసతప్ప వేరుండదు. అస్పృశ్యత, త్రాగుడు, వ్యభిచారము, తగవులు పెట్టుకొని కోర్టుల కెక్కుట మొదలైన పాపములతో పల్లెటూళ్లునిండియున్నవి. ఆరోగ్య స్థితిగతులు చూదమన్న మురికిచెరువులు, అంటురోగములు మొదలైన వాటితో నిండియున్నవి.

పల్లెటూళ్లయందలి స్త్రీలపాట్లు చూచువారికే తెలియగలదు. పశువులకంటె కనా కష్టముగా భర్తలు తమభార్యలను చూచుచుందురు. కొందరు స్త్రీలు ఇట్టి బాధల కోర్వలేక ఆత్మహత్యల చేసికొనుట మనము తరుచు వినుచుందుము. పసిబిడ్డలను పెంచుట తెలియకయు, ఏడాదికొకపర్యాయము గర్భముదాల్చు వనితల దురవస్థ, అట్టిసంసారములు పోషించలేని భర్తల అధోగతియు చూచుచునే యున్నాము. మేయోకన్య ఏదో వ్రాసినదని పౌరుషము జూపు సంఘసంస్కారులు ఇట్టిస్థితిలో ఏమి చేయుచుండిరో తెలియకున్నది. గ్రామములయందలి పరిస్థితులు మారుటలేదు. ఇది దేశోద్ధారణకై కంకణబద్ధులై యున్న మననాయకులు గ్రహింతురుగాక.

# ఆంజనేయస్తుతి

శ్రీమతి బెల్లంకొండ కనకమ్మగారు

తనరాజ్యమునువీడి, వనులపాలైపోవు, భానుజుసహచారివైననాడు,
దశరథసూనుండు తలయూచి మెచ్చంగ, అంచితరీతి భాషించునాడు,
ధరణిజాన్వేషణార్థముసముద్రముదాటి చిటికెలోపలలంక జేరునాడు,
రామానుజప్రాణ రక్షణోద్యోగివై తెగువమై నొకకొండ తెచ్చునాడు,

స్వామిభక్తియు సభ్యసంభాషణమ్ము,
అన్యదుర్లభమగుప్రతాపాతిశయము,
సతతపరహితజీవన వ్రతమునాగ,
నేమొప్రకటించితివిమాకు స్వామినీవు.




## దశావతారములు

శ్రీమతి ఆచంట సత్యవతీదేవిగారు

"శ్యామసుందరరామ! స్వామివామాంకమున" వలె— పల్లవి ॥ ఆదినారాయణ—ఆర్త పరాయణ—ఆదిలక్ష్మితో నీవు—అసురసంహరణకై — ఆర్తరక్షక — హేపరాత్పర—యనుచు నమరులు వేడగా భువి—నాలసించక—యవతరించవె అమరవర్యుల యార్తిఁదీర్పగా ॥ ఆ ॥

ఆదిమీనంబవై—అణగి నీరధినున్న—ఆసోమకునిఁగూల్చి—అజుకు నిగమముల నొసగి—సురాసురు లమృతంబు కొఱకై—సారిది గిరిచే తఱుచ—మును గఁగ—కరుణతో కూర్మంబవై యాకుధరమెత్తవె—కోరగా సురులూ ॥ ఆ ॥

ధరనుహిరణ్యాక్షు—దైత్యుండు బాధింప—ధరను వరాహమై—దైత్యునిఁ గూల్పవె—తండ్రిచే కడుబాధలొందిన—తనయుఁడగు—ప్రహ్లాదుఁ బ్రోవగ—స్తంభమున నరసింహమూర్తిగ తగజనించవె దైత్యుఁజీల్పగా ॥ ఆది ॥

అదితి కశ్యపులకు—నల వామనుండవై—యవతరించియా—యవని దానమడిగి—బలిని పాతాళంబు కణచి బాగుగా గర్వంబునడచి—బలిగురుండగు శుక్రగురునికి—బలముగా నొక కన్నుదీయవే ॥ ఆ ॥

పరశురాముండవై—పరగ క్షత్రియులఁగూల్చి—కార్తవీర్యార్జునుని—గర్వంబు ఖండించి దశరథునకును—తనయుఁడవుగా—ధరను రాముండనగ వెలసియు—ధరణిజను చెఱగొన్న దానవు దశముఖుని వేఁగూల్పగా నిలా ॥ ఆ ॥

విమలమైనయా—యదువంశమందున—వీరకృష్ణుండవై—విప్రతతి రక్షించి—బాల్యక్రీడలు—లీలలనగను—భక్తవరులకుఁ బరగఁజూపి—అష్టభార్యలు కొలువ నెంతయుఆనందముపొందగా నిలను ॥ ఆ ॥ భూతదయనుఁగల—బుద్ధదేవుండనగ—భువిరోసి—పూర్ణవైరాగ్యమైనిలువిడచి—సుత సతీబాంధవుల — పితరుల—సత్వరంబుగఁ బాసి వేచని — శుద్ధతత్వము — నిద్ధరన్ గనిబుద్ధిమంతులఁజేయవే! జనులా ॥ ఆ ॥ కలియుగకలుషముల్—కడువృద్ధిపొందంగ—మఱికల్కిమూర్తివై—మగుడజన్మించియు దుష్టశిక్షణ—శిష్టరక్షణ—దురితజాలము బాపి ధర్మము—ధరను పాదుకొల్పి—యీధరదయతో నేలుమ—సత్యవతిని ॥ ఆ ॥

# స్త్రీ అబలకాదు

## రా

## శ్రీమతి కృష్ణవేణి భిషగ్రత్నగారు

బలమనిన నేమి? దీనిని తొలుత తెలుసుకొనవలయును. శక్తికి రెండురూపములు —(1) సంగ్రామశక్తి (The Power to struggle) (2) సంస్థితిశక్తి (The Power of endurance)

*　　*　　*　　*

అయితే ఈవిధము తప్పని ఒకటేతూకము. మరియు ఒకటేపొడవుగల స్త్రీపురుషుల మెదడును సరిపోలించిచూడవలయునని కొందరికి తోచినది. ఇప్పుడిప్పుడు వారియొక్కమతమే సర్వసమ్మతమగుచున్నది. దీనినిగురించి 'రోబర్ కింగ్ మన్' (Rober Kingman) యనే మేధాశాస్త్రప్రవీణుడు అనేకశోధనములు చేసినాడు. వీరు చెప్పునదియేమనగా "ఒకటేతూకము ఒకటేపొడవుగల స్త్రీపురుషుల మెదడును పరీక్షచేసి పోలించిచూడగా వ్యత్యాసమేమియునుండదు. పురుషులమెదడున యెన్ని అణువులున్నవో అన్నియే స్త్రీయొక్క మెదడునందున్నవి. మరియు తూకమునందును, రెండు సరిసమానముగానఉన్నవి."



శ్రీమతి కృష్ణవేణి భిషగ్రత్నగారు

ప్రకృతి స్త్రీదేహమునకు యిచ్చిన సహనశక్తుల యొక్క మూలమునకు సంస్థితియనునది సార్థకనామమే. జగముయొక్క 'స్థితి' యందు దానిభాగమే యెక్కువగాఉన్నదికదా? సంతానము పడయుటయందు కష్టనష్టములున్నవని అందరికిని విదితమే. అయితే పుట్టిన పిల్లలను పోషించుభారమూ, స్త్రీలదే అయియుండుట వలన ఆ మహాకార్యమునకు ఆకష్టనష్టములు అనుకూలమేకదా? అయితే ప్రకృతి స్త్రీలకు అద్భుతసహ్యాంగపునర్జీవనశక్తియూ యిచ్చియున్నది. బిడ్డలను పెంచుటకు ఆమె హృష్టపుష్టముగా నుండవలెను. ఆయుష్యవంతురాలైయూ నుండవలయునుకదా? అనిన దీనికి యేది యెక్కువగా ఉండవలయును? ఒకప్రక్కన నెలనెలకూ ఒకవిధమైన ప్రాణనష్టమున్నది. ప్రతియొకసారి ప్రసవించునప్పుడంతయూ కష్టనష్టములున్నవి. ఇటువంటి ఆవర్తక (Recurrent) వైరులు సహజముగా ఆమె ప్రకృతియందే యున్నవి. పైన బాహ్యప్రపంచమునందుండిన, శీతోష్ణముయొక్క వ్యత్యాసములతొందర, సంతానపోషణయందునూ ఎన్నియో తొందరలు. ఈప్రకారము అనేకతొందరలున్నవి. ఇటుల రెండుప్రక్కలనూ బాధలుండగా సంతానము పోషించుటకై కావలసిన హృష్టపుష్టతయొక్కయూ, ఆయుష్యముయొక్కయూ గతియేమి? ఈవిచారము ప్రకృతిదేవికే యున్నదని స్త్రీలయొక్క అద్భుతప్రతియోగశక్తి (Resistance) నుంచి తెలియనగును. అన్నికష్టనష్టములకు ప్రతీకారము చేయుటకై ఆమెయందుండు శక్తిని వర్ణించుటకు అసాధ్యము. ఈ ప్రతియోగశక్తియే ఆమెయొక్క దేహపునర్జీవకశక్తి. సహనప్రతియోగములతో పుట్టిన సంస్థితిశక్తి ఆమెయొక్క సొత్తు.

ఇంకనూ అన్నిధర్మములయందునూ ప్రథమస్థానము పొందియున్నదగు త్యాగమునకు ఇదియేమూలము. ఈసహజ త్యాగమునకు తగిన విద్యయుండిన వారలకు చేతకానిపనియైననూ ఏది? అనేకదేశముల సెన్‌సస్‌రిపోర్టు (Census report) లే ఆమెయందుండుసంస్థితిశక్తికి సాక్షులు. మాదిరికి, మొన్నపోయిన(1921) సెన్‌సస్‌రిపోర్టులనే చూతము. వెయ్యిపురుషులు చచ్చినచోట యెందరు స్త్రీలు చనిపోయియున్నారని చూతము.

| ప్రాంత్యములు | పురుషులు 1000 మరణమునకు సరియగు స్త్రీల మరణములు. (సరాసరి) |
|---|---|
| బంగాళ | 909 |
| బిహార్ ఒరిస్సా | 936 |
| బొంబాయి | 957 |
| బర్మా | 901 |
| సెన్‌ట్రల్ ప్రావిన్సు బీరార్ | 923 |
| మద్రాసు | 977 |
| పంజాబ్ | 928 |
| సంయుక్తప్రాంతములు | 918 |

ఎటులచూచిననూ వెయ్యిమందిపురుషులకు వెయ్యిమంది స్త్రీలు చావలేదుకదా! ఇంతియేకాదు. ఒక ప్రక్కన ఆసెన్‌సస్ రిపోర్టు యేమి తెలిపినదనిన "Famine mortality fell more heavily on men than on women, the latter sex apparently being constitutionally more able to resist the hardships which economic stringency brings." (క్షామముయొక్క దెబ్బ పురుషులమీదనే యెక్కువగా వాలినది. స్త్రీలరచనమునందే ఈ దారిద్రకష్టములకు ప్రతీకారముచేయు శక్తి యెక్కువగానున్నదని తోచుచున్నది.) ఇదియే అనేక డాక్టరుల మతము.

ప్రకృతి స్త్రీలపైన ఉత్పాదకధర్మము మోపిన భారమునుచూచినచో వారే ఎక్కువగా చావవలయునని మనస్సునకు వచ్చును. అయితే నిజస్థితి అటులకాదు. వారల్లయొక్క సంస్థితిశక్తిచేయు భర్తి ఆకష్టనష్టములను మీరియున్నది. ఆమెయందు నడచు మారక (Destructive) వ్యత్యాసములకంటెనూ, పూరక (Compensating) వ్యత్యాసము లధికముగాయున్నవని నిస్సందేహముగనే చెప్పవచ్చును.

* * * *

నైజీరియాదేశపు ఇయాషిస్త్రీలు తమ పురుషులకన్ననూ బలాఢ్యులుగానున్నారు. లలనాజనులయందు వారి దేహకట్టు పురుషులకన్ననూ శ్రేష్ఠముగానున్నది. కెలఫోర్నియా శాస్త్రిక స్త్రీలయొక్క శక్తియూ పురుషులశక్తిని మీరియున్నది. అరబ్, మరియూ, కందహారి, ఆఫ్ఘన్ స్త్రీలు పురుషులతో సరిసమానమైన బలమునూ బిగువునూ, కలిగియున్నారు. టిబెటుస్త్రీలు పురుషులకన్ననూ మేలుగానున్నారు. ప్రయాణసమయమునందు భూతాన్ స్త్రీ పురుషులను మోసుకొనిపోవడము యెన్నియోసార్లు వినియుండవచ్చును. ఇంకనూ యెన్నియోదృష్టాంతములను అనేకదేశములయొక్క ఇతిహాసముల దృష్టాంతమునుంచి పెంచవచ్చును. కడకు సారాంశమేమి? క్రియాశక్తి ఒకరికి తక్కువ, ఒకరికియెక్కువ, అనిచెప్పుటకు సాధ్యములేదు. లింగభేదమున్నట్లుగా క్రియాశక్తినందు భేదములేదు. ఒకవేళ భేదమున్నచో, దానికి పరిస్థితియొక్క అభ్యాసముకాని దేహరచనకాదు.

పరిస్థితి అనుకూలించినట్లంతయూ, స్త్రీపురుషు లిద్దరూ సరిసమానమైన సంస్కృతినీ, కర్తృత్వశక్తినీ చూపించుచునేయున్నారు. అంతియేకాక, స్త్రీ చేసిన కార్యములయందు కేవల సంగ్రామకుతూహలమునూ, దానియొక్క దుష్పరిణామము తక్కువచేయుటనులే విశేషమని చెప్పుటకు ఇతిహాసములే సాక్షి. క్లోరోఫార్మ్ (Chloroform) అని ఔషధము. దాని ముందుకుతెచ్చిన సిమ్సన్ (Simpson) నను మొదటనే యొకస్త్రీ దానిని శోధించియుండెనని కొందరిరసజ్ఞుల మతము. అయితే 15-వ శతాబ్దమునందు ఆమెదానిని చూపించినపుడు ఆమె దైవయిచ్ఛకు విరుద్ధమైనకార్యము చేసియున్నదనీ ఆమెను చర్చి, మరియు స్టేటు (ధర్మగురువులూల, రాజశాసనములూ) చేరి కాల్చివేసిరి! రేడియం (Radium) యొక్క ఉపయోగము అందరికినీ తెలుసును. దీని ఉపయోగము మేడముక్యూర్ (Madame Curie) అనునామెయొక్క ఆశీర్వాదము. ఇటులనే జగత్తునందు జగడములనూ, దుఃఖములనూ తక్కువచేయుటకు స్త్రీలు చేసిన ఇంకనూ చేయుచున్న ఉపకారమునట్టిని యెంతయో పెంచవచ్చును. ఎలా వీలర్ విల్కాక్సు అనునామె వ్రాసిన ఈపద్యములను చదువుట ఉత్తమము.*

.................... "You men, you wise strong men, our self-announced superiors in brain, our peers in judgment, you go forth to war! ............

సారాంశము—పురుషులారా, బుద్ధిమంతులైన బలాఢ్యులారా, బుద్ధియందు మనకన్ననూ యెక్కువగానున్నదని తలచిన స్వనిర్మితశ్రేష్ఠులారా, మాకొఅకై న్యాయముచేయువారా, మీరా యుద్ధమునకు పోయెదరు.

"Say is there no substitute for war in this great age and era? If you answer 'No' Then let us rear our children to be wolves and teach them from the cradle how to kill. Why should we women waste our time and work in talking peace, when men declare for war?"

చెప్పండి—ఈ గొప్పయుగములందుకూడా యుద్ధమునకుబదులుగా, ఇంకేమిచేయుటకునూ మీకు తోచలేదా? మీరు 'లేదు' అనిచెప్పిన మేము మాబిడ్డలను తోడేలులవలె పెంచెదము. వారికి తొట్లయందే చంపునది నేర్పించెదము. మీరు యుద్ధమునకే నిలిచియుండగా మేము స్త్రీలముమాత్రము బిడ్డలకు శాంతినే ఉపదేశించుచూ ప్రొద్దును ఎందులకు వ్యర్థముచేయవలయును.

సప్తపదియందునూ స్త్రీ 'సఖా' కాని దాసికాదు. బానిసకాదు. వేదములందునూ, ఆమె అబలకాదు. వివాహమంత్రములకునూ ఆమె అబలకాదు. సనాతనధర్మాభిమానులు తమధర్మమునకు మూలమని తలచిన శృతి ఇటులున్నది. తదనుసారముగా, వరుడు ఆమెకు ఇటులచెప్పెను—"ఋగ్వేదము నీవు, సామవేదము నేను. ద్యౌ నేను, పృథ్వి నీవు. రేతస్సు నేను, రేతోభృత్ నీవు. మనస్సు నేను, వాక్ నీవు." (సాత్వమస్యమూహము మూహమస్మిసాత్వం। ద్యౌరహంపృథ్వీత్వం। రేతోహం రేతోభృత్త్వం మనోహమస్మివాక్త్వం.....................)

ఇటుల యింకనూ యెన్నియో శృతిస్మృతిపురాణముల ఆధారములున్నవి.

స్త్రీల ప్రకృతినీ, ఇతిహాసమునూ, ఆమె వివిధసామర్థ్యములనూ, వర్ణించడమైనది. ఇప్పుడు స్త్రీ అబలనా, కాదా, యని పాఠకులే తీర్మానించవలయును....

* "Woman and War"—Ella Wheeler Wilcox.

## ౯
## శ్రీమతి అక్కిరాజు సీతారామమ్మగారు

మరియు వయసున చిన్నదయ్యు మహాత్యాగినియై సమస్త ఆభరణములను స్వరాజ్యానికర్పించి అసహాయోద్యమమున ముందంజవేసి శ్రీ గాంధిమహాత్మునిచే సత్యోత్తమరాలను మెప్పుగుబడసి చివరికసువులు బాయునప్పుడుసైతము నన్ను మరచినను దేశమును మరువవద్దని భర్తను బ్రతిమాలిన మాగంటి అన్నపూర్ణాదేవి కీర్తి లోకవిదితము. స్త్రీ శక్తిత్వము గుర్తెరుంగని కొందరు పురుషులు స్వార్థపరులై స్త్రీలు తమకు దాస్యము సలుపుటకే సృజింపబడిరని భ్రమించి వారికి బొత్తుగా స్వాతంత్రమివ్వక ఉద్యమములందు పాల్గొననీయక దేశమున కెనలేని కీడు దెచ్చుచున్నారు. స్త్రీసహాయము లేక పురుషుడేమి చేయుచున్నాడు స్త్రీ చేయూతలేని సంసారము నీదగలడా? లేదు. వేయేల ఒక్కవిషయము గమనించిన మనకే తెలియగలదు. పుట్టినప్పటినుండియు అతిగారాబమున పెంచి పెద్దవారినిజేసిన తల్లిదండ్రులను తన ఆజ్ఞలనుగాని విన్నపములనుగాని జవదాటని సోదరీ సోదరులను విడచి ఎన్నడు కని విని యెరుంగని అత్తింటకరిగి అచ్చటగూడ పుట్టినింటియందు వలెనే భేదమించుకయైన నగపర్చక మెలగుచున్నారు. ఇంతకన్న స్త్రీ చూపవలసిన త్యాగ మింకేమిగలదు? స్త్రీవిద్య బొత్తుగా నసించియున్న యీకాలముననే పురుషులతో సమానముగ రాజకార్యములు సైతము నిర్వహింపగలిగియున్నారు. ఇంకను పురుషులతో సమానముగ విద్యాదిసౌకర్యములున్న యెడల స్త్రీ పురుషులకుచేయు సహాయ మింకెంతయుండునో వేరే యడుగవలెనా?



శ్రీమతి అక్కిరాజు సీతారామమ్మగారు

## ౧౦
## శ్రీమతి సూరపరాజు రుక్మిణమ్మగారు

మొగశిశువు గలిగెననగానుండు సంతోషదాయకములగు సంభాషణలుగాని, ముఖవిలాసముకాని, ఆడశిశువు గలిగెననగా జనులహృదయములుగాని, తల్లిదండ్రుల హృదయములుగాని కడునిస్సారముగా, ఆడపిల్లయా పుట్టినదనియును, యెప్పటికైనను, యెంతప్రేమతో పెంచి పెద్దదానిచేసి ప్రేమచూపినను, ఆడపిల్లయేగాని, యీడపిల్లగాదనువారును, ఆడదిబుట్టిన వొకబిరుదు దెగగోయవలయుననువారును, ఆడది యసరబుట్టిన దనువారును, యింకను యెన్నియో యసూయాభావములగుమాటల నాడుదురు. సాధారణముగా సామాన్యజనులు అనగా చదువుకోనివారగు మనపూర్వులు పురుషశిశువునైన తల్లిగర్భమందు తొమ్మిది నెలలు (అనగా) నవమాసములు మోయుననియును, స్త్రీశిశువైన పదినెలలు తల్లిగర్భమున మోయుననియును స్త్రీశిశువును గనునప్పుడు, పురుషశిశువును గనునప్పటికన్న, యెక్కుడు కష్టమనియును, వొక ప్రసవకాలమందేకాక యన్ని అంశములలో యాడుపిల్లకే యెక్కుడు కష్టపడవలయుననియును చెప్పుదురు. మొత్తము మీద స్త్రీలన చులకదనమేకాని అంత కేవలము పనికిమాలినజన్మగాదు.

## ౧౧

## శ్రీమతి జి. వీరమ్మగారు

ప్రపంచమునఁగల యాశ్చర్యములన్నిటిలో నిదియొక వింతగానున్నది. జన్మముతోడనే స్త్రీ యబల యని ఏ మహాపురుషుడు నామకరణమొనర్చెనోగాని యాసువాక్యము యన్నిటియందును ననగా గృహకృత్యము లందుఁదప్ప పురాణములందను, పద్యకావ్యములందును, నవనాగరికత నవలందును, ఇంక మొదలగు నన్నిరచనలందును స్త్రీ యబలయని లిఖించుచునేయున్నవారుగాని దేనియందును, యేవిషయములలోను ఎందుకయని ప్రశ్నించువారెందుఁగలరు. మరికొన్ని ఉపనిషత్తులందుగూడ, స్త్రీ సాధూనాం, యని వ్యాసులేల రచించెరని యడుగగా, భూతదయ, క్షమ, ఓర్పు, నమ్రత, విధేయత భక్తిమొదలగు సుగుణములన్నిటికిని వారిహృదయమే యాలయముగానున్నదని సూక్ష్మదృష్టిచే యూహించియుండ వచ్చును. అదియెట్లనగా స్త్రీ యొకయువకుని వివాహమాడినప్పుడు కొరంతలేనిసంసార మెన్నటికిని యా విధాత విధించియుండడు. అట్టికొరంతలం దీర్పఁగలుగుటకు గృహిణి, గృహముచ్యతే యనునట్లు తనయావద్బల ముచే నెరవేర్చునుగదా? మరియొకవిశేష మేమనగా స్త్రీయొకశిశువునకు తాను మాతగానున్నప్పుడుకలుగు ఆవే దనయు, విధిప్రేరేపణవలన బిడ్డలయొక్కసంఖ్య యెక్కువకాగా మరియు స్వల్పవేతనవలనగల్గు లోప ములవల్లను బిడ్డలయొక్క యారోగ్యముతోకూడుకొన్న సుఖదుఃఖములకును యబలయైన యెట్లుసహించును?

## ౧౨

## శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

బ్రహ్మణస్సకాశా న్నానావిచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యైక
బుద్ధిరూపబ్రహ్మశక్తి రేవప్రకృతిః ॥

స్త్రీలు శక్తిస్వరూపిణులు. ప్రపంచమునందంతయు శక్తి యిమిడియున్నది. అణువు మొదలుకొని బ్రహ్మాండ పర్యంతము అంతయు శక్తిమయమే. ప్రపంచోత్పత్తికి మూలకందమీశక్తియే. భగవంతుడు సృష్ట్యాదిని ప్రకృతి స్వరూపిణియగు శక్తినుంచియే ప్రపంచము నుద్భవింప జేసెను. ఈ సృష్టినంతయు సరిగా నియమింప నీశ్వరుడు త్రిమూర్త్యవతారములందాల్చెను. ఆయాదిశక్తియే లక్ష్మి, సరస్వతీ, పార్వతీ నామములతో వారి మువ్వురకుం బత్ని యయ్యెను. త్రిమూర్తులును శక్తిస్వరూపిణులే.

బ్రహ్మావిష్ణుశ్చ రుద్రశ్చ పరతత్వ విభూతయః
ఏషాంత్రయాణామధికః సర్వకారణమీశ్వరః॥

భగవదంశ పురుషులయందును, శక్త్యంశముఖ్యముగా స్త్రీలయందును గలదు. స్త్రీలు నిశ్చయముగా శక్తిస్వరూపిణులు. ఏకార్యమునందుగాని శక్తిప్రేరేపణ లేనిది ఆపని నిర్వహింపబడనేరదు. ప్రతిపనియందును



శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

శక్తితోడ్పాటు కావలెను. పురుషుడు శక్తిస్వరూపిణియగు స్త్రీ తోడ్పాటులేనిది ఏపనిని నిర్వహింపనోపడు. స్త్రీసహాయములేక నేపనిగాని జయముగాంచజాలదు.

మహితపర్వాక్రబలోపేతుండగు మహిషాసురుని గెలువ నోరులకు సాధ్యముగానికతన, దేవతాసమేతుడై చతుర్ముఖుడు దేవికి కరసుంజలి, అనేకవిధంబుల స్తుతించివేడ, ఆదేవి కరుణించి వానిబారినుండి యెదనని అభయమిడి అసురునిజంప సమకట్టి రౌద్రమూర్తియై ఘోరాకారముతో నేగుచున్న యాదేవికి ముల్లోకవాసులు పూజోపచారములనొనర్ప ఆదేవి విజృంభించు, మహాప్రళయాకారముతో నేగి నొక్కుమ్మడి దానవుల మర్దించి శాంతమూర్తిగాకయున్న సురసమేతుడై బ్రహ్మ ఆదేవిని శాంతమూర్తివిగమ్మని స్తుతింప ఆదేవి శాంతాకారతదాల్చె.

ఇటులనే స్త్రీలు శక్తిస్వరూపిణులయ్యు నొక్కొక్కసమయమునందు, శాంతతయు జూపుచుందురు. శక్తికి శాంతఘోరములని రెండవస్థలున్నవి.

* * * *

స్త్రీయొక్క తె గృహమున పెద్దలబూజించిన హస్తములతో, శత్రువులను నుక్కడగించును. ఇంట తన సహజకోమలగాత్రముతో మధురాలాపములాడిన యువతి మహాసంగ్రామమధ్యమున రణభేరివేయించి శత్రుగర్భ నిర్భేదమన్పుటుల దుందుభినినాదము చేయును. అహో! స్త్రీలు యెంతటిసాహసలు, ఎంతధీరలు, ఏంతశూరురాండ్రు! "సాహసం షడ్గుణంచైవ" అని యుండలేదా? వారు చేయదలపెట్టినకార్యము కొనసాగువరకు ఊరుకొనువారుకారు. పురుషులుగూడ పట్టుదలయందు స్త్రీలకు తీసిపోదురు.

## గోదావరి రైలువంతెన




(ఛాయాచిత్రగ్రాహకులు: శ్రీయుత ఆలమూరు శ్రీనివాసరావుగారు బి.యె.)

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి ఎ. అమ్మణ్ణి అమ్మగారు

ఇల్లుకట్టుదామా!
ఏమిఇల్లు?
పెంకుటిల్లు—
ఏమిపెంకు?
వరపెంకు—
ఏమివర?
తామర—
ఏమితామర?
మెట్టుతామర—
ఏమిమెట్టు?
కొండమెట్టు—
ఏమికొండ?
బొగ్గుకొండ—
ఏమిబొగ్గు?
నేలబొగ్గు—
ఏమినేల?
గచ్చునేల—
ఏమిగచ్చు?
పాలగచ్చు—
ఏమిపాలు?
బత్తెపాలు—
ఏమిబత్తె?
చుక్కబత్తె—
ఏమిచుక్క?
చాదుచుక్క—
ఏమిచాదు?
బియ్యపుచాదు—
ఏమిబియ్యము?
వూచబియ్యము—
ఏమివూచ?
జొన్నవూచ—
ఏమిజొన్న?
మొక్కజొన్న—
ఏమిమొక్క?
మామిడిమొక్క—
ఏమిమామిడి?
అంటుమామిడి—
ఏమిఅంటు?
మల్లెఅంటు—
ఏమిమల్లె?
గుండుమల్లె—
ఏమిగుండు?
ఇనుపగుండు—

౨. పాటలు

## కాకిపాట

(సంపాదకురాలు) శ్రీమతి రాయి సరస్వతమ్మ గారు

కాకినాకు దీపమిచ్చె
దీపమెత్తి అవ్వకిస్తి
అవ్వనాకు అడ్డిగలిచ్చె
అడ్డిగలెత్తి యెనుముకిస్తి
ఎనుమునాకు పాసియిచ్చె
పాసిఎత్తి తురకక్కయిస్తి
తురకనాకు తురాయియిచ్చె
తురాయిఎత్తి దొరకుయిస్తి
దొర నాకు దొరతనమిచ్చె.

## బూచమ్మకూతురు

బూచమ్మకూతుర్ని నేనేనా ?
బుద్ధిమంతురాలిని నేనేనా ?
ఆకులుపోకలు నావేనా ?
అందెలుకడియాలు నావేనా ?
ఆవులుగేదెలు నావేనా ?
అద్దగోడమీద బెల్లంముక్క
అందిపుచ్చుకో బూచమ్మ !
బూచమ్మకూతుర్ని నేనేగా

బుద్ధిమంతురాలిని నేనేగా
ఆకులుపోకలు నావేగా
అందెలుకడియాలు నావేగా
ఆవులుగేదెలు నావేగా
తోలుకురారా చిన్నన్న
దొడ్డిని పెట్టరా పెద్దన్న
తలుపూతియ్ పెద్దాదినా
పాలూపితుకూ చిన్నాదినా.

## 3. పద్యము

## బాల్యక్రీడలు

పెమ్మరాజు రాజగోపాలముగారు బి. యె సారస్వతసమాజము

ఉడుమాడంగదలంచి బాలకులతో నుద్యానమధ్యంబులో;
బడిలోనుండి రహస్యమార్గమున నెవ్వారైనవీక్షించి న
ప్పుడిదేపోయెద మంచినీరుకని నీవున్మెల్లగాజార న
య్యెడనీవెంటనె చల్లగాతరలనే? యేనప్పుడె ట్లోసఖా!

పలువురుగూడిమాడి బహుభంగులనాటలనాడుచుండ నే
నలజడిబొందిదొంగనయి అందరివెన్కనుపోవుచుండగా
నలవుబలంబుగల్గియటు లందరిమించెడి నీవు నాకు ని
ర్మలమహితానురాగపరమైత్రిదలంచుచు జేతజిక్కవే?

మాలియాకును తెచ్చి మముముట్టుమదికాదు చెలికాడ? కొనిరమ్ము తులసియాకు
కాదుకాదదికాదు బాదమాకును తెమ్ము బాదమా అదికాదు పనసయాకు
పోనితెమ్మదికాదు పొన్నాకుగొని తెచ్చి బాలురందరిగూడ పట్టికొనుము
అది తెచ్చుకొనుటెంత అదికాదు:వడినేగి నారికేళముగొని తేసుమనుచు

తోడిబాలురతోగూడి దొంగబట్టి
ఆడుకొనునాటి సౌఖ్యంబు లాత్మలోన

దలచుకొన్నంత నెమ్మనముపులకరించి
హర్షభాష్పంబు లురలించు నహహా! నాకు.

తల్లిని జేసి బాలనొకదాని, తుమెండిదె యాడుకొందమం
చల్లన పిల్లలెల్లరిని నంతటచుట్టును బోగుచేయగన్
ఘల్లన గజ్జెలందెలు వికస్వర మొప్పగ వారుపారగా
నుల్లసమొప్పవారలను నొక్కటముట్టుకొనంగ లేదకో?

ఒకటా? రెండును మూడునయ్యె, యికనీవో హేలాసఖీ! దొంగవై
తికదా? నన్నికముట్టుకొమ్మనుచు బ్రీతింబల్కగా బ్రీడతో
ప్రకటోత్సాహముతో మహాదరముతో బాల్యప్రగల్భంబుతో
చికురాచ్ఛాదితఫాలపంకజముతో చిన్నారి పొన్నారి బా
లికవెన్నాడిన సంతసంబుమదిలో లీనంబునయ్యెన్సఖా!

బాలికలందరుంగలసి ప్రాభవమొప్పగ మీరుదొంగలై
లీలజరింపుడంచు విపరీతపునిద్రనటింపవారల
వ్రేళలమెల్లగాదరికి వేజనివారినగల్గ్రహింపుచో
బాలికలెల్లమేల్కొని చివాలున జేయరెమందహాసముల్.

ఆయవి నిర్మలంబులయి ఆప్తసుహృద్గుణపూరితంబులై
బాయక లేతవెన్నెలలవాసిజెలంగి మనంబులోపలం
బాయనిపూతలైదనరి మోదముజిల్కు తలంచినంతనే
హాయియొనర్చుగాదెసఖుడా! మురిపెంబు రహించి యిప్పుడున్.

ధారాపాతముగాగ వర్ష మిలపై ధారాళమై పోయగా
నేరుల్పారగ కాగితంపుపడవన్నిర్మించి యవ్వానికిన్
పేరుల్పెట్టి సఖాళివెంటనడవన్ గ్రీడింపగా లేదొకో
పారావారతరంగనౌకలనుచున్ బాల్యంబునన్మిత్రమా!

మనమార నెప్పుడైన చిననాటబలెజేరి వచ్చాకునాడెడి భాగ్యమున్న
యిరుకులోనొకమూల పరిమెళించుచునున్న మొగలిపూవునుపట్టు పూన్కియున్న

ఆటపాటలతోడ తోటలోఁగుమిగూడి యుడుమాడుకొనుభాగ్య మొనరియున్న
తురకామరకనాడి చిరుచెమ్మటలతోడ కథచెప్పుకొనునాటి కలిమియున్న

ఎంతయానందముండునో యెరుఁగరాదు
బాల్యకాలంబులీలగా వరలెమనకు
అందుగల్గిన నిర్మలానందగరిమ
వేయిజన్మాలకైన లభింపగలదె?

## ౪. వస్తుపాఠము

## వెన్న

వృద్ధవైద్యుడు

ఆవు, బఱ్ఱె వీటిపెరుగును చిలికి తోడనే యెత్తబడిన వెన్న నవనీతంబనబడును. దానిని బాలురు వృద్ధులు భక్షించిన, బలము ధాతువృద్ధికలుగును. మఱియు శ్లేష్మము పిత్తము, వాతము వీటిని నశింపజేయును. మూర్ఛ, క్షయ, క్షీణత, కృశత్వము, యీ రోగములు గలవారికిని బాలురకును వృద్ధులకును మేలుచేయును.

ఆవువెన్న అమృత తుల్యము—సర్వోత్కృష్టమైన మహాప్రసాదము. భగవంతుడు కృష్ణావతారమున నవనీతచోరుడయ్యెను—గనుకనే నవనీతము మానవులకు మహాప్రసాదమనుట అతిశయోక్తిగానేరదు.

నవనీతమును ప్రతిదినమును బిడ్డలకు ఇచ్చుచుండిన ఆరోగ్యవంతులై యుండగలరు. కొద్దిగ వెన్న తీసుకొని బిడ్డల శరీరమునకు చరుముచుండిన చర్మరోగములు రాకుండుటయేగాక చర్మము మృదువుగనుఉండును. చేపనూనెకంటె వెన్న అనేకరెట్లు బిడ్డలకు మేలుచేయును.

ప్రాతఃకాలమున తులము వెన్నను చల్లని నీరుతో భుజించిన మలబద్ధకమును మూలవ్యాధిని హరించును. రక్తము స్రవించు మూలరోగముకు వెన్న ముద్దమందు అమృతతుల్యము.

వేసవికాలపు వేడినణచుటకు వెన్న మంచిమందు—నెయ్యికంటె వెన్న శ్రేష్ఠమైన పదార్థము.

ఈ వైద్యము ఎల్లరకు సులభసాధ్యమైనది గనుక ఆచరించవలయును.

౫. బాలికల రచనము

# శక్తిమతి

శ్రీమతి పోనకా వసుంధరాదేవిగారు

మాయూరినడుమ, పూర్వులచే ప్రతిష్టింపబడిన, ఆంజనేయస్వామి వారికి ఒక చిన్న మందిరము కలదు. అక్కడిజనులు ఆస్వామికి మ్రొక్కులు మ్రొక్కి ముడుపులు కట్టుచుందురు. ఆపట్టణమందు రాత్రి పరస్త్రీతో కూడ దొరకిన పురుషుని, స్త్రీని, ఆగుడియందు బెట్టి తెల్లవారగానే రాజసన్నిధికి కొనిపోయి దండించుట ఆచారమై యున్నది.



పోనకా వసుంధరాదేవిగారు

ఒకనాటిరాత్రి పరస్త్రీసంగతుండైన యొక బ్రాహ్మణుని కొత్వాలుపట్టి స్వామి ఆలయములో ఉంచి వెలుపల పెద్దగడియవైచెను. ఆవృత్తాంతము వెంటనే ఆబ్రాహ్మణుని భార్యకు శక్తిమతికి తెలియగా ఆపతివ్రత ధీరురాలై ఖేదపడక చెలులతో గూడి పూజాద్రవ్యములు గైకొని ఆస్వామి ఆలయమునకు పోయెను. అప్పుడు పూజారి దక్షిణమీద లోభముచేత కొత్వాలునకు తెలిపి తలుపుతీసి ఆమెకు ఆంజనేయస్వామి ఆలయములోనికి ప్రవేశము కలుగజేసెను. ఆమెయు పరస్త్రీతోగూడి అందున్నవాడై తన్నును తనపరిజనమును చూచి వెలవెల బోవుచున్న పతినిగాంచి ఆస్త్రీకి తన వేషమిచ్చి అక్కడనుండి బయటకు పంపి తాను భర్తతోకూడ అక్కడేయుండెను. తెల్లవారగానే రాజు ఉద్యోగస్తులు వచ్చిచూడగానే, ఆబ్రాహ్మణుడు అందు భార్యతో ఉండెను. ఆవృత్తాంత మెరింగి రాజు మృత్యుముఖమునుండి బయటకుతీసినటుల బ్రాహ్మణుని ఆలయమునుండి విడిపించి కొత్వాలునకు దండనవిధించెను. శక్తిమతి తనశక్తిసామర్థ్యమువల్ల తనభర్తను విడిపించుకొనెను. అట్లనే భర్తల కెట్టి కష్టమొచ్చినను తమశీలమాహాత్మ్యముచే వారిని కాపాడువారు భార్యలే. ఈ కథ మా పెదతల్లి చెప్పగా విన్నది.

గాంధి మహాత్ముడు



"శాంతరసమొలుకు బ్రహ్మతేజంబుతోడ"

౬. బుద్ధిపరీక్ష

## యుక్తిలెక్క

శ్రీమతి కొత్తపల్లి శారదాంబగారు

[ఇది బాలురయు బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనది. కావున ఈయుక్తి లెక్కకు ఉత్తరము స్వతంత్రముగ నాలోచించి పూర్తివర్కింగు చూపుచు 12 సంవత్సరములకు లోబడిన బాల బాలికలు జూను 10-వ తేదీలోపున లేఖాముఖమున (ఉత్తరములో వారివయసు తెలుపవలెను) మాకు తెలియజేతురుగాక!

—సంపాదకుడు.

ఒక గ్రామమునందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల దేవాలయములు గలవు. ఆదేవళములదగ్గరనే పూవులచెట్టును, ఒక కొలనున్ను ఉన్నవి. పూజారి పూవులను కోసి కొలనులో ముంచగనే కోసినపూవులకు రెట్టింపు అయినవి. అవి తీసికొనివెళ్లి బ్రహ్మకు కొన్ని పూవులు పూజచేసి మిగిలినవి తీసికొనివచ్చి మరల కొలనులో ముంచెను. మరల రెట్టింపు అయినవి. అవితీసికొనివెళ్లి బ్రహ్మకు పూజచేసి నన్ని పూవులతోడనే విష్ణువుకు పూజచేసి మిగిలినపూవులను తెచ్చి కొలనులోముంచెను. మరల పూవులు రెట్టింపు ఆయెను. బ్రహ్మ విష్ణువులకు ఒక్కొక్కరికి ఎన్నెన్ని పూవులు పూజచేసెనో అన్నిపూవులే మహేశ్వరునికికూడ పూజచేసెను. అయితే ఈమాఱు శేషము మిగులలేదు. పూజారి మొదటకోసిన పూవులెన్ని?

౭. వ్యాకరణజ్ఞానము

## సంజ్ఞాధికారము

బులుసు నరసింహశాస్త్రిగారు

(1) వ్రాయునప్పుడుగాని చదువునప్పుడుగాని యిదితప్పు ఇదియొప్పు అని చెప్పునది వ్యాకరణము. (2) తెలుఁగుభాషలోఁగల తప్పొప్పులను దెలియఁజేయునది తెలుఁగు వ్యాకరణము. (3) భాష మూఁడువిధములు. 1 అక్షరరూపము, అ, ఇ, ఉ మొదలగునవి. 2 పదరూపము. రాముఁడు, కొండ, మొదలగునవి. 3 వాక్యరూపము. రాముఁడు వాలిని చంపెను. మొదలగునవి.

### అక్షరప్రకరణము

(4) తెలుగునకు అక్షరములు (55) ఏఁబదియైదు. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః, అఁ, క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ఱ, ల, ళ, వ, శ, ష, స, హ. (5) అక్షరములు మూఁడువిధములు. 1 అచ్చులు. 2 హల్లులు. 3 ఉభయిలు.

అచ్చులు, (లేక) ప్రాణములు

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ: ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ;

హల్లులు, (లేక) వ్యంజనములు, ప్రాణములు లేనివి

క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ఱ, ల, ళ, వ, శ, ష, స, హ.

ఉభయములు

(ఒకప్పుడు అచ్చులు, ఒకప్పుడు హల్లులు) అరసున్న—ఁ నెఱసున్న—ం విసర్గ—ః

(6) అచ్చులు రెండువిధములు. దీర్ఘములు (నిడుదలు.) (2) హ్రస్వములు (కుఱుచలు)

దీర్ఘములు. ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ.

హ్రస్వములు. అ, ఇ, ఉ, ఋ, ఌ. ఎ, ఒ,

(7) ఎ, ఏ, ఒ, ఓ, లు వక్రములు. వంకరగాఁ బలుకునవి.

(8) ఐ, ఔ, వక్రతమములు, మిక్కిలి వంకరగాఁబలుకునవి.

హల్లులు మూఁడువిధములు

1. స్పర్శములు. 2 అంతస్థలు. 3. ఊష్మలు.

స్పర్శలు

క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ

అంతస్థలు

య, ర, ఱ, ల, ళ, వ

ఊష్మలు

శ, ష, స, హ,

(9) క, చ, ట, త, ప పరుషములు (కఠినముగాఁబలుకునవి)

(10) గ, జ, డ, ద, బ లుసరళము (తేలికగాఁబలుకునవి.)

(11) "న్" కారము ధ్రువము. (కఱుగుకది)

(12) మిగిలిన హల్లులు స్థిరములు. ఎట్టిమార్పును జెందనవి.




## రైలు టిక్కెట్లు ఇచ్చు మిషను:—

లండనునగరమునందు భూగర్భమునపోవు రైలుమార్గమునందు టిక్కెట్లనిచ్చుట కొకమిషను కనిపెట్టబడెను. అందు టిక్కెట్టుఖరీదు 3 పెన్నీలు. ప్రయాణికు లెవరయినను అందున్న ముఖ్యమునందొ రొక్కమును పడవైచినయెడల తత్క్షణము టిక్కెట్టు అడుగుననున్న చిన్నపళ్లెమునందు పడును. ఆరొక్కముకన్న ఎక్కువ రొక్కమును కాని, నాణ్యమును గాని పడవైచినయెడల ఆఖరీదు మినహాయించుకొని టిక్కెట్టుతోపాటు మిగిలిన చిల్లర చిన్నపళ్లెమున బడును. అంతకన్న తక్కువరొక్కమును పడవయిచినయెడల ఆమిగత చిల్లరను సూచించు నొక చిన్నబోర్డు మిషను ఎదుటిభాగమున కనపడును. ఈమిషను ఎంతమందికైనను పొరబాటులేక టిక్కెట్ల నొసంగును. (సమదర్శిని.)

## ప్రపంచములోనికెల్ల పెద్దవిమానము:—

జర్మనీదేశమున ఇంతవఱకు ప్రపంచములోనివారు చూచియుండనంతటి పెద్దవిమానము నిర్మింపబడినది. ఆ విమానముయొక్క ఇంజను 525 గుఱ్ఱముల శక్తిగలది. విమానముయొక్క నిడివి 137 అడుగులైయున్నది. ఇందు 160 మంది జనులు కూర్చుండుటకు తావుగలదు. విమానముయొక్క బరువు 52 టన్నులు.

## పాదములుగల పాము:—

పామునకు పాదములు కొడికిపాలుఉండుట ఇదివఱకెన్నడును మనము వినియెఱుంగము. కాని ఈమధ్య పాదములుగల పామొకటి కలకత్తామ్యూజియమునకు గొనిరాబడెను. పామును పరీక్షింపగా దానికి ఒక అంగుళమునిడివిగల రెండుకాళ్లును, కాలికొక్కింటికి మూడుగ్రేళ్లునుఉండెను. ఈపాము రంగపూర్ జిల్లా శుక్రర్ హాతి అను గ్రామమునందలి పాములవాండ్లచే పట్టబడెను. ద్రావకమునవైచి ఆపాము నిప్పుడు కలకత్తామ్యూజియము అధికారులు జాగ్రతపఱచియున్నారు.

## ఎవరెస్టుశిఖరముకంటె ఎత్తయినశిఖరము:—

ఇంతవఱకు భూగోళశాస్త్రవేత్తలు అందఱును ప్రపంచములోని పర్వతశిఖరము లన్నిటికంటె హిమాలయపర్వతమునందలి ఎవరెస్టుశిఖరము ఎత్తయినదని అంగీకరించియున్నారు. అమెరికాయందలి జాతీయ భూగోళశాస్త్రవిషయిక సంఘమువారి డైరెక్టరు అగు డాక్టరు జోసెఫ్‌రాక్ గారు ఈనడుమ పరిశోధనము

నకు టిబెట్టు దేశమునకు బోయి ఉన్నారు. వారు ఇప్పుడు హిమాలయపర్వతభాగములందు ఎవరెస్టుశిఖరము కంటె ఎత్తయినశిఖరము నొకదానిని కనుగొంటిమని ప్రచురించుచున్నారు.

ఆడది మగవాడగుట:—

టిప్పరిలో విట్టమైరుపట్టణమునందలి ఒక వైద్యశాలయందు మంత్రసానిగా ఉన్న ఈవా మేరిడిరు అను నొక స్త్రీ తన ఇరువదిమూడవయేట మగవాడుగా మారెను. అప్పుడు పురుషోచితమగు ఈవర్ మాంకేగూబర్డు అనునామము దాల్చెను. జనన రిజిష్టర్లులోగూడ మగవాడుగా మార్చబడెను. పెక్కుమంది వైద్యులు పరీక్షించి ఆమె మగవాడుగామారుట నిజమేనని ధృవపఱచిరి. ఇప్పుడామె (అతడనవలయును) టిప్పరీ మాన్‌మాత్ పశాసునందు తనతోడి మంత్రసానిగానుండిన స్త్రీని వివాహము చేసికొనెను.

శారదా వివాహముల సరదాలు:—

ఒకచోట వివాహారంభసమయమున పంచామృతప్రాయశ్చిత్తము చేయునిమిత్తము పురోహితుడు వధువుయొక్క హస్తకమలమున బెల్లము, పెరుగు ఇత్యాదివస్తువులను ఉంచి వరునకు ఇప్పించుసమయమున చిన్నపిల్లయగు వధువు వానిని తననోట్లో వైచుకొనెనట. మరి ఇంకొకచోట ముక్కుపచ్చలారని వరుడు అయిదు రోజులు వివాహదీక్ష అని తెలియక మధుపర్కములను విప్పివైచి వట్టిమొలతో తోడిబాలురగూడి మరియొక వీధికి ఆడుకొనుటకు పోగా అక్కడివారు అందఱు నవ్వడము, ఇక్కడివారు అందఱు వెతికడము సంభవించెను. (పంచానన)

ఆడవస్తాదు:—

మనదేశము కుస్తీలకు చాల ప్రసిద్ధిచెందినది. భూలోకములోకెల్ల ప్రసిద్ధిచెందిన జిబిస్కోగారు హిందూదేశమునకు వచ్చి గామాగారిని ఓడించెదనని ప్రగల్భములు పలికి తుదకు ఆ గామాగారిచేతనే చిత్తయి మళ్లి తిరిగి మాట్లాడక "గామా పెద్దపులిరా నాయనా" అని తల్లడిల్లుచు వచ్చినత్రోవపట్టుకొని వెళ్లిపోయెను. అందుచే మనదేశములో కుస్తీలు చాలతరుచుగా జరుగుచున్నవి. వానిలో ఏమియు అంత అతిశయోక్తిలేదు. ఇప్పుడు మొన్న ఒక విచిత్రమైన కుస్తీ హైద్రాబాద్‌లో జరిగినది. అదిఏమన అది ఆడవాండ్ర కుస్తీ. ఒక ఆడామె ఈరానుదేశస్థురాలు. రెండవ ఆమె హైద్రాబాద్‌లో ఆకులు అమ్ముకొని జీవించువనిత. ఇందులో హైద్రాబాద్ వస్తాద్ చాల పొడుగుగాను బలముగాను చూచుటకు భీకరముగాను వచ్చి రణరంగములో నిలువబడెను. రెండవఆమె ముసుకువేసికొని అసలే పొట్టికితోడుగా వంగొని మనుష్యులమధ్యనుండి వచ్చెను. వచ్చి ముసుగుతీసి పారవేసి తానుగూడ రణరంగములో నిలువబడెను. గాని ఈరానుమనిషి ఏనుగువద్ద దోమకీత్యానుండెను. తరువాత ఇద్దరు కలబడిరి. హైద్రాబాదు నాయకురాలు చాల చాతుర్యమును చూపెను. ఈరాను ఆమెను గట్టిగాపట్టి పైకిఎత్తెను. 'హైద్రాబాద్‌నకు పేరు తెచ్చినదిరా' అని సభ్యులందరు ఆహ్లాదముగా చప్పట్లు చరచిరి. కాని పైకిలేపబడిన ఈరానుమనిషి గట్టిగ ఒకతన్నును తన్నెను. ఒకరుక్రింద నూగులసంచివలె గభాలున పడిరి. వారు ఎవరుని హైద్రాబాదు వస్తాదు. ఆమెమీద చిత్తుచేసి కూర్చొనియున్న దెవరుని ఈరానువస్తాద్. (గోలకొండపత్రిక)

స్త్రీలకు ప్రత్యేకమైన చెఱసాల:—

మదరాసు ప్రభుత్వమువారు వెల్లూరునందు ప్రత్యేకము స్త్రీలకొఱకు నిర్మించిన చెఱసాల కట్టుటకు మూడులక్షల రూపాయిలు వ్యయమైనవని తెలియుచున్నది.



## అ నా స పం డు:—

అనాసపండుయొక్క ఓషధీగుణమునుగూర్చి 'స్వతంత్ర' పత్రిక ప్రచురించిన దిగువ విషయములు స్త్రీలు—అందుముఖ్యముగ గర్భిణిస్త్రీలు—గమనింపవలసియున్నవి:—

"ఇదిమంచి రుచిగలపండు. మిక్కిలి సువాసన గలిగియుండును. గురుగుణముగలది. పిత్తవికారముల నణచును. యెండతగిలిన వారలకిచ్చిన ఆప్యాయముగనుండును. అరోచకమును బోగొట్టును. ఈ పండు నుపయోగించు విషయమున ముఖ్యముగ గమనించవలసిన విషయ మొకటిగలదు. రుచిగనుండుటచే మంచి దని అందరు తిందురు. గర్భవతులగు స్త్రీలకు ఇది యెంతమాత్రమును పెట్టకూడదు. ఈ పండుతినిన 12 గంటల లోపల గర్భాశయమంతయు సంకోచమునొంది, వెంటనే రక్తస్రావమారంభమగును. పక్వమగుపండుకంటె పచ్చిగానుండునది మరీ ఉపద్రవకరము. పచ్చికాయను తిన్నచో అంత్రములను ప్రకోపింపజేసి కొందరికి విరోచనములుగూడ గలిగించును. బాబూ కెన్నిలాల్ దేగారు వంగదేశమున దీని ఉపయోగము నీక్రిందివిధమున జెప్పినారు. వంగదేశమున దుష్టులగు స్త్రీలు గర్భస్రావము గలిగించుటకొఱకు అపక్వమగు అనాసపండు కొంచము ఉప్పుతోడ నలుగగొట్టి గర్భవతులకిచ్చెదరు. దీనిని గర్భవతులు తినినచో ప్రారంభమున (అనగా మూడు మాసములలోపల) వెంటనే స్రావముకలుగును. మూడుమాసములు గడచినపిదప కొందరికి స్రావము కాకపోవచ్చును. అయితే శరీరదౌర్బల్యాదులు అనుకూలముగ నున్నచో మూడు నెలలకు పిదపకూడ గర్భాశయమంతయు సంకోచమునొంది స్రావముగలిగి 24 గంటలలోపల గర్భపాతకమగును. కాన ఈ పండు ఉపయోగించు విషయమున జాగ్రత్తగ ప్రవర్తింపవలయునని మనవిచేయుచున్నాము."

## అ స్వా భా వి కా హా ర ము లు:—

మే మాసము 7—వ తేదీనాటి 'దీనబంధు' పత్రిక పై విషయమునుగూర్చి ఇట్లు ప్రచురించుచున్నది:—

"డబ్బాపాలు మొదలగు అస్వాభావికాహారముల (Patent foods) వలన కలుగుచున్న యపారనష్టమును, యనారోగ్యమును డబ్బిచ్చి కొని తెచ్చుకొనుచున్నాము.

శిశుమరణములు వృద్ధియగుట కిట్టియాహారములే ముఖ్యహేతువు.

హిందూదేశపు వైద్య పరిస్థితులు శిశుమరణసంఖ్య నెక్కువగా సూచించుచున్నవి. నేటిదనుక యట్టి మరణములకు కారణము గనిబెట్టలేదనియే జెప్పనొప్పును. రోగ మెందువలనవచ్చెనో దెలియక రోగనివృత్తికి యత్నించుట హాస్యాస్పదముగాక మరేమగును?

తల్లితండ్రులు బలిష్ఠులైయున్ననేగదా బలవంతులగు బిడ్డలనుకనుట! నేటితల్లులలో యట్టివారు అరుదు. కనుకనే శిశువులందరు బలహీనులుగనున్నారు. మరియు ఈ అస్వాభావికాహార వాతావరణమున అట్టి బలహీనులగు శిశువులారోగ్యమును పెంపొందించుకొనగలరనుట వట్టికల్ల. తల్లితండ్రులు తమబిడ్డల నేరీతి పెంచవలెనో యెరుగరు. సరిగదా. చాలమంది వైద్యులుగూడ సరిగ నాలోచింపకయే సర్వశిశువ్యాధి హరమనెడి దురూహతో విదేశమునుండివచ్చిన యేదోనొక యస్వాభావికాహారమును మందుగా వాడ నియమించుచున్నారు. శిశువులకు బలమును, పుష్టిని గలిగించు తల్లిపాలను వృద్ధిపరచుటకెట్టి సూత్రములను జేర్కొనరు. బలమగు స్వాభావికాహారములందిని తల్లిపాలను వృద్ధిపరచుకొనినచో శిశువులారోగ్యవంతులగుదురే గాని సంవత్సరముక్రితమో అంతకుపూర్వమో తయారుచేసిన ఏసీసా లేక డబ్బాపాలునుగూడ బలము గలిగించవు. ఇట్టి అస్వాభావికాహారమును గూర్చి చక్కగ ప్రకటించెడి మందుల వ్యాపారస్తులకు డాక్టరులు దాసులై వాటి గుణాగుణములను లెక్కింపకయే రోగులకును శిశువులకును అట్టి డబ్బాలను వాడ నియమింతురు.

వైద్యులు రోగికి ఆహారము నిర్ణయించుపట్ల తమ స్వానుభవమును, తెలివిని యుపయోగించవలసి యున్నది. శుభ్రమైనవి, బలమొసంగునవి, చవుకగ దొరకునవి, సర్వత్ర లభించు కాయగూరలే మిక్కిలి యారోగ్యకరములు. చెట్లనుండి అప్పుడు కోసినవాటియందు మంచి జీర్ణశక్తిగలదు. వాటిని నిలవయుంచినను ఉడికించినను అట్టిశక్తినశించును. పాలుగూడ కాచనివి శ్రేష్ఠము.

నిమ్మకాయ చెట్టునయుండగా నొకగుణమును, కోసినతర్వాత నొకగుణమును, మర్నాటి కింకొకగుణమును ఇచ్చుచున్నది. అట్లే ఎండినతర్వాతను, వండినతర్వాతను, ఉప్పు, కారములతో గలిపి ఊరుగాయ వేసినప్పుడును వేర్వేరుగుణముల నిచ్చుచున్నది. ఈ విధముగా ప్రతివస్తువయు కాలమునుబట్టియు, స్థలమును బట్టియు గుణములయందు మార్పుజెందును.

ఈ డబ్బాలు, సీసాలయందమ్మబడు పాలు, ఆహారములు శ్రేష్ఠమగు స్వాభావికాహారములు దొరకని ప్రయాణీకులకు, సముద్రయానము జేయువారికేగాని దొరకు ప్రదేశములయందుండు సామాన్యులుగూడ వాడుట వారియజ్ఞానముగాని వేరుగాదు. వీటిని వాడుటచే జీర్ణశక్తి నశించుటయేగాక అనేకరోగములు గలుగజేయును.

మరియు నిట్టి యాహారములు దేశదారిద్ర్యమును గూడ వృద్ధిజేయుచున్నవి. బీదజనులుసహితము వైద్యుల మోసములంజిక్కి తమబిడ్డల కారోగ్యము గలుగుననుయాశతో ధనమును నిట్టి డబ్బాలకై వెచ్చించి ఋణగ్రస్తులగుచున్నారు. వీటివలన గలుగుచున్న యరిష్టములు అనుభవించెడి బీదలకుగాక వేరెవ్వరగుదురు?

తల్లిపాలులేనిచో పసిపిల్లలకు పళ్ళురాని యీడువరకు ఆవుపాలును అటుపైన అన్నమును తినిపించుట మంచిది. పాలలో బెల్లమువైచి జీర్ణశక్తినిబట్టి యివ్వదగును. హిందువులు సామాన్యముగా వాడునాహార పదార్థము లిట్టి యస్వాభావికాహారములకన్న మిక్కిలి మంచివి. విదేశములనుండి యిట్టిసరకు దిగుమతి యగుట మానినగాని యీదేశీయులు బలిష్ఠులుగాలేరు. ఆంగ్లేయవైద్యులు భాగ్యవంతులకైనను, పేదవారికైనను బలముకలిగించుట కిట్టి యస్వాభావికాహారములు వాడ నియమింపకుండినచో వారు తాముసు, తమ దేశమును భాగ్యవంతముగ నొనర్పగలరని నమ్ముచున్నాము."

## జటప్రోలు రాణీవారి పరిపాలనము:—

పైవిషయమునుగూర్చి మేమాసము 14–వ తేదీనాటి 'గోలకొండపత్రిక' సంపాదకీయ వ్యాసమున నిట్లు ప్రచురించు చున్నది:—

"హైద్రాబాద్‌లోని బాగుగ పరిపాలింపబడు సంస్థానములలో జటప్రోలు ఒకటి. కొన్ని నెలలకు పూర్వమే జటప్రోలు రాజాగారగు శ్రీరాజా సురభిలక్ష్మణరావు బహద్దూర్‌వారు చనిపోయిరి. వారి

మరణానంతరము వారిపుత్రులగు శ్రీజగన్నాధరావుగారు బాలుడైనప్పటికిని వీరివత్తుతల్లియొక్క మేధాశక్తిని గమనించినవారై ప్రభుత్వమువారు చనిపోయిన రాజావారి ఇష్టానుసారము జటప్రోలుసంస్థానమును కోర్టు ఆఫ్ వార్డు చే పరిపాలించనీయక ఆ రాణిగారికే స్వపరిపాలనార్థము ఒప్పజెప్పిరి. శ్రీరాణీగారును తమ కర్తవ్యమును బాగుగ గమనించి ఇన్నిదినములు చాలనిపుణతతో రాజ్యముచేసిరి. వీరుచాల ఉదార భావులు. బీదలయందు మిక్కుటమైన ప్రేమగలవారు. కావుననే వీరు రాజ్యమునకు రాగానే బీదలను పిల్చి పిప్పిజేయు నట్టి వెట్టిపద్ధతిని రూపుమాపి తమఔదార్య బుద్ధినివెల్లడిజేసి ప్రజలమన్ననకు పాత్రులైరి. ఇంతియేగాక డిచ్చిపల్లియందు గల కుష్ఠురోగుల వైద్యశాలకు నూర్లరూప్యముల విరాళముఒదయచేసి వారిమన్ననకు పాత్రులైరి. ఇంతయేగాక బీదరెడ్డి విద్యార్థులకు భోజనవసతుల నేర్పాటుజేయుచు చదువుకొనుటకు తగుసహాయమును చేయుచున్న రెడ్డివిద్యార్థి వసతి గృహమునకు ఐదువేలరూప్యములభూరిదానము నొసగి విఖ్యాతినిగాంచిరి.”

## హిందూస్త్రీలు విద్యాశూన్యలా?:—

అను విషయమునుగురించి శ్రీపునుగు సీతారామశాస్త్రిగారు 'బ్రాహ్మణపత్రిక' లో వ్రాసిన దిగువవిషయములు ఆలోచనను రేపుచున్నవి:—

“ఈ దినములలో వార్తాపత్రికలలో నానాముఖముగ 'హిందూస్త్రీలకు విద్యనేర్పవలయును. బళ్లను స్థాపింపవలయును. మాధ్యమిక పాఠశాలలు స్త్రీలకు ప్రత్యేకముగ నేర్పాటు గావింపవలయును. కళాశాల నుద్ధరింపవలయును, వేయేల? వారికి ప్రత్యేకముగా విద్యాపీఠమొండు నెలకొల్పవలయును' అని సంఘ సంస్కర్తలు స్త్రీవిద్య నుద్ధరింపవలయుననుచున్నారు. స్త్రీలు ఘోషపలిడుచున్నారు. వీరికి విద్యయన నెట్టిదో నియతముకాలేదు. పురుషుల కిదివరకెన్నడో ఏర్పడినవానినే వీరిప్పుడభ్యసించుచున్నారు. దానివలన బురుషులలో నిన్నాళ్లకు వేదమతాశక్తిశూన్యత, పూర్వహిందువుల యాచారముల దూషణము ప్రబలి నాస్తికత, నూతనమతాసక్తి, హైందవాచారముల విరమణము ప్రబలినట్లు ప్రస్తుత సర్కారు విద్యావిధానమువల్ల స్త్రీల లోను ప్రబలి సంఘము తలక్రిందుకానున్నది. పురుషులెన్నిపోకలుపోయినను కుటుంబములోని సంఘప్రాచీ నాచారములను హిందూస్త్రీ యిన్నాళ్ళు నిలువబెట్టియుండెను. ఇకనన్ననో ఆమెసైతము ప్రస్తుతపాశ్చాత్య విద్యావిమోహితురాలై సంఘాచారముల పాదు పెకలింప మార్గము నన్వేషించును. ఇదివరలో వారికి వ్రాయను చదువను విద్యరాకున్నను, నేర్పబడకున్నను హిందూస్త్రీనడత పవిత్రవంతముగ నుండెను. అందులకు గారణమేమనెదరా? ఇది హిందువులకందరకు దెలిసినదే. ఆమె పుట్టింట బాల్యావస్థయందుండునపుడు తల్లియో, మేనత్తయో మఱియే సమీపబంధువో ఆమెకు బరమేశ్వరాశక్తి, దేవుడొకడున్నాడను భావము, తల్లిదండ్రులయెడ భక్తి, వారిమాట జవదాటమి, గుళ్ళకేగి భగవధ్యానతత్పరత్వము, వాకిటికి వచ్చిన బిచ్చగానికి పిడికెడు బియ్యము వైచుటలోనుండు పరలోకసుఖము, బధిరాంధపంగుల జూచినప్పుడు వారివిషయమై పడవలసిన పశ్చాత్తాపము, అహింసయందలి పుణ్యము, భూతదయ, పరోపకారబుద్ధి ఇవియవియననేల సర్వ సుగుణములకు బునాదిగల్గింతురు. పదియేండ్లదై కన్యావస్థను దాటి వివాహము కాగానే అత్తమామల యిండ్లలో నడువవలసిన రీతులు, వారియెడ భక్తివిశ్వాసములు పతిభక్తిని ధృడపరచు సీత దమయంతి సావిత్రి మున్నగు భారతపవిత్రవతులైన నారీమణులనుగురించి సుబోధలనుజేయు గొప్పగొప్ప పాటలను కంఠ స్థములనుగా జేయుటయును భగవద్దశావతారములు తల్లీలలుగల కథలను వృద్ధాంగనలవలన నొకతీరున విద్య నేర్పబడును. పిదప రజస్వలయై గృహిణీదశ సంప్రాప్తమయినప్పుడు అత్తవారింటి గృహసంరక్షణము, తులసిపూజ, పుణ్యవ్రతములు నోముట, పాతివ్రత్యాచరణము వీనియందు బద్ధాసక్తులయి మెలంగుదురు. పిదప సంతానవతులగుచో శిశుసంరక్షణము బిడ్డలకు సునీతులను గరపి వారు పెద్దవాండ్రుకాగానే మంచి పురుషులగుటకు విద్వాంసులగుటకు మార్గముల జూపుదురు. లోకమున సంతానము సామాన్యముగా తల్లి గుణ గణముల నలవరించుకొనును. రాములను గన్నవారును, రావణుల గన్నవారును, సీతలను దమయంతులను సావిత్రులను గన్నవారును, తాటక మంధర కైకేయీలగన్నవారును స్త్రీలేసుమా. వీరిలో సుగుణదుర్గుణము

లచ్చుపడినని తల్లుల స్వభావానుసారముగ నేర్పడినది. తల్లితనయొక్క గుణములు అలవాట్లును తనబిడ్డలకు సర్వసాధారణముగా నేర్పును. ఇది విద్యాశూన్యత్వమా! గృహిణి కాగానే యాత్రలకు భర్తలతో ప్రయాణమై విదేశములనుజూచి నానాదేశపు నాగరికమును హిందూ స్త్రీ నేర్చుకొనును. లోకమున చదువు నేర్చుటయం పర్యవసానము సంఘమున కుపయోగపడుటకును భగవచ్చింత కలుగుటకునుతప్ప వేరొండుకానేరదు. హిందూస్త్రీకి వ్రాయను చదువను పూర్వకాలమున రాకున్నను పైనుదహరించిన సుగుణములకన్నిం టికి ఆమె ఆలవాలమై పుట్టినింటికి మెట్టినింటికిం గీర్తిదెచ్చెను. ప్రస్తుతము పాశ్చాత్యవిద్యకు సంబంధించిన రవంతవిద్య నేర్చినను వారికి రజస్వలానంతర వివాహములు, వారిభర్తల కోరుకొనుటలో తలిదండ్రుల యాజ్ఞ లవసరములేక వారికి స్వేచ్ఛ, సముద్రతీర విహారము, పరపురుషులతో స్వేచ్ఛాగోష్ఠి మున్నగువాని కలవాటుపడుచున్నారేకాని, వీరిలో నెవరో ఒకరిరువురు తప్ప మిగిలినవారికి సంఘసేవ, భగవద్భక్తి, పెద్దలయందాదరము, పాతివ్రత్యము, బంధుప్రీతి, దరిద్రులయెడ పశ్చాత్తాపము, భూతదయ కలుగుటయే లేదు. కావున వ్రాయనుచదువను నేర్పబడని పూర్వాచారపు హిందూస్త్రీయే పాశ్చాత్యవిద్యావిధానముల కలవాటుపడిన ప్రస్తుతనాగరికు లనబడు హిందూస్త్రీలకన్న చదువునేర్చినదని తలంచవలయును. చదివి పురుషులతో బాటు దొరతనమువారికి ఊడిగములొనర్ప గోరునదియు, ద్రవ్యసంపాదనతత్పరయు నగు ప్రస్తుతహిందూ స్త్రీలకన్న వ్రాయుటయు జదువుటయు నేర్పబడక సంఘమునకు, సంసారమునకు వెలలేని యుపకారమును జేయుచుండు పూర్వాచారపు స్త్రీయే మిక్కిలి ప్రపంచపునాగరకమునకు దోడ్పడునది యని యెఱుంగవలయును. ఈ రెండుతరగతుల స్త్రీలలో ఎవరు చదువువలన రాగలశ్రేయస్సును బొందువారో యూహింపుడు. విద్యవలన ప్రయోజనమేమి? పూర్వాచారపరాయణ యైన స్త్రీకి ఏవిధమున విద్యనేర్పబడుచున్నదో యామె విద్యాశూన్యురాలు కానేరదని తెలిపినాము. స్త్రీ యెంతమాత్రము ద్రవ్యసంపాదకురాలు కాగూడదు. తన్నిమిత్తమని వారికి విద్య నేర్పరాదు."

బాల్యవివాహములు :—

మే మాసము 10, 11, తేదీలయందు ఈరోడునందు ఆత్మగౌరవసమావేశముతో బాటు జరిగిన మహిళాసభకు అధ్యక్షతవహించి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారిచ్చిన ఉపన్యాసమునుండి క్రిందిభాగము ముద్రితము—

"పూర్వులు అనుష్ఠించిన ఆచారములను వారల చరిత్రమూలమున కనుగొనగా స్త్రీలు స్వయముగా వరుల సంపాదింపగలిగిరని తెలుచున్నది. ప్రకృతస్థితియందో స్త్రీప్రజ జననమని యనినతోడనే తలితండ్రులు వరాన్వేషణభారము వహించి శ్రమ కల్పించుకొనెదరేకాని తమబాలికల మంచివిద్యావినయాదిగుణవంతులుగ జేసి వారల జీవితకాలమను సముద్రమును నీదగలవారినిగా జేయుటయందు శ్రద్ధవహించుటలేదు. వీర్లకు వివాహమనిన బొమ్మలాటయని కాబోలు! జీవితమునకు ముఖ్యోపకరణమని ఎంచిన వీరికిద్దురూహ కనుపట్టదు. బాల్యవివాహమను చేటును యాక్రిందఉదాహరించిన వానివలన దెలుసుకొననగును:

| | |
|---|---|
| 5 సంవత్సరముల లోపుగా వివాహమొనరింపబడ్డ బాలికలు | 218463 |
| 10 ,, ,, | 2016687 |
| 10 సం॥ మొదలు 15 సం॥ లోపుగ | 6230207 |
| 15 సం॥ వత్సరముల వయస్సుకులోపుగ వితంతువులైనవారి సంఖ్య | 396556 |

ఈఆచారముఈపై ఉదహరించినవాటిమూలమున చేటని దెలియలేదా?

కావున ఈ వివాహమునకు శాసనము గొనివచ్చి, అమలునందు బెట్టించి, వ్రాతమూలకముగను ప్రసంగమూలకముగను జనులకు న్యాయమెఱిగించి దేశక్షేమమునకు స్త్రీలవృద్ధికిని తోడ్పడినట్టివార్లకు మనముమనఃపూర్వకవందనము లొసంగవలసినవారము. బాల్యవివాహదురాచారమునుగూర్చి వివేకానందులవా రిట్లుచెప్పినారు—"Child marriage is a sin for which the nation is suffering and therefore I will set my foot against that diabolical Custom."

# ప్రమోదూత సంచికలు

## ఆంధ్ర పత్రిక సంచిక:—

ఇరువదియొకటవ సంవత్సరాదిసంచిక. త్రివర్ణచిత్రములు ఎనిమిది–౧ రాధ ౨. జవహర్‌లాల్ నెహ్రూ ౩. కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు ౪. అచ్చర ౫. రాధాకృష్ణులు ౬. బాలుడు–మాంచాల ౭. రాణీసంయుక్త సందేశము ౮. విహారసుందరి. చిత్రములన్నియు ఆంధ్రసిద్ధహస్తులు చిత్రించినవైయుండుట ప్రశంసనీయము. ఆంధ్రచిత్రకళాతారాపథమున శుక్రతారయై వెలుగొందిన కీ. శే. దామెర్ల రామారావుగారి చిత్రము 'రాధ' పూజ్యస్థానమున నున్నది. ఆంధ్రచిత్రకారిణులగు శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, శ్రీమతి దామెర్ల సత్యవాణిగార్లు చిత్రించిన 'రాణీసంయుక్తసందేశము' 'రాధాకృష్ణులు' అను మనోజ్ఞచిత్రములు సంచికయొక్క కళాసౌందర్యమునకు దోహదకారులై యుండుట ఆంధ్రస్త్రీలు గర్వింపదగినసంగతి. వ్యంగ్య చిత్రములు, అజంతాచిత్రములు, సాధారణచిత్రములు బహుళముగానుండి సంచిక సౌందర్యమును రెట్టించు చున్నవి. వ్యాసములు విషయములనుబట్టి విభాగింపబడి కూర్పబడినవి. గద్యవ్యాసములను ముందు గమనింతము. 'ధాత్రీశిక్ష–శిశుపోషణ' అను శ్రీ దంతులూరి శ్రీరామచంద్ర భిషగ్వరుని వ్యాసము స్త్రీలు తప్పక చదువ వలసినది. సారస్వతవిషయికవ్యాసములలో కుందూరి ఈశ్వరదత్తుగారి పారిజాతాపహరణమనుచరిత్ర రచనాకాలమునను; చారిత్రకవ్యాసములలో దాసు దామోదరరావుగారి హిందువుల ఆధిక్యమునను; భిషగ్వర వేటూరి శంకరశాస్త్రిగారి సిద్ధనాగార్జునుడును; పేర్కొనదగినవి. ముద్దా విశ్వనాథముగారి 'ఛాయ' అను అనువాదితమగు వచనరూపకము బాలబాలికలకు నూత్నరుచిని పుట్టించునదిగానున్నది. కథావ్యాసములలో నొకటికూడ రుచిరములైయుండలేదని వ్రాయుటకు చింతిలుచున్నాము. ఇక పద్యవ్యాసముల పరికింతము. గద్యవ్యాసములకంటె పద్యవ్యాసములు కొంతవఱకు నూత్నభావసంకలితములైయున్నవి. తురగా వేంకట రామయ్యగారి 'మహారాజా అప్పారావు' ను, వేంకటవీరరాజకవుల 'జతీంద్రస్మృతి' యు ఒడలు జలద రింపజేయు భావములతో కూడియున్నవి. కాట్రావులపల్లి రామమూర్తిగారి 'ఆంధ్రమాతృ నిర్వేదము' కొంత వఱకు హృదయములను కలచజాలియున్నది. 'పదములు' అను శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి వ్యాసము భావసంపదయందు సంచికలోని పద్యవ్యాసములకు తలమానికముగా నున్నది. దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి 'కాపుపిల్లి'; సహదేవ సూర్యప్రకాశరావుగారి 'పాషి'; వేంకట కాళిదాసకవుల 'మన్మథ మూర్తి'; వడ్డాది సుబ్బారాయుడుగారి 'చాటుపద్యములు' అను వ్యాసములు మనోజ్ఞములైయున్నవి. దాదాపు మూడువందల పుటలుగల ఈ సంచికలో స్త్రీలు రచియించినవి ఒక్క గద్యవ్యాసము, ఒక్క పద్య వ్యాసముమాత్రమే యుండుట శోచనీయము. పైవత్సరపు సంచికయందు స్త్రీలవ్యాసములకు ఎక్కువతావు ఈయబడుగాకయని అభిలషింతుము. ప్రచురింపబడిన స్త్రీవ్యాసములు రెండును ప్రశస్తముగనున్నవి. అగుట గద్యవ్యాసము (స్త్రీలకు నవీనచట్టములు: వాని ప్రయోజనములు– శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు) నుండి కొంతభాగమును; పద్యవ్యాసము (ఉద్బోధ–శ్రీమతి వెలువోలు వసంతాదేవిగారు) నంతయు గతమాసపు గృహలక్ష్మి చేకొని ప్రచురించినది. సంచికయందు పేరుగాంచిన పెద్దలవ్యాసములు విశేషముగ గానరావు.

యువకులు వ్రాసిన వ్యాసములుకూడ సంపాదకులు ప్రస్తావనలో తెలిపినటుల 'పాతవాసనలను వ్యక్తముచేయునటుల నవీనాశయములను వ్యక్తముచేయుటలేదు.' సంచికవెల ఆంధ్రపత్రిక చందాదారులకు రు 1-0-0. ఇతరులకు రు 2-0-0. వలయువారు ఆంధ్రపత్రికా సంపాదకులపేర 6, 7 తంబుశెట్టివీధి, మద్రాసు అను చిరునామాకు వ్రాయవలయును.

## సమదర్శిని సంచిక:—

ఇది మూడవ యుగాదిసంచిక. కీర్తిశేషులైన డాక్టరు టి. ఎమ్. నాయరు ఎం. డీ. గారి సంస్మరణార్థము ప్రచురింపఁబడినది. తొలుత త్రివర్ణచిత్రములను తిలకింతము. గౌరవస్థానమలంకరించుచున్న 'రాధ-ప్రథమపాఠము' అనుచిత్రము మనోజ్ఞముగనున్నది. ఇది రాజమహేంద్రవరవాసిని శ్రీమతి ఆర్. కృష్ణాబాయమ్మ బి. ఏ; ఎల్. టి, గారు రచించినది. స్త్రీ రచియించిన చిత్రమునకు గౌరవస్థానమొసంగి సమదర్శిని సంపాదకులు తమ ఉచితజ్ఞతను ప్రకటించినారు. ఇదిగాక ఇంకను ఐదు త్రివర్ణచిత్రములుకలవు. ఐదును ఆంధ్రేతరుల రచనములే అయిఉండుట చింతింపవలసినవిషయము. ఆంధ్రులకొఱకైన ఈ సంచికలో ఆంధ్రచిత్రకారులచిత్రములకు తగిన ప్రాతినిధ్యములేకుండుట ఒకలోపము. పైసంవత్సరపు సంచికయందైనను సమదర్శినీసంపాదకులీలోపమును సవరింతురుగాకయని కాంక్షింతుము. ఇకవ్యాసములను పరిశీలింతము. పద్యవ్యాసములలో శ్రీయుత వడ్డాది సుబ్బారాయుడుగారి 'పాలములు-పిట్టలు'; శ్రీశివశంకరశాస్త్రిగారి 'క్రుద్ధముని'; శ్రీ జి. జోషువగారి 'ఉపాధ్యాయుడు'; శ్రీ అమరవాది హనుమచ్ఛాస్త్రిగారి 'వీడికోలు'; శ్రీ వేంకటకాళిదాసకవుల 'స్నేహలతాదేవి'; శ్రీ పెమ్మరాజు రాజగోపాలముగారి 'సాగరతీరాన' అనునవి ప్రశంసనీయములుగనున్నవి. మిగతపద్యవ్యాసములలో పెక్కులు నిస్సారములుగనుండి స్థలపూరణముకొఱకు సంపాదకులు చేతికివచ్చిన వానినెల్ల ప్రచురించిరా అనిపించుచున్నవి. పుట 122 లో నొకపద్యవ్యాసమున 'మనస్వదేశంబు'అను ప్రయోగముకలదు. ఎట్టిఅర్థసారస్యముగల ప్రయోగము! భాషాయోషకు శాశ్వతాలంకారములుగ కూర్పబడు సంచికలలో నిట్టి సారస్యములేని ప్రయోగములతో నిండియుండు వ్యాసములు ప్రచురించుట గర్హింపవలసిన విషయము. సంపాదకులు వ్యాసములను బాగుగాపరామర్శించి మఱియు ప్రచురించియుండవలసినది. ఇక గద్యవ్యాసములను చూతము. 'హైందవవ్యాపారసమస్య-శోస్త్రావ్యాపారసంరక్షణచట్టము'అను శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారి వ్యాసము విషయగర్భితమైనది; 'తెలుగుపత్రికలు' అను శ్రీ కొవ్విడి లింగరాజుగారి వ్యాసము తెలుగుపత్రికల కష్టనిష్టురములను తేటతెల్లచేయుచున్నది; 'భీష్మవిభీషణులు' అను శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి వ్యాసము రచయితవిమర్శజ్ఞానమును ప్రదర్శించుచున్నది; 'జన్మభూమి' అను శ్రీ ముద్దా విశ్వనాధముగారి వ్యాసము చదువదగియున్నది; 'భారతీయుల పూర్వసాంఘికచరిత్రము' అను శ్రీ కవికొండల వేంకటసత్యనారాయణమూర్తిగారి వ్యాసము విపులపరిశోధనముతో గూడుకొనియున్నది; 'గ్రంథాలయములు-రైతులు' అను శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి వ్యాసము ఆ విషయమునుగూర్చి చక్కని అభినివేశముతో వ్రాయబడిన వ్యాసమైయున్నది. కథావ్యాసములలో శ్రీమతి జానకీపురుషోత్తముగారి 'గులాబీకన్య; శ్రీ చింతాదీక్షితులుగారి 'పెద్దమేడ' అను రెండునుతప్ప మిగిలినవి నవ్యతయందును రమ్యతయందును కొఱవడియున్నవి. కథలనడుమ చిత్రములలో 117-వ పుటయందు అశుచిప్రాపకమగు చిత్రమొకటి దొరలినది. అందు విగతవస్త్రయగు స్త్రీ నిలబడి అద్దములో తననీడ చూచుకొనుచున్నట్లు చిత్రింపబడియున్నది. అభిజాత్యముగల స్త్రీలీచిత్రమునుచూచి జలదరింపునొందకుండ నుండజాలరు. మర్యాద తెలిసినయువకుడు తల్లి చెల్లెలు, స్నేహితురాలు, భార్యమొదలగువారికడ నీపుటను విప్పగలుగునా? శ్రీమతులు పి. పూర్ణమ్మగారు; తల్లాప్రగడ

విశ్వసుందరమ్మగారు; జానకీపురుషోత్తముగారు; మల్లిమడుగుల సీతాబాయమ్మగారు; న్యాయాపతి వేంకట విజయలక్ష్మమ్మగారు; సుబ్బలక్ష్మమ్మగారు; పెద్దాడ కామేశ్వరమ్మగారు; పులవర్తి కమలావతీదేవిగారు మొదలగు వనితామణుల వ్యాసములకు చోటిచ్చి ఆంధ్రస్త్రీజనమునకు అమితగౌరవము నాపాదించిన సమదర్శినీసంపాదకులు చూచి స్త్రీలు తలవంచుకొనకుండ నుండజాలని జుగుప్సాకరమగు చిత్రముతో సంచికను కలుషితము చేసినవిషయము గృహలక్ష్మి గర్హింపకుండ నుండజాలదు. ఈ సంచికలో పెద్దలవ్యాసములు పెక్కులు కనుపించుచున్నవి. అయినను ఇది సమదర్శిని శుక్లసంవత్సరాది సంచికయంత ఉత్కృష్టముగా లేదని చెప్పవలసివచ్చినందులకు చింతిల్లుచున్నాము. సంచిక ఆకృతి ఆకర్షణీయముగను, ముద్రణము ముచ్చటగను ఉన్నది. సంచికమూల్యము సమదర్శిని చందాదారులకు 1-0-0; ఇతరులకు 1-4-0 ఎవరికైనను పోస్టుఖర్చులు 0-7-0 ప్రత్యేకము. వలయువారు సమదర్శినీసంపాదకులపేర వ్రాయవలెను.

## ప్రారంభ విద్య సంచిక:—

'ప్రారంభవిద్య' కు వేంకటరామ్ అండుకో ప్రొప్రయిటరగు ఈదర వేంకటరావు పంతులుగారు వ్యవస్థాపకులు; కొంతకాలము నరసాపురము టెయిలరు హైస్కూలునందు ఉపాధ్యాయులుగ పనిచేసియు, అనంతరము స్కూల్సుడిప్యూటి ఇన్స్పెక్టరుగను పనిచేయుచు విద్యాశాఖయందు మంచిపేరు సంపాదించుచున్న కొప్పర్తి నారాయణమూర్తిగారు సంపాదకులు. విద్యాప్రపంచక సంచలనముతో నించుక పరిచయము నుపాధ్యాయులకు గల్గించుటయు, ఎప్పటికప్పుడు బోధనావిషయముల రచింపబడుచుండు నూతనపథంబుల నుపాధ్యాయులకు చూపుటయు ఉపాధ్యాయులు ఒండొరుల యభిప్రాయముల వెలిబుచ్చ నవకాశము నొసంగుటయు ప్రారంభవిద్య ప్రధానోద్దేశ్యములు. ఈసంచికయందు ఆయుద్దేశ్యములన్నియు సమకూడినవని చెప్పవచ్చును. విద్యాధికులయు, విద్యాశాఖాధికారులయు, విద్యాపోషకులగు జమీందారులయు ఛాయాచిత్రములు సంచికయందు విరళముగనున్నవి. విద్యావిషయికములగు పెక్కు వ్యాసములతో విలసిల్లుచున్నది. వలయువారు ఏలూరునందలి వేంకటరామ్ అండు కో వారికి వ్రాసి తెప్పించుకొనవలెను.

# గ్రంథస్వీకారము

1. ద్రౌపదీవస్త్రసంరక్షణము—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు; 2. సత్యాద్రౌపది సంవాదము—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు; 3. శారదాబిల్లు—పులికొండ పరబ్రహ్మముగారు; 4. ఉషాపరిణయనాటకమ్—బ్రహ్మశ్రీ గుండు రామస్వామిశాస్త్రి 5. శ్రీరామదండకము—గుండు లక్ష్మణశాస్త్రిగారు; 6. ఋణబాధ—గుండు. లక్ష్మణశాస్త్రిగారు; 7. శ్రీరామపాదుకాపాలనము—గుండు లక్ష్మణశాస్త్రిగారు; 8 జడగంటలు—చెలికాని సత్యనారాయణగారు; 9. చక్రపాణి—చెలికాని సత్యనారాయణగారు; 10. వసుమతి—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు; 11. స్త్రీలవ్రత కథలు, 1, 2, 3 భాగములు—బాలాంత్రపు వేంకటరావుగారు: ఈగ్రంథములను వందనములతో నందుకొంటిమి. కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

# డైరి

ఏప్రియలు 20:—లండనులోనున్న సెయింటుథామస్ ఆస్పత్రికి హంఫ్రస్టనుసతి 10,0000 పౌనులను విరాళ మొసగెను.

21:—శ్రీమతి టంగుటూరి ప్రకాశముసతిగారి యాజమాన్యమునను, శ్రీమతి గుమ్మడిదల దుర్గాబా యమ్మగారి యుద్యోధమునను చెన్నపురమున లవణశాసనోల్లంఘనమును దాదాపు రెండు వందలమంది అబలలు జయప్రదముగ సలిపిరి.

22:—భూపాలు బేగముగారు ఆలిఘరు ముస్లిము విశ్వవిద్యాలయమునకు ఛాన్సెలరుగా తిరిగ ఎన్నుకొనబడిరి.

23:—శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు కాకినాడయందొక బహిరంగసభలో ఉపన్యసించుచు సత్యాగ్రహమున పాల్గొనక ఇంటకూర్చుండు పురుషులకు గాజులు చూపెట్టినారు.

24:—మద్రాసు శాసనసభవా రంగీకరించిన పడుపుటిండ్ల నిర్మూలనచట్టము రాజప్రతినిధి ఆమోదమునందినట్లు ప్రకటింపబడినది.

25:—మద్రాసు హైకోర్టుబీచివద్ద శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు పోలీసువారి దౌర్జన్యమునకు గురియయ్యెను.

26:—

27:—మచిలీపట్టణమున నొక బహిరంగసభలో కొర్రపాటి అంకమ్మగారు సత్యాగ్రహమొనరించి తాను తెచ్చిన ఉప్పుపొట్లమును వేలము వేయగా ఒకటి కోకా అహోబలరావునాయుడుగారు రు 161 లకునుని రెండవదానిని, ఖానిపూడి ప్రకాశరావుగారు రు 25 లకును కొనిరి.

28:—ఘూర్జరదేశమునందలి స్త్రీలలో ప్రముఖురాండ్రు చాలమంది సంతకములుచేసి సత్యాగ్రహోద్యమమునుగూర్చి రాజప్రతినిధికి లేఖపంపిరి.

29:—

30:—మొగలాయి చక్రవర్తులలో కడపటివాడగు కీ. శే. బహదూరుషావారి మనుమరాలగు రువాక్ జనూనిబీగము తన ఎనుబదియవయేట రంగూనునగరమున స్వగృహమున చనిపోయెను.

మే 1:—బికనీరు రాజకుమారికిని కోటాసంస్థాన యువరాజునకును జరిగిన వివాహమహోత్సవసందర్భమున వేలకొలది బీదలకు అన్నదానము గావింపబడెను.

2:—వంగరాష్ట్రమున జెస్సోరులో ఘరానా కుటుంబములకు చెందిన స్త్రీలు 144–వ సెక్షను ఉల్లంఘించిరి.

3:—మేడం క్లాడురివరీ గారను పరాసుదేశపునారీమణి మహాత్ముని సందర్శించెను.

పిఠాపురం మహారాణిగారు బొంబాయినుండి "వైసేరాయి ఆఫ్ ఇండియా" అను స్టీమరుపయి ఇంగ్లండునకు ప్రయాణమయి వెళ్లిరి.

4:—గాంధిమహాత్ముడు నిద్రపోవుచుండగా అర్ధరాత్రి కరాడిలో అతనిని అరెస్టుచేసిరి.

5:—కరాడీనుండి వలంటీరులు మహాత్ముని నిర్బంధవార్త తెలియజేయుటకు పోవుసరికి శ్రీమతి కస్తూరిబాయిగారును, స్త్రీవలంటీరులును ప్రార్థనలుసలుపుచుండిరి. ప్రార్థనలు ముగియగానే

ఈ వార్త మాతాజీకి తెలుపబడెను. 'ఇది అనుకొనినసంగతే. దీనిలో నాశ్చర్యమేమున్నది?' అనిపలికి ఆమె నిత్యకృత్యములను సలుపసాగెను.

6:—విదేశవస్త్ర విక్రయశాలలవద్ద అలహాబాదులో స్త్రీలు పిక్కెటింగు అత్యద్భుతముగా చేయుచున్నారు. ఉమానెహ్రూసతి విదేశవస్త్రములను కొనుటకై వచ్చువారికి అత్యద్భుతముగా హితబోధ గరపుచున్నది. ఆంగ్లోయిండియను దంపతులిద్దరు యీమెయుపదేశములను విని స్వదేశవస్త్రములనే కొని స్వదేశదీక్షనే గైకొనిరి. ఒకపెండ్లికుమారుడు విదేశవస్త్రములను కొనుటకైవచ్చెను. చివరకు స్వదేశవస్త్రములనే కొనుక్కొనివెళ్లెను. ఒక చనిపోయినమనిషికి ఉత్తరక్రియలను చేయుటకై పోవుచున్న యొకస్త్రీ, విదేశవస్త్రములను ధరించిపోవుచుండెను. విచారములోనున్న ఆస్త్రీచేతకూడ స్వదేశవస్త్రమునే ధరింపజేసి ఆమె విదేశవస్త్రమును బజారు మధ్య తగులబెట్టిరి. మరణించిన ఒకనికి దహనసంస్కారములు జరుగు సమయమున పాడెను జాతీయపతాకములతో అలంకరించి గొంపోయిరి.

7:—మిస్. ఏమీ జాన్సను అను 22 ఏండ్ల వయసుగల యువతి యసహాయయయి యింగ్లండు నుండి ఆస్ట్రేలియాకు విమానయానము చేయుట కుత్సహించి బయలుదేరి ఆసియా మైనరు చేరెను.

8:—మహాత్మాగాంధిగారి నిర్బంధమునకు తమ అసమ్మతిని తెలుపుచు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు తమ మద్రాసు శాసనసభా సభ్యత్వమునకు రాజీనామానిచ్చిరి.

ప్రభుత్వమువారు అవలంబించుచున్న నిర్బంధవిధానమును ఖండించుచు జీవరాజు మెహతాగారి భార్య హంస్యమెహతాగారు బొంబాయియందలి తమగౌరవ మాజిస్ట్రేటుపదవికి రాజీనామానిచ్చిరి.

9:—ప్రభుత్వమువారి కఠిననీతిని నిరసించుచు శ్రీమతి లక్ష్మణరావుసతిగారు తిరునల్వేలిలో తమ గౌరవన్యాయాధికారిణి పదవిని త్యజించిరి.

10:—రాజా సర్ అన్నామలైయిగారు సిమ్లాలోని లేడీ ఇర్విను బాలికాపాఠశాలకు పదివేల రూపాయిలు విరాళమొసగిరి.

11:—ఈరోజునందు జరిగిన ఆత్మగౌరవ సమావేశముతోబాటు నడచిన స్త్రీజనసభకు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షత వహించిరి.

12:—స్త్రీలకు నూలువడకుటను నేర్పుటకు ఎగ్మూరునందలి భారతమహిళాసంఘమువారు వేసంగి పాఠశాలను తెఱచిరి.

13:—

14:—శ్రీమతి రుక్మిణిలక్ష్మీపతిగారు వేదారణ్యములో ఎరెస్టుగావింపబడిరి.

15:—శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారిని వెల్లూరులోనిస్త్రీల జెయిసాలకు తీసికొనివెళ్లిరి.

దర్శన ఉప్పుకొఠారుపై దాడి శ్రీమతి సరోజనీదేవిగారి యాజమాన్యమున ప్రారంభమయ్యెను.

16:—బొంబాయిలో కమలాదేవి ఛట్టోపాధ్యాయిని అరెస్టుచేసిరి.

17:—మున్షిగంజిలోని దేవాలయప్రవేశ సత్యాగ్రహము స్త్రీలు కలుగచేసికొని నెఱవేర్చిరి.

18:—సర్. బి. యన్. మిత్రగారి భార్య బెంగుళూరున మృతినొందెను.



మహాత్ముడు నిర్బంధింపబడినాడు:—

మార్చి 12_వ తేదీని మహాత్ముని స్వరాజ్యప్రస్థానము ప్రారంభమయినది. ప్రభుత్వమువారు అప్పుడు ఆతని నిరోధింపలేదు. ఏప్రియలు 6_వ తేదీని ఆతడు లవణశాసన ధిక్కారము చేసెను. అప్పుడును ఆతడు అరెస్టుకాబడలేదు. అప్పటినుండి ఆతడు శాసన ధిక్కారమును చేయుచునేయుండెను. ఇతరతావుల నెట్లుండినను పోలీసువారు ఆతని గాలిసోకినంతదూరమును పచ్చకర్పూరమై యుండిరి. ప్రభుత్వమువారు మహాత్ముని అనుచరులను బందీకృతులను చేయుచుండిరేగాని ఆతనిని తాకలేదు. ఉద్యమము విజృంభించెను. తుదకు మేనెల 4_వ తేదీని మహాత్మునికూడ పట్టుకొనిరి. అర్ధరాత్రి ఎరెస్టు. విచారణలేని దండన. గడువులేని శిక్ష. వ్రతభంగమగునట్లు మౌనదినమునను, నిద్రాభంగమగునట్లు అర్ధరాత్రియందును అరెస్టుచేసి పౌరసత్వముభంగమగునట్లు విచారణలేనిదండన విధించినను మహాత్ముని శిక్షకు గడువులేదనుటలో ఎప్పుడుపడిన అప్పుడు ప్రభుత్వమువారు శాంతి కోరవచ్చునను ఆశాకిరణము ద్యోతకమగుచున్నది. శ్రీ ఇర్విను ప్రభువర్యుని మంచితనమెఱిగిన భారతీయులకు ఈ ఆశాకిరణము ప్రకాశఫలము నీయగలదని తోచకమానదు.

ప్రకృతి సంక్షుభితమైనది:—

మహాత్ముని నిర్బంధముతోబాటు ప్రజాహృదయమును కలగుండుపెట్టిన సంఘటనములు కొన్ని మేమొదటివారమున సంభవించినవి, బర్మాలో భయంకరమైన భూకంపము. విశేషమగు ప్రజానాశనము. మేడలు మట్టమైనవి; ఇండ్లుగూలినవి; వంతెనలు కూలినది; రైళ్లు ధ్వంసమయినవి. విఖ్యాతిగాంచిన శ్వేదగాన్ పగోడా శిఖరము పగిలినది. పెగూ సర్వనాశనమైనది. ముప్పదివేలమందికి ఇండ్లుపోయెను. వేయిమంది చనిపోయిరి. కారాగారము కూలి ఖైదీలు పారిపోయిరి. సింహళద్వీపమున అతివృష్టిబాధ. కెలాలీనది పొంగి చాలప్రదేశములను పచ్చముపాడొనరించినది. పారసీకములో భూకంపము సంభవించినది.

చాల ఇండ్లు కూలినవి. ఇది 5—వ తేదీ మధ్యాహ్నము జరిగెను. ఆరాత్రి ఇంతకంటె తీవ్రతరమైన భూకంపము వచ్చినది. రెండు వేలమంది ప్రజలకు నష్టముకలిగినది. శాస్త్ర పరిశోధనచే ప్రకృతిని జయించితినని గర్వముతోపలుకు మానవుడు ఆదిభౌతికములగు నిట్టి అల్లరులు సంప్రాప్తమైన అవసరమున తప్పక తన అల్పత్వమును, నిస్సహాయతను గ్రహింపగలుగును.

ఎంత అవమానకరమైన విషయము?:—

అమృతసరమున జరిగిన క్రిందివిషయము ఎంత అవమానకరమైనది? అచ్చటి సత్యాగ్రహ సమరసంఘమువారి ప్రచురణశాఖాధికారి ఇట్లు ప్రచురించుచున్నాడు. "జలియనువాలాబాగులో కాంగ్రెసువాలంటీరగు నొకస్త్రీయెదుట ఒకనాటిరాత్రి పోలీసుకాని స్టేబులు ఒకడు బట్టలను విప్పుకొని దిసమొలవాడై నిలువబడెను," ఇది నిజమేయగునా? నిజమే అయినచో నాతడు మానవత్వమును మరచినాడని చెప్పుటకు సందేహింపవలసిన పనిలేదు. ఆంగ్లేయులు స్త్రీని దేవీస్వరూపమున గొలుచుమాన్యులు; కావున ఆంగ్లప్రభువులు తమ పరిపాలనమున ఇకముందు అట్టివి జరుగకుండ జాగ్రత్తచేయుదురని నమ్ముచున్నాము.

"ఎంత తపంబు చేసి జనియించినదో?":—

మహాత్ముని ఆజ్ఞప్తినందుకొని ఈతచెట్లు విరివిగ నరకబడుచున్నవి. విఠలబాయియు చెట్లు నరక ప్రారంభించెను. ఈ ఉత్కృష్టకార్యములో ఆత్మార్పణముగావించు నదృష్టము ఆతనికి కలిగెను. చెట్టును నరకుటలో తగిలిన దెబ్బవలన విఠలభాయి దివంగతుడయ్యెను. ఈ కీర్తికాయుని జన్మస్థలమగు అంబెటీకి (బార్డోలీతాలూకాలోనిది) వెళ్లినప్పుడు మహాత్ముడు భార్యాసమేతుడై విఠలభాయి తల్లిని, భార్యను చూచుటకు ఆతని యింటికి బోయెను. విఠలభాయి తల్లియు, భార్యయు మహాత్ముని ఎదుర్కొనిరి. "అమ్మా! మేము మిమ్ముల పరామర్శించుటకు రాలేదు. ప్రశంసించుటకు వచ్చితిమి. మీరు ధన్యలు. విఠలభాయికి ఉత్తమమగు వీరమరణము సంప్రాప్తమైనది. అతడు ఇపుడు వీరస్వర్గము నలంకరించుచున్నాడు." అని మహాత్ముడు వారితోననెను. దానికి విఠలభాయితల్లి 'ఆతనికి వీరస్వర్గము లభించుటకు మీ అనుగ్రహమే కారణము' అని పలికెను. ఎంతటి వెలలేనిపలుకు? కన్నకొడుకును దేశహితమునకై గోల్పోవుటకును, మహాత్మునిచే సందర్శింపబడుటకును ఆమె ప్రాగ్జన్మంబున ఎంతతపంబుచేసి జన్మించినదో?

కీర్తిశేషురాలు భూపాలుబేగము:—

ఆధునికయుగమున సంస్థానాధికారమును వహించి సమర్థతతో పరిపాలించు హైందవస్త్రీల ప్రజ్ఞాదక్షతలు ప్రకటపరచుచున్నవారిలో భూపాలుబేగము ఎన్నతగిన మహిళ. ప్రఖ్యాతపురుషుడగు దాన్ మహమ్మదువంశమున జనించి భూపాలుసంస్థానమును పరిపాలించిన స్త్రీరత్నములలో ఈమె మూడవయామె. హైందవస్త్రీజనాభివృద్ధికై ఈమె ఎక్కువగ కృషిచేసినది. కావుననే ఈమె ఢిల్లీలోజరిగిన అఖిలభారత స్త్రీజనసభయొక్క ద్వితీయసమావేశమునకు అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది. బేగమువారికి విద్యావిషయములందు అభినివేశము మెండు. కావుననే ఈమె ఆలిఘరు ముస్లిము విశ్వవిద్యాలయమునకు ఛాన్సెలరుగా ఎన్నుకొనబడినది. ఆపదవికి తిరిగి ఈమె ఎన్నుకొనబడి ఎన్నియో దినములు కాలేదు. ఇంతలో నామెకు మరణము తోసికొనివచ్చినది; భారత స్త్రీజనోద్యమాభివృద్ధికి ఒకగొప్ప దెబ్బతగిలినది. ఈమె పవిత్రాత్మకు పరమేశ్వరుడు శాంతిని ప్రసాదించునుగాక!

ఘోషాదురాచారమునకు తుదిచీటి:—

ప్రస్తుత సత్యాగ్రహామువలన స్వరాజ్యము వచ్చునోరాదో కాని అందువలన ఘోషాదురాచారముమాత్రము సమసిపోవుచున్నది. చూడుడు. విద్యార్థుల బహిరంగ సభలో డాక్టరు ఆలమ్‌సతి ఇట్లు ఉపన్యసించెను. "నేను నలుబదిరెండుసంవత్సరములుగ పరదాలోనుంటిని. ఇప్పుడు నాభర్తగారు దేశసేవచేయుచున్నందుకై సర్కారువారిచే నిర్బంధితులైరి. వారిస్థానము నాక్రమించి దేశసేవచేయుటకై నలుబదిరెండువత్సరములుగ నాకు ప్రాపడియున్న పరదాను పారవేయుచున్నాను." ఒక్క ఆలముసతియే గాదు. దేశమున ఎందఱోస్త్రీలు ప్రస్తుతావసరమున పరదాను విడిచిపుచ్చుచున్నారు. పరదాస్త్రీలు గ్రామములవెంట తిరిగి ఉద్యమప్రచారమును చేయుచున్నారు. ఈ ఉద్యమము హిందూదేశమున ఘోషాదురాచారమునకు తుదిచీటి గానివచ్చినది.

డాక్టరు ఆలమ్‌సతి ప్రజ్ఞ:—

నలుబదిరెండు సంవత్సరములుగ అవలంబింపబడుచున్న పరదాను పెరకివైచి విద్యార్థిసభలో ఉపన్యసించిన డాక్టరు ఆలమ్‌సతి తనప్రజ్ఞ ఉట్టిపడునట్లు తుదినిట్లు పలికినది. "నేను నా పుత్రులను, పుత్రికలను ఈ సత్యాగ్రహాసమరమున పనిచేయుడని చెప్పుటకు సంసిద్ధురాలనైయుంటిని. అయితే వారికట్లు చెప్పుటకుముందుగనే నేను సమరమున

దిగుట తగినపనియని ఈదినమే నేను వలంటీయరునగుచున్నాను." ఆ ప్రజ్ఞావతి నుడివిన ఈ వాక్యములను వినుటతోడనే సభలోని విద్యార్థులు నూర్గురు స్వచ్ఛంద సేవకులుగ చేరిరి. ఏకార్యమైనను స్వయముగ చేయుటలోను, చెప్పి ఇతురులచే దానిని చేయించుటలోను హిందూసుందరీమణులకుగల నేర్పుప్రస్తుతసత్యాగ్రహసమరములో డాక్టరు ఆలమ్‌సతివంటి స్త్రీరత్నములవలన ప్రస్ఫుటమగుచున్నది.

స్త్రీలు పురుషులకంటె ఉదారహృదయులు:—

బొంబాయినగరమున శ్రీమతి హంసమెహతాదేవి సత్యాగ్రహలవణమును ఒక యూరపియనుస్త్రీకి అమ్మెను. ఆ యూరపియనుస్త్రీ ఆ ఉప్పుపొట్లమును చేతితోపట్టెను. దారినిపోవుచుండిన యూరపియను పురుషుడు అదిచూచి ఆగ్రహించి యూరపియనుస్త్రీ చేతినుండి ఉప్పుపొట్లమును ఊడలాగుకొని దానిని అమ్మిన శ్రీమతి హంసమెహతాదేవి మీదకు గిరవాటువేసెను. స్త్రీ గ్రహించినది; పురుషుడు ఆగ్రహించినాడు. స్త్రీలు పురుషులకంటె ఉదారహృదయులుకదా! అవును. చూడుడు. ఉద్యోగపదవి లేనంత కాలమును హిందూదేశ సమస్యలపట్ల సుముఖముగా నుండిన లేబరు పక్షమువారు మంత్రాంగము నిర్వహించుచు హిందూదేశమునందలి నిర్బంధ విధానమును నిరసింపకున్నారు. పురుషులగు కాబినేటు మంత్రులు నిరసింపకున్నారు. కాని కాబినేటు మంత్రులలో నొకరగు గ్రాహాము వాలసుగాల భార్య శాంతికోరుడని బాహాటముగచాటుచున్నది.

డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డి రాజీనామా:—

మహాత్మగాంధిని కొద్దిరోజులకు పట్టుకొందురనగా ఢిల్లీ అసంబ్లీ ప్రెసిడెంటు శ్రీ వి. జె. పటేలు తనపదవికి రాజీనామా నిచ్చినాడు. మహాత్మగాంధిని పట్టుకొనిరనగా మదరాసు కౌన్సిలు డిప్యూటీ ప్రెసిడెంటు శ్రీ ముత్తులక్ష్మిరెడ్డి తనపదవికి రాజీనామా నిచ్చినది. ఆమెకు మాధన్యవాదములు. కాంగ్రెసు పక్షమున ఎన్నికకు నిలచి, కౌన్సిలునందు కాంగ్రెసు పక్షమునకు నాయకుడై, కాంగ్రెసు పక్షబలమున మద్రాసు కౌన్సిలు ప్రెసిడెంటుపదవినందిన శ్రీ నరసింహరాజుగారు కాంగ్రెసు కోరినను, మహాత్ముడు బంధీకృతుడైనను రాజీనామానీయకయుండగా నారియయ్యు, నామినేటెడు మెంబరు అయ్యు ముత్తులక్ష్మిరెడ్డిగారు రాజీనామానిచ్చినందుకు స్త్రీలోకము గర్వింపక మానదు. అయితే ఈగర్వముతో ఒక్కింత విషాదచ్ఛాయలుకూడ అలముకొనక మానవు. ఏమందురా? ఆమె తన నిరంతరాందోళనము మూలమున శాసనసభవారి దృష్టి ఎన్నియో

దురాచారములపై పుతిప్పినది. దేవదాసిచట్టము; పడుపువృత్తి నిర్మూలనచట్టము; పాఠశాలలయందును కళాశాలల యందును విద్యార్థులకు వైద్యపరీక్ష; ఆరోగ్యశాఖాధికారిణి నియామకము—ఇవి ఆమె శాసనసభామూలమున మద్రాసు రాజధానికి ప్రసాదించిన దివ్యఫలములలో ముఖ్యమైనవి. కౌన్సిలు మూలమున ఇట్టి దివ్యఫలములను ప్రసాదించిన తరుణీమణి కౌన్సిలు రంగముననుండి విరమించినదనగా విషాదము పొందకుండు వారెవరు? ఆమె మద్రాసు శాసనసభకు ఉపాధ్యక్షపదవికి ఎన్నికొనబడుట సమగ్రభారత మహిళాలోకమునకు అపూర్వగౌరవముగా సంతోషించితిమి. నూటఇరువదిమంది సభ్యులుగల కౌన్సిలులో ఒక్కగానొక్క స్త్రీ. ఏ సభ్యుడును చేయుచాలనంత పని నిర్వహించినది. శాసనసభలో ఎంతటి నిశ్చితబుద్ధిని చూపినదో శాసనసభను విడిచివచ్చుటలోకూడ అంతకంటె ఎక్కువ నిశ్చితబుద్ధి చూపినది. చూడుడు. ఆమెరాజీనామాలేఖలో ఏమి వ్రాసినదో! "ఆత్మగౌరవముగల స్త్రీ పురుషులు కార్యతత్పరులగుటకు మంచి తరుణమాసన్నమైనది. ప్రజలకొరకు పాటుబడి అష్టకష్టములు బడుచున్న మహాత్మునివంటి ఉత్తమశ్లోకుడు, ఔదార్యవంతుడు, పవిత్రస్వరూపుడు బంధిఖానాలోనుండగా మనమందరము కడుపులో చల్లయిన కదలకుండగ మహారాజులవలె సుఖానురక్తులమై యింటియొద్ద కూర్చొని యుండవలసిన దేనా? ఇప్పుడు భారతవర్షము అగ్నిదీక్షలో నున్నది. అట్టి సమయమునందు మనమందరమును మతభేదభావములను కట్టిపెట్టి ఏకమై పాటుపడుట యవసరము. మనకు వెంటనే ప్రభుత్వము అధినివేశస్వాతంత్ర్యము ప్రసాదించి తీరవలయును." కాంగ్రెసు పక్షమున కౌన్సిలునందు ప్రవేశించియు ఇంకను కౌన్సిలు చూరును పట్టుకొని వ్రేలాడుచున్న సర్వోత్తము లికనైన నామినేటెడు మెంబరగు ఈ నారీమణి అడుగుజాడల నడతురుగాక!

"ఔర! యాక్కోకతటిం బుప్పుంబోండ్లు కటారికత్తియల్ ":-

తొమ్మిదిమాసములుగ సాగుచున్నది. అధికారులు అంత్యజులను లోపలకు రానీయరు. వచ్చిన దేవాలయములు పాడగునని వారిమతము. పోకమానమని ప్రజల పట్టు. పరిస్థితులు విషమించినవి. యువకసంఘసభ్యులు అయిదుగురు నిరశనవ్రతము ప్రారంభించిరి. అరువదిగంటలకాలము పరిభ్రమించిపోయెను. అయినను దేవాలయాధికారులకు కరుణ పుట్టలేదు. ఆలయములోని విగ్రహములవలె ఆలయాధికారులుకూడ పాషాణములై యుండిరి. ఉన్నతకుటుంబములకు చెందిన స్త్రీలీవిషయమును గమనించిరి. వారియందు నిక్షిప్తమైయుండిన శక్తిస్వరూపము ఒకసారి ఎసరేగెను. రెండువందలమంది బయలుదేరిరి.

అంపములు, గొడ్డళ్లు, సమ్మెటలు దాల్చిరి. కోసి, కొట్టి, బాది తలుపులు తెఱచిరి. చూడ వచ్చిన రెండువేలజనము, లోనికరుగ ఇన్నాళ్లనుండిన సత్యాగ్రహము పూనియుండినప్రజలు, తలుపులు బ్రద్దలుకొట్టిన తరుణీమణులు జయజయధ్వానములతో ఆలయమున ప్రవేశించి దైవప్రార్థన గావించిరి. మరి అప్పుడు ఆలయాధికారుల పికరులేను. రెండువందల అరువదియొక్క దినములుగా జరుగుచున్న సత్యాగ్రహము రెండువందలమంది కటారికత్తియల సాహసమున రెండుగడియలలో తుదముట్టెను. స్త్రీసాహస మిట్టిది.

శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు:—

తూర్పుకృష్ణ, పశ్చిమకృష్ణ, పశ్చిమగోదావరి జిల్లాలయందు కమ్మవారు విశేషముగ సత్యాగ్రహసమరమున బ్రవేశించుచున్నారు. ఏప్రియలు నెల 30–వ తేదీని పశ్చిమగోదావరిజిల్లా ఏలూరునుండి కొందరు స్త్రీ పురుషులు మట్లపాలెమునకు లవణశాసనధిక్కార మొనరించుటకు బయలువెడలిరి. వారిలో సంఘసంస్కారణాభిలాషులును, దేశభక్తులునగు మూల్పూరి రంగయ్య దంపతులుగూడ యుండిరని వ్రాయుటకు మిగుల సంతస మగుచున్నది. వీరు కమ్మవంశజులు. వీరిరువురి జన్మస్థానమును ఏలూరునకు 6 మైళ్ల దూరముననున్న పెదపాడను గ్రామము. రంగయ్యగారి ధర్మపత్ని పవిత్రనామము చుక్కమ్మగారు. ఈమె బాల్యముననే వైధవ్యమొందినది. సంస్కారణాభిలాషులగు రంగయ్యగారీమెను 1912–వ సంవత్సరమున పునరుద్వాహమాడిరి. పిమ్మట రంగయ్యగారు ఆంగ్లేయవైద్యశాస్త్ర మభ్యసించి, తదాచరణమునకై ఏలూరు పట్టణమున నివాస మేర్పఱచుకొనిరి. గాంధిమహాత్ము డసహాయోద్యమ మారంభించిన నాటినుండియు, ఈదంపతు లిరువురును, ఖద్దరు వస్త్రధారులై దేశమున కుచితరీతిని సేవ



శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు

జేయుచుండిరి. లోకమున భార్యా త్యాగము గలదైన భర్తలోభియగుటయు, భర్తత్యాగియైన భార్యలోభియగుటయు సాంప్రదాయము. అట్లుగాక ఈ దంపతులిరువురును త్యాగమూర్తులగుట కడుంగడు మోదావహము. చుక్కమ్మగారు తమకుగల యాస్తి నంతయు దేశమున కీయ సంకల్పించి యిదివరలో రు. 3000 రూప్యములను ఆనంద నికేతనము, అన్నపూర్ణాదేవి బాలికాపాఠశాల శారదానికేతనము లను ధర్మసంస్థలకు, దానమొసగి కోడినారీలోకమున కాదర్శప్రాయులైరి. "ఇచ్చువారి హస్తమీయ జూచుచునుండు'' నన్నట్లు నేడు మరల ఈమె శ్రీయుతులు దండునారాయణరాజు, తల్లాప్రగడ నరసింహశర్మ, కొత్త సూర్యనారాయణ, మూల్పూరి రంగయ్యగార్లను ధర్మకర్తలుగ నియమించి స్త్రీ విద్యాభివృద్ధి, నిమ్నజాత్యుద్ధరణము, కమ్మబాలవితంతువుల పునరుద్వాహములకై రు. 4000 రూపాయల ధర్మముగ నొసంగి, ఇందుపై వచ్చువడ్డీతో శాశ్వతధర్మము జరుగునటుల గావించి ధన్యమైనది. రంగయ్యగారు తమ వైద్యవృత్తిని వదలి, కొందరు యువకులతో సత్యాగ్రహ మొనరింప జనిరి. చుక్కమ్మగారు భర్తృపథగామినియై సోదరీమణులు కొందరతోగలసి తానుగూడ సత్యాగ్రహోద్యమమున చేరినది.

ఇక నిట్టి ధర్మచ్యుతి కలుగరాదు:—

ఏప్రియలు 15-వ తేదీని కలకత్తాలోని భవానిపురమున రస్సారస్తాలో జరిగిన గలభాలో ఐరోపియను కన్య శ్రీమతి డెంచిగారికి దెబ్బలుతగిలినవి. ఆమె కోర్టులో ఇట్లు చెప్పినది. "మోటారుసైకిలుమీద సరోవరతీరమునకు షికారుపోయి ఉదయము ఏడుగంటలప్పుడు తిరిగి రస్సారోడ్డు మార్గమున పట్టణములోనికి వచ్చుచుంటిని. ఆరస్తాలో ఒకచోట కొంతమంది వంగయువకులును పంజాబీయులును గుమిగూడియుండిరి. నేను సమీపమునకు వచ్చుటతోడనే వారిలోకొందఱు చప్పట్లు కొట్టిరి; కొందరు నాపై రాళ్లువిసరిరి. రాళ్లు నా సైకిలుచక్రములకు తగిలినవి. నేను పోవుచునేయుంటిని. ఆగుమని ఒకరిద్దరు బెంగాలీయువకులు చేతులుచాపిరి. ప్రజాసమూహము గలభాగానుండుటచే నేను ఆగక ఎక్కువ వేగమున పోవ ప్రారంభించితిని. ఎదుట ట్రాముకారు నిలిచియుండుటచూచి ఎడమప్రైపునకు ఒత్తిగిలి పోవుచుంటిని. ఇంతలో ఒకరాయివచ్చి నాగుండెపై తగిలెను. మఱియొక పెద్దరాయివచ్చిపడి నాకుడిచేతిని గాయపఱచెను. సైకిలు మీదనుండి పడిపోయితిని. నేను లేచిచూచుసరికి నాసైకిలు తగిలి కాబోలు సమీపమున ఒకడుపడియుండెను. ప్రాణరక్షణార్థము నేను పరుగువెట్ట నారంభించితిని. నావెనువెంట ఒక

ఒక బెంగాళీయువకుడు పరుగెత్తుకొనివచ్చి పడిపోయిన నామనీపర్సునిచ్చెను. ఇంతలో కొంతమంది ఐరోపియనులు నాకడకువచ్చి వారి కారులో నన్ను ఆస్పత్రికి గొనిపోయిరి." పుణ్యభూమియగు ఆర్యావర్తమున ఇంతటి అధర్మకార్యము జరుగుట నిజముగా అవమానకరము. సత్యాగ్రహోద్యమమునకును దీనికిని సంబంధములేదని మేమంగీకరింతుము. అయినను ఇట్టి ధర్మచ్యుతి ఇక కలుగరాదు. పరుగెత్తుకొనిపోయి పడిపోయిన ఆమె మనీపర్సు ఆమెకిచ్చివేసిన ఆయువకుని ధార్మికబుద్ధి ఎల్లర నావేశించుగాక!

" అ ది య ల ం కృ తి క ం టె ర మ్య ం బు గా దె ? "

కాకినాడలో అహింసాపరులు సభచేసినారు. ఇది పట్టనివాళ్లెవరో రాళ్లువిసరినారు. సభాధిపతులు ఆరాళ్లను వేలముపాడినారు. శ్రీమతి మంత్రిప్రగడ బంగారమ్మ అను పుణ్యస్త్రీ ఒకరాతిని వేలముపాడెను. అయితే ఆమె కడుపేదరాలు. రాతిమూల్యము నిచ్చుటకు ఆమెదగ్గిర ఏగానియైనను లేదు. కావున ఆమె తనమెడలో వ్రేలాడుచున్న ఒక్కటేవస్తువు పుస్తెబొందును తీసి ఇచ్చెను. సభికులు చేష్టలుదక్కిరి. మంగళసూత్రము భారతమహిళకు దాంపత్యచిహ్నము. తెప్పపాటుకాలమైన నది తొలగియుండుటకు ఆమె అంగీకరింపదు. అగుటనేకదా చంద్రమతి తనకుమారుని లోహితాస్యుని దహనముచేయుటకు అనుజ్ఞకుగాను ఈయజాలని కాసుకుబదులుగా తన మంగళసూత్రమును పతిగానెఱుగబడినకాటికాపరి ఆజ్ఞాపించినను కూడ విడచుటకు ఒప్పుకొనకుండెను? అయితే ఇప్పుడట్టి ధర్మసూత్రములను తిరుగదోడి చూచుటకు తరుణముకాదు. జరుగుచున్న జాతీయమహాయజ్ఞమునకు త్యాగముచేయరానివస్తువ అనుచు నొకటుండరాదు. ఈయజ్ఞమునకు స్త్రీలు పతులనే పంపుచుండ దాంపత్యచిహ్నముమాత్రమే యగు మంగళసూత్రమును విడుచుటకు సందేహింతురా? సందేహింపరుగావుననే బంగారమ్మగారట్టి బంగారమువంటి పనియొనర్చెను. అప్పుడా మంగళసూత్రము అలంకృతికంటె రమ్యమైనదాయెను. రమ్యమేకాకుండెనేని అది తిరిగి వేలము వేయబడినప్పుడు ఉన్నబంగారముఖరీదుచొప్పున పదిహేనురూపాయలైన చేయనిదానిని నాలుగురెట్లుమూల్యమునకు ఎందుకుపాడుదురు? పాటదారు—చిరస్మరణీయుడు బులుసు సుబ్బారావు—మంగళసూత్రమును గొనివచ్చి సాష్టాంగనమస్కారములతో తిరిగి శ్రీమతి బంగారమ్మ కొసగెను. అపూర్వత్యాగముచే మెఱుగుబెట్టబడి దీప్తిపుంజములను వెదజల్లుచున్న ఆదివ్యమంగళసూత్రమును ధరించి ఆమానినీమణి సభికులచే 'అవ్వోలది మంగళసూత్ర మాహాత్మ్యమెట్టిదో? ' అనిపించెను

11

"భోజనపదార్థములు":—

'భోజనపదార్థములు' అను శీర్షికతో శ్రీయుత నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు (బి. యె.) వ్రాసిన విషయగర్భితమగు సుదీర్ఘవ్యాసములో గృహలక్ష్మి మార్చి, ఏప్రియలు సంచికలందు కొంతభాగమును, ఈమాసపుసంచికలో కొదువభాగమును ప్రచురించియున్నాము. భోజనపదార్థములను గూర్చి కూలంకషమగు నిట్టి వ్యాసము మాయెఱిగినంతవఱకు తెలుగుపత్రికలలో నింతవఱకు ప్రచురింపబడలేదు. భోజన పదార్థములను గూర్చిన జ్ఞానము గృహిణులకు ముఖ్యముగా కావలసియున్నది. ఏతద్విష యికమగు జ్ఞానమును వారియందు కలిగించుటకు సులభార్థబోధకమగు ఈవ్యాస మెంతయు సహకారికాగలదు. విపులపరిశోధన మొనర్చి అమూల్యమగు ఇట్టి యథోచిత వ్యాసమును గృహలక్ష్మికి అనుగ్రహించిన శ్రీయుత నిడమర్తి సత్యనారాయణమూర్తి (బి. యె) గారికి మాకృతజ్ఞత తెలుపుకొనుచు గృహిణీలోకమును ఈ వ్యాసమును బాగుగ చదివి తగినలాభమును పొంది ఇది వ్రాయుటలో వ్యాసకర్త పడిన శ్రమను సఫలపఱుపవలసినదని హెచ్చరించుచున్నాము.

అయినను బిసెంటమ్మను గౌరవింతుము:—

గాంధిని దూషించుచున్నది; ఆయన తలపెట్టిన ఉద్యమము నెడ దుమ్మెత్తిపోయు చున్నది. అయినను మేము ఆమెకు ముదిమివలన మతితప్పినదనువారితోగాని, ఆమె దివ్య జ్ఞానము సవ్యమార్గమునుండి జారిపోయిన దనువారితోగాని మాట కలుపజాలము. మేమింకను ఆమెను గౌరవించియేతీరుదుము. వ్యక్తిగతమైన అభిప్రాయమును నిర్భయ ముగ చాటుటకు ఎల్లరివలెనే ఆమెకును హక్కుగలదు. ప్రస్తుతోద్యమమునకు ఆమె ప్రతి గాక! ఒకప్పు డామె హోమురూలు ఉద్యమమునకు నియంత్రియై హిందూదేశమునకు అనంతమగు సేవచేసినది. దానికే ఆమెకు ఇప్పుడుకూడ మనము కృతజ్ఞులమైయుందము. చేసియున్నదానికి సంతోషించియు చేయుచున్నదానిని చింతింపకయు బిసెంటమ్మయెడ మనకుగల వెనుకటిగౌరవమును నిలుపుకొందము.

పూర్వాచారపరాయణులు గమనింతురా?:

ఇంతవఱకు ప్రకటితముకాని స్వామి వివేకానందులవారి ఉత్తరమొకటి ఈమా సపు 'ప్రబుద్ధభారత' పత్రిక లోకమునకు ప్రసాదించుచున్నది. శారదదాగారు ప్రత్యేక మొకచట్టమును నిర్మించి దేనిని నిర్మూలించుచున్నందుకు పూర్వాచారపరాయణులు తమ

పుట్టిమునిగినదని పురపుర బొక్కుచున్నారో అట్టి బాల్యవివాహాచారమును స్వామి వివేకానందులవారుకూడ నిట్లు స్పష్టముగ నిరసించుచున్నారు. "బాల్యవివాహములయెడ నాకు గాఢమగు అనిష్టతగలదు. బాల్యవివాహమునకు నేను బలియై బాధపడితిని. బాల్య వివాహాచారమను ఘోరపాతకమునకు మనజాతి ఫలము అనుభవింపుచున్నది. దీనిని నిర్మూలముచేయుట నా గాఢమైన ఆశయము." ఖండఖండాంతరములయందు హిందూ మతఖ్యాతిని శిఖరములనుదాటించిన చిరప్రతిష్ఠుడు స్వామిజీచెప్పిన వాక్యములను పూర్వాచారపరాయణులు గమనింతురా? స్వామిజీ మతప్రవక్తలు చెప్పినదానినైనను వినునంతటి వివేకము ఇకనైన వారికి గలుగునేమో గమనింతము.

స్త్రీ సత్యాగ్రహుల నిర్బంధము:—



శ్రీమతి సరోజనీదేవిగారు

స్త్రీ సత్యాగ్రహుల నిర్బంధములుకూడ ప్రారంభమైనవి. మద్రాసు యువజనసంఘాధ్యక్షురాలు, చెంగల్పట్టుబోర్డు మెంబరు మదరాసు సినేటుసభికురాలు అయిన శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ తమిళదేశమున వేదారణ్యక్షేత్రమునందు నిర్బంధింపబడి ఈ యుద్యమమున ప్రథమ స్త్రీనిర్బంధము ఆంధ్రస్త్రీకి కలుగునట్లుచేసినది. అఖిలభారతమహిళాసభకు కార్యదర్శిని, జనీవా స్త్రీవిద్యాసభకు భారతదేశప్రతినిధులుగా పోయి ఉన్నప్రజ్ఞావతి కమలాదేవి బొంబాయిలో నిర్బంధింపబడినది. కవయిత్రి కాంగ్రెసుసభాధిపత్యము వహించినకాంత, అబ్బాసుత్యాబ్జిగారి యనంతరము సత్యాగ్రహ నియంత్రి అయిన సరోజినిదేవి దర్శనలో నిర్బంధింపబడినది. సత్యాగ్రహమును సృష్టికి త్రికళలనదగిన ఈ మహిళామణులు మువ్వుర నిర్బంధమునకును అనంతరము మరి కొందరు స్త్రీలు నిర్బంధితులైరి.

# మేమాసపుచిత్రప్రశ్నకు సమాధానము.

ఈక్రింది చందానెంబరుగల చందాదారురాండ్రు మేమాసపు చిత్రప్రశ్నకు సరియగు సమాధానమిచ్చిరి.—260, 264, 336, 386, 579, 723, 808, 851, 857, 973, 1178, 1199, 1252.

# మేమాసపుయుక్తిలెక్కకు సమాధానము.

మేమాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి కమలమ్మగారి యుక్తిలెక్కకు మేముకోరినట్లు మేమాసము 10-వ తేదీలోపున సరియగు ప్రత్యుత్తరంబొసంగిన గృహలక్ష్మి పాఠకుల నామములు వరుసక్రమమున దిగువపేర్కొనుచున్నాము.

1. పయిడిసెట్టిసావిత్రమ్మగారు (9 సం|| 5-వ తరగతి); 2. బొండాడ భ్రమరాంబగారు (10 సం|| 4-వ తరగతి); 3. ఆర్. మాణిక్యాంబగారు; 4. చందా నెం|| 645. జంపాల లక్ష్మీదేవమ్మగారు (12 సం||) 5 హరిపద్మావతమ్మగారు (8 సం|| 3-వ తరగతి) 6. చందా నెంబరు 734. గిరిగిపరి కోటీశ్వరమ్మగారు; 7. W. రాజలక్ష్మమ్మగారు (10 సం|| 5-వ తరగతి); 8. కె. యస్. నీలమ్మగారు; 9. తాళ్లూరి భార్గవీదేవిగారు; 10. ధార్వాడ లక్ష్మీభాయమ్మగారు; 11. జె. నారాయణమ్మగారు; 12. దివాకర్ల మాణిక్యాంబగారు (11 సం||); 13. మాకెల్ల కనకదుర్గావతమ్మగారు (11 సం||); 14. ఆదిలక్ష్మి శ్యామలాంబగారు (12 సం||); 15. అనపరెడ్డి కోటీశ్వరమ్మగారు (9 సం||); 16. ప్రతివాది భయంకరం పుష్పవల్లి తాయారుగారు (10 సం||); 17. వేమారెడ్డి మహాలక్ష్మిగారు; 18. ఎ. అమ్మణ్ణమ్మగారు (10 సం||); 19. ఇమ్మడి కమలమ్మగారు (9 సం|| 3-వ తరగతి); 20. చందానెంబరు 733. ఆచంటవెలువల్లి ఉదయలక్ష్మిగారు; 21. తంగిరాల రామశేషుగారు (10 సం|| 1-వ ఫారము); 22. అంకంరాజేశ్వరమ్మగారు (11 సం|| 1-వ ఫారము;) శ్రీయుతులు 23. ఆచంట సూర్యరావుగారు (11 సం||); 24. ఆచంట శింగరాజుగారు (10 సం|| 1-వ ఫారము); 25. W. వేంకటకృష్ణరాజుగారు (9 సం|| 4-వ తరగతి); 26. దశిక వెంకటరమణగారు (12 సం|| 6-వ తరగతి); 27. చెల్లా రవి శర్మగారు; 28. స. గోపాలుగారు (8 సం||); 29. తూములూరి జయశంకరయ్యగారు (9 సం|| 3-వ తరగతి); 30. ఎమ్. బసవయ్యగారు (2-వ ఫారము); 31. ఉప్పులూరి వెంకటసత్యనారాయణమూర్తిగారు; 32. టి. ఎస్. సుబ్రహ్మణ్యంగారు (5-వ తరగతి); 33. బొమ్మారెడ్డి వేంకటేశ్వరరావుగారు (9 సం|| 2-వ ఫారము); 34. గుంటక పుల్లారెడ్డిగారు (2-వ ఫారము); 35. మాజేటి షహకారుగారు (1-వ ఫారము); 36. చోటపరపు సాంబశివరావుగారు; 37. ఎస్. ఆదముగారు (12 సం|| 2-వ ఫారము).

సుఖకుటుంబము.



పండిత హనుమంతరావుగారు, వారి సతీమణి,

"శిశువు భీమకేసరి."

బెంగుళూరు.

డాక్టరు. కే. ఎన్. కేసరిగారికి,

కేసరి కుటీరము,

ఎగ్మూరు, మదరాసు.

ఆర్యా,

గతవారము నా భార్య సుపుత్ర రత్నమును కనినందులకు చాల సంతసించి మీకు తెలియఁజేయుచున్నాడను. మీ "లోధ్ర" యెల్లప్పుడును నా కుటుంబమున జ్ఞాపకముండును. నా భార్య గర్భముదాల్చిన వెనుక మీ "గర్భరక్షక" వటిని వాడిన చాల మేలు కలిగినది. మీరు వివరించిన విధముగ శిశువు బంగారువర్ణముగ నున్నాడు. "భీమకేసరి" యని శిశువునకు నామకరణము చేసితిని. నా కృతజ్ఞతను తమకెట్లు వెల్లడింపగలను? లోకమున జన సామాన్యమునకును, ముఖ్యముగ స్త్రీలకును మేలొనకూర్చుటకై, మీకు చిరాయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కల్గించునట్లు దైవమును ప్రార్థించుచున్నాడను.

పండిత. కే. హనుమంతరావు.

గవర్నమెంటు ట్రాన్సులేటరు.

N. B. లోధ్ర అన్ని మందుల షాపులలో దొరకును.

# నిష్పక్షపాతియగు ఇంగ్లీషువైద్యురాలు



శ్రీమతి అన్నా తామస్ గారు

సూపరింటెండెంటు,

మెటర్నిటీ & చైల్డ్ వెల్ఫేరు,

బెంగళూరు.

హెల్త్ & ఇన్ఫెంటు వెల్ఫేర్

బెంగళూరు.

డాక్టరు. కే సరి గారికి,

ఆర్యా,

ఇంగ్లీషు అవుషధములవల్ల గుణము లేనందున తమ 'లోధ్ర' ను నా సోదరికి వాడితిని. ఆమెకు ఆశ్చర్యమయిన గుణము నిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీద ఈ యౌషధమును నారోగులకు వాడెదను.

ఇట్లు

డాక్టరు అన్న తామస్.

# భూస్వామి



కే. ఎల్. శర్మగారు, వారిభార్య,

బిడ్డ కేసరిబాయి.

డాక్టరు కే. ఎన్. కేసరిగారు

కేసరికుటీరము.

మదరాసు.

అయ్యా,

నా భార్య సంవత్సరము ఆరునెలలుగా కడుపు నొప్పితో బాధపడుచుండినది. అనేకమందుల వాడితిని, యింజెక్షనుల నిప్పించితిని గాని ప్రయోజనము లేక పోయెను. 20 దినములకు 'లోధ్ర' ను వాడగనే నొప్పి కొంతతగ్గెను. మరి 20 దినములకు వాడగా నొప్పి పూర్తిగపోయి, గర్భవతియైనది. నాల్గవ మాసము నుండి లోధ్రతోడ, గర్భరక్షకయు క్షీరబలాతైలము నిచ్చితిని. సకాలమున స్త్రీ ప్రజను సుఖ ప్రసవమైనది.

ఇట్లు

కే. ఎల్. శర్మ

భూస్వామి, ఒంగోలు.

# ఉపాధ్యాయులు



టి. వి. సుందరరామయ్యగారు, వారి

సతీమణియు, శిశువులు, లోధ్రుడు,

లోధ్రిణియును.

మ-రా-రా-శ్రీ

డాక్టరు కే. ఎన్. కేసరిగారికి,

కేసరికుటీరము,

మదరాసు.

అయ్యా,

అత్యద్భుతమగు తమ 'లోధ్ర' వలన మాకుటుంబమునకొనగూడిన మేలును వర్ణింపనశక్యము. 13 వత్సరములుగ కాపురము చేయుచుండియు మాకు సంతాన భాగ్యము లేకుండెను. ఇక ప్రాప్తి లేదని ఆశ వదలుకొంటిని. హఠాత్తుగ తమ 'లోధ్ర'ను గూర్చివిని, ఒకబుడ్డిని కొని నాభార్యకిచ్చితిని. ఇపుడామెకిరువురు శిశువులు పుట్టినందులకు సంతోషించుచున్నాను. వారికి లోధ్రుడు లోధ్రిణి అని నామ కరణము చేసితిని. ఇరువురును ఆరోగ్యముగనున్నారు.

టి. వి. సుందరరామయ్యా

ఉపాధ్యాయుడు,

రేణిగుంట.

# విషయసూచిక

# గృహలక్ష్మి

"వనితాలోకమునకు సదుపదేశముల జేయుచున్న పత్రికలలో గృహలక్ష్మి మొట్ట మొదటిది. ఇందు వనితల కనువైన విషయములు మృదుమధురశైలిని ప్రకటింపబడుచు వారిని విద్యాదివిధానములందు మార్గదర్శికలను జేయుట కాలవాలము లేర్పరుపబడు చున్నవి. ఇందు స్త్రీవిద్యావిషయమైన వ్యాసములు, నవలలు, చిత్రమైన కథలు, పద్యములు, గృహవైద్యము, యుక్తిలెక్కలు మొదలైనవి ప్రకటింపబడుచు చిత్రపటములు కూడ చాలవరకు ముద్రింపబడుచుండును. అందును దేశభక్తిగలవారి ఛాయాపటములు విశేషముగ ముద్రింపబడును. ఇంకను ఉన్నతపరీక్షలందుత్తీర్ణలైన స్త్రీలయొక్క ఛాయాపటములు గూడ ప్రకటింపబడుచున్నవి. సమస్తవిధములను స్త్రీల సౌభాగ్యదేవతను పెంపొందించుచున్న సచిత్రమాసపత్రికలలో ప్రస్తుత మిదియే యెక్కువగ దేశసేవజేయు చున్నది. ఈపత్రికకు వ్యాసలేఖకులు నానావిధముల సానుభూతి గనుపరుచుచున్నారు. తగిన ధనబలముండుటచే చిత్రపటములు మొదలైనవి విస్తారము ముద్రించుటకు సౌకర్యములు కలుగుచున్నవి. పత్రికాసంపాదకులు తగిన విద్యావంతులగుటచేత వ్యాసములు స్త్రీజనమనోహరములగుచున్నవి. ఇట్టిపత్రికారాజము ఇంకను వేనవేలుగ ప్రతులతో నాచంద్రార్కము విస్తరించుగాక!"

—'హిందూసుందరి' జ్యేష్ఠమాసము.

# జూను మాసపు యుక్తిలెక్కకు సమాధానము.

జూను మాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి కొత్తపల్లి శారదాంబగారి యుక్తిలెక్కకు మేము కోరినట్లు 10-వ తేదీలోపున సరియగు ప్రత్యుత్తరము ఒసంగినవారి నామములను వరుస క్రమమున దిగువ పేర్కొనుచున్నాము.

శ్రీమతులు 1. నర్రా శాయమ్మగారు (5-వ తరగతి, 12-సం॥) 2. సర్వేపల్లి శకుంతలమ్మగారు (9 సం॥) 3. పాకల రాజామణిగారు (1-వ ఫారము, 10-సం॥); 4. బి. మాణిక్యమ్మగారు; 5. పుష్పాల లీలా పద్మసరోజినీబాయిగారు (1-వ ఫారము, 10-సం॥); 6. కె. యస్. ముద్దమ్మగారు; 7. కమలమ్మగారు; (3-వ తరగతి) 8. శ్రీయుతులు వింత అప్పిరెడ్డిగారు; (1-వ ఫారము, 9-సం॥); 9. ఇమ్మాడి రామలింగం గారు; (4-వ తరగతి 10-సం॥) 10. వాడ్రేవు చలమయ్యగారు; 11. బంధకవి గోవిందరావుగారు; 12. యస్. యల్. బాలనారాయణయ్యగారు.

---




EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI, AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి

ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరికాశీవిశ్వనాధంగారు, సోల్ రిప్రజంటేటివుఆఫ్‌న్యూస్
బళ్లారి: వి. రాజుమొదలియార్ & సన్సు,
కారుస్ట్రీటు, బ్రూసుపేట.
రాజమండ్రి: ఆంధ్ర రంగారావుగారు, ఉల్లితోట వీధి
కాకినాడ: కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు.
నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.
బెజవాడ: నామల అంతోని.
గుంటూరు: సి. వి. సుబ్రహ్మణ్యంగారు, రైలుపేట,
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్.
పిఠాపురం: ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్.
హైదరాబాదు: ఎస్. గౌరీశంకరవర్మగారు, 566 రెసిడెన్సీ బజారు.
(దక్కను:) (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును)
వాల్టేరు: పి. తారనయ్య, అల్లిపురం.
మదరాసు: మదరాసు న్యూస్ ఏజన్సీ, మౌంటురోడ్డు.
అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.
నిడదవోలు: టి. కుటుంబ శాస్త్రిగారు.
చికాకోలు: తాటిగడప మాణిక్యరావుగారు.
పాలకొల్లు. వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపల్లి.
ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.
కాకరపల్లి: కే. సత్యనారాయణగారు, సరస్వతిగ్రంథమాల.
విజయనగరం: కేసనపల్లి. రామలింగంగారు, పొత్తూరివారి వీధి.
ఒంగోలు: కే. ఎల్. శర్మ
రామచంద్రపురం: సి. జి. శాస్త్రి & కంపెనీ.
గుడివాడ: సీతారాం అండు కంపెని.
కొవ్వూరు: జి. వి. రామరావుగారు.
ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్‌పేట.

ఇతర చోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి" తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సం॥ చందా. రు. 4.

విడి పత్రిక. అ. 6

మాదిరి పత్రిక కోరు వారు 6 అణాల స్టాంపులను పంపవలెను

**ప్రకటన రేట్లు**

| | | |
|---|---|---|
| నెలకు | ఒక పుటకు. | రు. 15 |
| నెలకు | $\frac{1}{2}$ పుటకు. | రు. 10 |
| నెలకు | $\frac{1}{4}$ పుటకు. | రు. 7 |

6 నెలలకుపైగా ప్రకటించువారికి నూటికి $12\frac{1}{2}$ వంతున కమీషను మినహాయింపబడును.

**మేనేజరు**

గృహలక్ష్మి

తపాలపెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి

## చందాదారులకు విజ్ఞప్తి

చందాదారులు మా కార్యాలయమునకు వ్రాయు జాబులయందు తమ చందా నెంబరు వ్రాయవలెను. చందా నెంబరు గృహలక్ష్మి కవరు కాగితముపై విలాసమునకు ముందున్నది.

లేనిచో ప్రత్యుత్తరము లిచ్చుటకు సాధ్యము కానేరదు.

గృహలక్ష్మి ప్రతిమాసము మొదటి తేదీని చందాదారులకు అతిజాగ్రత్తగ పంపుచుందుము. చేరనిచో 7-వ తారీఖులోపుగనే మాకు తెలుపుచు వారివారి తపాలాఫీసులో కూడ రిపోర్టు చేయవలెను. 7-వ తేదీ తరువాత చేరలేదని వ్రాయుచో తిరిగి సంచిక పంపజాలము.

—మేనేజరు—




# విలాసవస్తుసమస్య



మిత్రమగు పానములు, కొంచమగు దుస్తులు, పొందికయగు భోజనము. వీనితో ప్రకృతిబద్ధమగు జీవితము నడపిన ఋషుల సంతతివారము మనము. అయినను మనమిపుడు వారిసంతతివారమను సంగతిని మఱచియున్నాము; వారిజీవనపద్ధతులను విడనాడియున్నాము. ప్రస్తుతము నము విలాసవస్తువులకై విఱుగబడుచున్నాము. ఈవిఱుగబాటులో ఇందుమూలమున మనము దేశమునకు తెచ్చిపెట్టుచున్న అరిష్టమును అరయజాలు నిదానముకూడ నీళ్లు కాఱిపోవుచున్నది.

విలాసవస్తువులకై విఱుగబడుటవలన కలుగు అరిష్టములు రెండు. ఇంద్రియముల కామప్రవృత్తి ననుసరించి మనమున ఎసరేగు వాంఛలను కూడినమట్టుకు నిరసించి విలాస లాలసత్వమునకు ఎడగానుండజాలని నిర్వీర్యులమగుట మొదటిఅరిష్టము. విలాసవస్తువుల కొఱకు విదేశములకు డబ్బుపోసి పాడిపంటల మహాలక్ష్మియగు భారతమాతను పీల్చి పిప్పి చేసి కలిగియు దరిద్ర మనుభవించుదానిగా చేయుట రెండవఅరిష్టము. మొదటిదానికంటె రెండవఅరిష్టమే ప్రబలతరమైనది.

తిలకింపుడు. మిక్కిలి పేదరాష్ట్రమగు మన మద్రాసురాజధానియందు ప్రజలు ఏటేట విలాసవస్తువులకై ఎంతెంతసొమ్ము విదేశీయులపాల గుమ్మరించుచున్నారో? కృత్రిమాహారములకు 42 లక్షలు; ఎండినపళ్లకు 5 లక్షలు; పేటెంటుమందులకు 25 లక్షలు; పొగచుట్టలు సిగరెట్లు మొదలగువానికి 50 లక్షలు; కాగితములకు 150 లక్షలు; పట్టు

వస్తువులకు 35 లక్షలు; బంగారు వెండిజలతారులకు 15 లక్షలు; మెడపట్టీలు కాలర్లు మొదలగువానికి 17 లక్షలు; తోలువస్తువులకు 7 లక్షలు; బొత్తాసులు 1 లక్ష; బ్రష్షులకు 1 లక్ష; ఇమిటేషను నగలకు $1\frac{1}{4}$ లక్షలు; అత్తరులు సువాసనద్రవ్యములకు $1\frac{1}{4}$ లక్షలు; విలువరాళ్లకు 14 లక్షలు; పెనసళ్లకు 20 లక్షలు; పుస్తకములకు $11\frac{1}{2}$ లక్షలు; సబ్బులు మొదలగువానికి $3\frac{1}{2}$ లక్షలు; ఆటవస్తువులకు $3\frac{1}{2}$ లక్షలు.

ఒక్క రాష్ట్రమున ఒక్క సంవత్సరములో ఇంతటిసొమ్ము ఏవిలేకపోయినను సుఖజీవనమునకు వరిముల్లువాసియేని లోపములేదో అట్టి విలాసవస్తువులకై వెచ్చింపబడుచుండ భారతదేశము మొత్తముమీద ఏటేట ఎంతసొమ్ము వమ్మగుచున్నదో ఊహించుటకైన ఎడములేకున్నది. పాడిపంటలకు మహాలక్ష్మియైననేమి? అమూల్యములగు రత్నములగు పంటపొలమైననేమి? కాలువలుకట్టి నీళ్లప్రాయముగ నిరంతరము ఇంతటి ధనము విదేశములకు పోవుచుండ భారతభూమి దరిద్రభూమికాక ఎట్లుండును? ఆరుకోట్లమంది భారతీయులు రెండుపూటలు కడుపునిండ అన్నముతినుట ఎట్టిదో ఎఱుగక ఆటునటించుచున్నారు. మఱియంతమంది కనకనమంచు ఆకలి బాధకు తాళజాలక చావుబ్రతుకులతో సమయపురుషుని సేవకులైయున్నారు. దేశస్థితి ఇట్లుండ చేతిలో నాలుగుకాసులు ఆడుచున్న నీటుకాండ్రును, నీటుకత్తెలును విలాసవస్తువులను విరివిగ నుపయోగించుచు వినోదించుచున్నారు. ఎంతటి అవమానకరమైన విషయము!

ఇక నిది సాగనీయరాదు. ఆత్మసంయమన మలవఱచుకొని విలాసవస్తువులను పూర్తిగ విసర్జించి విదేశములకు పోవుచున్న ధనప్రవాహమును అరికట్టసలయును. ఇది ఉత్తమపద్ధతి. "మేము హశాసుబండ్లము. విలాసవస్తువులు విసర్జింపజాలము" అందురా అట్టివారికి మేమొక మనవి చేయుదుము. 'మనది ప్రకృతి అనుగ్రహించిన దేశము. ఉప్పుతో తొమ్మిదియు మనదేశముసపండును. మనము ప్రస్తుతము విదేశములనుండి తెప్పించుకొనుచున్న విలాసవస్తువులు సమస్తము కొంచము శ్రద్ధవహించినచో మనదేశముననే తయారుచేయించుకొనవచ్చును. శ్రద్ధపూని అట్టి వస్తునిర్మాణమునకు కర్మాగారములు స్థాపించి పని ప్రారంభించుచో వృత్తిలేక అల్లాడుచున్న మనదేశీయులకు కొందఱికి వృత్తులు కల్పించిన వారమగుదుము. మనధనము మనపొలిమేర దాటనీయనివారమును అగుదుము.'

విలాసవస్తువులను పూర్తిగ విడనాడి ఆత్మనిగ్రహము చూపుటయో, అదిచూపజాలనినాడు ఆవస్తువులను మనదేశమునందే తయారగునట్లు శ్రద్ధవహించుటయో చేసితీరవలయును గాని ఇక చేతులార చేరలకొలది ధనమును విదేశముల పాలుచేసి భారతమాతను దరిద్రదేవతగచేయు అవజ్ఞతకు పాల్పడరాదని సోదరసోదరీమణులను హెచ్చరించుచున్నాము.

# జీవితస్పృహ

నరహరిశెట్టి వేంకటరత్నముగారు

ఆమె రూపసి, లావణ్యరాశి, సౌందర్యరోచులు విరజిల్లు సుందరజ్యోతిర్మూర్తి: అగుగాక—

ఆమె గృహిణి. గృహనిర్వహణమున ఆమెరూపు మలినమగుచున్నది; పాకశాల యందామెలావణ్యము మసిబారుచున్నది; సుతపోషణమున ఆసమ్మోహనసౌందర్యము కళదప్పుచున్నది.

విద్యావతి అయిననేమాయె; విశ్వజనీనమతము వరియించునది యగుగాక! విజ్ఞాన సంపత్శోభితురాలు కానిమ్ము; ఆమె దృక్పథమున స్త్రీ, పురుషుడు అన్నివిధముల సమానులే! అయిననేమాయె!

ఉషస్సుతో ఆమె మేల్కొనుచున్నది. కాలకృత్యములు. తరువాత వంటయిల్లు; మెరుగిడినమోము పొయివేడిమిచే మాడిపోవుచున్నది. శుభ్రవస్త్రములు మాసిపోవుచున్నవి. సుకోమలములైన హస్తములు కాలిపోవుచున్నవి. ఎంతశుభ్రముగ నుండవలెననుకొనినను అశుభ్రతయే. ఒకవైపున పిల్లలు; వారిని చక్కజేయుటలో మఱింతమాలిన్యము. ప్రియపోషణమున, గృహము శుభ్రపరచుటలో ఆమె నిజమూర్తి మాసిపోయి వికృతాకారము మిగులుచున్నది. ఘర్మాంబుసిక్తములై అలసిపోయిన అవయవములు.

ఎటులో ప్రక్కపై దేహమువాల్చి ఆమె చిన్ననాడు తన భవిష్యత్తుగూర్చి భావించిన, ఆశించిన కోరికలు: ఆకసమున మేడలు, సెలయేటిప్రక్క తాను తనప్రియుడు ఒంటరిగా గూరుచుండి ఆనందించదలచిన తలపులు, నడుమనడుమ ప్రకృతిసౌందర్యములో విపంచీమధురనిస్వనములో మేళవింపులు, తమ—ప్రేయసీ ప్రేయసుల—గాఢపరిష్వంగమున సర్వలోకములు మంచువలె కరగిపోవునప్పుడు, ఇంక నెన్నియో ఆశలు, ఆశయములు, అల్లికలు స్మరణకువచ్చును. అంతయు మిథ్య:

"చిన్ననాడు అవివేకముచ జపతము ఆనంద సమ్మిళిత
మని భ్రమసితిని. లోకము విచారావృతము."

ఇట్లుభావించు ఆమెకు ఆనందమసలే లేకపోలేదు. అంధకారమధ్యమున తళతళ మెరసే తారలు; కారుమబ్బులనడుమ తళుక్కుమని మెరసే మెఱుగుదీవ; కురూపియైనన్నూ కోకిలకు మధురకంఠస్వరము; కంటకములనడుమనే కమనీయమైనని పూలవాసన: అదియే ప్రకృతిస్వభావలక్షణము.

యంత్రమువలె జంతుజీవితమువలె జరిగిపోవుచున్న ఆమె మామూలు జీవనములో పసిపాప చిరునగ వొకసంతోషరేఖ, ప్రియుని ప్రణయవీక్షణ మొకఆశాజ్యోతిర్లత: ఇటులే ఆనిస్తేజజీవనమున అపుడపుడు ఆనందభానూదయము, అంతలోనే అస్తమానము. పురుషుని జీవనవాహినిగూడ నిటులే కంటకసంయుతమైన కాఱడవిదారులనే నడచుచున్నది.

చిన్ననాటి తియ్యనికలలన్నియు నేడాతనికి కల్లలైనవి. ఇట్టి జీవములేని సతీపతుల సంయమజీవితమును కామము, మోహము, ప్రేమ—ఈ త్రిమూర్తులును నిరంతరాయముగ ఈనాఁడేకాదు యుగయుగములనుండి పరిపాలించి నిరవధికమైన నిస్తులమైన సుఖమును ఆనందమును ప్రసాదించుచున్నవి. అవియే లేకపోయిన లోకము శూన్యము.

# వీరమాత జిజాబాయి

ఓలేటి సీతారామమూర్తిగారు

౧

మృదులహృదులఁ బ్రాచేతస సదృశకవులు
లీలఁ గవితాలలామ కర్పించినట్టి
దివ్యభూషలగతిఁ గాలు కావ్యములను
సత్పురాణంబులన్నియుఁ జదివె నామె.

౨

వాటినిరతంబుఁ బఠియించి భవ్యమాత్ర
పాలు ద్రావుచునుండెడు ప్రాయమందె
తనతనయునకుఁ దద్వీరజనులఁగూర్చి
జెప్పుచును జాలగఁ బ్రశంస చేయుచుండి.

౩

"వారిగతి నీవు నొకయోధవరుఁడ వగుచు
పాపులైన శత్రువులను బారఁదోలి
ఋషులుగలభూమిఁ బునరుద్ధరింపు తనయ!
పాడిపంటలవెలయు నీ భరతమాత."

౪

అనుచు బ్రోత్సహించి యాతనిరక్తాన
వీరరసము కడఁక వెల్లివిరియఁ
జేయుచును శివాజిఁ జిన్నతనమునందె
వీరుఁజేసె నా పవిత్రురాలు.

౫

"పరవాహినీవీరబహుళరక్తాపగఁ
గదనభూమిని గత్తి కడిగెదీవు
శత్రుసైన్యాధిపశ్రవణంబులకు భయ
దంబౌచు నీపేరు తనరుచుండు
అలశివాజిని మించునట్టి వీరుఁడు పుట్ట
బోడని ఘోషింత్రు భూమిజనులు
శరదిందువిస్ఫురత్ చంద్రికలవిధాన
నలరుయశోభాగ్య మబ్బు నీకు"
ననుచుదీవించి రణములకంపు సుతుని
వీరమాత జిజాబాయి విమలకీర్తి;
తత్ప్రబోధంబువలననే తథ్యముగను
వీరుఁడై మించుచు శివాజి వినుతికెక్కె.

౬

అలజిజాబాయిఁ బోలిన యట్టిమాత
లరయఁగల్గిన నెందరెందరో మహాత్ము
లహాహ వెలసెడివారలో! అమ్మలట్లు
పెంచెదరుగాక బిడ్డలఁ బ్రీతి సతము.

# రాజభక్తిగల సరదారు

## శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పృథ్వీరాజు ఢిల్లిని రాజధానిగా జేసికొని ఆసేతుహిమాచలపర్యంతమైన భూమండలమునకు చక్రవర్తియై సామంతరాజులచే కప్పములు గొనుచుండెను. ఆకాల మందాతనికి సాటిరాజు లేడు. పృథ్వీరాజు మిక్కిలి వీరుడు. ఆకాలమందాతనితో సమానముగా యుద్ధముచేయువా రెవరునులేరు. పృథ్వీరాజుయొక్క సర్దారులును చాల వీరులు. వారు తమరాజునందు మిక్కిలిప్రేమతో మెలగుచుండెడివారు. ఆయనకొఱకు ఎల్లప్పుడును తమయొక్క ప్రాణములను ధారపోయుటకు తయారుగానుండెడివారు.

మహోబా రాజ్యమును పరమాల్ అను రాజా కాలమున ఏలుచుండెను. వారికిన్ని, పృథ్వీరాజుకున్ను యెల్లప్పుడు విరోధముండెడిది. పరమాల్ యొక్క సర్దార్లు అలహా, ఊదల్ ఇద్దరుసోదర్లును మిక్కిలి శూరులై యుండిరి. మరియుఁ దమ రాజునందధికవిశ్వాసపరులై యుండిరి.

ఒకమారు పృథ్వీరాజు పరమాలు మీదికి యుద్ధమునకువచ్చెను. ఇద్దరితరపు సిపాయిలున్ను, సరదార్లున్ను చాలశూరులగుటచేత యుద్ధము మిక్కిలి అధికముగా జరుగుచుండెను. వేలకొలది సిపాయి లాయుద్ధమునందు వీరస్వర్గ మలంకరించుచుండిరి. మరిన్ని ఊదల్, అలహ యున్ను మెరుపుతీగలతో సమానమైనదమకత్తులనుఁ ప్రకాశింపఁజేసి స్వర్గవాసులైరి. వీరికువురే దమ రాజుకొరకై ప్రాణమిచ్చిన శూరులుగా పనిఁ జేసిరి.

పృథ్వీరాజు యొక్క గొప్పగొప్ప వీరులున్ను, సర్దార్లున్నుకూడ స్వర్గవాసులైరి. పృథ్వీరాజునకు ఆయుద్ధమందు స్మృతిదప్పి భూమిపైపడిపోయినంత లోతుగాయమాయెను. సంయమరాయి పృథ్వీరాజుయొక్క నమ్మకమైనసర్దారు. ఆతడుకూడ ఈయుద్ధములో గాయపడియుండెను. ఆయనకు రెండుతొడలు నలుకబడెను. లేచుటకు శక్తిలేదు.

మహారాజగు పృథ్వీరాజు సంయమరాయుని దగ్గరగానే బడియుండెను. ఈసమయములో కొన్ని గరుడపక్షులున్ను, కాకులున్ను స్మృతిదప్పియున్న మహారాజు చనిపోయెనని యెంచి రణభూమినిఁ బ్రవేశించి పృథ్వీరాజును పొడువ బ్రయత్నించుచుండెను. ఆపక్షులామహారాజుయొక్క నాల్గువైపులను మెగురుచుండెను. ఆసంగతిచూచి సంయమరాయలు మిక్కిలి కంగారుపడెను. కాని యేమిచేయుటకు సమర్థుఁడగును? కాళ్లు నలుకబడి యుండుటచే నాపక్షులను లేచితోలుట కశక్తుఁడై మనంబున మిక్కిలి విచారపడుచుండెను. ఎన్నివిధముల తంటాలుపడినను రాజువద్దకుచేరు విహంగముల నెగురగొట్ట లేకపోయెను.

తనకోర్కె నెఱవేర్పలేక తుదకొక కష్టతరమైనయుపాయ మాలోచించెను. అట్టియుపాయ మింకొకరు నేటివరకు ఆచరించియుండరు! మనము కని, వినిఁగూడ యుండము.

సంయమరాయునికి దగ్గిరగా నొక కత్తిముక్క పడియుండెను. దానిని మెల్లన తీసికొని దానిచే తన శరీరముయొక్క మాంసమునుఁగోసి పక్షులపై విసర సాగెను. ఈయుపాయముచే పృథ్వీరాజును బాధించుటమాని పక్షులీతనిమాంసశకలము లను బక్షించునాశచే నీతనిచుట్టును చేరెను. "ఈయుక్తిచే మహారాజును రక్షింపఁగల్గితిని. ధన్యుఁడ" నన్న సంతోషముచే ఇంకను మాంసమునుకోసివేసి ఆకడకువిసరవేయు చుండెను.

ఆసమయములో పృథ్వీరాజుకు కొంచెము స్పృహవచ్చెను. కన్నులువిప్పి నలు దెసల పరికించెను. తనయొక్కసర్దారుని భక్తికృత్యముచేత మహారాజుయొక్క కన్నులు ప్రేమజనితభాష్పములచే నిండిపోయెను. హృదయము పరితాపపడెను. అట్టి విశ్వాసో పేతుఁడగు సర్దారునకు తన మనఃపూర్వకకృతజ్ఞతావందనము లర్పింపవలెనని కోరికజనిం చెను. కాని హృదయవేదనచే, అలసట యధికముకాఁగా వెంటనే మహారాజు చైతన్య హీనుఁడైపోయెను. సంయమరాయుఁ డింకను తనపని చేయుచునేయుండెను. క్రమముగా అవసన్నుఁ డగుచుండెనుకాని భక్తిహృదయముచే నెట్లో తనకృత్యము కొనసాగించు కొనుచుండెను.

చంద్రవరదాయీ పృథ్వీరాజుకు మిత్రుఁడున్ను దర్బారులో కవియున్నుగూడ అయియుండెను. ఆయన యుద్ధభూమిలో మహారాజును వెదకికొనుచు తుదకక్కడకు చేరెను. మహారాజును చూచెను. మహారాజుకొఱకుఁ దనమాంసము పక్షుల కాహార మిడుచుండిన సంయమరాయునిఁగూడ ఆసమయమందే చూచి చంద్రవర దాయీ ఆశ్చర్యకలితుఁడై, సంయమరాయుని అభిప్రాయమెఱుగఁజాలక ఆతనిని ప్రశ్నిం చెను. ఆతను మాటాడఁజాలని దుస్థితిలోనుండెను. కాని తనపనిమాత్రము నిర్వహించు చునేయుండెను. పట్టుదలగా పనిచేయుచున్న సంయమరాయుని పరీక్షించిచూచి, చంద్ర వరదాయీ ఆప్పుడా విశ్వాసోపేతుఁడగు సర్దారునిచేతలకు కారణమెఱుగగలిఁగెను. ఎప్పు డైతే తనదృష్టి పృథ్వీరాజుమీదఁ బడెనో యప్పటికి చంద్రవరదాయీకి సందర్భములు పూర్తిగా గ్రాహ్యమయ్యెను.

"ఓపూజ్యుడా! తమ రేమిచేయుచున్నారు?"

"కవిగారూ! పృథ్వీరాజుయొక్క ఉప్పుతోనే యీశరీరము నిర్మింపఁబడియున్నది. నేడు ఆమహారాజుకొఱకై యే యిది పనిచేయుచున్నది. ఇది నాకొక గొప్పపనికాదు. దీని కొఱకు మీరంత ఆశ్చర్యపడవలసిన అగత్యములేదు. తమరుమాత్రము మంచిసమయము

నకు వచ్చితిరి. నేను నాయొక్కపనిని వదులుచున్నాను. ఇప్పుడు తమరు మహారాజును రక్షించుకొనినాను." అని యెట్లనో లేనియోపికఁదెచ్చుకొని సంయమరాయలు విన్నవించెను.

ఇదిజూచి చంద్రవరదాయి ఏడ్చుట మొదలుపెట్టెను. సంయమరాయలను మిక్కిలి ప్రశంసించెను. అప్పటివఱకు సంయమరాయలు తనశరీర మాంసమునంతయు పక్షుల కెగుర వేయుటఅయిపోయెను. మహారాజును చంద్రవరదాయికి వప్పఁజెప్పినమీదట అధికానంద ముతో భారమును వదలించుకొనిన తేలికహృదయముతో ఆతడు వీరస్వర్గ మలంకరించెను.

ఆహా! కృతజ్ఞత కెంతటిపూజ్యత ఉన్నది! విశ్వాసమున కెంతటి విలువయున్నది! నిజమైన ఆత్మత్యాగియే "సంయమరాయసర్దార్". ఆయన యిహలోకమును, మరికి తోలును వదలి ఆచంద్రతారకమగు శాశ్వతస్వర్గపదవి పొందెను. ఇట్టివారలే మృతజీవు లనబడుదురు. వీరికి జన్మము మరలఁగలదా? ఇట్టి త్యాగచరిత్ర మెన్నిసార్లు కీర్తించినను క్రొత్తతరుగదు.

—హిందీనుండి అనువాదము

# ఆశాభంగము

కొప్పర్తి నారాయణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

సాంద్రనీలనికుంజపుంజప్ర
శాంతగహ్వరసీమ పుష్పము
దేవు హారమునందు జేరగ
దీక్షతోమురిసెన్.

సువర్ణపక్షముల నదల్చుచు
సుస్వరంబుల ప్రేమచిలుకుచు
కీటకంబులు, మాయదూతలు,
వాటముగ వ్రాలెన్.

వ్రాలిమకరందమును తృప్తిగ
గ్రోలిమూడుచు నెగిరిపోయెను;
అవని పుష్పము రాలిపడియెను,
ఆస లడుగంటన్.

పైననెచ్చట నుండియో యొక
పక్షి దేవునిమహిమ బాడగ
కంఠమును సవరింప బోయెడు
గాంచెనద్దానిన్.

వాడికోలను దానిహృదయము
వ్రక్కలేయగ నాకపోతము
ప్రేమసౌరభమును హరింపగ,
భూమిపయిగూలెన్.

అజునిపాదముచేరి కొల్చుట
కటవివృక్షం బాకసంబున
కెగయజూడగ దానిపాదము
నెవ్వడోసరకెన్.

పుష్పసౌందర్యమున కలరెను
పులుగుగీతల సంతసించెను.
తరువు శిరమునుగుచ్చి ముద్దిడె,
దైవమునరక్తిన్.

# కుమారీ ప్రబోధము

శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

కుమారీ! చిన్నతనమునుండియు తలిదండ్రుల యెడభక్తితో మెలగుము. తోడి వారలయందు దయగలిగియుండుము. పిన్నలయెడ ప్రేమతో మెలగుము. బీదలతో చనువుగా మాట్లాడి వారిమనస్సు రంజించునట్లుచేయుము. తిరిపెమెత్తువారిని చూచి తూలనాడకుము. దైవభక్తిగలిగియుండుము. ఇతరులసొత్తును తృణప్రాయముగా భావింపుము.

కుమారీ! నీనవజీవనారంభదశ నూతనోత్తేజము బొందుచున్నది. నీప్రేమైకమూర్తి యెడల మెలకువగా వర్తింపుము. నీనాథునియాజ్ఞ అతిక్రమించకుము. నీజీవితేశ్వరునితో కలహము బెంపకుము. వస్త్రభూషణావళులకొరకై నీదయితుని నొప్పింపకుము. అతని మనస్సు నొచ్చిన నీకును అంతియకదా! పుత్రీ? చనువుమెయి వర్తించి అతని హృదయ రాజ్యమున కర్ధాంగివై, అతనికగు కష్టసుఖములలో నర్ధాంగమవై అతనివశ్యునిగా జేసికొనుము.

కుమారీ! నీనవజీవన కుసుమమును వికసింపజేసి తత్పరిమళమును దశదిశలవ్యాపింప జేయుము. పెద్దలయెడభక్తి, పిన్నలయెడప్రేమ, సాధువులయందు దయ, శత్రులయంద కనికరము, బీదలయందును ధనికులయందును సమత్వము గలిగియుండుము. గురువిప్రదైవార్చనల నొనరించుచుండుము. త్రికరణశుద్ధిగా నాథుడే పరమేశ్వరుడను భావ ముత్పన్నమగునట్లుచూడుము. బిడ్డలకు ప్రేమమయినయి వారిని పలువిధముల సంతోష పెట్టుచు వారికి సద్బుద్ధు లలవడునట్లుచేయుము.

కుమారీ! నీకున్నదానితో తృప్తినిబొందుము, అప్పుసొప్పులకై పొరిగింటి కరుగకుము. అరువు నగలు వర్జించుము. తీరికవేళలనైనను సద్గ్రంథపఠన జేయవలెను. పెత్తనముల కరుగరాదు. ఇతరుల తగవులలో నీకు ప్రసక్తివలదు. ఒరులమీది కొండెములు నీకెవ్వరేని చెప్పుచున్న విని విననట్లుండుము.

కుమారీ! భారతపుణ్యాంగనల స్మరించి వారివలెనే పూతచరిత్రవై, వీరవనితవై, సాధ్వీమతల్లివై, కులదీపికవై ఉభయవంశోన్నతికిని మూలకందమవైయుండి నీజీవితమును సౌఖ్యవంతముగా నొనర్చుకొనుము.

# ఇద్ధరి అద్ధరి

ఆలమూరు రాజగోపాలరావుగారు బి. యె.

## ౧

అప్పుడే పశ్చమాబ్ధిలో సూర్యుడు మునిగాడు. మేరీ మెల్లిగా తండ్రిని నడిపించుకుంటూ తీసుకొచ్చి ఆపూలవనంలో తనతల్లిగోరీదగ్గర కూచోబెట్టి తనెళ్లిపోయింది. మాట్యూస్ తనసతిగోరీకేసి చూశాడు. ఇన్నిపువ్వుల్తో దాన్ని అలంకరించాడు, ముద్దెట్టుకున్నాడు. కళ్లలోనీళ్లునిల్చాయి. ఒఖసారి కొడుకూ, కొడుకు రాసిన ఉత్తరాలుజ్ఞాపకం వచ్చాయి. జేబులోంచుత్తరాలు తీశాడు, చదువుకున్నాడు. 'అయ్యో! డానియల్ యింతట్లోకే అత్తింటికోడలివై పోయావా! ఆడపిల్లకి పుట్టింటున్నంతసేపు పుట్టిల్లు తండనుకుంటుంది. పెళ్లవటంతోనే పుట్టిల్లు పరాయిల్లవుతుంది. అంతేకదా డానియల్ నువ్వాను' అనుకున్నాడు. 'డానియల్! నీతండ్రిని, నీరక్తం, నీప్రతిబింబం, చీకుముసలిని, కాటికి కాళ్లుసాచుకొని, మతిచెడి, ఘడియలమీద ప్రాణాలాధరం వేసుకున్నాను- ఈదీనసమయంలో, యీచరమావస్తలో, నీచెయ్యి నా హృదయంమీద వేసి "నాయనా" అని పిలవ్వూ? నిన్ను పెంచి పెద్దచేశానే, నాసుకృత ఫలం అనిపాడి ఆడానే. విజ్ఞప్తీగానే. ఒఖసారి-మరణోన్ముఖుడు, రోగపీడితుడు, దరిద్రుడు బిడ్డవలె బెంగకొనిఉన్నాడు. నీకొఱకే ఆగిఉన్నాడు" అనిరాయించానే. రాశానే-డానియల్ నీతండ్రంటే నీకో్పవా, నిరసనా, నిర్దయా-లేదు. డానియల్, నువ్వుసరళుడవు చిన్నవాడవు, అంచేత-డానియల్ నువ్వు పొరబడుతున్నావుసుమా. మేరీనీచెల్లెలు, నీతల్లి ప్రతిబింబం దాన్ని నువ్వెత్తుకు ముద్దాడవు. దాని మూత్రపురీషాలు నీశరీరాన్నింకాయి. అదిపరజాతా? అది నలుపా? ఇదినీదేశంకాదు? నీతల్లిదీదేశంకాదు? నేనీదేశమాత గర్భంల్లో నాఅస్తికలు దాచుకోనూ? లేదు దాచుకోను-పొరబాటు-అయ్యో డానియల్, కొడకా నీవు ధన్యుడవు-నేను విద్రోహిని. అపరాధిని-ఆయజ్ఞని పెదవిల్తో, అప్రస్ఫుటోన్ముఖమైన గులాబీలవంటి నోళ్లతో, ఆనందంగా పాలుతాగుతూన్న పసికూనన్ని, వాళ్లతల్లుల ఒళ్లలోంచిడేగలాతన్నుకు పోలేదూ, వాళ్లతలితండ్రుల్ని చంపలేదూ! వాళ్లపిల్లల్ని చెఱబట్టాను. వాళ్లరక్తంతాగాను. వాళ్లగుండె గుహచేసుకు నిద్రించాను. నాపాపం నన్నుకట్టిచంపదూ. ధర్మదేవత లేదూ; నిజం, డానియల్, నీతండ్రిమాటవినకు. కరుణ మింగెయ్యి. ప్రళయరుద్రిలా తాండవించు. పగపూనిన నల్లతాచులా కోఱతీపు తీర్చుకో. అగ్ని పర్వతంలా ఉడికెత్తిపో. అనుకుంటూ మాట్యూస్ లోలోపలకుల్లిపోయాడు. అయ్యో మేరీ! నేబతకనమ్మా! అంటూ ఆవుత్తరాలక్కడ పడేసి గొల్లునేడ్చాడు. మేరీ పరిగెత్తుకొచ్చింది. నాయనా యిప్పుడే కదా జావకోసంవెళ్లాను. ఇంతఖంగారైతే యెల్లా, బాబూనువ్వు శెంగమాను. ఇదిగో యీరాత్రో రేప్పొద్దునో్న వస్తాడన్నయ్య. శరీరం అమ్మింతర్వాత శలవు మనిష్టవాం అంటూ జావయిచ్చింది. "మేరీనిజంగా నాడానియల్ వస్తాడా? నాకళ్లకాయలు తీరతాయా? నా ఆత్మశాంతిస్తుందా? రాడమ్మా అతనురా"డంటూ ఆజావతాగాడు. మేరీ అతన్ని యింట్లోకి తీసుకుపోయి పడుకోపెట్టింది. సాయంత్రంకోసినపువ్వులు దండగుచ్చుచూ మధ్య మధ్య తండ్రి కదిలేచూస్తూ గడియారంకేసి

చూసి మందులిస్తూ మేరీ ఆరాత్రిగడిపింది. పొద్దున్న తండ్రిలేచాడు. కాస్తకుదుట బడ్డాడు. తండ్రిసెలవు మీద పువ్వులదండలుచ్చుకుని, పట్టణంలో అమ్మి నాలుగు కాళ్లేసి కడుపునింపుకోటానికి మేరీ వెళ్లింది. ఆనాడు పట్టణంలో పెద్దమోటింగు మేరీ అక్కడికిపోయింది.

౨

ఆనాడు ఆదేశంలో రాజ్యసంస్థాపనార్థం ప్రేరేపింపబడిన మహా యుద్ధాల్లో వెన్నిచ్చక గుండె డిగ్గి పోరాడిన తెల్లసర్దారులలో మాట్యూస్ అగ్రగణ్యుడు. అధికార్లతని ధైర్యసాహసాలికి తెల్లపోయి, పతకాలేం బహుమానాలేంవర్షం కురిపించారు. నాటి రణరంగాల్లో యేమూలచూసినా మాట్యూ సే. మాట్యూస్ మాటే. మాట్యూస్ కబుర్లే. తుపాకీపుచ్చుకోటం కత్తితిప్పటం. ఇళ్లంటించటం. జనాన్నిచంపటం. ఆస్తులుకొల్లి గొట్టటం, అతనినిత్య చరిత్ర జీవితం అయిపోయింది. అతనాదేశంలో అడుగెట్టింది మొదలు అతని అభివృద్ధి శ్రేయస్సూ యింతింతలుగా పెరిగిపోయింది. తన జీవితంలో స్థిరత్వంకలిగిందని ఆనందించేడు. ఆశావీథుల్లో ఒకసారి చక్రంతిప్పేశాడు. భావిజీతంలో బంగారంమేడలు పుష్పించిన వనాలు చూశాడు.

అప్పటికి 'రాణీ' ఎదిగినపిల్ల, రాణీ తండ్రి మాట్యూస్ దగ్గర వంటవాడు. రాణీ అప్పుడప్పుడు తన తండ్రితో వస్తూ బజార్నించి వంటకానికి కావసిని వస్తువులు తెచ్చి పెడుతూ తనతండ్రికి వండటంలోకూడా సహాయంచేస్తూండేది. తల్లి చిన్నప్పుడే పోయింది. తండ్రివృద్ధుడు. అంచేత తనుకూడా తండ్రితోపాటు మాట్యూస్ ఉప్పేతినేది.

వృద్ధుడైన తండ్రి దివంగతుడయాడు. ఇహరాణీయే మాట్యూస్‌కు దిక్కయింది. మాట్యూసే రాణీకి దిక్కయాడు. అదే అతనికి వండిపెట్టేది. అదేయిల్లూ వాకళ్లుసర్దేది. మొదట్లో, పరజాతిస్త్రీ; చిక్కన శరీరం. నల్లనికళ్లూ, నల్లనిజుట్లూ, నల్లనిశరీరం మాట్యూస్‌కు వెగటనిపించింది. కాని మోహం మితిమీరింది. బలవంతం చేశాడు. దినాలుగడిచాయి. అచ్చు మాట్యూస్ మాట్యూస్ నోట్లోంచూడిబడి నట్లున్నాడు. రాణీకంది మొగపిల్లాణ్ణి తెల్లని పిల్లాణ్ణి.

మాట్యూస్ గుండె గుభీలుమంది. పర్వతంమీద పడిందనుకున్నాడు. రానురాను ఆతల్లి ప్రేమ చూశాడు. ఆకొడుకు ఆటపాటలు చూశాడు. ఆ అవ్యక్తమధురమైన మాటలు చూశాడు. హృదయంలో పాషాణంపోయి ఓనూత్నకమలం వికసించింది. రాణీఅంటే తరిముట్టనిదయ, నిష్కళంకమైన అనురాగం, అనంతమైన వాత్సల్యం ఉద్భవించాయి. దీనికి తోడు రాణియొక్క కోమలమైన మనస్సు, నవనీతంవంటి హృదయం, దీనులయడదయ, అతన్ని జయించాయి. ఇహరాణీయే మాట్యూస్, మాట్యూసే రాణీ అయి పోయారు. రాణీ నిజమైన భార్యైపోయింది. మాట్యూస్ పవిత్రమైన భర్తయిపోయాడు. కొడుక్కి 'డానియల్' అనితన తండ్రిపేరెట్టాడు.

యుద్ధం అంటే, యింక మాట్యూస్‌కి రోతనిపించింది. ఒహళ్లచావంటే తన చావనిపించింది. శాశ్వతమైన సుఖం, నిరాడంబరమైన జీవనంకావాలన్నాడు. ముఖరేఖల్లో విచారలక్ష్మి ప్రవేశించింది. కళ్లలో ఆత్మతేజం ప్రజ్వలించింది. ఆఅధికారసేవలో హానిసత్వం కనబడింది. అధికార్లొత్తిడిచేశారు. మాట్యూస్ సెలవెట్టాడు. జబ్బన్నాడు. పింఛనిమ్మన్నాడు. పైవాళ్లు 'డిస్‌మిస్' చేశావన్నారు. ఇంటికొచ్చాడు. ఇంత గుడ్డ పట్టైతేనన్నంచాలన్నాడు. ఇంట్లోమార్పు. వంట్లోమార్పు. జగవంతామార్పు. ఇల్లాంతా పుస్తకాల్తోటీ పతాల్తోటీనిండింది. భగవత్సంబంధమైన గీతలు రాతలు తీశాడు. కాస్తకాస్తే జీర్ణంచేసుకుంటూ కూచున్నాడు.

## 3

భార్య భర్తకి కడుపునిండా అన్నమెడుతుంది. జ్వరంవస్తే మేలుకొనికూచుంటుంది. కష్టంవస్తే యేడుస్తుంది. అంతేకాని ఉద్యోగం మానానంటే సుతలాం ఒప్పుకోదు. అందులో పెద్ద ఉద్యోగం. పదిమంది చేతికిందుండే కీవి. అయినా అరచేతులో ప్రాణాలెట్టుకుని, కత్తిమీదసాముచేస్తూనుంచోమంటే నుంచుని కూచోమంటే కూచుంటూ జీవనంగడజటంకన్న మానుటయే మేలనిపించింది రాణీకి. కాని పిల్లాణ్ణి చూసుగుంటే మట్టుకు ముందుగతి యెల్లాగా అనిపించింది. ధర్మం కవచంగా ధరించి, ధైర్యంతోడు నీడచేసుకుని, పతికి చేదోడూవాదోడూ అయిమెలగే యింటిపడుచుకి కష్టపరంపరలు బుద్బుదప్రాయాలు. ఆకుఱ్ఱాణ్ణి తీసుకు పట్టణంవిడిచి పక్కనున్న ఓపల్లెటూరుచేరారు. తమకున్నరొఖ్ఖం రాణీ నగలుపెట్టి యింతభూమికొన్నారు. చక్కని భూస్వాములయారు. వారినాలుగేళ్లలో గృహకృత్యనైపుణ్యంచేతనేం సంసారం పొందికచేతనేం మరింత భూమికొన్నారు. అప్పటికన్న యిప్పుడే హాయనిపించింది.

మల్బ్బారు ఆడపిల్ల. మేరిపుట్టింది. పాపం నెల తిరక్కుండా సూతికజ్వరంచేత రాణీ మంచాన్నడింది. మాట్యూస్‌చేత చేతిలో చెయ్యేయించుకుంది. మేరీ నతనిచేతులోపెట్టింది. డానియల్ నతనికప్ప జెప్పింది. శరీరాన్ని విడిచింది. రాణీని ఆతోట్లోనే సమాధిచేశారు. నిత్యం ఆమరణం కాస్సేపన్నా ఆసమాధిదగ్గర కూచోందే మానేవాడు కాడు మాట్యూస్.

డానియల్ పసికుంక, మేరీ కళ్లుతెఱవనికూన. మాట్యూస్ మొగాడు. ఆపిల్లల్ని పెంచేవారెవరు చూచేవారెవరు? అయితే ఏం ఇంత డబ్బోశాడు. పదిమంది నౌఖర్ల నెట్టాడు. తల్లిలేని లోటుతప్ప మఱి లోటేం కనపళ్లేదు.

డానియల్ పెద్దాడయాడు. విద్యనేర్చాడు. ఉన్నత విద్యన్నాడు. పరదేశం పోవాలన్నాడు. తండ్రి ఒద్దన్నాడు, బతిమాలాడు. కొడుకు మూతిబిగించాడు పట్టు విడవలేదు. తల్లిలేని బిడ్డ. తండ్రి సరే అనక తప్పింది కాదు.

## ౪

గంటకొట్టింది. డానియల్ అఖరి నమస్కారంచేశాడు. మేరీ యేడిచింది. మాట్యూస్ కన్నీళ్లకడవై పోయాడు. ఓడ బయల్దేరింది. మాయమైపోయింది. యువకులహృదయాల్లో బహుశః పాషాణాలేకాని కోమలత్వం లేవనుకున్నాడు. మేరీని వెంటబెట్టుకుని యింటికివచ్చాడు మాట్యూస్.

డానియల్ 'సీమ' జేరాడు. పరదేశవాసం. కొత్తమొహాలు. కొత్తజీవనం. కొత్తభాష. మొదట్లో తండ్రికోసం బెంగెట్టుకున్నాడు. మేరీకోసం యేడ్చాడు. ఎవరైనా పిల్లలు కనబడితే మేరీ యిల్లాఉంటుందనుకునేవాడు. మేరీ, తనూ ఆడుకున్నరోజులు పాడుకున్నపాటలు జ్ఞాపకంచేసుకున్నాడు. ఆనందం విచారం రెండూ ఉప్పొంగిపోయేవి.

మొదట్లో తండ్రికి రోజూ ఉత్తరాలు రాశేవాడు. రానురాను వారానికోటి. ఆపైన నెలకోటి. తర్వాత జ్ఞాపకంవచ్చినప్పుడెప్పుడైనా. యిల్లామారింది. డానియల్ మెల్లిగా తన చదువులోంచి ఆటల్లోను స్నేహితుల్లోను పరిచయుల యిళ్లంలోనుపడిపోయాడు. విదేశవేషాలు, విదేశభాషలు, విదేశలాంఛనాలు అలవాటు

బద్దాయి. చూస్తూండగా ఆదేశీయుడైపోయాడు. తల్లితండ్రుల్ని తలుచుకుంటే తలవంపనిపించేది. చదువయింది. బయల్దేరలేక, బయల్దేరలేక స్వదేశానికి బయల్దేరాడు.

ఇంటిదగ్గిరిన్నాళ్లూ యివాళొస్తాడు. రేపొస్తాడనుకున్నారు. ఇంట్లో ఆస్తంతా డానియల్ చదువుగా మారింది. మాట్ర్యూస్‌ని దరిద్రం ఆవహించింది. ఇహ వాళ్లకి మిగిలింది ఓ దొడ్డి, యింతయిల్లు. మేరీ దొడ్డినిండా పువ్వుల మొక్కలేసింది. గోజా పువ్వులు కోసేది. దండలుగుచ్చేది. పట్నంలోకిపోయేది. అమ్మేది. తనకడుపు, తండ్రికడుపునింపేది. డానియల్ యెప్పుడువస్తాడా అని యెదురుచూస్తూఉండేవారు.

డానియల్ బయల్దేరాడన్నారు. తండ్రికాత్రం పట్టలేదు. మార్వాళీదగ్గర కెళ్లాడు. అప్పు తెచ్చాడు. డానియల్ కోసంయిల్లాంతా అలంకరించాడు. కొత్తవస్తువులుకొన్నాడు. కొత్తగుడ్డలు తెచ్చాడు. సైలెక్కాడు. రేవుదగ్గిరి కెళ్లాడు. డానియల్ నానుమాలుకట్టాడు. చేతులుచాచుకొని 'డానియల్ డానియల్' అని పరుగెత్తాడు. డానియల్ తిరిగిచూళ్లేదు. తన్నుచూసీ, ఆనుమాలుపట్టనట్టు తప్పించుకుపోతూన్న డానియల్ని చూశాడు. అతని పక్కనున్న పాశ్చాత్యపడుచు తన కోడలనిగ్రహించాడు. దరిద్రంలో యెండచేనలు పెక్కిఉన్న తన తండ్రినెక్కడ తనభార్యచూసిపోతుందో అని పెదమొహంతో రెండుఖబుర్లుచెప్పి ఓసలాంకొట్టి తటాలున పెళ్లాంతో బండెక్కివెళ్లిపోయాడు డానియల్.

మాట్ర్యూస్ యింటికివచ్చాడు. డానియల్ ఉద్యోగంలో ప్రవేశించాడు. మాట్ర్యూస్‌కి రోగం ప్రవేశించింది. మాట్ర్యూస్ డానియల్‌కి ఉత్తరాలువేశాడు. డానియల్ తనతండ్రి నొఖణ్ణీ తనదగ్గరికి గమ్మన్నాడు. మేరీవద్దన్నాడు. మేరీని విడిచిపెట్టమన్నాడు. మేరీని మరిచిపొమ్మన్నాడు. చివరకి డానియల్ తండ్రిని మరిచిపోయాడు.

మాట్ర్యూన్‌కిరోగం ఎక్కువయింది. బెంగవృద్ధయింది. మేరీఅల్లాగే తనతోట్లో పువ్వులమ్ముతూ తండ్రిని కాపాడుతూండేది. ఆనాడు అల్లాగే తండ్రినడిగి ఊళ్లోమీటింగులో పువ్వులమ్మపోయింది.

మేరీ తండ్రిదగ్గిర శలవుచ్చుకొని తోట్లోకొచ్చింది. ఇంకా యిన్ని పువ్వులుకోసుకుంది. గబగబామీటింగుకోసవని వెళ్లిపోయింది.

నిశాకాంత శ్యామలమై పుష్పితమైన ఆవనలతలమీద పన్నీరుజల్లి పారిపోయింది. దినకరుడు మెల్లిగా ఆ ఆకులమీద పువ్వులమీద మెటిసి దొల్లిపోతూన్న చిన్నచిన్న మంచుముత్యా లేఱుకుంటున్నాడు. మెల్లిగా డేకుంటూవచ్చి ఆ ప్రశాంతమైన సమయాన్ని మాట్ర్యూస్ తనభార్య సమాధిదగ్గిర జేరాడు. వెఱ్ఱి ఆనందంలో మునిగిపోయాడు.

ఆనాటి మీటింగులో ఆదేశముయొక్క ఉన్నతిని గురించి మాట్లాడారు. ఉద్రేకపూరితమైన ఆ ఉపన్యాసాలు జనాన్ని ఎత్తికుదేశాయి. ఒక్కొక్కళ్లు శిబిచక్రవర్తులో, రాణాప్రతాపులో, ఝూన్సీలక్ష్మీ బింబంమట్టుకు బొయిలో అయిపోయారు. మేరీయింటి మొహంపట్టింది. ఆ ఉద్రేకమైన మనస్సులోంచి తనస్థితియొక్క పోలేదు. తనతండ్రికి తానోభారమైపోయినట్లు గ్రహించుకుంది. ఇంత తాడో, అంతగొయ్యో తన్నుధరించక పోదనుకుంది. ఆనాటి సాయంకాలమే జరగాలనుకుంది, ముహూర్తం నిశ్చయించుకుంది. ఇంతలో చటుక్కున మార్వాళీ కనపడ్డాడు. మేరీగుండె గుభిలుమంది.

మేరీ:—అయ్యా! క్షమించండి. మీడబ్బు కొద్దిరోజుల్లో—

మార్వాళీ:—లేదమ్మా మీ అన్నయ్య మాడబ్బంతా మాకిచ్చేశాడు. అబ్బో! నెలయింది. అణాపైసల్తో ఆహా—ఏం సరసుడమ్మా. అడక్కుండా, నంచో బెట్టకుండా. అల్లావుండాలి కాతా అంటే, డబ్బిచ్చాడు నోటుట్రాన్సఫరు పొందాడు.

ఒఖసారి చేటంత అయింది మేరీమొహం. అన్న మారిపోలేదనుకుంది. మార్వాళీమాటలు వినకుండానే ఒఖపరుగులో పోయింది. తండ్రితో సువార్త చెప్పటానికి ఇంటికెళ్లింది. గబగబా తలుపుకొట్టింది. తలుపువేసి చూసింది. తలుపుమీద కాయితంకనబడింది. జప్తుకాయితం మాట్యూస్ ఆస్తి జప్తుచేశారు.

ఎల్లాగ ? నోటుట్రాన్సఫరుపొంది.

ఎవరు ? డానియల్.

ఎందుకని ? ఆ స్త్రి అన్యాక్రాంతం చెయ్యకుండా.

మేరీ తనేకదా అన్యురాలని గ్రహించిది. లోపల్నించి మూలుగు వినబడింది. తలుపుతట్టింది. యేడుపు బొబ్బలు వినబడ్డాయి. తనతండ్రి నెత్తుకుపోతున్నారో, బాధపెట్టి చంపుతున్నారో అనుకుంది. ఒఖతన్నుతన్నింది. తలుపూడిపడింది. లోపలికొఖ ఉరుకురికింది.

✂

మాట్యూస్:—నేనే-నేనే-మేరీ. మరెవ్వరూలేదమ్మా. లక్షలకొద్దీ ప్రాణాలు తీసిన యీ చెయ్యి ద్రోహం చెయ్యలేకపోయింది. అమ్మా కత్తిపోటు గురితప్పింది:-అయ్యో-. బాధ—. మేరీ-నీ సోదరుడు-కాదు, కాదమ్మా-. నా కొడుకు-. నానమోనా-.నా ఆస్తి—

మేరీ:—నాన్నా నువ్వంత భీరుడవా-

మాట్యూస్:—అమ్మా-నీవూ నన్ను నిందిస్తున్నావా? ఆ గోరీకేసిచూడు-.ఈ చేత్తో అతన్ని-

మేరీ:—ఆగు-నాన్నా-నీపాదములు సాక్షి, అదౌర్భాగ్యంతో నువ్వు ప్రాణత్యాగం చేసుకున్నందుకన్నాగాని—

మాట్యూస్:—అయితే, అమ్మా-మేరీ-నే బతకను—బాధ-మేరీ నీవు నిజంగా నాకూతురువేనా?

మేరీ:—నాన్నా-నేను నీ మేరీనికాను-నీ కూతుర్నికాను.

మాట్యూస్:—అయ్యో రక్తం పోతోంది. పాపిష్టిప్రాణంపోదు. అమ్మా. నాకడసారికోరిక. ఒఖకోరిక-నీపాదాలట్టుకుంటా. తీరుస్తావా తల్లీ.

మేరీ:—తండ్రీ! అంత అపనమ్మకమా? నాప్రాణాలైన నీకొఅర్పించనో ?.

మాట్యూస్:—అమ్మా-అంత మాటోద్దు. ఒట్టువెయ్యి-తీరుస్తావా?

మేరీ:—ఇదిగో ఒట్టు.

మాట్యూస్:—మాటతిరగని జాతినీది. ఇదిగో ఒఖపోటుపొడు-కత్తితీసుకో—బాధ అయ్యో! అయ్యో!

మేరీ:—ఓ భగవంతుడా. ఎట్టి పరీక్ష తెచ్చిపెట్టావు - తండ్రీ -యింత నిర్దయుడవా—ఆ—రుణంతీర్చుకుంటా-నాన్నా, కళ్లుమూసుకో. ఇదిగో ఆఖరి నమస్కారం. భగవంతుడిమీద దృష్టినిదానించు. కళ్లుముయ్యి. కత్తితీసుకున్నా-ఇదిగో-ఒకటి-రెండు-మూడు.

మేరీ కత్తితో తన గుండెల్లో పొడుచుకుంది. తనతండ్రికి నమస్కారంచేస్తూ వెనక్కివాలింది. మాట్యూస్ కళ్లువిప్పాడు మేరీనిచూశాడు. ‘ఓ నారీ—మఱి మాటలేదు. మాట్యూస్ కట్టయి, రాయయి, వజ్రమయి పోయాడు. ఆ ఆత్మలు రెండూ ఒకదానిని ఒకటితరువుకొంటూ నిత్యాత్మలో కలిసి పోయాయి.

# ఆహారణము

## (సాహిత్యక్షేత్రమున భారతనారి)

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

### భారతీయవైదికయుగము

ఈకాలమున ననేకులముఖమునుండి "స్త్రీలకు వేదపాఠాధికారములేదు" అనువిషయమును వినుచున్నాము; కాని వేదోపనిషత్తులందుఁ గొంచెమేని జ్ఞానముగలవారి కిట్టి భ్రాంతియుండదు. నాఁటి యాదర్శయుగమున "కన్యాప్యేవం పాలనీయా శిక్షణీయాతి యత్నతః" అను నక్షరార్థము ప్రతిపురుషుని చేతను బాలింపఁబడినది. తపోవనమున ఋషిబాలకుల పార్శ్వమున ఋషిబాలికలుసైతము విద్యాభ్యాసమును జేసెడివారు. హోమగుండముయొక్క నాల్గుదిక్కులందును ఋషిగణముయొక్క పార్శ్వమున వారిమాత, భగిని, పత్ని, దుహిత మొదలైనవారు కంఠమును గలపి వేదమంత్రోచ్చారణ జేసెడివారు. కేవలముచ్చరించుటయేగాక నాఁటి స్త్రీలు వేదమంత్రములనుసైతము రచించిరి. ఋగ్వేదసంహితలో బహుసూక్తములు రమణీగణముచే రచింపఁబడినవే. విశ్వవార, వాక్, లోపాముద్ర, సూర్య, అపాల, యామిదేవి, శాశ్వతి, ఊర్వశి, ఘోష మొదలగు స్త్రీలు ఋగ్వేదమున బహుసూక్తములు రచించిరి. అట్లు రచింపఁబడిన యనేకమంత్రము లెవరిచే రచింపఁబడినవి? యనువిషయము నెఱుంగకయే మనము దైనికానుష్ఠానవ్యవహారము నాచరించుచున్నాము.

### దార్శనికయుగము

వైదికయుగము తర్వాత దార్శనిక యుగముద్భూతమైనది. మైత్రేయి, గార్గి, మొదలగు దార్శనిక నారీగణ మీనాఁటియుగముకంటె మిగుల గౌరవస్వరూపము గలదియు, పాండిత్యవిషయములో నగ్రగణ్యముగనున్నది. బృహదారణ్యకమున ననేకపృష్ఠములు మైత్రేయీవిరచితములు. ఈమె పండితప్రవరుఁడైన యాజ్ఞవల్క్యుని ధర్మపత్ని. "అసతోమాసద్గమయ. తమసోమా జ్యోతిర్గమయ," అను నీయమృతమయ ప్రార్థనావాణి సర్వప్రథమమున నొక నారీకంఠమునుండి ధ్వనించినది.

దేవహూతి, ఆత్రేయి, లీలావతి, ఘన, భారతిదేవి మొదలగు ననేకస్త్రీలు జ్ఞానవిషయములో పురుషాపేక్షితలైయుండిరి. ఘనా, లీలావతుల నామమెఱుఁగని జనము

మన దేశములో లేదు. ఇద్దఱును గణిత, జ్యోతిష శాస్త్రములందు మంచి పండితురాండ్రు. ఘన జ్యోతిషశాస్త్రములోఁ బ్రఖ్యాతిగన్న యొకానొక ప్రతిభాశాలినియైన రమణి. ఈమె స్వయముగ వైజ్ఞానికతత్త్వసమూహములను బహింష్కారమొనర్చినది. ఈమె మామ సుప్రసిద్ధ జ్యోతిషపండితుఁడైన వరాహుఁడు. ఒకనాడీతఁడాకాశమండలమునందలి నక్షత్రముల లెక్కింప రాజాదిష్టుడై యట్లుచేయలేక యీమెను శరణువేఁడెనట. నాఁటిదినములలో గణితజ్యోతిషశాస్త్రము లెంతదూర మభివృద్ధిగాంచెనో యీకథను జదివినఁ దెలియును.

మఱియును భారతియను నొకస్త్రీ భారతదేశమున మిగుల ప్రసిద్ధిగాంచినది. ఈమె లోకవిఖ్యాతులైన శంకరాచార్యులవారి సమకాలికురాలు. అశోకుని రాజ్యకాలమున బౌద్ధధర్మమునకు మహావ్యాప్తిగలిగినది. నాఁడెందరో స్త్రీలు బౌద్ధసంఘమునఁ బ్రవేశించి తద్గ్రంథములఁ బఠించిరి.

## మహమ్మదీయ యుగము

యుద్ధములో రక్తపాత మొకవైపున, వీర్యవతులైన నారీయభ్యుదయ మొకవైపున, సాహిత్యసాధికారమణిగణోత్పత్తి మఱియొకవైపున, నీయుగమున జరిగినది. ౧౫-వ శతాబ్ద్యారంభమున ఐతిహాసికసూత్రమున రమణీగణము సాహిత్యక్షేత్రమునఁ బురుషులపార్శ్వమునఁ దిరుగుట చూడగలము. ఆర్యావర్తమేమి, దాక్షిణాత్యమేమి, భారతదేశమంతయు నీసమయములో రమణీగణముయొక్క కవిత్వముచే ముఖరితమైనది. చిత్తోర్ రాణి మీరాబాయిచే రచింపఁబడిన భక్తిసముంచిత పదావళులు నేఁటికిని రాజపుటానాలోఁ బ్రతిమఠమునందును ఘట్టమునందును గానముచేయఁ బడుచున్నవి.

## చైతన్యదేవుని యభ్యుదయము

చైతన్యదేవుఁడు షోడశ శతాబ్ద్యారంభమున జన్మించెను. ఇతడు వైష్ణవ ధర్మమును జాతి విభేదములేక ప్రేమధర్మస్వరూపముగఁ బ్రచారముగావించెను. బంగాళీయువతియైన మాధవియను నొకకవయిత్రి చైతన్యుని సమకాలికురాలు. ఆమెకవిత్వ మామె సమకాలికులైన వైష్ణవ కవుల దృష్ట్యా యేయంశమునందును నికృష్టముగాదు. మాధవియొక్క పదము లైతిహాసికతత్త్వపూర్ణములు. షోడశసప్తదశ శతాబ్దములలో రమణీగణము చాలవఱకు సంస్కృతభాషావిశారదముగ నుండినది. వైజయంతీదేవి భర్తయైన కృష్ణనాథసార్వభౌముఁడు "ఆనందలతికాచంపు" అను పుస్తకమును వ్రాసి యందా పుస్తకమును వ్రాయుటలో నాతనిపత్నియెక్కువ సాయపడినదని వ్రాసెను. మహామహోపాధ్యాయ యింద్రేశ్వరచూడామణి యొక్కకుమార్తె మానినీదేవియను నామె

స్మృతితత్వమునఁ బ్రజ్ఞావంతురాలు. సుప్రసిద్ధనైయాయికుఁడైన రుద్రమంగళుఁ డీమె పుత్రుఁడే.

౧౯౦౦-వ శతాబ్దము పాశ్చాత్యశిక్షకారంభము. ఇపుడు క్రమశః స్త్రీశిక్షాప్రసారమున కనేకవిధములుగ నభివృద్ధిగలిగినది. పురుషులపార్శ్వమున నే యనేక స్త్రీలు B. A., M. A. పరీక్షలందుఁ గృతార్థలగుచున్నారు. అవరోధప్రథ చాలవఱకు తగ్గిపోయినది. సాహిత్యక్షేత్రమున స్త్రీలు ప్రతిద్వంద్వులుగ నిలచిరి. కావ్యరచన, ఉపన్యాసదాన, మాసికపత్రసంపాదన మొదలగు విషయములలో స్త్రీలు ప్రతిష్ఠను సంపాదించుచున్నారు. సామాజికక్షేత్రమున గృహాస్థకన్యాసమూహము, శిక్షయిత్రులు, ధాత్రులు, డాక్టరులు మొదలగువారుగ నయి త్వరగ జీవితోపార్జనముచేసి కేవలము తను పోషణమేగాక పరివారవర్గముయొక్క లేమినిసైతము పోగొట్టుచున్నారు. రాజకీయ నైతికసభామంటపములలో స్త్రీ లుత్తేజసమైనవాక్యములతో జాతీయసంగీతములలో శ్రోతృవర్గమును బులకితముగను ముగ్ధముగను జేయుచున్నారు.

—'వంగలక్ష్మిలోని' శ్రీమతి స్వర్ణకుమారీదేవిగారి వ్యాసమున కనువాదము.

# తన్మయత్వము

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

నీవినీలకుంతలముల సౌరు జూచి
నీ వినూత్నంపు శ్యామల తనువు జూచి
నీదు స్నిగ్ధకపోలంపు నీటు జూచి
నాదు నెమ్మేను తన్మయత్వంబు జెందు.
నీదు కోమలమందహాసంబు జూచి
ప్రేమసంసిక్తనాలాపప్రియము నెంచి
నీమనోమోహానంబగు రూపు జూచి
నాదు నెమ్మేను తన్మయత్వంబు జెందు.
మృదుమృణాలములను గేరు హస్త
ములను చిత్రింపు వేణువు నలరదాల్చి
నీప్రవాళాధరమున చుంబింప జేసి
లోకములు లోలతను బొందుగీతకలను
బాడుచుండంగ పరవశత్వంబుగాంతు.
లోకమోహన మురళీనినాద గీతి
భూతసమ్మోహనంబుగా బాడుచుండ
భూగగన వ్యాప్తమై వీనువిందు జేయ
నాదు నెమ్మేను తన్మయత్వంబు జెందు.
చారుమురళీరవంబు నాచెవుల సోక
నాక్షణంబున సకలంబు మరతు నేను
నీ కిశోరంపు ముగ్ధరూపంబు జూచి
భావసామ్రాజ్యమున గాంతు స్వర్గపదవి.

# నవ్వుతాలు

తాత కృష్ణమూర్తిగారు బి. యె; యల్. టి.

## పాదధూళి

ఊళ్లోకి స్వాములవారు వేంచేసి వున్నారని తెలిసి, ఒక గృహస్థు వారి దర్శనానికి వెళ్లి, శాస్త్ర రీత్యా వారిని స్తుతించి, భిక్షకు రావలసిందని ప్రార్థిస్తూ, "మీ రాకవలన నా జన్మ తరించినట్లు భావిస్తాను. నా యిల్లు పావనం అవుతుంది. మీ పాదధూళి నా శిరాన్ని దాలుస్తాను." అని వినయంగా అన్నాడు.

స్వాములవారికి పట్టరాని కోపం వచ్చింది.

"ఏమయ్యా! యతీశ్వరులను యెగతాళి చేస్తే, వారికి ఆగ్రహం కలిగి శపిస్తారని యెరగవా? మా పాదాలకు ధూళి వున్నదని ఆక్షేపిస్తావా? నీ పాదాలు శుభ్రంగా వున్నాయా? పాంకోళ్లుతప్ప, యింకో పాదరక్షలు మేము ధరించకూడదని కాని, లేకుంటే, పేటెంట్ లెదర్ బూట్సు వేసుకోలేక పోయినామా?"

*    *    *    *    *

## విధేయత

మాజిస్ట్రేటు—వాదిని నీవు రోడ్డుమీద అడ్డగించి, తన్నినట్లు సాక్ష్యము వచ్చుచున్నది. ఏమందువు? లేదన గలవా?

ముద్దాయి—చిత్తం! తమరెట్లా చెప్పమని సెలవిస్తే, ఆ మోస్తరుగానే చెప్పగలను. లేదని చెప్పవలెనా, అండి?

*    *    *    *    *

## ప్రతివాది

బరంపురంలో, వీధులవెంబడి, గాడిదలు తిరుగుతూ వుండడం తరుచు. ఒకనాడు మాజిస్ట్రేటుకచేరీలో ఒకానొక ప్లీడరు గంభీరంగా వాదిస్తున్నాడు. చాదస్తంగా, చెప్పిన సంగతే నొక్కినొక్కి చెబుతూ వున్నాడు, పెద్దగొంతుకతో! కచేరీకి వెలుపల, సమీపంలో ఒక గాడిద నిల్చుని తీవ్రంగా ఓండ్ర పెడుతూ వుంది. దాని అరుపుకు, కచేరీ అంతా ప్రతిధ్వనులతో మ్రోగుతూ వుంది. కాని, ప్లీడరుగారి వాగ్ధోరణి ఆగ లేదు. ఇంకా గొంతుక పెద్దచేసి, ఆయన యేదో చెబుతునే వున్నాడు.

అప్పుడు మాజిస్ట్రేటు, "అయ్యా, ప్లీడరుగారూ, కొంచెంసేపు ఆగండి." అని నవ్వుతూ గాడిదవేపు చెయ్యిచూపి, "వారు సెలవిచ్చేది యేదో సాంతం అయినపిమ్మట, మీ వాదన మళ్లీ ప్రారంభించవచ్చును." అన్నాడు.

*    *    *    *    *

## చమత్కారము

వ్యాకరణసూత్రము—"తాదర్థ్యమున చతుర్థియగు. ఉదా: చావునకై సీతం గోరెను."

విమర్శకుడు—రాముడు సీతం గోరలేదా? ఆకోరుట చావునకా? కోరినందున రావణుడు చచ్చెను గాన నట్లు చెప్పుట అందురు. ఋజుమార్గమున బాలబోధము చేయవలసియుండగా, ఈ చమత్కార మేల? పెద్దలు 'ముక్తికై హరిని సేవించుచున్నాడు.' అని యుదాహరించిరి.

*    *    *    *    *

## యాచన

ఈమధ్య ఒక బ్రాహ్మణుఁడు నావద్దకు యాచనకు వచ్చివుండెను. వృద్ధుడు, చదువుకున్న పండితుడి వలెనే కనిపించినాడు. నాపేరూ, గోత్రం అడిగి, ఆశీర్వదిస్తూ, ఆశువుగా ఒకపద్యం చదివినాడు.

"తమరు ప్రభువులు, యువకులు, ధర్మదాతలు. నేను పరదేశీయుణ్ణి, బీదవాడిని, విద్వాంసులను సత్కరిస్తారని తెలిసి, తమ దర్శనానికి వచ్చినాను. ఈ మాఘమాసంలో వివాహముహూర్తము లున్నవి గనుక, యేదో తమవంటివారి అనుగ్రహంవలన, తిరిగీ ఒక యింటివాడను కావడమునకు సంకల్పించి, దేశాటనం చేస్తూవున్నాను. అటుపైని తమ అనుగ్రహం—నా అదృష్టం!"

"అయ్యా, మీవంటి వయసుమీరినవారు పెళ్లి తలపెట్టడం ఆశ్చర్యంగా వున్నది. చదువుకున్నవారు కదా, పోనీ మీరు సెలవియ్యండి? ఈ పెళ్లివలన మీకేమిలాభం? మరోవిధంగా యాచిస్తే సంతోషించి వుందును. మీరు పండితులుగనుక, యథారీతిని సత్కరించి, నా శక్తికొద్దీ యేదో ముట్టజెబుదా మనుకున్నాను. కాని, పెళ్లిమాట చెప్పినారుగనక—క్షమించండి—నేను యేమీ యివ్వను. ఇస్తే ఆమూలంగా నిష్కారణం ఒక పసిపిల్ల గొంతుకకోసినవాడిని అవుతాను." అని నిర్మొహమాటంగా చెప్పినాను.

"చిత్తం. చిత్తం......తమ చిత్తవృత్తి తెలుసుకోలేకపోయి, ఆవిధంగా మనవిచేసుకున్నాను. పెద్దవాడిని గనక, పెళ్లిపేరుచెబితే, రూపాయి దొరికేచోట రెండురూపాయలు దొరుకుతవికదా అని ఆశపడినాను. అంతేకాని, మళ్లీ పెళ్లిచేసుకునేందుకు నేనంత గడ్డితినేమూర్ఖుడనా అండి? ఇప్పుడున్న భార్యాపిల్లలను పోషించడానికే కదా అండి, యీ అవస్థంతాను? 'భార్యానిమిత్తం బహుకృతవేషం!' అన్నారు మనవాళ్లు.

* * * * *

## లాభనష్టములు

"అయ్యో, బంగారంలాంటి గొడుగు! ఎక్కడ మరచిపోయినానో కదా?......మొదట పెళ్లివారింటికి వెళ్లి, అక్కడినుంచి ప్లీడరుగారింటికి వెళ్లినాను. అటునుంచి తిన్నగా యిక్కడికే వచ్చినాను. కాబట్టి గొడుగు ప్లీడరుగారింటనే మరచిపోయివుంటాను."

"ఏమి? పెళ్లివారింటనే మరచిపోయి వుండకూడదూ?

(చిరునవ్వుతో) అందుకు వీలులేదు. అసలాగొడుగు నాదిగాదు. పెళ్లివారింటికి వెళ్లినప్పుడు అక్కడది నాకు దొరికింది!"

* * * * *

## కర్మ

గురువు—'రామఁడు రావణుని వధించెను.' ఈ వాక్యమున వధించుటనునది క్రియ. క్రియయొక్క ఫలమ ననుభవించిన వాఁడు రావణుఁడు. కావున రావణుఁడు, 'కర్మ.' అట్లే, 'అశ్వముం గొట్టెను' అను దానిలో కర్మయేది?

శిష్యుఁడు—ఈవాక్యమున కొట్టుటను నది క్రియ కావున, క్రియయొక్క ఫలము. సరిగా పరుగెత్తుట! ఆఫలమును రౌతు అనుభవించును. కాబట్టి కర్మ యెవరు? రౌతు!

* * * *

# స్వార్థ త్యాగము

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు గారు

భరతఖండము పతివ్రతామతల్లులకు నిలయము. పగతురబారినుండి పతిని రక్షించిన పద్మినివంటి వీరవనితలవలనను, సంగరమున నోడి గృహముజేరవచ్చిన పతిని యుద్బోధించి మరల రణమొనర్ప బంపిన ఖడ్గతిక్కనసతివంటి వనితామణులవలనను మిగుల యశముగాంచి 'మోదభాష్పముల్ విడచిన ముద్దరాలు' మన భరతమాత. కొలదికులమున నుద్భవించినను తన యసమాన స్వార్థత్యాగమువలన నొక రాచకుటుంబమును నిలువబెట్టి నీరుబోసినది పన్నాయను నొక మహాసాధ్వి. ఈమె దాసియైనను భారతరమణీమణులలో నగ్రస్థానము నాక్రమించుచున్నది. ఈమె యొనరించిన సత్కృత్యమే ఇచట విపులముగ వివరింపబడినది.

౧

ఆదినము చిత్తూరుపట్టణమునం దెటగాంచినను శోకదేవత తాండవమాడుచుండెను. అరిజనభయంకరుడై తన బాహుబలమున పెక్కు యుద్ధములందు జయము గాంచిన మహావీరుడును చిత్తూరు పురాధినాధుడును అగు సంగ్రామసింహుడు ఆదినముననే మరణించెను. ఆమహావీరుని ధర్మపత్నియగు కరుణావతి సహగమనమొనరింప జలకమాడి నూతనవస్త్రముల ధరించి, కన్నులువిప్పని తన చిన్నికుమారుని కరములనిడికొని, ప్రేమాతిరేకసంజనితభాష్పసలిలబిందుసందోహంబుల నతని వదనారవిందంబు దడపుచు, ఆతని రక్షింప తెన్నుగానక తనకడనున్న దాసియగు పన్నానుగాంచి వినయము వెల్లివిరయ నిట్లనెను. "నేను సహగమనమొనరింప నేగుచున్నాను. నాకుమారునకు ఇక నీవేదిక్కు. నీసుతునితోబాటు నా బిడ్డనికూడ జూచుకొనుము. అన్నిటికన్న ప్రపంచములోచుల్కన తల్లిలేనితనయుని బ్రతుకేకదా! ఆపదలయందు నాసుతుని రక్షింపుము." అని యాయమ్మ తనకుమారుని పన్నాకరములయందిడెను. కనులనుండి యశ్రుకణములురాల కరుణావతి వెనుదిరిగిచూచుచు వెడలలేక వెడలిపోయెను. ఆహా! కన్నకడుపుకదా!

పడుకటింట నలరుపాన్పుపై బవ్వళించియున్న పతినిడాయబోవు సతివలె, మోమున పతివ్రతాత్వంబు మొలకలెత్త, 'చిన్నిలేనవ్వు పెదవుపై చిందులాడ' కరుణావతి తనభర్త చితికడకేగి ముమ్మారు ప్రదక్షిణ మొనర్చి, గంధాక్షతలతోడ నాత్మేశ్వరుని చితిని పూజించి, వెఱపువిడచి, అగ్నిలో బ్రవేశించి భర్తతో ప్రకృతిగర్భమున లీనమైపోయెను.

౨

సంగ్రామసింహుడు మరణించునప్పటికి యువరాజు కడు పిన్నవాడగుటచే, వనవీరుడను నాయకుడు రాజ్యభారమును వహించి యువరాజుపేరున పరిపాలించుచుండెను. ధనమన్న ఎంతవానికైనను ఆశ జనియించునుగదా! కొన్నిమాసములు గడచునప్పటికి, యువరాజును సంహరించి తాను మహారాజు కావలెననెడిదుర్బుద్ధి వనవీరునకుద్భవించెను. ఆతడు తగుసమయమునకై వేచియుండెను.

ఈవార్త పన్నా వినినంతనే మిగుల భయపడెను. కరుణావతిపలికిన పలుకులన్నియు అమెకు జ్ఞప్తికివచ్చెను. తనపైబడియున్న భారము నపుడామె గుర్తించెను. ఆవార్త వినిన నాటనుండి పరాత్పరునిపై భారమువైచి సర్వవేళల యువరాజును కడుజాగ్రత్తతో కాపాడుచుండెను.

3

ఒకదినమున యువరాజు పరుండియున్న పాన్పుప్రక్కన పన్నా కూర్చుండి జోలపాట బాడుచుండెను. ఇంతలో సేవకుడొకడు పరుగుపరుగున నరుదెంచి, నాల్గువైపుల కలయ జూచి పరులెవరు లేరని కనుకొని, వెలవెలబోవుముఖముతో పన్నానుగాంచి "క్రూరచిత్తుడగు వనవీరు డీరాత్రి మనయువరాజును సంహరింపనున్నాడు. ఆతడీవిషయమును తన ప్రాణమిత్రులతో ననుచుండగా తెరచాటుననుండి వినగలిగితిని-కర్తవ్య మాలోచింపుము. ఈ విషయములో నేను కావలసిన సహాయమును నీకు జేయగలను. సంగ్రామసింహమహారాజనిన నాకును అభిమానముకలదు." అని పలికెను.

సేవకుని పలుకులు వినినంతనె పన్నా శిర మొకింతవంచి యోచింపగడగెను.

సేవకుడు:—ఇంక యోచించిన లాభములేదు. కాలము సమీపించుచున్నది.

పన్నా:—త్వరపడవలదు. నేను నీకొకయుపాయము దెల్పెదను: ఈదినము ప్రొద్దుగ్రుంకువేళ నేను మన యువరాజు నొకగంపయందిడి నీకొసంగెదను. నీవాగంపతో పొలిమేరకడ వేచియుండుము.



శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు

ఉభయభాషా ప్రవీణురాలు

















1 పయికారానది　　3 శ్రీకృష్ణుడు　　2 బొటానికల్ గార్డెన్స

5 కుక్కలు　　4 పయికారానదిపాతము.　　6 వారణాశి

సేవ:—యువరాజులేనిచో వనవీరు డూరకుండునా? నీవేరీతి కోట వెడలి వత్తువు?

పన్నా:—తక్కిన కార్యమంతయు నేను సాధించెదను; నీవు యువరాజును గొనిపొమ్ము.

సేవ:—అట్లే.

కొంతతడవు యోచించి పిదప సేవకుడు వెడలిపోయెను.

౪

సూర్యుడు పశ్చిమాంబుధిలో మునిగిపోయెను. కొంత తడవునకు కటికిచీకటి జగమెల్ల గ్రమ్ముకొనెను. నిర్ణయించినవిధమున సేవకుడు పన్నాకడ కరుదెంచి ఆమెయొసగిన బుట్టను శిరమునవిడుకొని మెల్లగా కోటద్వారముదాటి వెడలిపోయెను.

యువరాజు రక్షింపబడెనని వనవీరుడు విన్నచో పన్నాను ప్రాణములతో విడువడు. యువరాజును పట్టితెప్పింప భటులను నాల్గువైపులకు బంపును. కానరానున్న అపాయమును తప్పించుటకై పన్నా పరిపరివిధముల యోచింపగడగెను.

తుదకు తనకుమారుని బిలచి "నాయనా! నీవీ యంగీని ధరింపు" మని పలుకుచు వానికొక విలువగలయంగీ నొసంగెను. బాలుడు వెలవెలబోవుముఖముతో తల్లినిజూచుచు "అమ్మా! దొరగారుధరించు అంగీ నాకెందుకు, దొరగారుచూచిన యూరకుందురా" యని పలికెను. అంత నాయమ్మ దుఃఖమును దిగమ్రింగుచు, కుమారుని దగ్గరకు తీసుకొని శిరమునూర్కొని, చుబుకంబునువ్వి, మందమధురాలాపంబుల "నాయనా! మన యువరాజు ధరించు దుస్తులన్నియు నేను నీకుతొడిగెదను. నీవాదుస్తులతో నెంతసొగసుగా నుందువో నన్ను చూడనిమ్మ" ని పలుకుచు యువరాజుధరించు దుస్తులను తనకుమారునకు దొడగి యువరాజుపరుండు పాన్పుపై పరుండబెట్టి తాను ప్రక్కనగూర్చుండెను. యువరాజుదుస్తులను తాను ధరించినందులకు మిగుల సంతసించుచు అమాయకుడగు నా బాలుడట్లే నిదురించెను.

ఇంతలో కాలయమునిరీతి వనవీరుడు ఖడ్గమును చేతబట్టుకొని పన్నాకడ కరుదెంచి భీకరముగ 'యువరా జెచ్చటనున్నా' డని ప్రశ్నించెను. ఆపాదమస్తకము భయముచే ముచ్చెమటలుగ్రమ్మ, పలుక నోరురాక, యువరాజువేషమున పాన్పుపైనున్న తన కన్న కుమారుని పన్నా చూపించెను. సత్వరము క్రూరుడగు వనవీరు డాబాలునిపైబడి వాని శిరమునుఖండించి వెడలిపోయెను. ఆ ఘోరకృత్యమును జూడ నేరక నేలగూలియున్న పన్నా

కొంతతడవునకు తెప్పరిల్లి కడుపుమంటకు లోలోన కుమిలి కుమిలి చేయునదిలేక విగత జీవుడై పడియున్న తనయునిసోయగ మొకసారి కన్నులారజూచి, యువరాజును గొనిపోయిన సేవకుని గలుసుకొనుటకై వేగమె వెడలిపోయెను.

యువరాజు రోగపీడితుడై మరణించెనని ప్రజలకుదెల్పి, వనవీరు డాబాలుని దేహమును శ్మశానమునకంపెను. యువరాజునే తాను సంహరించినటుల నమ్మి మఱునాడు సింహాసనము నధిష్ఠించి రాజ్యము నుద్యల్లీల బాలింపగడగెను.

౫

నగరము వెలుపలనున్న సేవకుని కలసికొని పన్నా అచ్చటకు సమీపముననున్న కోయపల్లె కేగెను. అచ్చట కోయవారితో స్నేహమొనర్చి యచటనే తన నివాసము నేర్పరచుకొనెను.

ఇట్లు కొన్నివత్సరములుగడచిన పిదప యువరాజు పెరిగి పెద్దయయ్యెను. సామంతనృపతులకెల్లరకు వనవీరు డొనరించిన ఘోరకృత్యమును దెల్పుచు, యువరాజునకు సహాయము జేయరమ్మని పన్నావార్తల నంపెను. క్రూరుడగు వనవీరుని పరిపాలన తొలగింప నుత్సాహముతోనున్న నృపతులెల్లరు యువరాజునకు సహాయమొనరింప నేతెంచిరి. నృపతులతోగూడి యువరాజు చిత్తూరుగడిని ముట్టడించి వనవీరుని రణరంగమున సంహరించి సింహాసనమునధిష్ఠించెను.

తన్ను రక్షించి తనవంశమును నిలువబెట్టిన పన్నామహాసాధ్విని యువరాజు మిగులకొనియాడి కన్నతల్లివలె కడుగౌరవము జూపుచు ఆమె జీవితాంతమువరకు పూజించెను.

ఇట్టి సాధ్వీమణులుండుట వలననే నేటికిని కొన్ని రాజకుటుంబములు నిలచి యున్నవి.

గీ. కొలది కులమున బుట్టిన వెలదియైన,
కన్నకొమరుని నీచుని కత్తికొసగ
రాచబిడ్డని రక్షించి, రాజ్యమొసఁగె,
ఇంతకన్నను సత్కృత్యమేమి కలదు?

# విద్వాంసుడెవడు?

## శ్రీమతి కల్వాల పార్వతకుమారిగారు

ఆదినుండియు సనాతనులచేతను అధునాతనులచేతను విద్వాంసుడని చెప్పబడుమానవుడు సామాన్యముగా కొంత లోకజ్ఞానము తెలిసి శాస్త్రములయందు పరిచయము కలిగినవాడై కర్తవ్యాకర్తవ్యములను తెలిసికొనకయో తెలిసికొనియో యుండుట పరిపాటియైనది. శాస్త్రములను సాంగముగా చదివియు ధర్మమునను సరింపక మార్గ్యము నవలంబించువారిని లోకము లక్ష్యమే చేయదు. వానిని విద్యకలవానినిగానే భావించదు. శాస్త్రానుభవము కొంచెముగా కలిగియున్నను బుధవిధేయుడై వినయప్రవర్తనుడై ధర్మాచరణకలవానినే లోకము ప్రశంసించును. వానినే విద్వాంసునిగా భావించును. విద్వాంసుడను పదము కేవలము మీమాంసాదిశాస్త్ర పరిచయముగాని రఘువంశాదిపరిచితిగాని కలవాడే విద్వాంసుడని యర్థమును బోధించుటలేదు. ఒకకార్యమును సాధించుటకుగాని భగవత్సాన్నిధ్యమును పొందుటకుగాని పరోపకారార్థమైచేయు యేకార్యమునందైనను మిక్కిలి జాగరూకతతో మెలగి తన నైపుణీవిలసనమున నాకార్యము ననాయాసముగా నిర్వర్తించువాడాయా కార్యములయందు విద్వాంసుడని పిలువబడుచున్నాడు. కాని శాస్త్రానుభవము కలవానికి విద్వాంసుడనునామము రూఢియైనట్లు తోచుచున్నది. ఇతరుల విషయమున, ధనుర్విద్యయందు నేర్పుగలవాని నావిద్యయందు పండితుడనియు చోరవృత్తియందె మెలకువగలవాని నా వృత్తియందు పండితుడందురు. కానిపండితుడనునామము ప్రత్యేకముగా నుచ్చరించునపుడు వారికి జెల్లదు.

ధర్మాది సౌశీల్యములు గలవానిని జనులు విద్వాంసునిగా భావింతురేగాని యాపదమును వేరుగా జెప్పినపుడు ధర్మాత్ముని గ్రహింపకూడదు. లోకము గ్రహింపదు. శాస్త్రములు చదివిన వాడెట్టివాడైనను యెంతమూర్ఖుడైనను విద్వాంసుడనునామము వానికి జెల్లుచున్నది. కాని "పేరుపెద్ద ఊరు దిబ్బ" యన్న లోకోక్తులు ఇట్టివారుండుట వలననే కలుగుచున్నవి. విద్వాంసుడైయుండియు గుణసంపత్తిలేక పోవుటచే కలుగుననర్థములు పెక్కులుండును. ఏతద్విషయమప్పుడప్పుడు తాపసులయందుగూడ సంభవించుచుండును. కాని "ప్రమాదో ధీమతామపి" అను నీతివాక్యానుసారముగా నేక్షణముననో కొంచెము దుర్బుద్ధి పుట్టినను మహాత్ములైనవారు వెంటనే తమతప్పును సవరించుకొని భగవానుని సమక్షమున క్షమాపణ కోరుకొనుచుందురు. దుర్వినీతులట్లుచేయక తాముచేయునది తప్పైనను దానిని తమవిద్యాబలముననో దేహబలముననో ధనబలముననో సంఘబలముననో కప్పిపెట్టజూతురు. ఇట్లు కప్పిపెట్టుటకు బలమైన కారణము అజ్ఞానబలమే. నిజముగా కృకవాకము రత్నమును తృణముకంటే హీనమైనదని తిరస్కరించుటకు కారణములట్టివని చెప్పనక్కరలేదు. "అభావేవిరక్తిః" అన్నట్లు ద్రాక్షపండ్లకొరకు ప్రయత్నించిన క్రోష్టము లభింపకపోగా పులుపని యా ఫలములను నిరసించినది. అట్లే దుర్మార్గుడు తనకుపయోగించని వస్తువును గుణగణసంపత్తి గలదైనను భాగ్యప్రదాతయైనను తిరస్కరించును. తాను చేయుపనియంతయు భగవానుకిష్టమని తలంచుచుండును. పరధనముల నపహరించునపుడు పరదారల ననుగమించునపుడు పరమసాధువులగు మృగముల జీవముల సంహరించి తినునపుడుగూడ భగవంతుడు తమ్ము వానినిజంపి తినుటకే సృజించె ననియు "ఆనందోబ్రహ్మ" యన్న శృతి వాక్కునను సరించి పరదారాగమనమునందు తప్పేమి లేదనియు అందువలన సుఖముకలుగుననియు సుఖమున్న చోటనే స్వర్గమున్నదనియు స్వర్గము వేరేలేదనియు చెప్పుచుందురు. ఈ దుర్మార్గులలోగూడ విద్యకలవారు విద్యలేనివారు రెండుతెగలుగానున్నారు. వీరిలో దాదాపు విద్యలేనివారే శ్రేష్ఠులని చెప్పనగును. వారిని జీవహింసాదిపాపకార్యముచేయుట పాపహేతువు కాదాయని మనము ప్రశ్నించినప్పుడు వారు తినువారికి పాపమేమియు లేదు చూచువారికే పాపమని జవాబుచెప్పుదురు. అదియునుగాక పాపపుణ్య వివక్షతయే

మాకు తెలియదు మా చిత్తమునకు నచ్చినట్లెల్ల మేము చేయుదుము అని చెప్పుదురు. ఇందువలన నిటువంటివారు కొంచెము పాపభీతికి జంకుచుందురు. ఇక విద్యావంతులైన దుర్మార్గుల విషయమై చెప్పదలచినచో వారికి పాపభీతియే లేదు. నరకములేదు. స్వర్గములేదు. ఇచ్చటనే నరకస్వర్గములు కష్టసుఖములను మిషచే ననుభవించుచుందురు. బ్రతికినంతకాలము హాయిగా బ్రతుకుటయే మంచిది. ఇందుకై చేయు యేకార్యమైనను పాపకరమైనది కాదు. పరదారాగమనమున దోషము లేదనియు పరధనాపహరణము పాపముగాదనియు దుర్నీతులగువిద్వాంసులు ప్రలపించుచుందురు. ఇందులకై ఉదాహరణములగూడ నిత్తురు. పూర్వము పరాశరుడు సత్యవతిని బొందలేదా? ఇంద్రుడహల్యను గూడలేదా? ఈశ్వరుడు మునీశ్వరుల భార్యలతో చేరలేదా? ఆదిదేవుడగు విష్ణువు కృష్ణుడై గొల్లచేడియల పొందలేదా? అంతటివారే యట్లొనర్చిన మేము జేసినతప్పేమున్నదని నీతి గరపబోవువారి నోరులమూయింతురు. ఎంతమంది కొంపలనో తీయుదురు.

దావా గెల్పించెదమని కొందరు, భరణమిప్పించెదమని కొందరు, ప్రైవేటుదారులు బయలుదేరి, మోటార్లకు, తిండికి, చుట్టలకు, బీడీలకు, బీదవాండ్రను మోసపుచ్చి ధనము సంపాదించి ఆయమాయకులను ధ్వంసము జేతురు. కొంచెముగా నాంగ్లభాష నభ్యసించి అధికారుల మన్ననలకొరకు వారికి కొంత సుంకమిచ్చి స్నేహము సలిపి లోకమును మోసగించుచు డాంబికులై తిరుగుచుందురు. ఎచ్చటనైన పొరంబోకులో బీదవాడు గృహము గట్టుకొన బోవునపుడుగాని దారసుతాదుల పోషించుకొనుటకై పొలము జేసికొన బ్రయత్నించినపుడుగాని కండ్లుగుట్టి తనతో చనవుగానున్న అధికారితో లేనిపోని గొండెములు జెప్పుటయు బీదవాని జీవనాధారమును పీసివేయుటయు ఇప్పటిదుర్నీతివిద్వాంసుల యొక్కయు అధికారుల యొక్కయు పనియై యున్నది. దుర్మార్గులపక్షము విద్యవలన కలుగు లాభములివియే. ఇంకేమికావలయును. ఎందరిని మోసపుచ్చిన సుఖజీవనము. కష్టపడనక్కరలేదు. కష్టపడువాడొకడు, అనుభవించువాడొకడని యిందుకేగాబోలు పెద్దలు జెప్పుదురు. "విద్యా విహీనో పశుః" అను శీర్షికకు వీరు విపరీతార్థమును చెప్పుకొనుచుందురు. ఏమన మనమేదో కొంచెముగా విద్యనభ్యసింపబట్టియేకదా మనల నిందరు గౌరవించుట. అధికారులతో మాట్లాడు భాగ్యమబ్బుట. మోటార్లనెక్కుట మొదలగునవి. విద్యనభ్యసింపని బీదలకేమియు తెలియదు. మోసపుచ్చి మనమెంత జేసినను కనుగొనలేరు. ఏమున్నది! విద్యలేనివాడు వింతపశువనియూరక జెప్పిరా? ఇటువంటి మూఢులుండుట బట్టియే—నని తమలో తాము చెప్పుకొని సంతోషించుచుందురు.

విద్యవలన నుత్తములై విద్వాంసులగు వారు కేవలము లోకోపకారులై యుందురు. "విద్యాదదాతి వినయమ్" అను నీతివాక్యము వీరియందు వర్తించుచుండును. "విద్యానామ నరస్యరూప మధికమ్" అను శీర్షిక వీరిచేతలంబట్టియు గౌరవము వలనను వచ్చినదే. నిజముగా విద్వాంసున కొకమండలాధిపతియైనను సమానుడుకాజాలడు. రాజు తనదేశమునందే గౌరవింపబడును. విద్వాంసుడు తనదేశమునందేకాక పరదేశమునందును గౌరవింపబడును. రాజు యెంతధనముకలవాడైనను దానము చేయుచున్నచో నతని ధనము క్షీణించును. విద్వాంసుని విద్యాధనమభివృద్ధి పొందుచుండును. ఒకజనకున కిద్దరు తనయులుండిరనుకొందము. వారిద్దరు ఒకరు ధనమును సంపాదించుటను ఒకరు విద్యను సంపాదించుటకు కడంగి కొంతకాలమునకు సంపాదించి గృహమునకు వచ్చి ఒకరినుండి యొకరు మార్చుకొన జూచిరి. అపుడు విద్య సంపాదించిన వానికి ధనమును గ్రహించుట సులభముగా నున్నదిగాని ధనము సంపాదించిన వానికి విద్యను గ్రహించుట కష్టమని తోచినది.

విద్యవలన దుర్మార్గములు కొందరు నేర్చుకొనినను అందరు విద్యనభ్యసించినపుడు వారలా మోసము జేయుటకు వీలులేదు. విద్యలేనివారుండినపుడు గదా వీరికి మోసగించుటకు వీలగుట! విద్యసర్వోత్కృష్టమైనది. అందరు నభ్యసింపవలసినది. విద్యవలన నుత్తముడై పరోపకారమునకై దేశసేవకు నెవడు తన జీవితమును వినియోగించునో వాడే విద్వాంసుడు. నామమాత్రము విద్యలనభ్యసించి లోకమును మోసగించువాడు విద్వాంసుడు కాడు.

# గుంటకలగర

## వేరు.

గుంటకలగర వేళ్లను నూరి కొద్దిగ ఉప్పుకలిపి తినిన మూత్రపుమంట మానును. మోతాదు 20 చిన్నములయెత్తు.

వేరు విరేచనకారి; వమనకారి; కార్శ్యము; ప్లీహ వీని రోగములను పోగొట్టును. వేరు రసము లేక కషాయము వాడనగును. రసము మోతాదు. 3–4 తులములయెత్తు. కషాయపు మోతాదు 3–6 తులములయెత్తు.

యకృత్ప్లీహవృద్ధులయందు, పురాణచర్మవ్యాధులయందు మూలచూర్ణమును లేపనము చేయుచున్నారు.

## సమూలము

పచ్చిదినూరి నూనెలో గలిపి పూయుచుండిన ఏనుగకాలిరోగము (Elephantiasis) నెమ్మదించును.

దీని సమూలరసములో కాళ్లుచేతులు గంటకాలముంచిన దేహములోని పాదరసము దిగిపోవును.

## యోగములు

1. భ్రంశపైత్యము: భృంగరాజచూర్ణము:—

ఎరుగనటులుండుట, సదాచింతించుట, రెప్పపాటువేయక చూచుట, కడుకోపముగ మాటలాడుట ఈ లక్షణములు కలిగి తబ్బిబ్బులాడుటయే భ్రంశపిత్తమని తెలియవలయును.

అంజలి ప్రమాణముగల మిరియాలను ఒకప్రస్థము గుంటకలగరాకురసముతో భావనచేసి ఎండించి చూర్ణముచేసి కరక్కాయలు, పిప్పళ్లు, గంటుభారంగి, సైంధవలవణము, పుష్కరమూలము అనువానిలో ప్రతిదానిచూర్ణమును అక్షప్రమాణముగలిపి గచ్చకాయంత చూర్ణమును ప్రాతఃకాలమున తేనెతో సేవించిన భృంశపిత్తముహరించును.

2. భృంగరాజతైలం:—

నీలివేళ్లనుదంచి కషాయముకాచి యందు చంద్రవిత్తుల చూర్ణమును–నీలివేళ్లు, నల్లతుమికి, యష్టిమధుకము అనువాని కల్కమును ఒకప్రస్థము గుంటకలగరాకు రసమును

ప్రస్థము నూనెనుగలిపి తైలపక్వముగ కాచి వెంట్రుకలకు లేపనముచేసిన ఇంద్రలుప్తము వలీపలితము, హరించి వెంట్రుకలు తుమ్మెదలవలె నల్లనై మృదువుగనుండునట్లు చేయును.

3. పలితాదులకు భృంగరాజతైలం:—

ఇసుపచిట్టెము, త్రిఫలములు, సుగంధిపాల వీనిని కల్కము జేసి దీనికి నాలుగింతలు నువ్వులనూనె, నూనెకు నాలుగింతలు గుంటకలగరాకురసము బోసి తైలపక్వముగ కాచి వడియగట్టి శిరస్సునందు మర్దనచేసికొనిన శిరస్సునందు జనించెడిపోట్లు అకాలమందు పలితము, దురద, ఇంద్రలుప్తము నశించి వెండ్రుకలు నల్లగనుండును.

## కేశకృష్ణీకరణచికిత్స

తెల్లవెంట్రుకలు నల్లనగుట యందు గుంటకలగరయొక్క ఉపయోగము:—

1. కరక్కాయలు, తానికాయలు, ఉసిరికవరుగు, నీలియాకు, లోహచూర్ణము వీటిని సమభాగములుగ గుంటకలగరాకురసము, గోమూత్రము వీటిచే చక్కగ మర్దించి వెంట్రుకలకు లేపనముచేసిన అకాలమున నెరసినవెంట్రుకలు నల్లనగును.

2. లోహచూర్ణము, గుంటకలగరాకు, కరక్కాయలు, తానికాయలు, ఉసిరిక వరుగు, రేగటిమన్ను వీటిని సమభాగములుగ చూర్ణముచేసి చెఱుకరసమున 30 దినములు నానబెట్టి అకాలమున నెరసిన వెంట్రుకలకు లేపనము జేసిన నవి నల్లనగును.

—ముగిసినది.

# చిత్రప్రశ్న

శ్రీమతి సమయమంత్రిరాజ్యలక్ష్మమ్మగారు

[ఈచిత్రప్రశ్నకు సమాధానము గృహలక్ష్మిచందాదారులు మాత్రము-చందానెంబరు తెలుపవలెను. లేఖాముఖమున జూలై 10-వ తేదీలోపున మాకు తెలుపవలెను. —సంపాదకుడు]

1. ఐదు అక్షరముల పేరుగల ఊరు.

2. మొదటిఅక్షరము, ఐదవఅక్షరము కలిపిన ఒకానొక తృణధాన్యవిశేష మగును.

3. రెండవ అక్షరము, నాల్గవఅక్షరము కలిపిన పంచలోహములలో నొకదాని పేరగును.

4. మూడవయక్షరము, ఐదవఅక్షరము కలిపిన విష్ణువునకు పర్యాయపదమగును.

5. నాల్గవఅక్షరము, ఐదవఅక్షరము కలిపిన కొండకు అర్థమగును.

ఆయూరి పేరేమి?

# పరిశుభ్రత

## శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

ఈలోకమునందారోగ్యము లేకయున్నవారు ధనికులైనను సౌఖ్యమునకు దూరులగుచున్నారు. పరిశుభ్రతవలన నారోగ్యభాగ్యమును బొందుటకు మిక్కిలి చక్కని మార్గమున్నది. పరిశుభ్రతలేనిచోట ఆరోగ్యముండనేరదు. ఆరోగ్యములేనిచోట సౌఖ్యముండనేరదు. సౌఖ్యములేనిచోట జీవయాత్రను నడుపుట నరకకూపమునందు బడితన్నుకొనుటయగును. పరిశుభ్రతయనగా ప్రతిదినమును శరీరమును మాలిన్యములేనిదానినిగా చేయుటకు స్నానమాచరించుట యొక్కటియేగాదు. ధరించు వస్త్రములను పరిశుభ్రముగా నుంచుటయందు జాగ్రత్తపడుటయు, తినుపదార్థములందు మిక్కిలి జాగరూకతతోనుండుటయు, పీల్చుగాలి పరిశుభ్రమైనదై యుండుటయు ముఖ్యావశ్యకములే. ఎచ్చటమురికిగలదో అచ్చట ఈగలు దోమలు వాలుచుండును. దుర్గంధమైనచోటులలో యిట్టి ఈగలు వాలుచుండుటను చూచుచున్నాము. ఆఈగలే మనము తినుపదార్థములపై వాలి అపరిశుద్ధమును, అనారోగ్యమును గావించుచున్నవి. ఎచ్చట పరిశుభ్రముగా నుండునో అచ్చట ఈగలు, దోమలు మొదలైనవి గనుపింపవు. కాపురముజేయు ఇండ్లకు సమీపమున పెంటకుప్పలనుంచరాదు. అందువలన దుర్గంధము బయలు వెడలి గాలిని చెడగొట్టును. అట్టిగాలిని పీల్చుట రోగములను కొనితెచ్చుకొనుటయగును. మనము త్రాగుజలమును కాచి చల్లార్చి వడపోసి యుంచుకొనుటవల్ల జలమునందు గల దోషము హరించిపోవును. ఇండ్లయందు తేమలేకుండ జేయుట ప్రతి గృహిణికిని ముఖ్య కర్తవ్యమై యున్నది. స్త్రీలెంత పరిశుభ్రతగా నుందురో వారు, వారి పురుషులను అంతగా పరిశుభ్రతను గలవారినిగా జేయగల్గుదురు. పరిశుభ్రతను గమనించకయుండుట దరిద్రదేవతను ప్రవేశపెట్టుటయగును. స్త్రీలు చేయదగిన కార్యములు లోకమునందెన్నియేని గలవు. ఓ నా సోదరీమణులారా! మనగృహములయందు ప్రతివస్తువును పరిశుభ్రముగానుంచుట ముఖ్యవిధియని యెపుడు గుర్తించి యట్లు సర్వదాయాచరింతుమో యానాడే మనమెల్లరమును లక్ష్మీకటాక్షమునకు పాత్రులమగుదుము. రాత్రులయందు నిద్రించు గదులకు విశాలమైన గవాక్షములుండుటెంతావశ్యకమో దీపముల నార్పి పండుకొనుటయు నంతయావశ్యకమేయని గుర్తింపవలెను. పెద్దకొడిగానున్నదీపములు విస్తారముగా ప్రాణవాయువును ధ్వంసముచేయుచున్నవి. అంతేగాక వెలుతురుగా నుండు దీపములున్నచోట నిద్రించుటకూడదని ఆరోగ్యశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. గుమికూడి పరుండుటయు నట్లే ప్రమాదకరము. సాలెపురుగు అల్లుగూడులను యెప్పటికప్పుడే తీసివేయుచుండవలెను. స్నానముచేయునపుడు ప్రతిభాగమును పరిశుభ్రముగా తోముకొనవలెను. గోళ్లసందులయందు మట్టిలేకుండ శుభ్రపరుపవలెను. పరిశుభ్రతలేనిచో మేడలైనను నరకకూపములేనని తెలియవలెను. గృహమునందన్నితావులకును ధారాళముగా వెలుతురును గాలియును వచ్చుటకు వీలుండవలయును. మనపూర్వులు పరిశుభ్రతను, ఆరోగ్యమును బాగుగా గుర్తించిరిగాబట్టియే సర్వసూత్రములును మతధర్మాచరణముగ విధించియున్నారు. కాటుకను పెట్టుకొనుట, పసుపురాసుకొనుట, కుంకుమపెట్టుకొనుట, తులసమ్మను బెంచుట మొదలగు నిత్యాచరణముల యభిప్రాయము లేమైయున్నవో యించుక విచారించుడు. లోకమునకు కళ్యాణకారకులైన ఓ నా సోదరీరత్నములారా! పరిశుభ్రతను గమనింపుడు. ప్రతిదినమును ప్రతివిషయమునందును పరిశుభ్రతను పెంపొందింపజేయుడు. బాహ్యపరిశుభ్రతను గమనించు టెంతయవసరమో అట్లే ఆత్మపరిశుభ్రవర్తనము, వాచాపరిశుభ్రత, ప్రవర్తనాపరిశుభ్రతయు నంతకన్న ముఖ్యములే అయియున్నవి. మురికివస్తువుల నెన్నడు నింటియందుంచరాదు. వికారస్వరూపములను దృష్టిపథమునందుంచరాదు. ఎచ్చటపరిశుభ్రతగలదో యచ్చటనే శోభాయమానముగ నన్నివిధముల లక్ష్మి విరాజిల్లుచుండును. ఇహలోకమునందే స్వర్గతుల్యమగు మహదానందమును బొందగోరుచో పరిశుభ్రతను గమనింపుడు. పరిశుభ్రతను లక్ష్యమందుంచుడు. పరిశుభ్రతను అలవాటుచేసికొనుడు.

# స్త్రీ విద్యా—దాని యావశ్యకత

శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు

సంసారశకటమునకు స్త్రీపురుషులు రెండు వాహనంబులు. అందు స్త్రీపురుషులు విద్యావంతులై రేని వృషభద్వయమునుగూర్చిన శకటమువలె నా సంసారశకటము వడిదుడుకులులేక సహజగమనమున నేగును. కాని పురుషుఁడు విద్యావంతుఁడై స్త్రీ విద్యావిహీన యయ్యెనేని యొకవైపున వృషభమును మఱియొక వైపున మహిషమునుబూన్చిన శకటమువలె సంసార శకటమునకు గమనావరోధము తప్పక గలుగును. వృషభముముందునకులాగ మహిషము వెనుకకులాగును గదా! అట్టి శకటగమనం బెట్లు సుఖప్రదముకాదో యట్లే విద్యావంతుఁడైన పురుషుఁడును విద్యావిహీన యగు స్త్రీయునుగల సంసారము సుఖప్రదము కాజాలదు.



శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు

గృహకార్యనిర్వహణము స్త్రీకిగల ప్రసక్తి పురుషున కంతగ యవసరములేదు. శిశుపోషణాది భారమంతయు వనిత హస్తగతమైయుండును. కాన స్త్రీ విద్యావతికానిపక్షమున నట్టి కార్యాచరణదక్షత కలుగుటరుదు. శిశువుల యారోగ్యము నారయునపుడు స్త్రీ వైద్యవిద్యఁ దెలిసికొనియుండవలసిన యవసరము గలదు. పిల్లలయందుగలుగు కలహములు నివారణ మొనర్చునపుడు న్యాయాధికారిణియైయుండి న్యాయశాస్త్రమెఱిగి యుండవలయును. వారికి విద్యగఱపునపు డుపాధ్యాయినియై బోధనాభ్యసనశక్తి కలిగియుండవలయును. మాత విద్యావతియయ్యెనేని తత్సంతానమును విద్యావంతమైయుండును. మాత విద్యావిహీనయై మూర్ఖురాలయ్యెనేని తత్సంతానమును నట్టిదయగును. వేయేల! స్త్రీ సంసారరాజ్యమునకు రాణియై యారాజ్యచక్రము సరిగ దిరుగునట్లు చూచుచుండవలెను. విద్యలేనిపడఁతి యట్టి మహత్తరమైనకార్య మొనర్చుటకు శక్తురాలు కాకుండును. రాజ్యతంత్రజ్ఞుఁడుకాని రాజు తన రాచకార్యముల నెట్లు చక్కఁబెట్టుకొనలేఁడో యట్లే విద్యాగంధములేని నారి తన గృహకార్యములఁ జక్కబెట్టుకొనలేదు.

ఇతరదేశములలోకన్న మనదేశములో స్త్రీలలో విద్యాప్రచారము చాల తక్కువ. మూఢులగు తల్లిదండ్రులు తమ కుమార్తెలకు విద్య నేర్పకుండుటయే యిందులకు కారణము. తల్లి విద్యావతియైన బిడ్డలకుఁ జక్కఁగా విద్యవచ్చును. తల్లియ బిడ్డగుణములకు ముఖ్యకారణము. గర్భములోనున్నపుడే తల్లిగుణములు బిడ్డలకుఁ బట్టుపడును. విద్యావతియైనతల్లి బిడ్డలకు శ్రద్ధతో విద్యనేర్పును, నేర్చుకొనునట్లు చేయును. విద్యాధికులగు స్త్రీపురుషుల చరిత్రలను బోధించును. విద్యకలవారికిని లేనివారికిని గలభేదమును తెలుపును. వారియొక్కయు వీరియొక్కయు మంచిచెడుగుల జూపుచుఁ జదువుకొనునటుల వారలఁ బురికొల్పును. శివాజిని యంతటి వీరునిగానొనర్చినది తల్లిబోధలేగదా! కొందరవివేకులు స్త్రీలయొక్క శక్తిసామర్థ్యములను వికసింపకుండ నణఁచి స్త్రీలకు విద్య యనవసరమనియు విద్యగల స్త్రీలు పురుషునియాజ్ఞలో మెలఁగక యకార్యములొనరింతురనియు నూహించి మహిళాజనవికసమునకుఁ గలుగు పరిమళమునుఁ గప్పిపెట్టుదురు. ఇది కేవలము భ్రమప్రమాదజనితమైన యూహ. పూర్వము ద్రౌపది, సావిత్రి, సత్య, సీత మొదలగు పతివ్రతాశిరోమణులు విద్యావతులై యెట్టిమహత్కార్యములొనర్చిరో-యెట్టి జగద్విఖ్యాతి గడించిరో-మనమందఱమెఱింగిన విషయమే. వారు కించిన్మాత్రమైన తమ భర్తలయాజ్ఞ కడుగుదాటినట్లు చదివియుంటిమా! ప్రస్తుతకాలంబున గూడ సరోజనీదేవిప్రభృత వనితాతిలకంబులు తమ విజ్ఞానసంపత్తిచే ఖండాంతరంబులందుగూడ ననన్యసామాన్యమందు ప్రఖ్యాతినిగడించి భరతఖండమునకు నాయికమణులై భాసిల్లుచు భారతరమణీమణుల యపూర్వశక్తిని వెల్లడించుచున్నారు. మీదుమిక్కిలి విద్యావ్యాసంగముగల నారీతిలకములు పూర్వోదాహృత వనితామణుల చరిత్రలు పఠించి వారిని మార్గదర్శకులుగా నెంచుకొని యట్టిమార్గమున జరుప యత్నింతురు. విద్యనెఱుఁగని మూర్ఖురాండ్రు కూపస్థమండూకములై యేతద్విషయముల నించుకేనియు నెఱుఁగకుందురుగదా! ప్రతియుగమునను బ్రతిదేశమునను విద్యావతులైన స్త్రీలే ఖ్యాతిగడించి స్వదేశోద్ధరణము జేసిరిగాని విద్యావిహీనలైనవారిమాట యొకింతయు మనము కనివినియెఱుఁగము. ప్రస్తుతము మనదేశస్థితి యెట్టి క్లిష్టదశయందుండినదో విద్యావతులైన స్త్రీలు దేశీయుల కెట్లుపకృతిసల్పుచున్నారో పత్రికాపాఠకు లందఱకును విదితమే.

పాశ్చాత్యులు తమస్త్రీల కున్నతవిద్యల నేర్పి వారిని తమకంటె ఎక్కువమర్యాదతో చూచెదరు. పురుషులు కూర్చొనియుండగా స్త్రీలువచ్చిన వారులేచి తమకుర్చీని వారికిచ్చి తాము నిలుచుండియైన మాట్లాడుదురు. స్త్రీలను తమతో సమానముగాచూచి యెక్కువ అభివృద్ధికివచ్చునట్లనేకప్రయత్నములు చేసెదరు. మనవారన్ననో పురుషులుచూడగా స్త్రీలు కనపడగూడదని, స్త్రీలు విద్యనేర్చిన పురుషులకు గౌరవహాని కలుగునని యనేకదురభ్యాసములచే స్త్రీలకు విద్య నేర్పకుందురు. బాల్యమున తండ్రి, యౌవనమందు భర్త, వార్ధక్యమున గుమారుఁడామెకు సంరక్షకుడు. స్వాతంత్రమన్న దామెకేకోశమునను లేదు. అందుచేతనే స్త్రీలు ధైర్యముగను, స్వతంత్రముగను మాట్లాడరు. బిడియము, మూకీభావము, నిస్సహాయత స్త్రీల కలవాటైనది. స్వేచ్ఛతోబుట్టి పెరిగి పురుషులతో చిన్నపెద్దలతో సరిసమానముగను, తెలివితేటలుగను, వ్యవహారదక్షత గలిగి పరసహాయము నపేక్షింపకయే కార్యములుచేయగల్గు స్వాతంత్రలక్ష్మిని మన హిందూమాతలు నోచుకొనరైరి. మనదేశ దాస్యవిముక్తికి మహిళామణులుగూడ ముందంజవేసినగాని ఫలముండదు. వారికి మొదటినుండియు విద్యాబుద్ధులు బురుషులతోఁబాటు గఱపి స్వతంత్రకాంతలుగను, వీరమాతలగను చేసినపుడే భారతభాగ్యదేవత భారతీయునిహృదయమందు తాండవమాడగలదు. ప్రాచీనభారతవీరకాంతల మఱొక్కమారు మనము జూడగలిగిననేకాని భారతహృదయము సంపూర్ణత్వమునొందదు.

# సీతమ్మ పెండ్లి

## శ్రీమతి మదమంచి అనంతమ్మగారు

(మంజరీద్విపదలో పాటవరుసను వ్రాయబడినది.)

తెల్లని డేరాలు దింపికట్టేరు
పాగాలమొనగాండ్రు బయలుదేరారు
కళ్లజోళ్లవాండ్రు కదలివచ్చారు
విచ్చుకత్తులవాండ్రు వెంటవచ్చారు
విల్లునమ్ములవారు వెనుకవచ్చారు
బారుచొక్కాల సిబ్బందివచ్చింది
గరిడీలు దేరి బాకాలూదినారు
దిగబడ్డ రాణువ మొగసాలవెనుక
సాచాతవారు వాసాలదగ్గరనె
మోమోటపడువారు ముంగిళ్ల చెంత
పిలిచిజనకుడుమాకు పిల్లనివడంచు
సామంతరాజులు చక్కబొయ్యారు
మామూలు మర్యాద మరచినారంచు
విల్లుచూచినవారు వెనుకకేగారు
శివధనస్సువిరువ ఛీ పాపమంచు
శివభక్తులొకవంక జేరబడ్డారు
మాకాజ్ఞవచ్చిన మఱిచూడుడంచు
చేతిలో మీసాల చెడద్రిప్పినారు
పిలుచునందాక నోపికబట్టలేక
పైబడి విరువగా బరతెంచినారు
నెట్టుకవచ్చి కన్నెత్తి జేయుచును
విల్లు చురచుర జూచి వెల్లబొయ్యారు
తన్నగొయ్యదీని తలబెట్టుకొన్న
అవమానమని రెప్పలప్పళించారు
కొందఱుభీష్మించి కుర్చీలపైన
చతికిలబడి నేర్పుసంధించినారు
సూరెలనింతలో చూచిరి నృపులు
కలకల సభలోన చలనమొదవింది
నిట్టమెడలవారు నిక్కిచూచారు
సరిగంచుపాగాలు చక్కదిద్దారు



శ్రీమతి మదమంచి అనంతమ్మ గారు

చిరుగంట రవళికి చెవుడుపడ్డారు
బోణుకుబోణుకున మ్రోగె పునకపేర్లన్ని
నలుగురిపెటుగా నడచివచ్చాడు
పదితలల్గదలించి పారజూచాడు
దొకదొకకదలించి తోడిమార్బలము

రావణరాజు పరాకంచు ముందు
రాకాసి మూకలు దూకి నడచిరవి
అగ్రాన వచ్చి విల్లందుకొన్నాడు
గుసగుసలుపోయిరి కుంభినీపతులు
మిట్టకొమ్ముదాక మీసెనో లేదో
చిటపట నరములు చింపువందయ్యొ
భువి దదరిల్లగా బోర్లబడ్డాడు
పకపకలాడింది పరిషదాలయము
మన్ను మేసిన తలల్మరియెత్తకుండ
చురచురనిప్పులు చురియగాజూచి
పాశుపతంబు మాపరమదైనతము
విరువగా పాపమో వెంగిళులార
చిన్న యీవిల్లన్న చెప్పేటిదేమి
ఏమోయి జనకుడా! నామంచిదెలిసి
సీతనులంకకు జేర్తువా లేద?
మా రివాజుబట్టి మన్నింపగలము
సీతకు నామీద చెప్పనివలపు
నాకోరకె లంకలో నాడు జన్మించె
సీతపుట్టుట లంకచేటని వచింప
నీయింటపెంప వార్నిధిద్రోచినాడ
మామగారూ సెలవు మన్నింపవలయు
నోరారనడిగితి కారాకుమేసి
ఇందుకుభిన్నమా ఇప్పుడేచూడు
సీతాపహరణమ్ము జేసితీరుదును
బంధుపుత్రమిత్ర భగ్నమౌగాక
ఈరెంటిలోతప్ప కేదేనిజరుగు
కనిసించమని సభ కలయంగజూచి
కటకటాలదాక కదలె రావణుడు

తంద్రాళువైపోయె తత్సభాస్థలము
చరిచిరి చప్పట్లు పరిహాసమెసగ
వ్రేటువడ్డభుజగ వీరమ్మురీతి
బుస్సుబుస్సునలేవ బోయిరి నృపులు
ఇంతలోనే పదియెనిమిదియేండ్ల
బాలచంద్రులు సభాభవనమ్ములోకి
ఏన్గుగున్నలలాగు నిద్దరువచ్చి
దండమటంచు ముద్దర సుద్దిగాను
వాత్సల్యమెసగగా వర్తించినారు
గాధేయు డీబాలకంఠీరవులకు
జనకాజ్ఞచే శంభుచాపంబుజూపి
విరిచి వీర్యశుల్క ధరణిజగొనుడు
వంచపోయి పెద్దవాడాయటంచు
నీలమేఘశ్యాము నియమించినాడు
దాశరధికైన లేని ధైర్యమ్మువచ్చె
సన్ననిపల్వరుస సందు దూటాడి
తొగరుపెదిమలలోన దోబూచులాడి
నూనూగుమీసాల నునుపులోదేలి
కన్నులసౌరుతో గలిసివర్తించి
చెక్కుటద్దములపై జెంగలించుచును
ముసిముసినగవులు కొసరిముద్దాడె
రామచంద్రునిమోము రతనాలగీము
కలువకన్నులకాంతి దోలకరించింది
కెంగేలచాపము గీలించినాడు
పరగ ప్రత్యాలీఢపాదుడైనాడు
వరదగూడు పోలె వంచిపట్టాడు
బాణము సంధించి పట్టువదిలాడు
దిర్దిర దిరిగె భూదేవి కంపిల్లి

గిరివర్గమెల్ల బర్బరగూలిపోయె
దిగ్గజంబులెల్ల మ్రొగ్గబడిపోయె
చాపచుట్టగ శేషశాయిబడ్డాడు
పవనుడుముకాసేపు బంధించిపోయె
విల్లువిరిగిరెండు వ్రల్లలబడియె
పుష్పవృష్టి బోరుబోరున గురిసె
కండ్లప్పజెప్పి రక్కడరాజులెల్ల
ఆశీర్వదించిరి అర్ష దేవతలు
జయజయబెట్టిరి సకలభూభుజులు
పెట్టిపుట్టినభోగి పిల్లవాడనిరి
సర్దారు దశరథస్వామికొడుకనిరి
వీనిగన్నతల్లి వీరమాతనిరి
బంగారుబొజ్జ యీ పాపాయిదనిరి
సీతకు దగినట్టి చిన్నవాడనిరి
మిధిలేంద్రునకు దగ్గమేనల్లుడనిరి
భద్రముగ దేశము బాలించుననిరి
జనకరా జానందసౌధంబునెక్క
సభమూయుడని యనుచరులనుబంచె
రామునివిడిదికి రప్పించినాడు
జనులెల్ల తెలవారిచీకటితోనె
చెప్పుకోసాగిరి సీతమ్మపెండ్లి
రవ్వంతలోనె కర్ణాకర్ణికగను
ఊరునాల్గుదెసల నుడికిపోయింది
చప్పన్నదేశాలు జాబులంపారు
రఘువంశరాజుల రప్పించినారు
మగధ సౌరసేనమహారాష్ట్రవంగ
బర్బరాంగకళింగ పరిపాలకులును
నేలీనినట్టుల ప్రోలునిండారు

వెలిపట్టుడేరాలు విడిదికిచ్చారు
మిథిలానగరమంత మిలమిలలాడె
రత్నతోరణములు రచియించినారు
బంగారుటరటులు బాతించినారు
వెలిపట్టుపందిళ్లు విరచించినారు
నీలంపుటరుగులు నిర్మించినారు
ద్వారాల బూర్ణకుంభములుంచినారు
ఘనసారములుదెచ్చి గడపలకురాచి
పటికనార్చి రవ్వ పైనద్దినారు
కస్తూరికలయంపి కలయంగజల్లి
ముత్యాలపొడితోడ ముగ్గులిడినారు
రాజదేవిడీలు రంజిల్లిపోయె
ఐదువలుముందరా నచటదేవేర్లు
కదలివచ్చిరి రాము కళ్యాణమునకు
శృంగార రాముని సీతతోగూడ
శుభముహూర్తము వశిష్టుండు నిర్మింప
పెండ్లికొడుకునిజేసి పేరటాండ్రెల్ల
నలుగిడిపన్నీట జలకంబులార్చి
జిలుగులతడినద్ది వలిపెంబుగప్పి
అగరుధూపమువైచి యార్పివెంట్రుకలు
చిక్కుడలించిరి చేర్చుక్కబెట్టి
జానకిముస్తాబు జరిగినపిదప
మంగళధ్వనులు తురంగలించినవి
తౌర్యత్రికంబు వింతగ బోరుకొలిపె
యాజ్ఞవల్క్యనిమంత్రయాజమాన్యమున
కళ్యాణవేదిక గైసేసినారు
కర్తికి మునుముందు కంకణముగట్టి
శుభలగ్నమున గట్టె సూత్రమ్ము మెడలో

ముత్యాల తలంబ్రాలు ముగుద వోసినది
రామయ్య వోసాడు రతనాల బ్రాలు
పౌన్న వాహనమంత బోయి తెచ్చారు
ఊరేగుటకు బయద్దేరి రామీద
బాజాలుముందు జాబాయించినారు
వెండిపౌజులుముందు వెలిగించినారు
బంగారుదివిటీలు బట్టినడచారు
వింజామరలు చుట్టు వీవసాగారు
గుబగుబ మిథిలంత గుబ్బటిల్లింది
మేడలెక్కిరిచూడ మిథిలాపురమున
చెప్పుకోసాగిరి చిద్విలాసమ్ము
పుత్తడిబొమ్మ మాపూబోడి సీత
అందాలచందాల కందమీతల్లి
పౌన్నెమ్మలాటి దీ పూర్ణచంద్రాస్య
తగినమగ డేదొరికె ధర్మదేవతకు
రతనాలజీబు మా రామయ్య బాబు
చెంపలంటి మెఱయు చేరెడుకండ్లు
మలచినట్లున్నవి కలికి చెక్కిళ్లు
ముత్యాలతొలకరే ముద్దులనవ్వు
నీలమేఘములాటి నెమ్మేనుగూడ
తగినట్టి పెండ్లాము దాశరథికమరె
ఈడుజోడుగనున్న దీయిర్వురకును
కండ్లున్న ఫలమిపుడు గాంచగలిగాము
మామయ్య ఏమిచ్చె రామయ్యకనగ
జాంగలములుకొన్ని చదివించెమామ
నాకూతురైనట్టి నయగారికూచి
సహధర్మచారిణీ సాధ్వి జానకిని
అప్పగించితినని ఆత్మార్పణముగ
ఏడువారాల సొమ్మిచ్చె జానకికి
పసుపుకుంకుమ క్రింద పట్టణాలిచ్చె
కానియెన్నడులేని కడువిచిత్రంబు
రాచనగరుకు మొన్న రామయ్యబోయి
ఎఱుకచేప్పాడుటె ఏమిచోద్యమ్ము
పల్వారుస సందటే భాగ్యదేవతకు
కాపురమెత్తటే కనకాంగికనగ
తములపాకుతొడిమ తరచువేయంగ
సీతకు పల్వారుస చెదరగొట్టింది
తరుగేమితల్లికే తట్టుజూచినను
మండలాధిపతులు మామంచివారు
వర్ధిల్లు డిల వేయి వత్సరాలనుచు
దీవించినార లీ తీరున జనులు
జగతిలోజూడమీ సంబరమ్మనగ
చేసినారలు నాడు సీతమ్మపెండ్లి.



# విడాకుల చట్టము

## ౧౬

## శ్రీమతి కొనరాజు అమ్మాయమ్మగారు

సనాతనకాలమునుండియు నార్యావర్తమున వివాహము ఒక పవిత్రమగు విధిగ నెంచబడి స్త్రీపురుషుల కాజన్మాంతరసంబంధితమైయున్నది. అట్టియెడ విడాకులచట్టమనుపేరు విననంతనే పరమపవిత్రమగు భారతనారి హృదయము ప్రకంపితమగుచున్నది. ప్రాచీనకాలమున పతివ్రతామతల్లులకాకరమై స్త్రీపురుషులకు వైవాహికాదులయందు సమానగౌరవస్వాతంత్ర్యము లియ్యబడెడివి. శారదాచట్టము అమలులోనికి వచ్చినచో యుక్తవయస్కులై అన్యోన్యప్రేమావలోకనులై యువతీయువకు లుద్వాహమాడుదురు గదా? ఇక విడాకులచట్ట మనవసరమని నా యభిప్రాయము. వివాహానంతరమే గాదు. మనసావరించినంతనే దుఃఖములను కష్టములను తృణప్రాయముగ నెంచు పరమసాధ్వీమతల్లుల జన్మస్థానమగు భారతదేశమున ఇట్టి చట్టము ప్రవేశపెట్టుట గడుంగడు శోచనీయము.

## ౧౭

## శ్రీమతి మొక్కపాటి రాజ్యలక్ష్మిగారు

"నాతిచరామి" యనుశృతి ప్రమాణముగ గైకొని, యగ్నిదేవుని సాక్షిగ ప్రమాణమొనరించి, ఆజన్మాంతము యెడతెగని సంబంధము గలిగియుందుమని దేవతల యెదుటను, పండితుల సన్నిధిని, వివాహమాడిన, యాలుమగల యన్యోన్యసంబంధము, బాహ్యాడంబరములకు లోటుగలిగినంత మాత్రమున, విడాకులతో నంతరించు నదిగాదని తెలుసుకొనుట సులభసాధ్యము. పాశ్చాత్యవ్యామోహమున మునిగి తదాచారముల కొంతవఱకనుష్ఠించుచున్న మనకు నేడిట్టివిడాకులపద్ధతి తప్పుగ దోచకుండుట యాశ్చర్యముగాదు. ఐనను ప్రాచీన స్త్రీ జీవితముల నారసిన మన యజ్ఞానము కొంతవఱకు దొలగి యిట్టి విపరీతతీర్మానములకు చోటీయకుందుమని నాయాశయము పాశ్చాత్యయాచారములకును, మన ధర్మములకును హస్తిమశకాంతరముగల దన్న చాలదు. మన ధర్మములన్నియు దేవుని సన్నిధికేగుట కనువగు సోపానములవంటివి. సీత, సావిత్రి, దమయంతి మొదలగు పతివ్రతామతల్లులను; కౌసల్య, కుంతి మొదలగు వీరమాతలను గనిన భారతదేశము నేడిట్టి స్థితియందుండుటగాంచి విచారింపవలసిన సమయమున అధర్మయుతములగు తీర్మానములజేసి యాచారణను దెచ్చు మార్గమన్వేషించుచున్న మనలనుగాంచి కొలదిగనో గొప్పగనో గౌరవముగల పాశ్చాత్యులుగూడ నవ్వెదరు. కాన నో భారతమహిళామణులారా! యిట్టి తీర్మానముల సభలలో నుపపాదించి భరతమాత కపకీర్తిని గలుగ జేయకుందురు గాకయని కోరుచున్నాను.

## ౧౮
## శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు

మనహిందూదేశము పాతివ్రత్యాది సుగుణంబుల కునికిపట్టని ప్రసిద్ధివడసినది. మన దేశమెట్టి కష్టదశ యందును నష్టమొందక యుండుట స్త్రీలయొక్క పాతివ్రత్యమూలముననే. ఒకస్త్రీ మానము కాపాడుటకై పురుషులును తమప్రాణంబుల నిచ్చుచుండిరని పురాణాదుల వినుచున్నాము. (స్త్రీమూల మిదం జగత్) లోకంబునకు స్త్రీయే మూలము. స్త్రీ లేక జగమే లేదు. స్త్రీరూపిణియగు లక్ష్మీదేవి, భువనంబులు నిర్మింపు చున్నదనియు, ఆమెయే స్త్రీరూపమున ఇంటింట వెలయుచున్నదనియు చెప్పుదురు. ఆతల్లి యంశలమగు మన మెల్లరమును ఆమె సుగుణంబులగు పాతివ్రత్యాదుల నావంతైన బొందు టొప్పుగుగదా? పాతివ్రత్యాభిమానం బున స్త్రీ యెట్టి ఘనకార్యమైనను ఒనర్పగలుగుచున్నది. ఒకకాంత ప్రొద్దును నిలబెట్టెను. వేరొకవనిత తెల్ల వారకుండునట్లు జేసెను. ఇంకొకచెలువ పతిప్రాణంబుల దెచ్చుకొనెను. మారొకమహాత్మురాలు త్రిమూర్తుల శిశువులగావించెను. కిరాతుని నొకకాంత దహించెను. రావణునింట సీతాదేవియు ప్రాణంబులతో నిలిచి యుండుట పతిపైని యభిమానంబుచేతనే. నళాయిని భర్త యెంతకష్టపెట్టినను సహించి శాశ్వతకీర్తి గాంచెను. పతిపై యభిమానంబువలన మన హిందూవనితలు సహగమనమొనర్చుచుండిరి. అట్టి పాతివ్రత్యంబునకు ఉప కారకంబగు పవిత్రమైన వివాహసంబంధమును, ప్రేమబంధమును, ధర్మబంధమును త్రెంపుకొని విచ్చలవిడి మనస్సుపోయినట్లుగా తిరుగగోరుట యెంతటి హేయకరమైనది? మన నడవడుల విదేశీయులే మెచ్చుచుండ మనవారల కెట్లు విముఖతగలిగెనో? ఆహా! కాలముయొక్క విపరీతము! పురుషుడు లేక లోకంబు నిలుచునా? వారు మన మేలునకై పాటుపడుచుండ మనమే వారిని విడనాడ ప్రయత్నముల చేసికొని వారి యాశ్రయమును వదలింప గోరుకొనుచున్నాము. పురుషుడు స్త్రీయను లతకు ఆశ్రయమైన మహావృక్షము. ఆపురుషుని ఆశ్రయము లేకున్న స్త్రీయను లత కుప్పకూలి తొక్కిళుల బడవలసినదే. కేవలము దేహమె శాశ్వతము, ధనమే ప్రధా నము, అధికారమే స్వర్గము, ఐహికసుఖమే నిశ్చయమని నమ్మి పరలోకసాధనార్థమె పెద్దలొనర్చిన యేర్పా టుల విడనాడి మార్గదర్శకములుగా వారు వ్రాసిపెట్టిన పురాణాదులయందు నమ్మకగోల్పోవుటచేత మన దేశమిటు హీనస్థితికి వచ్చినది. కాన దీనినుండి కలుగబోవు లాభనష్టముల దీర్ఘముగ ఆలోచించి, మన భారతదేశంబున ఇట్టి విపరీతపుచట్టంబులకు తావీయకుండుటకై ప్రయత్నింప సోదరీమణులను ప్రార్థింపు చున్నాను.

## ౧౯
## శ్రీమతి సుంకరవాసుదేవమ్మగారు

విడాకులచట్టమువలన గలుగు అంతఃకలహములు—అనారోగ్యములు హత్యలు నీచభావము వీనిని వృద్ధిచేయునేగానినిర్మూలమునకు తావీయవు. మనదేశమునందును కొన్నిజాతులలోనివారు విడాకుల ననుసరించు చున్నపుడు మనము వారిని క్షుద్రులని అనుకొనుచున్నాము. ఎందులకనగా? తల్లిదండ్రులకు సంతానముపై నుండునంత తీపు ప్రపంచమునందింకేవస్తువుపైనిగూడ ఉండనేరదు. అందు మగవారికన్న ఆడువారికెక్కువ జాలిగలిగియుండుటగూడా ప్రజలకందరికి విశదమే. కనుక అట్టి జాలిగాని, ప్రేమగాని ఇసుమంతయు పాటింపక తొలిమగనివలన తమకుగలిగిన సంతానమును కఠినమనస్కులై విసర్జించి, ఇంకొకమగని చెట్టబట్టి యుండువారిని క్షుద్రులనుటలో ఆశ్చర్యములేదు. భగవంతుడు దయామయుడు. ప్రపంచసృష్టికై కామమనే మహావస్తువును పిపీలికాదిబ్రహ్మపర్యంతము కలుగజేసియున్నాడు. దానిని న్యాయమార్గమున ఒకపురుషుడు ఒకస్త్రీని వివాహముచేసికొని అనుభవిస్తూ ఆమహాత్ముని యాజ్ఞప్రకారముగ ప్రవర్తింపవలయునేగాని, కామాంధకారము కన్నులగప్ప లేనిపోని తప్పుడునడతలు నడచి దానిని పాడుచేయుటకుకాదు. కనుక కామమునే ఆధారపడియుండు చట్టము ఉత్తమమైన ఏ హైందవసుందరికిగూడ అవసరములేదని నా అభి

ప్రాయము. దుర్మార్గమైన చెడునడతలుగల పురుషుడు కులకాంతపై లేనిపోనిసాకులు గల్పించిగాని, లేక కులస్త్రీలో ఏదేని లోపాలోపము లున్నయెడల విని, కనిసహించలేని పురుషుడుగాని భార్యను విసర్జించుచున్నాడు. అట్టివారైనను నూటికికోటికి ఒకరుగాని లెక్కకెక్కరైరనియే నా వుద్దేశము. ఇదివరకు మన పూర్వులుగాని, ఇప్పుడుమనముగాని ఈచట్టములేక పడుబాధ లెవ్వి? ఇకముందు మనసంతతివారు పడబోయే దుస్తరసంతాపము లెవ్వి? అయినను పాశ్చాత్య స్త్రీల ననుసరించవలెననెడు భ్రమ మన భారతస్త్రీల కందరికిని కలుగుట మిక్కిలి ఆశ్చర్యమును కలుగజేయుచున్నది. మన భారతదేశమునందుగల స్త్రీపురుషుల కున్నంత మనోచాంచల్యము మరియే యితరదేశములకుగూడ లేదనియే నా నమ్మకము. ఎందులకనగా ఏదేశీయులా దేశభాషలను, ఆచారవ్యవహారములను విధిగా జేయుచు సాధ్యమైనంతవరకు వారి సంఘమును వృద్ధిజేసికొనుచున్నారు. మనహిందువులటుగాక ఎదుటివారి ననుసరించుచు సంఘమును క్షీణింపజేయుచున్నారు. మతాంతరులై ఎందరో ఎదుటిపక్షమును జేరుచున్నారు. ఇట్టిస్థితిలో లేనిపోనిశాసనములు, చట్టములు గలుగజేయుమని ఒకదానిపై నింకొకటి శాసనసభవారి హస్తగత మొనర్చుచున్నారేగాని మరియొకటిగాదు. రూపగుణప్రవర్తనలుగల పురుషుడు ఒకస్త్రీని పరిణయమాడి ప్రేమానురాగములుగలిగి దాంపత్యధర్మ మవలంబించుటయే నిజమైన మానవధర్మనిర్వాహణము చేసినట్లగును. అటుగాక పలువురుస్త్రీల సంపర్కముగలిగియుండు పురుషుడుగాని, పలువురుపురుషులతో సహావసించు స్త్రీగాని నరాకారమునుదాల్చియున్న పశువనియే నా అభిప్రాయము. కాన యిట్టి విపరీతము గలుగజేసికొని కలవరపడక ఈ యుద్యమమును మానుకొనవలయునని నా కోరిక.

## ౨౦
## శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు

పుణ్యవంతమయిన భారతభూమిలో జనించిన పవిత్రహృదయలగు భారతపడుచుమణులు విడాకుల చట్టము భారతభూమికి కావలెనని కోరుచున్నారనుట మిక్కిలి విచారకరము. వివాహవిచ్ఛేదమన్న స్వల్ప



శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు.

సమస్యగా పాశ్చాత్యవ్యామోహితలగు సోదరీమణు లేమైన అభిప్రాయపడియుండవచ్చునేమో కాని, యిది యంత చులకనైన సమస్యగా పరిగణించగూడదు. పాశ్చాత్యవిద్యావ్యామోహితలై, తన్నాగరకతా వాయువులచే అల్లాడుచుండిన ఏకొద్దిమంది సోదరీమణుల యభిప్రాయమో కాని, సమిష్టిగా భారతనారీమణుల యభిప్రాయముకాదని నిస్సందేహముగ నుడువగలను. పశ్చిమదేశములో ఈ విడాకులచట్టమువలన నెన్ని అనర్థకములైనకార్యములు జరుగుచున్నవో విచారింపుడు. ఆదేశమున నెందఱు వివాహవిచ్ఛేదనమువల్ల సౌఖ్యపడుచున్నారు? వివాహమైన సంవత్సరము లోపుననే ఆజన్మాంతముండదగిన పవిత్రమైన ఆత్మసంబంధము త్రెంపుకొని తిరిగి వివాహము కావించుకొనుటయు, తిరిగి త్రెంపుకొనుటయు వారికి సహజముగ పరిపాటియైనది. కోర్టులకెక్కి భార్య భర్తయందును, భర్త భార్యయందును మిక్కిలి హేయమయినటువంటి అపనీతికరములయిన కారణముల నిరూపించి విడాకులుపుచ్చుకొనుట మానవత్వమును చంపుకొని పశుత్వమును పెంపొందించుకొనుట విషయభోగలాలసులకు చెల్లునేమో కాని ప్రాచీనకాలమునుండి కీర్తిగడించిన హిందూమహిళలకు చెల్లదు. తమ జీవితముల తృణముగా భావించి

చనిపోయినభర్తతో సహగమనమాచరించిన సాధ్వీమణులను, భర్త మరణవార్త కర్ణరంధ్రముల సోకినవెంటనే ప్రాణములెగసిపోయిన పతివ్రతామతల్లులను కన్న భారతభూమియందా పరిణయవిచ్ఛేదములు? వలదు, ముమ్మాటికి వలదు. విచ్ఛేదపరాయణమైన జాతిలో వివాహములందుగాని, దాంపత్యధర్మములయందుగాని, దంపతుల స్వభావజనితమగు నిజమైన, నిర్మలమైన ప్రేమానురాగములు వారి హృదయములందు యిమిడియుండునేమో యోచింపుడు. ఆజన్మాంతము ఉండతగిన వివాహబంధనము ఈవిధముగ త్రెంపుకొనుచుండువారి కెట్లు నిర్మలమైన సహజప్రేమలు జనించును? దంపతుల హృదయకమలములయందు అన్యోన్యానురాగలతిక అల్లిబిల్లిగా నల్లుకొనుట కవకాశమెట్లేర్పడును? అట్టిదంపతుల జీవితములయందు ఇంచుకైన శాశ్వతమగు సౌఖ్యానందము లున్నవేమో మీ విశాలహృదయములతో యోచింపవేడెద. భావోద్రేకమైన తత్కాలికసౌఖ్య మున్నదేమో కాని మరణపర్యంతము ఉండతగిన శాంతిప్రదమైన సౌఖ్యజీవితము లేనేలేదని చెప్పవచ్చును. విడాకులచట్టమాచరణయందున్న దేశమందలి దంపతులజీవితములు, మనదేశమందలి దంపతులజీవితములకు పోల్చిచూచిన యెడల మనహిందూదేశమందలి దంపతుల జీవితములే సౌఖ్యప్రదములైనవనియు ఇచ్చటి స్త్రీలే శాంతిజీవితము గడుపుచూ గృహలక్ష్ములై అలరారుచున్నారనుట తెలియనగును. మనకంటె వారెక్కువ సౌఖ్యపడుచున్నారనుట కల్ల. పవిత్రమైన, నిజమైన ప్రేమానురాగములే లేనప్పుడు వారికింకెక్కడి సౌఖ్యము. కొంతమంది సోదరీమణులు దుర్మార్గులైన భర్తల బారి నుండి కాపాడబడుటకు ఈచట్టమావశ్యకమని నుడువుచున్నారు కదా! వారుచెప్పినట్లుగానే నూటికి కోటికి ఒకడు దుర్మార్గుడైన భర్త లేకపోలేడు. ఎక్కడనో యొక్కడున్నాడని వానిని చక్కబెట్టుటకు ఈచట్టము కావలయుననుట కేవలము ధర్మవిరుద్ధమును, కొరవితో తలగోరుకొనుచందమును అగును. ఒకవేళ అట్టివారుయుండినప్పటికిన్ని విజ్ఞానవతియగు భార్య సాహచర్యమువల్ల కొద్దిరోజులలోనే చక్కబడుదురు. చక్కబడిన సంసారము లెన్నియోయున్నవి. ఎందఱు సాధ్వీమణులు దుర్మార్గులైన తమభర్తలను సన్మార్గులుగా నొనర్పలేదు.

"రమణీమణి యుజ్వలనేత్రములయందు పరమాత్మ తనదివ్యపదము నుంచుకొన్నాడు. కనుకనే ప్రమాదపతితులెల్లరు తొలగిన తమమార్గము నా ప్రకాశమున తెలిసికొందురు" —విల్లిస్.

"కామిని సౌందర్యముచే దర్పవతియగును. పవిత్రగుణములచే ప్రశంసనీయమగును, లజ్జాశీలముచే దేవియగును." —షేక్స్పియర్

మహానుభావులు ఇటుల నుడివియున్నారు. ఇంతకు కారణము సాధ్వీమణియగు భార్యసాహచర్యమే కదా! ఒకవేళ యీచట్టమే వచ్చినయెడల యెన్ని అనర్థపరంపరల కాలవాలమగునోకదా! అప్పుడప్పుడు భార్యాభర్తల మధ్య ప్రణయకలహములు జనింపవచ్చును. ఒకొక్కప్పుడు యీప్రణయకలహములే తీవ్రరూపములు దాల్చుచుండును. అట్టిపరిస్థితులలో యీచట్టమేయున్నయెడల తీవ్రకోపాగ్నిజ్వాలలచే దహింపబడుచూ, యుక్తాయుక్తపరిజ్ఞానమును గోల్పోయి వెంటనే వివాహవిచ్ఛేదనమునకు పూనుకొనెదరుగా! అప్పుడెంతక్లిష్టపరిస్థితులేర్పడునో మీరే గ్రహింపుడు. ఇంతకు కారణము ఆతామసగుణమే గదా! అది చల్లారినపిమ్మట విచారము పొందుట చూచుచునే యున్నాము. దీర్ఘకాలము తీవ్రరూపములు దాల్చిన కలహములే కొంతకాలమునకు శాంతించి దంపతుల అన్యోన్యానురాగములతో చల్లగా సంసారముచేయుచుండుట మనకు క్రొత్తగాదు. ఈచట్టమే యున్నయెడల యింక పశ్చాత్తప్తమనస్కులైన దంపతులు కలుసుకొనుట కవకాశమే లేనేలేదుగా! ఇంక అంతటితో వారి వివాహబంధనలు తెగిపోవలసినదేగదా! అట్టి దంపతులకు బిడ్డలున్నయెడల వారెవరిపోషణక్రింద నుండవలయును! తండ్రిపోషణక్రింద నున్నయెడల

సవతి తల్లి చక్కగా పోషించగలదా! తల్లిపోషణక్రింద యుండినచో ద్వితీయభర్త—సర్వస్వతంత్రుడైన సవతితండ్రి—మచ్చరమునకు బిడ్డలు యెటుల కావలసినదేగదా! ఇట్టి బిడ్డలు తల్లి తండ్రి యెవరని చెప్పుకొనగలరు? పాపము! ఈవివాహవిచ్ఛేదనమువలన యేపాపమెరుగని పసినిసుంగులకు శరణ్యమేలేదు కాబోలు! కలుషభూయిష్టమై, కళంకపూరితమై యిన్నికష్టముల కాలవాలమైన చట్టమా' పుణ్యావంతమైన ఆర్యావర్తమునకు కావలెననుట. ఆహా! ఏమి ఈకాలమహిమ. సాధ్వీమతల్లులైన భారతమహిళాజనమెన్నడును తమస్వభావమునకు విరుద్ధముగా నడుచుకొనజాలరు. సర్వసౌఖ్యప్రదమైన గృహలక్ష్మిపదవిని త్యజింపనొల్లరు. పూజ్యనీయమైన మాతృస్థానమును కోల్పోవరు. ప్రాచీనకాలమునుండి కీర్తిగడించిన సతీత్వమునకు నేడు కళంకమాపాదించుకొనుటకు యిచ్చగించెదరనుట అసంభవము. అనన్య సామాన్యశీలవతులైన సీత, సావిత్రి, చంద్రమతి, దమయంతి మున్నగు పతివ్రతామతల్లులను గాంచిన భరతఖండమునకు ఇట్టి చట్టములు కంటకసదృశములు. ఈచట్టమువల్ల కలుగు కీడుగులు విమర్శించుట లెక్కకు మిక్కుటముగా యుండినను వ్యాసవిస్తరభీతిచేత ఇంతటితో విరమించుచున్నాను. "భారతవర్ష ధర్మము భారతపుత్రులయెడ కాదు. పుత్రికల కృపావిశేషమున దాని యునికికలదు. భారతరమణీమణులు తమ ధర్మమును వీడినచో భారతదేశమీవరకే నశించియుండును."

—స్వామి దయానంద

## ౨౧

## శ్రీమతి శంకర రామాయమ్మగారు

పతివ్రతాధర్మములకు ప్రఖ్యాతిగాంచిన భరతఖండవాసులలో ముఖ్యముగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు 'విడాకులచట్టము' యొక్క నామము చెవినిబడుట కర్ణకఠోరముగా నున్నదనుటలో నాశ్చర్యము లేదు. ఎవ్వరో కొద్దిమంది తప్ప తక్కినవారీ చట్టమునకు సహింపరు. ప్రపంచమంతటిలోను భరతఖండమే ప్రసిద్ధినొందినది. దేనికి? పతివ్రతాధర్మములకు. మగవాడు కుంటివాడైనను, గ్రుడ్డివాడైనను, రోగియైనను సహింపవలెనా అనియు స్త్రీని యెన్నిబాధలు పెట్టినను నోరుమూసుకొని యూరకుండవలయునా అనియు కొందరడుగవచ్చును. ఓర్పుతోను, శాంతముతోను కష్టములసహించిన స్త్రీకి ఎంతటిగౌరవముకలదో సోదరీమణులందరును ఆలోచించిన తెలియగలదు. నేనువ్రాయుటకు పూర్వమే నాసోదరీమణులు కొందరు పతివ్రతాధర్మములను గురించి వ్రాసిరి గావున నేనింతటితో నా యసమ్మతిని దెల్పుచు విరమించుచున్నాను.

> విడాకులచట్టమును గూర్చిన విదుషీమణుల అభిప్రాయములను స్థలాభావముచే గతమాసమున ప్రచురింపలేదు. అభిప్రాయముల కొఱకు మేము ప్రత్యేకము లేఖలు వ్రాసిన విదుషీమణులింకను పలువురు వారియభిప్రాయములను అనుగ్రహింపలేదు. త్వరలో అనుగ్రహింతురుగాక యని ప్రార్థింతుము. గృహలక్ష్మి పాఠకురాండ్రలో ఉత్సాహముకలవారు ఈ విడాకులచట్టమును గూర్చిన తమయభిప్రాయమును సంగ్రహముగ వ్రాసి మాకు బంపిన ప్రచురింపగలమనిమనవి.
>
> —సంపాదకుడు.

# ప్రౌఢబాల్యవివాహములవలని లాభనష్టములు

శ్రీమతి జి. వెంకమ్మగారు

ఇపు డెల్లయెడల ప్రౌఢవివాహములు ప్రబలియున్నవి. ప్రౌఢవివాహమనఁగా స్త్రీ పురుషులు యుక్తవయస్కులైన పిమ్మట నొకరి నొకరు వరించి చేసికొను పరిణయము. ఈ ప్రౌఢవివాహములు పాశ్చాత్యదేశములందు మెండు. వారినిఁ జూచి మన భారతీయులుఁగూడ నక్లే చేయుచున్నారు. ప్రౌఢవివాహములు మంచివైనను వానివలనఁ బెక్కునష్టములుగూడ నున్నవి. హానివలని ప్రయోజనములేమన స్త్రీ పురుషులు యుక్తవయస్కులైన వారొకరి నొకరు ప్రేమించి, యొకరినడతలొకరు తెలిసికొని పిదపఁ బరిణయ మాడుదురు. వారప్పుడు దృఢకాయులై యుందురు. ఆరోగ్యవంతులుగ నుందురు. అందున వారికి సంసార సుఖమపుడు దెలియును. వారికిఁ బుట్టుపిల్లలుఁగూడ నారోగ్యవంతులై యుందురు.

కాని, యిటువంటి వివాహములవలనఁ బెక్కునష్టములున్నవి. బాలికలకు పదునైదేండ్లకుఁ గామోదయ మగును. అంతవఱకు వారవివాహితులై యుందురు. అప్పుడు స్త్రీ పురుషులు గాఢమైన కామాంధకార మగ్నులై యొకరి విషయ మొకరు తెలిసికొననశక్తులై స్థితిగతుల విచారింపక శీఘ్రముగఁ బెండ్లిచేసి కొందురు.

ఆపిమ్మట వారు దుఃఖముల పాలగుదురు. ప్రౌఢవివాహములఁ జేసికొని దుఃఖించు వారనేకులు గలరు. మఱియుఁ ప్రౌఢ వివాహములవలనఁ దలిదండ్రులకుఁ గన్యాదాన ఫలముపోవును. బాలికలకెనిమి దేండ్లకు వివాహమొనర్చిన కన్యాదాన ఫలముగల్గునని పెద్దలందురు. కాన నీ ప్రౌఢవివాహములచేఁ గన్యాదాన ఫలము నశించును. మఱియుఁ బెద్దవారైన స్త్రీలకేమి, పురుషులకేమి, ఇతరవ్యక్తులందు మనసుపోవును. దీనివలన నొకపరి వివాహమాడిన భార్యాభర్త లాజన్మాంతము శోకమగ్నులగుదురు.

ఇపు డమెరికాదేశమున నొక నూతనపద్ధతి వెల్వడినది. యువతీయువకులు మూఁడేండ్లవఱకు మాత్రము గలిసియుండుట, (Contract System) ఇందువలన స్త్రీగాని పురుషుఁడుగాని నియమితకాలము దాఁటిన వేఱొక పురుషునిఁగాని స్త్రీనిఁగాని వరింతురు. దీనిచే మనుజులు అరోగ్యవంతులగుదురు. ప్రౌఢవివాహములున్న పాశ్చాత్యులలో నూటికిపదిమంది యాలుమగలు సుఖులై యుండుదురు. ప్రౌఢవివాహములచే ఇన్నినష్టములు గల్గుచున్నవి.

ఆదినుండి బాల్యవివాహములు మనదేశమున లేవు. పూర్వము స్వయంవరపద్ధతిప్రకారము కన్యకకు ఈడువచ్చిననే వివాహము గావించుచుండిరి. మనదేశమున నిపుడు వితంతువుల సంఖ్య యధికముగనున్నది. బాల్యవివాహములు దీనికిఁ గారణములు. బాలబాలికలను చిన్నతనమందే, వారజ్ఞానదశలోనున్నపుడే వివాహము సేయుదురు. ఇది కడుఘోరము. కన్యకకు వరునిఁగూర్చి కాని, వరునికి కన్యనుగూర్చి కాని యేమియుఁ దెలియదు. కొందఱు తల్లిదండ్రులు స్వలాభముకొఱకుఁ దమచిన్నబిడ్డల ముసలివాండ్లకిచ్చి వివాహము సేయుదురు. కొందఱు

* శ్రీ రాజకీయోన్నతబోధనాభ్యసనమహిళాపాఠశాల (అనంతపురము) లో, వాఙ్మయ సంఘ పక్షమున ఈసంవత్సరారంభమున జరిగిన వ్యాసలేఖన పరీక్షయందు, రెండుగంటలలో వ్రాసిన ప్రథమవర్గము వారు 28 గురు యభ్యర్థినుల వ్యాసములలో, ప్రథమస్థానము వహించినట్లు పరీక్షకులచే నిర్ణయింపఁబడి, తత్సంఘ ద్వితీయవార్షికోత్సవసమయమున (1-2-30) పారితోషికముఁ బొందిన యభ్యర్థిని వ్యాసము.

బాలికపం(డెండేడులకు రజస్వలయైన నప్పుడే గర్భాదానము సేయుదురు. కర్మముజాలక యాబిడ్డ చూలుదాల్చె నేని ప్రసవించునపుడామె ప్రాణము, శిశువుప్రాణము కడునపాయస్థితిలో నుండును. ఒకవేళ సుఖప్రసవమైనను బుట్టినబిడ్డయుఁ దల్లియు మిక్కిలి బలహీనులుగ నుందురు. వారిటుల చాలకాలము జీవింపరు. అకాలమున మరణింతురు. ఇట్లు జనక్షయమగుటచే సంఘమునకు నష్టము.

బాల్యమున వివాహితుఁడైన వరుఁడు పరలోకగతుఁడయ్యెనేని యతనిభార్య తన జీవితకాలమంతయు దుఃఖసాగరమున మునిఁగి యుండవలసివచ్చును. మన హిందువులలో వితంతువులు వివాహము చేసికొనఁగూడదు.

కాని, బాల్యవివాహములవలనఁ గొన్ని లాభములున్నవి. తలిదండ్రులందఱు (కొందరుతప్ప) తమ బిడ్డల హితమునే కోరి కులముశీలముగల వరునకిచ్చి వివాహము సేయుదురు. పిల్ల రజస్వల కాకముందు పామె నప్పుడప్పుడత్తవారింటికిఁ బంపుదురు. అల్లుని తమకడ కప్పుడప్పుడు పిలుచుకొని వత్తురు. దీనివలన భార్యాభర్తలకు పరస్పరానురాగము రేకెత్తి బలియును. సుఖముగనుందురు. ఎనిమిదేండ్లకు వివాహమొనరించిన కన్యాదాన ఫలము ప్రాప్తమగును.

కాని బాల్యవివాహములవలనఁ బిల్లలకు విద్యరాదు. 'వివాహో విద్యనాశాయ' యనునట్లు చిన్నప్పుడే పెండ్లిచేసిన బాలబాలికలకు విద్యపై మనసుగల్గదు. అందును మనదేశముష్ణదేశమగుటఁ బట్టి బాలికలు పాశ్చాత్యులవలె 15, 16 యేండ్లకు రజస్వలలు గాక 12 యేఁడులకే రజస్వలలగుదురు. రజస్వలలైన రెండు మూఁడు నెలలకే మనవారు గర్భాదానము సేయుదురు. ఆపైన బాలిక నత్తవారింటికిఁ బంపుదురు. ఇఁక విద్యయెట్లు వచ్చును? ఈ బాల్యవివాహములు స్త్రీపురుషు లిరువురు విద్యావిహీనులగుటకే కారణములగుచున్నవి.

బాల్యప్రౌఢవివాహముల లాభనష్టములఁగూర్చి చర్చించినపుడు ప్రౌఢవివాహమే మేలని తోఁచుచున్నది.

# ఒకనాటి సాయంకాలము

పెమ్మరాజు గోపాలము గారు బి. యె. సారస్వతసమాజము

భానుఁడపరాబ్ధిలోపల వ్రాలుచుండ
భావముదయమందెడు నాదుభావమందు
తచ్ఛవర్ణంపుబింబంబు దఃతుగకాంతి
ప్రీతి నాభావమునువిచ్చె గీతమగుచు.
వ్రాలె రవి సాంధ్యరాగంబు లీలవిడచి
కవిసమూహంబు రోదనఁడవిలి యఱువ
కవిశిరోమణివర్ణన దవిలిపాడు
కమలమదె సోలె నాదుహృత్కమలమలరె.

ఈసరోవరవారిపై నాసువర్ణ
సాంధ్యరాగంబు మిలమిల చలనమొందె
నాదు భావనారాగంబు మోదమొదవ
శ్రుతులవెలయించి గీతము కృతినిసింపె.
సంజచాయలు మాసెను సంతమసము
క్రమ్ముకొనుచుండె నెల్ల దిక్తటములందు;
మలయమారుత మెప్పటివలెనె యొలసి
కెరటములతోడ నల్లన క్రీడసలుపు.

# 'కథాకుసుమమంజరి'

## (విమర్శనము)

### భాషాసేవకురాలు

పాఠ్యగ్రంథనిర్ణయసభ (Text-Book Committee) వారి ఆమోదమును బడసిన ఆంధ్రగ్రంథములనీమధ్య పఠించుచుంటిని. అందు చింతాద్రిపేట హైస్కూలు సీనియరు తెలుగుపండితులగు విద్వాన్ టేకుమళ్ల పాపయ్యశాస్త్రిగారిచే రచియింపబడిన 'కథాకుసుమమంజరి' అను గ్రంథమొకటి. పాపయ్యశాస్త్రిగారు గృహలక్ష్మిపాఠకులకు క్రొత్తవారు కారు. వారికథలు ఒకటి రెండు గృహలక్ష్మిలో ప్రచురితములైనవి. అగుట నీమంజరి కూడ స్త్రీజనమనోరంజని యైయుండునను ఉత్సాహముతో పఠింపనారంభించితిని. కాని నాల్గవకథ చదువుట ప్రారంభించినతోడనే నేను ఉద్రిక్తనైతిని. కారణము ఆకథ పూర్తిగ నిచ్చట ఉదాహరించినచో మీకే తెలియగలదు.

### ధూమిని

పూర్వము "త్రిగర్తము" అను పేరుగలయొకానొక పల్లెటూరియందు ధనకుఁడు, ధాన్యకుఁడు, ధన్యకుండు అను మువ్వు రన్నదమ్ములు దమతమ భార్యలతో నివాసము సేయుచుండెడివారు. ఆయూర నున్నజను లందఱిలోను వారే యెక్కుడు ధనము గలవారు. కావున వారు సుఖంబుగఁ గాలము గడపుచుండెడివారు. అట్లు కొన్ని దినంబు లయినవెనుక వారిదేశమున వానలు గురియవయ్యె. పండ్రెండు వత్సరములు కఱవు సంభవించెను. కావునఁ బైరు లెచ్చటను బండుటలేదు. ఓషధు లన్నియు నెండిపోయె. నదులు, తటాకములు, నూతులు మున్నగువానియందుండు నీరెండిపోయెను. త్రాగనీరును దిన నన్నమును లేక ప్రజలు మిక్కిలి బాధపడుచుండిరి. ఆఁకలిబాధ కోర్వలేక జను లొకరి నొకరు చంపుకొని తినుచుండిరి. ఆతరుణమునఁ బైనుదాహరింపఁ బడిన సోదరులు మువ్వురు మాత్రము గృహములలో నున్న ధాన్యమును దిని కొంతకాలము గడపిరి. అనంతరము వారికిఁగూడ నింట ధాన్యము శూన్య మయ్యె. దానంజేసి వారది మొదలుగ నింట నున్న మేఁకలను, గొఱ్ఱెలను, గోవులను జంపి మెసవ మొదలిడిరి. కడకుఁ దమబిడ్డలను గూడఁ జంపుకొని తినిరి.

అప్పటి కాముగ్గురు సోదరులును వారిభార్యలును మాత్రము మిగిలియుండిరి. అత్తఱి నాముగ్గురు సోదరులును దమలో నిట్లు నిర్ణయించుకొనిరి. 'మన కిఁక నాహారసంపాదనమున కుపాయాంతరము గాన

రాకున్నది. కనుక మనభార్యలను బ్రస్తుతము చంపి భక్షింతుము. తరువాత నప్పటికొలఁది విచారించుకొందము. అని వారన్నదమ్ములు నిశ్చయించుకొని మొదటిదినము పెద్దవాఁడైన ధనకుని భార్యను జంపి యప్పటిక్షుధను దీర్చుకొనిరి. రెండవనాఁడు రెండవవాఁడైనధాన్యకుని పెండ్లమును జంపి భక్షించిరి. ఇఁక మూఁడవదినమున మూఁడవవాఁడైన ధన్యకునికళత్రమును సయితము తుదముట్టించి తిన నెంచి యుండిరి. కాని ధన్యకునకు మాత్రము తనప్రియురాలిని జంపుట కిష్టము లేదు. దానంజేసి యాతఁ డానాఁటిరాత్రి తనప్రియపత్నియైన ధూమినికడకుఁ బోయి యల్లన యిట్లనియె. "ప్రియురాలా! రేపు నాసోదరులు నిన్నుఁ జంపి తినఁ దలంచి యున్నారు. కావున మన మిద్దఱము నీగ్రామమును విడిచి మఱియొకదేశమునకుఁ గాని వనమునకుఁ గాని పోవుదము. తడవుసేయక నావెంట ర"మ్మని పిలిచెను.

ధూమినియుఁ దనప్రియుఁ డెఱింగించిన రహస్యవృత్తాంతమునకుఁ గడుంగడు సంతసిల్లి యారాత్రియే భర్తను గూడి యొకయరణ్యమున కరిగెను. ధన్యకుండు నా విపినమునఁ బండ్లను దుంపలను సేకరించి తన ప్రియురాలి కొసంగి యామెను బోషించుచుండెడివాఁడు. అనంతర మొకనాఁ డాదంపతులిద్దఱు నాయడవి యందుఁ దిరుగుచుండఁగా వికలాంగుఁడైన యొకహీనపురుషుఁడు వారికంటఁ బడెను. అతనిం గాంచి ధన్యకుఁడు మిగులఁ గనికరించి "యోపురుషుఁడా! నాతోడ వచ్చెదవా? నీ కాహార మొసంగి నీశరీరమునకుఁ దగిలిన దెబ్బలను గారచమురు మున్నగుతైలములతో మాన్పెద" ననవుడు నా మొండివాఁడు గడుంగడు సంతసిల్లి ధన్యకునితో నిట్లనియె. "ప్రభూ! నాకుఁ జుట్టములు గాని తలిదండ్రులు గాని స్నేహితులుగాని యెవరును లేరు. దానంజేసి యీవనమునం దిట్టి యవస్థ ననుభవించుచున్నాఁడను. మీరే నాతల్లిదండ్రులరు. మీరే నాబందుగులరు. మీరే నామిత్రులరు. మీరలే నా పాలిటిదేవతలరు."

నావుడుఁ గరుణాళుం డైన యాధన్యకుఁడు వానిని తన భుజములపైఁ గూర్చుండఁ బెట్టుకొని వృక్షములతోను లతలతోను గరము రమణీయంబైన యొక ప్రదేశమునకుఁ గొంపోయెను. అందా ధన్యకుఁడు లతలతోడను పత్రములతోడను నొకకుటీరమును నిర్మించి దానియం దావికలాంగునుండ నియమించెను. ప్రత్యహము ధన్యకుండును వానిభార్యయు మిగుల బ్రేమతోఁ బండ్లు, మాంసము, మున్నగు నాహారవస్తువుల నొసంగి పోషించుచు గారచమురులోనగు వానిని బెట్టి యాపురుషునిమేన నున్నగాయములను మాన్పిరి. ఇట్లుఁగొన్నిదినములు కాఁగా నాపురుషుఁడు చీయఁబట్టి యుద్రిక్తధాతుండైయుండె. ధన్యకుండు దన కొనర్చిన యుపకారమున కాతఁ డత్యంతము సంతసిల్లుచుండెడివాఁడు.

పదఁపడి ధన్యకుం డొకదినము పండ్లు దేర వనమున కరిగె. అత్తఱి వానిభార్యయైన ధూమిని తన యింటనున్న మొండివానిని నవివేకమున మోహించె. ఆపెపలుకులు వీనులందాఁకినంతనే "యోసీ! పాపాత్మురాలా! మిమ్మే తలిదండ్రులుగ భావించుచున్న నన్నుఁ గూర్చి నీవిట్లు పలుకుట కరము లోకవిరుద్ధ" మని యామొండివాఁ డాధూమినితోఁ జెప్పె. వాఁ డెంత బోధించినను వానిపలుకుల నాదుష్టురాలు గణింపక వానిమీఁది మోహము వదలకుండె. అనంతరము ధూమిని తలనొప్పియని యింట నొకమూలఁ బరుండె. అత్తఱి వనమునకుఁబోయిన ధన్యకుండును గృహమునకు మగిడివచ్చె. వచ్చినవెంటనే యాతఁడు భార్యయగు ధూమినిని జీరి "దప్పియెత్తుచున్నది. జలము గొనిరమ్మని" వచించె. అపు డాదుర్మార్గురాలు "నాకుఁ దల కంటగించెడి, నేను లేవఁజాలను. ఇదిగో చేఁద్రాడు. నూతికడ కరిగి జలము చేదుకొని త్రావు." మని సమాధానము చెప్పె. ఆపెమాటల నాలకించి ధన్యకుఁడు చేఁద్రాడు గైకొని నూతినుండి యుదకము చేదుకొనుచుండఁగాఁ గఠినురాలగు నాతని కళత్రము వానిని బావిలోఁ బడఁద్రోసె.

పదంపడి యామె వికలావయవుఁడైన యాపురుషుని భుజములపైఁ బెట్టుకొని యవంతీదేశమున కరిగె. అందలి జనులతో నామె యీతఁడు నాభర్తయని చెప్పుచుండెడిది. దానంజేసి యాయూరిజనులందఱు నామెను గడుంగడుం గౌరవమునఁ గాంచుచుండెడివారు. ఇట్లుండ నందఱును నాధూమినిని మహాపతివ్రత యని స్తుతింపుచుండఁగా బాటసారులచే బావినుండి యెత్తఁబడిన ధన్యకుండు నా యవంతీదేశమున కొకా నొకదివసమందరిగె. అందతఁడు దిరుగుచుండఁగా నొకనాఁడు దుష్టురాలగు ధూమిని యాతనిఁగాంచి యాదేశపుఁ బ్రభువుకడకుఁబోయి యిట్లనియె. "రాజా! నామగనిని వికలాంగునిఁగావించిన పాపాత్ముఁ డీయూర నున్నవాఁడు. వానిని దాము దయచేసి శిక్షింపుఁడు." నావుడు ఱేఁడు సేవకులచే ధన్యకునిఁ బట్టి తెప్పించి చిత్రవధ గావింపుఁడని కట్టడచేసె.

వారు రాజునాజ్ఞ శిరంబున వహించి ధన్యకునిఁ బట్టుకొని వధ్యస్థానమునకుఁ గొంపోయిరి. అచ్చట రాజుగారిసేవకులను వీక్షించి యాతఁడిట్లనియె. "ఓ పుణ్యాత్ములారా! నా విన్నపము నాలించి నన్ను వధింపుఁడు; త్వరపడకుఁడు." నావుడు రాజభటులు "నీవేమి విన్నవించుకొనఁ దలంచితివో తెలుపు" మనిరి. అపు డాధన్యకుఁడు "మహాత్ములారా! నాయందుఁ గరుణించి మీరు వికలాంగుఁడైనయాపురుషునిఁ బ్రభువునొద్దకుఁ దోడ్కొనిపోయి నాయందలి గుణదోషములను జెప్పుమని వాని నడుగుడు. ఆతఁడు నా యందు దోష మున్నదని నుడివినచో నన్ను వధింపుఁడు. లేనిచోఁ బరిత్యజింపుఁడు." అని యా రాజసేవకు లను వేఁడుకొనెను.

ఇట్లు వేఁడుకొనుచున్న ధన్యకునియెడ రాజభటులు గరుణించి యామొండివానిని మహీపాలు నొద్దకుఁ దోడ్కొనిపోయి ధన్యకుఁడు దమతోఁ జెప్పినమాటలను రాజున కెఱింగించిరి. అపుడు రాజు వికలాంగుఁ డగు నాపురుషు నీక్షించి "యోరీ! యీధన్యకుండు నీయవయవములను ఖండించెనా? సత్యము వక్కాణింపుము." నావుడు వాఁడు రాజుగారిపాదములపైఁ బడి "ప్రభూ! ఈ మహాత్ముఁడు నా కించుకేనియు హానిఁ జేయఁడయ్యె. నాయంగముల నీతఁడు ఖండింపను లేదు. పీనుఁడనై యరణ్యమధ్యమునందు విలపించుచున్న నన్ను నీ దయాళుండు దనవెంటఁ దోడ్కొనిపోయి నాకుఁ బ్రత్యహ మాహారాదికము నొసంగుచుఁ గాపాడుచుండెడివాఁడు. అనంతర మొకనాఁ డీతఁ డింట లేనిసమయమున దుష్టచరిత యగు నీతని గృహిణి తగదని యెంతచెప్పినను నన్ను వలపించె. పిమ్మట నీతఁడు గృహమున కరుగుదెంచి పానీయము నడుగుడు. నీమె తలనొప్పియని నెపమున చేఁద్రాటిని నొసంగి నూతినుండి జలము చేఁదుకొని త్రావుమని వచించె. ఈతఁడు బావినుండి నీరుచేఁదుకొనుచుండఁగాఁ బాపిని యగు నిది యీతని నూతఁ బడఁద్రోసె. అనంతరమిది నన్నీదేశమునకుఁ గొనివచ్చిన" దని యథార్థమును జెప్పెను.

భూపాలుండును వానిమాటలను విని కరము వెఱఁగంది పాపిని యగు నాధూమినిని జిత్రవధ సేయ భటులకాజ్ఞాపించి మంచినడవడిక గల ధన్యకుని వదలిపెట్టెను. ప్రభువునాజ్ఞచొప్పున సేవకులు ధూమినిని జిత్రవధ గావించిరి. కావున స్త్రీహృదయము క్రూరమని గ్రహింపవలెను.

చూచితిరా? కథ స్త్రీలయెడ నైచ్యానుసంధానముచేయునదిగా నుండుట అటుంచుడు. వడపోసిన నీతిని గమనింపుడు. 'స్త్రీ హృదయము క్రూరమని గ్రహింపవలె' నట. స్త్రీమాతృదేవిగదా! ఆమె హృదయము క్రూరమని గ్రహింపవలెనా? బాలబాలికల లేతహృదయములకు హత్తింపదగిన ఆదర్శమేనా ఇది? ప్రస్తుతము ఎక్కడనో తప్ప

మిగిలినతావులందు బాలికలకు ప్రత్యేకపాఠశాలలులేవు. వారు బాలురతో కలసియే విద్యాసముపార్జనము చేయుచున్నారు. బాలబాలికలు కలసియున్న తరగతిలో ఈకథ పాఠముజరుగునపుడు బాలికల హృదయములు ఎంతకొట్టుమిట్టాడునో? ఒకవేళ గ్రంథకర్త గారు 'ఈచిన్నపొత్త మాంగ్లపాఠశాలలయందు తెలుఁగు నేర్చుకొను క్రింది తరగతుల యందలి బాలురకత్యంతోప యుక్తమైయుండునని' పీఠికలో వ్రాసితిని; ఇది బాలురకు మాత్రమే ఉద్దిష్టమైనదని చెప్పవత్తురేమో? అయితే బాలురకుమాత్రము స్త్రీహృదయము క్రూరమని బోధించిన కలుగఁగల ప్రయోజనమేమి? స్త్రీవిషయమున చిన్నతనము ఇంతటినీచాభిప్రాయమును నేర్చుకొనినవ్యక్తి గృహస్థుడై రోగము ముంచుకొనివచ్చినను మందీయక భార్యనుచంపు పాపియో, ఒకవేళ ఆమెబ్రతికినను షష్టిఘడియలు సాదింపులతో వేపుకొనితిను క్రూరుడోయగును. కాని గృహిణిని మన్నించు మాన్యుడు కాజాలడు. బాలురను ఇట్లు భ్రష్టులనుజేయు కథలతో గ్రంథములనింపుట ఎంతమాత్రమును క్షంతవ్యముకాదు.

ఒకవేళ గ్రంథకర్తగారు ఈకథ దండిదశకుమారచరిత్రలోనిది సంగ్రహించితినని తమ తప్పిదమును దాటవేయ జూతురేమో? అయితే నీతిగర్భితములును, సభ్యములును అగు కథలనే ఎత్తుకొనవలయునుగాని చేతికివచ్చిన చెత్తనంతనుచేర్చి గ్రంథను పూర్తిచేయ గలిగితిమి గదా అని సంతోషించి బాలుర లేతహృదయమును కలుషితము చేయుట పాతకము. కావున ఈ గ్రంథమునుండి ఆకథ తొలగింపబడువఱకును ఇది పాఠశాలల యందు పాఠ్యగ్రంథముగా పెట్టకుండునట్లు విద్యాలయాధికారులను వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను.

## అర్ధాంగలక్ష్మి

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

సీ. అర్ధాంగలక్ష్మి, నేత్రానందనజ్యోత్స్న, సత్కార్యరచన కుత్సాహశక్తి,
అక్షయోదయవంశ వృక్షాలవాలంబు, మనసుమర్మము దాచుకొనెడు నెలవు,
మానుషానందసంపదల పంటకొటారు, పుణ్యావగాహంపుఁ బొడుపుటేఱు,
తోడువీడగలేని నీడ, యందమ్ములపొట్లంబు, సౌభాగ్యభోగరాశి,

ఇహమునందెకాక సహధర్మచారిణి
పరమునందుఁగూడ భద్రహేతు;
వివ్విధము నెఱింగి పువ్వారుఁబోణితో
గార్హపత్యసుఖము గాంచవలయు.




గో హా రు క న్య

(సినీమానటి : 'గృహలక్ష్మి' అను ఫిలుమునందు నటించునప్పటి చిత్రము)

# బాలవిజ్ఞానశాఖ

## ౧. పదము

### తొక్కు పల్కులు

చందన సత్యనారాయణమూర్తిగారు

కాయి—తాయి!
ఏమి—తాయి?
గొర్రెతాయి——
ఏమిగొఱ్ఱె?
పాలగొఱ్ఱె——
ఏమిపాలు?
మేకపాలు——
ఏమిమేక?

కంచిమేక——
ఏమికంచి?
ముళ్లకంచి——
ఏమిముళ్లు?
జెముడుముళ్లు——
ఏమిజెముడు?
బ్రహ్మజెముడు——
ఏమిబ్రహ్మ?

కారుబ్రహ్మ——
ఏమికారు?
పట్టుకారు——
ఏమిపట్టు?
సీమపట్టు——
ఏమిసీమ?
కండచీమ——

## ౨. పాటలు

### జోలపాట

(సంపాదకురాలు) శ్రీమతి జమ్మి సీతాబాయిగారు

జోలల్లు పాడితే బాలలకు నిద్ర
నాగస్వరం పాడితే నాగులకు ఆట
చిట్టి చిట్టీ చిట్టి! చీమల్ల మర్రి
మర్రిక్రిందవాడు తొర్రినాగన్న
తొర్రినాగన్నకు తోడెవ్వరంటే
గోవుల్లగాచేటి గోవిందుడెతోడు.
అమ్మాయి నెవ్వారే కొట్టినవారు
కొట్టిగోవులపాలు కొనిబోసినారు.
చిన్నారిపొన్నారి చిలుకవే నీవు
చిగురు మామిడిక్రింద చిన్నకోయిలవు.
ఏడువకు ఏడువకు వెర్రిఅమ్మాయి
ఏడిస్తె నీకళ్లు నీలాలుగారు
నీలాలు గారితే నేచూడలేను
పాలైన గారవే బంగారుకళ్లు
హాయి హాయి హాయి ఆపదలగాయి
చిన్నవాళ్లనుగాయి శ్రీవెంకటేశ.

### చందమామపాట

చందమామ చందమామఓచందమామ
చందమామ కూతురునీలగిరికన్య
నీలగిరి కన్యచేతనీళ్లుగాపిస్తే
నీళ్లల్లో తేరింది నీలాలపేరు
పాలల్లో తేరింది పగడాలపేరు.

3. వినోద కథ

# ఎలుక కథ

శిలిగం జగన్నాథము గారు

ఒకవూళ్లో ఒక రాజువుండేను. ఆ రాజుకు ఏడుగురు మొగసంతానం కలిగేరు. తన కుమాళ్లకందరికీ రాజు క్రమంగా వివాహంచేసేడు. ఏడో కుమారుడికి కూడా వివాహం చేయాలని సంకల్పించుకుని ఆ చిన్నకుమారుణ్ణి పిలిచి నీ వుద్దేశమేమిటో చెప్పమన్నాడు. అప్పుడు కొడుకు తండ్రితో "కదురంత తిన్నన, కందిరీగంత యెర్రన గలిగి మిక్కిలి చక్కని చిన్నదాన్ని వివాహంచేసేటట్టయితే చేసుకుంటా" నన్నాడు. రాజు ఆ మాటలన్నీవిని అంతచక్కని చిన్నది లభించడం అసాధ్యమని తలచి నీవే స్వయంగా దేశాటనంచేసి నీకు నచ్చినకన్యను వివాహమాడి రమ్మనిచెప్పాడు. తండ్రి ఆజ్ఞప్రకారం చాలినంత ధనంతీసుకొని సాలగట్టిన గుఱ్ఱాన్నెక్కి జయ్‌పరమేశ్వరా! అని అప్పుడే బయలుదేరాడు.

ఆ రాజకుమారుడు ఎన్నో దేశాలుతిరిగాడు. ఎందరితోనో తనసంగతిచెప్పాడు. కాని ఎక్కడా తనకు నచ్చినచిన్నది కనపడనేలేదు. వెదకి వెదకి వేసారి చివరకు నిరాశ చేసుకొని స్వగృహోన్ముఖుడయి ఆనాటిరాత్రి ఒకపూటకూళ్లముసలమ్మ ఇంటివద్ద బసచేసాడు. భోజనానంతరం ఆ రాజకుమారుని దేశాటనవృత్తాంతం ఆ పూటకూళ్ల ముసలమ్మ విని చాలానొచ్చుకుంది. రాజకుమారుని మోసంచేయాలని తలచి ఆ ముసలమ్మ "అయ్యో నాయనా! ఈ భాగ్యానికి నీవింత శ్రమపడ్డావా? మొదటనే నావద్దకువస్తే నీకు శ్రమలేకుండా పెండ్లికూతుర్ని కుదిర్చిపంపుదునుగదా" అంది. ఆ మాటలకు రాజకుమారుడు చాలాసంతోషించి "పెద్దమ్మా! అల్లాగయితే యిప్పటికైతేనేమి కుదిర్చిపెడుదూ. నీకు గొప్పపారితోషికమిస్తా" నన్నాడు. సరేనని ముసలమ్మలోనికెళ్లి, కొంత సేపటికొక పెట్టెతీసికొనివచ్చి "అందులో దేవతాకన్యవుంది. ఈపెట్టెను మీవూరు వెళ్లిన తరవాత తెరచిచూచుకోవచ్చును; గాని ఈలోగా మధ్యత్రోవలో తెరచిచూచి నావంటే దేవలోకానికి వెళ్లిపోతుందని" చెప్పి అరాజకుమారుడిదగ్గర వెయ్యిరూపాయిలు తీసికొని మెల్లగా ఆనిశీథమందేసాగనంపింది.

రాజకుమారుడు తన శ్రమవృథాకాక సఫలమయినందుకు భగవంతుణ్ణి స్తుతిస్తూ ఎంతోసంతోషంతో వారంరోజుల ప్రయాణం నాలుగురోజులకే తొక్కుకొనివచ్చి స్వగృహం చేరుకున్నాడు. పెట్టెను తనగదిలోపెట్టి తాళంవేసాడు. తల్లిదండ్రులూ, అన్నలూ

చాలాసంతసించేరు. రాజకుమారుని ఆగమనవార్తవిని గ్రామస్తులు తండోపతండంగావచ్చి విఫలమనోరథులై వెళ్లిపోయారు. రాజకుమారుడు ఆనాటిరాత్రి తనభార్యనిచూడాలని పెట్టెతెరచేడు. దాంట్లోభార్యావుందా? లేదు. మరిఏముంది? ఎలుక. మొదలు నరకిన కదలీవృక్షంలాగ పాపమారాజకుమారుడు హతాశుడై స్మృతితప్పి నేలమీదపడి పోయాడు. కొంతసేపటికి పూటకూళ్లముసలమ్మ మోసంతెలుసుకొని గుడ్లకు కుంచెడు చొప్పున దుఃఖబాష్పాల్ని రాల్చేడు. ఇక తనబ్రతుకునిరర్థకమనిన్నీ, ఆవృత్తాంతం ఇతరులకు తెలిసిందంటే తన జీవితం మరింతహాస్యాస్పదం అవుతుందనిన్నీ విచారంతో మంచం మీద పడుక్కొని బయటకు రావటమే మానివేసాడు. వేళప్రకారం భోజన పదార్థాలను గదిగుమ్మముదగ్గర యెవరో వకరు పెట్టిపోతుంటే తనయిష్టంవచ్చినప్పుడు తీసుకొని తానింతతిని, ఎలుకకు యింతపెడుతూ గదిలోనే కాలంగడుపుతూవున్నాడు.

రాజకుమారుని చర్యలు తల్లిదండ్రులకూ, అన్నలకూ, వదినెలకూ చాలాచిత్రంగా కనపడ్డవి. నూతనదంపతులవడంవల్ల అందమైన భార్యను వదలి బయటకు రాలేకపోతున్నాడని అనుకున్నారు. కొత్తకోడలి సౌందర్యనిగ్రహవీక్షణాభిలాష వారందరికీ హెచ్చింది. ఏ ఉపాయంచాతచూడవచ్చునా అని ఆలోచించారు.

ఒకరోజున పండుగవచ్చింది. పండుగకు బియ్యంలేవని కొంత ధాన్యం ఏడుభాగాలు చేసి ఆరుగురుకోడళ్లూ వడ్లుదంచడం మొదలెట్టారు. ఏడోవాటా రాజకుమారుడిగది ముందు పోసేరు. రాజకుమారుడు ఆసంగతివిని ఇక తన రహస్యం బహిరంగంకాక మానదని ఏడుస్తూపడుకున్నాడు. కొంతసేపటికి రాజకుమారునివద్దకు ఎలుకవచ్చి విచారంగా వుండడానికి కారణం అడిగింది. సంగతంతా చెప్పాడు. "ఓహో ఇదా మీరు విచారంగా వుండడానికికారణం? ఫర్వాలేదు. మీరు విచారించవద్దు. పెరుగూ అన్నంగిన్నెలో కలిపి పెట్టి మీరుపడుకోండి. తెల్లవారేవరకు నేనాపని చేయిస్తానని" ధైర్యంగాచెప్పింది. ఆమాటలువిని రాజకుమారుడు అల్లేచేసి పడుక్కున్నాడు.

ఎలుక పెరుగు గిన్నెవద్దకు వచ్చి "కిచకిచ" అని ఎలుకలన్నిటినీ పిలిచింది. ఎలుకలన్నీ వచ్చాయి. ఆ పెరుగూ అన్నం తినమంది. తిన్నాయి. తరవాత వడ్లరాసివద్దకు తీసి కెళ్లి వడ్లను పళ్లతో వలవమని తానూ వలవడంమొదలెట్టింది. కాసేపట్లో బియ్యం తయారవగానే ఎలుకలన్నీ ఎక్కడవి అక్కడకు వెళ్లిపోయినాయి. కొంతసేపటికి రాజకుమారుడు మేలుకొని చాలాసంతోషించి బియ్యాన్ని బయటపోసి మళ్లీ తలుపువేసేసాడు.

తెల్లవారగానే ఆరుగురు కోడళ్లూ ఆబియ్యాన్నిచూచి తమరు దంచినబియ్యమునకన్న పరిశుభ్రంగా వుండటంవల్ల ఆశ్చర్యపడి ఆమె అందకత్తేకాక పనికత్తెకూడా అనుకున్నారు. దానివల్ల ఆమెను చూడాలనేకోర్కె వారికి మరీ ఎక్కువయింది.

మరునాడు ఇంకొకపని కల్పించేరు. ఎవరిగదులకువారే వెల్లవేయాలని తీర్మానించుకుని, రాజకుమారునిగదికి వేయటానికి వెల్ల గదిముందుపెట్టి పోయారు. రాజకుమారుని హృదయాకాశాన్ని చింతామేఘములలముకొన్నాయి. ఎలుక మళ్లీఅడిగి నిన్నటిలాగే పెరుగూఅన్నము గిన్నెలోపెట్టి పడుకోమంది. అల్లేచేసాడు. మళ్లీ ఎలుక ఎలుకల్ని ఆహ్వానించింది. అన్నీవచ్చాయి. పెరుగూ అన్నం తిన్నతరువాత సంగతంతా చెప్పి సహాయంచేయాలని కోరింది. అవన్నీ వాటితోకల్ని వెల్లలోముంచి గోడలకు వెల్లవేసి వెళ్లిపోయినాయి. తెల్లవారగానే తోడికోడళ్లుచూచి తెల్లపోయారు.

మళ్లీ నియమించుకున్నారు పనులు. ఈసారి ఊరుబయటవున్న నూతికెళ్లి నీళ్లు తేవడం. రాజకుమారుని గదిముందు బిందెపెట్టి ఎవరిబిందెవారు తీసుకొని ఆరుగురు కోడళ్లూ నీళ్లు తెచ్చుకున్నారు. రాజకుమారుడు యీమారు తన నిగూఢజీవితరహస్యం ప్రకటనకాక తప్పదని విలాపిస్తూవున్నాడు. ఎలుక మళ్లీ అడిగి తెలుసుకుంది. కాని ఈమారు దానికీ ఏమీ తోచింపకాదు. చివరకు ధైర్యంతెచ్చుకొని ఎలుకల్ని పిలిచింది. విషయమంతా చెప్పింది. సరేనని వప్పుకొని ఆ ఎలుకలన్నీ బిందెలోదూరి దొర్లించుకొంటూ నూతిదగ్గరకు బిందెను తీసికెళ్లినాయి. కాని అక్కడ నీళ్లుతోడటం వాటికి సాధ్యంకాక ఎక్కడవి అక్కడకు వెళ్లిపోయాయి. పాపం అసలు ఎలుక అక్కడేవుండిపోయి భోరుమని ఏడుస్తూవుంది.

ఆసమయంలో పార్వతీపరమేశ్వరులు లోకపాలనార్థం బయలుదేరారు. ఆ ఎలుక ఏడుపు విని దయతలచి దగ్గరకువచ్చి సంగతంతా తెలుసుకొని కొన్నినీళ్లు అభిమంత్రించి మీదచల్లారు. వెంటనే ఆఎలుక దేవకన్యల్నిమించిన సౌందర్యంతో పదహారేళ్ల బాల అయినిలిచింది. పార్వతీపరమేశ్వరులు బంగారపుబిందెతో నీళ్లుముంచి భుజానికెత్తి దీవించి వెళ్లిపోయారు. అప్పుడాచిన్నది ఘల్లుఘల్లుమని కాలిఅందెలమ్రోతతో ఇంటికి వచ్చింది. తొలకరిమెరుపులా మెరుస్తూన్న ఆమె శరీరలావణ్యానికి అందరూ విస్మయం చెంది రాజకుమారుని అదృష్టాన్ని వినుతించారు. భార్యవల్ల రాజకుమారుడు యావద్వృత్తాంతమును విని పార్వతీపరమేశ్వరులకు ధన్యవాదాల నర్పించాడు. కథ కంచికెళ్లింది. మనం ఇంటికొచ్చాం.

ర. బుద్ధిపరీక్ష

## యుక్తిలెక్క

ముద్దా విశ్వనాథము గారు

[ఇది బాలురయు బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనది. కావున ఈ యుక్తిలెక్కకు సమాధానము స్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడిన బాలబాలికలు జూలై 10-వ తేదీ లోపున లేఖాముఖమున (ఉత్తరములో వారివయసు తెలుపవలెను) మాకు తెలియజేతురుగాక!]

—సంపాదకుడు

ఒకా సంఖ్యవుంది. ఆ సంఖ్యను 2 పెట్టి భాగిస్తే ఒకాటి మిగులుతుంది. దానినే 3 పెట్టి భాగిస్తే రెండుమిగుల్తుంది. ఆ సంఖ్యనే 4 తో భాగిస్తే 3 మిగులుతుంది. 5 చేత భాగించితే 4 మిగులుతుంది. 6 చే భాగిస్తే 5 శేషం వుంటుంది. అదేసంఖ్యని 7 పెట్టి భాగిస్తే సరిగ్గా తెగిపోతుంది. ఆ సంఖ్య ఏది?

౫. పద్యము

## మంచిబాలిక

వల్లూరి సత్యనారాయణచౌదరిగారు

భానుమూర్తిరాక కానుపింపకముందె
నిదురనుండిలేచి నిత్యకృత్య
ములనుదీర్చి స్నానమునుజేసి మనసార
దైవప్రార్థనంబు దనరసల్పి
బడికిఁదరలిపోయి బడిలోననొజ్జలు
గఱవుదాని స్థిరత గనుచునుండు
పుస్తకముల గట్టుపుట్టంబులను శుభ్ర
పరచుకొనుచు హాయి వరలుచుండు
అన్యులతోడి కయ్య మాడంగఁజనబోదు
స్నేహబుద్ధి నొరుల సేరుచుండు
పలుకబోదు చెడుగుగలుగు పల్కులెపుడు
వినగదలపదప్పి వీనులలర
ఒరులమాట నొకరి కెరిగింప మదిజంకు
బుధుల జూచినంత మ్రొక్కుచుండు
పిన్నవారి గనును ప్రేమరసంబొల్క
దీనుజూచి దయను బూనుచుండు
హాస్యమాడదలప దగహీనులనుగన్న
పరులసుఖమెకోరి పలుకుచుండు
తోడివారి ఘనత దొలగింప దలపదు
బుద్ధిశాలియైన ముద్దరాలు
గాననిట్టిబాల గనినంత విన్నంత
నిర్మలాత్ములగుచు నియతితోడ
నాదరించియాప్తె కాశీస్సులర్పించి
సంతసింతు రార్యజనము లెపుడు
భావికాలంబున బాలలారమీరు
ధాత్రి నతులువడయ దలతురేని
మంచివారిగూడి మసలుట యొప్పగు
సుగుణమబ్బుదాన శుభములొదవు.

# ఆరోగ్యభాగ్యము

ఆలూరు రామచంద్రయ్యగారు బి. యె.

లోకమునందు ప్రతిమానవునకును ఆరోగ్యము ముఖ్యమైనది. ఆరోగ్యమే ప్రతి జీవుని సంతసమునకు మూలకందము. అనారోగ్యమే దుఃఖమునకు కారణము. జన్మతః కల్గిన లోపములుదప్ప సాధారణముగ మనుజుని ఆరోగ్యసూత్ర మాతని హస్తగతమైయేయున్నది. ఆహారము, శరీరవ్యాయామము విశ్రాంతి మొదలగు విషయములు గమనింపదగినవి. క్షుద్బాధ తీర్చుకొనుటకు వలసినంత మితాహారము తినుట మంచిది. ఇది తినుట కర్హమైనది, యిది అనర్హమైనది అను యుక్తాయుక్త విచక్షణతకల్గి వస్తువులను వాడవలెను. మంచి అలవాటు దీర్ఘాలోచనచేతను, చెడువాడుకలు నిర్లక్ష్య భావము వలనను కలుగును. అలవాట్లు ప్రకృతికి రెండవవి. కాబట్టి మంచి అలవాట్లు అలవరచు కొనవలయును. లేనిచో దీర్ఘవ్యాధులుకల్గి వైద్యులచేతనైన నివారింపబడని స్థితి కల్గును; లేదా శస్త్రచికిత్సలకులోను గావలసివచ్చును. సామాన్యమగు ఆహారము, వలసినంత విశ్రాంతి, క్రమమైన అలవాట్లు గలవారికి ఆరోగ్యసంపద యెప్పుడును ఉండును.

ఎట్టి ఆహారమును భుజింపవలెను? తినుపదార్థములు క్రొత్తవిగను, ఆరోగ్యకరములుగను, బలకరములుగను, రుచికరములుగను, దృప్తికరములుగను ఉండవలెను. వెలతక్కువయని నిలువయున్న కూరగాయలగాని, యితరవస్తువులగాని కొనరాదు. వానివలన అజీర్తి విరేచనములు, గుండెదడ, అన్నమందు అనిష్టత, ఆకలి లేకపోవుట, ఒకవిధమగు క్రోధభావము ఇవి ఉదయించును. తెచ్చిన వస్తువులను పక్వముగ వండి భుజించుచో తృప్తియు, సంతసము నొనగూడును. అమితముగ భుజింపరాదు. అందువలన జీర్ణకోశమున కెక్కుడు పనికల్గును. ఆకలితీరుట కెంతభుజింపవలెనో అంతియ భుజింపవలెను. ఇట్లు చేయుటచే వ్యయమును చాలవరకు తగ్గును. త్రాగుట, మత్తు పదార్థములనువాడుట వదలవలయును. సదా మనోవ్యాకులత పొందియుండరాదు. అజీర్ణమువలన ఆరోగ్యమెట్లు చెడునో అట్లే మనోవ్యాకులతవలనకూడ ఆరోగ్యము చెడును. కాబట్టి చుట్టుప్రక్కల పరిస్థితులు బాగుండవలెను. ఆరోగ్యమునకు పరిశుభ్ర

తయు ముఖ్యము. ప్రతిదినమును స్నానము చేయవలెను. కొందరు రెండు మూడు దినముల కొక్కసారియైన స్నానము చేయరు. ధరించువస్త్రములు బాగుగ ఉతుకబడి శుభ్రముగ నుండవలెను.

ఆరోగ్యభాగ్యమునకు మరియొకపరికరము వ్యాయామము. వ్యాయామపరిశ్రమలచే దేహము స్వస్థత జెందును. భర్తయగువాడు తీరికగల్గువేళలయందు తనభార్యను కొంత దూరము నడిపించుకొని పోవలెను. మరలి యింటికి వచ్చువేళకు ఆకలికల్గును. అలసట జెందియుండుటచే మంచినిదుర వచ్చును. అట్లు సుఖనిద్రను జెందుస్త్రీలు బలవతులు, సంతోషస్వాంతలు, ఆరోగ్యవతులునై వర్ధిల్లుదురు. ఇరుగు పొరుగువారితో వృథా కాల క్షేపము చేయుటకు బదులు తెల్లవారగనే ఇంటిపనుల చక్కబెట్టుకొని, మంచివస్త్రముల ధరించి, మనసునందుండెడి వ్యాకులతను పారదోలి, సంతోషచిత్తముతో తమ భర్తలతో కొంతదూరము నడచుటకు మనస్త్రీలుసిద్ధముగ నుండవలెను.

కొందరు నూత్నదంపతులు, క్రొత్తకాపురము సరదాలో ఇంటిఖర్చులను గమనింపక యిష్టమువచ్చినరీతి వెచ్చింతురు. భార్యయైనది అట్లుగాక యింటివ్యవహారములను జాగ్రత్తగ చక్కబెట్టవలెను. వివాహమునకు పూర్వమే ఆమె గృహకార్యములందు తల్లివద్ద శిక్షణబొందవలెను. వంటచేయుట, కుట్టుపనులుచేయుట మొదలగు వాటియందు సుశిక్షను పొందియుండిన గృహకార్యములను చక్కగ నిర్వర్తింపగలదు. లోపములున్న భర్త కినుకవహింపవచ్చును.

పెనిమిటికి సమానుడైన యధిపతి స్త్రీలకులేదు. అతనికి నీడైన సుఖములేదు. ద్రవ్యమునంతటిని వదలియైనను స్త్రీ తనయొక్క మగనినే యాశ్రయింపవలెను. ఏయాడుది యింటిపనులయందు గట్టిదియో, బిడ్డలుగలదియో, పెనిమిటిని తనయుసువలె చూచుచున్నదియో, మఱిపాతివ్రత్యమును గలదియో, ఆమెయే నిజమైన పెండ్లము.

శ్లో॥ దహ్యమానామనో దుఃఖై ర్వ్యాధి భిశ్చాతురానరాః
హ్లాదంతే స్వేషు దారేషు ఘర్మార్తా స్సలివేష్వివ.

అను నార్యోక్తివలె, మనోవ్యాకులతచే కుమిలి యున్నట్టివారికిని, రోగముచేత పీడితులైనవారికిని, ఎండవేడిమిచే సంకటపడుచున్నవారికిని నీళ్లచే సుఖముకలుగునట్లు పురుషులు తమ తమ భార్యలచే మిక్కిలి సంతోషము పొందుదురు. ఒకరి గుణము నొకరెఱిగి, సహనస్వభావులై పరస్పరము సహాయముచేసికొను దంపతుల గృహము స్వర్గతుల్యము.

# చలివేంద్రము ముచ్చటలు

శ్రీమతి కొప్పర్తి సత్యవతమ్మగారు

## ౨

### చలివేంద్రవద్ద నొక గాజులసెట్టి

మఱునాడు పదిగంటలయ్యెను. మామూలుగా వేంకటనరసమ్మగారు చలివేంద్రవద్దకు వచ్చి యాత్రా యాత్రజనములకు దాహముఇచ్చుచుండిరి. ప్రొద్దు నడినెత్తికివచ్చుచుండెను. ఇంతలో వేంకటాపురము దిక్కునుండి ఒకగాజులసెట్టి బుధవారము సంతకు గాజులదుకాణము వేసుకుందామని వచ్చుచుండెను. సేద దేరి విశ్రమించిపోవు నుద్దేశముతో నాతడు చలివేంద్రలోనికి వచ్చెను. దాహము తీసికొని 'శివ! శివా! బ్రతికితిని, తల్లీ! నోరు ఎండిపోయినది. తిరిగి బ్రతికించినారు' అంటూ అచ్చటి అరుగుమీద కూలబడెను.

ఇంతలో అయిదుసంవత్సరముల ఆడుపిల్ల యొకతె అక్కడకువచ్చి గాజులసెట్టిని చూచి వేంకట నరసమ్మగారితో 'అత్తా! నాకు గాజులు తొడగించు' అని మారాముచేసెను. 'అట్లాగునే తొడగించెదను. కూర్చుండుము' అని ఆబాలికను వేంకటనరసమ్మగారు సముదాయించుచుండిరి. అప్పుడు గాజులసెట్టి కొప్పయ్య 'రండి! అమ్మాయిగారూ! తొడగుతా రండి' అనుచు వేంకటనరసమ్మగారిని చూచి

'అమ్మా! మీపేరేమిటండీ!'

'నాపేరు వేంకటనరసమ్మ అంటారు.'

'ఈ అమ్మాయిగారు మీకు ఏమవుతారండి?'

'మా అన్నగారి కొమార్తె. అవును గాని సెట్టీ! నేపేరేమిటి?'

'తల్లీ! కొప్పయ్య అంటారు.'

'కొప్పయ్యా! మీ దేయూరు?'

'అమ్మా! మాది తరిగొప్పుల. బందరు దగ్గిర బచ్చులపల్లిలో ఒక బ్రాహ్మణుల ఇంటివద్ద ఈ గాజులు అమ్ముతారు. వారివద్ద కొనితెచ్చి మాకు బేరమునకు ఇట్లు ఊరూరతిరిగి అమ్ముకొందును.

'బచ్చులపల్లి బ్రాహ్మణుల ఇంటి గాజులా? వారిఇంటిపేరెవరు?

'వారిఇంటిపేరు నాకు తెలియదు. కానండి ఆయింట్లో ఒక అరవైసంవత్సరముల ముసలాయన ఉన్నా డండి. ఎప్పుడూ వాకట్లోనే కూర్చుని విస్తరాకులకట్టలు, చుట్టలు కట్టుకుంటూ, చట్టుకుంటూ ఉంటారండి. గాజులకోసము వెళ్లితే వారి అబ్బాయినిపిలిచి రకాలు చూపించి రొక్కం చేతులో వేసుకొంటారండి. అమ్మా! వారిని ఎరుగుదువా అన్నారు మీకు వారుచుట్టాలా ఏమిటండి?'

'ఆ. చుట్టాలే'

'ఎటువంటి చుట్టాలండి?'

'మా రెండవచెల్లెలు అత్తవారు. ఆముసలాయన మాచెల్లెలుమామగారు.'

'అమ్మా! మీరుకోపం చెయ్యకుండావుంటే నేను ఒకమాట అంటాను. ఆముసలాయనవంటి సన్న రోమములు ఒక కంబళీ అవుతుందండి.

‘(పకపకా నవ్వి) ఈమాటు గాజులకు వెళ్లినపుడు అడిగి తెచ్చుకో కంబళీ వేయించుకొని గాజులు తొడిగేటప్పుడు క్రింద వేసుకుని కూర్చుండువుగాని.’

‘అమ్మగారూ! వారి అబ్బాయిల్లో ఎవరండి మీమనవడిగారు.’

‘ఆవూరికి కరణంగారు. చామనచాయగా పొడుగ్గా పంచెకి స్తంభమునలె ఉంటారు. నీవు ఎప్పుడూ కనిపించలేదూ?’

‘కనిపించారు కానండి ఎప్పుడూ మాట్లాడుతుండగా చూపలేదండి. మాటలు వచ్చునాండి?’

‘మాటలు రాకపోతే కరణీకం ఎల్లాచేస్తున్నాడు. కాని మాట్లాడకూడదని ఏదో వ్రతము ఉన్నట్లు కనిపిస్తాడు. ఆవీథి ఆయనవవరో అన్నము తూచి తింటాడుటలే. అట్లాగునే ఈయన మాటలు లెక్కపెట్టి మాట్లాడుతాడు.’

‘అమ్మా! ఇక్కడికి వచ్చినప్పుడేనా సరిగ్గా మాట్లాడరండి.’

‘పలుకు బంగారము. భోజనము చేసేటప్పుడు అక్కరలేదు, కావలెను ఇవిచేతులతోను కండ్లతోను ఆయనచేసే అభినయాన్నిపట్టి కనుక్కోవలసినదే. పూర్వజన్మములో ఏదో వేశ్య అయివుండి ఆవాసన ఇంకా వదలక ఈమాదిరిగా వున్నారని అనుకుంటూ వుంటాను. ఆయన ముఖముమీద యిరుప్రక్కలా పెద్ద కొచ్చింకలకవలె ఉన్న మీసాలు ఆయన పెదవికదిపవలసిన అవసరములేకుండానే ఆయన నియ్యోగాని చాటుతూఉంటాయి.”

ఈసంభాషణ జరుగుసరికి ప్రొద్దు కొంచెము వాటారగా గాజులసెట్టి సెలవుతీసికొని తనపనిమీద పోయెను. మఱికొంతసేపటికి సాయంకాలము కాగా వేంకటనరసమ్మగారు చలివేంద్రమూసి ఇంటికి వెడలిరి.

# గృహలక్ష్మి

## అనుముల వేంకట శేషకవిగారు

గృహమునకు లక్ష్మి యెయ్యది? కేవలము గృ
హంబు విడక మెలంగు నిల్లాలు? ప్రతిగృ
హంబునకుఁబోయి మెప్పువదలనంది, కళల
నీను పత్రికయా? సతు లెంచవలయు!
“ఇహసుఖంబుల కావాసమిది; తదన్య
సామ్యమెది?” యను పూరుషసన్నుతులకుఁ
దావలంబగుపత్నియా? భావవనధి
లలితపత్రికయా? గృహలక్ష్మి; చెపుఁడ!
గృహమునకు లక్ష్మి గృహలక్ష్మి; గృహముయొక్క
లక్ష్మి యగు గృహలక్ష్మియు; గృహమునందు
వెలయు లక్ష్మీకళలఁగూర్చు వితతవస్తు
సమితియగు గృహలక్ష్మియే; సరియ! కాని,
మనకు గృహలక్ష్మి యెయ్యది మఱితలంప?
దినదినంబును బొలయల్క తేజరిల్ల
వగలఁబొగిలించువగలాడి వలపుమేలొ?—
నెలనెలకువచ్చి మీసతుల్ నిక్కి చూడఁ
దహతహలఁగొల్పు పత్రిక తలఁపుమేలొ?
పురుషులైనను వివరింపఁబోలుఁగాదె!
పురుషులకుమాత్రమే మోదమొరయఁజేయు
సుదతికంటెను—స్త్రీపూరుషులకు సంత
సంబు, విజ్ఞానమును గూర్పఁజాలునట్టి
పత్రికయె—“గృహలక్ష్మి”, నాబలుకఁదగదె?



### కొమ్మలుగల కొబ్బరిచెట్టు:—

తాటి, కొబ్బరి, ఈత మొదలగు జాతిచెట్లకు కొమ్మలుండుట అసాధారణము. చోళ్లంగి అగ్రహారములో శ్రీవంకాయల సూర్యనారాయణగారి పెరటిలోగల కొబ్బరిచెట్లలో నొకటి సుమారు ౨౦, ౨౫ మూరల పొడవు పెరిగి అచ్చట రెండు కొమ్మలును, ఆరెండుకొమ్మలలో ఒక కొమ్మకు మఱియొక కొమ్మయును పెట్టినది. ఆమూడు కొమ్మలును సుమారు ౮ మూరల పొడవుగలవు. అవి మామూలు కొబ్బరిచెట్లవలె మట్టలతోను మూడుచెట్లకు ఉండు కాయలు, గెలలు వీనితోను నిండిఉన్నవి.

### అరువదిమైళ్లవఱకు కనిపించినమంట:—

రొమేనియా దేశమునందలి ప్లోయిషి పట్టణమున ఎనిమిది పెద్ద పెట్రోలియము చెలువులు పరశురామప్రీతి అయినవి. అప్పుడు వేచినమంట యొక్క వెలుగు అరువదిమైళ్లవఱకు కనిపించినది.

### ఊపిరితిత్తులు, గుండెకాయ ఫిలుమునకెత్తబడినవి:—

జర్మనీదేశమునందలి బెర్లినునగరమున ఒకానొక ఆస్పత్రిలో డాక్టరు వెన్నరు సీబర్టుగారు ఒకని ఊపిరితిత్తులు ఆపరేషను చేయుచుండగా అవిఫిలుమున కెత్తబడెను. ఆఫిలుములో ఆపరేషను చేయుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములప్పుడు ఊపిరితిత్తులు కదలుట, గుండెకాయ కదలుట అతిస్పష్టముగ చూడనైయుండెను.

### కుక్కలను కొలిచిన జాతి:—

లండను విశ్వకళాపరిషత్తువారి కళాశాలలో ఉపన్యసించుచు ప్రొఫెసరు సర్ విలియము ఫిండ్లర్సు పిట్రీగారిట్లు చెప్పిరి, "క్రీస్తుపూర్వము 3,400 సంవత్సరముల ప్రాంతమున పాలస్తీనులోని బెత్తుపెలిట్ ప్రాంతమునందు కుక్కలను పూజించినజాతివారు నివసించుచుండిరనుటకు నిదర్శనములు దొరికినవి. వారి సమాధులయందు కుక్కల ఆకారమున చెక్కబడిన చిన్న చిన్న విగ్రహములు పెక్కులు పొడగట్టినవి."

**మైలు పొడవుగల రైలుబండ్లు:—**

అట్లాంటిక్, ఫసిఫిక్ మహాసముద్రముల నడిమిభూభాగముపైనడచు రైలుబండ్లలో సరకులు గొనిపోవునవి సాధారణముగ ఒకమైలు పొడవు ఉండును. ఒక్కొక్క బండికి సాధారణముగ అరువది అడుగుల నిడివి గలవి నూరు, నూటయిరువది పెట్టెలు తగల్చబడును. అట్లాంటిక్, ఫసిఫిక్ మహాసముద్రముల నడుమగల మూడు వేలమైళ్లు రైలు మార్గమున పోవుటకు ఆరైలుబండ్లు పెక్కుదినములు తీసికొనును. ఈ మైలు పొడవుగల రైలుబండ్లు ఒక్కొక్కప్పుడు ప్రత్యేకము నారింజపండ్లనో లేక చేపలనో కొనిపోవునవిగానుండును.

**పాదచారుల సంరక్షక సంఘము:—**

వీథులవెంటపోవు పాదచారులను సంరక్షించుట కొకసంఘము అమెరికాఖండమున ఏర్పడినది. 1929-వ సంవత్సరమున మోటారు ప్రమాదములవలన అచ్చట ముప్పదియొక్క వేల అయిదువందలమంది మరణించిరి. ఇట్టిమరణముల తప్పించుట కీసంఘమువారు ప్రయత్నించుచున్నారు.

**పొడుగు గౌనుల సమస్య:—**

అమెరికాఖండమున ఆడవారిదుస్తులను తయారుచేయు పనివాండ్రు గౌనులు పొడుగుగానుంచుటకు ప్రచారము చేయుచున్నారు. ఈప్రచారమువలన రైల్వేవారికి కొత్తఖర్చు కలుగునట్లున్నది. న్యూజెర్సీ స్త్రీలు సమావేశమై తాము పొడుగు గౌనుల ధరించుచో ప్రస్తుతమున్న రైలుప్లాటుఫారముల మీదనుంచి రైలు పెట్టెలలోనికి పోవునపుడు తమ గౌనులను ఎత్తిపట్టుకొనవలసియుండుననియు నట్లుగాకుండుటకు ప్లాటుఫారములను ఎత్తుచేయుటగాని రైలుపెట్టెల మెట్లను ఇంకను కొంచము దిగువకు దింపుటగాని చేయవలెనని తీర్మానించుకొనిరి.

**నిశ్శబ్దమైన స్టేషను:—**

న్యూయార్కునందు నూతనముగా నిర్మింపబడిన బఫెలో రైల్వేస్టేషను 14,000,000 డాలర్లు ఖర్చు అయినది. ఈస్టేషనులోగల విశేషమేమన రైలు కదలునపుడుకూడ అందుకొంచమేని శబ్దముకాదు. పునాదులలోను పైకప్పులోను చేయబడిన ఏర్పాటులనుబట్టి ఇట్టి చప్పుడులేమి కలిగినది.

**జర్మనీ దేశమున రైళ్లు:—**

ఐరోపాఖండమునగల దేశములన్నిటిలోను జర్మను రైల్వేసిస్టము మిక్కిలి పెద్దది. దినమునకు ఆదేశమున రైళ్లు 33,000 మైళ్లు ప్రయాణము చేయును; దినమునకు అందు 2,000,000,000 మంది ప్రయాణీకులు ప్రయాణము చేయుదురు; 150,000 వాగనుల సామానులు రవాణాయగును.

**దినమునకు ఒక్కొక్క హత్య:—**

గతసంవత్సరమున న్యూయార్కుపట్టణమునందు దినమునకు సగటున ఒక్కొక్కహత్య జరిగియుండెనని పోలీసు కమీషనరు వేలెన్‌గారి వార్షిక నివేదికననుసరించి తెలియుచున్నది. ఆపట్టణమున 1928-వ సంవత్సరమున 339 హత్యలు జరిగియుండగా 1929-వ సంవత్సరమున 357 హత్యలు జరిగెను.




## మహాశక్తిగాదు ప్రాణిదుంగ:—

ఏదోయొకటి నల్లగా తలమాత్రము పైకి కనబడునట్లు మదరాసులో సముద్రములో ఒడ్డుకు 40,50 అడుగులదూరముగా కొన్నిదినములక్రిందట వచ్చుచుండెను. మొదటనది మైలాపూరు ప్రాంతమునను పిమ్మట తిరువళ్లిక్కేణిలో రాజధానికళాశాలకు ఎదుటను కనబడెను. దీనికి చాల వదంతులు బయలుదేరినవి. ఎవరికో ఆవేశమువచ్చి తానొక మహాశక్తిననియు నాగూరునుండి బయలుదేరితిననియు తిరువత్తూరు వెళ్లుచున్నాననియు అచట స్థిరపడెదననియు చెప్పినట్లొకవదంతి బయలుదేరెను. రాత్రి రెండుదీపములవలె దానికడ వెలుగుచుండునని మరియొక వదంతి బయలుదేరెను. మైలాపూరువద్ద నొక పల్లెమనిషి దానిపై నొకరాయి విసరగా రక్తము స్రవించెననియు పిమ్మట మఱియొకనికి రక్తపువాంతులు కలిగెననియును మరియొకవదంతి ప్రబలినది. ఈకడపటి వదంతివలన నెవ్వరునుగూడ దానిని సమీపించుటకు సాహసింపజాలక పోయిరి. కాని వందలకొలది ప్రజలు సముద్రముకడకు వెళ్లి దానిని చూడసాగిరి. మొన్నసాయంకాలమున కది హైకోర్టుబీచికి చేరినది. దానినొక సముద్రాధిష్ఠానదేవతనుగా భావించి పలువురు కర్పూరమును వెలిగించుట, కొబ్బరికాయలను కొట్టుట మున్నగు నారాధనలనుగూడ జరిపిరి. దానిని గూర్చి కోటలోనుండి హార్బరులోనికి టెలిఫోను చేయగా హార్బరు ఉద్యోగులు వెంటనే ఒక స్టీములాంచిని పంపిరి. హైకోర్టుకుఎదుట అది కనబడగా దానిని గొలుసులతో కట్టి స్టీములాంచి హార్బరులోనికి లాగుకొనిపోయెను. అచట క్రేనులతో దానిని పైకి లాగి గట్టుపైనపడవేసిరి. ఇది ఒక మిక్కిలి గొప్పచెట్టు మానుఅయిఉండెను. 30 అడుగుల పొడుగును 10 అడుగుల చుట్టు కొలతను కలిగియున్నది. రెండవ కొన కొద్దిగా సన్నముగా నుండుటవలననే యిది ఒడ్డునకు కొట్టుకొని రాకుండ నిలువుగానే తేలిపోగలిగెను. దీని అడుగు భాగమున నాచు, నీటిగుబ్బలు మున్నగునవి దట్టముగా పెరిగియున్నవి. దూరమునుండి చూచువారలకు కొద్దిగా నీటిపైని తేలుచుండిన భాగము కొంత విపరీతముగా కనబడుచుండెను. కావుననే ప్రజలలో కొంత పిచ్చి నమ్మకము కలిగినది.

## శోభనమా; శోచనమా? :—

మొన్న మొన్ననే హనుమకొండ లష్కరు బాజారులో నొక వింతశోభనము జరిగినది. ఈ వీధిలో గౌరవనీయమగు నొక యాదవ కుటుంబము గలదు. ఈ కుటుంబములో దాదాపు ఇరువది వసంతర్తుల చూచిన యొక యువకుడు స్కూల్ ఫైనలులో విద్య నభ్యసించుచుండెను. సాంప్రదాయానుసారముగ పాపమాతనికి బాల్యముననే వివాహము మాత్రము తప్పినదికాదు. తలిదండ్రుల వేడుక బాల్యవివాహముతో విరమింపక, పండ్రెండువత్సరముల తమ యనుంగుకోడలిని త్వరలో నొక స్వతంత్రమగు ఇల్లాలుగ జూడగోరి, వేదమూర్తులైన బ్రాహ్మణోత్తములచే గాబోలు ఒక శుభముహూర్తము నిర్ణయించుకొని శోభనకృత్యము లేర్పాటు చేయబడినవి. కాని పిల్లికెంత చెరలాటమైనను, ఎలుకకు ప్రాణ తల్లడము కాదా! అవయవ

సౌష్ఠవమున పరిపక్వమున కొంతవడి పుష్పవతియైనను గాని యీ కన్యకారాత్రి యెట్లు శుభవాహమై యుండునో? ఆ కన్యకకును, భగవంతునకును, సరళహృదయులకును దక్క కటికవానికన్న నెక్కుడు కఠినులైన అత్తమామలకేమి తెలియును? పాప మా బాలిక భర్తవలన గలిగిన దుర్భరశ్రమ కోర్వలేక మరునాడే తన స్వగ్రామమునకు పలాయన మయ్యెను. కాని అత్త మొదలగువారి కీ విషయము తెలియగనే ఆ కన్యను వెంబడించి చివరకు పట్టుకొని తెచ్చిరి. ఎంత ఘోరము. అత్తయాజ్ఞ లేనిదే పారిపోయినందుల కా కన్యతో తమకు గల సంబంధమును గూడ త్రెంపుకొన జూచిరట. శారీరకావస్థతో బాటు ముక్కుపచ్చలారని యీ బాలికకు మానసికావస్థగూడ తటస్థించవలయును గాబోలు. ఇట్టి యక్రమములు జరిగిన జరుగవచ్చునట కాని మనలో కొందరికి శారదాబిల్లు అమలునకు రాగూడదట. తద్విషయమై భర్తయొక్క హితచింతకు లెంత జవాబు దారులో విద్యాగంధ మబ్బిన భర్తగూడ స్వయముగ నంతే జవాబుదారి యనుటలో అతిశయోక్తి లేదు. యాదవులలో నొకవంక విద్యాభివృద్ధియై సంఘసంస్కరణము జరుగుచుండ మరొకవంక, విద్యాభూషణ భూషితులయ్యు సంఘదురాచారములకు బలియగుట దేశదురదృష్టము గాక మరే మగును? భగవంతుడు వీరికి సద్బుద్ధి నొసగుగాత! (గోలకొండ)

## కోడలికి వెలుగుచున్న హరికేను లాంతరుపైకప్పుతో వాతలు:—

సెరాంపూరు గౌరవన్యాయాధికారియగు రాయి మోహీంద్ర చంద్రలహరి బహదూరువారి ప్రమీల శాంతబాలదేవియను నామె తన మగనిమీదను, మామగారిమీదను ఇట్లు ఫిర్యాదుచేసెను. "జోగీంద్రనాథ బెనర్జీనామామగారు. రామచంద్ర బెనర్జీ నాభర్త. నావివాహము పెక్కువత్సరములకు పూర్వము జరిగెను. నేను కాపరమునకువచ్చిన కొలదికాలముననే నాభర్తకు నాపైదయతప్పెను. నన్ను మిక్కిలి అగౌరవముగా చూచుచుండెను. ఒక్కొక్కప్పుడు నాకు ఆహారపానీయములనుగూడ ఒసగకుండిరి. ఒకసారి నన్ను మాపశువులశాలలో పశువులతోగూడ కట్టివైచిరి. మరియొకసారి చాల సేపటినుండి బాగుగా వెలుగుచు మిక్కిలి వేడియెక్కియున్న హరికేనులాంతరుపైడిప్పతో నాఒడలిపై పలుతావులయందు వాతలు పెట్టిరి. ఈబాధలు భరింప జాలక నేను ఇది జరిగినకొలదికాలముననే నాపుట్టినింటికి పోతిని. నాతండ్రి వారుచేసిన అకృత్యములకై మావారిని కోపపడెను. అందుమీద మావారికి కోపమువచ్చి తిరిగి వివాహముగావించుకొనిరి."

## ఏడుగురు బిడ్డలతల్లి బి. ఏ. బిరుదము పొందుట:—

బెంగుళూరు నివాసురాలగు ఇక్బాలున్నీసా బేగముగారు మైసూరు విశ్వవిద్యాలయమునందు బి. యే, బిరుదమును గ్రహించిరి. మైసూరు రాష్ట్రములో పోలీసు సూపరింటెండెంటు పనిచేసి పించను తీసికొనుచున్న గులాము మొహిద్దీను ఖానుగారికుమార్తె యీమె. 1913 సంవత్సరములో ఈమె వివాహము జరిగెను. మైసూరురాష్ట్రపు పబ్లికువర్క్సుశాఖలో పనిచేయుచున్న యస్. ఏ. హుస్సేనుగారికిచ్చి వివాహము చేయబడెను. వివాహమైన పిమ్మట ఈమె చదువు ప్రారంభించెను. ఈమె తన సంఘాచారము ప్రకారము ఘోషాలోనుండియు తనకుకలుగుచున్న సంతానమును పెంచి పోషించుకొనుచు సంసారభారమును వహించుచు విద్యాశాఖయం దుద్యోగము సంపాదించి పనిచేసెను. ఈమె 1927 సంవత్సరములో యూనివర్సిటీ ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణయయ్యెను. ఇప్పుడు బి. యే. బిరుదమును గడించెను. మైసూరు ముసల్మానుల సంఘమందు బి. యే, పట్ట బిరుదమును సంపాదించిన నారీరత్న మీమె యొక్కతెయే. ఈమె విద్యాకృషియందలి ప్రాశస్త్య మేమనగా ఈమె ఏడుగురు బిడ్డలతల్లియై యుండియు పట్టుదలతో విద్యాభ్యాసము చేయగలుగుట. ఈమె జ్యేష్ఠకుమారుడు ఇంటర్మీడియేటు తరగతిలో చదువుచున్నాడు. స్కూలుఫైనలు పరీక్షయందు మొదటి తరగతిలో ఉత్తీర్ణుడయ్యెను. కాపురముచేయుచు చదువుకొనుట దుస్తరమనుకొను స్త్రీలీ ముసల్మానువిదుషీమణిని మేలుబంతిగ చేకొందురుగాక!



### నృత్యము:—

జూనుమాసము గృహలక్ష్మిలోని నృత్యమునుగూర్చిన సంపాదకీయవ్యాసమును గూర్చి 'ధర్మసాధని' పత్రిక ఇట్లు అభిప్రాయపడినది:—

"స్త్రీల నాట్యరంగప్రవేశమునుగూర్చి గృహలక్ష్మిపత్రికలో జరిగిన వాదోపవాదములను పల్వురు చదివియుందురు. తత్సందర్భమున జూన్ సంచికలోని "నృత్యము" అను శీర్షికక్రింద పత్రికాధిపతులచే వ్రాయబడిన యీ దిగువవాక్యములు గమనింపదగినవి. "సందేహింపక నృత్యకళ నవలంబింపవలయుననుటలో కులస్త్రీలు నాట్యాంగనలవలె బహిరంగమగు నృత్యము చేయవలయునని కాని పాశ్చాత్యస్త్రీలవలె అశుచిప్రాపకమగు నృత్యము చేయవలయుననిగాని మా తలంపుగాదు. మతిమాలినగొడ్డులెవరైన నట్టులవలంబింప నుపదేశించినను మతప్రవిష్టమగు మానసమునకు నోచిపుట్టిన భారతాంగన లట్టివిపరీతపద్ధతులను కలలోగూడ ఒప్పుకోలేయరు. అయితే ఇక మనస్త్రీలవలంబించుటకనువైన నాట్యవిధాన మేదనిన పరమమగు భక్తితో, పవిత్రమగు భావముతో వారు తమ లోపెరడులయందు మహాలక్ష్మివ్రతములసిసి ప్రార్థించుటలో పద్మములు పెట్టుటకు, పాటలుపాడుటకు, ప్రదక్షిణములుపుటకు, నమస్కారములు గావించుటకు తన్మయత తెచ్చిపెట్టు నృత్యమును తోడుచేయుటయే." ఇట్టి నృత్యము నెవరు కాదనగలరు? తులసిచెట్టుముందర పెరటిలో భజనచేసికొనుటకు స్త్రీలు నృత్యము నేర్చుకోవలయునన్న వద్దనువారుండగలరా? ధనసంపాదనోద్దేశముతో నిర్మింపబడిన నాటకరంగస్థలములందు బహిరంగముగా స్త్రీలు వేషములను దాల్చవచ్చుననునభిప్రాయమును "గృహలక్ష్మి" ప్రోత్సాహపరుచునని యిన్నాళ్ళనుండియు పల్వురు తలంచుచుండిరి. అట్టితలంపు వారి కెంత మాత్రములేదని యిపుడు స్పష్టమయినది. ఇది సంతోషకరము."

### బిల్వవృక్షము—

భారతీయులచే అతిపవిత్రవంతముగ చూడబడుచున్న బిల్వవృక్షమునుగూర్చి శ్రీమాన్ కొల్లిపర సుబ్బారావుగారు జ్యేష్ఠమాసపు 'ఆదిశైవపత్రిక' లో నిట్లు వ్రాయుచున్నారు:—

"పూర్వకాలమున లక్ష్మిదేవి శివుని భక్తురాలు కావలెనని దలంచి తన భర్తయాజ్ఞనుపొంది ఒక్క సంవత్సరమువరకు తామరపద్మములచే పువ్వులచే ఈశ్వరుని అర్చించ దీక్షబూనెను. ప్రాతఃకాలము కాలకృత్య

ముల దీర్చుకొని కొలనుకువెళ్లి నూటయెనిమిది పువ్వులను సంపాదించుకొని మందిరమునజేరి శివలింగమును పంచాక్షరీమంత్రము, శక్తిబీజము జేర్చి షోడశోపచారములచే పూజించుచుండెను. దీక్షాంతమున మామూలుగా స్నానాదికృత్యముల నెరవేర్చుకొని తామరకొలనుకు వెళ్లి పద్మములగైకొని యథావిధిగా అర్చించుచుండ పరమేశ్వరుడు తన మాయవలన రెండుపుష్పములు కొరతజేసి లక్ష్మీదేవి శక్తిని పరీక్షింపదొడగెను. పూజాంతమున రెండునామములకు పువ్వులు తక్కువయగుటచే (తన కుచములను ఒకప్పుడు భర్తయగు విష్ణువు కుచపద్మములని యనుట జ్ఞప్తికిదెచ్చుకొని) ఒక పుష్పమునకు తన ఒక కుచమునుగోసి పూజించి రెండవపుష్పముకొరకు రెండవకుచము కోయబోగా దయార్ద్రహృదయుండగు నాథగవానుడు ప్రత్యక్షమై చేయిబట్టుకొని 'భక్తురాలా! నీసాహసమునకు భక్తికిని సంతోషించితిని. నీకుచములు మామూలుగానుండునట్లనుగ్రహించితిని. మరియు నీవు పూజించిన కుచమును యొకవృక్షముగా బుట్టించుచున్నాను. దానిపత్రములు నాకేగాక సర్వదేవతలకును ప్రియము కాగలవు.' అని ఆకుచమును భూమిపైనుంచెను. అది (బిల్వ)మారేడుచెట్టుగా జన్మించెను. దీనిదళము మూడు ఆకులు గలిగియుండును. దానిలో మధ్యనుండు ఆకు శివుడు, కుడిప్రక్క విష్ణువు, ఎడమప్రక్క బ్రహ్మ యనంబడును. ఈబిల్వవృక్షమునకు శ్రీఫలవృక్షము శివప్రియ యని ఇత్యాదిగ ఇరువదియొక్క పేర్లుండును. దీనిచుట్టునున్న స్థలముపవిత్రమైనది. దీనిదళము కాలితో త్రొక్కినవారు అల్పాయుష్కులగుదురు. వేయిపద్మములచేపూజించిన ఎంతఫలముగలుగునో ఒక్క బిల్వదళమువలన అంతఫలముగలుగును: బిల్వవనము కాశీతో సమానము. బిల్వవృక్షము మొదట పరమేశ్వరుడు నివసించును. గృహావరణయందు ఈశానభాగమున బిల్వవృక్షమున్న ఐశ్వర్యకరమనియు, తూర్పుననుండిన సుఖప్రదమనియు, పశ్చిమదిశనున్న సంతానప్రదమనియు, దక్షిణమున యమబాధలు గలుగనేరవనియు, వసంతగ్రీష్మఋతువులయందు శివునకు బిల్వార్చనచేసిన అక్షయగోదానఫలము గలుగుటయేగాక జన్మాంతమున కైలాసము లభించునని స్కాంధపురాణము బోధించుచున్నది. ఇది భారతదేశమందంతటను హిమాలయప్రాంతారణ్యములలోను, మధ్యదక్షిణదేశములలోను పెరుగును. పండు, కాయ, వేరు, పట్ట, ఆకు, పండినపళ్ళపైనుండు తొక్క, పువ్వు ఉపయోగింపనగును. దీనిగుజ్జులో చక్కెరయుండును. కర్రపొడిలో పొటాసియము సోడియము కలిసిన ద్రవ్యముండును. పచ్చి ఆకులను మరగించినచో పసుపురంగును, ఆకుపచ్చరంగును, సువాసనయును గల నూనె దిగును."

## నృత్యమువలన దీర్ఘాయుర్దాయము:—

'డాన్సు మేగజిను' లో టెడుషాను అను సుప్రసిద్ధనర్తకుడు పైవిషయమునుగూర్చి వ్రాసిన దానిని 'ఆరోగ్యప్రకాశిక' యిట్లు అనువదించుచున్నది:—

"నర్తనమొనరించుచుండువారు చిరకాలము జీవింపగలుగుదురు. నీకు 87 యేండ్లు నిండినపిమ్మట వచ్చెడు నీ పుట్టినదినమునాడు నీవు వెనుకకువంగి నీతలను నీ కాళ్ళమధ్యనుండి భూమి కానించగలుగుదువా? జపాను దేశమునందు కాట్యామానర్తకుల సంఘమునకు అధ్యక్షురాలగు మేడం కాట్యామా అను నారీమణి తన 88 వ పుట్టినదినమునాడు యీ నృత్యవైఖరిని అతిసులభముగా చూపించినపుడు నేను స్వయముగాచూచితిని. నర్తనమనగా విందుసభలలో నేలమీదనుండు నునుపగు చపటామీద స్త్రీలును, పురుషులును చేతులు చేతులు పట్టుకొని అటునిటు నడయాడుటకాదు. పాటలనాటకముల వాడువారు రంగస్థలములందు చూపించెడు వైఖరులుగూడ నర్తనములో చేరవు. సాధారణముగ కరతాళధ్వనుల నొసరించుటకు సమ్మతింపని ప్రేక్షకుల వలనగూడ హర్షధ్వనులతోగూడిన ప్రశంసనుబడయుటకు తీవ్రముగా జరుపబడెడు కష్టతరములగు పద

విన్యాసనలుగూడ నర్తనభేదములు కావు. అధికమగు ఆనందాతిశయమువలన అతిసుందరముగను, లావణ్యముగను ముఖవైఖరులవలన రసమును వెల్లడించుచు శరీరమంతనుగూడ పూర్తిగా నుపయోగించుటయే నిజమైన నర్తనమగును."

**కరక్కాయ:—**

గృహయజమానురాండ్రకు సుపరిచితమగు కరక్కాయనుగూర్చిన క్రిందివిషయములు ఎ. కొండయ్యగారు జూను 1–వ తేదీనాటి 'జమీందారిరైతు'పత్రికలో వ్రాసిన వ్యాసమునుండి గ్రహింపబడినవి:—

"కాలక్రమమున బాగుగపండి భూమిపై రాలినదియు, క్రొత్తగను, గట్టిగను, గుండ్రముగను, లావుగను నీళ్ళలోవైచిన మునుగునదియును, లావుబెరడుగలిగి, చిన్నవిత్తులు గలిగియుండు కరక్కాయ ప్రశస్తమైనదగుటచేత సమస్తరోగములను బోగొట్టి సుగుణములనిచ్చును. కరక్కాయ ఉప్పగను, మిక్కిలి వగరుగను ఉండును. అగ్నిదీపనము చేయును. శుక్లవృద్ధి, నేత్రములకు హితము, శరీరపుష్టి వీట్లను కలుగజేయును. మరియు నిది శ్వాసము, కాసము, ప్రమేహము, మూలశంక, నులిపురుగులు, మలబద్ధము, గుల్మము, ప్లీహము వీట్లను నశింపచేయును. మధురముగను, పుల్లగను నుండుటవలన వాతమును, వగరుగనుండుటవలన పిత్తమును, కారముగ నుండుటవలన కఫమును బోగొట్టును. నూరి పుచ్చుకొనిన విరేచనమగును. ఉడికించి పుచ్చుకొనిన మలమును గట్టిపరచును. కరక్కాయ ఎండకాలమునందు బెల్లముతోను, వర్షాకాలమునందు సైంధవలవణముతోను, శరత్కాలమునందు తెల్లచక్కెరతోను, హేమంతకాలమునందు శొంఠితోను, శిశిరకాలమునందు పిప్పళ్ళతోను, వసంతకాలమునందు తేనెతోను జేర్చి భుజించిన "గరుత్మంతుడు సర్పముల నశింపజేయునటుల సర్వరోగములను నశింపజేయును."

**వివాహముల తీరు:—**

జూన్ 13–వ తేదీనాటి 'దారుల్ ఇస్లామ్' అను తమిళపత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"మెక్సికోనగరమున 'జూఅనీతా' అను రూపవతియు, యౌవనవతియునగు కన్యను వివాహమాడుటకు 30 యువకులు ఏకకాలమున ప్రేమించియుండిరి. ప్రతిదినము వారు ఆమెదగ్గిరకువచ్చి తమవాంఛల దెలుపుచు ఆమెను నిర్బంధింపజొచ్చిరిగాని తనువలెనే ఇతరులును ఆకన్యను ప్రేమించుచు తమపద్ధతినేయవలంబించుట వారిలో నొక్కరికైన దెలియదు. ఈపోరుపడలేక ఆమెవారికి వొకరోజు నిర్దేశించి ఆనాడు వివాహమాడునటు లామె వాటి కెటేగించియుండెను. ఇట్లు నిష్కర్ష గావింపబడిన దినమువఱకు ఆమె సుఖముగా కాలముగడిపెను. ఉద్దేశింపబడినరోజున వారందరు ఒక్కరొకరుగ వధూగృహమునకొచ్చిరి. పిమ్మట వారి నొకఱొకరు ప్రశ్నింప వారందరు ఒకకేయుద్దేశమునకై వచ్చితిమని దెలిసి తగవులాడనారంభించిరి. అందుచేత కొందఱికి గాయములుతగిలి వైద్యశాలకు పోవలసివచ్చెను; మఱికొందరు పోలీసువారియధీనమున నుండవలసి వచ్చెను. ఆహా! కలియుగ సుందోపసుందులు!

చికాగోనగరమున 'రాల్ఫ్‌వాగ్నర్' అనునాతని భార్య దంతబాధచే పరితపించుచుండెను. వివిధ చికిత్సల నొసంగియు అనుకూలింపనందున పండ్లనూడదీయుట మేలనిపించెను. అందుచే నామె చికిత్సాలయము

నకు పోవ సమకట్టగా ఆమె భర్తయగు 'రాల్ఫ్‌వాగ్నరు' తానాకృత్యమును నిర్వహింప సమర్థుడననియు చికిత్స తానే చేయుదుననియు ఆమెకుచెప్పి నొప్పిగలదంతమునకు నొక ఇనపకమ్మిగట్టి దానిని నొకతలుపునకు తగిల్చి బలముగానీడ్చెను. దంతమును కమ్మికిగట్టునపుడు ప్రక్కనున్నదంతములయందు పొరబాటుగ సంబంధించియుండినందున ఈడ్చు అదురులో బాధగలగినదంతమేగాక ఇంకను రెండుదంతము లూడిపడెను. అందలి బాధచేత కోపావేశయై భర్తనుదిట్టి కోర్టుమూలమున నాభర్తకు విడాకుల నిచ్చెను. భార్యకు సహాయపడవలెనను సదుద్దేశముతో ఈపనిచేసిన భర్త భార్యచే దిరస్కరింపబడి తుదకు భార్యనుగోల్పోయెను. ఆహా! ఏమి విడాకులమహిమ!

పెర్త్ నగరమున మిస్టర్ రస్టమ్‌హోవర్ అనునాతడు జర్మనినుండి విద్యుచ్ఛక్తియుతమయినదియు, విద్యుచ్ఛక్తిచేతనే నడుపదగినదియునైన ఒక మోటారునుగొని తన శెలవుదినముల దానిముందుదిరుగుటలో ప్రొద్దుపుచ్చుచుండెను. ఒకరోజు ఏదో ఆమోటారున భిన్నముగలిగి మోటారు రిపేర్ చేయు నొకశాలయందు వీధిలోనిలిపి సవరించుచుండిరి. అచ్చట నొక స్త్రీవచ్చి రిపేరుచేయువిధానము చూచుచు బండినిస్పర్శించెను. బండి పూర్ణమగు విద్యుచ్ఛక్తిచేత గూడినదియైయుండినందున అందలి శక్తిచేత ఆమె అశక్తయై క్రిందబడి మూర్ఛిల్లి నిశ్చేష్టితురాలాయెను. వెంటనే మోటారుదారగు 'రస్టమ్‌హోవర్' ఆమెను తనగృహమునకు గొనిపోయి చికిత్సయొనర్చుచుండెను. ఆమె క్రమముగ స్వస్థపడి పూర్వస్థితికి రాగలిగినదిమొదలు అతని ప్రేమించి వివాహమాడ నిశ్చయించెను. వివాహము శీఘ్రముగజరుగునని తెలియుచున్నది. ఆహా! ఏమివరాన్వేషణము! వివాహ మెంతబొమ్మలాట!

న్యూయార్కునగరమున 35 సంవత్సరముల ఈడుగల 'హెర్బర్టుజాన్కింగ్' అనునాతడు ప్రకృతము వితంతువుగనున్న 55 ఏండ్లకుచెందిన తన సవతితల్లినే వివాహమాడెను. ఇటువంటి స్వభావవిరుద్ధమగు వివాహమునుగూర్చి వధువుతో కొందరు ముచ్చటింపగా అందులకామె దెల్పునది యేమన భర్త జీవించియుండునపుడే తనకును తన సవతికొమారునికిని చాల ప్రేమయుండెడిదనియు, తనభర్తయు దీని నెఱుంగుననియు, తన భర్త మరణావసానమున ఈలాగే తనపుత్రునే పునరుద్వాహముగమ్మని వేడుకొనెననియు తదనుగుణముగనే యీవివాహము గావింపబడెననియు దెలియజెప్పెను. ఈవధువు ఆస్ట్రేలియాదేశమును మొట్టమొదట గనిపెట్టిన కాప్టన్‌కుక్ యనునాతని వంశమునకుచెందినది. ఆహా! ఏమి? మేయోకన్య జన్మదేశపు వివాహములధోరణి!

## స్త్రీలు: జాతీయ జీవనము:—

ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు పూనా హిందూస్త్రీల విశ్వవిద్యాలయము వారిపట్టప్రదానోత్సవము (బొంబాయిరాజధానిలో కలరాజకీయములగు అలజడులచే ఇది యిప్పుడు ఆపివేయబడినది) సందర్భమున నీయ నుద్దేశించిన ఉపన్యాసమునుండి క్రిందిభాగము ముద్రితము:—

“హిందుస్త్రీజనంబులకు ఇదియొక నూతనశకము. ఇంతకుముందు యెవరైన ఇప్పటి జాతీయోద్యమమునందు స్త్రీలింతటి ధైర్యసాహసములను ప్రదర్శింతురని పలికియుండినచో వానిని పిచ్చివానిగా పరిగణించియుందురు. కాని గాంధిమహాత్ముడు ఐంద్రజాలికునివలె హిందూస్త్రీలయందు నిక్షిప్తమైయున్న శక్తిని

ఒక్కసారి ప్రజ్వలింపచేసినాడు. స్త్రీలు జాతికి రక్షణదేవతలు. మన ప్రజలహక్కులను రక్షించుటయందు పనిచేయుచున్నవారిని ప్రోత్సహింపకుండను, వారియెడ సానుభూతిచూపకుండను ఎవరును ఉండజాలరు. యోధునికావని రాజ్యాంగవేత్తను నిజమైన స్త్రీపొగడజాలదు; కావుననే గాంధిగారి ఉద్యమమునకు స్త్రీలిచ్చుచున్న ప్రోద్బలమునకు నేను వింతపడకున్నాను. ప్రస్తుతకాలమున సాహసకార్యములను చేయుడని మిమ్ములను ఉద్బోధింప అవసరములేదు. చెప్పుదానికంటె నెక్కువ విలువగల ఉదాహరణముచేత నేడు స్త్రీలు చక్కని ఉద్బోధమును రేపియున్నారు. చిత్తరంజనదాసు సతి, సరోజనీదేవి, కమలాదేవిఛటోపాధ్యాయ, రుక్మిణీలక్ష్మీపతి, బరోడా రంగూనులయందలి త్యాగివంశ స్త్రీలు, లాహోరులోని బీగముఆలము, అహమదాబాదులోని శ్రీమతి అనసూయ, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, కే. యస్. మున్షిసతి, డిక్సనుకన్య ఇంకనుమరియెందరో మనప్రజలను ఉత్తమకార్యములకై ఉద్బోధింప ప్రకాశించుచున్నారు. నేడు భారతవర్షమును ప్రకాశమానముగ చేయుచున్న ఈవీరాంగనల ఛాయచిత్రములను, జీవితసంగ్రహములతోకూడ గ్రంథరూపమున ప్రచురింపబడిన బాగుండునని నే ఆశించుచున్నాను."

## భర్తలకొఱకు పాశ్చాత్య స్త్రీల పాట్లు:—

శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు పైవిషయమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు:—

"మనదేశమున భర్తనుబడయుటకై కన్యక ఇసుమంతయేని కష్టపడవలసిన పనిలేదు. అష్టకష్టములపడి తలిదండ్రులే వరాన్వేషణమొనరించి తమ పుత్రికనొకయింటివానినిగా జేతురు. పాశ్చాత్యదేశములందిట్టి మంచి పరిస్థితులులేవు. అక్కడి వారలు భర్తల వేటాడుటకై యచట విందులు, నాట్యములు తరుచు సమకూర్పబడుచుండును. ఇవి చాలక యిప్పుడాదేశమున పురుషవశ్యమును గుఱించి బోధించుటకు పాఠశాలలేర్పరుపబడినవి. అందు అవివాహితలగు కన్యలు విద్యార్థినులుగా జేరి ఎట్లు శృంగారించుకొనిన యే యే రకపు పురుషుల కండ్లకింపుగా నుండునో, గృహిణీత్వమన నేమియో, ఏగుణములుగల స్త్రీమంచిదని పురుషులు తలంతురో మొదలగు పాఠములను యథావిధిగా బఠింతురు. ఇందుకొఱకై ఆదేశములందు ప్రత్యేకపాఠపుస్తకములు వ్రాయబడినవి. అంతియగాక ఆపాఠశాలయందు పురుషులతో నెట్లు నర్మగర్భమగు సంభాషణల గావించిన వశ్యులయ్యెదరో వివరముగ బోధింపబడునట. రాను రాను నాగరికత మానవుల నెటుకొంపోయివిడుచునో భగవంతునికే ఎఱుక? మనయార్యధర్మములు నశింపకుండునట్లు భగవానుని ప్రార్థించుటకన్న మనమేమి యొనర్పగలము?

## అత్తరులు: వాని ఉపయోగము:—

శ్రీయుత వి. పాముపు అనువారు 'మద్రాసుమెయిలు' పత్రికలో పైవిషయమును గూర్చి ఇట్లు వ్రాయుచున్నారు:—

"అత్తరులవాడకమును ప్రోత్సహించుచును, నిరుత్సాహపరుచుచును పెక్కువాదములు జరిగినవి. పెక్కువ్యాసములు వ్రాయబడినవి. అయినను అత్తరులయందుకల ఓషధీగుణమునుగూర్చి ఆవాదములయందును, ఆవ్యాసములయందును తరుచుగా తడవబడియుండలేదు. పూర్వులకు అత్తరుల ఓషధీగుణమునుగూర్చి తెలసియుండినది. ఒకానొక లాటిన్‌గ్రంథకర్త నూటికిమించిన పలురకముల అత్తరులను రోగనివారణమునకు నిరూపించి

యున్నాడు. ఈ అత్తరులలో వయొలెట్ పువ్వులనుండి తయారుచేయబడిన అత్తరే అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. ఆ అత్తరు నికార్సు అయినదిగాను పువ్వులనుండిమాత్రమే తయారుచేయబడినదిగాను ఉండవలెను. రసాయనికసంబంధమైనద్రావకములచే తయారుచేయబడు అత్తరవులు నరములకు ఉద్రేకమును కలిగించుటయేకాక హానిచేయును. క్రొత్తలవెండరు అత్తరుచే చిలుకరింపబడిన దుప్పట్లు ఘ్రాణేంద్రియములకు తర్పణముగావించుటయేకాక నరముల ఉద్రేకమును అణచి ప్రశాంతమైన నిద్రను తెచ్చిపెట్టునదిగా నుండును. ప్రత్యేకమైన ఓషధీగుణముగల మరియొక అత్తరు మల్లెపువ్వులతో చేయబడునది. పూర్వగ్రంథకర్తలు దానిని ఒకరసాయనముగా పేర్కొనిరి. కాని దాని ఉపయోగవిషయమై వారొకమాట చెప్పియున్నారు. ప్రత్యేకము మల్లెఅత్తరును వాడుదుమా అదియొక వరప్రసాదినివలె పనిచేయును. మరియొకదానితో మిశ్రితముచేసి ఉపయోగింతుమా నరములకు నిస్సత్తువ, మనస్సునకు నిరుత్సాహముకలిగించి చెఱుపుచేయును. రసాయనికులు అత్తరువులను కలపుటలో మిక్కిలి జాగరూకులై యుండవలయును. కలగలుపుచేయబడిన కొన్ని యత్తరువులను వాసనచూచుటచే కొందరికి నరములు స్తంభించి హిస్టీరియావ్యాధి కలుగుటయుకలదు. అట్టిచో రోగులు ఆవ్యాధితమకువచ్చుటకు కారణముకనుగొనుటలో మిక్కిలి కష్టపడవలసివచ్చును. అత్తరులు అనాలోచితముగను అధికముగను వాడకూడదనుటకు ఇదియొక ప్రబలకారణము."

## వికలాంగులగుబిడ్డలను చంపవచ్చునా?:—

జూనుమాసము 15-వ తేదీనాటి 'ఇండియనుడెయిలీమెయిలు' పత్రిక పైవిషయమునుగూర్చి ఆలోచనను రేపు క్రిందిసంగతులను ప్రచురించుచున్నది:—

"హారాల్డుమార్టిను అనునొక ఆధునికగ్రంథకర్త. అతడీనడుమ నొకనాటకమును రచియించి ప్రచురించెను. 'భరింపరాని వికలాంగుడైనను తన బిడ్డ చంపబడుటకు తల్లి యంగీకరించునా? అంగీకరించనిచో ఆమె బిడ్డ భావిసుఖమునుగూర్చి బాగుగ ఆలోచించినదని చెప్పుటకు అవకాశమున్నదా?' అను సమస్యలానాటకమున చర్చింపబడినవి. ఆనాటకమునందలి ఒకపాత్రయగు స్త్రీకొడుకు వికలాంగుడై జనించెను. అట్టి వికలాంగులను తల్లిదండ్రుల అనుమతితో చంపివేయుటకు భావికాల్మికప్రభుత్వమువారు అనుజ్ఞాపూర్వకముగ చట్టముగావింతురు. ఆచట్టముప్రకారము ప్రభుత్వమువారు వికలాంగుడగు బిడ్డను చంపుటకు తల్లిదండ్రుల అనుమతి కోరుదురు. వికలాంగుడగు తనబిడ్డ ఆజన్మము బాధపడుటకంటె మృత్యువునువరించుటయే మేలని తండ్రి ఆతనివధకు అంగీకారమిచ్చును. కాని బిడ్డ తల్లిమాత్రము ఆతడు చంపబడుటకు సుతరాము ఒప్పుకొనదు. అగుటచే బిడ్డవధ ఆగిపోవును. వికలాంగుడు పెద్దవాడగును. తన వికలాంగత్వమునకు ఆతని మనోవ్యథ భరింపరానిదగును. అప్పుడు తల్లికి తాను వెనుకచేసిన తప్పిదము మనస్సునకుబట్టును. కాని అప్పుడు ఎంతచింతించిన నేమిలాభము? తన చిన్ననాటజరిగిన వృత్తాంతము తెలిసికొని వికలాంగుడు తన్ను చంపనీయక సంరక్షించిన తల్లికంటె చంపుటకు అనుమతి ఇచ్చిన తండ్రియే తనక్షేమము బాగుగ ఎఱిగినవాడని తండ్రిపక్షము వహించును. భావిసంతతివారు పరిష్కరించు అవసరమేర్పడు సమస్యల నీగ్రంథకర్త ఇట్లు చర్చించియున్నాడు."

# వనితాలోకము

**శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు:—**




శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు

కాకినాడ పురపాలకసంఘసభ్యురాలుగను, తూర్పు గోదావరిమండల విద్యాసంఘాధ్యక్షురాలుగను ఉండి దేశసేవచేయుచున్న రమణీమణి. తూర్పుగోదావరిమండల తిలకనగరమగు కాకినాడనివాసిని.

**శ్రీమతి డి. సక్కమ్మగారు:—**

కూర్గు దేశమునందలి కాఫీతోటల యజమానురాలుగా పేరు పొందినది. ఈమెఇప్పుడు మైసూరు సంస్థాన శాసనసభయందు సభ్యురాలుగా నియమింప బడినది.

**శ్రీమతి కొప్పర్తి వేంకటేశ్వరమ్మగారు:—**

సాహితీసమితిసభ్యులును, ఆంధ్రభాషాసేవకులును, 'ప్రారంభవిద్య' సంపాదకులును, నూజవీడు రేంజిస్కూళ్ల డిప్యూటి ఇన్స్పెక్టరులును అయిన శ్రీయుత కొప్పర్తి నారాయణమూర్తిగారి సతి. పతికిదగినసతియై ఈమె ఆంధ్రభాషయందు మంచిప్రవేశమును సంపాదించిన విదుషి. ఈమె వ్యాసములను కాలక్రమమున గృహలక్ష్మి లోకమువారికి అందచేయగలదు.



శ్రీమతి కొప్పర్తి వేంకటేశ్వరమ్మగారు

**శ్రీమతి యల్. డబ్లు. క్లార్కు కన్య:—**

అలహాబాదు విశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున జరిగిన న్యాయవాద పరీక్షలో మొదటితరగతిలో జయముపొందిన విదుషి. ఈమె ఐరోపియనువనిత. హిందూదేశమున న్యాయవాదపరీక్షయందు జయముగాంచిన ఐరోపియనుకాంతలలో ఈమె ప్రథమురాలు.

శ్రీమతి కొల్లిపర నాగలింగమ్మగారు:—

ఆంధ్రభాషయందు మంచిప్రవేశముగల యామె. వ్యాసరచనావ్యాసంగమున కుతూహలముతో పనిచేయుచున్నది.



శ్రీమతి కొల్లిపర నాగలింగమ్మగారు

శ్రీమతి ఆర్. కృష్ణాబాయి కన్య:—

బి. యె; యల్. టి. పట్టమునొందిన విదుషి. రాజమహేంద్రవరనివాసిని. చిత్రకారిణి. మద్రాసున ఈమధ్యజరిగిన అఖిలభారత ఉపాధ్యాయ పరిషత్తువారిచే బహుమానమును బడసినది. పార్కుఫెయిరు ప్రదర్శనములో బంగారుపతకమును పొందినది. 'రాణి మీరాబాయి' అను ఈమెరచించిన చిత్తరువును ఇండియాగవర్నమెంటువారు మెచ్చుకొని లండనునందలి ఇంపీరియలు ఆర్టుగ్యాలరీవారి ప్రదర్శనమునకు పంపియున్నారు. ఆంధ్రచిత్రకారిణీసంఘమున ఎన్నదగినవారిలో ఈమె యొకతె.

శ్రీమతి. ఇ. ఎ. లక్ష్మికుట్టిఅమ్మాళ్ కన్య:—

ఒక గొప్పనాయరుకుటుంబమున 1903—వ సంవత్సరమున పుట్టినది. చిన్నతనమున వీథిబడియందు విద్య నభ్యసించినది. ఆమె పెదతండ్రి తనసేవలో ప్రాణములు విడిచెనుగావున ఆమె విద్యావిషయమై కొచ్చిను పదనొకండవ రాజకుమారుడగు కేరళవర్మ అన్నిఖర్చులు భరించెను. 1926—వ సంవత్సరమున ఆమెకు విద్య పూర్తియయ్యెను. త్రిపునితురాయందు రాజబాలికలకొఱకై ఏర్పడిన విద్యాలయమున ఉపాధ్యాయినిగా కుదిరెను. దక్షిణచిట్టూరు; కాలూరులందుకూడ ఆమె ఉపాధ్యాయినిగానుండెను. ఆమె కోరికపైని మహారాజావారు ఆమెకు ఇపుడు న్యాయశాఖయందు ఉద్యోగమిచ్చిరి. కొచ్చిను ప్రధానన్యాయస్థానమునందు ఉద్యోగమునకుకుదిరిన స్త్రీలలో ఆమె మొదటిది.

శ్రీమతి కె. రాజరత్నముసతి:—

ఈమె మద్రాసు మహానగరమున రాజధానీగౌరవన్యాయాధికారిణిగా నియమింపబడినది.

**శ్రీమతి సుసర్లలక్ష్మీనరసమాంబగారు:—**

పశ్చిమగోదావరిజిల్లా పొలమూరు నివాసిని. గానకళాకోవిదురాలు. మాతృభాషయందు మంచి ప్రవేశముగలది.

**శ్రీమతి ఆర్. రుక్మిణిఅమ్మాళ్ కన్య:—**

పోలూరునందు డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు ఉద్యోగముననున్న శ్రీయుత కె. రంగస్వామి అయ్యంగారి తనయ. ఎగ్మూరునందలి వెల్లింగ్డనుసతి వైద్యపాఠశాలయందు వైద్యవిద్య నభ్యసించుచున్నది. మద్రాసునందలి గానకళా పరిషత్తువారి పోటీపరీక్షలలో ఈమె తన అద్భుతగానకళాప్రావీణ్యమును చూపి రెండు పతకముల బహుమానమును బడసినది. ఇదియొక గొప్ప గౌరవము. ఈమధ్య ఈమె మద్రాసు మ్యూజియము నాటకశాలయందు మద్రాసు సేవాసదన సహాయార్థము శ్రీ గవర్నరు దంపతుల యాజమాన్యమున జరిపిన గానసభ మిక్కిలి కొనియాడబడినది.




శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

**శ్రీమతి నోరన్ హసతి:—**

వియన్నా నగరమున జరుగనున్న స్త్రీల అంతర్జాతీయసంఘమునకు బొంబాయి రాష్ట్రస్త్రీ సంఘము తరపున ప్రాతినిధ్యము వహింపబోవుచున్నది. ఈమె బొంబాయి నివాసిని.

**శ్రీమతి డాక్టరు రాణిలక్ష్మీబాయి రాజవాడే:—**

గ్వాలియరు రాష్ట్రమునకు చెందినది. సర్ మోరోపంట్ జోషిగారి జ్యేష్ఠతనయ. అఖిలభారతస్త్రీజనసభకు కార్యదర్శినిగా ఎన్నుకొనబడినది.

**శ్రీమతి పి. పారిజాతమ్మకన్యగారు:—**

ఎం. ఏ; యల్.టి పట్టమునందినది. నాయుడుజాతి వారిలో ఈపట్టమును పొందుటకు ఈమె తొలియామె.

# నేపాళ దేశపు స్త్రీలు

నేపాళము హిందూదేశమున నొక అంతర్భాగము. హిమాలయసానువులనంటి యున్న పర్వతమయమగు దేశమద్ది ప్రపంచమునందలి పర్వతశిఖరములలో నత్యున్నతమైనదగు మౌంట్టుఎవరెస్టు ఈదేశముయొక్క ఉత్తరపుకొనసను గలదు. తూర్పుకొనసను ప్రపంచమునందలి పర్వతశిఖరములలో మూడవదియగు కాంచనగంగశిఖరము కలదు.




బట్టల నేత

తక్కువకులపు స్త్రీలు ధరించు ముతకబట్టలు నేపాళదేశమునందలి నేవారుజాతికిచెందిన స్త్రీలే తయారుచేయుదురు. పడుగు పేకల సరిది మగ్గములపై బట్టలు నేయుట అచ్చట స్త్రీలే చేయుదురు.

నేపాళదేశపు స్త్రీలు ఆభరణప్రియులు. కంఠమునందును నాసికకును వారు పెక్కు ఆభరణములు పెట్టుకొందురు. కంఠాభరణములు ప్రాయకముగా వెండితో చేయబడును. ముక్కుకు పెట్టుకొను నగలు బంగారము, వెండి, ఇత్తడి ఈలోహములతో నిర్మింపబడును.

నేపాళదేశపుస్త్రీలు వీరమాతలు. ప్రపంచప్రఖ్యాతిగాంచిన ఘూర్ఖా సిఫాయీల వీరత్వమును వినని వారెవరు? వినిగర్వింపని వారెవరు? సింహబలులగు అట్టి యుద్ధభటుల మాతలు ఎంతటి వీరమతులు, ధైర్యశాలినులు అయిఉందురో పాఠకులే సులభముగ యోజించుకొనవచ్చును.

ఆదేశపుస్త్రీలకు యౌవనప్రాదుర్భావము పదునైదు, పదునారేండ్లకే గల్గును. అయితే యౌవనవిలాసమామెను త్వరలోనే విడిచిపోవును. ముప్పది వత్సరములకే ఆమె చర్మము ముడతలుపడును, ముఖమునకు ముదిరూపువచ్చును. ఆదేశమున సాధారణస్త్రీలు ఆడంబరయుతమగు దుస్తులు ధరింతురని చెప్పుటకు వీలులేదు. పలురకముల నగలుమాత్రము విశేషముగ ధరింతురు. అవి ఒక్కలోహములతో మాత్రమే

నిర్మింపబడునవి కావు. ఆలిచిప్పలతోగూడ పెక్కురకముల నగలు ఆదేశమున చేయబడును. అవి పెట్టుకొనుట కాస్త్రీలు మిక్కిలి ముచ్చటపడుదురు.

ఆదేశమున నీవారుజాతికి చెందిన స్త్రీలు సాంకేతికవృత్తులందు ప్రవేశించి మంచి పనితనమలవఱచుకొందురు. ఇనుముతోడను, ఇత్తడితోడను పాత్రలుచేయుదురు; బంగారముతోడను, వెండితోడను నగలుచేయుదురు; ప్రత్యేకము కాగితము చేయుటకే అక్కరకువచ్చు ఒకానొక చెట్టునుండి కాగితములు చేయుదురు. వారు ప్రత్తి నూలువడికి ముతకబట్టలు నేయుదురు.




నేపాళదేశపురాణి

ఆమె పరిచారికలు వివిధములగు రాజ్ఞీచిహ్నములధరించి ఆమెను పరివేష్టించియున్నారు. రంగురంగుల కుచ్చెళ్లపైకుచ్చెళ్లు, బంగారు వెండిపూవులతో బుటేదారిపని చేయబడిన టోపీగలిగి నేపాళపురాణి నెమలివలెనుండును. ఆదేశమునందలి రాజలాంఛనములగు రక్తఛత్రము, నెమలి విసరుకఱ్ఱలు, ఈగల దోలుకుంచెలు ధరించి పరిచారకులు పాయలై వ్రేలాడు జడలతో రంగుబట్టలతో రాణిచెంతనిలబడి చిత్తాకర్షమొనర్చుచుందురు.

నేపాళదేశపు స్త్రీలు మునుపటి వలెగాక ఇప్పుడు తమ ఇళ్లయందు కొంత స్వేచ్ఛ ననుభవించుచున్నారు. అయితే మేలిముసుగు లేనిది వారు పరపురుషుని కంటబడరాదు. ఉన్నత కుటుంబములందలి స్త్రీల దుస్తులు చూడ మిక్కిలి ముచ్చటగ నుండును. పండుగ పబ్బములందు ధరింపబడు వస్త్రములు మిక్కిలి వెలగలవిగను, చేయబడిన బుటేదారిపనితో నేత్రములకు మిఱుమిట్లు గొలుపునవిగను ఉండును. స్త్రీలు గాఢమైన రంగు అద్దిన జాకట్టుధరింతురు. లోపల ధరింపబడిన బుటేదారిపనిచేసిన చిన్ని జాకట్టు కనిపించుటకై ఈజాకట్టు కంఠమువద్ద కొంత తెరవబడియుండును. వీని అన్నిటి కంటె ఆస్త్రీల దుస్తులయందు విచిత్రమైనది వారిదిగువ వస్త్రము. తీగెబెత్తములుగల పెక్కు కుచ్చెళ్లతో నావస్త్ర మొక గుబ్బగొడుగువలె నుండి స్త్రీ కదులునపుడెల్ల విచిత్రముగను కొంతవఱకు వికృతముగను సంచలించుచుండును.

నేపాళదేశమున హిందూమతమును, బౌద్ధమతమును ఒకదానిప్రక్క నొకటి వర్ధిల్లుచున్నవి. ఆదేశమున దేవాలయము విస్తారము. భీకరమూర్తియగు కాళికేశ్వరి అచ్చటి హిందువుల అభిమానదేవత. నేపాళదేశపు రాజధానీనగరమగు కాట్మాండునగరమున కాళికాదేవికి బ్రహ్మాండమగు దేవాలయము కలదు. దేవీనవరాత్ర్యుత్సవసందర్భమున జరుపబడు దుర్గపూజకొఱకు నేపాళదేశపు స్త్రీలు రాజుభార్య, ప్రధానిభార్య మొదలగు పెద్దపెద్దలును మిక్కిలిపేదవారును అందఱునుకలసి గొప్పఊరేగింపు జరుపుదురు. నేపాళదేశపురాజుల ముఖ్యలాంఛనమగు ఎఱ్ఱగొడుగులు ఆఉత్సవమునందు పెక్కులు గాననగును. ఆఉత్సవము దుర్గాలయము ముందునకు వచ్చినపుడు ఆస్త్రీలు పొందు భక్తిపారవశ్యము అతిలోకమైనది.




నేపాళదేశపురాజగృహముననుండు కాంతలు

కట్టినవన్నియు సిల్కుబట్టలు. ఇజారులు-తుర్కీదేశపు స్త్రీలవలె-తొడుగుదురు. ఇజారులు సాధరణముగ సిల్కుతోడనే నిర్మింపబడును. లేదా ఒక్కొక్కప్పుడు మజ్లినులతోకూడ నిర్మింపబడుటకలదు. రకరకముల రంగుగుడ్డలు ధరింతురు. రంగులలో ధూమ్రవర్ణము, హరిద్రవర్ణము, నారింజపండురంగు ప్రియతమములు. ఈస్త్రీలు టోపీల ధరింతురు. ఆటోపీలపై బంగారుతో జిలుగు బుటేదారిపని చేయబడియుండును. అవి కొంచము వంకరగ ధరింపబడి ధరించినవారికి వింత అందమును కొనితెచ్చును. వారి విశాలనేత్రములు క్రింది రెప్పలను కటుకపెట్టబడి ఆకర్షణీయములుగ నుండును.

నేపాళదేశపుస్త్రీలు సుభగమైన ఆకారముగలవారు. మంగోళియాజాతివారి ఆకారసంపద వారిని కొంత అంటియుండును. బౌద్ధమతమును అనుసరించువారుగనో లేక ఎఱిగియుండినవారుగనో ఉంట ఆదేశపుస్త్రీలు భూతదయ, శాంతస్వభావము కలిగియుందురు. టిబెట్టుదేశమునకు చేరువను ఉండుటచే ఆదేశపు స్త్రీలకు భారతస్త్రీజనములకు విలక్షణమైన ఆచారములు కొన్ని ఆటిబెట్టు దేశమునుండి అలవడినవి.

మే 19:—గోదావరిఏజన్సీ పోలవరము స్వరాజ్యాశ్రమములో స్త్రీలసభ జరిగినది. ఆసభకు గ్రామములోని అష్టాదశవర్ణముల స్త్రీలు పెక్కురు వచ్చిరి. శ్రీమతులు చేబియ్యం సోదెమ్మ, కాముచూడమ్మ గార్లు ఉపన్యసించిరి.

20:—ఫ్లోరెన్సు బ్రిటను అను 59 సంవత్సరముల వయసుగల ఇంగ్లండుదేశపునారీమణి 'హిందూదేశమునకు స్వపరిపాలనము' అను నోటీసుల పెలిపోను బాక్సులో అంటించినందులకై లండనునగరమున ఎరస్టుచేయబడి కేసు విచారణసందర్భమున 'భారతదేశమునకు ఆకు నేనెట్టి శిక్షనైన అనుభవించెదను' అని చెప్పెను.

21:—దర్శనలో ఉప్పుకొటారులపై దాడివెడలి సమిష్టిసత్యాగ్రహము నెరపిన నాయకురాలు సరోజినీదేవిగారిని అరెస్టుచేసిరి.

—నరసన్నపేట సబుమేజిస్ట్రేటుకోర్టులో ఇండియనుపినలుకోడు 117, ఉప్పుచట్టము 74 క్రింద శ్రీమతి వేదాంతం కమలాదేవిగారిపై కేసుతేబడి విచారింపబడి 6 నెలలు విడిఖైదు వేయబడెను. మెయిలులో నొక క్రైస్తవస్త్రీని సహాయముగానిచ్చి దేవిగారిని వెల్లూరుచెరసాలకు గొనిపోయిరి. ఈమె కాకినాడ నివాసులు డాక్టరు వేదాంతము కృష్ణయ్యగారి సతి. భారత కాంగ్రెసు సంఘసభ్యురాలు.

22:—డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి పుత్రిక డాక్టరు లక్ష్మీదేవిగారు లండనునందు యం. ఆర్. సి. పి; యల్. ఆర్. సి. యస్ పరీక్షయందు కృతార్థురాలై; ఎడింబరో, లండను ఆస్పత్రులయందు ప్రసూతికి సంబంధించిన విద్యను బాగుగ నభ్యసించి మదరాసుకు వచ్చిరి.

22:—పినలుకోడు 145 ప్రకారము శ్రీమతి సరోజినిదేవిగారికి 9 నెలలు విడిఖైదు వేయబడి ఏక్లాసు ఈయబడెను.

—శ్రీమతులు డి. ఎస్. ఆనందరావు సతి, ఎల్. సి. ఎస్. పోషకన్య, ఆర్. నారాయణయ్యరు సతి; శ్రీయుత కొంతిరామమూర్తిగారి భార్య వీరిని చెన్నపట్నము ఆనరరీమేజస్ట్రేటులుగా నియమించిరి.

24:—ప్రభుత్వము వారవలంబించిన నిర్బంధవిధానము విషయమున తన నిరసనభావమును తెలుపుటకై సంఘసంస్కర్తలలో ప్రముఖురాలుగానున్న శ్రీమతి విద్యాగౌరీ నీలకంఠగారు అహమదాబాదు మ్యునిసిపాలిటీలోను, జైలుకమిటీలోను తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి.

—తూర్పుగోదావరిజిల్లా రాజవరముగ్రామములోని చిత్తరంజనసమాజమువారి ద్వితీయవార్షికోత్సవము శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి అధ్యక్షతను జరిగెను. శ్రీమతి సమయమంత్రి మహాలక్ష్మియను బాలిక గ్రామస్త్రీల తరుపున అధ్యక్షురాలికి ఆహ్వాన మొసగినది.

25:—మిత్రసతి శ్రీమతి సుమతీదేవిగారు—లక్నో సత్యాగ్రహనాయకురాలు—హజరతు గంజివైపు ఊరేగింపులో వెళ్లుచుండగా అరెస్టు చేయబడిరి.

—చెన్నపురి సత్యాగ్రహనియంత్రి శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారిని ఆర్కాటులో అరెస్టుచేసి వెల్లూరుతీసికొని వెళ్లిరి.

26:—శ్రీ వీరేశలింగము పంతులుగారి వర్ధంత్యుత్సవము ఆంధ్రసంఘసంస్కరణ సభ, హితకారిణీ సమాజమువారి ఆదరణమున రాజమహేంద్రవరము నందలి ఆనందోద్యానవనమున జరిగెను.

—వెల్లూరులో శ్రీమతి దుర్గాబాయమ్మగారి కేసు విచారింపబడి పినలుకోడు 117 క్రింద 9 మాసములును, 74 ఉప్పుచట్టముక్రింద 3 మాసములును మొత్తము సంవత్సరము విడిఖైదు వేయబడి, ఏక్లాసు ఈయబడెను.

—శ్రీమేరీరాణిగారు తమ 63-వ జన్మదినమును బకింగుహ్యాం భవనమున జయప్రదముగ జరిపిరి.

27:—శ్రీమతి సత్యవతీ కన్యాంగారికి శిక్ష. ఈమె శ్రద్ధానందస్వామి మనుమరాలు. న్యూఢిల్లీ. ఆరు నెలల వరకును సత్ప్రవర్తనను కలిగి యుండుటకు 500 రూపాయలకు పూచీకత్తు నిమ్మని నేడు జిల్లా మేజస్ట్రేటు కోరెను. ఆమె నిరాకరించెను. క్రిమినలు ప్రొసీజరు 108 క్రింద 6 నెలలు విడిఖైదు వేయబడెను. ఏక్లాసుయియ్యబడెను.

28:—శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు తమగుంటూరుజిల్లా బోర్డు సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి.

29:—

30:—

31:—దేశబాంధవి దువ్వూరిసుబ్బమ్మగారిని రాజమండ్రిలో ఎరస్టుచేసిరి. వెంటనేకోర్టుకు తీసికొనిపోయిరి. ఇండియను పినలుకోడు 157-వ సెక్షను క్రింద 6 నెలలు విడిఖైదు విధింపబడెను. ఆవార్తను సుబ్బమ్మగారు చాల సంతోషముగా గైకొనిరి. 1922 లో సుబ్బమ్మగారు 108 సెక్షను క్రింద ఎరస్టు చేయబడి 1 సంవత్సరము శిక్షపొందిరి.

—శ్రీమతి సరళాదేవిగారు బరంపురమునుండి రైలులో బయలుదేరిపోవుచుండగా రైలు ఒక మయిలుదూరము వెళ్లినపిమ్మట రైలులోనున్న పోలీసువారు గొలుసులాగి రైలుబండిని ఆపి ఆమెను అరెస్టుచేసి లారీలో ఛత్రపురము తీసికొనివెళ్లిరి. ఛత్రపురములో డిప్టీకలక్టరు ఖాను సాహెబు మొహుద్దీను ఖానుగారి కోర్టులో విచారించి పినలుకోడు 117, ఉప్పుచట్టము 74, రెండుసెక్షనులకు చేరి ఆరునెలలు మొత్తము 12 నెలలు విడిఖైదు వేయబడెను. వెంటనే ఆమెను ఇచ్ఛాపురము తీసికొనివెళ్లిరి. ఆమెకుసహాయముగా నొకస్త్రీని కూడపంపిరి.

—25-వ తేదీని లక్నోలో అరెస్టు చేయబడిన శ్రీమతి సుమతీదేవిగారి కేసు చెరసాలలోనే విచారణచేయబడి ఇండియను పినలుకోడు 145-సెక్షను ప్రకారము 6 నెలల విడిఖైదు వేయబడినది.

జూను 1:—చెంగల్పట్టుజిల్లాబోర్డు సభ్యురాలగు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు అరెస్టు చేయబడినందులకు ఆమె దేశసేవను ప్రశంసించుచు ఆమెను అభినందించుచు సైదాపేట తాలూకాబోర్డు సభలో శ్రీయుత ఎం. భక్తవత్సలంగారు ఉపపాదించిన తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

2:—సార్వభౌముని జన్మదిన బిరుదములలో ఆమీజాన్సన్ కన్యకు సి.బి. ఇ బిరుదమునిచ్చిరి.

3:—ఎగ్మూరునందు పాంథియను హైరోడ్డులో మెటర్నిటీ హాస్పిటలుకు నెదుటనున్న పాంథియను గార్డెన్సులో స్త్రీల నూలువడుకుటకు పాఠశాల ఏర్పరుపబడెను.

4:—డేరాయిస్మాయిలుఖానులో సైనికశాసనము అమలులోనున్నను కూడ లెక్కచేయక సాయంకాలము వందలకొలది స్త్రీలు ఊరేగింపుజరిపిరి. మొదట సైనికులు వారిని నిరోధించిరి గాని పిమ్మట దారియిచ్చిరి.

5:—సాంగలుహిలులో క్రిమినలు ప్రొసీజరుకోడ్డు 144-వ సెక్షనుక్రింద అలీహుసేనుషాగారిని అరెస్టు చేసి ఒకసంవత్సరము కఠినశిక్ష వేయుటచే వారి భార్యయు, సోదరి, మఱి పెక్కుమంది మహమ్మదీయ స్త్రీలును ఘోషానుత్యజించి వీథులవెంట తిరిగి ప్రచారము చేసిరి.

6:—లండను పార్లమెంటు మెంబర్లకు ఒక ప్రత్యేకమైన ఉపన్యాసము గావించుచు భారతదేశమున సత్వర అధినివేశ స్వాతంత్ర్య వాగ్దానము చేయవలెనని శ్రీమతి బిసెంటుగారు తెలిపిరి.

7:—గుంటూరుజిల్లా కిరవదిలో శ్రీమతి పోలవరపు రంగమ్మగారనే కమ్మస్త్రీని ఆమెభర్త యెక్కడనున్నాడని అడుగగా తనకు తెలియదని చెప్పినందుకు పోలీసువారు ఆమెను చెంపమీదకొట్టిరి. ఆసంగతి అప్పుడు ఆగ్రామముననే మకాముచేసియున్న శ్రీకలెక్టరు దొరవారికి రిపోర్టుచేసికొనగా ఉదారులగు వారు చాల నొచ్చుకొనిరి.

8:—శ్రీమతి పిచ్చిముత్తుఅమ్మాళ్ గారు తమిళనాడు కాంగ్రెసు సంఘమునకు అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడిరి.

9:—శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారిని దేవరంపాడులో అరెస్టు చేసిరి.

10:—మిదునాపూరులో మ్యునిసిపలు బాలికాపాఠశాలలో ఉపాధ్యాయినిగా నున్న శ్రీమతి చారుశీలాదేవిగారు కాంగ్రెసులోచేరి దీక్షగా పనిచేయుచుండుటచే ఆమెను ఉపాధ్యాయిని పదవినుండి తొలగించి 144-వ సెక్షనుక్రింద నోటీసుకూడ నిచ్చిరి.

11:—నెల్లూరులో ప్రచురింపబడుచున్న సింహపురి పత్రికకు రు. 500 ధరావతు కోరబడుటచే ముద్రణము నిలిచిపోగా శ్రీమతి పాటూరు బాలసర్వతమ్మగారి సంపాదకత్వమున సైకలస్టయిలు చేసి ప్రచురింప నిశ్చయించిరి.

12:—క్రిమినలు ప్రొసీజరుకోడు 112 క్రింద భీమవరములో శ్రీమతి కోటమర్తి కనకమహాలక్ష్మమ్మగారికి 6 నెలలు విడిఖైదు విధింపబడినది. ఆమెను బి. తరగతి ఖైదీలలో చేర్చిరి. కనకమ్మగారికి 65 ఏండ్ల వయసుండును.

13:—విశాఖపట్టణములో శ్రీమతులు దిగుమర్తి జానకీబాయమ్మ, మంత్రిప్రగడ బంగారమ్మగార్లను అరెస్టుచేసి విచారించిరి. 145-వ సెక్షను ప్రకారము అక్రమసంఘముగా చేరిరను నేరముక్రింద చెరి 6 నెలలు కఠిన శిక్షయును, ఏబదిరూపాయిలు జరిమానాయును విధింపబడెను. జరిమానా చెల్లింపనిచో మరిఆరుమాసములు కఠినశిక్ష ననుభవింపవలెను. శ్రీమతి జానకిబాయి గారికి బిక్లాసు ఈయబడెను.

—శ్రీమతి శ్రీ పెరుంబుత్తూరు సుభద్రమ్మగారిని నందిగ్రామములో ఎరెస్టుచేసిరి. పోలీసు ఆక్టు 3 క్రింద ఆమెను బెజవాడలో విచారించి 6 మాసముల విడిఖైదు వేసిరి. బిక్లాసు నిచ్చిరి. వెల్లూరు జయిలునకు గొంపోవబడుచుండ ఆమెతో ఆమె స్నేహితురాలు శ్రీమతి పి. సుందరమ్మగారు వెంటనుండిరి.

14:—"కఠినవిధానముపట్ల అసమ్మతిని తెలుపుటకు బొంబాయిశాసనసంఘసభ్యత్వమునకు రాజీనామా నిచ్చిన శ్రీమతి యిడాడికిన్సను కన్యగారికి బొంబాయి కార్పొరేషనువారు అభినందనములు తెలుపుచు ఫ్రీడం ఆఫ్‌దిసిటీ గౌరవమును ఆమెకు స్థిరపరుచుచున్నారు" అను తీర్మానమును బొంబాయి కార్పొరేషను సభలో డైర్సీగారుపపాదింతురని తెలియుచున్నది.

15:—నేపాళము మహారాజావారి నాల్గవవార్షికోత్సవ సందర్భమున ఇద్దరు ప్రదర్శనము జరిగినది; వేయిమంది స్త్రీలు తత్సందర్భమున ఒకశాలలో నూలువడికిరి.

16:—ఖుల్నాలో సత్యాగ్రహుల ఉత్సవమును పోలీసువారు చెదరగొట్టిన సందర్భమున శ్రీమతి శైలినీదేవిగారికి గట్టి దెబ్బలు తగిలినవని తెలియుచున్నది.

17:—

18:—"సరోజనీదేవిగారిని. కమలాదేవిగారిని, లక్ష్మీపతి రుక్మిణమ్మగారిని, రాజకీయములగు నేరములకు నిర్బంధితులై యున్న తదితర నారీమణులను విడుదల చేయవలయునని యీ మ్యునిసిపాలిటీవారు గవర్నమెంటు వారిని కోరుచున్నారు" అని తీర్మానము తిరువళ్ళూరి మ్యునిసిపాలిటీసభలో సదరు మ్యునిసిపలు సంఘములోని నామినేటెడు స్త్రీసభ్యురాలగు గోమతి నాధనుసతిగారు ఉపపాదింపదలచిరి. కాని, మ్యునిసిపలు వ్యవహారములకు సంబంధములేని విషయము గనుక తీర్మానముపపాదింప వీలులేదని చెయిర్మనుగారు నిరాకరించిరి.

19:—శ్రీమతి జయంతి సూరమ్మగారిని జిల్లాకాంగ్రెసు కార్యాలయమునుండి ఆంధ్రభాషాభివర్ధనివద్ద జరుగు సభకు సాయంకాలము 5–15 గంటలకు పోవుచుండగా అరెస్టుచేసి గోపాలపురము తీసికొనివెళ్లి విచారించిరి. 6 మాసముల విడికైదు. బి. క్లాసు. స్త్రీ సహాయమిచ్చి వెల్లూరు తీసికొని వెళ్లిరి.

# పత్రికాపరిచయము

సుధ:—

ఈనూతనమాసపత్రికకు గృహలక్ష్మి తనమనఃపూర్వకమగు స్వాగతముచేయుచున్నది. మదరాసు కేసరీ ముద్రణాలయమున ముద్రింపబడి శ్రీయుత డి. దేశికాచార్యులవారిచే ప్రకటింపబడుచున్నది. శ్రీయుత వి. కుటుంబరావుగారిచే సంపాదింపబడుచున్నది. 'ఇంకనూ ఉదాసీనతయేనా?' అని ప్రథమవ్యాసము. విదేశవస్తుబహిష్కారమున భారతీయులిక ఉదాసీనత వహింపరాదని వ్యాసము బోధించుచున్నది. రెండవ వ్యాసము 'గవర్నరుస్పెషల్' అనునది. కథావ్యాసము. మహేంద్రనాథఠాకూర్ వారి కథకు అనువాదము కావలయును. 'ఆయుర్వేదము నుద్ధరించిన మహనీయుడు' అని మూడవవ్యాసము. ఇందు శ్రీ వైద్యరత్నపండిత డి. గోపాలాచార్యులవారి జీవితము సంగ్రహముగ చెప్పబడినది. ఇది సశేషమగువ్యాసము. నాల్గవవ్యాసమగు దొంగరాముని ఆత్మకథ కొరతగనున్నది. అనుభూత ప్రక్రియలు, ఆరోగ్యసూత్రములు అనంతరువాతి వ్యాసములు ప్రజలకు క్రొత్తవిషయములను నేర్పునవిగానున్నవి. స్త్రీలంటే అసహ్యం; వివాహము అవసరము; గ్రంథస్వీకారము, వివిధవార్తలు ఇవిమిగిలిన వ్యాసములు. పత్రిక ఆంధ్రమహాజనుల ఆద[illegible] చిరకాలము వెలయుగాక.



**శ్రీపంచమజార్జిసార్వభౌముని ఆరోగ్యము:—**

శ్రీపంచమజార్జిసార్వభౌముని దేహారోగ్యము దేవుని దయవలన సుస్థితినొంది ఎన్నియో దినములుకాలేదు. మరల ఈమధ్య శ్రీవారికి కీళ్లనొప్పులు కనిపించినవి. భగవదనుగ్రహమున అవి ఇప్పుడు బాగుగ నెమ్మదించినవి. శ్రీజార్జిసార్వభౌములు పూర్ణపురుషాయుషజీవులై రవి యస్తమింపని విశాలసామ్రాజ్యమును ఇంకను పెక్కువత్సరములు పరిపాలింపను, తనసామ్రాజ్యమున ప్రపంచశాంతిని పరిరక్షింపను చక్రరక్షకుడును, భద్రగుడును అయిన దేవుడు అనుగ్రహించుగాకయని మనఃపూర్వకముగ ప్రార్థింతుము.

**శ్రీమతి హరి వేంకటరమణమ్మగారికి అభినందనములు:—**

శ్రీయుత హరిసుబ్బారావుగారి కుమార్తెయగు ఈమె స్కూలుఫైనలువరకు ఆంగ్లము నభ్యసించియుండుటయు; సనాతనధర్మమండలి వారి వ్యాసముల పోటీపరీక్షలయందు గెలుపొందియుండుటయు; హిందీ, సంస్కృత భాషలయందు మంచి పరిచయము కలిగియుండుటయు; కుట్టుపనియందు కడునేర్పరియగుటయు గృహలక్ష్మీపాఠకురాండ్రకు విదితమే. ఈ విదుషీమణి యిప్పుడు పార్టుహ్యాండు పరీక్షయందు జయముగాంచినది. ఆంధ్ర విదుషీమణులలో సంక్షిప్త లేఖనమునందు త్తీర్ణురాలగుటకు ఈమెయే ప్రథమురాలు. అగుట శ్రీమతి వేంకటరణమ్మగారికి ఈ శుభసమయమున ఆంధ్రస్త్రీల అభివృద్ధినే అనవరతము నాకాంక్షించు గృహలక్ష్మి తన అభినందనములను అందజేయుచున్నది.



శ్రీమతి హరివేంకటరమణమ్మగారు

అభివందనములైన నొల్లని పరార్థసేవ:—

ఇంగ్లండులో ఈస్టుబోరను సముద్రతీరమున ఇద్దరు హైందవవిద్యార్థులు సముద్రములో స్నానము చేయబోయిరి. వారిలో ఒకడు ప్రమాదవశమున సముద్రమున మునిగి లోనికి కొట్టుకొని పోవుచుండెను. రెండవవాడిది కనిపెట్టి తోడి విద్యార్థి ప్రాణములను రక్షించవలెనను పదార్థప్రవణమైన బుద్ధితో తోడనే వానికొఱకు ఈదుకొని పోవుచుండెను. అలసటవచ్చి రెండవవాడుకూడ మునిగిపోవ ప్రారంభించెను. అపరిచితయగు ఆంగ్లబాలిక యొకతె ఇది చూచెను. ఈదుకొనిపోయి ఇద్దరు విద్యార్థులను రక్షించి తీరమునకు చేర్చెను. అప్పటికి వారికి స్మృతి తప్పియుండెను. స్మృతి తెలిసిన వారెక్కడ తనకు కృతజ్ఞతాపూర్వాభివందనములు తెలుపుదురో అని ఆపరోపకారపరాయణురాలు వెంటనే ఆప్రదేశమునుండి అదృశ్యమయ్యెను. లోకమువారి మెచ్చుకోళ్లకుగాని, ఉపకారము పొందిన వారి కృతజ్ఞతాభివందనములకుగాని ఆశింపక పరులకు ఉపకారము చేయుటయే కొందఱు అవతారమూర్తుల నిత్యకృత్యములు.

శ్రీ సనాతన విద్యాలయమునకు సహాయము చేయుడు:—

దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారి వలన పావనగౌతమీతీరమున రాజమహేంద్రవరమునందు 10-5-1928 తేదీని స్థాపింపబడిన శ్రీసనాతనవిద్యాలయమునకు స్థిరమైన వసతిగాని, నియామకమైన ఆదాయముగాని లేదు. ప్రజ్ఞావతియగు సుబ్బమ్మగారు గ్రామముల వెంట సంచారముగావించి చందాలు వసూలుచేసి విద్యాలయమును ఇంతవఱకు నిర్విఘ్నముగ నడుపుకొని వచ్చినారు. ఇప్పుడామహనీయురాలు కారాగృహవాసము చేయుచున్నది. కావున విద్యాలయము సంస్థాపకురాలు తిరిగివచ్చుసరికి స్వరూపనాశనము గాకుండ నిలుపవలసిన భారము దేశజులపైనున్నది. దేశజులలో మహనీయులు కొందఱిందులకు పూనుకొనిరని తెలుపుటకు సంతసించుచున్నాము. రాజమహేంద్రవరమునందలి న్యాయవాదప్రముఖులగు శ్రీయుత వీరఘంటల లక్ష్మీనరసింహమూర్తిగారును, వణిక్పుంగవులగు అరవ ఆదినారాయణమూర్తిగారును, ప్రజాహితజీవనులగు పాలకోడేటి గురుమూర్తిగారును విద్యాలయకార్యనిర్వాహకత్వమును పూని ఈ మాసము 5-వ తేదీని విద్యాలయము తెరచి యథాప్రకారము జరుప నిశ్చయించిన శుభవార్త ఆంధ్రుల చెవిని బడినది. శుభవార్త చెవిని వేసికొనుటతోడనే తమ బాధ్యత తీరినదని తలంపక ఆంధ్రసోదరసోదరీమణులు ఈ సంస్థను తమ స్వంతముగ నెంచి తగుమైన సాహాయ్యము చేసి విద్యాలయనిర్వహణమున కార్యనిర్వాహకవర్గమువారికి ఉత్సాహము కల్గింతురుగాక అని ఆశించుచున్నాము.

'స్త్రీలకు విద్య అవసరము లేదు':—

'స్త్రీలకు విద్య అవసరములేదు' అను కేక ప్రాచీన సంప్రదాయములకు పట్టుకొమ్మ యగు భారతదేశముననే ఇప్పుడంతగా వినిపించుటలేదు. అట్టిచో స్త్రీవిద్య బాగుగా అభివృద్ధినందిన ఐరోపాఖండమునకు మిక్కిలి సమీపముననున్న ఈజిప్టుదేశమున ఈనాడు కూడ విద్యావంతులగు మగవారట్టి కేక వేయుచుండుట అత్యాశ్చర్యకరమైన విషయము. ఆదేశమున విద్యాభిలాషిణియగు స్త్రీ ఒకన్యాయాధికారిదగ్గిర తన భర్త తన కుమార్తెకు డబ్బుయిచ్చి చదువు చెప్పించునట్లు చేయవలెనని విన్నవించుకొనెను. న్యాయాధికారి మహమ్మదీయుల న్యాయశాస్త్రప్రకారము మహమ్మదీయుడు తన పుత్రికలకు విద్య చెప్పించవలసిన అవసరములేదని ఆ విన్నపమును త్రోసిపుచ్చెను. త్రోసిపుచ్చుటతో సంతృప్తినందక ఆతడు స్త్రీలు విద్యగ్రహించుట తన అభిప్రాయమున మహాదోషమని చెప్పెను. ఈ అభిప్రాయప్రకటనము ఆదేశపు స్త్రీలలో పెద్దఅలజడి కల్గించెను. విద్యాశాఖ మంత్రిసముఖమునకు ప్రముఖురాండ్రగు ఆదేశపుస్త్రీలు రాయబారముపోయిరి. మహమ్మదీయుల దేశములందుకూడ స్త్రీలవిషయమున పూర్వము ఉండినన్ని నిర్బంధము లిప్పుడులేవు. ఆదేశపుస్త్రీలు సర్వతోముఖాభివృద్ధినందుచున్నారు. తోడిదేశపు సోదరీమణులతో సర్వవిషయములందును ఉజ్జీయగుచున్నారు. టర్కీ, ఈజిప్టుదేశములందు స్త్రీయుద్యమము బాగుగ కొనసాగుచున్నది. అట్టిచో తిరిగి స్త్రీలను ప్రాక్తనాచారములకు గొనిపోయి వారిని నాలుగు గోడలసందున చెఱలాడించుట తగనిపని. న్యాయాధికారి న్యాయశాస్త్రప్రకారము విన్నపమును త్రోసిపుచ్చినాడు. ఓగో, బాగో అదిసరి. అతడంతతో ఊరుకొనవలసినది. అట్లుగాక తన అభిప్రాయమును ప్రకటించి న్యాయనిర్ణయమును కలుషితముచేయుట ఎంత మాత్రము పాడిగాదు. తనఅభిప్రాయమును ప్రకటించునెడ నాతడు తాను న్యాయాధికారిననుభావము విస్మరించినాడు. తాను న్యాయాధికారిననుభావము విస్మరించిన న్యాయధికారితీర్పు న్యాయవిరుద్ధముకాక ఎట్లుండును? అగుట 'స్త్రీలకు విద్య అవసరములేదు' అను ఆతని వాక్యమునకు న్యాయప్రపంచమున చెల్లుబడి యుండనేరదు.

కీ. శే. వసంతకుమారదేవి:—

లాహోరు నివాసులగు కీ. శే. సర్. పి. సి. చెటర్జి కె. టి; సి. ఐ. ఇ. వారి భార్య వసంతకుమారీదేవిగారు గడచినమాసము 11—వ తేదీని కలకత్తాయందలి తమ

స్వగృహమున మరణించినారు. ఆమె మిక్కిలి మంచియామె. పెక్కుదానములను చేసినది. అందు జగన్నాథమునందలి సరోజనలినీసంఘము వారు నిర్వహించుచున్న వితంతు శరణాలయమునకు చేసిన గృహదానమును; లాహోరునందలి వైద్యకళాశాల ఆసుపత్రికిచ్చిన విరాళమును పేర్కొనదగినవి. ఈ దాత్రి పవిత్రాత్మకు శాంతిచేకూరుగాక!

కీ. శే. వేగూరు వేంకటసుబ్బమ్మగారు:—

మంచివారికి మరణమేసాక్షి. పదియుతొమ్మిదివత్సరములు నిండని పడుచు పరమపదించినది. జూనుమాసము 6-వ తేదీ మధ్యాహ్నము 1 గంటకు ఈమె భౌతికదేహము చాలించినది. ఈమె రాయబహదూరు మైనవోలు చంగయ్యపంతులవారి పుత్రిక. జీవితాంతమువఱకు అగ్గలమైన విద్యాభిలాషతో వరలుచు తోడిరమణీలోకమున జంగమమైన గ్రంథాలయముగ కీర్తిగాంచిన విదుషి—తల్లి—భ్రమరాంబగారిని చిన్నతనముననే గోల్పోయినను ఆదరణ ఎఱిగిన తండ్రిగారి మృదుహస్తములబెరిగి, సోదరుని అదుపాజ్ఞలలో విద్యాసముపార్జనము గావించి తన్నుచేపట్టిన వేగూరు వేంకటసుబ్బారావు (బి. యే, బి. యల్) గారి నయనానందదీపికయై వెలిగినది. 'గృహలక్ష్మి' గడచిన దసరాసంచికలో ఈవిదుషి రచియించిన అతికరుణకమగు కథను ప్రచురించి యున్నాము. సారస్వతమునకు పుష్టితేగలిగిన ఇట్టి విదుషీరత్నముల మరణము దేశమాతయొక్క దురదృష్టమునకు సూచన. శ్రీయుతులు చంగయ్యపంతులుగారికిని, వేంకటసుబ్బారావుపంతులుగారికిని ఈకష్టసమయమున మాసానుభూతిని తెలుపుకొనుచు ఈవిదుషీమణి పవిత్రాత్మకు శాంతిని ప్రసాదింప పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.



వేగూరు వేంకటసుబ్బమ్మగారు

గృహము విడువవలసివచ్చినది:—

ప్రస్తుతము భారతదేశమున నలుమూలలవ్యాపించియున్న సత్యాగ్రహోద్యమము స్త్రీల చిత్తములను, పిల్లలహృదయములను బాగుగ ఆకర్షించినది. ఆపాదమస్తకము కద్దరు

దుస్తులనుకట్టినస్త్రీలు,పిల్లలు బట్టలషాపులవద్దను, సినిమామందిరములవద్దను పికెటింగు చేయు దృశ్యములు కలకత్తాయందు— ఒక్కకలకత్తాయందే యననేల భారతదేశమున ప్రతితావునను సర్వసాధారణమైయున్నది; కాని బొంబాయినుండి వినవచ్చుచున్న స్త్రీలు, పిల్లలు జరిగించిన ఈవృత్తాంతము మాత్రము అసాధారణముగనున్నది. బొంబాయియందు నైటుహూ దాలోపొందియున్న ఒక మహాశయునకు ఈసత్యాగ్రహోద్యమము పట్టలేదు. కాని ఆతని ఇంటియందలిస్త్రీలును, పిల్లలును సత్యాగ్రహోద్యమమునకు సుముఖులైయుండి ఆతనిపై ఎదురుతిరిగిరి. ఆతనికి తనయింట పట్టెడుప్రసాదము దొరకుటకూడ దుర్ఘటమయ్యెను. చేయునదిలేక ఆతడు తాజమహలు హోటలుకుపోయి భోజనము చేసెను. ఇట్లుజరుగుటకు కారణభూతురాలైన ఆగృహమేధిని తన ధర్మమును బాగుగ నిర్వహించినదనుటకు అవకాశమున్నదో, లేదో పాఠకురాండ్రు నిర్ణయింపవలసియున్నది.

సైమనురిపోర్టు : ఆంధ్రరాష్ట్రము :—

ఆంధ్రమహాప్రజలు చిరకాలముగా కోరుచున్న ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణ విషయమున సైమనుకమీషనురిపోర్టు మొదటిసంపుటము ఇట్లు ప్రస్తావించుచున్నది. "మద్రాసురాజధానియందు వివిధభాషాప్రాముఖ్యముగల భాగములు పెక్కులుగలవు. ప్రధానభాషలు అరవము, తెలుగు. అరవము 18,000,000 ల మందిచేతను, తెలుగు, 16,000,000 మందిచేతను, మాటలాడబడుచున్నవి. మళయాళమును 3,000,000 ప్రజలు తిరువాన్కూరు కొచ్చిను సంస్థానములలోను, బ్రిటీషు జిల్లాయగు మలబారులోను మాటలాడుచున్నారు. కన్నడభాష మైసూరు సరిహద్దులందును, బొంబాయి రాష్ట్రపు సరిహద్దులందును వాడబడుచున్నది. రాష్ట్రమున కుత్తరమునందు ఉత్కళభాషను వాడెడి భాగములు చాల గలవు. ఈభాషాభేదములకు ఇటీవలికాలములో మిగుల రాజకీయ ప్రాముఖ్యము గలిగెను. ప్రత్యేకతపై గల మక్కువ దీనికి కారణమయ్యెను. ఆంధ్ర, లేక తెలుగు రాష్ట్రమును ఏర్పరుపవలెనను కోర్కె, పదునేడు సంవత్సరములక్రిందట తెలుగు మాటలాడెడి జిల్లాలవారి సమావేశమునందు మొదట ప్రతిపాదింపబడెను. పిమ్మట పెక్కు సంవత్సరములవరకు ఈ విషయమై ఆందోళనము జరుగుచునేయుండెను. ఇప్పుడది ప్రధాన రాజకీయసమస్య అయినది. మద్రాసు శాసనసభలో రెండుపర్యాయము లీవిషయమై చర్చ జరిగెను. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణసూచన శాసనసభలో నధికసంఖ్యాకులచేనామోదింపబడెను." సైమను కమీషను రిపోర్టు రెండవ సంపుటమున చేయబడిన సిఫార్సులలో నూతనరాష్ట్రనిర్మాణకార్యక్రమ మొకటి. సరిహద్దుల కమీషను నొకదానిని ఏర్ప

అచి ఇండియాగవర్నమెంటువారు నూతనముగ కొన్ని రాష్ట్రములను నిర్మించునట్లు అందు సిఫారుసు చేయబడియున్నది. 1913-వ సంవత్సరమున బాపట్లలో తలపెట్టబడి ఇన్నాళ్లుగ ఊగిసలాడుచున్న ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము ఏనాటికైనను సాగునను సూచన కల్గించిన సైమను కమీషను సభ్యులకు ఆంధ్రాభిమానులు సహస్రప్రశంసములు చేయ వలసియున్నది. దేశీయసభ్యులతోకూడియుండిన సెంట్రలుకమిటీవారి రిపోర్టుతో బాటు కేవలము శ్వేతముఖులతో కూడిన సైమనుసంఘమువారి రిపోర్టుకూడ నూతనరాష్ట్రముల నిర్మాణమున ప్రోత్సాహకరమగు సిఫార్సులు చేసియుండుట ప్రమోదావహమగువిషయము.

దు శ్శా స న ని త ల పిం చు చు న్నా డు:—

పంజాబునందలి దేశసేవాపరాయణలలో ప్రముఖురాలగు శ్రీమతి పార్వతీదేవి పత్రికలలో నిట్లు వ్రాయుచున్నది:—"ఆగ్రాలోని తాణాఛట్టా పోలీసు సబ్ఇనస్పెక్టరు కొంతమంది పోలీసువారితోడను, సాక్షులతోడను, ఒక సి. ఐ. డి ఇన్‌స్పెక్టరుతోడను వచ్చి నా ఇల్లు సోదాచేసెను. వారు వచ్చుసరికి నేను నాపడకగదిలోనుండి వస్త్రధారణము చేసికొనుచుంటిని. పోలీసు ఇన్‌స్పెక్టరు ఆగదియందు ప్రవేశింపబోయెను. ఈవతలఉన్న నాకుమార్తెయు, మఱియొక పెద్దమనిషియు లోనికి పోవద్దని ఆతనితో చెప్పిరి. ఆతడా మాటలను పెడచెవినిబెట్టి లోన ప్రవేశించుచుండెను. ఇంతలో నేను బయటికివచ్చి ఇతరుల పడకగదులలోనికి చొఱబాఱుట పెద్దమనిషితరహాయేనా అని ప్రశ్నించితిని. దానికి నీవు పారిపోవుదువను భయముచే నేనిట్లు తొందరపడితినని అతడు బదులుచెప్పెను." శ్రీమతి పార్వతీదేవిచెప్పు ఈసంగతులు నిజమగునేని ఆపోలీసుఇనస్పెక్టరు క్షంతవ్యముకాని తప్పుచేసెననుటలో సందేహములేదు. పార్వతీదేవి గృహము సోదాచేయబడుటకు ఇది ప్రథమముగాదు. సోదాచేయవచ్చిన పోలీసువారి పాదరక్షల టక్కుటిక్కులతో ఆమె గృహము పలుసారులు ప్రతిధ్వనించినది. అప్పుడెప్పుడును పలాయనము కాని ఆమె ఇప్పుడు పారిపోవుటకు వచ్చిన క్రొత్తముసలము ఏమిఉన్నది? పారిపోవుటకు ఆమె బందిపోటు దొంగకాదే! వ్యాయామకర్కశగాత్రికాదే? సంసారముచేయుచున్న అబల; అందును గదియందున్నది. పాఱిపోదలచినను అవకాశమేది? ఈసందర్భమునందలి ఆపోలీసు ఇనస్పెక్టరుచర్య పెద్దఅధికారులకు తెలిసియుండదు. ఇకముందైనను గృహములు— అందును స్త్రీసత్యాగ్రహులవి—సోదాచేయబడునెడల పోలీసుఉద్యోగులు పొందికగ ప్రవర్తించునట్లు అధికారులు జాగ్రత తీసికొందురుగాకయని హెచ్చరించుచున్నాము.

సైమనునివేదిక: భారతమహిళలు:—

ఏది ఎట్లున్నను సైమనునివేదిక భారతమహిళలనుగూర్చి ప్రశంసావాక్యములు పలుకుచున్నది. హిందూదేశపుస్త్రీలనుగూర్చి అని వేదికయందు ప్రత్యేక మొకప్రకరణము గలదు. అందు మొదటివాక్యము "హైందవరాజ్యాంగవిధానమును తర్కించు యే నివేదికకూడ స్త్రీల ప్రస్తుతపరిస్థితులను దిగనాడజాలదు." స్త్రీల వోటింగు హక్కులు, సాంఘికమహిళాసంస్కారులు, పరదా, బాల్యవివాహములను ప్రస్తావించి కమీషనరు లిట్లనుచున్నారు. "కాలపరిణామములో ప్రస్తుతము మారుచున్న దృక్పథమువలన స్త్రీల పురోభివృద్ధి యెటులుండునను విషయమున కెంతవ్రాసినను అత్యుక్తి కానేరదు. ప్రస్తుతము ఉపాధ్యాయవృత్తిలో గాని నర్సులుగా గాని జీవనోపాధిగల స్త్రీల సంఖ్య అత్యల్పము. దానిని వృద్ధిచేయుట కంతరాయములు పెక్కులు. అయినను భారతీయగ్రామములందు సర్వజనసామాన్యముగా బాలబాలికలలో విద్యవ్యాపింపజేయుటకు ఉపాధ్యాయినులెక్కువగా కావలెను. వైద్యసహాయములేక అనవసరముగా స్త్రీలు పడుక్లేశము దుర్భరము" "స్త్రీయుద్యమము పురోభివృద్ధికి ముఖ్యమైనసాధనసంపత్తిని గలిగియున్నది. దానివలన రాబోవు ఫలితములు లెక్కింపతరముగాదు. స్త్రీలు విద్యావంతులై పౌరవ్యవహారములందు, తగిన పాల్గొనునంత వరకును హిందూదేశము ఇపుడు పొందజూచుచున్న ఉన్నత పదవి నందజాలదు." ఈవాక్యములు సైమనుసంఘమువారికి భారతమహిళల ఉద్యమము నెడల అభిమానమును, ఉద్యమమునుగూర్చి అభిజ్ఞానమును గలవని చాటుచున్నవి. కమీషనర్లు ముఖ్యముగా అఖిలభారతమహిళాజనసభను అగ్గించుచున్నారు. కమీషనరులలో కొందఱు వారీదేశమున పర్యటనము చేయుచుండగా హిందూదేశ రాజధానీనగరమగు ఢిల్లియందు జరిగిన అఖిలభారత మహిళాజనసభకు పోయియున్నారు. సభ జరిగిన తీరును వారు శతథాశ్లాఘించుచున్నారు. విద్యావంతులును, ప్రతిభావంతులునునగు విజాతీయు లిట్లు ప్రశంసావాక్యములు పలుకుట భారతస్త్రీజనోద్యమమునకు నూతనోత్తేజమును, నూతనోత్సాహమును పూరింపగలదు.

నిర్బంధవిధానమును నిరసించిన ఆంగ్లయువతి:—

బొంబాయి కార్పొరేషను నామినేటెడ్డు సభ్యురాలు, శాసనసభా సభ్యురాలు సాంఘికసేవాపరతంత్రురాలు అయిన ఇడాడికెన్సను అను ఐరోపియనుస్త్రీ ప్రభుత్వము వారి తీవ్రనిర్బంధ విధానమును నిరసించుచుతన శాసనసభాసభ్యత్వమునకు రాజీనామా నిచ్చినది; సార్వభౌముని జన్మదినబిరుదావళిలో తనకీయబడిన కెయిజరిహిందీపతకమును నిరాకరించినది. అమెకు మాధన్యవాదములు.

# విషయసూచిక

# వ్యాసరచనయందు పోటీ పరీక్ష

## స్త్రీలకు మాత్రము

వ్యాసవిషయము 'బాల్యవివాహముల'ను గూర్చి. వ్యాసము ఫూల్ స్కేపు సైజున 10 పుటలకు మించకూడదు. పరీక్షకులు 'ఆర్య యువకసమితి, యలమర్రు, కృష్ణాజిల్లా.' ఈ వ్యాసరచన పోటీ పరీక్షయందు ఆంధ్ర స్త్రీలెల్లరు పాల్గొనవచ్చును. వ్యాసములు పరీక్షకులకు ఆగష్టు 20-వ తేదీలోపుగ పంపవలెను. పోటీలో జయముగాంచినవారికి మొదటి ముగ్గురకు బహుమతులీయబడును. మొదటి బహుమానము రు 5/- విలువగల గ్రంథములును; రెండవ బహుమానము రు 3/- విలువగల గ్రంథములును; మూడవ బహుమానము రు 2/- విలువగల గ్రంథములును ఈయబడును." అని ప్రచురింపవలసినదిగా కృష్ణాజిల్లా యలమర్రు నివాసులును, స్త్రీజన శ్రేయోభిలాషులును నగు గద్దే లింగయ్యా చౌదరిగారు మాకు వ్రాసినారు.

—సంపాదకుడు.

## జూలై మాసపు చిత్ర ప్రశ్నకు సమాధానము

ఈ క్రింది చందానెంబరుగల చందాదారులు జూలై మాసపు చిత్రప్రశ్నకు సరియగు సమాధానమిచ్చిరి.

152, 166, 276, 334, 336, 532, 591, 642, 723, 726, 728, 733, 745, 792, 800, 808, 863, 993, 1022, 1047, 1111, 1116, 1145, 1178, 1179, 1252, 1266, 1314, 1315.

చిత్రప్రశ్నకు సరియగుసమాధానము "వరాహగిరి."

## జూలై మాసపు యుక్తి లెక్కకు సమాధానము

జూలై మాసపు గృహలక్ష్మిలోని శ్రీయుత ముద్దా విశ్వనాథముగారి యుక్తి లెక్కకు మేము కోరినటుల 10-వ తేదిలోపుగ సరియగు ప్రత్యుత్తరమొసంగినవారి నామములను వరుసక్రమమున దిగువ పేర్కొనుచున్నాము. సరియగు సమాధానము 119.

శ్రీమతులు 1. కొంకెళ్ల సుబ్బులుగారు (11-సం); 2. మందపాటి సీతామహాలక్ష్మియమ్మగారు (11 సం॥, 1-వ ఫారం); 3, చిల్లరిగె కృష్ణాబాయమ్మగారు (11 సం॥); 4. కొలచిన జగదీశ్వరమ్మగారు (10 సం॥, 1-వ ఫారం); 5. కాటంరెడ్డి శ్రీదేవమ్మగారు (9 సం॥); 6. యస్. జయలక్ష్మిగారు (10 సం॥, 6-వ తరగతి); 7. మోటుమర్తి సరోజినీగారు (10 సం॥); 8. ఖండవిల్లి సుబ్బాయమ్మగారు 12 సం॥, 5-వ తరగతి); 9. నాగభూషణమ్మగారు (11 సం॥); 10. బొమ్మదేవర వెంకటనరసమ్మగారు (11 సం॥, 4-వ తరగతి); 11. వంకా సూర్యసరోజినీజయలక్ష్మిగారు (11 సం॥); 12. పాలడుగు వెంకట్రామమ్మగారు (11 సం॥, 5-వ తరగతి) 13. బొప్పన శారదాగారు (11 సం॥ 5-వ తరగతి); 14. చెల్లా శ్యామలాదేవిగారు (9 సం॥ 1-వ ఫారం); 15. పాకల రాజామణిగారు (10 సం॥, 1-వ ఫారం); 16 అ. పి. వెంకటరాఘవలక్ష్మినరసమ్మగారు (11 సం॥); 17. వెన్నేటి అన్నపూర్ణాదేవిగారు (7 సం॥); 18. పుష్పలీల (10. సం॥) 19. భూదేవి (10 సం॥) 20. ప్రమీళా (12 సం॥); 21. కమలమ్మ (9 సం॥ 4-వ తరగతి); శ్రీయుతులు 22. బొమ్మిశెట్టి హనుమంతరావుగారు (11 సం॥); 23. ఎన్. రాఘవాచార్యులుగారు 12 సం॥); 24. తూములూరి జయశంకరరావుగారు (9 సం॥ 5-వ తరగతి); 25. మానేపల్లి లక్ష్మయ్యగారు (12 సం॥); 26. బైరెడ్డి సత్యనారాయణగారు (10 సం॥, 6-వ తరగతి): 27. శ్రీరంగము శేషావతారముగారు (11 సం॥); 28. రావు వెంకటసూర్యరావుగారు (10 సం॥); 29. పెద్దాడ వెంకటనరసింహారావుగారు (11 సం॥ 2-వ ఫారం) 30. ముసునూరి జగన్నాధరావుగారు (11 సం॥); 31. కొడాల వెంకటరాజారావుగారు (11 సం॥, 1-వ ఫారం); 32. అగ్రహారం బాపిరాజుగుప్తాగారు (11 సం॥, 1-వ ఫారం) 33. బి. వి. గురవయ్యగారు (9 సం॥, 3-వ తరగతి).

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI, AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# రజోదర్శిని

తిమ్మసముద్రము

ఆర్యా

28—5—29

"..........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

## ఆర్షరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)




# స్వదేశీవస్తుప్రదర్శనము



మదరాసు మహానగరమున జూలై 15-వ తేదీ నుండి నిన్నటి వఱకు గోఖలేహాలులో స్వదేశీవస్తుప్రదర్శనము జరిగినది. అది జరిపినవారు మదరాసు స్వదేశీ సమితివారు; దానికి ఆహ్వాన సంఘాధ్యక్షులు డాక్టరు యు. రామారావుగారు; ప్రదర్శన ప్రారంభకులు ఆచార్యప్రఫుల్లచంద్రరాయిగారు. ప్రస్తుతము దేశమునందు లభింపగల స్వదేశీవస్తువులు దాదాపు అన్ని రకములును ప్రదర్శన శాల నలంకరించినవి. అఖిలభారతచరఖాసంఘపు తమిళనాడు శాఖవారు పలురకముల ఖద్దరు బట్టలను ప్రదర్శించిరి. చూపబడిన పెక్కురకముల రాట్నములు ప్రదర్శనాగారమునకు వన్నె తెచ్చినవి. మదరాసు పెన్సిలు ఫ్యాక్టరీ వారి పెన్సిళ్లు; దేశబంధు కంపెనీ వారి విలువగల వివిధములగు స్వదేశీవస్తువులు; గాడ్‌రాజు సబ్బులు; బెంగాల్ ఫార్మాటికలు వర్క్సు వారితల నూనెలు, దంతచూర్ణములు, ఇంకను పెక్కువైద్య సాధనములు; రాధాకృష్ణ మాచివర్క్సు వారి నిప్పుపెట్టెలు; కృష్ణవేణి మార్కు సిరాలు; చిత్తూరివారి లోటస్ బేబి తలనూనెలు, మొగము మెరుగులు ఇత్యాది అలంకారద్రవ్యములు; కరీంమార్కు బీడీలు; స్వదేశీమిల్లు బట్టలు, రగ్గులు విరివిగ ప్రదర్శింపబడినవి. ఆంధ్రుని ఆయుర్వేదపాండిత్యమునకును వ్యాపారనైపుణ్యమునకును అమోఘనిదర్శనములగు కేసరిగారి లోధ్ర; నాగేశ్వరరావుగారి అమృతాంజనము; గోపాలాచార్యుల వారి జీవామృతము చక్కగ ప్రదర్శితములై చూడవచ్చిన వారి చూపులను కట్టివైచినవి.

ఇట్టి ప్రదర్శనముల వలన గలుగు లాభములు రెండు. పెక్కు ప్రేక్షకుల నాకర్షించి వారి మనములందు స్వదేశీదీక్షను రేకెత్తించుట యొకటి. విద్యాగంధము లేమి స్వదేశమున తయారగు వస్తువులను గూర్చి కొంచమేని తెలిసికొన జాలని పామర జనులకు ఆ విషయమున తగు జ్ఞానమును ప్రసాదించుట రెండు. పత్రికా వ్యాసములు, ప్లాటుఫారము లెక్చరులు చేయజాలని ప్రబోధమును, కలిగింపజాలని స్వదేశవస్తుప్రేమను స్వదేశవస్తుప్రదర్శనములు చేయజాలును; కలిగింప జాలును.

అయితే ఈ ప్రదర్శనములు ఏడాది కొక్కసారి దేశమున ఎక్కడనో ఒక్క తావున జరిగిన మాత్రమున లాభము విశేషముగ నుండజాలదు. దేశము నందలి వివిధప్రదేశము లందు తఱుచు ఈ ప్రదర్శనములు జరుగు చుండవలయును. కొంచము పెద్దపట్టణము లన్నిటియందును స్వదేశవస్తు ప్రదర్శనశాలనొకదానిని శాశ్వతముగ నెలకొల్పవలయును. ప్రదర్శనశాలలయందే వస్తువిక్రయమునకు ఏర్పాటులు చేయుట మంచిది. మన దేశమునందు వారమున కొకసారి కొన్నికొన్ని ప్రదేశములందు సంతలు జరుగు చుండుటయు, అచ్చట ఆనాడు విశేషమగు వ్యాపారము జరుగుచుండుటయు ఎల్లరెఱింగిన విషయమే. సంతలలో సరకు తీయవచ్చువారు విశేషము పల్లెటూరిప్రజలు. పల్లెటూరిప్రజలకు స్వదేశవస్తువుల నందింపవలయునన్నచో సంతలలో స్వదేశవస్తుప్రదర్శనమునకు విక్రయమునకు పూనుకొన వలయును. విశేషజనముల నాకర్షించు తీర్థములందును, పుణ్యస్థలముల యందును స్వదేశ వస్తు ప్రదర్శనములకు, విక్రయములకు ఏర్పాటులు గావింప బడవలయును. ఇన్ని విధముల జనుల అందుబాటునకు సాగినగాని స్వదేశవస్తువులకు అర్హమగు ప్రచారమిచ్చితి మను కొనుటకు వీలుచాలదు.

మననాయకు లీరహస్యమును గ్రహించినారు; గ్రహించితగు ప్రయత్నములుచేయుచున్నారు. హిందూదేశమునందలి ముఖ్యనగరములలో ప్రముఖస్థానములను వహించుచున్న కలకత్తా, బొంబాయి, మదరాసు నాయకు లీ విషయమై విశేష శ్రద్ధను చూపుచున్నారు. కలకత్తా 135, కానింగు వీధి యందలి స్వదేశీ ప్రచార సమితి ఏమి, బొంబాయి హారన్బీ రోడ్డు నందలి స్వదేశీబీరో ఏమి, మద్రాసు నందలి స్వదేశీలీగు ఏమి ఈ విషయమున ప్రత్యేకకృషి సల్పుటకే ప్రారంభింపబడినవి. ఇతర పట్టణములందు కూడ ఇట్టి సమితులు ప్రారంభమై స్వదేశీవిషయమున సమగ్రప్రచారము, సముచిత ప్రబోధము జరుప బాధ్యత యెఱిగిన ప్రజానాయకులు ప్రయత్నించి దేశకళ్యాణమునకు తోడ్పడుదురు గాక!

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ ! నీవువ్రాసిన దీర్ఘలేఖ చేరినది. నీకుజాబువ్రాయని కారణము నీపై కోపమువచ్చియుగాదు, నీపై ప్రేమ తొలగియుగాదు, నాకు సోమరితనము ఒలిసియుగాదు. నీవు నాజాబున కెదురుజూచుచుందువనియు, వ్రాయకున్న నిష్ఠురవాక్యబాణాహతిచే నన్ను నొప్పింతువనియు నేను మాటిమాటికి తలంచుచునేయున్నాను. నేర మొప్పికొని శిక్షకు సిద్ధపడియున్న అపరాధినే గనుక నీమందలింపులు నాకు వింతగా నుండలేదు. కాని నీవు వేసిన ప్రశ్నాపరంపరలకిక సమాధాన మిాయుటకు యత్నింతును.

"ప్రస్తుత యుద్ధమకారణమున సకలవ్యవహారములు కట్టువడిపోయి మనుజులు సోమరులై పోవుచున్నారు. నీకుగూడ అదే వచ్చినదంటివి." నీవీవిషయమున చాలపొరబడి నావు. ఎందువలననగా నేను నీకు జాబువ్రాయుటకైన కాలమును వెచ్చింపక ఈమాస మంతయు తదేకదీక్షగా నూలువడికితిని. ఈగ్రీష్మఋతువంతయు నిదేవిధముగా సాగించి నచో రెండు కడుచక్కని వడుకునూలుచీరలను నేయించుకొందును. వ్యర్థములైన లేఖారచ నమును కట్టిపెట్టి యిట్టికార్యదీక్ష నవలంబించుట సోమరితనమా? స్వధర్మానుష్ఠానమా? ఇది నాయొక్కదానిమాటయేగాదు. దేశమంతట నిట్టులే వ్యర్థముగా కాలము బుచ్చువారిచే నూలు తీయబడుచున్నది. విద్యార్థులు, సామాన్యజనులు, ఉన్నతోద్యోగులు, పాటకపు జనులు వేయేల స్త్రీలు పురుషులు బాలబాలిక లిదేవిధముగా నూలు వడుకుచున్నారు. వ్యర్థప్రసంగములచేతను నిరుపయోగసంచారములచేతను వ్యర్థమైయుండెడి మానవశక్తి నిజముగా యీఋతువులోనే కొంచెములో కొంచెమైన సద్వినియోగపడినదని చెప్పవచ్చును. ఈవిధముగా భారతీయుల సహజమగు సోమరితనమించుక విచ్చిపోయియుండ దీనినే సోమరి తన మనుట నాకాశ్చర్యమగుచున్నది. "మనదేశమున ప్రతివత్సర మిావేసవిలో ఎన్నిరాజ కీయసభలు, ఎన్ని సారస్వతసభలు, ఎన్ని కళాపరిషత్తులు, ఎన్ని సాంఘికసమావేశములు, ఎన్ని వినోదప్రదర్శనములు. అబ్బా! లెక్కయున్నదా? అసంఖ్యాకముగా జరుగుచుండెడివి! అవియన్నియు నడుగంటినవి సరిగదా! సాధారణముగా జరిగెడి సినీమాలు, సర్కసులు

నాటకములుగూడ లేకుండాపోయినవి. తుట్టతుదకు మన యుష్ణమండలములనుండి యేటేట ఆరోగ్యమునకో, ఆనందమునకో, అధికారప్రాపకమునకో నీలగిరి, బెంగుళూరు ప్రాంతముల కేగెడి విద్యాధికయాత్రికులు దానినిగూడ మానుకున్నారు. ఇట్లు సర్వముకట్టువడిపోయి దేశము నిర్జనారణ్యమువలె చూపట్టుచున్నది. కాబట్టి ఈ మహోద్యమము దేశమునకు శుభస్థితిని చేకూర్చలేదు సరిగదా విశేషించి ఉపద్రవస్థితికి గొనిపోయిన" దని వ్రాసితివి. కల్పలతా! దేశమంతయు నొకేశిక్షాస్థానమై దేశీయు లెల్ల రొకేనేరస్థులై చెఱసాలలే స్వీయగృహంబులై యెల్లరొక్కవిధముగా గాసిలుచుండ నిపుడు వేడుకలకు, వినోదములకు, కథలకు, కబురులకు, వేసవియాత్రలకు అవకాశమెక్కడ? నేడు భారతదేశమందంతట నెచ్చటపై నకనుము. కద్దరుకపడా, చరఖా అవాజ్. ఒక్కటే దృశ్యము. దేశమునకు కావలసినదది. మహాత్ముడు కోరుచున్నదది. ప్రజలు చేయవలసినదది. ఇది ప్రజల కనీస ధర్మము, ఉడుతాభక్తి. దేశహితైకపరాయణులగు మహనీయులు సల్పుచున్న మహాత్యాగముతోగూడిన కార్యవారాశియందిది జలబిందుమాత్రము, అయితే బ్రహ్మాండముయొక్క నిర్మాణము పరమాణువులయొక్క సంయోగముచేతనేగదా?

"మనభారతదేశమునందు స్త్రీలలో త్రాగుడు లేదుగదా. కాన మద్యనిషేధప్రచారమునందు స్త్రీ లేల జోక్యము గల్గించుకొనవలెను. ఇది మిక్కిలి యసమంజసముగానున్నది." యని నీవువేసినప్రశ్న నీవడిగిన పలువిధప్రశ్నలలోకెల్ల నద్భుతముగానున్నది. మనదేశమునందు స్త్రీలలో త్రాగుడులేదను మాటవాస్తవమే. ఎక్కడైన నూటికి కోటికి ఒక్కస్త్రీ తాగుడు మఱిగినదున్నను అదినిషేధప్రచారము చేయతగినంత విశేషవిషయముగాదు. కాని స్త్రీ పురుషుల చేరికచే కుటుంబ మేర్పడుచున్నది. అందు సంపాదించుకొనివచ్చి కుటుంబమును పోషింపవలసిన పురుషుఁడు తన సంపాదనయందు నిత్యము త్రాగుడుకొఱకు కొంతవ్యయపఱచుచున్నచో ఆనష్టము స్త్రీది కాదా? అట్లుగాక పురుషుడు తనసొమ్ము నెట్టిదుర్వ్యయముచేయక జాగ్రత్తపెట్టుచుండినచో దానిలాభము స్త్రీది గాదా. స్త్రీ పురుషుల చేరికచే నేర్పడిన కుటుంబమునందు స్త్రీచేసిన వ్యయము పురుషుని, పురుషుఁడుచేసినవ్యయము స్త్రీని బాధింపకుండుటెట్లు? అదియట్లుండ మద్యమువంటి దుష్పదార్థసేవనముచేగల్గు హాని కేవల మార్థికమునకే సంబంధించినదిగాదు. త్రాగుడు సర్వవిధ భ్రష్టతకు కారణము. ఏస్త్రీయైనను భర్తచే నధికముగా బాధింపబడుచున్నదనుచో నామె త్రాగుబోతువానిభార్యయే యనుట నిక్కము. కావున స్త్రీ స్వయముగా త్రాగకపోయినను మద్యనిషేధయత్న మామెకు గానిపనియనుటకు వీలులేదు. మిత్రమా! దుర్భరమగు ఎట్టి

పన్నులకైన నోర్వవచ్చును. విదేశవస్త్రములనైన హర్షింపవచ్చును. కాని శరీరపోషణ కేమాత్ర మవసరములేనిదియు, నైతికముగా విశేష హానిని గల్గించునదియు, దుర్భరదారి ద్ర్యకారణమునునగు త్రాగుడుమాత్రము వాంఛింపదగినదికాదు. విదేశవస్తువులవల్లగాని, పన్నులవల్లగాని మనుష్యునకు గల్గెడిహాని ధనలోపము మాత్రమే; కాని మధుపానరతిచే మానవుల మనుష్యత్వమే నశించిపోవును. మధుసేవకుల కుటుంబములు నరకసమములు. ఇట్లు వ్రాయుటచే విదేశవస్తువులనుగాని, అధికమగుపన్నులను గాని హర్షించుచున్నానని భ్రమపడు చుంటివేమో? అదిగాదు. జలగలు రక్తమును పీల్చినచందమున నిరంతరము భారతీయుల ద్రవ్యమును పీల్చివేయుచున్న విదేశపుసరుకులును, పేదభారతీయుడు భరింపజాలని యధికపు పన్నులును నెంతతగ్గిన భారత దేశమునకంత శ్రేయము; కాని త్రాగుడుకును వీనికిని పోల్చిన-చో వీనికంటె త్రాగుడువలని నష్టమే యధికతమమని రూపించుటకే యట్లు పల్కితిని.

త్రాగుబోతువానిభార్య కూలివానిపెండ్లామగుగాక, జమీందారునిఇల్లాలగుగాక ఆమెదుఃఖము వివరింపరానిది. ఇఁక నామె సంతానవతియేయగునేని నాదుస్థితి వర్ణించుటకే శక్యముగాదు. ఈసందర్భమున ఒకవృత్తాంతము జ్ఞాపకమువచ్చుచున్నది. అది యిప్పట్టున వివరించుట అప్రస్తుతప్రశంస కాదనుకొందును. ఇప్పటికి కొన్నియేండ్లయినది. ఒకనాడు నేనొక త్రాగుబోతుకథను నా ప్రియస్నేహితురాండ్రలో నొకామెకు చదివి వినిపించుట తటస్థించెను. ఆమె ఆకథను చదువుమని కోరుటచేతనే నేను చదువుటకు పూనుకొంటిని. నేను చదువుచుంటిని. ఆమె వినుచుండెను. ఆకథలో త్రాగుబోతుభర్తవలన నాతనిపత్ని పడెడిబాధలు వినినకొలది నామిత్రురాలివదనము వివర్ణమై మ్లానమై పోవుచుండెను. ఆకథా సందర్భములు మిక్కిలి జాలికరముగానుండి నాకు చదువుటకుగూడ నోరాడకుండునంతటి దుఃఖమును గల్గించుచుండుటచే కథానాయకియందలి కనికరముచేతనే నామిత్రురాలట్లు విచారపడుచుండెననుకొంటిని. కథలో మితిమించిన పెనిమిటిత్రాగుడుచే నాకుటుంబిని నిర్ధనురాలగుటయు, అవ్యక్తులగు నామెబిడ్డ లదిగావలయు నిదిగావలయునని తల్లిని పీడించుటయు, ఆమె వారివాంఛితము నీడేర్పజాలక దుఃఖించుటయు గలభాగమువచ్చెను. మిక్కిలి జాలిగొలుపు నాపట్టును దుఃఖావరోధముచే వడివడిగా జదువజాలక ఆపి, ఆపి చదువుచున్న నేనొకమాటకస్మాత్తుగా తలయెత్తి నామిత్రురాలివంక చూచితిని. ఏమి చెప్పుదు నప్పటిదృశ్యము? నామిత్రురాలి కన్గవలనుండి సంతతధారగా బాష్పములు స్రవించుచుండెను. ఆకన్నీటిధారలు చూడగనే నాగుండె లవిసిపోయెను. అంతనేను నామిత్రురాలితో "రుక్మిణీ! ఇదేమి ఇట్లాపడుచున్నావు? కల్పితగాథలు సత్యములని భావించు

చున్నావా? ఏమి? ఎక్కే ఏడ్చుచున్నావు; కథచదవడం మానివేస్తా"నంటిని. "నిత్యము అనుభవములోనున్న కష్టములు, దుఃఖములు నీవు చదువుట మానివేస్తేమాత్రము తొలుగుతాయా? కథఆపవద్దు. శారదా! చదువుము. చదువుము." అని నామిత్రురాలు దుఃఖగద్గదకంఠగు స్వరముతో బల్కెను. నాచే మిక్కిలి యదృష్టశాలినియని భావింపఁబడుచున్న నామిత్రురాలి జీవితమింత దుఃఖభాజనమైనదని యాకస్మికముగా దెలియుటచే నేను నివ్వెఱ జెందితిని. నేనెప్పుడును ఊహింపని యొక రహస్యము నాపుస్తకమట్లువిచిత్రముగా బయటపెట్టెను. నా కికకథ చదువుటకు బుద్ధిపుట్టలేదు. చేతిలోని పాత్రమును క్రిందవేసి నామిత్రురాలినోదార్చుచు "రుక్మిణీ! నీపెనిమిటికట్టి దురభ్యాసమున్నదా? ఒకనాడును చెప్పకపోతివి." అంటిని. "ఏమొగముపెట్టుకొని చెప్పను? బి. యే చదువుచుండగానే సారాదేవత మాయిల్లు నాక్రమించినది. ఆనాటినుండి యీనాటివఱకు ఆసారాదేవత వలన నేను పడుచున్న క్లేశములకు మితిలేదు. నేనొక్కదానినైతే ఎట్లాగో తినో, తినకో. ఏడుస్తును. కడుపులో కాళ్లుముడిచి పెట్టుకొని పడుకోకుండా పిల్లలు నల్గురు. తెల్లవాఱిలేచినదిమొదలు యెన్నివిధముల తంటాలు. ఇంటికర్చునిమిత్తము నాచేతిలోకొక్కొక్కరూకరాలుట కెంతయో శ్రమ. కాని ఆసీమ సారాయములు నడిచప్పుడు లేకుండా వందలకొలది రూప్యములను కబళించి వేస్తుంటాయి. సొగసైన మాదిరులలో అందమైన బిరడాలతో మాబీరువలనలంకరించే ఆనిర్జీవపుసీసాలలో తమ్ముకొన్నయజమానునేగాక కుటుంబాలు కుటుంబాలుకూల్చి వేసే అద్భుతశక్తివున్నది. శారదా! నీవాకథ చదువుటచే నాకథయే నాకు జ్ఞాపకమువచ్చి యింత దుఃఖమువచ్చినది. ఏమిచేయను? ఆపుకోలేకపోయినాను అని నామిత్రురాలు మరల నధికముగా విలపించెను. కల్పలతా! నామిత్రురాలు పేదరాలుగాదు. గొప్పయింటిబిడ్డ. మంచివిద్యావతి. ఆమె యొద్ద లెప్పై విలువగల నగలున్నవి. ఆమె కట్టుకున్నది బెంగళూరుపట్టుచీర. ఆమెపెనిమిటి విద్యాధికుఁడు. ఉన్నతోద్యోగి. పైకిచూచువారి కామె గొప్పయదృష్టశాలిని వలెనేగాన్పించును. అయిననేమి? భర్తయలవాటుపడియున్న సీమసారాయము లామె నెంతపరితప్తమానసనుగా జేయుచున్నవో కనుము.

త్రాగుబోతుదనముచే శ్రీమంతులైనవారిస్థితియే యిట్లుండ ఇకపేదకుటుంబినులనిది యెంతదుఃఖపెట్టుచున్నదో చెప్పవలసినదేమి? పేదవారల పూరిగుడిసెల నొకపరిచూడుము. ఎప్పుడును ఆడుదానికంటె మగవానికి కూలియెక్కువ. అయితే ఆడుదానికూలి యింటికి జేరినట్టు మగవానికూలిచేరదు. అది ముక్కాలు మువ్వీసము కల్లంగడికే. ఒక్క ఆడుదాని కూలి కుటుంబపోషణకు చాలదు. మగవానికూలి కల్లుపాలవును. అట్టిచో ప్రొద్దున ప్రాచిమొగాన పాటుకువెళ్లి చేతిబిడ్డను చెట్టుకొమ్మకుగట్టినగుడ్డఉయ్యాలలో పడవేసి యెడపిల్లలను కంచెల వెంబడి కట్టలవెంబడి తిరుగవిడిచి పగలెల్ల కష్టపడిన ఆపేదరాలి క్షోభ

యెట్లుండునో చెప్పవలెనా? అది యటుండ ఆ చాలియుచాలని గంజియైన త్రాగుదుమని నమ్మకములేదు. తప్పదాగిన ఆధూర్తుడు అకస్మాత్తుగావచ్చి యింటిమీదపడి ఆగమునకు దొరకొనును. పెండ్లామును చావమోదును. బిడ్డలను జావమోదును. కూటికుండలు బోర్లదోయును. ఇంక ఆనోటి కడ్డదిడ్డములులేవు. వినరానిబూతులు. అట్లు ఇంటికిరాక పోయినా? కంచెలోనో కంపలోనో పడినాడనియో, రోడ్డుమీద దొర్లుచుండగా కానిస్టేబులు స్టేషనుకు యీడ్చుకొనిపోయినాడనియో కబురు. వానికొఱకు మరల పెండ్లాముపరుగు. ఏఱాయియైననేమి పండ్లూడగొట్టుకొనుటకన్నట్టుగా సంసారములోని శాంతిని చెఱచుట కేయల్లరియైనను నొక్కటేగదా?

మిత్రమా! సాయంత్రపువేళ పేదవారి గుడిసెల దెసకేగి చూచితిమా ఇప్పగిది మద్యదేవతకు బలియై క్షోభిల్లెడి సంసారములెన్నియో హృదయవిదారకముగా గనసగును.

అంతదూరముపోనేల? మాపనిమనిషి మగఁడును, దొడ్డినూడ్చుదాని మగడును ఇద్దఱు త్రాగుబోతులే. తమభర్తల దుర్వృత్తినిగూర్చి దినదినము వారు పెట్టెడిఘోష విన శక్యముగాదు. వాళ్లు చెప్పి చెప్పి, యేడ్చి యేడ్చి తుదకు తమనెలజీతము తమమగమని షికి మాత్రమీయవద్దని చెప్పుచుందురు. అటులనేయని నేనెన్నఁడును వాళ్లభర్తల పర ముగా జీతమీయను. కల్పలతా! త్రాగుడు పేదస్త్రీలను, ధనికస్త్రీలనుగూడ నిన్నివిధ ములు హింసించుచుండ నిషేధప్రచారము స్త్రీలకావశ్యకములేదని యెట్లుచెప్పనగును? మిత్రమా! నిజముగా త్రాగుబోతులు త్రాగుచున్నది భార్య, బిడ్డల రక్తముగాని మద్యము గాదు. దొరతనమువారి మహౌదార్యమువలనగాని మహాత్ములైనవారి నిరంతరకృషివలన గాని మద్యమును నిషేధించుభాగ్యము మన భారతదేశమునకు గల్గెనేని మనస్త్రీల పుణ్యము ఫలించినదనియే చెప్పవలయును.

గతవత్సరము దొరతనమువారు మన చెన్నరాజధానియందు కొన్నిలక్ష (నాల్గు లక్షలని జ్ఞాపకము) లొసగి మద్యనిషేధకప్రచారకసంఘములు నెలకొల్పినపుడు త్రాగు బోతుపతులచే వెతలబడుసతుల యాపదలు తీఱెడిభాగ్యము లభించెనని యెంతయోసంతసిం చితిని. అయితే ఆ టెంపరెన్సుకమిటీ లింకను జీవించియుండగనే అదేప్రచారమునకు పూను కొనిన అసంఖ్యాకభారతీయనరనారీమణులు చెఱసాలలలో ముఱుగుచున్నారు. పరస్పర విరుద్ధమైన యీకార్యమునకు హేతు వగమ్యముగానున్నది. దొరతనమువారికె మద్యపాన మిష్టమా? అయితే ఆ టెంపరెన్సుకమిటీల కర్థమేమి? మద్యనిషేధ మిష్టమా? అయితే ఇంతమంది దేశభక్తులు కారాగృహనిబద్ధులు కానేల? మద్యనిషేధమును బోధించినందు లకై యింతమంది దేశభక్తులు నిబద్ధులగుటజూడ "మద్యనిషేధమునకేర్పఱచిన టెంప రెన్సుకమిటీలు మీ కండ్లనీరుదుడుచుటకై యేర్పడినవేగాని నిజమైనప్రచారమునకుగాదు. మీ నైతికవిచ్ఛిత్తితో మాకుపనిలేదు. మీ సంఘక్షీణతను మేము పరికింపము. మీ

దార్రిద్రస్థితితో మాకు సంబంధములేదు. మీ దేహారోగ్యముతో మాకు నిమిత్తములేదు. మీ పెండ్లాముబిడ్డల ఘోషతో మాకగత్యములేదు. మాకుకావలసినది డబ్బు. డబ్బు డబ్బు. మద్యనిషేధమున కంగీకరించి మా కోట్లకొలదిధనమున కోల్పోవజాలము." అని ప్రభుత్వము ఖండితముగా చెప్పుచున్నట్లున్నది. ప్రజల నింతబలవంతపఱచి త్రాగించినను యీ మద్యపానమువలన మనుష్యున కేకొంచెమైన ప్రయోజనముగలదా? ఆకలితీరునా? ఆరోగ్యవర్ధకమా? తుదకు జిహ్వకైన నింపుగూర్చునా? ఏదియులేదు. త్రాగుబోతుకు మనస్సు నిలుకడలేదు. మాట నిలుకడలేదు. శరీరములో సత్వములేదు. నైతికముగా, సాంఘికముగా, ఆర్థికముగా, శారీరకముగా వాడు భ్రష్టుండై పోవును. వానితోబాటు వానిభార్యయు బిడ్డలునుగూడ వివిధకష్టములకుగుఱియై దురపిల్లుదురు. సారాదేవత ప్రవేశించినయింట ఆనందమునకు తావులేదు. సుఖమునకు తావులేదు. పెద్దమ్మయొక్క ప్రభావము శల్యావశిష్టులగు నాయింటివారి సుఖములమీదను, సర్వశూన్యమైన యాయింటి యందలి నలుమూలలను పొడకట్టుచుండును. కల్పలతా! ఈసందర్భమున 'ఆరోగ్యప్రకాశిక' లో సారాదేవత పలికినపలుకులు ఎంతయు వినదగినవిగానున్నవి. అందిటున్నది.

"ప్రపంచమున మనుష్యులను చంపుటలో అనగా హత్యనేరముచేయుటలో నన్ను మించినవారు మఱెవ్వరునులేరు.

ప్రపంచమున నిదివరకుజరిగిన యుద్ధములన్నిటిలోను చంపబడినవారిమొత్తము సంఖ్యకంటె నాచేచంపబడినవారిమొత్తము సంఖ్యయే మిక్కిలి హెచ్చుగానుండును.

నేను మనుష్యులను పశువులక్రింద మార్చితిని. నేను కోట్లకొలదికుటుంబముల సౌఖ్యమును రూపుమాపి కష్టములనే అనుభవించునటుల చేసితిని. కోట్లకొలదిమనుష్యుల అధోగతికికొనిపోవునట్టి దారిని సరిచేయుచుందును.

నేను బలవంతులను బలహీనులనుగా చేయుదును. బలహీనులను అంతమొందించెదను. నేనిదివరకు యెన్నికోట్లమందినో పాడుచేసితిని. ఇంకను యెన్నికోట్లమందినో పాడుచేయుటకు ప్రయత్నించెదను. నాపేరే సారాదేవత."

మిత్రమా! 'ఆరోగ్యప్రకాశిక'లో ప్రచురింపబడిన గిబ్బనుదొరగారి యీమహావాక్యములను చదివినప్పుడు "ప్రపంచములో నాచే దుఃఖింపబడినంతమంది పతివ్రతలు మరి దేనిచేతను దుఃఖపడలేదు." అనువాక్యమునుగూడ చేర్చిన బాగుండుననుకొంటిని. కల్పలతా! అది సత్యముగదా? పరమేశ్వరానుగ్రహమువలన మద్యనిషేధప్రచారము మనదేశమున శీఘ్రకాలములో ఫలించుగాక! మనస్త్రీల దుఃఖములు నివారణమగుగాకయని వాంఛించెదను. కల్పలతా! ఇప్పటికిని మద్యనిషేధప్రచారముతో స్త్రీలకు సంబంధము లేదనియే తలంతువా?

—శారద.

# చిన్న చూపు

## శ్రీమతి జానకీపురుషోత్తంగారు

### ౧

"అమ్మా, ఓమారిట్లావస్తావు" అన్నాడు గంగాధరరావు ఈజీచైరులోకూర్చుని ఉత్తరాలుచూసుకుంటూ,

"ఎందుకురా, నాయనా! పిల్చావుః టపావచ్చిందా ఏమిటిః"

"అవునమ్మా! బావ ఉత్తరంవ్రాశాడు. శ్యామల, పిల్లవాడు వస్తారట రేపుఉదయంరైలులో. స్టేషనుదాకా వెళ్ళవలసిఉంటుంది."

"అయితే ఆయనకూడా రావటంలేదూః పిల్లనొక్కర్తెను ఎట్లాపంపుతాడుః"

"లేదు. అతనురాడట. పనులేవో ఉన్నాయట. ఎరుగున్నవాళ్లెవరోవస్తూంటే శ్యామలనుపంపుతున్నాట్ట."

"సరే, అద్దైనావస్తోంది. పిల్లవాడు ఎల్లాగవున్నాడోయేమోః ఆమధ్య కాకితాకిందన్నారు."

"అంతాకులాసా అనేవున్నది ఉత్తరంలో. వస్తున్నారుగా రేపుప్రొద్దున."

"పదిరోజులపాటైనా వుంటామని వున్నదా ఉత్తరంలో."

"ఆఁఉంటుందిట. అక్కడ అతని మేనత్తగడుపుతుందిట."

"నాకు సావకాశంలేదు అయిదునిమిషాలు నిలుచోడానికైనా. పొయిమీద వస్తువుమాడిపోతుంది. అయితే అబ్బాయి! రేపు వెడతావుగా రైలుదగ్గరకి."

"వెడతానమ్మా! అంతా తొందరే. కావలసినంత టైముంది. ఇప్పటినుంచీ ఎందుకు ఆలోచన."

"అందుక్కాదురా, అబ్బాయి! నా ఆదుర్దానాది, ఎన్నాళ్లో అయింది దాన్నిచూచి."

"అవును, కాదూ మరి, క్రిందటి సంక్రాంతి కాయె చూచింది...సరే వెళ్లి పనిచూసుకో."

### ౨

తొమ్మిదిన్నరైంది గడియారంలో. తలవాకిట తలుపుతెరచిపెట్టి లక్ష్మమ్మ మాటిమాటికివచ్చి తొంగిచూసిపోతోంది. త్రోవనుపోయే ప్రతిబండి తమయింటికేనని. అందులో శ్యామల పిల్లవాడుకూడావున్నారని ఆమెభ్రమ.........

పదిగంటలకి శ్యామలవచ్చింది. పిల్లవాడుకూడావున్నాడు వెంట. లక్ష్మమ్మగారు మడికట్టుకున్నాననే మాట మరచిపోయి ఉత్సాహంతో మనుమడిని అమాంతం ఎత్తుకుని ఒకపాతిక ముద్దులు గుమ్మరించింది. తరువాత గూతుర్నిగూడా స్పర్శించి "యిట్లాఅయిపోయినావేః ఇదివరకున్న ఎంతనల్లబడ్డావు. అదిగో కళ్లలో బొత్తిగా నెత్తురుచుక్కన్న మాటేలేదు." అని యిత్యాదివాక్యాలతో ఆహ్వానిస్తుండగా గంగాధరరావు

వచ్చి "అమ్మా! మరీచాదస్తానపడి పోతున్నావేం? వచ్చింది. పదిరోజులుంటుందిగా. అంతతాపత్రయం ఒక్కసారేనా? మైలపడితివి. వంటఏమైపోయిందో వెళ్లుచప్పున." అన్నాడు.

"ఏమోరా నాయనా! మతిఉండడంలేదుబొత్తిగా. పోతున్నా. ఆగుడ్డలువిడిచి నీళ్లుపోసుకో అమ్మాయి! అయితే పిల్లవాడికి తలంటిపోస్తావా?"

"ఈ వేళ కాదు, రేపుపోస్తాను. నీవువెళ్లి వంటపనిచూడు......అయితే ఒదిసెక్కడ? ..."

లక్ష్మమ్మగారు రెండుచేతులునెత్తిన కొట్టుకుని ప్రక్కనున్న గదివైపు పళ్లుబిగించి చూపిస్తూ, బిగ్గరగా వినపడకుండా ఏమిటో గొణిగింది.

"సరే. మామూలేగా. క్రొత్తేముంది. వెళ్లు"......అని శ్యామల గదిద్వారందాటి లోపలకి వెళ్లింది. మంచంమీద అడ్డంగా ముసుగుపెట్టుకుని పడుకుంది సావిత్రి. అందుచేత శ్యామల దగ్గరగావెళ్లి "వదినా! వదినా" అన్నది.........

"నువ్వా? అప్పుడేశైలువచ్చిందీ? ఏమిటోవొళ్లే తెలియడంలేదు..."

"వొంట్లోఏమిటి? వదినా! ఎన్నాళ్లనుంచీ? అన్నయ్య, అమ్మ ఎవరూ చెప్పేరేకారేం?."

"ఆఁ...వాళ్లకేంపట్టింది నాసంగతి? నన్నొకమనిషిగా యెంచుతున్నారా వాళ్లు? లేకపోతే నేనూ లోకంతోపాటేవుందును."

"వొంట్లోఏమిటి, జబ్బు"?

"ఏమనిచెప్పను? ఒకటైతే అనుకోవచ్చు. ఏమిటో ఒళ్లంతానొప్పులు, కాళ్లుమంట, చేతులునొప్పి, ఒకక్షణంలేస్తే కళ్లుతిరుగుతై. రవ్వంతపని ఏమన్నాచేస్తే ఎంతో అలుసువచ్చి ఉక్కిరిబిక్కిరి అవుతాను... మరి తిన్నదంతా ఏమైపోతోందో?"

"మరి మందూ అదీ ఏమీ పుచ్చుకోడంలేదూ?"

"ఎందుకడుగుతావు, అటువంటివి. ఎవరికైనా నాసంగతి కావలస్తేగా? పోనీ నాలికకు హితవుగా ఉండేపదార్థాలు తిందామనుకున్నాగాని వీల్లేదాయె. ఏమడుగుతావు నాపని. ఉంటే వున్నవాళ్లల్లోనూ జతగాను, పోతే పోయినవాళ్లల్లోనూ జతగాను, ఇట్లావుంది."

"ఇస్సె....ఏంకష్టాలమ్మా......పిల్లాడెక్కడ?"

"నాకుతోడు వాడొకడు. ఇంతపెద్దదాన్ని నాపనే యిల్లాగుంటే వాడ్నిగూర్చి వేరేచెప్పాలా? రోజు రోజుకూ ఎండుకొస్తున్నాడు. నాలుగోయేడన్నమాటేగాని ఏడాదిపిల్లవాడల్లే వున్నాడు. పాపమేది? పైగా అంతాకొట్టడము, తిట్టడమూను. మనపిల్లాడు—అనేలక్ష్యం అభిమానమూ వుంటేగా?......ఇందాకవరకూ నీకోసం కలవరించేడు. ఇప్పుడే ప్రక్కింటివారింటికి కాబోలు వెళ్లేడు...నీపిల్లాడు ఎల్లావున్నాడు?"

"ఆఁ...సరిగానేవున్నాడు...బాగానేవుంది..."

"సరే. స్నానంకానీ, ఆలస్యమెందుకు?"

"నువ్వులేవక"—అంటూ సావిత్రితత్వం, తరహా అంతా పూర్వంనుంచీ యెరుగున్న శ్యామల లోలోపల నవ్వుకుంటూ గదిలోంచి వెళ్లింది.

## 3

మధ్యాహ్నం సావిట్లోకూర్చుని పత్తివొత్తులు చేస్తోంది లక్ష్మమ్మగారు. దూరంగా మంచంమీద శ్యామల మేలుకొనే పడుకుంది. పిల్లవాళ్లిద్దరూ కేకలువేస్తూ ఆడుకుంటున్నారు.

ఉన్నట్టుండి లక్ష్మమ్మగారు "సావిత్రీ!—ఓ సావిత్రీ!—ఓ సావిత్రమ్మా!...అబ్బే, అంతమాత్రంలో వినబడితే యెట్లా?......ఓసావిత్రీ! తేచికాఫీకి నీళ్లు పెట్టదూ కాస్త, పిల్లవాడు యేడుస్తాడో, యేమో"—అన్నది.

పైపెలుపుల్లో ఒకదానికి ప్రత్యుత్తరం రాలేదు. అయిదునిముషాలైన తర్వాత లక్ష్మమ్మ గది తలుపు త్రోసి—

"అమ్మాయి, సావిత్రీ! ఏమినిద్దరే? ఇరవై నాలుగుగంటలూ నిద్దరే, దరిద్రం, అట్లా వచ్చి అడబిడ్డతో మాట్లాడరాదా? కాఫీకి నీళ్లు పెట్టమంటే వినిపించుకోరాదా? నేను మడిలో చస్తిని—కాస్త మాట వినకపోతే యెట్లా యేడవనే? అమ్మాయీ!" అని దీర్ఘంతీసింది.

"ఏం, మావాళ్లు నాకేం కాఫీలు అవి చెయ్యడం నేర్ప లేదు. అవన్నీ తెలిసిన కోడల్ని చేసుకోక పోయినారూ? పెట్టూ, పెట్టూ అంటే ఎట్లా పెడుతాను. నాచేతకాదు. అదీగాక అస్తమానం పనిచెయ్యాలి సుండే, ఒక్కక్షణం తలనొప్పిగావుండి పడుకుంటే ఉసూరుమనడమాయె, చావమన్నారాయేం? నాకింత కన్న చేతకాదు. మీరు నాకు చేసేదానికి నేచేసేది చాల్లెండి. అంత చాలకపోతే మరొక కోడల్ని-చేయ కలిగినదాన్ని—తెచ్చుకోవచ్చు."

"ఎందుకే, అట్లా ప్రతిమాటు అర్థంలేకుండా మాట్లాడుతావు? శాణాతనం నేర్చావు, మహా. ఎక్కడికిపోతై బుద్ధులు. ఆతల్లికూతురివికావు. రాజ్యాలు ఏలగలరే అమ్మా! వచ్చినప్పటినుంచీ చూస్తాను. ఎప్పుడూ ఒకేరీతిగా ఉంది నీ ప్రవర్తన; ఈ నాలుగేళ్లనుంచి నేపడే అవస్థ పరమాత్ముడికి తెలుసు; ఏమో చిన్నపిల్లవు; ఈ రోజుకాకపోతే రేపో మాపో నేర్చుకుంటావు; నీవే సరిగా వుంటావని అనుకుంటున్నాగాని, యిట్లా పొగలబడి పోతావని, దుమ్మెత్తి పోస్తావని, కొయ్యలమారికోండవి అవుతావని, తవ్వెలమారితడికవవుతావని కల్లోనైనా అనుకోలేదే, అమ్మా!......ఏమియిదిగావుందే నీపని. పోనీ నేనంటే సరే, వాడంటేనూ లేదాయెలక్ష్యం. పురుగుల్ని విసిరికొట్టినట్టుగా ఛలిపేస్తావు యిద్దర్నీగూడాను. ఏదోపోనీ పిల్ల యింటికి వచ్చిందికదా రెండురోజులైనా సంతోషంగా వుందామంటే నీవైజంమానవా......"

"చాలు, చాలు. ఆపాళాన నోరుముయ్యండి. నేర్చుకపోయినారు. ప్రతిదానికి యిల్లుఎగిరిపోయేటట్లు కేకలేస్తారు. నాతో అట్లేమాట్లాడబోకండి. వొళ్లుమండుతుంది..."

"ఆం. ఆం. చూశావా, శ్యామలా! మీవొదినె యెంతదైందో. నేను నోరు మూసుకోవాలిట. ఎంతమాట, ఎంతమాట. అత్తంటే లక్ష్యమున్నదానివేనానువ్వు? నీతల్లియిల్లాగే పెంచిందా?......ఏముంది అన్నిటికి తెగించినదానికి... వాడురానీ చెప్తా యిదంతా. ఏమిటో తేలాలి......" అంటూ లక్ష్మమ్మగారు కళ్లనీళ్లపర్యంతం తెచ్చుకొని వంటింట్లోకి వెళ్లింది.

## ౪

"అబ్బాయి, గంగాధరం! ఇక ఒక్కక్షణం దీనితో వేగడందుర్లభం. కానివూళ్లో కష్టాలెమ్మైనా బ్రతకవచ్చు. ఇట్లావుండలేంబాబు. బ్రతికుండగానే పీక్కుతింటోంది. అడ్డమైన మాటలు, యిష్టంవచ్చినట్లు కూస్తోంది. అమ్మలక్కలందరూ నన్ను దుయ్యబట్టుకుంటున్నారు......ఒక్కవిషయంలో గోరంత సహాయ్యం లేక పోగా అడుగడుక్కీ దెప్పడం, సాధించడం, దుమ్మెత్తి పొయ్యడం. పోనీ నీవన్నా

అంతమాత్రంగా నేవుంది లక్ష్యం. మొన్న సహా చూడలేదూ? కోటుకుట్టవేఅంటే ఎల్లాగు మొహాన పారేసిందో. గుండెలు ఆర్చుకు పోతున్నైరా అబ్బాయి! ఇష్షో."

"ఎందుకమ్మా! పదిసార్లు అనుకోవడంకూడాను. ఏమన్నా లాభముంది గనుకనా? అట్లావిరగబడి పోతోంది. మరి ఏంచూసుకున్న గర్వమో? పుట్టింటికితోలేస్తే తెలుస్తుంది, గుప్పెడు మెతుకులకికూడా గతి లేదు."

"ఇప్పుడదేగా దాని పట్టుదల. అక్కడే మున్నదనే ఆలోచన దానికేదీ? పుట్టింటికి పంపించండి, అక్కడ ఉంటాను. వాళ్లు, వీళ్లు, ఎంత కాలంపుట్టిళ్లల్లో వుండడంలేదు.—అని దానిపంతం".

"ఏమో, నాకేమీ తోచకుండా వుంది, పుట్టింట్లో ఎన్నాళ్లని వుండనీయగలం? లోకానికేనా వెరవద్దూ?......... అబ్బబ్బ, ప్రాణసంకటంగా వుందమ్మా! పెళ్లాం కాదు. పెటాకులు. ఉండేం, ఊడేం ...ఏమోలే. ఇంతకు కర్మం—వడ్డించు కచ్చేరీకి వేళైంది, పోవాలీ..."

"అట్లాగే, నాయనా! స్నానంకానీ......సావిత్రీ! ఎక్కడే? సావిత్రీ!...వీలుగావుంటే పీట, విస్తరివేస్తావూవచ్చి......"

"వీలుగాకేం? నాకెప్పుడూ వీలే. మరొకరికంటె వీలుండదుగానీ. ....."

కొంతకాలము గడచిపోయినది.

"ఏమే? సావిత్రీ! పదినిముసాములైంది. రావేమీ వాడి కచ్చేరికి వేళ అయింది..."

"ఛీ, పాడుబ్రతుకు, తలనొప్పితోచస్తూంటే పలుకరించే దిక్కేనాలేదు. పైగా అవి చెయ్యలేదు, ఇవిచేయ్యలేదు...వెళ్లి చేసే మహాఉద్యోగంమండిపోతోంది......వేళైంది, వేళైంది..."

"ఇంత పనికిరాదే, అమ్మా! మహాఉద్యోగమా? అదీ లేకపోతే? ఏం, ప్లీడరుగుమాస్తాపని మాత్రం ఊర్కేవుందా? తెలివి తేటలుంటే అందులోనే సంపాదించవచ్చు......

"అవునవును. కనపడుతోందిగా సంపాదన...ఏమని చెప్పించేరు చదువు...కుంటికోనమ్మల్లే...ఏం ఉద్యోగం? పరువు, ప్రతిష్ట అక్కర్లేదు......గుమాస్తా...ఛీ."

"అవును, మరి మీ వాళ్లంతా తహశ్శీలుదారీ కలెక్టరీ, చేశారుగారూ...

"అవేమీ చెయ్యకపోయినా, కాలుమీద కాలేసుకుని కూర్చున్నారు. పొలాన్నుంచి ధాన్యంవచ్చి వాకిట్లో వాల్తుంది. అదేనా కనబడదాయె యిక్కడ. మోచెయ్యి ఆడితేగాని ముంజెయ్యి ఆడదాయె... ఇంతకూ నాకర్మం, ఈ మహాసంస్థానంలో ఎట్లాగైనా పడక పోతానని ఎంతో ఆదుర్దాపడ్డాడు మా మామయ్య. అప్పుడు ఆలోచన లేదు...కంతానికి ఉరిపోశారు, అన్నివిధాల. తోటివాళ్లంతా సుఖంగావుంటే నాగతియిది."

"అవునమ్మా! కాదుమరి? జమీందారుల పిల్లవాయె. ఇక్కడ వుండలేక ఉడికిపోతున్నావు. చేసేటప్పుడే మీవాళ్లు ఆలోచించుకుంటే పోయేది. మాకర్మం ఏలాగుంటే అట్లాఅయేది......"

"అవునవును, కాదుమరి? నామూలాన్నైనా బ్రహ్మచర్యం వొదిలింది అబ్బాయిగారికి......"

"నిజమేలే, తల్లీ! నిన్ను పలుకరించడం బుద్ధిపొరపాటునాది..."



శ్రీమతి కమలా నెహ్రూ గారు

*Courtesy of "Triveni"*



పుట్లి కన్య

('మైగ్రెస్' అను ఫిలిమునందు నటించునప్పటి చిత్రము.)

*Courtesy of "The Movie Mirror"*

౨

గదివైపు వసారాలోకూర్చుని సాయంకాలం సావిత్రి జడ వేసుకుంటోంది. శ్యామలకొడుకు గభాలున పరుగెత్తికొంటూవచ్చి నూనెసీసా తన్నేశాడు. భళ్లున సీసా బద్దలై ఆమె చీరంతా నూనెఅయింది. సావిత్రి మండిపడ్డది—"దౌర్భాగ్యపు పిల్లాడా! కళ్లుకనబడ్డంలేదూ? మిడిసిపోతున్నావు. ఏమిటిదంతా సిబ్బంది—" అంటూ పిల్లవాణ్ణి అయిదారు అణిచింది. ఈగల్లంతుకు శ్యామల, లక్ష్మమ్మగారు పరుగెత్తుకు వచ్చేరు. శ్యామల కంటతడిపెట్టి వూరుకుంది. లక్ష్మమ్మగారు గబగబ పిల్లవాణ్ణి ఎత్తుకుని—"ఓ అమ్మ! లేదే, మా నాయన! లేదే; కన్నారి! లేదే," అంటూ సావిత్రిదగ్గరగా వెళ్లి—"ఏమే! బుద్ధిమాలినదానా! వీపుమీద తేలేటట్లు అట్లాకొట్టావు? నీపిల్లవాడంటివాడు కాడు వీడుమాత్రం? ఏదో నాలుగురోజులు వుందామనివస్తే యీలాగు చేస్తావా? అంతయిష్టంలేకపోతే యిష్టంలేనట్లువుండరాదూ? ఏదోచూడక సీసా తన్నినంతమాత్రాన, అట్లా కొడతావా పసివాణ్ణి? పోనీ కంతంపిసికి పారెయ్యకపోయినావు, పీడవొదిలేది......మాట్లాడవేం? ...... ఏమీ తెలియనిదానిలాగు."

"ఆపిల్లవాడు చేసిందెవ్వరికీ కనబడదు. నూనంతా కాస్తలేకుండాపోయింది. చీరపాడైంది... నేను కొట్టిందిమాత్రం కన్పిస్తుంది. కొడితే కొట్టాలెండి. ఆమాత్రం అదుపు పెట్టే అధికారం నాదగ్గరావుంది... లేకపోతే మొదలే పిల్లవాణ్ణి యిక్కడకు రాకుండా జాగ్రత్తపెట్టలేక పోయినారూ."

శ్యామలకు ఏడుపువచ్చింది.—"ఇక్కడకురావడం నా దేపొరబాటు. నీకింతకష్టమెందుకు? నేనే వెళ్తాలే, ఒదినా." అన్నది.

"నేనూ చూస్తున్నాగా... అదివచ్చినదగ్గరనుంచీ మరీ మొదలు. మొన్నసహా నువ్వేదోతింటూ పిల్లాడికేనా రవ్వంత పెట్టలేదు. అదిమాత్రం గ్రహించదా? తెలియదా? వెడుతుందిలే, రాజ్యం అనుభవిద్దువుగాని... రావే శ్యామలా!"...అంటూ లక్ష్మమ్మగారు నిష్క్రమించింది.

సావిత్రికి దోమవాలినట్టైనా లేదు. జడపూర్తిచేసి, ముఖంతోముకుని గదిలో పడకవేసింది. పావు గంట తరువాత శ్యామలవచ్చి—"ఒదినా! ఆసందులో వారింటికి పేరంటానికి వస్తావా వెడదాం? పిల్చి వెళ్లేరుగా, యిందాక."

"ఎందుకు పేరంటానికికూడా, సిగ్గులేక. నాజవాయిరి, నాపట్టుచీరెలు వాళ్లుచూచి ఆనందించేటందుకా?"

"అదేమిటమ్మా! నగలతోను, బట్టలతోను వస్తుందా గౌరవం, మర్యాద? పనివల్ల పలుకువల్ల గాని."

"అందుకే కాబోలు అవన్నీదిగేసుకుని బయల్దేరావు. ప్రక్కన నేను దృష్టిపరిహారార్థంకోసమా రావడం?"

"ఎందుకమ్మా! అట్లామాట్లాడుతావు. నాకు అంతదూరం ఆలోచనపాలేదు. ఇద్దరంకలిసి వెడదాంగదా అనిపిల్చాను. పోనీ యీగొలుసును వ్వేసుకో, యిందు..."

"అక్కర్లే, ఛీ, సిగ్గులేక ఎరువుసొమ్ముగూడాను. ఉంటే పెట్టుకోవాలి, లేకపోతేలేదు. నాకర్మం ఎవరేంజేస్తారు. ఈమహాసంస్థానంలో యిట్లా అనుభవించాలిసివుంటే..."

"పోనీ, ఒదినా! నేను యివన్నీతీసి వేసివస్తాను. బయలుదేరుతావా?"

నాకోసంతియ్యనక్కర్లేదు. నీవువెళ్లు. నేరాను. అయిదోతనంవుండిగూడా అత్తతో సమానంగా..."

శ్యామలవినలేక, చెంగునవెనక్కు తిరిగి వెళ్లిపోయింది.

౬

"ఏమే, దౌర్భాగ్యపుదానా! నీమూలాన నాకంఠం పిసుక్కోవలసివచ్చేటట్టుందేం? నాకుదాపరించావు." అన్నాడు గంగాధరం గదిలో అడుగుపెట్టి.

ముసుగుపెట్టుకునిపడుకున్న సావిత్రి చెంగునలేచి పళ్లుబిగిస్తూ—"ఇదిగో జాగ్రత్తగా మాట్లాడండి... దౌర్భాగ్యం నాకా, మీకా? మీరేమని చేసుకున్నారు దౌర్భాగ్యపుదాన్ని? గతిలేకా? ఇస్తేనేకాని వల్లకాదని మామామయ్యచుట్టూ తిరిగి వేధించి కట్టుకున్నారు. మీరేనాకుదాపరించారుపైగా, లేకపోతే శుభ్రంగా..."

"ఒళ్లుతెలిసి మాట్లాడుతున్నావా? తెలియకుండా మాట్లాడుతున్నావా?"

"బాగా తెలిసే, కావాలనిమాట్లాడుతున్నాను. లేకపోతే ఏమిటి యిదంతా? నాకర్మం..."

"నీమూలాన కోపంవచ్చి శ్యామలవెళ్లిపోతోంది. చూశావా, ఏంబాగుంటుంది?"

"నామూలాన వెళ్లడమెందుకు పైగా నన్ను ఏడిపించడానికివచ్చి? నిన్ననేగా తనకున్ననగలన్నీ పెట్టుకుని నన్ను హేళనచేసింది......పోనీండి వెడితేనాకేం? నన్ను ఉద్ధరిస్తుందా?"

"అర్థంకావడంలేదు. ఏమిటిది? ఎప్పుడు యింతేనువ్వు, నీమాటలు...బుద్ధివుండక్కర్లేదూ?"

"అవును నామాటలెట్లా అర్థమవుతాయి. చదివింది మెట్రిక్లెషన్దాకానేగా. చదువైనా అంటలేదాయె కర్మం"...

"నాచదువుసంగతి నీకెందుకు? మీనాయన మహా బియ్యేప్యాసైనాడా?"

"ప్యాసుకాకపోతేయేం? డబ్బుంది. మనకదీలేదుగా? ఇట్లాగనితెలిస్తే ముందేబాగుండేది నాపని. విద్యావిహీనః—"అన్నారు.

"ఆఁ. ఆఁ. నన్ను పశువు అంటావు? ఫుంఢాకోర్. మరీతెగించిపోతున్నావు. బుద్ధిచెప్తాను..."

"మనకుఁటేగా మరొకరికి చెప్పడానికి..."

ఈమాట గంగాధరరావుకి నసాళమంటేంది. ఇటువంటివి మామూలే అయినా ఈదినం అతనికష్టం, దుఃఖం మితిలేనివై పోయినాయి. కళ్లల్లోకి నీరుతెచ్చుకున్నాడు.

"ఎందుకుపైగా ఆదొంగఏడుపులు? నవ్విపోతారు ఎవరైనా. నన్నిట్లానట్టేట ముంచినవారికి నా ఉసురు కొట్టకపోతుందా?"

"నోరుముయ్."

"మీరేమూసుకోండి. మీరేమీ నన్ననవలసినపనిలేదు. నేనేంపడేదాన్ని కాదు. ఇక ఒక్కక్షణం యిక్కడవుండదలచుకోలేదు. మాయింటికి వెళ్లిపోతాను."

"ఇకెప్పుడూరావా?"

"చదువుకుని బాగా డబ్బుసంపాదించిన తర్వాత కనబడండి. అప్పుడాలోచిస్తాను."

"ఆఁ. ఆఁ. ఫుంఢాకోర్!—"

"అదిగో అట్లామాటలు అనవద్దనే చెప్పేది. జ్ఞాపకంలేదూ? వెడ్తున్నాను, నన్ను మీరేమీ కల్లోనైనా తల్చుకో అక్కర్లేదు!"

"అంతే, అంతే.........అమ్మా! అమ్మా! కొంపలంటించికూడా పోతోందమ్మా! చూడు. చూడు."

# ఆదరణ

## శ్రీమతి కొలచిన జగదీశ్వరమ్మగారు

సాధారణముగా స్త్రీలు ఉత్తములును, సుస్వభావలును. ఇది నిజమే. కాని అదేమి పాపమో కొంచెమాధిక్యతరాగానే బీదవారిని తక్కువగా చూడటము వారి స్వభావముగా కనబడుచున్నది. ఈ స్వభావాల్లో కూడాచాలారకములున్నవి. ఏ శాంతినికేతనానికో, యేమహిళామండలికో, వెళ్లినప్పుడు దేవుడిచ్చిన కండ్లతో నాల్గుమూలల చూడటము తమ ఉన్నతస్థితికి లోపమని ఏకదృష్టితో చూచేవారొకరకము. ఎరిగియున్న వారినిపలుకరించడము గొప్పవారి లక్షణముగాదని పలుకరించకుండనుండే వారొకరకము. ఒక సామాన్యకుటుంబిని ఒక భాగ్యశాలిని యింటికి వెళ్లినప్పుడు వకటి రెండుసార్లొక మాదిరిగా మాట్లాడి తరువాత చూచి చూడనట్లుండి అటుపిమ్మట అసలేమాట్లాడని వారొకరకము. తక్కువస్థితి గలవారైనప్పటికి ఎక్కువ స్థితిగలవారనుకొని బాగామాట్లాడుచు వారిస్థితి తెలిసినవెనుక గప్‌చీప్ అగువారొకరకము. ఇకకాస్త చదివి ఉద్యోగాలలోనుండే మానినీమణులమాట చెప్పశక్యమేగాదు. అప్పుడు సీమనుంచి స్టీమరు దిగిన దొరసానియే తొంబది పాళ్లుమేలు అనిపించును. వారికి ఎదుటిచూపు కనబడదు; ప్రక్కమాట వినిపించదు. అథవా కనపడ్డా పనుల తొందరలలోనున్నట్లు నటించడము. మాట్లాడితే హాయిగా రాణీగారిలాగ మెత్తలువేసిన తిరుగుడుకుర్చీలో కూర్చొనో, శేషశాయిలాగ తల్పముమీదకొరిగో వచ్చినవారిని నిలబెట్టి మాట్లాడటము. తెనుగు మాట్లాడితే చాలానీచమని అట్టి వారి భావన.

ఆహా? ఏమి యీవిచిత్రము? ఇటువంటివారు కొందరు స్త్రీలలో నుండటము నుంచియేకదా స్త్రీలు అల్పులని పురుషులు మనకు పేరిడినది? ఎదుటివారి కష్టములు హాస్యాస్పదములు; కథలు. మనకష్టములు పడలేనివి. మొన్నమొన్ననే ఒక సామాన్య స్త్రీని ఒక ఉన్నతకుటుంబిని పెట్టిన భంగపాటు నాతో చెప్పికొనినది. ఆమె వారింటి కెన్నిసారులో వెళ్లినదట. వెళ్లినప్పుడల్లా పండ్లుమిఠాయి వారిపిల్లలకు తీసికొని వెళ్లేదట. ఆమె ఒకసారి కూడా తమయింటికి రాలేదట. "వారున్నవారు. మనము లేనివారము. సాటిలేదు." అనిమనసు సమాధానపరచుకొన్నదట. తరువాత తరువాత వారింటికివెళ్లి ఎంతసేపు కూర్చున్నను దర్శనభాగ్య మబ్బేదేకాదట. అంత వారిమాట మాణిక్యమై, పలుకు బంగారమైనదట. ఇంక ఏమేమొచెప్పి తమ బీదతనమును గురించి

కండ్ల నీరు పెట్టుకొనినపుడు నా హృదయము కరగి నీరై పోయినది. అయ్యో, ఎంత చెడ్డగుణములు? విద్యావతులును, ఉన్నతకుటుంబినులును యీరీతి ప్రవర్తించిన వారి కన్న తక్కువవారు అదియొకగొప్ప అనితలంచి నేర్చుకొనెదరు.

శ్లో॥ యద్యదాచరతిశ్రేష్ఠ
స్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే
లోక స్తదను వర్తతే

భగవద్గీత III. 21.

అని గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు ఉత్తముఁడనిపించుకొన్నవాఁడేయే కర్మలను జేయునో తక్కువవారును ఆయాకర్మములనే చేయుదురు. అట్టియుత్తముఁడు దేనిని బ్రమాణముగాఁదీసికొనునో లోకమంతయు దానినే ప్రమాణముగాఁ దీసికొని అట్లు ప్రవర్తించుచుండును. గొప్పవారిని చూచి క్రొద్దివారు నేర్చుకొనుట లోకధర్మమై యున్నది. మనయింట్లో వంట, పాచిపనిచేయు స్త్రీలువచ్చినను తగిన ఆదరణ చేసిపంపవలెను గాని నిరాదరణచేయరాదు. బీదవారు, పాపం, గొప్పవారితో మాట్లాడితేనే, స్నేహితముచేస్తేనే, వారిప్రసన్నవీక్షణము సోకితేనేవైకుంఠము వొరిగినట్లు సంతోషించెదరు. నాప్రియసోదరీమణులారా! గర్వమునకు స్వస్తి చెప్పినప్పుడే మనస్సునకు స్థిమితము. "నాశనమునకు గర్వము ముందునడచును" అనిబైబిలులో చెప్పియుండలేదా?

నేను వకమాటు ఆసుపత్రికి వెళ్లితిని. అక్కడ ఇన్‌పేషెంటుగావున్న ధనవతియైన యువతి నాతో ఇటుల చెప్పినది. "చూచారా అండి వీళ్లంతా పాకీవాళ్లు. మాలలు మాదిగలు. మన దొడ్డూడ్చే వాళ్లే వీళ్లు. నాలుగుముక్కలు చదివి ఏనర్సో, ఏడాక్టరో అవుతారు. అక్కడనుంచి టెక్కుటెక్కుమంటూతిరుగుతారు. ఎంతహీనపుకులాలో చూడండి. వాళ్లకుమనం దాసోహమంటూవుండాలి. రోజూ ప్రొద్దునే స్నానంచేసి ఎంతోశుచిగా వుండేదాన్ని. ఏమిటండీ! ఈపాకీకూడు? ఇక్కడి వాళ్లుపిలిస్తే పలకనే పలకరు. నాకు ఇంట్లో కావలసినంత మందినౌకర్లు. నేను ఎంత గొప్పవారికడుపున పుట్టినానో మీకు తెలుసునాఅండి? నాకు ప్రొద్దుట ఆరున్నరకే టిఫిన్, కాఫికావాలి. డాక్టరు డాక్టరని పలవరించినా అతీగతి లేదు. నేను యీరోజేయింటికి వెళ్లిపోతాను" అన్నదామె. ఆమె నిజముగా భాగ్యవతియే. ఇంటికి పోయిన తరువాత ఆమె ఆస్పత్రి లోని వారినందరిని పిలిపించి ఎన్నిసారులో విందొనరించినది. అదిపైడాబు.

ఇది ఆమెలోపల అభిప్రాయము. ఆమె మాటలు నాకెంతో ఆశ్చర్యమును విచారమును కలిగించినవి. ఆమె కొన్నులన్నియు అనుపత్రిలోనే. ముఖమునకు సలాము, వీపునకు మెటికలు. పురుషులు మనలను తక్కువగా చూచుచున్నారనియును, సమముగా చూడవలయుననియు, దేవుడు వారిని సృష్టించినట్లు మనల సృష్టించలేదా అనియును, ఇంకనెన్నియో, యేమేమొ, అనుకొనుచున్నాము. అట్టిచో మనము అందరము స్త్రీలమయ్యు కులమనియును, భాగ్యమనియును, అధికారమనియును, భేదాభిప్రాయములు పెట్టికొని కొంచెపువారిని వంచన చేయుట మంచిదికాదు. పురుషుల ననవేల? ఇంటగెల్చి రచ్చ గెలువమన్నారు. మనలో మనము సర్దుబాట్లు చేసుకొంటే, పురుషులు మన విషయములలో నేలానకున్నారా అని ఆనక విచారించుకోవచ్చును.

...శ్రీమతులారా! ఉద్యోగినులారా! భాగ్యశాలినులారా! ఐశ్వర్యము శాశ్వతమ... ...ఆదరణ శాశ్వతము అనుమాట మరువక మనలోనున్న దుర్గుణములను, తీసివేసి అట్టి మంచి నేర్చుకొనినయెడల అప్పుడుగదా మనము ధన్యలము.

# ప్రణయరథము

## శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

విమలసహస్రకమలక్రమవీథియందు
గోపికాంగనల్ తనచుట్టుగొలిచియుండ
మూడురాగాల శ్రుతులను జోడుగలిపి
పలుకు పలుకునఁదేనియ లొలుకుచుండ
మురళి మ్రోయించు శ్యామలమోహనాంగు
గాంచఁ బోవలె ప్రాణేశు కన్నులలర
నాదురథమును సుపథాన నడుపుమయ్య!
సప్తగిరులను దాటుచు సంతసమున
పంచకోశంబు నేర్పుతో బరగదాఁటి
మూడుగుణములకవ్వలి మూర్తియైన
విశ్వమోహనరాగంబు వీనులలర
గానమొనరించు ప్రాణేశు గాంచఁబోదు
నాదురథమును సుపథాన నడుపుమయ్య!
గాలితాకునకటునిటు గదలకుండ
దుర్గమంబగునడవిని నిర్గమించి
విరులనెత్తావి ఘుమఘుమ విసరుచుండ
విమలబృందావనాకాశవీథియందు
గానమొనరించు ప్రాణేశు గాంచఁబోదు
నాదురథము సుపథాన నడుపుమయ్య!
విమలమౌ నీవిభావరిసమయమందు
నేలకో నాథుఁగనుగొన నిచ్చవొడమె
పరమహర్షంబున గగుర్పాటునొంద
ప్రత్యగాత్మస్వరూపుడై బరగునట్టి
గాన మొనరించు జీవేశు గాంచఁ బోదు
నాదురథమును సుపథాన నడుపుమయ్య!
హృదయ మందున్న జీవేశు బడయలేక
వెతలగుందుచునుంటిని వెజ్జినగుచు
మూఁడవస్థలకును సాక్షిభూతమగుచు
విశ్వమోహనమూర్తియె వెలయుచుండి
గానమొనరించు ప్రాణేశు గాంచఁ బోదు
నాదురథమును సుపథాన నడుపుమయ్య!

# విడాకుల చట్టము

## ౨౨
## శ్రీమతి మాగంటి శకుంతలా దేవిగారు

పవిత్రవతులగు మనభారత నారీమణులు కొందరు విడాకుల చట్టముకావలయునని కోరుట చాల విషాదకరమగు సంగతి. పతినే దైవముగ జూచుకొనెడు మన హైందవ స్త్రీలకిట్టిచట్టము ముఖ్యావసరమని తోచుటకెంతయు ఆశ్చర్యముకలుగును. భర్త దుష్టవర్తనుడై సంచరించుచుండిన భార్య సవినయంబుగ సన్మార్గమునకు మార్చవలయునేగాని మఱొకనిని వివాహమాడుట పాడిగాదు. మరల వివాహమాడిన అతనుకూడ దుష్టుడైయున్న అపుడేమి చేయవలయును? మనహిందూదేశమునందిదివరకే కొన్ని చిన్నజాతుల [illegible] చాగమేర్పడియున్నది. జ్ఞానవతులును విద్యావతులునుఅయిన తతిమ్మా స్త్రీరత్నములుగూడ నీచము త్రవ్వుద్యమమున పాల్గొనవలసినదేనా? భర్త గ్రుడ్డియైనను, భాగ్యహీనుడయినను, అట్టివానితో సం[illegible] చేయవలసినదేనాయని, విడాకుల చట్టమునందు కుతూహలముగలవారు ప్రశ్న వేయకమానరు.

వారికి నాచేయుమనవి బాల్యవివాహములు శాసనసమ్మతములైనపుడిట్టి చట్టమును బెట్టనట్లయిన అందరిలో కొందరికయిన సహాయకారిగనుండెడిదేమో? ఇప్పుడెందుకు? కష్టసుఖముల నెరిగినపుణ్యశీలురును, దేశమున కలంకారమగు చట్టమేర్పరచిన గొప్ప మహనీయులునుఅగు శ్రీ. శ్రీ. శ్రీ. హరవిలాస శారదా గారి సంస్కరణముమూలమున ప్రౌఢవివాహములు ఆచారమగుచుండగా విడాకులశాసన మనవసరమని ప్రతి వారును, పూర్తిగా గ్రహింపకోరుచుంటిని. భర్తకు హితవులేకున్న భార్యను విడచుటలేదా పురుషునితోబాటు సమానమైన హక్కులుగల స్త్రీకూడ అట్లేలచేయరాదనెడి భావముతో భారతజాతికపవిత్రమగు పతివ్రతాత్వమునకు భంగకరమగు ఈచట్టమును ప్రవేశపెట్టుట చాల పొరబాటు. అనవసరమగు ఈ చట్టమును ప్రవేశబెట్టుటకంటె ముఖ్యావసరమగు వ్యభిచారనిర్మూలనచట్టమును గొనిదెచ్చిన ప్రజల కనేకవిధముల సుఖములున్ను; భార్యాభర్తలిరువురెడబాయక సకలభోగముల ననుభవించుచూ, ప్రేమమయులై యుండుటయు; దేశముదాంపత్యవిరోధమన్నదెట్టిదో ఎరుగక ప్రకాశించును; జంటమల్లెవలె సతీపతులెడబాయక సంచరింతురు. కావున వ్యభిచారనిర్మూలనచట్టమును గొనిరా మహనీయుల కనేకవందనము లర్పించుచున్నాను. మనహిందూ ధర్మశాస్త్రము లంగీకరించని విడాకులచట్టమును దెచ్చిపెట్టి భారతరమణీమణులసౌశీల్యమునకు భంగము కలుగచేయకుందురుగాకయని వారిని ప్రార్థించుచుంటిని.

## ౨౩
## శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

వివాహము ధర్మార్థకామమోక్షములను సాధించుటకేర్పడిన బాయరానిబంధముగానున్నను పురుషుడు-పదిమంది బిడ్డల తండ్రియైనను-నిర్భయముగ తన యర్ధాంగియందు లేశమైన తప్పుకాన్పింపకపోయినను వివాహబంధమును పరిత్యజించి తిరిగి వివాహమాడుచున్నాడు. అట్టి సందర్భమున మనస్త్రీలు విడాకుల

చట్టము కోరినారన్న ఆశ్చర్యములేదు. వికలాంగుడైననూ, కుష్ఠరోగియైననూ గ్రుడ్డివాడైననూ, పిచ్చివాడైననూ తగినంత నిదర్శనము న్యాయస్థానమందు రుజువుపర్చుకొని తిరిగి వివాహమున కనుజ్ఞ యిమ్మని కోరుట తప్పిదముకాదని నాయభిప్రాయము. మరియు భారతదేశపుస్త్రీలు భర్తదుఃఖమే తనదుఃఖముగను ఆతని సౌఖ్యమే తనసౌఖ్యముగను తలంచుచు కేవలము భర్తనే దైవముగ భావించుచున్నారు. అట్టితరి చాలమంది పురుషులు కురూపియను నెపమున భార్యను విసర్జించుచున్నారు. అట్టివారిని పెక్కుమందిని మనము నిత్యము జూచుచున్నాము. భర్తఅక్రమముగా తమ్మును హింసించుచు తమతో కాపురము చేయనపుడు హిందూ సుందరులు తమ భర్తపైని జీవనాంశము నిమిత్తము న్యాయస్థానమునందభియోగము తెచ్చి జీవనాంశము యిప్పించవలసినదని కోరుమాదిరినే భర్త దుష్ప్రవర్తనుడో, నీతిమాలినవాడో, త్రాగుబోతో, తీరనిదుష్టసంకటములపాలైనవాడో, కుష్ఠురోగియో, క్షయవ్యాధిపీడితుడో అయియున్న సమయమునందు అతనితో కాపురము చేయవలసియున్న స్త్రీ తనసంతతినంతయు రోగభూయిష్టముగలదానినిగ జేయుటకన్న తన వివాహపరిత్యాగము చేసుకొనుటకు న్యాయాధికారులయొద్ద మొరబెట్టుకొనుటలో పరువు తక్కువ గలుగదని తలచెదను. అట్టి న్యాయస్థానమందు భార్యయొక్క వాదన నిజమైనదైనట్లు యెంచబడి న్యాయాధీశులవల్ల స్థిరబడుటలో అక్రమములు జరుగునని చెప్పుటకు వీలుకనుపించదు. ఈ చట్టము పుట్టబడినంత మాత్రమున భర్తలయందరిపైననూ భార్యలు తిరగబడి తమ తమ వివాహములను రద్దుజేసికొనకోరుదురను భయముపొందుటకు అవకాశములేదు. సంతానవతులుకాని స్త్రీలకున్ను, అక్షతయోనులగు భార్యలకును యిట్టిచట్టము అవసరము గలిగిన సమయములందు పనికివచ్చుననుటకు సందియములేదు. హైందవస్త్రీలు వివాహబంధమును నిష్కారణముగ తెంచుకొన నంగీకరించుటకు భయపడుదురనుటలో అతిశయోక్తిలేదు. కాని వివాహబంధవిమోచనమును గోరుటకు హక్కును సంపాదించుటకు ప్రయత్నించుటకూడ సమానస్వాతంత్ర్యమును గోరుస్త్రీలకు దోషముకాదని నాయభిప్రాయము కాన విడాకుల చట్టమును కోరుట స్త్రీల విద్యుక్త ధర్మములలో నొకటియేయని నేను భావించుచున్నాను.

## ౨౪

## శ్రీమతి పాలడుగు సముద్రాలదేవిగారు

వివాహమనునది మనదేశమున మహాపవిత్రమైనదిగా నెంచబడుచున్నది. వివాహము వలన భార్యాభర్తలైక్యమగుదురు. భార్యకు భర్త కంటెను భర్తకు భార్యకంటెను ఈ ప్రపంచమున ప్రియమైన వారెవరును లేరు. వారలిరువురు నేకశరీరమునందర్ధభాగులగుటజేసి ఎటువంటి సుఖదుఃఖములందైనను చేరియుందురు. తల్లిదండ్రులకంటెను సోదరసోదరీలకంటెను తనకంటెనుగూడ భార్యభర్తలను ఒండొరుల నెక్కువగా ప్రేమించుకొనునట్లు చేయునదేది? వివాహమేగదా. అట్టి పవిత్రమైనటువంటి వివాహమునకు తెగదెంపులు తేదలచి కొందరు మహిళాలలామలు విడాకుల చట్టమను దానినొకటి మనభారతభూమియందుగూడ జొప్పింప నుంకించుచున్నారు. ఏ భూమి పతివ్రతామణులగు సీత, సావిత్రి మొదలగువారిచే కీర్తిగాంచెనో ఆనుక్షేత్రమునకాఈ శాసనము? ఒక వేళ కొందరు దుష్టులు దయాశూన్యులై యెల్ల వేళల తమ భార్యల హింసించుచున్నారను మాటవాస్తవమైనను అట్టివారిని శిక్షించుటకు తగిన చట్టముల నిర్మింప జేయుటకు కోరవలెనేగాని ఈ విడాకులచట్టమును గోరుట క్షేమము కాదని నా తలంపు.

## ౨౫

## శ్రీమతి కొరప్రోలు వేంకట రంగమ్మగారు

ఈ చట్టమును గూర్చి అనేకు లనేకవిధములుగ వ్రాయుచున్నారు. శారదాచట్టమునకు పూర్వమున జరిగిన రజస్వలానంతరవివాహములవలెనే విడాకులు గూడ దంపతుల మనోభావము లేకీభవించనిచోట చట్టనిర్మాణమక్కర లేకుండగనే జరిగిపోవుచున్నవి. శారదా చట్టము వచ్చునను భీతిచేత నతిబాల్య వివాహము లెట్లు జేసిరో అదేవిధమున డైవోర్సుచట్టమువలన హిందుసంఘముకల్లోలముల పాలుగావలసి వచ్చును. ఇదివరకే స్త్రీ జాతికి మానధనప్రాణములకు సర్వవిధముల భంగము కలుగుచున్నది. ఎన్నటి కైన స్త్రీ దేహము సాపాయముగాని నిరపాయముగాదు-అట్టిస్థితిలో పులిమీదపుట్రయనునట్లు వివాహ మాడిన భర్తను విడనాడ మరియొకడు మాత్రము గౌరవమును కాపాడునా? హిందూస్త్రీలభిప్రాయము లిట్టి విగావునవే నిరపరాధులై భర్తయే సర్వరక్షకుండు, దైవము, తన పాలిటి సర్వరూపుడు అని నమ్మి తమకే వారి తనువు మనము ప్రాణము ధారవోసిన స్త్రీల యెడల కఠినహృదయులై అనేకములగు శిక్షల పాలు జేసియు:— ఏ విధమైన ఆధారముగాని, అపచారముగాని లేక పోయినను నిష్కారణముగా విడ నాడి, వారి యిష్టము వచ్చినట్లు సంచరించుటయు గలదు. ఆ కారణములవలన పురుషులట్టిదుర్నయంబుల కొడిగట్టకుండునట్టి శాసనముల నరయవలయునే గాని స్త్రీల ఇష్టానుసారముగ స్త్రీలును, పురుషుల ఇష్టాను సారము పురుషులును సంచరించినచో భారతశిశువులు దిక్కులేనివారై పెక్కుదుఃఖముల పాలగుదురు. కలువులో అధికమాస మనునట్లు తండ్రి లేని (అనగా చనిపోయిన) బిడ్డలును; తల్లి లేని (చనిపోయిన) బిడ్డలును చాలక తలిదండ్రులు విడచివేసిన బిడ్డలు కూడా వేరువేరున్నతరి దేశపరిస్థితు లెట్లుండునో యోచించ వలసి యున్నది. కావున ముఖ్యముగాను మనదేశస్త్రీలకు విడాకులచట్టము కంటె అధిక స్వాతంత్ర్య మును విద్యావ్యాసంగమును అవసరము గాన వానికి తగురీతి నవకాశమిచ్చి పురుషుల దౌష్ట్యములడంగు నట్లు శాసించుట యుక్తమని, నా యభిప్రాయము. విడాకులచట్టమున కంత ఆవశ్యకత కనిపించదు.

## ౨౬

## శ్రీమతి సత్యబాల సుశీలాదేవిగారు

ఈ విడాకులచట్టమును స్వీకరించడానికి త్రోసివేయడానికీ గూడా సాహసించ లేక స్త్రీ సంఘము శంకాకులస్వాంతమైయున్నది. అత్యంతకుసుమకోమలియగు నొక బాల కఠినాత్ముని వశమున కడగండ్లు పడునపుడును, అపరభాషాదేవి యొర్తు నిరక్షరకుక్షియగు పతియొక్క ఆధీనంలో నిట్టూర్పులు విడుచు నప్పుడును, విరాగినో యొకర్తు విషయసుఖలోలుని చేత బాధింపబడునపుడును, ప్రేమమయదేవీ స్వరూపిణియగు కాంత శూన్యహృదయుడగు పతిదేవతచే నిడుములనందునపుడును, పతివ్రతామతల్లి యొర్తు నిరంతరబాష్పాకులనేత్రయై చూపట్టునపుడును యిట్లేయజ్ఞాతంబులగు నింకననేకవిధములగు భారము తన యావజ్జీవితమును - నిరర్థకమును, దుఃఖభాజనమును, అంధకారమయమును అగునట్లు గడిపి వేయుచుండు నారీలోకమును గాంచునపుడును దుఃఖభారావనతములైన వారి జీవితముల వినునపుడును గలిగిన యసహ్యావేదనలో ఇట్టిచట్టమొకటి యావశ్యకమను కొనినను; ఈ చట్టము నిర్మింప బడుటతో తనదేశమునందలి స్త్రీలయందున్న యెట్టి మహోత్కృష్టపవిత్రతచే ప్రస్తుతశోచనీయదురవస్థయందుగూడ

భారతమాత గౌరవమున తలయెత్తుచున్నదో యట్టి పవిత్ర యంతరించుననుటలో సందియము లేదు. ఒకవేళ ఈచట్టమములులోనికి వచ్చినను సద్వంశజాతయగు కాంత యొకర్తెయు ఎట్టిదుస్సహకష్టము నను భవించుచున్నను యిట్టి స్వేచ్ఛను కోరుకొనదు. తదుపరి వచ్చియురాని విద్యాజ్ఞానము చేత అజ్ఞానకార్యము లొనర్చుచు స్త్రీలకు విద్యయనర్థకమనివాదించు వారికి సహాయము అగుచున్న దుర్బలస్త్రీహృదయముల నిది చెడునుత్పన్న మొనర్చి హైందవకీర్తికాంతకు కళంక మాపాదించవచ్చును.

హిందూమతమే మూలమతమనియు, హిందూ స్త్రీలే యాదర్శకలగు నారీరత్నములనియు అను యశము అంతరించిపోవును. కొంతసహనముచేతను, ఇతరములగు కొన్నికట్టుబాటులతోడను సంస్కరింప బడ వలసిన యీ విషయమిట్లు నేటివరకు నతిపవిత్రమై, ఇహపరములను త్రిగలుగుటయుత్కృష్టమార్గమై, వెలయుచున్న వివాహధర్మమును అపవిత్ర మొనర్చుట అన్యాయము. హిందూశాస్త్రముల నిజస్వరూపమును నిన్న నేడు గుర్తెరింగి వాని నాచరణయందుంచి దేశోద్ధరణ మొనర్పబూను మనవారి కిట్టి చట్ట మెంతయు అనావశ్యకము. స్త్రీ, పురుషుల భాగ్యవిశేషమున నిక బాల్యవివాహములంతరింప నున్నవి గదా? ప్రతి స్త్రీకిని, పురుషునకును సమానముగ జ్ఞానదాయకములగు విద్యల నొసంగి, యుక్తవయస్సున యనుకూలదాంపత్యముల నొనగూర్చు భారము, తలిదండ్రులగువారు వహించినచో మద్యపానవ్యభిచారాదిదురభ్యాసములు రూపుమాసినచో, స్త్రీ సంఘమందలి హాహాకారములంతరింపగలవు. మరి అప్పుడీచట్టమనావశ్యకమేయగును. తొందరపడి ప్రస్తుత మీ చట్టముకు ప్రవేశ పెట్టి పిమ్మట దాని వల్లగలుగు అనర్థములకై చింతిలుటకన్న నేటివరకు చూపిన యోర్పునే మరి కొంతకాలమువహించి ఈ చట్టము లేకుండగనే అత్యావశ్యకములగు కట్టుబాట్లను నెలకొల్పుకొని దేశకల్యాణమును నిరీక్షింతము.

# భారతాంబిక ప్రేమంపుభవ్యసుతలు

కీసర వేంకటరామనరసింహరావుగారు

బాల సౌందర్యసౌభాగ్యపటిమసుంత
విమలవిద్యాప్రదీప్తిచే వెలసెనేని
పూవుతావియు నేకమై పొసగినట్లు
పరమపురుషుల సంతోషపరచుగాదె!
చక్కదనమును విద్యయుఁ జాలగలుగ
శీలమునుగూడ వెన్నంటి చెలగెనేని
యట్టిసోదరి నెవ్వ డీయవనియందు
నాదరింపడు సజ్జనుడైనవాడు?
శీలరూపంబులును విద్య జేరియుండ
వినయసౌభాగ్య మదిసుంతవెలసెనేని
యట్టిసోదరి సత్కీర్తి యఖిలజగము
నిండి చెలగదె కన్నులపండువగుచు?
విద్యయును శీలమును రూపు వినయములును
భర్తయందలిభక్తిచేఁ బరగెనేని
ఔర! యానారి నెవ్వడీయవనియందు
భక్తికతమునబూజింప బాలుపడడు?
ఇట్టివారలుకారొకో యిపుడుమనము
సీత, సావిత్రియంచు విశేషభక్తి
పూజసేయుచునున్నట్టి పూజ్యులాంధ్ర
భారతాంబిక ప్రేమంపు భవ్యసుతలు?

# స్త్రీల కెట్టి విద్యయవసరము?

శ్రీమతి యన్. రాజ్యలక్ష్మమ్మగారు

గృహస్థుడగు పురుషునకు గృహకృత్యములందు తోడ్పడి యిరువురకును గౌరవము తెచ్చువనిత గృహిణియన బడును. సాధారణముగా స్త్రీ లెల్లరును గృహిణులే. పాణిగృహీతలై బిడ్డపాపలగని సంసారయాత్ర జేయవలసిన భారము వారిపై నున్నది. సంసారమను సాగరమును భర్తయను పడవవాడు భార్యయను పడవసహాయముతో జ్ఞానమనెడు తెడ్డుకర్ర జేయూతగొని దాటవలసి యున్నాడు. భరించువాడు భర్త. సంసారమును భరింపవలసిన బాధ్యత భర్తపైనున్నది. భార్య సహాయము లేక భర్తయగు పురుషుడొక్కడే సంసారమును నడుపజాలడు. స్త్రీ సహాయము లేక సంసారము చేయదలంచుట జలము లేక సానరాతిపై తీయు గంధము తీరేయగును. అట్టివాడేకాకి. వానికి సంకల్పమేమియు లేదు. కులవృత్తిచే ధనమార్జించి, భార్యను బిడ్డలను పోషించవలసిన భారము పురుషునిదే. పురుషులు స్వార్థపరులనియు వారు స్త్రీలు విద్య నేర్చుకొన్ననోర్వ జాలరను అర్థముగల వ్యాసముల నెన్నెని చదువుచున్నాము. అజ్ఞానులగు పురుషుల మాటయటుండనిండు. బుద్ధిశాలియగు పురుషుడు తనకు తోడునీడగా వర్తించవలసిన భార్యకు విద్యనొసంగియే తీరవలెను. అటుల చేయడేని వాడు తాను భార్యవలన బడయగల సౌఖ్యము, సహాయము పొందజాలడు. అయితే స్త్రీలకు ముఖ్యముగా నెట్టి విద్యనొసంగవలెను ? ఎట్టి విద్యచే స్త్రీలు భర్తకు దోడ్పడి గృహస్థాశ్రమధర్మములను నెరవేర్చి ఇహపరసౌఖ్యములనొందగలరు ? స్త్రీలు ఉద్యోగములు జేసి ధనమార్జింప వలెనా ? అను విషయములు కొంతవరకాలోచింప దగియున్నవి.

పురుషునివలె స్త్రీలును సాధ్యమయినన్ని భాషలలో పరిచయము గల్గియుండుట యుక్తమే. విద్యలన్నిటిలో గృహకృత్యములకు సంబంధించిన విద్య; బిడ్డల పోషణమును గురించిన వైద్యవిద్య; ఇల్లు, వాటిని నలంకరించి శుభ్రముగా నుంచుకొనుటకు వలసిన ఆరోగ్యవిద్య, మితవ్యయము; భర్త, అత్త, మామ, అతిథి అభ్యాగతుల సత్కరించి దైవభక్తి, భూతదయ, పశ్చాత్తాపబుద్ధి బురికొల్పు విద్య స్త్రీల కత్యవసరము. ఉదరపోషణార్థమై ధనార్జనమునకుగాను స్త్రీ లున్నతవిద్య జదివి పరీక్షాఫలితముల నెదురుచూచుట మిక్కిలి యవసరము గాజాలదు. ఏలనన భరించువాడగు భర్త ఊరనైనను, ఊరూరు దిరిగియైనను ఎవ్విధినైనను, విత్త మార్జింపదగియున్నాడు. ఇంటి పట్టున గృహకృత్యముల నెరవేర్చి బిడ్డల నాదరించి బైటదిరిగి భర్త యింటికి వచ్చుసరికి పక్వాన్న మిడి, బంధుజనములను అతిథియభ్యాగతులను సత్కరించి, సత్కీర్తియను ధనము నార్జింపదగినది భార్య. ఇట్టి గుణవతియగు భార్యకన్న పురుషునికి వేరు భాగ్యమేమిగలదు ? తనవలె తనభార్యను ఉద్యోగము చేయనీకున్నంతమాత్రముననే పురుషుడు స్వార్థపరుడు కాజాలడు. అట్టులైన భరింపగల బాధ్యత భర్తపైలేకపోవును. భార్యసంపాదన కేగిన భర్త యింట నుండి గృహకృత్యముల నెరవేర్ప గలడా ? నెరవేర్ప జాలడు. స్త్రీ సంపాదనమున కొక యడ్డంకు

గలదు. "స్త్రీవిత్త మధమాధమం" యనెడు నీతివాక్యము. భార్య యుద్యోగమునకు బోయి, యింట లేనపుడు పాల కేడ్చిన బిడ్డగతి యెట్లు? లేక భార్యాభర్తలిరువు రుదరపోషణార్థమై యుద్యోగముల కేగిన గృహకృత్యములను, బిడ్డలను జూచుకొనువారెవరు?

ఉద్యోగము కొఱకు విద్యనేర్చుకొనిన స్త్రీలలో రజకునకు వేయుబట్టలను లెఖ్ఖ వ్రాయుట నావమోషి యనుకొను వనితలెందరో గలరు. ఇట్టివారిని కాళ్లకు బూడ్సులు, కండ్లకు సులోచనము జోడు, చేతిలో గొడుగు తగిలించికొని ఉపన్యాసములకు, సాయంకాలవిహారమునకు (Evening Walks,) నాటకములకు, సినీమాలకు బోనివ్వకున్నంతనే పురుషుడు స్వార్థపరుడగునా? బిడ్డలకు జలుబు చేసిననో, లేక కడుపుబ్బరించిననో గృహవైద్యములచే జక్క బెట్టజాలక ఆస్పత్రులకేగు విద్యావతులగు వనితలెందరో గలరు. ఈసామాన్య వ్యాధులకు ఔషధమెఱుంగబోలని స్త్రీ విద్యచే డాక్టరుబిల్లు మొత్తములను భరింపవలసిన వారగుట నిదర్శనమైయున్నది, భర్తలను నిరసించి. అత్తమామలను, బిడ్డలను అనాదరణచే తిరస్కరించి, అతిథి యభ్యాగతులను దరుమగొట్టు విద్యాధికురాండ్రగు భాగ్యశాలినులను బ్రత్యక్షముగా నెందఱినో చూచి యున్నాను. "ఇల్లుచూడు - ఇల్లాలినిచూడు" యన్నట్లు, ఇంటిని చూచిననే ఇల్లాలి గుణము దెలియ గలదు.

కావున స్త్రీలకు ఉన్నతవిద్య, పట్టపరీక్షలున్నను సరే, లేకున్నను సరే, గృహ కృత్యములకు సంబంధించిన విద్యమిక్కిలి యవసరము. ఇట్టి విద్య స్త్రీలకొసంగని పురుషుడు స్వార్థపరుడగును, అవివేకియునై సంసారసుఖము బడయలేనివాడగును.

# చిన్నికృష్ణ!

## శ్రీమతి పాండ్రంగి కృష్ణవేణమ్మగారు

పూర్ణచంద్రుని గేలించు పూర్ణకళను
మద్దికాయలు వ్రేలాడ మాలపొంత
వెన్నముద్దలు మ్రింగుచు వెలుగుఁతండ్రి!
నిన్ను నెన్నఁగ తరమౌనె? చిన్నికృష్ణ!

చిరుతముత్యపుహారముల్ విరివిగాను
నురుతరంబుగ బొజ్జపై నూగులాడ,
బాలసోముని చందాన ప్రబలుచున్న
నిన్ను నెన్నఁగతరమౌనె? చిన్నికృష్ణ!

ముద్దుగారుచు కేలున మురళిబూని
మందమధ్యను తన్మయ మొందునట్లు
సరసముగ గానమునుజేయు చందమామ!
నిన్ను నెన్నఁగతరమౌనె? చిన్నికృష్ణ!

బాల్యకాలమునాడె నీ బలముజూప
నలతృణావర్తమునుగూల్చి యలరినట్టి
దేవదేవుఁడవౌ వసుదేవతనయ!
నిన్ను నెన్నఁగతరమౌనె? చిన్నికృష్ణ!

విమలశ్యామలచాయమై వెలుగుమేను
మేఘద్వారమునందలి మెఱుపువోలె
నందమింపొందు మోమున హాసమొలుకు
నిన్ను నెన్నఁగతరమౌనె? చిన్నికృష్ణ!

దీనబాంధవ! నీప్రేమ తెలిసిగొలువ
కావఁగారావు నేజేయు కర్మఫలమ?
సర్వలోకంబులేలిన శాంతమూర్తి!
నిన్ను నెన్నఁగతరమౌనె? చిన్నికృష్ణ!

# గో రిం ట

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

ఆంధ్రులకు గోరింటచెట్టు చిరపరిచితమైనది. అయిననుఆచెట్టుయొక్క ఓషధీగుణములను మనవారు అంతగ తెలిసికొనియుండరు కాని అనాదిగ పర్వదినములలో దీనినివాడుకొనుట మాత్రము ఆచారమైయున్నది. అట్లతద్దియ, ఉండ్రాళ్లతద్దియ మొదలగు జాతీయ పర్వములలో ముఖ్యముగ స్త్రీజనము గోరింటాకును మెత్తగనూరి చేతులకు, కాళ్లకు అలంకరించుకొనెదరు. ఈ గోరింటాకును రాత్రిపూట పెట్టుకొని పండుకొనిన తెల్లవారు సరికి పెట్టినతావులు యెఱ్ఱవాఱియుండును. ఈ యలంకారమును స్త్రీలు, బాలికలు మిక్కిలి ప్రేమింతురు. ఇదియొకఅలంకారమేగాక మంగళప్రదమనికూడ వారుతలచెదరు. ఈపండుగలనాడు స్త్రీలు, వారి బిడ్డలు గతరాత్రి పరుండబోవుటకు ముందు పెట్టుకొనిన గోరింటాకును తీసివైచి శోణరాగరేఖచే శోభితమైయున్న కాలుసేతులను చూచుకొనుచు ప్రాతఃకాలముననే పెరుగు అన్నమును భుజించి నూతనవస్త్రాలంకృతలై పుష్పములను ధరించి తాంబూలచర్వణముచేయుచు ఇంటింటికిపోయి చెలికత్తెలను తోడ్కొని చెట్ల నీడలలో ఉయ్యాలలూగు ఆచారము యిప్పటికిని ఆంధ్రదేశమున పల్లెటిప్రాంతములందు నశించిపోలేదు.

గోరింటాకు శుభప్రదమైన ఓషధీరాజము. కాలివేళ్లకు, చేతివేళ్లకు కలుగు అనేకములగు జాడ్యములను ఇది నివర్తించును.

ఈ గోరింట హిందూదేశమందంతటను సాధారణముగ పెరుగును. ఇది కొంచపు పరిమళముగల వృక్షజాతికి చెందినది. దీనియాకులు ఒకయంగుళము నిడివియు, ఇంచుమించు ½ యంగుళము వెడలుపును గలిగి దీర్ఘచతురశ్రమువంటి ఆకృతిగలిగి సన్నని ఇరుమొనలుగలిగియుండును. పుష్పములు కొంచము తెలుపుతోకూడిన ఆకుపచ్చరంగుగలవియై సుగంధయుతములై యుండును. బీజములు (విత్తనములు) కోణాకృతిగలవి. గోరింటపండ్లు గుండ్రముగ నుండును; ఒక్కొక్కపండునందు నాలుగేసి గింజలుండును.

గోరింటకుసంస్కృతమున మెంధికా, మెంధీ, రక్తగర్భ, కురవక అనిపేర్లు. అరవమున దీనిని మరుతోన్రి అని యందురు.

ఔషధములయందు దీని నుపయోగించునపుడు ముఖ్యముగ ఆకులు, పిదప; పువ్వులు, విత్తులు మొదలగునవి ఉపయోగించుచున్నారు.

ఆ కు

దీనియాకు నూరికట్టినవ్రణములు మానును. ఆకులకషాయము పైనపోసినచో పుండ్లు, కాలిన బొబ్బలు, వీనిమంట, పోటు నయమగును; పుక్కిలించిన నోటిపుండు నయమగును. ఆకు నూరి కణతలకు పట్టువేసిన తలనొప్పి నెమ్మదించును; నూరిన ముద్దలో కొద్దిగ నూనెయు, తుమ్మజిగురు కలిపి యుపయోగించనగును. గోరింటాకు నూరి స్ఫోటకమువచ్చినవాండ్ర పాదములకు కట్టిన కండ్లలో స్ఫోటకముతగలదు. ఆకు నూరికట్టిన గ్రంధులు హరించును; గాయములుమానును; ఒంటికి పూసిన చిడుము మొదలగు చర్మరోగములునయమగును; తలవెండ్రుకలకు, గోళ్లకుకట్టిన అవి ఆరోగ్యముగ బలముగ పెరుగును. ఆకురసముతో చేసినతైలము పుండును,వ్రణమును మాన్పును. ఆకుపసరు పాలతోనిచ్చిన చలిజ్వరము కట్టును. ఆకునూరి సిరకాకలిపి పాదములకుకట్టిన మంటలు నయమగును.ఆకుచూర్ణములో సమముగనీళ్లుకలిపి ఉడికించికట్టిన వాతపునొప్పులు, మేహవాతపు నొప్పులు నిమ్మళించును. ఈకట్టు రాత్రికట్టి ఉదయమున తీసివేయవలెను. ఆకునూరి వాపు, నొప్పిగలచోట కట్టిన లేక పట్టించిన అవి హరింపునొందును. క్రొత్తగమానిన పుండు పైన వేసిన చర్మము దళసరిబారి బాగగును. ఆకుల తేలికకషాయములో కడిగిన ఓడ వాండ్రకువచ్చెడు (Scurvy) అనరోగము, అన్నివ్రణములు నయమగును.

పత్రములనుండి రంగుసాధింపబడి వ్రేళ్లు, నఖములు వీటికిఛాయకల్పించుట కధికముగ వాడఁబడుచున్నది. ఇంకను నీలిమందుతో చేర్చబడి శిరోజములకు సహజమగురంగును తిరిగికల్గించుటకుసైతము ఉపయోగింపబడుటయేగాక దీని కషాయమును సెగరోగమున ఇంజెక్షనుకొఱకు వాడఁబడుచున్నది. ఇంకను గోరింటపత్రములును, విత్తనములును యోనివ్యాధుల తొలగించుటలో సుప్రసిద్ధములు. గోరింటాకులను, విత్తనములను చూర్ణముజేసి ప్రత్తియందు చిన్నపొట్లములుగా నిమిడ్చి యోని యందిడుకొనినచో తదంతర్గతమగు వ్యాధులనుహరింపజేయును.

పు వ్వు లు

గోరింటపువ్వులుచిరకాలముకాయలాపడి లేచినవారు వాసనచూచినను, నుదుటకట్టుకొనినను మేలుచేయును. వీని తేలికకషాయ మిచ్చిన తలనొప్పి మానును. దానితో గూడిన

స్వల్పగాయములు మానును. ఈపువ్వులతో నింపినదిండును తలక్రిందనుంచుకొనిన నిద్రదెచ్చును. పువ్వులతో చేసిన తైలము స్వల్పగాయముల మాన్పును.

ఈజాతిపుష్పములనుండి గ్రహింపబడు పరిమళద్రవ్యమును పూర్వము యూదులు అభ్యంజనాదిక్రియల కుపయోగించుచుండిరి. అదియునుగాక శవములు కుళ్ళిపోకుండుటకై పైపూతగ నుపయోగించుచుండిరి.

గోరింటపువ్వుల గాఢకషాయముగాని, (కషాయము 2 తులములు), పువ్వులు; ఆకులు, చిగురుటాకులు వీనితో చేసిన సారముకాని (సారము 60 చుక్కలు) పుచ్చుకొనిన కుష్టు మొదలుగాగల దుష్టచర్మరోగములు నివారణయగును.

విత్తులు

విత్తులు, తేనె, Tragacanth అను జిగురువేసి నూరి నస్యముచేసిన తలనొప్పి నిమ్మళించును. విత్తులు తినిన సంధిమానును.

గోరింటమానుచెక్క రసము లేక కషాయము (3, 4 తులముల యెత్తు) లేక చూర్ణము శరీరతత్వమును మంచికి మార్చును. పాండురోగము, ప్లీహారోగము, మూత్ర కృచ్ఛము, కుష్టు మొదలగు కఠినచర్మవ్యాధులు వీనిని పోగొట్టును. విరేచనబద్ధముచేయును.

దీని కషాయమునుపైన బోసిన కాలినపుండ్లు మానును.

ప్రతిగ్రామమునందునుండి జనసామాన్యమునకు మిక్కిలి అందు బాటులోనున్న ఈ గోరింటచెట్టువలన ఇన్నిలాభములున్నట్లే మనవారికి తెలియదు. ఇకనైన స్త్రీలీవిషయికమగు విజ్ఞానము నార్జించి గోరింటచెట్టువలన పొందగల లాభముల నన్నిటిని పొందెదరుగాక!

# ప్రబోధము

చల్లా సూర్యనారాయణమూర్తిగారు

వనితారత్నములార! భారతమహాభాగ్యోదయావ్యాప్తి మీ
తనుహస్తాబ్జములందు నున్నది భవత్స్వాంతంబులోలిం బునః
పునరుత్తేజితముల్ పొనర్చుచును సంపూర్ణప్రబోధంబుఁ గై
కొని దేశంపువిముక్తికిందొడరి కోర్కుల్ సిద్ధినొందింపరే.

# స్త్రీలు : శాసనసభాప్రవేశము

## సింగంపల్లి వేంకటాద్రిగారు

ఈవ్యాసమున హైందవస్త్రీలు శాసనసభలలోగాని; స్థానికసంస్థలు అనగా యూనియన్‌బోర్డులు, మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు మొదలగు వానిలోగాని ప్రాతినిధ్యము వహించునట్టి సభ్యులకు సమ్మతుల నొసంగువిషయమునను, లేదా తామేప్రాతినిధ్యమువహించు విషయమునను, యిటీవల పదియేండ్లలో కలిగినమార్పులను, స్త్రీలు పొందగల్గిన హక్కు స్వాతంత్ర్యములనుగూర్చి యొకింత వ్రాయబడును.

స్త్రీలు అబలలనెడు దుర్గ్రహముచేతను, "స్త్రీబుద్ధిఃప్రళయాంతకః" అనెడు చెడులోకోక్తులనుబట్టియు హిందూపురుషులు భారతాంగనలను సమస్తరాజకీయవ్యవహారములనుండియు, సకలసాంఘికాదిసమస్యలనుండియు త్రోసివేయుట పరిపాటియైనది. ముఖప్రీతికై హైందవులు తమ భార్యలను అర్ధాంగలక్ష్మియనియు, సహధర్మచారిణి యనియు, 'గృహనియంత్రి' యనియు ఏమేమో వర్ణింపజూతురేగాని కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటలో స్త్రీలకెట్టిపాలు, పంపుగాని యోగ్యతార్హతలనుగాని యిచ్చుటకు సమ్మతింపరు. కావుననే 32 కోట్ల భారతీయులలో సగముకంటె నెక్కువగనున్నట్టి మహిళామహాజనుల సహాయసానుభూతులు పొందని కారణముననే పురుషులుసైతము శతాబ్దములనుండి దుస్సహమును దుర్భరమునగు దాస్యానలముచే సంతప్తులై కృశించి క్రుంగి అధోగతి జెందుచున్నారనుట అతిశయోక్తి కానేరదు. ఇక మాంటేగుచేల్మ్సుఫర్డు సంస్కరణల ప్రవేశానంతరము భారతాంగనలు పొందగల్గిన హక్కుస్వాతంత్ర్యము లెట్టివో విచారింతము.

పదునైదు పదునాఱుసంవత్సరముల క్రిందట మద్రాసు, బొంబాయి రాష్ట్రములలో గల పురపారిశుద్ధ్యసంఘములకు సభ్యుల నెన్నుకొను విషయములో పురుషులతో బాటు స్త్రీలకును సమానాధికారములు అనుగ్రహింపబడెను. కాని అప్పటి నిబంధనల నియమముల ననుసరించి అభ్యర్థులకు సమ్మతుల నొసంగ గల్గిన స్త్రీలసంఖ్య అత్యల్పముగానుండుట సంభవించినందున స్త్రీజనసామాన్యమున ఎట్టిఅభిమానమును ఉత్సాహమును ప్రబలియుండలేదు. ఈ కారణమున చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారు స్త్రీలకొసంగబడిన ఈస్వల్పాధికారమును కూడ రద్దుచేసిరి. ఐనను స్త్రీలెట్టి యాందోళనము చేయక యుపేక్షించియేయుండిరి. ఇట్లుండ 1914-1917-వ సంవత్సరములలో 'హోంరూలు' అనగా స్వపరిపాలనోద్యమము హిందూదేశమంతట ప్రబలి దేశీయులెల్లరదృష్టి నధికముగా నాకర్షించుటయు, ఏతదుద్యమస్థాపకురాలగు అనిబిసెంటు ప్రభృతులు ప్రభుత్వమువారిచే నిర్బంధింపబడి ప్రవాసమందుంపబడుటయు, అంతట కొంతకాలమునకె ప్రభుత్వమువారు తెలివితెచ్చుకొని వారిని విడుదల జేయుటయు సంభవించెను.

ఆసంచలనమును అవకాశమును పురస్కరించుకొని స్త్రీలును విజృంభించి తమకుచితమగు రీతి హక్కుస్వాతంత్ర్యములబడయ ఆందోళన మొనర్పసాగిరి. ఇంతలో 1917-వ సంవత్సరమున హిందూదేశాంగ మంత్రి

యగు మాంటేగుగారు అప్పటి రాజకీయ వాతావరణమున ప్రబలుచుండిన అద్భుతసంచలనమును స్వయముగ విలోకింప కాంక్షించి హిందూదేశమునకు విజయంజేసి యుండెను. హిందూదేశమంతట వ్యాప్తమైయున్న వివిధనారీసంఘముల ఆశయములను, లక్ష్యలక్షణములను ఆయన కొంతవఱకు గ్రహింపగల్గెను. 1917 డిశెంబరు 18-వ తేదీని (ఆల్ ఇండియా వుమెన్సుడెప్యుటేషన్) అఖిలభారతమహిళారాయబారవర్గమువారు మాంటేగ్యుమహాశయుని మద్రాసులో సందర్శించి తమ అభిప్రాయములను ఆశయములను విస్పష్టముగా వెల్లడించి రాజకీయములందు పురుషులతోబాటు స్త్రీలకును సమానస్వాతంత్ర్యములను హక్కులను ప్రసాదింపవేడిరి. సదయహృదయుడగు నామంత్రివరేణ్యుడును ఉచితరీతిని సమాధాన మొసంగి సంతృప్తులుగ నొనర్చెను.

మాంటేగు-చెమ్స్‌ఫర్డుప్రభువు లుభయులుకలిసి తయారు చేసిన రాజ్యాంగప్రణాళికలో స్త్రీల హక్కు స్వాతంత్ర్యముల గూర్చి ఎట్టిప్రస్తాపనను గాని సిఫార్సులనుగాని కావించియుండ లేదు. కాని భారతీయుల ఫ్రాంచైజ్ అనగా ఎన్నిక హక్కులను నిర్ణయించు విషయమై తగిన విచారణలు శిఫార్సులు చేయ నియమింపబడిన సౌత్‌బరో ఫ్రాంచైజు కమిటీ వారికి భారతదేశమందలి వివిధనారీసంఘములు తమ తమకోరికలు విన్నవింప నభిలషించి పత్రికలమూలమునను, కరపత్రముల మూలమునను, తంతివార్తలమూలమునను, పిటీషనుల మూలమునను అనేకములగు సలహాలను సూచనలను జేయుచు వచ్చిరి. 1919-వ సంవత్సరము జూలై నెలలో గవర్నమెంటు అఫ్ ఇండియా బిల్లు పార్లమెంటులో ప్రతిపాదింప బడిన తరుణమున రాజ్యాంగసంస్కరణముల స్వరూప పరిణామముల నిర్ధారణ మొనర్ప నియమితమైన జాయింటు సెలెక్టుకమిటీ ఎదుట సాక్ష్య మొసంగుటకును, విన్నవించుకొనుటకును భారతదేశమునుండి ఎన్నియో రాయబారవర్గములు వెడలి యుండెను. ఈ అవకాశమును జారవిడువక భారత మహిళామణులు తమ పక్షమున సలహాలను సాక్ష్యముల నొసంగుటకు శ్రీమతులు అనిబిసెంటు, సరోజినీదేవి, హీరాభాయ్ టాటాసతి, హీరాభాయ్ టాటాకుమారి ప్రభృతులను ఆంగ్లదేశమున కంపియుండిరి; కాని కార్యమంతగా అనుకూలింపకుండెను. ఎలెక్టోరల్ రూల్సు అనగా ఎన్నికల నిబంధనల నిర్మించు సందర్భమున స్త్రీలకెట్టి అధికారముగాని అనుకూల్యతను గాని చూపకుండిరి. కాని రాష్ట్రీయ ప్రభుత్వాంగములు లేక సంస్థలు స్త్రీలకు ఎన్నిక హక్కుల నొసంగుట సముచితమని నిర్దేశించుచో ప్రభుత్వము వారెట్టి అభ్యంతరములు ఆటంకములు కలుగజేయక తోడనే తదనుగుణ్యములగు నవకాశములు గల్పించుట అగత్యమని సూచనను మాత్రము కావించిరి. బ్రిటిష్ ఇండియాయందలి పరిస్థితులివి. ఇక స్వదేశరాజ్యములందలి పరిస్థితులెట్టివో విచారింతము.

తిరువాన్కూరు ప్రభుత్వమువారు స్త్రీలుకూడా శాసనసభాభ్యర్థుల నెన్నుకొనవచ్చునని 1920-వ సంవత్సరమున ప్రకటన మొనర్చియుండిరి. ఆసంవత్సరముననే జాల్వార్ సంస్థానము వారుకూడా యిట్టి హక్కులనే అనుగ్రహించియుండిరి.

1921-వ సంవత్సరము మద్రాసు రాష్ట్రీయ శాసననిర్మాణసభలో మలబారుమండలప్రతినిధియగు దివాన్‌బహద్దర్ కృష్ణన్‌నాయరుగారు (ఇప్పటి లా మెంబరు) శాసనసభాభ్యర్థుల నెన్నుకొను విషయమున స్త్రీలకు గల ప్రతిబంధకముల నన్నిటిని తొలగించునట్టి బిల్లునొకదానిని ప్రతిపాదింప సమకట్టి తదనుగుణ్యముగ నోటీసుయిచ్చియుండెను. ఆసమయమున చెన్ననగరమునను, వివిధమండలములందును గల విదుషీమణులు అనేకసభలను సమావేశపఱచి తగిన ప్రబోధ మొనర్చి శాసనసభ్యుల దర్శించి సుముఖులుగ జేసికొనగల్గిరి. 1921-వ సంవత్సరము ఏప్రియల్ 1-వ తేదీని శాసనసభలో నీవిషయము చర్చకురాగా మహమ్మదీయసభ్యులు మరి కొం

దఱు తప్ప మిగిలిన వారెల్లరు అనుకూలముగ సమ్మతులొసంగుటచే తీర్మానమామోదింపబడెను. ఈసభ్యు లెల్లరు స్త్రీమహాజనుల శాశ్వతకృతజ్ఞతాభివందనములకు పాత్రులైయుండిరనుటలో చోద్యము లేదు. ప్రతి కూలురకంటె అనుకూలురు ముప్పదిరెట్లుగురధికముగానుండిరనిన ఎంతలో ఎట్టిమార్పు, ఎట్టి అనుకూల్యత యేర్పడెనో చూడుడు.

బ్రిటిష్ ఇండియాలో స్త్రీలకిట్టి అసమాన గౌరవ ప్రపత్తి, హక్కు స్వాతంత్ర్యములు మరియే యితర రాష్ట్రమున ప్రసాదింపబడి యుండలేదు. ఈ సంవత్సరముననే బొంబాయి రాష్ట్రీయశాసన నిర్మాణసభలో 'త్రివేది' అను మహాశయుడుకూడా యిట్టి బిల్లు నొక దానిని ప్రతిపాదించియుండెను. కాని ఆబిల్లు యంతం తర్కర్కితమైన పదములఁ బొందిక క్రమవిరుద్ధముగా నున్నందున అది త్రోసివేయబడెను. కాని జూలై నెలలో అనగా నాసంవత్సరము రెండవమారు శాసనసభ సమావేశమైనపుడు రావుసాహేబ్ హరిలాల్ దేశాభాయి దేశాయి (అహమ్మదాబాద్ ప్రతినిధి)గారు మరల నిట్టిబిల్లునే ప్రతిపాదించియుండెను. ఈవిషయముపై మూడుదినములాకే పెట్టున తీవ్రమైన వాదప్రతివాదములు జరిగియుండెను. ఈవాద ప్రతివాదములలో నలు బదిమంది సభ్యులు పాల్గొనిరి. తుదకు 12 గురు తటస్థులుగను, 25 గురు ప్రతికూలురుగను, 52 మంది అను కూలురుగను నుండుటచే తీర్మానమామోదింపబడియే యుండెను.

1922 సెప్టెంబరులో బెంగాల్ రాష్ట్రీయచట్ట నిర్మాణసభలో ఎన్. ఎం. బోసు అనుసభ్యుడు యిట్టి బిల్లునే ప్రతిపాదించియుండెను. మూడుదినములు తీవ్రమైనచర్చ జరిగియుండెను. కాని మహమ్మదీయసభ్యు లెల్లరు ప్రతికూలముగనుండుటచే తుదకాబిల్లు త్రోసివేయబడెను. 37 మంది అనుకూలముగను, 56 గురు ప్రతికూలముగను సమ్మతులనొసంగుటచే వీగిపోయెనని గ్రహించునది. కాని 1925 సెప్టెంబరు నెలలో పురుషు లతోబాటు స్త్రీలుకూడ శాసనసభాభ్యర్థులకు ఓట్లనివ్వవచ్చునని యీబిల్లే మరల ప్రతిపాదింపబడగా 54 మంది అనుకూలురుగను 38 మంది ప్రతికూలురుగను నుండుటచే నయ్యది తీర్మానింపబడెను.

బిహార్ అండ్ ఒరిస్సా శాసననిర్మాణసభలో దేవకీప్రసాద్ అనుసభ్యుడు యిట్టిబిల్లునే ప్రతిపాదించి యుండెనుగాని ప్రతికూలురు పదిమం దధికముగానుండుటచే వీగిపోయెను. కాని యీరాష్ట్రమున స్త్రీలు చేయుచువచ్చిన ఆందోళనముల ఫలితముగా పురపాలకసంఘములలో ప్రాతినిధ్యమువహించుటకై అభ్యర్థు లుగ నుండగోరువారికి స్త్రీలుకూడ సమ్మతులనొసంగవచ్చునని యధికారమమాత్రము అనుగ్రహింపబడెను.

1923 లోనే సంయుక్తపరగణాలకు సంబంధించిన శాసననిర్మాణసభలో స్త్రీలుకూడా పురుషులతో బాటు శాసనసభాభ్యర్థులకు సమ్మతుల నొసంగవచ్చునని తీర్మానము లేక బిల్లు ఏకగ్రీవముగా నామోదింప బడియుండెను. ఇంతకుపూర్వము ఏదేశమునను ఏరాష్ట్రమునను స్త్రీలకు హక్కులనొసంగువిషయములో సభ్యులెల్లరు ఏకగ్రీవముగ నామోదించియుండుట సంభవించియుండ లేదనియు, ఇట్టి అపూర్వగౌరవము యునైటెడ్‌ప్రావిన్సెస్ మాత్రమే పొందగల్గెనని పాఠకమహాశయులు గ్రహింపవేడెద.

1926 లో పంజాబురాష్ట్ర శాసననిర్మాణసభలోను, మధ్యపరగణాలశాసనసభయందును యిట్టి బిల్లులు ప్రతిపాదింపబడి ఆమోదింపబడెను.

బర్మా శాసననిర్మాణసభలోను యిట్టి తీర్మానమునే కావించియుండిరి. బ్రిటిష్ఇండియాలో ఒక బీహార్ అండ్ ఒరిస్సారాష్ట్రీయ శాసననిర్మాణసభవారు తప్ప మిగిలిన శాసనసభలన్నియు నీబిల్లును ఆమో దించి స్త్రీలకు ఎన్నికహక్కుల నొసంగగల్గెనని పాఠకులు గ్రహింపవలెను.

1922 లో ఏప్రియలు నెలలో సమావేశమైన లెజిస్లేటివ్ కౌన్సిలు వారుకూడా యిట్టితీర్మానమునే కావించియుండిరి. 1922 అక్టోబరులో రెప్రజెంటేటివ్ అసంబ్లీ అభ్యర్థులకుకూడా స్త్రీలు ఓట్ల నివ్వవచ్చునసెడి హక్కును మైసూరుప్రభుత్వము వారనుగ్రహించియుండిరనిన బ్రిటిష్ప్రభుత్వమువారికంటె మైసూరు ప్రభుత్వమువారే స్త్రీలకు హక్కుస్వాతంత్ర్యముల నొసంగుపట్ల ముందంజవేయగల్గిరని స్పష్టపడగలదు.

తిరువాన్కూరు, కొచ్చిన్, రాజ్కోటసంస్థానములలోకూడా యిట్టిహక్కులు స్త్రీలకొసంగబడెనని గ్రహింపవలయును.

1925-వ సంవత్సరమున తిరువాన్కూరుప్రభుత్వము వారు 'పూనెమ్లక్ హోస్' అను విద్యావతిని లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరుగా నుండునట్లు నియమించెను. ఆమెయే యిప్పుడు ఆరోగ్యశాఖామంత్రిగానుండి స్త్రీలోకమునకు వన్నెయువాసియు తేగల్గుచున్నది. కొచ్చిన్సంస్థానమువారుకూడా 'మాధవీఅమ్మ' అను నారీమణిని శాసనసభలో నొక ప్రతినిధిగనుండునట్లు నియమించియుండిరి.

పై అంశములనుబట్టి బ్రిటిష్ఇండియాయందలి వివిధరాష్ట్రములలోను (బీహార్ ఆండ్ ఒరిస్సాతప్ప) శాసనసభాభ్యర్థులకును, స్థానికసంస్థలకు పోదలచిన అభ్యర్థులకును వోట్లను అనగా సమ్మతులనొసంగువిషయములోమాత్రమే స్త్రీలకు పురుషులతో బాటు హక్కులొసంగబడెననియు; కాని స్త్రీలుకూడా పురుషులతో బాటు అభ్యర్థులుగనుండి పోటీచేసి విజయమొంది సభ్యత్వమువహించుటకు అవకాశమేమాత్రము అనుగ్రహింపబడియుంపలేదనియు తెలియవచ్చుచున్నదికదా!

ఇండియన్ రిఫారమ్సుబిల్లు ప్రకారము రాష్ట్రీయశాసనసభలు స్త్రీలకు ప్రాతినిధ్యము అనుగ్రహించుటకు అధికారములేమాత్రము గలిగియుండలేదు. బ్రిటిష్పార్లమెంటుమాత్రమే యిట్టి ఆటంకములను తొలగించి ప్రాతినిధ్యమువహించుటకు తగిన అవకాశములుకల్పింప నధికారముకలిగియుండెను.

లెజిస్లేటివ్అసంబ్లీలోను, స్టేటుకౌన్సిలులోనుకూడా ఏయేరాష్ట్రములలో నిదివఱకు శాసనసభాభ్యర్థులకు వోట్లనిచ్చుహక్కు లొసంగబడెనో ఆయారాష్ట్రములందలి స్త్రీలును పురుషులతో బాటు లెజిస్లేటివ్ అసెంబ్లీ, స్టేట్ కౌన్సిలుకు పోదలచిన అభ్యర్థులకుకూడా ఓట్లు యివ్వవచ్చునని తీర్మానింపబడెనని పాఠకమహాశయులు గ్రహింపగోరెదను.

1924 లో జరిగిన ఎన్నికలలో స్త్రీలుకూడా రాష్ట్రీయశాసనసభలందును, అసెంబ్లీలోను, స్టేట్ కౌన్సిలులోను ప్రాతినిధ్యమువహింపదలచిన అభ్యర్థులకు వోట్లనుయిచ్చు మహద్భాగ్యము ప్రాప్తించియుండెను. మద్రాసు, బొంబాయిరాష్ట్రములలోని స్త్రీవోటర్లు తమవిధిని సక్రమముగ నిర్వర్తింపగల్గిరి.

1926 లో ఎన్నికలహక్కు విషయమై పునరాలోచింప నియమితమైన మడ్డిమెన్ కమిటీవారు తగిన విచారణజరిపి స్త్రీలు ఓట్లనుయిచ్చుటయేగాక శాసనసభలలోను, అసెంబ్లీలోను సభ్యత్వము వహించుటకు పోటీచేసి విజయమొంది సభ్యత్వమువహింపవచ్చునని సిఫార్సులుచేసియుండిరి. ప్రభుత్వమువారును సదయహృదయులరై యీసిఫార్సుల నామోదించి తదను గుణ్యముగ రాష్ట్రీయ శాసనసభలు వ్యవహరించి తగిన అవకాశముల గల్పింపదగునని అనుమతియొసంగెను. ఇమ్మహావిషయము భారతభావిరాజ్యాంగచరిత్రమున సువర్ణమణిమయాక్షరములతో లిఖింపబడదగియున్నది.

ఇమ్మహావకాశమును పురస్కరించుకొని 1926 జులై 17-వ తేదీన చెన్నరాష్ట్రీయ శాసనసభవారును, పిమ్మట పంజాబు, బొంబాయి శాసనసభలవారును, యిట్లేక్రమముగ తదితరరాష్ట్రీయులలోని శాసనసభలును స్త్రీలుకూడా పురుషులతోబాటు అభ్యర్థులుగనుండి విజయమొంది సభ్యత్వము వహింపవచ్చునని తీర్మానించి అనుమతులొసంగెను. కాని అంతపూర్వమే ఎన్నికలు జరిగియుండినందున స్త్రీలు పోటీచేయుటకవకాశమంతగా లేకుండెను. అంతగా యననేల ఏమాత్రము లేకుండెననియే చెప్పవచ్చును. ఐనను కొన్ని కొన్ని శాసన సభలలో స్త్రీలు మెంబర్లుగ నియోజితులగుచువచ్చిరి.

1927 లో మొట్టమొదట చెన్నరాష్ట్ర ప్రభుత్వమువారు డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి అమ్మాళ్ గారిని నామినేట్ చేసి అనగా సభ్యురాలుగ నియోగించి మార్గదర్శకులైరి. ఆయమ్మ నామినేట్ చేయబడిన కొలదికాలములోనే శాసన సభోపాధ్యక్షురాలుగ సభవారిచే నేకగ్రీవముగా నెన్నుకొనబడెను.

ప్రస్తుత పరిస్థితులనుబట్టియు, అవకాశములనుబట్టియు, శాసనసభాభ్యర్థులకు సమ్మతుల నొసంగ నర్హతాధికారములు కలిగిన స్త్రీలు పదిలక్షలకంటె నెక్కువగ యుండజాలదు. అడల్టుఫ్రాంచైజ్ సిస్టమ్ (Adult Franchise System) అనగా మైనార్టీ వెళ్ళిన ప్రతిపురుషుడు స్త్రీయును ఓట్లనిచ్చునట్టి పద్ధతి ప్రవేశపెట్టబడినగాని స్త్రీలకు శాసనసభలలో తగిన ప్రాతినిధ్యము యుండజాలదు.

ఇప్పుడైనను ఎందరో స్త్రీలు శాసనసభలలోను, స్థానికసంస్థలలోను ప్రాతినిధ్యము వహించుచు అత్యంత సామర్థ్యముతో ఏతత్కార్యములను నిర్వహింపగల్గుచున్నారనియే దైనికపత్రికాపాఠకమహాశయులు గ్రహింపగలరు. స్త్రీలకిట్టి హక్కు స్వాతంత్ర్యముల సంపాదించు విషయములో విశేష శ్రద్ధబూని శ్రమపడినవారిలో శ్రీనుతులు ముత్తులక్ష్మిరెడ్డి అమ్మాళ్, లేడీతాతా, లేడీబోస్, సదాశివయ్యారుసతి, బీగంఆఫ్ కాంబే, సరోజనీదేవి, పెటిట్ సతి, వాడియాసతి, జినరాజదాససతి, బిసాంటమ్మ, కజిన్సుసతి, శ్రీరంగమ్మ, శ్రీ॥ శ్రీ॥ చంద్రశేఖరయ్యారుసతి, మిస్ సొరాబ్జి, డాక్టర్ మిస్త్రీ, పామర్ సతి, సారళాదేవి చౌదరాణి, బ్రిజిలాల్ నెహ్రూసతి, షాఫీసతి, కె. ఎస్. రాయిసతి, రామారావుసతి ప్రభృతులు గణనీయులు.

# దశావతారములు

## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

వేదాదివిద్యలు వెలయింపగాజేసి ముదముమీరగ లోకములువహించి
భూగోళమెల్ల విస్ఫూర్తితోబైకెత్తి ఘనదుర్మదాంధు రక్కసునిదున్మి
బలిచక్రవర్తిని పాతాళమునగట్టి క్షాత్రమండలము సంక్షయమొనర్చి
నిశితమార్గణపంక్తి దశకంఠునిజయించి కమనీయమైన నాగలినిబట్టి

ఇంపుదళుకొత్త కరుణ వ్యాపింపజేసి
భువనకీర్తిగ మ్లేచ్ఛుల మూర్ఛముంచి
అతులమతి నివ్విధిని దశాకృతులదాల్చి
మహినిదనరారు శ్రీకృష్ణు మదిదలంతు.

# స్వర్గీయ సుధాదేవి బి.ఏ.

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

జేలార్ అంతర్గత గోపాలనగరమున మహిళాసమితిని స్థాపించి తదేకనిష్ఠగఁ బనిచేయుచున్న శ్రీమతి సుధాదేవి యీలోకమున లేదని మా పాఠకులెఱిఁగి మర్మాహతు లగుదురు. స్నేహసమత, స్వజనవాత్సల్యత, పరదుఃఖకాతరత, సరళత, ఔద్ధత్యహీనత, క్షమాశీలత యీమెకు సహజగుణములు; స్పష్టభాషణము, సాహసముతోఁ గూడిన స్త్రీజన సులభమైన మృదుత్వము నీమెకు సామాన్యములు. గృహమందు స్వామిసేవ, శిశుపాలనము మొదలగు నిత్యనైమిత్తికకార్యములతోఁ బాటీమె సమాజసేవ, నారీ మంగళము మొదలగు గ్రామౌన్నత్యమునకుఁ దగిన పనులను జేయుచుండెడిది.

ఈమె కలకత్తానగరమున జన్మించినది. "Bethune School" లో మెట్రిక్యులేషన్ చదువుచున్నపుడు ప్రెసిడెన్సి కాలేజి యధ్యాపకుఁడైన శ్రీయుక్త గిరిజాప్రసన్న మజుందారను నాతఁడీమెను వివాహమాడెను. వివాహానంతరము మెట్రిక్యులేషన్‌లో నుత్తీర్ణురాలై B. A. పరీక్షయందును జయముగాంచినది. పఠనకాలమున నీమె "ప్రేమమయి" యని ప్రసిద్ధినందినది.

వయసునకుఁదగిన జనసేవయు, జనసేవకుఁదగిన వ్యాకులాకాంక్షయు నీమె హృదయమున జాగ్రతములై యుండెడివి. "దేశమునందు దేశమునిమిత్తము జీవనద్రవ్యమును వెచ్చింపవలెను" అనునదియే యీసుగుణమయి యొక్క యాంతరంగికేచ్ఛ. సుమారు మూడువత్సరములకుఁ బూర్వ మీమె సంయోజనలిసీనారీమంగళసమితిలోఁ జేరి గోపాలనగరమున బాలికావిద్యాలయము, పల్లీసంస్కారసమితి మొదలగు కొన్ని ప్రజోపకార సమాజములను స్థాపించి పరిచాలన మొనర్చుచుండెడిది. ఈమె వినాభావముచే నాసంస్థలు నేఁడు మృతప్రాయములైనవి. హిందూసేవ, ధర్మనిష్ఠ, జాతీయతాబోధ, యీమె చరితమును దేజస్వంతముగ నొనరించినవి.

ఈమె తనకెంతటి యధికారమున్నను బరివారవిషయములోఁ గానీ, సామాన్య దాసదాసీజనవిషయములోఁ గానీ కర్కశవాక్య మొక్కటైనను బ్రయోగించెడిది

కాదు. వారి పోషణమున నశ్రద్ధాభావమును సహించెడిది కాదు. సత్యము, ప్రేమ, న్యాయము. వీనికాదర్శ మీమెయే. ఒకపరి శియాలదహ స్టేషను కడ నొక బికారిణియైన స్త్రీనిగుఱించి స్టేషనులోని యధికారి యనవసరాద్ధత్యము చేయునపు డీమె వానిని గుఱించి తీవ్రవాదముచేయ నాతఁడు విశేషలజ్జితుఁడాయెను. ఈమె చదువుకొనునపుడు సరసశైలిలో నుపన్యాసము లిచ్చుచుండెడిది. Bethune College ప్రిన్సిపాలైన మిస్ రాయిట్, మిసెస్ ఫేనా మొదలగు వారీమెయెడల మిగుల ప్రేమగలిగి యుండెడి వారు. కళాశాలలో విద్యాసమాప్తియైన పిదప గూడ నీమె కనేకపుస్తకము లుపహార ముగ నిచ్చిరి. తన ప్రశంసావిషయమున నీమె మిగుల సిగ్గుపడుచుండెడిది.

గతవత్సరమున శరీరము వ్యాధిగ్రస్తమైనను అతిరిక్తమైన పరిశ్రమచేసి బి. యె. పరీక్షలోఁ గృతార్థతచెందనది. విశ్వవిద్యాలయమందలి ఈమె విద్యయు, నీమె కాలమును రెండును సమాప్తి చెందినవి. ఈమె మృత్యువువల్ల స్వామి శోకతప్తుఁడు, శిశువులు నిస్సహాయులు, బంధువులు నిరాశులు, సహచారిణులు అభావగ్రస్తలు నైరి. ఈమె యకాలమృత్యువువల్ల శోకమగ్నుఁడైన స్వామి గిరిజాబాబునకొకయాత్మీయుఁడు "నీవొక స్త్రీని బోఁగొట్టి కొంటివి, మేమొక సహృదయబంధువును బోఁగొట్టుకొంటిమి." అని యొక లేఖ వ్రాసెను. "Whom God loveth, dieth young" అను నొక దానిని స్మరించికొని మనమూరట చెందవలయును. ఈమె యనేకసమయములలోఁ దన పతికిఁదాను బి. యె. లో నుత్తీర్ణతనందినపిదప నారీమంగళసమితి కాత్మదానము చేయుదునని చెప్పుచుండెడిది. ఈవిదుషీమహిళ కిద్దఱు బాలురును, ఇద్దఱు బాలికలును గలరు.

—"వంగలక్ష్మి" నుండి

# చిత్రప్రశ్న

## మానేపల్లి లక్ష్మయ్యాగారు

[ఈచిత్రప్రశ్నకు సమాధానము పూర్తివివరములతో గృహలక్ష్మి చందాదారురాండ్రుమాత్రము-చందా నెంబరు తెలుపవలెను-లేఖాముఖమున అగష్టు 10-వ తేదిలోపున మాకు తెలుపవలెను.]

—సంపాదకుడు.

1. ఆశ్రమవాసులలో మేటి యెవ్వఁడు? 2. ఆకాశమునసంచరించున దేది? 3. లక్ష్మీదేవి కావాసమెద్ది? 4. మంచికర్షకులకు లభ్యమగునదేది? ఈ ప్రశ్నలకు ఒక్కొక్క దానికి నాల్గేసి అక్షరములుగల జవాబులుచెప్పి ఎన్నియవప్రశ్నయొక్క జవాబులో అన్నియవ అక్షరమునుతీసి చేర్చినచో ప్రస్తుతము మీసన్నిధినున్ననామమగును. నాపేరు ఎవరో చెప్పుకొండి చూద్దాము.

# శ్రీమతి దామెర్ల కమలరత్నమ్మగారు

## శ్రీమతి పులవర్తి కమలావతి దేవిగారు

శ్రీమతి దామెర్ల కమలరత్నముగారు నరసాపుర హైస్కూలరోన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత దిగుమర్తి కోదండరామస్వామిగారి ప్రథమతనూజ. దిగుమర్తి కోదండరామస్వామిగారు ఇప్పటివారిలో కొందఱివలె ప్లాటుఫారములలో గంభీరోపన్యాసముల నొసగి వాని నాచరణయందుంచని సంఘసంస్కర్తలవలెగాక తాను నమ్మినదానిని యాచరణయందుంచి లోకమునకు మార్గదర్శిగానుండు విప్ర పుంగవుడు. అట్టి నిర్భయధనాముగవంశపుంగవుని తనూజాత యీ కమలరత్నము.

కమలరత్నముగారి జననియు బాగుగ చదువుకొన్నది. ఆమె నరసాపురమున స్త్రీసమాజము నేర్పాటొనరించుటయందేమి, స్త్రీలకు గ్రంథభాండాగారము నేర్పరచుటయందేమి, నరసాపురతాలూకాభివృద్ధి సంఘము నభివృద్ధికి దెచ్చుటయందేమి చేసిన సేవ నిరుపమానము. అట్టి మాతృదేవతసంసర్గమువలననే నేడు కమలరత్నము విద్యావంతురాండ్రగు స్త్రీలయం దత్యున్నతగౌరవస్థానమును బడయగలిగినది.

తన శిష్యులయెడలనే ఎంతోదయతో మెలంగు దిగుమర్తి కోదండరామస్వామిగారు కడుపునబుట్టిన బిడ్డ కమలరత్నము నరచేతిగులాబివలె పెంచి విద్యాబుద్ధుల గఱపినారు. కమలరత్నము చదువుకొనుకాలమున జయరామస్వామియను ఆయన హైస్కూలరోన్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగ నుండెడివాడు. శిష్యుల చదువువిషయమై యాయన మిగుల శ్రద్ధగైకొనెడివాడు. ఏదినముపాఠ మాదినము విద్యార్థులెల్లరు వల్లించితీర వలసినదే. లేనియెడల వారిని తగువిధమున శిక్షించి దారికితెచ్చెడివాడు. అందువలన నప్పటి హైస్కూలరోన్నత పాఠశాలావిద్యార్థులకు చదువువచ్చినట్లు మరి ఏపాఠశాలవారికి వచ్చెడిదిగాదు. ఆకాలమున రాజధానీనగర మగు చెన్నపట్టణము తరువాత నరసాపురమునందలి హైస్కూలరోన్నతపాఠశాలయే స్కూలుఫైనలుపరీక్షాఫలితముల నగ్రస్థాన మలంకరించుచుండెడిది. అట్టి మహత్తరకీర్తికి స్థానమైన హైస్కూలరోన్నతపాఠశాలయం దీకమలరత్నము తన చిన్నతనమునందు విద్యాభ్యాసమొనరించినది. ఆమె హైస్కూలరోన్నతపాఠశాలయందు స్కూలుఫైనలుతరగతిని పూర్తియొనరించి, చిత్రకళయందు ఆసేతుహిమాచలపర్యంతముగల కళాభిజ్ఞులచేతనేగాక ఖండాంతర చిత్రకళోపాసకులచేత సయితము యింతటి ప్రతిభావంతుడు యికలేడని ఖ్యాతికినిలయుడై ఇటీవల నకాల మృత్యుగహ్వరమున బడిపోయిన దామెర్ల రామారావుగారి కగ్రసోదరుడును; గాంధ్ర మహేంద్రనగర స్త్రీల క్లబ్బునకు కార్యదర్శినియై, ఢిల్లీనగరమునజరిగిన అఖిలభారతమహిళాసభకు ప్రతినిధిగ వెళ్లియుండిన విదుషీయు నగు శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారికి సోదరుడునునగు శ్రీయుత దామెర్ల వేంకటరావుగారు యం. ఎ. యల్. టి. గారిని వివాహమైనది. వేంకటరావుగారు రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వకళాశాలయందే లెక్చరరుగా పనిచేయుచున్నారు. చదువుకొనుచున్నప్పుడు రాజమండ్రి ఆర్ట్సుకళాశాలప్రిన్సిపాలుగారగు కూల్ డ్రేగారి మన్నన కీతడు పాత్రుడైనాడన్నయొక్కవిషయమును జెప్పిన యీయనప్రతిభ తమకే బోధపడగలదు.

జనకునిగృహమున నెంతవిద్య నేర్చినను అత్తవారింటికడ దోహదములేనిచో నావిద్య మెచ్చరిల్లక పోవును. కాని దామెర్ల వెంకటరావువంటి యోగ్యుని చెట్టబట్టుటచే ఈనారీరత్నము తనవిద్యను మరింత

శోభదెచ్చుచున్నయది. ప్రాణేశ్వరికి వలయుస్వాతంత్ర్యాదుల నిచ్చి మార్గదర్శియగుచున్న దామెర్ల వెంకటరావుగారి నీసమయమున మేమభినందింపకుండ నుండజాలము. ప్రభుత్వమువారీమె యొనర్చుచున్న సాంఘికసేవను గురించి ఈమె నీమధ్య మాపట్టణమున మహిళాన్యాయాధికారిణిగ నియమించి గౌరవించియున్నారు. రాజ్మహేంద్రవరమున నిట్టి యపూర్వగౌరవమును బడయుటకీసుందరీరత్నమే ప్రథమురాలు. బెంచికోర్టులందు స్త్రీలకుకూడ ప్రాతినిధ్యమున్ననేగాని స్త్రీలగు నేరస్థుల యిక్కట్లు బాయజాలవు. స్త్రీల మంచిచెడ్డలు, స్త్రీల కష్టనిష్ఠురములు స్త్రీలకుదెలిసినట్లు పురుషులెఱుంగజాలరు.

ఈమె భర్తగారగు దామెర్ల వెంకటరావుగారు కొంతకాలముక్రిందట అనంతపురమునకు బదిలీయొనర్చబడియుండిరి. అప్పు డీలలనామణి వారి ననుసరించిపోయి యనంతపురమున స్త్రీల రాజకీయపారిశ్రామిక నైతిక ఆర్థిక అభ్యున్నతికై విశేషకృషి యొనర్చియున్నది. క్లబ్బుల నిర్వహణమువిషయమై ఈమెకు సమగ్ర పాండిత్యము గలదు. అనంతపురముననున్నపు డచటి స్త్రీవిద్యార్థినులును ఈమెయుగలిసి చారిత్రకస్థలములగు హంపి మొదలగు చోట్లకు దర్శనార్థమరిగి ఎంతయో విజ్ఞానమునార్జించెడివారు. అనంతపుర బాలికాపాఠశాల వార్షికోత్సవమున శ్రీమతి దామెర్ల కమలరత్నముగారి యీక్రింది ఉపన్యాసభాగ మెంతయు సంస్తవనీయము.

"సోదరీమణులారా! ప్రపంచమునఁగల యితరదేశములయందలి స్త్రీలెల్లరు తమతమ యభ్యున్నతికి బాటుపడుచున్నారు. ఈతరుణముననే మనముగూడ క్లబ్బులస్థాపించి మన యభ్యున్నతికి బాటుపడవలయును. ఈపురమున నట్టిసంఘముండుటచేతనే అత్యల్పమగుధనముతో మొన్న మేము విజయనగరసామ్రాజ్య శిథిలములగు హంపీక్షేత్రమును జూడగల్గితిమి. మేమందఱమునుగలిసి యొక రైలుపెట్టెను గుత్తకు బుచ్చుకొంటిమి. అందఱమును శుభ్రమగువస్తువుల ధరించి కిలకిలలాడుచు కృష్ణదేవరాయలనాటి సంగతుల ముచ్చటించుకొనుచు నాయూర దిగితిమి. ఆయూర నొకప్లీడరు మమ్మాహ్వానించి చక్కఁగ నాతిథ్యమొసంగినాడు. ఆయన ఆతిథ్యమును మేము మరువజాలము. పిమ్మట నాయనగూడ మాతోడవచ్చి చూడదగువానినెల్ల జూపించినాఁడు. అచ్చట నొక రాతిరథముగలదు. దాని నిర్మాణచాతుర్యమును గాంచి శిల్పులే యచ్చరువందుచుండ మనమెంతవారలము. అచ్చటగల దేవాలయములు అందలి శిల్పినైపుణ్యము కన్నులారగాంచవలసినదే గాని పొగడుదమనిన భాషయందు పదజాలము కాన్పించుటలేదు. అట్టిశిల్పులను బోషించియుండిన మహారాజు కృష్ణదేవరాయ లస్తమించినాడు, ఇప్పుడు కళలకు రాజాదరణలేదు. కవిత్వమున కంతకన్న లేదు. అందువలననే కవిత్వమును, కళలును నేడు మనలో సన్నగిలిపోవుచున్నవి. పాశ్చాత్యకళలపై మనకున్న యాదరణ మనకళలపై లేదు. మా మఱఁది స్వర్గీయ దామెర్ల రామారావు చిత్రకళయందొక నూతనవిధానమును గన్పెట్టి దాని కాంధ్రాఆర్టు అని నామకరణమొనరించినాడు. అదివరకు ఖండాంతరమున ఆంధ్రుడన నెవ్వరో పేరుయూరులేదు. శ్రీయుత రామారావుగారి మూలముననే ఖండాంతరములవా రాంధ్రాదేశమనున దొకటున్నదనియును ఆందలిప్రజలు మిక్కిలి విజ్ఞానులనియును దెలిసికొనగల్గినారు. కావున అబలారత్నములారా! మీరీసంఘముల బలవత్తరమైనవానిగ నొనరించి వానివలనగలుగు మేళ్లను అనుభవింతురని ప్రార్థించుచున్నాను."

ఇట్టు లామె యుపన్యాసములు కడుంగడు విజ్ఞానపూరితములై యుండును. ఈమె యింకను భారత నారీమండలమున నెక్కుడుగ ప్రకాశించుగాక!

# సరోజినీదేవి

శ్రీమతి వోలేటి నిత్యకల్యాణమ్మగారు

౧

నీనవ్వు రేకలో
నీ చూపు సొగసులో
నీ మాట తేటలో
నవ్యకవితామృతపు
ఝురులు ప్రవహించు.
సన్నజాజి పడంతి మిన్నలే ధవళిమ
కన్నెరోజాపువ్వు కమ్మని నెత్తావి
నవ్వుమల్లియపువ్వు నవనీత మధురిమల్
పవ్వళించును నీదు పల్కుల హృదయాల
నోసరోజినీ ! నిరతంబు
ఓకవయిత్రీ ! సత్యంబు.
గాలిలో చివురాకు గలగలధ్వనులు
పాలపొంగులలోని మీగడ తెఱలు
సెలయేటిపాటలోపలి రహస్యములు
గలవు సరోజినిగానంబునందు.

౨

దాస్యశృంఖల బద్ధభారత
జనని నారసి యుస్సురంచును
ఉష్ణబాష్పకణంబు లొల్కితి
వోకటనో దేవీ !
నాటినుండియు నేటివరకున
నారతంబును భరతమాతకు
ప్రాజ్యకీర్తి ఘటింపఁజేయఁగఁ
బాటుపడినావు !
అల్లమేయో యనుచితపువా
క్యముల సత్యము లేదనుచుఁ జూ
పించి లీల నుపన్యసించితి
వెన్నొ దేశముల !

౩

శాంతియుద్ధపు రంగమందున
పంతమూనుచు నమ్మహాత్ముని
కుడిభుజమై వెలసియుంటివి
పడఁతివయ్యు సరోజినీ !
'దర్శనా' లవణంపుసత్యా
గ్రహమునందున నీవుచూపిన
పట్టుదలకల యోరిమికి జూ
పరలు ప్రమాన్పడిరి.
శాంతిరణభూతలములో నీ
స్థైర్యగుణమును గానబరచుచు
చాన లబలలుగారటంచును
జాటినావు సరోజినీ !

# శ్రీమతి మ. రాజీవాక్షిగారు తీసిన ఛాయాచిత్రములు




నరసాపురము

లూథరన్ క్రైస్తవ దేవాలయము



పాలకొల్లు

క్షీరారామ రామలింగేశ్వరస్వామి

ఆలయగోపురము.



కాకినాడ

వైష్ణవ దేవాలయము

ఒక దృశ్యము.



గుమ్మడిపండువంటి బిడ్డ



బాలక్రీడలు

# కఠినతపములరాదు నిక్కంబుముక్తి

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు

శ్రీరమానాథపాదరాజీవచింత
నామృతాస్వాద నాహృదయ ప్రమత్తుఁ
డతులభాగవతోత్తముఁడైన బ్రహ్మ
మానససుతుండు నారదమౌనివరుఁడు
విశ్వనాయకు గోలోక విష్ణుఁజూడ
నేఁగుదెంచెడు తరిని మధ్యేపథమున
దుష్టవన్యమృగాకులావిష్టభీక
రోరగాన్వితఘోరకాన్తారభూమి
నొక్కభూరుహచ్ఛాయ రేయుఁబవళ్లు
తనువుఁగృశియింప శల్యగతంబుగాఁగ
ప్రాణములు, కేవలము వాయుభక్షణమున
ఘోరతమమౌ తపస్సు కఠోరవృత్తి
జేయుచుండెడు నొకయోగిశేఖరుండు
పలికెనిట్టుల సంయమీశ్వరునితోఁ
విమలకరుణాళు గోలోకవిష్ణుఁగూర్చి
నిరతమతిభక్తితో తీవ్రనిష్ఠఁగఠిన
మగుతపము సేయుచుంటి మహాత్మ భక్త
వత్సలుని చిత్తమందురవంతయేని
దాసునకు తావుకలదో నాతప్పిదముల
సైచునో? హారికరుణారసహృదయమున
ఇంకనెన్నఁడు శ్రీగోకులేశ్వరుండు
తనయనూనకృపాసుధాధారఁజిలికి
లేచి రక్షించునో యెఱుఁగంగఁగోరి
నాఁడనంచును గోలోకనాథుతోఁడ
నామనవిగా మునీంద్రవిన్నప మొనర్చు
మనిన నటుగాకయంచుఁ బ్రహృష్టమతిఁ
బరమభాగవతోత్తముఁ డరుగుచుండ
ననతిదూరంబునందె మహాప్రమోద
వీచిఁదోఁగుచు నున్మత్తు వితము సతము

జ్ఞానపత్రినిఁద్రా వెడి శాంతిరాము
డబ్జసంభవసూతికిట్లనియె "పూజ
నము, భజనలేనినాదుగజ్ఞాయితడియు।
నేమి? గోలోకమున నిందిరేశుతోఁడ
నడుగుమీ? నారదా!" యన నబ్రమంది
వల్లె: యని యంతఁజని భగవానునిఁగని
ప్రణుతులొనరించి యాసిద్ధవరుని మనవి
శాంతిరాముఁడు వల్కెనసరణి నెల్ల
విన్నవించెను గోలోకవిష్ణుతోఁడ
సంయమీంద్రు వచస్సులసాంతముగను
వినెడుతరి నాని శాంతిరాముని గురించి
చెప్పనంత తత్క్షణమె యచ్చెరవుగాఁగ
శౌరి కనుగొల్కులందు నవారిప్రేమ
వారివర్షముగురియఁ గృపావిభూతి
బల్కెనిట్టుల "వత్స! ప్రపంచమందు
సరళవిశ్వాసభక్తికి శాంతిరాము
సాటియగువారులేరు నిశ్చయముసుమ్మ
నవ్యనవనీతమృదుల మనఃప్రవృత్తి
నన్నుస్మరియించు నెడల ననంతభక్తి
తన్ను మరపొంది తన్మయత్వమునుఁజెంది
లీనమైపోవుచుండు నాలోన సతము
శాంతిరాముని భక్తి విస్తారజలధి
తరచిచూడ నెవ్వరికి సాధ్యంబుగాదు
కమలజోద్భవ యోగిశేఖరుఁడెవండో?
నెంతచూచిన జ్ఞప్తిరాదింతయేని
ననుచు వచియించెనౌర? పరాత్పరుమది
నవిరళంబగు ప్రేమ నిత్యముభజించు
వారలకుముక్తి కొంగుబంగారముగద?
కరము తనువు గృశింపముష్కర కఠోర

సాధనలు జేర్చునే జగన్నాథుదరికి?
నిర్మలప్రేమవాత్సల్యనిబిడపూర్ణ
మానసమొకండెగాదె ప్రధానమగయ?
అంత నారదముని పరమాత్మవలన
శలవుఁ గొనిముదాప్తింజేరి శాంతిరాము
పరమభాగవతోత్తమా! వందనములు
యనుచు మాధవు మధురవాక్యములఁ దెలుప
నాలకించి మహాప్రమోదాబ్ధిఁదోఁగి
నుబ్బి తబ్బిబ్బు పడుచు నహో! యటంచు
చంకలనుఁగొట్టుకొనుచు నీసఃణిఁబాడ
సాఁగె "నవిచలసరళవిశ్వాసభక్తి
నెవరు భగవాను మది భజయించుచుంద్రో
వారి గజ్జాయి ప్రభుని కన్నీరు తోఁడ
నిటులెతడియుచునుండు సుమ్మీ మునీంద్ర
సత్యమిది; సత్యమిది; త్రిధా సత్యమిద్ది
అవ్యయానందసామ్రాజ్యదివ్యపదము
ననుభవింపంగ సాధ్యమా యందరకును?
భక్తిపరతంత్రు శ్రీ పాదపద్మయుగళి
నిశ్చలమున మనఃపీఠి నిలుపవలయు
దీనమందారు మధురమూర్తిని సతంబు
నిర్మలాంతరంగమున వర్ణింపవలయు
అనుపమానకృపానిధి యతులయశము
శ్రావ్యతరముగ గానంబు సలుపవలయు
విమలచారిత్రు మంగళవిగ్రహంబు
ననుకొని నంత ప్రత్యక్షు మందవలయు
ఆత్మవత్సర్వ భూతాని యనెడిసూక్తి
విశ్వసౌభ్రాతృతత్వంబు వెలయవలయు
తతపరోపకారార్థమిదంశరీర
మనెడు నార్యోక్తి సార్థక మందవలయు
మహి నహింసయే పరమధర్మ మనుమాట
నిత్యతపమునుగావించి నెగడవలయు
సుమతి బాపాయ పరపీడనమనుపల్కు
శ్రుతి విహితమాట లెరిగి వర్తింపవలయు
చిత్తమది పరిపక్వము చెందవలయు
నిత్యపరిపూర్ణతను మదినిండవలయు
నంతియే గాని స్థిరబుద్ధి నందలేని
ఉన్నతసరళవిశ్వాస మొందలేని
చిత్తనైర్మల్య సంశుద్ధి చెందలేని
కఠినతపముల రాదు నిక్కంబు ముక్తి.



# గృహము : స్త్రీలు

శ్రీమతి పరచూరు భువనేశ్వరిగారు

మనము నివసించునది గృహము. ఆగృహము పరిశుభ్రముగనుండవలయును. గృహమపరిశుభ్రముగనుండిన నందు నివసించుజనులకారోగ్యము చెడును. వ్యాధులు సంభవించును; వయసుచెల్లకపూర్వమే జీవనమును గోల్పోవుదురు. అందువలన మనగృహములు నిరంతరము పరిశుభ్రముగనుండవలయును. మనము గృహమును చిన్నవీధులలో గట్టుకొనరాదు. పెద్దవీధులయందు, బయలులయందు గట్టుకొనుచుండవలయును. మనకు బయలుస్థలమున్నంతమాత్రమున నచ్చట గృహమును నిర్మింపగూడదు. ఆస్థలము మన నివాసమునకు యోగ్యమా లేక అయోగ్యమాఅని విచారించుకొనవలయును. అచ్చట స్నానవసతి, విహారవసతులు గలుగునట్లుగ మనము గృహమును నిర్మించుకొనవలయును. ఇప్పటి భారత పుత్రులు గృహనిర్మాణవిషయశాస్త్రజ్ఞుల పిలిపించి మేమిచ్చట గృహమును కట్టుకొనుచున్నాము. మాకాస్థలము సుఖము చేకూర్చునాయని ప్రశ్నించెదరు. వారు సుఖములు కలుగునని నచ్చటనే గృహమును నిర్మించుకొని కాపురము చేయుచుందురు. లేక మరియొక స్థలమున భవనమును నిర్మించుకొందురు.

మనము నిర్మించుకొన్న భవనము విశాలముగను, అనేకగవాక్షములుగలదిగను, గదులెక్కువగనుండునట్లుగను పుష్పవనవాటికలకనుకూలముగను గృహము నిర్మించుకొని వేసవికాలమునందు మలయపవనార్థమై నారికేళాదివృక్షపరివృతముగ నుంచుకొనుట లెస్స. అట్టిగృహమునందలి జనులారోగ్యవంతులగుదురు.

మనము నివసించు గృహమునకు శోభరావలయునన్న పేరుప్రతిష్ఠలు రావలయునన్న స్త్రీయే ముఖ్యము. గృహమునకు లక్ష్మి స్త్రీ. అందువలననే విజ్ఞులు స్త్రీలను గృహలక్ష్మియని పేరిడిరి.

గృహము పరిశుభ్రముగ నుండవలయునన్న స్త్రీకి కొద్దిగనో గొప్పగనో ఆరోగ్యాదివిషయములు, సంసారభారనిర్వహణవిషయములు తెలిసియుండవలయును. ఏదైనను తెలిసికొనవలయునన్న విద్య కావలయును. ఆవిద్య యిప్పటి మహిళామండలికి లేదనియే నొక్కి వక్కాణింపవచ్చును. అందువలన గృహములు పరిశుభ్రతయందును, నాగరికతయందును కొఱవడియున్నవి. ఈకొఱతపోద్రోలుటకు ఆంధ్రపురంధ్రులు విద్యనవశ్యమభ్యసింపవలయును. జ్ఞానము సంపాదింప వలయును. సంసారమును నిర్వహింపవలయును. అప్పుడు గదా వారి జన్మసార్థకమగును. ఆంధ్రపురంధ్రులు తీరికయున్నకాలని దేశసంరక్షణార్థమై పాటుపడవలయును. తీరికయున్న కాలమును వృథపుచ్చక రాటమువడుకుటయో, గ్రంథములను పఠించుటయో ఆచరించుచుండవలయును. మన మహిళామండలి ఇంకను "చనిన నిమిషమింక మరది గాదు" యనుసూక్తినిగ్రహించలేదు.

ఇకనైనను మేల్కాంచి స్వకృత్యముల నిర్వర్తించుకొనుటమేలు. అయ్యో! ఎట్లు మేల్కాంచుట? ముందు పురుషులు మేల్కాంచవలయును. వారు మేల్కాంచి స్త్రీవిద్యకై పాటుపడవలయును. అబలలైనవారిని రక్షింపవలయును. అప్పుడు వారికి జ్ఞానమొదవును. వారు కార్యములయందు శ్రద్ధతీసికొందురు. ఇప్పటిభారత యువతీజనము సదాకాలమును వెళ్లబుచ్చుటయేగాని చేయుకార్యములు కనపట్టుటలేదు.

కన్యకలను సంరక్షించుకొను విషయము తల్లిదండ్రులదిగదా. తల్లిదండ్రులు తమశక్తికొలది వారికి కొంచెము విద్యనేర్పి తరువాత గృహకార్యములయందు ప్రవేశపెట్టవలయును.

ఇప్పటి జననీజనకులు పాఠశాలయందు పంతులు కొట్టునని లేనిపోనిభయముచే దమకుమార్తెలను బడికిబంపక ఇంటియందుంచుకొందురు. గృహకృత్యములయందు ప్రవేశపెట్టుటకు ఆపొగకు, నిప్పుకు దాళలేరు. బంగారులాగు మెరుగులుదేరు ఆమ్మాయిలమేను వాడి పోవుననియు జెప్పుచు రెంటికి జెడినవారలను జేయుదురు. అత్తింటికివెళ్లినపుడు పాపమాయమ్మాయిలేమి జేయుదురో?

వారికిష్టమైనప్పుడు భుజించుట, రోజునకు రెండుమార్లు వైద్యులగృహములకేగుట వారుచేయుపనులు. తినినది పనిచేయకపోయిన నరుగదుగదా. తినినది అరుగనందున వారికి వ్యాధులుగలుగును. రోజునకు రెండు మూడు మార్లు వైద్యులగృహములకు వెళ్లుట తటస్థించును.

ఇప్పటికన్నెలకు సంసారమననేమియో యెట్లునడచుకొనవలయునోగూడ తెలియదు, పట్టిముగ్ధలు. వారికి వివాహములుజేయుదురు. అత్తవారింటికిపంపుదురు. అత్తమామలయందు, భర్తయందు నెట్లునడచుకొనవలయునో వారికేమి తెలియును? అత్తలను కూర్చుండబెట్టి పనిచేయవలసినదిపోయి తాము కూర్చొని అత్తలచేపనిజేయించుకొందురు. ఇంతేనా? భర్తయన నెవరో వారికి తెలియదు. భర్తయందు లక్ష్యముండదు. అగ్నిసాక్షిగ వివాహమాడిన భర్త దైవసముడని యిప్పటి భారతయువతులు గ్రహించుటలేదనియే చెప్పుటకు అవకాశమున్నది. స్త్రీలు బద్ధకముగలవారై పనిపాటలుచేయక దాసీల నేర్పరచుకొని వారికొక ముద్దపెట్టి వారిచే రాత్రిపగలనక పనిపాటలు జేయించుకొందురు. వారు వేళకు భుజించుట, పరుండుట, వైద్యభవనముల కేగుట, సదావ్యాధులచే తీసికొనుట మొదలగు దుర్గుణములచేతీసికొందురు.

విలాసలాలసులగు భాగ్యవంతుల భవనముల పరికింతము. అవి పైన పటారము లోపల లొటారమన్న సామెతగానుండును. వారిగృహములయొక్క లోపలకువెళ్లిన కల్లుముంతలు, సారాయిముంతలు గానగును. వారికి పనిపాటలుండవు. పనులున్న దాసీలు చేయుదురు. వారిపని స్వేచ్ఛగకాలమును వెళ్లబుచ్చుటయే. ఆ గృహములయందు ధూళినిండుగనుండును. ఎప్పుడును గోమయముతో నలుకరు. ముగ్గులుపెట్టరు. అన్నము నున్నకుండలమీద మూకళ్లుంచరు. వాటిమీద ఈగలువాలిననుసరే. ఏమిచేసిననుసరే. శుభ్రమన నెరుంగరు. నిరంతము దాసీలనేడ్పించుటయేతప్ప వారికేమి తెలియును?

ఇట్టిపద్ధతినుండి ఎంతత్వరలో విడివడిన వారికంతమంచిది. గృహములను మాసమునకొకసారిసున్నము కొట్టి అలికి ముగ్గులుపెట్టి పరిశుభ్రముగా నుంచుకొనవలయును. "ఆరోగ్యము మహాభాగ్య" మనుమాటయే మరువకూడదు.

---

## గోదావరిలో స్టీమరు




(ఛాయాచిత్రగ్రాహకులు : ఆలమూరు శ్రీనివాసరావుగారు బి.యె.)

# హృదయవీథి

తురగా వేంకటరామయ్యగారు

౧

ఈ తోటలో నాడగలనా
అందాక
ఈరాగముల నాపగలనా
పూలవీణ ధరింపగలనా
జీవాలు
పోయినా: పాడుకోగలనా?

౨

శ్లోకాలు నిర్జించగలనా
లీలాభి
షేకాలహాయి మనగలనా
కల్యాణిలో కలియగలనా
ఆనంద
గానమ్ములో కఱుగగలనా?

౩

పాటలోనే బ్రతుకగలనా
కోటిరూ
పాలలోనే దిఱుగగలనా
జీవితమె నిత్యమనగలనా
హాయిగా
జీవగానము బాడగలనా?

౪

ఏటియురవడి నాగగలనా
నాపడవ
దాటించుకొని సాగగలనా
రేవులన్నీ చూడగలనా
ప్రేమమే
దేవుడని చాటించగలనా?

౫

సాగరమ్మును జేరగలనా
కెరటాల
సాహసమున నీదగలనా
గంభీరముగ పాడగలనా
నదులెల్ల
కలియుటే వీక్షింపగలనా?

౬

మాధవుని దర్శింపగలనా
అతనిలో
రాధనై విహరింపగలనా
ప్రణయలోకము లేలగలనా
దేవతా
భావాలు వర్షింపగలనా?

# పవిత్రపు నీడ

ముద్దా విశ్వనాథము గారు

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యంకర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

[ తా:—నీవు ఫలసంగ వర్జితుండవై నిత్యంబును చేయదగిన కర్మమును చేయుచుండుము; ఏపురుషుడు ఫలమును కోరనివాడై కర్మమును చేయునో ఆపురుషుడు మోక్షమును బొందుచున్నాడు. ]

—(భగవద్గీత, తృ. అ. 19-వగీ.)

ప్రహ్లాదుడు, జనకుడు మొదలగు నిష్కామయోగుల పవిత్రచరిత్రములవంటివి మనపురాణములయందే గాక యితరదేశ వాఙ్మయములందును గానవచ్చుచున్నవి. ఫ్రెంచ్ భాషనుండి 'గాత్ క్రాస్టె' చే నాంగ్లేయములోని కనువదింపబడిన హృదయంగమమగు నొక చిన్నకథ నిట వివరింతుము.

ఒక సన్యాసి తన నిష్కామమగు కర్మాచరణమువలన దేవతల మెప్పు వడసెను. తమకు తెలియకుండగనే నక్షత్రములెట్లు వెలుగు నిచ్చుచున్నవో, తమకు గోచరములేక పుష్పములెటులు పరిమళము వెదజల్లుచున్నవో, అటులనే ఈ సన్యాసి తన కెఱుకలేకనే యెన్నియో సత్క్రియ లొనర్చుచుండెను.

అహింస, దానము—ఈరెండు పదములలో నతని జీవితాశయమిమిడియున్నదని చెప్పవచ్చును. కాని యెన్నడును 'నేనీపనిచేసితి' నని చెప్పుకొని యెఱుగడు. చిద్విలాసము, దయాళుత్వము, క్షమ, దాతృత్వము—ఈసుగుణపుంజమే యాతనికీర్తి వేనోళ్ల చాటి, యెల్లదిక్కుల వెల్లడిచేయుచుండెను.

దేవత లీతనినిష్కళంకమగు సత్స్వభావమునకెంతయు సంతసించి శ్రీమన్నారాయణునొద్దకుదోడ్కొని జని "ప్రభూ! ఈసన్యాసికి అమానుషక్రియ లొనర్పగల వరమెద్దియేని ప్రసాదింపవలయు" నని కోరిరి.

అందులకు భగవంతుడు, "అటులనే యిచ్చెదను; వాని యభీష్టము కనుగొనిదెల్పుడు" అనియెను.

దేవతలు (సన్యాసితో):—ఏమయ్యా! స్పర్శతగిలినమాత్రాన నెట్టివ్యాధియైన నివారణచేయగల "యమృతహస్తము" నీకు వలయునా?

సన్యాసి:—మహాత్ములారా! వలదు, వలదు. అట్టియద్భుతక్రియలొనర్ప నాపరమేశ్వరునికే చెల్లును.

దే:—పాపాత్ములను బాధలనుండి విమోచనచేయుటకును, దుష్టులను సన్మార్గమునకు మరలించుటకును నీకు శక్తినిచ్చెదము తీసికొనుము.

స:—అయ్యా! అది దేవతలకర్తవ్యము; నేజేయనొల్లను.

దే:—పోనిమ్ము, నీకు 'క్షమాకవచ' మిత్తుము; గైకొనుము. దీనివలన నుద్భవించు సద్గుణముల ప్రభచే ప్రజలాకర్షింపబడి భగవంతుని స్తోత్రముచేయుచుందురు.

స:—అయ్యలారా! వలదు. ప్రజను నేనాకర్షించినచో దైవమునుండి వారికెడబాటు గలుగును. భగవంతుని స్తుతింప మానవుల ప్రేరేపించు నితరసాధనము లెన్నియో ఆప్రభువునకే తెలియును.

దే:—మఱి, నీ కోరిక యేమి, చెప్పుము?

స:—[చిఱునగవుతో] నాకేమి వలయును! శ్రీమన్నారాయణుని కటాక్షమున్న చాలదా?

దే:—ఓయీ, యతీ! ఎద్దియైన వరమొకటి నీవడిగితీరవలయు. లేనిచో, బలవంతముగ మేమే నీకిత్తుము.

స:—అటులయిన నాకెటుక లేక నే నేసెన్నియేని లోకోపకారములగు సుకృతములుగా వింప ననుగ్రహింపుడు!

ఇందులకు దేవతలు కొంతనడి కలవరపడిరి. అటుతరి యొకసభగా వించి యిట్లు తీర్మానించుకొనిరి:—"సన్యాసి యొక్క నీడ యతనికి కనబడకుండ వెనుకప్రక్కనున్నపుడును, ఇరుప్రక్కలనుండునపుడును మహత్తర శక్తిగలిగి యుండవలెను; దేవతాప్రసాదితమగు నీ యద్భుతశక్తి మూలన నీడబడినయెడల ఆనారోగ్యము సమయును, ఎవ్విధమగు బాధలైన నంతరించును, విచారములు పటాపంచలగును."

ఆక్షణమునుండియు వరము క్రియారూపముదాల్చెను. సన్యాసి నడచునపుడు, యిరుప్రక్కలను నీడ యుండినంతవఱకు ప్రదేశము పచ్చనై కన్నులపండువుగా నుండెను; మోడులుసహితము చిగిర్చెను; నీడస్పర్శ వలన నీరులేని చెఱువులు నిర్మలగంగాపూరితము లయ్యెను; పాలిపోయిన యనారోగ్యపుశిశువులు నీడజొచ్చి చిటుకలో స్వస్థతచెంది యుల్లాసముగనుండి తలిదండ్రుల కమితోత్సాహముగొల్పుచుండిరి.

ఈ జరుగుచున్న యద్భుతమగుమార్పులు తెలియకనే సన్యాసి తననిత్యకృత్యములు జరుపుకొను చుండెను. తమశక్తిచే కలుగుచున్న వెలుతురు నెటులు నక్షత్రములు గుర్తింపలేకున్నవో, తమనుండి విడివడు పరిమళము నెట్లు పుష్పములు తెలిసికొనలేకున్నవో అటులనే వరప్రభావమున తననీడచే గలుగుచున్న లెక్కలేని లోకోపకృతులు సన్యాసికి జ్ఞానపథమునకు రావయ్యెను.

జనులు యతీశ్వరుని నమ్రతకనిపెట్టి, యతని కీయద్భుతవిషయములు తెలియనీయకుండగనే, నిశ్శబ్దముగ వెంబడించు నీడజొచ్చి మేలుపొందుచుండిరి. రానురాను ప్రజలు కొంతకాలమున కాతని పేరుకూడమఱచి "పవిత్రపునీడ" యనునామమే సార్థకముగ వాడజొచ్చిరి.

# మదరాసు కాపురము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

అవగాహనస్నానమా? అబ్బెనని ముక్కుమూసికోవలెఁ గూవమునదిఁజూచి
కమ్మనికూరలా? కలవనితలయూఁపవలెఁ దిర్వలికేణి పొలమునరసి
చల్లనిగాలియా? చాలుఁబొమ్మని తల్పుగడెవేయవలె దొడ్డికంపుసోఁకి
ఆరోగ్యమా? తక్కువాయేమి యని పొంగిపొరలఁగావలెను డాక్టరులనెఱిఁగి

భాగ్యభోగ్యాభిలాష మభ్యధికపఱిచి
తదుపభోగోపపత్తి దుర్బలతచేన
వస్థఁగూర్చు సామాన్యగృహస్థునకును
జెన్నపురము కాపుర మెట్లు చేయఁగలమొ?

# భారతా!

పెమ్మరాజు రాజగోపాలము గారు సారస్వతసమాజము

ఈ
చుంబితాంబర
శైలశిఖర
భారతావని మన
మాతృభూమిర! భారతా!
తాడవింపర! ఓభారతా!
ఈ
సన్నదీనద
రమ్యకానన
సుందరావని మన
జన్మదేశము భారతా!
ఆడిపోవేరా! ఓభారతా!
ఈ
శ్యామసుందర
సస్యశోభిత
క్షేత్రశాలిని మన
కన్నతల్లిర! భారతా!
పొంగిపోవేరా! ఓభారతా!
ఈ
వీరపూరుష
జన్మకారణ
మాతృమణి మన
దేశమాతర! భారతా!
మేలుకోరా! ఓభారతా!
ఈ
ఆర్యనిలయము
జ్ఞానకందము
భాగ్యదేవత మన
పుట్టినిల్లుర! భారతా!
పాడవేరా! ఓభాగతా!

భరతమాతకు జయ

# సంసారనిర్వాహణము

ఆలూరు రామచంద్రయ్యగారు బి. యె.

భర్తలయెడ నూతనముగ కాపురమునకు వచ్చుభార్య లెట్లు ప్రవర్తింపవలయునను విషయము ముఖ్యముగ గమనింపదగినది. కొందఱుస్త్రీలు యింటికిని మగలకునుకూడ యజమానులుగ నుండగోరుదురు. సైరింప వీలుంపుపఱకీయాజమాన్యమును భర్తలు సహింతురు గాని శ్రుతిమించినచో వారు తమ తమ యిండ్లనువదలి సమయము దొరకినప్పు డెల్ల యితరులతో కాలము బుచ్చుదురు. అప్పుడు స్త్రీలు తమతప్పిదములనెఱిగి దుఃఖింప వలసివచ్చును.

కుటుంబపోషణ భర్తయొక్క ఆరోగ్యముపై నాధారపడియున్నది. భర్త ఆరోగ్యము గృహమునందు అతనికిగల్గు సౌఖ్యముపై నాధారపడియున్నది; అట్టిసౌఖ్యము స్త్రీపై నాధారపడియున్నది. ఆమె యింటిని రమ్యముగనుంచవలెను. భర్తవచువేళకు, యింటి పనులు చక్క బెట్టుకొని, కురులు దువ్వుకొని, శుభ్రమగు వస్త్రముల ధరించి, మోమున తిలకమిడి, పుష్పాలంకృతయై, శోభిల్లుచు మృదూక్తుల అతని గారవింపవలెను. స్వల్ప విషయములయ్యు భర్తకానందము గూర్ప జాలినవి ఇవియే. పగలంతయు కాయకష్టపడి యింటికివచ్చిన మగనికి మంచి పదార్థములను ప్రియముగ వండిపెట్టవలయును. అట్లుచేసిన, అతను ఆహారమును సంతోషముగ, నిదానముగ భుజించి తృప్తినొందును. తనకు మంచి యిల్లాలు దొరకినదను సంతోషమున గర్వించును.

కొందఱు స్త్రీలట్లుగాక భర్త యింటికివచ్చువేళకు చింపిరితలలతో, మలినవస్త్రములతో యెదురేగి అతనికి సంబంధించని స్వల్పవిషయముల గూర్చి తప్పులు బెట్టుచు, అతని ఆహారపానీయముల గమనింపకుందురు. నడుముపడిపోవునట్లు దుంగలు దూలములు మోచియో, మెడగుంజ్లు జారునట్లు వంచిన వీపెత్తక వ్రాసియో, కుటుంబరక్షణార్థము కష్టములపొంది యిక మంచముమీద నొరిగి కొంత విశ్రాంతి బొందుదమను నాసతో నిండ్లకరుదెంచిన పురుషులను భార్యలను కొందఱు పెనుభూతములు ఆడెడు దుష్ప్రలాపములు వారికి కనుకుపాటెయ్యవు. ఇండ్లు శ్మశానములకంటె భయంకరములగునట్లు చేయు

దురు. ఇందువలన జిగుప్సతో ఇంటికై సెలవుచేయవలసిన విత్తమును భర్తలు యెక్కుబ్బునందో, మరి యితరవిధములలోనో వెచ్చింతురు. పురుషులు సాధారణముగ మంచి స్వభావులు. వారి యందలి మంచిస్వభావము వృద్ధిపొందుట కవకాశములేనిచో దుష్టులగుదురు. తమ భర్తల స్వాధీనము నందుంచుకొని సంతోషపఱుచు శక్తి భార్యలయందున్నది. ఇందులకు విద్య యవసరము.

స్త్రీలకు విద్య అవసరము. విద్యాగంధము లేక మృగప్రాయులై యుండు స్త్రీలకు ప్రపంచజ్ఞానముండదు. యుక్తాయుక్తములు తెలియవు. స్త్రీలుజ్ఞానవతులైనచో ఆసంసారము నందుస్వర్గముకంటె సుఖతరమైన సుఖముకల్గును; లేనిచో నరకలోకమగును. అజ్ఞానులైన కాఠిన్యత మొదలగు గుణములలవడును. స్త్రీలకు విద్య నేర్పుట ప్రమాదకరమని కొందఱి యభిమతము; కాని అది సరికాదు. "కత్తిపీటను ప్రమాదముగ నుంచితిమేని ఎపుడయినను కాలు తెగును. స్త్రీలు క్రోధము వచ్చినపుడు బలవంతముగా నూతఁబడిచత్తురు. రోగి పీడితుడన్నము దిన్నయెడల వ్యాధిహెచ్చును. గుఱ్ఱపుబండి మీద బోవువాడు గ్రహచారముచే దానినుండి పడి కాలువిఱుగ గొట్టుకొనును. ఈహేతువుల మీదఁగత్తిపీటల నందఱును మొద్దుపఱచుకొనవలెనని గాని, నూతుల నందఱును బూడుచుకొనవలెనని కాని, అన్నము నందఱు మానుకొనవలెనని కాని, గుఱ్ఱపుబండ్ల నందఱును విఱుగగొట్టికొనవలెనని కాని చెప్పిన నెంత సందర్భముగనుండునో స్త్రీవిద్య యనర్థదాయకము గనుక మానుకొమ్మన్నను అంతే సందర్భముగ నుండును" అని 'కామినీదుర్గుణదూషణము, తన్నివారణమార్గములు' అను గ్రంథమునందు చెప్పబడియున్నది.

ప్రతిమానవునికిని స్వలాభాపేక్షకలదు. సంపాదించు ద్రవ్యమునందు కొంత నిలువ యుంచ ప్రయత్నించుట మానవునికి సహజము. అకస్మాత్తుగ రోగమో, మఱియేదైన విపత్తు కల్గినయెడల తాము యితరులపై యాధారపడ నక్కరలేదు కదాయను ధైర్యము కలుగును. కాబట్టి యీ విషయమునందు స్త్రీ పురుషునికి సహాయకారిగావలెను. భర్తలు సంపాదించిన దానిని దుర్వినియోగము జేయక రక్షింపవలెను. కుటుంబ భోగమునకు తగినంత వస్తువులకు మాత్రము వెచ్చించుచు మిగిలిన వాటిని జాగ్రతగ కాపాడవలెను. ఆదాయమునకు మించిన వ్యయముచేయుట ముప్పు అను విషయ మెఱింగి భర్తలకెట్టి కష్టములను కలుగనీయక భార్యలు మెలగవలయును. పురుషులకు అన్నవస్త్రములు దొరికిన చాలును. స్త్రీల కట్లుగాదు. వారికి అలంకారములును కావలెను. నగలకు, మంచిమంచి

చీరలకు భర్తలను తొందరసేయరాదు. వారిసుఖదుఃఖముల నెఱిగి ప్రవర్తించుటయే ధర్మము. సంసారమునకు లాభకరమైన కార్యములను గావించుట, బిడ్డల యభివృద్ధికై పాటుబడుట, భర్తల కొడబడియుండుట, బంధుజనమిత్రులను అతిథి అభ్యాగతులను సత్కరించుట, దైవచింతన, వ్యవహారజ్ఞానము, సంగీతము, పాకక్రియానైపుణ్యము స్త్రీలకుండవలసిన ప్రధానగుణములు. యువతులకు తమచుట్టములవద్ద చిరకాలము వసించుట యుక్తముకాదు. అది కీర్తిని, ధర్మాచారమును పోగొట్టును. ఆమెయొక్క స్థానము తనభర్తవద్ద. అతని సేవయే ఆమెకు స్వర్గ సుఖములనిచ్చును. ప్రత్యేకముగ ఆమె యెట్టి వ్రతములగాని ఒక్క ప్రొద్దులను గాని సలుపపనిలేదు. ఆమె పతివ్రత యనుపేరు బొందవలెను. అనుశాసనిక పర్వమందు:

> అనన్యచిత్తాసుముఖీ యానారీధర్మ చారిణీ,
> పరుషాణ్యపి చోక్తాయా దృష్టేక్రుద్ధేన చక్షుషా,
> సుప్రసన్నముఖీభర్తుర్యానారీసాపతివ్రతా॥

అని చెప్పబడియున్నది. అనగా, మగడుతప్ప యితర పురుషుని తలపనదియు, ధర్మాచారపరాయణయు, భర్త పరుషపువాక్కుల నాడినను కోపపడక సంతోషస్వాంతయై యుండునట్టి స్త్రీ పతివ్రతనాబడును. అట్టి కళ్యాణిని చేపట్టిన ధన్యుడు వీలుకల్గినప్పుడెల్ల నింటియందే యుండగోరును. అతనికి గృహముకంటె వేరు స్వర్గభూమియుండదు.

# స్త్రీస్వాతంత్ర్యము : ముసొలోని అభిప్రాయము

వడ్లమూడి గోపాలకృష్ణమూర్తిగారు

"నెపోలియనుచక్రవర్తి తన యర్ధాంగితో 'సతీ! సంతానముబడయుటకే నిన్ను పెండ్లాడితిని గాని మంత్రిత్వమొనర్చుటకు గాదని' చెప్పియుండెను. నా యభిప్రాయము నింత యందమైనమాటలలో చెప్పలేక

---

ప్రపంచమునంతటిని నెదుర్కొనుచున్న స్త్రీస్వాతంత్ర్యసమస్యపట్ల ఇటలీపరిపాలకుడగు ముసొలోని యభిప్రాయమును ఇచ్చట తెలుపుచున్నాను. ప్రేమతోకాక కత్తిమొనతో భయపెట్టి పరిపాలించుచు గాంధిమహాత్ముని అహింసాతత్వమునకు కేవలమువ్యతిరేకోద్దేశ్యము గలిగిన ఈనిరంకుశాధికారి విపరీతాభిప్రాయములను "గృహలక్ష్మి" పాఠకు లిదివరకే కొంత తెలిసికొనియున్నారు. దీనినికూడ విమర్శకదృష్టితో పఠించి బాగోగులయోచించి ఆత్మపరిశోధన జేసికొనవలసిన భారము ఆంధ్ర స్త్రీలోకము మీదకూడనున్నది. కనుకనే ఇందలి ప్రతివాక్యమునకును వ్యతిరేకడనేయయ్యును, ఈ వాక్యావళిని పాఠకులకొసగింప సాహసించితిని.

పోయినను నీనితో చాలవర కేకీభవించెదను. ఈనాటి స్త్రీ రాజకీయములలో పాల్గొన్నచో దేశక్షేమమునకై తా వహింపవలసిన బాధ్యతను గమనింపకపోవుట కవకాశముండును. కనుకనే స్త్రీ రాజకీయరంగమునకెక్కి గంతులు వైచుట నేను మిక్కిలి ద్వేషించెదను.

స్త్రీ లెన్నడును, ఎట్టి క్రొత్తవిషయమునుగాని కనుగొనలేదు. వైద్యశాస్త్రము, న్యాయశాస్త్రము, లలితకళలు, నాట్యము—దేనియందుగాని ఒక స్త్రీ యీ నూతనపరిశోధన నొనర్చినదని వ్రేలుపెట్టి చూపగలవారెవరైన నున్నారా? స్త్రీ లనుకరింపగలరేగాని సృష్టింపజాలరు. ఎంతదూరమో యేల—వారి యాభరణములు, దుస్తులు మొదలగువానినికూడ వారు స్వతంత్రముగ నిర్ణయింపజాలరు. ఈచీరె ఇట్లున్నచో సౌందర్యదాయకము—ఈ యాభరణ మీతీరుగనున్నచో నేత్రోత్సవమనికూడ స్త్రీబుద్ధికి తోచదు. పురుషుని ఆలోచనయే వారికి గతి. రాచకీయములలోగూడ వీరియవస్థ ఇంతగనేయున్నది. పార్లమెంటులోని స్త్రీలు కేవలము అల్లరిపిల్లకాయలే. అనవసరప్రసంగములు మెండు. ఒక చట్టముయొక్క మంచిచెడ్డల విచారించి యుక్తాయుక్తవిచక్షణజ్ఞానముతో తమనిర్ణయము నొసగుట వీరి కలవాటేలేదు. పార్లమెంటుసభాప్రాథమికోద్దేశ్యమునకే భిన్నముగను, సామాన్యధర్మమునకే కేవలము వ్యతిరేకముగను ప్రవర్తించి తమ వ్యక్తిత్వమును నిలువబెట్టుకొనుచుందురు. భావిమానవజాతియగు శిశువులపోషణము, రాజ్యపాలనముఅను నీ ద్వంద్వకార్యనిర్వహణమును స్త్రీ యొనర్పజాలదు. ఇందున నేదియేని ఒక్కటిమాత్రమే యామె చేయగలదు. ప్రకృతి స్త్రీని పిల్లలతల్లిగానుండునట్లేర్పాటుచేసినది. రాజ్యాంగవ్యవహారముల పురుషులకు వదలివేయుటయే శ్రేయోదాయకమని స్త్రీ ఎంతత్వరలో తెలిసికొనిన నంత మంచిది. స్త్రీ సంపూర్ణస్వాతంత్ర్యమునకు నేను ప్రతికూలుడను. స్త్రీస్వాతంత్ర్యము ప్రపంచమున కణుమాత్రమైన మేలొనగూర్పలేదు సరిగదా కుటుంబసంస్థనే కూల్చివైచి ప్రపంచశాంతికి ప్రబలశత్రువుగా నున్నది. కొలదికాలముక్రిందట నేను జనాభాలెక్కలను పరికించిచూడగా ప్రపంచమునందంతటను జననములు తగ్గిపోయినట్లు తెలిసినది. పురుషులుచేసెడి ఉద్యోగములను, వారు నిర్వహించెడు రాజకీయబాధ్యతలను స్త్రీలే వహించుచు స్వతంత్రత ననుభవించుచోట్ల నీవిషయము మరియు స్పష్టముగ కనబడుచున్నది.

రాచకీయముల స్త్రీలు సహజముగ నసమర్థలు. శిశువులు, వివాహములు మొదలగువిషయములందు చట్టనిర్మాణమొనర్చుటకు వీరికి ప్రత్యేకసామర్థ్యముండుట వాస్తవమే. అనాదినుండి స్త్రీజాతి కట్టిశిక్షణము లేకపోవుటచేతను సహజముగ తాత్కాలికావేశపూరితలగుటచేతను వారివలన దేశమునకు మంచికంటె చెడుగే ఎక్కువుగ జరుగుచున్నది. స్త్రీలు కొన్నిపట్ల దేశోపయోగకరములగు కొన్నిచట్టముల నిర్మించుటకు కారణభూతులైయుండిరనుట నేను కాదనను. కాని ఈచట్టముల కొకయాకృతినిడి వానిని ఆచరణలోపెట్టి వానివలన నేమైన ప్రపంచమునకు ప్రయోజనముకలుగజేయుటకు పురుషసహాయ మత్యవసరమైయుండెను.

అణుమాత్రమైన యదార్థానుభవముగల స్త్రీని మీరెవ్వరైన నెచ్చటనైన జూడగలిగిరా? నాకుటుంబమునగల స్త్రీలపట్ల నుచితగౌరవమున్నప్పటికిని, నేనుమాత్ర మట్టియామెను చూడలేదని చెప్పవలసియున్నది. స్త్రీలు పురుషునిజీవితమును సుఖవంతముగజేయుట కత్యవసరము. కాని వారింటనేయుండి పిల్లలను కని పెంచుచు పురుషునికి అధ్యాత్మికముగ సాయపడుచుండవలెను.”

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కు పలుకులు

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

పండమ్మపండు !
ఏమిపండు ?
మామిడిపండు—
ఏమిమామిడి ?
ముంతమామిడి—
ఏమిముంత ?
ఆముదంముంత—
ఏమిఆముదం ?
వంటఆముదం—
ఏమివంట ?
పిండివంట—
ఏమిపిండి ?

నున్నిపిండి—
ఏమినున్ని ?
మినపనున్ని—
ఏమిమినప ?
పెద్దమినప—
ఏమిపెద్ద ?
బడిపెద్ద—
ఏమిబడి ?
వీధిబడి—
ఏమివీధి ?
సంతవీధి—
ఏమిసంత ?

గొడ్లసంత—
ఏమిగొడ్లు ?
బఱ్ఱెగొడ్లు —
ఏమిబఱ్ఱె ?
పాడిబఱ్ఱె—
ఏమిపాడి ?
పాటపాడి—
ఏమిపాట ?
బూరపాట—
ఏమిబూర ?
తాంబూర.

౨. పాటలు

## చిన్న పిల్లల పాటలు

శ్రీమతి డి. సీతాబాయిగారు

౧

ఆటకు పిలువు

పిల్లల్లారరండి !
పిడికెడుబియ్యం తెండి !
ఆడుకుందాం రండి !
అట్టముక్కలు తెండి !
శీలశీలబండి
చిత్రమైనబండి !

కొత్తగుఱ్రాల బండి!
    కొనుక్కుందాం రండి!

౨
కూతురు పాట

చందమామ చీరగట్టి
    సన్నబియ్యం వళ్లోపోసి
అమ్మా! నేను చిన్నదాన్ని
    అల్లుడొస్తే పంపబోకు
ఢిల్లీకోట చల్లగవుంటే
    దినానికి టంకం నేనేతెస్తా.

౩
గోవిందుడు మీద పాట

గోవిందుడమ్మ! గోపాలుడమ్మ!
    కొబ్బరీ బెల్లమూ కొనితెచ్చెనమ్మ!
ఏడుమేడలమీద నన్నుంచెనమ్మ!
    ఏడాదికోసారి తావచ్చెనమ్మ!
గజ్జెలపాపణ్ణి నేగంటినమ్మ!
    ఎత్తుకొనిముద్దాడ తానెవ్వరమ్మ!
చిక్కుడుచెట్టుక్రిందికొస్తే ఛీఛీ అనిపిస్తు
కాకరచెట్టుక్రిందికొస్తే కాదుకాదనిపిస్తు
పొట్లచెట్టుక్రిందికొస్తే పోపో అనిపిస్తు
పల్లెటూరుగనుక బలిసిపోయాడు
పట్నవాసమైతే పట్టుకు తన్నిస్తు.

౪
గుఱ్ఱంపాట

గుడిగుడి గుంచం
    గుండారాగం
పాములపట్టం
    పడగారాగం
అప్పడాలగుఱ్రం
    ఆటకిబోతే
పేపేగుఱ్రం
    పెత్తనానికిబోతే
కత్తెయనా? బద్దెయనా?
    కాకరచెట్టుకు నీళ్లోయనా?

౫
కొంగపాట

కొంగకొంగ గోళ్లు
నీచేతిరాళ్లు
నాచేతి పువ్వులు
నీచేతిగోళ్లు.

౬
గణపతి మీది పాట

ఓబొజ్జగణపయ్య
నీబంటునేనయ్య;
కమ్మని నెయ్యయ్య
కందిపప్పయ్య;
పేరిననెయ్యయ్య
పెసరపప్పయ్య;
ఎలుకవాహనమదే
ఎక్కరాదయ్య!
ఉండ్రాళ్లమీదికి
దండుబోవయ్య.

౭
పువ్వులు కోయు పాట

పొద్దు పొద్దూ లేదామా!
అక్కల్లారా! పోదామా!
పోయి, పొన్నపూలు తెద్దామా!

11P

తెచ్చీ- దండలు గుచ్చుదామా ?.
గుచ్చీ, రాముని మెడలో వేద్దామా ?
వేసీ, భజనలు చేదామా ?

గచ్చకాయల ఆటపాట

కొండమీద వెండిగిన్నె
కొక్కురాజు కాలువిరిగె
దానికేం మందు ?
వేపాకుచేదు
వెల్లుల్లిగడ్డ
నూనెమ్మ బొడ్డు
నూటొక్క ధార !

3. బుద్ధిపరీక్ష

# యుక్తిలెక్కలు

[ఇవి బాలురయు బాలికలయు బుద్ధిబలమును పరీక్షించుటకు ఉద్దిష్టమైనది. కావున ఈ యుక్తిలెక్కకు సమాధానము స్వతంత్రముగ నాలోచించి 12 సంవత్సరములకు లోబడిన బాలబాలికలు ఆగస్టు 10-వ తేదీ లోపున లేఖాముఖమున (ఉత్తరములో వారివయసు తప్పక తెలుపవలెను.) మాకు తెలియజేతురుగాక !

—సంపాదకుడు.]

## ౧

బంధకవి గోవిందరావుగారు

రాముడు, రంగడు అను యిద్దఱు అన్నదమ్ములు ధాన్యముతోనున్న 20 వరుస గాదులు పంచుకొనవలయును. మొదటిగాదిలో ఒకపుట్టెడు, 2-వ గాదిలో 2 పుట్లు, 3-వ గాదిలో 3 పుట్లు, 4 వ గాదిలో 4-పుట్లు యిట్లు యెన్నోవగాదిలో అన్నిపుట్లు గలవు. (20-వ గాదిలో 20 పుట్లున్నవి అన్నమాట) గాదులుకూడ సమానముగానుండవలెను. ధాన్యము ఒకగాదిలోనుంచి ఒకగాదిలోనికి మారకూడదు. ఎట్లు పంచిపెట్టెదరు?



శ్రీమతి కామరాజు సుశీలగారు

## ౨

శ్రీమతి కామరాజు సుశీలగారు

ఈక్రింది త్రోపుడులెక్క పైవరుస యందు 8 అంకెలు గలవు. ఆ 8 అంకెలుకూడిన మొత్తము 36 యగును. క్రిందివరుసలోకూడ 8 అంకెలు గలవు. వాటినికూడినను 36అగును. పైవరుస అంకెలనుండి క్రిందివరుస అంకెలను త్రోసివేసిన, శేషమునకుకూడ 8 అంకెలు రావలెను. ఆ అంకెలనుకూడిన మొత్తముసయితము 36 కావలెను. ఆ అంకెలేవి ?

౮. వినోదకథ

# కాకి, పిచ్చుక కథ

శ్రీమతి జమ్మి సీతాబాయిగారు

ఒకకాకీ పిచ్చుక నేస్తం కట్టుకున్నాయి. కాకి కఱ్ఱలయిల్లు కట్టుకుంది. పిచ్చుక పిడకలయిల్లు కట్టుకుంది. ఒకనాడు కాకి కడవతోటీ, పిచ్చుక బిందెతోటీ వూరిబయటి నీటిబావివద్దకు వెళ్లి నీళ్లు తోడుకుంటున్నాయి. ఇంతట్లో గభాలున వానకురిసింది. కాకమ్మది గట్టిచేద. పిచ్చుకది చిల్లిచేద. కాకమ్మ గబగబ నాలుగుచేదలనీళ్లు తోడుకొని కడవనింపుకొని యింటికి వెళ్లిపోయింది. పిచ్చుక ఎంతసేపుతోడినా బిందె నిండటంలేదు. ఈలోగా రోడ్డుమీద వరదలై పారుతోంది వాననీరు. ఎల్లాగయితేనేం కొంచెంనీళ్లు బిందెలోపడగానే బయలుదేరింది పిచ్చుక యింటికివెళ్లడానికి. దారిలో కాలుజారి పడింది. బిందె సొట్టుపడింది. ఆఖరుకు యింటికివెళ్లి చూస్తే పిడకలయిల్లుగనక వానకు పూర్తిగాతడిసి కరిగిపోయింది పిచ్చుకయిల్లు. ఇంక నిలువనీడలేక కాకమ్మయింటికి వెళ్లింది.

అక్కడ కాకమ్మ వంటచేసుకొని తనపిల్లలకు పెట్టుకొని తనమగనికి అన్నం పెడుతోంది. పిచ్చుక అన్నదిగదా "కాకమ్మా! కాకమ్మా! తలుపుతీయి" అని. కాకమ్మ అన్నదిగదా "వుండవమ్మా! నామగనికి అన్నం పెడుతోవున్నాను" అని. కొంతసేపటికి పిచ్చుక మళ్లీ "కాకమ్మా! కాకమ్మా! తలుపుతీయి" అంది. "ఉండమ్మా! నాపిల్లలకి పక్కలువేస్తున్నాను" అని కాకమ్మ బదులుచెప్పింది.

మళ్లీ కొంతసేపటికి "కాకమ్మా! కాకమ్మా! తలుపుతీయి" అందిపిచ్చుక చలితో వడవడ వడకుతూ. ఆఖరుకు కాకమ్మ తలుపుతీసి పిచ్చుకను లోపలికితీసుకునివెళ్లి కొంచెం అన్నంపెట్టి వసారాలో వక నులకమంచంవేసి దానికింద వక కుంపటివుంచి, మంచంమీద పడుకోమంది. పాపము! పిచ్చుక చలికాచుకొంటూ పడుకుంది. కాకమ్మ మగడూ, పిల్లలతో గదిలో పడుకుంది.

కొంతసేపటికి పిచ్చుక లేచింది. చలి వదలిపోయింది. మంచంమీదనుంచి దిగి యిటూ అటూ కలయజూచింది. అక్కడ సెనగలతట్ట వకటి కనబడింది. ఆ సెనగలని కుంపటిలోపోసి కాల్చుకొని ఒక్కొక్కగింజనే తినడం మొదలుపెట్టింది. అలాగున తెల్లవారేసరికి ఆసెనగలన్నీ తినివేసింది.

తెల్లవారగానే కిటికీలోంచి తుర్రున పారిపోయింది పిచ్చుక. కాకమ్మా పిల్లలూ వచ్చిచూస్తే మంచంమీద పిచ్చుక లేదు. ఏమయిందా అనిచూస్తే కిటికీఅవతల కిచకిచ మని ధ్వనిచేస్తూ ఉన్నది. సరే వెళ్లిపోయిందిగదా అనుకొని కాకమ్మా పిల్లలు మొఖాలు కడుక్కోడానికి లోనికిపోయారు.

కథ కంచికిపోయింది, మనం యింటికివచ్చాం.

౫. పాఠపుస్తక పరామర్శ

## ప్రాథమిక పాఠశాలలు : వాచకపుస్తకములు

జోస్యుల వేంకటరావుగారు

విద్యావిషయోద్దేశ్యము లెప్పుడును మారుచునేయున్నవి. శాస్త్రజ్ఞులు నిరంతరము విద్యావిషయము లనుగూర్చి భిన్నాభిప్రాయముల నిచ్చుచున్నారు. విద్యయన మనోవికాసము నిచ్చునది. మనుజునందున్న సహజ శక్తుల నన్నువైనరీతి విస్తరింపజేయుటయే విద్యయొక్క ముఖ్యోద్దేశ్యము. ఈవికాసము గురువునొద్ద శిక్షణము వలన సమకూడవలయును. కావున బడిలో జరుగవలసినపని యేమన:-

1. పసిపిల్లల సహజశక్తులను గుర్తించుట.
2. వాని యభివృద్ధికి గావలసిన ప్రోత్సాహముల నుపయోగించుట.
3. వాని వికాసమునకు వలయుసాధనముల నుపయోగించుట.

చిన్నవాడొకడు కొన్నియంశములను నేర్చినంతమాత్రమున మనోవికాసమును బొందినవాడనియు, ఆతడు పెద్దయైనపిదప తనజీవితమును సౌఖ్యముగను సంతోషముగను గడుపుకొనగలడనియు ననజాలము. ఏలయన విషయములను గ్రహించినంతనే మనోవికాసము గలుగనేరదు. గ్రహించినవిషయముల నొకక్రమము ననుసరించి యేర్పర్చుకొని తనలో వాని నిమిడ్చికొని వానిసహాయమున యితరవిషయముల పరిశీలించి, పరిశోధించి, తెలిసికొనజాలిన సమర్థతను సంపాదింపవలయును. ఇట్టి సమర్థతను సంపాదించుటయే మనోవికాసమును బొందుటయని గ్రహింపవలయును. కాన ప్రాథమికవిద్య పూర్తిచేసిన సామాన్యజనుడు ప్రతివాడును తనచుట్టునుండు పరిస్థితులనడుమ సంతోషముగను, సౌఖ్యముగను తన జీవయాత్ర నడుపుకొనగలిగిన శక్తి సామర్థ్యములు గలిగియుండవలెను.

ఇట్టి శక్తిసామర్థ్యమునుగలుగచేయుటకు ముఖ్యకారణములు. మూడు అవియేవియన:

1. ఉపాధ్యాయుడు
2. విద్యార్థి.
3. పుస్తకములు; అందుండు విషయములు.

పైమూడింటియందును మూడవదియగు "వాచకపుస్తకములు: అందుండువిషయములు" అనుదానిని గురించి కొంచెము ఆలోచించవలసియున్నది. వాచకపుస్తకములు బాలుర వయస్సును సమర్థతను మనసునందుంచుకొని యేవిషయములగూర్చి చెప్పినయెడల వారు బాగుగ గ్రహింపగలరో అట్టివిషయములే అందుండ

వలెను. బాలురకు ఆవిషయములు వినుగుపుట్టకుండునట్లుండవలెను. పాఠములు పెద్దవిగాగాని పదకాఠిన్యము గలవిగాగాని యుండరాదు. వేరువేరువిషయములలోని పాఠమును బాలురమనముల రంజిల్లచేయును. అట్టి వాచకములలోనికథలు, శాస్త్రవిషయికపాఠములు, భూగోళశాస్త్రములు, చరిత్రాత్మకమైన కథలు ఉండ నగును. పూర్వకవుల యొక్కయు, భారత భాగవత రామాయణాది సద్గ్రంథరాజములలోనుండు వీరుల యొక్కయు విషయములను కథారూపముననుగాని సంభాషణరూపముగాగాని ఉండిన బాగు.

ఇదియునుగాక ఇట్టివాచకములు బాలుర వయోబుద్ధుల ననుసరించి వ్రాసినవిగానుండవలెను. క్రమ క్రమముగా పాఠములలోని కాఠిన్యము, విషయములలోని కాఠిన్యము వృద్ధినొందునట్లు సాధ్యమైనంతవరకు ఉండవలెను. భాష సులభముగ నేయుండవలెను. దీర్ఘములగు సమాసములనుగాని గ్రాంథికభాషనుగాని ఉప యోగించి భాషను దుర్గ్రాహ్యముగునట్లు చేయరాదు. పాఠరచనాపద్ధతి చిత్తరంజకముగానుండవలెను.

ప్రతిశాస్త్రవిషయికపాఠమునందును అనగా జంతువులనుగురించిగాని మొక్కజాతులనుగురించిగాని వ్రాసి నప్పుడు పటములు ఆకర్షణీయములుగను ఎదురుగాను ఉండవలెను. అట్లుండుటవలన బాలురకు సంతోష మును మాడగానే పాఠముపై పేరు చదువనక్కరలేకుండగనే ఫలానాపాఠముగదాయని గుర్తించుటకు సులభ సాధ్యముగా నుండును. క్రిందితరగతులలోని బాలురు పూర్వకథలు, విదేశబాలుర జీవితములు వారి యాట పాటలనుగురించియు వినుటకుత్సాహపడుచుందురు. అట్టిపటములను మెండుగను విపులముగాను ఉండిన బాలురు నేర్చుకొనుటకుత్సాహపడుచుందురు.

మనదేశము నేలిన శివాజీ, అక్బరు మున్నగురాజవరేణ్యుల చరిత్రలు వారల జీవితములు వారిదేశమునకు చేసిన ఉపకారములు చదివిన వేడుకగానుండును. ఇంకను భాగవత రామాయణాది సద్గ్రంథములలోనుంచి ఎత్తివ్రాసిన ధ్రువునికథ సీతాకల్యాణము మొదలైనపాఠములు ఆదరణీయములు. ఇట్టిపాఠములు ప్రాథమిక విద్యాభ్యాసమొనర్చు బాలుర మనస్సులందు హత్తుకొని పెద్దయైనకొలది దైవభక్తి, దేశభక్తి, పెద్దలయందు నమ్రత, మంచినడవడి మొదలగు సుగుణములు అలవఱుపగలవు. వ్యాకరణవిషయములను క్రమేణ నేర్పుటకు పుస్తకము చివరగాని ప్రతిపాఠాంతమందుగాని విషయములచేర్చుట బాగు.

పాఠములలోని విషయములు బాలురకు కొన్ని తెలిసినవిగాను కొన్ని తెలియనివిగాను ఉండవలెను. అన్నియు తెలిసినవిషయములుండిన బాలురు చదువుటకు శ్రద్ధతీసికొనరు. అన్నియు తెలియనివియుండిన అసలు చదువుటకైన ప్రయత్నింపరు. వాచకపుస్తకముల నడుమగాని తుదనుగాని కొన్నిపద్యముల జేర్చవలెను. అడుగుతరగతుల పుస్తకములలోని పద్యములు మంజరీలక్షణసమన్వితములై యుండవలెను. దసరాపాటలవలె నింపుగ బాలురు పాడుకొనుట కర్హములైయుండవలెను. ఇక పైతరగతులలోని పద్యములు కొన్ని పూర్వకవి విరచితములై యుండనగును.

ప్రతిపాఠాంతమందును కఠినపదములు వాటి కర్థములువ్రాయుచున్న బాలురయొక్క పదజాలము వృద్ధినొందుటయేగాక ఆపదములకు అలవాటుపడి క్రొత్తవిషయములు చదువునప్పుడు ఇతరులయొక్క సహా యములేకుండగనే చదివి వానిని చక్కగా గ్రహించగలుగుదురు.

పాఠములలో సాధారణముగా ఒకమాటకు అనేకమైన అర్థములుగాని ఒక అర్థమునిచ్చు పెక్కుమాటలు గాని గలవు. అట్టిచోట ఒకేఅర్థమునిచ్చు మాటలు వేరువేరుగా నుపయోగించిన బాలురు భాషాజ్ఞానము సుల భముగా వృద్ధినొందగలదు. అందుకు ఉదాహరణముగా సముద్రము, కడలి, అంబోధి, రత్నాకరము, జలనిధి మున్నగునవి చేకొననగును.

ఇంకను వాచకపుస్తకములలోని పాఠములు ఆయాతరగతుల బాలురకు అనువుగానుండునట్లు చిన్న తరగతులకు చిన్నపాఠములుగను పెద్దతరగతులలోనికి బోవుకొలది పెద్దపాఠములుగను ఉండవలెను.

1-వ తరగతిలో పాఠములు చిన్నవిగను 30 నిమిషములకంటె ఎక్కువకాలము పట్టునవిగను ఉండరాదు. ఎందుచేతననగా 1-వ తరగతివిద్యార్థులు చాలసేపు వారిదృష్టులను ఒకవిషయముమీద కేంద్రీకరించి బోధించినపాఠమునుబట్టి వారిచేత డ్రాయింగు వేయించుటగాని పాఠముయొక్క సారాంశము వారి స్వంతమాటలలో చెప్పించుటగాని అనువుగానుండునట్లుండవలెను.

వాచకపుస్తకములు మొదటితరగతిలో పెద్దఅక్షరములుగ నుండవలెను. అట్లుండిన బాలురు అక్షరములను వెంటనే గుర్తించుటకున్ను వేగముగ చదువుకొనుటకును ఉపయోగించును. మాటలు ఒకేరీతిగా శబ్దమువచ్చునట్లుండిన బాలురు చదువుటకుత్సాహపడుదురు. పుస్తకములలో అచ్చుతప్పులుగాని అచ్చు సరిగా కనుపించకపోవుటగాని యుండరాదు.

ప్రాథమికపాఠశాలలో చదువువారు చాలమంది బీదజనులబాలురై యుందురు. అట్టివారు పుస్తకములు పెద్దఖరీదులుపెట్టి కొనజాలరు. కాన వాచకపుస్తకములు వెల బీదసాదల కందుబాటుగానుండునట్లు సరసముగా నుండవలెను. అట్లుండక హెచ్చువెలయుండిన ఎవరును కొనరు. ఒకచో కొనునట్లు మనము నిర్బంధించిన స్కూలులోని విద్యాభివృద్ధికిని బడియొక్క ఔన్నత్యమునకున్ను చాల భంగకరముగానుండును. ఇన్నివిషయములను గమనించి భాషాపరిణామమునకు బాధ్యులుకాగల బాలురకు వాచకపుస్తకములు ఏర్పరుపదగును. మరియు పాఠశాలలందు పాఠవిషయములు ప్రస్తుతము రాష్ట్రమునందెల్లెడల నొక్కరీతిగనే యుండవలసియున్నది. ప్రాథమికపాఠశాలలందలి విద్యాప్రమాణమును కట్టినిర్ణయ మనావశ్యము. జనులలో బెక్కుతెగలుగలవు. ఒక్కొక్కతెగకు కొన్ని నైసర్గికలక్షణములు గలవు. ఒకప్రదేశమందు నివసించుజనులకుగల పరిస్థితులు మఱొకస్థలమునందుండువారి పరిస్థితులకు భిన్నములైయుండును. విశాఖపట్టణంజిల్లాలో నటవీప్రాంతములం నివసించు కోయలకు కృష్ణాజిల్లాలో ముఖ్యపట్టణమగు బందరుపురముననుండు జనులకు పరిస్థితులలో ఎంతభేదముగలదో చూడుడు! వీరికిని కర్నూలుజిల్లాలోనుండు ఆదిమాంధ్రులకును పరిస్థితులలోగలట్టి వ్యత్యాసమును గమనింపుడు. వీరందరకు ఒకటేవిధమగు ప్రాథమికవిద్యావిషయము లుపకరించునా! మరియు సముద్రతీరవాసులకును పల్లపునేలలందుండు కృషీవలులకును, దక్కనుపీటభూములందు నివసించువారికిని మన్యపుకొండలలో గాపురముండు చెంచులకును పాఠవిషయములు సమానముగ నేర్పఱుపదగదు.

కాబట్టి దేశకాలపాత్రముల ననుసరించి పాఠవిషయములను ఆయాచోట్లనుండు బడులకు నిర్ణయము చేయవలసియున్నది.

ఈ. నీతికథ

# శిశువులు పెద్దవారికంటెం దెలివిపరులు

రూపనగుడి నారాయణరావుగారు

వైశాఖమాసము. అపరాహ్ణము. ఉఱుము మెఱుములతోఁ బాములు ప్రేలఁగట్టిన విధంబున ఘోరధారగ వర్షము గురిసెను. వాననీరు పల్లములనిండి చిన్నప్రవాహములుగఁ వెలికిఁ బాఱుచుండెను. ఒక యెఱువుపడియనుండి ముఱికినీరు సన్నఁగ బయలు

వెడలు చుండెను. ఆ మెఱువు పడియ రెండిండ్లకు నడుమనుండుటచేతను, అప్పుడె వాన వెల్చుచూపి యుండుటచేతను, ఇరుగుపొరుగిండ్ల శిశువులిద్దరా మెరువుపడియకుం జని యానీట నాడుకొన నుంకించుచుండిరి. ఆ శిశువులలో నొకతె యించుక పెద్దది, మఱి యొకతె పిన్నది. పెద్దదాని తల్లి తనబిడ్డకు బసుపురంగుగల యంగీని బావడను దొడిగి యుండెను. పిన్నదానితల్లి మేఘవర్ణముగల యంగీని బావడను దన కూనకుఁ దొడిగియుం డెను. పిన్నది పడియలోనికిఁ దిగఁ జూచుచుండెను. పెద్దది దానిఁజూచి "సీతా, పావ డతోఁగూడ నీటిలో దిగవద్దు. పావడ తడిసిన మీయమ్మ గొట్టును. నేను బావడ విడిచె దను, నీవును విడువుము" అనెను. ఇద్దఱు శిశువులును బావడలువిప్పి యొడ్డునఁబెట్టి యంగీ లను నెగఁద్రోసి కొనుచు వేర్వేఱు ప్రక్కలనుండి నీటి పడియలోనికి దిగిరి. సీతకు మోకాళ్లు మునిఁగెను. అప్పుడది "అచ్చీ! ఇక్కడలోఁతెక్కువగానున్నది. నాకు భయమగు చున్నది" అని బిగ్గరగాఁ బలికెను.

"అదియేమిలోఁతె? అంతకంటె నెక్కువలోఁతుండదులే నాదగ్గరకుఁ దిన్నఁగ రమ్ము" అని లక్ష్మినుడివెను. వా రొండొరుల సమీపించుచుండిరి.

"సీతా! నీళ్ళను గట్టిగాఁదట్టవద్దు. ఊరకరమ్ము" అని లక్ష్మి సీతను మంద లించెను.

ఈ మాటలు చెవులఁబడినతోడనే సీత మిక్కిలి చెలరేఁగి కాళ్ళతో నీళ్ళనుజిమ్మ నారంభించెను. లక్ష్మియంగీపై నంతయు ముఱికినీరు పడుటయెగాక దాని ముక్కులోప లను కనులలోపలను నీరు ప్రవేశించెను. లక్ష్మి తనకనులను దుడిచికొని తన యంగీపైని ముఱికినీటి మరకలనుజూచి సీతపై మిక్కిలి కోపపడి, చీవాట్లుపెట్టుచు దానింగొట్టఁ వెంబ డించెను. సీత తప్పుచేసినదగుటచే దిగులుపడి, నీటిపడియనుండి వెలికిదూఁకి తనపావడఁ గైకొని యింటివంకఁ బరువిడుచుండెను. లక్ష్మి తల్లి యటఁబోవఁదటస్థించుటచేఁ దనబిడ్డ యంగీపయి ముఱికి మఱకలుండుటనుజూచి "పాడుబిడ్డ! ఎక్కడఁబోయి యుంటివె? అంగీ యంతయు ముఱికియైనది" యని యఱచెను.

"సీత నాపై నీరుజిమ్మెను" అని లక్ష్మి బదులుపలికెను. లక్ష్మి తల్లి సీతను బట్టు కొని చెంపలపై రెండువాయించి బుగ్గలు పులిమెను. సీత వీధియంతయు వినునట్లుగ గట్టిగా నేడ్చెను. సీత తల్లి పరుగెత్తికొని వచ్చెను.

"ఓసీ! ఎందుకె నాబిడ్డను గొట్టుచున్నావు" యని యనుచు నామెను గద్దింప నారంభించెను.

మాటకుమాట హెచ్చెను. అయంగనలు నోటికసిదీర నొండొరులఁ దిట్టికొనిరి. పలువురు గుమిగూడిరి. ఒండొరులఁ బ్రల్లదములాడిరి. ఒకరిమాట యొకరు వినకుండిరి. వారొట్టుఁ బెట్టుకొనుచు శపించుచుండిరి. వారిలో నొకఁడు తన పొరుగింటి వానిని గొట్టెను. అలబలము హెచ్చెను. అంత లక్ష్మియవ్వ జనసమ్మర్దమునందుఁ దూఱి మధ్యవర్తియైనిలిచి వారిని శాంతింపఁ బ్రయత్నించెను.

"అక్కలారా! అన్నలారా! ఏమీ యన్యాయము. మీ రిట్లు కొట్లాడుట తగునా? మీరు కొట్లాడి యొండొరులఁ దిట్టికొని పాపము నొడిగట్టుకొనుచున్నారు."

ఆవృద్ధురాలి పలుకులెవ్వరు నాలింపరైరి. ఆమెను గూడఁ దిట్ట నారంభించిరి. ఇట్లు స్త్రీలు నిష్ఠురముగా వాదు లాడుచుండ, లక్ష్మి తనయంగీని నెండించి తొడిగికొని యల నీటి పడియకువచ్చి యొక చిన్నరాతితోఁ గాల్వఁ ద్రవ్వుచు నందలి జలము పెద్దవీథి గుండఁ బ్రవహించునట్లు చేయుచుండెను. దీనిఁజూచినసీత లక్ష్మియొద్దకువచ్చి యొక చిన్న కఱ్ఱముక్కతో గాల్వనుదీయుచు దానికి సాయపడెను. స్త్రీ లింకను వాదు లాడుకొనుచుండిరి. పడియయందలి జలమా శిశువులు ద్రవ్విన కాలువగుండ వీథిలోనికిఁ బ్రవహించి యిరుపక్షములవారిని సమాధానపరచుటకై ప్రయత్నించుచున్న యా వృద్ధురాలున్న చోటికి వచ్చుచుండెను. శిశువు లిరువురు తాముత్రవ్వినకాల్వ కిరుగడలఁ జనుచు మిక్కిలి యుల్లాసముతో నాడుకొనుచుండిరి.

'సీతా! చాలు నిలపుము. నిలుపుము' అని లక్ష్మియఱచి పల్కెను. సీత త్రవ్వటముచాలించి తనకఱ్ఱముక్కను బ్రవాహమునందువైచి "అచ్చీ! రావే. ఈ కఱ్ఱముక్క కాల్వలో మున్గుచుఁ దేలుచు నెట్లుపోవుచున్నదో చూడు" అని పల్కెను. వారిరువురు నిట్లాడుకొనుచు జనులగుంపులోనికిఁ జనిరి.

ఆలాడుకొనుచుండు శిశువులనిరువురిని గనుఁగొని వృద్ధురాలు ఇంకను వాదులాడుచుండు స్త్రీలతో నిట్లనెను.

"అమ్మలారా! అక్కలారా! ఎవరివిషయమై మీ రిట్లు తీవ్రముగ వాదులాడుచున్నారో యా శిశువు లిరువురు తమవైషమ్యముమఱచి యొండొరులఁబ్రేమించుచు నేకీభావముతో నాడుకొనుచున్నారు. వారు మీ కంటె నెక్కువ తెలివి గలవారు."

అక్కడిస్త్రీలా శిశువులఁజూచి సిగ్గుచేఁ దలవంచికొనిరి. అంత వారు నవ్వుకొనుచుఁ దమతమగృహంబులకుం బోవఁ దరలిరి.

"మీరు శిశువులవలె నమాయకులై యుండనిచో స్వర్గకవాటంబు మీకుఁ దెఱవఁ బడదు."

'కథామణి ప్రవాళముక్తావళి'నుండి.

## ౭. బాలికల రచనము

## లీల

### సమయమంత్రి రాజ్యలక్ష్మి గారు

లీలకు మూడవసంవత్సర మాషాఢ శుద్ధ పంచమికి వచ్చినది. జిలి బిలి ముద్దు పలుకులచే తల్లితండ్రులకు కడుంగడు నాహ్లాదము గూర్చుచున్నది. చందురుని వంటి లేత నెమ్మొముతో కలువరేకులబోలు కన్నులతో దొండపండువంటి పెదవులతో దానిమ్మ గింజలను తలపించు పల్వరుసతో వచ్చియురాని మాటలతో యల్లిబిల్లి పాటలతో చిన్నతనపు యాటలతో మాతాపితలకేకాక యిరుగు పొరుగు వారలకు కూడ ముద్దు కలుగ చేయుచున్నది. ఎల్లప్పుడు సోదరీ సోదరులతో కయ్యమాడు చుండును. సోదరియగు శ్యామలకు పదవ సంవత్సరము. ఆమెకూడ సౌందర్యవతియే. వైశాఖమాసములోనే పెండ్లి యయినది. వరుడు డాక్టరు పరీక్ష చదువుచుండెను. అన్న పూర్ణమ్మ గారి ప్రథమసంతానమే శ్యామల. రామారావుగారు తమపుత్రికకు తల్లిపేరు పెట్టికొనిరి. తరువాత గోపాలక్రష్ణుడు కలిగెను. కృష్ణుడు చాలా అల్లరి పిల్లవాడు. ఇప్పుడు ఆరవ సంవత్సరము. అక్క పెండ్లి ముందరనే యక్షరాభ్యాసము చేసిరి. లీల నిరంతరము బువ్వ లాటలతో పూజలతో తీరుబడి లేకయుండును. లీలకు లక్క పిడతల కొరకు పెద్ద దేవదారు పెట్టియున్నది. దానిలో మూతలు లేని డబ్బాలు పనికిరాని పుస్తకాలు మొదలగు చెత్తకూడ ఉండును.

శ్రావణ మాసము వచ్చినది. అక్కతో నోములు నోచుకొనుచు, పేరంటములకు వెళ్లుచు, తనకు మంచి బట్టలు కుట్టించలేదని మారాము చేయుచుండెను. రామారావు గారు లీల కేవి కావలసిన నవి కొనుచుండును. రెండవ మంగళవారము వచ్చినది. లీల ఆకు పచ్చని పట్టు చమికీ గౌను తొడగి నాగరము, జడగంటలు, పొడుగుల చేమంతి పూవువేసికొని మెడలో గడియారపు గొలుసు, నానుపేటలు వేసికొని మొలకు వడ్డాణము పెట్టికొని, చేతికి పొదుల వుంగరము పెట్టికొని బూటులు వేసికొని ముద్దులు గులుకుచు సోదరితో పేరంటమునకు వెళ్లినది.

నాలుగుగంటలు అయినది. అన్నపూర్ణమ్మగారు వచ్చిన ముత్తయిదువులకు వాయనము లిచ్చుచున్నది. అప్పుడు శ్యామల యేడుస్తూవచ్చింది.

'ఏమమ్మా? శ్యామలా! ఏడుస్తున్నావు. ఎక్కడైనా పడ్డావా? చెల్లాయి యేదీ?' అని యాత్రముతో ప్రశ్నించినది. ఆ అలజడిఁజూచి శ్యామల మరింత బిగ్గరగా నేడ్వ మొదలు పెట్టినది. అక్కడ నున్నవారంతా తెల్లబోయారు. 'శ్యామలా! చెప్పమ్మా, ఏమి భయము లే' దని బ్రతిమాలగా బ్రతిమాలగా చెల్లాయి కనబడలేదన్న అంశము తేల్చినది.

ఆమాట వినగానే అన్నపూర్ణమ్మగారు మొదలు నరికిన కదళీతరువువలె క్రిందకు పడిపోయి విచారిస్తూన్నారు. తనచిట్టితల్లి కనపడక పోయినప్పుడు విచారము కాక ఏమున్నది? అయినను అన్నపూర్ణ కొంచెము ధైర్యముగల ఆవిడే. వచ్చినవారిలో నొకయామె "ఏమోనమ్మా! రోజులు తిన్నగా లేవు. వంటి నిండా వస్తువులున్నాయి. ఎవరి కన్ను కుట్టిందోకాని చక్కని పిల్ల. మారత్నంతోటి ఆడుకునేది. ఏసందులోకి పోయినదో" అన్నది. "శ్యామలా! ఎక్కడ వరకు నీ దగ్గరవున్నదా పిల్ల? నీవెక్కడ చూచుకున్నావు దాని" నని అడిగింది రామమ్మగారు. "నేతి వారింటివరకు వెళ్లినదాకావున్నది. ఆ తర్వాత నాల్గు యిళ్లుదాటి పుసులూరి వారింటికి వెళ్లి చూచుకున్నాను. లేదు. అక్కడ యిళ్లన్ని సందులోను వెతికాను కనిపించలే" దన్నది శ్యామల. పేరంటాళ్లంతా ఒక్కొక్కళ్లే వెళ్లారు.

అన్నపూర్ణ యెట్టకేలకు ధైర్యము తెచ్చికొని జవాను వెంకటదాసుని పిలచి నేతి వారి వీధినంతా వెదకి రమ్మన్నది.

వీరయ్యను కోర్టుకు వెళ్లి బాబుగార్ని తీసుకొనిరమ్మన్నది. తాను దేవుళ్లకు మ్రొక్కుతోన్నది. లీలలేనిదే యిల్లు చిన్నపోయినది.

ఇంతలో రామారావుగారు వాడిన మొగముతో యింటికి వచ్చారు. ఆయన్ని చూచి అన్నపూర్ణ, శ్యామల గొల్లుమన్నారు. వారితో రామారావుగారు కూడా విచారిస్తున్నారు. "నా చిట్టి తల్లి యేమైనదో? వెతికించండి? లీలను ఎవళ్లెత్తుక పోయారో కనుక్కోండి. లీలలేనిదే యిల్లు చిన్నపోయింది. పోలీసువారికి రిపోర్టు చేయండి. ఆలస్యము చేయవద్దు" అని గోలపెడుతోంది అన్నపూర్ణ. "నాన్నా! చూచునాన్నా? చెల్లాయి ఏమైపోయిందో?" అని శ్యామల అన్నది. పాపము కృష్ణునకిదియేమి తెలియలేదు.

ఐదుగంటలకు కృష్ణుడు స్కూలునుంచి యింటికి వస్తున్నాడు. ఇంటికి వచ్చేటప్పటికి లీల కుక్కపిల్లతో ఎదురురాలేదు. లోపలికి వచ్చేటప్పటికి అమ్మ, అక్క యేడుస్తున్నారు. నాన్నకూడా ఆవిధంగానే యున్నాడు. కృష్ణునకు సంగతి బోధపడింది. తానుకూడా లీల

కోసం విచారిస్తూన్నాడు. రామారావుగారు పోలీసువారికి రిపోర్టువ్రాసి వెంకటదాసు కిచ్చి యినస్పెక్టరుగారి కందచేయమన్నారు. ఇంతలో వీరయ్యవచ్చి పిల్ల కనపడ లేదన్నాడు. రాత్రి ఎవరు భోజనాలు చేయలేదు.

మరునాడు సాయంకాలము ఇనస్పెక్టరు వద్దనుండి యీ వుత్తరం వచ్చినది.

"రామారావు గార్కి.

మీ తనయ రేపు నాల్గు గంటలకు దొరకవచ్చును. కనుక నాల్గు గంటలకు స్టేషన్కు రావలసినది."

ఈ వుత్తరము రామారావుగారు అందరికి చదివి వినిపించారు. వారికి కొంచము ఆశ అంకురించినది. ఆ వేళ రెండు మెతుకులు తిన్నారు. ఎప్పుడు తెల్లవారునా? ఎప్పుడు సాయంకాలమగునా? ఎప్పుడు లీల కళ్లబడునాయని తొందరపడుతున్నారు. తెల్లవారినది. ఇనస్పెక్టరుతో మాటాడుదామని రామారావుగారు ఏడుగంటలకు స్టేషనుకు వెళ్లిరి. అక్కడ యినస్పెక్టరులేడు. వారి బంట్రోతు సాయంకాలము రమ్మన్నారని చెప్పాడు. రామారావుగారికి ఏమీ పాలిపోవుటలేదు. తెల్లవారితే శుక్రవారము. శ్యామల మామగారు శ్రావణపట్టీ పట్టుకుని వస్తారు.

నాల్గుగంటలకు రామారావుగారు మళ్లీ స్టేషనుకు వెళ్లిరి. ఇంకా యినస్పెక్టరు గారు రాలేదు. జవాను కూర్చుండమన్నాడు. వివిధయోచనలతో నిమిషాలు యుగాలులా గడుపుతున్నాడు. స్టేషనులో గుఱ్ఱపుబండి చప్పుడైనది. బండి ఆగినది. రామారావు గారు ఒక్క గంతున బండివద్దకు వెళ్లిరి. ఆయన మనసు మనసులోలేదు. సంతోష మొక వైపునా దుఃఖ మొకవైపునా కనబడుతోంది! వెళ్లగానే యినస్పెక్టరుగారొకపిల్లను-శల్యావశిష్టమైయున్న యొకపిల్లను-రామారావుగారి చేతులలో బెట్టిరి. రామారావుగారు లీలను చూసేటప్పటికి దుఃఖ మాగక చంటిపిల్లవలె ఏడ్చిరి. ఇనస్పెక్టరుగారా పిల్లకు కొంచెము పాలు పోయుమనిరి. రామారావుగారు కాఫీ హోటలులో పాలుకొని పిల్లకు పోసి ఇంటికి తీసికొని వెళ్లిరి.

అన్నపూర్ణ యానందమునకు మేరలేదు. తెల్లవారినది. శ్యామలచే శుక్రవారపు పూజ చేయించుదామావద్దా అన్న ఆలోచన వచ్చినది. అన్నపూర్ణ పిల్ల చావుగండము గడచినది వద్దనియును, గడచినది గనుకనే మరీయానందముతోచేసి కోవాలని రామా రావుగారును వాదించిరి. తుదకు రామారావుగారి పంతమే నెగ్గినది. రామారావుగారు ప్రొద్దుననే వెళ్లి ఇనస్పెక్టరు గార్ని విందునకు పిలచిరి. తొమ్మిదిగంటలకు సాంబశివరావు గారుశ్యామలమామగారు శ్రావణపట్టీతోవచ్చి సంగతివిని ఆశ్చర్యపోయారు. సంతోష ముతో భోజనములు ముగిసినవి.




దీపలక్ష్మియే దివ్యలక్ష్మి

# శ్రీమతి నరసమ్మగారి పాత్రధారణము




నారదుడు

(కుమారవిజయనాటకము)




సీత

(సంపూర్ణరామాయణనాటకము)




అనసూయ

(అనసూయనాటకము)




# జోలపాట

శ్రీమతి ఆచంట సత్యవతమ్మ గారు

—"లాలి లాలి కృష్ణయ్య" వలె—

జోజో రఘువంశరామా! జోజో రవికులసోమ!
జోజో రమణీయరామ! జోజో పవళించు రామ! జోజో॥
దశరథసుతుఁడవనుచు దలఁతురు జనులు నిన్ను
ధరనుద్ధరించ బుట్టిన దైవామని తెలియలేరు! జోజో॥
బంగారుడోలికాలో రంగైన పరుపుపైని
సింగారమొప్ప నీవు కంగారుపడకయుండు జోజో॥
జలకంబులాడి నీవు చాలాగ అలసినావు
కడుపార పాలుద్రావి, కన్నుల మూయుతండ్రి జోజో॥
నీముద్దు మోముగాంచి, నీతల్లి మురియుచుండె
నీలామేఘశ్యామ! నిద్రించవేగ రామ! జోజో॥
దైత్యుల సంహరించి ధర్మంబు నుద్ధరించ
తగువాడవగుదాక దయతో నిద్రించు రామ! జోజో॥
సర్వజ్ఞమూర్తి! నిన్ను, చంటిపాపడవనుచు
సఖులుఁదలఁచిరి వింత సత్యవతికిఁ దెల్పు. జోజో॥




# శ్రీమతి నరసమ్మ

కొత్తపల్లి లక్ష్మయ్యగారు

శ్రీమతి నరసమ్మగారు ఆంధ్రులగు నటకురాండ్రలో పేరెన్నిక గన్నవారియందు నొక రత్నము. ఈయమ ఆంధ్రనాటకకళోద్ధారకుడగు శ్రీయుత వనారస గోవిందరావుగారి చతుర్థపుత్రిక. నైజాం యిలాకా వేములవాడ గ్రామములో 1910-వ సంవత్సరం అక్టోబరు నెల 7 వ తేదీని జనించెను. 1930 మార్చిమాసపు గృహలక్ష్మిపత్రికలో మనకు పరిచితురాలైన శ్రీమతి సుభద్రమ్మగారును వీరును సమానవయస్కులైనందున ఏక కాలముననే వీరిరువురికి అక్షరాభ్యాస మొనర్చి బ్రహ్మశ్రీ రాయప్రోలు సోమనాథశాస్త్రి గారివద్ద విద్యచెప్పించిరి. ఈమె మిక్కిలి చురుకైనదగుటచేతను ఎక్కువ తెలివి తేటలు గలిగినదగుటచేతను రెండు సంవత్సరములలో చక్కని అర్థజ్ఞానమలవడునట్లు భాషాపరిచితి సంపాదించెను. ఈమె ఉచ్చారణ విన సొంపుగానుండును. తదుపరి ఒక్క సంవత్సరము సంగీతవిద్య నభ్యసించి ఈమెకు 8-వ సంవత్సరమున అనగా 1918-వ సంవత్సరములో తండ్రిగారిచే నిర్వహింప బడుచున్న శ్రీ గోవిందరాయసురభినాట్యమండలిలో ప్రవేశించెను. అప్పటినుంచియు 5 సంవత్సరములవరకు భాషాజ్ఞానము కొరకును, సంగీత జ్ఞానము కొరకును ఎక్కువ కృషిసల్పుచు బాల, బాలికల పాత్రల నభినయించుచుండెడిది. చిన్నతనములో బాలపాత్రలు బలరాముడు, లవుడు బాలిక పాత్రలు తార మొదలగునవియు నభినయించినది.

1924-వ సంవత్సరములో మహారాజశ్రీ సి. వెంకటప్పయగారిని వివాహ మాడెను. ఆతడు మంచి మనస్సు గలవాడు; తెలివి తేటలు గలవాడు; హార్మోనియము

తబలా వాయించుటలో మంచి నిపుణతగలవారు; యంత్రపరిశీలనలో ఆశక్తిమెండు. మంచి వినోదనటకుడును. ఈమెకు అన్ని విధముల అనుకూలుపైన భర్త. వారి దాంపత్యము చూచినవారి కందరకు కనులకింపుగా నుండును. వారి ప్రేమపూరితమైన సంభాషణ వినిన కొలది ఆనందముగానుండును. వివాహమైన తరువాతకూడ ఈమె పురుషపాత్రలను స్త్రీ పాత్రలనుకూడ వేయుచు కీర్తిని బడయుచున్నది. పతివ్రతలగు సీత, అనసూయ, సావిత్రి మొదలైన వారిపాత్రలు ప్రదర్శించి ఈమె అనేక పండితులచే మెప్పువడసి ఎక్కువ బంగారు పతకముల నందుచున్నది. పురుషు పాత్రలలో లవుడు, నారదుడు ఈ రెండు పాత్రల అభినయించినపుడు చక్కగా ప్రేక్షకుల మనము లొప్పించుచున్నది; కాని పతివ్రతాపాత్రల నభినయించుటలో ఈమెకు అభిమానము మెండు. పాత్రపోషణమునకై అయిదుసంవత్సరములు ప్రత్యేకకృషి సల్పిన విదుషీమణి. శ్రీమతి నరసమ్మగారు వివిధ నాటకములందు అభినయించిన పాత్రల చిత్రములను ఈసంచికయందు ప్రచురించినారము.

# కన్యాకవయిత్రి

నరహరిశెట్టి వేంకటరత్నముగారు

ననుఁబోలు రమణుండు దొరకునో లేదో?
సిరియున్న నేమాయె విద్యలేకున్న?
కవియౌనొ కాక కామాంధుఁడేయౌనొ?
యెట్టులున్నదొ నా యదృష్ట? మోచెలియ!
తల్లిదండ్రులతోడ ధైర్యానఁదెలిపి
కవిపాణినే నేను కేలఁగీలింతు
నేనుకోరినయట్టి నాథుఁడే కాఁగ
నేమనివర్ణింతు నేఁబొందుసుఖము?
ధనమునఁగల్గునా తన్మయత్వమ్ము?
మనసులందేయుండు మనసుఖంబెల్ల;
రమ్యనిర్జనప్రదేశములు రాణింప
మేముకూర్చుందుము చెట్టునీడలను;
భావనామయలోక వర్తనముచేత
వీక్షించెదము మేము చిత్రమ్ములెన్నొ;
విమలతరంగిణీతటినిఁ గూర్చుండి
మధురపుంబాట నైక్యముగఁ బాడెదము;
ప్రకృతిశోభనుజూచి యందున్నయట్టి
పరమేశ్వరునిఁగాంచి హర్షమొందెదము.

* * *

కరుణాళుఁడేనన్నుఁ గరుణింపకున్న
నేమిచేయుదునంచు నశ్రువుల్ విడిచె.

# వనితాలోకము

**శ్రీమతి పొన్నమ్మాళ్ గారు:—**

ఈమె బ్రాహ్మణ వంశమున జన్మించినది. తిరువాన్కూరు హైకోర్టులో గుమాస్తాగా నియమింపబడినది. బ్రాహ్మణస్త్రీలలో నిట్టి ఉద్యోగమును బడయుట కీమెయే ప్రథమురాలు.

**శ్రీమతి పాకల సౌభాగ్యవతమ్మ గారు:—**


శ్రీమతి పాకల సౌభాగ్యవతమ్మ గారు

బరంపురము పురపాలక సంఘ సభ్యురాలుగ ప్రభుత్వము వారిచే నియమింపబడినది. శ్రీయుత పాకల నారాయణస్వామిగారి భార్య. సుప్రసిద్ధులగు పిఠాపురము యెస్టేటు దివానుగారి తనయ.

**శ్రీమతి కె. ఆర్. కె. అయ్యంగారు సతి:—**

ఈమె లండను విశ్వ విద్యాలయమున విద్యాసముపార్జనము చేసినది. కీర్తిశేషులగు సిన్హా ప్రభువర్యుని సోదరుని తనయ. ఈమె ఇప్పుడు కూనూరులో ప్రభుత్వము వారిచే గౌరవమేజస్ట్రీటుగ నియమింపబడెను.

**శ్రీమతి లక్ష్మీనారాయణ సతి:—**

నాయరు కులమునకు చెందినది. బి.యె. పరీక్షయందు తీర్ణురాలయ్యెను. మఱియు నీమె అణ్ణామలై విశ్వవిద్యాలయము నందు గానపరీక్షలో ఉత్తీర్ణు రాలయ్యెను. ఈమె తండ్రి త్రివేంద్రమున పేరుకెక్కిన గాయకుడు. ప్రస్తుత మీగానవిదుషి త్రివేంద్రము కళాశాలయందు సంగీతశాస్త్రోపాధ్యాయినిగా నియమింపబడినది.

**శ్రీమతి ఎం. బాలమ్మాళ్ గారు:—**

ఈమె ఎం. బి. బి. ఎస్. పరీక్షలో ఉత్తీర్ణురాలైన విద్యావతి. ప్రస్తుతమీయామె తిరుచినాపల్లి మునిసిపలు కౌన్సిలు సభ్యురాలుగ ప్రభుత్వము వారిచే నియమింపబడినది.

మిసెస్ మెహతా కన్యగారు:—

ఈమె రసాయన శాస్త్రజ్ఞురాలు. మదరాసు క్వీన్ మేరీ కళాశాలయందు ఉపాధ్యాయినిగ నియమింపబడెను.

శ్రీమతి డి. షా రాజ్ ఆనందరావు పతి:—

మద్రాసు నగరమున నూతనముగ రాజధానీ గౌరవ న్యాయాధికారిణిగ నియమింపబడినది.

శ్రీమతి యల్. షోకు కన్య:—

మదరాసు మహాపట్టణమున గౌరవ న్యాయాధికారిణిగ నియమింపబడినది.

శ్రీమతి ఎ. జి. గిల్లిస్పి కన్య:—

మైసూరు సంస్థానమునందలి హాస్సన్ జిల్లాలోని రెడ్ ఫెరస్ మెమోరియలు హాస్పిటలులో వైద్యురాలు. నూతనముగ నిర్మింపబడిన హాస్సన్ జిల్లా బోర్డులో ఈమె ఇప్పుడు సభ్యురాలుగ ప్రభుత్వమువారిచే నియమింపబడినది.

శ్రీమతి ఇ. మధురము కన్య:—

డాక్టరు యమ్. ఓబ్రియను బీడను గారి స్థానమున లేడీ వెల్లింగ్డను స్త్రీల వైద్య పాఠశాలకును, విక్టోరియాఘోషాఆసుపత్రికిని ఈమె సూపరింటెంటుగా నియమింపబడినది.

శ్రీమతి పురందేవిగారు:—

ఈనడుమ లాహోరు నగరమున జరుపబడిన ఆర్య మహిళాసభకు అధ్యక్షురాలుగ ఎన్నుకొన బడినది.

శ్రీమతి యమ్. వార్కీ కన్య:—

ఈమె వైద్యురాలు. ధర్మపురమున ఈమె గౌరవ వైద్యశాఖాధికారిగ నియమింపబడినది.

శ్రీమతి రూప్ చంద్ బిలారామ్ సతి:—

నూతనముగ కరాచీనగరమున స్త్రీలకొఱకు ప్రత్యేకముగ స్థాపింపబడిన కాస్మాపొలిటను క్లబ్బుకు అధ్యక్షురాలు. ఈమె తన స్నేహితురాండ్రందఱిచేత రెండేసి వందల రూపాయిలు విరాళమునిప్పించి వారిని క్లబ్బుకు పోషకురాండ్రుగ చేర్పించినది. ఇట్లు వసూలు చేయబడిన మొత్తము 30,000. కరాచీ యందలి వితరణ మెఱిగిన వణిక్ప్రుంగవుడగు నారాయణదాసు దయాళదాసు ఈక్లబ్బుకు 15,000 భూరివిరాళ మిచ్చెను. ఈ సొమ్ముతో నామె క్లబ్బునకు బ్రహ్మాండమగు మందిరము కట్టించెను. పుస్తక భాండాగారమును పెంపొందించెను; చిన్నపిల్లల కొఱక ఆటస్థలమును ఏర్పఱిచెను; మూడు టెన్నిసు కోర్టుల నిర్మించెను. ఇవి అన్నియు ఆధునికపద్ధతుల ప్రకారము నిర్మితములై శ్రీమతి రూప్ చంద్ బిలారామ్‌సతి కార్యశ్రద్ధకు నిదర్శనములై యున్నవి.

# నిర్బంధితలగు ఆంధ్రనారీ సత్యాగ్రహులు

( 23—7—30 వఱకు )

| నెంబరు | నామము | నిర్బంధింపబడిన తేది | ప్రదేశము | సెక్షను | శిక్షాంతికాలము | తరగతి | విడిఖైదు లేక కఠినశిక్ష |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఆచంట రుక్మిణమ్మ | 14-5-30 | వేదారణ్యము | ఐ. పి. సి. 117 | 12 మాసములు | ఏ | విడిఖైదు |
| 2 | వేదాంతం కమలాదేవి | 21-5-30 | నరసన్నపేట | ఐ.పి.సి. 117; ఉప్పుచట్టము 74 | 6 మాసములు | ? | ,, |
| 3 | గుమ్మిడిదల దుర్గాబాయమ్మ | 25-5-30 | ఆర్కాటు | ,, | 12 ,, | ఏ | ,, |
| 4 | దువ్వూరి సుబ్బమ్మ | 31-5-30 | రాజమండ్రి | ఐ. పి. సి 157 | 6 ,, | ? | ,, |
| 5 | ఉన్నవ లక్ష్మీబాయమ్మ | 9-6-30 | దేవరంపాడు | ? | 6 ,, | ? | ,, |
| 6 | కోటమర్తి కనకమహాలక్ష్మమ్మ | 12-6-30 | భీమవరము | క్రి. ప్రొ. కో. 112 | 6 ,, | బి | ,, |
| 7 | దిగుమర్తి జానకీబాయి | 13-6-30 | విశాఖపట్టణము | క్రి. ప్రొ. కో. 145 | 6 మాసములు,50రూపాయిలు | బి | కఠినశిక్ష |
| 8 | మంత్రిప్రగడ బంగారమ్మ | ,, | ,, | ,, | ,, ——జరిమానాయున్న | సి | ,, |
| 9 | పెరుంబుత్తూరు సుభద్రమ్మ | ,, | నందిగ్రామము | పోలీసుఆక్టు 3 | 6 మాసములు | బి | విడిఖైదు |
| 10 | జయంతి సూరమ్మ | 19-6-30 | బరంపురము | ఉప్పుచట్టము 74 | ,, | ,, | కఠినశిక్ష |
| 11 | పొణకా కనకమ్మ | 26-6-30 | నెల్లూరు | ఐ. పి. సి. 143 | ,, | ? | విడిఖైదు |
| 12 | ఓరుగంటి మహాలక్ష్మమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 13 | కోటగిరి తాయారమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 14 | ముత్తుకూరు కామమ్మ | 29-6-30 | ,, | ఐ. పి. సి. 144 | ,, | సి | కఠినశిక్ష |
| 15 | పొన్నలూరు రమణమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 16 | కట్టా శంకరమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 17 | కాళంగి శేషమాంబ | 3-7-30 | తెనాలి | ? | 12 మాసములు | బి | కఠినశిక్ష |
| 18 | సంఘము లక్ష్మీబాయమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 19 | వికర్ల అన్నపూర్ణమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 20 | వాసిరెడ్డి హనుమాయమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| 21 | వారణాసి సీతమ్మ | 5-7-30 | బొండాడ | ,, | 3 మాసములు | ,, | విడిఖైదు |
| 22 | తల్లాప్రగడ విశ్వసుందరమ్మ | 8-7-30 | ఏలూరు | క్రి. ఎ. ఆక్టు 17 | 4 ,, | ఏ | ,, |
| 23 | పత్తిపాటి సీతమ్మ | 10-7-30 | రేపల్లె | ? | | ? | ? |
| 24 | కలగర పిచ్చమ్మ | 12-7-30 | ఏలూరు | ఐ. పి. సి. 145, 188 | 6 మాసములు | ఏ | విడిఖైదు |
| 25 | కొమ్మూరి వీరవెంకమ్మ | ,, | ,, | ,, | ,, | ,, | ,, |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 26 | తుమ్మల దుర్గాంబ | ? | కావూరు | ? | ,, | సి | విడుదలైరు |
| 27 | తుమ్మల చంద్రమ్మ | ? | ,, | ,, | ,, | ,, | ,, |
| 28 | కలిదిండిసీతయ్యమ్మ | ? | ,, | ,, | ,, | ,, | ,, |
| 29 | దామరాజులక్ష్మమ్మ | 21-7-30 | ఏలూరు | క్రి. ప్ర. ఆక్టు 17 | ,, | ఏ | ,, |
| 30 | దాసరికృష్ణవేణమ్మ | ,, | ,, | ,, | 4 మాసములు | బి | ,, |
| 31 | దాసరి లక్ష్మీబాయమ్మ | ,, | ,, | ,, | 6 మాసములు | ,, | ,, |
| 32 | ముడింబి వెంకటమ్మ | ,, | ,, | ,, | ,, | సి | ,, |
| 33 | నాగళ్ల కృష్ణమ్మ | 23-7-30 | తెనాలి | ఉప్పుచట్టము | ,, | ? | కఠినశిక్ష |
| 34 | కంది పిచ్చమ్మ | ,, | ,, | ,, | ,, | ? | ,, |

## గమనింపదగిన విషయములు

1. ప్రస్తుత సత్యాగ్రహసమరమున ఆసేతుహిమాచలపర్యంతమైన ఈ భారతభూమిలో ప్రథమమున నిర్బంధింపబడిన స్త్రీ ఆంధ్రజాతికి చెందినది. ఆమె శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు.

2. 23-7-30 తేదీవఱకు 34 ఆంధ్రస్త్రీలు నిర్బంధింపబడిరి.

3. అందు 10 మందికి కఠినశిక్ష; మిగిలినవారికి విడిశిక్ష. స్త్రీలలో కఠినశిక్షపొందుటకు ప్రథములగు శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారు.

4. నిర్బంధితలగు 34 స్త్రీలలో 6 గురకు ఏ తరగతి, 11 గురకు బి తరగతి, 8 గురకు సి తరగతి, 9 గురకు ఏ తరగతి యిచ్చినది నూంశిగ తెలియ వచ్చుటలేదు. సి తరగతిలో ప్రథమమున చేర్చబడిన స్త్రీ శ్రీమతి మంత్రిప్రగడ బంగారమ్మగారు.

5. 6 గురకు 12 మాసముల శిక్ష, 24 రకు 6 మాసముల శిక్ష; 2 రకు 4 మాసములశిక్ష; 1 రికి 3 మాసములశిక్ష; 1 రికి శిక్షాపరిమితి నూంశిగ తెలియ వచ్చుటలేదు. వేయబడినశిక్షలన్నిటిలోను మిక్కిలి తక్కువదియగు 3 మాసముల శిక్షపొందినవారు శ్రీమతి వాడ్రేవు సీతమ్మగారు. శిక్షగాక ఇరు వురకు జరిమానాకూడ విధింపబడినది. అట్లు విధింపబడినవారు శ్రీమతులు దిగుమర్తి జానకీబాయి; మంత్రిప్రగడ బంగారమ్మగార్లు.

6. 12 గురు ఇండియను పీనలుకోడ్డుక్రింద; 8 గురు క్రిమినలు అమెండుమెంటు ఆక్టుక్రింద; 4 రు ఉప్పుచట్టముక్రింద; 1 రు పోలీసుఆక్టుక్రింద విచా రింపబడిరి. మిగిలినవా రేయేచట్టములక్రింద విచారింపబడిరో తెలియవచ్చుటలేదు.

7. మేమాసమున 4 గురు; జూనుమాసమున 12 గురు; జూలై మాసము 23-వ తేదీవఱకు 18 గురు నిర్బంధింపబడిరి.

8. గంజాముజిల్లాలో 1 రు; విశాఖపట్టణముజిల్లాలో 2 రు; తూర్పుగోదావరిమండలమున 1 రు; పశ్చిమగోదావరిమండలమున 9 గురు; కృష్ణామండ లమున 1 రు; గుంటూరుమండలమున 11 గురు; నెల్లూరుజిల్లాలో 6 గురు; అరవదేశమున 2 రు నిర్బంధింపబడిరి. ఆంధ్రమండలములన్నిటిలో గుంటూరు జిల్లాలోఎక్కువమంది నిర్బంధింపబడిరి. ఇరువురు ఆంధ్రరమణులు తమిళదేశమున నిర్బంధింపబడియుండుట విశేషము.

9. భారతదేశమునందలి ఏ ఒక్కజాతియందును ఇంతమంది స్త్రీలు నిర్బంధింపబడియుండరనుట సత్యసమీపము. అయినను ఆంధ్రుని ఆంగ్లదినపత్రికయగు 'స్వరాజ్య' అస్తమించుటచే ఈవిషయము సమగ్రముగ తోడి భారతీయులకు తెలియకున్నది. తగిన ప్రచురణలేక ఆంధ్రునిశక్తి గమనపడుటలేదు. గడపయే దాటనప్పుడిక వీధినిబడుట యెక్కడ ?



## చీమలు నిప్పును ఆర్పగలవు:—

ఒకానొక ప్రొఫెసరు చీమలనుగూర్చి పెక్కుగ్రంథములను చదివెను. ఆగ్రంథములలో కొన్నిటియందు 'చీమలు నిప్పును ఆర్పగలవు' అని వ్రాయబడియుండెను. 'స్వయముగ పరిశీలించిగాని దీనిని నమ్మరాదు' అని ఆతడు నిశ్చయించుకొనెను. అందు విషయమై చేసినదానిని ఆతడిట్లు వర్ణించుచున్నాడు: "ఒక చిట్టడవికిపోతిని. ఒక చీమల పుట్టయందు కొవ్వువత్తి నొకదానిని అది ఒక అంగుళముపై నుండునట్లు గ్రుచ్చితిని. పిమ్మట వత్తి వెలిగించితిని. తోడనే దగ్గఱ ఉన్నచీమలు కొంతదూరమునకు తొలగిపోయి మూకలుగట్టి మంటను చూడసాగినవి. కొంతసేపటికి వానికి తమ ఇంటికి రానున్న అపాయము తెలియవచ్చినది కాబోలు? అవి కంగారుగ కదల నారంభించెను. ఆగుంపునుండి అప్పుడు కొన్ని పెద్దచీమలు ఎట్టికంగారును లేక నేరుగా మండుచున్న కొవ్వువత్తి దగ్గఱకువచ్చి దాని నెక్కి మంటను సమీపించి ముందుకు తిరిగి వెనుక కాళ్ల ఆధారమున మంటకు ఎదుటివైపున వ్రేలాడచొచ్చెను. మంటకు చుట్టును చీమలిట్లు ఏర్పడినవి. అప్పుడవి తమదేహములను కొంచెము ముందునకుచాచి మంటమీదికి ఏదో నొక ద్రవపదార్థమును చిమ్మినవి. మంట చుయ్యిచుయ్యిమనెను. ఇప్పుడు చీమలు తండోపతండములుగ రాజొచ్చెను. మంటవైపునకు పృష్ఠభాగము ఉంచి అవి అన్నియు నిట్లే ఏదోనొక ద్రవపదార్థమును వదలనారంభించినవి. క్రొత్తచీమలు ప్రాకి వచ్చుచునేయుండెను. దీపమునకు బాగుగ సమీపముననుండిన పెక్కుచీమలు కాలిపోయెను. కాని కాలిపోయిన వానిస్థానమున, రాలిపోయినవాని స్థానమున క్రొత్తచీమలు ఎడతెగక వచ్చుచునే యుండెను. పుట్టలో చెదిరియున్న ఒకటి రెండు ఎండుటాకులకు నిప్పుతగిలినది. తగిలీతగులుట తోడనే వానిపై చీమలు ప్రాకి చచ్చినన్నిచచ్చి వానిని ఆర్పివైచినవి. చీమలు కొవ్వువత్తి ఆర్పుటకు ప్రారంభముచేసి ఇప్పటికి నాలుగున్నర నిముషములయ్యెను. వత్తి ఆరిపోయినది. చీమలు గెలిచినవి. అరగంట కాలము ఊరకుండి వత్తిమఱల వెలిగించితిని. ఈమారు చీమలు వెనుకటికంటె ఎక్కువగ మూకలుకట్టివచ్చి ముప్పది రెప్పపాటుల కాలములో దాని నార్పివైచినవి. చీమలు నిప్పును ఆర్పగలవు అని నేను చదివినదానిని నిర్ధారణ చేసికొనుటయేగాక ఇందు మూలమున నే నొక గొప్పనీతిని నేర్చుకొంటిని. తమపుట్టకు అపాయము కలిగినపుడు చీమలు తమబ్రతుకులపై ఆశవిడిచి పనిచేసినవి, ప్రాణములను తృణప్రాయముగ నర్పించినవి. సాముదాయకమగు క్షేమము కొఱకు వ్యక్తిని నష్టపఱచుటకు చీమ లెంతమాత్రమును వెనుకాడవు. చీమ అంతటి చిన్నజంతువు ఎంతటి నీతిని ప్రదర్శించుచున్నదో చూచితిరా?"

## ఒకేకాన్పున అయిదుగురు పిల్లలు:—

పంజాబునందలి రంక్ జిల్లాలోని కింగ్ ఎడ్వర్డు మెమోరియలు ఆస్పత్రియందు ప్రసవచికిత్సకై వచ్చిన నొకస్త్రీకి అయిదుగురు పిల్లలు పుట్టిరి. తల్లియు పిల్లలును కులాసాగా ఉన్నారు.



సమగ్ర పంచాంగరచన: స్త్రీలు:—

గోదావరీతీరస్థమగు కొవ్వూరునందలి ఆంధ్రజ్యోతిర్విద్యాపీఠమునకు జెందిన శ్రీయుత పిడపర్తి సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారు పై విషయమునుగూర్చి ఇట్లు వ్రాయుచున్నారు :—

"మన ఆంధ్రదేశమునకు సమగ్రపంచాంగ మొకటి రచింపబడవలసిన ఆవశ్యకత కలిగియుండుట పంచాంగకర్తల నందఱకును తెలిసిన విషయమే. సమగ్రపంచాంగమును రచియించుటకు పదిమంది జ్యోతిశ్శాస్త్రజ్ఞులు సంవత్సరమునకు నాలుగు మాసములు పనిచేయవలసియుండును. అందువలన గణితభాగమందు నక్షత్రశోధన శాలలయందు యంత్రపరీక్షకు సిద్ధపడుటయేగాక లోకమందు వర్ష వాత ఆతప సస్య అరిష్ట అర్ఘములను నాఱు విషయములను ఋజువుగ తెలియపఱచుటకు కూడ అవకాశము కలుగును. మరియు అట్టి పంచాంగమువలన పంచాంగకర్తల మతభేదములుకూడ నశించి కర్మశ్రద్ధకల వారలకు కాల నిర్ణయముల యందు కలుగు సంకటములుకూడ తొలగిపోవును. పై గణితము ప్రతి సంవత్సరమును చేయుటకు విసుగు లేని వారు కావలయును. నేను చాలకాలమునుండి అట్టి పంచాంగకర్తల కొఱకు ప్రయత్నించుచుంటిని. పంచాంగకర్తల ప్రశ్నలు యోచింపగా పురుషులకంటె నీ కార్యక్రమమందు పదుగురు స్త్రీలను నియమించుట సౌకర్యముగ తోఁచుచున్నది. పురుషులకంటె స్త్రీలకు కార్యక్రమమునందు విశేషశ్రద్ధకలదనుటకు మన హిందూకుటుంబములే తార్కాణము. తల్లి చావు పిల్లలకంటె తండ్రి చావు పిల్లలు తేటగానుందురు. వ్రాయుట చదువుట మాత్రము తెలిసిన స్త్రీకి ఆరు మాసములకు పంచాంగమును గుణించుట నేర్పవచ్చును. పిమ్మట మరి ఆరు మాసములకు సమగ్రపంచాంగరచనయందు శక్తిని కలుగజేయవచ్చును. మొత్త మొక్క సంవత్సరము పాటుపడిన మానవతి దేశమందు పంచాంగరచనయందు కలదుస్థితిని తొలగించుటకు ప్రసవిత్రి కాగలదు."

ఆంధ్ర స్త్రీలీ మహనీయుని అమూల్యాభిప్రాయము ననుసరించి పంచాంగకరణవిద్యయందు తగుపాండిత్యము సంపాదింప ప్రయత్నించి తమ బుద్ధి బలమును ప్రకటింతురుగాక!

ఉల్లిపాయలు:—

జూలై 19-వ తేదీ నాటి 'గోలకొండపత్రిక' లో డా. అర్థరుగారు ఉల్లిపాయలను గూర్చి ఇట్లు వ్రాయుచున్నారు:—

"మనము అనుదినము వాడు ఉల్లిపాయ శ్రేష్ఠత వర్ణింప తరముగానిది. అవ్వగారి వైద్యము ఉప్పు ఉల్లిపాయతో మహత్కార్య చేయునదై యున్నది. ఉల్లి మూడువిధములుగలది. నీరుల్లి, వెల్లుల్లి, అడవి ఉల్లి. నీరుల్లి, వెల్లుల్లి గృహరత్నములు. అడవి ఉల్లి (Indian Squill) వైద్య రత్నమై వెలయుచున్నది. తేలుకుట్టినచోట వుప్పు ఉల్లిపాయదంచి కట్టిన పసిపిల్లలకు మొదలుకొని పెద్దవారి పర్యంతము అతిసూక్ష్మముగా తేలు విషము దిగును. పసిపిల్లలు కంటికూనలకు ఉల్లి రసమును పోతురు. దీనిని చక్రములుగకోసి కలకండ పొడిని చల్లి రాత్రియంతయు మంచులోనుంచి ఉదయమందుండి వచ్చు నీటిని సీసాలోవేసి ఒక్కతేగరిటెడు చొప్పున పుచ్చుకొనిన ఉక్కసదగ్గులు, రక్తవమనము, మూత్రమునుండి సుద్దపడుట, మూత్రములోని మంట పోయి ఆరోగ్యమునిచ్చును. నిమ్మరసము పాలుకలిపి త్రాగుటకన్నను నీరుల్లిరసము చక్కెరకల్పిపుచ్చుకొనిన రక్త అరిశస్సులు త్వరగా కట్టుపడును. రక్తమూత్రము, మధుమూత్రము, రక్తాతిసారము, బొట్టుగా పడెడు మూత్రాశ్మరీ, మూత్రఘాతము వీనిని బోగొట్టును. నీరుల్లి గృహవైద్యమునం దతిశ్లాఘనీయమైనది. గడ్డపైన ఉడికించిన ఉల్లిగడ్డలను మార్చి మార్చికట్టుచుండిన ప్లేగుగడ్డలు, చంకగడ్డలు, రక్తగడ్డలు, మాదలు మున్నగునవి మాయమగును. నూనెలో ఉల్లిగడ్డను ఉడికించి చెవిపోట్లుకు, మేహవాతములకు పిల్లల గజ్జికి వాడుదురు. చిరకాటిలో నానబెట్టిన ఉల్లిపాయలు గుండెకు బలమిచ్చును. అరుచిని బోగొట్టును. నేత్రములకు హితకారి. మూత్రములో పుట్టబోయెడు రాళ్లను కరిగించును. ఏ ఔషధముతోను గుణమివ్వని దంతరోగములు (చీము రక్తము కారుట) ఉల్లిగడ్డనుదంచి ఉప్పుకలిపి అనుదినము తోముతూరాగా ఆశ్చర్యముగా కుదరును. ఉల్లికాడలను కూరకువాడుదురు. వీని విత్తనములను మెదడుకు బలమిచ్చునట్లు ఔషధములలోవాడుదురు. వెల్లుల్లి ముఖ్యముగా నంజు రోగముల మీదను తైలరీతిగదీసి పక్షవాయువు నరముల ఈడ్పుల పైన పూయుదురు. క్షయవ్యాధి గలవారికి వెల్లుల్లి, నల్లమేకపాలు, కుంకుమపుష్పము, మిశ్రి కల్పి లేహ్యపాకము చేసి కొద్దిగా తినుపింతురు. హిస్టిరియాయను బాలింతలకు వచ్చు రుగ్మతలకు వెల్లుల్లిపాయ మపరిమితమని కొనియాడుదురు. తెల్ల వుల్లి గడ్డలు పెద్దవాటిలో తాళకమును పెట్టియు వెల్లుల్లిముద్దలో వలాందా ఇంగిలీకము పెట్టి వంటచేసియు ఆయౌషధములను వైద్యగణము సంజీవిగా భావింతురు. ఆఖరున అడవి ఉల్లి (Indian Squill) లో ద్రావకమును తయారుచేసి కఫప్రకోపముతో చేరిన దగ్గుతోను దమ్ముతోను బాధపడువారికి ఈయరఖును వైద్యశాలవారు వాడుదురు. మితముదప్పి ఉల్లినివాడ కూడదు. వాడు వారలు చిరకా (Vinegar) మొదలైన వాటిని విరుగుళ్లుగా నెంచవలయును."

రత్న చరిత్రాంశములు:—

జూన్ 28-వ తేదీ స్వతంత్ర పత్రిక ప్రచురించిన వజ్రములను గూర్చిన యీక్రింది సంగతులు చదువ తగియున్నవి:—

## ప్రసిద్ధ భారతీయ రత్నముల తూకములు

| | సానబెట్టనివి. రతులు. | సానబెట్టినవి. రతులు. |
|---|---|---|
| గ్రేట్ మొగల్ | 156 | 68 |
| కోహినూర్ | 186 | 103 |
| ఆర్లాఫ్ | ... | 193 |
| నైజామ్ | 277 | ... |
| రీజంటు | 410 | 137 |
| టస్కనీ | 134 | ... |
| అక్బర్‌షా | 116 | 72 |

1425 సం॥న గోండ్వానా పరగణాలో నున్న కుల్లం రత్నఖనిని స్వాధీన పరచుకొనుటకు అహమద్‌షా మాహబూబ్ జమీందారునితో యుద్ధ మొనర్చెను. 1593 సం॥రము కుతుబ్షా సంగమేశ్వరము వద్ద కృష్ణానదిని దాటి అప్పుడు రత్నములకు ప్రతీతిని గాంచిన ముసలిమడుగు కోటను ముట్టడించెను. 1652 సం॥రమున జాలు మడుగు రత్నఖనులకై గోల్కొండ సేనాని మీర్ జుమ్లా గండికోటా సంస్థానాధీశునిపై దండెత్తి గెలిచి సదరు గనులలో పనిజేయించెను. అతనే 1640 సం॥రమున వజ్రకరూరు గనులను లోబరచుకొనెను. పదు నెనిమిదవ శతాబ్దములో టిప్పుసుల్తాను అనేక రత్నఖనులను స్వాధీన పరచుకొనెననియు, మునుమడుగు వజ్రకరూరు గనులను పనిచేయించుటకు స్వయముగ ప్రారంభించెననియు ప్రతీతి గలదు. రత్నపరీక్ష జేయుటకు హైందవుల పద్ధతు లొకవిధము. పగటియందు గాక, సాయంకాలమందును రాత్రుల యందును పరీక్షింతురు. అడుగు చదరముగల గూటిలో పెద్దవత్తి దీపముంచి, రత్నమును వేళ్లమధ్యనుంచి పరీక్షించి, వానిలో నీరు దిగియుంటను యింకను లోపములను చక్కగా గమనింతురు. ప్రస్తుతమున పాశ్చాత్యులు యెలక్ట్రిక్ లైట్ ద్వారా గమనింతురు. మంచిరత్నము యెన్నరేచాయలో చక్కగా కాంతియొసంగును. ఇమిటేషనుది మసిబూసిన దానివలె కన్పడును. రత్నము లరిగిపోవు. రత్నములు లేక స్త్రీ సొగసు సంపూర్ణము కాజాలదు. అవి అత్యవసరములు. భార్యాభర్తలకు అన్యోన్యతను గల్గించునది రత్నములని ఐరోపాయందు నమ్మకము గలదు. రత్నములు ధరించుటచేత ధైర్యము, పౌరుషము, దేహధార్ఢ్యము గల్గును. శత్రునాశనమును, విజయమును గలుగజేయును. రత్నధారణమువలన దుష్ప్రయోగములు నిష్ప్రయోజనములై ప్రయోగకునినే క్షీణింపజేయును. రత్నధారుని దుష్టజంతువులంట వెరచును. చాపల్యమును, భూతములను బోగొట్టును. రత్నము వద్ద విషముంచ రత్నము తడియగును. అదియునుగాక పాపి చేతిలోనుండు రత్నము గుణములను గోల్పోవును. రత్నములు కొంత సయిజువరకు మదింపులో హెచ్చుధరపడును. అంతకుపై సయిజునకు ధర నిర్ణయించుట కష్టము. మొదటి రకము రత్నము 1 కారెట్ 100 రూపాయ లనుకొనుడు; రెండు కారెట్లు రు. 300 లు, పది కారెట్లు రు 12000 లు యివ్విధముగనుండును. రత్నములలో పెక్కుతెగలు, వర్ణములుగలవు. దోషములు లేనివి అరుదు. ప్రపంచములో ప్రతీతిగనిన రత్నములు దోషరహితములుగావు. ప్రాచీన రత్నములన్నియు భారతీయములే. ప్రస్తుతమున రత్నపరిశ్రమ యొనర్చువారు బెల్జియనులు, డచ్చివారు, పోలులు, ఆస్ట్రో హంగేరీవారు. ఈకర్మాగారములందు కార్మికులు నమ్మకముంచజాలనివారయ్యును యీ పరిశ్రమ నష్ట మెరుగదు.

**తెలుగు తెఱవల సాహసము :—**

అను విషయమునుగూర్చి సుప్రసిద్ధమగు ఆంధ్రద్వైవారపత్రిక 'సమదర్శిని' ఇట్లు ప్రచురించుచున్నది.:—

"తూర్పు గోదావరిజిల్లా కాకినాడయందొకమహిళావిద్యాలయమును స్థాపించిన శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారును, రాజమహేంద్రవరమున శ్రీ సనాతన స్త్రీ విద్యాలయమును స్థాపించిన గం|| భా|| స|| శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మగారును, గుంటూరులో శారదానికేతనమును స్థాపించిన ఉన్నవ లక్ష్మీబాయమ్మగారును, వైశ్యయువతీ విద్యాలయ స్థాపకురాలు శ్రీమతి కాళంగి శేషమాంబగారును, నెల్లూరులో శ్రీ కస్తూరీబాయి విద్యాలయ స్థాపకురాలు శ్రీమతి పొణకా కనకమ్మగారును సత్యాగ్రహోద్యమమందు పాల్గొని కారాగార వాసమునందుకొనినారు. యువజనసమితి యధ్యక్షురాలు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారును శ్రీకృష్ణజన్మస్థానమునకు వెడలిరి. హిందూయువతీశరణాలయ స్థాపకురాలు శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారి బోలి కొంతమంది మాత్రమే యింకను బయటనున్నారు."

**దుఃఖాంత నాటకములు, నవలలు రోగులు చదువరాదు :—**

పోర్ట్సుమతులో పబ్లికు హెల్తు కాంగ్రెసు ఇనిస్టిట్యూటు వైద్యశాలకు అధికారి యగు సర్ బ్రూసు పోర్టరుగారు 'డెయిలీ హెరాల్డు' పత్రికలో నిట్లు ప్రకటించుచున్నారు.

"వెనుక నొకసారి నవలలను వ్రాయుచుండు నొకకవి దారుణవ్యాధిచే పీడింపబడుచున్న ఒక యువతిని తన నవలకు నాయకురాలినిగా నొనర్చి ఒక నవలను భాగములుగా వ్రాసి పత్రికలలో ప్రకటింపసాగెను. అట్టి వ్యాధివలననే బాధింపబడుచు నావైద్యశాలలో చికిత్సను బడయుచున్న మరియొకయువతి ప్రతివారమును ఆనవలను శ్రద్ధగా చదువుచుండెను. ఒక వారమున వచ్చిన సంచికలో ఆనవలలోని యువతికి సంపూర్ణారోగ్యము కలిగినట్లు వ్రాయబడెను. ఆభాగమును చదువగానే వైద్యశాలలోనున్న యువతికిగూడ రోగము మళ్లుముఖమైనది. దానివలన ఆమె మనసులో గట్టిమార్పు కలిగినందున అతిశీఘ్రముగనే ఆమె సంపూర్ణారోగ్యమును బడయ గలిగెను. ఈనవలను వైద్యశాలలో శ్రద్ధగా చదువుచున్న యువతిని నేను కని పెట్టుచుండుటచే నేనుగూడ దానిని శ్రద్ధగా చదువుచుంటిని. ఆ కవి దానిని దుఃఖాంతముగా నొనరింపదలచె నని నాకు తెలిసినది. అతడు తన నవలలోని యువతి ఆ ప్రబలవ్యాధిచే మృతినొందినట్లు వ్రాసియుండినచో వైద్యశాలలోని యువతిగూడ తప్పక మృతినొందునని నేను గ్రహించితిని. కావున వైద్యశాలలో యువతిని గూర్చి నేనాకవికి వ్రాసితిని. మీ రీయువతిప్రాణమును కాపాడుటకు మీ నవలలోని యువతికిగూడ వ్యాధికుదిరినట్లే మీరు వ్రాయవలెను. లేనిచో నిష్కారణముగా నొక నరహత్యకు మీరు పాత్రులగుదురు. మీరు మీ నవలను సుఖాంత మొనరించినచో ఒక యువతికి ప్రాణదాన మొనరించినవారగుదురు. అని నేను వ్రాయగా నతడు నామాట పాటించి తన ప్లాటును మార్చుకొని తన నవలను సుఖాంత మొనరించెను. ఆ రీతిగా ఈయువతి ప్రాణములను కాపాడెను. అతడు కాల్పనికప్రపంచము నందలి యువతిని చంపివేసియే యున్నచో భౌతిక ప్రపంచములోని యువతినిగూడ చంపివేసియేయుండును. వైద్యశాలలో నున్నవారికి మందులకంటెను మంచిగ్రంథములే ముఖ్యావసరములయియున్నవి. వ్యాధులతోడను మరణములతోడను గూడిన గ్రంథములు వైద్యశాలల గ్రంథాలయములలో నుండగూడదు. దుఃఖాంతములగు కథలను చదువుటవలన మంచి ఆరోగ్యవంతులుగానుండిన వారికి సైతము మనసు చెదరి పోవుచుండును. కొన్నిరోజులవరకును వారు మరల నుల్లాసమును బడయజాలరు. అట్టిచో వ్యాధిగ్రస్థులగు వా రట్టిగ్రంథములను చదివినచో సహజముగానే వారిహృదయములు చాలబలహీనములుగా నుండును గాన ఒక్కసారిగా హృదయస్పందన మాగిపోయి వారు మృతినొందెదరు. కావున దుఃఖాంతములగు నవలలు నాటకములు మున్నగువానిని వ్రాయుటవలన ప్రజలకు లేశమైన మేలుకలుగుటలేదు. పైగా ప్రాణహానికూడ కలుగుచున్నది." (ఆంధ్రపత్రిక.)



## బందిపోటు దొంగలను తఱిమివైచిన ధైర్యవతి:—

దక్షిణకనరాజిల్లాయందలి ఒక పల్లెటూరియందు ధనికురాలగు బాలవితంతువు నివసించుచుండెను. తనపిల్లలుతప్ప ఆమెకు నెనరుగల పురుషదక్షత లేదు. ఆమెయింటికి దూరమున కొన్నిగృహములు గలవు. పురుషదక్షతలేని ఈ వితంతువుధనమును ఊఁచముట్టుగ దోచుకొనుటకై ఒకనాటిరాత్రి ఆమెయింటికి దొంగలువచ్చిరి. ఆస్త్రీ ఈసంగతి నెట్లోగ్రహించెను. గ్రహించి నగదు, నగలుగలపెట్టెను జాగ్రతగ మేడమీదకు గొనిపోయి భద్రపఱచెను. పిమ్మట నిప్పుచేసి నూనెసలసలమరిగించుచుండెను. ఇంతలో దొంగలు మేడమెట్లు ఎక్కుచుండిరి. అప్పుడాధైర్యవతికాగుచున్న నూనె వారిపై దిమ్మరించెను. ఒడలుకాలి దొంగలు క్రిందకు దొర్లిపోయిరి. దొర్లిపోయి తొలిగిపోవచ్చునా? పోక వారు గృహావరణమునందలి చెట్లసందున డాగియున్న మఱికొందఱు తమతోడిదొంగలతో మంతనముచేసి ఆయింటికి నిప్పంటించ ప్రయత్నపడిరి. ప్రజ్ఞావంతురాలగు ఆస్త్రీ ఇదికూడ గ్రహించి నిప్పంటించ ప్రయత్నించు వారిపైగూడ మరుగుచమురు పోసెను. శరీరము కాలి పారిపోవుటకు అశక్తులై వారందఱును ఒక్కచో పడియుండిరి. అప్పుడా స్త్రీ పోలీసువారికి కబురుచేసి దొంగలను అప్పగించెను. దొంగలు మొత్తము పదునలుగురు. వారిలో ఎనమండుగురు నూనెకాల్పులవలన వైద్యశాలలో మరణించిరి. అయితే ఈదొంగలందఱును ఆమెకు దగ్గఱబంధువులే. వారిలో ఒకడామె భర్తకు పెద్దన్నయగుట బావ. ధనలోభము బంధుత్వము పరిగణింపదుగదా? స్త్రీసాహస మిట్టిదని లోకమునకు ఎరుకచేసిన ఆవితంతువు అభినందనమున కెంతయు దగినది.

## తనకఱ్ఱ విరుగువరకు దొంగలను లోన కాలుపెట్టనీయలేదు.—

వంగరాష్ట్రమున కిల్లీనగరమున కృష్ణదయాలురాయి గృహమున జూలై పద్రెండవతేదీని 'బందిపోటు దొంగతనమొకటి జరిగినది. దొంగలు ఇంటప్రవేశించి కృష్ణదయాళురాయిని తలమీద ఇనపపూచలతో చావమోది గదిలోప్రవేశింప ప్రయత్నించిరి. రాయికొమార్తె ఇరువదినాలుగుసంవత్సరముల వయసుగలది. లావణ్యప్రభాదేవి అనుపేరిది. అప్పుడు దొంగలకు అడ్డమువచ్చి చేతికఱ్ఱతో వారి నడ్డగించినది. ఆమెచేతి కఱ్ఱ ఉన్నంతవఱకు దొంగలకు గదిలో కాలుపెట్టుటకుగాని ఆమెశరీరముపై దెబ్బవేయుటకుగాని వీలుచిక్కినదికాదు. అరగంట పోరినను ఆమె ధైర్యకవచము ఇసుమంతయైన జంకలేదుకాని చేతికఱ్ఱ విరిగిపోయెను. తెరచిన యింటిలో కుక్కలుదూరినట్లు అప్పుడాదొంగలు నిరాయుధురాలైన లావణ్యప్రభాదేవిని పులుసులోనికిఎముక లేకుండ కుళ్లబొడిచి గదిలోకి చొఱబాఱిరి. దేవికంటె వయస్సునకు పదిసంవత్సరములు పెద్దవాడును పురుషుడై పుట్టినవాడును అగు ఆమె సోదరుడా గదియందేయుండియు దొంగలతో దొమ్ములాడుచున్న చెల్లెలికి చేదోడు కాజాలక పిఱికిమందు తాగెను. పౌరుషమునకు మూర్తినని చెప్పుకొను పురుషుడు చేసినపని ఇది. అబలయని పేర్కొనబడు స్త్రీ చేసినపని అది.

జూను 20:—

21:—హజారిబాగు జిల్లా కాంగ్రెసుసంఘాధ్యక్షురాలగు శ్రీమతి సరస్వతీదేవికి ఇండియను పినలు కోడు 143 శెక్షనుక్రింద ఆరు మాసములు విడి ఖైదు విధింపబడెను.

22:—పండిత ఇంద్రగారు ఫ్రీప్రెస్సు విలేఖరితో నిట్లు చెప్పిరి: "ఢిల్లిలో స్త్రీలను ఎక్కువగా అరెస్టు చేయకుండుటకు కారణము ఢిల్లీ జయిలులో స్త్రీలకనువైన తావులేక పోవుటయే. ఢిల్లీ జయిలులోని స్త్రీలవార్డు చెప్పరానంత అసహ్యముగనున్నది. గౌరవ కుటుంబములకు చెందిన నారీమణుల నచట పెట్టుట తలపరానిది. ప్రస్తుతము ఆగదులలో పిచ్చివారు కలరు. ఢిల్లిలో నిర్బంధింపబడిన నారీసత్యాగ్రహి శ్రీమతి సత్యవతీ దేవిగారిని పిచ్చివారితో మాత్రము చేర్చక 16 చేతి మిల్లులు పనిచేయు హాలులో పెట్టియున్నారు. మిల్లుల మధ్య ఆమె నిద్రింప వలెను. అట్లు నిద్రించుట సుకరముకాదు. కావున ఆమె వసారాలో పరుండుచుండును. వాన వచ్చిన వసారాలో పండుకొనుటకు వీలులేదు. ఇట్టి అసౌకర్యములులేని ప్రత్యేకపు జైలు కట్టించిన తరువాతనే స్త్రీల నిర్బంధము ఇచ్చట వృద్ధిచేయవలెనని ప్రభుత్వమువారికి నేను సలహా ఇచ్చుచున్నాను."

23:—

24:—శ్రీమతి కస్తూరిబాయిగారు మీరటు వెళ్లి సత్యాగ్రహాశ్రమమును సందర్శించిరి.

—రాజశ్రీ సూరంపల్లి రెడ్డిగారి ధర్మపత్నియు, నిరతాన్న ప్రదాత్రియు, దాత్రియునైన శ్రీమతి సుభద్రమ్మగారు విజయనగరమున పరమపదించిరి.

25:—దేశబంధు చిత్తరంజనదాసు సోదరియగు శ్రీమతి ఊర్మిళాదేవిని, నారీసత్యాగ్రహసమితి కార్యదర్శినియగు విమలప్రతీహదేవిని, కలకత్తా పోలీసు ఆక్టు 62 ఏ శెక్షనుక్రింద, ఇండియను పినలుకోడు 117 క్రింద అరెస్టుచేసిరి.

26:—శ్రీమతులు ఊర్మిళాదేవి, విమల ప్రతీహదేవిగార్లకుచెరి ఆరునెలలు విడిఖైదు విధింపబడెను.

—కలకత్తా నారీసత్యాగ్రహసంఘములో ప్రముఖసభ్యురాండ్రగు జ్యోతిర్మయి గంగూలీ, మోహినీదేవి గార్లు నిర్బంధింపబడి చెరి ఆరునెలల విడిశిక్షనుపొందిరి.

27:—శ్రీమతులు పొణకా కనకమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మ, కోటగిరి తాయారమ్మగార్ల కేసు నెల్లూరు డిప్టీ మేజస్ట్రేటు కోర్టులో విచారింపబడి ముగ్గురకు చెరి ఆరుమాసముల విడిఖైదు విధింపబడినది.

28:—

29:—శ్రీమతులు కట్టా శంకరమ్మ, ముత్తుకూరు కామమ్మ, పొన్నలూరు రమణమ్మగార్లను నెల్లూరులో 144-వ శెక్షను ధిక్కరించినందుకుగాను పోలీసువారు అరెస్టు చేసిరి.

—బాలాసోరులో గయాదాధారశ్యాముగారి భార్యయు, అభిమానందుగారి భార్యయు తక్లీ ఊరేగింపులో రెండుసారులు నాయకత్వము వహించినందులకు వారి భర్తలకు వారంట్లు జారీ చేయబడెను. వారు తమభార్యల ప్రవర్తనకు సమాధానము చెప్పవలసినదిగా కోరబడిరి.

30:—సిల్హాట్‌లో స్త్రీ వలంటీర్లు అచ్చటి ప్లీడర్లను కొందఱిని కాంగ్రెసు ప్రచారమును సాగించుటకై జూలై 1-వ తేదీనుండి మూడు మాసములవరకును ప్రాక్టీసు మానవలసినదనియు, మాననిచో వారు కోర్టులకు పోవుటకు వీలులేకుండ స్త్రీ వలంటీర్లు వారి యిండ్లవద్ద పికెటింగు జరుపుదురనియు ప్రకటింపబడెను.

జూలై 1:—నిజాము రాష్ట్రమునందలి బ్రిటీషు ప్రాంతములో (సికిందరాబాదు) శారదాశాసనము అమలులో నుంచబడెను.

—శ్రీమతులు ముత్తుకూరు కామమ్మ, పొన్నలూరు రమణమ్మ, కట్టా శంకరమ్మగార్ల కేసు నెల్లూరులో విచారింపబడి ముగ్గురకు చెరి 6 నెలలు కఠిన శిక్ష విధింపబడెను. అందఱిని సి. తరగతిలో చేర్చిరి.

2:—కలకత్తాలో శ్రీమతి రమాదేవి (పంజాబు స్త్రీ) గారికి పికెటింగు ఆర్డినెన్సు క్రింద ఆరునెలల విడిఖైదు విధింపబడెను. 'నాయందు నేరమే యున్నచో నాకు మరణ దండనము విధింపుడు, కాని జైలుకు పంపకుడు' అని ఆమె చెప్పెను.

3:—శ్రీమతులు కాళంగి శేషమాంబ, సంఘము లక్ష్మీబాయమ్మ, వికృాల అన్నపూర్ణమ్మ, వాసిరెడ్డి హనుమాయమ్మగార్లు తెనాలిలో ఎరస్టుచేయబడి విచారింపబడిరి. నలుగురకు కఠినశిక్ష వేయబడెను. బి. క్లాసు ఈయబడెను.

4:—బొంబాయి నగర కాంగ్రెసు సంఘాధ్యక్షురాలగు శ్రీమతి పెరినుబెను, ఉపాధ్యక్షురాలగు శ్రీమతి లీలావతి మున్షీగార్లు పినలుకోడు 188 సెక్షనుక్రింద విచారింపబడి చెరి మూడు మాసముల విడిఖైదును పొందిరి.

5:—కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘమును అక్రమసంఘముగ ప్రభుత్వమువారు ప్రకటించినందులకు తన అసమ్మతిని తెలుపుటకుగాను శ్రీమతి బిసెంటు కాంగ్రెసు కార్య నిర్వాహకసంఘమున సభ్యురాలుగ చేరుటకు సంకల్పించినది.

—బొండాడ గ్రామ నివాసినియగు శ్రీమతి వారణాసి సీతమ్మగారిని జాతీయగీతములు పాడినందులకై భీమవరములో అరెస్టుచేసి మూడుమాసములు విడిఖైదు విధించి బి. క్లాసులో చేర్చిరి.

6:—కాంగ్రెసు కార్య సంఘమున చేరగోరిన డాక్టరు అనిబిసెంటుగారికి భారత కాంగ్రెసు సంఘాధ్యక్షులగు సర్దారు వల్లభాయిపటేలుగారు ఈక్రిందతంతినిచ్చిరి. 'అమ్మా! మీకు వందనములు. మీరు ధైర్యముతోను దేశాభిమానముతోను చేసిన ఈ ఘనకార్యము మిక్కిలి ప్రశంసనీయము. మీరిటుల మార్గదర్శినులగుటవలన దేశమునందలి జాతీయశక్తులన్నియు ఈ విషమసమయమున కాంగ్రెసు పక్షమున నిలువగలవనుట కెట్టి సంశయమును లేదు."

—వేసంగిసెలవులకు మూయబడిన రాజమహేంద్రవరమునందలి స్త్రీ సనాతన విద్యాలయము విద్యాలయపు కమిటీవారి ఆధిపత్యమున తెరవబడినది.

7:—శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారిని క్రిమినలు లా ఎమండుమెంటు చట్టము 17 సెక్షను క్రింద ఏలూరులో అరెస్టుచేసి విచారించి 4 నెలల విడిఖైదు విధించిరి. ఏ క్లాసు ఈయబడెను.

—65 సంవత్సరముల వృద్ధయగు లుక్మంజీసతిగారిని పికెటింగు ఆర్డినెన్సు క్రింద విల్లిపల్లి దగ్గర చెంబూరులో ఎరస్టు చేసిరి. ఈమె శ్రీ అబ్బాస్‌త్యాబ్జిగారి బంధువురాలు. కేసు విచారించి ఈమెకు 4 నెలల విడి ఖైదును రు. 100/- ల జరిమానాయు విధించిరి. జరిమానా చెల్లింపనిచో మరియొక మాసము జైలు ననుభవింపవలయును.

8:—శారదా చట్ట విరుద్ధముగ బాల్య వివాహము జరిపినందులకు శిక్ష విధింపబడుట కొక ప్రథమ నిదర్శనము. మహమ్మదీయ గాయకుడగు ఫకీరా మిరాసీ అను నతడు ఏడేండ్లు వయసుగల తన కుమారునికిని కర్నూలు జిల్లా నివాసియగు మోలార్ అను నతని కుమారైను వివాహము గావించెనని రోహటక్ జిల్లా మేజస్ట్రేటు జమాన్ మొహిదీఖాన్ గారతనికి పదిహేను రోజుల విడిఖైదు విధించిరి.

9:—శ్రీరాజప్రతినిధిగారు భారతశాసనసభలో ఉపన్యసించుటకు బోవుచుండ స్త్రీ వాలంటీరులు ఇరువదియైదుగురు ఖద్దరు ధరించి ప్రాకారము గేటువద్ద నిలిచి పోలీసువారు పొమ్మన్నను పోకుండ తమ ప్రబోధము గావించిరి. వైస్రాయిగారు బయటకు రాగానే 'శాంతిలేదు. విప్లవము విజయమొందుగాక! జాతీయపతాకము నెత్తుడు. యూనియను జాకుదింపుడు. భగత్‌సింగుకి జే, గాంధికి జే'యని కేకలు వేసిరి. వైస్రాయిగారు సభలోనికి పోగానే స్త్రీలు జాతీయగీతములు పాడుకొనుచు పురములోనికి పోయిరి.

—శారదా చట్టముక్రింద రోహటక్‌లో నొక మహమ్మదీయునకు శిక్ష విధింపబడినవార్త తెలియగనే ఆ ప్రాంతపు డిప్యూటీకమీషనరుకు ఆ శిక్ష నిందితు డనుభవింప నక్కఱలేదని సభాయుతులగు గవర్నరు నిర్ణయించిరని పంజాబుప్రభుత్వమువారు తంతి నొసంగిరి. నిందితుని వెంటనే వదలి వేయవలయుననిరి. ఈ చట్టము క్రింద మొదటి అపరాధమునకు హెచ్చరింపు శిక్ష చాలునని పంజాబుప్రభుత్వమువారి అభిప్రాయము.

10:—బొంబాయిరాష్ట్రమండలి ఘట్కోపరునందు సంఘసేవాధురీణయగు శ్రీమతి కలకాబేన్ కిశోరదాసుగారిని మద్యశాలల పికెటింగుకై అరెస్టుచేసి 4 మాసములు విడిఖైదును రు. 100 జరిమానాయును విధించిరి. జరిమానా చెల్లింపనిచో మరియొక నెల ఖైదు. ఆమె తనవృత్తియేమని ప్రశ్నింపగా నూలువడకుట అని చెప్పెను. తీర్పుచెప్పినపుడు ఆమె మేజస్ట్రేటును రాజీనామా నొసగుమని ప్రార్థించెను. ఠాణాలోను, ఘట్కోపరునందును సంపూర్ణమగు హరతాళము జరిగెను.

11:—ఫ్రీప్రెస్సువారీ వార్తను ప్రకటించుచున్నారు: శాసనోల్లంఘనోద్యమము సందర్భమున కలకత్తాలో ఇటీవల అరెస్టుచేయబడిన ఆరుగురు స్త్రీలు ప్రస్తుతము ప్రెసిడెన్సి జైలునందున్నారు. కాని వారి హోదాకు తగిన ఏర్పాటులేమియు జైలునందు కావింపబడలేదు. అందుచే శ్రీమతి

ఊర్మిళాదేవిగారు హృద్రోగము వల్లను, శ్రీమతి మోహినీ దేవిగారు నిద్రలేమి వల్లను, శ్రీమతి జ్యోతిర్మతి గంగూలి సతిగారు వైశ్యరోగ ప్రకోపము వలనను, శ్రీమతి విమల ప్రతిహాదేవిగారు దుర్మాంసము పెరుగుటవల్లన బాధపడుచున్నారు. గొప్పకుటుంబములకు చెందిన వీరు సాధారణ స్త్రీలతో కలసియుండుటచే వీరి ఆరోగ్యము చెడినది. వీరందఱును ఇప్పుడు కారాగృహమునకు చేరిన వైద్యశాలయందు చికిత్సను పొందుచున్నారు.

— డాక్టరు జీవరాజ మెహతాగారి సతీమణియగు శ్రీమతి హంసా మెహతాగారిని అరెస్టయిన మోడిగారి స్థానమున బొంబాయి యుద్ధసంఘమున కధ్యక్షురాలుగా నెన్నుకొనిరి.

12:—శ్రీమతులు కలగర పిచ్చమ్మ, (కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగారితల్లి) కొమ్మూరి వీర వేంకమ్మగార్లను 144-వ సెక్షను ఉల్లంఘించి ఊరేగింపు జరిపినందుకు ఏలూరులో ఎరస్టు చేసిరి.

—శ్రీనివాస వరదనుగారు వెల్లూరు జెయిలులో శిక్షననుభవించుచున్న తమ భార్య శ్రీమతి పద్మాసని అమ్మాళ్ గారిని చూడబోయిరి. ఆమె జెయిలు భోజనము సరిపడక చిక్కిపోయినదనియు, శ్రీమతి అంగచ్చి అమ్మాళ్ గారు అగడుపుచే బాధపడుచున్నారనియు, స్త్రీల చెఱసాలలో 29 గురు స్త్రీలున్నారనియు తెలుపుచున్నారు.

—ఢిల్లీ నగరమునందలి స్త్రీలకు ఎన్నికహక్కునొసంగవలయుననుటను పురపాలక సంఘము వారామోదించిరి.

—సంస్థానపు దేవాలయములందు దేవదాసీపద్ధతి తొలగిపోవలెనని తిరువాంకూరు సంస్థానపు మహారాణి రీజెంటుగారు ఉత్తరువుచేసిరి. క్రొత్తమలయాళపు సంవత్సరమునుండి ఈ ఉత్తరువు అమలులోనికి వచ్చును.

13:—శ్రీమతులు బులుసు భద్రమ్మ, పొరుపూడి వేంకటరమణమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ బి.యె. గార్లు సామర్లకోటలో స్త్రీలసభచేసి రాజకీయ ప్రబోధము గావించిరి.

—కాకినాడ జగన్నాధపురము గ్రామములో చర్చివద్దనున్న గవర్నమెంటు హిందూబాలికా పాఠశాల వార్షికోత్సవము అత్యంతానందముగా జరిగినది.

14:—భారత శాసన సభాసభ్యుల బసలవద్ద స్త్రీ వాలంటీరులు పికెట్టు చేసిరిగాని సరిహద్దు ప్రాంత సమస్యనుగూర్చి సభను విరమించుటకు తాము తీర్మానమును ప్రతిపాదింపవలసియున్నదని సభ్యులు చెప్పుకొనగా నారీమణులు వారిని సభకు వెళ్ళనిచ్చిరి.

—కాకినాడ జగన్నాధపురము హిందూబాలికా పాఠశాల వార్షికోత్సవ సందర్భమున అనసూయ పత్రికాధిపురాలగు శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారి అగ్రాసనాధిపత్యముక్రింద ప్రత్యేకముగా స్త్రీలసభ యొకటి సమావేశమాయెను.

15:— వెనుక హైకోర్టు జడ్జీగా నుండిన సయ్యదు హుస్సేను యిమాంగారిసతి; సి. సి. దాసుగారిసతి వీరల నాయకత్వముక్రింద చాలమంది స్త్రీలు పాట్నాలో ఊరేగింపును జరిపి విదేశవస్తువులను

బహిష్కరింపవలెనని బోధించిరి. బిహారుఘోషా స్త్రీలు చాలమంది అంతఃపురములను విడనాడి రాజవీథులయందు జాతీయ పతాకములను ధరించి ఊరేగింపులో చేరిరి.

:16:--మిడ్నపూరులో కళాశాలవద్ద పికెటింగు చేసిన స్త్రీసత్యాగ్రహులు 15 మందిని మోటారు బస్సులో ఎక్కించి పోలీసు ఇనస్పెక్టరు ఊరికి 8 మైళ్లదూరమున అడవి చేరువను విడిచి పెట్టెను. తిరిగివచ్చుటకు ఆనారీసత్యాగ్రహులకు బస్సులు లభింపమి నాటుబండ్లపై గ్రామమునకు చేరిరి.

--కోయంబత్తూరులో పోలీసువారు మీనాక్షమ్మాళ్ గారిని అరెస్టుచేసిరి. ఈమె కొలంబో నివాసులగు శ్రీ. నటేశయ్యరుగారి భార్య. పోలీసుచట్టము 3-శెక్షను ప్రకారము ఈమెకు మేజస్ట్రేటుగారు 6 నెలలు విడిఖైదు విధించిరి.

:17:--శ్రీమతి చారు సుశీలాదేవిగారు నారీసత్యాగ్రహులకు నాయకత్వము వహించి ఊరేగింపు జరుపుచుండగా మిడ్నపూరులో ఎరెస్టుచేసి విచారించి ఆరుమాసముల ఖైదు విధించిరి.

--బాలసోరు నివాసినియగు చంద్రమణిదేవి బరంపురములో 144-వ సెక్షను ధిక్కరించుటకు పోవుచుండగా మార్గమున గంజాములో ఎరెస్టుచేసి విచారించి ఆరుమాసముల విడిఖైదు విధించి స్త్రీ సాహాయ్యమిచ్చి వెల్లూరు చెఱసాలకు బంపిరి.

--బెజవాడలో శ్రీమతి పొదర్తి సుందరమ్మగారు 144 సెక్షను ధిక్కరించుచు స్వరాజ్యపతాకమును చేతబూని స్వదేశగీతములు పాడుచు పురవీథులవెంట తిరిగిరి. అనేకులు చూచుచు ఆమెవెంట జనిరి.

--కాకినాడలో గొల్లకోట కమలాదేవిగారు ఒక చరకాసంఘమును స్థాపించి సుమారు 2 డజనుల రాట్నములమీద దారము తీయించుచున్నారు. దినమునకు సుమారు వీశెడునూలు తయారగుచున్నది.

:18:--కలకత్తాలో బెతూను కాలేజీవద్ద స్త్రీ సత్యాగ్రహులు పికెటింగుచేసి దారి కడ్డముగ పండుకొనిరి. డిప్యూటి కమీషనరు పోలీసుదళముతోవచ్చి వారిని అరెస్టుచేసి తీసికొనిపోయి అడవి చేరువను కొందఱిని, పాడుయింట కొందఱిని వదలివైచెను. స్త్రీలనిట్లు చేసినందుకు బెతూనుకాలేజీ విద్యార్థినులందరును కళాశాలను వదలి బయటకువచ్చిరి.

--భారత కాంగ్రెసు కార్యసంఘసభలో పండిత సుందరలాలుగారి స్థానమున పండిత జవహరలాలు నెహ్రూగారి ధర్మపత్నియగు శ్రీమతి కమలాదేవిగారిని సభ్యురాలుగా సర్దారువల్లభాయి పటేలుగారు నియమించిరి.

--మీరటులో స్త్రీవలంటీర్ల నాయకురాలును ప్రొఫెసరు డి. యస్. శాస్త్రిగారి సతీమణియునగు ఊర్మిళాదేవిగారిని పికెటింగు ఆర్డినెన్సు క్రిందను, పినలుకోడు 505 సెక్షను క్రిందను అరెస్టుచేసిరి.

:19:--మద్రాసు స్వదేశీ ప్రదర్శన సందర్భమున స్త్రీలకు రాట్నములు, తక్లీ పోటీజరిగెను. రాట్నముపై నూలువడకు పోటీయందు 26 మంది స్త్రీలును, తక్లిపై నూలువడుకు పోటీయందు 14 మందియు పాల్గొనిరి.




**వరశుల్కాచారమునకు బలి:—**

ఇతరదేశములందు యుద్ధములు, ప్రమాదములు, రోగములు మాత్రమే జనాభాను తగ్గించు సాధనములుగనుండ హిందూదేశమున పైమూడింటితోబాటు వరశుల్కము కూడ జనాభాను తగ్గించు సాధనముగ క్రాలుచున్నది. ఈవరశుల్కదురాచారము ఏటేట ఎంతమంది హిందూబాలికలను మృత్యుదేవత కరాళవదనగహ్వరమున వైచుచున్నదో లెక్కలేదు. పదునేడు సంవత్సరములకు పూర్వము వరశుల్కాచారమునకు బలియగుచు స్నేహలతాదేవి కరుణానిశితమగు లేఖాసాధనమున హిందూమహాప్రజల లోహమయ హృదయములను ఛిన్నాభిన్న మొనర్చినను ఆ ప్రజాసంఘమునుండి ఆ దురాచార మింకను తొలగిపోకున్నది. మాంత్రికుడగు కాలపురుషుడు సయితము ఈ దురాచారపిశాచమును భారతభూమినుండి పాఱద్రోలలేకపోవుచున్నాడు. కావుననే వరశుల్కదురాచారము హిందూదేశమున అడ్డులేక సంచార మొనర్చుచు మాతృభూమికి సత్సంతానఫలమును ప్రసాదింపగల మంచిబాలికల నెందఱనో ఈడ్చుకొని పోవుచున్నది. జూలై ఇరువది నాల్గవ తేదీని మున్షిగంజిలో వరశుల్కదురాచారపిశాచముచేసిన ప్రళయతాండవమును పరికింపుడు. పదునాఱు సంవత్సరముల పడుచు. తన వివాహముకొఱకు అడగబడుచున్న మితిదప్పిన కట్నమును కొనితేలేక అవస్థపడుచు అయ్యో మనుమరాలికి వివాహము గావింపజాలక పోతిమే అను విచారముతో కుమిలిపోవుచున్న తాతమొగము చూడజాలక ఆ బాలిక కిరసనాయిలులో ముంచబడిన తనశరీరమునే వత్తిగచేసి వెలిగించి వరశుల్కదురాచారపిశాచమునకు అఖండదీపమెత్తెను. ఎల్లకాల మీదీపములిట్లు ఎత్తబడుచునే ఉండవలెనా? ఆపిశాచముయొక్క ప్రళయతాండవము సమాప్తము కాకపోయిన మానెను శమనమైన బొందదా? హైందవబాలికలకు పెండ్లియీడువచ్చినదనగా గండకాలము వచ్చినట్లుగా ఇంకను భావింపబడుచునుండవలసినదేనా?

అహల్యాబాయి జాతర:—

శ్రీమతి అహల్యాబాయి హోల్కారువారి ఈయేటి జాతరదినము ఈ మాసము 22-వ తేదీ అయిఉన్నది. హిందూదేశ చారిత్రికాకాశమున పొడచూపిన ప్రశస్తనక్షత్రములలో అహల్యాబాయియొకతె. ఆమె రాజ్యపాలనాధురీణయేకాదు గొప్పదాత్రికూడ. హిందూదేశమున మూలమూలల సయితము ఆమె దాతృత్వమును ప్రశంసించు కట్టడములు చూడనగును. హిమవత్పర్వతశిఖరముల నడుమనున్న కేదారనాథమున ఆమె తైర్థికుల సౌకర్యార్థ మొక విశ్రాంతి గృహమును నిర్మించెను. హిందూదేశపు ఉత్తరదిశనున్న ఈస్థలమునే పేర్కొననేల? ప్రాచ్యదిశనున్న జగన్నాథమున, పశ్చిమ దిక్కుననున్న ద్వారకయందు, దక్షిణదిశనున్న రామేశ్వరమున అహల్యాబాయి నామాంకితములగు కట్టడములు మనము దర్శింపగలము. గయాపుణ్యక్షేత్రమున విష్ణుపాదదైవపీఠమును, కాశీక్షేత్రమున విశ్వేశ్వరదేవాలయమును ఆమె నిర్మించినవే. కాశీనగరమున గంగాకూలంకషకు ఆమె కట్టించిన సోపానపరంపరలుగల తావునకు అహల్యాఘట్టమను వ్యవహారనామము నెలకొన్నది. ఇట్లు ఎన్నని ఆమె ఘనకార్యములను లెక్కింపగలము? ఆ మహనీయురాలు 1795-లో దివంగతురాలైనది. అప్పటినుంచియు ఏటేట ఆశక్తిమతికి జాతరలు జరుగుచున్నవి. ఈయేడుకూడ యథారీతిని ఆయుత్సవము దేశమునందలి వివిధప్రదేశములందు జరుపబడు గాకయని హెచ్చరించుచున్నాము. వీరనారి ఝూన్సీ లక్ష్మీబాయి ఉత్సవమును ఏటేట జరుపుచుండినట్లే శక్తిమతి అహల్యాబాయి ఉత్సవముకూడ జరుపునాచారము నేర్పఱిచి ఆంధ్రులు వీరపూజయందు గల తమసహజాభిలాషకు ఉచితోపయోగ్యవృత్తి గల్గించుకొందురుగాక!

కారణము విద్యార్థుల నిశ్చయమే:—

అన్నామురాష్ట్రిముసందలి డూబ్రినగరమునందలి బాలికల ఉన్నతపాఠశాలలో చదువుచున్న విద్యార్థినులందఱును తామెవరమును రాజకీయ విషయములలో ఎట్టి జోక్యమును కలిగించుకొనమని జూను ముప్పదవ తేదీలోపున పూచీకత్తు నీయవలయునని విద్యాశాఖాధికారి ప్రకటించెను. పాఠశాలలో మూడువందలమంది విద్యార్థినులుండిరి. జూను ముప్పదవ తేదీ నాటి సూర్యుడస్తంగతుడగునరికె ఆమూడువందలమంది విద్యార్థినులలో ఏబదిమంది మాత్రము అట్టి పూచీకత్తు నిచ్చిరని తేలినది. ఉత్తరువు గౌరవించినవారి సంఖ్యకంటె గౌరవింపని వారిసంఖ్య అయిదురెట్లు హెచ్చుగా నుండినది. ఇది గమనించి విద్యాశాఖాధికారి తన ఉత్తరువు చల్లగ ఉపసంహరించుకొనెను. పాటించువారు లేనప్పుడు ఉత్తరువులు చేసి మాత్రము లాభమేమి?

**రాయలసీమ: ఉగాది కానుక:—**

ఆంధ్రభూమియందు సగభాగ మాక్రమించుచున్న రాయలసీమయందలి పత్రికా ప్రచురణము ఉత్సాహము పొందదగినదిగాలేదు. అట్టిచో తాడిపత్రి దేశబంధుముద్రణాలయమువా రిట్టిసంచికను ప్రచురించిరనగా మిక్కిలి సంతోషింపదగిన విషయము. ఈ ఉగాది కానుక క్రౌనుసైజున 60 పుటలతో నొప్పుచున్నది. ఇందు తొలుత రాయలసీమ భోగట్టా అనుశీర్షికక్రింద అనంతపురము, కర్నూలు, కడప, బళ్లారిజిల్లాలను గూర్చియు రాయల సీమయందలి స్వదేశ సంస్థానములనుగూర్చియు ముఖ్యవిషయములు పేర్కొనబడినవి. 'అన్నయా', 'ఉమకురక్తాలనీ కాళ్లుకడిగి కొనుము', 'మామాట', 'స్వర్గసుఖసూచనలు', 'ప్రణయసంక్రాంతి', 'ధ్వనిమతము:' ధ్వనికావ్యవిభేదములు', 'స్వాతంత్ర్యసమరము,' 'ప్రస్తుత సారస్వతస్థితి', 'స్త్రీపునర్వివాహము', 'ప్రశంస', 'తాడిపత్రిచరిత్ర', 'తాడిపత్రి కైఫీయతు' అను వ్యాసములు గలవు. ఇందు మెకంజీ దొరవారు సేకరించిన తాడిపత్రి కైఫీయతు ప్రచురణము అభినందార్హమైనది. ఈ కైఫీయతు సంపాదించి దానికి మంచి పీఠికవ్రాసి ఈ సంచిక విలువను హెచ్చించి శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైనారు. మెకంజీదొరవారు సేకరించిన కైఫీయతులన్నియు ఈ మాదిరిగా సంపాదింపబడి ప్రచురింపబడునేని ఆంధ్రుని చరిత్ర అంధకారకూపమునుండి బయటపడి వెలుగు చూడగలదు. రాయలసీమ భోగట్టాలో కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకాయందలి ముదిరెడ్డిపల్లెనుగూర్చి ఇట్లు వ్రాయబడినది: "ఈగ్రామమున గోట కట్టికొని తిప్పిరెడ్డిపల్లె కుమారనరసింహనాయినిభార్య వొన్నూరమ్మ గ్రామముల పాలించినది. ఈకడప మండలమున నీమెయొక్కటేయే పాళెగత్తె. ఈమె శౌర్యపరాక్రమముల కాటపట్టయిన వెలది. నవాబుల సైన్యముల నట్టాడనీయక చాలకాలము పోరాడినది. తుదకు హైదరాలీ సైన్యములచే నోడింపబడి గంజికుంటలో వధింపబడెను." వొన్నూరమ్మ చరిత్ర చేకూరునేమోనని మేము ప్రాచ్యలిఖితభాండాగారము నందలి ముదిరెడ్డిపల్లె కైఫీయతు చూచితిమి. కాని చిక్కలేదు. కావున ఈమెచరిత్ర ముదిరెడ్డిపల్లె ప్రాంతములందలి విద్యావంతులు సేకరించి ప్రచురింపవలసియున్నది. ఈ సంచికను ప్రచురించినవారు ఏతద్విషయమై శ్రద్ధవహింతురుగాక. సంచిక వెల 0-8-0. వలయువారు తాడిపత్రియందలి దేశబంధుముద్రణాలయమువారికి వ్రాయవలెను.

వీరబాలికలు :—

ఈనడుమ ఢక్కానగరమున నడచిన అల్లరులలో బందిపోటులు ప్రసన్నకుమార నంది ఇంటికివచ్చిరి. అప్పుడు ప్రసన్నబాబు ఇంటిలో లేడు. ఇంటిలో ఉన్న ఆడవారు రక్షణకొఱకు పోలీసువారికి ఫోనుచేసిరి. పోలీసువారురాలేదు. అప్పుడు ప్రసన్నబాబుపుత్రికలు ఆనందబాల, అమలబాల ఇరువురును బందిపోటులకెదురై అరగంటకాలము వారిని నిలువరించిరి. సాయుధులగు మోటువారితో వారెంతకాలము పోరగలరు? పోరియుందురేమొ! అంతలో ఒక ఆమెకు నుదుటిపై బలమైన గాయము తగిలెను. అగుట వారిబలము తగ్గిపోయెను. దొంగలు లోనప్రవేశించి దోచుకొనిరి. ప్రాణములకుకూడ తెగించి వీరబాలికలు చేసిన ఈ కృత్యము కొండాడ దగియున్నది. అసహాయమైపోరి పెక్కుమంది బందిపోటులను గాయపఱచిన వీరనారి హేమాలకొలిని పుట్టిన వంగజాతికి గౌరవము తేగలిగిన వీరబాలలు వీరిరువురును. ఈ సంచికలో లోకవార్తలు అనుశీర్షికక్రింద చెప్పబడిన లావణ్యప్రభాదేవి వృత్తాంతమును, ఈవీరబాలల వృత్తాంతమును అవలోకించి నేటి వంగరమణులు ఎట్టి సాహసికురాండ్రై వ్రాలుచున్నదియు తెలిసికొనవచ్చును.

తిరువాన్కూరులో దేవదాసిపద్ధతికి తుదిచీటి :—

క్రొత్తమలబారుసంవత్సరాదినుంచియు తనసంస్థానమునుండి దేవదాసి పద్ధతి తొలగిపోవలెనని ఆర్డరు చేసినందుకు తిరువాన్కూరు మహారాణి రీజెంటుగారిని మేము మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. కొన్ని సంవత్సరముల క్రిత మీా సంస్కరణమును మైసూరు ప్రభుత్వమువారు కొనితెచ్చిరి. ఈనడుమ శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారి నిర్వాహణమున మదరాసు శాసనసభవారు దేవదాసి సంస్కరణమును ప్రతిపాదించిరి. ఇప్పుడీ సంస్కరణము తిరువాన్కూరులో ప్రవేశముగన్నది. మద్రాసురాష్ట్రమునకంటె తిరువాన్కూరున ఈ సంస్కరణము జయప్రదముగ ఆచరణలోబెట్టుట సులభము. ఏ మందురా? తిరువాన్కూరు దేశమునందలి దేవాలయములన్నియు సంస్థానము వారివి. అగుట దైవమునకుదాసీతనము పేరిట జరుగు వ్యభిచారమంతయు నిక నా సంస్థానమున కట్టువడిపోవును. అయితే ఈసంస్కరణవిషయమున జాగ్రతకూడ చూపవలసియున్నది. దేవాలయములనుండి ఈ దాసీలను తొలగించినంతమాత్రమున విశేషలాభ ముండదు. దేవాలయమునుండి వారు తొలగింపబడుటచే వ్యభిచారమునకు ఇప్పుడుగల మతసంబంధము తొలగునుకాని వ్యభిచారము నిలిచియే ఉండును. ఉండకుండ చేయవలయునన్నచో దేవాల

యములనుండి తొలగింపబడిన దాసీలకు జీవనాధారముకొరకై ఏమైన వృత్తులు కల్పింప వలయును. తాను తెచ్చిన సంస్కరణము సమగ్రఫల మిచ్చుటకు మహారాణీ రీజెంటుగారు పర్యాలోచింతురుగాక! దేశమిప్పుడు సంఘసంస్కరణముకొరకై ఉవ్విళ్లూరుచున్నదనుటకును, రాజకీయమున స్త్రీల జోక్యము శుభప్రదమే యనుచున్నదనుటకును రాణీగారి ఈచేత మంచి నిదర్శనము.

# గ్రంథ విమర్శనలు

## కేరళసూత్రములు:—

ఇదియొక జ్యోతిషగ్రంథము. ద్వాదశభావములనుగూర్చిన వివరములుగలది. భాష్యముతో కూడినది. చిన్నసైజు: 16 పుటలు: 1929-వ సంవత్సరమున హిందూరత్నాకరముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. మొదటి కూర్పు 1000 ప్రతులు. వలయువారు ప్రచురణకర్తపేర శ్రీ పి. నటేశన్, నెం. 49 తులసింగ మొదలి వీథి, పెరంబూరు పోస్టు మద్రాసు అను చిరునామాకు వ్రాయవలెను.

## కృష్ణశతకము:—

స్త్రీలును, చిన్నపిల్లలును చదివి అర్థముచేసికొనగల సులభశైలిలో వ్రాయబడిన కందపద్యముల శతకము. ఇది చిరకాలముగ మన దేశమున ప్రచారములోనున్నది. భారద్వాజసగోత్రుడును, గంగమాంబ సుతుడును అయిన నృసింహాహ్వయుడు రచియించిన శతకము. శతకము ప్రాముఖ్యముగా దేవతాపరమైన కథల తోడను స్తుతులతోడను నిండియున్నది. ఫూల్ స్కేపు సైజున 21 పుటలు. 1929-వ సంవత్సరమున హిందూ రత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. గ్రంథము వలయువారు ప్రచురణకర్తపేర పెరంబూరు నటేశ మొదలియారు, 49, తులసింగ మొదలి వీథి, పెరంబూరు పోస్టు మద్రాసు అను చిరునామాకు వ్రాయ వలెను.

## మంత్రపుష్పత్రయము:—

దేవాలయములందును, బ్రాహ్మణ సదస్సులయందును పఠింపబడు ౧. సహస్రశీర్షం దేవం ౨. యోపాం పుష్పం వేద ౩ జాతవేదసే సునవ వామసోమ అను మూడు మంత్రపుష్పములకు విద్యారణ్యభాష్యము ననుసరించి వ్రాయబడిన ఆంధ్రటీకాతాత్పర్యస్వరములుగలది. సనాతనధర్మము సన్నగిల్లుచున్న ఈ దినములలో ఇట్టి గ్రంథములు టీకాతాత్పర్యములతో వెలయించి జనుల కందించు ఉద్యమము మిక్కిలి శ్లాఘింపదగినది. అగుటచే ఈ గ్రంథ సంపాదకులగు శ్రీ ద్వి. కోటీశ్వరశర్మ శాస్త్రి, క. మార్కండేయశర్మగారలు అభినంద్యార్హులై యున్నారు. ఈ మంత్రపుష్పములయందు వివరింపబడిన భగవంతుని యొక్క విరాట్పురుష విభూతివర్ణనము, ఉపాస్యస్థల విశేషవర్ణనము, సకలవిధ దేవతా స్వరూప వర్ణనము అర్థమెఱింగి పఠించిన కలుగు హృదయానందము కొలదియిడరానిది. చెన్నపురి చాకలపేట యందలి చంద్రికా ప్రెస్సున 1926-వ సంవత్సరమునందు ముద్రితము. ఇది నాలగవ ముద్రణము. క్రౌను సైజున 32 పుటలు. వెల అణాలు నాలుగు. వలయువారు స్వధర్మప్రకాశిని, బృందావనము, కీల్పాకు పోస్టు, మదరాసునకు వ్రాయునది.

# పత్రికాపరిచయము

పూలతోట :—

ఇది మాసమున కొకసారి వెలువడు చిన్నికథల పుస్తకము. ఇందు ఇతర కథలతో బాటు పాఠశాలలో జదువు విద్యార్థుల కుపయోగించు నీతికథలును ప్రాథమిక 'విద్యాతరగతులలో' చదువు బాలురను, బాలికలను సులభముగా అర్థముచేసికొనగలిగెడి భాంత కథలును ప్రకటింపవలెనను ఉద్దేశముతో ప్రారంభింపబడినది. మాపత్రికాపీఠము నలంకరించుచున్న పూలతోట మొదటి రెండు సంచికలు పై ఉద్దేశమునకు అనుగుణముగనే ఉన్నవి. సంచికలు డెమ్మీసైజున 24 పుటలతో నొప్పుచున్నవి. సాలు చందా రు ౧–౮–౦ వలయువారు సంపాదకుడు, పూలతోట గ్రంథమాల నయీంనగర్, హనుమకొండ, నిజాము ఇలాకా అని వ్రాయునది.

# గృహలక్ష్మి

౧

"మాస మాసమును గృహలక్ష్మి నత్యాదరమున జాగ్రతగఁ బరిశీలించుచుంటిని. స్త్రీల కన్ని విషయములలోను నభివృద్ధి నాకాంక్షించు మీ పోషింపబడు గృహలక్ష్మి యెంతయు నభినందింపదగియున్నది."

8—7—30.
ఏలూరు.

ఇట్లు
విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తి.

౨

"...తమరు దయతో అంపిన గృహలక్ష్మి వి. పి. ఈ రోజుననే చేరినది. పైకము చెల్లించి విడుదల చేసితిని. ఇందలి వ్యాసములు బహు అహ్లాదకరములుగా ఉన్నవి. నాకు ఎంతయు సంతస మొనగూర్చుచున్నవి."

10—7—30.
చికాకోల్.

ఇట్లు
మగటపల్లి కృష్ణమూర్తి శెట్టి.

౩

"ఆంధ్రమున నా కెఱుకయున్నంతవఱకు ఏ పత్రికయు నింతవఱకు గృహలక్ష్మితో సమమైన సేవను చేసి యుండలేదని నొక్కి వక్కాణించుచున్నాను. గృహలక్ష్మి చిఱుతప్రాయమైనను చేసిన సేవ వర్ణనాతీతము."

16—7—30.
యలమర్రు.

ఇట్లు
గద్దే లింగయ్యచౌదరి.

# విషయసూచిక

# ఆగస్టుమాసపు యుక్తిలెక్కకు సమాధానము

ఆగస్టుమాసపు గృహలక్ష్మిలోని శ్రీయుత బంధకవి గోవిందరావుగారి యుక్తి లెక్కకు మేముకోరినట్లు ఈమాసము 10-వ తేదీలోపుగ సరియగుప్రత్యుత్తరమునొసంగిన వారి నామము లీక్రిందపేర్కొనుచున్నాము.

శ్రీమతులు 1. వెలుగడం వేంకటనరసుబాయమ్మగారు (8 సం||); 2. బొమ్మదేవర రాఘవమ్మగారు (10 సం|| 3-వ తరగతి); 3. కారుసెట్టి పార్వతీదేవమ్మగారు (8 సం|| 2-వ తరగతి); 4. పాకల రాజామణిగారు (10 సం|| 1-వ ఫారం); 5. కొంపల్లి సుబ్బులుగారు (11 సం||); 6. శ్రీయుతులు బి. ఈశ్వరరెడ్డిగారు (2-వ తరగతి); 7. యస్. లక్ష్మీనరసయ్యగారు (5-వ తరగతి).

యుక్తిలెక్కకు సమాధానము 105.

ఆగస్టుమాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి కామరాజు సుశీలగారు ఇచ్చిన యుక్తి లెక్కకు మేముకోరినట్లు 10-వ తేదీలోపున సమాధానమునిచ్చినవారి నామము లీదిగువ పేర్కొనుచున్నాము.

శ్రీమతులు 1. కార్యపూడి లక్ష్మమ్మగారు (11 సం||); 2. గదంసెట్టి పార్వతీదేవమ్మగారు (8 సం||; 2-వ తరగతి); 3. బి. వి. వెంకటలక్ష్మమ్మగారు (3-వ తరగతి); 4. సి. వెంకటలక్ష్మమ్మగారు (3-వ తరగతి).

యుక్తిలెక్కకు సమాధానము 36.

## యుక్తిలెక్కలు రెంటికిని సరియగు సమాధానమిచ్చినవారు

శ్రీమతులు 1. యమ్. తిరుప్యాలమ్మగారు (9 సం||); 2. డబ్ల్యూ. రాజలక్ష్మిగారు (10 సం|| 1-వ ఫారం; 3. లీలాపద్మసరోజనీబాయిగారు (10 సం||); 4. ఆర్. కోమలంగారు (10 సం|| 2-వ ఫారం); 5. వినతకుమారిగారు (10 సం|| 1-వ ఫారం); 6. కె. కమలమ్మగారు (9 సం|| 3-వ తరగతి); 7. ఆవుల అన్నపూర్ణగారు (11 సం|| 2-వ తరగతి) 8. శ్రీయుతులు వావిలాల కృష్ణమూర్తిగారు (11 సం|| 4-వ ఫారం); 9. వెంకటకృష్ణమరాజుగారు (9 సం|| 5-వ తరగతి); 10, కె. సుబ్రహ్మణ్యముగారు (12 సం|| -వ ఫారం); 11. వెల్లంకి సత్యనారాయణగారు (11 సం|| 6-వ తరగతి); 12. తిరుమలయ్యగారు 10 సం||); 13. పులవర్తి వెంకటేశ్వరరావుగారు (9 సం||).

# ఆగస్టుమాసపు చిత్రప్రశ్నకు సమాధానము

ఈ క్రింది చందా నెంబరుగల చందాదారులు ఆగస్టుమాసపు శ్రీయుత మానేపల్లి లక్ష్మయ్యగారి చిత్రప్రశ్నకు సరియగు సమాధానమునిచ్చిరి. సమాధానము 'గృహలక్ష్మి'

261, 448, 468, 514, 723, 772, 792, 830, 857, 1111, 1116, 1127, 1174, 1178, 1179, 1223, 1252, 1266, 1314.

# గృహలక్ష్మి

అయ్యా, నేను ఈమాసపు గృహలక్ష్మిపత్రికనుజదివితిని. మాసమాసమునను స్త్రీల కనుగుణ్యమగు వ్యాసములను ప్రచురింపబడుటచూచి చాల సంతసించుచున్నాను. స్త్రీల ఆయురారోగ్యాభివృద్ధిని పెంపొందింపగల పత్రిక యిదియొక్కటియేయని నాతలంపు.

5-8-30 కాకినాడ ఇట్లు, బంధకవి గోవిందరావుగారు.




EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS




# స్త్రీలు : ఎన్నికలు



మడ్డిమెనుకమిటీవారు 1926-వ సంవత్సరమున చేసిన సిఫారుసుల మూలమున భారతదేశమున వివిధరాష్ట్రములందు (ఒక్క బీహారు ఒరిస్సారాష్ట్రమున తప్ప) స్త్రీలకు ఎన్నికలకు నిలచు హక్కు ప్రసాదింపబడినది. ఆహక్కు ప్రసాదింపబడిన నాలుగుసంవత్సరముల అనంతరము జరుగుచున్న ఈ ఏటి ఎన్నికలలో స్త్రీ అభ్యర్థిను లెవ్వరును గానరాకున్నారు. ఇందులకుగల కారణములు విచారణీయములు.

దేశమునందలి ఇప్పటి రాజకీయపరిస్థితులు అనుకూలముగలేవు. శాసనసభలను బహిష్కరింపవలెనని కాంగ్రెసు ఆదేశించినది. ఆర్జనాతృష్ణగల పురుషసంఘమువలెగాక భారతస్త్రీసంఘ మంతయు కాంగ్రెసుదిక్కునకే మొగ్గియున్నది. వెనుకటిశాసనసభల ఎన్నికలలో అభ్యర్థినులుగానిలిచిన శ్రీమతి కమలాదేవి ఛట్టోపాధ్యాయి మొదలగువా రిప్పుడు కారాగారములందున్నారు. అదియునుగాక శాసనసభలయందు పురుషులకున్నంత మక్కువ స్త్రీలకులేదు. దేశమున నింత అలజడియున్నను శాసనసభికులు పెక్కుమంది చలింపలేదు. తమస్థానములను కఱచుకొనియేయుండిరి. స్త్రీ లట్లుండలేదు. వారిహృదయకమలములకు త్యాగవాసనయున్నది. కావుననే మద్రాసురాష్ట్రమున ముత్తులక్ష్మిరెడ్డి, బొంబాయిరాష్ట్రమున ఇడాడిక్సనుకన్య, మధ్యమాగాణములందు అనసూయాబాయికాళి ప్రభుత్వమువారి నిర్బంధవిధానమును నిరసించుచు ఆయారాష్ట్రీయ శాసనసభలలో తమసభ్యత్వమును—అవి ప్రభుత్వమువారి నియామకముమూలమున వచ్చినవేఅయినను—విసర్జించియున్నారు. ఇట్టి పరిస్థితులలో ఈ ఎన్నికలందు స్త్రీలు అభ్యర్థినిలుగా కానరాకుండుట వింతకాదు. రాజకీయమైన ఈ అడ్డంకి తత్కాలికమైనదేకాని నిలుకడయైనదికాదు. అయినను నిలుకడయైన అడ్డంకులుకూడ పెక్కులుండి స్త్రీలను శాసనసభాభ్యర్థినిలుగాకుండ చేయుచున్నవి. శాసన

సభాభ్యర్థులు తమ ఎన్నికలప్రచారమును తీవ్రతరముగసాగింపవలసియున్నది. ఇట్టి తీవ్రతర ప్రచారమునకు పురుషులకుగలిగినన్ని వీళ్లు స్త్రీలకులేవు. పురుషులు యథేచ్ఛముగ గ్రామములవెంట సంచారమొనరించి ఓటరులను స్వయముగనో లేఖాముఖముననో సందర్శింపగలరు. వచ్చిన దూషణభూషణములను అంగిటిలోనై చిక్కొని ఊరకుండురాటుతనము వారికడనున్నది. గ్రామములవెంట సంచారమొనర్చుటకుగాని, వివిధస్వభావములుగల ఓటరులను సందర్శించుటకుగాని, ఎన్నికలప్రచారములో కలుగు దూషణభూషణములకు తాళుటకుగాని లజ్జాసాధ్వసములకు మూర్తియగు భారతస్త్రీ ఇంకను సంసిద్ధురాలై యుండలేదు. ఓటరులను తమపక్షమునకు ఆకర్షించుటకై ఒక్కొక్కప్పుడు తమఅంతరాత్మప్రబోధమునుగూడ అవతలకుద్రోసి చేయరానివాగ్దానములను చేయవలసియుండును. కొసరుకొంకులులేక ఇట్టి వాగ్దానములను చేయుటలో పురుషుడు పూర్తిపౌరుషమును చూపగలడు. మొన్న జరిగిన పై ఎలక్షనులలో సర్. సి. పి. రామస్వామయ్యరుగారును ఇప్పుడు జరుగనున్న ఎలక్షనులలోదివానుబహదూరు టి. రంగాచారిగారును శారదాచట్టము విషయమైచేసిన వాగ్దానములు వెల్లడియైయున్నవి. భారతస్త్రీ ఇట్లు ఎట్టివాగ్దానములనైనను చులకనగచేయజాలు తెంపరితనమునకు ఒడబడజాలని అబలఅయిఉన్నది. అదియునుగాక ఎన్నికలు బహువ్యయమూలకములైయున్నవి. రూపాయలను శనగపప్పువలె గుప్పి ఎన్నికలలో పూర్తిప్రయత్నము చేయగల సామర్థ్యము ధనాలపెట్టెకు తరువుకాడగు పురుషునకే యున్నది కాని అస్వతంత్రురాలగు భారతస్త్రీకి అది నమలరానినారికేళమే. ఒకవేళ ధనమున్నను ఎన్నికలలో జయము పొందుటకు ముఖ్యలక్షణములగు వారి ప్రీతియు వీరిప్రేమయు సంపాదింప ఏఎండకాగొడుగునెత్తు అంగుడితుడిపితనముగాని, రామాస్వస్తి రావణాస్వస్తి అనుచు ఉడుములలోబుట్ట పాములలోతోకపెట్టు సిగ్గిడితనమునకుగాని భారతస్త్రీ దోసిలియొగ్గజాలదు. అదియునుగాక ఓటరులలో ముప్పాతికముప్వీసము పురుషజాతికి చెందినవారు. జాత్యభిమానమునకు రాశీభూతుడగు పురుషుడు తన ఓటును ప్రణిపాతయాచకుడైయున్న తోడిపురుషునకే ఇచ్చునుగాని గౌరవపురస్సరముగ మాత్రమే అర్థింపగల ఆడుదానికి ఈయనొల్లడు. ఇన్ని నిలుకడయైన యడ్డంకులకు తత్కాలికమైన పై అడ్డంకి అండయైయుండ స్త్రీలీ ఎన్నికలలో అభ్యర్థినిలుగ గానరాకుండుటలో అబ్బురమేమియు లేదు.

ఓటరులలో బాగుగ విద్యావ్యాపనము జరిగి, దేశమున ప్రతివ్యక్తికి ఓటింగు అధికారము ప్రసాదింపబడునో ఈప్రతిబంధకములన్నియు విచ్చిపోయి స్త్రీలు బాహాటముగ శాసనసభలకు ఎన్నుకొనబడుటకు మంచి వీలు ఏర్పడును. అట్టి పర్వదినములు వచ్చుపర్యంతము భారతస్త్రీలు ప్రభుత్వమువారి నియామకము మూలముననే శాసనసభలయందు ప్రవేశము గాంచగల్గుదురు.

# విజయరాఘవనాయని రాణి

ఆంధ్ర శేషగిరిరావుగారు బి. యె; సారస్వత సమాజము

కర్ణాటాంధ్రసామ్రాజ్యనియంతయైన కృష్ణదేవరాయల కాలమున ఆమహనీయుని ప్రాపునొంది తమిళదేశమున తంజావూరు, మధుర మొదలగు తావులందు ఆంధ్రనాయక రాజ్యములు వెలసి వర్ధిల్లినవి. ఈ ఆంధ్రనాయకరాజులు తెలుగుదేశమునుండి మంత్రులు, దండనాథులు, పండితులు, కవులు, గాయకులు, వేశ్యలు మొదలయినవారిని అచ్చటికి తీసికొనిపోయి వలస నెలకొనిరి.

క్రీస్తుశకము పదునేడవశతాబ్ద ద్వితీయార్ధమునందు తంజావూరు ఆంధ్రనాయకరాజ్యమున విజయరాఘవనాయకుడును, మధుర ఆంధ్రనాయకరాజ్యమున చొక్కనాథనాయకుడును ప్రభుత్వము చేయుచుండిరి.

తంజాపురమున రాజగోపాలవిలాసమను భవనమున విజయరాఘవనాయకుడు ఒక నాడు కొలువుదీరియుండెను. అప్పుడు మధురనుండి చొక్కనాథనాయని బంధువులును, స్థానాపతులును, పురోహితులునువచ్చి విజయరాఘవనాయని దర్శించి ఆతని భేటికి యోగ్యమైన వస్త్రభూషణాదులు సమర్పించిరి. "వచ్చిన వర్తమాన మేమి" అని నాయకుడు వారిని ప్రశ్నించెను. వచ్చినవారు ఇట్లు చెప్పిరి. "మా ఏలినస్వామి రాజా చొక్కనాథనాయని వారు వివాహము చేసికొన తలపెట్టి కన్యకార్థము దేవర సముఖానకు పంపినారు. వారికిని మీకును తరతరములనుండి ఇచ్చి పుచ్చుకొనుటలు ఉన్నవి గదా! ఇది చిరకాలముగా నడచివచ్చుచున్న సంబంధమే. కావున దేవరవారు దయతలచి శుభవార్త వెంటనే దయ చేయవలెను."

వచ్చినది వికాసవదనముతో స్వీకరింపఁదగిన వివాహమంగళప్రశస్తమైన సందేశము. కాని ఈ సందర్భమున విజయరాఘవనాయనివదనమున పిసరంతయైన వికాసము పొడసూప లేదు. మీదు మిక్కిలి ఆతనివదనము అప్రయత్నముగ సంకుచితమైనది; ఎనుబది హేమంతముల అనుభవముచే కలిగిన సడలుపాటు గానరాకుండ బంగారు దారములచేత ఎత్తి గట్టిగ కట్టించుకొనిన ఆతని కనుబొమలు సహితము అప్రయత్నముగ ముడివడినవి.

సందేశహారులతో ఆతడు ఇట్లు చెప్పెను. "మీ దొర ఏ మొగముపెట్టుకుని కన్యకను ఇమ్మని అడుగపంపినాడు? మీ చొక్కనాథనాయని పితామహుడైన తిరుమలశౌరికి వెనుక మాఅచ్యుత రఘునాథమ్మను వివాహముచేసిరి. ఆ తిరుమలశౌరి ఒకప్పుడు క్రొత్తగా నగరు కట్టించి పట్టమహిషియగు అచ్యుతరఘునాథమ్మకు చూపినాడు. హాస్యము కొఱకు ఆమె ఆ కొత్తనగరు తంజావూరులోని తన తండ్రి నగరికి ఎంతమాత్రము సాటి

రాదని చెప్పి నవ్వెను. ఊరకుండబోతు అగు తిరుమలశౌరి ఆ నవ్వుతాలి మాటకు ఓర్వలేక ఆమెను బాకుతో పొడిచి చంపినాడు. ఆ సమాచారము విని మావారు అందఱును ఘోషఘోషమున దుఃఖించి—'ఇటువంటి క్రూరకర్మునకు తెలియక పిల్లనిచ్చినాము. ఇచ్చినందుకు తగిన శాస్తి అయినది. ఇక జన్మజన్మకి మనము వారితో సంబంధము చేయరాదు'—అని ఒట్టు పెట్టుకొన్నారు. ఇట్లు జరిగిఉండగా తిరిగి సంబంధము కావలెనని మీ దొర ఏ బుద్ధితో మావద్దకు మిమ్ములను పంపినాడు?"

విజయరాఘవనాయఁడిట్లు వారి కోరిక త్రోసిపుచ్చెను. వారు కొనివచ్చిన భేటి వస్తువులనయినను స్వీకరింపలేదు. పైగా తన సేవకులకు ఆజ్ఞాపించి ఆ వచ్చినవారిని తక్షణమే కోటబయటకు పంపించివేసెను. ప్రతిదినము ఉదయమున జాములోగా పంద్రెండువేల బ్రహ్మణ్యానికి షడ్రసోపేతముగా జ్యేష్ఠాంశ మిప్పించికాని తాను భుజించుట ఎఱుఁగని ఆ అన్నదాత కోటబయటనైనను సందేశహరులకు బత్తెము భరణము విచారించు ఏర్పాటులు చేయలేదు.

ఈ విధమున అవమానమును పొంది వారు పోయి రాజా చొక్కనాథనాయనితో నడచిన వృత్తాంతము యావత్తు పూసగ్రుచ్చినట్లు శ్రుతపఱచిరి. తోడిసంస్థానికుడనగు నేను అడుగఁబోగా ఆతడిట్లు చేయునా అని చొక్కనాథనాయుడు ఒక్కపెట్టున మండిపడి తన దళవాయి వేంకటకృష్ణప్పనాయని పిలిచి దండు కూర్చుకొని పోయి తంజావూరు కోటను ముట్టడింపుమనెను. ప్రభుని ఆజ్ఞ తలనిడుకొని వేంకటకృష్ణప్పనాయడు క్రీస్తుశకము 1673-వ సంవత్సరమున తంజావూరు కోటను ముట్టడించెను. తంజనగరముసేనాని వేంకటకృష్ణప్పనాయనికి ఎదురెక్కి యుద్ధముచేయ సాగెను. తంజావూరి కోటలో విశేషసైన్యముండెను. అందుకు మధురవారు ఎంతమాత్రమును జంకక దండు పురిగొలిపి ఫిరంగులు మోర్జాలపై ఎత్తించి కోటపైని ఉన్న జనముమీద లక్ష్యముంచి ప్రేల్చసాగిరి. ఎడతెగని గుండుదెబ్బల కాగలేక తంజావూరు సేనలు విరిగిపోవ దొడంగెను. కొంచముకొంచముగా తంజాపురి కోట శత్రువుల స్వాధీనము గాఁజొచ్చెను.

అప్పుడు వేంకటకృష్ణప్పనాయుఁడు విజయరాఘవనాయని కిట్లని కబురుచేసెను. "విశేషసైన్యముతో మేము కోటలో చొఱబడుచున్నాము. క్రమముగా మీ సేనలు విరిగిపోవుచుండుట మీరు చూచుచునేయున్నారు. గడియకో అరగడియకో కోట మా స్వాధీనమై తీరును. ఇప్పుడైనను మీరు మా రాజునకు కన్య నిచ్చి సంధి చేసికొనుచో మాపౌజును వెనుకకు మరలించుకొని పోయెదము." దీనికి విజయరాఘవనాయడు "రాజ్యము పోయినను, సర్వనాశనమైనను మీకు భయపడి కన్యను ఇచ్చువారము కాము. రాజీప్రస్తావన మాతో తలపెట్టవలదు" అని ప్రతివార్త పంపెను.

కొంతసేపటికి తంజావూరు కోట మధురవారి సేనలతో నిండిపోయెను. రాణివాసపు స్త్రీలున్న అంతిపురమును మాత్రము ఇంకను శత్రువులు ఆక్రమింపజాలకుండిరి. అప్పుడచ్చట సందడికయ్యము జరుగుచుండెను. అదిచూచి విజయరాఘవనాయకుడు తన కొమారుడు మన్నారప్పనాయనితో ఇట్లు చెప్పెను. "కుమారా! ఈ యుద్ధమున మనము ప్రాణములు విడుచుట ఇక నిజము. మనము మరణించిన పిమ్మట మధురసేనానులు మహాలు చొచ్చి మన చిన్నదానిని తీసికొనిపోయి తమ రాజునకు వివాహము చేయుదురు. ఇది తప్పదు. అప్పుడు మన మాటకు ఓటుపాటును, వారి పట్టుకు చెల్లుపాటును గలుగును. రాజ్యము పోయినను, ప్రాణములు పోయినను, సర్వనాశనమయినను మన పౌరుషము నిలుపుకొనవలెను; వారు పట్టిన పట్టు చెల్లనియ్యరాదు. ఇప్పుడు మన మేమాత్రము వెనుకంజవైచినను మన పేరుకు హానివచ్చుచు; మానముపోవును. కాబట్టి స్త్రీలనందఱిని మనమే దైవికము పొందించవలెను. మహాలులోనికి పోయి ఈ కార్యము నెఱవేర్పవలసిన భారము నీమీద నున్నది." అవిలంఘనీయమగు తండ్రిఆజ్ఞ ఒకవంక, వీరుని ప్రథమధర్మమగు స్త్రీమానసంరక్షణము ఒకవంక, తన్ను ఎచ్చరింపగా మన్నారప్పనాయకుడు అంతిపురమునకు దారి తీసెను.

మానమునెడ విజయరాఘవనాయనికంటె ఆతనిరాణి వేయిమడంగుల హెచ్చు అభిమానముగలది. కావుననే ఆ మానవతి ఎదుటిదళము కోట చొచ్చెనని వినుటతోడనే అభిమానవతులగు మిగిలిన అవరోధజనమును ఒక్కచో చేర్చెను. మందుకుండలు రప్పించి వారిచుట్టు పేర్పించెను. శత్రువులు హఠాత్తుగా చొఱబడినచో మందుకుండలకు నిప్పుపెట్టుటకైన అవకాశముండదేమో అని ఆమె ఆనతినంది రాణివాసపు స్త్రీలు కత్తులు, జముదాఢ్లు దూసికొని ప్రాణములు అర్పింప సంసిద్ధలై యుండిరి.

ఏలినవారిఆజ్ఞ ఎప్పుడు వచ్చునా అని విజయరాఘవనాయని రాణి ఎదురుచూచు చుండెను. కుమారుడు మన్నారప్పనాయకుడు ఇంతలో అచ్చటికి వచ్చెను. "ఏలినవారికి క్షేమమా? మాకు ఏమి ఉత్తరువు ఇచ్చిరి?" అని రాణి ఆతనిని ఆత్రముతో ప్రశ్నించెను. ఆతడు తాను వచ్చినపని తల్లికి నివేదించెను. వెంటనే రాణి పొడుచుకొని మరణించెను. అది చూచి మిగిలిన రమణీమణులు ఒకరినొకరు కత్తులచేతను, కటారులచేతను నఱుకుకొన ప్రారంభించిరి. ఇంతలో మన్నారప్పనాయడు మందుకుండలకు నిప్పు ముట్టించెను. రెప్పపాటులో అగ్నిజ్వాలలు ఛెటచ్ఛటాయమానమై నగరంతయు ఆక్రమించి ఆనగరిలో ఆడుపురుగు లేకుండ దగ్ధము చేసెను.

ఆకాసమంటిన జ్వాలాజిహ్వాలు మన్నారప్పనాయడు మఱలివచ్చుటకు పూర్వమే జరిగినవర్తమానమును విజయరాఘవనాయనికి తెలియజేసినవి. ఇంతలో మన్నారప్పయు

తండ్రి చెంతకు వచ్చెను. తండ్రి కొఱకు బిడ్డలును చేతుల తీటవోవునట్లు యుద్ధము చేసి వీరజనోచితమగు ఆయుధమరణమును పొందిరి.

తంజావూరు ఆంధ్రనాయకరాజ్యసంబంధమున అరవదేశమునందు వలస నిలిచిన ఆంధ్రపురంధ్రి విజయరాఘవనాయనిపత్నియు ఆమెతోడి ఆంధ్రరమణీమణులును ఈ విధమున మాటకొఱకు మానముకొఱకు సంఘవిలయమును పొంది ఆంధ్ర కీర్తిని దిక్కులు తెలివొందునట్లు ప్రకాశింపఁజేసిరి. విజయరాఘవనాయని రాణియొక్కయు, ఆమె తోడి తెలుగుతెఱవల యొక్కయు మానప్రియత్వము మహిని వెలయించుటకు వారికి మరణ వరమును ప్రసాదించిన రాజభవన మిప్పటికిని మసిబాఱిన గోడలతో, బొగ్గులు నిలిచిన దూలములతో నిలచియుండి ఆనాటివృత్తాంతమును చూపరులు జ్ఞప్తి కెలయించుచున్నది. అరవదేశమున వలస నెలకొన్న తోడి ఆంధ్రరమణీమణుల సాయమున విజయరాఘవనాయని రాణి ఆనాఁడట్లు ఆర్జించిన కీర్తిధనమునకు ఒక్క అరవదేశమందున్న ఆంధ్రులేకాక మిగిలిన ఈ విశాలప్రపంచమున వివిధభాగములందున్న ఆంధ్రులందఱునుకూడ తొలగింపరాని భాగస్వాములై యున్నారు.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! నీవు వ్రాసినట్లు శారదాచట్టమునకు సవరణ నుపపాదించుట యనుచిత కార్యమనుటకు సందియములేదు. శారదాచట్టము త్వరపడి చేయబడినది కాదు. దాదాపు రెండువత్సరముల దీర్ఘకాలము దేశీయులచే చక్కగా యోచింపబడినది. ప్రజాభిప్రాయమును కనుగొనుటకై యేర్పడిన ఉపసంఘమువారు దేశమంతటను పర్యటనమొనర్చి నానా విధముల విచారణ యొనర్చిరి. పెక్కుమందికడ సాక్ష్యములను గైకొనిరి. డాక్టరుల యభిప్రాయములను తెలిసికొనిరి. పండితుల యభిప్రాయములను తెలిసికొనిరి. స్త్రీల యభిప్రాయమును తెలిసికొనిరి. న్యాయమూర్తుల యభిప్రాయమును తెలిసికొనిరి. ఈ విధముగా ప్రత్యేకవ్యక్తుల యభిప్రాయములనేగాక వేర్వేరు సంఘములపక్షమునను సంస్థలపక్షమునను గూడ విచారణయొనర్చి తెలిసికొనబడెను. ఇన్నివిధముల విచారించిన వెనుకనే యుపసంఘమువారు బాలికల వివాహవయస్సు పదునాలుగేండ్లుగానుండుట యుక్తమని నిర్ణయించిరి. తదుపరి యుచితమైన ఈ తీర్మానము సామ్రాజ్యశాసనసభవారిచే ఆమోదింపబడెను. దానికి ప్రభుత్వమువారును తోడ్పడిరి. రాజకీయకారణములచే ప్రసిద్ధప్రజాప్రతినిధులెల్లరు రాజీనామాలు పెట్టుటవలన ప్రస్తుత సామ్రాజ్యసభ యీకలుతీసిన కోడివలె నున్నది; కాని శారదాబిల్లు శాసనముచేయుబడునాఁ డిట్లు లేదు. పటేలు మహాశయు డధ్యక్షుడుగను, నెహ్రూ మాళవ్యా వంటి నాయకమణులు సభ్యులుగనునుండ ప్రభుత్వము

వారును ప్రజాప్రతినిధులును మిక్కిలి సఖ్యతతోచేసిన శాసనము శారదాశాసనము. ఆశాసనమైన అప్పటికప్పుడే ప్రజల నెత్తిపై పెట్టలేదు. దాదాపైదుమాసములకు తరువాత నమలులోనికి వచ్చునట్లు నిశ్చయింపబడెను. ఆ అయిదుమాసముల గడువులో శాసనము రద్దుచేయనెంచుచో సభ్యుల కవకాశము లేకపోలేదు. కాని ఆ అయిదుమాసములు శాసన ప్రతికూలురు రెక్కలైన కునికిపాట్లు పడుచుండిరో లేక విపరీతముగాజరిగిన వివాహములలో విందులే గుడుచుచుండిరో తెలియదు. శారదాచట్ట మమలులోనికి వచ్చులోపల పూర్వాచారపరాయణుల ప్రేరణచే దేశీయులు గావించిన యనుచితవివాహములకు లెక్కలేదు. ఒక్క మచిలీపట్టణమునందే 900 వివాహములు జరిగినట్లు లెక్కింపబడెను. ఇక యావద్భారతదేశమునందును ఎన్నిలక్షల వివాహములు జరిగెనో వివరింప దరముగాదు. దేశీయులెల్ల రా విధముగా కన్నులు తెఱువనివారును, పిడికిళ్లు విప్పనివారును, మాటలు రానివారును, నడకలు నేరనివారును అయిన కసుగందులకు గంగవెఱ్ఱులెత్తినట్లు పెండ్లిండ్లుచేయుచుండ నేను సవరణ నామోదింప సాహసించిన శాసనసభ్యులలో నొక్కరైన 'దేశీయులారా! భయములేదు. శారదాచట్టము రూపుమాపెద'మని చెప్పకపోయిరి. నాడుత్తోడ్పడి నేను తాటస్థ్యమువహించిన ప్రభుత్వమువారైన సవరణ కవకాశముగలదని సూచింపరైరి. అతిబాల్యవివాహము లా విధముగా ననిరోధకముగా నసంఖ్యాకముగా జరిగిపోయిన పిమ్మట, అభము శుభము నెఱుగని పసిపాపల కంఠములకు పూర్తిగా నురులు వేయబడిన పిమ్మట, ప్రజానురాగము బడసిన ప్రజాప్రతినిధులెల్లరు శాసనసభలు వీడివచ్చిన పిమ్మట, గడువుకాలము గడచిపోయి శారదాచట్ట మమలులోనికివచ్చి మూడుమాసములైన పిమ్మట యిప్పుడా సవరణ? ఆ సవరణయైన యెట్టిది? సివిలు కోర్టుద్వారా సర్టిఫికెట్టు పొందిన వారికి చట్టములో పొందుపరుపబడిన వయస్సులకు లోపుగనే తమ బిడ్డలకు వివాహము చేయుటకు సురపత్ సింగుగారి సవరణ అవకాశ మొసంగుచున్నది. అయితే యిక శారదాచట్ట మెందులకు? బాల్యవివాహములను చేయ నెంచువారెల్ల కోర్టులో దరఖాస్తుపెట్టి సర్టిఫికెట్టును పొంది తమ పిల్లల కెప్పటియట్లు వివాహముజేయుదురు. ఆక్షేపణలేనివా రొకరి సలహా లేకయే తమ కొమార్తెలకు ప్రౌఢవివాహములను చేయుచున్నారు. ఇకనేమున్నది? శారదాచట్టము బ్రతికియుండియు చచ్చిన చందమగును. సర్టిఫికెట్టును బడయుట కేదైన కొంచెము ఫీజుగూడ నున్నచో కోర్టువారి కదిగూడ నొక ఆదాయకారణము గావచ్చును. వానిలో నేదైన తకరరు వచ్చినచో లాయరులకుగూడ నొకింత సంపాదనాహేతువు కావచ్చును. కల్పలతా! శారదాచట్టము జీవచ్ఛవముగా నుండి చేయుపని యింతియేగాదు; మఱియొక ముఖ్యమైన నష్టమును గలదు. దేశములో శారదాచట్టమునకు ప్రతికూలురుగా నున్నవారు రెండు విధములుగానుండిరి. వారిలో నొకరు పదునాలుగేండ్ల వివాహములు శాస్త్రవిరుద్ధములని వాదించు పూర్వాచారపరాయణులు; వేఱొకరు యుక్తవయస్సు

వచ్చిన బాలికలకు వివాహముచేయుటకు మనస్ఫూర్తిగా నిష్టముండియు మన వైవాహిక హక్కును ప్రభుత్వపరముచేయుట గూడదను లౌక్యులు. చట్టమున కనుకూలురగు సంస్కర్తల చిత్తములందుగూడ నీ వివాహాధికారమును గోల్పోవుటనునది గొప్ప సమస్యగానే యుండెను. కాని దేశములో బాల్యవివాహములవలని యనర్థకములు నానాటికి మెండగుటయు, ఎన్నివిధముల ప్రబోధించినను ప్రజాసామాన్యము తమపూర్వాచారమును వీడజాలకుండుటయు గని స్త్రీల పురోభివృద్ధి నాశించు కొందఱు మహాశయులు ప్రభుత్వమువారి వలననైన నీ బాల్యవివాహములు నిరోధింపబడిన జాలునని తమ హక్కును కోల్పోవుట కొడబడిరి. అయితే యీ సవరణయే నెగ్గెనేని దేశమున కింతకంటె అనర్థకమును దేశీయుల కింతకంటె యవమానమును వేఱొండు లేదు. ఏలననగా ఎప్పుడు మన బాలికల వివాహమును చేసికొనుటకు కోర్టువారి సర్టిఫికెట్టును బడయు టగత్యమైనదో అప్పుడే మన వివాహముల హక్కును ప్రభుత్వమువారి పరము చేసినట్టులైనది. అయితే శారదాచట్టమును సృష్టించుటయొక్క యుద్దేశము బాల్యవివాహములను నిషేధించుటకే గదా. బాల్యవివాహములను చేసికొనువారికి ప్రభుత్వమువా రుత్తరువు నొసంగినచో శారదాచట్టముయొక్క ప్రయోజన మేమున్నది? కాన కలిగియున్న అధికారమును కోల్పోవుటయు, కలుగవలసిన ప్రయోజనము కలుగకపోవుటయు సురపత్ సింగుగారి సవరణయొక్క ఫలితములుగా నేర్పడగలవు. కావున మిత్రమా! స్త్రీ జనాభ్యుదయచింతతోఁ జేయబడిన శారదాచట్టము యథారూపమున నమలులోనికైన రావలెను. లేదా అసలే రూపు మాసిపోవనైన పోవలెను; కాని సురపత్ సింగుగారి సవరణను మాత్రము దేశీయు లెంతమాత్ర మామోదింపగూడదు. అప్పటికప్పుడే శారదాచట్టమును రూపు చెడజేయ నెంచిన సింగుగారి సవరణకు ప్రజాభిప్రాయమును కనుగొనుటయను మఱియొక సవరణతో యమర్సనుదొరగా రించుక యత్నపడిరి. కాన ప్రజాభిప్రాయమునకై విడువఁబడిన ఈ సవరణను అనర్థకహేతువని పూర్తిగా నిరసించి దేశీయులు శారదాచట్టముయెడల తమకుగల సమ్మతిని తమ నిశ్చితాభిప్రాయము ద్వారా మరల నొకపరి దృఢపఱుపవలెను. ముఖ్యముగా నిది స్త్రీలకు సంబంధించినది గావున స్త్రీలెల్ల రీ సవరణవిషయమై తీవ్రప్రాతికూల్యమును జూపదగును. గృహలక్ష్మి యు నిందులకు దోడ్పడవలెనని నా కోరిక.

మన చెన్ననగర మహిళాసంఘమువా రప్పుడే యీ సవరణవలని ప్రమాదమును గుర్తించి నిరసనసభ జరిపినట్లు పత్రికలలో జదివితిని. ఇది యెంతయు శుభావహము. ఇటులనే భారతదేశమంతట నీ సవరణకు తీవ్రప్రాతికూల్య మెదుర్కొనుగాకయని యాశించెదను.

కల్పలతా! ఈసమయమున దేశీయు లుపేక్షించిన దేశమునకు మేలుగాక కీడునే చేసినవా రగుదురనుట నిక్కము. భవిష్య మెట్లున్నదో?

—శారద.

# నవ్వు

## పూడిపెద్ది వేంకటరమణయ్యగారు

### ౧

"నాయనా! పువ్వునవ్వు-పండనవ్వు! అత్తరువనవ్వు-పన్నీరనవ్వు! ఒకనవ్వు-చెక్కనవ్వు! అన్నిటికీ పోనిస్తూ అంటావు! ఇదేమిట్రా? బాబూ! రంభలాటి పిల్ల-చెప్పబడ్డవంశంలో పుట్టిందనిచేసానుగదా! నీవలాగదాన్ని ఉల్లంఘనచేస్తే పాపమది యెంత నొచ్చుకుంటుందో నీకు తెలుసునా? ఈడొచ్చినకోడలు ఇంట్లో కలకలలాడుతూ నవ్వుతూ ఉండాలిగాని కంటికీ మంటికీ ఒక్కటే ధారగా యేడుస్తూ ఉంటేయేలాగు?"

అంది కొడుకునుపిలిచి రామమ్మ. కొడుకు జగన్నాథం పాతికేండ్లవాడు. చిన్నప్పుడింటివద్ద గురువునుపెట్టి కావ్యాలుచెప్పిస్తే కాబోలు ఎలాగో చదివి "అబ్బ! దీనినిండా అసందర్భపువర్ణనలే! ఇవన్నీ నిజమని యేలాగనమ్మడం? ఇలాటి పరిస్థితులు కవిగాడిఊహాప్రపంచంలో ఉంటాయేమోగాని కండ్లకు కనబడుతూన్న ఈ బాహ్యప్రపంచంలో లేందే యెలాగ నమ్మడం? నాకీ కావ్యాలూ అక్కరలేదు—కంగారు అక్కరలేదు" అని చదువు మానేశాడు. అంతా మన కంటికే కనబడుతూన్నప్పుడు ప్రాపంచికవిషయానురాగానుభోగాలను గూర్చి వేరొకడు చెప్పేదేమిటని ఆతనియూహ. తల్లి ఆలాగ అడుగగానే జగన్నాథం కన్నులు విశాలంగా విప్పి

"ఏమిటమ్మా! అలా అంటావూ? ప్రేమ అన్నది యెక్కడుంది? వ్యవహారంలో, సంసారంలో, జీవనయాత్రలో వస్తువుకూ వస్తువుకూగాని, వస్తువుకూ జీవికీగాని, జీవికీ జీవికీగాని ఒకవిధమయిన అనుబంధం అలవాటవుతుంది. ఆ అలవాటునే దొంగముండావాళ్లు ప్రేమ అంటారు. అందరితోపాటే నన్నూ భగవంతుడు సృష్టించేడుగదా; ఆ ప్రేమదేవత యేదో నాకేల ప్రత్యక్షంకాదూ? వట్టిమాట. ప్రేమ అనేది వ్యక్తి తనంతట తాను కల్పించుకొని నటించే వేషంగాని వేరొకటికాదు. పోనీ అలాచూచినా నేను దాని నేమీ బాధించలేదే! ప్రేమో, ప్రేమో అని హృదయంలోలేనిఆవేగం పైకి చూపించలేదు. అంతేనా?"

రామమ్మ:—అదికాదురా బాబూ! వాళ్ల శ్రీనివాసరావు చూచేవా? ఇరవై నాలుగుగంటలూ శ్యామలను విడిచి ఉండడు. దానికి వాడే తలదువ్వి జడవేస్తాడు. జడనిండా పూలుపెడతాడు. నొసటను చుక్కపెడతాడు. ముంగురులు సవరిస్తూ దగ్గఱ కూర్చోపెట్టుకుంటాడు. చేతిలో చేయి సంధించుకుని పూలతోటలో దానితో తిరుగుతాడు. శ్యామల ఆ గచ్చురుగుమీద పడుక్కుంటే మొన్నను వాడు దట్టంగావిడ్డ పూవులతోనిండిన మల్లెకొమ్మతో ఆ యిల్లాలికి సురటీలు విసురుతున్నాడు. ఆ సమయంలో వాడి కన్నుల లోనూ దాని కన్నులలోనూకూడా వజ్రాలతళుకులాగ ప్రేమ వెల్లివిరిసిపోయింది. వాళ్లనుచూచి మా జగన్నాథమూ కాముడూ యెప్పు డిలాఉంటారో అని అనుకున్నాను. అలాటివన్నీ తనకు లేవని కాము డేడుస్తుంది. కట్టుకున్నదాన్నేడిపించడం మనకుమాత్రం మంచిదట్రా?

జగన్నాథం.—ఏడుస్తే నేనేంజేసేది? నవ్వితే నేను వద్దన్నానేమిటి? పోనీ, ఏడుపూ నవ్వూ ఒక యంత్రంమీదనే నడుస్తాయి. ఏడుపు జలసహాయంవల్ల నడుస్తే నవ్వు వాయు సహాయంవల్ల నడుస్తుంది. ఇవి ప్రకృతితోనే వస్తున్నాయి. వానిని శ్రీనివాసరావు మాత్రం మార్చగలడేమిటి? ఈ బుడిబుడివేసాలు నావల్లకావమ్మా! చేయక విధిలేని పను లేవో ప్రకృతిసిద్ధంగా చేస్తూనే ఉన్నాను. వాటికి వన్నెలుపూయడం, జిలుగులుచెక్కడం నావల్లకాదు. ఇరవైనాలుగు గంటలూ జపమాల పట్టుకొని "కాముడూ, కాముడూ" అని జపంచేయలేను. ఒకవేళ నేనలాచేసినా అది బాహ్యమేగాని నా హృదయంలో పుట్టిన బుద్ధివిశేషంమాత్రంకాదు. ఇలాటివేషాలు జీవుడి కవసరమే అయితే సహజంగా నాకలాటి కోర్కెలేల పుట్టవూ? ఇలాటి పటాటోపాలు చూచేకాబోలు ప్రకృతినే మాయ అనేశాడు. ధారాళంగా బ్రతుకగలిగినప్పుడీ మాయ యెందుకూ?

రామమ్మ.—అయితే నీకర్మం బాబూ! నేనింతకంటె యేంచెప్తాను? అది చిన్నపిల్లా, అయినింటి పిల్లానూ. అది యేడుస్తే చూడలేక యీపాటిఅయినా నీతో చెప్పేను....అదీ అలాటిదే! అదికాస్త తెలివైందయితే నిన్నీపాటికిబుట్టలో పెట్టి చిలక్కొయ్యను వేసీదూ? ఏమో మీకర్మం పసిపిల్లలుకారుగదా!

౨

జగన్నాథానికి స్వశరీరంమీదనే ప్రేమ లేదేమో? జుట్టుకండ్లలో పడకుండా కత్తిరించు కొనేవాడుగాని తలకు చమురు రాచి యెన్నడూ దువ్వుకొనేవాడుకాడు. ఒడలు కుళ్లు

లేకుండా తోముకొని కడుక్కొనేవాడుగాని వాసననస్తువులేవి వాడుకచేసేవాడుకాడు. ఏదో ఒక గుడ్డ కట్టుకొనేవాడుగాని ఇది మంచీ యిది చెడ్డా, ఇది ఖరీదూ ఇది చౌకన్నా అని యెంచేవాడుకాడు. అత డేపని చేసినా అలాగే. ప్రేమ అంటే యేమిటో అతని కర్థమయ్యేదికాదు. వాని ప్రవర్తనచూచి కాముడికి చాలా కించగా ఉండేది. రాత్రి నాలుగుగడియలూ లెక్కలమేష్టరంకెలువేసిన ట్లాగదిలో పడుక్కొనేవాడు. తెల్లవారక ముందే పైకి వచ్చేసేవాడు. కాముడు యంత్రపుబొమ్మలాగు అలాగ కాలక్షేపం చేసేది. తెల్లవారేక జగన్నాథం ఆమెను ఎక్కడున్నావనేనా అడిగేవాడుకాడు.

ప్రేవులు చిగిరించినట్టు కొనలుసాగే ప్రేమతో, హృదయం కట్టతెగినట్టు పొరలిపారే ప్రేమతో, సర్వాంగకములు సందడించేటట్టు త్రుళ్లింతలాడే ప్రేమతో, కనుచిప్పలు నిండి తొణకే ప్రేమతో, పెంచికొన్న తలిదండ్రులను విడచి-వారియెడఁగల సున్నితయయిన, సుకుమారమయిన ప్రేమసూత్రమును తామరతూడులోని దారమునువలె త్రెంచేసి యీ నూతనసూత్రానికి కట్టుపడివచ్చిన యాడుదానికి కొసామొదలూ కానరాక గాలిలో యెండాకులాగు హృదయం గడగడలాడితే యెలాగు? ప్రేమలేకపోతే హృదయం యెందుకూ? ప్రేమ హృదయానికి వేషమా? తేనె పువ్వునకు వేషమేకాబోలు? ఆ తేనెకు మాధుర్యం మరొక వేషంకాబోలు? ఆహా! సృష్టిలో నెన్నిచిత్రాలూ? ఇన్ని చిత్రాలు ఉంటేనేగాని యీ సృష్టియంత్రం నడవదుగాబోలు?

* * * * *

ఆనాటె సాయంకాలం కాముడు పన్నీట జలకమాడింది. పట్టుచీర కట్టుకుంది. మసిలీనురవిక తొడుక్కుంది. హృదయంమీద నటించే ప్రేమలతలాగు బంగారపు గొలుసు పైటసందునుండి మిలమిలలాడుతూంది. ఆలతను పెంచడానికి రసంచిలికేగిండీలాగు హృదయకలశం తొణుకుతూంది. ఇంటిముందర తోటలో తొగరుచెట్టు క్రింద కూర్చుని కాముడు పూలగుత్తులు కడుతూంది. చేరువనే చివురాకులతో, చెంగలువ పూలతో, సన్నజాజి సరాలతో, మల్లెదండల మడువులతో పూసెజ్జ పరచింది. ఆ తొగరుచెట్టుమొదట మాలతీసుమాలతో, గులాభిగుత్తులతో చిన్నతిన్నె నమర్చింది. సోగకొమ్మకు తీగయుయ్యాలఁగట్టి దానిలో దిరిసెనదిండ్లు కూర్చింది. కూజాతో పన్నీరు-పళ్లెముతో ఆరముగ్గిన గులాబీజామిపళ్లు పెట్టింది. ఆమె హృదయమున ఒక్కొక్క ఊహా పొడసూపుతూంది; పూల గుత్తిలో ఒక్కొక్క పువ్వు విరుస్తూంది. మెల్లగ

తూరుపుదిక్కు తెల్లబారింది. చిమ్మనగ్రోవితో జిమ్మిన పాలజల్లులాగు వెన్నెల తుంపురులు వెల్లి విరిసేయి. నిర్మలమైన ఆకాశపునీలితెర త్రోసికొని చుక్కలన్నీ చోద్యం చూడడానికి గుంపులు గుంపులుగా వస్తున్నాయి. ఆడుతనము సూచించుటకు కాబోలు భూమి వెన్నెల తళుకులో వెలవెలబారుతూంది. అలా భయపడుతూన్న నేలపడతిని తన నీలిప్రేళ్లతో చూపి రేయి చుక్కలచేత కన్ను గిలిపిస్తూంది. విరహాన క్రుంగిపోతూన్న తలనెత్తి కౌఁగలించి చెట్టుకొమ్మలు చివురుపెదవుల వేడినిట్టూర్పులు విడుస్తున్నాయి. దూరముననున్న ప్రియుల ఛాయాచిత్రాలు చూచిచూచి విరహభారంచేత విసిగి విసరివైచినట్టు నీడలు నేలను ప్రాకుతున్నాయి. కలవరించి కలవరించి నిదురించిన విరహిణివలె రాత్రి పులుగులసందడులు మాటువడ లేగూర్కున మాగన్ను పెట్టింది. కలత నిద్దురలోని కామగీతంలాగు ఆ ప్రశాంతనిశాహృదయం చెదరేటట్టు వీణానిస్వనాలు వెడలుతున్నాయి.

చేరువనే చెట్టుచాటున నిలబడి జగన్నాథం కాముడినిచూచేడు. ఆమెను చేరబోయి "ఏమిటీవికారం ? చెట్లపువ్వులన్ని యేమిటిలా చిందరవందర చేసేశావు ? బాగుంది విద్య! తీగ బిగించిమీటితే వాగదూ ? ఎన్నిపిట్ట లరుస్తున్నాయికావు ? ఇదోవిద్యా ? చాలు నీపాటిలే ! రాత్రివేళ తోటలో ప్రవేశించేవేమిటి ? చీకటిచాటున ఏదేనా గుదిమీగలదు. ఏతుంటరేనా చూస్తే మెళ్లో పుస్తెపూసా తెంచుకుపోగలడు. అక్కడ కవతాయి అన్ని వేషాలును. పువ్వులన్నీ తెంపేశావు ! ఆకులనీ రాల్చేశావు ! తీగలన్నీ దిగలాగేశావు ! బాగుంది నెత్తురుకోతవాళకం కట్టేవేమిటి ? పద! యింట్లోకి-ఆముసలిముండాకూతురొక్కర్తాలోపల దేవులాడుతూంది కాబోలు."

కాముడు లేచి నిలబడి గడగడావడికింది. ఆపె కళ్ళనిండా నీళ్లుక్రమ్మేశాయి. జాలిగ జగన్నాథంముఖం చూచింది. మాటాడబోయి గద్గదిక సవరించుకొంది.

"ఇంకా వెళ్లవేం లోపలికి ? ఏమిటీశృంగారం ? వికారంలాగుంది. ఏపనిలేనివాడో కావ్యాలలో యేదోవ్రాస్తే నీవుకూడా అలా చేయాలనుకున్నావా ? నయం ! ఇంకా వరూథినిలాగుందామని హిమవత్పర్వతం యెక్కేవుకావు !—"

కాముడు మెల్లగా యింటివైపుమరలింది. పైటతో కన్నీరుఒత్తుకుంటూ నడుస్తూంది. చెట్టుక్రిందవీణ చిన్నబోయింది. కోపంచేత గురితప్పిపోయిన మన్మథునిబాణాలులాగు తొగరుపూలురాలి వీణతీగెలు మ్రోగేయి. జగన్నాథం వీణచూచేడు. "అబ్బ !



సినిమానటి: మిస్ జుబీదాకన్య

*Courtesy of "The Movie Mirror"*

వీపుగోకుకున్నట్టు యీ వెఱ్ఱివాయిద్యా లెందుకో? కడుపుబాదుకున్నట్టు ఘటంమొత్తేసే వాళ్ళు కొందరూ-సహాయంలేక యేఅడవిమృగంవాతనో పడిపోతూన్నట్టు మొఱ్ఱోమని అరచేవాళ్ళు కొందరూ. ఈకూతవినలేక వాడే చెవిమూసుకుంటూఉంటాడు మళ్లాను. ఎందుకీవికారాలు? ఈఘోష కర్థమా, అనుభవమా? గీతగీసి చదవమన్నాడట వెనుకటికెవడో. చెప్పాడు కర్థంచెపతామంటారీ వికారపుముండాకొడుకులు-అరబ్బీకథలలో బ్రాహ్మస్సైడువిందు లాగ తేలింది. వినండని అరచేవాడు చెప్పితేవినేవాడు తలతిరిగేటట్టు ఊచడమేనా? వట్టి మాయ! వట్టివేషం! వట్టినటన!" అంటూ ఆవీణ కాలితో వారకుత్రోసేసి యింట్లోకి వెళ్ళిపోయినాడు.

పాలయల్కచేత పెడమొగముపెట్టిన యిల్లాలిని బ్రతిమాలవలసినవయసులో తానే ఆమెను పొమ్మంటున్నాడు. ప్రియురాలి కంఠనిస్వనంవిని పులకరించవలసిన వయసులో గానము వికారమంటున్నాడు. చేతికి వీణనందించి గీతాలుచిమ్మమనవలసిన వయసులో మ్రోగుతూన్నవీణను ముంగాలతన్నినాడు. శృంగారపక్షాలమీద నింగికెగయవలసినవయసులో చిందరవందరయిపోతున్నాడు.

3

"జగన్నాథం! పదిరోజులాయ పిల్లవానినితీసుకొనివస్తే పలుకరించనేనా పలుకరించవు! కన్నెత్తిచూడనేనాచూడవూ! ఇదేమిట్రా? నాయనా! ఇరుగువాళ్ళూ పొరుగువాళ్ళూ అలావచ్చిచూస్తున్నారు. పిల్లడినివిడువలేక అలాచేతులలో వాడిని నలిపేస్తూ ముద్దులుకురిపించేస్తూ ప్రొద్దుపోయేదాకా కూర్చుంటున్నారు. ఆపాటియైనా చేసేవుకావట్రా? నేనీలాగ అడుగుతూవుంటే నామీదనీకుగల భక్తిచేతనయినా వాడినొకమా ఎత్తుకో కూడదూ? నాజన్మానికేముంది? ఇదేకాదట్రా నాకు ముద్దూముచ్చటాను?" అంది రామమ్మ.

జగ:—అమ్మా! ఆముద్దుపెట్టుకుంటున్న వాళ్ళందరూ పయివాళ్ళుకాబట్టి ఆవేషాలు వేసేరు. వాళ్ళకెందుకుంటుందీ యీపిల్లడిమీదప్రేమ? వట్టివేషం! నాకిలాటివేషాలేం పడవమ్మా! ధారాళంగాబ్రతకాలికాని దబ్బరప్రేమతో తబ్బిబ్బుకాలేనుసుమా?

రామ:—కొసకూ ఒకటేపాటట్రా? కొన్నాళ్ళకుగాకపోతే కొన్నాళ్ళకైనా మనసు త్రిప్పుకోవద్దూ? ఇంతకీ యేంలోపంవుందికనక? పిల్లవాని నొకసారిచూడూ! యెలాగున్నాడో! దూదిపింజలలాటి పాలబుగ్గలూ, దాలెమ్మరేకులాటి యెఱ్ఱనినోరు, ఆలిచిప్పలలాటికళ్ళూ, తుమ్మెదపిల్లలలాటి ముంగురులూ, తూచినట్టు శరీరనిర్మాణం చూడడానికానందంగా ఉండదట్రా? ఎత్తుకున్నవాని కలంకారంకాదట్రా చంటిపిల్ల? నీమనస్తత్వాన్ని

బట్టీ ఆలోచించుకో. పసిపిల్లవానినవ్వులాటి అమాయకమైన, అకల్మషమైన, అమృతం చిలికే ఆలాటినవ్వు జగత్తులో మరెక్కడేనా ఉందా? ఆటపాటలుమరిగిన బాలునినవ్వున కర్థం వుంది. అంతోయింతో తెరచాటుంది. శృంగారమెరిగిన జవరాలినవ్వునకు నానార్థాలూ వున్నాయి. అది అన్వయకఠినమైన ఆంధ్రకావ్యంలాటిది. గంభీరమైన హృదయంతో తల యెత్తి జగత్తును పరిశీలిస్తూన్న కౌమారపునవ్వులో కలతపెట్టేభావాలున్నాయి. కంగారు పెట్టే అర్థాలున్నాయి. శరీరంవలె ముడతలుతేలిపోయి, అనుభవించినహృదయంవలె చెదరిపోయి, వాడిపోయినచూపుక్కలవలె కళావిహీనమై, వంగిపోయిననడుమువలె విషాదవక్రమయి, బలవంతముగజారిపోయే ముసలినవ్వులో శాస్త్రచర్చలున్నాయి. శంకరభాష్యాలున్నాయి. కాని జగన్నాథం! పసికూన అమాయకపునవ్వున కేయర్థమూలేదు. ఏఅవకతవకాలేదు. ఏప్రతిఫలాపేక్షాలేదూ, ఏమాయాలేదు. ఏమర్మంలేదు. తుమ్మెదముట్టని తేనె, అమరులంటని యమృతరసము-అలాటి పసినవ్వుకూడా విసమేనా? అనవ్వువికాసంతో హృదయం వికసించదూ? అదికూడానటనే అంటావాయేమిటి!...... ఈపాటి నామాట విందూ-పెద్దముండాకూతురనుగదా! దానివల్ల నాకేం నష్టంలేదు. ఒక్కసారి పిల్లవాని నెత్తుకుందూ—

జగన్నాథం కొంచెముసేపాలోచించేడు. "అయితే యిలాతే" అన్నాడు.

రామమ్మ:—కాముడూ! పిల్లవాడ్ని తెచ్చి బాబుచేతికియ్యి!

కాముడు కొడుకును తెచ్చి మగనిచేతి కందించింది. అతనిచేతులలోపెట్టగానే ఆపిల్లవాడు మిలమిలచూస్తూ కాలుసేతులువిసరేడు. క్రిందపడతాడేమోనని ఆపిల్లవానిని జగన్నాథం గుండెకదుముకున్నాడు. ఆమెత్తని పాలబుగ్గలు వాని హృదయఫలకాని కంటేయి. చివురుపాదాలు చెక్కిలినితాకేయి. జగన్నాథాని కొక్కసారి ఒడలు జలదరించింది. ప్రేమాంకురాలలాగు పుల్కాంకురాలు తలలెత్తేయి. బిగించిన వీణతీగలలాగు శరీరములోని నరము లొక్కతూరి జల్లుమన్నాయి. ఈతీగల నెవడుమీటినాడో! లోని రక్తనాళములలో ప్రేమరసమే ప్రవహించింది. ఇది ఆతనికి నూత్నావస్థ. ఈయవస్థలో నాతనికి బాహ్యవస్తుచైతన్యము తగ్గిపోయింది. కాలుసేతులు గడగడవడకినవి. రెప్ప లరవాలినవి. చేతిలో పసిపిల్లడు పెదవులుసవరించి, కనుబొమలదలించి, ముకుపుటములుబ్బించి, నాల్కసవరించి, మెల్లగనవ్వి "ఊ" యని కెవ్వునకేరినాడు. ఆనవ్వుతో జగన్నాథంహృదయం వికసించింది. చెక్కు లెట్టుపడ్డాయి. కన్నులు చెమ్మగిల్లేయి. పెదవులు వడకేయి. అప్రయత్నముగ ముఖ

మున చిరునవ్వు మొలకెత్తింది. పిల్లవానిని మరెంత దగ్గరగ హృదయమునకద్దుకొని అతడు తలవంచి గుంటలుపడ్డ వానిబుగ్గలుఒకమారుముద్దుపెట్టుకొన్నాడు. దానితో వానికేదో బరువు హృదయమునుండి తగ్గినట్లయింది. ఒక్కనిట్టూర్పు విడిచినాడు. ఒకవింతసుఖం క్షణమాత్రం వానినావరించి మైమరపించివిడిచింది. పిల్లవానిముఖమున నమాయకపురేకలు జాలువారుతున్నాయి. మరియొకతూరి జగన్నాథం వానిని ముద్దిడినాడు. ఇంతలో తనకు పూర్వజ్ఞానముకలిగింది. చిన్నబోయినాడు. పిల్లవానిని మెల్లగ తనతల్లిచేతి కిచ్చివేసినాడు. పెద్దనేరముచేసినట్లెంచుక తహతహలాడినాడు. తానిప్పుడు చేసినపని మాయయో నటనమో వట్టివేషమో యేదో వానికి తెలిసినదికాదు. మనసవశమైనప్పుడు మనమేమిచేస్తామను కున్నాడు. మెల్లగలేచి గదియీవలకు వచ్చినాడు. చీడీమీదనిలబడి యిదియంతయు చూచు చున్నకాముడు తనభర్తచూపిన యీవిపరీతచర్యకు పట్టలేనియానందమున పలువిచ్చి నవ్వు తూంది. జగన్నాథ మామెమొగము క్రీగంటచూచినాడు. పసికూనననవ్వానవ్వు ప్రతిఫలిం చింది. దానికంటె యీనవ్వు సుందరంగా లలితంగా శృంగారంగా కనబడింది. అతనిహృద యంలో ఒకవింతమార్పు కలిగింది. తలకట్టంట వానిమొగ మెఱ్ఱపడినది. తా నేయవస్థలో నున్నాడో తెలియకుండా వానిహృదయం దడదడకొట్టుకొంది. అత డనుకొనకుండానే మెల్లగా అడుగు లామెవైపేసాగేయి. అప్రయత్నంగా వానికుడిచేయి యామెభుజంమీద వాలినది. ప్రేమభారంచేతనువలె పొడవైనవానితల ఆమెతలపైకి వంగినది. ప్రేమదేవత చల్లు నాశీస్సాక్షితలవలె కాముడుతలమీద కన్నీటిచినుకులు రాలినవి.

# మందహాసము

## చెలికాని సత్యనారాయణగారు

వెదఁజల్లువెన్నెల విలువైనయట్టి
అరవిరి మొగ్గల కనువైనయట్టి
ముత్యాల మురిపించు మురువైనయట్టి
వెలఁగల రతనాల వలపించునట్టి
జిలఁజిల నమృతంబు జిలికించునట్టి
నీమందహాసంబు నేనెట్లు మఱతు

చిత్తమాకర్షించు సింగారమైన
కష్టాలుమరపించు కమనీయమైన
ఆనందమునదేల్చు నపురూపమైన
అన్నింటికంటెను అసమానమైన
నీమందహాసంబు నేనెట్లుమఱతు?

# అమూల్యాభరణములు

యాలేటి వేంకటరావుగారు

రోమకచరిత్రమున నొకనారీరత్నముయొక్క సుగుణాతిశయముఁగూర్చి చెప్పఁబడిన విషయము నేటి భారతరమణీమణులకు, నందులో ముఖ్యముగ విద్యావిహీనలైన వారికి, నెంతయు నీతిదాయకమైయున్నది. ఒకనాడు పెక్కండ్రుస్త్రీలు పేరంటమునకు నామెయింటికి వచ్చియుండిరఁట. అత్తఱి వారివారి విలువగలనగలను ఆమెకు వారు చూపింపసాగిరఁట.

ఆగృహిణి యేలాటియాభరణములు ధరించునదికాదు. అందులకుఁ దనయింటికి వచ్చియున్న వనితలెల్ల నెత్తిపొడుపుమాట లాడఁజొచ్చిరఁట. పేరంటము ముగిసినతరువాత వారువీడ్కొని నిజనివాసములకుఁబోనున్నసమయమున, "అక్కలారా! నాయాభరణముల మీరుచూడ నిష్టపడుచున్నారా?" అనియడుగుచుఁ దనసేవకురాలిదెసఁ గనుసన్న చేసెను.

వెంటనే ఆపరిచారిక లోనికిఁజని, ఏడెనిమిదేండ్లప్రాయపుబాలుర నిరువురను దోడ్తెచ్చి వారిముందర నిలిపెను.

"ఓయమ్మలారా! ఈనాకూర్చుకొడుకుఁగుఱ్ఱలే నా యమూల్యాభరణములు" అని యాగృహిణిచెప్పెను. దానఁ దమకుఁ దలవంపులుఘటిల్లెనని మారుమాటాడనేరక ఆపేరంటాండ్రు తమతమయిండ్లకు వెడలిపోయిరట.

పైచరిత్రాంశములోని యంతరార్థముచదువరులు గ్రహించియేయుందురు. ఆమెచెప్పినది సహేతుకమైనదేకదా! మనబిడ్డలు మనకు ఆభరణములే అగుగదా! మనలను విడనాడిపోవునెడవారికి బదులుగా దేనినినిల్పుకొనఁగలము మనకు ముద్దులమూటగా?

ప్రతి స్త్రీయును దనసొమ్ములను రేయింబవలు భద్రపఱచుకొనుచుండును. అంతియ కాక అప్పటప్పటికి వానిని శుభ్రపఱచుకొనుచునుండుటయుఁ గలదుకదా!

చదువరియైనతల్లి నిజసంతానమును బ్రేమించుటయేకాక ఎంతో శ్రద్ధాభక్తులతోఁ దాఁగన్నబిడ్డలను పెంచుచుండును. ప్రేమయు, జ్ఞానమును నాఁజను నీరెండు వేరువేరువిషయ

ములు. ప్రేమాతిశయమునఁ దనబిడ్డలఁ బెంచు తల్లి ఒక్కొక్కవేళలో నేయేవిధమునఁ దన పెంపకముసాగించినదో నయ్యది వారిజ్ఞానాభివృద్ధికి సాధనమైయుండునో దానినెఱుంగక ఆపె తనయింటి పనిపాటులలో నిమగ్నయైయుండును. కావునఁ గన్నతల్లులు జాగ్రత్తలో జాగ్రత్త వహింపవలయును. లేకున్నఁ జిన్నతనాన వారిని జెఱచి గుణహీనులనుగాఁజేసినందులకు అట్టితల్లులే యుత్తరవాదులగుదురుసుమా!

బడిచదువువలనఁ దమబిడ్డలు బాగుపడకపోరని నమ్మియున్నవారికంటె మించిన వెఱ్ఱివార లీలోకమునలేరు. గృహమే ప్రథమపాఠశాలకదా! "విద్యాదదాతివినయం" అన్న న్యాయము గృహమునందున్నప్పుడే బాలుని పెంచుటలో నన్వయించునట్లు తల్లులుబాధ్యత వహించియుండవలయు. అడుగడుగునకును తప్పుచేయుబాలుని దిద్దుకొనుచువచ్చి ఋజుభావము పట్టుఁబడనేర్పవలయు. అట్లు నానాటికి సత్ప్రవర్తనగలిగిన బాలుఁడు పెరిగి పెద్దవాడైనను తనసుగుణములను వికసించినపుష్పము తనసౌరభమును వెదజల్లునట్లు ప్రకటింపకపోఁడు. దానంజేసియే "యద్భావంతద్భవతి" అన్నయార్యోక్తి మనకు ననుభవసిద్ధముగానుండునట్లేర్పడియున్నది.

# గృహలక్ష్మి

బొడ్డు బాపిరాజుగారు

తరుగుసూపని భక్తితాత్పర్యములకున్కి అడుగుదాటనియమాయకపుబంటు
మనసులోనున్న మర్మముదాచుకొనుపెట్టి వీడకెప్పుడునుండు తోడునీడ
సుఖదుఃఖములను పంచుకొనుభాగస్వామి చెప్పినపనిచేయు చెలిమికత్తె
తనువువీడెడిదాక దగిలియుండెడిముడి అనుపమప్రణయవాహినికివనధి

అనయముశుభంబుగోరు శ్రేయోభిలాషి
మంచిచెడుగులచెప్పు నమాత్యవరుడు
తొలినిజేసినమేటినోములఫలమ్ము
గాదె? గృహలక్ష్మి తలపోయగా ధరిత్రి.

# సంసారతరణోపాయం

సూదిరాజు జనార్దనరావుగారు

మొగవాడుచులాగ్గా అధికారం చలాయించుకో గలిగింది ఒక్క ఆడదానిమీదనే. ఇతరచోట్లల్లో అధికారం చలాయించుకోవాలెనంటే శక్తి, యుక్తి, పదవులుండాలె; కాని, ఆడదానిమీద అధికారం చలాయించడానికి మొగవాడై పుట్టుతేచాలు. ఎంతహీనంగా జీవనంచేసే వాడికైనా వాడి పెండ్లాంమీద వాడికి అధికారంవుంగి. ఇదొకరు ఇచ్చిన అధికారంకాదు. ఈ అధికారం మనదేశవాసులకే కాదు; భూలోకమంతటా ఉంది. దీనినిబట్టి చూస్తే మొగవాడు ఆడదానిమీద అధికారం పొందటానికి కలిగిన అర్హత శరీరబలంబట్టి వచ్చిందని తెలుస్తుంది. అందుకనే ఆడదాన్ని అబల అన్నారు.

కనక ఆడదానికి లొంగిపోయిన మొగవాడు వట్టిచవట పెద్దమ్మ అన్నమాట. అట్టివాడికి పదుగురిలో తలవంపులౌతుంది. పౌరుషంగల మొగవాడు పొడుచుకొనిచస్తాడు.

మన హిందూవివాహసిద్ధాంతాలు మహాలగువుబిగువులుకలవి. మనకు వివాహాలు చేసికోవటాలె కాని విడాకులులేవు. కాబట్టి ఆడది ఆమరణాంతం రామార్పణమంటూ భర్త్రార్పణ మవుతున్నది. ఇక మన మొగవాడు భార్యమీద చూపించే అధికారం యింతింతకాదు. లేస్తే తన్ను, కూర్చుంటేతన్ను. తన్నులు తినలేని ఆడది, తిననోల్లని ఆడది రచ్చకుపడుతున్నది. తన్నులు తింటున్న మొగవాండ్ల బాధ భగవంతుడుకే తెలియాలె. ఇట్లాంటిస్థితిలో మన సంసారాలస్థితులు ఒకండ్లకొకండ్లు చెప్పుకొనే యత్తులోలేవు. అందుకనే చెప్పుకోరు. ఇట్లాకుమిలి యెంతకాలంవుంటాం? దీనికేదో మార్గంచూచుకొనవలెనా, వద్దా? కాబట్టి బుద్ధికి యీవిధంగా వేదాంతం చెప్పుకుందాం.

మొగవాడు ఆడదానిని పశుత్వంగా స్వాధీనం చేసుకుంటున్నాడు. సరళహృదయుడై పశవర్తినిగా చేసుకోటంలేదు. తన బలాన్నినమ్ముకొని విజ్ఞానాన్ని మట్టిలో కలిపాడు. ఆహారవిహారాలకు సంతృప్తిపడే పశువులు త్వగింద్రియానుభవంకోసం స్వార్థపరత్వంతో మెలగినట్లు మానవుడు మెలగవలసిందే? పశువులకంటే నరులకు అధికంగా జ్ఞానమంటూ ఒకటివున్నదంటున్నారుగా పెద్దలు. కాబట్టి మనం నరపశువులం యెందుకు కావాలె?

ఆలోచించి చూస్తే యెప్పటికి బలవంతుడిదే రాజ్యం. మొదట్లో ఆడది అబలైతే మొగవాడు దానిని అదరగండంతో తన స్వాధీనం చేసుకున్నాడు. కాని తనవస్తువైన దానిని బాగుచేసుకుందామనేధోరణిలో లేడు. ఆడది ఆకర్షనీయమైన వస్తువునుఆబలయు అవుటంచేత స్వరక్షణకోసం మొగవాడి నీడనదాగవలసి వచ్చింది. అప్పటినుండి మొగవాడికి ఆడదానిమీద సంపూర్ణాధికారం దొరకింది. తనసుతప్ప మరొకనిని పలుకరించకూడదు, కన్నెత్తి చూడకూడదు అనే స్వార్థంయేర్పడ్డది. అందుకని మొగవాడు తన స్త్రీని పదుగురిలో ప్రదర్శింపటానికి యిష్టపడడు, సరికదా తనతో సమానమైన యోగ్యత తీసుకొనిరావటానికైనా ప్రయత్నం

చేయడు. ఎందుకంటే తనతో సరితూగే భార్య తనస్వాధీనంలోనుండి తప్పిపోతుందనేభయం. ఈవిధంగా స్త్రీప్రపంచాన్నివంచి మగవారు వడబోస్తున్నారు. అందుకని మనకుటుంబాలన్ని సారంలేని సంసారాలైనై.

ఇదిన్నిగాక భార్యకు పాతివ్రత్యమనే బురఖాతగిలించి భర్తయెంత అఘాయిత్యమైనా జేస్తున్నాడు. భగవత్ప్రసాదితమైన గాలి, వెలుతురుకూడ అనుభవించనోచుకోని భార్యలగతి చెప్పటానికి వీలులేదు. వీరు రాతిక్రింద మొలకల్లాగ పాలి స్త్రీయత్వానికికూడ యోగ్యులు కాకుండా పోతున్నారు. వీరితో యేంసుఖం వుందో పొందే పురుషులకే తెలియాలే. తానిట్లాబాధపడుతున్నా భార్యను అట్లాబాధ పెడుతున్నా తనకైతే గౌరవంవుందని సంతోషిస్తున్నాడు. ఇట్లా పురుషుడు స్వార్థంకోసం ఆడదానికి యెన్నో విషయాలల్లో అడ్డు తగిలాడు. వారికి సహజంగా వుండే సౌకుమార్యం, విలాసం, తెలివితేటలు అన్ని మంటకలిపి వట్టిమొద్దమ్మ వారిని తయారుచేసినాడు. చంద్రుడి వెన్నెలలోని శీతలత్వం, మకరందంలోని తీపి, పుష్పంలోని సౌరభం తీసి వేస్తే మిగిలివుండే మొఱడు పదార్థమే ఆడదానిరూపంలో, మాటల్లో, గుణాల్లో మిగిలివున్నది.

అట్టి స్త్రీతో పొందే ఆనంద మేమిటో మీరే ఆలోచించండి. వట్టిపశువుల్లాగ వర్తిస్తున్నాం. మనకు యిక యెవరు పుడుతారో గ్రహించండి. నత్తకు వీపుమీది గుల్లబరువనితోచనట్లు సహజంగా అలవాటుపడి పోయిన యీపాడుసంసారం మనకు భారంగా తోచటంలేదు.

మనం గొప్పలాభాన్ని పొందాలెనంటే స్వల్పత్యాగానన్నా చెయ్యాలె. ఇంటిలో జరిగే తెలివితక్కువ దనాలకు కనుమూతయుండాలె. వెర్రివెంగళప్పలాగ సంచరించకూడదు. అన్నిటికి అన్నిధర్మాలు చెప్పుతాం. ఆచరణకొచ్చేటప్పటికల్లా యెవరికైనా కష్టమె. ఆచరించలేనివారైనా అనుగ్రహంపొందటానికి అర్హులే. వారి మీద తున్నన ఆగ్రహించకూడదు. అట్లాచేస్తే యింటిపొందిక చెడుతుంది. ఏకగర్భజనితులైతే యేంచేస్తు న్నాం? వారిని వదలుకుంటున్నామా? ఆలాయెవడైనా ఒకడు వదులుకుండేవాడువుంటె వాడు రాక్షసుడే. నిన్ను వదలిపొయ్యేవారిని గురించి చింతపడవద్దు. వారు తిరిగి స్వానుభవంతోవస్తే దయార్ద్రుడవై దరిచేర్చుకో. ఈసడించుకొనవద్దు. ఎవరికైనా కష్టానుభవంమంచిదే. తెలివిగలవాండ్లంతా పైవిధంగానే చేస్తున్నారు. వారిని ఆక్షేపించే వారుండకూడదు.

ఎవరైనా చెడుచేయటానికైనా మంచిచేయటానికైనా తెలివివుండాలె. తెలివితక్కువపెద్దమ్మలు యేది చేయలేరు. నీ యింటిలో విద్యలేక మంచివారనిపించుకొనేవారంతా వట్టిమందులు. చెడుచేయలేనంత అస్వాతంత్రత, అశక్తత, తెలివితక్కువతనం వీనిలో వుండటంచేతనే మంచివారనిపించుకుంటున్నారుగాని నిజంగా వారికేదో మంచితెలిసి చేయటంచేతకాదు.

చదువుకున్నవాండ్లు కొంచం చెడుప్రవర్తనకలిగివుంటారని సర్వసాధారణముగా కొందరు చెప్పుకుంటారు. వారిదినడుమంత్రపుచదువు. చెప్పుకున్నంత జరగదు; కాని చెప్పేదాంట్లో కొంతవరకైనా యదార్థంలేకపోలేదు. వారు చదువుకోటంవల్లనే, కొంచెం తెలివికలగటంవల్లనే వారట్లాచేస్తారని నాభావం. ఆకారణంచేత యింటి వాండ్లకు విద్య అవసరంలేదని చెప్పటం మూర్ఖం. ఈనాడు చేసింది పర్యాయతీతప్పని తెలుసుకోటానికైనా తెలివివుండాలెగా. వారికి సరీగా చెప్పగల మొగవాడుంటే తెలుసుకుంటారు. ఈ ఒక్కకారణంచేత సమస్త సౌఖ్యాలకు ఆలవాలమైన స్త్రీవిద్యను తూలనాడకూడదు. విద్యగల ఆడదితెచ్చే సౌఖ్యం అనుభవవేద్యు లగు భర్తలకు తెలుస్తుంది. మంచిచెడుగులు తెలుసుకోటానికి, అనుభవంలో వుంచుకోటానికి వారికి స్వాతంత్రం వుండాలె. విద్యావంతులు ఆరోగ్యమైన సంతానాన్నికంటారు. ఆరోగ్యాన్ని కాపాడుకుంటారు. విద్య, మంచినడత, హృదయానందకరమగు సంగీతమును వారు బాలురకు నేర్పుతారు. ఇంటిని స్వర్గతుల్యం చేస్తారు. స్వరాజ్యానికి మార్గం చూపిస్తారు.

# చారుగమ్మత్తు

తాత కృష్ణమూర్తిగారు బి. యె; యల్. టి.

పుల్లయ్యశాస్త్రి మంచితమాషామనిషి. భోజరాజుమొహం చూస్తే కవిత్వం పుట్టుకొచ్చినట్లు పుల్లయ్యశాస్త్రి మాటలాడితే చాలు యెంతటి వాడికీ నవ్వురాక మానదు. హాస్యరసం అనేది ఆయనలో మూర్తీభవించి వున్నది. అందువలన ఆయన మాటలకుగాని చేష్టలకుగాని యెవరూ తప్పు పట్టరు—కోపగించుకోనరు!

ఒకనాడాయన మాయింటికి విందుకు వచ్చియుండెను—రాత్రిపూట.

ఏవో కులాసాకబుర్లు చెప్పుకుంటూ యిద్దరం భోజనం చేస్తున్నాము. నాభార్య కూడా ఆయన మాటలకు అప్పుడప్పుడు తనలో నవ్వుకుంటూ వడ్డన చేస్తూవుంది.

చారుగిన్నె తెచ్చి యెదురుగా వుంచి గరిటెపట్టుకొని ఆమె నిల్చుంది.

"వెయ్యండమ్మ వెయ్యండి—చారేనా?" అన్నాడు శాస్త్రి నాకేసిచూచి.

పదిలంగ గిన్నెలోని చారు గరిటెతో తీసి నాభార్య ఆయనకు వడ్డించింది.

పెద్దగా చప్పుడుచేస్తూ చారుత్రాగి "బలే; యేం మజాగా వుంది! రుచికి దక్షిణాది వాళ్ల 'రసము'ను సహా మించి వున్నది. పంతులుగారూ! చారు చిత్తగించండి. ఒక పురిసెడు త్రాగితే మీకే తెలుస్తుంది." అన్నాడు శాస్త్రి.

మామూలుగా నాకు చారుపోసుకొనే అలవాటు లేదు. కాని యింతగా శాస్త్రి పొగడుతూవున్నప్పుడు కాస్త రుచి చూదామనుకొని కొద్దిగా అన్నం తీసి చారు పొయ్యమని సంజ్ఞచేసి పురిసెడు పట్టినాను. గరిటె నిండా తీసి నా భార్య వేడివేడి చారు నా చేతిలో పోసింది.

భగ్గుమన్నది చెయ్యి! ఆవేడి భరింపలేక విస్తట్లో చారు విడిచిపెట్టినాను. చెయ్యి చుఱుకై యెఱ్ఱగా అయింది. ఆ మంటకు కళ్లవెంబడి నీళ్లువచ్చినవి. బిక్కచచ్చి నాభార్య నిల్చుంది చీవాట్లకై యెదురుచూస్తూ. కాని ఆమెదేంతప్పు? శాస్త్రికి చారు వడ్డించినప్పుడు వేడిగావున్నదని ఆయన అనలేదు. కాబట్టి వేడిమి మోతాదుగానే ఉన్నది కాబోలని ఆమె అనుకున్నది.

"ఏమయ్యా! 'చారు వేడిగా ఉన్నది సుమండీ! చేతిలో పోసుకోకండి!' అని నాతో చెప్పలేదేమి?" అన్నాను శాస్త్రి వైపు తిరిగి.

ఆయన వెంటనే యేమీ బదులుచెప్పక కొంతసేపు నావైపు నిదానించి ఉప్పెనగా నవ్వుకున్నాడు. "చారుకు వేడి రుచి, మనిషికి శాంతం భూషణం అన్నారు మనవాళ్లు. కాని అసలుసంగతి మనవి చేస్తాను వినండి. చారు భరించలేనంత వేడిగా వున్నదన్న సంగతి తెలియక మొదట చేతిలో పోయించుకున్నాను. చెయ్యి చుఱుక్కు మంటకెత్తింది. మించిన దానికి వగచి యేం లాభం? బయలుపడి నాపరాభవం వెల్లడి చేసుకుంటే నగుపాట్లేకద? అంచాత కిక్కురుమనకుండా ఊరుకొని మొండికెత్తి కొద్దిగా ఆవేడిచారు నోట్లోకూడా పోసుకున్నాను. నోరు కాలి అవస్తపడతానని తెలుసు. కాని, అందుకు కూడా ఓర్చుకున్నాను."

"నాకుకూడా ఆపరాభవం జరుగుతుందో లేదో చూదామనా యీమెత్తు?" అన్నాను.

"మీరుకూడా నావలెనే చెయ్యికాలి అవస్థపడితే మరి నాకు జరిగినదాన్నిగూర్చి నవ్వాలని అనిపించదుగా మీకు?" అని నవ్వుతూ అన్నాడు శాస్త్రి.

# కానరాకుండిరకట యీకాలమందు

శేషాద్రి రమణకవులు

వినువారిగుండియల్ప్రీల లక్ష్మణమూర్ఛ భావబంధురముగాఁ బాడువారు
అంపకంబులనుఱాలైన నీరగునట్లు నప్పగింతల నప్ప జెప్పువారు
వరుసపాటలచేత వావివారలనెల్ల వేయివిధాల నవ్వించువారు
అధ్యాత్మరామాయణాదికంబు ముఖస్థ మొనరించి యింపుగాఁ జదువువారు

కావ్యసారార్థసంగ్రహాంకంబులైన
మధురగీతాదికంబుల మాతృభాష
నెలమిమైగూర్చితగఁ బఠియించువారు
కానరాకుండిరకట యీకాలమందు॥

# స్త్రీలు: సాహిత్యజ్ఞానము

సామవేదం జానకిరామశర్మగారు

మనుజుఁడొకానొక సాంఘికమగు ప్రాణి. సంఘమునకు సాహిత్యము ప్రాణము. ఏజాతియొక్కగాని, సంఘముయొక్కగాని నీచోన్నతులు చాలవరకు దాని సాహిత్యముపై నాధారపడియున్నవి. ఏజాతియందు లేక ఏసంఘమునందు సాహిత్యాభావమున్నదో అది నిర్జీవమును, నిస్సారమునని సందేహరహితముగ చెప్ప వచ్చును. సాహిత్యశబ్దార్థము మిక్కిలి విశదమైనది. భిన్నములగు సాహిత్యజ్ఞానముగల పండితులు వేరువేరర్థ ములతో "సాహిత్య" శబ్దమునకు వ్యాఖ్యనుచేసియున్నారు. సాధారణముగ "సహితస్య భావః సాహిత్యమ్" అనగా దేనియందు సహితమగుభావమున్నదో దానినే సాహిత్యమని చెప్పుచున్నారు.

కావ్యతీర్థ పండిత రామదహీన్ మిశ్ర యను విద్వద్వరులు "సాహిత్యమీమాంస" యను తమగ్రంథ మున సాహిత్యశబ్దమున కీవిధముగ విలక్షణార్థము చెప్పియున్నారు. "హితముతోవర్తించునది సహితమన బడుచున్నది. దానిభావమే సాహిత్యము. అనగా మనకు హితము (మేలు) చేయునదే సాహిత్యమనబడు చున్నది."

సాహిత్యశబ్దార్థ మేదైనగానిండు. సాహిత్యము మనుజున కత్యంతావశ్యకమగు అంగములలో నొకటి యనునదిమాత్రము నిర్వివాదాంశము. నీతినిష్ణాతుఁడగు భర్తృహరి తన నీతిశతకమున సాహిత్యావశ్యకత నీక్రింది శ్లోకమున వ్యక్తపరచెను.

"సాహిత్యసంగీతకళావిహీనః
సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః
తృణం నఖాదన్నపిజీవమాన
స్తద్భాగధేయం పరమం పశూనామ్."

వీరిమతమున సాహిత్యహీనుఁడగు మనుజుఁడు వాలమును, శృంగమునులేని పశుసమానుఁడు. స్త్రీ పురుషు లను భేదముచే మానవజాతి రెండువిధములు. మనము జాగ్రతగ పరిశీలించినచో పురుషుఁడు శిరమును స్త్రీ హృదయమునని తెలిసికొనగలము. మానవశరీర మనుయంత్రమున కీరెండును ముఖ్యసాధనములు. వీటియాధా రముననే శరీరయంత్రము పనిచేయుచున్నది. శిరమును (పురుషుఁడు), హృదయమును (స్త్రీ) అభిన్నమగు సంబంధము కలిగియున్నవి. అధికారనియతిమాత్రము భిన్నముగనున్నది.

నిశ్చయసుఖము ననుభవించుటయే మనుష్యజాతి చరమాశయము. సాహిత్యమువలన అంతరంగమున కానందరూపమగు సుఖము కలుగగలదు. సాహిత్యము మానవహృద్వికాసమునకు దోడ్పడును. పురుషుల సంతసము స్త్రీహస్తగతమని చెప్పినచో సాహిత్యమర్మజ్ఞులు కినియకుందురుగాత! స్త్రీ సాంసారికసుఖమును మాత్రమే కలుగజేయగలదని తలచువారు కేవలము భ్రమకులోనగుచున్నారు. స్త్రీ పురుషునకు సహచారియు

ఆంతరంగికమిత్రమునైయున్నది. సుఖమందును, ఆమోదప్రమోదములయందును ఆమె ఎట్లు ఆవశ్యకమో, దుఃఖమందామె మృదుమధురవాక్యములును, స్నేహార్ద్రస్వభావమును అట్లే యావశ్యకములు. స్త్రీపురుష జీవనము లొండొరులందు యొడతెగనిసంబంధము గలవి. సాహిత్యజ్ఞానముగల స్త్రీల సదాచారాదికములు రసపూర్ణములును, స్నేహార్ద్రములును నగుచున్నవి. ఇక స్త్రీలసాహిత్యజ్ఞానము పురుషుల కేవిధముగనుపయోగ పడునను అంశమునుగురించి విచారింతము.

వేదము మనుష్యులకొరకే సృష్టింపబడినది. వేదమునందు సాహిత్యోపదేశమునొసంగు అనేకమంత్ర ములు గలవు. వాటినుండి యుదాహరణార్థము:—

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసిజానజాలమ్
దేవాభాగంయథాపూర్వే సంజానానా ఉపాసనే"॥

దీనియందు శుద్ధభావములతో స్త్రీపురుషులకై సాహిత్యావశ్యకత విశదపర్చబడినది. ఇటులున్నను స్త్రీలను కేవలము గృహకార్యనిర్వహణమునందుంచుటవలన వారి యున్నతభావములును, ఉన్నతాదర్శము లును క్షీణించుచున్నవి. మరియు వారి మానసికశక్తి వంటయింటియగ్నితాపముచే నశించుచున్నది. సాహిత్య జ్ఞానము పొందినపిదప వారిమనము ఉన్నతభావములకు స్థానమయి రసపూర్ణమగును. కాన పైన వ్రాసినభావ ముల నలవర్చవలెనన్న స్త్రీలకు సాహిత్యజ్ఞాన మావశ్యకము.

సాహిత్యజ్ఞానాభివృద్ధికి కేవలము గ్రంథపఠనమే గాక తదంతస్థములగు భావములను పూర్తిగ మననము జేయవలెను. కవికి గ్రంథరచనమందెంత సామర్థ్యముండవలెనో, దానిని సమగ్రముగ యర్థముజేసుకొను టకు పాఠకుడుగూడ తగుసామర్థ్యము గలిగియుండవలెను. ఇటులగానిచో గ్రంథమునకు విలువయుండదు. కవి సాహిత్యోపాసకుడును, పాఠకుడు సాహిత్యసేవకుడును గావలెను.

స్త్రీజీవనము కేవలము గృహకార్యమందే సమాప్తినొందరాదు. సంఘము స్థిరరూపమును దాల్చవలె ననినను, పవిత్రాశయములతో వృద్ధిబొందవలెనన్నను స్త్రీలకు సాహిత్యజ్ఞాన మావశ్యకము. నేడు గ్రామ మందలి స్త్రీలకును, పట్టణమందలి స్త్రీలకును విశేషవ్యత్యాసము గాననగును. గ్రామములయందలి స్త్రీజీవనము సాహిత్యాభావముచే నీరసముగనున్నది. గ్రామ్యనాగరకజీవనములందలి స్త్రీత్వమొక్కటేయైనను, పట్టణ మందలి స్త్రీ జనము సాహిత్యసలిలావగాహనముచే సంస్కరింపబడినది. పల్లెలందలి స్త్రీలనుగాంచిన వారి సాహిత్యజ్ఞానావశ్యకత బోధపడగలదు.

సాహిత్యజ్ఞానముయొక్క పరాకాష్ఠ పుస్తకావలోకన మాత్రమేగాదని పైన చెప్పబడినది. సాహిత్య జ్ఞానోపయోగము జీవయాత్రయందడుగడుగునను వ్యక్తమగును. అందును పురుషునిజ్ఞానము కళంకరహితమగు పుస్తకజ్ఞానము. స్త్రీ సాహిత్యజ్ఞానమన్ననో వ్యవహారకౌశలమునకు పట్టుగొమ్మ. మరియు పురుషుడుచేయు కార్యములందు అసంతృప్తికనుగొనవచ్చును. కాని స్త్రీచేయు వ్యవహారములందుమాత్రము శాంతి, ధీరత, గంభీరత ప్రకటమగుచున్నది. స్త్రీకి శిశుపోషణము, వృద్ధసేవనము, పతివ్రతాధర్మాచరణము మొదలగు యుత్తమకర్మలందభిరుచియు, నేర్పును సాహిత్యజ్ఞానమువలన అభివృద్ధి గాగలదు.

వర్తమానకాలమున హిందూస్త్రీల సాహిత్యజ్ఞానము మిగుల ఘృణార్హమును, కళంకితమునైయున్నది. దీనికి కారణము మనసాహిత్యముపైగల విదేశీయప్రభావమే. ఏవిధముగనైనను రెండుజాతులకు పరస్పరము సంబంధముగలిగిన రెంటియందును, ఆచారవ్యవహారములందును, భావములందును మెల్లగ పరివర్తనము గలుగు

చున్నది. పాశ్చాత్యప్రభావమున ఆర్యస్త్రీలు నేడు ఆర్యమతధర్మములనువీడి గృహజీవనమును, సంఘజీవనమును, సాహిత్యజ్ఞానమును సారరహితములుగ నొనర్చుచున్నారు.

ప్రాచీనకాలమందార్యస్త్రీలు స్వతంత్రమును గలిగియుండిరిగాని, యది ధర్మవిరుద్ధమెన్నడును గాలేదు. ఆర్యస్త్రీలపుడు విద్యావతులై సాహిత్యజ్ఞానమునుబడయుటయే దీనికి కారణము. నేడార్యస్త్రీలు ప్రాచీనధర్మముల ననుష్ఠింపవలెనన్న వారికి సాహిత్యజ్ఞాన మత్యావశ్యకము. సాహిత్యజ్ఞాన మలవరుచుకొనిన పిమ్మట వారు ప్రాచీనసంప్రదాయానుసారము సత్యమును, స్వతంత్రయుతమునునగు గృహజీవనమును గడుపగలరు. పురుషుల సాహిత్యజ్ఞానము గ్రంథరచనమందును, పఠనమందును సమాప్తమొందవచ్చునుగాని స్త్రీల సాహిత్యజ్ఞానముమాత్రము అపారమగు విశ్వసాహిత్యమునందు సమావిష్టమగును. సాహిత్యజ్ఞానముగల స్త్రీలోకమే ప్రపంచమున పురుషులకు శాంతి, మాధుర్యము, మార్దవమునగూర్చును.

ప్రభూ! మాసంఘమునకు పూర్ణవికాసమునిచ్చు సాహిత్యజ్ఞానమును ప్రసాదించి దానిని స్వతంత్రముగను, నిష్కళంకముగను, ప్రేమయుతముగను జేయుము.

—శ్రీమతి సుమిత్రాదేవిగారి హిందీవ్యాసమున కనువాదము.

# పసుపుపిట్ట

శ్రీమతి కొరదోలు వేంకటరంగమ్మగారు

చూతప్రసూనమంజరుల జూడఁగవచ్చి తదీయసౌరభో
పేతసమీరసఖ్యమున బ్రీతివహించి వసంతమల్లికా
వ్రాతసుగంధగంధవహు వత్సలతంగని గ్రీష్మవేళలన్
జాతురి ప్రౌఢగీతములఁ జెప్పగనొప్పు హారీతశారికల్.

కోకిలసుస్వరంబు మధుకూజితమంచు జనంబువేరుగా
గాకని దూరుచుండుదురుగాక నిజంబుగ రెంటిమీరున
ప్రాకృతమాధురీగరిమబర్వెడు నీకలగీతికారతిం
జేకొన కర్ణపర్వమగుఁ జెప్పెడిదేమి? విహంగపుంగవా!

సలలిత మాఘమాసమున చయ్యన మాదెసకేగుదెంచి నీ
లలితకళావిమర్శన విలాసముగా బ్రకటించి శ్రావణం
బిలకరుదెంచునంచు మదిభీతిలి నీ స్వజనంబుతోడ నే
నెలవున కేగుదెంచెదవు? నేర్పరివౌదు హారీతశారికా!

ఉత్తరాయణపుణ్యమహోత్సవములు
నెఱపి వర్షాగమంబున నెలవులేక
యెచట నుత్తరాయణముండు నచటికేగు
పసుపుపచ్చని శారికాప్రతతి యెపుడు.

# ఆ శ్చ ర్యం

## శ్రీ మ తి ల లి త కు మా రి గా రు

సౌందర్యపిపాసియగు నాతఁడొనరించు సత్కార్యమేదియు లేదని పలుగురు సను చుండిరి. అతఁడు ప్రకృతికొరకే జీవించుచుండెను. పాప మతఁడు నిరర్థకజీవిగా పరిగణింపబడు చుండెను. అట్టివాఁడు స్వర్గసుఖములు చూరగొనునని యెవఁడెంచును.

స్వర్గదూత ప్రమాదవశంబున వానిని స్వర్గలోకంబునకు తీసికొనిపోయెను. స్వర్గము అనిర్వాచ్యసౌఖ్యాకరంబెయయ్యు నిరంతరనిస్స్వార్థజీవనమయమై సకాల్యకరణీయబద్ధమై పరిశుద్ధమైన ఉదాత్తసంకల్పరంజితమైయుండును. అతనికదియంతయు నక్కరలేదు. వాని దృష్టులే వానికి జీవితసుఖదంబులగు సౌందర్యవస్తుప్రదర్శన మొనర్చుచుండెను.

విలాసముగా దుస్తులధరించి భూలోకమునకన్న సౌఖ్యమయజీవనము నాతఁడు చేయు చుండెను. స్వర్గవాసు లీనిరర్థకజీవి యెవఁడు ?'.........అని ప్రశ్నించుకొనుచుండిరి.

వీణాతీవలపై జరజరనడచు వ్రేళులవలె నడుగులవైచుచు త్వరితగమనమున నాసౌందర్యవతి సరఃప్రాంతమునకుపోయి నీళ్లుతెచ్చుచుండెను. అతటంబుననే యాతఁడు పిపాసాతురితుఁడై కూరుచుండుటనైన ఆమె యెఱుంగదు. జుత్తునైన సరిగాముడివేసుకొనుట కామెకు తీరుబాటులేదు. స్వర్గజీవన మట్టిది.

ఎట్టకేలకామెతో మాటలాడుట కాతఁడు సంకల్పించుకొనెను.

"నీకుండ నొకపరియిచ్చెదవా ?"

"ఏల? " అని నీళ్లుముంచుకొనుచు నామె ప్రశ్నించెను.

"రంగులవేయుటకు"

ఆమె త్వరితగమనయై వెడలిపోయెను. ప్రతిదినము నాతడడుగుట జరుగుచుండెను. ఎట్టకేల కామెసమ్మతించి భాండము వానికందించెను. ఎన్నియోచిత్రము లందుపై లిఖించి యత డామెకొసంగెను. ఆమె గృహమునకు వెడలెను.

నాటిరాత్రి నిద్దురరాని యామె దీపసముఖమునగూర్చొని, యాచిత్రముల నుప లక్షింపుచుండెను. కాని వాని యర్థమేమియు నామెకు గోచరింపలేదు. మరునాఁడు యథా ప్రకార మామె సరస్సునకేగెను. ఆవిచిత్రభాండముజూచి నల్వురు నాశ్చర్యపడిరి. అతఁడును ఆతటంబుననేయుండెను.

"నీజుత్తులో అల్లుకొనుటకు పారిజాతప్రసవమాలిక నల్లుట కనుజ్ఞనిమ్ము."

"అదియత్యంతావసరమా."

"కా......దు."

అతడు ప్రసవమాలిక గూర్చెను. ప్రతిదినము జత్తునల్లుకొనుట యామె కొకపని. కోకిలకంఠస్వరములవలె కొనసాగు స్వర్గపువనులలో నవస్వరములువినబడినవి. పెద్దలందరు సభచేసి దీనికి మూలకారకుడగు నాతనిపిలిచి "ప్రమాదవశమున నీవిటకువచ్చితివి. నీవు మరల భూలోకమునకేగవలయును."

"ఆలాగే!" అని యాతడులేచెను.

"నేనుకూడనూ!" అని యామె వానివెన్కనే పోయెను.

స్వర్గమంతయు నాశ్చర్యభరితమయ్యెను.

# నీవెవండవో?

## తుమ్మలపల్లి వేంకటరత్నముగారు

నేనొకనాడు నాదుజననీకరడోలికయందుఁ దూఁగుచు
న్నానటువంటి నాదు నయనాల కొకొక్కముహూర్తమాత్ర మ
మ్మానిని నేత్రగోళములమధ్య వెలింగెడి జ్యోతులందు నీ
లేనగుమోము గన్పడె బలే! వివరింపుము నీవెవండవో?
మెఱుఁగుల తోఁటలోన పసమించెడు మేఘరథంబుపైని యం
బరమున వాయువేగమున బైనమొనర్చెడు నీచరాచర
స్ఫురితజగత్ప్రబోధకవిశుద్ధగళధ్వనితోడ నన్ను హె
చ్చరిక యొనర్చుచుఁ మొగముచా టొనరించిన నీవెవండవో?
తళతళలాడి పోయితివి తళ్కుమెఱుంగుమఱుంగులోపలన్
మిలమిలలాడి పోయితివి మింటమినుక్కను చుక్కలోపలన్
పలపలలాడి పోయితివి పర్వపువెన్నెలతేఁటలోపలన్
కిలకిలలాడి పోయితి శుకీధ్వనిలోపల నీవెవండవో?
తుమ్మెద పాటలో నెమలి తొయ్యలి యాడెడుబోగమాటలో
కమ్మనిపాలపాపలమొగమ్ముల బర్వెడితేనెతేఁటలో
సొమ్ములమూటలో రుచులచొప్పులనేర్పెడిపూలతోఁటలో
గమ్మనిపించునట్టి లయకాఁడవురా! భళి! నీవెవండవో?
ఎక్కడ నీదురాగమె మఱెక్కడజూచిన నీదుభావమే
ఎక్కడ నీదుశక్తియె మఱెక్కడజూచిన నీదువ్యక్తియే
పెక్కులిఁకేల? సృష్టికి పిపీలికయాదిగ బ్రహ్మదాక నీ
వొక్కఁడవే గనంబడుచునుంటివి చెప్పుము నీవెవండవో?

# విడాకుల చట్టము

## 27

### శ్రీమతి పాటిబండ వేంకట అలమేలుమంగ తాయారు గారు

భారతనారి యర్ధాంగి, అనుయాయి. వివాహకాలమున నామెను తండ్రి "తవదాస్యామి దత్తా స్నేహేన పాలయ" యని వరునిచేతులలో పెట్టాడు. బాష్పబిందువులతో పాదప్రక్షాళనచేస్తూ "నాతిచరామి" అంటూ వరుడు స్వీకరించాడు. భవసాగరతరణమునకు ఒకరికొకరు భగవద్దత్తమగు కేలూతగాతలచుకొని ఆనందించుకున్నారు. "ఇది నీయర్ధాంగి, ఇతడు నీ యైహికదైవము" అనివారిని శాసించాయి శాస్త్రాలు. స్త్రీపురుషులు కలిస్తేనేగాని వ్యక్తిత్వానికి పూర్ణత్వంలేదు. పాంచభౌతికము ప్రపంచము. అందొకభూత మున్మత్తమై చెలంగినచో ప్రపంచమునకు కొంతసృష్టి. పంచభూతము లొక్కుమ్మడి విజృంభించినచో ప్రపంచము పటాపంచలగును. సృష్టి నిర్దిష్టపథమునుండి భ్రష్టమైపోవును. స్వేచ్ఛానుభూతి ఒక్క పురుషునకేగల్గియున్నప్పుడే ఇట్లుండనిక స్త్రీకి గూడగల్గినచో, ప్రకృతి ప్రపంచము భగ్నముగావలసినదే. అందునను స్త్రీబుద్ధి ప్రళయాంతకము గూడను. హిందూమతమునందైహికమునకు ప్రాముఖ్యములేదు. హైందవాదర్శమంతయు నాముష్మికమే. జగత్తు క్షణికమనియు, శరీరము నశ్వరమనియు, ప్రాపంచికసౌఖ్యములు మిథ్యామాత్రములనియు హైందవమతము. ఆముష్మికసాధనమున నైహికసుఖ మెందులకు? ఆత్మ యెట్టులును స్వతంత్రమే. కర్మయికమగు జగత్తును, నశ్వరమగు దేహమును మోక్షసాధన కుపకరణములుగాని, యైహికదైహికసౌఖ్యము లనుభవించుటకుగాదు. భర్త యైహికదైవముగాన భర్తృసమారాధనము ముక్తిదాయకము. మాయాంధభూతమగు మానవప్రపంచమున భార్యాభర్తలకు పాతివ్రత్యమేకపత్నీవ్రతములు మోక్షసాధనోపకరణములుగా శాస్త్రనిర్దిష్టములు. పురుషుడు ధర్మకర్మభ్రష్టుడైన నగుగాక స్త్రీ కావలసిన యగత్యమేది? "సహధర్మచారిణియు, నర్ధాంగియునగు పత్ని పతిపతనమున భాగస్వామిగావలదా?" యని మూర్ఖప్రశ్న రావచ్చును. ధర్మము మోక్షసాధకము. దుష్టమగునదేదియు ధర్మముగాదు. అట్టి దౌష్ట్యములందు భార్య పంచుకొననక్కరలేదు. స్త్రీ యర్ధాంగియని యొప్పుకొన్నచో భర్తనుండి భిన్నమగునగత్యముగాని యవకాశముగాని లేదు. ఏనాడు స్త్రీ పురుషునిహృదయమునకు హృదయమును హత్తించినదో యానాడే యామె యాతనిదైపోయినది. ఒకప్పు డొకనియుచ్ఛిష్టము నారగించి నేడు మఱియొకని యుచ్ఛిష్టము నాశించి, పరవశమైన తనతనువును మరియొకని కర్గ్యమొనర్చుట మానవతియగుమగువకు లజ్జాకరముగాదా? ఎంత జుగుప్సాకరమైనను పతియుచ్ఛిష్టము పత్నికి భోజ్యము. నేడొకనియుచ్ఛిష్టము రేపొకనియుచ్ఛిష్టమునగుచో వెలకాంతకన్న కులకాంత ఘనతయేమున్నది? అగ్నిసాక్షిగ నెప్పుడొకనిని వివాహమాడినదో అప్పుడే ప్రపంచములోని ప్రతిమగవాడును "పరపురుషు" డైపోవునుగదా? పరపురుషుని కన్నెత్తియైన జూడరాని, చూడని భారతవనిత పరపురుషుని పరిరంభణముల కాశించుటయా? ఎంత యధఃపతనము. నేడొకనిని నాథాయని పిలిచి రేపు మరియొకనినా? ఎంతదురవస్థ? భర్తృపరిత్యాజనకాలమునకు సంతతియున్న నాసంతానము నేమి చేయుదురు? ఆడుపిల్లలను పత్నియు, మగపిల్లలను పతియు, నపుంసకసంతానమున్నచో చెరిసగమును బంచి కొందురుగాబోలు? కొందరు మాతృవియోగమునను, కొందరు పితృవియోగమునను కృశించి చివరకందఱు చత్తురుగాబోలు. మిగిలినపీనుగలు క్రొత్తకుంకను "నాన్నా" యనుట నేర్చుకోవాలిగాబోలు. పాపము, కోరికోరి తెచ్చికొన్నందులకు తాముచచ్చుచావుగాక నోరువాయిలేని యాకూనలనుగూడా చంప సిద్ధపడినారే! ఏమి యీదుండగము? అవివాహితయగునాడుదియనాఘ్రాతమగు పుష్పమువంటిదట. ఒకపుష్పమును పలువురు వాసనజూచుట యారోగ్యమునకు భంగము. వివాహానంత

రము స్త్రీ తన నిర్దుష్టతత్వమును పురుషుని నిర్దుష్టతత్వములో నైక్యమొనరించుకొనును. పిదప ఒకనితత్వమున కలపడి దానిలక్షణముల గలిగించుకొన్న తన తత్వమును మరియొకదానితో గలుపుట దుర్లభము. కలయికయరుదు. తత్వము భేదించినచో విషమించును. విషమించుట తరుచు. పురుషుడు బహు స్త్రీసమాసక్తుడగుచో భిన్నతత్వ సంగమమువలననుత్పన్నములైనవేయి సుఖరోగములు. తత్వము విషమించుట యారోగ్యమునకు భంగము. ఆరోగ్యములేక సౌభాగ్య మెక్కడిది? తత్వము భేదించినచో సంతు శూన్యము. నష్టములు శతమానములు. బుద్ధిలోపముచే పురుషుడు తెచ్చివైచిన రోగములకుదోడు స్త్రీగూడ కొన్నిటిని తేగా లోకమంతయు రోగమయమై నాశనమగును గాబోలు. విడాకులచట్టము ననుసరించుటయనగా బహిరంగవ్యభిచారము సాగించుటయని యర్థమేగదా! ముఖ్యముగ నీచట్టము గోరుటలో హిందువులకుండవలసిన పారమార్థికచింత యావంతయులేదు. ఐహికచింతయున్నను యనర్థము లనంతములు. పవిత్రయగు భారతకాంత కిట్టి యపవిత్రవాంఛ లుద్భవించుట ప్రపంచమునకు శుభముగాదు. భారతపురుషులందరు పరమార్థసాధకమగు మహాకార్యమునకు గడంగు నీతరుణమున భారతస్త్రీ యిట్టి యనర్థవాంఛాసక్తయగుట యెంతయు నశుభము. అమంగళము నాశనమగుగాక!

## 28

### శ్రీమతి పెదమల్లు రామానుజమ్మగారు

భారతదేశము పాతివ్రత్యమునకు ప్రసిద్ధికెక్కియున్నది. ఒక్కొకపురుషుడుమాత్రము స్త్రీవల్ల ప్రశంస నీయుడు కాగలడు. అది స్త్రీయొక్క మహిమవల్లననే. స్త్రీయనునామె శక్తిస్వరూపిణి. శక్తియొక్క అపరావతారమే. ప్రపంచమున ఏచెడుజరిగినను, మంచిజరిగినను స్త్రీయొక్క పాతివ్రత్యమహిమవలననే. పాతివ్రత్యమునకు ఆశ్రయము పతియగు పురుషుడు. అట్టిఆపురుషుని ఆశ్రయము మాటిమాటికి మార్చుట నీతిపథముగాదు. కాబట్టి భారతసోదరీమణులు ఇటువంటి ఆశ్చర్యకరమైనటువంటివి, తమ ఔన్నత్యమునకు భంగకరమైనటువంటివి చట్టమునకు తావీయకుండవలయునని నా అభిప్రాయము.

## 29

### శ్రీమతి వాసరి వెంకటసుబ్బమ్మగారు

ఏమి ఈకాలమహిమ? పరమపవిత్రమైన ఈ ఆర్యావర్తనమున కెట్టి విషమావస్థలు సంఘటిల్లుచున్నవి? ఎన్నడు కనివినిఎరుంగని ఈ విడాకులచట్టము ఏపాశ్చాత్యవ్యామోహితులవలననో అంగీకరింపబడినంతమాత్రమున పతివ్రతామతల్లులని ప్రపంచమెల్లెడలను వాసికెక్కిన భారతమహిళలా దీని నంగీకరించుట? ఏకొద్దిమందియోతప్ప భారతదేశీయు లెవరును దీని నామోదింపరు. వివాహసమయమందు అగ్నిసాక్షిగ వేదోక్తుల ప్రకారము దేవునిముందర, పురోహితులయెదుట, వివాహవీక్షణార్థమేతెంచిన పెద్దమనుష్యుల యెదుట నొకరికరము నొకరు గ్రహించుచూ చేసిన ప్రమాణములనూ, ధర్మప్రేమపాశబంధమ్ములను ఒక్కపెట్టున ద్రెంచుకొని యేదోయొక లోపమున ఆగ్రహావేశులై కన్నుమిన్నెరుంగక యావజ్జీవనము ఒకరికొకరు సంబంధములేకుండ విడిపోవలసినదేనా? అంతతో తృప్తిచెందక మరల వివాహము చేసికొనెదరట. వీరికి పిల్లలుండిరా వారు ఎవరికడనుండెదరు? తల్లిదరినుండిరా మారుతండ్రి వీరియెడల ప్రేమగలిగియుండునా? స్త్రీ ఏలకలిగియుండును? అతనిపిల్లలయినగదా ప్రేమగల్గుటకు. ఇంటియధికారియగువానికే ప్రేమలేకున్న వీరిజీవితమెట్లుగడచును? తండ్రిదగ్గరనుండిరా సవతితల్లి ఏవిషయములోనైన వీరిపై కోపముగ్గలైనా వీరినిదుఃఖింప

చేయగలదు. పాపము ఇక ఈపసినిసుంగులగతి ఏమి కావలయును? వలదు, వలదు. దీనదయాళూ ఈపసికూనలకు కష్టముల తెచ్చిపెట్టకుము. ఆహా! ఏమి ఈవిడాకులచట్టముయొక్క మహాత్మ్యము! ఈచట్టమువలన భారతమాత పవిత్రత మంటగలుపుటయు, పసినిసుంగులను కష్టములపాలుచేయుటయు, ఇంకను అనేకములైన కుమార్గములకు దారితీయుటయుతప్ప ఎంతమాత్రము లాభకారిగాజాలదని చెప్పవచ్చును. భార్యలోదోషమున్న భర్తసహించి భర్తలోదోషమున్న భార్యసహించి అన్యోన్యానురాగులైయుండుట యొప్పుగాని యొకరిదోషములొకరు నిరూపించుకొనుచు కోర్టులకెక్కుట భావ్యమా? సీత, సావిత్రి, లోపాముద్ర, దమయంతి మొదలగుసతీతిలకంబులఁగన్న ఈ భరతభూమి యెంతయు పూజ్యురాలు. ఇట్టి పూజ్యనీయదేశమున ఈచట్టము నమలులో బెట్టవలెననుట కడుంగడు హైన్యమని భావించుచున్నాను. ఈచట్టమునుగురించి వినుటకు మా భారతసోదరీమణులెంత విచారించుచున్నారోగదా?

## 30

## శ్రీమతి కాటంరెడ్డి శేషమ్మగారు

విడాకులవల్లఁగలుగు కష్టములు పెక్కులువున్నవి. వాటినైనను పాటించక అనర్థదాయకమగు విడాకులు అమలులోకి తేజూచుటవలన భారతమాతకును మనసోదరీమణులకును తలవంపులు ఘటిల్లుననుటకు యేలాటిసందియము లేదు. పెక్కుదేశములందును అగ్రస్థానమువహించి పేరుప్రతిష్టలందు వన్నెకెక్కిన మనజన్మభూమిని ఇపుడిటువంటి చట్టము అమలులోకి తెచ్చుట మనసాధ్వీమణుల కెంతయు లజ్జాకరముకాదా? కోట్లకొలది పతివ్రతామణులచేత ప్రసిద్ధమైన మన భరతభూమియందు ఋషీశ్వరులు జేసిన యేర్పాటులన్నియు యేటగలిపి అర్థసూక్తులుగా వారువ్రాసిన శాస్త్రములయందు నమ్మికకోలుపోయి పాశ్చాత్యపద్ధతులయందు అభిరుచి జనించుటచేత నేకదా మనదేశము యిట్టి నీచస్థితికి పాల్పడవలసివచ్చినది? అగ్నిసాక్షిగను, పూజనీయులగు పెద్దల సన్నిధియందును వివాహమాడినభార్యను భర్తయున్నూ, భర్తను భార్యయున్నూ అన్యోన్యప్రేమబంధముల ద్రెంచి పాశ్చాత్యపద్ధతుల అవలంబించుట భారతభూమినిజన్మించిన సోదర సోదరీమణులకు నీతిగాదోపదు. స్త్రీ తనయొక్క జీవితమున మనసార ఒకపురుషుని ప్రేమించి ఆపురుషునితో సర్వసుఖములయందు పాల్గొని దైవసాక్షిగా వైవాహికమునిర్వర్తించిన భర్తయొక్క ధర్మస్వరూపిణియై, అర్ధాంగిని అనిపించుకొని యెడతెగని ప్రేమతో స్వర్గతుల్యముగా సంసారముగడపుసమయములో కొన్నికష్టములు కలుగవచ్చును. అట్టికష్టములలో స్త్రీలు శాంతముగావర్తించవలయును. యెటువంటి ప్రేమసంబంధములకున్నూ ఒక్కొకసమయములందు మనస్సులు మార్పులుకలుగును. ఈమార్పులకు అనేక కారణములుండును. ప్రకృతిమార్పువల్లను, ననుభవించెడు పదార్థములవల్లను, స్త్రీలయొక్క పూర్వజన్మదుష్ఫలితమువల్లను మనస్సులు మారవచ్చును. అట్టిసమయములందు తొందరపడి విడాకుల నిచ్చుకొనుచెడల స్త్రీలు యెన్నికష్టములైనను అనుభవించుటకు సిద్ధముగా వుండవలసివచ్చును. కాబట్టి స్త్రీలు తమభర్తలయెడల అసూయలేక సద్బుద్ధితో మెలగుటవలన పురుషులు యెంతదుర్మార్గులైనను వారినితిరిగి మంచిత్రోవను నడిపించి వారితో సర్వసుఖములు బడయుటకున్ను అర్హులగుదురు. భర్త దుర్మార్గుడనియు, కురూపియనియు, తన్ను ఎల్లప్పుడు బాధించుననియు, పాశ్చాత్యనాగరికతలు అనుభవించుటకు వీలులేదనియు యిట్టిభర్తతో వుండుట హేయమని న్యాయవిరుద్ధమైనభర్తలతో కాపురముచేయుటకు కుల స్త్రీలకు మనస్సు యెట్లొప్పును? ఈలాటికష్టములు ఎన్నిఅయినను నిర్వహించుటకు స్త్రీలకు ధర్మముగాని పలువురపురుషులకు చోటిచ్చుటకు మనస్త్రీలహృదయమున తావులేదు. విడాకులవల్ల మనము కన్నశిశువులకు మనమే మారకులమయ్యెదము. ఇంతవరకు విడాకులచట్టము లేకున్నను తల్లులు

గతించిన వెనుక తండ్రులు మరొకవివాహము చేసుకొన్నప్పుడు సవతితల్లులవల్ల వారిశిశువులు యెట్టికష్టములు అనుభవించేదిన్ని లోకవిదితమయివున్నదిగదా. విడాకులవల్ల సవతితల్లులుగాకి సవతితండ్రులుకూడా పెక్కుమంది అయ్యెదరు. అపుడు వారిగతి యేమికావలెనో విచారించనవసరములేదా? వారు వుండుటకు తావు ఏది? వారియొక్క కష్టమును తీర్చెడివారెవరు?

## 31

## శ్రీమతి కోమండూరి శేషమ్మగారు

సీత, అనసూయ, లోపాముద్ర మొదలయిన పతివ్రతలుద్భవించిన ఈ ఆర్యావర్తమున వేశ్యకులమునే రూపుమాపవలెనని పెక్కుమంది మహాపురుషులు తీవ్రప్రచారము చేయుచుండగా విడాకులచట్టమును అమలులోనికి తెచ్చినయెడల భరతఖండములోని స్త్రీలలో చాలమంది వేశ్యాధర్మమునవలంబించి గాక మరిఏమి అగుదురు? అట్టియెడ శిశుహత్య, ప్రజాక్షయము, సతీపతులకు కలహములు, బెదరింపులు ఎక్కువయగును. భార్యాభర్తలిరువురు ఒకరిని ఒకరు విడిచి లేచిపోయెడివారె అవుటచేత వారికి పుట్టినబిడ్డలు దిక్కులేక వీథుల దిరిగెను వెంటయెత్తుకొనుటకుకూడా పనికిరాకపోవుట మనకండ్లతోనే చూడవలసివచ్చును. విదేశములలో విడాకులచట్టమువలన అక్కడినారీమణులు పడెడిపాట్లు మన కండ్లారచూచుచు, వినుచు, అంత క్రూరమయిన చట్టము మాకును కావలయునని కోరుట చాలా శోచనీయముగావున్నది.

## 32

## శ్రీమతి వీరపనేని సుశీలదేవిగారు

విడాకులచట్టమను పేరు కర్ణరంధ్రములకు సోకగానే శరీరము జలదరించుచున్నది. ఈచట్టము మన భారతదేశమునకునూ, పూర్వచరిత్రలకునూ విరుద్ధమైనది. ఈచట్టము దేనికి ఉపయోగించును? లాభమేమి? నష్టమేమి? అనుప్రశ్నలు ప్రతివారికి స్ఫురించును. మోహము చంచలము. ప్రేమ అచంచలము. ఒకస్థలమందు ఒకవుస్తువుండిన ఆస్థలములోనే రెండు వస్తువులెట్లిమడవో యట్లే ఒకరియందు ప్రేమయుండిన మరియొకరి మీదకు ఆప్రేమ చలించదు. అట్లు చలించినదానినే మోహమందురు. ప్రేమయనగా తనజీవితమంతయు తన మొదటిభర్తయందే నిలిపియుంచుట! ఈచట్టము ప్రేమయున్నవారి కెంతమాత్ర ముపయోగకారిగాదు. మోహమున్నవారి కుపయోగించునుగాని శరీరారోగ్యము చెడును. పాపముఫలించును. తుచ్ఛభోగము లభించును. ఈలోకముతో త్వరలో శలవుదీసికొనగల్గుదురు. దిక్కులేక దిమ్మరియైపోవచ్చును. తుదకు విరాగినియైపోవును. ఈ తుచ్ఛభోగములకై యెందరినో అనారోగ్యవంతులను జేయుచూ "పోషింపనిచో పుట్టింపకు" అనుమాట వ్యర్థము జేయుచూ ఇహపరములకు దూరమగుటయే దీనికి ఫలమనువూహ పొడసూపుచున్నది. ప్రతిమానవశరీరమునకునూ సంభోగాదియిచ్ఛలయందు ఒక్కరియందే తనప్రేమను నిల్పుట విధికృత్యమైయున్నది. అట్లు కానిచో ఎవరినిజూచిన వారియందే ఆమెమనస్సు చంచల మగుండును. ఆమెకీలోకములో ప్రేమయనునది



వీరపనేని సుశీలాదేవిగారు

లేదు. స్థిరత్వమనునది లేదు. మనము విద్యావతులమైనందుకు మోహమనే రాక్షసిని పారద్రోలలేమా? దానిని అణచలేమా? మనపూర్వులు మహాపతివ్రత లెట్లయిరి? ఈవిడాకులుపయోగించు స్త్రీలుకూడ పతివ్రతలేనా? వారికి మోక్షపదమున్నదా? విదేశములందొక స్త్రీ యిప్పటికి అరువదిమందికి విడాకులిచ్చినదని పత్రికలో జూచితిని. ఆమె యింకెంతమందిని హస్తమునందు వైచుకొనునో? ఇదియే చట్టమహిమ. పూర్వము రావణుండు అనేక వేలమంది స్త్రీలను వివాహమాడెను. రావణుండే స్త్రీయందు స్థిరత్వముజూపెను? ఏ స్త్రీ యందును జూపలేదు. దానిలో సౌఖ్యమున్నదా? మనమేల జన్మించితిమి? విద్యనభ్యసించి, ప్రజ్ఞావతులమై, గృహిణులమై, గృహకృత్యములను సంసారసంబంధమయిన పనులనెరవేర్చుచూ, సద్గ్రంథముల పఠించుచూ, భర్తతో సుఖమనుభవించుచూ, బీదలయందు కరుణగలిగి, దానధర్మములజేయుచూ పెద్దలయెడ సవినయముగా ప్రవర్తించి వారిప్రవోక్తులను ఆచరించుచూ, రాజయోగముతో జీవితము గడుపవలెను. భోగలాలసులమై, అనాచారులమై అనారోగ్యవంతులమై డాంబికవృత్తియందు మెలంగి ఎన్నియో నీచముల కొడంబడి హత్యలుకల్పించి, తనబిడ్డలను దూరముజేయుచూ, దుష్కృత్యములపాలొనరించునట్టి హీనమగుకార్యము మరొండులేదు. శారదాచట్టము మనకువచ్చినది. అది స్త్రీలను విద్యావిజ్ఞానములందుంచి, స్త్రీపురుషులకు అన్యోన్యప్రేమానురాగములను వృద్ధిజేయుచూ, సత్సంతానమునూ, ఆరోగ్యాభివృద్ధినీ పెంపొందించగలదు. కావున పాశ్చాత్యుల ఆచారమగు యీవిడాకులచట్టమును భారతశాసనసభయందును, తదితరసభల యందునూ ఆమోదింపజేసి, భారతనారీమణుల గొంతుకలు నులుమకుందురుగాకయని సోదరీమణులను ప్రార్థింపుచున్నదానను.

## 33

### ఒక సోదరి

భారతభూమి పతివ్రతామతల్లుల కాలవాలమై చెలగుచున్నది. అట్టి భారతావనియందుద్భవించిన భారతనారీమణులు విడాకులచట్టమను మాట కర్ణములలో సోకినంతనే ప్రకంపితలగుచున్నారు. మనము పాశ్చాత్యవ్యామోహమున బడి మన ధర్మముల వీడి పసుపు, కుంకుమ కాటుకలను దూరులమైతిమి; కాని పతులకుమాత్ర మింకనూ దూరులము కాలేదు. ఇక నట్టి కాలముగూడ రాబోవుచున్నదా? ఆహా! ఏమి కాలమహిమ? అగ్నిసాక్షిగ వివాహమాడిన పతితో జీవితాంతము వరకూ కష్టసుఖములనోర్చి అతనినే దైవముగ నెంచి సంసారమొనర్చిన నారీమణియే పతివ్రతగాని ఒకరిని వీడి పరులను పెండ్లాడిన నారి పతివ్రత యెట్లగును? పవిత్రపాతివ్రత్యమునకు కళంక మాపాదించు నీ చట్టమును కోరవలదని నా భగినీగణమును ప్రార్థించుచున్నదాన.

## 34

### శ్రీమతి మాదిరెడ్డి సీతామణిగారు

ప్రాచీనకాలమునుండియు మన వివాహములు పవిత్రంబులగు మంత్రములచే పూతుండగు నగ్నిహోత్రునిసాక్షిగా చేయబడుచున్నవి. పవిత్రుండగు ననలుని సాక్షిగానయిన వివాహబంధము విడగొట్టుకొనుటకు ఏ భారతనారియు నంగీకరింపదు. వివాహితలైనతోడనే భర్తతోడిదియ తమకుగతియని యెంచెడి హిందూ యువతి భర్తతోడి సంబంధము విడగొట్టుకొనుట కిచ్ఛగించునా? ఆమె యెన్నటికి నిచ్ఛగించదు.

భారతదేశపు స్త్రీలు స్వార్థత్యాగులనియు, పవిత్రహృదయులనియు ఖండఖండాంతరములయందు ఖ్యాతి గాంచియున్నారు; అట్టి భారత స్త్రీలు బుద్బుదప్రాయములగు తుచ్ఛసుఖముల కాసించి, అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్తను విడనాడి వేరొకనిఁ జెట్టబట్ట నంగీకరింపరు. నిష్కళంకప్రేమపరీతహృదయులగు భారతనారీమణుల కీవిడాకులచట్టము చాల మనస్తాపము గలిగించుచున్నది. పాశ్చాత్త్యవ్యామోహితలగు సోదరీమణు లీ చట్టమును పుణ్యభూమియగు నార్యావర్తమునఁ బ్రవేశపెట్టుట కడుంగడు శోచనీయము. భారతదేశమందలి ప్రతి స్త్రీయు నీ విడాకులచట్టమును గర్హింపవలయునని నా కోరిక.

## 35

### శ్రీమతి మగటపల్లి మీనాక్షమ్మగారు

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణములలో మొదట మూడుజాతులవారికి విడాకులచట్టము ఆచరణలో లేదు. కాని నాల్గవజాతియగు శూద్రజాతిలో కొన్ని అంతర్జాతులు గలవు. ఈ అంతరజాతులలో మారుమనువులున్నవి. అనగా సతికి పతిపైనసూయగలిగినచో వానిని విడనాడి వేరొకపురుషుని పెండ్లియాడ వచ్చును. ఈలాగున ఏడుమనువులవరకు స్త్రీకి హక్కుగల కొన్ని జాతులు మన హిందూదేశమున యున్నవి. ఇట్టి మనువులు, ఇట్టి విడాకులుగల జాతు లెంత సుఖించుచున్నవో మనము గమనించుచునే ఉన్నాము. కావుననే అగ్నిదేవునిసాక్షిగా, బ్రాహ్మణుల బంధువుల సన్నిధిని, శుభముహూర్తమున "నేను యీ యువతిని నేటినుండి నా భార్యగా స్వీకరించినాను" అని ఘోరప్రమాణములు చేసినట్టి వరుని భార్య విడనాడుట హేయమైన పని అని చెప్పవలసివచ్చుచున్నది. వివాహమయిన నిమిషము మొదలు వారి జన్మాంతరముల వరకు సంసారమను యీ మహాసముద్రమున భార్యాభర్త లిరువురు నావికులై, జీవయాత్రఅనుపడవను నడుపవలయును. పతికి సతి సేవచేయుటే విధి. వాని ఆజ్ఞానువర్తినియై వానికి సుశ్రూషలు సలుపుచు సంసారముచేయవలయు. అట్టి సతియె పతివ్రత అనంబగును. ఇట్లాచరించినచో ఇహమందును, పరమందును సౌఖ్యమబ్బును. కావున ఓ, సోదరీమణులారా! ఈ విడాకులచట్టము ఆచరణలోనికి దెచ్చి మన భరతమాతకు అపఖ్యాతి తేకుందురుగాకయని ప్రార్థించెదను.

## 36

### శ్రీమతి పి. రత్నమణిగారు

పదిమంది పోదలచు దారినే పదునొకండవవారును బోదలచుట లోకాచారమైయున్నది. కాని యక్కడక్కడ కుశాగ్రబుద్ధు లుండకపోవరు. వారు ఏటి కెదురీత నీదగలరు. కాలమను ఝంఝామారుతమున కెదురు నడవగలరు. వారే ప్రాపంచికసౌఖ్యనిర్మాతలు. అనంతసముద్రముదాటి యవతల భూమి కనుగొనిన కొలంబసును మొట్టమొదట వెఱ్ఱిముండ కొడుకనిరి; మరికొందఱు రాజద్రోహియనిరి. ఇంక కొందఱు బ్రతుకలేని యపస్మారియనిరి. కాని యా సముద్రరాజములనెల్ల తఱించి పుష్పఫలఖనిజసమృద్ధమైన యమెరికాఖండము నతడు కనుగొనివచ్చినంతనే పురజనులు గౌరవించిరి. రాజులు పీర్ బిరుదమునొసంగి యభినుతించిరి. అంతటివాడు ప్రపంచమున లేడనిరి. అటులనే మన హైందవకుటుంబములయందలి లెక్కలేని దోసగుల దాటిసుఖసమృద్ధమగు జీవితఖండమును గనుకొనుటకు నావ యీ విడాకులచట్టమని నేను నుడువ సాహసించినందులకు నాపై మీరు కినియకుందురు గాక! పతిసేవాపరాయణురాలై స్వయంవరమున

లక్ష్మీపతిని వరించి ఖండఖండాంతరముల యశమునుగన్న ఆచంటకులాబ్ధిచంద్రమ రుక్మిణీసతి ఏమనుచున్నదో కనుగొనుడు. "నారీమణులారా! ఈ విడాకులచట్టము శాసనమైనంతమాత్రమున భారతపాతివ్రత్యమను నావ మునిగిపోవదు. అందుగల దోసగులమాత్రమే తొలగించుట కీచట్ట ముద్దేశింపబడినది." మనలో వివాహము లనేకము లనాలోచితముగ జరుగుచున్నవి. పురుషుడు షండుడైనయెడల జీవితకాలమంతయు భార్య యుసూరుమనుచు నేడ్చుచు నూరకుండవలసినదేనా? ఏమి వింత? భార్య గొడ్రాలైనయెడల పురుషుడు రెండవ భార్యను కట్టుకొన సిద్ధపడుచున్నాడేమి? ఇంకొక సంగతి. ఎన్నియో జబ్బులను దాచిపెట్టి వివాహ మొనరింపుచున్నారు. భర్త కుష్ఠురోగియైనచో భార్య యిక వానిని విడువగూడదేమి? వానికి క్షయయుండినచో వానివలన దిక్కుమాలిన దౌర్భాగ్యసంతానమును గని తానేడ్చి వారి నేడ్పించవలసినదేనా? ఇట్టి పరమ దౌర్భాగ్యస్థితులయందు పతిని విసర్జించుట కీ విడియాకులచట్టమును నిర్మింప సమకట్ట దీనికింత గగ్గోలుపడుట యేల? ఆకాశము విరిగి నెత్తిమీదబడినట్లింతయార్భాట మేల? అంతియగాని ఈ చట్టము రోజునకొక మగనిని గట్టుకొని కులుకుటకుగాదు. విపరీతపరిస్థితులయందు భ్రమప్రమాదములచే అయోగ్యుపు వరుడు లభించినపుడుగాని; యోగ్యుడైన భర్తయే దుస్సహవాసముచే తాగుడు కలవాటుపడి తనపాలిటి మారణ దేవతయై తన యొంటి నగల నొలుచుకొన సంసిద్ధుడైనపుడు కాని యీ వజ్రాయుధము నుపయోగించుకొన వచ్చుననియే మన సోదరీమణు లీ విడియాకులచట్టమునకు చేయూతనొసంగగలరని నమ్ముచున్నాను.

## 37

## శ్రీమతి అంగర వెంకటమ్మగారు

సీత, సావిత్రి, దమయంతి, అరుంధతి మొదలగు పురాణపతివ్రతలును; మహారాణీ ఝూన్సీ లక్ష్మీభాయి, రాణీ సంయుక్త, పద్మిని మొదలగు రాచపతివ్రతలును పుట్టి పెరిగినందున భారతమాత చాల కృతార్థురాలై యుండగా అటువంటి ఈ దేశమున విడాకులచట్టము పెట్టినందున ఎట్టి అనర్థములు రాగలవో యూహించక మన చెన్నరాష్ట్రనారీమణులు ఈ చట్టమును పెట్టవలెనని కోరుచున్నారు. మనవారందరకు ఈ చట్టమువలన పతివ్రతాదిగుణంబులన్నియు అడుగంటిపోవునుగాని సుగుణంబులొక్కటియు దరిజేరియుండవు. పతివ్రతాదిగుణంబులున్నందుననే కదా అనసూయ త్రిమూర్తులను పసిబాలలగ జేయగల్గినది? సావిత్రి తనమగని ప్రాణము రక్షింపగల్గినది? ఇకనయిన బుద్ధి తెచ్చుకొని ఈ చట్టమును దేశములోనికి రాకుండజేయుదురు గాక యని భారత సోదరీమణులను ప్రార్థించుచున్నాను.

## 38

## శ్రీమతి డి. కృష్ణవేణిగారు

మన భారతదేశము అనాదినుండియు వీరాంగనలకు పతివ్రతామతల్లులకును వీరమాతలు మొదలగు మహాతల్లులకును పుట్టినిల్లయి వెలయుచున్నది. ఇట్టి పవిత్రదేశమున జన్మించిన సుగుణమణుల పట్ల నీ విడాకులచట్టమును ప్రయోగించి అపవిత్రులుగ జేయు టెంతయు విచారకరము. ఈ చట్టమువలన నెన్నియో నీచకార్యములు బయల్పడును. కొంతకాలమునుండి బంధించిపైచిన సతీపతుల ప్రేమబంధములను ఒక్కసారి త్రెంపుటెంత అసాధ్యకార్యము? తదుపరి వెంటనే ఇంకొకని వరించు టెట్లు కుదురును? వివాహమైన కొలదికాలమునకే

మరణించిన భర్తను విడువలేక దుఃఖసాగరమున మునింగి వస్త్రభూషణాదులను త్యజించి అతనితోడిదే లోకమని శరీరారోగ్యమయిన కాపాడుకొనక అల్పకాలముననే వృక్షముగా మారిన ప్రేమాంకురమును నరకజాలక అతని నామమునే స్మరించుకొనుచు ఆ మూర్తినే మనస్సునందు చిత్రించుకొని ఆ పటమునకు కోరికలనెడి పువ్వుల నర్పించుచు ఆ ప్రేమమూర్తి నామజపముజేయుచు జీవితమును గడుపుచున్న మహాతల్లుల నెందరినో గాంచుచున్నాము. అట్టియెడ నెంతకాలమునుండియోయున్న సంబంధమును ఏదియో యొక చిన్న అంతకలహమువలన భార్యాభర్తలలో నొకరిపై యొకరికున్న సంబంధమును త్రోసిపుచ్చుటెట్లు? ఈ సంబంధము అల్పమైన ఒక చట్టమువలన అంతమొందునది గాదు. ఇది ఇరువురి జీవితాంతములవెనుక నిర్మూలమగునుగాని మధ్యలో వదలింప నెవరితరమునుగాదు. మనలోను (ఎరుకలు, ఏనాదులు) మొదలగుజాతులవారు ఈవివాహవిచ్ఛేదనమువలన పడుచున్న పాట్లను కన్నులార గాంచుచునే అట్టి అవినీతికార్యములను భారతవిదుషీమణులుగూడ జేయబూను టెంతయు శోచనీయము. పవిత్రభూమియగు నీ భారతదేశముయొక్క ఔన్నత్యమునకై పాటుపడు భారతమహిళామణులు ఇట్టి చట్టములకు చోటివ్వకుందురుగాక యని కోరుచున్నాను.

## 39

## శ్రీమతి కే. పంకజాదేవిగారు

మనకు ఇదివరకు విడాకులచట్టము లేకపోయినప్పటికిన్ని యిప్పుడు మనము కోరవలసివచ్చినది. ఎందుకనగా పూర్వకాలమందు స్త్రీలను అన్యాయముగా విసర్జించుటలేదు. ఇప్పుడన్ననో స్త్రీలు ఎంత బుద్ధిమతులయినను పదిమంది బిడ్డలుకన్నప్పటికిని వారియెడ లేశమైనను తప్పులేకపోయినప్పటికిని పురుషులు స్త్రీలను విసర్జించుట కలుగుచున్నది. ప్రతిజీవరాసిలో స్త్రీజన్మ లేకుండ లేదుకదా. అట్లుండగా పురుషులు స్త్రీతోడ్పాటు లేకుండా ఏపనియును చేయజాలరు. ఇట్లుండ స్త్రీలయందు అన్యాయభావముచూపుచున్న పురుషులను దోషముకలుగును. ఆసంగతి తెలుసుకొనకుండా సంచరించుట కలుగుచున్నదికనుక విడాకులచట్టము అతి అవసరము. స్త్రీలవిసర్జించుటమొదలగునవి లేకపోయిన విడాకులచట్టము అనవసరము. ఇప్పుడు స్త్రీల విసర్జించుట మొదలగునవి కలుగుచున్నదిగనుక విడాకులచట్ట మత్యావసరము అని నేను గట్టిగాచెప్పుచున్నాను.

## 40

## శ్రీమతి వి. యస్. కాంతమ్మగారు

విడాకులచట్టమువలన కొన్ని లాభములున్నను మొత్తముమీద లాభములకంటె నష్టములెక్కువ. ప్రస్తుతము మనదేశపుస్త్రీలయందు విద్యావిజ్ఞానములు స్వల్పములు. నూటికి ఏ 1 వంతుమందియోగాని తక్కినవారెల్లరు నిరక్షరకుక్షులు. పైవారైనను మొత్తముమీద ఎక్కువమంది స్వల్పవిద్యాప్రవేశినులేగాని ప్రపూర్ణలుగారు. విద్యవచ్చియైనయుండవలయును. లేదా రాకయైననుయుండవలయును. గాని మిడిమిడిజ్ఞానము, వచ్చిరానిచదువు మిగుల అపాయకరము. మిడిమిడిజ్ఞానమున అహంభావము హెచ్చును. అహంభావమువలననే అనేకములగు దుర్గుణములు పొడచూపగలవు. ఈప్రస్తుత నాగరికతకు ఫలములగు మిడిమిడిజ్ఞానులకన్న చిన్నచిన్న గ్రామములలోనివసించు అజ్ఞానయువతులు అత్తమామలఎడ భక్తిశ్రద్ధలు, పెద్దలయెడ వినయవిధేయతలు, బీదలయెడ జాలి, దైవముఎడల భయభక్తులు, భర్తఎడ అతీతమగు మన్నన ప్రేమ, పాపభీతి, ధర్మచింత మొదలగు పెద్దలేర్పచిన సంఘమర్యాదలునుగలిగి తీరికయగునపుడు నీతిదాయకములగు చిన్నచిన్న పాటలు పాడుకొనుచు,తమకాగృహమే వైకుంఠమురీతి ఎంచుచు అమాయకహృదయలై, ఆనందమనస్కలై విసుగొకింతయు లేక

గృహకృత్యాదికములు, పూజాదిపుణ్యకార్యములు మొదలగువానితో నిర్విచారముగ కాలముగడుపుదురు. ఇట్టి అకల్మషహృదయుల కేమిచెప్పినను వెంటనే మనసుకబట్టును. కారణము అమాయకలగుటచేనే. పరిపూర్ణవిద్యావతులకుగూడ వెంటనే బోధపడును; గాని స్వల్పజ్ఞానుల కట్టులుగాదు. తాబట్టినకుందేటికి మూడేకాళ్లనిట్లు తమకంటె ఎవ్వరికిని తెలియదని వారిభావము. అందులకు వ్యతిరేకమైన కోపము. అందువలన యీర్ష్య, దానివలన పార్టీలు. ఇంతటిదేగాని ఐకమత్యము, ధర్మచింత, పాపభీతి చెప్పినవిషయముగ్రహించి మంచిచెడ్డలనాలోచించు వివేకజ్ఞానము లేకబోవుటయేగాక మనకన్నవారు ఘనులా యనెడి ద్వేషభావము మొదలగునవి బయలుదేరి సంఘము మరింత హీనస్థితినొందును. ఎంతవరకును మనవారు కట్టు జుట్టు బొట్టు మొదలగు స్వల్పవిషయముల అనేకవిధములగు మార్పులనుజేయుచు వానిలో వివిధపద్ధతులను గనిపెట్టుచు వానికొరకధికశ్రద్ధను చేసుకొని కాలముగడుపుదురేగాని మనసంఘాభివృద్ధికి వలయువిషయములలో నొకించుకైన శ్రద్ధబూనరు. ఇట్టి పరిస్థితులలో విడాకులచట్టము అమలులోపెట్టిన సంఘమర్యాద, వ్యక్తిగౌరవములు నష్టమగును. పురుషులలోగూడ ఉన్నతవిద్యావంతులు తక్కువ. ఉన్నవారైనను ఉద్యోగవిధానమున కనువగు విద్యావంతులుతక్క తదితరవిషయములలో మాటలలోనొకరీతి క్రియలలో మరియొకరీతి మెలంగెడివారేగాని మనోవాక్కాయకర్మల స్త్రీస్వతంత్రాభిలాషులు. మానవసృష్టిలో స్త్రీపురుషు లొకమాదిరివారేయనియు ఇరువురి కన్నివిషయములలో సరియగుహక్కులు గలవని తలంచువారు అరుదు. తరువాత ఎంతవిద్యావంతులైనను స్థిరచిత్తులుగనున్నవారు కొలదిమంది. భార్య ఎంతజ్ఞానవతియైనను ఎంతటి సుశీలయైనను ఆమెను త్రోసిపుచ్చి పెండ్లిచేసికొనినవారు కొందరు. రహస్యవిధమున హేయప్రవర్తనలుసలుపువారు కొందరు. ఈరీతినుండియు ఎట్లో భార్యను పోషించుటమాత్రము తప్పనిసరియనిభావించి కాలముగడుపుచు కొంతకాలమునకు చంచలత్వమడగి ధర్మమార్గమునకు వచ్చెదరు. ఇట్లే యువతులలోగూడ ఎంతదుర్మార్గవతియైనను వెలియనుభయముచే భర్తకన్న గతిలేదుగదాయని వానిచెంతనుండియే తన పాపకార్యములుసాగించినను కొలదికాలమునకు బుద్ధిమారి సన్మార్గావలంబినియై హృదయేశునకు ముదముగూర్చును. చంచలచిత్తులగు స్త్రీపురుషులు కొంతకాలము ఏకీభావమున నుండకపోయినను తదుపరి స్థిరచిత్తులై ఏకాభిప్రాయులై ఐకమత్యముగనుందురు. ఈ విడాకుల చట్టమువచ్చిన ఇంక ఈ అవకాశముండదు. దుర్బలహృదయములు, చంచలప్రవృత్తులుగ యువతీయువకులెల్ల గాలిచేకొట్టికొనిపోవు తరుపత్రములరీతి ఏమాత్రము మనోవైకల్యముగల్గినను విడాకులు. తరువాతచేయునది వారికే తెలియదు. అంతమాత్రమే యీచట్టమువలన లాభము. ఇదివరకే హూణవిద్యాప్రభావముననో స్త్రీపురుషుల దుర్బలహృదయములవలననో దేశమించుక నీతిరాహిత్యముగనున్నది. ఇక చట్టమమలులోనికివచ్చిన నీతినియమధర్మములు పూర్తిగనశించుట కవకాశమేర్పడును. గనుక మనదేశములో విడాకులచట్టమువలన లాభములకంటె బాధ లెక్కువగోచరించుచున్నవి.

 విడాకులచట్టమును గూర్చి విదుషీమణుల అభిప్రాయముల ప్రకటన ఇంతతో విరమించడమైె

—సంపాదకుడు.

# సున్నపునీరు

కొణకంచి చక్రధరరావుగారు

హిందుస్థానమునందు మూల్యమేమియునీయ నక్కరలేకయే, లేక నత్యల్పమూల్యమునకు లభించెడి పదార్థము లసంఖ్యాకములుగలవు. వాని నౌషధరూపముగ నుపయోగించినచో నిక కుదురజాలవని నిరాశనొందిన లేక మూల్యవంతములగు నౌషధములను మండలములకొలదిగ సేవించిన నివారణకాజాలిన రోగములను పెక్కింటిని నివారింపగలిగి యున్నవి.

ఈప్రపంచమునంగల యొక్కొకయణువుసైతము నిష్ఫలముగలేదను రహస్యము నెరుంగజాలినదేశములవారలు తమ విమర్శనాకౌశలము, బుద్ధి, శక్తి పనిచేయగలిగింతటిలో నేపదార్థమును వ్యర్థముగబోనీయరు. వారలు మన బాహ్యదృష్టికి సాధారణములలోని కెల్ల సాధారణముగ గన్పించెడి పదార్థములవలనగూడ యసాధారణమగుపనిని గైకొనుచు లోకము నబ్బురపడజేయుచుండుటయేగాక తాము తన్మూలమున నపరిమితైశ్వర్యము నార్జించుచున్నారు.

ఇప్పుడు యూరపు, అమెరికాఖండములవారలు నూతనపదార్థములను నిర్మించి, వాని నచిరకాలముననే ప్రపంచములోని విక్రయస్థానములందు వ్యాపింపజేసి యాస్థానికుల నుండి యపారమగుద్రవ్యమును లాగికొనిపోవుచున్నారు. హాలండు, జర్మనీ, యింగ్లండు మొదలగుదేశములవారు పేరాఫీన్, నికల్, ఓక్సాయిడ్ మొదలగు మనమెరుంగని పదార్థములతో వనస్పతి (Vegetable) ఘృతమును సిద్ధపరచి ఎంతయోద్రవ్యమును ప్రోవుజేయుచున్నారు. ఒక్క మనహిందూస్థానమునందే మానవుని యారోగ్యమున కత్యుపద్రవదాయకమగు నీనేయి ప్రతిసంవత్సరమునందును పదునైదుకోట్లరూపాయల విలువగలది వ్యయమగుచున్నప్పు డీదుష్టపదార్థము వారల కింకెంతద్రవ్యము నార్జించుచున్నదో దీనినిబట్టి కొంతవరకూహింపవచ్చును.

మనదేశమున కావశ్యమగు ప్రతిపదార్థము విశేషించి ఇతరదేశములనుండియే తయారుచేయబడి వచ్చుచున్నది. ఔషధములనుగూర్చి విచారింపుడు. ఏపదార్థమును మనమిక్కడ కొన్నిగవ్వలవ్యయముతో తయారుజేసికొనగలిగియున్నామో యట్టివానికే,

సర్టిఫైడు పాఠశాల



శిశుసహాయక సంఘము, మదరాసు

శిశుసహాయకసంఘము, మద్రాసు



బాలికలు పని చేయుచుండుట

దేశముయొక్క లక్షలకొలదిగ కాదు కోట్లకొలది ద్రవ్యము వెలుపలికరుగుచున్నది. సున్నమెంత చవకయైవస్తువో చూడుడు. దీనిని మన యౌషధరూపముగ పనిగొనినచో దీనివలన పెక్కువ్యాధులు నివారణకాగలవు. ఆంగ్లేయవైద్యపద్ధతితోగూడ సున్నము ఉపయోగింపబడుచు దానివలన జనులు కొంతలాభము నొందుచున్నను మనవైద్యులింకను దానిని గూర్చి బాగుగ శ్రద్ధగైకొనకున్నారు. సున్నమెంత యత్యల్పమూల్యమునకులభించువస్తువో యంత యధికలాభప్రదమైనదిగనున్నది. ఇచ్చట సున్నపునీటిని సిద్ధపరచుటకును దాని వలన నివారణనొందెడి కొన్నివ్యాధులపై నుపయోగించుటకును, వలయుపద్ధతిని సూచించెదము.

పావుశేరు చల్లార్పని కాలిన సున్నపురాయిని మట్టిపాత్రయందుంచి దానిలో అయిదు శేర్ల పరిశుభ్రమైననీటిని పోసి బాగుగ కదిలించియుంచవలెను. నాలుగు గంటలకాలమట్టుంచి సున్నమంతయును అడుగునకుచేరి పైనున్ననీరంతయును శుభ్రముగ గానవచ్చుచున్నపిదప నానీటిని వేరుపరచి పరిశుభ్రమైనగుడ్డతో వడపోసి సీసాలలో నింపిపెట్టుకొనవలెను.

1. కలరారోగికి రెండేసితులముల సున్నపునీటిని పదునైదునిముషములకొకసారి త్రాగించవలయును. రోగి ప్రాణములను విడువబోయెడిసమయమున, గుండెచలనమాగిపోవుచున్నసమయమున, కాళ్లుసేతులు చల్లబడుచున్నసమయమునసైతము ఈయౌషధము పెక్కుతావుల లాభప్రదముగ గన్పట్టినది.

2. క్షయసంబంధములగు వ్యాధులలోగూడ నీసున్నపునీరు మిగులలాభకారి. ముఖ్యముగ ప్రారంభదశయందొక్కొకఔన్సు నీటిని దినమున కారుయేడుసారులు వేడిపాలలోగాని, వేడినీటిలోగాని కలిపి త్రాగించవలయును. ఈరోగముకొరకు సున్నపునీటితో కలుపబడిన యౌషధము లెన్నియో ఇతరదేశములనుండి తయారై వచ్చుచున్నవి. కాని మనకు సాధారణమగు సున్నపునీటితో నెంతగలాభించునో యంతకంటె నెక్కుడులాభమా యౌషధమువలన కాజాలదు.

3. పిల్లలెండిపోవుట: ఈవ్యాధి కనేకకారణములు గలవు. కాని యన్నిటికంటె పెద్దకారణ మట్టిపిల్లల తలిదండ్రులు బలహీనులుగనుండుట. సున్నపునీటిలో రెట్టింపు పటికిబెల్లముకలిపి పానకముజేయవలెను. పాలుద్రావెడిపిల్లల కీపానకములోనుండి నాలుగుమొదలు ఇరువదిబొట్లదనుక దినమునకు రెండుమూడుసార్లు పాలలోకలిపి త్రాగించవలెను. దీనివలన పిల్లలు దృఢగాత్రులయ్యెదరు. మరియు పెక్కుబాధలనుండి విముక్తులై సుఖముగనుండెదరు. ఈపానకమునే పాశ్చాత్యులు నానావిధములగురంగులలో సిద్ధపరచి గొప్పగొప్ప యాకర్షణీయములగు వాక్యములతోగూడిన ప్రకటనములద్వారా నెంతగనోవర్ణించి పెద్దపెద్దమూల్యమున కమ్ముచుండెదరు.

4. నువ్వులనూనెలో సున్నపునీటిని కొంచెముకొంచెముగ చేర్చుచు తెల్లగ నవనీతమువలె నగునంతవరకు కట్టెతో కలియబెట్టుచుండవలెను. దానిని గాయములమీదను ముఖ్యముగ కాలినపుండ్లమీదను ఉపయోగించినచో చక్కనిగుణమునిచ్చును.

5. ఒక్కొకఔన్సు సున్నపునీటిని దినమునకు నాలుగుసారులు కొంచెము మంచి నీటితోకల్పి త్రాగించినచో మూలవ్యాధివలన స్రవించెడిరక్తము నణచివేయును.

6. స్త్రీలకు రజోసంబంధములగు వ్యాధులలోను, లేక నేదేని పుంసులేక గాయముల నుండి కారెడి రక్తమునాపుటకును పైనజెప్పినవిధముగనే యుపయోగించవలయును.

7. గుండె బలహీనముగనున్నచో లేక నాడి బలహీనముగనడుచుచున్నచో ఒక్కొక ఔన్సు సున్నపునీటిని కొంచెకొంచెము వ్యవధిగ త్రాగించుచుండవలెను. లేక ఒకఔన్సు సున్నపునీటిని ఇంజక్షన్ చేయవలెను.

8. విరోచనము గ్రహిణిబాధలలో రక్తము ఆమము (బంక) పడుచుండినను లేక పడకపోయినను ఒక్కొకఔన్సు సున్నమునీటిని దినమునకు నాలుగైదుసార్లు త్రాగించవలెను.

9. దంతములువచ్చుచుండుటవలనను, లేక నింకేమైన నితరకారణములవలనను, శిశువులకువచ్చెడి విరోచనవ్యాధులలో ఆరుమాసముల యీడుదనుక పదిచుక్కలు; రెండు సంవత్సరముల యీడుదనుక 20 చుక్కలు సున్నపునీటిని దినమునకు నాలుగులేక అయిదు సారులు నీటిలోకల్పి త్రాగించవలెను.

10. ఎముక నిర్మాణమగునప్పుడు లేక వృద్ధినొందుచున్నప్పుడు వానిలోకలిగెడి బలహీనతకును, ఎముకయందు పురుగుచేరియున్నప్పుడు, ఎముక కరగిపోవనారంభించినప్పుడును నెత్తివెంట్రుకలు రాలిపోవసాగినప్పుడును ఒక్కొకఔన్సునీటిని దినమునకు మూడుసార్లు త్రాగించవలెను.

11. దంతములు బలహీనములైనప్పుడు, కదలుచున్నప్పుడు, చిగుళ్లవాపులో, లేక దంతములు కొద్దికొద్దిగ విరిగిపోవునప్పుడు, లేక దంతములలో పుప్పిపుట్టినప్పుడు లేక వాని మొదళ్లలో పురుగేర్పడినప్పుడు ఒక్కొకఔన్సు సున్నపునీటిని త్రాగించవలెను. మరియు సున్నపునీటితో పుక్కిళించవలయును.

ఈ చెప్పబడినవానిలోనేగాక ఇంక నెన్నియోవ్యాధులయం దీసున్న మత్యంత లాభప్రదము.

—ఉర్దూపత్రికనుండి యనువదింపబడినది.

# శూరాంగన

## కొత్త అప్పయ్యచౌదరిగారు

కొలదిమాసములక్రిత మీవిషాదచరిత్ర మార్కాపురంతాలూకాలోని యొకగ్రామములో నిజముగా జరిగినది. గ్రామమంత పెద్దదియు, చిన్నదియుగాదు. భూస్వాములగు రెడ్లతోను, కూలినాలివలన జీవనము సేయు మాలమాదిగలతోను యాగ్రామ మొప్పియుండును. ఆయూర వెంకటరెడ్డియను నొకధనికుడు గలడు. ఊరికివెలుపల దాదాపొకయరమైలుదూరములో నతని కరువదియెకరముల విస్తీర్ణముగల పెద్దచేనొకటుండెను. అతనిపనిపాట లెల్లప్పుడు నాపొలముననేయుంటచేతను, ఆభూఖండముపై నతనికి మక్కువయగుటచేతను, తనకొక తుపాకీ లైసెన్సుంటచేతను గ్రామకాపురమువిడచి దగ్గరలో నితరగృహములెవ్వియు లేకపోయినను, యాపొలమందొకప్రక్కన సుందరగృహమొకదానిని నిర్మించుకొని ఆతడందు వాసముసేయుచుండెను. రాత్రియందతనికి తోడుగ మాలపాలెగాండ్లింటియందు బరుండుటచే భయమంతగ లేకుండ హాయిగ కాలముబుచ్చుచుండెను.

'కాలమొకరీతి యెవరికి గడువబోదు' అని యొకమహాకవిజెప్పినట్లెల్లప్పుడు నొకేరీతి రాదు. వెంకటరెడ్డి బాకీ వసూళ్లనిమిత్తం సమీపగ్రామమున కేగవలసివచ్చెను. అతనిభార్య వెంకటసుబ్బమ్మ పతిభక్తిపరాయణ. సుగుణములప్రోవు. ధైర్యవతి, సాహసికురాలు. ఈదంపతులకు ప్రాణపదమగు మూడేండ్లబాలిక గలదు. ఏకమాత్రశిశువగుట నీదంపతు లాబాలిక నల్లారుముద్దుగ బెంచుచుండిరి. గ్రామాంతరమేగునపుడు రెడ్డి తానారాత్రికి గృహమును జేరననియు, జాగ్రత్తగనుండుమనియు భార్యను హెచ్చరించి వెడలిపోయెను.

రెడ్డియింటివద్ద నిద్రించు పాలెగాండ్లిద్దరు కడుదురాత్ములు. వారు తమయజమాని సర్వస్వమపహరింపనెన్నిదినములనుండియో యదనుకొరకు వేచియుండిరి. ఈసమయమునుగుర్తించి వారు గ్రామములోని మరి యార్గురుమాదిగల సాయముజేసికొని గృహము నారాత్రి కొల్లగొట్ట నిశ్చయించిరి. మామూలుప్రకారము వెంకటసుబ్బమ్మ పాలెగాండ్లకు జాగ్రత్తచెప్పి, తలుపులు లోనగడియలువేసి నిద్రాదేవికి వశ్యురాలుగాక మేల్కొనియేయుండెను. అర్ధరాత్రిసమయమున లోనున్నయిరువురకు సన్నని యీలల వినబడెను. అది సాంకేతికధ్వనిగావున వారిలో నొకడులేచి గడియలుదీసెను. తోడనే యాయుధపాణులగు నార్వురుచోరులు లోనప్రవేశించి వాకిలి తిరుగబంధించిరి.

సరభసమున లోనికేతెంచిన వీరింగాంచినతోడనే గృహిణి సంగతినంతయు నిముసములోగ్రహించి మారుమాటలాడిన ధనమునకేగాక మానప్రాణములకుగూడ భంగమువాటిల్లునని కిక్కురుమనక యూరకుండెను. అంత నాదస్యుదళములో నొక్కడు "మీయాస్తినంతయు ఆభరణములతోసహా యిచటబెట్టుము. లేనిచో నీప్రాణములుదక్క" వని గద్దించెను. 'మాధనమంతయు మీ కట్టెదుటనేయున్నది. మీయిచ్చవచ్చినట్లు గైకొనవచ్చు' నని యాసాధ్వి మారుపల్కెను. పేచీలేకనే వ్యవహారము పైసలగుచున్నందున వారు మిగుల సంతసమంది తమతోగొనివచ్చిన సురను సేవింపసాగిరి.

ఆదంపతుల పశుగణమందొక చక్కని కోడెదూడగలదు. సర్వాంగసుందరమగు నాలేగ తల్లిపాలను వీడకపూర్వమే రెండువందలరూప్యముల ఖరీదుచేయజాలియుండెను. దానిని వెంకటసుబ్బమ్మ అత్యంతగారాబముగ బెంచుచుండెను. ఆదురాత్ములు సురాపానమత్తులై యాచక్కని దూడపలలమును నంజుడుగగైకొనగోరి యాసాధ్వితో నాయుదంతము విన్నవించిరి. ఇందుకుమాత్ర మాయమ తనయసమ్మతిని దెలిపెను. ఆముష్కరులు తమపట్టువీడనందున కార్యము మించవచ్చునని యాయమ అందుల కియ్యకొనెను. వెంటనే

యాదూడ కడకు కరవాలముపాలగుటయు తన్మాంసము వంటకమునకై యాపెచేతికియ్యబడుటయు తటస్థించెను. కన్నీటిధారలచే పయ్యెదకొంగుదడుప నాలేమ భారహృదయముతో నెట్టులో యామాంసమును వండెను. అంతనాదస్యులందరు పంక్తిదీరికూర్చుండి యాపె నాపదార్థమును వడ్డింప నాజ్ఞాపించిరి. చేయునది లేక యాసాధ్వి వడ్డనజరిపెను. వారందరు తృప్తిగ భుజించుచుండిరి.

ఇంతతో నీపెకష్టములు గట్టెక్కలేదు. ఆముష్కరుల వెట్టిప్రజహృదయములోగాని వారీపెనుగూడ నాపలలమునుదిన బలవంతపెట్టిరి. ఆమె చేయునదిలేక యొకయుక్తిని బన్ని స్నానముచేసినగాని తానేమియు గైకొనననియు, చేసివచ్చి యారగింతుననియు తెల్పెను. అంతవారు నీవు పలాయితవగుట కుపాయముబన్నుచుంటివి పోవ వీలులేదనిరి. ఈపల్కులకాసాధ్వి—ఏకమాత్రశిశువే తనసర్వస్వముగ నెంచుకొనుచున్న ఆసాధ్వి—"నేనురానని మీ కనుమానమున్నచో ఈనాబిడ్డను మీయెదుట నుంచిపోయెద. పావుగంటలో రానిచో, నీబిడ్డను మీయిచ్చవచ్చినట్లు జేసికొనవచ్చు" నని కన్నీరొలుకబల్కెను. ఇందుకువారు సమ్మతించి దురక్షణమున నీవురానిచో బిడ్డను నలిపిచంపెదమని బెదరించి యాపెను విడచిరి.

నారినుండివిడువబడిన బాణమువలె యానారి వారిబారినుండి తప్పించుకొని రివ్వున గదివెలుపలికేతెంచి బయట గొళ్లెముబెట్టెను. తక్షణమే యాపెకొక చక్కనియుపాయము దోచెను. మూలనున్న కిరసనాయిలు డబ్బాదెచ్చి యాహూనెలో పాతగుడ్డలను పెక్కింటిని దెచ్చి ముంచి యాదస్యులున్న గదిద్వారమునొద్ద బడవైచి యందగ్గివైచెను. బయట వాకిలి బంధింపబడగనే లోనుండి యాదస్యులు 'తలుపు దీసెదవా? బిడ్డను చంపమందువా?' యని గోలసేయుచు, తలుపులు విరుగదన్ను ప్రయత్నము సేయుచుండిరి. కాని, యాశూరాంగన వీనినేమియు లెక్కసేయక, బిడ్డప్రాణములకు తనప్రాణములకు జలాంజలినొసంగి, తన పనిని పూర్తిజేసెను. మందువేసగివాయువు యగ్నిహోత్రునకుదోడ్పడ నాతడు పెద్దజ్వాలలతో పైకిలేచెను. గోడలు చాల యెత్తుగనుంట నాదస్యులు పైకెగబ్రాక యత్నించియు విఫలమనోరథులైరి.

అర్ధరాత్రిసమయమగుటను, గృహము గ్రామమునకు దూరమగుటను చాలసేపటికిగాని యాగృహదహనవిషయ మెవ్వరికిని దెలియలేదు. తెల్లవారుజామున సుమారు నాల్గుగంటలకు గ్రామవాసులందరికిని దెలిసి పరుగిడివచ్చిరిగాని పెంకుటిల్లగుట నెవ్వరును దగ్గరకుబోవుటకు వీలులేకపోయెను. గ్రామముయొక్క పెత్తనదారు వెంటనే పోలీసుస్టేషను కీసమాచారముదెలుప సూర్యోదయమగుసరికిరువురు రక్షకభటులతో నొక సబిన్‌స్పెక్టరు విచ్చేసెను. చాలసేపటికిగాని నిప్పునార్ప వీలులేకపోయెను. అంత వారందరాదగ్ధగృహమును బ్రవేశించి చూడ నందు భస్మరాసులును వానిక్రింద నెముకలప్రోవులును గాన్పించెను. అందరు వానిని నిదానించి చూచుచుండగా తటాలున నొక స్త్రీవ్యక్తి—మలినాంబరధారిణి—జలపూరితనేత్రి—ఆకంపితగాత్రి—కేశజాలములు ముఖమండలముననావరింప, వికృతవేషముతో బరుగిడివచ్చి, యాభస్మరాసులలో దేనినో నెమకసాగెను. అంత నారక్షకోద్యోగి 'నీవెవరవు? ఏమి వెదకెద' వని పృచ్ఛసేయ నాకాంత మారుపల్కక యచట బడి మూర్ఛిల్లెను. అచటగూడినవారిలో గొందరామెకు శైత్యోపచారములుజేసి స్పృహదెప్పించిరి. కొందరాదీనురాలిని గుర్తించి సమాచారమడుగ నామె సవిస్తరముగ వృత్తాంతమంతయు రక్షకోద్యోగికెరిగించి యాభస్మరాసిపైనొకసారి చూడ్కినిగడించి రెండుభాష్పబిందువులు రాల్చెను. తనబిడ్డతో తొమ్మిది నిండుప్రాణములదీసిన హంతకురాలని కొందరు దూషించిరి. దొంగలకు తగినశాస్తిజేసిన శూరాంగనయని కొందరు భూషించిరి. మేము ఆమెను శూరాంగన అనినవారితోడనే మాటకలిపెదము.

తరువాత సర్కారువారుసైత మామె ధైర్యమునకును, స్వార్థత్యాగమునకును మెచ్చి, యామెను శిక్షింపకపోవుటయేగాక, తగు బహుమతినొసంగిరని వినికిడి.

# మాతృధర్మము.

## శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

పరమేశ్వరుడు ప్రపంచమును ప్రకృతివలన సృజించెను. సకలభూతజాలమునకు ప్రకృతి మాతయు పరమేశ్వరుడు జనకుడును అయియున్నారు. ఈశ్వరుడు నిస్సంగుడు, నిర్మోహుడు, నిశ్చలుడు అయియుండును. చరాచరభూతజాలమెల్ల ప్రకృతిని నాశ్రయించియే యుండును. సకలజీవులును స్త్రీశక్తిమీదనే ఆధారపడియుండును. ప్రకృతిస్వరూపిణు లగు స్త్రీలమీదనే ప్రపంచముయొక్క బాగోగులును ఆధారపడియున్నవి. దేశముయొక్క గౌరవాగౌరవములకుకారకులును స్త్రీలే. దేశములో ప్రతాపానలము రగుల్గొల్పెడివారలును స్త్రీలే. దేశము వీరశౌర్యపరాక్రమశాలురతో నిండి నిర్భయముగానుండుటకును, సుజ్ఞానవైరాగ్యశుద్ధసత్వమూర్తు లుద్భవించుటకును కారకులు స్త్రీలే. వేయేల? శరీర మునకు ప్రాణమెటులనో, కుటుంబములకును, దేశములకును స్త్రీలటుగావున యేదేశముగాని మహోన్నతదశనొందవలెనన్న స్త్రీలను సుశిక్షితలనుగా చేయవలెను.

వారిని సన్మార్గగామినులనుగా నొనర్చి వారికి తగినంత సద్విద్య నొసగవలెను. స్త్రీలకు తగినంత ప్రోత్సాహము కలిగించుచు వారిని ఉచితరీతిని గౌరవించుచుండవలయునే గాని అత్తింట నడుగుపెట్టగానే అచటివారు కోడళ్ళను ఉదాసీనబుద్ధితో చూచుటయు, అత్తింటివారిని చూచిన ఆమె గడగడలాడునట్లు శిక్షించుటయుకూడదు.

బిడ్డలను దేశోద్ధారకులనుగా పౌరుషవంతులనుగా చేసి వారికి తగినంత తేజోబల స్థైర్య ధైర్యమొనగూర్చుటకును మాతలే ముఖ్యకారకులు. కాన వారిని ఉచితజ్ఞలుగా నుండునట్లును కుటుంబరాజ్యమునకు రాణిగనుండి యందు తనప్రజలయొక్క బాగోగులు తనవిగా చూచుకొనుచు పరిపాలించుటకు తగిన శక్తిమతులుగానుండునట్లును జేయవలెను. ఇట్టికార్యము లొనర్చుటకును స్త్రీలే ముఖ్యముగా బూనుకొనవలయును. ప్రతిమాతయు మున్ముందు తన మనస్సును నిర్మలముగా నుంచుకొనుటయు తాను ఆచరించు ప్రతి కార్య మును యొరుల కత్యంతామోదమును గూర్చునదిగానుంటయు ముఖ్యము. తాను నెఱవేర్చ

చుండెడి ఆయా పనులను ఈశ్వరదత్త బుద్ధితో నెరవేర్చుచుండవలెను. ప్రతి పనియందును శ్రద్ధాళువైయుండవలెను. కేవలము భౌతికముగా జీవింపక బాహ్యావేషాడంబరములనే ముఖ్యముగాగొనక ఈశ్వరభక్తియు ఆత్మవిచారణయు సలుపుచుండవలెను. ప్రతి యువతియు ముఖ్యముగా తన స్వధర్మముల నెఱవేర్చుచుండవలెను. భర్తశుశ్రూష, దేవపూజ, పెద్దల సేవ, అతిథి అభ్యాగతుల నాదరించుట, బిడ్డల సంరక్షణ ఇట్టి పనులు ముఖ్యావశ్యకములు.

ఇట్టి పనులయందు హేయభావము పూనక నాచరించువనితయే గృహిణీశబ్దమున కర్హురాలు. ప్రస్తుతకాలమున మనస్త్రీలు తమవిధ్యుక్తధర్మముల తాము నెఱవేర్పక సోమరులయి పరిచారికాబృందముచే నడపించుచున్నారు.

పిల్లలను దాదులవశముచేసి వారి మంచిచెడ్డల గమనింపకయే లోకాభిరామాయణప్రసంగములచే కాలము వ్యర్థపుచ్చుచున్నారు. బిడ్డల మంచిచెడుగులను విచారింపకయే, వారి అవ్యక్తమధురవాక్కుల కత్యంతామోదము నొందకయే, వారిని నైతికపథముల బట్టింపకయే కేవలము సంతానవతులయినమాత్రమున మాతృధర్మము నెఱవేర్చినట్లగునా?

## ఈశ్వరప్రార్థన

కీ. శే. శ్రీపతి పండితారాధ్యుల మీనాక్షమ్మగారు

కీర్తన

"దినకరవంశపావనులైన శ్రీరామచంద్రులే మాతండ్రిగా" అనుమాదిరి.

కైలాసగిరినివాసుడైన నీలకంఠుడె మాతండ్రిగా
కడునొప్పు గట్టురాజుపట్టియగు గౌరె మాతల్లిగా॥
కాశీనివాసురాలగు జాహ్నవీగంగ మాపినతల్లిగా
గణపతి భైరవ కార్తికేయ వీరభద్రాదులన్నలుగా॥ కై॥
దేవవల్లి కల్పవల్లి భద్రకాళి వదినలుగావలెగా
నందీశ్వర భృంగీశ్వర ప్రమథాగణములె బంధువులుగా॥ కై॥
ఇలలోను ఈశుని మామగారయినట్టి హిమవంతె మాతాతగా
కడువేడ్క గౌరినిగన్నట్టి మేనక ముత్తవతల్లిగావలెగా॥ కై॥
రాజులయిండ్లనివాసముచేసేటి లక్ష్మిమామేనత్తగా
శేషశయనుడైన వైకుంఠవాసుడు శౌరిమేనమామగా॥ కై॥
కడునొప్పు కైలాసపట్టణంబెనాకు కన్నవారియిల్లుగా
ఇలలోనుకలలోను ఈశుని నేగట్టిగానమ్మియుంటినిగా॥ కై॥

# కాశీ ప్రయాణము

## సరస్వతుల వేంకటసూర్యనారాయణశాస్త్రిగారు బి. టి. ఎస్.,

౧

పతంజలిశాస్త్రిగారివయస్సు అరవయ్యోపడిలోంచి డెబ్భయ్యోపడిలో పడ్డాది. అయినా కాయ శరీరపు మనిషి గనుక ధృఢంగానే వున్నారు. ఆయన పిసినిగొట్టుల్లో ఘటుకం. ముప్పదియైదవయేట పెళ్లాం చచ్చిపోయినా మళ్లా పెళ్లాన్ని కొనుక్కుంటే డబ్బు ఖర్చవుతుందని గట్టిగా ఆలోచించి పెళ్లి మానీసాడు. తనకున్న బంధువులల్లా తన చచ్చిపోయిన కూతురుతాలూకుకూతురు ఒక్కర్తే. ఆ పిల్లనిగూడా ఒక మొగాడికి కట్టబెట్టి ఏదో పెళ్లయిందనిపించేడు; మూడేళ్లక్రిందట కాపరానికికూడా పంపించేసాడు. ఇరస్తా పరస్తా శాస్త్రిగారికి మరెవరూ దగ్గర బంధువులు లేరు. తనకు వండిపెట్టడానికి మనమరాలిని ముసలికాలంలో తనకు సహాయంగా ఉండడానికి ఆవిడ భర్తను తన యింట్లో ఉంచుకొని పోషించడానికి తగిన సామర్థ్యం ఉన్నా డబ్బయిపోతుందని శాస్త్రిగారు స్వయంపాకనీమస్థులయ్యేరు. మనమరాలు కాపరానికి వెళ్లిన దగ్గిర్నించిన్నీ రోజూ పొద్దున్నే లేవడం బిందె చెంబు పట్టుకొని యేటికిపోవడం కాలకృత్యాలు నెరవేర్చుకోడం ఎనిమిదిగంటలకల్లా నీళ్లుపట్టుకొని యింటికి వచ్చి యిల్లు శుద్ధిచేసుకొని ఏదో యింత పప్పు అన్నం ఉడకపెట్టుకొని దేవతార్చనచేసి పన్నెండుగంటలకు భోజనంచేసి కొంచెంసేపు నిద్రపోవడం శాస్త్రిగారికి మామూలు.

౨

ఒకనాడు శాస్త్రిగారు దేవతార్చనలో కూర్చున్నారు. పదకొండు గంటలయింది. వీధి తలుపు ఎవరో పిలిచారు.

“ఎవరువార”న్నారు పతంజలిశాస్త్రిగారు.

“నేను” అని జవాబు.

“నే నంటే?”

“నేను. తలుపు తియ్యండి.”

“నే నేవిటి నా శ్రాద్ధం. నేనంటే యెవరు? దేవతార్చనకి కూర్చునే సరికి ఎవరో ఒకరు పాకంలో పుల్లలాగు వస్తారు.” అని శాస్త్రిగారు కోపంతో లేచి గబగబవెళ్లి తలుపు ధడాలున తీసేరు. తీసే సరికి గుమ్మంలో మనమరాలు వెంకమ్మ, ఆవిడ రెండేళ్ల కొడుకు సుబ్బు ప్రత్యక్షం. వాళ్లని చూసేసరికి శాస్త్రిగారికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఏంచేత? మరి రోజూ వాళ్లకి తిండి పెట్టాలిగా.

“ఏం? వెంకమ్మా! నీకు మరేం పనిలేదూ? నీ మొగుడు ఎక్కడికేనా ఉద్యోగప్రయత్నానికి వెళ్లేసరికి నీవు యిక్కడికి పరిగెత్తుకొస్తావు, ఏవిటో దాచపెట్టినట్టు! అంత పోషించలేనివాడు నిన్నెందుకు పెళ్లాడాలి?” అని శాస్త్రిగారు కసిరేరు.

వెంకమ్మ మాత్ర వేం తెలివితక్కువదా? "తాతా! మరి అలాగయితేను, నన్ను గొప్పవాడికే యిచ్చి పెళ్లిచెయ్యలేక పోయావా?" అన్నది.

తాత మనస్సు చివుక్కుమన్నది. నిజమే. తనదే తప్పు. గొప్పవాడయితే కట్నాలకని, కానుకలకని చాలా డబ్బు ఖర్చవుతుందని వెంకమ్మని బీదవాడికిచ్చి పెళ్లిచేసేడు. వెంకమ్మ చెప్పిన జబాబు వినగానే శాస్త్రిగారి కోపం తగ్గింది గాని ఎత్తిపొడుపుమాటలవల్ల లోపల దుఃఖంగానే ఉంది. వారిద్దరినీ లోపలికి రమ్మని వంటసామానులు ఇచ్చేరు. వెంకమ్మ స్నానంచేసి ఏదో యింత వుడకపెట్టి భోజనం అయిందని పించింది.

## 3

శాస్త్రితాతగారు రెండుమూడు రోజులయేసరికి మెల్లగా మనస్సు కుదుర్చుకున్నారు. ఏమయినా మగవాడు. అందులో ముసలికాలం. ఎన్నాళ్లని వండుకోగలడు? జీతం అక్కరలేకుండా యింత తిండిపడేస్తే నమ్మకంగా పనిచేసే వంటది దొరికిందికదాయని శాస్త్రిగారు సముదాయించుకున్నారు. ఇంతకీ పేగుసంబంధం ఎక్కడికి పోతుంది ఎంత లోభివాడికయినా?

కాని తాతగారికి కొత్తచిక్కొకటి వచ్చింది. మనమడు సుబ్బు మొద్దబ్బాయి కాడు. చాలా చురుకయిన వాడు. ఎప్పుడూ ఏదో ఒక పెంకిపని చేస్తూనే ఉండేవాడు. అందులోనూ తాత మడికట్టుకున్నప్పుడు అతన్ని ముట్టుకోడం అంటే మరీ సరదా వాడికి. తాతగారు పిల్లవాణ్ణి ఏమిచేయలేక వెంకమ్మని కోప్పడేవారు. వెంకమ్మ "అయ్యో! ఒకరిపంచను చేరబట్టి కదా నా పిల్లడి ఆటలను చూసి సంతోషించే వారు లేరు. మీదు మిక్కిలి కోంపడతారు" అని దుఃఖపడేది. అప్పుడప్పుడు ఆదుఃఖం కోపంగా మారి సుబ్బు వీపుమీద రెండుమూడుదెబ్బలు వేయించేది. సుబ్బుమాత్రం తల్లి కొడితే యేడవక పకపకనవ్వేవాడు.

ఒకనాడు తాతగారు స్నానానికి వెళ్లేరు యేటికి. అప్పుడు సుబ్బు మెల్లిగా తాతగారి దేవతార్చన గదిలో ప్రవేశించేడు. తాతగారి పీటపైని బైటాయించేడు. పూజకోసం తీసిపెట్టిన గంధమంతా ఒంటికి ఎక్కించుకున్నాడు. పక్కనున్న పువ్వులన్నీ తనపై జల్లుకున్నాడు. నైవేద్యం కోసం వుంచిన అరటిపళ్లు రెండూ వొల్చుకొని తినేసేడు. కర్పూరం వెలిగించి రోజూ తాతవాయించేటట్టు గంట గణగణవాయించేడు. ఇంతట్లో తాతగారు యేట్నించి వచ్చేరు. గంట విని గదిలోకి గబగబ పరిగెత్తి చూస్తే పిల్లవాడు సుబ్బు అక్కడ ఉన్నాడు. తాతగారికి ఒళ్లు మండింది. నాలుగు దెబ్బలు వేదామా అని దగ్గరకి వెళ్లేరు. వెళ్లేసరికి సుబ్బు నవ్వుతూ లేచి "తాతా! పెచాదం" అని అరటిపళ్ల తొక్కలు చేతిలో పెట్టేడు. తాతగారి కోపం అంతా యెక్కడికో పోయింది ఒక్కమారు. ఫకాలున నవ్వేరు పిల్లవాని ఊహలు చూసి. ఎన్నడూ లేని ప్రేమ పిల్లవాడిపై పుట్టింది. మైలపడిపోతాననేనా అనుకోకుండా సుబ్బును ఎత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు.

## ౪

ఆరోజునుంచీ తాతా, సుబ్బూ నేస్తులయిపోయారు. సుబ్బును విడిచి తాతా, తాతనువిడిచి సుబ్బూ ఒక్కగడియ ఉండలేక పోయీవారు. తాతగారి దేవతార్చన పీటప్రక్కను సుబ్బుకూడా ఉండాలి. తాత గంధము రాసుకుంటే సుబ్బుకూడా రాసుకోవాలి. తాత దండం పెడితే దేవునికి, సుబ్బు "జేజ"కు దండం పెట్టాలి. తాతగారు సుబ్బుకు "సీతారామ్, సీతారామ్, సీతారామ్ జయ సీతారామ్" అని చెప్పగానే

సుబ్బు "తీతాలామ్, తీతాలామ్, తీతాలామ్ దెయ తీతాలామ్" అని చప్పట్లు చరిచేవాడు; తాతగారు అపరిమితానందం పొందేవారు. తాతగారి కిప్పుడు యెంగిలిబాధ పోయింది; సుబ్బుకు తన విస్తరంటులోనే అన్నము పెట్టేవారు. సుబ్బు నిద్రపోతూవుంటే వాడిని లేపేసి ముద్దుపెట్టుకొనేదాకా ఆయనకు తోచేది కాదు. మొట్టమొదట సుబ్బును చూడగానే ఆయనకెంత కోపం వచ్చిందో, యిప్పుడంత ప్రేమ హెచ్చింది. చిన్నపిల్లల ఆటపాటలను చూసినవెనుక ఎవరిమనసు కరుగకుండును? వెంకమ్మకూడా వారి పొత్తును చూసి చాలా సంతోషించింది.

✂

ఒకనాడుసాయంత్రం సుబ్బు నిద్రపోవడంచేత తాతగారికి ఏమీ తోచక వీథి అరుగుమీద కూర్చున్నాడు. ఊరికే కూర్చుంటే అనేకమైన ఆలోచనలు పుట్టడం మామూలే. తాతగారికీ అనేకమైన వూహాలు పుట్టేయి. అన్ని ఊహాల్లో "ముసలికాలం వచ్చింది. కాలు చెయ్యి యీమాత్రం దృఢంగా వున్నప్పుడే కాశీకి పోయి గంగాస్నానం చేదామన్నది" ఒకటి. తాతగారికి చాలా రోజుల్నుంచీ ఈ కోరిక ఉన్నప్పటికీ డబ్బు చాలా ఖర్చయిపోతుందన్న భయముచేత ప్రయాణం మానేసేడు. డబ్బు ఖర్చయితే అయిందివెళ్దామని నిశ్చయం చేసుకొనేసరికి వెంకమ్మ సుబ్బు తన యింట్లో ప్రవేశించేరు; అంచేత మళ్లా ప్రయాణానికి ఆటంకం వచ్చింది. కాని ఈ సంసారలంపటం ఎలాగో వదుల్చుకొని కాశీ తప్పక వెళ్దామని శాస్త్రిగారు నిశ్చయం చేసుకున్నారు. ఇంతట్లో చీకటిపడ్డాది. ఇంట్లోనించి వెంకమ్మ "వంటయిందని" కేకవేసింది.

తాతగారు మడికట్టుకొని సంధ్యావందనం చేసి భోజనానికి కూర్చొని వెంకమ్మని పిల్చేరు.

"వెంకూ! నేను రెండుమూడు రోజుల్లో కాశీకి పోవాలి. నీ మొగుణ్ణి వచ్చి మిమ్మల్ని తీసుకుపొమ్మని ఉత్తరం వ్రాయి."

"అలాగే తాతా! ఆయనకి వారంరోజులు కిందటే కదా అయింది ఉద్యోగం. వచ్చే ఆదివారం వస్తానని వ్రాసినారు. మేము వెళ్లిపోయిన తర్వాత నీవు కాశీకి వెళ్లవచ్చులే" అన్నది వెంకు.

"ఆ! ఇలాగే కాలక్షేపం అయిపోతున్నాది. ఎప్పుడు కాశీకి పోదామన్నా ఏదో ఆటంకమే. ఆయన వచ్చినా రాకపోయినా ఎల్లుండి మీరు వెళ్లిపోండి. ఆ మర్నాడు మంచిది. నేను కాశీకి బయల్దేర్తాను."

"సరే, లే."

ఆ రాత్రే సుబ్బుకు ఉపద్రవమయిన జ్వరం వచ్చింది. రాత్రంతా కలతనిద్ర. ఊరికే అదే పలవరించడం. వెంకమ్మ, శాస్త్రీగారుకూడా తెల్లవారిందాకా పిల్లవాడి దగ్గరే కూర్చున్నారు. మర్నాడు మరీ హెచ్చింది. జ్వరం. పలవరింతల్లోకూడా సుబ్బు "తాతా! తాతా!" అని పిలిచేవాడు. తాత దేవతార్చన భోజనంకూడా మానుకొని పిల్లవాణ్ణి కాచుకొని కూర్చున్నాడు. అనేకమైన మందులు తెచ్చి పోసేడు. వెంకమ్మ కానీ తీసి వెంకటేశ్వర్లుకి ముడుపు కట్టింది. మూడవనాటికి జ్వరం పూర్తిగా తగ్గింది. వారంరోజుల కల్లా మామూలు రస్తాలో పడ్డాడు. ఈ జ్వరం రావడంకాదుగాని సుబ్బుకు తాతదగ్గిర మరీ చనువు హెచ్చయిపోయింది.

శాస్త్రీగారి కాశీప్రయాణం పిల్లవాడికి జ్వరం రావడంవల్ల మళ్లీ ఆగిపోయింది. పిల్లవాడు మామూలు స్థితికి రాగానే తాతగారికి కాశీప్రయాణం జ్ఞాపకం వచ్చింది. లేనికోపం తెచ్చుకొని "వెంకూ! రేపు ఉదయం నీవూ సుబ్బూ ఊరికి పొండి. నేను కాశీకి తప్పక పోవాలి. ఎప్పుడు పోవాలన్నా మీ ఆటంకమే" అన్నాడు. సుబ్బు "తాతా! నేనుకూలా వత్తానూ ఊ ఊ" అని యేడ్చేడు.

౬

మరునాడు తెల్లవారేసరికి కామేశ్వరరావుగారు దిగేరు. ఆయన యింట్లో కాలు పెట్టీపెట్టడంతోటే శాస్త్రిగారు లెక్చరు మొదలెట్టారు. "ఏమయ్యా! నీకు పెళ్లాంపిల్లల ఘోష అక్కరలేదా యేమిటి? సుబ్బుకు ఉష్ణమని వ్రాసినా వచ్చేవుకావు. ఎవడు చేస్తాడనుకున్నావు వీళ్లకు చాకిరీ. నేను కాశీకి పోవాలని అనుకుంటే ఎప్పుడూ వీళ్ల ఆటంకమేనా? వేగిరం వీళ్లను మీ యింటికి తీసుకుపో."

కామేశ్వరరావుగారు తనకు ఒక్కరోజుకంటే ఎక్కువ శలవులేదనీ, అంచేత ఆ మధ్యాహ్నమే ప్రయాణమనీ వెంకమ్మతో చెప్పేరు. సుబ్బు "తాతకూలా వత్తాలా?" అని అడిగేడు.

మధ్యాహ్నం కామేశ్వరరావుగారు, వెంకమ్మ, సుబ్బు బయలుదేరారు. శాస్త్రిగారు వారిని స్టేషను వరకూ అంపకం పెట్టారు; రైలు కదిలేవరకూ సుబ్బును ఎత్తుకొనే వున్నారు. అంచేత సుబ్బు, తాత తనతో వస్తాడనే అనుకున్నాడు. కాని రైలు కదిలేవేళకి సుబ్బును కామేశ్వరరావుగారు తీసుకోగానే, వాడు "తాతా! లా, తాతా! లా" అని రాగం మొదలెట్టాడు. "ఆ తాత నీతో యెందుకు వస్తాడు? కాశీకి పోతాడు." అని వెంకమ్మ ఎత్తి పొడిచింది. "రేపు నేను వస్తాను. నీవు ఇవ్వాళ వెళ్లు" అని తాతగారు సుబ్బును ఊరుకోబెట్టేరు.

౭

రైలు వెళ్లిపోగానే, తాతగారు యింటికి చేరారు. ఏపక్క చూసినా యిల్లు నిద్దరోతూవుంది. ఆయనకు ఏమీ తోచలేదు. సుబ్బు దగ్గర లేకపోవడంచేత ఏపని చెయ్యడానికీ మనసు పోలేదు. రాత్రి వంట వేళయింది. చాలారోజుల్నించీ అలవాటు తప్పిపోవడంచేత వండుకోవడం గొప్పచికాకనిపించింది. భోంచేసి పడుకున్నారుగాని నిద్ర పట్టలే. కళ్లు మూతపడేసరికి సుబ్బు కనపడేవాడు. తాతగారు ప్రొద్దుటే లేచి "మరి కాశీ లేదు, గంగాలేదు సుబ్బు దగ్గిరకే పోవాలి." అనుకున్నారు. వేగిరం భోంచేసి రైలెక్కేరు.

రైలు దిగి కామేశ్వరరావుగారింటికి తాతగారు వెళ్లేసరికి సుబ్బు వీధిలో ఆడుతున్నాడు. "అమ్మా అగ్గో తాత" అని కేక వేసాడు. వెంకమ్మ నమ్మలేదు. కాని తాత సుబ్బునెత్తుకొని ఇంట్లోకి వస్తే చాలా ఆశ్చర్యపడ్డాది. తాతా, మనమడు కొంచెంసేపు ఆడుకున్న తరువాత వెంకమ్మ మెల్లిగా తాత నడిగింది.

"ఏం? తాతా! కాశీకి పోవా?"

"ఆ! ఏం? కాశీ అమ్మా! మనసే కాశి! మనసే గంగ! మనశ్శుద్ధియున్నచో చాలును. కాశీకి పోనక్కరలేదు. నే నింక సుబ్బును వదిలి ఉండలేను. అంచేత కాశీకి పోను."

# వ్యత్యాసము

## చిరంజీవి మిల్లి శివరామకృష్ణ ప్రసాదుగారు

అధికసౌందర్యవతియైన యతివమిన్న
తగిన విజ్ఞానమునుగాంచి తనరెనేని
కమ్మతావులజిమ్ముపుష్పమ్మురీతి
తలనుదాల్చి పూజింతురు ధరణిజనులు.

విద్యయన నేమొ యెరుగని వెలదికకట
ఎంత సౌందర్యమున్నను ఏమిఫలము
సౌరభములేని యట్టి పుష్పంబునెవరు
గారవింతురు సౌందర్యగరిమగాంచి.

# హిందూధర్మశాస్త్రము: స్త్రీవారసులు

పెమ్మరాజు సత్యనారాయణగారు బి. ఏ.

పూర్వకాలమునందు ప్రపంచములోని యన్నిజాతులయందును గుటుంబములోని పురుషులలో పెద్దవాఁడే వ్యవహారములను జక్కఁబెట్టుచు కుటుంబపుఆస్తికి కర్తగానుండెడు వాఁడు. అట్టి స్థితిలోఁ గుటుంబములోని తక్కిన పురుషులకే హక్కులు తక్కువగా నున్న పుడు స్త్రీల మాట జెప్పవలెనా? రానురాను కుటుంబములు చీలిపోయి పురుషులలో ఆస్తి పంపకములు కలిగినపుడు స్త్రీలకుఁగూడ జీవనాధారమునకుఁ గొంత ఆస్తిని ప్రత్యే కింపవలసి వచ్చెడిది. అట్లు ప్రత్యేకింపబడిన ఆస్తిలో స్త్రీలకు మొట్టమొదట హక్కులు తక్కువగా నున్నను రానురాను పురుషులతో సమానముగా స్త్రీలు హక్కులను గలిగి యుండిరి.

స్త్రీలలో మొట్టమొదట కుమార్తెకు హక్కులు కలిగినవి. పుత్రులు లేనప్పుడు పుత్రికాపుత్రుఁడే కుటుంబయజమానికి పరలోకగతులను పుత్రునితో సమానముగా నిలఁ బెట్టఁగల సమర్థుఁడని తలఁచుటచే, తండ్రి తన పుత్రికకు వివాహముచేసిన తర్వాత కూడ తన యింటనే యామెను పెట్టుకొని తన ఆస్తికి తదనంతరము ఆమెను హక్కురాలినిగాఁ జేయుచుండెను. గొడ్రాలగు కూఁతురునకు మాత్రము అట్టి హక్కులు లేవు.

కుమార్తెలలో మొదట కన్య, తర్వాత నిర్ధనయగు వివాహిత, తర్వాత ధనవంతు రాలగు వివాహిత తండ్రియొక్క ఆస్తికి వారసురాండ్రు.

కుమార్తె తర్వాత తల్లియొక్క హక్కులు బయలుదేరినవి. తండ్రికన్నను తల్లియే దగ్గఱ బంధువని, రక్తసంబంధ మెక్కువయని భావించుటచే తల్లి మొదట, తర్వాత తండ్రి పురుషుని ఆస్తికిఁ గర్తగా నెంచబడియున్నారు.

తల్లి తర్వాత భార్యకు హక్కులువచ్చినవి. కాని రానురాను, భార్యయే స్త్రీలలో నగ్రస్థానము వహించెను. భార్య అనఁగా భర్తశరీరములో సగము అని భావించిరి. సగము (భర్త) చనిపోయినపుడు తక్కిన సగము (భార్య) బ్రతికియుండగా నితరులకు ఆస్తిచెందుట

అన్యాయము. అందుచే పురుషుని విభాగపు ఆస్తికిని, స్వార్జితపు ఆస్తికిని యతని వితంతువే హక్కుదారాలు. అట్టిహక్కు ఆమె జీవితకాలమువఱకే అని పెద్దలు శాసించిరి. ఆస్తి సంక్రమించునాఁటికి ఆమె పతివ్రతగానుండవలెను. తర్వాత వ్యభిచారిణియైనను ఆస్తి నిలుచును. కాని పునర్వివాహాము చేసికొనినయెడల ఆస్తి పోవును.

పుత్రులుగాని, మనుమలుగాని, మునిమనుమలుగాని (పుత్రునిసంతతివారు) లేనపుడు వితంతువు తర్వాత కుమార్తె పురుషునికి వారసురాలు. ఆస్తి నాక్రమించునాటికి యామె పతివ్రతగానుండ నక్కఱలేదు.

కుమార్తె తర్వాత కుమార్తెయొక్క కుమారుఁడు వారసుఁడు. ఎందఱు మనుమలున్న అన్ని వాటాలుగా ఆస్తిని పంచుకొని అనుభవింతురు.

పుత్రికాపుత్రుని తర్వాత బంగాళాదేశములో తండ్రియు, మన చెన్నరాజధానిలో తల్లియు వారసులు. బంగాళాదేశములో తప్ప తక్కినరాజధానులలో తల్లి ఆస్తిని గైకొనునపుడు యామె పతివ్రతగానుండ నక్కఱలేదు.

సవితితల్లి బొంబాయిరాజధానిలో తప్ప తక్కినరాజధానులలో వారసురాలు కాదు.

తలిదండ్రుల తర్వాత సోదరుఁడు, సోదరుని పుత్రులు, వారి తర్వాత వారి పుత్రులు వారసులు. తర్వాత మనరాజధానిలో తండ్రితల్లి, తండ్రితండ్రి, పుత్రుని పుత్రిక, పుత్రికాపుత్రిక, చెల్లెలు, చెల్లెలు కొడుకు, తండ్రి సోదరుఁడు, తండ్రి సోదరుని కొడుకు, తండ్రి సోదరుని కొడుకుకొడుకు వగైరాలు వరుసగ వారసులు. ఇందలి స్త్రీలకు హక్కులు ఇండియా గవర్నమెంటువారి 1929-వ సం॥ రపు రెండవ ఆక్టువలనఁ గలిగినవి. స్త్రీలకు జీవితకాలపు హక్కుమాత్రమే కలదు.

## అనంతుని పెండ్లి

వడ్లమాని అప్పారావుగారు

ఇది మహోన్నత దివ్యదేదీప్యమాన
మంగళాక్షతాశీర్వర్ష మంటపమ్ము;
ఇదియె సాంధ్యరాగముహూర్తవేళధౌత
కౌముదీసుభ్ర మాధుర్యకాంతి ఝరులు
కలువకౌగిళ్లలో చేరు అలరుపెండ్లొ!
ఇదివినూత్న చైత్ర మృదుప్రమేయదీర్ఘ
మల్లికాదేవి నూత్న సామ్రాట్టువనమొ!

వలపుపందిళ్ల కనుచూపు కలువ సుధలు-
తోరణాలల్లి యొండొరుల్ తొట్రుపడుచు
మెడదరాగాల ముగ్గుల,గడపినారు-
జీవితామలవేది నాసీనులౌచు
ప్రేమసూత్రమ్ము కేలెత్తి బిగియగట్టి
దంపతులు మీరు ప్రేమనిధానమందు
మిళితమైనారు...... ..........

# గర్భధారణచిహ్నములు

ఆలూరు రామచంద్రయ్యగారు బి. యె.

మానవసృష్టియే వివాహముయొక్క ముఖ్యోద్దేశము. కానిచో ఈశ్వరుడు పుట్టించు శక్తిని నరులకు ప్రసాదించియుండడు. వివాహానంతరము గర్భధారణ సైజముగనుక ప్రసవవిషయమై ప్రతివివాహితయు తెలిసికొనియుండవలెను. లేనిచో గర్భవతియైనప్పటి నుండి ఆమె భయమునకును సంశయములకును లోనగుచుండును. తలిదండ్రులీ విషయమున తగుసదుపాయము లొనర్పవలెను. ఒనర్చిన ఆయమ ధైర్యముగనుండగలదు.

గర్భముధరించుటకు మొదటిచిహ్నము ఋతుస్రావము నిలచిపోవుట. గర్భముధరించి నట్లు యువతికే తోచును. ఐదారువారములు గడచినవెనుక ముఖవికాసము తగ్గును. తల తిరిగినట్లుండును. భోజనాత్పూర్వమును, అనంతరమును అరోచకముగనుండును. ఉదయ మున కడుపునందు అసహ్యముతోచి వమనములగును. ఈచిహ్నములు కొందరుస్త్రీలయం దధికముగను కొందరియందు తక్కువగను కాన్పించును. ఒకానొకపురుషునికి తనభార్య గర్భముధరించి ప్రసవించువరకును ఆమెకుండవలసినచిహ్నములన్నియు తనయందే అగుపడె ననియు, ప్రసవసమయమున నాతడు తనపనులను చేసికొనుటకు శక్తిలేనివాడయ్యెననియు ఒకవైద్యుడు చెప్పుచున్నాడు.

గర్భవతికి అన్నముమీదనంతగా ఇష్టముండదు కాని చిఱుతిండ్లయం దాసక్తి యెక్కువగనుండును. మరియు ఫలాదులనుకోరును. ఆరోగ్యకరములగు ఫలముల భుజించుట మంచిది.

ప్రాతఃకాలవమనములు అనేకదినములుండవు. వాటికిబదులు పంటినొప్పిగాని నర ములసలుపుగాని బయలుదేరును. ఈనొప్పి తనంతట వదలిపోవును కాబట్టి ఓర్చుకొనవలెను. పంటి నూడబెరికినను నొప్పితీరదు.

మరియొకచిహ్నము ఉమ్ములు అధికమగుట. నోటియందు విశేషముగ నీళ్లుఊరి ఉమ్ములు అధికమై చొంగకారును. అది కొందరికి నవమాసములవఱకుండును. కొందరికి కొన్ని దినములుమాత్రముండును. కొందరికి ఉండనేఉండదు.

మరియొకగురుతు స్తనములుపెరిగి పులకరించుట. రజస్రావమునిలిచిన కొంతకాలము నకే యీమార్పు గోచరించును.

ఇవిగాక మరికొన్ని చిహ్నములు గలవు. అవి స్త్రీలకు తెలిసియుండవు. తెలిసియుండినను పాటింపబడవు.

నాడీపరీక్షవలనకూడ స్త్రీ గర్భవతియైనట్లు గుర్తింపవచ్చును. గర్భవతి పండుకొన్నను కూర్చుండినను నాడి ఒకేరీతిగ కొట్టుకొనును. గర్భిణికానిస్త్రీకి అట్లుగాక నిలుచున్న వేగముగను, కూర్చొన్న మందముగను కొట్టుకొనును.

గర్భముధరించిన ఆరువారములకు చనుమొనలును వానిచుట్టుప్రదేశమును నలుపెక్కి పైకి ఉబుకును, మరి గట్టిపడును. నాల్గుఐదుమాసములైనపిదప స్తనముల పిండిన-చో పాలు వచ్చును. ఇదియు నమ్మతగినది. ఈపరీక్షలవలన సర్వము బాగుగినేయున్నదని ఊహింపవలెను.

కాలికండరములు బలిసి నిలుచుటకుకూడ కష్టముగనుండుట మరియొకగురుతు.

మూడవమాసాంతమునుండి నడుమునందు నొప్పికలుగును. ఇది పిండము వృద్ధిపొందుటవలన. అప్పటినుండి తొమ్మిదవమాసమువరకు కడుపు క్రమక్రమముగా పెద్దదై ప్రసవమగువేళకు రొమ్ముయెముక నంటును.

కొందరికీసమయమున మూలవ్యాధి వచ్చుటకలదు. కాని యీవ్యాధిచే పీడింపబడువారు బలహీనులుగను, వ్యాధి నదివరకేగలవారుగను ఉందురు.

గర్భోత్పత్తియైన సుమారు నాల్గుమాసములకు గర్భమునందొకవిధమగు చలనమేర్పడును. ఇందులకుకారణములు నిర్ణయింపజాలకున్నారు. శిశువుకు ప్రాణమువచ్చి గర్భగోళమున తిరుగుచున్నదని కొందరూహించుచున్నారు. ఈచలనమునకు ప్రత్యేకప్రాముఖ్యత యెట్టిది లేదు.

గర్భముధరించినట్లు తెలియగనే స్త్రీ ఆరోగ్యమును కాపాడుకొనుటకు ప్రయత్నింపవలెను. మొదటనే మంచివైద్యురాలియొద్ద పరీక్షచేయించుకొనవలెను.

మంత్రసానిశాస్త్రము చక్కగనరసి అనుభవమునుపొందినస్త్రీనే మంత్రసానిగ నేర్పరచవలెను వ్యయమునకుభయపడి తెలిసితెలియనివారెసహాయమును కోరెన-చో తీరని ముప్పుకలుగుట నిశ్చయము.

తల్లిగాని సోదరిగాని సహాయమునకులేని-చో దాది నేర్పాటుచేయవలెను. ఆదాది చేయు కార్యములన్నియు వైద్యురాలిసమ్మతి బడయవలెను. డాక్టరులనుంచుకొనుటకు శక్తిలేనివారు ఆసుపత్రులకుపోయినయెడల కాన్పునకు వసతులన్నియు ఊరకచేయబడును. పాలుమాలిన-చో తీరనివ్యాధిసంభవించును.

# బాలవిజ్ఞానశాఖ

౧ పదము

## తోక్కు పలుక్కులు

శ్రీమతి బి. జ్ఞానాంబగారు

రా, రా—
ఏమిరా ?
బండిఅ—
ఏమిబండి ?
పెట్టెబండి—
ఏమిపెట్టె ?
చెక్కపెట్టె—
ఏమిచెక్క ?
జాజిచెక్క—
ఏమిజాజి ?
సన్నజాజి—
ఏమిసన్న ?
చెయ్యిసన్న—
ఏమిచెయ్యి ?
తోలుచెయ్యి—
ఏమితోలు ?
పులితోలు—
ఏమిపులి ?
పెద్దపులి—
ఏమిపెద్ద ?
కులముపెద్ద—
ఏమికులము ?
రంగుకులము—
ఏమిరంగు ?
మోర్రంగు—
ఏమి మోరు ?
నన్నుమోర్.

౨. పద్యము

## మన ఆటల పేళ్లు

గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మగారు

౧
చిమగుడు దూబూచి చిట్లపొట్లాకాయ
గుమగుమగుంచాలు గూవనాళ్లు

౨
చీకటిమొటికెళ్లు సిరిసింగణావత్తి
కుప్పిగంతులు నెట్లు కుందికాళ్లు

౩
తూరనతుంకాలు గీరనగింజలు
గుజగుజరేకులు గుంటచాళ్లు

౪
పింపిళ్లు కుచ్చెళ్లు పిడిగ్రుద్దులాటలు
దాగిలిమ్రుచ్చులు తన్నుబిల్ల

౫

బొమ్మరా లువ్వలపోటి వెన్నెలకుప్ప
లప్పళా లాలంకు లందలములు

౬

గంజనగా లీనెగాజులు నాల్గుకం
బాలాట బిట్టనగోలె లాకె

౭

పుట్టచెం డ్లుప్పనబట్టె లచ్చనగండ్లు
పిల్లదీపంబులు పిల్లగోళ్లు

౮

పీకెలు బొమ్మల పెండిండ్లు నోమన
గుంటలు గుజ్జెనగూళ్లునంజి

కోలక్రోతులు గొబ్బెళ్లు కుందెనగుడి
గ్రచ్చకాయలు కనుమూసిగంత లల్లి
చిక్కనాబిల్ల లోటిల్లు చిందెఱయన
నొప్పునాటలవేళ్లయి యువిదలార!

3. పాటలు

## దొంగాట

శ్రీమతి ధార్వాడ లక్ష్మీబాయమ్మగారు

ఉత్తుత్తీ పళ్లు
ఉత్త్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు
నిమ్మా పళ్లు
తోడిపిల్లలార! దొంగైన పిల్ల
తన మొగుడిపేరేమొ తానెచెప్పాలి
ఉత్తుత్తీ పళ్లు—ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు—నిమ్మా పళ్లు

(కస్తూరిదొంగ)

ముద్దు కస్తూరి! నీ మొగుడి పేరేమొ?
నా మొగుడిపేరొచ్చి నారింజపండు!
ఉత్తుత్తీ పళ్లు—ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు—నిమ్మా పళ్లు

(రమణ దొంగ)

చిట్టి రవణా! నీ చెల్వుపేరేమొ?
నా చెల్వు పేరొచ్చి—నే చెప్పనమ్మ!
చెప్పవా? దొంగైతె తప్పదో యమ్మ!
నాచెల్వు పేరైతె నా చిట్టిమొగుడు!
ఉత్తుత్తీ పళ్లు—ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు—నిమ్మా పళ్లు

(శాకుంతల దొంగ)

శాకుంతలా! నీ చిన్నిమొగుడెవడె?
నా చిన్ని మొగుడొచ్చి ఆ చందమామ!
ఉత్తుత్తీ పళ్లు—ఉత్రాణీ పళ్లు
నేరేడీ పళ్లు—నిమ్మాపళ్లు

(సీతమ్మ దొంగ)

సొగసు సీతా! నీ మొగుడిపేరేమొ?
పాలసంద్రమిమ్మాది బాలకృష్ణుండు.

## జోలపాట

శ్రీమతి కొత్తపల్లి శారదాంబగారు

చిచ్చోలోలోహోయిహోయి ఆపదలుగాయి
చిన్నవాళ్లనుగాయి శ్రీ వెంకటేశ!
శ్రీవెంకటప్పయ్య దిక్కునీవయ్య
శరణన్నవారిని చేకొనుమయ్య!
తిరుపతికి బొయ్యేటి చిట్టిదాసరి!
తిరువెంగళప్పనికి యెందరే స్త్రీలు?
పెద్దాపె నాంచారు పేరుతులశమ్మ
అందరిలో చక్కనిది అలుమేలుమంగ.
చిలకల్లు చెలరేగి జీడికొమ్మెక్క
అబ్బాయి చెలరేగి మామభుజమెక్క.
మామభుజమెక్కి యేమేమియడుగు?
పాలుత్రాగ గిన్నడుగు పాడావునడుగు.
ఎందుకుయేడ్చేవు? ఏలయేడ్చేవు?
పాలకుయేడ్చేవు పసిబిడ్డనీవు.
ఆడితేపాడితే అవ్వలకుముద్దు
చప్పట్లుతట్టితే తాతలకుముద్దు.
చిన్నినాఅమ్మాయి చీమంతెకద్దె
ఏడ్చేటియేడ్పుకు కొండలదురును.
చిట్టిముత్తెముప్పుట్టి సీతకడుపున
స్వాతివానకురిసె సముద్రంబునిండ
చిన్నినాఅమ్మాయి నవ్విపలికితే
మునిపంట్లు ముత్యాలు పగడపుగడాలు
చక్కిళ్ళుచామంతి రేకులుబోలు
తిరు-తిరుమాకొండ తిరైనకొండ
తిరైయున్నదే తిరుపతికొండ.
అందరిమామలు చందమామల్లు
అబ్బాయిమామల్లురామలక్ష్మణులు.
బూచివాడికి బువ్వపెట్టనేరాదు
పెట్టితేఅబ్బాయిని పట్టుకొనిపోను
నిద్రపోనిద్రపో నీలివచ్చినది
నీలిజంగమువెంట బూచివచ్చినది
నిద్రకువెయ్యేండ్లు నీకువెయ్యేండ్లు
నీతోటిబాలురకు నిండువెయ్యేండ్లు
నిద్రపో నిద్రపో భద్రశయనుడ!
బలభద్రశయనుడ! హరి! నిద్రపోర!

౪. వినోదకథ

## గొల్లపిల్ల

శిలిగం జగన్నాథంగారు

ఒక పల్లెటూళ్లో గొల్లదంపతులుండేవారు. గొల్లాతడు గొర్రెల మందను మేపుకొని వచ్చేవాడు. గొల్లది పాలూ పెరుగూ చుట్టుపట్ల గ్రామాలలో అమ్ముకొని వచ్చేది. ఆ సొమ్ముతో జీవనంచేస్తూ ఉండేవారు. వారికి లేకలేక ఒక బుడుతడు పుట్టేడు వృద్ధాప్య దశలో. పేదరికంలో ఉన్నా ఆ వృద్ధదంపతు లాతణ్ణి బహు గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేసేరు. నిండుయవ్వనంలో ఉన్నకొడుక్కి పెండ్లి చేయాలని కలిగింది జననీజనకులకు.

పల్లెలు వెదకేరు, పట్నాలు శోధించేరు చక్కని కోడలికోరకు. ఎక్కడ వెదకినా చక్కని చుక్క లభించిందే కాదు వారికి. తిరగ్గా తిరగ్గా ఆఖరుకి దగ్గిర బంధువుల్లోనే సంబంధం కుదిరింది. పిల్ల గుణవంతురాలు అందగత్తె అని బంధువులు చెప్పిన మాటలు వినడంవల్లనేగాకుండా, స్వయంగా వెళ్లి చూచుకున్నందున తన కొడుక్కి తగిన భార్య లభించినందుకు ఎంతో మురిసిపోయిం దాగొల్లముసలమ్మ.

బంధుబృందంతో తర్లిపోయి ఒక శుభలగ్నాన్ని వివాహం చేసుకొని వచ్చేరు.

కొన్నాళ్లకు కోడలు కాపరానికి వచ్చింది. కొడుకూ కోడలూ ఏమీ అరమరలు లేక పరస్పరానురాగంతో నిత్యసంతోషంగా కాలక్షేపం చేయుచుండడం చూచి ఎంతో ముచ్చటపడేది ముసలమ్మ. ఇల్లా కొంతకాలం గడచేసరికి కోడలు చూలాలయింది.

కాలచక్రం పరిభ్రమణం చేస్తూ ఉన్నకొలదీ ముసలమ్మ భావాలుకూడా మార్పు చెందడం మొదలెట్టాయి. కొడుకు ఎప్పుడూ కోడలితో సరససల్లాపాలాడుతూ, దాని మాయావాగురిలో నిమగ్నుడయి బాహ్యప్రపంచమునే విస్మరించి తమయందు అవిధేయతగా ఉన్నాడని తలచింది. ఆ నూతనదంపతుల ప్రణయవీక్షణాలూ, ప్రేమమయ సుభాషణలూ వారి తక్కిన చర్యలూ చాలాకంటకంగా కనపడ్డవి ముసలమ్మకు. కోడలకు కొడుకు పుట్టేడంటే ఆ భవిష్యత్సంతానంవల్ల ఇప్పటి వీరి ప్రణయవృక్షము మరింత వృద్ధిబొంది వేరులు పారి అభేద్యమవుతుందని అనుకుంది. ఏ విధంగానైనా వారి ప్రేమ భూరుహాన్ని సమూలంగా విచ్ఛేదనం చేయాలని సంకల్పించుకుంది. సాధనోపాయాలను ఊహించడం మొదలెట్టింది.

ముసలిగొల్లనికి ఆకస్మికంగా జబ్బుచేసి నాలుగైదునాళ్లు నవసి నాకలోక మలంకరించేడు. అంత్యక్రియల అనంతరం తండ్రిచేతి గొర్రెలగానే కర్ర కొడుకుచేతికొచ్చింది. నవయవ్వనవతియు, గుణవతియు, అనుకూలవతియు అయిన భార్యని విడచి వెళ్లలేక వెళ్లలేక వెళ్లేడు మందకు. ఇట్లాంటి వియోగం సంభవిస్తుందని కలలోనైనా అనుకోలేదు పాపమా నవయువకుడు.

ఇక కసి తీర్చుకోవచ్చు ననుకొన్నది ముసలమ్మ కోడలిమీద. తన 'అత్తగారి అథార్టీ'ని నిరంకుశంగా చలాయించడం మొదలెట్టింది. కల్ల కపట మెరుగని ఆ గొల్ల పిల్ల తన్నత్తగా రెంత బాధించుతున్నా సహించుకుంటూ గృహకృత్యాలు సక్రమంగానే చేస్తూ ఉండేది. ఎంత చేస్తూ ఉన్నా అది బాగాలేదని, ఇది బాగాలేదని వంకలుపెడుతూ సణుగు

కొనటమేగాకుండా ఇట్లోంచి లేచిపొమ్మని అర్ధచంద్రప్రహారాలుకూడా చేస్తూ ఉండేది. పాప మాగోల గోలుగోలున దుఃఖిస్తూ కృశించి సగమయిపోయింది.

అత్త ఇంకొక ఉపాయ మాలోచించింది. కోడల్ని చల్ల అమ్ముకొనిరమ్మని నియోగించింది. కోడలట్లే చల్లకడవ నెత్తి నెత్తుకొని చుట్టుపట్ల గ్రామాలకు పోయి సంజవేళకు ఇంటికి చేరుకొనేది. అత్తగారు కొడుక్కి అన్నము పెట్టి తాను తిని హాయిగా పరుండేది. కుండలోనున్న కొంచెము మాడుతో క్షుధానల మారక పరితపించేది కోడలు.

దిక్కులేనివారికి దేవుడే దిక్కంటారు. గొల్లపిల్ల కాకలితీర్చుకొనటాని కొక ఉపాయం తోచింది. చల్లను అమ్మటానికి పోయే తోవలో ఒక మారేడు చెట్టుంది. ఆ చెట్టు పళ్లు చక్కగాపండి ఖాదనయోగ్యంగా ఉన్నాయి. ఆ పండ్లు కొన్ని కోసుకొని తిని ఇంత చల్లతాగి కొంతసేపు సేదతీర్చుకొనేది. ఆ చెట్టువద్దకు ఆహారసంపాదనార్థం వచ్చిన గువ్వ పిట్టల మెడలలో తన మెళ్లో ఉన్న నల్లపూసలను తెంపికట్టి వాటి సౌందర్యం తిలకిస్తూ కొంచెంసేపుండి తరవాత తన పనిమీద పోయేది. మళ్లీ వచ్చేటప్పుడు కొన్ని పళ్లు తిని ఆ గువ్వలమెడలలో ఉన్న నల్లపూసలను విప్పుకొని ఇంటికిపోతూ ఉండేది. ప్రతిదినమూ ఇదే విధంగా వెళ్లేటప్పుడూ వచ్చేటప్పుడూ మారేడుపళ్లను తినుచుండడంవల్ల మారేడుపండు వర్ణంగా శరీరచ్ఛాయ మిలమిల మెరుస్తూ ఉండేది.

అత్తగారు కోడలి దినదినప్రవర్ధమానసౌందర్యం చూచి చాలా ఆశ్చర్యపడ్డది. తాను ఇంటిదగ్గర సరిగ్గా అన్నంపెట్టకుండా ఉండడంవల్ల క్రమేణ కృశించి శల్యావశిష్టంగా ఉండడానికి మారుగా జవసత్వములతో నూతనసౌందర్యశోభితంగా ఉండడంచేత పూర్వపు క్రోధానలం మరింత జ్వాలాభీలం కాజొచ్చింది. ఎల్లానైనా కారణం కనిపెట్టాలని గొప్ప తలంపుపెట్టుకుంది.

రివాజు ప్రకారం కోడల్ని పోనిచ్చి తానూ ప్రచ్ఛన్నంగా వెంబడించింది. కోడలు యథాప్రకారం మారేడుపళ్లను తినడం, గువ్వలకు నల్లపూసల దండల్ని కట్టడం ఇదంతా చూచి కారణం గ్రహించింది. గిరుక్కున తిరిగి ఇంటికి వచ్చి కొన్ని పత్తిగింజలను, గొర్రె చీమిడీసీ సంగ్రహించి పూర్వపు చెట్టుదగ్గరకువెళ్లి పళ్ల అన్నిటిలోనూ పత్తిగింజలను గొర్రె చీమిడీసీ పెట్టి గువ్వపిట్టలు అక్కడకు రాకుండా బెదురులుపెట్టింది. ఇక తన కోడలికి ఆహారం దొరక్క చస్తుందనే సంతోషంతో తిరిగి ఇంటికి వచ్చేసింది.

గొల్లపిల్ల సాయంకాలం చెట్టువద్దకు వచ్చేవరకు అక్కడ గువ్వలు కనపడలేదు. వాటికోసం కొంతసేపు వెతికింది. ఎంత వెదకినా అవి కనుపించలేదు. తన మెడలో నల్ల

పూసలు లేనందుకు అత్తగారు కోపిస్తుందని చాలా భయపడ్డది. మారేడుపళ్ళయినాకొన్ని తినిపోదామని రెండుపళ్లు ఏరుకొని తినబోయేసరికి వాటినిండా అసహ్యంగా గొర్రెచీమిడిన్నీ పత్తిగింజలున్నూ ఉన్నాయి. అవి పారేసి ఇంకా కొన్ని ఏరుకుంది. వాటిలోనూ అదే విధంగా ఉన్నవి. పాప మా బాల భగ్నమనోరథంతో, భయోద్రేకహృదయంతో ఇంటికి వచ్చేవరకు కట్టెదుట ప్రత్యక్షమయింది అత్త. మెళ్లో నల్లపూసలు లేనందుకున్నూ అంత ఆలస్యంగారావడానికిన్నీ కారణాలు చెప్పమన్నది కోడల్ని అత్తగారు. సంచలితహృదయారవిందంతో కొయ్యబారి నిశ్చేతనంగా ఉన్న ఆ అమాయికురాలి మీద అవాచ్యములయిన లేనిపోని నేరములు మోపి కొడుకుతో చెప్పి కొట్టించింది. ఇల్లువదలి పొమ్మని గెంటింది. అవమానం దుఃఖం దుస్సహం అవడంవల్ల ప్రాణపరిత్యాగం చేసుకుంది ఆ పసుపు గొల్లపిల్ల.

గువ్వల మెడలు నల్లగా ఉండడానికిన్నీ, మారేడుపళ్లల్లో పత్తిగింజల్లాగ, గొర్రె చీమిడిలాగ ఉండడానికిన్నీ ఇదే కారణమని మన పెద్దలంటారు.

౫. పిట్టకథ

# భూమమ్మకథ

శ్రీమతి శ్రీపాద శారదా దేవిగారు

భూమమ్మ జన్మనామము భూదేవి. ఆమెను భూమమ్మని లోకులు పిలుచుటచే నీ పేరు వ్యవహారనామమై పోయినది. లోకమిత్రమహారాజు సంతానములో ఈమె యొక్కతెయే ఆడుపిల్ల. ఈమెను విష్ణువర్ధనమహారాజుగారి కిచ్చి వివాహము చేసిరి.

ఈమె అత్తవారి ఇంటికి వెళ్లిన తరువాత సంతానవతియై దైవభక్తి, పితృభక్తి మున్నగు సుగుణములతో జక్కగా వర్ధిల్లుచున్నది. ఆమె ఓర్పునకు పెట్టినది పేరు. ఆమె సుగుణములకు నునికిపట్టనియు, అసంఖ్యాకముగా బెరిగిన సంతానమును బోషించు భారమెక్కువై నప్పటినుండియు ఆమె మనశ్శాంతి కప్పుడప్పు డవాంతరము లెన్నియో గలుగుచుండుననియును నారదునివలన విని బ్రహ్మ ఆమెకు కొన్ని దైవికశక్తుల నిచ్చి ఆమె యోగక్షేమములను దనతో మనవిచేసుకొనుట కనుమతి యొసంగెను.

ఒకనాడు భూమమ్మ సరస్వతమ్మ మగనితో తన్నుగూర్చి ఇట్లు చెప్పదొడగెను: "నేను నా తండ్రిగారైన లోకమిత్రమహారాజుగా రింటినుండి విడిపోవునప్పుడు మా బంధువుల అందరిమనస్సులు చింతతో నిండియుండెను. పొరలిపొరలివచ్చు నా దుఃఖమును నేను దిగమ్రింగుకొనియున్నాను. నాటినుండి నేను ప్రొద్దుచూడక భుజింపరాదనియు, దినమున కొక్కసారి ఆత్మప్రదక్షిణంబును, సంవత్సరంబున కొకమారు పితృప్రదక్షిణంబును చేయ నొక నీమ మేర్పరచుకొని యట్లు చేయ మొదలిడితిని."

భూమమ్మ సంకల్పించుకొనినవ్రతము నేటికిని నిరాఘాటముగా జరుగుచున్నది. ఆమె దిగమ్రింగుకొనిన దుఃఖాగ్ని ఆమె కడుపులోనుండి యప్పుడప్పుడు బయలుపడి చలిజ్వర బాధచే దేహము కంపించునట్లు, ఆమె దేహమును గజగజ వడకునట్లు చేయుచుండును. అట్టి సమయమందున చంకనున్న చంటిబిడ్డలు జారి క్రిందపడి వారికి ప్రాణాపాయముగూడగలుగు చుండును.

ఆమె దగ్గర యొక చమత్కారము కలదు. ఎవరైనను ఆమె దగ్గరకు వెళ్లి ఎదుట నిలబడి వీక్షించినచో, ఆమె ముఖము చదునుగను తప్పడగిను నుండునట్లు కనబడును. అట్లుండుటయే నిజమను నమ్మకము సాధారణజనులలో వ్యాపించియున్నది. నిజ మాలో చింపగ బుద్ధిమంతులైనవారికి ఆమె ముఖము గుండ్రముగానున్నదని తెలియకపోదు. ఒక్కొక్కప్పుడు మనకన్నులు మనలనే మోసబుచ్చుచుండును. మనము రైలులో ప్రయాణము చేయునప్పుడు చెట్టుచేమలు నడుచుచున్నట్టు మనము చూచుటలేదా? ఆమె యెండలో నిలుచున్నప్పుడు, ఆమె క్రీనీడ ఇతర వస్తువులపై బడి ఆమె ముఖము గుండ్రముగానున్నట్టు స్పష్టముగా గానవచ్చును. ఆమె నెత్తిమీదనున్న ఆకాశమనెడి టోపి గుండ్రముగానుండుట అందరు యెరిగినవిషయమే. అదియునుకాక ఆమె తండ్రియైన లోకమిత్రమహారాజుగారు గుండ్రని ముఖముకలవారు. ఆమె కుమారుడైన వెన్నెలయ్యాయు నట్టివాడే. ఇట్లే ఆమె సహోదరులైన శనిమహారాజు, శుక్రాచార్యులు, బుద్ధమహర్షి, అంగారక మహాశయుడు - వీరు వారననేల? ఆమె వంశమునందందరును చక్కని గుండ్రని ముఖముగలవారలే. అయినప్పుడు ఆమె విషయమందుమాత్రము మనము అన్యథా యేల తలంపవలయును? ఆమె ముఖమును గూర్చి ఇంతగా చెప్పవలసిన కారణము మనము మన కన్నుల నెల్లప్పుడును నమ్మి మోస పోకూడదని చెప్పుటకొరకే. భూదేవి మిక్కిలి పాటుపడు స్వభావముకలది. రాత్రిపగలుఅనక యెండవాన అనక తన పనులేమో తానేమో కాని ఆమె ఇతర ఇంటి ఆడపడుచులవలె తన ఇంటిపనులను విడిచి పొరుగిండ్లకు నెప్పుడును పెత్తనము చేయబోదు. ఆమె యెప్పుడు విశ్రాంతి గైకొనునో ఆమెను పుట్టించిన బ్రహ్మదేవుడు తప్ప నన్యు లెరుంగ శక్యముకాదు. ఆమె యెక్కడికైన పోదలచినచో చెట్టుగుట్టనక నీళ్లునేలనక అవకాశము (ఆకాశము) ఉన్నంతవరకు ముందుకుపోవుటయే కాని వెనుకంజవేయుటనునది ఆమె స్వభావమునకు విరుద్ధము. ఈ ప్రకారముగా భూమమ్మ సుగుణముల ప్రోవై యెల్లవారిని తన వంకకు ద్రిప్పు కొనుచుండును. అంతటి వశీకరణశక్తిగల భూమమ్మయొక్క స్వభావవర్ణనతో నేడీచిన్న వ్యాసమును ముగించి లోకజ్ఞులు ఆమెనుగూర్చి చెప్పుకొనెడి వింతకథలను మునుముందు వ్రాయ దలపెట్టెదను.

# మొ గ లి

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

మొగలి తుప్పగ పెరుగు చెట్టు. సువాసనగల పూవులను పూవుచెట్లజాతులలో నిది యొకటి. మొగలిచెట్టునేకొందఱు గేదంగియనియు, పువ్వులను గేదంగిపూవులనియును వ్యవహరింతురు. ఇది దక్షిణహిందూదేశమునను, అండమానుదీవులయందును, బర్మారాష్ట్రము లోను దాసియంతట అడివియే డొంకలుగ పెరుగును. వంగదేశమున దీనిని తోటలయందు నాటి పెంచెదరు. పుష్పములయొక్క వర్ణములనుబట్టి మొగలియందు రెండురకములు ఏర్పడుచున్నవి. సితకేతకి, స్వర్ణకేతకి అని. సితకేతకి మగజాతియు, స్వర్ణకేతకి ఆడుజాతియు నని తెలియనగును. సితకేతకి పుష్పములు శ్రావణమాసమునందును స్వర్ణకేతకి పుష్పములు మాఘఫాల్గుణమాసములందును విరివిగదొరకును.

మొగలికి సంస్కృతమున క్రిందినామములున్నవి. కేతకీ; ధూలిపుష్పికా; శూచికా పుష్ప; స్థిరగంధా; విఫలా; గంధిపుష్పా; కనకప్రసవా; లఘుపుష్పా; సుగంధినీ; క్రకచ్ఛదా; దీర్ఘపత్రా; దళపుష్పా; ఛిన్నరుహా; శివద్విష్టా; నృపప్రియా. ఈసంస్కృతనామములచే మొగలిపువ్వుయొక్క స్వరూపమును సులభముగను సమగ్రముగను తెలిసికొనవచ్చును.

## మొ గ లి సా ధా ర ణ గు ణ ము లు

కేతకీ కటు కాపాకే
లఘుస్తిక్తా కఫాపహా॥
—ధన్వంతరినిఘంటు.

కేతకీవాలలావృష్యా
తంద్రా నిద్రా కరీమతా॥
—ఆత్రేయసంహిత.

కేతకః కటుకః స్వాదు
లఘు స్తిక్తః కఫాఘహః
ఉష్ణాతిక్తరసాజ్ఞేయా
చక్షుష్యా హేమకేతకీ॥
—భావప్రకాశః.

మొగలి శ్లేష్మమును హరించును. కాక, పైత్యము, కామ వికారము కలుగజేయును. మూత్రగుండెకు బలముచేయును.

## మొ గ లి పు వ్వు గు ణ ము లు

కేతకీకుసుమం వర్ణ్యం
కేశదౌర్గంధ్యనాశనం
హేమాభం మదనోన్మాద
వర్ధనం సౌఖ్యకారిచ.
—రాజనిఘంటువు.

కేతకీ కుసుమధారణమున కేశముల దుర్గంధము తొలగిపోవును. మనస్సునకు ఉల్లాసమును మదనోద్దీపనమును కలుగును.

### మొగలిచల్లు యొక్క గుణములు

మొగలిచల్లు అనగా మొగలిచెట్టునకు బుట్టిన వ్రేళ్లవంటి ఊడలు.

తస్యస్తనోఽతిశిశిరః రసాయనకరో బల్యో
కటుః పిత్తకఫాపహః దేహదార్ఢ్యకరః పరః.

—రాజనిఘంటువు.

మొగలిచల్లయొక్క రసము వెగటుగనుండును. గుల్మము, శూల, మూలవ్యాధి, ఉదరరోగము వీనిని బోగొట్టును. రసాయనమువలె దేహదార్ఢ్యమును కలిగించును. మొగలిచల్ల రసము పూటకు 3, 4 తులములయెత్తుచొప్పున రెండుపూటలు ఈయనగును.

### మొగలి ఆకుల విస్తరి గుణములు

మొగలి ఆకుల విస్తరియందలి భోజనము మనోహరముగ నుండును. మూత్రకృచ్ఛ్రము, రక్తపైత్యము, వాతము వీని నణచును. చలవజేయును.

### మొగలి ఆకుల వీవన గుణములు

మొగలి ఆకులతో చేయబడిన విసనకఱ్ఱవలని గాలి మనోహరముగనుండును. వాతమును పోగొట్టును; శ్లేష్మమును తగ్గించును; చెమటను ఆర్చును; రక్తపైత్యమును ఉపశమింపజేయును; మేహమును శాంతింపజేయును.

### మొగలితో చేయబడు ఔషధములు

మొగలిపూవుల రేకులనుండి ఒక విధమైన చమురు తీయబడుచున్నది. నీటిలో మొగలిపూ మొగ్గలధృతి దించుటచే ఒక మోస్తరు ద్రావకము తయారుచేయబడుచున్నది. అన్ని పూవులనుండివలె మొగలిపూవులనుండియు అత్తరువు తయారు చేయబడుచున్నది. మొగలి ద్రావకమును, అత్తరువునుగూడ ఔషధములుగ ఉపయోగింపబడుచున్నవి. మొగలిచెట్టు వేళ్లనుండి తయారుచేయబడుచున్న తైలముకూడ ఔషధముగ వాడబడుచున్నది.

### రోగములందు వాడుక

మొగలిద్రావకము దీపనకారియగు ఔషధముగ వాడబడుచున్నది. చెమటపుట్టించుటకును; శూలరోగమును పోగొట్టుటకును ఉపయోగింపబడుచున్నది. మోతాదు అరడ్రాము మొదలు ఒక డ్రాము వఱకును ఈయనగును.

మొగలి అత్తరువు, తైలము ఉద్దీపనమునకు, శూలరోగహరణమునకు, కీళ్లనొప్పుల యందు, తలనొప్పికి ఉపయోగింపబడుచున్నవి. తైలము చెవిపోటులనుకూడ నివారించును. మూర్ఛరోగమునందు మొగలిపువ్వులలోని కింజల్కమును నస్యముచేయవలసినదిగా నిరూపింపబడినది. శిరోరోగములయందు మొగలిపూల లోపలి రేకులు చుట్టకాల్చుట మంచిది. మొగలివేళ్లను పాలతో దంచి గొడ్రాలితనమునకు గర్భపాతభయము కలిగినపుడును లోనికి వాడబడుచున్నది. ప్రమేహములందు మొగలివేళ్ల రసము పూటకు రెండు తులములయెత్తు చొప్పున పంచదారలో కలిపిగాని, మొగలిపూవుల లోపలి రేకులు పిండిన రసమును జిలకర్రపొడి పంచదారలో కలిపిగాని ఏడురోజులు ఈయనగును. పథ్యము వరియన్నము, పెరుగు లేక మజ్జిగ. క్షారపదార్థములన్నియు విసర్జింపవలెను. మొగలిరేకులు ఎండించి యుంచి ఉబ్బసదగ్గుచేత విస్తారముగా బాధగానున్నప్పుడు చుట్టవలెచుట్టి కాల్చిన శ్లేష్మము వెంటనే తెగి పడిపోయి బాధ తగ్గిపోవును.

## కష్టములు పెట్టువాఁడెపో కటికివాఁడు

కని కడుగారాబమున బెంచుచుండిన తల్లిదండ్రుల ప్రాపునెల్లవదలి
యాటపాటలదన్ను నలరించుచుండిన తనదు తోఁబుట్టువులందఱిని వదలి
యిరుగున పొరుగున నెలమితోఁగ్రీడల సలుపుచుండినయట్టి సఖులవదలి
పలుమాఱుఁ జూచుచుఁ బలుకరించుచునున్న మితిలేనిబాంధవప్రతతివదలి

సర్వమును భర్తయేయని శ్రద్ధతోడ
వచ్చికొల్చెడు సాధ్విని వదలిపెట్టి
కష్టములు బెట్టువాఁడె పో కటికివాఁడు
సకలకళ్యాణగుణధన్య! సర్వమాన్య!

— సర్వమాన్య శతకమునుండి.




పిండి విసరుట




కాయకష్టము

(ఈ ఛాయాచిత్రములు రాజమహేంద్రవర నివాసులగు ఎస్. ఆర్. కృష్ణగారు తీసినవి.)



## పదమూడేండ్లనాటి మూగతనము పోయినది:—

ఎర్నెస్టు సూలివాన్ అనువాడొక యుద్ధభటుడు. వానికి ఒకానొక యుద్ధములో తగిలిన గుండుదెబ్బ వలన కొండనాలుక చితికిపోయెను. ఆ కారణమున నాతనికి మాటలాడు శక్తి నశించినది. మూగతనము వచ్చుటచే నతడు చేసన్నలతోడను కనుసన్నలతోడను అభిప్రాయప్రకటనము గావించుచు అవస్థపడుచుండెను. ఇట్లు ఆతడు పదమూడు సంవత్సరములు కష్టపడెను. పదమూడు సంవత్సరముల అనంతర మాత డొకసారి భార్యతోకూడ మాటలాడు బయాస్కోపు ప్రదర్శనము చూడబోయెను. అచ్చట ప్రదర్శనమునందలి నటక చిత్రములు మాటలాడుట కాంచి ఆతడు అత్యుత్సాహభరితుడయ్యెను. ఆట ముగిసిన పిమ్మటకూడ అతనికి కలిగిన ఉత్సాహము తగ్గలేదు. భార్యతో బయటకు వచ్చెను. అప్పుడు ఆతని భార్యకు ఎదురుగా మోటారు వచ్చుచుండెను. ఆమె పరధ్యానముగానుండెను. ప్రమాదము కలుగునట్లుండెను. ఆ సంఘటమున ఆ మూగవాడు మైమఱచి భార్యను కేకవేసి హెచ్చరించెను. మాటలాడు బయస్కోపు ప్రదర్శనము సందర్శించుటచే కలిగిన ఉత్సాహమునకు బయటి హఠాత్సంఘటనముచే కలిగిన భయముతోడై ఆతని మూగతనమును మాన్పివైచినవి. పదమూడుసంవత్సరములుగ మాటలాడలేకుండిన ఆత డిప్పుడు అతి స్పష్టముగ మాటలాడకలుగుచున్నాడు.

## గాలికంటె కెరటములు వేగముగ ప్రయాణించును:—

కెరటములు గాలికంటె ఎక్కువ వేగముతో ప్రయాణముచేయును. కావుననే తుపానుగాలి సోకుటకు ఎన్నియోగంటల ముందుగనే సముద్రమున తరంగములు ఉత్తుంగములై తీరమున హోరుపెట్టును. సముద్ర తీరమున చిరకాలముగ నివసించియుండు ప్రతిభావంతుల కీ సంగతి అనుభవవేద్యము.

## రెండున్నర మైళ్ల లోతు వస్తువులను ఫోటోతీసిన కెమీరా:—

ఇటలీయందలి పిస్టోలా సంస్థానమునకు ప్రభువు గొప్పశాస్త్రవేత్త; అతనికడ నొకవిచిత్రమైన కెమీరా ఉన్నది. అది 13,000 అడుగులు లోతుగల ప్రదేశమునందలి వస్తువులనుకూడ పటముల కెత్తగలదు. ఈ నడుమ నా శాస్త్రవేత్త రెండున్నరమైళ్ల లోతుననున్నవస్తువును తన ఈ కెమీరాసాయమున ఫోటోతీసినాడు.

## మహాసముద్రములందెల్ల లోతైన ప్రదేశము:—

ప్రపంచమునందలి అయిదు మహాసముద్రములందును మిక్కిలి లోతైన ప్రదేశము ఫిలిప్పైను దీవుల చెంత గలదు. సముద్రములను సర్వేచేయు ఓడ 'ప్లానెట్టు' అనుపేరిది అచ్చట 32,089 అడుగుల లోతు

కనుగొన్నది. ప్రపంచమునందలి పర్వతశిఖరములలోనికెల్ల అత్యున్నతమైనదగు ఎవరెస్టుశిఖరమును తెచ్చి ఇచ్చట నుంచినచో ఆ శిఖరము పూర్తిగ మునిగిపోవుటయేగాక యింకను దానిపైన 3,000 అడుగుల ఎత్తున నీరు ఉండును.

### "తెల్లని కాకులును గలవు తెలియరసుమతీ":—

గత సంవత్సరము ఆగస్టుమాసమున కృష్ణాజిల్లా దివితాలూకా రేమాలవారి పాలెమను గ్రామమున రెండు తెల్లని కాకిపిల్లలు కానవచ్చుచుండినవనియు, అవి రంగు విషయములోతప్ప మిగతవిషయములన్నిటి యందును మామూలు కాకులను పోలియుండినవనియు అను వార్త గృహలక్ష్మి పాఠకులకు విదితమే. ఇప్పుడు తూర్పు గోదావరిజిల్లా రాజోలు తాలూకా రాజోలు గ్రామములో డిస్ట్రిక్టు మునసబుకోర్టువద్దను జూలై 3-వ తేదీని ఉదయము 11 గంటలవేళ తెల్లని కాకి వచ్చినది. శరీరము కాళ్లు రెక్కలు అన్నియును తెల్లగా నున్నవి. రంగువేసినదేమో అనుకొనుటకు వీలులేకుండ అది వర్షములో తిరిగినను తెలుపు మాయలేదు. మిగతా కాకులతో బాటు తిరుగుతూ కావు కావు మనుచుండినది. 'తెల్లని కాకులును లేవు తెలియరసుమతీ' అనుదానికిక చెలామణీ లేదు కాబోలును.

### మహానాగము:—

లండను జంతుప్రదర్శనశాలయందు, పాములుంచబడిన బ్లాకులో సెంటు ఆల్బన్సు స్మిత్తుగారిటీవల నొక సర్పమును గొనివచ్చి అందు జేర్చిరి. అది యొక మహానాగము. దాని పొడవు 16 అడుగులు. పడగ ఎత్తి విప్పినపు డిత్రాచు 8 అడుగుల యెత్తు ఉండును. పడగ ఎత్తి విప్పిన సమయములలో అది వెనుకకును ముందునకును తల నాడించినచో చూచుటకు చాల భయంకరముగ గాన్పించును. ఈ మహానాగమును ఉంచుటకు ప్రత్యేకముగా ఏర్పాటులు గావింపబడుచున్నవి. ఇంతటి సర్పము ప్రపంచమున నిదివఱకెన్నడు జంతు ప్రదర్శనశాలలలో ప్రదర్శితము గాలేదు.

### ఆస్పత్రిలో బిడ్డలు మారిపోవుట:—

చికాగోనగరమునందలి ప్రసూతివైద్యశాలలో రెండు మూడుగంటలకాలవ్యత్యాసమున ఇరువురు స్త్రీలు ప్రసవించిరి. పదిరోజుల అనంతరము ఆ స్త్రీలు తమతమ బిడ్డలతో ఆస్పత్రినుండి ఇండ్లకు బోయిరి. ఇంటివద్ద ఆ స్త్రీలలో నొకతెయగు విలియము వాట్‌కిన్సు సతి తన బిడ్డ మెడలోనున్న జేబుపై తనతోడ ఆస్పత్రియందు ప్రసవించిన రెండవ స్త్రీ గృహనామమగు 'బామ్‌బెర్‌జర్' అని వ్రాసియుండుట చూచెను. అందుపై వాట్‌కిన్సు సతి బిడ్డను తీసికొని బామ్‌బెర్‌జర్ దగ్గరకు పోయి మన బిడ్డలు మారుగుడు అయినారు అని చెప్పెను. ఆ స్త్రీ భర్త ఇది విని 'కాలేదు. మేము తెచ్చిన బిడ్డ అచ్చముగ నావలెనే యుండెనని చూచిన వారందఱును చెప్పుచున్నారు' అనెను. ఈ విషయమై విచారణ నడచెను. బామ్‌బెర్‌జర్ స్త్రీకి ఆస్పత్రిలో మంత్రసానిగానుండిన ఆమె బామ్‌బెర్‌జర్ గొనిపోయిన బిడ్డ మెడలోనుంచి వాట్‌కిన్సు అను పేరు వ్రాయబడియున్న జేబును తీసివైచితినని చెప్పెను. అయినను బామ్‌బెర్‌జర్ దానిని చెవినిపెట్టలేదు. 'ఈబిడ్డ సరిగా నన్ను పోలియుండెనని చూచినవారలు అందఱును చెప్పుచున్నారు. ఈ బిడ్డ మాబిడ్డయేగాని అన్యముగాదని' అతడు పట్టుపట్టెను. వైద్యశాలాధికారులు ఈ విషయమై ఎట్టి నిర్ణయమును చేయజాలక శాస్త్రవేత్తలను రప్పించి విచారణ చేయింపదొడంగిరి. వారు వచ్చి బిడ్డలయు, బిడ్డల తండ్రులయు శరీరములు జాగ్రత్తగా పరీక్షించిరి. వారి తలలు కొలిచిరి. చర్మముయొక్క రంగులు పరిశీలించిరి. వెంట్రుకలు పరీక్షించిరి. ఇట్లు పలువురు శాస్త్రవేత్తలు ఒకరినొకరు సంప్రదించుకొనకుండ ఎవరికి వారే పరీక్షలు చేయుచున్నారు. వీరందఱు ఇట్లుచేసిన పరీక్షలయొక్క ఫలితములను తైఫారుచేసి ఏ బిడ్డ ఎవరిదో నిర్ణయింతురట. తాము ఈ విషయమున తప్పక సరియైన నిర్ణయముచేయగలమని ఆశాస్త్రవేత్తలు చాటుచున్నారు. ఈలోగా చికాగో ఆరోగ్యశాఖాధికారి ఇకముందిట్టి తికమకలు కలుగకుండ ప్రసూతివైద్యశాలలలో బిడ్డలు పుట్టినతోడనే వారి పాదముల ముద్రలు తీసికొనబడి భద్రపఱుపబడవలయునని ఆదేశించుచున్నాడు.



## అమెరికా స్త్రీ:—

జె. డబ్ల్యు. కూమ్సుగా రిట్లు వ్రాయుచున్నారు:—

"అమెరికాదేశపు స్త్రీలు మొత్తముమీద చురుకైనవారు. కాని ప్రతివిషయములోను వారు పురుషత్వము ననుకరించుచున్నారేమోఅని ఇంచుక సందియము పొడమక మానదు. వ్యాయామపరిశ్రమలు వారల నారోగ్యవతులగను, బలిష్ఠలగను, పూర్ణస్వతంత్రలుగను జేయుచున్నవి. బాల బాలికల మిశ్రమపాఠశాలలలో వీరు విద్య నభ్యసించు కాలమున, బహుశః బాలుర సాంగత్యముచేతనే వీరి కీ తీరు సునాయాసముగ పట్టువడియుండును. కళాశాలలో తయారైన బాలిక 'అర్ధాంగి' యను నామము సార్థకము చేసికొనగలుగుననుటకు సంశయములేదు. ఏలన, బుద్ధికుశలతయందు తన భర్తకు తోడ్పాటుగ నుండును; గృహనిర్మాణమున కడు నేర్పుతో వ్యవహరింపగలదు. కాని సామాన్యపురుషునకు సాంసారికనిర్వాహణమందారితేఱిన గృహిణియే తగియుండును. ఎందుచేత? ఆమె గృహమే తన సర్వస్వమని యెంచుకొనును; భర్తకు గృహము స్వర్గతుల్యముగ తోపించి, అతని దృష్టి యెల్ల వేళలందును ఇంటివంకనే నిల్చియుండునంత హాయి గూర్చును; ఆఫీసుపని చూచుకొనినవెంటనే మృదుసల్లాపములతోను నిర్మలభక్తియుతమగు సేవతోను తన్నాదరించు ప్రియసఖిని చేరుట కతడు తహతహపడునట్లు చేయును. నూటికి తొంబదిమంది బాలికలు సామాన్యసాంసారికజీవనపథము ననుసరింపవలసియుండుననియు ప్రస్తుతము బాలబాలికలు కళాశాలలో బడయుచున్న విద్య వారి జీవయాత్రకు నిరుపయోగమనియు అందుచే విధానము మార్పుచెందవలెననియు విద్యాశాఖాధికారులు గుర్తించినటుల తోచదు. ఒకేవిధమగు విజ్ఞానమునార్జించిన దంపతులుగల అమెరికా గృహము వలయునంత సౌఖ్యముగ నుండుట యరిది. విద్యావతులగు స్త్రీలు టోపీ లేకుండ వీథులలో దిరుగుటయు, పెక్కు విషయములలో స్వాతంత్ర్యేచ్ఛ నగపరచుటయు సర్వసామాన్యముగ గోచరించుచున్నది. మాతృత్వమును, అందుగల రంజకవిషయములును ఆమెకంత యాకర్షణీయములు గావు. ఎంతసేపును స్వకీయసౌఖ్యము కాలయాపనకొఱకే యామె యాశించుచుండును. జ్ఞానవతులన్నిపట్టులను ఉత్తమలనియే చెప్పవలసియున్నది. నిప్పురాదపెట్టుట వంటి స్వల్పాంశములలోగూడ వారు మెదడుతోనే పనిచేయుదురు. కళాశాలలో జదివిన ప్రవీణురాలు 'చేతులకంటె మెదడునకే' తమ కార్యనిర్వహణములో నగ్రస్థానమిచ్చును."

ఈ విధాన మెంతవఱకవలంబనీయమో, పాశ్చాత్యవిద్యను వాంఛించు భారత సోదరీమణు లూహింతురు గాక!

—ముద్దా. విశ్వనాథము

విద్యుచ్ఛక్తి:—

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారిట్లు వ్రాయుచున్నారు:—

"మన దేహంబున విద్యుచ్ఛక్తి యున్నదనుట యెల్లరకు తెలిసిన విషయమే. ఇంకను నీటియందును భూమియందును మేఘంబులు గూడిన యాకాశమందును యుండుచున్నదని చెప్పెదరు. బలముగలిగిన శక్తిచే బలహీనమగు శక్తి యాకర్షింపబడుననుట విదితమే. విద్యుల్లతల నాట్యంబున విద్యుద్దీపంబులు గప్పున ఆరిపోవుచుండుట చూచుచునేయున్నాము. ఎందరో ప్రాణులు విద్యుద్దీపంబులు నిర్మించునపుడు గొప్పదగు యాశక్తిచే యాకర్షింపబడి యల్పమగు తమ శక్తిని గోల్పోవుచున్నారు. అట్టి శక్తిని యాపుటకు రబ్బరు, మ్రానుపలకలు, పట్టు, జాలియుండునని చెప్పెదరు. మన పూర్వులు దేహమందుండు విద్యుచ్ఛక్తి వెలుపలికిబోవకుండుటకై పట్టు నుపయోగించుచుండిరనియు, నూలువస్త్రములకు పట్టంచులు వేయుచుండిరని చెప్పెదరు. పాదంబులకు పావుకోళ్లను ధరించుచుండిరి. కొయ్య మంచములు బల్లలు నుపయోగించుచుండిరి. భూమిపై మ్రానిపీటలు వైచుకొని కూర్చుండుచుండిరి. దాని యుపయోగ మిటీవల మరుగైపోయెను. ఆదినుండియు పట్టును వాడుట కిదియే కారణమైయుండును. దేవతలు పట్టునే వాడుకొనునట్లు పద్యములచే, శ్లోకములచే, తెలియుచున్నదిగదా? అయిన పట్టుయొక్క యుత్పత్తిని దలచిన మనంబు కలుష్కమగును. వేలకొలది పట్టుపురుగులను వేడినీటవైచి చంపి దాని నివాసస్థానమగు పట్టును మన ముపయోగించుట చాల దయావిహీనంబని నొక్కి చెప్పవచ్చును. ఇంతటి కాఠిన్యంబువహించి యా పట్టును ధరించుటలో యార్యుల యభిమతంబేమొ యెరుగరాదు. దానికి మహత్తరమైన కారణంబుండియుండుననియే నా యభిప్రాయము. దానిని దెలిసినవారీ సందియంబును దీర్చవలయునని వేడుకొనుచున్నాను."

వర్షమును చిత్తమువచ్చినపుడు కురిపింపగలమా?:—

శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారిట్లు వ్రాయుచున్నారు:—

"ప్రకృతి శాస్త్రపరిశోధనలయందు పాశ్చాత్యదేశము లొకదానినొకటి మించిపోవుచున్నయవి. ఇప్పుడు హాలండుదేశమున మన చిత్తమువచ్చినపుడు వర్షమును కురిపింపగలమా? యను విషయమును గురించి విరివిగ శాస్త్రపరిశోధనము జరుగుచున్నయది. మన పురాణములయం దింద్రుడు మేఘముల కధినాథుడు. యజ్ఞయాగాదుల నొనరించి హవిర్భాగములచే నాతనిసంతుష్టిపరచిన యతడు పూర్వపుదినములయందు సకాలమున వర్షముల కురిపించెడివాడు. నేడు హాలండుదేశమునందలి పరిశోధనల మూలముగా మన చిత్తమువచ్చినపుడు వర్షముల కురిపింపగల్గితిమేని యిక మనమే మేఘముల కధిపతులము కాగలము. హిందూదేశమునందలి ప్రకృతి శాస్త్రవేత్తలలో ఘనుడగు ప్రొఫెసరు సి. వి. రామనుగారు ఆ హాలండు శాస్త్రజ్ఞుని కలసికొని సంప్రదించిరి. ఆ ప్రకృతి శాస్త్రవేత్త తన వాయువిమానముపై ఆకాశమున ఎనిమిదివేల యైదువందల యడుగుల యెత్తున కెగిరి మేఘముల సమూహముపై తన వాయువిమానములో కొనిపోయిన చూర్ణమొనర్చబడిన మంచుగడ్డను వెదజల్లెను; వెంటనే మిక్కుటమగు వర్షము ఆమ్సుటర్డాము ప్రాంతమున అకాలమున వర్షించినది. అతడుపయోగించిన మంచుగడ్డ టన్నున్నర బరువుకలది. ఇకముందు వర్షములు కురువనిచోట్ల యీ నూతనమార్గము లవలంబింపబడ నోపును. హాలండు దేశమువంటి స్వతంత్రదేశములందు ప్రకృతి శాస్త్రవేత్తలు తమ పరిశోధనల జరుపుటకు ప్రజలును ప్రభుత్వమునుగూడ సాయపడెదరు. మన దేశమున పరిశోధనలకు ప్రభుత్వసానుభూతిగాని ప్రజాసాయముగాని లేదు."

## పసుపు: కుంకుమలు:—

చెన్నపురియందలి పిడారియారుకోవెలవీధిలోని సరస్వతిసంఘమువారి ధర్మవైద్యశాలాధికారియగు సాధూ వైద్యశేఖరుడు 'సండే టైమ్సు' పత్రికలో పసుపు కుంకుమల ఉపయోగములనుగూర్చి యిట్లు వ్రాయుచున్నాడు:—

"1. పసుపుగుండను హిందువులు అన్ని వంటకములలోనుగూడ చేర్చెదరు. 2. స్త్రీలు స్నానముచేయునపుడు పసుపును రాచుకొనియే స్నానముచేసెదరు. 3. ఇండ్లలో గుమ్మములకు పసుపురాచి కుంకుమ పెట్టెదరు. 4. సువాసినులు స్త్రీలకాళ్లకు పసుపురాచెదరు. 5. భగవంతుని పూజచేయుటకు పీఠము నలంకరించుటలో పీఠము కలశము మున్నగువానికన్నిటికిని పసుపురాసెదరు. 6. శుభకార్యములలో స్త్రీలకు పసుపు కుంకుమల నిచ్చెదరు. అటుల నాహ్వానించునపుడుగూడ మా యింటికి "పసుపుకుంకానికి రావలెను" అనియే సువాసినుల నాహ్వానించెదరు. 7. పెండ్లిండ్లు మున్నగు శుభకార్యములలో పసుపుచీరలను తడిపి స్త్రీలకిచ్చెదరు. 8. తిరుపతియాత్ర మున్నగుయాత్రలకు వెళ్లెడు స్త్రీ పురుషులు పసుపులో తడిపి ఆరవేసినబట్టలనే కట్టుకొందురు. 9. పసుపుకుంకుమలు లేకుండ ఏశుభకార్యమును జరుగదు. 10. శుభకార్యముల కాహ్వానించునపుడు ప్రతి యింటికిని పోయి పసుపుకుంకుమలు నిచ్చెదరు. 11. ఇండ్లను శుభ్రపరచవలసి వచ్చినపుడు పుణ్యాహవచనము జరిపెదరు; అపుడు పసుపునీళ్లను మంత్రించి యింటియందంతటను చల్లెదరు. 12. అంటు ఎంగిలి మున్నగువాని స్పర్శ కలిగినపుడు ఆవుపేడ దొరకనిచో పసుపునీళ్లతోనే స్థలమును అలికెదరు. కుంకుమగూడ పసుపుతోనే చేయబడును. హారతికర్పూరము, సాంబ్రాణి, మంచిగంధము, చందనకాష్టము, పసుపు, కుంకుమ, వేపాకు, తులసి మున్నగునవన్నియునుగూడ హిందువులకు పవిత్రవస్తువులే. వీటి యన్నిటిలోను ఆరోగ్యమును పారిశుద్ధ్యమును కలిగించెడు గుణము కలదు. కావుననే హిందువులు వీనిని పవిత్రపదార్థములుగా భావించుచున్నారు. పసుపు 1. పరిశుభ్రమొనరించును. 2. క్రిములను సంహరించుటలో ఉద్రేకమును కలిగించకుండ శాంతముగా పనిచేయును. పసుపును వేపాకులను సమభాగములుగ తెచ్చి నూరి ముద్దచేసి పుండ్లమీద రాసినచో అన్నివిధములగు పుండ్లును మానును. కుష్ఠువ్యాధివలన కలిగెడు పుండ్లుగూడ మానును. స్ఫోటకము వచ్చినవారికి ఈముద్దనే రాయుదురు. దీనిని రాయుటవలన పుండ్లు యెండిపోయి పక్కులుగట్టి రాలిపోవును. ఈ ముద్దను యెప్పటికప్పుడు తయారుచేయుచున్నచో మరింత గుణము కనబడును. ఒక పలము పసుపును, ఒక పలము వేపాకును తెచ్చి ఒక పడి నీళ్లలో వేసి 15 నిముషములసేపు మరుగనిచ్చి వడపోయవలెను. దానిని సీసాలలో పోసియుంచి యీ కషాయముతో పుండ్లను కడుగుచుండవలెను. సవాయి పుండ్లు కుష్టు పుండ్లు మున్నగువాటికిగూడ నిది చాల మంచిది. దీనిలో రసవిషగంధకాదులు లేవు గాన దీనివలన నెట్టి మంటయును కలుగదు. అతిమూత్రవ్యాధివలన కలిగెడు మాంసగ్రంథులను (పూతిమాంసము) గూడ యీ కషాయముతోగూడ కడిగినచో అద్భుతమగు గుణము కనబడును. శగసంకటము (గనేరియ) ను, స్త్రీల కుసుమవ్యాధి (లుకేరియా) జ్వరము, పెరిపెరలు, సెప్టిక్ ఫీవర్సు మున్నగు వ్యాధులలో నీ కషాయమును తడవకు అర ఔన్సు లేక పాతిక ఔన్సువంతున రోజుకు రెండుమూడు సారులు త్రాగుచుండినచో మరింతమేలు కలుగును. కుసుమవ్యాధిలో పైన కడుగుటకుగూడ దీనిని వాడవచ్చును. ఒక తులము పసుపును ఒక తులము మిరియాలును ఆళాకు నీళ్లలో వేసి అరగంటసేపు మరిగించి వడపోసి కలరారోగికి గంటకొకసారి పావు

అవున్న చొప్పున వాంతులును విరేచనములును కట్టువరకునుగూడ త్రాగుచుండవలెను. గ్రామములో కలరా వ్యాధి ప్రబలముగానున్న రోజులలో ప్రతిదినము ప్రతి మనుష్యుడును ఉదయమున యీ ద్రావకమును ఒక పావు ఔన్సు త్రాగుచున్నచో కలరావ్యాధి రాదు; లేదా ఆరోజులలో కూరలు పచ్చడులు చారు పులుసు మున్నగువానిలో మామూలుకంటె మరికొంత హెచ్చుగా పసుపుగుండను చేర్చుచుండినను గూడ కలరావ్యాధి రాదు. కలరారోజులలో అజీర్తిని కలిగించెడు వస్తువులను వేనిని తినగూడదు. చాల లఘువుగానే తినుచుండవలెను. చాల పరిశుభ్రముగా నుండవలెను. ఇండ్లను బట్టలనుగూడ పరిశుభ్రముగా నుంచవలెను. అన్ని పదార్థములపైనను మూతలు పెట్టవలెను. నీళ్లు బాగుగా మరిగించియే త్రాగవలెను. చద్ది అన్నము, కుళ్లిన పదార్థములు, చెడిపోయిన కాయగూరలు, మిగుల పండినపండ్లు, బజారులలో అమ్మబడు మిఠాయీలు మున్నగువానిని తినగూడదు. ఈ వ్యాధివచ్చినవారి చెంతకు వెళ్లగూడదు. కలరావ్యాధి రాకుండుటకు యింజక్షను లెంతమాత్రమును అవసరము లేదు. కలరావ్యాధి చాలా ముదిరిపోయి మూత్రబంధము కలిగినపిమ్మటగూడ పసుపు ద్రావకము నిచ్చుటవలన చాలమంది బ్రతికిరి. ఇది అత్యద్భుతముగా పనిచేసినది. 5 మొదలు 15 వడ్లగింజల యెత్తు పసుపును అదేతూకముగల మిరియాలను నూరి రెండుమూడుగంటల కొకసారి తినుచుండుటవలనగూడ కలరావ్యాధి నివారణమగును. వాంతులు అజీర్ణము కడుపునొప్పి నీళ్ల విరేచనములు మున్నగు నజీర్ణవ్యాధుల కన్నిటికిని గూడ పసుపు మిరియాల కషాయమే చాల శ్రేష్ఠమైన ఔషధము. ఈకషాయమును కొద్దిగా త్రాగిననుగూడ చాలును. మిరియాలను చేర్చకపోయినను ఒక్క పసుపు కషాయమువలననే గుణమిచ్చునుగాని మిరియాలను గూడ చేర్చినచో మరింత మంచిది. ఒక ఇనుపబాణీలోనైన లేక మట్టిమూకుడులోనైన 5 పెద్ద మిరపకాయలను బాగుగా నల్లబడువరకును వేయించవలెను. మిరపకాయలు బాగుగా నల్లబడిన పిమ్మట ఒక చిటికెడు ఆవాలను వేయవలెను. అవి గూడ బాగుగా వేగగానే ఒక తులము పసుపువేయవలెను. అటుపిమ్మట రెండు నిముషములు వేగనిచ్చి ఒక కాలుపడి నీళ్లను ఆ మూకుడులో పోయవలెను. నీళ్లు బాగుగా మరిగిన పిమ్మట మూకుడును క్రిందకు దింపి వడపోయవలెను. అటుపిమ్మట కలరావ్యాధి వచ్చినవారికి తడవకు ఒక టీస్పూను వంతున అరగంట కొకసారి యీ ద్రావకమును వాంతులును విరేచనములును పూర్తిగాకట్టువరకును గూడ నిచ్చుచుండవలెను. మామూలు అజీర్తివిరేచనములు వాంతులు మున్నగునవి కలిగిననుగూడ నీ కషాయమునే యియ్యవచ్చును. (ఆంధ్రపత్రిక)

భార్య:—

ఆగష్టు 1-వ తేదీనాటి ‘సత్యసాధని’ పత్రికలో శ్రీయుత బలభద్ర కోటయ్యగారు ‘భార్య’ అను శీర్షిక క్రింద వ్రాసిన దిగువ విషయములు గమనార్హములై యున్నవి:—

“భార్య అనగా భారమైనది. భరింపబడదగినది. భర్త భరించువాడు. ఇది మోయదగినదని గ్రహించి మోయుటకు సిద్ధముగ నున్నవానికే బరువెత్తవలయును. శరీరములు నిష్ప్రయోజనకరములని గ్రహించినచో వానివలనంగలుగు ప్రయోజన మద్భుతమనియు, భగవంతునికి వాసయోగ్యములుగావున బవిత్రములనియు బెద్దలనెదరు. దాహముగలవాడు జలాపేక్షచే నిష్ప్రయోజనమగు మట్టికుండను మోయుచున్నాడు. శరీరములు మట్టికుండవంటివైనను వానివలన గలుగు ప్రయోజన మనుభవింపదలచినవానికే భార్య నొనగూర్పవలయును. అప్పుడు భార్యయనగా భరింపబడదగునదియు భర్త భరించువాడును నగును. ఆ యభిమానమునకు మూలాధారము ప్రేమ. మోహము ప్రేమనుండి జనించినదే. మోహమునకును ప్రేమకును గల భేదమును గుర్తెరిగిన

ప్రేమకు వశుడైనవాడు భార్య భరింపబడదగినదనియు మోహమునకు వశుడైనవాడు భార్య భారమైనదనియు గ్రహింపగలడు. భార్యకు అర్థాంగియని పేరు. సగము శరీరముగలది. భర్తకు సగము శరీరమిచ్చినదా? భర్త యొక్క సగము శరీరము తాను పుచ్చుకొనినదా? ఎద్దానినైన మన కిచ్చినవారిని గౌరవించవలయునా? మన యొద్దనుండి పుచ్చుకొనినవారిని గౌరవించవలయునా? భర్తకు భార్య శరీరమునంతయు నిచ్చివేయుచున్నది; గాని సగముమాత్ర మిచ్చివేయుటలేదు. భర్త భార్య కర్ధశరీరము నిచ్చివేయుచున్నాడు. అనగా భర్త భార్య నెల్లప్పుడును శరీరమునకంటించుకొని తిరుగుచుండునని భావము. ఈభావ మాంగ్లేయులపద్ధతులవలన గ్రహింప బడినది కాదు. భార్యకు తన శరీరమునం దర్ధభాగమిచ్చి గౌరవించుట మన దేశమునకు బూర్వాచారమనుట కీశ్వరు డర్ధనారీశ్వరుడనుటయే ప్రబలనిదర్శనము. శరీరనిర్మాణమునందలి విభాగ విమర్శనలో తేజస్సు, ఓజస్సు, మనస్సు అనునవి ఘనమైనవి. వెలుతురు కళాకాంతులు మున్నగువానిని నిరూపించునది వ్యక్తపరచునది తేజస్సు. బాహ్యరూపమునందలి తుష్టిపుష్టిని తెలియజేయునది ఓజస్సు. అన్నిటిని పరిపాలించునది మనస్సు. మనస్సు దేనికిని స్వాధీనముకాదు; మనస్సు భగవంతునికి మాత్రము స్వాధీనమగును. భగవంతుడు అనంగుడు. అనంగుడు మన్మథుడు. మన్మథు డనగా మనస్సునుపట్టి మర్దింపగల సమర్థుడు. మన్మథుడను పేర భగవంతునికి దక్క నన్యులకు స్వాధీనముగాని మనస్సును హరించి మనోహారియగుటవలన భార్య మిగుల గౌరవింపబడినదగు చున్నది. "ప్రపంచమున నిర్ణయభేదముగల వ్యవహారికసూత్రమునకు బ్రధానగ్రంథము భార్య. విషయమహా గహనసంచార పరిశ్రాంతునకు మందారగమహీరుహచ్ఛాయ మానినీమణి. దేని మందహాసము చంద్రఖండముల కును, కటాక్షవీక్షణములు పులకండములకును, హితబోధ కావ్యరససమృద్ధికిని మించునో అది స్వీయకాంత" అని మహాకవులు నుడివియున్నారు; కావున భార్య ప్రాణనాయకి యగుచున్నది. గొప్పతనమును నిరూపించుట కొరకు గొప్పవారి నుదాహరణగా గొనవలయును. అందరికంటెను గొప్పవాడు దేవుడు. జీవుడు దేవునియొద్ద నుండి బయలుదేరి మరల దేవునియందు కలియునను తత్వమునకు జీవబ్రహ్మైక్యమని వేదాంతులనెదరు. పురుషుడు, స్త్రీశరీరమునుండి జనించి మరల స్త్రీ శరీరమున గలియుచున్నాడు. "మనుజుడు దేని శరీరలతికను తన నిజదేహ ద్వితీయముగ నెంచుచున్నాడో, మనుజుడు దేని సౌఖ్యమునుద్దేశించి రేయింబగలు విరామము లేక పాటుపడుచున్నాడో మనుజుడు దేనియందు కలియుటచే జనించి, జనించుటచే కలియుచున్నాడో అది స్త్రీశరీరముగావున స్త్రీ పురుషుల పరస్పర గాఢాలింగనమునకు జీవబ్రహ్మైక్యమని పేరు. భక్తికి తత్పరత్వ మును దన్మయత్వమునానుండును. ఈ యైక్యమువలన దత్పరత్వమును దన్మయత్వమునుగూడ గలుగుచుండును; గావున స్త్రీ పురుషులలో పురుషుడు జీవుడనియు స్త్రీ దేవుడనియు గ్రహించవలయును. మనుజునకు పుణ్య వశమున ననుకూలవతియగు భార్య లభించును. సమస్తవైభవములు మనుజునివెంట రావనియు, తాను చేసిన పుణ్యము మాత్రము వెంటవచ్చుననియు పెద్దలనెదరు. మనుజుని పుణ్యమునకు బాహ్యరూపము భార్య. తనను గన్నవారుగాని, సహోదరులుగాని తనవెంట వచ్చువారు గారు. ఎచటికన్న నచటికి ఛాయవలె, గుఱ్ఱమువెంట తోకవలె తాను చేసుకొనిన పుణ్యమువలె వెంటవచ్చునది భార్యగావున భార్య గౌరవింపబడదగినదే."

## సంగీతము: జంతువులు:—

సంగీతమనిన జంతువుల కిష్టమేనా అను విషయమునుగూర్చి ఇంకను ఎక్కువగ విమర్శింపబడవలసియున్నదని 'జస్టిసు' పత్రిక దిగువవ్యాసమును ప్రకటించుచున్నది:—

"సంగీతము జంతువులకు ఇష్టమా? ఏతద్విషయమై తగు పరిశోధన జేసియుండమిచే పై ప్రశ్నకు జవాబు చెప్పుట కష్టము. సాధారణముగా పిట్టలకు పాములకు సంగీతమన్న యిష్టమనియు కుక్కలకది యయిష్ట మనియు పెక్కండ్రెఱుంగుదురు. దీనికి కారణములు పిట్టలు ఎచ్చటనైన సంగీతమును విని తిరిగి ఆ పాటనే పాడ బ్రయత్నించుట, పాములు నాగస్వరమునువిని ఎచ్చటనున్ననుసరే ఆస్వరమూదబడుచున్న తావునకు వచ్చుట మొదలగునవి కారణములు. కుక్కలు తద్వ్యతిరేకముగా సంగీతము వినబడుచున్నప్పుడు తమయయిష్ట మును దెల్పుచూ, బవుబవుమని ఒక్క పెట్టున గోలబెట్టును. వీథిలో నొకగుఱ్ఱము కదను త్రొక్కుచున్నప్పుడు

బ్యాండువాద్యమున్నయెడల గుఱ్ఱమెంతో యుత్సాహవంతముగ కదను త్రొక్కగలదు. ఆ గుఱ్ఱమో కదను త్రొక్కుచున్నప్పుడు ఏమోటారుకారో వచ్చి తనయింపను చప్పుడుచేసినయెడల నాగుఱ్ఱమాధ్వనికి బెదరి వెడలిపోవును. అనగా గుఱ్ఱమునకా బ్యాండు మొదలగు వాద్యములన్న యిష్టమని తెలియుచున్నది. సంగీతమన్న చెవులుకోసికొను కుక్కలుకూడా కొన్నియున్నవని ఒక బ్రిటిషు వారపత్రికావిలేఖకుడు వ్రాయుచున్నాడు. ఈ లేఖకునకొక శునకముండెడిదట. ఇది పాడమని, యీలవేయుమనికూడా అడుగునట. తనను పాటవినవలయునని బుద్ధిపుట్టినప్పుడు మేజాబల్లమీదకువెళ్లి తన యజమానిముందర కూర్చొని నెమ్మదిగా తన ముందటికాళ్లతో యజమానిబుగ్గలు గీకునట. అప్పుడాత డేదైన నీలవేయుటగాని పాటపాడుటగాని మొదలుపెట్టిన పిదప నాకుక్క శాంతముగా అల్లరిచేయకుండా బల్లమీదకూర్చుండి తోకనాడించుకుంటూ వినునట. ఇక గుఱ్ఱములవిషయమై యాలోచింతుదము. సామాన్యమైన సంగీతపుపాట గుఱ్ఱములకు పనికిరాదు. తప్పెట్లు కొట్టుట డోలుకొట్టుట మొదలగు పెద్దధ్వనిగల సంగీతము గుఱ్ఱముల నాకర్షించగలదు. ఇయ్యది కొంతమంది మానవులకు అయిష్టముగనుండవచ్చును. కారణము ఆధ్వనికి మానవునిచెవులకున్న శక్తిపోయి చెవుడువచ్చును. పక్షులు అట్లుగాక సంగీతమన్న తమకు యిష్టమనికూడా తెలుపును. మయినాపక్షులు కనరీపక్షులు మన సంగీతమును విని, మరల నాసంగీతమునేపాడ ప్రారంభించును. అయ్యది వానికి సంగీతమన్న యిష్టమనుటను దెలుపును. పక్షులు కాలానుగుణ్యముగ ప్రవర్తించును. కోయిల వసంతఋతువునందుమాత్రమే కూయును. గోరువంక శబ్దము డిశంబరు జనవరినెలలలో వినబడును. యింకొకపక్షి యింకొక కాలమందు కూయును. కొన్ని పిట్టల పాటలు మానవులకు యిష్టముగ నుండును. మఱికొన్ని యయిష్టముగానుండును. రూకుపక్షులపాటలు ప్రతివానికి అయిష్టముగానేయుండును; గాని పక్షులకు యిష్టముగనేయుండవచ్చును. లండను నగరమున కాకెటోయను పక్షి వీణె వాయించగలదు. రివరెండు యఫ్. డబ్లియు. టర్నర్ గారు పెంచుచున్న కాకెటో యనుపక్షిగూడ వీణె వాయించగలదట. ఇక సర్పముల విషయమై నాగస్వరము పాములను లోబరచుకొనుట యెంత నిజమయియుండునో ఆలోచింతము. నాగస్వరమును పాడుచు, బుట్టతీయగనే పాము తనతల యెత్తి పడగవిప్పి, ఆడించుచు, తన ఆనందమును, హాయిని తెలియజేయును. పాములుగూడ జంతువులవలనే మానవులను తమ మిత్రులవలె భావించుచుండునుగాని విరోధులుగ భావించవు. శాస్త్రపరిశోధకులు యింకను బరిశోధించి నిజమును వెల్లడించెదరుగాక." (సత్యసాధని)

## కుండలే ఆరోగ్యప్రదములు:—

కుండలే ఆరోగ్యప్రదములను శీర్షిక క్రింద సాఘూ వైద్యశేఖరులు ఆగష్టు 10-వ తేది నాటి 'సండే టైమ్సు' పత్రికలో నిట్లు లిఖింపుచున్నారు.

"నాగరికత ముదిరినకొలదియు మానవుడు ప్రకృతికి దూరమగుచున్నాడు. ఒకప్పుడు మానవుడు వండుకొనకయే ఆహారమును తినుచుండువాడు. కాలక్రమమున ఆతడు వస్తువులను పచనముచేసికొన ప్రారంభించినాడు. పచనకార్యములకు తొలుత ఉపయోగించినవి కుండలే. కుండలు ఉపయోగించినంతకాలము మానవుని ఆరోగ్యము ఏమాత్రమును చెడలేదు. కాలక్రమమున మానవుడు తన బుద్ధి నుపయోగించి లోహపాత్రలను నిర్మించుటకు వాడుటకు మొదలిడినాడు. కుండలకంటె ఇవి చిరకాలముండుటను, సులభముగ బ్రద్దలుకాకుండుటను లోహపాత్రలవాడుక విరివియైనది. కాని లోహపాత్రలకు పులుసుతగిలినచో కిలముక్కును. కిలముక్కకుండుటకుగాను కళాయిపూత కనుగొనబడినది. ఎన్ని కళాయిపూతలు పూసినను లోహపాత్రలు మట్టిపాత్రలంత మంచివికావు. లోహపాత్రలతో వండిన అన్నము మట్టిపాత్రలతో వండిన అన్నమంత ఆరోగ్యప్రదమును గాదు. లోహపాత్రములందు ప్రస్తుతము అల్యూమినముపాత్రలకున్న ప్రచారము వేనికిని లేదు. ఏమాత్రము పులుసు ఉప్పు తగిలినను అల్యూమినముగిన్నెలకు చిలుముతగులుట ఆగిన్నెలు వాడువారికెల్లరకును అనుభవైకవేద్యమే. ఉప్పు, పులుసు లేక ఏ పదార్థముల పచనము జరుగును? వంటకు వెండి, నికార్సు అయిన కంచుపాత్రలు తప్ప మట్టిపాత్రలతో సమమైన లోహపాత్రలు లేవు. కుండలలో వండినపదార్థముల

యందు ఎట్టి చెడుమార్పును కలుగదు. పులుసు, ఉప్పు ఉపయోగించినను వానియందు చిలుముకలుగదు. అవి మిక్కిలి తక్కువధరకు అన్ని గ్రామములందును, అన్ని బజారులయందును లభ్యమగును. కొందఱు కుండలు ఆరోగ్యప్రదములన్న జ్ఞానమును కలిగియుండియు వానిని వాడరు. అవి సులభముగ పగిలిపోవునను భయము. కాని జాగ్రత్తగా వాడినచో కుండలుకూడ బహువారములుండును. ఏళ్లతరబడిగ వాడుచు కొందఱుస్త్రీలు కుండలను జాగ్రత్తగనుంచుట మేమెఱుంగుదుము. అవి ఒకవేళ పగిలిపోవునని అనుకొన్నను లోహపాత్రలకు కళాయిపెట్టుటకంటెను, త్వరితముగ చిల్లుపడిపోవు అల్యూమినము పాత్రలను క్రొత్తగ కొనితెచ్చుటకంటెను కుండల ఖరీదు హెచ్చుగాదు. తగరము, రాగి, అల్యూమినములందు పులుసు, ఉప్పు మిశ్రితమై మానవుని ఆరోగ్యమును ఎట్లుచెడగొట్టుచున్నవో ప్రజలలో బోధింపవలసినపని ఆరోగ్యశాఖాధికారులపైనిలిచియున్నది. ఆరోగ్యభాగ్యము కోరువారు కుండలనే వంటకు ఉపయోగింపవలెను. కుండలతో వంటచేయుట ఈ దినములలో గౌరవమునకు తక్కువగ ఎంచబడుచున్నది. ఇది మిక్కిలి దురభిప్రాయము. గౌరవముకంటె ఆరోగ్యము ముఖ్యము. అది తెలిసికొనిననాడు రాజాధిరాజులుకూడ కుండల నుపయోగింతురు. దీనికి ప్రచారము వలయును.”

సాధూ వైద్యశేఖరులు వ్రాసిన ఈ వాక్యము లెంతయు నిజము. నిత్యము కుండ అన్నమునకు అలవడిన పాటకపు జనులకు లోహపాత్ర లుపయోగించువారి యింట ఒక పూట భోజనమిడినచో వారు ‘అమ్మా! తెప్పేలా అన్నము. కడుపుమండిపోతోంది, కండ్లు మండుచున్నవి’ అనుట సర్వసాధారణమైయున్నది. ఇకనైనను ప్రజలు కుండలయొక్క విలువను గ్రహించి వానిని విరివిగ నుపయోగించుచు ఆరోగ్యదేవతయొక్క నిత్యాశీర్వాదములను బడయుదురుగాకయని హెచ్చరించుచున్నాము.

సున్నము:—

ఆగస్టుమాసపు వాసవిపత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

“దేహారోగ్యమునకు సున్నము ఎంత ఆవశ్యకమో మనము తెలిసికొనవలసియున్నది. దేహమందలి ఎముకలు, కండలు, నరములు నెత్తురు—ఇవన్నియు క్రిమికూటములు. అనేకములైన క్రిములుచేరి ఒక అవయవమగును. క్రిములయొక్క ఆకారములు భేదముగనున్నను, అవిచేయుపనులు వేరువేరైనను, అవన్నియు ఒకేవిధమైనవి. ఒక్కొకక్రిమికిని రెండుభాగములు గలవు. అంతర్భాగము మన మెదడు గుండె చేయుపనులు చేయుచుండును. బహిర్భాగము క్రిమియొక్క దేహము. క్రిముల అంతర్భాగములు బాగుగనున్నయెడల దేహారోగ్యము చక్కగనుండును. అవి బలహీనములైనయెడల దేహారోగ్యము చెడి వ్యాధులు ప్రారంభించును. క్రిముల అంతర్భాగములందు సున్నము ప్రధానవస్తువు. ఈసున్నమును తీసివేసినయెడల క్రిమి సన్నగిలి అణచును. క్రిమికి సున్నము అవశ్యకమగుటచే దేహమునకంతకును అది ఆవశ్యకమే. మనముతిను కాయగూరలలోను త్రాగు పాలలోను సున్నముగలదు. కాని కాయగూరలను వండుటచేతను, పాలను కాచుటచేతను అందలిసున్నము జీర్ణముకానేరదు. సున్నము తగ్గగనే మొదట పండ్లుకదలును. ఎముకలందు సత్తువ తగ్గును. నరములు నిస్సారమగును, కండలు సళ్లిడును. రక్తమందలి తెల్లపురుగులు నీరసించును. మరియు రక్తముపులిసి, లోనికివచ్చు కొద్దిపాటిసున్నమునుగూడ నిలుపుకొనజాలక విడిచిపెట్టుచుండును. కనుక అది క్రిములకుచేరుటకు బదులు మూత్రముగుండ పోవుచుండును. సాధారణమైన సున్నము జీర్ణముకాదు. జీర్ణమగువిధమున తయారుచేసిన సున్నముతో చేసిన ఔషధములు ఉపయోగకరములు. జంతువులదేహము లన్నిటికిని మూలాధారము ఎముకలు. ఈయెముకలు సున్నమని అందరకు తెలిసినవిషయమే. ఇండ్లను శుద్ధిచేయునది సున్నము. సున్నముతో ముగ్గులుపెట్టుట తాంబూలములో సున్నముతినుట వీనివలనగలుగు లాభమును గ్రహించుడు.”

# వనితాలోకము

**శ్రీమతి ఎం. ఎ. జానకీకన్యగారు:—**

బ్యాంకరులగు శ్రీయుత ఎం. ఎ. శ్రీనివాసయ్యంగారి తనయ. మేరీ కళాశాలయందు బి. ఏ., డిగ్రీనిపొంది మదరాసు న్యాయశాస్త్రకళాశాలయందు ప్రవేశించి న్యాయశాస్త్రవిద్య పఠించుచున్నది.

**శ్రీమతి హన్నను అంజలోసతిగారు:—**

ఈమె ఇంతకుపూర్వమే మదరాసు కార్పొరేషనుసభయందు రాయపురము ప్రతినిధిగనుండినది. తిరిగి ఆమెఈ పదవికి గతమాసమున జరిగిన ఎన్నికలలో ఎన్నుకొనబడినది.

**శ్రీమతి ఎస్. డాచింపులు విల్సనుకన్యగారు:—**

మదరాసు జనరలు ఆసుపత్రిలో ధాత్రి (నర్సు)గ నుండినది. ఈమె ఇప్పుడు ఉన్నతవైద్యవిద్య నభ్యసించుటకు ఐరోపాఖండమునకు వెడలినది. లండను, డబ్లిను, బెర్లిను, వియన్నానగరములయందు క్రమముగ ఆమె వైద్యవిద్య నభ్యసించును.

**శ్రీమతి హామిదాలిసతిగారు:—**

ఈమె అబ్బాసుత్యాబ్జిగారి కుమార్తె. ఉత్తరహిందూస్థానమున సుప్రసిద్ధయగు సంఘసంస్కరణప్రచారకురాలు.

**శ్రీమతి పి. విశాలాక్షీ అమ్మాళ్ గారు:—**

ట్రిచూరు నగరమున గౌరవన్యాయాధికారిణిగ నియమింపబడినది.

**శ్రీమతి యస్. డి. విల్సన్ కన్యగారు:—**

మదరాసు జనరలుఆసుపత్రియందు స్టాఫ్ నర్సుగ ఉండినది. ఈమె ఇప్పుడు ప్రసూతివైద్యమున ఉన్నతవిద్య గఱచుటకై ఇంగ్లండునకు బోయినది.

**శ్రీమతి పద్మావతి అషీర్ సతిగారు:—**

తిరుపూరునందు నూతనముగ ఏర్పరుపబడిన స్త్రీ సమాజమునకు అధ్యక్షురాలుగ ఎన్నుకొనబడినది.

**శ్రీమతి కాథరైను రాజమ్మాళ్ కన్యగారు:—**

బ్యారిష్టరు శ్రీయుత జె. ఎ. డేవిడ్డుగారి కుమార్తె. బి. యె. పట్టమును పొందినది. అమెరికాఖండమునందలి వస్సార్ విశ్వవిద్యాలయమున పదార్థవిజ్ఞాన శాస్త్రవిషయమున ఉన్నతపరిశోధనము సలుపుటకై ఆ ఖండమునకు బోవుచున్నది.




మాతంగినీదేవి సాహసము:—

మాతంగినీదేవి పదునెనిమిదిసంవత్సరముల పడుచు. మహిస్వోకరుగ్రామనివాసిని. జూలై 22-వ తేదీ తెల్లవారుజామున ఆమెభర్త పనిమీద గ్రామాంతరము పోయియుండెను. ఆసమయమున ఆమె పొరుగువాడు హరిమోహనునాస్కరు పేరివాడు ఇరువదియైదుసంవత్సరముల వయసువాడు మాతంగినీదేవి గృహమున చొరబడి ఆమెమానమును చెఱుప సాహసించెను. శీలవతియగు మాతంగినీదేవి ఆతని దుష్టచేష్టితమును నివారింప సకలవిధముల ప్రయత్నించెను; కాని అతడు లొంగుబాటునకురాలేదు. తుదకు ఆమె పదునుగల ఒక పరిముట్టుతో ఆతనిని పొడిచెను. ఆనరాత్ముడు మరణించెను. తాజేసిన భయంకరకృత్యమును తిలకించి ఆ అబల మూర్ఛావివశయయ్యెను. తెల్లవారినది. ఇరుగుపొరుగువారువచ్చి చూతురుగదా మరణశయ్య నలంకరించిన నాస్కరుప్రక్కన స్మృతితప్పి దేవి పడియుండెను. ఆలిపూరుపోలీసువారికి కబురుతెలియగా హత్యానేరముక్రింద ఆమెను అరెస్టుచేసిరి. స్మారకమువచ్చినమీదట దేవి నడచినవృత్తాంతము యావత్తు వెల్లడిచేసెను. కేసు విచారణజరిగెను. మానసంరక్షణకొఱకు నాతనిని చంపినదిగావున ఇది నేరముకాదని ఉచితజ్ఞుడగు న్యాయాధికారి కేసు కొట్టివేసెను. ప్రజ్ఞారక్షితశీలయగు మాతంగినీదేవి ప్రజలమన్ననలందినది. ఇట్టి పరిస్థితుల నెదుర్కొనవలసివచ్చు స్త్రీలందఱును మాతంగినీదేవి చేసినట్లేచేయుట తన అభిప్రాయమని న్యాయాధికారి తీర్పులో చెప్పెను.

కోడలిని కాల్చి చంపిరి:—

ఆమెపేరు విద్యుతబాలదాసి. శ్యామచరణదత్తు అనువాని భార్య. కలకత్తా 104, మసిజిద్ బరివీధియందు వారిగృహము. ఒకనాటి ఉదయమున విద్యుతబాలదాసి చనిపోయియుండెను. ఆమె ఒడలంతయు విస్తారము కాల్పులుండెను. మొగమున అవి మిక్కిలిగనుండెను. డాక్టరు పరీక్షించెను. కాల్పులవలననే మరణము జరిగినట్లు నిర్ణయించెను. హత్యయో ఆత్మహత్యయో ఆతడు నిర్ణయింపలేకపోయెను. విద్యుతబాలదాసి తండ్రి కోర్టులో ఈక్రిందివృత్తాంతమును నివేదించెను. "విద్యుతబాలదాసి నా మూడవకుమార్తె. ఆమెవయస్సు పండ్రెండుసంవత్సరములు. అత్తింటిలోనివారి కందఱకును ఆమెయే వంటచేయవలసియుండెను. భోజనములకు వారు రాత్రి చాల ప్రొద్దుపోయినగాని వచ్చువారుకారు. వచ్చుసరికి పదార్థములన్నియు వెచ్చగనుంచవలయునని వారి ఆజ్ఞ. అట్లులేనిచో వారామెను తిట్టియుకొట్టియు తీవ్రవ్యధలకు గుఱిచేయుచుండిరి. కొట్టుటయు తిట్టుటయు తఱుచు ఆమె భర్తయు, అత్తగారును సాగించుచుండిరి. ఇక తొమ్మిదిరోజులకు చనిపోవుననగా ఆమె ఒకసారి కాళీఘట్టమునకు వచ్చెను. ఆనాడామె తన కడగండ్లనన్నియు నిట్లుచెప్పెను. "నాఅత్తగారు నన్ను తఱుచు తిట్టుచుండును. తలదువ్వుకొనుటకుగాని, తలకు చమురువ్రాసికొనుటకుగాని ఆజ్ఞలేదు. ఒళ్లుతోమి నీళ్లుపోసికొనుటకుగాని శుభ్రవస్త్రములు ధరించుటకుగాని అధికారములేదు," ఆమె మామగారికి బుర్రాబజారులో బట్టలదుకాణము కలదు. నెలకు మూడువందలవఱకు ఆర్జించును. నేనుకానుకగా ఇచ్చిన బట్టలు నా అల్లునకుగాని నా వియ్యంకునకుగాని సరిపడకుండెను. నేనిచ్చిన బట్టలనుగూర్చి నాఅల్లు

డొకసారి 'నాహోదాకు ఇట్టిబట్టలా?' అని నిరసించెను. కడచిన పుష్యమాసములో మా అమ్మాయి మా యింటికి వచ్చినపుడు ఇదివఱకు నేను మా అల్లునకిచ్చిన శాలువ ఇచ్చివేయుచు దానిస్థానమున మఱియొకటి హెచ్చువిలువగలది ఈయవలయుననియు లేనిచో తన అత్తయును, భర్తయును బాధింతురనియుచెప్పెను. ఉదయమున పెందలకడలేచి పాచిపనియు చేయలేకపోవుచున్నదని ఈబాలికను అత్త సాధించుచుండినది. పెండ్లి అయిన నాలుగుమూడుమాసములకే కొట్టుట ప్రారంభించిరి. ఆమెకు కంటిజబ్బుకలదు. దానికి వారు వైద్యము చేయింపలేదు. ఆసంగతి ఆమె మామగారితోచెప్పగా మీయింటికి తీసికొనిపోయి వైద్యముచేయించుకొనుడని చెప్పెను. ఆమెమొగము కాల్పులచే శరీరమునందలి ఇతరప్రదేశములకంటె ఎక్కువ నల్లబడియుండుటచేతను కట్టుకొనినచీర పూర్తిగ తగులడకుండుటచేతను ఆమెమొగమును బలవంతముగ మంటలోచొప్పించి చంపి యుందురని నాభావము." వారిపొరుగుననున్న లావణ్యలతాదాసి తనసాక్ష్యములో ఇట్లుచెప్పెను. "నిత్యమును ఆబాలికకు ఉదయమున మూడు రొట్టెముక్కలు ఇచ్చుచుండిరి. అవితిని ఆమె సాయంకాలము మూడు గంటలవఱకు వేచియుండవలసియుండెను. అప్పుడామె మధ్యాహ్నభోజనమునకు అనుజ్ఞ ఇచ్చుచుండిరి. ఆమె భర్త రాత్రి 12½ గంటలప్పుడు భోజనముచేయువాడు. ఆతని భోజనానంతరమే ఆబాలిక భోజనముచేయవలసి యుండెను. ఆకలికి తాళలేక ఆమె అధికముగ అఘోరించుచుండునది. ఈ అఘోరింపులు అత్తగారిచెవిని బడినను నిరర్థకములగుచుండెను. కంటివైద్యమునకు ఈబాలిక పుట్టినింటికిపోయి ఉండినపుడు ఈమె అత్త నాతో రెండుమాసములైనను ఆమెను తీసుకొనిరాలేదు. మా వానికి తిరిగి పెండ్లిచేతుమని చెప్పెను."

### ఆరు వత్సరముల కన్యను చెఱచుట:—

గోరక్షనాథదాసు సుఖరోగములచే బాధపడుచుండెను. కన్యాసంభోగమువలన అవికుదురునని ఆతని నమ్మకము. ఆ నమ్మకమున ననుసరించి ఆతడు ఆరువత్సరములుగల ఒకకన్యను చెఱచెను. కేసు ఆయెను. కేసు విచారణ సమయమున ఆతడు పిచ్చివానివలె నటించెను. న్యాయాధికారి ఆతనికి శిక్షవిధించుచు ఇట్లుచెప్పెను. "ఇతనిని కొరడాదెబ్బల శిక్షకుకూడ గుఱిచేయుట నా అభిమతము. ఈ తప్పిదమునకీతడు పెక్కువారములు కారాగారశిక్ష ననుభవింపవలయునని నా నిశ్చయము. నే నీతనికి ఆరుసంవత్సరముల కఠినశిక్ష విధింపుచున్నాను."

### అత్తింటిబాధలే కారణము.—

చందూరిలాలసింగు ముజఫర్‌నగరమున మేజిస్ట్రేటు. అతడొకనాటిరాత్రి మోటారుపై బోవుచుండెను. దారిలో ఒకమహమ్మదీయునివెంట ఒక హిందూస్త్రీ ఉండుట నాతడుచూచెను. ఆతనికి అనుమానముతగిలెను. విచారింపగా చేరువనున్న మఱియొక పట్టణమునకు తీసికొనిపోయి ఆమె నొకానొక హిందూపురుషునకిచ్చి వివాహము చేయబడనున్నట్లు తెలిపిరి. లాలసింగునకు అనుమానము తీరలేదు. కావున మోటారును వేగముగ ముందునకు కొంతదూరము సాగించుకొని పోయి చీకటి గప్పిన ఒక తావున నిలిపి దీపములు ఆర్పివైచి దాగి యుండెను. ఆతడు వెనుకవచ్చుచున్న ఇరువురనుకనిపెట్టుచుండెను. చూడగా చూడగా ఆస్త్రీ బలవంతముమీద రైలుస్టేషనునకు గొనిపోబడుచున్న సంగతి తెలియవచ్చెను. అందుమీద ఆ మేజస్ట్రేటు సేవకులను బంపివారిని నిరోధించెను. అప్పుడు ఆస్త్రీ (ఆమెనామము సుందరి) తన విషాదవృత్తాంతము నిట్లుచెప్పెను. "మాఅత్తవారు నన్ను పెట్టుబాధలతో ఆ యింట నాకు ఊపిరి పీల్చుట మిక్కిలి కష్టముగానుండెను. ఆ యింటనున్నచో జీవింతునను ఆశ అడగారుటచే పుట్టింటికిపోవ ప్రయత్నపడుచుంటిని. గెయిండా అను పేరుగల ఈమహమ్మదీయుడు నన్ను నమ్మించి పుట్టింటికి గొనిపోవుదునని చెప్పెను. నిజమనుకొంటిని. ఆతనిని వెంబడించితిని. పుట్టింటికి చేరుటకు బదులు పుంశ్చలీస్త్రీలుండువాడకు గొంపోవబడితిని. నా మానము వీడిబోయినది." అనంతరము మేజస్ట్రేటు కేసు తెచ్చి గెయిండాకు అయిదుసంవత్సరముల కఠినశిక్ష యిప్పించెను.

# గ్రంథవిమర్శనలు

వసుమతి.—

ఇదియొక సాంఘికనవల. కర్త్రి గృహలక్ష్మీపాఠకులకు చిరపరిచితురాలును సుప్రసిద్ధాంధ్రవిదుషీరత్నమును నగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. ఈనవలయందు స్త్రీలోలుడగు పతిచే వసుమతిపడిన ఇక్కట్లు అతికరుణకముగ ధారాళమగుశైలిలో వివరింపబడినవి. వసుమతి క్షమాశీలము మంచి నేర్పరితనమును ప్రదర్శింపబడినది. పతి వేశ్యాగృహముననే ఉండుటయు, ఇంట వసుమతి ఒంటరిగనుండుటయు, దీపముపెట్టుటకు కిరసనాయిలు లేకుండుటయు, పెట్టిఅడుగున దొరికిన పావలానిచ్చి సేవకుని కిరసనాయిలు తెమ్మనగా వాడది కాజేయుటయు, రాత్రియంతయు చీకటింట వసుమతి గడుపుటయు మొదలగుఘట్టములను చదువునపుడు కఠినహృదయులకుగూడ కంటివెంట నీరుగారకమానదు. ఇది ప్రత్యేకముగ స్త్రీరచనమని తెలుపు జాతీయములగుప్రయోగము లీగ్రంథమున బెక్కులుగలవు. 'కొండంతతండ్రికన్న నేలబుట్టయంత తల్లిమేలు' 'బిడ్డలంగంటిమిగాని వారివ్రాతలం గనలేముగదా;' 'ఎవరికైన నున్నమాటయనిన రోండిగాల్చుకొనినట్లుండును గదా'; 'నిప్పులేనిది చెయ్యిపొక్కునా'; 'వాములుమ్రింగుస్వాములకుం బచ్చిగడ్డి ఫలహారమా'; 'ఇచ్చినవారికయు బుచ్చుకొనినవారు బులియగదా'; 'వడ్లతో దట్టఎండవలెను.' అనునవి అట్టిప్రయోగములకు నిదర్శనములుగా చేకొననగును. 'నానాతిట్లు'; 'సకలచిక్కులు'; 'మహారొంపి'; 'నానాబాములు'; 'ఆగ్రహమందలింపులు'; 'సప్తపన్నెలు' మొదలగు మిశ్రమసమాసములు రెండవముద్రణమున తొలగింపబడవలయును. గ్రంథము డెమ్మీసైజున 168 పుటలు. వెల రు ౧-౦-౦. వలయువారు గ్రంథకర్త్రిపేర బాపట్లకు వ్రాయవలెను. పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారి ఆమోదముద్రబడసిన గ్రంథము.

దాంపత్యము:—

అమెరికాసంయుక్తరాష్ట్రముల ప్రజారోగ్యసంఘమువారు ప్రచురించిన High Schools & Sex Education అను గ్రంథము సతీపతులకు ఆరోగ్యభంగము లేకుండ శారీరకమానసోల్లాసములు కలిగించు విధానములను నీతిపథము విడిచి చరించుటవలని కష్టనిష్ఠురములును విద్యార్థులకు బాగుగ బోధింపబడవలయునని హెచ్చరించుచున్నది. అట్టి పుస్తకముల కింకను మన పాఠశాలలయందు తావీయబడకున్నను ఏతద్విషయకగ్రంథములు ఇప్పుడు కొన్ని మన ఆంధ్రమున బయలుదేఱుచున్నవి. కాని అవి ధనార్జనాతృష్ణగల పుస్తకవిక్రేతలు పుట్టించినవిగాని శాస్త్రజ్ఞులువ్రాయదలచి వ్రాసినవి కావు. ఆతరగతి పుస్తకములలో ప్రస్తుతము మన విమర్శనకు పాలుపడిన 'దాంపత్యము' అను గ్రంథము మేలితరముగ నున్నది. వాత్స్యాయన కామసూత్రములు, చరక శుశ్రుతాది వైద్యగ్రంథములు, కొక్కోక కళాశాస్త్రము మొదలగువానియందలి ఉపదేశము లిందు కూడినమట్టుకు చేర్చబడినవి. గ్రంథాదిని గల ఈ వాక్యములు గ్రంథరచనోద్దేశమును వెల్లడించుచున్నవి. 'పాశ్చాత్య నాగరికతావ్యామోహమునబడి వారి వేషభాషలకు వారి యాచారములకు అంజలు లొసంగుచు ఆర్యసాంప్రదాయముల దాంపత్యధర్మముల మఱచియున్న ఆంధ్రదంపతుల క్షేమైన యీ గ్రంథము తోడ్పడగలదేమోయను నాశతో పెక్కుగ్రంథములు పరిశోధించి నాకుగల స్వల్ప వైద్యానుభవమునుబట్టి అశ్లీలమునకు తావులేకుండ శాస్త్రసమ్మతముగ క్లుప్తముగ సతీపతుల శారీరకమానసికోల్లాసముల కనువగునట్లు రచించితిని.' ఆంధ్రప్రబంధములనుండి పద్యములును, సంస్కృత కావ్యములనుండి శ్లోకములును ఏర్చి కూర్చి కర్త గ్రంథమునకు ప్రామా

ణికత గలిగించినాడు. అయితే T. V. Galloway గారు Biology of Sex for Parents and Teachers అను గ్రంథమున వ్రాసినట్లు ఇట్టి గ్రంథములను మిక్కిలిచిన్నపిల్లలకు అందనీయకూడదు. ఆ విషయము 'దాంపత్యము'ను ప్రచురించినవారుకూడ కడుజాగరూకత వహింతురుగాక! పుస్తకము చిన్నసైజున 105 పుటలు. వెల రు. 1—0—0 పోస్టేజి ప్రత్యేకము. ఇది ఆంధ్రప్రకాశికా గ్రంథమాలలో ప్రథమపుస్తకము. గ్రంథమాల చందాదారులకు అంచెకూలితో సహా పుస్తకము వెల రు. 1—0—0. 1929-వ సంవత్సరమున మదరాసు చాకలపేట గోపాలకృష్ణ ప్రెస్సునందు ముద్రితము. వలయువారు గ్రంథసంపాదకులగు శ్రీయుత దొంతం సెట్టి నాగేశ్వరరావుగారి పేర 2, రామానుజకూటంవీథి, చాకలపేట, మదరాసు అను చిరునామాకు వ్రాయవలెను.

### రుక్మిణీకల్యాణము:—

బమ్మెర పోతరాజుగారి భాగవతమున దశమస్కంధము పూర్వభాగమునందు అతిమనోహరముగా వర్ణింపబడిన రుక్మిణీకల్యాణమును విడిగ ముద్రించినగ్రంథమిది. ఇది స్త్రీలు ఆప్యాయముతో చదువుగ్రంథములలోనొకటి. పోతరాజుగారి కవనమునుగూర్చి ప్రత్యేకము చెప్పవలసినది లేదుగదా! పెరంబూరు సి. సి. సి. హైస్కూలు తెనుగుపండితుడగు సోమంచి గురుస్వామిశాస్త్రిగారు ఇందలి ప్రతిపద్యమునకును టీకాతాత్పర్యములు వ్రాసియున్నారు. కావున స్త్రీలు స్వయముగ చదువుకొని తమభాషాజ్ఞానమును పెంపొందించుకొనుటకు అనువుగనుండును. గ్రంథము 1930-వ సంవత్సరమున మదరాసు హిందూరత్నాకర ముద్రణాలయమునముద్రితము; పి. నటేశమొదలియారుగారిచే ప్రకటితము. క్రౌనుసైజున 98 పుటలు. వలయువారు ప్రకటకర్త పేర 49, తులసింగ మొదలివీథి, పెరంబూరు, మదరాసు అని వ్రాయవలెను.

### బాలనీతికథావళి:—

ఇది శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిచే విరచితము. 1930-వ సంవత్సరమున రాజమహేంద్రవరమునందలి శ్రీచింతామణిముద్రాక్షరశాలయందు ముద్రితము. గ్రంథము క్రౌనుసైజున 88 పుటలు. వెల ప్రతి ఒక్కింటికి 0-6-0 మాత్రము. ప్రతులు వలయువారు పాలపర్తి భావనారాయణగారు, టీచరు, బాపట్ల, గుంటూరుజిల్లా అను చిరునామాకు వ్రాయునది. గ్రంథప్రవేశమున కర్త్రిగారిట్లు వ్రాయుచున్నారు. "ఇందలి కథలలో చాలవఱకు సత్యమైన చరిత్రాంశములైయుండుటయే వీనిలోగల విశేషము. అత్యద్భుతమహిమలతో నిండిన పౌరాణికగాథ లనేక మిప్పుడు మనబాలురకు పాఠ్యపుస్తకములుగా నిర్ణయింపఁబడుచున్నవి. అవియెంత నీతిగర్భితములైయున్నను యూహాతీతములగు మహిమలతో నిండియుండుటచే పురాణపురుషులు వేఱు మనము వేఱు వారుచేసినపనులను మనము చేయజాలము అనుభావము బాలురకుగల్గు నవకాశము గలదు. కాన నిర్మలములైన బాలబాలికల మానసకేదారములందు నీతిబీజములను నాటి సాధారణమానవుల సత్యజీవితాంశములనే కథలరూపమున వారికి బోధించుట సమంజసమగును." ఇదియెంతయు సత్యము. ఈగ్రంథములందలి కథలన్నియు నిట్టివే. ఇవిఅన్నియు బాలవినోదమున్నగు హిందీవాచకపుస్తకములందలి కథల నాధారముగగొని వ్రాయబడినవి. వరలక్ష్మమ్మగారి రచనాసౌందర్యమునుగూర్చి గృహలక్ష్మి పాఠకులకు ప్రత్యేకము పేర్కొననక్కఱలేదు. ఆంధ్రసాహిత్యబిరుదాంకితులగు శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఈగ్రంథమునుగూర్చి ఇట్లువ్రాయుచున్నారు. "ఇందలి కథలు నీతిబోధకములై మనోహరములై పాఠశాలలలో చదువుకొను బాలురకు బాలికలకు మిక్కిలి ఉపయోగకరములైయున్నవి." విద్యాశాఖాధికారు లీగ్రంథమునందలి మేలెంచి బాలురకును బాలికలకును దీనిని అందుబాటునుంచ ప్రార్థించుచున్నాము.

# డైరి

జూలై 20:—శ్రీమతి మార్గరెటు కజిన్సుసతి అధ్యక్షతక్రింద తిరువాంకూరు రాజకీయేతరయువజనసమావేశము నాగర్కోయిల్‌నందు జరిగెను.

21:—ఏలూరులో క్రిమినలులాఅమెండుమెంటుఆక్టుక్రింద శ్రీమతులు దామరాజు లక్ష్మమ్మ, ముడుంబి వెంకటమ్మ, దాసరి కృష్ణవేణమ్మ, దాసరి లక్ష్మీబాయమ్మగార్లకు శిక్ష విధింపబడెను.

22:—శ్రీమతి ఎస్. సీతమ్మగారు సికింద్రాబాదులో మార్కెటువీధియందు స్థాపించిన పరోపకారిణీ బాలికా ధర్మపాఠశాలకు శ్రీధర్మవరవామననాయకుగారు 150 రూపాయిలు దానమొసంగిరి.

23:—

24:—కలకత్తాలో నారీసత్యాగ్రహసంఘమునకు కార్యదర్శినియగు జ్యోత్స్నాదేవిగారు స్త్రీలఊరేగింపు జరుపుచుండగా రాత్రి $1\frac{1}{2}$ గంటలవరకును పోలీసువారు ఉత్సవమును నిరోధించినను స్త్రీలు కదలనందున శ్రీమతి జ్యోత్స్నాదేవిగారిని అరెస్టుచేసిరి.

25:—సంయుక్తరాష్ట్రములలో ఖద్దరుప్రచారముచేయుటకు సబర్మతీఆశ్రమమునుండి బయలుదేరి శ్రీమతి మీరాబాయిస్లేడుకన్యగారు అలహాబాదు వెళ్లిరి.

26:—శ్రీమతి చారుశీలాదేవి మిధునాపూరుచెరసాలలో శిక్ష ననుభవించుచున్నది. ఈమె వితంతువగుటచే ఇతరులువండిన పదార్థములను భుజించుట కంగీకరింపలేదు. ఈమె వంటచేసికొనుటకు తగిన ఏర్పాటులను జేయనందున నిరాహారదీక్షను బూనినది.

—అమెరికా లూథరుచర్చిమిషనరీ డాక్టరుగా గుంటూరుమండలమున నలుబదిసంవత్సరములుగ అప్రతిమానసేవచేయుచుండిన శ్రీమతి డాక్టరు ఆనీక్రూగ్లరుదొరసానిగారు గుంటూరున పరమపదించిరి.

27:—భారతమహిళామహాసభ అర్ధసంవత్సరసమావేశము బెంగుళూరులో జరిగెను. ఆంధ్రదేశమునందును, మైసూరు గ్వాలియరుసంస్థానములందును ఖద్దరు అభివృద్ధివిషయమున జరిగినపనిని అభినందించుచు సభలో తీర్మానింపబడెను. రాబోవుసమావేశము లాహోరులో 1931 జనవరి 12-19 తేదీలయందు జరుపుటకు నిశ్చయింపబడెను. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షురాలిగ నెన్నుకొనబడెను.

28:—కలకత్తాలో పికెటింగుఆర్డినెన్సు ననుసరించి అరుస్టు చేయబడి వదలిపెట్టబడినవారు పోను మిగతావారికి ఈరీతిని శిక్షలువిధింపబడెను. శ్రీమతి కిలాసేన్‌కన్య, శ్రీమతి నిస్జరినీసర్కార్‌సతి, శ్రీమతి ఆవాలతీదేవి, శ్రీమతి దురందరాదేవి, శ్రీమతి లావణ్యామిత్రసతి, శ్రీమతి ఛాయాదేవి వీరలకు చెరి నాలుగు నెలలశిక్ష విధింపబడెను. శ్రీమతి కుమారీపుష్ప, శ్రీమతి సరోజ్ భాసినీగుహా, శ్రీమతి సరేష్‌గుహారాయసతి వీరికి చెరిరెండు నెలలశిక్ష విధింపబడెను. శ్రీమతి ఆరతిముఖర్జీసతికి 10 రూపాయిల జరిమానాగాని లేనిచో కోర్టులేచువరకు శిక్షగాని విధింపబడెను. జరిమానాకట్టుటకు ఆమె నిరాకరించి శిక్షననుభవించెను.

29:—పాట్నాలో హాస్సనుఇమాంగారిభార్య, హాస్సనుయిమాంగారి కుమార్తె, సామిగారిభార్య, సి. సి. దాసుగారికుమార్తె, శ్రీమతి గౌరీదేవి, అంబికాచరణుగారిభార్యగార్ల కేసు విచారింపబడి హాసనుఇమాంసతిగారికి 200 రూపాయిలును తక్కినవారికందరికి చెరి 100 రూపాయిలును జరిమానా విధించెను.

30:—గుంటూరుకాలేజీవద్ద పికెటింగుచేసినందుకుగాను శ్రీమతులు పాదర్తి సుందరమ్మ, కొండా సత్యవతమ్మగార్లను పోలీసువారు అరెస్టుచేసిరి. ఇందు శ్రీమతి సత్యవతమ్మగారిని మోటారుపై

తీసికొనివెళ్లి పేరికజెయిల్ స్టేషనులో వదలిపెట్టిరి. రాత్రిఅగుట అచటనే ఆమె ఆగ్రామమున ఉపన్యసించెను. శ్రీమతి ఇప్పగుంట వేంకటమాంబగారును ఆమెశిష్యురాలగు శ్రీమతి కొప్పర్తి రత్నమ్మగారును క్షమాపణలనిచ్చిరి. ఎనుబదియేండ్ల వృద్ధురాలగు శ్రీమతి మద్దులచిన్నమ్మగారు క్షమాపణ ఈయనందున 1 సంవత్సరము కఠినశిక్ష; రెండువందలరూపాయిల జరిమానా విధించిరి.

31:—గతరాత్రి పేరికజెయిల్ స్టేషనులో వదలిపెట్టబడిన శ్రీమతి కొండా సత్యవతమ్మ ఉదయము గుంటూరుకురాగానే పోలీసువారు అరెస్టుచేసిరి.

ఆగష్టు 1:—రాయబహుదూరు శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారి ధర్మపత్నియగు రాజ్యలక్ష్మమ్మగారి 20-వ వార్షికోత్సవము రాజమహేంద్రవరమునందు వితంతుశరణాలయపు బాలికలచే శరణాలయమున జరుపబడెను.

2:—ఇతరనాయకులతోబాటు బొంబాయిలో శ్రీమతి మణిబెనుగారినికూడ అరెస్టుచేసిరి.

—శ్రీకందుకూరి రాజ్యలక్ష్మమ్మగారి 20-వ వార్షికోత్సవసందర్భమున సాయంకాలము 3 గంటలకు రాజ్యలక్ష్మీవిలాసభవనములో మహిళాసమావేశమయ్యెను. శ్రీమతి దామెర్ల కమలరత్నముగారు అధ్యక్షతవహించిరి. ప్రార్థనానంతరము శరణాలయమునందలి బాలిక శ్రీమతి అచ్చమాంబ, శ్రీమతి పులవర్తి కమలావతీదేవి, శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగార్లు ఉపన్యసించిరి.

3:—తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకా గంగవరముగ్రామములో శ్రీమతి బులుసు భద్రమ్మ, పారుపూడి వేంకటరమణమ్మగార్లు ప్రస్తుతపరిస్థితులనుగూర్చి ఉపన్యసించి ఖద్దరు ప్రచారముగావించిరి.

4:—ఉదయము 9 గంటలకు శ్రీమతులు సత్తిరాజు శ్యామలాంబ, ముల్పూరి చుక్కమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, వద్దిపర్తి శకుంతలాదేవిగార్లు ఏలూరునందు 144-వ సెక్షను ధిక్కరించుచు పెద్దబజారుగుండా జాతీయగీతములుపాడుచు జాతీయపతాకములను పట్టుకొని ఉత్సవముగా సేగిరి.

5:—కాకినాడలో శ్రీపైండా వేంకటనారాయణగారు వారుస్థాపించిన సత్రములో నెలకొల్పిన రాట్ణపాఠశాల ప్రారంభోత్సవమును శ్రీమతి కజిన్సుసతిగారిచే జరిపించిరి. ఆసభలో శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారుకూడ ఉపన్యసించిరి.

6:—ఏలూరులో కల్లుపాటలు పాడబడుచుండగా సత్తిరాజు శ్యామలాంబ, ముల్పూరి చుక్కమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, వద్దివర్తి శకుంతలాదేవిగార్లు పికటింగుచేయుటకు పోయిరిగాని వారిని పోలీసువారు కచేరి ఆవరణలోనికి రానీయలేదు.

—మోతీలాలుసతి ప్రచారమువలన లక్నోవిశ్వవిద్యాలయమున నేడు పాఠశాల జరుగలేదు.

—రాజమహేంద్రవరములో హిందూసమాజమున స్త్రీలసభలో శ్రీ కజిన్సుసతి ఖద్దరునుగూర్చి ఉపన్యసించెను.

7:—144 వ సెక్షను ధిక్కరించుచు 17-7-30 తేదీని బెజవాడవీధులలో జాతీయపతాకమును చేబూని జాతీయగీతములనుపాడుచు తిరిగినందుకు పోలీసువారు శ్రీమతి పావర్తిసుందరమ్మగారిని వారిగృహమునందు అరెస్టుచేసి కేసువిచారణనిమిత్తము స్టేషనరీసబుమేజస్ట్రేటువారి కోర్టుకు తీసికొనివెళ్లిరి. కేసు వాయిదా వేయబడెను.

—కలకత్తాలో పికెటింగుఆర్డినెన్సుక్రింద శ్రీమతి సీతాదేవిగారికి 4 నెలలు విడిఖైదువిధింపబడెను.

—బొంబాయిలో మాలవ్యాతోబాటు శ్రీమతులు మణిబెను, రత్నాబెను, హంసణంకౌరు, అమృత కౌరుగార్లను చెరి 100 రూపాయిల జుల్మానాయున్ను జుల్మానా చెల్లింపనిచో చెరి 15 రోజులు విడిఖైదును విధింపబడెను.

—పోలీసువారు సూర్యోదయాత్పూర్వము 2 గంటలనువచ్చి అమృతసరమున జలియన్వాలా బాగులో శ్రీమతి విద్యావతియనునామెను కాకోరిఖైదీలలో నొకరగు రామప్రసాదుబిస్మిలు గారి సోదరిని) అరెస్టుచేసిరి.

8:—రావల్పిండిలో 144-వ సెక్షను అమలులోనున్నప్పుడుగూడ మాలవ్యా గారి అరెస్టుపట్ల తమ అసమ్మతిని తెలుపుటకుగాను అచట 2000 మంది స్త్రీలు ఊరేగింపుజరిపిరి. పోలీసువారు ఎట్టి నిరోధమును కలిగింపలేదు.

9:—తిరునల్వేలికాపురస్థులును కాంగ్రెసువాదులునగు లక్ష్మణపెరుమాళ్ పిళ్లె గారిసతి శ్రీమతి స్వర్ణమ్మాళ్ గారు రామనాథు జిల్లా మేజిస్ట్రేటుగారి వారంటుప్రకారము మధురలో అరెస్టు చేయబడిరి.

10:—ఇర్విను ప్రభువు లండను చేరెను. తక్షణమే స్వస్థానమునకు బయలుదేరెను.

—బొంబాయిలో రాజకీయఖైదీల స్మారకోత్సవసందర్భమున శ్రీమతి హంసామెహతాగారి నాయకత్వముక్రింద బ్రహ్మాండమగు ఉత్సవము జయప్రదముగజరిగెను.

—లయాల్పూరులో సారాదుకాణములవద్ద పికెటింగుచేసినందులకై శ్రీమతులు గోమతీదేవి, ధనదేవిగార్లు అరెస్టుచేయబడిరి.

11:—బెజవాడలో శ్రీమతి పొనచ్ఛ సుందరమ్మగారి కేసు తిరిగి వాయిదా వేయబడెను.

12:—ఫిరోజాబాదులో పాలివాల్ సతిగారిని మరి 11 మంది స్త్రీలను ఒక దేవాలయమువద్ద పికెటింగు చేసినందుకై అరెస్టుచేసిరి. కాని వెంటనే ఏ షరతును లేకుండగనే మరల వారిని విడిచిపెట్టిరి.

—ఎవరో ఒక శ్రేయోభిలాషి జుల్మానా చెల్లించుటచే బొంబాయిలో పండిత మాలవ్యాగారితో బాటు శ్రీమతులు మణిబెను పటేలు, రత్నాబెను, హంసణాకౌరు, అమృతకౌరుగార్లు నలుగురును వదలివేయబడిరి.

—బెజవాడలో శ్రీమతి పొనచ్ఛ సుందరమ్మగారి కేసు ఈ నెల 25-వ తేదీకి వాయిదా వేయబడెను.

13:—స్వాతంత్ర్య స్త్రీ సమితివారు రౌండుటేబిలు సభకు బ్రిటీషు స్త్రీలను, భారతరమణులను ప్రతినిధురాండ్రుగ నియమించినచో ఇంగ్లండు ఇండియాలకు ప్రస్తుత మేర్పడిన కష్టపరిస్థితులను తొలగించుట కెంతయు తోడ్పడెదరని రాంశేమేక్డొనాల్డుగారి కొక లేఖ వ్రాసిరి.

14:—స్లేడుకన్య (మీరాబాయి) గారు కలకత్తానుండి ఉదయము చెన్నపురికి విచ్చేసిరి.

15:—డాక్టరు ఛార్లట్ క్రాసు అను జర్మనీదేశపు స్త్రీ కలకత్తానుండి చెన్నపురికి వచ్చిరి. ఈమె జెయినుమత మవలంబించి సుభద్రాదేవియను పేరుదాల్చియున్నది. ఈమె లీప్‌జిగ్ విశ్వవిద్యాలయమునందు భారతీయ తత్వశాస్త్రమునకును సంస్కృతమునకును ప్రొఫెసరుగానున్నది.

—కలకత్తా నారీసత్యాగ్రహసమితి అధ్యక్షురాలు శ్రీమతి ఇందుబాలదేవి పికెటింగు ఆర్డినెన్సు క్రింద నాలుగుమాసముల కఠినశిక్షను పొందెను.

16:—బొంబాయి యుద్ధసంఘాధ్యక్షురాలగు శ్రీమతి హంసామెహతా అహమ్మదాబాదులో ప్రస్తుత పరిస్థితులనుగూర్చి ఉపన్యసించెను.




**మంత్రసానులకు విద్యాప్రసాదము:—**

ప్రసూతిరోగములనుగూర్చియు శిశురోగములనుగూర్చియు కొంచమేని జ్ఞానముగలమంత్రసానులు గ్రామమునకు ఒక్కొక్కరు చొప్పుననైన హిందూదేశమునందలి గ్రామములందన్నిటియందుండినచో మనదేశమున ఏటేటగలుగు ప్రసూతిమరణములలో, శిశుమరణములలో ముక్కాలు మువ్వీసము తగ్గిపోవుననుట సత్యదూరముకాదు. అయితే ప్రజానాయకులుగాని ప్రభుత్వమువారుగాని మన గ్రామసీమలకట్టి మంత్రసానులను ప్రసాదించుటకు కొంచమేని ప్రయత్నింపకున్నారు. స్వదేశసంస్థానము లన్నిటిలోను పెక్కు విషయములలో ముందంజ వేయుచున్న బరోడాసంస్థానమునం దీవిషయమై కొంతకృషిజరుగనుండుట కొనియాడదగినది. తమసంస్థానమునందలి ముఖ్యస్థలములగు బరోడా, పట్టన్, విస్నగరు, పెట్లడ్ అనుపట్టణములందు బరోడాప్రభుత్వమువారు మంత్రసానులకు వలయువిద్యను ప్రసాదించు సంస్థలనేర్పరచినారు. ఇందువిద్యనేర్చు మంత్రసానులకు నెలకు పదునై దురూపాయిల ఉచితవేతనమును ప్రభుత్వమువారేఇచ్చెదరు. పేదవారగు మంత్రసానులను గ్రామములనుండి ఈ విద్యాలయమునకు ఆకర్షించుటకు ప్రభుత్వమువారీయ నిశ్చయించిన ఉచితవేతనములు ప్రయోజనకారులు కాగలవు. ఈసంస్థలయందు విద్యాప్రసాదము ప్రతిసంవత్సరమును జూనునుండి డిసెంబరువఱకు ఆరుమాసములలో పూర్తియగును. ఇట్టి పద్ధతి నవలంబించుటవలన కాలక్రమేణ ప్రభుత్వమువారు తమ సంస్థానమునందలి ప్రతిగ్రామమునకును విద్యావతియగు మంత్రసానినిప్రసాదించి ప్రజాక్షేమమునకుతోడ్పడగలుగుదురు. బ్రిటీషుఇండియాయందుకూడ ప్రభుత్వమువారిట్టి పద్ధతినవలంబించుటకు ప్రజానాయకులు ఆందోళన సలుపుదుగాక!

**రంగుపిరాయించుట:—**

దివానుబహదూరు టి. రంగాచారి సి. ఐ. ఇ. వారు తమఎన్నికల వినతిపత్రమునందు శారదాచట్టము బాలికల వివాహవయస్సు పండ్రెండుసంవత్సరములనుండి పదునాలుగు వత్సరములకు హెచ్చించుటకు తాము వ్యతిరేకులమని ప్రచురించియున్నారు. దీనికి మేము ఆశ్చర్యకలితులమగుచున్నాము. ఏమందురా? శారదాబిల్లునుగూర్చి విచారణసలి

పిన సెలెక్టుకమిటీవారు బాలికల వివాహవయస్సు పండ్రెండునుండి పదునాలుగుసంవత్సరము లకు పెంచగా దానిని అభినందించుటకు జరిగిన ఒకానొక పౌరజనమహాసభకు దివానుబహా దూరువారు అధ్యక్షులై యుండిరి. మరియు బిల్లునకు వ్యతిరేకముగ రాయబారముకొనిపో యిన సనాతనులను నిరసించిన ఒకానొకసభలో శ్రీ రంగాచారిగారు ప్రధానవ్యక్తిగా నుండిరి. స్థితి ఇట్టిదికాగా రంగాచారిగారు ఇప్పుడు ఓట్లకొరకు రంగుపిరాయించిరి. నాయ కులమనుకొనువా రిట్లుప్రవర్తించుట అవమానకరముగనున్నది.

**బరోడాలో విడాకులచట్టము:—**

సంఘసంస్కరణవిషయికములగు చట్టములను నిర్మించుటలో బ్రిటీషు ఇండియాకు బరోడారాజ్యము ఉపదేశకర్త్రిగ నున్నది. బరోడాలో విడాకులచట్టము ఆమోదింపబడినది. బరోడా గవర్నమెంటువారు విడాకుల బిల్లు గతసంవత్సరము శాసనసభలో ప్రవేశపెట్టిరి. అది ఉపసంఘమువారి విచారణకు పాల్పడెను. ఉపసంఘమున తొమ్మండుగురు పురుషు లును, ఇరువురు విదుషీమణులును ఉండిరి. విచారణ సల్పి ఉపసంఘమువారు బిల్లులో కొన్ని ముఖ్యమగు సవరణలు చేసిరి. బిల్లునకు పూర్వాచారపరాయణులు వ్యతిరేకప్రచా రముసల్పిరి. స్త్రీలకు ఆర్థికస్వాతంత్ర్యము రానిదే ఇట్టిచట్టము అమలులోనికివచ్చినచో అది స్త్రీలకే ముప్పుతెచ్చిపెట్టునని వారివాదన. ఆవాదనకు పదుగురిలో చెలామణీలేకపోయి నది. బిల్లు రెండవసారి శాసనసభలో చదువబడెను. బిల్లు చట్టమగుటకు బరోడారాజ్య మున రెండుసారులు చదువబడినచాలును. ఇక రాజావారి ఆమోదమునుమాత్రము బడయ వలసియుండును. ఆజన్మాంతమైన సఖ్యమున భార్యాభర్తలు జీవించుటలో ఉన్నతాదర్శము లేకపోలేదు. అయితే స్త్రీ మాత్రమే అట్టిసఖ్యమునకు బద్ధురాలును పురుషుడు స్వతంత్రు డును అయినచోట ఆ ఆదర్శమునకుగల ఔన్నత్యము పోయినది. ఈ విషయమున ధర్మ సాధని ఇట్లువ్రాయుచున్నది. "కలిసి కాపురముచేయుటకెంతమాత్రమును వీలుగాని సందర్భ ములలో భార్యాభర్తలు విడిపోవుటకు క్రైస్తవ మహమ్మదీయ వివాహపద్ధతు లవకాశ మొసంగుచున్నవి. ఒక్క హిందూవివాహ పద్ధతిలోనే అట్టివీలు కనిపింపదు. ఈ పద్ధతిలో పురుషునినుండి విడిపోయి ఇష్టమైనచో పునర్వివాహమాడుటకు స్త్రీకిమాత్రమే అధికారము లేదు. ఉన్న భార్యను విడిచి వేఱొక భార్యను స్వీకరించుటకుగాని లేక యిష్టము వచ్చిన తీరున ప్రవర్తించుటకుగాని హిందువులలో పురుషునికి పూర్ణమైన స్వాతంత్ర్యముగలదు. స్త్రీకి లేని యీ అధికారము పురుషునికుండుటచే అనేకహిందూకుటుంబములలో చాల చిక్కులుకలుగుచున్నవి. పురుషులు అమానుషముగా స్త్రీలనుచూచుట తటస్థించుచున్నది. భర్త యెంతటి ఆర్జనాపరుడైనను విడిపోదలచుకొన్న స్త్రీకి భరణమును గోరుటకు తప్ప నంతకు మించి యెట్టి అధికారమునులేదు. ఇట్టి సందర్భములలో విడాకులచట్టమును స్త్రీలు కోరుట యెంతమాత్రమును ఆశ్చర్యముగాదు. విడాకుల చట్టమువలన హిందూస్త్రీల పాతి

వ్రత్యమునకు కళంకము కలుగునని తలంచుట నిరాధారమైన భ్రమ. చట్టములవలన ఉన్న పాతివ్రత్యము పోదు. లేనిపాతివ్రత్యము రాదు." అయినను బరోడారాజ్యమున అయినంత సులభముగ బ్రిటీషు ఇండియాలో విడాకులబిల్లు చట్టమగునని తలంచుటకు సూచనలులేవు. చూచుచుంటిరిగదా గృహలక్ష్మియందు ప్రకటింపబడుచున్న విడాకులచట్టమునుగూర్చిన విదుషీమణుల అభిప్రాయములలో ముప్పాతికముప్వీసము దానికి వ్యతిరేకమై యుండుట. చట్టమువలన ఏమాత్రము లాభముండినను దానిని అనుభవింపగల స్త్రీలే చట్టమునకు ఇట్లు ప్రతికూలముగ నున్నారు. ఈ ప్రతికూలప్రభంజనమునకు ఎదురొడ్డి విడాకులచట్టమును నిలుప మన సంఘసంస్కర్తలు ప్రయత్నింతురేమో చూడవలసియున్నది.

మదరాసు శిశుసహాయకసంఘము:—

1920 సంవత్సరపు మదరాసు శిశుసంరక్షకచట్టమునందలి సూచనలను నిర్వహించుట, అసహాయలగు బాలబాలికలకు నిలువ నీడకల్పించుట, అపరాధములొనరించు బాలబాలికలను సన్మార్గమునకుత్రిప్పుట, మదరాసు బోర్‌స్టల్‌పాఠశాలల చట్టనిర్వహణమునకు తోడుపడుట మొదలగు ఉన్నతాశయములతో 1925—వ సంవత్సరమున ప్రారంభింపబడిన మదరాసు శిశుసహాయకసంఘము సత్వరాభివృద్ధినంది నేడు మదరాసునందలి ప్రజాహితసంస్థలలో నొకటిగ క్రాలుచున్నది. శ్రీ గవర్నరు వైకౌంటుగోషెనుప్రభువువారు ఈ సంఘమునకు రాజపోషకులు. ఈసంఘమువారు బాలికలకొఱకు కీల్‌పాకునందలి 'రిట్రీటు' భవనమున సీనియరు జూనియరు సర్టిఫైడుస్కూలును నడుపుచున్నారు. వేపేరియందలి లాడర్సుగేటురోడ్డునకు కుముదవిల్లాభవనమున రిమాండుహోమును; ఆదియప్పమొదలివీధియందలి కోల్‌మెన్‌విల్లాయందు బాలుర క్లబ్బును నిర్వహించుచున్నారు. ఉదారులగు ధనవంతులు విరివిగపోషించి మంచి అభివృద్ధికితీసికొనిరావలసినసంస్థ. ఈసంఘమునకుసంబంధించిన రెండుచిత్రములను ఈమాసము ప్రచురించియున్నాము.

దానశౌర్యము:—

సింధుదేశమున సింధునది వెల్లువలవలన విశేషనష్టము సంభవించినది. షికారుపూరు సర్వనాశనముకావలసినదే. దానశూరుడగు ఒకానొక మహమ్మదీయజమీందారుని చేతలవలన దానికాపాటుతప్పినది. పట్టణముపై పడ నుంకించుచున్న నీటినంతను కాలువకు గండిపెట్టించి తనజామీందారీపొలముపై పారించెను. ఇట్లుచేయుటచే ఆతనికి ఏబదివేలరూపాయిల విలువచేయుపంటనష్టపడెను; నలుబది వేలరూపాయిల ఖరీదుగల వ్యవసాయపుపనిముట్లు పచ్చముపాడయ్యెను. ప్రజలక్షేమమునుగోరి ఉదారుడగు ఆజమీందారుడు లక్షరూపాయిలనష్టమునకు ఒప్పుకొనెను. పరులకొఱకేజీవించు ఇట్టిమహనీయులు నిత్యము స్మరింపదగినవారుకదా!

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౩.]  అక్టోబరు 1930  [సంచిక

PRINTED AT LODHRA PRESS, EGMORE, MADRAS

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' Schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

1 **Ongole**
2 **Cuddapah.**
3 **Tadpatri.**
4 **Guntur.**
5 **Adoni.**
6 **Hindupur.**
7 **Tirupati.**
8 **Nellore.**
9 **Bezwada.**
10 **Berhampore.**

## TALUK BOARDS.

1 **Penukonda.**
2 **Ramachandrapuram.**
3 **Vellore.**
4 **Narasarowpet.**
5 **Berhampore.**
6 **Madanapalle.**
7 **Dhone.**
8 **Koilkuntla.**
9 **Karvetinagar.**
10 **Chendragiri.**
11 **Peddapur.**
12 **Tadepalligudem.**
13 **Proddatur.**
14 **Jammalamadugu.**

*Editor,*

# GRIHALAKSHMI.

**Post Box. 752.**

EGMORE, MADRAS.

# విషయసూచిక

రాసు సేవాసదనము: లేసుఅల్లికతరగతి; 13. మదరాసు సేవాసదనము: బట్టకత్తిరింపుల, కట్టుపనులతరగతి; 14. సూల్తానాకన్య; 15. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు; 15. శ్రీమతి మదమంచి అనంతమ్మగారు; 17. మదరాసు సేవాసదనము: బుటేదారీపని; 18. మదరాసు సేవాసదనము: నేతపనితరగతి; 19. చాందుబీబి; 20. మదరాసు సేవాసదనము: తెనుగుక్లాసు; 21. మదరాసు సేవాసదనము: జలతారుకుట్టుపనితరగతి; 22. క్రీ. శే. వేగూరి వేంకటసుబ్బమ్మగారు; 23. రాట్నము: గృహాశ్రమ; 24. ఏణాక్షి రామారావు కన్యగారు యం యె. (ఆనర్సు); 25. శ్రీమతి వింజమూరి వేంకటరత్నమాంబగారు; 26. విద్యావతులగు సోదరీమణులు; 27. శ్రీమతి అదిపూడి వసుంధరాదేవిగారు, ఎమ్; బి. ఎస్. సి. ఆనర్సు; 28. శ్రీమతి వెంపాటి జానకీపురుషోత్తముగారు; 29. శ్రీమతి రెడ్డి లక్ష్మమ్మగారు; 30. శ్రీమతి శ్రీరాం సూరమ్మగారు; 31. శ్రీమతి సి. హెచ్. పాలమ్మగారు; 32. కుక్కబండిలాగుట; 33. సూలువడకుట; 34. హాలండుదేశపు విలాసవతులు; 35. శ్రీమతి పత్రి కనకమ్మగారు, ఆమెభర్త; 26. శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు.

# గృహలక్ష్మి

## ౧

"అయ్యా,

వందనములు

గృహలక్ష్మి నందుకొంటిని. ఈనెలపత్రిక అత్యంతరమణీయముగా పాలుపోలుచున్నది.

ఏలూరు }
3-9-30 }

ఇట్లు
బొడ్డు బాపిరాజు."

## ౨

"అయ్యా,

నమస్కారములు

గృహలక్ష్మి దినదినాభివృద్ధిబొందుచు నూతనసద్భావరచనలతోడను, ఆకర్షణీయమైన చిత్తరువులతోడను విలసిల్లుచుండుటజూడ యెంతయు మోదావహము. పరమేశ్వరు డీపత్రికను ఆచంద్రతారార్కముగ విలసిల్లునట్లు అనుగ్రహించుగాకయని కోరుచున్నాను.

గుంటూరు }
5-9-30 }

ఇట్లు
అద్దంకి అనసూయాదేవి."

## 3

"అయ్యా,

తమ గృహలక్ష్మిపత్రికను తరుచు చూచుచున్నాను. బాలికాపాఠశాలలకు ఇది ముఖ్యావసరమని నాకు తోచినది. నేను గృహలక్ష్మిపుస్తకమును మాతరగతిబాలికలచే చదివించుచుండగా వారలయానందమునకు మేరలేదు. కాన బాలికాపాఠశాలలకు ఇది ముఖ్యావసరమనియు తప్పక ఒకపుస్తకము సాంక్షను చేయించవలసినదిగా శ్రీతణుకుతాలూకాబోర్డువారికి రెండుదినములక్రితమే వ్రాసికొనియుంటిని.

కాల్ధరి }
10-9-30 }

ఇట్లు
తల్లాప్రగడ వేంకటేశ్వరరావు,"
నిడదవోలుతాలూకా ప్రాథమికవిద్యాసంఘ కార్యదర్శి.

SREE KARA

KASTURI




REGD

AMODINI

నంజన్‌గూడ్ సద్వైద్యశాలవారి
ప్రఖ్యాతిగాంచిన ఆయుర్వేద ఔషధములు.

'జీవసుధ'—అజీర్ణజాడ్యములకు. 'బాలసుధ'—శిశువులకు బలవర్ధకము. అమృతామలక, భృంగామలక, చందనాదితైలములు.

'ఐ. డి. ఎల్. సుఖభేది మందు.' 'ఐ. డి. ఎల్. తలనొప్పి మందు.' 'ఐ. డి. ఎల్. తామరమందు.'

పక్వముచేయబడిన ఆముదము. గోరజనమాత్రలు.

సోల్ ఏజంట్లు:—యునైటెడ్ కన్సరన్,
54, బందరువీధి, మదరాసు.






## వ్యాసరచనయందు పోటీపరీక్ష

కృష్ణాజిల్లా యలమర్రునివాసులును, ఆర్యయువకసమితి కార్యదర్శులును, స్త్రీజన శ్రేయోభిలాషులును నగు గద్దే లింగయ్యచౌదరిగారు మాకిట్లు వ్రాయుచున్నారు:—

### ౧

ఆగస్టునెల 'గృహలక్ష్మి' లో మేము ప్రకటించిన పోటీపరీక్షలో ఈక్రిందివారికి ఆయాబహుమతులీయవలయునని పరీక్షకులు నిర్ణయించిరి.

1. శ్రీమతి ఎమ్. వేదవల్లితాయారమ్మగారు (విద్వాన్ ప్రిలిమినరీ)
2. శ్రీమతి కల్పాల పార్వతీసమారిగారు
3. శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

### ౨

## గృహలక్ష్మి ఉచితము

ప్రశస్తమగు వ్యాసమునువ్రాసి పంపువారికి గృహలక్ష్మి ఒకసంవత్సరము ఉచితముగాపంపునట్లు చేయుదును. వ్యాసవిషయము 'ఖాదీప్రచారము: స్త్రీలకర్తవ్యము' నుగూర్చి. వ్యాసము ఫుల్ స్కేపుసైజున 5 పుటలకు మించకూడదు. ఈ పోటీపరీక్ష స్త్రీలకుమాత్రమే. వ్యాసములు ఆక్టోబరు 20-వ తేదీలోపున నాకు చేరవలయును.

# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సం॥ చందా. రు. 4.

విడి పత్రిక. అ. 6

మాదిరి పత్రిక కోరువారు 6 అణాల స్టాంపులను పంపవలెను

**ప్రకటనరేట్లు**

| | | |
|---|---|---|
| నెలకు | ఒక పుటకు. | రు. 15 |
| నెలకు | $\frac{1}{2}$ పుటకు. | రు. 10 |
| నెలకు | $\frac{1}{4}$ పుటకు. | రు. 7 |

6 నెలలకుపైగా ప్రకటించువారికి నూటికి $12\frac{1}{2}$ వంతున కమీషను మినహాయింపబడును.

**మేనేజరు**

గృహలక్ష్మి

తపాలపెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి

**చందాదారులకు విజ్ఞప్తి**

చందాదారులు మా కార్యాలయమునకు వ్రాయు జాబులయందు తమ చందానెంబరు వ్రాయవలెను. చందానెంబరు గృహలక్ష్మి కవరు కాగితముపై విలాసమునకు ముందున్నది. లేనిచో ప్రత్యుత్తరము లిచ్చుటకు సాధ్యము కానేరదు.

గృహలక్ష్మి ప్రతిమాసము మొదటి తేదీని చందాదారులకు అతిజాగ్రత్తగ పంపుచుందుము. చేరనిచో 7-వ తారీఖులోపుగనే మాకు తెలుపుచు వారివారి తపాలాఫీసులలో కూడ రిపోర్టు చేయవలెను. 7-వ తేదీ తరువాత చేరలేదని వ్రాయుచో తిరిగి సంచిక పంపజాలము.

-మేనేజరు-

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరికాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివుఆఫ్ న్యూస్

బళ్లారి: వి. రాజు మొదలియార్ & సన్సు,
కారుస్ట్రీటు, బ్రూసుపేట.

నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.

బెజవాడ: నామల అంతోని.

మచిలీపటణము: కె. బాలకృష్ణ

తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్.

హైదరాబాదు: ఎన్. లక్ష్మిబాయిగారు, 566 పెద్దగడియారం చౌరస్తా మార్కెటురోడు, బజారు. (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును)

వాల్తేరు: పి. తారనయ్య, అల్లిపురం.

మదరాసు: మదరాసు న్యూస్ ఏజన్సీ, మౌంటురోడ్డు.

అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.

నిడదవోలు: టి. కుటుంబ శాస్త్రిగారు.

చికాకోలు: తాటిగడప మాణిక్యరావుగారు.

పాలకొల్లు. వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపర్రు.

ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.

కాకరపర్రు: కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల.

విజయనగరం: కేసనపల్లి. రామలింగంగారు, పొత్తూరివారి వీధి.

ఒంగోలు: కే. ఎల్. శర్మగారు

రామచంద్రపురం: సి. జి. శాస్త్రి & కంపెనీ.

గుడివాడ: సీతారాం అండు కంపెని.

కొవ్వూరు: జి. వి. రామరావుగారు.

ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట.

రాజమండ్రి: ఎన్. బి. కృష్ణరావుగారు

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు

బరంపురం: గోనియశెట్టిగారు, గొల్లపల్లి

కొల్లూరు: కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల.

ఇతర చోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# రజోదర్శిని

తిమ్మసముద్రము
28—5—29

ఆర్యా

"..........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకముందే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

ఆర్యరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)

అదె కైలాసము దృగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్భామాసదాధ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వానబి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస మజ్ఞాననా!

—చిమ్మపూడి అమరేశ్వరుడు

వాగర్థా వివసంపృక్తౌ
వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌ వందే
పార్వతీపరమేశ్వరౌ॥

—మహాకవి కాళిదాసు.

శ్రీరంజిల్లి జగత్కుటుంబమునకుం బ్రేమాస్పదంబై శుభా
ధారంబై యనపాయమై యఖిలవిద్వత్సేవ్యమై శాంతశృం
గారంబుల్ వెదచల్లు దివ్యమగు సత్కావ్యప్రబంధంబటుల్
స్ఫారంబైన యుమామహేశ్వరుల దాంపత్యంబు స్తుత్యంబగున్.

—జనమంచి వేంకటరామయ్యగారు.




# బొమ్మలకొలువు: స్త్రీలధర్మము



శ్రీదేవీనవరాత్ర్యుత్సవములు దేశమున దివ్యముగాజరుగుచున్నవి. దీక్ష, ధనము, విద్య అను శక్తిత్రయమునకు పర్యాయాభిధానములగు దుర్గ, లక్ష్మి, సరస్వతులను పూజించుటలో పుణ్యశీలురగు భారతీయులు పర్యాప్తులై యున్నారు. ఈ ఉత్సవములలో స్త్రీలు ప్రత్యేకముగచేయునది బొమ్మలకొలువు. గృహమునగల బొమ్మలనన్నిటిని ఒక్కచోచేర్చి వానికి పదిదినములు పూజలు సల్పి, పేరటాండ్రను పిలిచి వారికి పసుపుబొట్టు నిచ్చి వారితో గొంతుకకలిపి వానికి మంగళము పాడి వారితో చేతులుకలిపి వానికి హారతినిత్తురు.

ఈ బొమ్మలకొలువు ఆదిలో గృహమున నిర్మితములగు వస్తువుల ప్రదర్శనముకొఱకేర్పడినది. సర్వమును కదలజేయు కాలమూర్తి సంకల్పబలమున తొలుత ఉత్కృష్టమైన ఆదర్శములతో నేర్పఱుపబడినట్టి ఈ యాచారమిప్పుడు ఆంతర్యమునుగోల్పోయి అసలుకే మోసముదెచ్చునదియైయున్నది. కాలుకదుపుటకు వీలుఈయని ప్రావృట్కాలమున తీరికయై పనితనమున గృహిణులు తయారుచేసినవస్తువుల కీశరన్నవరాత్రములు ప్రదర్శనసుముహూర్తములై యుండినవి. ఆడుబిడ్డతయారుచేసిన అద్దాలరవిక, క్రొత్తకోడలుగుట్టిన గోడసంచులు మఱియిట్టివియే అనగా ఆయింటియందుమాత్రమే నిర్మింపబడిన వస్తువులే ప్రదర్శింపబడు

చుండినవి. ఒక్కొక్క యింటియందు ఎంతటి నేర్పుకత్తెలుండిరో ప్రత్యక్షీకరించుట కీశరన్నవ రాత్రప్రదర్శనములు చక్కని సాధనములుగనుండినవి.

ఇప్పుడాస్థితి మారిపోయినది. నేఁడు కుట్టుపని, లేసుఅల్లిక తెలిసిన తెఅవలుసహితము తమపనుల నచ్చటప్రదర్శించునాచార మేర్పఱచుకొనలేదు. జర్మనీలోముద్రింపబడిన చిత్ర పటములు, పుదుచ్చేరినుండివచ్చిన బొమ్మలు ఇవియేకదా ఇప్పటి బొమ్మలకొలువులయందు మనము సమీక్షించునవి? ఈబొమ్మలకు జపానునుండి దిగుమతినొందిన కర్పూరపుహారతి. ఈసందర్భమున కుంకుమమొదలుకొని దేవతార్చనవఱకు ఉపయోగింపబడు సమస్తవస్తువుల మీఁదను ఇట్లు విదేశీయముద్ర పడియున్నది.

పడిన ఈ ముద్ర దేశకల్యాణమునకుగానిది; కలిగిన ఈమార్పు పడతుల ప్రజ్ఞా సాంద్రతకు సహకారికానిది. కాకపోవుటకుతోఁడు ఆముద్ర దేశసంపదకు తూటుపెట్టినది; ఆ మార్పు గృహకళలకు తుదిచీటినిచ్చినది. ఇకనిది సాగనీయరాదు. ఈడఁబోయిన దేశసంపదకు పునర్భవముకలిగింపబడవలయును; కొనూపిరులువైచిన గృహకళలకు పునర్జన్మ ప్రసాదింపబడ వలయును. ఈమహాదీక్షావిధినిర్వహించుటకు భారత స్త్రీ తనయందు నిక్షిప్తములై ప్రస్తు తము నిద్రాణములైయున్న దుర్గ, లక్ష్మి, సరస్వతి ఈశక్తులను ఉత్థాపనముచేసి ప్రయో గింపవలయును. స్త్రీశక్తిని ప్రశంసించి ప్రార్థించుటకేర్పడిన ఈ దేవీనవరాత్రములయందే దేవీ స్వరూపిణులగు భారతస్త్రీలు ఒట్టుపెట్టుకొనవలయును. ఏమని? ఎట్టిసందర్భములయందును విదేశవస్తువులు తాకమని, తలంచమని.

తనగృహములకు ఉపప్లవముగల్గించుచున్న విదేశవస్తువ్యామోహమను అసురునిసంహ రింప దుర్గయు; స్వయముగానిర్మించియు, కూతుండ్రకోడండ్రచే నిర్మింపించియు ఆత్మగృహ మునకు వస్తుసంపదసమకూర్ప లక్ష్మియు; స్వయముగానిర్మించిన వస్తువుల నుపయోగించుటచే గలుగు ఆత్మతృప్తిని, అధికలాభమును తెలియనిజనులకుపదేశింప సరస్వతియునై భారతస్త్రీ గృహమను జగతికి ధాత్రికావలయును. ఇట్లగుటకు నేటి శరన్నవరాత్రములనాటి బొమ్మల కొలువులు గృహమునన్నిర్మింపబడినవస్తువులను లోకమునకు పరిచయముచేయు ప్రదర్శనము లుగా తిరిగి మారవలయును. అట్లుమారినచో భారతదేశమునందు ఏటికేఁడాదిలోను ఒక్క షష్ఠిఘడియలకాలమునమాత్రమేగాక నిత్యము విజయదశమియై నివ్వటిలగలదు. నిత్య విజయదశమీప్రాప్తిని భారతస్త్రీలు దేశమునకు కల్గింతురుగాక!

# ఓ భారతీయుఁడా!

కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగారు

ఓ భారతీయుఁడా! నీవు స్త్రీని గృహకోణమునందు నిర్బంధించుచున్నావు. చేయి ఆడించుకొనజాలని అస్వతంత్రురాలినిగ ఆమెను చేయుచున్నావు. మాధ్యమునముంచి అధఃపతితురాలినిగ గావించుచున్నావు. నీయిష్టానుసారము ఆమెను ఆటవస్తువుగ వ్యవహరించుచున్నావు. నీ నిర్బంధమువలన నామె సత్యధర్మమార్గములకు దూరమగుచున్నది.

*　　　*　　　*　　　*　　　*

ఓ భారతీయుఁడా! నీవు స్త్రీని విద్యాహీనను గా జేయుచున్నావు. బాల్యవివాహదురాచారముల నెలకొల్పి దేశమును బాలవితంతువిలాపములతో ముఖరితమొనర్చుచున్నావు. బాల్యమునందే ఆమె మాతృత్వమువహించునట్లుచేసి కష్టపెట్టుచున్నావు. అకాలమృత్యుముఖమున బడవేయుచున్నావు. వితంతువివాహములకు తావులేదనుచున్నావు. స్త్రీ నీకు దాసిగనుండవలయునని నిత్యము నిర్వచించుచున్నావు. సతీత్వము, మాతృత్వములనుగూర్చిన ధర్మముల నుపదేశించుచున్నావు. 'నీకు నేనేదైవము' నని బోధించి ఆమె యన్నివిధముల నీస్వాధీనమునందుండునటుల యత్నించుచున్నావు. నీయత్నము సర్వత్ర సఫలమగుచునేయున్నది. స్త్రీ వ్యక్తిత్వమెఱుగని జంగమమైనప్రతిమవలె నైనది.

*　　　*　　　*　　　*　　　*

ఓ భారతీయుఁడా! 'స్త్రీని గౌరవింపుము' అని ఘోషించుచున్న నీశాస్త్రముల నీవిషయమున ప్రమాణముగొనవేమి? నీస్వాధీనమునసున్న వస్తువు అవమానములపాలయి అస్వతంత్రయై, అధఃపతితయై, పశుప్రాయయై ఉన్నను సహించుచున్నావు. నీకీవిషయమున ఎంత ఓరిమియున్నది? ఆమెను ఔన్నత్యమునకుకొనిపోవ సాధనముకొఱకు ప్రయత్నింపవా? ఆమెనిర్బంధమును తొలగింపవా?

*　　　*　　　*　　　*　　　*

ఓ భారతీయుడా! నారీకల్యాణమే నీకల్యాణమనియు, నుభయులకల్యాణమే దేశకల్యాణమనియు ననుభావమింకను నీహృదయమున కలుగలేదు. నాకంటె నారి తక్కువదియనుభావము నీవు కలిగియున్నంతకాలము నీకాభావముకలుగుట దుర్లభము. నారి నాతోసమానురాలు; ఆమె సమ్మాననార్హురాలు అనుతలంపు నీకు పొడసూపినప్పుడే నీవు సుఖాన్వేషణమునకు యత్నింతువు. ఆమెకు సర్వాధికారములకును అర్హతయున్నదనుభావముకల్గినపుడే నీవు ఆమెను స్వతంత్రురాలినిగచేతువు; అప్పుడే ఆమెకు విద్యాదానమొసగి ఉన్నతదశకు తోడితెత్తువు. అంతదనుక నీవు నారీప్రపంచముపై నిర్నిరోధనిరంకుశపరిపాలనము కొనసాగింతువు.

*　　　*　　　*　　　*　　　*

నారీగౌరవమునుబట్టి దేశగౌరవము. నారీస్థానమునుబట్టి దేశస్థానము. నారీస్వాతంత్ర్యమునుబట్టి దేశస్వాతంత్ర్యము. కావున భక్తప్రియుడగు భగవానుడు భారతస్త్రీలోకముపై కరుణామయదృష్టులుబఱపి నీహృదయమునందు సత్యభావములుదయింపజేయుగాక! మాతృదేవి, సోదరీమణి, పార్శ్వవర్తిని అయి నిన్ను పోషించుచు, ప్రోత్సహించుచు, సేవించుచు, వర్తించుచున్న స్త్రీలను గౌరవించుట నేర్చుకొననినాడు నీకు ముక్తిలేదు. నీవు ముక్తిదూరుడవుగాకుందువుగాక! ఓభారతీయుడా! నీవు ముక్తిదూరుడవు గాకుందువుగాక!

—'నారి' అను అముద్రితగ్రంథమునుండి.

# పెన్షనుపుచ్చుకున్న నాటిరాత్రి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

డెప్యూటీకలెక్టరు రాజేశ్వరరావుపంతులుగారు తాము పెన్షనుపుచ్చుకునేకాలం సమీపిస్తున్నందున నరసినతలకు నల్లరంగుపూసుకొనీ, తొస్సినోటికి పండ్లుపెట్టించుకొనీ తమ ఉద్యోగకాలం మఱిరెండేండ్లు పొడిగించుకోడానికి నానాపాట్లుపడ్డారు; కాని లాభించలేదు. ఉన్నట్టుండి ఒక్కనాఁడు "మీరీనెలాఖరునుంచీ పెన్షను పుచ్చుకోవలసిం"దని ఆర్డరు వచ్చింది. పిట్టపిడుగులాగవచ్చిన ఆ ఉత్తరువుచూచుకొని రాజేశ్వరరావుగారు నిర్విణ్ణులై పోయినారు. "ఛీ ఎంతమేపితేనేమి. ఈఅధికారులకు విశ్వాసంలేదు?" అని విసుక్కున్నాఁడు. విచారపడ్డాఁడు. నిజమేపాపం గొప్పహోదాలోఉన్న ఉద్యోగస్థుణ్ణి తినితిరుగుతూ ఉండగానే పెన్షనుపుచ్చుకోమంటే కష్టంగాదా?

పెన్షనంటే యేమిటి? ఏఁడువందలయాభై వచ్చే జీతం రెండువందలయాభైకి దిగడం. ఉద్యోగరీత్యా ఉండేనౌకర్లూడడం. స్వంతంగాపెట్టుకొనే నౌకర్లు తగ్గడం. బంగాళాకాపురం వదలడం. అన్నిటికంటే పెద్దకష్టం ఒక్కొక్కకలపుగీటుతో తాలూకాలను జిల్లాలనుయేలిన ఆదక్షిణహస్తం ముడిచిపెట్టుకొని కూర్చోడం. ఇన్నివిధాల నష్టహేతువైన పెన్షనుపుచ్చుకొని నాకొకరులేరు నేనొకరికిలే నన్నట్టుగా జీవించడం నిజంగా దుఃఖముగాదా? అయితే తప్పేదేమున్నది? ఆయనజాతకంలో ఉద్యోగాంశ మెంతదాకా ఉన్నదో అంతదాకా వెళ్లిపోయింది. దశాంతరం వచ్చింది. బదిలీదారుఁడుగూడా వచ్చిపడతాఁడు.

మేజస్ట్రీటునుండి తాసిల్దారులోకి తాసిల్దారునుండి జిల్లాశిరస్తారులోకి శిరస్తాలోనుండి డెప్యూటీకలెక్టరులోకి అని ప్రమోషన్లు అవుతూవుంటే ఒక్కొక్కమెట్టెక్కినప్పుడల్లా బంధువులు స్నేహితులూ అభినందనలేఖ లంపుతూఉంటే నిజంగా ఆకాలం మహోల్లాసకరమైందేకాని ఉన్నతోద్యోగుల అంత్యస్థితి తలుచుకుంటే బహుజాలిగా ఉంటుంది. అందుకనేగదా కొందఱు ఆడదాని అయిదోతనం, మగవాడి ఉద్యోగంఒకటి అనిఅంటూఉంటారు.

రాజేశ్వరరావుపంతులు గుమాస్తాజీవితం ఎట్లావెళ్లదోశాడోగాని కొంచెంహోదాగల ఉద్యోగంలోకి వచ్చినతరువాత ఆయన నడుమువంచి నేలమీదివస్తువు చేతితో తీసుకోలేదు. చెయ్యెత్తి వంకెమీది ఉత్తరీయం భుజానవేసుకోలేదు. అన్నీ నౌకర్లు అందించవలసిందే. అప్పటినుంచీ యిప్పటిదాకా ఒక్కవిధంగా జరిగిపోయింది.

రాజేశ్వరరావుపంతులు మంచి ఒడ్డూపొడుగూగలమనిషి. దానికితగినట్టుగా విశాలమైనముఖం. పెద్దపెద్దకండ్లు ఆయన ఆకృతికి గంభీరాన్ని కూరుస్తుంటాయి. స్వభావంచేత ఆయన మాంచి దర్జాపురుషుడు. ఆస్వభావానికి తగినట్టుగా ఉన్నతోద్యోగికావడంవల్ల ఆయనధరించే దుస్తులూ ఉపయోగించుకొనే వస్తువాహనాలు మిక్కిలిఘనంగా ఉంటాయి. ఆయన యీమాజామావేసుకొని అద్దాలబండిమీదనో స్వారీగుఱ్ఱంమీదనో మోటారుసైకిల్‌మీదనో వెళ్లుతూవుంటే మగవాళ్లే ఎదుటనిలబడడానికి భయపడి చాటుకుపోతూ ఉంటారు. ఆయనేగాకుండా ఆయన భార్యాబిడ్డలుగూడా బహుఠీవిగా ఉంటారు. అందఱి

యిండ్లలో ఆడవాళ్లవలె వారి ఆడవాళ్లు ఇంట్లో పనిచేయరు. అవును, చేయవలసినపనేమున్నది? ఇంటియజమాని ఘెల్లుమని డిప్టీకలెక్టరుచేస్తూవుంటే ఇంట్లో చాకిరీచేసుకున్నదాకా వారికేమి కర్మం? ఇంట్లో యిద్దఱువంటవాళ్లూ, (సర్కార్యాటుకొకరు, ఇంటిదగ్గిరకొకరూ) నల్గురు పని మనుష్యులూ, పైన సర్కారుబంట్రౌతులూ. వీరేనా? ఆశ్రయింపుకుచేసేవారూ, అభిమానం చేత చేసేవారూ, ఓ ఒకరేమిటి లెక్కలేనంతమంది. వారుకాపురంవున్న పెద్దబంగాళా యీ నౌకరులతోనే కిటకిటలాడిపోతూ ఉంటుంది. ఇకవాళ్లు అటున్నచెంబు యిటుతీసిపెట్టవలసిన అవసరమేమున్నది ?

మేడగానియింట్లో ఆయనెప్పుడు కాపురండుండలేదు. ఇక వారియింట్లో వస్తుసామగ్రి అంటారా? విలువైనవీ వింతలైనవీ ఏంవుంటాయో అవన్నీవాళ్లయింట్లో ఉన్నాయనే అనుకోవచ్చు. వింతవింతైన సోఫాలూ కుర్చీలూ వ్రాతబల్లలూ బీరువాలూ నిలువుటద్దాలూ చిత్తరువులూ వారియింట్లో యేమూలచూచినా కనబడుతూ ఉంటాయి. రకరకాలు వెండి బంగారువస్తువులకూ ముద్దునుసువస్త్రాలకూ వారియిల్లొక పెద్దభాండారం.

ఈవిధంగా ఉద్యోగాభివృద్ధితోపాటు నానావిధభోగాలకు జ్ఞానేంద్రియకర్మేంద్రియాలతోగూడిన తమశరీరాన్ని అలవర్చి ఆయనేగాకుండా ఆయన భార్యాబిడ్డలుగూడా యింతకాలంనుండి ఒక సుఖమయరాజ్యంలో జీవయాత్రచేస్తున్నారు. ఆభోగానుభవతన్మయతలో తమ కీవినంతను కుల్లుక్రుంగినట్లు క్రుంచివేయడానికి పెన్షననేదివస్తుందని ఆయనగానీ, ఆయన యింటిలోనివారుగాని యెప్పుడూ యోచించలేదు. రోజులట్లాగ గడచిపోయినాయి. నేడు ఆకస్మికంగావచ్చిన పెన్షన్ఆర్డరు వామనమూర్తి బలిచక్రవర్తివైభవాన్ని లాక్కొని పాతాళానికి త్రొక్కినట్లు వారిని త్రొక్కివేసింది.

లోకమెప్పుడూ సుఖదుఃఖద్వంద్వం. ఒకరు యేడుస్తూఉంటే ఒకరు నవ్వుతూ ఉంటారు. రెంటినీ సమంగాచూడాలని ప్రతివాళ్లూ పాటపాటతూఉంటారు; కాని జ్ఞానచక్షువులేనివారి కాభావంకలగడం సున్న. ఉద్యోగసమాప్తికాలం తలుచుకొని రాజేశ్వరరావుపంతులుగారు దుఃఖాన కుములుతూవుంటే తాసిల్దారుపనిలోనుంచి డెప్యూటీకలెక్టరులోకి ప్రమోషనై పంతులుగారికె బదిలీగావచ్చిన ఆ పెద్దమనిషి మహోల్లాసంతో తట్టాబుట్టాకట్టుకొని ముప్పయ్యోతారీఖురాత్రికే రాధారిబంగాళాలో విడిశాడు. ఆ వర్తమానం వినగానే రాజేశ్వరరావుగారికి మఱీ గుండెకొట్టుకోవడం మొదలుపెట్టింది. దాదాపు పాతిక వత్సరాలు ఆయననుకప్పిఉన్న అధికారమత్తత ఆముప్పయ్యోతారీఖురాత్రి వదలిపోవడం మొదలుపెట్టింది. ఆయనకు యిప్పటికి వెనుకచూపుతగిలింది. ఆయనెప్పుడూ తనసుఖం తన మంచీ తన అభివృద్ధీచూచుకోవడమేగాని యెదుటవాడి కుపకారంచేసియెఱుగడు. జాలికూడా చూపియెఱుగడు. కాళ్లుపట్టేవాడిని చాలనడం, పంకావేసేవాడిని ఆపమనడం, కాగితాలు తెచ్చి నమ్రుడై నిల్చున్నగుమాస్తాను కూర్చోమనడం ఆయన ఉద్యోగజీవితంలో పరిచయం

లేనిసంగతులు. ఎంతవఱకూ స్వార్థాపేక్షతోనే ఆయనజీవితం గడిచింది. అధికారబలంచేత ఆయన తనఉద్యోగకాలంలో యెంతమందికో తొందరించి పెన్షన్లు యిప్పించాడు. ఈకఠిన మైన ఆయనప్రవర్తనకు స్ట్రిక్టుమాన్ అని కొందఱూ, కఠినచిత్తుడనికొందఱూ, గర్వపోతని కొందఱూ నానావిధాలుగా వ్యాఖ్యానాలుచేస్తూ ఉండేవాళ్లు. అయితే లోకులు నన్ను గూర్చి యిట్లా అనుకుంటూఉంటారనేమాటే ఆయనకెప్పుడూ తోచలేదు. నేనీ సామాన్య మనుష్యప్రపంచాని కందనియెత్తులో ఉన్నాననీ నన్నుగూర్చి ఒకమాట అనుకోడానికై నా వారి కర్హతలేదనీ ఆయన ఊహ. అటువంటితలంపులతో జీవించిన ఉన్నతోద్యోగికి తెల్ల వాఱితే తన ఉద్యోగం వూడుతుందనే ఆరాత్రివేళ మనస్సులో యెంతగాభరాగా ఉంటుందో చెప్పవలసిందేమిటి? అన్నిటికంటె నాడు తన్నుబాధిస్తున్నవిషయం పెన్షనుపుచ్చుకోవడం కాబట్టి తాను తొందరపెట్టి పెన్షన్లుయిప్పించిన తాభేదార్ల దీనాలాపా లాయనస్మృతిపథాన తగలడం మొదలుపెట్టినాయి. "అయ్యా! పేదవాడిని గంపంతసంసారం, పిల్లలు యింకా యెక్కిరాలేదు. ఇప్పుడేపెన్షనుపుచ్చుకుంటే కాపురంగడవదు. ఇంకా యేడాదిపాటు నౌకరీ చేస్తాను. అనుగ్రహించం" డని ప్రాధేయపడడం తాను టట్ వల్లగాదని నిరాకరించి ఆయన హృదయాంతరాళంలో ఆనిశ్శబ్దనిశాసమయమందు స్పష్టంగావినపడడం మొదలుపెట్టాయి. గ్రామఫోనులో పలికించినట్లుగా ఈపాతకథలన్నీ పలుకుచున్నవారెవ్వరు? అతడు నలు దిక్కులాపరికించిచూచాడు. అంతయు శూన్యము. మనుష్యుడి కయిష్టమైనపదార్థం కంటికి కనబడితే కళ్లుమూసుకోవచ్చు. చెవికి వినబడితే చెవులుమూసుకోవచ్చు. ఒంటికిసోకితే ఒడలుమూసుకోవచ్చు. కాని యేమిలాభం? ఆయనకిప్పుడు తోచుచున్న శబ్దాలు, ఆకారాలు బాహ్యంనుండివచ్చినవి కావు. హృదయకుహరంలోనుండి ఉద్భూతమైనవి. వాటికాతడెక్కడదాగుతాడు. "అయ్యో! నాకాళ్లవేళ్లంబడిబ్రతిమలాడిన ఆస్వల్పోద్యోగులలో నేనూ ఒకడనైనాను. వాళ్లే నన్నిప్పుడు సూక్ష్మరూపాలతో వెక్కిరిస్తున్నారు. ఇక నేనెట్లా జీవించడం? నాకేవిధంగా గౌరవం ఉండబోతుంది? ఆ స్వామీ! నాకీ అధికారనిషా దిగక మునుపే నీసాన్నిధ్యానికి తీసుకబోతే బాగుండెడిది. హా......... ఉన్నతోద్యోగ్యమా! నీలో యింతదావాగ్ని ఉన్నదా? హా...... తెలుసుకోలేదు. తెలుసుకోలేదు." అని రాజేశ్వరరావుపంతు లారాత్రివేళ విచారం మొదలుపెట్టాడు. మనుష్యుల కష్టసుఖాలతో కాలానికి పనిలేదు. అది ప్రపంచపుసుఖసంతోషాలను అంటీముట్టకుండా ప్రపంచప్రాణులనుమాత్రం తనతోబాటు యీడ్చుకపొయ్యే పరబ్రహ్మస్వరూపం. తెల్లవాఱితే అధికారంపోతుందే యీరాత్రి యిట్లాగేనిలువబడితే బాగుండునని రాజేశ్వరరావుపంతులు భావిస్తూఉన్నా వినక కాలచక్రం ప్రొద్దుపొడిపించితీఱింది.

రాత్రిఅంతా నిద్రలేక పోవడంచేత ఉస్సురస్సురంటూ పక్కమీదినుంచి లేచి రాజేశ్వరరావుపంతులుగారు కాలకృత్యాలు తీర్చుకొని కాఫీత్రాగి దాదాపు యెనిమిది

గంటలకు కచ్చేరి సావడిలోకి వచ్చారు. కాని పూర్వపు కళకాంతులు యేమూలా కన్పడ లేదు. నౌకర్లంతా క్రొత్త కలెక్టరుగారి పనుల సరఫరామీద వెళ్లిపోయినారు. సావట్లో ఒక్కబంట్రౌతులేడు. అంతా బావురుమంటున్నది. నలుమూలలపడిచివున్న కుర్చీలు, బల్లలు, బీరువాలు, పెట్టెలు, కాగితాలు, పుస్తకాలు మొదలైన ఆఫీసు సామానులన్నీ ఎప్పటట్లే ఉన్నా అవన్నీ తనకు వీడ్కోలొసంగుచున్నట్లే ఆయనకు తోచింది. అయ్యో హోదా పోయిన బ్రతుకు యిట్లాగే ఉంటుంది కాబోలునని నిట్టూర్పు విడిచాడు. అయిదునిమిషా లిట్లాగడిచిపోయినాయి. పంతులుగారు యేమీతోచక అటూయిటూపచార్లుచేస్తున్నారు. ఇంతలో పంతులుగారికి బదిలీగావచ్చిన అవధానిగారు బిళ్ల బంట్రౌతులు యిరుపార్శ్వముల నడుస్తూఉండగా పంతులుగారి దర్శనానికి వచ్చారు. ఆయనను చూడగనే పంతులుగారి ముఖం వెలవెలపోయింది. అప్పుడేపుట్టి మునిగిపోయినట్టు వచ్చాడని లోలోపల కొంచెం విసుక్కొని యింటికి వచ్చిన పెద్దమనిషిని మర్యాదచేసి కుర్చీలో కూర్చోబెట్టి తానుగూడా కూర్చున్నారు. పరస్పరసంభాషణల్లో ఆనాడు తిథివార నక్షత్రాలు బాగున్నాయనీ ఆపూట వర్జంలేదనీ అప్పుడే చార్జీయివ్వమనీ క్రొత్త కలెక్టరుగారు తమ అభిప్రాయం వెళ్లబెట్టారు. "ఒకనాడు నేనూయిట్లాగే అఘోరించా. ఆతిథివారనక్షత్రాలే నేడు నాకు మంచివికాకుండా పోయినాయి" అనుకొని రాజేశ్వరరావుపంతులుగారప్పుడే చార్జీ పుచ్చుకోడానికి గొంతు మీదవచ్చి కూర్చున్న కలెక్టరుగారిని చూచి కటకటబడ్డారు. ఈయన కటకటతో ఆయన కేమిపని? మధ్యాహ్నమనీ సాయంత్రమనీ రాజేశ్వరరావుపంతులుగారు అనుపులు పెట్టినా ఆబదిలీఉద్యోగి వదలిపెట్టక పంతులుగారివల్ల మంచి సమయంలో ఒక కాగితం పుచ్చుకొని తనగిలి తీర్చుకొని చక్కావెళ్లాడు. ఆసమయంలో ఉన్నతోద్యోగాల ఆరంభ విరామాల సంతోషదుఃఖాలు ఆ ఉద్యోగుల యిరువురి మొఖాన కన్పట్టినవి. పొయ్యే ఉద్యోగం ఒకపూట ఆపుకుంటేమాత్రం వరిగేదేమిటని రాజేశ్వరరావుగారు తెంపుచేసుకొని ఆమధ్యాహ్నం వెళ్లి చార్జీపూర్తిగా ఒప్పజెప్పి యింటికొచ్చారు. పాతికేండ్లకీ మధ్య వెంట బంట్రౌతు లేకుండా యింటికొచ్చిందాపూటే. ఆరావడం ఆయనకెంతో కష్టమనిపించింది. లోకమంతా మామూలుగానేఉన్నా అనుద్యోగియగు తన్ను లోకమంతా నిర్లక్ష్యం చేస్తున్నట్టు ఆయనకు తోచింది. అందువల్ల వంచిన తలయెత్తకుండావచ్చి యింట్లోపడ్డాడు. మనస్సు స్థిమితంగా ఉండనందున ఆసాయంత్రం క్లబ్బుకుగూడా వెళ్లలేదు. ఎవరో యెఱిగిన వారు ఒకరో యిద్దరో యింటివద్దకేవచ్చి మాట్లాడివెళ్లారు.

పనితొందరయేమీ లేక పోవడంచేత రాత్రిభోజనాలు తొందరగానే అయినాయి. ఎవరితోనూ మాట్లాడేటంత ఉల్లాసంగా ఉండనందున రాజేశ్వరరావుపంతులుగారు భోజనం కాగానే వచ్చి తనగదిలో పక్కమీద పడుకున్నారు. ఉద్యోగం పోతుందనే దిగులుతో గూడినరాత్రి గడచినరాత్రి. పోయిన తరువాత గడపవలసినరాత్రి యిది. అత్యంతహృదయ

వేదనాపూర్వకమైన యీరాత్రులు ఆయన జీవితంలో యెప్పుడూ చవిచూచినవిగావు. ఇంతకాలం ఏకఛక్కిగా అధికారం చలాయించిన తరువాత నీకు కలిగేదేమిటి? మిగిలిందేమిటి? మంచా? చెడ్డా? ఒకమాటు యోచించుకోమని అంతర్వాణి యేదో పలికినట్లయింది. ఆమాట తలుచుకోగానే ఆయనఒళ్లు జల్లుమన్నది. ఆయన తన ఉద్యోగకాలంలో యెవరికీ ఉపకారంచేయలేదు. దయజూపలేదు. కొంతమందికి సస్పెన్షన్లు, కొంతమందికి డిస్మిస్‌లు, కొంతమందికి ఉద్యోగాలుతగ్గించడం, కొంతమందికి యింక్రిమెంట్లు బిగపట్టడం, కొంతమందికి పెన్షన్లూడగొట్టడం, కొంతమంది కధికశిక్షలు వేయడం, ఒకటేమిటి అనేక విధములుగా అసంఖ్యాకప్రజాహృదయాలను క్షోభపెటిచాడు. పరార్థములను భంగపరిస్తేనేగాని స్వార్థంఫలించదు. స్వార్థం పోగొట్టుకుంటేనేగాని ప్రజానురాగం లభించదు. అప్పటి ప్రయోజనాలకోసం ప్రజలను ధిక్కరించి స్వప్రయోజనం చూచుకొన్నాడాయన. అధికారం ఉన్నన్నాళ్లూ దానిలోపమేమీ ఆయనకు కన్పడుటలేదు. కాబట్టి తనపనులనుగూర్చి ఆయనెప్పుడూ నెమరు వేసుకోలేదు. అయితే ఆహోదా తొలగిపోయిననాటిరాత్రివేళ తానూ ఒక సామాన్యమనుష్యుడై పోయిన సమయంలో నీకు మిగిలిందేమిటి? మంచా? చెడ్డా? అని అంతర్వాణి ప్రశ్నిస్తూవుంటే అటకమీద దాగిఉన్న దొంగల్లాగ ఏమూలనో పడిఉన్న అధికారదుర్వినియోగచిహ్నాలన్నీ విస్ఫుటాకారాలతో ఆయన మనోవీధిని పొడకట్టడం మొదలు పెట్టాయి. తాను చేసిన అకృత్యాలన్నీ తనలోనే దాగి ఉన్నాయనీ అవితనమీద విజృంభిస్తాయనీ ఆయనెప్పుడు వూహించలేదు. ఇంతకాలంనుండి యేబలంచేత అవి అణిగిఉన్నాయో ఆ ఉద్యోగబలం పోయినతరువాత ప్రతి ఒక్కటీ ఎదుటికొచ్చి "నీవానాడట్లా దుఃఖపెట్టావు; ఇట్లాదుఃఖపెట్టావు. ఇప్పుడు నీహోదాపోయింది. నీవైభవంపోయింది. ఇక నీ గొప్పేమిటి? అందరితోబాటువాడవే నీవూను. అయ్యో! అందుకనే ఎంత ఉన్నతాధికారం వచ్చినా నేనూ ప్రజల్లో ఒకడనే అనేమాట మఱచి పోగూడదయ్యా" అని కిలకిలా నవ్వడం మొదలుపెట్టినాయి. ఆవికృతహాస్యాలకు రాజేశ్వరరావుగారిహృదయంజలదరించడం మొదలు పెట్టింది. అన్నిటికంటె ఒకదృశ్యం ఆయన యేవిధంగా మఱచిపోదామనుకున్నా మఱవలేకుండా ఉన్నాడు. తాను డివిజనల్ మేజస్ట్రీటుకోర్టు న్యాయపీఠాన కూర్చొని ఉన్నాడు. ఎదుట ఒక అపరాధి నిలువపెట్టబడ్డాడు. అతడు ప్రజాహితమతియగు నొక దేశారాధకుడు. ఆయన ముఖము సుప్రసన్నమైఉన్నది. ఉత్ఫుల్లనేత్రాలు శాంతతేజములను వెదజల్లుచూ ఉన్నవి. ప్రజలు నిండారుభక్తితో సమర్పించిన పరిమళకుసుమదామం కంఠసీమను శోభిల్లుతున్నది. ప్రజాహృదయమును చూరగొన్న ఆస్వార్థత్యాగికి వెలుపలనున్న ప్రజలు జయపెట్టుచున్నారు. ఇతడెంత గుంపునుకూడ గట్టుకొని వస్తేనేమి? నాచేతిలోనివాడు అని అప్పుడుతనకుగల్గినతలంపుకాన ఆ అపరాధివంక నిశితంగాచూస్తూ "మూడేండ్లు కఠినశిక్ష" అన్నాడు తాను. శిక్ష విని అపరాధి ఒక్క చిఱునవ్వు నవ్వాడు. శిక్షకు వెఱపు

లేదు. కష్టపాటుకు చింతలేదు. ఏమి టానవ్వు? తనకు ఒళ్లుమండిపోయింది. వేయిరూపాయలు జుల్మానాఅన్నా ఘతాను. దానికిని అపరాధి ప్రత్యుత్తరము మధురమందహాసమే. తన అధికార మును తృణీకరించుటగా ఆనవ్వుయొక్కతాత్పర్యమని తనకు తోచింది. కాబట్టి అతనిని యింకను వంచచేయనెంచి యితనికి కోర్టులోనే సంకెళ్లువేసి తీసుకొని పొండని పోలీసులకు ఉత్తర్వుచేశాడు తాను. అట్లే జరిగింది. అప్పటికిని ఆదేశారాధకుని మోమున దైన్య మగుపించలేదు. న్యాయస్థానమునకు వెలుపనున్న ప్రజలు ఆశిక్షావిధానమును విని తన్ను తలచి కటకటబడి అతనికోఅకు కన్నీరు విడిచారు. అయితే ఆనా డావిషయం తనహృద యంలో యేమాత్రము వేదనకలిగింపలేదు. ఉద్యోగబల మానాడు అభేద్యభిత్తికై వెలుపలి విషయములేమియు ఆయనకు కన్పడకుండాచేసినది. నేడాభిత్తిక కూలి పోయింది. తాను వారు ఇప్పుడొక్కచోట నిలువబడ్డారు. ఒకరిమొఖం ఒకరికి విశదంగా కన్పడుతున్నది. అయితే వాళ్లిప్పుడు తన్నేవిధంగా చూస్తున్నారు......హా.హా...ఆప్రజాహితమతియగు దేశారాధకుని మూడేండ్ల శిక్షాకాలం పూర్తి అయింది! అతఁడు రేపోమాపో బంధవిముక్తుడై అసంఖ్యాప్రజాహృదయంలో తాను నిక్షేపించిపోయిన ప్రేమమధువును చేరలతో జుర్రు కుంటాడు. ఆహా! ఎంత భాగ్యశాలి ఆ అపరాధి! తానిప్పుడు ఉద్యోగవిముక్తుడైనాడు; కాని ప్రజలను మనసార ఆలింగన మొనర్చుకోడానికి తాను వారి హృదయాల్లో కంట కాలను గ్రుచ్చిఉండగా ఎట్లాసాధ్యమాతుంది? హా......హా.

ఈ విధాలోచనలు మనస్సున పొడకట్టిన కొద్దీ అతని మనస్సు సంక్షుభితసాగరము వలెనే వేదనతరంగాలతో కొట్టుకోడం మొదలు పెట్టింది. ఇందువల్ల చాల రాత్రివర కాయనకు నిద్రేలేదు. కానీ యెట్లాగో కలవరంతోగూడిన ఒక్కకూర్కు పట్టింది. కాని గాలిలేక పోవడంచేత ఒళ్లంతా చెమటపోసి వెంటనే మెలకువవచ్చింది, ఎప్పటివలెనే "అరే, సుబ్బా! వెధవా! పంకా లాగకుండా నిద్రపోతున్నావట్రా! కుం............"ఇంతలో తన ఉద్యోగం పోవడంచేత పంకానౌకరుగూడా పోయినాడనీ అందువల్ల అహర్నిశలు విరామం లేకుండా వీచే పంకాకట్టువడి పోయిందనీ జ్ఞాపకంవచ్చింది. 'అయ్యో!' అని పెదవి కఱచుకొని ఒక్క నిట్టూర్పు విడిచా డాఉన్నతోద్యోగి.

రాజేశ్వరరావుపంతులుగారు నౌకర్నువేసిన కేకకు అవతల మంచంమీద పిల్లవాడిని పెట్టుకొని పడుకొనిఉన్న రమణమ్మగారికి మెలకువవచ్చించి. "నౌకరెక్కడున్నాడు? కలవరిస్తు న్నారా?"అన్నది. సిగ్గుచేత ఆయనభార్యకు బదులు పలకకుండా 'నౌకర్లను చాకిర్లను పెట్టు కోడంకూడా ఒకప్పుడు బంధహేతువే. లేకపోతే అసంఖ్యాకమానవకోటి తమజీవితములో యెప్పుడు పంకామొఖమే యెఱుగకుండా జీవిస్తూఉండగా నాకెందుకీబాధ! అనితలచేడు. నేత్రాలు అశ్రుసిక్తములైనాయి కాబోలు తువ్వాలకండ్లమీదపెట్టుకొని పక్కకొత్తిగిలేడు.

# నారీహృదయము

పెమ్మరాజు రాజగోపాలముగారు (సారస్వతసమాజము)

౧

సాయంకాలమవుతోంది. చల్లగా మెల్లగా పిల్లగాలి కార్యభారంచేత అలసిపోయిన వాళ్లకి హాయి చేకూరుస్తోంది. సరళాదేవి పడకకుర్చీలో అరశయనంగావుండి యేదోపత్రిక చదువుకొంటోంది. ఆమె యెదురుగుండానే మరొకకుర్చీలోకూర్చొని పూలుకుడుతోంది సీతారత్నము. ఆలాకొంతసేపుజరిగింది. అంతట్లో సరళ పట్టురెప్పలపైకెత్తి రమణీయ నేత్రాలతో పూలవానకురిసేలాగు చూచి "ఒసేవు, యిందులో తమాషాపడింది, చదవనా" అంది. "చదవ్వే" అంది సీతారత్నము. తరళసుందరవిశాల నయనాలతో చదువుతోంది సరళ. విద్యాలాలసురాల్ని, చదువుతోన్న ఆ కాంతాకృతిని తిలకిస్తోంది సీత. చదువుట పూర్తికాగానే

సరళాదేవి:—తెలిసిందిటే ?

సీతారత్నం:—మొగాళ్లకి సిగ్గొచ్చేలారాసిందే !

సరళాదేవి:—ఔనే. కాకపోతేఏమిటి. కొంచెం ఆడవాళ్లు వీథిలోకివెళ్లేటప్పటికల్లా, మొగాళ్లు కస్సుమంటారు. పైగా వింతమృగాన్నిచూచినమాదిరిగా చూస్తారు.

సీతారత్నము:—ఆమాట నిజమేకాని. ఎల్లాఅయినా ఆడవాళ్లు మొగాళ్లలోకి వెళ్లకూడదనే నావుద్దేశం. వెలుగూచీకటీ యెల్లాగో, పగలూరాత్రీయెల్లాగో, తూర్పూపడమరాయెల్లాగో అల్లాగే ఆడదీ మగాడూనూ. ఆడది ఆడదే. మొగాడు మొగాడే. వాళ్లు ఒకళ్లొకళ్లని ఆకర్షించుకుంటారు. అంచాత కలిసి తిరక్కూడదే.

ఆమాటవినుసరికి సరళ సరళనేత్రాల్లో కెంజాయమెరిసింది. సుందరలలాటంమీద యేదోకాని యోచనావిద్యుద్వాహిక ఒకటి తళుక్కుమంది. చొచ్చుకుపోయేచూపొకటి సీతమీద విసరి, "నీ అభిప్రాయం చాలాతప్పే. ఈకంటికికనుపించే సృష్టిఅంతాకూడా శక్తిమయం. అది రెండువిధాలగా కనపడుతోంది. అవే స్త్రీపురుషరూపాలు. మానవకోటిలో స్త్రీది సగంపాలు. స్వార్థపరత్వంతో మొగాడు సగం యింట్లో మడతొక్కేసాడంటే యిక యీదేశానికి నిష్కృతిలేదన్నమాట. ఆడది ఆడదే, మొగాడు మొగాడే అంటావా? నేను వప్పుకోనుసుమీ? పురుషుడికెల్లాటిభావాలున్నాయో, యెల్లాటి అనుభవాలున్నాయో, స్త్రీకీ అల్లాటివేవున్నాయి. మగవాడు చెల్లించుకుంటాడు. వాటికే ఆడదానికి హక్కులేదంటాడు." అన్నది సరళాదేవి. దానికి సీతారత్నం "సరే కాని తక్కినది చదువు" అంది. అంతలో దడాలున వీథితలుపుతెరచుకొని కేశవరావు లోనప్రవేశించాడు. అతన్ని చూడగానే వాళ్లిద్దరూ కుర్చీలమీదనుంచీ లేచారు. సరళాదేవి కేశవరావువైపు చూస్తో వెల్లిపోయింది. ఆమెముఖవికాసంలోని తళతళ, ఆపరిసరవాతావరణంలో దారివేసుకొన్నట్టుంది.

అప్పుడు సీతారత్నం "రండి" లోపలకని భర్తతో యింట్లోకి వెళ్లిపోయింది.

౨

రాత్రి యెనిమిదిగంటలయింది. భోజనమవగానే వెంకట్రావు తమవైపు కటకటాల గదిలోవున్న యీజీఛైరులో మేనుచేర్చాడు. అతనికెదురుగుండా ఒక తుంగచాపమీద హార్మోనియంపెట్టుకొని పాడుతోందిసరళ.

లాంతరు ప్రకాశమానంగా వెలుగుతోంది. అప్పటిసరళ సరళాకృతి చూసితీరాలి. క్రొత్తమాదిరి లేయెఱుపు పట్టంచుఖద్దరుచీర కట్టింది. భుజమూలాలుదిగీదిగని పొట్టిచేతుల మైకాపూలజాకెట్టు తొడిగింది. ఆమె కాంతిపుంజాలువెదజల్లే ముఖారవిందం, నిమ్నోన్నత సుందరశరీరనిర్మాణం చూపుల్నాకర్షిస్తాయి. ఒక్కొక్క-సౌందర్యకిరణమేవచ్చి ప్రకాశిస్తూవున్న లైటుమీదపడి, సరళముఖంమీదికి ప్రాలి, మృదుకపోలాలమీద తళుక్కుమని, మెళ్లలో చంద్రహారంమీద మిలమిల్లాడి, చేతులమీదనుంచి పాకిపోయి, ఆమె కరాంగుళాలతో కలసిమెలసి హార్మోనియంమీద నాట్యంచేస్తోంది. ఎదురుగుండావున్న ఖద్దరువస్త్రధారి, సురూపశాలి వెంకట్రావుకళ్లలో అశ్రుకణాలునిల్చాయి. "మరువకు డార్యులారా!" అని దీనంగా, విచారపూరితంగా మానవహృదయాలు కరిగిపోయేలాగు పాడుతోంది సరళాదేవి. వెంకట్రావు సరళాదేవి భర్త. బి. యె; బి. యెల్. బిరుదాలుపొందాడు. మనోహర నవనవోల్లసితభావాలు మెఱపించే కవితాత్మకలవాడు. దాస్యజీవనంమీద మనస్సుపోక పత్రికి ఒహాటిపెట్టి నూతనాదర్శాలు బోధిస్తున్నాడు. సంకుచితమార్గంలోవున్న యీమనుజ లోకానికి అతడు స్వేచ్ఛాకుమారుడు. ఆమె స్వాతంత్ర్యకుమారి.

కేశవరావు స్కూల్లో మాష్టరు. అతడు బి. యె; యల్. టీ, ప్యాసయ్యాడు. సీతారత్న మాయనభార్య. ఆయింట్లో ఒకవైపున కేశవరావు, మరొకవైపున వెంకట్రావు కాపురమున్నారు. సీతారత్నానికి సరళాదేవికి ప్రాణస్నేహంకుదిరింది. ఇద్దరిభావాలు చాలా వఱకూ కలసిపోయినవే. వెంకట్రావు కేశవరావు బహిర్విషయాల్లో ఒకటిలాగేవుంటారు. కాని ఆదర్శాలువేరు. వెంకట్రావుకున్నంత విద్యాసంస్కారం కేశవరావుకిలేదు. అంచేత అంతరాత్మలు కలవవు.

సరళాదేవి పాడుతోంది. హృదయా లలిసిపోతున్నాయి. విషాదచ్ఛాయ లలము కుంటున్నాయి. అంతలో కేశవరావు కేకవేశాడు. వెంకట్రావులేచి యిల్లారండన్నాడు. సరళ కొంచెము విరాకుపడింది. ఫరవాలేదుపాడవే అన్నాడు భర్త.

బంకించంద్రునిగీతం పూర్తిచేసి రవీంద్రునిగీతం మొదలెట్టింది సరళ. అక్కడవున్న తమలపాకులపళ్లెం కేశవరావుముందుకి "వేసికోండి" అని నెట్టాడు వెంకట్రావు. కేశవరావు

తల కొంచెమువంచి మధ్యమధ్య సరళ రూపసిరి, కంఠసౌందర్యం చూచిముగ్ధుడవుతున్నాడు. అంతలో లోపలిహాలులోనుంచి సీతారత్నంవచ్చి సరళాదేవికి పక్కగాకూర్చుంది. కాస్సేపు కూర్చొని ఆమె భర్తవైపుచూచేటప్పటికే అగ్నిజ్వాలకురిపించాడు కళ్లతోటి. పాపం, సరళాదేవిచాటుకి యేమీయెరుగనట్టు తప్పుకుంది సీతారత్నం.

కేశవరావు కామె అక్కడికిరావడం యిష్టంలేదు. కాని పైకేమంటాడు. తనభర్త స్వభావం యెఱిగినదే సీత. ఈసంగతి అన్యమనస్కుడుగావున్న వెంకట్రావు కనిపెట్టాడు కాడు. సరళ కనిపెట్టింది. కేశవరావువైపు దీర్ఘంగాచూచి ఒకసారి చిరునవ్వునవ్వింది.

సీతారత్నంవైపు కేశవరావు మధ్యమధ్య కోపంగాచూస్తూవుండడం సాగించాడు. అతనిచర్య కనిపెట్టడమారంభించింది సరళా.

చివరకి నిద్రవస్తోందని వంకపెట్టుకొని సీతారత్నం వెళ్లిపోయింది. ఆమెవెనకాలే పాటమానేసి సరళాదేవి వెళ్లింది.

అప్పటికి రిస్టువాచిలో చూచుకొన్నాడు వెంకట్రావు. పదయింది. ఇంక నిద్ర సమయం అవుతోంది అన్నాడు కేశవరావు. "సరే, లెండి" అన్నాడు వెంకట్రావు.

## 3

సీతారత్నం:—ఎందుకండీ ఆకోపం.

కేశవరావు:—ఎన్నిసార్లుచెప్పాను? నీకు బుద్ధిలేదు.

సీతారత్నం:—అందులో తప్పేమిటి. సరళ సంగీతంపాడుతోందే మీరెల్లాకూర్చున్నారువచ్చి.

కేశవరావు:— వాళ్లకి యెగ్గులేదు. వాళ్లదంతా బ్రహ్మసమాజపురకం. దాని మొగుడికిష్టమైె నన్ను కూర్చోమన్నాడు. నాకిష్టంలేదు. అంచేత నువ్వుకూడా కూర్చోడానికి వప్పుకోను.

సీతారత్నం:—వట్టిఅన్యాయమండి. ఆడవాళ్లుయెల్లావున్నా పాపం, అయనకక్కర్లేదు.

కేశవరావు:—ఏడిసాడు పిచ్చిముండాకొడుకు. అందుకనే అల్లా ఆడిస్తోంది. పైగా అంతస్వతంత్రం పనికిరాదు ఆడదానికి. వెంకట్రావుపెళ్లామంటే వూళ్లో యెంతచెడ్డపేరుందో నీకుతెలుసు. సరళది దుర్నడత అని చెప్పుకుంటారు.

సీతారత్నం:—అల్లా యెవళ్లుచెప్పుకుంటారో వాళ్లు వట్టితెలివితక్కువ వెధవలు. సరళ నిర్భయమైనది. స్వతంత్రురాలు. అంత నిర్మలమైనమనస్సుకలది యింకొకదాన్ని నేను చూడలేదు. సరళది దుర్నడతా? ఎవరాఅన్నవారు మీతోటి?

కేశవరావు:—ఎవరైతేం? అనేకమంది అన్నారు.

సీతారత్నం:—ఏడిసారువాళ్లు. వెధవలోకులు కాకులు. ఒకడేమంటే రెండోవాడూ అదేకూత. ఇది నిజమా కాదా అని విమర్శించేవాడేవకడో, యిద్దరో వుంటారు. సరళకి మొగుడంటే అపరిమితమైనప్రేమ. నాకది బాగాతెలుసు.



ఆకిరిపల్లి: శోభనాచలపతి దేవాలయము

—ఛాయాచిత్రగ్రాహకులు (వెంట్రప్రగడ జమీందారువారు.)



పురి:జగన్నాధాలయము

—ఛాయాచిత్రగ్రాహకులు (ద్వారం జగన్నాధరావుగారు)

కేశవరావు:—ఏంచేత అంతప్రేమ?

సీతారత్నం:—సరళమొగుడు అందమైనవాడు. విద్యావంతుడు. రసికుడుకూడాను. అన్ని సమకూడినతర్వాత పూర్తిగాప్రేమించాక సరళమనస్సు అన్యత్రా పోమ్మన్నాపోదు. మీరనుకుంటారు. ఆయనభార్యని స్వతంత్రురాల్ని చేశాడు, అంచాత పాడవుతుందని. కాని నిజంచెప్పవలసివస్తే ఆడదానికి నిర్బంధంలోపెట్టి అడుగడుక్కీ అనుమానించేభర్తమీద అసలే వుండదుప్రేమ. పైగా ఆలాటివాణ్ణే వంచిద్దామనివుంటుందేమో? ఇంతకీ దాంపత్యం అన్యోన్య ప్రేమతో కూడినది కావాలండీ.

కేశవరావు:—ఏమిటే! వెంకట్రావు నీకంత అందంగాకన్పించాడా? ఏమోలే.

సీతారత్నం:—ఛా! ఏమ్మాటలండీ? అసలు మీమనస్సు మంచిదికాదు. అంచేత మీకు లోకమంతా వక్రంగానే కన్పిస్తుంది.

కేశవరావు:—ఆడవాళ్ల కందమేగా కావలసింది.

సీతారత్నం:—స్త్రీలు సౌందర్యాన్ని అర్చిస్తారు. నిజమే. కాని పురుషులకంటె స్త్రీలకే ఆత్మసంయమం యెక్కువ. ఒకమారు భారతసతి ఒకపురుషున్ని కట్టుకొన్నాక వానితోనే జీవితం గడపకలదు. అధికసుందరుణ్ని చూచినా యెక్కడో కాని చలించినవృత్తాంతం వినం. ఇహమొగాళ్లో, అందమైనఆడదాన్ని చూస్తే మూఢవంతులు పిచ్చెత్తేవాళ్లే.

కేశవరావు:—దానికేంగాని, సరళాదేవి మంచిదేఅంటావా ?

సీతారత్నం:—మీకెవరుచెప్పారోకాని అల్లాటిదికాదండీ.

కేశవరావు:—నేనక్కడకూర్చుంటే అల్లా తెగచూస్తుందెందుకు?

సీతారత్నం:—బాగానేవుంది. మీరు నాకేసిచూస్తోవుంటే అది మనిద్దరినీకనిపెట్టి నవ్వుతోంది.

కేశవరావు:—మంచిదైతే అస్తమానం చూడడమెందుకూ?

సీతారత్నం:—సరిపోయింది. ఏమిటావెఱ్ఱి. మిమ్మల్నివరించి చూసిందంటారు కాబోలు కర్మం. ప్రేమవిలోకనాలెప్పుడూ అంత నిశ్చలంగావుండవు. ప్రేమించినవాళ్లంతగా అసలు ముఖాముఖిగా చూడలేరు, లజ్జావకుంఠనం తొలగించిపారేసి.

కేశవరావు:—అబ్బే అందుకోసమడగలేదే. మంచిదేకాని చెడ్డపేరువచ్చింది.

సీతారత్నం:—ఎవళ్లో కిట్టనివాళ్లూ, ప్రయత్నంచేస్తే సాగనివాళ్లూ యిల్లాంటి అపవాదాలు పుట్టిస్తారండీ.

కేశవరావు:—ఎందుకే నాకివ్వమని రోజూ అల్లాకాఫీ, యేదిచేసుకుంటే అదల్లా పెట్టమని నీకిస్తుంది. ఇల్లాటిపనులు చేస్తుందికనకే లోకులికి అనుమానంతగులుతుంది.

సీతారత్నం:—వెధవలోకులు పోనిస్తురూ. అవన్నీ నన్నుపట్టి మీాకుపెడుతుంది. నారీ హృదయంమీాకేమి తెలుసు. అదికనిపెట్టడానికి చాలా తెల్వికావాలి. మీాకునిద్దరరావటంలేదు.

కేశవరావు:—మరీ............

సీతారత్నం:— అబ్బా నిద్రవస్తోందండీ.

## ౪

మనుష్యభావాలతోపాటు కాలంకూడా సాగుతోనేవుంటుంది. పై సంఘటనలుజరిగి అప్పుడే రెండుమూడునెలలు కావచ్చింది. కాలంతోపాటు మనుష్యునిమనస్సులో భావాలు కూడా మారుతాయి. కేశవరావుహృదయం క్రమక్రమంగా సరళాదేవిమీాద లగ్నం కావడం మొదలుపెట్టింది. అవి సహాయనిరాకరణపురోజులు. సరళభర్త నిరంతరం ప్రచారం చేస్తూ గంభీరోపన్యాసాలిస్తూ సంచారంమీాదవుండేవాడు. ఆకాలంలో ఆతడు రెండురోజు లింట్లోవుంటే నాలుగురోజులు గ్రామేతరాల్లోవుండేవాడు.

మొదటిరోజుల్లో సరళఅంటే కేశవరావుకి అసహ్యంగావుండేది. ఆమె సౌందర్యం చూచి మణిగలపామనుకొనేవాడు. ఆమె స్వభావంమీాద శంకలుబయలుదేరాక కోపంగా కూడావుండి సీతారత్నమామెతో మాట్లాడడానికికూడా యిష్టపడేవాడుకాడు.

కాని క్రమక్రమంగా, సరళలోవున్న యే మహాశక్తిప్రభావమో అతన్ని వశంచేసు కోవటం మొదలుపెట్టింది. ఆమె ఆరోజుల్లో సభలోకి నిర్భయంగా పోయేది. జాతీయ గీతాలు పాడేది. ఇంటింటికి వెళ్లి ఖద్దరుప్రచారంచేసేది. ఏమిటాడదల్లా చలించి తిరగడం మొగుడువూరుకోడం అని తన భార్యదగ్గర కేశవరావనడం, అది విని సరళ నవ్వుతూవచ్చి మీారుకూడా ఖద్దరు కట్టండనడంజరిగేది. సరళను అయిష్టంగాచూచే కేశవరావు యిప్పుడు ప్రేమతోచూడడం ప్రారంభించాడు. ఇది తప్పు సుమీా అని అంతరాత్మకి చెప్పిచూసాడు. కాని అది నేనువిన్నంది. దానిమీాద సరళ నన్ను తిరిగి ప్రేమిస్తోందా అని ప్రశ్నించుకోడం మొదలెట్టాడు. వెంకట్రావు నాకంటె చక్కనివాడే కాని నా అంత బలమైనవాడా అను కొన్నాడు. అతనికి తర్కించుకొన్నకొలదీ సరళకి తనంటేకూడా అభిమానంవుందని స్థిరపర చుకోసాగాడు. "సరీగా నేను స్కూలునుంచి వచ్చేసరికి, గుమ్మంలోవున్న నన్ను కిటికీలో నుంచి తొంగిచూస్తూవుంటుంది. ఓమాటు నేను నూతిదగ్గరుంటే ఏమీా తెలియనట్టు నూతి దాకావచ్చి తిరిగెళ్లిపోయింది. వెళ్లిపోయేటప్పుడు మళుపుదగ్గిర తిరిగి నా కేసిచూసి మరీ వెళ్లింది" అని ఆలాటి వెన్నో జ్ఞాపకముచేసుకోడ మారంభించాడు. అన్నిటికన్న ఆవాళ జరిగినవిషయ మాతని మనస్సులో సరళ తన్ను పూర్తిగా ప్రేమిస్తూన్నట్లుగా స్పష్టంచేసి వైచింది.

ఆవేళ వెంకట్రావు ఊళ్లోలేడు. సీతారత్నం బయటవుంది. కాని సరళ చక్కగా కాఫీకాచి తీసికొనివచ్చి కేశవరావు స్నానంచేసివచ్చేసరికి సిద్ధంగా బల్లమీాదవుంచింది. కేశవ

రావువచ్చేసరికి ఆమె వెళ్లిపోతోంది కాని నాటి ఆమెఆకృతి అతన్ని సంపూర్ణంగా ఆకర్షించింది.

※

అర్ధరాత్రి అవుతోంది. జ్యోత్స్నాసాగరం ప్రపంచమంతా ముంచివేసింది. అపార నిర్మలవినీలాకాశంపైన, ప్రశీతలచంద్రికాపులకితధాత్రీతలంక్రింద. వెంకట్రావున్న వాటా వైపున ఒకమల్లెపందిఱ వుంది. ఆవాళ ఆకుకన్పడకుండా పూచింది. ఆ వెన్నెలవెల్లువల్లో ఆమల్లెపందిరి పూలతెప్పకిమల్లే తేలిపోతోంది. సీతారత్నం సుఖనిద్రపోతోంది. వెంకట్రావు గ్రామాంతరంపోయాడు. అంతరగృహంలో సరళాదేవి శయనించివుంది. నిద్రపోతోందో లేదో చెప్పలేము. ఈవలమాత్రం కేశవరావు మేలుకొనే పడుక్కున్నాడు. చీమచిటుక్కు మన్నప్పుడల్లా తలెత్తిచూస్తున్నాడు. ఏదోఒకవిధమైన సంకేతధ్వనిమాత్రం చేస్తూవుండే వాడు. చాలాసేపు జవాబుకోసం నిరీక్షిస్తూవుండేవాడు. సరళపరున్నగదివైపు చెవిరిక్కించి వింటూవుండేవాడు. చివర కేగాజులచప్పుడో విన్పడేది. దానితో కొండంతఆశతో లేచి వెంకట్రావుపడకగదివైపు కిటికీలోనుంచి చూస్తూవుండేవాడు.

సరళాదేవి యెప్పటిలాగు నిద్రపోతూన్నట్టుగానే పరుండేది. అది కేశవరావుకి చాలా దుర్భరంగావుండేది. ఏంచేస్తాడు? కొంతసేపటికి తలుపులు తెఱవపడ్డాయి. సరళాదేవి కళ్లు నలుపుకొంటూ యీవలికివచ్చింది. ఆమెనుచూచి కేశవరావంతా దొంగవేషంఅనుకున్నాడు. ఏంచేస్తుందో చూద్దామని కదలకుండాపడుకున్నాడు. సరళ వాకిటికిరాగానే పరున్న కేశవ రావుని చూచింది. చూడగానే నిద్రపోతున్నాడోలేదో అని కొంచెం దగ్గరగాపోయి చూచింది. కేశవరావు కదలలేదు. కేకవేసి సీతారత్నాన్ని లేపుదామా అనుకొంది. మళ్లీ నిద్రపోతున్నదాన్ని లేపడమెందుకనుకుంది. ఆమెనులేపితే ఆయనకూడాలేస్తాడు యెందుకీ గొడవంతా అనుకొంది. అల్లాఅని తర్కించుకొని అరుగుదిగి చాటుకుపోయింది. కొంచెం సేపాగి మెల్లగా అటు తిరిగిచూచాడు కేశవరావు.

మల్లెపందిరదగ్గిర నుంచుందిసరళ. కొంతసేపు చిత్రప్రతిమలాగు అల్లాగేవుండాదృశ్యం తిలకిస్తూ. తర్వాత పందిరదగ్గరకెళ్లి పువ్వులుకోయడ మారంభించింది. కొన్నిపువ్వులను తల నిండా పెట్టుకొంది. ఇంకాకొన్నికోస్తూ వుండగా ఒకవేళ కేశవరావులేస్తాడేమో అని మధ్య మధ్య అతనివైపుచూస్తోంది. చల్లని తెల్లని పండువెన్నెల. పూలతోనిండిన మల్లెపందిర. ఆప్రక్కనే కోరినరూపఖని సరళ. ఆ అవకాశం పోగొట్టుకోకూడదనుకున్నాడు కేశవరావు. మోహావేశంచేత వుద్రిక్తుడైపోయాడు. సరళ తనకోసమేవచ్చి సిగ్గుపడిపోతోందనుకున్నాడు. తక్షణం వెనకాలేవెళ్లి సరళను రెండుచేతుల్తోనూ పట్టుకున్నాడు. సరళ గిఱ్ఱున వెనక్కితిరి గింది చకితురాలై. కేశవరావునుచూచి కాస్సేపు మాటవచ్చిందికాదు. ఆమెశరీరం కంపించి

పోయింది. ముఖం కోపంచేత ఎఱ్ఱబారింది. నేత్రగోళాల్లోంచి మంటలులేచాయి. కేశవరావుచేతులు విదల్చిపారేసి ఒక్క చెంపకాయతీసింది. కేశవరావు నిర్ఘాంతపోయాడు. సరళ కెవ్వునకేకెట్టి యింట్లోపడి భడాలున తలుపుఘడియవేసుకొంది. ఆచప్పుడువిని సీతారత్నం లేచి యీవలకువచ్చింది. కేశవరావక్కడనే కొయ్యయిపోయాడు.

౬

ఆసుపత్రిలో ఒక వరాందావైపు గది. కేశవరావు మరణావస్థలోవున్నాడు. ఒక ప్రక్కన వెంకట్రావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. సీతారత్నం దూరంగా రాయిబొమ్మైపోయి కూర్చుంది. దైన్యవదనం, చిక్కుపడిపోయిన జుట్టు, భీతిగొలిపేచూపులు ఆమెకురాబోయే ఉపద్రవం చెప్పుతున్నాయి. ఆమె తల్లిదండ్రులుకూడా అక్కడికి వచ్చారు. అక్కడికి సరళ కూడా వచ్చింది. మెల్లిగా కళ్లువిప్పి కేశవరావు ఆమెకు దణ్ణంపెట్టాడు. సరళ కళ్లల్లోనుంచి ప్రవాహం బయలుదేరింది. అదిచూచి వెంకట్రావు ఆమెను చాటికిపొమ్మన్నాడు. కేశవరావు వెంకట్రావు కేసిచూచి కళ్లతో దగ్గరకు రమ్మని పిల్చాడు. వెంకట్రావు దగ్గరగా వెళ్లాడు. కేశవరావు హీనస్వరంతో "క్షమించాలి" అన్నాడు. "నాకేమీ కోపంలే" దన్నాడు వెంకట్రావు.

ఇంతట్లో కేశవరావు కళ్లు గిరగిర తిరిగిపోయాయి. ఇక తెప్పపాటు లేదు. శ్వాస లేచింది. వెంకట్రావు మళ్లీ డాక్టరు దగ్గరకుపరుగెత్తాడు. కేశవరావు తనప్రయత్నం వ్యర్థం కాగానే, తన అవస్థ తెలుసుకొన్నాడు. సరళ భర్త రాగానే చెప్పక మానదనుకున్నాడు. ఇదంతా సీతారత్న మావేళే కనిపెట్టింది. ఇక చెడ్డపేరుతో బతికేమి లాభమనుకొని స్కూల్లోనుంచింత నైట్రికేసిడ్డు తెచ్చికొని తాగేసాడు. దాని ఫలిత మిదంతా.

డాక్టరు, వెంకట్రావూ వచ్చేసరికి కేశవరా వప్పుడే యిహాలోకం విడుస్తున్నాడు. డాక్టరు రోగిని పరీక్షించి పెదవి విఱచి అయిపోయిందన్నాడు. అంతా గొల్లుమన్నారు. ఇంతలో సీతారత్నం విసవిస పరుగెత్తుకుపోయింది. సరళాదేవి కేకలువేస్తూ ఆమె వెన్నాడింది. వాళ్లవెనుక సీతారత్నం తలిదండ్రులు పరుగెత్తారు.

ఏమి లాభం? పరుగెత్తి సీతారత్నం అక్కడేవున్న నూతిలో గుభాలున దూకింది. అనేకమందక్కడ పోగయ్యారు. శ్రమపడి సీతారత్నాన్ని పైకి తీసారు. అప్పటికప్పుడే ఆ సతీమణి ఆత్మ పరలోకంలో కూడా భర్తసేవచేయడానికి పోయింది. సరళ, వెంకట్రావు నిర్విణ్ణులైపోయారు.

# తిరస్కృతాంధ్ర వాఙ్మయము

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

జనసామాన్యము నేడు రాజకీయసాంఘికములగు హక్కులకై యెడతెగనిపోరు సల్పుచున్నట్లులే సారస్వతమునందుకూడ ప్రజాసామాన్యపుభాషకు ఆంధ్రసాహిత్యమునందు అర్హమైనస్థానమును సంపాదించుటకై సంకులసమరము చాలతీవ్రముగా కొనసాగవలసియున్నది. నేటి రాజకీయసాంఘికములగు పోరాటలచేత ఇప్పుడిప్పుడు ఎప్పటికైనను గమ్యస్థానము చేరగలమని ఆశాకిరణము లెట్లు పొడసూపుచున్నవో అట్లే ఇందును మఱికొంతకాలమునకు ఆశాకిరణములు పొడసూపకమానవు. రాజకీయాదులందు నేడుకలుగుచున్న యరుణోదయకాంతులు సుమారొక అర్ధశతాబ్దికి పైఁబడినకాలమునుండి యెడతెగకచేయుచున్న యత్నములకు ఫలములు. నిముసనిముసమునకు జీవితసంఘర్షణముల కాకరమైన రాజకీయసాంఘికములలోనే, యెడతెగక సర్వులూ ప్రయత్నములుచేయు సందర్భములలోనే, జనులందు తగినంత ప్రబోధముగల్గించి వారిహక్కులు గుర్తించునట్లుచేయుటకే (అనఁగా అమిత కొలదిపాటివిషయమని భావము) ఇంత దీర్ఘకాలముపట్టినప్పుడు, దాదాపు వేయిసంవత్సరములక్రిందటే అనఁగా నన్నయ్యభట్టారకుల కాలమునాఁటికే స్థిరత్వముసడలి కాలిలోని జవచచ్చి కూలఁబడి నేటి మనకాలమునాఁటికి ఆడాపొడ అణగారి, అస్తివా నాస్తివా యన్నదశకు వచ్చిన ఆంధ్రప్రజల సామాన్యభాషకు ఆంధ్రసాహిత్యమున అర్హతసంపాదించుటకు ఎంతమంది ఎన్నెన్నివిధముల నడుములు కట్టవలెనో, ఎన్నెన్నియత్నములు చేయవలయునో, ఎన్నెన్ని కష్టములకు నష్టములకు వెక్కిరింపులకు వేళాకోళములకు విటకారములకు కటుకారములకు నిందలకు మందలింపులకు అడ్డంకులకు సొడ్డంకులకు ఆటుమాటలకు పోటుమాటలకు గుఱికావలయునో, ఎన్నెన్ని అవమానముల నొందవలయునో, ఎందఱెన్నిరీతుల తమజీవితముల నిందుకు ధారపోయవలయునో, ఎన్నియుపకరణముల సృష్టింపవలయునో, కష్టించి కడప్రాణముతో ఉన్న ఎన్నెన్నితెగలకు జీవితాశ పురికొల్పవలయునో, కాలూనుకొనువాని కెన్నిటికి యూఁతనీయవలయునో, ఉరుములు పిడుగులు వడగాడ్పులు అతివృష్టి అనావృష్టిబాధల నెన్నింటికడ్డుపడి బ్రదికింపవలయునో, బ్రతికినవాని కెన్నిరీతుల అందచందములు ఆయురారోగ్యస్థితులు దిద్ది తీర్చి తేజరిల్లవలయునో పెద్దలకు తెలియనిదికాదు.

అట్లయినచో ఆపెద్దలు ఏలయుపేక్షించినారు?-అని యడుగవచ్చును. దీనికి నాసమాధానమొక్కటే: అనుభవసిద్ధమైనది. తక్కిన అన్నిశాఖలలోవలెనే ఇందును పెద్దలు నిద్రాముద్రితులు. అనూచానపరాయణత్వమనుపేర నడుమంత్రమున వచ్చిన అలసత్వమునకు పాల్పడి, అసలుమఱచి తాననుభవించుచున్నదే తత్వమని యున్నారు. వారికి అప్పకవి యుపదేశించినదే ఆదర్శము. చిన్నయసూరి యనుశాసనమే పెన్నిధి. ఉండుమ్మల దండలే బంగారుకుండలు. సిద్ధిర్లోకాద్దృశ్యా-యన్నది చిలుకపలుకువలె అనుకరణమాత్రమే. కనుక పెద్దలయాశ వదలుకొని పిన్నలే ఇందులకు పూనుకొనవలెను. ముందురాబోవుదేశము భాష సిరిసంపదలు మొదలైనవన్నియు వారివి. బాగుచేసుకొన్నను ఓగుచేసుకొన్నను అనుభవింపవలసినవారు వారు. అర్చవలసినవారు వారు. తీర్చవలసినవారు వారు. దిద్దుకోవలసినది సద్దుకోవలసినదికూడ వారే. రాజకీయముగా స్వరాజ్యమును-స్వాతంత్ర్యమును వచ్చినప్పటికినీ, సాంఘికముగా సమస్తములగు మతహక్కులు ఆర్జించినప్పటికినీ, వానితోఁబాటు వాఙ్మయమునందుకూడ సర్వాంగీణమగు పెంపుసొంపు వచ్చిననేగాని నిజమైన జాతీయత లభింపదు. కనుక జాతీయతకు పరంపరాకారణమైన సారస్వతసాహిత్యాదులయొక్క సర్వాంగపూర్ణత నార్జించుటకు సైతము నేటినుండియే యువకులు, బ్రాహ్మణాబ్రాహ్మణవివాదములుగాని, పండితపామరభేదములుగాని

గ్రామ్యగ్రాంథికవిభాగములుగాని పెట్టుకొనక జాతీయతనుపకరించు సాధనములను సర్వతోముఖముగా సాధ్యమైనచో సర్వులూకలిసిగాని, లేకున్న ప్రత్యేకముగాగాని రాత్రింబవళ్లు కృషిచేయవలసియున్నది. అట్టి కృషిచేయవలసిన యావశ్యకతను, దాని లాభములను మీ మనస్సులకు నచ్చఁజెప్పుటకే నేనీవ్యాసము వ్రాయుచున్నాను. నాయత్నముగోరంతయైనను ఫలించినచో ధన్యుఁడను. లేకున్నచో—యత్నే కృతే యది నసిద్ధ్యతి కోఽత్రదోషః—అన్నమాట పాటింతునేగాని నిరాశనుపొందను. యత్నమును మానను.

నేడు జాతీయతకు అనుగుణముగా మనసారసత్వమును పెంపుచేసికొనుటకు రెండుపద్ధతులు కలవు. మన సారస్వతోద్యానమునుసర్వాలంకారశోభలతో విలసిల్లజేయుటకు ఆ రెండుపద్ధతులును మనకు ముఖ్యములే. అనుసరణీయములే. అభివృద్ధికి హేతుభూతములే. అవశ్యము మనము ఆదరించి ఆచరించి ఫలమును పొందుటకు యత్నింపవలసినవే. సందేహము లేదు; కాని కొందఱొకవిధమునను మఱికొందఱు వేఱొక విధమునను సర్వశక్తులను ఉపయోగించవలెను. ఎవరివీలునుబట్టి వారు పనిచేయవలెను. ఎల్లాగా అంటారా?—తలాః పిడికెడుపిడికెడూ—అన్నట్లు. కనుక అసలు ఉద్దేశ్యముమాత్రము మఱువవద్దు.

ఇక మార్గములేమిటో చెప్పవలెకదా! నేడు మనలో కొందఱము ఆంగ్లాదివిదేశభాషాపాండితీమండితులము. మఱికొందఱము ఇతరభాషాజ్ఞానములేని, ఉన్నను ఉపయోగించుశక్తి పూర్తిగాజాలని ప్రాంతపద్ధతి ననుసరించి ఏపుక్కిటిపురాణానికైన నుపయోగింపగలదను నూహతో సంస్కృతము చదివి, దానితో జీవిక జరుగక తెలుగుపండితు లనెడి బొంతలుగప్పుకొని—జన్మమంతయు ప్రథమమీది కచటతపలతో కాలముపుచ్చువారము.

మొదటితెగవారు పూనినచో నేడు వివిధములగు విదేశభాషలలోని విజ్ఞానరాశిని మోటారుబస్సులలో తోడుకొనివచ్చి నింపగలరు. కాని వారికే చాల యిబ్బందులున్నవి. తెచ్చినవి గాజుపళ్లేలూ ముండ్లగరిటెలూ అని మనవారెక్కడ వెక్కిరింతురో అని భయమొకవంక; సాహసముచేసి తెచ్చినను మనవారి విభూతిపండ్లలోనూ విస్తరాకులకట్టలలోను విడిదోవతులలోను అపవిత్రములనుబుద్ధితో చోటిత్తురో లేదోయన్నయనుమానము వేఱొకవంక, ఇచ్చినను వానిని మనవస్తువులతో కలసిమెలసి ఉండునట్లు అతుకగలమో లేమోయన్న ఆందోళనము వేఱొకవంకను వారిని బాధిస్తున్నవి. మనము వారికి భయముదీర్చి దొరికినంతవఱకును తీసుకొనిరండి, మన మందఱముకలసి ఆలోచించి అతుకుదాము అని అభయమిచ్చి ప్రోత్సాహముచేయవలయును. ఏమంటారా? వెట్టో మొట్టో అసలువస్తువులు నిండుగా ఉన్ననేకదా హాటిని ఊర్జితపఱిచే ఆలోచన బయలుదేరును?—కాఁబట్టి. మఱియింకను రెండోతెగవారిపని. వీరికి కొంత ఉద్యానవనము లోఁబడిఉన్నది. స్వార్థమునకో పరార్థమునకో, ఎట్లయిననేమి? ఉద్యానవనభారమును పైనివైచుకొని చిరకాలమునుండి పరంపరగా తమకు తోఁచినట్లు పాటుబడుచున్నారు. వీరిసంతతివారే మొన్నమొన్నటి 18-వ శతాబ్ది చివఱభాగమువరకును ఈతోఁటకు పరిపాలకులు. వీరి పరిపాలనమును మనతోఁట చిరకాలము అనుభవించినది. కాని రానురాను ఆతొలినాటి నవకము, దూరదర్శిత్వము, అందచందాలు, సాహిత్యసారస్వతాభిరుచి, సహజమగుమార్దవము—ఇంతయేల అపరంజివంటి ఆ మిలలు మొదలయిన సుగుణము లన్నియు క్రమక్రమముగా స్తంభించిపోయి, ఈనాఁటికి ఆవెనుకటిపాలకులవకూడ లేకుండపోయినది. తోటవిషయము నట్లుంతము. ఉద్యానపాలకులు తమకర్తవ్యమునే విస్మరించినారు. సర్వసమత్వము గుణవివేచనము అస్తమించి, యేకపక్షావలంబనము స్వేచ్ఛాపాలనము ఆచోట నెలకొనినవి.

నిజమును పరీక్షించినచో ఉద్యానపాలకులకు అందచందములనిచ్చుచు ఆర్యతనుపోనీయని అన్నిజాతుల లతలు పొదలు గుదులు కుటజములు చెట్లు చేమలు ఫలవృక్షములు బలిష్ఠములగు తరువులు-ఇత్యాదులం దన్నిటియందు సమబుద్ధియుండవలయును. పరమేశ్వరుఁడు వీనిలోవీనికి ఒసంగిన ప్రత్యేకప్రత్యేకములగు అందచందములు సుగుణములు కన్నులకు ఎప్పటికప్పుడుమాసిపోక కనుపట్టుచుండవలయును. దేవునిసృష్టియందు తియ్యమామిడికిని తీటకసిందకునైతము ఒక్కొక్క ప్రత్యేకార్హతను చాటినాఁడు. నెమిలికొకరీతి యుత్కర్ష నిచ్చిన కొంగకు మఱొకరీతి యుత్కర్ష నిచ్చినాఁడు. దీనిని గమనింపక మనయుద్యానపాలకులు కొన్నిమొక్కలను తోఁటనుండి పెల్లగించివైచిరి. మఱికొన్నిఁటికి రూపముమార్చిరి. ఇఁక కొన్నిటిని విజాతీయములతో చేర్చిరి. వేఱొకకొన్నిఁటిని వేలువెల్లంకులని కుంకుడువేళ్లతోఁగూడ గుస్తరించిరి. ఈరీతిగా నడుమంత్రపు తెలివితేటలతో అనాదినుండివచ్చుచు, అధికారతారతమ్యము ననుసరించి అన్నితెగలవారికి, అన్నిరకముల వారికి ఇంపునుసొంపునుగల్గించుచు వచ్చుచున్న ఆ అనాదితరుగుల్మలతాదుల కుటుంబములను రూపుమాయించి ఆస్థానములో-పటపటలాడు బరుసుదినుసులను, బబ్బూలములను వానికికాపుగా శార్దూలములను మత్తేభములను నెలకొల్పి ప్రజాసామాన్యంపు సేవల నాప్రక్కకేని రాకుండ దిట్టములగు నల్లరాళ్లతో కోటగట్టినట్లు ప్రహరీని నిర్మించినారు. ఇఁక క్రమముగా సర్వసామాన్యుఁకందు ప్రవేశమునునిషేధించి అనేకకట్టుబాట్లతో, అతిప్రయత్నముతో అత్యావశ్యకములని తాముసమ్మిన కొద్ది మొద్దుమాకులతో ఆతోఁటను నింపినారు. 'ఏంలాభము?' అని పాపమాసామాన్యప్రజలు తమతమతీగలను తొట్లలోవైచికొని ఎట్లో మచ్చుకొఱకు ఉసురులు విచ్చిపోకుండ జాతిని కాపాడికొనివచ్చుటకు ప్రయత్నించుచువచ్చిరి. కాని వేయియేండ్లకుపైబడిన కాలమునుండివచ్చిన యీ యెడబాటునుండి యెవరికివారే యమునాతీరే-అన్నట్లయినది. కనుక మనమిప్పుడు స్థానమునుకోల్పోయిన ఆజాతులకు ఆతోఁటలో స్థానమును సంపాదించవలసియున్నది. ఈపనికై నడుములుగట్టి పనిచేయవలసినవారుకూడ ముఖ్యముగా నీ రెండవతెగవారే. అనఁగా పండితులు. వీరు తమపూర్వులుచూపిన సంకుచిత బుద్ధిని సడలించి ధారాళముగావించుకొనవలసియున్నది. మూసియుంచిన ద్వారములు తెఱచి ముందుకువచ్చి ఆజాతులను మఱల యథాస్థానమున ప్రతిష్ఠించుకొనుటకు ప్రతిష్ఠించుకొనునట్లుచేయుటకు పూనుకొనవలసి యున్నది. వారియాహ్వానము ననుసరించి తమ పూర్వహక్కులను నిల్పుకొనుటకై ఆప్రజలును రావలయును.

కాని యిదిసాధ్యమా?—యని నిరాశచెందరాదు. ఉద్యానపాలకత్వమును వహించిన జాతివారమగు మాలోమాకు కలహము లారంభమైనవి. దాదాపుగా 20 యేండ్లకుపైఁగా కొందఱము గతకాలమున మావారు చూపినట్టి ఉపేక్షకు అవనతికి అన్యాయమునకు పశ్చాత్తాపముపొందితిమి. ముందుమావారిని సకారణముగా నొప్పించుటకై మాలోని అనుభవజ్ఞుఁడు చిరకాలమునుండి పోరుచున్నాడు. కాని ఆయనవాదమును మావాదమును అదరగొండితనమున ఇంతవఱకు మావారు అసారసూచకములగు పెదవివిరుపులతోను, ముక్కుమూతివంకరలతోను, కండ్లెఱ్ఱతోను, కసరికొట్టుటలతోను సత్కరించుచున్నారు.

యువకులపక్షమున కొందఱము ఈపరిస్థితుల గమనించితిమి. అపసవ్యపుత్రోవలో ఆరంభమైనదని గుర్తించితిమి. ఆవలిపక్షమునకు రాజాశ్రయాదులున్నవనియు నెఱింగితిమి. ఈపరిస్థితులలో నింకను వాదప్రతివాదములతో ప్రొద్దుపుచ్చుట మాకిష్టము లేదు. వ్యష్టిగను సమష్టిగను ముమ్ముందు నిర్మాణకార్యమును నిర్వహింపవలయునని నిశ్చయించుకొన్నాము. సారస్వతములో నిర్మాణకార్యమేమని మీరు నవ్వగావచ్చును. మానిర్మాణకార్యవిధాన మిది.

మున్ముందు గ్రంథస్థములుగాని, నిస్సారములని త్రోసివేయఁబడిన, ఎబ్బెట్టేయని చప్పరించిన, దిక్కును తెన్నును లేక గ్రుక్కియున్న వాఙ్మయశకలములను ఒకచోటికి ప్రోగుచేయుట, నాటి యుత్కర్షములను సుగుణములను స్వానుభవముగా బయలుపెట్టుట, వానికి అల్లుపెట్టి మాలమాలల ప్రాకించుట, పాదుకొనఁజేయుట ఫలింపజేయుట, వానిని ప్రజలకు రుచిచూపి వారంతవారే అంట్లుగట్టి ప్రోదిచేసి, దిక్కుదిక్కులను నింపి, ఊపిరి సల్పనట్లు ఒత్తిడిచేసి యుద్యానము నాక్రమింపజేసి వానిస్థానమును తక్కినవానితో సరిసమానముగా పొందింపఁజేయుట—ఇత్యాదులు. ఈనిర్మాణకార్యమును మేము దీక్షతో సాగింతుమేని అర్హస్థానమును తప్పక ఆర్జింపగలము. మాపక్షపు నాయకుఁడు వేగిరపాటుచేత-వెనుక గాంధియవలంబించినట్లే శాసనోల్లంఘనము-(ఇదియే గ్రామ్యవాదము) నారంభించి, ప్రజలు సంసిద్ధులుగాలేరని అప్పటికి ఆపినాఁడు. దానిని అవ్వలి పక్షమువారు అపజయమని చాటినారు. కాని ఇదిమేము అనుభవింపవలసినట్టి అపజయములో అల్పాల్పమగు నంశముమాత్రమే.

కనుక జనసామాన్యపు భాషకు ఆంధ్రసాహిత్యమున నర్హస్థానము నార్జించుటకై మేము చేయుచున్న నిర్మాణకార్యప్రయత్నములలో వ్యష్టిగా కొందఱు ప్రాచీనశాసనముల భాషను శోధించుచున్నారు. కొందఱు ఛందోలక్షణముల నన్వేషించుచున్నారు. మఱికొందఱు చెదరిన వాఙ్మయశకలముల సేకరించుచున్నారు. ఇంకకొందఱు మాలమాలల వెదకుచున్నారు. ఇందులో నేనుచేపట్టిన దొక అత్యల్పమగుభాగము. అది మావారు సేకరించినదానిలోఁగల మెఱుగులెత్తిచూపుటయే. ఈపని నాకొకరు పెట్టినది కాదు. పెత్తనమువలెనే నాయంతనేనే పైనవైచికొనినది. నా అల్పమగు శక్తి యిందుకుచాలదనుట నిజమే. కాని శక్తి గలంతపట్టుకు చేయవలసియుండుట అంతకంటెనిజము. కనుక దీనిపరిణామము ఎట్లుండునా?—యన్నయాలోచనతో నిమిత్తము లేకుండ నేను ప్రజలభాష ఆంధ్రసాహిత్యమున దానికిఁగల అర్హస్థానము అన్నవిషయమై కొంతచర్చింపఁ దలఁచితిని. ఇది ఉపక్రమాంశము.

సాధారణముగా పాటలను—అందులో మన తెలుగులోనున్నట్లు రెండేసిఅక్షరాల దగ్గఱనుండి ఆరంభమై, సంగీతసాహిత్యముల సహవాసమును తొలఁగిపోనీక జంటగాకూర్చిన పాటలను—ఇంగ్లీషు మొదలయిన భాషలలో ఏమనిఅందురో నాకు తెలియదు. తెలియవలసిన అవసరముగూడా దాటిపోయింది. అరవైయేండ్లు వచ్చె—అన్న సామెతప్రకారము. కాఁబట్టి అది దుస్సాధ్యమని వైరాగ్యము. అథా వేవిరక్తిః—కదా!

ఆంధ్రసాహిత్యమున నింతవఱకు అర్హస్థానము నొందజాలని, ఆదిమదశలో మహోన్నతి ననుభవించిన జాడలను అమరావతీత్యాదిస్తూపములలోని చిత్రకళవలె, ఇప్పటికి మెఱయించుచున్న యీభాష ఎప్పుడారంభమైనదో, ఏమేమిమార్పులనొందుచు ఎట్టిరీతులఁ బెఱిగినదో నిర్ణయించి సప్రమాణముగా చూపుటకు మనకు చాలినంత యాధారములేదు. ఈ భాషలో ఇప్పుడు మనము కనుగొనుచున్న యీ వాఙ్మయశకలములకు పౌర్వాపర్యమునుగాని, సంగతివిసంగతులను (అదుకులు—అన్వయములు) గాని, నేటి మనదృష్టికి తగినట్లు నిర్ణయించుటకుగూడ వీలులేదు. ఏమనఁగా ఆకాలపువారి లక్ష్యము అచ్చము చారిత్రికమునందుమాత్రమే నిలువలేదు. వారికి మతసాంఘికాది వ్యవస్థలు చెదరకుండను; ప్రాచీనమైన పరంపరాగతమయిన పవిత్రత, పురాణప్రీతి, దైవభక్తి, ఆముష్మికప్రాధాన్యము—ఇత్యాదులు కలిసిమెలసియుండునట్టులును చేయుటయే ముఖ్యోద్దేశము. అందునను ఈ ఉద్దేశములను-మనసునకు విసుగుకలుగకుండను, ఉత్సాహము ఎడతెగకుండునట్లును, సంప్రదాయము సడలనివిధమునను-పిల్లలు అందఱను మూడేండ్ల ముద్దుపసిబిడ్డలు మొదలుకొని పదునారేండ్ల బాలబాలికలై, ప్రాయముమించిన పడుచులై, పడుచుదనమున పాతివ్రత్యమును సంసారాభిరుచిని పదనెక్కింపఁగల పడంతులై, కనిపెంచి, అద్దుసుద్దులు అష్టైశ్వర్యాలు అనుభవించి అంతమున కాటికికాళ్లు జాపవలసిన స్థితిలోఁగూడ, నాముష్మికమును అటునిటు తొణకనీకుండ చూరఁగొనఁదలఁచిన ముదకలవఱ

కును పనికివచ్చు సమస్తవాఙ్మయమునను ప్రతిఫలింపఁజేయుచు, సంగీతసాహిత్యసరణులను మేళవించి కూర్చియున్నారు.

కనుక నేఁడు వీని తత్త్వమును పరీక్షించి ఇందలిసారస్యమును వెదఁజల్ల దివిరినయెడల, మూఁడేండ్లయిన నిండని పసిబిడ్డల ముద్దుముద్దులు మొదలుకొని, ఆఖరుదశలోనున్న ముసలమ్మలవఱకుఁగల సమస్తాంధ్రవాఙ్మయ రాశిని లక్ష్యముగా తీసికొని విమర్శింపవలసియున్నది. అప్పుడు కాని మనకు సంపూర్ణముగా వీటి సత్త్వము తలకెక్కఁగదు. కాని ఇది అంతంతమాత్రాలతో అయునట్టిది కాదు. ఏమందురా? ఈ వాఙ్మయము అంతులేక యున్నది. అందలి విభాగములు అనంతములు. వానిలోఁగలసారములు ఇసుకపాతరవోలె, చెలమనీటివలె తోడిపోయుచున్నకొలఁది ఎడతెగక యుబుకుచుండును గదా! కాఁబట్టి దిక్ప్రదర్శనముగా స్థూలరీతిని కొన్ని కొన్ని హద్దుల నేర్పఱచికొని, అతిసంగ్రహపంక్తికతో మనమిచ్చట ముచ్చటించుకొనక తప్పదు. ఇందుకుగాను నేను ప్రకృత మేర్పఱచుకొన్న దిక్ప్రదర్శన రీతి యిది:—

## స్త్రీ విభాగము

1. మూఁడవయేఁడారంభమైనది మొదలు అయిదవయేఁడారంభము అగువఱకుఁగల వాఙ్మయము. (మూఁడేండ్లవయస్సువచ్చువఱకును, అనఁగా కొంచెము ప్రపంచపరిచయ మేర్పడినది మొదలుకొని 3 సం॥ వచ్చువఱకుఁగూడ పిల్లలకు వాఙ్మయము కలదు. కాని ఇది వారికి వినిసంతృప్తిని గలిగించునదగుటచేత నాల్గవవిభాగమునఁ జేర్చితిని.)

2. అయిదవయేఁడారంభము మొదలు అనఁగా అక్షరాభ్యాసము మొదలు ఎనిమిదవయేడు వచ్చువఱకు (అనఁగా మొగపిల్లలకైనచో వారి జాతులను కుల పద్ధతులను అనుసరించి ఉపనయనాదులు, ఉన్నత విద్యారంభము లగునంతదనుకను, ఆఁడుపిల్లలైనచో పెండ్లియీడు వచ్చువఱకును) గల వాఙ్మయము.

N.B. ఇంతటితో మొగపిల్లలకు ఈ శాఖతో సంబంధము తెగిపోవును. ఆడుపిల్లలకు అట్లేనిలచి యుండును.

3. ఎనిమిదవ యేడు మొదలు పదునారవయేడు వరకు [అనఁగా పెండ్లి అయినది మొదలుకొని అత్తవారింట కోడరికము సాగింపఁదగువఱకు] గల వాఙ్మయము.

4. పదునారవయేడు మొదలుకొని ఇరువదియైదు లేక ముప్పదవయేడు వచ్చువఱకుఁగల [అనఁగా ఇద్దరు ముగ్గురు బిడ్డల తల్లియగువఱకుఁగల ఇల్లాలి దశవఱకు] గల వాఙ్మయము.

5. ముప్పది మొదలు అరువది వచ్చువఱకు [అనఁగా వియ్యమందుదశ మొదలుకొని తాను గణించిన జ్ఞాన విజ్ఞానాదులను తన యల్లుండ్రు, కూతుండ్రు, కోడఁడ్రు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు మున్నగు వారికి పంచిపెట్టుచూ, వారి యందా కౌశల మేరీతి ప్రతిఫలించుచున్నదో కన్నారఁ జూచితనియువఱకు] గల వాఙ్మయము.

6. అరువది వచ్చినది మొదలు అంత్యకాలము వఱకును [అనఁగా జీవితాంతమువఱకును ఆముష్మికమునవ్వారిగాఁ జూరగొనుట కావశ్యకమైనట్టి విషయములు] గల వాఙ్మయము.

## ఇఁకను పురుషవిభాగము

1. విద్యాభ్యాసము నేయఁజాలంగక, అనఁగా వ్రాయను చదువను నేర్వక, కాయకష్టముల నొనర్చి బ్రదుకు తెరువును నిర్వహించుకొను కూలీలు, వ్యవసాయదారులును భిక్షాటనమునే వృత్తిగా పెట్టుకొనిన గోసంగులు, దొమ్మరులు, దాసరులు, ఏనాదులు, ఎఱుకలు, కొమ్ములవాళ్లు, బూరలువాళ్లు మున్నగు వివిధవృత్తులవారును, పడవలవాళ్లును, కోయలు, కొండజాతులు మున్నగు నాటవికులును, లోకమునకు నీతిమతవేదాంతతత్త్వముల బోధించుటకై ఏర్పడిన బవినివీళ్లు, పంబవాళ్లు, సాతానులు, మాలదాసర్లు, బైరాగులు మొదలైనవాళ్లును [ఇఁకను ఇట్టివారును నిందు చేరెదరు.] వీరుపయోగించునట్టి పాటలు, పద్యాలు, దరువులు, తత్త్వాలు మొదలగునవి.

2. పగటివేషగాండ్రు, భాగవతము లాడునట్టి కూచిపూడి భాగవతులలోనివారు, విప్రవినోదులు, అంత్యజాతులు మున్నగు ననార్యాదిమాంధ్రజాతుల కాచార్యత్వమును వహించునట్టివారు ఇత్యాదులుపయోగించునట్టి పాటలు మున్నగు వాఙ్మయము.

3. మిశ్రవాఙ్మయము అనఁగా పై విభాగమున దేనికిఁ జెందక, అన్ని సంఘములకు సర్వసాధారణముగా జెందదగిన వాఙ్మయము.

ఇట్టులు విభజించినచో సౌకర్యము గలుగవచ్చును విమర్శించుటకై -అని నాకుఁ దోచినది. ఇది స్థూల రీతి. ఆవశ్యకమైనచో నింకను అనేకావాంతర్భాగములుగా విభజించికొని, విమర్శించికొన్నను లాభముగల్గునే గాని నష్టములేదని నా తలంపు.

౧-వ విభాగము:—2, 4, 6 గురువులతో ఆరంభమయ్యే భాష. (పాటలు, పదాలు, ముద్దుపలుకులు, తొక్కుపలుకులు) ఇందులో సాహిత్యము కొలఁది, శ్రావ్యత హెచ్చు.

౨-వ విభాగము:—మొగ, ఆడుపిల్లల ఆటపాటలు, చిత్రప్రశ్నములు, వేడుకపదాలు, కథాఫక్కికలు, సామెతలు, ఎత్తిపొడుపులు, వేళాకోళములు, బొమ్మలపెండ్లిండ్లు, హరిబువ్వాలు మొదలగునవి.

3-వ విభాగము:—నోములకథలు, పాటలు, పెండ్లిపేరంటాలకుచెందినపాటలు, పదాలు, చిత్రప్రశ్నలు, కథలు వగైరాలు (నలుగుపాటలు, పూలబంతిపాటలు, తాంబూలాలపాటలు, గంధముపూసేపాటలు మొ.)

౪-వ విభాగము:—లాలిపాటలు, జోలపాటలు, నలుగుపాటలు, వరుసపాటలు, వియ్యాలవారి సరసాలపాటలు, అలుకపాటలు, తలుపుదగ్గఱపాటలు, వప్పగింతపాటలు, బువ్వముబంతి పాటలు, శోభనపు పాటలు, ఉయ్యాలపాటలు, దంపుళ్లపాటలు, తలంటుపాటలు, నోములువ్రతాలపాటలు, పూజాపురస్కారాలు మంగళహారతులు మున్నగువాని పాటలు, మేలుకొలుపులు, సువ్విపాటలు, వేడుక పాటలు మొదలైనవి.

౫-వ విభాగము:—పుణ్యము పురుషార్థము-వీనికిచెందిన పురాణకథల పాటలు. [సముద్రమథనము, లంకాయాగము, కుచ్చెలకథ, (కుశలవకథ) అష్టకాలు, అష్టపదులు, గజేంద్రమోక్షము. సీతాకల్యాణము, సీత ఆనవాలు, లక్ష్మణదేవరనవ్వు మొదలయినవి పెద్దపెద్దపాటలన్నియు నిందు చేరును.] సంఘనియమాచారాదులు పాతివ్రత్యము మున్నగువాని బోధించు పాటలు—ఇత్యాదులు. (దండకములు, వ్రతాదులపాటలు కూడ)

౬-వ విభాగము:—తత్త్వములు, వేదాంతములు, గంగాగర్భాలు, మోక్షమునొందిన భక్తులపాటలు, విరక్తిజ్ఞానము ఆత్మతత్త్వము మొదలయినవానింగూర్చిన పాటలు, స్తోత్రపుపాటలు, శైవవైష్ణవభక్తుల పాటలు.

ఈ రీతిగా స్థూలమగు పద్ధతితో ఆరు విభాగములు చేసికొన్నఁగాని ఈ పాటల వాఙ్మయము, లేక ప్రజాసామాన్యమగు వాఙ్మయమునుగుఱించి కొన్ని చర్చలు చేయుటకు వీలు లేదని తోఁచినది. కావున నేనిట్లు చేసితిని. ఈ చేసిన విభాగములో అచ్చము పామరులకొఱకై కొందరు రచించినట్టి-ద్విపద వాఙ్మయమునకు చెందినట్టి-పెద్దపెద్ద ప్రత్యేకగ్రంథములను ఇందు చేర్చలేదు. దానిని ద్విపదవాఙ్మయములో మన పెద్దలు ఇదివఱకే చేర్చియున్నారు. పండితారాధ్యచరిత్ర, బసవపురాణము, నవచోళచరిత్ర, నవనాథచరిత్ర, హరిశ్చంద్రనల కథలు, వెంగమ్మగారి రాజయోగసారాదులు—ఇత్యాదులు ఈ ద్విపదవాఙ్మయమునఁ జేరును. ఇట్లేయక్షగానాములును హరికథలు మున్నగునవి. వాని నాయావిభాగముల క్రింద ప్రత్యేకముగా చర్చించి రూపింపదగును. నాచేసిన విభాగములుగల వాఙ్మయము-ఇంతవఱకును వాఙ్మయసాహిత్యములఁ జేరనిది. మనము నిర్లక్ష్యము చేసినది. బహుగుణముగలది. కచ్చితముగా, నేననుకొన్నంతటి-ప్రాచీనాద్యకాలీనత్వమొకవేళ లేకున్ననూ, కొంతకుకొంతైనా ప్రాచీనత, ఆద్యకాలీనత కలిగినది. మన యిప్పటి భాషాసంస్కర్తలు చేయిపెట్టనిది. కష్టపడి అన్వేషించినచో ఆదికాలపు ఆంధ్రభాషయొక్క అందచందాలు, ఆరంభదశలోని నవకము నాజూకులు మొదలయిన అనంతములగు గుణగణములను వెల్లడించునట్టిది. అమృతమధురమైనది. సంగీతసాహిత్యముల కలయికలు, మెలయికలు, సాంఘికసారస్వతప్రభృతులసామరస్యాలు, సరణులు - కలది. అపరంజివలె ఎట్లు ఏరీతి నుపయోగించిన నట్లు ఆరీతి సాగి మనోహరత నిచ్చునది. కావుననే దీని యోగ్యతను, ఆంధ్రసాహిత్యమున మనకాలమున వీనికి యీవలసిన యథార్థస్థానమును విడమర్చి వ్రాయబూనితిని. చిత్తగించి మననముచేసి కర్తవ్యమఱయుదురుగాక; కనుక నిటుపైనిఅసలు ప్రధానమగు నంశమును విచారణచేయుదము.

ఇందులకుగాను ముమ్ముందు మఱియొక్కమాట:—ఆంధ్రజనసామాన్యపు వాడుకలో మాత్రమేయున్న గ్రంథస్థము కానట్టి-మన గ్రాంథికులు పండితులు నిర్లక్ష్యము చేసిన ఈ వాఙ్మయములోఁగల కొన్నికొన్ని భాగములు ప్రత్యేకముగను కొన్నికొన్ని పత్రికలద్వారాను మనవారు వెల్లడింప దివిరినారు. అందులో మంజువాణీప్రెస్సు-ఏలూరు-వారు ప్రప్రథములు. వీరు ఈ స్త్రీలపాటలను మూడుభాగములుగా ముద్రించియున్నారు. బ్ర. శ్రీ. తేకుమళ్ల రాజగోపాలరావుగారు పిల్లలపద్యములను పేర 1927-వ సం॥ లో నొక చిన్నపుస్తకమును ప్రకటించిరి. భారతిపత్రికలో-టేకుమళ్ల కామేశ్వరరావు బి. ఏ., గారు 1930-వ స.॥ లో మఱికొన్నిటిని సేకరించి ప్రత్యేకముగాఁగూడ ప్రకటించిరి. సుప్రసిద్ధాంధ్రపండితవిమర్శకులు వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు బహుకాలము నుండి చాలపాటలను సేకరించుకొనియున్నారఁట. అందుఁగొన్ని బాలభాష—అను పేర భారతీగృహలక్ష్ములు ప్రకటించినవి. ఇటీవల గృహలక్ష్మి ఈ విషయమునఁ బ్రత్యేకమగు శ్రద్ధను ప్రచురణోత్సాహమును ప్రకటించుచున్నది. ఇది మెచ్చుకొనఁదగిన విషయము.

ఈ గృహలక్ష్మిలో—బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిల్లా సాంబమూర్తిశాస్త్రిగారు, కారుపల్లి కోదండరామయ్యగారు, చందన సత్యనారాయణగారు మున్నగు పురుషులును; శ్రీమతి సోదరి ఆంధ్రచింతామణిగారు, అద్దంకి అనసూయాదేవిగారు, బులుసు లక్ష్మీనరసమ్మగారు, రాయి సరస్వతమ్మగారు, జమ్మి సీతాబాయిగారు, మొగసాటి అప్పలనరసమ్మగారు, డి. సీతాబాయమ్మగారు మున్నగు వనితామణులును ఈసందర్భమున పాటల ప్రకటించిరి. నా యీ వ్యాసములో వారి ప్రచురణములను గైకొంటిని. కనుక కృతజ్ఞతను ముమ్ముందు వెల్లడింపవలసి యున్నాను.

తొలుత విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవాచనములేని ఏ శుభకార్యమును ఆర్యులు చేయరు. అందును కులశీలములలో-మాటమంతులలో-ఆచారవ్యవహారములలో ఆర్యతను పోనీకుండ కాపాడుకొనివచ్చిన ఆంధ్రస్త్రీలు-ఆ యాంధ్రజనసామాన్యము-అట్టి శుభాచారమును ఉజ్జగించుటకు ఒప్పుకొనరు. కావున వారి వాఙ్మయమునుండియే ముమ్ముందుగా విఘ్నేశ్వరస్తుతిని పఠించి యుపక్రమముఁ గావించెదను.

| | | |
|---|---|---|
| వెనకా వెనకా | వాగూనీళ్లూ | దూదీమడుగులు |
| వేముల తోటా | వనములపత్రీ | దుప్పటిరేకులు |
| కనకాపండ్లూ | మెత్తని కాళ్లూ (గోళ్లూ) | తెల్లనిగుళ్లో |
| కామునిరూపులు | మేచకశంఖులు | నల్లనివినాయకునికి |

నాల్గుచేతులా నమస్కారమయా!

నేను విభజించినరీతిగా రెండుగురువులు, నాల్గేసి ఆరేసి గురువులతో ఆరంభమయ్యే బాలభాషయొక్క ఆరంభదశకిది యంకురార్పణము. ఈ పాట రెండేసిగురువులతో ఆరంభమైనది. పదునాల్గు చరణములుగలవు. ఆద్యక్షరయతియును ప్రాసయతియునుకూడనిందుగలవు. బాలికాబాలురకు సంగీతసాహిత్యములతోఁ గలిపి, తెలుఁగుతల్లి వెన్నతోఁగలిపి గుజ్జు తినిపించుచున్నది యిందు. స్థూలదృష్టికి ఇందలి యర్థము చప్పున బోధపడదు. అన్యాపదేశముగా అభినవకోమలమగు నాంధ్రశిశువులమానసమున అత్యద్భుతమును, అసాధారణమునగు ప్రకృతివర్ణనను గావించి తనకుఁగల ప్రకృతిప్రేమయొక్క బీజములను నాటుచున్నది. చిత్తగింపుడు. గ్రీష్మవర్షాశరదృతువుల మనోహరతను ఎంత చక్కఁగా రంజకముగా నిందు ఆతల్లి నెలకొల్పినదో! మొదటి నాల్గుచరణములును గ్రీష్మర్తువును స్ఫోరకము చేయుచున్నవి. ఈ పాటను పిల్లనికి చెప్పెడి ఋతువు వర్షర్తువు నందలి భాద్రపదమాసములోని వినాయకచవితి. ఆ ఋతువునకు - వెనకావెనకా చూడండి. తరుణమగు గ్రీష్మము. వసంతములోని చిగుళ్లకషాయకాంతు లిప్పటికి మంచి పసరువన్నెకు తిరిగియుండును. ఒక్క వేములుతప్ప (వేపచెట్లు) ఆ కాలమున మఱియే వృక్షములును పండియుండవు. మామిళ్లును కలవు. కాని గ్రీష్మము సగపడునప్పటికే అవి దాదాపు ముగియవచ్చును. కనుక ఇట్టి గ్రీష్మాధిక్యమున వేములు పచ్చగాపండియున్నవఁట. వేప చేదుగనుండునుగనుక దాని పండ్లును చేదేయని యెంచవలదు. అవి పండినవెనుక చాల

తీయగానుండును. బంగరుపసిమిని మించినవై గుత్తులుగుత్తులుగా—చిన్నచిన్నవి పెద్దపెద్దవి వేములతోటలనిండి బంగరు జాలరులవోలె నున్నవి. వానిని ఆయమ్మ తలపించుచు ప్రకృతిసందర్శనానందమును వేయివిధముల శిశువులకు గలిగించుచున్నది. అదియే కనకాపండ్లూ కాముచిరూపుః.

ఇంతలోనే చప్పున వర్షర్తువు ప్రవేశించినది. క్రమముగా శ్రావణమాసమున తొలకరితో నారంభమైన వర్షములు ఇంతలై అంతలై, గ్రీష్మములో నీటిచుక్కయైన లేకుండ యెండిపోయిన వాగులనిండుగా నీళ్లు నిండినవి. వనప్రదేశములయందలి చెట్లు వాని ఆకులు పరువమునొందినవి. అడవులనిండ పచ్చని మెత్తనికోమలములగు గడ్డిబయళ్లు పచ్చని రత్నకంబళ్లు పఱచినట్లు పెంపొందినవి. నత్తచిప్పలు మున్నగునవి వర్షధారలచే కసటువోయి నీటుపట్టులయొడ్డులు మున్నగుచోట్ల మేచకవర్ణమున మెఱయుచున్నవి. ఇత్యాదులు వర్షర్తువునందలి ప్రకృతిదృశ్యములు. వినాయకచవితినాటికిగల ప్రకృతిరంగ మిదియే. మొదటిదంతకు ముందుః.

ఈ వర్షర్తువు దాటుటతోనే శరదృతువు ఆరంభమగునని ఊరించుచున్నది. ఏమిటాదృశ్యమందురా? ఆలోచింపుడు. వర్షర్తువులోని ప్రవాహములవేగము తగ్గిపోయి, పెద్దపెద్ద కొలనులు చెఱువులు మున్నగు వానిలో గట్టుదన్ని నీరు నిలచియుండును. అది వానకాలములోవలెబురదనీరుగాక, చుక్కపొడిచియుండును (అగస్త్యోదయమైయుండును) గనుక, నిర్మలమై తేరి, లేయెండకు తళతళలాడుచు, దూరమునకెంతో సొంపు నింపుగలుగునట్లులుగా, పింజలువారు నక్లేకిన దూదిరాసుల మడుగులువోలె, చల్లగావెన్నెలచలువజేసిన తెల్లని దుప్పటిరేకులు పఱచినట్లుండును. ఈ రీతిగా సర్వాంగీణముగా తెలుపు మించియుండునది ఆ శరదృతువు. అట్టి శరదృతువే ఆ దేవునకు కట్టని పెట్టని గుడియట! అందును తెల్లనిగుడి. భాద్రపదము వర్షాకాలపుమధ్యముననున్నదనుటను మఱవకుండు. ఈకాలములోనే చేళ్లు మున్నగునవి అమితముగా పండియుండును. ఇంకను మబ్బులనలుపు తగ్గియుండదు. ఈ నల్లని నేరేడుపండ్లరాసులు, ఆ నల్లనిమేఘములగుంపులతో విరాజిల్లు ప్రకృతిమూర్తియే మనకు వినాయకుడు. అతడే కాలమూర్తి. ఆకాలమూర్తి యాజ్ఞావశముననే అరనిముసమయిన ఆలస్యములేకుండ, ప్రకృతివశవర్తినియై ఆతని చిత్తమునకు హత్తునట్లు సర్వదా సొగసులు గుమ్మరించి లోకమును ప్రకాశింపజేయుచున్నది. ఇంతటి శక్తిసామర్థ్యములు గల ప్రకృతియే సైతము లోగొనియుండు ఆ కాలమూర్తియెదుట, మనమును మనవంటిప్రాణులును ఒక లెక్కయా? కనుక తల్లి-ఉగ్గుబాల తోడనే సంగీతసాహిత్యములను సామరస్యవిజ్ఞానమును సరసవిజ్ఞానమును కలిపి, మన కడుపులకు బెట్టు, మన యాంధ్రమాత-ఏమని మనకు ఉపదేశము నిచ్చుచున్నది? వినుడు—

నాలుగుచేతులా నమస్కారమయా!

అనుమనుచున్నది. శ్లో. జీవాస్సర్వేపిపశవః పతిస్తేషాం ప్రభుశ్శివః, తస్మాత్పశుపతిః ప్రోక్తః, నమస్తస్మై మహాత్మనే—అను ఉపనిషద్వాక్యమును, కాలః పచతి భూతాని, కాలస్సంహరతి ప్రజాః—అన్న గీతావాక్యమును చిదుకగొట్టి వాముతోనూరి, కటువుగాకుండ తీయనిస్తన్యమునుగలిపి, సంగీతశ్రావ్యతనుజోడించి, మహోత్సాహముతో మాగముచేయక త్రాగినట్లుచేయుచున్నదికదా. ఆ తల్లియప్పు ఎట్లుతీరగలదు? బి. ఏ., హైటెల్లోనా? మఱి, ఈవినాయకప్రార్థనమున కనుబంధముగానే ఈ క్రింది దానినికూడ చిత్తగింపుడు:—

ఓబొజ్జ గణపయ్యా ఉండ్రాళ్లమీదికి కమ్మని నెయ్యాయిన
నీబంటు నేనయ్యా దండు బంపూ కడుముద్దు పప్పయిన

పొట్టనిండాతినిపొడిచిగెలుతు.

N.B. సోదరిడి. సీతాబాయిగారు దీనిని గృహలక్ష్మిలోనిచ్చారు. కాని చాల మార్పుఉన్నది. పైరెంటిలోగల సాహిత్యము నాయత్న మక్కఱలేకయే వెల్లడికాగలదు. ఇవి మొదటివిభాగమున మొదటి తరగతికి చేరినట్టివి.

—మిగిలియున్నది.

# దుర్గపూజ : దసరా

శ్రీమతి ఉద్య సుబ్బలక్ష్మమ్మగారు

దుర్గపూజ బెంగాలీలకు ముఖ్యమైనపండుగ. ఇరువదేండ్లకుపూర్వము దుర్గపూజాదినములలో పట్టణవాసులెల్లరును పల్లెటూళ్లకుపోయి వాటికి నూత్నకళను కల్గించుచుండిరి. ధనవంతులు, బీదలు, పండితులు, పామరులు సమస్తజాతులవారు తమతమ భేదములను మరచి సౌహార్దమున మెలగుచుండిరి. కాని కాలమొక్కరీతి గడువదుకదా? ఇప్పుడన్ననో తమకష్టములను మైమరచుటకై బెంగాలీబాబులు యేకొండప్రాంతములకోజని తమ పల్లెటూరిసోదరులను మరచుచున్నారు.

దేవి, భగవతియని దుర్గకు పర్యాయనామములు. దుర్గ భారతీయులందరిచేతను పూజింపబడుచున్నది. పదునేడవశతాబ్దమున పుదుచ్చేరియందు క్రైస్తవులు కొందరు మేరీకన్య విగ్రహమును ఊరేగించుచుండగా నిష్కపటులగుహిందువు లావిగ్రహము భగవతి (శ్రీరాములవని నమ్మి వెంటాడిరని వెనీషియన్ యాత్రికుడు మనూసీ (Manucci) చెప్పుచున్నాడు. అదేరీతి ఒకమహమ్మదీయుడు దుర్గయు, ఫాతిమా (Fatima) యు నొక్కరే యను పిచ్చినమ్మకమున ఉండెను.

దుర్గ సమరమున కధిదేవత. సంహారకర్తభార్య. వాడిబాణముల ధరించును. సింహవాహనారూఢయై భయంకరులగుదానవుల బరిమార్చును. ఆమె యారాధనయందు జంతుబలి నొసర్తురు. బలియొనర్చిన మహిషపునెత్తుటిలో తమయొడలిని తడుపుకొను ఆచారము పదిసంవత్సరములపూర్వమువరకు వాడుకలోనుండెను. ఇప్పటిబెంగాలీల పూర్వికులు యుద్ధమునకుపోవుటకు పూర్వము భగవతినిపూజించి, పిదప ఆవిగ్రహమును నీటగలపుచుండిరి. ఈయాచారమును జ్ఞప్తికిదెచ్చుటకై కాబోలు పైనివివరించిన వికారపువాడుక! మొట్టమొదట దుర్గపూజ వసంతకాలమున జరుగుచుండెడిది. అందువలననే దుర్గకు వసంతియను పేరు. పిమ్మట శ్రీరాములవారు లంకేశునెదుర్కొనుటకు పూర్వము శరత్కాలమున ఈమెసాయమును ప్రార్థించెనట. అప్పటినుండి శరదృతువున ఈమెపండుగ జరుపబడసాగెను. ఈఋతువున వానలునిలచి నదులుదాటుటకు వీలుకలవియై పొలములందు మేతసమృద్ధిగనుండి దిగ్విజయమున కనుకూలముగనుండును. అప్పుడాదేవిభక్తులు త్రుప్పుపట్టిన కత్తులకటారుల తోమికడిగి శుభ్రపరచి తమ ఉన్నతాశ్వములనెక్కి దాడివెడలుచుండిరి; ఇదియు నిప్పుడుమారినది. దుర్గ ఇపుడు లోకమాతయైనది. ఆమె కిరుప్రక్కల లక్ష్మీసరస్వతులున్నారు. ఆయమకుమారుడు కార్తికేయుడు. సురలనుసాయముగొని రాక్షసుల జయించుటకుబదులు సొగసుగాడైనాడు, సుందరాంగుడైనాడు. ఇంకను కొన్నిచోట్ల బలులొసంగబడుచున్నను, పూజారులు పదియవనాడు శాంతిమంత్రములనుచ్చరించుచు ఆజలము స్వామిదర్శనమునకై వచ్చిన భక్తులపై చల్లుచున్నారు. మరునాడు స్నేహదివసము. అందరును తమ కలతలమరచి స్నేహభావమున ఒండొరుల నాలింగనమొనర్చుకొనుచున్నారు.

వీరులగు మహారాష్ట్రులుమాత్రము తమముత్తాతల శౌర్యాదికార్యములనుమరువలేదు. ఇప్పటికిని వారు విజయదశమినాడు తమవద్దఉండు ఆయుధములను తళతళ మెరయునట్లు తోమి శుభ్రపరచి, గుఱ్ఱములపై నెక్కి, గుంపుగ సాయంత్రమున తమ యూరి పొలిమేరలదాటుచున్నారు. అట్లుదాటి ఒకశమీవృక్షముదరిజేరి దానిపత్రములనూడబెరుకుదురు. దీనికి 'బంగారుదోపిడి' యని పేరట.

మహారాష్ట్రసామ్రాజ్యనిర్మాతయగు శివాజీ వానకాలమున యుద్ధసన్నాహముల నాపివేయుచుండెను. దసరాదినముల సేనానాయకులు ఉద్యోగులందరు తనరాజధానియందు సిద్ధముగనుండునట్లు దిట్టపరచియుండెను. కాని శివాజీకితరువాతవారు బలహీనులగుటచే అధికారము పీష్వా హస్తగతమాయెను. అప్పటినుండి దసరాయుత్సవములను అతివైభవముగ పూనాయందు పీష్వా జరిపించుచుండెను. వానిని సర్‌జాన్‌మాల్కం యిట్లని వర్ణించుచున్నాడు: "పదవనాడు తనసైనికులును, నాయకులును తమ అంతస్తుకుతగినట్లు ఉడుపుల ధరించి తళతళమెరయు ఆయుధములజళిపించుచు అశ్వములనెక్కి వెన్నాడ పీష్వా ఊరినివదలి నిర్ణీతస్థలమునకు వెళ్లును. వెళ్లి శమీవృక్షమునీడ జేరును. పూజానైవేద్యము లయినపిదప శమీపత్రముల కొన్నిటిని పీష్వా ఊడబెరుకును. అపుడు సైనికులు తుపాకులపేల్తురు. అనంతరము అందుకనికొనబడిన బార్లీచేనునుండి కొన్నియెన్నుల దీయును. అప్పుడు గుంపంతయు ఒక్కపెట్టున చేనుపైబడి వారివారికిదొరికినంత దోపిడితో సంతృప్తులై జయజయధ్వనులతో గృహాభిముఖులగుదురు. అప్పనుండిరాత్రివరకు కెల్లెడలను వేడుకలే. రాజభవనమున దర్బారుజరుగును. సభికులను ఉచితరీతి బహుమతులతో పీష్వా సన్మానించును."

1809-వ సంవత్సరమున మేజర్ బ్రౌటన్ (Major Browghton) అనునాతడు దౌలత్‌రామ్‌సింధియావారివద్దనుండెను. అతడిట్లువ్రాయుచున్నాడు: 'దసరాపండుగ 18-వ తేది అతివైభవముగ జరుపబడెను. ముందునాడు సైనికులు తమగుఱ్ఱములకు నీరుపోసి జలకమాడించి, తమ ఆయుధములను శుభ్రపఱచి, గుఱ్ఱములపై వేయుటకు చిత్రవిచిత్రములైన వస్త్రములను తయారుచేయుచుండిరి. మరునాడు తెల్లవారగనే సేనలు వరుసలుదీరి క్రమక్రమముగ జండాలతో సాయుధపాణులై నిలుచుండిరి. సర్దారులు, కాల్బలము, అశ్వబలము, గాయకులు, ఏనుగులు ముందును వెనుక మహారాజును కన్నులపండువొనర్చునట్లు వచ్చిరి. కొంతదూరమున మధ్య ఒకచెట్టుకొమ్మ నాటబడియుండెను. రాజు పల్లకిదిగగనే పండితులు పూజనారంభించిరి. పాలుపెరుగు కొమ్మలపై అభిషేకించి తడిసిన బియ్యపుగింజలను ఆకులపై వెదజల్లిరి.'

## మయూరుని కూతురు

పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు

సంస్కృతసారస్వతమునఁ బ్రసిద్ధిఁజెందినవారిలో సూర్యశతకమును రచించిన మయూరుఁడు సుప్రసిద్ధుఁడు. ఈతనికి బాణుఁడు సమకాలికుఁడు. ఈతఁడు పాండిత్యమునఁ గాళిదాసు, భవభూతి మున్నగు కవీంద్రులతో సరిపోల్పఁదగినవాఁడు. ఇతఁడు సూర్యశతకమును రచించుటకుఁగల కారణము నొక కథగాఁజెప్పెదరు. తన తనయ నీతఁడు సుప్రసిద్ధ కవియు, సమకాలికుఁడునగు బాణుఁడనువానికిచ్చి యుద్వాహమొనర్చెను. పిమ్మట నీతఁడు కారణాంతరమున దూరదేశమున కేగి, కొంతకాలమిటనుండి పిమ్మట స్వదేశమును జేరెను. ఈతఁడు స్వస్థానమును జేరిన పిమ్మట యౌవనవతియగు తనదుహితనుజూచి, చాలకాలము క్రిందట (నామె బాల్యప్రాయమున) జూచియుండుటంజేసి గుర్తింపనేరక యామె యొక పర వనితయని తలఁచి యామె నీరీతిగ వర్ణించెను.

"ఏణీదృశాపాణిపుటేనిరుద్ధ
వేణీర్విరేజే శయనోత్థితాయా
సరోజకోశాదివనిస్సరంతీ
శ్రేణీషు నీభూయమధువ్రతానాం."

మఱియు నామె నీయెనిమిదిశ్లోకములలో వర్ణించెను. ఈశ్లోకములనే మయూరాష్టక మందురు.

1. "యాసాకాప్రస్తుతాంగీ ప్రచలితనయనా హంసలీలావ్రజంతీ।
ద్వౌహస్తౌ కుంకుమార్ద్రౌ కనకవిరచితా....................।
..............................గతాసాబద్ధ వీణాహసంతీ ।
తాంబూలం వామహస్తే మదనవశగతా గుహ్యశాలాంప్రవిష్టా ॥

2. యాసాకా భుక్తముక్తా ప్రచలితనయనా స్వేదలగ్నాంగవస్త్రా।
ప్రత్యూషే యాతిబాలా మృగఇవ చకితా సర్వతశ్శంకయంతీ।
కేనేదం వక్త్రపద్మం స్ఫురదధరరసం షట్పదేనైవపీతం।
స్వర్గాః కేనాద్యభుక్తో హరనయనహతో మన్మథః కస్యతుష్టః ॥

3. యాసాకా స్తనపీనభారకఠినామధ్యే దరిద్రావతీ ।
విభ్రాంతాహరిణీ విలోలనయనా సంత్రస్తయూథోద్గతా ।
అంతః స్వేదగజేంద్రగండగళితా సంలీలయాగచ్ఛతీ ।
దృష్ట్వారూపమిదం ప్రియాంగగహనం వృద్ధోపికామాయతే ॥

4. నామేనాఽఽవిష్టయంతీ ప్రవిరళకుసుమం కేశభారంకరేణ।
ప్రభ్రష్టం చోత్తరీయం రతిపతితగుణా మేఖలాందక్షిణేన ।

తాంబూలం చోద్వహంతీ వికసితవదనా ముక్తకేశానరాగా।
నిష్క్రాంతా ......శాన్మదనవశగతా మారుతంప్రార్థయంతీ ॥

5. యాసాకా నవయౌవనా శశిముఖీ కాంతాఽఽపతీగచ్ఛతీ।
నిద్రావ్యాకులితా విఘూర్ణనయనా సంపక్వబింబాధరా।
కేశైర్వ్యాకులితా నఖైర్విదళితా దంతైశ్చఖండీకృతా।
కేనేదం...రాత్రుసీన.....శార్దూలవిక్రీడితా ॥

6. యాసాకాపరిపూర్ణచంద్రవదనా గౌరీమృగాక్షోభినీ।
లీలామత్తగజేంద్ర హంసగమనా...............।
నిశ్వాసాధరగంధశీతల ముఖీవాచామృదూల్లాసినీ।
సాశ్లాఘ్యః పురుషః సజీవతివగోయస్యాత్ప్రియాహీదృశీ ॥

7. యాసాకా జఘనస్థలీ సులలితా ప్రోన్మత్తకామాధికా।
భ్రూభంగం కుటిలంత్వనంగధనుషః ప్రఖ్యంప్రభాచంద్రవత్।
రాకాచంద్ర కపోలపంకజముఖీ క్షామోదరీ సుందరీ।
వీణాదండమిదంవిభాతితులితంవేల్లద్భుజంగచ్ఛతి ॥

8. యాసాకా...హావభావవిలసచ్చంద్రాననంబిభ్రతీ।
గాత్రం చంపకదామ గౌరసదృశం పీనస్తనాలంబితా।
పద్భ్యాంసంచరతీ ప్రగల్భహరిణీసంలీలయాస్వేచ్ఛయా।
కిం చైషా గగనాంగనా భువితలేసంపాదితాబ్రహ్మణా ॥"

ఇట్లు వర్ణించెను. ఆమె కడు విద్వాంసురాలగుటచే దాని యర్థముఁ గ్రహించి మిక్కిలి కినిసి, "కొమరితనని యెంచక నన్నిట్లు కాముకునిగతి వర్ణించితివి; కావున నీవు శ్వేతకుష్ఠువ్యాధిచేఁ బీడితుఁడవుక"మ్మని శాపమిచ్చెను. తదనుగుణంబుగ నతని జన్మాంతర కృతమగు కర్మగూడ అనుభవింపఁదగుకాల మాసన్నమాయెను. కావున నతఁడట్లు కుష్ఠు రోగముచేఁ గడుబాధపడుచు బాగుగ యోచించి,

"హుతాశనాద్భుతిమిచ్ఛేత్ జ్ఞానమిచ్ఛేన్మహేశ్వరాత్।
ఆరోగ్యంభాస్కరాదిచ్ఛే న్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్ ॥"

అను నార్యోక్తిననుసరించి శతవల్లీనిర్మితమగు డోలికయందుపవిష్టుఁడై నియమ వ్రతుఁడై సూర్యభగవానునింగూర్చి నూఱుశ్లోకములతో నుతిసల్పెను. అతఁడు ప్రతిశ్లోక మునకు నొక తీగ నుచ్ఛేదించుచుండెను. ఇట్లు నూఱుతీగల నుచ్ఛేదించునప్పటికి వ్యాధి నిర్మూలమయ్యెను. ఈ నూఱుశ్లోకములే సూర్యశతకమని ప్రసిద్ధిజెందియున్నవి. ఆహా! స్త్రీవాక్ప్రభావమెంతటికార్య మొనర్చినది!

# పసుపు

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

పసుపునకు సంస్కృతమున రజని, హారిద్రా అనియు; అరవమున మంజళ్ అనియు; ఆంగ్లమున టర్మరిక్ అనియు పేళ్లు. దీనిని హిందూదేశమునందంతటను చూడనగును.

పసుపు ఊరగాయలయందు, కూరపొడులయందు, ఆహారపదార్థములందు ఆహ్లాదకరమయిన వర్ణము నిచ్చుటకు విరివిగ ఉపయోగింపబడుచున్నది. ఇంకను స్త్రీలచే ముఖమునకు, శరీరమునకు, కాళ్లకు లేపనము చేయబడుచున్నది. ఇప్పుడును గ్రామములయందు వివాహాదిశుభప్రయోజనములయందు ఈవాడుక అనుసరింపబడుచున్నను నవనాగరికులమనువారు ఇప్పుడు దీని నుపయోగించుటకు బదులు 'ఫేస్‌పవుడర్'ను ఉపయోగించుచున్నారు. పసుపును ముఖమునకు పూసుకొనుటచే కాంతి, మంచివర్ణము కలుగుటయేకాక చర్మరోగములు ఏవియైనఉన్న నివారణమగును. స్నానమున పసుపు ఉపయోగమువలనకూడ ఈలాభములు గలవు. ఆచారములకు, ఆరోగ్యసూత్రములకు సంబంధమున్నదనుటకు ఇదియొక నిదర్శనము. ఈ విషయములు తెలియక మనస్త్రీలు పాశ్చాత్యస్త్రీల ఫేషనులను అనుకరించుచున్నారు.

## వైద్యవిషయము

ఔషధములయందు ముఖ్యముగ పసుపుకొమ్మను వాడుచున్నారు. యోగములను వివరించుటకుముందు పసుపుయొక్క సాధారణగుణములను వివరించెదను.

పసుపు చేదు వెగటురసములు కలిగియుండును. ఉష్ణముజేసియార్చును. శ్లేష్మమును, మేహమును హరించును. తేలికను, జఠరదీప్తినిఇచ్చును. రక్తమును శుభ్రపఱచును. జీర్ణముజేయును. క్రిమిరోగము, తంద్ర, దగ్గు, జ్వరము, విషము, కుష్ఠు, దురద, మేహవ్రణములు, కఫరోగము, అర్శోరోగము, మూత్రము వెంటపుద్దపడెడు మేహరోగము, ఉబ్బసము వీనిని బోగొట్టును. హృదయమునకు పొట్టకు బలముచేయును. నీళ్లవిరేచనములు కట్టును; సుఖప్రసవముగావించును. మూత్రమును జారీచేయును; పాండువు, కామిలరోగము హరించును. కండ్లకు కాంతిదెచ్చును; కార్జములోపుండగు రోగమును బోగొట్టును; కార్జమును శుభ్రపరచును.

## యోగములు

పసుపుకొమ్ము నిప్పులమీద కొద్దిగ కాల్చి నమలిన పండ్లనొప్పులు హరించును.

కాల్చిన పసుపుకొమ్ము ఊట మ్రింగుచుండిన ఒగర్పుగల దగ్గు శమించును.

పసుపు నీళ్లతో అరగతీసి కండ్లలో పెట్టిన నేత్రరోగములు హరించును.

పసుపు నూరికట్టినను లేక పసుపుగుండ నీళ్లతోకలిపికట్టినను గడ్డలు, వ్రణములు, దుష్టవ్రణములు యివి హరించి శుభ్రముగ మానును.

పసుపు, నల్లమందు, పటికి కలిపి కండ్లకు పట్టువేసిన కండ్లయెరుపులు, పోటు యివి మానును.

దీని పువ్వులరసము పూసిన శోభమచ్చలు మానును.

తేలుకుట్టినచోట పసుపుగుండ కాల్చిన పొగబట్టించిన తేలువిషము హరించును.

పచ్చిపసుపునూరి తలకుపట్టించిన తలదిమ్ము, తలతిగడము యివి నిమ్మళించును.

ఎండు పసుపుకొమ్ము పొగబట్టిన అపస్మారముయొక్క మూర్ఛ నివర్తించును.

1 వంతు పసుపు, 20 వంతులు పటికి రెండును చూర్ణించి కలిపి చెవిలోకి జొచ్చునటుల ఊదిన చాలకాలముగనుండు రసి, చీముకారుట యివి కట్టును.

పసుపును కారముగల సున్నమును కలిపివేసిన స్వల్పగాయములు, కొట్టుకపోవడము నిమ్మళించును. పుండుకాకుండచేయును. నొప్పి హరించును. నీళ్లతో పసుపుసున్నము కలిపికట్టిన గోరుచుట్టు, మడమశూల, కణుపుమాద, కణుపుజెట్ట మొదలగునవి హరించును. ఈకట్టు నీళ్లతో తడుపుచుండవలెను.

పసుపు కట్టిన లేక పసుపునీళ్లలో గలిపిపోసిన వ్రణములలో పురుగులు చచ్చును. ఇతర చున్న జంతువులు, పురుగులు చచ్చును.

పసుపుపొగ లేక పసుపుచల్లిన వేడినీళ్ల యావిరిపట్టిన దగ్గు, పడిసెము, శిరోభారము యివి మానును.

పసుపుగుండ పాలలోకలిపి అందులో మిరియాలపొడి గలిపి దినమునకు రెండుపూటలు యిచ్చిన జ్వరముగల దగ్గును, పడిసెము వీటిని అణచును.

వట్టి పసుపుగుండ నీళ్లలోకలిపియిచ్చిన సర్పవిషము, పడిసెము, దగ్గు యివి నిమ్మళించును.

పసుపు చిక్కగ నీళ్లలోకలిపిపూసిన గాయములు, కవుకుదెబ్బలు, ఇరుకునొప్పులు యివి మానును. గజ్జి చిడుము మొదలగు చర్మరోగములు మానును.

పసుపుకషాయముతో కండ్లు కడిగి తడిపసుపుగుడ్డ కండ్లమీద ఉంచిన లేక దానితో కండ్లు తుడుచుచుండిన కండ్లకలక నివర్తించును. ఇది సామాన్యముగ అందరిచే నుపయోగింపబడు క్రియయే.

దూదిపింజెమీదగాని, పచ్చినూలుచుట్ట (ఈరె) మీదగాని పసుపుగుండ దళసరిగబోసి దానిని కంటిమీదవేసి కట్టుకట్టిన కంటికిదెబ్బతగిలి యెఱ్ఱబడటము, వాపు, నీరుకారడము కట్టును.

పచ్చిపసుపుదుంపను నీడను ఆరబెట్టి దానిని ఒకనిమ్మకాయలో రంధ్రముజేసి అందులోనుంచి 3 దినములు నిమ్మకాయలోనేయుంచి 4-వనాడు పసుపుకొమ్ముతీసి దానిని 1 రోజు యెండబెట్టి మరునాడు దానిని మరియొకనిమ్మకాయలో 3 దినములుఉంచి 4-వదినముఎండించి ఈచొప్పున 7 నిమ్మకాయలలో ఉంచితీసిఉంచి రోగిఉమ్మితో పసుపుకొమ్మును గంధముతీసి కండ్లకు కాటుకవలెపూచిన కంటిరెప్పలమీద వెంట్రుకలు లేచును.

పచ్చిపసుపుకొమ్ము తెచ్చి బ్రహ్మచెముడుమ్రానులో రంధ్రముచేసి అందులో పసుపుకొమ్ముఉంచి రంధ్రము దాని మ్రానిక్రతో పూడ్చి 7 దినములు ఉండనిచ్చి 8-వ నాడు పసుపుకొమ్మును నీళ్లలో ఊరబెట్టి యాపసుపుకొమ్మును నీళ్లలో గంధముతీసి పూయుచుండిన శ్వేతకుష్ఠువు, తెల్లపొడలు, మచ్చలుమానును.

పసుపుక్రిమిహరమైనది. క్రిమములను నాశనముచేయుటకు దానితో కల్కము చేయబడుచున్నది. పసుపు 1 భాగము; ఓమము 4 భాగములు; వెల్లుల్లిపాయలులేక ఎర్రగడ్డలు 16 భాగములు నీటితో చక్కగనూరి చేయునది. పిదప తైలముతో ఉడికించి సుఖోష్ణముగనున్నపుడు పైన లేత అరిటాకు లేక తామరఆకు వేసి ముద్ద వ్రణముపై కట్టునది. ఇది సాధారణముగ వాపులయందు ఉపయోగింపబడుచున్నది. ఇది క్రిమిహరలేపము. ప్రమేహమున పసుపును ఉసిరికెస్వరసము తోడను తేనెతోడను వాడవలయును.

శ్లీపదమున, కుష్ఠమున పసుపును గోమూత్రముతో సేవించిన గుణమునిచ్చును.

కాసమును శమింపజేయుటకు పసుపుపొడి ఘృతముతో ఇవ్వవలయును. పొడ, సామాన్యచికిత్సలచే గుణముపొందని దురద, క్రిమిజన్యచర్మరోగములు పసుపు లేక పసుపు, వేపాకుకల్కము వీనియొక్క ఉపయోగమువలన నయమగుచున్నవి.

అర్శోరోగమున (మూలరోగము) పసుపు, గంజాయాకు, ఎర్రగడ్డలు, అల్లివిత్తులనూనె వీటితోతయారు చేసిన లేపమును మూలములు చాలా బాధకరములుగను, బయటికివచ్చునవిగను యుండునపుడు వాడుచున్నారు.

పుండ్లయందు ఆవాలనూనె చక్కగపూసి పసుపుచూర్ణముజల్లిన 3, 4 దినములలో అవిమానును. మానని వాపులకు పసుపు, టంకణము నూరి వాడిన వాపులు శీఘ్రముగ అణగును.

పడిసెమున పసుపుకొమ్ము వేసి పాలను కాచి కొద్దిగ చక్కెరచేర్చి యిచ్చిన చాలా ఉపయోగము.

కడుపుఉబ్బుతోకూడియుండిన అజీర్ణమున 15–20 గ్రెయిన్లు పసుపు ఇచ్చుటచే ఉపయోగమున్నది. ఇది అజీర్ణమును కుదుర్చుటమేకాక జఠరదీప్తి నిచ్చుచున్నది. రక్తదుష్టజన్యములగు చర్మరోగములయందు సేవన లేపనములు ముఖ్యములు, ఉపయోగకరములు.

శరీరమునందు బొబ్బలు కనుబడకుండుటకై నూనె, పసుపునుగలిపి లేపనముజేయుచున్నారు.

కొంచెమునున్నము, పెట్లుప్పు (నూరేకారము) పసుపుకల్కమున కలిపి కొద్దిగ వెచ్చజేసి గాయములు ఇరుకునొప్పులయందుపయోగించుట అందరికి తెలిసినయోగమే.

పసుపు లోపలికిచ్చుమోతాదు పూటకు 20 మొదలు 40 గోధుమగింజలయెత్తువరకు ఉండనగును.

పసుపు అధికముగ సేవించుట తటస్థించిన ముంతగుండెకు, ఇంద్రియమునకు నష్టముజనించుచున్నది. ఇట్టి సమయమున విరుగుళ్లుగా నిమ్మ, పంపరపనస, నారింజపండ్లను వాడనగును.

## శిశుపోషణ

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు, సారస్వతసమాజము

మనదేశమున శిశువుల మరణములు అమితముగానున్నవి. మరే దేశమునందును వీని సంఖ్య యింత హెచ్చుగాలేదు. దీనికి కారణము లనేకములున్నవి. తల్లియొక్క అజ్ఞానము అందు ముఖ్యమగువానిలో నొకటి. కనుక శిశుపోషణమున మాతృబాధ్యతకు సంబంధించిన కొన్ని విషయములనుగూర్చి చెప్పెదను.

శిశువును లేతమొక్కతో పోల్చవచ్చును. అజ్ఞానకృతమునగాని అజాగ్రతవలనగాని వారి కేవిధమగు లోటు సంభవించినను వారి యుత్తరజీవితమున దాని దుష్ఫలితములు పొడ చూపును. అపుడవి దిద్దుబాటునకు లొంగక ఆప్రాణికి నిరంతరదుఃఖభాజనములగును.

### దుష్టమగు ఆసనములు

పసిపిల్లల ఎముకలు మెత్తగనుండి ఎటువంచిన నటువంగును. ఎదిగినకొలదిని అవి గట్టిపడి బాల్యమున పొందిన వంకరలను నిలుపుకొనును. కనుక చిన్నతనమున పిల్లల నెత్తుకొనుట, నడిపించుట, కూర్చుండబెట్టుట మొదలగువానిలో జాగ్రత్తగ నుండవలెను. అటులున్నచో దేహముయొక్క సహజసౌష్ఠవము చెడదు. అవయవములు క్రమవికాసమునొంది ఆరోగ్యము హెచ్చును. సమస్తధర్మసాధనములకును మూలమగు శరీరమును సక్రమముగ నుంచుట ఎల్లరియొక్క విధియునై యున్నది.

### దుస్తులు

దుస్తులు అందముకొరకని చాలమంది యుద్దేశము. అవి ఆరోగ్యసాధనములను మాటమరతురు. అందుచే నడివేసంగిని ఉన్నిదుస్తులను ధరించువారున్నారు. ఇది ఎంతయును శోచనీయమగు విషయము. అట్టులే వారు శిశువులనుగూడ లక్కబొమ్మల నలంకరించినట్లు అలంకరింతురేగాని అవి నోరులేని పసివారికి అసౌఖ్యకరములని తలంపరు. వానిని భరింపజాలక ఏడ్చినను లెక్కసేయరు. శీతలకాలమున పసివారికి ఉన్నిదుస్తు లవసరము. తదితర కాలములందు తెల్లని సన్నవలువలు సరిపోవును. ధవళవస్త్రధారణమున పరిశుభ్రత యలవడును. ఏమాత్రము మురికైయైనను పైకి కన్పించునుగాన రోగక్రిముల నంకురింపనీయవు.

### ముద్దిడుట

చంటిపిల్లలను ముద్దిడుకొనుట సర్వసాధారణము. అందువలన మిక్కిలిచెడుగు సంభవించును. దగ్గు మొదలగువ్యాధులుగలరోగులు ముద్దిడుకొన్నచో నావ్యాధులు వారలకంటి జీవితాంతమువరకును బాధించును. అందరిని ఎత్తుకొననిచ్చుటే తప్పు. ముద్దిడుకొననిచ్చుట అన్నిటికన్నను గొప్పతప్పు. అదిమహాపాతకమని నాయభిప్రాయము.

### ఆహారము

శిశువునకు తల్లిపాలే చాలమంచివి. కాని ఆపాలు ఆరోగ్యదములుగానుండుటకు తల్లియొక్క భోజనాదులు ఆరోగ్యసూత్రములననుసరించి యుండవలెను. ఆమెపాలను

త్రాగుచు, ప్రాణకృత్సమృద్ధములగు ఆకుకూరలను, పండ్లను దినవలెను. పాలబీదవడిన పిల్లలకు బాగుగాకాచి సగపాటినీటితో చేర్చిన ఆవుపాలుగాని, గ్లాక్సోపాలుగాని మంచివే. అట్టివారికి ఫలరసములు అవసరము. కమలాఫలము, నారింజ, బత్తాయి, ద్రాక్షపండ్లరసములు ఒక్కొక్కచెంచాడు ఇవ్వవచ్చును. వేళకుఇచ్చుట, మితిమీరకుండుట, విరేచనము సాఫీగాఅగునట్లు చూచుట మిక్కిలి అవసరము.

## స్నానము

అనుదినము స్నానము అవసరమైనది. స్నానముచేయించునపుడు నూనెవ్రాసినతరువాత చిరుఎండతగులుట ఎంతయునుమంచిది. ఒడలుకందునట్లు వేడినీటినిపోయుట ఆరోగ్యకరముగాదు.

## ఆటపాటలు

పిల్లల నాడుకొననివ్వవలెను. వారిటునటు కొట్టుకొనుచు తమకు అస్వాతంత్ర్యమున నున్న కండరసమూహములను స్వాతంత్ర్యమునకు గొనితెచ్చుకొందురు. నిరంతరసంచలనమువలన వారికికావలసిన యుష్ణము ఉత్పత్తియగును. ఉదయాస్తమయములందు వారు బైటకు తీసికొనిపోయి పరిశుద్ధవాయువును, కాంతినిబడయగలవారిగా జేయవలెను. వారిని నిదురబుచ్చునపుడు మధురములగు జోలపాటలను బాడవలెను. వారు పరుండుస్థలమున కంటికింపగు రంగులుగల మహాపురుషుల చిత్రపటములను వ్రేలాడదీయవలెను. ఇట్టివానివలన వారిరుచులు, అలవాటులు నియమబద్ధములును, పరిశుద్ధములును అగును. వారెదిగి పెద్దతనమున ఆదర్శప్రాయులగు పౌరులగుదురు.

తల్లిదండ్రులును, అనుజన్ములును వారినెంత గౌరవమర్యాదలతోడను, ఆదరాభిమానములతోడను జూతురో వారు నంతప్రేమాస్పదులునగుచు భక్తి, వినయము, ఉపకారబుద్ధి మొదలగు సద్గుణగణభరితులై ఎదిగి కీర్తిని సంపాదింపగలరు.

పసిపిల్లలను భయపెట్టుట మనలో ఆచారము. భయమువలన స్వసంత్రశక్తి నశించును. పిరికితనమలవడును. అంతేకాక బుద్ధివిహీనత, మాంద్యము సంభవించును. కనుక ఏసమయమందును వెరపించుట కూడదు. ఇటులే వారియెదుట పెండ్లిమొదలగువానినిగూర్చి మాట్లాడుట, హేళనచేయుట కూడనిపనులు. వయసునకుతగిన భావములుమాత్రమే వారికి తెలుపదగినవి.

పసిబిడ్డను తల్లి ఎంతదగ్గరిగదీసి పెంచునో ఆబిడ్డ యంత సుగుణవతియగును. తల్లి సచ్చింతనగల్గి, ప్రేమముదొలుక బిడ్డను పెంచవలెను. అట్టిబిడ్డ తన్నుగాంచిన తలిదండ్రులకును, నిర్మించిన భగవంతునకును ఖ్యాతిదెచ్చునట్టి సద్వర్తనగలిగి యలరారును.

# కీ. శే. డాక్టరు కుగ్లరుకాంత

రాయసం వేంకటశివుఁడుగారు

స్త్రీ, శిశువుల యుపయోగార్థమె సుమారేఁబదిసంవత్సరముల క్రిందట గుంటూరుపురమున నొక వైద్యశాలను స్థాపించి, దాని నున్నతస్థితికిఁ గొనివచ్చి, తన డెబ్బదియైదవయేట 1930-వ సం॥ జూలై 26-వ తేదీని గుంటూరునందు పరమపదమునందిన శ్రీమతి డాక్టరు కుగ్లరుగారి జీవితము భారతనారుల కాదర్శప్రాయముగ నుండును. అన్నాయస్‌కుగ్లరు అమెరికాసంయుక్తరాష్ట్రములోని పెన్సిలువేనియాజిల్లా మాఁటుగోమరీతాలూకా ఆథెన్సువిలు గ్రామమున నొకసద్వంశమున 1856 ఏప్రియలు 19-వ తేదీని జననమయ్యెను. అచ్చట మతసంఘములలో సుప్రసిద్ధుఁడైన చార్లసుకుగ్లరు ఈమె జనకుఁడు; దైవభక్తిపరురాలగు హారియటు ఈమె జనని. కుగ్లరుదంపతులు తమపిల్లలనందఱి నెంతో జాగరూకతతోఁ బెంచిరి. వివేకవతియగు అన్నాబాల ఇంటిపనులందును, తమ్ములను చెల్లెండ్రను బెంచుటయందును తల్లికి మిక్కిలి తోడ్పడుచువచ్చెను. ఈకుగ్లరుకుటుంబములోని పిల్లలు తమ గ్రామపాఠశాలలోఁ జదివి పెద్దచదువులకు ఫిలడెల్ఫియానగరమందలి విద్యాలయములకుఁ జనుచుందురు. మతబోధకురాలుగఁ దనజీవితము గడపవలెనని అన్నా చిన్ననాఁడే మనోనిశ్చయముచేసికొని దానికి సహాయభూతముగ నుండునట్టి వైద్యవిద్యనభ్యసింప మొదలుపెట్టి తన పందొమ్మిదవయేట ఫిలడెల్ఫియావైద్యకళాశాలలో ప్రవేశపరీక్ష నిచ్చెను. 1870-వ సం॥ మార్చినెలలో ఈబాల వైద్యవిద్యయందు పట్టపరీక్షలో నుత్తీర్ణయై ఆశీతకాలమున కళాశాల వైద్యాలయములో పనిచేసెను. అంత తనతాలూకాలోని నారిసుటవునులో నూతనముగ స్థాపితమైన ఉన్మాద వైద్యాలయమున నీసుదతి సహాయవైద్యురాలై రెండుసంవత్సరములు గడపెను. రోగులను దయార్ద్రహృదయమునఁ గనిపెట్టి వారి కృతజ్ఞతకు పాత్రురాలైన ఈవనితను జూచి ఇట్టి వైద్యశాలలలో స్త్రీలను వైద్యురాండ్రుగ నియమించుట శ్రేయమని అచటిజనులు గ్రహించిరి.



కీ. శే. డాక్టరు కుగ్లరుకాంత

స్వదేశమున మంచియుద్యోగమునఁ బ్రవేశించి, తానిట్లు హాయిగ దినములుగడుపుచుఁ గూర్చుండుట డాక్టరు కుగ్లరున కభిమతముగాదు. లోకోద్ధరణకార్యములఁ బాల్గొని అందుమూలమున ధన్యతనొందవలెనని ఆమానిని మనస్సున సంకల్పించుకొనెను. దూరపు హిందూదేశమున గుంటూరునగరమున క్రైస్తవమత సంఘమువారి బాలికాపాఠశాలలో నుపాధ్యాయినీపదము తనకిచ్చెదననఁగా ఇదియె తనకర్తవ్యమునకు దారి చూపెడి యీశ్వరాదేశమని గ్రహించి దానిని స్వీకరించి తానెచటనుండినను దయామయుఁడగు పరమేశ్వరుఁడు తన నొకకంటఁ జూచుచుండునను గాఢవిశ్వాసమున అయబల పదివేలమైళ్లదూరమందలి భారతదేశమునకుఁ బ్రయాణమయ్యెను. తల్లియొద్దను, తోఁబుట్టువులు మిత్రులయొద్దను సెలవుగైకొని యాకాంతారత్నము 1883 ఆగష్టు 25-వ తేదీని "బ్రిటీషుప్రభువు" అను పొగయోడలో బయలుదేరెను. ఓడలో నీమె సహవాసులు గుంటూరుమండలములో మతగురువులుగనుండిన డాక్టరు ఉనాంగెస్టు, వుల్ఫుగార్లును, వారి కుటుంబములోనివారును.

1883 అక్టోబరు నెలలో డాక్టరు కుగ్లరు చెన్నపురి చేరెను. ఆ కాలమున నిప్పటివలె హిందూదేశమున ప్రయాణసౌకర్యము లంతగ లేవు. చెన్నపురినుండి బయలుదేరి బకింగుహాము కాలువలో పడవలమీఁద పదునాల్గుదినములు ప్రయాణము చేసి ఈమె నవంబరు 29-వ తేదిని గుంటూరు చేరెను. భారతీయులే స్వజనులుగను, వారి కష్టసుఖములే సొంతమైనవిగను భావించుకొని ఏబదిసంవత్సరములు కుగ్లరుసతివలెనే గుంటూరుపురమున నివసించి యిటీవలనే స్వదేశమునకు వెడలిపోయిన అమెరికను లూథరనుమతగురువగు డాక్టరు ఊలుదొర అప్పు డానారీరత్నమునకు స్వాగత మొసంగెను.

గుంటూరు చేరినతోడనే డాక్టరు కుగ్లరు వైద్యదీక్షను పూర్తిగ స్వీకరింప వలనుపడకుండెను. గుంటూరు పురమం దామె కపు డీయఁబడినపని బాలికాపాఠశాలయందును, జనానాస్త్రీలకును విద్య నేర్పుటయె. ఐనను శీఘ్రకాలములోనే డాక్టరు కుగ్లరు జనులకు వైద్యముచేయుటకు వలయు వసతులను గల్పించుకొనెను. 1884-వ సంవత్సరమునం దీమె తాను బసయుండు జనానాగృహమున కొందఱు రోగులకును, వారివారి యిండ్లకడ గొందఱికిని వైద్యముచేసెను. ఈపద్ధతి బాగుగ లేదని యిచటి క్రైస్తవమతగురువులు తమలో తాము చందాలు వేసికొని కొంతసొమ్ము గూర్చి భారతదేశపు స్త్రీల యుపయోగార్థమై వైద్యసాహాయ్యమును చేయింపుఁడని అమెరికా మతసంఘము వారిని కోరిరి. దీని ఫలితమేమనఁగా 1885వ-సంవత్సరమున డాక్టరు కుగ్లరు వైద్యగురువుగ నియమింపబడెను. ఆమె కాపురముండిన ఇంట తడికలతో నొకగది యమర్పఁబడెను. అందు రోగులకు మందులీయఁబడుచుండెను. అంత శ్రీ వింజమూరి భావనాచార్యులవారి వాక్సహాయమువలన 1886-వ సం॥ ఆగస్టు నెలలో అద్దె కొకయిల్లు పుచ్చుకొని డాక్టరు కుగ్లరు వైద్యశాల నచట స్థాపించెను.

ఆ కాలమందు పూర్వాచారపరాయణులగు హిందువులు క్రైస్తవులు పెట్టిన వైద్యాలయములకుఁబోయి మందుపుచ్చుకొనుట కెంతో సంకోచించుచుండిరి. డాక్టరు కుగ్లరు చేతినీరు త్రాగనొల్లక బ్రాహ్మణవితంతువులు వైద్యశాలకు తమయిండ్లనుండి మంచినీరు తెచ్చుకొని మందుపొడుము నందు గలుపుకొని పుచ్చుకొనుచుండిరి. ఈబాధపడనొల్లక తమకు మాత్రరూపముననే మందీయుఁడని కొందఱు కోరుచుందురు. అందఱిని ప్రేమించి డాక్టరు కుగ్లరు వారలకు మంచిమందులిచ్చుచు కాలక్రమమున వారికి స్నేహితురాలయ్యెను.

1889-వ సం॥ డాక్టరు కుగ్లరు అమెరికాపోయి అచటి జనులను హిందూదేశీయులకు వైద్యవిషయమున సాయముచేయుఁడని వేడెను. ఈమె తిరిగి భారతదేశము వచ్చునప్పటికి స్త్రీవైద్యాలయనిర్మాణమునకు $17\frac{1}{2}$ యకరముల స్థలము గుంటూరు క్రైస్తవమతసంఘము వారు సంపాదించిరి. 1892-వ సంవత్సరమం దచట వైద్యాలయమునకు శంకుస్థాపనము జరిగెను. 1893-వ సంవత్సరమున బైటిరోగులకు మందులిచ్చుగృహమును, 1897-వ సంవత్సరమున రోగులు నివసించుటకు వసతిగల వైద్యాలయమును తెరువఁబడెను. ఈ వైద్యశాల దినదినాభివృద్ధిగాంచి రోగులకును చికిత్సకులకును సకలసౌకర్యములుగల విశాలభవనములతో నిపుడు విరాజిల్లుచున్నది. దక్షిణహిందూదేశమునఁగల గొప్పవైద్యాలయములలో నిది యొకటి.

ఈ వైద్యశాలలోఁజేరి ఆంధ్రదేశమం దన్నిదిశలనుండియును వచ్చిన స్త్రీలు శిశువులును తమ రోగనివారణము గావించుకొనుచున్నారు. ఈ ప్రాంతములందు ఒక్కొకకుటుంబమున మూఁడునాలుగుతరముల వారికి డాక్టరు కుగ్లరె వైద్యముచేసియుండెను. వైద్యాలయోత్పత్తికిని, అభ్యున్నతికిని కుగ్లరుసతి ముఖ్యకారణముగావున "కుగ్లరు వైద్యశాల" యనియే జనులు దీనిని వ్యవహరించుచున్నారు. కుగ్లరె యీసంస్థకుఁ బ్రాణము. ఆపత్కాలమునఁ దనయొద్దకేతెంచిన రోగులకెల్లరకును ధనికులు దరిద్రులను విభేదము లెంచక కుగ్లరుకాంత కృపతో వ్యాధి నివారణముఁ జేయుచుండును. ఆమె వైద్యమనిన నందఱికిని నమ్మకమే! తమయెడ నపారప్రేమను చూపుచుండెడి యా తల్లిని "పెద్దమ్మ" యని జనులు చెప్పుకొనుచుందురు.

గుంటూరునందలి "స్త్రీ, శిశువైద్యాలయము"న కింత ప్రఖ్యాతి గొనివచ్చి, అపరధన్వంత్రియను పేరు వడసిన కుర్లరుకాంత యింతటి ధన్యచరితయగుటయందలి రహస్యమేమి? ఈ సుదతీరత్నమునకుఁగల యపార దయయు, ధర్మకార్యనిరతియును ఈమె విజయమునకు ముఖ్యకారణములు. ఈ పుణ్యవతి మనమునందలి కృపావాహిని యెట్టి ప్రతిబంధములునులేక ప్రవహింపుచుండును. ఈమె వైద్యాలయమున ధనికులు దరిద్రులు గొప్పవారు కొద్దివారుఅను వివక్షలేక యందఱును సరిసమానమైన యాదరమునకుఁ బాత్రులగుచుందురు. జనుల నింతగ నాకర్షించినది వైద్యురాలి శక్తిసైపుణ్యములకంటె ఆమె యపారకారుణ్యమెయనుట సమంజసము. ఎల్లరకును కుర్లరుకాంత అపరదైవముగనుండెను. ఆమహనీయురాలందఱికిని ప్రేమాస్పదయగు పూజ్యురాలు. ఆమె హస్తము అమృతహస్తము; వాక్కు మధురవాక్కు; క్రీస్తుమహాశయుఁడు బోధించిన యున్నతమత ధర్మముల కీపుణ్యశీల ప్రవర్తనము ప్రబలతార్కాణమని యందఱు విశ్వసించియుండిరి.

బాలప్రాయముననె వేలకొలఁదిమైళ్లు దూరముననున్న భారతభూమి కామెను ప్రయాణము కట్టించిన యాపుణ్యవతి ధీరతయు, పరులకష్టములను దొలఁగింప స్వసౌఖ్యమును విడనాడిన యామహాస్వార్థత్యాగమును, ఆపన్నులను సదా యాదరింపఁజూచెడి యాదయార్ద్రబుద్ధియు, సత్కార్యాచరణమునందే యాశ్వానుభవము గనుచుండెడి యాభక్తివిశేషమును కుర్లరుకాంత మహాప్రతిభావంతురాలని వేనోళ్ల చాటుచున్నవి. ఇట్టి యుత్తమురాలు మృతినొందియు సజీవిగనె పరిగణింపఁబడును. ఈ సుశీలచే స్థాపింపఁబడిన వైద్యాలయాభివృద్ధికిఁ దోడుపడి ఏతన్మూలమున కీ. శే. డాక్టరు కుర్లరుగారియెడల తమకుఁగల కృతజ్ఞతను వెలిపుచ్చి కృతకృత్యులయ్యెదరు గాకయని ఆంధ్రమహాజనులను హెచ్చరించుచున్నాను.

# ఝాన్సిలక్ష్మిబాయి

శ్రీమతి వెలువోలు వసంతాదేవిగారు

కురియింపరేల ? మీకుసుమసర్వస్వమ్ము స్వర్గసామ్రాజ్యవృక్షమ్ములార!
వెలయింపరేల ? మీలలితజయధ్వానభారముల్ కాహళీభేరులార!
వెదజల్లరేల ? మీహృదయపూర్వసుభక్తి సర్వచరాచరసమితులార!
ఎగఁబట్టరేల ? మీసొగసుబంగరుపుటల్ రహి భారతీచరిత్రమ్ములార!

ఇంక మీకతోధికమహోత్కృష్టమైన
రమ్యసుముహూర్తకాలంబు రాదు రాదు;
అదిగొ ! ఝాన్సిలక్ష్మిబాయి యరుగుదెంచి
దుముకుచున్నది యుద్ధరంగమున కిపుడె.

# గురుశిష్యసంవాదము

కూచి నరసింహముగారు బి. యె.

శి:—నమస్కారము! తమరు రమ్మని నాకు వర్తమానమంపినారఁట, యేల?

గు:—శీఘ్రాయురస్తు! కూరుచుండుము. 'భారతీ'సేవకువలెనే నాకు నీవు 'లక్ష్మి' సేవకుఁగూడఁ దోడ్పడుదువేమోయని.

శి:—ఎట్లు? ఏవిషయమున?

గు:—'గృహలక్ష్మి' పత్రికవారొక వ్యాసము వ్రాసి పంపుఁడని నాకొకజాబు వ్రాసినారు. యథావకాశముగా నొక "గురుశిష్యసంవాదము" ముందువ్రాసి పంపెదనని నేను వారికి మరల వ్రాసినాను. కాని యఱువదియైదవయేఁడు రాఁబోవుచున్న నావంటివానికి అన్నమాట వెంటనే చెల్లించుకొనుట మంచిదని తరువాతఁదోఁచినది.

శి:—వ్యాసమునకు నాసాహాయ్యమేల? మీరొకరే వ్రాసిపంపవచ్చును!

గు:—వ్యాసమునకొకఁడుచాలునుగాని వాదమునకుఁ గనీసమిద్దఱైనఁ గావలయుఁగదా? వ్రాసిపంపెదనని నే మాటయిచ్చినది సంవాదము గాని వ్యాసము గాదు.

శి:—సరే! అట్లే కానిండు. ఇంతవఱకు జరిగిన సంవాదములు శిష్యప్రేరణమువలన జరిగినవి. ఈ సంవాదము గురుప్రేరణమున జరుగనున్నది. ఎత్తుకొనవలయు విషయమేది?

గు:—'గృహలక్ష్మి' స్త్రీజనాభ్యుదయాభివృద్ధికై ప్రకటింపఁబడుచున్న చక్కనిపత్రిక. అందుచేత మన విషయముకూడ స్త్రీజనోపయోగకరమైనదిగానే యుండుట మంచిది.

శి:—ఏదేశములో స్త్రీలు గౌరవింపఁబడి సంతోషముతో మెలగుచుందురో ఆదేశము శారదేందిరలకు సంచారస్థానమై సర్వసంపత్సమృద్ధమై కలకలలాడు చుండునని గ్రంథములు చెప్పుచున్నవి.

గు:—ఔ నామాట సత్యమే. కాంతలకు విద్యాగౌరవములు కొఱఁతగా నుండుట మనదేశదుర్దశకుఁ గల కారణములలో నొకటి.

శి:—దేశము దుర్దశలో నుండుట నిజమేకాని స్త్రీలు విద్యాగౌరవవిహీనలై యున్నారను మాట మాత్రము వివాదాస్పదము. ఇప్పుడు భారతదేశస్త్రీలలోఁ గవితావిశారదలున్నారు. పాండితీబిరుదాంచితలున్నారు. వివిధపరిపాలనాశాఖలలోఁ బ్రవేశించి వన్నెయు వాసియుఁగాంచుచున్నవారున్నారు. దేశభక్తిలో స్వార్థపరిత్యాగములో కష్టసహనములో శౌర్యసంపత్తిలో మేము పురుషులకుఁ దీసిపోము—అని క్రియారూపమునఁజూపి ప్రజాప్రశంసాపాత్రములగుచున్న మహనీయలున్నారు.

గు:—ఎప్పటినుండియున్నారు? ఎంతమందియున్నారు? ఈ మనయజ్ఞానభూయిష్ఠప్రజాక్షారాంబుధి పదిగుప్పిళ్ల పంచదారతో తియ్యపడఁగలదా? ఇప్పుడున్న విదుషీమణుల సంఖ్య యెంతగనో పెరిఁగినఁగాని కుదికిలఁబడియున్న మన భారతమాత మరలలేచి తలయెత్తఁజాలదు. మొన్న మొన్నటివఱకు మన స్త్రీలకు విద్యాగంధమేలేదు. స్త్రీలకు విద్యగఱపుట తప్పు, అనర్థకారి—అన్నరోజుల మాట లింకను చెవులలో మ్రోఁగుచునేయున్నవి, విస్మృతిలోఁబడలేదు.

శి:—కాని—మనలోమనమాట—స్త్రీవిద్యయెంతమాత్రము క్షేమకరము గాదనియే మీయభిప్రాయమా? బడిచదువువలనఁ జెడిపోయిన పడఁతులు లేరా?

మద్రాసు సేవాసదనము



లేసు అల్లిక తరగతి

గు:—పురుషులలో నున్నట్లే కొందఱుండవచ్చును. విద్యావంతులైన మగవారిలో—లంచములుదిను నుద్యోగులు, అసత్యవాదులగు నధికారులు, కచ్ఛశుద్ధిలేని కళావిదులు, నీతిలేనిపండితులు—ఎందఱున్నారో యెఱుఁగవా? ఆదోషము నీవు విద్యకారోపింతువా? అది దుష్ప్రకృతిమూలక మందువా? జ్ఞానము దుర్వినియోగము చేసినచో ననర్థకారియగును, సద్వినియోగముచేసినచో సర్వసౌఖ్యప్రదాయియగును. ఈ మాట స్త్రీపురుషు లుభయులపట్లును సమానముగానే వర్తించును. మగవారి కుపయోగించు విద్యలు విశిష్టముగా మగువల కేహానియును జేయవు. దురుపయోగముచే ధనాదులు మాత్రము కీడుచేయవా? ఆకారణమున నర్థోపార్జనము మానుకొన్న వారెందఱున్నారు? అజీర్ణభయముచే నన్నత్యాగముచేసిన వారెందఱున్నారు? ఎప్పుడో చేయి తెగవచ్చునని కత్తిపీఁట వాడుకొనక వదలిపెట్టిన కాంతలెందఱున్నారు?

శి:—కావునఁబురుషుఁడు నేర్చుకొను విద్యలన్నియు స్త్రీ నేర్చుకొనవచ్చుననియే మీయభిప్రాయమైనట్టు మాపట్టుచున్నది.

గు:—ఏవిద్యాభ్యసనార్హతానర్హతలైనను దేహారోగ్యపాటవములఁబట్టి, బుద్ధిసూక్ష్మతను బట్టి, సంస్కారబలమునుబట్టి, అభిరుచులస్వభావతీవ్రతలఁబట్టి నిర్ణయింపవలయునుగాని స్త్రీపురుష భేదమును బట్టిగాదు.

శి:—అశ్వైన నశ్వారోహణమల్లవిద్యాధనుర్విద్యాదులు తరుణులు యథేష్టముగా నభ్యసింపవచ్చునా?

గు:—చిక్కుప్రశ్నలు వేసినన్ను "చిత్తా" చేయఁ జూచుచున్నావు కాఁబోలు! తురగారోహణప్రవీణలగు సరోజాక్షులును, బరువుబండి గుండెపైనుండి పోనిచ్చుకొని యద్భుతశరీరసత్త్వముఁజూపు నలరుఁబోండ్లును, సజ్యచాపహస్తలై సమరములో శత్రుల ఢీకొనఁగల సత్యభామలును గొందఱున్నప్పటికిని—సహజశరీరనిర్మాణపాటవములలో స్త్రీపురుషులకు భేదములేదని చెప్పినేఁ బ్రౌఢవాదము చేయువాఁడనుగాను.

శి:—ఆభేదము గణనీయమైన భేదముగాదా?

గు:—వాయువేగమనోవేగములతోఁబోవు రెయిలుమోటరుబండ్లును ఆకాశయానములును గల కాలములో, చంటిపిల్లవానిచేఁ గూడఁ జిటుకలో శత్రుశతములను శలభములవలెఁ జంపింపఁగల యంత్రపుఫిరంగులుగల యీ రోజులలో మోటుబలమంత గణనీయముగాదని నేననుకొనుచున్నాను. పౌరుషము మనోనిష్ఠమైన ధర్మముగాని శరీరనిష్ఠముగాదు. నేఁటిపరిస్థితులు పరికించినచో శౌర్యధైర్యసాహససంపత్తిలోఁ బురుషులను మించు స్త్రీలున్నారని నీవు సులభముగా గ్రహించుకొనఁగలవు. అవసరమువచ్చునెడల నంగనలు దేనికిని వెనుదీయరు. కనుక శరీరములోఁ గానిపించు స్త్రీపుంసభేదము మనోనిర్మితిలో లేదని నీవు రూఢిగానమ్మవచ్చును.

శి:—మీరు చెప్పిన మాటలు నిజమేకాని ఆరోగ్యజవసత్త్వములలో మనస్త్రీ లన్యస్త్రీలకంటె నెందుచేతనో లొచ్చుగాఁ గాన్పించుచున్నారు.

గు:—పురుషుల యవస్థయునట్లేయున్నది! దాని కతిబాల్యవివాహములు ప్రధానకారణములు. ఇతరదేశీయ బాలికలట్లు చదువులలోఁబడి యాడుచుపాడుచు నింగిపై నెగురుపతంగములవలెఁ జిత్తోల్లాసముతో నుండవలయు చిఱుప్రాయముననఁ బిల్లలకుఁ బెండ్లి సంకెలలు, పదుమూడవయేటఁ బ్రసవకష్టమును మాతృత్వప్రాప్తియును, కానుపుపైఁ గాన్పువలనఁ బసితనములో వార్ధకచిహ్నములు, గర్భసంబంధవ్యాధులు, అకాలమృత్యువు—ఈయనర్థములు మనదేశములో మిక్కుటముగాఁ గన్పట్టుచున్నవి.

శి:—ఔను. వీనివలన విద్యానష్టమేకాక యారోగ్యనష్టప్రాణనష్టములుకూడ సంభవించుచున్నవి.

గు:—అంతేకాదు; నానాఁటికి హిందూజాతి యల్పాయుష్క జాతియు నిస్సత్వనిర్వీర్యజాతియు నగుచుండుట కీబాల్యవివాహములే ప్రబలహేతువులు. అపరిపాకవయిస్కులగు పదుమూఁడేండ్ల బాలికకును పదునేనేండ్ల బాలకునకును గలుగు శిశువు అంగుష్ఠప్రమాణార్భకుఁడుగాక ఆజానుబాహువుగాఁ బెరుఁగు శిశువెట్లు కాఁగలఁడు? అట్టి విద్యావిహీనపుఁదల్లి పోషణమున నుండవలయు బిడ్డఁడు మందబుద్ధియు భీరువును గాక మేధావియు శూరుఁడును నెట్లు కాఁగలఁడు?

శి:—బాల్యవివాహములఁ బ్రతిషేధించుచు మొన్న గావింపఁబడిన పెండ్లిచట్టము మంచిదిగాదని కొందఱు పెద్దలేలఘోష చేసినారో నాకెఱుక పడకున్నది!

గు:—శారీరారోగ్యశాస్త్రమర్యాదావిధులెట్లున్నను చట్టము ధర్మశాస్త్రమునకు విరుద్ధమనియుఁ బితృదేవతల యుత్తరగతులకుఁ బ్రతిబంధకమనియు మనహిందువులలోఁ గొందఱు వాదించినారు; మంచికిఁగానిండు చెడ్డకుఁగానిండు ప్రభుత్వమువారు మతవిషయములలోఁ బ్రవేశపెట్టఁగూడదని కొందఱుచెప్పినారు. బాలవితంతుబాధ పోఁగొట్టుట శాసనముయొక్క ముఖ్యోద్దేశము. మాఖురానులో వితంతూద్వాహమున కనుజ్ఞగలదు కాన బాల్యవివాహములు మాకు సెబ్బరచేయఁజాలవు—అని కొందఱు మహమ్మదీయులు చెప్పినారు.

శి:—వారట్లు చెప్పినారు, వీరిట్లుచెప్పినారు—అని గోడమీదిపిల్లివాటముగాఁ దప్పించుకొనఁజూడకుండ ఈవిషయమున మీయభిప్రాయమేమో సువిస్పష్టముగా సెలవిండు.

గు:—నాయనా! వస్తువునకు నీడవలె నెట్టిసదర్థమునకైనను ఆనుషంగికముగావచ్చు నన్నర్థమంతో యింతో యుండకమానదు. దుర్వినియుక్తమైన విద్యవలన విపరీతఫలము సిద్ధించునని యిప్పుడేకాదా యనుకొన్నాము. ప్రౌఢావివాహములవలనఁ దటస్థించు చిక్కులు కొన్నియుండవచ్చును; కాని యవి యతిబాల్యవివాహములచేవచ్చుచున్న మహావిపత్తులతోఁ బోల్చిచూచినచో అద్రులయెదుట నణువులవలె నెంతమాత్రము పరిగణింపవలయుకష్టములుగాఁ గానిపింపవు.

శి:—కనుకఁ గన్యలను యుక్తవయస్సువచ్చువఱకు నట్టేపెట్టి పిమ్మట పరిణయముగావించుటయే కర్తవ్యమని తేలినది.

గు:—ఆ! ముమ్మాటికినట్లే! పరిణయవాంఛ హృదయములలో నంకురింపకముందు పరిణీతులబాధ్యతలు చక్కగా మనసులకెక్కకముందు పెద్దలముద్దుకై ముక్కపచ్చలాఅని చిన్నపిల్లలకుఁ జేయుపెండ్లి క్రీడాప్రాయమైన బొమ్మలపెండ్లిగాని శ్రేయోదాయకమైనపెండ్లి గాదు.

శి:—ఆరోగ్యశాస్త్రమర్యాదానుసారులై సానురాగసంసారకార్యనిర్వహణమునకు సర్వవిధముల ననుకూలములగు యుక్తవయోవివాహములు కూడవని కొందరైన నేలచెప్పవలెను?

గు:—చిరకాలమునుండి ప్రచారములోనుండుటచే నలవాటుపడిన యాచారవ్యవహారములుమాని తద్వ్యతిరిక్తములగు క్రొత్తవానినవలంబించుట మనసున కెంతోకష్టముగా నుండును. అది సామాన్యమానవప్రకృతి.

శి:—రజస్వలావివాహములు బ్రాహ్మణులకుఁ గూడనివిగాని కాఁపులకుఁ గానివికావుగదా. అట్టిచో శూద్రులు పరంపరగావచ్చు తమయాచారములు మానుకొని బ్రాహ్మణుల ననుకరించి బాల్యవివాహములు చేయుచున్నా రదెందుచేత?

గు:—కులముచేఁగాని విద్యావిత్తాధికారాదులచేఁగాని తమకంటె నధికులగువారి నడవడి నవలంబించి నడవఁజూచుటయును బ్రజాసామాన్యప్రకృతియే కనుక గొప్పవారెప్పుడును దమప్రవర్తనములో బహుజాగ

రూకులై యుండి యన్నివిషయములలోను లోకులకు సచ్చర్యాప్రదర్శనమే కావించుచుండవలయును. అట్లు చేయనిచోఁ బెక్కనర్థములు సంభవించును — అని పెద్దలు చెప్పుదురు. చూచుసదాచారములు సులభముగాఁ బట్టుపడవుగాని దురాచారము లిట్టెయనుకరింప వీలుగానుండును. గురువుగారిబుద్ధియు శీలమును శిష్యులు సంపాదించుకొనుట కష్టముగాని ఆయన వంకరనడకయు, ముక్కుమాటలును, నస్యాభ్యాసమును సంగ్రహించుటతి సుకరము. ఆంగ్లేయుల వ్యవహారనైపుణి, పట్టుదల, దూరదృష్టి, సకాలసక్రమ కార్యనిర్వాహదక్షత — ఇవి మనకంటుటలేదుగాని వారి కాఫీ తేనీళ్ల త్రాగుడులు, వారి పగాయికోటులనీటులు, వారి మెడపట్టీల బెడఁగులు, వారిబూట్ల మిసమిసలు, వారి వసారాటోపీలు, ఎడమచేతిగోళ్లు కొఱుకుకొనుట, నాలికతో నాకి యుత్తరపు సంచులు జిగురుబిళ్లలును అంటించుకొనుటలు — ఇట్టులెన్నియో మన కలవడినవి. ఆరీతిగానే బ్రాహ్మణుల నిత్యస్నానము ఆహారశుద్ధి మున్నగు సల్లక్షణములు శూద్రుల కలవడుట కష్టముగానున్నదిగాని కన్నులుదెఱవని కూనలకుఁ బెండ్లి చేయుదురాచారముమాత్ర మిట్టేపట్టువడినది.

శి:— మనదేశమువంటి యుష్ణప్రదేశములలో వివాహవాంఛ లేఁతవయసుననే జనించుచుగానఁ బెండ్లిండ్లు పిన్నవయసులోనే కావింపవలెనుఅని కొందఱనుచున్నారు. దానికి మీరేమందురు?

గు:— కామోదయమగువయసు కొంతవఱకు శీతోష్ణస్థితినిబట్టి యుండుననుమాట కేవల మసత్యము గాదు; కాని యది అతిబాల్యవివాహావశ్యకతను స్థాపింపజాలునంత బలముగల సత్యముమాత్రముగాదు. యుక్త కాలమునకుఁబూర్వమే కామోద్రేకముగలుగుటకు యదార్థమైన ప్రబలహేతువులు కొన్నియున్నవి.

శి:— అవి యేవి?

గు:— అవేవో చెప్పకముందు కొన్నిసంగతు లుపోద్ఘాతముగాఁ జెప్పెదను విను: ఆహారనిద్రాకామములు పశువులకువలె మనుజులకును సహజముగానున్నవి. జ్ఞానవంతుఁడుగనుక మానవుఁడు వానిని నియతముగా సాగించుకొని నిపుణముగా జీవనము గడుపుకొనవలెను. కాని సామాన్యముగా మనుష్యులు పామరులై భగవదత్తమైన తమబుద్ధిని దుర్వినియోగముచేసికొని కృత్రిమసాధనములచే విషయోపభోగముల నమితముగాఁ బెంచుకొని యిహపరముల రెంటికిని జెడి పశువులకంటెను అధములని యనిపించుకొనుచున్నారు.

శి:— అదెట్లు?

గు:— సహజావబోధప్రేరితములై యుక్తకాలమున యథోచితముగా క్షుత్పిపాసాకామశాంతులు గావించుకొని యంతటితోఁ దనివినొంది తమమనుగడ పశువులు సాగించుకొనుచుండగా మనము బుద్ధిచే ననేకదురుపాయకల్పనములు గావించుకొనుచుఁ, దృప్తియనుమాటలేక, భోగములను — వానితోపాటు రోగములను — వృద్ధిచేసికొనుచు ననేకబాధ లనుభవించుచున్నాము. అందుచేత శరీరారోగ్యానుకూలములగు విషయసుఖములను మాత్రమే యనుభవించు పశ్వాదులు అతిభోగులగు మనుష్యులకంటె నీతిమంతములు, సుఖజీవులు — అని చెప్పవలసివచ్చుచున్నది. ఆత్మసంయమమువలనఁ గలుగు పరమార్థసుఖముమాటయే మఱచి మనమంతకంతకు బాడగుచున్నాము — అని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు.

శి:— తత్త్వోపదేశప్రవాహములోఁ బడి కొట్టుకొనిపోకుండ ఈపాటికి గట్టెక్కి మనము మగల మన ప్రస్తుతవిషయమునకు వచ్చుట మంచిదని మనవిచేసికొనుచున్నాను.

గు:— నాయనా! తత్త్వోపదేశమన్న నీకంత తలనొప్పిగానున్నదా? పోనీ! నీయిష్టముప్రకారమే చేసెదను.

శి:— అకాలకామప్రేరకములైన యథార్థకారణములు సెలవిచ్చెదనని చెప్పినారు!

గు:— ఆమాత్రపుమతి భగవత్కృపవలన నింకను నిలచియున్నది. జ్ఞాపకావశ్యకతలేదు. భూపతన మాదిగాఁ బెండ్లిమాటలఁగూర్చి వినుట యొకమనహిందువులలోనే కాన్పించుచున్నదని మహాత్ముఁడు చెప్పినాఁడు.

శి:—నాకేమియు బోధపడుటలేదు.

గు:—ఎంతదగ్గఱగానున్నను మనముఖము మనకుఁ గాన్పింపనట్లు లెవరిదోషములు వారికి సులభముగా గోచరింపవు. బిడ్డ పుట్టుటతోనే “మీకల్లుఁడు గలిగినాఁడమ్మా! ఇదిగో మీకోడలు, చూడవే!” యను వేళాకోళపుఁ బెండ్లిమాటలకు మనవా రుపక్రమించుట మనకు నిత్యానుభవములో నున్నది. తరువాత శైశవ క్రీడలలో బొమ్మలపెండ్లిండ్లును, కొమ్మలు వియ్యాలందుటలును! ఈబాల్యసంస్కారము లూరకపోవు.

శి:—నిజమే.

గు:—మఱియు నీ క్రింది యితర హేతువులు కొన్నియున్నవి: నిత్యము గృహములో పిల్లలకు అనియంత్రితవిషయోపభోగప్రదర్శనము గావించు పెద్దల చర్యలును, కామవికారద్యోతకములగు పరిహాసవాక్యములును, లఘుప్రసంగములును. విద్యావ్యాసంగముచేయు వయస్సులో శశాంకవిజయము, హంసవింశతి, శుకసప్తతి ఇత్యాద్యసద్గ్రంథముల పరిచితి.

శి:—అయ్యో! ఆద్యంతములందుఁ జేర్కొనఁబడిన పుస్తకములు మహారసవంతములుగానుండునే!

గు:—ఔను! కాని ఆ కవితాలాలిత్యమే తియ్యని వాజీకరణలేహ్యమువలె యువజనుల కకాలానర్థకర కామోద్దీపనకారియగును. ఈ గ్రంథములవంటివే చిత్తవిక్షేపకారకములగు నాటకప్రదర్శనములును సినిమాలను చలప్రతిమాప్రదర్శనములును. ఈ మాట మహాత్ముఁడుగారే యొకచోటఁ జెప్పినారు.

శి:—మీవన్నియు విచిత్రపుమాటలు! ప్రపంచములోఁ బ్రజోత్పత్తి గావలయునా? దానికిఁ బ్రేరకముగాఁ గామసుఖముండవలెనా? పెండ్లిమాట చెవిని బడఁగూడని బూతుమాటయై, కడుపునిండఁ దినినఁ గామవికారములు గలుగుచో నిఁకీప్రపంచములో బ్రతుకుట యెట్లు? సుఖపడుటయెట్లు? అన్నియునుడిగి కాటికిఁ గాళ్లు సాఁచుకొనియున్నవారెన్ని శ్రీరంగనీతులైనఁ జెప్పవచ్చును.

గు:—శాంతింపుము! మొగ మెఱ్ఱచేసికొనకు! ఔను, కామసుఖము ప్రజోత్పాదనప్రేరకమే. యౌవనావిర్భావసమయమందు సహజముగా స్త్రీపురుషుల కన్యోన్యసంభోగవాంఛ యంకురింపక మానదు. దానికిఁ బ్రత్యేకప్రయత్నములును, జారత్వాకృత్యములు కన్నులఁగట్టినట్లు చిత్తాకర్షకముగా నభివర్ణించి చూపు గ్రంథములును అక్కఱలేదు. అకాలకామోద్రేకమును, అనుచితచిత్తప్రవృత్తులను అరికట్టుటకే సదుపదేశములును, సద్గ్రంథములును, సన్నియమములును గావలయును. అన్నముఁదినుమనియు నిద్రపొమ్మనియు నేగురువుఁ గఱప నక్కఱలేదు. అవి నైసర్గికశరీరధర్మములు. అకాలభుక్తి, అహితపదార్థభుక్తి, అమితభుక్తి కూడవు, హానికరములు—అని చెప్పుటకే సదుపదేశములు గావలెను. హితవాక్యములు సాధారణముగాఁ బ్రియవాక్యములుగావు గనుక నాపై నీకింత కోపమువచ్చినది.

శి:—సరి సరి! కోపములేదు గీపములేదు. పడుచుతనపుతొందర క్షమించి సంభాషణముసాగింపుఁడు.

గు:—ఆహారములోఁగూడ నతిజాగరూకత యావశ్యకము. మనము తఱచుగా నుపయోగించు మిరపకాయలు మున్నగు తీక్ష్ణపదార్థములు మనస్సులోఁ దీవ్రప్రవృత్తులు గలిగించుననియు, సాత్త్వికాహారము శ్రేయస్కరమనియు మనశ్శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇంకొకమాట! బ్రహ్మచర్యాభావమువలననే భారతభూమి కనేకాపాయములు సంభవించినవి, సంభవించుచున్నవి—అని పెద్దల యభిప్రాయము.

శి:—అటులైన స్త్రీలుగూడ వివాహములు చేసికొనకుండ నుండవచ్చునుగాఁబోలు!

గు:—ఏలయుండఁగూడదు? పెండ్లియాడి సంతానముఁగనుటయే స్త్రీపురుషులకుఁ బరమార్థముగాదు. అంతకంటె నధికతరములై ప్రశంసనీయములైన ప్రయోజనము లనేకములున్నవి. దీర్ఘరోగములతోను దుష్టరోగములతోను దీసికొనుచుండువారు, అంగవైకల్యముచేఁ గురూపులైనవారు, కటికి దరిద్రులు, ముదురువయ

స్సులలో భార్యాభర్తలఁ గోల్పోయిన పురుషులును స్త్రీలును— అవివాహితులుగానుండి, యుదారతరచిత్త ప్రవృత్తులతో దేశోపకారాది పూతకృత్యములకుఁ దమ దేహబల బుద్ధిబల నీతిబలములన్నియు ధారవోయుచు జీవమాత్రసలిపి, యంతమునఁ బరమేశ్వరసాన్నిధ్యమును బ్రాపించుట పరమోత్కృష్టమైన పని.

శి:—వారి కిహసుఖములేవి పాపము!

గు:—ఓయి వెఱ్ఱివాఁడా! వారివే నిజమైన సుఖములు! అహంమమకారములఁ ద్యజించి "పరోపకారార్థ మిదంశరీరం" అను నార్యోక్తి ననుసరించి పోవుచున్నామను నెఱుకవలనఁగలుగుతుష్టికిఁ దుల్యమైన యానందమింకొకటిలేదని యనుభవజ్ఞులుచెప్పుచున్నారు. అట్టి మహాత్ములకును, మహాత్మురాండ్రకును పామర జనదృష్టిని గష్టములైనవే సుఖములుగాఁ బరిణమించును; అట్లే కానిచో నెన్నికష్టములు వచ్చి పైఁబడు చున్నను సన్మార్గవర్తు లెప్పుడును దమ మార్గమునే యంటిపట్టుకొని వీడకుండుటకుఁదగిన హేతువగపడదు. జీర్ణ మనశ్శరీరములను నిత్యము పునఃపుష్టములఁజేయుటకుపయోగపడవలయు నన్నసారము నన్యథా తుచ్ఛశరీర సుఖాభాసములకై వ్యయించి దుర్బలసంతానముఁగని దేశమును నరకీటకసహస్రములతో నింపి తెచ్చిపెట్టు కొన్న శరీరదౌర్బల్యమనోదౌర్బల్యములతోఁ దాము కృశించి కృశించి చచ్చు స్త్రీ పురుషులకంటె నట్టి త్యాగ శీలురే ధన్యతరులును, సుఖవత్తరులును అని నీవు రూఢిగా నమ్మవచ్చును. ఇప్పటికిని తదితరులతోఁ బోల్చి చూచినయెడల యుక్తప్రవర్తనముగల వితంతువులకును విధురులకును ఆయురారోగ్యసుఖము లెంత యెక్కువగా నున్నవో పరిశీలించి చూడుము. అధఃపతనమొందియున్న మన దేశముయొక్క పునరుద్ధారణమహాకృత్యమునకు అకలంకబ్రహ్మచారులును, విశుద్ధబ్రహ్మచారిణులును అనేకులు గావలయును— అని శ్రీవివేకానంద స్వామివారు సెలవిచ్చినారు. మన దేశమున కిప్పు డర్థనీతిసంపత్తులు తక్కువగానున్నవి గాని అపత్యసంపత్తి కేమాత్రపు లోటును లేదు.

శి:—మంచిదే కాని, మనసుచలింపకుండ మనుష్యులు—అందులో స్త్రీలు — యావజ్జీవబ్రహ్మచర్య వ్రత మవలంబించి యుండఁగలరా?

గు:—ఉండలేకేమి? దిక్కులేని దీనబంధుజనమున కుపచారములు చేసి వారి ముప్పు గడుపుటకో, దేశ మాతృసేవచేయుటకో, మతబోధనవ్యాపనకృత్యములు సలుపుచు భగవత్సేవచేయుటకో, రుగ్ణులకు రోగోప శాంతి గావించి వారిని సుఖపెట్టుచు వారి యాశీర్వాదములఁగొనుచుఁ గాలముగడపుటకో రత్నములవంటి పాశ్చాత్యరమణు లెందఱో బుద్ధిపూర్వకముగా వివాహసౌఖ్యములు పరిత్యజించి, యేకాకినులై, తమ మను గడ చక్కఁగా సర్వజనస్తవనీయముగా సాగించుకొనుచున్నారు. యోగ్యతలో మనస్త్రీలు పాశ్చాత్యస్త్రీల కంటెఁ దక్కువవారందువా? వారికి సుసాధ్యమైన పరోపకారజీవనము వీరికేల సాధ్యముగాదు? ఇఁక నీమన శ్చాంచల్యప్రశ్నమునకు సదుత్తరమీయవలసియున్నది. తీవ్రమైనయభినివేశముతో, తదేకదీక్షతో, ఏసద్వ్యాపారములోనో పడి సదా మునుఁగుచుఁదేలుచు నుండువారికిఁ గామచింతలకుఁ దెఱపియుండదు. వివాహ వాంఛలు జనించుట కంతకంటె నవకాశముండదు. "మీరు పెండ్లి చేసుకొనరాదా?" అని జగద్విఖ్యాతిఁ గాంచిన చిత్రకళాభిజ్ఞుఁడగు మైకెయెల్ ఏంజెలో గారి నొకరడుగఁగా "నేను చేపట్టిన చిత్రకళాప్రేయసి యీర్ష్యాగ్రస్తురాలు! తనకు సవతిగా నెవతిని రానీయదు!" అని ప్రత్యుత్తర మిచ్చినాఁడట! సంవాద మతి దీర్ఘమాచున్నట్లున్నది. ఇఁకఁ జాలింతము.

శి:—చిత్తము! నమస్కారము!

గు:—శుభమస్తు! లోకాస్సమస్తా స్సుఖినోభవంతు!

# పెండ్లినాటి ప్రేమ

నరహరిశెట్టి వేంకటరత్నముగారు

ప్రేమించి పెండ్లిచేసికొను ప్రేయసీప్రేయసులు, పెండ్లిచేసికొని ప్రేమించు సతీపతులు—ఒకరి స్వేచ్ఛాజీవనము ప్రభాతప్రభాకాంతిలో పులకించి వలపులవిరజిమ్ము గులాబీ పువ్వు; రెండవవారి నియమితజీవితము కృత్రిమవిద్యుత్ప్రసారమున విచ్చినపూవు. ఒకటి కిలకిలనవ్వుచు గలగలప్రవహించే సెలయేరు; ఇంకొకటి కావలసిత్రవ్వించినకాలువ. తారతమ్యము చాలాగలదు తరచినకొలది.

ప్రణయమును ప్రోదిచేసికొనిన ప్రణయినీప్రణయశీలురు తమనవజీవనము నలరించిన ఆకర్షణము, Romance, మధురభావములు తరలిపోవకుండ కాపాడుకోవలెను. పెండ్లిచేసికొని ప్రేమింపనలవరచుకొనిన సతీపతులు ప్రేమబాంధవ్యమును గ్రహించి జీవితముల నానందశోభాప్రసన్నము చేసికొన యత్నించవలెను. ఒకరిజీవనము మానసికమైన ప్రేమానుభూతిలో విరిసి భౌతికానుబంధమున పరిమళించుచున్నది. ఇంకొకరిజీవితము భౌతికానుబంధమున కొనలువారి ప్రణయాత్మకమగు సుఖానందము నందవలసియున్నది. ప్రేమ అమూల్యము, అపూర్వమయిన ప్రవృత్తి. పూవుకన్న సుకుమారము. సాగరముకన్న గభీరము. దానిని భద్రపరచుకొనకపోయినచో నది లక్ష్మికంటె చంచలము.

ప్రేమ వసివాడకుండ పెంపొందింపజేసికొనుటకు అనేకరీతులు. ముఖ్యముగ—మానసికమైనప్రేమకును భౌతికములైన అనేకవిషయములకునుగల అవినాభావసంబంధము దంపతులు కలనైన మరచియుండరాదు. ఎచటనున్ననేమి, ఎటులున్ననేమి, ఏమిచేసిననేమియని కనులకుకనుపించని ప్రేమను అలక్ష్యముచేసినచో నదికూడ దంపతుల నలక్ష్యముచేయును. అంతియేకాదు. ప్రేమవిషయమున నెప్పుడును నొకేరీతి కొన్నిసూత్రములననుసరించి ప్రవర్తించుటయు కూడనిపని. ఒక్కవిషయము: ప్రేమ ఒకప్పుడు సమీపముననున్న సతీపతుల పలుకులలో, భావములలో వికసించును. అదియే మఱియొకప్పుడు వారొకరినొకరు ఎడబాసియున్నసమయాన ప్రభవించును. సొంపుగదిద్ది తీర్చికొనిన సతినికాంచిన నాటికన్న నిద్రితయై కేశములు గుత్తులుగుత్తులుగా శయ్యాపార్శ్వములబడి అలంకారములైన లేని సమయమునచూచి ప్రేమవశత మైమరచినపతి కలడు. పురుషుడు చక్కనిదువ్వలువలు ధరించి "బాగున్నదా అలంకారము? వంకలేమీలేవుకదూ?" అంటే "బాగానే ఉన్నారండీ!" అనినసతియే ఇంకొకప్పుడు "చుక్కబొట్టుపెట్టుకుంటే ఎంతో ముచ్చటగా ఉందిసుమండీ" అని పొలుపొంగినగతిపొంగు ప్రేమను విరియబోసినసమయమును కలదు. సతియెడ పతి, పతియెడ సతి ఎక్కువ బిగియబట్టుకొనికాని ఎక్కువ విచ్చలవిడిగాగాని వర్తిల్లుటకంటే స్వేచ్ఛగా, స్వభావసిద్ధముగా, విమలహృదయములతో ప్రవర్తించుట లెస్స. ఒకరికిష్టమైనపను లొకరుచేయుట; ఒక్కచో గ్రంథపఠనము; సంగీతము; ప్రకృతివైచిత్ర్యపరీక్ష; విజనభూముల, పచ్చికబయిళ్ళ వెన్నెలరాత్రులు విహరించుట—ఇవన్నియు ఆయాపరిస్థితుల

వారి ప్రకృతుల ననుసరించి ప్రణయాభ్యుదయమునకు, ఐక్యహృదయానందాతిశయమునకు కారణములగును.

పెండ్లినాటిప్రేమయొక్క బిగి కాలముగడచినకొలదియు సడలిపోవుట సాధారణముగ నందఱిదంపతుల జీవితములలో గాంచుచున్నవిషయము. ఇందుకు కారణము సతీపతుల లోపమగునేమోకాని మానవజీవితముయొక్కగాని ఏతన్నిర్మాతయొక్కగాని లోపము మాత్రముకాదు. ప్రారంభదినములలోని ప్రేమానుబంధమును దినదినము ప్రగాఢమొనరించు కొనుటకు ఉత్తమవిషయములేకాదు, చాల స్వల్పవిషయములుసయితము తోడ్పడగలవు. కూర యేమిచేయవలెనని సతి ఆలోచించుచున్నప్పుడు పతి ఆయాలోచనాచింతనమున సాయ పడుట, ఆమె వంటయింట పనిచేసికొనుచున్నప్పుడు తీరికగనున్న పతి ఆమెయొద్దగూరు చుండి సంతోషప్రదమైన సంభాషణచేయుట, పతినిగూర్చి సతి "ఏమండీ! తలదువ్వనా?" అనగా అతడు "నన్ను నీతలదువ్వనిస్తే, నాతల నిన్నుదువ్వనిస్తా" నని చిఱునగవుతోననుట, సంతకములేని యుత్తరము వ్రాసి కవరులోనుంచి "మీకు ఉత్తరమువచ్చింది. చూడండి." అనియిచ్చి చదివినపిమ్మట "కొద్దిరోజుల్లో మీరు తండ్రిఅవుతారనియేనా అందులోని విశేషం" అని శుభవార్తతెలుపు సతి మధురభాషణములు—ఇదంతయు మృదులోరు విలాసము. ఇట్టివి దంపతుల దైనికజీవితమునకు ఉత్తేజము, ఉజ్జీవము కలిగించును.

రంభయై, మాతృదేవియై, మంత్రియై ఆయాసమయములందు సతి పురుషునియెడ ప్రవర్తించవలెననిచెప్పి అంతటితో మానివేయుటకంటె పతి సతియెడ ప్రేమికునివలె, తండ్రి వలె, తల్లివలె, సోదరివలె, సోదరునివలె, చెలికత్తెవలె వర్తించవలెననుట ఉచితము, సరసము.

సంతానము కలుగుటతోడనే దాంపత్యసౌఖ్యము సన్నగిల్లునని, పెండ్లి పెద్దబండ వంటిదని కొందఱు వివేకమహితులుకానివారు విచిత్రవాదముచేయుట కలదు.

ప్రకృతిలో జంతువులు, పక్షులు, క్రిమికీటకాదులుసయితము దాంపత్యసౌఖ్యము ననుభవించుచున్నవి. మానవుడు ప్రకృతిసంతానమున నుత్తమజీవి కనుకనే అతడు ప్రేమా నందయోగి యగుచున్నాడు. మానసికమయిన ప్రేమానందము జంతువుల, పక్షుల, క్రిమికీట కాదులజీవితములందుశూన్యము. ఇదికూడామానవుడు సర్వజీవులలోఅత్యుత్తముడనుటకొక హేతువు. మానవుడు ఎక్కువ వివేకజ్ఞానములవల్లనైననేమి, బుద్ధిమాంద్యమువలననైననేమి పరమేశ్వరప్రసాదితమైన ప్రేమైకజీవితమును సరియైనతీరున గడపనేరక అందలి ప్రేమానంద మును, నిరవధికసుఖమును కోల్పోవుచున్నాడు. అత్యుత్తమజీవియైన మానవుని జీవనలోక మునకు ప్రేమయే సూర్యచంద్రతారకాగణము. సుషుప్తిలోతొలకరించు అద్వితీయానందము నితరసమయములలోగూడా ప్రసాదించునది ప్రేమయొక్కటియే.

కనుకనే ప్రేమనుకోల్పోయిన జీవనము నిర్జీవము; ప్రేమను వికసింపచేసికొను జీవ నము జీవకళలోవిరిసి విమలసుఖానందప్రభాసిత మగుచున్నది.

# మాలసుబ్బి బాష్పీజము

శ్రీమతి మరుపూరు వేంకటసుబ్బమ్మగారు

## ఒక టో రంగము

[రామాబాయమ్మ నీళ్లబిందె తీసికొని ప్రవేశించుచున్నది. ఆవైపుననే సుబ్బిఅను 18 ఏండ్ల మాలపిల్ల పోవుచున్నది.]

రామా:—దూరం! దూరం! మీదకొస్తావేం? కళ్లకు పొరలుగ్రమ్మినవా యేం?

సుబ్బి:—అమ్మా! మీ రెవరు! నాకుమీకు యెంతోదూరం ఉన్నదే. ఎందుకిలా అంటారమ్మా!

రామా:—ఓసీ! నే నెవ్వరైనది కనబడుటలేదా! నాకులమడుగుదానవు నీవా? దూరమైన నీచకులము దానవు,

సుబ్బి:—అమ్మా! నే దూరముగానడుచుటకు నాయందు దోషమేమి? నేను మీవంటిదానను గానా? ఏందులకమ్మా! మమ్ములచూచిన యీ నిరసనభావము? మమ్ముల ఏదేవుడు చేసినాడో మిమ్ము ఆదేవుడే



శ్రీమతి మరుపూరు వేంకటసుబ్బమ్మగారు

చేసినాడు. మీకు యెంత బుద్ధిజ్ఞానములున్నవో మాకు అంత వున్నవి. తల్లీ! ఎందుకిలా కోపపడెదరు? నాయందు యేనీచగుణము కనిపెట్టితిరి? మీలాటివారు ఇట్లు చూచుటచే మాబోటి అనాథలు క్రిష్టియనులలో కలుస్తున్నారు. భిన్నాభిప్రాయములతో నైకమత్యములేక మీమతము క్షీణించిపోతున్నదే! దానికైనా కంటతడిపెట్టరాదా?

రామా:—ఏమే! ఎక్లెట్లు! నీ మెట్టవేదాంతము లిక చాలింపు. నీబోటి మహాత్ములాంధ్రను చేరతీసిన మామత ముండునః లేనియెడల క్షీణించునా? ఏమిమాయలమారి మాటలు నేర్చితివే? గొడ్లుతిను చండాలురైనమీకుకూడ ఇంత తెలివా? ఎప్పుడు విననిమాటలాడుతున్నావు. ఇకచాలునడువు.

సుబ్బి:—అమ్మా! మీవంటివారు చేరదీసి యిటువంటి నీచకృత్యములు చేయవద్దని మందలించి మాకింత బ్రతుకు తెన్నుచూపిన యికనట్లు చేయుదుమా? మీరు మా జోక్యము కలిగించుకొనక యెచ్చటనో వూరిబయలున ఒకమారుమూల వుండమని మా ముఖముచూచిన పాపమని మీరనుకొనుట చేతనే మేము జీవనాధారములేక మనకు బ్రహ్మ లలాటమున వ్రాసిన విధియిదేకాబోలని గొడ్లనుభక్షించి వాటి చర్మము చెప్పులు మొదలగునవి చేసుకొని వాటిని మీలాటివారికి తక్కువమొత్తమునకు అమ్మి ఆడబ్బుతో క్షుద్బాధ తీర్చుకొనుచున్నాము. ఇందు మాదోషమేమున్నది? అలాటివి మంచివికావని చెప్పినచో మేము వినకున్న మమ్ము నిరసనభావముతో చూడవలెగాని ఇట్లు నిష్కారణముగా మమ్ములనిందించుట న్యాయమా?

రామా:—ఆహా! యేమి శ్రీరంగనీతులే! యెంతలేసినీతులుచెప్ప మొదలుపెట్టితివే! మీజన్మతోపుట్టిన నీచగుణముల ఒకరుచెప్పిన మానుదురా?

[ఇంతలో ఝాన్సీ బడికివెళ్లుచు, ప్రవేశము.]

ఝాన్సీ:—అక్కా! యేమిటీగోల? రోడ్డుపై మనుష్యులు వెళ్లకుండా చేస్తావాయేమి? అది యెక్కడనో అంతదూరములో నిలుచుకొనివుంటే దానితో నీకెందు కీతగవు? అధవా మనిషి నీకెదురుగావచ్చినదనుపో. నీవు తొలగివెళ్లిన లోపమేమి?

రామా:—చాలునమ్మా! మీకిష్టమైతే ఆనీచకులమువారిని నెత్తికెక్కించుకోండి. మీవున్న ఓర్పు నాకు లేదు. ఈకాలమువారి బుద్ధులన్నియు యిట్లామండిపోతున్నాయి. క్రిష్టియనుబళ్లలో యఫ్ఫే, బియ్యే చదువుతూ వారి సహవాసముచేస్తే ఈలాటిబుద్ధులు కాక మంచివివస్తవా? రామ! రామ! కాలమెట్టి కలికాలమోకదా!

ఝాన్సీ:—అంటే కోపమొస్తుందికాని యేమెడ్రాసునుంచో, బొంబాయినుంచో ఒక మాలవాడువచ్చి హోటలుపెట్టిన మనమగవారు పోయి అక్కడ కాఫీఫలహారము తీసుకోవడములేదా? సోడాషాపులో క్రిష్టియన్సు సోడాబుడ్డికొట్టియిచ్చిన తాగడము లేదా? తురకవాడు ఇచ్చిన తాగడము లేదా? ఇవన్నిరోజూరోజూ బావగారు, అన్నగారు పరమానందముతో చేసేవేకదా! యేమాలవాడో కలెక్టరుగానుంటే నౌకరీకొరకు వాని కాళ్లమీదపడి ప్రాధేయపడవచ్చును. ఇంతెందుకు మొన్న మాచెల్లెలికి జబ్బుచేస్తే అమెరికన్ ఆసుపత్రికి పోతే ఒక క్రిష్టియన్ నరుసువచ్చి మమ్ములను తాకి మందుయివ్వలేదా? దీనికంత మూఢత్వమేకారణము. అక్కా!

రామా:—చాలులేవమ్మా! వాళ్లనివీళ్లని ఒకటేచేస్తావా?

ఝాన్సీ:—అవునులే అక్కా! వారువీరు ఒకటెందుకవుతారు. ఈమాలవారే మతములోకలిసి కొద్దో గొప్పో చదువుకొని డాక్టరులుగావస్తేనో, లేక నర్సులుగావస్తేనో వారికి వంగివంగి సలాములుచేయవచ్చును. కాని ఇప్పుడైతే అంటుగాదూమరి?

[ఇంతలో బడిగంటవినబడును.]

ఝాన్సీ:—అక్కా! బడిటైమయింది. వెళ్లుతాను. దానితో నీకిష్టములేకపోతే చూచిచూడనట్టుపోవాలగాని తగవులుపెట్టుకొనికూర్చుంటే ఏమి మర్యాద.

[అంటూ ఝాన్సీ వెళ్లును.]

రామా:—అమ్మయ్య! ఇప్పటికి పెద్దలకు పంగనామాలు పెట్టేది బయలుదేరింది. ఎట్లాగయితేనేమి ఎఫ్ఫే చదువుతోంది. 19 యేండ్లున్నాయి. చిన్నా పెద్దా లేకుండా యింతవరకు చదువుతూవుంటే యిలాటి విపరీతపుబుద్ధులు కాక మరేమి పట్టుబడతాయి. [సుబ్బివంక చూచి] ఏమే యికనైన వెళ్లుతావా లేదా? నీ మూలాన యెంత ఆలస్యమైనదే! బిడ్డ యేడుస్తుందేమో?

సుబ్బి:—అమ్మా! మిమ్ములనడ్డుపెట్టవలెనని నాకుమాత్రముందా? మీరు అక్కడ నిల్చుంటే యింకొకళ్లు వచ్చి దారి తొలగమంటే మీ కెంత అవమానముగాఉంటుందో యోచించుకొండి [అంటూ ప్రక్కకు తొలగును.]

రామా:—యేమిటీ వేధవగోల?

[అంటూ ధుమధుమలాడుచూ యింటివైపు వెళ్లును. సుబ్బి తనపరాభవమును గురించి దుఃఖించుచూ వెళ్లును.]

## రెండోరంగము

[సుబ్బి దీనవదనముతో ఒకయింటిఅరుగుమీాద కూర్చొని ఉండును.]

సుబ్బి:—[తనలో] రేపు ఆదివారము బాప్టిజమిప్పించెదమని మిరియమ్మగారనుచున్నారు. క్రీస్తుమతమునందు నాకంతనమ్మకము లేదుకాని పొట్టకూటికై చేరవలసివచ్చుచున్నది. అనాడు ఆమె అన్న

మాటలు నా హృదయమున ములుకులవలె నాటుకొని ఈ తుచ్ఛజన్మ మేలవచ్చినదా అని చింతించుచుతూ ఈ దారిన వెళ్లుచున్న దేవుడంపిన దూతవలె నా పాలిటికి ఈ మిస్సమ్మ అగపడి పాఠశాలలు తెరచిన చేర్పించెద నని చెప్పినది. ఆవల డాక్టరుపరీక్షకు పంపెదనని చెప్పినది. దేవుని కటాక్షమువల్ల ఐదుసంవత్సరములుగడచి గట్టెక్కిన అదృష్టవంతురాలినే! మాబోటి దీనులకు పరోపకారము చేయుటకంటె యింకేమి కావలెను యీమిషనరీలకు.

## మూడోరంగము

[ఆరేండ్లు గడచినవి. అమెరికన్ ఆసుపత్రి. శామాబాయమ్మ పండుకొనియుండును. ప్రక్కన ఝూన్సీ, డాక్టరు కూర్చొని ఉందురు.]

డాక్టరు:—అమ్మా! యిప్పటికి మీ బాధ కొంత తగ్గినదని తలుస్తాను.

రామా:—తమ దయవల్ల యిప్పటికి కొంత తగ్గినది. ఇంటికి వెళ్లుటకు తమ సెలవుకొరకు నిరీక్షిస్తున్నాను.

డాక్టరు:—ఇప్పుడు తమరు లేచి తిరుగకూడదు. కాన, యింక పదిరోజులుదాక యింటికి వెళ్లుట మంచిదికాదు.

రామా:—డాక్టరుగారు నే వచ్చినప్పటినుంచి నాకొక సందేహముగానున్నది. తమరిని యెచ్చటనో చూచినట్లున్నది. తమ పేరేమమ్మా!

డాక్టరు:—అదేనాసందేహము? ఆనాడు తమచే అనరానిమాట లనిపించుకున్న సుబ్బిని కదా! యింతలోనే మరచితిరా? ఇదంతా మీ ధర్మమే!

రామా:—[పక్కమీదనుంచి త్రుళ్లిపడి] యేమి? అవును, ఈ మధ్య యెవరో మాలపల్లిలోనుంచి ఒకామె క్రిష్టియన్సులో కలసి చదువుకొను వెళ్లినట్లు విన్నాను. నీవేనా? చాలా సంతోషమమ్మా.

డాక్టరు:—అవునండి తమబోటివారంత మాపై బహిష్కారాయుధమును ఝళిపింతురు; కాననే మా స్థితి అధోగతి పాలగుచున్నది. ఆ మిరియమ్మకున్నకరుణ మీబోటివారలకు లేకపోయినందులకు చింతించుచున్నాను. ఆమె దయవల్లనే ఇప్పుడు నేను పదిపావులు తెచ్చుకొని గౌరవంగా బ్రతుకుతున్నా.

రామా:—నేనొక్కర్తెను యేమిచేయగలను సంఘమంత అలా ఘోషిస్తుంటే?

ఝూన్సీ:—అక్కా! నేనొక్కటి చెప్పుతా; ఎంతకాలము ప్రతివ్యక్తి మతమును, ప్రతిమానవుని శ్రేయమును సర్వజనమతముగను, సర్వజనశ్రేయముగను భావింపమో అంతకాలము హిందూదేశము బాగుపడుట దుస్తరము; సుఖదుఃఖములను హానివృద్ధులను పరస్పరము పంచుకొననిచో మన మెట్టి అభ్యుదయమునుగాని అధిష్టింపజాలము. అన్యోన్యకలహములు మొదలగునవియే ఆర్యావర్తప్రాచీనరాజ్యభ్రష్టతకు, దాస్యమునకును ప్రబలకారణములు. సోదరుల అంతఃకలహములే కటుంబముయొక్క అధికారమును, పలుకుబడిని, గౌరవమును నశింపజేయుచున్నవి. అన్యోన్యకలహమేకదా కురుపాండవులను, యాదవులనునశింపజేసినది? ప్రాణమానభంగకరమగు ఆఘోరవ్యాధియే మన ఆర్యావర్తజనుల పట్టి పీల్చి పిప్పిచేయుచున్నాది. అది యెప్పటికైన మనలను విడిచిపోవునో, లేక మన సౌఖ్యములను శాశ్వతదుఃఖకూపమున బడద్రోయునో తెలియకున్నది.

డాక్టరు:—ఇన్నియేల దీనికంతయు హిందువులకు విద్యాభావమే కారణము. మరియు పండితుల మూర్ఖత. మంచిగాని చెడ్డగాని బిడ్డస్వభావనిర్ణయమునకు తల్లియే బాధ్యతవహించును. బిడ్డలను బాగుచేసి వృద్ధికి తెచ్చునది, పాడుచేయునది తల్లియే. అట్టి తల్లికి విద్యాగంధమున్నచో దైవసమకాగలదు. బిడ్డకు ఆదినుండియే సమభావమును తల్లి గరపిన పవిత్రమైన హిందూమతము అనుదినము ఇట్లు క్షీణించిపోద. ఇప్పటి హిందూమతోద్ధారకులమనుకొను ఛాందసులు యీసూత్రమును గ్రహించిన దేశమాత ధన్యముకాగలదు!

# వివాహము: కొన్ని విషయములు

మల్లాడి పెరుమాళ్లయ్యగారు

వివాహము శుభకార్యముగా ఎంచబడుచున్నది. స్త్రీపురుషులకు తమ జీవితము లందు సుఖము గూర్చునది వివాహము. సంఘమునందు గల యువతీయువకులకు వివాహ మాడవలయుననెడు యభిలాష సహజము. పెండ్లిని గూర్చెడు తలంపులు సాధారణముగా వారికి ప్రీతినిచ్చును. కుటుంబజీవితమునందే వారు తమ జీవితోన్నతసుఖమును బడయు దురు. ఒక యువతి యుక్తప్రాయమునను్నను రూపలావణ్యవిలాసవతియై చురుకుతనము విజ్ఞానముకలిగి సామర్థ్యముతో వ్యవహరించుచున్నను వివాహము కానిదే సంపూర్ణ జీవితము ననుభవింపజాలదు. ఆయువతియైశ్వర్యారోగ్యముల ననుభవించుచున్నను తన జీవితమునందు తృప్తిపొందలేదు. తానుకోరిన యువకుని బరిణయమాడుటయే యామె సహజమగుకోరిక. అదితీరినప్పుడే ఆమె జీవితమునందు సంపూర్ణసుఖమును పొందగలరు.

కొంతకాలమునకు పూర్వము యుక్తప్రాయమునకు రాకముందే బాలికలు భార్యలు కావలసివచ్చెడిది. యోచనాశక్తిలేనిపసితనమునందే వారు పిల్లలకు తల్లులు కావలసివచ్చె డిది. నేడట్లుగాక యుక్తప్రాయముకలిగి వివాహమును గూర్చి యాలోచింప శక్తికలుగు వరకు బాలికలు వివాహమున కర్హురాండ్రుకారని గణింపబడుచున్నారు. ఇది మిక్కిలి శుభసూచనము. తాను కోరినవరుని బరిణయమాడుటయే యువతియొక్క ధనము, సంపత్తి, సర్వసుఖమును. అప్పుడే ఆమెయాత్మశాంతిపొందును. అట్లుగాక ధనమునాశించి ధనవంతుని వివాహమాడుట యాత్మహత్య చేసికొనుటవంటిది. కులగోత్రములకొరకు పెండ్లిచేసికొనుట శరీరము నమ్ముకొనుటయే. సహజదృష్టితో పరిశీలింపగలుగు బుద్ధిమంతుల కీకృత్యములందు గల యమానుషత్వము తెలిసివచ్చును. తాత్కాలికవాంఛలచే మోహితులై వివాహ మాడు యువతీయువకులు పెక్కండ్రుకలరు. అట్లు మోహమునకు లోనగుట కొంతవరకు మానవస్వభావమునందు సహజము. కాని యతిబాల్యవివాహముచేయుసంతతి యమా నుషముకాదు. మోహితులై వివాహముచేసికొనినపిదప ఆ స్త్రీపురుషులు తమ మొదటి వాంఛలను ద్రుంచికొని నిర్మలజీవితమును బడయుదురు.

వివాహమునకు దేహారోగ్యము ముఖ్యమగు విషయము. దేహారోగ్యము లేనిదే జీవితమునందు సుఖము లభింపదు. అంగవికలత్వమును సహింపలేము. అనారోగ్యు లగు దంపతులకు జనించు సంతానము సహితము బలహీనముగ నుండును. కావున వివాహ మునకు ముందు యోచింపదగు ప్రధానవిషయము దేహదార్ఢ్యము. బలహీనతవలన కలుగు నష్టము దంపతులేగాక వారికి జనించు పిల్లలుసహిత మనుభవింతురు. అందుచేతను సాధ్యమైనంతవరకు రూపవంతుడును, పురుషార్థముగల వరునిపొందుట యువతుల లక్ష్యము. తనభర్త సులక్షణములు గల సంతతికి తండ్రికాగలుగు అర్హతకలవాడుగా నుండవలయును. యువతులకట్టి తలంపులుండుట వారి జీవితోన్నతికి తోడ్పడును. ఒక పడుచు తన యుద్దే

శము నిట్లు నిరూపించెను. "ఇప్పుడు నేనెవరిని వివాహమాడవలయునో నాకు తెలియదు. కాని నాకోరిక యీవిధముగా నున్నది. నాకుజనించు పిల్లలు, తమ తండ్రియెడ ప్రేమకలిగి, యాతనియెడ గౌరవభావముతో ప్రవర్తించవలయును. భర్త నన్నాదరించి, నాప్రేమకు గుర్తియై, నన్నానందింపచేయగలవాడుగా నుండవలయును. అతడు దేహధార్ఢ్యముకలిగి, నాదృష్టిని యాకర్షింపకలవాడుగా నుండవలయును. నేనాతని భార్యను, నాకాతడుభర్త-యనుభావము మాయిరువురియందు సదా మెలగుచుండవలయును."

వివాహమును స్థిరపర్చువానిలో ప్రేమమొదటిది, బుద్ధిరెండవది. ప్రేమవలన యను రాగముజనించును. దేహధార్ఢ్యము, రూపలావణ్యము గలిగినప్పుడే మోహముండును. అటు పిమ్మట యొండొరులను ప్రేమించు కొందురు. జీవితమునందు సుఖమునిచ్చునది నిర్మల ప్రేమయే. బాలికాబాలురకు యిరువదివత్సరముల ప్రాయమువచ్చిననేగాని వారియందు మోహముపూర్తిగా యంకురింపదు. వారియందు తగుబుద్ధియును వికసింపదు.

వివాహము స్త్రీపురుషుల సౌఖ్యముకొరకుగాక కుటుంబాభివృద్ధికను నొకవాదన కలదు. ఇదియును సహేతుకమగు వాదనయని కొందరి యభిప్రాయము. కుటుంబజీవన మానందమిచ్చును; ప్రేమానురాగము లభివృద్ధిచేయును; శుభసమయములందు హెచ్చరిక, కష్టకాలములందు ఓర్పును కలుగజేయును. ఈ విషయములను యనుభవపూర్వకముగా తెలిసికొనదగునవి. అందుచేతను గృహము ఇహలోక స్వర్గమువంటిది. (Home is the Heaven on Earth) ఇట్టి కుటుంబజీవనము వివాహముయొక్క ఆశయమనుట పవిత్రోద్దేశము. ఇట్టి ఉన్నతోద్దేశములు ఫలించునట్లు ప్రయత్నించుట దేశౌన్నత్యమునకు తోడ్పడును. పూర్వము గ్రీసు, రోముదేశములందు వివాహసంస్థ దేశక్షేమముకొరకు సాధనగా ఎంచబడెను. దేశసంరక్షణ చేయగలుగునట్టి బలాఢ్యులను కనుటకొరకు వివాహ మావశ్యకమను భావము కొంతవరకు ప్రబలియుండెను. తమబిడ్డలను బలాఢ్యులుగా తయారుచేయుట తలిదండ్రుల విధిగానుండెను. బలవంతులను కనిన తలిదండ్రులకు ప్రభుత్వపాలనయందు గౌరవము ఉండెడిది. అందుచేతను బలముగల బిడ్డలను కనుటకుగాను వివాహసమయ మందు దేహదారుఢ్యముకల వరుని యువతులు కోరువారట. అదియునుగాక దేహ దార్ఢ్యము కలిగియుండుట అందరికిని సహజముగనుండు కోరిక. అందుచేతనే వివాహ విషయములందు వరుడెంతటి ధనవంతుడైనను దేహదార్ఢ్యముకలవానిని దెచ్చికొనుట శ్రేయము. ఒకయాంగ్లయువతివివాహమునుగూర్చివ్రాసినవ్యాసమందు ఈ విధముగా చెప్పబడియున్నది. "నా భర్త బలముకలిగి సంతానమునిచ్చునట్టి దార్ఢ్యముగలవాడుగా నుండవలయు." యువతులు తమ వివాహవిషయములలో సిగ్గు స్త్రీకి భూషణమను అపోహపడి జోక్యము కలుగజేసుకొనకుండుట ఇతరులచే తామమ్మబడుటవంటిది. యువతు లీవిషయములు గ్రహింతురుగాక.

" మదికుదురఁజేసి చల్లనిమాటచెప్పి
కలఁకనెడలించి ధైర్యంబుకలుగఁజేసి
తల్లిదండ్రులఁబోలి పెద్దలనుబోలి
సదుపదేశంబుచేయుఁ బుస్తకమెనీకు.
మించువిజ్ఞానజలధిఁ దేలించునావ
మంచిచెడ్డలగతు లేర్పరించుత్రోవ
మానసికరోగములనెల్ల మాన్పుమందు
పొగడఁదగువిందు నీకెందుఁబుస్తకంబె."

—వేంకటపార్వతీశ్వరకవులు.

# లెటీషియా

ఆరవిల్లి నరసింహాచార్యులుగారు బి. ఎ. (సారస్వతసమాజము)

ఏదేశమునందలి సాంఘిక మర్యాదల నలవరుచుకొనఁగోరి భారతదేశమునందలి విద్యావంతులు నిరంతర కృషిసల్పుచుందురో, యేదేశమునందలి యువతీమణులు విజ్ఞానమునఁబురుషులకుఁ దుల్యలో యట్టి ఇంగ్లాండు దేశమున క్రీ. శ. 1802-వ సంవత్సరమున L. E. L. అను సంకేతాక్షరములచేమాత్రము సుప్రసిద్ధయైన లెటీషియాలాండన్ అను కవయిత్రి జన్మించి తన మనోహరకవితాలహరిని విబుధులనోలలాడించి, దైవదత్తములైన విద్యారూపముల కసూయాపరులైన క్రూరకిరాతులచే నొకయెడనుండి మఱొక్కయెడకు హరిణాంగన వలెఁ దరుమఁబడి యాశ్రయదాత యని యొకమేఁకవన్నెపులియందఁ జేరి, జన్మదేశమును బాసి, విదేశమునందు-విరుద్ధప్రకృతిగల స్వల్పసంఖ్యాకులనడుమ - కఠినహృదయుఁడగు భర్తతో నాలుగుమాసములు మాత్రము కాపురముఁజేసి, జీవితమునురోసి తనముప్పదియారవయేట కలుషభూయిష్టమైన ఈలోకమును వీడెను.

ఈమె చరిత్రమును సమగ్రముగ నెఱిఁగినవారి సంఖ్య స్వల్పము. ఈమె తన శైశవావస్థయందే తన జనకుని గోల్పోయి పినతండ్రియింటఁ బెరుగుచు నాతనితో 1814-వ సంవత్సరమున బ్రోంప్టన్ నగరమున నివసింపఁబోయెను. లాండన్ గృహారామపరిసరముననే తత్కాలమున నాంగ్లసారస్వతప్రపంచమునఁ బ్రఖ్యాతిగల జెర్డన్ అను పత్రికానిర్వాహకుఁడు కాపురముండెను. వయసును మించిన యవయవపుష్టిగల యాపదిరెండేండ్ల బాలిక శరీరపరిశ్రమకై తోఁటయందు-చేత నొకపాత్రముతోఁ-బరువెత్తుచు నట్టియెడఁగూడ గ్రంథపఠనము నేమరక తన యద్భుతచర్యచే జెర్డన్ పండితుని దృష్టినాకర్షించెను. వారికిఁ గ్రమముగఁ బరిచయమై పితృపుత్రికావాత్సల్యముగా నభివృద్ధిచెందెను. ఆబాలిక రచించెడి గీతముల సవరించుచుఁదప్పొప్పులఁ దెలుపుచు నామె విజ్ఞానాభివృద్ధికిఁ బండితుఁడు మిగులఁ దోడ్పడెను. ఆమెకు మార్గదర్శకుఁడు, హితుఁడు, ప్రబోధకుఁడునైన జెర్డన్ పండితునిచే సహజకోమలమైన యాబాలకవితావల్లి పరిష్కృతమై నూత్న వికాసము నందెను.

జెర్డన్ పండితుఁ డామెపద్యములను దన పత్రికయందుఁ బ్రచురించుచుండ నమూల్యములగు నారత్నములు క్రమక్రమముగా విద్వాంసుల నాకర్షింపఁజొచ్చెను. ఆమె పద్యగద్యవ్యాసములను విమర్శనలనుఁ బత్రికకొఱకు వ్రాయుచు సంపాదకునకుఁ జేదోడుగా నుండి పత్రికానిర్వహణభారముఁ గొంత భరించెడిది. అరవిరిసిన యాకుసుమసౌరభము నలుదెసలఁగలయఁబర్వఁ దద్దర్శనార్థుల సంఖ్య పెరుగఁజొచ్చెను. గ్రంథముల విలువ హెచ్చెను. ఆమెకు గ్రంథముల మూల్యముగా సుమారు 2,485 పౌనులు లేక ముప్పదియేడువేలరూపాయలు లభించెనని యంచనా వేయఁబడినది.

1834-వ సంవత్సరమున అనగా నామె ముప్పదిరెండవయేట ఆమె ప్యారిసునగరమున స్వల్పకాలము నివసింపనేగెను. అచ్చటనుండి యామె తన హితుఁడును, గురువును అగు జెర్డన్ పండితునకు వ్రాసినలేఖ లామె మనోహరమగుశైలిని, ఆమెకు జెర్డన్ పైఁగల గౌరవాదరభావములను, ఆమె సరళహృదయమును, గ్రంథరచనమునెడ నామెకుఁగల యుత్సాహమును వ్యక్తపరచును. ఆమె తన లేఖలలో ఫ్రెంచి గ్రంథకర్తల యుత్తమగ్రంథములను స్వేచ్ఛాభాషాంతరీకరణ మొనర్చి సంవత్సరమున కొక సంచిక ప్రచురించు నుద్దేశమును దన హితున కెఱింగించెను.

---

* The Story of L. E. L. అను శీర్షికతో Fitzgerald వ్రాసిన యాంగ్లవ్యాసము నాధారముగాఁగొని యీవ్యాసము రచించితిని.

ఇట్టి యమూల్యరత్నము నెవ్వఁడు తన హృదయ సీమ నలంకరించుకొనఁ గోరకుండును? కాని దేదీప్యమానమగు నీయమూల్యరత్నము లోకోక్తికి విరుద్ధముగాఁ దన యాశ్రయదాతను వెదుకుకొనవలసిన దురవస్థకుఁ బాల్పడెను.

ఈనారీమణిహృదయ మెంత ఉత్సాహతరంగితమో యంత కోమలము. ఎంత అనురాగపూర్ణమో యంత ఆత్మగౌరవభావపూరితము. అణుమాత్రమైనఁ దనమనసు నొవ్వఁజేసిన నామె సహింపజాలకుండెడిది. ఆదేశమునందు వినోదగోష్ఠులలో హృదయవేదనాకరములగునట్టి సన్నివేశములు పెక్కు తటస్థించును. తనమనసు నేమాత్రమునొప్పించిన నామె సైరించెడిదికాదు. ఈకారణమున నామెకు పెక్కురు శత్రులై యామె విద్యారూపసంపదల కదివరకే యసూయాపరులౌటచే వివిధగతుల నామెను వేధింపఁజొచ్చిరి. యేకాకినియగు నాయబలపై లేనిపోనినిందలగల్పించి యూరుపేరులేని యుత్తరముల నామెమిత్రుల కంపుచు దుర్వార్తలఁబ్రచురింపుచు నామె మనశ్శాంతిని దూలింపసాగిరి. వయోవృద్ధుఁడు, పితృతుల్యుఁడు, కుటుంబీకుఁడు, జ్ఞానవృద్ధుఁడునగు జెర్డన్ పండితునిపైగూడ దోషారోపణమయ్యెను. అవివేకులు కొంద ఱట్టివృత్తాంతములకుఁ జెవియొగ్గినను వివేకులకు జెర్డన్ యెడఁగాని లెటీషియాయెడఁగాని గౌరవభావము తగ్గకుండెను. కాని యామెపక్షము నెవ్వరుపూనుకొనుదురో వారిపైన దుర్ణయసంఘము చెలరేగునను భయమున నామె మిత్రబృందమునకు వాగ్బంధనమయ్యెను. అనుక్షణము మిత్రు లనుతాపముతోను, శత్రులుపైశాచికానందముతోను దన్నుఁగూర్చి యాడుకొనుమాట లానవనీతకోమలహృదయను—నిరపరాధినిని—విషతప్తములగు వాడియలుగులవలె వేధింపఁజొచ్చెను. పసిడికిఁదావియబ్బిన భాతి లావణ్యమునకు వన్నెవెట్టు వైదుష్యసంపదగల యాయువతీరత్నమును వివాహమాడ నువ్విళులూరు ప్రతియువకునకును 'ఆకాశరామన్న' యొక యుత్తరమంపుచుండెను. కొందఱీనిందలు కల్పితములని మనసారనమ్మి యామె నిష్కళంకచరిత్రమును లోకమునకెఱిగించి యామెకృతజ్ఞతారాగముల సంపాదించుకొనఁగోరి విశ్వప్రయత్నమున నామెను నిర్దోషయని తెలిసికొని జగమునకుఁ దెలిపిరి. కాని తనపై కల్పితములైన యపవాదములకుఁ జెవియొగ్గి తనచారిత్రమును విమర్శించిరను క్రోధమున నామానవతి వారిని దిరస్కరించి శత్రువులసంఖ్యను బెంచెను.

పాప మాయబల దినదినమును విచారమునఁ గ్రుంగిపోవుచుండెను. ఉత్సాహ మడుగంటెను. విషాదమేఘచ్ఛన్నమై యామెవదనబింబము మ్లానమయ్యెను. నిరంతరసంతాపమున నిద్రకు దూరమై మనశ్శాంతిని గోరి నిద్రఁగల్పించు మందులసేవించుచుఁ దన్మూలమున నారోగ్యమడుగంటు మనోవ్యాధికి మందుఁగానక యట్టి దుర్భరావస్థయందును ఆమె ఆత్మగౌరవలోపమని తనవేదన బయల్పడకుండ నణఁగఁద్రొక్కఁ బాటుపడుచుండెను. తనశత్రువుల బారినుండి తప్పించుకొనుటకై కొందఱు వృద్ధస్త్రీలయొద్ద వసించెనుకాని యాదుండగీంద్ర యలజడి తప్పించుకొనఁజాలదయ్యెను. ఈవేదన యామెజీవితమును సంశయావస్థకుఁ దెచ్చెను.

వేటకానిచేఁ బొదనుండిపొదకుఁ దరుమఁబడిన కురంగి ప్రాణరక్షణమును గోరి బెబ్బులిగుహలో డాగినట్లు శత్రుభీతినుండి విడివడి మనశ్శాంతినందఁగోరిన యానిర్భాగ్యురాలికి ఆఫ్రికాదేశమున నుద్యోగముననున్న మాక్లియన్ అనునొకనితోఁ బరిచయమై వివాహప్రసంగములు జరిగెను. తనదుర్దశ తొలఁగెనని యామె యానందమందెను. అతఁడొక సంవత్సరము గడువుపెట్టి ఆఫ్రికాకుఁబోయి సంవత్సరమైనపిదపఁ దిరిగివచ్చి యామెకు తిరిగి వాగ్దానమొనర్చి స్కాట్లండుదేశమున కరిగెను. వారములుగడచినవి. నెలలుజరిగినవి. అతనియొద్దనుండి యొక్కయుత్తరమైన లేదయ్యెను! ఆమెకును ఆమెహితులకును ఆతురతహెచ్చెను. తనశత్రువులచే నీవరుఁడుగూడ మోసగింపఁబడెనను విచారమున వధువు కృశించి మంచముఁబట్టెను. ఆమెయవస్థకు జాలిబూని యామె హితుఁడొక్కఁడు అతనిచర్యను నిరసించుచు నుత్తరము వ్రాయ నందులకుఁ బ్రత్యుత్తరముగా

నాతఁడు తానుద్యోగరీత్యా ఆఫ్రికాదేశమున నుండవలసినవాఁడగుటచేఁ దనతోఁగూడ నామె వచ్చిన నాయుష్ణప్రదేశమున నామెయారోగ్యము చెడునేమోయనుభయమున వివాహమునెడ విముఖుఁడనైతినని యును, ఈవిషయ మామెకెఱిఁగింపఁజాలనైతిననియుఁ దెలియపఱచెను. ఆయమాయకురాలది నిజమనినమ్మి ప్రేమ వెల్లివిరియు నొకలేఖను బంపెను. ఎట్టకేలకు వివాహము నిశ్చయమయ్యెను. కాని వరునికోరికపై గోప్యముగా నుంచబడెను.

స్కాట్లండుదేశమునుండి వివాహార్థము దయచేసిన వరుని బింకమునకు మేరలేకుండెను! తన విపరీత ప్రవర్తనమునను, విదుషీమణులయెడఁ — బ్రత్యేకముగా వధువునెడను, ఆమె గ్రంథములయెడను జూపు నిరసనభావమునను ఆమెకును ఆమెమిత్రబృందమునకును మనోవేదనఁగూర్పఁజొచ్చెను. సర్వసిద్ధమైన వివాహము చెడెననుమాట పడుటకంటె యట్టివానితోడి వివాహ మధిక వేదనాకరముగాఁజాలదని యా మానవతి ధరణీ దేవిని మీఱిన యోరిమితో నాతని చర్యలను సైరించెను. వివాహమైన కొన్నాళ్లకు వా రాఫ్రికాకు వెడలు తఱిని వివాహవృత్తాంతము ప్రకటింపబడెను. మాక్లియన్ చిరకాలమునుండి యామెను సేవించుచున్న పరిచారికను దొలగించి యామెకు మనోవేదనఁ గూర్చెను. తరువాత ఓడ నెక్కఁబోవు సమయమున, మిగుల బలవంతముపై, నొక క్రొత్తపరిచారికను గుదిర్చెను. ప్రయాణసమయమునందైన నాతఁడామెతోఁగలసిమెలసియుండక యామెయెడ నిర్లక్ష్యముగాఁ బ్రవర్తించెను.

ఆ సమయమున ఆఫ్రికాకాలనీలో స్వల్పసంఖ్యాకులగు నాంగ్లదేశస్థులు పురుషులుమాత్రము నివసించుచుండిరి. మాక్లియన్ ఆకాలనీగవర్నరు. మూడువైపుల సముద్రముచేనావరింపబడిన యొకయగ్రమునందలి భవనములో నా దంపతులు నివసించెడివారు. ఆమెయుఁ బరిచారికయుఁ దక్క నందాంగ్లస్త్రీ లెవ్వరును లేరు. మాక్లియన్ రోగిష్ఠి. సహజముగ నుత్సాహికాఁడు. గణితశాస్త్రమునం దభిరుచిగలవాఁడైనను సారస్వతవిషయములయెడ విముఖుఁడు. కాఠిన్యత కార్యసాధకమను నమ్మికతో నాతఁ డామెయెడ నిర్దాక్షిణ్యముగాఁ బ్రవర్తించి యామెను గృహకృత్యములఁ బ్రవీణురాలిగా నొనర్పఁదలచెను. తత్ప్రతిఫలముగా నామె కనుక్షణమును జీవాట్లు తగులుచుండెను. పనికత్తెలు చేయఁగొంకెడి పనులుగూడ నామె పాలఁ బడుచుండెను. వేయేల? ఆతని స్వరమున నామెకు సర్వాంగీణకంప ముదయించెడిది. విజ్ఞానవతియు, నానందరస తరంగితహృదయయు, కోమలకవితారచనాధురీణయు, సరళస్వభావయునగు నామె తన యంత్యకాలమున విదేశమున అనాగరికులనడుమ, తన్నీసడించు పతి యనుగ్రహ మాకాంక్షించుచు, హృదయభారము తీరునట్లు తన కష్టములను జెప్పుకొనుటకు హితులులేక, తాను త్రికరణశుద్ధిగాఁ జేయు పరిచర్యలకుఁ బ్రతిఫలముగా లభియించు చీవాట్లకు గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు ననదయై శారీరకమానసికక్లేశముల ననుభవింపఁజొచ్చెను.

నాలుగుమాసములకే తన యిల్లాలు గృహకృత్యములందు నిపుణురాలైనదని తోఁచుటనో మఱేకారణముననో మాక్లియన్ పనికత్తె నింగ్లాండుకు పొమ్మనెను. మఱునాఁటి యుదయమున నామె తన యజమానురాలి సెలవుఁగొనఁబోయి నిర్జీవమగు నామె శరీరమునుమాత్రమే దర్శించెను. ఆమెయొద్ద నొక విషపదార్థముగల సీసాయుండుటచే, మితముగావాడిన మనోద్దీపనమును అమితమైన మృతియును గలిగించు నా మందు నమితముగా సేవించుటవలన మరణించెనని నిర్ధారణసలిపిరి. ప్రమాదమున నామె యమితముగా వాడెనో లేక యానాఁడు మాక్లియన్ పనికత్తెనుఁ దొలగించుటచేఁ దనకు ముందు గలుగఁబోవు సంసారనిర్వహణమునందలి కష్టనిష్ఠురములను భావించుకొని పతి యాదరణమునెడ నిరాశఁబూని జీవితమునురోసి యెఱింగియే యీ సాహసకృత్య మొనర్చెనో? ఏమైననేమి? ఆంగ్లదేశలక్ష్మి యమూల్యాలంకార మొకటి శాశ్వతముగా భూస్థాపితమైనది.

చేయిఁజాఱిన వస్తువుకొఱకై చింత మెండు. ఆమె మరణానంతరమునఁగాని మాక్లియన్ ఆమె విలువ గ్రహింపఁజాలఁడయ్యెను. అనురాగపూర్ణహృదయయు, సరళస్వభావయుఁ, గడుంగడువిధేయయునగు నామె కొఱకై చాల పరితపించెను. ఏమి లాభము?

"ఎంత యేడ్చిన నెంత పిలిచిన
ఎంతగా బ్రతిమాలుకొన్నను
నుంతయైనను వినఁగఁజాలదు
చూడఁజాలదు"............

ఆమె చరిత్రమును వ్రాసిన ఫిట్జిరాల్డు అను నాతఁడు లెటీషియా మరణమునకు మాక్లియన్ బాధ్యుఁడు గాఁడనియు; వ్యాధిపీడితుఁడు, కార్యమగ్నుఁడు, స్వల్పావాయముగలవాఁడు, సారస్వతమునెడ విముఖుఁడు నగుట నాతని ప్రవర్తనమునందలి స్వల్పవైపరీత్యములను బెంచి యుద్రేకముతో నామె మిత్రు లాతనిపై నిందారోపణఁజేసిరనియు, ఆమెను ఆఫ్రికాయందు సందర్శించిన యొకరిద్దరు ఆమె యుత్సాహముతోనుండి నట్లు తెల్పిరనియు, నామె యాఫ్రికానుండి తన మిత్రులకు వ్రాసిన జాబులందు విషాదచ్ఛాయ తోఁచదనియు వ్రాసియున్నాఁడు.

తానెన్నఁడెఱుఁగని విదేశములను కథారంగములుగా సంతరించి పండితలోకము నానందపరచిన కల్పనాశక్తిగల మేధాసంపన్న; జననిందను భర్త నిరాదరణమును సైరించిన ధీరచిత్త; తన్నుఁగూర్చి యొరులు చెప్పుకొనుట సహింపని మానవతి; తన కాపురమునందలి గుట్టును వెలిఁబుచ్చునా? అనన్యగతికయై తన్నాశ్రయించిన దీనురాలిని కీల్బొమ్మవలె నాడించి యామెను వివాహమాడుట లోకోద్ధరణమునకని భావించిన దురభిమాని; చింతచే చివికిపోయిన యామెహృదయము బ్రద్దలగునేమో యనిశంకలేక నిర్దయుఁడై వేధించి యామె మానసికావేదనఁబెంచిన కఠినహృదయుఁ డామె యాత్మహత్యకు బాధ్యుఁడు కాఁడా?

## మాటలాడగనేలనే?

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

ఈవామపూవునై యీజన్మమున నేను
యిచటనే వాలిపోనా? బిగివీడి
యిచటనే రాలిపోనా?
అందంపుపూవునై మందంపుతావినై
మెలగురోజులు బోయెనా? యింతలో
చెలగునవ్వులు బోయెనా?
ఆమనోహరమైన గానంపుఝురులలో
నురుగునై మెరవలేదా?
వెల్లువలపరుగునై పర్వలేదా?
సౌరభోపేతమై, చల్లనై, మెల్లనై
నడచునడకలు బోయెనా?
యింతలో వీచుతావులు బోయెనా? జీవితపు
చిన్నెలన్నీ వీడెనా?
మించునై, వెల్గునై, మొగులునై తార
నై మిసిమించి వెలుగలేదా?
రేరాజుపస చిన్నబుచ్చలేదా?
కాంచనపు కాంతులతో
చంచలపు రెక్కలతో
అంచనై ఆడలేదా?
కొమ్మపై మించునై మెరవలేదా?
కడచిపోయిన కాలవాహినిని
దలపోసి
పాటపాడగనేలనే? చంద్రికా
మాటలాడగనేలనే?

# సుశీల

తాత కృష్ణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

“పుట్టినాడవు గొప్పయింటను
గట్టివాడవు చదువుసంధ్యల—
కొట్టితిట్టగ భార్యనీగతి
యెట్టిపాపంబో ?

మెచ్చి నీనగుమోము తీరును
నచ్చినట్టి వయోవిలాసము
హెచ్చుకట్నములొసగి బాలిక
నిచ్చుటెందులకా ?

పిల్లనిచ్చినవారి నెంచక
తల్లిదండ్రుల గణనసేయక
చెల్లునా యిటుసేయ మిత్రమ!
పిల్ల చిన్నదిగా ?

దుష్టమిత్రులగూడి పాడయి
నష్టపడి ధనగౌరవంబుల
నష్టకష్టము లేలపెట్టెదు
నిష్ఠురత సాధ్విన్ ?

తప్పత్రాగుచు నొడలు దెలియక
ఒప్పుతప్పరయంగ జాలక
తప్పుమాటల వదరుచుందువు
మప్పిదములేకన్.

ఏలదన్నితి వామె నిర్దయ
శీలవతిని గుణాఢ్యురాలిని ?—
ఆలసించక చూపుమోయి! సు
శీల యెక్కడనో.”

అనెడిమిత్రుని పాణిపల్లవ
మనునయంబునబట్టి మెల్లన
వినయముగ తా బలికెనిట్టుల
వేణు గద్గతికన్.

“బుద్ధిహీనుడనైతి మిత్రమ !
శుద్ధమూర్ఖత జేతులారగ
ముద్దుపట్టిని చంపుకొంటిని
నిర్దయామతినై.

అరయకుంటి సుశీల గుణముల
నరయకుంటిని మంచిచెడ్డల
పరమపాపము గట్టుకొంటిని
క్రూరకర్ముడనై.

నాగరికమని విర్రవీగుచు
పగలురాత్రియుగూడ త్రాగుచు
మగువనొల్లక మాయకాంతల
మరగి చెడిపోతిన్.

ఎన్ని యిడుమల గుడువజేసిన
నన్ను మదిలో ద్వేషమెంచక
కన్నవారికినైన చెప్పక
నన్ను తాంగి మనెన్.

ప్రేమమీరగ నన్ను గాచుచు
ప్రేమఫలమున కాశజెందుచు
క్రమవిధాన ధరించె గర్భము
లేమ ముదమందన్.

ఖలుల సహవాసంబు కతనను
చెలుల లోలుడ నౌటచేతను
బాలపై ననుమానమందితి
శీలమెంచక, హా!

న్యాయమెంచక, నీచమిత్రుల
మాయమాటల నమ్మికొంటిని
కోయిలేదో కాకిగూటను
కూయుననుభ్రాంతిన్.

తాపమొదవగ హృదయమందున
కోపభరమున నాపె దన్నితి
నెపముదెలుపక, నెయ్యమెంచక
నీచహృదయుడనై.

తనువుదెలియక మ్రోదినాడను
కినుకబూని యకారణంబుగ
వినగనైతిని యామె యేడ్పును
వినగ మతిలేమిన్.

గర్భమందున పెరుగుచుండిన
యర్భకుని కాదెబ్బ తగులగ
దుర్భరంబయె సతికి బాధయు
గర్భస్రావమునన్.

రక్తస్రావమువలన కోమలి
శక్తిలేమిని మూర్ఛవడియెను;
యుక్తిదోచక మిన్నకుంటిని
రిక్తహృదయుడనై."

అనుచుమిత్రుని దోడ్కొనిచని
పాన్పుపై స్మృతిదప్పియుండిన
మానినిని చూపించి, ఖిన్నత
దీనుడై నిలచెన్.

వేణుమిత్రుడు వైద్యుడౌటను
తనదు యావచ్ఛక్తిజూపియు,
ప్రాణముల నిలవెట్టు సాధన
గనమి దిగులందెన్.

"సత్యమాస్థితి నెటుగగోరెదో?...
మృత్యుముఖముననున్న దీమెయు;
హత్యచేసితి వాలుబిడ్డల—
హంతకుడవౌరా!

తెలివివచ్చు సుశీల కిప్పుడు
బలముచాలదుసుమ్మి, గుండెకు
అలసటన్ బడనీయకూడదు......
...సెలవుగైకొందున్."

స్మృతికివచ్చినపిదప బొటబొట
సుతునికై గన్నీరుకార్చుచు
మృతియె శాంతికి సాధనంబని
యతివ తలపోసెన్.

దీనదృష్టిని నాథుబిలచియు
తనదుచెంతకు వచ్చి నిలువగ
హీనమగు డగ్గుత్తికను తన
మానసము విప్పెన్.

"తప్పు చేసితినంచు దలచితొ?
విప్పిచూడుము నాదుహృదయము
నిప్పువలె నాప్రేమమగుపడు
నిష్కళంకముగన్.

ఓర్చియుంటిని నీదు నిర్దయ
కోర్చికొంటిని ప్రేమలేమికి;
ఓర్చుకొన నాతరమె, బిడ్డ వె
లార్చి దునుమంగన్?

ఎన్నికష్టము లొందవినను నా
చిన్నిబాలుడు నాకులేడా
యన్నధైర్యముకూడ నేటితో
మన్నుగలిసె కదా!

ఆశలేదిక బ్రతుకుపై, నవ
కాశమునులే దెందుకైనను;
బాసిశిశువును బ్రతుకజాల, హృ
దీశ! సెల"వనియెన్.

# స్త్రీలు: బ్రహ్మచర్యము

కూచిబొట్ల హనుమంతరావుగారు

స్త్రీలు బ్రహ్మచర్య మవలంబించు టే మాత్రము పనికిరాదనియు, అవలంబించుట శాస్త్రీయము గాదనియు, పూర్వాచారము లేదనియు మొదలగు అభిప్రాయము లనేకము లీకాలమున ప్రబలియున్నవి. అందులకు దార్కాణముగా నీ కాలమున బ్రహ్మచారిణు లెచ్చటను గానవచ్చుటలేదు. పురుషులయందు బ్రహ్మచారుల ననేకుల గాంచుచున్నాముగాని బ్రహ్మచారిణియగు నొక్క స్త్రీయైనను మచ్చునకైనను గన్పడుటలేదు. బాలికకు పండ్రెండు సంవత్సరములుగూడ పూర్తిగా నిండకమునుపే, యింకను సాధ్యమగునెడల యష్టవర్ష ప్రాయమునసే వివాహముగావించి తల్లిదండ్రులు తమ బాధ్యతనుండి విముక్తులమైతిమని తలచుచున్నారు. ఆ జన్మాంతము నొకరినొకరికి కలవేసి కట్టుచున్నారు. వధూవరులయభిప్రాయము లనవసరము. మూలనున్న ముదుసలి యిష్టపడిన జాలును. వివాహము జరిగిపోవుచున్నది. మంగళసూత్రము ముడివైచుటకు పెండ్లికుమారునకు చేతగాక యున్నచో పురోహితుడే యాతనికి మారుగ ముడివైచుచున్నాడు. పెరిగి పెద్దవారైన పిదప యొండొరులకు ప్రేమయున్నను లేకయున్నను సంఘ నియమములనైనను పాటించి పరస్పరము కపటప్రేమల నటించుచు సంసారముల నిస్సారము జేసికొనుచున్నారు. అట్టి పెండ్లిండ్లవలన ప్రయోజనమేమి? అట్టి పెండ్లిండ్లు చేయుటకంటె తగిన వరుడు దొరకునంతవరకు బ్రహ్మచర్యమవలంబించియుండుటయే యుత్తమము.

ఒకనాడు ప్రధానరాజకుమారికయగు సులభయను పేరుగల యొక నైష్ఠికబ్రహ్మచారిణి జనకమహారాజుయొక్క సభలోనికి వెళ్లెను. జనకు డామెను ఎవరునీవని ప్రశ్నించెను. అందుమీద

సాహంతస్మిన్కులేజాతా భర్తర్యసతిమద్విధే
వినీతామోక్షధర్మేషు చరామ్యేకామునివ్రతం. —భార. శాం. అ. 3౨౧.

"నేను గొప్ప రాజకులమునజన్మించితిని. గురువువద్ద విద్యనభ్యసించియున్నదానను. బ్రహ్మచర్యసమాప్తియైనపిదప నాకు దగిన విద్యాధిగుణసంపన్నుడగు పతి దొరకని కారణమున సన్యాసాశ్రమము స్వీకరించితి"నని ప్రత్యుత్తరమిచ్చెను.

పురుషులయందు సనకసనందనాదులు, శుక నారద పరశురామ హనుమ భీష్మాదులవలెనే పూర్వము స్త్రీసమాజమునందును ఆజన్మాంతము బ్రహ్మచారిణులుగ నుండి యింద్రియనిగ్రహణమువలన సత్యభాషణాది తపంబులజేయుచు, పండితులచేత సత్కారములబొందుచు, తమ కీర్తిని దిగంతవిశ్రాంతముగాజేసికొని స్త్రీజాతికి పేరుదెచ్చిన నారీమణు లెందరోగలరు. శాండిల్యమునిపుంగవుని కుమార్తె ధృతవ్రత, గార్గి, బడబా మొదలగు బ్రహ్మచారిణుల కీర్తి నేటికిని మనము వినుచున్నాము.

సమానం బ్రహ్మచర్యం —ఆ. శ్రౌ. పట. ౮.

బ్రహ్మచర్యము స్త్రీపురుషులకు సమానమని యాపస్తంబశ్రౌతసూత్రములందు లిఖింపబడిన వాక్యమువలన స్పష్టమగుచున్నది.

ద్వివిధాస్త్రియో బ్రహ్మవాదినః సద్యోవధ్వశ్చ తత్రబ్రహ్మవాదినీనా ముపనయన మగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే భిక్షాచర్యా ఇతివధూనాం తూపస్థితే వివాహేకథం చిదుపనయనమాత్రం కృత్వా వివాహఃకార్యః; ఇతిహారీతేనోక్తం.

ఈ హారీతవాక్యమునుబట్టి స్త్రీలయందు బ్రహ్మవాదినులనియు సద్యోవధువులనియు రెండువిధములుగ నున్నట్లును; వారిలో బ్రహ్మచారిణు లుపనయనసంస్కారమును బొంది యగ్నిహోత్రములొనర్చుచు వేదాధ్యయనము జేయుచు స్వగృహమునందే వసింపుచుండవలయుననియు; సద్యోవధువులు వివాహసమయంబున నుపనయనము జేయించుకొని వివాహము జేసికొనవలయుననియు తెలియుచున్నది.

కావున స్త్రీలకు బ్రహ్మచర్యము శాస్త్రసమ్మతముగాదనుట కేవలము మిథ్య. ఇక ఆచారము లేదనుట యంతకంటెను విపరీతము. అట్టి యాచారమే లేనిచో పైన చెప్పబడిన స్త్రీలు బ్రహ్మచర్యమెట్టు అవలంబించిరి? అట్టి బ్రహ్మచారిణుల నాకాలమున పండితశ్రేష్ఠులును ఋషిసత్తములును నెటు లాదరించిరి?

కావున బాలికలకు తగిన వరుడు దొరుకునంతదనుక బ్రహ్మచారిణులుగా నుంచు టేవిధముగ నాక్షేపణీయాంశముగాదని నిర్ణయము చేయవచ్చును.

## నారి !

తిమ్మరాజు సత్యనారాయణరావుగారు

నీ
కనులలో వెలుగొందు
కళలలో మాధుర్య
గరిమయంతయు నేనె
కాల్చివైచితిని.
నీ
నిత్యనూతనరూప
నిధులలో నలరారు
నవ్యసౌందర్యమ్ము
నలిపివేసితిని.
నీ
దివ్యనిర్మలమూర్తి
దెసలెల్ల బఱపించు
శాంతిపుంజములెల్ల
చాటుపఱచితిని.
నీ
మృదులహృదయపుప్రేమ
మధువెల్లహరియించి
రాక్షసుడనై దాని
రాతిజిదిమితిని.
నీ
ప్రేమయే హరియించి
నీమనోహరమూర్తి
నలిపి, రాక్షసుడనై,
నవ్వి, నాదాసిగా
కలకాలముండుమని
కాలదన్నితిని.
నీ
జీవమధుకుసుమమును
జిదిమి పెంధూళిలో
పొరలించి, దొరలించి
పొగరెక్కి పొంగితిని.
కనులువిడినవి, నేను
కామాంధుడను, నీదు
దివ్యప్రేమకు దగని
దీనపశువును నేను;
ఎటుల సహించితో?
ఎటులత్యజించితో?
ఎటుల ప్రేమామృతము
నెడతెగక కురిసితో?
పాదాల వ్రాలెదను
పాపిని హతమార్తువా?
రాక్షసునిదయవీడి
శిక్షింతువా!
నారి!
శిక్షింతువా?

# నారీ సమస్య

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

కారణాంతరములచే మాటువడియున్న హైందవనారీప్రతిభను బ్రకటించి దేశమునకు జాతికిని దొల్లింటియౌన్నత్యము తేఁదలంచి పలువురు విద్వాంసులును, విదుషీమణులును స్త్రీవిద్యాభివృద్ధికై నేఁడు పాటుపడుచున్నారనువిషయ మెంతయు నానందింపదగియున్నది. కాని యెందరో ధైర్యవతులగు యువతులాగర్భశ్రీమంతులయ్యు బాహ్యకష్టములకు వెఱువక రాజకీయవిషయములఁ బాల్గొని స్వప్నమందేనియూహింపరాని కష్టములనందు చున్నను, ఎందరో విదుషీమణులు ప్రతిభావిశేషముచే నున్నతవిద్య నభ్యసించి యున్నతో ద్యోగములఁ జేయుచున్నను దేశమునందు నేఁడును స్త్రీలకు స్వాతంత్ర్యమీయరాదను వారును, వారికి విద్య యనవసరమని చెప్పువారును ఉండుట విచిత్రము.

భగవన్నిర్మితంబైన ప్రపంచములోఁ బురుషుల కెట్టిస్వాతంత్ర్యము సుఖదుఃఖాను భవమునను న్నదో యట్టిద స్త్రీలకునుగలదు. కావుననే "యథైవాత్మతథాపుత్రః పుత్రేనా దుహితాసమా" యని ధర్మశాస్త్రము. కాని స్త్రీలు కేవలము పురుషుల తుచ్ఛమైన యైహికసుఖానుభవముకొఱకై నిర్మింపఁబడిన క్రీడాసాలభంజికలుమాత్రము గారని ప్రతి వ్యక్తియుఁ దెలిసికోవలెను. అట్టిస్థితిలో స్త్రీలు విద్యను జదువనగుననువిషయమున సందే హమేమియులేదు. "స్త్రీయస్తథాపాఠనీయా యథాతాః కార్యవస్తుని, పుంవత్ప్రవృత్తిమా ధాయ సాధయేయురనాకులాః" యను ధర్మశాస్త్రముసైత మీయర్థమునే స్పష్టీకరించు చున్నది. పూర్వమాశ్రమములందలి మునిపత్నులుసైతము మునులతోఁబాటు వేదాధ్యయ నము చేసియుండుటను, విశేషించి స్త్రీలు ఋగ్వేదాదులలోఁ గొన్నిభాగములు రచించి నట్లును మనము వినుచున్నాము. ఆకాలమున స్త్రీలు పాతివ్రత్యముననేమి, విద్యావిషయ మునమేమి మిగుల ప్రసిద్ధలై శాశ్వతమైన యశమునంది నేఁటికిని మనచే స్మరింపఁబడు చున్నారు. ప్రాచీనకాలమున స్త్రీలయెడనున్నయట్టి స్వాతంత్ర్యమును బురుషులడంచి స్త్రీ విద్యాబహిష్కారమొనర్చి మాటలయందేమి, చేష్టలయందేమి, హృదయములందేమి స్త్రీలను బనికిమాలినవారినిగఁజేసి తుచ్ఛభోగములకే వారు నిర్మింపఁబడిరని నిర్ధారించి దేశ మునకును, జాతికిని, వ్యక్తిత్వమునకును భంగముగలిగించినారు. కాలానుసారముగ స్త్రీలు సైతము వారి సహజప్రతిభను గోల్పోయి కేవలము దాస్యత్వముననకే తాముపుట్టితిమనియు దుర్మార్గుఁడైనను, సంసారనిర్వహణమందశక్తుఁడైనను గేవలము పురుషానుసరణమే స్త్రీకి ముఖ్యకర్తవ్యమనియు నద్దాననే జన్మసాఫల్యమగుననియు నెంచి వ్యక్తిత్వమును గోల్పోయి

రని చెప్పుట కెంతయువిచారము. స్త్రీల యీ యజ్ఞానమును గుర్తించియే పురుషులు తమ యుదరపోషణముకై సంతబజారులలో స్త్రీలనుసైత మమ్ముచుండెడివారు.

పదవశతాబ్దముననున్న క్షేమేశ్వరుఁడను నొకకవి తన చండకౌశికమను నాటకమున హరిశ్చంద్రుఁడు తనభార్య నమ్మఁజూపునపు డామె పరపురుషపర్యుపాసనము, పరోచ్ఛిష్ట భోజనమునను నీరెంటును బరిత్యజించు నన్నుఁగొనుఁడని నేకవేయఁ గొందఱు "ఇట్టి నిన్నుగొన్న లాభమేమి ?" యని యనినట్లు వ్రాసెను. కావున నాకాలమున స్త్రీలను నీచ కార్యములకై యమ్ము నాచారముసైతముండెడిదని యూహింపనగును. శక్తిస్వరూపిణులగు మాతృసమలగు స్త్రీల కిట్టిదురవస్థయుఁ బ్రాప్తించుట యెంతయు శోచనీయము. వేయేల? పరమపవిత్రలైన స్త్రీలయెడఁ బురుషులు చేయరానియపచారములొనర్చి తీరరానికష్టముల గలుగఁజేసినారు.

కాని నేఁడిట్టిదురాచారములు రానురాను తగ్గిపోవుటయేగాక స్త్రీలయెడ నొకవిధ మగు గౌరవము, ప్రేమ పురుషులకుఁగలిగి వారికి విద్యార్జనమున నవకాశమిచ్చుటయేగాక యుచితమగుస్వాతంత్ర్యమునుసైతమిచ్చుచుఁ బురుషులు తమ్మదాముగౌరవించుకొనుటయే గాక దేశమునకుఁగూడ నభ్యుదయముగలుఁగజేయుచున్నారనుట యెంతయు నానందింప దగిన విషయము. స్త్రీలుసైతము గొందఱు తమయజ్ఞానముఁబాపుకొని కనులఁదెఱచి యన్నివిషయములలోను బురుషులకు సాహాయ్యమొనర్చుచు వారిహక్కులకువారు పోరా డుచున్నారు. విడాకులచట్టమొకటి స్త్రీల కావశ్యకమనియెంచుటయుఁ గొందఱు దానిని గావలయుననుటయుఁ, గొందఱనవసరమనుటయు మనము గృహలక్ష్మిముఖమునఁ జూచి నాము. ఇందలి యుక్తాయుక్తములను జర్చించుట కిది ప్రదేశముగాదు.

స్త్రీలు సహజముగఁ బతివ్రతలును, ధైర్యవతులును. కానిసాంప్రదాయమును, సహ వాసమునుబట్టి వారికిఁజెడునలవాట్లును, అధైర్యమును అలవడును. ఏనాఁడు పాతివ్రత్యము నందున్న సుగుణమును నారీమణి మనసార గ్రహింపఁగలదో; యేనాఁడు ధైర్యమునందున్న సుగుణమును స్త్రీ గ్రహింపఁగలదో యానాఁడు స్త్రీ తన సహజపాతివ్రత్యమును, సహజ ధైర్యమును దాల్చి దేశమున కుపకారముచేయఁగలదు. దీనికి యువతులు ముఖ్యముగఁ బురాణములను, జరిత్రలను జదువవలయును. దానిని బట్టి తన దేశమునందుఁ బూర్వమెట్టి యువతులు పుట్టి దేశోపకార మొనర్చినారో తెలిసికొని తానును నట్లే ప్రవర్తించి యశము నందఁ గోరును.

పతివ్రతలను దుష్టులబారినుండి రక్షించు నిమిత్తము వారి వెనుక సదా దేవత లదృ శ్యులై తిరుగుచుందురఁట. దీనికిఁ దార్కాణముగ కీచకుని గృహమునకుఁబోవు ద్రోవది తన రక్షణము నిమిత్తము సూర్యుని బ్రార్థింప

"తరణియు దుఃఖితయగు న
త్తరుణిని గాచుటకు నత్యుదగ్రభుజావి
స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ
గరుణార్ద్రమనస్కుఁడగుచుఁ గ్రక్కునఁబనిచెన్."

అని భారతమునఁ జదువుచున్నాము. దేశమున ధైర్యముగల యువతులు పలువురు యుద్ధములొనర్చియుఁ, బురుషులకు ధైర్యోత్సాహములఁ గలుగఁజేసియుఁ గీర్తిని గాంచినారు. ఖడ్గతిక్కన యాదవులతో యుద్ధమొనర్చి యలసటఁజెంది నిరుత్సాహమున మరలి గృహమునకురాఁగ నాతని భార్య స్నానార్థము జలముతోడి యటనొక మంచమును, దానిపై నొక వస్త్రమును నడ్డుగఁబెట్టి యట పసుపు మొదలగు స్త్రీజనోచితోపకరణముల నుంచినదఁట. అపుడు ఖడ్గతిక్కన యిది యేమని ప్రశ్నింప

"పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడు వారమైతిమి
పగ పేటికి జలకమాడ వచ్చినచోటన్."

అని యన్నది. భర్త ప్రాణములనైనను లెక్కింపక పౌరుషమే మానుషము అని యెంచు నాయువిద పతికిఁజేసిన క్రియాపూర్వకహితోపదేశమును విన్నచో నేయువతి తన యధైర్యమును వీడి దేశహితమునకుఁ బ్రయత్నింపకుండును? శైశవముననే తలిదండ్రుల నెడబాసి యాశ్రమమునందే పెరుగుచుఁ బాపకార్యమనునది యెఱుంగనిశకుంతలను దుష్యంత మహారాజు నమ్మికపుట్టఁబలికి గాంధర్వవిధిఁ బరిణయమాడి దైవవిధిని బ్రత్యభిజ్ఞానమంధరుఁడుగాగా శకుంతల తన వచోనైపుణిని జ్ఞాపకము చేసినదిగాని శాపోపహతుఁడగు రాజునకు స్మృతిగలిగినదిగాదు. అంత శకుంతల తుదకు విసిగి వేసారి "అనార్య, ఆత్మనో హృదయానుమానేన పశ్యసి ........తృణచ్ఛన్నకూపోపమస్యతవానుకృతింకః ప్రతిపత్స్యతే" అని యన్నది. పతివ్రతయగు శకుంతల పట్ల నిది తగదందురా లేక ధైర్యవతి యగు యువతీలక్షణ మిదియందురా?

స్త్రీలు తమ జాతి నుద్ధరించుకోవలెనన్న మున్ముందు ధైర్య మవలంబించి, తమ యస్వాతంత్ర్యమునకును, అజ్ఞానమునకును గారణ మారసి తన్నివారణమునకై యొక సమాజమును స్థాపించి దాని కుపశాఖలుగఁ బ్రతి పల్లెటూరినందును స్త్రీసమాజములను స్థాపించి దానికి స్త్రీలనే యధ్యక్షులుగ నుంచి తద్ద్వారా విద్యాప్రచారము సాగింపవలెను. దీనికి వారు సంపూర్ణమైన పురుషసాహాయ్య మపేక్షింపవలెను. విద్యావిహీనలైన స్త్రీల యొక్క మూఢాచారమునుఁ బోగొట్టవలెను. దేశమున కౌన్నత్యము తేవలెను. ఇట్టిది

యాంధ్రనారీమణులకు లేదుగాని బంగాళాదేశమున నిట్టి సమితియొకటి "సరోజనళినీనారీ మంగళసమితి" యను పేరిట స్థాపింపఁబడి నేఁడెక్కువగఁ బ్రచలితమగుచున్నది. ఇట్టిది యాంధ్రదేశమునకు నైతము ముఖ్యము. కావున స్త్రీలు ముఖ్యముగ విద్యార్జనముచేసి తమజాతికిని తమదేశమునకును గౌరవముదెచ్చి చిరయశస్సునంది ధన్యతను జెందవలయును.

# నావ వేగమే నడుపుమయ్యా!

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

భక్తవత్సల! గోవింద! పరమపురుష!
యధికమాయాంధకారము లావహింపఁ
బ్రళయజంఝూనిలాహతి దొలఁగఁబడుచు
భయదసంసారజలధిలోఁ బడిననన్ను
జ్ఞాననౌకాసమారూఢఁగానొనర్చి
శాశ్వతానందపదమును సత్యమైన
మంచితీరంబుజేర్పఁగ నెంచుమయ్యా!
నావికా! నావ వేగమే నడుపుమయ్యా!
స్వచ్ఛమగు పూర్ణిమనిశాసమయమందు
కౌముదీప్లావితంబైన గగనసీమ
ధవళసువితానకాంతిచే దనరుచుండ
అలలతాకుడుచేఁగడు నార్తిజెంది
చూడగుంపువీడిజరించు లేడివలెను
తీరమిసుమంతగానక తివురుచుంటి
నడుమముంచకయోడను నడుపుటకును
గొప్పవాఁడవునీవని కోరుచుంటి
మంచితీరంబుజేరఁగ నెంచుచుంటి
నావికా! నావ వేగమే నడుపుమయ్యా!
విశ్వరూపంబుయైయది వెలయుచుండ
నదులు నాడీచయంబులై ననుచుచుండ
పర్వతంబులు శల్యముల్ వసుధ పదము
దేవలోకము మస్తమై తేజరిల్ల
నంతరిక్షము నాభియై యలరుచుండ
సూర్యచంద్రులు కన్నులై సొబగుగూర్ప
పావకుండు నెమ్మొగమై బరఁగుచుండ
దిక్కులన్నియు శృతులుగా దేజరిల్ల
వాయువుచ్ఛ్వాసనిశ్వాస భాతివెలుఁగ
భూరుహములుతనూరుహములుగదనర
నీవునేనొక్కటేచుమ్ము నిక్కమరయ
మంచితీరంబుజేరఁగ నెంచుచుంటి

నావికా! యోడను వేగమే నడుపుమయ్యా!
ఐంద్రజాలికునివోలె నింపుమీరు
జిత్రవస్తుప్రదర్శనము చేసిచేసి
ఈప్రపంచనాటకరంగగృహమునందు
సూత్రధారియైజీవుల సారదిద్రిప్పు
చూడఁగనఁబడకుండెడు చొప్పుగలిగి
కష్టసంసారగతులలో గడుపునన్ను
చిన్మయానందపదవిని జేర్పుదేవ!
శరణమన్నచో రక్షించు సత్యపథము
మంచితీరంబుజేరఁగ నెంచుచుంటి
నావికా! నావ వేగమే నడుపుమయ్యా!
నిబిడతమసావృతంబైన నిశిని నేను
హాయిగానౌకమీఁదనే యధివసించి
ప్రేమగీతంబులీలగా బాడుకొనుచు
అమలగంగాతరంగమ్ము లందునూగి
పక్షివోలెను నానావ పరుగులెత్త
నేఁగుచుంటిని యెచటికో యెఱుఁగలేను
భావసుతరంగములఁబడి మఱచియుంటి
యెంతవరకిట్లుపోదునో యెఱుఁగలేను
ఔర! యేమిది! ప్రభాతమాయనపుడె
పక్షిజాలమ్ము కలకల బలుకుచుండె
మలయమారుతము లింపుగా జిలుకుచుండె
కాననమున గులాబి వికాసమొందె
సృష్టివైచిత్ర్యమును గాంచ హృష్టమాయె
నిన్ను త్వరపెట్టితిని ఆపు మన్న! యిచట
నిదియె నా చేరదలచిన పథము స్వామి!
యాప్తురాలను గాపాడుమయ్యా! యింక;
మంచితీరంబుఁ జేరఁగ నెంచుచుంటి
నావికా! నావ వేగమే నడిపితయ్యా!

## లక్ష్మి

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

### ౧

### అక్కా—తమ్ముడు

కాన్పూరు జిల్లాలో గంగానదీతీరమున క్రోసులకొలది వ్యాపించియున్న ఫలవంతమగు భూఖండ మొక్కటి కలదు. అది పలుతెలంగుల పైరులతో నొప్పి చూపఱులకు విందు గొల్పుచుండెను. ఆ ప్రదేశమున కుత్తరభాగమున నొక చిన్నపల్లెయున్నది. ఆ గ్రామములోని యిండ్లు చాలవఱకు బ్రాహ్మణ క్షత్రియులవి. గొల్లలు, మంగలులు మొదలగు వారివికూడ గొన్ని యిండ్లుగలవు. ఆగ్రామమున ధనికులెవ్వరు నివసించుట లేదు. గ్రామములోని గృహములన్నియు మట్టియిండ్లు, పూరికొంపలు. అయినను ఆగ్రామవాసులు సంతోషముతో సుఖముగ దినములు గడుపుచున్నారని చెప్పవచ్చును; కూటికి గుడ్డకు వారికి లోటులేదు.

ఆగ్రామము చాలకాలమునాటిది. వందలకొలఁది వత్సరములనుండి జనులందు వసించుచున్నారు. అందలి పాడువడిన దేవాలయములు రెండు ఆగ్రామప్రాచీనతకుఁ బ్రబలసాక్ష్యములైయున్నవి. గ్రామవాసులలో గొంచెము చోరవగలవారు కొందరు దూరనగరములకేగి చాకిరీచేయుచున్నారు. ఆంగ్లపరిపాలనా ఫలితముగ నొక యింగ్లీషుబడి, ఒక బాలికాపాఠశాల, చిన్న తపాలాఫీసు నగ్రామమునను నందు వెలసినవి.

జ్యేష్ఠమాసము సాయంకాలము నాలుగుగంటలై యుండవచ్చును. ఒక చిన్నయిల్లు దాని ముందర వాకిలిలోఁ బదిరెండేండ్ల బాలికయొకతె గూర్చుండియున్నది. సమీపమున నయిదేండ్ల ప్రాయముగల ఆపె సోదరు డాడుకొనుచుండెను. ఆకన్య చూచుటకు జాలనందముగ నున్నది. పసిడిచాయ, కాలుసేతులు బొద్దుగఁ దీర్చినట్లున్నవి. కోమలగాత్రము. విశాలనయనములు. ముఖమండలము వికసితపద్మము రీతి నొప్పుచున్నది. ఆమెప్రాయమున సాధారణముగా బాలికలు చంచలచిత్తలైయుందురు. ఈమెకడ నాచాంచల్యములేదు. వయసునఁ జిన్నదియైననేమి? ఇప్పటినుండియు నామె బుద్ధి స్థిరముగనున్నట్టు తోచుచున్నది. ఆమె తమ్ముడు బాల్యస్వభావమున స్థిరముగా నొకచో నిల్వక యటునిటుఁబరుగులిడుచుండెను. ఎంతయో యత్నమున నాపిల్లవానిని దియ్యని మాటలచే బ్రతిమాలుచు నడుమనడుమ బుస్తకము నొకటిఁదెచ్చి యక్షరములు జదివించుచుండెను. ఒకటి రెండక్షరములఁజదివి మరల నాబాలుఁడు దృష్టినిటనుండి మరలించుచుండెను. అంతట నాకన్య ప్రేమతో

"తమ్ముఁడూ! గణేశా! శ్రద్ధగఁజదివినఁ జాలరూపాయిల సంపాదింతువు. చదువనిదే యెవ్వరును గొప్పవారుకారు." అని పలికెను.

గణేశుడు వెంటనే నవ్వి పుస్తకము దూరముగ విసరివైచి "నేను గొప్పవాఁడనుగా నక్కఱలేదు. గొప్ప వాఁడనయిన?" అనియెను.

ఆకన్య ఆపుస్తకము నెత్తి బ్రతిమాలుచు

"గొప్పవాఁడవయిన పెద్దయిల్లు కట్టుదువు. మంచి మంచిబట్టలు కట్టుకొని కచ్చేరీకివెళ్లి యుద్యోగముఁ జేతువు. చాల మందికిఁబెట్టి నీవు తిందువు." అనియెను.

గణేశునకేమియు బోధపడలేదు. అతఁడు

"అతర్వాతనో?" అనియెను.

అక్క—"పెండ్లికూతురును తీసికొనివత్తును."

గణే—"ఎంతపెద్ద పెండ్లికూతురు?"

ఆపిల్లనవ్వి తమ్ముని ముద్దుపెట్టుకొని "రాముని అమ్మమ్మవంటి దానిని. ఏమి? గణేశా!" అనియెను.

గణేశునకు కోపమువచ్చి "ఆ అది ముసలిది! నేను ఎఱ్ఱని పెండ్లామును దెచ్చికొందును–"

అనుచు నెగురుచున్న ఒకతూరీఁగను వెంబడించెను. ఎంత పరుగెత్తినను ఆతూరీఁగ దొరకలేదు. అది దొరకలేదని కాళ్లు రెండును పాఱఁజాచుకొని యేడ్వన కారంభించెను.

"నాకాతూరీగనుబట్టి యిమ్ము" అని గణేశుడు అక్కకడ నేడువ నారంభించెను.

అక్క—"తూరీగను బట్టుకొన్న పాపము! అది కుట్టిన చేతిలో గాయమగును" అని మెల్లగ బుజ్జగించి చెప్పెను.

ఆకొంటెపిల్ల వాడామాటలవినునా? "ఆనాడు అత్తయ్య నాకొక తూరీఁగనుబట్టి యిచ్చెను. అది కుట్ట లేదే?" అని నేలమీఁద దొర్లుచు వెక్కి వెక్కి యేడ్వదొడంగెను.

అక్క ఆతని నోదార్చుటకు లక్షప్రయత్నముల జేసెను. కాని యాతడు వినలేదు. ఇఁకఁజేయునది లేక "సరె! పద. పట్టుకొందము." అని తూరీఁగను వెంబడినట్టునటించి పట్టుకొను మిషను జీరచెఱఁగు విసరి దానినింకను నెగురకొట్టెను. తూరీఁగయెగిరిపోయిన పిమ్మటఁదమ్మునివంక తిరిగి "తమ్ముడూ! యెగిరిపోయినది. అయ్యో! ఏమిసేతు"నని ఆతని బాధ తప్పించుకొనెను.

"నాకు మామిడిపండు కోసి యిమ్ము"అని గణేశదత్తుగా రాజ్ఞనిచ్చిరి. "ఇప్పుడు మామిడిపండ్లెక్కడివి? ఇఁకను వగరు పిందెలు–ఏడ్పుగొట్టు మొగమువయితివే"అని ఆమె కసరెను.

గణేశప్రభువుగారు మరల దొర్లుట కారంభించిరి. ఏడ్చుచు నాకు మామిడిపండును గోసియియ్యకున్న పుస్తకములు చించి పారవేయుచున్నాను అనఁజొచ్చెను.

ఆసోదరి పాపము ఏమియును జేయలేక "తమ్ముడూ! పచ్చికాయలు కొఱికిన జబ్బుచేయును. పండినప్పుడు తినవచ్చు" అని చెప్పెను.

కాని యాచపలు డామాటలవినునా? ఆతఁడు "అమ్మా! ఎమే, అమ్మా!"యని పెద్దరాగముపెట్టెను.

"అమ్మ" అను పేరు వినసరికి సోదరికి గన్నులనుండి నీరు బొటబొటరాలెను. వారలతల్లి చనిపోయి నేఁటికి నెన్నియోదినములు కాలేదు. తమ్ముఁడు "అమ్మా"యని దీర్ఘముఁదీయఁగా అక్కకు దల్లి జ్ఞప్తికి వచ్చెను. మారుమాటలేక కన్నీరు తుడుచుకొనుచు సమీపమందున్న మామిడీచెట్టునకుఁ గొంకె తగిల్చియొక కాయ త్రుంపి తమ్ముని చేతిలోఁబెట్టెను.

ఆకాయ చేతిలోఁబడినంతనే యేడ్పంతయు మాయమయ్యెను. సంతోషముతో—

"అమ్మగాక మనల నెవ్వరాదరింత్రు
వర్షమేగాకయెవ్వరు వార్ధినింత్రు"

అని పాడ మొదలిడెను.

బాలకుని ఈగీతమాలకించిన సోదరికి దుఃఖమాగలేదు. నయనములనుండి బాష్పవారి వెలువడెను. ఆమె "గణేశా! ఈగీతమును బాడకుము" అనిమెల్లగ మందలించెను.

ఈమాటల వినఁగానే యాపిల్లవాని కల్లరిహెచ్చి ఇంకను గట్టిగాఁజప్పటులఁ జరచుచు

"తల్లిగాకున్న నెవ్వరు తలచువారు"

అని గొంతెత్తి పాడఁదొడఁగెను.

ఈ పాట విన్నకొలఁదిఁ బాపమాపెకేలనో మనమున భీతిజనించెను. తమ్ముఁడు మాటిమాటికిఁ దల్లినిఁ దలఁచుటచే బెంగకొను నేమొ యను శంకకూడ బొడమెను. ఎంత బ్రతిమాలినను ఆతఁడాపాట మానఁడు. తుదకు రోషముతో నామె "నిన్ను జికుక గొట్టెద" ననెను.

గణేశుడది విని అక్కగారిని బాగుగానుడికించుచుంటినని కడుపు బ్రద్దలగునటుల నవ్వుచు దనముద్దు మాటలతో "కొట్టుము-ఏదీకొట్టుము నీవుకొట్టిన నాకుదెబ్బలుతగులవు లే. నీవు నాన్నవా? లేక బడిపంతులవా?" అని పరుగెత్తఁజొచ్చెను. ఆకన్యకంత నవ్వువచ్చెను. మాట మఱపించుట కవకాశము చిక్కెను. చిఱునగవుతో "గణేశా! నాన్న, బడిపంతులు నిన్ను బాగుగా కొట్టుచుందురా?" యని ప్రశ్నించెను.

గణేశ—నాన్న అంతకొట్టఁడు. కాని బడిపంతులు మాత్రము చావబాదుతాఁడు. బడిలో నెందుకో నవ్విన నిన్న బెత్తముతో వీపు పెట్లుగొట్టినాడు.

కన్య—అయ్యో! కడునిర్దయుఁడే! కుఱ్ఱవాడు కొంచెము నవ్వఁగూడదా? దీనికై కొట్టవలెనా? ఏమి, బాబూ! దెబ్బలుతినకుండ నీకుఁ జదువురాదా? చదువకున్న గొప్పవాఁడవెట్లగుదువు? బాగుగాఁజదువుకో, నాయనా! నీవుకూడ పంతులుగారంత వాడవగుదువు.

గ—అయిన నేనుగూఁడ అందఱను గొట్టఁగలను.

కన్య—అదేమిగణేశా? నిన్నెవరైనకొట్టిన నీవు సుఖముగ నుండుదువా? అట్లైన నీవితరుల నెందులకు గొట్టెదవు.? నీకప్పుడు దుఃఖము కల్గినట్లే యితరులకును దుఃఖము కల్గదా?

చీకటిపడుచుండుటఁగాంచి యాపిల్ల తమ్మునితో "గణేశా! ఇఁకనింటిలోనికిఁ బోవుదము, పద. నీకు పైమీద నీళ్లుపోసి మంచిబట్టలుకట్టెదను. నీవు పిల్ల జమీంధారునకువలె బల్లమీఁదఁ గూర్చుండువుగాని. నేను అన్న మువండెదను. నాన్నకూడ వచ్చువేళయైనది" అనియెను.

ఇంతలోనింటికి నెట్టావును, దూడయువచ్చినవి. వానిని పశువుల పాకలోఁగట్టి, ఆకన్య చిట్టుదవుడు నావుకు గలిపిపెట్టెను. నడుమనడుమ నాయావు అక్క, తమ్ములఁజూచి తనసంతోషము బ్రకటించుచుండెనా యన్నట్లు తల యూచుచు దాణా తినఁజొచ్చెను. ఆపిల్ల ప్రేమతో దాని వీపుఁజఱచుచు నిల్చెను. ఆపిల్ల స్వయముగ నిత్యము నాపాకభాగమునూడ్చి నీటితోఁగడిగి శుభ్రము చేయుచుండును. గోవునకు సేవచేయుట చాల పుణ్యమును సంగతి యామె తనతల్లియొద్దనుండి నేర్చికొనెను.

## ౨
## తండ్రి—కుమార్తె

ఆపిల్లల తండ్రిపేరు రామచరణదీక్షితులు. ఈతఁడు ఆసమీపమున గ్రామమునందొక జమీందారునికడ నుద్యోగినుండెను. ప్రతిదినము నుదయముననే యచ్చటకుఁబోయి సాయంకాలమువఱకు బనిఁజేసి రాత్రి యింటికివచ్చుచుండును. అతనిభార్య జీవించియున్నప్పుడు ఒక్కొక్కమారాతఁ డింటికిఁగూడ వచ్చెడువాఁడు కాఁడు. భార్యపోయి సంవత్సరమైనది. అప్పటినుండియు నాతడే పిల్లలకొఱకు అనుదినము నింటికిరావలసి వచ్చుచున్నది. అతనికి బ్రతిదినము రెండుక్రోసులకుదక్కువ నడకయుండదు. కాని యేమిచేయఁగలడు? పిల్లలపై మమకార మొకవంక, పొట్టకూటికై చింత మఱియొకవంక.

సంధ్యాసమయమయ్యెను. మెల్లఁగఁ బ్రపంచకంబంతయు నంధకారబంధురమయ్యెను. నేఁడు దీక్షితులు మాత్ర మింకను నింటికిరాలేదు. ఆతఁడెంతకును రాకుండుటఁగాంచి యాపిల్ల భయపడుచుండెను. రాత్రి యధికమయినకొలఁదిఁ గుమార్తెగుండె లధికముగా గొట్టుకొనఁజొచ్చెను. గణేశదత్తుఁ డానందముగ నాఁడు

కొనుచుండెను. నడుమనడుమ నాన్న రాలేదా? యని తండ్రిమాటగూడ జ్ఞాపకముచేసికొనుచుండెను. ఆకన్య కేమియు మనస్థిమితము లేదు. సంజెకసవునూడ్చి దీపముల వెలిగించి పక్కలదులిపివేసెను. తండ్రికిఁ గాళ్లుకడుగుకొనుటకు నీళ్లు, తమలపాకులు మొదలగునవియన్నియు యథాస్థానములలో సిద్ధముచేసియుండెను. కూరవండి దింపెను. పప్పుపులుసు కాఁగుచుండెను. అన్నమునింకను వార్చలేదు. దానిపైదృష్టిలేక తండ్రిరాక కెదురు చూచుచుండెను.

గణేశదత్తునకు నిద్ర యారంభమయ్యెను. అతఁడు మరల రాగాలు మొదలుపెట్టెను. ఇదికాంచి వెంటనే యన్నమువార్చి తమ్ముని జంకజెట్టుకొని మధ్యాహ్నముచేసిన మిఠాయిముక్క తినుటకునిచ్చి కొంచెము పాలుద్రావించి పరుండఁబెట్టుటకుఁ గదిలోనికిఁ గొనిపోయెను. కాని యాపెధ్యానమంతయుఁ దండ్రిమీద నేయుండెను. "నాన్నగారు నేఁడింకనురాలేమి? ఇంతదూరము పొలముగట్లవెంబడిఁ జీకటిలోఁబడి యెట్లువత్తురోగదా? నేఁడాయన యెన్నిచిక్కులుఁబడుచుండిరో? అయ్యో! వారు మాకొఱకెన్నికష్టముల ననుభవించుచుండిరి!" అని యామె యాలోచింపదొడఁగెను. అంతనొకసారి తమ్మునివంకకుతిరిగి "గణేశా! నీవు బాగుగఁజదువుకొని పెద్దవాఁడవుకమ్ము. అప్పుడు నాన్నగారింతశ్రమపడ నక్కరలేదు." అని కన్నీరుపెట్టుకొని వెంటనే తుడుచుకొనెను.

రాత్రి యొకజాము గడచియుండవచ్చును. ఒకయువకుఁడువచ్చి ఆగుమ్మమున కెదుటనిల్చెను. అతని వయసునకుఁదగు మంచిదుస్తులుగాని, విలాసచిహ్నములుగాని యాతనిశరీరమున లేవు. పీడితునిదేహమట్టులాతనిశరీరము క్షీణించియుండెను.

ఆయువకుఁడాద్వారముకడ నొకనిమిషము నిల్చెను. దూరమునడచుటచే నలసటఁజెందెను. ఇంటిలోఁ బ్రవేశించి నలుమూలలఁజూచి వెంటనే వెనుకటిసంగతులు స్మృతికివచ్చుటచే నొక పెద్దనిట్టూర్పువిడిచెను. మెల్లమెల్లఁగ లోనకుఁజొచ్చి "లక్ష్మీ!" యని కేకవేసెను.

లక్ష్మి తనతమ్మునియొద్దఁ గూర్చుని నాతనికి నామాటయు నీమాటయుఁ జెప్పుచుండెను. తండ్రిమాట వినునరికి నాతనిదుఃఖమంతయు గాలికిమబ్బువలెఁ బటాపంచలయ్యెను. "నాన్నగారూ!" అని యఱచుచు గణేశదత్తుకూడఁ బరుగునవచ్చెను. లక్ష్మి త్వరితముగవచ్చి "చీకటిపడెనగదా యని విచారించుచుంటిని" అని పలికెను.

"నేడు పని యెక్కువగానున్నది. అందుచే వచ్చుట యాలస్యమయ్యెను." అనుచు దీక్షితులు తన బట్టల దీసివైచెను. కాలుసేతులఁ గడగికొనివచ్చి గణేశు నొడిలోఁబెట్టికొని కూర్చుండెను.

చల్లారిపోవునను భయముతో నామె యింతవఱకుఁ బెసరట్లను వేయలేదు. అవివేయునరికి నాలస్యమగునను నుద్దేశ్యముతో మిఠాయి నొకటిఁదెచ్చి తండ్రికిచ్చి లోనకుఁబోయి, నిప్పునెగసనఁదోచి పెనముకాల్చి పెసరట్టును వేసి, మంచినీరునుగొనికొని తండ్రియొద్దకువచ్చి నిల్చెను. అతఁడు కుమార్తెవంకకుఁదిరిగి "అమ్మా! లక్ష్మీ! ఇప్పటినుండియు సంసారకార్యములలో నేర్పుసంపాదించితివే! నాకై యీమిఠాయి నెందులకు జేసితివమ్మా! నేనిల్లువదలినదిమొదలు నీవీపనిపాటలలోఁబడి కొట్టుకొనుచుందువా? శక్తికిఁదగనిపనిఁ జేయకు. తల్లీ! నీదార్ఢ్యమునకుమించి కష్టపడిన రోగమువచ్చి పడిపోదువేమో సుమీ! నీకు రోగమువచ్చిన గణేశు నెవరుచూతురు? నాగతియేమగును? మిఠాయిగిఠాయి నవసరములేదు. ఏదోవిధముగ నాల్గుగంజిమెతుకులు దొరికిన నదియే పంచభక్ష్యపరమాన్నములు" అని అనెను.

లక్ష్మి శిరమువాల్చి "లేదునాన్నా, నేను బగలంతయు బనిపాటలుచేయుటలేదు. నాకుఁ గావలయునంత తీరుబడిగలదు. సెనగలువిసరి, ఇంట్లో బెల్లముండనేయున్నది గనుక గణేశునకొఱకు నేవో రెండుండలు చేసితిని. పిల్లలందరుఁ జిరుతిండ్లుతినుచుండ వానికిబుద్ధి వానిపైనుండును. అందుచే నేనును జేసితిని. సెనగలు విసరుట నెరుఁగుదును. అదియంత పెద్దపనికాదు. నేఁడు రాత్రిపడిపోయినది. మీరాకకెదురుచూచుచుఁ గూర్చుండుటచే ముందుగఁ బెసరట్లనువేయలేదు. కొంచెము మంచినీరు పుచ్చుకొనుఁడు. ఇంతలో పెసరట్లు తిరుగవేసి మిమ్ములను గేకవేయుదును." అని ఆపిల్ల మరల నింటిలోనికివెళ్లెను.

దీక్షితులు లక్ష్మి తెచ్చియుంచిన మంచినీళ్లను ద్రావుచు నాలోచింపఁదొడగెను.—"పండ్రెండేండ్లపిల్లకు నీబుద్ధిఏమి? ఆపెక్కపనులన్నియు నెవరునేర్పిరి? నేర్పుట కెవరున్నారు? నాదురదృష్టమే యామెనింత నేర్పరిగాఁ జేసెను! ఆమె స్వయముగానే ఈపనులన్నియు నేర్చెను. మాలక్ష్మి నాపట్ల సాక్షాల్లక్ష్మియే. ఆమెకార్యములందణుమాత్రము దోషముకానరాదు. ఇప్పటినుండియు నామె యెంతచాతుర్య మలవడఁజేసికొన్నది! చిదానందముతో గంతుచు సంతోషముగఁ గాలముగడుపవలసినదినములే! నా దురదృష్టవశమున ముక్కుపచ్చలారనిపిల్ల ముసలిదానివలె సంసారకష్టములలోబడి కొట్టుకొనవలసివచ్చెనుగా! విసరుట, దంచుట, వంటచేయుట ఇంకను ఎన్నిపనులు చేయవలయునోగదా! పుట్టింటనే యొకగడియ విశ్రాంతినైన నోచుకొనలేదా? నాస్థితి నాలోచించిన మాపిల్లను భాగ్యవంతుని కీయఁగల్గుదునా? అన్నిటికిని శ్రీమన్నారాయణుఁడే కలఁడు. దుఃఖితులను దుఃఖమునుండి తరింపఁజేయువాఁడాతఁడే. ఆపరమాత్ముఁడుదక్క నాకు శరణ్యుఁడెవ్వఁడు? అతఁడే నాకు సహాయుఁడు. హే! శ్రీమన్నారాయణా! నిర్భాగ్యురాలగు మాలక్ష్మిపై నీకు దయరాదా?"

అని యాలోచించి యొక పెద్దనిట్టూర్పువిడిచె. ఇంతలో లక్ష్మివచ్చి "వడ్డించితిని వచ్చి భోజనము చేయు" డని పిలిచెను. భోజనముచేయుచు దీక్షితులు లక్ష్మివంకజూచి "ఏమమ్మా! నీబట్టలన్నియుఁ జినిగినవా?" యని ప్రశ్నించెను, "లేదునాన్నా! రెండుచీరలు క్రొత్తవి నాపెట్టెలోనున్నవి." అనిచెప్పి యేదో పనిమీద లోనకుబోయెను. ఇంతలో గణేశుడు "లేదు, నాన్నా! అక్కయ్య తనబట్టలను ముష్టిదానికొకదానికిచ్చివేసి తానుఁ జినిగినబట్ట కట్టుకొన్నది." అనిచెప్పెను.

దీక్షితులు లక్ష్మిని దగ్గరకుఁబిల్చి "నీబట్టల నెవరికిచ్చితివి?" యని యడిగెను.

లక్ష్మి మోమువంచి భయపడుచు "నేఁ డొకచీకుముసలిది. గ్రుడ్డిది. ఒకపుత్రవానివెంట వచ్చినది. ఆమెవంటిమీద నొక పాతగుడ్డప్రేలికమాత్ర మున్నది. నేనదిచూచి దానికి నాప్రాతబట్టల నిచ్చితిని. అది నన్నెంతో ఆశీర్వదించినది. నాయొద్దనింకను రెండుబట్టలున్న" వని మెల్లగఁ జెప్పెను.

దీక్షితులు లక్ష్మికిఁదగు తండ్రి. అతఁడున్న దారిద్ర్యావస్థలో మరియొకడైన మండిపడియుండునేమో. దీక్షితునకుఁ గోపము రాలేదు. సంతోషించి చిరునగవుతో "అమ్మాయీ! అయినఁ గ్రొత్తబట్టల నేల యిచ్చితివి కాదమ్మా?" యనెను.

"అవును. క్రొత్తబట్టలనిచ్చిన నామె మరికొన్నిదినములు సుఖముగగట్టుకొనుట వాస్తవమే. కాని ఏమిచేతును? మనము గూడ ధనికులముకామే?" అని యామెపలికెను.

కుమార్తె సూక్ష్మబుద్ధిఁగాంచి ముగ్ధుఁడై యాతండ్రి ప్రేమార్ద్రహృదయముతో "నీకెంతటి గొప్పహృదయము కలదో యీనిర్భాగ్యునిఁట స్పష్టముకాదు. ఆనారాయణమూర్తి నీకు మేలొనగూర్చుగాక" యని పలికెను.

—మిగిలియున్నది.

## మాంచాల

శ్రీమతి మదమంచి అనంతమ్మగారు

౧

"ముత్యాలసవకమ్ము మురువార బెంచిన నయగారికూచి నానాణెకాడు
కన్నమనీడు నాకన్నులవెన్నెలా ముద్దురాయన్న నామోజుకాడు
బ్రహ్మనాయడు బిగ్గపట్టి చెక్కిలినొక్క వసవల్చునట్టి నావన్నెకాడు
నాయకురాలు మన్నారు లోలోగుల్లి పైకిప్రేమించు నాజూకుకాడు

నాకుగాయక మెనసిన నాటినుండి
వింతగురిపించు వన్నెల విసనకఱ్ఱ
బ్రాహ్మణుని పట్టుదలచేత బాలచంద్రు
డుదయమునుండడో రవి క్రుంకకుండునేమొ.

కారెమపూడి యుద్ధమున కాపలనాటి పసిండికోటపై
సారెకు వెల్మబావుట ప్రచండమరున్నదదంతరిక్షమై
హోరున నార్చుచున్నది మహోద్ధతి బోరుకలంగ భేరికా
వారము ప్రాణనాథు డిటువచ్చునో? పాళెము పట్టిపోవునో?

'జయజయ చన్న కేశవ' యను ధ్వనులతో ఆవులించినది వియత్తలంబు
బారుటీటెల పరస్పరఘట్టనలచేత అంతరాళంబు నిప్పులమికొనియె
మల్లుచరుపులచేత మల్లడిగొనిపోయి మారుమ్రోగెను దిశామండలంబు
వీరపానముజేసి విజ్జోడుపడివచ్చు వెల్మదొరలధాటి విరిగెభూమి

కాళరాత్రిమీద గాలివానముసురు
క్రొత్తసౌధమునకు గురుతువట్టి
రాగలండో? లేడో? రప్పించిచెప్పెడి
వీరబోధ సుంత వినునో? వినడో?

సానివారి మేటిసబ్బాయి కిచ్చెడి
మూడుగరిసె లాణిముత్తియములు

కాపుబంచి వాని గాలించి తెప్పించి
సావరాలమీద జల్లినాను

ప్రతిదినంబు వ్రాసిపంపెడిలేఖలు
దేవిడీలనుదాటి తిరిగిపోవు
దాచినానువాని దైవమా! యాప్రేమ
మాన్పలేక బైసి మాలినైతి.



పెండ్లినాడు దప్ప ప్రేమారగాజూచి
మాటలాడనైతి మధురముగను.
మాదువదిన మగువ మాంచాలతలదుబ్బు
దోనెకడుపు చెవులు దొప్పలనుచు
పలుక కారణమేమోయి? బ్రాహ్మణుండ!
ఆడుతోడున బుట్టవేమయ్యనీవు?
ఇంతవలపాక్షికము బూనితేమి?తండ్రి!
సానిసబ్బాయి నీకేమి సారెబెట్టె?
మగువమాంచాల యివ్వని మాన్యమేది?
నల్లగొండలకోనేటి నట్టనడుమ

జారుబండల గుడిమెట్టకోరిమీద
ఏడుబరులను దాటించి తేనితేజి.
పక్కుమని ప్రక్కలై తలబగులుగాక!
జగతిపై బుట్టి నిర్భాగ్యజన్మనైతి
భర్తమెచ్చని యీ భోగ్యభాగ్యమేల?
కర్మఫలమును దాటగాగలరె జనులు?
గండువారాడుబిడ్డనై గణుతికెక్క
చెట్టబట్టితి శీలము చిన్నవాని.
అత్తవచియించుమాటలం దర్థమేమొ?
'చిట్లగూడదు ముత్యము; చెదరరాదు
గంధపుంబూత'యనె మాదు కలయికలను.
మరుగుపరచెడి మాతల్లి మతమదేమొ
చెప్పినట్టులేజేయుట శీలవృత్తి.
రెండువంశము లీనాము రేవులోన
నల్లలనుద్రెంచుటకు వచ్చినదిరణంబు
కోడిపందెముమూల మీఘోరమునకు
నాగులేటినప్రేగులు దోగునాడు
చిగురుచింతలపై గ్రద్ద లెగురునాడు
గోలెములుపన్ని నక్కలు గూయునాడు
మేటినలగాము తలమింట మీటునాడు
మలగిగచ్చలు పలనాట మొలుచునాడు
సొగసినాయకురా లిలదెగిననాడు
వలసబోయినరౌతులు వచ్చునాడు
బ్రహ్మనాయడు ఖడ్గము బట్టునాడు
పీన్గుపెంటల గురిజాల బెనుగునాడు
బాలచంద్రుని రక్తసంప్లావితమయి
భూతధాత్రి పరిశ్రాంతి బొందునాడు
గుత్తికొండబిలంబులో కూడికలును
తుదకుకారెమపూడిలో మదుగులున్న

పంతుగలిగెంచెగాబోలు బ్రహ్మమాకు"
అనుచుచింతాభరమ్మున ననలుసంధ్య
మగువమాంచాల మేడపై తగటుదీర్చి
చెక్కుటను చేయిజేర్చి యోజించుచుండె—

౨

కేలిడి ముక్కుమీద తులకించెడిరూపము 'నాట్టె'గాంచి "మాం
చాల విరూపిగాఁదలఁచి సానిగృహంబున కేగినాడ ఛీ!
ఛీ! లలనా ! నికృష్టమతి జీవితమెల్లను వీటబుచ్చుచున్
గాలికుటీరమందు కనుగానక నే వసియించినాడనే?"

3

పాచిముడిచి కాసెబంధించి కోలెమ్ము
జబ్బలోఁఉసి దొనలు చౌకళింప
విల్లునమ్ముబట్టి వెనుకనిల్చిన బాల
చంద్రుగాంచె సాధ్వి సాధ్వసమున.
కాంచి మాటలాడగా కొంతయుంకించి
తేరిచూడలేక తిరిగిపోయె.
తివిరి దేటనీరు దెచ్చి దక్షిణపాద
కమలమొకటి గడిగె కాంతునకును.
"మాంచాల ! రెండవది మానినావదియేమి
గండువారాచారకాండ గాబోలు?"
"పల్నాటివీరుడా! పరిగణింపవదేల
సానిసబ్బాయి దాచరణంబుగాద?"
"కోమలీ ! యిదియేమి, కుడిపైటవేసితివి
శీలమువారి దాసీకైనలేదె?"
"గండువారింటిలో గాలిసైతముగాని
కుడివైపుగావీచు, కోల్పోదుపటిమ"
"తములపాకు రెండుదరుల జీల్తువదేమి?
వేరుబంధముజేతువే? వీరపత్ని!"
"సానిదాతుంపు నీ సతిదియీతుంపు
వీనెలాగునిన్ను వెతకి తీసితిని."
నవ్వినాడు బ్రహ్మనాయనికొడుకు
మాంచాల రెపరెప మదుగుకేగినది.

వీరగంధముదెచ్చి విరజిమ్మమీద
వీరచిహ్నముగాగ వెన్నుతాచినది
తమ్ములమందిచ్చి దరికిజేరినది
అత్తజెప్పినమాట నాదరించినది.
బాలుడు తనకాలిపై డిమువ్వలను
విసరివైచినాడు కసిదీరపైకి
మోముపైకెత్తకా ముదితపల్కినది—
"పల్నాటియుద్ధమే పచ్చిసునీకు
త్రోసిరాజు నీకు తోడివార్బలము.
బ్రతికిన పల్నాడు రతనాలమేడ
చచ్చిన పల్నాడు పుచ్చలబీడు.
విసరుమా నీ వెల్మబావుట
వింటికినిమంటికిని హోరుగ
కరుడుగట్టని రక్తధారలు
తిరుపమిచ్చుచు పిరికివారికి. వి॥
కాలుబెట్టిన కదనరంగము
ధూళిగప్పగ క్రోలుపులివలె
కోలవాహిని దూలనేయుము
సోలి నాయకురాలుబొంగ. వి॥
వెన్నుచూపని వీరవరుడని
విన్ననాటికి నేనుపలువురి
కన్నులను బడగలను లేదా

మదరాసు సేవాసదనము



బుటేదారిపని

మున్నుగా రణమునకు బ్రొయ్గదు. వి॥
పారివచ్చితివేని యిరువురు
పడుతులింటగలా రటంచును
పసుపుముద్దలు బిందెపై నిడి
ముసిముసిగ నవ్వేదరు దాదులు. వి॥
బాలునిరక్తము పైకిపొంగినది.
కునిసిరోమములు గగ్గురుపాటుజెందె
మగువ మాంచాలిని మగుడవీక్షించె—
రూపపిపాసితయై రోసెసర్వమ్ము
అధరపుటంబులు నదిరిపోసాగె
తన్మయత్వముజెందె తనువెల్లనపుడె—
"కారెమపూడికే కదలమాంచాల
రాజ్యమేల? నేను రాజుగానేల?
నీదుసౌఖ్యాంబుధి నీదులాడకయ—
కనికరింపుము నన్ను కలికిమాంచాల!"
అనెనో, లేదో! గుండెలదరిపోనిల్చి
పులివిధానచెలగి కలికిపల్కినది—
"మధురజీవన! ఎంతమందిపోలేదు?
షట్చక్రవర్తులు చావకున్నారె?
మనమెల్లరము నిల్తుమనుమాట నిజమె?
క్షణములోరాగల చావుచెప్పదువె?
సుఖమెప్పటికి మనసొమ్ముగాబోదు
కష్టసుఖములు తప్పగలవె జీవులకు
కర్మభోక్తయొకడె కడతేరగలడు
కర్మలేనివ్యక్తి కలుగబోదొకటి
ప్రకృతివినాశమే ప్రాజ్ఞుడూహించు
ఉన్నదిబోదు లేకున్నదిరాదు
లెమ్ము కారెమపూడి లెంకకుగదలి
కర్మభాజనుడవై ఖడ్గమ్ముబట్టి
త్రుంచితూటాడుము దొడ్డడికాండ్ర
శాంతిశాంతియనుచు సౌఖ్యమ్ముగోరి
పడతులచేతిలోపల బొమ్మలైన
పలనాడు మీచేత పాలితంబౌనె?
దౌర్జన్యమూని యుద్ధముజేయబొమ్ము—
పల్నాటిరక్తంబు పలుచబారెనొకో?
వింటిని నేటి కీవెల్మబాబులకు
నాలుకపై బొంకు నడిపీపుపోటు
సున్నయటంచు మీచొప్పుబరికింప.

శీలమువారివంశమున ఛీ! యిటువంటి నికృష్టుడైన రా
చూలి జనించెనే? వెనుకచూపును, వెన్నునతూపు జన్మజ
న్మాల కెఱుంగ ఱట్టిపలనాటి మహాత్ముల రక్తధారలో
కాళిమ నేడుగన్పడియె గట్టిది నా మెడతాళి యింతకున్."

## ౪

నివరమాటవినియె శీలముసింహాంబు—
నుమికె బైటికొక్క దూకులోన—
నవ్వుకొన్నదపుడు నాజన్మఫలమేమి
నేరపత్నినినుచు ధీరురాలు....

# స్త్రీధనము

పెమ్మరాజు సత్యనారాయణగారు బి.ఎ.

స్త్రీధనమనఁగా స్త్రీకిఁగల చరస్థిరరూపకమైన ఆస్తి. అట్టిఆస్తి హక్కులనుబట్టి రెండు విధములు. (1) దాన విక్రయాదిహక్కులు లేక జీవితకాలముమాత్రమే అనుభవింపవలసిన ఆస్తి. ఉదా. వారసత్వమువలన భర్త అనంతరము వింతతువునకువచ్చు ఆస్తి. ఆయాస్తి వితంతువు తదనంతరము భర్తవారసులకుఁ జెందును. (2) దానవిక్రయాదిసమస్తహక్కులనుగలిగి, తన అనంతరము తన సంతతివారికే చెందఁజేయనగు ఆస్తి. రెండవదియే నిజమగు "స్త్రీధనము" అనియు, మొదటిది "వితంతుయాస్తి" అనియు స్థూలదృష్టిని వాడుదురు.

మనహిందూధర్మశాస్త్రమునకు శ్రుతిస్మృతులే మూలాధారములని అందఱకును దెలియును. "శ్రుతి" యనఁగా వినఁబడినది. భగవంతునివలన ఋషులకు వినఁబడినదే శ్రుతి. వేదములు నాలుగు, వేదాంగములు ఆఱు, ఉపనిషత్తులు 18 శ్రుతులనఁబడును. "స్మృతి" యనఁగా జ్ఞాపకముంచుకొనఁబడినది. ఋషులే తాము విన్నది వల్లించుటవలనను, వల్లింపఁజేయుటవలనను, శిష్యపారంపర్యముగా జాగ్రత్తపెట్టుచున్నను; వేదములోని కొన్నిభాగములు మఱచిపోవుట తటస్థించెడిది. అట్లు మఱచిపోయినవి మఱల జ్ఞాపకము తెచ్చికొని కొందఱు గ్రంథముల రచించిరి. అట్టి గ్రంథములేస్మృతులు. స్మృతులుద్వివిధము (1) ధర్మసూత్రములు. ఇవి వచనరూపకములు. ముఖ్యకర్తలు: గౌతమ, బోధాయన, ఆపస్తంబ, పరాశర, వశిష్ట (2) ధర్మశాస్త్రములు. ఇవి శ్లోకరూపములు. వచనరూపకములగు సూత్రములనే కంఠస్థము చేసికొనుట కనువుగ నుండుటకుగాను శ్లోకరూపమున కొందఱువ్రాసిరి. వారిలో ముఖ్యులు మను, యాజ్ఞవల్క్య, కాత్యాయన, బృహస్పతి, వ్యాస, నారద, విష్ణు, దేవల.

రానురాను ఈస్మృతులమీఁద వ్యాఖ్యానములు, నిబంధనములు బయలుదేఱినవి. వానిలో ముఖ్యమైనవి:—(1) విజ్ఞానేశ్వరుఁడు యాజ్ఞవల్క్య స్మృతిమీఁద "మితాక్షర" అను వ్యాఖ్యానము క్రీ॥ శ॥ పదునొకండవ శతాబ్దమున వ్రాసెను. ఇయ్యది బంగాళారాజధానియందు తప్ప తక్కిన అన్ని రాజధానులందును అనుసరింపఁబడుచున్నది. (2) జీమూతవాహనుఁడు మనుస్మృతి ననుసరించి "దాయభాగము" అనునది క్రీ॥ శ॥ పదమూఁడవశతాబ్దమునవ్రాసెను. ఇది బంగాళాదేశములో ననుసరింపఁబడుచున్నది.

ఈరెంటికి ముఖ్యమైన భేదములు:

మితాక్షర (చెన్నపురిరాజధాని వగైరాలు)

1. జననమే ఆస్తికిహక్కునుకలిగించును; కుమారుఁడు తండ్రితో కుటుంబాస్తికి సమానమైనహక్కుదారుఁడు.

2. తండ్రి కుటుంబాస్తిని అన్యాక్రాంతము చేయలేడు; కుమారుఁడు ఆస్తి విభాగమునకు సైతము దావా తేఁగలడు.

3. అవిభాగపు కుటుంబాస్తిని కుటుంబములోనివారెవరైనను అన్యాక్రాంతము (విక్రయాదులు) చేయలేరు.

4. రక్తసంబంధముబట్టి వారసుతనము కలుగును. కావున సోదరీపుత్రులు వగైరాల హక్కులు దూరము.

దాయభాగము (బంగాళారాజధాని)

1. మరణమే ఆస్తికి హక్కును కలిగించును; కావున కుమారునకు తండ్రి జీవితకాలములో పిత్రార్జితమునకు తండ్రిపైన హక్కులేదు.

2. తండ్రి సర్వస్వతంత్రుఁడు; పుత్రుఁడువిభాగమునకుగాని, ఆఖరునకు మనోవృత్తికిగాని నిర్బంధింపజాలఁడు.

3. కుటుంబములోనివారెవరైనను తమతమ అవిభాగపువంతువిషయమై దానవిక్రయాద్యధికారము కలిగియున్నారు.

4. పిండప్రదానసామర్థ్యమునుబట్టి వారసుతనము యేర్పడును. సోదరీపుత్రులు వగైరాల హక్కులు దూరముకావు.

హిందూధర్మశాస్త్ర మూలములగు స్మృతులే స్త్రీధనమును నిరూపించినవి.

| | | |
|---|---|---|
| | (1) | గర్భాదానహోమసమయమున - పెండ్లికుమార్తెకీయఁబడు బహుమానములు, దానములు, ధర్మములు |
| మను | (2) | ఊరేగింపుటుత్సవములోని బహుమతులు |
| | (3) | ప్రేమపూర్వకములగు బహుమానములు |
| | (4) | సోదరులవలని బహుమానములు |
| | (5) | తల్లి ,, ,, |
| | (6) | తండ్రి ,, ,, |
| నారద | (7) | భర్త ,, ,, |
| విష్ణు | (8) | భర్త తనపునర్వివాహసమయమున వెనుకటి భార్యకు అపరాధపరిహారార్థముయిచ్చిన ధనము, వస్తువులు. |
| | (9) | శుల్కము (కన్యాశుల్కము) కన్యకై వరుఁడిచ్చిన ధనము కన్యకే చెందును కాని కన్యతండ్రికి చెందదు. |
| | (10) | వివాహానంతరపు బహుమానములు |
| కాత్యాయన | (11) | సౌదాయిక—బంధువుల ప్రేమసూచకములగు బహుమానములు |

మితాక్షర, దాయభాగములు — వారసత్వమువలన పురుషునివలనసంక్రమించినస్థిరచరాస్తులయందు స్త్రీకి నిరంకుశమైన హక్కులేదు. అనఁగా దానవిక్రయాది హక్కులులేవు. కాత్యాయనవచనమేమనఁగా "సన్మార్గరాలును, తన పెద్దలకు విధేయురాలును, నిస్సంతువునగు వితంతువు తనకు వారసుతనము వలన వచ్చిన ఆస్తిని తన జీవితకాలముపఱకు మితముగా అనుభవింపవలెను; తరువాత ఆమె భర్త వారసులు ఆయాస్తిని పొందుదురు."

బొంబాయి, మిథిలా (ఉత్తర బీహారు) ప్రాంతమువారు వారసత్వమువలన పొందిన చరాస్తియందు స్త్రీకి నిరంకుశమగు హక్కుగలదందురు. కాశి, చెన్నపట్నము, కలకత్తా ప్రాంతమువారు నిరంకుశమగుహక్కు లేదందురు. ఇట్టి చరస్థిరాస్తులయందు స్త్రీలకు నిరంకుశమగుహక్కుల నిచ్చుటకొరకు చట్టము ప్రస్తుతము మన దేశమున ఆలోచింపఁబడుచున్నది.

వారసుతనమువలన స్త్రీలనుండి స్త్రీలు పొందినఆస్తి:—అట్టి ఆస్తి వారసురాలి స్త్రీధనము కాదు. వారసురాలి అనంతరము వెనుకటిస్త్రీయొక్క వారసులకే చెందును. కాని, బొంబాయిరాజధానిలో మాత్రము వారసురాలి స్త్రీధనమగును.

భర్తవలనఁగాని బంధువులవలనఁగాని దానముగా స్త్రీకి ఇవ్వబడిన ఆస్తి సర్వహక్కులతోనని సూచింపఁబడనియెడల నది ఆమె స్త్రీధనము కాదు. క్రొత్తవారివలన (బంధువులు కాని వారివలన) దానముగాఁబడిన ఆస్తి స్త్రీధనము అగును.

పుత్రులకుటుంబాస్తి పంచకములో తల్లికివ్వఁబడిన మనోవృత్తి (జీవనోపాధి) సర్వహక్కులతోనని సూచింపఁబడనియెడల ఆమెఅనంతరము అట్టి ఆస్తి తిరిగి కుటుంబాస్తికి జెందిపోవును.

శుల్కము, పెండ్లికాలపు బహుమతులు, పరులవలని దానములు వీనిని స్త్రీ తనయిష్టము చొప్పున చేసికొనవచ్చును. భర్త అనుజ్ఞలేకయే దానవిక్రయాది అధికారములను కలిగియుండును. కాని

యాజ్ఞవల్క్యుడు "రోగము, కాటకము, ఋణము యిత్యాదిబాధసమయములందు భర్త అట్టిఆస్తిని తీసికొనవచ్చును; తిరిగి యివ్వనక్కఱలేదు" అనిచెప్పెను. ఋణదాతలు మాత్రము ఈ హక్కును చలాయింపమని భర్తను గోరలేరు.

కన్యగానున్నప్పుడు లభించిన ఆస్తియందు స్త్రీకి (మైనరు కానియెడల అనఁగా 18 సం॥ వయస్సు దాఁటనియెడల) సర్వహక్కులును గలవు.

కన్యయొక్క ఆస్తికి వారసులు:—

(1) ఏకోదరసోదరుఁడు (2) తల్లి (3) తండ్రి. తరువాత రక్తసంబంధమునుబట్టి బంధువులు. శుల్కము కూడా యీవారసులకే చెందును. కన్యకుఁగాబోవు భర్తయిచ్చు ఆస్తి, వివాహము పూర్వమె యామె మరణించిన అతనికి తిరిగి యిచ్చివేయఁబడవలెను.

వివాహితయగు స్త్రీ ఆస్తికివారసులు:—

(1) అవివాహితయగు పుత్రిక (2) వివాహితయగు బీదపుత్రిక (3) వివాహితయగు ధనముగల పుత్రిక. (4) పుత్రికాపుత్రిక (5) పుత్రికాపుత్రుఁడు (6) పుత్రుఁడు (7) పుత్రునిపుత్రుడు (8) భర్త (9) భర్తవారసులు.

వివాహము అనుమతింపబడనిరకములోని దైనయెడల భర్త, భర్తవారసులకు బదులు తల్లి, తండ్రి, తండ్రివారసులు ఆస్తికి కర్తలగుదురు.

వివాహములు ఎనిమిదిరకములు:–(1) బ్రాహ్మ–సాలంకృతకన్యాదానము (2) దేవ–యజ్ఞశుల్కము బదులు కన్యనిచ్చుట (3) ఆర్ష–యజ్ఞపశువులను గ్రహించి కన్యనిచ్చుట (4) ప్రాజాపత్య–పెండ్లికుమారుఁడే కన్యనుగోరి స్వీకరించుట (5) గంధర్వ – భార్యాభర్తల అనుమతిని గావించుకొను పెండ్లి. పెండ్లికి ముందే గర్భాదానము అయియుండును. (6) అసుర–ధనమిచ్చి కన్యను కొనుగొనుట (7) రాక్షస–కన్యబంధువులను జయించి బలిమిని కన్యనుగొనిపోవుట. (8) పైశాచ–భంగపఱచిన కన్యను శిక్షార్థముగాఁ బెండ్లిచేసికొనుట.

ఇందు మొదటినాలుగు అంగీకరింపఁబడిన రకములు; చివర నాలుగు అంగీకరింపఁబడని రకములు.

## గృహస్థు : గృహిణి

శ్రీమతి వోలేటి నిత్యకల్యాణమ్మగారు

పురుషుండు వికసించు పుష్పరాజంబు
మానిని తద్భవ్యమకరందకణము,
తేనెమాధురిలేని సూనంబుఁగాంచి
నిరసించుచుండు భ్రొందేఁటిసతంబు
కులకాంతనగవుతోఁ దులదూగనట్టి
మందభాగ్యునినవ్వు తుమ్మతలంబెల్ల.
కడుపులో తేనియల్ గల్గు భ్రొంబువ్వ
రామణీయకమీను ప్రకృతిధామమున
అర్ధాంగితోఁగూడనలరు నరుండు
ఇంపులొల్కుచునుండు గృహమందు సతము.
లలితవసంతకాలమనోజ్ఞవేళ
తేనెపూవులు నవ్వుసోనలొసీదు
విమలతేజస్వి ! జీవితకాలమెల్ల
ప్రాణకాంతకు పజ్జ హర్షింపుమయ్యా.
ప్రబలనై దాఘతాపమునశోషిల్లు
పూతేకుఁదమపుమో పుష్పరసంబ !
కష్టాలదశయందు కాంతునిహృదిని
మోదరసార్ద్రింబు నొనరింపు గృహిణి !

# మల్లమదేవి

వేంకటకాళిదాసకవులు

[వెలమవీరుల విహారమున కాటపట్టయిన బొబ్బిలికి మహారాజ్ఞి యీమె. శౌర్యధనుఁడగు రంగరాయని జాయ. మానసంరక్షణమునకు మంటలో దుముకుట వెలమవెలందుల యాచారము. బొబ్బిలిముట్టడినాఁడు బెబ్బులియని పేర్వడిన పాపరాయని సోదరియు వీరపత్నియు నగు నీమె యగ్నిలీనమై నూత్న తేజమున ననంతవీథుల వెలుఁగొందుచున్నది. ఈమె నామము స్మరణీయము. ఈమె చరిత్ర మనుసరణీయము.]

జవమున్ సత్త్వములేని మాభరతదేశమ్మెల్ల నొక్కుమ్మడిన్
సవరింపంగల తావకీనశుభవర్చస్సుల్ మదిన్నిల్పి క్షా
త్రవతీ! నీయనిరూప్యభావనలఁ దోరమ్మైనగీతాలఁ గా
వ్యవిపంచిన్ బలికించుచుండెదరు సుమ్మా భారతీయుల్ సదా.

ఓ వర్చస్విని! నీ సహోదరు సుషుప్త్యద్వ్యక్తమౌ చిత్తమున్
లేవందీసితి వాజిలోనికిఁగడున్ నిర్నిద్రుఁడై యేఁగఁగా;
ఏవో నాఁటి మహత్త్వముల్ మరల మాయీ యాత్మలన్ జ్ఞప్తితో
భావిద్యుత్ప్రతిభన్ సతంబు వెలిఁగింపం బూనుచుండున్ జుమీ!

మరపుతెరన్ మరుంగువడి మాహృదయమ్ముల నేఁటిదాఁకఁ జ
త్తరువువలెన్ భవద్విమలతా విభవమ్ములు మాసిపోయె; నా
తెరవిడె నేఁడు; మాకనుమతింపుము పావనతావకీనదృ
క్సరసిజనిర్గతాచ్ఛమధుసారము లీపయి క్షాత్రశాలినీ!

నీవలె భారతీయజననీగళలంబితపాశబంధముల్
తీవలపోలికన్ సడలఁదీయఁగఁ జాలెడి సోదరీమణుల్
కావలెనంచు దేశము విలాపమొనర్చుచునున్న నేఁడు క
ష్టా! విధి! యామె కంటితడినైనను నొత్తెడువార లుందురా?

నీవానాఁడు విశుద్ధవహ్నిశిఖలన్ దేహంబు నర్పింప నీ
పావిత్ర్యంబులు మింటిపై కెగసి శోభల్ నింపు నక్షత్రమై
యీవేళన్ భరతావనీహృదయచిహ్నీభూతహైన్యాంధవీ
ధీవిద్యుల్లతికాగతిన్ మెరయుఁగాంతిన్ క్షాత్రతేజస్వినీ!

# చాందుబీబి

ఓలేటి సీతారామమూర్తిగారు

గౌనబుగావిడి శ్వేతయాశులమరుంగు
నందుఁబెరుగుచుఁగళలొల్కు నలరుపోల్కి
నంతిపుర సౌధరాజంబు లందుఁబెంపు
నొందివిలసిల్లె మృదుగాంగి చాందుబీబి.



భయదసమరరంగంబున వాలుఁబూని
పొంగుచుండంగ వీరరక్తంబుమేన
యోధశాత్రవుతోఁబోరి యుక్కడంచి
పరగ నుతులనుగొను వీరవనితయామె.
చివురులనుమేసి ముద్దుగాఁ జిన్నిచిన్ని
పాటలనుబాడు కోకిలబాలభాతి
మృదులకంఠస్వరంబుతో నెంతొయెంతొ

మధురముగఁ బాడనేర్చె నామంజువాణి.
రాష్ట్రరాష్ట్రంబులందలి రాజకీయ
పద్ధతులనేర్చికొనుచు నేప్రొద్దునందు
నెచటనేమేమిజరిగెనో యెఱిఁగికొనుచు
బీజపూరునుగాపాడు వెలదిసతము.
సకలవిద్యలు నా నెరజాణనేర్చె
నొగిజనకునింట నహమదునగరమందు;—
ముద్దుతోఁమతనేర్పింప బూనుకొనిన
వెలఁదులకు నేరఁగారాని విద్యలేదు.
మొగలుసైన్యము లహమదుముట్టడించె
నుంతయేనియున్యాయంబుఁ జూడకుండ
న్యాయమగువారసునివీడి యన్యబాలు
నహ! త్వదీయసింహాసనమందునునుచ.
న్యాయవారసుపక్షంపు నయవిశాల
హృదయులందరుఁ జాందుతో నిట్టులనిరి—
"అమ్మ! నీయన్నరాజ్యంబు నపహరింప
నెత్తువేసినారు మొగలాయీలు వినుము.
ఎవనినోయొకనినిఁదెచ్చి యీయహమదు
నగరికతఁడె నిక్కపుటధినాథుఁడనుచు
నాడుచున్నారు తత్పాలనాంతరమున
నాయహమ్మదుఁ గైకొనునాశ వారు;
నారములముంచినను నీవె క్షీరములను
ముంచిననునీవె యోతల్లి మ్రొక్కుచుంటి
మెట్టులీ యర్భకునిజూతొ! యెటులువీని
రాజ్యమునుగాచి న్యాయమార్గముఘటింతొ!"
న్యాయమార్గమువీడి యన్యాయపథము
నందుజరియించు వారలనరసినంతఁ

క్రోధదందహ్యమానహృదయయై కోమలాంగి
ఉష్ణరక్తాపగయుఁ బొంగ నొడలియందు.
"కంఠమునజీవమున్నంత కాలమేను
మొగలువాహిని కధిపతియగుమురాదుఁ
జూడనీయకహమ్మదుఁ జూడుడయ్య!
మొగలులందఱ కబ్బురమునుఘటింతు."
అనుచుఁబ్రతినబూని యయ్యమలచరిత
వెంబడించిన యోధజనంబుతోడ
విమలతరళభయదకృపాణమునుబూని
చేరె నహమదు దుర్గంపుసీమ క్షణము.
మొలకనవ్వొండుతోప నెమ్మోమునందు
"యోధులార! సత్కార్యంబునొండుజేయఁ
బూనియిటువచ్చితిరిగాన పోరునందు
జంకువీడి చెండాడుఁడు శాత్రవులను.
పాఱఁగాఁజూడకుఁడు; మీదుప్రాణములను
గాచుకొనుబుద్ధివీడుఁడు—కదనమందు
హతులమైన స్వర్గానందఱమును
బండొరులఁగాంచుకొనుభాగ్యమొదవుగాక!
కలహమందున విజయమేకల్గెనేని
న్యాయముఁగడంక నిలబెట్టినారటంచు
నొగిమొగలులనోడించిన యోధులనుచు
మనలఁగొనియాడుచుందురు మహినిజనులు."
అనుచునామెనువ్వు పల్కులాలకించి
నంతనేవీరవరులకు స్వాంతమందు
ధైర్యహర్షప్రదీప్తులు దందడింప
"తల్లి! యటులనేజేతుము తప్ప" కనిరి.
బుద్ధిచాతుర్యమునుజూపి పూవుఁబోడి
ఎచ్చుటెచ్చట నెవరెవ్వరెట్టులుండ
వలయునోదెల్పి, దుర్గంబుభద్రముగను

గాచుచుండెఁ దా నబలయేగాని-బాల.
నాల్గుప్రక్కలమొగలు సైన్యములగములు
కోటచుట్టును విడిసెను—కొన్నిదినము
లాయె, మొగలాయిలొకనాటిరేయి నొక్క
మొగివిజృంభించిరె సమరమును బొనర్ప.
"ఓయిమొగలాయిసార్వభౌమోద్భవుండ!
ఏల మాతోడి శత్రుత్వ మింకమీద
నెయ్యుఁడవుగమ్మ యీయవినీతివీడి—
అతులగౌరవమందె దీ వట్టులయిన!
రాజ్యకాంక్షయెనీకున్న—ప్రాజ్యశౌర్య
లక్ష్మి విలసిల్లుమద్వీరరక్తమంత
మేనులందున నొక్కబొట్టైనలేక
పారునట్టులుచేయఁగావలయు నీవు!"
కమ్మనొండట్లులిఖియించి కాంతచాందు
లలిమురాదుకుఁ బంపనాగ్రహముచెంది
యాతఁడిట్లను "నేనొకయబలపల్కు
నట్టివాక్యంబులకు భీతినందుదునొకొ!"
కడఁగిమొగలాయిలు తుపాకిగముల శత్రు
సైన్యములఁగాల్ప తాళగాఁ జాలరై రి
దుర్గమందున్నయట్టి యోధులునుగూడ—
కడిమిసెడె; రక్తపూరితగాత్రులయిరి!
ఆప్రతిహతయోధులనెల్లనరసిచాందు
మేలిముసుఁగల్లనల్లన గాలినూఁగ
"జంకుచుండెదరదియేల శాత్రవులకు
మరచినారె మీదుప్రతినమాట?" యనుచు
భయదవాలొండు (?) కరపల్లవమునఁగ్రాల
నతులసాహసవృత్తి ముందంజవేసి
"ఏలమగవారలయ్యును నిట్లుమిన్న
కుండెదరు? పోరుసల్పుఁడో యోధులార!

అబలనగునేను చూడుడీ! యాహవమున
మొగలుపురుషసింహులధైర్యమునుహరింతు;
ధైర్యవంతులు నావెంటఁదరలిరండు
పారిపొండులోనికి లాతివార"లనుచు
పరులుదుర్గంబులోనికే యరుగుదేరఁ
జూచుచుండంగ నవ్వీరశూరవనిత
ఘనకృపాణమునకుబలిగానొర్చి
యరులరక్తంబు నన్దోఁగియలరెనహహా!
వెంబడించిరి చాందుబీబీని వేల
కొలదియోధులు వెంటనే చలముబూని—
తత్ భయప్రదనయనప్రతాపశిఖల
శత్రుతతిముంచి సమయింపసాగినారు!
"ప్రాణమేపోయినను లీల స్వర్గమందు
గాంచుకొందుముసుండి యొకళ్లొకళ్ల;
నేదిచూపుడు మీశౌర్య మిప్పు"డనుచు
చాందు తద్యోధవరులఁ బ్రోత్సాహపరచె.

* * *

శత్రుసైన్యమునం దలసటజనించె;
లావుగల్గిన యొకమొగలాయిలేఁడు;
అరసిసైన్యాధిపతి మురాదంతకూడ
తనయొనర్చిన దన్యాయమనుచుఁ దోఁప;
తానొనర్చినకార్యంబు తానెరోసి
తద్దయును చాందున్యాయంపు బుద్ధిమెచ్చి
దక్కనును వీడిపోవంగదలఁచి యతఁడు
చాందుకంపంగ నొకలేఖసంతరించె:—
"నీవొక యాసుదానవని
నిస్సమయించుట యెంతటంచునే
భావమునం దలంచితిని
పావనవీరలతాంగి! పోరునన్
నీవొనరించు నద్భుతము
లెంతని నేఁగొనియాడుదున్; ముదం
బావహిలెన్; భవత్ప్రణుత
సాహసవృత్తులు గల్గునేరికిన్!
అనుపమదివ్యవీరలలి
తాంగి! యొకానొకన్యాయకార్యమున్
బొనరుపగాగడంగి యిటు
భూరిమహాద్భుతసంగరంబు నీ
వొనరిచితమ్మ! మెచ్చనగు;
నోటమినాయది, గెల్పు నీయదే!
యని వలదింక; నీవొసఁగు
హమ్మదు నీవనినట్టివానికే!"

* * *

"మొగలు వీరులగెల్చిన ముగుద"యనుచుఁ
జాందుబీబిఁ బ్రశంసించె జననికాయ;
మబలసమకట్టునెడలఁ జేయంగరాని
కార్యమొండైన ధారుణిఁగలుగదమ్మ!

# శరత్కాలదేవతాగారములు

కనుపర్తి అబ్బయామాత్యుడు

భేరీమృదంగకాహళరవోపేతంబులై ధూపధూ
మారబ్ధోరుసుగంధబంధురములై యశ్రాంతనైవేద్యవి
స్తారోదారములై ప్రదీపకళికాసాంద్రంబులై దేవతా
గారంబుల్ నవరాత్రులందనరె విఖ్యాతిన్ శరద్వేళలన్.

మద్రాసు సేవాసదనము



తెనుగు క్లాసు

మదరాసు సేవాసదనము



జలతారుకుట్టుపని తరగతి

# ఆడుబిడ్డలు

"మానిసి"

మనహిందూదేశమున స్త్రీలపైన స్త్రీలు అధికారము చలాయించుట వాడుకలో నున్నది. అందును భర్తయగువాని తల్లియు, యక్కచెల్లెండ్రే యీయధికారము బాగుగ సాగించుకొనచాలియున్నారు. ఇది యంతయు మన స్త్రీల మౌఢ్యమువలననేయని విశదమగుచున్నది.

ఇందులో ఆడుపడుచులగువారు తాము స్త్రీలమేయనుమాట పుట్టింటికివచ్చుటతోడనే మరచిపోవుచున్నారు. వారు వారియత్తిండ్లయందు వారియత్తయాడుబిడ్డలచేత పడినపాట్లన్నియు తలచుకొని, ద్విగుణీకృతమైన పంతముతో వారితోబుట్టినవారి భార్యలకు అత్తింటికాపురమన భయమును యొత్తిడిని కలుగ చేయుచున్నారు.

అరవవారియందు వివాహమప్పుడు మంగళసూత్రముకట్టుటయందు ఆడుబిడ్డలకుకూడ భాగమున్నది. దానిచేతనే "యాడుబిడ్డయనిన యర్థమగండు" అనులోకోక్తి వాడుకలోనికివచ్చినది. అరవలలో అత్త యాడుబిడ్డలు యిద్దఱును యేకమై కోడండ్రకు యెక్కువయొత్తిడి కలుగచేయుచున్నారు. ఆంధ్రులయందు యాడుబిడ్డలను యల్లునితోపాటు కట్నములిచ్చి, లాంఛనములుజరిపి వారిచేత యొత్తిడికలిగించుకొనుచున్నారు.

మనహిందువులకు పిరికితనమెక్కువ. వారు యెవరునైన అనతలచుకొనిన ధైర్యముగ అనుటలేదు. వారి మొగముచాటున సాధించుకొనుచున్నారు. మన స్త్రీలకు విద్యలేమి కాలయాపనమునకై యిరుగింటిపొరుగింటి ముచ్చట్లతోను, కోడండ్లమీద నేరములతోను కాలయాపనము చేయుచున్నారు.

ఈ యాడుబిడ్డలకు వారివారి తోబుట్టువుల భార్యలు తోబుట్టువులతో కలసిమెలసియుండిన యరికాలిమంట తలకెక్కుచున్నది. ఒకవేళ పురుషుడు భార్యను వెనుకవేసికొని తోబుట్టును పొరపాటున ఏమైన అనిన వానిభార్య యేదో మందోమాకో పెట్టి వశముచేసికొనినదనియు, పెండ్లికిపూర్వము తన తోబుట్టినవాడు చాల మంచివాడనియుకూడ చెప్పుచున్నారు.

చిన్నపిల్లలైనకోడండ్రు మంచిచెడ్డలు తెలియక వారితో సఖ్యముగనుండవలయునని యుండినను వారి నైజము వారువదలరు. ఎదురుగ స్నేహభావముచూపినను చాటుగ వారిని ఆ పని చేయలేదని, యీపని చేయలేదనియు చెప్పుచుందురు. ఆడుబిడ్డలకు వారితోబుట్టువుల భార్యలయందు తప్పుబట్టుట తప్ప వేరుపని లేదు. సాధారణముగ వదినమరదండ్రకు సఖ్యముకుదురుట అరుదు.

కొందఱుపురుషులు అక్కచెల్లెండ్రతోచేరి భార్యకు అత్తింటకాపురమన భయదాయకముగచేయుచున్నారు. కొందఱుపురుషులు వారిభార్యల వారితోబుట్టువులతోను, వారి బంధుజాలముతోను లోపాలోపముల వెల్లడిచేసి, వారిని హేళనచేసి వారితో నవ్వువారుకూడ కలరు. మనహిందూసంఘమున ఈ యాడువారిచలాయింపులకు బాల్యవివాహములే కారణములు. అత్తింటియందు పెద్దవారగువారలందఱకు వినయార్థము సేవచేయుటవలన భర్తతోపాటు యందరు భర్తలై నెత్తికెక్కుచున్నారు.

మన స్త్రీలకు బాగుగ విద్య, జ్ఞానముకలిగి యందఱు స్త్రీలు సమానమేయను బుద్ధి కలుగువఱకు ఈ యొత్తిడి పోవచాలదు. మనదేశముననే యత్తనిన పెద్దపులితో సమానముగనుండుట. కోడండ్రగువారు తమ స్వాతంత్ర్యమును తమ జ్ఞానమును అణగద్రొక్కుకొని భర్తకును, వారిఆడతోడునకును వణకుచున్నారు.

పనిపాటలులేని పురుషులు కొందఱు యేమియుతోచక యాడువారితో పుక్కిటిపురాణములందును యాడువారి మూఢత్వమును మెచ్చుకొనుచున్నారు. మనలో పురుషులే కొందఱట్లు మాఢ్యమువహించియుండ సంసారకూపమునఁబడియుండు ఆడువారుఅట్లుండుట వింతకాదు.

ఆడుబిడ్డల యొత్తిడిచేత తోబుట్టువుల భార్యలకు వారనిన కోపము, ద్వేషము; వారనిన గిట్టకుండుట ఇవియన్నియు సంభవించుచున్నవి. మనలో స్త్రీలపైన స్త్రీలకు జాలియు, 'ఆపేక్ష' యులేక తగవులతోను మనస్పర్థలతోను కాలముగడుచుచున్నది.

స్త్రీలకు బాగుగ విద్య యలవడకపోవుటచేత కొంచెము చదువుకొనినవారినిచూచిన చదువుకొనని వారికి హేళన. ఒకవేళ ఒక బాలిక కొంచెముచదువుకొన్నను అత్తింటికివచ్చుటతోడనే యామె విద్యకు నీళ్లువదలవలసినదే.

మనస్త్రీలు యిన్ని అన్యాయముల నోర్చికొనుచున్నారు. కాని వారిని యెదిరించుటలేదు. మనజనులకు సంఘ మెంతపురాతనమైనదైనను సరియే యందుండు అన్యాయముల తెలిసికొనికూడ దానికి యన్యథా నడచుకొనుటకు ధైర్యములేదు. మనసంఘము బాగుగ ముందునకువచ్చుటకును మనయాచారములు నూతనమగుటకును స్త్రీవిద్య యవసరము. స్త్రీలను ఎన్నిశతాబ్దములవఱకు పైకిరానీయక యణచిపెట్టుదురో అంతవఱకు మనసంఘము బాగుపడనేరదు. ఎప్పడు స్త్రీలకు స్త్రీలు లోబడకుందురో అప్పుడే మనము స్వాతంత్ర్యమునకు యర్హులమగుదుము. మనము ముందు స్త్రీబానిసత్వము వదల్చుకొనినకాని పురుషునిబానిసత్వమును వదల్చుకొనలేము.

## దసరా

శ్రీమతి లలితకుమారిగారు

తలిరుటాకులువోలె మెత్తనగువీరి
ముగ్ధహృదయాలనేపూలు పూచెనొక్కొ?
జల్లుచున్నారు హిమబిందుసముదయపు
సన్నపరిమళభరితపుష్పములు వీరు:
విమలనళినీదళాల యందములకులుకు
చిలుకుచిరునవ్వు నేత్రాలఁబలుకులేని
భావములఁదెల్పుచూపుల జీవమొలుక
పాడుచున్నారు నిర్మలభావములను;

వీరుజల్లిన యలరుల తీరుఁజూచి
వీరుపాడినపాటల సౌరుఁజూచి
మెత్తనోయేమొ, యమృతసంపత్తియేమొ,
వీరిమెడఁదలటంచు నే వివశమగుదు.
పూలుజల్లిన మోహనముగ్ధమతులు
పాటఁబాడిన సంపూర్ణభాగ్యశీలు
లలరులన్వోలెఁ బాటలపలుకువోలె
వెలుఁగుదురుగాక వీరు భావిదశలందు.

## విజయదశమి

శ్రీమతి పి. అప్పలనరసమ్మగారు

వచ్చినదినేఁడు మంగళవాద్యములతొ
విజయదశమి; చెల్లెల! వేగవెడలిరమ్మొ
పోవుదము భక్తితో దేవిపూజకొరకు
తలపులందలి మధురవాంఛలు ఫలింప

వత్సరమ్మున కొకసారివచ్చునమ్మ
దశమిపండుగ; లెమ్మొ! పోదము పవిత్ర
మానసంబున పూవులమాలగట్టి
విశ్వజనని పాదములకర్పింతమిపుడె.

# అంబికాస్తవము

రావిపాటి త్రిపురాంతకుఁడు

ఉ. ఆదిమశక్తి యీతరుణి; యాద్యకుటుంబిని యీకుమారి; ము
త్తైదువ ఈతలోదరి; చిదాత్మిక యీసతి; విశ్వమాత యీ
పైదలి; సర్వలోకగురుభామిని యీచపలాక్షి; యంచు బ్ర
హ్మాదులువచ్చి నిచ్చలు హిమాద్రికి నిన్నెఱిఁగింతు రంబికా!

ఉ. కూడెడువెంద్రుకల్ నిడుదకూఁకటఁ గ్రోవుగ బొడ్డుపై వళుల్
జాడగఁదోఁపఁ గ్రొమ్మొలకచన్నులు మించుదలిర్ప సిగ్గునన్
జూడఁగ నేరముల్ మెఱుఁగుజూపుల నీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనమువాడుటగాదె తలంప నంబికా!

ఉ. భారతివై సరోజభవుపాల వసించి; రమావధూటివై
నీరజనాభుఁజెంది; ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరివరించి తమ్మ! నినుఁగొల్వక యీరక యేలకల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా!

చ. బెడఁగగురత్నదర్పణముఁ బేరినవెన్నెలవోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేని కందువోఁ
గడుగక నేరెటేట సితకంజముముంపక నైజకాంతియై
తొడరిన తల్లి నీమొగముతో సరివోల్పఁగఁజాలు నంబికా!

ఉ. వాలినకన్ను ముంగురులు వాతెఱకెంపుమెఱుంగుఁ జంటిపై
గ్రాలెడు తారహారమును గంకణచారుకరంబు డాఁవలం
దూలుచునున్న పయ్యెదయుఁదోఁచిన కన్నులుమోడ్చిమోడ్చినీ
పాలగు నీశుమేనసగఁబాలు మనంబునఁజేర్తు నంబికా!

ఉ. తెప్పలబోరుఁదల్పు లిసిఱింతలువాతెఱచూపుఁ గుంచియం
ద్రిప్పి తళుక్కునందెఱచి తిన్నని మోమునఁగాయువెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూగిన సిగ్గసియాడఁ బ్రీతి నీ
వప్పరమేశుఁజూచి తనువర్ధముఁగొంటి పొసంగ నంబికా!

# ఆత్మార్పణము

కీ. శే. వేగూరి వేంకటసుబ్బమ్మగారు

౧

పురజనులెల్లరు గుంపులుగుంపులుగవచ్చి చూచుచున్నారు. అందరికిని ఆశ్చర్యము, కళవళము. నిన్నటిరోజు భద్రముగనుండి ఏనుగులు ఎక్కత్రొక్కనను కదలని కోటవాకిలి ఈ వేళ ప్రొద్దుపొడవకమునుపే కూలిపోయినది. ఒకమారైన కట్టడముకట్టినవాని పొరబాటనుకొనవచ్చును. ఇట్లు మూడుమారులు పడిపోయినది. ఏదియో కారణముండును కాని ఏమికారణమో ఎవరును జెప్పలేరు.



కీ. శే. వేగూరి వేంకటసుబ్బమ్మగారు

ఆ కాలపువారికి ప్రతి విషయము దేవుడుచేయునని నమ్మిక. అట్లే కోటవాకిలి పడిపోవుటకుకూడ కారణము దైవమేయని చిన్నలు, పెద్దలు, స్త్రీపురుషులందరు నిర్ణయించిరి. ఒక దుష్టదేవత అందు వసించి యున్నదనియు, దానికి తగ్గ బలియీయకున్న వాకిలినిలువదనియుకొందరునిర్ణయించిరి. అందరును ఆ మాట నామోదించిరి. ఎటువంటి వారిని బలియీయవలెనని ప్రశ్నింప తప్ప త్రావి మత్తిల్లి ఒడలెరుంగని ఆవేశపరుడొకడు 'నిండు చూలాలి' ననిచెప్ప నది దైవవాక్యమనియు అట్లే ఆచరింపవలెననియు అందరు నిర్ణయించిరి.

ఇది మహారాజునకుకూడ తెలిసినది. కాని రాజు ఒప్పలేదు. కాలిక్రింద చీమనలిగిన కన్నీరు విడచునట్టి దయాపరు డారాజు. అట్టివారు పూర్ణగర్భిణిని బలియిచ్చుటకు సమ్మతించునా? కనుక ఆ విషయమై ఎవరు చెప్పినను అతను వినలేదు. అందరును చెప్పిచెప్పి విసిగి చెప్పుట మానుకొనిరి.

ఊరిలో ప్రజలకెల్ల ఇదే ఆలోచన. కోటవాకిలి లేకున్న జరుగదు. బలి ఈయక ద్వారము నిలుచుట కల్ల. మహారాజునకు బలియన్న గిట్టదు. ఏమిచేయుదురు? ఎవరికిని తోచలేదు.

౨

గాఢాంధకారము; సుమారు జామురాత్రి గడచియుండును. మహారాజై నరంగరాజు అప్పుడే భుజించి తాంబూలము సేవించుచు కూర్చొనియుండెను. ముఖముచూడ ఏదియో గొప్ప ఆలోచనలో మునిగియున్నట్లున్నది. అప్పుడప్పుడు తాంబూలచర్వణము నిలిపి, వేడి నిట్టూర్పులు వదలుచు దైవమున్నాడని పల్కును. అతనికి ఏమియు తోచలేదు.

అపుడు కామమ్మ భర్తను వెన్నంటివచ్చి మామగారి పాదములపై బడెను. ఇంట వెలుగునది మినుకుమినుకుమను సన్ననిదీపము; మనసున అపారమగు ఆలోచన; సామాన్యముగ జనసంచారములేనిదొంగప్రొద్దు. కనుక రంగరాజునకు తనకుమ్రొక్కిన దెవరో మొదట తెలియలేదు. కొంతసేపటికి గుర్తించి 'ఏమమ్మా! వచ్చితి?' వనెను.

కోడలు అప్పటివరకు మామగారియెదుట నిలచి మాటలాడినది లేదు. ఎట్లుపలుక వలయునో ఎరుగదు. కనుక నిరుత్తరయైయుండెను. మామగారు మరల 'ఏమి, తల్లీ!' అనెను. విధిలేదు; పలుకక తప్పదు. చివరకు గద్గదస్వరమున మిగుల భయపడుచు "కోటద్వారమునకు నన్ను—" అని ఆపై మాట చెప్పలేకపోయెను.

యువరాజు కళవళపాటుతో 'ఏమంటివి?' యనెను. ఆమె ఉద్దేశము అప్పటివరకు అతనికి తెలియదు. మామ కను లెఱ్ఱజేసెను. ముందుమాట ఆమెనోట రాలేదు. తన నోరు ఎవరో నొక్కిపట్టినట్లాయెను. ఆమె నోరు తెరవలేదు.

మువ్వురును కొంతసేపు చిత్రకారుని బొమ్మలవలెనుండిరి. ఒకరి మనసు నొకరెరింగియున్నను ఎవరును పలుకలేదు.

ప్రపంచమున ప్రతిజీవికి ప్రాణము తీపికదా? పశుపక్షులు పురుగులుకూడ చనిపోవ నిచ్ఛగింపరుకదా? అటువంటి లోకమున 'కోటకై బలియయ్యెద'నని స్వంతముగ వచ్చి చెప్పు త్యాగినియగు దేవిమూర్తిముందర పలుక ఎవరిసాధ్యమగును? అట్టి సమర్థులెవరు?

రాజునకు కోడలి మనస్సు తెలిసెను. కంటియందు వెచ్చనిబాష్పములు రాలెను. 'అమ్మా! నీవంతకన్నను గొప్పకార్యము చేయవలసియున్నది. తల్లీ! నావంశదీపమును వెలిగించు భారము నీపై ఉన్నది. మాతల్లివి, సాహసముచేయకమ్మా! నేను నిన్ను పోగొట్టుకొనను. అమ్మా! నీవంటి లక్ష్మిలేకున్న నాకీ మందిరమెందుకు? ఏమిచేయను? నీవు నాయిల్లు ఉద్ధరించ నాయింటికొచ్చిన మహాలక్ష్మివి. నీవిటువంటి పిచ్చిమాటలాడకు'మని పలికి ఆమెను బుజ్జగించెను

11

ఆమె ఏదో మాటాడుటకు ప్రయత్నించెను కాని మాటరాలేదు. నాలుక అంగిట కరుచుకొన్నట్లాయెను. కన్నీటిబొట్లు బొటబొటరాలి అద్దమువలెమెరయు చెక్కిళ్లపై ముత్యములవలె జారిపడుచుండెను. ఏదియు జెప్పలేక మామకూడ కన్నీరువిడుచుచుండెను. భర్త దయ్యముపట్టినట్లు నిలిచిపోయెను. తన కండ్లముందర జరుగు విషయములు చూచుచు, వీనులార వినుచున్నను, అన్ని విషయములు మనసునకెక్కినను, అతడు ఏదియు తెలియని పిచ్చివానివలెనుండెను. ఏమి చెప్పుటకును తోచలేదు. ఆశ్చర్యముతో భ్రాంతునివలెనిలిచి యుండెను.

కొంతసేపటికి రంగరాజు 'తల్లీ! నీహృదయము గొప్పది; దేవతవలె పూజలుబడయ వలసినదానవు; తప్పి మనుజులలో పుట్టితివి; నా పుణ్యముచే ఈయిల్లు జేరితివి. ఇంకను అనేకకాలము బ్రదికి, నన్ను నా పిల్లలను కాపాడు'మని కేల్మోడ్చెను.

కామమ్మ భరించలేకపోయెను. ఎందుచేతనో పసిబిడ్డవలె వెక్కివెక్కిఏడ్చెను. రాజునకుకూడ గొప్పసమయములందు వచ్చు దుఃఖమపుడు వచ్చెను. యువరాజు సరేసరి మైమరచియున్నాడు. కంటియందు నీరుమాత్రము కాలువలై పారుచున్నవి.

3

తెల్లవారినది. కరపాదములులేనివారు, అనూరులగువారు నిమిషములోజగమంతయు తిరుగు అరుణునివలె బహువేగముగ రాజనగరునకు పోవుచున్నారు. ఎట్లెట్లో రాజమందిరములోనివిషయము అందరికిని తెలిసిపోయినది. పలువురు పలువిధములనిరి. లోకములో ప్రజలను సృష్టించినవాడొకడైనను మనస్సులను సృజించినవారనేకులై యుందురు; లేకున్నపై విధము లెట్లుండును?

రాజమందిరమందుకూడ కొంత మార్పుగలిగినది. మందహాసముచే మనోహరమై విలసిల్లు ముంగురులతో, బాల్యమువదలి యౌవనముచేకొన్న కాంతితెలుపుచున్న యందముతో చూచినవారిమనస్సును తక్షణము తనదిగజేసుకొను సుందరివదనము సౌందర్యము మాని గంభీరమునుచేకొనెను. హంసనడకలతో, చిరునవ్వుతో లోకమునుమోహింపజేయు సుందరి కామమ్మ శృంగారమునువదలి గంభీరపౌరుషమును చేపట్టెను. ప్రేమమయమై ప్రేమసుధను గురిపించుచు పతిప్రాణయగుమానిని స్వార్థమునువీడి పరార్థమునందుమగ్నయై ఇహలోకచింతలు వదలి పరలోకసుఖములనుభవించు గృహిణి కాబోవుచున్నది.

నిన్నటిరోజు నవ్వుచు ఆడుకొన్న చెలికత్తెలు నేడు ఊరక చింతిలుచున్నారు. యువరాజు మంత్రబద్ధునివలె ఆమెవెంటవెంట దిరుగుచున్నాడు. ఆమె ఏమియు పలుకలేదు.

స్థిరమై, సౌమ్యమగుదృష్టి. లయముననుసరించి నడచునడకగల మందగమన. ఏదియో అపారమగు ఆలోచన ముఖమున గనబడుచున్నది.

## ౪

అర్ధరాత్రి. జార-చోరులుతిరుగుప్రొద్దు. ఊరిలో జనులందరు తల్లియొడిలోతలజేర్చి సుఖనిద్రనుజెందు శిశువులవలె గాఢనిద్రజెందియుండిరి. అచ్చటచ్చట పహరావారి కొమ్మూదుటలు, రాత్రిపక్షుల ఆరాటముతప్ప ఇక ఏవిధమగుచప్పుడు లేదు. ఎవరికిని నిద్రాభంగములేదు. రాచనగరియందుకూడ అందరు నిద్రించిరి. భయమున కవకాశములేకయుండుటచే కావలివారలుకూడ గాఢసుషుప్తియందుండిరి. ఈసమయమున నిద్రాదేవికి వశులుకానివారు ఒకరిద్దరుకలరు.

అంతఃపురమున దేవిమూర్తి ఒకఆమె. మంచముప్రక్క నిలువబడి కన్నీటితో తన విభునిదర్శనముచేసుకొనుచున్నది. ఆమె ముఖమునందు దేవలోకమువారికుండు గాంభీర్యము, త్యాగము తాండవించుచున్నవి.

గడియారమెచటనో 'టంగు టంగ్' ని రెండుగంటలు కొట్టెను. వెంటనే ఆమె భర్తను వదలి తన నిర్ణయస్థానమునకు తర్లిపోయెను.

ఇంకను సూర్యుడు బాగుగా ఉదయించలేదు. కోటవాకిలిదగ్గర ప్రజలు గుంపులు గుంపులుగ మూగుచున్నారు. అందరికిని ఆశ్చర్యము, వ్యసనము, కళవళము. అమాసనిశియందు మిన్కుమిన్కుమను చుక్కవలె కొద్దిగ తృప్తి, దుఃఖమే ఎక్కువ. కోటవాకిలి మృత్యుదేవత క్రీడారంగమువలె చూచుటకు భయంకరముగఉన్నది. కోటచుట్టుపట్ల, కట్టడమునకై తెచ్చిన రాళ్లు మన్నుగారలరాసులు, ద్వారమునకై తెచ్చిన దంతపుచెక్కలు, గంధపుచెక్కలు పడియున్నవి. వీటి మధ్య అమూల్యదుకూలమును ధరించి పురుషవేషమున సుందరియొకర్తు రక్తమున మునిగి తేలుచున్నది. ఆసుకుమారదేహము తలలేనిదియైఉన్నది. ధూళిధూసరమై సంధ్యవలె ఎఱ్ఱనగు వస్త్రములతో నిండియున్నది. చెట్టునుండిరాలిన పుష్పమువలె తల కొంతదూరమున పడియున్నది. సుందరమగురూపము భీకరముగమారినది. దృశ్యము భయంకరముగను హృదయవిద్రావకముగను ఉన్నది. అందరి హృదయములు తటతట కొట్టుకొనుచున్నవి.

రంగరాజుకోడలు కామమ్మ కోటవాకిలికి బలియైనది. యువరాజు పట్టాకత్తి రక్తసిక్తమై అచటనే పడిఉన్నది. ఆమెశిరము మొండెము వేరువేరుస్థలములపడిఉన్నవి. చుట్టును

రక్తము కాలువలుగ పారుచున్నది. మహారాజు యువరాజులుకూడ అచటనేఉన్నారు. వారిద్దరు నిర్విణ్ణులయిఉన్నారు. ప్రతివారికిని కనుల నీరు నిండియున్నది. ఎవరును పెద్దగ ఏడ్వలేదు. అందరినోట ఒకటేవాక్కు: 'ఆమె ఈఊరిదేవత; ఈ పార్థివదేహమును బలి యిచ్చి ఆఅస్వార్థసుందరి దివ్యదేహముతో దేవతామూర్తియై మనల రక్షించపోయినది.' ఈ మాట తప్ప వేరులేదు. సూర్యోదయములోపల అంతయు ముగిసినది. కామమ్మ పార్థివ దేహము భూగర్భములో అంతర్హితమైపోయినది. భూదేవియు, సౌందర్యసౌజన్యములందు త్యాగవీరలక్షణములందు చెన్నొందు స్వార్థత్యాగినిని దివ్యకుసుమమని తన వక్షమున ధరించినది. వసుంధర ముందు అట్టి రమణీమణిని సృజించు బ్రహ్మకు మాదిరికావలయు నన్నట్లు తనలో ఇముడ్చుకొనెను. లోకముమాత్రము ఆమెను పోగొట్టుకొని దురదృష్ట మనిపించుకొనెను. రాజమందిరము సంగతి వేర చెప్పనక్కఱలేదు. గొప్ప రత్నమును పోగొట్టుకొనెను.

కోటవాకిలి దృఢముగ నిలిచెను. అచట యిపుడు భయంకరమగు హత్యాచిహ్నము లేవియులేవు. అచటఉండునది యొక దేవీధామము. ఆభవ్యమందిరములో ప్రసన్నవదన యగు దేవీమూర్తి నిలిచియున్నది. మందిరము చిన్నదైనను అందమైనది. రంగరాజు ఆ కోటవాకిలికి వచ్చినపుడెల్ల అచట మంగళహారతి యిత్తురు. ప్రజలకెల్ల ఆ దేవిపై చాల భక్తి. ప్రతిశుక్రవారము అచట ఒక ఉత్సవము జరుగుచుండును.

## తెలుగుతెఱవ

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

మాయమర్మములేక మర్యాదగోల్పోక మాధుర్యమునమీఱు మాటతీరు
క్రుంకుజంకులులేక బింకంబుగోల్పోక విప్పారియొప్పారు వెన్నుతీరు
లౌల్యంబులేక చాపల్యంబుగోల్పోక తీపుతీయములూరు చూపుతీరు
క్రొవ్వుంబులుపులేక మవ్వంబుగోల్పోక నడపునబెడఁగారు పొడవుతీరు

అఖిలభారతక్ష్మాభ్యంతరస్థితా
నేకజాతియువతిలోకమునను
నిస్సమానరీతి నెగడుఁగదా తెల్గు
నాతియందు వీరమాతయందు.

# విమలవివేకము

ఆంధ్ర రంగారావుగారు



రాజమహేంద్రవరమున సూరయ్య అను ఒక బ్రాహ్మణుడు కలడు. ఆయనకు విమల అను ఒక కుమార్తెయు, ఆనందుడను ఒక కుమారుడును కలరు. సూరయ్యగారి తల్లికూడ సజీవురాలై యున్నది. విమల వివాహ విషయమై మేనరికమే చేయవలయునని ముసలిది గట్టి పట్టుదల కలిగియుండెను. వారు బీదవారైనను మూతికి చేతికి ఎంగిలి లేని సంబంధమని తలచి సూరయ్యగారు మేనల్లుని తీసికొనివచ్చి తమ గృహమందే యుంచుకొని చదువు చెప్పించుచుండిరి. ఇంటిపేరు కస్తూరివారు. ఇల్లు గబ్బిలపుకంపు అనునట్లు చదువునది మూడవఫారము; రెండవమారైనను మేనల్లుని వేషములకు లోటులేదు. హాజలైన్ స్నో, సులోచనములు, షూట్సు, హైక్లాసు సబ్బులు, సెంట్లు యివి తప్పకయుండవలెను. ఎంతతంటాలుపడిన ఏమిలాభము? మేనల్లునికి మచ్చుకుమాట్లాడ మన్నను ఇంగ్లీషురాదు.

తాచెడ్డకోతి వనమెల్ల చెరచినదన్నట్లు సూరయ్యగారి మేనల్లుడు విమల తనకంటే ఎక్కువగా చదువుకొనునేమోయని తలచి విమలకు విద్యచెప్పించుట అనవసరమని ముసలమ్మగారితో మనవిచేసుకొనెను. ముసలమ్మగారు తలచుకొనిన ఆగ్రహమందు అందరును ముక్కుచెవులు మూసుకొనునట్లు చేయును. అందుచే అప్పటి నుండియు విమలకు విద్యలేకుండపోయెను. విమల తల్లికూడ ఇక మూడువత్సరములలో అత్తవారింటికిపోవు విమలను పాఠశాలకుపంపుటకన్న సుఖముగా కాలక్షేపముచేయించిన బాగుండునని తలచి విద్యమాన్పించుటలో అత్తగారికి సహాయపడెను.

ఇప్పటికి విమలకు తొమ్మిదివత్సరముల వయస్సు. వాచకమేనియు సరిగా చదువుటకురాకుండనే విమల విద్య అడుగంటెను. మేనల్లుని వేషములనుచూచి అతనిపై విమలకు అసూయజనించెను. విద్యలేనివానికి వేషములతో లాభమేమి అని తలచుచుండెను. అందుచే అతనిని వివాహమాడరాదని విమల నిశ్చయించుకొనెను. సూరయ్యగారుకూడ తనమేనల్లుడు చదువనిన శ్రద్ధలేనివాడని తెలిసికొని పైసంబంధములకై వెతుకనారంభించెను.

సూరయ్యగారు పోలవరంకాపురస్థులైన నరసయ్యగారింటికివెళ్లి వారికుమారుడైన విశ్వేశ్వరునకు తన కుమార్తెను వివాహముచేసికొనవలసినదని కోరెను. నరసయ్యగారు పిల్లనుచూచుకొనుటకు వారముదినములలో వచ్చెదనని తెల్పిరి. విశ్వేశ్వరుడు రాజమహేంద్రవరమున స్కూలుఫైనలుపరీక్షకు చదువుచుండెను. ఉన్న దానిలోనే సుఖజీవనముచేయు వివేకముకలవాడు. పిల్లవాండ్రతో ఆటలాడుటన్నను వారికి చదువుచెప్పుటన్నను ఇతనికి మిక్కిలి యిష్టము.

ఒకదినమున నరసయ్యగారును విశ్వేశ్వరుడును పెండ్లికుమార్తెనుచూచుటకై సూరయ్యగారింటికి వెళ్లిరి. తగుమర్యాదలు జరిగినపిదప విమలచే ఒకపాట పాడించిరి. నరసయ్యగారు వాచకముకూడ చదివించమని చెప్పిరి. ఇదివరలోనే కంఠస్థముగావచ్చిన పాఠము నొకదానినిచూచి విమల గణగణచదువ నారంభించెను. అందులోనివిశేషమును విశ్వేశ్వరుడు గ్రహించెను. కాని నరసయ్యగారు గ్రహింపజాలరైరి.

వేసవిసెలవులలో విమలకు విశ్వేశ్వరునకును వివాహముజరిగెను. విశ్వేశ్వరుడు చిన్నకథల పుస్తకము నొకదానిని తన చెల్లెలు చేతికిచ్చి విమలచే చదివించమనెను. ఆమె ఆ పుస్తకమును విమలవద్దకు తీసికొనిపోయి చదువమనెను. విమల సిగ్గుచే తలవంచుకొనెను. తన బండారము బయలుపడునని చదువకుండ తప్పించుకొన జూచెను. కాని లాభములేకపోయెను. చదువ మొదలిడెను. కాని ఒక పంక్తినియు నడచుటలేదు. అప్పుడు విశ్వేశ్వరుడది చాలునని పుస్తకము తీసికొనెను.

మనుగుడుపులలో అత్తగారితో విమలకు విద్య చెప్పించవలెనని విశ్వేశ్వరుడు చెప్పెను. కాని అత్తగారేమిచేయగలదు. ఆమె అస్వతంత్రురాలు. మేనరికము చేయలేదని ముసలిది కటకటపడుచుండెను.

౨

విశ్వేశ్వరుడిప్పుడు విశాఖపట్టణమున డాక్టరుపరీక్షకు చదువుచుండెను. సంక్రాంతిపండుగకు విశ్వేశ్వరుడు అత్తవారింటికి వెళ్లెను. విమల తలుపుసందులనుండియు, గోడపంచలనుండియు అతనిని తొంగిచూచుచు ఆనందించుచుండెడిది. విమలను చూడవలయునని, చూచి మాటలాడవలెనని అతనికి కోరికయుండెను. కాని ఎన్నివిధముల ప్రయత్నించినను విశ్వేశ్వరునకు విమలతో మాటలాడుటకు వీలుకలుగలేదు. అతనికేమియు తోచకపోవుటచే ఆనందునకు అనేకవిధములైన పాటలను పద్యములను చెప్పి అతనిచే బిగ్గరగ అనిపించుచు ఆనందించుచుండెను.

ముసలిది యివి విని మాతులు ముక్కలు విరచుకొననారంభించెను. "ఇది యిల్లనుకున్నాడా? సంత బజారనుకున్నాడా? ఆగావుకేకలేమిటి?" అని అనేకవిధములైన మాటలను వంటచేయుచు ముసలిది అనుకొనుచుండెను. విమల ఇవన్నియు వినెను; మనస్సున కష్టముతోచెను. వెంటనే విమల విశ్వేశ్వరుడుండు తావునకుపోయి "తమ్ముడూ! ఏమిటిరా ఆకేకలు? నాయనమ్మగారు విసుగుకొంటున్నారు" అనెను. విశ్వేశ్వరుడు ఏదియో అనవలెనని తలంచెనుకాని విమల పారిపోయెను.

విశ్వేశ్వరుడు స్వగ్రామమునకు పోవుచు మామగారితోను అత్తగారితోను విమలకు విద్య చెప్పించవలసినదని తెల్పుకొనెను. స్వగ్రామము చేరుకొని తండ్రితో క్రిందివిధమున సంభాషించెను.

"నాన్నగారూ! మీకోడలికి చదువుచెప్పించవలసినదిగ మామగారికి పేర యుత్తరము వ్రాయుదురూ."

"అబ్బాయీ! నీకెందుకింత పట్టుదల అది మన యింటికి వచ్చినపిదప చదువుచెప్పకూడదా?"

"నాన్నగారూ! మీరే ఈవిధముగా తెల్పుట నాకు మనస్కరించుటలేదు. ఎంతమంది యువకులు తమ భార్యలు విద్యావతులైన బాగుండునుగదా అని తలపోయుచుండిరో? సంసారబాధ్యత వహించినపిదప చదువు వచ్చుటకై పడుచున్నపాట్లు తలచుకొని 'తోటకూరకాడనాడైనను చెప్పవైతివిగదా' అనునట్లు మా తల్లిదండ్రులు చిన్నతనమున చదువుచెప్పించకపోయిరికదా యని ఎంతమందియువతులు చింతించుచుండిరో? కాబట్టి మీకోడలికి చదువు చెప్పించునంతదనుక నేను వారింట భుజించదలచలేదు."

సెలవుదినములు ముగిసిన వెంటనే మరల విశ్వేశ్వరుడు విశాఖపట్టణముజేరుకొనెను.

విశ్వేశ్వరుడు వేసవిసెలవు లిచ్చుటతోడనే అత్తవారింటికి పోయెను. సూరయ్యగారు గ్రామాంతరము వెడలియుండిరి. అత్తగారు అల్లుని మడికట్టుకొనవలసినదిగా తెల్పెను. కాని విశ్వేశ్వరుడు "నాకుతలనొప్పిగ ఉన్నది, కొంచముజ్వరమువచ్చినట్లున్నది" అని ఏవేవో లేనిపోనిమాటలను తెల్పుచు తప్పించుకొనుచుండెను.

ఇట్లు భోజనములేకనే అత్తవారింట విశ్వేశ్వరుడు ఆనందునకుమాత్రము పాఠములను చెప్పుచు కాలక్షేపము చేయుచుండెను. మూడుదినములనుండియు నిట్లే! అత్తగారి కేమియుతోచక చిట్టచివరకు విమలను అడుగమనెను. విమల విశ్వేశ్వరునితో మాట్లాడవలెనని వచ్చెనుకాని కంఠము పూడిపోయెను. మాటవచ్చుట లేదు. కాని విశ్వప్రయత్నముచేసి "మీకు జ్వరమువచ్చుచున్న ఎవరివద్దనైన మందుపుచ్చుకొనరాదా? రోగం రొష్టు అన్నారుగా?" అనెను.

"నాకు జ్వరముగానున్నదని ఎవరన్నారు?"

"లేనిచో ఏల భుజించరాదు?"

"మోసపుచ్చినవారింటియందు మొదట బుద్ధిలేక భుజించినను, రెండవమారుకూడ అందును పిలువకుండ వచ్చినపుడా భుజించుట?"

"మోసపుచ్చినదెవరు?"

"ఎవరో నా? తమరే! చదువురానిదే చదువువచ్చుననుకొనునట్లు చేయలేదూ?"

ఈ పలుకులు విమలప్రక్కలో శూలములవలె నాటుకొనెను. ఇంకేమని మాట్లాడును? విమల ఆలోచనానిమగ్నయై లోనికేగెను.

విశ్వేశ్వరు డానందునితో మాత్రము తెల్పి స్వగ్రామము చేరుకొనెను.

## 3

అది జూలై మాసాంతము. విశాఖపట్టణమున విశ్వేశ్వరుడు శ్రద్ధగా చదువుకొనుచుండెను. ఒక దినమున ఆతడొక యుత్తరము నిట్లు చదువుకొనుచుండెను.

“ప్రియమైన అల్లుడు విశ్వేశ్వరునకు...

నేటికి సరిగా వారంరోజులకు అనగా ఆగస్టు 8-వ తేది ఉదయం 7-15 గంటలకు మా ఆనందునకు ఉపనయనము చేయుటకు పెద్దలచే నిశ్చయింపబడినదికాన నీవు తప్పక రావలెను. మ. స. మీఅమ్మగారిని మీ నాన్నగారిని నేను స్వయముగా వెళ్లి తీసికొనివచ్చెదను.

రాజమండ్రి.
1—8—20

గ్రహించవలెను
సూరయ్య.”

ఒక్క క్షణకాలమేనియు ఆలోచించకుండనే విశ్వేశ్వరుడు క్రిందివిధమున జవాబువ్రాసెను.

“మ-రా-రా-శ్రీ మామగారికి

మీ యుత్తరమందినది. సంతోషవర్తమానము తెలిసికొంటిని. కాని నేను మా నాన్నగారి ఎదుట మీరు మీ కుమార్తెకు విద్య చెప్పించుదనుక మీయింట భుజించనని శపథము చేసియున్నాను. అందుచే నేను వచ్చుటకు వీలులేదని తెల్పుట కెంతయు చింతించుచున్నాను.

విశాఖపట్టణము
2—8—20

చిత్తగించవలెను
విశ్వేశ్వరుడు.”

ఆనందుని ఉపనయనముహూర్తము రెండుదినములుమాత్రమే కలదు. విశ్వేశ్వరున కేమియు తోచుట లేదు. అత డీక్రిందివిధమున ఆలోచించుచుండెను.

“అయ్యో అల్లుడు లేకుండ ఉపనయనము చేయుచున్నారు అని లోకులందురుకదా; కాబట్టి నేను వెడలుటే మంచిది. ఏమి? మా నాన్నగారి ఎదుటచేసిన వాగ్దానము నుల్లంఘించుటయేనా? రానని యుత్తరము వ్రాసియు వెళ్లుటెంత అవమానకరము. పాపము ఆనందుడు ఏమనుకొనుచుండునో కదా!”

ఇంతలో పోస్టుజవాను ఒక కవరును తెచ్చియిచ్చెను. విశ్వేశ్వరుడది చించి చదువనారంభించెను. క్రమక్రమముగ ఆతనివదనము ఆనందవికసితమగుచుండెను.

“ప్రాణప్రియా,

మా నాన్నగారికి మీరువ్రాసినఉత్తరమంది రెండుదినములైనది. లేఖవ్రాయుటలో ఇది నాప్రథమయత్నమగుటచే ఏమని జవాబిత్తునాయని రెండుదినములనుండియు ఆలోచించితిని. ఈ యుత్తరము నేను వ్రాసితిననిన నమ్ముదురా? వివాహపూర్వమే నా విద్య అడుగంటుటకు కారణము మీకు తెలిసియేయుండును. ఇక నేను విద్య నభ్యసించినదెట్లో మీకు తెల్పెదను. వివాహసమయమున మీరు నలుగురిలో నాకు చదువురాదని బయలుపెట్టి యుంటిరి. అదియే నా మనస్సునవేధించుచుండ అగ్నిలోపోసిన ఆజ్యమువలె మీరు అభోజనులై మోసముచేసితి వన్నమాటలు మరింత బాధనుకలుగజేసెను. ఆ మరుదినమునుండియే విద్యనభ్యసించ మొదలిడితిని. నా విద్యకొరకై మాయింటి ప్రక్కనున్న సుందరమ్మగారు పడిన శ్రమను నేను వర్ణింపజాలను. అది వేసవికాలమగుటచే పగలు మాయింటియందందరు నిద్రపోవుసమయమున సుందరమ్మగారివద్దకు పోయి శ్రద్ధతో నభ్యసించ మొదలిడితిని. ఆంగ్లమునకన్న ఆంధ్రమునే ముఖ్యముగ నభ్యసించవలెనని సుందరమ్మగారు తెల్పియుండుటచే ఆంగ్లభాష

నభ్యసించలేదనిన క్షమింతురుగాక! మీవంటియువకు లిట్టి పట్టుదలచూపినచో బాలలేల విద్యావిహీనలగుదురు? అదంతయు పురుషులలోపమే. మిడిమిడిజ్ఞానముతో మిట్టిపడుచుంటినని ఆగ్రహముజూపకుందురుగాక! ఈ నా స్వల్పజ్ఞానముతో సుందరమ్మగారి విశేషప్రోద్బలమున ప్రప్రథమమున నేను రచించినపాట నిందు వ్రాసెదను.

అమ్మరో నాపల్కు లాలకించవే
ఆలకించినీవువాని నాచరించవే॥ అ॥

౧ పాటలెన్నో నీవు బాగ పాడనేర్వవే
పాటలలో ఇమిడిఉంది పరమతత్వమే॥ అ॥

౨ ఆటలన్ని నీవుబాగ ఆడనేర్వవే
ఆటలలో ఇమిడిఉంది ఆరోగ్యమే॥ అ॥

3 హాస్యమునకైననీవు అసత్యమాడకే
అసత్యమాడుతేను నీకు హానికల్గునే॥ అ॥

౪ తెలివిగలిగి నీవుఎప్పుడు తెలుగుచదువవే
చదువుకున్న నీకు చాలజ్ఞానమబ్బునే॥ అ॥

మా నాయనమ్మగారు పిల్చుచుండుటచే ఇంతటితో విరమించుచున్నాను. మీపట్టుదలఫలించినదిగాన వచ్చెదరని తలచుచున్నాను.

రాజమండ్రి
5—8—20

చిత్తగించుడు
భవదాగమన నిరీక్షకురాలు
విమల”

లేఖ చదువుకొనగానే విశ్వేశ్వరుని ఉత్సాహముప్పొంగెను. వెంటనే రాజమహేంద్రవరమునకు ప్రయాణమాయెను.

## ౪

సూరయ్యగారి గృహమున కలకలధ్వని మిక్కుటమాయెను. మరునాడే ఉపనయనముహూర్తము. బంధువులందరునువచ్చిరి. కాని ముఖ్యమైన విశ్వేశ్వరుడు రాకపోవుటచే కొంతమంది ఖిన్నమనస్కులై యుండిరి. విమల ముఖమునమాత్రము మార్పేమియు కలుగలేదు.

సాయంత్రము ఆరుగంటలాయెను. ఒక యువకుడు చేత సూటుకేసునొకదానిని ధరించి సూరయ్యగారి గృహము ప్రవేశించుచుండెను. వెంటనే ఆనందుడు అపరిమితానందుడై ఆనందబాష్పములకార్చుచు “అమ్మా! బావగారొచ్చారే” అని అతివేగమున విశ్వేశ్వరుని చెంతకు పరుగెత్తుకొనివచ్చెను. చూచుటకై చుట్టునున్న అమ్మలక్కలందరును వచ్చిరి. ఇంటనున్నవారందరు గుమిగూడిరి. వెంటనే నరసయ్యగారు వచ్చి “ఏమిరా అబ్బాయి! రానని యుత్తరము వ్రాసినావట. మళ్లీ ఎందుకువచ్చావురా?” అనిరి. విశ్వేశ్వరుడు విమలవ్రాసిన లేఖను చదివి వినిపించెను. ఇంటనున్నవారు విమల చదువుకొనిన వయినమే తమకు తెలియలేదని ఆశ్చర్య పడిరి, చుట్టునున్న అమ్మలక్కలు విమలవివేకమునకు విస్మయమందుచు “ఎంత తెలివిగల పిల్లమ్మా” అనుకొనిరి.

అందరును విస్మయాశ్చర్యములతో నిండియుండ ఒక్కరే ధుమధుమలాడుముఖముతోనుండిరి. అది ఎవరు? మూతులుముక్కులు విరచుకొను మన ముసలమ్మగారే!

## ఆనందాశ్రువు—దుఃఖాశ్రువు

శ్రీ సీతారామమూర్తిగారు

బాలభానుని భవ్యకాంతులు
లోకమందునఁ బ్రాకులాడెడు
సమయమున మేల్కాంచి లోకే
శ్వరునిఁ బ్రార్థించి.

నిత్యకృత్యములన్ని యొనరిచి
నియమమున స్నానంబుఁజేసి మ
నోజ్ఞమాగతి వడకినేసిన
నూత్నవస్త్రముదాలిచి.

వాలుజడ పుష్పముల మురిపెము
లేఁతనవ్వుల పూతకాంతులు
చేతిపొత్తపు నవ్యమధురిమ
చెలఁగ నద్దెసల.

బడికినేగుచు శ్రద్ధతోఁజత
పాఠములనన్నింటి నేర్చుచు
వరలుచుండును బాలయొక్కతె
జ్ఞానదీపికతోఁ.

ఆమెవ్రాసిన చిత్రపటములు
జీవయుతములు వలె వెలుంగును;
ఆమెపాడిన పాటలెల్లను
నమృతధారలె కురియును.

ఆడుపుట్టువుపుట్టి సిగ్గును
వీడి విద్యను నేర్చుకొనుచు
న్నది యటంచును నమ్మలక్కలు
నవ్వి రాయమను.

ఆపె హృదయము చలనసరణిని
చూపలే దొక్కించుకైనను;
అమ్మలక్కలఁగాంచి తాఁలో
నామె నవ్వుకొనుఁ!

లీలనాసతి తుదకుపట్టప
రీక్షఁగాంచెను పూర్ణజయమును;
కవితలమెకు అబ్బిపోయెను;
ఖ్యాతి గడియించెఁ.

ఆమెనారసి మోదబాష్పము,
నమ్మలక్కల దుస్థితికి దుః
ఖాశ్రుకణమును నేలవిడిచెను
ఆంధ్రజనయిత్రి.

ఆంధ్రవనితలయున్నతికై సహస్ర
ధా భవశ్శక్తి నేరీతి ధారవోసి
యాంధ్రజనయిత్రికండ్లమోదాశ్రుకణము
లూరఁజేసెదో 'గృహలక్ష్మి' ఊహసేయు.

# బందీ

**కనుకుర్తి రామకోటయ్యచౌదరిగారు**

## ౧

అదిశరత్కాలరాత్రి. బహుశా మొదటియామముగడచి రెండవయామము ప్రవేశించిఉంటుంది. నిర్మలనీలాకాశములో చంద్రుడు తన యుజ్జ్వలమయిన కిరణములను నల్దిక్కుల ప్రసరింపజేయుచూ మంద గమనముతో వెళ్లుతున్నాడు.

ఈ సమయములో పద్మానదీజలతరంగములపై తేలియాడుచూ నొకసుందరమయిననావ తీరమున కొచ్చి ఆగిపోయినది. నావలోనుండి కేశవబాబు నావికునితో 'ఇప్పుడెంత ప్రొద్దుపోయింది?' అన్నాడు. నావికుడు 'బహుశా రెండవయామము ప్రవేశించిఉంటుంది' అన్నాడు.

కేశవబాబు: "రేపు ప్రొద్దుఉండగనే నావవిడువాలి." నావికుడు అంగీకార సూచకముగా తల నూపి పడకప్రబంధముచేయ మొదలుపెట్టాడు. దినమంతయు పరిశ్రమజేసినందువల్ల మరుక్షణమె నావికు లందరు నిద్రాదేవికి వశులయ్యారు.

కేశవబాబుకు నిద్రరావటములేదు. ఆకాశమువైపుకు జూచుచూ తనభార్యయగు వీణాయొక్క సుందర సురమ్యముఖారవిందము తన హృత్పటముపైకి తెచ్చుకొనుచూ అపారమగు ఆనందసముద్రములో నీదు లాడుచున్నాడు. పాపము, ఎన్నిరోజులయిందో తనప్రాణమగు వీణను గలుసుకుని?............ఇప్పుడు దసరాశెలవులలో ప్రాణప్రియ దర్శనాలాలసుడయి ఆకాశహర్మ్యములు నిర్మించుకొనుచూ అత్త వారింటికి వెళ్లుచున్నాడు. అక్కడ కొన్నిరోజులుండి భార్యను తీసుకుని స్వగృహమునకుపో నిశ్చయించాడు. ఈ సంగతి యింతకు పూర్వమే భార్యకు తెలియపరచాడు. కానున్న భార్యాపునస్సమాగమముచే కేశవబాబు హృదయంలో ఎట్లాగోఉంది.

ఇంతలో ఆకస్మికముగా రెండుడింగీలు నావ కిరువయిపులవచ్చి నిలబడ్డవి. వెంటనే కొందరు ఖడ్గహస్తులగు దొంగలు నావమీదకు దూకి నావసరంగులవద్దకు వెళ్లి "జాగ్రత. నోరు తెరువవద్దు. పరుగెత్త ప్రయత్నించవద్దు. అన్యథా చేసినచో మీప్రాణములు దక్క"వన్నారు.

పాపము భయమువల్ల వాళ్లు అట్లానే పడియున్నారు. తర్వాత దొంగలు కేశవబాబునొద్దకు వెళ్లి ఉన్నడబ్బుఊడలాగి చేతులుకాళ్లుకట్టి, యొకడింగీపయి బడవయిచి యెక్కడకో నెట్టుకెళ్లేరు.

## ౨

ఇప్పటికి చాలారోజులనుంచి వీణకు అన్నము రుచించుటలేదు. నిద్రాలేదు. ఆమెఎల్లప్పుడు యస్వ మనస్కయైయుంటుంది. తనభర్త ఉత్తరము సజలనేత్రములతో చూచుచూ ఎప్పుడువచ్చెదరా యని లెక్కలువేస్తూయుంటుంది; ఇదేపని. కాని వారు రావలసినరోజు గడచిపోయి చాలాదినములయింది. ఇప్పుడు దినమంతయు రోదనమేపని. ఈ రోజు దుర్గపూజ. నగరజనులంతా దుర్గాపూజోత్సాహులయి ఉన్నారు. ఇదంతా వీణకు మరీ దుఃఖముగలుగజేసింది.

వీణ యిక ఆగలేకపోయింది. తనచిన్నన్నయయిన కైలాసునొద్దకు వెళ్లి ఏడ్వటం మొదలు పెట్టింది. అన్నయోదార్పుచే కొంతసేపటికి కన్నుల నీరు తుడుచుకొనుచూ "దాదా! నీకాళ్లు పట్టుకుంటాను. కాస్త నాభర్తసంగతివిచారించు. నామనస్సంతా వికలంగాఉంది. పొరపాటునమీమనుష్యులేవారినిపట్టుకున్నారేమో?"

"ఛీ నోరుముయ్యి, ఎక్కడిమాట? మేము కేశవబాబును ఎరుగమాయేమి? నీవాచింతేమీపెట్టుకోబోకు. బహుశా యేదన్నా కారణమువల్ల రాలేకపోయాడేమో?" అని దాదా అన్నాడు.

"కాదు. దాదా! వారటువంటివారు కారు. వస్తాననిరాకుండా ఎప్పటికిఉండరు. ఒకవేళ వారు రాజాలకపోతే ఉత్తరం అవశ్యంవ్రాసేవారు. నీవు వారినిజూచి చాలారోజులయిందె. మరచిపొయ్యేంటావు. గుర్తించకుండానే పట్టుకొని ఉంటారు."

కైలాసుడు నవ్వి "మంచిది; నేను పొరపాటుచేస్తే నీవు చూచుటతోనే గుర్తించగలవా? అట్లయిన ఈరాత్రే నిన్ను దొంగలకొట్లోకి తీసుకెళ్లుతాను. చూచి గుర్తించుదువు గాని. రాత్రికొచ్చి నిన్ను తీసుకెళ్లుతాను" అనిచెప్పి గదినుండి మెల్లమెల్లగా వెళ్లిపోయాడు.

వీణ యొకదీర్ఘనిశ్వాసమువిడిచి చేలాంచములతో కంటినీ రద్దుకుంది.

రాత్రి రెండు యామములు గడచిపోయింది. వీణగదివద్దకు కైలాసుడువచ్చి "వీణా!"యని పిల్చాడు. వీణ మెలకువతోనేయుంది. "వస్తున్నాను. దాదా!"యని తలుపుతెరచుకొని బయటకొచ్చింది.

కైలాస్—"నేను చెప్పునది ధ్యానముతోవిను. నేను నిన్నిప్పుడు ఎక్కడకు తీసుకెళ్లుతున్నానో అక్కడి మాట ఎప్పుడూ ఏరోజునయినా ఎవరితోనయినా చెప్పవద్దు. అక్కడ ఏవిధమయిన ప్రశ్నలు నాతో వేయవద్దు. అక్కడ ఒకవేళ కేశవుడే యుండుట తటస్థించెనేని వానితో ఏవిధమయిన మాటలు మాట్లాడవద్దు." వీణవద్ద ఈప్రమాణము తీసుకున్న పిమ్మట ఒకచోట గుప్తద్వారము తెరచి మిణుకుమిణుకుమను దీపపు ప్రకాశములో సురంగమార్గమును గడచి వారు దొంగలయింటిని ప్రవేశించిరి.

* * * *

చాలాదినములకు పూర్వము. బిహారులో జమీందారులు కొందరు దార్లుకొట్టించి ప్రయాణీకులను కొట్లలో బంధించి వారిధనమానప్రాణముల తమకైవసము చేసుకొనుచుండెడివారు. కైలాస్ నారాయణ సింహుడుకూడా ఈశ్రేణిలో చేరినవాడే. ఈయన పూర్వీకులుకూడా ఎల్లప్పుడు దుర్మార్గకృత్యములతోనే ఇహలోకమువిడిచిరి. "దొంగలకొట్టు"యను పేరుగల ఈనరకకుండములో ఎందరు అసహ్యమగు అత్యాచారములతో గూడుకొనిన మరణమునకులోనైరో ఎవరు చెప్పగలరు?

* * * *

చోరకోఠరిలో మిణుకుమిణుకుమను దీపపు వెలుతురున నల్గురయిదుగురు భూమిపైబడియుండుట వీణ జూచింది. అందరు ఆకలిదప్పులచేతను భయముచేతను జీవన్మృతులయిపడి యుండిరి. అందులో ఆమె కేశవబాబును జూచి అదరిపడ్డది. భర్త్రాన్వేషణమునకు ఆమెకు ఒక్కక్షణంగూడాబట్టలేదు. దుఃఖభరముచే ఆమె కనుకొలకులనుండి బాష్పబిందువులు జలజలరాలుచున్నవి. వీణ స్థితిని గ్రహించి కైలాసునకుగూడా కేశవుని గుర్తించుటలో ఆలస్యముపట్టలేదు. తనబావమరదిని పొరపాటున పట్టుకుని ఈయంధకూపములో పడవేసినందుకు కైలాసుడు చాలా సిగ్గుపడ్డాడు. అంతట మెల్లగా చెల్లెలను బయటకు తీసుకునివచ్చి "ఇప్పుడేమియుపాయము? పొరపాటున జరిగిపోయింది. కేశవునివదలితే రహస్యముదాగదు. వాడుజీవించి యుండినయడల ఎప్పుడోయొకప్పుడు ఈకళంకాగ్ని బయటబడి మనల నిలువెల్ల మాడ్చగలదు" అన్నాడు.

వీణ సోదరుని మాటలువిని శూన్యహృదయముతో సోదరునివైపు చూచింది. నోటినుండి ఒకమాట అయినను వెడలలేదు.

## 3

రహస్యాగారములో వీణాసోదరత్రయం గూడింది. ఆలోచన ప్రారంభమయింది. వాదప్రతివాదములతో ఆఖరుకు రెండుమూడుదినములలోనే కేశవునిజీవితము తుదముట్టింపవలయునని తీర్మానించిరి.

భర్తప్రాణరక్షణార్థము వీణ సోదరులకాళ్లపైబడి ప్రార్థించింది. బ్రతిమాలుకుంది. పాషాణహృదయములుకూడా కరుగునట్లు వాపోయింది. కాని ఏమిలాభము? చెల్లి హృదయవిదారాక్రందనము వారి నిష్ఠుర పాషాణహృదయములలో ఇంచుకంతయైన పరివర్తనము చేయలేకపోయింది....... ఏవిధముచేతను వారు ఒప్పుకొననప్పుడు యొకరాత్రియయిన తనభర్తతోనుండనివ్వమని ప్రార్థించింది. ఈప్రార్థనమాత్రం ఒప్పుకున్నారు. కాని చెల్లిని సావధానముగాఉండునట్లు హెచ్చరించారు. ఈవిషయములో చిన్నయక్కరముగూడా బయటకురాగూడదన్నారు. వీణ ఒప్పుకున్నది.

౪

రెండుదీర్ఘ వర్షములతర్వాత ఈరోజున ఈబందీయవస్థలో ఈ చోరకోఠరీలో తనప్రాణమగు వీణను ఒంటరిగాజూచినప్పుడు కేశవబాబు విస్మితుడయ్యాడు. శూన్యదృష్టితో తనప్రియతమవైపు చూచాడు. వీణ చేసైగచే మాట్లాడవద్దని తెలియపరచి కేశవునిచెవులో సంగతంతా తెలియపరచింది. తరువాత తనకోక ఒకటిచ్చి,... "దీనిని స్త్రీలమాదిరిధరించి ఏమాత్ర మాలస్యముచేయకుండా ఉత్తరంగావెళ్లు. అక్కడ ఇద్దరుమనుష్యులుంటారు. వారునిన్ను పోలీసుఠాణాకు తీసుకవెళ్లుతారు. వెంటనే పోలీసుదళమును తీసుకుని ఇక్కడకురావలయును.... ఊం. తొందరగారావాలి" అంది. కేశవబాబు ఒప్పుకొనలేదు. కాని వీణ జలజనేత్రయై కాతరస్వరముతో బ్రతిమాలునపుడు కేశవునికి తప్పనిసరియయింది. స్త్రీకి మాదిరి కోకనుధరించి పోనిష్టములేకున్నను వీణబలవంతముచే పోవక తప్పినదికాదు. వీణ మొదటినుండి భర్తపలాయనసూత్రానికి మార్గము వెతుకుతూనేయుంది. ఇద్దరుజవానులకు ధనాశబెట్టి తనవైపుత్రిప్పుకుని సంకేతస్థానమునకు భర్త చేరగనే ఆయనను తీసుకుని పోలీసుస్టేషనుకు వెళ్లమని చెప్పింది. ఈ ఏర్పాటంతయు చేసి భర్తనుపంపి భర్తస్థానే తాను బందీగాఉండి రాబోవుఆపదకు సిద్ధంగాఉంది.

౫

నల్దిక్కుల అంధకారము మాయమౌతోంది. ఇంక ప్రభాతమునకు ఎంతో ఆలస్యములేదు. బందీగృహ కవాటముపై చప్పుడు...... వీణ భయకంపితయై గడగడవణకుచూ గడియతీసింది. కైలాసుడు చేసైగతో ఆమెను బయటకురమ్మనిచెప్పి మెల్లమెల్లగా లోపలికివెళ్లాడు. ఏముంది?...శయ్య శూన్యంగాఉంది. కైలాసు డదరిపడ్డాడు. పిచ్చివానివలె నలువైపుల కలయదిరిగాడు. ఏమూలజూచినను అంధకారదర్శనమే.......... బాణవేగముతో వీణవద్దకువచ్చాడు. తలవెండ్రుకలు పట్టుకొని ఇంట్లోకి లాక్కొచ్చాడు. "సైతానా! వాడేడీ? చెప్పు. ఎక్కడదాచిపెట్టావు?" అన్నాడు. వీణ నిరుత్తరయై తలవంచి నుంచునిఉంది.

"ఏమి? చెప్పవేమి? వా డెక్కడఉన్నాడు?"

వీణ మెల్లగా "దాదా! ఎక్కడున్నారనిచెప్పేది. ఇకమీరు వారిని పట్టుకొనలేరు. భర్త హత్య కన్నులారచూచుచూ ఎట్లాఉండేది? మీరు వారిని ఏమిచెయ్యాలనుకున్నారో అది నన్నేచెయ్యండి. ఎటువంటి శిక్షయినా వెయ్యండి. అనుభవించుటకు సిద్ధముగాఉన్నాను" అన్నది. కైలాసుడు కోపముచే పిచ్చివా డయ్యాడు. "ఓ, సర్వనాశనీ! రాక్షసీ! ఇన్నాళ్లనుండి నంగనాచివలె నుంటివిగదె. భర్తప్రాణసంరక్షణార్థ మయి మా మానావమానములనయినా జూడవయితివిగా? హతభాగినీ! దీనికి ప్రతిఫలమనుభవింపు" మని మొలనుండి సునిశితమయిన చురినితీసి చెల్లెలి వక్షస్థలములో దుర్మార్గుడు ఆమూలాగ్రముగా గ్రుచ్చివేశాడు. వీణ ఆర్తనాదముచేయుచూ భూమిపైబడిపోయింది. మహాత్యాగినియు పరమపతివ్రతాశిరోమణియునగు నామె రక్తముచే చుట్టూయున్నభూమి ఎఱ్ఱబడిపోయింది.

౬

పోలీసు చాలారోజులనుంచీజరుగుచున్న ఈహత్యాదులను పట్టుకొనవలయునని ప్రయత్నించుచున్నారు. కేశవబాబు చెప్పుటయేతడవు వారు వెంటనే బయలుదేరారు. పోలీసుదళం కైలాసనారాయణుని యిల్లు ముట్టడించారు. వెంటనే యినస్పెక్టరు రహస్యగృహమువైపు వెళ్లాడు. ఎదురుగా వీణారక్తరంజితకళేబరము కొట్టుకలాడుచూఉంది. కేశవబాబు పరుగెత్తి భార్య మస్తకము ఒడిలో ఉంచుకున్నాడు. వీణ భర్తవంక సజలనేత్రములతో జూచుచూ "ఈజన్మలో నిన్నుసుఖపెట్టలేకపొయ్యాను. కాని రెండోజన్మలో సుఖపెట్టగలను. నీవు రెండవవివాహముచేసుకుని సుఖపడవలయునని నాకోర్కె"...... ఇక ఒక్కమాటయినను బలుకలేదు. ప్రాణేశ్వరునిఒడిలో తన మస్తకముంచిజీవలీలను సమాప్తినొందించినది.

(హిందీనుండి.)




రాట్నము : గృహపరిశ్రమ

*Photo by M. K. R. Aiyangar.*




ఏ గ్నా ష్మీ రా మా రా వు క న్య గా రు యం. యె. (అనర్సు)




## ఏణాక్షిరామారావుకన్య

ఆకుండి వేంకటశాస్త్రిగారు

ఈమె 'రావుబహద్దరు' బిరుదాంకితులగు నొక న్యాయాధిపతికుమార్తె; బెంగుళూరు నందలి ఒక శ్రోత్రియబ్రాహ్మణకుటుంబమునకు చెందియున్నది. ఈమె ఫిల్ముననైనటించుటకు దక్షిణహిందూదేశమున ముందంజవేసిన ప్రథమహైందవయువతి; ఫిల్ముననైనటించుటకు కావలసిన మూర్తిత్వము, లాలిత్యములను గలిగియుండి సర్వవిధముల యర్హురాలైన నట్టువరాలని యనిపించుకొన్నది. నట్టువరాలివృత్తియందు ప్రవేశించిన రెండువత్సరములలోనే ఈమె పాత్రఖేలనమందలి సామర్థ్యము ప్రతిభగాంచెను.

ఈమె లేడివలె చంచలములగునేత్రములను గలిగియున్నందున "యేణాక్షి" యను నన్వర్థబిరుదముతో ఫిల్మునటీలోకమున వినుతిగాంచినది. ఇంద్రచాపములోని రంగులువంటి రంగులతో మనోజ్ఞమైన (కండ్లలో) నల్లగ్రుడ్లనుగలిగిన యామె కనిష్ఠసోదరి రామారావను పేరుగల పదునేడువత్సరముల యువతి యేణాక్షి రామారావుకన్యవలెనే ఫిల్మునటీవృత్తిలో ప్రవేశించుట కభిలషించుచున్నది.

మృచ్ఛకటికమను సంస్కృతనాటకకథను మూలముగాగల్గిన "వసంతసేన" యను పేరుగల ఫిల్ములో ఏణాక్షిరామారావుకన్య వసంతసేనయను నాయికాపాత్రను ధరించి చక్కగ నిర్వహించినది.

ఒక జర్మనుకంపెనీవారు తయారుచేసిన 'షిరాజ్' అనుఫిల్మున ఈమె నాయికాపాత్రఖేలనమొనర్చి మెప్పుగాంచెను. ఈ ఫిల్ము తయారగుటకు నాలుగునెలలు పట్టినది. నాలుగులక్షలరూపాయలు వ్యయమయ్యెను. ఇందలి కథ 'టాజ్ మహాలు' నకు సంబంధించినది. ఈఫిల్ము హిందూదేశములోనే తీయబడినది.

'షిరాజ్' ఫిల్ములో ఏణాక్షిరామారావుకన్య పాత్రఖేలనముకంటె 'వసంతసేన' అనుఫిల్ములో ఆమెపాత్రఖేలనము ఎన్నిమడుంగులో ఉత్తమమైనదై యున్నదని కళాకోవిదులచే కొనియాడబడెను.

'వసంతసేన' అను ఫిల్ములోనికథ అజంతాశిల్పములనాటి ప్రాచీనతగలది. ఈఫిల్ము తయారుచేయుట కారునెలలుపట్టినది. రెండులక్షలరూప్యములు వ్యయపఱుపఁబడినవి. ఈ ఫిల్ము తయారుచేసినవారు 'భావానీకంపెనీ' వారు. వీరికి మైసూరుగవర్నమెంటు వారుకూడ ఈఫిల్ము తయారుచేయుటకు ధనసహాయమొసగిరి. 'వసంతసేన' యనుఫిల్ములో విద్యావతులైన స్త్రీలనేకులు పాత్రఖేలనమొనర్చిరి. అట్టివారిలో 'కమలాదేవి ఛటోపాధ్యాయ' యనునామెకూడ కలదు.

'ఏణాక్షి' రామారావుకన్య ఫిల్మునటీవృత్తిలో ప్రవేశించి తనవంటివిద్యావతులు కూడ ఈవృత్తియందుప్రవేశించుట కుత్సాహముకల్గించి మార్గదర్శినియయ్యెను.

ఈ 'వసంతసేన' అనుఫిల్ము యూరపుఖండమున చాలభాషలలోనికి యనువదింపబడి ఆయాదేశములలో చూపఁబడుచున్నది.

ఈ ఫిల్మునే ధ్వనిభాషణము (Talkie) గలదానినిగా మార్చుటకుగాను ఏణాక్షి రామారావుకన్య ఇప్పుడు యూరపుఖండమునకు వెళ్లియున్నది. అచ్చట 'వసంతసేన' అను ఫిల్మమాట్లాడుఫిల్ముగా (Talkie) మార్చబడుచున్నది. ఇదియేమాట్లాడుఫిల్ముగాచేయబడు చున్న మొదటిభారతీయఫిల్ము. క్రమక్రమముగ మన పురాణగాధలు, నాటకములును హిందూదేశభాషలను మాట్లాడుఫిల్ములుగా తయారుకాబడు సుదినములు త్వరలో రానున్నవి.

## ఆంధ్రాభ్యుదయము

శ్రీ శేషాద్రిరమణకవులు

ఇహసౌఖ్యపరసౌఖ్యహేతుభూతంబగు సదనదైవతపూజ జరుగుచుండ
మహితాంధ్రసత్కవిమధురభావంబుల నరసిమెచ్చెడి శక్తి యతిశయింప
సహజసౌందర్యంబుసాటు ప్రాక్తనవేషభాషలపైఁ బ్రీతిపరిఢవిల్ల
జోలపాటలతోడ సుతులకుఁబౌరాణికములఁదెల్పెడి శక్తిగ్రాలుచుండ

ఆంధ్రతత్త్వంబు దమయెడ నన్నిగతుల
జీర్ణమొనరించుకొని మాతృసేవజేయు
నాంధ్రకాంతలచేనుండె నాంధ్రజాతి
యభ్యుదయమెల్ల నెన్నటికైననేమి.

# శమీపూజ

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

శమీపూజయనగా జమ్మిచెట్టును పూజించుట. ఈపూజ ప్రతిసంవత్సరము ఆశ్వయుజ శుద్ధదశమినాడు జరుపుదురు. ఈపూజవలన శత్రునాశనము, పాపపరిహారము కలుగుననియు అభీప్సితములుకూడ ఈడేరుననియు ప్రజల నమ్మకము. దీనినే శ్లోకరూపమున జెప్పెదరు.

శ్లో. శమీ శమయతేపాపం
శమీ శత్రునాశనం
అర్జునస్య దనుర్ధారీ
రామస్య ప్రియదర్శనీ॥

ఈ శమీపూజ పూర్వచారిత్రము తెలిసికొందము. పాండవులు కౌరవులచే జూదముననోడింపబడి అజ్ఞాతవాసముగడపుట తటస్థించెను. ప్రచ్ఛన్నవేషముతో విరటుని గొలువబోవునపుడు తమ్ము కౌరవులుగాని మరితరులుగాని గుర్తింపకుండునటుల తమ గాండీవము మొదలగు ఆయుధములను మూటగట్టి పరులు తరచు చొరని శ్మశానవాకిటనున్న జమ్మివృక్షముపై చూపరులకు భయమగునటుల ప్రేతరూపముగా యేర్పరచి చెట్టుపైనుంచి విరటునిగొల్వబోయిరి. విరటునికొల్వున కొంతకాలము గడపినపిదప పాండవుల జాడనుతీయుటకు కౌరవులు ఉత్తరగోగ్రహణమునకు పూనుకొనిరి. తత్సమయముననే ఇంకొకప్రక్క దక్షిణగోగ్రహణము జరిగెను. దానికి విరటుడు అర్జునుడుతప్ప ఇతర పాండవనాయకులు, ఇంకను సైన్యాధిపతులు అందరు యేగిరి. రాజ్యమున ఒక్క ఉత్తరుడు మిగిలియుండెను. ఉత్తరకుమారుని ప్రజ్ఞలనుగురించి నేను వేరే వ్రాయనక్కర లేదు. పాఠకులకు తెలిసినవిషయమే. ఉత్తరుడు బృహన్నలవేషముతోనున్న అర్జునుని సారధిగగైకొని గోవులను మరలించుటకై నేగెను. రణరంగమున కౌరవయోధులగు, భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడుమున్నగు మహారథికులనుగాంచి భయకంపితుడై ఉత్తరుడు పరుగెత్తజొచ్చెను. వణుకుచు ఒడలంతయు చెమటలుగార ఇంటికిపోవనుద్యుక్తుడైయున్న ఉత్తరుని అర్జునుడు బుజ్జగించి భయముతీర్చి తానే పోరుసల్పెదనని తాను బృహన్నలరూపముధరించిన కారణమును దెలిపి తానే అర్జునుడనిచెప్పి జమ్మిచెట్టుపైనున్న తమ ఆయుధములను తెమ్మనిచెప్పెను. ఉత్తరుడు జమ్మిచెట్టుదగ్గరకు పోయిచూడగా అది ప్రేతరూపముగా గన్పట్టెను. అందుచే భయపడి అర్జునునిదగ్గరకు పరుగెత్తుకొనివచ్చి నాకు భయముగానున్నది నేను ఆప్రేతమును ముట్టజాలనని చెప్పెను. అది ప్రేతముగాదు పరులు తమ ఆయుధములను ముట్టకుండ భయపెట్టుటకుగాను ప్రేతరూపముగ తాము కట్టితిమనియు అందుచే ఎట్టిభయములేకుండ చెట్టునెక్కి క్రిందకుదింపుమనియు అర్జునుడు ఉత్తరుని వెంటగొనిపోయెను. అప్పుడుత్తరుడు నిర్భయముగ ఆవృక్షముపైకెక్కి అయుధములను క్రిందికి దించెను. పిదప అర్జునుడు జమ్మిచెట్టును తన ఆయుధమగు గాండీవమును పూజించి తనకు జయముగలుగునటుల ప్రార్థించి తన గాండీవమును పట్టుకొని మరల యుద్ధమునకుబోయి గోవులనుమరలించి జయమును కీర్తిని బడసెను. ఇది జరిగినదినము ఆశ్వయుజశుద్ధదశమీదినము. అర్జునుడు గాండీవమును పూజించుటవలననే దీనికి ఆయుధపూజయనియు నందురు, అందుచే ఆనాడు అందరును తమతమ ఆయుధములను పూజింతురు. అర్జునుని పేరు విజయుడు. కాబట్టి అనాడే అర్జునునకు జయముకలుగుటచే విజయదశమియని పిలచుచున్నారు. విజయుడు శమీవృక్షము పూజించుటవలన శత్రువులనోడించి దిగ్విజయముబడయుటచే ఇతరులుకూడ శమీపూజవలన తమ తమ కార్యములనుగూడ సాధించుకొనగలమను నమ్మకమేర్పడెను. ఆనాటినుండి నేటివరకు ప్రతిసంవత్సరము ప్రజలు అదిగొక సాంప్రదాయకముగ శమీపూజ చేయుచుందురు. విజయదశమినాడు స్వంతముగ పూజచేయలేనివారు పైనచెప్పిన శ్లోకమును చిన్నికాగితముమీద వ్రాసి జమ్మిచెట్టుకొమ్మకు గ్రుచ్చెదరు.

ఈజమ్మివృక్షమున మహత్తుగలదనియు ఆమహత్తు యెఱిగియేపాండవులు ఆయుధములనుదాచుకొని అవృక్షమును పూజించి ఆవృక్షముయొక్క మహత్తువలను తమకార్యములను సాధించుకొనిరనియు నుడువుదురు. నేటికాలమునగూడ ప్రజలు తమకార్యములను ఫలించుననునమ్మకముతో పూజించుచున్నారు. శమీపూజ వృత్తాంతము నాకు తెలిసినంతవరకు వ్రాసితిని. ఇంతకువిశేషములున్న చదువరులు తెలుపుదురు గాక! ఈసందర్భమున ఒక్కవిషయము వ్రాయవలసియున్నది. దేవీనవరాత్రులకును శమీపూజకును యెట్టిసంబంధమో తెలియకున్నది. దేవీపూజవిధానము వేరు. శమీపూజావిధానము వేరు. ఈసందేహమును బుధులు బాపెదరుగాక.

## మానినీమణీ!

కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

చ. బడలిక నుస్సురుస్సురనివచ్చిన భర్తకుఁ దెల్పకమ్మ! నీ
యిడుమలు; పాదశుద్ధికొఱకిచ్చి జలంబును తాళవృంతమున్
వడిఁ గరమందుఁబూని నునుపాన్పునఁజేరిచి సేదదీర్చి నీ
వడుగులనొత్తి సౌఖ్యములనందఁగఁజేయుము; మానినీమణీ!

చ. పలుమఱునిల్వకమ్మ! తలవాకిట; పక్కన నవ్వకమ్మ! బం
ధులయెడఁ బ్రీతిఁదాల్పవమ! దుర్గుణకాంతలతోడ నెన్నఁడుం
గలియకుమమ్మ! నిద్దురని గాలముపుచ్చక సత్ప్రవర్తనం
బులను జెలంగవమ్మ! గుణభూషణశాలిని! మానినీమణీ!

చ. పనులను జక్కఁబెట్టుటను బానిసవై; విభుమ్రోలనిల్చి యు
క్తిని బచరింప మంత్రివయి; క్లేశముఁబాపఁగ నౌషధంబవై
చనువునఁబాయసాన్నములఁ జక్కనికూరలఁ బిండివంటలం
దనుపఁగ మాతవై; సతులధర్మమునిల్పుము మానినీమణీ!

చ. ముసుఁగిడి నిద్దురింపకుము, మోముటుద్రిప్పకుమమ్మ! యెవ్వరే
న్విసిగినయంతమాత్రమున వేగిరపాటునుజెంది యన్యులం
గసరకుమమ్మ! బావలెడ గౌరవముంపుము; మంకుమాటలన్
మసలకుమమ్మ! నీకు నవమానముగల్గును; మానినీమణీ!

చ॥ చిలుకలకొల్కి! మామెదుటఁజేసెడు చిన్నఁదనంపుఁ జేష్టలం
గులుకకుమమ్మ! యత్తకును గోపమువచ్చును, మామతిట్టు; నా
కలిగొనువేళలందుఁ గినుకన్భుజియించుట మానకమ్మ! పెం
దలకడలేచి యింటిపని దప్పకచేయుము మానినీమణీ!

---

బిడ్డకుతల్లి ఉపదేశించినట్లుగా ఊహించి వ్రాయబడిన ఈపద్యములను శ్రీశాస్త్రిగారు 1905–వ సంవత్సరము ఏప్రియలుమాసమున రచియించిరి. కాని వాని నేలనో శ్రీవారు ప్రచురింపరైరి. విస్మృతిగహ్వరము పాలుగాకుండ ఆపద్యములను సేకరించి ఉభయభాషాప్రవీణ ఉప్పులూరి సత్యనారాయణశాస్త్రిగారు ప్రచురింప మాకుబంపిరి.

—సంపాదకుడు.

# గర్భవతుల నియమములు

ఆలూరు రామచంద్రయ్యగారు బి. యె.

స్త్రీ గర్భవతియైనది మొదలు తనయందుగల్గు మార్పులను గూర్చి చింతించుచుండును. అదియే ప్రథమధారణయగుచో తనకేమిగతి రానున్నదో యని వెతజెందును. సదా ఒంటరిగ నుండగోరును. పరుండును. తల్లి రక్తమునుండి పుష్టినిగొని పిండము పెరుగునుగాన ఆమె శరీరస్థితిమనోస్థితులబట్టి శిశులక్షణములుండును. కాబట్టి గర్భిణులు నిర్మలహృదయలై సంతోషయుతలై విచారము, భయము, కోపము, ద్వేషము మొదలగు వాటికి చోటివ్వక మెలగవలెను. తన పుత్రుడు సద్గుణరాశిగ నుండవలెనని సదా దైవమును ప్రార్థింపవలయును. పుట్టబోవు శిశువుకొరకై తన శరీరమును మనసును నిర్మలముగ నుంచుకొనవలెను. లేనిచో తనకును శిశువునకును కూడ హాని సంభవించుట నిక్కము. ప్రసవము కష్టయుతము. అయినను ఆరోగ్యవంతుల కేకష్టము నుండదు. గర్భిణు లీక్రింది విషయముల గమనింపవలెను.

వ్యాయామము: గర్భవతులు తగిన శరీర సాధకమును తీసుకొనుచుండవలెను. పనిపాటలుచేసి జీవించు స్త్రీలు సుకరముగ ప్రసవించుటయు ఐశ్వర్యవంతులగు నాగరిక స్త్రీలు యెక్కుడు కష్టములకు లోనగుటయు తెలిసిన విషయమే. కాబట్టి గర్భిణులు పనిపాటలు మానక, మితముగ దేహపరిశ్రమ కల్గించుకొనవలెను. ఒకటి రెండు గంటలకాలము తోటలు మొదలగు ప్రదేశములందు నడువవలెను. కాలుసేతులు కదలింపక ఇంటియందున్న స్త్రీలు బలహీనలగుటయేగాక వారి సంతతియు బలహీనముగనుండును; ప్రసవమును బాధాకరముగనుండును. పరిశ్రమయని ఆయాసము కల్గించునట్టి పనులను చేయరాదు. చేసిన గర్భపాతమగును.

ఆహారము: ఆహారము మితముగను, శీఘ్రముగ జీర్ణమగునదిగను ఉండవలయును. అత్యుష్ణపదార్థములు, పిండివంటలు పనికిరావు. రాత్రులందు కొద్దిగభుజింపవలెను.

మలబద్ధము: గర్భిణులు మలబద్ధము లేకుండునట్లు జాగ్రతపడవలెను. విరేచన ఔషధములు ఘాటుగనుండరాదు. చిట్టాముదము నివ్వవచ్చును. ఆపిల్‌పండ్లు విరేచనకారి కాబట్టి వాటిని వాడవచ్చును. ఇప్సన్‌సాల్టు (Epson Salt)ను వాడరాదు. రాత్రి నిదురించుటకు పూర్వము విరేచనమునకు తీసుకొనవచ్చును. అపుడపుడు ఆలివ్ నూనె (Olive oil) కొద్దిగ తీసుకొనుచుండిన మలబద్ధముతొలగును. కొందరికి టీ, కాఫీ, కోకో, నీళ్లు— వీటిని వేడిగనున్న పుడు త్రాగిన మలబద్ధముతొలగును. ఎంత ద్రవపదార్థము భుజించిన అంతకంతకు మలబద్ధము తొలగును.

నెలలు గడచిన పిమ్మట తలయందు నొప్పి (Neuralgia) కల్గును. అపుడు తడిలేక వెచ్చచేయబడిన ఫ్లానలుతో కాపడమిచ్చిన మంచిది. ఈనొప్పి నరములకు సంబంధించినందున తాత్కాలికబలముగూర్చు బ్రాంది, విస్కీ మొదలగువాటి నివ్వరాదు.

పండ్లనొప్పిని పోగొట్టుటకు మంచి పండ్లపొడిని వాడవలెను. పండ్లూడదీయించుట యుక్తముకాదు.

గర్భిణులకు సామాన్యముగ గల్గు వమనాదులకు మందు పనిలేదు. కూడినంత విశ్రాంతి తీసుకొన్నచాలును. మూడు గ్రెయినులు Oxalate of Cerium గల చూర్ణమును వాడవచ్చును. దగ్గువలనకూడ వమనములు కల్గును.

మాసములు నిండినకొలది కొందరికి కాళ్లయందు మర్మావయవములందు వాపు కన్పించును. పిండము దిగువకుజారి రక్తప్రవాహమునకు యిబ్బంది కల్గుటయే దీనికి కారణము. ప్రసవానంతరము తనంతట ఈ వాపుమానును. కాబట్టి మందులక్కరలేదు. ముఖము మొదలగు చోట్లయందు వాపు అగుపడిన తోడనే వైద్యునికి చూపవలెను.

కొందరు గర్భవతులకు శ్వేతస్రావమగుటకలదు. ఇది అధికముగనుండినయెడల కష్టమునిచ్చును. పరిహారార్థము మంచిసబ్బుతో రహస్యప్రదేశమును వేడినీట కడిగి, Permanganate of potash కలుపబడిన గోరువెచ్చని నీటిని పిచికారితో నుపయోగింపవచ్చును.

కొందరికి మూర్ఛవ్యాధివచ్చును. సుమారు 25 బొట్లు Sal volatile ను రెండు ఔన్సుల నీటియందు కలిపి తీసుకొన్న స్మారకము కల్గును. దేహమునకు శ్రమకల్గింపక కాపాడు కొనవలెను.

అజీర్ణభేదులకు మందులు పనిలేదు. ఆహారమునందు మార్పులను గావించుకొనవలెను.

నోట ఉమ్మినీరు అధికముగ కారుచుండిన Tincture of Myrrh తోడ పుక్కిలించవలెను.

మూలవ్యాధియుండినచో తగువైద్యము తోడనే చేయించుకొనవలెను.

మొదటి ఆరుమాసములలోగ రక్తస్రావమగునట్లు తోచినయెడల అతి జాగ్రతగ మెలగవలెను. ఇది చెడుచిహ్నము. తగు విశ్రాంతి తీసుకొని అతిజాగ్రతగ మెలగిన గర్భపాతము తప్పిపోవచ్చును. ఇట్టి చిహ్నము ఏడవనెలకు పిమ్మట అగుపడిన యెడల ఆ స్త్రీ అకాలప్రసవమునకు సిద్ధపడవలయును. పూర్తిగ నెలలయిన పిదప ప్రసవించు స్త్రీకంటె ఈమెకు కష్టమెక్కువ. కాబట్టి నిశ్శబ్దముగ నుండుచోట ఆమెనుంచి ఆమెకు ధైర్యము కల్గింపవలెను. ఏడవనెల యందు పుట్టిన శిశువును అతిజాగరూకతతో కాపాడిన బ్రదుకవచ్చును; కాని ఇట్లు సంభవించుట అపరూపము.

పైకనినరీతి స్రావమును నొప్పులును అగుపడినతోడనే వైద్యుని పిలిపింపవలెను. అతనువచ్చులోపల ఆమెను పరుండబెట్టి ఆహారవిషయమున మిక్కిలిమితముగ నుంచవలెను.

తినుటకుగాని త్రాగుటకుగాని వేడిపదార్థములను ఇవ్వరాదు. స్రావమధికముగ నుండిన యెడల తలకంటె యెత్తుగనుండునట్లు కాళ్లనుంచవలెను. చన్నీళ్లలో తడిపిన గుడ్డలను అధో భాగములపై కప్పిన మంచిది.

గర్భవతులు భీతిని కల్గించు దృశ్యములను చూచుటయు, అట్టి విషయములను వినుటయు కూడదు. అంటువ్యాధులుగలవారిగృహములకు పోవజనదు. పోయి వ్యాధిని సంపాదించుకొనువారు మిక్కిలిగ కష్టపడుదురు. మరిగర్భస్రావమగును. అతిజాగ్రతగ మెల గనిచో గర్భస్రావము వలన అనేకగర్భాశయరోగములు కలుగును. గర్భాశయము స్వస్థా నమునుండి తొలగును. నెత్తురు విషపూరితమగును. ఇట్టి సందర్భములందు వైద్యుని రప్పించవలెను.

గర్భిణులు ధరించువస్త్రములు తేలికగను వదులుగను పరిశుభ్రముగను ఉండ వలెను. ఉన్నిగుడ్డలతో దేహమాద్యంతము కప్పుకొనుట మంచిది. ఉన్ని ధరించుటచే శీతోష్ణభేదముల వలన ఎట్టిచెఱుగును కలుగదు. వస్త్రములు వదులుగ ధరించనియెడల రక్తము చక్కగ ప్రవహింపకయుండుటయేగాక శిశువు పెరుగుట కవకాశముకూడనుండదు. బిగువైన రవికలను తొడుగరాదు. అందువలన స్తనములు పెరుగుటకు వీలులేక పిదప స్తన్య లోపము సంభవించును.

గర్భిణులు వీలగునంతవరకు పరిశుభ్రమగు గాలిపీల్చుచు, కొద్దిగనడుచుచు, సోమరితనము మానియుండవలెను. సైకిలు యెక్కుట ప్రమాదకరము. వారు పరుండు గదులు విశాలముగ నుండవలెను. కిటికీ దగ్గరగను చలిగాలి కెదురుగను పరుండరాదు. రాత్రులు చాలసేపు మేలుకొనరాదు. మిక్కిలి వేడిగగాని చల్లగగాని యుండు నీట జలక మాడరాదు. నీట చాలసేపునానరాదు. నలుగు మొదలగువాటితో గట్టిగ దేహమును రుద్ద కూడదు. సముద్రము, నదులు, చెరువులు మొదలగువాటియందు స్నాన మాచరింపజనదు.

గర్భవతులు తమ కాలమును సంతోషముగ గడుపవలెను. వ్యాకులము మాని సద్గ్రంథపఠనమును, దైవచింతయు కల్గియుండవలెను. అంగహీనులను, వికృతాకారులను, క్రూరకృత్యములను చూడరాదు. భయోత్పాదములగు కథలను వినరాదు. గర్భవతి యేవిధమగు రూపలక్షణములుగల శిశువు తనకు జనింపవలయుననికోరునో అట్టిలక్షణములు గల వారినిగాని వారి చిత్రములనుగాని చూచుకొనుచుండవలెను. పూర్వము రోములో ఒక ఉద్యోగియొకడు తనమంచము నలుప్రక్కలును మన్మథవిగ్రహములనుంచి యుండెననియు, గర్భవతియగు వాని భార్య సదా ఆప్రతిమలను సందర్శించుటచేత మన్మథాకృతిగల పుత్రుని కనగల్గెనని యొక కథకలదు. వికృతాకారములు చూచిన మంచిలక్షణములు గల బిడ్డలు కల్గజాలరు.




శ్రీ రామశర్మ మాండలికగారు

శాలితండులపిష్టమును పాలతోకలిపి తిని త్రాగుచువచ్చిన వారముదినములలో స్త్రీలకు పాలు వృద్ధియగును.

నేలగుమ్మడుచూర్ణము, సన్నబియ్యపుపొడి సమభాగములుకలపి పాలుచక్కెరతో సేవించుచు పాలుఅన్నము తినుచువచ్చిన వారముదినములలో స్త్రీలకు పాలుపడును.

నల్లకలువదుంపల చూర్ణము, చక్కెర, నేయి, తేనె, పాలు మొదలగువాటితో సేవించిన స్త్రీలకు ఆరోగ్యముకలిగి కాంతి బలముచేకూరును. సమస్తరక్తదోషములు నివారణమగును.

పేలాలు, సైంధవలవణము, మామిడిజీడి సమభాగములు చూర్ణముచేసి 10 గ్రెయినులు మొదలు 15 గ్రెయినులవఱకు మోతాదుకట్టి ఇచ్చిన చిన్నపిల్లలకుకలుగు వాంతులు శీఘ్రముగ నిలిచిపోవును.

కాటుకగింజలు కొంచెమువేచి చూర్ణముచేసి దానితోసమముగా చక్కెరచేర్చి 1 లేక 2 తులములు తినిపించిన పిల్లలకు సుఖవిరేచనమగును.

యవలువేచి మసిచేసి నూనెలోకలిపి పూసిన కాలినవ్రణములబాధ నివారణమగును.

రెల్లచిగురు చారుగాగాని పచ్చడిగాకాని చేసితినిన సుఖవిరేచనమగును.

మయూరశిఖీమూలము పాలతో 1/8 తులముమొదలు 1/4 తులమువరకు సేవించుచువచ్చిన పుత్రసంతానము కలుగును.

నిద్రభంగి, బూరుగవేరు, ధాతకీపుష్పము, కలువదుంపలు సమభాగములు చూర్ణముచేసి తులముచొప్పున పాలు, చక్కెరతో సేవించుచుండిన గర్భపతనము గాకుండును.

# సౌందర్యము

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

మానవతత్త్వ మాదినుండియు సౌందర్యదేవత నారాధించుచునేయున్నది. నరమాంసభక్షకుఁడై, దిగంబరియైయుండు నాటవికుఁడుసయితము మొగమునకు రంగుపూసికొనును. కాళ్లేతులయందు బచ్చాకుబొట్లతో నలంకరణము చేసికొనును. శిరోవేష్టముపై నెమిలిపింఛ మమర్చుకొనును. ఇవన్నియుఁ దనసౌందర్యముఁ బెంపొందించుకొను నభిలాషముచేత నేకదా! అత్యున్నతనాగరికతస్థితియందున్న యైరోపాఖండవాసియు, నమెరికావాసియు సౌందర్యప్రవృద్ధికొఱకే తన శాస్త్రవిజ్ఞానమును గళానిపుణతయు గావించుచుండును. వివిధ పరిధానములు, సబ్బుబిళ్లలు, అత్తరులు, నడకలు, మరియాదలు ఇవియన్నియు సౌందర్యదేవత నన్వేషించుటకొఱకై నాగరకు లుపయోగించు పరికరములేగదా! ప్రాఁతకాలపు గ్రీకులు సౌందర్యము దేవతలచేనొసంగబడిన వరప్రసాదమనియు, నారోగ్యముతరువాత నదియే గణ్యమనియుఁ బరిగణించుచుండెడివారు. రోమీయులును సౌందర్యదేవతారాధకులేయైయుండెడివారు. వారి చిత్రప్రతిమలు, కట్టడములు మున్నగునవి యందులకుఁ బ్రబలాదర్శములు.

గ్రీకు రోమనులవలెనే మన ప్రాచీనార్యులుకూడ సౌందర్యదేవ్యుపాసకులే. సౌందర్యమునుగూర్చి వైష్ణవవిజ్ఞానమెఱింగినంత విశేషముగా నేఁటికిని నితరమెద్దియును నెఱుఁగఁజాలకుండెను. వైష్ణవుఁడు తన కొఱకుఁగాక భగవంతునితృప్తికొఱకే సింగారించుకొనును. ఏలయన నతఁడు తన దేహము శ్రీకృష్ణునిరథమని గ్రహించి వర్తించును. ఈవిశ్వములోఁ బురుషోత్తముఁ డొక్కఁడేగలఁడనియు, స్త్రీపురుషు లతనిప్రకృతులనియు లోకమందుఁ గాముకుఁడు తనకామిని మిక్కిలి యందమైనదిగా నుండఁజూడఁదలంచినటులే శ్రీకృష్ణుఁడు తనప్రియులైన సర్వమానవులను నందముతో నొప్పియుండఁగోరుననియు వారిసిద్ధాంతము. "ఆత్మదేహమును బాధించుకొనువాఁడు వానిహృదయస్థితుఁడనైన నన్ను బాధించినవాడగును." అని కృష్ణభగవానుఁడు చెప్పినట్లు భగవద్గీతయందుఁ గలదు. "ఈశరీరము ప్రభునియాలయమని యెఱుఁగవా?" అని పౌల్‌మహర్షి చెప్పినట్లు బైబిలులోఁ గలదు. ఇట్లు సర్వత్ర దేహము పవిత్రమైనదనియు దానిని సింగారించుకొనుట ప్రతిమానవుని కర్తవ్యమనియుఁ దలఁపఁబడుచున్నది.



వ్యాసకర్త్రి

మనకు జీవితకాలములోఁగలిగెడు కష్టములలో సగఁబాలు ఆరోగ్యధర్మములను, ఆత్మశృంగార సూత్రములను ధిక్కరించుటచేతనే కల్గుచున్నవి. సంపూర్ణసౌందర్యము సంపూర్ణారోగ్యములేనిదే కలుగదు. అవయవనిర్మాణసౌష్ఠవము, కరచరణవిన్యాసానుకూల్యము మున్నగునవి కేవల మారోగ్యశాస్త్రజ్ఞానమువలననే యలవడునవికావు.

ఆరోగ్యశాస్త్రవిజ్ఞానము సుందరతను గొంతవరకుమాత్రమే పెంపొందించును. చర్మమునకు నునుపు, కండరములకు బలుపు మొదలగునవి దానివలనఁ గలిగినను బరిపూర్ణసౌందర్యమునకు నింకనుగొంత ఇతరజ్ఞానము కావలయును. ధనముకన్నను, కీర్తికన్నను ఆరోగ్య మమూల్యమైనది. ఆరోగ్యములేనియైశ్వర్య మపార దుఃఖహేతువు. అందములేనివారలచందమును గుందునకుమూలమే! తనగదిలోఁగూర్చుండి తనవిగ్రహమును దర్పణములోఁజూచికొని తన వికారరూపమునకు మిగుల విషాదమొందెడుమానవుని సౌందర్యచంద్రికలు దిగంతములవఱకు వ్యాపించిన నేమిప్రయోజనము? అది వానినొగులు నెట్లుదీర్పఁగలదు? ఏసభకుఁబోయినను, ఏగుంపుననిలచినను జూపరులనాకర్షించెడు సౌందర్యముగలవారిజీవనమే పావనము. వారిజన్మమే ధన్యము.

"ప్రేమయే రాజసభలను, ప్రయాణములను, ప్రమదావనములను బరిపాలించును." అని యొక యాంగ్లేయ కవి పాడినాఁడు. "ప్రేమనుండియే ఈప్రపంచము జనించినది. ప్రేమచేతనే ఈప్రపంచము జరుగుచున్నది. ప్రేమలోనికే ఈప్రపంచము ప్రవహించి లీనముకానున్నది." అని యుపనిషత్తులువ్రాసిన మహా

ర్షులు పలుకుచున్నారు. కాని సౌందర్యము లేక ప్రేమయెక్కడిది? సౌందర్యమే ప్రేమను బ్రేరేచును. ప్రేమయే సౌందర్యమును సంవృద్ధిగావించును. సౌందర్యమనెడు మాంత్రికుని చేతికఱ్ఱచేఁ దాఁకఁబడకున్న మానవహృదయములలోని ప్రేమ మాంద్యమువహించియే యుండునుకదా! అటులే ప్రేమ తనమురళి మ్రోయింపకున్న సౌందర్యనాగము ఫణమువిచ్చి యాడదుకదా! నాఁడహల్య పాషాణరూపముతోఁబడియుండ భగవానుఁడగు శ్రీరామచంద్రుని ప్రేమరసపూరితమగు పాదధూళియేకదా మరల యథాసుందరరూపముఁ దాల్పఁజేయఁగల్గినది? అందము వలపుముందరనిలుచును. అంత వలపు దన్నుదానెఱుఁగును. వలపు అందములోనుండిచూచును. అంత దానికి నూత్నోజ్జీవముగలుగును. సౌందర్యసందర్శనమే ప్రేమను మేల్కొలుపును. ప్రేమస్పర్శమే సౌందర్యమును మేల్కొలుపును. సౌందర్యము ప్రేమనుసమీపింపఁ బ్రేమ క్రమప్రపూర్ణతగాంచును. ఈరీతిగా సౌందర్యప్రేమల పోటీయే సమస్తప్రణయమునకు గళలకును నాధారమగుచున్నది. ఈ కవలదేవతలు సృష్టియారంభమునుండి ఈపరుగుపందెమునఁ బరువెత్తుచున్నారు. పందెమింకను ముగియలేదు. అది యెప్పటికిని ముగియదు. ప్రళయాంతముదాఁక నుండునదే.

ప్రేమలేని ప్రాణమేల? అందములేని ప్రేమయేమున్నది? అందములో లోపమనినఁ బ్రేమ పస్తున్నదన్న మాటయే! నిరశనవ్రతమూనిన ప్రేమ నికృష్టతవహించును. ప్రేమతత్త్వము మాయయని యత్యాశ్రమధర్మము దానిని ఖండించుచున్నది. సౌందర్యము సర్పతుల్యమని యది వాక్రుచ్చుచున్నది. కాని దానివలనఁ బ్రయోజనమేమి? అదినీతినేమేని బెంపొందింపఁగల్గినదా? ప్రణయసౌందర్యముల తిరుగుపాటేకదా యైరోపాఖండమున మధ్యకాలపువైరాగ్యమును మాయమొందించగల్గినది. ఆపరిణామములలోనే సంఘము, మతము అనునవి ప్రపంచము, దేహము, మాయ—అను దేవతలచే నిర్జింపఁబడినవి. అదియంతయు సౌందర్యము తనశత్రువులపైఁ గసితీర్చుకొనుటయేయని నమ్ముడు. సౌందర్యదేవతను సింహాసనమునుండి తొలగింతుమేని ప్రణయదేవతయు నధఃపతితురాలగును. భగవంతుండుసహితము నైచ్యమునఁబడును. ఆదేవతలకు నుచితస్థానమొసంగుదుమేని దైవము కూడ దనయుచ్చస్థితియందుండును.

అమితధనాకర్షణమునకై వేశ్య కృత్రిమశృంగారమును దెచ్చుకొని యలంకరించుకొనును. నిర్మలచరితయే ఒకకన్యగాని, యొక యిల్లాలుగాని యటులే యలంకరించుకొనును. కాని యీరెండువిధములగు నలంకరణములలోను భేదముకలదుగదా! మొదటిది యపవిత్రమైనది, రెండవది పవిత్రమైనది. ఆత్మశృంగారముపట్ల నశ్రద్ధవహించు గృహిణి భర్తృస్నేహసంపాదన మొనర్పఁజాలక నిందపాలగునుగదా! అంతియేకాక మగని మారుత్రోవలంబెట్టి నీతిని చెడగొట్టునదియు నగును.

అందముగానుండవలయునను కోరిక సర్వజనులకును గలదని యెఱింగితిమి. అట్లున్నప్పుడు లోకములో నింకను వికారస్వరూపులుండుటకుఁ గారణమేమి? అది వారికోరికలోని లోపమువలనఁగాదు; అందముగా నుండఁగలమార్గ మెఱుంగకపోవుటచేతనే. మననాగరికతలో నెందఱో స్త్రీలు ఆరోగ్యధర్మములను విడనాడి యందముగా నుండఁగోరుచున్నారు. వారు మైపూఁతలు, మొగము మెఱుఁగులు, విషసహితములైన ద్రావకములు మున్నగునవి యుపయోగించుకొని సురూపముం దెచ్చుకొనుటకుమారు కురూపమాపాదించుకొనుచున్నారు. అందమనునది (1) అవయవముల నిర్మాణములలోను (2) ఆకృతియొక్క యానుకూల్యములోను (3) చర్మముయొక్క కాంతి, నునుపు, రంగుమొదలగువానిలోను (4) కాలుసేతుల జిగులలోను (5) భావోద్రేకము కలిగినప్పుడు వివిధావయవముల సౌష్టవములోను నిమిడియున్నది. వీనిలో మొదటిరెండును తలిదండ్రులవలనఁ గలుగును. ప్రయత్నించిన రావు. తక్కుంగలవి ప్రయత్నముచే నలవర్చుకొనవచ్చును. కరచరణలాఘవము శరీరపరిశ్రమముచేఁ బొందవచ్చునని యెల్లరెఱింగినదే. భావోద్రేకములప్పు డాంగికసౌష్టవము, లలితకళాప్రవేశమువలనను, నాట్యకళాపరిచయమువలనను గలుగవచ్చును. దేహలావణ్యము నిర్మలమైనగాలి పీల్చుటచేతను, బరిశ్రమముచేయుటచేతను గాంచవచ్చును. అప్పుడు మానవులు దేవతాసన్నిభులై మహాతేజోనిధులై యుండఁగలరు. దీర్ఘకాలము సుఖజీవనమొందఁగలరు.




# బువ్వము బంతి పాట

కీ. శే. శ్రీపతి పండితారాధ్యుల మీనాక్షమ్మ గారు

పార్వతీ ఆగస్త్రేశ బువ్వముపద్ధతి విన్నవించెదనేడూ॥ పార్వతీ॥

పచ్చలపందిళ్లె పెట్టిరిగా ముత్యాలతోరణములే కట్టిరిగా పసిడికలిశములే
నిలిపిరిగా పంచమావాయిద్యములే మ్రోవంగా॥ పార్వతీ॥

భక్తులందారు ఒకబంతినుండా ముత్తైదులంత ఒకబంతినుండా బంగారుఅరిటా
కులేపరచి పాత్రాభికారమే చేసి॥ పార్వతీ॥

అరటికాయ కంద వడియములు అప్పడములే వడ్డించిరిగా చింతకాయా
మామిడికాయా చిత్రమైన పచ్చళ్లే వేసిరిగా॥ పార్వతీ॥

సన్నబియ్యాపన్న మొడ్డించి చాయకందిపప్పె యుంచిరిగా కమ్మనికమ్మ
పాషము వోడ్డించి కావాలిసినంత నెయ్యోడ్డించిరిగా॥ పార్వతీ॥

వడలూ సుధియాలు హోళీగములునులాడూలు చిత్రాన్నమొడ్డించి చార
క్షీరాన్నము పెరుగుతో ఆరగించిరి జనులందరును॥ పార్వతీ॥

ఈమనీ ఈశ్వరకల్యాణవిభవమూ చాల సంతోషకరము విన్న చదివీని వ్రా
సీనవారికి ఇష్టసంపదలిచ్చు ఈశ్వరీ॥ పార్వతీ ॥

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి పొణకా రమణమ్మగారు

రాగముపాడ్తా
వింటావా ?
ఏరాగము ?
కూనరాగము—
ఏకూన ?
పిల్లికూన—
ఏపిల్లి ?
మానుబిల్లి—
ఏమాను ?
వేపమాను—
ఏవేప ?
కరివేప—

ఏకరి ?
తొలకరి—
ఏతొల ?
పనసతొల—
ఏపనస ?
కూరపనస—
ఏకూర ?
తోటకూర—
ఏతోట ?
అరటితోట—
ఏ అరటి ?

పచ్చరటి—
ఏపచ్చ ?
ఆకుపచ్చ—
ఏ ఆకు ?
పండుటాకు—
ఏపండు ?
తలపండు—
ఏతల ?
అవతల—
ఏ అవ ?
మీ అవ్వ—

౨. పాటలు

## బడికి పిలుపు

"సోదరి"

తేరా పలకాబలపము
ఇవ్వరా అయ్యవారిచేతికి
ఇంపులరంగా !

పోరా భోజనవేళకు.
రారా పద్యాలుచదువ
రాజకుమారా !

## నాపేరు జమీందారు

శ్రీమతి వడ్లపట్ల శశిరేఖగారు

కాకీకాకీ కలవలకాకి
కాకీని తెచ్చి గంగనుముంచ
గంగ నాకు గంధమిచ్చె
గంధంతీసి గోవుకియ్య
గోవు నాకు పాలుయిచ్చె
పాలు తెచ్చి పంతులుకియ్య

పంతులు నాకు పాఠంచెప్పె
చదువులంత మామకుచూప
మామ నాకు పిల్లనిచ్చె
పిల్లపేరు మల్లిమొగ్గ
నాపేరు జమీందారు.

## నాపేర్రు తహసిల్ దారు

కాకీకాకీ గవ్వలకాకి
కాకీనాకు దీపమిస్తే
దీపంతీసుకెళ్లి గానుగవాడికిస్తే
గానుగాడు నాకు గరిటెడునూనిస్తే
నూనెతీసుకెళ్లి మాష్టరుకిస్తే
మాష్టరునాకు పద్యంచెపుతే
పద్యం మామకువినిపిస్తే
మామనాకు పిల్లనుయిస్తే
పిల్లాపేర్ మల్లిమొగ్గ
నాపేర్ తహసిల్ దారు.

శ్రీమతి యస్. రామరాజ్యముగారు

## చిన్నపిల్లల ఆటపాటలు

౧

బానమ్మబాన
బానచిక్కుడుబాన
దొరగారింట్లోపెండ్లి
చూచివద్దాంరండి.

౨

అమ్మానాకుబువ్వ
చేతిలోదిగవ్వ
కందిఆకు తోరణాలు
కందిపప్పుపూరణాలు
చందలగ్నం పెళ్లికొడక
లేచిరావయ్యా.
చెల్లెమ్మనిస్తాము
పెళ్లాడరావా?
అబ్బబ్బసిగ్గు
వరిపిండిముగ్గు.

౩

ఒక్కోయొక్క
ఒప్పులగుప్ప
రెండోయిరెండు
రెక్కలపక్షి
మూడోయిమూడు
ముక్కాలిపీట
నాలుగోయినాల్గు
నావకాళ్లు
అయిదోయిఅయిదు
అరచేతివేళ్లు.

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

౪

ఒప్పులగుప్ప
ఒయ్యారిభామ
మంచినీళ్లు
మామిడాకు
తురకలదొడ్లో తుల్లిపువ్వు
మాదొడ్లో మల్లెపువ్వు
జల్లెడనిండా పూలు
జల్లాలమ్మతీర్థం
మప్పానవరం మాకియ్యి
దేముడుగిన్నె మాకియ్యి.

౫

వానావస్తుంది పెద్దప్ప
వడ్లుతియ్యా పెద్దప్ప

౬

చెయ్యికిందాకొచ్చినోళ్లు
చెయ్యిదెబ్బ
కాలికిందాకొచ్చినోళ్లు
కాలిదెబ్బ.

## జోలపాట

శ్రీమతి కె. అమ్మాయమ్మగారు

ఆయిఆయిఆయి ఆపదలుగాయి
చిన్నవాళ్లనుగాయి శ్రీవెంకటేశ. ఆయి
జోలల్లుపాడితే జొన్నల్లుపండు
జోలలకుజొన్నబువ్వ నీకు వరిబువ్వ. ఆయి
ఏడ్చేటిఅబ్బాయికి ఎఱ్ఱావుపాలు
నాచిన్నిఅబ్బాయికి నల్లావుపాలు. ఆయి
అబ్బినికొట్టినకొట్టు వూరెల్లరట్టు
తేరేమాఅబ్బాయికి ముత్యాలబొట్టు. ఆయి
ముత్యాలబొట్టుకు మూఁడురేకల్లు
రత్నాలబొట్టుకూ రావిరేకల్లు. ఆయి
వజ్రాలుస్థాపించిన వారిమామల్లు
మాణిక్యాలుస్థాపించినవారిబాబుల్లు. ఆయి
చిట్టినాఅబ్బాయి చిఱుమొగముచూచి
సిగ్గుపడిచంద్రుఁడు పొడవజాలాఁడు. ఆయి
ముద్దుల్లుముద్దుల్లు ముచ్చికాయల్లు
అబ్బాయిముద్దుల్లు గచ్చకాయల్లు. ఆయి
ఇంతంతదీపమ్మ యిల్లల్లవెలుగు
ఈశ్వరుడిచందమామజగతెల్లవెలుగు. ఆయి
గోరంతదీపమ్మ కొండల్లవెలుగు
గోపాలకృష్ణమ్మ మందల్లవెలుగు. ఆయి
మాడంతదీపమ్మ మేడలకువెలుగు
మారాజుఅబ్బాయి మాకళ్లవెలుగు. ఆయి
సూర్యుఁడుచంద్రుఁడు అన్నదమ్ముల్లు
సూటిగుఱ్ఱాలెక్కి జూదమాడేరు. ఆయి
అబ్బాయితమ్ముఁడు అన్నదమ్ముల్లు
లక్కపావాలెక్కి లెక్కరాసేరు. ఆయి
ఏవాడవెళ్ళేవు అబ్బాయినువ్వు?
ఎవ్వరుకట్టేరు కాళ్లమువ్వల్లు? ఆయి
కలవారిపట్నన్ని గారాములన్ని
కంచారికట్టేఁడు కంచుమువ్వల్లు. ఆయి
తనతోడిపట్నన్ని తనకుముద్దాని
అన్నయ్యకట్టేఁడు వెండిమువ్వల్లు. ఆయి
గంధమ్ముతీసిన్న సానచల్లన్న
సభలోన అబ్బాయి మాటచల్లన్న. ఆయి
ఇండూవతీసిన్న నీళ్లుచల్లన్న
ఇంట్లోన అబ్బాయికడుపుచల్లన్న. ఆయి
గోపాలకృష్ణమ్మ పెళ్లయ్యేనాఁడు
గోరింటపూచింది కొమ్మలేకుండ. ఆయి
మాయింటఅబ్బాయి పెళ్లయ్యేనాఁడు
మల్లెల్లుపూచేయి మొగ్గలేకుండ. ఆయి
ఉయ్యాలలోబాల వుగ్గుకేడుస్తే
ఉత్తమాయశోద వూచివుగ్గెయ్యి. ఆయి
పల్లకీలోబాల పాలకేడిస్తే
బలభద్రమాలక్ష్మి పాడిపాలొయ్యి. ఆయి
ఏటిక్కకాలువ ఎంతదూరమ్మ
ఎత్తిపెంచినతల్లి కెంతమోహమ్మ. ఆయి
కాలువనీళ్లన్ని కడుసముద్రమాయె
కడలేనిమోహామే కన్నతల్లికి. ఆయి
పిల్లిపిల్లిపిల్లి పిల్లలకుతల్లి
పల్లెరుముళ్లలో పాలిచ్చిపోవె. ఆయి
పిల్లలికిపాలోసి పల్లెలకుపంపి
అబ్బాయికిపాలోసి ఆడుకోపంపు. ఆయి
ఆయిఆయిఆయి ఆపదలుగాయి
చిన్నవాళ్లనుగాయి శ్రీవెంకటేశ. ఆయి

3. పుక్కిటికథ

## చెల్లెలు

శ్రీమతి కొప్పర్తి వేంకటేశ్వరమ్మగారు

అనగా అనగా ఒక బ్రాహ్మడు. అతనికి నలుగురు కొడుకులూ, ఒక కూతురు. వాళ్ల చిన్నతనంలోనే తల్లి తండ్రి కాలంచేసినారు. మొగపిల్లలకందరికి కొన్నాళ్లకు పెళ్లి అయి భార్యలు కాపరాలకు వచ్చారు. ఆడపిల్ల అందరికన్న చిన్నది. అందరికి ముద్దుచెల్లెలు. వదినెలకుమాత్రం ఆడపిల్లంటే కిట్టేదికాదు. అందుచేత వాళ్లంతా యేమి హానిచేస్తారో చెల్లికని కంటికిరెప్పలాగ అన్నలంతా కాపాడుతూవుండేవాళ్లు చెల్లెని. ఇట్లా కష్టమనేది కన్నెరక్కుండా కాలక్షేపంచేసింది కొన్నాళ్లు ముద్దుచెల్లి.

ఒకనాడు పళ్లు అమ్మవచ్చాయి వూళ్లోకి. చుట్టుపట్ల పిల్లలంతా పళ్లు కొనుక్కుంటూంటే చెల్లికూడా పళ్లు కొనిపెట్టమని పెద్దవదినెగారిని అడిగింది. ఆమె రెండో ఆమె నడగమంది; ఆమె మూడో ఆమెను, ఆమె నాల్గో ఆమెను అడగమన్నారు. కొంచెం జ్ఞానంతెలిసిన పిల్లగనుక, 'అమ్మా నాన్నా లేకపోబట్టిగదా పళ్లు కొనిపెట్టేవాళ్లు కరవయ్యారు' అని యేడ్వడం మొదలెట్టింది. ఏడ్చియేడ్చి ముసుకెట్టుకుని పెద్దన్నగారిగదిలో మంచంమీద పడుకొని నిద్రపోయింది. నల్గురన్నలు పొలాన్నుంచి వచ్చారు; జొన్నకంకులు, పండ్లు తీసికొని చెల్లికోసం. మామూలుగా యెదురువెళ్లి యేంతెచ్చారని అడిగేచెల్లి ఆనాడు అన్నలకెదురు వెళ్లనేలేదు. చెల్లి యేమైందని అన్నలంతా ఆదుర్దాగా అడిగారు భార్యలను. మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు వదినెలంతా. పెద్దన్న చొక్కావిప్పడానికి గదిలోకి వెళ్లేసరికి మంచంమీద ముసుగుపెట్టుకొని పడుకొనివుంది చెల్లి. లేపినా లేవలేదు. ఇంకా లేస్తుంది ఇంకా లేస్తుందని రోజల్లా చూచినా లేవనేలేదు. ఏడ్చి యేడ్చి పాప మాపిల్ల మూర్ఛపోయింది. చచ్చిపోయిందని అన్నలంతా చాలావిచారించి, ముద్దుచెల్లిని దహనంచెయ్యడానికి చేతులురాక, మంచంపాళంగా యెత్తుకువెళ్లి ఒక మహారణ్యం మధ్య వదిలేసివచ్చారు చెల్లిని అన్నలంతా. పీడ విరగడైందని వదినెలకుమాత్రం సంతోషంగానేవుంది.

రాత్రి రెండుజాములకి అడవిలో చల్లనిగాలి హాయిగా వంటికి తగిలేసరికి మూర్ఛ తేరి, చెల్లి నిమ్మళంగా లేచిచూచింది. పెద్ద అడవిమధ్యవుంది తాను. అడవిలో చాలా భయమేసిందిగాని, ధైర్యము తెచ్చుకొని అక్కడనుంచి నెమ్మదిగా నడిచినడిచి తెల్లవారేసరికి ఒక ముసలమ్మయిల్లు చేరింది. ఆ యింటి ముసలమ్మను "అవ్వా! అవ్వా! నీకు చాకిరంతా చేసిపెడతా, నాకిన్ని మెతుకులు పడేస్తూవుంటావా?"అని అడిగింది చెల్లి. "నాకు పిల్లాజల్లాలేరు, నువ్వు చాకిరీచెయ్యక్కర్లేదు యేమీ చేయక్కర్లేదు: నా దగ్గిరవుండమ్మా!" అంది అవ్వ. అలాగే అతిగారాబంగా అవ్వదగ్గర వుంటూవుండేది కొన్నాళ్లు చెల్లి. "ఉత్తరం దక్షిణం మాత్రం పోకమ్మా" అనిచెప్పింది ఒకనాడు అవ్వ."ఉత్తరాన పెద్ద రాక్షసివుంది. పిల్లలను చంపుకుతింటుంది. దానిదగ్గిర 'కురువేరు' వుంది. దానికోసం వెళ్లి యెంతమందో చచ్చిపోయారు. దక్షిణాన 'అందరాని' చెట్టు వుంది. దాని పువ్వుకోసంవెళ్లి యెంతమందిరాజులో ప్రాణాలు పోగొట్టుకొన్నారు. అంచేత ఆ దిక్కులకు పోవ" ద్దంది అవ్వ.

ఒకనాడు అవ్వ వెళ్లవద్దన్నదిక్కులకే వెళ్లాలని తోచింది చెల్లికి. అక్కడికి వెళ్లేసరికి రాక్షసిముండ యిల్లు పెద్దగుహలాగ పుర్రెలతోను, రక్తముతోను భయంకరంగా కనబడ్డది. అది చూచేసరికి హడలెత్తి అక్కడే యేడుస్తూ కూర్చుంది చెల్లి. ఇంతలో రాక్షసి వచ్చింది. ఏవూరు నీదని అడిగింది. నాది ఫలానా

పూరు, దారితప్పి వచ్చానిట్లా అని చెప్పి యేడవటం మొదలెట్టింది. రాక్షసి దానిని సముదాయించి "నీకేమీ భయంలేదు, నాదగ్గరవుండు, నీకు అన్నీ యిస్తా" నని చెప్పి తన దగ్గర వుంచుకొని ప్రేమగా పెంచుకుంటూ వుండేది. రోజూ తలదువ్వి కురువేరుముక్క జడలోపెట్టి అందంగా అలంకరించి సంతోషిస్తూవుండేదిరాక్షసి. కొన్నాళ్లయ్యేసరికి చెల్లిమీద ప్రేమ, నమ్మకము మొదలైనవి బాగా కుదిరాయి రాక్షసికి.

ఒకనాడు యిదే మంచిసమయం అని రాక్షసి యింట్లోలేనప్పుడు కురువేరుచెట్టు మొదలంట పీకివేసి రొంటిన పెట్టుకొని దక్షిణంగా అందరాని చెట్టుదగ్గిరికి పారిపోయింది చెల్లి. ఆ చెట్టుదగ్గిరికి వెళ్లేసరికి అదివరకెంతమంది తన్నుకుచచ్చినా అందు తెలియని చెట్టు పువ్వురాల్చింది. ఆ పువ్వు తీసికొని తిన్నగా అవ్వదగ్గరకు వెళ్లింది. అదివఱకే చెల్లి ఏమైపోయిందో అని వెతుకుతూవున్న అవ్వకు దానిని చూచేసరికి ప్రాణాలన్నీ లేచి వచ్చాయి. అతి సంతోషంతో చెల్లిని కౌగలించుకొంది. ఇద్దరు హాయిగా కాలం గడుపుతూవుండేవాళ్లు.

ఇట్లావుండగా కొన్నాళ్లకు ఒకరాజు ఆ అడవికి వేటకువచ్చాడు. అవ్వదగ్గర అడవిలోవున్న ఈపిల్లను చూచి మోహించాడు. మోహించి, "అవ్వా! అవ్వా! ఈ పిల్లను నాకిస్తావా? పెళ్లాడుతా" నన్నాడు రాజు. "ఇంతకంటేవుందా? నాయినా! అట్లాగే పెళ్లాడ" మంది. తన కూతురికి పెద్ద సంబంధం దొరకింది గదా అనే సంతోషంతో అవ్వ. పిల్లను తీసుకువెళ్లి వైభవంతో పెళ్లాడాడు రాజు.

ఇక్కడ చెల్లిఅన్నలగతి ఏమైంది? కూటికిలేక అడుక్కుతినేగతి పట్టింది వాళ్లకు పాపం! కడుపుకక్కుర్తికి కట్టెలమ్ముకోవడం మొదలుపెట్టారు వాళ్లంతా. కొంతకాలమునకు చెల్లికి కొడుకుపుట్టినాడు. పిల్లాడికి బారసాల జరిగేరోజుకు ఈ అన్నలంతా కట్టెలమోపులు ఎత్తుకొని డబ్బు బాగా దొరుకుతుందిగదా అని దివాణంలోకి వెళ్లారు. వెళ్లేసరికి వాళ్లను అందరిని గుర్తించింది చెల్లి. వెంటనే వాళ్లనుఅందరినీ రప్పించి తలంటిపోయించి మంచిబట్టలు కట్టబెట్టి పిండివంటలతో భోజనం పెట్టించింది. లోపలవున్న పాతకోపంచేత వదినెలనుమాత్రం కాస్త అవమానపరచింది. పెళ్లాలను అవమానపరచినందుకు అన్నలు కాస్త చిన్నబుచ్చుకున్నారు. అప్పుడు తన కథంతా చెప్పుకొనిరాగా అన్నలంతా అశ్చర్యపోయారు యెంతపని జరిగిందీ అని. వదినలు సిగ్గుపడి తల వంచుకున్నారు.

అన్నలకు జీవనోపాధి యేర్పాటుచేయించింది చెల్లి. తర్వాత అంతా సుఖంగావున్నారు.

కథ కంచికి వెళ్లింది. మన మింటికి వచ్చాము.

## గృహలక్ష్మి

సి. వి. పార్థసారథిగారు

పతికి ఏవేళ వలపుల బరణియగుచు
వంశవృక్షంబునకు నాలవాలమగుచు
చుట్టములుమిత్రులకుఁదాను సురభియగుచు
భర్తకన్నిట సైదోడు భవనలక్ష్మి.
కల్గుశుభకార్యంబుల కాదికారణంబు
పాపపుణ్యములకు దాను పాలికాపు
ప్రణయపాఠములనుజెప్పు పంతులమ్మ
పడఁతి, సంసారభారంపు పట్టుకొమ్మ.
మనసు చీకాకుమాన్పెడి మంచిమందు
ముద్దుమురిపంబులను జూపు మోహనాంగి
ముచ్చటచ్చటలనుదీర్చు ముద్దురాలు
వనిత, గేహంపు సర్వసౌభాగ్యలక్ష్మి.



## స్త్రీలు: వేదాధ్యయనము:—

హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమువారి ముప్పదవ జయంత్యుత్సవసందర్భమున మహాముని కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు స్త్రీవిద్యనుగూర్చి గావించిన ఉపన్యాసమునుండి 'స్త్రీలు: వేదాధ్యయనము' అను విషయములనుగూర్చినవాక్యములను సెప్టెంబరునెల 6-వ తేదీనాటి గోలకొండపత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"ఆదికాలములో స్త్రీపురుషులు సమానముగా చదువుకొనుచుండెడివారు; ఋగ్వేదమంత్రములలోను ఉపనిషత్తులలోను స్త్రీలు వేదాధ్యయనముచేసినటుల నిదర్శనములున్నవి. ఏ కారణముచేతనోగాని మన దురదృష్టవశమున ఈ మధ్యకాలములో వారు విద్యాగంధము లేనివారైరి. ఇటీవలనే మరల వారి విద్యాభ్యాసప్రయత్నములు జరుగుచున్నవి. నా యభిప్రాయములో స్త్రీలు మతవిద్య నేర్వవలయును. పురుషులు తమ విద్యను చదివి పరభాషలవెంబడి పరుగెత్తుచుండ, విద్యలేకపోయినను మనహిందూమతమును స్త్రీలే కాపాడుచున్నారు. బయట ఎన్నివేషములు వేసినను ఇంటికి వచ్చినతోడనే తమ తల్లులకును, భార్యలకును భయపడి మతసంప్రదాయము పురుషులనుసరించుచుండుట మనము చూచుచున్నాము. ప్రాచీనకాలమున విద్యజెప్పుట యనిన వేదమునునేర్పుట అని యర్థము. మీ నిలయములో వైదికవాఙ్మయగ్రంథములనుంచవలెను. క్రైస్తవులకు బైబిలు, మహమ్మదీయులకు ఖురానుయెటులనో హిందువులకు వేదమటుల. ఇప్పుడు చాలమంది వేదమును చదువనేర్చినతోడనే వేదపండితులమని భ్రమబడుచున్నారు; కాని దానియర్థమును వారు చక్కగా గ్రహించలేకున్నారు. వైదికవిజ్ఞానము ఇప్పుడు నశించినదనియే చెప్పవచ్చును. ఇతరపనులచే పురుషులకు దీనినిపుడు నేర్చుకొను తీరిక లేకపోవుటచే స్త్రీలకే ఎంతతొందరగా మనము వేదము నేర్పించిన అంతతొందరగా మనదేశము మతము బాగుపడగలదని నా యభిప్రాయము. స్త్రీలును, శూద్రులును వేదము జదువరాదని పూర్వాచారపరాయణులందరు. కాని శూద్రులు వేదము చదువవచ్చునని కొన్ని శాస్త్రములలో వ్రాసియుండగా స్త్రీలేల చదువరాదో నాకు తెలియదు. యజుర్వేదములో నాలుగు జాతులవారును సంస్కారవిధియైనతోడనే వేదాధ్యయన అధికారులగునటుల చెప్పబడియున్నది. కనుక పూర్వము అన్ని జాతులవారును వేదమును చెప్పుకొనుచుండిరి. ఇటీవల శ్రద్ధలేక దానిని వదలిపెట్టిరి. వెనుక హిందువులందరికి సమానమైన అధికారములుండెడివి. ఇప్పటి బ్రాహ్మణుడు తాను వేదమును చదువడు. ఇతరులను చదువనీయడు. నాకు స్త్రీలమీద చాల యభిమానము. పూర్వకాలమందు ఒక డబ్బుతో ఉపనయనమయ్యెడిది; తరువాత విద్య

నేర్పుటలో వారు చాలకాలము గడిపెడువారు. ఎనిమిదవ ఏట ఉపనయనమైనతోడనే పురుషుడెటుల వేదమును చదువుట కర్హుడగుచున్నాడో అటులనే వేదమును చదువు నధికారమిచ్చుటకు స్త్రీకి ఎనిమిదవ ఏట వివాహసంస్కారములు జరుపబడుచుండెడివి. వివాహసంస్కారమే స్త్రీలకు ఉపనయనము. కనుక అప్పటి నుండియే వారికి తమ సతులకు వేదమును నేర్పుచుండిరి. కనుక నా యభిప్రాయములో సంస్కారములేకుండ నేడియు సక్రమముగా జరుగదు గనుక ఉపనయనమనుడు; సమిధాసంస్కారమనుడు స్త్రీకి ఎనిమిదవ ఏటచేసి వేదమును నేర్పించుట మంచిది. స్త్రీకి ఎంతభక్తియుండునో పురుషునికి అంతలేదు. కనుక వేదాధ్యయనమేమి యోగాభ్యాసమేమి వారికి తొందరగావచ్చును; రామాయణములో సీత సంధ్యావందనము చేసినటుల యున్నది. భర్తచేసిన పుణ్యములో సగము భార్యకువచ్చునని నేను నమ్మను. స్త్రీని తన వశములో నుంచుకొనుటకు పురుషుడు దీనిని పన్నినాడు. ఈ క్రియలు మనస్సుకు సంబంధించినవి గనుక డబ్బువలె విభాగించుటకు వీలులేదు; కనుక ఎవరిక్రియలు వారుచేసికొనుచు పరిశుద్ధత పవిత్రత నార్జించుట మంచిది. అప్పుడే దేశాభివృద్ధి కాగలదు; ఇప్పుడు పురుషులు స్త్రీలను ధనపుపెట్టెలనుగా నుపయోగించుచు కావలసివచ్చినప్పుడు దానిని వారినుండి లాగికొనుచున్నారు. కనుక ద్రవ్యాశచూపి పురుషుడు స్త్రీని మోసగించుచున్నాడు. వేదములకు తమ ఇష్టమువచ్చినటుల అర్థములకల్పించినది ముగ్గురు పండితులు. వీరు చాళుక్యరాజులవద్దనున్న విజ్ఞానేశ్వరుడు, బుక్కరాయలవద్దనున్న సాయనాచారి, యాదవులవద్దనున్న హేమాద్రి. కనుక మనకిప్పుడు సాంఘిక విప్లవము కావలసియున్నది. రాజకీయవిప్లవముకన్న ఇదియే ముఖ్యతరమని నేను నమ్ముచున్నాను."

## సీమంతపుంసవనసంస్కారములు:—

శ్రీయుత చెరుకుపల్లి రామేశ్వరశర్మగారు శ్రావణమాసపు 'వర్ణాశ్రమ' పత్రికలో సీమంతపుంసవనసంస్కారములనుగూర్చి వ్రాసిన దిగువవాక్యములు గమనింపదగియున్నవి:—

"గర్భవతియగు ద్విజస్త్రీని సీమంతపుంసవనములను సంస్కారములచేసంస్కరించవలయునని స్మృతులు పల్కుచున్నవి. సీమంతసంస్కారముచే గర్భము సంరక్షింపబడుననియు పుంసవనసంస్కారముచే గర్భవతి పుత్రునిగనుననియు శాస్త్రములు చెప్పుచున్నవి. ఇయ్యవి ప్రథమగర్భమునం దాచరింపబడిన చాలుననియు, ఆసంస్కారములచే ననంతరగర్భములన్నియు సంస్కరింపబడినవే యగుననియు ఆపస్తంబాదిమహర్షులు వచించుచున్నారు. నాలుగవమాసమం దాచరింపతగినది సీమంతము. సంస్కారమునకు "సీమంతోన్నయనము" అని పూర్తి నామధేయము. సీమంతమనగ స్త్రీయొక్క శిరస్సునగల పాపడిరేఖ. ఈరేఖను పతిచే తుడిపించెదరు. ఇట్లుతుడుచుటయే "ఉన్నయనము" అందురు. ఈసంస్కారము నాచరించతలచిన శుభదినమునకు పూర్వమందే గర్భవతియొక్క పతి నాందీశ్రాద్ధమాచరించి బ్రాహ్మణులకు భోజనంబిడి భుజించిన శుచివంతులును, మంత్రవేత్తలును అగువారలవలన ఆశీర్వాదములనందుకొని అగ్నిహోత్రమును ప్రతిష్ఠించి యందు యెనిమిది ప్రధానాహుతులను హోమముజేసి జయాదిహోమములతో బూర్తిజేసి పత్నిని ప్రాఙ్ముఖముగ కూర్చుండబెట్టి తాను పడమటిముఖముగ నిలుచుండి మూడుచోట్ల తెల్లమచ్చలుగల ఏదుపందిముల్లు, మూడుదర్భపోచలు, గల దుబ్బుపండ్లు ఆకులతోనుండు మేడికొమ్మ ఈమూడువస్తువుల నొకటిగాచేర్చి పత్నియొక్క పాపటిరేఖను పయికి తుడువవలయును. తుడుచునపుడు వ్యాహృత్యాదిమంత్రములను పఠించవలయును. వీణాగాయకులచే కొన్ని సూత్రోక్తమంత్రములను గానముచేయింపవలయును. అనంతరమందు యవాంకురములను, లేదా వరి నారును, త్రాటితోకట్టి దానిని పత్నియొక్కశిరస్సునకట్టవలయు. అంతనక్షత్రోదయమగువరకు దంపతులు మౌనవ్రతమవలంబించి భుజించకయుండి యనంతరమున ఆవుగిత్తదూడ నొకదానినితెచ్చి దానివెనుక దంపతులు తూర్పుగాగాని యుత్తరముగాగాని కొంతదూరమునడిచి వ్యాహృతులు జపించి మౌనవ్రతమునువిడిచి యథాసుఖముగ విహరించవలయును. ఈసంస్కారమునం దుపయుక్తములగు మంత్రములయొక్కయు, ఓషధుల

యొక్కయు వీర్యము గర్భసంరక్షణము చేయఁజాలియున్నదని మంత్రద్రష్టలగు మహర్షులు వచించియున్నారు. పుంసవనమను సంస్కారము గర్భవతియైనదని తెలియుటతోడనే అనఁగ మూఁడవమాసమునఁగాని నాలుగవ మాసమునఁగాని యాచరింపదగినది. కాని సాధారణముగ సీమంతోన్నయనమయిన తరువాతనే యాచరించఁబడుచున్నది. సీమంతమునందువలెనే ఇందును పూర్వదివసమునందు నాందీశ్రాద్ధమాచరించి మరునాఁడగ్నిప్రతిష్ఠ గావించి యందు "ధాతాదదాతునోరయిమ్" ఇత్యాది యెనిమిది ప్రధానాహుతులను జయాదిహోమములను గావించి రెండుకాయలతో నొక మొగ్గతో తూర్పుగాని యుత్తరముగ గానియున్న మఱ్ఱికొమ్మ చిగురును తెచ్చి దాని నొకఋతుమతికాని కుమారిచే రాతిపై రాతితో నూరించి వస్త్రమున వడియగట్టి పత్నిని యగ్నిసమీపమున తూర్పుముఖముగ వెల్లకిలపరుండఁబెట్టి యామె కుడిముక్కున పతి తన కుడిచేతియంగుష్ఠముతో రసమును తాను తూర్పుముఖముగ నిలుచుండి కనులుమూసికొని పిండవలయును. ఈరసము పిండునప్పుడు "పుంసువనమసి" యను మంత్రమును పఠించవలయును. ఆమె యారసమును చీదివేయక గ్రహించి గర్భకోశమునకు చేర్చుకొనవలయును. ఈకర్మచే సంస్కరింపబడిన స్త్రీ పుత్రునికనును. ఇదియనుభవైకవేద్యమై, ఆసేతుహిమాచల పర్యంత మనాదికాలమునుండియు నాచరింపబడుచున్నది. కాని ఏలకో ఇటీవల మన యాంధ్రదేశమున నీసీమంత పుంసవనసంస్కారము లాచరింపబడుట లేదు. ఇట్టిసంస్కారము లున్నవనిగూడ కొలదిమందికి మాత్రమే తెలిసియున్నది. ప్రయోక్తలలో చాలమందికి ప్రయోగవిధానముకూడ తెలియుటలేదు. ఇప్పటికిని ఈరెండుసంస్కారములు దక్షిణదేశమునందు తప్పక యాచరింపబడుచున్నవి. పవిత్రములై, యారోగ్యకరములై, నిరపాయములై, ఆచరణీయములైయున్న స్మార్తసంస్కారములను వదలి మనవా రెన్నియిక్కట్టులకు లోనగుచున్నారో వివేకు లూహించవలయును. పుంసవనసంస్కారమును ప్రథమగర్భమునందే యాచరింపవలయునని విధించినమాట జరుగునుకాని అనధికారి చెప్పుమాటలకు విలువలేదని తెలియగలము. మంత్రములను నవిసమాధిస్థితిలోనున్నప్పుడు మహానుభావులు నుడివినమాటలు లేక శబ్దములు. అవి సనాతనకాలమునుండి ఆధ్యాత్మనదీప్రవాహమువలె పారుచునేయున్నవి. మనమొనర్చు సంధ్యాదిక్రియలు ఈప్రవాహములోచేరి లోకకల్యాణకారకమగును."

## లోకములోని పెండ్లి వాడుకలు:—

అను శీర్షికక్రింద సెప్టంబరుమాసపు 'వాసవి' పత్రిక దిగువవిషయములను ప్రచురించుచున్నది:—

"మనలో పెండ్లిండ్లలో వధూవరులు తలంబ్రాలు పోసుకొనుట, వారిపై పెద్దలు అక్షతలు చల్లుట వాడుకయైయున్నది. వధూవరులమీద బియ్యము చల్లు వాడుక యితరదేశములలోకూడ కలదు. కొన్నిచోట్ల బియ్యమునకు బదులు రొట్టెనుకోసి పంచిపెట్టుదురు. ఇదంతయు దయ్యములను తృప్తిపరచుటకు చేయుపని. దయ్యములు సోకకుండ కాపాడుటకై సేనలలోని యుద్యోగస్థులు పెండ్లిచేసికొనునపుడు, సైనికులు బారులు తీరి రెండుప్రక్కల వారు కత్తులచేతఁబట్టుకొని, వధూవరులు నడచిపోవుటకు "ఆర్చి" కట్టుదురు. డర్హాములో పెండ్లికూతురు తలపైనుండి గుండ్లుపోవునట్లు తుపాకులు కాల్చుదురు. ఆఫ్రికాలో వరుఁడు వివాహమైన రాత్రియంతయు నింటిచుట్టు కత్తిచేఁబూని గస్తుతిరుగును. నిజెగొరోడ్ లో పెండ్లికొడుకు కొడవలి చేతబట్టి యింటిచుట్టు చీకటిలో పారాయిచ్చును. ఇవన్నియు దయ్యములను పారదోలుటకు ఏర్పడిన వాడుకలు.

వధువులను దాచుట:—బహార్ ద్వీపములో వరుడు పెద్ద చీకటిగదిలో దాచిన వధువును వెదుకవలెను. ఈజిప్టులో ముహూర్తము అయ్యేవరకు వధువును వరుఁడు చూడగూడదు. వధూవరులకు మధ్య తెరపట్టువాడుక మనలోకూడ గలదు. జ్యూలవివాహములలో వధువు పైనపట్టిన తెరక్రింద కన్నులు మూసుకొని యుండవలెను. తెరయుండుటచే పైనుండి దయ్యములు రావని భావము. పెండ్లింఢ్లలో పెండ్లివారు ఉల్లభముక్రింద నడచుట మనలోకూడ కలదు. బిడౌయిన్లలో పెండ్లియైన వెంటనే పెండ్లికూతురు కొండలలోకి పారిపోయి దాగికొనును. పెండ్లికొడుకు దానిని వెతకవలెను. బల్గేరియాలో నూతన వధూవరులు ఏడు దిన

ములవరకు ఇల్లువిడిచి బయటపోగూడదు. పెండ్లికూతురిని కొంతకాలము దాచియుంచవలెనను భావమే కొన్ని చోట్ల పెండ్లిండ్లలో దోమతెరవంటి బురకావేయుపద్ధతిగా మారినది. పెండ్లిరోజున పెండ్లియగువరకు పెండ్లికూతురును పెండ్లికొడుకు చూడరాదని చెప్పుదురు.

దయ్యములను మోసపుచ్చుట:—కొన్నిచోట్ల పెండ్లికూతునకు మగవేషము వేసి, పెండ్లికొడుకునకు బదులు బొమ్మను పెట్టుదురు. ట్రాన్సిల్వేనియాలో వధువును మరి యిద్దరు స్త్రీలను తెరచాటున నుంచుదురు. వరుడు అందులో తనభార్య యెవతో తెలిసికొనవలెను. ఎస్తోనియాలో పెండ్లికూతురియొక్క సహోదరుడు ఆడవేషము వేసుకొని తన సోదరికి బదులు కూర్చుండును. బ్రిటనులో వధువుకు బదులు ఒక స్త్రీ తరువాత నొక స్త్రీచొప్పున ముగ్గురు కూర్చుందురు. తర్వాతనే వధువువచ్చును. ఇండియాపశ్చిమోత్తరరాష్ట్రములలో వధూవరులు వివాహమునకుముందు కొన్నాళ్లు స్నానముచేయక మురికిగుడ్డలు కట్టుకొని దాగియుండవలెను. కొన్నిచోట్ల దయ్యములు తమను గుర్తుపట్టలేకపోవునను తలంపుతో పెండ్లినాడు వధూవరులు క్రొత్తబట్టలు గట్టుకొందురు. ఆబట్టలను ముందుగా కట్టుకొనగూడదు. ఇవియే మనలో మధుపర్కము లనబడును.

స్త్రీల ప్రమాదము:—బర్మాలో సన్యాసులు స్త్రీలుచేసిన వంటకమును భుజించరు. ఆషాంటి, సెనిగాంబియా, కాలిఫోర్నియా మొదలగుచోట్ల భార్య భర్తతో కూర్చొని భుజింపకూడదు. కొన్నిచోట్ల స్త్రీలకు పురుషులకు ఒకేపొయ్యిమీద వంటచేయగూడదు. మన దేశమందువలెనే ఆఫ్రికాలో స్త్రీ పురుషులు ప్రత్యేకముగా భోజనముచేయుదురు.

సహపంక్తిభోజనము:-సహపంక్తిభోజనము స్నేహభావమును సూచించును. కొన్నిచోట్ల అట్టిభోజనమే వివాహతంతు. బ్రజీలులో వధూవరులుకలిసి బ్రాంది త్రాగుదురు. జపానులో వధూవరులు ద్రాక్షసారాయ తొమ్మిదిగిన్నెలు త్రాగుటతో వివాహము పూర్తియగును. నివజోస్‌లో ఒకకుటుంబమునుండి వధూవరులు కొన్నన్నముతినుటయే వివాహము. నార్వేలోను రష్యాలోను వధూవరులు ద్రాక్షరసమును త్రాగుదురు. వధూవరులు తినగామిగిలినది శుభసూచకము. ఐరోపియనుల పెండ్లిండ్లలో పంచిపెట్టబడు రొట్టెతునకలు తలక్రిందపెట్టుకొని పరుండినయెడల పెండ్లికానివారికి తగినభార్య లేక భర్త లభించునని భ్రాంతి. మనలో తలంబ్రాలబియ్యము నట్లే స్త్రీలు తెచ్చి దాచుకొందురు. మన పెండ్లిండ్లలోని బూవంబంతి యట్టిదే.

రక్తముకలుపుట:-మెక్సికోవాసులగు అజ్టెక్సులో వధూవరులరక్తము కొంచెముతీసి కలుపుటవల్ల వివాహబంధ మేర్పడును.

చేతులుకలుపుట:-పుట్టువాలలో వధూవరులు బొటనవ్రేళ్లుకలిపి కట్టుటవలన వివాహబంధమేర్పడును. అబ్బీసీనియాలో వధూవరులచేతులు ఒక బట్టక్రిందపెట్టి చిటికెనవ్రేళ్లను కలుపుదురు. మలయాలో వధూవరులు ఒకరినోటనొకరు అన్నముపెట్టుదురు. మనలో సప్తపది ప్రధానకర్మ. వధూవరులు ఏడడుగులునడచి వధువుకాలి బొటనవ్రేలిని వరుడు నల్లరాతికితాకించును. ఇదిలేనిదే వివాహబంధమేర్పడదు.”

**శారదాచట్టమునకు సవరణ:—**

ఆగష్టుమాసపు ‘హిందూసుందరి’పత్రిక శారదాచట్టమునకు దిగువ సవరణనుగొనిరానాయకులను హెచ్చరించుచున్నది:—

“శారదాబిల్లు యెట్టి దుర్ముహూర్తమున ప్యాసయినదోకాని ఇది ప్యాసయినను ప్యాసవనటులే నిరుపయోగస్థితిలోనుండిపోయినది. ఇది యెంతయైన విచారింపవలసిన విషయము. ఇది ప్యాసుకాకమునుపు మనదేశమున నెక్కడనోకాని పసిబాలికలవివాహము లంతగా లేకుండెను. ఇది ప్యాసయినదిమొదలు ప్రతిప్రాంతములోను నెన్నడు మున్ను కనివిని యెఱుగని, తలంచియుండని ప్రతివారికి బీభత్సగాగన్పట్టు నతిబాల్యవివాహములేకాక అతిశిశువివాహములుకూడా వేలానువేలుగా జరుపబడినవి. చట్టము ఆచరణలోనికి

వచ్చుననగా జరిగిన వింతవింతవివాహములకు లెక్కయే లేదు. ఎల్లజాతులవారు నేదో యుప్పెనవచ్చుచున్నటుల కంగారుపడి యిహపరఫలాఫలముల యోచనయేమరచి యనేకయసంగతవివాహములు జేసిరి. సరియే దానితో గూడ సరిపోవలేదు. ఆచట్టము అమలులోనికివచ్చినదాదిగా మఱియొకటి బయలుదేరినది. తమ్ము బాధించునను భయసంకోచములు లేకుండా నిరాఘాటముగా యథేచ్ఛగా శిశుబాలవివాహములు చేయుచున్నారు. పిల్ల పెద్దదియగునేమో, కులము మతము మంటగలియునేమో యని భీతిల్లు ఛాందసబ్రాహ్మణులేకాక యట్టియవమాన మేమియులేని యితరజాతులవారు అనగా నాలుగైదుమనువులు చేసికొన్నను దప్పులేని చాకలి, గొల్ల, యీడిగె, యెరకల, మేదర, చప్పటజాతులవారుగూడా నాలుగైదేండ్లబాలికలకే గబగబ పెండ్లిళ్ళుచేసి వేయుచున్నారు. వారిలో ననేకవధూవరు లిర్వురుంగూడ గోచిపెట్టలేని పసివారుగాంగూడ గన్పట్టుచున్నారు. ఇంత పుట్టుమునక యేమివచ్చెనో అవగాహమగుటలేదు. ఈ బిల్లు ప్యాసుచేయించినవారు నాటినుండియే ఇది యాచరణలో బెట్టబడునటుల దగినయేర్పాటు చేయకపోవుటవల్ల వారెంతయో ప్రయాసపడిచేసిన పని యంతయు వ్యర్థమగుటయేకాక ఆపని బాల్యవివాహముల నాపుటకు మారుగ నింక ననర్థకమై నెలపిల్లలకుం బెండ్లిండ్లుచేయు నవకాశములంగూడ గల్గించినది. ఇంతియేకాక చట్టములో నుదాహరింపంబడిన కొన్ని కఠిన నియమములవల్ల దానియొక్క పటుత్వము నశించిపోయినది. ఏమనగా నెచటనైన బాల్యవివాహము జఱిగినచో నావిషయ మాస్థానీయులగు గ్రామోద్యోగులుగాని, ఇతర సంఘసంస్కారాభిలాషులుగాని యధికారులకు రిపోర్టుచేయుటయు, దానిపైని వారు చర్యతీసుకొనుటయు నను నేర్పాటు దానిలోలేదు. ఎవరైన నందుకై ఫిర్యాదుచేయవలెనన్నచో రూ. 100 లు ధరావతుకట్టవలెను. జిల్లామేజస్ట్రీటుచెంతనే కేసుపెట్టవలెను. వారి సొంతఖర్చుమీదనే ఆ కేసులో సాక్ష్యవాఙ్మూలము లిప్పించి రుజువుపరచవలయునను నియమము లేర్పాటుచేయబడినవి. ఇవి ఆచట్టముయొక్క పటుత్వమునే చెడదీసివైచినవి. ఇంతగొడవ నెత్తిబెట్టికొని యేదో వాళ్లదారినివారు బోవువారిపై కేసుపెట్టి వారిని చెరకంపి, వారితో రోష్టు ప్రజలతో నిష్ఠురము పడుటకెవరు సాహసించి ముందడుగువైతురు? కేసుపెట్టనివిషయమై ప్రభుత్వోద్యోగులుకలుగ జేసికొనరుగదా! అందువల్ల చట్టము వ్యర్థమైనది. ఇందువల్ల దేశమున బాలవితంతువులేకాక శిశువితంతువులుగూడ నేర్పడి ఇంకను నీతిబాహ్యతకు దేశనష్టమునకు దోడ్పడుదురుగదాయని విచారముగలుగుచున్నది. గ్రామకరణములు నిరంతరము గ్రామములోని జననమరణముల లెక్కలువ్రాసి తాలూకాకచేరీలకుం బంపుదురు. అందుకు వారిచెంత ఒకప్రతియు, తాలూకాఆఫీసులో నింకొకప్రతియునుండును. కావున నీ వివాహవిషయమగు రిపోర్టు చేయు పూచీకూడా వారిపైనేపెట్టుచో వారు తమగ్రామములోజరుగు బాల్యవివాహములంగూర్చి, వారి పేర్లు వాకబుచేసి వారి పుట్టినతేదీ వెదకి నాటికి వారివయస్సెంతో తెల్పుచు రిపోర్టు పంపుమని వారికి ఆర్డరున్నచో వారు వివరముగా వివాహమునకు సంబంధించినవారి పేర్లతోసహా తెలియపరతురు. అందువల్ల నితరులకు కష్టనిష్ఠురములు లేకుండ సులభముగా పనిజరుగును. తహసీల్ దారు లేక మేజస్ట్రీటు తనకచ్చేరిలోనున్న పుట్టుకలెక్కలంబట్టి సరిచూచి, అట్టివివాహమునకు సంబంధించినవారిపై తగినచర్య తీసికొనుటకు డిస్ట్రిక్టు మేజస్ట్రీటుకే రిపోర్టుపంపుచో మంచి ఫలితమేర్పడి చట్టము సార్థకమగును. లేనిచో దేని నివారణార్థమై ఈ చట్టము శాసనముగావింపబడినదో ఆ ప్రయోజనమే శూన్యమై పాత దురాచారమిట్లు అవిచ్ఛిన్నముగా సాగుచునేయుండుట తప్పదు. కావున చట్టమును సమర్థించి దానికై కృషిచేసిన దేశాభిమాను లీదోషముల గ్రహించి ఈ సూచించినవిషయ మాచరణలోనికిదెచ్చునటుల నొకసవరణచట్టముపెట్టి యామోదింపజేయుచో మిగుల సమంజసముగానుండునని సూచించుచున్నారము.”




## అట్లాంటిక్ మహాసముద్రమున ఉత్తుంగమైనతరంగము:—

1928-వ సంవత్సరము ఏప్రియలుమాసమున అట్లాంటికు మహాసముద్రమున ఉత్తుంగమైనతరంగ మొకటి లేచినది. అంతకుపూర్వము అంతఎత్తుకు ఆసముద్రమున తరంగములు లేచియుండలేదు; ఆతరంగము లేచినపుడు ఆసముద్రమున 'లీవియూథన్' అను పేరిది ఓడ ప్రయాణముసల్పుచుండెను. ఆ ఓడయొక్క సెర్చిలైటు నీటి మట్టమునకు 140 అడుగుల ఎత్తుననుండెను. లేచినతరంగము ఆదీపమును ఆర్పివేయగలిగినది.

## స్త్రీ పురుషుడుగా మారుట:—

నాంగునేరితాలూకా సెల్వమరుదూరుగ్రామమున నొకగొల్లవానికి ఒకబిడ్డ పుట్టెను. ఆమె స్త్రీ శిశువు ఆకారము కలిగియుండెను. ఆమె స్త్రీశిశువనియే భావించి తలిదండ్రులామెను సాకిరి. ఆమెకు 20 సంవత్సరములురాగా ఒకయువకునకిచ్చి వివాహముచేసిరి. ఆమె భర్తతో పదిమాసములు కాపురముచేసెను. కాని ఆమెకడ ఆడుపోడుములేవియు కానరాలేదు. దాంపత్యసుఖమునకు దూరుగాలైయుండెను. మర్మావయములందు ఆమెను సహింపరానిబాధ పొడసూపెను. అందుమీద ఆమెభర్త ఆమెకు మందిప్పించుమనిచెప్పుచు ఆమె తండ్రివద్దకు బంపెను. ఎందఱోడాక్టరులు ఆమెకు చికిత్సచేసిరి. కాని బాధ నివారణకాలేదు. గొప్పడాక్టరులచే నామెను పరీక్షచేయింపవలెనను కోరికతో ఆగొల్లవాడామెను ఎడియంగాడికి దీసికొనివెళ్లెను. ఎడియంగాడిలో అనుభవజ్ఞురాలగు నొక మంత్రసాని ఆమెను పరీక్షించి ఆమె పురుషుడుగాని స్త్రీకాదనియు వెంటనే నాగర్‌కోయిలకు తీసికొనిపోయి అచ్చటి సుప్రసిద్ధవైద్యులచే పరీక్షచేయింపవలయుననియు సలహా ఇచ్చెను. నాగర్‌కోయిల్‌నందు ఆమెను పరీక్షించి శస్త్రచికిత్సగావించి ఆమె పురుషుడేయని డాక్టర్లు నిర్ణయించిరి. యువతి యౌవనుడాయెను. అతనికి వివాహముకూడ కానున్నది.

## వృకోదరుడు:—

భీమునిబోలిన భోజనశూరునివృత్తాంత మొకటి వినవచ్చుచున్నది. సరాజెవూలో అనుతావున భోజనము విషయమై పోటీపరీక్ష గావింపఁబడెను. అందు వాల్లాస్‌విక అనునామముగల బాస్మనుదేశీయుడు జయముగొనెను. అతనివయస్సు 25 సంవత్సరములుమాత్రమే. పెక్కుమంది ప్రేక్షకులసమక్షమున నాప్రసాదరాయడు: 17 పౌనుల గోధుమరొట్టె; 2 పౌనుల వేపుడుమాంసము; 4 పౌనుల ఉడికించని ఓట్సుధాన్యము, 30 భాగములు ఐయిసుక్రీము ఏకటాకీని తినివైచెను. పదార్థములన్నియు భుజియించి మిక్కిలి సంతృప్తుఁడై ఆతఁడిట్లు వచించెను, "ఇంతటివఱకైన నాజీవితకాలములో నేను మూడుమారులుమాత్రమే కడుపునిండ భుజింపగలిగి

తిని. మొదటిసారి నేను యుద్ధభటుడుగానుండినపుడు 25 గురు సైనికులకొఱకు సిద్ధముచేయఁబడిన ఆహార పదార్థములనన్నిటిని నేనొక్కఁడనే భుజియించితిని. రెండవతూరి మఱియొకమారు నేను చాలబాగుగ భోజనముచేసితిని. అప్పుడు నేను సరాజెవూలోనుండి మాస్టరుకుగల 50 మైళ్లదూరమును ఒక్కఁబిగిని నడువగలిగితిని. ఏఁబది మైళ్ల నడకయు సంపూర్తిచేసి మాస్టరుచేరువరకు నాకు తిరిగి యాఁకలికలుగలేదు. మూడవమారు మీయందఱియెదుట తిరిగి నేడు సంతుష్టిగ భుజియింపఁగలిగితిని. నేను సాధారణముగ నిత్యము 22 పౌనుల రొట్టెనుతిని 17 పైంటుల జలమును త్రాగగలను."

ఒకే కాన్పున ఆఱుగురు పిల్లలు:—

దక్షిణ అమెరికాఖండమున బ్రెజీలిరాష్ట్రమున నివసించు సెన్ హారోహన్ అనుయువతి ఒకే కాన్పున ఆఱుగురుబిడ్డలనుగనియెను. ఆఱుగురుబిడ్డలును మగచిన్నవారే.

కోతిరూపుగల స్త్రీలు పురుషులు:—

జపానులో తయిహోజీకి పశ్చిమమున 25 మైళ్లదూరమున వోకుమూరా అనుగ్రామము కలదు. ఆగ్రామము దాదాపుగా నిర్మానుష్యముగానే యున్నదిగాని ఆగ్రామమున ఒకకుటుంబమున కోతిరూపుగల స్త్రీలును పురుషులునుకలసి అయిదుగురున్నారు. వీరినిగూర్చి జపానుపత్రిక లిటులవ్రాసినవి: "ఈగ్రామములో నివసించుచున్న యొకవేటకాడు యీగ్రామమునకు సమీపమందున్న అడవిలో ఒకకోతిని తుపాకితో కాల్చిచంపెను. అతడింకను బ్రతికియేయున్నాడు. అతనివయసు 95 సంవత్సరములు. ఆకోతి చనిపోవుటకు ముందు అతనిని శపించి ప్రాణములువదలినది. అందువలన ఆవేటకాని పెద్దకుమారుడగు జింతారో సౌరానాక అనునతనికి పుట్టిన 5 గురు బిడ్డలును స్త్రీలును పురుషులునుకూడ కోతిరూపువారైయెరి. సౌరానాకవయసు ఇపుడు 75 సంవత్సరములు. వీరికి 5 గురికిని ఒంటినిండ కోతులకుండునటులే బొచ్చుకలదు. వీరిని తమ తండ్రియింటియందే యుంచిరి. వీరిలో పెద్దవానివయసు 38 సంవత్సరములు. గ్రామములోనివారందరును యీకోతిమనుష్యులనుచూచి చాల భయపడుచుందురు. వీరు ఇండ్లనుతగులబెట్టుట మున్నగు కోతిచేష్టలన్నియును చేయుచుందురనిగూడ వారు తెలిపిరి. 1925 వరకును ఆగ్రామముసంగతి యెవరికిని తెలియదు. అపుడు జానాభాతీయుటకు ఒక ఉద్యోగి ఆగ్రామమునకువెళ్లుట తటస్థించెను. అతడచట వీరినిచూచి విచిత్ర జంతువులను ప్రదర్శించునట్టి యొకనికి తెలిపెను. వెంటనే అతడచటికి వెళ్లి ఒక్కొకనికి 20 పౌనులవంతున 5 గురికిని 100 పౌనుల నిచ్చెదనని వారితండ్రితోను తాతతోను చెప్పగా వారంగీకరించిరి. ఒకమోటారు కారులో వారినైదుగురిని యెక్కించి అతడు కనాజావాకు తీసుకొనివచ్చెను. కాని వారు చాలదౌర్జన్యమొనరింప నారంభించుటచే అతడు వారిని మరల ఆగ్రామమునకు పోనిచ్చెను. వారినిపుడు ఆగ్రామములో చూడవచ్చును."

(ఆంధ్రపత్రిక)

ఆఱువారముల వయసుగల శిశువు మాటలాడుట:—

బ్రెజిలులో ఒక మోటారుకారుడ్రైవరుకు ఒక ఆడపిల్ల పుట్టెను. ఆశిశువుకు అమెరీసుమాటర్రు అని పేరుపెట్టిరి. పుట్టిన 14–వ రోజుననే ఆశిశువు ధారాళముగా మాటలాడసాగెను. పుట్టిన 30 రోజులలోపుగానే ఒకరోజున పోర్చుగీసుభాషలో ఆశిశువు "తండ్రీ! ఏమిబ్రతుకు!" అని తనతండ్రితో ననెను. ఆశిశువు అటుల మాట్లాడుటవిని అతడు నిర్ఘాంతపడెను. అతనిపేరు మాటరు. ఆబిడ్డపేరు అమెరీసు. తనశిశువు మాటలాడుటనుగూర్చి మాటరే ఒకనాడిటుల తెలిపెను. "ఒకనాడు సాయంకాలము నేను యింటికి చాల ఆలస్యముగా వెళ్లితిని. పని యెక్కువగానుండుటచే ఆలస్యమైనదని నాభార్యతో మామూలుమాటగా చెప్పితిని. 43 రోజుల పసిబిడ్డయగు నాకూతురు ప్రక్కమీద పరుండియుండెను. "నాయనా! నీస్నేహితులతోగూడ వెళ్లి వినోదముగా ప్రొద్దుపుచ్చితివి కాదా? అందువలన ఆలస్యమైనదని నీవు అమ్మతో నిజమేలచెప్పరాదు?" అని ఆశిశువు నాగుట్టు బయటపెట్టెను. నేనపుడు నిజముచెప్పితిని." అని అతడనెను.

# వనితాలోకము

**విద్యావతులగు సోదరీమణులు:—**


విద్యావతులగు సోదరీమణులు

శివపురము జమీందారులగు పి. వి. మానిక్కమునాయకరు గారి ముగ్గురుకుమార్తెల ఛాయాచిత్రము లిచ్చో ప్రదర్శితములు. నడుమ విశ్వవిద్యాలాంఛన వస్త్రములను ధరించి నిలబడినది శ్రీమతి జీవామానిక్కము కన్య. ఈమె బి. యె. ప్యాసుచేసి ఇప్పుడు యం. ఏ. పరీక్షకు చదువుచున్నది. ఈమెకు కుడివైపున స్త్రీల క్రిస్టియనుకాలేజీలో బి.యే. కు చదువుచున్న గుణామానిక్కము కన్యయను సోదరియు, ఎడమవైపున క్వీనుమేరీకాలేజీలో ప్రవేశపరీక్షకు చదువుచున్న పుంజీమానిక్కము కన్యయను సోదరియు నున్నారు.

**శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు, ఎమ్., బి. ఎస్. సి. (ఆనర్సు):—**

ఆదిపూడి సోమనాథరావుగారిపుత్రికయగు శ్రీమతి వసుంధరాదేవిగారు పిఠాపురమందలి ఆర్.సి. హెచ్. హైస్కూలునందు ప్రవేశపరీక్షవరకునుచదివెను. అప్పుడే తెలుగుకవిత్వమునందుకూడప్రవేశముకలిగెను. 1921-వసంవత్సరమీామె మదరాసునందలి మేరీకళాశాలయందు ఎఫ్. ఏ. కు చదువప్రవేశించెను. 1925 నందు బి. ఏ. 2-వ క్లాసులో జయముపొందెను. 1926-వ సంవత్సరము ఎం. ఏ. యందు త్తీర్ణురాలై ఆ సంవత్సరమే దొరతనమువారొసంగిన విద్యార్థి వేతనముపై తానుతీసికొనిన రసాయనశాస్త్రమందు బి. ఎస్. సి. కి చదువుట కాంగ్లదేశమునకుబయలుదేరెను. ఎం.ఏ. యందుండగా ఈమె "దురాచారభంజను"డను పాత్రము రచించెను. ఈమెకు కుట్టుపని, సంగీతము, చిత్రలేఖనము వీటియందుప్రవేశముకలదు. మూడు సంవత్సరములు లండనులో బెడ్ఫర్డుకాలేజీయందు బి.ఎస్.సి. కి చదివి ఆనర్సుతో జయము పొంది 1930 ఆగస్టు 25-వ తేదీ మదరాసువిచ్చేసియుండుట కెంతయుసంతసించుచున్నారము.



శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు



శ్రీమతి రెడ్డిలక్ష్మమ్మగారు:—

ఈమె రాయలసీమలోని పెండేకల్లునివాసిని. ఆంధ్రభాషయందు మెచ్చదగిన ప్రవేశముగలది. ఈమె గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయ వాగ్దానము చేసియున్నది.

శ్రీమతి జానకీపురుషోత్తముగారు:—

కృష్ణాజిల్లాబోర్డుకు చెందిన కపిలేశ్వరపురము ఉన్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయులైన శ్రీయుత వెంపటి పురుషోత్తము (బి.యే;యల్.టి) గారి భార్య. ఈమె చక్కని ఆంధ్రభాషాజ్ఞానము కలది. ఉపజ్ఞామహితములగు చిన్నికథలు వ్రాయు ఆంధ్రస్త్రీలలో అందెవేసినచేయి.

శ్రీమతి శ్రీరాం సూరమ్మగారు:—

శ్రీమతి రెడ్డిలక్ష్మమ్మగారు

ఈమెనరసాపురనివాసిని. దంతవైద్యురాలు. దంతవైద్యవిషయికములగు ఈమెవ్యాసములు గృహలక్ష్మి కాలక్రమమున ప్రచురింపగలదు.

శ్రీమతి సి. హెచ్. పాలమ్మగారు:—



శ్రీమతి శ్రీరాంసూరమ్మగారు

ఈమె శ్రీమతి శ్రీరాం సూరమ్మగారిప్రథమపుత్రిక ఏడవతరగతి ప్యాసుచేసినది. అమరకోశము, భర్తృహరి సుభాషితము, మనుచరిత్ర చదువుచు ప్రస్తుతము సంగీతము కూడ నభ్యసించుచున్నది. తన వయస్సు ద్వాదశవర్షములుమాత్రమే ఐనను ఈ బాలిక బుద్ధిమతి గావున ఇంతటి విద్యాప్రవేశము గాంచినది.



శ్రీమతి సి. హెచ్. పాలమ్మగారు

# హాలెండు దేశపు స్త్రీలు

హాలెండు ఐరోపాఖండమునందలి ఒక చిన్న దేశము. దక్షిణమున బెల్జియముదేశమును, తూర్పున జర్మనీదేశమును; ఉత్తరపశ్చిమదిక్కులయందు సముద్రమును ఈ దేశమునకు ఎల్లలు. వైశాల్యము 15,760 చదరపుమైళ్లు. ఇందు విశేష ప్రదేశము సముద్రముయొక్క మట్టముకంటెపల్లముగనుండును. జనసంఖ్య 6,84,000. ఈదేశమున ఒక అంగుళమునేలయేని వ్యర్థముగాకుండ వ్యవసాయము చేయబడుచున్నది. ఓట్సు, గోధుమలు, బీటుదుంప ఇవి ముఖ్యమగు పంటలు. గనులలో రాక్షసిబొగ్గు గనులు చెప్పదగినవి. చేపలపట్టుపరిశ్రమ విస్తారముగ సాగుచుండును. నిర్బంధప్రాథమికవిద్యాపద్ధతి గలదు. శిశుపాఠశాలలు 1,300. ప్రాథమికపాఠశాలలు 6,000. ఈచిన్నదేశమున ఆఱువిశ్వవిద్యాలయములుగలవు. ఇందు నాలుగు ప్రభుత్వమువారివి; ఒకటి ప్రత్యేకసాంకేతికవిద్యలను బోధించునది: ఒకటి కేవలము ప్రజాసంస్థ. ఇవిగాక వర్తకము, నావికావ్యాపారముబోధించు పాఠశాలలుగలవు.




కుక్కబండిలాగుట

పాలు, పెరుగు, వెన్న అమ్మువారును; కాయలు, కూరలు, పళ్లు అమ్మువారును తమ తమ వస్తువులను చిన్న చిన్న బండ్లలో ఉంచి వానికి కుక్కలను పూన్చి వీధులవెంట నడపించుకొనిపోవుదురు.

ఈదేశమువారికి ముఖ్యవృత్తి వ్యవసాయము. ప్రపంచమునందలి మరియేదేశపు స్త్రీపురుషులుగాని వ్యవసాయమున నింతకష్టపడరు. సముద్రతీరప్రదేశములందు నివసించువారిలో పురుషులు చేపలుపట్టుటయందును స్త్రీలునూలువడుకుటయందును పరిశ్రమింతురు. హాలెండు దేశీయులు మితభాషులు. కార్యదక్షులు. ఆదేశమున స్త్రీపురుషులు ఒక్కనిముసమునేని వ్యర్థముగబోనీయరు. అచ్చటి స్త్రీలదుస్తులలో ఒక విలక్షణతకలదు. జాకెట్టుపై జాకట్టుగా వారు నాలుగైదుజాకట్లు తొడుగుదురు. గాలియంత్రములు ఆదేశమున హెచ్చు. ఆవిరియంత్రములు ఇతరతావులయందు చేయుపనులన్నిటిని ఈగాలియంత్రములే ఇచ్చటచేయును. భూప్రదేశముకంటె ఎత్తుననున్న సముద్రజలము లోనికిచొఱబారి దేశమును జలమయము గాకుండజేయుటకు వేయబడిన గట్లపై ఈగాలియంత్రములు నిర్మింపబడును. ఈదేశము వారు తమగృహములను అతిసుందరముగ అలంకరింతురు. గోడలకు తెల్లనిపలకలను, నీలపు

పలకలను తాపింతురు. ఎఱ్ఱనిపలకలు నేలపై పఱపింతురు. ఆరంగులకూడికఆయింటికి ఎంతో శోభగానివచ్చును.

ఆదేశపు ప్రాథమికపాఠశాలలలో విస్తారము స్త్రీలనే ఉపాధ్యాయినిలుగ నియమింతురు. ఆ ఉపాధ్యాయినిలు ప్రాయికముగ దేశసేవ, ప్రజాసేవకొఱకు బ్రహ్మచర్యమును గైకొనిన మహనీయులే. హాలెండుదేశపు బాలికాపాఠశాలకు పోయితిమేని చూచుటకు బహుముచ్చటగనుండును. పరిశుభ్రమైనబట్టలను పొందికగధరించి బాలికలు వికసించినగులాబి పూవులవలె నుందురు.



నూలువడకుట

గృహకృత్యములు ముగిసిన పిదప ఏమాత్రము తీరుబడికలిగినను హాలెండుదేశపు స్త్రీలు శుభ్రవస్త్రములను ధరించి రాట్నముచెంతకుచేరుచు నూలువడకి మా గృహములకు వలయు వస్త్రములను మేమే సమకూర్చ గలిగితినిగదా యని సంతసించుచుందురు.



హాలండుదేశపు విలాసవతులు

తాము ధరించిన ఉడుపుల యన్నిటియందును హాలండుదేశపు విలాసవతులు టోపీని విస్తార మాదరింతురు. అది బంగారు, వెండి జరీతో బుటేదారుపనిచేయబడి అంచులయందు లేసు అల్లికగలిగి అతిమనోహరముగ నుండును.

ఆదేశమున స్త్రీలుపురుషులు దారునిర్మితములగు పాదరక్షల నుపయోగింతురు. పాదరక్షలులేనిదే వారు బయటకాలుపెట్టరు. అయినను వానితో గృహములోనికిపోవుట వారే వగించుకొందురు. సింహద్వారముకడనే దానిని వదలివై చెదరు. ఆదేశమునందలి గ్రామములలో ఏవీథియందుచూచినను గుమ్మముముందు ఇట్టిపాదరక్షలు ప్రత్యక్షమగును.




### పురుషుల నమ్మదగదు:—

ఇరువదివత్సరముల ఆంగ్లయువతి 30వత్సరముల యువకునొకని ప్రేమించి తన ప్రేమగాథ నాతనికి విన్నవించి వివాహమాడుమనెను. భాగ్యగల ఆతడు తాను బ్రహ్మచారిననియు, ఒక వత్సరదినములు గడచిన తరువాత వివాహము చేసికొందుననియు నమ్మించి ప్రస్తుతము తనకు చెడుదినములనియు, అందువలన లోకమునకు ముఖముచూపి ధనమార్జించుట కవకాశములేదనియుచెప్పెను. తనతలిదండ్రు లీతనిని వివాహమాడుట కంగీకరింపకపోవుటయేగాక ఇదివరకు ఇచ్చుచుండిన ధనముగూడ నామెకు ఇయ్యమానిరి. అందుమీద ఆతని కెట్లులైనను సహాయపడి కష్టములు తొలగించవలయునని యెంచి హోటల్లయం దుద్యోగముచేయు యజమానులనుమోసగించి దొంగతనముచేసి వందలకొలది పౌనులనుగొనివచ్చి ఆమె తానుప్రేమించినవానికి యిచ్చుచుండునది. ఇట్లు 14 మాసములు గడచినయనంతరము ఆతడు ఈమెను వివాహమాడననియు, తనకు భార్యకలదనియు తెలియజెప్పెను. అభిమానముగలయువతియగుటచే ఒకఉత్తరమునువ్రాసి విషముద్రావి ఆయువతిమరణించెను. ఆఉత్తరము న్యాయాధికారికివ్రాసినది. ఉత్తర మీక్రింద పొందుపరుపబడినది; "నేనుస్వయముగ విషముద్రాగి మరణించితిని. ఇందలి విషయములు లోకమునకు వెల్లడిచేయుడు. పురుషులకు ప్రేమగాని, మనసుగాని, పవిత్రతగాని లేదు. నేను ప్రేమించి, హృదయమొసగి, అతనికై దొంగతనముచేసినను ఆతను మోసగించెను. తాను వివాహితుడైయుండియు నాకు బ్రహ్మచారినని చెప్పెను. ఇటువంటి వర్తనమును స్త్రీయే ప్రదర్శించియుండినది యువకుని హృదయమెట్లు కలవరపెట్టునో అట్టులే నాహృదయముకూడ కలతకులోనుచేసి నన్నుజీవితము చాలించుకొనజేసినది."

(స్వతంత్ర)

### పిశాచముల దుష్కృత్యములు:—

సంయుక్తరాష్ట్రమునందలి పిలిభిటు గ్రామమున ఒక వైశ్యకుటుంబముగలదు. అగోచరములగు కొన్ని భూతములవలన కొన్నియేండ్లనుండి ఈ కుటుంబమువారికి చెప్పనలవిగాని బాధలుకలుగుచుండినవి. 12నెలలనుండి ఈ పిశాచముల బాధ మరింత దుర్భరమైనది. ఒక సంవత్సరము క్రితము మూడేండ్లవయసుగల యొకబాలుని ఈ పిశాచములు తీసుకొనిపోయి నూతిలో పడవేసెను. అతడు వెంటనే మృతినొందెను. 8 నెలల ఈడుగల శిశువును పిశాచములు ఒక మూడంతస్తుల మేడకప్పుపైన పెట్టెనుగాని ఆ శిశువు చనిపోలేదు. ఇంటిలోని వంటపాత్రములు ఆహారపదార్థములు వండబడినపదార్థములు రూపాయలు మున్నగునవన్నియును మాయమగుచుండును. ఇటుకలవర్షము చెప్పతరముగాదు. రాత్రింబగళ్లు యెవరో తలుపులను గుద్దుచున్నట్లు చప్పుడులు వినబడుచునేయుండును. ఇపుడు చిలకకొయ్యలను వేయబడిన బట్టలును, ట్రంకుపెట్టెలలో నుంచబడిన బట్టలునుగూడ నిష్కారణముగా తగులబడిపోవుచున్నవి. గత 15 రోజులలోను 1000 రూపాయలు విలువగల బట్టలు తగులబడినవి. కావున ఈ కుటుంబమువారి నెవరైన ఈ బాధనుండి తప్పించగలిగినచో వెంటనే సహాయము చేయగోరెదను అని ముకుందలాలుగారు 'అమృతబజారు' పత్రికలో వ్రాసిరి. ఇట్లు వ్రాసిన మరునాడే ఆ పిశాచములబాధగల వైశ్యులయింటికి ఒక సన్యాసి వచ్చెను. ఆతడు వచ్చినప్పటినుండియు వారికి పిశాచముల పీడవదలినది అని ముకుందలాలుగారు మరికొన్నాళ్లకు సదరు పత్రికయందే వ్రాసిరి.

ఆగష్టు 17:—లయల్పూరులో గయసుదేవియను పసిబిడ్డతల్లికిని, ధనదేవిగారికిని పికెటింగు ఆర్డినెన్సు ప్రకారము చెరియొక నెల కఠినశిక్ష విధింపబడి సి. తరగతి ఈయబడెను. బారు అసోసియేషను వారు ఒక సభచేసి ఈ శిక్ష దారుణమైనదనియు ఘోరమగనున్నదనియు తీర్మానించి శిక్ష తగ్గింపవలెనని అధికారులనుకోరిరి.

—తూర్పుగోదావరిజిల్లా మండపేట కాపుశిస్తులు వేగుళ్ల రామమూర్తిగారి కుమారునకును, వల్లూరి రామస్వామిగారి వితంతుతనయకును సోమేశ్వరాలయములో వివాహము జరిగెను. రామచంద్రపురము తాలూకాలో కమ్మకులమున ఇది మూడవ వితంతూద్వాహము.

18:—పాలకొండగ్రామములో అనువాదసమితిసభ్యులు సమావేశమై నాటకములనుప్రదర్శించుటలో ప్రజ్ఞాసాంద్రురాలగు శ్రీమతి ఎ. ధనలక్ష్మీబాయిగారికి ('హాస్యరసవినోద' శ్రీయుత పుల్లయ నటకుడిగారి భార్య) 'నాట్యశారద' అను బిరుదమునిచ్చిరి.

19:—కలకత్తాలో బడాబజారులో సీమగుడ్డలదుకాణమువద్ద పికెటింగుచేసినందులకు శ్రీమతి భగవతీదేవిగారికి 5 నెలలు విడిఖైదు వేయబడెను. ఇదివరకు ఐదుసారులీమెకు హెచ్చరిక ఇవ్వబడెను.

—రాజమహేంద్రవరమున హితకారిణీసమాజమువారి యాజమాన్యముక్రింద ఆనందాశ్రమమునందు ఒక వితంతూద్వాహము జరిగెను. వధువు శ్రీమతి రామకోటమ్మగారు, వరుడు తెనాలి వాస్తవ్యులగు మునిపల్లె వేంకటశేషగిరిరావుగారు.

20:—శ్రీమతి కొండా సత్యవతమ్మగారు 117 ఐ. పి. సి.; 74 సాల్టుఆక్టుక్రింద గుంటూరు సబు మేజస్ట్రేటుగారిచే విచారింపబడి 6 నెలలు కఠినశిక్షయు, రు. 50 ల జరిమానాయు, జరిమానా చెల్లింపనిచో మరి రెండునెలలు విడిఖైదు విధింపబడి వేలూరు స్త్రీలజయిలుకు పంపబడెను.

21:—మీరాబాయిగారు మధురలో ఖద్దరునుగూర్చి కాంగ్రెసువారితో సంభాషించెను. స్త్రీల సభలోను, బహిరంగసభలోను ఖద్దరుధారణమునుగూర్చియు, హిందీభాషాభ్యసనమును గూర్చియు ఉపన్యసించెను.

22:—నిషేధింపబడిన పత్రిక పెషావరు విచారణసంఘమువారి నివేదికయొక్క ప్రతికై పోలీసువారు లాహోరులో జుట్షీసతి బసను శోధించిరి. కాని అది దొరకలేదు.

23:—పంజాబురాష్ట్రమున సత్యాగ్రహనియంత్రిగా నియమింపబడిన ప్రథమస్త్రీయగు జుట్షీసతిగారిని క్రిమినలు ప్రొసీజరుకోడు 103 సెక్షనుక్రింద అరెస్టుచేసిరి.

24:—

25:—దక్షిణకలకత్తాకు పికెటింగు నాయకురాలగు లావణ్యప్రభాదేవిగారికి రు 100 జరిమానా లేక 2 నెలలు విడిఖైదు విధింపబడెను. ఆమె జైలుకుపోవుటకే సమ్మతించెను.

26:—శ్రీమతి మీరాబాయికన్యగారు కోయంబత్తూరులో మిల్లు ప్రతినిధులతో 18-వ నెంబరుకు తక్కువనెంబరు నూలును మిల్లుయజమానులు తయారుజేయకుండుటకుగాను ఏర్పాటునొకదానిని గావించుటనుగూర్చి రెండుగంటలు చర్చించెను.

—ఇటీవలి తిరువాన్కూరు మహారాణిగారి ఉత్తరువుననుసరించి నాగర్కోయిలయందలి శచీంద్ర దేవాలయమునందున్న 32 మంది దేవదాసీలు బర్తరఫు చేయబడిరి. వారి స్థానే సదరు నౌకరి చేయుటకై 8 మంది మగవాండ్రు నియమింపబడిరి.

27:—క్రొత్తఢిల్లిలో శ్రీమతులు కొహ్లీసతి ప్రభావతిదేవిగార్లను పినలుకోడు 145, 344 సెక్షనుల క్రింద నేరముచేసినవారుగా పరిగణించి 145 సెక్షనుక్రింద రెండునెలలువిడిఖైదును, 342 సెక్షను క్రింద 4 నెలలు విడిఖైదును, రు. 50 జరిమానాయును, జరిమానా చెల్లించనిచో మరి నాలుగు నెలలు విడిఖైదను విధించిరి.

—పంజాబు యుద్ధసంఘమునకు ప్రథమమహిళానియంతయగు జ్యోతిసతిగారికి ఒక సంవత్సరము విడిఖైదు విధించిరి. ఆమెను ఏ. తరగతిలో చేర్చిరి.

28:—కాకినాడ ఆంధ్రబాలవితంతుశరణాలయమున వితంతూద్వాహము జరిగినది. వరుడు చెన్నపురవాస్తవ్యుడు హనుమప్పశెట్టిగారు, వధువు కాకినాడ కాపురస్థులు శింగంశెట్టివారి ఆడుబడుచు.

29:—

30:—పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరి బాలికాపాఠశాల ద్వితీయవార్షికోత్సవము శ్రీయుత ముళ్లపూడి నరసయ్యచౌదరిగారి యాజమాన్యమున జయప్రదముగ జరిగినది. బాలికలు సావిత్రినాటకమును ప్రదర్శించిరి.

31:—మదరాసు తంబుచెట్టివీథి శ్రీశంకరాచార్యులమఠమున చెన్నపురిజిల్లా సనాతనధర్మస్త్రీలసభ మాతృశ్రీ యం. లక్ష్మమ్మగారి అగ్రాసనాధిపత్యముక్రింద సమావేశమయ్యెను.

సెప్టెంబరు 1:—కలకత్తాలో బుర్రాబజారు గుడ్డలదుకాణములను పికెటింగు చేసినందులకై గోదావరిభేన్ అను గుజరాతిస్త్రీకి నాలుగుమాసముల విడిఖైదు విధింపబడెను.

2:—బొంబాయి యుద్ధాలోచనసంఘాధ్యక్షురాలగు శ్రీమతి హంసామెహతాగారికి మూడు నెలల విడిఖైదు విధింపబడెను.

3:—శ్రీమతి కువలేకరుగారు పూనానగరమున సత్యాగ్రహనియంత్రిగా ఎన్నుకొనబడిరి.

—అలహాబాదులో స్మాలుకాజుకోర్టులో సాక్ష్యమిచ్చుటకు ఒకగ్రామమునుండి నెలలునిండిన చూలింతరాలిని తీసికొనివచ్చిరి. ఆమెకు ఆకస్మికముగ నొప్పులువచ్చి కోర్టువసారాలోనే ప్రసవించెను. పిమ్మట ఆమెను, శిశువును భద్రముగా వైద్యశాలకు గొనిపోయిరి.

4:—పేరాలనివాసిని శ్రీమతి పీసపాటి త్రిపురాంబగారిని అరెస్టుచేసి చీరాల సబ్ మేజస్ట్రీటుగారు విచారించి కాంగ్రెసువాలంటీరుగా చేరినందుకుగాను 17-వ సెక్షనుప్రకారము 6 నెలలు విడిఖైదును 50 రూపాయలు జరిమానాయును విధించిరి. జరిమానా చెల్లింపనిచో మఱియొకనెల విడిఖయిదును విధించిరి. సి. క్లాసునిచ్చిరి.

5:—కలకత్తాలో లావణ్యాదేవి, శాంతాదేవిగార్లకు విదేశవస్త్రములమ్ము దుకాణములవద్ద పికెటింగు చేసినందులకై వరుసగా 4 నెలలు, 5 నెలలు విడిఖైదు విధింపబడెను.

6:—'దొరతనమువారికి ప్రజలు పన్నులను చెల్లించకూడదు' అని ఆనందులో ఉపన్యసించినందులకు శ్రీమతి మణిబెనుపటేలుగారిని అరెస్టుచేసిరి.

7:—శ్రీమతి మీరాబాయిగారు ఏలూరుచేరిరి. డాక్టరు ముల్పూరి రంగయ్యగారిసతి శ్రీమతి చుక్కమ్మగారు రాట్నపుపాఠశాలకై దానముచేసినగృహమును సందర్శించిరి.

8:—శ్రీమతి మీరాబాయిగారు కాకినాడలో పురమందిరమున ఖద్దరునుగూర్చి ప్రబోధము గావించిరి.

9:—శ్రీమతి మీరాబాయిగారు కలకత్తాచేరిరి. పోలీసువారు ఆమెను అరెస్టుచేసిరి. కాని కొంతసేపు అయినతరువాత ఆమెను వదలివేసిరి.

10:—శ్రీయుత సర్దారు వల్లభాయిపటేలుగారి కుమార్తె శ్రీమతి మణిబెనుపటేలుగారికి కెయిరాజిల్లా భద్రపూరు మేజస్ట్రేటు నాలుగునెలలు కఠినశిక్ష వేసెను. బి. క్లాసు ఇచ్చెను.

11:—వెల్లూరు చెఱసాలలోనున్న శ్రీమతి కాళంగి శేషమాంబగారికి గర్భకోశరణము ప్రబలగా జయిలుఆస్పత్రిలో మేజరుశంకరశాస్త్రిగారు ఆపరేషను చేసిరి.

12:—వంగరాష్ట్రమున జూను 24-వ తేదీనుండి సెప్టెంబరు 10-వ తేదీవఱకు 78 గురు స్త్రీలు వేర్వేరుకాలపరిమితులకు శిక్షింపబడిరని తెలియుచున్నది.

13:—ఇటీవల చెన్నపురియందు జరుపబడిన బాలబాలికల ప్రదర్శనమునందు గెలుపొందినవారికి వై. డబ్ల్యు. సి. ఏ. భవనమున డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు బహుమతుల పంచిపెట్టిరి.

బహుమతులను పంచిపెట్టుటకుముందుగా ఆమె ప్రారంభప్రసంగముగావించుచు చేతిపనుల యందును, గృహపరిశ్రమలయందును బాలబాలికల కుత్సాహమునుబుట్టించి ఈవిధముగా పరిశ్రమల నభివృద్ధిచేయుటకు ఈప్రదర్శనము తోడ్పడుట తమకు తృప్తికరముగానున్నదనిరి.

—శ్రీమతి మీరాబాయిగారు ఖుల్నాకుబోయిరి. పెక్కువేలమంది వారికి స్వాగతమొసగి గొప్ప ఊరేగింపుతో తోడ్కొనివచ్చిరి. గాంధిపార్కులో జరిగిన బహిరంగసభలో ఉరుదూభాషలోను ఇంగ్లీషుభాషలోనుగూడ మీరాబాయిగారు ఉపన్యసించిరి. కాంగ్రెసుసంఘమువారామెకు సన్మానపత్రమును సమర్పించిరి.

14:—బెంగాలువిప్లవోద్యమము చెలరేగినసందర్భమున కలకత్తాలో స్త్రీవిద్యార్థులు నివసించు మూడుచోట్లు సోదాచేయబడినవి. ఛాత్రీభవన్‌లోనుండు రేణుకాసేన్ అనునామెను కమలాదాస్, కమలాదాస్‌గుప్తా అను మరియిద్దరువిద్యార్థినులను పోలీసువారీసందర్భమున అరెస్టుచేసి నిర్బంధములోనుంచిరి. జామీనుపై వారిని విడిచిపెట్టుటకు పోలీసువారు నిరాకరించిరి.

15:—కలకత్తాలో శ్రీమతులు దేవకాళిదేవి, కృష్ణదేవిఅను నిరువురుస్త్రీలకు విదేశీవస్త్రదుకాణములవద్ద పికెటింగుచేసినందులకై చెరినాలుగునెలల విడిఖైదును విధింపబడెను.

16:—పంజాబులో కాంగ్రెసు ఉద్యమమునందు నాయకత్వమువహించుచున్న పురాణదేవిగారు నిర్బంధింపబడిరి.

—శ్రీమతి అన్నాచాందిగారు కేరళరాష్ట్రమున ప్రథమస్త్రీన్యాయవాది తిరువనంతపురములో అడ్వొకేటుగ చేర్చుకొనబడెను.

17:—స్త్రీలహక్కులవిషయమై హిందూన్యాయశాస్త్రమును సంస్కరించుటకైన సవరణచట్టమును గూర్చి సిఫార్సులుచేయ మైసూరున నియమింపబడిన కమిటీవారు తమనివేదిక ప్రచురించిరి.

18:—కలకత్తాలో శ్రీమతులు ప్రమిళాదేవి, లీలావతిదేవి, పుష్పదేవి, యమునాబాయిగార్లు బొడాబజారునందు పికెటింగుచేసినందుకు అరెస్టుచేయబడి చెరినాలుగునెలలు విడిఖైదు విధింపబడిరి.

19:—బొంబాయి యుద్ధసంఘాధ్యక్షురాలగు శ్రీమతి రామాబాయికందార్‌గారిని పినలుకోడు 118 సెక్షనుక్రింద అరెస్టుచేసిరి.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచముమార్జినువదలి కాగితమునకు ఒక తట్టుననే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామాపూర్తిగ నిచ్చుచుండవలెను.

—సంపాదకుడు.




### రౌండు టేబిలు సమావేశము: స్త్రీ ప్రతినిధులు:—

రౌండుటేబిలుసమావేశమున కాహ్వానింపబడిన ప్రతినిధుల ఏబదిమందిలోను ఇరువురు స్త్రీలుండుటకు మిక్కిలి సంతోషించుచున్నాము. ఈ ఇరువురిలో ఒకఆమె హిందూస్త్రీ, రెండవయామె మహమ్మదీయవనిత. ఈ మహమ్మదీయవనిత సుప్రసిద్ధులగు సర్. మహమదు షఫీగారి కుమార్తె; ఇంతకుపూర్వము భారతశాసనసభాసభ్యుడుగనుండిన మియామునవాజుగారి సతి. హిందుస్త్రీ ఇంతకుపూర్వము మద్రాసు ప్రధానామాత్యులగు సుబ్బరాయనుగారి సతి. సైమనుసంఘసభ్యులు భారతస్త్రీల ప్రజ్ఞాసాంద్రతను ప్రశంసించియున్నారు. ఆ ప్రశంసకు మొప్పుమువాటిల్లనిరీతిని ప్రజ్ఞాసాంద్రతతో ప్రవర్తించి ఈ రమణీమణులు భారతస్త్రీలోకమునకు రౌండుటేబిలుసభామూలమున కూర్పగలిగినంత మేలును సమకూర్తురుగాక! రౌండుటేబిలుసభయందు తీరుమాటలయవసరమున వీరు కారాగారములందు కడగండ్లపడుచున్న తమతోడిసోదరీమణులవిషయము జ్ఞప్తియందుంచుకొందురుగాక!

### రౌండు టేబిలు సమావేశము: ఆంధ్ర రాష్ట్రము:—

తెలుగువారిగోక్లేమహాశయుడగు శ్రీయుత దివానుబహదరు మోచర్ల రామచంద్రరావుపంతులుగారు రౌండుటేబిలుసమావేశమున కొకప్రతినిధిగా ఆహ్వానింపబడియుండుట మన యదృష్టము. ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను గుర్తించిన పూజ్యమూర్తులలో రామచంద్రరావుపంతులుగారొకరు. కాని వెనుక మాంటేగుసంస్కరణముల సందర్భమున ఇంగ్లండునకు పోయివచ్చిన క్రొత్తలో వారు భీమవరములో ఉపన్యసించుచు ప్రత్యేకరాష్ట్రమును బడయుటకు ఆంధ్రులింకను కొంతకాలము వేచియుండవలెనని హెచ్చరించిరి. వారి హెచ్చరికప్రకారము ఆంధ్రు లీపదిసంవత్సరములును వేచియుండిరి. తిరిగి వేచియుండమనుట లెస్సగాదు. కావున శ్రీవారు తమ అసాధారణప్రజ్ఞనంతను వినియోగించి ఆంధ్రరాష్ట్రనిర్మాణము వెంటనేయగునట్లు రౌండుటేబిలుసభ చర్చించుప్రభుత్వవిధానమున కార్యము నడపి రెండుకోట్ల ఆంధ్రమహాప్రజల అభివందనములను, అభినందనములను అందుకొందురుగాక! పంతులుగారికి ఈవిషయమున రౌండుటేబిలుసభకు పోవుచున్న ఇతర ఆంధ్రప్రముఖులు గూడ చేదోడువాదోడు అయ్యెదరని నమ్ముచున్నాము.

**రాజమహేంద్రవరహితకారిణీసమాజము:—**

వితంతుశరణాలయమొకటి, ప్రార్థనామందిరమొకటి, గ్రంథాలయమొకటి, ఉన్నతపాఠశాలయొకటి ప్రతిష్ఠించి ఆంధ్రులకుప్రసాదించి వీరేశలింగముపంతులు దివంగతుడైనారు. నాటినుండి హితకారిణీసమాజమువారాసంస్థలను యథారీతిని నిర్వహించుచున్నారు. ఆసమాజముయొక్క 1929-వ సంవత్సరపు కార్యనివేదిక పరిశీలించితిమి. ప్రోత్సాహకరముగనున్నది. వితంతుశరణాలయము శ్రీకామరాజు హనుమంతరావుగారియొక్క పరిశీలనముక్రిందను, ఉన్నతపాఠశాల శ్రీజయంతి గంగన్నగారి యాజమాన్యమునను, గ్రంథాలయము శ్రీ అడవి శంకరరావుగారి సంరక్షణమునను నిర్వహింపబడుచున్నవి. నివేదనవత్సరమున ఈసంస్థలన్నిటిలోను గ్రంథాలయమున ఎక్కువ అభివృద్ధికానబడుచున్నది. ఈ అభివృద్ధికంతకును కారణభూతులైన శ్రీయుత అడవి శంకరరావుగారెంతయు స్తుతింపదగియున్నారు.

**శ్రీమతి పత్రి కనకమ్మగారు:—**

బాల్యముననే వితంతువై సంస్కారభావమునొంది పునర్వివాహముగావించుకొని బాలవితంతువులబాధల అనుభవపూర్వకముగ నెఱిగినదికావున తనభర్తను ప్రోత్సహించి ఆతనిచే ఉద్యోగముమానిపించి కాకినాడయందు వితంతుశరణాలయము స్థాపించి యథాశక్తిని వితంతూద్వాహముల నిర్వహించుచున్న శ్రీమతి పత్రి కనకమ్మగారి దేశహితబుద్ధి, కార్యనిర్వహణదీక్ష ప్రశంసాపాత్రములు. శ్రీ వీరేశలింగము పంతులుగారినాటనుండిఎందఱోపురుషులు శ్రద్ధపూని బాలవితంతువులకుపరిణయము లొనర్చి సంఘవ్యవస్థకు సొంపుగూర్చుచున్నారు. ఇప్పుడు శ్రీమతి పత్రి కనకమ్మగారినిబోలిన స్త్రీలు సహితము ఈసంస్కరణమునకు గడంగుట మోదావహము. సంఘసంస్కర్త్రి శ్రీమతి పత్రి కనకమ్మగారియు, ఆమె సంఘసంస్కరణాభిలాషకు కార్యరూపమునిచ్చుటలో తన పురుషకారమునంతయు చూపుచున్నవాడగు ఆమెభర్తయొక్కయు ఛాయాపటమునిచ్చుట ప్రదర్శించుచున్నాము.



శ్రీమతి పత్రి కనకమ్మగారు, ఆమెభర్త.

కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి తృతీయవార్షికోత్సవము:—

పూపప్రాయముననే దేశమాతకు దివ్యమైనసేవచేసి పునరావృత్తిలేని పుణ్యలోకము నకుబోయిన శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవిగారి తృతీయవార్షికోత్సవము ఈనెల 6-వ తేదీని అయిఉన్నది. ఆమెపవిత్రాత్మ ఆవేశించి ఆమెభర్త శ్రీ బాపినీడుగారిని, ఆమెతల్లి శ్రీమతి కలగర పిచ్చమ్మగారిని దేశసేవలో కారాగారవాసము స్వీకరించునట్లు చేసినది. దేవిగారి దేశసేవయు, త్యాగగుణము, కార్యదీక్ష అనుసరణీయములు. అనుసరణీయములగు ఆమెగుణముల నలవఱచుకొనుటకు బ్రహ్మపురముమొదలు బళ్లారిపర్యంతముగల ఆంధ్ర సోదరీమణు లెల్లరు ఆమెస్మారకోత్సవమును ఆనాడుజరిపి చరితార్థలగుదురుగాక!

మదరాసు సేవాసదనము:—

మనరాజధానియందలి స్త్రీవిద్యాసంస్థలలో మదరాసు సేవాసదనము తొలుత పేర్కొనదగినది. శ్రీమతులు కజిన్సుసతి, జీనరాజదాససతి, ముత్తులక్ష్మిరెడ్డి, జస్టిసు వేంకట సుబ్బారావుసతిగార్ల విశేషకృషిమూలమున ఈసంస్థ ఇప్పుడు స్థిరవసతినంది నుంగంబాకము నందలి హారింగ్టన్‌రోడ్డున బ్రహ్మాండమగుభవనమున విరాజిల్లుచున్నది. అనాథస్త్రీలకు తలదాచుకొనుతావు; విద్యాగంధమెఱుగని కులకాంతలు విద్యావిలసనముపొందెడు పీఠము అయి సేవాసదనము క్రాలుచున్నది. ధాత్రీవిద్య, మంత్రసానివిద్య, ఉపాధ్యాయినీకళనేర్పి స్త్రీలను స్వతంత్రముగ జీవింపగలుగువారిగచేయుట; లేసుపని, కుట్టుపని, నేతపని, బుటేదారుపని, పేముపనినేర్పి స్త్రీలను గృహపరిశ్రమలయందు కుశలప్రవేశినులనుచేయుట ఈసదనముయొక్క ముఖ్యోద్దేశములు. ఈ ఉద్దేశములన్నియు ఉచితరీతిని ఆచరణమునందు పెట్టబడినవనుటకు ఈసంచికయందు ముద్రింపబడిన ఆసేవాసదనమునకు సంబంధించిన ఛాయాచిత్రములు ప్రబలనిదర్శనములుగాగలవు. ఈ స్త్రీవిద్యాసంస్థ పెద్దల ఆశీర్వచనములను, ధనికుల సాహాయ్యసంపత్తిని పొందుచు దినదినప్రవర్ధమానమై స్త్రీవిద్యాసంస్థలకు ఒజ్జబంతియు, తలమానికమును అయి విలసిల్లునట్లు విశ్వలోకనాథుడు అనుగ్రహించుగాక!

గృహలక్ష్మి దసరాసంచిక:—

గృహలక్ష్మి తృతీయవత్సరపు దసరాసంచిక వినీతభావముతో ఆంధ్రమహాప్రజల కరకమలములకు సమర్పించుకొనుచున్నాము. ఎప్పటితీరున ఇందు విదుషీమణులవ్యాసములకే ప్రాధాన్యమొసంగితిమి. దివంగతురాలైన విదుషీమణి శ్రీమతి మాగంటి అన్నపూర్ణా

దేవిగారి 'నారి' యను అముద్రితగ్రంథమునుండి అమూల్యమగు నొకభాగమును సంగ్రహించి ప్రచురించినారము. మాతృదాస్యవిమోచనముకొఱకు కారాగారముస్వీకరించిన విదుషీరత్నములగు శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి 'లక్ష్మి' యను చిన్ననవలయు, శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారి 'మాటలాడగనేలనే' అను శీర్షికతోనొప్పు పద్యవ్యాసమును సేకరించి ప్రచురింపగలిగినందులకు ఆనందితులమగుచున్నాము. ఆధునికాంధ్రస్త్రీలు ఎట్టిమనోహరకవిత్వము చెప్పగలుగుచున్నారో ఈసంచికయందు శ్రీమతి మదమంచి అనంతమ్మగారి 'మాంచాల' అనువ్యాసమును పరికించిన తెలియగలదు. మఱియిక శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసమునుగూర్చి గృహలక్ష్మిపాఠకులకు ప్రత్యేకపరిచయ మనవసరము. 'అనసూయ' అనుపేరుతో ఆంధ్రస్త్రీలకొఱకు ఒక మాసపత్రికను నిర్వహించిన విద్యాధురీణ శ్రీమతివింజమూరి వేంకటరత్నమ్మగారు 'సౌందర్యము'నుగూర్చి నొక చక్కనివ్యాసమువ్రాసి గృహలక్ష్మివ్యాసకర్త్రులవర్గమున చేరినారు. గృహలక్ష్మికి ఎడపదడప వ్యాసములువ్రాయుచు దానిసారస్వతపుష్టికి దోహదకారులగుచున్న శ్రీయుతులు పెమ్మరాజు రాజగోపాలము, నిడమర్తి సత్యనారాయణమూర్తి, సూరిగుచ్చి కృష్ణమూర్తి, నరహరిశెట్టి వేంకటరత్నముగార్ల వ్యాసములకుదోడు ఇందు శ్రీయుతులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, రాయసం వేంకటశివుడు, కూచి నరసింహముగార్లు మొదలగు ఆంధ్రపండితప్రకాండుల ప్రశస్తరచనములను సంపాదించి ప్రచురించితిమి. విస్మరింపబడనున్న కీ. శే. కల్లూరి వేంకటరామశాస్త్రిగారి పద్యవ్యాసమును గృహలక్ష్మిమూలమున లోకమునకు చేకూర్పగలిగినందులకు సంతసించుచున్నాము. స్థలాభావముచేతను, కాలాభావముచేతను మాకార్యాలయమునకువచ్చిన వ్యాసములలోను, ఛాయాపటములలోను పెక్కులు ప్రచురింపజాలకపోయితిమి. వానిని కాలక్రమమున గృహలక్ష్మిమాససంచికలలో ప్రకటింపగలమని మనవి. ఈ దసరాసంచిక ఆంధ్రసోదరీమణుల విశేషాదరణమునకు బాత్రమగునని నమ్ముచున్నాము.

వేడికోలు:—

గృహలక్ష్మి తృతీయవత్సరపు దసరాసంచిక తమ కరకమలములకందించుచున్న ఈశుభావసరమున గృహలక్ష్మిచందాదారుల నొక సంప్రార్థనముచేయ నువ్విళ్లూరుచున్నాము. రెండుకోట్ల ఆంధ్రమహాప్రజల మాతృశ్రీల అభ్యుదయార్థము రెండున్నరసంవత్సరములకుపైగ నిర్వహింపబడుచున్న గృహలక్ష్మికి ప్రస్తుతము రెండువేలుమాత్రమే చందా

దారులున్నారు. ఆకారణముచేతనే ధనైకసాధనములగు ఇంకను పెక్కు వన్నెలుచిన్నెలు గృహలక్ష్మి పొందజాలకున్నది. ప్రస్తుతమున్న రెండువేలచందాదారులలో ఒక్కొకరును ఇదిస్వకార్యముగ శ్రద్ధవహించి ఒక్కొక్క క్రొత్తచందాదారును చేర్పించినచో గృహలక్ష్మికి కొఱవడని ఆర్థికపుష్టికలుగగలదు. సమగ్రసౌందర్యసంపాదనమునకు సాధనములును సమకూఱును. పుటలయందును, పటములయందును పుష్టినొంది గృహలక్ష్మి రాజిల్లనవకాశము కలుగును. శ్రద్ధాళువులగు గృహలక్ష్మిచందాదారులు నడుములుకట్టి దానికాభాగ్యము చేకూర్తురుగాక !

గృహలక్ష్మి ముఖపత్రము:—

ఈమాఱు గృహలక్ష్మిముఖపత్రముమీద ముద్రింపబడిన మనోహరమగుచిత్రము శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు చిత్రించినది. పుష్కరాంబగారు గుంటూరునందలి శ్రీ శారదానికేతనమున చిత్రకళాభ్యాసనము గావించిరి. వారుచిత్రించిన 'ఏకలవ్యుడు' అను ఏకవర్ణచిత్రమును గృహలక్ష్మి గతదసరాసంచికలో ప్రచురించియున్నారము. చిత్రకళకు దోడు ఈమె సాహిత్యజ్ఞానముకూడ గలిగియున్నది. ఈమె రచియించిన 'స్త్రీవిద్య: దానియావశ్యకత' యను ప్రశస్తవ్యాసము కడచిన జూలైమాసపుగృహలక్ష్మి ప్రచురించియున్నది. చిత్రకళయు, సాహిత్యవిద్యయు జోడించి పరిశ్రమించుచున్న ఆధునికాంధ్రస్త్రీలలోపుష్కరాంబగారు గణనీయ అనుటలో సందియమావంతయు నుండదు. ఆంధ్రస్త్రీల అభ్యుదయమునే అనవరతము కాంక్షించు గృహలక్ష్మి వారి చిత్రకళాభ్యుదయమునకు దర్పణప్రాయముగనున్న పుష్కరాంబగారు రచియించినచిత్రమును ముఖపత్రముగ మురియబడుచున్నఆనందముతో చేకొన్నది. చిత్రకారిణి, విదుషియగు పుష్కరాంబగారు తమనేర్చిన విద్యాకళలచే ఇంకను ఆంధ్రస్త్రీలోకమునకు వన్నెయువాసియుగూర్ప భగవాను డనుగ్రహించుగాకయని ప్రార్థించుచున్నాము.



శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు

# విషయసూచిక

త్రివర్ణ చిత్రములు

1. దేవపూజ: ప్రథమపాఠము

2. లజ్జావతి

ఛాయాచిత్రములు

1. "మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు" 2. గాయనులు 3. శ్రీమతి ధర్మశీలా సతిగారు 4. శ్రీమతి జొన్నలగెడ్డ శారదాంబగారు 5. శ్రీమతి కోటమర్తి రాజేశ్వరమ్మగారు.

# గృహలక్ష్మి దసరా సంచిక

౧

అయ్యా,

వందనములు

గత రెండుసంవత్సరములనుండియు తమ పత్రికారాజమును చదివి ఆనందించుభాగ్యము నాకును, విను భాగ్యము మా పాఠశాల బాలికలకును లభించుచున్నది. అందలి తొక్కుపలుకులు, పాటలు మా విద్యార్థినులు ప్రేమతో పఠించుచుందురు.

లింగంగుంటపాలెం
7—10—30

ఇట్లు
గంధం సీతాపతిశర్మ

౨

ప్రియమైన గృహలక్ష్మికి,

చెల్లీ!

ఆంధ్రులకు, ఆంధ్రనారీమణులకు, ఆంధ్రబాలబాలికలకు అమితాహ్లాదకరమైన దసరాపండుగ ఏతెంచినది. ఇట్టి శుభసమయమున నీవంటి పిన్నవారిని సంతోషపెట్టుట మాబోటి పెద్దలకు తప్పనిపని. కావున నిందు వెంట ఐదురూప్యములను కానుకగా బుత్తెంచితిని. సంతసముతో గ్రహింతువుగాక!

పెద్దముడియము
3—10—30

ఇట్లు నీసోదరి
బి. జ్ఞానాంబ

౩

ఆర్యా,

వందనములు

గృహలక్ష్మి దసరాసంచికను జూచితిని. ఆంధ్రవనితల శారీరమానసికాభివృద్ధులకును, జ్ఞానోదయమునకును పండినపెరటికల్పకమురీతి వెలయుచున్నది. అట్టి పత్రిక చిరజీవిగానుండవలయునను వాంఛ హృదయాంతికమునుండి వెలువడుటచే నా మెకొక 'ఆశీస్సు' నంపుచున్నాము.

విశాఖపట్టణము
7—10—30

ఇట్లు
వడ్లమాని అప్పారావు

౪

ఆర్యవర్యా,

అత్యంతరమణీయముగ తయారొనర్పబడిన మన గృహలక్ష్మి దసరాసంచిక అందుకొని యమందానంద కందళిత హృదయారవిందనైతిని. ముఖచిత్రము ఆంధ్రనారీమణివిరచితమై ఆంధ్రకళను వెదజల్లుచుండుట సంస్తవనీయము. పెక్కుమంది ఉత్తమవ్యాసరచయితల వ్యాసములున్నవి.

రాజమండ్రి
4—10—30

ఇట్లు
పులవర్తి కమలావతీదేవి

౫

అయ్యా,

వందనములు

గృహలక్ష్మి అందినది. ఆ పత్రికలో చాలభాగం చదివేశాను. 'మానినీమణీ' యను పద్యములు కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు వ్రాసినవి చాల బాగున్నవి.

విశాఖపట్టణము
8—10—30

ఇట్లు
వేదుల మీనాక్షి
క్వీనుమేరీసు గరల్సు హైస్కూలు

౬

"గృహలక్ష్మి" అను సార్థకనామము ధరించిన మూఁడుసంవత్సరముల ముద్దుబాల, తన అసమాన శేముషీవిశేషముచే బాల్యవయస్సుననే ఆంధ్రస్త్రీల కభివృద్ధి మార్గదర్శినియై, కవితల కల్పతరువై, సెచ్చెలియై, బాలబాలికలయొక్కయు, స్త్రీలయొక్కయు విద్యాజ్ఞానముల నభివృద్ధిచేయు సద్గురురూపిణియై, గానవిద్యాకళావిశారదయై, గృహిణుల హస్తాలంకారియై, లోకవార్తలనందించు పత్రికామణియై, ఆరోగ్యవిధులందెల్పు వైద్యశిఖామణియై, లోపముల సవరించు విమర్శక విజ్ఞానమణియై, సృష్టిచిత్రముల సృష్టించు చిత్రకారిణియై, ప్రతిభాశాలినియై, సకలాంధ్రస్త్రీల పరిచయమింత బాల్యకాలంబుననే పొంది ప్రతియింట తన విజ్ఞానసుమ సౌరభముల గుబాళింపఁజేయుచుండుట ఆనందకరము. ఇట్టి పత్రికాబాల నింకను అభివృద్ధిపరుప ఆ పరమేశ్వరుఁడు అనుగ్రహించుగాక.

రాజమండ్రి
8—10—30

ఇట్లు
ఆచంట సత్యవతమ్మ

౭

మదరాసులో ఎగ్మూరునుండి డాక్టరు కె. ఎన్. కేసరిగారి సంపాదకత్వమున వెల్వడుచున్న సచిత్ర మాసపత్రికయగు "గృహలక్ష్మి" దసరాసంచికను కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇంతవఱకించుమించుగ ఆంధ్రసంచికలు సంవత్సరాదినాఁడు వెడలుచుండెనుగాని ఈ గృహలక్ష్మి సంచికను మన భారతదేశమునందంతటను అత్యంతవైభవముతో నొనరింపబడు దసరాపండుగనాఁడు వెలువరించుచు శమీవృక్షపూజాప్రార్థనాదుల బ్రకటించుట ప్రత్యేకప్రశంసనీయమగు నూతనాంశము. దాని ముఖపత్రముపైగల త్రివర్ణచిత్రమును, లోనగల "పార్వతీపరమేశ్వరులు" "రాజపుత్రకాంత" "గ్రంథపరిశీలనము" లెంతయు ముచ్చటగనున్నవి. మఱియు నిందు సేవాసదన చిత్రపటములు, సుప్రసిద్ధలగు నారీమణుల చిత్రపటములు భారత సినిమా నాట్యాంగనలగు

౭

శ్రీమతులు సుల్తానా-ఏణాక్షి రామారావుకన్య ఎం. ఎ. (ఆనర్సు) గారలయొక్క చిత్రపటములు మొదలగు నూతనాలంకారములు బెక్కులలరారుచు నీ సంచికను "మణినావలయమ్ వలయేనమణి" అనురీతిని మరి ద్విగుణీకృతశోభ నొడగూర్చుచున్నవి. ఇయ్యది స్త్రీలోకాభ్యుదయముకొఱకై స్థాపింపబడినదగుట్టచేత తదను గుణ్యముగ నిందు సుప్రసిద్ధులగు నారీమణుల వ్యాసములు పెక్కులలరారుచున్నవి. ఆంధ్రస్త్రీలోకాభ్యుదయమే ఆదర్శముగనెంచి ఈ పత్రికను అధికశ్రమలకోర్చి అత్యంతరమణీయముగ వెల్వరించుచున్న డాక్టరు కె. ఎన్. కేసరిగారు ఆంధ్రులకృతజ్ఞత కెంతయు బాత్రులు. ఇట్టి సాంఘికసేవచేసి ఈ గృహలక్ష్మి సచిత్ర మాసపత్రిక దినదినప్రవర్ధమానమయి చిరస్థాయియగు గాక యని మేమాశీర్వదించుచున్నారము.

—సమదర్శిని (11–10–30)

౮

అయ్యా,

వందనములు

సీ. చిత్రవిచిత్రంపు చిత్రముల్ గలవని సతతంబు పామరుల్ సంతసింపఁ<br>
జదువగా నేర్చిన సజ్జనుల్ చక్కఁగఁ గథలసారస్యంబు గైకొనంగఁ<br>
భాషాభివృద్ధినిఁబడయఁగోరెడువారు పసగల్గువ్యాసముల్ పంపుచుండ<br>
సకలశాస్త్రమ్ములం జదివినపండితుల్ శాస్త్రవిమర్శనల్ సలుపుచుండఁ

గీ. నొక్కచోటునగథలు వేరొక్కచోట<br>
వింతచిత్రము లొక్కచో వివిధశాస్త్ర<br>
చర్చలొకచోట హాస్యప్రసంగములును<br>
గల్గి గృహలక్ష్మి యుల్లాసకారిగ నెగొ.

ఇట్లు

వేపేరి, మదరాసు<br>
13—10—30

పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రి<br>
తెనుగుపండితుడు, యస్. పి. జి. హైస్కూలు

౯

ముద్దులొలుకు ఈ సంచికను మేమందుకొంటిమి. నాలుగు త్రివర్ణచిత్రములును ముప్పదియారు ఛాయా పటములును, పఠనీయములగు కథా, వ్యాస, సంభాషణాదులుగల ౧౭౨ పుటలును గల్గి సంచిక యెంతయు మనోరంజకమై యొప్పుచున్నది. మొదటినుండి కడపటివరకు నెల్లవిషయములను చదువక, చూడక పుస్తక మును క్రిందపెట్టుటకు వీలుండదు. తిరస్కృతాంధ్రవాఙ్మయము, డాక్టరు కిర్గ్లరుకాంత, స్త్రీధనము మున్నగు గలవ్యాసములు స్త్రీలకు మిక్కిలి ఉపయుక్తములుగానుండునని తలంచుచున్నాము. పెండ్లి మనుపుచ్చుకొన్న నాటిరాత్రి, లక్ష్మి, విమలవివేకము మొదలగు కథలేమి; ఝాన్సీ లక్ష్మీబాయి, మాంచాల ప్రభృతిశీర్షికలు గల పద్యములేమి ఎల్లవారికిని సుజ్ఞానమును, సంతోషమును సమకూర్పకమానవు. ఇట్టి సుందరమైన సంచికను తెనుగుదేశమునకర్పించిన పత్రికాధిపతులను మే మభినందించుచున్నాము.

—ధర్మసాధని (10-10-30)

౧౦

డాక్టరు కే. యన్. కేసరీగారి సంపాదకత్వమున మదరాసు ఎగ్మూరునుండి వెలువడుచున్న 'గృహలక్ష్మి' దసరాసంచికను వందనములతో నందుకొంటిమి. 'గృహలక్ష్మి' పత్రిక వాస్తవముగా గృహలక్ష్మియే

యని జెప్పవలెను. ముచ్చటయిన అచ్చు, ముద్దులుమూటగట్టు పటములు, నారీలోకమునకు ఉపయుక్తములగు వ్యాసములతో విరాజిల్లి యువతీసంఘమును మేల్కొలుపు పత్రికారాజమై ప్రకాశించుచున్నది. ఈ దసరా సంచిక సర్వవిధముల శోభస్కరముగానున్నది. నాలుగు త్రివర్ణపటములు, 36 సాధారణ ఛాయాపటములతో వివిధనారీమణులచే, ప్రఖ్యాతిబడసిన వ్యాసకర్తలచే వ్రాయబడిన వ్యాసములు, ఆంధ్రస్త్రీలోకాభ్యుదయమున కెంతయేని దోహదమిచ్చువిధమున ప్రకటించబడినది. స్త్రీలలోగల మూఢాచారములనునమ్మకములను పారదోలుటకు 'మాలసుబ్బి బాప్టిజము' అను వ్యాసము మిన్నయై విరాజిల్లుచున్నది. ఈ పత్రికారాజము దినదినప్రవర్ధమానయై, చిరస్థాయియై, సార్థకనామధేయియై వర్ధిల్లునటుల దీనబంధు ఆశీర్వదించునుగాక!

—దీనబంధు (20-10-30)

## ౧౧

స్త్రీలఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుటకై డాక్టరు కె.యన్. కేసరి గారు స్థాపించిజయప్రదముగ నడుపుచున్న సచిత్రమాసపత్రిక "గృహలక్ష్మి" యొక్క దసరాసంచిక సర్వాంగసుందరమై, మనోజ్ఞమగు వ్యాసరచనములతోను, కళాపూర్ణములగు చిత్తరువులతోను ప్రసిద్ధ భారతీమణుల ఛాయాపటములతోను నింపబడి బహు ఆకర్షణీయముగనున్నది. బొమ్మలకొలువు, దుర్గపూజ, శిశుపోషణ, విజయదశమి, శమీపూజ మున్నగువిషయములేగాక కవితాలోకమును విజ్ఞానదీప్తిచే తేజోవంతముగ చూర్చగల సమస్తవిద్యావ్యాసంగములు దీనిలో గానవచ్చును. ఆంధ్రస్త్రీల అద్భుతకల్పనాశక్తికి నెలవుగనేర్పడిన "గృహలక్ష్మి" ప్రతి ఆంధ్రుని గృహమును తప్పక నలంకరించతగియున్నది. పార్వతీపరమేశ్వరుల త్రివర్ణలేఖనము, అలంకృత, శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయి, భారతసినీమాలోకమున ప్రఖ్యాతిగాంచిన నటి సుల్తానాకన్య, శ్రీమతిగుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు, 'షిరాజ్' 'వసంతసేన' ఫిలిములలో నాయికాపాత్రను ధరించి కళాకోవిదులచే కొనియాడబడిన ఏణాక్షి రామారావుకన్య, యం. యె. (ఆనర్సు), శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవి ఎం. బి. ఎస్. సి. (ఆనర్సు) గార్ల ఛాయాచిత్రములు ఈ పొత్తము సౌందర్యమునకెక్కుడు వన్నె తెచ్చినవి. నెల్లూరు వాస్తవ్యులగు కీ. శే. వేగూరి వెంకటసుబ్బమ్మగారిచే వ్రాయంబడిన "ఆత్మార్పణము" అను వ్యాసరాజము ఆమె పటముతో ఇందు చేర్చబడియున్నది. శ్రీమతి పొణకా కనకమ్మ గారి ఫోటో చేర్చబడినది. దాదాపు అరువది వ్యాసములు నలుబదిచిత్రపటములతోను ఈ దసరాసంచిక ఎంతోసొంపుగనున్నది.

—దేశబంధు (20-10-30)

# గమనింపుడు

కృష్ణాజిల్లా యలమర్రునివాసులును, ఆర్యయువకసమితి కార్యదర్శులును, ఆదర్శ గ్రంథమండలి సంస్థాపకులును, స్త్రీజనశ్రేయోభిలాషులును అగు శ్రీయుత గద్దే లింగయ్య చౌదరిగారు యీక్రింది విధముగా వ్రాయుచున్నారు:—

## ౧

# గ్రంథరచనమున పోటీపరీక్ష

## (స్త్రీలకు మాత్రమే)

నేటి మన ఆంధ్ర విదుషీమణులు పెక్కురు సామర్థ్యమున్నను తగు ప్రోత్సాహము లేమండుటచే గ్రంథరచనమునకు విడివిగ గడంగకున్నారు. అట్టివారికి ప్రోత్సాహము కలిగింపవలయునను కుతూహలముతో

ఈ పోటీపరీక్ష నేర్పాటుచేసినారము. కావున భాషాసేవకురాండ్రగు విదుషీమణులు తమ అభిమానవిషయమునుగూర్చిగాని, ఆదర్శ స్త్రీపురుషుల జీవితచరిత్రములుగాని 500 పుటలకు మించని గ్రంథములు వ్రాసి వానిని ప్రజోత్పత్తి సంవత్సరాదిలోపుగ మాకు బంపవలెను. పరీక్షలో నెగ్గిన గ్రంథములు మేము స్థాపించిన ఆదర్శగ్రంథమండలిలో ప్రకటింపబడును. ఈ పోటీపరీక్షలో పాల్గొని గ్రంథములు రచియింప కోరికగల విదుషీమణులు తాము ఏవిషయమునుగూర్చి గ్రంథము వ్రాయుచున్నది మాకు లేఖాముఖమున తెలిపి పిమ్మట గ్రంథరచనమునకు ఆరంభము చేయవలెను. పోటీపరీక్షలో నెగ్గినవారికి మొదటి ఇరువురకు బంగారుపతకము లీయబడును. తరువాతి ఇరువురకుకూడ తగుబహుమానములీయబడును.

## ౨

## గ్రంథకర్త్రులకు మనవి

ఆంధ్రవిదుషీమణులచే రచితములైయుండి ఇంతవఱకు ఏకారణముచేతనైన ముద్రణముకాకయున్న గ్రంథములను నవంబరు 30-వ తేదీలోపుగ మాకడకు బంపినచో అందు మంచివి గ్రహించి ఆ గ్రంథకర్త్రులను ఉచిత రీతిని సత్కరింతుము. అన్యభాషలనుండి గ్రంథములను అనువదించిపంపు విదుషీమణులకుకూడ తగిన బహుమతు లీయబడును.

## 3

మేము అక్టోబరుమాసపు గృహలక్ష్మి సంచికలో ప్రకటించిన ‘ఖాదీప్రచారము: స్త్రీల కర్తవ్యము’ అను విషయమునుగూర్చిన వ్యాసముల పోటీపరీక్షలో

1. శ్రీమతి కల్వాల పార్వతీకుమారిగారికి
2. శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారికి

ని బహుమతులీయవలయునని నిర్ణయింపబడినది. ఈయ నిర్ణయింపబడిన బహుమానము గృహలక్ష్మి ఒక సంవత్సరముకు సప్లయిచేయుట. 1931-వ సంవత్సరము మార్చిమాసపు సంచికతో గృహలక్ష్మి నాలుగవ సంపుటము ప్రారంభమగును. అప్పటినుండి ఈ వ్యాసకర్త్రులకు ఒకసంవత్సరము గృహలక్ష్మి పంపబడు ఏర్పాటులు చేయుచున్నాము.

---

సంతానము పుట్టకుండా

# "ప్రివెన్ట్రస్"

యే స్త్రీ "ప్రివెన్ట్రిస్" యనుదానిని నడుమున ధరించునో ఆ స్త్రీ సంతానములేక యుండి సదా సౌఖ్యముగనే యుండును. యెప్పుడు సంతాన సౌఖ్యము కావలయునని కోరునో అప్పుడు 'ప్రివెన్ట్రిస్' యనుదానిని వదలవలెను. సంతానదుఃఖ మనుభవించు స్త్రీలకు అత్యావశ్యకరముగాన వలయువారు తక్షణమే మాకు వ్రాసి తెప్పించుకొనుడు.

దీని వెల రూ. 3—8—0

పైకము ముందుగా పంపువారికి పోస్టేజి ప్యాకింగు ఉచితము.

సోల్ యేజెంట్లు:

## మన్యం అండు కంపెనీ. బళ్లారి

---

కేసరిగారి రత్నత్రయము

# లోధ్ర అర్క

స్త్రీల ఆరోగ్యమునకు జ్వరనివారణము

# అమృత

రక్తశుద్ధికరము

మందులవర్తకులు అందరిదగ్గిరను దొరకును

## కేసరికుటీరము, ఎగ్మూరు, మదరాసు.

# రజోదర్శిని

తిమ్మసముద్రము
28—5—29

ఆర్యా

"………మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

## ఆర్యరసాయనశాల

(ముక్త్యాల; కృష్ణా.)

"చేత వెన్నముద్ద చెంగల్వపూదండ
బంగరుమొలత్రాడు పట్టుదట్టి
సందెతాయెతులును సరిమువ్వగజ్జెలు
చిన్నికృష్ణ! నిన్ను చేరికొలుతు."




# నాస్తి మాతృసమో గురుః

"ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతంపితా
సహస్రంతుపితౄన్ మాతాగౌరవేణాతిరిచ్యతే."

—మనుస్మృతి.



అనుభవజ్ఞులగు పెద్దలు 'తల్లి దైవము, తండ్రి ధనము' అని చెప్పుదురు. ఈ వచనముసందెంతయో అర్థమిమిడియున్నది. తండ్రియగువాఁడు ప్రాయికముగా బిడ్డకు సుఖమొసగూర్చుసాధనముమాత్రమేయగు ధనమును ఈయగల ఉపకారియే యగుచున్నాఁడు గాని 'మంచి చెడ్డలగతు లేర్పరించు' నేర్పు అలవఱచు ఉపదేష్టయగుటలేదు. తల్లియగునది దుర్భరమగు ప్రసూతివేదనను భరించి ఉత్సర్గవిణ్మూత్రలాలాద్రవశ్లేష్మజాలముల కెట్టివేళను కుత్సింపక పంచకరపాట్లుపడి బిడ్డనుసాకు ధాత్రియగుటకు తోఁడు ఎల్లయెడల బిడ్డ మనశ్శక్తులను బెంచి ఆశక్తులను సవ్యమైన చాలులో పెట్టు ఉపాధ్యాయినికూడ నగుచున్నది.

తల్లి స్తన్యమునఁబట్టి దేహబలమును, ఆమె ఇచ్చు శిక్షనుబట్టి మనోబలమును బిడ్డకు గలుగును. శిశువుల అభ్యాసములు, ఆలోచనలు తల్లి ననుసరించియే యుండును. బిడ్డల జీవనదర్పణమున ప్రతిఫలించు ప్రతిలక్షణమును తల్లినుండి సంక్రమించినదియే యనుట సత్యదూరము కాదు. అగుటనే 'యథామాతా తథాశిశుః' అనియు, 'తల్లిని చూచి పిల్లను, పాడినిచూచి బఱ్ఱెను కనుగొనవలె' అనియు సామెత లేర్పడినవి.

బిడ్డలు తమపిన్నతనమున తల్లికడనుండునంతకాలము మఱియెవ్వరికడ నుండరు. లక్కవలె ఎట్లువంచిననట్లువంగు ఆలేఁబ్రాయమున బిడ్డలకు సత్ప్రవర్తన, చదువు సంధ్యలు

నేర్పుటకు తల్లికున్నంతవీలు తండ్రికి ఉండదు. విద్యాజ్ఞానసముపార్జనమునకు శైశవబాల్యావస్థలే మంచికార్తులు. ఈకార్తులయందు బిడ్డ తల్లియొక్క అడ్డాలలోను, పాదములచెంతను ఉండి విశేషకాలము బుచ్చును. ఈ కార్తులలో వెన్నతోడను, ఉగ్గుపాలతోడను, గోరుముద్దలతోడను తల్లులవలన నేర్చుకొన్న విషయములు బిడ్డల హృదయక్షేత్రములందు అరఁటికట్లులవలెనంటి ఎప్పటికిని వీడకుండును. కావుననే 'తల్లి చాలు బిడ్డకు తప్పదు' అను ఆర్యోక్తి సిద్ధించినది.

తల్లి చాలు బిడ్డకు తప్పనిదగుట శిశువులయెడ తల్లికిగల బాధ్యత కొలఁదియిడరానిదగుచున్నది. కొలఁదియిడరాని ఆబాధ్యత తెలిసికొని వర్తించు మాతలుగల దేశము దేవభూమి యనిపించుకొనును. ఆబాధ్యత తెలిసికొనక, తెలిసికొనినను దానికిఁదగినట్లు వర్తించుటకుఁ దెలివి చాలకయుండు మాతలుగల దేశము నరకసదృశముగ నుండును. ఈ సత్యమును గుఱుతెఱిఁగిన ప్రాజ్ఞుఁడు కావుననే నెపోలియనుచక్రవర్తి 'దేశౌన్నత్యమునకు మంచి తల్లులు కావలయు'నని మేఘగంభీరస్వరమున గర్జించినాఁడు.

తల్లియగునది 'కోటంత దేవుడికి మేటంతపత్రి' పూజచేసి తన బిడ్డకు 'బ్రహ్మంత ఆయువు' అర్థించిన శ్రద్ధతోడనే ఆబిడ్డను పౌరుషజ్ఞానకీర్తులఁ బరగునట్లుఁగూడఁ జేయఁగలదు. ఉగ్గుత్రాగించుటకై బిడ్డ బుగ్గలమీఁద చిటికెలువైచిన వ్రేళ్లతోడనే ఆమె యర్హకాలమున బిడ్డచే బడులు దిద్దింపఁగలదు. ఆటలసందడిలోబడి ఆగమ్మకాకివలె తిరుగుచున్న బిడ్డను లాలించి కొనివచ్చి వేళపట్టుకు అన్నముపెట్టి అన్నపుఁజొరవ గల్గించి బిడ్డకు దేహబలమును పెంపొందించునట్లే అభ్యాసకాలమునందు చేరంజీరి అక్షరపుఁజొరవకూడఁ గల్గించి ఆమె బిడ్డకు జ్ఞానశక్తిసంపాదనమునకు సాధనము సమకూర్పఁగలదు. అల్లరిగచ్చకాయయై ఆగముచేయుచు చెఱఁగుబట్టి యేడ్చుబిడ్డకు కాకమ్మ, నక్కమ్మ కథలను జెప్పి యేడ్పుడుపు విధముననే ఆమె అజ్ఞానవ్యసనమున తాడు తెగిన గాలిపటమైయున్న బిడ్డను జ్ఞానావబోధముచేసి గుణముల కుప్పగాఁ జేయఁగలదు. తనకలపుంస్కోకిలకంఠమెత్తి తెల్లవాఱగట్ల భూపాలరాగమున మేలుకొలుపులుపాడి బిడ్డలను నిద్రలేపిన చందముననే ఆమె ప్రాథమకల్పికుఁడైన బిడ్డఁడికి పాఠముచెప్పి ఆతని జ్ఞానశక్తులను క్రమమున రేపి అవితిరిగి ఎన్నటికిని నిద్రాముద్రితములు కాకుండునట్లుఁ జూడఁగలదు. తొట్టియలలో బిడ్డలను శయనింపఁజేసి వారినిరాములుగను, సీతలుగను భావించి జోలపాటలు పాడుటయేగాదు ఆమె తన బిడ్డలు నిజముగ రాములవలె, సీతలవలె ఆదర్శజీవితమున నెగడునట్లుగా నుద్బోధ చేయఁగలదు. 'విద్దెముచేసిన గిద్దెడు నెయ్యి' అని హెచ్చరించుచుఁ జిన్నబిడ్డకు నడకనేర్పిన ఓర్పుతోడనే ఆమె తనబిడ్డకు మంచి నడవడిక కలుగునట్లును హెచ్చరింపఁగలదు. పోరుపట్టిన బిడ్డను పొత్తిళ్లలో నుంచుకొని చిచ్చికొట్టునట్లే ఆమె ఉపదేశకర్త్రియై ఉద్వేలమైన ఆబిడ్డ భావములకు శమనమును గలిగింపఁ

గలదు. దేహసంబంధమైన రోగమగు అనారోగ్యమునుండి బిడ్డను కాపాడి శ్రీరామరక్ష చెప్పిన విధమునసనే ఆమె మనస్సంబంధమైన రోగమగుఅజ్ఞానమునుండి కూడ బిడ్డను కాపాడి శ్రీరామ రక్ష చెప్పఁగలదు.

"పళ్లూబియ్యం దేవుడికోయి
పాలూనెయ్యీ బాలుడికోయి"

అని ఆశపెట్టి బిడ్డమనము తొలుత దేవపూజకు మరలించినరీతినే ఆమె బిడ్డను ప్రతి ఫలాపేక్షలేక పరంధామునికొలుచు నిష్కామయోగిగాఁ బిమ్మటఁ జేయఁగలదు.

'కాగలదు, కాగలదు' అని ప్రత్యేకము వేఱ్కొననేల? ఆమె కాగలిగినది. చూడుఁడు. ఐరోపాఖండమునంతను లీలామాత్రముగ నుఱ్ఱూతలూగించిన నెపోలియను చక్రవర్తి సింహాసన మధిష్ఠించినపుడు 'ఈ సింహాసన మెక్కఁగల యోగ్యత ఏమైన నాకడ నున్నచో అదిఅంతయు నాతల్లి ప్రసాదమున లభించినదియే' అని చెప్పెను. తల్లియగు హామీదారాణి ఆశీర్వచసబలముననే అక్బరు కీర్తివిస్తారుఁడయ్యెను. శివాజిమహారాష్ట్ర సామ్రాజ్యనిర్మాతయయ్యెనన్నచో ఆకీర్తిలో చాలభాగ మాతని తల్లియగు జిజాబాయిదే. అతిలోకమగుటచే సుశ్లోకమైన గాంధిమహాత్ముని ఋజువర్తనమునకు ఆతని తల్లియే కారణ మనుట జగమెఱింగిన సంగతి. ఇట్టి దృష్టాంతములు ప్రతిదేశచరిత్రమునందును పుంఖానుపుంఖములుగ నున్నవి. తల్లియందు ఇట్టి మహత్తరశక్తియున్నది కావుననే ఆర్షేయములగు వేదములును, పౌరుషేయములగు శ్రుతిస్మృతులును

'నాస్తి మాతృసమో గురుః'

అని దిక్కులు పిక్కటిల్లునట్లు దివ్యఘోషము చేయుచున్నవి.

## ఆశీస్సు

వడ్లమాని అప్పారావుగారు

చూపుచూపునసుఫల్ సూచించుచంద్రుండు
కలువపూవలపులో కలియునట్లు,
అలరుకన్నియనోట చలువతేనెలజూచి
గొంతెత్తిపాడిన కోకిలమటు,
బరువైసజలదాల భావాలగ్రహియించి
యింద్రచాపమ్ము చిత్రించునట్లు,
అణువుమొదలుగ నీయఖిలదేశమ్ముల
వాసనల్గొనితెచ్చు పవనుపగిది,
తలపుతలపున నూత్నతత్వమ్ము మెఱయ
ఆంధ్రవనితలశిరముల కలరువగుచు-
వేయికల్పాలు బ్రతికియువిసువులేని
స్వర్గసీమలగల పారుజాతమటులు-
మనగదే నీవు 'గృహలక్ష్మి'మమ్ముజూచి.

## శ్రీమతి బత్తుల కామాక్షమ్మ

శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు నిర్వహించుచున్న ప్రాచ్యవిద్యాపరీక్షలలో ఉభయభాషాప్రవీణ కక్ష్యయందు జయముగాంచిన ఆర్యవైశ్య స్త్రీలలో శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ప్రథమురాలు. ఆవిదుషీమణి చరిత్ర తెలిసికొనదగినది.

ఆంధ్రసంఘమున బాలికలు ఉన్నతవిద్య నార్జించుటకు అవకాశములు తక్కువ. కావుననే ఆంధ్ర బాలికల విద్య సాధారణముగ నాల్గవతరగతితో తుదముట్టుచున్నది. శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి విద్యయు నట్లే అయినది. వివాహమైన కొలదికాలమునకే ఆమెకు వైధవ్యము సంభవించెను. పదమూడేడుల బాల్యప్రాయమున వైధవ్యభారము మీదపడినది. ఇక మిగిలిన ఆయుర్దాయము కడపబ్రోయుట ఎట్లు? కామాక్షమ్మగారు బాగుగ యోజించిరి. అక్షరరూపిణియగు శారదాదేవి నర్చించి ఆయుర్దాయము కడపబ్రోయుటకు ఆమె సంకల్పించినది. రాజమహేంద్రవరమున నివాసమేర్పఱచుకొన్నది. ఆంధ్రదేశమునందలి గ్రంథాలయములందు అతిశ్రేష్ఠమైనదగు అచ్చటి గౌతమీగ్రంథాలయము శారదాదేవినర్చించుటకు కామాక్షమ్మగారికి కావలసిన పుస్తకపరికరముల నందించినది. ఆనాడు గ్రంథాలయమువారు ఉచితముగ అనగా చందా గైకొనకయే స్త్రీలకు వారమువారము వలయు పుస్తకముల నందజేయువారు. ఇట్టి సదుపాయముండుటచే నామె వలయుపుస్తకములను సులభముగఁబొంది విద్యాసముపార్జనము చేసినది.

అబలాసచ్చరిత్రరత్నమాల మొదలగు రమణీమణుల గమ్యచరిత్రలు గానముచేయు గ్రంథములలోని సంఘసేవాధురీణలనుగూర్చి చదువునపుడెల్ల కామాక్షమ్మగారికి వారివలె తానుకూడ సంఘసేవచేయవలయుననుబుద్ధి పొడచూపుచుండునది. కాని ధనాభావముచే ఆమె సంఘసేవాసక్తి అప్పటికి కార్యరూపము తాల్పకయే నిలిచియుండినది. కేవలము గ్రంథములయందు సంతరింపఁబడినదియే విద్య కాదనియు యాత్రానుభవముచే ఆర్జించిన అనుభవముకూడ విద్యయే అనియు ఆమె తాత్పర్యముగుటచే ఆమె కొంతకాలము యాత్రలు సేవించినది. భద్రాచలము సేవించినది. రామేశ్వరయాత్ర సల్పినది. తత్సందర్భముననే కన్యాకుమారయగ్రము, అనంతశయనము మొదలగు దక్షిణదేశయాత్రలు సేవించి కేరళదేశమున కొంతకాలము సంచారమొనరించి ఆదేశపు ఆచారవ్యవహారములను అవగతమొనరించుకొన్నది. తన తండ్రిగారితో కలసి కొంతకాలము చెన్నపురిగమున నివసించి నగరమర్యాదలను పరిశీలించినది. పిమ్మట కలకత్తా, కాశి, గయ, మధుర, ఢిల్లీ మొదలగు ఉత్తరహిందూదేశమునందలి పట్టణములను; అజ్మీరు, మార్వారు, మేవారు, బరోడా మొదలగు సంస్థానరాజ్యములను తిలకించి; బొంబాయి, పూనా మొదలగుపట్టణములను పరికించి స్వస్థానము చేరినది. మరల నొకమాఱు దక్షిణదేశయాత్ర చేయవలయుననుకోరికపొడమి ప్రయాణమై బెంగుళూరు, మైసూరు, శివసముద్రము, కోలారు మున్నగు రమ్యప్రదేశముల సందర్శించినది. ఆసేతుహిమాచలపర్యంతమైన ఈ యాత్రలమూలమున శ్రీమతి కామాక్షమ్మగారు పొందిన లోకానుభవము అపారము.

దేశయాత్రలమూలమున అపారమగు లోకానుభవమునుపొంది ఆమె స్వస్థలముచేరి సమస్తభాషలకును తల్లిభాషయగు సంస్కృతమును కృషిచేయ నారంభించెను. ఇట్లుండ ఒకానొక పుణ్యదినమున శ్రీనాళము రామలింగయ్యగారితో ప్రస్తావించుచుండగా, వారు వైశ్యస్త్రీలయొక్క జ్ఞానాభివృద్ధికై ఒక సంస్థను స్థాపించవలెనని తమకు చిరకాలముగా కోరికయున్నదనియు, సమర్థురాండ్రగు స్త్రీలు పూనుకొనినయెడల వైశ్యసేవాసదనమును వెంటనే స్థాపించెదమనియు వారు చెప్పిరి. తన సంఘసేవాసక్తి కార్యరూపముదాల్చు శుభావసరము వచ్చినదని ఆమె తెలిసికొని తానా భారమువహించుటకు నడుముకట్టెను. దానకర్ణుడును, స్త్రీవిద్యాభిమానియునగు శ్రీనాళము రామలింగయ్యగారు పావనగౌతమీతీరమున రాజమహేంద్రవరమున 1920-వ సంవత్సరమున వైశ్యసేవాసదనమును స్థాపించి శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి ఒప్పగించిరి. ఈ పదిసంవత్సరములుగ నాయమ ఆ విద్యాసంస్థను కడుపునబుట్టిన బిడ్డకంటె ఎక్కువగ అరసి రక్షించుచు దినదినాభివృద్ధినందునట్లు చేయుచున్నది. ఈవిదుషి, ఈసంఘసేవాధురీణ బహుకాలము జీవించి ఆంధ్రస్త్రీలను విద్యావతులుగ చేయుటలోను, ఆంధ్రసంఘమును పునర్నిర్మాణముచేయుటలోను శక్తివంచనలేక పాటుపడునట్లు పరమేశ్వరుడు అనుగ్రహించునుగాక!

# సీత

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

"ఇదిగో, ఎంతకాళ్లా వేళ్లాబడి బతిమాలుతున్నా నామాటవినవుగదా" అని నారాయణమూర్తి రాట్నము వడుకుతూ అప్పుడే గృహలక్ష్మి దసరాసంచికలోని బొమ్మలు చూడడానికని దగ్గ కూర్చున్న సీతతో అన్నాడు.

"చాల్లెండి, ఎవరన్నా వింటే నవ్విపోతారు. పాప మాయనచేత కాళ్లుకూడా పట్టించుకుంటున్నదని యిరుగుపొరుగువారు విరగబడి నవ్వుకోటానికా?" అని తెరుస్తూతెరుస్తూఉన్న పుస్తకాన్ని ఆపి ముఖము చిట్లించుకొంటూ సీత అన్నది. "ఏమీ, తప్పేమున్నదీ? అవసరమైతే వారికి వీరూ, వీరికి వారూ కాళ్లు పట్టుకుంటే మాత్రము తప్పా?" అని తీసేతీసే బారనాపి నవ్వుతు నారాయణమూర్తి అన్నాడు.

"అబ్బో, దయాదాక్షిణ్యాలుకురిసేలాగే మాట్లాడుతున్నారే" అని అన్నది సీత దసరాసంచికలోని పార్వతీపరమేశ్వరుల బొమ్మ చూస్తూ.

"మరి ఆక్షేపించకూ ఎవరికిచేతైనట్లు వారు మాట్లాడుతారు."

"బాగుంది, ఆక్షేపణయేమిటి? మీదగ్గఱ యేమిమాట్లాడినా తప్పేనంటే" అని కాగితాలు తిరగవేస్తున్నది.

"ఏమున్నదీ, ఏంలాభమూ చదువుకొని ఆనందించడం చేతకాకపోయిన తరవాత ఎన్నిపుస్తకాలుంటే ఏంలాభమూ, ఎన్ని మంచి విషయాలుంటే యేం?"

"పోనీలెండి, ఎవళ్లకు తగ్గ ఆనందము వాళ్లకు. అందరూ అందలమెక్కితే మోసేవారెవరు?"

"మాటలు మాత్రమున్నవి కోటలుదాటుతూ. క్రియమాత్రము శూన్యము" అంటూ ఆమిగిలిన ఒకక్రాయే కునీ అందుకున్నాడు నారాయణమూర్తి.

ఇంతలోకే బొమ్మలు చూడడం అయిపోయిన తర్వాత పుస్తకంమూసేసి ఆపక్కాయీపక్కా తిప్పి విస్ఫారితనేత్రాలతో చూస్తూండి ఒకసారి భర్తవంకచూచి "ఏమైనా చెప్పుదురూ?" అన్నది సీత.

"నాకేం తెలుసును? ఏంచెప్పమన్నావు? నేచెప్పేదేమీ నీకు నచ్చదాయెను."

"ఎందుకు నచ్చదులెండి, చదువువిషయం తప్ప ఏమేనా చెప్పండి."

"గాంధిగారి విషయం చెప్పమన్నావా?"

"అబ్బో, వద్దులెండి. తియ్యాపెట్టాతరముగాదన్నట్లు అంతూపంతూలేని ఆవిషయం చెప్తూంటే దానిలో చాలా చిక్కులుంటవి. అది తప్ప..."

"మరి నిన్న ఏదోపనిమీద మన ఊళ్లో కాలవపక్కగా బజారుకేసి వెళ్లుతున్నా..."

"ఏదోపనేమిటిలెండి, మనకులేని పనులున్నాయా? ఏఅప్పారావుగారికోసమో అనిచెప్పరాదూ?"

"బాగుంది, నువ్వేగాసబ్బుబిళ్ల తెమ్మని వేధించావు?"

"సరేలెండి, ఆకాస్తానామీదికె నెట్టాలూ? కానీయండి, చదువుకున్నందుకీపాటే నాచేతకాకబోతే యికేముంది మరీ?"

"విను. తరవాత ఎదురుగా నల్లకోటు తొడుక్కొని అడుగున బాగామాసిన పంచె కట్టుకొని ఒకడు వస్తూన్నాడు. దగ్గరకురాగా చూస్తేనిగదా యీమధ్యదావాల్లో ఆస్తిఅంతా పోగొట్టుకొన్న ఒక జమీందారు. ఈప్రాంతాలవాడే. పాపము బ్రతికిచెడినవాడు. ఆవెనకటిఐశ్వర్యమంతాపోయినా, ఆదర్జాఅంతానశించినా, ముఖంలోఉన్న సహజకళాకాంతీ యేమీతగ్గలేదు."

"పగ్గినకేంలెండి. కథకానీయండి."

"జరిగినసంగతి చెప్తూంటే కథ అంటావేం? నావెనకాలే పొగాకుమడతలు నెత్తినపెట్టుకొని చిరుగుల చొక్కా, పాతచెప్పులూ, నోట్లో ఆరిపోయినచుట్టా కలిగిన కాపులువస్తూ ఈయన్నిచూచి—పాపము వాళ్లకేం తెలుసు జమీందారనీ—తమలాగే పిచ్చిగా ఉన్నాడుగదాఅని "ఏమయ్యా! వసంతవాడ పడవలెప్పుడు బయలుదేరుతై?" అని అడిగారు. పాపమాయననవ్వుకుంటూ పోయినాడు. చూచావా? ఎంతటి ఐశ్వర్యవంతుడి కెట్టిగతి పట్టిందో? అంతా స్వయంకృతాపరాధమే. ప్రపంచమంతా ఇట్లాగే ఉంటుంది."

"మీ వేదాంతాలకేమి లెండి. పాప మాయన్ని చూచి నాలుగు పద్యాలు వ్రాయక లేక పోయ్యారూ?" అని సీత నవ్వి "ఇదేమీ బాగాలేదు. ఇంకోటి చెప్పండి, మంచిది" అని అంది.

"అ స్తమానమూ ఏం చెప్పేది? మొన్న, తెనాల్లో—బంధువు లింటికి పోవడం మామూలు లేదు గనుక—సుబ్బారావుగారి హోటలుకు వెళ్లాను. అది చాలా పెద్దమేడ. అందంగా ఉండకపోయినా విశాలంగా ఉంటుంది. ఆ సుబ్బారావుగారుకూడా కొ స్తకోపదారిగాని మంచివాడే. అందుకనే చాలమంది అక్కడికి వస్తారు. ఎతిగున్న హోటలు గనుక దబదబాలోపనికిపోయి, చొక్కా తియ్యడం అలవాటు లేదు గనుక ఆపాటే పంక్తిలో కూర్చున్నా. ఇంచుమించుగా ఆబంతిలో అందరూ నాలాగే కూర్చున్నవారే. ఇంతట్లోకే ఒకాయన పట్టుగుడ్డ కట్టుకొని మంత్రాలు జపిస్తూ లోపలికివచ్చి మమ్మల్ని చూచి అసహ్యించుకొని ఓమూలగా కూర్చున్నాడు. ఏదో అందరికీ ఆనందముగా కబుర్లు చెప్పుతూ అనుభవం కలిగిన వెంకట్రామయ్య అనే ఆయన వడ్డిస్తూ ఉల్లిపాయల పులుసు తెచ్చి మా బంతిలో అందరికీ పోసి దబదబాలోపలికి పోయినాడు. ఈ పట్టుగుడ్డాయన మునిగిపోయినట్లుగా పెద్ద కేక వేసి "ఏమయ్యోయి! నాకు పొయ్యకుండానే పోయినావేం?" అని అన్నాడు. అంటే "బాబూ! ఇది ఉల్లిపాయల పులుసు. తమకు చారు దెస్తా" నన్నాడు వడ్డించే వెంకట్రామయ్య. తరువాత "ఉల్లిపాయలేమిటి? పూటకూటింటికి వచ్చినాక తప్పుతుందా? ఎన్ని మాలకూళ్లో కాంది అయిందీ అప్పుడే. నా యిష్టము వచ్చింది చేయించుకోడానికి మా యిల్లా యిది" అని పులుసుకోసం మెసురు చూస్తూ పోయమన్నాడు. వడ్డనాయనకూడా కొ స్తగమ్మత్తు చేతామని పులుసు తేర్చిపోశాడు. "ఇందుముక్కలుకూడా తగలెయ్యండి" అని విసుక్కుంటూ అన్నాడు పట్టుగుడ్డాయన. మేమందరమూ గొల్లుమని నవ్వాము."

ఈ మాటకు సీతకుకూడా నవ్వు వచ్చింది. వచ్చే నవ్వు నాపుకొంటూ "అయితే ఉల్లిపాయలు తింటం తప్పంటరా?" అన్నది. "తప్పని నేననను. మంచిగానీ, చెడుగానీ వాళ్ల వాళ్ల అలవాటులను వారే చెడువని లోకానికి చెప్పుతూ తాము అయిష్టంగా తప్పని సరిగా అది ఆచరిస్తున్నామని లోకాన్ని మోసపుచ్చదలచడం చాలా తప్పు అని నా అభిప్రాయం" అన్నాడు నారాయణమూర్తి.

"సరేలెండి, మీకేం; ఎన్నయినా చెప్పుతారు. అప్పతల పని ఎవరు చేస్తారు?" అని ఆపుస్తకం ప్రక్కన ఉంచి నవ్వుకొంటూ వెళ్లింది సీత.

నారాయణమూర్తి సంస్కృతం చదివి తెలుగులో జ్ఞానం సంపాదించిన మనిషి. సంస్కృతం చదువుకోవడంవల్ల అతనికి ఇంకా కొన్ని భాషలలో పరిచయం కలిగింది. కాని అతని క్రాపింగూ, కొనలు కత్తిరించిన మీసమూ, షర్టువై ఖరీ, పంచెకట్టూ చూస్తే అత నంత పాండిత్యం గలవాడనిగానీ, వినయం గలవాడని కానీ ఎవ్వరూ అనుకోరు. కాని అతడు చాలా నెమ్మదైనవాడు. ఆ ఊళ్లో అతన్నెరిగినవారంతా అతడంటే చాల ఇష్టపడతారు. అతడు తమదగ్గిర ఉంటేనే చాలనే అభిప్రాయంలో ఉంటారు కొందరు. ఇంటా, బయట ఇతని మాటలు విని సంతోషించనివాళ్లు లేరు. పురుషులంటే ఎంత గౌరవమో ఇతనికి స్త్రీలన్నా అంతే గౌరవం. అంతేకాకుండా చాలా పాటుపడి వారి ప్రస్తుత విద్యావిహీనత, అస్వాతంత్ర్యము మొదలగువానిని గురించి అక్కడక్కడా చెప్పుటయేకాక చాలాసార్లు పత్రికలలో వ్రాస్తూ ఉండేవాడు.

ఇతని భార్య సీత. ఈతనికెంత చదువు వచ్చో ఆమెకంత శూన్యము. చక్కనిది-బాగా తమాషాగా మాట్లాడుతుంది. అన్నీ తెలుసును. భర్త కనుసన్నలలో మెలగుతుంది. ఆమెను చూస్తే నారాయణమూర్తికెంతో ప్రేమ; ఆనందమును. అయ్యో చదువుకోలేదే అని వెంటనే విచారమూ కలుగుతుంది. పోనీ తాను చెప్పుదామా అంటే ససేమిరా చదువు వద్దని చదువుకుంటే చెడుగు చాలా ఉందని చెప్తుంది. అసలు ప్రస్తుత కాలపరిస్థితులనుపట్టి ఆడవాళ్లకి చదువు అనవసరం అంటుంది. ఏమైనా చదివి చెప్పితే శ్రద్ధగా వింటుందిగాని

తాను చదువుకోదు. చదువుకోటాని కంగీకరించితేచాలు అతడు నెత్తిమీద పెట్టుకొని నిముషంలో కావాలసినంత చదువు వచ్చేటట్లుచేస్తాడు. అందుకోసమే పాపమాయన ఆమె రోజూ ఏవో చెప్పమంటే దేశంలో జరిగే విషయాలే కథలుకథలుగా చెప్పి నీతి ఉపదేశించి చదువుమీద అభిరుచి పుట్టేటట్లు చేయడానికి ప్రయత్నించేవాడు. మంచి రంగులబొమ్మలుగల పుస్తకాలను తెచ్చిచూపిస్తే పోనీ ఒకనాటికైనా చదువుమీదబుద్ధి పుట్టుతుందేమో అని ఎన్నోపుస్తకాలు తెచ్చేవాడు పాపం. వాటినామె నలిపినా, చిన్నతనంచేత చింపినా, కాస్తయినా కోప్పడేవాడు కాడు. ఆమె చదువుకోలేదన్నమాటేగాని అన్నీ తెలుసు. తనయెడ భర్తకున్న అనురాగం గ్రహించేది. వెంటనే అతని విచారాన్ని గ్రహించేది.

నారాయణమూర్తి వృథాగా కాలక్షేపము చేయడాని కంగీకరించేమనిషిగాదు. ఎప్పుడూ ఏదోచదవటమో, వ్రాయటమో, లేకదారము తీయటమో చేసేవాడు. ఈపనులను నియమంగా అతడాచరించేవాడు. మధ్యాహ్నం పనులన్నీ అయిన తరవాత సీతవచ్చి మాట్లాడుతుందిగదా తాను చదువుతూఉంటే భంగము కలుగుతుందని ఆసమయంలో రాటము ముందరకూచునేవాడు. ఈయనదారం తీస్తూఉండే సీతచిరునవ్వుతో వచ్చి యేమైనా చెప్పమనేది. ఆయన ఆమెసంతోషానికేం చెప్పినా అందులో ఒకనీతి ఉండేటట్లుచెప్పేవాడు. దానిని ఆమెలోపల గ్రహించి పైకి ఏదో వేళాకోళముచేసినట్లు పలికినా అట్లాచరించుటకు ప్రయత్నించేది. సీతాదేవి చరిత్రమూ, ఆమహాతల్లి ఆభయంకరమైన లంకలో ఆనాడు రావణాసురుడంతటి రాక్షసుణ్ణికూడా లెక్కచేయకుండా భర్తనేతలచుకుంటూ ఉండటం, అగ్నిలో భగభగామండుతూండగానే భర్తను తలచుకొని దూకటం, అది చల్లారిపోవటం మొదలైనవి అప్పటికప్పుడు జరుగుతూఉన్నట్లు భర్తచెప్పితే లోపల సీతాదేవిని మనసారతలుచుకుంటూనే పైకి "చాల్లెద్దురూ, పురాణాలకేం, అగ్నిలోదూకిందట, కలానికడ్డు లేకపోయేసరి. ఇంకానయం కత్తితో గొంతుకోసుకుంటే రెండుముక్కలైందని చెప్పారుకాదు" అని హాస్యమాడినా తాను సీతాదేవివలె ప్రవర్తించడానికి నిశ్చయించుకొని అట్లాచరించేది.

ఒకనాడు మామూలువేళకే సీతవచ్చి తీరికగా కూచుని నవ్వుతూ, "ఏమండీ, మీరు చదువుకోమని కోరుతారుగదా నాకిప్పుడేం చదువువస్తుంది?" అని అన్నది భర్తతో. "నీకా, అయిదోనాటి కమరంకూడా చదివేటట్లు చెయ్యనూ?" అని ఆశాసూచకస్వరంతో అన్నాడు నారాయణమూర్తి. "ఓహో, నేను చదివినా, చదవకపోయినా అమరం చెప్పేసినట్లే ఉన్నారే—అయినా ఒకమాటడుగుతాను. మొన్న చదువు కావాలి, చదువుకావాలని వాళ్ళసరస్వతిని శారదాపీఠంలో చదివించుతూంటే ఏమైందీ, తల్లీతండ్రీ అనేనా లేకుండా వాళ్ళవెంకట్రావుతో లేచిపోయి కాపురంచేయటంలేదూ ఆపిల్ల. ఇదేనా ప్లీడరీ చదివిన వెంకట్రావూ, కావ్యాలు చదువుకొనే సరస్వతీను చెయ్యాలిసింది? అసలు నిజంగా చదువుకొన్నవాళ్లకి నాఅనీ, తనఅనీ ఉండదు, పోదురూ—"

"బాగుంది, అల్లాఅడుగు, వాళ్ల సరస్వతికి జ్ఞానమేనా లేనినాడు వివాహంచేశారుగదా, పాపం ఆ చిన్నవాడు విపరీతంగా మసూచికంపోసి ఆరోనెల్లోనే అంతరించాడుగదా, అప్పుడు సరస్వతి యేంచేస్తుంది, చెప్పు?"

"ఏంచేస్తుందేమిటీ, లోకంలో వెధవముండలందరూ ఏంచేస్తున్నారు? అదేచెయ్యాలి—"

"నీ అభిప్రాయం కేవలం పొరబాటు. బాలవితంతువులకు వివాహాలు చేయవచ్చుననీ, అవి శాస్త్రసమ్మతాలనీ పండితులే అంగీకరించారు. ఆనాడు చూస్తివిగా రాజమండ్రీలో వీరేశలింగంపంతులుగారు ఎంతో

శ్రమపడి స్థాపించగా నిర్విఘ్నంగా సాగుతూఉన్న వితంతుశరణాలయం. అప్పుడే అక్కడి ముక్కుపచ్చలారని చిన్న పిల్లలనుచూచి చాలా ఆశ్చర్యపడి ఆదరంతో బాగుండని పలికావు గామతి. చదువుకున్నదిగనుకనే ఆ అమ్మాయి విశుద్ధమైన ప్రేమతో, నిష్కల్మషమైన హృదయంతో అతణ్ణి ప్రేమించింది, తప్పా? పోనీ యీ కేమన్నా దుష్ప్రవర్తన ఆమెదగ్గిరఉందా?"

"లేదనుకోండి, నిజమే, పాప మాపిల్ల ఎమీఎరగనిది, పెండ్లిచేసుకుంటేమాత్రం ఏమని నాకూ తోచింది. అయినా అట్లాఅందరితోనూ చెప్పకుండా అర్ధరాత్రివేళ దొంగతనంగా లేచిపోవడమేమిటి?—"

"మతి కులాచారాలు ఒప్పుకోకపోయినాక ఏంచేస్తుంది. తల్లిదండ్రులంగీకరించరాయెను. సరేనని యింట్లోఉండి ఈపనిచేస్తే తనమూలాన ఏపాపమూ ఎరగని తల్లిదండ్రులకు లేనిపోని చిక్కులువస్తవని ఆపని చేసింది. అందరూ అందుకానందించారు. పెద్దలాశీర్వదించారు. అయినా ఒకమాట చెపుతాను, దోషము అనేది మనసునుబట్టి ఉంటుందిగాని చదువునుబట్టి ఉండనే ఉండదు."

"ఉండదంటారేం? చదువుపట్టి సాహసాలు జాస్తి అవుతై. వానినిబట్టి చెడుగుణాలు తొందరగా పట్టుబడతై."

"నిజమే, మతి చదువుకోటం ఎందుకూ? చెడుపనిని మానివేయటానికేగా. విజ్ఞానంకలిగినవాళ్లు ఇది మంచీ, ఇదిచెడూ అని గ్రహించాలి."

ఈ ఉపదేశంవల్ల ఆమె లోలోపల ఎంతో సంతోషించింది. తానూ చదువుకుంటే ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చుననుకొన్నది. స్త్రీలకు చదువులేక పోబట్టేగదా వాళ్లప్రతిభ అంతా అణిగిపోతూంది అని అనుకున్నది. తాను చదువుకుందామని లోపలఉన్నా, పైకి చెప్పితే తనపంతంవదలినట్లవుతుందనుకొని ఒకనాడు భర్తచేత బతిమాలించుకొని బలవంతాన అక్షరాలు దిద్దించుకొన్నది. ఆశుభసమయంలోనే తథాస్తుదేవతలు తమపనిని చేశారు. సీత వస్తుతా తెలివితేటలు గలదవటంచేత నారాయణమూర్తి కష్టపడకుండానే అచిరకాలముననే చదువు నేర్చుకున్నది. నారాయణమూర్తి తనకువచ్చిన భాషలన్నీ నేర్పలేకపోయినా హిందీలో మాత్రం కొంతపరిచయంకలిగించాడు. ఆనాటినుంచీ తనపేరవస్తూఉన్న పత్రికలు సీతపేరుతో తెప్పించటం మొదలుపెట్టాడు.

పత్రికలు రాగానే యిరుగు పొరుగు పిల్లలంతా గుంపుగూడేవారు. నారాయణమూర్తివలెనే తానూ వారిని కసరకుండా బొమ్మలు చూపించి అందులో పాటలుపాడీ, కథలు చదివీ, పిల్లలనందరినీ సంతోషపెట్టేదిసీత. ఆవీథి పిల్లలకందరికీ సీతఅంటే ఎంతో ఇష్టము. ఎప్పుడూ ఎవరో ఒకపిల్లో, పిల్లాడో సీత యింటికడ ఉంటూనే ఉండేవారు. నారాయణమూర్తి తనప్రయత్నం సఫలమైందని సంతోషించి ఎన్నో పుస్తకాలు రోజూ తెచ్చి యింట్లో బల్లమీద పడేస్తూ ఉండేవాడు. తీరికచేసుకొని సీత అన్నిటినీ శ్రద్ధతో చదివేది. నారాయమూర్తిమీదిగౌరవంచేత ఆపుస్తకాలిచ్చినవాళ్లుకూడా తొందరగా ఇయ్యమని అడిగేవారుకాదు.

సీత సంతోషాన్ని అనుసరించి తెనుగుభాషా, తెనుగుదేశమూ, తెనుగువారినీగురించి చెప్పినవ్విస్తూ ఉండేవాడు నారాయణమూర్తి. అనుదినమూ భగవద్గీతలో ఓపిక ఉన్నన్ని శ్లోకాలు కంఠతావచ్చేటట్లు చదివించేవాడు.

ఇంతకూ సీత యెంతచదువుకున్నా నారాయణమూర్తి రాటము వడుకుతూ ఉండేటప్పుడు చిరునవ్వుతో వచ్చి ఆయనదగ్గరకూర్చుని "ఏమైనా చెప్పండీ" అనడంమానలేదు.

# 3

## చెలికత్తెలు

లక్ష్మికి వయసువచ్చుకొలఁదిని బుద్ధి, ప్రభావముకూడ హెచ్చ దొడఁగెను. ఆమె పదమూఁడవయేట ఒకనాఁడు తన బుద్ధిసూక్ష్మతనెట్లు ప్రకటించెనో ఇట వ్రాయకుండనుండఁజాలను.

ఒకనాఁటి సాయంకాలము రాధ, శ్యామ, సమేవ, చంప, రామప్రియ, సావిత్రి, సరయు, శ్రీగంగ, యమునా, భాగీరథీ మొదలగు చెలికత్తెలు లక్ష్మి యింటికివచ్చిరి. ఆగ్రామములోని బాలికలందరియెడ లక్ష్మికి స్నేహము. అందరామెను దమ సహోదరికివలెనే భావించుచుందురు. వారందరు లక్ష్మికడఁ గూర్చుండి, రామాయణమో మఱి ఏదేని సద్గ్రంథమో చదువుచుందురు; బట్టలుకుట్టుచుందురు; ఊలల్లికల నల్లుచుందురు; లేదా మరి యట్టిది యేదేనిచేయుచు సరససల్లాపము లాడికొనుచుందురు. ఆయూరిలో నొక బాలికాపాఠశాలయున్నదని మొదటనే చెప్పితిమి. మొదటిలో నాపాఠశాలకు నంతగ బాలికల నంపువారు కారు. కాని లక్ష్మివంటి బాలికలు నల్గురైదుగురు విద్యావతులై యాపాఠశాల గౌరవము నిలువబెట్టినందున క్రమముగ గ్రామవాసులలో నుత్సాహము కలిగి తమ పిల్లలను పాఠశాలకుఁబంప మొదలిడిరి. ఇతర గ్రామములందలి పిల్లలకన్న నీయూరియందలి బాలికలు పనిపాటలలోనేమి, చదువులోనేమి చుఱుకైనవారని పరిగణింపబడఁ జొచ్చిరి.

ఈ దినమున నిరుగుపొరుగింటి బాలికలందరును లక్ష్మియింటిలోఁజేరి సంతోషముతోఁ గాలముగడుపుచుండిరి. లక్ష్మి నలుదెసలఁజూచుచు వారికిఁగావలయువానినన్నిఁటిని దాసమకూర్చుచుండెను. ఆపిల్లలు నారీనవరత్నమాల చదువుటకు ప్రారంభించిరి. నాల్గుపుటలగుసరికిఁ దనవిద్య ప్రకటించుకొనుటకు "నే నీనారీరత్నమాలనంతయుఁ జదివితి"నని శ్యామయనెను. భాగీరథి తన తాతగారింట నాటకముకట్టగా నందులోఁ బార్వతీవివాహముఁజూచి వచ్చితినని చెప్పి యిఁక నాప్రసంగములోనికి దిగెను. ఈ విధముగఁ బుస్తకము చదువుట యాగిపోయెను.

అంత లక్ష్మి "మంచిదే. అయిన సీత, సావిత్రి, శకుంతల, పార్వతి వీరలలోఁ బాతివ్రత్యమున నెవ్వరెక్కుడో చెప్పుఁడు?" అని వారల ప్రశ్నించెను.

శ్యామ—ఇందులో నెక్కువతక్కువ లేమిటి? వీరందరును దేవతలు—అందఱును బతివ్రతలే!

లక్ష్మి—అయిన వారలలో నంతర మేమియును లేదా? మంచిచెడ్డ లన్నిటికి నుండును. విలువగల సువర్ణమునందు మాత్రము మంచి, చెడ్డలు లేవా? కొంత బంగారము మేలిమి, గొంత జబ్బుగను నుండదా?

సమేవ—అంతరము లేకేమి? వీరలలో సీతాదేవి అందఱను మించిన పతివ్రత. అగ్నియందు దుమికినను ఆమె భస్మము కాలేదు. ఆమె మాట యన్నంతనే పృథ్వీదేవి బ్రద్దలై యామెను దనలోనికి వచ్చునట్లుచేసెను.

లక్ష్మి—అవును. సీత పతివ్రతయగుటలో సందేహమేమియును లేదు. అయినను ఆమె యొకపొరబాటు గావించెను. రామచంద్రునిపై గోపించి పృథ్విలోఁజొచ్చెను. దీనివలన రామచంద్రున కెంత మనఃక్లేశము గల్గియుండును? భర్తమాట పాటింపకుండనుండఁజనదు. అతని దుఃఖితునిఁజేయుట సతీధర్మమును గాదు.

ఈ మాటవిని రామప్రియ తీర్పుఁజెప్ప నారంభించెను. "సరే. కాని అక్కా! పాపము. సీత యెంతని సహింపగలదు? భర్త రావణుని యింటినుండి తీసుకొనివచ్చి నిప్పులలోఁబడవేసి యొకసారి పరీక్షించెను. మరల లోకుల ప్రసంగము లాలకించి ఆమె నడవుల వెడలనడఁచెను. ఇంకను బరీక్షయా? ఇంత వెన్నాడిన పాప మాయబల యెంతనిసహింపఁగలదు?"

లక్ష్మి—భర్త స్త్రీకి గురువు, దైవము. ఆతఁడు దుఃఖపెట్టనిమ్ము సుఖపెట్టనిమ్ము ఆతనియెడ భక్తి చూపుచుండుట స్త్రీధర్మము. భర్త దుఃఖపెట్టెనని స్త్రీ యాతనిని దుఃఖింపఁజేయుట తగునా? అగుచో నింక పతిభక్తియేమి?

శ్యామ—(నవ్వి) సరే; సీతమాట నీవొప్పుకొనవు. సావిత్రివిషయములో నేమందువు? ఏమి చెప్పుదువో చెప్పనే; లక్ష్మి! వినుము.

లక్ష్మి—సావిత్రి పతిభక్తివంటి పతిభక్తి యరుదే కాని యామె యొకవిషయములోఁ దప్పుచేసెను. కావుననే దానిఫలమామె యనుభవించెను.

రామప్రియ—అక్కా! సావిత్రి పాపకార్యమేమి యాచరించెను? ఆఫలమామె యెట్లనుభవించెను?

లక్ష్మి—దోషముకాదా? సావిత్రి రాజకుమారి. ఆమె తలిదండ్రుల యధీనమందున్నతటి వనములకేగి తన్ను సత్యవంతున కిచ్చికొనలేదా? దానఁ దలిదండ్రుల కవమానముకాదా? ఈ పాపముచే నామె తనభర్త మృతిఁ జూడవలసివచ్చెను. తన నిరుపమ పతివ్రతా ప్రభావముచే భర్తను బ్రతికించెను. అయినను దనభర్త మరణయాతన ననుభవించుట యామె చూడవలసివచ్చెఁగదా? పతివ్రతకు భర్తచావు చూచుటకంటె దుఃఖముండునా? ముందు తన యిచ్చవచ్చినట్లాచరించెను. పిదప నాదుఃఖమనుభవించెను. శకుంతల విషయమాలోచింపుము—దుష్యంతుంగాంచి వనమందాతనివరించె. ఆసమయమున జనకుఁడగు కణ్వముని మాటయే యామె బొత్తుగ మఱచెను. తుదకామె యెన్నికష్టము లనుభవించెను? సోదరీ! మన తలిదండ్రుల నవమానించి మనంత మనమే యితరుల సొమ్మగుట మిక్కిలి చెడ్డపనియని నాయభిప్రాయము. తలిదండ్రులాలోచించి యెవరికిఁగన్యాదానముచేసిన వారినే మనము దేవతలఁగ భావించి సేవఁజేయవలయును. ఇందుచేతనే పార్వతి సతియను పేరిటఁ బరగుటకుఁగారణము. ఆమె రాజకుమారిక. అయినను దలిదండ్రులు బిచ్చగాడగు మహాదేవునితో నామెకుఁ బెండ్లిచేసిరి. పార్వతి దానికి సంతసించెను. శక్తివంచనలేక యాతనికి బరిచర్యలు చేయుచుండెను. స్వామినింద సహింపఁజాలక ప్రాణత్యాగ మొనర్చిన పరమపతివ్రతగదా పార్వతి!

చంప కొంచెము చంచలస్వభావ. ఈమాటలు సరిగ నామెతల కెక్కలేదు. లక్ష్మిమాటల కడ్డమువచ్చి ఆమె "సరే కాని,లక్ష్మి! ఈ మాటలకేమి? నీవు అత్తవారింటికి వెళ్లుదువుగదా! అప్పుడు మేము నిజముగా నీకుఁజక్షిప్తియుండుదుమో లేదో చెప్పుము?" అనియెను.

శ్యామఅందఱికన్నను సంగతిసందర్భము లెఱిఁగినది. చంపమాటల కామె కొంచెము దుఃఖితయై "భగవంతుఁడు త్వరలో అట్టిదినమును బ్రసాదింపఁగలడు. అప్పుడు మనల నామె మఱచిపోవచ్చును. కక్కగారు లక్ష్మివివాహచింతలోఁబడియున్నారు. ఇంకను సంబంధ మెక్కడను స్థిరముకాలేదు. కక్కగారి చేతిలో సొమ్ములేదు. ఈవ్యయమెట్లుభరింపకలరో, లక్ష్మినొసట నేమి వ్రాసియున్నదో కదా!" అనెను.

రాధ—వినలేదఁటే! లక్ష్మి వివాహము స్థిరమైనది. లక్ష్మితండ్రిగారు నిన్న మాయింటికివచ్చి మానాన్నగారి సలహాతీసికొనిరి. మానాన్నగారాయనకు నయిదువందలరూపాయల నప్పునిచ్చెదరు. నాదగ్గిరనున్న నగలుతీసికొని వెళ్లి ప్రస్తుతము కార్యము గానిత్తురు. ఆవెనుకఁగ్రమముగ క్రొత్తనగలు చేయించి పెట్టెదరు. దేవీపురములో సంబంధము స్థిరమైనది. పిల్లవాఁడుకూడ లక్ష్మికీడగినవాఁడు. చూచుటకుఁగూడ బాగుండును.

ఈమాటల విని లక్ష్మి మాటాడకూరకున్నది. చెలికత్తెలెవరికేదోచినట్లుగ వారు మాటలాడుచు లక్ష్మిని హేళనచేయ నారంభించిరి. లక్ష్మి వారి నవ్వులాటలనాపి "శ్యామా! ఏమే? రూపాయలులేకన్న నెవ్వరికినిఁ బెండ్లియేకాఁజాలదా?" అనెను.

శ్యామ—కాఁగలదు. కాని మంచిచోటఁబడుట, మంచివరుఁడు లభించుటమాత్రము కష్టము.

లక్ష్మి—రూపికలు లేనివాడు తనకుమార్తెను ధనికుల కియ్యకపోయిన హానియేమి? పేదవానికూతురు బీదవాని యింటఁబడిన నష్టమేమి?

శ్యామ—ఈమాటలేమిటే? లక్ష్మి!

లక్ష్మి యాపుకొనలేకపోయెను. కన్నులనీరు కార్చెను. వెంటనే కన్నీటిని తుడుచుకొని "సోదరీ! నీవు మానాన్నతో నిన్నిరూపాయల నప్పుతీసికొనవద్దని చెప్పుము. ఈయప్పు తీర్చగలనని నమ్మకమేమి?" అనెను.

శ్యామ—ఆయన ఏమి చేయగలడు? కుమార్తెను వివాహము చేయకుండ నుండజాలఁడు.

లక్ష్మి—నగల ప్రసంగములేని గవ్వఖర్చుకాని తావు చూడుమని చెప్పుము. రూపాయల నప్పుచేసి తుదకు సందుగొందులఁ దిరిగి ముష్టియెత్తుకొనుటకంటె సామాన్యసంబంధము జేసికొనుట మేలుగదా?

ఈమాటలతో సంజెపడినది. ఆనాటికి మన బాలికలందరు సభచాలించి యెవరిండ్లకు వారేగిరి. లక్ష్మియు నాలోచించుచుఁ దనపనులలో మునిఁగెను.

## ౪

## పని: పాటలు

వేసవికాలమందు ఆగ్రామములో మంచినీటికిఁ జాలనిబ్బందికలుగుచుండును. చాలదూరమునందున్న నూతినుండిగాని చెరువులోనుండిగాని మంచినీరు తెచ్చుకొనవలసివచ్చుచుండును. వైశాఖజ్యేష్ఠమాసములందు తఱచు నూతులుకూడ నెండిపోవుచుండును. లేదేని నీటినిండ ఆకులురాలి కుళ్లి త్రాగుటకుఁ బనికిరాకుండును. ఆదినములలో మనవారిస్థితియు నంతియే. గ్రామమునకుఁజాలదూరమందు త్రాగుటకు వీలగు మంచినీటి నుయ్యి యొక్కటియేకలదు.

నిత్యము లక్ష్మి ఆ నూతినుండి మంచినీరు తెచ్చుచుండును. లక్ష్మికి పని కఠినమని దీక్షితులొకపేదరాలికి నెలకింతని ఏర్పాటుచేసి నీరు తెప్పింపఁజూచెను. లక్ష్మి యందు కొప్పుకొనలేదు. తన తండ్రియు బీదవాఁడని ఎంచి లక్ష్మి ప్రతిదినము రెండుపూటల స్వయముగ నితరకాంతలతో నూతికేగి నీరుతోడి తెచ్చుచుండును. పట్టణపుఁ బూబోండ్లవలె లక్ష్మి సుకుమారియై గొప్పయింటి ఆడుపడుచైయైన నీపని కవసరము లేకుండెడిది. ఇట్టి మాటయే తలఁపకుండెడిది. పల్లెటూరి పడుచు, బీదలకడుపునఁబుట్టినది. అందుచేఁ బసితనమునుండియుఁ బనులన్నియుఁ దనచేతితోఁ దానేచేయుట నేర్చుకొన్నది. చిన్నతనమునందే తల్లి కెన్నియో పనులుచేసి సాయపడుచుండెడిది. ఈవయసున సంసారభారము విధివశమున లక్ష్మి భుజస్కంధమునఁబడినది. మొదటనుండియు అలవాటుపడియుండినదగుటచే గృహకార్యనిర్వహణమునందుఁ గడుఁ జతురయైనది. పని చేయుటకు వెనుదీయని బాలికకు శరీరమందొకవిధమైన బలము కల్గును. లక్ష్మి చాలఁ జక్కనిది. కోమల గాత్రముగలది. అయినను దుఃఖమును సహించుటయందుగాని, పాటుపడుటయందుగాని అణుమాత్రము జంకదు.

నేఁడు గాంచుఁడు. లక్ష్మి భుజమున నొకబిందెనుంచుకొని నెమ్మదిగనడచివచ్చుచున్నది. ఆమెముందు ఆరేండ్లప్రాయముగల తమ్ముఁడు గణేశు పరుగిడుచున్నాఁడు. అతఁడు త్రోవ కిరుప్రక్కలనున్న మొక్కలను బువ్వులను ద్రుంపుచుండ, అక్కగారు వద్దనివారించి బెదరించుచున్నది.

వేసవికాలము. ఎండ తీవ్రమగుచున్నది. ఆయెండలో నిండుబిందె భుజమున నుంచుకొని సుకుమారి యగు నా కన్య వచ్చుచుండ 'వెన్నబొమ్మ కరిగిపోవుచుండెనా' యన్నట్లు చెమటబొట్లు రాలుచుండెను. ఆమె మోమునమాత్ర మలసటఁజెందిన లక్షణమే కన్పట్టుటలేదు. కార్యనిమగ్నులగువారికి నలసటదోఁచునా?

త్రోవలో నొక ఇరుగుపొరుగు ముసలమ్మ ఈమెను చూచినది. లక్ష్మి స్వభావమును, ఆమె పడు కష్టములనుగాంచిన ఆ గ్రామవాసులందఱకును నీమెయెడ నవ్యాజప్రేమ; బిందె భుజమున మోపికొని స్వేద బిందువులచే స్నానముచేయుచువచ్చుచున్న లక్ష్మిని గాంచి ఆ వృద్ధస్త్రీ కరుణార్ద్రహృదయముతో "ఆహా! లక్ష్మీ! ఇంత పెద్దబిందె మోసికొని ఇంతదూరము నీటికై ఎందుకు వచ్చితివమ్మా? నీవెంత పెద్దదానవే? ఇంత బిందె నెత్తికొనివచ్చుట నీకు తగినపనియటే! ఏమే! ఆబరువునకెట్లు వంగినడచుచుంటివో కనుము? అయ్యో! రామచరణదీక్షితు లెంతకఠినుఁడే; ముక్కుపచ్చలారని ముద్దుకూఁతునిచే నీళ్లబిందెల మోయించుచున్నాఁడు! నాల్గుడబ్బులు పారవెసిన నెవ్వరైనఁ దెత్తురుగదా!" అనియెను.

ఈ మాటలు విని లక్ష్మి చాల సిగ్గుపడినది. బిందెతో నిల్చి "అమ్మా! నాన్న యశోదమ్మతో నీళ్లు తెచ్చిపోయుచుండమని చెప్పినారు కాని నేనేవద్దంటిని. ఎక్కడనుండి తెచ్చిపోయునో! అదీగాక పరాయ

వారు తెచ్చిపోసిన నీరు త్రాగుట నాకంతమంచిదిగ తోఁచదు. ఇంతపని కితరులెందుకు? నే నింతకన్న పెద్ద బిందెల యెత్తితేఁగలను. అమ్మ నా కీపనులన్నియును ముందుగనే నేర్పినది. ఏది ఎటులున్నను, ఈ పనులన్నియు నేను జేయవలసియుండుననియే కాఁబోలు మాఅమ్మ వాటినన్నిఁటిని నాకు నేర్పినది" అనియెను.

లక్ష్మి కన్నులనీరు క్రమ్మెను. ఆమె దుఃఖముచూచి, ఆమె స్థితిగాంచి, ఆవృద్ధురాలుకూడ శోకించి "పద, లక్ష్మీ! కొంతదూరము నేను తీసికొనివత్తును. నడువుము" అని లక్ష్మిభుజమునుండి బిందెతీసి తానెత్తికొని నడచుటకారంభించెను. లక్ష్మి యెంత వద్దని బ్రతిమాలినను బిందెనియ్యక ఆమె ఇంటి మ్రుంగిలివఱకుఁ దెచ్చెను. అంత లక్ష్మి బిందెఁ దీసికొని పనిపాటలసంగతి ఆలోచించుచు లోనికి వెళ్లెను.

ఇంటి వసారాలో రామచరణదీక్షితులు కూర్చుండియుండెను. అతనిశరీరమంతయు నిశ్చలమైయున్నది. ఫాలభాగమున శోకదుఃఖములు తొంగిచూచుచున్నవి. కడకంట నశ్రుబిందువులగుపడుచున్నవి. దేహమంతయు భయకంపితమైయున్నట్లు తోఁచుచున్నది. తండ్రి నెన్నఁడు లక్ష్మి ఇట్టి స్థితిలోఁ జూచియుండలేదు. దీక్షితులకు నడిమివయసునందే భార్యావియోగము ఘటిల్లెను. ఇంటిలో వృద్ధులగు నితర స్త్రీలెవ్వరును లేకుంటచే నాతఁడు కన్నులార తన సంతానములకష్టముల గాంచవలసివచ్చెను; ఐనను నేటికివలె ఆతఁడెన్నఁడు శోకగ్రస్తుఁడైనట్లులేదు. హృదయమునం దాభీషణశోకాగ్ని ప్రజ్వరిలుచుండఁబోలు. కాని ఆతఁడెన్నడీరీతి దానిఁ బయలుపడనీయలేదు. తల్లిలేని తనపుత్రికను, బుత్రుని మఱపించుటకుగాను సదా నవ్వుమొగముతో నుండువాఁడు. నేఁడీ దురవస్థ ఏల? ఇట్టి అసమయమున నింటికి వచ్చుటేల? బట్టలైనఁ దీయలేదే? నేలపై మట్టిముద్దవలెఁ జదికిలబడెనే? సమీపమునఁ దములపాకులడబ్బీ పడియుండెను. దీక్షితులకున్న వ్యసనము కారాకిల్లి వేయుట. నేఁడు దానిమీఁదఁగూడ దృష్టిలేదు. గణేశదత్తుడు "నాన్నా! నాన్నా!" అని పిల్చి ఒక్కగంతువేసి తండ్రిమీఁదఁబడెను. వాత్సల్యహృదయుఁడగు తండ్రి కుమారుని దగ్గఱగఁ దీసికొనకుండుట అటుండనిచ్చి నేఁడు చేతితో దనముద్దులకొడుకును ద్రోసివేసి "పో! పో! నన్ను విసిగింపకుము" అనియెను.

ఇది గాంచి లక్ష్మి కంపించెను. నేడవశ్యముగా నేదే ననర్థము వాటిల్లియుండనోపునని ఆపిల్ల తలఁచెను. తండ్రి యెదుటనుండి నింటిలోనికిఁబోవుటకుగూడ జంకి వెనుకపాటుగ లోనకుఁబోయి బిందె క్రిందకు దింపి కొంచెమునేపటివరకు నేమో ఆలోచించుచు వంటింటిలోననే నిల్చెను. పిమ్మట భయపడుచు, భయపడుచుఁ దండ్రియొద్దకుఁబోయి నెమ్మదిగ "నాన్నా! ఎంతసేపైనది వచ్చి? కాళ్లు కడుగుకొనలేదా? నీళ్లు తెత్తునా?" అని చెంబుతీసుకుని నీళ్లు తెచ్చుటకు లోపలికి వెళ్లెను.

దీక్షితులు ఒక పెద్దనిట్టూర్పువుచ్చెను. ఆ నిట్టూర్పున కమాయికురాలగు నాకన్య నిర్ఘాంతపడి కట్టెబొమ్మకువలె నిశ్చేష్టయై నిల్చిపోయెను. కనురెప్పకూడ వాలలేదు. దీక్షితులు "లక్ష్మీ! లక్ష్మీ! నాకేమియుఁ దక్కఱలేదు. ఇక నాకిట్టి సేవలు చేయకుము. నేనునీకు దండ్రినిగాను" అనెను. ఆతండ్రి కన్నులనుండి కన్నీరు కాల్వలుగట్టెను. లక్ష్మి కన్నులనుండియు బాష్పవారి వెలువడెను. భయముచే నాచిన్నారిబిడ్డ గుండెలు దడదడఁ గొట్టుకొనుచుండెను. 'అయ్యో! కుఱ్ఱతనముచే నేనేదేని మహాపరాధము చేయలేదుగదా? లేకున్న మానాన్నగారి కింతదుఃఖమేలఁ గల్గెను?' అనుకొని నీరుతెచ్చుటలోఁ జాలయాలస్యమైనదియని శంకించి, "ఏమి సేతు, గణేశుఁడెంతవద్దని నేను వారించినను వినక, త్రోవపొడుగునను మొక్కలఁద్రుంపుచు నాలస్యముచేసినాఁడు. అందుచే నింటికివచ్చుట ఆలస్యమైనది." అని చెప్పినది.

తండ్రి గట్టిగ "ఓసీ! నిర్భాగ్యురాలా! నన్నింకను ఎందుకు బాధింతువు? నీ విట్టి అమాయికురాలవును, ఇంత మంచిదానవుగాకున్న నీ జనకుఁడింత దుఃఖితుఁడు కాకుండునేమో? సామాన్యపుఁబిల్లలవలె నీవును దుర్మతివి, అల్లరిదానవునయిన నా కీహృదయజ్వాల లేకుండెడిదేమో? మరియే అల్పనిగృహమందైన జన్మించియుండినచో నీవింతకంటె శతగుణముల సుఖివై యుండెడిదానవేమో? నేనును నిశ్చింతుడనై యుండెడివాడను. నాపురాకృతపాపమూలమున గదా నీకిట్టి కష్టములు? నిన్ను ప్రాణములకన్న నెక్కువగ ప్రేమించుచుండెడి నీ తల్లి వీనినన్నిఁటి నెఱిఁగి కాబోలు స్వర్గస్థురాలైనది. ఆమె పుణ్యాత్మ. ఈ దుఃఖములఁ గాంచ నామెకేల? నేను మహాపాతకుఁడను. ఇదంతయు నా నొసటివ్రాఁత."

లక్ష్మి మాటలేక నిల్చిపోయెను. గాలిపాటునఁగదలు కదళీపత్రమువలె వడఁకుచుండెను. ఆమె యేమనఁగలదు? ఏ విధముగఁ దండ్రి నోదార్పఁగలదు? అమాయికురాలగు నాకన్య కేయుపాయమును దోఁచుట లేదు. నిశ్చేష్టయై ప్రతిమవలె నిల్చి కన్నీరు కార్చుచుండెను. ఇదంతయు నాలకించుచు గణేశదత్తుఁడుకూడఁ గదలికలేక నిల్చిపోయెను. కాని దీక్షితుని హృదయవేదన పొంగి పొరలుచుండెను. "ఈ లోకమున ధర్మమునకుఁదగు ఫలము దొరకదు. సంతానమునకుఁ బితృసేవకన్న మించిన ధర్మము మఱొకటి లేదే? మా లక్ష్మివలె పితృసేవాభక్తిపరాయణులగు పిల్లలుకలరే? ఇట్టి చిన్నవయసులోననే తండ్రిసుఖముకై పెద్దవారికన్నను బాటుపడుచున్న తనయ ఏ తండ్రికైననుండునా? ఒకవేళనుండుటయే తటస్థించిన నామె మా లక్ష్మివలె నిర్భాగ్యురాలు కావలెను. ఈ జగత్తున ధర్మమునకుఁ బరిణామము దుఃఖమే. ఈ గుణము లెవరికి కావలెను? నేనీ సంగతి పూర్తిగ తెలిసికొంటిని" అని దీక్షితులనుకొనఁజొచ్చెను.

లక్ష్మి ఎంతయో ప్రయత్నమున ధైర్యము తెచ్చుకొని "ఏమి? నాన్నా! ఏమిజరిగెను?" అని ప్రశ్నించెను.

దీక్షితులు:—జరుగునదేమి? అట్లయిన వినుము. నీతోడనే చెప్పెదను. నావిచారము చెప్పుటకు ఈ ప్రపంచమున నీవుతప్ప నాకెవరుగలరు? నేటికి మూడుసంవత్సరములనుండి మంచి కుఱ్ఱవానికై వెదకుచుంటిని. మీతల్లి ముందుగనే చనిపోయినది. నాయింట నీకొక అరనిముసమైన విశ్రాంతిగాని, సుఖముగాని లేదుకదా! చదువుకొన్నవానికి నెవ్వనికైననిచ్చి నిన్ను వివాహముచేసిన సుఖింతువుకదాయని ఆలోచించితిని. గణేశుఁడు మగపిల్లవాఁడు. వాని కీకష్టములు కలకాలముండునవి కావు. నాకు సాధ్యమైనంతవరకు మంచిచోట పెండ్లి చేయవలెనని ఎంచి నేనెన్నెన్నితావులకుఁ దిరిగితినో ఆ పరమాత్మునకే ఎఱుక. ఎందఱినో స్తుతించితిని. మఱి యెందఱి పాదములనో బట్టుకొంటిని. ఎవ్వరు నాదుఃఖము నష్టము చేసికొనలేదు. నాకు ప్రాణమిత్రులని భావించుకొన్నవారలే నాకిత్తఱి సహాయమొనర్చుటకు మొగముముడిచిరి. మన కులములోఁగూడ సొమ్మునిచ్చి వరుని గొనవలసి వచ్చుచున్నది. దినముల మహాత్మ్యము కాఁబోలు. ఎల్లవారిని ధనాశపట్టుకొని పీడించుచున్నది. దేవీపురములోనున్న శంకరరావును నేను చిన్నతనమునుండియు నెఱుఁగుదును. ఆతనికొడుకు నాకన్నివిధములనచ్చెను. ఆ శంకరరావు కాళ్లు గడుపుఁబట్టుకొని ఐదువందలరూపాయలకు సమ్మతిపఱచి ఈ సంబంధము స్థిరపరచుకొంటిని. మన ఊరిలోనున్న అంబికాప్రసాదు నాకు ఐదువందలరూపాయలిత్తునని వాగ్దానము చేసి ఇప్పుడు నా ఆశలన్నియు గంగపాలు సేయుచున్నాఁడు. ఐదువందలు నాదగ్గఱ లేవు. నీ ఇల్లువాకిలి అన్నియుఁదాకట్టుపెట్టి రెండువందలు తీసికొని వెళ్లమనుచున్నాఁడు. అదివిని నిరాశనొందితిని. మనసు ఏమియుబాగుండలేదు. నేను నమ్మినాతఁడే తుదకు నన్ను మోసగించెను. నాకిఁక నుపాయాంతరము లేదనియు, నీ కష్టముల కంతు లేదనియు నాకిపుడు తోఁచుచున్నది. మీ అమ్మ చనిపోవునపుడు 'మన లక్ష్మిని చూచుచుండుఁడు. దానిని మరచిపోకుఁడు' అని చెప్పిపోయినది.

లక్ష్మి ఇఁక వినలేదు. శోకముతోఁ బాటుసిగ్గు. లోనికిబోయి తములపాకులకు సున్నము రాస్తుకూర్చున్నది.

## ఆతిథ్యము

రామచరణదీక్షితున కాపదవెంట నాపదవచ్చి మీఁదఁబడుచుండెను. కన్యావివాహచింతతోఁ దిరుగుచుఁ బనిలోనికి సరిగ వెళ్లుటలేదు. అందుచే నాతని యజమానునకుఁ గోపమువచ్చి దీక్షితులును బనిలోనుండి తొలగించెను. ఈ చిన్నయుద్యోగము చేతిలోనుండుట చేతనే యేదో విధముగ నింతవరకుఁ బిల్లలఁ బోషించుకొనుచు వచ్చెను. ఆకస్మికముగ నౌకరీ చేతిలోనుండి పోవుటచే ప్రపంచమంతయు నాతనికంధకారమయముగఁ దోఁచుచుండెను. కూతునకుఁ బెండ్లియీడువచ్చినది. ఆచింతచేఁ బిచ్చివాఁడయ్యెను. ఉద్యోగమా తలవని తలంపుగఁ జేతిలోనుండి తప్పిపోయినది. కట్టెదుట గాఢాంధకారము. జీవితమార్గ మగమ్యముగఁ దోఁచుచున్నది. ఈ విచారముల మూలమున నాతనితల తిరుగఁదొడఁగెను.

కొద్దిదినములగుసరికి దారిద్ర్య మాతని చుట్టుముట్టినది. కర్చులకుఁగానియేనిఁ జేతలేదు. ఉద్యోగము లభించుఆశ కానవచ్చుటలేదు. ఇంటియొద్ద కుమార్తెయో వ్యక్తురాలు కానున్నది. ఆమెనువిడచి పనిపాటలకై

పరదేశములకెట్లేగఁగలఁడు? ఇంటియొద్ద నూఱకకూర్చున్న దురవస్థ పెరుగుచుగాని తఱుగదే! నెమ్మదిగ నాలోచించి యాతఁడొకనాఁడు లక్ష్మినిపిల్చి "అమ్మా! లక్ష్మీ! నేను నౌకరీకొఱకు పైకిపోయిన నీవును, తమ్ముఁడును నింటియొద్ద నొంటిగనుండఁగలరా? ఇల్లువదలి వెళ్లకున్నఁబని జరుగునట్లు లేదు" అనెను.

లక్ష్మి విషయమంతయు గ్రహించి గణేశదత్తును, దానును ఇంటిలో నొంటరిగనుండుట కంగీకరించి "దిక్కులేనివారల కానారాయణమూర్తియేదిక్కు. ఆతఁడే మమ్మురక్షించును. ఇఁక భయమేల? మన మెవ్వరికిని హానిసేయలేదే? మనకెవ్వరుహానిచేతురు?" అనుచుఁ దండ్రికి ధైర్యముగూర్చి పలికెను.

కుమార్తె పల్కులకుఁ దండ్రికి నుత్సాహము హెచ్చెను. పిల్లలకొకనెలకు వలయు కర్చునిచ్చి కాన్పూరునగరమునకు వెళ్లిపోయెను. వెళ్లునపుడు తనయింటి పొరుగుననున్న యొక ముసలియాపెతో రాత్రులువచ్చి లక్ష్మికి సహాయముగఁ బరుండుమనిచెప్పి పోయెను.

శ్రావణమాసము. చీకటిరాత్రి. దానికితోడు ఆకసము మేఘచ్ఛన్నమై కన్నుఁగానవచ్చుటలేదు. ఉండియుండి మెఱుపులు కనులుమిరుమిట్లుగొల్పునటుల మెఱయుచున్నవి. వానకుంభవృష్టిగఁ గురియనారంభించినది. ఉరుములధ్వనికి గుండియలవియుచున్నవి. వర్షప్రహోరు, మేఘముల ఘెళఘెళారావములుదక్క నేవియు వినవచ్చుటలేదు.

లక్ష్మి తమ్మునిప్రక్కలోఁబరుండి సాయమువచ్చిపరుండుచున్న ముసలమ్మతో నీమాటయు నామాటయు నాడుచున్నది. ఆముసలమ్మను లక్ష్మి 'అత్తా!' యని పిల్చుచుండును.

గణేశునకు నిద్రపట్టినది. రాత్రియొకజాముగడచినది. అయినను లక్ష్మికి నిద్రవచ్చుటలేదు. ఆమె యట్లెపరుండి యనేకవిషయముల నాలోచించుచుండెను. "తండ్రి యిల్లువిడచివెళ్లి నేఁటికి నెలదాటినది. ఇంతవరకాతనివద్దనుండి సమాచారమేమియునురాలేదు. ఆతఁడెక్కడనుండునో? ఎట్లుండునో? ఏమిచేయుచుండెనో? జబ్బేమియుచేయలేదకదా! అయ్యో! ఇట్టి భీకరనిశీథమున నెవ్వంపంచఁ దలదాఁచుకొనెనో? ఇంటిలోనికని యిచ్చిన సొమ్మంతయు వ్యయమైనది. అదిగాక యత్తదగ్గరఁగూడఁ గొంత యప్పయినది. ఇఁక ముందెట్లుగడచునో?" ఈమాటల నాలోచించుచు బరుంటచే నామెకు నిద్రవచ్చుటలేదు. మనస్సునకు చాంచల్యముగల్గినది. ఈచిత్తచాంచల్య మభివృద్ధియగుటగాంచి యత్తనుపిల్చి ఆమె "అత్తా! కథచెప్పవు. నాకు నిద్రవచ్చుటలేదు." అనెను. అత్త ఒక కథచెప్పుట కారంభించినది. లక్ష్మి వినుచున్నది.

ఇంతలో వానహోరునుఛేదించుకొని "ఈ యింట నెవరైననున్నారా?" అను ధ్వని బయటనుండి వినవచ్చెను.

లక్ష్మి కథనాపుమని అత్తకు చేసన్నఁజేసి పైధ్వనిని శ్రద్ధగవినుచుండెను. ఇంతలో మరల నెవ్వరో "లోన నెవ్వరునులేరా? మేము నేటిరాత్రి చిక్కులలోఁబడిపోయినాము. మా కిద్దరకు నిచ్చట నేఁటికిఁ దలదాచుకొనుటకుఁ దావుదొరకునా? అల్లరిచిల్లరవారము కాము. మంచికుటుంబములోనివారము" అని కేకలు వేసిరి.

లక్ష్మి వెంటనేలేచి "అత్తా! చూడుము. వీధిలో ఎవ్వరో కేకవేయుచున్నారు" అనియెను.

ఆముసలిది "పిచ్చిదానా! ఇట్టిరాత్రి ఎవ్వరని తలుపుతీయుట?" "వేటొకచోటికి బొమ్మనుము" అని కొంచెము చిరచిరలాడెను.

వీధిలోనుండి తిరుగ "ఎవరండీ! మేమిద్దరమున్నాము; ఈవర్షములో జిక్కుకొనిపోయినాము. మాకుఁ గొంచెము నిల్చుట కవకాశమిచ్చిన చాలమేలుచేసినవారగుదురు; తలఁదాఁచుకొననిచ్చినఁజాలును; మరేమియు నక్కరలేదు." అని స్పష్టముగ వినఁబడెను.

ఆముసలిది "ఈయింటిలో మగవారెవ్వరును లేరు; మీరింకొకచోటికి బొండు" అని కఠినముగ జవాబునిచ్చెను.

లక్ష్మికి నూఱకొన బుద్ధికాలేదు. త్వరితముగ దీపమును వెలిగించుకొని వెళ్లి వీధిగుమ్మము తెఱచెను. వసారాలో ఒక కంబళిపడవైచి లోనకుఁ దప్పుకొనెను. ఇదిగాంచి యాపథికులు కొంచెము ధైర్యము తెచ్చుకొని లోనకువచ్చి ఆకంబళిమీఁదఁ గూరుచుండిరి.

లక్ష్మి చేసినపని ఆముసలామెకేమియు నచ్చలేదు. తనలోఁదాను గొణుగుకొనఁజొచ్చెను. లక్ష్మి "అత్తా! ఏమిటనుచున్నావు? ఇట్టి దుస్సమయమునఁ బెద్దమనుష్యులకుఁ దావియ్యకుండనుండుట మంచిదా? మా నాన్న ఈనాటిరాత్రి ఆశ్రయమున కెవ్వరిగుమ్మము ముంగిట నిల్చి అఱచుచుండునో! అదికూడ ఆలోచింపుము" అని బోధించెను.

ఆముసలిది "ఏమి ధర్మాత్మురాలవైతివే! సరే ఇంట్లో నిల్చుటకవకాశమిచ్చితివి. మంచిదే. వాకీదినమంతయు మంచినీళ్లయినా త్రాగకుండనున్న వారికి భోజనమేమిపెట్టెదవో చూతును. ఇంట్లో గుప్పెడు మెతుకు లున్నవి; నీకు చల్దిఅన్నమునకే సరిపోవు; రేపు నీవుపవాసముండవలె" ననియెను.

లక్ష్మి "గట్టిగా మాటలాడకుము!" అని ఆవృద్ధస్త్రీతోఁ జెప్పి లోనకుఁబోయెను.

వసారాలోనున్న మార్గస్థులు వీరలమాటలాలించి వీరు కడుబీదవారని గ్రహించి వారిలోనొకరు రెండవ వానితో "మన కీదినము భోజనమక్కఱలేదు. వీరు మమ్ముల నాదరించి ఈ వర్షములో నాగుటకు స్థలము జూపిరి. అదియే పదివేలు" అని అనెను.

ఆముసలిది ఆవసారాలోనికివచ్చి వారలతో "అయ్యలారా! ఈయింటిలో మగవారెవ్వరును లేరు; ఈ యింటి యజమాని తనకుమార్తెను, మరియొక చిన్నకొడుకును దిక్కువిడచి ఉద్యోగము సంపాదించుకొనుటకు దేశాంతరము వెళ్లినాఁడు; ఈ పిల్లలిద్దఱు నీ యింటిలోనున్నారు; ఒంటరిగానుందురని రాత్రులువచ్చి నేను బండుకొనుచున్నాను" అనెను.

ఆ బాటసారులలో ఒకనికి ఇరువది ఇరువదిరెండేండ్లుండును; రెండవయాతఁడు నడిమివయసువాఁడు. వారిలో యువకుఁడు "మేమిచ్చటునరావలసినదికాదు: ఇచ్చటఅందరును స్త్రీలేయున్నారు. తప్పనిసరియైనది. ఈ వర్షపురాత్రి ఎక్కడను వెదకుచుఁబోలేకపోతిమి. సరే ఈ గృహయజమాని పేరెవ్వరు?" అని ప్రశ్నించెను.

ముసలిది:—రామచరణదీక్షితులు. నౌకరీసంపాదించుకొనుటకు దూరదేశము వెళ్లినాడు.

యువకుడు:—రామచరణ దీక్షితులను మేమెఱుఁగుదుము; ఆతఁడు మాకు బంధువు. ఇదొకమేలు.

లక్ష్మి అత్తను బిల్చి "అత్తా! వారిని భోజనముచేయుమని చెప్పుము. ఏమిచేయుమందురో అడుగుము. నీవొకసారి పెరటిదొడ్డిలోనికి నాకు సాయమురమ్ము. పొదున నొకఆనపపిందెకలదు; త్రుంపుకొనివచ్చినకూరకుఁ బనికివచ్చును" అనెను.

లక్ష్మి మాటలవిని ఆయువకుడు "భోజనమవసరములేదు; ఇక్కడ పరుండినఁజాలు. మాశ్రమ దూరమగు"నని పల్కెను.

లక్ష్మి ఆముసలియత్తవలన ఆ బాటసారుల పుట్టుపూర్వోత్తరముల నడిగించెను. వారి జన్మస్థానమచటికిఁ బదిక్రోసుల దూరమందున్న సువర్ణపురమనియు, ఆ యువకుని పేరు వింధ్యాప్రసాదనియు, రెండవయాతఁడు వాని బంధువనియు, ఇట్టిరాత్రివేళ వారలకుఁ బరమేశ్వరుఁడు లక్ష్మిగృహముఁజూపి తలదాచుకొనఁ జేసెనని యుఁదెలిసెను.

లక్ష్మి కాళ్లుకడుగుకొనుటకు చెంబుతో నీరుపంపి వారుభయులును భోజనముచేయకున్న తమకుఁజాల కష్టముగనుండుననియు, వంటకు వేఱుప్రయత్నమవసరములేదనియు అత్తచేఁ జెప్పించెను.

లక్ష్మి సౌశీల్యాదిగుణసంపత్తిని గాంచ మన పథికుల కమితానందముకల్గెను; ఆనడిమివయసు మనుజుఁడు ఆ ముసలిదానితో "నీవా అమ్మాయిని 'లక్ష్మి' అనికదా పిల్చితివి?" అని అడిగెను.

ముసలిది:—అవును. అన్నివిధముల ఆపిల్ల సార్థకనామ.

నడివయసువాఁడు:—మాకది కనఁబడుచునేయున్నది. సరే! మాకు దీక్షితునితో బాంధవ్యముకలదు. మీరింత పట్టుపట్టిన ఇఁకేమిచేయఁగలము? లక్ష్మిప్రసాదము స్వీకరింతుము.

లక్ష్మి కిదివిన్న సిగ్గును సంతోషమునుగూడఁ గల్గినది. వేవేగ వంటచేయుటకారంభించినది. ఆముసలిది దొడ్డిలోనుండి అనపకాయ తెచ్చినది. చిన్నవానితో వేగముగ శాకపాకముల సిద్ధముచేసి లక్ష్మి ఆకులలో ఉభయులకు వడ్డించినది. ఆఁకలిగొన్నవారి కేమిడినను అమృతప్రాయముగ నేయుండును. తెలివరు లిర్వురు నలసి యున్నారు; బాగుగ ఆకలిగొనియున్నారు. అయినను లక్ష్మి చేసిన వంటకమును మెచ్చుకొనకుండనుండ లేరైరి. ఆ యువకుడు "మామా! చూచితివా? నేనింటిలో ఆనపకాయ ముట్టను; ఈ ఆనపకాయకుఁ జిత్రమైన రుచి వచ్చినదేని? ఈ వయసున నీపిల్ల ఇంత గుణవతి ఎట్లాయెను? సౌశీల్యాదిసద్గుణసంపత్తికిఁదోడు వంట యెంత బాగుగఁజేసినది!" అనియెను.

మామ:—అవును. ఈ కన్య సాక్షాత్ లక్ష్మియే; భగవంతుఁడీమెను గలవారింటఁ బడ వేయుగాక!

వారిద్దరు భోజనములుచేసిన తరువాత లక్ష్మి వసారాలోపరుండిన జల్లుగొట్టి నిద్రపట్టకుండునని వార లకు ప్రక్కగదిలోఁ బడక నేర్పాటుచేసెను. ఇంటిలో మంచి మంచములేదు. గదిలో దుమ్ముతో బల్లయొకటి పడియుండెను. అది దులిపి దానిపై కంబళి పఱచి, మెత్తవేసి, పువ్వుల అల్లికలుగల అంచులదుప్పటి యొకటి దానిపైఁబరచెను. అందు మధ్యవయస్కుఁడగు నతిథి పడుకొనుటకుఁబోయి ఆముసలమ్మను "అవ్వా! ఈ పువ్వుల నెవ్వరల్లిరమ్మా? నేనిట్టి దుప్పటిని జూడలేదు" అని అడిగెను.

ముసలిది:—అమ్మాయికి అన్నియల్లికలును తెలియును. ఈ గ్రామములోని బాలికలంద ఱామెకడ నల్లికల నేర్చికొన నిత్యము వచ్చుచుందురు. లక్ష్మి సుగుణరాశి. కాని అదృష్టము మంచిదికాదు. ఇట్టి గుణవతి నొసట నా విధాత ఏమి వ్రాసెనో?

ఆ అతిథి లక్ష్మినిగూర్చి ఇంకను ప్రశ్నించి ఆమె తండ్రికడ ధనములేమిని; వారు పడుచున్న బాధలనుగూర్చి పూర్తిగ వినెను. వింధ్యాప్రసాదు విని మనసులో "ఇట్టి కన్య వివాహవిషయములో దుఃఖింపనేల? ఈ పిల్ల అడుగిడినచోట లక్ష్మి సదా వాసమేర్పరచుకొనదా?" అని అనుకొనెను.

ప్రొద్దుటనే లేచి మిఠాయి కొనుక్కొనుమని చెప్పి వింధ్యాప్రసాదు గణేశదత్తు చేతిలో రెండు రూకలను ఉంచెను.

గణేశా రూకల నక్కగారికి చూపెను. ఆమె నేత్రములు బాష్పపూరితములయ్యెను. నిర్భాగ్యుడగు గణేశు నెవ్వరేని ఆదరించిన లక్ష్మి నయనములు కృతజ్ఞతాశ్రుపూరితములగుట సహజమైనది. ముక్కు మొగ మెఱుఁగనివారినుండి రూప్యములగ్రహించుట మంచిదికాదని యెంచి గణేశదత్తునితో "తమ్ముఁడూ! నాన్న వచ్చిన నీకు రూపాయీల నిప్పింతును. వీనిని వారి కిచ్చివేయుము" అని చెప్పిపంపెను.

గణేశుఁడు అక్కగారి యాజ్ఞ మన్నించెను. అతఁడు వింధ్యాప్రసాద యొద్దకు బోయి "నాన్న నాకు రూపాయలఁ దెచ్చియిచ్చును. మీరు మీరూపాయలఁ దీసికొం"డని చెప్పెను.

వింధ్యాప్రసాదు నవ్వి "ఇచ్చినవి మఱలఁ బుచ్చుకొనరా"దనుచు తెలియనివానియొద్దనుండి రూప్యము లను గ్రహించుట భావ్యముకాదని లక్ష్మి తలంచెను. కాబోలునని ఆలోచించి మరల నాకుఱ్ఱవానితో "మేము పరాయివారముకామని మీ అక్కయ్యతోఁ జెప్పుము. మనమందరము గావలసినవారము. మీ నాన్నగారు మమ్ము బాగుగా నెఱుఁగుదురు. వారు వచ్చినతరువాత మరియొకసారివత్తుము" అనిచెప్పి ఆఅతిథులిర్వురును లక్ష్మిని ప్రశంసించుచు వెడలిపోయిరి.

సుగుణములప్రోవులగు లక్ష్మిని ఒక ధనవంతుడు ఎట్లు వివాహముచేసి కొనెనో; లక్ష్మి ప్రశంసాపాత్రముగ నెట్లు కాపురముదిద్దినదో తెలియగోరెదరా? పై మాసపు సంచిక పరికింపుడు.

# కీ. శే. అన్నపూర్ణాదేవి

శ్రీమతి బి. జ్ఞానాంబగారు

౧

ఖద్దరుధరియించి కాల్పుడీ పరదేశవస్త్రంబులనిన ప్రశస్తవీవు
అంటరానితనంబు మటుమాయమొనరింప నిరతంబు మదినెంచు నెలతవీవు
స్వారాజ్యమే స్త్రీలజన్మహక్కనిదెల్పి స్వాతంత్ర్యదీక్షకై సాగితీవు
బీదసాదలజూచి ప్రేమతో సర్వంబు ధారవోసినయట్టి దాత్రివీవు
విపులవిఖ్యాతిగాంచిన వెలదివీవు
సకలవిద్యలనేర్చిన చతురవీవు
నిన్నువినుతింప నేరీతి నేర్తుమమ్మ !
సకలసద్గుణపూర్ణ ! శ్రీయన్నపూర్ణ !

౨

ఓలేటి సీతారామమూర్తిగారు

ప్రవిమలమ్మగు దరహాసభాగ్యరేఖ
మోమునందు వెలుంగగా పూతచరిత
భరతమాతకు భక్తిసేవలనుసల్పి
తనువునొసఁగిన వనితావతంసమామె !
లలితకళాసుమంబులఁ బ్రీతితో సతతమ్ముఁదిరుగు మధుపమ్మైయైన
గంభీరభావనాకమనీయచంద్రికాతరళితహృదయపథంబుతోడ
వికచపుష్పంబులో విరిదేనియట్టులు పల్కుపల్కునను భావంబె బలయ
ఘనమగు నవలలు ప్రణుతప్రబంధముల్ రచియించుచుఁ బ్రజానురాగమంది
ఆంధ్రభాషాలలామ కత్యంతప్రీతి
సేవలను సల్పి యశమందు చెలియయామె ;
ఆంధ్రదేశాన జన్మించి నట్టివారి
కనిశము మరవఁదగనట్టి వనితయామె !

---

అక్టోబరుమాసపుసంచికలో మేముచేసిన ప్రార్థనమును మన్నించి ఆమాసము 6-వ తేదీని ఆంధ్రదేశము నందలి వివిధప్రాంతములందు కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగారి తృతీయవార్షికోత్సవమును నిర్వహించి ఆంధ్రసోదర సోదరీమణులు తమ ఉచితజ్ఞతను ప్రకటించినారు. ఏతత్సందర్భమున కవితాత్మగల ఆంధ్ర సోదరసోదరీమణులు కొందఱు అక్షరరూపమున ఆదివంగతురాలి దివ్యయశమును గానముచేసిరి. అందు మువ్వురరచనములనిచ్చో ప్రచురించుచున్నాము.

ఆంధ్రభూమాత తనకష్టపారఁగాంచి
ప్రేమతోఁ బెంచినట్టి పవిత్రురాలు
అతులగాంధీమహాత్ముఁడత్యంతప్రీతిఁ
దప్పకగొనియాడుచునుండు ధన్యురాలు.

శాంతరణావనిఁ రణముసల్పి దృఢంబుగదాస్యపంకమం
దెంతయుజ్ఞానహీనులయి యీదుచురోజుచునున్న యాంధ్రులన్
బంతమెలర్ప స్వేచ్ఛగొనివచ్చి సుఖోన్నతులన్ బొనర్పఁగా
నంతములేని కష్టములనందిన పావనమూర్తి ఆమెయే!

ప్రీతిధరియించు నగలు పరిత్యజించి
కట్టినదుకూలములనన్నిగాల్చివైచి
వడకినేసిన పరిశుభ్రవస్త్రములను
గట్టి దేశభక్తిని జాటుకాంతయామె!
తీయనైన వాక్కులను దేశీయసభల
భావములనెల్ల విప్పుచుఁ బఱచిచెప్పి
యాంగ్లజాతీయులగుణంబులన్ని తెలిపి
యాంధ్రులకు జ్ఞానమొసఁగినయమ్మ యామె!

పూర్ణిమాచంద్రచంద్రికాస్ఫురితకాంతిఁ
బోలు సద్యశోన్నతిఁ దనపుణ్యనామ
మాంధ్రజనహృత్ఫలకములయందుఁ జెక్కి
యవని వీడిన దివ్యలతాంగి యామె!
పూర్ణఁ బోలిన వీరకాంతలు
పుణ్యమాతకు భరతభూమికిఁ
బరగసంతస మొసఁగుసుతలని
యెఱుఁగు మీనాక్షీ!

## 3
## వేంకట శాళిదాస కవులు

[ భారతీయస్వాతంత్ర్యసస్యమును ఫలవంతముగఁ జేయుటకు హృదయరుధిరము ధారవోసిన వారలలో నీమె యగ్రగణ్య. దేశనాయకుఁడు, మహాత్ముఁడు, అహింసారిధచోదకుఁడు, శాంతిసమరనాయకుఁడు నగుగాంధి యీమెను దనకూఁతురుకన్న నెక్కుడుగ నాదరించినాఁడు. ఈమె దేశభక్తిభరిత; భాషాప్రవీణ; గ్రంథరచనాధురీణ. సౌరభసంపదల లోకమెల్లెడల వ్యాపింపఁజేయుచున్న యీకోమలపుష్పమును నిష్కరుణముగ విధి మొగ్గనాఁడె కోసివైచి స్వాతంత్ర్యోద్యానవాటికకుఁ దీరని లోపముఁగల్పించినాఁడు.]

ఈదేశమ్మొకనాఁడు మున్నెపుడొ కానీ యుజ్జ్వలౌన్నత్యసం
పాదిత్వమ్మున వెల్గిపోయెనట! ఆభాగ్యమ్ము నష్టింప నెం
తే దారిద్ర్యము నొందియున్నదికదా యీనాఁడు; నీవన్నపూ
ర్ణాదేవీ! జనియించినావు పునరౌన్నత్యాప్తికిందోడ్పడన్.

ఖేదాపాదకదాస్యవృత్తిజనితక్లేశార్తహిందూసవి
త్రీదృఙ్నిర్గళితోష్ణబాష్పకణికాబృందాపనోదక్రియన్

గాదే యిర్వదినాలుగేండ్లబ్రతుకున్ సాగించినా వన్నపూ
ర్ణాదేవీ ! భవదీయకీర్తిసుషమల్ ప్రాఁకన్ సమస్తావనిన్.
స్వాదుత్వమ్మున మార్దవమ్మునఁ బ్రశస్తమ్మైన నీయాంధ్రభా
షాదీప్యన్నవకావ్యకల్పనసుధాసారైకమాధుర్యమా
స్వాదింపన్ గలయిమ్మహాభరత దేశమ్మెల్ల నోయన్నపూ
ర్ణాదేవీ ! యొనరించుకొన్న తనపుణ్యశ్రీల మేలెట్టిదో.
గంగయొడ్డున నార్షకన్యకల్ పాడినసామగానములోని చల్లఁదనము
సాధాంతికములలో క్షత్రియవీరమాతలు వచించిన పోటుఁపలుకువాడి
రణరంగమందుఁ గారణజన్మలైన ధైర్యవతుల్ వచించు గర్జారవమ్ము
మృత్యుదేవతతోడఁ బ్రేమకై మానినుల్ కలహించి పలుకువాక్యములశక్తి

నీపలుకుపల్కునందు వన్నియలుచెంద
దేశకల్యాణభూషణార్థినివిగాఁగ
మాతృపాదసేవాసక్తి మాన్యశక్తి
నందఱకుఁదెల్పితివికాదె యన్నపూర్ణ!

సర్వసౌవర్ణభూషావితానంబు నర్పణచేసినావు స్వరాజ్యనిధికి
అన్యదేశీయవస్త్రానీకముల నగ్నిహోత్రంబునకుఁగానుక యొసఁగినావు
జాతీయవస్త్రప్రచారంబుఁగష్టించి సాగించినావు దీక్షానియుక్తి
నీజీవితమ్ము హిందూజగన్మాతృదేవీసేవకై ధారవోసినావు

భారతీయ సతీమణివారమునకు
మార్గదర్శినివై నేఁడు స్వర్గశోభఁ
గాంచివెలుఁగొందుచున్నావు గగనసీమ
నన్నపూర్ణాంబ! దేశరక్షావలంబ!

సౌదర్యంబుఁదలంచుచున్ భరతదేశక్షేమసౌభాగ్యర
క్షాదీక్షారతులైన సోదరులకున్ సాహాయ్యముంజేసి హిం
దూదార్గత్యమునెల్లఁబూర్ణముగ నున్మూలింపఁగానన్న పూ
ర్ణాదేవీ! నినుఁబోలుధీరలగు కాంతల్ వాంఛనీయల్ గదా!
ఆదర్శమ్ముగనీదుజీవితము నిత్యమున్ మదిన్ నిల్పి నీ
సాదృశ్యంబున భారతీయరమణీసంఘంబు పెంపొంది హిం
దూదేశోద్ధరణక్రియాభిరతచేతోవృత్తినోయన్నపూ
ర్ణాదేవీ! చరియించుఁగాక ఇటుపై రంహాస్స్వరాజ్యాప్తికిన్.

# తార

## సహదేవ సూర్యప్రకాశరావుగారు

మసకచీకటిరేకుల విసపుచాయ
మూలమూలల దిశల క్రమ్ముకొనుశీతు
కారుసంజ, మబ్బైనియుగానరాదు
మింట, కలగబారినది కాశ్మీరరోచి.

నీలినీడలదారుల చీలిచికొని
మినుకుమనక, చలింపక, మెరయబోక
జారుపోగమంచు తెలిచీరచాటునుండి
క్రిందుమీదుల చూడసాగినది తార.

పాడుకొనుచు పాడుకొనుచు పరవశాన
మూగవోయినదియువోలె, మోము వాంచి
రెప్పలార్పక, భవితవ్యదృశ్యమేదొ
కనులపడగ నిశ్చలసమాధిని మునింగె.

తీరుతీయమ్ము చిటుల ప్రతిదివసమ్ము
జీవితామలరాగ రంజితమొనర్చు
తిమిరగానకల్యాణోత్సవముల జొరక
కుంచుకొనియె నిశాదేవికూడ నేడు.

ఈవిసీలవియోగకుటీవిటంక
సీమనేకాంతపూజలో చిందువారు
కంటక్రొన్నీరు మున్నీరుగా స్రవించి
బాహిరిలునేమొ, ఇపుడు కల్పాంత మేమొ.

విస్మరింపజాలని రహోవిరహాకిరణ
తప్తశోకారుణాంధసుషుప్తగీతి
కురియుచున్నది మాలిన్యమిరియుకొరకొ
కనుకొనలజారిబడు నీలికలలకొరకొ.

ఆశలన్నియు నుసివాడి నాశమయిన
ఇంతతారుణ్య మింతయనంతతృష్ణ
ఇంతపరిశాంత మింతనైస్పృహ్యమెటుల
దాచికొన్నదో శీర్ణహృదంతరమున.

నిలుకడలులేని వలపునీడలమరంగు
బ్రదుకుదాచుకోదుర్వ్యథన్ బడిక్రుశించె
సౌహృదయజీవగీతిప్రసన్నబుద్ధి
తొలకరించునే విరియునే వలపుటాస.

కనలెడూర్పుల వంతెన గట్టుకొనుచు
తుదిమొదలులేనియూహాప్రతోళి దిరుగు
చెట్టులోజీవికన్ పదిలించుకొన్న
దీవెలికి లోకమునకు నైర్ఘృణ్యమేలొ.

ఎన్నడో మధురించిపోయినది బ్రదుకు
హృదిని రాపాడు బరువుకోరికల జాలి
మెసవి లోలోన గ్రుక్కిళ్లు మ్రింగుకొనుచు
పాడుకాబోలు కొసరుజీవంపుసొదల.

కంటికార్చిచ్చుమంటవే కవియదెసల
నెదనిరాశానిరుత్సాహమే గ్రసింప
కరుణగురిసెడు హాసవికాసమెల్ల
కూర్చునారజనీవిటకోరకముకు.

ఆయమాయికతారక నటులెనేను
చూడసాగితి, చుక్కలేచూపులేని
విజనశర్వరశ్యామికావేళలందు
సందడింపనిశిథిలతాజ్ఞాతసీమ.



'మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు'

Photo by: Messers M. Doss & Bros., Madras



గాయనులు

(బొంబాయి: ప్రొఫెసరు దేవధరువారి గానకళాశాలావిద్యార్థినులు)

# చంద్రావతి

శ్రీమతి గొట్టిపాటి విశ్వసుందరిగారు

## కష్టాంతకమగు నొక చిన్న కథ

‘అదేమిటి? కొమ్మలువిరుస్తున్నా’వన్నాడు జయచంద్రుడు. ‘మా తండ్రిగారికి శివపూజకై పుష్పములు కావలెను. ఈ మాలతీపుష్పము లందనందున కొమ్మలు విరుస్తున్నాను’ అన్నది ముద్దుగొల్పే కంఠస్వరముతో చంద్రావతి.

కృష్ణానది ఒడ్డున రెండు చిన్నపల్లెలున్నవి. ఆ రెండు చిన్నపల్లెలకుమధ్యను పొలములో ఒక పెద్దతోట ఉన్నది. ఆతోటలో చిన్న చెఱువుకూడావున్నది. అందు తామరలు కలువలు దట్టముగ అల్లుకొని నాచును మరుగుపరచినవి. ఆ సరోవరము లోతైనదిమాత్రముకాదు. అడుగును తొంగిచూస్తే తెల్లటిఇసుక మెరుస్తూ కనబడుతుంది. ఆతోటలో రకరకాల పువ్వులచెట్లు, తీగెలు ఉన్నవి. ఏకాలము ఏపూలు దొరుకుతవి.

ఆమెనుజూచి ఆతడున్ను పద్మములను, ఇందీవరములను చెఱువులోదిగి కోసి బయటికితెచ్చినాడు. తోటలో ఒకరికేసి ఒకరు చూచుకొంటూ ఎఱ్ఱగన్నేరుపువ్వులు కోసికొన్నారు. ఆనాటికి అట్టే మాటలు లేకుండ ఎవరి ఊరికి వారు వెళ్లిపోయినారు.

ఆనాటినుండి ఆ బాలుడు—ఆ బాలిక ఉదయము, సాయంకాలము ఆతోటలో కలుస్తుండేవారు. ఆమెకు అందని మాలతీవృక్షశాఖలను జయచంద్రుడు వంచేవాడు; ఆమె అంతట ఆకొమ్మల నందిపుచ్చుకొని పువ్వులు కోసుకొనేది. నిత్యము ఆమె తండ్రి శివపూజకు క్రమముదప్పకుండా పువ్వులు పట్టుకుపోతుండేది. వారి వయస్సుతోబాటు సంభాషణయొక్క తీరు మార్పునొందుచుండేది. ఆ బాలిక బడిలో వింతవింత దండలు గ్రుచ్చుట నేర్చుకొన్నది. కొన్నిదినములైనతర్వాత రోజూ ఆతోటలోనే ఒక క్రొత్తమాదిరి దండనుగ్రుచ్చి తన పనితనము నాతనికి జూపించవలెననేతలంపుతో ఆతని మెడలో వేసిపోతుండేది. వీరు నిత్యమూ ఈ విధముగా ఆడుకొంటున్నను ఎవ్వరు గమనించినారుకారు.

ఇట్లా కొంతకాలము గడిచేసరికి వాళ్లకు యౌవనమువచ్చింది. ఒకరోజున ఆతడు తన ఆవేదనను గోటితో వృక్షపత్రములమీద నిట్లు వ్రాసినాడు. “కొన్నిరోజులనుంచి నీ మృదులహస్తముతో వేస్తున్న శిరీష కుసుమదామములు నా ఆనందబాష్పములచే నానిపోవుచున్నవి; నయనానందముగనుండే ఆ ఉద్యానవనము నీవు వెళ్లిపోయినంతనే చీకటిముద్దగా ఉంటున్నది: పక్షుల కలకలధ్వనులు శ్రుతికటువుగనుంటున్నవి; ఆ సుందరతటాకము చూడ కంటగింపుగానుంటున్నది; మొదటసారి నిన్ను చూచినంతనే నాకు మంచిభావమంకురించింది. నానాటికి ఆభావ మున్నతశిఖరమెక్కినది; నేను ప్రేమోన్మాదినయినాను. నీ కిట్టి ప్రేమతలంపు కలిగెనో లేదో నాకు స్పష్టముగ తెలియదు; నీవు నన్ను పెండ్లిచేసుకొంటె నీజీవితవాంఛలు నెరవేర్చుటకు భక్తునివలె సేవచేస్తాను. ఇందులకు నీ వంగీకరింపకపోయిన మన శాశ్వతవియోగమున కంత్య...; ఇంతట మనస్నేహబంధము తెగిపోకుండుగాక. నిన్నను నీతో ఈవిషయమును జెప్పుటకు ప్రయత్నించేసరికి లజ్జా దేవత వాగ్దేవిని బంధించింది. కానీ ఈ లేఖలోనైనా సమగ్రముగా వ్రాయుటకు భావపరంపరల వేగమునకు తగినంతవడి చేతికి లేకపోయింది. చేయి వణికిపోతున్నది............”

ఉషఃకాలమున సూర్యుడు దిఙ్మండలమున హరిద్వర్ణముతో ప్రకాశిస్తున్నాడు. ఆతనికిరణములు కొన్ని పలుచని నీలమేఘములచాటున దాగుకొన్నందున ఆకాశము బంగారుకాంతులీస్తున్నది. ఉత్సాహముతో చంద్రావతి పూజాపుష్పములను కోస్తున్నది. ఉన్మత్తునివలె తహతహతో వేగముగావచ్చి ‘వృక్షశాఖలను చిందరవందరచేస్తూ వడివడిగ పువ్వులుకోస్తున్నావు; నాకోసము కొంచెముసేపు ఆగుము. తరువాత కోసికొన వచ్చును’ అన్నాడు జయచంద్రుడు.

‘పూవులుకోయుట పూర్తి అయింది; ప్రొద్దెక్కినది. నేడు ఆలస్యమయింది. పూజాపుష్పముల కెదురు చూస్తుంటాడు నాతండ్రి సెలవిమ్ము నేటికి’ అన్నది చంద్రావతి.

‘సరియే. శాశ్వతముగ’ అని వేఱుమాట మాట్లాడకుండ చేతిలోని లేఖను ఆమెమీద విసిరివేసి వెనుకకు తిరిగి చూడకుండ వెళ్లిపోయినాడు.

చంద్రావతి ఆలేఖను చీరకొంగున ముడివేసికొని ఇంటికివచ్చి కృష్ణాస్నానజలముతో తండ్రిగారి పూజా గృహమును కడిగి పూజాపరికరములను వడివడిగ అమర్చి ఏకాంతముగ గూర్చుండి ఆతురతతోటిన్నీ భక్తిప్రేమలతోటిన్నీ జయచంద్రుని లేఖను ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు చదివింది. కళ్లవెంట నీళ్లు తిరిగినవి. ఏమి వ్రాయుటకు తోచిందికాదు. ఏకైకపుత్రికయగు తనకు సౌఖ్యమబ్బేటట్లు కులశీలరూపగుణములుగల వరుడు లభింపవలెనని ఇష్టదేవుని తండ్రి ప్రార్థించుట ఆమెకు తెలుసును.

‘ఆతనితో తిరుగుట, పూవులు కోయుట, కబుర్లు చెప్పుకొనుట ఆనందముగనుండేది; సంతృప్తికొల్పేది. వేఱు తలంపులు అప్పటిలో నాకుగాని ఆతనికిగాని కలిగేవికావు. నేడు యౌవనముతోపాటు భావములు మారినవి. పూర్వప్రేమలు కలిగినవి. ఈ విషయమై నాతండ్రిగారియెదుట మాట్లాడుటకు నాకు ధైర్యము స్వాతంత్ర్యము ఎక్కడిది? ఎవ్వరిచేతనైనా ఆతడు నాతండ్రిగారికి ఈవిషయము చెప్పింపరాదా? ఆతని ప్రేమించినానని ఆతనికి నేనెట్లు వ్రాసేది?’ అని ఆలోచించి ఆలోచించి తుదకు ఏమి వ్రాయుటకు తోచకూరుకొన్నది. పువ్వులు తెచ్చుటకు తోటకుపోవుట ఆనాటినుంచి మానివేసింది. ఇంటిలో గూర్చుండి తనకు భర్తగా జయచంద్రుని ప్రసాదింపవలెనని సదా దేవుని మనస్సులో వేడుకొంటున్నది. ఆమె తన ప్రియునకు చేయవలసిన విందు భోజనవిధానములనుగూర్చి తలపోయుచుండేది.

పడమటిగాలులు వీచుచున్నవి; వసంతఋతువు; ఆమ్రచూతములు మెక్కి కోయిలలు కుహూరావములు చేస్తున్నవి. మామిడిపూతలోని తేనెను జుర్రుతూ తేనెటీగలు ఝుంకృతముచేస్తున్నవి.

జయచంద్రుని తల్లిదండ్రులు చిన్ననాడే మరణించినారు. పెంచి పెద్దచేసిన పినతండ్రి కొద్దికాలముక్రిందటనే చనిపోయినాడు. ఇక ఆతని పెండ్లివిషయమై శ్రద్ధపుచ్చుకొనే ఆత్మబంధువు లెవ్వరు లేరని స్థిరపఱచుకొనినాడు. ఆమెయందు తనకు వలపుగలిగిననాడే తన కుటుంబస్నేహితుడైన దక్షిణామూర్తితో ‘ఆమె తండ్రితో మాట్లాడి పెండ్లి నిశ్చయము చేయవలసిన’దని ఆతురతతో చెప్పుకొనినాడు. దక్షిణామూర్తి బదులుచెప్పనందున ఆ సంబంధమతనికి ఇచ్చలేదని తలంచినాడు.

దక్షిణామూర్తి జయచంద్రునితో చెప్పకుండా చంద్రావతిజనకునియొద్దకు వచ్చి జయచంద్రుని జాతకమును చూపి ఆతని గుణగణములను వర్ణించినాడు. చంద్రావతి జాతకమును పరీక్షించినాడు. వారిద్దరకుగూడా జ్యోతిశ్శాస్త్రములో పాండిత్యము సున్న అయినను పండితులమనే నమ్మిక మెండుగానున్నది. పెండ్లికి లగ్నము పెట్టినారు. చుట్టములు వధువుకు విందులుచేసి విలువైన వస్త్రాభరణములనిచ్చినారు.

చంద్రావతి తనను లక్ష్యపెట్టలేదనే కోపమునకుతోడు జవాబైనను రాకపోవుటచేత చంద్రావతియందు ఆతనికి తీవ్రద్వేషము కలిగింది. ఆతడు తీవ్రస్వభావముకలవాడు; తలచినది నిమిషములమీద జరుగవలెననే కోరికగలవాడు.

ఆతనికి వెంటనే పెండ్లిచేసుకోవలెననే కాంక్షపుట్టింది. గయ్యాళి, వికృతస్వరూపిణి అయిన అన్యశాఖకు చెందిన కన్యను పెండ్లిచేసికొనినాడు. అతడు తనశాఖపోతున్నదని చింతింపలేదు; కన్యయొక్క అర్హతానర్హతలను గణింపలేదు. వెంటనే పెండ్లిచేసికొని చంద్రావతిమీద కక్షతీర్చుకొన్నానుగదా అని సంతృప్తిపడినాడు. ఆ నూతనవధువుయందు కృత్రిమప్రేమ కల్పించుకొన ప్రయత్నించుచున్నాడు.

పిడుగువంటి ఈవార్త లగ్నదినము రెండురోజులున్నదనగ చంద్రావతికుటుంబమువారికి తెలిసింది. ప్రియుడు తొందరపడినందుకు చంద్రావతి ఆశ్చర్యముపోయింది. చింతించినది. ఇరుగుపొరుగువారు తన మిత్రుని నిందించుట ఆమెకు గిట్టిందికాదు. తన దురదృష్టమును నిందింపవలెనేగాని ఆతనినిందింపరాదని ఆమె తలంపు. ఆనాడు ఆమెకు అన్నము సహించిందికాదు. పండుకుంటే ముల్లుగ్రుచ్చుకొన్నట్లుంటుంది. వారిద్దరు కలసి తిరుగుట, మాటలాడుట, పువ్వులుకోయుట, ఉత్తరము—అంతా చిత్రించినట్లు కళ్లబడుతుంది.

రాత్రియంతయు నిద్రలేదు. కళ్లనీళ్లతో ప్రక్క తడిసిపోయింది. అర్హతానర్హతలను విచారించే ఉద్దేశము విడిచి ఎవరికన్నా బంధువులలో ఆలగ్నములోనే ఆమెనిచ్చి పెండ్లిచేసి వంశగౌరవము నిలువబెట్టుకొనవలెనని తండ్రి ప్రయత్నించడము ఆమెకు తెలిసింది. అదివరలో ఆశించి విఫలమనోరథులయినవారంతా మూగనారంభించినారు. కొందఱు అప్పుడు మేము పనికిరాకపోయినామని వేళాకోళముచేయ నారంభించినారు. కొందఱు ఆమెవివాహము గురించి ఉన్నవిలేనివిచేర్చి కథలల్లనారంభించినారు. ఇదంతా ఆమె కేమా నచ్చిందికాదు. ఆమె 'ఈ జన్మంలో పెండ్లి అక్కరలేదు; నన్ను శివునికర్పించుకొనినాను; వివాహ ప్రయత్నము విడువు'మని తండ్రితో చెప్పుకొన్నది.

సదా ఆమె శివాలయములో దేవుని ధ్యానించుతు వీలున్నపుడు శివపురాణమును గేయములుగ రచిస్తుండెను. ఇట్లు కొన్నియేండ్లు గడచినపిదప నొకలేఖ వచ్చింది చంద్రావతికి; అందిట్లున్నది:

"చంద్రావతీ! నా ఆత్మకథను ఒకసారి చదువుటకు దయయుంచి ఓపికపట్ట గోరుచున్నాను. అమృతమునకై ఆశించినాను. విఫలమనోరథుడనై తివనే తొందరచేత, కోపముచేత, కక్షచేత, పట్టుదలచేత అమృతతుల్యమని విషమును సేవించినాను. పూలదండ అని కోరితెచ్చుకొంటిని. విషసర్పమని తెలిసికొని స్వాయముగ మృత్యుశృంఖలముచేత బంధించుకొంటిని. ప్రపంచమంతా అంధకారబంధురముగానున్నది నాకు............ ఒక్కసారి తుదిదర్శన భాగ్యమిమ్ము. తుదిసారి నీమాటలు వినిపించి చావునకుబూర్వము దుఃఖమున కొక్క నిముషము విశ్రాంతినిమ్ము. నీ పవిత్ర ఉద్దేశములకు నేనెట్టి భంగమునుగలుగ జేయను. నీ ఉగ్రతపస్సునకు ఈ పాపాత్ముడు భంగముకలుగజేయ నేరడు. నీ వవకాశమిత్తువేని నా కన్నీటితో పాపపరిహారార్థము ఒకసారి నీపాదపూజచేయుదును; తుదిసారి నీదృక్కులతో నాదృక్కులు మేళవించి ఇహలోకయాత్రచాలింతును.

ఇట్లు

జయచంద్రుడు"

ఆమె ప్రతివాక్యము ఆపిఆపి రెండుమూడుసారుల చొప్పున ఆలేఖనంతను చదువుకొన్నది. పూర్వజీవితము జ్ఞప్తికి వచ్చిందికాబోలు చెక్కిళ్లమీదనుండి కన్నీళ్లు జారి లేఖలోని అక్షరములు చెడిపోయినవి.

మొదట ఆమె ఆతని రాకకు మెత్తపడిందిగాని వద్దు వద్దు యని అంతరాత్మ ప్రేరేపించింది. తపస్సునకు భంగముకలుగునను కొన్నది: ప్రపంచవిషయములకు చిత్తమును మరలనీయరాదనుకొన్నది; కఠినముగ 'వీలులేదు' అని జవాబు వ్రాసింది.

ఆమె తిరిగి విశ్వేశ్వరపూజసేయ నారంభించింది. కళ్లనీళ్లు ఇంకిపోయినవి. ఈలోకము నేమఱచి చిత్తమును దేవునితో మేళవించియున్నది. జయచంద్రుడు వచ్చినాడు. 'ఇక నిన్నెన్నడు బాధింపను. ఒక్కసారి దర్శనమిచ్చి ఈ జన్మకు ఈ చిక్కు తీర్చుకొనుము.............ఇంకా అనేకవిధముల ప్రాధేయపడినాడు. తలుపు గట్టిగా తట్టినాడు. యోగములోనున్న ఆమె చెవికి ఇవియేమి చొచ్చినవికావు. ఆతడు విసిగి వేసారి దగ్గఱనున్న ఎఱ్ఱమాలతీపుష్పములను తెచ్చి నలిపి ఆరసముతో తలుపుమీద

"చంద్రావతీ! సాధుశీలా! ఈ పాపాత్మునకు సందర్శనమున కవకాశమిచ్చినావుకాదు. తగిన శాస్తి జరిగింది. వేగిరమునకుదగిన ప్రాయశ్చిత్త మనుభవించినాను ఈ జన్మలోనే. తుదిసెలవు" అని వ్రాసినాడు.

ఆమె యోగమునుండి మేల్కొన్నపిదప బయటితలుపుమీది అక్షరములను చదువుకొన్నది. కళ్లవెంట నీళ్లు తిరిగినయి. ఆ యక్షరములను కడిగివేయుటకు సమీపమందలి కృష్ణాస్రవంతికి నీళ్ళకు తేబోయింది. ఆకృష్ణానదిలో—మరణించినప్పటికిని—జయచంద్రుడు నిమీలితనేత్రములతో వెన్నెలలో చంద్రావతికి గనబడినాడు. ఆమె నివ్వెరపడి 'ఆహా! ఈ లోకమున ప్రేమకెట్టిగతులు?' అనుకొన్నది.

# గుమ్మడు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

రాణించుముత్యాలరావిరేకయుబొట్టు యిరువైన కురులలో మెరయుచుండ
బాగైన వజ్రాలపోజులకమ్మలు తళుకుచెక్కిళ్లపై దాండవింప
వక్షస్థలమ్మున బలితంపునునుజిగి ముత్యాలహారముల్ మురిసియాడ
వెలలేనిరతనాలనలరారు బహువిధకరకంకణమ్ములు ఘల్లురనగ

నలరి; తాడు కవ్వంబున కమరజుట్టి
చాలవలెవాటుకొంగు యుయ్యాలలూగ
వనితవైయ్యారమునను బ్రభాతవేళ
పెరుగువడిఘుమ్మఘుమ్మన దరచుచుండ

నాదమటువిని కృష్ణుండు నవ్వుచుదరి
జేరి తక్కుచు నడుమున జేయినునిచి
"అమ్మ! వెన్న! వెన్నో!" యంచు నెమ్మితోడ
నడిగి తడయక కవ్వమ్మునణచిపట్ట

అలనిలింపపుష్పామోద యాయశోద
రట్టుజేయుపుత్రుని భయపెట్టదలచి
"యరయు మీభాండమున గుమ్మడనెడుబూచి
దిరుగుచున్నాడు చెయివెట్టగరచునమ్మ!"

అనవిని మందహాసవదనాంబుజుడౌచు మురారి "తొల్లినే
వినుకలిగాశతాకృతుల వేడ్కధరించి భయంకరోగ్రులౌ
దనుజుల కల్మషాత్మకుల దాల్మివధించి సమస్తలోకముల్
గొనకొని సంచరించితిని గుమ్మడటన్న విచిత్రమయ్యె నెం
దును గనలేదు యిప్పుడెటదోచెను జూపగదమ్మ మ్రొక్కెదన్."

అనగ యశోద విస్మయమునంది కుమారు ననంతమూర్తిగా
గని పెనుమాయలోదగిలి కన్నుల బాష్పకణాళిగ్రమ్మ కృ
ష్ణుని వడినెత్తి ముద్దుగొని సూటిగ గుమ్మడుపోయెనంచు వె
న్ననిడి నయంబునం బనుప నవ్వుచునేగె రయానవెన్నుడున్.

# సుభాషితము*

సోదరీమణులారా!

## తొలిమనవి

ఎక్కడనో గృహాభ్యంతరంబున గూర్చుండి యేదియో తోచినవిధంబున చదువుకొనుచు వ్రాసికొనుచు కాలక్షేపము సేయు నన్నీమహిళాసభ కధ్యక్షురాలినిగా నెన్నుకొనుట యెంతవఱకు యుక్తముగానున్నదో నేను చెప్పజాలను. నాకు మాత్ర మీపదవి సరిక్రొత్త. అగుటనే గతమూడు నాలుగువర్షములనుండియు సుప్రసిద్ధాంధ్రవిదుషీమణులు వహించిన యీ స్థానమును వహించుటకు మిగుల జంకునుకొంకును నందుచున్నాను. కావున నాప్రసంగమునందేవేని లోపములున్నచో బిడ్డలయవ్యక్తాలాపంబుల నెనరుతో వినెడి తల్లులవలె వాత్సల్యముతో వినవలయునని నాతొలిమనవి.

నేడు విజయదశమి. భారతీయులెల్లరు వేడుకల వెల్లువలదేలుచు విజయోత్సవములు సల్పెడు సుదినము. కాని నేడు మన భారతదేశము బహుక్లిష్ట స్థితియందున్నది. మహాత్మా గాంధిగారిచే ప్రారంభింపబడిన దౌర్జనరహితస్వాతంత్ర్యసంగ్రామంబున మహాయోధులై పోరాడిన యసంఖ్యాకనరనారీమణులు చెఱసాలలోపడి గాసిల్లుచున్నారు. లోకోత్తర పురుషుడగు మహాత్ముడుగూడ యెఱవాడకారాగారమున గడువెఱుగని శిక్ష ననుభవించుచున్నాడు. ఇక మన కేటి విజయోత్సవములు? ఇంటిలోని వారందఱు సుఖముగానున్న గదా పండుగ? ఏదినమున మనదేశజనని దాస్యవిమోచనమునందునో, ఏదినమున నేడు పలుసిలుగులు గుడుచుచున్న రాజకీయనిర్బంధితులు కారాగారవిముక్తులగుదురో—ఆదినము మనకు పర్వదినము, విజయదినము. మన దేశీయుల నావరించిన యవిద్యాతమంబు విరియక మన కట్టిశుభదినంబులు ప్రాప్తించుటకల్ల. కాన మనము మనవిద్యావిజ్ఞానంబులు పెంపొంచుటకై త్రోవ లరయవలసియున్నది.

## స్త్రీలు: జ్ఞానాభివృద్ధి

ఏయుగమునందైనను, నేకాలమునందైనను, నేదేశమునందైనను, మనుజుల జ్ఞానాభివృద్ధికి రెండేమార్గములు. అందొకటి ప్రత్యక్షముగా బోధనందుట; రెండవది గ్రంథపఠనముచే జ్ఞానమును గడించుట. ఒకవిషయమును గూర్చి పొత్తమునందు జదువుటకంటె

* శ్రీ వేటపాలెము సారస్వతనికేతన ద్వాదశవార్షికోత్సవసందర్భమున ౨-౧౦-౩౦ తేదీని జరుపబడిన చతుర్థమహిళాసభ కధ్యక్షత వహించిన సుప్రసిద్ధాంధ్రవిదుషి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి అధ్యక్షోపన్యాసము.

నొకరివలన ప్రత్యక్షముగా వినుట మేలైన పనియేయగును. కాని అన్నియెడలను నట్టి ప్రత్యక్షబోధ యందుబాటైన పనిగాదు. ఒకరువ్రాసిన గ్రంథము ప్రపంచమంతయు వ్యాపించుట కవకాశముగలదు. కాని ఒకరు గావించిన బోధను వినుటకు వారి సమీపస్థులైన వారికే దప్ప అన్యులకు శక్యంబుగాదు. అందును మానినులవిషయమున ప్రత్యక్షముగా వినుటయనుకలిమి తలపరాని విషయము. గృహకృత్యములవలనను, తదితరానేకాభ్యంతరములవలనను సాధారణముగా స్త్రీలకు తమగ్రామమున జరిగెడి యుపన్యాసాదికంబులనే వినుటకు వీలుగాదు. అట్టిచో గ్రామాంతరప్రసంగములను గూర్చి తలంచు టనవసరము. కాన స్త్రీల జ్ఞానభివృద్ధికి స్వయముగా చదువుకొనుటయే ముఖ్యమైన త్రోవ. ఈ చదువుకొనుటయందు గూడ మరల రెండువిధములైనవి యున్నవి. ఒకటి గ్రంథము, రెండవది వార్తాపత్రిక.

## స్త్రీలు: వార్తాపత్రికలు

ఇప్పుడిప్పుడు గ్రంథపఠనము మనస్త్రీలలో నించుకించుక వృద్ధిగాంచుచున్నది. కాని వార్తాపత్రికాపఠనమునందు మనస్త్రీలకు బొత్తిగా పరిచయములేదు. ఇది యెంతయు విచారకరమైనవిషయము. నాగరికప్రపంచమున నేడు వార్తాప్రతిక విద్యనొసగు ఒజ్జయై, హిత ముపదేశించుగురువై, కడుగూర్చిన నేస్తమై, ప్రాభవముగల ప్రభువై, యీప్సితార్థసిద్ధిని గల్గించు దైవమై యఖిలమానవహృదయము నాక్రమించుచున్నది. ఇట్టి సర్వవిధజ్ఞానదాయినియైన పత్రికయెడల వైముఖ్యము స్త్రీల యవిద్యావ్యాప్తికి నిదర్శనమని చెప్పక తప్పదు.

## ముఖ్యకర్తవ్యము

అయితే ప్రస్తుతదేశకాలపరిస్థితులు స్త్రీలిట్టి యవిద్యాంధకారనిమగ్నలై యుండుటకు యోర్చకున్నవి. మనదేశమున జరుగుచున్న యసమవివాహములు స్త్రీలజీవితమును దుఃఖభాజనముగా జేయుచున్నవి. వరశుల్క_కన్యాశుల్కా_దిదురాచారములు స్త్రీల పురోభివృద్ధిని భంగపఱచునవిగానున్నవి. ఆర్థికములగు వారసత్వాధికారములు స్త్రీల కన్ననవస్త్రములకు కొఱతను గల్గించునవిగానున్నవి. రాజకీయస్వాతంత్ర్యములనెడిపేర స్త్రీలకొసగబడుచున్న సభ్యత్వాధికారములుగూడ వట్టిమేడిపండులుగానే యున్నవి. దీన నేమగును? స్త్రీలు నిజమైన అధికారమునుబడసి తమజాతి సౌభాగ్యమును తాము పరిశీలించుకొను సామర్థ్యముగలవారైనప్పుడేగదా వారు విద్యావతు లనబడుదురు? ఇట్టి

విద్యస్త్రీలకు పట్టుబడవలెనన్నచో పాఠశాలలలో నున్నతవిద్య నభ్యసించియు, గ్రంథాలయములలో గ్రంథపత్రికాదులను పఠించియు ఇరుమార్గముల విజ్ఞానసముపార్జనముచేయుట ముఖ్యకర్తవ్యము.

అయితే ఈగ్రామము నందింత గొప్పగ్రంథాలయముండగా గతవార్షికనివేదికను బట్టిచూడ గ్రంథములనుచదివిన పురుషులసంఖ్య 366 అయియుండగా పాఠకురాండ్రు 59 గురు మాత్రమేగలరు. పురుషులు చదివినగ్రంథములు 3594 అయియుండగా స్త్రీలు చదివినపుస్తకములు 227 మాత్రమే. ఎక్కడ 366? ఎక్కడ 59? ఎక్కడ 3594? ఎక్కడ 227? విచారించిచూడ పురుషపాఠకులసంఖ్యకంటె స్త్రీపాఠకులసంఖ్య ఆఱువంతులుతగ్గియున్నది. పురుషులు చదివిన గ్రంథములకంటె స్త్రీలుచదివిన గ్రంథములు పదునాఱు పంతులకు తగ్గియున్నవి. ఈ అంకెలు గన మానసంబెంత దుఃఖసంతప్తమగుచున్నదో వివరింపజాలను. కాలము మాఱుచున్నది. అభిరుచులు మాఱుచున్నవి. పరిస్థితులు మాఱుచున్నవి. ఇట్టియెడ మనస్త్రీలిట్టి విద్యావిహీనలచేత గొట్టుకాడుచున్నచో స్వసంఘశ్రేయమునకెట్లు తోడ్పడగల్గుదురు? తమకు ప్రసాదింపబడుచున్న నూతనాధికారముల నెట్లు వినియోగించుకొన గల్గుదురు?

వర్తమానకాలమున మనభారతదేశసాంఘికరాజకీయార్థికప్రపంచమున నపూర్వ సంచలనము బయలు వెడలియున్నది. సర్వాంగసుందరంబగు భారతజాతియొక్క పునస్సృష్టి కిది ప్రసూతివేదనవంటిది. జాతియనగా నొకపురుషసంఘమే జాతిగాదు. స్త్రీపురుష సముదాయమంతయు కూడియే జాతియనబడును. కాన కేవలము పురుషసంఘమునందు వికాసము కలిగినంతమాత్రమున జాత్యభివృద్ధి చేకూరదు. పురుషులతో సమానసంఖ్య గలవారగు స్త్రీలుగూడ యున్నతస్థితికిరావలయును. శరీరమునందేదేని యొక్కఅవయవము లావుపాటియున్నచో నదియారోగ్యలక్షణమని భావింతుమా? భావింపము. మఱియు నది రోగచిహ్నమని చికిత్సచేయుదుము. అటులనే జాతియనెడు శరీరమునందును ఒకే పురుషజాతిగాని స్త్రీజాతిగాని, లేక ఒకేమతముగాని కులముగాని యున్నతస్థితికి వచ్చినచో నది జాత్యభివృద్ధియొక్క లక్షణముగాదు. మఱియు నది జాతిక్షీణతకు గూడ హేతువగును. కాన జాతియొక్క పురోభివృద్ధి నాకాంక్షింతుమేని నరనారీభేదములు, బ్రాహ్మణాబ్రాహ్మణభేదములు, హిందూమహమ్మదీయభేదములు లేక మనభారతజాతియంతయు సమానవికాసమునందవలసియున్నది.

## స్త్రీపురుషశక్తులు

దురదృష్టవశమున మనదేశమున బహుశతాబ్దములనుండియు విద్యాభ్యాసమున స్త్రీలుపేక్షింపబడియున్నారు. జాతియందించుమించు సగమునకు చాలియున్న స్త్రీలిట్లు విద్యావిషయమున నశ్రద్ధచేయుటచే మన జాతికి గల్గిన నష్టమపారము. ఇంకను నట్టి హైన్యస్థితియందే స్త్రీలుండిరేని దేశమునకును దేశీయులకును గూడ నపారనష్టము వాటిల్లగలదు. ఒకే స్త్రీగాని పురుషుడుగాని పూర్ణమైన వ్యక్తిగాదు. స్త్రీపురుషు లిరువురియొక్క చేరికయే వ్యక్తియొక్క పూర్ణస్వరూపము. కావుననే

> స్త్రీపుంసయోరాత్మశక్త్యైకత్వసంపాదనం వివాహః
> ధర్మార్థకామమోక్షాణాం దారాః సంప్రాప్తిహేతవః॥

అని పెద్దలు వ్రాక్రుచ్చియున్నారు. అనగా స్త్రీశక్తిగాని పురుషశక్తిగాని ఒక్కొకటిగ పరిపూర్ణముగాదనియు, వివాహబంధముచే నీయుభయశక్తుల నేకీభవింపజేయుటచేతనే మానవశక్తియొక్క పరిపూర్ణత యేర్పడుననియు పై శాస్త్రవచనముల తాత్పర్యము. కాన పురుషుడు విద్యావంతుడగుచున్నప్పుడు స్త్రీగూడ నాతనితో సమానముగా విద్యార్జనచేసి యాతడు చేయుసత్కార్యములకు సహాయకురాలై, ప్రోత్సాహకురాలై, సహధర్మిణీ నామమును సార్థకముచేయవలయును.

## స్త్రీలకు క్రొత్తహక్కులు

ఇటీవల కొలదివత్సరములనుండి విద్యావతులగు స్త్రీలును, స్త్రీజనహితైకచింతగల పురుషవరేణ్యులు కొందఱును చేయుచున్న ప్రయత్నములచే స్త్రీలహక్కుబాధ్యతలు విస్తరింపజేయబడుచున్నవి. రాజకీయాధికారము లొసంగబడుచున్నవి. సాంఘికవిషయములు సంస్కరింపబడుచున్నవి. వివాహముల విషయమై చేయబడిన శారదాచట్టము, నియోజకనియోజితాధికారము మున్నగునవి స్త్రీలకొఱకు క్రొత్తగాచేయబడిన సంస్కరణములే. శారదాశాసనము స్త్రీలమేలుగోరి చేయబడినదేయైనను దీనికనుకూలురు ప్రతికూలురుగూడ మెండుగానే కానవచ్చుచున్నారు. స్త్రీసంఘశ్రేయమునకై చేయబడిన శారదాచట్టము కేవలము పురుషుల పరిష్కారమునకే వదలిపెట్టుట హితముగాదు. ఇది యిట్లుండ 'డైవోర్సు' అనగా పెండ్లిండ్లరద్దుచట్టమునకుగూడ దేశమున ఆందోళన బయలుదేరినది. స్త్రీలు దీనిని చక్కగా విమర్శించి పథ్యాపథ్యములను గమనింపవలయును.

## ఓటింగు హక్కు

స్త్రీలకీయబడిన రాజకీయాధికారములలో ఎన్నికలలో పాల్గొనుట ముఖ్యమైనది. ఇపుడు దేశమంతటను పల్లెలను పట్టణంబులనుగూడ వినబడుచున్న 'ఓటు' అనుమాటను

మీరుగూడ వినియుందురు. ఓటుఅనగా సమ్మతియని యర్థము. ఒకరికి తనసమ్మతి నొసగి సభ్యత్వమున కెన్నుకొనుట, ఒరులవలన తాను సమ్మతులనుబడసి సభ్యత్వమును బడయుట ఇదియే నియోజకనియోజితాధికారము. ఓటుఅనునది "దేహి అంటె నాస్తి" అనేదా అని మొగమోటమితోను దాక్షిణ్యముతోను పెట్టవలసిన భిక్షుగాదు. రాజ్యపరిపాలన యందు ప్రతివ్యక్తిని భాగస్వామిగా జేయబడుట కీయబడినహక్కు ఓటు. ఓటరు లెల్లర కీయబడిన పరిపాలనాధికారమును నొకనికి కట్టిపెట్టి మాకుమాఱుగా నీవు శాసనసభలోనిలిచి ప్రజాహితముగా పరిపాలన సేయుమని పంపబడిన ప్రతినిధి వాడు. నేడు 'ఓటు, ఓటు' అని మనయిండ్లచుట్టును పలుమారు తిరిగిన అభ్యర్థి పలుమారు తిరుగుటచే యెంతపేలవముగా కనుపించినను అధికమైన ఓట్లను సేకరించి యెన్నికలలో నెగ్గనేని రాజ్యాంగమునందుతానును ఒక చేయిచూపగల శూరుడగును. ప్రాతచట్టములను రద్దుచేయుటకును, క్రొత్తచట్టములను సృష్టించుటకును సమర్థుడగును. ఆచట్టము లొకప్పుడు ప్రజలకు హితమైనవి కావచ్చును లేదా అహితమైనవికావచ్చును. మొత్తముమీద ప్రజల మంచిచెడ్డ లాతనియధీనమగును. కాన మనము ఓటునొసగునప్పుడు మనముఓటునిచ్చెడి పెద్దమనిషి స్వార్థపరుడా? పరార్థ పరుడా? ఇతనికీయబడిన ఓటు సద్వినియోగమగునా? దుర్వినియోగమగునా ? అని బాగుగా యోచింపవలెను. క్షేత్రమెఱిగివిత్తనము పాత్రమెఱిగి దానముచేయవలెననిగదా పెద్దలవచనము. కాన పాత్రుడైనవానికే ఓటునిచ్చుట ప్రజలధర్మము. కాని పక్షభేదములు, కులాభిమానములు, స్థానికాధికారములు, ఐశ్వర్యప్రాబల్యములుచూపి ఓట్లను యాచించు వారికి ఓట్లనొసంగుట మనహక్కును దుర్వినియోగపఱుచుకొనుట. మఱియు నట్టిది దేశానర్థకము. దేశహితైకచింతగల సజ్జను డేకులమువాడైనను నన్నికులములవారికి మేలేచేయును. స్వార్థచింతగల పురుషు డేతెగవాడైనను తనతెగవారికైన మేలుచేయడు. కాన యిట్టి చిన్నినాపొట్టకుశ్రీరామరక్షయనెడి వారివాగురులలో జిక్కకుండుటకు ఓటరులు మంచి విద్యావివేకములుగల విశాలహృదయులై యుండుటవసరము.

## స్త్రీవోటరుల కర్తవ్యము

మన చెన్నరాష్ట్రమునందు స్త్రీలకు ఓట్లనిచ్చిపుచ్చుకొను నధికారము అన్నిరాష్ట్రములకంటె ముందుగా ప్రసాదింపబడినది. స్థానికసంఘముల యెన్నికలయందును, శాసనసభల ఎన్నికలందును మన స్త్రీ వోటర్లు పాల్గొనుచుండుట నచ్చటచ్చట కనుచున్నాము. కాని యీవోటుయొక్క వినియోగము చాలవఱకు యింటిలోని మగవారిసలహాపై నాధారపడుచున్నదే గాని స్వబుద్ధిచే వినియోగింపబడుటలేదు. స్వబుద్ధిచే వినియోగింపజాలనివారు ఓటును

నెవరో చెప్పినట్లు యెవరో యొకరికి పాఱవేయుటకంటె ఎవరికిని యివ్వకుండుటయే లెస్స. కాన స్త్రీలు యిట్టి హక్కును వినియోగించుకొనుటకు మంచి విద్యావంతులై యుండుటవసరము. మఱియు స్త్రీ వోటరులు పక్షభేదములు, కులకక్షలుమున్నగు దేశానర్థకభేదంబులకు మనంబున తావీయక తమ్ము ఓటునర్థించెడి యభ్యర్థి దేశశ్రేయమును, స్త్రీలశ్రేయమును గోరెడివాడేనాయని మాత్రమే యోచించి ఓటు నివ్వదగును. స్త్రీలలో విద్యబాగుగా పెంపొందినచో తామే యభ్యర్థినులుగా గూడ నిలువవచ్చును. గతశాసనసభయందు డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు ప్రభుత్వనియమితసభ్యురాలై చేరి దేవదాసీచట్టమునకై మిగుల కృషిచేసి సఫలమనోరథురాలై వేశ్యాసంఘమున కెనలేని యుపకృతిచేసెను. కాన ఒక్క స్త్రీవలననే యింతమేలొనగూడియుండగా స్త్రీ లధికముగా చట్టసభలలో ప్రవేశించినచో నింతకంటె మేలొనగూడియుండును గదా? అయితే స్త్రీ లిట్టిపదవులబడసి స్వజాత్యభివృద్ధికి కృషిసేయుటకు విద్యావివేకము లేనిచో సాధ్యమగునా?

### స్త్రీవిద్యావ్యాప్తి : దాని యావశ్యకత

"విద్యానామ నరస్యరూప మధికం ప్రచ్ఛన్నగుప్తంధనం
విద్యాభోగకరీ యశస్సుఖకరీ విద్యాగురూణాంగురుః
విద్యాబన్ధుజనో విదేశగమనే విద్యాపరా దేవతా
విద్యారాజసుపూజ్యతే నహిధనం విద్యావిహీనఃపశుః"

అని భర్తృహరి సుభాషితమునందు చెప్పినతెఱంగున మనుజులకు విద్యయే రూపము. విద్యయే రహస్యముగ దాచిపెట్టబడిన ధనము. విద్యయే సకలభోగములను కీర్తిని సుఖమును గలుగజేయును. విద్యయే గురువువలె అన్నియుబోధించును. పరదేశమునందు చుట్టమువలె సహాయమొనర్చును. విద్యయే పరమాత్మ. విద్యయే రాజపూజితము. ధనమిట్టిదిగాదు. ఇట్టి విద్యలేనివాడు పశుతుల్యుడు. విద్య యిన్నివిధముల లాభకారియని పెద్దలు వాక్రుచ్చియున్నారు. ఇట్లున్నను స్త్రీలకు విద్య హానికరమనువారును లేకపోలేదు. కాని విద్య కధిష్ఠానదేవతయే స్త్రీయైయుండగా విద్య స్త్రీల కనర్హమనువాక్యము పరిహాసాస్పదమైనదిగదా? బహుకాలమునుండియు స్త్రీవిద్యావిషయమై ఉపేక్షింపబడుటచే స్త్రీ చచ్చుపడిన అవయవమువలెనున్నది. అవును. చేతనప్రాయమైన విద్యాసంస్కారములేనప్పుడెట్టివారైన జడపదార్థముగా మారిపోవుటయు, వారి శక్తిసామర్థ్యము లడగిపోవుటయు సహజమేగదా? ఎంత విలువగల జాతిరత్నమైనను సానబెట్టక ప్రకాశింపదుగదా? నేడు మతసంఘరాజకీయాద్యనేకముఖముల శిథిలతనుజెంది పునర్నిర్మాణమును గోరుచున్న మన భారతావనియం దిట్టిజీవగఱ్ఱయైన స్త్రీవిద్యావ్యాప్తి మిక్కిలి యవసరము.

## స్త్రీలు : దేశీయపరిశ్రమలు

స్త్రీలు చేయవలసిన మఱియొక ముఖ్యవిషయము దేశీయపరిశ్రమలను పోషించుట. గృహపరిశ్రమల నుద్ధరించుట. నాగరికతయనుపేరున మన స్త్రీలలో పెక్కుమంది విదేశీయ వస్త్రములను, వస్తువులను విరివిగా ఉపయోగించుచున్నారు. ఒక్క మన చెన్నరాష్ట్రము నందే సంవత్సరమునకు 18,100000 లక్షల విలాసవస్తువులు కొనుబడియగుచున్నవి. విలాస వస్తువులనగా జీవితావసరమునకిసుమంతైనను అవసరములేని పరిమళద్రవ్యములు, సబ్బులు, ఇమిటేషనునగలు, ఆటవస్తువుల్కు, సిగరెట్లు, జిలుగుపట్టువస్త్రములు మున్నగు భోగద్రవ్య ములు. వీనిలో నేవిలేకపోయినను మనజీవితము గడవకపోదు. అయినను ఇట్టివాని కెంత సొమ్మునో కోల్పోవుచున్నాము. ఒక్కసబ్బుకై మహరాష్ట్రీయులు వెచ్చించుధనము మూడు న్నరలక్షలు. దేశముయొక్కసంపత్తిని కోల్పోవుటకు దీనికంటె వేరుపురుగు వేఱొకటిలేదు. అయితే సబ్బు వాడకున్న మన మనాగరికులమని భావనగల్గుచున్నప్పుడు వానిని వినియో గింపకుండనుండుట మనవారికి మిక్కిలి కష్టమగుచున్నది. అయితే విదేశపు సున్ని తంపువస్తువులను మనము వినియోగించుకొనినచో అది నాగరికతాలక్షణముగాదు. ఎప్పు డైనను పొరుగువారినగలను తెచ్చుకొని ఒడలినిండపెట్టుకొనినచో ఆమెను మనము భాగ్య వంతురాలని భావింతుమా? మఱియు తెలివితక్కువదియని హేళనసేతుము. అంతకంటె తెలివితక్కువ విదేశవస్తువులతో కులుకుట. ఎప్పుడు మనదేశమున అట్టివస్తువులను తయారు చేసి వినియోగింతుమో అది నిజమైననాగరికత. దేశముయొక్క ఆర్థికాభివృద్ధి దేశీయపరి శ్రమలపై ఆధారపడియున్నది. కాన స్త్రీలెల్లరును మనదేశమున తయారైన వస్తువులను ఉపయోగింపనగును. లేదా మానవలయును. అంతియేగాని విదేశజములపై మోహము కలిగియుండుట తగదు. మనదేశమున తయారుచేయబడిన వస్తువులు క్రొత్తగాచేయబడు చున్నవగుటచే నాణెమునకు తగ్గియుండవచ్చును. విలువకు హెచ్చియుండవచ్చును. అయి నను వానినేకొని దేశీయపరిశ్రమలకు ప్రోత్సాహమొసగదగును.

## స్త్రీలు : గృహపరిశ్రమలు

దేశీయపరిశ్రమలనేగాక గృహపరిశ్రమలనుగూడ స్త్రీలు పునరుద్ధరింపవలసియున్నది. గృహపరిశ్రమలో రాట్నముపై నూలువడుకుట ప్రధానపరిశ్రమ. దానివలన అఱువదికోట్ల రూప్యములు మనదేశమునకులాభమగును. ఇవియేగాక పూర్వము మనస్త్రీలచే పరిపాటిగా చేయబడుచు ఇప్పుడు విస్మరింపబడియున్న రంగులద్దుట, పేముపనులు, కుట్టుపనులు, కాటుక

పట్టుట, కుంకుమచేయుట, తలనూనెలు కాచుకొనుట మున్నగునవిగూడ స్త్రీలు నేర్చుకొని ఈ స్వల్పవస్తువులకై ప్రతిసంవత్సరము విదేశములకుపోవుచున్న కోట్లకొలది రూప్యములను నిలుపదగును. మనదేశపు ద్రవ్యసంపత్తియనెడిభూరితటాకమున కీవిదేశపువస్తువులనెడివన్నియు సన్నిగండ్లయి మన సంపత్ప్రవాహము నెడతెగక విదేశములకు పాఱించుచున్నవి. ఎంత భాగ్యవంతమైన దేశమైనను నిరంతర మీవిధముగా స్వీయధనంబును విదేశంబులపాలొనర్చుచున్నప్పుడు పేదఱికము పాలుగాకుండనుండగలదా?

సోదరీమణులారా! స్త్రీయొక్క తోడ్పాటులేక ఏ మతమును వ్యాప్తినందదు; ఏ సాంఘికవ్యవస్థయు చక్కబడదు; ఏ శిథిలరాజ్యమును పునరుద్ధరింపఁబడదు; ఏ పరాధీన దేశమును స్వాతంత్ర్యమునుబడయదు; ఏపరిశ్రమలును పోషింపబడవు. కాన మీరెల్లరును విద్యావిజ్ఞానవతులై పురుషులతో సమానముగ కార్యక్షేత్రమునబ్రవేశించి దేశము నుద్ధరింపవలయును. భావిభారతనిర్మాతలగు బాలబాలికల పోషణ మీహస్తములయందున్నది. వారిని గుణవంతులుగను, కార్యదీక్షాసక్తులుగను, దేశాభిమానపూరితులుగను దైవభక్తిరతులుగను జేయవలసినభారము మీది. కావున మీరువిద్యావతులై ఐహికాముష్మికంబుల సాధించుచు మీబిడ్డలనుగూడ అట్టివారినిగాజేసి దేశము నుద్ధరింపుడని నామనవి.

నిజముగా చతుర్భుజగను, వీణాపాణిగను, మయూరవాహనిగను శిల్పులచేతను, చిత్రకారులచేతను విరచింపబడెడి వాణీరూపము నిజమైనరూపముగాదు. గ్రంథసముదయమే వాగ్దేవియొక్క సత్యమైనరూపము. ఆ గ్రంథసముదాయములుగల నికేతనములే నిజమైన శారదాలయములు. ఆ దేవాలయములందుండెడి గ్రంథపత్రికాదులను చదివి విజ్ఞానమును గడించుటే భారతీదేవినర్చించుట. పట్టణంబులనేనియుండుటరుదైన యిట్టి సరస్వతీసదనము మీ చిన్నిగ్రామముననుండుట మీ గ్రామవాసులభాగ్యము. ఈసారస్వతనికేతన ప్రతిష్ఠాపకులు తమ గ్రంథాలయముద్వారా పురుషులలో జ్ఞానప్రబోధము గావించుటచేతనే సంతృప్తమానసులుగాక స్త్రీల విద్యాభివృద్ధికిగూడ కృషిచేయుచు నిట్టి మహిళాసమావేశములను గూడ నేర్పఱచుట మీగ్రామస్త్రీల అదృష్టమనుటకు సందియములేదు. కాన అక్షరరూపిణియగు భారతినర్చించి ఆమె అనుగ్రహంబున విద్యావిజ్ఞానవిభాసితహృదయలై విరాజిల్లెదరుగాకయని కోరుచున్నాను. దీర్ఘమైన నా ఉపన్యాసమును ఓపికతో వినిన మీకు నా కృతజ్ఞతాభివందనములర్పించుచు, మీతోడి సమావేశలాభమును గల్గించిన ఆ పరమేశ్వరునకు కృతాంజలిబద్ధనై నా ఉపన్యాసమును ముగించుచున్నాను.

# తిరస్కృతాంధ్రవాఙ్మయము

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

ఇఁక నీ క్రింద నిచ్చినవి పిల్లలకు వాచకశక్తిని, జ్ఞాపకశక్తిని, లోకజ్ఞతను సులువుగా నేర్పుచు, కష్టములేకుండా భాషలో సంగీతమును సాహిత్యమును జొనిపి, వారికుత్సాహముఁ గలిగించునట్టివి. విమర్శించు కొలఁది బహుగుణములు కలవి. చిత్తగించుఁడు:—

౧ పండోయమ్మా పండు
ఏమి పండూ?
మామిడిపండూ (సం. 3. సంచి. 6)

౨ కాలువకు పోదాం
వస్తావా?
ఏం కాలువా?
రాజు కాలువా? (సం. 3. సంచి. 1.)

3 ధిమిత ధిమిత
ఏంధిమితా?
పసుపుధిమితా?
ఏం పసుపూ? (సం. 3. సంచి. 2)

౪ ఇల్లు కడదామా?
ఏమి ఇల్లూ?
పెంకుటిల్లూ.
ఏంపెంకూ? (సం. 3 సంచి. 4)

౫ కాయి తాయి
ఏంతాయి
గొత్రితాయి (సం. 3. సం. 5.)

౬ చూచి చూచి (టే. రా. గో. 86.)

౭ చెక్కని స్తంభం ,, 98.

ఈ క్రింది ప్రతీకలు గలవి మఱొక్కరకమువి: ఇవియును పైవానిలోనే చేరును.

కాకీనాకూ దీపమిచ్చి
దీపంతెచ్చి అవ్వాకిస్తీ (సం.3. సంచి.4.)
వానావానా వల్లప్పా (టే. రా. గో. 3)
గిద్దాగిద్దా గిటుక్కు ,, 9
తోడుపాయసంతోడు ,, 11
కాకీకాకీ గంగలొ మునిచీ ,, 16
కాళ్లాగజ్జా కంకాళమ్మా ,, 17
గుడుగుడు గుండం ,, 25
కందిపప్పు పూరణం ,, 41
బావాబావా పన్నీరూ ,, 43
కరణం కరణం ,, 73
కొంగాకొంగా గొళ్లూ (టే. రా. గో. 39)
ఏనుగమ్మా ఏనుగూ ,, 40
తాతా తాతా తై
తాతనుపట్టుకొవెయ్.
తక్కెడలోను తొయ్
తలోతాపూ తై.
తాతా తాతా ఏతామెత్తా
పాతాపగ్గం పరుగూలెత్తా
తత్తత్తాళూ తల్లోపిల్లో
కొత్తాకుండా గుభేల్ గుభేల్. (నాసేకరించినవి)

ఈపైని పేర్కొన్న పాటలు అన్నియు ప్రకటితములై యున్నవి. శ్రోతలకు చదువరులకు ఇవి సులభ్యములు. కాఁబట్టి పూర్తిగా నీయలేదు. వీనిలో పండోయమ్మా, అనునది మొదలు చెక్కని స్తంభఁ-అనేంత వఱకుఁగల పాటలు మూడేండ్లయీడువచ్చిన పిల్లలకు జ్ఞాపకశక్తిని వాచకశక్తిని గల్గించి పెంపుచేయుటకై అంత్యానుప్రాసలతో భాషను తెలుగుతల్లి గోరుగుజ్జులవలె పిల్లలకు అలవఱచుచున్నది. అందులోనూ వివిధములైన వస్తువులపేరులు చెప్పనట్లుచెప్పుచునే, పిల్లడి మనస్సునకు ఆలోచనగలిగించు ప్రశ్నను వేయనట్లుగా వేయుచునే, ఎక్కడికక్కడికి అబ్బురపాటునుగలిగించుచూ, అంతలోకి ఆమాటకు జవాబు తానేకలిగిస్తూ ఆ పిల్లల కానందమును వెల్లివిరియించుచున్నది. చక్కని సంగీతపు ఎత్తుగడయును, వస్తువులఁగూర్చిన సహజ

విజ్ఞానమును, అందును మెఱుఁగైన నాజూకైన వస్తువుల నేలుకొనవలసిన నేర్పును, అనుకరణమును, ఆనందమును, అందచందములను-అప్రయత్నంగా ఇవి అలవఱచుచున్నవి.

గృహలక్ష్మిలోను భారతియందును ఇంతవఱకు ప్రకటించిన పాటలును, ఏకుమళ్ల రాజగోపాలరావుగారు, ఆ కామేశ్వరరావుగార్లు ప్రకటించిన పాటలును, ఈశాఖకు సంబంధించినవానిని ప్రదర్శించితిని. వీని తర్వాత పిల్లల కోమలచిత్తమునకు నచ్చునట్టి కథలు ఆరంభమగును. ఆ కథల వివరమును నాలుగు ఐదు ఆరవవిభాగములలో విస్తరించి చెప్పఁదలఁచితిని. ఈ మధ్యదశలో పిల్లల మనస్సును అతిచిత్రముగా జంట జంట మాటలుగల పాటలలోని కాకర్షించెదరు. వారు వానిని పదిలముగా జ్ఞప్తియందుంచుకొందురు. అట్టి పాటలజాతికి చేరినవి ఈ క్రిందివి కొన్ని:—

ఉయ్యాల-జంపాల (ఏ. రా. గో. 1)
కొండామీదా, గుంమాజారె
కొక్కొరాజూ కాలూవిఱిగె (3)
అప్పటితిప్పటి తాంబ్రా (4)
చిప్పీచిప్పీ గోళ్లు (5)
అనఁగన గనగన గోరాజూ (6)
కాకికాకీ కనుమాడే (8)
గిద్దాగిద్దా గిటుక్కు (9)
తోడు పాయసం (11)
తాతా తైబొమ్మలాట (12)
కాకీకాకీ గంగలోమునిఁచీ (16)
గుమగుమ గుంచం (25)
ఉచ్చింతా ఉరితాడూ (85)
చల్లాచేయ్ గొల్లభామా (57)
వదినా వదినా వల్లంకీ (97)

ఇత్యాదులు చాల కలవు. వీనిని ఆయా గ్రంథకర్తలు ప్రచురించిన పాటల సంఖ్యతోకూడా నిచ్చితిని. మనము ఇట్టివానిని విమర్శించి వీటి తత్త్వము నెఱుఁగ బూనుకొనవలయును.

ఇవి ఆటతోకూడా కలిపి ఆడుతూ పాడెదరు. కావున అచ్చనగాయలు మొదలైన ఆటలను విమర్శించు సందర్భముతో పాటుగా నాకు తోఁచినవిషయములను వీనిని గుఱించినవానిని అచ్చటనే ఇచ్చెదను.

అచ్చము ఇవిగాక పాటగా పాడుటకును, కథగా జోడించి చెప్పుటకును, పిమ్మట మంచివాచాలత నలవఱచుకొనుటకును మూలకందములుగా నుపయోగించుటకు పనికివచ్చు కొన్ని లజ్జులుకలవు. ఇవి కొన్నికొన్ని చోట్ల నివురుకప్పిన నిప్పులలాగునను, మఱికొన్నిచోట్ల మెఱుఁగులుగ్రక్కు మాణిక్యములవలెనూ మెఱయుచునున్నట్టివి వందలకొలఁదిగా వీరి వాఙ్మయమునందు ఉన్నవి. మచ్చుకై కొన్నింటిని ఉదాహరించెదను:—

(౧) ఆదివారపుకథలోనుండి—

పక్షులారా గిక్షులారా
పారాడే పార్వాలారా
అడవిమహాదేవమ్మకు
ఆడపిల్లపుట్టె
సోమాదులవారి
సోమమ్మకు చెప్పండి.

(౨) పాలూతాగా పసిడీగిన్నె
ఉగ్గూతాగా ఉగ్గూగిన్నె
ఉయ్యాలగట్టా చేరులుకొన్నీ
చెయ్యెత్తాడా చిలుకలుకొన్నీ
బంగారాపూ పట్టుబట్టలూ
సింగారంగా హత్తింపా.

(౨) ఉండ్రాళ్లతద్దెకథలోనుండి—

అకులూ గికులూ
పోకలూ గీకలూ
రవికెలూ గివికెలూ
మినుములూ గినుములూ

సున్నం గిన్నం
లవంగాలూ గివంగాలూ
ఏలక్కాయలు గీలక్కాయలు
జాపత్రీ గీపత్రీ
కాచూ గీచూ
నల్లపూసలు గిల్లపూసలు
లక్కబరిణెలూ గిక్కబరిణెలూ
గోరింటాకూ గీరింటాకూ

కూరలు గీరలు, బియ్యం గియ్యం
నెయ్యీ గియ్యీ, ఉప్పు గిప్పు
పెరుగూ గిరుగూ, పాలూ గీలూ
మిరపకాయలూ గిరపకాయలూ
పొట్లకాయలూ గిట్లకాయలూ
కాకరకాయలూ గీకరకాయలూ
గోంగూరా గీంగూరా
ములక్కాయలూ గిలక్కాయలూ తెమ్మన్నది.

N.B. ఆకథలో రాజు ఋకులు దొరుకుతాయి గాని గీకులుదొరుకుతాయా? అని వెక్కిరిస్తాడు.

(3) చిట్టిబొట్టు కథలోనుండి—

చిట్టీబొట్టూ-పట్టావాలె
సిరిగలయింటా-పుట్టావాలె
పట్టుపుట్టం గట్టావాలె
పట్టపురాజుచెయ్ పట్టావాలె
బాలతోడుగూ తోడగావాలె
కులముగుణము గలగావాలె

ఏడ్గురుతోడ పుట్టావాలె
ఏకచక్రం ఏలావాలె
భూదేవివంటి పుట్టిల్లు గలగాలె
ధరణదేవివంటి తలితండ్రి గలగాలె
ఆకాశమంటీ అత్తామామగలగాలె
అష్టయిశ్వర్యాలతో అలరాలే.

(౪) సూర్యచంద్రులకథలోనుండి—

ఇంద్రలోకానా యింద్రకన్నెలూ
చంద్రలోకానా చంద్రకన్నెలూ
భూలోకానా పేరంటాళ్లూ
ఫెళ్లుఫెళ్లునా వెలుగంగా,
కొలనులోవున్నా కోటికన్నెలూ
కొలనులో స్నానం జేస్తుండా

ముత్యాలా చిప్పాలాతో
ముగ్గులు పెట్టూతుండంగా
అమ్మల్లారా! అక్కల్లారా!
ఏమినోమో ఏమివ్రతమో
చెల్లెల్లారా! చెప్పండీ.
(ఇత్యాదులు నూటికిపైగానున్నవి.)

తన తల్లి లేక అక్కలు మున్నగువారు నిరంతరముగా తమయొద్ద ఆలనపాలనలతో అభ్యాసముసేయఁ దెచ్చుచున్న యీ ఆంధ్రవాఙ్మయమును ఆయీడునవే అమితమగు నుల్లాసముతో అలవర్చుకొని, దానిని తమ తమ ఆటపాటలలో వానిని అప్రయత్నముగా ఆడిపాడి ప్రచారమునకు కొనివచ్చుచున్నారు. అనాయాసముగా తనసంతానమిట్టియానందము ననుభవించుచుండఁ గాంచిన యాతల్లిహృదయ మెంత యానందతరంగములలో తొప్పతోగుచున్నదో చెప్ప శక్యము కాదుగదా. అంతతో ఆ తల్లి తృప్తిపొంది యూరకొనలేదు. చిన్నచిన్న సామెతలుగా, చిక్కుప్రశ్నలుగా, చిత్తానందకరములుగా వానికి మఱికొంత వాఙ్మయమునురుచిచూపుచున్నది. వెనుకటివానిలో అంత్యప్రాసతో ఆయావస్తువులపేర్లను రమ్యముగా అలవఱచుటయే ఆ తల్లియుద్దేశము. కాని ఇంక మీఁదటివానిలో వారిని అప్రయత్నముగా నాలోచనలో నాటుకునట్లు చేయుచున్నది. ఇచ్చటి నుండి రెండవ విభాగము ఆరంభ మగును.

బాలురకు బాలికలకు ఐదవయేం డారంభమగును. కేవలము అలవాటునకు మాత్రమే బడికిపోయి అన్నలతోఁబాటు మఱల వచ్చుచుండెడిదశయిది. ఎక్కువ ఆటలమీఁదను పాటలమీఁదను వారి చిత్తము అహోరాత్రములును పఱుగులెత్తుచుండును, తల్లంటుపాసి తామొక క్రొత్తప్రపంచములోఁ బ్రవేశించుచున్నారు. తమవలెనే మఱి ఇతరుల పిల్లలును ఈడుజోడుగా నాటపాటలలోఁ కలియుచుందురు. తమకంటెను పెద్దవారు ఏమిచేయుచున్నారో, తమ యీఁడువారేమిచేయుచున్నారో గమనించి, తమ కానందము గొల్పు తెరగతిలోఁ జేరెడిరోజులు ఇవి; కనుక ప్రశాంతములగు సాయంసమయములందు తలదువ్వి, బొట్టుపెట్టి, ముస్తాబు చేసి తమ యీడువారితోఁ నాడుటకు తల్లులు వీరి నంపుదురు. పల్లెటిసీమలలోని బజారు అరుగులు ఈవాఙ్మయము పెరిఁగెడు రంగములు. చిత్రచిత్రములగు ఆటలు, వానికితగిన పాటలు, యుక్తిప్రత్యుక్తులు, చినచిన్నకథలు [పేదరాలి పెద్దమ్మముచ్చటలు తప్పకుండా ఉండును.] మొదలైనవన్నియు నీదశయందలి వాఙ్మయములోఁ నేచేరును. అందుండి చిత్రప్రశ్నలను సంబంధించినది ఈ క్రిందిభాగము:—అందును సంగీతసాహిత్య సమ్మేళనము ప్రజ్ఞావృద్ధి ప్రధానములగు పాటలు. ఇట్టివి సంస్కృతమునందుఁ బ్రహేళిక లందురు. సరిగా ఈ పాటలలోని మాటలే పొడుపుకథలనియు వాడుచున్నారు. వీని వివరమును మున్ముందు పాటలను ఉదాహరించి ఆ పిమ్మట వ్రాయుదును. సంస్కృతమునందలి మూలములనుకూడ నిచ్చెదను. గనుక ప్రకృతము వీనిని అసఁగా పాటలను మాత్రమే చిత్తగింపుఁడు.

౧

ఆకాశమంతా అల్లుకు రాఁగా
అడ్డెడుబియ్యం చల్లుకు రాఁగా
కడివెడునీళ్లూ కారుకురాఁగా
చాటెడుచెక్కలు చెక్కోరాఁగా
అందులోవహరాజు అల్లల్లాడాడూ?
* చెప్పితే నీనోరు గప్పుమంటుందీ
తప్పితే నీనోరు చప్పగుంటుందీ

—గానుగ.

౨

అడవిలోపుట్టింది
అడవిలోపెఱిగింది
కడవలోదూరింది,
గట్టుమన్నాదీ
మాయింటికొచ్చింది
మాఅమ్మమెచ్చింది
తాడోసికట్టింది
తైతక్కలాడింది

—కవ్వము.

౩

అడవిలోనిమాను అంతచక్కనిమాను
అమ్మల్లు యెక్కేటి అందాలమానూ
తేనెతేటలుగట్ట నూనెమెఱుగులుజార
నున్నగాచెక్కనా తిన్నన్నిమానూ

—రథము.

౪

అంభాలమీఁదా కుంభాలూ
కుంభాలమీఁదా కుడిత్తొట్టీ
కుడిత్తొట్టిమీఁదా గుండ్రాయీ
గుండ్రాయిమీఁదా కోరింతా
కోరింతమీఁదా అరికఅవురూ
అవురుగడ్డిలో ఆవులు వేలూ —వేలు.

* ఈ మకుటమును కొందఱు ప్రతిదానికీ పాడుదురు. కొందరు పాడరు.

౫

అగ్గిఅగ్గిచాయ
అమరకుంకుమచాయ
బొగ్గుబొగ్గూచాయ-పోలిచాయా
కందిపప్పూచాయ
కాలనేమీచాయ
కడసారితాతయ్య కణితిచాయా

—గురిగింజ.

౬

వోరోరి లచ్చన్న-వళ్లంత గిచ్చన్న
కారాకుపచ్చన్న కండతియ్యన్నా

—సీతాఫలము.

౭

కట్టమీా దంగీ-చెట్టుపేరంగీ
కొండమీా దంగీ-కోటసంగీ.

—గేదంగి.

౮

కొండనుందీ, పెండెనుందీ (పులి:పాము.)
కోమరగిరీ, తాడినుందీ (లొట్టె)
రాజుకుందీ, రంభకుందీ (సందికడియం)
బాలకుందీ, చీలకుందీ (ముక్కుపోగు, దీపం)
నీళ్లల్లోనూ-నిల్చుంది (కొంగ)

౯

చెక్కని స్తంభం-చేతి కందదూ
చెయ్యని కుండా-పొయ్యని నీళ్లూ
వెయ్యని సున్నం-తియ్యంగా

—కొబ్బరి.

౧౦

తల్లీ తల్లీ నల్లన్నా
తల్లీకూతురు తెల్లన్నా
మెల్లంగ తింటే పుల్లన్నా
మిక్కలి తింటే ఘల్లున్నా

—వెలగ.

౧౧

తలా లేసీ తాలారీ
మొలా లేసీ మొలారీ
అంచుల్లేసీ ఆచారీ
చుంచు ల్లేసీ చూనారీ

—తలారి.

౧౨

దిబాదిబా లాడేవి రెండూ (కాళ్లు)
ది బ్బెక్క చూచేవి రెండూ (కళ్లు)
ఆలకించే నైనా రెండూ (చెవులు)
అందుచ్చుకొన్నేవి రెండూ (చేతులు)

౧౩

నల్లనినాగీ నంగానాచీ
తెల్లనితిమ్మా తీటకసిందా
పచ్చనిబాపీ బావానోట్లో
కచ్చాపచ్చా కరాకరా

—తాంబూలము.

౧౪

పండు గానిపండూ
పండువెన్నెల చెండూ. (విభూతిపండు)
పువ్వుగాని పువ్వూ.
పూసుకొంటే నవ్వూ. (కుంకుమపువ్వు)
కట్ట గాని కట్టా
కరేపాకు జుట్టా (జీలకట్ట)
గొడుగుగాని గొడుగూ
కోరరాని పిడుగూ. (కుక్కగొడుగు.)

౧౫

పొడల పొడల బువ్వా
పొంక మైన గువ్వా
బువ్వలోకి మొవ్వా
పురుగులతినే అవ్వా,
రాజుల పొడిచే రవ్వా
రాత్రి తెలిపే రివ్వా
నున్నానై నాగువ్వా
నూకలు దినే తవ్వా

—కోడిపుంజు.

౧౬

మాఱూకథా మంకెన్నా
మా మామా కొంకెన్నా
మళ్లావ స్తే ఉంకన్నా
నాకూ నీకూ లంకెన్నా

—గొళ్లెము.

౧౭

రాచావారికి నచ్చేచిన్న దీ
రాజ్యాలల్లా మెచ్చేనన్న దీ
బంగారువారింటి కోడలూ
పట్టుమంచేరాదు బేడలూ
చేంతాడుతో తోడకుండా
చెంబుతోనూ ముంచకుండా
నీటుగాను కుల్కుతున్న దీ
నీళ్లుతెస్తానంటు వున్న దీ

—కొబ్బరికాయ.

౧౮

వంకరటింకర మానూ
వయ్యారిమానూ
మామాలెక్కే మానూ
మావూరొచ్చే మానూ
కాపూలెక్కే మానూ
కష్టాజీవుల గూనూ
ఎత్తుకొతిరిగే మానూ
ఇంతీపెండ్లీ కౌనూ

—పల్లకి.

౧౯

వంకరటింకర సో, వాడీతమ్ముడు ఆ,
నల్లినిపిల్లా మీ,
నా కేమిస్తా తే

— సొంఠి, అల్లము, మిరియాలు, తేనె.

౨౦

వంకాయ తమ్ముడూ, వంగినడిచేగుమ్ముడూ,
కూచుంటేగుచ్చుడూ, వేచివేస్తే విప్పుడూ

—నేలములక్కాయలకూర.

౨౧

పీడాలవిత్తూ, కొండ్యాలకొరివీ
పుట్టుసన్నాసీ, భూషణాలభోగీ
పెళ్లికిపెద్దా-పేడేసిరుద్దా

—బొట్టన వ్రేలు, చూపుడు వ్రేలు,
పవిత్రంవేలు, చిటికెనవ్రేలుచేయి.

౨౨

వడ్లవాడుచెక్కలేని, వయ్యారిమొగ్గా
వాకట్లోపడ్డాది, వన్నెల్లబుగ్గా (ముగ్గు)
ముంగిట్లో ఆబుగ్గమూతిపై వంగ్గా (ఎంగిలి)
వంగిన్నగూనుపై వన్నెల్లమూట(చాకిమూట)
మూటచాటుగవచ్చి మునలిచంకెక్కా

—పొది.

౨౩

వైశాఖమాసంలో వదలిపోతాడూ
మాఖమాసంలోను మళ్లావస్తాడు
వొస్తూను తెస్తాడు వుల్లిపువ్వుల్లూ

పుల్లిపిల్లనువిడిచి వెళ్లనంటాడు.
—కుంపటి నిప్పులు.

౨౪
వెలక్కాయలబండీ-
మొగురుకొంటూ పోండీ,
చింతకాయలబండీ-
చెంగుమంటూ రండీ. (?)

౨౫
వేలూరువింతా, గోలకొండకొంతా
ఇంతుల్లసంతా, ఇగిలింపుబొంతా
చంటిపిల్లలపంతం, సాగించుముంతా
—తాంబూలం, వీడెం.

౨౬
పాటల్ల పచ్చడీ, రాగాలబుఱ్ఱా
నిత్తైకయ్యాలా, నెలతపాడింది. (?)

౨౭
చింతాకాయ బొంతాకాయ
చిగురూ మామిూడికాయ. (?)

౨౮
రాకూ రాకూ బండీ, 'రావుల్లబండీ
వొస్తునాపోదునా, వోరామ చిలుకా. (?)

౨౯
అంతూ లేసీ చెట్టూకూ
అరవై నాగ్లే కొమ్మాలూ
కొమ్మకు కోటీ పువ్వూలూ
పువ్వుకు రెండే కాయలూ.
—ఆకాశపుసూర్యచంద్రాదులు.

౩౦
ఆకాశానా హారా హారా
అందుకోపోతే గరా గరా
నేలాబడితే ఠక్కున్నా
నేనూతింటే చక్కన్నా. —తాటిపండు.

౩౧, ౩౨
ఇకఇకలకాయా, ఇంకేమికాయా?
పకపకలకాయా, పడతేమి కాయా?
—ఇప్పకాయ. పత్తికాయ.

౩౩
ఇక్కడఉండే బండీ
ఎంతలోపోయె రండీ,
మల్లెమొగ్గల బండీ
మాసిందిరండీ —ఎండ.

౩౪
ఎనిమిదిచేతుల పబ్రాసీ
ఎప్పుడుతిరిగే సోబ్రాసీ
వెన్నునజంజెం వేళ్లాడూ
తీసినకొద్దీ తెర్లాడూ —రాటము.

౩౫
ఎండకుఎండదు ఏమిటీ?
వానకుతడియదు వాయించూ,
గునగునవచ్చే కూసవ్వా
కూడు జరగదే కోటవ్వా. —రూపాయ.

౩౬
జీడీవారికి కోడలూ
సిరిగలవారికి ఆడోడుచు
వైసులగుల్కే వయ్యారి
వైశాఖంలో వస్తుందీ.
—మామిడిపండు.

౩౭
బెత్తెడుబెత్తెడు పెయ్యా
భేతాళూని చెయ్యా
అంచక్కని చేనంతా
అంతలోమింగేపంవింతా? —మంగలకత్తి.

౩౮
ముక్కుమీది కెక్కు
ముందరిచెవులూ నొక్కు
టక్కులనిక్కుల సొక్కు
జారిం దంటే ఠక్కు —సులోచనము.

౩౯
ఱెక్కలుముయ్యని పక్షి
రెప్పలుముయ్యని జాణా
రెంయిమంటూ రేపెట్టు
రేపూమాపూ చేపెట్టూ (?)

౪౦
సంతల్లోసానీ, వింతల్లగూనీ
చెట్టుకెక్కే సింగమ్మా
గట్టునుండే గంగమ్మా (?)

౪౧
వచ్చేవు పొయ్యేవు నాకోఅకూ,
వంగికూచున్నాను నీకోఅకూ.
వైసుచూపూతావు నాకోఅకూ,
కాసుకోనున్నాను నీకోఅకూ.
సఘము చచ్చున్నాను నీకోఅకూ,
యిఘును చస్తున్నావు నాకోఅకూ.
—గాలము-చేప.

౪౨
మాటాల్ తేటాల్ మీవంతూ,
మాపాటిభోజనాల్ మావంతూ.
పాటా పద్దెం మీవంతూ,
మూటాముల్లా మావంతూ. (?)

౪౩
నూతిలోపామూ, నున్నన్నిపామూ
పొడలపొడలపామూ, పొట్టిపొడుగుపామూ
నాడవాడపామూ, వాలైనపామూ
చారచారలపామూ, చక్కన్నిపామూ
పామూదెచ్చి, కూరాచేస్తే
పంటికిందికి చాలదూ —పొట్లకాయ.

౪౪
పచ్చన్ని పెట్టెలో, విచ్చుకోనుందీ
తెచ్చుకోపోతేను, గుచ్చుకుంటుందీ
ఎంతగుచ్చుకొన్న, ఏమైనగానీ
తెచ్చుకోమానునే, మెచ్చుకోమానా
—మొగలి.

౪౫
వేసేవేసే జీలాకఱ్ఱా
మొలచేమొలచే ములకా కూరా
పూశేపూశే బొండూమల్లే
వేశేవేశే వింతాగెలలా
కాశేకాశే కామంచీ. —అరంటి.

౪౬
అమ్మా! అమ్మా! పెంచావూ
అల్లీబిల్లిగ నుంచావూ,
పెద్దాదాన్ని చేశావూ
పెనిమిటివూసూ మరిచావూ,
ఇంటీనేనూ ఈడేరే
ఈరాత్రెవరే కూడేదూ?
ఈడేరీన ఇల్లాల్ని
ఎత్తిపెట్టుకో యిల్లాలా!
కల్లాగాదు కాపొచ్చు
కాంతా! నిన్నూ మదిమెచ్చు
తల్లీ! తల్లీ! తలపట్టూ
తెల్లారితే తీసెట్టూ —మల్లెమొగ్గ.

౪౭
ఎగువోపలకా దిగువోపలకా
పలకలక్రిందా మెలికలపామూ
పామునుపట్టా పగ్గంలేదూ
పెగ్గెలుపలుకే సిగ్గొదినా. (?)

# విద్యార్థినులు: వ్యాయామము

శ్రీమతి వా. కమలాఱమ్మగారు

మనముబడికినెళ్లుఆడుపిల్లల విషయమై కొన్ని సంగతులు బాగుగాగమనింపవలసినదిగా నున్నది. బాలికలకు మనము విద్యగఱపుటకుగాను శ్రద్ధపుచ్చుకొని వారికొఱకెంత ద్రవ్యమైనను ఖర్చుపెట్టుటకు వెనుదీయకయున్నాము. విద్య యెల్లరికి అవశ్యకమే. కాని దానివలెనే ఆరోగ్యమునుగూడ గమనించవలెను. ముఖ్యముగా ఆడుపిల్లలవిషయమై వారి దేహదార్ఢ్యము గమనింపవలెను. హైస్కూళ్లలోను, కాలేజీలలోను విద్యార్థినులసంఖ్య ప్రతి సంవత్సరము హెచ్చుచున్నది. వారివారి తరగతులకుతగినట్లు విద్యయందు బుద్ధికుశలత కలిగియున్నను, వారి దేహపరిస్థితుల యోచించిన బళ్లలోనుండుటకు వారు తగినట్లుండరు. దుర్బలులగు పిల్లలకు వారి మెదడునకుమించిన పనినిచ్చి వారి దేహమును చెడగొట్టుట చెలుపుగాదా? ఈలాటివారు పరీక్షలయందు తీర్ణలై డాక్టర్లుగానో, టీచర్లుగానో పోయి పనిచేయజాలక విడచిపెట్టుటయో, లేక వివాహితలై గృహకృత్యములను నెరవేర్చుకొనుటకు చేతగాక దుర్బలమగు సంతానమును కని సంసారసుఖమునకు దూరులై, తమ్ము తమ సంతానమును కష్టములపాలుచేసికొని శీఘ్రముగా మృత్యువువాత బడుటయో చూచుచున్నాము. వీటికంతయు బళ్లలో విద్యార్థినులకు వ్యాయామవసతులు లేకపోవుటయే కారణము.

మనదేశపు ఆడుపిల్లలకు వివాహమే గమ్యస్థానమైయున్నది. అందులకు తగినట్లు మనము వారిని పెంచుచున్నామా? వారివారి గృహకృత్యములను చేసికొని దృఢమగుసంతానమునుపొంది ఆబిడ్డలనుజాగ్రతగపెంచుట నేర్చి నిపుణలగు గృహిణులగునట్లు వారిని మనము చేయుచున్నామా? విద్యావతులైనను ఆరోగ్యములేనియెడల స్త్రీలు సంసారమువలనను, సంతానమువలనను సుఖపడజాలరు.

మన హైస్కూళ్లవిషయమై ముఖ్యముగా మనమొకటి గమనించవలసియున్నది. స్త్రీలు వహింపవలసిన భార్యాత్వమునకు, మాతృత్వమునకు తగినవాంఛ నేర్పక ఉపాధ్యాయినిగానో, ఉద్యోగినిగానో పోవుటకు, సంసారబంధమునుండి తొలగిపోవుటకు తగు మార్గమును మన స్కూళ్లయందలి విద్యాధోరణి చూపుచున్నది. ఇందువలన స్త్రీలు నేర్చిన విద్య వారికిని మనసంఘమునకును ప్రయోజనములేకపోవుచున్నది.

మనదేశపు విద్యార్థినులకును విదేశపువిద్యార్థినులకును చాలా భేదములున్నవి. విదేశపువిద్యార్థినులు తేజోవంతములగు ముఖములుకలిగి దృఢగాత్రలుగానుండి సంపూర్ణా

రోగ్యవతులై యున్నారు. ఇందులకు కారణము వారు విద్యను దేహారోగ్యమును సమముగా చూచుచుండుటయె. అన్ని వ్యాయామక్రీడలలోను పాల్గొని ఆరోగ్యమునకు తగిన వ్యాయామవసతులయందు భోజనవసతులయందు వారు హెచ్చుగా శ్రద్ధతీసుకొనుచున్నారు. మనదేశమందవ్విధముగాలేదు. విద్యార్థినులు 'పుస్తకమ్ హస్తభూషణమ్' అను వాక్యమును వృధాపుచ్చక ఎల్లప్పుడు చేత పుస్తకముతో కాలయాపనముచేయుచున్నారు. విదేశీయులవలె టెన్నిస్, బాట్ మింటన్ మొదలగునవిలేకపోయినను వీరికిమనదేశపుస్త్రీలవలె దంచడము, విసరడము అయినను తెలియదు. ఇందుచేత మన విద్యార్థినులు జీవకళలులేక నిర్జీవమగుముఖములతో పరీక్షలలో మార్కులకు నువ్విళ్లూరుచుందురు. దేహదార్ఢ్యములేక విద్యనేర్చుకొనుటవలన ప్రయోజనమేమి? మనము విద్యనుకోరునట్లే ఆరోగ్యమును కోరి రెంటిని సమముగాదలచి దేహపరిశ్రమముచేసినట్లయితే దృఢగాత్రులమగుదుము. వ్యాయామముచేయుట కలవాటుబడ్డచో ఒక రోజైనను వ్యాయామములేకుండనుండని పరిస్థితి ఏర్పడును. అన్నపానాదులు లేనియెడల ఎట్లు పరితపించుదుమో అట్లే దేహపరిశ్రమము లేకపోయినను కష్టపడుదుము. కావున బడులలో పిల్లలకు విద్యతోసహా వ్యాయామమునేర్పవలయును.

ఇప్పటి పద్ధతులప్రకారమే స్త్రీలకు విద్యనేర్పించుచుండినచో, మనదేశము బలశాలురగు ప్రజలనుబడయజాలదు. విద్యాశాఖాధికారులు మనదేశమునకు మేలుచేయుటకు మార్గములరసి విద్యావిధానమును మార్చవలెను. మన విద్యార్థినులు బడులు, కాలేజీలు వదలినవెంటనే ఉద్యోగములో ప్రవేశించి కొద్దిరోజులకే ముసలివారగుచున్నారు. విదేశములలో మనకన్న పదిఏండ్లతర్వాత ముదిమి ప్రాప్తించుచున్నది. దానికి హేతువేమన విదేశములలో విద్యాశాఖాధికారులు వారివిద్యావిధానములో ఆరోగ్యవిషయమునకు వ్యాయామవిషయమునకు హెచ్చుప్రాముఖ్యత నిచ్చుచున్నారు. చిన్నపిల్లలకు విద్యనేర్పుట ప్రారంభించినప్పుడే వారి ఆరోగ్యమునకు తగు భోజనపదార్థములిట్టివని, దేహారోగ్యమునకు దేహపరిశ్రమము అవశ్యకమనియు ఆటలతో పాటలతోసహా నేర్పుచున్నారు. కాబట్టి మనదేశపు విద్యాశాఖాధికారులు మనవిద్యావిధానమున ఆరోగ్యము, వ్యాయామము, ఆహారమమున్నగువిషయములనేర్పుటకు ముఖ్యముగా అవకాశమిచ్చినచో వీరుగవర్నమెంటుపరీక్షలసహితము అతిసులభముగా ప్యాసుచేయగలరు. వీనికి తగిన ఉపాధ్యాయినుల నేర్పాటుచేయవలెను. ఇట్టి మార్పుల గావించుట విద్యాశాఖాధికారుల ముఖ్యకర్తవ్యముగానున్నది. విద్యాశాఖాధికారులు దీనిని గుర్తించి ఆచరణయందు బెట్టుటకు దేశీయనాయకులు తీవ్రమగు నాందోళ జరుపవలసియున్నది. నాయకులిందుకు పూనుకొందురుగాక !

# ఈయరణ్యము దాటగలనా?

తురగా వేంకటరామయ్యగారు

౧

ఈ యరణ్యముదాటగలనా?
ఏనాటి
కేని మార్గముదీయగలనా?
ఈకొండ లెగఁబ్రాకఁగలనా
హృదయేశు
నీకండ్లతోఁజూడఁగలనా?

౨

ఏవేళపయనమై నానో?
దారిలో
ఎన్నెన్నినదులీదినానో?
చావకెటుదాగల్లినానో?
ఈరేయి
సాగించి యెటుఁ జేరగలనో?

౩

కాలమేఘాల్గ్రమ్ముకొనెనా?
నక్షత్ర
కాంతికూడా కప్పబడెనా
కొండలెన్నోయడ్డువడెనా?
జీవమీ
మొండికట్టైను నిల్పఁబడెనా?

౪

సింగమ్ము గర్జించుచుంటే
కొండలే
"ఖంగు"మని మార్మ్రోగుచుంటే
జీవాలు పరుగెత్తుచుంటే.
నాగుండె
జేరునా చెదరవద్దంటే.

౫

శాశ్వతముగావలచినానా?
అందుకే
జన్మలెన్నోఎత్తినానా?
సర్వమూ విడిచియున్నానా?
నాథు నీ
జన్మనైనా చూడలేనా?

౬

ప్రకృతి "కల్యాణి"యేకాదా?
ఈసృష్టి
ప్రణయసంభరితమేకాదా?
ప్రణయమ్ముతో సృష్టిరాదా?
జగదీశు
ప్రాభవమునిత్యమేకాదా?

పోలి యనుపేర నొక్కసుశీల, సాధ్వి
కలదు రజకాంగనామణి యలఘుచరిత,
పతిపదధ్యాననిరత, పావనగుణాఢ్య,
తనకులాచారములను దప్పనిపడంతి.
తోడికోడండ్రతో తగవాడఁబోదు
అత్తమామలయెడ కడుబత్తిఁగలిగి
అతివిధేయతతోనుండు... అకట! పూర్వ
జన్మకృతపాపసంచయసంభవంబొ?
ఎంత యణకువతోనున్న నెంతభక్తి
నున్న అడుగడుగడుగు లొత్తుచున్న
రాసి అంపానఁబెట్టు రాకాసియత్త...
అన్నిటికినోర్చు నెదురాడ దావధూటి.
పుట్టినింటిధనంబేమి ముట్టదనుచు
మొనయుకోపానరేఁచి వాకొనఁగరాని
నుడులకోడలిచిత్తమ్ము నొవ్వనాడు
అర్థలోభులమతులు శూన్యములుగావె?
"చెడిప! సంసారమేమైనఁ జేయనలదో?
కాక వనిఁ గాపురంబుండఁగాఁదలంతొ?
ధర్మమా—నీ" కటంచును దగవులాడు
బిచ్చమునువేయునపుడు దావచ్చెనేని.
ఎంతవేధించుచున్న కాసంతయేనిఁ
జింతిలదు, భర్తతోడనుజెప్పి కంట
నీరువెట్టదు, వేటుండఁ గోరదాపె,
సహనమందు వసుంధరాసతియెతలంప.
విడువదెప్పుడు తన కులవృత్తినెలమి
నుడువదెప్పు డసత్యమా నుడులనొకట
ముడువదెప్పుడు పరధనంబులనువాంఛ
నడువదెప్పు డయుక్తమా నడత పోలి.

వచ్చె కార్తికమాసంబు, హెచ్చెచలియు,
సోమవారపుభజనలు చోద్యమయ్యె,
రాత్రియందు పురాణపారాయణంబు
లుదయమున నదీస్నానంబులొప్పె ప్రజకు.
పోలి నొకదాని గృహకృత్యములనొసర్ప
నింటికడఁ గాపువెట్టి నిశ్చింతతోడ
నత్తయునుఁజిన్నికోడండ్రు నరిగినారు
స్నానములఁజేసి పుణ్యమార్జనముసేయ.
అత్తయునుఁదోడికోడండ్రు నరుగఁజూచి
పెరటఁగలబావికడఁజేరి పెందలకడ
జలకములనాడి శుభ్రవస్త్రమును దాల్చి
బత్తిఁబూజించె దేవు నాయుత్తమాంగి.
అమలమగు భక్తిరస ముదకముగఁజేసి
మానసాబ్జంబు పూజాసుమంబుగాగ
విమలమా తనతనువు నైవేద్యముగను
స్వామి కర్పించిమించె నాసాధ్విమిన్న.
భక్తిగలవారికెందున్న ముక్తికలుగు—
ఘనతకై భక్తిఁగల్పించుకొనెడివార
లెన్నిదేవాలయంబులఁగన్న—నదుల
మునిగిన—క్షేత్రమేగిన ముక్తియున్నె?
పోలి యీలీల నిరతంబుఁ బూర్ణభక్తి
దేవునర్చించి యయ్యది తెలియకుండ
నత్తజూచినఁ గోపానమొత్తుననుచు
నెప్పటివిధాననుండు నేమెఱుఁగనట్లు.
ప్రతిదినంబును నదికేగి పరమభక్తు
లటఁులనటియించి స్నానంబులాచరించి
సికతశీతల నక్తకయుక్తలగుచు
వత్తురవ్వారు జనులుకన్నెత్తిచూడ.

కపటనటనావిశేషతఁ గనులఁగప్ప
వచ్చు మానవావళికి భూవలయమందుఁ
గాని పరమేశుసన్నిధి కపటవృత్తి
దాగునాయంచుదుష్టులు దలఁప రేమొ?
విమలవర్తిని, పరమసాధ్వీమతల్లి
పోలి గృహమున దేవునిపూజఁజేయు
బత్తియున్న నింటనయిన బయటనైన
ఆపరంధాముఁడొక్కఁడే యగునుగాదె?
చనియె కార్తిక మత్యంతసంతసమున—
మార్గశిరశుద్ధపాడ్యమి మానవాళు
లనఁటిదొప్పల జ్యోతుల నమరఁగూర్చి
వానివిడిచిరి నదులఁ దెప్పలవిధాన.
తెల్లవారకమునులేచి యెల్లవారి
మేలుకొనుడని గృహమునఁ బోలి నునిచి
చిన్నకోడండ్రు పూజలుసేయుకొఱకు
వలయుసామగ్రిఁగొని తన పజ్జనడవఁ
జనియె నత్తయును నదికి స్నానమునకు...
వారలరిగినవెనువెన్కఁ బూరికొంప
నెలమిఁగసపూడ్చి అలికిముగ్గులనువెట్టి
పోలి వేవేగ స్నానంబుఁబూర్తిజేసి
అరఁటిదొప్పను నొకదానిఁ బొరుగువారి
నడిగి యార్జించి జ్యోతులనందునిలిపి
పూజనొనరించి దృఢభక్తిపూరితాత్మఁ
బెరటిబావియె నదిగ సంస్మరణఁజేసి
ఆకృతివహించినట్టి పుణ్యంబునాగ
అన్యమెంచక విమలహృదయాబ్జయగుచు
భక్తిరసమున తన్మయత్వమునుబొంది
అంజలిఘటించిపలికె నాయమ్మయిట్లు.
"ఓమహాదేవ! సర్వేశ్వరా! మహాత్మ!
తెలియకయొ తెలిసియునో నేసలిపినట్టి
వెన్నొతప్పులుగలవు క్షమింపుమయ్య!
తలఁపగామేము నీకు బిడ్డలముగామె?"
అనుచుప్రార్థించి మరల వందనముజేసి
ఆలసించిన నత్త రాజాలుననుచు
మెల్లమెల్లనజ్యోతుల నెల్లనూత
విడిచిపెట్టె నాగుణవతి పొడముభక్తి.
సాధ్వి భక్తికిదైవంబు సంతసించి
మణిగణసమేతమైన విమానమొండు
నంపెనంతట తన భక్తురాలికొఱకు.
భక్తసులభుఁడుగద భగవంతుడెపుడు.
పోలి నిర్మలచరితంబు భువినివెలసె—
కానిజీవచ్ఛవంబుల కరణినుండు
మానవులజీవితం బొకమారుకాని
స్మరణఁజేతుమె? చెప్పుడీ, సాధ్వులార!

# చిత్రప్రశ్న

శ్రీమతి పోచిరాజు రాజ్యలక్ష్మీదేవిగారు

1. గృహలక్ష్ములకు ఎల్లవేళల కావలసిన వస్తువు.
2. ఒకానొక చేతిపనివాడు.
3. ఒక గొప్ప అంటువ్యాధి.

వీనికి ఒక్కొక్కదానికి మూడేసిఅక్షరములుగల నామము ఒకదానిక్రిందమఱియొకటి వ్రాసినచో అడ్డముగా చదివినను, క్రిందికి చదివినను సమానపదములుగ నుండవలయును. అవియేవి?

ఈప్రశ్నకు సమాధానము ఆలోచించి మాకు లేఖాముఖమున నవంబరు 7-వ తేదీ లోపున తెలుపుదురుగాక! గడువుదాటిన పిమ్మట పంపువారి నామములు పత్రికలో ప్రచురింపబడవు. —సంపాదకుడు.




# మొటిమలు, మచ్చలు

యౌవనప్రాదుర్భావకాలమున కొందఱికి మొగముమీద మొటిమలులేచి అందవికారమును గొనివచ్చును. అందవికారముగనున్న ఈ మొటిమలను పోగొట్టుకొనుటకు సాధారముగ వానిని బలవంతముగ చిదిపివేయుచుందురు. చిదిపిన పిమ్మట ఆ మొటిమలను పిండగా మొదట నల్లగనో తెల్లగనో ఏదో ఒకపదార్థము బయటికివచ్చును. పిమ్మట ఎరుపుడాలుగల ద్రవమువచ్చును. ఈపద్ధతిచే మొటిమపోవును గాని దాని స్థానమున మచ్చ ఏర్పడును. అందవికారము మాత్రము తొలగిపోదు. అందవికారమును కలిగించుటకు మచ్చ అయినను మొటిమయైనను ఒక్కటే. కావున మొటిమ చిదిపినను మచ్చపడని ప్రక్రియ అవలంబింపవలయును. మొటిమను మిక్కిలి సున్నితముగ చిదిసి అతిజాగ్రతగ పిండివేయవలెను. లేనిచో తప్పక మచ్చ ఏర్పడును. మచ్చ ఎర్పడకుండుటకై రెండు సంగతులు గమనింపవలయును. మొటిమ చిదిపి పిండుటకు ముందు అచ్చటి చర్మమును మృదులపఱచుట మొదటి విషయము హైడ్రోజను పెరాక్సైడు (Peroxide of Hydrogen: ఇది బజారులలో కెమిస్టులవద్ద సులభముగ దొరకును.) కొంచము చిదుపబడిపిండివేయబడిన మొటిమకుపైన పూయవలెను. దీని పూతచే అక్కడ ఎట్టి మచ్చయు యేర్పడకుండుటయేగాక చర్మము యథాస్థితిని నిలుచును. మరల ఆతావున మొటిమ బయలుదేరకుండగ కూడ చేయును. హైడ్రోజను పెరాక్సైడు సులముగ సంపాదింపజాలని పల్లెటూరి వారు అవలంబించుటకు ఒకటి రెండు సూక్ష్మక్రియలు చెప్పుదుము. వసకొమ్ము గంధముతీసి గాని; జాజికాయ, చందనము సమభాగములుగ అరగదీసి కాని; మిగులముగ్గిన పొట్లకాయలోని గుంజునుపట్టించినగాని మొటిమలు, మచ్చలు మొదలగునవిపోయి చర్మము నునుపుదేరి ముఖమునకు మంచియందము వచ్చును. అయితే ఈక్రియలు అధమపక్షము ఒకమాసముదినములైనను విడువక చేయవలెను.

## మన్మథబాణము

డాక్టరు యస్. శేషగిరిరావుగారు

నిత్యమల్లివలె సంవత్సరము పొడుగునను పూయు కొద్దిపూలజాతిచెట్లలో మన్మథబాణ మొకటి. ఇది చిన్నితుప్పగ బెరగును. ఇది హిందూదేశము నందన్ని ప్రాంతముల యందును వర్ధిల్లును. దీనిపువ్వులు ఈశ్వరప్రియమైనవి. అవి తీక్ష్ణమైన ఎఱ్ఱరంగుగానుండును. దీనివేళ్లు శాఖలుదేరి మొదలున సుమారు $\frac{1}{4}$ అంగుళము నడిమికొలత గలిగియుండును. పట్ట దళసరిగను, నున్నగను, గోధుమవర్ణముగను ఉండును. పచ్చిపట్ట కోసినచో పసిమిపసరు వెలువడును. అది కట్టనివాసన గొట్టును. ఔషధోపయోగములందు ఈచెట్టుయొక్క వేళ్లు, పువ్వులు గ్రహింపబడుచున్నవి. మన్మథబాణమును ఆంగ్లమున 'జంగిల్ జెరానియమ్' (Jungle Geranium) అనియు, అరవమున 'విర్చి' అనియు నందురు.

### వేళ్లు

ఆకలిలేమి, వాంతులు, ఎక్కిళ్లు ఈరోగముల తీవ్రత ఉపశమింప జేయుటకు దీని వేరు వాడబడుచున్నది. ఈవేరుపొడి (30 మొదలు 40 గ్రెయినులు) పిప్పళ్లతోనూరి నీటితో గుజ్జుచేసిగాని కషాయముగ (ఒకటికి అయిదుభాగములు) కాచిగాని రక్తగ్రహణి, అతిసారములయందు వాడిన మంచిగుణమిచ్చును. ఇది వెర్రిపాల (దీనినే కుక్కపాల అని కూడ అందురు) చూర్ణముకంటె మంచిది. ఏమనగా ఇది దానికివలె వికారమును కలిగింపదు. ఈగుజ్జు లేక కషాయము జ్వరములయందును, సెగరోగములయందును మంచిపని చేయును. కషాయముయొక్క మోతాదు 1 లేక $1\frac{1}{2}$ డ్రాములు. మన్మథబాణముల వేళ్లపొడి కొంచము నీళ్లతో ముద్దచేసి ఆముద్దను లింటుపై (Lint) చరిమి పుండ్లమీదను, చిరకాలముగాఉండే వ్రణములమీదను వైచికట్టిన మంచిగుణమిచ్చును. కొబ్బరికోరుపిండగావచ్చు పాలతోగాని లేక విడిగాగాని ఈముద్దను తలనొప్పులయందు కురుపులయందు వాడనగును. గొంతు నొప్పులయందు ఈవేరు గాఢకషాయము పుక్కిలించి ఉమియుటకు ఉపయోగించిన మంచిపనిచేయును.

### పూవులు

రెండుతులముల పూవులను నేతితో వేయించవలెను. అట్లు వేయించిన పూవులను జీలకర్ర, నాగకేసరములతో (దినుసు ఒక్కంటికి 4 గుంజలప్రమాణమున: 4 గుంజలనగా 7 గ్రెయినులు) కలిపి చూర్ణముచేసి వెన్నపూసతోగాని కలకండతోగాని లేహ్యాపాకమున వండి అతిసారములయందు రోజునకు రెండుసారులు ఉపయోగించిన మంచిగుణమిచ్చును.

ప్రదరరోగములయందును సెగరోగములయందును ఈపుష్పములవాడుక ప్రయోజనకారిగ నుండును. ఈపూవులు మజ్జిగతేటతోగాని పెరుగుతోగాని మేకపాలతోగాని ఈయవచ్చును.

## తైలము

ఈచెట్టుయొక్క పూవులతోను ఇతరభాగములతోను మళయాళదేశపుస్త్రీలు తమ శిశువులకు కలుగు కరపాణికురుపులకు లేపనమునకు సేవనమునకు ఔషధములను తయారుచేసి వాడుచున్నారు. ఆఔషధములలో ముఖ్యముగ వాడుకయందుండు తైలముయొక్క ప్రక్రియనిచ్చట తెలుపుచున్నాను. దాసానిపువ్వు, బాడిశ, గరికె, మన్మథబాణము వీనియొక్క స్వరసములయందు నల్లజీలకర్ర, అతిమధురము కల్కముగాకలిపి కొబ్బరినూనెతో కాచవలెను. అట్లుకాచిన తైలము లేపనమునకు మిక్కిలి ఉపయోగకరము.

మళయాళదేశపుస్త్రీలు దీని నిట్లు విరివిగ నుపయోగించుచు చక్కని లాభమును పొందుచున్నారు. వారిదేశమునందువలెనే మనదేశమునందును మన్మథబాణము సాధారణముగ ప్రతివారి పెరడులయందును పెరుగుచున్నది. కాని ఆంధ్రస్త్రీలు దీని ఔషధోపయోగమును గుర్తించలేదనియే చెప్పవచ్చును. అలంకారమునకు, దేవపూజకుమాత్రముపయోగించుచు దానివలన చేయగల పెక్కు ఔషధోపయోగములను జారవిడుచుచున్నారు. ఈచెట్టుయొక్క ఔషధోపయోగములను ఇకనైన తెలిసికొని ఆంధ్రస్త్రీలీపెరటిచెట్టును మందునకు తెత్తురుగాక!

## సుమము

తిమ్మరాజు సత్యానారాయణరావుగారు

రమ్యసుందరమూర్తియై, సౌమ్యమధుర
వాసనలఁజల్లు నొక్కపుష్పమ్ముగాంచి,
ప్రబలవాంఛ మనసునుబాధవెట్ట,
“నాకుకావలె”నని కోసినానునేను.
“ఈసుమమునాది; దీని నింకెవరుఁగూడ
చూడఁగారాదు; ఈపూవుసోయగమ్ము
నాకొరకె; ఈమధురవాసనలునుఁగూడ
నాయనుభవముకొఱకునై చేయబడియె!”
అమృదులపుష్పమునుదెచ్చి, యాసదీర
హృదయదేశానఁ బ్రేమతోనదిమినాను;

ఆమధురవాసనలనెల్ల నవశుఁడనయి
విసువులేకయే సతతమ్ము పీల్చినాను!
అంతమేలేని కోరికయతిశయింప
ఎన్నిమారులో సుమము ముద్దిడితినేను;
నాకఠినహస్తములతోడ నలిపివైచి
ఏమొ ఆనందమొందఁగా నెంచినాను.
నలిగినది పూవు; ఆవాసన లికలేవు.
అమృదులరూపమునుగూడ నంతరించె!
నలిగి, కృశియించి తెల్లనై నాదురాశ
సత్వమునుజూపు పుష్పంపుశవమె మిగిలె.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

బూసెమ్మ బూసి!
ఏమిబూసి?
దొంగబూసి—
ఏమిదొంగ?
కసిదొంగ—
ఏమికసి?
పాతకసి—
ఏమిపాత?
గుడ్డపాత—
ఏమిగుడ్డ?
మురికిగుడ్డ—
ఏమిమురికి?
తలమురికి—
ఏమితల?
బట్టతల—
ఏమిబట్ట?
పట్టుబట్ట—
ఏమిపట్టు?
గట్టిపట్టు—
ఏమిగట్టి?
కట్టుగట్టి—
ఏమికట్టు?
మడికట్టు—

ఏమిమడి?
నారుమడి—
ఏమినారు?
మిరపనారు—
ఏమిమిరప?
కొండమిరప—
ఏమికొండ?
గుత్తికొండ—
ఏమిగుత్తి?
పళ్లగుత్తి—
ఏమిపళ్లు?
దొండపళ్లు—
ఏమిదొండ?
కాకిదొండ—
ఏమికాకి?
మాలకాకి—
ఏమిమాల?
పూలమాల—
ఏమిపూలు?
మల్లెపూలు—
ఏమిమల్లె?
అంటుమల్లె—
ఏమిఅంటు?

తలంటు—
ఏమితల?
జడతల—
ఏమిజడ?
రంగుజడ—
ఏమిరంగు?
వంగరంగు—
ఏమివంగ?
సీమవంగ?
ఏమిసీమ?
రెడ్డిసీమ—
ఏమిరెడ్డి?
మోటరెడ్డి—
ఏమిమోట?
యెడ్లమోట—
ఏమియెడ్లు?
బండియెడ్లు—
ఏమిబండి?
రైలుబండి—
ఏమిరైలు?
చిన్నిరైలు—
ఏమిచిన్ని?
శేవలచిన్ని—

ఏమిరేవల?
ఓడరేవుల—
ఏమివాడ?
పొగవాడ—

ఏమిపొగ?
పొయ్యిపొగ—
ఏమిపొయ్యి?
మరపొయ్యి—

ఏమిమర?
తామర.—

౨. పాట

## ఊరడింపు

(సంపాదకురాలు) శ్రీమతి లలితాకుమారిగారు

ఊరుకోఅమ్మాయి ఊళ్లేలుతావు
పండుకోఅమ్మాయి పట్నాలుసీవి;
చిట్టిముత్తెంపుట్టె సీతకడుపున్న
మంచిముత్తెంపుట్టె మాకుఅమ్మన్న;
స్వాతివానలుకురిసె సంద్రాలకడను
పాలవానలుకురిసె బంఘాలకడను;

ఆటమాణిక్యంవే పాటమాణిక్యం
నట్టింటమాఅమ్మ రత్నమాణిక్యం;
ఆడితేముద్దమ్మ నవ్వితేముద్దు
నట్టింటమాఅమ్మ నవ్వితేముద్దు;
ఊరుకో......

## కోతిపాట

(సంపాదకులు) శ్రీ తాప్రగడ వేంకటచలపతిరావుగారు

౧

కోతిపుట్టె దెందుకురా?
కొమ్మలువిరచే టందుకురా—
కొమ్మలువిరచే దెందుకురా?
రథముగట్టె టందుకురా—
రథముగట్టె దెందుకురా?
రాముడెక్కె టందుకురా—
రాముడెక్కె దెందుకురా?

రావణున్ని చంపేటందుకురా—
రావణున్ని చంపే దెందుకురా?
సీతనుదెచ్చే టందుకురా—
సీతనుదెచ్చే దెందుకురా?
పట్టాభిషేకం చేసేటందుకురా—
పట్టాభిషేకం యెందుకురా?
ప్రజల్ని రక్షించేటందుకురా—

(సంపాదకురాలు) శ్రీమతి వడ్లమూడి వేంకటలక్ష్మమ్మగారు

౨

కోతిపుట్టిం దెందుకు?
కొమ్మలుతిరిగేటందుకు—
కొమ్మలుతిరిగి ఎందుకు?
రథములుకట్టేటందుకు—
రథములుకట్టి ఎందుకు?
రాముడెక్కేటందుకు—
రాముడెక్కి ఎందుకు?
రాజ్యమేలే టందుకు—

రాజ్యమేలీ ఎందుకు?
పంటలు పండేటందుకు—
పంటలుపండి ఎందుకు?
పాతళ్లేసేటందుకు—
పాతళ్లేసిఎందుకు?
ప్రజలు బ్రతికేటందుకు—
ప్రజలుబ్రతికి ఎందుకు?
భజనలుచేసేటందుకు—

## తిరుగుడుపాట

(సంపాదకురాలు) శ్రీమతి వడ్లమూడి రామానుజమ్మగారు

బాలికలు విలాసముగా తిరుగుచుపాడుపాట

వెంకటప్ప సంకటి
వేడుమూళ్ల దుప్పటి
కప్పుకోనుచాలదు
కోడిపిల్లదూరదు
బావిలోవేస్తే తడవదు
పొయ్యిలోవేస్తే మండదు.

### 3. భూగోళశాస్త్రకథలు

## భూమమ్మవారాలకథలు

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

భూమమ్మ విష్ణువర్ధనమహారాజుగారివద్దనుండి యొక వరము సంపాదించుకొనెను. అదేమన ఆమె తన కిష్టమైన ప్లాను ననుసరించి ఒక చక్కని గుండ్రని ఇల్లు కట్టుకొననిచ్చుట. విష్ణువర్ధనమహారాజుగారు ఆమె కావరమిచ్చుటతడవుగా ఆమె తన బిడ్డలలో నొకరగునట్టియు, ఇటీవలనే విదేశమునకేగి ఇంజనీరింగ్ పరీక్షలో ఉత్తములుగా నుత్తీర్ణులైనట్టియు పరంతపవాజపేయిగారను ముద్దులకొమరునిచే రాజభవన మనదగిన గొప్ప సౌధమును వాస్తుశాస్త్రోక్తమైన నిర్మాణముకలదిగా జేయించి దాని పటమును సిద్ధపరచునట్లేర్పాటుచేసెను. ఆమె తన అభిప్రాయములను ముందుగానే జెప్పియున్నందున పరంతపగారిచేఁ దయారుచేయబడిన వాస్తుశాస్త్రోక్తరాజభవనమునందు విష్ణువర్ధనమహారాజుగారును భూదేవిగారును సకుటుంబసపరివారముగా నివసించుచున్నారు. సృష్టికి ప్రతిసృష్టిచేయగల భూమమ్మ కల్పనాశక్తి ఎట్టిదియో ఇకముందు చెప్పబోవు ఆమె రాజభవనవర్ణనవలన గ్రహింపనగును.

ఆమె తన కుటుంబమునందెవరినిగూడ తారతమ్యభావముతోఁ జూడలేదని జూపుటకు ఆ భవనమంతయు నారింజపండువలె గుండ్రముగానుండునట్లు నిర్మింపఁబడినదని చెప్పిన జాలుననుకొందును. ప్రహారీగోడలతో గూడి ఆ సౌధశ్రేష్ఠమంతయు నాలుగుభాగములు జేసిన నందు మూడుభాగములు నీళ్లును ఒకభాగము నేలయుఁగలదిగానున్నది. ఆమె తన పిల్లల వినోదముకొరకును, వారికి భూగోళశాస్త్రజ్ఞానము బోధించుట కొరకును, ఆ భవనమునందుండు నీటిభాగమును ఐదు విభాగములుగాజేసి వానికి పంచమహాసముద్రములని పేరిడెను. అట్లే భూభాగమునుగూడ ఐదు భాగములుగాజేసి వానికి భూఖండములని నామకరణమొనర్చెను. ఆ విషయమట్లుండనిచ్చి నేడు వ్రాయబోవువిషయమునకు వచ్చెదను.

ఆమెభవనమందలి అద్భుతమైనవి.ప్రియబంధుస్మరణచిహ్నములుగాగట్టబడినవి ఏడంతర్భవనములుగలవు. అవన్నియుగలసి యొక ప్రత్యేకస్థలమున గట్టబడినందున ఆ ప్రదేశమునకు 'కాలచక్ర' మని పేరు పెట్టఁబడెను. తత్కాలచక్రమున 'వర్షము' లను అరువది గిట్టలుగలవు. ఆ గిట్టలలో 'మాసము' లనుపేర బండ్రెండావరణములుగలవు. ఆ యావరణములయందు 'ద్విపక్షశకటము'లను పేరుగల సుందరమందిరములు రెండుగలవు. ఆ ద్విపక్షశకటాలయములందు 'వారగ్రంథు' లను ఏడుగదులు నిర్మింపబడియున్నవి. ఆ గదులు ఎవరెవరి జ్ఞాపకార్థమై నిర్మింపబడినవో వారివారి చిత్రపటము లాయాగదులలోని గోడలపై అద్దములుగల కొయ్యచట్రములయందు బిగిఁపబడియున్నవని మీరు చదివి తెలిసికొనఁబోవుచున్నారు. మనమొకసారి ఆ గదులలోనికి బోయి పరీక్షించిచూచెదము. రండు:—

మొదటిగది:—ఇది మిక్కిలి వైశాల్యముగలది. ఇది లోకమిత్రమహారాజులుంగారి జ్ఞాపకార్థమై నిర్మింపబడినది. ఇందులోని తూర్పుపడమరల గోడలపై లోకమిత్రమహారాజుగారి చిత్రపటములు చక్కని గుండ్రని కొయ్యచట్రములలో బిగింపబడి అమర్చబడియున్నవి. ఇందు ఏడురంగులున్నను జూచువారికొక్కటే తెలుపురంగు కానవచ్చును. లోకమిత్రమహారాజులుంగారికి సూర్యభగవానులనియు, ఆదిత్యచక్రవర్తియనియు

మూరుపేర్లుగలవు. ఆయనకే భానుప్రభువను ముద్దుపేరును బారసాలయప్పుడు భూమమ్మ తాతగారు పెట్టియున్నందున ఈ గదియందు భానుప్రభువు శిలావిగ్రహము ఒకమూల స్థాపనముచేసి భూమమ్మ ఆ విగ్రహమునకు మొదటివారమున పూజచేయుచుండును. అది చూచి దానిని దర్శింపవచ్చెడి లోకులును ఆదిత్యవిగ్రహమును బూజింపఁదొడఁగిరి. ఆ వారమునకు 'ఆదివార'మని పేరువచ్చెను.

రెండవగది:—ఇది మొదటిగదియంత వైశాల్యముగలదికాదు. ఇది భూమమ్మనుండివిడిపోయిన వెన్నెలయ్య జ్ఞాపకార్థమై కట్టఁబడినది. ఈ గదిలోని తూర్పు పడమటిగోడలపై వెన్నెలయ్య బింబప్రతిమలు రెండు చక్కఁగా చిత్రింపబడియున్నవి. వెన్నెలయ్య జ్ఞాపకార్థమై కట్టింపబడిన ఈ గదియందు నొకమూల స్ఫటికశిలానిర్మితమైన వెన్నెలయ్య విగ్రహమునకు భూమమ్మ రెండవవారమునఁ బూజచేయుచుండును. వెన్నెలయ్యకు సోమయ్య అను మరొకపేరు కలదు. ఆ విగ్రహమును అక్కడకువచ్చు ప్రజ లారాధించి పోవుచుందురు. ఆ వారమునకు 'సోమవార' మని పేరువచ్చెను.

మూడవగది:—ఇది వెన్నెలయ్యగదికంటె నెక్కువ వైశాల్యముకలది. ఇది అంగారకమహాశయుని స్మరణచిహ్నముగఁ గట్టబడినది. ఈ గదియందు అంగారకమహాశయుని చిత్రపటము పూర్వము చెప్పబడినవారి వలెనే ఒకప్రక్కన గోడకుఁ జేర్చి కట్టఁబడియున్నది. ఆయన ముఖకాంతు లెఱ్ఱగానుండి ఆ గదియంతయు సాంధ్యరాగోదయచ్ఛాయలతో విలసిల్లుచుండును. ఈయన మంగళవిగ్రహుఁడుగావున భూమమ్మ మంగళుని విగ్రహమును రాగితోఁ జేయించి దానిని ఒకమూలనుంచి ఆ విగ్రహమును మూడవవారమున పూజించుచుండును. అది జూచుటకు వచ్చిన ప్రేక్షకులును మంగళునికిఁ బూజాపురస్కారములు నిర్వర్తించి పోవుచుందురు. ఆ వారమునకు మంగళవారమని నామకరణ మొనర్పబడెను.

నాల్గవగది:—ఇది బుధమహర్షి సత్తముని జ్ఞాపకార్థమై నిర్మింపఁబడినది. దీనియందు బుధమహర్షి విగ్రహము చిత్రింపబడి స్వచ్ఛమైన బ్రహ్మతేజస్సుతో నొప్పుచున్నది. ఈయననుగురించి చెప్పఁబడు పురాణకథ లనేకములుకలవు. అందులో తారాశశాంకవిజయమనునది యొకటి. ఈయన విగ్రహమును వెండితోఁ జేయించి ఒకమూలనుంచి భూమమ్మ ఆ విగ్రహమునకు నాల్గవవారమున పూజచేయుచుండును, నాడు లోకులును బుధవిగ్రహమును ఆరాధించి ఇష్టార్థసిద్ధినిఁ బడయుచుందురు. ఆ వారమునకు 'బుధవార' మని పేరు కలిగెను.

ఐదవ గది:—ఇది గురుమహాశయుని జ్ఞాపకార్థమై కట్టఁబడినది. ఈయనకు బృహస్పతియను నామాంతరముకలదు. ఈయన దేవతలకు ఆచార్యపురుషుఁడు. సకలనీతిశాస్త్రజ్ఞానసంపన్నుఁడు. ఈయన శిలావిగ్రహమును, ఈయన చిత్రపటమును దివ్యముగాఁ జేయఁబడి ఆ గదియందు స్థాపింపఁబడియున్నవి. ఈయన మూలవిగ్రహమునకు భూమమ్మ ఐదవవారమున పూజచేయుచుండును. లోకులును ఆయననుదర్శింపోవునపుడు గురుమహాదశ తమకెప్పుడువచ్చునో కదాయని అనుకొనుచుఁ బోవుచుందురు. ఆ వారమునకు 'గురువార' మని ప్రసిద్ధమయ్యెను.

ఆఱవగది:—ఇది శుక్రాచార్యుల జ్ఞాపకార్థమై కట్టబడిన స్మరణచిహ్నము. ఈయన విగ్రహముకూడ మిక్కిలి మనోహరముగ చిత్రింపబడి ఆ గదిలో గోడకు నొకవైపున గానవచ్చుచుండును. ఈయన మూలవిగ్రహమును ఇత్తడితో జేయించి ఆ విగ్రహమునకు భూమమ్మ బూజచేసిపోవుచుండును, పౌరాణికు లీయనను గుఱించి అనేకకథలనల్లిరి. జ్యోతిశ్శాస్త్రసంపన్ను లీయనను కడు గౌరవించుచుందురు; శకునపక్షు లీయనను తమలో ఒకరినిగాఁ జూచుకొనుచుందురు, అందువలననే కాబోలు లోకులు కొందఱు శుక్రుఁ డెదురుగానుండఁ బ్రయాణముచేయ నిరాకరించుచుందురు. కొంతమంది స్త్రీలు ఈ భవనమునకు భూమమ్మతోపాటు వచ్చి ఆఱవవారమున శుక్రవారపుకథలను చెప్పుకొని శుక్రవారాలనోములు నోచుకొని పోవుచుందురు. ఆ వారమునకు 'శుక్రవార'మని నామమయ్యెను.

ఏడవగది:—ఇది మందభాగ్యుడైన శనిమహారాజుగారి స్మరణచిహ్నము. ఇందుతూర్పుగోడకు ఎత్తుగా శనిమహారాజు ఛాయాచిత్రమొకటి వ్రేలాడుచుండ దాని క్రిందనే నిలువెత్తుగా బట్టపై వ్రాయబడి కొయ్యచట్రములతో బిగింపబడిన ఆయన చిత్రపటము గోడకు చేర్చబడియుండును. లోకమిత్రమహారాజుగారి సంతతిలో అంగవైకల్యముగలవాడు ఈయనఒక్కడే. ఇచ్చట అంగవైకల్యమనగా కుంటివాడనుట. శనివిగ్రహమునకు భూమమ్మ కడపటివారమున పూజచేయుటచూచి, చూడవచ్చిన లోకులుగూడ శనిపూజచేసి దానధర్మములుచేసికొన మొదలిడిరి. ఆ వారమునకు 'శనివార' మని పేరు కలిగెను. పాఠకులారా! నేడింతటితో భూమమ్మవారాలకథలు సమాప్తముచేసి మఱియొకసారి మిమ్ముల దర్శించెదను.

## ర. పద్యము

## చిట్టితల్లి

ఏటుకూరు వేంకటనరసయ్యగారు

చివురుచేతులలోన చిటికెపోయేను
ననలసందునబడి నలిగిపోయేను
చిట్టినాకౌగింట కరగిపోయేను
ముద్దులవెల్లిలో మునిగిపోయేను
నువ్వాలపాటలో నురిగిపోయేను
చిట్టిమాటలలోన చిందిపోయేను
గారాబుపనులలో కందిపోయేను
కకవికనవ్వించ కదలిపోయేను
మంచిచందనమంటి మాసిపోయేను
కమ్మకస్తురిసోకి కమలిపోయేను
రావటే? ముద్దాడ రతనాలవెల్లి!—
మచ్చదీసినచందమామ నీమోము
చిగురుటాకులజీబు చిన్నారికాళ్లు
మురువారువెన్నెలగురియు లేనవ్వు
తొలకరిమబ్బులో దోబూచులాడు
నీకైనగోకైన నీదుముంగురులు
కోకిల లేమావికొమ్మపై బాడ
విన్నానుకన్నాను వినుచునీపాట
అందాలచందాల కందమైవెలసి
చిదిమిపెట్టినదివ్వె చిమ్మమైవెలిగి
మామంచిదానవై మనుమువెయ్యేండ్లు
పోవటే? రాధికాపూజ కోతల్లి!—
మలయానిలుడు నీదుమామగారైన

వెన్నెలలో మెల్లపీవనవేయు
కామించిపెండ్లాడ గలిగినట్లయితె
జాబిల్లిదోతెంచు సాయాహ్నమందు
పిలువకేతలవకే పికమేమొపాడి
లేయివుళ్లనుదిని లేచిపోయినది
కావలెనంటివా? కలువపువ్వుల్లు
తుమ్మెదగొనివచ్చి తొంగిచూచినది
గుజ్జనసీమారు కుడువకేయున్న
రంగుకుచ్చెలదెత్తురా నాన్నగారు
మారామచేపొమ్ము మాయయ్యకడకు—
వెండిలాంతరుబట్టి వేగవచ్చాడె
చల్లన్నిగాలిలో చందమామయ్య
పాదరసపుబుడ్లు పలుచంగగట్టి
పందిరిపై తాను పవ్వళించాడె
చినతమ్మునికన్న సింగారమున్న
ముద్దుగాతావెన్న ముద్దలిచ్చేనె
గోగుపూవులుదెచ్చి కొండపై కెక్క—
బంగారురథముతో బరుగెత్తడేమొ,
పాలుపెరుగుదెచ్చి పాపాయికిచ్చి
పాల్లకీదెప్పించి పంపరాడేమొ,
ఉత్తదిఉత్తదే ఉత్తుత్తమామ
మాయదారివిగాదె మాయమ్మ? నీవు!—

౫. వినోదకథ

# ఏగాని అప్పు

శ్రీమతి వీరపనేని సుశీలాదేవిగారు

అసగా అసగా ఒకవూళ్లో ఒకపిల్లివుంది. ఆ పిల్లి మాజిత్తులమారి. అందరిని మోసబుచ్చుతుంది. ఇంట్లోవాళ్లు కాస్త అవతల, యివతలకు వెళ్లితేసరి, ఓపాలేగాదు, ఓరొట్టెగాదు, ఓనెయ్యేగాదు, ఓ అన్నమేగాదు, ఓపెరుగేగాదు, యేది అవుపడితే అదిఅల్లా, "గుటకాయస్వాహా" అనేస్తుంది. అందుకని యెవళ్లూ, యేమీ పెట్టేవాళ్లుకారు. ఇలా వుండగా పిల్లి ఓనాడు భూమితో అన్నదిగదా "భూదేవి! భూదేవీ! నీవుండబట్టిగదామేమున్నాం? నీపంటలేగదా అందఱూతింటారు? నీగర్భముచీల్చి నీళ్లుతీసికొని దప్పితీర్చుకొంటున్నారు. నీగర్భం శోధించేగదా వజ్రాలు, వైఢూర్యాలు, నవరత్నాలు తెచ్చుకొని రాజులుసైతం కిరీటాలలో వేసికొంటారు? ఏమమ్మా నీదాతృత్వం" అనిపొగడింది. చాలా శాంతురాలైన భూమిఅన్నదిగదా "చాలాపొగడుతూన్నావు. నాతో నీకేమైనాపనివుందా ఏమిటి?" అనే వరకు పిల్లి అన్నదికదా "ఎంతమాట! నేను లేనిపోనిసంగతులు చెప్తే పొగడికగాని ఉన్నది చెప్పితే పొగడికా? నీతో రాజాధిరాజులకే పనివున్నది. సూర్యుడికి పనివున్నది. చంద్రుడికి పనివుంది. నక్షత్రాలకు పనివుంది. నీవులేకపోతే వారంతా క్రిందపడిపోతారు. ఇల్లాంటి వాళ్లకే పనివుంటే ఇక నాబోటిదానికి పనివుండదా, నీ ఆధారం చూచుకొనేగదా బ్రతుకుతున్నాను" అంటే భూమి నవ్వి ఊరుకుంది. అప్పుడు పిల్లి ఒక ఏగాని బదులియ్యమంది. భూమి ఆమాట విని "సరే, మళ్ళీ ఎప్పుడడిగితే అప్పుడు నేనుగాని, నా ఆర్డరుపొందినవారికిగాని ఇచ్చివేస్తానని ప్రమాణికం చేస్తే యిస్తా"నన్నది. పిల్లి "కావలిస్తే సాక్షులనుగూడా తెస్తాను" అన్నది. అంటే భూమిఅన్నదిగదా "నీతివుండాలిగాని, సాక్ష్యం ఎందుకు?" అని ఏగాని బదులిచ్చింది. పిల్లి వెళ్లుతూ "సరే ఇక భూమికి ఈ ఏగాని మళ్లీ యిస్తానా ఏమిటి, ఏవరుచూశారు" అనుకున్నది. ఒకఏడాదైంది. రెండేండ్లయింది. మూడేండ్లయింది. నాల్గవ ఏడు గడిచింది. ఆరోజులలో కాలదోషాలమాటలేదు. ఓనాడు పిల్లినిజూచి భూమిఅన్నదిగదా! "పిల్లీ! పిల్లీ! నా ఏగాని ఇయ్యవా" అని. అంటే పిల్లి అన్నదిగదా "నీ ఏగాని ఏమిటి? నేనియ్యట మేమిటి?" అంటే భూమి అన్నదిగదా "నాదగ్గిర అప్పు పుచ్చుకొన్న ఏగాని" అన్నది. అప్పుడు పిల్లి అన్నదిగదా "భూదేవీ! నీవు అబద్ధమాడవు, కాని ఏపిల్లికిచ్చావో? నావంటి పిల్లులు అనేకంవున్నాయి. నీవు అప్పిచ్చిన పిల్లికి రెండు కళ్లూ వున్నయ్యా" అంటే భూమి ఉన్నయి అంది. ఈలోగా పిల్లి ఒక చెట్టెక్కి ఒక కొమ్మతో కుడికన్నులొట్టచేసుకొని "ఇదిగో నాకుఒకటేకన్ను చూడు"అంది. భూమి నవ్వుతూ "ఐతే నీకీశిక్ష చాలు" అని వూరుకున్నది. పిల్లి తన ప్రజ్ఞకు చాలా సంతోషించిందే కాని కన్నుపోవుటవల్ల ఎలుకవేట సాగక బ్రతికిననాళ్లూ చాలా దుఃఖపడ్డది.



## పదిహేను ఏండ్లకు పెండ్లి: కాన్పు: విడాకు:—

అమెరికాఖండమునందలి చికాగోనగరమున సరహాకోహెన్ అను నామె తన పదునొకండవ సంవత్సరమున పెండ్లియాడెను. మఱియొకసంవత్సరమునకు అనగా తన పన్రెండవ ఏట ఆమె బిడ్డనుగనెను. మఱి మూడేండ్లకు అనగా పదునైదవ ఏట క్రౌర్యముకారణముగా భర్తచే విడాకు ఈయబడినది. తనదేశమున జరిగిన ఈ విపరీత విషయమునకు మేయోకన్య ఏమి చెప్పునో?

## స్థూలకాయముగల ఆడది:—

ప్రపంచమునందలి స్త్రీలందఱిలోను మిక్కిలి స్థూలకాయముగల యామె ఇటలీదేశమునగలదు. ఆమె తూకము 551 పౌనులు. అనగా మూడున్నర కాటాధాన్యపు బస్తాలబరువు ఉన్నదన్నమాట. ఆమె ప్రయాణముచేయుట మిక్కిలి కష్టముగానుండినది. ట్రాముబండిగాని, మోటారుబస్సుగాని ఆమె ఎక్కుటకు స్థలసంకోచము కలుగుచువచ్చెను. కావున ప్రయాణించుట కామె ప్రత్యేక మొకలారీని ఏర్పఱచుకొనెను. ఒక సర్కసుకంపెనీవారితో గలసి ఆమె విశేషముగ యాత్రలుచేసినది. తన్మూలమున ఆమె విశేషధనమార్జించినది. ఉన్నవిశేషమేమన ఆమెను వివాహమాడుటకు పలువురు పురుషులు ప్రయత్నించిరి. ఆ ప్రయత్నించినవారు ఆమె స్థూలకాయమునుచూచి మోహించిరో లేక ఆమెకనకముపై కన్నువేసి సమీపించిరో ఊహింపవచ్చును. పాలకోసము రాయిమోయునట్లే వారు ఆమెడబ్బుకొఱకు ఆమె కాయమును సహింపనిచ్చగించియుందురు. ఏమైననేమి? వివాహముచేసికొనకయే ఈనడుమ నామె తన స్థూలదేహమును వదలి వైకుంఠమున కేగినది.

## చీమలు తొట్టిపడవను కట్టినపుడు:—

చీమలు నిప్పును ఆర్పగలవను సంగతి గృహలక్ష్మిపాఠకులకు తెలిసినవిషయము. ఇప్పుడు చీమలు తొట్టిపడవను కట్టినడిపిన సంగతి శ్రీ యం. వి. మూర్తిరాజుగారు తెలుపుచున్నారు. "ఇటీవల ఒకసీసాలో మంచి ఉడకతేనెనుంచి చీమలు పట్టకుండుటకై దానిపై కాగితమునువేసి దారముతో మూతనుబిగించి మేడపై నొక బీరువాలో పింగాణీపళ్లెమునందు నీరుబోసి దానిమధ్య నీతేనెసీసానుంచితిని. నాలుగుదినములైనపిమ్మట

తేనెకొరకు బీరువా తెరచిచూడగా వందలకొలది ఎఱ్ఱచీమలు పింగాణిపళ్లెముచుట్టును మూగియున్నవి. అందు కొన్ని ఒక గుంపుగ జేరి తొట్టిపడవవలె ఏర్పడి నీటిపై తేలియుండెను. నా తత్తరపు జాగ్రత్తతో పరిశీలించితిని. పడవనడుపువారు తెడ్లతో నీటిని త్రోసి పడవను నడుపునట్లు క్రింది భాగములోనున్న చీమలు తమ కాళ్లతో నీటిని మెల్లగా త్రోయుచుండుటచే తేనెసీసావైపునకు మెల్లగా సాగిపోవుచుండెను. పింగాణిపళ్లెముయొక్క అంచునకును, నీటిలో పళ్లెనుమధ్య నుంచబడిన తేనెసీసాకును నాలుగు అంగుళముల దూరముగలదు. నావద్ద నున్న భూతఅద్దమును దెచ్చి దానిగుండ చూచితిని. మిక్కిలి ఆశ్చర్యము జెందునట్లు చీమలుజేయు ప్రతిపని యును స్పష్టముగ కనుపించినది. తొట్టి పడవగ ఏర్పడిన చీమలతుట్టె కడుగుభాగమునయున్నచీమలు తమ తల లను పైకెత్తుకొని వెనుకభాగమును నీటియందుంచినవి. అందువలన నవి నీటిపై తేలుటకవకాశముచిక్కినది. అట్లు క్రిందివరుసలోనున్న చీమలు ఒకటితోనొకటి గొలుసువలె తమ కాళ్ళను బంధించివైచినవి. వాటిపై మూడువరుసలుగా తొట్టివలె గుండ్రముగ మరికొన్ని చీమలుగలవు. అట్లు తొట్టిగ ఏర్పడిన చీమలదొంతిలో మరికొన్ని జీమలు బల్లకట్టుపై మనుష్యులెక్కినట్లు ఎక్కి హాయిగ కూర్చుండెను. ఆహా! చీమలకెంత జ్ఞానము; సాహసము, పట్టుదల, జాత్యాభిమానముగలదో ఇంచుక విచారింపుడు. తమలోకొన్నింటికైనను మకరందము లభింపగలదని గదా స్వార్థరాహిత్యమూని చీమలు సైతము కొన్ని తమప్రాణాపాయమునైనను లెక్కగొనక ఇంత సాహసకార్యమునకు గడంగినవి. అందు కొన్నిచీమలు చావకయుండలేదు. అయినను పట్టుదలను వీడక రెండుగంటలకాలములో చీమలు తేనెసీసాను సమీపించగలిగినవి. అల్పజీవములగు చీమలవంటి కీటకముల వద్ద నుంచిగూడ మానవు లెన్నోవిషయములను నేర్చుకొనవలసియున్నదని మరువరాదు." (ఆంధ్రపత్రిక)

## చీమలయొక్క తెలివి:—

టైమ్సు ఆఫ్ ఇండియాపత్రికలో జి. యమ్. జాధవుగారు చీమలు మిక్కిలి తెలివిగలజంతువులని తెలు పుటకొక నిదర్శనమునిచ్చుచున్నారు. ఈగలబాధ వదలించుకొనుటకై వారు జిగురుకాగితమును ఈగలు దాని మీద వాలి దానికంటుకొనునట్లు నేలమీద పఱచిరి. దానిమీద పెక్కు ఈగలు వాలినవి. కాగితమునకంటు కొనిపోయి కొట్టుమిట్లాడి అవి చచ్చినవి. చచ్చిన ఈగలతోనున్న కాగితమును కొన్నిచీమలు చూచినవి. ఆ ఈగలను లాగికొనిపోవుటకు అవి ప్రయత్నపడినవి. కాని కాగితమున జిగురుపదార్థముండుటచే లాగికొనిపోవుటకు సాధ్యపడలేదు. ఈగలను సమీపించుటకే వీలులేకుండెను. అప్పుడాచీమలు ఒకదానిముట్టె దగ్గర నొకదాని ముట్టెపెట్టుకొని ఏదియో గొప్ప ఆలోచనాసభ కాబోలు చేసినవి. ఎట్టి తీర్మానమామోదింపబడినదో కాని వెంటనే ఆ చీమలన్నియు దొడదొడ వెళ్లిపోయినవి. ఈగలను కొనిపచ్చుట సాధ్యముకాదని చీమలు వెళ్లి పోయినవని భావింపబడినది. కాని ఇంతలో అవి తిరిగివచ్చినవి. ఊరికేమాత్రము రాలేదు. ఒక్కొకచీమయు ఒక్కొక్క చిన్న మట్టిఉండను కఱచికొనివచ్చినవి. మొదట ఒకచీమ తాను తెచ్చిన మట్టిఉండను కాగితము మీది జిగురుఅంచున పెట్టినది. ఒకదానివెంబడిగా మఱియొక చీమవచ్చి మట్టి ఉండను కాగితముమీద పెట్టుచు ఈగలసమీపమువఱకు చక్కనిబాట ఏర్పఱచినవి. ఆబాటమీద ఆచీమలు ప్రాకిపోయి ఈగలను సమీపించి వానిని లాగప్రయత్నించినవి. కాని అపుడును ఈగలు ఊడిరాలేదు. అంతట కొన్ని చీమలు మట్టి ఉండలను ఈగల కాళ్లక్రిందకు దొర్లించి జిగురు విడునటులజేసి వానిని లాగుకొనిపోయినవి. మానవునిచే, బ్రహ్మసృష్టిలో మిక్కిలి చిన్నజంతువుగ పరిగణింపబడిన పిపీలిక సంఘముగగూడి ఎంతటి బుద్ధిబలమును ప్రద ర్శించుచున్నదో చూచితిరా?

## ఐర్లండు దేశమున బ్రహ్మచారులు:—

ఐర్లండుదేశమునందలి పురుషసంఘములో నాలవవంతు బ్రహ్మచారులుగనున్నారు. ఇరువదియైదు ముప్పదిసంవత్సరములకు నడిమివయస్సున నున్న పురుషులలో నూటికి ఎనుబదిమంది అవివాహితులున్నారు.



## పురుషజనోచితమగు నేటివిద్య స్త్రీజనోచితము గాదు:—

నార్వేదేశపు శాస్త్రవేత్తలలో సుప్రసిద్ధుడగు డాక్టరు జేన్. ఎ. మోఁయన్‌గారు ఒసగిన ఒక ఉపన్యాసమునం దిట్లు చెప్పియున్నారు:—

"నేటిప్రపంచమునకు ముఖ్యావసరమగువానిలో బాలికలను మాతృత్వమువహించుటకు తగినవారిగా చేయుట యొకటి. నేటిబాలికలు నేర్చుచున్న విద్య స్త్రీజనోచితముగలేక పురుషులకుమాత్రమే పనికివచ్చునది గానున్నది. అగుటనే నేటి స్త్రీలు స్త్రీత్వమును గోల్పోవుచున్నారు. ఇందుమూలమున మానవలోకమునకు ఒనగూడుచున్ననష్టము అపారముగనున్నది. కావున స్త్రీలవిద్యయందిక నిట్టి 'పురుషముద్ర' ఉండరాదు. స్త్రీలకు చెప్పవలసినవానిలో ముఖ్యమైనవి మూడు. 1. వంశమును నిలబెట్టుట; 2. కుటుంబమునకు ఆహారపానీయముల సమకూర్చుట; 3. కుటుంబారోగ్యము నరసి రక్షించుట. ఇట్టివిషయులును వీనికి సంబంధించినవియు వారికినేర్పి వారిని ఇల్లలని ఇష్టపస్తువుగ చూచువారినిగా తయారుచేయవలయును. అంతియేగాని నేటివిద్యయొనర్చుచున్నటుల ఇల్లలని వారికి పెద్దపులి యగునట్లుగ చేయరాదు. నేను స్త్రీలకు విద్యనేర్పు విశ్వవిద్యాలయములు భావికాలమున మాతృమణులై వెలయగల ఎందఱోబాలికలకు శ్మశానవాటికలై ఉండుచున్నవి. విశ్వవిద్యాలయమునవిద్యబడసిన స్త్రీలు దామాషాని ముప్పదియేండ్లువచ్చినగాని వివాహమొనర్చుకొనుచుండుట లేదు. దామాషానివారికి ఇద్దఱు పిల్లలకంటె ఎక్కువ పుట్టుటలేదు. ఇది సత్యమార్గముగాదు. సవరింపబడవలయును. ఎంతత్వరలో సవరించిన లోకమున కంతమంచిది."

## నూరేండ్లకుపైబడి జీవించుచున్నవారు:—

అక్టోబరు 10-వ తేదీనాటి 'అమృతబజారుపత్రిక' ఇట్లు ప్రచురించుచున్నది:—

"ఈమధ్య లండనులో ఒక ముదుసలి విమానముమీద విలాసయాత్రగావించెను. ఆతని వయస్సు 108 సంవత్సరములు. తత్సందర్భమున నూటికిపైబడి జీవించుచున్నవారిని గురించి కొంత ప్రస్తావమువచ్చెను. ఆ ప్రసక్తిసందర్భములో ఈ క్రిందిసంగతులు వెల్లడియైనవి. సిమూక్సద్వీపములందు మనుష్యులు నూటముప్పది వత్సరములవఱకు బ్రతికియుండుట సర్వసాధారణమైయున్నది. న్యూయార్కుపట్టణమును ఆ మధ్య సందర్శించుటకు వచ్చిన ఒక టర్కీదేశీయుడు తనకు నూటయేబదియెనిమిదివత్సరముల వయసుగలదని చెప్పెను. చీనాదేశమున నొకనికి చిన్గ్‌యూన్ అను పేరిటివానికి రెండువందల ఏబదివత్సరముల వయస్సట. ఇటలీ దేశమున నూటఇరువదియొక్క వత్సరములు నిండిన స్త్రీయొకతెయు, నూట ఇరువదిరెండువత్సరములు నిండిన పురుషుడొకడును గలరు. నూరేండ్లకుపైబడి జీవించువారు బల్గేరియాదేశమున ఎక్కువమందిగలరు. గడిచిన జనభా

లెక్కల ప్రకారము ఆ దేశమునందలి జనులలో మూడువేలనూట ముప్పదితొమ్మండుగురు నూరేండ్లకు పైబడిన వయస్సుగలవారు. బల్గేరియా దేశముకంటె ఎన్నియోరెట్లు హెచ్చుజనభాగల బ్రిటను దేశమున నూరేండ్లకు పైబడి జీవించుచున్నవారు నూటనలుబదియైదుగురే గలరు. నూరేండ్లకుపైబడి జీవించుచున్నవారి సంఖ్యాబలముగల దేశములలో బల్గేరియా తరువాత స్పెయిను దేశమును పరిగణింపవలయును. ఆదేశమున మూడుపందల ఏబదియైదుగురు నూరేండ్లకుపైబడిజీవించువారుగలరు. ఐర్లాండు దేశమున నూటపదునారుగురుగలరు. బల్గేరియా దేశమున శతాధికజీవుల సంఖ్య ఇంత హెచ్చుగనుండుటకుగల కారణమేమి? కారణము బహుశా ఆ దేశస్థుల భోజన విధానము కావచ్చును. శాకములు, పండ్లు, వెన్న, రొట్టె ఇవి ఆదేశస్థుల ఆహారవిధానమునందలి ముఖ్య పదార్థములు. బల్గేరియా దేశమునందలి మూడువేల నూటముప్పదితొమ్మండుగురు శతాధికజీవులలోను పదునలుగురుమాత్రమే తమ జీవితకాలమున ఒకసారియైన వైద్యునియొద్దకు బోయినవారు. ఈ శతాధిక జీవులలో పెక్కుమంది మద్యమును ముట్టరాదనుమతమునకు చెందినవారు కారు. వారిలో మూడవవంతు చుట్ట త్రాగుదురు.”

నారింజపండ్లు; నిమ్మపండ్లు:—

తమిళనాడు ‘ఆయుర్వేదవైద్యపత్రిక’ నిమ్మ, నారింజపండ్లనుగూర్చి యిట్లు వ్రాయుచున్నది:—

“నాలుగైదేండ్లనుండి ఈ ఫలముల గుణాతిశయములనుగూర్చి అనేకపత్రికలయందు వైద్యవిద్వాంసులు ప్రశంసించుచు, తమ పరిశోధనాఫలితములనుకూడ వెల్లడించుచున్నారు. మన శరీరమునకు కావలసిన ముఖ్యమగు ఆహారపదార్థము లందుగలవని ఆహారపదార్థతత్వజ్ఞులు కనుగొన్నారు. కొంతకాలముక్రిందట నారింజపండ్లు రోగులు, బాలింతలు మొదలైనవారు తినరాదనుచుండెడివారు. కాని ఇప్పుడిప్పుడవి వారికి ప్రధానాహారముగా నొసంగబడవచ్చునని వైద్యులు చెప్పుచున్నారు. ప్రకృతిచికిత్సావాదులచే తొట్టిస్నానములు చేయువారీపండ్లను ప్రధానముగ భుజింపదగినవని నిర్ధరింపఁబడెను. బందరులో డాక్టరు అహోబలరావుగారను నొకరు నారింజపండ్లను తమకడకు వచ్చురోగులు విరివిగ ఉపయోగింపవచ్చునని యాదేశించి వైద్యము నడుపుచున్నారు. నారింజపండ్లలో ప్రశస్తమయినవి, రుచికలవి, పెద్దపరిమాణముగలవి గుంటూరు జిల్లాలో పెద్దవడ్లపూడినుండి అనేకప్రదేశములకు ఎగుమతియగుచున్నవి. పరిమాణమునుబట్టి ఇవి ఒక్కొక్కటి అణా, రెండణాలు ధరలుకలవిగానున్నవి. ఈ పెదవడ్లపూడి నారింజవిత్తనములను సంపాదించి రాజమహేంద్రవరము ప్రాంతముల నారింజతోటలను వేయుచున్నారు. కొంతకాలము క్రిందట బత్తాయి పండ్లకధికమగు విలువ ఇవ్వబడుచుండెను. కాని ఇప్పుడు నారింజ, నిమ్మ లాస్థానము నాక్రమించుచున్నవి. మానవుని సహజాహారపదార్థములలో నారింజ, నిమ్మలు ప్రధానస్థాన మాక్రమించుటచే నారింజ, నిమ్మల యుగ మారంభమైనదని చెప్పవచ్చును. ఆంగ్లేయవైద్యులు, ఆయుర్వేదవైద్యులుకూడ తమ అనుభవములనుబట్టి ఈ ఫలములనుగూర్చి సదభిప్రాయముల నైక్యకంఠముగఁ బలుకుచున్నారు. నిమ్మ, నారింజ, దబ్బ, నారదబ్బ, కమలాఫలం, ద్రాక్ష మొదలైనవన్నియు ఒక తరగతిగా చెప్పబడుచున్నవి. వీనికి ఇంగ్లీషులో సిట్రన్ కుటుంబము (Citron Family) అని పేరు. నిమ్మపండ్లనుగూర్చి ఒక ఆయుర్వేదపత్రికలో ఇట్లు వ్రాయబడియున్నది. నిమ్మపండునుగూర్చి యూరపుఖండమున శతాబ్దములక్రితముకూడ అనగా, రోమునగరమున గ్రీకులు కూడ యెఱుగరు. నిమ్మచెట్టు మొట్టమొదట హిందూదేశమునకు ఈశాన్యభాగమున కోమోన్, శిఖీపర్వత పార్శ్వప్రదేశములలో ఒక అడవిచెట్టువలెనుండెను. కాని యిప్పుడు దేశమెల్లెడల నీ నిమ్మచెట్టు విరివిగ పెంచబడుచున్నది. ఇది ఉష్ణదేశములలోను సమశీతోష్ణప్రదేశములలోను పెరుగుచున్నది. వివిధఫలసముదాయములలో నిమ్మపండువలె అనేకవిధముల నుపయోగింపబడుటలోను, విశేషగుణాధిక్యతలోను మఱియొక ఫలము సమముకాలేదు. ఈ ఫలమున నూటికి ఎన్నోరెట్లు సిట్రికుఆసిడ్ కలదు. ప్రత్యేకముగ తయారుచేయబడు సిట్రిక్ ఆసిడు, ఫలములోగల సిట్రిక్ ఆసిడుతో సరితూగలేదు. ప్రతిమనుజుడు తాను నిత్యమును

భుజించు ఆహారమున నిమ్మపండు ఏదోయొకరూపమునచేకొనుట మిక్కిలి ప్రయోజనకారియైయున్నది. ఏలనన దీనియందు విటమినులు అధికముగ గలవు. అందును ముఖ్యమైన విటమిను సి అధికముగ గలదు. నిమ్మపండులో గల గొప్పగుణమేమన దీని రసము మన శరీరములోని రక్తమును శుభ్రపఱచును. కీళ్లనొప్పులు రాకుండ జేయును. నిమ్మరసమును నిత్యమును ఈక్రిందిపద్ధతిగా సేవింపవచ్చునని తెలుపఁబడినది. మొదటిదినము ఏ ఆహారమును భుజింపక నీరుత్రావియుండుట. రెండవదినమున నిమ్మరసమును నీరును సమముగ కలిపి (పంచదార కలుపకూడదు.) త్రాగుట. ఈ విధముగ పండ్రెండుపండ్లరసమువరకు హెచ్చించి మరల ఒక్కొక్కటిగా తగ్గించుచురావలెను. ఈ విధముగ అలవాటుచేసికొనినచో క్రమముగ ఇతర ఆహారమునందిచ్ఛపోదవును. క్రమముగ నిమ్మరసము త్రాగుచు కొన్నిఫలములను భుజించుచు, అన్నమును తినుట పూర్తిగ మానవచ్చును."

—ఆకుంఠి వెంకటశాస్త్రి.

## అబలాభ్యుదయము.—

దక్షిణహైదరాబాదునందలి ఆంధ్రసోదరీసమాజపు అష్టమవార్షికోత్సవసందర్భమున శ్రీమతి ఆర్. శారదమ్మగారు అబలాభ్యుదయము అనువిషయమునుగూర్చిన ఇచ్చిన ఉపన్యాసమునందలి దిగువభాగము పునఃపఠనార్హముగ నున్నది:—

"శ్రేయస్సు నాశించుట స్త్రీలకైనను తప్పు కాజాలదు. 'వింటికి నారివలెనే పురుషునకు బడతుక'యని గోల్డ్‌స్మిత్తు కవీశ్వరుడు వచించినాడు. బండిముందుకు నడవవలయునన్న దాని రెండుచక్రములును సమానముగా నడువవలయు. పురుషులు పక్షపాతమును, స్వాభిమానగర్వములను విడనాడిన గాని స్త్రీస్వాతంత్ర్యము దుర్లభము. పురుషుడై పుట్టుటవలననే విశేషమొండులేదు. స్త్రీజన్మము కళంకముకాదు. అగునేని, తల్లిలేని తనయుడుండజాలడు. కనుక కళంకముతోనే యతడు పుట్టుచున్నాడు. కాని పురుషజన్మము శ్రేష్ఠతరమని అభిప్రాయము వ్యాపించి యుండుటవలన పాశ్చాత్యసోదరీమణులు ఆ అభిప్రాయము నిర్మూలించుటకు మిక్కిలి కష్టపడియున్నారు. ఆదేశములందలి సఫ్రజెట్టు ఉద్యమమును మీరు విని యుండవచ్చును. తిరస్కారమునకు దుర్విమర్శనమునకు సాంఘికబహిష్కారమునకు, కడకు కారాగృహప్రాప్తికైనను లోనై తమ వాదము సహేతుకవాదమని రూఢిపఱచియున్నారు. ఇంచుమించుగా పురుషులకున్న సర్వాధికారములును స్త్రీలు సాధించియున్నారు. మిస్ బాండ్‌ఫీల్డు అను సోదరి ఇప్పటి కార్మికప్రభుత్వములో మంత్రిపదవి నలంకరించి యున్నది. మనదేశమున సహితము గౌరవన్యాయాధికారిత్వము నెందరేని స్త్రీలు పొందియున్నారు. పూర్వాచారపరాయణత్వమునకు ప్రసిద్ధిచెందిన మదరాసురాష్ట్రమున శాసనసభకు ఉపాధ్యక్షురాలుగా శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు ఎన్నుకొనబడి దక్షతతో దేశసేవచేసినారు. కేవల బుద్ధివిశేషతలనే కాక బలసంపదనుగూడ స్త్రీలు ప్రఖ్యాతి గడించుచున్నారు. సర్వనాగరికుల అభిప్రాయము ప్రపంచాభిప్రాయము మనకు సాహాయ్యమొసరించుచుండ, మనమేల అధైర్యపడవలయును?"

## రామమోహనరాయలు:—

సెప్టెంబరు 27-వ తేదీని ఆసేతుహిమాచలము జరిగిన రామమోహనరాయల వార్షికోత్సవమును పురస్కరించుకొని అక్టోబరు 10-వ తేదీనాటి 'ధర్మసాధని' పత్రికలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు 'ప్రాణదాత' యను శీర్షికతో ఆమహనీయునిగురించి వ్రాసిన గభీరవాక్యములనుండి ఈక్రిందివి ముద్రితములు:—

"నూరేండ్లక్రిందట మనదేశ మిప్పటివలె లేదు. మూఢమతములకు, మూఢాచారములకు దాసులైన యజ్ఞానజనసముదాయముతో నిండియుండెను. విగ్రహారాధనములు, నరబలులు, సిడియాటలు, సహగమనములు, బహుభార్యాస్వీకారములు, తొలిచూలి బిడ్డలను గంగకర్పించుటలు మున్నగు నెన్నియో దురాచార

ములు సదాచారములుగా ప్రజలచే తలంపబడుచు సర్వసామాన్యముగా నాడు జరుగుచుండెను. అందుముఖ్యముగా స్త్రీలస్థితి మిక్కిలి శోచనీయముగా నుండెను. సహగమనమను పేరిట నేటేట నసంఖ్యాక స్త్రీలు చచ్చిన మగలతో బాటగ్నిదగ్ధలై పోవుచుండిరి. మిగిలిన వారైన సుఖజీవనము చేయజాలరైరి. ఒక్కొక్క పురుషుడు పెక్కుమందిని అనగా ఏబది యరువదిమంది స్త్రీలను సైతము పెండ్లాడుట యాచారముగానుండెను. కాని పెక్కుమంది స్త్రీలొక్కొక్కనికి కట్టిపెట్టబడి వాడిందఱను పోషింపజాలకున్న నే పుట్టింటనో పడి కాలము వెళ్ళబుచ్చుచు ఆ పెనిమిటి చచ్చినంతనే యింతమంది స్త్రీలు సహగమనముచేసి మరణించుచుండిరి. తొలిచూలు బిడ్డలను గంగ కర్పించినచో తరువాత పుట్టినబిడ్డలకు క్షేమమని నమ్మి కడుపారకనినబిడ్డలను తీసికొనివెళ్ళి స్త్రీలు గంగలో వేసి చంపుచుండిరి. వీనిని గూర్చి మంచిచెడ్డలను విచారించు జ్ఞానమైన స్త్రీల కానాడు లేకుండెను. అవిద్యాంధకారనిమగ్నలైయున్న స్త్రీలీవిధముగా జీవితేచ్ఛ లేక, సుఖాకాంక్ష లేక, మాతృవాత్సల్యము లేక సర్వశూన్యహృదయలై మానవత్వలక్షణములే గోల్పోయి జంత్రగాని చేతి కీలుబొమ్మలవలె పురుషు డెట్లుంచిన నట్లుండిరి. దయాదాక్షిణ్యరహితులగు శ్రోత్రియులు సహగమనాదిదురాచారములకు స్వార్థబుద్ధితో శాస్త్రధర్మంబులు కల్పించి స్త్రీలను హతమార్చుచుండిరి. సర్వవిధముల దుస్థితియందున్న ఇట్టి నిస్సహాయస్త్రీల నుద్ధరించుటకొక మహనీయ వ్యక్తి యుదయించు టగత్యమై యుండెను. కాన ఆమహత్తరకార్యనిర్వహణమునకుదయించిన పురుషోత్తముడే రామమోహనుడు.”

## సాంఘిక పునర్నిర్మాణము: స్త్రీలు:—

మదరాసు ప్రెసిడెన్సీకాలేజిలో తత్త్వశాస్త్రపండితులగు మహారాజశ్రీ డాక్టరు **టి.** వి. శేషగిరిరావు నాయుడుగారు (యమ్. యె. పి. హెచ్. డి.) విజయనగరము ఆంగ్లకళాశాలావిద్యార్థుల సమావేశమునం దిట్లుపన్యసించిరి:—

“మన ధర్మశాస్త్రములయందు ఈ స్త్రీధర్మమునుగూర్చి ఏరీతిని చెప్పబడియున్నది? మనము మనుస్మృతిని తీసికొని చూచినచో మనకు కానవచ్చునదేమన స్త్రీ ఎల్లప్పుడును ఒకని సంరక్షణలో యుండవలెననియు, స్త్రీకి పురుషునకున్నంత హక్కుగాని, స్వాతంత్ర్యముగాని లేదనియు తెలియుచున్నది. మైత్రేయి, గార్గి స్మృతులయందుకూడ స్త్రీలయొక్క నిర్బలత్వము, అస్వతంత్రతయే చెప్పబడియున్నది. ప్రస్తుతపుస్థితుల ననుసరించి చూచినచో స్త్రీ యొక వ్యక్తిగ పరిగణింపబడుటలేదు. శ్రుతులకాలములో స్త్రీహక్కు బాగుగ ప్రబలియుండినదని నమ్ముట కవకాశములున్నవి. కాని ఈ హక్కులు కాలముతోపాటు అవియును మాయమైనవి. ఏ శాస్త్రము మనుష్యప్రపంచమునకును, సౌభాగ్యమునకును, అభివృద్ధికిని అంగీకారము సూచింపదో అట్టిది ధర్మశాస్త్రము కానేరదు. మగవానికున్న స్వాతంత్ర్యము ఆడువాని కెందుల కుండరాదు? ఆమె మాత్రము ఒక మనస్సనియు, ఆత్మయనియు, తపస్వినియనియు తెలియరాదా? దీనికి కారణము కానరాకున్నది. మగవానియొక్క ఆధిక్యమెచ్చటనున్నది? ఆడుది ఎన్నటికిని మగవానిసొత్తు కానేరదు. స్మృతులయందు మనము గాంచునది ఏమన పరిగ్రహణవిధి (Principle Of Possessiveness). మనమిప్పుడు చేయవలసినదేమన రెండువైపులకును సరిపడు క్రొత్తవిధిని కనిపెట్టవలెను (Creativeness). స్త్రీని పురుషుడు ఎప్పుడు వానియధీనమునందున్నసొత్తు అని యనుకొనునో ఆ మరుసటిక్షణమే ఆ సంసారముయొక్క ఉత్సాహము, సంతోషము పోయినవన్నమాట. స్త్రీలను, తమ బాహుబలముచేతగాని, అధికారబలముచేతగాని బంధనమునందుంచుటకు పురుషులకెక్కడను హక్కులేదు. రోజంతయును వంటకముమూలముననో, శిశుసంరక్షణమూలముననో వ్యయపరచుటయేనా స్త్రీల ధర్మము? పరస్పరానురాగముననే మనసౌఖ్యమును వృద్ధిపరచుకొనవచ్చును. స్త్రీని ఒకబానిసవలె భావించుట మిక్కిలి హేయకరము. స్త్రీలకు పురుషులకువలెనే స్వాతంత్ర్యములను హక్కులను ఇచ్చి వారి పూర్వపుమర్యాదను వారల కొసగవలెను. స్త్రీలయందొకవిధమైన అద్భుతమగు శక్తిగలదు. స్త్రీయే పురుషుల కావేశముకలిగించునది. స్త్రీయే మనుష్యప్రపంచమునకు మాత. అటువంటి స్త్రీని మిక్కిలి దౌర్జన్యపుస్థితియందుంచుట ఏమైన సమంజసకరముగనున్నదా?”

# వనితాలోకము

శ్రీమతి బెక్కా సియన్ కన్య—

కొచ్చిను నగరమున గౌరవన్యాయాధికారిణిగ నియమింపబడినది.

శ్రీమతి ధర్మశీలాలాల్ సతిగారు—

సుప్రసిద్ధభారతచరిత్రపరిశోధకులగు శ్రీ కె. పి. జయస్వాలుగారి తనయ. వయస్సు 18 సంవత్సరములు మాత్రమే. ఆమె బెనారసు విశ్వవిద్యాలయమునందు ఆంగ్లసారస్వతమున ఎం. ఏ; పరీక్షనిచ్చినది. ఆ ఇచ్చుటలో పరీక్షాభ్యర్థులందఱిలోను మొదటదిగా జయముగాంచినది. ఆమె ఇప్పుడు లండను విశ్వవిద్యాలయమున ఆంగ్లసారస్వతమున ఉన్నతవిద్యనందుటకు ఆంగ్లదేశమునకు వెళ్లియున్నది.



శ్రీమతి ధర్మశీలాలాల్ సతిగారు

శ్రీమతి జొన్నలగెడ్డ శారదాంబగారు—

అధునిక యుగమున ఆంధ్రభాషయందు వ్యాసరచనావ్యాసంగము ననున్న ఆంధ్రవనితలలో ఈమె యొకతె. ఈమె ప్రస్తుతము కలకత్తా నగరమున నివసించుచున్నది. ఈమె వ్యాసములను కాలక్రమమున 'గృహలక్ష్మి' ఆంధ్రలోకమునకు అర్పింపగలదు.



శ్రీమతి జొన్నలగెడ్డ శారదాంబగారు

శ్రీమతి బి. ఇందిరమ్మగారు:—

ఈమె మైసూరువిశ్వవిద్యాలయమున బి.యె. పట్టమును బొంది 1928-వ సంవత్సరమున ఉన్నతవిద్యనందుటకై ఆంగ్లదేశమునందలి లీడ్సు విశ్వ

విద్యాలయమునకు పోయియున్నది. ఈమె 1929-వ సంవత్సరమున బోధనావిధానమున డిప్లమోపొందినది. 1930-వ సంవత్సరము జూనుమాసమున ఎం. ఏ. డిగ్రీని పొందినది. కొలదిదినముల క్రితము ఈమె హిందూదేశమునకు తిరిగివచ్చినది. మైసూరు నందలి స్త్రీల బోధనాభ్యసనకళాశాలకు నియంత్రిగా నియమింపబడినది.

శ్రీమతి కామాక్షీ అమ్మాళ్ గారు:—

రంగూను విశ్వవిద్యాలయమున ఈ సంవత్సరము యం.యస్.సి. ఆనర్సు డిగ్రీపొందినది. ఈమె ఒక్కతియే ఈమె ఇప్పుడు ఏతద్విశ్వవిద్యాలయము వారి ఉపాధ్యాయవర్గమున చేరియున్నది.

శ్రీమతి కోటమర్తి రాజేశ్వరమ్మగారు:—


శ్రీమతి కోటమర్తి రాజేశ్వరమ్మగారు

ఈమె పశ్చిమగోదావరిజిల్లా అత్తిలి బ్ పోష్టు పాలమూరు గ్రామనివాసిని. ఆంధ్ర సంఘమునందలి దురాచారములను దూషించుచు ఈమె ప్రహసనములను రచియించుచున్నది. ఈమె తనరచనములను గృహలక్ష్మికి అనుగ్రహింప వాగ్దానముచేసియున్నది.

శ్రీమతి మిస్ మార్సెల్లా రాయనుగారు.—

మదరాసు చిత్రకళాశాలలో విద్యార్థిని. చేతితో చేసిన నగలను మదరాసు బాల బాలికల ప్రదర్శనమునందు ప్రదర్శించెను. లోహముతో నగలపరిశ్రమనునేర్చినప్రథమభారతస్త్రీ ఈమెయే. ఈమె ఇతరులకు ఈవిద్య నేర్పదలచియున్నది.

## కావలెను

కళలయందు, విద్యలయందు, పరిశ్రమలయందు, తదితరవిషయములందు పేరుమిగిలిన ఆంధ్రస్త్రీల ఛాయాచిత్రములు, జీవితసంగ్రహములు గృహలక్ష్మిలో ప్రచురించుటకు కావలయును. అట్టి వానిని సేకరింపగల వారు వానిని సేకరించి మాకు పంప ప్రార్థించుచున్నాము.

—సంపాదకుడు.




## కృష్ణసర్పముయొక్క అద్భుతమహిమ:—

బాపట్లతాలూకా ఆదిమండ్రగ్రామమునకు ఫర్లాంగుదూరములో నొక తాటితోపులయందొకసర్పమున్న పెద్ద పుట్టగలదు. అది బయటికి వచ్చినప్పుడు జనులు గుమిగూడి ప్రక్కనున్న వరిచేను పాడుచేయుచున్నారని చేను ఆసామివారిని తిట్టగా అతని కండ్లు కాన్పించలేదు. తరువాత ఆపాము తుంగభద్రదగ్గరనున్న కొలనులో స్నానముచేసి యథాస్థానమునకేవచ్చెను. పామొక గొప్ప మహత్తుగలదని ఆవేశములుపూనిన గణాచార్లు పామునకు చందనాదిపూజలు గావించిరి. అది వారిని కలువలేదు. చేను ఆసామికేకాక ఇంటియందున్న కుమార్తెకుకూడ కండ్లు కనుపించకపోయినందున వారు పామువద్దకు వెళ్లి క్షమించమనికోరగా వారి కండ్లిపుడు కన్పించుచున్నవి. రాత్రింబగళ్లు విరామములేక తీర్థము ప్రారంభమైనది. ప్రాణాచారముబడినవారిపైనుండి సర్పము ప్రాకుచుండును. అప్పుడప్పుడు పాలుమాత్రము త్రాగుచున్నది. చూడదలచినవారు నిడుబ్రోలు లేక చుండూరుస్టేషనులో దిగిన నాలుగుమైళ్లదూరములో చూడవచ్చును. —మొగసాటి లక్ష్మణరాజు.

## గయలో పిండప్రదానము కోరుట:—

మరణానంతరజీవితవిషయమై పరిశోధనసలుపువారు శ్రీయుత రాజకుమార బోసుగారు 'అమృత బజారుపత్రిక' లో ప్రచురించిన దిగువవిషయములను అభిలాషతో చదువగలరు. "ఇరువదియైదు సంవత్సరముల వయస్సుగల నాజ్ఞాతి యొకడు జ్వరముతగిలి కొంతకాలముక్రిందట చనిపోయెను. అప్పటి కాతనిభార్య గర్భవతిగానుండినది. అతని శ్రాద్ధకర్మలు చేయవలసినది ఆమెయే. గర్భవతికావున శ్రాద్ధకర్మాచరణముచేయవలనుపడినదిగాదు. ఆమె నీళ్లాడి పురుడువెళ్లిన పిదప ఒకానొక అమావాస్యదినమున శ్రాద్ధము విధ్యుక్తముగ జరుపబడెను. కాని శ్రాద్ధబ్రాహ్మణులు భోజనముచేయుచుండగా కుక్కయొకటివచ్చి వారినడుమనుండి పోవుటచే వారు భోజనములు విడిచి లేచిపోవలసివచ్చెను. శ్రాద్ధమయిన పిమ్మటను చనిపోయినమాజ్ఞాతిచెల్లెలు ఎనిమిదితొమ్మిదియేండ్లవయస్సుగల ఒక బాలికతోకలసి అస్థికలుతెచ్చుటకై అతనిని పాతిపెట్టిన స్థలమునకు పోయెను. వారు అస్థికలు కొనివచ్చిన కొద్దిదినములకు ఆ బాలికకు జబ్బుచేసెను. రక్తవిరేచనములు పట్టుకొనెను. జబ్బులోనుండగా ఆమె యొకనాడు మూర్ఛపోయెను. మందులు మాకులు ఆమెను మూర్ఛనుండి తేర్చలేకపోయెను. కావున ఒక మాంత్రికుని పిలిచిరి. మంత్రవాది మంత్రములు చదువనారంభించెను. ఆ బాలిక హఠాత్తుగ లేచి 'వెళ్లిపోవుచున్నాను, వెళ్లిపోవుచున్నాను' అని కేకలువైచెను. మంత్రవేత్త 'ఎవరు నీవు' అని ప్రశ్నించెను, 'నేను అశ్వినీను' అని బాలిక బదులుచెప్పెను, చనిపోయిన మాజ్ఞాతిపేరు అశ్వినే. అప్పుడు ఆ బాలికకును మంత్రజ్ఞునకును ఈ క్రిందిసంభాషణ జరిగెను:

ప్రశ్న:—ఈ బాలిక నేల పట్టుకొంటివి?

ప్రత్యు:—నేను ప్రస్తుతము నివసించుచున్న శ్మశానమునకు ఈమె పోయి యుండుటచేత.

ప్రశ్న:—ఈ బాలికతోనున్న పెద్దామె నీవేల పట్టుకొనలేదు?

ప్రత్యు:—ఆ పెద్దామె చేతులయందు ఎముకలుండుటచేత.

ప్రశ్న:—నీ శ్రాద్ధము యథావిధిగా జరిగినదికదా నీ వింకను శ్మశానముననే తిరుగాడుచుండ నేల?

ప్రత్యు:—శ్రాద్ధమొనరించిన ఆమె (తన భార్యయనుట) అశుచిగానుండినకారణమున ఆమె యిడిన పిండములను నేను గ్రహింపలేకపోయితిని. శ్రాద్ధబ్రాహ్మణుల భోజనములు ఇందువలననే చెడగొట్టబడినవి. (పరిశీలింపగా శ్రాద్ధకాలమున ఆతని భార్యను కురుపువేసియుండెననియు, దాని నెత్తురుతో బట్ట మసిక అయి ఉండవచ్చుననియు తెలియవచ్చెను.)

ప్రశ్న:—సరే, చేసిన శ్రాద్ధమువలన నీవు తృప్తికలుగలేదు. నీకు తృప్తికలుగుటకై ఇపుడేమి చేయవలయును?

ప్రత్యు:—శ్రాద్ధము యథావిధిగా తిరిగి జరుపబడవలయును. లేదా గయలో పిండప్రదానము జరుగవలయును.

అట్లే జరుపబడునని చెప్పినమీదట భూతము ఆ బాలికను వదలెను. ఆబాలిక స్వాస్థ్యమువహించెను.”

## సంతానవిషయమున కలియుగ ధృతరాష్ట్రుడనదగినవాడు:—

భారతమంతయు బొంకు అనువారు తమ వాదమునకొక ఆధారముగ మానవసామాన్యుడగు ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు నూర్గురు పుత్రులుపుట్టుట అసంభవమని పలుసారులు ఎత్తిపలుకుచుందురు. కాని జర్మనీదేశమునుండి వినవచ్చుచున్న ఈ వార్తను విని వారు తమవాదమును వదలుకొనవలసివచ్చునదిగానున్నది. హెర్ బెర్నార్డు స్కీన్‌బెర్గు అని ఒక జర్మనుదేశీయుడు. ఆతని భార్య ఇప్పటికి ఇరువదిసంవత్సరముల క్రితము అనగా 1910-వ సంవత్సరప్రాంతమున తన ఏబదియారవ ఏట మరణించినది. ఆమె తన జీవితకాలమున అఱువదితొమ్మండుగురు పిల్లలనుగనెను. ఆమెకు కలిగినకాన్పులలో ఒక్కటియు ఒక్కొక్క బిడ్డను గన్నవిగావు. ఒక్కొక్కకాన్పున నలుగురేసి బిడ్డలచొప్పున ఆమె నాలుగుకాన్పులు గాంచెను; ఒక్కొక్కకాన్పున ముగ్గురేసి బిడ్డలచొప్పున ఆమె ఏడుకాన్పులుగాంచెను; ఒక్కొక్కకాన్పున ఇద్దఱేసి బిడ్డలచొప్పున ఆమె పదునాలుకాన్పులు గాంచెను. ఇట్లు అఱువదితొమ్మండుగురు పిల్లలను భర్తకు ప్రసాదించి ఆమె ఈశ్వరసాయుజ్యముపొందెను. కాల్లావేళ్లా పిల్లలుకలిగియున్నను స్కీన్‌బెర్గు తిరిగి వివాహముచేసికొనెను. ఆ సంతానగోపాలుని చేపట్టి రెండవభార్యకూడ సంతానమును బడసెను. పుత్రులును పుత్రికలును కలిసి ఈమెకు పదునెనమండుగురు కలిగిరి. ఈమె ఇంకను సజీవురాలై యున్నది. అభినవధృతరాష్ట్రుడనదగిన స్కీన్‌బెర్గునకు ఇప్పుడు డెబ్బదియేడు సంవత్సరములు. ఆరోగ్యముగ ఆనందముగనున్నాడు. పుత్రికలైననేమి పుత్రులైననేమి ఆతనికి ఈ డెబ్బదియేడువత్సరముల జీవితకాలములోను ఎనుబదిఏడుగురు పుట్టిరి. దామాషాను సంవత్సరమునకు ఒక్కరికంటె ఎక్కువయేయున్నారు; అయితే ఎనుబదిఏడుగురులోను ఇరువదిమంది మరణించిరి. అఱువదిఏడుగురు సజీవులై యున్నారు. ఆ తండ్రియు ఈ బిడ్డలును ఒక్కపంక్తిని కూర్చొని భోజనముచేసినచో పెండ్లిపంక్తివలె నుండునుగదా? దుర్యోధనసంపత్తి.

సెప్టెంబరు 20:—బొంబాయి యుద్ధసంఘాధ్యక్షురాలగు శ్రీమతి రామాబాయి కందార్ గారిని పినలుకోడు 118-వ సెక్షను క్రింద అరెస్టుచేసిరి.

—శ్రీమతులు కమలవిశ్వాస్, సుషమముఖర్జీ, సురమముఖర్జీ గారలకు కలకత్తా బుర్రాబజారులో విదేశవస్త్రవిక్రయనిరోధమునకై 4 నెలలు విడికైదు విధింపబడెను.

21:—

22:—నడియాడులో మద్యశాలను పికెటింగుచేయుచుండగా 8 మంది స్త్రీలు అరెస్టుచేయబడిరి. వీరిలో ఒకవనితకు ఆరునెలలబిడ్డ చేతిలోనుండెను.

—బొంబాయిలో శ్రీమతి కందార్ గారికిని, కాంగ్రెసు బుల్లెటిన్ సంపాదకురాలు దిల్షన్ సయ్యదు అనునామెకును చెరిమూడునెలలు విడికైదు విధింపబడెను.

23:—బొంబాయిలో హుస్సేనుత్యాబ్జిగారి అధ్యక్షతక్రింద మహిళామణులు సమావేశమై దేశభక్తులందరును జెయిలులోనున్న ఈసమయమునజరుగు రౌండుటేబిలుసభయందు తమకు నమ్మకములేదనియు, సభకు నియమింపబడిన ఇరువురు స్త్రీప్రతినిధులు వారికి వారే ప్రతినిధులనియు, వారు భారతస్త్రీలకు ప్రాతినిధ్యము వహింపజాలరనియు తీర్మానించిరి.

24:—

25:—మోటారుపందెములందు విజయముగాంచిన గౌరవనీయురాలు శ్రీమతి విక్టరు బ్రూసు సతి లండనునుండి జపానునందలి టోకియోకు విమానప్రయాణము ప్రారంభించెను.

26:—

—ఎన్నికల పికెటింగు ఫలితముగా కటకమునందు కాంగ్రెసు సంఘకార్యదర్శినియగు మాలతీదేవిగారిని అరెస్టుచేసి ఆరునెలలు విడికైదు విధించిరి.

27:—కలకత్తాలో శ్యామ్‌బజారులోని విదేశవస్త్రముల దుకాణములవద్ద పికెటింగుచేసినందులకై శ్రీమతులు అరుణదాసుగుప్త, లఖిమనదేవిగార్లకు చెరి 3 నెలల విడికైదు విధింపబడెను.

28:—

29:—జస్టిసు బదరుద్దీనుత్యాబ్జీగారి కుమార్తెయగు శ్రీమతి లక్ష్మణీసతిగారికి (65 సంవత్సరముల వయసు, మహమ్మదీయకులము) కల్లంగడులపికెటింగునేరముక్రింద కుర్లా రెసిడెంటు మేజస్ట్రేటు 5 నెలలు కఠినశిక్ష విధించెను. థానాజిల్లాజడ్జి ఈ కేసునుగూర్చి బొంబాయి హైకోర్టువారికి వ్రాసెను. న్యాయమూర్తులు మడ్గోకరు, బార్లీగార్లు విచారణచేసి తీర్పుచెప్పిరి. శ్రీమతి లక్ష్మణీసతిగారు సాంఘికసేవకొఱకే పికెటింగుచేసెను. ప్రజల చెడు అలవాట్లు తొలగించుటయే ఆమె యుద్దేశముగాని దుకాణములను మూసివేయించుట కాదు. కాన ఆమెకు శిక్షవిధించుట తప్పు అని జిల్లాజడ్జిచేసిన సూచనను హైకోర్టుజడ్జీ లిద్దరును కూడ నామోదించిరి. ఆమెను విడుదలచేయవలయుననియు, జుల్మానాను వసూలుచేసియుండినచో తిరిగి ఇచ్చివేయవలయుననియు వారు తీర్పుచెప్పిరి.

30:—పంజాబు ప్రభుత్వకార్యనిర్వాహకసంఘసభ్యులును, మంత్రులును రాజప్రతినిధికొసంగిన వీడ్కోలువిందు సందర్భమున వ్యవసాయమంత్రియగు సర్. జోగీంద్రసింగుగారు శ్రీమతి ఇర్విను ప్రభ్విని గూర్చి ఇట్లుపలికిరి. "ప్రజలకష్టములను నివారించుటకు ఇర్విన్‌ప్రభ్వి ప్రయత్నించినది. స్త్రీవిద్యకై ఆమె చాలకృషిచేసినది. ఆమెదయ, సద్భావము ఇతరులకు ప్రీతి కలుగచేసినవి. అనేక భారతస్త్రీలు ఆమెకు వందనములర్పింపగలరు." ....

అక్టోబరు: 1:—కలకత్తా బాంబుకేసు సందర్భమున కలకత్తాలో అరెస్టుచేయబడిన శ్రీమతులు కుమారీరేణుక, కుమారీకమలాగార్లను ప్రధానరాజధానిమేజస్ట్రేటు కోర్టుకు తీసికొనిపోయిరి. వారినిద్దరను ఈనెల 6-వ తేదీవరకును రిమాండులో నుంచుటకు అతడు ఉత్తరు వొసగెను.

—శ్రీమతి బెసెంటమ్మగారి ఎనుబదినాలుగవ జన్మదినము.

2:—శ్రీ వేటపాలెము సారస్వతనికేతనమున చతుర్థవార్షికమహిళాసభ శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి అధ్యక్షతక్రింద జరిగెను.

—శ్రీ గాంధిమహాత్ముని 62-వ జన్మదినోత్సవము చెన్నపురిలో శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిగెను.

—బొంబాయిలో శ్రీమతులు పెరిన్ కెప్టన్ సతి, లీలావతి మున్షి సతిగారులు కారాగారవిముక్తులైరి.

3:—ఈనెల 1-వ తేదీని అహమ్మదాబాదులో ఎరెస్టుకాబడిన దాదాభాయి నౌరోజిగారి మనుమరాలు కన్యాకుర్షదు బెనునౌరోజిగారికి ఒక నెల విడిఖైదు, 25 రూపాయిల జరిమానా, జరిమానా చెల్లింపనిచో ఇంకొక నెల ఖైదు విధింపబడెను. ఏ తరగతి ఈయబడెను.

4:—రాజమహేంద్రవరమునందు హితకారిణీసమాజమువారియాదరణమున వితంతుశరణాలయ బాలిక శ్రీమతి లీలావతిగారికిని కోయంబత్తూరు వాస్తవ్యులు శ్రీయుత సి. యస్. సంగమేశ్వరముగారికిని వివాహముజరిగెను.

5:—శ్రీ ఇర్విన్‌ప్రభ్వి సిమ్లా చేరెను.

6:—బొంబాయిలో సురేంద్రజీపాండ్యాగారు 'సినిమా రంగభూమి' అను పత్రికకు సంపాదకుడుగనుండెను. ఇటీవలనే ఇతనిపైని రాజద్రోహమునకు కేసు తేబడినందున మేజస్ట్రీటు ఇతనికి రెండేండ్లుకఠినశిక్ష విధించెను. ఇతడు సినీమానటి జుబీదాకన్యనుగూర్చి మానవష్టకరమగు వ్రాతలను తనపత్రికలో వ్రాసెనని ఆమె ఇతనిపై కేసుతెచ్చెను. కేసు విచారణకు వచ్చెను. జెయిలుదుస్తులతోనున్న పాండ్యాగారిని కోర్టుకుతీసికొనివచ్చిరి. ఆస్థితిలో అతనిని చూడగానే జుబీదాకన్యకు జాలికలిగినది. 'మీరితనికి శిక్ష విధింపవలెనని నేను కోరను.' అని ఆమె తన న్యాయవాదిద్వారా మేజస్ట్రీటునకు తెలియజేసెను. కాని మేజస్ట్రీటు ఇది గొప్పనేరమనిభావించి ఆతనికి 6 నెలలు విడిఖైదువిధించెను. పాండ్యాగారు 'ఈమెను గూర్చినవార్త ఎవరో నాకువ్రాసిపంపిరి. నేను సరిగా విచారణచేయకుండ దానిని పత్రికలో ప్రకటించితిని. నేనందులకు చాల చింతిలుచున్నాను' అని తెల్పిరి.

—కలకత్తా బాంబుకేసుసందర్భమున ఈ నెల 1-వ తేదీనిఅరెస్టుచేయుబడి రిమాండులోనుంచబడిన నారీమణు లిద్దఱుని విడుదలచేయబడిరి.

—వెనుక మధ్యరాష్ట్రశాసనసభలో నామినేటెడ్ సభ్యురాలుగనుండిన శ్రీమతి అనసూయాబాయి కేల్‌గారు నాగపూరు మహారాష్ట్రసమరసంఘమునకు 10-యవ నియంత్రిగా నియమింపబడినది.

6:—ఏలూరునందు కీ. శే. శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవిగారి వార్షికోత్సవము శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతక్రింద జయప్రదముగ జరిగెను.

7:—తణుకులో కీ. శే. శ్రీమాగంటి అన్నపూర్ణాదేవిగారి తృతీయవార్షికోత్సవము, చరకాపాఠశాల ఉపక్రమణోత్సవమును శ్రీమతి మల్లి రామనాథంగారి హాలులో శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతను జరుపబడెను.

—జాస్కుకు ఇరువదిమైళ్ల దూరమున హిమోబారీకు అనుపేరుగల కొండలవరుసపైని బ్రూసుసతిగారి విమానము పగిలిపోయెను. ఆమె సురక్షితముగానున్నది. రక్షణ ఈయబడినది.

8:— శ్రీమతి సుఖదేవి పలివాలుగారు ఫిరోజబాదునందు నాల్గవ ఆర్డినెన్సుప్రకారము అరెస్టుచేయబడిరి.

—కలకత్తాలో మహిళారాష్ట్రీయసమితి కధ్యక్షురాలుగానుండిన చమేలీదేవిగారు పికెటింగు ఆర్డి నెన్సుక్రింద రాజధానిజైలులో 6 నెలల శిక్షననుభవించుచుండగా గడచినవారము మగ శిశువును కనెను. పుట్టిన వారముగోజులకు అనగా ఈనెల 7-వ తేదీని శిశువు మరణించెను. పురిటితల్లిని ఈదినము ఉదయము వదలిపెట్టిరి.

9:—నైజాంస్టేటులో కష్టమ్సుక్లార్కుగనున్న గోవిందరాజుల వేంకటకృష్ణారావుగారికిని బాల వితంతువు ఐతంరాజు అనసూయమ్మనుఇచ్చి కాకినాడ సూర్యారావుపేటయందలి బాల వితంతు శరణాలయములో వివాహముజరిగెను.

—బొండాడగ్రామ కాపురస్థులగు శ్రీమతి వారణాసి సీతమ్మగారు మూడు మాసముల ప్రవాసమైన తరువాత రాయవెల్లూరు స్త్రీల చెఱసాలనుండి విడుదలయైరి.

—లాహోరులో జుట్షీ సతియొక్క చెల్లెండ్రు మువ్వురు అరెస్టుచేయబడిరి.

10:—మైసూరు రాష్ట్రములోని గ్రామవాసులకు ఆరోగ్యధర్మములను శిశుపోషణనుగూర్చి బోధించుటకై స్త్రీ ప్రచారకులను నియమించవలయునని మైసూరు అసెంబ్లి సభ్యురాండ్రగు శ్రీమతులు శాకమ్మగారును, కమలమ్మగారును మైసూరు అసెంబ్లిసభలో తీర్మానమును పాదించిరి. కావలసినంతమంది ప్రచారిణులు లేనందున ప్రస్తుతము ఇది కష్టసాధ్యమనియు మైసూరుప్రభుత్వమువారు ఇందువిషయమైన శ్రద్ధ వహించియేయున్నారనియు బదులు చెప్పబడెను.

—లాహోరునగరమున కాలేజీల పికెటింగుసందర్భమున అరెస్టుచేయబడిన జుట్షీ చెల్లెండ్రు మువ్వురు, పిండీధరకన్య మున్నగువారలు 16 మంది స్త్రీలును విచారింపబడి ఒకనెల విడి ఖైదును, రూ. 150 జరిమానాయు (లేనియెడల మరి రెండువారములు ఖైదు) విధింపబడిరి. జుట్షీ చెల్లెండ్రును, రూపకార్, శకుంతలగార్లును ఏ తరగతిలో నుంచబడిరి. మిగిలినవారికి బి తరగతి ఈయబడెను.

11:—శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారు బొంబాయి వెళ్లిరి.

12:—శ్రీమతి సోదరి సుబ్బలక్ష్మమ్మగారిచే స్థాపింపబడిన శ్రీశారదావిద్యాలయముయొక్క సహాయార్థమై మ్యూజియము థియేటరునందు వివిధవినోదప్రదర్శనమొకటి జరిగెను.

13:—ఢిల్లిలో శ్రీమతి బ్రిజరాణిగారు స్త్రీల కాంగ్రెసుసంఘాధిపురాలు అరెస్టుచేయబడెను.

—లాలా లజపతిరాయిగారి కుమార్తె శ్రీమతి పార్వతీదేవిగారు అరెస్టుచేయబడిరి. స్త్రీల జెయిలులోనుంచబడిరి. ఆమె 124 (ఏ) సెక్షనుప్రకారము నేరస్థురాలని నేరారోపణ చేయబడెను. జామీనుమీదవిడుదలచేయబడుటకు అనుమతినొసంగెదనని మేజస్ట్రేటు చెప్పినను ఆమె జామీనిచ్చుటకు నిరాకరించెను.

15:—గుంటూరునందలి స్త్రీసనాతనధర్మమండలివారి 25-వ వార్షికోత్సవసభ శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి యధ్యక్షతను జయప్రదముగ జరిగెను.

16:—చెన్నపురి ఆంధ్రమహాసభవారి యాజమాన్యమున తత్సభాభవనమందు శ్రీమతి హిల్డావుడ్ సతిగారు 'భారతదేశకార్మికసమస్య' యను విషయమునుగూర్చి ఉపన్యాసమొసంగిరి.

17:—

18:—అహమదాబాదులో కోటీశ్వరుడును గొప్ప మిల్లులయజమానియునగు అంబాలాలు సారాభాయిగారి భార్య శ్రీమతి సరళాదేవిగారు నేడు గుజరాతు డిక్టేటరుగను రాష్ట్రీయ కాంగ్రెసుసంఘ కార్యదర్శినిగను నియమింపబడిరి.

19:—




**జనాభాగణనమును బహిష్కరింపరాదు:—**

శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు జయిలునుండి విడుదలయైవచ్చినపిమ్మట ఒకటి రెండుతావుల ఉపన్యసించుచు రాబోవు జనభాలెక్కలను బహిష్కరింపవలెనని చెప్పిరి. చెప్పుటయేగాదు దీనినిగూర్చి ఆలోచింపవలసినదిగా దేశీయమహాసభాధ్యక్షులకు తెలిపియున్నారు. ఎరస్టగుటకు ముందు జవహారిలాలు నెహ్రూగారు ఈ విషయమై రాజగోపాలాచారిగారికి ఇట్లు లేఖవ్రాసియున్నారు. "వచ్చే జనాభాలెక్కలను బహిష్కరింపవలయునని మీరు సూచించుచున్నట్లున్నది. మేము మీతో పూర్తిగ నేకీభవించుచున్నారము. జనాభాబహిష్కారమన్న జనాభాలెక్కలను తయారుచేయు గౌరవోద్యోగముల నిర్వహించుటకు తదితరసహాయమునుజేయుటకు జనసామాన్యము నిరాకరించుటయు అధికారులు దెలిసికొనగోరుసంగతులనుజెప్పనిరాకరించుటయునన్నమాటయే." జనాభాలెక్కల గణనమునుబహిష్కరించుట లెస్సయగు మతముకాదు. సైమనుకమీషను, రౌండుటేబిలుసభ మొదలగువానివలె జనాభాలెక్కలు రాజకీయమునకు సంబంధములేనివి. జనాభాలెక్కలు తీసుకొనువారికి సరియగు ప్రత్యుత్తర మీయనిచో 50 రూ. జరిమానా విధింపబడును. ఇట్టి శాసనధిక్కారముచే ప్రభుత్వము స్తంభింపబడునా? జాతీయోద్యమమునకు క్రొత్తసత్తువ కూర్పబడునా? స్తంభింపనుబడదు. కూర్పనుబడదు. అయినచో జనాభాలెక్కల బహిష్కారము సమ్మానార్హమనరానిదగుచున్నది. ఈ జనాభాలెక్కలు పదిసంవత్సరముల కొక్కసారి తీసికొనబడును. పదేసిసంవత్సరముల కొక్కసారి తీసికొనబడుచుండుటచే ఆలెక్కలు దేశముయొక్క అభివృద్ధి ఆయాపదిసంవత్సరములకాలమున నెట్లునడచినదో ఆవర్జాతేల్చుటకు సులభముగానుండుచున్నవి. ఆవర్జా తేల్చుట సులభమగుటయేకాదు. ఆ తేల్చిన ఆవర్జా కాలవ్యత్యాసము పొసగకుండుటచే సరియైనదై యుండుచున్నది. అదియును

గాక ఉప్పుచట్టము మొదలగు నీతిబాహిరములైన చట్టములనేగాని ఇట్టి దేశహితైకకార్యములను బహిష్కరించుటకు గాంధి ఒప్పుకొనడు. ఈ కారణములచే జనాభాను పూర్తిగ బహిష్కరించుటగాని, దానిపనులను కొంతకాలము ఆపియుంచునట్లు చేయుటగాని నష్టదాయకమును అకార్యకరణమును అగుచున్నది. వీనిని గమనింపక కాంగ్రెసువారు జనాభాను బహిష్కరించుటకే భీష్మించినచో జనాభాలెక్కల పరిగణనము ఎట్లును ఆగదు కాని తేల్చబడిన లెక్కలుమాత్రము లోపభూయిష్టమై దేశముయొక్క అభివృద్ధిని యథాస్థితియందు ప్రదర్శింపజాలని చెడారమగును. ఇట్లగుటకు దేశమునందలి అర్థశాస్త్రవేత్తలు ఒప్పుకొనజాలరు. కావున జనాభాపరిగణనము బహిష్కరింపకుండుట మంచిది. రాబోవుకాంగ్రెసు మహాసభయందీవిషయము చర్చింపబడుగాక!

మైసూరు రాష్ట్రమున జన్మనిరోధప్రచారము:—

స్వదేశసంస్థానములలో మైసూరురాష్ట్రము అనేక విషయములలో ముందడుగు వేయుచున్నది. జన్మనిరోధప్రచారము ప్రభుత్వమువారు చేకొననచ్చునా కూడదా అను విషయమునుగూర్చి నాగరికతాశిఖరమునధిష్టించిన ఐరోపియనురాష్ట్రములే ఇంకను ఎట్టి నిర్ణయమునకురాలేదు. పూర్వాచారమునకు పేరుమోసిన దక్షిణహిందూదేశమునకుచెందిన రాష్ట్రమయ్యు మైసూరున ఐరోపియనురాష్ట్రములందు ఇంకను ఎట్టి నిర్ణయమునకురాని విషయమునుగూర్చి ప్రభుత్వమే బాధ్యతవహించుటకు పూనుకొన్నది. మైసూరురాష్ట్రమున సీనియరుసర్జనుగానున్న డాక్టరు సుబ్బారావుగారు వైద్యవృత్తిమూలమున తన అనుభవమునకు వచ్చినదానినిబట్టి పెక్కుమందిస్త్రీలు అనారోగ్యముచేతనైననేమి, పెక్కుకాన్పులను పొందియుండుటచేతనైననేమి తిరిగి మాతృత్వము వహించుటకు అనర్హులై యున్నారని తేల్చి ఆసంగతి ప్రభుత్వమువారికి నివేదించిరి. నివేదించుచువారు సంస్థానమునగల సుప్రసిద్ధ వైద్యాలయముల నాలుగింటియందును వైద్యురాండ్రను నియమించి మాతృత్వము వహింపనర్హలగు స్త్రీలకు వారిచే జన్మనిరోధమునుగూర్చిన విషయములు బోధింపవలయునని సూచించిరి. ఈసూచనను ప్రభుత్వము వారంగీకరించిరి. దీనిని ఫలితము లెట్లుండునో వేచిచూచెదము.

స్త్రీసనాతనధర్మమండలి: పంచవింశతివార్షికోత్సవము:—

ఆంధ్రదేశమునందలి స్త్రీసమాజములలో గుంటూరునందలి స్త్రీసనాతనధర్మమండలి పల్లచే గౌరవింపదగినది. ఆమండలియొక్క 25-వ వార్షికోత్సవము అక్టోబరు 14, 15 తేదీలయందు జయప్రదముగ జరిగినది. వార్షికోత్సవమునకు అధ్యక్షురాలు ఆంధ్రవిదుషియు,

ఆంధ్రగ్రంథకర్త్రియునగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు. ఆమె ఈ వార్షికోత్సవ సందర్భమున ఇచ్చిన గంభీరోపన్యాసము పై మాసపుగృహలక్ష్మిసంచికలో ప్రచురింపగలము. ఈమండలి నిన్నిసంవత్సరములుగ నిర్వహించుచున్న శ్రీమతి ఏకా వేంకటరత్నమ్మగారికిని, ఇప్పుడామెకీవిషయమువ చేదోడువాదోడుఅగుచున్న శ్రీమతులు నండూరి వేంకటలక్ష్మమ్మ ఇప్పగుంట వేంకమాంబగార్లకును మా అభివాదము లర్పించుచున్నాము. స్త్రీసనాతనధర్మ మండలి సక్రమాభివృద్ధినందునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక!

**కీ. శే. రాయబహదూరు బ. డి. లక్ష్మీనారాయణగారు:—**

శ్రీలక్ష్మినారాయణగారు మధ్యరాష్ట్రమున సుప్రసిద్ధులగు నాంధ్రప్రముఖులలో నొకరు. శ్రీమంతులు. శ్రీమంతులగుటయేకాదు. విత్తమునకు దగిన వితరణగలిగి మీనుమిగిలినవారు. మధ్యరాష్ట్రముల శాసనసభలో సభ్యులుగానుండిరి. స్టేటుకౌన్సిలులో మెంబరుగనుండిరి. నాగపూరుజిల్లాబోర్డునకు ప్రెసిడెంటుగనుండిరి. ఆంధ్రరాష్ట్రమునుండి విడివడియున్న నాగపురమున వలస నెలకొన్నవారేయైనను వీరు ఆంధ్రాభిమానమును విడనాడలేదు. వీరు ఆంధ్రవిశ్వవిద్యాలయగ్రంథాలయమునకు రెండులక్షల రూపాయల వెలగల గ్రంథసంచయము నొసగిరి. ఈవిషయము వీరినితెలుగుమాగాణియందలివారికి ప్రియతమునిగ చేసినది. ప్రియతములైన ఈయన మరణమునకు విచారింపని ఆంధ్రుడుండబోడు. సెప్టెంబరు 30_వతేదీని ఈ ఆంధ్రప్రముఖరత్నము తమ భౌతికశరీరమును విడచిరి. స్వర్గీయమైన ఈయన ఆత్మకు శాంతి చేకూరుగాక!

**భారతమహిళాసమితివారి దృఢనిశ్చయము:—**

రౌండుటేబిలుసభకు పోవుచున్న ఇరువురు ప్రతినిధురాండ్రలో నొకతెయగు శ్రీమతి సుబ్బరాయనుసతిగారు హిందూదేశభావిరాజ్యాంగనిర్మాణమునకై కూడనున్న రౌండు టేబిలు సమావేశమున చర్చించుటకు భారతస్త్రీసమస్యలనుగూర్చి ఏమైనసలహాలున్న తనకు తెలుపవలసినదిగా మదరాసునందలి భారతమహిళాసమితి కార్యసంఘము వారిని లేఖాముఖమున కోరెను. దానిపై ఆకార్యసంఘమువారు సెప్టెంబరు 30-వ తేదిని ఈక్రింది జబాబునంపిరి. “26-వ తేదిని మీరువ్రాసినలేఖకు ప్రత్యుత్తరము. మేము 1930 ఏప్రియల్ మాసమునందే రౌండుటేబిల్ సమావేశమందు ప్రాతినిధ్యమునుగూర్చి మా యభిప్రాయమును లండన్‌లోని మా ప్రతినిధులకు తెలిపియున్నాము. ఎట్టి మినహాయింపులును లేని అధిని వేశస్వాతంత్ర్యమునకు హిందూదేశమునకుగలహక్కు నంగీకరించుచు ముందుగానే యొకప్రకటన గావింపవలసినదనియు ఆ హక్కును సార్థకపరచుటకే రౌండుటేబిలు సమా

వేశమును జరుపవలెననియు మేము తీర్మానించియుంటిమి. భారతమహిళాసమితి యాజమాన్యమున గోఖలేభవనమునను, రనడేభవనమునను జరిగిన సభలయందుగూడ హిందూదేశమున శాంతిసౌహార్ద్రతల నెలకొల్పుటకు మొదటిమెట్టుగా హిందూదేశమునకు అధినివేశ స్వపరిపాలనారాజ్యాంగనిర్మాణమే రౌండుటేబిలుసభాకర్తవ్యమని ప్రకటించు టత్యావసరమని వైస్రాయిని కోరుచు తీర్మానింపబడెను. లండనులోని మా ప్రతినిధుల కిదివరకే తెలుపబడిన పై తీర్మానముల ననుసరించియు, రౌండుటేబిల్ సభ సమకూర్పబడిన పరిస్థితుల నుపలక్షించియు, దేశములో నధికసంఖ్యాకుల బలముగల పక్షమునకు చెందిన నాయకులు స్త్రీపురుషు లెవ్వరును లేకుండుటను గమనించియు, మేముకోరిన ప్రకటనను వైస్రాయిగారు గావింపమిచేతను, రాజ్యాంగమును నిర్మించుటకని మీరు సూచించినసందులకాధారముగా వాగ్దానము సున్నయగుటచేతను ఈ సంఘమువారు మీద్వారాగాని, మరియే భారతనారీమణి ద్వారాగాని తమ యభిప్రాయములను పంపదలచుకొనలేదు.” ఈ దృఢనిశ్చయమునుగూర్చి విశేషముగ విమర్శింపవలసిన పనిలేదు.

## తొలగింపబడిన తిరువాన్కూరు దేవదాసీల జీవికకు ఏర్పాట్లు:—

తిరువాన్కూరులో క్రొత్తమలయాళసంవత్సరాదినుండియు దేవదాసిపద్ధతితొలగిపోయినది. తొలగిపోవలెనని తిరువాన్కూరు మహారాజ్ఞిరీజెంటుగారు వైచిన ఆర్డరునుగూర్చి ఆగష్టుమాసపు గృహలక్ష్మిలో మేమిట్లువ్రాసితిమి. “దైవమునకుదాసీతనము పేరిటజరుగు వ్యభిచార మంతయు నికనాసంస్థానమున కట్టువడిపోవును. అయితే ఈసంస్కరణవిషయమున జాగ్రతకూడ చూపవలసియున్నది. దేవాలయములనుండి ఈ దాసీలను తొలగించినంత మాత్రమున విశేషలాభముండదు. దేవాలయమునుండి వారు తొలగింపబడుటచే వ్యభిచారమునకు ఇప్పుడు గల మతసంబంధము తొలగును కాని వ్యభిచారము నిలిచియే ఉండును. ఉండకుండచేయవలయునన్నచో దేవాలయములనుండి తొలగింపబడిన దాసీలకు జీవనాధారమునకై ఏమైనవృత్తులు కల్పింపవలయును.” వృత్తులు కల్పింపబడలేదు గాని వారి జీవికకు ఏర్పాట్లుమాత్రము చేయబడినట్లు వినుచున్నాము. దేవాలయమునుండి తొలగింపబడిన దాసీలకు వారి కిదివరకు ఒసంగబడుచున్న మామూళ్లు వారి జీవిత పర్యంతము ఒసంగబడుచుండవలయునని మహారాజ్ఞి రీజెంటుగారు ఉత్తరువు జారీచేసిరి. ఈ ఉత్తరువు మూలమున మహారాజ్ఞి రీజెంటుగారిదివరకు కొనివచ్చిన సంస్కరణము సమగ్రఫలమిచ్చుటకు అవకాశమేర్పడినది.

రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమునకు విరాళములు:—

స్త్రీలకు ఉచితముగ గ్రంథముల నిచ్చుచు స్త్రీవిద్యాభివృద్ధివిషయమున రాజమండ్రి గౌతమీగ్రంథాలయమువారు చేయుచున్న సేవకొండాడదగియున్నది. రాజమహేంద్రవరపు స్త్రీలకీగౌతమీగ్రంథాలయము పెరటికల్పకమైఉన్నది కావుననే ఆపట్టణమున పెక్కుఱు విద్యావతులగు స్త్రీలు గానవచ్చుచున్నారు. గ్రంథకర్త్రియు, వ్యాసకర్త్రియునై ఆంధ్రవిదుషీలోకమున ప్రకాశించుచున్న శ్రీమతి పులవర్తి కమలావతీదేవి; వైశ్యసేవాసదననియంత్రియు, ఉభయభాషాప్రవీణురాలునుఅయి ఆంధ్రప్రజ్ఞావతుల నడుమ విరాజిల్లుచున్న శ్రీమతి బత్తుల కామాక్షమ్మ మొదలగు రాజమహేంద్రవరాంధ్రరమణీమణులు ఈగ్రంథాలయమువలని లాభముపొందిన వారే. ఇట్టి ఉత్తమగ్రంథాలయమునకు తూర్పు గోదావరిజిల్లాబోర్డువారు రెండువేలరూపాయిలును, పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకాబోర్డువారు నూరురూపాయిలును విరాళములిచ్చి స్త్రీవిద్యాభిమానులగువారి కృతజ్ఞతకు పాత్రులైనారు. దీనిని పురస్కరించుకొని మేము తూర్పుగోదావరిజిల్లాబోర్డువారికిని, తణుకు తాలూకాబోర్డువారికిని మాకృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

మైసూరు రాష్ట్రమున హిందులా సవరణ:—

ఈ సంవత్సరారంభమున మైసూరు ప్రజాప్రతినిధి సభవారుచేసిన తీర్మానము ననుసరించి మైసూరు ప్రభుత్వమువారు ఒక కమిటీని నియమించిరి. ప్రస్తుతము అమలులోనున్న హిందూలా ప్రకారము స్త్రీల స్థితిని పరామర్శించుటయు, స్త్రీలై పుట్టుటనుబట్టి వారి కాలాప్రకారము గలుగుచున్న కష్టనష్టములను పోద్రోలుటకు అనువైన సవరణలు సూచించుటయు ఆకమిటీవారి కృత్యములుగ నిర్ణయింపబడెను. ఆకమిటీవారు పూర్తి విచారణ సలిపి తమ నివేదికను ప్రచురించిరి. స్త్రీకి వారసత్వపు హక్కులేదు అన్న మూలసూత్రము తప్పనియు, అది ఆచరణమున కఠినముగను అన్యాయముగను ఉన్నదనియు వారు తొలుత సూచించిరి. స్త్రీకి వారసత్వపుహక్కు లేదు అను మూలసూత్రము హిందూదేశమునందలి కొన్ని భాగములలో ఎప్పుడును అంగీకరింపబడలేదని చెప్పుచు వారు ప్రభుత్వము వారివిషయమున జోక్యము కలుగజేసికొని వారసత్వపుహక్కు లనుభవించుటలో ఆడువారు మగవారు అను విభేదములు ఇకకూడదని నిర్ణయింపవలెనని హెచ్చరించుచున్నారు. స్త్రీలకు నూతనముగ ఈయబడుచున్న ఈవారసత్వపుహక్కు మూలమున వారి సంతతికి ఎట్టి అన్యాయమును జరుగకుండుటకై కూడ పెక్కుసూచనలు చేయబడినవి. లా ప్రకారము గాని సంక్రమించుటవలన గాని తన సంపూర్ణాధికారమునకు లోబడని ఆస్తుల

మీాద గాక ఇతరమగు ఆస్తులన్నిటిమీాదను (అనగా స్త్రీధనము మీాదననుట) స్త్రీకి సంపూర్ణాధికారము అనగా దానవిక్రయసత్వాధికారము లీయబడవలయునని ఆకమిటీవారు సూచించిరి. మగడు సుఖరోగములచే పీడింపబడుచున్నను, ఇంటనే ముండను ఉంచుకొన్నను, ఇతర స్త్రీలతో వాడుకగా వ్యభిచరించుచున్నను, భార్యఉండగా తిరిగి పెండ్లాడినను, భార్య బ్రతుకు దుఃఖపూరితమును, దుస్సహమును అగునట్లుగా ప్రవర్తించుచున్నను, మత భ్రష్టుడైనను భార్య ప్రత్యేకముగ ఆతనినుండి జీవనాధారమును పొందుటకు హక్కుగలిగియుండవలయునని కమిటీవారు నిర్దేశించిరి. ఈకమిటీవారుచేసిన సూచనలు ఆచరణయందు పెట్టబడినచో హిందూసంఘమున స్త్రీల దుస్థితి విచ్చిపోవును. ఇట్టి సంస్కరణము కొనివచ్చుటలో హిందూదేశమునందు మైసూరుప్రభుత్వము మార్గదర్శిత్వమును వహించుచున్నది.

ధర్మ దేవతాలయమును జేరగలుగు నాదర్శము:—

భారతస్త్రీలదుస్థితిని ఎగురజిమ్మివేయు ఇట్టి సూచనలను గావించిన మైసూరు హిందూలాసవరణసంఘమువారికి బరోడామహారాజ్ఞి చిమ్నాబాయిగైక్వారుగారు (సి.ఐ.) చిరస్మరణీయమగు క్రింది అభినందనలేఖను పంపినారు. చిత్తగింపుడు. "ఈ ప్రశ్నను బరిష్కరింపబూనినందులకు మైసూరుప్రభుత్వమువారిని నే నభినందించుచున్నాను. స్త్రీలకు సంబంధించిన హిందూలా విభాగములను కొంతమట్టుకు మార్చుటకుగల యావశ్యకతను జనసామాన్యము చక్కగా గుర్తించియుండుట యాధునికపరిస్థితులకు తగినట్టియు, సంతోషకరమైనట్టియు సందర్భమేయగును. హిందూన్యాయశాస్త్రము ప్రస్తుతము పక్షపాతముతో నిండియున్నది. ఆర్థికముగను, సాంఘికముగను గూడనయ్యది స్త్రీలకు అన్యాయముగా దక్కవయంతస్తు నొసంగియున్నది. చిరకాలముగ హిందూస్త్రీలు అనేకములగు ఇబ్బందులకు లోనై యున్నారు. మీాకమిటీవారిచే ప్రారంభింపబడిన ఈ దర్యాప్తుకు ఫలితముగా నాయిబ్బందులలో కొన్నియైనను బాపబడుట జరిగినచో న్యాయ దేవతాలయ ద్వారములనుదెరచియుంచునాదర్శమును జేరుటలో చాలముందుకు వెళ్ళగలుగుటయే యగును. ఇంతవరకు న్యాయదేవతాదర్శనము స్త్రీలకు లభ్యమయియుండలేదు." బ్రిటీషు యిండియాలోకూడ న్యాయదేవతాలయద్వారములు తెఱువబడి స్త్రీలకున్యాయదేవతాదర్శనము లభించు సుదినములు త్వరలో గలుగుగాక!

అఖిల ఆశియా మహిళా సభ:—

1931-వ సంవత్సరము జనవరి 12-వ తేదీ మొదలు 19-వ తేదీవఱకును లాహోరు నగరమున అఖిల ఆశియామహిళాసభ సమావేశముకానున్నది. ఆ సందర్భమున జరుగవల

సిన పనులన్నియు చురుకుగాజరుగుచున్నవి. పాలస్తైను, సిరియా, సిలోను, నేపాళము, జపాను, బర్మా, ఇరాక్, సయామ్, ఇండోచైనా, మలేషియా, హవాయ్, పెర్షియా, బెలూచిస్థానము మొదలగుదేశమునందలి స్త్రీ లీసభకు తమ ప్రతినిధురాండ్రను పంపుట కంగీకరించియున్నారు. ఈ సమావేశము కూడుటలోగల ఉద్దేశములు ఆఱు. (1) ప్రాచ్య నాగరికతకు మనమెల్లరము పుత్రికలమను ఐక్యభావమును ఆశియాఖండపుస్త్రీలలో పెంపొందించుట. (2) ప్రాచ్యనాగరికతయందలి సుగుణములను నిలువచేసి వానిని జాతికిని తన్మూలమున ప్రపంచమునకును అక్కఱకువచ్చునట్లుచేయుట. (3) ప్రాచ్యనాగరికతా వృక్షమునకు వేరుపురుగులై యున్న అనారోగ్యము, విద్యాహీనత, దారిద్ర్యము, పనికితగిన సంబళములేకుండుట, శిశుమరణములు, వివాహములందలి దురాచారములు మొదలగువానిని పరామర్శించి వానిని పోద్రోలుటకు ప్రయత్నించుట. (4) విద్య, దుస్తులు, స్వాతంత్ర్యము, సినీమాలు, యంత్రములు మొదలగు పశ్చిమనాగరికతాలక్షణములను ఉచితమగురీతిని ఆశియాస్త్రీలకు అనువుపఱచుట. (5) ఆశియాఖండమునందలి వివిధదేశములందలి స్త్రీజనాభివృద్ధికి సంబంధించిన విషయముల నొకరికొకరు సంప్రతించుకొని వలయుమార్పులు చేసికొనుట. (6) లోకముయొక్క శాంతికళ్యాణమునకు తోడుపడుట. ఇట్టి ఉత్కృష్టాదర్శములతో కూడనున్న ఈ సమావేశము భారతరమణీమణులనాయకత్వమున ఆశియాఖండపు స్త్రీలు గాఢనిద్రనుండి మేల్కొనుచున్నారనుటకు ప్రబలనిదర్శనముగానుండగలదు. ఆశియా ఖండమునందలి వివిధదేశముల స్త్రీల క్రమాభివృద్ధిచరిత్రలో ఈసభ ప్రాముఖ్యమును వహింపగలదనుట నిశ్చయము. భావికాలమున ఆశియాస్త్రీల జీవితములందు పొడసూపు పెక్కుమార్పులకు ఈసభ మొదటిపాదు కాగలదు.

ఆర్ 101 విమానవిధ్వంసము:—

బ్రిటీషువారి విమానములన్నిటిలోను మిక్కిలి పెద్దదియగు ఆర్ 101 విమానము ప్రథమయాత్రలో భారతదేశమునకు బయలుదేరెను. బయలుదేరిన కొన్నిగంటలలోనే అది విధ్వంసమై విశ్వమానవప్రపంచమును విచారసముద్రమునముంచెను. ఇంతవఱకు ప్రపంచమున సంఘటిల్లిన విమానవిధ్వంసములందిదిసాటిచెప్పరానిది. దానిపై ప్రయాణించుచున్న ఏబదియాఱుగురు ప్రయాణీకులలోను నలుబదివదుగురు విమానముతోబాటు కాలిపోయిరి. బ్రిటీషు విమానశాఖామంత్రియగు లార్డు థామ్సను — బ్రతికియుండినచో బహుశ ఈతడు ఇర్వినుప్రభుని యనంతరము భారతరాజప్రతినిధియైయుండును — విమానయాత్రలయందు సుప్రసిద్ధులగు సర్ సెఫ్టను బ్రాంక్ కర్ : ఈ మహాశయులిద్దఱును ఇందుమరణించిరి.

సాదృశ్యము చెప్పుటకు వలతిగాని ఈ విమానవిధ్వంసమువలన విమానయాత్రయెడ పలువురు విముఖులుకావచ్చును. ప్రకృతిని జయించుటలో మానవుడు ధనమును, ప్రాణమును విశేషముగ నష్టపడినాడు. నష్టపడుచున్నాడు. ఆవిరియంత్రములు, పొగయోడలు కనుగొనబడినప్పటి ప్రాణధననష్టములు ప్రపంచచరిత్రపుటలయందు ప్రస్ఫుటముగ వ్రాయబడిఉన్నవి. 1911-వ సంవత్సరమున అట్లాంటిక్ మహాసముద్రమున భగ్నమైన 'టైటానిక్' అను గొప్ప పొగయోడ చరిత్రమింకను మానవుని స్మృతిపథమునుండి తొలగిపోలేదు. కాని ఇట్టి ప్రాణ ధననష్టములకు మానవుడు భయపడలేదు. ప్రకృతితో ఎదురొడ్డినిలిచినాడు. తుదకు ఆతనిది ప్రకృతికంటె పైచేయియేఅయినది. ఆంగ్లమంత్రిమాణిక్యుడు రామ్సే మేక్డొనాల్డు చెప్పినట్లు మానవుడు అగాధమగు సముద్రమును జయించినాడు, అనంతమగు ఎడారిని జయించినాడు, నిరవధికము ఆకాశమునుగూడ జయింపగలడు.

## మదరాసు క్వీన్ మేరీ కళాశాల:—

మదరాసు క్వీన్మేరీ కళాశాల నివేదిక పరిశీలించితిమి. 1929-వ సంవత్సరమున కళాశాలయందు 151 మంది విద్యార్థినులేయుండగా ఈసంవత్సరము 183 విద్యార్థినులు ఉన్నారు. ఇట్లు విద్యార్థినుల సంఖ్యయందేగాక పరీక్షాఫలితములందుగూడ నిరుటికంటె ఈసంవత్సరము మంచియభివృద్ధికనుపించుచున్నది. శ్రీమతి యస్. యన్. అఖిలాబాయి సతి (సబ్ అసిస్టంటు సర్జను) గారు విదార్థినులను వైద్యపరీక్షగావించినారు. టెన్నిసు, బాడ్మింటను మొదలగు ఆటలునాడుటకు కళాశాలయందు మంచి యవకాశములున్నను విద్యార్థినుల పెక్కుఱు ఆటలయందు పాల్గొనకుండుట శోచనీయము. ఈసంవత్సరము జూలై మాసమునుండియు సంగీతపు తరగతులుఏర్పఱుపబడినవి. బియ్యేక్లాసు విద్యార్థినులకందు పరీక్షలు జరుగగలవు. వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము విద్యార్థినులు అభిమాన శాస్త్రముగ గ్రహించి చదువుటకు ఏర్పాటులింకను జరుగలేదు. రాజధాని మొత్తముమీద గల స్త్రీకళాశాలలో ఉత్తమమైనది ఇదియొక్కటియేగావున ఆశాస్త్రములుగూడ కళాశాలయందు సాధ్యమైనంత త్వరలో ప్రవేశమునందునట్లు ప్రభుత్వమువారు శ్రద్ధవహింపవలసియున్నది.

## వ్యభిచారగృహనిర్మూలనచట్టము : శరణాలయస్థాపనము:—

మద్రాసు శాసనసభవారిచేగావింపబడిన వ్యభిచారగృహనిర్మూలనచట్టము అమలులోనికివచ్చుటతోడనే ఒకక్రొత్తసమస్య పొడసూపుచున్నది. ఆసమస్య వ్యభిచార

గృహములనుండి సంరక్షింపబడినవారు తలదాచుకొనుటకు తావుకనుగొనుటయే. వ్యభిచార వృత్తినుండి సంరక్షింపబడినట్టి స్త్రీలకొఱకు ప్రస్తుతము సాల్వేషను ఆర్మీ వారొకగృహమును నిర్వహించుచున్నారు. కాని అందు చట్టములమలులోనికివచ్చి సంరక్షింపబడు వారి సంఖ్య హెచ్చుటతోడనే స్థలసంకోచ మేర్పడును. కాబట్టి నూతనముగ నొక శరణాలయమును స్థాపించుటయవసరమగుచున్నది. ఇట్టి శరణాలయము స్థాపించి నిర్వహించు బాధ్యత ప్రభుత్వమువారే వహించుట లెస్సయని ఈచట్టమునుగూర్చి విచారణసల్పిన సెలక్టు కమిటీవారు సూచించియుండిరి. కాని ప్రభుత్వము వారాబాధ్యతను వహించుటకు ఒప్పుకొనలేదు. ప్రజాసంఘమే ఇందుకు పూనుకొనవలసియున్నది. నూరుమంది సంరక్షింపబడిన బాలికలు ఉండుటకు వసతిగల మందిరము నిర్మించుటకు లక్షరూపాయిలగునని అంచనావేయబడెను. ఇదిగాక శరణాలయము నిర్వహించుటకు సాలీనాఖర్చుకూడ కొంత యుండును. ధనముండినగాని శరణాలయము స్థాపింపబడుటకును, అది నిర్వహింపబడుటకు ఏమాత్రము వీలుండదు. శరణాలయములేనిది చట్టము అమలులోపెట్టి లాభములేదు. శరణాలయ స్థాపనమిట్లు అత్యవసరమగుచున్నది. కావున దేశహితమును గోరు ప్రతివారును దాని స్థాపనమునకు యథాశక్తినితోడుపడుదురుగాకయని కోరుచున్నాము. ఈసందర్భమున విరాళములు పంపదలచుకొన్నవారు డి. యఫ్. మాక్లెల్లాండు, ఆనరరీ ట్రెజరరు, మద్రాసు విజిలెన్సు అసోసియేషను, వై. ఎం. సి. ఏ. ఎస్ప్లనేడు, మద్రాసు. అనుచిరునామాకు పంపవలెను.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జినువదలి కాగితమునకు ఒక తట్టుననే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములనుగూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు

# గ్రంథవిమర్శనము

## విప్రసందేశము:—

శుభావహమగు నాటకము. ఐదు అంకములు గలది. ఈ నాటకమున ప్రస్తరింపబడిన కథ రుక్మిణీపరిణయ వృత్తాంతమే. రుక్మిణీపరిణయకథయనుట తోడనే నవీనులకు పౌరాణికవాసన గొట్టవచ్చును. కాని ఈ నాటకమున కవిపురాణవాసన పిసరంతేనిలేకుండ వ్రాసినాడు. రుక్మిణివివాహము రాజకీయ వివాహముగ చూపబడినది. కథయంతయు క్రొత్తవెలయింపబడినది. రుక్మిణి విప్రునిచే శ్రీకృష్ణమూర్తికి పంపిన సందేశమే కథకు ప్రాణముగావున ఉచితజ్ఞుడగు కవి నాటకమునకు 'విప్రసందేశము' అను పేరిడినాడు. ఈ నాటకమున ఒకటి రెండుతావుల పూర్వాపరసందర్భము పొసగని వాక్యములు చూపట్టుచున్నవి. విదర్భదేశమునుండి వచ్చిన విప్రుని శ్రీకృష్ణుడు తొలుత 'కుశలమె వారిపుత్రికకుఁ గోమలగాత్రికిఁ బద్మనేత్రకున్' (పుట 34) అని అడుగును. కొంతసేపు ప్రసంగము జరిగినమీదట విప్రుడు శ్రీకృష్ణునితో 'విదర్భదేశాధీశులగు భీష్మకునకొక కుమారీరత్నంబుకలదని మీ రెఱింగియేయుందురు.' (పుట 35) అని పలుకును. పొసగుబాటగునా? ఇట్టివి ఇంకను ఒకటిరెండుతావుల దొరలినవి. పునర్ముద్రణమున సవరింపబడుగాక! తప్పొప్పులపట్టికయందు చూపినవిగాక ఇంకను పెక్కు ముద్రణదోషములు కనుపట్టుచున్నవి. పుట 16 ఆలోచనానిమగ్న అనియుండవలసినచోట ఆరోచననిమగ్న యని; పుట 46 అతిక్షిప్తము యనియుండవలసినచోట అతిక్లిప్తము యని; అదేపుట త్ర్యక్షాక్షరీ మంత్రజపము యని యుండవలసినచోట త్ర్యక్షాక్షతీమంత్రజపము అని ఇత్యాదులు రెండవముద్రణమున సవరింపబడవలయును. ఇట్టి స్వల్పదోషములంత పరిగణనీయములుగావు. నాటకము గుణబహుళముగానున్నది. ఈ నాటకమునందలి అన్నిపాత్రలలోను సుమతిపాత్రయొక్క పోషణము మాకు బాగుగనచ్చినది. ఆతని అవలంబనమున కవి నాటకమున విరజిమ్మిన హాస్యరసము హృద్యముగనున్నది. స్థలాభావముచే ఈ నాటకమునందలి పెక్కు విశేషముల ప్రదర్శింపజాలకున్నాము. నాటకాభిరుచిగల ఆంధ్రులెల్లరు ఆదరింపదగిన గ్రంథము. గ్రంథము క్రౌను సైజున 112 పుటలు. వెల రు 1-0-0 మాత్రము. వలయువారు నాటకకర్తయగు కవికొండల వేంకటరావుగారికి పశ్చిమగోదావరిజిల్లా నరసాపురమునకు వ్రాయవలెను.

## చాణక్యుఁడు:—

ఇందు విశాఖదత్తమహాకవిచే సంస్కృతమున రచింపఁబడిన ముద్రారాక్షసమను నాటకమునందలి కథ నవలారూపమున తెలుగున రచింపఁబడినది. ఈ కథ చాణక్యుఁడొనర్చిన యద్భుతకార్యములతోను అపూర్వసంఘటనలతోను, యుక్తులతోను, తంత్రములతోను, రాజనీతికౌశలముతోను పరిసమాప్తినొందుటచే దీని కీనామము ముంచబడుట సమంజసముగనున్నది. ఇందు చాణక్యుఁడు యుద్ధమునకు సాహాయ్యముగొనివచ్చిన పర్వతేంద్రునిపై యుద్ధాంతమున విషకన్యను ప్రయోగింపఁజేయుట కడుంగడు నద్భుతావహమై యున్నది. నందుల మంత్రియగు

రాక్షసుని రాజభక్తియు, దృఢసంకల్పమును నిందు చక్కగ వర్ణింపఁబడియున్నవి. అర్థశాస్త్రమును రచియించిన కౌటిల్యుడనునత డీచాణక్యుడే. ఈ చాణక్యునకే విష్ణుగుప్తుడను నామాంతరముగలదు. ఇందలి గాథ హిందూదేశచరిత్రకు సంబంధించినదై యున్నది. నవనందులచే నవమానింపఁబడి వారిని నాశమునొందింతుననియు తన్ను శరణుఁజొచ్చిన చంద్రగుప్తుని సింహాసనస్థుని జేయుదుననియు ప్రతినపట్టిన చాణక్యుని పన్నుగడలాశ్చర్యజనకములుగానున్నవి. గ్రంథము మృదుమధురశైలితో నొప్పారుచు పాఠకులకు ఆనందజనకమైయున్నది. ఇది హైస్కూలు క్లాసులకు పాఠ్యగ్రంథముగానుండుటకెంతయు తగియున్నది. దీని వెల 0—10—0 ఇది క్రౌను సైజున 123 పుటలుగలిగియున్నది. ఇది సి. సి. సి. హైస్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయులైన వేదుల సత్యనారాయణశాస్త్రిగారిచే ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది. పారిజాతగ్రంథమాలయను నొక గ్రంథమాలకు సంపాదకులగు గ్రంథకర్తగారివద్దనే నీ గ్రంథము లభించును. వలయువారు పారిజాతగ్రంథమాలా సంపాదకులు: వేదుల సత్యనారాయణశాస్త్రిగారు, సి. సి. సి. హైస్కూలు, పెరంబూరు, మదరాసు. అని వ్రాయవలెను.

### రంగూన్ తమాషా:—

ఈ గ్రంథమునకు 'పిట్టుకల్లుషోకు' అను నామాంతరముగలదు. శ్రీఆంధ్రసరస్వతీసమాజమువారి ప్రథమ పుష్పము; సంభాషణరూపమున వ్రాయబడినది. మద్యపానమువలని కష్టములు ప్రదర్శింపబడినవి. గ్రంథము రచియించినది సూర మీరయ్యగారు. గ్రంథము క్రౌనుసైజున 22 పుటలు. వెల రు. 0—2—0. దొరకుచోటు: ఆంధ్రసరస్వతీసమాజము, నెం. 3 స్టీలుబ్రదర్సు రైసుమిల్లు, పాజుండాంగ్ పోస్టు, రంగూను.

### సన్మానము:—

ఏలూరునందలి ఆదివారప్పేట నివాసులును, కవితారసజ్ఞులును నగు శ్రీయుత బొడ్డు వేంకటసుబ్బారాయుడుగారు తమ ద్వితీయపుత్రులు శ్రీయుత బాపిరాజుగారి వివాహమహోత్సవసందర్భమునందు గావింపబడిన శతావధాన పండితాశీర్వాదపద్యములను సన్మానమనుపేర నచ్చొత్తించినారు. శతావధానము జరిపినవారు కవిరత్న కాకర్ల కొండలరావుగారు. ఆది శతావధాని అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను జరిగినది; శుభకార్యములలో నిట్లు కవితాపూజచేసి ఆదరణలేని కవితకు ఒక్కింత ప్రోత్సాహము గలిగించిన బొడ్డు వేంకటసుబ్బారాయుడుగారి మార్గము శ్రీమంతులు పెక్కుగవలంబించుట భాషాపోషకమగును. ఆశీర్వాదపద్యములలో శ్రీయుత మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారివి చాల బాగున్నవి. గ్రంథమువెల తెలుపబడలేదు. వలయువారు బొడ్డు వేంకటసుబ్బారాయుడుగారికి వ్రాయనగును.

### ఏడవ శారదా పద్యవాచకము:—

పెరిగి పెద్దలై దేశమునకు దీప్తితెచ్చు పౌరులుగాగలుగుటకు మన బాలురను చిన్నతనముననే దేశాభిమానపూరితహృదయులను చేయవలయును. ఇందుకు వారు చదువు ప్రతియక్షరమును వారిజాతియొక్క ఉన్నతిని కీర్తించునదిగను, వారిజాతియందు పుట్టువుగన్న మహాపురుషులను స్మరించునదిగను, వారి దేశముయొక్క ఉత్కృష్టతను చాటునదిగను ఉండవలయును. పుంఖానుపుంఖములుగ వెలువడుచున్న నేటి మన వాచకపుస్తకములందు కొన్నిటియందైనను విద్యార్థుల హృదయములందు దేశాభిమానము హత్తించు అక్షరబీజ మొక్కటి గూడ కనపడదు. స్థితి యిట్టిదై యుండగా ఒక వాచకమున శ్రీరాములు మొదలుకొని చిత్రించువఱకును ఆంధ్రతాముద్ర నెలకొనియుంచో కలుగు ఆనందమునకు మేరయుండదు. మేరలేని అట్టి ఆనందమును కలిగింపగల యట్టి

వాచకపుస్తకమొకటి వెలువడినది. అది ఏడవ శారదావాచకపుస్తకము. ఇందు ఆంధ్రతామ్రముద్రగల ఘట్టములు వివిధములగు ఆంధ్రకావ్యములనుండి ఏర్చికూర్చబడినవి. ఈగ్రంథము సంకలించిన సాహస్వతార్చకునకు గల ఆంధ్రాభిమానము కొలములువెట్టి దరముకావనుట సునిశ్చయము. కృతిసమర్పణమప్పటి ఆతని ఈపవిత్ర సువర్ణాక్షరముల పఠికింపుడు. "పట్టినపట్టువిడువక సాధించుదిట్టయై బ్రహ్మసృష్టికి బ్రతిసృష్టిగావించిన కౌశికమునీంద్రుని వంగడమునఁబుట్టి శ్రీరామచంద్రమూర్తిని అయోధ్యకొసఁగిన తల్లికి, కర్షలఁ బోషించుచు భాగ్యమును హెచ్చించుచు విజ్ఞానమును వెదఁజల్లుచు నఖండప్రభతో భరతవర్షమునంతను నేకచ్ఛత్రముగా నేలిన తల్లికి, ఆసియా ఐరోపా మున్నగు పంచమహాభూఖండములకు జ్ఞానభిక్ష నొసంగి యుద్ధరించిన సిద్ధనాగార్జున దిజ్ఞాగాది విశ్వాధర్మకులఁ గన్నతల్లికి, మాతల్లికి, ఆంధ్రభాషామతల్లికి నేఁటి తన బిడ్డల యభ్యుదయమునకై యీ శారదావాచకములను వినయముతో భక్తితో సమర్పించుకొనుచున్నాను." గ్రంథసంధాతకిట్టి ఆంధ్రాభిమానము ఉన్నదికావుననే గ్రంథమున ప్రతిపుటయు ఆంధ్రతామ్రముద్రతో విలసిల్లుచున్నది. పరమేశ్వరుఁడాంధ్రదేశమున స్థిరనివాసమేర్పఱచుకొనుట, వ్యాసాదులు ఆకసమునుండి ఆంధ్రమండలమును గనుంగొనుట; అగస్త్యుని ఆంధ్రదేశయాత్ర మొదలగు ఈ వాచకమునందలి ఘట్టములు చదువుచుండగా విద్యార్థుల మనములు దేశాభిమానములతో తెప్పలు తేలును. పెక్కుఱు ఆంధ్రకవిశ్రేష్ఠుల మధురకవితలతో వారికి పరిచయము యేర్పడును. తమ విద్యాకాలమున ఒక్కతరగతిలోనైన దీనిని వాచకపుస్తకముగ పఠింపని తెలుగులు విద్యార్థియుండఁగాదని మా తాత్పర్యము. ఈ ఉత్తమగ్రంథమును సంధాత సుప్రసిద్ధాంధ్ర పరిశోధకశిఖామణులగు శ్రీయుత తేకుమళ్ళ రాజగోపాలరావుగారు. గ్రంథము క్రౌను సైజున 74 పుటలు. వాచకము వెల 0—8—0 అణాలు. వలయువారు గోపాలరావుగారిపేర 124, వెల్లాలవీధి, వేపేరిపోస్టు, మదరాసు అను చిరునామాకు వ్రాయవలెను.

## మహాలయము:—

ప్రారంభము, పాషండులు, బోధ, గురుకృప, మతనూత్న్యము, అచలమతము, స్త్రీమర్మము, గురువు, ప్రారబ్ధము, పరిపూర్ణులు, అచలఫలితము, అనంతోపనిషత్తు, అచలానుసక్కులు, అతీతము. రహితమార్గము నిజగతి, లయము అను శీర్షికలతో "మహాలయము" అను ఈ గ్రంథమున మతవేదాంతములకు సంబంధముగల విషయములు చర్చింపబడినవి. గ్రంథకర్త బెజవాడయందలి శ్మశానవాసియని తెలుపబడినది. గ్రంథము డెమ్మిసైజు 76 పుటలు. గ్రంథమునకు మూల్యములేదు.

## వివేకానందసందేశము:—

గ్రంథకర్త కూచినరసింహముగారు. ఇది మార్కాపురమునందలి వివేకానంద సమాజమువారు 1929-వ సంవత్సరమున శ్రీ వివేకానంద జన్మదినోత్సవ సందర్భమున చదువబడిన వ్యాసము. త్రిలిఙ్గపత్రికనుండి పునర్ముద్రితము. గ్రంథము క్రౌనుసైజున 28 పుటలు. పోస్టేజికొఱకు ఒకఅణాబిళ్ల పంపువారికీగ్రంథము ఉచితముగ పంపబడును. ఆధునికయుగమున హిందూమతప్రతిష్ఠను జీవితమర్పించిన జ్ఞానధనులలో వివేకానందులవారొకరు. వారి రచనములను పెక్కుఅనువదించి తెలుగువారికర్పించిన కూచి నరసింహముగారు వారి సందేశమునంతను కూర్చి ఇందు బెట్టినారు. సులభముగ లభ్యమగుచున్నది కావున దీనిని ఎల్లరు పఠింతురని నమ్ముచున్నాము. పుస్తకమువలయువారు వ్యాసకుటీరము, మేలుపాక, విశాఖపట్టణముజిల్లా అను యడ్రసుకు వ్రాయవలెను.

## ధనమహిమ:—

ఇదియొక వచనకావ్యము. శ్రీ ఆలూరు వాసుదేవయ్యగారిచే రచియింపబడినది. ఇందు ధనాశగలవారు పుణ్యమునకు సుఖమునకు ఎట్లు దూరులగుదురో మందచిత్తుని కథారూపమున చక్కగ వివరింపబడినది. ఇందలి

కథకంటె ఇందలి వచనరచనాపద్ధతి మమ్ముల నెక్కువగ నాకర్షించినది. ఎడనెడ గూర్చబడిన నీతిశ్లోకములు గ్రంథము విలువను హెచ్చించినవి. లోకోక్తిసంఘటనముకూడ చక్కగనున్నది, 'భోగముదానికి బొడ్డులో పండ్లన్నట్లు'. 'దుడ్డులేక దువ్వలువకావలెనన్నట్లు'; 'కుక్కసంతకుఁబోయి కోలదెబ్బలుతిన్నట్లు'; 'నేతికుండ నేలఁబెట్టి యుత్తకుండ నుట్టిమీఁదఁ బెట్టినట్లు'; 'మ్రింగిన కళ్లకురుచి యెంచినట్లు'; 'మట్టిగుఱ్ఱానిపై నీటిలో స్వారిచేసినయట్లు'; 'పెండ్లిసందట్లో పుస్తెఁగట్టమఱచె,నన్నట్లు' మొదలగు సామెతలు యథాప్రదేశవినివేశిత ములై రచనాసౌందర్యమును రెట్టించినవి. సావిత్రి చరిత్రను తలపించుచున్న ఇందలి 'ధీమణి' అను కాంత వృత్తాంతము స్త్రీలతికుతూహలముతో జదువగలరు. ధనమునకు కాపుమాత్రముండ నేర్చిన దయ్యమగు పతి మరణింపగా యమదూతలతో వాదులాడి ఆతనిని పునర్జీవితునిగావించుకొనిన ధీమణి ధీవిశేషము, ధైర్యగరిమమిక్కిలి కొనియాడదగినవిగనున్నవి. పాఠ్యగ్రంథముగ నుంచదగినది. గ్రంథము క్రౌను సైజున 58 పుటలు. పుస్తకము వలయువారు 4 అణాల బిళ్లలు పంపవలెను. దొరుకుచోటు ఆలూరు రామచంద్రయ్యగారు; 8 మూర్తి లేను, పార్కుటవున్, మదరాసు.



# వేడికోలు

జాతీయములగు బాలక్రీడా విశేషములు మనకు పెక్కులున్నవి. వానిని హంసవింశతి ఇట్లు పేర్కొనుచున్నది:—

> "బొమ్మలపెండ్లిండ్లు బువ్వఁపుబంతులు పుణికిళ్లు నిట్టుక్కి బొమ్మరిండ్లు,
> గుజగుజరేకులు గొబ్బిళ్లు నీగగేబుడిగిన్సు జాబిల్లి పుక్కటిల్లు
> గుజ్జెనగూడులు కోలు కోలన్నలుగీరన గింజలు పారుపట్లు
> పిప్పిళ్లు త్రొక్కిళ్లు బేడిసె తిరుగుళ్లు నచ్చనగండ్లు దాయాలు పాళ్లు
> లడరు వాయనగుంట లాదైనయట్టి యాటపాటలఁ బ్రొద్దువోనుఁగుఁజెలుల."

ఈబాలక్రీడావిశేషములనుగూర్చిన వివరములు గృహలక్ష్మిలో ప్రచురింపదలంచితిమి. క్రీడాచపలులగు చిన్నిబిడ్డలతో నిత్యసహచర్యముననుండు స్త్రీలకు ఇవి ఆడుపద్ధతియు మర్యాదయు బాగుగ తెలియును. కావున ఉత్సాహముగల స్త్రీలీబాలక్రీడల నన్నిటిని గూర్చిగాని సాధ్యముకానిచో కొన్నిటినిగూర్చిగాని మాకు సాధ్యమైనంతత్వరలో తెలుపవేడుకొనుచున్నాము.

—సంపాదకుడు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS

# విషయసూచిక

# నవంబరుమాసపు గృహలక్ష్మి

౧

అయ్యా,

ఈమాసపు సంచిక అందుకొన్నాను. లక్ష్మీకథ నేను అనుకొన్నట్లుగానే వచ్చుచున్నది. ఆకథ హృదయములోని సున్నితపు నాళాలు మెల్లిగాకదలిస్తుంది. 'చంద్రావతి' కూడా చాలామంచికథ. ఆధునికసంప్రదాయము లందులో వున్నాయి. అల్లాంటి స్వకీయరచనాలు మీరెక్కువగా ప్రోత్సహించాలి మంచిమంచి యువకవులంతా మీపత్రికలో వ్రాయుట శుభావహము.

తణుకు
4-11-30

ఇట్లు
పెమ్మరాజు రాజగోపాలము

౨

ఆర్యా,

గృహలక్ష్మి దసరాసంచికయు నవంబరునెల సంచికయు నందుకొంటిని. నవనవోన్మేషితములగు వ్యాసములు, పాటలు, పద్యములు, చిత్రములు, కథలు వీనితో మీగృహలక్ష్మి యొకనాటికన్న మఱియొకనాటికి పెల్లుమీఱుచున్నదని నిర్వివాదాంశముగ నిష్పాక్షికబుద్ధితోఁ దెలియఁజేయుటకు మిగుల సంతసించుచున్నాడను.

ఏలూరు
5-11-30

చిత్తగించవలెను
వదలవాడ ధర్మరాజు

౩

అయ్యా,

వందనములు.

మీరు నాకు గత ఆదివారమొసంగిన నవంబరుమాసపు గృహలక్ష్మిని సావధానముగా జూచితిని. ప్రతి యింటను గృహలక్ష్మి ఉండవలసిన పుస్తకము.

రాయపేట, మద్రాసు
6-11-30

ఇట్లు
చోడూరు కమలమ్మ

౪

అయ్యా,

తమచే ప్రకటింపబడుచున్న గృహలక్ష్మిని ఒక మిత్రుని ప్రోత్సాహమున రెండుమాసములనుండియు తెప్పించి చదువుచుంటిని. గృహలక్ష్మి నాకొకగుణపాఠము నేర్పినదని వ్రాయుటకెంతయు సంతసించుచున్నాను. పత్రికలన శ్రద్ధలేని నేనిపుడు గృహలక్ష్మి నూతనసంచికకై ఎప్పుడువచ్చునాయని ఎదురుచూచుచుంటిని. గృహలక్ష్మి ఆంధ్రుల ఆదరణాభిమానములు పొంది యింకను భాషాసేవయు, ఆంధ్రరమణీమణుల సేవయు చేయుగాక!

యలమర్రు
6-11-30

ఇట్లు
మోటూరి సీతారామబ్రహ్మముచౌదరి

౫

ఆర్యా,

గృహలక్ష్మి నవంబరుసంచిక అత్యంతరమణీయముగా పొలుపొందుచున్నది. కీ. శే. అన్నపూర్ణాదేవి అను పద్యవ్యాసమును చదివినాను. చాలబాగున్నది.

ఆదివారపుపేట, ఏలూరు
6-11-30

ఇట్లు
మానేపల్లి లక్ష్మయ్య.

౬

ఆర్యవర్యా,

"...గృహలక్ష్మికతంబున, బయటికిరాక మూలపడియున్న విదుషీరత్నముల యమూల్యవ్యాసపరంపర దిలకించి పులకించుభాగ్యము మాబోటి శారదాసేవకురాండ్రకు గలుగుచుండుట ఎంతయు సంతోషదాయకము. పెక్కునూతనచిత్రములతో మాగృహలక్ష్మిని అతిమనోహరముగ నలంకరించి పంపుచున్నందుల కాంధ్ర యువతీమండలి తరుపున తమకు నాధన్యవాదముల నర్పించుచున్నదానను. వేయేల! మీ తొక్కుపలుకులు మాబాలురను బాలికల నాకర్షించి 'అమ్మా! గృహలక్ష్మి మరల నెప్పుడువచ్చునే?' యని యడిగింపుచున్నవి."

రాజమండ్రి
8-11-30

ఇట్లు
పులవర్తి కమలావతిదేవి

౭

ఆర్యా,

వందనములు.

మీరు దయతో పంపిన గృహలక్ష్మి చేరినది. వందనపూర్వకంగా అందుకున్నాను. ఈనెల గృహలక్ష్మి చాలాబాగాఉన్నది. ఎన్నిసార్లు చదివినను ఇంకా చదువవలెననేయున్నది.

బొబ్బిలి
13-11-30

ఇట్లు
పిండిప్రోలు కొండయాంబ

౮

ఆర్యా,

వందనములు.

ప్రతిమాసపు గృహలక్ష్మి సంచికను శ్రద్ధతో చూచుచుంటిని. బాలవిజ్ఞానశాఖ బాలబాలికలకు మాతృసమానమై యొప్పారుచున్నది. మూడుసంవత్సరములు నిండని ముద్దుబాలిక గృహలక్ష్మి ఆంధ్రదేశములో అత్యుత్తమ కీర్తిగడించినది. నవంబరుమాసపు సంచికలోని దేవపూజ: ప్రథమపాఠము; లజ్జావతి మొదలగు త్రివర్ణచిత్రములేకాక మారాజు అబ్బాయి మాకళ్లవెలుగు, గాయనులు మొదలగు చిత్రములు చాల ఆకర్షణీయములుగనున్నవి. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి లక్ష్మి అనుకథ బాలికలకెల్ల ఆదర్శపాత్రమై యలరారుచున్నది. శ్రీమతి బి. జ్ఞానాంబగారి కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిస్మరణ సముచితముగనున్నది. ఆచంద్రతారార్కముగా మానెచ్చెలియగు గృహలక్ష్మి వర్ధిల్లునట్లు పరమేశ్వరుఁడనుగ్రహించుగాక!

కూచిపూడి
20-11-30

ఇట్లు
మేకా రంగమ్మ

# గృహలక్ష్మి దసరా సంచిక

## ౧౨

గృహలక్ష్మి మాసపత్రిక దినదినాభివృద్ధిగాంచుచు స్త్రీల యభివృద్ధికి మార్గదర్శకమగుచున్నదని తెలుపుట కెంతయు సంతసించుచున్నాము. దసరాసంచిక మేలైన వ్యాసములతోను, చిత్రపటములతోను విరాజిల్లు చున్నది. ఇందుగల వ్యాసములలో చాలమట్టుకు ఆంధ్రసోదరీమణులచే రచియింపబడు టెంతయు సంతోషావహము. ఈ మాసపత్రిక వెలువడిన మూడుసంవత్సరములలో ఆంధ్ర నారీరత్నముల విద్యాభివృద్ధికి, సాంఘికాభివృద్ధికి, ఎంత వన్నెగలిగెనో ఇందలి విషయములవలననే తెల్లమగుచున్నది. స్త్రీరత్నములు వ్రాసిన వ్యాసములలో కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవి గారి 'భారతీయుడా'యను వ్యాసమును, దేవులపల్లి సత్యవతమ్మగారి 'నావ వేగ మేనడుపుమయ్యా' యను గీతమును, మదమంచి ఆనంతమ్మగారి 'మాంచాల'యను పద్యములును, వోలేటి సత్య కల్యాణమ్మగారి 'గృహస్థు: గృహిణి' యను వ్యాసమును, బాలవిజ్ఞానశాఖయందలి గీతములును ప్రాముఖ్యమైనవి. కథలన్నియు స్త్రీలయభివృద్ధికిని, నీతిబోధకము ఆటపట్టులై యున్నవి. ముఖ్యముగా కీ. శే. మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి పద్యములు ప్రతినారీమణి గమనింపదగియున్నవి. త్రివర్ణచిత్రములలో పార్వతీపరమేశ్వరులును, గ్రంథపరిశీలనమును, అలంకృతయును సాధారణపటములలో కమలాదేవి ఛటోపాధ్యాయ మొదలగునవియు అత్యంతరమణీయములైయున్నవి. శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారు చిత్రించిన ఈ సంచికయొక్క ముఖపటము బాగనున్నది. మొత్తముపైన ఈసంచిక చాల ఆకర్షణీయముగనున్నది. గృహలక్ష్మి చిరంజీవియై వర్థిల్లి వనితాలోకమునకు నిరంతరము సేవచేయుచుండుగాకయని కోరెదము.

—గోలకొండ పత్రిక

## ౧౩

డాక్టరు కేసరిగారిచే ప్రకటింపబడుచున్న గృహలక్ష్మి దసరాసంచిక మా కార్యాలయము చేరినది. ఇందు స్త్రీలకు మిగుల ఉపయోగకరములగు వ్యాసములు పలువు రాంధ్రనారీరత్నములచే వ్రాయబడినవి. "మాలసుబ్బి బాప్టిజము" "బందీ" "పెన్షన్ పుచ్చుకున్న నాటిరాత్రి" అను కథలు పఠించితీరవలెను. ఇదిగాక స్త్రీలు తెలుసుకొనవలసిన విషయములనేకములు గలవు. "పార్వతీపరమేశ్వరులు, రసపుత్రకాంత, గ్రంథ పరిశీలనము, అలంకృత"యను 4 త్రివర్ణచిత్రములు ఆకర్షణీయములుగా ముద్రింపబడినవి. బొత్తుగా ప్రపంచమునకువ్యతిరేకముగా ప్రవర్తించుచున్న బర్మా ఆంధ్రస్త్రీలు ఈపత్రికను తెప్పించుకొని పఠించినచో కొంత కాలమునకైన తమ ప్రవర్తనను మార్చుకొనగలరని నమ్ముచున్నాము. ఈపత్రిక ప్రతిమాసారంభమునను ప్రకటింపబడుచుండును. సంవత్సరచందా రు. 4-0-0 మాత్రమే. మేనేజరు, గృహలక్ష్మి కార్యాలయము, పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు, మదరాసు అని వ్రాయవలెను.

—ఐరావతి. (1-11-30)

## ౧౪

సర్వాంగసుందరమగు గృహలక్ష్మి దసరాసంచికను వందనములతో నందుకొన్నాము. ఇది నిరిటిసంచిక కంటెను మనోహరమైయున్నది. రంగులచిత్రములును, స్త్రీలరూపపటములును వ్యాసములకు వన్నె తెచ్చినవి. వ్యాసములలో అనేకములు స్తుతిపాత్రములుగానున్నవి. వాటిలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి 'పెన్షన్ పుచ్చుకొన్న నాటిరాత్రి' అనుకథయు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రుల వారి 'తిరస్కృతాంధ్రవాఙ్మయ'

మను వ్యాసమును ప్రత్యేకప్రశంసకు పాత్రమైయున్నవి. గృహలక్ష్మి ఆంధ్రస్త్రీలకు నిజముగ ఆభరణమని చెప్పవచ్చును. దానివలన ఆంధ్రస్త్రీలలో మంచిసభ్యత కలుగగలదని నమ్ముచున్నాము.

—రెడ్డిరాణి (నవంబరు)

౧౫

మహాశయా,

తమగృహలక్ష్మి దసరాసంచికచూచితిని. అందలిరసవంతమగు వ్యాసములు, ముద్దులు మూటగట్టు పద్యములు, జ్ఞానశీలములంగలుగజేయుపాటలు, తనివితీరమింజేసి చదివి చదివి ఆనందోత్సాహకందళిత హృదయాంతరంగుడనైతి. ఇందు ముఖ్యముగా శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మ, మదమంచి అనంతమ్మ, వెలివోలు వసంతాదేవి, వింజమూరి వేంకటరత్నమాంబ మొదలగు విదుషీమణులు రచియించిన ముద్దులొలుకు వ్యాసములును, శ్రీయుతులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, రాయసము వేంకటశివుడు, కూచి నరసింహము పంతులు మొదలుగాగల విద్యావాచస్పతులు రచియించిన వ్యాసములును పఠింపదగినవి. ఇయ్యది ముఖ్యముగ స్త్రీలకు విడువరాని ఆభరణము.

మొగలతుర్రు 14-11-30 }

ఇట్లు
బాలకవి, విద్యావైశద్య
యేలేశ్వరపు వేంకటకృష్ణమూర్తి

౧౬

ఆర్యా,

నమస్కారములు. తమదసరాసంచిక చాలా ఆకర్షణీయముగనున్నది.

మునికూడలి 15-11-30 }

ఇట్లు
కాళ్ళూరి వేంకటరామారావు

౧౭

ఆర్యవర్యా,

వందనములు.

మీ రీమధ్య దసరాసంచికను వి. పి. గామాయన్నగారికి పంపితిరట. అద్దానిని వారు త్రిప్పివైచిరట. ఎంత ఆశ్చర్యకరమగు విషయము. గృహలక్ష్మియే లేకున్న నికెట్లు? నేనాసమయమున లేకుండుటవలన వి. పి. త్రిప్పిరిగాని ఉన్నచో నేనైనపుచ్చుకొనిఉందును. నేను మొన్న నేవచ్చితిని. తదుపరి నాకీసంగతి తెలిసెను. వెంటనే నావద్దనప్పుడు రెండురూప్యములేయుండుటనుబట్టి ప్రస్తుతము ఆరుమాసములకైన పంపుడని తమపేర మాపెదతండ్రిగారిచే మనియార్డరు చేయించినాను. అది మీకుఅందియేయుండునని తలంతును. గృహలక్ష్మి లేకున్న మాగృహమేమియు బాగుగ లేదు. కాన నాయందు దయయుంచి తాము గృహలక్ష్మి పంపినచో ఎంతయు కృతజ్ఞురాలను.

హేలాపురి. 12-11-30 }

ఇట్లు
సోదరి

౧౮

అయ్యా,

వందనములు.

తాము పంపించిన గృహలక్ష్మి దసరాసంచికను కృతజ్ఞతతో స్వీకరించితిని. సంచిక ముద్రాణాది విషయములందేమి చిత్రపటాదిశోభలందేమి చక్కని సద్భావముల విరాజిల్లు వ్యాసరాజములందేమి అమందా

నందమును గల్గించుచున్నది. ఆధునికాంధ్ర స్త్రీలలో నెంతటివిజ్ఞానాభివృద్ధి గలవారలుండిరో యీసంచిక సువ్యక్తమొనర్చుచున్నది. సంచిక ముఖపత్రమునందుగల శ్రీమతి ముప్పలనేని పుష్కరాంబగారిచే చిత్రింపబడిన చిత్రము ఆంధ్రస్త్రీల చిత్రరచనానైపుణ్యమును వేనోళ్లజాటుచు సంచికకు మిగుల తేజుస్సు నిచ్చుచున్నది. ఇందుబాలబాలికల విజ్ఞానాభివృద్ధికై తొక్కుపలుకులు మొదలగునవెంతయు సహకారిములై గాన్పించుచున్నవి. ఇట్టి సర్వాంగసుందరమై యలరారు గృహలక్ష్మి దసరాసంచికను దిలకించి నేబొందిన యానందమునకు మేరయేలేదు. కావున నాయానందము నీలేఖామూలమున వెల్లబుచ్చుచున్నాను.

జగన్నాథపురము, కాకినాడ. 7-10-30

ఇట్లు
వీరుభొట్ల భాస్కరరావు

౧౬

ఈసంవత్సరము అక్టోబరు మాసమునందు వెలువడిన గృహలక్ష్మి దసరాసంచికను కృతజ్ఞతతో నందుకొంటిమి. ఆధునికాంధ్రవనితాలోకమునందు ఆంధ్రవాఙ్మయము, చిత్రలేఖన, అల్లిక, నేత మొదలగున వెట్లభివృద్ధి నొందుచున్నవో యీసంచికను దిలకించిన వారికి బోధపడగలదు. వ్యాసరచనయందు గాని, ప్రబంధములు వ్రాయుటయందుగాని, కవితాధోరణియందుగాని, పురుషులకు ఆంధ్రస్త్రీలెంతమాత్రము తీసిపోరని యీసంచిక రుజువుపరచుచున్నది. ఇందు విదుషీమణుల వ్యాసములేగాక పురుషులం దనేక పండితవరేణ్యులు వ్రాసిన వ్యాసములుగూడ ముద్రింపబడినవి. పరిశీలించినచో పురుషులతోపాటు స్త్రీలుగూడ ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి సమానముగ తోడ్పడుచున్నారని విదితమగుచున్నది. ఇందనేకచిత్రపటములును, వ్యాసకర్త్రినుల ఛాయాపటములునుగూడ ముద్రింపబడినవి. ఈ గృహలక్ష్మిపత్రిక ప్రతిమాసమునందును వెలువడుచున్న సంచికలన్నియును చిత్రపటశోభితములై అనేకవిదుషీమణులచే వ్రాయు వ్యాసరాజముల కునికిపట్టయి, ముద్దులొలుకుమాటలకు ముురిపెంపుగొలుపు పాటలకు నిలయమై, పండితప్రకాండుల సదుద్దేశముల కాలవాలమై వర్ధిల్లుచు ఆంధ్రమాతకు కంఠాభరణమునందు చిత్రింపపడిన మణులవలె ప్రకాశింపుచున్నవి. ఈగృహలక్ష్మిపత్రిక ఆంధ్రవనితాలోకమును అన్నివిధముల నున్నతినొందింప సమకట్టినదనుటకుసందియము లేదు. గృహలక్ష్మిపత్రిక చిరస్థాయియై ఆంధ్రదేశాభ్యుదయమునకు తోడ్పడుగాత.

— అగ్నికులప్రబోధిని

# కథావ్యాసమునకు బహుమానము

కథావ్యాసమునకు బహుమాన మీయబడును. బహుమానము గృహలక్ష్మి ఒకసంవత్సరము ఉచితముగ నిచ్చుట. ఈ బహుమానపరీక్షకు ఎల్లరు పోటీ చేయవచ్చును. పోటీకి పంపబడు వ్యాసములు డిసెంబరు 31-లోపున చేరవలెను. కథావ్యాసమున అది వ్రాసినవారి నామముండరాదు. కల్పితనామము ఉంచవలెను. వ్యాసమునకు గుచ్చబడిన వేఱు కవరులో తననామము వ్రాయుచు ప్రక్కన కల్పితనామము ఉదాహరింపవలెను. కథయొక్కరచన, అందలి పాత్రపోషణ, వస్తుకల్పన, జాతీయతలనుబట్టి బహుమానము నిర్ణయింపబడును. గ్రాంథికభాషగాని, వాడుకభాషగాని ఉపయోగింప వచ్చును. పరిమితి అరటావులు పది పదిహేనింటికి మించరాదు. వ్యాసములు దిగువ చిరునామాకు పంపవలెను.

డాక్టరు యస్. శేషగిరిరావుగారు
123, పూనమల్లి హైరోడ్డు, వేపేరీపోస్టు, మద్రాసు.

---

# నవంబరుమాసపు చిత్రప్రశ్నకు సమాధానము

నవంబరుమాసపు గృహలక్ష్మిలోని శ్రీమతి పోచిరాజు రాజ్యలక్ష్మిదేవిగారిచ్చిన చిత్రప్రశ్నకు సరియగు సమాధానము:

| | | |
|---|---|---|
| కుం | కు | మ |
| కు | మ్మ | రి |
| మ | రి | డి |

మేము పెట్టినగడువులోపల పై సమాధానమును తెలిపినవారి నామములను వరుసక్రమమున క్రింద నుదాహరించుచున్నాము:—

1. అడివి సుందరమ్మ, 2. చిత్రపు సుశీల, 3. లక్కాకుల కమలమ్మ, 4. మంచావఝ్ఝుల సీతారామయ్య, 5. పాలడుగు సముద్రాలదేవి, 6. కలవగుంట సీతారామమ్మ, 7. కోడూరి అప్పారావు, 8. వెల్లంకి సతీదేవి, 9. చదలువాడ ధర్మరాజసతి, 10. చెలికాని గంగాధరరామారావు, 11. వై. సోమన్న, 12. కలపటపు రంగనాయకమ్మ, 13. వేటూరి కమలాంబ, 14. దా. లక్ష్మీబాయి, 15. యన్. సావిత్రి, 16. చింతా కృష్ణవేణమ్మ, 17. తోలేటి కామేశ్వరమ్మ, 18. జానకిబాయిపటేల్, 19. మోటూరి సీతారామబ్రహ్మము చౌదరి, 20. ఎమ్. వేదవల్లి తాయారమ్మ, 21, మానేపల్లి లక్ష్మయ్య, 22. నుసర్ల లక్ష్మీనరసమాంబ, 23. తూములూరి సీతమ్మ, 24. కొత్త రామయ్యశ్రేష్టి, 25. ఎ. నరసింహము; 26. శారదాకేసరి, 27. మాచిరాజు సూర్యకాంతమ్మ, 28. మందపాటి సీతామహాలక్ష్మిగార్లు.




# హిందూదేశమున శిశుహత్యలు



శిశుహత్యలు. ఏదేశమునందలి స్త్రీలు తమ సంతానమే తమసర్వస్వ మను కొందురో; సంతానముకొఱకు నోమజాలనినోములు నోమి, కనిపించిన చెట్టులకెల్ల పుట్టలకెల్ల మ్రొక్కి, వేరులువెల్లంకులు కట్టుకొని, కాయలు కసరులు తిని పడరానిపాట్లుపడుదురో అట్టి హిందూదేశమున శిశుహత్యలు జరుగుచున్నవన్నచో మిక్కిలి ఆశ్చర్యముకలుగక మానదు. మాతృస్వరూపిణియగు స్త్రీ తన రక్తములో రక్తమును, తనప్రాణములో ప్రాణమును అగు శిశువును సుఖసుఖాన చంపజాలదు. తల్లి తనశిశువును చేతులార హత్యచేయుటకు ఆమె మతిభ్రష్టురాలైన అయి ఉండవలెను; లేదా ఆమె హత్యచేయబడినశిశువును పొందుటలో సంఘనీతికి వ్యతిరేకించినదైన అయి ఉండవలెను.

ఏమై ఉండిననేమి? ఏ దేశమున శిశుహత్యలు కలవో ఆ దేశమునందలి వారు సంఘనీతికి కొంత దూరులై యున్నారని లోకమువారు అనుకొనకతప్పదు. అందులో విదేశీయములైన కొన్నిగురిగింజలకు వెక్కిరించుట కవకాశముదొరుకును. దొరసానిమేయమ్మ హిందూదేశమునందలి శిశుహత్యలనుగూర్చి వ్రాసిన అతిశయోక్తులు ప్రతిభారతీయుని హృదయమునందు ప్రతిధ్వనించుచునేయున్నవిగదా?

ఈ శిశుహత్యలసమస్యనుగూర్చి మన సంఘసంస్కర్తలిపుడిపుడు కొంత చర్చించుచున్నారు. శిశువును హత్యయొనరించినందుకు శిక్ష స్త్రీ ఒక్కర్తుకమాత్రమే అనుభవించు-

మన్నది. సంఘనీతినతిక్రమించి శిశువునుగన్న స్త్రీ కాకులవంటిలోకుల కండ్లయెదుట బడజాలక తన శిశువును చంపి తన అవనీతికి మసిబూయజూచుచున్నది. శిశుహత్య జరుగుటకు కారణభూతమగు అవనీతికి స్త్రీ ఎంత బాధ్యురాలో పురుషుడును అంతే బాధ్యుడగుచున్నాడు. అవనీతికి స్త్రీపురుషులది సమానబాధ్యతకాగా దానికగు శిక్ష ఒక్క స్త్రీ శిరమునమాత్రమే బడుచున్నది. స్త్రీజనశ్రేయోభిలాషులు ఇదిమిక్కిలి అవనాయమని ఆందోళనచేయుచున్నారు. ఈ ఆందోళనకు ఫలముగా వెనుకటి భారతశాసనసభలో ఒక మహాశయుడు హత్యచేయబడిన అక్రమసంతానముయొక్కతల్లిని ఒక్కర్తుకనేగాక తండ్రినిగూడ శిక్షించుటకు శిక్షాస్మృతిని మార్పుచేయవలయునని ఒక ప్రతిపాదనమును గొనివచ్చినాడు. న్యాయశాస్త్రప్రకారము ప్రత్యక్షముగ హత్యచేసినవారు మాత్రమే శిక్షాపాత్ర మగుదురనియు, ఆ కారణమున ఈ ప్రతిపాదనము అశాస్త్రీయమనియు ప్రభుత్వమువారు దీనిని ప్రతిఘటించిరి. ప్రతిపాదన తిరస్కృతమైనది.

తిరస్కృతమగుగాక! ఈ విషయమున స్త్రీలకు జరుగుచున్న అవనాయము పెద్దలందఱును గ్రహించియేయున్నారు. వెనుకటిమదరాసుశాసనసభలో ఒక సభ్యుడు గడచిన ఐదుసంవత్సరములలోను మదరాసురాజధానియందు శిశుహత్యలసందర్భమున జరిగిన కేసులమొత్తమెంతయని ప్రశ్నించెను. ముప్పదియైదు అని ప్రభుత్వసభ్యుడు ప్రత్యుత్తరమిచ్చెను. నాలుగుకోట్లకు మించిన జనాభాగల ఈ రాజధానియందు ఐదుసంవత్సరములకు శిశుహత్యలకుచెందిన కేసులు ముప్పదియైదుమాత్రమే.

ముప్పదియైదుమాత్రమే. ఈగలవలె వ్రణములేవెదకు మేయమ్మవంటివారలకు ఈ గోరంతలు చాలును కొండంతలుచేయుటకు. మేయమ్మవంటివారు చెప్పుటకు ఏమాత్రము సందులేకుండచేయుటకును, భారతభూమి ఆవగింజంతయైనఅవనీతిలేని పవిత్రభూమియని అనిపించుకొనుటకు మనము ప్రయత్నింపవలసియున్నది. ప్రయత్నించినచో ఈ విషయమున మనము కొలదిలోనే ఫలమును పొందగలము. ఈఅవనీతి మనదేశమున విశేషవ్యాప్తిగాంచలేదని ప్రదర్శింపబడిన లెక్కలు ప్రత్యక్షీకరించుచున్నవి. కావుననే ఈ దురాచారమును కొలదిప్రయత్నముతోడనే పాఱద్రోలవచ్చునని ధైర్యముగ చెప్పుట.

శిశుహత్యలు గావించు స్త్రీలు విశేషము ఏతెగవారు; ఆ స్త్రీలు అవివాహితలా, వితంతువులా; వారిని ఈహత్యకు ప్రేరేపించిన కారణములు సాంఘికములా, ఆర్థికములా, మానసికములా అను విషయములు జాగ్రత్తగ పరిశీలింపబడవలయును. పరిశీలించి ఆయా కారణములు తొలగిపోవుటకు సాధనములరయవలయును. శిశుహత్యలుగావించు స్త్రీలకు ప్రబోధము పుట్టించుట మాత్రమే చాలదు. సంఘము సంస్కరింపబడనిది వారికి ప్రబోధము పుట్టించి లాభములేదు. స్త్రీయగునది ప్రబలకారణముండినగాని చేజేతల తన బిడ్డను చంపుకొనదు. ఆమె ఆనేరము చేయుటకు విశేషముకారణము లుండును. ఆవిశేషకారణములను

పాఱద్రోలుటయే సంస్కర్తలవిధాయకకృత్యము. వితంతువివాహములు విరివిగసాగించుట, అనాథలగు స్త్రీలకు వృత్తులునేర్పుటకు శరణాలయములను స్థాపించుట, నిద్రాముద్రితమగు హిందూసంఘమును విద్యాప్రబోధముచే వికసింపజేయుటమొదలగుకృత్యములవలన హిందూదేశమున శిశుహత్యలు తప్పక నిరోధింపబడును.

అయితే ఇట్టి నిరోధము సమగ్రమగుటకు కొంతకాలముపట్టును. ఈ లోపున సులభమైన ఒక మెలకువను దేశీయులు చూపవచ్చును. అక్రమసంతానమును బొందిన స్త్రీకి సంఘముయొక్క కశాఘాతము తగులకుండ సంరక్షించు శరణాలయములు దేశమున ప్రధాన పట్టణములందన్నిటియందును ఏర్పఱుపవచ్చును. ఇట్టి ఏర్పాటువలన సంఘమునకు వెఱచి చేయబడు శిశుహత్యలు వెంటనే కట్టువడిపోవును. కాలక్రమమున సంస్కర్తల కృషిమూలమున వితంతువివాహములు విరివిగ జరిగి, అనాథశరణాలయములు స్థాపింపబడి, హిందూసంఘము ప్రబోధింపబడి అక్రమసంతానోత్పాదనదుష్కృత్యముకూడ నిలిచిపోవును. అందుతో ఈ శిశుహత్యలసమస్యవిషయమున హిందూదేశమును రంధ్రాన్వేషణపరులు వేలెత్తి చూపుటకుగల అవకాశము అదృశ్యమగును.

## పూలగుత్తి

వి. ఆర్. భరద్వాజగారు

చివురుపొదిగిటిలోనఁ
జిన్నారిపొన్నారి
జిలుఁగుక్రొన్ననగుత్తి
చిఱునవ్వు లొలికినది.
తొగరుపెదవులఁదేనె
తుంపురులుచిలికినది.
లేఁతబుగ్గలముద్దు
పూఁతలను గ్రమ్మినది-
వెలితియూర్పులనుగ్గు
వలపులను జిమ్మినది.
చిఱురెక్కలూఁచినది.
వెరగంది చూచినది-
ఉబుసులెన్నో పెదవి
యోరనే డాఁచినది-

మవ్వముగఁదారినది
కెవ్వమని కేరినది.
ఆప్రసవగుచ్ఛమును
మాప్రేమచిహ్నముగ
నాప్రాణవిభుఁడు తొలి
నాకొసఁగెఁ బ్రీతిఁ.
నాటగోలెను మేముప్రేముడి
నాటిపెంచిన తీవజంటఁగ
ననఁగిపెనఁగితి మంతఁగోర్కులు
కొనలుసాఁగినవి.
పొడముపుల్కల చివురుపొత్తులఁ
బొదివికొని యాపూలగుత్తిని
కలయఁజూచితి మదియ షాపై
కనులువిచ్చినది.

# విధివిధానం

శ్రీమతి వెంపటి జానకీపురుషోత్తము గారు

(సంభాషణలతో నిర్వహింపబడిన ఒక చిన్నకథ)

“ఎక్కడా కనపడ్డంలేదేం హనుమాయమ్మా?” అన్నది వృద్ధస్త్రీ.

“తీరుబడివుంటేగా కనపడ్డానికి, సుబ్బమ్మపిన్నీ.”

“తీరుబడిలేకేమమ్మా! ఇంట్లో కోడలు లేదూ?”

“ఉంటేయేం? చిన్నపిల్ల. ఇంటినిండాచుట్టాలువస్తే దాని మొఖం అదేంవంటచేస్తుంది? కాఫీ, ఫలహారాలు చెయ్యడంతోటే దానికి సరిపోతోంది. వచ్చి నాలుగురోజులైందికదా అని తీరుబడిచేసుకున్నా ఇట్లా.”

“చిన్నపిల్ల, చిన్నపిల్లంటూ అనక. ఇప్పటినుంచి చేస్తూవుంటే బాగాఅలవాటు అవుతుంది.”



శ్రీమతి వెంపటి జానకీపురుషోత్తము గారు

“సరే, నాలుగురోజులు పోతే చేసుకోదూ? వచ్చిన మరునాటి నుంచీ యెందుకులే?

“అయితే, హనుమాయమ్మా! వొకసంగతి విన్నాను...”

“ఏసంగతి?”

“దీక్షితులుగారి అమ్మాయి పద్మావతి సంగతి.”

“ఏమని?”

“పద్నాలుగేళ్లపిల్ల మొగవాడి దగ్గర చదువు నేర్చుకొంటోందని.”

“ఆసంగతా? విన్నాను. అయితే యేంపిన్నీ?”

“బాగానే వుంది. నలభైయేళ్ల దానవు నీవుకూడా అట్లా చెపుతే యేం చెప్పను?”

“ఏంఅట్లా అంటావు పిన్నీ?”

“చూడూ. మొగవాడి యెదురుగుండా కూర్చుని చదువుకోడమా? అదీ కాక రోజూ సాయంకాలం వూరిబయటికి షికారు వెడుతుంది కూడాను.”

“చదువుకోకపోతే జ్ఞానం యెట్లా వస్తుందమ్మా? పిన్నీ!”

“ఓహో, నీవు చదువుకున్నదానవు కనుక అట్లా మాట్లాడుతున్నావు. సరే. చదువుమాటలట్లావుంచు. బయట ఈషికార్లేమిటి? ఎవరేనా అడిగితే ఆరోగ్యానికంటుంది. అల్లా వెళ్లని వాళ్లంతా రోగాలతో తీసు

కుంటున్నారా చెప్పు? ఏమోనమ్మా, ఆ కుటుంబంలో పూర్వంనుంచీ అంతా చాలా మర్యాదగా వుంటు న్నారు. ఇప్పటి యీచిన్నకారు యేంచేస్తారో?"

"మన మెందుకు అట్లాఅనుకోడం? ప్రొద్దుగూకింది. వెళ్తాను మతీ."

* * *

ఉదయం యేడుగంటలైంది. దత్తాజీస్నానంచేసి తెల్లటి ఇస్త్రీబట్టలు కట్టుకొని, క్రాపింగ్ దువ్వుకొని బయటికి బయలుదేరాడు. ప్రక్కసందు తిరగ్గానే స్నేహితుడు కనపడ్డాడు.

"ఎప్పుడువచ్చావురా? శ్రీనివాసా!" అని అతన్ని పలకరించాడు.

"రాత్రి వచ్చానురా, దత్తాజీ!"

"ఎక్కడికి బయల్దేరావు?"

"ఏదో బయల్దేరాను. ఎక్కడ నీ బస?"

"ఇక్కడే, దీక్షితులుగారి ఇంట్లో."

"ఏదీక్షితులుగారు?"

"ప్లీడరుదీక్షితులుగారురా."

"అయితే, నీవువచ్చినందుకు ఎక్కడైనా ఉద్యోగం కుదిరిందా?"

"ఎక్కడా దొరకలేదురా, శ్రీనివాసా!"

"పోనీ, దీక్షితులుగారితో చెప్పకపోయినావా? ఆయన యేదైనా ప్రయత్నంచేసేవారేమో?"

"చెప్పినాను, ఆయనా ప్రయత్నంచేశారు. యెక్కడా ఖాళీలేంది ఆయనమాత్రం ఏంచేస్తారు?"

"మరి, ఆయన ఇంట్లో కూర్చుని ఈ బెజవాడపట్నంలో ఎట్లాగడుపుతున్నావు కానీలేకుండా?"

"వాళ్లఇంట్లో పూరికే కూర్చోలేదు. వాళ్లఅమ్మాయికి ట్యూషన్ చెప్పమంటే చెప్తున్నాను."

"అయితే నెలకి ఏమిస్తారు జీతం?"

"ప......ది......హే......ను."

"చాల్లే, గునుస్తావేమి? బి. ఏ. ప్యాసు అయి ఇంట్లో పూరికేకూర్చోకుండా దొరకింది. అదీ కొంత బాగానేవుంది. కాని నీవు భోజనంహోటల్లోనేనా?"

"లేదురా, వారింట్లోనే భోజనం చెయ్యమన్నారు. ఇంతవరకూ వారింట్లోనే. సరే కాని నీకెక్కడైనా దొరికిందిట్రా ఉద్యోగం? శ్రీనివాసా!"

"లేదురా, దత్తాజీ!"

"ప్రయత్నం చెయ్యడంలేదూ మరి?"

"ప్రయత్నం జేస్తూనేవున్నాను. కాని నాకూయెక్కడా కలిసిరావడంలేదు."

"మరి, యేంపనిమీదవచ్చావు ఈవూరు?"

"ఉద్యోగంకోసమే. ఇక్కడ మానాన్న స్నేహితుడున్నాడు. ఆయనతో ఆవిషయంచెప్పి వెడదామని వచ్చాను."

"ఆయనదగ్గరకు వెళ్లావా?"

"లేదురా, యికవెళ్లాలి. ఇదిగో పదిగంటలు కొడుతున్నారు. ఉంటాను."

"సరే, శుభంభూయాత్. కానీ"

* * *

"కాఫీ, ఫలహారం పుచ్చుకొన్నారా? దత్తాజీగారూ!"

"ఆఁ, పుచ్చుకొన్నానమ్మా."

"అయితే మీరు బయటికి షికారు వెళ్లడానికి సిద్ధంగా వున్నారన్నమాటే."

"లేనమ్మా, పద్మావతీ!"

"ఎందుచేత? ఏదైనాపని వుందా?"

"పనేమీలేదు."

"మరెందుకురారూ?"

"ఊర్కేనే అన్నాను, రోజూ వెడుతూనే వున్నాంగా. రేపు వెడదాంలేండి."

"అయితే ఇవ్వాళ సినీమాకు వెడదాము పోనీ?"

"సినీమా అంటే నాకు తలనొప్పి. నేరాను. మీరు వెళ్లిరండి."

"ఈఫిల్ము చాలా బాగా వుంటుందిట. తప్పకుండా వెళ్లి చూడాలి. నేను ఒక ర్తెనూ యెట్లా వెళ్లనూ?"

"మీ నాన్నగారిని పిల్చుకుని వెళ్లండి."

"ఆయన రారండీ, ఆయనకి తీరుబాటుండదు."

"చెప్పానుకాదూ, నాకు సినీమా అంటే తలనొప్పిఅని. కావాలంటే మిమ్మల్ని దిగవిడ్చివస్తాను. సినీమా ముగిసేవేళకి మళ్లీవచ్చి ఇంటికి పిల్చుకొస్తాను."

"మీవీలు, ఇష్టం. అట్లాగేచేయండి. ఇదుగో జడ వేసుకొనివస్తున్నా."

* * *

"మేము ప్రయాణం తలపెట్టామండీ, దత్తాజీగారూ!"

"ఏఊరికి?" అన్నాడు ట్యూషన్ చెప్తూ.

"తిరుపతికండి."

"ఏదైనా మొక్కుబడి వుందా?"

"అవునండీ" అన్నాడు ప్రక్కనుఉన్న దీక్షితులుగారు.

"ఎవరికి?"

"మా అమ్మాయికి ఆమధ్య జబ్బుచేస్తే మొక్కుకున్నాం. నిమ్మళంగావుంటే కొండకి పిల్చుకొస్తామని. వెడదామంటే అప్పటినుంచి యెప్పటికప్పుడు కోర్టుపనులతో సరిపోతోంది. మొన్ననే కోర్టు మూశారు గనుక యిప్పుడు తలపెట్టాను. ఈ నెలరోజులు తిరుపతి ఇంకా ఆవైపుల ప్రయాణంచేసి వద్దామనివుంది."

"ఎప్పుడు వెడతారు?"

"రాత్రి మెయిలుకి వెడదాం. మీరుకూడా సిద్ధంగావుండండి."

"స్టేషన్ దగ్గర సహాయానికా?"

"కాదు, మీరుకూడా తిరుపతికి రావడానికి."

"ఆఁ, నే నెందుకు లెండి?"

"ఏం అట్లా అంటున్నారు? మీకేమన్నా అభ్యంతరంవుందా?"

"అబ్బే, యేంలేదండీ"

"మరెందుకు అట్లాఅన్నారు?"

"నేనువస్తే నాకయ్యే ఖర్చులు మీరు పెట్టుకుంటారని. మరేమీలేదులెండి."

"మరేం, ఫరవాలేదు. బయల్దేరిరండి."

"మీమాటకాదంటానా? సరేలెండి."

"బట్టలు సర్దుకోండి. తొమ్మిదిగంటలకల్లా బయల్దేరాలి." అంది పద్మావతి.

* * *

"ఎవరికోసరం అమ్మాయీ! ప్రొద్దుటినుంచీ ఈప్రాకారంలో వెతుకుతూవున్నావు?"

"మీకోసరమే."

"నాకోసరమా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును."

"ఎందుకూ?"

"మీతో మాట్లాడాలి."

"నీకు తెలుసునా నన్ను?"

"తెలుసును."

"నీవెవరో నాకు తెలియదే?"

"మీకు నేనెవరో తెలియదుగాని మిమ్మల్ని నాకు తెలుసు."

"ఎట్లా?"

"భర్త అవడంచేత."

"ఎవరూ?"

"మీరు."

"చాల్లే, నీవెవరమ్మా? ఇట్లాంటిమాటలు మాట్లాడకు."

"ఈవిషయం చెపుదామనే ప్రొద్దుటినుంచి మీకోసరం చూస్తున్నాను."

"ఏవిషయం?

"నేను మీభార్యనని."

"నా కింకావివాహంకాందే నీవు భార్య వెట్లాఅయినావు?"

"మిమ్మలను వరించడంచేత."

"నన్ను, ఇదివరకెప్పుడుచూసి వరించావు?"

"పదిరోజులక్రిందట స్వప్నంలో మిమ్మల్నిచూసి వరించి మిమ్మలనేపతిగా చేయమని ఏడుకొండల వెంకటేశ్వర్లని వేడుకొన్నాను."

"అయితే నేనిక్కడవున్నానని నీకెట్లా తెలుసూ?"

"నాలుగురోజుల క్రిందట స్వప్నంలో వెంకటేశ్వర్లు కనపడి నీవువరించిన భర్త కొండమీద ఉంటాడు. అచ్చటికివచ్చి వివాహంచేసుకో అని చెప్పినాడు."

"నేను పెళ్లిచేసుకోకపోతే నిన్ను?"

"మీరు చేసుకోకపోతే మీపాదములవద్ద జీవములు విడుస్తాగాని మరొకరిని చేపట్టను."

"అయితే, ఇక్కడికి యెప్పుడువచ్చావు?"

"నిన్నవచ్చాను."

"నీదేవూరు?"

"నాది నెల్లూరు."

"నీ తల్లితండ్రులెవరు?"

"నేను అనాధను."

"నీపేరేమిటి?"

"అనసూయ."

"అనసూయా, నీమృదువైనశరీరం నాకోసరం కష్టపెట్టుకున్నావా?" అన్నాడు దత్తాజీ.

"లేదు, స్వామినినమ్మి నావిధి నెరవేర్చుకున్నా."

"స్వామియాజ్ఞ అయితే సరే. మనలనిద్దరినీ యిక్కడ కూర్చినందుకు వెంకటేశ్వర్లస్వామికి నమస్కరిద్దాం, రా."

"ఈశ్వరసంకల్ప మెవ్వారెరుంగుదురు?" అంటూ గూఢంగా గానంచేస్తూ స్వామిసాన్నిధ్యానికి బయల్దేరారు ఇద్దరూ.

స్వామియాజ్ఞప్రకారం. స్వామియేర్పర్చిన శుభముహూర్తాన అనసూయాదత్తాజీలు భార్యాభర్తలైనారు. ఏడుకొండలవాని యేర్పాటు జరిగిపోయింది.

దీక్షితులుగారు నూతనవధూవరులను ఆశీర్వదించారు. పద్మావతికూడా వారిని చూచి అభినందించింది.

## శబరి

శ్రీమతి సీరము సుభద్రయాంబగారు

ఉ. ఎంతటి ధైర్యమో, యహహా! యెంతటి నిష్కపటస్వభావమో;
సుంతయుఁ గొంకులేక పరిశోధనతో రుచిదాను జూచి, య
త్యంతమనోజ్ఞ సత్ఫలము లాపయిఁ బెట్టెను రామమూర్తి; కే
యింతులుసాటి యాశబరి కీత్రిజగంబుల రోసిచూచినన్?

ఉ. కన్నులు విందుగాఁగ రఘుకాంతుని గాంచి భజించి, భక్తి సం
పన్నత రాముమెప్పు సులభంబుగఁ దాను గడించినట్టిదె,
యెన్నఁగరాని సత్పదవి కేగెను; లేరె ధరం దపోధనుల్?
సన్నుతభక్తిచే శబరి సాటికి రారొకరైన వారిలోన్.

చ. పరమపవిత్రయా శబరి భాగ్యమె భాగ్యము; సన్నుతింపఁగాఁ
దరమె? భవాబ్ధితారకము తారకనామము రాముమోమునం
గరమును సూక్ష్మమార్గమునఁ గాంచఁగగల్గి, మునీంద్రవంద్యయై
నిరుపమకీర్తికాంత తన నెచ్చెలిగాఁ బొగడొందె నిచ్చలున్.

ఉ. ఎంగిలి పండ్లొసంగెనని యేవ వహింపక రాఘవుండు మా
తంగి తనంత నిచ్చిన సుధామధురామ్రఫలాళితోడ నా
యంగన భక్తిసత్ఫలము నాదరమొప్ప గ్రహించుచున్, దివిన్
మంగళసత్పదంబు, భువి మాయనిఖ్యాతియు నిచ్చె నామెకున్.

చ. అతులితభక్తిభావమున నవ్యయు రాము భజించి పూతయై,
సతతము ధాత్రిపై శబరి సంస్తుతికిం దగినట్టిదయ్యె; నీ
క్షితి రఘురామపాదయుగసేవ యొనర్పకయున్న, వ్యర్థజీ
వితమది; రామభక్తులు పవిత్రచరిత్రలు స్తోత్రపాత్రులున్.

# సాదింపు

న్యాపతి కృష్ణారావుగారు బి. యె; బి. యల్.

(వినోదపాఠము)

సాదింపు అనేది ఎట్టి శాంతమైన గృహములోనైనా ఇంగువపలుకంతేనా ఉంటుంది. ఇందుకలదు అందులేదు అని లేదది. ప్రతీమొగుడూ (ఆమాటకువస్తే పెళ్లాల్ని అడగండి) భార్యచేసిన చేష్టల గురించో, ఇంట్లో జరుగుతున్న వ్యవహారం గురించో పెళ్లాన్ని సాదిస్తూనే ఉంటాడు. ప్రతీపెళ్లామూ (కావలిస్తే మొగుళ్ల నడగండి) మొగుడు తాను చేసిన కార్యాలన్నిటికీ చీటికీమాటికీ అడ్డం వస్తూంటాడని సాదిస్తూనే ఉంటుంది.

ఇక వివాహం అయిన పురుషుడెవడైనా నిద్రలేచింది మొదలు రాత్రి పడుకోబోయే వరకూ సాదించకుండా ఉన్నట్లయినా, అంటే ఇంట్లో గొడవలులేకుండా ఉంటే వాడిలో వాడే ప్రొద్దస్తమానం సాదించుకునే రకమని అంటాము. సాధారణంగా తలపాగాలు చుట్టుకుని తిరిగే ఈమొగప్రపంచకంలో నాకే మహా రెండుకొమ్ములు మొలిచాయని తిరగడం ఉందే పరమఅసహ్యాం. ఏమో నాకలా అనుపిస్తుంది.

సాదించడం రెండు పక్షాలకు చెడే. మరీ చిన్నచిన్న విషయాలే సాదించడానికి కారణం. ఒకమాటు సాదించే టప్పటికి సాదింపబడిన పక్షానికి ఒళ్లుమండి ఎందుకుసాదించారో కారణం తెలుసుకోలేక నరసింహమూర్తి అయిపోవడం తటస్థిస్తుంది. తక్కిన పక్షానికి హిరణ్యకశిపుడిలాగ మరణించడంలేదు కాబట్టి మాటకు మాట, తిట్టుకు తిట్టు, కేకకు కేక ప్రబలమై—సరీగా అర్థం చేసుకుంటే సాదింపుకారణం యెంత దోమగా ఉండేదో అంత యేనుగై—ఆగ్రహం విజృంభిస్తుంది.

నా సాధనంలో ఇవన్నీ కట్టిపెట్టేశాను. నాపన్నుగడ యేమిటంటే ప్రతీక్లబ్బులోనూ ఉన్నట్లుగా ప్రతీగృహంలోను ఫిర్యాదులపుస్తకం అని ఒకటి ఉండాలి. భర్తకేదైనా గనుక సాదించవలెనని ఉంటే ఆపుస్తకంలో ఒక వైపున వ్రాతపూర్వకముగా సాదిస్తాడు. తరువాత యిల్లాలు చల్లగావచ్చి సాదింపుని చదువుకుని నవ్వుకుంటూ దాని కెదురుపుటలో జబాబు అతిసబబుగా వ్రాశేస్తుంది. మళ్లీ యజమానుడు ఇంటికివచ్చి మందహాసంతో పుస్తకంవిప్పి ఉత్తరాన్ని విలోకించి ఆనందించడమో, కోపం తెచ్చుకోవడమో—ఏదో, జబాబుబట్టి అఘోరించడం—అదీ నాపన్నుగడ.

ఈ సంగతి నాస్నేహితుడున్నూ వ్యాసకర్తయున్నూ అయిన సూర్యనారాయణ మూర్తితో చెప్పాను. తాత్పర్యం నిమిషమాత్రాన గ్రహించి భళీయని నన్నా మోదించి ఆ మర్నాడే ఆచరిస్తానన్నాడు. తాను వ్యాసాలువ్రాశే ఎక్సర్‌సైజు బుక్కొకటి తీసి ఒక పేజీపైన "సాదింపులు" అనీ దానికెదురుపేజీలో "జబాబు" అనీ ఎర్రసిరాతోలిఖించి నడవలో బల్లమీద పారేశాడు.

మరుసటిదినము పదకొండుగంటలకు అచ్చుపోసిన గిత్తలాగ సడవలోకి ఒక్క-గంతులోవచ్చి పెన్సిలుపుల్లను గట్టిగాబిగించి రోషంతో మూతి బిడాయించి ఈ ప్రకారంగా "సాదింపులు" పేజీలో యిరికించాడు.

"నేను ప్రొద్దున్న వ్రాసుకోవడం ప్రారంభించేసరికి ఆ చంటివాడు నాగది ముందరికి వచ్చి యేడుస్తూ డప్పువాయించడం అత్యంతవసరమా?"

అంత తనవైపు వస్తూన్న భార్యను మూకీభావముతో వీక్షించి పుస్తకాన్ని బల్ల మీద జారవిడిచి తన గదిలోకి పారిపోయి "ఊరికే శబ్దం చేస్తూంటే వ్యాసాలు ఎలాగ వ్రాస్తాననుకొం"దని తలపోస్తూ కూర్చున్నాడు. కొంత సేపయిన తరువాత "జబాబు" యేమిటో అని చూశేసరికి—

"ఇంకా కొంచెం విశదముగా వ్రాయండి." అని ఉన్నది.

సూర్యనారాయణమూర్తికి శాంతంరాలేదు. తన వ్యాసాలన్నీ సులభసుందరములని పేరుప్రతిష్టలు పొందుతే తన భార్యకు విశదం కాకపోవడం ఆమె అజ్ఞానమే యని అభిప్రాయ పడ్డాడు. మళ్లీ కోపంతో "ఆచంటివాడు..." అని తాటికాయలంత అక్షరాలతో ఎప్పటి సాదింపునే లిఖితపూర్వం చేశాడు. ఈపర్యాయం "జబాబు"—"ఏచంటివాడు?" అని ప్రశ్నార్థకమై అతని కంటికిఎదుట నిలబడ్డది.

మూర్తి ఒడలుమండిపోయి ముచ్చెమ్మటలుక్రమ్మినాయి. అతని చిన్నకొడుకు అల్లరి చేసి యేడుస్తున్నప్పుడల్లా మూర్తి వాడ్ని "రామం"అని పేరుతో పిలువక "ఆచంటివాడని" విసుకుతో హెచ్చరిస్తూంటాడు. అతనిభార్యకు వాడ్ని (రామం అని ఆమె పిలుస్తుందిగనుక) అలా విసుక్కో-వడం యేమాత్రం యిష్టంలేదు. అపుడు సూర్యనారాయణమూర్తి ఈకప్ప దాటువేయడానికి ఆమెకు అవకాశం కలిగిందని పళ్లుకొరుకుచూ పెన్సిలుమొన విరగ్గొట్టి మళ్లీ సూదిగా చెక్కి- శూలంలాగ పట్టుకొని బరికాడు. ఏమని?

"మన చంటివాడు ..ఆరామిచంటివాడు. నాడబ్బంతాతాతిని, నౌకరీచేస్తూన్న ఆరామి ఆ చంటివాడ్ని నాగదిముందర చప్పుడు చెయ్యమని వదిలెయ్యకపోతే కాస్త యెత్తుకొనీ ఆడించకూడదూ? ఇంకా ఈమోస్తరుగాజరుగుతే ఊళ్లోవేరేగదితీసుకోవలసివస్తుంది. ఏమి?"

ఇందుల కాతని భార్య —రామమ్మ అను పేరిది—ప్రత్యుత్తరము ముక్తసరిగ మూడుఅక్షరాల్లోముగించింది. "అలాగే?"

సూర్యనారాయణమూర్తి రోషభాషణఘుర్ఘురధ్వానంతో పుస్తకాన్ని పొయ్యిలోకి విసిరేశాడు. నన్నుగురించి నాపన్నుగడనుగురించి అభిప్రాయంచెప్పడానికని నాదగ్గరకు వచ్చారు. నేను విన్నాను. మీకు చెప్పాను. ఆచరించ తగ్గదేనా? విదుషీమణులు వివరింప వలసిఉంది.

# "అమ్మ...కాదు, పిన్ని" అంది పాపాయి

కె. కామేశ్వరరావుగారు

(సాంసారికమగు ఒక చిన్నికథ)

కలగబాఱిన చిత్తానికి కనుగందుల తొక్కుపలుకులు కమ్మని సుఖాన్నిస్తాయి.

మా దేవిగారితో తీరుబడి అయినప్పుడల్లా తీరికూర్చొని ముచ్చటగా మురుస్తూండడం ఏరోజు కారోజు నాకు తీరనికోరికయిపోతూంది. 'మనసులోవర్తించే' కులకాంతతో నేచీపెట్టడమన్నా కూడా కష్టమే. జూనియర్ రాణి కాపరాని కొచ్చి అట్టేకాలం అవలేదు. సీనియరు మా పాపాయిని నాకు వప్పగించి, పుణ్యాత్మురాలు కనక దుఃఖభాజనమగు ఈ లోకాన్ని వదిలిపెట్టేసింది. మా అత్తగారు (యిప్పటా విడ) అప్పుడప్పుడు "రెండో పెళ్లివాడికి పిల్లనిచ్చాము - మా పిల్ల ఏం సుఖంపడుతుంది - కుర్రతనంలో చచ్చినవాళ్ల కోరికలు తీరవుకూడాను" అని విచారిస్తున్నప్పుడు నా మనస్సంతాపము ఎక్కువౌతూండేది.— కాని మొదటినుంచి సంసారంలో మా ఇద్దరిమాట ఏకీభవించి ఇంచుమించుగా స్వర్గసుఖం అనుభవించటం వల్ల ఇప్పుడుమాత్రం అలా ఎందుకు కాకూడదని వితర్కించుకుంటూండేవాడిని. దైవయోగంవల్ల ఇప్పుడు కూడా అనుకూలదాంపత్యమే - స్థితి తక్కువవాణ్ణయినా...

ఓనాడు బళ్లోంచి వచ్చాను. తలగుడ్డ తీసి విసిరిపారేశాను. (రోజూ వకటే ఏడ్పు కనక చిరాకు) కోటువిప్పి గోడకి తగిలించాను. నులకమంచం వాల్చుకుని కూలబడ్డాను (చేసేది స్కూలుమేష్టరీ దర్జాలెలా వస్తాయి?) మానాన్న (మా కుర్రవాడికి మా నాన్నపేరు పెట్టుకున్నా) నేను లోపలికెళ్లేసరికప్పుడే మొహం ఎంతోచేసుకుని పరిగెత్తుకొచ్చి నాకాళ్ళని కౌగలించుకున్నాడు. "నాన్నారూ!" అన్నాడు తొక్కుపలుకులతో.-మా పాపాయికూడా ఈమధ్యనేవచ్చింది తాతగారి యింటిదగ్గరనుంచి. ఆ పిల్లలి నిద్దరిని చూసుకుంటే ఆనందమే - బ్రహ్మానందం. 'వెయ్యి మేకల్ని కాయొచ్చును కాని పదిమంది పిల్లల్ని జాగ్రత్తపెట్టలేము.' చిరాకు ఎక్కువ మూలాన్ని పాపము - మా నాన్నని - నన్ను కన్నతండ్రిని - నావరాలకొండని - నాబంగారుముద్దని ఏమీ తెలియని నా ఆనందమూర్తిని-కసిరాను. మా నాన్న ముఖం చిన్నదైపోయింది. ఎక్కడలేని దుఃఖమూ వచ్చేసింది. అభిమానం సాయపడింది. వెక్కి వెక్కి రాగాలు మొదలెట్టాడు. నేనుమాత్రం పలుకరించలేదు. నాది రాతిగుండనుకున్నాడు. ఆ నిష్కల్మషహృదయుడు ఏడుస్తూనే అమ్మదగ్గరకి వెళ్లాడు. ఎక్కువమూలాన్ని మాటలసంపుటి తిన్నగాలేదు "నా-న్న-నన్ను-తిత్తారు........"

హైకోర్టులో పితూరీచేశాడు మా నాన్న...'ఓ చిన్న లెక్చరేనా ఉండదా ఈవేళ' అనుకున్నాను. 'నేరస్థుణ్ణి కనక కోర్టువారు నాకు ఏమైనా శిక్ష విధిస్తారేమో' అనుకున్నాను.

"మా నాయన! ఏమిరా ఏడుస్తున్నావు?"

"నా...న్న...తిత్తారు...మరి కొత్తిరా"

"నువ్వు మీనాన్నకి నాన్నవుగా...నువ్వే కొట్టిరా!"

"ఊఁ..."

"వెళ్లు-కొట్టిరా"

"నే కొత్తలేను...మరి నువ్వే కొత్తు"

నవ్వుకుంటూ (నేనెల్లాగ వింటూంటాననే) "అల్లాగేలే-అనక-పట్టుకుని-పెళ్లి చేద్దాము-ఊరుకో యింక, మా నాయన ఊరుకోరా!" అంది నా అర్థశరీరం.

నేను చిరానులోనే చిదానందంపొందాను. శిక్ష తగ్గింది - కేసు కొట్టేశారు - మానాన్న ఏడుపు మానేశాడు-కాని నాకోరిక మాత్రం తీరలేదు: మా నాన్నపంతం నెగ్గింది కనక-మాదగ్గరకు రాక-దూరంగా నిలబడి "ఓతాయి లారికి-ఆనక-పెళ్ళోయ్" అన్నాడు గేలిచేస్తూ.

"ఎవరికిరా తమ్ముడూ?" అంది పాపాయి నాదగ్గరే ఉండి.

"మీ నాన్నకోయ్,"

"మా నాన్నని ముట్టుకుంటే తంతాను..."

"నేను...కాదు...మరేం...మా అమ్మోయ్"

ఎంచేతో పాపాయి మాట్లాడలేకపోయింది. ఎవరేనా చెపుతూండగా విందేమో సవతితల్లుల కథలు. నాకేసి చూసింది బిక్కమొహంతో......"సుబ్రాడల్లాగంటే-ఆడపిల్లకి అభిమానం ఎక్కువ-చిన్న పుచ్చుకుంటుందేమో" అని "అమ్మా! మనం యిద్దరంజట్టు-తమ్ముడు మనజత లేడన్నాను."

మాపిల్ల ముఖపద్మం వికసించింది. దగ్గరకొచ్చి కూచుంది. మానాన్న ధుమధుమలాడుతూ మళ్ళీ అమ్మదగ్గరకెళ్ళాడు యింకో స్మాలుకాజు దాఖలికి. ఈసారి మాదేవి ఊరుకోలేదు. కొడుకుని చంకెట్టుకొని సావిట్లోకి వచ్చింది.

"ఏమిటిది! చిన్నపిల్లల్ని అలా కసురుతూవుంటే దగ్గరకు మరి చేరుతారా?"

"పోనీ లే-నువ్వే చేర్చుకో-నాకొద్దు లే"

"అంతే మరి. ఆ ఆనందం అనభవించే యోగముండాలి"

"ఆనందమంటే ఏమిటి?...నేను అదృష్టవంతుణ్ణి కాదుకామోసు"

"పిన్నీ! మానాన్నకి పెళ్ళి చేస్తావా? ఆనక!" అంది పాపాయి చప్పున నవ్వుతూ.

"మరి చెయ్యొద్దూ? వాడికేమి తెలుస్తుంది-సుబ్రాడు-దగ్గరికొస్తే అలా చీదరించుకోడం!......" మా రాణిగారి మొహం పవర్ణమిచందమామ అయిపోయింది.

సందుచేసుకొని మానాన్న "అమ్మా! అదుగో-నాన్నారు-మరి కొత్తూ!" అన్నాడు నాకేసి చూస్తూ.

"ఏడికావు - అ స్తమానం - ఓటేగొడవ - వెర్రికుంకా?"

తమ్ముడు అక్కదగ్గరికొచ్చేశాడు. "అక్కయ్యా! అమ్మ మంచిదికాదే" అన్నాడుచురచురాచూస్తూ.

"మా నాన్న ఎంతో మంచివాడు" అంది మళ్ళీ పాపాయి ఊరుకోకుండా తమ్ముణ్ణి ఉడికించటానికి.

నా ఆనందానికి అంతుదొరకలేదు. జేబులో పొట్లం జ్ఞాపకమొచ్చింది "అమ్మా! కోటుజేబులు వెతుక్కో...తమ్ముడూ, నువ్వూకూడాను" అన్నాను.

"నువ్వుకూడా కొంచం తీసుకోవే పిన్నీ!" అంది పాప.

"నాకొద్దు మీరు తినండి" అంది పిన్ని.

"తమ్ముడికీ అక్కకీ మహాఐకమత్యం - నావద్దా చనువుగానే తిరుగుతోంది - అదీ నా యదృష్టమే" అంది మా జూనియర్.

"దేవిగారి దయ" అన్నాను నేను.

"ఎంతదయ అయినా సవతితల్లినేగా" అంది. కళ్ళంబడి ఓటి 'ండు...రాలి ఉంటాయి. చివాలున లేచిపోయింది యింట్లోకి.

నాకూ మనస్సు చలించింది.

"అమ్మా! పాపా! నాన్నని మడిగట్టుకోమను; త్వరగా" యని వినిపించింది లోపలనుంచి రాణీగారి కంఠధ్వని.

"నాన్నా! మడికట్టుకోమంటూంది...అమ్మ...కాదు, పిన్ని." అంది పాపాయి.

హృదయము బ్రద్దలవుతూందేమో! సరిగ్గా నిలపడలేననుకున్నాను. కంఠము వణుకుతూంది. "పిన్ని... మీ అమ్మకి చెల్లెలేనమ్మా."

"అయితే యింకో-అమ్మా? నాన్నా?"

"అవును అమ్మా!"

పీటమీద కూచున్నా భోజనానికి. మా నాన్న మంచి ధోరణిలోనే నాపీటమీదే కూర్చున్నాడు.... అమ్మ వడ్డించే పదార్థాలు "తాలుతాలం" టూన్నాడు. "అమ్మా! కూరెయ్యి" అని దబాయిస్తున్నాడు. పాప రాలేదు అన్నానికి. "అమ్మా! రా" అన్నాను. "అమ్మా నేనూ కలిసితింటాము" అంది. రాణీగారు నవ్వుతూ నాకేసి చూచారు. గ్రహించాను భావాన్ని. ధన్యుణ్ణయ్యానని పొంగిపోయాను.

భోజనాలయాయి - మా నాన్న అమ్మ మంచంమీదికి చేరాడు. మా పాప నేను ఓమంచం ఎక్కాము. సగంరాత్రయింది - రాణిగారు చివాలున లేచింది. నా ప్రక్కలోవున్న పాపాయిని తీసుకుంది చేతుల్లోకి- "నా తల్లీ! నువ్వు నా కూతురివే. మాపిల్లవే-మా అక్కకూతురివి-నా కూతురివే" ఏమిటే అడావిడి? అని అడిగాను ఊరుకోలేదు.

"...............శనివారం పండగ పిల్లకి శుభ్రమైన బట్టలు కుట్టించండి..."

"నాన్నా! పండుగెప్పుడు? అని" తెల్లారిన తరవాత మా అమ్మ అడిగింది.

"ఏం?"

"అమ్మకి మంచిచీరెలు కొనవూ"

"అల్లాగే"...మరి కుర్రవాడు-మా నాన్నేగా-అందరికీ నూతనవస్త్రాలంకారాలు ఏర్పరిచా తగ్గట్టుగా-నేనుమాత్రం ఎప్పటి బడిపంతుల్నే...నా వేషం మామూలు గంగిరెద్దుబొంతలే.

## బంగారు పిచ్చుకలు

ఆకుండి వేంకటశాస్త్రిగారు

తెల్లవారెడువేళను తెలివిగాంచి
చికచికరవంబుచేయుచు చెట్టుకొమ్మ
మీదగూర్చుండుపిచ్చుకల్ మిగులవేడ్క,
నంత నాహారమెందేని నరయఁబోయి
సంధ్యవేళగూటినిజేరు సంతసమున:
ఆడుపిచ్చుకముందుగ నచటికేగె
నేని తనభర్తరాకకై యింపుకనుల
నెదురుచూచు నిముషములనెన్నుకొనుచు.

దేవదేవునిసృష్టిలో దివ్యమైన
ఇట్టిమిథునానురాగంబె యెచటనైన
చూడవచ్చును మనము యీచొప్పునరయ
జీవయాత్రనుహాయిగఁ జేయుకొనుటకె
దంపతీభావమమరె నీధాత్రిలోన:
ముద్దుగుల్కెడు పిచ్చుకల్ మోహవశత
నెంతొచక్కగవర్తించు నెలమిమీర
దంపతీభావమననిదె ధరణిలోన.

# బలి

శ్రీమతి గంటి వేంకటరమణమ్మగారు

(జాలిబుట్టించు నొకచిన్న కథ)

౧

"రామ్" అని వీధిగుమ్మములోనిలువబడి సరోజిని పిలచినది. ప్రత్యుత్తరములేదు. "రామ్ ఏడీ?" అని దాసీని చూచుచు ఆమె పలికెను.

"నందుడుగారింటికి కాబోలు వెళ్లినారు చినబాబు" అని దాసి చెప్పినది. "నేను రమ్మంటున్నానని చెప్పు" అని సరోజిని తీవ్రస్వరముతో నాజ్ఞాపించెను. దాసి పోయి ఐదునిముషములలో తిరిగి వచ్చినది. "చినబాబు రానంటున్నా" రని యామెచెప్పెను.

"అబ్బబ్బ! ఇది యెక్కడి యల్లరమ్మా! మాటాడిన వారింటికి పరిగెత్తుతుంటాడు. కులముతక్కువని చెప్పిన వినడు" అని యామె యనుకొనుచు 'రామ్' కొరకై తానే బయలుదేరెను. ఆమె యెదురుగనున్న చిన్నయింటికడనాగి "రామ్" అని పిలచెను. సరోజినిని చూచి గుమ్మములో కూర్చుండియున్న స్త్రీలిర్వురులేచి నిలువబడిరి.

"రామ్ ఏడీ?" యని వారిని సరోజిని ప్రశ్నించెను.

"లోపలనున్నారు తల్లీ!" యని వృద్ధురాలు ప్రత్యుత్తరమిచ్చినది.

సరోజిని గృహములోనికిప్రవేశించెను. ఆపెవెనుకనే ఇర్వురుస్త్రీలుకూడ వెడలిరి.

కొంతదూరము సావడిలోనుండి పోయి సరోజిని ఎడమవైపు చూపుల త్రిప్పినది. అటువైపు చిన్నతోటయున్నది. అందు కట్టివేయబడిన మేకప్రక్క నొక బాలుడు—పంచ వర్షప్రాయుడు—కూర్చుండియుండెను. ఆ బాలుడు మేకకు గడ్డిపోచల నందించుచుండెను.

"రామ్" అని సరోజిని ప్రపంచము మాఱుమ్రోగునటుల కేకవైచెను. రామ కుమారుడు లేచి నిలువబడెను.

"పద" యని సరోజిని దగ్గరగా వెళ్లినది.

రామకుమారుడు కదలలేదు.

సరోజిని యా బాలుని చెయిపట్టుకొని యీడ్చుకొనిపోయెను.

౨

సరోజిని కృష్ణకుమారుని భార్య. రామకుమారుడు వారి ఏకపుత్రుడు. కృష్ణకుమారుడు హరిపురజమీందారు.

సరోజిని తన పుత్రుని వెంటబెట్టుకొని వృద్ధమాతను సందర్శింప గోపీనాథపురము పోయెను. రామకుమారుడు వచ్చిన మరునాడే యెదుటింటివారగు నందునికుమారులతో స్నేహముగావించెను. వారింట నొకమేకయున్నది.

ఆ బాలునకు తోడిబాలురతో నాడుటకంటె మేకను గిల్లిపోచల నందించుటయే ప్రియముగనుండెను. భోజనము సేయునపుడు, నిద్రించునపుడు తక్క ఇంకేసమయమునను మేకను వదలియుండెడివాడు కాడు.

"గోపీ" యని రామకుమారు డామేకకు పేరుపెట్టుకొనెను. ఒకసారి గోపికి రామ్ తన కోటును తొడుగనిచ్చెను. కాని యెటుల తొడుగుటయో వానికి బోధపడలేదు. అందుచే కోటును గోపీ శరీరమునకు త్రాళ్లతో బిగించి కట్టివేసెను. ఇంకొకసారి తన జోళ్లను తొడుగ ప్రయత్నించెను. కాని నాలుగుకాళ్లకు రెండుజోళ్లు తొడుగుటెటులో తెలసికొనలేక పోవుటచే రామకుమారు డాప్రయత్నములను విరమించెను.

సరోజినికిమాత్రము రామకుమారుడు వారింటికిపోవుట ఇష్టములేదు. వారు ధనవంతులు కాకపోవుటయే దీనికికారణము. పెక్కుసారులు తన కుమారునితో వారింటికిపోవలదని చెప్పెను. కాని లాభములేక పోయెను.

## ౩

నాడు సరోజని హరిపురమునకు పోనుండెను.

బండి వాకిట నిలువబడియున్నది. పెట్టెలు మొదలగు వస్తువులన్నియు లోనపెట్టిరి. సరోజిని బండికడకుపోయి నిలువబడెను. కాని రామ్ శకటములోలేడు—గృహమునకూడ లేడు.

సరోజిని త్వరితగతి నందునిగృహమున ప్రవేశించెను. లోన గోపీ మెడపట్టుకొని రామ్ నిలువబడియుండెను. ఆ బాలుని కండ్లనుండి నీరు కారుచున్నది.

"రామ్! పద—" యని సరోజిని కేకవేసెను.

రామకుమారుడు కదలలేదు.

సరోజిని వానిదగ్గరకుపోయి చేయిపట్టుకొని యీడ్చివేసెను.

"గోపీ—అమ్మా—నా...గో...పీ" యని రామ్ యేడ్వమొదలిడెను. కాని సరోజిని వాని యేడ్పును లక్ష్యపెట్టలేదు. బండిలో వానిని కూర్చుండబెట్టి తానెక్కెను. రామకుమారుడు గృహముచేరిన తరువాతకూడ యేడ్చుచునే యుండెను.

## ౪

రామ్ గృహము చేరినదిమొదలు యెవ్వరితోడను మాటాడుటలేదు. ఎవ్వరు పిల్చినను పలుకడు; ఒక్కొక్కప్పుడు భోజనముసేయుటకూడ మరచిపోయెడివాడు. ఎప్పుడు నేదియో యాలోచించుచుండెడి వాడు.

ఇటుల పదునైదు దినములు గడచినవి.

ఒకదినము సాయంత్రమున రామ్‌కు తీవ్రమగు జ్వరమువచ్చెను. వెంటనే వైద్య మహాశయునకు కబురుచేసిరి. ఆతడువచ్చి, రోగినిచూచి మందిచ్చి పోయెను.

కృష్ణకుమారబాబుతో వైద్యుడు "ఇది సన్నిపాతజ్వర"మని చెప్పెను. దినదినము జ్వరము తీవ్రరూపము తాల్చుచున్నది.

ఒక్కొక్కప్పుడు రామకుమారుడు నిద్రనుండి త్రుళ్లిపడి లేచి "గోపీ" యని కేక వేయును. "నేనురానమ్మా" యని అనుచుండును. కాని సరోజినికి మాత్రము ఈమాటల యర్థము బోధపడలేదు—ఆమె గోపీనాథపురమున జరిగిన సంగతులు మరచిపోయినది!

ఆమె రామ్ క్షేమముగ నున్నచో మేక నొకదానిని కాళీమాతకు బలిగనిత్తునని మ్రొక్కుకొనెను !!

ജ

నెలదినములు గడిచినవి. ఇరువదియైదవదినమున రామకుమారునకు జ్వరము వదలినది; కాని యింకను లేవ నశక్తుడుగ నున్నాడు.

ఒకనాడు లేచిచూచుసరికి రామకుమారునకు ఎదుటిద్వారమున మేకయొకటి కట్టి వేసియుండుట కాన్పించెను. దానిమెడలో వేపాకులుకట్టబడియున్నవి; ముఖమునకు పసుపు రాసియున్నది.

రామకుమారు డయిదునిముషములవరకు దానిపైపటులే రెప్పవేయకుండచూచెను.

"గోపీ" యని పెద్దకేక వేసెను—వెంటనే మంచముపైనుండి క్రిందకుగెంతి దాని కడకు పరుగిడెను. ప్రక్కనున్న దాసికూడ వానివెనుకనే పోయెను.

రామ్ మేకమెడ గట్టిగ పట్టుకొని "గోపీ—గో—పీ" యని యనెను. అతనికండ్ల వెంట నీరుకారుచున్నది—శరీరము వణకుచుండెను.

ప్రక్కనేయున్న దాసికి ఇది యేమియు బోధపడలేదు.

"గోపి యేలా వచ్చింది?" అని బాలుడు ప్రశ్నించెను.

"కొనితెచ్చేరు" అని దాసి పలికెను.

"ఏందుకూ?"

"కాళీమాయికి బలియ్యడానికి, బాబూ!"

"బలియా? బలి అంటే—?"

"బలి అంటే—అంటే—చంపేస్తారన్నమాట,"

"చంపేస్తారూ?" అని రామ్ పలుకగలిగెను!! దాసివైపు, మేకవైపు కండ్లుపెద్దవిగ జేసి చూచుచు నిలువబడెను.

ఇంతలో సరోజిని వచ్చెను. మేకప్రక్కను నిలువబడియున్న రామ్‌ను చూడగనే ఆమెకు గోపీనాధపురమునందలి సంగతులన్నియు జ్ఞప్తికివచ్చినవి. లేచికూర్చుండుట కశక్తుడగు బాలకు డెటుల క్రిందకు దిగెనోయని యామె యాశ్చర్యపడెను.

"అమ్మా! గోపీని చంపేస్తారా?" యని ప్రశ్నించెను.

సరోజినికి యేమి చెప్పవలెనో తోచలేదు. ఆమె యటులే నిశ్చేష్టురాలై నిలువబడి పోయెను. ఇంతలో పురోహితుడువచ్చి బలిసమయమైనదని చెప్పెను. కాని రామ్ గోపీని వదలలేదు. సరోజిని, కృష్ణకుమారులిరువురు అనేకవిధముల ప్రయత్నించిరి—కాని రామ్ మాత్రము మేకను వదలలేదు.

తుదకు బలవంతముగ వారిని వేరుసేయనిశ్చయించిరి. రామ్ నొకడు పట్టుకొన ఇంకొకడు మేకను కాళికాలయమునకు తీసికొనిపోయెను. మేకవెనుక సరోజినికూడ వెడలి పోయినది.

గోపియు, సరోజినియు గృహమును దాటగనే రామ్ వదలివేయబడెను. తోడనే యాబాలుడు వీధిగుమ్మమువైపు "గోపీ" యని యేడ్చుచు పరుగిడెను.

గుమ్మముదాటిన తోడనే పెద్దఅరుగులున్నవి. రామ్ పరుగిడుచుపోయి అరుగుల మీాదనుండి క్రిందపడెను.

రామకుమారుడు మరి లేవలేదు. ఆ బాలుడు తన గోపీతో నాడుకొనబోయెను. ఇప్పుడెవ్వరైనను వారిని వేఱుసేయగలరా?

—అనువాదము.

## నా దు త ల్లి !

యర్రగుంట్ల వేంకటలక్ష్మీనరసింహముగారు

తోడికోడండ్రు కోపింప తొందరపడి
శాంతగుణమును గోల్పోక శాంతగుణమె
భూషణంబన్న ఆర్యోక్తి బుద్ధిదలచి
నాధుమన్ననబడయుము నాదుతల్లి!

అత్తమామల ఆజ్ఞల జక్కఁజేసి
ఇల్లుసవరించి వినయంపు యింపుగదుర
పెద్దవారలసెలవంది పేర్మిగురియ
నాధుసేవలు సేయుము నాదుతల్లి!

పోకు పొరుగిండ్లకెపుడును ప్రొద్దుబుచ్చ
చేయబోకుము దుష్టుల చెలిమియెపుడు
నిద్రబోకుము పగటిని నిముషమేని
ఆడబోకుము కల్లల నాదుతల్లి!

కోడితోనిద్ర మేల్కాంచి కొనరికొనరి
నాధుపాదపద్మములకు నతులొనర్చి
వినయవతి సుగుణ, చిరంటి, యనుచుజనులు
నాణ్యమెంచంగ వర్ధిల్లు నాదుతల్లి!

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

## ౬

## గుణగౌరవము

చాటసారు లిద్దరును ఇల్లుచేరిరి. వింధ్యాప్రసాదు తన చుట్టముతో "రూపము, గుణమునుగల్గియు ధనాభావముచే నాకన్యకు వివాహము గాకుంట చాల విచారకరమగు సంగతి. ఎన్నిరూపాయలైనను నేనే యిచ్చి యోగ్యుడగువరున కామె నిప్పించి పెండ్లిచేయింపవలెననియున్నది. ఇట్టి లక్ష్మి యెన్నిదినములిట్లు దుఃఖములనుభవించుట?" అనెను.

మామ నవ్వి "నీవు తలఁచుకొన్న నీవె యామెను వివాహముచేసికొనవచ్చును. దయాళుఁడవగు నీకే ఆ కన్య పరిణయయోగ్య" యనెను.

వింధ్యాప్రసాదు మాటాడలేదు. గుణగ్రాహియగు నాయువకుడు లక్ష్మి గుణములఁ గనిపెట్టెను, చూడుఁడు: అతఁడెట్లుగ గుణముల గౌరవించుచుండెనో? వింధ్యాప్రసాదుఁడు చామనచాయరంగువాఁడు. వయసున ఇరువది-యిరువదిరెండేండ్లకు మించియుండడు. పుష్టిగలదేహము, మోమున యోగ్యత తాండవమాడుచున్నది. ఎత్తయిన నుదురు. కన్నులు కడుపెద్దవి. ఆతని గాంచినంత నెవ్వరైన నీతడు బుద్ధిమంతుఁడనియు, సత్స్వభావుఁడనియు గ్రహింపఁగలరు. సువర్ణపురమందు వారికి రెండంతస్తుల మేడగల పెద్దభవనము గలదు. ఆయింటికెదుట నొక మంచిచెఱువును, జెఱువుగట్టున వీరి ఇంటినంటి ఒక చక్కని శివాలయమునుగలవు.

వింధ్యాప్రసాదు పోయి తనగదిలోఁ గూరుచుండెను. వెంటనే ఒక నౌకరువచ్చి ఆతని దుస్తులఁ దొలగించి, కాళ్లుకడిగి, విసనకఱ్ఱతో విసరనారంభించెను. అతఁడావిసనకఱ్ఱను దాను దీసికొని సేవకునితో "నీవు పోయి పిన్నిని పిలుచుకొనిర"మ్మని పంపివేసెను. వింధ్యాప్రసాదుని తండ్రినాఁటినుండియు వారియింటనొక పరిచారిక కలదు. ఆమె వింధ్యాప్రసాదును బెంచి పెద్దవానినిజేసెను. అతఁడామెను గక్కియని పిలుచుటయే గాకుండఁ బినతల్లికివలెనే ప్రేమించి గౌరవించుచుండెను. ఆతఁడు వచ్చెననువార్త వినుటతోడనే యా వృద్ధనారి యొక్కపరుగునవచ్చి "నేడింతవఱకు ఎచ్చటనుంటివి? ఇంతవఱకు ఏమైనఁ దింటివా లేదా? రాత్రి గాలివానకెక్కడ నాగితివి?" అని ప్రశ్నించెను.

వింధ్యా:—గాలివానకు మాకేమియు బాధకలుగలేదు. భగవంతుఁడు మాకొకమంచిచోటు చూపించెను. ఈ నాఁడింతవఱకు మాత్ర మేమియుఁ దినలేదు.

కక్కి:—అయ్యో! అబ్బాయీ! ఎంతపనిచేసితివి? అటునిటుఁదిరిగి యెందుకు కష్టపడెదవు? గొప్ప కుటుంబములోని బిడ్డవు. ఇంకను పిల్లవాఁడవు. నీకింత పరిశ్రమ యెందులకు? దేశములోఁ దిండిలేనివా రెవరో యని వెదకుచు వారికొఱకు సందుగొందులు తిరుగుచు బిచ్చమెత్తుదువా? మూఁడుజాములైనది. ఇంతవఱకొక మెతుకైనఁ గొఱక లేదుగదా! ఎంతదూరమునుండి వచ్చుచున్నావు? శరీరమునుండి చెమట ఎట్లుకారుచున్నదో! అయ్యో, తండ్రీ! ఎందుకనీశ్రమ చెప్పుము?"

ఆ వృద్ధ కన్నుల నీరుకారజొచ్చెను. విసనకఱ్ఱ తీసికొని విసరుచు "అమ్మాయీ! వింధ్యాప్రసాదు ఇంటికివచ్చె. ఇంకను వంటచేయవేమి? త్వరగాకానిమ్ము" అని గట్టిగ కేకవేసి చెప్పి యంత ఆవిడ తాను కూడ లోనకుబోయి వంటచేయమని తొందరచేసి కొంచెము మిఠాయి, ఒక పంచపాత్రలో మంచినీరును తీసికొనివచ్చెను. వింధ్యాప్రసాదు వదినగారు-వితంతువు-వంటచేయుచుండెను.

వింధ్యాప్రసాదు సువర్ణపురమునఁ గడు ధనవంతుఁడగు జమీందారుఁడు. ఆతనికి సాలునకుఁ బదివేలు రూపికల రాబడివచ్చును. ఇదిగాక తండ్రి కూడబెట్టినగదుగూడఁ జాలగలదు. ఇంత పెద్దయింటిలో, ఇట్టి యింద్రభవనమున ఆతని విధవవదినగారు సుభద్రయు, ఒక చిన్న మేనగోడలుందప్ప నింకెవ్వరునులేరు. సేవకులుగూడ విస్తారముగ లేరు. ఈ 'కక్కి', మఱియొక సాగరుఁడను వట్టవాఁడును మాత్రముకలరు. వింధ్యాప్రసాదుకుటుంబము మొదట నింత చిన్నదికాదు; కొన్ని సంవత్సరములక్రిందట నచ్చటకువచ్చిన మహామారిలో నాతని తండ్రి, తల్లి, అన్నగారు, చెల్లెలు వీరందరును మరణించిరి. ఆనాఁటినుండియు వీరియింట నంధకారము వ్యాపించినట్లున్నది.

ఇంత పెద్దభవనమునకు, ఇట్టి గొప్పజమీకి యజమాని ఈ ఇరువదేండ్లప్రాయముగల వింధ్యాప్రసాదు. ఈ చిన్నవయస్సున నిట్టి కష్టములు ప్రాప్తించుటచే వింధ్యాప్రసాదు సాంసారికకార్యములయెడ నొకవిధముగ నుదాసీనత బూనియున్నాఁడు. ఆతని కేపనియందును మనసులేదు. కుటుంబసుఖభోగములందాతని కేమాత్రమేని వాంఛలేదు. స్నేహితులును, చుట్టములును ఎంత బోధించినను వివాహమున కింతవఱకాతడు సుంతయేని యొప్పుకొనుటలేదు. సుభద్ర వంటచేసి భోజనమునకు వింధ్యాప్రసాదునకుఁ గబురుచేసినది. వింధ్యాప్రసాదు భోజనముచేయుచు "వదినా! నేనింటిదగ్గఱ నెప్పుడును ఆనపకాయ తినను. నిన్న ఒకచోట నొకపిల్ల ఆనపకాయకూర వండినది; దాని రుచినేమిచెప్పుదును. ఈజన్మంలో నేనట్టికూర నెప్పుడునుదినలేదు. దినమంతయు శ్రమపడియుండుటచేతనేమొ చెప్పజాలనుగాని కూర మహారుచిగానున్నది." అన్నాడు.

మఱది మాటలు విని సుభద్ర హేళనకు "ఇప్పుడట్టి పిల్లలుచేసినవంటలే నీకు రుచించును. ఇఁకనంత బాగుగవంటచేయఁగల బాలికనొకదానిఁ దెచ్చికొనుము. ప్రతిదినము ఆమె చేతికూర తినవచ్చును. సరే కాని నిన్న ఎవ్వరివంటతింటివి. బాగున్నదికదా?" అనెను. వింధ్యాప్రసాదు వర్షము, ఆదుర్గతి, తాము రామచరణదీక్షితుల యింటికి నతిథులుగ వెళ్లుట; లక్ష్మి మంచిగుణములు అన్నియుఁజెప్పి వినిపించెను. లక్ష్మి రూపగుణముల ప్రశంస వినఁగ సుభద్రకు సంతోషమువచ్చి మందహాసముతో "ఆమెకుఁ బెండ్లియాయెనా?" యని ప్రశ్నించెను.

వింధ్యా:—కాలేదు. ఆమె తండ్రి తనకుమార్తెకు వివాహముచేయగలంతటి ధనికుఁడుకాఁడని నేవింటిని. మనలో ఇట్టి విపరీతములు బయలువెడలుచున్నవి. డబ్బులేకున్న మంచి వరుడుదొరకుట దుర్ఘటమగుచున్నది గదా! ఆ కన్య వివాహయోగ్యయైయున్నది.

సుభద్ర:—అయిన నింకేమి? నేనాపెను నా చెల్లెలిగ జేసికొందును.

వింధ్యాప్రసాదేమియును మాటాడలేదు. దాన సుభద్ర కపరిమితానందముకల్గెను. వివాహము చేసికొమ్మని మఱదితోఁ బలుసారులు ఆమె చెప్పియుండెను. కాని అతఁడెన్నఁడు నందులకంగీకరింపలేదు. వింధ్యాప్రసాదునకు వివాహముచేయించి పచ్చగ కోడలి నింటికిదీసికొనిరావలెనని యాపెకోర్కె. ఆమెకింకను జవ్వనమారంభముకాకమున్నె ఆమెకడుపున ఒకపిల్ల గలిగినంతనే దురదృష్టదేవత ఆమెపలపై స్వారిచేయ మొదలిడినది. ఆమెకుఁ జిన్నతనమునుండియుఁ బిల్లలతల్లినై కుమారులకు వివాహములుఁజేసి కోడండ్రనింటికిఁదెచ్చి వారిపై ఇష్టానుసారముగా అధికారమునడపవలెనని యొకముచ్చట. కాని విధివశమున ఒక ఆడుపిల్ల గలుగుటయే తడవుగ నామె విధవయైనది. ఆమె ముచ్చట మనసులోనే నిల్చిపోయినది.

బాలవితంతువైనంతనే ఆమెఆశాలతలు వాడినవి. కాని ఇంటికి యజమానురాలుగనుండవలెనను తలంపు మాత్ర మిసుమంతయేనియుఁ దగ్గలేదు. మఱదికి వివాహముగావింపజేసి తాను దోడికోడలిపై యజమానురాలై తన మనోవాంఛల దీర్చుకొనవలెనని ఆమె ఆలోచించుచుండెను. నిజమే. మనసుభద్ర మిక్కిలి కటుభాషిణి. ఇంటిలోఁ దాను కసరుటకుఁదగువారు లేకుండుటచే నోరుమూసికొని ఊరకొనవలసివచ్చుచున్నది. ఇన్ని దిన

మూలకు మఱది వివాహమునకు సమ్మతించుచుండుటను గాంచి సంతసముఁబట్టజాలక ఆమె యానందముతో "ఏమయ్యా! యోగిపుంగవా! గృహస్థువు కానుంటివా?" అనెను.

వింధ్యాప్రసాదు గంభీరస్వరముతో "గృహస్థునైన నింకను నెక్కుడు సుఖమబ్బునా? సుఖమందు ఆశ నా కేమాత్రమును లేదు? పరాయియింటి బాలను దెచ్చి ఆమెను నాదుఃఖములలోఁ బాల్గొనఁ జేయవలెననిలేదు."

లక్ష్మి రూపగుణములఁ గాంచి వింధ్యాప్రసాదు మెత్తఁబడెనని సుభద్ర గ్రహించినను మఱఁదితో "ఒకటి మాత్రము చూడుము. పెండ్లి లేకుండ నిటునటు ఎన్నాళ్లు తిరిగినను నీకు సుఖము చేకూరదు. భగవదేచ్ఛను జరిగిన దేమో జరిగిపోయినది. ఈ విధముగ నుండుటమాత్రము బాగుండదు. తలిదండ్రుల పేరు నీతో నంతరింపఁజేయుట మహాపాతకము. సరే! ఈ పిల్లకుటుంబ మెట్టిది?" అనెను.

వింధ్యా:—కుటుంబమున కేమి? కుటుంబము మంచిదే.

సుభద్ర:—అయిన బీదవారనియా? ఐన నేమి? వారివి పదిరూపాయలువచ్చిన మనకేమి లాభము? వివాహసందేశమును రేపే తప్పక అచ్చటుకుఁ బంపుదును.

వింధ్యా:—కొంచెము ఓపికఁబట్టుము. విచారింపకుండ నే కార్యము జేయరాదు.

సుభద్ర:—నీవు కూర్చుని విచారించుచుండుము; కొండపిట్ట చేతికి జిక్కినది. ఇంకెట్లెగురగలదో చూతును. ఓ నారాయణమూర్తీ! మా మఱది మనసు మారకున్న సత్యనారాయణవ్రతము చేతును.

వింధ్యాప్రసాదు మరి మాటాడలేదు. భోజనమొనర్చి బయటకుఁబోయెను. సంతోషమున సుభద్ర కొడలు తెలియుటలేదు.

## ౭
## మంచిగుణములవలని ఫలము

ఒకనాఁడు కాకున్న మరియొకనాఁడైన గుణమునకుఁదగు గౌరవము లభింపగలదు; ధర్మము నెన్నడును వీడక యాచరింతుమేని నెప్పుడేనొకప్పుడు దానికిఁ దగు పురస్కారము నందగలము. రత్నము చీకటిగనిలోఁ పడియుండియు ఒకనాడది బయటఁబడి వర్తకుని చేతిలోనికి రాకమానునా? అరణ్యములో కుసుమరాజములు కొన్ని ఎవ్వరికంటఁబడకయుండినను గుణగ్రాహులగు మనుజశ్రేష్టుల కంటబడిన ఆ పువ్వుమొక్కలఁ దమ పుష్పవాటికలో నాటింతురు. గుణవంతుల గుణములకుఁ దగుపారితోషికమిచ్చుటకునే పరమాత్ముఁడు వారల సాధుపుంగవుల దృష్టిగతులఁ జేయుచుండును. ఆ జగదీశ్వరుని యనుగ్రహమూలముననగదా ఆదరిద్రునిపుత్రి గుణవతియగు లక్ష్మి గుణగ్రాహియగు వింధ్యాప్రసాదు కన్నులఁబడుట! ఒకనాటి పరిచయమున నాజవ్వనుఁడు గుణవతియగు ఆబాలారత్నముగుణములకు ముగ్ధుఁడయ్యెను. లక్ష్మి రూపగుణములఁ గాంచ గృహస్థాశ్రమమం దాతనికిఁగల విముఖత తొలఁగిపోయినది. సంసారమందు సుఖముకూడ లభింపఁగలదని వింధ్యాప్రసాదు యోచింపనారంభించెను. లక్ష్మివంటి స్త్రీని భార్యగఁబడసిన ఆపె మృదుమధురభాషణములకు, నాదర సత్కారములకు దుఃఖితుని దుఃఖములు పటాపంచలగునని ఆతఁడు తలంచెను. ఆ దరిద్రునికన్యకు వివాహ మగుట కష్టమగుచుండెనని ఆతఁడూహించెను. ఇందుమూలమున నాపె తండ్రికిని ఉపకారము చేసినవాడ నగుదు ననియు, ఆమెగుణముల నాదరించినవాడ నగుదు ననియు, ఏతత్కార్యాచరణముననే స్వార్థము పరమార్థము లభింప నున్నవనియు, లక్ష్మితో గృహస్థాశ్రమమున జొత్తునేని మనస్ఫూర్తిగఁ బరోపకారముల నాచరింపగలుగుదు ననియుగూడ ఆత డాలోచించెను.

వింధ్యాప్రసాదు తనమిత్రుడగు ఒక జమీందారునికడ రామచరణునకు మంచి ఉద్యోగమునిప్పించెను. కాని ఈ ఉద్యోగమాతనికి లభించుటకు మూలకందమెవ్వరో రామచరణునకుఁ జాలకాలమువఱకుఁ దెలియదు. ఈ నౌకరీవచ్చుటవలన ఆతని సంసారకష్టములు వెనుకపడినవి. ఆతడు హృదయమునఁ గరుణానిధియగు భగవంతుని స్మరించుకొనుచుండెను.



"పక్కింటి అబ్బాయి లాడంగి సాగుడు"

*Photo by Messrs M. Doss & Bros. Madras.*



రాంపియారి కన్య

(కృష్ణాఫిలుముకంపెనీలో నట్టువరాలు)

కొన్నిదినములైనపిమ్మట వింధ్యాప్రసాదు సమ్మతిని రామచరణదీక్షితుల యొద్దకు వివాహసందేశ మంప బడెను. ఈ రాయబారమును రామచరణు డానందముతో అందుకొనెనని వేరె చెప్పనక్కఱలేదు. వింధ్యాప్రసాదు కులగౌరవము నెవ్వరెఱుంగరు? అతఁడు గౌరవమర్యాదలుగల గొప్ప జమీందారుఁడు. పరోపకార బుద్ధిగల సజ్జనుఁడు. దరిద్రుఁడగు రామచరణదీక్షితుని కూఁతురు అతనిభార్యయగునని ఎవ్వరునుదలఁచియుండరు. దీక్షితు డిది వినుటతోడనే పరమానందభరితుఁడయ్యెను. శుభదినమున మంచి ముహూర్త మేర్పాటుఁ జేసికొని పదిమంది అనుచరులతో వచ్చి వింధ్యాప్రసాదు లక్ష్మిని పాణిగ్రహణ మొనర్చుకొనెను.

లక్ష్మి పేదవానిబిడ్డ. వింధ్యాప్రసాదుడు ధనవంతుల కుమారుడు. ఐనను వివాహసమయమున వివిధాలంకారభూషితయగు లక్ష్మినిజూచి నగలన్న ప్రాణములనిచ్చు ధనికుల కోడండ్రు, కుమార్తెలు అసూయపడు చుండిరి. వింధ్యాప్రసాదు తనకు అల్లుడై నందుకు రామచరణదీక్షితులు హృదయము స్వర్గానందసుఖము నను భవించుచుండెను. కన్యకుఁ దగినవరుఁడు లభించెనని గ్రామవాసులందఱనఁజొచ్చిరి. భగవంతుడే ప్రయత్నించి ఈ వధూవరులగూర్చెను. సద్గుణములుకలచోట భగవంతుడు ఈ రీతినే తోడ్పడుచుండునుగదా!

## ౨

## సవతితల్లి

వివాహమైనవెనుక నాలుగైదుదినములు అత్తవారింటనుండి లక్ష్మి ఇంటికి వచ్చివేసెను.

కొన్నిమాసములు గడచిన పిమ్మట కార్యముచేసికొని లక్ష్మిని అత్తవారింటికిఁ దీసికొనివెళ్లుటకు వింధ్యాప్రసాదు వచ్చెను. కార్యము జరిగెను. కార్యమైన తరువాత తాను అత్తింటికి ప్రయాణము కావలసియుండగా పెనిమిటితో "మా తండ్రియింట ఆడదిక్కెవరును లేరు. తమ్ముఁడు చిన్నవాఁడు. నే నిచ్చటనుండియిప్పుడు మీ వెంటవచ్చిన మా తండ్రికి భోజనము విస్తరిలోనికి రాదు. మా నాన్నగారంత పెద్దవాఁడు కాడు. అతనికి మరల వివాహమయిన బాగుండును. ఆయన సమ్మతింపరని తోఁచుచున్నది. ఐనను మనము చెప్పిన మన మాటలఁ ద్రోసివేయఁజాలరు. సవతితల్లివచ్చిన గణేశునకుఁ గష్టము కలుగవచ్చునందురేమో? నేను తమ సెలవు దీసికొని మరిరెండు నెలలు వారిదగ్గఱనున్న ఆమెను మాతల్లితో సమానురాలినిగఁ జేసి రాగలననుధైర్యమున్నది. మనముండగ నాన్న దుఃఖపడుచుండుట భావ్యముగఁదోచదు." అని మృదువుగఁ జెప్పెను.

వింధ్యాప్రసాదు బుద్ధిమతియగు భార్యమాటను పాటించెను. తానే స్వయముగా మామగారియొద్దకు వెళ్లి ద్వితీయకళత్రస్వీకారమున కాయనను ప్రోత్సహించెను. మొదటిలో అందులకాతఁడంగీకరింపలేదు. అది చక్కబడినగాని లక్ష్మి యత్తవారింటికి వెళ్ల నిచ్చగించుటలేదని గ్రహించిన తరువాత దాని కియ్యకొనెను. వింధ్యాప్రసాదు విశ్వప్రయత్నములొనర్చి యుక్తవయస్కురాలును, సులక్షణవతియగు ఒక కన్యనుదెచ్చి రామ చరణదీక్షితున కిప్పించి వివాహముచేయించెను. లక్ష్మి సవతితల్లికిఁ బనిపాటులు నేర్పుచు మరికొన్ని దినములు తండ్రియింటనుండెను.

తన సవతితల్లిని తల్లితోసమముగఁజేతునని లక్ష్మి మొదటనే జెప్పెనుగదా! పాదరసమణి నంటిన లోహము సువర్ణమగునట్లు లక్ష్మి సాంగత్యమొనర్చిన స్త్రీ యెట్టిదియైన సద్గుణవతి కావలసినదే. లక్ష్మి యట్టి సుగుణపుంజము. లక్ష్మి చెప్పినట్లుగనే చేయనారంభించెను. సవతితల్లి ఇంట నడుగిడిననాడు గణేశుడు "అక్కా! ఈమె ఎవరు?" అని యడిగెను. "ఈమె మనయమ్మ. మన అమ్మయే వచ్చినది," అని లక్ష్మి చెప్పెను. గణేశునకు నాలుగువత్సరములప్రాయమందు తల్లి పోయినది. తల్లి జ్ఞాపకము కొద్దిగఁగలదు. "ఈమె అమ్మ యెట్లగును? అమ్మయైన మేలిముసుగు వేలవేసికొనును? అమ్మ ఎప్పుడును మేలిముసుగు వేసుకొనలేదే?" యని

గణేశుఁడడిగెను. తన తల్లిమాట స్మృతికి వచ్చునంత లక్ష్మికిఁ గన్నుల నీరుగ్రమ్మెను. కాని ఆమె ఎంతయో ప్రేమతో సవతితల్లితో "అమ్మా! నీవు నీ సంతానము నెదుటనే సిగ్గుపడుచున్నావు? ఇదేమి? నీవు కాకున్న మమ్ముల నెవ్వరు ప్రేమింతురమ్మా? చాలదినములనుండి మాతృస్నేహము మాయెడ లేదు. నేను కొన్ని దినములైన జననీప్రేమ ననుభవించితిని కాని నిర్భాగ్యుఁడగు గణేశుడు మాతృప్రేమ ఎట్టిదో యింతవఱకెఱుఁగఁడు. అమ్మా! వాని నెత్తికొమ్ము. అతఁడు నీకడుపునఁబుట్టినవాఁడనుకొనుము." యని లక్ష్మి శోకించెను. వ్రీడావతియగు ఆ క్రొత్తకోడలి సిగ్గు పారిపోయినది. గణేశు నెత్తుకొన్నది. గణేశు "అమ్మా! అమ్మా!" యని సంతోషమును వెలిబుచ్చెను.

లక్ష్మి నాఁటినుండియు గణేశును సవతితల్లి కొప్పఁజెప్పినది. వీలైనంతవఱకు గణేశుపనులను దాఁ జేయుట మానినది. అతని పనులన్నిటి నామె సవతితల్లిపై దిగవిడచినది. దేనికైన గణేశు తనయొద్దకు వచ్చిన "పోయి యమ్మనడుగు" మని పంపివేయుచుండెను. గణేశుఁడే దేని చెడుపనిఁజేసిన లక్ష్మి వానిని గదిమిన అతఁడు అమ్మసహాయమును దీసికొనఁబరుగెత్తునటుల జేసినది.

అమాయకుఁడగు గణేశదత్తు అక్కగారికిఁదనమీఁద దయతగ్గుచుంటఁగాంచి సవతితల్లి శరణుజొచ్చెను. ఆ సవతితల్లియు నీ పరిస్థితులలో ఆ బాలునియెడ ననాదరణ చూపఁజాలకుండెను.

తన ప్రాణములకన్న నెక్కువ మక్కువఁజూపుచువచ్చిన తమ్మునియెడ లక్ష్మి కనఁబఱచు ననాదరణమునకుఁ గారణమేమి? మీరే ఊహించుకొనుడు. వీరు తనవారనితలంచి ఎవ్వరిపై మనము విశ్వాసముంతుమో వారే ఈనాఁడు కాకున్న మరి పదినాఁడులకైన మనల తమవారలగాఁ జేసికొందురని లక్ష్మి బాగుగ నెఱుఁగును. ఇందుననే ఆమె తన సోదరుని నిరాకరింప ఆరంభించెను. ఆ సోదరుఁడును సవతితల్లిని తన తల్లిగనే భావించుకొనుచుండెను. అట్లు కాదన్న వారెవ్వరును ఆయింట లేరు. అట్టి యనాథనుజూడఁ గఠోరహృదయముగూడ దయార్ద్రమై స్రవించును. గణేశునకు నీళ్లుపోయుట, బట్టలుకట్టుట, తిండిపెట్టుట, దగ్గఱ పరుండపెట్టికొనుట అన్నియు లక్ష్మి మానివేసినది. ఈ పనులన్నింటిని సవతితల్లిపైననే యుంచినది. తానేమిచేసినను సవతితల్లి నడుగకుండఁజేయుటలేదు. అడిగిపెట్టకుండ నీయాజమాన్యము లభించుటయు; లక్ష్మియు, గణేశుఁడునుఁగూడ తనకు శరణాగతులగుటయుఁగాంచి వారుసవతికుమారుఁడు, సవతికుమార్తె యనుభావమే ఆమెకు ఉదయింపలేదు.

తరువాత కొన్నిదినములకు భార్యను దీసికొనివెళ్లుటకు వింధ్యాప్రసాదు వచ్చెను. లక్ష్మి చిన్ననాటినుండియుఁ బుట్టిపెరిగిన ఇంటిని, తండ్రిని, తమ్ముని చెలికత్తెలను వీడనేరక వెక్కివెక్కి ఏడ్చుచు; విమాత చరణతలములంటి; యందరికడ సెలవుఁగొని అత్తవారింటికి వెళ్లెను. వెళ్లునపుడు గణేశునిగూడ కొనిపోదలచెనుగాని సవతితల్లి ఆత్రముతో "లక్ష్మీ! నీవు నన్నువిడచి వెళ్లుచుంటివి. గణేశుఁడైన నాయొద్దనుండకున్న నొంటరిగ నేనెట్లు బ్రతుకుదు"నని యనుటచే లక్ష్మి ఆతని నామెకడ దిగవిడచి వెళ్లిపోయెను.

లక్ష్మిని అత్తింటికిఁ బంపితిరి. అచ్చట ఆ సుగుణమణి ఎట్లువర్తించునో పరికింపరా? పరికించుటకుఁబై మాసపు గృహలక్ష్మిసంచిక చేకొనుడు.

—సంపాదకుడు

# వివాహము

వడ్లమూడి వేంకటరత్నముగారు

౧

వేంకటేశమున కిరువది వసంతములు దాఁటినవి. నిర్వికారమగు మనఃఫలకమునఁ దోఁచిన ప్రేమాంకురములవలెనే అతని విశాలమగు నెమ్మొగమున నూనూఁగుమీసములు పొటమరించినవి; భావములవలెనే నడకలును గంభీరములైనవి.

అతఁడు సంస్కృతమున శిరోమణిపరీక్షకుఁ జదువుచుండెను. ఆంగ్లసాంఘికాచార పరిచయమున మన ఆచారములను తాఱుమారు సేయరాదని అతని తలంపు. అతఁడప్పుడప్పుడు సతులను బానిసలుగఁ జూడరాదనియు, స్త్రీజాతి గౌరవపాత్రమైనదనియు, హైందవ వివాహము సతీపతుల ప్రేమనాడికలను పెంచి, పెనచి దిటవుపఱచుననియు, వివాహవిచ్ఛేదములవంటి తుచ్ఛశాసనములకు మనదేశమున అవకాశమీయరాదనియుఁ బత్రికలకు వ్రాయుచుండును. పాఠశాలాచర్చాసంఘములలో శ్రుతిస్మృతివచనపూర్వకముగా అతఁ డుపన్యసించుచున్నపు డితరులు వ్యతిరేకము మాటలాడుటకు జంకుచుందురు. హిందూసంఘముయొక్క ప్రత్యేకతను స్థాపించుటకు మనవివాహపద్ధతులు సాధనములని అతఁడనుచుండును.

౨

అతనికి వివాహము చేయుటకుఁ దలిదండ్రు లాలోచింపసాగిరి. ఇతర కార్యాసక్తుని వలెఁ దిరుగుచు అతఁ డాయాలోచనలను వినుచుండువాఁడు. అతని హృదయాకాశమున నానూతనయౌవనభావములు తళుక్కున మెఱయుచుండెడివి. అస్ఫుటభావతరంగములు విజృంభించి సమ్మేళనము నొందుచుండెడివి.

గ్రామమునందు కొందఱు బాలికలున్నను తలిదండ్రు లితరగ్రామములయందు విచారింప నారంభించిరి. పిల్లవాఁడు చదువుకొన్నవాఁడు; బుద్ధిమంతుఁడు; సామాన్యస్థితిగల వాఁడు. పిల్లలకేమి?

సంబంధ మనుకొనుచున్నప్పటినుండియు నా బాలిక చక్కనిదేమో చూడవలయుననియు, చదువుకొన్నదేమో తెలిసికొనవలయుననియు అతఁడు భావించుచుండువాఁడు. కాని తెలియుటయెట్లు? తన మనస్సునువిప్పి యీవిషయము నెప్పుడు నితరులకుఁ జెప్పలేదు. 'ఊరుపేరులైన నెటులోవిని యేదేనివంకతోఁ దెలియకుండఁ జూచివచ్చిన బాగుగనుండును' అనుకొనెను గాని యెప్పుడును సాహసింపలేదు. 'మా తలిదండ్రులకీమాత్రము దెలియదా? వారికి నాసంతోషమే ప్రధానముగదా! తాతకుదగ్గులు నేర్పవలయునా?' అని యతఁడు నిశ్చయించెను.

వివాహమయినది. బాలిక చక్కనిదేయనవచ్చును. పదుమూఁడేణ్లుండును. అతని మానసమున నెన్నియో భావములు గలిగినవి. ముందుముందు తానెట్లు మెలంగవలయునో నిశ్చయమయ్యెను. తానెట్లు పలుకరింపవలయునో యాలోచించెను. అందులకుఁ బ్రత్యుత్తరముగవచ్చు నాతీక్ష్ణదృక్కులకు మానసము చిల్లులువడెను. ఆ మందహాసమునకు చిత్తము ద్రవించెను. మృదుమధురములగు నాపలుకులకు అవ్యక్తమగునానందరసము జాలువాఱెను. తాను జదివిన విలాసవతులు పతివ్రతలు ఒక్కమాఱు మనోవీధిని మినుకుమినుకుమనిరి.

3

వేంక:—ఇందాక కేకలువేస్తున్నావేమిటి?

సుబ్బమ్మ:—నేనేమి కేకలు వేశాను?

సుబ్బమ్మ పుట్టింటియొద్దనే యుండెను.

వేంక:—ఏమిటో కేకలు వినిపించినవే?

సుబ్బమ్మ:—నేనేమీ కేకలువేయలే.

పాపము! వేంకటేశమునకు గుండెలు చెదరినవి. తనభార్యకు అడకువలేదని యతఁడు గ్రహించెను.

తానంతట నూఱకొన్నచో పెంకెతనము—మొండిపట్టుదల పట్టుపడునని యాతఁడు తలఁచెను.

సుబ్బ:—నన్నుతిడ్తే నేను మళ్లీ తిట్టేను.

ఆమెకోర్పులేదని యతఁడు నిశ్చయించెను..

వేంక:—ఆడవాళ్లు కుక్కలవలె పోట్లాడుకోవడం మంచిదేనా?

సుబ్బ:—నన్నుతిడ్తే నేనెందుకూరుకుంటాను?

పాపము వేంకటేశమునకు నెత్తిపై పిడుగువడినట్లయ్యెను. తన మనస్సునఁగల్గిన ఆశాతరంగములన్నియుసముద్రతరంగములవలె మరలనందేలీనముకాఁజొచ్చెను. తనఅత్తమామలు జ్ఞానదూరులగుటచేఁ దమకుమార్తె నడవిమొక్కవలెఁ బెరుగనిచ్చినారని యతఁడూహించెను. ప్రయత్నము వ్యర్థముకాదని రాత్రులయందు స్త్రీధర్మములను బోధింపసాగెను.

౪

ఒకనాఁడు వేంకటేశమింటికి వచ్చునప్పటికి ఇల్లు శాంతిదూరముగ నుండెను. తల్లి యుదాసీనతతోనుండెను. భార్య రుసరుసలాడుచుండెను. అతని నెవరును పలుకరింపలేదు. అతనికి చాలకష్టముతోఁచెను. మనస్సు చేయిపెట్టి కలఁచినట్లయ్యెను. అతఁడక్కడనిలువలేకపోయెను. బయటికేగెను. కాని మనస్సున కూఱటలేదు. మరలవచ్చెను. మరలవెళ్లెను.

*　　*　　*

మఱియొకనాఁడు తనప్రియమిత్రునితో తనయింటికేగెను. తనవదినె యింటఁజఱచిఱ లాడుచుండెను. భార్య యేమోగొణుగుచుండెను. తనతల్లి చీదివైచుచు పొరుగింటి యామెతో నేమోచెప్పుచు తన్నుజూచి మానివైచెను. ఇందులకుఁగారణము తనభార్య యేయయియుండునని యతఁడు తలఁచెను. అతనికిఁగష్టముతోఁచెను. తనభార్యతో నేదియో చిన్నపని చెప్పెను. కాని యామె వినిపించుకొనలేదు. మఱలఁజెప్పెను. ఫలములేకపోయెను. అతనికిఁగలిగిన కోపమింతగాదు. ఏమిచేయవలయునో తోఁచలేదు. మఱియొకపనిని జూపి మిత్రునిగొని వెలువలకుఁబోయెను. అతఁడింటియొద్ద నెప్పుడును శాంతినెఱుఁగఁడు. ఎప్పుడును చిరచిరలు—రుసరుసలు—ధుమధుమలు—మొగముమాడ్పులు.

ఒక్కొక్కమాఱు పరధ్యానముతోనున్నట్లు పోవుచున్నను నొక్కొక్కమాఱు భార్యను కొట్టుచునేయుండెను. ఇంటియొద్దనుండుటయన్న నతనికిఁదలనొప్పి. అవకాశము గలిగినపుడు బంధువులను జూచి వచ్చుచుండును. ఒకనాఁడతఁడు తనభార్యతో "నిన్నెవ రేమియన్నను నీవేమియు మాటలాడఁబోకు. నాతోఁజెప్పుము. నేను విచారించెదను." అని చెప్పెను.

* * *

భార్య:—యివ్వాళ చూచావా యేం జరిగిందో?

వేంక:—ఏమి జరిగింది?

భార్య:—పరాయిదాన్ని నేనొకదాన్నున్నాగా అన్నిటికీ!

వేంక:—ఏమిటి? జరిగిందేమిటీ?

భార్య:—మాట్లాడితే నేను ఒట్టెదాన్నవుతా.

వేంక:—అసలుజరిగిందేమిటో చెప్పమంటే...

భార్య:—చీపురుకట్టతీసిదాచానట.

వేంక:—ఎవరిది?

భార్య:—మనయింట్లోదే.

వేంక:—మనయింట్లోదిదాచడ మెందుకు?

భార్య:—నెత్తినికొట్టుకోవడానికి.

వేంక:—ఎవరన్నారు?

భార్య:—అందరూ అంటారు పడేవాళ్లుంటే. పొద్దుటినుంచి నానామాటలువింటూ పడరానిపాట్లు పడుతున్నాను.

వేంక:—నేనుకనుక్కోనా?

భార్య:—నీలోఅలుసు కనుక్కొ—నికాదూ వాళ్లిట్లామీదకి రావడం?

ప్రత్యక్షముగా కాకున్నను వేంకటేశము కొంత విచారింపకపోలేదు. కలహమునకు తనభార్యయే కారణమని యాలోచించెను.

※

ఇప్పుడు గృహలక్ష్మిలోఁ బ్రకటింపఁబడుచున్న యభిప్రాయములను—వివాహ విచ్ఛేదము హిందువులు వాంఛింపరాదను వానిని—జూచి వేంకటేశ మిట్లు చెప్పెను.

“దీర్ఘంగా ఆలోచించితే ఆశాసనంవుండడం మంచిదిగానే కనబడుతున్నది.”

## అశ్రువులు

కస్తూరి రాజమాణిక్యముగారు

ఎన్ని అవమానములనో చలించిపోయి,
గాటపుపరాభవాగ్నికిఁ గ్రాగిపోయి,
తుదిమొదలులేని వేదనఁ గదలిపోయి,
అలసి సొలయుచు చింతలో జలదరించె
కోమలసుమమ్ముబోలిన నామనస్సు!
ఈదురంత
వేదనాప్రోజ్వలాగ్నికి నాదుకుసుమ
కోమలహృదంతరమ్ము సంకుచితమంద
కేగతినియోర్చి, నిలిచి, సహింపగలదు?
ఈ మహావేదనకు దరియేలలేదు?—
సలిలభారగభీరమౌ జలదమట్లు
జలదరించిన దశ్రుశీతలమెడంద;
చింతలో వంతలో, నిశోచివికిపోయి,
రాలిపోయెదనే పెనుగాలిచేత
నేలరాలిన కుసుమమ్ము వోలె సోలి.
శోకమనుమంచు తెఱగప్పి, సుఱిగిపోయి,
గాలికిచలించు చిఱుకెఱటాలతోడ
వెలవెలలుబారు వేణికాసలిలములకు
కమలిన విషాదబహుళగీతములుపాడి,
కనుగొలంకుల కన్నీటి కణమురాల్చి
అల్లనాలోననే నూఱడిల్లుచుందు.
ఇది విషాదపుజీవనము; ఇవి విభగ్న
హృదయభావాలు; తప్తాశ్రులివి; తుపాను
గాలివడకెడి ప్రాభాతవేళలివ్వి.

సంక్రాంతి పండుగకుముందర వెలువడు జనవరిమాసపు గృహలక్ష్మి సంచికలో ‘సంక్రాంతి: గోపూజ;’ ‘సంక్రాంతి: శీతువు;’ ‘సంక్రాంతి: ప్రకృతి;’ బొమ్మలనోము మొదలగు ఆ పండుగకు చెందిన వ్యాసములు ప్రచురింపబడుచున్నవి. కావున ఆ సంక్రాంతి శుభవాసరములలో అత్తింటికిబోవు క్రొత్త యల్లుడు తన క్రొత్తడికిని, పట్టణమందలి పాఠశాలనుండి స్వగ్రామమునకుబోవు విద్యార్థి తనచెల్లెలికిని, పండుగజరుపుటకై తండ్రి అత్తింటినుండి తీసికొనివచ్చిన కుమార్తెకును ఈయగల బహుమానములలో జనవరిమాసపు గృహలక్ష్మి కూడ చేర్చబడుగాక!

# మిస్ మేరియా

కూచిమంచి సుబ్బారావుగారు

(రష్యాదేశవిప్లవచరిత్రకు సంబంధించిన ఒకానొక వృత్తాంతకథనము)

౧

దరిద్రుఁడు దుఃఖమనుభవించుచున్నాఁడు అనుమాట ప్రతివారు నెఱింగియున్నదియే. అయితే, పరమేశ్వరుఁడు దరిద్రులను కేవలము దుఃఖ మనుభవించుటకే పుట్టించెననుమాట లోక మంగీకరింపదు. నోటిమాటతక్క ఈసిద్ధాంతము రూఢిగా ఋజువుచేయఁబడియుండలేదు. ప్రభువులను రాజులను చక్రవర్తులను బుట్టించిన పరమేశ్వరుఁడే దరిద్రులఁగూడ బుట్టింపుచున్నాఁడుగదా! కేవలము దరిద్రులుమాత్రమేల దుఃఖమనుభవింపవలెను? నిజమే. ప్రతివాఁడును దనభాగ్యమును వెంటఁగొని జన్మించుచున్నాఁడు. దానింబట్టియె మానవులు సుఖదుఃఖము లనుభవింపవలసి వచ్చుచున్నది. అంతమాత్రమున దుఃఖముయొక్క భాగము కేవలము దరిద్రులకే వచ్చిపడినదని భావింపరాదు. గొప్పగొప్ప భాగ్యశాలురును సువర్ణమయపర్యంకములయందు నరకసమానమగు వ్యాకులమగు నస్థిమితజీవనము నెడలించుచున్నారు. ఇందుకు విరుద్ధముగా నెందరో దరిద్రులు తమ తాటాదూటపుఁ గుటీరమున జప్పిడిరొట్టిందిని మంచి సంతోషముతో నానందమయజీవనముఁగడుపుచున్నారు. కావున మానవులసుఖదుఃఖములకు గారణము వారిభాగ్యము కారణముగాని ధనాఢ్యతయు, దారిద్ర్యమును గావని సిద్ధాంతముగఁ గన్పట్టుచున్నది.

అయితే రష్యాదేశమున ధనికులు, ప్రభువులు నీ సిద్ధాంతమును మరచిపోయిరి. దరిద్రులుగూడ మానవులేయను జ్ఞానము నశించెను. జారుయొక్క ప్రభుత్వము దరిద్రుల జన్మసిద్ధమైన న్యాయమగు హక్కులంగూడ లాగికొనుటలో లేశమును వెనుదీయలేదు. రష్యాదేశపు దరిద్రులు ప్రభుత్వదౌర్జన్యములు సహించి సహించి వివశులై హాహాకారములువెట్టి యూపిరిలేక సొమ్మసిల్లిపోయిరి. మొత్తమున వారును మానవులే. వారి దేహములును రక్తమాంసశల్యమయములే. వారికిని మానవోచితమగు జీవనము గడుపుట కధికారముండెను. వారియోరిమికింగూడ గొంతపరిమితియుండెను. అందువల్ల పాపముబద్దలగుకాలము వచ్చుసరికాదుష్టుల దౌర్జన్యమునకు ప్రతీకారము చేయుటకై ప్రజలరక్తనాళములం దొక యావేశపూరితమగు సంచలనము బయలుదేరెను. ప్రతిహింస చేయవలెనను సంకల్పము వారినావహించివైచెను. దేశమెల్ల యెడను విప్లవసంఘములుస్థాపింపఁబడి యెలుకలవలె జారుప్రభుత్వపు పునాదులంద్రవ్వి బలహీనముజేయ నారంభించెను. ఆ సమయమున నవయౌవనవతి, అపరదేవకన్య, సుకుమారియగు మిస్ మేరియా యను నొక స్త్రీకూడ నత్యాచారనివారణసమితి యను విప్లవసంస్థలో సభికురాలుగా నేర్పడెను.

ఒకనాటి సాయంసమయమున నొక గొప్పస్థలమున గొన్నియవశ్యకవిషయములపై కర్తవ్యమును నిర్ణయించుటకై యెల్లరును సమావేశమైరి. సభాసదుల సమక్షమున నెన్నియో విమర్శింపవలసిన చర్చింపఁదగిన విషయములుండెను; కాని, వానియన్నిటిలో నత్యంతముఖ్యమైనది: ఆ ప్రాంతపుపాలకుఁడగు గవర్నరు బోర్గోన్ అనువాని యత్యాచారము (దుర్మార్గవర్తన) నంత మొందించుటంగూర్చిన ప్రశ్నగా నేర్పడెను. జారుచక్రవర్తి పాలన మహాఘోరములకు కేంద్రమే అయియుండెను. అయితే గవర్నరగు బోర్గోన్యొక్క క్రూరకృత్యము మరియు నధికఘోరముగను, నమానుషముగను, నుద్దండముగను, భరింపశక్యముగానిదిగను నండెను. వాఁడు ప్రజలను శత్రువులకంటెను హీనముగను తిరస్కారముగను జూచుచుండెను. ఆ మానవాతీతమగు దుండగములకు హింసలకు నెల్లరు విసికిపోయిరి.

సమావేశముయొక్క కార్యక్రమము ప్రారంభముకాగానే సభాధిపతియగు రిచ్చార్డు సభాసదులంబిలచి యిటుల బలికెను. "ఓ గౌరవనీయులగు సభాసదులారా! ఈ సమయమున నేను ఉపన్యాసము గావించుటకు గాని మీలో నెవ్వరైన నుపన్యసింపుడని ఆహ్వానించుటకుంగాని యవసరమున్నటులఁ గన్పింపదు. ఇప్పటివరకు మనకార్యనిర్వహణము ఉపన్యాసము లివ్వవలసిన యవస్థలోనే యుండి ఆహద్దుదాటకుండెను. అయితే నేడు ఆవిషయములను ఆసిద్ధాంతములను కార్యరూపమునం బెట్టవలసిన తరుణముతటస్థించినది. ఉపన్యాసముల మూలమున లాభములేకున్నది. నేటినుంచి మనము పరమేశ్వరునిపై భారమువైచి మనకార్యక్రమముయొక్క దృష్టిపథమును మార్చవలసియున్నది. దాని ఫలితమునుగూర్చి శంకింపక మనమెల్లరమునుఁ గార్యరంగమునఁ బురికవలసి యున్నది. మనము సత్యముగా న్యాయముకొఱకు ప్రాణములర్పింప సంసిద్ధుల మగునెడల మనకు విజయము చేకూరకుండుటకుఁ గారణమేమియుఁ గన్పట్టదు. ప్రపంచపుచరిత్ర దీనికి సాక్షీభూతమైయున్నది. కావున స్వతంత్రయజ్ఞమందు ధగధగ ప్రజ్వరిల్లుచున్న యగ్నిగుండమున నాహుతియగుటకు మనము సంసిద్ధులము కావలయును. ప్రస్తుతమున మనసమక్షమున నిలిచియున్న కార్యములన్నిటిలోను మొట్టమొదటిది నరపిశాచమైన బోర్గ్నును గడతేర్చివేయుటయైయున్నది. ఏయుపాయముననైన నాక్రూరరాక్షసునినంత మొందింపక తప్పదు. మీ రెల్లరు నీ ప్రస్తాపనవిషయమున మీమీయభిప్రాయములు వెల్లడింపవలెను."

సభాధిపతియగు రిచ్చార్డుయొక్క ఆవేశపూరితములగు వాక్కులు వినగానే సభాసదులెల్లరు నేకకంఠమున "అగును. ముఖ్యముగా వానింగడతేర్పవలయును. మేమెల్లరము సత్యన్యాయవేదిపైని మా దేహప్రాణములు బలియొసగుటకు సంసిద్ధముగానున్నారము. ఇట్టి ఘోరకృత్యములు సహించుట భయంకరమగు పాపము నధర్మమునైయున్నది." అని యెలుగెత్తిపల్కిరి. సభాధిపతి యుత్సాహవాక్యములతో మఱల—"మీ యుత్సాహపూర్ణశపథవాక్కులు వినగా నామనస్సునకమితానందముగల్గినది. అయితే నాపాపిష్ఠి బోర్గ్నును హతమార్చు పుణ్యమును జూఱఁగొనఁదలంచువారు లేచినిలువంబడుడు" అని కేకవైచెను.

సభాధిపతినోట నామాట వచ్చియురాగానే ఆసభాస్థానముననున్న యెల్లరు నొక్కమారుగా "ఇదుగో ఆపని నేను నిర్వహించెదను. ఆ పిశాచమునుహతమార్చెదను" అని గుండెపైఁజేయిచరచుచు లేచినిలువఁబడిరి.

ఈయుద్రేకముంగాంచి సభాధిపతి గంభీరముగా—"మీరువట్టి ఆవేశమునుపడకుడు. ఆవేశపూర్ణమగు కార్యములు సఫలములు గాఁజాలవు. అతని నేవిధముగా గడతేర్పవలయు ననెడి యుపాయసాధనముఁగూర్చి ముందు యోజింపవలెను" అని పలికెను.

ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగాఁ గొందరుసభ్యులు—"మేము పిస్టలుగురిపెట్టి వానిని జంపెదము" అనిరి. అపుడు వారిలో స్టువార్టు అనునొకఁడు ముందుకువచ్చి గంభీరవాక్కులతో "నాయనలారా! ఆయనమీదకు పిస్టలు గురిపెట్టుట సులభకార్యము గాదు. అతను నిరంతరము బహుజాగ్రత్తగా మెలఁగుచుండును. అతని చుట్టును సదా ఆయుధధారులగు నంగరక్షకులు నిలిచి కాపుగాయుచుందురు—" అనెను.

సభాధ్యక్షుడు—ఈవిషయమే నేను నూహించుచున్నాను. వాని నంతమొందించుటకుఁదగిన పన్నాగము కనిపెట్టవలెను.

స్టువార్టు—ఒక యుపాయమున్నది. దానివల్ల వాఁడు బహుసులభముగాఁ గడ తేరవచ్చును.

సభాధిపతి:—అదేమో నెలవిండు.

స్టువార్టు—వాఁడు తన కుమారుఁడగు ఫిలిప్పును మిక్కిలిప్రేమతోఁజూచికొనుచుండును. ఏయుపాయము వల్లనైన మనమాతనినిహతమార్చునెడల ఆపుత్రశోకముచేత ఆపాపి వాడంతటఁవాఁడే దగ్ధమైపోవకమానఁడు.

సభాధిపతి "ఇదిమాత్రము మంచి సాధనోపాయమగును. నాకు మీమాట బాగా నచ్చినది. కడమ వారెల్లరునీపద్ధతి నామోదించుచో దీనిప్రకారము పనిసాగింపవచ్చును" అనెను.

ఆమాటవిని ఎల్లరు "ఖళీ, బాగు. ఇది మాకును సమ్మతమే" అనిరి సభముగించి ఆతనిహత్యకై యత్నింప నిశ్చయించిరి. ఇందుగలవిశేషమేమనగా నీదివఱలో సూచింపబడిన యువతియగు మేరియా ఆయువకునిఁబట్టి వారికప్పగించి చేయు కార్యభారము దానువహించితినని ప్రతిజ్ఞయొనర్చెను.

౨

ఒకనాడు సాయంసమయమున విద్యుద్దీపముల ధగద్ధగలు వివిధచ్ఛాయలుగల అద్దాలమేడలయందు ప్రతిఫలించి వేలాదివేలయి ఇంద్రధనుస్సులువ్యాపించినటుల గన్పట్టుచు మాస్కోనగరసౌందర్యమువర్ణనాతీతముగఁ జేయుచుండెను. ప్రజలెల్లరుఁ దమతమ యుద్యోగవ్యాపారములు ముగించి వాయుప్రసారమున ఆనందింపఁ బయలుదేరుచుండిరి; యథేచ్ఛాసంచారులగు యువకులు తమమిత్రులతోడను, ప్రియాంగనలతోడను నుపహారాసవాదులు సేవింప సతూహలులై హోటళులవైపు నడచుచుండిరి; మరికొందరు తమకాముకీమణుల కేలుకేలున సంధించి సినిమావినోదముం గాంచుటకై వెడలుచుండిరి; ఇంక గొందరు వింతవింతలగు సుందరవస్తువులంగొని సంతసించుచు గృహాభిముఖులై పోవుచుండిరి.

ఆ సంధ్యాసమయమున నొకయువతీమణి ప్రఖ్యాతిజెందిన యొక గొప్పహోటలులోఁ గూర్చుని యుపహారసేవనముచేయుచుండెను. యౌవనమే సౌందర్యముంగల్గించును. అందులో సహజముగా సుందరియైపుట్టిన లలితాంగియొక్క లావణ్యము యౌవనమున వర్ణనకుమించి ప్రకాశించుననుట ఏమివింత? ఆమెయొక్క మనోహరమగు ముఖమండలముగాంచిన వారిహృదయములందు సమ్మోహనాస్త్రప్రయోగము జరిగినట్లుండెను. ఆమెను గాంచిన ప్రతిపురుషుఁడును ఆమె దేవతాంగనయని తలంచి అపూర్వసౌందర్యనిర్మాణమునకై విధాతం గొనియాడుచు దానికిసార్థకమగునటుల చింతించుచుండిరి. ఆహోటలులోనైతే పెక్కురుండిరి. కాని ఆసుందరి ఫలహారముచేయు గదిలోమాత్ర మెవ్వరును లేకయుండిరి. ఆమెయొక్కతియేయుండెను. ఆయువతి దాదాపుగా ఫలహారము చేయుట ముగించినదైనంతలోనే యొకయువకుడు ఆగదిలోనే ప్రవేశించెను. అతని వేషవైఖరులు గాంచుచో నేయపరిచయుఁడైనను నాతఁడెవ్వరో గొప్పవిఖ్యాతకుటుంబసంజాతుఁడని గ్రహింపకపోఁడు. అయన రాగానే హోటలుమేనేజరు స్వయముగానే ఆయనను స్వాగతమొసగుటకు త్వరితగతిని బరువెత్తి వచ్చెను. మంచినిపుణులగు సేవకులువలయునవెల్లందెచ్చి సమర్పించుటకునియమింపంబడిరి. నమ్రతయు, శిష్టాచారభావముఁ గనుపరచుచు మేనేజరు తనగదిలోనికి వెడలెను. సేవకులు మాత్రము చేతులుగట్టుకొని నిలిచి ఆయువకుఁడు కోరినవెల్లఁదెచ్చి యొసంగుచుండిరి. అటుల ననేకరుచ్యపదార్థములు నాసవములు బల్లపైనుంచి వారు బయటకు వెడలిపోయిరి. యువకుడు ఫలహారము జేయఁదొడఁగెను; కాని ఆయన ముఖమండలమున నెవరికొఱకో నిరీక్షించుచున్నటుల ప్రకటించు భావద్యోతకమును గాన్పించుచుండెను.

ఇంతలో యువతీమణి ఫలహారాసవపానములుసమాప్తిగావించుకొని సొమ్మునకు బిల్లు తెచ్చుటకై నౌకరును కేకవైచెను. యువకునిధ్యాన మంతవఱకు నామెదెసకుపోక లేదు.; కాని యామె మొగమెత్తి కోయిలకంఠముతో మనోహరమగు మధురవాక్కులు బలుకగానే యాతనిదృష్టి యామెవైపు మరలి యామెను బలుకరించి ప్రస్తాపింప నభిలషింపజేసెను. అపరిచయుఁడైన తాను ఆమెతో మాటలాడుట వారిసభ్యతకుఁగాని శిష్టాచారమునకుఁగాని విరుద్ధముగాకున్నను నభిలాషపడెదమియు నామెనుఁ బలుకరింప సాహసముచేయలేక కొట్టుమిట్టాడుచు సందియమొందుచు మాటనోటచివరవఱకు గానిచ్చి పైనకికయనఁబోవుచు తటపటాయింపుచుండెను; కాని

ఆస్థితి యెంతయో నేపునిలువలేక. బుద్ధిచంచలించినవానివలె నొకటి నోటనైచికొనుచు తలయెత్తి యామె పై పుగనిపెట్టుచు నాటనటజేయుచు వికారచేష్టలు, హావభావములు ప్రదర్శించుచుండెను. ఇంతలో నాయువతి హోటలువారలు తెచ్చినబిల్లుంగొని సొమ్ము చెల్లించి యటనుండి వెడలిపోవ ఆయత్తపడుచుండెను. బైటకేగినచో నిక తనకార్యము భంగమగునని యాయువకుఁడు కలవరపడి గ్రోలుట మాని చట్టునలేచినిల్చి ఆమెం బలుకరించి "తామెవ్వరో నాకుఁగొంచెము నివేదింప ననుగ్రహింతురా?" అని ప్రశ్నించెను.

యువతి అనుకూలభావము గన్పట్ట ముఖారవిందమున మందహాసచంద్రికలు వెలయ "మిగులసంతోషముతోఁ జెప్పెదను" అనెను. పిదప నిటుల సంభాషణజరిగెను.

యువకుఁడు—అగుచోఁ దాము తమనామము నివాసము నేమో దయచేసి తెలిపెదరో?

సుందరి—అయ్యా! నాపేరు మేరియా. నేను నాతండ్రితోఁగూడనుంటున్నాను. ఆయన యిచటనే యొక సామాన్యవర్తకుడు.

యువకుఁడు—అయితే తాము నా అవిధేయప్రస్తాపనపై నలుగక బాగుగాయోచింప దయబూనెదరా?

సుందరి—సెలవొసంగుడు. ఏమి ఆజ్ఞ?

యువకుఁడు—నేను మీకు నపరిచయులమగుటవలన నాకుఁదమతో నిట్టి ప్రశంసచేయుట కావంతయు నధికారములేదు. కాని తమ సౌజన్యత గాంచినంతనే—

ఆమాట సంపూర్తిగాకుండగనే ఆసుందరి మధ్యనందికొని "తమకునేను అపరిచయురాలనేకాని తాము మాత్రము నాకు అపరిచయులుగారు" అనెను.

యువకుడు—(సంతసమున వికసితముఖారవిందుఁడై) నన్ను తమరు బాగుగా నెఱింగియున్నారా?

సుందరి—(చిరునవ్వు మోమున మొలకలెత్తించి) ఇచ్చట విఖ్యాతపాలకులగు గవర్నరు పుత్రరత్నమగు మిస్టర్ ఫిలిప్సు మహాశయుని నెవ్వరెఱుంగకుందురు? నేను ప్రత్యక్షముగాఁ దమతో ముఖపరిచయముగలుగుట నాకు మహాభాగ్యమని తలంచుచున్నాను.

ఫిలిప్—తమరు నాయెడల నిట్టి గౌరవభావము గల్గియున్నందుకు మిగుల ధన్యవాదము లొనర్చుచున్నాను.

మేరియా—అగుచో నేమిసంగతి? సెలవొసంగుడు. నాకుఁగొంచెము అవశ్యకార్యముపై బయటికేగవలసియున్నది.

ఫిలిప్—(కొంచెము నిరాశాసూచనతో) ఈ సమయముననే తామొక యవసరకార్యముపై బయటికేగనున్నారా?

మేరియా—అయ్యా! అగును ఒకగృహస్థునితో గలిసి మాట్లాడవలసియుండి వెడలనున్నాను.

ఫిలిప్—నేటి తమకార్యక్రమములో నేమియు మార్పుచేయుటకు వీలుకలుగదా?

మేరియా—ఏల? మార్పుచేయు అవసరమేమి వచ్చినది?

ఫిలిప్—తాము ఇపుడే నాతోగూడ వచ్చి సినీమావీక్షణవినోదమున భాగముకొనుటకై యాహ్వానింప సమకట్టియున్నాను. అది సమ్మతింప ననుగ్రహింపగలరా? అనుగ్రహించి యది సమ్మతించెదరా?

మేరియా—(కొంచెమునవ్వుచు) మందస్వరముతో, తమరు మరియొకదినమున నాసేవార్పణమునకై తమ సమ్ముఖమునకు వచ్చుట కనుజ్ఞయొసంగెదరేని మిగుల వీలుగానుండగలదని విన్నవింపుచున్నాను.

ఫిలిప్—(కొంచెము నిరుత్సాహవర్చస్సుతో) అది మీ అనుగ్రహముంబట్టియున్నది. నేనేమనగలను? అయితే, నేడే నా నిమంత్రణము ననుమోదింపుచో మాత్రము పరమానందముగా నుండును.

మేరియా—తమరు అంతబ్రతిమాలుచోఁ దమమాటదీసివేయునంత యాసిగ్గులేని దానను కాను. తమ చిత్తము.

ఫిలిప్—భళీ! ఈవాగ్దానమునకై తమకు నేను జన్మాంతము వఱకు గృతజ్ఞుడనై యుండెదను.

మేరియా—ఇందులో గృతజ్ఞత చూపవలసినంత విషయమేమున్నది? నావంటి క్షుద్రవ్యక్తిపైని దామింత కటాక్షము బరపుచున్నారు. ఇది నేను నపురూపసౌభాగ్యమని యెంచుకొనుచున్నాను.

ఫిలిప్—నామొండిసాహసమును క్షమింపుడు. తమ వ్యక్తిత్వమును, సౌజన్యతయు తమ్ము నేనింత చనువుగా జోరవగా బ్రశంసింప గారణములైనవి. అవియే నాపైని మంత్రప్రయోగమువంటి ప్రభావము చూపినవి. నేడు నాదుఃఖమయభావనమున నొక నూతనోత్తేజ ముదయించి సంచలింప నారంభమైనది.

మేరియా—తమరు నాయెడల నిట్టు సద్భావము గల్గియున్నారు. అందుకే నేను తమకుఁ గోటిగుణిత ముగా ధన్యవాదమొనర్చుచున్నాను. అయితే వడలిపోయియున్న నా హృదయమును తమ కృపావృష్టిచే మరల నవీనముగా నొనర్చుట తమ యౌదార్యముకంటె వేరుగాదు.

ఈవిధముగా గొంతసేపటివఱకు ప్రేమపూర్వకమగు సరససంభాషణములు జరుగగా పిమ్మట వారిర్వురును మోటరుశకటముపై నధిరోహించి, సినీమావినోదము దర్శించుటకై వెడలిపోయిరి.

## 3

పైనివివరించిన సంఘటనము జరిగినపిదపఁ గొన్నివారములుగడిచెను. ఈలోపున మేరియా ఫిలిప్పులకు గావలసినంత మైత్రియు నైక్యతయు గుదిరిపోయినవి. వారు పరస్పరము ప్రేమించికొనిరి. మేరియా యొక్క రూపలావణ్యములు, నమృతమయవాక్కులు ఫిలిప్పును మాయాజాలములోబంధించెను. ఫిలిప్పుయొక్క సౌష్టవ శరీరమును వికసితముఖారవిందమును మధురభాషణలు మేరికి మోహనమంత్రములుగా బరిణమించి ప్రేమ రజ్జువులతో బిగించివైచినవి. కావున నామెయు నాతనిఁ బ్రాణనాయకునిగాఁ దలఁచి మనసా ప్రేమింపం దొడగెను. వారిర్వురు నెవరికివారే యెదుటివారు తమపూర్వపుణ్యవశమున లభించిన దేవతాస్వరూపులనియు, నీసంఘటనమునందు మానవజన్మము సార్థకమయ్యెననియు భావింపుచుండిరి. అయితే ఈమె నాటిసభలో ఫిలిప్పు అను నీయువకునే నేటి తనహృదయేశ్వరునే పట్టియిచ్చెదనను భారమువహించి శపథముదాల్చియున్న కారణమున నామె కర్తవ్యమో ఆమెను విశ్వాసఘాతకురాలను వివశురాలిఁ గావించుచుండెను. కానిపరమేశ్వరుఁ డామె హృదయమును దేహమునువలెనే బహుసుకుమారముగను మృదువుగను నిర్మాణించెను. తనప్రాణమునకు నాథుడై ప్రాణములకంటె నధికుఁడైయున్న యువకుని సుందరుని మనోహరుని యెడల విశ్వాసఘాతసేయుట యెటుల? ఈరహస్యమును గనుకొని స్థిరపరచుకొనుట కామెకు సమర్థత చాలకుండెను; మేధపనిచేయకుండెను; వ్యక్తి చంచలించిపోవుచుండెను; ఆతరుణమున ఫిలిప్పునకు విశ్వాసఘాత సేయుట యనగా నామెదృష్టికి మనుష్యత్వమను పరిభాషకుగూడ కళంకముందెచ్చిపెట్టుటగా గన్పట్టుచుండెను. ఒకవైపు నామెకర్తవ్యము ధర్మబద్ధత వాగ్దానవిషయము నట్లుగావింపక తీరనటుల బలవంతపెట్టుచుండెను. మానవధర్మముయొక్కయు గర్తవ్యపాలనముయొక్కయు నాందోళనమునంబడి యేమియుంబాలుపోక కొట్టుమిట్టాడుచుండెను. ఈసమస్య పరిష్కరించికొనుట కామె కసాధ్యముగా నుండెను. మొదటినుండియు నుచ్ఛదశకు వెడలిన యుత్సాహ చంద్రుడు వ్యాకులపథమున గ్రిందకుం గ్రుంగ నారంభించెను.

అటు లత్యాచారనివారకసమితివారు నీమెముందుచేసినప్రతిజ్ఞ నెరవేర్చుటకై యొత్తిడి సేయనారంభించిరి. పాపము యీామె గొప్ప సంకటస్థితిలో మునిగి నిస్తబ్ధురాలై పోయెను. తుద కామె యొకదారిఁబట్టుటకు నిశ్చ

యించికొనెను. సమితివారితో లేక ఫిలిప్పునో మోసపుచ్చి యెవరితో యొకరికి విశ్వాసఘాత సేయుటదక్క ఇంకొక యుపాయ మామెకు స్ఫురించుటలేదు. తాను పొందుచున్న సౌఖ్యము అయాచితసంఘటనము బుద్ధిపూర్వకముగా మంటలో గిలిపికొనుట. మాయయన్నది తెలియక తన్నే హృదయేశ్వరునిగా నమ్మి గౌరవాదరములతో నానందవార్ధి నోలలాడించుచున్న ప్రాణనాథుని మోసపుచ్చి విశ్వాసఘాతకియై చేతులార వైరులకు నప్పగించి రాక్షసకృత్యమునకుం బాలుపడుట, యెవరో దుర్మార్గమొనర్చుచున్నందుకు వారికి ప్రాయశ్చిత్తమునకై యేమియు నెరుగని యొక యమాయకుని హతమార్పఁజేసి మానుషధర్మమున కపఖ్యాతి దెచ్చుట, ఇది ధర్మమా లేక తన్నే నమ్మి దేశదాస్యవిమోచనమునకై జాతీయవిప్లవారణమునకై యాహుతిగానున్న సమితిలో చేరు వానిని మోసపుచ్చి ప్రతిఘటించి వైరిపక్షములోదూరి స్వలాభాపేక్షకై జాతికి ఘాత చేయుట ధర్మమా అని చర్చించి స్వార్థమా ధర్మమా అని ప్రశ్నించికొనెను. తుదకు సమితికే ఆజన్మసేవయొనర్చుటకు తీర్మానించికొనెను. ఒకవేళ సమితివారియెడల విశ్వాసఘాతయొనర్చినను తనయొక్కయు ఫిలిఫ్‌యొక్కయు జీవనము యథాప్రకారము సురక్షితముగా నుండుటకు సాధ్యపడదు. విశ్వాసఘాత చేసిన యపరాధమునకై వారేదో యొకదినమున తుదకుఁ దమ యిర్వురఁగూడ హతమార్పక విడిచిపెట్టరు. అందువలన నామె విధిలేక తనహృదయేశ్వరుఁడగు ఫిలిప్పును వారికప్పగించుటకే దృఢనిశ్చయము గావించికొనెను. కాని యామె యంతరాత్మమాత్రము ఈదుష్కార్యము ననుమోదింపకుండెను. ఆమెయొక్క మనస్సాక్షి ఫిలిప్పును బలివేదికకాహుతి యొసఁగ సంసిద్ధపడకుండెను. ఈ నిర్ణయముయొక్క భయంకరభావనలతో నామెతల తిరిగి దృశ్యమగోచరమై భూతలము తనపాదములక్రిందినుంచి క్రుంగిపోవుచున్నటుల దోఁచుచుండెను.

ఏకార్యమునకైన ఫలాఫలముల యదార్థరూపము నిర్ణయించుట మానవశక్తి కతీతకార్యమై యున్నది. మేరియాయొక్క ప్రేమ తుదకింతభయంకరముగను ప్రాణఘాతుకముగను బరిణమించునని ఫిలిప్పు స్వప్నమందైన నూహింపలేదు. మేరియా యెడల నాతని ప్రేమ పరిశుద్ధముగను స్వాభావికముగను నుండెను. ఇకనాతఁడామెను శాస్త్రోక్తముగా బహిరంగముగా బరిణయమాడి ఆ ప్రేమానుబంధము చిరస్థాయి గావించుకొనుటకై మనసు స్థిరము గావించికొనియుండెను. అతని ప్రేమలో క్షణభంగురత్వమా, లేదు. జీవనోన్మాదమా, యంతకంటెను లేదు. ఆప్రేమ గంగోదకమువలె నిర్మలముగను, సత్యమువలెఁ బవిత్రవంతముగాను నుండెను. ఇటు మేరియా హృదయమూ అంతకంటె నంటుకొనిపోయెను. లేశమైన కల్మషము చంచలత లేని శుద్ధభావముతో నాతనిం బ్రేమించి యానందమున దేలుచుండెను. ఇరువురి హృదయములొక్కటి, దేహములొక్కటియై అపూర్వ శోభతో వెలయుచుండెను. ఆయనురూపప్రాయములుగల సహజసౌందర్యవిలాసములుగల యిర్వురు కాముకీకాముకులు వాస్తవముగా దంపతులగు సుయోగము చేకూరి వారు తల్లిదండ్రులకు నేత్రపర్వము గల్గించు భాగ్యము గల్గింతురేని నిర్వురజన్మములు సార్థకములయ్యెనని వారినిగాంచినవారుంగూడ సంతసించి యుప్పొంగవలసినదే. అయితే నట్టియోగము భగవదాధీనముగదా? ఇట్టి యనుపమమగు నన్యోన్యానురాగబద్ధమగు ప్రేమ భయంకరముగా విషమయముగా బరిణమించునని యెవరు భావింపఁగలరు?

ఒకనాటి సంధ్యాకాలమున ఆమె ఫిలిప్పును మున్ను సమితివారితో గావించికొనిన సాంకేతికమునననుసరించి విహారమునకై పురముబయటనున్న యొక యుద్యానవనమునకుం దోడ్కొనివెడలెను. అచట నామె యెద్దియో మాయగాథ దెల్పుచు భావిగతిం గూర్చి పరితప్తచిత్తయై యుండెను. అపుడామె దేహలత భయఝంఝామారుతమున నల్లల్లాడఁజొచ్చెను; మేనెల్లఁ జెమర్చెను; కంఠస్వరము సన్నగిల్లెను; చైతన్యము స్తంభించెను; వ్యక్తి యంతరించెను; దృశ్యమెల్ల నదృశ్యమై తానెచ్చటనున్నదియు నేమి చేయుచున్నదియుంగూడ గ్రహింపఁజాలని విషమా

వస్థలోఁబడి విధికి లోబడియుండెను. ఇంతలో విప్లవకారులు యొక్కయెరకలో వచ్చిపడి వారిని ముట్టడించి యాయువకునింబట్టి తమ రహస్యస్థానమునకుం గొనిపోయిరి. ఫిలిప్పున కది జాగ్రతావస్థయో స్వప్నావస్థయో తెలియకుండెను. ఆతుఁతచే దెబ్బ దెచ్చికొని తన ప్రేయసివంకఁ దలద్రిప్పి గాంచెను. కాని యామెయాతనికంటికిఁ గాన్పింపలేదు. మరల వ్యక్తిఁ గోల్పోయి మూర్ఛితుఁడై కనులు దెరచుసరికి దానొక చెరసాలలో రాజద్రోహులగు విప్లవకారుల మధ్యనున్నటుల గనిపెట్టెను. అపుడు గూడ నాయమాయకుఁడు దన ప్రేయసిగా నర్ధదేహినిగా విశ్వసించియున్న మేరియాయే బుద్ధిపూర్వకముగా తన్ను వారలకు ఒప్పగించి ప్రాణఘాతయొనర్చెనని తలంపలేదు సరేయే కదా మీదుమిక్కిలి యా ద్రోహులవలన నామె కేమి యుపద్రవము గల్గెనోయని చింతించుచు వ్యాకుల బడుచుండెను.

## ౪

పాపము! ఆ నిర్దోషి తన తండ్రియొక్క దురంతవర్తనమువలనను, దన ప్రేయసియొక్క విశ్వాసఘాతమూలమునను దానుబలివేదికపై కెక్కవలసిన వాఁడయ్యెను. అపు డాయువకునింగాంచి హంతకులు దామాతనిని బంధించిన సంగతి యెఱింగించి మరుసటిదినమున ప్రొద్దు పొడుచుటకుముందే యాతని నొక నిర్దిష్టస్థానమున హతమార్పనున్న వార్త దెలిపిరి. వారిలో సభానాయకుఁడగు రిచ్చార్డు, ఫిలిప్పునుంగాంచి యాతని యంతిమ వాంఛ (కడపటి కోరిక) దెలుపుమనగా ఫిలిప్పు శాంతభావముతో "అయ్యా! నేను మేరియాను విశుద్ధహృదయముతో ప్రేమించియున్నాను. ఇందుకు పరమేశ్వరుడును, మేరియాయొక్క హృదయమును సాక్షులు. ఆమె ప్రేమముందర నాజీవనమును తుచ్ఛముగా భావించుచుంటిని; నేటికిని భావింపుచున్నాను. నాకు మరణముగలుగుటవల్ల నాయర్ధాంగియగు మేరియా తన కర్తవ్యపాలనమొనర్చి, కృతకృత్యురాలు కాఁగలిగిన యెడల నంతకంటె నాకు సంతోషదాయకమగువిషయ మింకేమికలదు? నాజీవనమే ధన్యమైనది. ఏమనగా దీనియంతము నాప్రాణప్రియయొక్క యానందమునకు హేతుభూతమగుచున్నది. నేను బహునిర్లిప్తుడనై మహాసంతోషపూర్వకముగా మరణించుచున్నాను. ఇంతకంటె నాకు గావలసినదేమున్నది? అయితే నాకొక కోరికమాత్రమున్నది. అదిమాత్రము దీర్చుటకు వినయముతో ప్రార్థింపుచున్నాను." అనెను.

ప్రెసిడెంటు రిచ్చార్డు "తమ ఈ విశుద్ధప్రేమ గాంచగా నాకు మహదాశ్చర్యముగలుగుచున్నది. వాస్తవముగా దమరు ప్రేమప్రపంచమునకు మహాజ్యోతిర్మయమగు రత్నములు. ప్రేమయొక్క యదార్థరహస్యమును దమరు సంపూర్తిగా ననుభవమునకుఁ దెచ్చియున్నారు. తను రోమరోమములనుండియుఁ బ్రేమప్రభలు ప్రాదుర్భవించుచున్నవి; ప్రకాశించుచున్నవి. తమవంటి మహాపురుషులను హత్య యొనర్చి అనుపమదాంపత్య సంఘటనమును విచ్ఛిన్నముగావించుట న్యాయదృష్టిని, మానవధర్మమునుబట్టిచూడగా మహాఘోరమగు పాపకార్యమైయున్నది. అయితే నేమిచేతును? కేవల వివశుఁడనైపోయియున్నాను. మా వర్తమానకర్తవ్యము, ప్రస్తుతరాజకీయదుస్థితి ఇట్టి యకార్యములజేయుటకై బాధ్యుల నొనర్చివేయుచున్నది" అని పల్కుచు నేత్రములనుండి బొటబొట కన్నీరు విడువఁదొడంగెను. విప్లవకారుల సంఘమునకు ముఖ్యనాయకుఁడై యనేక ద్రోహకార్యములు చేయుటకుఁ, జేయించుటకు దీక్షావ్రతములు బూని యమరాజపదవి నాక్రమించియున్న రిచ్చార్డు ఫిలిప్పుయొక్క ధైర్యస్థైర్యముల కచ్చెరువొంది, గుణరూపములకు వింతపడి, అవ్యాజప్రేమకు సంతసించి అట్టి మహనీయుని, నిరపరాధిని హతమార్పవలసివచ్చినందుకు దుఃఖింపఁబూనగా ఫిలిప్పు ఆతని యవస్థ గాంచియు దాను కొంచెమును జంచలింపక నిర్భయముగా "అయ్యా! తమరు నావిషయమై వ్యర్థముగా నేల

శోకింతెదరు? నేను నిర్విచారముగా, సంతోషపూర్వకముగా, ప్రేమను బహుమానపూర్వకముగా నాప్రాణము లర్పించుచున్నాను. తమరు నాప్రార్థనమాత్రము నెఱవేర్పుఁడు" అని పలికెను.

రిచార్డ్సు:—అదేమియో సెలవొసంగుడు.

ఫిలిప్పు:—నేను మరణమునకు ముందు నాప్రేయసియగు మేరియా నొకమారు దర్శింపఁగోరుచున్నాను.

రిచార్డ్సు:—ఇదియేనా తమ వాంఛ? అవశ్యముగా తీర్చెదను. ఇట్లుచెప్పి ఆయన వెడలిపోయెను. ఆయన వెడలిపోయిన పిదప ఫిలిప్పు ఇఁక దన మరణమునకై సన్నాహము గావించుకొనఁబూనెను. నాటిదనుక గడచిన తన జీవితమునందలి ఘటనములెల్ల హృదయపటమున బయాస్కోపువలె నాట్యమొనర్పఁ దొడంగెను. ఆయన తన జీవితమునందలి ప్రతివిషయమును మరల మరల జ్ఞప్తికిఁదెచ్చుకొని దానిపై చర్చింప నారంభించెను. ఒకమారు ఆయన ముఖమండలమున పిచ్చినవ్వును, మఱల హృదయావేదనయుఁ బ్రత్యక్షమై స్థితి తారుమారుచేయుచుండెను......ఆయన యొకమారు ప్రమత్తునివలె నూగుచు, నొకమారు తాపసివలె నిమీలితనేత్రుఁడై, నిశ్చలహృదయుడై, భావనాతరంగముల గమనాగమనములఁ గాంచివిచారణచేయుచుండెను. బాల్యమునుండియు గష్టమన్నమాట యెఱుఁగక హాయిగా నిర్విచారముగా రాజభోగముతో యథేచ్ఛగా గడచిన జీవితము, మేరియాయను భువనమోహినియొక్క ప్రేమసాగరమున విహరించిన జీవితము, ఉన్నతవాంఛా శిఖరము నధిష్ఠించి శుభమయశృంగారపూరితసౌఖ్యానందప్రపంచదృశ్యమును వీక్షించుచున్న జీవితము, తలవని తలంపుగా హఠాత్తుగా విచ్ఛిన్నమై అగాధములోఁబడి ఆకాశమున కెగురవలసిన యోగముగలిగించిన ఈశ్వర విధికి ఆశ్చర్యపడుచు, "మేరియా, మృత్యుదేవతయా? ఆహా! కావున్న నాకట్టి యనుపమప్రేమమధువేల గ్రోలించి తన్మయునిఁ గావించును?" అనితలపోయుచు "స్వప్నతుల్యమగు గతజీవితముముగిసి తెలివివచ్చినదా?" అని వింతపడుచు నెవ్వరిని నిందింపక, యెవరికొరకును విలపింపక, యేమియు భీతిల్లక, హృదయము పరమేశ్వరునియందు సంధించియుండెను.

అప్పటికి రాత్రి రెండుజాములైనవి. రెండుగంటలవేళ నాతని యంతమగునని కావలివాండ్రవలన నూపీ తెలిసెను. కావున మిగిలిన రెండుగంటలుకూడ దన జీవనమును శాంతియుక్తముగా నిశ్చలముగా నుంచఁ బూనెను.

ఇంతలో మేరియా చంచలతలేనిమించులతవలెనున్న మేనుతోవచ్చి హృదయముమాత్రము చాంచల్యము నొంద ఉన్మాదినివలె హీనమగుకంఠస్వరముతో నిట్లనఁబూనెను. "ఫిలిప్! ఓహృదయేశ్వర! ప్రియ! ఫిలిప్! క్షమింపుము. మీయెడ నేను ఘోరమగు విశ్వాసఘాత యొనర్చినాను. అకటా! పరమేశ్వరుడు మిమ్ము నట్టి అమాయకులనుగా సృష్టించెను. మీరు మంచిచెడ్డల తారతమ్యము గ్రహింపఁజాలకపోయితిరి. నావంటిపాతకికి క్రూరరాక్షసికి మీరు దేవీస్థానమొసంగినారు. పత్నీభావమువహించి యీ పదవియందు నన్ను నిల్పినారు. మధురవాక్యములలో, మందహాసములలో విషనాయువు దాగియున్నదని తెలిసికొనలేకపోయితిరి. నా ప్రియా! ఆదర్శప్రియా! సత్యమైన ప్రేమ, సత్యసంధత, యమాయకత యను రెండే మీ సర్వనాశనమునకుఁ గారణము లైనవి. అయ్యయ్యో! మిమ్ము గాపాడుట కింకనాకు శక్యముగాదు. ఏమిచేయుదును? మిక్కిలిచెప్పి యేమి ప్రయోజనము? మందహాసచంద్రికలు వెదజల్లుచు, నిశ్చయప్రేమబద్ధులై ప్రియుని ప్రేమానురాగముల కాస్పదలైన స్త్రీలే యిట్లు గావింపగా గపటనటనలజేయుచు గల్లమోహముంగనబరచు కాంతలెంతజేయుదురో యిపుడు లోకము దెలిసికొనగలదు. ప్రాణనాథా! నన్నే సర్వమని నమ్మియున్న మిమ్ము నపాయము పాలు జేసి యీ మొండిప్రాణి యింక నీకట్టెంబట్టికొని వ్రేలాడునా? దానికంత యాత్మగౌరవము లేదా? మానాభి

మానములు లేవా? సాహసము లేదా? ఇదిగో ఈదుష్టజీవి చేసినవంచనకు, విశ్వాసఘాతకు, పాపకార్యమునకు ప్రాయశ్చిత్తముగా మీకంటె ముందే తరలుచున్నది. అట్టి ప్రాణప్రియుని నంతమొందింపుచు నింక బ్రతికి బాగుపడునా? ఛీ! సిగ్గు. సిగ్గు. మహిళామణికి మానమే ధనము. సాహసమే ప్రవృత్తి. కాని ప్రియా! జాగ్రత! ఇది ఆలోకమునందేగి మరల మీకు స్వాగతమివ్వఁ బోగోదునేమో, ఆతిథ్యమివ్వబోవునేమో, ఈ మొండిప్రాణిని నమ్మకుడు; మఱల మోసములోఁ జిక్కకుఁడు. లేదేని చెడిపోయెదరు. దానికేమి? ఇపుడు ప్రస్తుతకర్తవ్యము వచ్చి పడియున్నది. నిర్దయాత్ములగు నీహంతకులచేతి ఖడ్గప్రహారమువల్ల మీహత్యగాకుండ ఆత్మగౌరవము కాపాడుకొనుఁడు. అనగా మీహత్య మీరు స్వయముగా గావించుకొనుడు. ఏదీ! నాయందెంత గాఢానురాగమున్నదో చూచెదను? మన ఇరువుర ఆత్మార్పణమువలన మన దేశమంతయు నత్యాచారపీడనుండి విముక్తి నొంది సర్వస్వతంత్రపదవి నలంకరించి సమానరాష్ట్రములందు శిరోమణికాగలదు. ఆలస్యమేల? కాలము సమీపమగుచున్నది. ఇదిగో! నాజేబులో బారుపెట్టిన పిస్టలున్నది.” అనుచు లోజేబులో చెయ్యి పెట్టినదో లేదో ధన్నుమను ధ్వనియై మేరియా శవము ప్రాణనాథుని (ఫిలిప్పు) పాదములపై శిరమానునటుల పడిపోయెను. • అతఁడదలి ఆశవముపైబడి విలపింపబూనెను. కావలివారు కలవరపడి లోనప్రవేశింప నుద్యుక్తులగుచుండిరి. పిస్టలుపైకెత్తిచూపఁబడెను. తక్షణ మతడదిలాగికొని గుండెపై నొక్కవేఁటువైచికొని ఆమెపై కొరిగెను.

*

ఆ యిద్దరు కాముకీకాముకుల, యువతీయువకుల బలిదానము వృథాగా పోలేదు. ఈప్రేమ మిణుగురు మహాకార్యము నిర్వహించిచూపించెను. అనగా ఎందుకై మహాత్యాగము గావింపఁబడెనో ఆపని నెరవేరుట కది మూలకారణమాయెను. అనురూపవయము గల గాఢానురాగబద్ధులైన యా దంపతుల హత్యాస్మరణమునకు మృత్యుదేవతయే చింతించెను; రక్తపాతులగు హంతకులే పశ్చాత్తప్తులై శోకించిరి; దేశమాతయే తన స్వలాభమునకై అట్టి యపురూప మిథునమును బలిగొంటినిగదా యని లజ్జించెను. కడమ సామాన్యమానవులమాట చెప్పుటకేమున్నది? ఈతడే ఏకపుత్రుఁడుగాగల్గి అనుపమప్రేమతో గారవించుచున్న తల్లిదండ్రుల దుఃఖమునకు ఇక మేరయుండునా? తన వృద్ధావస్థలో నేకమాత్రపుత్రుఁడు మరణించిన దుర్వార్త వినినంతనే గవర్నరగు బాగ్నో సహింపఁజాలక బెంగపెట్టుకొనెను. ఎల్లరు నెన్నోవిధముల ఆయన నోదార్చి ధైర్యముఁగఱపిరి. కాని లాభములేకపోయెను. నాటినుండియు ఆయన పుత్రశోకమున వ్యక్తిహీనుడై మతిచెడి తనపదవికి నీళ్లువిడిచెను అత్యాచారనివారకసమితివారి యీాప్సితము సంపూర్తియయ్యెను. నిరంకుశ సామ్రాజ్యప్రభుత్వదుర్గమునందు పునాదిరాయిఊడిపోయి క్రమముగా నన్యాయదుర్గమునంతను విచ్ఛిత్తిగావించి దేశవిముక్తికిఁ బునాదియయ్యెను.

ఆహా! దేశదాస్యవిమోచనమునకై దీక్షఁబూని తనకు లభించిన స్వర్గతుల్యమగు పదవి వదలుకొని స్వార్థమును వీడి ప్రతిజ్ఞానిర్వహణ మొనర్చిన మేరియా ఎంతయో ధన్యురాలుగదా? ఈమె చరిత్రము సువర్ణాక్షరములతో లిఖించియు ఈవీరదంపతుల స్వర్ణవిగ్రహములు రచించియు నిత్యము బూజించుచుండిననే రష్యా స్వాతంత్ర్యవాదుల కృతజ్ఞత స్థిరరూపము నొందగలదు.

—శ్రీవిశ్వనాథసింహశర్మగారి హిందీవ్యాసమున కనువాదము.

## మెంతులు, మెంతికూర

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్.ఐ.యమ్.

మెంతిమొక్క ఏకవార్షికములగు వృక్షజాతులలో చేరినది. హిందూదేశమునందన్ని ప్రాంతములందును ముఖ్యముగ కాశ్మీరదేశము, పంజాబురాష్ట్రము, బొంబాయిరాజధాని, మదరాసురాజధాని, గంగామైదానములందు విశేషముగ సాగుచేయబడుచున్నది. ఆహార పదార్థములందును, ఔషధయోగములందును మెంతిమొక్కయొక్క గింజలు, బొండెము (గింజలుండు కాయడిప్ప), ఆకులు ఉపయోగింపబడుచున్నవి. బొండెము మూడునాలుగు అంగుళముల నిడివిగానుండును. అది చివరునసన్నముగ కోసుతేలియుండును. ఒక్కొక్క బొండెమున మాణిక్యపట్టె ఆకారమునమండు గింజలు పదిమొదలు ఇరువదివఱకు నుండును. మెంతిగింజ రెండుఅంగుళములు నిడివిగానుండును. గింజలు పసుపుపచ్చగాగాని, గోధుమవర్ణముతో మిశ్రితమైన పసిమిగాగాని నుండును. గింజలు రుచికి చేదుగాను, జిడ్డుగాను, సువాసనగాను ఉండును.

మెంతిమొక్కలలో లేతవియు, సువాసనగల ఆకులును కూరకొఱకు విశేషముగ వాడబడుచున్నవి. మెంతిగింజలు (మెంతులు అందురు) కూరపొడులయందు సంబార వస్తువులుగ జేర్చబడుచున్నవి. మెంతికూర కొంచముచేదుగ నుండి దాని ఉపయోగము క్రొత్తయగువారికి సరిపడకయుండును. పైత్యప్రకృతిగల వారలకు దీనికూర మలబద్ధమును పోద్రోలును.

### మెంతులు

శూల, కడుపుఉబ్బరము, అతిసారము, గ్రహణి, అజీర్ణము, ఆకలిలేమి, బాలింత రాండ్రకువచ్చు గ్రహణి, చిరకాలముగనుండే దగ్గు, పాండురోగము, కడుపులో బల్లకట్టిన వ్యాధి, గుల్మము మొదలగు రోగములందు మెంతులు విరివిగ వాడబడుచున్నవి. మెంతులు నేతితో వేయించి సోపుతోడను ఉప్పుతోడను కలిపిముద్దగాచేసి వాడుచో గ్రహణికట్టును. మెంతులనువేచి పొడిచేసి కషాయముకాచి తాగిన అతిసారరోగులకు మంచిది. వేచిపొడి చేయబడిన మెంతులకు సమభాగమువేచిన గోధుమపొడిచేర్చి కషాయముకాచి కాఫీకి బదులుగ వాడిన చక్కని పానీయమగును. మెంతులు అంబలిగాగాని జావగాగాని కాచి పిల్లల తల్లులకిచ్చిన పాలుపడును. మెంతిమోదకము, చిన్నిమెంతిమోదకము ఇత్యాదిపేళ్లుగల మెంతులతో చేయబడిన మిఠాయిలు అజీర్ణరోగములందు, బాలింతలకువచ్చు గ్రహణులకు, కీళ్లనొప్పులకు వాడబడుచున్నవి. మెంతిమోదకముచేయు విధానము భైషజ్య రత్నావళిలో చెప్పబడియున్నది. కరక, తాడి, ఉసిరిక, అల్లము, పిప్పళ్లు, మిరియాలు, తుంగగడ్డలు, నల్లజీలకర్ర, ధనియాలు, కట్ఫలము, కుష్ఠము, కర్కాటకశృంగి, ఓమం,

సైంధవలవణము, బిడాలలవణము, తాళీసపత్రము, నాగకేసరము, తేజపత్రము, దాల్చిని చెక్క, ఏలకులు, జాజికాయలు, జాపత్రి, లవంగాలు, మంచిగంధము, కర్పూరము ఇవి ఒక్కొక్క భాగము చొప్పునను వీనియన్నిటికి సమభాగములుగ మెంతులును గ్రహించి చూర్ణముచేసి పాతబెల్లపు పాకముతో మోదకములు చేయవలెను. మోతాదు ఒకటి మొదలు రెండుడ్రాములవఱకును. ఉదయమునపూట నేయి, తేనెతో తీసికొనవలెను.

డాక్టరు పి. బ్లూమ్‌గారు కాడ్లివరు అయిలుకుబదులుగా మెంతులువాడవచ్చుననియు; కాడ్లివరుఅయిలు ఉపయోగించుట మంచిదని చెప్పబడిన శోష, స్క్రోఫులా అనబడు గండమాల, కీళ్లకదుపులరోగము,అంటురోగములపిమ్మటవచ్చేనిస్సత్తువ, పాండురోగము, నరముల నిస్సత్తువ మొదలగు వ్యాధులయందు ఆ ఆయిలుకుబదులుగా మెంతులు వాడవచ్చుననియు చెప్పుచున్నారు. కాడ్లివరు ఆయిలును ఇన్సులిన్ (Insulin)తో కలిపియిచ్చు వాతరోగము (Gout)లందు, అతిమూత్రరోగములందు కూడ మెంతులను వాడవచ్చునని డాక్టరుగారు చెప్పుచున్నారు. ఇట్లు వాడుటలో మెంతులు పొడిచేసి రెండుటీస్పూనుల మోతాదు ప్రతి దినము చారుతోగాని, పాలతోగాని, తాండ్రతోగాని కలిపిపుచ్చుకొనవచ్చును. మెంతులు తలకు వాడినచో వెంట్రుకలు రాలిపోవడము పోవును; శిరోజములు గుబురుగా పెరుగును. తలకురాచుకునే కొబ్బరినూనెలో కొంచము మెంతులు వేయించివేయవలెను. ఆ మెంతులు నానిన పిమ్మట కొబ్బరినూనెకు ఒకవిధమగు సువాసనగలుగును. ఈనూనె తలవెంట్రుకలను రాలిపోకుండ జేయుటయేగాక వానిని బాగుగ పెరుగునట్లుచేయును. మెంతులచూర్ణము వాపుగల భాగములకు వాపుతీయు నిమిత్తముకట్టుగా వాడుదురు. ఈచూర్ణము చర్మమునకు సువాసనకల్గించు అంగరాగముగ కూడ వాడబడుచున్నది.

మెంతులపిండిని నీళ్లతో నుడికించికట్టిన గెడ్డలు త్వరగా చీముపట్టి పగులును. ముల్లు విరిగినచోట కట్టిన నదిసులభముగ ఊడివచ్చును. గెడ్డలకు వీటితో కాపడమిచ్చిన వాటిని మృదువుపఱచును. శీఘ్రముగ పగులజేయును. మెంతులు వెన్నలోగలిపితినినను పెరుగులో, కలిపితినినను, మెంతులఅట్టు తినినను, రాత్రిపరుండువేళను మెంతులు నీళ్లతోతినినను, రక్త గ్రహణికట్టును. చిన్ననిమ్మకాయంతో వెన్నలో ఒకవుల్లిపాయ సన్నముగకోసినముక్కలను, మెంతులనుకలిపి రెండుపూటలను 2, 3 దినములుదినిన గ్రహణి, రక్తగ్రహణికట్టును. సీకాయను పొడిచేయునపుడు కొద్దిగబియ్యము, పెసరపప్పు, మెంతులుకలుపుట తమిళులకు వాడుక. ఇటులచేయుటచే కేశములువృద్ధిజెందును. మృదువగును. మెంతులు, ఒకటిరెండుగా కొట్టినమిరియములు వేసి నూనెకాచి అభ్యంగనముచేజ్వరాదిఉపద్రవములుకలుగునని తోచిన వాడెదరు. తెల్లగడ్డనుకూడ చేర్చుట కొందఱి వాడుకయైయున్నది.

### ఆవిరికుడుము

ఒకఆకుకు మినప్పప్పుయందు తేగరివెడు మెంతులుకలిపి రుబ్బి కొద్దిగ ఉప్పు, జీలకర్రకలిపి, ఆసిండితో ఆవిరికుడుములను (ఇడ్డెలనుతయారుచేయుటవలె) తయారుచేసి నెత్తురు బంక పడుచున్నవారికి వేడిన నెయ్యితో ఇవ్వవలయును. త్వరలో మంచిగుణమిచ్చును.

### మెంతిమజ్జిగ

కాలణాయెత్తుమెంతులు, (ఒకకొమ్ము) పసుపునూక వేయించి పొడిచేసి నాలుగుఆళా పలుపుల్లమజ్జిగలో కలిపి కరివేపాకు, ఆవాలు, జీలకర్ర—వీటితో తిరుగబోత వేసి కొద్దిగ లవణమును కల్పునది లేదా పుల్లమజ్జిగయందు ఉప్పు, పసుపుకలిపి మెంతులు, ఆవాలు, జీలకర్ర, కరివేపాకు వీటితో తిరుగబోతవేయునది.

ఇట్లుతయారుచేయబడిన మజ్జిగ జ్వరము నిలిచినవారికి మజ్జిగవాడిన జ్వరముతిరుగ వచ్చునేమోయను సందేహమున్న వాడుదురు.

మెంతులుఅచ్చముగగాని వెన్న మొదలగు వాటితోగాని పుచ్చుకొనెడు మోతాదు బేడెత్తుమొదలు ½ తులమెత్తువరకు.

మెంతులను అమితముగ తినిన పైత్యవికారమును తలనొప్పిని బుట్టించును. విరుగుళ్లు పులుసు, శికంజబీను, పుల్లదానిమ్మ. పెరుగుతో నానవేసితీసికొను మెంతులను నమల కుండ మింగవలెను.

### మెంతికూర

మెంతిఆకులు నూరినముద్ద వాపులు తీయుటకు కట్టుదురు. కాలిన గాయములకు కట్టిన అవిశమనము పొందును. ఈకూరాకులు వెన్నలోవేచి పైత్యవికారము కలిగినపుడు లోనికిత్తురు.

ఆకునునూరి వెంట్రుకలకు కట్టిన వాటికి మృదుత్వము దెచ్చును. వెంట్రుకలురాలి పోవడమును మానును. ఆకులను ఆముదముతో వెచ్చజేసి గెడ్డలకుకట్టిన వాటిని పక్వపరచి పగులజేయును. దీనికూర పథ్యమైనది.

### పులుసుకూర

కందిపప్పు బాగుగా ఉడికించి తరిగికడిగిన మెంతికూర, చింతపండు చిక్కనిపులుసు, ఉప్పు, కారపొడి, సన్నగాతరిగిన రెండుమిరపకాయలువేసి ఉడికించి చక్కగకలియబెట్టి తిరుగ బోతవేయునది.

### కూర

తిరుగబోతవేసి అందు తరిగికడిగిన కూర, ఉప్పు, పసుపువేసి వాడ్చునది—పిదప తురిమినకొబ్బరికాయ, ఉడకబెట్టిన పప్పుకలుపునది. లేదా ఉప్పు, పసుపు, నీళ్లు—వీటితో

తరగబడినకూరను ఉడకబెట్టి బుట్టయందువేసి పిండునది—బాణలియందు తిరుగబోతవేసి, తురిమినకొబ్బెర, (ఉడకబెట్టిన) పప్పు, కొద్దిగచక్కెరవేసి పిండినకూరవేసి కలుపునది.

మెంతికూర విస్తారముగ దొరుకుదినములలో దానిని సేకరించి కడిగి తడిగి ఎండించి వరుగుగాచేసి నిలువచేసి అదివిరివిగ దొరకని దినములలో వాడుదురు. పచ్చిమెంతికూరతో చేయనగు అన్ని పాకవిశేషములును మెంతికూరవరుగుతో చేయవచ్చును.

కూరనిత్యమును బుచ్చుకొనుచుండినను, అమితముగ బుచ్చుకొనినను తలనొప్పి దెచ్చును. వికారమును పుట్టించును. విరుగుళ్లు పులుసువస్తువులు, శికింజబీను. కాక తత్వము కలవారికి కాసిని ఆకు.

☞ మెంతులు, మెంతికూరతో చేయబడు పాక విశేషములు ఇంకను తెలిసినవారు దయచేసి మాకు తెలిపినచో వానిని వారివారి నామములతో పత్రికయందు ప్రచురింపగలము.

—సంపాదకుడు.

# గీతాంజలి

మల్యాల వేంకటశేషగిరిరావుగారు

పట్టుపీతాంబరము మొలఁజుట్టిబిగిచి,
కంఠమాలలు చిఱుబొజ్జ కడకుజాఱ,
గజ్జెలందెలు కాలను ఘల్లుమనఁగ,
స్వర్గమునుమించు నందనవనములోన
మలయమారుతమున ముంగురులెగురంగ
నధరమునఁ జిఱునవ్వు నాట్యంబుసలుప,
మురళినూఁదంగఁ గరములఁబూని యలరు
నీలవర్ణుండ! గోపాల బాలకృష్ణ!
ఆలమందలనడుమ గీతాలఁబాడి,
పసులునటఁదరులును దాండవంబుసలుప
హాయినింపు నీసోయగ మనవరతము
దలఁచిచిత్రింతు నామనఃఫలకమందు.

# ఆశీర్వాదము

బొడ్డు బాపిరాజుగారు

వాఙ్మయాభ్యున్నతివ్యాపారముననొప్పి
లలితకళావనోల్లాసి వగుచు
మానినీలోకసమ్మాననక్రియ మీఱి
కవివరాశీర్వాద కలనమించి
ప్రమదమేపారసంపల్లాభముల హెచ్చి
పత్రికావళి నగ్రపదమునొంది
భువనకల్యాణ సంపూతవృత్తి జెలంగి
దిగ్దేశముల యశోదీప్తినెనసి
దినదినోన్మేషణాకృతిఁ దేజరిల్లి
ఆంధ్రజనగృహలక్ష్మివై యలరనేర్చి
మేటిగృహలక్ష్మినామము మేలుగూర్ప
ప్రబలుమోపత్రికా! వేయివత్సరములు.

# సుభాషితము*

సోదరీమణులారా!

విద్యావతులగు మీ సమక్షమున మిక్కిలి అల్పజ్ఞురాలనగు నేను ఏమి చెప్పవలయునో బోధపడకున్నది. క్రిందటివత్సరము మీమండలి యధ్యక్షురాలగు శ్రీమతి ఏకా వేంకటరత్నమ్మగారు నన్నీవార్షికోత్సవమున కధ్యక్షతవహింపవలయునని ఆహ్వానింపగా అపరిచితమగు నీపదవి కొప్పుకొన సాహసించజాలక నావల్లగాదని క్షమింపవేడి మిన్నకుంటిని. అప్పటికి వారు నాయందు దయబూని వదలిపెట్టిరి. కాని మనఃపూర్వకమైన ప్రేమ యున్నప్పుడు దానిని ప్రకటీకృతమొనర్పకుండనుండుట ఎవరికిని సాధ్యముగాదు. కావుననే నిరుడు కాదని నందులకైన నేమియునుకొనక శ్రీ రత్నమ్మగారు ఈ సంవత్సరము మరల రావలయునని నన్నే కోరిరి. నా అసామర్థ్యము నన్నెంతగా వెనుకకీడ్చుచున్నను వయోవృద్ధులగు శ్రీ వేంకటరత్నమ్మగారు నన్ను నిరుపమాన పుత్రికావాత్సల్యముతో మాటిమాటికి వాంఛించుచున్న యభీష్టము నీడేర్పకుండనుండుట యవిధేయవర్తనమగునని ఒప్పుకొంటిని. ఐనను నా యనుచితసాహసమునకు నాకిప్పటికిని భయముగానేయున్నది. ఏలననగా గత ఇరువదినాలుగు వత్సరములనుండియు నీమండలి వార్షికోత్సవములు మీకు పెక్కుమంది విద్యావతుల పరిచయ లాభమును కలిగించియుండును. విషయగర్భితములైన వారి ప్రసంగములు మిమ్ముల ఆనందరసప్లావితహృదయలనుగా జేసియుండును. అల్పజ్ఞనగు నేను మీకట్టి మోదమొదవింపజాలనేమోననియే నా భీతి. కావున నా నేర్చుకొలంది నేను విన్నవించువిషయముల నోపికతో నాలించి ఈ సభ జయప్రదముగా నెఱవేఱునట్లు మీ రెల్లరు తోడ్పడవలయునని నా ప్రార్థన.

నేటి స్త్రీసనాతనధర్మమండలి వార్షికోత్సవసభ ఇరువదైదవది. బహుశా ఇంత ప్రాయముగల స్త్రీ సమాజము మన ఆంధ్రదేశమున వేరొండులేదనియే చెప్పవచ్చును. అయితే ఒక మనుజునియొక్క జీవితమును గాని సంస్థయొక్క జీవితమును గాని పరిశీలింపదలచినపుడు వయస్సునుబట్టిగాక ఆ మనుజుడుగాని సంస్థగాని చేసిన ఘనకార్యచయంబులచేతనే గణింపదగును. అవ్విధంబుగా విలోకించినచో ఈ మండలియం దెంచదగిన యభివృద్ధి కానరాదు. ఇందుల కీసమాజస్థాపకుల లోటేమియు లేదు. స్త్రీసమాజములే ఆక్షేపణీయములనెడి ప్రతికూలవాయువులు దట్టముగా వీచెడి ఇరువదైదేండ్లక్రిందట నిట్టి సమాజమును స్థాపించుటయే ఘనతర కృత్యముగదా! ఇరువదైదేండ్ల క్రిందట నొక ఫలవృక్షమును మనపెరటియందు నాటియున్నచో నెంతమానుగట్టియుండును! ఎంత శాఖోపశాఖలుగా విస్తరించియుండును! ఎంత పత్రపుష్పఫలవిరాజితమై యలరారియుండును! అహో! దానికొమ్మలెన్ని పక్షిగూళ్లకాధారమైయుండును! దానిఫలంబులెన్ని ప్రాణుల కాహారమైయుండును! దానినీడలెన్ని నరపక్షిమృగవితానముల కాశ్రయమైయుండును! స్థావరమైన ఒక వృక్షము తనజీవితము నింతసార్థకము చేసికొనగలిగియుండగా నిరువదైదేండ్లప్రాయముగల యీ స్త్రీసమాజము పెక్కుమంది విద్యావతుల కాకరమైన యీమహానగరమున ఎంత విపులశాఖోపశాఖలుగలిగి యెంత స్త్రీజనోపకారకమైయుండవలసియుండెనో వేఱుగ జెప్పవలయునా! అయితే మన తెలుగుసీమయందలి స్త్రీ సమాజములట్టి యుచ్ఛస్థితికి నోచుకొనలేదు. ఇందులకు ముఖ్యమైనకారణము స్త్రీసమాజములయొక్క ప్రయోజనమును మనస్త్రీలింకను గుర్తింపజాలకుండుటయేయనుటకు సందియము లేదు.

---

* అక్టోబరు 14, 15 తేదిలయందు జరిగిన గుంటూరు స్త్రీసనాతనధర్మమండలివారి 25-వ వార్షికోత్సవమునకు అధ్యక్షతవహించిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి ఉపన్యాసము.

మనదేశమున స్త్రీలకు ఘోషాలేదు. ఎక్కడకును పోరాదు, రారాదను నియమములుగూడ లేవు. దేవోత్సవములు, ఊరేగింపులు, పేరంటములు, ప్రదర్శనములు, కాలక్షేపములు మున్నగు పెక్కింటికి స్త్రీలకు ప్రత్యేకింపబడిన వైనను కాకున్ననుగూడ స్త్రీలు విరివిగానే వెళ్లుచుందురు. ఇన్నివిధముల యవకాశముండియు ఘోషాగల యుత్తరదేశములందుకంటె మనదేశమున స్త్రీసమాజములు మిక్కిలి హీనస్థితిలోనుండుటకు మనమెంతయు చింతింపవలసియున్నది.

కాలము మాఱుచున్నది. అభిరుచులు మాఱుచున్నవి. అధికారములు మాఱుచున్నవి. సాధారణముగా స్త్రీలకు విద్యవలదని వాదించు పూర్వాచారపరాయణులు సైతము స్త్రీలకు విద్యవలదనువాదము నుజ్జగించుచున్నారు. ఇంకను స్త్రీవిద్యకూడదను వారు కోటికొకరున్నను వారిమొఱ అరణ్యరోదనమగుచున్నది. ఇట్టియెడ స్త్రీలింకను సమాజములయెడ సుముఖులు కాకుండుట మన స్త్రీజాత్యభివృద్ధికి భంగకరము.

స్త్రీసమాజములవలన పలువిధప్రయోజనములున్నవి. ఐకమత్యము ప్రబలుటకును, పరస్పరసహాకారము వర్ధిల్లుటకును; ఒకరివైదుష్యము నొకరు, ఒకరి కళాప్రావీణ్యత నొకరు బడసి విజ్ఞానవతులగుటకును స్త్రీసమాజము లెంతేని తోడ్పడగలవు. ఇట్టి సమాజములు మనదేశమునవెంత విరివిగా వ్యాపించిన మననారీసంఘమంత శీఘ్రముగా ఔన్నత్యస్థితికివచ్చును. అయితే "స్త్రీవిద్య, స్త్రీవిద్య" యనుపదమెంత యధికముగా వినబడుచున్నను మన స్త్రీలలో నిజమైన విద్యావ్యాప్తి యల్పముగానే యున్నదని చెప్పకతప్పదు. మనదేశమున స్త్రీవిద్యాభివృద్ధికై దొరతనమువారు వెచ్చించుచున్న ధనము తలకు నెనిమిదిపైసలే. ఎనిమిదిదమ్మిడీలకు సవాశేరు వంకాయలు రావుగదా, ఆడుదానికి విద్యయేమివచ్చును? ఈయెనిమిదిపైసలు వెచ్చించి బాలికలకు వారు చెప్పించెడి చదువు అక్షరపరిచయము మాత్రమేకాని యంతకంటె వివేకమును గల్గించునదికాదు. నిజమైన విజ్ఞానము స్త్రీలకు సమాజములవలననే కలుగవలయును. స్త్రీసమాజములనగా ఎవరోనలుగురు స్త్రీలుచేరి యే భారతభాగవతరామాయణాదిపురాణములనో చదివి యర్థము చెప్పుకొనుటగా మనవారి భావముగానున్నది. సాధారణముగా పెక్కు స్త్రీసమాజములు చేయుచున్న పనిగూడ నదియే. పెద్దవారు పురాణముల నాలించుటతోడను పిన్నవారు నవలలను చదువుటవలనను నెప్పటికిని విద్యావతులు కాజాలరు. మంచి ఆశయములు కలిగినవైనచో పురాణములుగాని నవలలుగాని విద్యాభివృద్ధికి ఉచితమగు సాధనములు కావచ్చునుగాని అవియే విద్యాసర్వస్వము కావు. విద్య పెక్కుముఖములుగానున్నది. పంచభూతనిర్మితంబగు నీశరీరముతో మనము జీవయాత్రచేయుచున్నాము. మనజీవయాత్రకు పర్వతములు, అరణ్యములు, నదులు, సాగరములు, ఖగమృగాదులు, సూర్యచంద్రాదిగ్రహములు మున్నగున వెన్నియో తోడ్పడుచున్నవి. అయితే వీనినిగూర్చిన సామాన్యజ్ఞానమేగాని, అనగా ఈనీరు మనకు స్నానపానములకుపయోగించును, ఈ సూర్యుడు వెలుగునిచ్చును, చెట్లు రుచ్యమైనపండ్లనిచ్చును, ఈపశువులపాలు పానయోగ్యము అను స్వప్రయోజనజ్ఞానమేగాని—ఇవియేమి? ఇవిఏయే భిన్నపదార్థములతో నిర్మితంబైనవి? ఇవి ఒకేవస్తువా? భిన్నమా? వీనికి మనకుగల పరస్పరసంబంధమేమి? యని యోచింపవలసినచో వీనినిగూర్చి మనమేమియు నెఱుగము. తుట్టతుదకు మనశరీరమునుగూర్చిగాని మనచెట్టుచేమలనుగూర్చిగాని మనకేమియు తెలియదు. చరాచరాత్మకంబైన యీ విశాలవిశ్వమునందలి ప్రతిపదార్థమునుగూర్చియు గొప్పగొప్ప పరిశీలనలతోగూడిన శాస్త్రగ్రంథములు వ్రాయబడియున్నవి. అవి మన తెలుగునగూడ కొన్ని పరివర్తింపబడియున్నవిగాని వానిగొడవ మన స్త్రీ లెఱుగరు. ఇవిగాక దేశచరిత్రలున్నవి. మనముపుట్టిన హిందూదేశమెట్టిది? దీని చరిత్రయేమి? ఇదియెప్పు

డెప్పు డేయేరాజులపాలనమునందెట్టెట్టి యుచ్ఛనీచము లనుభవించెను? ఇందు జన్మించిన మహాపురుషులెవరు? ఇట్టిదిని చరిత్రజ్ఞానము. దీనినిగూర్చికూడ మనస్త్రీలకుగలజ్ఞానము అత్యల్పమే. ఇక భాషావిషయమైగూడ మనము శ్లేష్మవలపినదనంతిముగాగలదు. అనుశ్రూతముగావచ్చుచున్న యాచారములను పట్టుకొని ప్రాకులాడు టయే గాని నిజమైన మతవిషయకజ్ఞానముగూడ మనకులేదు. "ఈ దేశమునయెన్ని మతములు పుట్టినవి? ఎన్ని గిట్టినవి? ఎన్ని యిప్పుడు ప్రచారమునందున్నవి? ఆయామతకర్త లెవరు? వారి ఆశయములెట్టివి? వారెట్లు తమ మతముల దేశమున వ్యాప్తమొనర్చిరి? ముఖ్యముగా హిందూమతముయొక్క ఆదర్శమేమి? దీని యుత్కృష్టత యెచ్చటగలదు?" అని యెవరైన మనలనుప్రశ్నించినచో మనము గ్రుడ్లొప్పజెప్పి మిన్నకుండ వలసినదే. ఇవిగాక మనస్త్రీలకు సంబంధించిన వారసత్వాధికారములు మున్నగు ఆర్థికవిషయకజ్ఞానముగూడ మనకు సున్న. మఱియు స్త్రీలు ప్రత్యేక కౌశలము చూపగలగృహపరిశ్రమలు, లలితకళలు మున్నగువానిజ్ఞానము గూడ మనకడ నశించిపోయినది. వీనినన్నిటినిమించినది భగవంతునిగూర్చిన పరతత్త్వజ్ఞానము. ఇన్ని విషయము లందు సమధికజ్ఞానము కలిగియుంటయే నిజమైనవిద్య. అయితే పాఠశాలలలో మనబాలికలకు నేర్పెడి ప్రాథ మికవిద్య యిట్టి యున్నతవిషయములనుగూర్చి యెట్టి పరిజ్ఞానమును గల్గించునదిగాదు. బాలికలు చదువు కొనెడి యత్యల్పకాలములో వారు వర్ణపరిచయమును, సంఖ్యాపరిచయమును మాత్రమే పొందుచున్నారు. బాలికలు చిఱుతప్రాయముననే వివాహితలై గృహములందు నిర్బంధింపబడియుండుటచేతను, వారికిజ్ఞానోప దేశముచేయవలసిన తల్లులుగూడ పైనివివరించిన విజ్ఞానవిషయములనుగూర్చి యేమియు నెఱుగనివారై యుండుటవలనను మన స్త్రీ లీవిజ్ఞానమునకు శాశ్వతముగా దూరమై యజ్ఞానాంధకారమున గొట్టుకాడు చున్నారు. శక్తి, బుద్ధి, సంపదయనెడి పార్వతి, వాణి, లక్ష్మియను దేవీత్రయము నుపాస్యదేవతలను గలిగి యుండియు మన స్త్రీలిట్టి యవిద్యాతమసంబున నిమగ్నచిత్తలైయుండుట మనయభాగ్యము. ఈ విద్యా దారిద్ర్యము మన స్త్రీలకిప్పుడు ప్రాప్తించినదిగాని పూర్వములేదు. ప్రాచీనకాలమున లీలావతియను విదుషీ మణి విరచించిన గణితశాస్త్రమిప్పటికిని మహామేధావులకు సైతమగమ్యముగానున్నది. ఖనా జ్యోతిశ్శాస్త్ర పాండిత్యమబ్బురమై విక్రమార్కుని యాస్థానవిద్వన్మండలి యందామెను దశమరత్నముగా జేర్చుకొనజాలెను. జనకసభయందు గార్గి యాజ్ఞవల్క్యునితో బ్రహ్మవాదమునల్పెను. ఆదిశంకరునకును తన భర్తయైన మండన మిశ్రునకును గల్గిన శాస్త్రవాదమునందు సరసవాణి పరీక్షకురాలాయెను. విజ్జలదేవి మనోహర మంజుల కవితావివేషమునందు కాళిదాసును మించి నుతిగాంచెను. లక్ష్మీదేవి న్యాయశాస్త్రమును విరచించి స్త్రీలకు పెక్కుహక్కులను కల్పించెను. పరమభక్తురాలగు మీరాబాయి యనేకభక్తిగీతముల రచియించెను. నేటికిని ఉత్తరదేశమున ఆమెగేయములకుగలఖ్యాతి యనుపమానము. వేదమును చదువరాదని స్త్రీలకు శాసనము కాని మొదటివేదమగు ఋగ్వేదమునందే స్త్రీలు వ్రాసిన ఋక్కులున్నవి. ఈవిధముగా మనస్త్రీలవైదుష్యము పెక్కురీతుల విస్తరించియున్నది. నేడుగూడ మనదేశమున మరల నట్టివిదుషీరత్నము లుద్భవింపవలెనన్నచో - రూర స్త్రీసమాజములుద్భవిల్లి యవియెల్ల విద్యాపీఠములై తనరారవలయును. ఏనాడు మనదేశమునందు ప్రతి చిన్నగ్రామమునందును స్త్రీసమాజములు వెలసి స్త్రీలకు వివిధవిషయకజ్ఞానమును గల్గించుటకు తోడ్పడునో. ఆనాడు మనదేశము మరల తొల్లిటిసౌభాగ్యమును బడయగల్గును.

ఈమండలివారీసంవత్సరము తమ సమాజపక్షమున మరల బాలికాపాఠశాలను స్థాపించునట్లు లాహ్వాన పత్రికలలో సూచించిరి. స్త్రీవిద్యావ్యాప్తియందు వీరికి గల యభిలాష ప్రశంసనీయమే. కాని స్త్రీసమాజ ములకు బాలికాపాఠశాలల ననుబంధముగా నేర్పరచుటవలన ప్రయోజనము లేదని నాయభిప్రాయము. ఏలనన,

ఈ నగరమునందు బాలికలనిమిత్తమై పురపాలకసంఘమువారిచేతను, క్రైస్తవమిషనరీలచేతను స్థాపింపబడిన పాఠశాలలు పెక్కులున్నవి. ఇవిగాక జాతీయపద్ధతులపై నిర్వహింపబడుచున్న శారదానికేతనము, వైశ్యయువతీవిద్యాలయము మున్నగు నుత్తమపాఠశాలలును గలవు. బాలికలకొఱ కిన్నిపాఠశాలలుండగా మరల వారికే యొకబడిని పెట్టుటవలన ప్రయోజనమేమి? ఇంతగొప్పపట్టణముండియు వివాహితలైన ప్రాయపుస్త్రీలు అనగా గృహిణీమణులు విద్యాబోధనందుట కొక్క పాఠశాలయైన నీనగరమున లేకుండుట యీ పట్టణమున కెంతయు కొఱతగానున్నది. కాన స్త్రీవయోపాధి కుపకరింపగల వృత్తివిద్యలు, గృహపరిశ్రమలు మున్నగునవి నేర్పగలదియు, మతసాంఘికరాజకీయార్థికచారిత్రకసారస్వతకళాద్యనేకవిషయకపరిజ్ఞానము గల్గింపగలదియునగు నొకస్త్రీలపాఠశాల నేర్పఱచిన మిక్కిలి యుపయుక్తముగ నుండును. పట్టణములలో స్త్రీలు సాధారణముగా మధ్యాహ్నకాలమంతయు తీరుబడిగానేయుందురు. పల్లెటూరి స్త్రీలకువలె పొలముపనులు, తదితరములగు వడ్లదంపులు మున్నగు క్లేశతరకృత్యములు పట్టణవాసస్త్రీలకు లేవు. కాన నిట్టియవకాశము విద్యాభివృద్ధికై వినియోగ్యమగుచో దేశమునకెంతేని నుపకృతి కాగలదు. దేశమున కిప్పుడు కావలసినది విద్యావతులగు తల్లులు. తల్లు లెప్పుడు విదుషీమణులగుదురో వారిబిడ్డలప్పుడే విధిగా విద్యావంతులగుదురు. కావున స్త్రీల విద్యాభివృద్ధికై స్త్రీసమాజములు ముఖ్యముగా కృషి సేయవలసియున్నది.

ప్రతిస్త్రీసమాజమునకును ననుబంధముగా గ్రంథాలయ మొకటి యుండుటవసరము. సమస్తవిషయకగ్రంథములు గల గ్రంథాలయము స్త్రీలపెరటి కల్పకము. ప్రత్యక్షముగా వినుట కవకాశములేక నెమ్మదిగా నింటగూర్చుండి చదువనిచ్ఛగించువారికి సద్గ్రంథములకంటె మిన్నయైనగురుడు వేఱొకడులేడు. కాన సకలవిధశ్రేయోదాయినియైన విద్యనొసగు గ్రంథభాండారము స్త్రీలెల్లర కందుబాటగునట్లు స్త్రీసమాజములయందుండుటవసరమగును. దీని ననుసరించి పఠనమందిరముగూడ నుండుట అగత్యము. పఠనమందిరము నందవశ్యముగా బఠింపదగినవి వార్తాపత్రికలు. అపారమైన ప్రపంచజ్ఞానము నొనగూర్చుటకు వార్తాపత్రికలకంటె మేలైన సాధనములు వేఱెవ్వియులేవు. ప్రపంచములో నెచ్చటనైనను సర్వవిషయములందును ననుక్షణము గలుగుచున్న మార్పులు, పొందుచున్న యభివృద్ధి, దేశముల స్థితిగతులు, జాతులరీతులు, శాస్త్రముల పరిణామములు, స్వాతంత్ర్యపారతంత్ర్యదేశముల తారతమ్యములు, వేయేల సర్వవిషయములును ననుదినవార్తాపత్రికాపఠనముచే బోధపడును. మనదేశమునందిప్పుడు రాజకీయసాంఘికవిద్యాకళాద్యనేకవిషయములనుగూర్చి జరుగుచున్న యత్నములను మన స్త్రీలెల్లరు ముఖ్యముగా తెలిసికొనవలసియున్నది. మఱియు వోటునిచ్చుట మున్నగు రాజకీయాధికారములు కొన్ని మన స్త్రీల కొసంగబడుచున్నవి. వారసత్వాధికారములు కొన్ని యొసంగబడుచున్నవి. వైవాహికవిషయములు కొన్ని సంస్కరింపబడుచున్నవి. కాన నాయావిషయములను గూర్చిన మంచిచెడ్డలను తెలిసికొనవలయుచో ప్రతిస్త్రీయు నిత్యము వార్తాపత్రికలను జదువుటయో లేక ఒకరు చదువగా వినుటయో అగత్యము. ప్రభుత్వమువారి ఔదార్యమువలననో, మహనీయులగువారి కృషివలననో, విద్యావతులగు నారీరత్నముల యత్నములవలననో మన మెఱుగకయే మనకొనగూర్పబడుచున్న అధికారమును వినియోగించు సామర్థ్యమును స్త్రీలు కలిగియుండుట అవసరముగదా? కాన ప్రతిస్త్రీసమాజమునకనుబంధముగా గ్రంథాలయపఠనమందిరములుండుట అవసరమైయున్నది. ఇంతియేగాదు. స్త్రీసమాజమునకింకను శాఖలుగా చేర్పదగినవి పెక్కులుంగలవు. సేవాశాఖ నేర్పఱచి పేదలకును; రోగార్తులకును నన్నవస్త్రౌషధోపచారములు సేయవచ్చును. బాలింతల రక్షింపవచ్చును. శిశువులపోషింపవచ్చును. మతశాఖ నేర్పఱచి స్త్రీలకు మతసంబంధమైన జ్ఞానమొదవింపవచ్చును. సంస్కరణశాఖ నేర్పఱచి స్త్రీల యభివృద్ధికై చేయబడుచున్న ఉదారసంస్కరణలను విశాలహృదయముతో యోజించి తగువిధమున ప్రోత్సహింపవచ్చును.

ముఖ్యముగా స్త్రీలు బాలవితంతువు లీశాఖవారిచే రక్షింపదగినవారు. సనాతనాచారములన్నియు మనకై పూర్వులేర్పఱచియుంచిన అచ్చుదిమ్మలనియు, మన భావములన్నియు నాయచ్చులలోనికే యిమిడిపోవలయు ననియు భావించుట తగదు. వేదములుగాని, స్మృతులుగాని, పురాణములుగాని యొకేవిధముగా లేవు. వాని యందనేకభిన్న భావములు పొడకట్టుచున్నవి. మహర్షులకైనను తలయొక తలంపుకలుగుటచేతనే యొక్కొక్క రొక్కొక్కస్మృతిని వ్రాసిపెట్టియున్నారు.

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే
పతౌ పంచస్వాపత్సునారీణాం పతిరన్యోవిధీయతే."

అనగా పతి మృతిజెందుట, దేశాంతరగతుడగుట మున్నగు నైదువిధములగు కారణములచే పతికొఱగాని వాడైనప్పుడు ఆమెకు పునర్వివాహముచేయనగునని పరాశరుడు చెప్పియున్నాడు.

"పాణిగ్రాహో మృతేబాలా కేవలంమంత్రసంస్కృతా
సాచేదక్షతయోనిస్యాత్ పునస్సంస్కారమర్హతి."

అనగా కేవలమంత్రసంస్కారపూర్వకవివాహము మాత్రమేయై నిషేకముగాని బాలకు పునస్సంస్కారము చేయదగునని వసిష్ఠుండు తనస్మృతియందు వ్రాసియున్నాడు. స్త్రీలకివేవియుకూడవను మహర్షులుకూడ కొందఱు లేకపోలేదు. అయితే మహర్షులందఱు పూజనీయులే. ఇందులో నెవరి నవునందుము? ఎవరిని కాదందుము? ఇటులనే స్త్రీల వివాహవయస్సువిషయమైగూడ మహర్షులు భిన్నాభిప్రాయులుగానేయున్నారు. గతవత్సరము మనదేశమునందు శారదాచట్టము చేయబడిన సందర్భమున వివాహవిషయమై జరిగినవాదోపవాదములు, అప్పుడు చేయబడిన అనుచితపు వివాహములు, అందువలన మనస్త్రీసంఘమునకు జరిగిన ఘోరతరాన్యాయములు మీరును నెఱిగియేయున్నారు. కావుననే ఇట్టిసంస్కరణముల పట్టున నుదారచిత్తముతో యోజించి దేశకాలములను గుర్తించి స్త్రీజనాభివృద్ధికరములగు సంస్కరణముల నామోదించి తన్నిమిత్తమై సంస్కరణశాఖవారు కృషిచేయవచ్చును. రాజకీయశాఖ నేర్పఱచి స్త్రీలకు రాజకీయవిషయములను గూర్చియు, నియోజితనియోజకస్వాతంత్ర్యమును గూర్చియు బోధింపనగును. సారస్వతశాఖ నేర్పఱచి స్త్రీలకు కవితారచన, వ్యాసరచన, కథారచనమున్నగు సారస్వతవిషయములందభిరుచి గల్గింపవచ్చును. కళాశాఖ నేర్పఱచి దానివలన కుట్టుపనులు, అల్లికపనులు, చిత్రరచనలు, మున్నగు కళావైదగ్ధ్యమును దెల్పెడి హస్తకళ నుద్ధరింపవచ్చును. రాట్నముమున్నగు గృహపరిశ్రమల నుద్ధరింపవచ్చును. స్వదేశీశాఖ నేర్పఱచి దానివలన స్త్రీలలో స్వదేశీవస్తువుల యందభిమానమును పెంపొందింపవచ్చును. దేశీయపరిశ్రమలను పోషించుటవలని ప్రయోజనమును నచ్చచెప్పవచ్చును. పరదేశవస్తువులను వాడుటయందలి యనర్థము నెఱుకపఱుపవచ్చును. నాగరికత యను పేరున మనస్త్రీలయందు పొడకొనుచున్న విలాసవస్తువ్యామోహమును తొలగింపజేయవచ్చును. ఈకృత్రిమనాగరికతాభ్రాంతిచే మన స్త్రీసంఘమునకు గలుగుచున్న కీడులు వివరింప సాధ్యముగానివిగానున్నవి. ఒక్క మన మద్రాసురాజధానినుండి ప్రతిసాలున దాదాపు రెండుకోట్లరూప్యములు విలాసవస్తువులకై పరదేశముల పాలగుచున్నవి. జీవితమున కేమాత్ర మవసరములేని సబ్బులు, సూదులు, రిబ్బన్లు, లేసులు, పట్టుగుడ్డలు, ఆటసామానులు, పౌడర్లు, తలనూనెలు, అత్తరువులు మున్నగునవియే మనధనము నపారముగా నష్టపఱచుచున్నవి. ఒక్కసబ్బులు మాత్రమే మనరాజధానినుండి విదేశములకు కొనిపోవుచున్నధనము $3\frac{1}{2}$ లక్షలు. మనద్రవ్యతటాకమున కీవిదేశపు సున్నితంపు వస్తువులన్నియు నన్నిగండ్లు. ఎంతకాలము మన మీగండ్లను పూడ్చజాలమో అంతకాలము మనదేశదారిద్ర్యము తొలగదు. అందును దేశదుస్థితిని కండ్లారచూచుచుండియు

మన స్త్రీలీవిదేశీయనాగరికతా వ్యామోహమును వీడజాలరేని దేశసౌభాగ్యమునకు చాలహానికల్గించిన వారయ్యెదరు. విదేశవస్తువుల నుపయోగించుటచే మనమెప్పుడును నాగరికులము కాము. నిజమైన భారతపుత్రి యిట్టియనాగరకకృత్యమును సేయుట కొడబడజాలదు. పొరుగింటి స్త్రీయొక్క నగలనుదెచ్చి కొంచెముసేపు ధరించిన స్త్రీ యెట్లు భాగ్యవంతురాలుగాదో పరదేశపువస్తువుల నలకరించుకొన్న స్త్రీయునట్లు నాగరికురాలుగాదు. విదేశపునాజూకువస్తువులతో తుల్యమైన వస్తువులను మన దేశమునందు తయారుచేసికొని యెప్పుడు మనము ధరింతుమో అప్పుడు మనము నాగరికులము. మఱియు నాగరికవస్తువులయందు మన స్త్రీలకుండెడి యభిలాష సామాన్యకుటుంబములకు మిక్కిలి హానినిగల్గించునదిగాగూడ నున్నది. కాన ఈకృత్రిమనాగరికతా భ్రాంతి మన స్త్రీలనుండి తొలంగుటకు స్వదేశీశాఖ వారెంతైన కృషిచేయవచ్చును. ఈవిధముగా గ్రామమున కొకపటిష్ఠమగు స్త్రీసమాజముండెనేని పెక్కుశాఖలద్వారా స్త్రీలలో నఖండప్రబోధము సేయవచ్చును. భారతదేశపు జనసంఖ్యయందు సగమునకు మిగిలియున్న స్త్రీజాతి ఇన్నివిధముల యభివృద్ధికాంచిన గాని మన దేశము బాగుపడదు.

ముఖ్యముగా స్త్రీసమాజము లాకర్షణీయములై యుండుటకు వారమున కొకటి రెండు మాఱులు స్త్రీల వలనగాని పురుషులవలనగాని ఏదియే నొక విషయమునుగూర్చి యుపన్యాస మిప్పించుట గత్యమగుపని.

అయితే ఇవి కాగితముపై వ్రాయుటకు సులభముగానున్నను వీనినన్నిటినిగాని లేక కొన్నిటినిగాని యేర్పఱచి యాచరణయందు బెట్టుట సామాన్యమైన కార్యముగాదు. ముఖ్యముగా నిట్టి మహాకార్యములను నిర్వర్తించుటకు ధనము, విద్య, శక్తి యనునవి ముఖ్యమైనవి. ఈమూడుశక్తులు కేంద్రీకృతమైనప్పుడే సామాజికకార్యములు నెరవేరును. కాని యీమూడును నొక్కచో కూడియుండుట యీశ్వరసృష్టియందే లేదు. విద్యయున్న వారికి ధనముండదు. ధనమున్న వారికి విద్యయుండదు. ఈరెండునుగలవారికి శక్తియనగా నారోగ్యముండదు. కావుననే విద్యయున్నవారు తమవిద్యను, ధనమున్నవారు తమధనమును, బలమున్నవారు తమబలమును నొసగి యీమూడుబలములచేతను సంస్థను బలీయ మొనర్పవలెను. ఇట్లు త్రివిధశక్తులను సమ్మేళనమొనర్చుటకు కావలసినది సంఘీభావము. సంఘీభావములేక నేపనియుగాదు. ఒకజలబిందువు సస్యమును రక్షించుటకు సమర్థము గాదు. అవియే వర్షరూపమున నెడతెగకుండ ఆకాశమునుండి పడినపుడు ధరపైగల సకలక్షేత్రములను సస్యశ్యామలములుగాజేయుటకు సమర్థమగుచున్నవి. అటులనే యొకగడ్డిపోచ యేనుగును కట్టివేయుటకు చాలదు. కాని ఆగడ్డిపోచలే అసంఖ్యాకముచేరినపుడు మదపుటేనుగును బంధింపజాలినవగుచున్నవి. కావున నొక్కొక్కరేమియు చేయజాలరు. మఱియు నొకే నగరమునం దొకేసంస్థలు బింబమునకు ప్రతిబింబమువలె పెక్కులుండుట గూడ మంచిదిగాదు. అభిప్రాయభేదములచేత నిట్టివి ఒక్కొక్కప్పు డుద్భవించుట కలుగుచుండును. కాని దేశమున దేశహితైకకాంక్షగల విద్యావతులే యరుదుగానుండగా వారంద అన్నివిధములుగా చీలి యనేకసమాజము లేర్పఱచుటవలన ప్రతిదానికి బలముకొలదియగును. ఎవరును నేపనియు చేయజాలకపోదురు. కాన సాధారణముగా దేశహితైకకాంక్షగల స్త్రీలెల్లరొక్కటిగాజేరి కార్యనిర్వహణమునకు గడంగుట యుక్తమగువిధానము.

ఈ సమస్తకార్యములకును నాధారముగా చేయవలసినది నీతి. సూత్రనిబద్ధమైన పూసలవలె మనము చేయు సర్వకార్యములు నీతిసూత్రనిబద్ధములై యుండవలయును. అందును స్త్రీలెల్లరకాదర్శపాత్రమైన గొప్ప సమాజమునం దేయించుకలోప మగుపించినను లోకులెల్లరు దానిపై విషమదృష్టులను బఱపి పరిహసింతురు. మఱియు కూలద్రోతురు. ముఖ్యముగా ప్రజలశక్తియుక్తులపై నాధారపడవలసిన సంస్థలెంత పవిత్రముగానున్న ప్రజాహృదయమునంతగా చూఱగొనును. మన ఆంధ్రదేశమునందు లేదుగాని మదరాసు, బొంబాయి, కలకత్తా

మున్నగు పట్టణములలో పెక్కుమంది విదుషీమణులు మంచికట్టుదిట్టములతో సమాజముల నేర్పఱచి యద్భుత మైన పనిసేయుచున్నారు. తమసమాజమును శాఖోపశాఖలుగా విస్తరింపజేసి యనేకవిధములుగా స్త్రీజాత్యభి వృద్ధికి తోడ్పడుచున్నారు. అన్నిరాష్ట్రములలో స్త్రీలలో గలుగుచున్న యభివృద్ధిగాంచియే 'గృహలక్ష్మి' దసరా సంచికయందు విద్యాధికసోదరుడు సూరిగుచ్చికృష్ణమూర్తిగారు మనఆంధ్రస్త్రీల నిట్లు హెచ్చరించుచున్నాడు. "స్త్రీలు తమజాతి నుద్ధరించుకొనవలెనన్న ముమ్మందు ధైర్యమవలంబించి తమయస్వాతంత్ర్యమునకును, అజ్ఞాన మునకును గారణమారసి తన్నివారణమునకై యొకసమాజమును స్థాపించి దానికుపశాఖలుగ బ్రతిపల్లెటూరి యందును స్త్రీసమాజములను స్థాపించి దానికి స్త్రీలనే యధ్యక్షురాండ్రుగా నుంచి తద్ద్వారావిద్యాప్రచారము సాగింపవలెను. దీనికి వారు సంపూర్ణమైన పురుషసాహాయ్యమపేక్షింపవలెను. విద్యావిహీనలైన స్త్రీలయొక్క మూర్ఖాచారమును బోగొట్టవలెను. దేశమున కౌన్నత్యము తేవలెను. ఇట్టిది యాంధ్రనారీమణులకు లేదుగాని బంగాళాదేశమున ఇట్టిసమితియొకటి సరోజనళినీనారీమంగళసమితియను పేరిట స్థాపింపబడి నేడెక్కువగా ప్రచలితమగుచున్నది. ఇట్టిది యాంధ్రదేశమునకు నైతము ముఖ్యము. కావున స్త్రీలు ముఖ్యముగా విద్యార్జన చేసి తమజాతికిని తమదేశమునకును గౌరవముదెచ్చి చిరయశస్సునంది ధన్యతను జెందవలయును." స్త్రీజనా భ్యుదయచింతతో నీసోదరుడు గావించిన హితోపదేశము గమనింపదగినది. మన దేశమున నచ్చటచ్చట స్త్రీసమాజములున్నను అవిచేయవలసినంత పనిని చేయకుండుటకు గారణము సమాజములనెల్లను కేంద్రీకరింప జేసి ఒకపద్ధతికిని, ఒకకట్టుబాటునకును, ఒక ధర్మమునకును బద్ధపఱచి సక్రమరీతిని నడిపింపగల ప్రధానసంస్థ లేకపోవుటయే కారణము. కావున ఆంధ్రదేశమున గల స్త్రీ సమాజముల నెల్లకూడదీసి క్రమమగు పద్ధతిని నడిపించుటకు బహుకాలమునుండి పనిచేయుచున్న స్త్రీ సమాజములు పూనుకొనవలయును. సమస్తదేశహితై కోద్యమములందును ముందంజవేసి ఆంధ్రదేశమును యశోవిరాజితము గావించుచున్న మీగుంటూరుపురము నందలి విదుషీరత్నములే యిట్టి ఘనకార్యమును చేయ పూనిననెంతయు సమంజసముగానుండును. మీపుర స్త్రీలకట్టి సత్ప్రేరణను నచిరకాలములో భగవంతు డనుగ్రహించును గాక!

సోదరీమణులారా! దీర్ఘమైన నాయుపన్యాసము ముగిసినది. ఇందేవైన యొప్పులున్న గ్రహించి తప్పులు సైరింపవేడెదను. సర్వశుభప్రదాతయగు పరమేశ్వరుడు మన స్త్రీ సంఘము నుద్ధరించుటకు సమస్తవిధ ముల సహాయభూతుడగును గాక!

## యుక్తిలెక్క

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ఒకనివద్ద ఎనిమిది శేర్లు పాలుండెను. ఆ పాలను చెరి నాల్గుశేర్ల క్రిందను భాగించి, ఇరువురకు పోయవలెను. వానివద్ద అయిదుశేర్ల చెంబొకటియును, మూడు శేర్ల చెంబొకటి యును ఉండెను. ఆ రెండుచెంబులతో ఆపాల నిరువురకు సమభాగములుగా పంచుటెట్లు?

☞ ఈ యుక్తిలెక్కకు జబాబు స్వతంత్రముగా ఆలోచించి పదిసంవత్సరములకు లోబడిన బాలబాలికలు ఆ జబాబును డిసెంబరు 7-వ తేదీలోపున లేఖాముఖమున (అందు వారివయస్సు తెలుపవలెను) మాకు తెలుపవలెను.

—సంపాదకుడు.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

సుంకర వాసుదేవమ్మగారు

ఆటఆడ్దామా?
ఏమిఆట?
గవ్వలాట—
ఏమిగవ్వ?
తేనెగవ్వ—
ఏమితేనె?
పుట్టతేనె—
ఏమిపుట్ట?
పాముపుట్ట—
ఏమిపాము?
నాగుపాము—
ఏమినాగు?

మల్లెనాగు—
ఏమిమల్లె?
బొడ్డుమల్లె—
ఏమిబొడ్డు?
కలువబొడ్డు—
ఏమికలువ?
తెల్లకలువ—
ఏమితెల్ల?
పాలుతెల్ల—
ఏమిపాలు?
బఱ్ఱెపాలు—
ఏమిబఱ్ఱె?

కారుబఱ్ఱె—
ఏమికారు?
పట్టకారు—
ఏమిపట్ట?
తలపట్ట—
ఏమితల?
గొఱ్ఱెతల—
ఏమిగొఱ్ఱె?
కొండగొఱ్ఱె—
ఏమికొండ?
పాపికొండ—

౨. పాటలు

## కొంగ

(సంపాదకులు) షోతాప్రగడ వేంకటాచలపతిరావుగారు

బాలబాలికలు గృహాంగణముల నాడునప్పుడు వియత్పథంబున బోవు కొంగలబారులజూచి తమతమ చేతివ్రేళ్లుజూపి గెంతుచు పాడుపాట.

కొంగకొంగ గోళ్లు
కోరివేడితె బోకు
కోపమామాపై వద్దు
కొనగోళ్లపై బెట్టు

కొమ్మలాకూ నీరెట్టు
కోటంత పువ్వు
చూస్తేను జూపు
నవ్వితే నవ్వు.

# చిన్నపిల్లల పాటలు

(సంపాదకులు) ఆచూరి వేంకటరామారావుగారు

౧

గోవిందుడమ్మా! గోపాలుడమ్మా!
కొబ్బరిబెల్లము కొనిపెట్టెనమ్మా!
జీడిపప్పులుతెచ్చి తినపెట్టెనమ్మా!
చాయపప్పులుతెచ్చి చవిచూపెనమ్మా!
ఏడుమేడలమీద నన్నువుంచెనమ్మా!
ఏడాదికోసారి తావచ్చెనమ్మా!
గజ్జలకామున్ని నేగంటినమ్మా!
ఎత్తుకుముద్దాడ తానెవ్వరమ్మా?

౨

రావాకుచిలకమ్మ ఆడవేపావ
రాజుల్లునీచెయ్యి చూడవచ్చేరు
ప్రధానపుంగరము పసిడివత్తులు
గణగణావాయించి గంటదెప్పించి
గజంబరాయుడు తాతర్లి రాగా
అన్న అందలమెక్క తాగుఱ్ఱమెక్క
గుఱ్ఱంబుమీదికి పల్లంబుదేరె
పల్లమ్ముమీదికి బాలుణ్ణితేరె
బాలుణ్ణిముందరికి బాలికనుదేరె
బాలికశిఖలోకి కురువేరుతేరె
ననుగన్నతల్లికి నానుతేరమ్మ
నాకొక్కముత్యాల బొట్టుదేరమ్మ
బొట్టుకుబొమ్మంచు చీరదేరమ్మ
చీరకు చిలకల్ల రవికెదేరమ్మ
రవికకు రత్నాలపేరుదేరమ్మ
పేరుకుపెట్టెల్ల సొమ్ముదేరమ్మ
సొమ్ముకుశోభిల్ల వళ్లు దేరమ్మా
వంటికి పడుగంటిపసుపుదేరమ్మ
పసువుకు పారేటినీళ్లు దేరమ్మ
నీళ్లకు నిత్యమల్లిచెట్టు దేరమ్మ
చెట్టుకు చేమంతిపువ్వు దేరమ్మ
పువ్వుచ్చుకు మాలక్ష్మిపూజచేయరమ్మ.

౩

చిట్టిబొమ్మలపెండ్లి చేయవలెనన్ని
శ్రీ రెండువాకిళ్లు శ్రీ తోరణాలు
గాజు స్తంభాలనే బూజంబుబుఱ్ఱు
అరటి స్తంభాలనే అమరపెళ్లరుగు
చిన్నన్న పెట్టాడు చింతాకుచీరె
పెద్దన్న పెట్టాడు పెద్దల్లసొమ్ము
నాయన్న పెట్టాడు నానుతోపుస్తె
నాయక్కపెట్టింది పసుపాడుపళ్లెము
పసుపాడుపళ్లెములో పచ్చనక్షింతలు
పచ్చనక్షింతలే నే పుట్టినిల్లు.

౪

చిట్టీచిట్టీమిరియాలు చెట్టుకిందపోసి
పుట్టమన్ను దెచ్చి బొమ్మరిల్లుకట్టి
బొమ్మరింట బోగంపాప బిడ్డకన్నాది
బిడ్డతలకునూనె నాతలకునెయ్యి
అల్లవారింటకు చల్లకుపోతే
అల్లవారికుక్క 'భౌ' మనె
పొయిలో పాముబుస్సుమనె
నాచంకబిడ్డ కేరుమనె
నాకాళ్లగజ్జెలు ఘల్లుమనె.

## చిలకమ్మసారె

(సంపాదకురాలు) శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారు

రావాకుచిలకమ్మ ఆడవేపాప
రాజుల్లుప్రధాన్లు అడుగవచ్చేరు
అన్నకందలమిచ్చి తాగుఱ్ఱమెక్కి
గుఱ్ఱంబుమీదికీ పల్లంబుతేరే
పల్లంబుముందరికి పాపణ్ణితేరే
పాపడిముందరికి కూతుర్నితేరే
కూతురుసిగలోకి కురువేరుతేరే
ననుగన్నతల్లి కొకనానుతేరమ్మా
నానుకు ముత్యాలబొట్టుతేరమ్మా
బొట్టుకు బొమ్మంచుచీరె తేరమ్మా
చీరెకు చిలకల్ల రవికతేరమ్మా
రవికెకు రత్నాలపేరు తేరమ్మా
పేరుకు పెట్టెల్లసొమ్ముతేరమ్మా
సొమ్ముకు శోభిల్ల వళ్లుతేరమ్మా
వంటికి వడ్డాదిపసుపుతేరమ్మా
పసుపుకు పారేటినీళ్లుతేరమ్మా
నీళ్లకు నిమ్మల్లతోటతేరమ్మా
తోటలోవున్నదే నిత్యమల్లిచెట్టు
నిత్యమల్లికింద నీళ్లకుండల్లు
నీళ్లకుండలమీద రామచిలుకల్లు
రామచిలుకలమెడలో రత్నాలపేర్లు.

3. వినోదకథ

## కోమిటియుక్తి

అనగాఅనగా ఒక అడవి. ఆ అడవిలో ఒకపెద్దపులి. ఆపెద్దపులికి ఒక నక్కమంత్రి. పెద్దపులి రోజూ మాంసంవేటాడితెచ్చి నక్కకుపెడుతూవుండేది. ఒకరోజుబొత్తిగా ఆహారం దొరకలేదు. నక్కా, పెద్దపులీ ఆకలితో నకనకలాడుతూ దోవలో పోతున్నవి. ఆ సమయాన ఒక కోమిటిసెట్టి వడలూ, పకోడీలూ అమ్ముకోడానికి పొరుగూరికి వెళ్లుతూ వాటికెదురుపడ్డాడు. అతన్నిచూడగానే నక్క యీలలువేసింది. పెద్దపులి గర్జిస్తూ అతనిమీదికి దుమికింది. కోమిటిసెట్టి కంగారుపడి "పులిరాజా! నాదొక మనవివుంది; చిత్తగించాలి" అన్నాడు వణుకుతూ.

"సరే, త్వరగాకానీ" అన్నది పెద్దపులి ఆగ్రహంతో. సెట్టి కొంతధైర్యంతెచ్చుకొని "ఈ గంపలో కావలసినన్ని ఫలహారాలున్నాయి. దేవరవారు వాటిని తినిచూసి రుచిగా లేకుంటే తర్వాతనన్ను భక్షించండి" అన్నాడు. పెద్దపులి ఫలహారాలన్నీ తిని పచ్చిమాంసం కంటె పదిరెట్లు బాగుండడంవల్ల చాలా సంతోషించి "సెట్టీ! నీవు తెచ్చిన ఫలహారాలు చాలాపసందుగావున్నవి. కాబట్టి నిన్నురక్షించాను. ప్రతిరోజూ యిదేమాదిరిఫలహారాలు తెస్తూవుండు. అదుగో ఆ గుహలో వెండీబంగారందండిగా దాచివుంచాను. పోయి నీకు కావలసినంతతెచ్చుకో" అన్నది. సెట్టి సంతోషంతో గంతులువేస్తూ వెళ్లి తనగంప పట్టి

నంత వెండీబంగారం మూటకట్టుకొని మోయలేక మోయలేక యింటికి వెళ్లేడు. అప్పటి నుండీ ప్రతినిత్యం ఫలహారాలు తయారుచేసుకొని పెద్దపులివద్దకు వెళ్లడం, వెండీబంగారం తెచ్చుకోవడం సెట్టికి మామూలయింది. ఇలా ఒకనెల గడిచింది. ప్రభువుగారు ఫలహారాలతో తృప్తిపొందుతూ వుండడంవల్ల నక్క మంత్రిగారికి ఉపవాసవ్రతాలు వృద్ధి అయినవి. ఇక బతకడం కష్టమనుకొని నక్క నఖశిఖపర్యంతం ఆలోచించి పులివద్దకువెళ్లి "ఏలినవారు ఈమధ్య దాసునిపై దయతప్పినట్లున్నారు. అయినా ఫరవాలేదు. ఆకోమిటివాడినిమాత్రం నమ్మవద్దు. వాడు మహాచెడ్డటక్కరి. రేపటిదినం ఫలహారాల్లో విషంపెట్టుకొనివస్తాడు. మీరు జాగ్రత్తగా ఉండాలి." అన్నది. పులి ఆమాటనిజమే అనుకొని "అయితే యిందుకు ఉపాయమేమిటో నీవేచెప్పు" అన్నది. "రేపటిదినం సెట్టి ఫలహారాలు తెస్తూనే ముందు నాకు తినబెట్టండి. తిన్నతర్వాత నేనుయథాప్రకారం ఉంటినా సరే. లేకుంటే మీరు వాటిని ముట్టుకోవద్దు."

మరుదినం మామూలుప్రకారం సెట్టి ఫలహారాలు తెచ్చేడు. పులివాటిని తాకకుండా నక్కను తినమని చెప్పింది. నక్కడొక్కలు పూడేటట్లుతిని కిందపడి విలవిల తన్నుకుంటూ వూపిరిబిగబట్టింది. అదిచూసి పెద్దపులి కోపంతో సెట్టిమీదికి యెగిరి జుట్టుపట్టుకొని "ఓరీ, కోమిటి! నీవుచేసినతంటా నక్కమూలాన బయటపడింది. నీజీవితం యింతటితో ముగిసింది. ఏమి చెప్పుకుంటావో చెప్పుకో" అనింది.

"పులిరాజా! ఎలాగూ చచ్చిపోతున్నాను. కాబట్టి నాఆఖరుకోరికను మన్నించాలి. మాతండ్రి చనిపొయ్యేటప్పుడు నక్కతోలు కాస్త జంధ్యానికి తగిలించుకోమని చెప్పేడు. అది యింతవరకూ దొరకలేదు. ఏలినవారి అనుగ్రహంవల్ల యిప్పుడు దొరికింది. కాబట్టి తమ సెలవయితే కాస్త చర్మంకోసుకొని జంధ్యానికి తగిలించుకుంటాను" అన్నాడు సెట్టి చేతులుజోడించుకొని. పులి సరేఅనింది. సెట్టి పేనాకత్తితో చురుకుపుట్టేటట్లు నక్కచర్మం పరపరకోయసాగేడు. పాపం, నక్క మంటకు భరించలేక బతుకుజీవుడా అని పరుగెత్తింది. సెట్టి పకపకనవ్వుతూ "పులిరాజా! ఇటీవల తనకు తిండి దొరక్కపోవడంవల్ల ఇలా కుయుక్తులు పన్నింది నక్క. నక్కజిత్తులకంటె కోమటిజిత్తులు హెచ్చు కాబట్టి గండం తప్పించుకున్నాను. ఇక సెలవు" అని తిరిగిచూడకుండాయింటికి వెళ్లేడు.

## ముచ్చుసెట్టియుక్తి

పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు

దొంగలపురమను ఒకగ్రామముగలదు. ఆగ్రామమున ముచ్చుసెట్టియను కోమటి యొకడుగలడు. అతడు చాలయుక్తిగలవాడు. ముచ్చుసెట్టి మొదట కడుబీదవాడుగానుండెను. కాలక్రమమున అతడు వర్తకముచే చాలధనము నార్జించెను. ఒక మేడకట్టుకొనవలెనని యతని యుద్దేశ్యము. అందుచేత అతడు ఊరునకు ఉత్తరమున ఒకప్రదేశమునుకొని మేడకట్టుకొనుటకు ఇటుక, కలప మొదలగునవి సిద్ధముచేసుకొనెను. కాని వ్య

కాలము సమీపించెను. వర్షములు అధికముగ కురియుచుండెను. బాటలన్నియు బురదలతో నిండి బండ్లునడచుటకు చాలకష్టముగ నుండెను. సెట్టి త్వరితముగ మేడకట్టుకొనవలెనను తొందరతోనుండెను. ఇటుక కలప మొదలైనవి కాపురమున్న యింటిదగ్గరనుండెను. మేడకట్టుకొనవలసినచోటు ఊరుకు ఉత్తరపువైపున సుమారు ఒకమైలుదూరమున నుండెను. ఇంటిదగ్గరనున్న యిటుక యచ్చటికి చేరుటకు కూలీలు దొరుకుటలేదు. బండ్లుపోవుటకు బాటలు వీలుగలేవు. కావున సెట్టి బాగుగ ఆలోచించి యొక పన్నుగడ పన్నెను. ఆపన్నుగడ ననుసరించి యతడు మరుసటి దినమునుండి ఆయూరునకు సుమారు రెండుమైళ్లదూరముననున్న యొక చిట్టడవిదగ్గర ఒక చిన్నదుకాణమును పెట్టుచుండెను. ఆయడవిలో కొందరు దొంగలు నివసించుచుండిరి. వారు తరచుగ దొంగలపురమునకువచ్చి కన్నములు వేయుచుండిరి. అయినను ఆగ్రామమున నివసించువారు చాలమంది బీదవారగుటచే వారికి విస్తారము ధనములభించుటలేదు. మచ్చుసెట్టి దుకాణము పెట్టినప్పటినుండియు దొంగలచ్చటికివచ్చి కొంతసొమ్మతనికిచ్చి యతనిదగ్గరనే వారికి కావలసిన వెచ్చములను కొని ·తీసికొని పోవుచుండిరి. మరియొక్కొక్క సమయమున కాలక్షేపము నిమిత్తమచ్చటకువచ్చి యచ్చటనేకూర్చుని ఏదో వినోదముగ మాటలాడుకొనుచునో, ఆటలాడుకొనుచునో యుండెడివారు. ఇట్లు రెండు మూడు వారములు గతించెను. సెట్టికిని దొంగలకును కొంచెము స్నేహమయ్యెను. అంతట ఒకదినమున మధ్యాహ్న సమయమున ఎండమిక్కుటముగ నుండగా వారందరును సెట్టిదుకాణముదగ్గర నొకచెట్టునీడను కూర్చుని మాటలాడుకొనుచుండిరి. ఆమాటలసందర్భమున దొంగలనాయకుడు సెట్టినిచూచి "సెట్టిగారూ! మీకిక్కడ దుకాణము పెట్టిన లాభమేముందండీ? ఏపట్టణమునకైనాపోయి దుకాణముపెట్టుకొనిన చాలలాభమువచ్చునుగదా? అట్లు చేయక ఇక్కడయేల పెట్టితిరి?" అని యడిగెను. అందుపైన సెట్టితానంతకుపూర్వము ఓడవర్తకముచేసితిననియు, చాలధన మార్జించితిననియు, ఇంకసంపాదనవిషయమున విరక్తిజెంది పరోపకారముచేసి పుణ్యము సంపాదింపదలచి దుకాణములేని యిట్టియడవిప్రాంతమున దుకాణముపెట్టితే మార్గస్థులకు చాల ఉపయోగకరముగ నుండుననియు అందుచేత అక్కడ ఆ దుకాణమును పెట్టితిననియు చెప్పెను. దొంగలు ఆమాటలకు లోలోన చాలాసంతోషించిరి. వారందరును ఆదినమున సెట్టియింటికికన్నము వేసిన చాలధనము దొరుకునని ఊహించుకొనిరి. వారు ఇండ్లకేగి తగినట్లేర్పాట్లుచేసికొనియుండిరి. ఇంతట సాయంకాలమయ్యెను. ప్రొద్దుగ్రుంకక పూర్వమే మామూలుప్రకారము తన దుకాణమునెత్తుకొని సెట్టి యింటికివెళ్లెను. ఇంటికి వెళ్లగనే సామానులు సర్దుకొని పద్దులువ్రాసుకొనుటకు ప్రారంభించెను. ఇంతట బాగుగ చీకటి గ్రమ్మెను. మబ్బుబాగుగ వేసియుండెను. తొమ్మిదిగంటలయ్యెను. సెట్టిభార్య భోజనమునకై సెట్టిని తొందరపెట్టుచుండెను. కాని సెట్టి రాదయ్యెను. ఇట్లె పదకొండుగంటలయ్యెను. క్రమముగ ఊరు మాటుమణిగెను. అందరును నిద్రపోవుచుండిరి. సెట్టిమాత్రము భోజమునకు లేవకుండెను. అట్టి సమయమునకు దొంగలు పదుగురు బయలుదేరి సెట్టి యింటికికన్నము వేయుటకై అడవినుండివచ్చిరి. సెట్టిని భార్య భోజనమునకులెమ్మనుటయు, అతడు అయిపోయినది వస్తున్నానని కేకవేయుచుండుటయు వారు వినిరి. ఇంకను వీరు నిద్రింపలేదని వారనుకొనినారు. నిద్రపోవువరకు ఎక్కడనైనను దాగియుండవలెనని తలచి వారందరును దొడ్డివైపున వంటయింటికి దగ్గరగానున్న చెక్కపెళ్లలాటు ప్రక్కన ఒదిగికూర్చునియుండి కోమటికిని భార్యకును ఏమిసంభాషణజరుగునోయని వినుచుండిరి. సెట్టి పద్దులు వ్రాసుకొనుటను ఆపుచేసి భోజనమునకువచ్చెను. "ఏమిది? ఏరోజు కారోజే. భోజనమునకింత ఆలస్యంచేస్తారు. ఏమిపనిచేస్తూఉంటారు? ఇల్లాగైతే నేను బాధపడలే"నంది సెట్టిభార్య. "పళ్లి యేమున్నది? ఇంటిలోనిసొమ్ము జాగ్రత్తపెట్టుకోవద్దంటావా? ధనముకంటే యెక్కువా భోజనం? కష్టపడి సంపాదించాను

గదా” అన్నాడు సెట్టి. “ఏంకష్టపడ్డారేమిటి? నాకష్టంకంటే ఎక్కువకష్టమా?” అని సెట్టిభార్య అనెను. “ఏం కష్టపడ్డానా? చెప్పుతావిను, నేను పడినకష్టం” అనిచెప్పడం మొదలెట్టాడు. “చెప్పండి” అందిభార్య. “నేను ఓడవర్తకానికివెళ్లి తుపానులకు భయపడక, సముద్రప్రయాణానికిభయపడక ఓడవర్తకం చేస్తూండేవాణ్ణి. పడరానికష్టాలుపడి తిరగరానిదేశం తిరిగి చేయరాని వర్తకాలుచేసి చాలాడబ్బు సంపాదించి సంచులతోటి తీసుగువచ్చి యింటినిండా పోసేశాను. అయితే కడపటను ఒకప్రమాదంమాత్రం సంభవించింది. అదేమంటావేమో? నీవు కాపరానికి రాకపూర్వమే సంపాదనంతా అయిపోయి నిన్ను పెళ్లాడిన తరువాతనే మా అమ్మ బాబు చనిపోయినారు. అందుచేత ఇంటిదగ్గిరవుండేవాళ్లులేక పైగా సొమ్ముపోసుకొనుటకు ఇల్లు చాలక వర్తకంమానివేసినాను. ఇంటిదగ్గరనే ఉండి డబ్బున్నదిగదా అని చాలాగర్వంగా ఉంటూఉన్నాను. ఒకనాడొకయోగీశ్వరుడువచ్చి మన అరుగుమీద రాత్రిపడుకున్నాడు. మరునాడు చాలడబ్బున్నవాడవని విని మనింటిదగ్గర భోజనంపెట్టమన్నాడు. ఎవడో బిచ్చగాడనుకొని భోజనముపెట్టుటకు ఇష్టములేక వేళాకోళముగా ఇటు అటు కదుపుతే ఇటుకై పోతుంది కాబట్టి డబ్బుఖర్చుపెట్టి నీకుభోజనంపెట్టనన్నాను. దానిమీదట యోగికికోపంవచ్చి ‘అట్లేబాగాకదులుతే నీరూపాయలన్నియు ఇటుకలైపోతాయిలే’అని నన్ను శపించాడు. అందుచేతనే నేను మనసొమ్మునకు ఆట్టేకదలికతగలకుండా ఉండవలెనని పెట్టెలుచేయించి వాటిలోపోసి దొడ్డివైపు కొట్టులో భద్రముగాపెట్టి ఉంచాను” అని సెట్టిచెప్పుచుండగా “ఆమాట గట్టిగా చెప్పకండి. ఊళ్లో దొంగలుపడుతున్నారు” అన్నదిభార్య. “బాధలేదు. దొంగలు ఇంటికికన్నము వేస్తే వేయవచ్చును గాని దొడ్డివైపు కొట్టులో సొమ్ముఉంటుందని వాళ్లకేంతెలుస్తుంది. అంతేగాక ఆదివారంరోజున అడిపిరాలవారింట కన్నం జరిగిందని కొందరు పోలీసులు ఊరుకిపడమరవైపున కాపున్నారు. మొన్న దక్షిణపువీధిని దొంగతనం జరిగిందని మరికొందరిని దక్షిణపువైపున కాపలావేశారు. నిన్న తూర్పువైపున తేలీల యింటకన్నము జరిగినదని ఆవైపున మరికొందరిని కాపలావేశారు. ఆవరుసని పోలీసులు కాస్తూండగా దొంగ లెట్లాపట్టుకుపోతారు?” అని సెట్టి అన్నాడు.

పిమ్మట ఇద్దరును భోజనములుచేసి నిద్రపోయినారు. దొంగ లీమాటలువినిరి. తాము శ్రమపడ నక్కరలేకయే దొడ్డివైపునుండియే సొమ్ముతీసుకొని పోవచ్చునని తలచిరి. ఆగదికి కన్నము త్రవ్విరి. ఆయింట అంతకుపూర్వమే సెట్టిచే నిటుకలతో నింపబడిన పెట్టెలుండెను. వాటిని తలకొకటియు నెత్తుకొని పోలీసులు కాపులేని ఉత్తరపుదిశకుపోజొచ్చిరి. అట్లు ఊరుబయటకుపోయి సెట్టిమేడకట్టుకొనుటకై కొన్న స్థలమునకు సమీపమున పెట్టెలు బ్రద్దలగొట్టి చూచుకొనిరి. అందరి పెట్టెలలోను యిటుకలేయుండినవి. వారా యిటుకలనచ్చటవిడిచి, వచ్చుటలో కదలి రూపాయలిటుకలయ్యెనని తలచి తిరుగ సెట్టియింటినిజేరి తల యొక పెట్టెను తిరిగి తీసుకొనిపోయిరి. మరల ఊరుబయటకుపోయిచూడ అవియు నిటుకలేయయ్యెను. ఇట్లే తెల్లవారువరకు ఇటుకపెట్టెలను మోయుచుండిరి. సెట్టి కొంచెము రాత్రియుండగనేలేచి దొంగలేమి చేసిరోయని యూరుబయటకుబోయెను. వారు “ఈతడవకూడ నిటుకలేయయ్యెనే” యనుకొనుచుండిరి. సెట్టి “మిత్రులారా! కొన్ని యిటుకలు ముక్కలయ్యెనే” యనెను. “ఇటుకలు కాదు మాశరీరములు ముక్కలయ్యె” ననుచు దొంగలు పారిపోయిరి.

కావుననే మనవాళ్లు ‘దొంగలో ముచ్చులో’ యందురు. దొంగలనుమించినవాడు ముచ్చుసెట్టి కనుక దొంగలకంటె యెక్కువవారు ముచ్చులని మనవారియభిప్రాయమని తలుస్తాను.



వయస్సుకుమించిన తలపులు



“పవ్వళింపరా పాండురంగ!”

# జోన్ ఆఫ్ ఆర్కు

అబలయై పుట్టినది. ఆ పుట్టుటయు ఆయుధజీవులగు పురుషసంఘముగల క్షత్రియ జాతియందుగాదు. కఱ్ఱపట్టి గొఱ్ఱెలను కాచు వెఱ్ఱిగొల్లకులమున పుట్టినది. వెఱ్ఱిగొల్లకులమున పుట్టినది. కఱ్ఱపట్టినది. గొఱ్ఱెలనుకాచినది. ఇంతలో ఈశ్వరసందేశమువచ్చినది. కఱ్ఱ పట్టినచేతితోడనే కత్తి పట్టినది. వెఱ్ఱిగొఱ్ఱెలను కాచిన బుద్ధితోడనే వెంగలివిత్తులై యున్న తనజాతివారిని కాచినది. అబల సబలయైనది.

ఐదుశతాబ్దులకు పూర్వము జరిగిన విషయము. ఆంగ్లేయులు దండెత్తుచు వచ్చి ఫ్రాంసుదేశమునందలి భాగముల నొక్కొక్కటిగ కబళించుచువచ్చిరి. ఈ కబళించుట పెక్కువత్సరములు నిర్నిరోధముగ సాగెను. ఫ్రాంసుదేశమున పుట్టువుగన్న పురుషులలో నొక్కడుకూడ ఈ కబళింపును అడ్డగల మహానాయకుడుగా మారజాలకపోయెను. ఫ్రెంచి దేశము ఆంగ్లరాజ్యమున నొక అంతర్భాగముగ నై సర్వనాశనము నొందునేమోయను పరిస్థితి పొడసూపెను.

పొడసూపిన ఈవిషమపరిస్థితిని పోద్రోలుటకు భగవానుఁడు ఒకమహాశక్తిని ఫ్రెంచి వారికి ప్రసాదించెను. ఆ మహాశక్తియే జోన్ ఆఫ్ ఆర్కు. ఆమె క్రీస్తుశకము 1411-వ సంవత్సరమునందు 'డోంర్మే' అను గ్రామమున జన్మించెను. తండ్రి జాక్విన్ డి ఆర్కు; తల్లి ఇజబూ. ఆ మహాశక్తి బాల్యచర్యలతో మనకు ప్రశక్తిలేదు. ఆమెకు పదునెనిమిది సంవత్సరములు వచ్చెను. హృదయసీమకు పరమేశ్వరుని ఆదేశమునువచ్చెను. 1429-వ సంవత్సరమున ఫిబ్రవరిమాసమున ఆమె ఆఱుగురు సైనికులను వెంటబెట్టుకొని ఫ్రెంచిరాజు ఛార్లసును దర్శించెను. 'దేశముక్తికి నేను యుద్ధముచేతును. అనుజ్ఞనిమ్ము' అని జోన్ ఆఫ్ ఆర్కు చెప్పెను. సుత్తిమెత్తనివాఁడగు ఆతని కీమాటలు తొలుత మనస్సుకు పట్టలేదు. ఆమె నొక్కిచెప్పెను. అప్పుడాతడామెకు ఐదువేలసైనికులనిచ్చెను. ఆనేనకు ఆపదునెనిమిదేండ్లపడుచు నాయకురాలయ్యెను. కవచముధరించి ఆమె అశ్వము నధిరోహించెను.

ఇదివఱకు ఒకసారియు యుద్ధభూమిచొఱని, యుద్ధానుభవములేని గొల్లపడుచు సేనానాయకురాలు. పరాజయములను పొందుటమాత్రమే యెఱిగిన ఫ్రెంచిసైనికులు ఆనాయకురాలివెంటవచ్చువారు. ఆ నాయకురాలును, ఈసైనికులును కలిసి జయింపవలసినది విజయపరంపరతో తాఁకుబాఱియున్న ఆంగ్లసైన్యమును. సంకల్పబలమునకు సాధనాబలమునకు పోరాట ఘటిల్లినది.

ఆ పోరాటములో సంకల్పబలమునకే విజయముగలిగినది. 1429-వ సంవత్సరమున ఏప్రియలు 29-వ తేదీని జోన్ ఆఫ్ ఆర్కు ఆంగ్లేయులను జయించి ఆర్లీన్సు పట్టణమును

ప్రవేశించినది. ఇందుతో ఫ్రెంచివారిహృదయములందు ఉత్సాహము ఎసరేగెను. ఆంగ్లేయుల ఉత్సాహము దినదినము దిగనాఱెను. చేయునదిలేక వారు మేనెల 8-వ తేదీని ఆర్లీన్సు కోటముట్టడినివదలి వెనుకకుబోయిరి. ఆర్కు-కన్య విజృంభించినది. ఆమె మెట్టినతావంతయు ఫ్రెంచివారి హస్తగతమగుచుండెను. జూను 12-వ తేదీ మొదలు 19-వ తేదీవఱకు ఆమెగొనిన విజయములకు లెక్క-లేదు. జూలై 17-వ తేదీని ఈ విజయములను పురస్కరించుకొని ఫ్రెంచిరాజు చార్లసుకు పట్టాభిషేకముజరిగెను. ఆ శుభసమయమున ఆతని పార్శ్వమున ఆర్కు-కన్య నిలబడియుండెను. "ఓ వీరాంగనా! నా కీశుభము నీమూలమున గలిగినది. కృతజ్ఞతాపూర్వకముగ తీర్తును. నీవేదైనకోరుకొనుము" అని రాజనెను. 'నాగ్రామమగు డోంగ్రేమే సర్వదుంబాలాగ్రామముగ చేయబడుగాక!' అని ఆర్కు- పలికెను.

ఎంతటికోరిక! దేశమును తాను జయించుకొనివచ్చినది. ఎట్టికోరిక కోరినను రాజు ఆసమయమున ఈయననజాలడు. కాని ఆమెకు విశేషవాంఛ కలుగలేదు; తన గ్రామము సర్వదుంబాలాయగుటయే ఆమె కోరెను. తన గ్రామము నంతగ ప్రేమించెను గావుననే ఆమె తనదేశము నింతగ ప్రేమింపగలిగెను. ఆమె ఈ స్వల్పపు కోరిక నెఱవేర్పబడెను. నాటికిని నేటికిని ఎందఱో రాజులు ఫ్రెంచిసింహాసనమెక్కిరి. ఎన్నియో ప్రభుత్వవిధానములు మాఱినవి. కాని ఫ్రాంసుదేశపుపన్నులపుస్తకములో 'డోంగ్రిమీ' కెదురుగ 'పన్ను ఏమియు లేదు; ఆర్కు-కన్య జ్ఞాపకార్థము' అను అక్షరములు అక్షరములై వచ్చుచున్నవి.

రాజుకు పట్టాభిషేకము జరిగెను. ఆ సంతోషమున వారు కార్యమును మఱచిరి. ఇంకను ఒకభాగమున ఆంగ్లేయసైనికులు ప్రబలులయ్యేయుండిరి. శత్రుశేషము మిగల్చరాదు అని ఆర్కు-కన్య చెవినిల్లుకట్టుకొని పోరెను. సుత్తిమెత్తనివాడగు రాజు వినలేదు. ఆర్కు-కన్య స్వయముగ కార్యరంగమునకు దుమికెను. జరిగినపట్టాభిషేకముతో పరవశులై తన్నుమఱచిన ఫ్రెంచివారు వెనుక. తమ విజయములకు వేరుపురుగిది అని తన్నుచూచు ఆంగ్లేయులు ఎదుట. వెనుకవారి వెన్నుచఱుపుకలుగలేదు. ఎదుటివారి ఎదుర్కోలు తప్పలేదు. 1430-వ సంవత్సరము మేనెల 24-వ తేదీని ఆమె ఆంగ్లేయులచేతులలో చిక్కెను. ఫ్రాంసుదేశమున తమ పరాజయములకు కారణభూతురాలగు ఆపడుచు మాంత్రికురాలని వారు నిర్ణయించిరి. తమకింత మేలుచేసిన ఆకన్యను మాయామాంత్రికురాలుగానెంచి విచారణచేయుదుమని వాగ్దానముచేసి ఫ్రెంచివారామెను ఆంగ్లేయులనుండి విడిపించుకొనివచ్చిరి. 1431-వ సంవత్సరము జనవరి 3-వ తేదీని విడిపించుకొనివచ్చిరి. జనవరి 9-వ తేదీని విచారణ ప్రారంభమయ్యెను. అక్షదర్శకుడు మే 24-వ తేదీని తీర్పుచెప్పెను. మే 30-వ తేదీని చచ్చువఱకు ఆమెను కాల్చిరి.

జాతీయోద్యమములు నడిపి చారిత్రకప్రపంచమున వెలుగుచున్నవారిలో ఆర్యకన్య యొకతె. ఆమె దేశభక్తికిరాశి. వీరాగ్రేసరులమనుకొన్నవారు వెనుకంజవైచిన తావున ఆమె విజయాక్షతలు వైచినది. పరాజయపీడ, పరరాజపీడ వదల్చి 'పరాసుదేశము పరాసువారిదే' అను సూత్రమునకు జనిస్థానమైనది. దీనికే ఆమె మాయామాంత్రికురాలయ్యెను. తన దేశభక్తిని జాతీయతను గ్రహింపజాలని యంబేదలనకుమ బుట్టి ఆమె కోతిచేతిరత్నమయ్యెను. ఇతరులనుచంపి ఆమె తనవారికి హితముగూర్చెను. తనవారిచే చంపబడి ఆమె ఇతరులకు సైతము చింతగూర్చెను. ఆమె యిప్పుడు సెయింటు. తన పందొమ్మిదవయేట యామె మాయామాంత్రికురాలను నేరమున కాల్చబడెను. క్రీ.శ. 1900-వ సంవత్సరమున ఆమె సెయింట్లలో జేర్పబడెను. ఇది కాలపురుషుడుచేసిన ఘనకార్యము. ఈ ఘనకార్యము చేయుటకాతనికి ఐదుశతాబ్దులు పట్టెను.

## రామమోహనరాయలు *

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు

దుర్మతాచారబద్ధుల కాళ్లనున్న శృంఖలములు తెగియె నీకారణమున
అజ్ఞానతిమిరమోహమున మూఁతలువడ్డ కన్నులువిచ్చె నీకారణమున
అగతికానాథబాలానూనహృదయదుఃఖములు చల్లారె నీకారణమున
పతనోన్ముఖంబైన భారతావని యధోగతినుండిమరలె నీకారణమున
మతమునంగల ధర్మసూక్ష్మములు తెలిపి
సముచితాచారవిధుల భేదములుమలపి
పాడుగానున్న దేశంబు పరువునిలిపి
సుస్థిరంబైన సుఖమీవు చూఱఁగొంటె.

ఎప్పుడుఁ దాఁజేయునట్టి సత్కృతియైన నీశ్వరార్పణముగానే యొనర్చి
తానునమ్మిన సత్యధర్మంబు లెన్నెన్ని యిడుమలువచ్చిన విడువకుండి
తనతోడిమానవుల్ తనతోడఁబుట్టిన వారలేయనెడు భావంబుగలిగి
యన్నిధర్మములలో నన్యోపకారధర్మంబె ప్రశస్తధర్మముగ నెంచి
సహజసత్కరుణార్ద్ర ప్రశాంతమధుర
మానసుండయి పరమేశు మహిమఁదెలిసి
మనిన మహనీయుడెవఁడన్న నిను నొకనిని
విడిచి, లెక్కింపఁగా వ్రేలు మడవఁగలమె?

అకటా! దేశహితంబుపొంటె నిజసౌఖ్యంబుల్ విసర్జించి తా
పకబంధుప్రకరాప్తమిత్రగణసంపద్వైభవాదుల్ నిర
ర్థకతఁజెంద విదేశభాగమున నిర్యాణంబుఁ గావించి నీ
సుకృతోపార్జితపుణ్యలోకసుఖముల్ చూఱాడఁగా నేగితే.

* ఇవి 1930, సెప్టెంబరు 27-వ తేదీని పిఠాపురముపురమందిరమున జరిగిన రామమోహనరాయల వర్ధంతి సందర్భమునఁ జదువఁబడినది,

# శ్రీయుత బొల్లిన మునిస్వామినాయుడుగారు

## శ్రీమతి గుండారెడ్డి సౌభాగ్యమ్మగారు

ఇటీవల మనరాజధానిలో జరిగిన యెన్నికల వెంటనే నిర్మింపవలసిన మంత్రాంగము యనేక కారణాంతరములచే ఆలస్యమై 25-10-30 కి నిర్మింపబడెను. ఈరాజధాని ప్రజల భాగ్యోదయమునకో యన్నట్లు జస్టిసుపక్షనాయకులగు శ్రీయుత. బొ. మునిసామినాయుడుగారిని గవర్నరుగారు యాహ్వానించి మంత్రాంగము నిర్మింపకోరిరి.

శ్రీయుతులు : బి. మునిస్వామినాయుడుగారు; చిత్తూరు
,, యస్. కుమారస్వామిరెడ్డిగారు; తిరునల్వేలి
,, పి. టి. రాజన్‌గారు; మధుర

ఈముగ్గురును శ్రీ గవర్నరుగారిచే నియమితులై 27-10-30 ని వారివారిమంత్రి పదవులను స్వీకరించిరి.



శ్రీమతి గుండారెడ్డి సౌభాగ్యమ్మగారు

ప్రస్తుత పరిస్థితులలో సక్రమరాజకీయాందోళనముతో దేశసేవ యొనర్చుటకు పూనుకొన్నది జస్టిసుపక్షమొకటియే. ఈపక్షీయులే సాంఘికవిషయములను సరళహృదయముతో మార్పుచేయగల వారమని వాగ్దానములు చేసియుండువారు. సాంఘికముగ బాగుపడనిదేశము త్వరగా రాజకీయాభివృద్ధి చెందజాలదనెడి విషయము దేశసేవకులందరును నామోదించియున్నారు.

ఈనూతనప్రధానామాత్యులు సరళస్వభావులు. నిర్మలప్రవర్తకులు. శాంతమూర్తులు. రైతుకుటుంబములో పుట్టిపెరిగినదాత. ముఖ్యముగ తన చిత్తూరుజిల్లాలో ఆబాలగోపాలము దైవమువలె పూజింపబడుచుండు వక్త. ఐదుమంది ఆడుబిడ్డలుగలవారు. అగుట స్త్రీలోకకష్టసుఖములను సులభోపాయమున నెఱుంగ నవకాశముగల దేశసేవాతత్పరులు. నవీనచాణక్యులనదగు శ్రీనాయుడుగారు తన మంత్రాంగకాలములో స్త్రీలోకమునకు చేయదగిన మేలైన కార్యములు పెక్కులున్నవి.

దేవాదాయధర్మాదాయముల శాఖను వీరిపరిపాలనలోనికి ఉంచుకొనియున్నారు. అతుకులబేరముగాగాకుండ దేవదాసీపద్ధతిని ధైర్యముతో నిలుపుదలచేయుటకు శ్రీ నాయుడుగారికి ఇందువలన అవకాశము లభించినది. బాల్యవివాహనిషేధచట్టము భారతశాసనసభలో ప్యాసై శాసనమైనదేకాని ప్రతిఫలమేమియు లేక పసికూనలకు వివాహములు సాగింపబడుచునేయున్నవి. వీరు దీనినిగూర్చి తగు శ్రమతీసుకొని ప్రభుత్వము

వారిని మేల్కొలిపి ప్రజలకు ఈచట్టమునందు మర్యాదకలుగునట్లు చేయించవలెను. గత మదరాసు శాసనసభలో శ్రీమతి డాక్టరు. ముత్తులక్ష్మమ్మగారికృషిచే చట్టరూపముదాల్చిన పడుపువృత్తినిషేధకచట్టము తగురీతిని ఉపయోగపడుటకు ముఖ్యముగా అనాధబాలికల శరణాలయము ఒకటియుండవలయునని ప్రజాసేవకులు కోరియుండుటను సఫలీకృతము కావించవలసినది శ్రీవారిధర్మము.

స్త్రీవిద్యను కేవలము పురుషులకువలెనేగాక, నవీనపద్ధతులనుకలిగి, గృహసంబంధమైన వ్యవహారములకు ఉపయోగించు రీతిగా వీరిమంత్రాంగహయాములో విద్యావిధానమును మార్పుదల చేయుటకు శ్రీ నాయుడుగారు పునాదినివేయించవలెను.

త్రాగుబోతుతనమును మాటలతో నిరసించుచున్నారే కాని కార్యరూపముగా నిలుపుదలచేసి చూపుటకు పూనిన మహనీయులెవరును లేరు. గడచిన మార్చినెల బడ్జట్టుచర్చ సమయములో శ్రీ నాయుడుగారు మధుపానశాఖామంత్రిపరిపాలనను నిరసించుచు నిషేధకసభలతో ప్రయోజనము లేదనియు, ఒక ప్రక్కన ప్రభుత్వము అంగడి పెట్టించి సారాయివగైరాలు అమ్మించుచు మఱొకవంక సభలుచేసి త్రాగుడు మానుడని ప్రభుత్వమువారే పూనుకొనుట సమంజసము కాదనియు—త్రాగువారు ఉపన్యాసాలు వినరనియు, వినువారలలో త్రాగువారుండరనియు—పలుక సాహసించి ప్రభుత్వమువారు ఒకజిల్లాలోనైనా పూర్తిగ మధ్యపాననిషేధమును చేయించి చూడవలయునని హెచ్చరించియున్నారు. దేశదారిద్ర్యమునకు ప్రధానహేతువగు ఈ మధుపానమును పోగొట్టుటకు గౌరవనీయులగు ప్రధానామాత్యులు తమ మాటలనే తాము మఱువక వారి శక్త్యానుసారము వంచనలేక తన సహాయమంత్రులతోడకలసి వారలందరు నిషేధమునకు పూనియున్నారని లోకులకు కార్యరూపముగా రూపించవలయును.

## ఈడుజోడు అనభిజ్ఞులు

కవికొండల వేంకటరావుగారు

భార్యయింటనుండఁ బతివేఱుపనిమీాద
రాజవీథినుంట లచ్చనంబు
గాదుకాదు: మేముగలసి యిర్వురమొక్క
పొలమునందుఁజేయఁదలతుము, పని.
ఊడ్పునీట నీడలొక్కొక్కళ్లవి వేఱు
తెలియబోక మొలకఁదేట డాగు:
నూర్పుడపుడుపాట తూర్పారువేళ, నే
మొదలుపెట్టునంత ముదితబాడు.
ఒక్కగాలిమేము చక్కఁబీల్తుము
ఒక్కపూవుగోసి చుక్కవంచు
దానిచెవిని దమ్మిఁ దగిలింప వేఁదీసి
యదియె చేడె నాకు నందియిచ్చు.
మాదుఘటికలొకటె మాదుకోర్కెలొకటె
వ్రాతచదువుమాకు రాదిరువుర
కొరులువచ్చి గాథయాకొట్టుతామన్న
చేటభారతమ్ము సెప్పఁగలము.
ఒకరుపుట్టినపుడొకరు పుట్టకయున్న
ఒకరుపోవునప్పు డొకరుపోవ
నూహగొనుచునుందు ముల్లంబులందున.
ఏమ? ఈడుజోడు ప్రేమమాది.

# ఏలూరు

ఆంధ్రమండలములో నొకదానికి తిలకనగరమగు భాగ్యమునకు నోచిపుట్టిన పట్టణములందు ఏలూరు ఒకటి. దీని కీభాగ్యము 1925-వ సంవత్సరము ఏప్రియలుమాసమున పట్టినది. పశ్చిమగోదావరి మండలము ఏర్పాటైనది. కృష్ణాగోదావరుల డెల్టాలముఖస్థానమున వర్ధిల్లుచున్న పెద్దపట్టణములు బెజవాడ, రాజమండ్రిల కీభాగ్యములేదు. బెజవాడ, రాజమండ్రీలవలె నిదియు చారిత్రకప్రసిద్ధమైన పట్టణమే. తన పేరు కొంతకాలము దేశముపేరుగా వెలయించిన వేగి ఏలూరుకు పదిమైళ్లదూరముననున్నది. అదియునుగాక ఉత్తరసర్కారులలో చిరకాలముగ ఏలూరు ప్రముఖస్థానము వహించుచున్నది. పూర్వమిచ్చట కోట ఉండినది. అతావుననిప్పుడు దిబ్బ. తాలూకా ఆఫీసు, మునసబుకోర్టు మొదలగు మందిరములిప్పుడాదిబ్బను త్రొక్కుచున్నవి.



ఏలూరు పు: మందిరము

రాజమండ్రిని గోదావరి, బెజవాడను కృష్ణ, ఉన్నట్లే ఏలూరున తమ్మిలేరుగలదు. గోదావరి కృష్ణలకువలె ఇది జీవనది గాదు. అయినను ఇదివర్షాకాలమున దాట శక్యము గానిదిగా నుండును. మోకాలిబంటి నీరుపోవుచున్నను దాటరాదు. అప్పటి దానివడికి తాచుపాముపిల్లకూడ చాలదు. కావుననే తమ్మిలేరునుగూర్చి 'ఇది వర్షాకాలమున తాచుపాముపిల్ల ఇతరకాలములందు ఇసుకపళ్లెము' అని చెప్పుదురు. గోస్తనది తణుకును చుట్టినట్లు తమ్మిలేరు పాయలుగా చీలి ఏలూరుచుట్టును పాఱుచున్నది. కొల్లేరుసరస్సునబడుచున్నది.

కృష్ణాగోదావరులవలె జీవనదిగాని తమ్మిలేరు ప్రక్కననున్న ఏలూరు కృష్ణాగోదావరుల కాలువలకు సంగమస్థానముగ నున్నది. ఆంధ్రభూమియందలి కొంతభాగమును సస్యశ్యామలముగచేయజాలిన పవిత్రవాహినులు కృష్ణాగోదావరులు కరస్పర్శము గావించుకొను ప్రయాగ ఏలూరు. గంగ గోదావరికి చెల్లెలు. యమున కృష్ణనుపోలినది జలవర్ణ విషయమున. తెలుగువారి గంగాయమునలగు గోదావరి, కృష్ణానదులు ఏలూరున జట్టాపట్టములువైచికొని ఏలూరును తెలుగువారి ప్రయాగగామార్చినవి.

బెజవాడకు పెదవడ్లపూడి, రాజమండ్రికి కడియము పండ్లగంపలు. వంగూరు ఏలూరు కట్టినది. ఏలూరు తమలపాకులు నెల్లిమర్ల ఆకులతో పోటీకి నిలువగలవు. ధనధాన్యసమృద్ధమగు పశ్చిమగోదావరికి ప్రధానపట్టణమగుట ఏలూరు మంచి వర్తకస్థానముగా పేరుకెక్కుచున్నది. ఈఊరిమీదుగా భద్రాచలమునకు రైలు పడుచో ఇంకను అభివృద్ధి కలుగగలదు. బియ్యపు మరలు చాలగలవు. ఏలూరునందలిమహమ్మదీయులు తివాసీనేతయందు తీవ్రమైన దీక్షగలవారు. నెల్లూరున అభ్రకపువర్తకము, గుంటూరున పొగాకు, రాజమండ్రియందు అల్యూమినముపలె ఏలూరున రత్నకంబళ్లవర్తకను విరివి. ఏలూరున చూడదగిన వానిలో జనపనారయంత్రశాల యొకటి. ఇది గోగునారను, జనపనారను బాగుగా ఏకి పురిపేని దానితో గోనె సంచులు నేయును. ఇందు దినమునకు వేయిమంది కూలీలు పనిచేయుదురు. ఇదిగాక ఆంధ్రదేశమున విశాఖపట్టణముజిల్లా నెల్లిమర్లలో నొక జనపనార యంత్రశాల గలదు. అయితే అది విదేశీయుల చేతిలోనున్నది.


మ్యునిసిపల్ హైస్కూలు, ఏలూరు


మ్యునిసిపల్ ఆఫీసు, ఏలూరు

ఏలూరు చూడబోయినవారు పోయి కొల్లేరుసరస్సునుకూడ చూచివచ్చుచుందురు. ఇపుడు కొల్లేరుసరస్సుగలచోట పూర్వమొక పట్టణము, కొల్లేరులోని దిబ్బలు ఆపట్టణము

నందలి ఎత్తయినప్రదేశములు, ఒకమునీశ్వరుని శాపమువలన అదిఅంతయు జలమయమైనదని జనశ్రుతి. ఇరువదినాలుగుమైళ్ల వెడల్పు వ్యాపించినజలము చూచుటకు చాల ముచ్చటగ నుండును. పలురకముల పక్షులధ్వనులతో నచ్చట పగలంతయు పాటకచ్చేరీజరుగుచుండును. కొల్లేరుసరస్సు చుట్టుపట్ల చేపలవర్తకము గలదు. కొల్లేరులోని దిబ్బలు మిగుల సారవంత మైనవి. సారువా, దాళువా రెండుపంటలు ఏడాదికి. కావుననే కొల్లేరున ధాన్యము కొల్లలు అను నామెత. ఇది ఎద్దడి సంవత్సరముల మాట. ముంపు సంవత్సరములందు కొల్లేటిరైతుల పుట్టి మునిగినదన్నమాటే. కట్టుకథలోని పట్టణమువలెను వారి పంటలును కొల్లేటిగర్భమున పడిపోవును. కొల్లేరు మఱిరెండింటికి ప్రసిద్ధి కొంగలకు, దోమలకు.

ఉత్తరసర్కారులందలి మండలములలో నొకదానికి ప్రధాననగరమయ్యు కళాశాల లేని పట్టణము ఏలూరు ఒక్కటే. హైస్కూళ్లు రెండు. ఒకటి బాలురకు. ఇది మునిసి పాలిటీవారిది. మఱియొకటిబాలికలకు. ఇదిగవర్నమెంటువారిది. లక్షాఅరువదివేల రూపాయల రాబడిగల ఏలూరు మునిసిపాలిటివారి యాజమాన్యమున ప్రాథమికపాఠశాలలు 26 మాత్రమే గలవు; 18 బాలురకు, 8 బాలికలకు. అందుచదువు బాలురసంఖ్య 1853, బాలికల సంఖ్య 894. బాలురలో నూటికిపండ్రెండుగురును, బాలికలలో నూటికి నలుబదిఒక్కరును పాఠశాల గడపత్రొక్కక పట్టణమగు ఏలూరునందున్నారు.

ఏలూరు ఆంధ్రస్త్రీలకుప్రియతమమైనది. అది శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారి పట్టణము. ఆమె స్మారకసంస్థలన్నియు నాగ్రామముననే గలవు. జరుగుచున్న జాతీయ సంగ్రామమున ఆంధ్రదేశమునందు గుంటూరు తరువాత ఏలూరునుండియే ఎక్కువమంది స్త్రీలు చెఱసాలలకేగియున్నారు.

వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జినువదలి కాగితమునకు ఒక తట్టుననే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరు వారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

౪౭

అరచేతంతా పట్నం
అరవై మేడలపట్నం
మేడకు మూఁప్పై గదులూ
గదులకు పదిమందిబంట్లూ
బంటుబంటుకు బందూకు
బందూకుచూస్తే భయమెచ్చూ
మెచ్చావచ్చు ఆపోరూ
మెలతా చెప్పే ఎవ్వారో?

—తేనెటీగలు: తెట్టె.

౪౮

అడవిలోబుట్టింది, అడవిబెఱిగింది
పాడుపాములువచ్చి పైనబడ్డాయి
రాజింటికొచ్చింది, రాజుపై కెక్కింది
చెంబులోనీళ్లన్ని చెడఁదాగిపోయింది.
చెప్పితే నీనోరు గప్పుమంటుందీ
తప్పితే నీనోరు చప్పగుంటుందీ.

—గంధపుచెక్క.

౫౦

అమ్మాకడుపున బడ్డానూ
అంత సుఖాన వున్నానూ,
చోచ్చో మళ్లా వచ్చానూ
సోలీ యింట్లో పడ్డానూ
నీచేద్దెబ్బలు తిన్నానూ
నిలువున యెండీ పోయినానూ
నిప్పులగుండం దొక్కానూ
నీరై మారీ పొయ్యానూ.

—గడ్డి, పేడ, పిడక, బూడిదె.

ఇఁకను ఈ పాటలలో సంస్కృతమునందు గల సచ్ఛాయము లగు శ్లోకములను ఇచ్చట వివరింపవలసి యున్నది. కాని ఒక్కొక్కదానిని గుఱించి సంస్కృతమునందలి ఛాయలను ఈయఁదలఁచినచో గ్రంథవిస్తరమును శాఖాచంక్రమణమును కలుగఁగావచ్చును. కాన ఒక్కటి రెండు విషయములకుఁగల సంస్కృతచ్ఛాయలను ఇచ్చట చూపుచున్నాను. పైని యిచ్చిన పాటలలో 9–వది, 17–వది యగు పాటలను పాఠకులు ఒక్కమారు చిత్తగింతురుగాక. వాని క్రిందిది సంస్కృతచ్ఛాయయని తోఁపగలదు. కాని అర్థమునందును రచనమునందును భేదములేక పోలేదు:—

శ్లో. వృక్షాగ్రవాసీ న చ పక్షిరాజః
త్రినేత్రధారీ న చ శూలపాణిః
త్వగ్వస్త్రధారీ న చ సిద్ధయోగీ
జలం చ బిభ్రన్ న ఘటో న మేఘః.

దీని యర్థము:—చెట్టుకొట్టకొనన నుండునది. కాని పక్షులనురాజగు గరుడిమాత్రము కాదు. మూఁడు కన్నులు ధరించునది. ఇట్లనుటచేత త్రినేత్రుఁడగు శివుఁడనుకొందురేమో? కాదు. త్వగ్వస్త్రమును (చర్మాంబరమును) ధరించునది. సిద్ధయోగులు నిట్టివారే గనుక వా రనుకొనరాదు. ఇది సిద్ధయోగి యెన్నటికిని కాదు. పైగా సర్వదా నీరును మోయుచునుండును. ఇంతమాత్రాన నది ఘటమని కాని మేఘమని కాని యనుకొనరాదు. అది ఘటమును కాదు. మేఘమును కాదు. ఇట్టి వస్తువు—అనఁగా చెటుకొననుండునదియును, ముక్కంటియు, త్వగ్వస్త్రధారియు, జలభరణము కలదియు నగునది ఏది? అని.

కొబ్బరికాయకు ఇట్టి గుణములన్నియు కలవుగదా! అది—యని సమాధానము. ఇట్టివానికే సంస్కృతమునందు ప్రహేళిక లందురని చెప్పియున్నాను కదా. ప్రహేళికలు చదువరులకు బుద్ధిసూక్ష్మతను ముఖ్యముగా గలిగించితీరును. ఇవి చతుష్షష్టికళలలో నొక్కటియని వాత్స్యాయనసూత్రములందు పరిగణింపబడినది. [చూడుడు: అందు సాధారణాధికరణము-అను ప్రథమాధికరణములో 3-వ యధ్యాయమునందు, నా ప్రచురణము.]

దండిమహాకవి ఈ ప్రహేళికలయొక్క ఫలమును ఇట్లని నిరూపించినాడు:—

క్రీడాగోష్ఠీవినోదేషు తజ్ఞై రాకీర్ణమంత్రణే
పరవ్యామోహనే చైవ సోపయోగాః ప్రకీర్తితాః.

దీని తాత్పర్యము:—క్రీడలు, గోష్ఠులు, వినోదములు, నాగరకజనులు విహారసభలున్నగు వానియందు అట్టివానిలోగల మర్మమెఱింగిన సరసులగుసభ్యులతో నిండియుండిన ప్రదేశములలో ఒకరితో నొకరు గుప్తముగా గలసి చతురములగు సంభాషణముల నొనరించుకొనుటకును, పరులను వాదవేళలలో భ్రాంతినొందించి పరిహసించుటకును ఇవి-అనగా ప్రహేళికలు - మిక్కిలియును ఉపయోగకరములని ప్రశంసింపబడినవని తాత్పర్యము.

మఱియును ఆ మహాకవియే ఈ ప్రహేళికలు పెక్కుతెఱంగులనున్నట్లు చెప్పుచు తన కావ్యాదర్శమున పదునెనిమిదిరకములగు ప్రహేళికలను లక్ష్యలక్షణసహితముగా నిరూపించినాడు. *

1. సమాగతప్రహేళికలు
2. వంచితప్రహేళికలు
3. వ్యుత్క్రాంతప్రహేళికలు
4. ప్రముషితప్రహేళికలు
5. సమానరూపప్రహేళికలు
6. పరుషప్రహేళికలు
7. ప్రకల్పితప్రహేళికలు
8. నామాంతరితప్రహేళికలు
9. నిభృతప్రహేళికలు
10. సంమూఢప్రహేళికలు
11. పరిహారికాప్రహేళికలు
12. సంఖ్యాతప్రహేళికలు
13. సమానశబ్దప్రహేళికలు
14. పరిహారికాప్రహేళికలు
15. ఏకచ్ఛన్నాప్రహేళికలు
16. ఉభయచ్ఛన్నాప్రహేళికలు
17. దుష్టప్రహేళికలు
18. సంకీర్ణప్రహేళికలు

దండికవియంతటివాడు మహోత్తమమైన సాహిత్యలక్షణగ్రంథమునునిర్మించిన యతడు ఈ ప్రహేళికల కేర్పఱచిన లక్షణముబట్టియు, నిర్ణయించిన ఫలమును అందలిభేదముల వివరణముబట్టియు నియ్యవి ఉత్తమవాఙ్మయభాగములని పరిగ్రహింప నెట్టిసంశయమును లేదు. పైగా కవితలో నారితేరిన విద్వాంసులు

* వీని వివరములను పూర్తిగా ఇచ్చుట ఈయజాలకున్నాడను. ఈ కావ్యాదర్శమును బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రాంధ్రమున పద్యకావ్యముగా మార్చినారు. వచనమున నేను వ్రాసితిని. వారిది ముద్రితము. నాది అముద్రితము. బ్రతికియుండునేని ఎప్పటికైన ముద్రింపగలనను ఆశతో దానిని దాచియుంచితిని. [పం. ఆ.]

క్రీడాగోష్ఠీవినోదవిహారాదులందు మహోత్తమస్థానమునిచ్చిన యీ ప్రహేళికలను లలితమగు భాషలో మిక్కిలియును కోమలమగు బాలచిత్తములకు ఎక్కునట్లును, వారికి ముమ్ముందు రాఁగల సభావిజయముల కిది పునాదిగానుండునట్లుగ నిర్మించి పెంపొందించుట మిక్కిలియు శ్లాఘ్యము కాదా?

పైఁగా వినుటకుపుట్టనిరీతిని చాల యింపుగా లోకజ్ఞానమును కలిగించుచు శ్రావ్యమగు గానరసముతో మేళవించి సాహిత్యసంగీతాభినివిష్టులఁ జేయుచున్నది. చిత్తగింపుడు ఆమె బోధనరీతి యెట్లున్నదో!

౧-వ పాటలో గానుగనుగూర్చి చెప్పుచున్నది. నేటికాలమున ప్రాథమికపాఠశాలాపాఠ్యగ్రంథములను వ్రాయుచున్న విద్యాధికులవలె-ఇదిగో గానుగ. చూడుము. ఇది గిఱ్ఱున తిరుగుచున్నది. దీని నొక యెద్దు ఈడ్చుచున్నది. ఈడ్చునప్పుడు రాతిచక్రముక్రిందఁబడి నువ్వులు నలిగి పప్పయి నూనె వచ్చుచున్నది. అని ఇత్యాదిగా ఏకరువుపెట్టక-అన్యాపదేశముగా గానుగనాడుటను వారి మనసునకు స్ఫురింపఁజేయుచు, యేదో కథాంశమును చెప్పునట్లు వారిమనస్సులను విస్ఫారగమొనర్చుచు శ్రావ్యముగా మధురముగా - ఆకాశమంతా అల్లుకొరాఁగా-అని ఇత్యాదిగా నుపక్రమించినది.

ఇట్లే ౨-వదానిలో ఎవరిదో ఎక్కడనో ఒకకథ ఆరంభించినట్లుగా ఆరంభించి - అడవిలో పుట్టింది, అడవిలోఁ బెరిగింది, కడవలో దూరింది, గఱ్ఱుమన్నాది-అని యనుటతోడనే బాలునకు జిజ్ఞాస యుదయించి అందులోఁగల తత్త్వము నెఱుంగవలయునన్న తహతహ యుదయించి, అంతవఱకు తనకు పరిచితములయిన యావత్తువస్తువులను ఆతల్లి చెప్పినలక్షణములు కలిగియున్నవా? లేవా? యనిపరీక్షింపదివురుటయు, నందుతోఁ బాటుగా తనజ్ఞాపకశక్తిని పెన్నగొట్టి అట్టివస్తువు నన్వేషించుప్రయత్నమును తప్పని సరిగా కలిగితీరును. పసిపిల్లల ప్రజ్ఞను పెంపొందింపజేయుట కింతకంటె మించిన బాలామృత మేదియున్నది? దీనివలననే ఆనాఁటి గృహలక్ష్ముల విచక్షణశక్తి యెంతదొడ్డదియో చాటఁబడుటకు జాలియున్నది.

ఒక్కలోకజ్ఞానమును వస్తుస్థితిని ప్రతిభాభివృద్ధిని మాత్రమే ఇవి కలిగించుచున్నవా? మన జాతీయతకు సంబంధించిన సర్వవిజ్ఞానములను ఇందును ఇట్టివానియందును మనవారు మేళవించియే యున్నారు. ౩-వ పాటలోని రథవర్ణనములోఁగల లోకోత్తరశిల్పమును తేనెతేటలును నూనెమెఱుఁగులును జారునట్లు నిర్మించు ఆ శిల్పుల నైపుణ్యమును, ౪-వపాటలో ఆరోగ్యమును శుచిత్వమును అన్యాపదేశముగా బోధించు నుద్దేశముతో చిత్రించిన ఆపేలతలను, ౫-లో గుఱిగింజనుగూర్చినవస్తువిజ్ఞానమును సీతాఫలపుకాయలు గేదంగిరేకులు తాంబూలము మున్నగువానిని ౧౩-వ పాటలోని కొబ్బరికాయను రూపించు రూపకాలంకారముయొక్క సౌందర్యమును, పల్లకినిగూర్చిన మంగళకామిత్వము, ౧౯-౨౦ పాటలలోఁగల పాకశాస్త్రవైద్యశాస్త్రాదివిజ్ఞానశకలములను చిత్తగించినచో-మనవారిట్టిపాటలలో నెంతెంతటిఘనభావములను రససంపదను నిముడ్చియున్నారో చదువరులకు స్వయముగానే మనఃపథమునకు రాఁగలదు.

ఈ విధముగానే ౧౫-వ పాటలోని కోడిపుంజువర్ణనముఁగనుఁడు. ఇంతయేల? సంస్కృతకవులలో నొక మహాకవి కుంపటిని ఈక్రిందివిధముగా వర్ణించినాడు. (హసంతియనఁగా కుంపటి.) చూడుడు ఈరెంటిని.

శ్లో. హసంతీం చ హసంతీం చ
హసంతీం వామలోచనాం
హేమంతే యే న సేవంతే
తే నూనం దైవవంచితాః.

(౨౩-వ పాట)

వైశాఖమాసంలో వెడలిపోత్తాఁడూ
మాఖమాసంలోను మళ్లవస్తాఁడూ
వొస్తూను తెస్తాడు వుల్లిపూవుల్లూ
వుల్లిపిల్లనువిడిచి వెళ్లనంటాడూ.

సంస్కృతిరచయితకు వామలోచనఁగా గోచరించిన హసంతి—తెలుగురచయితకు చాతుర్మాస్యము నెఱపునట్టి జతురుఁడగు వ్యాపారిగా గోచరించినాఁడు. ఒక్క గోచరించుటయే గాక, అపరిత్యాజమగునా హేమంతసుఖమును వదులఁజాలక వదులఁజాలక వటించుచున్నట్లు గోచరించుచున్నాఁడు. ఎంతవింత! కావుననే ప్రౌఢమికము లయినను, నేటివారికి కొందఱకు నిస్సారములయినను సహృదయులగు రసికులకు నిందును వాఙ్మయముకలదనియు రసభావాలంకారాదిసంపత్సౌభాగ్యములు కలవనియు కనుక నిట్టివానిని పోకుండ సేకరించినిలిపి వానియర్థములను వివరించి గ్రంథస్థముఁ జేయుట యుచితమనియు నామనవి.

ఇఁక నీవిషయము నింతటితో విరమించి, [నేను ఇదివఱకు విభజించినరీతి ననుసరించి] రెండవవిభాగములోని తక్కిన యంశములను పూర్తిచేయుటకుముందుగా, ఈ ప్రహేళికల పాటలలాంటివే పొడుపుకథలని మనవారు గద్యముగా మఱికొన్నింటిని చెప్పుకొనుచుందురు, ప్రసంగసందర్భమునుబట్టి అవియును పైపాటలలోనిలాంటి భావములనే కలిగియున్నందునను, వానికి వీనికి ఇంచుమించు కొన్నిచోట్లతప్ప తఱుచు రచనతుల్యముగానుండుటఁబట్టియు నిచ్చట ఆ పొడుపుకథలనుకొన్ని మచ్చుకి ఇచ్చుచున్నాను. ఇవి మంజువాణి ప్రెస్సువారి స్త్రీలపాటలు ౨-వ భాగమునుండి గైకొనఁబడినవి. వీనిని పూర్తిగా చూడగోరువారాగ్రంథమున చిత్తగింపవచ్చును. బ్రహ్మశ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావుగారియొద్ద ఈవిషయమున నింకను ఎక్కుడు సంచయముకలదని వినుచున్నాను. కున్నచో వారుగు పూర్తిగా వెలువరింతురుగాక. *

పొడుపుకథలు—స్త్రీలపాటలనుండి.

ఆకాశాన అంగవస్త్రము లార వేసినారు.
—అరటియాకులు

ఆకాశమున వెన్నముద్దలు వ్రేలాడుచున్నవి.
—వెలగకాయలు

ఆకాశమున కొడవళ్లు వ్రేలాడుచున్నవి.
—చింతకాయలు

ఆకాశముననుండును అదిపక్షిగాదు, తోకఉఁటుంది మేకకాదు, తాడుండి తైతక్క యని ఆడుతుంది.
—గాలిపటము

అడిగేవారు, ఇచ్చేవారేగానిఉపయోగించేవారరుదు.
—సలహా

అందరికిముఖంజూపుతానుగానీ వీపుగోకువాండ్రతో చాలవిరోధము.
—అద్దము

అడవిలో అంకమ్మ తల విరియబోసుకొని నివాలాడుచున్నది.
—ఈతచెట్టు

అమారాదేశమునుంచి కొమారా పండ్లొస్తే కొనేవాళ్లేగాని తినేవాళ్లు లేరు.
—వగడము

అబూబు యిబూబు పోట్లాడుతుంటే అల్లాసాహేబు వచ్చివిడిపించినాడు.
—తాళముచెవి

---

* పొడుపుకథ లనుమాటను సరిగా నాకు అర్థము కాలేదు. చదువరులు సంప్రదాయానుసారముగాఁ దెలిసినవారున్నచో ఇందు వెల్లడింపఁబ్రార్థింతును. [పం. ఆ.]



## దేవపూజ: ప్రథమపాఠము:—

నవంబరుమాసపు గృహలక్ష్మిలోని ముఖచిత్రమునుగూర్చి వంగల వేదమూర్తిగారిట్లు వ్రాయుచున్నారు—

"మొన్నటి కార్తీకమాసంలో మాగృహలక్ష్మి మా సీతారామాంజనేయసంఘానికిరాగా "దేవపూజ: ప్రథమపాఠము" అనుచిత్రముచూచి చాలాఆనందించా. పుట్టిందిమొదలు గిట్టేవరకు భక్తిభావాలతో ఓలలాడే మనహిందూదేశంలో ఇట్టిచిత్తరువులుండుట ఆశ్చర్యంకాదు. కాని అన్నింటివలెకాక యిదిభక్తిఅంటె అంతగా తెలియక ఏదోకాస్త అభిప్రాయంగల నాబోటివాళ్లమనస్సునుకూడా యేదో ఒకఅనిర్వాచ్యమైనస్థితిలో దింపుతున్నది. చిన్నతనంలో, ఆడుకోడం తప్పితే మరేమీ అక్కరలేనికృష్ణుడు, యేంజెపితే అదేనమ్మకునే కృష్ణుడు, అవునంటే అవును కాదంటే కాదనేకృష్ణుడు, పుణ్యపాపాలు రెండూ యెరుగనికృష్ణుడు, తనబండిమీద యెక్కిన యేనుగుతో ఆడుకుటూంనే, దాన్నితాడుబట్టుకు లాగుతూనే, వాళ్లమ్మపిలిస్తే వొచ్చినుంచుని, యేదో ఆట గోడితనాన దేవుణ్ణి మాడాలనుకున్నాడు. కాని దేవుడియెదుట అట్లానుంచోవచ్చునో రాదో పాపం యేం తెలుసు? అప్పుడు వాళ్లమ్మ చేతులుపట్టుకొని దణ్ణంపెట్టాలనిపెట్టిస్తూ, పిల్లవాడిభావాలకు సరిపొయ్యేటట్టుగా, గొప్పగొప్పఋషులు, మునీశ్వరులు, యోగులు యెంతోకాలంకష్టపడి తెలుసుకున్న "సత్యస్వరూపాన్ని" ఒక చిన్ని తేటగీతితో "చేతవెన్నముద్ద..." ఇత్యాదిగా చెబుతున్నది. అదంతావిని కృష్ణుడు నిష్కల్మషుడు గనుక చెప్పింది చెప్పినట్లగా గ్రహించాడు. మైమరచాడు. ఒక్కసారిగా కళ్లు మూసుకున్నాడు. నిశ్చేష్టుడైనాడు. తన ఆటల్ని తనయేనుగును మరచిపొయ్యాడు. పరమయోగులకుకూడాసాధ్యంకాని దుర్లభమైనసత్యరూపదర్శన సంజనితానందామృతాన్ని ఆ చిన్నికృష్ణుడు, ఆ ముద్దుబిడ్డడు, ఆపసిపాపడు చూరగొంటున్నాడు. చూరగొనకేం! "పిల్లవాడి హృదయంతెల్లకాగితంవంటిది. దానిమీద ఏరంగువేస్తే అదేపడుతుం"దని మహాత్ములవారు చెప్పినట్లుగా ఆ పిల్లవాడి హృదయం తెల్లకాగితంవంటిది. తల్లి యెంతచెప్పిందో అంతాపడ్డది. ఇటువంటి దృశ్యాన్నిచూస్తే యెవరికానందంకలుగదు? ఇదేమన ప్రాచీనసంప్రదాయం. ఇదేమన ఆదికాలపు భాగ్యం. ఇదేమన హిందూదేశంలో చిన్నతనంనుంచీ వేదాంతంనూరిపొయ్యడాన్ని పదేపదే జ్ఞాపకంచేసేది. ఇటువంటి చిత్తరువు వ్రాసినవారికి చిన్నికృష్ణుఁడు ఆయురారోగ్యైశ్వర్యచిత్రకళాభివృద్ధుల నొసగుగాక!"

## భారతీయక్రైస్తవులు: శారదాచట్టము:—

నవంబరు 10—వతేదీనాటి 'ధర్మసాధని' పత్రిక ఇట్లు లిఖింపుచున్నది—

"ప్రథమమున హిందూసంఘమునకే వర్తించునట్లు రావుసాహేబు హరవిలాస శారదాగారు తమ బాల్యవివాహనిషేధచట్టమును తయారుచేసిరి. కాని ఉపసంఘమువారు దూరదృష్టితో చట్టమును సకలసంఘ

ములకును వర్తించునటుల మార్పుచేసి దేశమునకు మహోపకారము గావించిరి. చట్టము నెడల మహమ్మదీయులు కొందరు కనబఱచిన అసమ్మతిని బట్టి బాల్యవివాహాచారము మహమ్మదీయులలో గూడ నున్నదని స్పష్టమయ్యెను. శారదాచట్టము క్రైస్తవసంఘమునకు చేయగల ప్రయోజనమును గూర్చి యిటీవల 'ఇండియన్ విట్నెస్' అను క్రైస్తవపత్రిక యొకవ్యాసమును వ్రాసెను. దీనినిబట్టిచూడ గ్రామములలోనివసించు క్రైస్తవులింకను బాల్యవివాహములనే జరుపుచున్నారనియు, క్రైస్తవవివాహశాసనము ననుసరించి వివాహములన్నియు జరుగుటలేదనియు తెలియుచున్నది. శారదాచట్టములోని సంగతులను నచ్చచెప్పి గ్రామవాసులగు క్రైస్తవులు బాల్యవివాహాచారము ననుసరింపకుండునట్లు చూడవలయునని తత్పత్రిక మతబోధకులను హెచ్చరించుచున్నది. ఇపుడు బాల్యవివాహములవలని బాధల ననుభవించువారొక్క హిందువులే కాదనియు, మహమ్మదీయులు క్రైస్తవులుగూడ దానియనర్థములకు లోనగుచున్నారనియు తేటతెల్లము కాగలదు. ఆచారదాసులగు నెవ్వరో కొందరు సణుగుకొన్నను బహుసంఖ్యాకులు శారదాగారిని, ప్రభుత్వమువారిని మెచ్చుకొనగలరు. ముఖ్యముగా తమకు వివాహస్వాతంత్ర్యమును ప్రసాదించినందులకై శారదాచట్టమును యువజనులు శ్లాఘింపకమానరు.”

## వేపనూనె:—

పరిశ్రమలశాఖవారీప్రకటనము గావించుచున్నారు—

“వేపనూనె వేపవిత్తనములనుండితయారుచేయబడుచున్నది. ఆవృక్షము భారతదేశమునందంతట విస్తారముగ పెరిగియున్నది. పట్టణవాసములయందు సైత మది దుర్వాయువును పరిశుభ్రపరచు ననునమ్మకమువలన రస్తాలయందును నందనవనములయందును పెంచుచుందురు. ఆవిత్తనములయందు పచ్చనినూనె లభించును. దాని వాసన వెగటుగను భరింపనశక్యముగనునుండును. అందు ఔషధప్రభావముకూడకలదు. క్రిమినాశకాదిసాధకములకు ఆనూనెను స్వల్పముగ నుపయోగించిన చాలును. ఆ నూనె యీరోజులలో స్వల్పముగ ఔషధార్థము మాత్రము వినియోగింపబడుట వలన తగుమాత్రము నూనె తీయబడుచున్నది. కాని విత్తనములు చాలమట్టుకు వ్యర్థముగ పారవేయబడుచుండును. ఇటీవల కొందరు సబ్బులను తయారుచేయువారు స్వల్పముగ ఈ నూనెను చేర్చి ఔషధపుసబ్బులను తయారుచేయుచున్నారు. నూనెనుకాని విత్తనములను కాని ఎగుమతి యింతవరకు కెవ్వరు చేయలేదు. ఈ దరిమిలాను లండన్ సామ్రాజ్యసంస్థవారు ఇండియా సిలోనుప్రాంతములనుండి యీవిత్తనములను సీమకు ఎగుమతిచేయించి యచ్చట వినియోగింపజేయుట కుపాయము నాలోచించిరి. వారి ప్రోత్సాహమువలన నొక ఆంగ్లసోపుకంపెనీవారు సదరువిత్తనములను నూనెను రసాయనికముగపరిశోధించుట కుద్యమించిరి. ఆనూనెవలన తక్కువరకపు బ్రౌనుసబ్బుతయారగుచున్నట్లు ఆకంపెనీవారు తెలియజేసి ఈనూనె వెల్లుల్లివలె దుర్భరమగు వెగటువాసన కొట్టుటవలన నగరవాసములయం దీనూనె నాడించుటకు వీలుండదనియు తెలియజేసిరి. అటుతరువాత ఆ నూనెయందలి దుర్వాసనను తొలగించుటకు ప్రయత్నములు గావింపబడెను. కాని ప్రయోజనములేక పోయెను. అందువలన వేపనూనెకు యూరపుఖండమున బేరము తగులునను ఆశ లేకపోయెను. వారి రిపోర్టులో ఈనూనె ఇండియాలో వాడబడు విధానము గమనింపబడదయ్యెను. నూనె వాడుట సాధారణముగా ఇండియాలో నగరములయందు మాత్రమే గాక ముఖ్యముగా గ్రామప్రాంతములయందంతను చేయబడుచున్నది. అదికాక ఇండియాలో నూనెలన్నియు సాధారణముగ గానుగలో నాడబడుచుండుటవలన విత్తనములను ముందుగా వేడిచేయవలసిన యవసరములేదు గనుక ఆంగ్లవిధానమును మనము గమనింపనక్కరలేదు. సంయుక్తరాష్ట్రములయం దీనూనె హెచ్చుగ తయారుచేయబడుటకెంతేని యవకాశము కలదు. కావున సాధారణముగా బట్టలనుతుకు సబ్బును తయారుచేయుటకీ నూనెయందలి వాసనను తొలగించుటకు సాధకము కలదాయని యాప్రాంతవాసు లభిలషించుచున్నారు. అందువలన ప్రస్తుతము వ్యర్థముగ పోవుచున్న వేపవిత్తనములవలన ఏటేట చాలధనము సమకూడును. దేశీయపరిశ్రమల నభివృద్ధిపరచుటకును ప్రజలకు

సహసముగ సబ్బులభించుటకును వినియోగించును. ఇంకను ఇందువలన నశేసులకు పనిపాట్లులభించును. ప్రస్తుత మీ విషయమున గావింపబడిన పరిశోధనలవలన వేపనూనె యితరనూనెలతో కలుపునెడల దానివాసన చాల వరకుతొలగి మేలుతరము సబ్బులను తయారుచేయుటకు వీలుపడునని తెలియనగుట ముదావహము.”

## వెల్లూరు స్త్రీల చెఱసాల సానిటేషను:—

నవంబరుమాసమున వెల్లూరు స్త్రీలచెఱసాలనుండి విడుదలపొందిన శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు 'ఆంధ్రపత్రిక'లో ఆచెఱసాలలోని సానిటేషనుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు:—

“ప్రస్తుతము రాజకీయనిర్బంధితురాండ్రు నివసించుచున్న వెల్లూరు స్త్రీలచెఱశాల మిగుల సంకుచిత స్థలమున, సాధ్యమైనంత తక్కువ వైశాల్యమున విచిత్రమైన ప్లానుతో కట్టబడియున్నది. పురుషుల జైలున సుమారు మూడుమైళ్ళ స్థలముండగా స్త్రీలజెయిలులో తిరగడానికైనా స్థలములేదు. అట్టి ప్రదేశమున సామాన్యఖైదీలు సుమారు 300 మంది స్త్రీలు, రాజకీయఖయిదీలు 50 మందియు నివసించియున్నారు. ఈఖైదు త్రికోణాకృతిగానున్నది. అంచుచుట్టు ఖైదీలగదులు కట్టబడియున్నవి. వానికే చేరియున్న కర్మాగారము మొదలగునవి గాక, తక్కిన పెద్దగదులలో ఖైదీలు మొత్తములుగా నివసిస్తారు. ప్రత్యేకపు గదులు కూడ కొన్ని గలవు. అందు కొన్ని గదులును, చిన్నహాలును కాళిచేయబడి ఎ.బి.సి. క్లాసులుగానున్న రాజకీయఖైదీలకీయబడెను. ఈ ప్రదేశముల మాడింటి ముందు చిన్నచిన్న అవరణములుకలవు. వానియందే వీరు ఉండవలయును. పైకివెళ్ళడానికే స్థలములేదు. సి. క్లాసులో వాళ్లకి బొత్తిగా అన్యాయం. వాళ్ల ఆవరణ మిగుల చిన్నది. సుమారు 30 అడుగుల పొడుగు 20 అడుగుల వెడల్పు వుంటుంది. ఉన్నచోటునుండి బయటకు వచ్చి పదచలనము చేయుటకే వీలులేదు. ముందుజైలులో నడుగుపెట్టినతోడనే చుట్టూనున్న గదులముందు కుటీరములవలె కట్టబడిన 8 పాయఖానా దొడ్లు, వానిమధ్య హాస్పిటలున్ను కాన్పించును. ముందుకు కోణాకృతిగానున్న వీథివైపున సింహద్వారము, దానికి సంబంధించి, జైలధికారులు తమ కార్యకలాపములు జరుపుకొనుటకు ఒకమేడయిల్లుఉన్నది. మధ్యనున్న, ఆవరణములోఆసుపత్రియేగాక, వంటశాలయును చిన్నపాఠశాల కూడ నున్నవి. వాని మధ్య రెండువలయాకారముగానున్న మార్గములే కాళీస్థలములు. ఆ స్థలములందైనా మమ్ముల నడువనీయరు. అచ్చట ఆటపాటలకు గాని పరిశ్రమలకుగాని యేవిధమైన సౌకర్యములు లేవు. అందువలన ఖైదీల ఆరోగ్యమంత బాగానుండుటలేదు. ఆస్పత్రిచుట్టునున్న రోడ్డుమీదనైనా పరుగెత్తనిస్తే బాగుండును. బయటఆడుకొనే యాటలమాటయటుంచి, ఇంట్లో ఆడుకొనేయాటలకైనా, ఏర్పాటుచేయాలి. జైలు జీవనములో ఇది చాల అవసరము. అట్టియేర్పాట్లులేవు సరిగదా, వచ్చే నిర్మలవాయువునుపాడుచేయుటకు ఎక్కడజూచినా పాకీదొడ్లే. రాత్రింబవళ్లు ఖైదీలు నివసించేగదులకు వీటికి పదిపన్నెండడుగులైన దూరముండదు. అదిగాక దొడ్లలోనండి మలమునంతా తీసుకొనిపోయే తొట్టివంటిది ఏ. బి. క్లాసు ఖైదీలువుండే గదులప్రక్కనే కట్టబడియున్నది. ప్రొద్దుటవచ్చి అది తీసికుపోయేవరకు అది అక్కడనేయుండును. అది తీసుకుపోయేటప్పుడు కలుగుటచే ముఖ్యముగా నాగదులకు, తక్కిన కొన్నిప్రదేశములకుకూడ దుర్వాసనవలన కడుపులోని పేగులు పైకి వెళ్లివచ్చునేమో యన్నంత యుండును. అక్కడయుండే దుర్వాసన గాలిలో మిళితమై ఆసుపత్రిలోనికికూడ వస్తుంది. అందువలన రోగులకుకలిగే ఇబ్బందియు, హానియు వేరే చెప్పనక్కరలేదు.”

# వనితాలోకము

**శ్రీమతి అలిమేలుమంగతాయి అమ్మాళ్ గారు:—**

మదరాసునగరమున గౌరవ న్యాయాధికారిణిగ నుండినది. మదరాసు క్రొత్తశాసన సభలో సభ్యురాలిగా నియమింపబడినది.

**శ్రీమతి జె. జుట్షి కన్య గారు:—**

లాహూరునందలి ప్రభుత్వము వారి స్త్రీల కళాశాలలో ఉపాధ్యాయిని. గవర్న మెంటువారి నిర్బంధవిధానమును నిరసించుచు తన ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చినది. ఆమె ఇప్పుడు శ్రీకృష్ణజన్మ స్థానమునకేగియున్నది.

**శ్రీమతి రాఘవ అమ్మాళ్ గారు: —**

వెల్లూరు పురపారిశుద్ధ్యసంఘమున సభ్యురాలుగ నియమింపబడినది.

**శ్రీమతి యఫ్. రాజరత్నము సతి గారు:—**

సేలము మునిసిపలు సంఘమున సభికురాలుగా నియమింపబడినది.

**శ్రీమతి మధుర రామరావు నాడికన్య గారు:—**

బొంబాయియందలి సుందరదాసు వైద్యకళాశాలలో వైద్యవిద్య నభ్యసించినది. బొంబాయి విశ్వవిద్యాలయపు స్నాతకసభలో ఈమెకు 'వైస్రాయిగారి రజితపతకము'ను, 'లేడీరే రజితపతకము'ను ప్రసాదింపబడినవి.

**శ్రీమతి అసఫ్ ఆలీ సతి గారు:—**

ఈమె ఢిల్లీనివాసిని. స్వాతంత్ర్యయుద్యమమున పాల్గొని ఒకసంవత్సరము విడిఖైదు నార్జించినది.

**శ్రీమతి జె పి. శ్రీవత్సవ సతి గారు:—**

ఈమె కాన్పూరు నివాసిని. సంయుక్త పరగణాల శాసనసభలో సభ్యురాలుగా నియమింపబడినది.

**శ్రీమతి కార్నీలియా సొరాబ్జి కన్య గారు:—**

వంగ, ఉత్కల, అస్సాము రాష్ట్రములందలి కోర్టు ఆఫ్ వార్డ్సుకు న్యాయవాదిని. అమెరికాలోని యునైటెడ్డుస్టేట్సునందలి విలియమ్సుటవునులో జరుగనున్న రాజ్యాంగ సంస్థలప్రతినిధి సమావేశమునకు పోవుచున్నది.

**శ్రీమతి కే. సి. డి సతి గారు:—**

ఈమె భర్త ఇండియను సివిలుసర్వీసుకు చెందినవారు. బెంగాలు ఒలింపిక్ అసోసియేషను కార్యనిర్వాహకసంఘసభ్యురాలుగ ఎన్నుకొనబడినది.



శ్రీమతి అసఫ్ ఆలీసతిగారు



శ్రీమతి అలమేలుమంగతాయిఅమ్మాళ్ గారు



శ్రీమతి కె. జుట్షికన్యగారు



శ్రీమతి జె.పి శ్రీవత్సవసతిగారు



శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు



శ్రీమతి దామెర్ల కమలరత్నముగారు



## శస్త్రచికిత్సకుని పనిచేయు చీమలు:—

తూర్పు పెరూదేశనివాసులు చీమలచే శస్త్రచికిత్సకుడు చేయుపనిని చేయించుచున్నారు. గాయముపడినపుడుగాని చర్మము ప్రమాదవశమున కోయబడినపుడుగాని మనశస్త్రచికిత్సకులు తెగినభాగములను కలిపికుట్టుదురు. తూర్పు పెరూదేశస్థులు అట్లుగాక గట్టిముట్టెగల పెద్ద అడవిచీమలను తెచ్చి తెగివిడివడ్డ చర్మభాగములను వానిచే కరిపింతురు. అవి కఱచుటలో ఆవిడివడ్డ చర్మము ఒకటిగా చేరును. అప్పుడు వారు ఆచీమలముట్టెమాత్రముంచి మిగిలినభాగమును కత్తిరించి వేతురు. పట్టిన పట్టును సడలింపక ఆముట్టె అట్లేనిలిచిపోవును. ఆకోత మానువఱకు అది యట్లేయుంచబడును. పెద్దపెద్ద కోతలకు ఆదేశస్థులు ఇట్టి చీమలముట్టెలను బారుగ ఏడెనిమిది యుపయోగించుట కలదు.

## అమ్మమ్మ పెండ్లికూతురగుట:—

ఈనడుమ బైఫ్లీటులోని సెంటుమేరీసు చర్చిలో ఒక వివాహము జరిగెను. వధువు నామము ఎమిలీ. ఆమె డెబ్బది ఆరేండ్ల అమ్మాయి. వరుని నామము కాంబెలు. ఆతడు డెబ్బదియేండ్ల అబ్బాయి. వధువుకంటె వరుడు పిన్నవయస్కుడగుట ఒక్కటియే ఇందలి విశేషము కాదు. వధువుయొక్క మనుమరాండ్రిద్దఱును, వరుని కుమారుడును వివాహమునకు వచ్చి యుండుట మఱియొక విశేషము.

## అనుకున్న ఏబదిరెండు వత్సరములకు వివాహము:—

రాచెస్టరులోని కమ్మరివాడగు జానెహెన్రీపెన్‌ఫోల్డు అనువాడును హాలింగ్సులోని సరహాప్రింగు కన్యయు వివాహమాడుటకు నిశ్చయించుకొనిరి. ఈనిశ్చయము జరిగిన కొద్దికాలముననే ప్రింగుకన్య తల్లి చనిపోయెను. అప్పుడామె తనతండ్రి సంరక్షణకొఱకు కొంతకాలము తన వివాహము నిలిపివేయవలసివచ్చెను. కొంతకాలమునకు ఆమె తండ్రికూడ మరణించెను. కాని ఆకుటుంబమునందలి ఇతరవ్యక్తులకు ఆమె సంరక్షణ కావలసివచ్చెను. కావున తిరిగి వివాహము వాయిదా వేయబడెను. ఇట్లు ఏబదిరెండువత్సరములు జరిగిపోయెను. తరువాత ఆమె వివాహమునకు అడ్డంకులన్నియు తీరిపోయెను. వివాహసమయమున 'ఏబదిరెండు వత్సరముల దీర్ఘకాలము వేచియుండుటచే విసుగుపుట్టలేదా?' అనిఒకరామెనడుగగా "పుట్టలేదు. అవకాశము చిక్కువఱకును వేచియుంటిమి" అని ఆమె బదులుచెప్పెను.

నూటపదియారవపటలకట్టు వచ్చుట:—

జాగ్ ఆఘా అనువాడు టర్కీదేశస్థుడు. అతనికిప్పుడు నూటపదియారవవత్సరము. ఇంతవఱకు అతనిది బట్టతల. ఇప్పుడిప్పుడే వెంట్రుకలు వచ్చుచున్నవి. ఆవెంట్రుకలు దట్టముగను కాటుకనల్లగను ఉన్నవి. అతడీనడుమ అమెరికాదేశమునకు యాత్ర సేవింపనరిగెను. అచ్చట నొకనితో నాతడు ఎదుగుచున్న తనవెంట్రుకలను వేళ్లతో దువ్వుచు 'నేనింకను చాలకాలముజీవింతును' అని చెప్పెను. ఇందలి నిజానిజములెట్లున్నను ఈతనిని సందర్శించిన ప్రసిద్ధ వైద్యుడొకడు ఇతడికను ఇరువది సంవత్సరములు కరాకండీగా జీవించి తీరునని చెప్పెను. మాట్లాడుసినీమాకు ఇతనినిగొనిపోయిరి. ఆసినీమా సందర్శనానంతరము అతడిట్లుచెప్పెను. "నాభార్య ఈసినీమా మాసి ఎంతసంతోషించి యుండునోగదా? ఆమెకు అరువదిఆరవ ఏడు. విదేశయాత్ర చేయగల దార్ఢ్యములేకపోవుటచే ఆమెను గొనిరాలేకపోయితిని." ఈమధ్య ఆమెరికాదేశమున వేడిగాడ్పులు విసరెను. ఆసందర్భమున అందఱును ఇండ్లలోదూరి శైత్యోపచారములు చేసికోగా ఈతడు బహిరంగస్థలములందుపచారు చేసెను. అతడుప్రపంచిరవల్యాపమునుచూచియున్నాడు. అతనికిపండ్లు ముమ్మారువచ్చి ముమ్మారు ఊడినవి. అమెరికాదేశమునందలి ఒకదంతవైద్యునినుండి ఆతడు డెబ్బదియైదుసంవత్సరములకు పూచీకత్తుగలచేత దంతముల కట్టుజతలను ఇప్పుడు తీసియున్నాడు.

రెండువందలనలుబదిఏండ్లవయస్సునరోజుకు 30 మైళ్లునడచుట:—

చీనాలో టీనుసినులో లెట్టిసెంటు సినుయును అనునతడు కలడు. హ్యూను హూరాజు సింహాసనమెక్కిన పిమ్మట 17 వ సంవత్సరమున 1687లో నితడుపుట్టెను. ఇపుడు ఇతనిసంతతివారు 11 తరములవారు కలరు. 1 ఇతడు 2 కొడుకు 3 మనుమడు 4 మునిమనుమడు 5 యినిమనుమడు 6 యినిమనుమని కొడుకు 7 యినిమనుమని మనుమడు 8 యినిమనుమని మునిమనుమడు 9 యినిమనుమని యినిమనుమని యినుమనుమడు 10 యినిమనుమని యినుమనికొడుకు 11 యినుమనుమని యినిమనుమని తామరతంపరగానున్న మనుమడు. 11 తరముల సంతానమును చూచుచు ఇతడింకను సజీవుడైయున్నాడు. గత 200 యేండ్లనుండి యితడు ప్రతిదినమును రోజుకు 30 మైళ్లునడుచుచు గ్రామములవెంట తిరిగి మందుల నమ్ముచుండెను. న్యూయార్కుటైమ్సు విలేఖరి టీనుసినువెళ్లి యితనిని చూచి వచ్చెను. ఇతడు 1687 లో జన్మించెనుగదా. ఇపుడు 1930-వ సంవత్సరము. కాన ఇతనికి ఇప్పుడు రెండువందలనలుబదిమూడవవత్సరము. —ఆంధ్రపత్రిక

నలుబదియైదేండ్లనుండి అన్నపానములుముట్టని అతివ:—

వంగరాష్ట్రమున బంకూరామండలమునందలి బయూరు అను కుగ్రామమున నలుబదియైదు వత్సరములుగా అన్నపానములుతాకకుండనున్న స్త్రీగలదు. ఆమెకు మిక్కిలిచిన్నతనముననే వైధవ్యముప్రాప్తించెను, అందుతో ఆమె విచారఖిన్నయయ్యెను. ప్రాపంచికవిషయములందు ఆమెకు గొప్ప విరక్తిభావముకలిగెను. ఆమె అన్నపానములు ముట్టుటకూడ మానివేసెను. ఆమె కాయస్థకులమునకు చెందినది. ఆమె సోదరుడు పురూలియాకోర్టులో న్యాయవాది. ఆమెకు ఇప్పుడు అరువదిసంవత్సరములు దాటినవి. ఆమె అన్నపానములు విడనాడి నలుబదియైదు సంవత్సరములైనది. ఈకాలములో ఆమెకెప్పుడును జబ్బుచేయలేదు. ఆ ప్రాంతమున మలేరియా హెచ్చు. అయినను ఆమెనుఎప్పుడును మలేరియాజ్వరముసోకలేదు. ఆమె గొప్పఆస్తిపరాలు. ఇంటిపనులన్నియు ఆమెయేనిర్వహించును. గుప్పెడుమెతుకులైనను, గ్రుక్కెడుమంచినీళ్లయినను ముట్టక ఆమె నలుబదియైదుసంవత్సరములుగ గృహకృత్యములు సకలము నిర్వహించుచు జీవయాత్ర సాగించుచున్నది.




## ఒక సింహము ఆడుపులిని ప్రేమించిన యదార్థగాథ:—

ప్రేమ విశ్వవ్యాపితమైన ఒకశక్తి. మానవలోకము మీదేకాక, జంతువులమీదా – జగదీశుడు చెప్పినట్లు సజీవములే ఐతే–తరులతలమీదా, ప్రేమ తన అధికారముద్ర చెలాయిస్తోంది. ప్రత్యక్షముగా చూచిన ఒకరుచెప్పిన ఈకథావృత్తాంతము నీక్రింద ఉదాహరిస్తున్నాము. ఒకతోటలో ఆడుపులినొకదానిని పెద్దబోనులో పెట్టి ఉంచారు. చాలామంది అది ఎవరికీ అపాయంచేసేదికాదని చెప్పేవారు. అదికూడా తనబోనులో సాధువుగానూ, తృప్తిగానూ, ఉన్నట్లు కనబడేది. దానికి దగ్గరే మరొకబోనులో ఒకసింహముంది. పెద్దదై, బలశాలియై, ఆరోగ్యవంతమై చూడడానికి అందముగాకూడాఉండెడిది. రెండింటికి ఆహారముపెట్టి పోషిస్తోఉండేవారు. కొంతకాలముదాకా మరేమీ విశేషంలేకుండానే గడచిపోయింది. ఇల్లాఉండగా, ఒకనాడు మరొక ఆడుపులిని తీసికొనివచ్చారు. దాని చూపుల్లో క్రౌర్యముంది. ఎప్పుడు కస్సుమంటోనే ఉండేది. రెండేబోనులున్నాయి. ఏంచేదామాఅని ఆలోచించారు. "సరే మధ్యగా ఇనుపకమ్ములుపెట్టి ఇదివరకున్న పులినీ, సింహాన్నీ ఒకదానిలోనేపెడదాము" అని ఒకరు సలహాచెప్పారు. సరేనన్నారు. కాని, ఇనుపకమ్ములకు బదులు దృఢమైన కఱ్ఱకమ్ములుమాత్రమేపెట్టారు. మొదటేమో సింహము, తనఇంటిలో సగభాగము పెద్దపులి ఆక్రమించుకోడానికిఇష్టపడక గర్జించింది. ఎల్లాగో ఆఖరికి ఆ ఆడుపులినితోసి లోపలికి పంపించారు. సింహము విధిలేక దానికి తనఇంట్లో స్వాగతమివ్వవలసివచ్చింది. లేదు. అవి ఎప్పుడూ విడిపోకుండా ఉండాలనుకొన్నాయి. కాని మనుష్యుడిచేతులంతకన్నా శక్తివంతములైనవికావూ? వానిని విడదీసిన కొన్నాళ్ళదాకా అవి ఒకదానికేసి మరొకటి చూచుకొంటూ ఉండేవి. అవి ఆహారము తినడం మానివేశాయి. మృగరాజుకు రోగలక్షణాలు కనుపించాయి. నానాటికీ చిక్కిపోతున్నాడు. ఆడుపులిగతీ అల్లాగేఉంది. ఆ మృగములను పెంచేవాడు దయగలవాడు. ఇదివరకుదానికన్నా పెద్దబోను నొకదానిని నిర్మించి రెండింటినీ మళ్లీ ఒకదానిలోనే పెట్టారు. వాటి ఆనందానికి మేరలేదు. అవి ఒకదాని శరీరాన్ని ఒకటి నాకుకొన్నాయి. రక్తారుణమైన భాస్కరబింబము పశ్చిమాకాశముమీద దిగజారుతో ఉండేవేళ, ప్రేమతో, తనప్రియురాలి శరీరాన్ని తదేకధ్యానంతో నాకుతోన్న సింహము. ప్రథమదర్శనమువల్లనే జనించినప్రేమా అది? మొదటి రోజంతా ఆసింహము మౌనముద్రవహించింది. ఆమూగతనంలో ఏమి అర్థముందో ఎవరికి తెలుసు? మూడు నాలుగునెలలైన తరువాత, ఒకచక్కని ఉదయకాలమందు, ఆమృగాలను పెంచేవాడు ఒకవింతదృశ్యాన్ని చూసి, ఆశ్చర్యచకితుడయ్యాడు. సింహము కఱ్ఱకమ్ముల్లోంచి, ఆ ఆడుపులిని నాకుతోంది! "రాతిగోడలు కారాగారమును, ఇనుపకమ్ములు పంజరమును తయారుచేయలేవు." ఆ ఆడుపులి సింహానికి ప్రియురాలు కాదూ? ఈసంగతిచూచి, ఆమృగాలనుపెంచేవాడు, ఏమిజరుగుతుందో చూడాలని కుతూహలంచేత ఆరెంటినీ విడదీసి వేరుగాఉంచాడు. ఆపని రెండింటికి ప్రమాదకరమైంది. తమప్రేమలో మనుష్యుడు చెయ్యి చేసుకొని అంతరాయమవుతాడని అవిఎప్పుడూఅనుకోలేదు. ఒకచోటికిచేర్చబడ్డాయి. తన ప్రియుడిభుజముమీదతలవాల్చి పరుండియున్న ఆడుపులిని, కావాలన్నవాళ్లు నేటికిని చూడవచ్చును. —కస్తూరి రాజామాణిక్యము

మేనరికము:—

మేనరికము అనగా మేనల్లునికి బిడ్డనిచ్చుట. ఇది విధిగాకొన్నిప్రదేశములలో లేకపోవచ్చుగాని, మా నెల్లూరుజిల్లాలో అందులో కనిగిరితాలూకాలో ముఖ్యముగా విధిగా బిడ్డనిచ్చి తీరవలసినదే. ఇతరుల విషయంలో నేను చెప్పజాలనుకాని ఆర్యవైశ్యులలోపుట్టుకు మరితప్పించుటకులేదు. బిడ్డను తీసుకొనవలసిన వారైనను సరె తప్పుటకులేదు. ఈపద్ధతిలో యీడుజోడు సరిగావుండి ధనగౌరవములు సరిగానుండువారు పాతచుట్టరికము తొలగకుండా సమకూర్చినందులకు భగవంతుని అనేకవిధముల కొనియాడెదరు. అందుకు యేభాగము విరుద్ధమైననూ వారివిచారము చెప్పనక్కఱలేదు. కొన్నాళ్లక్రిందట కనిగిరి సమీపమున ఒకగ్రామములో ఒక ఆర్యవైశ్యుని యింటవివాహముకావలసిన యిద్దరుకొమార్తెలుండిరి. పెద్దకూతురు 12 సంవత్సరములు. చిన్నది 8 సంవత్సరములు. ఆపెద్దకూతురు సుమారు 55 సంవత్సరములకు తక్కువలేని బ్రహ్మచారికి మేనరిక భాద్యత కలిగియుండెను. తండ్రి యేవిధముగానయినా తప్పించవలెనని ప్రయత్నములు సలిపెనుగాని సమకూడదయ్యెను. ఆగ్రామములో ఆయనతో వైరముగల వకరిద్దరువైశ్యులు యేవిధముగానయినా సరే ఆముసలివానికి ఆపిల్లను వివాహముచేయించి తీరవలెనని యుండిరి. అప్పటికిగాని కన్యాదాతను ఓడించితిమను సంతోషమువారికి కలుగదు. ఆహా! వారికి వారికిగల పరస్పరవైషమ్యములు ఆచిన్నబిడ్డపైననాచూపవలయును? కన్యాదాతయేమి చేయగలడు? నువెవరికయినా యిద్దామని వెళ్లినచో మేనరికము పిల్లయని వానికి తెలిసియెయుండును. తెలియకపోయిన యీరామాయణమంతయు ముందుగా చెప్పకతప్పదు. చెప్పనిచో దాగునా? యిదంతయు విని మాపిల్లవానికి మరియెక్కడనయినాపిల్లనుచూచుకుంటాముగాని మాకు ఈతగాయిదా బిడ్డవలదువలదనుచుండిరి. దొంగతనముగా చేయుదమన్ననూ వుభయులు గ్రామములో సహపంక్తిభోజనములకుసహా దూరముకావలసినదే. ఇందుకు ఎవరుధైర్యము చేయగలరు? తుదకు గ్రామస్థులకు చెప్పుకొనిరి. వారందరు వకచోటచేరి అంతయు విని ఆపిల్లను పిలిపించి అడిగిరి. ఆపిల్ల కొంచెమో గొప్పో చదువు అభ్యసించినదగుట "నాకు ఆ భర్త అవసరములేదు. మీరుపట్టుపట్టిచేసినచో నుయ్యో గొయ్యో చూచుకొంటా." అని గిరుక్కున వెడలిపోయెను. ఇకను వారుచేయునదిలేక, ఆవరుని యేలాగయిననూ వివాహము అక్కరలేదని నీవు సమ్మతింపచేసుకున్నచో వారు సహాయముచేయుదుమనికన్యాదాతతో చెప్పిరి. అంతట వానిని పిలిచి 'నీకు కొంతడబ్బు యిచ్చెదను మరెచ్చటనయినా మాట్లాడి వివాహము నేనేచేయించిపెట్టెదను' అని కన్యాదాత ఎన్నిచెప్పిననూ ఇప్పుడు తప్పిన వివాహముకాదని ఆ పేదవానికి అందులో వయసుమీరిన వానికి కాదని తెలియును గావున సమ్మతించక పోయెను. పిల్ల వినకపోయెను. గ్రామస్థులు ఆలాగుచెప్పిరి. వరుడు వినకపోయె. మరేమిచేయగలడు? తిరిగి గ్రామస్థులవద్దకువెళ్లి మొరపెట్టుకొనెను. అప్పుడు వారు ఆలోచించి పెద్దపిల్ల తెలివికలదిగనుక సాగదు. రెండవ పిల్లను ఇచ్చుట మంచిదనిరి. కాన, రెండు వివాహములు అనగా యిద్దరుకొమార్తెలకు వకసారే చేయవలెననిరి. అదేప్రకారము పెద్దపిల్లకు వేరేవరుదిర్చి లగ్నముస్థిరపరచిరి. వివాహదినమున తలంబ్రాలుచేయునప్పుడు చిన్నబిడ్డ నాయనా, నాయనా, అక్కమొగుడుదగ్గర నన్నుకూర్చొపెట్టెదరేమో అని రెండుమూడుసార్లు హెచ్చరించెను. కాని వారు వినియూ పలుకలేదు. తలంబ్రాలుకాగానే ఇరుగు పొరుగు పిల్లలుచేరి నీమగడుముసలివాడులే అని చిన్నపిల్లను ఎగతాళిచేసిరి. ఆ పిల్ల ఇదంతయుగ్రహించి వివాహ వేళకు కనుపడకుండా వకచోట దాగుకొనెను. అంతకన్న ఆబిడ్డ (అష్టవర్షప్రాయముగల ఆ పసికూన) ఏమి చేయగలదు? కాని అందరూవెదకి, వెదకి, బలవంతముగా పట్టుకవెళ్లి తాళికట్టించిరి. వివాహము ముగిసెను. పిండివంటలతో భోజనములాయెను. తల్లియు తండ్రియు వారికిగల దుఃఖమునంతనూ వకసారి వెళ్లబుచ్చిరి, గ్రామస్థులందరు అన్ని విధముల అనుకొనుచూ ఎవరియిండ్లకు వారు వెళ్లిరి. ఇందులో కల్పన యేమియు లేదని పాఠకులు గ్రహింతురుగాక.

—దరిశి సుబ్బలక్ష్మమ్మ

# డైరి

## అక్టోబరు

20:—శ్రీమతి సోఫియాసోమ్జీకన్య బొంబాయి యుద్ధసంఘాధ్యక్షురాలుగ నియమింపబడెను.

—విల్లీపార్లీ సత్యాగ్రహశిబిరమునకు సేనానాయకురాలుగనున్న శ్రీమతి కమలాబెనుగారు అరెస్టుచేయబడిరి. శ్రీమతి రామ్‌కీబెన్ బజాజ్ గారిని వారు తమ స్థానమున నియమించిరి.

21:—శ్రీమతులు పెరినుబెను, కప్టెనుసతి, కోసాబెనుసతిగార్ల నాయకత్వమున బొంబాయిలో అన్నిమతముల స్త్రీలును పసుపురంగు చీరలను కట్టుకొని, చిన్నసైజు త్రివర్ణపతాకములను ధరించి దీపావళిసందర్భమున గొప్పఊరేగింపు జరిపిరి.

22:—బొంబాయిలో శ్రీమతి సోమ్జీకన్యగారు అరెస్టుచేయబడిరి. బొంబాయికార్పొరేషను సభ్యురాలును, సంఘసేవానిరతురాలునునగు శ్రీమతి అవంతికాబాయి గోఖ్లేగారు ఆమె స్థానమున బొంబాయి యుద్ధసంఘపు క్రొత్త డిక్టేటరుగా నియమింపబడిరి.

23:—బొంబాయిడిక్టేటరు శ్రీమతి సోమ్జీకన్యగారికి క్రిమినలులా అమెండుమెంటు చట్టము 1-వసెక్షను క్రింద మూడునెలలును; 2-వ సెక్షనుక్రింద ఆరునెలలును విడిఖైదు వేయబడెను. రెండుశిక్షలను యేకకాలమునందే అనుభవింపవలెను. 'బి' క్లాసు ఈయబడెను.

24:—పంజాబు విశ్వవిద్యాలయము సిండికేటు సభాకార్యక్రమమునందు మిసు మన్మోహినిజుట్షిగారు నిరుడు లాహోరులోని గవర్నమెంటుకళాశాలలో చరిత్రయందు ఎం. ఎ. పరీక్షయందు త్తీర్ణురాలైనను ఆమె అక్టోబరు 8-వతేదిని కాలేజిపికెటింగుచేసి ఒకనెల శిక్షపొందినందున ఎం.ఏ. డిగ్రి యివ్వరాదని ఆకాలేజిప్రిన్సిపాలు గారెటుగారు ప్రతిపాదనపెట్టిరి.

25:—మన్‌మోహిని జుట్షీకన్యకు ఎం.ఏ పట్టము నొసంగరాదని లాహోరు ప్రభుత్వ కళాశాలా ప్రిన్సిపాలగు కల్నల్ గారెటుగారు విశ్వవిద్యాలయపు సిండికేటులో ప్రతిపాదించిన తీర్మానము వీగిపోయెను.

26:—లూధియానాలోని మహిళాసత్యాగ్రహదళనాయకురాలు శ్రీమతి ప్రకాశవతిదేవిగారికి 4 నెలలఖైదును రు. 150 జరిమానాయును విధింపబడెను. 'ఏ' తరగతి ఇచ్చిరి.

27:—శ్రీమతి ముస్సామత్ కిశోర్ దేవి అనునొక అలహాబాదు కాంగ్రెసుప్రచారకురాలికి గవర్నమెంటుపట్ల అవిశ్వాసము పురికొల్పినందుకై మూడు నెలల కఠినశిక్షవిధింపబడెను.

—సాయంకాలము బొంబాయిలో శ్రీమతి అవంతికాబాయి గోఖ్లేగారు కార్పొరేషను సభకు వెళ్లి సభానంతరము ఈవలకురాగానే పోలీసువారామెను ఎరస్టుచేసిరి.

—కలకత్తాలోని దక్షిణభాగపు మహిళాసంఘసహాయకార్యదర్శినియు, ఏబదిసంవత్సరముల గుజరాతీ స్త్రీయునగు వాజియాబాయికి పికెటింగుఆర్డినెన్సుక్రింద 3 నెలలు కఠినశిక్ష వేయబడెను.

28:—బొంబాయిలో శ్రీమతి అవంతికాబాయిగోఖలేగారికేసు విచారణజరిగెను. క్రిమినలులా సవరణచట్టము 17 (1) ప్రకారము 6 నెలలు విడిఖైదును, 17 (2) ప్రకారము రు 400 జరిమానా, చెల్లింపనిచో మూడు నెలలు ఖైదును విధింపబడెను. 'బి' క్లాసు ఈయబడెను.

29:—ఢిల్లీలో ఒక్కసంవత్సరమువఱకు మంచినడతకలిగియుండునట్లు 1000 రూపాయిల జామీనుపత్రము వ్రాసి యివ్వవలెనని అసఫ్‌ఆలీసతి కోరబడెను. కాని ఆమె అట్లుచేయుటకు నిరాకరించినందున సంవత్సరమువిడిఖైదు విధింపబడెను. 'ఏ' తరగతి ఈయబడెను.

—చిట్టగాంగు ఆయుధములదోపిడి సందర్భమున చంద్రనాగూరులో పోలీసువారు అరెస్టుచేసినవారిలో నొకతెయగు శ్రీమతి సుహాసినీదేవిగారు విడుదలగావింపబడిరి.

—ఇండియా హైకమీషనరు చటర్జిగారిసతి లండనులో మైకల్మాస్ బారిష్టరుపరీక్షలయందు హిందూ మహమ్మదీయ న్యాయశాస్త్రములందుత్తీర్ణురాలయ్యెను.

30:—శ్రీమతి కలగరపిచ్చమ్మగారు కీ. శే. మాగంటి అన్నపూర్ణాదేవిగారి తల్లి వేలూరుజయిలునుండి శిక్షాకాలపరిమితిముగియకుండగనే వదలిపెట్టబడిరి. ఈమె కడుపునొప్పి, గుండెనొప్పి, క్షయరోగమునకు సంబంధించిన తీవ్రవ్యాధిచే బాధపడుచున్నది. ఈమె వెంట అన్నపూర్ణాదేవిగారి కుమార్తె మూడేండ్ల బాలికగలదు.

—ఢిల్లీలో శ్రీమతి సేవుగుప్తాసతి ఎరస్టుచేయబడెను.

31:—డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారిని అభినందించుటకుగాను సాయంకాలము మదరాసు ఎగ్మూరు పాంథియను తోటలయందు డాక్టరు సి. నటేశముమొదలియారుగారి అధ్యక్షతను సభజరిగెను.

నవంబరు

1:—కలకత్తాలో బెంగాలు నారీసత్యాగ్రహసమితికార్యదర్శియైన విమలప్రతిభాదేవిగారు అనారోగ్యకారణమువలన శిక్షాకాలము పూర్తికాకుండగనే వదలివేయబడిరి. వారు చిత్తరంజనవార్షికోత్సవ సందర్భమున జూను 26-వ తేదిని 6 నెలలు కఠినశిక్షకులోనైరి.

2:—కలకత్తాలో శ్రీమతులు లక్ష్మిదేవి, తారాదేవి, విద్యాదేవి, చాందీదేవి, సావిత్రీదేవి, గంగాదేవిగార్లను నిషిద్ధకీర్తనలు పాడినందుకు ఎరస్టుచేసిచెరి 6 మాసముల శిక్ష విధించిరి.

3:—బొంబాయిలో స్పిన్నర్సు కంపెనీవారి షాపుయెదుట స్త్రీలు పికెటింగుచేయ నారంభించిరి. కంపెనీ అధికారులు తమ సరుకుపెట్లెను చేతితోలాగెడిబండిలో ఎక్కించి తీసికొనివెళ్లవలెనని యత్నించిరి. స్త్రీలు అడ్డము నిల్చిరి. బండిని పోనియ్యలేదు. పోలీసువారు లాటీదెబ్బలతో జనసమూహమును తరిమివేయుచు పికెటింగు చేయుచున్న స్త్రీలను త్రోసివేయసాగిరి. ఈసంఘర్షణమందు-స్త్రీలచేతిగాజులు పగిలిపోయెను.

—12 వేలమంది స్త్రీలు బొంబాయిలో సభచేసిరి. జగన్మోహనదాసుగారిసతి సభకధ్యక్షతవహించెను. పోలీసువారు స్త్రీలయెడల ఎల్లవ నేడు మైదానమువద్ద ప్రవర్తించినవిధము అక్రమమనియు, దూష్యమనియు తీర్మానించిరి. స్త్రీల మానగౌరవములను కాపాడవలయుననియు బొంబాయి స్త్రీలందరను ఐకమత్యముతో నుండవలయుననియుకోరుచుతీర్మానముచేసిరి. ఈతీర్మానములప్రతిని వైశ్రాయిగారి భార్యకును, బొంబాయి గవర్నరుగారిభార్యకును, మేరీరాణీగారికిని అందజేసిరి. బ్రిటిషుదేశములోనున్న సుప్రసిద్ధ స్త్రీ సమాజములకుగూడ పంపిరి.

5:—

4:—క్రిమినల్‌లా అమెండుమెంటుఆక్టు 17 (1) సెక్షను ప్రకారము యీదిగువ వివరింపబడిన స్త్రీలకు ఢిల్లీ అడిషనలు డిస్ట్రిక్టుమేజస్ట్రేటు శిక్ష విధించెను. 1. సేవుగుప్తసతిగారు 4 నెలలు విడిఖైదు; (ఏ) క్లాసు 2. బీడిసతిగారు 5-వ డిక్టేటరు 6 నెలలు విడిఖైదు, (బి) క్లాసు 3. జయరాణిసతిగారు 200 రూపాయలు జుల్మానా, చెల్లించనిచో 2 నెలలు విడిఖైదు, (ఏ) క్లాసు.

6:—బరంపురమున రాజకీయోద్యమములందు పాల్గొనరాదని శ్రీమతులు అదుర్తిలక్ష్మీబాయమ్మ, యల్లయ్యసూరమ్మ, మంత్రాలసీతమ్మగార్లకు క్రిమినలు ప్రొసీజరుకోడు 144 సెక్షను క్రింద నోటీసులు జారీచేయబడెను.

7:—పశ్చిమగోదావరిజిల్లా చాగల్లునందలి ఆశ్రమస్థాపకురాలు శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు వెల్లూరుజయిలు నుండి విడుదలచేయబడిరి.

—ఏలూరునివాసిని శ్రీమతి దాసరి కృష్ణవేణమ్మగారు గర్భిణితోనున్నవారు గనుక శిక్షాపరిమితికి వారము రోజులు ముందుగ వెల్లూరు చెఱసాలనుండి విడుదలచేయబడిరి.

8:—బొంబాయి ఢిల్లీపార్లమెంటు మెంబరు శ్రీమతి కమలాబెను సోదావల్లాసతిగారికి క్రిమినలులా అమెండుమెంటు ఆక్టుప్రకారము ఎనిమిదినెలలు విడిఖైదును 200 జుల్మానాయును, జుల్మానా చెల్లింపనిచో మఱియొక నెల ఖైదును విధింపబడెను. 'ఏ' క్లాసు ఈయబడెను.

9:—

10:—శ్రీమతినవాజ్ బెన్‌జమ్షెడ్జీమహవేవాలాగారు ఢిల్లీపార్లీసత్యాగ్రహశిబిరమునకు నాయకురాలుగా నియమింపబడిరి.

—కాన్పూరులో 108 సెక్షనుక్రింద శ్రీమతి సీతాదేవిగారికి ఒకసంవత్సరము విడిఖైదు విధింపబడెను. బి. క్లాసు ఈయబడెను.

—మధ్యమాగాణముల శాసనసభఎన్నికల బహిష్కరణసందర్భమున నాగపురమున యుద్ధాలోచనసంఘాధ్యక్షురాలగు శ్రీమతి అనసూయాబాయి కేలుసతియు, శ్రీమతి కమలాబాయి హాస్పేట్ గారును అరెస్టు చేయబడిరి.

—రాజమండ్రినివాసిని శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ బి.యె. గారిపై 144-వ సెక్షను నోటీసు జారీచేయబడెను. మూడునెలలవఱకు సభలుచేయరాదనియు, ఇతరప్రబోధములు గావింపరాదనియు నిషేధింపబడిరి.

11:—బొంబాయిలో కాంగ్రెసు బులెటిన్ సంపాదకురాలగు శ్రీమతి త్రిశూలదారుకన్యగారిపై క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టు 17 (1), (2) క్రింద నేరమారోపింపబడి 4 నెలల విడిఖైదు, 50 రూపాయిలు జరిమానా, లేదా ఒక్కొక్క నేరమునకుఅధికముగా ఆరువారములశిక్ష. రెండును ఒకేసారియనుభవింపదగినవి.

12:—కలకత్తాలోషకావత్ మెమోరియల్ బాలికాపాఠశాల ప్రధానాధ్యాపకురాలుగ పనిచేసియున్న మిస్ అయేషా బీబీగారు బి.ఏ శుద్ధిసంస్కారము ననుసరించి హిందూమతమును స్వీకరించి సివిలువివాహపు చట్టము ప్రకారము శ్రీశుధీర్‌కుమారబోసుగారు యం.ఏ అను హిందూవిద్యార్థిని వివాహమాడెను.

—ఉత్కళరాష్ట్రీయకాంగ్రెసుకమిటీ అధ్యక్షులగు గోపబంధుచౌదరిగారి భార్యయగు శ్రీమతి రామదేవిగారికి కటకమునందు పికెటింగు చేసినందులకై నాలుగునెలల శిక్ష విధింపబడెను.

—ఆంధ్రకాంగ్రెసుసంఘసభ్యురాలగు శ్రీమతి శ్రీకాంతం కమలమ్మగారు వేలూరుజయిలునుండి విడుదల చేయబడిరి.

13:—

14:—మదరాసు ప్రెసిడెన్సి కాలేజి ఆంధ్రభాషాభివర్ధనీసమాజము వారి యాజమాన్యమున డాక్టరు శేషగిరినాయుడుగారు ఎమ్.ఏ; పి.హెచ్. డి. గారి యధ్యక్షతక్రింద శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు ఎమ్.ఏ; బి.ఎస్.సి. గారు పాశ్చాత్త్యదేశములలో జీవితమునుగూర్చి ఉపన్యసించిరి.

15:—మదరాసులో శ్రీమతి కామాక్షమ్మగారు అరెస్టు చేయబడిరి.

16:—కలకత్తాలో శ్రీమతి లక్ష్మీమణిదేవిగారు అరెస్టుచేయబడిరి.

17:—బొంబాయి యుద్ధసంఘమునకు శ్రీమతి ఊర్మిళామెహతాగారు (గుజరాతి స్త్రీ) అధ్యక్షురాలుగ నియమింపబడెను.

18:—

19:—మదరాసులో ఎరస్టుచేయబడిన శ్రీమతి కామాక్షమ్మగారికి 5 నెలలు విడిఖైదు విధింపబడెను.

# గ్రంథవిమర్శనము

జంటలు:—

'ఉండవిల్లి: కొండపల్లి; భువనేశ్వరము: జగన్నాధము; అంతర్వేది: మొగలితుర్రు; పెద్దతిరుపతి: చంద్రగిరి; రాజమహేంద్రవరము: ధవళేశ్వరము' అను యాత్రాస్థలములను కవితాత్మగల నొక విద్యాధికుడు సందర్శించినపుడు పొడసూపిన భావములకు ఈగ్రంథము క్రోడీకరణము. ఇవి భావగీతముల ఫక్కినిగద్యములో వ్రాయబడినవి. యాత్రాస్థలముల వర్ణనములో ఆత్మభావములను మేళవించి గద్యకవిత్వము వ్రాయు ఆచారము తెలుగున క్రొత్త. ఈ జంటలు ఆతరగతి సారస్వతమునకు పురోగామి అనవచ్చును. గ్రంథకర్తగారి గురువర్యులగు O.J. Couldrey దొరవారి 'The South Indian Hours' అను గ్రంథము ఛాయామాత్రముగ ఈ 'జంటలు' రచనమును పురికొల్పియుండవచ్చును. ఇందలి ప్రకృతివర్ణనము లతిమనోహరముగ నుండి క్రొత్తదనమును వెలిగ్రక్కుచున్నవి. ప్రకృతిదేవి నర్తించు ఈగ్రంథకర్తకి వారినిపాతాలు ఆడవారి పాంజేబు పట్టాలవలెను, తుమ్మకాయగొలుసులవలెను గోచరించినవి. కొండపల్లిబొమ్మలనుగూర్చి వ్రాయు పట్టున కవి తన దేశాభిమానమునంతను గ్రుమ్మరించినాడు. కొండలెక్కే అడ్డదార్లు వైకుంఠపాళీనిచ్చెనలవలె లీలామాత్రముగ పొడగట్టు ఈ కవికి భువనేశ్వరయాత్ర భూరియానంద మిచ్చుట వింతగాదు. అన్నిటికన్నను రాజమహేంద్రవరమును గూర్చిన ప్రకరణము అవ్యయానంద మిచ్చుచున్నది. రసార్ద్రతయు అందే హెచ్చుగా నున్నది. ఆపురి కవిగారి కాణాచిగదా. ఉచితజ్ఞులగు ఆంధ్రులెల్లరు ప్రోత్సాహింపదగిన ఉత్తమగ్రంథము. క్రౌనుసైజున 140 పుటలు. గ్లేజుకాగితము లు. 1930-వ సంవత్సరము సీతారామముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల రు. 1-0-0. వలయువారు గ్రంథకర్తలగు శ్రీకవికొండల వేంకటరావు (బి.యె. బి.యల్) గారిపేర పశ్చిమగోదావరిజిల్లా నరసాపురమునకు వ్రాయవలెను.

—గృహలక్ష్మి

ఆంధ్ర దేశీయ కథావళి (రెండవ భాగము):—

ఇయ్యది సుమారు 56 పుటలుగల గ్రంథము. ఇందు 17 కథలు వ్రాయబడియున్నవి. ఇందలి కథలు వాస్తవములైనను గాకున్నను నమ్మదగినటుల నెంతయు సమంజసముగఁ గన్పట్టుచున్నవనుట నిశ్చయము. పింగళి వారి పేకికథయెంతయు బాలురకాహ్లాదకరముగను సత్యమ్మృతముగను గన్పట్టును. ఈకథనుబట్టి పింగళివంశము గంధర్వసేవితమనియు నందుచే నుత్కృష్టమైనదనియు నూహింపవలసి యుండును. తిమ్మరుసుకథలో గృష్ణ సర్ప మాతపమును వారించుచుండుటచేఁ దిమ్మరుసుయొక్క భావియదృష్టము సూచింపబడుచున్నది. ఇందలి రచన మృదుమధురపదగుంభితమై యత్యద్భుతరసావహమై యొప్పారుచున్నదనవచ్చును. ఆంధ్రులై యుండి మున్ముందు ఆంధ్రవాఙ్మయము నభివృద్ధిఁజేయవలసిన బాలు రిట్టిగ్రంథములం జదివియుండిన రాఘవపాండవీయాదియాంధ్రోత్తమగ్రంథములం జదువుపట్ల వారికి వింతవింతయూహ లుద్భవించి విద్యాభాగ్యోదయమున కెంతయు తగియుందురని తలచెదను. ఇట్టి కథావళిని శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావు బి.యే. యల్. టి., యమ్.ఆర్. ఎ.యస్. గారు రచించి యాంధ్రలోకమున కెంతయు నుపకృతిగావించియున్నారు. వలయువారు నెం. 134, వెల్లాల వీధి, పరశువాకం, వేపేరిపోస్టు, మద్రాసు అని వ్రాసినఁబడయగల్గుదురు.

—పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రి

**మణిభూషణము (రెండు భాగములు):—**

ఇదియొక సంధానగ్రంథము. రసవత్తరములగు కథాఘట్టములు భారత, భాగవతములనుండి సంగృహీతములై ఆంధ్రభాషాభ్యాసకులగు విద్యార్థుల మానససీమ నలంకరించు నొకభూషణవిశేషణమునకు మణుల భాతి కూర్చఁబడినవి. ఇట్టి పొందికను చేయుట కష్టసాధ్యమైన పని యగుఁజనును. ఏలయన ఇట్టి మనోజ్ఞములగు కథాఘట్టములను సంతరించుటలో ఆంధ్రభాషోపన్యాసకులు కథాసరళి కడ్డని పద్యములు కొన్నితీసివేసి, వలసినంతభాగము మాత్రముంచి యివ్విధమున నేర్చికూర్చ కబ్బయు కష్టసాధ్యమని విజ్ఞులకెల్లరకుఁ దెలియును. ఇవి హైస్కూలు ఫారములలో పఠనీయములుగనుంచ నెంతయు దగియున్నవి. మణిభూషణ మనుసుసనోజ్ఞనామముతో రెండు భాగములను శ్రీయుత వేమవుల్ల రాజగోపాలరావుగారు. B.A.L.T., M.R.A.S., (Telugu Lecturer, Christian College, Madras) ప్రకటించిరి. వెల మొదటిభాగము0-8-0. రెండవభాగము 0-10-0, వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

—అకుండి వేంకటశాస్త్రి

**ఆబ్దికమంత్రములు:—**

ఏపనులుమానినను హిందువులు శాస్త్రసమ్మతమైన యాబ్దికకృత్యములమాత్ర మింకను మానకున్నారనుట సత్యమే. ఆబ్దికమంత్రము లందరు నభ్యసించియుండక పోవచ్చును. కారయితలెల్ల సమయముల లభ్యముకాక పోవచ్చును. పుస్తకరూపమగు నీయుపదేష్టను గృహమున నుంచుకొనుట యుక్తము. ఈగ్రంథమున సాబ్దిక ప్రయోగవిధులును, మంత్రములును సమగ్రముగను, సస్వరముగను వ్రాయబడియున్నవి. ఇందలి మంత్రములు, తైత్తిరీయబ్రాహ్మణాదికములలో నెచ్చెటెచ్చటనున్నదియు ననుక్రమణికకూడ నిందుఁజేర్పబడియున్నది. ఇయ్యది సుమారు డెమ్మీసైజున 128 పుటలు గలిగి రు. 1-4-0 వెల గల గ్రంథము. ప్రతియింటనుండదగినది. దీనిని స్వధర్మప్రకాశినిపత్రికాధిపతులు ప్రకటించి బూర్వాచారపరాయణులకు మహోపకారమొనర్చినారు. 'మేనేజరు, స్వధర్మప్రకాశిని, బృందావనం, కీల్పాకుపోస్టు, మదరాసు' అని వ్రాసిన నీగ్రంథము లభింపగలదు.

—పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రి

**బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక:—**

కర్త కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు. వీరు రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వమువారి కళాశాలలో సంస్కృతపండితులుగను, కొవ్వూరు సంస్కృతకళాశాల ప్రధానోపాధ్యాయులుగను ఉండి వినుమిగిలినవారు. గ్రంథము పరవస్తు చిన్నయసూరిగారి బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానము. డెమ్మీసైజున 850 పుటలు. వెల రు 5-0-0 మాత్రము. ఆంధ్ర మభ్యసించు వారికెల్లరకు బాలవ్యాకరణము పాయరానిమిత్రము. అట్టి బాలవ్యాకరణమునకు శ్రీవారు వ్యాఖ్యానము రచియించి దానిని సులభగ్రాహ్యముగ చేసినారు. ఈవ్యాఖ్యానము సాయమున బాలవ్యాకరణమును గురుసాహాయ్య మక్కఱ లేకనే పఠింపవచ్చును. ఈ గ్రంథమున కిది రెండవ ముద్రణము. ప్రథమముద్రణమునలేని పెక్కు విషయము లిందు చేర్పబడి గ్రంథముయొక్క విలువను పెంపొందించుచున్నవి. బాలవ్యాకరణసూత్రములకు మాతృకలని శ్రీవారు ఎలుగెత్తి చెప్పు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి హరికారకలు కూడ నిందుచేర్పబడినవి. ఈ కారికలు కంఠస్థ మొనర్చుకొనుటకు అనువుగ సంస్కృతమున శ్లోకరూపమున వ్రాయబడియున్నవి. వీనిని జిహ్వాగమున

నిలుపుకొను వారికి ఆంధ్రవ్యాకరణమందలి మర్యాదలన్నియు కొట్టినపిండియగును. ఈముద్రణమున శ్రీవారి వ్యాఖ్యానముల నాక్షేపించుచు శ్రీవఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారును, మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారును పత్రికలలో వ్రాసినవ్రాతలకు శ్రీవారు చెప్పిన సమాధానములుకూడ చేర్పబడినవి. ప్రాచ్యవిద్వత్పరీక్షలు ప్రాముఖ్యమునకు వచ్చుచున్న ఈరోజులలో ఈబాలవ్యాకరణగుప్తార్థ ప్రకాశిక బహుళప్రచారమునంది శ్రీశాస్త్రిగారి కీర్తిని అనశ్వరము చేయగలదు. గ్రంథమువలయువారు శ్రీయుత కల్లూరి రామచంద్రమూర్తిగారు, బి.యె; బి.ఇ.డి; అసిస్టెంటుటీచరు, బోర్డు హైస్కూలు, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా అనుచిరునామాకు వ్రాయునది.

—గృహలక్ష్మి

**నూటపదియార్లు:—**

పరమేశ్వరునిగూర్చి భక్తుడు వెలువరించిన భావపరంపర నూటపదియారు సీసపద్యములలో కూర్చబడినది. ఈనూటపదియారు సీసపద్యములలో మొదటి ఏబదియెనిమిదియు తొలిదొంతరగను, రెండవ ఏబదియెనిమిదియు మలిదొంతరగను విభాగింపబడినవి. రచయితలు శ్రీయుత ఓలేటి వేంకటరామశాస్త్రిగారు. గ్రంథమునందలి ప్రతిపద్యమును భక్తిభావమును గురియించుచున్నది. కఠినపదములు లేవు. శైలిధారాళము. ఇందలి పద్యములు స్త్రీలును బాలురును కంఠస్థ మొనర్చుకొనుటకు అనువైయున్నవి. అవి వారి మనములందు మంచి భక్తిభావమును రెచ్చకొట్టుటకు సమర్థములై విలసిల్లుచున్నవి. గ్రంథము 1927-వ సంవత్సరమున పిఠాపురమునందలి విద్వజ్జనమనోరంజని ముద్రాక్షరశాలయందు ముద్రితము. క్రౌను సైజు గ్లేజు కాగితము. వెల తెలుపబడలేదు. వలయువారు గ్రంథకర్తగారి పేర పిఠాపురమునకు వ్రాయవలెను.

—గృహలక్ష్మి

**మానసబోధతారావళి:—**

పిఠాపురవాస్తవ్యులు శ్రీమల్యాల వేంకటశేషగిరిరావుగారిచే రచియింపబడి శ్రీఉమర్ ఆలీషాకవిగారిచే సరిచూడబడి శ్రీశొంఠి సత్యనారాయణమూర్తిగారిచే ముద్రింపబడి కాకినాడ లక్ష్మీకంపెనీ వారిచే ప్రకటింపబడినది. చదువరుల మనమున భక్తిభావమును పూరించు చిన్నగ్రంథము. వెల ఒక అణా.

# పత్రికాపరిచయము

**భారతీపత్రిక:—**

ఇది బరంపురమునుండి ప్రచురింపబడుచున్న తెలుగుదినపత్రిక. ఆంధ్రదేశమున మొదటి దినపత్రిక రాజమహేంద్రవరమున కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే 'గౌతమి' అనుపేర నిర్వహింపబడినది. కాని అది చిరకాలము నిలవలేదు. మంచికట్టుదిట్టములతో ప్రారంభింపబడి సాగింపబడుచున్న తెలుగుదినపత్రిక దేశోద్ధారకుని ఆంధ్రపత్రిక యొక్కటియే. సమదర్శినికూడ దినపత్రికగా మారినదని విందుము. ఆంధ్రపత్రికవలె ఇదియు మద్రాసునందే ప్రచురింపబడుచున్నది. సౌకర్యములంతగా లేని ఉత్తరసర్కారుల పట్టణములలో నొకదానియందు భారతీదినపత్రిక నిర్వహింప సమకట్టినవారి దీక్ష ప్రశంసింపదగినదియు, ప్రోత్సహింపదగినదియునై

యున్నదనుటలో సందేహములేదు. పత్రికకు ప్రొప్రయిటరగు గాదె బలరామదాసు (బి. ఏ) గారిని; పత్రికా సంపాదకులగు యమ్. వి. రమణారావు (బి.ఏ.) గారిని మేమీసందర్భమున మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. పత్రిక చిరకాలము వర్ధిల్లుగాక! ఈదినపత్రికకు ఒక నెలకు చందా రు 1-8-0 మాత్రము. వలయువారు మేనేజరు 'భారతీపత్రిక' బరంపురము, గంజాజిల్లా అనుచిరునామాకు వ్రాయవలెను.

కథాకల్పము:—

ఇదియొక నూతనసచిత్రకథల మాసపత్రిక. తొలి సంచిక నవంబరుమాసమున వెలువడినది. ఇందు ఆదర్శకపుప్రేమ; రామన్, మోహన్; రాణీ; దిక్కులేనివారికి దేవుడేదిక్కు; అపాయకరమగు నుపాయము; చిత్రగుప్తుని భర్తుడు అను కథలుగలవు. ఈప్రథమసంచిక తొందరగ ముద్రింపబడుటచే కాబోలు అచ్చుతప్పులు అనేకము నిలిచిపోయినవి. ఇకముందుసంచికల ప్రూఫులు జాగ్రత్తగ పరిశీలింపబడుగాక! ఈపత్రిక చివరపుటపై నంద్యాల వి. యన్. ప్రెస్‌వారి ప్రకటనగలదు. అది అచ్చముగ మాలోగ్రాప్రెస్సునుగూర్చి మేము వత్సరములుగ గృహలక్ష్మిలో వేయుచున్న ప్రకటనయే. ఇది గ్రంథచౌర్యమనిపించుకొనును గావున ముందుసంచికలనుండి ఈప్రకటనయొక్క రచనము మార్పునొందుగాక! పత్రిక సాలుచందా రు. 3-0-0. డెమ్మీ సైజున గ్లేజు కాగితములతో నొప్పుచున్నది. వలయువారు 'కథాకల్పము' ఆఫీసు, బండాత్మకూరు, నంద్యాల తాలూకా, కర్నూలుజిల్లా అను చిరునామాకు వ్రాయునది.

వైద్యప్రచారిణి:—

వైద్యవిద్వత్సభపక్షమున ప్రకటింపబడు ద్వైమాసపత్రిక. సంపాదకులు, ప్రకాశకులు వైద్యవిద్వాన్ కంభంమెట్టు విష్ణువర్ధనరావుగారు ఏ. ఆర్. ఏ. సి. బెజవాడ. పత్రిక డెమ్మీసైజున గ్లేజు కాగితములపై నచ్చొత్తింపబడుచున్నది. ఆయుర్వేదాభిమానులాదరింపదగిన పత్రిక. సంవత్సరపు చందా రు 1-8-0 మాత్రము. వలయువారు సంపాదకుల పేర వ్రాయవచ్చును.

జ్యోతిషచంద్రిక:—

ఆంగ్లమున ప్రచురింపబడు జ్యోతిషవిషయికమగు మాసపత్రిక. ప్రతిమాసము రెండుజాతకములను గూర్చిన చర్చ, ఇదివఱకు ప్రచురితములుగాని జ్యోతిషవిద్యారహస్యములు ఈ మాసపత్రికయందు ప్రచురింపబడును. సంవత్సరపు చందా రు. 2-12-0. పత్రిక డెమ్మీసైజున ప్రచురింపబడుచున్నది. పత్రికాసంపాదకులు పండిత జ్యోషి ఐ. వి. ఆర్. శర్మగారు. ప్రొఫెసరు ఐ. షణ్ముగరావుగారు మేనేజింగు డైరక్టరు. పత్రికవలయువారు మద్రాసు, చేపాకు నందలి అరుణాచలఆచారివీథిలోని 2/32 గృహమునందున్న జ్యోతిషచంద్రికాకార్యాలయమునకు వ్రాయవలెను.

లాంగ్విటీ:—

దీర్ఘాయువునందుటకు చక్కని ఆరోగ్యమార్గములను బోధించు ఆంగ్లమాసపత్రిక. 1930 జూలైలో ప్రారంభింపబడినది. మాసక్రమమున వెలువడుచున్నది. సంచికలన్నియు ఆరోగ్యవిషయగర్భితములై చదువరులకెంతయో క్రొత్త విజ్ఞానమును చేకూర్పగలవిగానున్నవి. ఆరోగ్యమార్గము లుపదేశించుట కీపత్రిక స్నేహితుడుగ నుండగలదు. మదరాసు ట్రిప్లికేను, 60 సుందరమూర్తి వినయాగరుకోవెలవీథి పత్రికాకార్యస్థానము. వలయువారు అచ్చటికి వ్రాయవచ్చును. సాలుచందా పోస్టుఖర్చులుసహా రు. 3-4-0 మాత్రము.




**రామమోహనుడు సహగమనాచారము ఉండవలెనన్నాడట:—**

కాప్టెన్ జె. ఇ. ఎలామ్అను తెల్లదొర ఈసంవత్సరము ఏప్రియలు మాసమున నొకగ్రంథమును ప్రచురించియున్నాడు. దానినామము 'స్వరాజ్యము: హిందూదేశసమస్య' అని. పీఠికలో గ్రంథకర్త తానీగ్రంథమును తనతోడిదేశీయులకు హిందూదేశమునుగూర్చిన నిజజ్ఞానమును గల్గించుటకు రచియించితినని వక్కాణించినాడు. అయిఉండునని చదివితిమి. పెక్కుతావులనది మేయమ్మగారి 'మదర్ ఇండియా' కు ఛాయగానున్నది. కాని కొన్నికొన్ని అబద్ధపువ్రాతలలోనిది దాని యబ్బయనిపించుకొనజాలియున్నది. రామమోహనరాయలనుగూర్చి ఎలామ్ దొరవ్రాసిన వాక్యములను చిత్తగింపుడు: "సహగమనదురాచారము నిషేధింపవలయునను లార్డువిలియము బెంటిక్కు సలహా తీవ్రముగా అందు ముఖ్యముగా బ్రాహ్మణపండితులచే ప్రతిఘటింపబడెను. బ్రాహ్మణప్రతినిధులు బెంటిక్కును సందర్శించి ఆ ఆచారము నిషేధింపరాదని విన్నవించుకొనిరి. ఆవిన్నపముపై ఎనుబదిమంది బ్రాహ్మణ పండితుల సంతకములు చేసిరి. బెంటికుప్రభువు దానిని ప్రీవీకౌన్సిలు వారికి బంపెను. తత్సందర్భమున రామమోహనరాయలు-గొప్పసంస్కర్తయని కొనియాడబడుచున్నవాడు-స్వయముగ లండనువెళ్లి న్యాయవాదుల నేర్పఱచి హిందువుల మతాచారములను తాకుట న్యాయముగాదని వాదింపించెను. కాని రామమోహనుని ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. ప్రివీకౌన్సిలువారు ఈవిన్నపమును త్రోసిపుచ్చిరి. అందుతో సహగమనదురాచారమును నిషేధించుచు విలియము బెంటిక్కుప్రభువుచేసిన శాసనము 1829-వ సంవత్సరమున బ్రిటీషుభారతదేశమున అమలులోనికివచ్చెను." సహగమనదురాచారమును పాఱద్రోలుటలో ప్రభుత్వమువారికి రామమోహనరాయలు కుడిభుజమై పనిచేసెనని హిందూదేశమునందలి కుమ్మరిపురుగు సైతముచెప్పగలదు. ఇట్లు సత్యగోపనముచేయుటవలని లాభమేమో తెలియరాదు. హిందూదేశమును గూర్చిన యదార్థజ్ఞానముతోడిదేశీయులకు ఈగ్రంథము మూలమున ఎలామ్దొరగారు ఎంతవఱకు గల్గింపగలుగుదురో ఈ ఒక్క విషయమువలననే తేటతెల్లముగాగలదు. భారతదేశచరిత్రను ఈ గ్రంథము మూలముననే తెలిసి

కొను ఆంగ్లేయునకు హిందూదేశమున గొప్పసంస్కరణములు బయలుదేరుటకు ఆదిపీఠమగు రామమోహనరాయలు పుణ్యమెఱుగని పూర్వాచారపరాయణుఁడుగ నెఱుకపడునుగదా?

జనాభాబహిష్కారము : "దీనబంధు":—

గతమాసపు గృహలక్ష్మిలో మేము జనాభాగణనమును బహిష్కరించుట మంచి మతముగాదని చాటియుంటిమి. మాసమకాలికపత్రికయగు 'దీనబంధు' ఈ విషయమై మాతో ఏకీభవించుచున్నదని తెలుపుటకు సంతసించుచున్నాము. నవంబరు 5-వ తేదీనాటి 'దీనబంధు' తనసంపాదకీయవ్యాఖ్యలయందు ఇట్లు ప్రచురించినది. "భారతదేశముయొక్క జనాభాగణనము తప్పక అవసరము. మేమెప్పుడును నిట్టి అవ్యక్తపు ఉద్యమములయెడల సానుభూతి జూపజాలము. ప్రతిదేశమునకును జనసంఖ్యానిర్ణయ మవసరము. జాతీయోద్యమమునకుగూడ నిది ప్రాముఖ్యమే. ఇట్టిస్థితిలో పెండ్లికి చావుకు నొకేమంత్రము నేకరుపెట్టుట, ప్రతివిషయమునకు అడ్డుతగులుట, బహిష్కరణాస్త్రమును విసరుట నేడు ఆచారమైనది. ఇప్పటికైనను ఈయుద్యమనిర్మాతలు మౌనమువహించిన ముందు క్లిష్టపరిస్థితులకు తావులేకుండబోవును." ప్రజాభిప్రాయవాహినిని సుక్షేత్రములపై పాఱించుటకు పత్రికలే సమర్థములు గావున ఇతర పత్రికలుగూడ 'దీనబంధు' మార్గము నవలంబించి బహిష్కారాయుధమును ప్రయోగింపరానివిషయములపై ప్రయోగింపకుండునట్లు ప్రజాసంఘమును ప్రబోధించునుగాక!

శ్రీమతి సేనుగుప్తా సతి నిర్బంధము:—

సతి పతిని అనుసరించినది. జతీంద్రమోహనసేనుగుప్తుడు ఇదివఱకు నాలుగు సారులు కారాగారమునకు పోయియున్నాడు. ఇది ఐదవసారి. ఈ ఐదవసారి ఆతని వెనువెంట ఆతనిభార్యకూడ కారాగారమునకు పోయినది. ఆమె అంగ్లస్త్రీ అయినను ఆమె భారతీయుని పెండ్లియాడుటచే భారతసతీధర్మము ననుసరించి పతిపాదములనంటి నడచినది. ఆమె కేసువిచారణ డిల్లీలో నవంబరు 4-వ తేదీని జరిగెను. విచారించినది ఢిల్లీజిల్లా మేజిస్ట్రేటు పూల్ దొర. విచారించువాడును, విచారింపబడునామెయు ఆంగ్లజాతికి చెందినవారే. అపూర్వసంఘటనము. క్రిమినలు లాఅమెండుమెంటుఆక్టు 17-వ సెక్షను ఏ క్రింద ఆమెకు నాలుగుమాసముల విడిఖైదు వేయబడెను. ఏక్లాసు ఈయబడెను. ఆమె విచారణలో పాల్గొనలేదు. కాని కోర్టులో నామె ఈవాఙ్మూలము నిచ్చినది. "అక్టోబరు 30-వ తేదీనాటిరాత్రి రాణితోటలో నన్ను పోలీసువారు అరెస్టుచేసిరి. నేటివఱకు నన్ను ఏమేజిస్ట్రేటు వద్దను పోలీసువారు పెట్టలేదు. నేను డిఫెంసు చేసుకోనని మీకుగాని మరియే మేజిస్ట్రేటుకుగాని యెట్లు తెలియును? జామీను విడుదలకు అర్జీయిచ్చుకోనని మీకెవరుచెప్పిరి? నన్ను జయిలున నుంచుకొమ్మని జయిలరుకు వారంటిచ్చినవారులేరు. అట్టిచో నన్ను నిర్బంధమున నుంచుట కతని కేమియధికారము? విచారణావిధానముగురించికూడ కొంత మీకు దెల్ప

వలెను. ఇదియొక బహిరంగమైన విచారణయని మీరనగలరా? ఇంగ్లీషువారు తమదేశము వదలి ఇటకువచ్చినపిదప నెట్లుమారుదురో తెలిసికొనుట కిది నిదర్శనము. ఇట్టి అక్రమము లన్నియు శీఘ్రీయంము జరుగుచున్నవి. అయినను ఈప్రభుత్వవిధానమునే వైసురాయి పొగడుచుండును. ఈ కారణములవల్లనే నేను డిఫెన్సు పెట్టుకోలేదు." ఇంగ్లీషువారు తమ దేశమువదలి ఇండియాకు వచ్చుటతోడనే ఎట్లుమారుదురో తెలిసికొనుట కిదియొక నిదర్శ నము అను శ్రీమతి సేనుగుప్తాసతి వచనముల విని పూల్‌దొరవారు ఏమని యెంచిరో? స్వజాతీయురాలు చెప్పిన ఈవాక్యములందలి సత్యమును ఆ విచారణకర్త గ్రహింపగల్గెనా?

**ఇప్పు డెంత మెచ్చుకొనునో?:—**

జతీంద్రమోహనసేనుగుప్తుని అత్తగారును, సేనుగుప్తాసతి నెల్లీ తల్లియునగు శ్రీమతి గ్రేసతి కేంబ్రిడ్జిలోనున్నది. గతపర్యాయము తన అల్లుడు సేనుగుప్త నిర్బంధింపబడినవార్త విని ఆమె 'డెయిలీన్యూసు' పత్రికాధిపతితో నిట్లుచెప్పెను. "నాఅల్లుడును కూతురును ఒండొరుల గాఢముగ ప్రేమించుకొనుచున్నారు. సేనుగుప్తునితప్ప అన్యుని పెండ్లియాడ నని నాసుతనెల్లీ పట్టుపట్టినది. అతనినే పరిణయమాడినది. 'ఆంగ్లస్త్రీ హైందవుని చేపట్టునో ఆమె పూర్తిగ హిందూతత్త్వమున లీనముగావలయును, హిందూదేశమునే తన దేశముగ చేకొనవలయును' అని నెల్లీఅభిప్రాయము. ఆఅభిప్రాయానుసారము ఆమె సేనుగుప్తాకార్యము లన్నియు స్వకార్యములుగ నెంచుకొని వ్యవహరించుచున్నది. సేనుగుప్తునికంటె మంచి భర్త నాతనయకు దొరకియుండడు." ఈ వాక్యములదెంతటి మెచ్చుకోలున్నది? ఒక్క అల్లుడు నిర్బంధింపబడినప్పుడే ఇట్లు మెచ్చుకొనిన ఉచితజ్ఞురాలు శ్రీమతి గ్రేసతి ఇప్పుడు తన అల్లునితోగూడ కారాగారమునకు తనకూతురుగూడ పోయిఉన్నదని తెలిసికొని ఎంత మెచ్చుకొనునో? సేనుగుప్తాసతి కేంబ్రిడ్జివదలి ఇరువదియొక్క సంవత్సరములైనది. ఏడుసంవ త్సరములకు పూర్వయొక్కసారిపోయి తల్లిని చూచివచ్చినది. ఈమాఱు పోయినప్పుడామె తల్లి ఆనందబాష్పములతో నామెను హృదయమునకు చేర్చుకొని అభినందింపగలదు.

**విడుదలయైనవనితామణులకు స్వాగతము:—**

నవంబరుమాసమున కొందఱు ఆంధ్రరమణీమణులు కారాగారమునుండి విడుదల యైరి. కారాగారమున వారికి సౌకర్యములు తక్కువయైనను పూర్తివిశ్రాంతియుండును. ఆ విశ్రాంతిమూలమున వారిశక్తి పుంజీభవించి విడుదలయైన పిమ్మట తిరిగి దేశహితము కొఱకు తీవ్రముగ కృషిచేయుటకు వలనుపడును. ఇప్పుడు విడుదలయైన శ్రీమతులు వార ణాసి సీతమ్మ, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, వేదాంతం కమలమ్మ, కలగర పిచ్చమ్మ, దాసరి కృష్ణవేణమ్మగార్లు రెట్టించిన దీక్షతో తిరిగి కార్యరంగమునప్రవేశింపగలరు. వారికి మా స్వాగతము.

# గృహలక్ష్మి సంక్రాంతి సంచిక

జనవరి మాసపు గృహలక్ష్మిసంచిక సంక్రాంతిసంచికగ వెలువడును. ఆసంచికలో సంక్రాంతిపండుగకు సంబంధించిన గద్యపద్యవ్యాసములే విశేషముగనుండును. సంక్రాంతి పర్వమునకుచెందిన ఈక్రిందివ్యాసములప్పుడే ప్రచురణక్రమమునందినవి.

1. సంక్రాంతి : గోపూజ (సంపాదకీయము)
2. మాయింట ఒకసంక్రాంతివిశేషము (కథ) —కవికొండల వేంకటరావుగారు.
3. సంక్రాంతిసందడి (పద్యము) —ఓలేటి నిత్యకల్యాణమ్మగారు.
4. సంక్రాంతిముత్యాలు (పద్యము) —వోలేటి సీతారామమూర్తిగారు.
5. సావిత్రిగౌరిదేవి (పద్యము) —స్థానాపతి రుక్మిణమ్మగారు.
6. సంక్రాంతి (పద్యము) —నీలంరాజు వేంకటేశ్వరరావుగారు.
7. సంక్రాంతిపర్వము (పద్యము) —బొడ్డు బాపిరాజుగారు.
8. సంక్రాంతి: శీతువ (పద్యము) —కవిసార్వభౌముడు.
9. బొమ్మలనోము (వచనము)—సత్తిరాజు కామేశ్వరరావుపంతులుగారు, బి. యె.
10. సంక్రాంతి: దీక్షావస్త్రములు (కథ)—సామవేదుల చిరంజీవమ్మగారు.
11. సంక్రాంతి (పద్యము)—వెలువోలు వసంతాదేవిగారు.

ఇవిగాక సంక్రాంతిదినములలో విరివిగపూయు చేమంతినిగూర్చి రెండువ్యాసములు ప్రచురింపబడును. సుప్రసిద్ధాంధ్రకవయిత్రి తరిగొండ వేంకమాంబ రచియించిన ద్విపదభాగవతము ఇంతవరకు అముద్రితము; దానిని సేకరించి భాగములుగ ప్రచురించుచున్నాము. అందుమొదటిభాగము సంక్రాంతిసంచికలో ప్రారంభింపబడును. ఇది స్త్రీలు పాటగా పాడుకొనుటకెంతయుదగియుండును. ఆసంచికలో రెండుత్రివర్ణచిత్రములు ప్రచురింపబడును. మొదటిచిత్రము 'వీరాంగన'. ఇది కత్తి చేబూని కదనమునకురుకుచున్న ఒకానొక క్షత్రియాంగనచిత్రము. ఆ చిత్రమును ఈ సంచికకొఱకు ప్రత్యేకము తెప్పించియున్నాము. చట్రము కట్టించుకొనుటకెంతయు దగియుండును. రెండవత్రివర్ణచిత్రము 'సంఘసేవకురాలు.' సినీమానటి మనోరమకన్య, పండగముస్తాబు, అను రెండు పూర్తిపుటఛాయాచిత్రములును; పెక్కులు ఇతరచిత్రములునుప్రచురింపబడును. అదనముగ కొద్దికాపీలుమాత్రమే ముద్రించుచున్నాము. కావున కాపీలకు త్వరపడవలెను. ఆలసించిన దొరకవు.

సంచిక ఒక్కంటికి వెల రు. 0–6–0 మాత్రమే.

సంక్రాంతి శుభవాసరములలో తమ శిష్యురాండ్రకు పాఠశాలాధికారులు ఈయ తగిన బహుమానములలో గృహలక్ష్మిసంక్రాంతిసంచిక మేలితరముదికాగలదు.

గృహలక్ష్మి; పోస్టుబాక్సు నెం 752, ఎగ్మూరు, మదరాసు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# విషయసూచిక

---

నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ వారి

# ఆంధ్ర వ్యాసరచన పోటీపరీక్షలు

1. ఈ పరీక్షలకుఁ గానుపంపబడు వ్యాసములలో ఉత్తమమగు దానిని రచించిన వారికి "కేసరి స్వర్ణపదకమును" "రేబాలసుందరరామిరెడ్డిగారి స్వర్ణపదకమును" ప్రోగ్రెసివ్ యూనియన్ వారు తిక్కనజయంత్యుత్సవమున బహూకరణముగా నొసంగుదురు.

2. ఈ పరీక్షలలోఁ దొలిదానికి, అనగా "కేసరి స్వర్ణపదక" పరీక్షకు స్త్రీలుమాత్రమే పోటీచేయ నర్హులు. రెండవదానికి బోధనాభ్యసన పాఠశాలలలోను, ఉన్నతపాఠశాలలలో 4, 5, 6, ఫారములలోను కళాశాలలలో ఇంటర్మీడియేటుతరగతిలోను సంస్కృతాంధ్రవిద్యాశాలలలో విద్వాన్‌శిరోమణి కక్ష్యలకంటె తక్కువ కక్ష్యలలోను చదువు విద్యార్థియేని, విద్యార్థినియేని పోటీచేయవచ్చును.

3. విషయములు. i గ్రామపునర్నిర్మాణము: స్త్రీల బాధ్యత. స్త్రీలకు మాత్రమే.

ii ప్రకృతకాలమున ఎక్కువ ఆదరణీయము లెవ్వి? లలితకళలా? పరిశ్రమలా? (Which deserve greater encouragement at present-Fine arts or Industries?)

4. వ్యాసము అగ్రామ్యభాషలో నుండవలయును. లేఖనము కాగితమున నొక్కప్రక్కనే యుండవలయును. వ్యాసము సాధారణపు వ్రాయసమున ఫూల్ స్క్యాపు కొలతగలపుటలు పదునేనింటికెక్కువ యుండరాదు. వ్యాసమున గ్రంథములనుండి అనువాదములు మొదలగునవియున్న ఆగ్రంథాదికము పేరు లాయాపుటల యడుగుననే వ్రాయఁబడవలయును. దీర్ఘములైన యనువాదములుండరాదు. భాషయందు రుచిరతయు భావమున స్వాతంత్ర్యమును కథనమున కౌశలమును ఎక్కువగుణములు (Marks) బడయఁగలవు.

5. వ్యాసముఁగాక వేరొకపుటలో పోటీచేయువారు తమపేరును, తండ్రి లేదా, పోషణకర్త పేరును, తాము చదువుచున్న విద్యాలయము పేరును, విశదముగా వ్రాసి అందు క్రిందనే తద్వ్యాసరచనకుఁగాఁ దాము పేర్కొన్నగ్రంథాదికము తక్క నితరము చూడలేదనియు వ్యాసము సొంతముగా నితరసాహాయ్యము లేకయే రచించితిమనియు ఒక జ్ఞాపకము వ్రాసి చేవ్రాలు చేయవలయును. తానెఱింగినంతవరకు వ్యాసము అభ్యర్థి రచించినదే యని ఈకాగితమునఁ దమపాఠశాలప్రధానోపాధ్యాయునిచే వ్రాయించి యాయన చేవ్రాలు పడయవలయును. కేసరిస్వర్ణపదకపరీక్షకు పాఠశాల ప్రస్తావనమక్కఱలేదు. విద్యార్థినులేగాక, ఎల్లరు స్త్రీలును ఈపోటీయందు పాల్గొనవచ్చును

6. పోటీచేయువారి పేరుగాని చిత్రాలుగాని వారినిగుర్తింప సాధనములగు నితర చిహ్నములుగాని వ్యాసమున నెచ్చటను ఉండరాదు. అభ్యర్థులు తమ వ్యాసముల నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ కార్యదర్శికి 1931-వ సంవత్సరం జనవరి నెల 31-వ తేదికిగాని నాటికిముందే గాని చేరునట్లు రిజిష్టరు పోస్టులో బంపుకొనవలయును.

కార్యదర్శులు

నెల్లూరు
1-1-31

గంద్రకోట సంజీవరావు,
గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య,

# డిసెంబరు యుక్తిలెక్కకు సమాధానము

## శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారిచ్చిన యుక్తిలెక్కకు సరియగు సమాధానము.

8 శేర్ల పాలలోనుంచి ఒకనికి 5 శేర్ల చెంబుడు పాలనుపోయును. మిగిలిన 3 శేర్ల చెంబుడుపాలు రెండవవానికి పోయును. తరువాత మొదటివాని 5 శేర్లలోనుంచి 3 శేర్ల చెంబుడుపాలుతీసి 3 శేర్ల వానికి పోయును. అప్పుడు 6 శేర్లొకనివద్దను 2 శేర్లొకనివద్దను యుండును. మరల 6 శేర్ల వానిపాలనుండి 5 శేర్ల చెంబులోతీసి 2 శేర్లున్నవానికి పోయును. అప్పుడు ఏడు శేర్లొకనివద్దను ఒకశేరొకనివద్దను యుండును. అప్పుడు 7 శేర్ల వానిపాలనుండి 3 శేర్ల చెంబుతో తీసి ఒకశేరున్నవానికి పోయగా ఇరువురకు చేరినాల్గుశేర్ల చొప్పున సమముగా యుండును.

పెట్టిన గడువులోపల పై సమాధానమును తెలిపినవారి నామములు

1. క. సుందరమ్మ (11-వ సంవత్సరము); 2. హెచ్. నంజమ్మ (11-వ సంవత్సరము); 3. రాపర్తి సీతారామమ్మ (9 సంవత్సరములు); 4. తూములూరు జయశంకరయ్య (10 ఏండ్లు); 5. అడుసుమిల్లి పద్మాబాయి (10 సంవత్సరములు); 6. కాకరపర్తి సూర్యకాంతమ్మ (9 సంవత్సరములు); 7. మోచర్ల రామచంద్రరావు (10 సంవత్సరములు) 8. ప. కృష్ణమ్మ (9 సంవత్సరములు); 9. నీళాపాళెం సావిత్రి; 10. విప్పర్తి కమలాంబ (8 ఏండ్లు); 11. పాకల రాజామణి (10 వత్సరములు); 12. కొడాలి లక్ష్మమ్మ (10 సంవత్సరములు); 13. వెల్లంకి సతీదేవి.

## ప్రశస్తచిత్రమునకు

### ఏబదిరూపాయిల బహుమానము

గృహలక్ష్మి ముఖపత్రముపై చిత్రించుటకు చిత్రములు కావలసియున్నవి. ఆ చిత్రములు గృహలక్ష్ముల ప్రజ్ఞను, ప్రతిభను ప్రదర్శించునవిగా నుండవలయును. స్త్రీ రచితములగు చిత్రములు ప్రథమ పరిశీలనమునందును ప్రశస్త చిత్రమునకు ఏబది రూపాయిల బహుమాన మీయబడును. చిత్రములు ప్రజోత్పత్తి సంవత్సరాదిలోపున మాకు చేరవలయును.

—సంపాదకుడు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.




# రమణమ్మ



అంతులేనిలజ్జాసాధ్వసములకుగాణులై గడపదాఁటి తలవాకిలిత్రొక్కి చూడనొల్లని భారతకాంతలుకూడ అవసరమైనచో కరమున కటారినిగీలించి కదనరంగమున కుఱికినారు. శత్రుమర్దనమున మహిషాసురమర్దనులైనారు. భారతదేశచారిత్రకసంపుటముల నొకపరి పరికించితిమేని మహాదేవరాయలంతటివానిని భద్రకాళియైఓటుబుచ్చినరుద్రమదేవి— ఆకొన్న ఆడుసింగమువలె అక్బరుపై కుఱికినరమాబాయి— మహిషాసురుని మర్దించిన నాటిదేవీస్వరూపమునుజ్ఞప్తికి తెచ్చు ఝాన్సిలక్ష్మీబాయి మొదలగు కత్తివిసరినహైందవ కాంతలు పదులకుపదులు దృగ్గోచరమగుదురు. వారలచరిత్రలు విపులీకృతములైయున్నవి. కటారిపట్టియుండినవీరవనితలలో నొకతెయైనను ఇంతవఱకు విపులీకృతముగాని ఒకానొక భారతవీరవనిత వీరచరిత మిటవిస్తరింపబడుచున్నది. అయితే కత్తివిసరినఇతరభారతకాంతలకును ఈమెకును ఈషద్భేదముగలదు. కటారిని వారు కదనముకొఱకుపట్టినారు, ఈమె కదనముమూలమున పట్టినది; వారు చంపుటకు, ఈమె చంపుకొనుటకు. కత్తిపట్టినకారణమును, పట్టినకత్తిచేసినపనియు నిట్లువేఱైయున్నను ఫలముగాప్రదర్శితమైనమహనీయగుణము మాత్రమొక్కటియే. చంపుటలో వారెంతశౌర్యమునుప్రదర్శించిరో చంపుకొనుటలో నీమెయు నంత — ఒకవీసము హెచ్చేయనుట ఔచిత్యము— శౌర్యమునుప్రదర్శించినది. ఉభయత్ర రిపుంజయమే లక్ష్యము; ఆలక్ష్యసాధనము అక్కడ వైరివీరులనుచెండి వారిని దరికిరాకుండ చేయుటచేత; ఇక్కడ తన్నుతానే చెండుకొని ఊపిరియుండఁగ తాను వైరులచేతబడకుండ చేసికొనుటచేత. ఇఁక నామెకథ వినుఁడు.

రమణమ్మ వెలమకాంత; దామెర్ల ధర్మారాయనిభార్య; బొబ్బిలిరాణి మల్లమకు వదిన, బొబ్బిలికోటలో దారుణమగుసంఘమరణముజరిగినప్పుడు రమణమ్మ నెలలునిండిన చూలాలు. అపూర్వవ్యాధశిఖామణి నరసారాయడు కత్తినిపట్టి రమణమ్మదగ్గఱకువచ్చెను. శాత్రవరక్తముతో దాహముతీర్చుకొనవలసినకటారిని నరసారాయ డాత్మపక్షమునందలిఅతివలపైఁబ్రయోగింపవలసివచ్చెను. ఈపనినెఱవేర్చుట కాతనికి మొదట బొత్తిగానిష్టములేక పోయినది. అయినను ప్రభువగురంగారావు తనచేతిపట్టాకత్తినిచ్చిపంపినపు డాతని కిదితప్పని సరియాయెను. రంగారాయనిసుగ్రీవాజ్ఞ ప్రేరేపఁగా నాతఁడు వెఱ్ఱిచొఱవ తెచ్చుకొని ఇద్దఱు ముగ్గుఱుస్త్రీలనుజెండాడినాఁడు. అందుతో నాతనిహృదయ మట్టిదారుణకృత్యమునకుఁబరిచితమై కార్కశ్యమువహించినది. జంకులేనిహృదయముతో, సందేహింపనిమనముతో నాతఁడు తక్కినరమణులను తనకత్తివేటుల కెరచేసినాఁడు.

ఇప్పు డాతఁడు నిండుచూలాలై యున్న రమణమ్మనుసమీపించెను. లోకభారమును లోఁగొనిన విశ్వగర్భునిచిహ్నతో వెలయుచున్న ఆనిండుచూలాలిని చూచుటతోడనే నరసారాయనికరవాల మప్రయత్నముగ వెనుకకులాగుకొనిపోయినది. ఎంతప్రయత్నించినను అమెనుచంపుట కాతనికిఁజేతులురాలేదు. కార్కశ్యమువహించిన ఆయపూర్వవ్యాధశిఖామణి హృదయముగూడ నప్పట్టునఁజలించిపోయినది. వ్యాయామసుస్నిగ్ధమైన ఆతనిదృఢకాయము గాలిలోతీఁగవలెఁ గంపింపసాగినది. తుద కాతనికి దేహస్మృతియేతప్పిపోయినది. పట్టుతప్పి ఆతనిచేతిపట్టాకత్తి ఖంగుమనిక్రిందఁబడెను. ఆఖంగుతో నాతనికిఁదెలివిగల్గినది. తిరిగి కత్తిపట్టుటకుఁబ్రయత్నించినాఁడు. కానిఆతనినరములు తిరిగితోడుకొనిజిగివహింపలేదు.

మానవతి రమణమ్మ యిదిచూచెను. నరసారాయని బలహీనత గ్రహించి యిట్లనెను. 'నరసారాయఁడా! చెప్పిశత్రువులనుపొడువఁగల వెలమవీరుఁడవు. అట్టి నీవీమెడ సాహసముదక్కి శౌర్యమునేది కొఱగానివానివలె నిలచియుండెదవేమి? స్త్రీలమానముకాచుట వీరులవిధ్యుక్తధర్మము. ప్రభునిఆజ్ఞ నెఱవేర్చుట సేవకునిప్రథమవిధి. నీవు వీరుఁడవు; రాజసేవకుఁడవు. కావున విధ్యుక్తమైనవీరధర్మమునెంచి, మీఱరానిరాజాజ్ఞ నుదలఁచికత్తిపట్టుము. నీపనినీవు నెఱవేర్చుకొనుము.' నరసారాయఁడీవీరవచనములువినెను. లజ్జచే నాతనివదనము వివర్ణమయ్యెను. కాని అపూర్వవ్యాధకృత్యముచేఁగార్కశ్యమువహించినఆతఁడు ప్రబోధింపఁబడిగూడ నానిండుచూలాలినివధింపసాహసింపలేకపోయెను. ఆతఁడేమిచేయును? చేష్టలుదక్కి కొయ్యబొమ్మవలె నిలచియుండెను.

నివ్వెఱపడి నిర్జీవప్రతిమవలె నిలచియున్న నరసారాయనిచూచి-తుపాకిగుండ్లదెబ్బలు తిని గుభేలుగుభేలుమని కూలుచున్న కోటగోడలచప్పుడువిని-బ్రతికియున్న-చోఁ రాఁగలమానభంగమునుదలఁచి, యిఁక జాగుచేసినకార్యముగాదని రమణమ్మ రక్తసిక్తమైనేలపైఁబడి

యున్న నరసారాయనికటారినందుకొని తనంతటతానేపొడుచుకొనెను. బాగుగా ముదిరిన గెలతోఁగాలిదెబ్బకు నేలఁగూలినఅరఁటిచెట్టువలె నానింపుచూలాలు నేలమీఁదఁబడెను. రమణమ్మచేసినఈయత్యద్భుతదారుణకృత్యమును దిలకించి లోకజ్ఞుఁడగు కవి

"దేవతిర్యఙ్మనుష్యులం దీవిధంబు
పెంపు గనలే దటంచు నిలింపులెల్ల
వెలమవెలఁదుక సాహసవిక్రమములు
భళిభళీ యని పొగడి రద్భుతమునమునుండి."

అనిముక్తకంఠముతోఁబలికినాఁడు. ఏదేశమునకైనను, ఏజాతికైనను తనమానసం రక్షణప్రియత్వముచేఁగీర్తినార్జింపఁగలఆమానవతీమణి మానదేవత కిట్టిదారుణ విధమున బలి వోయెను. మానముకొఱకురమణమ్మ యెంతటిదారుణకృత్యమునొనర్చినదో? వింధ్యపర్వతము వలె విఱుచుకొని మీఁదఁబడుచున్న భ్రూణహత్యామహాపాతకమునకు ఆమె యిసుమంత యైన జంకలేదు. అగ్నిపర్వతమువలె హృదయగోళముననుడుకారుచున్న మాతృప్రేమకు ఆమెరవ్వంతయైనఁజలింపలేదు. అయితే రమణమ్మను మాతృప్రేమ తెగఁగోసినగొడ్డురాలని కాని, భ్రూణహత్యకొడికట్టినపాతకియనిగాని అనుటకు వీలులేదు. మానసంరక్షణార్థము ఆమెయిట్టిపనిచేసినది. వీరవంతమగు బొబ్బిలిగడ్డపై ఊపిరిపీల్చుటకు బానిసస్త్రీలుకూడ మానభంగమునకువెఱచి తమప్రాణములనిచ్చివేయుచుండఁగా నిలువెళ్లనివెలమకులమునఁ బుట్టిన ఆరమణీమణి స్త్రీలకుముఖ్యభూషణమగు మానమునుగోల్పోయి బ్రతుకేబంగార మనుకొని చెడిజీవింపఁగలదా?

పదునాఱవశతాబ్దిని ఉత్తరహిందూస్థానమందలి గాథామండలసంస్థానాధీశ్వరియైన దుర్గావతి మొగలాయిచక్రవర్తిఅక్బరుతో యుద్ధముచేయవలసివచ్చెను. ఆసమరమునఁదుదకు గాథామండలమువారికి అపజయశంకపొడమెను. అప్పుడు దుర్గావతి పవిత్రమైనతనశరీరము మ్లేచ్ఛులచేతఁజిక్కిమైలపడకుండుటకు ఆత్మసేవకులలో నొకనినిపిలిచి తననుఖండింపఁగోరెను. అట్టికానిపనికి సాహసింపలేక ఆతఁడు 'నావలనఁగాదు' అనెను. అందుమీఁదనెను వెంటనే దుర్గావతి వీరనారి తనకుఁదానేపొడుచుకొనిచనిపోయెను. వీరహృదయముగలఅంగన అమానుషముజరుగుటభరింపలేదు. అగుటనేకదా, నెలలునిండినచూలాలై యున్నందునఁదన్ను తెగటార్పజంకిన నరసారాయనికాదని తనకుఁదానై పొడుచుకొని రమణమ్మ మృతినొందినది?

రమణమ్మ వీరహృదయమును యథారీతిని వివరించుటకుఁగాని, ఆమె మానసంరక్షణ ప్రియత్వమును ఉచితరీతిని వర్ణించుటకుఁగాని వాఙ్మయమునకుఁదగినశక్తిలేదు. భారతకీర్తికిఁ గల్పాంతమువఱకు రక్షణదేవతలై వెలయఁగల భారతరమణీమణులలో వీరనారి, మానవతి యైన రమణమ్మ ఎన్నఁదగినది.

# సంక్రాంతి: గోపూజ

శునం వాహాః శునం నరః శునం కృషతు లాంగలం।

శునం వరత్రా బధ్యంతాం శునమష్ట్రాముదింగయ॥ —ఋగ్వేదము.

ఎద్దులు సుఖముగా నడచునుగాక! మనుష్యులు సుఖముగాఁద్రోలుదురుగాక! నాగలి సుఖముగా దున్నునుగాక! పగ్గపుఁద్రాళ్లు సుఖముగాఁగట్టబడుఁగాక! ఎద్దులు మెల్లగానదలింపఁబడుఁగాక! (సంక్రాంతి)

ఎద్దులు మెల్లగానే అదలింపఁబడినవి. పగ్గపుఁద్రాళ్లు సుఖముగానే కట్టబడినవి. ఎద్దులు సుఖముగానేనడచినవి. మనుష్యులు వానిని సుఖముగానె తోలినారు. నాగలి సుఖముగానే దున్నినది. ఎద్దులుపడినశ్రమ ఫలించి పిడికెడువిత్తులకు పౌణకెడుగింజలచొప్పున పండినవి. పండిన ఈపంట ఇంటికివచ్చుసరికె చూడియావులన్నియు ఈని పుష్కలముగపాడి నిచ్చునవియైనవి. బలవర్ధకములగు ఆహారపదార్థములను, ఆయుర్వర్ధకములగు పాలను ప్రసాదించి గోగణము కర్షకుడు సంక్రాంతిపురుషునిసమారాధనముసలుపుట కిట్లు అనంత కాలమునుండి సాయపడుచున్నది.

అనంతకాలమునుండి సాయపడుచున్నవి గావుననే సంక్రాంతిపురుషసమారాధనమున కేర్పడినదినములలో మూడవనాడు—కనుము—గోపూజకు అనంతకాలమునుండి ప్రత్యేకింపబడియున్నది. కర్షకులకాణాచియగు పల్లెటిసీమయందు కనుముదినమును పసులపండుగ దినమందురు. ఆనాడు కర్షకమహాజనులు పసులకొమ్ములకుపసుపుపూసి అలంకరించి వానిని ఊరేగింతురు. అరవదేశమున పసులపండుగదినమును 'మాట్టుపొంగలి' యందురు. ఆదేశీయులానాడు తమతమ గోగణమునెల్లకడిగి, వానికి కడుపునిండ మేతవేసి, వానిని కుచ్చులతో నలంకరించి, పసుపుపూసి ఊరేగింతురు. ఈఉత్సవము గొప్పగ జరుపుటకు కర్షకులెల్ల చందాలనై చికొందురు.

ఈదినమున జరుగు గోపూజోత్సవముల వైభవము చూడవలెనన్నచో నేపాళదేశమునకుబోవలెను. హిందువులకు గోగణము అతిపవిత్రమైనది. అది వారికిధనము. అనగా లక్ష్మీస్థానమన్నమాట. గోపుశరీరమునందలి వివిధభాగములను వివిధదేవత లధిష్ఠించియున్నారని వారినమ్మకము. వారు నిత్యము ఆరాధించు శివకేశవులలో శివుడు పాశుపతి, కేశవుడు గోపాలుడు. గోగణమునిట్లుగౌరవించిపూజించువిషయమున హిందూజాతులలోనేపాళదేశము వారు అగ్రసరులు. గోజాత్రసమయమున వారు గోపుశరీరమునకు వరిపిండిపూసి పసుపు కుంకుమబొట్లు పెట్టుదురు. చిన్నపిల్లలు వానికి ప్రదక్షిణము వత్తురు. ఇంటింట గొప్పవేడుకలు నడచును. ఇంతటిఉత్సవములతో గోపూజ నిర్వహింతురు గావుననే నేపాళదేశీయులకు ఘూర్ఖాలు—గోరక్షకులు—అనునామము అన్వర్థమై వెలయుచున్నది.

ఆసేతుహిమాచలపర్యంతమైన హిందూదేశమున సంక్రాంతిదినములలో జరుగు ఈ గోపూజలయందు భారతస్త్రీకిగూడ మహనీయమైన భాగముగలదు. స్నానముచేయించుట, పసుపుపూయుట, కుంకుమబొట్లుపెట్టుట, ఊరేగించుట మొదలగు ఆడంబరయుతములగు పనులతోడనే ఆమె గోపూజఅయినదనుకొనదు. ఆమెకుగల మాతృహృదయమునకు తృప్తి కలుగురీతిని ఆమెగోపూజచేయును. పసులపండుగదినమున డబ్బుకక్కుర్తిగలమగవాడు ప్రయత్నించినను ఆమెపాలుపితుకనీయదు; ఎద్దులనుపూన్చి బండికట్టనీయదు. తల్లిపాలుచాలని పసిపిల్లవానికే కావలసియుండుగాక, వచ్చియున్నక్రొత్తయల్లునకు మీగడతోడి దధిప్రకాండము మనసువచ్చినపదార్థమేయగుగాక, చిలిపియైన ఎడపిల్లవాడు క్షీరాన్నమునకు చీదఱచికాకు చేయుచుండుగాక, ఓపలేనితనపుఓకిరింతలతో ఓటాటిఒగుడుకఱచుచున్నకూతురికి మనసైన గోగుకూరపచ్చడిలోనికి ఆదినము చిలుకమ్మినిదీసినవెన్నపూస దినదినమువాచవియగు వస్తువే యగుగాక కనుముపండుగనాడు-పసులపండుగనాడు యనవలయును-పాలు పితుకరాదని ఆమె సుగ్రీవాజ్ఞ. పండుగనాడు నాలికకునచ్చిన పదార్థములను నాలుగువ్రేళ్లు లోపలకుపోవ తిని కొత్తపుట్టములనుగట్టుకొని నవ్వుమొగంబులతో నట్టివాకిటతిరుగు తనబిడ్డలకువలెనే ఆనాడు తమ తల్లిపాలనన్నిటిని తామే డొక్కలునిండత్రావి లేగదూడలు తననట్టివాకిట చెంగుచెంగున గంతులువేయుచు అంభారవములతో ఆనందగీతములుపాడిననే ఆమెకు తృప్తికలుగును. అప్పుడే ఆమెభావనలో గోపూజ జయప్రదముగ నిర్వహింపబడినట్లు. భారతాంగన గోవునిట్లు పూజించుచున్నది కావుననే భారతదేశమునకు ఇంకను ఈమాత్రమైన పాడిపంటలు గలుగుచున్నవి. భారతస్త్రీకి గోవునెడ ఎంతటి అభిమానముగలదో క్రిందివిషయము తేటతెల్లముచేయగలదు. ప్రభుత్వమువారికి పన్నులీయ నిరాకరించి బార్డోలితాలూకాయందలి తమగ్రామమునువిడచి కాడిమేడికట్టుకుని బరోడాసంస్థానమునకు వలసపోయిన ఒకకుటుంబము వారిని శ్రీమతి క్షేమారావుసతి సందర్శించి 'మీరెంతకాలమిట్లు ఉన్నఊరువిడచి పరుల పంచపడియుండగలరు?' అనిప్రశ్నించెను. దానికి ఆకుటుంబిని 'ఎంతకాలమైనపడియుందుము. మమ్ముగురించి మాకేమియుచింతలేదు. కాని మాపసులనుగూర్చియే మాకు తీరనిబెంగగానున్నది. పదిమాసములకు సరిపోవు పశుగ్రాసమే మాదగ్గఱనున్నది. పాపము, వానినిసాకుట ఎట్లో?' అని ప్రత్యుత్తరమిచ్చెను. ఎట్టిప్రత్యుత్తరము! ఇల్లువాకలివదలిపెట్టినను ఇసుమంతయైన చింతలేదు; పరులపంచపడియున్నను పిసరంతేని బెంగలేదు. ఉన్నచింత, ఉన్నబెంగ గోగణముయొక్క భావినిగూర్చియే.

గోపాలుడగు కృష్ణునిదేశమున నివసించుచున్న ఆబార్డోలీకుటుంబిని గోవులకు సమృద్ధమగు గ్రాసముకలుగునట్లును, హిందూదేశమునందలి గోగణమునకెల్ల తఱుగనిశుభముకలుగునట్లును భగవానుడనుగ్రహించునట్లుచేయ సంక్రాంతిపురుషుని ఈశుభవాసరములలో జరుపబడుగోపూజోత్సవములనుపురస్కరించుకొని భారతస్త్రీలు ప్రార్థనలు సల్పుదురుగాక!

# సంక్రాంతిరంగములు

శ్రీమతి మదనమంచి అనంతమ్మగారు

విరిమల్లెచెఱివినకురులు నీలాలాడ నీరెండచెంగావిచీరెజార
మంచుముత్యాల దామంబులుదూగాడ చలిగాలియూర్పులు సందడింప
పచ్చికబంగారుపావడా దిగవార తఱిపివెన్నెలనవ్వుతుఱగలింప
సంజపారాణికెంజాయ మైజెలువార పలుకు తురాయిపిట్టలనుగేర
హైమవతి పౌష్యలక్ష్మికానందమొసగ
సందిదండల నలరింప జక్కవచ్చె
చిట్టిసంక్రాతి మోమింత చేసికొనియె
బంతిచేమంతి మిరపల పౌరుషమున.

## పంటవలంతి

కాపుకవిరైన మాయమ్మకన్నకడుపు
చల్లదనమును వర్ణింప చతురుడగును
చేలబూచిన తంగేడుపూలకోవ
మురువుగావిరబూసిన ముద్దబంతి
దోరగిలి పండిపీగిన దోసపండ్లు
ఎఱుపుగొల దిగివారిన మిరపపండ్లు
కుఱపలై నేల జవ్వాడు వరిగచేలు
నిత్యకళ్యాణ మొసగరాణించుచుండి
కాపుకన్నెలపాటల గలిసిపోయి
అల్లనల్లన బయ్యెర లాడుచుండ
పండిపోయిన సంసారభాగ్యగరిమ
ప్రకృతిదేవీసమాశ్లేషపారవశ్య
మనుభవించుచు సంక్రాతి మునునిడుకొని
పైరపచ్చల దూగాడె పంటవలతి.

## దాసరి

'జయ, రమారమణాహరి! జయ, ముకుంద!'
అనుచు చిఱుగజ్జియలుకాళ్ల గునియుచుండ
చిఱుతలొకకేల తంబూర మఱొకకేల
పూలదండలు మెడనిండ దేలియాడ
పట్టెవర్ధనములు మెయిబ్రాకులాడ
బట్టతలమీద నక్షయపాత్రమొప్ప
కాశవస్త్రము జబ్బల గదలియాడ
వెంటబాలురు తాళమువేయుచుండ
చిందుద్రొక్కుచు సాతానిజియ్యరొకడు
వీధి వెనువెంట జనుదెంచు వింతజూచి
ముగ్గుదీర్చి చిఱుపేడముద్దలునిచి
బంతిపూవులు వానిలోపల నిమిడ్చి
పరుగు పరుగున నింటిలోపలికినేగి
బియ్యపుం బాత్రగొనివచ్చి పిల్లకాన
దాపునకురాడె కోణంగిదాసరనుచు
తేఱిపారగజూచు బజారువైపు.

## కోడిపందెము

పల్లకురులను జుంజురు ముళ్లువైచి
కుఱుపకత్తులుగొని పండ్లుగొఱికికొనుచు
నుచ్చరలుగొట్టుచును గోళ్లనుద్దవి
ఈకె బంగారుబొమిడికెల్బికెవైచి

కెవ్వుమని కెలకులకురాలు రువ్వుకొనుచు
చప్పటులుగొట్టి పందెము 'సాహు'యనుచు
పిరికివారినకోళ్ల డెప్పరిలజేసి
చిన్నికుంతల నీరాసజేసి కెలన
బారుదీరిచి శకునము 'బయ్యా, మనుచు
మాటిమాటికి దూబరమంత్ర మిడుచు
పికిలికుచ్చులగట్టినరకము కొంత
పట్టుతాళ్లు బిగించిన పౌజుకొంత
చీల్చి మెలికోరకత్తుల జేర్చికట్టి
కొక్కొరోయని కూసెడి కోళ్లబట్టి
చింతతోపులబయలున వింతలెసగ
కోడిపందెములాడెడు కొంతజట్టు.

## మనుగడలు

'మసలుమాన్యములమ్మిన గడవదయ్యొ
కలవరింతువు సంక్రాంతివలువలనుచు
సారెచీరెలికెన్నాళ్లు జరుపుటమ్మ?
పుట్టినిలుగుల్లజేతువే పూవుబోడి?'
'నాల్గురోజుల తరువాయి నాటికేను
అరిసెలప్పనములు సేసినానుగాని
కొరకొరలు మాని మాపిన్నికొడుకు బిల్చి
తినుడు సహపంక్తి నేడైన తృప్తిదీర.'
'శారదాపీఠమున బిడ్డ జదువవైచి
మొగముజూపరు సెలవల ముందుబోయి
పిల్లదానినిగొనిరండు బీతుగుడిచి
చిక్కి సగమైనదేమొ నాచిట్టికూన.'
'కోడలా! పుట్టినిలువారి జాడలేదె,
చంక లెగురగవైచి తీసంకురాత్రి
కన్నలరుదెంచికొనిపోదురనుచు, మాదు
కమలనిదె తీసికొనివచ్చితిమిగదమ్మ.'
అనుచు నీరీతి మనుగడలరయువారు
అల్లురకు కూతులకు కబురంపువారు
క్రొత్తయుడుపులు దెప్పించుకొనెడువారు
ఇల్లుగుల్లైన భూషలకేడ్చువారు
పిండివంటల నటకలబేర్చువారు
ఇండ్లువాకిళ్లు ముగ్గులనింపువారు
నూతనవికాసమెనయగా భూతలమున
రంగరంగవై భోగంబు పొంగి పొరలు
వింతహృదయాల జొరిన సంక్రాంతియపుడె
తరలిపోయెనటంచు నాతురతగొనిరి.

## డుబుడక్కవాడు

నొసలిపైఁజుక్కల మిసిమినామపురేఖ
లనువొంద భుజముపై నసిమిసంచి
వాలువీనుల గాజునీలాలపోఁగులు
పైనొప్పుపప్పళి పచ్చడంబు
మెలిగొనఁజుట్టిన తలపాగ చెఱఁగుంచి
పైటపేటాచుట్టు పట్టుశాలు
కడిఁదిమీఱఁగఁ జంకనిడిన బొట్టియకోల
డాకమ్రోసెడు డుబుడక్క కేల
వఱలదిక్కులనెంచి దుర్వారమైన
కీడుమేలును దెల్పుచుఁ గేకలిడుచుఁ
గెల్లికొనుచును దనపేరు కేరికొనుచు
వచ్చెనచటికి డుబుడక్కవాఁడొకండు.

—హంసవింశతి. ఆ. ౨.

# సంక్రాంతి

శ్రీమతి నెలువోలు వసంతాదేవిగారు

ప్రకృతి

ఘనసమూహార్కసుకిరీటకాంతితోడ,
శ్యామలదిగంతలలితవస్త్రమ్ముతోడ,
అత్యమలహిమధవళదేహమ్ముతోడ,
కాంతసంక్రాంతలక్ష్మి సాక్షాత్కరించె.
ఘనవినిద్రాంబుజాతముఖమ్ముతోడ,
కలితబంధూకమృదుతిలకమ్ముతోడ,
లలితమధుసుమహారవల్లరులతోడ,
కాంతసంక్రాంతిలక్ష్మి సాక్షాత్కరించె.
వికసితకుసుమదరహాసవీచితోడ,
కుసుమనిష్యందమధుదయారసముతోడ,
జలఖగధ్వనిమధురసుస్వరముతోడ,
కాంతసంక్రాంతిలక్ష్మి సాక్షాత్కరించె.

స్త్రీలు

"గరగరలొనర్చితిమి గృహాంగణములెల్ల,
అమలభవదీయపాదపద్మములజంట
ధూళిసోకకయుండి సద్రుచులుపర్వ,
అమ్మ! సంక్రాంతిదేవి! ఆహ్వానమమ్మ.
కేయియర్ఘమ్మునుండి నిర్మింపఁబడిన
రంగవల్లీమతల్లికారచన లివిగో!
నీదువాహనాల్ రథములై నెగడుచుండె
అమ్మ! సంక్రాంతిదేవి! ఆహ్వానమమ్మ.
ద్వారములఁ బూలతోరణాల్ వఱలుచుండె,
భవ్యఘనధాన్యరాసు లబ్రమ్ములిడెడి,
ఉండిపోవమ్మ నీయిష్టమున్నవఱకు
అమ్మ! సంక్రాంతిదేవి! ఆహ్వానమమ్మ."

బాలికలు

"తెల్లవారెను, బూవులుకోల్లపోయె
ఇంతప్రొద్దేల నిద్రించితీవుతల్లి?
ఎట్టుగొబ్బెమ్మలను నిప్డుపెట్టుకొంటు?
రేపుచీకటితోనిద్ర లేవఁగలను."
"ఏమె,చెల్లెల! రెండుపూలిమ్మునాకు,
రేపునాల్గిత్తునీకు, సరే! గదమ్మ
లేకపోయినఁ దరుగానో? లేదో? చెల్లి!
నేఁటిపిడుకలు, పొంగలినాఁటివంట."
"దివ్యసంక్రాంతిపండుగుదినమునందు
నేమిబొమ్మలు పెట్టగా నెంచినావు?"
"గోపకృష్ణుని, రాధను, గోపికలను
పొన్నచెట్టును నేఁబెట్టనున్నదాన."

# సంక్రాంతి దినములలో

ముత్యాలముగ్గులు ముంగిళ్లనెలకొల్పి
యందంబు పలుమాఱు లరయువారు
కిఱ్ఱుచెప్పులఁదొడ్గి కఱ్ఱ చంకనుబెట్టి
యత్తవారిండ్లకు నరుగువారు
అత్తవారిండ్లకు నరుగంగఁదలపోసి
సిలుమవారలరాక వేచువారు
అతిసమీపమువంటు నల్లుళ్లఁబిల వంచు
ముసలిభర్తలఁ జాలఁగసరువారు
ఇట్టలంబైన చలికి సహింపలేక
ఉదయమైనను వెలికిరానోడువారు
నైరిసంక్రాంతిదినముల నఖిలజనులు.

—పూర్వకవి.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు

నెచ్చెలీ!

నీవు వ్రాసిన ఉత్తరములన్నియు చేరినవి. కాని రెండుమాసములనుండియు నీవు లెక్కలేనన్ని లేఖల లిఖించుచున్నను నీకొక్క జాబునైన వ్రాయజాలనందులకు నాకు చాలవిచారమగుచున్నది. ఏమిచేయుదును? ఇంటిలో ఒంటరిదాననైనాను. కలముపట్టుటకంటె గరిటెపట్టుట అవసరమైన పనిగానున్నది. దానికితోడిది శీతకాలపుప్రొద్దు. ప్రొద్దుకు ముద్దుకుసరి. ఇకనేను నీకు ఉత్తరమెప్పుడు వ్రాయుదును? అందువలననే తెల్లవాఱుజామునసైన వ్రాయుదుమని వాకిలిలో సంక్రాంతిదాసరివచ్చి 'హారో, రంగ హరి, కస్తూరిరంగ, కావేటిరంగ' అని కేకలుపెట్టగా మెలకువవచ్చి లేచి ఆతనికి పిడికెడుబియ్యము వేసివచ్చి కలము కాగితము చేత బట్టుకొని దీపము ముందరవచ్చి కూర్చున్నాను. అయిననేమి? కలముసాగునా? అదిగో! "అమ్మా! వాకిట్లో నీళ్లుచల్లడమైంది; ముగ్గులుపెట్టుకోం"డని పనిమనిషి అఱచుచున్నది.

ఈ ధనుర్మాసములో మనకిది యొక పెద్దపని. పగలు పదిరెండుగంటలు ఫెళ్లునవెలిగే సూర్యభగవానుఁడు జీతమాలస్యమైన కూలివానివలె పదిగంటలకాలమైనను పగలుచూపక పరుగెత్తిపోవుచుండగా ఇందులో ఒకగంట తనక్రిందకు లాగుకొనును సంక్రాంతిముగ్గు. పోనిమ్ము ఆలస్యమగునని యీముగ్గువేయుట మానుదుమనినను మనస్సొప్పదు. ఈదినములలో ఒకరిని మించిన రంగవల్లి నొకరమిడిన గాని మనకు సంతోషముండదు. మఱియు నిన్న వేసిన ముగ్గు నేఁడు వేయుటయు లజ్జాకరమే. కావున దినమున కొక్కటి. మనకళావైదగ్ధ్యము న్ప్రకటించుట కీధనుర్మాసమొకయుత్సాహకరమైనమాసము. దేవతలకు దక్షిణాయనము రాత్రికాలమనియు, ఉత్తరాయణము పగటికాలమనియు, అందీధనుర్మాస ముషఃకాలమనియు, కావున దేవతాప్రీతికరమగు నీయుషఃకాలమున రమణీయరంగువల్లులచే మన ప్రాంగణముల నలంకరింపవలెననియు పెద్దలు చెప్పుదురు. మనకళానిపుణతను జూపుట కీదిమంచి యదనగుటచే దేవతలకేగాక మన స్త్రీలకును నిది ప్రీతికరమగు మాసమేయగుచున్నది.

మనకంటె ప్రీతికరము మన బాలికలకు. వారి గొబ్బిళులులేకున్న మనరంగవల్లులు చిన్నబోవా? కాన వారుమనకంటె కార్యనిమగ్నులై ఒకచో ఆవుపేడ; ఒకచో పెద్దగుమ్మడి పూవులు, బంతిపూవులుతెచ్చి గొబ్బిళ్లుచేసి వానిని పసుపు, కుంకుమలచేతను పుష్పాదుల చేతను నలంకరించి ముంగిళ్లనిడువఱకు వారికి సంతుష్టిలేదు. నిన్నప్రొద్దున నేనుమావాకిలిలో ముగ్గులు పెట్టుచుంటిని. అప్పటి కింకను బాగుగా తెల్లవాఱలేదు. దశదిశలను మంచు దట్టముగా కప్పియున్నది. చేతులు కొంగర్లుపోవుచు ముగ్గు సాగుటలేదు. చలికిదవడలు దగ్గఱకు పడుచున్నవి. ఆసమయములో ఇద్దఱుబాలికలు నాముగ్గునకు దగ్గఱగా నిల్చున్నారు.

వారిలో ఒకబాలకు యేడేండ్లు వేఱొకదాని కైదేండ్లు న్నట్టున్నవి. పెద్దదానిచేతిలోపేడపళ్లిక, చిన్నపిల్లచేతిలో పూలపుటిక ఉన్నవి. కాని పేడబుట్టలోపేడలేదు; పూలబుట్టలో పూలులేవు. వారి చిన్నిముఖములు మఱింత చిన్నబోయిఉన్నవి. "పేడా, పూలూతెచ్చుకోక యిట్లా నిలబడ్డారే"మని నేను వారిని అడిగితిని. "పోయివచ్చాము దొరకలేదు" అని ఆబాలికలు చిన్నబుచ్చుకొని పలికిరి. వారినిచూచుటకు నాకుజాలివేసెను. ఆవుపేడయు పువ్వులును దొరకకపోవుటచే వారెంతో యుత్సాహభంగముపొందినట్లుగానుపించిరి. వారికన్నుల నీరొక్కటి తక్కువగాని వారిమోమంతగా ముడుచుకొనిపోయినది. మా కెదురవీధిలోనున్న ఒకయిల్లు చూపి "వారింట చాలఆవు లున్నవే, మీకు పేడెందుకు దొరకలేదు?" అని వారిని మరల నేనడిగితిని. "ఆయింటి ముసలమ్మ చాలాచీకటి ఉండగానే లేచి లాంతరుపెట్టి పేడంతా వెదకి తట్టలోవేసి దాచిపెట్టిందిట. మేముపోతే అంతాయెవరో యెత్తుకొనిపోయినారు పొమ్మన్నది" అన్నారు ఆబాలికలు. "అయితే మీ అమ్మను పంపకపోయినారా? పెద్దవాళ్లువస్తే ఇచ్చేదేమో?" అన్నాను నేను. "మాఅమ్మ ముగ్గులుపెట్టుతున్నది" అన్నారా బాలికలు. అవును, అమ్మకు దగినపని అమ్మకు, బిడ్డలకుదగినపని బిడ్డలకు, ఆమె రంగవల్లులులేకున్న వీరి గొబ్బిళ్లకు శోభలేదు, వీరిగొబ్బిళ్లులేకున్న ఆమె ఆరంగవల్లులకు రక్తిలేదు అనుకొంటిని. పేడదాచిన ముసలమ్మ పిసినారితనమునకు నాకు అసహ్యముగలిగినది. మాచిన్నతనములో గూడ మేమిట్లులనే గొబ్బిళ్ల కావుపేడ దొరకనినాడు ఆశాభంగమునొందిన దినములు నాకు జ్ఞాపకమువచ్చినవి. ఈపసిబిడ్డ లీచలిలో మంచులో గొబ్బిళ్లమీది ఆసక్తిచేత వచ్చి సందులకైన పట్టెడుగోమయ మివ్వవచ్చునే? ఈమాసము గడచిపోయిన వెనుక నీపసిబాలలు మనయిండ్లకు రమ్మనినను వత్తురా? ఈనెలదినములు బాలికల కావుపేడ వదలివేయరాదా? అనుకొని మాపనిమనిషి శుద్ధికై తెచ్చిన ఆవుపేడ వారికిచ్చి మాదొడ్డిలోనున్న యేపిచ్చిపూలో నాలుగు పుణికియిచ్చి వారిని పంపివేసితిని. అప్పుడాబాలికలు గొప్ప పెన్నిధిలభించినట్లుబ్బుచు తమయింటికి వెళ్లినారు.

ఈ బాలికలు గొబ్బిళ్లు పెట్టుకొనుటనిన నాకు మిక్కిలి సంతసముగానుండును. మఱియు వీరు సందెగొబ్బి పెట్టుకొని గొబ్బితట్టుచుండుట చూచుట నాకు మిక్కిలి సంతోషకరము. ఒక్కగొబ్బిపండుగ మన బాలికలకు పెక్కువిషయములలో పరిజ్ఞానముగలిగించును. బద్ధకములేక తెల్లవాఱుజామునలేచుట, వాకిలి పరిశుభ్రపఱచుకొనుట అట్లుండ పుష్పపత్రాదులతో పరిచయము, మతసంబంధమగు పూజాపునస్కారములతోపరిచయము, ముగ్గులతో పరిచయము, ఆటతో పరిచయము, పాటతో పరిచయము ఈవిధముగా లలితకళలలో ప్రథమపాఠము బాలికలు గొబ్బిపండుగలలో నేర్చుకొందురు. ఆతరువాత పెద్దపండుగ మూడుదినములు బాలికలు పెట్టుకొనెడి రకరకముల బొమ్మలసామానులు మున్నగునవి గూడ వారికి కళాప్రవీణతయందభినివేశ మొసగునవే.

మిత్రమా! ధనుర్మాసములో బాలికలకే యింత తీరనిపనియైయుండ నిక మనస్త్రీల సంగతి చెప్పవలయునా? వేకటితో ఓకరించుకొనుచు తొలకరిలో పుట్టినింటికేగినతొయ్యలి ప్రకృతిలక్ష్మి సుఖప్రసూతయై గంపెడు కొడుకులను గంపెడు కూతుండ్రను వెంటనిడుకొని చేమంతిపూవులజడతో, బంతిపూలహారములతో పూచినతంగెడువలె కలకలలాడుచు నింటికివచ్చును. కోడ లింతవైభవముతో యేటికేడాదికి సరిపోవు సారెచీరలు గట్టుకొని యింటికి వచ్చుచుండ ప్రవాసివలె మనము ముడిచిపెట్టుకొని కూర్చుండిన బాగుగానుండునా? ధనధాన్యసమృద్ధియైవచ్చెడి యాప్రకృతిపడంతి విడియుట కనురూపముగా మన గృహము లుండవలదా? ప్రాతగోడకు పూతచక్కనా, కోతికూపికి వ్రాతచక్కనా అనిగదా సామ్యము. ఇంటికిపాదట్టు దులిపించి, గోడలకు సున్నము పూయించి మండిగములకు పసుపుకుంకుమలు, ద్వారములకు తోరణంబులు, ప్రాంగణములలో రంగవల్లులు, నిడిగృహలక్ష్మి నలంకరించు కొనవలదా? ఈపనులన్నియు నెఱవేఱవలయుననిన రెండుకాళ్లొకచోనిడి కూర్చుండుటకు వీలగునా? పనియెంత యెక్కువైననేమి? పనిముద్దు భాగ్యముముద్దుగదా? అయినను సోమరులమై మనము బావుకొనునదేమున్నది? ఇస్టీరియాలువచ్చి అల్లాడటమేగదా? కాన సర్వావయవములు పాటవమునెందునట్లు ప్రతిస్త్రీయు తన గృహకృత్యములను తాను నిర్వర్తించు కొనుటయే మంచిది.

కాని పనులకు దగినట్టుగా మనకు ప్రొద్దుతక్కుగూడ నిప్పుడే. ఇంచుమించుగా రెండుగడియలప్రొద్దెక్కనగాని సూర్యభగవానుడు మంచుతెఱలు చించుకొని బయటకు రానేరాడు. వచ్చినప్పుడైన నించుకసేపు నిలువబడనే నిలువబడడు. ఆనిలిచిన కాసేపైన చుఱుకైన యెండ నీయడు. "అరోగ్యం భాస్కరాదిచ్ఛే న్మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్" అన్నట్టుగా మనకాయురారోగ్యములను ప్రసాదించు ఆదిత్యుడిట్లు జడుడై మందుడై తూర్పుమూలగాబుట్టి దక్షిణపుమూలగా నక్షత్రోవనుబడి యతివేగముగా బశ్చిమాద్రికి బరువులెత్తుచుండ మనకు అహములెట్లు సన్నముగాకుండును? తేపు శిశిరుడువచ్చి పండుటాకులూడగొట్టినట్టులే సూర్యునిబధకమునుగూడ నూడగొట్టినగాని ఆయనకు మనకును గూడ చుఱుకురాదు. అంతవఱకింతే. కల్పలతా! నా కీసూర్యుని శీఘ్రగమనంబు గనిన

"పొడుపుఁగొండమీఁదఁ బొడుచుట మొదలుగా
బరువువెట్టి యినుడు పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెగాక మసలిన జలిచేత
జిక్కి జిక్కినఁగఁ జిక్కకున్నె?"

అని సూర్యుడు తానుగూడ చలివాతబడుదునని పరువులెత్తుచున్నాడను శ్రీమద్భాగవతములోని పద్యము జ్ఞాపకమువచ్చి నవ్వుకొనుచుందును. శుభప్రదమైన ఉత్తరాయణ పుణ్యకాలమువచ్చినగాని మనకీపనుల వడిదుడుకు లడగవు.

సంక్రాంతియనునది మనకొక సామాన్యమగు పండుగ యేగాక గొప్ప ఆరోగ్యోత్సవ మనికూడ చెప్పవచ్చును. కల్మలతా! బుద్ధిశాలురగు మనపెద్దల భావనాశక్తి యద్భుతము. కావుననే మతవిధులను నారోగ్యవిధులను మేళవించి యనుల్లంఘనీయములుగా జేసి యున్నారు. ఏలననగా మనవారికి ఆరోగ్యవిధులయందుకంటె మతవిధులయందు భక్తి యెక్కువ. కావున నీధనుర్మాసములో జరిపెడు శౌచవిధులెల్ల మనకు దేవపితృపూజలతో మిళితమై మనలను తప్పక నిర్వర్తించునట్లు నిబద్ధించుచున్నవి. కాని నిజమునకివియన్నియు మన ఆరోగ్యమునకే. చూడుము: ఈశీతకట్టుదినములు మనకు మిక్కిలి జబ్బుదినములు. ధాదాపు కార్తీకమాసమువఱకు వానలుకురిసి నేలయంతయు తడిగానుండును. సూర్యకిరణ ప్రసార మల్పముగానుండుటచే నీకాలములో వాతావరణముగూడ అర్ద్రితగానుండును. నేలతడిగానుండుట, వాయువులు శీతలములై యుండుట, ఎండలు తీక్ష్ణముగా లేకుండుట మున్నగుకారణములచే పుడమిపై నుండెడి పెక్కు కశ్మలపదార్థములు తడిసి క్రుళ్లి సాంక్రామికవ్యాధుల కుత్పత్తిహేతువులగు సూక్ష్మజీవులు పెక్కు లుద్భవిల్లి ప్రజలను వ్యాధిపీడితులను గావించుచుండును. కావుననే యీదినములలో స్వర్గద్వారములు తెఱచి యుండునని మనవారనుచుందురు. ఎప్పుడు దేశమున వ్యాధులు చెలరేగియుండునో అప్పుడు స్వర్గద్వారము తెఱచియున్నట్లేగదా? కావున బద్ధకములేక ఒడలువంచి పనిచేయుటయు, మనగృహములును గృహావరణములును పరిశుభ్రపఱచుకొనుటయు, రోగకారకములగు సూక్ష్మజీవులు నశించునట్లు ఆవుపేడతో కలయంపిజల్లి ఘూర్వైనసున్నముతో రంగవల్లు లిడు కొనుటయు మనకు విధిగానేర్పడినది. అప్పుడువేసిన ఆవుపేడ కస్తూరికి తుల్యమని ఆయు ర్వేదిజ్ఞులమతము. కాన గోమయముతోడిపని మనకీదినముల నధికముగా కల్పించియున్నారు. ఈవిధముగా నీధనుర్మాసము మన ఆరోగ్యముకొఱకే పిన్నపెద్దలనెల్లర నిటుకార్య పర తంత్రులనుగా జేయుచున్నది.

అయినను ఈపనులబాధ ఇకనెన్నిదినములోలేదు లెమ్ము. పండుగ పదిదినములలోనికి వచ్చినది. ఈనెలపదునాల్గవతేదీయందు సూర్యుడు మకరరాశియందుప్రవేశించును. అదియే ఉత్తరాయణారంభము. అదియేపుణ్యకాలము. ఎప్పుడు సూర్యు డుత్తరాయణగతుడగునో అప్పుడే ఆమార్తాండుని కిరణజాలంబులు తీక్ష్ణతగాంచును. ఆలోకబాంధవుని తేజఃకిరణప్రస రణచే చరాచరాత్మకంబగు విశాలవిశ్వంబెల్ల నవశక్తినిబడసి తేజోవంతమై విరాజిల్లును. మిత్రమా! ఈపుణ్యకాలమునందు మనమేగాక అన్నిమతములవారును, అన్నితెగలవారును, అన్నిదేశములవారును నీపండుగలజేసికొనుట గమనింపదగిన విషయము. క్రైస్తవుల కీదిన ములలో సంవత్సరాది. బ్రాహ్మల కీదినముల బ్రహ్మోత్సవము. మహమ్మదీయులకుగూడ నివి పండుగదినములే.

ఇక మనహిందువులపండుగవిశేషములు చెప్పనక్కఱయేలేదు. పసిబిడ్డలకు భోగిపండ్లు. ఆపై వారికి బొమ్మలు పెట్టుకొనుట. వారికంటె వయస్సున పెద్దయగు యువతులకు సావిత్రీగౌరీవ్రతము. నైష్ఠికులగువారికి స్నానదానతర్పణాదులు. గృహస్థులు క్రొత్తకోడండ్రను, కూతుండ్రను తెచ్చుకొనుట. కాపులకు కోడిపందెములు. వైష్ణవాలయములలో ఉదయపూజలు. వేయేల, ఐహికాముష్మికలాభంబులను శారీరమానసికాత్మీయసౌఖ్యంబులను నుత్తరాయణపుణ్యకాల మొనగూర్చుచున్నది. ఈశ్వరానుగ్రహంబున ప్రజలు శీతవాతాదికాయక్లేశంబులనుండి విముక్తులైనారు. ధనధాన్యంబు లింటికిఁ జేరినవి. చూడిపశువులెల్ల పాడిపశువులై పాలుపెరుగులు కొల్లలుగావించినవి. ఇల్లువాకిండ్లు చక్కఁగానలంకరించుకొనినారు. నిన్న మొన్నటివఱకు కోతవేతలకుబోయి కూలిగింజలు పుష్కలముగా సేకరించుకొనియుండుటచే కూలినాలిజనములకుగూడ నీపండుగ కడుపునిండినపండుగ. కాన ఈపండుగదినములలో మృష్టాన్న మారగించనివారే యుండరు.

నెచ్చెలీ! నీవును పతీసంతానయుతవై రమణీయమును మహోత్సాహదాయకమును నగు నీజాతీయారోగ్యోత్సవానందమును పరిపూర్ణముగాననుభవించెదవు గాకయని మనఃపూర్వకముగ వాంఛించుచున్నాను.

భావపురి
౧-౧-౩౧

ఇట్లు
శారద.

## సంక్రాంతి

సహదేవ సూర్యప్రకాశరావుగారు

నింగినీలాలచాలులో రంగవల్లి
సందెపువులుగా నందాలచిందె, చదల
నల్లుకొనిన హేమంతలాస్యాంతమంగ
ళాచరణగీతిలో నుదయమ్ము లేదు.
శుక్లపక్షనవోదయస్ఫూర్తిలోన
మలయువలిగాడ్పు వడకంచుతలములందు
ఎదలుఎదలు ప్రేమార సూత్రించుకొనును
విశ్వరాగమ్ముతో ముడివేసికొనుచు.
వెలది! వెన్నెలబిళ్ల, గొబ్బిళ్లనాడి
బడలియున్నావు ప్రణయకోపమున కసలె
తీరికయెలేదు, ఇంకప్రతీక్షలోనె
గడపగానౌనె మధుకల్పకమ్మువఱకు.
నీమోవికోసలు పూర్ణించుకొన్నవి, రేఖి
కాంకబందూకరాగ ప్రశస్తి
నీచిఱునవ్వులే నిశితమాధుర్యమం
దమ్ములై వలయాకృతమ్ములాయె,
నీకనులైనవి ఆకొన్నకోరిక
ద్రుల్లింతలాడు ప్రరోహకములు.
పులకించిపోలేని పలుకుసోనలమ్రోత
లేపావురా గుబాళింపుదొరికె
పువులుపువ్వులుగా విరబోసికొనుచు
నీవుబోయినదారులనీడలందు
చివురుజూపులతో సుధాజీవితమ్ము
కలుపుకొన్నది మధురసంక్రాంతిసిరుల.

—'వకుళమాల' నుండి.

# ఉత్తరాయణమహోత్సవము

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

గీ. ఉర్వి నాబాలగోపాల మొక్కరీతి
నెల్లజాతులవారల యుల్లములను
మిగుల నలరుచు పెద్దపండుగ యనంగ
హాయిగా వచ్చె మన కుత్తరాయణంబు.

సీ. శీతవాతార్తమౌ భూతలోకము రోగభీతిఁ బాపెడు దివ్యభేషజంబు
దక్షిణాశకుఁ బోవు తరణి రథంబు నుద్ధతి వెన్కఁ ద్రిప్పు నుత్తరభటుండు
గ్రహతారకారత్నగణముల నేఁటేట సానపట్టెడు వేల్పుసానరాయి
వలరాజునకుఁ గ్రొత్తబాణంబు లొనరింప మలయమారుతుఁబిల్చు మదనహితుఁడు

గీ. వసుమతీపద్మినీశుల పగలు తీర్చు
రాయబారియు వేదవిధీయమాన
సకలశుభకర్మములకు నాజ్ఞాపకంబు
నగుచుఁ బ్రత్యక్షమగు నుత్తరాయణంబు.

సీ. వెల్ల లోడిక లొప్ప విలసిల్లు గోడలు పసుపుపూసిన ద్వారబంధములును
పచ్చబంతులు గుచ్చు మెచ్చుతోరణము లలంకరించినయట్టి లక్ష్మికమ్మి,
కుంకుమద్రవసుధాపంకరేఖాచిత్రకమనీయమైనట్టి గడపకమ్మి,
అలికి ముగ్గులుపెట్టు నరుగులు గుమ్మంబు లింపులీనఁగ నొప్పు నిండ్లవరుస,

గీ. చక్కఁగానూడ్చి కలయంపి చల్లినట్టి
వీథులును సందులును బిల్లవీథులెల్ల
కన్నులకు విందొనర్చుచుఁ గానవచ్చు
మకరసంక్రమణోత్సవప్రకటనముగ.

సీ. ఆడుపుట్టువులకు నాహ్వానపత్రిక పిల్లలకోర్కెల పీఠభూమి
అల్లుళ్ల బిగువుల కాచార్యకంబు వియ్యపురాండ్ర తగవుల కాటపట్టు
కట్నాలుకానుకలు కైసేయు శుభవేళ బట్టలవర్తకు పంటనేల
బొమ్మలనోముల పువుఁబోండ్ల కొలువులు సంతరించెడు మేలుజంత్రకాఁడు

గీ. కోడిపందెంబులకు జోడుకోడె, జూద
గాండ్రనెడిపాము లాడించు గారడీఁడు
మేకపోతుల పాలిటి మిత్తియైన
మకరసంక్రాంతియెన్న సామాన్యమొక్కొ?

చుక్కలును గుండ్రరేఖలు సూర్యచంద్రు
లష్టదళపద్మములు చతురస్రములును,
చామరంబులు వ్యజనముల్ ఛత్రములును
నిండ్లు బాణంబులును బండికండ్లు తేరి
కొనలు ముక్కోణములును షట్కోణములును
తీరువసుకోణములు ద్వాదశారములును
వజ్రరేఖలు ద్వారముల్ పాపటేడు
పూలతీఁగలు కొమ్మలు పొన్నచెట్లు
తులసికోటలు మున్నుగాఁ బలువిధముల
ముగ్గులును, పిండి కుంకుమ పూలు పసుపు
పొదివికూర్చిన గొబ్బిళ్లు పొలుపు మీఱు
వీథివీథిని, కన్నులవిందుగాఁగ
మకరసంక్రాంతిపురుషుండు మంజుగాన
వాద్యరవముల నుల్లము పల్లవింప
నైదువలు తన్నుఁగొల్చి వెన్నంటి నడువ
నదిగో! ఊరేగు నుత్తరాయణము చాట.

# సంక్రాంతి వీడుకోలు

కడియాల కామేశ్వరరావు గారు

చేరవచ్చెను సంక్రాంతి; చీరవచ్చె
నామెజనకుండు, కూతుని, నల్లుఁగూర్మి:
అత్తయును "మనయిందిర నంపలేదు
దానియత్తవా రెందు చేతనో, కనుండు
చిత్ర మల్లునిఁ బిడ్డను, జీరి వచ్చె
గుర్రవాడు; ముద్దుగ బంపగూడ దొక్కొ
ఆడువారల పుట్టింటి యాశ దెలియ
రైరె! కూతుళ్లగన్న వియ్యాలవారు
వినుతి నొనరించుకొలదిని విర్రవీగు
చుందు; రిది చెల్లిపోవునుసూ! యదృష్ట
వంతులై కొడుకులను గనువారికెందు.
పండుగదినాలు; యింటిలోపలను, పచ్చ
నైన యొకచిన్నముత్తైదువైన లేక,
యుండ జెల్లునె; యిక బంపకుండనగునె?
మీరు స్వయముగ నరుదెంచి, కోరుచుండ,
నైన గనుగొను డయ్య గృహంబు మీరు
గోడలకు క్రొత్తసున్నము గొట్టలేదు;
గుమ్మముల కైన గుంకుమ గూర్పలేదు;
క్రొత్తగింజ లింటికివచ్చురోజు; లీయ
వస్థతో నేమిజేయుదు; వచ్చిపోవు
కొంపగద; యెన్నియని చెప్పుకొందునయ్య?
ఐన కొడుకు గోడలు నొకసైరిగాదె!
వారిదే పెత్తనము; పెద్దవారిగోల
తలకు నెక్కెనె, ఐన మీ తనయ మనసు
అల్లు నిష్టము, మీద మీ యభిమతంబు."

* * *

"అమ్మ! మీపల్కు రూఢియా; నైన, నింత
కాల మిచ్చటనుండె మా కన్నబిడ్డ;
పండుగదినాలు కాన నే వచ్చియుంటి,
ముచ్చటగ బుట్టినింటిలో మూడునాళ్లు
లైన పేరంటములు సేయనౌను; మీ త
నూజ నంపలేదంచును నొచ్చుకొనరె?
అనుభవైకవేద్యముగాక, యన్యమగునె
బిడ్డలను గన్నవారి యాపేక్షలరయ."

* * *

మాటమెత్తనలో నెత్తిపోటుపదును
చూపు సోత్ప్రాసకరము లౌ, చురుకుమాట
లంతరంగంబునను బిగియారబట్టి
బిగువు బింకంబు లోకకొంత వెలువరించె.
అల్లుని బరిపరివిధాల ననునయించి
యనుగుగూతురుతో పైన మయ్యెనతడు.
తండ్రి వెనువెంట నడచెడు తనయహృదయ

మందు వివిధభావంబులు చిందులాడె
బుట్టినింటికేగుదునన్న ముచ్చటొకటి,
ప్రియుని దిగవిడచిపోయెడు బెంగయొకటి,
'వచ్చునో! రాడొ!' యంచను భావమొకటి,
'పంతమున జేసి రాడ'ను వంతయొకటి,
'యిద్దరము గూడివచ్చెద; మింక నీవు
వెడలు'మని తండ్రి యింటికి వెడలనడపి
మగని సన్నిధినేయుండు మన సదొకటి,
త్వరితగతివత్తు దిరిగి యన్న ధైర్య మొకటి,
జనకు డేమనునో యనుశంక యొకటి,
ఒకటియునునేల భావము లొకటివెనుక
నొకటియై తెంద మిటు నటు నూపు చుండె;
మాటి మాటికి భర్తపై మమత జూపు;
సారె సారెకు బ్రార్థించు సరణి దెలుపు;
రాగయుత మైన వ్రీడాభరంబు కతన
నిమిషమైనను నిశ్చింత నిలువబోదు.
నేత్రముల తల్పు లరమూసి నిలచె నెదుట,
గారుచున్నవి ముత్యాలు కనుకొనలను,
పలుకు దొట్రిలు, నిలుకడ బడయలేక
భావములు చూపు తళుకుల బ్రతిఫలింప
చూపులన దన్ను బ్రతిమాలు చున్న సుదతి
దృష్టు లొకకొంతదానస్వయించుకొనుచు,—
ఆనిగూఢామృతరసంబు, లనితరాను
భూతములుగాగ, తనప్రియ మొగమునందు,
తన విలోకనచంద్రికాతతుల బరపి,
నిజసతీవదనకుముదమున్మేషము గన,
ప్రతివచోయుక్తి బ్రణయంబు బాదుకొలిపి
"అటులె రావచ్చు— దాని కభ్యంతరంబు
కూడ నేటికి?—మీ పుత్రితోడమీరు
చనుడు మున్ముందు; వత్తు నిశ్చయముగాగ."

# సంక్రాంతి సంగీతము

కస్తూరి రాజా మాణిక్యము గారు

సుమసుకుమారగంధముల సోలిన దీచలిగాలి; అంతరా
ళము మధురించె రాగరసలాలనమూర్ఛ ఉషోదయాన; హ
ర్షము పులకించుకొన్న మహిళాహృదయాలివి; జాతిగుండియల్
చెమరుచునేమొ, మూగమురళీ, గళమెత్తుకు పాటపాడుమా!

మానవులుమీరు, జీవనభావభరము
మరచిపాడుడు, ఒకనాటివరకు; ఈ ఉ
షస్సువెలిగించి వలపుదృశ్యమున శాంతి
ఉన్నదోలేదో, చూచిపోవుదురుకాని.

కిలకిలమ్రోయుచున్న విహగీమధుగానము లామెవాణిలో
పలికినపాటలు,—ఋతుహీనవారులు రాల్చినవామెకండ్లె ఆ
వలపుబెడంద ఊర్పుల సువాసిలె నీతొలి ప్రొద్దు; గాలిమ్రు
గ్గులు సవరించుచేవలపుకోర్కెలురేగిన ఆమెనవ్వునో!

ఈశుభోదయవేళ నాదేశజనులు
ఉత్సవోచ్ఛలితానంద మొందెదరట!
స్త్రీలుపురుషులు చేతితోచేయిగలిపి,
జారిపోయిన మాతృదేశస్వతంత్ర
భాగ్యరమకయినడచిపోవలెనురండు!—
ఎదలుకలవారు మాతోడ కదలిరండు!
ఇది యుగోదయవేళ......

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

## ౬

## తోడికోడలి పరాజయము

జనకుని పర్ణకుటీరమునుండి లక్ష్మి భర్తగారి ఇంద్రభవనమునకువచ్చెను. పూరింటవసించు దరిద్రకుమారి నేఁడు రాజసౌధమునకు రాణియయ్యెను. హంసతూలికాతల్పములు, రత్నాభరణములు, లెక్కలేనిగృహపరికరములు అన్నియు లక్ష్మి యాధీనములైనవి. ఇదంతయు సౌభాగ్యవతియగు లక్ష్మి సుగుణఫలితముకాదా! ఇవన్నియుఁగాంచి ముదమంది "ఆనారాయణమూర్తి కృపవలన నాకివన్నియుఁగల్గినవి. ఈ ధనసంపత్తినంతను ఈశ్వర సేవలయందు సాధ్యమైనంతవరకు నుపయోగింతునేని యాతనిదయకు నాకృతజ్ఞత వెలిపుచ్చినదాననగుదు" నని లక్ష్మి తలంచెను.

సుభద్ర మఱదికి వివాహముగావింపఁజేసి కోడలినిఁదెచ్చెను. ఆమెపై యధికారమునడుపుకోర్కె మాత్రము పూర్తికాదయ్యెను. లక్ష్మి తోడికోడలగు సుభద్రకుఁ దానే వశురాలయ్యెను. ఆమెకు పైదానిగ సుభద్ర సంచరించుచుండెనుగాని యామెను బీడించుట కామె కవకాశము దొఱకుటలేదు. లక్ష్మి చేయు పనులలో నేదేనిదోషము నెమకి తన గొప్పతనము చూపించవలెనని యామె యభిప్రాయము. కాని లక్ష్మి యేమి చేసినను దోడికోడలి నడుగకుండఁజేయుటలేదు. నా యాజ్ఞలేకుండ లక్ష్మి తనయిష్టమువచ్చినటుల చేయుచున్నదని సుభద్ర దోషారోపణ మొనర్పజాలకుండెను. ఆమె కార్యములలో లోప మేమాత్ర మేని గనపడిన సుభద్ర కన్ను మొగ మెఱ్ఱఁజేసి తూలనాఁడుట కెంచును. ఇంతలో లక్ష్మి భయపడుచు "నేనింకను బనిపాటలు బాగుగ నెఱుఁగను. మీదగ్గిరకు వచ్చికదా నేర్చికొనుచుండుట" అని జవాబునిచ్చును. "ఐన ఇన్నిదినములు తండ్రి యింట నేమిచేయుచున్నావు. బూచాలకూచివి కావుగదా! నేర్చికొనలేకపోతివా?" అని సుభద్ర గర్జించును. అంత లక్ష్మి వినయముగ "తండ్రియింట నీపనుల నేర్చికొను టెట్లుసాధ్యమగును? పసితనములోననే మా తల్లి చనిపోవుట మీరెఱుఁగుదురు. ఇంక నెవ్వరు నేర్పెదరు" అని పల్కును. సుభద్ర కింకఁ బ్రత్యుత్తరముండదు. మాటాడదు. మాటకుమాట పెరగును. నమ్రత యహంభావమును తగ్గించును.

"లక్ష్మి నాకుమాత్రెను స్వభావికముగ నిరాదరించును. అప్పుడు నోటికివచ్చినవి నాల్గనందును" అని సుభద్ర యాలోచించెను. కాని యదిగూడ జరుగలేదు. లక్ష్మి జానకిని దనకన్న నెక్కుడుగ బ్రేమించుచుండెనను మాట సుభద్రకు కొద్దిదినములలోనే తెల్లమయ్యెను. ఈ యంశమును జానకియే స్పష్టపఱచెను.

ఒకనాఁడు తోడికోడండ్రిద్దరు నొక్కచోఁగూర్చుండి జానకి నాడించుచుండిరి. కొంచెముకాలము నా మాటయు నీమాటయునైనతర్వాత లక్ష్మి "జానకీ! నీవత్తవారింటికి వెళ్లివచ్చునపుడు నాకేమి తెత్తువు చెప్పవే" అని యడిగెను. జానకి నవ్వి "నేను నీకు జిలేబి, మిఠాయి, పకోడి" తెత్తుననెను. లక్ష్మి "అమ్మకో" యని మరల ప్రశ్నించెను. జానకి తనచిన్నితల నటునిటు నూపి "అమ్మకేమియును తేను."

సుభద్ర:—ఏమే! నాకేమియు నెందుకు తేవు?

జానకి:—నీవు నన్ను కొట్టుదువు.

సుభద్ర:—కక్కి నిన్నేమియు ననదా?

జానకి:—కక్కికి నేనంటే ప్రేమ.

సుభద్ర:—నీవు నామాటలు వినుటలేదు. అందుకే నేను నిన్ను కొట్టుట. కక్కిమాట వినుచుందువు.

జానకి:—నీమాటలను నేను వినను. నీవు మంచిదానవు కావు. కక్కి నన్ను కొట్టదు. నాకు పాత్రములలో మంచిమంచిబొమ్మలం జూపెట్టును. ఆడుకొనుటకు బొమ్మలనిచ్చును. నాకు కక్కిమీదనే ప్రేమ. నీమీద అసలు లేదు.

సుభద్ర అపజయము గాంచినది. లక్ష్మి జానకి నెత్తుకొని ప్రేమతో ముద్దుగొని "చూచితిరా! అక్కయ్యా! ఇది నాకూతురు. మీకేమియును గాదు."

ఈ విధముగఁ గ్రమక్రమముగ సుభద్ర యన్నియంశములలోను అపజయము గాంచుచునే వచ్చెను. ఆమె పెద్దతనము పారిపోయెను. లక్ష్మిని పరాభవింపనెంచి తాను పరాభవింపబడుచుండుట తటస్థించినది. అంతటంతట నామె లక్ష్మిని మనస్ఫూర్తిగఁ బ్రేమింపనారంభించినది. కసరికొట్టుటకు బదులుగా ఎనిమిదిజాములు సుభద్రనోట లక్ష్మిప్రశంసయే. తాను మంచిదైన బ్రపంచమును మంచిదే.

## ౧౦

## పరిచారికకు పరిచర్యలు

కాలుఁడు కడునిర్దయుఁడై వింధ్యాప్రసాదు ఇంటిని దుఃఖపరంపరలందు ముంచెను. లక్ష్మి గుణగణములచే ఆయింట నిపుడు నిత్యసంతోషము నెగడుచుండెను. గుణవతియగు భార్య ప్రేమ, భక్తి, సేవలనుబొందుచు వింధ్యాప్రసాదు తనదుఃఖముల మఱచెను. వానియింట నిపుడు తొల్లిటికివలె మంగళకార్యములగుచుండెను. మొదటికివలె పండగలుపబ్బములు జేసికొనఁజొచ్చిరి. మిత్రులు, అతిథులు, అభ్యాగతులు యథారీతిఁ బ్రతిదినము వచ్చుచుఁబోవుచుండిరి. నడుమనడుమ లక్ష్మి బంధువులనందఱను పిల్చి విందులఁజేసి వారియందుఁ దన ప్రేమప్రకటించుచుండును. ఇరుగుపొరుగు వారలకు, బీదలకు, దుఃఖితులకు సదా భోజనవస్త్రాదులనిచ్చి వారిని బ్రసన్నచిత్తులఁ జేయుచుండును.

వింధ్యాప్రసాదు నొద్ద సాగరుఁడను పిల్లవాఁడొకఁడు సేవకుఁడుగనుండెను; సాగరునియిల్లు ఆగ్రామమందే. అవకాశము చిక్కిన వాఁడు పరుగెత్తి యింటికిఁ బోవుచుండువాఁడు. ఇప్పుడో యింటికి వెళ్లుట మానినాఁడు. ఎవరైనఁ బిల్చినను ఇంటికిఁబోవుతలంపే వానికి లేదు. ఒకనాఁడు వింధ్యాప్రసాదు వానిని బిల్చి "ఏమిరా సాగరా! నీ వెన్నినాళ్లనుండి యింటికి వెళ్లుట లేదు?" అని ప్రశ్నించెను. "ఇంటికి వెళ్లిన నేమున్నది? మొదటిలో అమ్మకై బ్రాఁకులాడుచుండి యింటికి పరుగెత్తుచుండెడువాఁడను. చిన్నమ్మగారు వచ్చినారు. ఆమె యుండఁగ నిఁక అమ్మమాటయేల?" అని సాగరుఁడు జవాబునిచ్చెను.

వింధ్యాప్రసాదు నవ్వి "నీవు వట్టి కృతఘ్నుఁడవురా! ఎవరో యితరులాదరించుచున్నారని మీఅమ్మనే మఱతువురా?" అనెను.

సాగరుఁడు "అమ్మను మఱచిపోలేదు; అమ్మదగ్గరకుఁబోయిన నాలుగుగంజిమెతుకులు పడవేయును. ఇప్పుడా గంజిమెతుకులు రుచించునా? కడుపునిండఁ బప్పుఁగూరలుఁ బిండివంటలతో భోజనము. బాబయ్యా! చిన్నమ్మగారు నన్ను చదువుకొనమనుచున్నారు. నాకుఁ బుస్తకములనిచ్చి చదువు నేర్పింతుమనుచున్నారు" అనెను.

ఆనాఁడు మొదలు వింధ్యాప్రసాదు శ్రద్ధగ సాగరునకుఁ జదువుచెప్పనారంభించెను; పనిపాటలకు మరియొక సేవకుని యేర్పాటుచేసికొనెను.

వింధ్యాప్రసాదు 'కక్కి' యని పిలుచుపరిచారిక ఇప్పుడు వయోవృద్ధయైనది. శరీరమంతయు జీర్ణించిపోయినది. చనిపోవుటకు సిద్ధముగనున్నది. లక్ష్మిప్రేమ ననుభవించుభాగ్యమామెకు కొలఁదిదినములు మాత్రమే ఉన్నది కాఁబోలును. దగ్గుచేతను, రక్తగ్రహణిచేతను పీడింపబడుచున్నది. ఆమెకుఁ దనవారనుకొనువారెవ్వరును లేరు.

ఈజన్మము చాకిరిచేయుచునే ముసలిదైనది. వృద్ధాప్యముగుట, దానికిఁదోడు రోగగ్రస్తయగుట, లేచికూర్చుండుటకుకూడ శక్తిలేదు. ఇట్టిదశయందెందరో రోడ్లప్రక్క చెట్లక్రిందబడి మ్రగ్గుచుండుట మనము గాంచుచునే యున్నాము. మన "కక్కి" అదృష్టవంతురాలు. ఇంటిదాసియైనను లక్ష్మి దానిని అత్తగారివలెఁజూచి సేవలు చేయుచున్నది. అంతవఱకెందుకు కుమారులును, కుమార్తెలును ఎందరోకల్గి కోడండ్రెందరోకలిగిన ఇల్లాలికిఁ గూడ నిట్టి పరిచర్యలు జరుగునాయని సంశయింపవలసినదే.

మరణదినములాసన్నమైనవి. కక్కి దగ్గుచు పరుండియున్నది. ప్రక్కదగ్గఱ లక్ష్మి తనబాలకునెత్తికొని కూర్చున్నది. ఇంతకు గొన్నిదినములకుఁబూర్వమే ఆమెకొకకుమారుఁడు కలిగెను. ముసలిది సహింపరాని మరణయాతనబడుచుండ లక్ష్మి కన్నులనుండిఆగక కన్నీరుకారుచుండెను. ఆమె దేహము తనకోమలకరకమలముల నంటుచు "భయపడకుము; నీకు త్వరలో నెమ్మదిగనుండును. నేను నిన్ను గంగాస్నానము చేయించి తీసికొని వత్తును. నీపాపములన్నియుఁ బోవును" అని లక్ష్మి మృదువుగఁబల్కెను. లక్ష్మి మధురభాషణములకు ఆమెకు మరణబాధ తగ్గినట్లుగనుండి వెక్కివెక్కియేడ్చుచు "అమ్మాయి! గంగాస్నానమువలన నాకు గల్గునదేమి? నేను మహాపాతకినైయైనను, నీయట్టి పతివ్రతయెదుట నీచేతి గంగాజలముఁద్రావుచు మరణించుచుండ ముక్తి కరతలామలకమేగదా? నీవు సాక్షాత్ లక్ష్మీదేవివి. ఇక మరణించుట నాకు మంచిది. కాని చనిపోవలెనని లేదు. నీప్రీతిని నేమఱువజాలను. నీయాదరసత్కారములఁబాసి చనిపోవుటకు బుద్ధిపొడవుటలేదు. తెమ్ము, అమ్మాయీ! మా చిన్ననాన్నను నావక్షమునఁ బరుండఁబెట్టుము" అని ఆముక్కాలిముదుసలి పుల్లలకు బోలెనెండిన తనచేతులు జాపెను. లక్ష్మి తనపిల్లవాని నామెగుండియలపై ఆన్చిపట్టుకొనెను.

కొంచెము సేపైన పిమ్మట లక్ష్మి యాముసలిని "అమ్మా! రెండుదానిమ్మగింజలు నోటిలో వేసికొమ్ము" అనెను.

ఆపెకు దేనిమీఁదను రుచిలేదు. "ఏమియును తినవలెనని లేదమ్మా" అనియెను.

లక్ష్మి:—కొంచెము షరబత్తు త్రాగుదువా?

ముసలిది:—వద్దు! అమ్మాయీ, ఒకటియు బాగుండుటలేదు.

లక్ష్మి:—ఏమియును తినవలెనని లేదా?

ముసలిది:—లేదు.

లక్ష్మి:—కొంచెము పెరుగుమీఁగడ తీసికొనిరానా?

ఆవృద్ధ యూరకున్నది. లక్ష్మి వెంటనే సాగరునిచేఁ బెఱుగుమీఁగడలఁదెప్పించి ముసలిదియాపెకుఁ బెట్టెను. కాని ఇంతయత్నములు యిట్టిసేవలు ఆమె నీలోకమునఁ గట్టివేయలేకపోయినవి. రెండుమూఁడు దినములలో ఆపెప్రాణపక్షి యామె జరాకృశదేహపంజరమునువిడచి ఎగిరిపోయినది. ఆమె చనిపోయినతర్వాత లక్ష్మికిఁ జాలదుఃఖముకలిగినది. తర్వాత కొన్నిదినములవఱకు విచారించుచునేయుండెను. "కక్కి" శ్రాద్ధదినమునఁ "గక్కి"మాటలపై వింధ్యాప్రసాదు వేయిమందిబీదల కన్నదానముఁజేసి వారందఱికొక్కొక్కకంబళీ చొప్పునఁ బంచియిచ్చెను. ఆ ముసలి "కక్కి" ఛాయాపటమునకు అద్దముకట్టించి గదిలోఁ వ్రేలాడఁగట్టుకొనిరి.

## ౧౧

## తనయింట తానే దాసి

అంతటంతట లక్ష్మి గుణప్రశంసలు తావులవ్యాపించినవి. మంచికోడండ్రప్రసంగము వచ్చినప్పుడెల్ల లక్ష్మి యుపమానమే ముందెత్తుచుండిరి. తమకుమారులకు వివాహములు చేయనెంచి లక్ష్మివంటి కోడండ్రు రావలెనని తలఁచుచుండిరి. వింధ్యాప్రసాదు రాబడి దినదినాభివృద్ధియగుటఁగాంచి లక్ష్మియే యాతనిభార్యగ

నవతరించెననియు ఆమెమూలముననే వింధ్యాప్రసాదు నానాటికి భాగ్యములతోఁ దులతూఁగుచుండుటకుఁ గారణమనియు బ్రజలందఱేకగ్రీవముగఁ బలుకుచుండిరి.

ఆవృద్ధపరిచారిక కాలగతినందిన వెనుక వింధ్యాప్రసాదు మరియొక దాసిని వెదకుచుండెను. కాని యింత వఱకు యోగ్యయగునదెవ్వతెయుఁ గానరాలేదు. ఇందుచే ఇంటిలోపలి అన్నిపనులును సుభద్రయు, లక్ష్మియుఁ గలసి చేసుకొనవలసి వచ్చుచుండెను. ఏపనిలోనను లోటుకలుగకుండ లక్ష్మియన్నిటిని సవరించుకొనుచుండెను.

ఒకనాఁడు వింధ్యాప్రసాదు తనగదిలోఁగూర్చుండియుండ లక్ష్మి పిల్లవానినెత్తికొని మందహాస మొనర్చుచుఁ బెనిమిటియొద్దకువచ్చి “దాసికొఱకు వెదకుచుంటిరి కాఁబోలు. ఎవ్వతెయును దొఱకలేదా?” అనెను.

వింధ్యా:—సరియైనది దొఱకుటలేదు. తోఁచకున్నది. దాసిదిలేకున్నఁ జాలకష్టము.

లక్ష్మి:—అట్లయిన నాదొక మనవి.

వింధ్యా:—చెప్పుము.

లక్ష్మి:—నేనొక దాసినిత్తును.

వింధ్యా:—ఎవరది? నీవు దానినెఱుఁగుదువా?

లక్ష్మి:—ఆ బాగుగ నెఱుఁగుదును. కాని దానిని మీయెదుటకు రానీయను. పగటిపూట పనిచేసి వెళ్ళిపోవును. కాని మీయెదుటఁబడదు.

వింధ్యా:—నీమాటలు బోధపడుటలేదు. కొంచెము విప్పిచెప్పుము.

లక్ష్మి:—తెలిసిన నేమిసేతురు? పనిపాటలలో భంగము రాదు. ఇప్పుడేవిధముగ జరిగిపోవుచున్నవో అన్నియు నావిధముగనే జరిగిపోవును.

వింధ్యా:—జరుగుటకేమి లే జరిగిపోవుచునేయున్నవి. నీవు పనిచేయుచుంటివి.

లక్ష్మి:—అగుచో నేను దాసీతనమునకేల పనికిరాను?

వింధ్యా:—అట్లయిన నీకు దాసినిబెట్టుకొనుట యిష్టము లేదా?

లక్ష్మి:—వద్దు, ఇతరులఁ బెట్టుట కవసరముకనఁబడదు. ఆదాసీకృత్యములు నేనే చేసెదను.

వింధ్యా:—జీతమేమి పుచ్చుకొందువు?

లక్ష్మి:—దాసీలందరకు మూడురూపాయలుగదా యిచ్చుచున్నారు. నాకునవే యిండు. దమ్మిడియైనను తక్కువ పుచ్చుకొనను.

వింధ్యా:—రూపాయలఁ దీసికొని నీవేమి చేయుదువు?

లక్ష్మి:—నగలు చేయించుకొందును.

వింధ్యా:—కావలసిన నగల చేయించుకొమ్ము. కాని వానికి చందువా నేను చేయించిపెట్టను. నగలు పెట్టెలో దాచుటయేగాక నీవు పెట్టుకొందువా? వానినెన్నడైన ధరించితివా?

లక్ష్మి:—ఈ నగలు నాకై చేయించుకొనను. నగలు ధరింప మనసు లేదు. ఈ ఆభరణములు ధరించిన అహంభావము హెచ్చునను భయముకలదు. వందలకొలది స్త్రీపురుషులు కట్ట గుడ్డయైన లేక, కడుపునిండ గంజిలేక దుఃఖించుచుండ నేను నగలు వేసికొని కులుకుచు వీధులవెంబడి తిరుగుచుందునా? పండగదినములలో ధనికులపుత్రులు మంచిమంచిబట్టలుకట్టుకొని వెడలుచుండగాఁ బాపము పేదవారిపిల్లలు వారలఁజూచి సంకుచితమనస్కులై యట్టె యూరకొనుచున్నారు. వారును బిల్లలే, వీరును బిల్లలేగదా! పండగలలోఁ గొందరానందోత్సవములు జరుపుకొనుచుండఁ గొందరు కన్నీరుగార్చుచుందురే? ఈ దాసీకృత్యమొనర్చి దానికి మీరిచ్చు వేతనమును వసంతోత్సవదినములందు బీదలబిడ్డలకు బట్టలుకట్టించుటకునై వ్యయమొనర్పవలెనని యెంచితిని. ఇంటిపనులన్నియు నేనే చక్కఁజూచుకొందును. అక్కయ్య (తోడికోడలు) కూడఁ జాలపనులు చేయుచున్నారు. ఈ పేటలోని బాలికలకు, స్త్రీలకు నేనన్న ఎంతయోగౌరవము. వారు నాపనులఁ జేయుటకు సిద్ధపడుచుందురు. అట్టిచో మరియొక పరిచారికను అవసరమేమి?



పండగముస్తాబు



పంౘ్రెండు కొమ్మలుగల తాటిచెట్టు
(విశాఖపట్టణములో మహమ్మదీయుల గోరీలందున్నది.)



'అల్లరిలో ఆనందము'



జడిపింపు

వింధ్యాప్రసాదు కడుదయాళుఁడు. భార్యమాటలకు నివ్వెరపడి మనములో "ఆహా! ఇట్టి సుగుణవతి నాకు భార్యయగుటచే నాయందు ధర్మపథము స్పష్టముగ నేర్పడియున్నది" అని ఆలోచించి భార్యతో "నీ యిష్టమువచ్చినట్టు చేయుము. నీవు నౌకరిచేయునెడల నీసజీతము మూడురూపాయలే కాదు. నీకెంత వేతనము నియ్యవలెనో నాకుఁదోఁచుటలేదు. నీకు సాలునకు వేయిరూప్యములనిత్తును. దానిని నీకుఁదోఁచినవిధమున నుపయోగించుకొమ్ము. లక్ష్మియే నాకు దాసియైయుండ నాకు ధనమునకు గొదువయుండునా!" అని అనుచుండ వింధ్యాప్రసాదు నేత్రము లానందాశ్రుపూరితములయ్యెను. లక్ష్మి తలవాల్చుకొని వెళ్లిపోయెను. వెళ్లునపుడు పిల్లవానిని భర్తగారిచేతికిచ్చిపోయెను.

లక్ష్మిచెప్పుమాటలు సుభద్రకు నచ్చలేదు. లక్ష్మియెడగోపించుకొని "లక్ష్మీ! నీవుపట్టి తెలివితక్కువదానవుసుమా! నీవాయన్నపూర్ణవై యుండిన మీస్వామి దయామయుడగు విశ్వనాధుఁడు కాఁడా? ఇంటిలో రూకల వెచ్చించుటకు మీరిర్వురును గట్టివారే! రూప్యములు వ్యయము కాకుండుటకా దాసివద్దని ఈ పనులఁ జేయుట నీనెత్తిమీద నే వేసికొంటివి?" అనెను.

లక్ష్మి తోడికోడలితో "అక్కా! నారీజన్మ పురుషులకు దాస్యమొనర్చుటకే భగవంతుడేర్పాటు చేసినది. పతియే సతికిఁబరమదైవము. తనచేతులతో భర్తకు శుశ్రూషఁజేయుపడఁతి జన్మసాఫల్యముగాంచుచున్నది. మనము వారి చరణారవిందపూజనము సలుపవలదా? ఏవిధమునైన నాథుని పదకమలములఁబూజించి జన్మ గడపవలయును. కాలుసేతులు గలిగియుండ వ్యర్థముగ దినములుగడపిన నేమిలాభము?" అని అనెను.

## ౧౨

## ఉపాధ్యాయినీత్వము

తండ్రియింటనున్నపుడే లక్ష్మి కొంచెముగ విద్యనభ్యసించినది. పసితనమందే ఆమె తల్లి చనిపోయినది. అందుచేఁ బనిపాటల సేయుమనువారుకాని, నేర్పువారుకాని ఎవ్వరును లేరైరి. అత్తవారింటికి వచ్చిన తర్వాత ఆమె బాగుగ విద్య నభ్యసించినది. ప్రయత్నించి కుట్టుపనులు, అల్లికపనులఁ దనకన్న బాగుగ నేర్చినవారియొద్ద నుండి గ్రహించుచుండెను. ఆమె బుద్ధిప్రభావముచే నిరంతరకృషిచేఁజెప్పినవారే కొన్నికొన్నియంశముల నామె నేయడుగునట్లుగ వానియందు నేర్పుసంపాదించినది.

ఆ పేటలోనిస్త్రీలు లక్ష్మి అన్నివిషయములలో నేర్పరియగుట గ్రహించి తమపిల్లల నామెయొద్దఁజదువుకొనుటకుఁ బంపుచువచ్చిరి. లక్ష్మి యెంతయోప్రేమతో వారలకుఁ జదువుట, వ్రాయుట, కుట్టుట, అల్లుటయు నేర్పుచుండును. గృహకార్యములనన్నింటి నామె చేయవలసివచ్చినను వానినితన నేర్పుచేఁ ద్వరలోముగించుకొని బాలికలకుఁ జదువుచెప్పుటకు సమయము చేసికొనుచుండెను. ఈప్రకారముగ ఒక బాలికాపాఠశాల ఏర్పడినది. బుద్ధిమతియగు పత్ని యొనర్చు మంచికార్యమును బ్రోత్సాహించుచు ఆమెకు వలయు పరికరములన్నియు వింధ్యాప్రసాదు సమకూర్చుచుండెను.

ఒకనాఁడు వింధ్యాప్రసాదు పాఠశాలఁజూచుటకువచ్చెను. ఆయన బాలికల నెన్నియోరీతులఁ బ్రశ్నించెను. వానికిఁదగురీతి వారు ప్రత్యుత్తరములనిచ్చిరి. వారల బరీక్షించి, వారిచ్చిన యుత్తరములకు సంతసించి ఆతడు తనలోఁ దనప్రియురాలి విద్యాదానవిధానమునకు ఎంతయో మెచ్చికొనెను.

* * * * *

ప్రియసోదరీమణులారా! రండు. లక్ష్మికి శుభాశీర్వాదములను గోరుచు నేటికి విడిపోవుదము. మీలో నొకర్తుకకేని లక్ష్మి గుణగణములబ్బిన నేధన్యునుగ నెంచికొందును.

# సుశీల

శ్రీమతి ఇల్లిందల సరస్వతీ సీతారామ్ గారు

సంక్రాంతిపండుగయగుటచే వనితామణులందరు గడపలకుఁ బసుపురాచియు, తోరణములుగట్టియు; గోడలకు సున్నమువేయించియు గృహములనలంకరించుచుండిరి. ఏగృహమును పరికించినను అలంకారమయమైయుండెను. తల్లులు తమ బిడ్డలకు బంట్లుపోసియు, నగలతో నలంకరించియు, క్రొత్తదుస్తులను ధరింపజేసియు, తమ నేత్రముల కానందముగావించుకొనుచుండిరి. పురమంతయు సంతోషమయముగనుండెను.

అట్టి సంక్రాంతిపండుగద్దినమున-ఎంతోయానందముగా నుండవలసినదినమున-ఏకారణముననో ఒక ఇందువదన ఖిన్నవదనయై విచారించుచుండెను. ఆమె తనగృహమలంకరింపలేదు. తలయైనను ముడిచినట్లులేదు. ఆమె కురులన్నియు ముద్దుమోముపై స్వేచ్ఛగా విహరింపజొచ్చెను. ఆమె కను లశ్రుజలపూరితములై యుండెను. ఆమెతనలోతానిట్లనుకొనుచుండెను. "నాజీవితము నిరర్థకమైనది. ఇంకను యెన్నిదినము-లిట్లుండవలెనో? ఇక నాకు మరణమే శరణ్యము."

ఇంతలో నెవరో వీధితలుపు తట్టిరి. ఆమె లేచి తలుపును దెఱచెను. అంత నొక పురుషుఁడు లోనఁబ్రవేశించెను. అతనిపేరు మోహనరావు. తనదుస్తులను విప్పుచు, ఎదుట నున్న యింతినిజూచి "వంటజేసితివా?" యని ప్రశ్నించెను.

"అంతయు సిద్ధముచేసితిని."

"నాకు త్వరలో అమర్చుము. పనియున్నది. భోజనముచేసి వెంటనే వెళ్లవలెను."

భోజనమునకు కూర్చున్నదిమొద లతఁడు భార్యను, నోటి కుచ్చరింపరాని పరుష వాక్యము లాడెను. సుగుణవతియగు సుశీల తలవాల్చి మౌనముధరించియుండెను. నిర్భాగ్య దామోదరుఁడైన ఆమోహనుఁడే యాయింతిభర్త.

మోహనరావు నడవడికనుగూర్చివిచారించినచో నతఁడు జారుఁడు, జూదరి, త్రాగుబోతు. ఇన్నిలక్షణములాతనియం దమరియున్నవి. తిరిగితిరిగివచ్చి గుణవతియగు భార్యను, సుశీలను అష్టకష్టముల పాలుగావింపుచుండెను. ఒకక్షణమైనను యింటనుండఁడు. వేళకువచ్చి భోజనముచేసి, వెంటనే వెళ్లును. ఇది మోహనరావు దినచర్య.

నేటికి మూఁడుదినములనుండియు మోహనరావు యింటికివచ్చుటలేదు. సుశీల కృశించుచుండెను. ఆమెకేమియు పాలుపోవుటలేదు. భర్త దర్శనమబ్బిన యంతేచాలునని సంతోషించు సుశీలకు అతని దర్శనమే దుర్లభమయ్యెను.

సాయంకాల మాఱుగంటలయ్యెను. మోహనరావు జాడలేదు. ఆమెకేదోపిచ్చియెత్తినట్లయ్యెను. ఆమె కన్నీటిధారలు కాల్వలుగట్టుచుండెను. కూర్చుండినను, పరుండినను ఆమెకేమియు దోచుటలేదు. ఆమెప్రక్క యంతయు కన్నీటిచేఁ దడిసి ముద్దయయ్యెను.

సుశీల యెట్టకేలకులేచి కూర్చుండెను. ఆమె కేదియో జ్ఞాపకమునకు వచ్చుటచే నున్మాదిని వలె లేచి గదిలోనికిఁబోయి తలుపు బంధించుకొనెను.

తెల్లవాఱెను. ఉదయము ఎనిమిదిగంటలకు మోహనరావు కోపము మోమునలంకరింప విచ్చేసెను. తలుపు తీసియుండుటచే లోన ప్రవేశించెను. కోపదృష్టులతో సుశీలను బిలిచెను. జవాబురాలేదు. కాని మోహనరావు పిలిచిన బిలుపులచే నిల్లంతయు మాఱుమ్రోతలుమ్రోగుచుండెను. అతనికంతకంతకు కోపమధికముకాజొచ్చెను. గదితలుపుబంధించి యుండుటచే ననుమానించి తలుపును గట్టిగతన్నెను. గడియవీడి తలుపు తెఱువఁబడెను.

మోహనరావటునిటు తేఱిచూచెను. భార్యశయనించియుండెను. బల్లపై ఏదోకాగితము గనబడుటచే తీసిచదివెను. అందిట్లుండెను.

"ప్రాణప్రియా!

నేటికి మూడుదినముల క్రిందట మీరు గృహము వీడియుంటిరి. భోజనమునకైనను యింటికిరాలేదు. నేను సదా మీపాదపద్మములనే నమ్మియుంటిని. మీరింటిలో నుండకపోయినను భోజనముకైనను వచ్చుచుంటిరిగదాయని యల్పసంతోషమునైన కాలము గడుపుచుంటిని. మీదర్శనభాగ్యము కలుగుచుండుటచేత సంతోషించుచుంటిని. మూడుదినముల నుండియు మీదర్శనభాగ్యము లభించలేదు. మీరుపెట్టు బాధలకన్నిటికి నోర్చితిని. మీరింత నిర్దయ వహించుటకు హేతువేమో నాకు తెలియదు. భర్తృసన్మానములేని యాడుదాని బ్రతుకు నిరర్థకమని తెలిసియుండియు ఇప్పుడు కాకున్న నొకప్పుడైనను మీమనసు తిరుగునని భావించి యిన్నిదినములు నామేన ప్రాణము నిలుపగలిగితిని. చివరకు నాయాశ నిరాశయైనందున లాభములేదని ఎంచి ఆత్మహత్యగావింప సాహసించితిని. మన్నింపుడు. దురదృష్టవంతురాలయిన సుశీల మీకంటి కికగనబడదు. ఆదినము మీతో మాట్లాడిన మాటలే కడసారిమాటలు. ఆదినము మిమ్ముజూచినచూపులే కడసారిచూపులు. ఈ జాబే కడసారి జాబు. ఇక వ్రాయజాలను. ముగించుచున్నాను.

ఇట్లు
దురదృష్టవంతురాలు
సుశీల"

## సావిత్రిగౌరిదేవి

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

విమలకారుణ్యమృదులపవిత్రమూర్తి
నాకు నీవును ముమ్మారునీకు నేను
సాక్షియేగాని యన్యంబుజరుగనీక
అత్తమామల బహుదండనాదులుడిపి
పోరులనడంచి మమ్ముసమ్మోదమంద
దేవిదేవరవలెనొప్ప దీవనలిడి
నిత్యమును భవదీయసాన్నిధ్యమిచ్చి
కావు మోయమ్మ! సావిత్రిగౌరిదేవి!!

# లలిత

శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారు

"అత్తా! యివ్వాళ నే మడిగట్టుకుంటా" అన్నది లలిత బియ్యంకొలుస్తూన్న అత్తగారితో.

"సారి, నీవు వండడం నేను సుఖపడడం. అంత అదృష్టంకూడానా నాకు? కోడలువస్తుంది సుఖపడతాను అనుకున్నా. పైగా నీక్కూడాచేయాలసొచ్చె." అన్నది సూరమ్మ ముఖం చిట్లిస్తూ, మూతి విరుచుకుంటూను.

"ఎలా చెయ్యాలో కాస్త చెప్పితే చేస్తా."

"నిన్న చేశావుగా, చేతులారా పట్టుకెళ్లి వేరేనిప్పుల్లో పోయక్కర్లే. చెప్పడమంటే నోటితో చెప్పతారుగాని చెయ్యిపట్టుకొని చేయించలేరుగదా."

"కాస్త రెండుమూడురోజులు చేస్తే చేతవుతుందిగాని ఓరోజుకే ఎలా వస్తుందిమఠి?"

"రెండుమూడు రోజులుకాదు రెండుమూడునెల్లుచేసినా నీకు చేతగాదు. అంతవఱకూ నేను ఘంటాపథంగా చెప్పగల. వచ్చేవాళ్ల వైఖరీ వేరు. వాళ్ల పార్వతిచూడు ముచ్చటేస్తుంది. ఇల్లుచూసి ఇల్లాలినిచూడమన్నారు. ఇంట్లోకివెడితే స్వర్గంలా ఉంటుంది వాళ్లయిల్లు. ఏవేవో చెంకీపటాలూ, పూసలదండలూ అన్నీ గుచ్చి ఇంటినిండా అలంకరించింది. రోజూ మధ్యాన్నం భారతంచదివి మా అందరికీ చెప్తూఉంది. పోనీ నీకలాంటి పనులైనాచేతగాదుకదా? మొన్న భారతంలోపద్యానికర్థంచెప్పమంటే చెప్పలేకపోయావు. ఏమిటో పదిక్లాసు లింగ్లీషు చదివిందంటే చదివింది. ఏమిసదువో ఏమిలోకమోసమ్మా. ఐనా చదువుసంటే పనీపాటా అవసరంలేదని ఏ ధర్మశాస్త్రంలో ఉందో. ఇంతకీ నా అదృష్టం."

లలిత ఒక భాగ్యవంతులబిడ్డ. తల్లిదండ్రుల కొక్కతే ఆడపిల్లగనక లలిత నేమీ యింట్లోపనులు ముట్టనిచ్చేవారుకాదు. ఐనా ముట్టటానికంత అవసరంకూడాలేదు. చిన్నప్పటినుంచీకూడా చాలా నెమ్మదైనపిల్ల. ఎవ్వళ్ళజోలికీ ఎపుడూ పొయ్యేదిగాదు. ఆ అమ్మాయి, తనొక్కతే భాగ్యవంతురాలను గానసీ అందరూ లోకంలో ఇంతేభాగ్యవంతులనీ అభిప్రాయంగలది. అందుకోసం అందరూ తనలాంటివాళ్లేఅనేయభిప్రాయం చేత గర్వం అనేది ఆ అమ్మాయిలో స్థానం ఏర్పఱుచుకోలేదు. తల్లిదండ్రుల ఆచారాలేగాని విపరీతమైన ఆచారాలు షోకులూ ఏమీ లలితలో లేవు.

కాలాన్నిబట్టి లలితకు ఇంగ్లీషుచదువు చదివించారు. సూక్ష్మబుద్ధిగలది కాబట్టి త్వరలోనే స్కూల్ఫైనలుదాకా చదివింది. ఇంగ్లీషుచదువుకోడం మూలాన్ని తెలుగుచదువంటే, తెలుగుభాషంటే ఆమె కర్థంగాలేదు. ఇంట్లో మొగపిల్లలెంతో లలితా అంతే. వాళ్లమోస్తరే పొద్దున్నే కాఫీతాగడం, పదిగంటలకల్లా భోంచెయ్యడం, అందరితో కారులో స్కూలుకుపోవడం. తానాడపిల్లల స్కూలుదగ్గిర దిగేది. అంతేగాని యిల్లనీ, సంసారమనీ, పెళ్లిఅనీ, వంటచేయాలసొస్తుందనీ ఆమె ఉద్దేశంలో లేనేలేదు. ఇట్లా పెరగడానికి తల్లిదండ్రులే ముఖ్యకారణం. అన్నలు తమ్ముళ్ళతోపాటు ఎప్పుడేనా నాన్నదగ్గరకుపోయి "నాన్నా! నేను ప్లీడరీచదవను. శుభ్రంగా ఎం.ఏ., ప్యాసయి లెక్చరరుగా పోతాను. ఎంతో హాయిగా ఉంటుంది" అనేది. తండ్రికూడా యీ అమాయికపుమాటలకెంతో ఆనందించి "పోనీలే అమ్మా! నీ యిష్టంవచ్చినట్లే చదువు." అని ప్రేమపూర్వకంగాఅనేవాడు. కూతుర్నిచూస్తే బ్రహ్మానందంఆయనకు. కూతు రింగ్లీషుమాటాడితే ఆయన చెవికి వేదంలా ఉండేది.

దూరసంబంధం ఆస్తిఉన్నవారికిస్తే ఇంటిపనులేమీ చేతకాని తనపిల్లకు వాళ్లేం ఇబ్బంది పెడతారో అని ఆలోచించి మేనరికం ఇచ్చాడు. అతనిపేరు రమణారావు. రమణారావుకి వేలకొద్దీ ఆస్తి లేకపోయినా అన్నవస్త్రాలకి ఏమీలోటులేదు. మామగారి సాయంవల్లా పెద్దచదువే చదివి ఉద్యోగం చేస్తున్నాడు. లలిత స్వభావంచూసి ఇతడామెను ఎంతో అభిమానంగా చూసుకునేవాడు. ఏమీ పనులు చేతగాకపోయినా ఏమీ లోటులేనట్లే తలచేవాడు. తల్లి సాధించేప్పుడల్లా ఏదో సమాధానం చెప్పేవాడు. అంతేగాని లలితను ఏమీ అనేవాడుగాదు. తల్లికీ లలిత అంటే ఆదరం ఉందిగాని స్త్రీస్వభావం ఎంతకాలమని ఊరుకోగలదు? పొద్దున్నే కోడలు లేచి మొగంకడుక్కొని, తలదువ్వుకొని, చీరసింగారించుకొని యింట్లో ఏంపనిచెయ్యకుండా కూర్చోడం. తాను పెద్దది ముందుగాలేచి వీధివాకిలిదగ్గరనుంచీ, అంటుతప్పాలాలదగ్గరనుంచీ, పొయ్యిరాజెయ్యడంకూడా తానేనాయె. అసలు దాసీలుచేస్తే ఆమెకు ముందు ఆచారానికి పనికివస్తేనా? మొట్టమొదట ప్రారంభంలో ముద్దుగానేఉన్నా తరవాత తరవాత లలితమీద కోప్పడుతూండేది. మేనత్తే అయినా యీ కోపానికి లలిత చాలా నొచ్చుకొని చిన్నప్పటి తన ప్రవర్తనకు విచారించేది. ఇట్లా కోప్పడుతూండబట్టే అత్త వండుతూంటే తానూ రోజూ చూస్తూ కొంతగ్రహించి ఓనాడు తానువండుతానని సాహసంచేసేవఱకూ అన్నం వేపుడుబియ్యంకిందికి తయారైంది. ఆనాడు అత్తగారు విసుక్కొని తిట్టి ఇల్లంతా ఓవీధిభాగోతం కిందికి దించింది. నాడుమొదలు లలిత నిదిచెయ్యమని అనదు. చేయబోయినా చేయనిచ్చేదిగాదు. ఇదంతా కోపం మూలాన్నే. రోజూ సాధిస్తూండేది. కొడుకుతో చెప్పేది.

వీళ్లయింటిపక్కే పార్వతి అనే ఓపిల్లవుంది. ఆ యింటివాళ్లు సంఘసంస్కారులు కాకపోయినా ఆవుద్దేశంలోవాళ్లు. పార్వతి శారదానికేతనంలో జాతీయవిద్య నేర్చింది. ఇంగ్లీషుఅసలురాదు. చేతిపనులలో ఆరితేరినపిల్ల. ఆ అమ్మాయి తెలుగుపుస్తకాలు, సంస్కృతపుస్తకాలూ బాగా చదివి అందులో సంగతులు ఇరుగుపొరుగువాళ్లకుచెపుతూండేది. లలితకూ పార్వతికీ స్నేహం ఎక్కువ. లలిత అత్తపోరుమూలాన్ని రోజూ పార్వతియింటికిపోయి పనులు నేర్చుకుంటుండేది. అత్త ఎఱుక్కుండానే వంటమొదలైనవి పార్వతి యింట్లో బాగా నేర్చుకుంటూండేది. ఒకనాడు లలిత పార్వతి ఇంటికిపోయి "పార్వతీ! నువ్వు ఇచ్చిన అబలాసచ్చరిత్ర రత్నమాల చదివేశానే. మన స్త్రీలల్లో ఇంతగొప్పవాళ్లున్నారా అనుకున్నా. అసలు గ్రంథకర్త పేరు చూసేవఱకు గుండెమీద చెయ్యి వేసుకోవాలసొచ్చింది. ఇంతవఱకూ నేను తెనుగువి పట్టుమని పది పుస్తకాలైనా చదవతే" అంది.

"లలితా! అదేమిటే అలా అంటావు. హిందూస్త్రీవై ఉండి నీవు తెలుగుపుస్తకాలు చదవలేదంటే నాకే చాలా విచారంగా ఉంది. ఇంకా నాదగ్గిర ఎంతెంతమంచిపుస్తకాలున్నాయనుకున్నావు? రోజూ చదువుతూండు. ఇస్తానులే."

"సరే చదువుతానుగాని మీయింట్లోఉన్న పూసలదండలుగుచ్చడం నాకాస్త చెప్పవే. నేనుకూడా నేర్చుకుంటా"

"సరిపోయింది. నువ్వు కుట్టడం ఎందుకు? కొనుక్కుంటే కావాలసినన్ని దొరుకుతాయి."

"కొనుక్కున్నదానికీ మనం కట్టుకున్నదానికీ భేదంలేదూ. మనంకట్టి గుమ్మాలకి కట్టుకుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది. సరేగాని నువ్వు అవన్నీ మీజాతీయవిద్యాలయంలో నేర్చుకున్నవేనా?"

"అవునే. నేర్పుతాగాని నువ్వు నాకాస్త ఇంగ్లీషు నేర్పవూ"

"నీ కింగ్లీషెందుకే, స్త్రీలకు అవసరమైనపనులేవో నీకు రానేవచ్చు."

"అదికాదు నామట్టుకు కొంచెం ఇంగ్లీషుకూడా వచ్చిఉండడం ఆవసరమనితోచింది. ఎంచేతంటే ఈ కాలంలో ఏ ఉత్తరంమీద చూసినా ఇంగ్లీషు విలాసాలేగదా. రాత్రి టెలిగ్రాంవచ్చింది. టెలిగ్రామనగానే మా అత్తగారు కంగారుపడ్డారు. నాకు చదవడం చేతగాదుగా, అప్పుడు లాంతరుతీసుకొని నీదగ్గిరికి రావాల్సొచ్చింది చూశావా!"

"సరే లే రేపణ్ణించి మొదలెడుదుగాని, అదెంతసేపు వస్తుందిభాగ్యం."

కొన్నాళ్లకు లలితఅత్తగారికి జబ్బుచేసింది. జబ్బుకాస్తేఅయినాకోపంతో కొడుకునుచూచి "రమణా! నే నీచాకిరీ చెయ్యలేనురా, చేతులూకాళ్లూ పడిపోతున్నాయి. మాచెల్లెలుగారింటికిపోయి కాస్త ఒళ్లు నెమ్మదయింతరవాత వస్తా. జాగ్రత్తగా ఉండండి అని వెళ్లిపోయింది. ఈ వెళ్లడం లలితమీద కోపంచేతనే అని రమణారావు గ్రహించాడు. నాటినుంచీ హోటలునుంచి అన్నంతెప్పించి తనూ లలితా తింటున్నారు.

ఒకనాడు రమణారావు ఆఫీసునుంచి ఇంటికివచ్చి లలితతో ప్రేమగా మాట్లాడుతూ ఇల్లుచూచి "ఇవాళ ఇల్లు ఏమిటో కొత్తగా ఉందేమి?" అని అడిగాడు.

"ఏం కొత్తగా ఉందేమిటి? ఎప్పుడూ ఉన్న ఇల్లేగా."

"ఏమోమరి...ఇదేమిటీ, ఈ పూసలతోరణాలూ, ఈ చంకీ పటాలూ ఎప్పుడుకొన్నావు నాతోచెప్పకుండా. చాలా బాగఉన్నాయే. ఎంతైనాయి."

"అవినే కొనలేదు. ఊరికే ఎలా ఉంటాయో అని వాళ్ల పార్వతి కుచ్చిన వడిగితెచ్చాను.

"ఈ తోరణాలవల్ల ఇంటికి ఎంత అందం వచ్చిందో. ఐనా వాళ్ల పార్వతి చాలా పనిమంతురాలు. ఇవే నువ్వుకట్టితే ఇంకా ఎంతో ఆనందించేవాడిని."

"పోనీ మీకంత సంతోషంగా ఉంటే నేనే కట్టాననుకోండి."

"నువ్వుకట్టినప్పుడే ఆసంతోషంవస్తుందిగాని తెచ్చిపెట్టుకుంటే రాదు."

"అయితే నేనే కట్టేను."

"నిజంగా."

"నిజంగానే."

"ఎప్పుడు నేర్చుకున్నావు?"

"అత్తయ్య ఊళ్లోలేదుగనక రోజూ మధ్యాన్నంవెళ్లి నేర్చుకున్నాను."

"అబ్బో, నాకెంతో ఆనందంగాఉంది—హోటలునుంచి అన్నంవచ్చిందా?—వంటింట్లో పెట్టక ఇక్కడ పెడుతున్నావేం?"

"ఏమీలేదు. నిన్నవానకి వంటిల్లు కురసింది. ఇంకా ఆరలే."

"ఇవ్వాళ హోటలుకి కొత్తవంటవాడు వచ్చాడుగావును వంట చాలాంబాగుంది."

"బాగుందా? ఏమో వచ్చాడు కాబోలు."

"సరేగాని, వంటిల్లు ఎక్కడ కురిసిందేమిటి, అసలు ఇల్లు కురిసేంత వానైనా లేందే నిన్న—ఓహో నువ్వు చేశావేమిటివంట, ఈయింటి వైఖరీ నీవైఖరీ చూస్తే అలాగే ఉంది."

"అవును"

"అబ్బా, ఎంతపనిమంతురాలవయ్యావు? అలాఅయితే ఇప్పుడే మాఅమ్మకుఉత్తరంరాస్తాను రమ్మని."

# యోగినీ విలాపము

తురగా వేంకటరామయ్యగారు

౧

పాపమేమీ చేయలేదే
ఈదాసి
భావమంతా నీదికాదే
ఈయనంతప్రకృతి నేలేటిధీరుడా!
మాయచేలోకాలుమఱపించు-చోరుడా!
చూడనైనా చూడలేవా?
ఈజీవి
జాడలైనా దీయలేవా?

౨

చింతలందే నిలువగలనా
నావలపు
లంతలంతమైతే బ్రతుకగలనా
ఆనందమున నాట్యమాడే కళానిధీ
అఖిలరూపాలలో నలరే కృపానిధీ
పూజలైనా యందుకోవా?
నాప్రేమ
పుష్పమైనా దాల్చలేవా?

౩

త్యాగసీమే కాపురమ్మా
నీప్రేమ
రాగమురళే జీవనమ్మా
ఈయంధకారమ్ము లేకమైక్రమ్ముటా
ఈలోకమాలోకమే దెలియకుండుటా
వెలుగులోనే నిలువలేవా?
నీమోము
తళుకులైనా జూపలేవా?

౪

జీవితమ్మే ప్రేమమయమా
నిర్భిత
చిత్తమంతా స్వప్నమయమా
ఈవ్యర్థకథన మీవేల సృష్టింతువో
ఈవృథాజన్మ లింకెన్ని కల్పింతువో
ఆగలే దీయల్పజీవి
హృదయేశ!
అమృతజీవన మీయలేవా?

౫

ప్రాణమేలా నిల్పగలవో
నాప్రేమ
ఫలము లేనాడీయగలవో
ఈవేదనావార్థులెటుల దాటింతువో
ఈయోగినీగాన మెపు డాదరింతువో
కొంచెమైనా దెలుపలేవా;
యోగినీ
ఘోషలైనావినగలేవా?

౬

ఇష్టమైతే యేలుమోయి;
చూచుటే
కష్టమైతే మానుమోయి
నీయనంతప్రేమనిధులనైనా యిమ్ము
ఈమహాభీలాగ్ని కేనియాహుతులిమ్ము
చివరమాటే దెల్పితినిరా
ఏమైనఁ
జేయుమోయి; హృదయచోరా!

# సంక్రాంతి పర్వము

బొడ్డు బాపిరాజుగారు

సీ. విరియఁబూచిన బంతివిరులు చేమంతులు
నెలపునిమపవెన్నెలలఁ దుఱిమి
నవనవలాడు చెందొవలను నొకకొన్ని
నల్లగల్వలను గర్ణములఁ జొనిపి
మిసలఁగాఁబండిన మిరపచేనులచాయ
వెలలేని పట్టుదువ్వలువఁ గట్టి
కంఠసీమ నవీనకాంచనహారంబు
కరములఁ దుహినకంకణము లమరఁ
దన్నుఁ బోషింపఁగాఁ జిచ్చెయెత్తి దంపమిడెడు
సాటివరలక్ష్ములందఱి సౌఖ్యమడిగి
దశదిశల వింతతేజమ్ము లెసకమెసఁగ
భద్రగజయానమున వచ్చెఁ బౌష్యలక్ష్మి.

గీ. అత్తవారిపిలుపున కాయత్తపడని
క్రొత్తయల్లుండ్రు; బొమ్మలకొలువుఁ దీర్పి
సంతసింపని యింతులుఁ; గాంతురాక
కెదురుచూడని యిల్లాండ్రు; వెదకినఁగలి
కమునకును గానఁబడరు సంక్రాంతియందు.

సీ. చెల్లెండ్రముద్దును జెల్లింపవాంఛించు
వింతబొమ్మలఁ గొనిపెట్టువారు
సుతలు బొమ్మలకునై బ్రతిమాల చికరిక
మ్ములపిండివంటలు సలుపువారు
క్రొత్తయిల్లాండ్రకుఁ గొనలుసాగెడి ప్రేమ
వెలలేనికోకలు విడుచువారు
పొరుగూరినున్న తోఁబుట్టువులను బావ
లను పండుగకుఁ బిల్వఁ జనెడివారు
అల్లునకుబట్టలుం గొను నవసరమున
హెచ్చువడ్డీలదిగ మ్రింగు బచ్చులకును
ప్రాంశరీనోట్లు వ్రాసెడి బడుగువారు
నైరి సంక్రాంతిపండుగయందు నెందు.

సీ. అంటినచోఁ దెగునట్లు కత్తులనూఱి
పదను బెట్టెడి కోడిపందెగాండ్రు
పశులయొడల్లు శుభ్రము సేసి మురియుచు
శృంగారమును జేయు సేద్యగాండ్రు
అల్లుడింటికివచ్చునని సున్నములవేసి
సంబారముల్ కొనసాగుమామ
"లత్తకోపలియంచు" క్రొత్తకోకఁ గొనంగ
మగని వేధించెడి మానవతులు
భావిధనకాంక్ష మునుమున్నె వర్తకులకుఁ
దిథులఁ జెప్పఁగ వచ్చెడి ద్విజవరేణ్యు
లెందుఁ బొడఁగన్నఁ దామెయై యేపుమీఱి
గంటెరొయారి! నాటిసంక్రాంతినాఁడు.

ఉ. ఎక్కడఁ జూచినన్ గనుల
కింపొనఁగూర్చెడిన్ రంగవల్లికల్;
చక్కని గొబ్బిముద్దలును;
సంతసమారఁ జరించు బాలికల్;
మిక్కిలిబొమ్మకొల్వులును;
మేటిదుకాణములొప్పు నెంతో సొం
పెక్కి సమస్తభూతల మ
దేమొకొ! క్రొత్తదివో లెఁ దోఁచెడిన్.

గీ. కోళ్ళపుంజాలఁ జంకలక్రిందఁ బొదవి
వాకొనఁగరాని పంతాలు బలుకుకొనుచు
బరికిచుట్టును మొత్తమై పందెగాండ్రు
నేలయీనిన తెఱఁగున నిలచిరపుడు.

ఉ. "ఏరయినన్ సవాల్! కొదమ
తేనఁగ నాదగు డేగకోడిపై
కోరినయంత పందెమున
కున్ దిగువాడను జేవయున్నచో
మీరొక చేయిఁ జూడుఁ" డని
మీసముదువ్వుచు పల్కెనొక్కఁడే
పారెడినుద్ధతిన్ సఖుల
పై పొఁగనుంగొని మాటిమాటికిన్.

ఉ. "పెంచితిఁ గన్నబిడ్డవలె
ప్రేముడిఁ బెక్కుదినాలనుండి యే
కొంచెమొ గొప్పయో ధనముఁ
గూర్తువుగా! యని యిప్పుడోదలన్

పంచుకొనంగఁ జేసితివి
నా" కని యోడినకోడికిన్ విచా
రించుచుఁ బల్కె నొక్కఁడతి
హేళనఁ జేయఁగఁ దోడివారలున్.

ఉ. "ఏమనుకొంటివే మొగ? మన
యీ నెమలిన్ జయించుకోడి నీ
గ్రామముచుట్టు ప్రక్కలను
గాంచ" మటంచు వచించి పుంజుపై
గోమున ముద్దువెట్టుకొని
"కోటివరాలకు నెత్తుకెత్తు మా
కామఁ"డటంచు నొకండు సార
కాయలఁ గోయుచునుండె మిత్రుతో.

ఉ. జనులవినోదమున్ బెనుపు
సేయఁగ నెత్తుటమేను జొత్తిలన్
బెనగుచు, లేచుచున్, బడుచు,
పీకుచు, రక్కుచు, చీరుచున్ హుషా
రున ననిసేయఁ జొచ్చె కడు
రోషమున న్నొకరెండుపుంజు 'క్రా'
ననుచును మధ్య మధ్య నరు
లాడెడి మాటల రెచ్చిపోవుచున్.

గీ. చీటికిని మాటికిని పతిఁ జేరి యింట
నివ్విలే వవ్విలేవని హెచ్చరించు
సతుల గడిబిడి పెట్టని సరసవాద్య
మగుచు వీధులఁ బ్రతిశబ్దమాచరించె.

వ. ఒకచోట:

మ. "ఇదిగో! మిమ్ములనే సుమండి! విన
రేమి? పండుగం చల్లునిన్
బదినాళ్లుండఁగ మొన్న నేపిలిచె
మీ నాత్మమ్మ; మీకింకనుం
గుదరన్ లేదు ముహూర్త; మేమియని
నన్ గోపంబు చాల్లెండి! మీ
కెదియున్ బట్టదు ముద్దుముచ్చ"టనెఁ
దా నిల్లాలు ప్రాణేశుతో.

వ. వేరొకచోట:

చ. "నిరుడును బిల్వలేదనుచు
నిష్ఠురమేసినవారు; మొన్న 'నే
మెఱుఁగని జాణగాయితిరొ
యెంచును వియ్యపరాలటంచు మీ
మఱఁదలితో వచించిరట
మానిఁచో నికను న్నే? ఊప్పెపో
యి రియమునం బిలువు
నే!" యని యొక్కతె తెల్పెనాథుతో.

వ. ఇంకొకచో:

చ. "కనుఁగొనినావ? మొన్న మన
కాంతమ కొన్న గులాబిసిల్కుచీ
రను; వెలకేమిలెండు! కడు
దివ్యము గాదె జరీబుటాయు? 'బా
వను కొనఁగోర రాదె?' యని
పంకజనుక్కయ దెల్పె" నంచు సి
గ్గును, బ్రణయంబుఁ దోప నొక
కోమలి పల్కెను వ్యంగ్యవైఖరుల్
దనరఁగ నాథుతోడ, అబ
లల్ నెఱజాణలు మాటపొందికన్.

వ. మఱొకయెడ:

గీ. "ఎలమినిదె తొలిపండుగ పిలుపుగాన
దనర వియ్యాల వారినందఱిసిఁ బిలిచి
మనకుఁ దోచినరీతి యల్లునకు వారి
కందఱకు బట్టలను బెట్టనగు" నటంచు
మగనితో నచ్చఁజెప్పి సమ్మదము సెలఁగ
పిలుపుఁడని పంచె నొకఫుల్లజలజనయన.

క. ఈరీతి సతులు దమతమ
కోరికలన్ బ్రాణవిభులకున్ దెలుపఁగ వా
రోరిమి విని; చేసిరి. యిఁక
నేరకముగఁ గ్రొత్తయల్లు రేపొందిరనన్.

సీ. "ముంజేతిగడియారమును గొనిపెట్టినఁ
గాని రా"ననెడి నాగరకుఁ డొకఁడు
"వెలగల సిల్కుబట్టల నొసంగకయె రా
వీలుగా"దనెడి రంగేళి యొకఁడు
దలుచుపే తడవుఁగాఁ జెలరేగుముదమున
నరుగఁ జూచెడి యమాయకుఁ డొకండు
"పత్తు; రా"నని చెప్ప కెత్తిపోడుపుల మా
మల విసికించెడి మలక యొకఁడు

"నిరుడు నేమిచ్చినారు? సంబరముసాలు;
పిలువకయేయున్న లాభంబు గలుగుమీకు;
నెందుకీకర్చు?" లని చెప్పి యెప్పటివలె
సంతసమ్మున నేగు వాచాటుఁడొకఁడు.

ఉ. "పండుగ చేరవచ్చెనొక
వార్తయు నిప్పటికేని యేలరా
కుండెనొ? మామయింటికడ
నుండఁడొ యేమొ? మఱెందు కీవృథా
దండుగయంచు నెంచిరొ గ
దా!" యని తర్కము సేసికొంచు న
ల్లుండొకఁడుండు తత్క్షణము
లో వినవచ్చెను మామ పిల్పులున్.

ఉ. "క్రిందటిమాసమందెదియొ
ప్లీడరుతోఁ బనియుండివచ్చి 'మీ
రందఱురండి పండుగ' క
టంచు మఱిమఱి నొక్కిచెప్పి యే
మఁదొకవార్త నేనియును
సంపఁడుగా? మరియాదయన్న మా
కెందునలేదు మామ" కని
యెంచె నొకానొక క్రొత్తయల్లుఁడున్.

గీ. "మాటవరుసకునైన మా మామగారు
పండుగకురం" డటంచును బలుకలేదు
మొన్నవచ్చినతడవ, నింకెన్న నేల?
యని నిరాశవహించెఁ బ్రాతల్లుఁడొకఁడు.

చ. తిలకము ఫాలభాగమున
దిద్ది శిరోజములన్ మనోహరం
బెలయఁగదువ్వి చూపులకు
నింపగు దుస్తులఁదాల్చి క్రొత్త బూ
ట్సుల టకటక్ నినాదములు
సోద్యముఁ గూర్పఁగ నొక్కయల్లుఁ డిం
పలరఁగ నత్తవారి పిలు
పంది రయంబుగ నేగుచుండెఁదా.

గీ. పట్టణంబునఁ జదివెడి బాలుఁడొకఁడు
పాత్రములకంచు తనతండ్రి విత్తమంపఁ
గ్రొత్తబట్టలఁ గుట్టించి యత్తవారి
గ్రామమున కేగె టింగురంగాయటంచు.

రకరకమ్ముల వింతవస్త్రములఁ దాల్చి
వెలయుఁ దులలేని భూషణమ్ముల ధరించి
యువిదలందఱు గుమిఁగూడి యొకరియింటి
కరిగినపిదప మఱొకరి యింటికరిగి
మంగళారతిఁ బాడి బొమ్మలకు నల్ల
వారలిడు దోసనారింజపండ్లతోడ
చిట్టిచెల్లెండ్ర యొడులను నిట్టినింపి
యేవొ నాటిసంగతులు తర్కించుకొనుచు
వెడలి రెవరిండ్లకు వారె వేడ్కమీర.
తీరుబడి లేదు నిట్టూర్పుఁ దీయనైన
వలువలుకొను మామలకు; బట్టలదుకాణ
దారులకుఁ; బిండివంటలఁ గోరిచేయు
నత్తలకు; నోరచూపుల గుత్తఁగొనుచు
పతులఁజూచెడిసతులకు; బళియనట్లు
నత్తవారింట మెక్కెడి నల్లురకును;
నింటియింటికిఁ జనుపురోహితుల; "కయ్య
బాబు! బిచ్చ" మని యడుగు వారలకును.

చ. తలుపులు, ద్వారబంధములు,
దట్టలు, బుట్టలు, వంటకట్టియల్,
కలపిడకల్, వెదుళ్లు, కడు
లావగు దూలము లెన్నొయెన్నొ తి
ట్టుల సహియించి తెచ్చి అవి
టోకున మండెడు భోగిమంటలో
పలఁ బడవైచినారలు గు
భాలునఁ గొందఱు దిప్పకాయలున్.

క. మంత్రములను మఱచినచోఁ
దంత్రములం బూర్తిఁజేసి ధనముహరింపన్
యంత్రములై విప్రులు సం
క్రాంతిని నెటఁదామెయగుచుఁ గనుపట్టిరిగా.

చ. ఒకట నొకానొకండుఁ దన
కొప్పగ మంత్రము రామి దగ్గికు
త్తుక సవరించి కొంతయును
దుమ్ముచు వేరొకకొంత నేదియో
వికవికలాడి ముక్కుపొడిఁ
బీల్చుచు నింకొకకొంతపూర్తిగాఁ
బికరొక యింతలేకఁ గడు
విజ్ఞుఁడనంచనె దక్షిణడ్గుచో.

ఉ. జాణయొకండు నొక్కయెడ
జ్ఞప్తికిఁ దట్టమి వెక్కసెప్పుడో
రాణఁబఠించినట్టి యమ
రంబునఁ గల్గిన శ్లోకపాదముల్
బూని గతానుమానుఁడయొఁ
బో! "త్రిదశా విబుధాస్సురాస్సప
ర్వాణ" యటంచు తత్క్షణమె
పాదముఁ బూరణఁ జేసె వింతగా.

సీ. కూష్మాండదానముల్ గొని వెసవెక్కనే
సుబ్బిసెట్టికి సమ్మఁజూచు ద్విజులు
అల్లుండ్రకై తెచ్చినట్టి వస్త్రంబుల
నెంచి భార్యలకుఁ జూపించువారు
"బొమ్మపెండిలి మీరు భోజనంబున"కంచుఁ
జెలిమికత్తెలఁ బిల్చు జలజముఖులు
బట్టలిచ్చిన నవ్వివదని మూతి బి
గించికూర్చుండి భీష్మించువారు
క్రొత్తవలిపెమ్ములనుగట్టి కులుకువారు
భూషణమ్ముల మెయిదాల్చి మురియువారు
మితముసెడి పిండివంటలు మెక్కువారు
నగుచుఁ దనరిరి నాటిసంక్రాంతియందు.

గీ. విమలహృదయాంబురుహలైన ప్రమదలకును
వత్సరంబున కొకపరి వత్సలతను
మాధవుండొసఁగెడి బహుమానమనఁగఁ
దనరె సంక్రాంతి కనులు సార్థకముఁ జెంద.
పదియునెన్మిది సంక్రాంతిపర్వములను
జూచినాడను నిఁకనెన్ని జూడఁగలనొ?
అఖిలలోకనియామకుం డనఘమూర్తి
శ్రీపతి యనంతకరుణావిశేషమునను.
స్వస్తియగుఁగాక ప్రజలకు; సార్వభౌము
లిలను న్యాయమార్గమునఁ బాలింత్రుగాత;
గోద్విజాళికి శుభము గల్గుత! సతతంబు.
అఖిలలోకంబులను సౌఖ్యమమరుఁగాక!

# సంక్రాంతి

నీలంరాజు వేంకటేశ్వరరావుగారు

శా. తానెవ్వాఁడు చరాచరాద్యఖిలభూతానీకలోకంబు లెం
తేనై పుణ్యమునన్ భరించునతఁ డాదిత్యుండు నాకర్కట
స్థానంబున్ విడి గ్రమ్మరన్ మకర మాస్థానంబుగాఁ గైకొనున్
గానన్ యద్దిమహోత్తరాయణము, సంక్రాంతిప్రభావంబునౌ.

మ. అవి సంక్రాంతిదినంబులౌట సరసీజాక్షుల్ చలిన్సైఁచి వే
కువ నత్యంతవిచిత్రరీతులుగ ముగ్గుల్ దీర్చి వాకిండ్లలో
బువులుంగాయలు ముగ్గుపై నునిచి సమ్మోదంబె బాటింత్రు తా
మవిధిన్నేరరు హైందవాంగనల కీమర్యాద యేనాటిదో?

శా. అల్లుండ్రన్ సుతలన్ విధాయకముగా నాహ్వానముంజేతు, రే
యిల్లాలైనను మృష్టభోజ్యముల నెన్నేగూర్చు యానాటికిన్,
దల్లుల్ పిల్లలుగోరిన ట్లుచితవస్త్రాలంకృతుల్ జేతు, ర
త్యుల్లాసంబొనగూర్చు సంక్రమణ మోహో యెంత పూజ్యంబొకో!

మ. అవినీతుల్ మధుపానమత్తులయి నొయ్యన్ గోడిపందెంబులం
దవులంజొత్తురు దానఁజీవములు వందల్ వేలుగా నాశనం
బవు, నీపర్వదినంబులన్ ముదము సంభావింపఁగాఁజెల్లు, గా
క విరుద్ధంబుగ హింసజేయుటది సంక్రాంతీమహాత్మ్యంబొకో?

# మాయింటబకసంక్రాంతివిశేషం

కవికొండల వేంకటరావుగారు

అన్నిపండగల మాటా ఏలావున్నా సంక్రాంతిపండగయొక్క తరితీపి తలుచుకుంటేనాఅంటే నా కదో విధంగా తట్టుతూంటుంది. పెద్దపండగనాడెవరూ ఏదంపతులూ వాదోపవాదంలోకి దిగుతారని నేననుకోను. కాని నాకూ నాగృహలక్ష్మికీ ప్రతీసంక్రాంతి పెద్దపండగనాటిరాత్రీ శషభిషలే. శషభిషలంటే నిజంగా శషభిషలే. పాతపంచాంగాలు తిరగేయడం, పెద్దపెద్దల్ని తగవు తీర్చమనడం, తుదకు వద్దు వద్దు కొంఅమాలిన గుద్దులాట అని ముద్దు ముద్దుగా సయ్యోద్దె పడడం, ఇన్నీ నడుస్తవి.

ప్రతీసంక్రాంతిపండక్కి అని పైనివ్రాసినప్పటికీ ఇందున వివరించేదొక సంక్రాంతిపండక్కి జరిగిన సమాచారమే. తక్కినప్పటివికూడా అలాంటివేయైనప్పుడేవో యెక్కదానిని పుచ్చుకుని వ్రాస్తేచాలునని నాయభిప్రాయము. ఇంతకూ పండగలుకూడా ఏకేటావచ్చినా ఒకయేటిపండగ యేలాంటిదో మఱుచటిసాలు పండగకూడా అలాంటిదిగానే జోపిస్తూంటుంది. ముగ్గులంతే, ముచ్చట్లంతే, ఒబ్బట్లంతదళసరివే, తబ్బిబ్బులు తమాషాలు అవేమాదిరివే. సర్వసాధారణంగా చూస్తాగా అంతే, అంతే. ఊహించినకొద్దీ ఏలాపోతుందంటే నాయూహవామనుడు బలిచక్రవర్తికి పైకితిరిగివచ్చుటకు వరముప్రసాదించినప్పటి మొదటిపండగ నాండెలా జరిగిందో, సంకురుమయ్య ఆదియకరాన్ని బయలుదేరి నప్పుడేలా పఱిగిందో, యిప్పుడూ అదేచొప్పు జఱుగుతూ, పఱుగుతూవుందని నేనూహిస్తూవుంటాను, సదా ఊహిస్తూవుంటాను. ఊహేంలని అలాగేచూస్తూ వుంటాను. అలాగే వింటూవుంటాను. చాలా చాలా ఈలాగ్గా యేడాదిపండగల చక్రం తిరిగేలో సంక్రాంతి అనేఆకు పైకిరాంగానే ప్రకృతి ఎంత అందగిస్తుందో, పంటవలంతి ఎంత యొయ్యారంగా సందడిస్తుందో, అంత కనుకలి నాకళ్లుదోంపెట్టుకొని నాకనుపాపల్లో ఆడిస్తూవుంటాను, అంతవినుకలికినాచెవి కోసికొన్నట్టయి పోతాను. ప్రకృతమునకు వద్దాం.

అప్పటికప్పుడే నెలపట్టి నెలఅయింది. నెల అయింది అంటే, తిథివారనక్షత్రాలు లెక్కపెట్టే తారీఖు పటాలుచూచి, వ్రానే ననుకు నేరుగనుక, కాదు కాదు. మాపెద్దమ్మాయి నడిగేను. "ఎన్నాళ్లయిందమ్మా! పరిపిండితో వాకిట ముగ్గుపద్మాలు, ముగ్గుగుమ్మడిపళ్లు, గీయడంప్రారంభించీ" అని. అంటే గబగబా— పెఱటివైపున గోడనే తఱచి గొబ్బిపిడక లూడబెఱికిన ఆనవాళ్లు గుంపులు గుంపులుగా లెక్కించి నెలఅయిందంది. "గొబ్బిపిడకలన్నీ యేమైనాయే?" అని పునః అడిగేసరికి "నిన్న తెల్లాఅగట్ల భోగిమంటలో పడెయ్య లేదూ? మీరు తలంటుకుని చలికాచుకోలే?" అంది. "అవునేవ్! అవునేవ్!" అంటూ నేనున్నా, బంతి చెట్లను అప్పటికి నెలనుండి పిల్లలు గొబ్బిళ్లు తఱచునప్పుడు మధ్యనిలిపికొనుటకై కోసికొనివెళ్లిన పువ్వులు పోగా చెట్లమిగిలి బాగా విడిచియున్నవాని నొకకొన్నింటినిగోసి ఒకబుట్టలో పోసి నా గృహలక్ష్మి ముందు నట్టింటబెట్టి "ఇవన్నీ దండగ్రుచ్చి వీధిగుమ్మానికట్టు. పెద్దపండగ. శృంగారంగావుంటుంది." అన్నాను. నామాట వినలేవో వినే విననట్టునటించి అనాలనే అందో అందిగదా నాగృహలక్ష్మి "పెద్దపండక్కి పెద్ద జరీపువ్వుల భనారసుచీర కొనిపెడతారా?" అంది. ఆమాట నేను వినలేదో వినేవిననట్టు నటించానో, ఒక్కఉడాయున చావడిలోనికివెళ్లి పోయినాను, మాఱుమాటాడకుండా.

నేను చావడిలోనికివెళ్లి సొమ్ముసంచీతీసి పాతికరూపాయలు లెక్కించేలోగా బంతిపూలదండ నొక దానిని మాచిన్నమ్మాయి చావడిలోకి తీసికొనివచ్చి "ఇదిగో! దండ! ఇది గుమ్మానికట్టమంది అమ్మ" అని నాచేతికిచ్చింది. "ఎవరుగుచ్చా" రన్నా. "అమ్మే గుచ్చింది" అంది. అయితే యీపాతికరూపాయలూ

పెట్టి అమ్మను కావలసిన చీర కొనుక్కోమను. బంతిపువ్వులు గ్రుచ్చినందుకు బహుమతీగానిచ్చానని చెప్పు" అని ఆరూపాయలు దానిచేతికిచ్చి దండపుచ్చుకొని గుమ్మానికికడుతున్నా. వెంటనే పిల్ల అయినా అది పెద్దదానిలాగు కనుబొమ్మలెగరేసి, "అమ్మకాదండి గ్రుచ్చుతా, నాన్నగారూ! నేనూ గ్రుచ్చుతా. తానుగ్రుచ్చానని చెప్పనుందిమీతో" అంది. "అయితే ఆరూపాయలు నీవు తీసికొని అమ్మదగ్గఱ దాచుకో" అని పంపివేసినాను.

బంతిపూలదండ గుమ్మానికక్కట్టి నేనొకమాఱువీధిలోనికివెళ్లి మాయింటిగుమ్మంకేసిచూచి "బాగుంది." అని అనుకొని గుమ్మంతిరిగి ఎక్కుతున్నా. పెద్దమ్మాయివచ్చి "నేపెట్టిన ముగ్గంతా తొక్కేశారా?" అంది. "అయ్యో! తొక్కేశానే?" అని నొచ్చుకున్నా. నానొచ్చుకోవడంతో సానుభూతిగలిగి "పోనీలెండి. ఎదరింటివారిముగ్గు మాయింటిముగ్గు పక్కిళ్లముగ్గులు కలిపినచోట్ల తొక్కలేదు లెండి. ఎలా కలిపేశానో చూచేరా? మనవీధంతా యీవేళ తెల్లని పిండిముగ్గు. ఈవేళ దారంటనడిస్తే కాళ్లకుదుమ్మవదు. కాళ్లేం చక్కావుంటాయి" అంది. ఆ ఆనందంలో చంక లెగరేసింది. చంకలెగరేసి "దానికి దండగుచ్చితే పాతిక రూపాయలిచ్చారు. నేను ముగ్గుకలిపినందుకో?" అంది. "నీకూఇస్తాను అమ్మదగ్గఱదాచుకుంటేను" అని దానికొకపాతికరూపాయలులెక్కపెట్టిఇచ్చాను. ఆరూపాయలుతీసికొని "అమ్మదగ్గఱెందుకుదాచడం? నాపెట్లోనే దాచుకుంటాను." అంది అది. "ముగ్గుకలపడం అమ్మచెబితే చేశావా? నీ అంతట నీవుచేశావా?" అని అడిగాను. "నాఅంతట నేనేచేశాను. వాళ్లమ్మాయి యిక్కడదాకా పెడితే నేనక్కడదాకా పెట్టాను. నేనక్కడదాకా పెడితే, వాళ్లమ్మాయి యిక్కడదాకా పెట్టింది. ఈవేళ పెద్దపండగో మీముగ్గు మాముగ్గు కలిపేదాం అని నాకూదానికితోచి మేమిద్దఱం కలిపేశాం. ఈమాత్రానికి అమ్మకావాలా?" అంది. "అయితే నీపెట్లో దాచుకుని తాళంవేసికొని ఆతాళం అమ్మచేతికియ్యి" అన్నాను. "అలాగే లేండి" అని వెళ్లిపోయింది.

తరువాత స్నేహితులతండా ఒకటివచ్చి చావడిలో ఈసంగతీఆసంగతీ సంతోషంగాచెప్పి మధ్యాహ్నమెక్కడికైనా వెడదామన్నారు. ఆలాగేలేండి అని వారిని వీడ్కొలిపేను. గుమ్మం ముందు బొబ్బిలిపాటగాళ్లేమిటి, బుడబుడక్కలవాళ్లేమిటి, తంబానపదంవాళ్లేమిటి, గంగిరెడ్లవాళ్లేమిటి, పగటివేషగాళ్లేమిటి, తోలుబొమ్మలాళ్లేమిటి, ఎఱుకలాళ్లేమిటి, చెంచులాళ్లేమిటి, జంగాలేమిటి, సనాయివాళ్లేమిటి, నిమషనిమషానికి ఎవరో ఒకరు ఏదో వింతపాటతో, ఏదోవింతమాటతో, కాసంతో కూసంతో ముష్టివేయుటకై నన్ను ప్రేరేపించి, బలిచక్రవర్తి బయటబడ్డ వాసరమును జ్ఞప్తికిదెచ్చినారు.

ఝామున్నరైపొద్దెక్కింది. "మడిగట్టుకోండి. లేండి, బ్రహ్మగారువచ్చి కనిపెట్టుకొనియున్నారు." అని లోపలనుండి వర్తమానంవచ్చినది. నేనున్నూ వీధితలుపువేసి, స్నానాద్యనుష్ఠానములు పెరటిలో నిర్వర్తించుకొని, తర్పణాదులనువదలి, ఇష్టమృష్టాన్నము పిండివంటలతో వచ్చినవారిసహాపంక్తినియథాశాస్త్రీయంగా ఆరగించి తాంబూలంసేవించినాను. పండ్రెండు, ఒంటిగంటౌతుందివిశ్రాంతిగొని లేచేసరికి. అప్పటికి నాయిల్లాలు తానూభోంచేసి "ఫలాహారం చేస్తారాయేమిటి? నిద్రనుండిలేచినట్లున్నారు? మడివదలకుండా వడ్డించేస్తా" నంది. "పండగంటే అస్తమానం భోజనం. పిండివంట వండడం, మడిబట్టకట్టుకోవడం అనా నీ అభిప్రాయం" అని అడిగినాను. "కాదు. భోంచేయడం, నిద్రపోవడమూ" అంది ఎటకారంగా.

"అయితేరా పురాణంచదువుతా" నన్నాను. "ఏంపురాణం?" అంది. "వామనఘట్టం" అన్నాను. "ఓమనగాయలు అన్నారుకాదు" అంది పెద్దమ్మాయి, తమలపాకులు నములుతూ. చిన్నమ్మాయి చెక్క పట

పటమనిపిస్తూ, "పాములపట్టం, పాములపట్టం." అంది. "ఉండడర్రా!" అని వాళ్ళిద్దఱను తల్లి వారించి అంది "వామనఘట్టం వినడానికి బనారసుచీర తెచ్చిపెట్టారా?" అంది. "ఆచీరకట్టుకొని బలిచక్రవర్తి దానం ధారపోసినట్టు నాకేమైనా ధారపోస్తానంటే తెచ్చిపెడతా" నన్నాను. "ఈతగింజవేసి తాటిగింజలాగే మహానుభావుల్లాగున్నారు మీరు" అంది. "కాదు విను" అన్నాను.

"రవిమధ్యాహ్నమునం జరింప——"అను పద్యముకడప్రారంభించి భాగవతకథ చదివిచదివి సాయంకాలమైదుగంటలగు సరికి "ఇంతింతై, వటుడింతయై మఱియు దానింతై, నభోవీథిపైనంతై, తోయదమండలాభ్రమునకల్లంతై, ప్రభారాశిపైనంతై, చంద్రునికంతయై, ధ్రువునిపైనంతై, మహర్వాటిపైనంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై" అనేపద్యం చదువుతూవున్నాను.

వీథిలోనుంచి నామిత్రుల్లో ఒకరు "పండగపూట ఎంతైనాకావచ్చును. ఈవలకొచ్చి యెండలో నీడ చూచుకో. ఆచివరనుంచి యీచివరకుంటుంది. సాయంకాలమైంది. రా. నాకావిహ్వాతియేర్పాటుచేసి నీకై ఎదురుతెన్నులుచూస్తున్నాం" అన్నాడు. వెంటనే "మంగళం నీవుచెప్పు"అని ఆపుస్తకం నాగృహలక్ష్మిమీద పడవేసి నేనుకండువా మంచిదొకటి వేసికొని మిత్రులతోవెళ్లిపోయినాను. తిరిగి రాత్రి ఏడెనిమిది ఘంటలు అయ్యేసరికి ఇంటికివచ్చినాను. వస్తూ వస్తూ త్రోవలో బట్టలకొట్టుమీద ఒకచీర బేరంచేసి, అది యింటికి నావెనకాలె పంపించేటట్టు పురమాయించినాను.

నేను తలుపుతట్టడంలోనే తాను గబగబావస్తూ కంజదళాక్షి మంజీరమధురధ్వనికి కంకణస్వనము తోడుగా ఘడియదీసి "ఇదిగో! చీర. మీరుతెచ్చిపెట్టకపోయినా వచ్చింది" అంది; కట్టుకన్నచీరకుచ్చెళ్లు వీథి తలుపుతీయడంలో విసరినగాలి కల్లలాడుతూంటే గుప్పెటపట్టుకొన్నట్టు, నాకు చూపించినట్టు వుండాలన్నట్టుగా చెయ్యిగొల్పి—ద్వ్యర్థికావ్యం అనుకొన్నా.

ఎవరిచ్చారని నేనడక్కుండానే "మాఅన్నయ్య నాపుట్టినరోజునాడు కట్టుకోమని ఇచ్చినాడు. మీరు తెచ్చిపెట్టేదేమిటి?" అంది. అయితే ఈవేళ నీపుట్టినరోజా? ఎప్పుడూపుట్టినరోజు కనుమునాడు చేసికొనేదానివి కాదూ?" అన్నాను.

"నాపుట్టినరోజు వేఱు. కనుము వేఱు. రెండూ ఒకరోజునకావు, అని నిరుడు మీరు అన్నారుకాదా" అంది సహచారిణి. "కనుము కాదన్నానుకాని ఒకరోజు వెనక్కినెట్టి పెద్దపండగ అని నిర్ధారణచేసినానా నేను?" అని అన్నాను.

"కనుము కాదన్నాక ఒకరోజిటోఅటో అవుతుందిగాని వారాలకు వారాలే ఎగించిపోవుగదా? ముక్కనుమొక్కనాటికి కానేరదు. ఏమాఅంటే నేను పుట్టిపురిటింటిలోవుండడంచేత ఆసంవత్సరం మాయింట్లో ఎవరూ బొమ్మలనోముపట్టలేదట. అందుచేత పెద్దపండగకావచ్చును" అని కట్టుతున్నాను. మన చిన్నమ్మాయి పెద్దమ్మాయి నాకు హారతియిచ్చేమన్నారు." అనిపాడుగ్గా మాట్లాడింది పడంతి. "అవును, అన్నాం, నాన్నగారూ! మంగళహారతి పళ్లెంలో ఏమేస్తారు?" అన్నారు పిల్లలు—కొసరి, కొసరి.

"ఏమేసినాఅమ్మే" అన్నాను. "నేనేంపశువునా? మెయ్యడానికి? ఎప్పుడుచూచినా యింతే. అంత చదువుచదివి, నాపుట్టినరోజెప్పుడూ అని యిక్కడకు పదారేళ్లనుండి అడిగితే సరిగా చెప్పలేకుండావున్నారు" అని రుసరుసలాడి రుసరుసలమ్మలా బుసబుసా కన్నీళ్లుగార్చింది కాంత.

"ఓసుతిమించుతోంది" అనుకున్నా. "వెఱ్ఱిదానా! మీఅన్నయ్య చీరయిచ్చినప్పుడు చీరమడతలో చీటిమీద నీపుట్టినరోజు వ్రాసి, ఫలానిరోజుకు ఈబహుమానం అని వ్రాయలేదా? వ్రాయకపోతే మానె

చెప్పలేదే?" అని అడిగాను. "వాడు చెప్పకేం. వాడు సరిగ్గా నే చెప్పినాడు, పుట్టిన రోజున కట్టుకోమని. మీరే యీ తికమగ్గా మాట్లాడ్డం." అంది.

వెంటనే అటకమీదవున్న పాతపంచాంగాల కట్టలు అన్నీ వెతికి పురాతనవాఙ్మయపుస్తకాలన్నీ దులిపి నాపుస్తకభాండాగారంలోని జంత్రీపుటలన్నీ త్రిప్పి, ఒకవిధంగా నాగృహలక్ష్మిని ఒప్పించేసరికి నాతాతలు దిగివచ్చినారు.

ఏలాఅంటే: ఆమెపుట్టింది కనుంపండగే. కనుంపండగ అన్నది ఆమె పుట్టినసంవత్సరం హూణశకమును బట్టియోజిస్తే 14 జనవరి అయింది. మఱి మన యీ కథాసందర్భసంవత్సరాన్నిబట్టిచూస్తే 14 జనవరి పెద్దపండగ నాడయింది. మనం ఇప్పుడు బ్రిటీషుబావుటాక్రిందవున్నాం కాబట్టి వారి తారీఖునునుబట్టి రచ్చలకు సెలవులు అవి ఇస్తున్నారు కాబట్టి, నీపుట్టినరోజు కూడా ఆలెక్కనుబట్టి లెక్కించడము ముఖ్యకర్తవ్యము. 14 జనవరి సరియైన నీపుట్టినరోజు. అవశ్యం కొత్తచీర యీవేళే కట్టుకుని యీవేళే నీపుట్టినరోజు చేసికోవడం సవ్యం" అన్నాను. "మఱి పుష్యమాసంలో ఫలానితిథినాడు పుట్టాను అంటే అదీ 14 జనవరే నా?" అని అడిగింది.

"అవదు. అవదు." అన్నాను.

"అయితే పుట్టినరోజు నిర్ధారణచేయాలీ అంటే చాలాలకలకలుపడాలి. ఎప్పట్లాగ ఏతిథీ, ఏతారీఖు చూచుకోకుండా కనుంపండక్కే నాపుట్టినరోజు చేసికుంటే వదిలిపోతుంది." అంది. "అది ఛేషైనపని. సాంప్రదాయప్రసిద్ధిగాఉంటుంది. శాలివాహనశకాన్నిబట్టిచూస్తే మఱో మహారోజు కావచ్చును. ఫసలీవారీని మీనమేషాల్లెక్కిస్తే ఇంకోనాడవవచ్చును. ఏమార్పూలేకుండా సుస్థిరంగా ఏటేటావచ్చేది సంక్రాంతిపండగ ఒకటే. ఆ మర్నాడు తప్పకుండా వచ్చేది కనుంపండగ" అన్నాను. "కాదు. నాపుట్టినరోజు" అని నాగృహలక్ష్మి నా మాటలో తనమాటకలిపి "పోనీ రేపుపుట్టినరోజుకు కొనిపెట్టండి మీరు. ఈచీర పండక్కి మాపుట్టింటివారు పెట్టినట్టుంటుంది" అంది.

"కొనిపెట్టండేంవిటి, పుట్టించుకువస్తే; అదిగో" అన్నాను. ఆఅండంలో బజారువాడు చీరపట్టుకువచ్చి గుమ్మందగ్గఉన్నాడు. అది అందిపుచ్చుకొని "ఇదిగో!" అని అమ్మందయాన కందిచ్చినాను. దరహసిత వదనయై తీసికొంది.

కట్టుకుందనుకుంటాను మర్నాడాచీర, తనపుట్టినరోజుకు నేను కొనిపెట్టింపంటూ—ఇప్పటిదాకా జ్ఞాపకమా? మళ్లీ సంక్రాంతిపండక్కదంతా పరగడపు—కాదు నాగృహలక్ష్మియొక్క మళ్లీపుట్టినరోజుకు.

# గృహలక్ష్మి

శ్రీమతి ఎమ్. వేదవల్లి తాయారమ్మగారు

పతికెల్లపనులం దుపచరించునట్టి నె
లతలేని వానియాలయము లయము
నాథుని కనుసన్న లాధారముగఁబోవు
వనితారహితుని జీవనమువనము
సద్యశంబుగడించు విద్యగల్గిన మాన
వతిలేని వానిభవమ్మువమ్ము

కాంతునిశ్రమదీర్చి సంతోషమొనగూర్చు
తరుణీరహితుని గోత్రమ్ముత్రమ్ము
గాన గృహలక్ష్మిలేని ప్రముక్కుడుల కెంత
కలిమి గల్గిననదియెల్ల కలువుగాదె
భవనమెంతటి శృంగారభరితమైన
దివ్వెలేకున్న నది వన్నె దేరనట్లు.

# సంక్రాంతి పండుగ

శ్రీమతి సీరము సుభద్రయాంబగారు

సూర్యుఁడు తూర్పున నుదయించునందురు. సంవత్సరములో రెండుదినములనే సూర్యుఁడు తూర్పున ఉదయించును. అందు మేషసంక్రాంతిదిన మొకటి; తులాసంక్రాంతి దిన మొకటి; అవి చైత్రాశ్వయుజమాసములందువచ్చును. ఆదినములఁ బగలును రాత్రియు సమముగాఁ బండ్రెండేసిగంటలు. మేషసంక్రాంతిదినమునుండి యాషాఢములోవచ్చు కర్కాటకసంక్రాంతిదినమువఱకును సూర్యుఁడుదయించుస్థానము దినదినము కొంతకొంత ఉత్తరమునకు జరుగుచు వెళ్లును. ఆదినమున అన్నింటికంటె దీర్ఘమైన పగలు; హ్రస్వమైన రాత్రి. ఆదినమునుండి సూర్యుఁడుదయించుస్థానము దినదినమును దక్షిణమునకు జరుగుచు వెళ్లి, తులాసంక్రాంతినాఁడు సరిగాతూర్పునకుఁజేరి, యటువెనుకఁ బుష్యమాసములోవచ్చు మకర సంక్రాంతినాటివఱకును దక్షిణమునకే జరుగుచు వెళ్లును. ఆనాఁ డన్నింటికంటె హ్రస్వమైన దినము; దీర్ఘమైనరాత్రి. మకరసంక్రాంతినాఁటినుండి మరల సూర్యోదయస్థాన ముత్తరమునకు జరుగుచుఁ గర్కాటసంక్రాంతినాఁటివఱకును వెళ్లును. మకరసంక్రాంతినుండి కర్కాట సంక్రాంతివఱకు ఉత్తరాయణమని, కర్కాటసంక్రాంతినుండి మకరసంక్రాంతివఱకును దక్షిణాయనమని యందువలనఁ బేరులుకలిగినవి. ఈయయనములు రెండును గలిసి సంవత్సరమగును. పయివిధముగా సంవత్సరమునఁ బండ్రెండుసంక్రాంతులున్నవి. సూర్యుఁడు మకర రాశిఁ బ్రవేశించుదినము మకరసంక్రాంతి లేక మకరసంక్రమణము; తక్కినరాసులకు నట్లే. సౌరమానముగలవారి మాసములు సంక్రాంతినుండి ఆరంభము. మకరసంక్రాంతినాఁడారంభమగునది మకరమాసము. దానికిపూర్వముది ధనుర్మాసము. మన తెనుఁగువారిది చాంద్రమానము. చంద్రుఁడు పౌర్ణిమయం దేనక్షత్రమునఁ బ్రవేశించియుండునో దానినిబట్టి మాస నామముకలుగును. పున్నమనాఁడు చిత్తానక్షత్రమునఁ జంద్రుఁ డుండుమాసము చైత్రము; అశ్వినియందుండునది ఆశ్వయుజము. సంక్రాంతులన్నింటిలోను మకరసంక్రాంతి మనకు ముఖ్యమైనదగుటకుఁ గారణము పురాణకాలమునకుఁ జెందినది. తక్కినదేశములందువలెనే మనదేశమునందును మనుష్యులు గుహానివాసస్థితిమానినతరువాతఁ బశువులను మచ్చికచేసికొని పచ్చికకొఱకై పర్యటనస్థితి యవలంబించి, అటుతరువాత భూమిని సాగుచేయుట నేర్చుకొని ఏకప్రదేశనివాసస్థితికి దిగిరి.

మకరసంక్రాంతినాఁ డత్యంతదీర్ఘనిశ; సూర్యుండుండుకాలమత్యంతస్వల్పము. నాఁటినుండి యహములు దీర్ఘములై నిశలు సన్నములగుచుండును. అందువలనఁ గ్రమక్రమముగాఁ జలి తగ్గును. కాఁబట్టి యది మహాముఖ్యదినమని మన పూర్వులు భావించి యానాఁడు పెద్దపండుగచేయసాగిరి. అన్నింటికంటె నది పెద్దపండుగగనుక పెద్దపండుగయనఁగా మకర సంక్రాంతియైనది. సంక్రమణములన్నింటిలోను ముఖ్యమైనదిగనుక సంక్రమణమన్న పేరు

దానికి మూఢిగాఁగిలిగినది. గ్రామ్యజనుల పలుకులలో సంక్రమణము సంక్రమాణముగాను, సంక్రాంతి సంకురాత్రిగాను దేలినవి.

పచ్చికబయ ళ్లవసరమైనకాలములో వర్షము ముఖ్యము. నాఁడు వర్షాధిదేవతయైన యింద్రునిగూర్చి పెద్దపండుగ జఱుగుచుండెను. వ్యవసాయమునకు సూర్యరశ్మి యంతకంటె ముఖ్యము. ఇంద్రోత్సవము మాన్పించి పెద్దపండగ సూర్యమండలమధ్యవర్తియైన శ్రీమన్నారాయణమూర్తినిగూర్చి యుత్సవముగామార్చినవాఁడు నారాయణాంశసంభూతుఁడైన కృష్ణభగవానుఁడు. ఏతత్కథ భాగవతమున దశమస్కంధమునందు సహజసాహిత్యుఁడైన పోతనామాత్యుఁ డత్యంతరసవంతముగా రచించినాఁడు. దానిని నా నేర్చువిధమున తేట మాటల వ్రాసితిని. చిత్తగింపుఁడు.

రవిరథతురంగములు క్రమక్రమముగాఁగ
దక్షిణాశకునరిగి, యత్తఱినిదిరిగి
యుత్తరముఖంబుపెట్టె; సూర్యుఁడు మకర
రాశిలోఁజొచ్చె; మకరసంక్రాంతివచ్చె.
నందాది యాదవులు సం
క్రందనుఁ బూర్వమటు ప్రీతుఁగావించుటకై
సందడిగా నింద్రోత్సవ
మందఱునుంజేయఁదలఁచియటుకృష్ణునితోన్.
ఎఱిఁగింపఁ గృష్ణుఁ డఖిలము
నెఱిఁగినవాఁడగుటఁజేసి "యింద్రోత్సవ మి
త్తఱి జరుపనేల? సర్వే
శ్వరుఁడగు శ్రీవిష్ణుపూజ సలుపంగఁదగున్.
కర్తయు భర్తయున్ సకల
కారణుఁడై విలసిల్లు శ్రీరమా
భర్త; యతండె సర్వక్రతు
పాలకుఁ; డాతనిఁగూర్చియే మన
స్ఫూర్తిగఁ జేయుఁడుత్సవము:
పుష్కలవృష్టియు, నిష్టసిద్ధియుం,
గీర్తియు, సర్వభోగములుఁ
గేశవసత్కృప మీకుఁగల్గెడున్."

అరవిందాక్షుఁడు కృష్ణుఁడు
పురందరుని సేవతమకుఁబోలనిదని యా
సరణిందెలుపఁగ నందుఁడు
పరమానందుఁడుగఁబరఁగెబంధులుఁదానున్.
హరి, నారాయణు, దీనవత్సలుని, లో
కారాధ్యు, సర్వేశు, శ్రీ
ధరునింగూర్చి యొనర్చిరుత్సవము శ్ర
ద్ధాభక్తి సంయుక్తులై
వరగోవర్ధననామభూధరధరా
ప్రాంతంబునన్ యాదవుల్
చిరకాలంబయి యున్న యింద్రక్రతువున్
జేసేత పోఁద్రోయుచున్.
క్రతుసంపూర్తినిగాంచి యాదవజనుల్
కౌతూహలాయత్తులై,
నతులన్ దక్షిణలన్ మహాసురుల నా
నందాత్ములఁజేసి, గో
తతులందన్పి, సమస్తబంధుహితమి
త్రవ్రాతసంయుక్తులై
యతిరమ్యంబుగ విష్ణుదివ్యకథ లా
హ్లాదంబునం బాడఁగా.

దివిజేంద్రుఁడు కనుఁగొని, త
న్నవమానితుఁగాఁగఁజేసి యాదవులుహరిన్
సవనపతిఁజేసిరని మది
రవిలినక్రోధానలమున రభసాత్మకుఁడై
నీలజీమూతసంజాతనిబిడతమము
క్రమ్ముకొనఁజేసి, దినకాంతుకాంతియడఁగఁ
బ్రళయజంఝూనిలోపేతబహుళముగను
వారిధారలఁగురియించె ఘోరరీతి.
ఆయతివృష్టి యాదవుల
కయ్యెడ దుర్భరమయ్యె నిర్భరా
పాయసమేతమై, యమిత
బాధకమై, యతిలోకఘోరమై;
యాయదిగాంచి గోపకులు
ప్రాణభయార్తినిడిక్కి-స్రుక్కి- "కృ
ష్ణా! యదునందనా! వరద!
శౌరి! దయామయ! కావవే" యనన్.
శైలముఁగేల ఛత్రమటు
శౌరి ధరించుచు వర్షబాధయా
మూలనుమాన్పి గోపకులఁ
బ్రోచెను; దానికి మాఱుసేయఁగాఁ
జాలక వజ్రి లజ్జగొని
సమ్మతిఁగృష్ణు క్షమింపవేఁడె; గో
పాలకు నార్తరక్షకుని
బ్రస్తుతిచేసిరి గొల్లలెల్లరున్.
హరియీగతి గోవర్ధన
గిరిఁదాల్చిప్రజాళి వృష్టికిఁబొగులకుండం
బరిరక్షించిన సుదినము
పరఁగెనుధరలోనఁ బెద్దపండుగయగుచున్.

## గంగిరెద్దు

అడివి బాపిరాజుగారు

ప్రభువుగారికీ దండముపెట్టు
పాదమువంచీ భక్తినిపెట్టు
పట్టుశాలువలు పెట్టెదరంట
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.
మోసముచేసును మునసబుగారు
కక్షలకట్టును కరణముగారు
కలిమిగలిగినా కాపులెవారు
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.
కుంచెకుమాయా కోమటిమాట
ప్రత్తికాయగా బ్రాహ్మణభాటి
సలాముతెచ్చును సాహెబుభేటి
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.
చెన్నపట్టణము చేరువరాదు,
కాశీపట్నం కానగపోదు
కాపవరమునూ కదలగలేదు
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.
చెట్టుకదలినా పుట్టవదలదు
నీరుపోయినా నాచుకదలదు
గుడిపాడయినా గూబవదలదు
గుడిపొలముల పూజారివదలడు
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.
వెండికొండలా యీశ్వరుఁడండి
భమిడికొమ్ములా బసవయ్యండీ
యేడుకొండలా వెంకన్నండీ
  డూ,డూ,డూ,డూ, వెంకన్నా.

—'సంక్రాంతి' నుండి.

# త్యాగిని

శ్రీమతి మైదవోలు పద్మావతిగారు

౧

'నాయనా! అందరును సత్యాగ్రహపోరాటమున పాల్గొనుచుండ నీవు ఆడుదానివలె ఇంటకూర్చొని యున్నావేమి? ఆ భరతపుత్రుల ఘోష నీచెవికెక్కలేదా? మహాత్ముని యాజ్ఞ యనిన లక్ష్యములేదా? భారతీయుల పాట్లుచూడ ముదుసలినగు నాకు రోషపౌరుషములు పైకుబికి జాలిచేత గుండెనీరగుచున్నదే. నీమన సేమి పాషాణమా? ఇనుమా? ఏలకరుగదు? నీవును ఒక మానిసివేనా? ఈదేశమున జనించినవాడవేనా?' యని రావు తల్లి కుమారునికి వడ్డించుచు ప్రశ్నించెను.

అందుకు రావు 'అమ్మా! నీకు నేను సత్యాగ్రహోద్యమమునందు పాల్గొనలేదని కొదువగలదా? నీఉన్నతాభిప్రాయములు తెలియక నేను ఇంటనిలబడితిని. నీకింత గొప్పఅభిప్రాయముండుట మునుపే తెలిసియున్నచో నందరితోపాటు మొట్టమొదటిరోజే నాఉద్యోగమునకు స్వస్తిచెప్పి సత్యాగ్రహులతోకలిసి భారతీయుడను నామము సార్థకముచేసుకొనియుందును.' యని విస్తరిముందునుండి లేచెను.

వెంటనే ఆమె 'నాయనా! నాకుమాత్రము మనదేశపు విషమస్థితి తెలియదా? నేనేమి మూఢురాలనా? మీనవనాగరికుల యభిప్రాయమున ముదుసలులు కేవలము పశువులని కాబోలు. నీవు నన్నేల పౌరబాలుగ దలచితివి? నాకు కొంతకొంత మనదేశపుస్థితి తెలియును. నేచెప్పిన చోద్యపడుదువు. నేను శారదాచట్టమును ఆమోదించినవారిలో నొకర్తనుసుమా' యనెను.

అందుమీద రావు 'అమ్మా! నాతోడబుట్టువులును, తండ్రియు మొదలగువారందరు మనయిద్దరిని వదలి కాలధర్మమునొందిరి. నీవు నన్నేయాధారముగ జేసికొని ఉన్నతవిద్య చెప్పించి నేటికి నిన్నుపోషించు భారము నాపై వైచితివి. మొన్నటివరకు నీ కాయకష్టముచే సంపాదించినసొమ్ముతోగదా మనము జీవయాత్రగడిపినది? అమ్మా! నన్నిపుడు నీవు మనస్ఫూర్తిగ స్వరాజ్యసమరమునకంపెదవా? లేక యందరుపోవుచున్నారు గనుక, నేనునుపోయిన గౌరవమని యెంచిపలికెదవా? ఒకవేళ నేను సత్యాగ్రహపోరాటమున వీరస్వర్గమలంకరించిన నీవు సంతసింతువా? నీవు దుఃఖింపననిన ఇప్పుడుపోవుటకు సంసిద్ధుడను. ఏదియు బాగుగ నాలోచించిచెప్పుము. నీమనసు నొప్పించుట నాకిష్టములేదు. గుడికొట్టి తులసికోటకట్టిన ఎంతపుణ్యమో మాతృదేవి కిష్టములేనప్పుడు లోకోపకారముచేయ ఇష్టపడుటయు అట్టిదే. నేను సత్యాగ్రహసమరమున ఇంతవరకు చేరనందున కిదియే కారణమని ఇప్పుడు చెప్పుచున్నాను' అని పలికెను.

*          *          *          *          *

రెండురోజులుగడిచినవి. రావు తల్లి తనలోతానేదియో ఆలోచించుకొనుచుండెను. 'నాకన్నను దేశమాతయే ముఖ్య'మను పలుకులు ఆమెనోటినుండి యప్రయత్నముగ వెలువడెను.

౨

ఒకనాడు రావు యింటికివచ్చునప్పటికి ఇల్లు నిశ్శబ్దముగ నుండెను. తాను ప్రతిదినము ఇంటికివచ్చునప్పటికి నయనానందకరముగ ఎదురువచ్చు మాతృదేవిముఖము నాడు గన్పడలేదు. అంత 'అమ్మా! అమ్మా!' యని యంగలార్చుచు చిన్నపిల్లవానివలె ఇల్లంతయు కలయవెదకినాడు. తల్లి నిమిత్తములేక పొరుగింటికిపోవు దురభ్యాసముగలది గాకున్నను, కొంతసేపువేచి యిరుగుపొరుగిండ్లన్నియు విచారించినాడు. ఆమెజాడయే కాన

రాలేదు. పదివందిచేత యామెను వెదకి వెదకి, తుదకు నూయియందుచూడగ ఆమెశవమునయందు తేలియాడు చుండెను. ఆమె మరణమునకు కారణము ఎవరును ఊహింపలేకపోయిరి. ఆమెకు శరీరమందు ఏవిధమగు రుగ్మతయు లేదు. ఇన్నిరోజులు కష్టించినను, ఆమెకుమారుని ఉద్యోగమైనతరువాత కాయక్లేశములేక సుఖముగనే కాలముగడుపుచుండెను. ఆమె పోరుపొల్లాటములు కలనైనఎఱుగదు. కనుక శత్రువులుకూడ లేరు. ఆమెబలవన్మరణమున కందరు ఆశ్చర్యపడిరి. మరణకారణ మగమ్యగోచరము. రావుకూడనూహింపలేకపోయెను. యథావిధిగ దహనసంస్కారములు జరిగినవి. రావు విచారమునకు మేరయేలేదు. ఆతనికి తల్లియే సర్వస్వము. ఎఱిగియున్నవారందరువచ్చి పరామర్శించి వెళ్లిరి.

* * * * *

రాత్రి రెండుగంటలు కొట్టునప్పటికి రావుకు కునుకుపట్టినది. నిద్రలో ఆతడొకస్వప్నమునుగాంచెను. స్వప్నమున మాతృమూర్తి కట్టెదుటనిలిచి ఇట్లు పలికెను. 'నాయనా! దీర్ఘాయుష్మంతుడవుకమ్ము. భారతీయుడ ననిపించుకొనుము. నీవు సత్యాగ్రహమునందు పాల్గొనకుండుటకు నేనడ్డమనితలచి, నాకన్న దేశమాతయే ముఖ్యమని ఎంచి, నే సజీవముగనున్న వెనుకంజవేయుదువనిఎఱిగి నేను నాజీవములుత్యజించితిని. నాకై విచారింపకుము. ఇక నీవు నిశ్చింతతో నీవు భారతమాత ఏర్పఱచిన ఆజ్ఞల నెరవేర్పుము' అని పల్కి యదృశ్యమాయెను.

* * * * *

రావు మేల్కాంచి మాతృమరణమునకు నిజకారణముకనుగొని, తన నౌకరికి నీళ్లువదలి, గాంధిగారి శిష్యుండై, స్వరాజ్యసమరమునం ప్రవేశించి యందు వీరస్వర్గమలంకరించి భరతమాతఋణమును తీర్చుకొనినాడు. మాతృమూర్తినికలిసి ఆమెకుకూడ ఎప్పటివలె ఆమెఋణమును తీర్చుకొనుచున్నాడేమో!

## యల్లుండు విడుచునే యత్తయిల్లు?

కొమ్మూరి భోగలింగాచార్యులుగారు

ఒకవంక నత్తగా "రొకపూటయేగద
రేపేగు"దంచు దా నాపుచుండ
"ఇప్పట్టుననుబోవ నెప్పట్టుననురాను
సరియెపో"మ్మని బావమఱదిబలుక
చాటునుండినచెలి "చాలు రేపేగుదు"
రంచుచూపుల తనకించు దెలుప

"పట్టిమాటలె, పోరు, బెట్టులేయదికొంత"
యని చిన్నిమఱదలు హాస్యమాడ
"ఇందరనంగను పోనేల? యేగుమెల్లి"
నంచుమామయ్య "గొంకుగటులుంచు"మనంగ
ఎట్టికార్యాంతరములం దాకట్టుపడిన
కొత్తయల్లుండు విడుచునే యత్తయిల్లు?

## సంక్రాంతి: సీతువు

కవిసార్వభౌముండు

చలిప్రవేశించు నాగులచవుతినాండు,
మెఱయువేసవి రథసప్తమీదినమున,
నచ్చసీతుప్రవేశించుం బెచ్చుపెరింగి
మార్గశిరపౌషమాసాల మధ్యవేళ,
ఇండ్లమొదలను నీరెండనీడికలను
ననుంగుదమ్ముండు నన్నయు నాటలాడు;
నత్తయనుగోడలును గుమ్ములాడుంగుమ్ము
గాంచుచోటికి మకరసంక్రాంతివేళ.

—'శివరాత్రిమహాత్మ్యము' నుండి.

# భాగవతము: ప్రథమస్కంధము

తఱికొండ వేంకమాంబ

— ఇష్టదేవతాదిప్రార్థనము —

శ్రీగణపతిని శ్రీక్షేత్రపాలకుని
నాగమసంవేద్యు నతిభక్తిఁగొలిచి
పరఁగ నందవరీకవరకులంబిలను
సారంబుగాఁబ్రోచు చౌడాంబఁదలఁచి
వరుస సూర్యాదినవగ్రహంబులకు
మురువార కరములు ముకుళించిమ్రొక్కి
మేలుకై వ్యాసవాల్మీకాదులైన
లాలితకవులను లక్ష్యమందుంచి
సర్వమతాచార్యసముదయంబులను
సర్వపండితులను జాలకీర్తించి
సకలసన్మౌనుల సకలదేవతల
సకలయోగీంద్రులఁ జరణముల్ గొలిచి
యురుభక్తి నాంజనేయుని నారదాది
వరభాగవతులను వరుససేవించి
పరఁగ నవప్రజాపతుల వాణీశు
నిరవొందఁగా నుతియింపుచు మఱియు
జగతి ననంతవిష్వక్సేనముఖ్యు
లగు నిత్యముక్తుల నాత్మభావించి
నాయిష్టదైవమై నన్నుసంతతము
బాయకున్నటువంటి పట్టాభిరాము
విగ్రహం బాత్మలో వీక్షించి విద్య
కగ్రేసరుండైన హయముఖుఁబొగడి
శ్రీవరాహస్వామి శ్రీపాదములను
భావించి మదినుంచి ప్రాపుగానెంచి
శ్రీమానినీలోలు శృంగారలీలు
హేమభాస్వరచేలు నిభరాజపాలు
కమలజనుతశీలు కరుణాలవాలు
నమితకీర్తివిశాలు నఖిలైకమూలు
బహుదనుజఘ్నాలు భవభయోన్మూలు
మహితకాంతికపోలు మధురవాగ్జాలు
కలికలుషవిదారు కనకాద్రిధీరు
జలనిధిగంభీరు జగదేకవీరు
గురుశేషగిరివాసు కోమలహాసు
చిరతరసువిలాసు శ్రీశ్రీనివాసు
యదుకులాంబుధిసోము సంబుదశ్యాము
సదమలగుణధాము సంపూర్ణకాము
సరసమునిస్తోము జగదభిరాము
తఱికుండపురిధాము తారకనాము
నాదినారాయణు నాత్మయందుంచి
నాదేవు...............హరిని
అలిమేలుమంగమ్మ నర్చించి మఱియుఁ
జెలఁగి భారతిని పూజించిసేవించి
కడఁక నాధారాదికషట్కమును
గడచి సహస్రారకమలమధ్యమున
పరిపూర్ణనిర్గుణబ్రహ్మమైనిలచి
ధరణిపైఁబండితోత్తముఁ డనవెలసి
వరకృపతోడ మద్వరదుఁడై నన్ను
పాలింపుచున్న సుబ్రహ్మణ్యగురుని
శ్రీలలితాంఘ్రిరాజీవయుగ్మమును
హృదయపద్మంబు నందిరవుగానుంచి

— కృతిప్రశంస —

ముదముదీపింప సన్మోక్షచింతనము
చేయఁగా భూసురశ్రేష్ఠునిమాడ్కి
నాయంబుజోదరుఁ డాదరంబెసఁగ
ఘనతరంబైన భాగవతంబునందు
మొనసిన తత్త్వార్థములను బామరులు
తెలియలే రటుగానఁ దేటగాఁదత్త్వ

ములనెల్ల సంక్షేపముగ రచియించి
హరిపరాక్రమములు హరివిహారములు
హరియవతారముల్ హరిమహాత్మ్యంబు
పొలుపొంద విస్తరింపుము నీవటంచుఁ
బలికినందుననిట్టి భాగ్యంబునాకు
కలిగించుమనుచు వేంకటగిరీశ్వరుని
తలఁచగా తఱికుండధాముఁడై యతఁడు
నీలాభ్రవర్ణుఁడై నిరుపమ హేమ
చేలుఁడై మోముపైఁ జిఱునవ్వుమెఱయఁ
గరుణాకటాక్షవీక్షణము దీపింప
సరసుఁడై మధ్యాహ్నసమయంబునందుఁ
జిన్నికృష్ణునిరీతిఁ జెంతకువచ్చి
పన్నుఁగాఁదెచ్చి శ్రీభాగవతంబు
నన్ను చేకొమ్మని నాచేతికిచ్చి
సన్నసైగల నిది సారంబుగాను
వరుసనాద్విపదకావ్యము జేయుమనుచుఁ
జిరమైనదయను సూచించియున్నాఁడు;
అదియేమొ తెలియలేదమ్మహామహుఁడు
చెదరకఁగృతినెటుఁ జెప్పింపఁగలఁడో
అతినికే తెలియు నే నాచందమెఱుఁగ
నతఁడు నాహృదయాబ్జమందు దీపించి
చెలువొంద వాక్కులిచ్చినచందముసను
వెలయఁజెప్పెదను నావిధమెట్లులనినఁ
దలఁచుకొని వేదశాస్త్రపురాణములను
లలికావ్యనాటకాలంకారములను
దగపూర్వకథచందంబుల నెఱుఁగ
నగుమాటగాదిది నైజమెట్లనిన
నాచిన్ననాఁడు నోనామాలునైన
నాచార్యులెవరు నాకానతీలేదు
యిఁకనేమిచెప్పుదు నెట్లనో వాణి
సకలంతుఁడై జిహ్వాయందుం చెగురుఁడు

అటుఁగాన నారసింహాంకితశతక
మటమీఁద నారసింహవిలాసకథయు
నట శివనాటకంబదియునుగాక
నటరాజయోగ సారాఖ్యద్విపద
నట కృష్ణనాటకం బదియునుగాక
నట పారిజాతాపహరణసత్కృతియు
నట రమాపరిణయంబను పెండ్లిపాట
యట చెంచునాటకంబను నొక్కకథయు
మఱియును శ్రీకృష్ణమంజరియవల
నిరుపమశ్రీకృష్ణనాటకంబు
కరమొప్పనలగోపికానాటకంబు
విరచించి భక్తితో వేంకటశైల
వరమందు తఱికుండవాసుఁడై నన్ను
పరిపాలనముచేయు ప్రభువై దనర్చి
కరుణార్ద్రదృష్టితోఁ గడతేర్తుననుచు
సరసవిజ్ఞానలక్ష్యము నిచ్చినట్టి
శ్రీనివాసస్వామి శ్రీపాదములకుఁ
బూనియర్పించి తిప్పుడు సంతసముస
ఫలితార్థమైన శ్రీభాగవతంబు
నల ప్రథమస్కంధ మాదిజేసికొని
క్రమముగా ద్వాదశస్కంధముల్ వరుస
నమర నేరచియింతునంటి నాస్వామి
యెటుకడతేర్చునో; యీఁగతోయధిని
పటుశక్తితో సీఁదఁబరువెత్తుకరణి
నేనుభాగవతంబు నెఱవేర్తుననుచుఁ
బూనిన నవ్వరే బుధులైనవారు
ఆనాఁడు పోతరాజాత్మయందుండి
నానార్థసారనిర్ణయవాక్యములను
బలికించినటువంటి పట్టాభిరాముఁ
డలర నామీఁద నేఁడభిమానముంచి
చెలువొప్ప నెపుడు నాజిహ్వాయందుండి

పలికించినటులనే పల్కితిక్కృతిని
శ్రీతతికరుండ సంసింహాసుడనంగ
ఖ్యాతిగా వెలయు వేంకటగిరీశ్వరుని
పదయుగళికి సమర్పణముచేసెదను
సదయులై తప్పొప్పు సమకూర్చికొనుఁడు.
ఘనమైన తత్కథాక్రమ మెట్టులనిన
వినుఁడయ్య కవులగు విద్వాంసులార!

— కథాప్రారంభము —

వెలయు సృష్టిస్థితివిలయంబు లెవని
వలననేర్పడు ననువర్తసంబునను
వ్యావర్తనమునఁ గార్యములందభిజ్ఞుఁ
డై వేడ్కఁదారాజననుచు నూహించి
యెవఁడిచ్చెవేదంబు లెలమి పద్మజున
కెవనికై మోహింతురిలను సద్బుధులు
అట్టిపరబ్రహ్మమైన మాధవుని
పట్టుగానమ్మి నే ప్రార్థింతునిట్లు:
పరమగాయత్రిజపము కర్మమనుచు
నరసిచూడఁదిదర్థమగు బ్రహ్మమనుచు
రమణీయమత్స్యపురాణంబులోన
నమరఁగా గాయత్రి నధికరింపుచును
జనులకుధర్మవిస్తారంబు వృత్రుఁ
డనెడుదైత్యుని ద్రుంచినట్టిదోషంబు
పరిహారమెందుఁజెప్పంబడు నదియె
వరుసగా శ్రీభాగవతమంద్రు బుధులు.
వలనొప్ప నీభాగవతపురాణమును
వెలసినభక్తితో వినఁగోరుచున్న
వారిచిత్తములకు వారిజోదరుఁడు
శ్రీరమాధీశుండు చిక్కునుగాక
తక్కనశాస్త్రముల్ తామెన్నివినినఁ
జిక్కఁడు విష్ణుండు చిత్తవల్లులకుఁ
గనుక భాగవత ముక్కంతదీపింప
వినఁగోరుమనుజులు విమలవర్తనులు
తాపత్రయమునందుఁ దగలక సుఖద
మై పరమార్థమైనట్టి వస్తువును
కనుఁగొనవచ్చు భాగవతంబునందు
ఘనతరమగు వేదకల్పవృక్షమున
ప్రకటభాగవతాఖ్యఫల ముద్భవించి
శుకముఖంబున జాఱెసుధయుఁ దదమృత
రసమునుగ్రోలి నీరసకర్మఫలము
నసమానమతి వీడు సతఁడు ధన్యుండు.
అల భాగవతపురాణాఖ్యసద్గ్రంథ
కెలమి నేప్రారంభ మేర్పరించెదను.

— నైమిశారణ్యవర్ణనము —

అమితమునీంద్రుల కాటపట్టయిన
రమణీయమై మిశారణ్యంబునందు
మందారజంబీరమన్మథవకుళ
కుందచందనసాలకురువకక్రముక
వటబిల్వబదరికాశ్వత్థమాలూర
కుటజహింతాళతక్కోలతమాల
నారికేళార్జుననారంగపనస
వారిజాతాశోకపాటలీతిలక
కదళికాప్రముఖవృక్షంబు లెల్లపుడు
పొదువుగాఁజిగిరించి పూచిఫలించి
వలనొప్ప నందనవనము చందమునఁ
గలకాలమునుజల్లఁగా నొప్పుచుండు;
శుకపికప్రముఖపక్షులు కొన్ని చెలఁగి
ప్రకటసత్ఫలరసపానంబుఁజేసి
పక్షీంద్రతతితోడ బలసిమదించి
వృక్షరాజములపై విహరింపుచుండు;
ప్రవిమలమునులు తప్పకనాచరించు
సవనాగ్నిధూమంబు జలదంబటంచు
వెలయ హోతలుసేయు వేదఘోషంబు

జలదగర్జనము నిశ్చయముగాననుచు
వారక కేకారవములు గావించి
గౌరవంబెసఁగ రెక్కలువిప్పి విప్పి
లాలితవర్ణశాలల చుట్టునిలచి
నీలకంఠంబులు నృత్తముల్ సలుపు;
పంకజాకరముల పజ్జలవ్రాలి
పొంకంబులైన పుప్పొడికుప్పలందు
ఒప్పుగాఁజేరి సముజ్జ్వలగతుల
నప్పుడప్పుడు హంసలాడుచునుండు;
మొనసి రామాయణమ్ములు పఠింపుచును
మునులకర్ణములకు ముదమునిచ్చుచును
వన్నెకెక్కిన యజ్ఞవాటంబులందు
క్రన్నన పక్షులు ఝంకారముల్ సేయు;
తిరములై యచ్చట ధేనువుల్ పులులు
కరిరాజబృందముల్ కంఠీరవములు
మొదలైన బహుమృగమ్ములు జాతివైరి
మదములవీడి సమ్మతవిహారముల
వరుసగానందంబు వర్తింపుచుండు;
పరమపావనతీర్థపటల మచ్చోట
నమరగంగాప్రవాహంబుచందమున
నమలమై యఘముల హరియింపుచుండు;
బలుసెలయేర్లదిబ్బల కొండచఱుల
లలిమించు కందమూలఫలాదులెపుడు
గలుగు; నీకాలమాకాలంబుననక
పొలుపగుచుండి నెప్పుడు సుగంధంబు
భూరిదిగంతంబుల నింపుచుండు;
నీరూఢి నానైమిశారణ్యభూమి
యందువిష్ణుక్షేత్ర మననొప్పుస్థలము
నందుండి వరశౌనకాదిసన్మునులు
హరినిజెందుటకు సహస్రవర్షంబు
లరసిచేసిన సత్రయాగంబునందు
రొకనాఁడుప్రొద్దున నూహించిలేచి
సకలకర్మచయంబు నాఁగంబుజేసి
సూతునిజూచి మెచ్చుగవినుతించి
యాతాపసోత్తము లందఱిట్లనిరి:

— నారాయణకథాప్రశంస —

"ఓసూత! నీవుమహోత్తమాత్ముఁడవు,
వ్యాసప్రసాదితవరతపోనిధివి,
అలఘుపురాణేతిహాసధర్మములు
దెలిసితి, వవియెల్ల దెలిసితిమేము,
అదనరి: జనులెల్ల సవ్యయానంద
పదమందుఁజెందు నుపాయంబు నీవు
గుఱుతుగాఁదెల్పు మక్కువమీరమాకు,
కరుణాసమేత! యీకలియుగంబునను
కలమానవులు పుణ్యకర్మముల్ సేయ
రలసు లజ్ఞాను లల్పాయువుల్ జనులు
ఖలులు గర్వాంధులు కఠినులు రోష
కలితులు లోభులు కామవర్తనులు
పరధనాసక్తులు పరహింసకులును
పరసతీరతులు నిర్భాగ్యులు గనుక
వారినిగడతేర్చు వరపురాణంబు
సారంబుగాఁదెల్పు సన్మునిశ్రేష్ఠ!
శాంతమెందుసఁబుట్టు సకలజీవులకు
భ్రాంతియెందున వీడు భవమెట్టుదొలఁగు
నాయుపాయముఁదెల్పు" మనవిని సూతుఁ
డాయమలాత్ముల కపుడిట్టులనియె:
"పరమునీశ్వరులార! వ్యాసనన్మౌని
చరణాబ్జములను నాస్వాంతమందుంచి
శుకునకుప్రేమెక్కి హెచ్చుగనొక్కసరణి
ప్రకటించిచెప్పెద పట్టుగావినుడి:
హరి పరమాత్ముఁ డనంతుఁడవ్యయుఁడు
పరమేశ్వరుఁడు పరబ్రహ్మ మచ్యుతుండు

పావనాచారుఁ డుభయవిమోచనుఁడు
శ్రీవిష్ణుదేవుఁడు చిదచిదీశ్వరుఁడు
పతితపావనకీర్తి భాసిల్లుకొఱకు
పతితులనైన చేపట్టెదననుచు
వసుదేవతనయుఁడై వసుధపైఁబుట్టి
యసమానుఁడై భూమి కతిభారమైన
ఖలులనెల్లనణంచి కరుణదీపింప
సలలితాత్మకసాధుజనబృందములను
రక్షించినటువంటి రామానుజుండు
మోక్షప్రదాతయై మొనసియున్నాఁడు,
కావున నెటువంటి కలుషాత్ములైన
నావిభుచరితంబు లాలించి వినిన
మానసంబులకు శ్రీమాధవస్మరణ
నానాఁట రుచిబుట్టు నాటు సద్భక్తి
నానాఁట నఘములు నశియించు మదికి
నానాఁట దెలియు జ్ఞానస్వరూపంబు
జ్ఞానంబుదెలిసి ప్రజ్ఞాచక్షులైన
నానందపరవశులై సుఖింపుదురు
కావున జనుల నీకలియందు పతిత
పావనుఁడైనట్టి బాలకృష్ణుండు
మన్నించు"ననఁగ నమ్మహనీయమతులు
కన్నుల హర్షాశ్రుకణములు దొరఁగఁ
బులకాంకురంబు లపుడు మేనులందు
మొలువ సూతునకు నమ్మునులిట్లనిరి:
"తాపసోత్తమ! యిదితథ్య మెట్లనిన
శ్రీపతి లీలావిశేషంబులనెడి
ఘనసుధావృష్టిచేఁగాక తదన్య
మనఁగఁగల్గిన సాధనాంతరంబనెడు
మంచుచే సంతాపమాయానలంబు
చంచలింపక నేలచల్లారిపోవు?
హరినామకథనదావాగ్నిచే ఘోర
తరపాపవిపినాళి దగ్ధంబుగాదె?
వనజాక్షు దర్శనవాయువుచేతఁ
జనవె దుస్తరదుఃఖజలదమాలికలు?
నడరవిష్ణుధ్యానహర్యక్షపటిమ
మడియనె సంతాపమదగజేంద్రములు?
వరకృష్ణ లీలాశ్రవణభానుదీప్తి
నరుగదె ఘోరమాయాంధకారంబు?
నరహరి పదభక్తినావచే విపుల
తరభవాంభోనిధిఁ దరియింపరాదె?
యిఁకవేయునేల మాకిప్పు డీశ్వరుని
ప్రకటప్రభావమేర్పడఁ దెల్పు సూత!
కలియుగసంప్రాప్తి గాఁగలదనుచు
వలనొప్పఁగా వైష్ణవక్షేత్రమందు
ఘనతరసత్రయాగనిమిత్తమునను
మొనసినిలచితిమి, మురవైరికథలు
తగవిననెడఁగల్గె దైవయోగమున;
జగదీశ్వరుండైన చక్రాయుధుండు
అతిగూఢకపటమర్త్యాకృతిదాల్చి
సతతంబు బలభద్రసహితుఁడై ధరను
యెన్నాళ్లు వసియించె? నెవరి శిక్షించె?
వన్నెమీఱంగ నెవ్వరిని రక్షించె?
అవియెల్లవరుసగా నతికృపతోడ
వివరించిచెప్పు మోవిమలచరిత్ర!
వననిధిదాఁటఁగా వాంఛించువారు
దనరారఁగాఁ గర్ణధారునిగన్న
కరణి నీకలిదోషకంధిదాఁటుటకుఁ
గరమర్థితో నినుఁగంటి మోతండ్రి!
ధరను ధర్మమున కాధారమైనట్టి
సరసిజాక్షుఁడు నిజస్థానంబుఁజేరి
యున్నపిమ్మట ధర్మ ముర్వీతలమునఁ
జెన్నొందనెవరిని జేరె?"నటంచు

పనిబూని శౌనకప్రముఖులై నట్టి
మునివరులెల్ల సమ్మోదంబుతోడ
నడుగఁగా విని రోమహర్షణసూని
కొడుకైన సూతుండు గురుభక్తి మెఱయ
మఱల వేదవ్యాసమౌనిపుంగవుని
సురుచిరాత్మకుఁడైన శుకుని గీర్తించి
యాసంయమీంద్రుల కప్పుడిట్లనియె:
"వాసిగా వినరయ్య వరమౌనులార!
వలనొప్పఁగాఁ గార్యవర్గంబుచేత
నలఘుకారణజాల మధికరించినది
యాత్మ, యాయాత్మ యధ్యాత్మమౌనట్టి
యాత్మకుఁ దెలివినెయ్యమున నిచ్చుటకు
రూఢిగా దీపస్వరూపమై పరమ
గూఢమై వేదాంతగురుసారమగుచు
రహినొప్పు నిట్టి పురాణమర్మంబు
సహజంబుగాఁ జెప్పి సంసారజలధి
దాటఁగోరుచునుండు ధన్యులకెల్ల
పాటించి శుకముని ప్రవరుండు సెప్పె
నట్టిమర్మంబు మీ కందఱకేను
పట్టుగాఁ జెప్పెద పాటించి వినుఁడి;
హరికిమ్రొక్కి వచింతు, నదియెట్లనిన:
కరమొప్ప విశ్వమంగళకరంబగును
అలఘుప్రశ్నంబు నన్నడిగితి రందు
వలన ధన్యుండనైతి, వరమునులార!
...యేమిటను శ్రీకృష్ణు సంప్రశ్న
మొనరఁజేయఁగ బడుచుండు, నేవగను
స్వాంత మం దాత్మప్రసన్నమైయుండు,
నంతరాయవిముక్తమగు హరిభక్తి
యేరూపమునఁగల్గు, నిలపూరుషులకు
సారంబుగా నదె సద్ధర్మసరణి;
పరుఁడైన హరిపదభక్తియోగంబు
వైరాగ్యవిపులవిజ్ఞానసంపదలఁ
గలిగించు, హరినామకథలయందుఁ దగ
నిలువని ధర్మంబులెల్ల వ్యర్థములు
నరులు సకాములై నానావిధములు
ధరనుజేయుచునుండు ధర్మంబులకును
ఫల .....మేర్పడ ధర్మమందు
నలర నవ్యభిచారియగు నర్థమునకుఁ
గామంబు ఫలము నిక్కంబుగాఁగాదు
భూమిలో విషయానుభోగమైనట్టి
కామంబునకు సర్వకరణసంప్రీతి
పామరంబగునది ఫలముగాఁబోదు
యెంతకాలంబు తానిలను జీవించు
నంతకాలము ఫలంబగు కామమునకు
మఱియు జీవునకుఁ గర్మఫలంబుచేత
నరయ నెద్దిప్రసిద్ధ మదియనర్థంబు.
లలిధర్మమునకు ఫలంబెద్ది యనుచుఁ
బలికిన హరిభక్తి ఫలముభక్తికిని
ఫలము విజ్ఞానంబు పరఁగదానికిని
ఫలమగు వైరాగ్యపటిమ దానికిని
ఫలమగు మోక్ష మాపరముక్తికిని
ఫలము బ్రహ్మంబు తత్పరమేమిలేదు
ఆపరబ్రహ్మంబు నమలవిజ్ఞాన
రూపంబనుచుఁగొందఱు వచింపుదురు
వినుఁడు కొందఱు మఱివిమలవిజ్ఞాన
మననొప్పు నద్వైతమగు తత్త్వమంద్రు,
ఉపనిషత్తులచేత నొనర నాతత్త్వ
మపరిమిత బ్రహ్మమన నొప్పుచుండు,
అనఘహిరణ్యగర్భాదులచేత
ననుపమపరమాత్మ యనఁబడు నదియె,
జగతిపై సాత్వికజనులచే నదియె
భగవంతుఁడని పల్కఁబడి యొప్పుచుండు,

వరుస వేదాంతశ్రవణసంగ్రహమున
పరమార్థ మెఱిఁగిన పండితోత్తములు
చెలఁగు క్షేత్రజ్ఞుఁడన్ జీవాత్మయందుఁ
గలపరమాత్మునిగని సుఖింపుదురు
అమరిన వర్ణాశ్రమాచారములను
తమతమ ధర్మముల్ తామాచరించి
హరిపదాంబుజముల కర్పించినపుడు
హరి సంతసించిచ్చునది ధర్మసిద్ధి,
హరివిగ్రహధ్యాన మనెడు ఖడ్గమున
పరఁగ నహంకారపాశంబుచేత
బద్ధమైచెడుకర్మపటలి నశించు,
సిద్ధయోగీశ్వరసేవితుఁ డగుచుఁ
గర్మనిర్మూలనకారణుండగుచు
ధర్మజ్ఞుడైన మాధవచరిత్రములు
వినఁగోరువారికి వెయ్యేండ్లకైనఁ
దనివిఁదీరదు సుధాపానంబునైనఁ;
దనియక కృష్ణుంఁడు తనచరిత్రములు
వినుచు నానందించు విమలమానసుల
హృదయపద్మంబులం దిరవుగానుండి
పదిలంబులైన శుభంబులొనర్చు
నెడములై యశుభంబులెల్లనశించు,
నడర భాగవతంబు నాలకించినను
భక్తి జనించు నాభక్తియం దధిక
రక్తిదీపించు నారక్తిచే మదిని
ముంచికొన రజస్తమోగుణద్వయము
నంచితకామలోభాదిదుఃఖములు
నశియించు సత్త్వగుణంబు చిత్తమున
విశదస్వరూపమై వెలుగుచునుండు
నరుఁడు ప్రసన్నమనస్కుఁడై నపుడు
గుఱుతుగా ముక్తసంగుండగుచుండు
నటముక్తసంగుడై నపుడీశ్వరాఖ్య
పటుతత్త్వవిజ్ఞానపటుతదీపించు
నాయీశ్వరునిగాంచినట్టి కాలమున
నాయహంకృతి భిన్నమైనశియించు
ఆయహంకృతి బోయినపుడు సంశయము
లేయెడ నిలువక నెప్పుడో తొలఁగు
నాసంశయగ్రంథు లణఁగిన వెనుక
నీ సంసరణసంగమెల్ల నశించు
సంగంబువిడిచిన సకలకర్మములు
భంగంబునొందుఁ దాపరమందుఁజెందు
సరసపద్మజవిష్ణుశంభుసంజ్ఞలను
సరవి సృష్టిస్థితిసంహారములను
హరియొక్కఁడే సేయు నాథ్యుఁడై నిలచి
మఱియు నొక్కవిశేషమర్మంబు గలదు:
అలఘుకాష్ఠంబునకన్న ధూమంబు
నలధూమమునకన్న నాహుతాశనుఁడు
యెటు విశేషములగు నీప్రపంచమున
నటుతామసంబునకన్న రాజసము
రాజసంబునకన్న రహిసాత్త్వికంబుఁ
దేజరిల్లు విశేషదీపితంబగుచు
హరిసాత్త్వికుండని యఖిలసంయములు
గురుతరభక్తితోఁ గొలిచిరి మున్ను
సతతంబుఁ, గొందఱు సంసారసరణి
కతివృద్ధిఁ గోరుచు నన్యదేవతలఁ
గొలుతురు, మోక్షంబు గోరినవారు
పలుగులయిన భూతపతులఁజేరకను
నేర్పుతో దేవతానిందలుమాని
యోర్పరులగుచుఁ బద్మోదరుండైన
హరి దివ్యకళలెప్పు డనుభవింపుదురు,
మఱికొందఱిలను తామసరాజసముల
చేత నందనులను సిరినిగోరుచును
బ్రీతితోఁ గొలుతురు పితృదేవతలను

పాయక నిట్టియుపాసనల్ పెక్కు
లాయాశయున్న వా రవి సేతు రెపుడు
ఆయుపాసనలు చేయఁగ మెచ్చివచ్చి
యాయాఫలము లిత్తు రన్య దేవతలు,
ధర హరి మోక్షప్రదాతయై భక్తి
పరులకు ముక్తి తప్పకనిచ్చు కతనఁ
జిరముగా మునిజన సేవితుఁడగుచుఁ
బరమార్థహృదయుఁడై పాలింపుచుండు.
అలవేదయోగక్రియాజ్ఞానతపము
లలఘుధర్మంబులు నమలయజ్ఞములు
భగవత్పరంబులై ప్రబలుచునుండు
సగుణస్వరూపుఁడై నట్టి యీశ్వరుఁడు
లీలగాఁగలుగుచు లేకనుండుచును
మేలిమి త్రిగుణసమ్మిళితమైనట్టి
తనమాయచేత నింతయు సృజియించి
గొనకొని గుణిగాక గుణిచందమునను
లలినిజమాయావిలసితంబులగుచు
నలరు గుణంబులం దటుప్రవేశించి
చెలఁగి విజ్ఞానవిజృంభితుఁడగుచు
వెలుఁగుచు వేదాంతవేద్యుఁడై యుండు,
అరయ పావకుఁడొక్కఁడయ్యు ననేక
తరుసమూహములందుఁ దగిలిసంతతము
కరమర్థితోడఁ బెక్కుఁడుగాఁదోఁచు
కరణి విశ్వాత్ముఁడొక్కఁడు నై యుండి
తనయందుఁగల్గు భూతంబులయందు
ననిశ మంతర్యామియై వెల్గుచుండు,
సొరిది మనోభూతసూక్ష్మేంద్రియముల
గురుతరంబుగఁగూడి కూడకనెపుడు
పనిగొన గుణమయభావంబులెల్ల
తనచేతఁగల్గియుఁ దానుభూతముల
తరమిడి తగులక తద్గుణంబులను
పొరిపొరి ననుభవంబులు సేయుచుండు
ననిశంబు లోకకర్తయైన యావిష్ణుఁ
డనువొంద దేవతిర్యఙ్మనుష్యాది
జాతుల లీలగ జనియించిమించి
ఖ్యాతిగా సకలలోకముల రక్షించు"
నని సూతుఁ డాశౌనకాదులఁజూచి
మనము రంజిల్లగా మఱల నిట్లనియె:
"మహదహంకారతన్మాత్రలిగూడి
సహజషోడశకళాసంయుక్తమగుచుఁ
బంచమహాభూతభాసితుఁడగుచు
నంచితశుద్ధసత్త్వాకృతియగుచుఁ
జరణోరుభుజముఖశ్రవణనేత్రములు
పరఁగ నాసాశీర్షపటలంబులెల్ల
బహుసహస్రంబులు భాసిల్లుచుండు,
బహుకిరీటాదికాభరణాంబరములు
అరుదుగాఁ బెక్కువే లమరుచునుండు,
పరమపూరుషుఁడైన పరుఁడనంతుండు
వలనొప్ప భువనైకవర్తనాయత్న
మలరఁగా విపులతరాబ్ధిమధ్యమున
భోగీంద్రశయనుఁడై భూరివిలాస
యోగనిద్రారతినుండు విష్ణుండు.

—ఏకవింశత్యవతారములు—

నారి సకలావతారావళులకును
మునువొప్పఁగా నిది మొదటిది, యట్టి
యస్వప్ను నాభియం దజుఁడుద్భవించె,
భాస్వరలీలాప్రపంచమంతయును
ఆయెడనాబ్రహ్మ యవయవంబులను
పాయక ప్రభవించి పరగుచునుండె;
అరయఁగ నావిష్ణుఁడటమీఁదఁ జెలఁగి
సరసకౌమారాఖ్యసర్గంబునందు
దొరకొని విప్రుఁడై దుర్లభంబగుచు

# పల్లెటూరి పిల్ల

శ్రీమతి కో. సు. వత గారు

సంక్రాంతివైభవము జెప్పనలవికాకున్నది. నిరుడు ఈరోజులనాటి ముచ్చట చెప్పుతున్నాను. శారిదా బిల్లు మూలమున నెక్కువగానైన వివాహములమూలమున బెరిగిన యల్లుళ్లు గ్రామములయందు వింతవింత దుస్తులధరించి బజారుల వెంబడి దిరుగుచుండ నూతనముగ పరిణయమైన బాలికలుగూడ బాగుగ ధరించికొని యొక్కరొకరు సభకు గాబోలు నడచుచున్నారు.

మాధ్యమగుటచే మావారిని ఇంటికి తీసుకొనిరాలేదు గాన వారు స్నానముజేయునపుడు, భోజమునకు బోవునపుడు తలుపుచాటునుండి, వంటయింటికిటీకీలనుండి చూడవలసిన ఆవశ్యకతలేదు గాన నేనుగూడ మామూలుదుస్తులతో బయలుదేరి సభజరుగుచున్న పార్కులోనికి బోయితిని. నేను పిల్లను. విద్యావతిని గాను. అగుట నన్నాహ్వానించువారు లేరుగాన నేదోయొక మూలగూర్చుని పైకారణములవలనే దానియందు భాగముదీసికొనక పోయినందులకు నాకు విచారములేక పోయినది.

సభ నలంకరించిన స్త్రీలలో బొట్టుగలవారును, జుట్టుకత్తిరింపనివారును, కట్టుమార్చనివారును నలుగురైదుగురు మాత్రము ఏదోమూలలందు గూర్చునియుండిరి. నేను వెళ్లుసరి కెవరేమిజెప్పిరోగాని తరువాతివారందరును యొకరి వెనుకనొకరు చెప్పిన యంశములనే జెప్పుచు పాడినపాటయేబాడుచు ఏడ్చినయేడుపునే యేడ్చుచు నిరాటంకముగ పల్లెటూరిబాలలు పనికిరానివారని, వారికెట్టిసభలులేవని, వారికి నాగరికత తెలియదని, వారు మొద్దుగుడ్డల ధరింతురని, వారిభర్తలు పొలములందుదిరుగుదురని, వారు వార్తాపత్రికలుజదువరని, పనికిమాలిన పడతులని నిందించుచు సింహనాదమున నుపన్యాసము లిచ్చుచుండిరి. అంత నొక నారీమణి నాలుగు పదులసంక్రాంతులైనను కనీసముజూచియున్న యువతి మెల్లగా ఉపన్యాసపీఠము నలంకరించి యిట్లని చెప్ప మొదలిడినది.

"సోదరీమణులారా! పల్లెటూరిబాలల జీవితముల విమర్శించుచు జూపిన మీయనన్యసామాన్యవిద్యావిశేషమునకు నాయంజలులు. పల్లెటూరిపిల్లయన్న తమకంత పరిహాసమేలనో తెలియకున్నది. పల్లెటూరి యువతీమణులకు నాగరికత తెలియదని అనాగరికులై చెడిపోవుచున్నారని చెప్పిన పట్టణపుబాలికకు నావందనములు. అమ్మా! నీవిచటపుట్టినంతమాత్రమున మీయమ్మ, మీయమ్మమ్మ, ఆక్రిందటితరములతల్లులు పుట్టిన దెచటనో యెఱుంగకుండ యిట్టె యనాగరికులని తెలిపితివే. నీవు హూణభాష నభ్యసించినందులకు దేశమునకు జేయు నుపకారమిదియా? నీసోదరీమణు లనాగరికులా? ఈరైళ్లకూతలమధ్యమున ఈఫేక్టరీలపొగల నడుమన ఈసైడుకాల్వలదరిని ఈక్రిక్కిరిసియున్న యిండ్లలో ఈచెడురోగములకు స్థానమైన పట్టణమునందు జన్మింపలేదని వారిని పరిహసించుచుంటివా? ఆపచ్చని పైరులమీదినుండి యడ్డులేకవచ్చు గాలి ననుభవించి యేపుగాబెరుగు బాలిక లనాగరికురాండ్రా? బాల్యమునుండి యాముదమునైన రాచికొనక కాటుకలనైన బెట్టికొనక (మోము తెడిచికొనినచో చేతిగుడ్డలకగునని) హేజులైనస్నోలు ఫేసుపౌడరులు రాచికొని, యొక్కచల్లగాలివిసరుసరికి మొగములు తడిలేక పొడిపొడిలాడి-పగిలి-బీటలువారు మోములుగల మీరు నాగరికతయందారితేరినవారా? ఇంటికి లక్ష్మివలెనుండ మోమున కాసంతబొట్టులనైనను ధరింపకయుండు నీపాపలు నాగరికులా? పుట్టినదాది యనవసరముగ పొరుగుగుమ్మమునైన ద్రొక్కక యింటబెరిగి యొద్దానియందును జౌక్యముగలిగించుకొనని పల్లెటూరియిల్లా లనాగరికపుమొద్దా? మీవలె నాటకముల నరయలేదని, సాంఘిక రాజకీయసభలకు హాజరుకాలేదని, ఇంట భర్తను వంటజేయించుచు సాయంత్రమగుటయే తడవుగ చల్లగాలి

సేవింప బీ-చీలకుపోలేదని పల్లెటూరిబాలికయని నంత చులకనయా? ఆమెకున్నంత ధైర్యము, ఆమెకున్నంత మనోబలము, ఆమెకున్నంత బంధువులయొక్క ఆదరణ, ఆమెకున్నంత దూరాలోచనము నీయందు పట్టణపురాణివని గర్వించుచున్న నీయందు లవమైన నున్నదియా? వంటయింట పిల్లిచప్పుడు చేయుచున్నట్లు ధ్వనియైనచో భర్తగారికి ఫిర్యాదుచేయుదువుగాని ప్రక్కనుండికదలవే. అట్టి నీకు ధైర్యమా? బిచ్చగాడు వాకిటిముందరకువచ్చి "అమ్మా! బిచ్చము"నిన "ఛీఛీపొమ్మ"ందువు గాని గుప్పెడుధాన్యము వేయవెగజే. ఇట్టినీకు కనికరమా? అల్లంతదూరమునన బంధువుగాననైన చటుక్కునలోనికిబోయి తలుపువేసికొందువేగాని యాదరింపజాలవే. అట్టి నీకు బంధువులయందాదరణయా? పట్టుమని యొక్క బాల్చెడునీరు భావినుండి పైకిదీయలేని నీకు బలమా? గాలికి కాసంతతొలగినముంగురుల వేయిమారులు సవరించుకొందువుగాని పాలుచాలక కావుమని యఱచుచున్న పసిబిడ్డను రెండుసారులు సవరించుకరకే విలుగా? అట్టి నీవు రాజకీయరంగమునందు హుమ్మని యొక్కసారి దుమికి స్త్రీ సంపూర్ణస్వాతంత్ర్యము కొరకునై యత్నింపుచుంటివేగాని నీపిల్లలెంత యారోగ్యవంతులై యుండిరో తెలిసికొనజాలవు గాబోలునేమి? ఇతరదేశజులు సగటున జీవించుకాలమునకు నీదేశజులు జీవించుకాలమునకును నెంతవ్యత్యాసమున్నదో తెలిసికొనకుండ నున్నావు. తెలిసికొనినచో కండ్లనీరు గ్రమ్మదా? అందులకు కారణము "నీవు" అని తెలిసినపుడు నీ విచారమునకంతున్నదా? ఎందువలన? నీసంరక్షణ తక్కువ. చిన్నతనమునుండి నీబాలురు ఇతరదేశజుల ననుకరించుట యెక్కువ. అనుకరించుటమానుమని నీవుజెప్పుసలహాలు మరీ తక్కువ. "అమ్మా! వంటయైనదా?"యని యడుగ కొంచెము ఆలస్యముగాగ కాఫీత్రాగి రమ్మందువే గాని చల్దియన్నమును తినరాదా యని మాటకైన ననవే. కడుపునొప్పిగా ఉన్నదనిన సోడాతాగిరారాదా? యని యందువేగాని వాముసలపి యివ్వజాలవే. నీదేశపువస్తువును నీశీతోష్ణస్థితికి కచ్చితముగ సరిపోవు ద్రవ్యమునువిడచి దాని విలువను కొంచెమైనను గ్రహింపక, ఎట్టిదైనను ఇతరదేశముల వానినేవాడి నీడబ్బునుకొల్లగొట్టించుచున్న నీవు నాగరికతామహామహురాలివా? ఎంత విపరీతమూ.

లేకలేక కలిగిన నీగర్భమునకు-మీయందు నూటికి తొంబదిమంది-బస్తీలవారు-డాక్టర్ల సహాయము తప్పక కావలసియుంటున్నదా? లేదా? సుఖముగ ప్రసవమగునట్లు నీశరీరమును మంచి యారోగ్యస్థితియందుంచుకొన జాలవుకదా? పల్లెటూరిపిల్ల యిట్లేకష్టమునక-అరనిముసములో-లండనునందప్పుడే పెద్దపెద్దబిరుదములతో దిగిన డాక్టర్ల సలహాలులేక-సూదులతో మందుల నెక్కించుకొనక-ఇరుగమ్మకైనను దెలియకుండ పొరుగమ్మకైనను బిలువకుండ-ప్రసవమగుటలు గాంచినచో నిసుమంతవారలస్థితి, యారోగ్యమునందు వారికిగల స్థానము దెలిసికొనజాలుదువు గదా? అపుడు మీపరిహాసములు మిమ్ములనే నిందింపకుండునా?

పల్లెటూర నివసించు నొక్కొక్క స్త్రీ యార్థికముగ గృహమేధికెంతసాయము జేయునో యెఱుంగుదువా? నీకు తెల్లవారిలేచినది మొదలన్నియు బజారునుండియే రాగ-నీకింక స్వంతయాదాయ మెక్కడ? మీ భర్తలు సంపాదించు ధనమునందు సగము మీకోకలకొరకు-మీపోసలకొరకు-జేయబడిన బిల్లులకు సరిపోవునా? లేదా? యని బెంగపెట్టుకొని-"నేసెపాడు పదుసునూలు మొద్దుబట్టలు కట్టుకొనజాల"నని యనినపుడు మీకొరకు సన్ననిచీరల కొనిపించి యాతఁడుగూడ మొద్దుగుడ్డల ధరింప వీలులేదని నిముసమున కొకతూరి దుస్తులను మార్పించుచున్నారా? లేదా? అంతమాత్రపు నీవు దమ్మిడి వెనుకవేయజాలక—ఆదాయమునందు సగము నీకొరకే వ్యయపఱచు నీకు-అదియు జాలక మూతివిరుచుచు మూల్గు నీకు-సర్వవిధముల నార్థికముగ మగనికి సాయపడు పల్లెపిల్ల చిల్లిగవ్వకు పనికిరానిది యాయెనా?

ఇక స్త్రీస్వాతంత్ర్యము కొరకునై నీవుజేయు విశ్వప్రయత్నము-నీవుజేయు యార్భాటము-నీవుజేయు భూమ్యాకాశము లేకములగునట్టి గగ్గోల-నీవుకట్టు గాలిమేడలు-నీవుజేయు సభలు-పల్లెటూరివారలు సేయు

చుంటలేదని కోపమా? వారు బానిసలా? వారికివి యనవసరమని యెఱుంగలేక పోయితివేమి? వారికి గావలసిన స్వాతంత్ర్యము పురుషులనుండి సంపాదించియేయున్నారు. పల్లెటూరిభర్తలు-తమభార్యల నడుగకుండ-వారితో నాలోచనలు సేయకుండ-వారియనుమతిని గైకొనకుండ-చివరకు కేరాత్రులయందో శయనమందిరము సందుపాటుల సంభాషింపకుండ-దూరాలోచన సేయకుండ-వెనుకముందు లరయకుండ-యుదయమున నేపని గూడ జేయజాలరని తెలియదు గాబోలు. వారికీనాటరంగమునందు పాత్రధారణమును గైకొనుటకై భర్తల నుండి యధికారమక్కరలేదు-రాజకీయరంగమునందు ప్రవేశ మనవసరము. ఉపన్యాసపీఠముల నలంకరించి సింహనాదములతో ఆచరణలోనికిరాని తీర్మానముల తీర్మానించుట పనికిరాదు. పిచ్చిపిచ్చిచేష్టలకు మనసు బోదు. తమ యనుకూలదాంపత్యమునకు లభించు సంతానమును-ఆరోగ్యవంతముగ, ధైర్యవంతముగ వారిని-బలవంతులుగ-కార్యశూరులుగ-కార్యనిర్వాహకులుగ-బానిసత్వమునంబడి దరిగానక విలపించు భారతసామ్రాజ్య విముక్తికారకులుగ-ఆత్మగౌరవపరులుగ-జేయుటయే వారలకువిధి.

అప్పుడే, యట్లుగావించినపుడే-నీవు ధన్యవు-నీదేశము స్వతంత్రము-నీబాలురు స్వేచ్ఛావిహారులు-నీభావి పుత్రుల దాస్యవిముక్తి-తెలసినదా? పల్లెటూరితల్లివలె నీవును నీబాలకులగూడబలవంతులుగజేసి స్వతంత్రమునకై పోరాడమని జెప్పిపంపుముగాని నాటకము జూచి రమ్మనకుము.

నీదేశమెపుడు స్వేచ్ఛననుభవించి, యితరసామ్రాజ్యములవలె స్వాతంత్ర్య మనుభవించునో యపుడే నీవు నాగరికురాలవగుదువు. అంతవరకు నీదేశమునందు ఏభాగముగాని ఏపట్టణముగాని యేపల్లెగాని నాగరికత నెఱుంగజాలదు. ఈసన్నగుడ్డలు, ఈక్రాపుకత్తిరింపులు నాగరికతనీయజాలవని యింకను దెలిసికొనజాలని మన బుద్ధిమాంద్యము నేమనవలయునో దెలియకున్నది.

ఇప్పుడు కొందరు పల్లెటూరిబాలలు ఉద్యోగస్థుల భార్యల మనిపించుకొనవలయునని-బస్తీపిల్లలమని పిలుపించుకొనవలయునని-పట్టణవాసపు నాగరికపు యువతీమణులమని లోకు లనుకొనవలయునని నగలదీసి-క్రాపులుదిద్ది-షైరులకేగుటకునై యత్నింపుచున్నారు. మీనిజమైన సరుకును వారు గ్రహింపజాలకున్నారు. అందు పెద్దగొప్ప యున్నదని భావించుచున్నారు. ఇదివరకువలె తీరికసమయములందుపయోగించు రాటముల దీసివైచి, జాతీయగీతమును-మహాత్ముని శాంతిరాగమును వినుటమాని-మీవలె రామనాథశాస్త్రిగారివియు-శేషగిరిరావుగారివియునైన ప్లేటులవైచికొని రాగపుతాత్కాలికానందమున మునుంగుచున్నారు.

అమ్మా! ఆరాగముల వినుసమయము వేరు-ముప్పదిమూడుకోట్ల భారతీయులు నూతనశకారంభమున చలనముగలుగ ఏకకంఠమున దాస్యవిముక్తికై-నవయువకులు-ఒక్కొక్కయడుగు ముందునకు వేయుచు-ముందునకు నవీనరాగములబాడుచు పాతపాటల మరచుచుండ నీరాగముల వినువారెవరు? నీకు మాత్రమవి యెటుల సంతసము నిచ్చుచుండెనమ్మా? నీపుత్రునిగూడ తన విధ్యుక్తధర్మమును గెలసికొనమనుము.

నీప్రేమఘోషనకు కీయిచ్చు నన్నితడవులు నీరాటమును ద్రిప్పినచో నీకుటుంబమునకుసరిపోవు గుడ్డలనేయ గల్గుదువే. కాని ఫోనుల నవతలనుంచి రాటము ముందరనుంచికొనుము-నీబాలికలకు చిన్నతనమునందే బంతులాటలకై పంపక రాటమువడుకుట నేర్పుము. రాటము పల్లెటూరిదని నిరాకరింపకుము.

నీసంతానమునకు మాతృసేవయందలి యత్యద్భుతమహాత్మ్యమును బోధింపుము-శివాజీమాత ననుసరించుటకు ప్రయత్నింపుముగాని-పుట్టుటతోడనే బిడ్డలను ఏనర్సులకో యొప్పగించి వారిని మాతృసేవయన నేమియో తెలియని మట్టిబొమ్మలనుగా మాత్రము సేయవలదు. పల్లెటూరియనుకరణమని ప్రక్కద్రోవలకుబోకుము.

పల్లెటూరితల్లులు-వారిసంతానమును-యసత్యవాదుల-మోసగాండ్ర-రౌడీల-బలహీనుల-దేశదిమ్మరుల--షోకుపురుషుల జేయజాలరని పట్టణములందు పనిలేక తిరుగు పైమహనీయులే దెలుపగలరు.

కారణమేమి? చిన్నప్పటినుండి నీభయము తక్కువ-నీమూలముననే యీరౌడీలసంఖ్య హెచ్చినది. తెలియునా? పల్లెటూరివాడుగా నాతనయుడగునని బెదిరించి శిక్షింపమానకుమా.

నీబాలురకు విద్య నేర్పించుభారము సగము నీపైనన్నది. నీవునేర్చుకొనిన విద్యను నాటకపు పాత్రల పోర్షనుల వల్లించుటలందును-చిన్నికథల గీకుటయందును మాత్రమే వినియోగపరుపక దానియందలి రుచిని నీ బాలురకు గలిగింప యత్నింపుము. నూటికేడుగురు చదువుకొనిన వారున్న నీదేశమింక యెన్ని యుగములకు స్వాతంత్ర్యరుచిని దెలిసికొనునో తలంపుము.

పాశ్చాత్యనాగరికతాప్రవాహమున వెనుకకుజూడక యట్టెకొట్టుకొని పోవుచున్న మీకు-ఆంగ్లేయ విద్యావతులైన మీకు-నాముసలమ్మమూల్గులు-పల్లెటూరిజీవితమునందలి పవిత్రతాప్రస్తగము-నారాటపుటా రాటము-చెవులకెక్కవనుసంగతి నాకు దెలియనిదికాదు. కాని, ఇప్పుడు దెలిసికొనజాలకపోయిన ప్రయోజనములేదు.

కాన నోసోదరీమణులారా! నాయందుకనికరమున మీపల్లెటూరిపిల్లలయందాదరమున వారిని పల్లెటూరి గొడ్డులని-పల్లెటూరిదున్నలని-పల్లెటూరి పెద్దమ్మలని-పల్లెటూరి పనికిమాలిన పెయ్యమ్మలని-పనికిమాలినపల్లెటూరి బాలికలని యింకనేమాత్రముననవలదుసుమా? నాగరికులమనిపొంగుచున్న మీయతిశయమడుగంటును. ఆసుకుమారతనూలతలకు మీమాటలు పెనుగాలులుసుమా! వారెంత మోటవారైనను-తమ్ముమ్రిమించిన భారమునైనను వహింతురుగాని-ఒక్కపల్లెత్తుమాట యనినచో వారు సహింపజాలరు సుమా! వారి తామసము తారామండలమున కెగయును సుడీ!

తెలసినదా? నాయందు సంపూర్ణానుగ్రహముంచి వారినిమాత్రమేమియు ననవలదు సుమా? మరువకుడు! మరువకుడు!! మరువకుడు!!! ఇంతకాలమును విసికొనినందులకు క్షమింపుడు!”

ఇట్లుచెప్పి ఆమె దిగినంత నగ్రాసనాధిపతిగారంత్యోపన్యాసమును ప్రారంభించి పల్లెటూరిబాలికలను గూర్చి చెప్పిన యామహాశయురాలివాక్యములను మరువవలదని చెప్పిరి. కరతాళధ్వనులతో సభముగియ-నింటికి వచ్చి-మరునాడే మాయమ్మను వేధించి నాయనగారిచే రాటముకొనిపించి తీరితిని.

## సాంధ్యరాగము

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

ఉష్ణకిరణుండు తనశాంతదృష్టిదాల్చి
పశ్చిమదిశాలలన గాంచపర్వులిడఁగ
నెల్లడను గాంచనపురంగు లెనయుచుండె
ప్రకృతిసౌందర్యసీమయై పరిణమించె.

* * *

కల్వలరవిచ్చి గన్నులం దెరచుచుండె
చలువలం గ్రమ్మి నట్టేట జలములాడె
సాంధ్యసంపదసరవిమై చెలఁగుచుండె.

* * *

సాంధ్యరాగమరీచులు సొగసుగుల్క
గూండ్లకును జేరుచుండె పక్షిగములు
రాత్రిగడువంగ రాజ్యంబునేలగాను
రాగ చంద్రుండువినువీధివెల్గుచుండె.

# సంక్రాంతి : దీక్షావస్త్రములు

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

"ఆహా! చిన్నపిల్లల యజ్ఞానమన నిట్లేయుండునుగదా! ఆ సేతుహిమాచల పర్యంతము భారతదేశము రాజకీయవిషమపరిస్థితులచే నుడికిపోవుచున్నది. పోనీ దేశముమాట దేవుడెఱుగును. తమకుటుంబములో కలిగిన చిక్కులనుకూడ లెక్కచేయమన్నారు. ఇంకా పండుగలనీ, పర్వములనీ, అజ్ఞానమే ఆనందముగా మురిసిపోవుచున్నారు! ఎంత మందలింతమన్నను చిన్నపిల్లలుకదా—కన్నబిడ్డలు కదా! పదిమాసములనుండి యహోరాత్రము పడరాని కష్టముల బడుచు ఆయన కారాగృహమున బంధితులై గాసిలుచుండ నోటికెతిండి యెట్లుపోవును? రాత్రులు కంటిపై రెప్ప పడుటలేదు...చల్లని స్నేహార్ద్రదృష్టులతో నామనో వీచికల వెల్లివిరియజేయు...నాకన్నుల వెన్నెలయైన......వారిని విడిచి యింకనూ రెండు నెలలుండవలెనా? స్వేచ్ఛావిహారుల కేనా శృంఖలములు?—దానశీలుర కేనా దండనములు? ఏమిన్యాయము? నా కీసంవత్సర మొకయుగముగ తోచుచున్నది. ఎంతగా కాలముగడుపు కొందమన్నను—కదలకున్నది. ఆహా, ఆయనచే మంత్రితమగు నీచక్రమేకదా నాకు రక్షారేఖయయినది. దినమునకు నాలుగయిదుగంటలు నూలువడకి—యింతవరకును కష్టమును మరచుచుంటిని. నేడింక దుర్భరముగ మనసు క్రాగుచున్నది. తెల్లవారిన 'భోగి' పండుగ. ఇరుగుపొరుగులవా రీరాత్రే యిండ్లు చక్కబఱచుకొనుచున్నారు. నాకుమాత్రము కాళ్లాడకున్నవి. ఎంతచేసినను నాకేమియానందము?...పాపము, పిల్ల లింతదాక రేపటిదిన చర్య తమలోతాము చర్చించుకొనుచు నవ్వుమొగములతో సంతోషముగ నిద్రించిరి... అయ్యో, ఆమహనీయులు బంధితులైన నాడింత యధైర్యము లేదే! నేడెందులకింతయుద్రేకము!...పాపము—ఈపసివారి యుత్సాహమున కేమి సార్థకము?...ఈవార మింతవరకును జాబువ్రాయ నాలసించిరేమో? జైలు అధికారులు వివాదపెట్టి యుండరుకద?"

రాజేశ్వరి తరుణారుణలోచనముల నీరుగ్రమ్మ, తదేకదృష్టితో గతమాసములలో జైలునుండి భర్తవ్రాసిన ప్రాతలేఖలను మరల మరల చదువుకొనుచుండి నాటిరాత్రి యించుమించు పదిగంటలవరకు మేల్కొని యున్నది. దీపము కొంచెము తగ్గించి అచ్చటనే నేలపై నొరగి యాలోచించుచుండెను. ఎట్లో కొంచముధైర్య మవలంబించినది. రాక రాక ఎన్నోపిలుపుల కీసారి కరుణించి పెద్దకుమార్తె కనకలక్ష్మిని అల్లుడు తీసుకొనివచ్చెను. తెల్లవారిన నేదోపండుగ చేయవలసియుండునుకద! ఆరాత్రి పనులేమియు పూర్తికాలేదు. వేకువనే లేచునుద్దేశముతో రాజేశ్వరి నిద్రించెను.

నాడు మిక్కిలి యలసియుండుటచే రాజేశ్వరికి గాఢముగా నిద్రపట్టెను. కాని నిద్రలోమాత్ర మేమిసుఖము? స్వప్నప్రపంచమున తనకష్టజీవమును భరింపలేనట్లొకటి రెండునిట్టూర్పులను పుచ్చినది. ఇంతలో పక్షుల కలకూజితములకు, చల్లని పిల్లతెమ్మె

రల తాకునకు—ఉలికిపడి రాజేశ్వరి లేచికూర్చున్నది. కాని యామె ముఖసీమయందిప్పుడు తెల్లవారుచున్న తూర్పుదిక్సతి మోమునంబలె వికాసము మొలకలెత్తుచుండెను.

రాత్రి కలలో రాజేశ్వరి యాస్వల్పకాలమును పతిసాన్నిధ్యమునసేగడపి, వాని యమృతవాక్కుల నాస్వాదించినది. ఆమహాత్ముని గంభీరభాషణము లింకను ఆమె కర్ణయుగ్మములకు వినబడుచునేయుండెను. ఆదేశసేవకుని యుపదేశసరణి యింకను ఆమె మనసున పంక్తులు దీర్చుచుండెను. ఆసత్యాగ్రహి ధర్మాచరణ మామెను కార్యదీక్ష కుత్స హించి ధైర్యము నుద్దీపింపజేసెను. ఒక యనిర్వాచ్యమైన యానందమామె హృదయ కలశమునుపొంగి పొరలి కన్నుల నవ్వుదేరుచుండెను.

నాడు భోగిపండుగ. నాడు రాజేశ్వరిగారి యింట నందరు అభ్యంగనమాచరించిరి. పెద్దమ్మాయి కనకలక్ష్మి యింటిముంగిలి పలురకములగు వింతముగ్గులతో నింపివేసెను. ఆహా! చూచుట కాయిల్లు, అమృతమయమగు స్వర్గసీమ పంచ్రెండుద్వారములు తెరచి యుంచినట్లు నేత్రపర్వముగనుండెను. వేకువజాము, చిలుకల కలకూజితములు, మందమారుత పరంపరలు. ఇట్టి పుణ్యసమయమున ప్రకృతి నవనవాకృతులతో చిరునవ్వు నవ్వుచుండ ఏకష్టజీవి హృదయభావము చివురింపదు?...నాటి కాకియార్పుసైతము రాజేశ్వరి కొకశుభ సూచకముగ గన్పడుచుండెను. బాగుగ తెల్లవారగనె చిన్నకుమార్తెలు లలిత, కమలలు పట్టుపరికిణీలపై పలెవాటువైచుకొని వెండికుంకుమబరిణెలుచేతబట్టి యావీధి ముత్తయిదువల నందఱను—తమ్ముడికి భోగిపళ్లు పోయుటకు పసుపు కుంకుమకు పిలిచివచ్చిరి.

ఉదయము ఫలాహారముచేసి పెద్దల్లుడు వీధిలోని కుబుసుపోకకు బయలుదేరెను. రాజేశ్వరి వంటకములన్నియుసిద్ధముచేసి శ్రీమహాలక్ష్మిని భక్తితో నుపాసించినది. అల్లుని రాక కెదురుచూచుచు వారందరు నొకచోకూర్చుండిరి. చాలదినములకు రాకరాక వచ్చిన కుమార్తె కనకలక్ష్మి చెప్పువిశేషములను వినుచు రాజేశ్వరి యల్లుని సదయహృదయము నకు సంతసించుచుండెను. ఆతడు మంచి రాజకీయవేత్త. లలితాకమలలు మామూలుగ రాట్నములపై దారముతీయుచు అక్క చెప్పుచున్న ఆమె అత్తవారింటికబుర్లు వినుచుండిరి. ఉదయము పదునొకండుగంటలైనది. రాజేశ్వరి యల్లునిరాకకు చూచుచు నిన్నరాత్రి కలను కుమార్తెలతో చెప్పి ముచ్చటించుచుండెను. "మీనాన్నగారు పండుగకు మిమ్మంద రిని యాదరించుటకు దగ్గరలేకపోయిరని గాని...ఆయన మహానుభావులు! సచ్చరిత్రము చేతను దేశసేవలచేతను సత్కీర్తి సంపాదించిరి. ఆయన విధించిన కార్యదీక్షను నేటివరకు కొనసాగించుచుంటిమి. దేశమాతసేవకులు కష్టములయందే సుఖమనుభవింపవలెను. అందు నను మనభారతజాతికష్టములతో పోరాడుటకే భగవంతుడు నిర్మించినట్లున్నది. మీనాన్న గారిట్టియుపదేశములేకదా యెల్లప్పుడు చేయుచుండువారు. ఆయన ఖైదునుండి మరలివచ్చు వరకును మనమిద్దరుప్రచారమును మాత్రము మానకూడదు. తరవాత వారితోకలసి

మరల శాంతయుద్ధమునకుపూనుకొందము......అనాఁడు, ఈపసినాగమ్మకొరకు నేను వెనుక కంజవేసితినిగాని..."అని రాజేశ్వరి యొడిలోని చిన్నికుమారునియెత్తి ముద్దులు కురియించి, హృదయమున కంటిపెట్టుకొనెను.

అల్లుఁడు తొందరతో ప్రవేశించి జైలునుండివచ్చినలేఖను సంతోషముతో రాజేశ్వరి ముందర పడవైచెను. ఆమె పట్టరానియానందముతో జాబు కన్నుల కద్దుకొని కలలో గాంచిన భాగ్యరాశి తెలిసికొంచినట్లుబ్బుచు ఆతురపడుచున్నకుమార్తెల కాలేఖ యిట్లుచదివి వినిపింపఁజొచ్చెను.

"ప్రియశీలా!

మీయందర కాశీర్వచనములు. మీకీలేఖ పండుగనాటికందునని తలఁచి వ్రాసితిని. నేనిప్పటికి మంచి యారోగ్యముగనే యున్నాను. భారతదేశమను విశాలకారగారమునుండి ప్రస్తుతము నేనున్నజైలులో ప్రవేసించునప్పుడు నామట్టుకు చాలకష్టములు తగ్గిపోయినట్లు తోఁచినది. కాని పెక్కురు సోదరులింకనుముక్తిలేక దేశమంతటను పడరానిపాట్లు పడుచున్నారను తలఁపుమాత్రము నన్ను పీడించుచున్నది.

జైలులో నాసత్ప్రవర్తనమునకై నన్ను ఒకనెల ముందువిడువనెంచిరని తెలియు చున్నది. నావిషయమై నీవించుకేని విచారింప నవసరములేదు. మనకింతకన్న యానంద మేమున్నది?

గ్రహింపుము

—నీచెలిమికాడు."

రెండవప్రక్కకు త్రిప్పి చదువుడు.

"శుకశాబకములారా! నేను మీయందరను మనసులోచూచుచునేయుంటిని. ఇచ్చట నుండి ప్రతిదినము మీతోకలసి మాటలాడగలను. చిన్ని పిట్టలగు మీరుకూడ నాలోచన యనురెక్కలతో నావద్దకెగిరిరండు. ఎగురుట నేర్చుకొనుడు. చి॥ సౌ॥ కనకలక్ష్మి వచ్చిన దని వ్రాసిరి. ఆమె స్వయముగా నాపేర వ్రాయలేదేమి?

లలితా! నీకు చరఖాపోటీపరీక్షలో బంగారుపతకము బహుమానము వచ్చినదని తెలిసికొని చాలసంతసించితిని. నిన్ను దీవించుచున్నాను. ఇంకా మంచినూలు వడకుటకు ప్రయత్నింపుము.

కమలా! ప్రతిదినము ప్రార్థనశ్లోకములు చదివి దేవదేవుని కీర్తించుచున్నారా? పాఠ ములను శ్రద్ధగా చదువుకొనుము.

చిన్న పిల్లడికి నాపండుగముద్దులు. మీయందరికి సంతోషకరమగు సంక్రాంతిపండుగ కోరుచు, మీకొరకు భగవంతుని ప్రార్థించుచు లేఖ ముగించుచున్నాను.

ఇట్లు, దేశసేవకుడు."

లేఖ నొకసారిచదివి తృప్తిపొందక రాజేశ్వరి మరల మరల చదువుకొనెను. మాట మాట కామె నేత్రాంబుజములు విస్ఫారితములై తెలికాంతుల వెదజల్లుచుండెను. నాఁడె నాథుని దర్శించినట్లాయె పట్టరానిసంతోషముతో—అల్లునికి పిల్లలకు తీయనైన తన మనో భావములవంటి పిండివంటలను విందుబెట్టెను.

భోజనములయ్యెను. కనకము మడచి యిచ్చుచుండ అల్లుడు చావడిలోకూర్చుండి తాంబూలము వేసికొనుచుండెను.

“కమలా! నీవు బావకొఱకు, అంతశ్రద్ధగా వడికి నేయించియుంచిన పట్టంచులచాపు నకు పసుపుపెట్టి బావచేతికియ్యి. తాంబూలము కాగానే ఆతడు క్రొత్తబట్టలను ధరించును. అమ్మాయీ లక్ష్మీ! నీవు చాలకాలమునకువచ్చి మగనితోగూడి మానట్టింట పట్టెడన్నము తిని మాకుపండుగముద్దునడపితివి. నాన్నగారు మిమ్ము ఆశీర్వదించుచున్నారు. అప్పుడేచాల రోజులక్రిందటనే నేస్వయముగా నీకొఱకీచీర నేయించియుంచితిని. నీవీఖద్దరు చీరను కట్టు కొని నీభర్తపాదములకు నమస్కరింపుము.” అల్లుడపరిమితానందముతో పట్టంచుల వాణీ చూచుచు “కమల చేతివడుకునూలే యిది! అమాయికమైన కమలాకుమారి విలాస నైపుణ్యము లీవస్త్రముల నుజ్జీవించుచున్నవి. నాకెంతయు ప్రియము” లనుచు నాగోధుమ రంగు ఖద్దరువస్త్రముల కట్టుకొని నిలువ, లోపలినుండి సవిలాసముగ చీర సవరించికొనుచు వచ్చి కనకలక్ష్మి వంగి వానికి నమస్కరించి ప్రక్కగా నిలచెను. ఎదుట రాజేశ్వరి చిరు నవ్వు ముఖమును వెలిగింప “మీరీదీక్షావస్త్రములతో భరతమాత పవిత్రాలయమున, జాగ్రద్భక్తితో మాతృపూజ చేయుదురుగాక!” యని దీవించెను. అల్లుఁడు సంతోషముతో ఇట్టి విజ్ఞానము, పట్టుదల, కార్యదీక్ష ప్రస్తుతభారతస్త్రీల కందరకును కలిగినచో భార తీయులకు స్వరాజ్యము కరతలామలకముకదా?” అనుకొనెను.

* * * *

నాఁడు పసిపాప చిరంజీవి గాంధిమొదలు శ్రీమతి రాజేశ్వరివరకు వారియింట నంద రును స్వచ్ఛమగు స్వదేశీవస్త్రములను ధరించి దేశసేవాదీక్షబూనిరి.

సాయంకాలము నాలుగుగంటలకు పేరటాండ్రందరును రాజేశ్వగారియింటికివచ్చి వసారాలో బారులు దీర్చికూర్చుండిరి. లలిత కుర్చీలో చిన్నబ్బాయి గాంధీకుమారుని కూర్చుండబెట్టుకొనెను. ముత్తయిదువలందరును గాంధీకుమారునికి భోగిపండ్లుపోసి శతం జీవివికమ్మని దీవించిరి.

కమల, కనకలక్ష్మి వెండిపళ్లెమున కర్పూరమువెలిగించి సన్ననికంఠముతో, “రారా గాంధీకుమారా—రారా ఇటురారా”అని మంగళముపాడి హారతినిచ్చిరి.

మంగళకరమగు నాపుణ్యస్త్రీల యాశీర్వాదమహిమచే గాంధి చిరంజీవియగుగాక!

# సంక్రాంతి సమావేశము

శ్రీమతి జూలూరి తులసమ్మగారు

(సాంసారికమగు నొక చిన్నకథ)

[ఇందువచ్చు పాత్రలు:—గుణవతి: ఈమె ఈకథయందలి ముఖ్యపాత్ర; శ్యామలరావు: గుణవతిభర్త; యశోదమ్మ: ఆమెఅత్త; మురళీధరరావు: ఆమెమామ; వీరమతి, చంద్రమతి, రుక్మిణి: ఆమెకుమార్తెలు; మురళీధరము, మోహనరావు, కృష్ణుడు: ఆమెకుమారులు; మాధవరావు గోపాలరావులు ఆమె యల్లుండ్రు. ఇందు గోపాలరావు శ్యామలరావుగారి అక్కకుమారుడు, అగుట మేనల్లుడు; రాధ గుణవతికోడలు; వెంకప్ప గుణవతి స్నేహితురాలు.]

మధ్యాహ్నము రెండుగంటలకు ఫలాహారమునకై శ్యామలరావుగారు యింటికి వచ్చుసరికి గుణవతీదేవి మారాము సేయుచున్న కుమారు నోదార్చుచుండెను. పదియేండ్ల యీడుగల రుక్మిణియను బాలిక తనదీర్ఘములగు కుటిలకుంతలములను చేత సవరించుకొనుచువచ్చి 'అమ్మా! నాకు జడవేయుము. బడి కాలస్యమగుచున్నది' యని నూనె దువ్వెన్న పూవులు పట్టుకొనివచ్చి యెదుట నిలువబడెను.

గుణవతీదేవి 'వేసెదనమ్మా!' యని యిట్టితలయెత్తి చూచుసరికి శ్యామలరావుగారు యెదుట. 'ఫలాహారమునకై వచ్చితిరా?' అనియెను గుణవతి. 'అవును. నీకొడుకు చెన్నపట్టణమునుండి ఉత్తరము వ్రాసినాడు. చూచుకో'మ్మని శ్యామలరావుగారు కవ రామెచేతికిచ్చి ఆసమీపముననున్న కుర్చీపైగూర్చుండి యామెయొద్ద మారాముచేయుచున్న బాలు నెత్తికొని బుజ్జగించుచు 'నాకుఫలాహారము త్వరగాతెమ్మా. వేళయైనది' అనియెను.

పెరటివరండాలో గూర్చుండి పొరుగింటి వెంకప్పతో గలసి పురాణగోష్ఠి సేయుచున్న అత్తగారు ఇంతలో 'గుణవతీ! పనిమనిషివచ్చినది. దానికేమైనపని చెప్పు'మని కేకవైచినది. గుణవతి ఇందేది ముందు చేయవలెనో? అప్పు డన్వర్థనామధేయయగు గుణవతీదేవి తన కుమారుడు వ్రాసిన యుత్తరమును చదువుచు నాలుగైదుపంక్తులు చదివి 'ఓరి తండ్రీ!...బాబు ప్యాసైనాడట చూచినారా?' అన్నది.

శ్యామలరావు:—చూడలేదు గాని నీవు చెప్పుటచేత వినుచున్నాను. నీవలెనే నీకొడుకుగూడ గట్టివాడే. పట్టినపట్టువదలక ప్యాసైనాడు. నాకేమి బహుమతినిచ్చెదవు?

గుణవతి:—బహుమతియడుగుటకే గాబోలును నీకొడుకనుచున్నారు. మీకొడుకుకాడాయేమి?

శ్యా:—నీకొడుకు, నీయిల్లు, నీజనము, నేను నీవానిని. కాకపోతే నీసెలవుకొరకు ఎంతమంది కనిపెట్టికొనియున్నారో చూడు.

గు:—మీకు బహుమతికావలెనా? ఇదుగో ఫలాహారము పట్టుకొనివచ్చెదను.

శ్యా:—ఉత్తరమంతయు బూర్తిగ చదువనక్కరలేదా?

గు:—చదివెదను; మీరు ఫలాహారము సేయుచున్నప్పుడు.

ఇంతలో రుక్మిణి ఆవేగముతోపోయి 'మామ్మా! అన్నప్యాసైనాడట, యిప్పుడుత్తరంవచ్చింది' అని వరండాలోనున్న యశోదమ్మతో చెప్పింది.

యశోదమ్మ:—చిట్టితల్లీ! మంచిమాటచెప్పితివి. ఎప్పుడు వచ్చెదనని వ్రాసినాడు? బాబునుచూచి యెన్నిదినములో అయినది. కన్నులుకాయలు కాచినట్లున్నవి: (వెంకప్పవైపుకు చూచి) మాయజమానిగారి పేరింటిగాడు వీడే. ప్యాసైనాడట. (రుక్మిణివైపుచూచి) మీనాన్నమాట వినబడుచున్నది. వచ్చినాడాయేమి?

రు:—అవును, మామ్మా!

అంతట యశోదమ్మ 'అబ్బాయీ!' యని కేకవైచెను. పైడిమువ్వలమొలత్రాడు మెరయుచున్న ముద్దు బిడ్డని చేతిపైగూర్చుండబెట్టుకొని క్రాపుసవరించుకొనుచు శ్యామలరావు పెరటివరండాలోనికిబోయి 'అమ్మా! మరల్లి ప్యాసైనాడట' అనియొకటిపిలువబడెను. యశోదమ్మ "అవునట. వానికష్టంఫలించింది. సంతోషమైన మాట చెప్పితివి. బాబు యెప్పుడు వచ్చెదనని వ్రాసినాడు?" అని అడిగెను. దానికి శ్యామలరావు 'పరీక్ష ప్యాసైనాడుగదా; సలాసాగ స్నేహితులతోకలుసుకుని రెండుమూడురోజులలోవచ్చును. నా కాలస్యమగు చున్నది. వెళ్లెదన'ని సావడిలోనికివచ్చెను. ఇతలో రుక్మిణి ఫలాహారము తెచ్చి తండ్రిచేతికిచ్చెను. చంటిబిడ్డను గుణవతిచేతికిచ్చి శ్యామలరావు ఫలాహారము సేయుచుండెను. గుణవతి యుత్తరము చదువదొడంగెను. చదివి 'తమ్మునికి ఆటవస్తువులును, చెల్లెలికి పూలుదారమున్ను, నాన్నగారికి ట్వీడుకోటుగుడ్డలున్ను, పెద్దచెల్లెలికిరంగు సామానులున్ను, తమ్మునికి జోళ్లున్న తెచ్చెదనని వ్రాసినాడు. చూచితిరా? నీకొడుకు నీకొడుకని మీరను టయేగాని యెవరికొడుకో తెలియుచు నేయున్నది.' అనియెను.

శ్యా:—మేమందరమును బంధుగులము. మీరింటివారు. కనుక నేమాకందరికిని ఇష్టవస్తువులనిచ్చిసంతోష పరుపవలెను యజమానివగు నీవు.

గు:—మీరు కవులు కనుక యెప్పటికి సరిపడున ట్లప్పుడు చెప్పి దాటిపోగలరు.

ఇట్లని మరలయుత్తరమునుచూచి 'నాలుగైదురోజులలో వచ్చునట' అనియెను.

శ్యా:—ఉత్తరమంతయు నీవు చదువుకో. నాకు వేళయైనది. పోవలెను.

గుణ:—అబ్బాయి ప్యాసైనాడని కోడలిని పంపమని వియ్యంకునికి వ్రాయండి.

శ్యా:—సంక్రాంతి సమీపించుచున్నదిగదా! ఇప్పుడువారుపంపుతారనితోచదు. అయిన నను వ్రాసెదనులే.

ఇట్లుచెప్పి శ్యామలరావు వెడలిపోయెను. పిమ్మట గుణవతి 'రుక్మా! దానికి పనిచెప్పిగమ్మ. నీకుజడవేసె దను' అనియెను.

రుక్మిణి 'అమ్మా! నాకు చాలయాలస్యమైనది. నేను వెళ్లునప్పటికి పాఠములు కొన్ని అయిపోవును. ముందునాకు జడవేయుము' అని తల్లిచే జడవేయించుకొని రుక్మిణి బడికిపోయెను.

*   *   *   *

గుణవతి:—చంద్రా! ఎంతసేపు పేపరుచదివినను విసుగులేదే. నీకు ఇతరపని యించుకైన నక్కరలేదు కద. జడవేయించుకొని వెళ్లు. అన్న ప్యాసైనాడట. అత్తవారింట పేపరుచదువుకొనుచున్న నారూరకుండరు. పని పాటలు నేర్చుకొనియుండవలెను. చదువుకొను సమయమున జదువుకొనవలెను. పనిచేసికొను వేళలలో పనులు చేసికొనవలెను. అత్తింటికి కాపురమునకుబోవుబిడ్డ యెంతయో అడకువ, భక్తిశ్రద్ధలు పనిపాటలయందు చురుకు కలుపుగోలుతనము మున్నగుగుణముల నలవాటుపరచుకొనవలెను.

చంద్రమతి:—అమ్మా! ఏనాటిమాటలో చెప్పెదవేమి? అయినను యిప్పుడు నాకన్నిపనులు చేతనగును. నేను చేయలేనిపని యేమున్నది? నీవే చెప్పు.

గుణవతి:—పనులు చేతవచ్చు ననుకొమ్మ. అతిచాదస్తముగనన్నియు కడుగుటకే ప్రొద్దుచాలదు నీకు. నీవు చదువుకొనిన ఆరోగ్యపాఠములు వంటపనులకై వినియోగింతువు. అంతయాలస్యమైననెట్లుజరుగును? నీవే చెప్పు. నేనుమాత్రము శుభ్రముగ చేసికొనుటలేదా? ఆజడవేసెదను రమ్మ. అన్న ప్యాసైనాడట.

చంద్ర:—అవును, వింటిని. నాకవసరములగు వస్తువులు తెచ్చెదనని అన్న వ్రాసినాడు. అమ్మా! వదినెను పంపమని వ్రాయండి. అందరమును సంతోషముగనుండవచ్చును.

గుణ:—పెద్దక్క యింకను చిత్రములు వ్రాయుచునేయున్నది కాబోలు. ఆమెనుకూడ తలదువ్వెదను రమ్మనిచెప్పుము వెళ్లి.

చంద్ర:—అక్క నిన్నవ్రాసినబొమ్మ నీవుచూడలేదుగాని, అమ్మా! ఒక వీరపురుషుని చిత్రించినది. పౌరుషముట్టిపడుచున్నట్లున్నది. దానిచేతియందే తల్లియుండి వ్రాయించుచున్నదో గాని...

గుణ:—(మాటకడ్డమువచ్చి)మరల యీదినమునకూడ నేవేవోరంగులుకలిపినది. ఏమి వ్రాయుచున్నది?

చంద్ర:—ఒకకాంగ్రెస్ నాయకుని పోలీసువారు చెఱసాలకు గొనిపోవుచుండ నాతనియొగ్గ చిరునగవుతో నాతనికి పూవులదండలువైచి క్షేమముగ వెళ్లిరమ్మని యనుమతించినట్లువ్రాసినది. ఆముఖచిహ్నము చూచితీరవలెను. దాని కీయూహ లెక్కడెక్కడ తోచుచున్నవోగాని వ్రాసినవి వ్రాయనుండ నింటినిండ బొమ్మలే, నమ్మా!

చిత్రలేఖనాయత్తచిత్తయగు వీరమతికి నామాటలు వినఁబడుచున్నను మనస్సు ప్రకృతివిలీనమగుటచే యందలియర్థమును గమనింపనేలేదు.

గుణ:—వీరమతీ! నీకు త్వరగాజడయల్లి నేను వెళ్లవలెను. పనియున్నది.

అప్పు డాశలాక నొకబల్లపైనిడి ఆమె జడవిప్పుకొనుచు తల్లిసమీపమునకువచ్చెను. 'అన్న ప్యాసైనాడట' అని గుణవతి ఉత్తరము కూతురుచేతికిచ్చెను. వీరమతి ఉత్తరముచదివి 'అమ్మా! న కిష్టమగువస్తువులెవ్వియో అన్నకు తెలుసును. చూడు. తెచ్చెదనని వ్రాసినాడు. వదిననుపంపమని మామగారికి వ్రాయమని నాన్నగారితో చెప్పు' అన్నది.

గుణ:—నీ పెనిమిటికూడవచ్చిన బాగుండును. అల్లుండ్రు ఆడపడుచులు వచ్చిన బాగుండును. నీవు ముంతెడు నీళ్లు పోసుకొనవలెను గదా, అమ్మా! మరల నాకిదియొక బెంగ.

వీర:—బెంగ యెందులకు? దేవునిదయగలుగ నేమిభయము? బావనుకూడ రమ్మనివ్రాయండి. పండుగ వెళ్లినతరువాత చెల్లిని అత్తవారింటికి పంపవలయును కాబోలును.

గుణ:—వ్రాయుమనియెదను. అయినను నీకు నూడిదయిచ్చి తీసుకొనివచ్చిన పిమ్మట నొకసారి యతడు రాకూడదూ? సెలవులు కనుక నొకవేళవచ్చునేమో?

ఇట్లని గుణవతి వీరమతికి జడవేయుచుండగ నత్తగారగు యశోదమ్మవచ్చి 'అమ్మా! గుణా! వంటవేళ యైనట్లున్నది. బ్రాహ్మడింకనురాలేదు. నేను మడికట్టుకుందునా?' అన్నది.

గుణ:—మీరు మడికట్టుకొననక్కఱలేదత్తయ్యా! కృష్ణని మీరు కొంచెముచూడండి. నేనే మడికట్టుకుందును. మీయబ్బాయిగారు కచేరీనుండియింకనురాలేదు. వంటచేయలేకపోదునా తొమ్మిదిగంటలగునరికి? ఈదినం భాగవతంలో మీరు చదివినవిషయములు చెప్పండి.

యశో:—నిన్నటి తరువాయి. కపిలుడు దేవహూతికి జీవబ్రహ్మలక్షణములుచెప్పుట. చదివినంత సేపు ఆనందముగానున్నది. ఈదినం వెంకప్పకూడ వచ్చినదిగనుక గ్రంథం బాగావెళ్లింది. ఏకక్రియాద్వ్యర్థకరీ యన్నట్లామెవచ్చుటచే పుస్తకముచదువుకొనుట వత్తులుచేసికొనుట కూడ జరిగింది. వెంకప్ప మంచి తెలిసిన మనిషి సుమా?

గుణ:—వెంకప్ప మంచియెన్నతగిన మనిషియని చెప్పవచ్చును. చిన్నప్పటినుండి మాయిరువురకును చాలస్నేహము. ఆమెయును నేనును మానాన్నగారివద్ద కావ్యములుచదివినాము. నాచదువు సంసారమునకును ఆమె చదువు సన్యాసమునకును పరిణమించినది.

యశో:—నీకేమే, గుణా! నీవు సంసారివి, విద్యావతివి. కనుక నే సంసారసందర్భములు చక్కగా తెలిసికొని బిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పించుకొని అత్తాడుబిడ్డలలో నడకువగా మెలగుచున్నావు. పండుగకు బిడ్డలను అల్లుండ్రను పిలిపించు. మీవదినకుకూడా వుత్తరం వ్రాయించు.

గుణ:—అలాగే. మీ అబ్బాయిగారితో చెప్పండి. అన్నగారికి వ్రాయమని.

సాయంకాల మగుటతోడనే యెవరిపనులమీద వారు వెళ్లిరి. తండ్రిగారగు మురళీధరరావుగారును శ్యామలరావుగారును బిడ్డల విద్యావిషయకమగు నాయావిషయములు ముచ్చటించుకొనుచు భుజింప సందరును తమతమ పడకగదులలోనికి జనిరి. అప్పుడు యెక్కడనుంచి నిలచియుండెనోగాని మహామాయాస్వరూపిణి, సుఖప్రద, ఆనందమయి, నిశామయియగు నిద్రాదేవి యాందరికన్నులలోనం బ్రవేశించి నాట్యముచే చిత్తచైతన్యము హరించి మోహితులజేసెను.

* * * *

ఇంతలో సుఖనిద్రచేం మురళీధరరావుగారు వేకువమేల్కాంచి గజేంద్రమోక్షములోని ముఖ్యములగు పద్యములుచదువుచు భక్తిపారవశ్యుడైయున్నతరి పసివాండగు కృష్ణుడు తాతయ్యయొద్దకనియడుగ నాయనకడకు తీసికొనివెళ్లిరి. ఆయంబిడ్డను ప్రక్కలోపరుండబెట్టుకొని మరల సహస్రనామ స్తవము మున్నగు భాగములు చదువుచుండ భళ్లున తెల్లవారెను.

* * * *

ఉదయమున లేచి కాలకృత్యములు తీరినవెనుం చంద్రమతి-పదునాలుగేండ్ల బాలిక-పెరటిలో పొగడచెట్టుక్రింద రాలిన పూవులనేరి దండగ్రుచ్చుచుండెను. ఆమెతమ్ముడగు కృష్ణుడు ప్రక్కవైపున గూరుచుండి గ్రుచ్చినపూవులను లాగుచుండెను.

చంద్ర:—తమ్మీ! యిదిలాగకూడదమ్మా! యీదండ మన బావకిద్దాము.

రుక్మిణి:—అక్కా! పెద్దక్కవచ్చి రెండునెలలు కావచ్చినది. సెలవురోజునసైన మనలంజూచుటకు రాని బావకు దండ సమర్పింతువు గాబోలునే.

కృష్ణ:—బావమాట చెప్పిన నాకు కోపమువచ్చుచున్నది సుమా. రేపోమాపో మనవదినవచ్చును. ఆమెకొఱ కీదండ దాచియుంచు.

చంద్ర:—ఈపదిగంటల బండిలో వదిన, అన్న, బావకూడ వత్తురు. పాపము బావకుతీరిక లేదు. అందువలననే యిన్నిదినములనుండి రాలేదు.

రుక్మి:—ఎందువలన?

చంద్ర:—కాంగ్రెస్ ఆఫీసులో పనిచేయుచుండుటవలన.

ఇంతలో మాధవరావు, గోపాలరావు లోపలికివచ్చిరి. ముంగురులతో నలంకరింపంబడి మందహాస భాసితమగు వారివదనమప్పుడు చూచితీరవలెను. గుణవతీదేవి 'వచ్చితిరా, బాబు! అందరికిని సుఖమేకద. ఈ సోఫాపై గూర్చుండుడు' అనియెను.

గోపాలరావు:—బావయెచ్చట?

గుణ:—ఇంకను రాలేదు.

గోపాలరావు:—అతనిపరీక్ష ప్యాసైనట్లు పేపరులో చూచి అతనిని చూచుటకై వచ్చినాను.

మాధవరావు:—నేనును అందుకొఱకై వచ్చినాను.

ఈమెచేయు సంఘసేవ సాటిలేనిది. ఒక్కదిన మీామె తనపనిని కట్టిపెట్టినచో దుర్భరమగును. ఈ సత్యమును గుర్తించినవాఁడు గావుననే లోకోత్తరపురుషుఁడగు గాంధి మహాత్ముఁడు పాకీదొడ్లను పరిశుభ్రపఱచుకృత్యము తన శిష్యులు నిర్వహింపవలసిన వాటిలో నొకటిగా నిర్ణయించి నాఁడు. ఇది అమోఘమగు సంఘసేవయని ఆమహాత్ముని నిర్వచనము. చంటిపిల్లయొక్క లాలామూత్రపురీషములను తొలగించుటకు తొందరపఁడు మాతృమూర్తిగూడ ఎడపిల్ల యొక్క లాలామూత్రపురీషములను తొలగించుటలో కొంత ఏవగింపునొందును. స్థితి ఇట్టిదికాఁగా ఈమె చేయు చున్నపని యెంతశ్లాఘనీయమైనదో సులువుగ ఆకళింప వచ్చును. పురపారిశుద్ధ్యమునకు ఈమె తోడ్పాటు అనంతమైనది. రంగూను, మద్రాసు, దక్షిణహిందూ దేశమున మఱికొన్నిపట్టణములు వీనియం దిట్టిసంఘ సేవకులు తెలుగువారే. ఇది గణనీయమగు విషయము. వృత్తిగౌరవమును గ్రహించుటలో కార్లయిలుమహాశ యులును, సంఘసేవయొక్క అంతర్యమును గ్రహించు టలో గాంధిమహాత్ములునునై ప్రజ లీసంఘసేవకురాలి కృత్యమును మెచ్చుకొందురుగాక!

గుణ:—నీవెందుకొఱకువచ్చితివో నేనెఱుంగుదును. 'పెద్దబావ, పెద్దబావ' యని పిల్లలందరును కలవరించుచున్నారు.

గోపాలరావు, మాధవరావు పెరటిలోనికి బోయిరి.

రుక్మిణి తిరిగిచూచి 'అదుగో, బావ' అని ఆపుష్పమాల బావమెడలో వేయును. చంద్రమతి గోపాలరావునుచూచి సిగ్గిలి లోనికిపోవుచుండెను. అత డామె నడ్డగించెను. చంద్రమతి ఓరచూపులతోఁగూడుకొనిన దండయొకటి భర్తకు ప్రసాదించి లోనికిజనియెను.

ఇంతలో శ్యామలరావుగారక్కడకువచ్చిన అల్లుండ్రతో కొంచెము సేపు యిష్టాలాపములుచేసి 'మీబావ కూడ యిప్పుడో యింకనో వచ్చును. రాధమ్మనుకూడ పంపుమని వ్రాసినాను. పండుగదినములలో నందరిని యొక్కచోటికి సమావేశపరచినాడు దేవుడు' అనియెను. గోపాలరావు 'అంతవఱకు నేనుండుటకు వీలులేదు. అమ్మమ్మయెక్కడ?' అనియెను. యశోదమ్మగారువచ్చి 'బాబు! గోపాలు! అమ్మకులాసాగానున్నదా? నాకేమైన కబురుచెప్పలేదు గద? ఏమిరా? గోపా! మాటలాడవేమి?' అన్నది. గోపాలరావు 'ఊఁ, అందరు కులాసాగా నేయున్నారు'అనియెను. అందుమీఁద యశోదమ్మగారు 'బాబూ! నీవువచ్చి చాలదినములైనది. కన్నులు కాయలు కాచినట్లున్నవి సుమా. ఇటుపైని తఱుచు వచ్చుచుండెదవులే. రుక్మిణికి పెండ్లిచేసి చంద్రమతిని సారెపంపవలెనని తలంచుచున్నాము' అనియెను.

గోపాలమాధవరావుగార్లు ముచ్చటలాడుకొనుచు మేడమీఁదికి బోయిరి. అప్పుడు వీరమతికి కోపము వచ్చినది. ఆకోపకారణము మాధవరావు గ్రహించెను. వీరమతి మాధవరావువైపునకు చూచి 'ఏలినవారికి ఎన్నాళ్లకుదయవచ్చినది?' అనెను. అప్పు డవకుంఠితయువతీరత్నమువలె క్రోధాచ్ఛాదితప్రేమవిలసితమగు చంద్రమతిచూపాక వింతసంతసముగూర్చెను మాధవరావునకు. పాపమత డప్పుడు మార్ధవముగ తాను రాకుండుటకు కారణముబుదెల్పెను, గాని యామె మనసునకంత సహేతుకముగ గనంబడనియట్లు లాచూపులలోన నుద్భాసితమగుచుండుటను తేటతెలికన్నులు సాక్ష్యము చెప్పక చెప్పుచున్నటులుండెను.

ఇంతలో మురళీ రాధలు బండిదిగి పెరటివసారాలో సుందరకాండపారాయణము సేయుచున్న తాతగారగు మురళీధరముగారికి నమస్కరించిరి. ఆయనవారల కాశీస్సులిచ్చి 'బాబూ! నీవు ఉద్యోగము చేయుటగూడ చూడవలెను' అనియెను. దానిమీద మనుమడు మురళి 'పెద్దలు మీరింతకష్టపడి నాకు విద్యాతేజమును బ్రసాదించి దాస్యజీవనమునకా ప్రోత్సహించుచున్నారు?' అనియెను. ఆమాటవినగనే మురళీధరము గారిగుండె ఝల్లుమన అప్పటి కాప్రసంగమునుమార్చి 'గోపాలమాధవులను చూచితివా? నీపరీక్ష ప్యాసైనట్లు పేపరులో చూచి నిన్నుచూచుటకై గోపాలంకూడ వచ్చినాడు. వెళ్లు మేడమీదికి' అనియెను.

రాధ అత్తగారియొద్దకేగి యామెకు వందనమిడి, అవ్యక్తముగ మాటలాడుచు తప్పటడుగులిడుచున్న ముద్దుమఱది నెత్తుకొని 'వదినెగారెచ్చట?' అనియెను.

గుణ:—'అమ్మా! రాధా! నీవు ఓపలేనిదానవు. వారందరువచ్చుసరి కాలస్యమగును. ఎప్పుడు భోజనము చేసితివో? స్నానముచేసిభోజనమునకు రమ్మా.

రాధ:—వదినెనెలను చూచివత్తును. మోహనరావు కనుపడడేమి?

గుణ:—వాడా? పరీక్షదినములని తాతగారియింటిదగ్గిర స్నేహితులతోఁకలిసి చదువుచున్నాడు. ఇంటికి వచ్చుటలేదు.

రాధ:—రుక్మిణమ్మ చదువుకొనుచున్నదా?

గుణ:—ఆ. చదువుచున్నది, నేషనల్ బడిలోనే.

రాధ:—అచ్చట పాఠములేమిటి చెప్పెదరు?

గుణవతి 'గృహవైద్యము, శిశుపోషణము, చిత్రలేఖనము, పాకశాస్త్రము, సంగీతము మున్నగువిషయములు. ఉపాధ్యాయినులును శ్రద్ధతో చెప్పెదరు. అచ్చట నేర్చినదే వదిన చక్కగా చిత్రలేఖనము వ్రాయగలదు. పిమ్మట మాటలాడుకొనవచ్చును. భోజనమునకు రమ్మ' అనియెను.

వెనుక ముందుగ నందరును ముచ్చటగ ముచ్చటలాడుకొనుచు భుజించుచున్నప్పుడు రాధ 'అత్తయ్యా మీకు వైద్యమెవ్వరు నేర్పిరి?' అన్నది. గుణవతి 'నాకు మా నాన్నగారు చెప్పినారు. మాయమ్మగారికి పిల్లలకు చదువులనినను పనిపాటలు నేర్పుటయనినను చాలపట్టుదల. చిన్నతనమున నామె చేసిన తీర్పేయిది. లేకున్న మనయింటి వైద్యమున డబ్బెయెంత ఖర్చగునో చూడుము. తరువాత మాటలాడుదము లెమ్మ' అనియెను.

మురళీధరంగారు మధ్యగూర్చుండి మనుమలనందరిని సమీపమున గూర్చుండబెట్టుకొని తాంబూలచర్వణము చేయుచుండెను. అప్పుడు గుణవతి భర్తతో "పిల్లలందరువచ్చినారు. మాఅమ్మ నాన్నగారు బిడ్డలను చూచెదరు. పండుగకు ఇచ్చటకురమ్మని చెప్పండి. రేపే పండుగ. బొమ్మలనోము లయ్యేవఱకు మాయమ్మ యిచ్చటనే యుండును" అనియెను. శ్యామలరావుగారందుమీద అత్తమామల తోడ్కొనివచ్చిరి.

మరునాడు సంక్రాంతిపండుగ. ఆదినమున బిడ్డలందరును అభ్యంగనస్నానములు చేసిరి. పిండివంటలతో భోజనములైనవి. శ్యామలరావుగారు ధోవతులు చీరలు జతపరచి తండ్రిగారిచేతనిడి జతలుజతలుగ తండ్రిగారి చేత నందఱకు నిప్పించిరి. యశోదమ్మ తన సంపత్తి చూచుకొని అట్టె చూచిన దృష్టి తాకునేమోయని తన దృష్టులు మరల్చుకొనియెను. అంతట గుణవతి "మురళీ! మీరు బావ అందరును షికారుకు వెళ్లండి. మేమందరము పేరంటమునకు వెళ్లెదము. వెళ్లునప్పుడు మోహనరావునుకూడా పిల్చుకు వెళ్లండి." అనియెను.

చిన్ననాటనుండియు ఆమెతో చదువుకొనిన స్నేహితురాలగు వెంకప్పవచ్చి గుణవతీదేవి సిరిసంపత్తులు చూచి సంతోషముతో "ఇదియంతయు మాగుణవతి యదృష్టము. పున్నెమున్న నిట్లు ఫలించును. గుణవతి సంసారము చూచిన మాబోంట్ల పాపములు నశించును. స్వర్గము మీయింటనున్నదే, తల్లి! యిదియంతయు మీమామగారి తపోఫలితమే సుమా. కన్నులు చల్లగానున్నవమ్మ. సాయంతనమగుచున్నది. పేరంటము చేసికొందు" అనియెను.

అప్పుడు గుణవతి "వెంకప్ప! బొమ్మలనోములు రేపటినుండి. బిడ్డలు నలుగురు బొమ్మలనోములు నోచుకుందురు. నీవుకూడ మాయింట నేయుండి ఆ వేడుక చూడుము" అనియెను. అందుమీద రుక్మిణి "అమ్మా! బొమ్మల నోములనగా నాకర్థము తెలియదు. ఆసంగతి తెలిసేలాగు చెప్పుము" అనియెను. దానికి గుణవతి "బొమ్మల నోములని అందరికది యొకవాడుకపదము గాని అది సావిత్రీగౌరీవ్రతము. సావిత్రి యమునంతవాని చేతిలోబడి పోయిన భర్త ప్రాణములను తన పాతివ్రత్యమహిమచే సంపాదించి తన మాహాత్మ్యము యుగయుగపర్యంత మాచంద్రార్కముగ నిల్పుకొన్నది. ఇది పిన్న పెద్దయనక నందరు చేయదగిన వ్రతము. పాతివ్రత్యశీలయగు సతికి పొందరాని కార్యములు లేవు. చిట్టితల్లీ! నీవుకూడ వచ్చేసంవత్సరము ఈనోము నోచుకొనవచ్చును." అనియెను. అందుపై రుక్మిణి "సావిత్రి రాజస్త్రీయని కథలో వ్రాయబడియున్నది. రాజస్త్రీని మనము పూజింపవచ్చునా?" అని అడిగెను. దానికి గుణవతి "గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః అనియున్నది గావున గుణములే పూజాస్థానములుగాని, లింగ, రూప, జాతి వయస్సుమున్నగునవి కారణములు గావని పెద్దలు వచింతురు. కావున గుణవంతులు యుగయుగపర్యంతము బూజింపఁబడుచునేయుందురు. కావున నీవుకూడ విద్యాబుద్ధులు నేర్చుకొని అత్తాడుబిడ్డలతో కలసిమెలసి ఎల్లరకు తలలోని నాల్కవలె కాపురము చేయుము. స్త్రీలందరును యిదియే నేర్చుకొని ఉత్తమస్త్రీల వర్తనము ననుసరించి మెలంగి కీర్తికాములగుదురుగాక! మనమింక మాటలు చాలించి పేరంటమునకు బోవుదము." అనియెను.

# మకరసంక్రమణము

కవితావినోద అల్లంశెట్టి అప్పయ్యగారు

రమ్యపరిమళవిభవాభిరామమగుచు
వెల్లివిరిసిన చేమంతివిరులుకొన్ని
బంతిపూవులుకొన్ని హేమంతుఁడు కొని
పౌష్యలక్ష్మివిలోకనోద్భాసిగాఁగ
రహినరుఁగుదెంచె మకరసంక్రమణవేళ.

పద్మినీగాఢపరిరంభభావుఁడగుచు
దినకరుండు ప్రశాంతుఁడై దివివెలింగ
దిక్కులన్నియుఁ గడువింత తెలివిఁ జెందెఁ
బ్రకృతి భావోదయ శ్రీలఁ బరిణమించె.

పట్టణంబులయందును బల్లెటూళ్ల
యందు ననవేల కళ్లములందుఁగూడ
ముత్తెములవానగురిసెనా ముగ్గులమరె
నమలసంస్తవనీయశోభావహముగ.

తల్లిపాలనునైన స్వాతంత్ర్యమూని
గ్రోలఁజాలనిదూడలు గోడులుడిఁగి
స్వేచ్ఛఁజరియించుచుండు నిశ్చింతననిన
మనుజులేరు పరాధీనమతులునేఁడు?

కొక్కొరోకోయనుచు కోడి కూయకమును
పొడుపుగుబ్బలిపై ప్రొద్దుపొడువకమును
మేలుకొలుపుల సందడిమిన్నుముట్ట
నెల్లవారలుమేల్కాంచి రెంతొవేడ్క.

వేకువనులేచు పుణ్యభామినులు తాన
మాడి చలిచేతవడఁకి మాటాడలేక
వంటకంబులుసేయునెపంబుతోడఁ
గొంతవడి యగ్గిదరిఁజేరి కూరుచుంద్రు.

వింతవింతనగల్ దాల్చి వివిధవర్ణ
నూతనాంబరములుగల్గి నోరికోలఁది
కేకలిడుచును చలి! చలి! పోకుపోకు
నిలుమునిన్నుమ్రింగు నొకపెద్దపులియటంచుఁ
బాడుదురు పిల్లవాండ్రు ప్రభాతమందు.

అన్నమననేమొ యెఱుఁగక యాఁకలిగొను
పరమదారిద్ర్యజనులును బాధలుడిఁగి
పిండివంటలచే రసోపేతమైన
భోజనంబుల సంతృప్తిఁబొందుచుంద్రు.

కోరి కూష్మాండదానముల్ గొమ్మటంచు
దేని సంక్రాంతిపురుషుండు పూనియెక్కు
ననుచునుఁబురోహితునిఁ బిల్చియడుగువారిఁ
దెలుపువారినిలెక్కింప వలనుపడదు.

కోడికూయకమునుపు మేల్కొనుచు జంగ
మయ్య'లోహోమహాదేవ!'యనుచు గంటఁ
బట్టిభిక్షుకుగా పాటబాడి క్షుభిత
గాత్రు లగుచుందురొక్కొక్కగ్రామమందు.

డోలువాయించిపాడి డూడూయటంచు
గంగిరెద్దులఁ బురికొల్పి గంతులిడెడు
దాసరిజనంబువేసెడి వేసముఁగని
సంతసంబందుచుందురు జనములెల్ల.

బోడితలపయి నొకపట్టుపుట్టమమరఁ
బదిలపఱచిన యక్షయపాత్రతోడ
తాళవృంతంబు వలకేలఁదనర నూర్ధ్వ
పుండ్రములుదాల్చి బికిరంబుపొంటె నెల్ల
వీధులంబడి సాతానిపిండు తిరిగె.

ఇట్టిదినమింక నెట్టులభించు ననుచుఁ
బల్లెటూరిజనుల్ రచ్చబండకేగి
స్వేచ్ఛమైనుందు రటఁ గొంతసేపునిలిచి.

పరమకల్యాణ సుఖములు ప్రజలకిడుచుఁ
జింతలెల్లనుదీర్చి రక్షించుకొఱకు
నించువేడుకమై నరుదెంచినట్టి
పౌష్యలక్ష్మిరో! నీకిదేస్వాగతంబు.

# బొమ్మలనోము

సత్తిరాజు కామేశ్వరరావుపంతులుగారు

బొమ్మలనోము స్త్రీకి వివాహమయిన మొదటిసంవత్సరము మొదలుకొని యెప్పుడు చేసికొనినను తొమ్మిదిసంవత్సరములు చేసికొనవలసిన నోము. మూఁడవసంవత్సరమునఁ బ్రారంభించుటకూడ నక్కడక్కడఁ గలదు. ఇది సంక్రాంతిపండుగ వెళ్లిన మూఁడవరోజునఁ బ్రారంభింపవలెను. గ్రామములో నెవరీనోముఁ బట్టుటకు సంసిద్ధులైయుండిరో మొదటఁదెలిసికొని, అట్టివారందఱు నొక్కచో సమావేశమై యెవరింట నీబొమ్మలనుంచిన నీనోము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తినొందునో యెవరయిల్లందఱికిని నందుబాటుగనుండునో యోచించుకొని యట్టి యింటి నొకదానిని ముందేర్పాటుచేసికొందురు. ఆయింటి వారఖండమను దీపము నాఱిపోకుండఁ జూచుచుండవలయు.

ఈనోముపట్టు యంగనలందఱును మొదటిరోజున నొక్కొక్కరును తవ్వెడుతవ్వెడుబియ్యము నొక్కొక్కరవికెలగుడ్డయు, నొక్కొక్కకానియు పళ్లెరములయందుంచుకొని కుంభకారునిగృహమునకు బాజాభజంత్రీలతో నరిగి యవి వానికొసఁగి వానిచే నీయఁబడినబొమ్మల నొక్కొక్కరు మూఁడేసిచొప్పున దీసికొని తాము పట్టుకొనివెళ్లిన పళ్లెములో నుంచుకొని ఉల్లాభముక్రింద నడచుచు, నేర్పఱచుకొన్న యింటికి వత్తురు. ఆ యింట నిర్ణయింపఁబడిన గదిలో వ్రేలాడఁగట్టఁబడినబల్లపై నీబొమ్మలనుంచి వానికి పసుపుగుడ్డలఁగట్టి ధూప దీపములర్పించి పూలు, చందనము, అక్షతలు మున్నగువానితోఁ బూజించి మంగళంబులఁబాడి యవసర నైవేద్యంబులఁజెల్లించి తర్వాతఁ బులగము నివేదనఁ జేతురు. ఆసాయంకాల మందఱుఁజేరి మంగళహారతులబాడి యేదోయొక తినుబండపువస్తువును బ్రసాదముగాఁ బంచిపెట్టుదురు. ఇట్లు మొదటిరోజు గడుపుదురు.

రెండవరోజు మొదలాఱవరోజుగడఁజనునవఱకు నందఱొక్కసారియే రావలయునను నియమములేక యెవరి కెప్పుడువీలగునో వారప్పుడేవచ్చి పూజాదులునిర్వర్తించి వెళ్లుచుందురు. అయితే మహానివేదనలు మాత్రము నిర్ణయింపఁబడియున్నవి. రెండవరోజున క్షీరాన్నమును, మూఁడవరోజున ముద్దగుడుములు, నాల్గవ రోజున నానఁబ్రాలు, అయిదవనాఁడప్పాలు, ఆఱవరోజున గారెలును నైవేద్యములు చెల్లింతురు. ఏడవ నాఁడును తొలినాఁటివలెనే యందఱొకేసారివత్తురు. ఆరోజున అట్లును నైవేద్యముగాఁ బెట్టుదురు. ఈ యేడురోజులును నేవిధమగునాటంకములు లేక వ్రతముసాగెనేని నాయేటి కావ్రతము సాంగమయ్యెనని దలఁతురు. ఎనిమిదవనాఁడందఱు నేకకాలమున రానక్కఱలేదు. ఆరోజున బూరెలు సమర్పింతురు.

తొమ్మిదవరోజున యథాప్రకారము పూజలన్నియు జరిగినపిమ్మట బొమ్మల నొకపల్లకియందుంచి మేళ తాళములతో నూరేగించుచు బుక్కాలఁజల్లుకొనుచు నొక జలాశయమువద్దకు దీసికొనిపోయి యక్కడ బెరుగును, నడుకుల నివేదనఁజేసెదరు. తర్వాత నీబొమ్మల నొక తెప్పపైనుంచి దీపమువెలిగించి దానిని లోఁతునకు గెంటివేయుదురు. అట్లా తెప్పపై బొమ్మలనుంచుటకుఁ బూర్వమే తలకొక బొమ్మను దీసికొనియుందురు. ఇట్లుత్సవము ముగిసిన పిదప నెవరింటికివా రేగుదురు. ఎవరింట నీబొమ్మలుంచఁబడినవో వారుమాత్రము దాము తెచ్చికొనిన బొమ్మ నాబల్లమీఁదనుంచి మంగళములు బాడుదురు.

చేటకుఁదొమ్మిదేసిబిళ్లకుడుములుగల తొమ్మిదిచేటలును, తొమ్మిదిలక్కజోళ్లును, తొమ్మిదినల్లపూసల జోళ్లును, తొమ్మిది తమలపాకులును, తొమ్మిది పోఁకచెక్కలును గలిసి యొక వాయనమగును. ఈనోము పూర్తియైన తొమ్మిదవసంవత్సరమున తొమ్మిదివాయనములు తొమ్మండ్రుగురుముత్తయిదువులకిచ్చెదరు. దీనికి నుద్యాపనమని పేరు.

దీనినే సావిత్రిగౌరీదేవి నోమందురు. పూర్వము శివుఁడు పార్వతి కీవ్రతము నుపదేశించెనఁట. సావిత్రి తన భర్తయైన సత్యవంతునికి దీర్ఘాయువుకలుగుటకై యీవ్రతమే చేసియున్నదని చెప్పుదురు.

—'ఐదవకమలావాచకము'నుండి.

# సూర్యోపాసన: సంక్రాంతి

ఆకుండి వేంకటశాస్త్రిగారు

ఆర్యులు మధ్యాసియానుండిబయలుదేరి యూరపుఖండస్థదేశములకును, ఆసియాఖండములోని వివిధదేశములకును శాఖోపశాఖలుగాచీలిపోయి యాయాప్రదేశములకు వ్యాప్తిగాంచి యచ్చట స్థిరపడినట్లు చరిత్రవలన తెలియవచ్చుచున్నది. ఆర్యులలోనొకశాఖహిందూదేశమునుప్రవేశించి గంగాసింధుమైదానములలోస్థిరవాసమేర్పరచుకొనిరి. ఆర్యులనాగరికత నుద్ఘోషించువేదములను, వేదమంత్రములను పరీక్షించిచూడగా వారు పంచభూతములందు ఈశ్వరతేజమునుకనుగొనుచు దైవభావమున భజించుచుండిరనియు వారుసూర్యచంద్రగ్రహతారకాదులనుదైవభావముతోజూచుచు పూజించుచుండిరనియు తెలియుచున్నది. అందుముఖ్యముగ చంద్రగ్రహతారకాగణంబున దివ్యతేజంబుతో వెలుగొందు మహత్తరమైనగ్రహము సూర్యుడే. ప్రాతఃకాలతరుణతరణి యరుణోదయకాంతులకు ప్రహృష్టులగుచు ఈజగత్పరిరక్షకుడగు శ్రీమహావిష్ణువే యీసూర్యబింబరూపమున వెలుగొందుచున్నాడను భావంబు వారిమనంబుల గాటముగ నెలకొనియున్నది. అందులకే అమరునిఘంటువునందు సూర్యుని నామములలో 'కర్మసాక్షీజగచ్చక్షుః' అని సూర్యునికి సార్థకనామము లొసంగబడియున్నవి. మానవుడుచేయుపనిని చూచుట సూర్యుడు కర్మసాక్షియని పేర్కొనఁబడియున్నాడు. మేఘావృతమై సూర్యదర్శనములేని దినమును జనులు దుర్దినముగా పరిగణింతురు. హైందవస్త్రీలు కొందఱు తమకొమారులకుగాని, కొమార్తెలకుగాని యెప్పుడైన భయంకరమైన రుగ్మతగలిగినయెడల ఆరుగ్మత సూర్యభగవానుని యనుగ్రహవశమున కుదిరినయెడల తాము ప్రతిదినమును సూర్యదర్శనముచేసిగాని భుజింపమని యొకశపథరూపమగు వ్రతమునుబూని వానకాలములో మేఘచ్ఛన్నమైననాడు సూర్యదర్శనములేనిచో, యానాడుపవసించి రాత్రికాగా యాతని యపరరూపమగు దీపమును వెలిగించి నమస్కరించి ఫలాహారముగొందురు. ఇటులచేయుట సూర్యారాధనవిధములలో నొకటి. ఆదికాలమున ఆర్యులు సూర్యుని యపరరూపమగు అగ్నిని ప్రజ్వలింపఁజేసి మంత్రములతో సూర్యు నుద్దేశించి హవిస్సులను వ్రేల్చుచుండిరి.

వివాహకాలమున వధూవరులిరువురును అగ్నిని ఔపాసన చేయవలసియుండును. సూర్యుడు కర్మసాక్షియు, జగచ్చక్షువునయినట్లే అభేదావ్యవసాయియగు సూర్యుని అపరరూపమగు అగ్నియొక్క ఔపాసన ప్రతివేదచోదితకర్మయందు విధిగ విధింపఁబడియున్నది.

సూర్యశతకమును సంస్కృతభాషయందు రచించిన మయూరునికాలమున అనేక మతావలంబులున్నట్లే సూర్యోపాసకులగు సౌర్యమతస్థులుకూడ నుండిరి. ఉత్తరహిందూస్థానమున ఈమతము వ్యాప్తియందుండెను.

ఒక వారములోని దినముల పేర్లలలో నొకదినము ఆదిత్యవారమనిగాని, ఆదివారమనిగాని పిలువబడుచునేయున్నది. ఆదిత్యహృదయమను మంత్రరాజముకూడ కలదు. ఈమంత్రరాజమును మునులుకూడ అర్హులగువారికుపదేశించుటయు గలదు. సంధ్యావందనమునకూడ సావిత్రీస్తోత్రముగలదు. ఇదిసూర్యపరమైనదే.

స్త్రీల సౌభాగ్యమును పెంపొందించుటకై ఆదివారములనోము లుద్దేశింపఁబడినవి. ఏదోవిధమున స్త్రీలును సూర్యారాధకురాండ్రుగ నున్నారు. రథసప్తమి, సంక్రాంతి మొదలైన సూర్యగమనమునకు సంబంధించిన పర్వదినములలో సూర్యప్రీతికరములగు వ్రతానుష్ఠానపరులగుటను సూర్యోపాసకులుగా నున్నారు. అయితే మనము పూజించు పురాణప్రసిద్ధములగు రామకృష్ణాద్యవతారములగు దేవతలకు దేవళములున్నట్లే సూర్యునికి దేవళములు దేశమున విరివిగానున్నవా, అట్లులేకపోవుటకు కారణమేమి యని తర్కించిచూచిన పూర్తిగ సూర్యునికి ప్రత్యేకదేవళములు లేకపోలేదు.

సూర్యుడు ప్రత్యక్షదైవమగుట యాతనిని బహుశః ఆర్యులు దేవాగారములనుంచ పనిలేదని తలచియుందురు. అతడు ప్రతిదినమును (మేఘచ్ఛన్నమైనప్పుడుతప్ప) మనచక్షువులకు ప్రత్యక్షమగు దైవమేయగుట దేవళములు ప్రత్యేకముగ సూర్యునిపేర లేకపోవుటకు కారణమైయుండ జనును. అయినను పూర్తిగ సూర్యుని దేవళములు ఆర్యనాగరకత వ్యాప్తినందిన దేశములలో లేకపోలేదు.

సూర్యోదయ, సూర్యాస్తమయాదులగు సంధికాలములు మహిమాన్వితములుగ హిందువులచే నెన్నబడుచున్నవి. సూర్యనమస్కారాది వ్యాయామకర్మకలాపానుష్ఠానమునకును, స్నానజపాదివిధుల ననుష్ఠించుటకును తమ మెదలి, సూర్యతేజోవబోధముకలుగు సంధికాలమెంతయుతగియుండుటచే ప్రాతఃకాల్యములగు విధిచోదితములగు కర్మ లుద్దేశింపఁబడినవి. సూర్యునిగూర్చి నిడుమోలు కనకసుందరముగారిట్లువ్రాసియున్నారు: "ఆర్యులు సూర్యుడు, సావిత్రి, మైత్రేయుడు అను పేరులతో ఆదిత్యుని పూజించుచుండిరి. ఆదేవతావర్గమునకు ఆదిత్యవర్గమని పేరు. సూర్యుడు జ్యోతిర్మయుడు. కాలమానముల కాధారభూతుడు. సూర్యు డదితిపుత్రుడందురు. సూర్యుడు, సావిత్రియు ఉపానాధులుగ వర్ణింపఁబడియున్నారు. పూషపదము సూర్యుని నామాంతరము. వేదములకు పిదపకాలమందే విష్ణువు (ద్వాదశాదిత్యుల నామములలో విష్ణువను నామము కూడకలదు) ఆదిత్యులలో ప్రథముడుగను, హైందవులుపూజించు మూర్త్రిత్రయములోప్రముఖుడగు దేవుడుగను ఆరాధింపఁబడుచున్నాడు. సూర్యుని పూజావిధానమును గూర్చియైన వేదములు ప్రత్యేకించి శాసించియుండలేదు. ఆకాలమునందు సూర్యుడును తదితరదేవతలవలెనే యారాధింపఁబడెడివాడని మన మూహింపవలసియున్నది. ఉపనిషత్తులందు సూర్యునకు విశేషమగు ప్రాముఖ్యమువచ్చినది. ఛాందోగ్యోపనిషత్తునందు తృతీయఖండము సూర్యకిరణధ్యానమును గూర్చినదై యున్నది. ఆదికావ్యములగు సంస్కృతభారతరామాయణములందు సూర్యారాధనము వివరింపఁబడియున్నది. భారతమున సూర్యుడు అష్టోత్తరనామములఁ గీర్తింపఁబడియున్నాడు. రామాయణమున యుద్ధకాండమున నొక్కయధ్యాయము పూర్తిగ సూర్యసంకీర్తనమునకే వినియోగింపబడినది (ఆదిత్యహృదయము.) బౌద్ధసారస్వతభాగములగు జాతకములుకూడ సూర్యారాధనమునుగూర్చి ముచ్చటించుచున్నవి. పురాణములందు సూర్యునిగురించి యితిహాసములు పెక్కులున్నవి. వాయుపురాణమున వివరింపఁబడిన సూర్యారాధన క్రమమిప్పటికిని కొంతవరకు హిందువులచే నాచరింపబడుచునేయున్నది. సంధ్యావందనమునందలి ముఖ్యభాగమగు గాయత్రీమంత్రము సావిత్రీమంత్రమే. అయ్యది అనాదిని సూర్యునుద్దేసించియే రచింపఁబడియుండనోపు. ఉత్తరహిందూదేశమున సూర్యోపాసన ప్రచారములోనున్నది. రాహుకేతువులను రాక్షసులు సూర్యచంద్రుల గ్రసించి గ్రహణములను గల్గించుచున్నారనుగాధ యతిప్రాచీనమైనది. సూర్యుడు మయునకు గృహనిర్మాణక్రమ ముపదేశించినటుల సూర్యసిద్ధాంతము చూపుచున్నది. బృహస్పతి, అంగారకుడు, శుక్రుడు, బుధుడు అనిమనము పిలచెడు గ్రహగోళములు నియమితసమయములలో సూర్యునిచుట్టు నొకసారి తిరిగి వచ్చుచున్నవి. హిందూదేశమున సూర్యారాధనము గ్రహారాధనము 2000 యేండ్ల క్రిందటనే ప్రచారములో నున్నట్లనేకప్రమాణములు కలవు. తక్షశిలానగరమున సూర్యదేవాలయ మొకటి యున్నటుల ఫిలోస్ట్రేటస్ (Philostratus) అనుగ్రీకు దేశస్థుడు రచియించిన అపోలినియస్ జీవితచరిత్రమునందున్నది. యాజ్ఞవల్క్యుడు, వరాహమిహిరుడును సూర్యారాధనమును వివరించియున్నారు. ముల్తాన్‌నగరమున సూర్యదేవాలయమొకటి నిర్మింపఁబడినటుల భవిష్యపురాణమునందున్నది. ఈ యాలయమునందలి సూర్యవిగ్రహమునకు పుష్పములతో పూజలొనర్చుచుండెడువారని చైనాయాత్రికుడు యువాన్‌చ్వాంగ్ వర్ణించినాడు. ఆల్బరూని యను పారసీకుడు 'ఇండియా' అనుగ్రంథమున యీదేవాలయమునుగూర్చి ముచ్చటించియున్నాడు. 9-వ శతాబ్దిని జీవించియున్న యానందగిరియను పండితుడు సూర్యారాధకులను ఆఱుతెగలుగ విభజించియున్నాడు.

ఉదయించు, మధ్యాహ్నిక, అస్తంగత, సాయంసమయ సూర్యుల నారాధించుచుండెడివారు. క్రీ 466 సం॥ నాటి యొకశిల్పములో సూర్యారాధనము సూచింపఁబడియున్నది. కృతయుగాంతమున మయమహాసురుడు జ్యోతిశ్శాస్త్రము నెఱుగగోరి సూర్యునిగూర్చి యుగ్రతపము జేసెను. అప్పుడు సూర్యుడు ప్రీతుడై యతనిని "నీవునీనివాస స్థానమగు రోమక (Rome) పురమునకుబొమ్ము. నీయాప్సితము నెరవేరును" అనిచెప్పెను. సూర్యునికై నిర్మింపఁబడిన దేవాలయములు హిందూదేశమున నరుదుగనున్నవి. దక్షిణహిందూదేశమున తంజావూరునం దొకటిగలదు. కొల్హాపురమున నవగ్రహాలయ మొకటిగలదు. దక్షిణదేశములలో శివాలయములలో నవగ్రహములు ప్రతిష్ఠింపఁబడియేయున్నవి. తంజావూరిలోగల సూర్యుని దేవాలయము 'సూర్యనార్ కోవిల్' అని పిలువఁబడుచున్నది."

భూమి, సూర్యాది గ్రహగోళములన్నియు అన్యోన్యాకర్షణముకలిగి గ్రహమండలమున తిరుగుచున్నవి. భూగోళము సూర్యగోళముచుట్టును తిరుగుచున్నది. భూగోళము తనచుట్టుతాను తిరుగుటవలన దివారాత్రములును సూర్యుని చుట్టివచ్చుచుండుటవలన సంవత్సరములును కలుగుచున్నవి. ఇట్లు చుట్టివచ్చుచుండుటలో మార్చినెల 22 తేదీ ప్రాంతమున భూమధ్యరేఖయున్న భూమధ్యభాగము సూర్యునకెదురుగను, సమీపముగను యుండుట కలుగును. అందువలన భూమధ్యరేఖాభాగముననుండు దేశములలోని జనులకు సూర్యుని వేడిమి యధికముగనుండును. భూమధ్యరేఖకుత్తరమున 23½ డిగ్రీలదూరములో కర్కాటకరాశియనిగాని కర్కాటకరేఖయనిగాని చెప్పబడుభాగముగలదు. దానిని ఇంగ్లీషులో ట్రాపిక్ ఆఫ్ కేన్సరు (Tropic of Cancer) అందురు. ఇట్లే భూమధ్యరేఖకుదక్షిణమున 23½ డిగ్రీలదూరములో మకరరాశియనిగాని మకరరేఖయని చెప్పబడు భాగముగలదు. ఈభాగము అనగా మకరరాశియనిగాని మకరరేఖయనిగాని చెప్పబడుభాగము సూర్యునకు, పుష్యమాసమున శుక్లపక్షము సప్తమిప్రాంతమునందు యెట్టయెదురగును. దీనినే సూర్యుడు మకరరాశి యందుసంక్రమించినాడని చెప్పుదురు. ఇదియే మకరసంక్రాంతియనిగాని, సంక్రమణమనిగాని చెప్పబడుచు మహోత్తరమైనపుణ్యకాలముగను పర్వకాలముగను హిందువులచే నెన్నబడుచున్నది. సూర్యప్రీత్యర్థము "పొంగలి" తయారుచేసి సూర్యునికిని వేదనచేయుదురు. ఈపర్వము హిందువులందఱిచేతను మహాపర్వముగా నెన్నబడుచున్నది. ఈమకరసంక్రాంతిపుణ్యకాలమున గోభూహిరణ్యాదిమహాదానములను చేసినచో అట్టిదాతలకు కోటిగుణితముగ పుణ్యమును ఉత్తమలోకములును లభించుననిచెప్పుదురు. సూర్యుడు మకరరాశిలోనుండుదినములు శాస్త్రరీత్యా చూచినయెడల సూర్యగ్రహము తన్నుపాసించు భక్తులకు శుభపరంపర నీయగలడని వైదికగ్రంథములు చాటుచున్నవి. ఇట్టి కర్మసాక్షియొక్క శుభదృష్టులను మనపై ప్రసరింపఁజేసికొని యారోగ్యభాగ్యాదులబడయ ననువగు యీసంక్రాంతిశుభసమయము సూర్యభక్తులకేగాక యెల్లరకును సకల సంపత్సమృద్ధుల నొసగిమనుచుగాక!

## సంక్రాంతి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ఉ. సంజగులాబి తూరుపుదెసన్ తనరేకుల విప్పుచుండె, బైఁ
బంజరు వెట్టిపోయె నుడుపంక్తు లనంతవిహాయసస్థలిన్,
క్రొంజిగిలేతప్రొద్దు మెఱుగుల్ నిగుడంగ విహంగగాయనీ
మంజులగానముల్ మలసె మందసమీరతరంగపంక్తిపై.

ఆర్యుల కుపాస్యదేవతయై తమఃప్ర
వృత్తినడగింప నావిర్భవించెఁ జదల
నా, యుషఃకాంత, సంక్రాతి యవసరమున
పూర్వదిశ తేజరిల్లె నపూర్వలక్ష్మి.

ఉ. ముప్పదిమూడుకోట్ల ముఖముల్ వికసించె, తదీయకాంతుల
య్యుప్పరవీథి నూతనయుగోదయతేజము లీలబర్వె, నీ
కప్పిన కారుచీకటి కకావికలై చనె; భోగిపండుగల్
జొప్పడె, భారతస్థలి విశుద్ధతపఃపరిపాక మొప్పగన్.

ఉ. పూసినకుంకుమంబుఁ బసపుం బసలొప్పగ బూర్వదిక్తటో
ల్లాసమునందు నార్యగృహలక్ష్మి నిజాననశోభఁ దెల్పె; సం
ధ్యాసుషమల్ మహత్తరకళాలయముల్, గృహిణుల్ నిరంతరో
పాసనలన్ భజింపుడుఁ బ్రభాతకళావతి నీ సరస్వతిన్.

శా. ఈసంక్రాంతిసమాగమంబు, పరమోత్కృష్టప్రభాపూరితా
శాసందోహము, నూతనోద్యమమహోత్సాహప్రదంబున్, కళా
వ్యాసంగంబు, మహార్థయుక్తరసవత్పద్యంబునై, గేహల
క్ష్మీసౌభాగ్యము వృద్ధిజేయుత యశశ్రీ దిక్కులన్నిండగన్.

# సంక్రాంతి సందడి

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

గృహిణి భర్తతో:

గడచిపోయిన శుక్లలో కడుముదమున
పిలువ నేవోపరీక్షలవలన పాప
మిటకు నేతేరలేకపోయినయతండు
మనవిశాలాక్షిమగఁడు వచ్చెను, ముదంబు
లావహిల్లెడు మనహృదయంబులకును,
అరయ నీయొక్కసంక్రాంతి యతనిరాక
వేయిసంక్రాంతిపర్వాలహాయిగూర్చు.

గయ్యాళి మగనితో:

నిరిటిసంక్రాంతికే నాకు నీలిచీర
మరువక కొనియిచ్చెదనని మాటయిచ్చి
రేపుమెల్లుండియని యిటులే వచించి
నన్నుమాయలలో ముంచినారు; తుదకు
చీరమాటయే మరవంగఁజేసినారు;
మరలసంక్రాంతివచ్చె; ఈమారు మీరు
తప్పుకొనలేరు——కొనుటింక తప్పదండి!

చెలికత్తె స్నేహితురాలితో:

చెలియ! సావిత్రి! ఎంతటిచిత్రమమ్మ!
ఆరునెలలైన నేగలేదమ్మ! నీవు
దోసిళులతోడ దలంబ్రాలుపోసినప్పు
డించుకయులేని యీసిగ్గునెచటినుండి
ఎరువుతెచ్చుకొంటివి? నిన్నునరయుకొఱకు
గంపెడాసతోవచ్చు మగనినిగాంచి
తలుపుచాటున వంటింటతల్లి చెంత
తారులాడెద వెట్టిచైదములు నీవి?

భిక్షువు: తనలో

మూనాళ్లాయా పొట్టకుపట్టెడు
మెతుకులుదొరికిన మేలనితిరుగా
భోగులకైనా పుట్టాబోనీ
పిండీవంటలు నిండె నాఒడి
భళిరా! భళిరా! భళి! సంక్రాంతి!!
మరలా శీఘ్రం మరలీరావలె.

# సంక్రాంతి ముత్యాలు

వోలేటి సీతారామమూర్తిగారు

ఆయపూర్వపుణ్యాదినోదయంపువేళ
భారతీయుని మంజుహృత్పథమునందు
జాలుజాలుగ హర్షసుమాలురాలు
చదల నేదివ్యయువతులు జల్లుచుంద్రో!

సుధలువెదఁజల్లు తెలిచుక్కశోభభాతి
తరళితమయి ద్వారాలంకృతమ్ములైన
మవ్వములనొల్కు ముత్యాలమాలమిసిమి
నమరుచున్నది యాంధ్రగృహంబు శీవి!

దివిజలోకంపు టమృతబిందువులుజాతి
ఈమనోహరాంధ్రగృహసీమలందు
సున్నితంబును స్వచ్ఛమై సొబగులొల్కు
రంగవల్లులభాతి నేర్పడియెనేమొ?

పొల్పుగావిడ్డ వేకువపూలవోలె
ప్రేమపరిమళముల లేఁతహృదులతోడ
నావధూవరు లొండొరు లరసికొనిన
వాలుచూపులు దివ్యార్థవైభవములు.

తొలుత పరిణయోత్సవవేళనలముకొనిన
సిగ్గుదొంతరల నటునిటుచెదరఁజేసి
స్ఫురితమైన యామహాసీయమూర్తినట్టి
మరలఁగన బాల యెంతగమనసుపడును!

వాలుజడయందమర్చిన పూలవలపు
లొలయుచుండు చెంగావిబుగ్గలబెడంగు
ప్రబ్బుపెదవుల చిరునవ్వురాగరేఖ
లాంధ్రబాలిక! పతికుపహారములొకొ?

చీకటిపథాల వెన్నెలరేకయగుచు
జీవితంపు సౌఖ్యామృతశీకరములు
భావిదశ విరఁజల్లెడు పడతియనుచు
ఓరగా పత్నిఁ గాంచెద వోకుమార?

ప్రేమకారణమునఁ బ్రవర్ధిల్లుచుండు
ప్రకృతినిరతంబు మానవద్వంద్వమందుఁ
బ్రణయబీజాంకురము మొలవంగఁజేయు
పూతసంక్రాంతి! దైవసంభూతవీవు!

# బోగిపండుగ

బోగిపండుగవచ్చెఁ బొందుగామనయిండ్ల
తలయంట్లు సాగింపవలయునేఁడు
ఎల్లిసంక్రాంతియు నెల్లుండికనుమావ
లెల్లుండి ముక్కను మేఁగ దెంచు
దండిగానిన్నాళ్లు పిండివంటలదోడ
నిష్టమృష్టాన్నంబు లింపుమీఱ

బావలుమఱఁదులు బందుగులల్లుండ్రు
వదినెలుమఱదండ్రు బంతిగుడిచి
క్రొత్తపుట్టముల్ ధరియించుకొని ముదమునఁ
గూడికిలకిలలాడుచు వేడుకలర
పాడుదముపాట లాటల నాడుకొంద
మోలిమనమెల్లరముగూడి బాలురార!

—చాటుపద్యమణిమంజరి

'ఒలియ: ఒలియో: రా, వేలుగలవాడా! రా, పొలిగాడా!'

అను అనుపల్లవిగల నొక చక్కని పదమును కుప్పనూర్చుడు కళ్లములందు పాడుదురు. భాషాభిమాను లెవరైన దానిని సేకరించిబంపుచో కృతజ్ఞతాపూర్వకముగ గృహలక్ష్మిలో ప్రచురింతుము.

# చేమంతులు

శ్రీమతి బి. జ్ఞానాంబగారు

౧

## మొక్కలను పాతవలసిన విధము

చేమంతి చెట్లను ప్రాకుడు ముఖ్యావసరము. లేనియెడల చెట్లు గాలిచేత రాచుకొని ఆకులు పువ్వులు నలిగి చెడిపోవును. ఇట్లు చెడిపోకుండుటకై మొక్కల నొకేవరుసనపాతిపెట్టి వానిప్రక్కన తీగెలనుప్రాకించుటకు రెండుతడికెలను కొంచెమెత్తుగానుంచవలెను. ఇట్లు 10, 12 అడుగులు యెడముగా రెండు వరుసలుగా చేమంతిమొక్కలను నాటి వానివెనుక తడికెలపైని పూలతీగెలను ప్రాకునట్లుచేయవలెను. వరుసలెంత పొడవుగానుండినను ప్రమాదములేదు. కాని ఉత్తరపడమరలనైపుమాత్ర ముండితీరవలెను. అట్లుండినగాని ఎండనుండి రక్షింపబడనేరవు. ఒక్కొకతీగె తడికెప్రక్కను మూడువరుసలుగా చేమంతిమళ్లనుంచవచ్చును. ఇట్లు చేసినయెడల నెత్తిమీదికివచ్చినప్పుడు తప్ప తక్కినవేళలలో మొక్కలకు ఎండ తగులనేరదు. ఈరీతిగాపెంచబడిన చెట్లపూవులు దరహసితవదనములట్లు మనోహరములై యుండును.

## నీళ్లు పోయు పద్ధతి

మళ్లుగాగట్టి ఎండలోనుండు చేమంతులకు మధ్యాహ్నవేళ నీళ్లుపోయుట మంచిది. ఇండ్లలోను గదులలోను పెంచుకొను మొక్కలకు ప్రొద్దుననే నీళ్ళుపోసి చక్కగా గాలితగులునట్లు ఉంచవలెను. మళ్ళలోని మొక్కలకంటె తొట్లలోనిమొక్కలకు నీరెక్కువగా పోయవలెను. ఎక్కడనున్న మొక్కలకైనను పాదులోని తేమ ఆరనిదే మరలమరల నీళ్ళుపోయరాదు. అట్లు పోసినచో కుళ్ళి చెడిపోవును. మొక్కలపైనినీళ్లు పూలగుత్తులసందున నిలుచునట్లు చల్లరాదు. అచ్చట నీళ్ళునిలిచెనేని పుష్పములు చక్కగావికసింపవు. ఒకవేళ వికసించినను రేకులు పూర్తిగావిడక చెడిపోవును.

## చిళ్లలు, తలలు, మొగ్గలు త్రుంచుట

మొక్కకు విరివిగా చిళ్లలు త్రుంచివేయుట మేలు. ఇట్లు త్రుంచివేయబడినవానిని మరలనాటిన క్రమముగా పెద్దమొక్కలగును. కొమ్మలకుచివర ఆకులపుంజమొకటి బయలుదేరి మొగ్గదొడుగు స్థలమునంతయు నాక్రమించుకొని మొగ్గలయభివృద్ధికి కొంత యాటంకముకలుగజేయును. కావున మొగ్గయొక్క యాకృతి స్పష్టముగా ఏర్పడినతర్వాత చిన్నకత్తెరతో ఆకులపుంజమును కత్తిరించివేయవలెను. మొగ్గలవద్దనేకాక కొమ్మలయందచ్చటచ్చట నైతము ఆకులగుబురు బయలుదేరుచుండును. దీనినప్పుడప్పుడు కత్తిరించుచుండినయెడల కాడలు బలముగా నెదుగుటయేగాక పుష్పములుగూడా తేజోవంతములైయుండును. ఇక మొగ్గలనుగురించి జాగ్రత్తవహింపవలెను. ఒక్కొక గుత్తిలో అనేకములైన మొగ్గలుదయించును. వానిలో బలముగా చక్కగానున్న మొగ్గలనుమాత్రమే యుండనిచ్చి తక్కినవానిని కత్తిరించవలెను. ఇట్లు చేయుటవలన మిగిలినమొగ్గలు సలక్షణముగావికసించుట కవకాశముండును.

## పోషణము

చేమంతిపూలు పూయునప్పుడు కొన్నిదేశములలో పెద్దగాలివానలు ముసురు పట్టుటకలదు. అందువలన మొక్కలు విరిగి పూలు పాడైపోవును. కాబట్టి నూనె మైనముకలిపి కఱిగించి దానిలో నొకముతకగుడ్డను ముంచి మైనపుగుడ్డగాజేసి గాలివానదినములలో చెట్లపైకప్పవలెను. మంచుగురియుస్థలములలో చేమంతిచెట్లను పెంచగోరువారు మైనపుగుడ్డలను తప్పకకలిగియుండవలెను. కుండీలలోనున్న మొక్కలను వానలుకురియునప్పుడు ఇండ్లలో గాలితగులు ప్రదేశములందుంచవలెను.

## పురుగుపట్టుట: దానికి చికిత్స

చేమంతిచెట్లను నీళ్ళుపోసి కాపాడుట ఎంతముఖ్యమో ఆచెట్లను చీడ, తడి, ఎండలనుండి కాపాడుట యంతకంటెను ముఖ్యము. రపరెపలాడుచు ఎదిగిన చెట్లు నిమిషములో పురుగుగొట్టి నశించిపోవును. పురుగు పట్టినచో తత్క్షణమే ఈచికిత్సను చేయవలెను. కొయ్యగాల్చినబొగ్గు మసిచేసి తీగెజల్లెడతో జల్లించి అందులో సగమువంతు పొగాకు పొడచేసికలిపి ఆపొడిని ఘాటుపోకుండ ఒక గాజుమూతగల సీసాలో వేసియుంచి చీడ దగిలినమొక్కలపై చల్లవలెను. ఇట్లుచల్లుటకుముందే ఒకచిన్నకుంపటిలో నిప్పులుపోసి పొగాకువేసి ఆపొగను చెట్లకు పట్టించవలెను. పొడుము చిటికెడుతీసి పురుగుపట్టినచోట వేయవలెను. దీనితో పురుగులు నశింపవేని 1 పౌను గంధకము, 1 పౌను కాల్చినసున్నము, 3 శేర్లనీళ్ళుపోసి ఇనుపపాత్రలో 10 నిమిషములసేపు కాచి అందులో తేలినతేటను ఒకసీసాలోపోసిపెట్టుకొని కావలసినప్పుడు కొంచెముకొంచెముగా తీసికొని నీళ్లలో గలిపి పురుగుపట్టినచెట్లను పిచికారీచేయవలెను. ఇట్లుచేయుటవలన సమస్తమైన పురుగులునుతప్పక నశించును.

## చీనాగోపురము

చేమంతిమొక్కలతో వినోదములైనయాకృతులను నిర్మింపవచ్చును. వానిలో చీనాగోపురమొకటి. ఇందు లకై 12 అంగుళముల తొట్లనుపయోగించవలెను. మధ్య 5 అడుగులయెత్తుగల కొయ్యను మఱినాలుగుకొయ్యలు అందులో సగము ఎత్తుగాను పాతిపెట్టి ప్రతికొయ్యచుట్టు మూడుగాని నాలుగుగాని ఒక్కొక్కరకపు చేమంతులను పాతిపెట్టవలెను. తరువాత చిన్నకొయ్యలు రెండింటికి తొట్టిపలెవంపుగా వెదురుబద్దకట్టవలెను. ఆబద్ద కట్టునపుడు పాతిపెట్టినకొయ్యమొనలు పైకి యగపడునట్లు కట్టి వెదురుబద్దకు ఆకుపచ్చరంగువేయవలెను. ఇట్లే చిన్నకొయ్యలన్నిటికిచేయవలెను. తర్వాత చిన్నకొయ్యలనుండి పెద్దకొయ్యకొనకు గోపురమువలె త్రాళ్ళుకట్టి ఆత్రాళ్లపై ఎట్టింగువేసి మొక్కలు ఎదుగుచున్నకొలది వలయునట్లు కత్తిరించుచు టేపుతో కట్టుచుండవలెను. తుదకిది చీనాగోపురమువలె నేర్పడును. ఈరీతిగనే రథమువలెను ఏనుగువలెను కొండవలెనుగూడ చేయవచ్చును. ఏయాకారము కావలెనో ఆచట్రమును నిర్మించుకొని అందులకనువైనచోట్ల చెట్లను పెంచుకొనవలెను.

౨

## డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

సంక్రాంతిదినములలో విరివిగ లభ్యమగు పుష్పములలో చేమంతులు ముఖ్యమైనవి. ఇవికాక ముద్ద బంతిపువ్వులు, రేకబంతిపువ్వులు, గుమ్మడిపువ్వులు యీదినములలో దొరకును. ఈపుష్పములను కన్నియలు పేడగొబ్బిళ్ళపైగ్రుచ్చి చూపరులకు కనులపండువు చేయుదురు. చేమంతి (Crysanthemum) ఏకవార్షిక పుష్పజాతులలోచేరినది. బంతిచెట్ల వర్గములోనిది. తక్కినయేకవార్షికములవలె విత్తులవలన వృద్ధియగును. వీని విత్తులను సామాన్యముగ వర్షకాలాంతముమొదలుకొని శీతకాలాంతమువరకు నప్పుడప్పుడు చల్లుచుండవచ్చును. విత్తులను నేలపైగట్టిన మళ్లలో జల్లుటకంటె వెడల్పుగనుండు మంటి పళ్లెములలో జల్లుట మంచిది. ఈపళ్లెములను మొక్కలు మొలచి కొంచెమెదుగువరకు నీడనుంచవలెను. నీరు చిల్లులుగల జారీ డబ్బాతో జాగ్రత్తగ బోయవలెను. అయితే సామాన్యముగ వేళ్లతోనుండు కాడలను విడదీసి పాతుటవలన నిది వృద్ధిచేయబడుచుండును. ఇదియొకచోట నుంచినయెడల బహువార్షికముగ బెరుగునుగాని యిట్లుచేయుట మంచిపనికాదు. ప్రతిసంవత్సరమును యెరువువేసి బలపరచిన క్రొత్తస్థలమందు నాటుటయే మంచిది. విత్తులు చల్లుటకు తొలకరియు, మొక్కలుతీసినాటుటకు ఆశ్వయుజమాసము అనుకూలములు. చేమంతిని సంస్కృతమున బృహత్పుష్పా, మహాసహా, గంధాఢ్యా, ద్విరేఫా, గణసమ్మతా, కుంజకా, శతదలా, సువృత్తా, శతపత్రికా, తరుణీ, సేవతీ, సేవంతీ, సేవంతికా, సుమనస్, సుశీతా, శివవల్లభా, సౌమ్యగంధా, చారుకేసరి, కుబ్జక, శతపత్రి, రామతరుణీ, కర్ణికా, మహాకుమారీ అందురు. ఈనామములవలన చేమంతిస్వరూపమును తెలిసికొనవగును.

## రకములు

ఇందనేకవందల రకములుగలవు. మిగుల సువాసనగల పచ్చని చిన్నపూవులరకము సామాన్యముగ నందరి దొడ్లలోను పెంచబడుచున్నది. ఇదిగాక తెలుపు పసుపువర్ణములును పాటలవర్ణము గులాబీవర్ణము చెంగావివర్ణము సింధూరవర్ణము నారింజవర్ణము మొదలగు ననేకవర్ణభేదములుగల పూవులతో మిగుల సుందరములై యొప్పు విదేశీయపు జాతులుగూడ చాలగలవు. అయిన సాధారణముగ తెలుపు పసుపువర్ణభేదములుగల చేమంతుల మనము చూచుచున్నారము. ధన్వంతరినిఘంటువున ఎఱ్ఱచేమంతియున్నటుల వ్రాయబడియున్నది. రక్తపుష్పా, లాక్షాపుష్పా, అతమంజులాయని యీఎఱ్ఱరకమునకు అందు పేర్లు. ఇదియున్నటుల మనకు తెలియదు.

## సంగ్రహణము

పుష్పములను గోయునపుడు మొక్కలకు చెడుపుగలుగకుండుటకై కత్తితో కోయుట కాని కత్తెరించుట గాని మంచిది. గోళ్లతో త్రుంపుటగాని యట్లు వీలుగానపుడు మెలిపెట్టి విరుచుటగాని మంచిపనికాదు. కోసిన పూవులు వాని తొడిమెలను నీటిలోనుంచినయెడల త్వరలో వాడిపోవు.

## ఉపయోగములు

పూవులు దండలుగ గ్రుచ్చి ధరించుట, జడలలో పెట్టుకొనుట, పూజార్థముపయోగించుట, చెండ్లుగకట్టి అలంకారార్థము మేజాలపై బెట్టుకొనుట మొదలగు సాధారణోపయోగములను గూర్చి విస్తరించుట అనవసరము. ఔషధోపయోగముల వివరింతును.

చర్మములమంట, పైత్యవికారములందిది ఉపశమనమూలికగ నుపయోగింపబడుచున్నది. నేత్రసంబంధములగు వ్యాధులకు కూడ ఉపయోగకారిగ చెప్పబడినది. దీని వేరు, ఆకురసము లేక కషాయము ఊర్ధ్వశ్వాస, కఫము, పైత్యము, విషము, ఆనాహము అనగా మలమూత్రబద్ధము, జ్వరము, గుల్మ, మూలవ్యాధి, క్రిమిరోగము ఉబ్బురోగము వీటినణచును. రసముయొక్క మోతాదు పూటకు 4-5 తులములయెత్తు. కషాయపు మోతాదు 4-8 తులముల యెత్తు.

## పుష్పముల చూర్ణము, కషాయము, సారము

చేదుగ కారముగనుండును. తలత్రిప్పు, పైత్యశ్లేష్మములు, జ్వరము, క్రిమిరోగము వీటిని హరించును. జఠరదీప్తి బలము తేలిక వీటినిచ్చును. పేగులకు మిక్కిలి అనుకూలముగనుండును. సమస్తరోగములను శమింపజేయును. దేహములో కూడుకొనిన దుష్టద్రవకూటమిని కరిగించును. అనగా నీరుజేయును. నరములకు సత్తువనిచ్చును. పొట్టలోని వాతమును వెడలగొట్టును. నొప్పిని శమింపజేయును. మూత్రమును జారీచేయును. ఋతుబద్ధమునుపోగొట్టును. మూత్రపిండముయొక్క రోగమును శమింపజేయును. వరుసజ్వరము, అగ్నిమాంద్యము, స్త్రీల విరహతాపజ్వరము, అజీర్ణశూల వీటిని అణచును. తేలిక కషాయముతో గాయములు వ్రణములు గెడ్డలు వీటికి వత్తడమిచ్చిన కుళ్ళుపట్టకుండాచేయును. నొప్పిశమించుటకు దీనిని పిచికారీచేయనగును. గాఢమైన కషాయము వమనముచేయును.

మోతాదు: కషాయము 4-6 తులములు. చూర్ణము 30-90 గోధుమగింజలయెత్తు. సారము 10-20 గోధుమగింజల యెత్తు.

## పువ్వుల అరకు

రక్తపైత్యము, జ్వరము, మూర్ఛ, శ్వాస, దాహము, తాపము, అరుచి, అగ్నిమాంద్యము వీటినిపోగొట్టును. మోతాదు: పూటకు 5-6 తులములు. దినమునకు 2-3 పూటలు.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## గొబ్బిపాట

(సంపాదకురాలు) శ్రీమతి పాకలరత్నమాలగారు

తక్కన్నగొబ్బి
తారన్నగొబ్బి
కొట్టారిగొబ్బి
కోలాటగొబ్బి
అమ్మతలలో
చిన్నిగొబ్బి.

## గొబ్బెమ్మపాట

(సంపాదకుడు) ఆనూరి వేంకటరామారావుగారు

సుబ్బిగొబ్బెమ్మ!
మల్లిపువ్వంటి
మగనినివ్వావె,
చేమంతిపువ్వంటి
చెల్లెలినివ్వావె,
గుమ్మిడిపువ్వంటి
కూతుర్నివ్వావె,
అరటిపండంటి
అల్లుణ్ణివ్వావె,
మొగలిపువ్వంటి
మామనివ్వావె,
అరటిపువ్వంటి
అత్తనివ్వావె,
తామరపువ్వంటి
తమ్ముణ్ణివ్వావె,
మందారపువ్వంటి
మరదలినివ్వావె,
తోకమల్లిపువ్వంటి
తోడునివ్వావె,
పొట్లపువ్వంటి
పొరుగునివ్వావె,
అనగపువ్వంటి
అమ్మానివ్వావె,
తామరమొగ్గంటి
తండ్రినివ్వావె,
గుమ్మడిపండంటి
కొడుకునివ్వావె,
కలవపువ్వంటి
కోడలనివ్వావె,
మాలతిపువ్వంటి
మనుమలనివ్వావె,
అందరానటువంటి
ఐశ్వర్యమివ్వావె,
ఆడవాళ్లందరకు
ఐదోతనమివ్వావె.

## సావిత్రిగౌరిదేవినోముపాటలు

౧

చూస్తి, చూస్తి.
ఏమిచూస్తి?
దేవిని దేవరనుచూస్తి;
పార్వతీపరమేశ్వరుల
పాదాలుచూస్తి.
దేవి దేవర
యేమిచేస్తున్నారు?
వారిద్దరేమిచేస్తున్నారు?
నందికేశ్వరునెక్కి
ముత్యాలురత్నాలు
కలియబోసుకుని
జూదమాడుతున్నారు.
ఎవరు గెలిచిరి?
ఎవరు ఓడిరి?
ఇద్దఱు ఏకసమానులే.

అందుకుఎవరుసాక్షి?
దేవిసాక్షి, దేవరసాక్షి,
నందిసాక్షి,
నారాయుడుసాక్షి,
నందిసాక్షి,
నాగుమయ్యసాక్షి,
పంచాంగంబ్రాహ్మడుసాక్షి,
ఆయనయేడుగురు
కొడుకులుసాక్షి,
ఆయనఏడుగురు
కోడండ్రుసాక్షి,
ఆయనభార్యసాక్షి,
కోటసాక్షి,
కొమ్మసాక్షి,
కోటలోఉన్న
పుట్టసాక్షి,
పుట్టలోఉన్న
నాగేంద్రుడుసాక్షి,
పంచపాండవులుసాక్షి,
కోటలోఉన్న
తులసెమ్మసాక్షి,
పేడతట్టపోలిసాక్షి,
రేగిపళ్లపోలిసాక్షి,
పులగంవండిన
పుల్లమ్మసాక్షి,
పెరుగన్నముపెట్టిన
పేరమ్మసాక్షి,
ముద్దకుడుములువండిన
ముత్తమ్మసాక్షి,
నానుబాలుపెట్టిన
నాగమ్మసాక్షి,
గార్లువండిన
గంగమ్మసాక్షి,
బూర్లువండిన
బుచ్చమ్మసాక్షి,
అట్లువండిన
అచ్చమ్మసాక్షి,
పరమాన్నమువండిన
పార్వతమ్మసాక్షి,
కలగాయిపులుసు
గాచినకామమ్మసాక్షి,
సాక్షి, సాక్షి,
సావిత్రిగారు
నీకు నేసాక్షి,
నాకు నువ్వుసాక్షి,
ఎల్లకాల
ముందుకావలెను.

౨

కంటె, కంటె.
ఏమికంటె?
కిందనగిరులుకంటె
మీదను మెట్లు కంటె
సావిత్రిగారుకంటె
చల్లమెట్ల గౌరు కంటె
కోరినకొడుకులకంటె
తరగనిఅయిదో
తనముచేసి
సావిత్రీగారుతల్లి!
మీపాదాలుగంటె.

3

తల్లిదండనా
తండ్రిదండనా
కలుగజేసి
అత్తదండనా
మామదండనా
కలుగజేసి
పురుషదండనా
పుత్రదండనా
కలుగజేసి
రాజదండనా
యమదండనా
యెన్నటికివద్దు.
స్వర్గానికెళ్లినా
సవతిపోరువద్దు.
మహాలోకానికెళ్లినా
మాకుతల్లిపోరువద్దు.
సావిత్రిగారుతల్లి!
నీదండన మాకు
మాదండము మీకు
ఎల్లకాలము
కావలెను.

# మెట్టుపాటలు

౧

మెట్టు మెట్టమ్మ మెట్టు
ముత్యాలమెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్నూ
ఆడిన్న మెట్టూ
స్వర్గానగారమ్మ
సౌభాగ్యమెట్టు.
మెట్టు మెట్టమ్మ మెట్టు
రత్నాలమెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్నూ
ఆడిన్న మెట్టూ
స్వర్గానశ్రీగారూ
సౌభాగ్యమెట్టు.

మెట్టు మెట్టమ్మ మెట్టు
పసుపానమెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్నూ
ఆడిన్న మెట్టూ
స్వర్గానశ్రీగారు
సౌభాగ్యమెట్టు.
మెట్టు మెట్టమ్మ మెట్టు
కుంకుమామెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్నూ
ఆడిన్న మెట్టు
స్వర్గానశ్రీగారు
సౌభాగ్యమెట్టు.

మెట్టు మెట్టమ్మ మెట్టు
అక్షింతలమెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్న
ఆడిన్న మెట్టు
స్వర్గానగారమ్మ
సౌభాగ్యమెట్టు.
మెట్టు మెట్టమ్మ మెట్టు
పువ్వుల్లమెట్టు
మెట్టాడపోదాము
రారెశ్రీగారూ.

నువ్వున్నూ నేనున్నూ
ఆడిన్న మెట్టు
స్వర్గానశ్రీగారు
సౌభాగ్యమెట్టు.

౨

మెట్టమ్మ మెట్టు
పసుపాన మెట్టు
కుంకాన మెట్టు
అక్షింతల మెట్టు

గంధాన మెట్టు
పువ్వుల మెట్టు
బుక్కాయి మెట్టు
పిండిన్ని మెట్టు

రత్నాల మెట్టు
ముత్యాల మెట్టు
మెట్టాడ పోదాము
రారెశ్రీగారు.

౨. బాలికలరచనము

# గోదాదేవికళ్యాణము

శ్రీమతి పాకలరత్నమాలగారు

పన్నిద్దరాళ్వారులలో నొకరైన పెరియాళ్వారుని తనయ ఆండాళ్లు. వైష్ణవకులము నందుద్భవించినది. చిన్నతనమునుండియు తండ్రివద్దనుండి పురాణములవినుచు వేదాంతగోష్ఠి యందే కాలము గడుపుతూవుండినది. కొన్నిదినాలకి వివాహవయస్సు వచ్చినది. కాని పెరియాళ్వారు చాలపేదవాఁడు. పూవులు మాలలుగ్రుచ్చి రంగనాయకస్వామికి ప్రతిదినమూ

యిస్తూవుండేవాఁడు. దానిమీద వచ్చినడబ్బుతో సంసారముగడచిపోతూవుంది. ఇంకపిల్లకు పెళ్లియెలాచెయ్యడమా అని ఆలోచిస్తూవుండేవాఁడు. ఇదంతా చూచింది ఆండాళ్లు. ఆమె రంగనాయకస్వామినే వరించినది. భగవంతునే భర్తగా చేసికొనవలెనని తలంచింది. అది యెట్లా సాధ్యమాతుందని ఆలోచించగా తనతండ్రి ఒకప్పుడు భగవంతుని నిశ్చలభక్తితో ఎవరు యేకోరికకొరకుప్రార్థించిన ఆకోరిక నెరవేరునట్లుచేయునని చెప్పినవాక్యము జ్ఞప్తికివచ్చినది. అది మార్గశీర్షమాసము. చలిచే బాగుగ నెండవచ్చువరకూ అందరూ నిద్రించుచుండేవారు. అదేసమయమని ఆండాళ్లు తెల్లవారుఝామున నాలుగుగంటలకులేచి కాలకృత్యములు తీర్చికొని శుభ్రవస్త్రములు ధరించి పూవులు పండ్లు తీసికొని ప్రతిదినమూ తనచెలికత్తెల పిలుచుచు వారితోకూడి వూరిబయట ఒకరంగనాయకవిగ్రహమునుంచి పూజచేస్తూవుండేది. ఇట్లు కొన్నిదినాలుగడచిన పిదప స్వామి ఆమె నిశ్చలభక్తికి సంతసించి బిచ్చగాని వేషముతో వారింటికివచ్చి బిచ్చమడిగెను. ఆండాళ్లు ధర్మము వేసినది. ఆదొంగబిచ్చగాడు ఆండాళ్లునిచూచి నవ్వుతూ వెళ్లిపోయాఁడు. ఆపిల్ల అతనే రంగనాయకులని గ్రహించి తనని అతనికిచ్చి వివాహముచేయమని తల్లిదండ్రులను కోరింది. వారు రంగనాయకులు పేదవారి పిల్లను వివాహమాడడనిరి. ఆరాత్రి పెరియాళ్వారునిస్వప్నమున స్వామి కన్పించి ఆండాళ్లుని తనకిచ్చి వివాహముచేయమని చెప్పెను. ఆమరునాఁడు అందరితోకలసి స్వామి కోవెలకు వెళ్లి అత్యంతవైభవముతో కూతురుని స్వామికిచ్చి వివాహముచేశారు. ఆండాళ్లు మార్గశీర్షమాసము నెలదినములును నిశ్చలభక్తితో తెల్లవారుఝామున వ్రతముచేసెను. దానితో నామెకోర్కె సిద్ధించెను. కనుకనే యిప్పుడనేకులు ఆనోము చేయుచున్నారు. ఈనోము దక్షిణదేశస్థు లెక్కువగా చేయుదురు. పండుగ నెలదినము లీనోము అత్యంతవైభవముగా నుండును. భోగిపండుగనాడీమెకళ్యాణము జరిగెను. ఈమెకు గోదాదేవి అను నామము గలదు. ఆమె పండుగ నెలదినములునూ దినమున కొక్కొటి చొప్పున పాశురములను పాడుచూ ఒక్కొక్క చెలికత్తెను లేపుచూవుండేదట. ఈమె దక్షిణదేశస్థురాలగుటనుబట్టి అరవముతో స్వామిని ప్రార్థించినది. అవి ముప్పయివకటి. ఆపాశురములను పఠించుచూ పండుగదినములలో దేవపూజయొనర్చిన ఎంతో ఆనందముగనుండును.

## 3. వినోదకథలు

## మూడు తెడ్లకు ఆరు తెడ్లు

శ్రీమతి పాకల రాజామణిగారు

ఒకబాటసారి ఓరోజున చాలాదూరాన్నుంచి ప్రయాణం చేస్తూవున్నాఁడు. మధ్యాహ్నము రెండుగంటలయింది. అతనికి చాలా ఆకలివేసింది. అంచేత అక్కడ దగ్గరగావున్న వొకయింటికివెళ్లేడు. ఆయింట్లో ఒకఆడమనిషి కూనిరాగాలుతీస్తూ కూర్చున్నది. ఆబాటసారి ఆవిడనుచూచి 'అమ్మా! చాలాదూరంనుంచి వస్తున్నాను. ప్రొద్దెక్కినది. చాలా

ఆకలిగావున్నది. నేను బియ్యంయిస్తాను. ఇవి కాస్తవండిపెడితిరా? మీకుపుణ్యంవుంటుంది' అని అన్నాడు. అనేటప్పటికి ఆవిడ సరేనని బియ్యంతీసుకుని కడిగిపొయ్యిమీదపెట్టి అతనిని యింటి వసారాలో పండుకోమన్నది. బాటసారి అలసివుండడంనుంచి సగంకన్నులు తెరచి చూస్తూ పండుకున్నాడు. ఆయింటి ఆవిడ చాలాగడుసు. అతను నిద్రపోతూవున్నాడనుకుని పొయ్యిమీద వుడుకుతూవున్న అన్నంలో మూడు తెడ్లు తీసి తన అన్నములో వేసుకున్నది. ఇదంతాచూశాడాబాటసారి. ఇంతలో ఆవిడ 'అన్నముఅయింది, కూరయేమైనాతెచ్చుకో. నేను నీళ్లకువెళ్లివస్తా.'అనిచెప్పి నీళ్లకెళ్లింది. బాటసారి మెల్లిగాలేచి ఇల్లంతాతిరిగిచూశాడు. ఏమైనావున్నదేమోనని. ఇంట్లో ఏమీలేదు. దొడ్డిలోనికివెళ్లిచూడగా అక్కడ ఒక బుట్ట క్రింద ఓకోడిపిల్లకనబడింది. సరేనని దాన్నితీసిచంపి మాంసమంతాకోసి చట్టిలోవేసి పొయ్యిపైన పెట్టేడు. ఇంతలో వుట్టిమీదవున్న ఆవునెయ్యి అతని కంటబడింది. ఆనెయ్యి అంతా ఆకూరలోపోసి కూర్చున్నాడు. కొంచమునేపటికి ఆవిడవచ్చింది. 'అమ్మా! కూరతెచ్చి పొయ్యిమీద పెట్టేను. వంటఅయితే వడ్డించు' అన్నాడు. మరిన్నీ ఆవిడలేనప్పుడు అతడు ఆవిడ అన్నంలోనుంచి ఆరుతెడ్లుతీసి తన అన్నంలో వేసుకున్నాడు. మూలచూరులోవున్న క్రొత్తపగ్గంవొకటి తనగుడ్డలలోతీసి దాచుకున్నాడు. ఆ యిల్లాలికియివన్నీ తెలియక 'వడ్డిస్తాను.రానాయనా'అని అన్నంపెట్టి కూరవడ్డించింది. బాటసారి బాగాతినిమిగిలినది ఆమెను తీసుకోమన్నాడు. ఆమె చాలాసంతోషించి 'నాయనా! నీపేరేమిటోచెప్పు'అన్నది. అతడు 'అమ్మా! నాకు చాలాపేర్లున్నాయి. మూడుతెడ్లకుఆరుతెడ్లు. కొసరుకుకోడిపిల్ల. అనుపానం ఆవునెయ్యి. క్రొత్తపగ్గం పాపయ్య' అనిచెప్పి వెళ్లిపోయాడు. ఆతరువాత ఆవిడ అతనుచేసిన మోసం తెలుసుకుని చాలావిచారించింది.

# సంక్రాంతి: ప్రకృతి

పాటిబండ మాధవశర్మగారు

వేకువన్ కోడికూతలవిని సుషుప్తి
నుండి మేల్కాంచి ముసుంగులోనుండి యొకరి
నొకరు వీక్షించి, లేతనవ్వొలయ సగము
విచ్చు మొగ్గలు భావగర్భితపదాల
ఇంచుమోదాన నెదియొ భాషించుకొనియె.
భ్రమరభిక్షువు తెలతెలవారువేళ
మేలుకొని పూవుటిండ్లకు నోలినరిగి
ప్రకృతిసౌందర్యలీలాభివర్ణనమ్ము
గీతములనల్లి మృదులసంగీతమును బొ
నర్చి, వారలొసంగు నూత్నమధురసము
ఇంచుమోదాన భిక్ష గ్రహించుకొనియె
తోయజకుడ్మలములనుండి తొంగిచూచి
భానుపడతికిజూపి సంభ్రమభరమున
రెక్కలన్ విచ్చి మెడనెత్తి నిక్కవట్టి
చక్రవాకమ్ము స్వర్ణపక్షతతితోడ
ఇంచుమోదాన చెలి కౌగలించుకొనియె?
తరుణరాగోజ్వలన్మృదుచరణపల్ల
వములబారాణి నుదయాంగణమలబెట్టి
రక్తిమములిచ్చుకొని వనలక్ష్మి క్రొత్త
పెండ్లికూతురువోలె కాన్పించునాడు!

నిన్న మొన్నటివరకాఁడుకున్న దాన
వేదిగంబరవై ; యేడనెరవు తెచ్చు
కొంటి వీనునుసిగ్గు లీక్రొత్తవేసము?
ఎఱుపుపండినబుగ్గల కొఱికికొనిత్రి
నంగమనసాయెడినిగదే నాకుగూడ!

—"హిమకణముల" నుండి.

# దండుగలమారిపండుగ

కొసరాజు రాఘవయ్యచౌదరిగారు

సీ. ఏండ్లుపైబడ నెత్తురింకి ముక్కుచుమూల్గు
ముసలివగ్గులకొంప ముంపనేమొ
కటకటా! నోరెఱుంగని బాలపాపల
చిట్టుముట్టుగ బాధపెట్టనేమొ
బిడియమ్ము వెనుదన్ని పీడింప వడయాడు
పడుచుజంటల పంథఁబట్టనేమొ
కోడికూతనె మేలుకొననీక రైతుల
పనిపాటలను భంగపరచనేమొ
గీ. తగుదునేనని నీముల్లెదాచినట్లు
అంకపొంకాలచలిగాని చంకఁబెట్టి
దాపరించెద వేటేట తప్పకుండ
పరమదుర్మార్గురాలవే, పాష్యలక్ష్మి!
సీ. హరిదాసు 'గోవింద'యని పాడుకొనెఁగాని
పేరెత్తి నిన్నేమిపిలువలేదు
'ఔర డూ బసవన్న!'యనెగాని గంగెద్దు
దాసుండు నీజోలిఁదలఁచలేదు
అత్తమామలు కూతునల్లుఁబిల్చిరెగాని
అసలు నీకాహ్వానమంపలేదు
'ఒలియ ర'మ్మని కాపు పాలిగానిననెఁగాని
కించిత్తు నినుఁ బల్కరించలేదు
గీ. పట్టుమని బొట్టుకాటుకఁబెట్టి నిన్నుఁ
బిలిచెన ప్లేమొగంతుల వెట్టుకొనుచు
పరుగులెత్తెద వేటేట మరవకుండ
పరమదుర్మార్గురాలవే, పాష్యలక్ష్మి!
సీ. కొక్కొరోయని మేలుకొల్పుపాటలఁబాడు
కోడిపుంజులగొంతుఁ గొరుకనేమొ
వేమొగంబులతోడ విరుగఁబూచినబంతి
పూలగుత్తుల ద్రుంచిపోవనేమొ
కుదురుగాఁదినియింటఁ గూర్చుండుఘనులకు
జూదంబులో రుచిఁజూపనేమొ
కడుపుచిచ్చునబాధపడి మాడువారికి
త్రాగుబోతుతనంబుఁ దార్పనేమొ
గీ. గడచిపోయిన చుట్టపక్కాలనెల్ల
స్పృహకుఁదెప్పించి మమ్మేడిపింపనేమొ
కానిచో నీవు రానేమికారణంబు
పరమదుర్మార్గురాలవే, పాష్యలక్ష్మి!
సీ. ఒడలుదాచక నెత్తురోడ్చి మాదిగసుబ్బ
డారుగాలముఁగూర్చినట్టిడబ్బు
పరిగేరుకొని గొడ్లమరలించి గొల్లచి
న్నబ్బాయి తెచ్చుకొన్నట్టిడబ్బు
కుప్పకావలిఁగాచుకొని చుండికొండన్న
క్రొత్తకుండను దాచుకొన్నడబ్బు
పవలురేలునుపాటువడికష్టపడి మాల
కోటి సంపాదించుకొన్నడబ్బు
గీ. కోడిపందెంబులకొ, త్రాగుకొఱకొ, జూద
మాడుటకొ, లేక పాడుచిత్తాటకొఱకొ
ఖర్చుబెట్టించి బైరాగిగాఁద్రఁజేసి
పంపెదవుగాదె దుర్మార్గపాష్యలక్ష్మి!
సీ. పైరుపచ్చల కుబ్బుపచరించుమంచు ని
న్నండబాయకనుండకుండెనేని
చచ్చువారికి స్వర్గసామ్రాజ్యమిప్పించు
ఉత్తరాయణమె తోడుండదేని
పరమభక్తినొనర్చు బాలవీరులపూజ
నీకాత్మరక్షగా నిల్వదేని
మురువుగా నచ్చటల్ ముచ్చటల్ ప్రకటించు
శుచి నిన్ను వరియింపఁ జూడమేని
గీ. పిన్నలకుఁబెద్దలకు మురిపెంబుఁగూర్చు
పండుగపదంబె నీకు లేకుండెనేని
పలుకులేటికి నిన్నట్టె పట్టపగలె
పట్టిచెండకపోదుమే పాష్యలక్ష్మి!



## భారత స్త్రీలు: విద్యాప్రబోధము:—

డిసెంబరు 13,14 తేదీలయందు మచిలీపట్టణమునజరిగిన ఆంధ్రరాష్ట్రీయచతుర్థమహిళా మహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి ప్రభలసత్యవతమ్మగారు తమఉపన్యాసమున 'భారతస్త్రీలు: విద్యాప్రబోధము' అను విషయమునుగూర్చి ఇట్లు ప్రస్తావించినారు:—

"ప్రపంచములో భారతీయస్త్రీలకుగూడ నొకానొకయున్నతస్థానము లభింపవలయుననిన స్త్రీవిద్య మన విషయములో నొక మహాసమస్యయగుచున్నది. ఈవిద్యావిషయమున ననేకుల కనేకలక్ష్యములున్నవి. కాని మనకిచ్చట పరమావశ్యకముగా గణింపదగినది సర్వస్త్రీజనప్రబోధము. ఇదివరకు విద్యాపద్ధతియంతయు కేవలనీతిబోధకమై సంఘముయొక్క సాముదాయకవిజ్ఞానమునుమాత్రమే బాలబాలికలకుబోధించులక్ష్యముతో నొప్పియుండెను గాని బాలబాలికల వ్యక్తిత్వమును బహిర్గతము గావించి యభివృద్ధిచేయుపద్ధతి లేకుండెను. మన స్త్రీ విద్యావిషయముకూడ పూర్వమిట్లేయుండెను. కేవల మక్షరజ్ఞానముతోనే వారు సంతృప్తిపడుచుండిరి. కాని యిప్పటి మనవిద్యాపద్ధతివలన రెండుకార్యములు సాధింపబడవలసి యున్నది. విజ్ఞానవృద్ధియు, పౌరత్వాభిమానమును పెంపొందింపజేయుటయే మన విద్యాపద్ధతియొక్క లక్ష్యద్వయము. ఉత్తమజాతికై యుత్తమస్త్రీని నిర్మించుటయే విద్యాలక్ష్యము. కనుక మనపిల్లల నేదోయొకబడికి పంపించుటతో మనము సంతృప్తిపడరాదు. మన బాలబాలికలేవిధముగ విద్యాభ్యాసము గావించినచో నిజమైన యభివృద్ధి నొందుదురో నిర్ణయింపవలసిన భారము మనపైననే యున్నది. ఈనాటి విద్యాపద్ధతి యనేకసమస్యలతో కూడుకొనియున్నది. సహవిద్య, కర్మవిద్య, సర్వజనప్రబోధము, ప్రౌఢవిద్య యిట్టిసమస్య లనేకము పరిష్కారకఠినములై యున్నవి. కాని సామాన్య స్త్రీజనమెల్ల విద్యాసంపాదనమునకై కడునాతురతగొనియున్నారు. ఈయుద్యమమును సంపూర్ణముగా నిర్వహించుట కసాధ్యమయినను గవర్నమెంటువారీ కార్యనిర్వాహణమునకు పూనుకొనియున్నారు. విద్యాశాలల సంఖ్య క్రమక్రమముగా హెచ్చుచున్నది. ప్రారంభవిద్యకై ప్రతిసంవత్సరము తగినంత ధనము ప్రత్యేకింపబడుటలేదు. ఈసందర్భములో మన పురపాలకసంఘములవారు నిర్బంధవిద్యావిధులను బాలికల విషయముగూడ వ్యాపింపజేయవలయునని కోరుచున్నాను. ఈనిర్బంధవిద్యావిధానముచేతను విద్యార్థుల వయోనిర్ణయముచేతను తగినంత విద్యాభివృద్ధి జరుగునని చెప్పవచ్చును. బాలికల విద్యావిధానములో చాలమార్పులు జరుగవలసియున్నవి. ఈవిషయమై ప్రతివిద్యామహాసభయందును చర్చలు గావింపబడుచునే యున్నవి. భారతీయ గానశాస్త్రము బోధనవిషయములలో నొకటిగా విశ్వవిద్యాలయము వారంగీకరించుటయు, గృహశాస్త్రము, ఆరోగ్యము, ప్రథమసహాయము, గృహపరిశ్రమలు మొదలగు విషయములకు తగినంత

ప్రాముఖ్యము నిచ్చుటయు నీసభాచర్చలవలని ఫలితమేయని చెప్పవచ్చును. అదియునుంగాక ప్రౌఢజనవిద్యావిషయముగూడ మనము నిర్వహింపవలసియున్నది. ఉచితసంచారగ్రంథాలయముల నేర్పరచుటయు, వివాహితస్త్రీలకు ప్రైవేటుక్లాసుల నేర్పరచి వ్రాయుట, చదువుట, లెక్కలు నేర్చుట, కుట్టుపని, గృహశాస్త్రము మున్నగునవి నేర్పుటయు, మాజికులాంతరు ఉపన్యాసములపెట్టి విషయప్రబోధము గావించుటయు మున్నగునవి అంధకారమున నున్న మనసోదరీమణులకు శ్రేయోదాయకమగుననుట నిక్కువము. ఈమహిళాసభవారీవిషయము లన్నిటిని ఆంధ్రదేశమున వ్యాపింపజేయుటకు శక్తివంచనలేక ప్రయత్నింతురని నమ్ముచున్నాను.”

## స్త్రీలు: దేశసేవ:—

ఆంధ్రరాష్ట్రీయచతుర్థమహిళామహాసభాధ్యక్షురాలగు శ్రీమతి కొణకంచి లక్ష్మిదేవిగారు తమఉపన్యాసమున ‘స్త్రీలు: దేశసేవ’ అనువిషయమునుగూర్చిఇట్లుముచ్చటించినారు:—

“మనదేశములో నిదివఱకెన్నడును యేదేశమునందును జరిగియుండనిమహోద్వేగమున దయాశాంతిపూరితములగు లలితమర్యాదలతో సాంఘికపరివర్తనము జరుగుచున్నది. మహాత్ముని ప్రేమగానము దైన్యవిదారకమంత్రోపదేశములు దిశాంతమునకు వ్యాపించి జనులనందరినాకర్షించినవి. అందున దేశదాస్యమును తొలగించుటలో భారతనారీజను లవలంబింపదగినవిగ మహాత్ముడు ఉద్ఘోషించిన ధర్మములు మనసోదరీమణుల హృదయసీమలందు ప్రతినాదము నియ్యసాగినవి. నూఱేండ్లనుండి సంఘసంస్కర్తలు కోరుచుండిన మార్పులన్నియు కడచిన కొలదిమాసములలో మహాత్మునిమాట పెంపున సిద్ధించినవి. జాతిమతభేదములు, పరస్పరవైషమ్యములు, స్త్రీపురుషాధికారభేదములు మున్నగు దాస్యహేతుకములగు లోపములు పటాపంచలయి యెగిరిపోయినవి. భారతనారీమణులు ఈస్వాతంత్ర్యసమరమునందు పురుషులను మించి పరాక్రమించి విజాతీయరచయితలచ్చెరువొంద తమ విజ్ఞానమును దేశసేవాపరాయణత్వమును సాహసౌదార్యములను దీక్షాపరత్వమును ప్రకటించియున్నారు. గంగిగోవువలె నింటినంటి పెనిమిటినే దైవముగ భావించుచూ ఇంటిచాకిరియే పరమధర్మముగ నెంచుచూ ఎందుకును గానరాక విద్యావిలాసశూన్యయై మెలగుచుండునని లోకులు పరిహసించెడి భారతయువతి యవసరమైనచో దేశస్వాతంత్ర్యమునకుగాని ధర్మమునకుగాని హానివాటిలినచో రివ్వున మేల్కాని వీరాగ్రణియయి విప్పొంది పురుషులతోబాటు సకలాధికారముల నిర్వహించి విజయశీలయై వెలుగగల పూర్వచరిత్రాంశముల గ్రిమ్మర నీనాటిచరిత్రధ్రువపరచుచున్నది............... భారతమతసాంప్రదాయములందును ధర్మములందను చరిత్రయందును దేశీయకావ్యకళలందును క్రొంత ప్రవేశముండవలయును. భారతజాతియుగతరములనుండి తనశీలమును స్వభావమును సభ్యతను సాంప్రదాయములనునిలువబెట్టికొనిన గౌరవమందుచున్నది. ఇన్నిశతాబ్దములు పారతంత్ర్యత ఇంకేదేశమునకునుబట్టియుండలేదు. ఇన్నివిధములగు పరనాగరిక సంపర్కము లేజాతికిని కలిగియుండలేదు. ఇంతటి దారిద్ర్యము దైన్యము ఇన్నివిధములగు మర్మవిదారకహేతువులును జాతిమతభేదములును వేరెచ్చుటను గానరావు, కాని యింతటిపీక్షతో స్వధర్మసంరక్షణ మొనర్చిన జాతిగాని పరనాగరికప్రవాహమునకోర్చిన దేశముగాని మానవచరిత్ర చూపజాలకున్నది. ఇట్టినియతికి ఇట్టి ఆయుర్భాగ్యమునకు మూలకారణము హిందూవనిత అనియే చెప్పవచ్చును. ఆమెయందు వేదఋషుల సంకల్పములన్నియు ధర్మప్రబోధకులయుపదేశములన్నియు వీరవనితలచరిత్రలన్నియు పతివ్రతలధర్మములన్నియు మూర్తీభవించియున్నవి. శిలారూపమై చిరస్థాయియైయుండి బాహ్యాడంబరము లేకున్నను మానవజాతిలో భారతీయుల ప్రత్యేకస్వరూపము వెలుగొందజేయుటకు ముఖ్యహేతువై యున్నది. ఇట్టి జాతీయస్త్రీధర్మములను నిలుపుకొనెడి బాధ్యత మనయందున్నది.”

# వనితాలోకము

## శ్రీమతి లీలాసరస్వతిగారు:—

అల్లోపతిక్ వైద్యవిధానమున ఆరితేరిన ఆంధ్రరమణీమణులలో శ్రీమతి లీలాసరస్వతి యొకతె. ఈమెజన్మస్థానము బందరు. మద్రాసునందు మెట్రిక్యులేషను తరగతియందు కృతార్థురాలై వైద్యవిద్యచేకొని యల్. యం. పి. డిగ్రీనిపొందినది. ఈమె యిప్పుడు రంగూనుపురమున వైద్యము ప్రాక్టీసు చేయుచున్నది. ఈమె భర్తగారిచే స్థాపింపబడిన రంగూను మోర్టన్ స్ట్రీటు (జయిలుఖానాగల్లీ) నెంబరు 44 గృహమున గల ఆంధ్రవైద్యశాలలో స్త్రీరోగులకు చికిత్స నొనర్చుచున్నది.



శ్రీమతి లీలాసరస్వతిగారు

## శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు:—

ఈమె యొకసుప్రసిద్ధాంధ్రవిదుషి. ఈమె రచనములను కొన్ని గృహలక్ష్మి ప్రచురించియున్నది. ఇంకను ప్రచురింపగలదు. వ్యాసరచనా వ్యాసంగమున కృషి చేయుచున్న ఆధునికాంధ్రస్త్రీలలో ఈమె గణింపదగినది.



శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

## శ్రీమతి మళిని బాలచంద్రసూక్తంకర్ సతి:—

యం. బి. బి. యస్. పరీక్ష ప్యాసుచేసి డాక్టరుపదవి నలంకరించియున్నది. బొంబాయి నివాసిని. ఆనగరమున గౌరవన్యాయాధికారిణి. గవర్నమెంటువారినిర్బంధవిధానమును నిరసించుచు ఆపదవికి రాజీనామా నిచ్చినది.

## శ్రీమతి హెస్టరుస్మిత్తుకన్య:—

ఈమె బి. యె. పరీక్షనిచ్చినది. అల్వేలోని బాలికల సాశ్రమపాఠశాలకు ప్రధానోపాధ్యాయిని. గతమాసమునజరిగిన తిరువాన్కూరు స్త్రీల విద్యాసాంఘికసమావేశమునకు అధ్యక్షత వహించినది.

# గ్రంథవిమర్శనము

## కృష్ణార్జున సంవాదము:—

ఇదియొక ద్విపద కావ్యము. కావ్యమున ప్రస్తావింపబడినది గయోపాఖ్యానముకథ. రచయిత నాదెండ్ల గోపమంత్రి. ఈగోపమంత్రి శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని మంత్రిమాణిక్యంబగు తిమ్మరసునకు మేనల్లుండు. 'తొలుత గుత్తి దుర్గరాజ్యమునకుఁ బరిపాలకుడుగను, పిదప కొండవీటి సామ్రాజ్యమునకు రాజ్య ప్రతినిధిగను శ్రీరాయలవారిచే నియోగింపబడి కత్తికి గంటమునకు సమముగఁబని చెప్పిన జగజెట్టి.' ఇట్టిమహనీయునిచేరచియింపబడిన ఈకావ్యమునుగూర్చి పీఠికలో శ్రీశేషాద్రిరమణకవులిట్లువ్రాయుచున్నారు. "గయోపాఖ్యానకథ కేవల సంవాదరూపము. ఒకరితోనొకరు సంభాషించుటయే యిందలిప్రధానాంశము. తుదిఁగల సంగరముదనుక కథయంతయు నిటులెనడచును. ఛందోనియమబహుళములగు నితరవృత్తములకంటె నిట్టికథలకు గేయరూపము సాధారణనియమాన్వితమునగు ద్విపదయెంతయుఁదగియుండును. ఈగ్రంథమున నందందు జాతీయములు లోకోక్తులు కవి సందర్భోచితముగఁ బొందుపఱచినాడు. సంభాషణములలో సరసము నిరాఘాటమునగు మృదుశైలియు వర్ణనములలో నీషత్కఠినశైలియు ననువగుతావుల రసోచితముగ నిక్కవి నెలకొల్పినాడు." ఇదిస్త్రీలు పాటగ చదువుకొనుటకెంతయు దగియుండును. అన్నయగు కృష్ణునితో ఒకవంకను భర్తయగు అర్జునితో వేఱొకవంకను సుభద్రరాయబారము నడపిన ఈగ్రంథమునందలిఘట్టములు చదువునపుడు స్త్రీలహృదయములు ఉత్తేజితములుగాక మానవు. ఇట్టి ఉత్తమగ్రంథమును ఉద్ధరించిన శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారి భాషాభిమానమునకు జయవెట్టుచున్నాము. గ్రంథము క్రౌనుసైజున 78 పుటలు. వెల 0-6-0 అణాలుమాత్రము. గ్రంథము దొరకుచోటు: గోలకొండపత్రికా కార్యాలయము, త్రూపుబజారు, హైద్రాబాదు, దక్కన్.

## వేంకటపతిదేవమహారాజు:—

క్రీస్తుశకము 1585-వ సంవత్సరము మొదట్టి 1614-వ సంవత్సరమువఱకు పెనుగొండరాజధానిగా చేసికొని విజయనగరసామ్రాజ్యపరిపాలనము నెగడించిన వేంకటపతిదేవమహారాయలజీవితచరిత్రమిది. హీరాసుపండితుని ఆరవీటివంశచరిత్ర ఈగ్రంథరచనమునకు ఆధారము. ఆరవీటివంశజులగురాజులలో వేంకటపతిదేవమహారాయలు ఎన్నదగినవాడు. ఆంధ్రకీర్తికి నెలవైనవారిలోనొకడు. ఆమహనీయుని వీరజీవితము తెలుగున వెలయించి శ్రీయుత టి. శివశంకరముగారు తెలుగువారికృతజ్ఞతకు పాత్రులైనారు. దీనిని పాఠశాలలయందు పఠనీయగ్రంథముగ బెట్టి ఆంధ్రవిద్యార్థులకు తమజాతిని వెలయించినమహనీయులలోనొకడైన ఈవీరపురుషునిజీవితము చిన్ననాటనే పరిచయమగునటుల జేయవలసిన బాధ్యత ఆంధ్రవిద్యాధికారుల తలపైయున్నది. గ్రంథము ఫెదరువెయిటు కాగితములమీద ముద్రితము. వేంకటపతిదేవమహారాజు విగ్రహచిత్రమును, నాటిదక్షిణహిందూదేశపటమును గ్రంథమున చేర్చబడి దానివిలువను పెంచినవి. గ్రంథము క్రౌనుసైజున 74 పుటలు. వెల రు 1-0-0. దొరకుచోటు సాధనబుక్కుడిపో, అనంతపురము.

## స్త్రీ చరితకదంబము:—

గ్రంథకర్త తేకుమళ్ల రాజగోపాలరావుగారు. స్త్రీచరితములను ప్రస్తావించు ఆంధ్రవచనగ్రంథములలో నిది తొలుతటిదనవచ్చును. 1896, 1897 సంవత్సరప్రాంతములందు తాము ప్రథమశాస్త్రపరీక్షకుఁ జదువుచు గ్రంథకర్తగారు చారిత్రకప్రసిద్ధులును, ఆదర్శనీయలునునగు హైందవనారీమణుల పదుమువ్వురి చరిత్రలను

శ్రమచేసి సంపాదించి తొలుత జనానాపత్రికలోను పిమ్మట గ్రంథరూపమునను వెలయించినారు. పిమ్మట స్త్రీచరిత్రాత్మకములగు పుస్తకములు మఱికొన్ని బయలుదేరినవి. ఈతరగతి పుస్తకములకుపురోగామియగు స్త్రీ చరితకదంబమున కృష్ణకుమారి, గనోరుదేశపురాణి, రాణిసంజుక్త, భగవతీదేవీ, కర్మదేవి, పద్మిని, ఆనందభాయి, జ్యోషి, అహల్యాబాయి, దుర్గావతి మొదలగు భారతరమణీమణుల చరిత్రలు కీర్తింపబడినవి. ఓఢ్రులయింటి ఆడుబడుచును ఆంధ్రులయింటికోడలునగు చిన్నాదేవి చరిత్ర తెలుగుస్త్రీలు ప్రత్యేకశ్రద్ధతో పఠింపగలరు. స్త్రీవిద్యాభిమానులు ఆదరింపదగినగ్రంథము. క్రౌనుసైజున 56 పుటలు. వెల 0–6–0 అణాలు. వలయువారు గ్రంథకర్త పేర 124 వెళ్లాలవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి అను చిరునామాకు వ్రాయవలెను.

శృంగారకంఠాభరణము:—

మధురకవితావిలసితములగు ప్రాచీనశృంగారగ్రంథములను ముచ్చటైన అచ్చుతో, మురువైన బైండుతో వెల్వరించుచు ఆంధ్రభాషను సేవించుచున్న శృంగారగ్రంథమాలవారి శృంగారసంచిక ఈశృంగారకంఠాభరణము. సంచిక క్రౌనుసైజున (గృహలక్ష్మిసైజున) ఫెదరువెయిటు కాగితములపై ముద్రింపబడియున్నది. ముద్రణము ముచ్చటగనున్నది. 134 పుటలు. ముఖపత్రముపై నొక చక్కని చిత్రము ముద్రింపబడియున్నది. తన దేహకాంతితో సమానకాంతిగల గులాబిపువ్వును—ఆమె నేత్రములవలెను అదిబాగుగ విచ్చియున్నది—ఆఘ్రాణించుచున్న స్త్రీచిత్రము. చిత్రము జీవకళయుట్టిపడుచు చిత్తాకర్షణీయముగనున్నది. చట్రము కట్టించుకొనుటకు తగియున్నది. గద్యపద్యవ్యాసములు సంచికయందు డెబ్బదియారుగలవు. శ్రీయుతులు సెట్టి లక్ష్మీనరసింహము, భోగరాజు నారాయణమూర్తి, గుడిపాటి వేంకటాచలం, వడ్డాది సుబ్బారాయుడు, కొత్తపల్లి సూర్యారావు మొదలగు పెద్దల వ్యాసములతోడను పలువురు యువకుల వ్యాసములతోడను సంచిక యొప్పుచున్నది. శృంగార రసప్రియులకు తద్రసప్రమత్తత గల్గింపజాలినదిగా ఈసంచిక కూర్పబడినది. సంచిక వెల శృంగార గ్రంథమాల చందాదారులకు రు 1–8–0; ఇతరులకు రు 2–0–0. వలయువారు మేనేజరు, శృంగార గ్రంథమాల, తపాలపెట్టె నెం 110, మద్రాసు అని వ్రాయవలెను.

మదాలస:—

అయిదంకములుగల నాటకము. రామకృష్ణకవులచే విరచితము. మదాలసచరిత మార్కండేయపురాణములోనిది. నీతిదాయకమును హృదయంగమమునగు నాచరిత్రము నాటకముగ రచియింపబడినది. మదాలస పతిభక్తి, గురుజనభక్తి; ఋతధ్వజునిపత్నీప్రేమ, పితృవాక్యపరిపాలనము; తాళకేతువు రాక్షసమాయ; అశ్వతరుని ఉపకారదీక్ష; మాల్యవతిధైర్యగరిమ; కుండలస్నేహభావము చక్కగ ప్రదర్శింపబడినవి. గ్రంథము డెమ్మిసైజున 72 పుటలు; వెల రు 0–8–0 అణాలు. దొరకుచోటు: కవితావిలాస్: పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

హోరానుభవదర్పణము:—

ఇదియొక జాతకగ్రంథము. ఇందు శంకరులను నొక ప్రాచీనకవి కృతమగు శ్లోకములును, వాటికి పెరంబూరు సి.సి.సి. హైస్కూలు తెలుగుపండితులు బ్రహ్మశ్రీ సోమంచి గురుస్వామిశాస్త్రులు వారిచే వ్రాయబడిన తాత్పర్యములును గలవు. మూలగ్రంథస్థశ్లోకములు పండితులకుమాత్రమే తెలియునుగాని జనసామాన్యమునకు తెలియుటకై వ్రాయబడిన యిందలి తాత్పర్యములందుగొన్ని భాషాదోషములున్నను లెక్కింపదగవు. కాని, శ్లో. శ్రీమన్మాధవరాజీయే శాస్త్రానుభవగోచరే। యచ్చలోకోపకారాయ కథితంతదిహోచ్యతే॥ పదక్రమము:- శాస్త్రానుభవగోచరే మాధవరాజీయే లోకోపకారాయ యచ్చకథితందిహోచ్యతే. తాత్పర్యము:—శాస్త్రానుభవముచేత గోచరింపదగిన మాధవరాజీయగ్రంథమున లోకోపకారార్థమెయ్యది చెప్పబడెనో యది యిచ్చట

జెప్పబడుచున్నది. ఇట్లుశ్లోకమర్థమిచ్చుచుండ, 'మాధవరాజీయగ్రంథానుభవంబునగోచరించినదియును, లోకోపకారముగ జెప్పబడినదియు, నేదిగలదో అది యిచ్చట తెలియజేయబడుచున్నది' అని తాత్పర్యము వ్రాసియుండిరి. ఇట్లే యింకను గొన్నికొన్నిచోట్ల తాత్పర్యభేదములు కన్పట్టుచున్నవి. రెండవముద్రణమున సవరింపబడుగాక. ఇయ్యది 43 పుటలుగల్గి గ్లేజుకాగితముమీద ముద్రింపబడియున్నది. వలయువారు: పి. నటేశమొదలియారు. 49 తులసింగమొదలివీధి, పెరంబూరు పోస్టు, మద్రాసు. అని వ్రాసిన బడయగల్గుదురు.

—పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రి.

# పత్రికాపరిచయము

## గోలకొండ పత్రిక నిజాం ప్రభువు జన్మదినోత్సవ సంచిక:—

మార్గశీర్ష శు॥ ౭ శనివారమునసైన శ్రీనిజాంప్రభువరేణ్యుల ౪౯-వ జన్మదినోత్సవసందర్భమున హైదరాబాదునందలి గోలకొండపత్రిక వారొక ప్రత్యేక సంచిక ప్రచురించియున్నారు. అది మాకార్యాలయమునలంకరించినది. సంచికయందు నిజాంప్రభువుగారి ఛాయాచిత్రమును, విహారదంపతులు అను చిత్రమును, నిజామురాష్ట్రపటమునుగలవు. సంచికయందు కోటమర్తి నాగేశ్వరశర్మగారి ఆశీస్సు, సందేశము; చిదరెమఠము వీరభద్రశర్మగారి శుభకాంక్ష; రామకృష్ణ సీతారామ సోదరకవుల నైజామురాష్ట్రప్రశంస అను పద్యవ్యాసములు గలవు. ఇందు 'సందేశము' పునఃపఠనార్హముగనున్నది. గద్యవ్యాసములలో సి. యస్. నాయుడుగారు వ్రాసిన 'తెలంగాణము' అనువ్యాసము చాలబాగున్నది. తెలంగాణమునుగూర్చిన సమస్త విషయములును ఒకచో చేర్పబడినవి. వి. యెం. రాజుగారి 'హైదరాబాదు నగరాభివృద్ధి'; మంగు శేషగిరి రావుగారి 'నైజామురాజవంశావళి', ఆదిరాజు వీరభద్రరావుగారి 'విద్యాభివృద్ధి' అనువ్యాసములుకూడచక్కగ వ్రాయబడినవై యున్నవి. అవకాశము తక్కువగుటచే ఈసంచిక యింతకంటె విరళముగ ప్రచురించుటకు వీలు లేకపోయినదని సంపాదకులు తెలుపుచున్నారు. పైవత్సరము ప్రయత్నించి సంపాదకులీసంచికను పెంపొందింతురుగాకయని కోరెదము.

## ప్రజాహిత:—

ఏలూరు తాలూకా ప్రజాహితమండలిపక్షమున నూతనముగ ప్రచురింపబడుచున్న వారపత్రిక. తొలి సంచిక డిసెంబరు 7-వ తేదీని వెలువడినది. 'మనదేశములో నిపుడు జరుగుచున్న శాసనోల్లంఘనవిధాన మనర్థదాయకమనిన్ని మీదుమిక్కిలి అమాయకులగు రైతుల వర్తకుల కనేకకష్టముల కాకరమగుచున్నదనిన్ని నమ్మి నమ్మినదానిని ప్రచారముగావించుటకై,' ఈపత్రిక నెలకొల్పబడినదట. నారదసంచారముక్రింద అశుచి ప్రాపకమగు వ్రాతలకు చోటీయబడినది. ఇట్టివి లేకుండిన 'ప్రజాహిత' సార్థకప్రజాహితకాగలదు; సభ్యలోకమున మన్ననయు బడయగలదు. చందా తెలుపబడలేదు. ప్రచురణకర్త పర్వతనేని నారాయణరావుగారు.

## వివేకవతి:—

స్త్రీలు చదువదగిన నానావిషయములను ప్రస్తావించు నొకమాసపత్రిక. ఇది క్రిస్టియన్ లిటరేచర్ సొసైటివారివలన ప్రచురింపబడుచున్నది. చందా సంవత్సరమునకు పంద్రెండణాలు. కావలసినవారు మేనేజరుగారికి పోస్టుబాక్సు నెం. 501 పార్కుటౌన్ మదరాసు అను చిరునామాకు వ్రాయవలెను. మాపత్రికాపీఠమలంకరించుచున్న నవంబరుమాసపు సంచికలో గృహవిషయములు, కండ్లుకలుగుట మొదలగు స్త్రీలు చదువతగిన విషయములు కలవు.




## హిందూదేశమున మోటారుకారులు:—

క్రీస్తుశకము 1898-వ సంవత్సరమునకు పూర్వము హిందూదేశమున ఒక్కమోటారుకూడలేదు. ఆసంవత్సరమే బొంబాయిలో ఒకమోటారుకారు దిగుమతినొందెను. హిందూదేశమునకు వచ్చిన మెదటికారు అదియే. ఇప్పుడు దాదాపు రెండులక్షలకార్లు హిందూదేశమునగలవు. 1915-వ సంవత్సరమున 2,956 కార్లు ట్రక్కులు దిగుమతినొందెను. దరిమిలానువాని దిగుమతి క్రమముగ హెచ్చిపోయెను. 1929-వ సంవత్సరమున ట్రక్కులు, కార్లు కలిసి మొత్తము 33,500 దిగుమతి నొందెను.

## శస్త్రచికిత్సకుని పనిచేయు చీమలు:—

గతమాసపు గృహలక్ష్మి కథలు: కబుర్లలో శస్త్రచికిత్సకుని పనిచేయు చీమలనుగూర్చి కొంతవ్రాయబడినది. ఆపద్ధతి ఆయుర్వేదమునకు క్రొత్తగాదు. అష్టాంగహృదయము ఉత్తరస్థానము (అ. 26) అభిన్నాంత్ర చికిత్సలో ఇట్లువ్రాయబడినది. శ్లో.అభిన్నమంత్రం నిష్క్రాంతంప్రవేశ్యంనత్వతోన్యథా। ఉత్పంగిల శిరోగ్రస్తం తదప్యేకేవదంతిను॥ అభిఘాతమువలన పేగులు బైటికివచ్చియుండినప్పుడు అవిభిన్నముకాకుండినచో దానిని ముందువలె లోపల ప్రవేశింపజేయవలయును. ఒకవేళ పేగులో భిన్నమైనయెడల వాటిని లోనికి ప్రవేశింపజేయంజనదు. భిన్నమైయుండినను పేగులనులోనప్రవేశింపచేయవలయునని కొందరాచార్యులు వచింపుచున్నారు. ఈచికిత్సయందుచేయు సీవనకర్మయందు యథాప్రకారముగ కాక ఉత్పంగిలచీమల నుపయోగింపవలయును. భిన్నమైనభాగములనుచేర్చి చీమలను కరిపించి పోయినసంచికలో దెలిపిన ప్రకారము కత్తిరించవలయును.

—డాక్టరు యస్. శేషగిరిరావు.

## ఒకఆవు ఒకేసారి మూడుదూడలను ఈనుట:—

శ్రీయుత మాచిరెడ్డి వేంకటస్వామిగారు ఆంధ్రపత్రికలో ఇట్లు ప్రకటించుచున్నారు. కదరితాలూకా నాగిరెడ్డిపల్లె గ్రామమున నొక సామాన్యపాడిఆవుకు (నాటుఆవుకు) మూడుదూడలు పుట్టినవి. మూడు దూడలు బ్రతికియున్నవి. తల్లిఆవు సహా జీవించియున్నది. ఆవు తనదూడలను తాపుకొనుచున్నది. పెద్దవారు ఆవు మూడుదూడలను ఈనుట ఎప్పుడు చూచిఉండలేదని చెప్పుకొనుచున్నారు. ఆవుకు పసుపుకుంకుమ నారికేళములతో పూజలు కొందరు పుణ్యస్త్రీలు చేసిపోవుచున్నారు.



**గుజరాతీ స్త్రీ దృఢనిశ్చయము:—**

ఇస్నావు అనుగ్రామము. తోడిగుజరాతిగ్రామములతోబాటు ఆగ్రామమువారుకూడ పన్నులనిరాకరణము ప్రారంభించిరి. ఈగ్రామమువారి ఈప్రారంభమునకు మూలకారకురాలుఒకస్త్రీ. ఆమె పవిత్రనామము రావబెన్. ఒక్కపలుచటిమనిషి. సగముకాలము చెల్లినది. శాంతియుతమైన ప్రవర్తనము. ఇందువిశేషమేమున్నది? ఉన్నవిశేషమంతయు ఆమె నేత్రములందేయున్నది. ఒకసారివిప్పిచూచెనా ఆమెనేత్రములు ఆమెకుగల మనోద్రఢిమను వెల్లడించును. ఆమెకూతురు నిజముగ ఆమెకుకూతురే. ఆతల్లికూతుండ్రు పట్టినపట్టువిడుచుట ఎట్టిదో ఎఱుగరు. ప్రారంభించిన పన్నులనిరాకరణము ఇంకముందెట్లు సాగవలెనోయని ఆగ్రామమందలి పురుషులందరు సమావేశమైరి. సమావేశము రావబెన్ గృహముననే. సమావేశప్రారంభమున రావబెన్ ఇట్లు చెప్పెను. 'దృఢనిశ్చయులై వచ్చి యుండిన-చో మీకు స్వాగతము. ఊగిసలాడువారు నాయింట ఊపిరిపీల్చవద్దు'. సమావేశముఅయిన వారిలో ఒక్కడును వెనుకకుజారలేదు. ఎల్లరు తమ దృఢనిశ్చయము వెల్లడించిరి. కొన్ని దినములుజరిగెను. రావబెన్‌భర్తయొక్క ధైర్యగరిమజారిపోయెను. ఆతడు వెనుకంజవైచు సూచనలు పొడగట్టెను. వెంటనే రావబెన్ నిరాహారదీక్షవహించెను. తల్లివెంట కూతురు నిరాహారదీక్షపూనెను. శుష్కోపవాసములతో శుష్కించిపోవుచున్న యిల్లాలిమోము, నిట్రుపాసములతో నీరసించిపోవుచున్న కూతురిమోము చూచి ఆతడుతిరిగి దృఢనిశ్చయుడయ్యెను. పన్ను ఈయకుండుటకు శపథముపట్టెను. తల్లికూతుండ్రు ఆహారము ముట్టిరి.

**మద్రాసుశాసనసభ ఎన్నికలు: స్త్రీలు:—**

మద్రాసుశాసనసభ వోటర్లలో రాజధాని మొత్తముమీద 98,680 స్త్రీలుగలరు. నాలుగుకోట్ల జనాభాగల మద్రాసురాజధానియందు పూర్తిగ ఒకలక్షమంది స్త్రీలకైనను ఓటింగుహక్కులేదు. మొన్నజరిగిన ఎన్నికలు ప్రజలమనస్సు నాకర్షింపనివిధము తమకున్న వోటింగుఅధికారముచలాయించినవారిసంఖ్యనుబట్టి నిర్ణయమగుచున్నది. 98,680 మంది

స్త్రీ వోటరులలోను 17,836 మంది మాత్రమే వోటుచేసినారు. నూటికి నాలుగవవంతు స్త్రీలకుమాత్రమే ఓటింగుఅధికారముకున్నది. ఓటింగు అధికారమున్న ఆకొద్దిమందిస్త్రీలలో అయిదవవంతుమాత్రమే ఓటుచేసినారు. శాసనసభాబహిష్కరణవాంఛ మదరాసురాజధానిస్త్రీలలో 'బాగు' నుండినదనుటకు ఇది మంచినిదర్శనము.

చతుర్థాంధ్రరాష్ట్రీయమహిళాసభ:—

ఈమహిళాసభ డిసంబరునెల ౧౩-౧౪ తేదీలయందు మచిలీపట్నమునందు జరిగినది. ప్రధాననగరములందెల్ల నమలునందున్న ౧౪౪ సెక్షనువల్లను తదితరనిర్బంధశాసనముల వల్లను, ముఖ్యముగా నుత్సాహముతో సభలయందు పాల్గొనెడి స్త్రీపురుషాదులనేకులు కారాగారముల కేగియుండుటచేతను గతమూడునాల్గుమాసములనుండియు మన ఆంధ్రదేశ మొక విధమగు సుషుప్త్యవస్థయందుండెను. ఈపరిస్థితులయందు జరుగవలసిన రాష్ట్రీయ మహిళాసభ జయప్రదముగా నెఱవేఱునాయని యెల్లరు సంశయించుచుండిరి. ఈమహిళాసభను గతవత్సరము తమపురమున కాహ్వానించిన నారీమణులు ఏలూరివారు. అయితే ఆఆహ్వానించినవారిలో కొందఱు చెఱసాలకేగియు మఱికొందఱందుల కనాయత్తలుగను నుండినందున వారీమహిళాసభను జరుపుటకు సాహసింపజాలక పోయిరి. తదుపరి ఇది రాజమహేంద్రవరమున జరుగునని వినవచ్చెను. కాని తలవని తలంపుగా నిది బందరుమహిళామణుల ఆదరమునకు పాత్రమైనది. జరుపవలసినసభ వ్యయప్రయాసలకు సాధ్యమైనది. తమకు గల వ్యవధియుసత్యల్పము. వీనికితోడు విపులజంఝామారుతములు. ఈప్రాంతవాసులతో బాటు వీరికార్యక్రమమును పెక్కుమారులు తారుమారు గావలసెను. అయినను మొక్కవోని యీపురస్త్రీలకార్యదీక్షసంస్తవనీయము.

ఆంధ్రరాష్ట్రమహిళాసభా ప్రతినిధురాండ్రు: ఖద్దరు ధారణము:—

ఈచతుర్థాంధ్రరాష్ట్రీయమహిళాసభ రాజకీయవిషయములకు వెలిగానుంచబడినది. అయినను సభకువచ్చిన ప్రతినిధురాండ్రును, ప్రేక్షకురాండ్రును, ఆహ్వానసంఘము వారును, అధ్యక్షురాండ్రనుగూడ శుద్ధఖద్దరువస్త్రధారులై యుండుట యెంచదగినవిషయము. గుంటూరు, బెజవాడ, ఏలూరు, రాజమహేంద్రవరము, తణుకు, నరసాపురము, గుడివాడ, అంగలూరు, తెనాలి, బాపట్ల మున్నగుపలుతావులనుండి యేతెంచిన విదుషీమణులు ప్రాయికముగా ఖద్దరు దుస్తులనేధరించియుండిరి. జరీపని, పట్టుపని, కుట్టుపని, అద్దకపుపని, నేతపని, రంగుపని మున్నగు పెక్కుపనితనములచే నత్యంతరమణీయముగా నొనర్పబడిన ఖద్దరుచీరలను, రవికెలనుధరించిన నారీమణులు సభకు అపూర్వమగు శోభను, ఖద్దరుకు అసదృశమగువిలువను చేకూర్చిరి. ఆశుద్ధఖద్దరువస్త్రముల విశుద్ధకాంతులలో చీనిచీనాంబరముల జిగజిగలు చిన్నబోయినవి. గణనాతీతమగు మాణిక్యములనసమమ వెల వెలబోవు గాజురాలవలె శుద్ధఖద్దరువస్త్రధారిణులగు పెక్కు స్త్రీలుగల ఆసభలో విదేశ

వస్త్రధారిణులగుస్త్రీలు వ్రేళ్లమీదలెక్కింపదగియుండిరి. దేశమున వ్యాపించియున్న స్వదేశీ యోద్యమమునకు చిహ్నముగా చతుర్థాంధ్రరాష్ట్రీయసభలో దేశభక్తులకు కనులచల్లగా కనబడినదిదియొక్కటియే.

ఆంధ్రరాష్ట్రీయ చతుర్థమహిళావిద్యాసభ: ముఖ్యతీర్మానములు:—

13-వ తేదీని జరిగినది విద్యాసభ. పదునాలగవతేదిని జరిగినది సాంఘికసభ. ఉదయముపూట విషయనిర్ణయసభలు మద్యాహ్నము మహాసభలు. పంద్రెండు విషయములు విద్యాసభయొక్క విషయనిర్ణయసభలో చర్చింపబడినవి. అందు 3, 4 తీర్మానములైన పాఠశాలలో గఱపబడువిషయములన్నియు స్వభాషలోనే నేర్పబడవలెనను తీర్మానమును, ప్రస్తుతము నేర్పబడు విద్యావిధానము సరిగాలేదనియు, దేశభక్తి నీతిమతము మొదలగు విషయములను బోధించునదిగా విద్యయుండవలెనను తీర్మానమును విశేషముగా చర్చింపబడినవి. ఆహ్వానసంఘకార్యదర్శినులలో నొకరగు నాథావఝల సరస్వతమ్మగారును, మిసెస్ పాల్ అనువారును ఆంగ్లభాష బాగుగా పట్టుబడుటకు అన్నివిషయములు ఆంగ్లభాషలోనే నేర్పనగునని వాదించిరి. అది సమంజసముకాదు, ఆంగ్లభాషలోనే సర్వవిషయములు బోధింపబడుటచే మాతృభాషప్రాముఖ్యత తొలగుచున్నదనియు, చదువుకొనువారికి గూడ కష్టమెక్కువగుచున్నదనియు ఆదుర్తి భాస్కరమ్మగారు సమాధానమిచ్చిరి. దీనిపై వాదోపవాదములు చెలరేగెను. చాలమంది మాతృభాష నామోదించుచు మాటలాడిరి. కాన స్వభాష నామోదించు తీర్మానమునకే జయమొదవెను. రెండవ వివాదవిషయము దేశభక్తి నీతి మతము మొదలగు విషయములను బోధించునదిగావిద్యయుండవలె ననునది. ఇందు మతమను విషయము తొలగింపవలయుననియు, పాఠశాలలలో పెక్కు మతముల వారుందురనియు, అందు ఒకమతమును చెప్పిన మఱియొక మతస్థులకు కష్టముగాదాఅనియు మఱియు మతమేవలదను వారుగూడనుండవచ్చుననియు, కానమతమనుమాటను తీసివేయవలయుననియు పెద్దాడ కామేశ్వరమ్మగారనిరి. కానిచాలమందికీవాదన నచ్చలేదు. మహమ్మదీయపాఠశాలలలో మహమ్మదీయమతమును బోధించుచున్నారనియు, క్రైస్తవపాఠశాలలలో క్రైస్తవమతమును బోధించుచున్నారనియు, మనహిందూపాఠశాలలలోనే హిందూమతము బోధింపబడుట లేదనియు, కాన హిందూపాఠశాలలలో హిందూమతము బోధించు టవసరమని భాస్కరమ్మగారనిరి. మతమనగా ఎవరిమతము వారికేయనియు, మనుజులు మతజీవులనియు, ఏమతమునకును చెందనివారు లేనే లేరనియు, మతములేదను వారున్నచో వారుమతములేదనుమతము వారగుచున్నారనియు కనుపర్తి వరలక్ష్మమ్మగారనిరి. ఇందు వాదోపవాదములు చెలరేగెను. ఎంతసేపటికిని నీవిషయము నిర్ణయము కాలేదు. పెక్కుమందిస్త్రీలు మతమనునది యుండితీరవలయునని వాదించిరి. తుట్టతుదకొకపరిష్కారమునకు రాలేక యీవిషయమును కట్టకడపట చర్చింతమని యప్పటికా

తీర్మానమునకు సంబంధించిన చర్చనాపి తక్కినవిషయములను చర్చించిరి. కాని తుదకు మతవిషయక తీర్మానమును చర్చింపకయే సభను దాదాపుపదునొకండుగంటలకు ముగించిరి. మధ్యాహ్నము మూడుగంటలకు మహాసభ పురమందిరమున ప్రారంభమైనది. ఉదయము విషయనిర్ణయసభలో తరువాత చర్చింపవచ్చునని విడిచిన మతవిషయకతీర్మానము చివరకు ప్రస్తావింపకనే విడిచిరి. మధ్యాహ్నము ప్రతినిధులకు అచ్చువేయించి పంచిపెట్టిన విషయనిర్ణయసభలోని తీర్మానముల కాగితములందు దేశభక్తి నీతి మతము అనుచోట మతమను మాటతీసి వేయబడి ముద్రింపబడియుండెను. ఇది యెవరియనుమతితో తొలగించి ముద్రించిరో తెలియదు. దీనికే ప్రతినిధులుగుసగుసలాడుచుండ ఇంకను దానిపై ద్వేషము తీరక కాబోలు నెమ్మదిగా ఆతీర్మానమునే సభలో చర్చకుబెట్టక దాటవేసిరి. దీనికి కారకులెవరో తెలియదుగాని చాలమంది ప్రతినిధురాండ్ర కీవర్తనము మిగుల అసంతృప్తిని కలిగించినది. తమ కయిష్టమగువిషయమును సభవారికి నచ్చజెప్పి వారిని వశగతులను గావించుకొని అధిక సంఖ్యాకులవలన నామోదింపజేసి విజయులగుట సమంజసముగాని యిట్లుచేయుట మంచిదికాదు. దీనివలనమతాభిమానుల మతముతీసివేయబడినట్లుకాజాలదు.

చతుర్థాంధ్రి రాష్ట్రీయమహిళా సాంఘికసభ: శారదా చట్టము:—

పదునాలుగవతేదీనాటి సమావేశము. ఈసమావేశమునందు చర్చింపబడిన విషయములు ౧౧. అందు హరవిలాసశారదాగారిచట్టము నమలులో పెట్టవలయుననియు, నాచట్టమును ప్రజలాచరణలోపెట్టునట్లు ప్రచారసంఘములేర్పడి పనిచేయవలయుననియు, ఈచట్టములోని వయస్సుతగ్గించు సూచనలు కనుపించుచున్న విగాన వానికీసభవారు అసమ్మతిని తెలియజేయుచున్నారనియు, మఱియు నూరురూపాయలధరావతుగూడ తీసివేయవలయుననియు ఈసభవారు తీర్మానించుచున్నారను విషయము మొట్టమొదట చర్చకువచ్చెను. ఇందు నూరురూపాయల ధరావతు తీసివేయవలయునను నంశమునందు చాల చర్చజరిగెను. ధరావతుకట్టి కేసుపెట్టవలెననుట చాల అసంభవమగు విషయమనియు ఇందువలన నెవ్వరును కేసుపెట్టుటకు సాహసింపరనియు, మఱియు ఇందువలన గ్రామస్థులలో పరస్పర వైషమ్యములు జనించుననియు కాన ధరావతు తొలగించవలయుననియు చాలమంది యభిప్రాయపడిరి. శారదాచట్టము మతవిషయము గనుక అందులో ప్రజలకుగూడ కొంత బాధ్యత గల్గించుటకును అబద్ధపుకేసులు పెట్టకుండుటకును ఇట్టి ధరావతు నేర్పరచబడెనని భాస్కరమ్మగారనిరి. కాని శారదాచట్టముయొక్కవ్యాప్తికీధరావతు ప్రతిబంధకమని చాలమంది వాదించిరి. తుదకీవిషయమువోటుకు పెట్టబడెను. ధరావతు తొలగింపవలయునను సూచననే అధికసంఖ్యాకులామోదించిరి. ప్రభుత్వమువారీవిషయమును గమనింతురుగాక!

**విడాకులచట్టమును గూర్చి విశేష చర్చ:—**

వివాహవిచ్ఛేదవిషయములందు స్త్రీపురుషులకు సమానహక్కులుండవలెనని యీసభవారు తీర్మానించుచున్నారు అనువిషయము చర్చకువచ్చెను. ఈద్వైవోర్సు తీర్మానము చర్చకురాగనే ప్రతినిధురాండ్రలో గొప్పసంచలనము గలిగినది. సాంఘికవిషయములను పెక్కింటి నుత్సాహముతో నామోదించిన సోదరీమణులు పెక్కండ్రీవిషయమున తమఅసమ్మతిని ప్రబలముగా సూచించిరి. పాతివ్రత్యమున పేర్గాంచిన భారతనారీమణుల నిర్మలకీర్తి కీతీర్మానము గొడ్డలిపెట్టని ఉన్నవ లక్ష్మీబాయమ్మగారివంటి పెద్దలు శంకించిరి. మిసెస్ నాగభూషణము, మిసెస్ పాల్ అను క్రైస్తవనారీరత్నములుగూడ నీవిడాకులచట్ట మామోదింపదగినదికాదని ఖండితముగాదెల్పిరి. కాని సంఘసంస్కారవిషయమున ఎప్పుడును పురోభాగముననుండురాజమండ్రికిచెందినప్రతినిధురాండ్రు దామెర్లకమలరత్నమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ, ఆదుర్తి భాస్కరమ్మ, బత్తుల కామాక్షమ్మగార్లు యీ తీర్మానమున కనుకూలముగా మాట్లాడి ప్రతినిధులను సమ్మతింపజేయవలయునని చాలప్రయత్నించిరి. కాని బెజవాడ ప్రతినిధురాండ్రగు తుర్లపాటి రాజేశ్వరమ్మ, మంచాల సావిత్రమ్మ, బొడ్డపాటి సీతాబాయమ్మ,ఉప్పులూరిసుందరమ్మగార్లుమున్నగువారుగాని గుంటూరునుండివచ్చినఉన్నవ లక్ష్మీబాయమ్మ, రాయసము రత్నమ్మ, ముంతాకోటేశ్వరమ్మ, చంద్రమౌళి అన్నపూర్ణమ్మ గార్లుమున్నగువారుగాని ఏలూరినుండివచ్చినమూల్పూరు చుక్కమ్మ,శృంగారకవిలక్ష్మీనరసమ్మ గార్లుమున్నగువారుగాని తదితరగ్రామాదులనుండివచ్చినప్రతినిధురాండ్రుగానిదీనికామోదము తెల్పరైరి. ఇదివోటుకు బెట్టినచో మహాసభముఖముచూడకుండగనే విషయనిర్ణయసభలోనే అడగారిపోవు సూచనలు కన్పట్టెను. కావున ఓటుకు పెట్టకుండ మహాసభలో నీతీర్మానమును దామెర్లకమలరత్నమ్మగారుపపాదించుటకును పెద్దాడ కామేశ్వరమ్మగారామోదించుటకును యేర్పఱచి అటుపై అనుకూలురైదుగురు ప్రతికూలురైదుగురు దీనిపై అయిదేసినిమిషములు మాట్లాడునట్లును తరువాత మహాసభలోనేదీనిని వోటుకుబెట్టునట్లును నిర్ణయించిరి. మూడుగంటలకు మహాసభ పురమందిరములో నారంభమైనది. తీర్మానములపై చర్చసాగెను. అవి తీర్మానింపబడెను. కాలక్రమమున విడాకులతీర్మానము చర్చకువచ్చెను. ఈతీర్మానము చర్చకు వచ్చునప్పటికి ప్రతినిధిప్రేక్షకసమాజములం దొకవిధమగు నుత్సాహము, ఆతురత పొడసూపెను. దామెర్లకమలరత్నమ్మగారీతీర్మానము నుపపాదించిరి. పెద్దాడ కామేశ్వరమ్మగారు మేఘగంభీరస్వరముతో దీనిని బలపఱచుచు పూర్వాచారపరాయణలమాయమాటలలోబడి కర్తవ్యము మఱువక స్త్రీలకత్యంతోపయోగకరమగు నీతీర్మానమునకనుకూలముగా వోటు నొసంగుడని సభవారిని హెచ్చరించిరి. తరువాత ఇరుపక్షములవారి వాగ్బలము ప్రదర్శింపబడెను. బత్తుల కామాక్షమ్మ, సత్తిరాజు శ్యామలాంబ, ఆదుర్తి భాస్కరమ్మ గార్లువిడాకులచట్టమును సంపూర్ణముగా నామోదించుచు ప్రసంగించిరి. కనుపర్తి వరలక్ష్మమ్మ

గారు విడాకులచట్టమువలన కలుగబోయెడి యిబ్బందులను పెక్కింటిని వివరించిరి. కాని దయనీయలగు భర్తృపరిత్యాగినుల జీవితముగూడ అంతకంటె దుస్సహమైనదనియు, పెక్కు సందర్భములలో బాలవితంతువుల స్థితికంటె ఈభర్తృపరిత్యాగినులగు బాలలస్థితిఅత్యంత దుఃఖకరమైనదిగా నుండుననియు, కాన ప్రతివారికిగాక నిషేకముగాక నిర్హేతుగా వదిలిపెట్ట బడిన వారును; షండుడు, పిచ్చివాడు, దేశాంతరగతుడునైన భర్తలగలవారునునగు బాలికల కీచట్టము ప్రవర్తింపజేయనగుననియు సవరణపూర్వకముగా మాట్లాడిరి. ఈ తీర్మానము యథారూపముగా నెగ్గింపపట్టుబట్టియున్న ప్రతినిధురాండ్ర కీసవరణ హితముగాలుపనందున చాల గడబిడచేసిరి. తరువాత ప్రతికూలపక్షమున నాథావర్షుల సరస్వతమ్మ, మిసెస్‌పాల్ అనువారలు తీర్మానమునకు ప్రతికూలముగా మాట్లాడిరి. వీరిరువురు క్రైస్తవసంఘమునకు జెందినవారు. డైవోర్సు చట్టము తమ సంఘమున గలవారు. ఇట్టివారు డైవోర్సు వలదనుట గణనీయాంశముగానుండెను. తరువాత ఉన్నవ లక్ష్మీబాయమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మ, కొట్టుపాటి అంకమ్మగార్లు మనహిందూసాధ్వీధర్మమునకు కళంకదాయకమైన ఈ తీర్మానము నామోదింపరాదని ఖండితముగా బల్కిరి. అతిముఖ్యమైన ఈ తీర్మానమున నుపన్యాసకు రాండ్ర కొక్కరికి అయిదునిమిషములు మాత్రమే అవకాశమీయబడుటయు, ఇంకను మాట్లాడనెంచువారకి వీలుచిక్కకుండుటయు కొంతబాధాకరముగనేడుండెను. కాని ఈతీర్మా నము వోటునకు పెట్టబడెను. అనుకూలురపక్షమున కామేశ్వరమ్మగారును ప్రతికూలుర పక్షమున లక్ష్మీబాయమ్మగారునువేదికపై నిలువబడి అనుకూలురు చేతులెత్తండి, ప్రతికూ లురు చేతులెత్తండియని సభవారిచే డ్రిల్లుచేయించిరి. వరలక్ష్మమ్మగారి సవరణవాదమున కనుకూలురుగానున్న వారీయుభయ వాదులకు చేతులెత్తక తటస్థముగానుండిరి. చేతినెత్తుట ఎందుకో యెఱుగనివారు కొందఱు రెండుచేతులనెత్తిరి. కొందఱు లెక్కడుచుండగానే చేయి వాల్చుకొనిరి. ఈ గందరగోళములో నేదోవిధముగా చేతులులెక్కించుకొని అనుకూలురు ఇదివదిఆఱుగురు ప్రతికూలురు ఇరువదిఏడుగురుఅని తేల్చుకొనిరి. ఇంతలో విడాకులచట్టము కావలయునను వారికి సంతోషకరముగా అగ్రాసనాధిపురాలివోటు వారి కొసగబడెను. కాని ఈవిషయ మప్పుడు తేల్చుట అసాధ్యముగాన వచ్చేవార్షికసభలో చర్చింపనగునని విడిచిపెట్ట బడెను. ఈవిధముగా విడాకులబొమ్మ తయారుచేయబడియు ప్రాణపతిష్ఠ జరుగకపోవుటచే మఱుగైపోయినది.

**పంచమ ఆంధ్రరాష్ట్ర స్త్రీల విద్యాసాంఘిక సభ:—**

వచ్చేసంవత్సర మీసభను గుంటూరులో జరుపుటకు గుంటూరుమండలప్రతినిధు రాండ్రైన రాయసము రత్నమ్మ, ముంతా కోటేశ్వరమ్మ, త్రిపిరినేని సాధువమ్మ, కనుపర్తి వరలక్ష్మమ్మగార్లు ఆహ్వానించిరి. గుంటూరుపురమున ఆసభకూడునాటికి దేశమునందు-నేటి విషమపరిస్థితులు విచ్చిపోయి శాంతి నెలకొనుగాక!

నవంబరు

20:—లండను రౌండుటేబిలుసభలో స్త్రీలప్రతినిధి బేగముషానవాజు‌గారుపన్యసించి పలువురు మన్ననలబడసిరి.

21:—కారాగారములందున్న హిందవరాండ్రను కుంకుమబొట్టు పెట్టుకొననీయవలసినదిగా బొంబాయి ప్రభుత్వము వారు జైళ్లకన్నిటికి ఉత్తరువు పంపినారు.

—ఆజన్మాంతము స్త్రీలస్వాతంత్ర్యము కొఱకు పోరాడియుండిన నారీమణి శ్రీమతి డేంమేరీషాప్లీబ్‌గారు మరణించిరి.

22:—మదరాసు స్త్రీలవిద్యాసాంఘికమహాసభ తిరువాన్కూరుమహారాణిగారధ్యక్షతను సమావేశమయ్యెను.

—కాశిలో శ్రీమతి స్వర్ణలతదేవిగారికి 100 జరిమానా విధింపబడెను. జరిమానా ఆమె చెల్లింపకపోయినను వసూలుచేయుట కష్టముకాదు గనుక ఆమెను విడుదలచేయవలయునని మేజస్ట్రేటు ఉత్తరువుచేసెను.

23:—ఉభయగోదావరిమండల స్త్రీల మహాసభ రాజమహేంద్రవరమున జరిగెను.

24:—అహమ్మదాబాదులో జవహరిఉత్సవదినమున ఊరేగింపు జరిపినందుకు శ్రీమతి సరళాదేవి అంబాలాలు గారికి రు 100, మినుమృదుల (ఆమెసమాస్త్రిగారికి రు 50 జరిమానా, యివ్వనిచో 15 రోజులు ఖైదు విధింపబడెను.

—లక్నోలో ప్రేమచంద్ సతి, రామనాథసతి, రాజాదేవి, రామాదేవిగార్లకు చెరిఆరువారములు ఖయిదు వేయబడెను. ఇందు రామనాథసతిగారు మూడేండ్లవయస్సు గల శిశువుతో జెయిలుకేగినది.

25:—బొంబాయిలో వల్లభాయిపటేలుగారి కుమార్తె మణిబెన్‌గారికి విధింపబడిన నాలుగుమాసముల శిక్ష హైకోర్టులో మూడుమాసములకు తగ్గించబడెను.

—22-వ తేదిని రాయవెల్లూరుజయిలునుండి విడుదలయైన దువ్వూరి సుబ్బమ్మగారు రాజమండ్రిచేరిరి.

26:—బొంబాయి ఖారులో జవహరుదినోత్సవమునుజరిపినందుకు అరెస్టుచేయబడినవారిలో ఆరుగురుస్త్రీలలో ముగ్గురికి నాలుగుమాసముల విడిఖైదును తక్కినవారికి రు 250 చొప్పున జుల్మానాయు చెల్లింపనిచో చెరి ఏడువారముల శిక్షయు విధింపబడెను. వారిలో ఒక స్త్రీ పదునెనిమిదినెలల ఈడుగలబిడ్డతో గూడ చెఱసాలకు వెళ్లెను.

—పాట్నాలో శ్రీమతి వింధ్యావాసినిదేవిగారికి (అంబికాచరణుగారి భార్య) రు 200 జరిమానా విధింపబడెను. జరిమానా యివ్వనిచో నాల్గునెలలు విడిఖైదు. బి. తరగతి. ఈమె కాయస్థబ్రాహ్మణులలో గొప్పయింటి స్త్రీ.

27:—బొంబాయిలో క్రిమినలు లాసవరణచట్టముక్రింద శ్రీమతి ఊర్మిళామెహతాగారికిని, శ్రీమతి వీరబాలా దీక్షిత్ సతిగారికి ఎనిమిదిమాసములశిక్ష విధింపబడెను.

—లక్నోలోనప్రసిద్ధహిందీగ్రంథకర్తలగు ప్రేమచంద్రాగారిభార్య మణిశిరోమణిదేవిగారికిని. మరిముగ్గురు స్త్రీలకును చెరి ఆరువారముల విడిఖైదు విధింపబడెను.

28:—కలకత్తాలో శ్రీమతులు సలూక్‌భాయి, కావర్‌భాయిగార్లు ఇరువురు ప్రభాతఫేరీలు సెక్షను 188 క్రిందు నాలుగునెలలు విడిఖైదును పొందిరి.

29:—శ్రీమతి సరళాదేవిగారు (గంజాంజిల్లా,) శ్రీమతి సరస్వతమ్మగారు, శ్రీమతి అంగచ్చమ్మాళుగారు వేలూరుజయిలునుండి విడుదలయైరి.

30:—

## డిసెంబరు

1:—బొంబాయిలో శ్రీమతి హంసమెహతాగారు విడుదలచేయబడిరి.

2:—చుప్రలో శ్రీమతి జానకిదళారిగారు ప్రథమవలంటీరుదళముతోగూడ ప్రస్థానముగావించినందులకు క్రిమినలులాసవరణ చట్టముక్రింద ఆరుమాసముల విడిఖైదు విధింపబడెను.

3:—కలకత్తాలో డెబ్బదియేండ్ల వృద్ధ నారీసత్యాగ్రహసమితి కధ్యక్షురాలు మోహినీదేవిగారు దేశబంధు వార్షికదినమున ఆరునెలలు శిక్ష విధింపబడి అనుభవించి విడుదలయైరి.

4:—కాకినాడ వాస్తవ్యురాలగు వల్లూరి వెంకాయమ్మగారి ధనసహాయమున బెజవాడ గవర్నరుపేటలోనున్న రామమోహనపుస్తకభాండాగారమున స్త్రీలఉపయోగార్థము నూతనభవనమునకు పునాదులు వేయబడెను.

5:—బొంబాయిలో ఫ్రీప్రెస్‌జర్నలు సంపాదకులపై కేసువచ్చుటచే ఏత్పత్రికాసంపాదకత్వము ఆయనభార్య వహించినది.

6:—ఢిల్లీలో జవహర్లాల్ గారి అత్తగారు కొత్తనియంత్రిగా నియమింపబడినది.

:—బొంబాయిలో శ్రీమతులు గంగాబెన్ పటేలుసతి, శాంతాబెన్ పటేలుసతి, త్రివేదికన్యగార్లకు చెర ఆరు మాసముల శిక్ష విధింపబడెను.

:—సూరతులో శ్రీమతులు వసుమతీదేవి మొదలగు 19 మంది స్త్రీలకు చెరి 300 రూపాయిల జరిమానా విధింపబడెను. జరిమానాలను ఆస్తి జప్తుచేసి గ్రహించెదరు.

7:—లాహోరుఫోర్మను క్రిస్టియను కాలేజి విద్యార్థినియగు శ్యామజుట్షికన్య బి.ఎ. యికముందు పికెటింగుచేయ ననిమాట ఈయనందున కాలేజినుండి వెడలగొట్టబడినది. అక్టోబరులో కాలేజీపికెటింగుకై ఆరునెలలు శిక్ష విధింపబడిన జుట్షిచెల్లెండ్రలో ఈమె యొక్కతె.

8:—దేశసేవక ప్రముఖురాలు సత్యబాలాదేవిగారు మల్లార్పూరులో అరెస్టుచేయబడిరి.

9:—

10:—తిరుపూరులో శ్రీమతి పద్మావతిఅషల్, భాగ్యలక్ష్మమ్మాళ్ గార్లకు జరిమానా విధింపబడెను. జరిమానా వసూలుచేయుట దుస్సాధ్యమైనందున వారు అరెస్టుచేయబడిరి. చెరి ఆరుమాసముల ఖైదు విధింపబడెను. వారిని ఎ. తరగతిలోచేర్చి కోయంబత్తూరు జెయిలుకు పంపిరి.

11:—శ్రీమతులు పద్మావతిఅమ్మాళ్ గారు (మధుర) కోటమర్తి కనకమ్మగారు (భీమవరము) వేలూరు స్త్రీల జెయిలునుండి విడుదలయైరి.

12:—వెల్లూరుజెయిలునుండి విడుదలపొంది శ్రీమతి ఉన్నవలక్ష్మిబాయమ్మగారు గుంటూరు చేరిరి.

13:—ఈసంవత్సరము కలకత్తావిశ్వవిద్యాలయపుబి యస్.సి. పరీక్షలయందు తీర్ణులైనవారిలో ఉమాబోసుకన్య ప్రథమురాలుగనుండిరి. మన్మథనాధభట్టాచారిబంగరుపతకము, సోనామణివెండిపతకము వీరికివ్వబడినది.

:—నాల్గవ ఆంధ్రరాష్ట్రీయమహిళాసభ మచిలీపట్టణమున ప్రారంభమయ్యెను.

14:—లండన్ వాడ్‌హం కాలేజీ విందుసందర్భమున మాట్లాడుచు భారతదేశాభివృద్ధి స్త్రీలచేతిలోనే యున్న దని సైమన్‌సతి నుడివెను.

15:—కీర్తిశేషులైన స్వామిశ్రద్ధానందగారి మనుమరాలు, 16 ఏండ్ల బాలిక క్రిమినలులాసవరణచట్టము 1. (ఏ) సెక్షన్ క్రింద అరెస్టుచేయబడెను.

16:—శ్రీ మేరీరాణిగారు లండనులో బకింగుహాము రాజమందిరమున రౌండుటేబిలుసభకు ప్రతినిధులుగావచ్చిన భారతనారీమణులకును వీరితోగూడనిపుడు యిండియానుండివచ్చిన ఇతరభారతాంగనలకును విందుచేసిరి.

17:—నెల్లూరుమండల కాంగ్రెసుసంఘాధ్యక్షురాలు కూరపాటి మంగళాంబగారికి 144-వ సెక్షను క్రింద నోటీసు ఈయబడెను.

18:—

19:—మీరాబాయిగారు 'న్యూస్‌ఆఫ్ ఇండియా' అని నూతనవారపత్రిక ప్రారంభింతురని తెలియుచున్నది.

# డిసెంబరుమాసపు గృహలక్ష్మి

౧

డిసెంబరుమాసపు "గృహలక్ష్మి" కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇందు హిందూదేశమున శిశుహత్యలను గూర్చి సంపాదకీయమునందు చర్చింపబడెను. సంఘనీతికి వ్యతిరేకముగ ప్రవర్తించి సంఘముయొక్క భయము చేతనే సహజముగ మాతృప్రేమ అధికముగనుండు స్త్రీలు యీ దారుణకృత్యములు చేయుచుందురనియు, వారు బయల్పడుటచే శిక్షింపబడుచున్నారనియు, ఈనేరమునకు కారణభూతులైన మగవారుగూడ ఈశిక్షయందు భాగము పొందుటుచితమనియు, విధవావివాహములు అనాథాశ్రమములు యెక్కువజేసినచో ఈదురాచారము నశింపగలదనియు, యువతులగు స్త్రీలు చెడుమార్గము ద్రొక్క నవసరము తప్పుననియు ఈవ్యాసము బోధించుచున్నది. ఈసంచికయందనేకములగు వ్యాసములు అందెక్కుడుభాగము స్త్రీలచే రచింపబడినవియున్న, స్త్రీల పటములును గలవు. స్త్రీలకుపయుక్తమగు కథలు వ్యాసములలో శ్రీపద్దమూడి వేంకటరత్నంగారి "వివాహము," శ్రీమతి గంటి వేంకటరమణమ్మగారి "బలి," కె. కామేశ్వరరావుగారి "అమ్మ...కాదు. పిన్ని." న్యాపతి కృష్ణరావుగారి "సాదింపు," శ్రీమతి వెంపటి పురుషోత్తంగారి "విధి విధానం" ముఖ్యమయినవి. స్త్రీల ధైర్యోత్సాహములను పెంపొందించుటకు విదేశచరిత్రలందలి ఆదర్శవీర వనితలగాథలు గూడ ఇందు గలవు: కూచిమంచి సుబ్బారావుగారు మిస్ మేరియా (గపియా)గూర్చివ్రాసిరి. "జోన్ ఆఫ్ ఆర్కు" ఫ్రాంసుజాతీయోద్యమము నడపిన స్త్రీరత్నము కథయు, శిలాప్రతిమాచిత్రముగలవు. మదరాసు జాతీయోద్యమమునందగ్రస్థానమువహించిన శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు వ్రాయుచున్న లక్ష్మియను నవలయందలి కొన్నిభాగములిందు చదువదగియున్నవి. వెంకటేంద్రుడు రచించిన పద్యరత్నములు యీ సంచికకు వన్నెదెచ్చియున్నవి. ఇవిగాక బాలికలపాటలు వానికిని సంస్కృతశ్లోకములకును గల సంబంధము నిరూపించుచు శ్రీయుత పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిచే వ్రాయబడిన "తిరస్కృతాంధ్రవాఙ్మయము" అనువ్యాసము యెన్నో క్రొత్త విషయములను దెలుపుచున్నది. ఇవిగాక యీ సంచికయందు యితరపత్రికలనుండి సేకరింపబడిన విషయములు, గతమాసపు "డైరీ" మున్నగువిషయము లనేకములు గలవు. సావిత్రి, సత్యవంతుడు, యముడుగల త్రివర్ణచిత్రము ఈసంచికయందగ్రస్థానము వహించినది.

—ఆంధ్రపత్రిక. 5-12-30

౨

బాబూ, వందనములు

మా గ్రంథాలయమునకు వచ్చిన గృహలక్ష్మిని నేడేచూచితిని. డిసెంబరుసంచిక మనోహరముగనున్నది. 'పూలగుత్తి' 'శబరి' 'సాదింపు' 'అమ్మకాదు పిన్ని' 'బలి' సప్రాణములుగనున్నవి. 'సుభాషితము' ప్రత్యేక భూషణము తగినది. ముప్పదివ్యాసములలో పదునేడువ్యాసములు పురుషకృతములైయుండుటయేలోటు. కాగా డిసెంబరు గృహలక్ష్మి హృదయంగమము. 'గృహలక్ష్మి' యుద్ధతప్రేమిలోకములోని నాకీపురుషకర్తృక వ్యాసబాహుళ్యము నచ్చలేదు. క్షమింపుడు.

తెలప్రోలు
8-12-30

ఇట్లు
పాటిబండ మాధవశర్మ

3

అయ్యా, నమస్కారములు

మీ పత్రికను ప్రతినెలయు చూచుచుంటిని. ఈ నెల పత్రిక పూర్వపువాటికంటె మిగుల ఉన్నత శ్రేణికి చెందినది.

ఏలూరు
5-12-30

ఇట్లు
లకంశెట్టి వేంకటసుబ్బారావు

౪

అయ్యా, దండములు

మీగృహలక్ష్మి పత్రికను ప్రతినెలా చూచుచున్నాను. బాలవిజ్ఞానశాఖ నన్నెంతయు ఆకర్షించినది. బాలబాలికల హృదయాంతరాళను సువిజ్ఞానచంద్రికావళుల వెల్వరించుటకు మీపత్రిక పార్వణచంద్రుడని తలచెదను.

ఇట్లు
బి. నాగభూషణరావు

౫

ప్రియమైన గృహలక్ష్మికి
నెచ్చెలీ!

నీవు దినదినప్రవర్ధమానవగుచుంటివి. చిత్రపటములతో చిత్రకథావ్యాసములతో నలరారుచున్నావు. వయస్సున పిన్నవయ్యు నారీలోకమునకు నీవొనర్చుచున్నమేలు కొనియాడదగియున్నది. ఒక్క నారీలోకమునకననేల పిన్నపెద్దభేదములు లేక స్త్రీపురుషవివక్షణలేక అందఱకును నీవుచేయు బోధ శ్లాఘాపాత్రముగనున్నది. తొక్కుపలుకులకొఱకు పిన్నలును, వ్యాసములకొఱకు యౌవనులు, కథలుకబుర్లకు మూలనున్న ముసలమ్మలుగూడ యెప్పుడు మొదలుతేదీ వచ్చునా యెప్పుడు నీవు వత్తువాయని యెదురుచూచుచున్నారు. ఇంత అల్పవయస్సుననే నిన్నింతగజేసి యందఱిమెప్పును బడయుచున్న మహనీయులకు ఇందుమూలముగ ధన్యవాదములంపుచున్నాను.

హేలాపురి
4-12-30

ఇట్లు
నీ నెచ్చెలి

౬

ఆర్యా, వందనములు

తాము పంపు గృహలక్ష్మిని ప్రతిమాసమున చూస్తూవున్నాము. మా ఉపాధ్యాయులయిన శ్రీనూరిగుచ్చి కృష్ణమూర్తిగారు దయతో మాకు కథలు మొదలైనవి చదివిచెప్పుచూ మాచే చదివించుచూ మాకు జ్ఞానాభివృద్ధిగావించుచున్నారు. మేము ప్రతినెలలో గృహలక్ష్మికొఱకు కాచుకొనుచున్నాము. తొక్కుపలుకులు ఆటలు మాకు సంతోషము కలుగ చేస్తూవున్నవి.

ఏలూరు
4-12-30

ఇట్లు
పాకల రాజామణి

౭

ఈ మాసపత్రికయొక్క డిసెంబరు సంచిక మాకందినది. "హిందూదేశమున శిశుహత్యలు" అనువిషయమునుగూర్చి ప్రారంభవ్యాసము. జోన్ ఆఫ్ ఆర్కుయొక్క అద్భుత చారిత్ర మెరికైన ఆశ్చర్యవిషాదములను కలిగి కలిగింపకమానదు. వర్తమానభారతజన్మదాతయగు శ్రీరామమోహనరాయలవారిని గూర్చి ఓలేటి వేంకటరామశాస్త్రిగారు వ్రాసిన మనోహరపద్యములుగలవు. ఇంకను పలువిషయములనుగూర్చిన పద్యములతో, వ్యాసములతో, అనేక కథలతో, బాలికాబాలకుల కుపయుక్తములగు పాటలు, పదములతో సంచికయలరారుచున్నది.

—ధర్మసాధని. 10-12-30

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ ప్రిపజం టేటివు ఆఫ్ న్యూస్

బళ్ళారి: వి. రాజు మొదలియార్ & సన్సు, బ్రాహ్మణవీధి.

నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.

బెజవాడ: నామల అంతోని.

మచిలీపటణము: కె. బాలకృష్ణ

తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడు, (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును)

అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.

నిడదవోలు: టి. కుటుంబ శాస్త్రిగారు.

చికాకోలు: తాటిగడప మాణిక్యరావుగారు.

పాలకొల్లు. వేమరాజు నరసింహంగారు, హెడ్మాష్టరు, మట్టపల్లు.

ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.

కాకరపల్లు: కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల.

విజయనగరం: కేసనపల్లి. రామలింగంగారు, పొత్తూరివారి వీధి.

ఒంగోలు: కే. ఎల్. శర్మగారు

రామచంద్రపురం: సి. జి. శాస్త్రి & కంపెనీ.

గుడివాడ: సీతారాం అండు కంపెని.

కొవ్వూరు: జి. వి. రామరావుగారు.

ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట.

రాజమండ్రి: ఎన్ బి. కృష్ణరావుగారు

తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు

బరంపురం: గోనియశెట్టిగారు, గొల్లపల్లి

కొల్లూరు. కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల.

గుంటూరు: పత్రి వేంకటహనుమంతరావుగారు, బ్రాడిపేట.

కాకినాడ: గడ్డా బ్రదర్స్. రామారావుపేట,

పిఠాపురం: మెం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం.

మదరాసు: కస్తూరి రాజామాణిక్యముగారు

ఇతర చోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు
"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# విషయసూచిక

త్రివర్ణ చిత్రము
మాయ

ఛాయాచిత్రములు

1. శ్రీమతి జమ్మి సీతాబాయి గారు
2. చీనాకాంత, ఆమె చిన్నారికోడుకు
3. 'వెన్నముద్దపరూపువెట్టిన మాడిక్కి నున్నమెత్తని మేననొప్పెడు వాడు'
4. దేహపరిశ్రమ
5. శ్రీమతులు టి. పి. రాజ్యలక్ష్మికన్య. లీలాకన్య
6. శ్రీమతి విన్నీస్టూయార్ట్
7. పాలబుగ్గలు
8. జపమా? ఎంగిలియా?
9. రాజమండ్రి గోదావరి రైలువంతెన
10. త్యాగిని
11. మూరీకాంతల నాట్యము
12. మూరీస్త్రీల దుస్తులు
13. పుష్పగాభివందనములు




# దుర్గాబాయమ్మగారి 'లక్ష్మి'

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి 'లక్ష్మి' యను చిన్న నవల గతమాసపు గృహలక్ష్మిసంచికలో ముగింపునొందినది. రాజకీయరంగమునరాణదేరిన తమబుద్ధి సారస్వత రంగమునఁగూడ నెట్లుసానలుదేరఁగలదో దుర్గాబాయమ్మగారు 'లక్ష్మి' యందుఁ బ్రస్ఫుట ముగఁబ్రదర్శించిరి. షేక్సుపియరువిరచితమగు 'హేమ్‌లెట్' నాటకమునందు హేమ్‌లెట్ పాత్రయెట్లో దుర్గాబాయమ్మగారిచే విరచితమగు 'లక్ష్మి'యను చిన్ననవలయందు లక్ష్మి పాత్ర యట్టిది. కలపంద్రెండుప్రకరణములలోఁబెక్కింటియందు లక్ష్మి ప్రత్యక్షముగనే పాఠ కులకుఁబొడగట్టును. ఆమెప్రత్యక్షముగఁ బొడగట్టని ఒకటిరెండు ప్రకరణములు లక్ష్మిగుణ ప్రశంసలతోడనే లలితములై యున్నవి. ఈకథలోని ఇతరపాత్రలన్నియు లక్ష్మికొఱకే కథా రంగమునఁబ్రవేశించి లక్ష్మిమూలముననే పాఠకులమనమున కెక్కును.

ప్రథమప్రకరణము. పంద్రెండేండ్లబాలిక - లక్ష్మి - తనఅయిదేండ్లఅల్లరితమ్మునితోఁ గథావతరణమునఁ గానవచ్చుచున్నది. ప్రథమముననే కథయందలి ప్రధానపాత్రతోఁ బాఠ కులకుఁబరిచయముచేయు కళారహస్యమును దుర్గాబాయమ్మగారు గ్రహించిరనుటకిదిమంచి నిదర్శనము. లక్ష్మి, పాపము, తల్లిలేనిపిల్ల. జ్ఞానమెఱుఁగనితమ్మునకును, జ్ఞానమెడఁగినతండ్రికిని కాచిపోయుఆడదిక్కు ఆమెయే. వయసునకు అందనిబాధ్యత. అయినను ఇతరులు ఆహా యనునట్లు ఆమె ఈబాధ్యత నిర్వహించినది. కావుననే ఆమెపాఠకులమనమునంతలోఁ జూఱ గొన్నది. ఆమెచరిత పూర్తిగఁదెలిసికొనవలయుననుఉత్కంఠపాఠకుల మనమున ఎసరేఁగి నది. అల్లరిగచ్చకాయయగు తమ్మునిమబ్బువెట్టి మారాముడుపు ఆమెతెలివి, ఆదరించి అవునకుదాణాపెట్టు ఆమెపనితనమును పరికించినపాఠకు లిఁక రెండవప్రకరణమున ఆమెపిత్రు

దేవుని యెట్లుపరిచరించుచున్నదో పరికింతురు. తండ్రివచ్చినతోడనే కాళ్లుకడుగుకొనుటకు నీళ్లు. వేడిపెసరట్లుతయారగునంతలోపల మిఠాయిఫలాహారము. 'కుంచమంతకూఁతురున్న చో మంచముమీఁదనేకూడు' అను పెద్దలవచనమునకు లక్ష్మి పేర్కొనఁదగినతార్కాణమైనది. ఆమె ఉత్తమగుణములలో నొకటియగు ఔదార్యము ఈప్రకరణముననే బీజరూపమున నున్నది. వేసివెయ్యనిధనికుఁడుగాక ఆమెతండ్రిసామాన్యసంసారి. లక్ష్మికాసంగతి తెలియును. కావుననే ఆమె తనపాఁతబట్టనే దానముచేసినది. ఈవిషయము తనచెవులకుఁ జేరినపుడు ఆమె తండ్రి ఆమెనుద్దేశించి 'నీకెంతటిగొప్పహృదయముగలదో యీనిర్భాగ్యునింట స్పష్టముకాదు' అనిపలికినాఁడు. జన్మమిచ్చినవానినుండి లక్ష్మిపొందినఈయోగ్యతాపత్రమునకు విలువకట్టుట బుద్ధికిఅందరానివిషయము. మూఁడవప్రకరణము. ముచ్చటైనప్రకరణము. లక్ష్మిచెలికత్తెలు పాఠకులకుఁ బరిచయమగుదురు. చుక్కలలోఁ జంద్రునివలె లక్ష్మి చెలికత్తెలనడుమ ప్రకాశించును. సునిశితబుద్ధినుపయోగించి ఆమె సీత, సావిత్రి, శకుంతల, పార్వతి వీరలపాతివ్రత్య తారతమ్యమును ఎంచినది. ఆమెఎన్నికలో పార్వతి ప్రతివ్రతాశిరోమణి. సంభాషణ లక్ష్మి వివాహప్రశంసలోనికిసాగినది. మంగళప్రసక్తమగు వివాహప్రశంసలోఁ 'గట్నమునకు అప్పు' అనుకాకికూఁత వినవచ్చినది. లక్ష్మిబెదరినది. ఆమెహృదయముచెదరినది. కన్నులు జలకుండములైనవి. జాలితో జాపకులై జాగరించుచున్న ఓపాఠకులారా! లక్ష్మికి ఎట్టికష్టమును లేక వివాహమగునట్లు ఆశీర్వదింపుఁడు.

నాల్గవప్రకరణము. లక్ష్మికష్టములకు లంకెపీఁట. ఊరివెలుపలనున్న మంచినీటినూయి చెంతనుండి బిందెబుజమునఁబెట్టుకొని నిప్పులుచెరఁగు ఎండలోనింటికివచ్చినది. వసారాలోఁ దండ్రి రామచరణదీక్షితులు. విచారగ్రస్తమైనవదనము. జలపూర్ణమైననేత్రములు. చిన్నారి కొడుకుపైఁజీదరింపు. అతఁడు లక్ష్మివివాహముకొఱకుఁదేఁదలఁచినఅప్పుపుట్టలేదు. గుణరాశియగు లక్ష్మిని ఆతఁడు మంచిచోటపడవేయఁదలఁచెను. తలఁచినతలపులకుఁ దారుమారు. అందుతో ఆతనికిలక్ష్మిసుగుణములే వేదనాకరములయ్యెను. 'ఓసీ!నిర్భాగ్యురాలా!'అన్నాఁడు. లక్ష్మి మాటలేకనిలచిపోయెను. పాఠకులునిస్తబ్ధులైనారు. నిస్తబ్ధతతొలఁగుటయే తడవుగ వారు హృత్పిండమునుచిదుకగొట్టగల ఇట్టిసన్నివేశమును ఘటించిన దుర్గాబాయమ్మగారి రచనాచాతుర్యమునకుఁ జేమోడ్పులిచ్చినారు. అయిదవప్రకరణమున ఆతిథ్యము. నాల్గవ ప్రకరణమున నాట్యమాడినదుఃఖదేవత ఈప్రకరణమునఁగూడ తొంగిచూచినది. లక్ష్మి తండ్రికిఉన్నఉద్యోగముకూడ ఊడినది. మఱలఉద్యోగము సంపాదించుటకొఱకుఁబ్రవాసము. తల్లిఇహలోకమునేవీడెను. తండ్రి ఇతరపట్టణములకుఁబోయెను. తమ్మునిపెట్టుకొనితానింటిని కనిపెట్టుకుని ఉండవలసివచ్చెను. కాని ఈకష్టములన్నియు ఆమె మేలుకొఱకేయయ్యెను. ఆనాఁడుపాతబట్టను దానముచేసిన ఆమెఉదారహృదయమే ఈనాఁడు ఆమెచే గాలివానకు వెఱచివచ్చినవారికి ఆతిథ్యమిప్పించెను. సాయముపండుకొనవచ్చిన ముసలమ్మ అడ్డుతగిలినను

లక్ష్మిగమనింపలేదు. వండిన ఆనపకాయకూర, వేసిన అల్లికదుప్పటిపక్క ఆమె అదృష్టరేఖను బయలుపెట్టినవి. భగవంతుఁడు వాడినచేనిమీదికి వానలుపంపినాఁడు. అతిథినుండి రూకలు గ్రహింపసంకోచించి లక్ష్మి తనఅభిమానమును బ్రదర్శించుటతో ఈప్రకరణము ముగియుచున్నది. ఆరవప్రకరణము. గుణములకుతగిన గౌరవము దొరికినది. లక్ష్మిచేతి ఆనపకాయకూరతిని ఆమె అల్లినదుప్పటిమీఁద శయనించిన ఆనాఁటిఅతిథి జమీందారు వింధ్యాప్రసాదు ఈనాఁడు లక్ష్మిని తనభార్యగఁజేకొనుటకు నిశ్చయించినాఁడు. ఆనిశ్చయమునకు ఆతనివదిన సుభద్ర ప్రాణముపోసినది. కాబోవుమామగారికి ఆతఁడుద్యోగమిప్పించినాఁడు. ఇఁకలక్ష్మి కన్నియుశుభపరంపరలు. సుఖమయమైనకాలము గాలప్పరుగునఁబోవునట్లే శుభపరంపరలతోఁగూడినలక్ష్మి ఉత్తరకథయు నిఁకవేగముగనడచును. లక్ష్మి వివాహముతో సప్తమప్రకరణము సమాప్తమగుచున్నది. అష్టమప్రకరణము. లక్ష్మి మగనితోఁజెప్పి తండ్రికి రెండవవివాహముచేయించినది. సవతితల్లి తనతమ్ముని కన్నకొడుకువలెఁ జూచునట్లును, తన తమ్ముఁడు సవతితల్లినితల్లివలెఁజూచునట్లును లక్ష్మి చేయగలిగినది. ఎంతటినేర్పుకత్తె!

తొమ్మిదవప్రకరణము. తోడికోడలిపరాజయము. పదియవప్రకరణమున పరిచారికకు పరిచర్యలు. వింధ్యాప్రసాదు ఏరికోరి లక్ష్మిని పెండ్లియాడినాఁడు. ఏరికోరి చేసికొన్నందులకు లక్ష్మి ఏకాంతసేవాచతురయైనది. ఆమెకిప్పుడొకకొడుకు. ప్రేమించినతరువాతమాత్రమే పెండ్లియాడి, పెండ్లియాడినఁదరువాతనుగూడ ప్రేమించుమగనిని లక్ష్మికిఁగూర్చి గుణములకుఁ బూజ్యతకల్గించి కావ్యగుణమును మెలకువతో నీతిబోధవైపుమొగ్గునట్లుచేసిన దుర్గాబాయమ్మగారినేర్పు గరిష్ఠమును, వరిష్ఠమును. లక్ష్మి ఇపుడు ఒకలక్షీశ్రపుత్రుని అర్ధాంగలక్ష్మి. అయినను ఆమెకు అతిశయమురాలేదు. తనయింటతానే దాసిగనున్నది. పనిముద్దునేగాని భాగ్యపుముద్దును ఆగుణవతి ఆశించలేదు. పతియే సతికిఁబరమదైవమనుటలో లక్ష్మి ఇప్పటికిని ఎప్పటికిని పార్వతియే. 'ధనముహెచ్చినచో మదముహెచ్చును, మదముహెచ్చినచో దుర్గుణంబు మానకహెచ్చును' అను లోకజ్ఞుఁడగు కవివచనమునుగూడఁగాదనిపింపఁజాలిన లక్ష్మిప్రభావమును బ్రస్తరించుఁ బదునొకండవప్రకరణమును బాఠకులు సంతోషముమూలమునపండబాఱినహృదయములతో ముగించుచున్నారు.

పండ్రెండవప్రకరణమున లక్ష్మి ఉపాధ్యాయిని. ఉపాధ్యాయినియగు లక్ష్మిపాత్రను సృష్టించిన దుర్గాబాయమ్మగారు వెనుక కాకినాడలో హిందీఉపాధ్యాయిని. ఇపు డామెనివసించుచున్న రాయవెల్లూరు స్త్రీలచెఱసాలయందును ఆమె హిందీఉపాధ్యాయినియే. ఉపాధ్యాయినికావుననే ఆమెతనఈచిన్నినవలకు 'మీలో నొకర్తుకకేని లక్ష్మిగుణగణములబ్బిన నే ధన్యనుగనెంచికొందును' అనువాక్యముతో ఉపసంహారము తెలిపినది. ఉపాదేయములైన లక్ష్మివంటి ఉత్తమస్త్రీపాత్రలను మఱికొన్నిఁటిని దుర్గాబాయమ్మగారు తెలుఁగువారికిఁ బ్రసాదించునట్లు పరమేశ్వరుఁడనుగ్రహించును గాక!

# సులక్షణ

ఆంధ్ర శేషగిరి రావు గారు బి. యె.

హిందువుల మెక్కా కాశీనగరమునఁ బ్రియవ్రతుఁడను నొక బ్రాహ్మణుఁడు. ప్రియవ్రతుని ప్రియురాలు శుభవ్రత. ఆదంపతుల ప్రణయవృక్షమునకుఁ బ్రత్యక్షఫలముగా నొక కూఁతురు జనియించెను. అనపత్యత తొలఁగెనుకదాయను ఆనందము లేకుండ నాబిడ్డ తండ్రి గండమునఁ బుట్టి మాతాపితలకుఁ దీఱని మనస్తాపము కలిగించెను. మూలనక్షత్రమున మొదటికాలఁగేంద్రమున నాంగిరసుఁడుండగా నామె పుట్టినది. దుష్టనక్షత్రమునఁ బుట్టు గాక, ఆమె నక్షత్రమువలెఁ జూడఁదగి సర్వలక్షణసౌభాగ్యజన్మభూమియై ప్రకాశింపుచుండెను. అట్లగుట నామెకుఁ దల్లిదండ్రులు సులక్షణయను పేరిడి పెంచుచుండిరి.

సులక్షణ సలక్షణముగాఁ బెరుఁగుచుండెను. అంతంత బాల వర్ధిల్లఁగాఁ దండ్రికి అంతకంత చింత వర్ధిల్లెను. గోగుకామవలె నింతలోఁ బెరఁగి వరయోగ్యయై కూఁతురు ఇంట నుండఁ దండ్రియగువానికిఁ జింత వర్ధిల్లుటలోఁ జిత్రమేమి? సౌభాగ్యభాగ్యసంపదల యందుఁ దనకుమార్తెకు అనుగుణుఁడగు వరుని నన్వేషించుఁ జింతలోఁ బ్రియవ్రతుఁడు చిక్కి శల్యమైనాఁడు. భేషజముచే భేదింపఁబడని ఇట్టి చింతాజ్వర మలముకొనఁగాఁ జిక్కి సగమైన ఆ బ్రాహ్మణునకు- గోరుచుట్టుపై రోకటిపోటుగా- జ్వరము తగిలినది. తగిలిన ఈజ్వరము కొద్దిదినములలోననే ఆతనిని పరలోకమునకుఁ దరలించుకొని పోయినది. పతి మృతినొందినమాట వినుచునే శుభవ్రత - ఆమె శుభవ్రతయగుట - చితినెక్కి చింతసోఁకని చిత్తముతో సహగమనము చేసినది.

జ్వరము తండ్రిని తుదముట్టించినది. జ్వాల తల్లిని మ్రింగివైచినది. అవివాహితయగు సులక్షణ ఆదరించువారికి నోచక లోకమున మిగిలినది. దుఃఖావేశమున తూలఁబాఱుట కింతకంటె విషమవిషయము లేమి కావలయును? ఏమియు నక్కఱలేదు. కాని సులక్షణ దుఃఖావేశమున తూలఁబాఱలేదు. బాల్యమెడలని అబలయేయయ్యు సులక్షణ ధీరోదాత్తయై దుఃఖదేవతను దవ్వులకు జోపినది. నిర్విచారముతో నామె తలిదండ్రుల కౌర్ధ్వదైహిక విధుల నిర్వర్తించినది.

ప్రాణము ప్రాణములగు మాతాపితలకు దూరమైన ఆమెకు ఇఁక ఇహలోకసుఖములపై మనసు పోవలేదు. వివాహచింతను విడనాడినది. ఆబాలబ్రహ్మచారిణి తపశ్చర్యకు దొరకొన్నది. అవ్యయానందమిచ్చు మోక్షపదము అవలంబింపఁబడినతపమునకుఁగాంక్షింపఁబడిన ఫలము. ఊరికి ఉత్తరముననున్న ఉత్తరార్కకుండపార్శ్వ ప్రదేశము ఆరంభింపబడినతపమునకుని ర్దేశింపఁబడినభూమి. తీవ్రమైన దీక్షతో, నిండారిన నిష్ఠతో సులక్షణ తపస్సు చేయుచుండెను.

సులక్షణయొక్క తపస్సమాధినియతత్వమునకుఁ గట్టువడెను కాబోలు-సులక్షణ తపోనియతికిఁ బూనిన కొద్దిదినములకేవచ్చి మేఁకపిల్లయొకటి ఆమెచెంతకుఁ జేరెను. ఇహలోకమోహములఁద్రెంచుకొని సర్వసంగపరిత్యాగినియై సర్వేశ్వరునిగూర్చి తపము చేయుచున్న సులక్షణ ఆమేఁకపిల్లమీఁద మోహమునిలిపి దానిని తనయొద్ద నిలుపుకొని మచ్చికచేయుచుండెను. పగలు నాలుగుజాములలో నొక్కయరనిముసమేని ఆమేఁకపిల్ల సులక్షణను ఎడబాయదు. రాత్రికాఁగా నందందు నాలుగుగఱికిపోచలఁ గొఱికి అచ్చటి ఉత్తరాదిత్యకుండికలో రెండుగ్రుక్కల ఉదకముద్రావి యది మఱల నాబాలబ్రహ్మచారిణి పాదములఁజెంతకు వచ్చివ్రాలును. తల్లిని విడిచియుండనొల్లని పసిపిల్లవలెఁ దన్ను ఎడబాయనొల్లకున్న ఆమేఁకపిల్ల నామె తల్లివలెనే ఆదరించుచుండెను.

పెక్కువత్సరములు గడచెను. దీక్ష తీవ్రతలో దిగతీత పొడసూపలేదు. నిష్ఠ నిస్తంద్రతలో సడలుపాటు గానరాలేదు. అట్టి సులక్షణ తపమునకు మెచ్చి పరమేశ్వరుఁడు పార్వతీసహితుఁడై ప్రత్యక్షమైనాఁడు. దర్శనమిచ్చిన పురాణదంపతుల నామె వలగొన్నది. అపుడుగూడ నామేఁకపిల్ల అమెను ఛాయవలె నంటియే యుండెను. అంతట సులక్షణను జూచి 'బాలా! అరుదగు నీతపమునకు హర్షించితిమి. వరము వేఁడుము. ఇత్తుము' అని పరమేశ్వరుఁడు పలికినాఁడు.

జీర్ణశల్యముగా జీరాడుచున్న శరీరమునకై ఇసుమంతేనిచింతింపక చిరకాలముగాఁ జేసిన తపమునకుమెచ్చి పరమేశ్వరుఁడు ప్రత్యక్షమైనాఁడు. వరము వేఁడుమనుచున్నాఁడు. పెదవిమెదపుటయే తడవుగఁ జిరకాంక్షితమగు ముక్తిపదము సిద్ధింపనున్నది. ముక్తిపదము కొఱకే సులక్షణ ఈఘోరవీరతపము అవలంబించినది. ముక్తిపదముకొఱకే ఆమె ఈడుగ్ర తపోమహాసీయవేదనాభరము వహించినది. కాని ఇప్పుడామె స్వార్థమునకై నముక్తిపదము విస్మరించినది. ముందు పరార్థము. స్వార్థముసంగతి తరువాత. చూడుఁడు ఆమెయేమన్నదో!

> "మీనకేతనదమన! యీమేఁకపిల్ల
> ప్రాణసఖివోలె నాయొద్దఁ బాయకుండు
> శర్వ! యీనోరుమాలిన జంతువునకు
> మొదలవరమిమ్ము, వరమిమ్ము పిదపనాకు."
>
> —కాశీఖండము.

సులక్షణ భూతదయార్ద్రబుద్ధికి భూతభర్త మెచ్చినాఁడు; మెచ్చి కరుణాకింకరమైన కటాక్షాంకురమున నామెను జూచినాఁడు; చూచి ఆమేఁకపిల్ల మఱుపుట్టువునఁ గాశిరాజునకుఁ గూఁతురై పుట్టునట్లు వరమిచ్చినాఁడు. ఇట్లు మేఁకపిల్లకువరమిచ్చి శంకరుఁడు తనభూతదయార్ద్రబుద్ధిచే మీస్త్రీలోకమునకంతకును జిరయశము నార్జించిన స్త్రీరత్నము సులక్షణకుఁ దగినవరము ఈయవలసిన బాధ్యత నీపై నిలచియున్నదనుటకు సూచనగా

పార్వతివైపు క్రీగంటిప్రసారమును బ్రసరించినాఁడు. మగని కనుసన్నలమెలఁగు ఇంగితజ్ఞ గావున పార్వతి తనతండ్రియగుహిమవంతుఁడు ఏదేశపుటుత్తరపుటెల్లలను ఎల్లవేళల శత్రుదుర్భేద్యముగఁ బరిరక్షించుచుండునో అట్టి భారతదేశమునఁ బుట్టువుఁగన్న స్త్రీల భూతదయార్ద్రబుద్ధికి ఉత్తమమైన ఉదాహరణమై వెలయుచున్న సులక్షణకు దివ్యత్వమిచ్చినది. గుణానురాగిణియగు గౌరికి అంతతోఁదృప్తిగలుగలేదు. సులక్షణ మహితగుణమునకు దివ్యత్వమిచ్చుట యొక్కటియే తగిన సత్కారముకాదని ఎంచి పార్వతి ఆమెను చంపకమాల, మలయవాసిని, కోకిలాలాప, మధురభాషిణిమొదలగు తనచెలికత్తెలలో నొకతెగాఁ గైకొనెను. సులక్షణ మేలిగుణ మామెకు లోకపూజ్యయగు సతీదేవి నిత్యసన్నిహితత్వమును గలిగించినది.

భారతస్త్రీల భూతహితబుద్ధికి సులక్షణచరిత్ర లక్షణమైనతార్కాణము. సులక్షణ చరిత్రము భారతీయుల జ్ఞప్తికెలయించుచు నామె మేఁకపిల్లకు ఏకుండికపార్శ్వమున ముక్కంటిచే వరమిప్పించినదో ఆప్రదేశము బర్కరీ (మేఁకపిల్ల) కుండమని ప్రసిద్ధికెక్కినది. ఆపూర్వచరిత్రను దలపించుచు బర్కరీకుండ మిప్పటికిని కాశీపట్టణమునఁగలదు. కాశీయాత్రసేవించు మహనీయులెల్లరు బర్కరీకుండమునఁగూడఁగ్రుంకి సులక్షణ భూతహితార్థబుద్ధికి జయవెట్టుచుందురు. తమతోఁగూడ మఱికొందఱిని తరింపఁజేయు సులక్షణవంటి మహనీయురాండ్రను భరతమాత మఱియెందఱినో ప్రసవించినది.

## హనుమంతుడు, సీత

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

"వినవమ్మ! నీప్రాణవిభునిసేమంబు
నినుబాసినదిమొద ల్నిత్యవేదనల
నేలపై బవళించు నిద్రయెఱుంగ
డోలిమాంసాహార మొల్లడెన్నఁడును
వాసియై దండకావనములోనిన్ను
మోసపోవుటలెంచు మోమరవాంచు
నిట్టూర్పునిగుడించు నించుకన్నీరు
నెట్టనమూర్ఛిల్లు నేలపైఁద్రెళ్లు
దెలివియైలేచు నల్దిక్కులుచూచు
గలకునివ్వెరగందు గళవళంబందు
'హా సీత!' 'హా సీత!' యని ప్రలాపించు"
సచ్చరిత్రమునకు సంతోషమంది

"యోసమీరాత్మజ! యోపుదువీవు
సనఘాత్మయే బెండ్లియైనదిమొదలు
జనలోకనుతు రామచంద్రునిగాని
పొలుపొందుగా నన్యపురుషాంతరముల
గలలోననైన నను గదిసియేనెరుగ
మఱియన్యపురుషుల మదినంటనేను
నానాథునకునీవు నమ్మినబంట
వైనను నినుమెక్క నఱుదెంచుటొల్ల
యొక్కమాసముజూతు నుండలేనవల
ఈలోనరఘురాము నెబ్బంగినైన
వాలాయముగదెమ్ము వడినింకబొమ్ము"
అనిసీతపల్కు వాక్యములెల్లవినియె.

# బొమ్మలనోము

శ్రీమతి గండికోట సావిత్రీదేవిగారు

“ఏమయ్యా! వెంకన్నశాస్తుల్లూ, నీకువచ్చిన ఏళ్లెవరికొచ్చాయి, నువ్వే ఇంతంత పాపానికివడబడితే ఎల్లాచావడము.” అని అన్నది శేషమ్మ వాకిట్లోకి యాయవారానికప్పుడే వచ్చిన వెంకన్నతోటి.

“ఏమిటమ్మోవు చాలా ఝూంకారంగా అంటున్నావు. ఇప్పుడేంకొంపమునిగిందేమిటి” అని అన్నాడు వెంకన్నశాస్తుర్లు సావకాశంగా చేతులోఉన్న జంధ్యాలు సరిచేసుకుంటూను.

“ఇంకాముణగడమేమిటీ, నీకెంతకర్పూ_రిఅయినాకా స్తవెనకా ముందూచూడొద్దూ” అంది శేషమ్మ అతనిస్థిమితత చూసి కోపంరెట్టించి.

“ఇప్పుడేంమునిగింది, అసలుసంగతేమిటో చెప్పకుండానిలేశావే, అవతలపొద్దెక్కుతూంది. ముత్తయిదులంతా పూజకొచ్చేవేళకూడాను. పదిఇళ్లేనా చూచుకొద్దామని ఇలాబయల్దేరితే మధ్యఇదో గాలివానా?” అన్నాడు ముఖంచిట్లిస్తూను.

“చాల్లే, చెపుతున్నావు మహామొనగాడల్లే, నాల్గురాళ్లకాశపడి కుడీఎడమూఅని లేకుండా ప్రతివాళ్లూ నోములు పడుతూంటే చల్లగా ఊరుకుంటావూ, ఏమీఎరగనట్టు,” అంది శేషమ్మ చేతులోకున్న చిన్నమనమణ్ణి జబ్బుచ్చుకుగుంజుతూ.

“ఏమిటమ్మా పొద్దున్నే ఇలా మొదలెట్టావు. అసలు నేననుకుంటూనే ఉన్నా. నిద్దరలేస్తూంటే ఆదిక్కుమాలిన పిల్లి వంటింట్లోనుంచీ పనున్నట్టు ఎదురుగుండావచ్చింది.” అని విసుక్కున్నాడు.

“చాల్లేవయ్యా, నీగ్గాగా సరిపోయింది వెధవముండలచేత నోములు పట్టించడం” అని వెనక్కు తిరిగింది శేషమ్మ.

ఇంతలోకే ఇంట్లోనుంచి మీనాక్షి చేత్తో బియ్యంపట్టుకొచ్చి “ఏమిటమ్మా! ఆ బ్రాహ్మణ్ణి అలాకసురుతావు. అసలాయన తప్పేమిటీ, పాపం వాళ్లసుందరికిమాత్రం నోములూ అవీనోచాలని ఉండదా ఏమిటి దాని కర్మంచేత బియ్యే చదువుతూన్న మొగుడుచచ్చిపోతే వాళ్ల మేనమామ దానిమీద ప్రేమచేత తన స్నేహితుడికిచ్చి పెళ్లిచేస్తేమాత్రం. మొదటపాపం నాపెళ్లప్పుడే అయింది కూడాను దానిపెళ్లి ఎక్కడికీ కదలకుండా పన్నెండేండ్లపిల్ల ఇంట్లోకూచోగలదా ఏం.” అని బియ్యంపెట్టి వెంకన్నను పంపేసింది.

“ఏం విడ్డూర్యాలట్టా, ఇందుకే నేను ఆడపిల్లలకి అంతచదువక్కర్లేదు. ఆదిక్కుమాలిన మాలబళ్లోకి పంపద్దని మొత్తుకుంటేవిన్నారా? నాకెందుకొచ్చిన సంతమ్మా? ఈ నాలుగురోజులూగడుపుకొని అవతలికి విరగడైపోతాను. ఆనక ఒక్కఘడియ ఉండమంటే ఉండను. అప్పుడు మీఇష్టంవచ్చినట్లు వెధవాళ్లతోగాదుగదా మాలాళ్లతో నోచుకోండి.” అని శేషమ్మ ధుమధుమలాడుతూ ఇంట్లోకి వెళ్లింది.

వెంకన్నశాస్తుర్లు కాకినాడకాపరస్తుడు. లోకులేమనుకుంటే ఏంగాని మొత్తానికి శ్రోత్రియుడుగానే లెక్కకొస్తాడు. ఏదెలాగయినా ప్రతినిత్యం తెల్లారగట్ల నాలుగువేసేసరికి శాస్తుర్లుబట్ట లుతుక్కునేచప్పుడుతో ఇరుగుపొరుగువారికి పనీపాటలకి మెళుకువొస్తుంది. ఆతరవాత పార్థివపూజా, మిగిలిన నైష్ఠికాలూ ముగించుకొని వంటినిండావిభూతిపూసుకుని తెల్లగాతోమిన ఇత్తడిచెంబూ, ఇంకోచేత్తోపంచాగమూ వీనితో బయలుదేరితే ఎదురుపడ్డవాళ్లంతా కనుమెప్పుడనీ, అమ్మవారిని నిలపడమెప్పుడనీ, వర్జాలెప్పుడనీ ఇత్యాదిప్రశ్నలు వేస్తూంటే ఓపికతో బ్రాహ్మణాశూద్రాభేదంలేకుండా జవాబులుచెపుతూ ఊరివిశేషాలుతెలుసుకుంటూ రెండుఝాములయ్యేసరికో పెద్దమూటతో ఇల్లుచేరడం అతనినిత్యకృత్యం. వాళ్లఇంట్లో ప్రతిఏటా ఎటువంటిఇబ్బందులొచ్చినా జంకకుండా అమ్మవారిని నిలిపి తీరుతాడు. నోములవిషయంలో ఆయన ఉదారస్వభావం కొంచెం

తెలుసుకోవాలి. ఏవరైనా ఓపిల్ల పొద్దున్నే మఱచిపోయికాఫీతాగి పెద్దవాళ్లపట్టువల్లనోముపట్టుదామని ఆయన దగ్గరకుపోయి "శాస్తుర్లుగారూ నాసంగతేమిటి?" అని అడిగితే ఓమాటు పైకీ కిందికీచూసి "కాఫీలోపాలు గలిసినవిగా, పాలకితప్పేమిటి, క్షీరంసర్వదా శ్రేష్ఠం యని శాస్త్రంలోఉందిగాదమ్మా" అనిచెప్పి పట్టిస్తాడు.

ఇంకా బొమ్మలునిలిపేవేళకిరా వీలులేకపోయిన వాళ్లకి తనైనాకాస్తమట్టితీసి ఉండచేసి నోముపట్టిస్తాడుగాని మానడు. వాళ్లాడింపునాటికి తనకిజ్వరమేనా ఏమేనావస్తే ఓబండిపిలిచి అందులో అమ్మవారినిపెట్టి వాళ్లాడిస్తాడుగాని ఇంకోబ్రాహ్మడికి అప్పచెప్పడు.

ఇంతదీక్షగలవాడు గనకనే మొగుడుచచ్చిపోతే రెండోపెళ్లి చేసుకున్న సుందరమ్మ ఆయేడు నోము పట్టుతానంటే నిక్షేపంలా వచ్చేరూపాయీ బియ్యమూవదులుకోడమెందుకని ఆ అమ్మాయిమానాన్ని ఆఅమ్మాయినోచుకుంటుంది, ఎవరు చూడొచ్చారు అని సమాధానపడి నోచుకోమని చెప్పేడు పాపం. కాని శేషమ్మ నడిబజారులో నిలేసి నానామాటలూ అని గుట్టుబయటపెట్టింది.

మర్నాడు మీనాక్షిని నోమునోయించడానికి తీసుకువచ్చింది శేషమ్మ. అక్కడికిరాగానే ఆవిడకంటికి ఓమూలకూచుని పూజచేసుకుంటూన్న సుందరమ్మ కనిపించింది. దాంతోటి ఆవిడకు కోపమూ వణుకూ ఒక్కమాటే వచ్చాయి. వెంటనే సుందరమ్మ దగ్గిరకూచోబోతున్న మీనాక్షినిచూసి "మీనాక్షీ! ఇంకామీదికిపోతావేమే. ఇలారా ఇక్కడ కూచుని పూజచేసుకుందువుగాని, ఈయేడునోము గంగలోకలిసేపోయింది. ఎలాగయినా" అంది.

"అమ్మమ్మా! ఇప్పుడేంవచ్చిందే, పూజచేసుకోడం ఎక్కడైతేనేం, భక్తిగాని కావాలిసింది."

"అమ్మా! నీతోమాట్లాడడమేతప్పు. మళ్లీ ఏటికీనే బతికుంటే సూరమ్మగారింట్లో పట్టిస్తానోము. ఈ శాస్తుర్లు గుమ్మంలోనే కాలుపెట్టను, తల్లీ! అయినా నోమనీమడిఅనీ నీకుంటేనా? అసలు పట్టననే మొదటినుంచీ పట్టుబడితివి. అంతరాద్ధాంతాలతోపట్టిననోము ఇంతకంటె అఘోరిస్తుందేమిట్లే. నీయిష్టమొచ్చినట్లే చేసుకో. ఇంకా ఆ సుందరిమీదపడి దానిపూలతోటే చెయ్యిపూజ. ఎవరిక్కావాలి, ఏదోపెద్దదాన్నిగనక ఈ అఘాయిత్యాలు చూడలేక ఇలా అంటాగాని నామాటెవరిక్కావాలి?" అని గిరుక్కునవెళ్లింది శేషమ్మ.

పూజ అయింతరవాత అమ్మవారికి "మంగళమోరాఘవేంద్ర" అనీ, "మంగళంచిత్రాశ్వరాణిరో అశ్వపతిపుత్రీ సత్యవంతునిపత్ని సావిత్రీ" అనీ మంగళహారతులుపాడి పూజ ముగించారు. అందులోకొందరు అమ్మవారికలా పాడతారా అంటే కొందరు పాడినవాళ్లు పరమభక్తురాళ్లనీ, వారికి దేవిఅనీ దేవుడనీభేదం లేదనీ చెప్పుకుని ఇళ్లకునడిచారు.

నిమ్మళంగావాళ్లాడించాలిసిన రోజొచ్చింది. పళ్లాల్లోపెట్టుకున్న పూలుతగ్గిపోయాయేం అనికొందరూ, బుటలో ఇంకా అరటిపళ్లుండాలనికొందరూ వెతుక్కోడాలతో సగంకాలంగడిచింది. పడుతూలేస్తూ ఎలాగో వెంకన్నశాస్తుర్లు చెపుతూన్నవిధంగా అమ్మవారిమీద అందరూచేతులేసిదింపారు. మళ్లీ ఎన్నాళ్లకో అని అందరూ బయలుదేరారు.

వాళ్లాడించడం అయింది. తెచ్చిన అటుకులు అయిపోతే పక్కవాళ్లని అడిగిపుచ్చుకొని ఎటిగున్నవాళ్లు కనబడ్డప్పుడుపెట్టి గౌరవం నిలబెట్టుకున్నారు కొందరు. ఇళ్లకుచేరేప్పటికి రాత్రి ఏడుగంటలైంది. దీపంవెలిగించి మీనాక్షి 'అమ్మయ్య' అనికూలబడింది అలసట తీర్చుకోడానికి. వెనక్కుతిరిగి చెల్లెల్నిచూసేప్పటికి చెవలదుద్దులు లేవు. తెల్లబోయి 'ఏమే! దుద్దులేవే' అంటే 'ఏమోనే' అనేమాటలతోటీ, 'ఈ ఏడు ఏమిటమ్మా అన్నీ యిలాగేవచ్చాయి, ఆచారాలుతప్పేవాళ్లకి అంతే అపరాధ'మనే శేషమ్మ సాధింపులతోటీ ఆ రాత్రిగడిచింది.

# వంటమనిషి సరదా

శ్రీమతి జమ్మి సీతాబాయిగారు

(కేవలము వినోదముకొఱకు)

నాకు వంటచెయ్యడమంటే మహాఅసహ్యం. అది నాజూకయిన పనికాదని నావుద్దేశం. ఈజీ ఛైరులో పడుకుని నవలలుచదవడం, అల్లికలు మొదలైనపనులుచేయడం అంటే నాకుచాలాయిష్టం. కానినాకు యేనియం దయిష్టమో అదినాచేతచేయించడం మావారికి యిష్టము. వంటమనిషినిచూడమని యెన్నిసార్లుఅన్నా రేపుమాపు అనిజరపడం మావారికి ఆచారంఅయింది. అది సగముక్రిందసగముమీద పారబోస్తుందనీ, రుచిగా చెయ్యదనీచెప్పి నామనసుతిప్పేందుకు ప్రయత్నంచేస్తూంటారు. ఈలా ఆటంకాలుచెపుతున్నందుకు ఆయనమీద కోపంవచ్చి యిక అడగవద్దు అనుకునేదాన్ని అప్పుడప్పుడు. కాని తొమ్మిదిఅయేసరికి వంట అయిందా లేదా అనిమాత్రం రోజూ హడావిడిచేస్తూంటారు. అలాంటప్పుడు నేను "లేచి కాఫీత్రాగి జడవేసుకుని స్నానము చేసి వంటచెయ్యడానికి వచ్చేసరికి యింతఆలస్యమవుతుంది. ఇదే వంటమనిషయితే యీపాటికి చక్కగావండి మీకూ నాకూ పిల్లకూకూడా పెట్టేసునుకదా!" అని మొహం ముడుచుకుని అంటే "అదేమిటే అలా అంటావూ! అనవసరంగా డబ్బుఖర్చౌందకని అలా అన్నానుకాని చూడు రేపీ పాటికి వంటమనిషివంటచేస్తూంటే నువ్వు సూదీవూలూ పుచ్చుకుని సోఫామీద కూచుంటావు" అని నన్నువూరించి భోజనంచేసి కచేరికి వెడుతుంటారు. ఒకొక్కనాడు "నాస్నేహితుడు వకడు గుంటూరులోవున్నాడు. వాడికి రాశాను. పంపుతాడు. రేపు జబాబువస్తుం"దనీ అంటూంటారు. ఇలాగే రోజులుగడిచిపోతున్నాయి.



శ్రీమతి జమ్మి సీతాబాయిగారు

ఒకరోజున మావారు భోజనంచేసి ఆఫీసుకివెళ్లేరు. నేను భోజనంచేసి పని తొందరగాచేసేసుకొని పుస్తకం వకటి చదువుకోవలెనని చేతితోపట్టుకొని పుటలుతిరగేస్తూ కుర్చీలో కూలబడ్డా. రెండుపేజీలు చదివానో లేదో యెక్కడనుంచివచ్చిందో మాఅమ్మాయి రివ్వున బాణంలా వచ్చి "ఇదేమి పుస్తకమే" అని చరాలున చేతిలోనుండి వూడపీకింది. ఆపళంగా వళ్లుమండుకొచ్చి వక్కటి అంటించా. ఇక పుస్తకం ముట్టుకోలేదు. వంటమనిషివుంటే ఇంతయిది వుండకపోవునుకదా. ప్రొద్దుటినుండీ పనితీరికలేక చివరకు ఆసక్తితో చదువుకుంటూవుంటే విఘ్నమాఅని, మావారు చేయుచున్న అశ్రద్ధకు మరింత కోపంవచ్చింది. కాని మాఅమ్మాయిదగ్గరలేదుగనుక నాకోపం అణచుకొన్నా. ఇక యీరోజున వండగూడదనుకొన్నా. ఇంత మొండితనంచేస్తేనేగాని నాకోర్కె తీరేటట్టుగాలేదు. మళ్లీ పుస్తకం తీసుకొని చదువుకుంటూ కూర్చున్నా.

సాయంత్రం ఆరుగంటలయింది. మావారు వచ్చేవేళయిందని కనిపెట్టి మరింతదీక్షగా పేజీలు తిరిగేస్తున్నా. మాపిల్ల ప్రక్కయింటిపిల్లలతో ఆడుకుంటున్నది కాబోలు. తండ్రిగారు రావడంచూసి యెదురువెళ్లి

"నాన్నగారూ! అమ్మకు ఎందుకో కోపంవచ్చింది. నన్ను కొట్టిం"దని చెపుతూవున్నది. వాళ్లు నేనుకూర్చున్నగది కిటికీలోనుండి నాకు కనపడుతూనేవున్నారు. సరే వస్తున్నారుకదా అని నేను పుస్తకం క్రిందపడేసి నిద్రనటించాను. మావారు లోపలికివచ్చినట్టు జోడు చప్పుడు వినిపించింది. అంతట్లోకే ఆగిపోయింది. నేను వంటమనిషి విషయమై వుత్తరంవచ్చిందంటారేమోనని చెవులురిక్కించుకొని పడుకొన్నా. "అమ్మని లేపు, ఉత్తరం వచ్చింది" అని అన్నారు. అదిమాత్రము నాదగ్గిరకు రావడానికి ఇష్టపడలేదు. ఉత్తరంమాట చెవిని పడేసరికి ఎక్కడికోపం అక్కడేయెగిరిపోయిందినాకు. "ఏమనివ్రాశాడండీ, వంటమనిషిని యెప్పుడుపంపుతానన్నాడు? బాగా వంటచేస్తుందనివ్రాశాడా? రేపేనా? ఏరయిల్లోవస్తుంది?" అని ఇత్యాదిప్రశ్నలతో అయన్నితొందరపెట్టేశా. "ఉండుమరీ. అంతతొందరగాఅడిగితే ఎల్లా, నన్ను చెప్పనిస్తావా?" అని కోటువిప్పుకుంటూ జవాబిచ్చారు. ఎపుడు చెపుతారాఅని తొందరచేస్తే మళ్లీ రావద్దని రాస్తారేమో అన్నభయంచేత నోరుతెరుచుకొని ఆయనమొహం కేసిచూస్తూ కూచున్నా.

ఇంతలోకే యెవరో బంట్రోతు శనిలాగ మావార్ని పిలుస్తున్నాడు. ఆయన తొందరగా వెళ్లిపోయారు. "సరే వూరికేకూచోడంయెందుకు పాపం, పిల్ల మధ్యాహ్నం కొప్పడినభయంచేత మళ్లీ అన్నంకూడా అడుగలేదు, రేపటినుండి వంట నాకక్కరలేదుకదా, ఈపూటేకదా" అని లోపలికివెళ్లి స్టవువెలిగించివంటమొదలుపెట్టా. అరగంటలో మావారు లోపలికివచ్చారు. ఉత్తరంలో ఎప్పుడు పంపుతానన్నాడా అన్నధోరణే నాది. నావుద్దేశం గ్రహించి "వుత్తరం యెక్కడనుంచనుకున్నావు. మీఅక్కయ్యకు కొడుకుపుట్టాడుట" అన్నారు. ఇక నేను యెంతనిరుత్సాహపడ్డానో గ్రహించుకోండి. రేపటినుండి వంట నాకుఅక్కర్లేదుకదా అని అప్పుడు నేను చెయ్యవలసినపనులు తలచుకొంటూవున్న నాకు సంతోషకరమైనవార్త తెలిసినప్పటికీ రేపువంట తప్పదు అని తెలిశేసరికి నిలువునా నీరైపోయా. నాఅవస్థచూసి మావారు నవ్వమొదలుపెట్టారు. దానితో ఏడుపుకూడావచ్చి మేడమీదికిపోయి పడుకున్నా. వంట అయిందిగా. అందుచేత నన్ను బ్రతిమాలనక్కరలేకుండానే వడ్డించుకొని భోజనంచేశేసారు మావారూ, పిల్లానూ.

ఆరాత్రి నేను భోజనంచెయ్యనేలేదు. మరునాడు ప్రొద్దున్నే కాఫీ కాచాలి. ఇక మావారు మళ్లీ యెప్పటిపాఠమే మొదలుపెట్టారు. "అల్లాకాదు. నేను మీమాటలు వినను. ఈసాయంత్రం రైల్లో వంటమనిషి వచ్చితీరా"లని ఖండితంగాచెప్పాను. "సరే టెలిగ్రామిస్తాను. తప్పకుండావస్తుంది. కాఫీ తయారుచేసే లోపల టెలిగ్రామిచ్చివస్తా"నని వెళ్లారు. అక్కడికి కొంతసంతోషంవచ్చింది. త్వరగా కాఫీచేసి సిద్ధంగా కాచుకొని కూర్చున్నా. మావారువచ్చి "సాయంత్రం నాల్గున్నర రైల్లోవస్తుం"దనిచెప్పారు. "అమ్మయ్య! ఇక ఈపూటేకదావంట" అనుకున్నా. కాఫీలుకానిచ్చేసి వంట చురుగ్గాచేసేసా. భోజనంచేసి వారు ఆఫీసుకు వెళ్లిపోయారు. క్రమంగా నాలుగుగంటలయింది. నాఆత్రం యేమనిచెప్పను? చీమ చిటుక్కుమంటే వంటమనిషేనని లేచిచూస్తున్నా.

ఎలాగైతేనేం టైము అయింది. రైలువచ్చినట్టు తెలుసుకున్నా. గుమ్మంలోచూస్తూనిలబడ్డా. దూరాన్నించి తెల్లబట్ట వెధవమనిషి వస్తున్నట్టు కనిపెట్టా. తప్పకుండా ఆవిడే మావంటఆవిడ అయివుంటుందనుకున్నా. చేతిలోమూట మొయ్యలేక మొయ్యలేక అవస్థపడుతూందావిడ. మాగుమ్మాలేమయినా కొంచెంపెద్దవి చేయించాలేమోనని భయంపట్టుకుందినాకు. ఎలాగయితేనేం దారిలోవున్న వాకిళ్లలోనూ అరుగులమీదా కూచుంటూ లేస్తూ చివరకు మాయింటికిచేరింది. తెల్లబోయి నన్నుచూస్తూ "యిదేనాండీ ఫలానివారిల్లూ" అని మావార్ని అడిగింది. "అవును లోపలికి రం"డని మొహం చేటంతచేసుకుని చెప్పా. కాని ఆవిడ లోప

లికిరాకుండానే గోడ్డుమీదనిలబడి "గుమ్మంలోనిలబడి లోపలికిరమ్మంటావెట్లా? కొంచెం పెద్దముండననీ ఆచారంగావుంటానేమోఅనీ ఆలోచించుకోనక్కరలేదూ." అని పెద్దగొంతుతో మొదలుపెట్టింది. ఈవాగ్ధోరణిచూసి నాకు భయంవేసింది. నేను వాకిటవున్నానని ఆవిడ తలచుకొన్నట్లు తెలుసుకుని కొంతభయంఅణచుకొని "వాకిటవుండలేదు. లోపలికిరావచ్చు"నని చెప్పా. దానితో కొంతశాంతించి "ఆహా! అట్లాగా?" అనుకుంటూ మందగమనంతో లోపలికివచ్చి మూటవకచోటపెట్టుకొని కూలబడింది.

సరే కుశలప్రశ్నలతరువాత ఆవిడపేరు సోదెమ్మ అనీ, ఇద్దరుకూతుళ్లనీ, వకఆవిడ యెక్కడో దక్షిణాదినివున్నట్టు, వకఆవిడ యీవూరిలోనేవున్నదనీ, వాళ్లుపడుతూన్న కోడండ్రికమూ మొదలైనవిచెప్పడం మొదలుపెట్టింది. ఎంతసేపటికీ వంటకులేవదు. మావారు ఆఫీసునుండి రావడంతోటే భోజనంచేస్తారు. ఇక ఈవిడ తనంతట తను లేచేటట్టుగాలేదు. సార్థకనామురా లేరాబాబూ అనుకుని "లేచి స్నానముచెయ్యండి. వంట త్వరగాకావా"లన్నాను. "ఇదేమమ్మా. ఇంతపెందలకడనే ఏమివంటమ్మా? ఎప్పుడూఇలాంటప్పుడువంటకు ప్రయత్నంచెయ్యలేదు." అని విసుగుకుంటూ లేచింది. "ఇదేమిటిరాబాబూ అప్పుడేసాధింపుమొదలుపెట్టిం"దని భయపడుతూ లోపలికిపోయా. ఎలాగయితేనేం రాత్రితొమ్మిదిగంటలకి వంట అయిందన్నమాట ఆవిడ గొంతులోంచి వూడిపడింది. సగంనిద్రలోవున్న పిల్లనూ మావారినీలేపి అన్నంతిన్నాం అనిపించాం. ఆపూటకి.

వంటమనిషియొక్కసుఖం అప్పటికేనాకు తెలిసిపోయింది. అల్లాగు కొన్నిదినాలుగడిచేసరికి రెండువారాలకిసరిపడే వీసెడునెయ్యి నాలుగురోజులేరావడం, ఇంట్లోకి కావలసినవస్తువులన్నీయెన్ని తెప్పించినాసరే రెండురోజులకేఅయిపోవడం, క్రమంగా ఇంట్లో ప్రతివస్తువు కనబడకపోవడం సంభవించాయి. మాకు నెలకు సరిపోయేడబ్బు వారానికి చాలేదికాదు. చూసినవాళ్లు బట్టలోపెట్టుకొని కూతురింటికి ఏమిటో తీసుకువెడుతూవున్నదనిచెప్పడం విన్నాను. ఆవిడను అడిగితే కస్సుమనిలేచింది. దానితో ఇకవంటమనిషి వద్దురాబాబూ అని నాకు చాలావిసుగుపుట్టి "ఇప్పటికి మీకెంతడబ్బు అయినదో తీసుకొని మాయిల్లు వదలి మమ్మ కృతార్థులను చేయవలసిన"దని కోరాను. సాయంత్రం మావారువచ్చేసరికి వంటచేసుకుని తయారుగావున్నాను. భోజనానికి లేవండనిచెప్పి నేనే వడ్డనచేస్తూంటే తెల్లబోయిచూస్తూ "ఇదేమిటి? సోదెమ్మగారు యేరీ?" అన్నారు. "ఆవిడవల్లకలిగిన నష్టములు తెలుసుకొని పంపించేసా"నని చెప్పేసరికి "అయితేయికరోజూ వంటమనిషికోసం వేధించడం తప్పిం"దన్నారు.

# వెన్నెల్లో

పెమ్మరాజు రాజగోపాలముగారు బి.యె, (సారస్వతసమాజము)

ఈమనోహరచంద్రికాధవళధవళ
పూరవారాశి లోకాని ముంచివైచి
శాంతతేజోవిరాజితజగముజేసె.
తారకాహీరహారాలు రెండొమూడొ
కాని నాజూకుకాబోలు గగనకాంత
స్వల్పముగవైచుకొన్నది. ఆవినీల
నిశ్చలగభీరరామణీయకత దర్శ
నీయమేకాని వర్ణింపతరముకాదు.

పుష్పితారామసీమలు, ఫుల్లకైర
వాంచితతటాకములు, పవమానవీచికా
పులకితనగాలు యీకరగిపోసి
నట్టివెన్నెలవెండిక్రొందళుకులోన
మెఱయుచున్నవి, నామెయినిండి
పొంగితొల్కాడు నానందపూరముబికి,
ఎంతసుందరమైనదో యీధరిత్రి.

# ప్రియంవద

సామవేదం జానకిరామశర్మగారు

మూడువందలసంవత్సరములక్రిందట వంగదేశమున శివరామశాస్త్రియను ఒకానొక సుప్రసిద్ధపండితుడుండెడివాడు. ఆయనవద్దకు పలుతావులనుండి విద్యార్థులువచ్చి విద్యనభ్యసించుచుండెడివారు. ఒకానొక సాధారణ గృహమునకుముందు శీతలవృక్షచ్ఛాయ నాతడు విద్యాదానముగావించుచుండెడివాడు. శివరామశాస్త్రి శిష్యులకు కావ్యాదుల బోధించునపుడాతని కొమరితచెంతనుండి మిగుల శ్రద్ధగ నాలించుచుండెడిది. సంస్కృతమామెకు అర్థముగాకున్నను వినుట కింపుగనుండుటచే నామె దానికొఱకు ఆటలనైతము మఱచుచుండెడిది. భుజించునపుడుదక్క తక్కినసమయముల యందామె పాఠశాలయందే యుండెడిది. విద్యార్థులెల్లరామె ప్రాతఃకాలమున క్రిందిశ్లోకము మధురస్వరమున గానముసేయ విని యానందించెడివారు.

శ్లో॥ యాకుందేందు తుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా।
యావీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా।
యాబ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిర్దేవైస్సదాపూజితా।
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా॥

ప్రతిదినమును పాఠశాలయందు విద్యార్థులు పఠించు శ్లోకముల నాకర్ణించి, వానిని కంఠస్థములుగ జేసికొనుచుండెను. పగలు పఠించిన శ్లోకములకు తండ్రియగుశివరామశాస్త్రిచే రాత్రిఅర్థములను జెప్పించుకొనుట యామెకువాడుక.

శివరామశాస్త్రి పుత్రిక విద్యాభిలాషయు మేధాశక్తియు నారసి విద్యార్థులతో నామెకు పాఠముల నేర్పుట కారంభించెను. అత్యుత్సాహముతో నామెతండ్రియొద్ద విద్యనభ్యసించుచు నచిరకాలముననే సంస్కృతభాషయందు పాండిత్యము సంపాదించెను. తక్కిన విద్యార్థులీమెగ్రహణశక్తియు, నిరంతరవిద్యాభిలాషయు నారసి అసూయాగ్రస్తులైరి. కొన్నిరోజులకామె చిన్నచిన్న పాఠములను విద్యార్థులకు బోధించుటయు, సహపాఠులతో కావ్యచర్చజేయుటయుజూచి శివరామశాస్త్రి మిగుల యానందముజెందెను. ఆమె యెల్లపుడు శాంతముగను, ప్రియముగను మాటలాడుచుండుటచే నామెను విద్యార్థులందరును "ప్రియంవదా"యని పిలుచుటకారంభించిరి.

యుక్తవయస్సురాగానే శివరామశాస్త్రి కొమరితను "రఘునాథమిశ్ర"యను యువకునకిచ్చి వివాహముగావించెను. ప్రియంవద పాండిత్యము నలవఱుచుకొనిన పిదప సంస్కృతమున కవిత నల్లుట కారంభించెను. తండ్రి యానతిపై నామెప్రథమమున తనయిష్టదైవమగు గోవిందునిపై నీక్రిందిశ్లోకమును వ్రాసెను:

శ్లో॥ కాళిందీపులినేషు కేలికలనే కంసాదిదైత్యద్విషం।
గోపాలీభిరభిష్టుతం వ్రజవధూనేత్రోత్పలైరర్చితమ్।

బర్హాలంకృతమస్తకం సులలితైరంగైః త్రిభంగం, భజే!
గోవిందం వ్రజసుందరం భవహరం వంశీధరం శ్యామలమ్॥

ఈశ్లోకమును ప్రియంవద పాఠశాలయందు చదివినపుడు, విద్యార్థులును, తండ్రియు కవితాప్రారంభముననే వ్రాసిన ఆశ్లోకమునుగాంచి యచ్చెరువొందిరి.

అత్తవారింటికేగిన పిదపగూడ ప్రియంవద విద్యాగోష్ఠిని వీడలేదు. ప్రియంవద భర్త సాధారణపండితుడు. విశేషించి ధనవంతుడునుగాకుండుటచే గృహకృత్యములన్నియుఆమెయే నిర్వర్తింపవలసివచ్చెను. ఆమెకు విద్యాభిమానముమెండైనను ఎన్నడునామె గృహకృత్యములపై నీచతనారోపింపలేదు. భర్తృసేవ, గృహకృత్యనిర్వహణము, అతిథిసత్కారము, గోపూజ మొదలగుపనులయందుగూడ మిగుల భక్తిశ్రద్ధలతో ప్రవర్తించుచుండెడిది. తీరిక యైనపుడెల్లయామె సద్గ్రంథపఠనమొనర్చెడిది. ఏహస్తముచే నామె కోమలకవితాభ్యాసము గావించుచుండెడిదో ఆహస్తముచేతనే గృహపారిశుద్ధ్యమునకై చీపురును స్పృశించుటకు ఆమెమనస్సెన్నడును సంకోచమునొందలేదు.

ప్రియంవదకు పతిపై భక్త్యనురాగములు మెండు. భర్తవాక్యముల నామె వేద సమానముగ గౌరవించుచుండెడిది. భర్తకడకు విద్యాభ్యాసముజేయవచ్చిన విద్యార్థులకు ఆమె స్వగృహమున భోజనాదిసదుపాయములను గలుగజేసెను. విద్యార్థులామెను మాతృసమానముగగౌరవించుచుండిరి. ఈమె మార్కండేయపురాణమందలి మదాలసచరితమునకు టీకయు, మహాభారతమందలి శాంతిపర్వాంతర్గతమగు మోక్షధర్మమునకు విపులమగు వ్యాఖ్యయు వ్రాసెను. భర్త యనుమతిపై నామె నాగరలిపియందున్న సంస్కృతగ్రంథములను వంగీయలిపియందు వ్రాసెను. ప్రథమమున ప్రియంవదకు కావ్యములయందభిరుచి మెండైనను, భర్తృగృహమునకేగినపిమ్మట మీమాంసశాస్త్రమునందు పరిచయముకలుగజేసికొనెను. భర్తయాజ్ఞనుమీరక నిరంతరము సద్గ్రంథపఠనమొనర్చుచు గృహకృత్యనిర్వహణము, గోపూజ, అతిథిసత్కారము మొదలగుధర్మకార్యములయందు శ్రద్ధవహించుచు జీవితముగడిపిన ఈవిదుషీమణిచరిత్రము వనితాలోకమునకాదర్శమై వెలయుగాత!

## పలుకరింపు

కొసరాజు రాఘవయ్యా చౌదరిగారు

జీర్ణశల్యాలలో జీవంబుబుట్టించు
దేశాభిమానసందేశములను,
తలపోసికొన నొడల్ పులకరించు భారత
శిల్పచిత్రకళావిశేషములను,
ప్రకృతిగర్భంబులోబడి గొట్టుమిట్టాడు
తరుణీమణుల పూర్వచరితములను,

భావదాస్యము పటాపంచలై పోవంగ
సంఘసంస్కారప్రసంగములను,
బీరువోనీక కడదాకనేరికూర్చి
క్రమముదప్పక నడయాడగష్టమనక
నెలనెలకువచ్చిమాకు వినిపించుచుండు
సరసగృహలక్ష్మి! నీకిదేస్వాగతంబు.

# తాంబూలము

మ. సూర్యప్రకాశరావుగారు

హిందూదేశములో తాంబూలచర్వణం యుగయుగాలనాటినుండి పరిపాటిగాఉంది. అది హిందూ గృహంలోని నిత్యకృత్యాల్లో ఒకటిగా ఎట్లు వ్యవహారంలోనికివచ్చిందో నిరూపించడం కష్టం. పెదవులకి రక్తి, నోటికి వాసన కూర్చడానికి సృజింపబడ్డదని సగసాగ్రేసరులు చెపుతారు. దీని యమూల్యగుణాలను గూర్చి హిందూపురాణభిషగ్వరులు తమ వైద్యగ్రంథాల్లో సువర్ణాక్షరాలతో లిఖించినారు. స్థానభేదాన్ని బట్టి దాన్ని ఉపయోగించేవిధానంకూడా మారుతుంది. ఎవరు ఎన్నివిధాలుగా వినియోగించినా అందులో వాడ వలసిన ముఖ్యపదార్థాలు మూడు. తమలపాకులు - వక్క - సున్నము. ఉత్సాహాన్నిగూర్చడానికి, మధుర వాసన లెగజిమ్మడానికి, లాలాజలాన్ని అభివృద్ధిచేయడానికి, ఉచ్ఛ్వాసనిశ్వాసాలను మధురించడానికి ఏల కులు, జాజికాయ మొదలైనవి ఉపయోగిస్తారు. తాంబూలమును వాయుహరఔషధంగాకూడ వాడుతారు.

ఈయభ్యాసం మనకెట్లయింది? ఎందుకయింది? అని మీరుపృచ్ఛచేయవచ్చు. దానికొక్కటే ప్రత్యుత్తరం. ఇతర మత్తుపదార్థాలనుండి విముక్తిగాంచడానికి దీనిని విశేషం వినియోగిస్తూఉండేవారు. జనబాహుళ్యంలో ఇది ఎంతవఱకు అభ్యాసంలోనికి వచ్చిందిఅంటే, హిందూఆచారాల్లో కలిసి ఇదికూడ ఒకఆచారమయిపోయేవఱకు అభ్యాసమయింది.

ఎవరైన హితులుగాని, బంధువులుగాని మనగృహాలకి విచ్చేసినట్లయితే వారికి మర్యాదపూర్వకంగా తాంబూలము ఇచ్చుట సత్కారము. భోజనానంతరంకూడా తాంబూలసత్కారం మామూలు. ఇది పరిమళాన్ని కూర్చడానికేగాక జీర్ణశక్తికికూడ తోడ్పడుతుంది. అతిథులకు ప్రథమాన్ని దీన్నిసత్కరించడం సురభిళంకోసం, భోజనానంతర సత్కరించడం జీర్ణశక్తి నభివృద్ధిచేయడంకోసం. దీన్నిబట్టి మనం గ్రహించవలసిన విశిష్టవిషయం ఒకటి. అభ్యాగతిని, అతిథిని భోజనాదికములతో సంతృప్తినిచేయడమేగాక వారి ఆరోగ్య విషయాల్లోకూడా శ్రద్ధవహించుట.

ఇది సాంఘికాచారంగాకాక, మతాచారంగాకూడప్రచారంలోనికివచ్చింది. వివాహాదిశుభకార్యాల్లో వధూవరులను పాన్పులపైకూర్చోబెట్టి ఒకళ్లొకళ్లకి ఆకుమడుపులని అందింపచేస్తారు. అదీగాక కళాశాస్త్రములో చెప్పబడిందేమిటంటే స్త్రీ తననాథుని శయనాగారములోనికి, అభ్యంగనస్నానముచేసి శుభ్రవస్త్రాలనుదాల్చి, కస్తూరితిలకము నెన్నుదుటదిద్ది, సువాసనామిళితమైన తాంబూలపరిమళంపు గుప్పని గుబుల్కొన నవ్వువెన్నలతో తాంబూలపళ్లెముతో ప్రవేశించాలని. అప్పుడామె వీడెంవేసుకోవడం తీయనిఊర్పులుకలగడానికీ, ప్రియునకు సిగ్గుదొంతరలు కంటిరెప్పలతూగాడ తాంబూలమీయడం ఆతనికి ఉద్రేకాన్నిగూర్చడానికీ అని నాఉద్దేశం. వైద్యులు విశేషంగా నిష్కాములకు కామేచ్ఛను కలిగించడానికని దీన్ని వినియోగిస్తూ ఉండేవారు.

ఔషధరూపకంగా ప్రచారంలోవున్న తాంబూలం సాంఘికాచారంగాపరిణామమంది ఇంటికివచ్చిన యతిథికి రుచించినా రుచింపకపోయినా గౌరవతాత్పర్యంకోసం తాంబూలం సత్కరించడం అలవాటయింది. ఆరోగ్యసంబంధమైన ప్రథమోద్దేశం పూర్తిగా కుంకుడువేళ్లతో మటుమాసిందికాని ఆయభ్యాసంమాత్రం పోయిందికాదు. ఈచిరంతనాభ్యాసము కొన్నిదేశాల్లో వ్యసనంకిందకూడామారిందీ. కొంతమంది-నాస్నేహితులలో కొందఱిని నేనెఱుంగుదును-వారి కన్నపానాదులకన్న తాంబూలచర్వణమే విశిష్టకృత్యం.

తాంబూలానికి అలవాటుపడినవాడు తాంబూలము నోటిలోలేనివేళల లాలాజలాన్ని పదేపదే ఉమ్మి వేస్తూఉంటాడు. లాలాజలంయొక్క సహజలక్షణం జీర్ణశక్తికి తోడ్పడడం. ఊరక ఉమ్మివేస్తూఉంటే అది వ్యయించిపోతుంది. తాంబూలము జీర్ణశక్తినికలిగిస్తుందని చెప్పుతూ తమలపాకు ఈనెపన్నా విరుద్ధగుణాలని నిరూపించడంకూడా నావిధి.

అది వంధ్యత్వాన్ని అపాదిస్తుందని, అందుకనే ఈనెప తీసివేస్తారని కొందరి మతం. వారాంగనలు ఈనెలను తీయకుండగనే తాంబూలము సేవిస్తారట. వారివంధ్యత్వానికి విశేషంగా కారణం అదేనట.

ప్రజ ఆయభ్యాసానికి పరాక్రాంతమవడమేకాక జఠరీయంగా, అంత్రీయంగా ఉద్రేకాన్ని పుట్టిస్తుందని, జీర్ణశక్తికి, సదారోగ్యానికి మూలకందమని వారి గాఢవిశ్వాసము. ఆగాఢవిశ్వాసానికి ఏమీ ఆధారభూతం లేదు. ఎందుకంటే తాంబూలానికి వెర్రిగాఅలవాటుపడినవాళ్లు (Dyspeptic) అజీర్ణరోగంతో (Pyorrhoea) దంతవ్యాధితో బాధపడుతారు.

నేననుభవించడమేకాక పెక్కుచోట్ల దాని గుణాగుణాలని పరీక్షించిచూచాను. దానిగుణాలకన్న దుర్గుణాలే సమధికం. ఈదుర్గుణాలవిషయం నాఆంధ్రసోదరసోదరీమణులకు విన్నవించడము నావిధి.

సర్వదా తాంబూలచర్వణంవల్ల దంతగ్రంథి (Gum) ఆమపుపొర (Mucus Membrane) వాటి స్పర్శజ్ఞానాన్ని గోలుపోయి మొక్కపోతవి.

దంతపుష్టి తగ్గి క్షీణించిపోవడమేగాక పంటి పైభాగాలను పుప్పిపట్టుతుంది.

పండ్లకొకవిధమైన గారపట్టుతుంది. దానికి హేతువు తమలముతో వేసుకోవలసిన సున్నముకన్న విశేష సున్నము వేసికొనుట. సున్నము శరీరములోఉంటుంది. అది లోనుండి పైకివచ్చి లాలాజలముతో మిశ్రమై గార (Tartar) దంతాలకుపట్టుతుంది. ఎక్కువసున్నంవల్ల రక్తప్రవాహధాటి ఎక్కువై దంతాలకు పాచిపట్టుతుంది. సున్నము విశేషంగా వాడడంవల్ల లాలాజలంయొక్క సహజగుణం మారుతుంది. వక్కముక్కలు, తమలపాకు చిన్నిచిన్ని రేకలు పండ్లసందుల ఇరికికొనుటచే అచ్చటవున్న మాంసకండరము కుంచింపబడడమేకాక అచ్చటనుండి చీముకారడమువకుగాని చీముఏర్పడడమునకుగాని వీలగుతుంది. ఈనిరంతరోద్రేకానికి దంతగ్రంథి వాచి నెమ్మదినెమ్మదిగా చీముపట్టి సడలిపోతుంది. దంతగ్రంథి బలవిహీనం కావడంతోటే దంతాలు పటుత్వంతప్పి రాలిపోతవి. ఆమపుపొర అంతరించిపోతుంది.

కొందరువీడెములో పొగాకు, పొగాకుతో మిళితమైన మసాలాద్రవ్యాలు ఉపయోగిస్తారు. ఇదినోటిలో ఉండే సన్నపొరలకు వికారాన్ని కలిగిస్తుంది. అట్టివారు భోజనాదికములయొక్క అభిరుచిని గోలుపోతారు. మన హిందూదేశములో ప్రజలకుగలుగు దంతవ్యాధులకు విశేషకారణము తాంబూలచర్వణమే. దీనివల్ల నాలుకమీద, దవడలమీద రణాలులేస్తవి. దంతవ్యాధి శరీరంలో వివిధరుగ్మతలుకలగడానికి సహకారి అవుతుంది.

దేనిద్వారా మన జీవితయాత్ర పెంపొందడానికి దోహదంచేసుకుంటున్నామో అట్టినోరే రుగ్మతాపీడితమైతే జీవితయాత్ర సాగడంఎట్లు? దంతవ్యాధి అంతటితో ఆగిపోతున్నదా అంటె వివిధరోగాలని రేపి వాటికిసహకారి అవుతుంది. దీనికంతకుకారణం అమితంగా తాంబూలము సేవించడమే. ఇది వైద్యశాస్త్ర పరిజ్ఞాతల అమూల్యాభిప్రాయము.

# విద్యార్థినులు

వేంకటకాళిదాసకవులు

౧

ఎవ్వరోవీరు? గుంపులై యిప్పుడెదురు
వచ్చుచున్నారు,ముచ్చటల్ పల్కువారు!
మోహనమ్మగు నేమి కోలాహలమ్ము!
ఈపథమ్మున కీవేళ నెంతశోభ!

౨

పరికిణీకుచ్చెళుల రాపుపడిన వీరి
చరణమంజీరములమృదుస్వనములేమొ!
కదలికలు గల చేతుల వదలలేని
పసిఁడిగాజుల మధురనిస్వనములేమొ!

౩

హస్తముల సంతరించిన పుస్తకములు!
అధరముల్పై వినిర్మలహాసరుచులు!
చక్షువులలో నమాయికవీక్షణములు!
మానసమ్ముల నానందమధురిమములు!

౪

బాల్యమెడలని యెన్నెన్ని పరికిణీలు!
వయసువచ్చిన యెన్నెన్ని వల్లెవాటు!
లెదిగి జ్ఞానముఁగొన్న యెన్నెన్ని చీర!
లెంతపున్నె; మెట్టియదృష్ట;మేమిఫలము!

౫

వీరు విద్యార్థినులు! సాంధ్యవేళఁ బాఠ
శాల విడనాడి తమతమయాలయముల
కరుగుచున్నారు! చింతనేయెఱుఁగబోరు!
చదువుకొనువారిసంపదభ్యుదయమెంతొ?

౬

పాలచెక్కిళ్ల యీబాలపలుకులోన
నే గభీరవక్తృత్వమ్ము దాఁగికొనెనొ?
బిడియపడునట్టి యీముగ్ధవీక్షలోన
నే జగత్పాలనాధాటి యొనసికొనెనొ?

౭

నవకమీను నీ తెలినవ్వు నివురులోన
నణఁగివసియించునో ప్రతాపాగ్నికీల!
వడియెఱుంగని యీ యంచనడకలోన
నిమిడిపోయియున్నదొ వీరనృత్యశోభ!

౮

భరతమాతృపదాబ్జసేవాప్రసక్తి,
హైందవౌన్నత్యసంపాదనానురక్తి,
యీసమస్తవిద్యార్థినీబృందమందు
మొగ్గదొడ్డిఉన్నవొ ముందుపూచుకొరకు!

౯

వీరివలె భారతీయతన్వీలలామ
లభ్యసింతురుగాక విద్యలు! స్వదేశ
భావిభాగ్యోదయాదిసౌభాగ్యవిరచి
తోన్నతికి శక్తిధారవోయుదురుగాక!

# సుభా...!

శ్రీమతి నిమ్మగడ్డ సత్యవతిగారు

౧

ఎండాకాలము. మిట్టమధ్యాహ్నము. మార్తాండుడు ప్రచండుడై వెల్గొందుచుండెను. పక్షుల కిలకిలా రావములు వినరావు. ఎండవేడిమి సైర్వజాలక పశుసముదాయములు పచ్చికబయళ్లనుండి తరుచ్ఛాయలకును పసులసాలపొంతలకును జేరుచుండెను. గేదెలు ప్రక్కనున్నప్రవాహములో దొర్లాడుచుండెను. చంపీపూరు వీధులన్నియు నిర్జనములైయుండెను. తాపము భరించలేకనో యనునట్లు గ్రామస్థులందరు తమతమ పనులను కట్టిపెట్టి విశ్రాంతి గైకొనుచుండిరి. ప్రకృతియంతయు ప్రశాంతమైయుండెను. అట్టితరి పండ్రెండేండ్లప్రాయము గల బాల యొకచింతచెట్టునీడకూర్చుండి ప్రకృతి శోభాయమానమున కెంతయు ఆనందించుచు నొక్కతరి ప్రక్కనే పారుచున్న నదీతరంగములవలె పొంగిపొరలివచ్చుచున్న దుఃఖతరంగములు లోలో నడచుకొనుచు అంతలో లీలామానుషవిగ్రహస్వరూపుని లీలలకెంతయు నాశ్చర్యమందుచు మరియంతలో ప్రపంచమే దుఃఖభాజనముగా తలపోయుచుండును.

చంపీపూరు బంగాళాదేశములోని చిన్నపల్లె. పల్లెమధ్యనుండి స్రవంతి. చుట్టూ తోట. తోటలోని వృక్షములపై పక్షుల కలకలధ్వనులు. ఆవుదూడల అంబా, అంబాయను అరవులు. చూపరులకెంతయు మహదానందదాయకము. ఆహా! పల్లెజీవనమెంతఆనందకరమో, ఎంతఆరోగ్యకరమో పట్టణవాసులకెట్లు తెలియును?

వణికాంతుడు చంపీపూరులో నొకసామాన్యగృహస్థు. ఆయనకు ముప్వురుకూతులు. కన్యలనుకన్నతండ్రి ఈదినములలో పడవలసిన కష్టనష్టములనుపడి సుకేశినీ, సుహాసినీలను వణికాంతుడుపరిణయంబొనర్చెను. అతని మూడవకూతురు సుభాషిణి. తలిదండ్రులకు గారాపుబిడ్డయగుటచే నీమెను వారు సుభాయని పిల్చుచుందురు. ఆమె సహజసౌందర్యానికి తుమ్మెదరెక్కలవలెనున్న ముంగురులు, విశాలమైన నేత్రములు వింతవికాసము కల్పించేయి. తలిదండ్రులు తమయనుంగుబిడ్డయగు సుభనుచూచినప్పుడెల్ల యేలనో లోలోన గుందుచుందురు. గ్రామస్థులు సుభసౌందర్యమునుచూచి సహించలేరేమోయనునట్లుగా వారిలోవారు విచారించుచుందురు.

ఇరుగావిడ పొరుగింటిఅవ్వతో సుభనుచూచి 'తానొకటి తలుస్తే దైవమొకటి తలుస్తాడని సుభాషిణి అనిపేరుపెడితే ఎక్కడైనా మూగపిల్ల అవడమువిన్నామా?' అన్నది.

అవ్వ:—ఎంతఅందముంటే యెందుకు? నోటమ్మట మాటలేకపోయాక. ఏమోకాని, యీమూగపిల్లకు పెండ్లి అవడము కష్టమేనమ్మా!

ఈవిధముగా సుభనుగూర్చి ఆపల్లెటూరిస్త్రీలనేకవిధముల చింతించుచుండిరి.

సుభయెన్నడును తన ఇరుగుపొరుగు, యీడుజోడు పిల్లలతో ఆటపాటలకు పోయియెరుగదు. ఆమె చెలికత్తెలు ప్రక్కనున్ననదీతరంగములు, వృక్షములపైనున్న పక్షులు, దూడల పాకలోని ఆవులు, పాలగదిలోని పిల్లిపిల్ల. ఆమె వీటినే ప్రేమించును, వీటితోనే తనదుఃఖము వెలిబుచ్చుకొనును. వీటిఅన్నిటికంటెను ఆమెకు ముఖ్యమైన స్నేహితుడొకడుకలడు. వాడు చేపలుపట్టు తుంటరిపిల్లకాయ. ఆమె ప్రతిదినము తనపనులను నిర్వర్తించుకొని తనచెలులవద్దకు పోవుచుండును. ప్రతాపుడు నదివద్దను చేపలు పట్టుచుండును. ఈమె వానిసమీపముననే చింతచెట్టునీడ కూర్చుండి ప్రకృతిశోభనుచూచి ఆనందించుచుండును. అప్పుడప్పుడు ప్రతాపునికి తమలపాకులకు సున్నమురాసి యిచ్చుచుండును. ఆనాటి మిట్టమధ్యాహ్నము చెట్టుక్రిందకూర్చుండి యేవేవో తలపోయుచున్నదామెయే.

## 2

'పిన్నీ! సుభకు పెండ్లీడువచ్చినది. యింకాహాడావుడియేమీలేదు. మాటాడకవూరుకున్నారేమి?' అన్నది ఒక స్త్రీ నీలాటిరేవులో. 'ఏమో, యీడొచ్చినపిల్ల. ఇంకాయెన్నాళ్లు అట్టేపెట్టుకుంటారు. ఆడపిల్లఅయ్యేక అంగలోపమయితే తప్పుతుందా, అర్థలోపమయితే తప్పుతుందా? ఎవరిచేతులోనో ఒకరిచేతులో పెట్టాలిగాని, అమర్యాదకూడాను-అలాంటికుటుంబానికి' అని ఒకబాధ్యతమోసిన ఆవిడ. ఈలాగుననే సుభనుగూర్చి అనేకవిధముల చెప్పుకొనసాగిరి.

ఈమాటలన్నియు సుభతల్లికి మనశ్శరములై వేధించుచుండెను. ఈరోజులలో అన్నిలక్షణములూఉన్న ఆడపిల్లకు పెండ్లిఅగుటయేకష్టము. అందులో మూగపిల్లను పెండ్లాడువారెవ్వరు? తక్కినలక్షణములుండినయెడ వచ్చుగాక! తలిదండ్రులు సుభపెండ్లివిషయమై అహర్నిశలు అన్నపానములనువిసర్జించి చింతించుచుండిరి. చివరకు ఆగ్రామస్థులు కుటుంబమును వెలివేయుదురని భయముకలిగినది. ఎట్టకేలకు వణికాంతుడు తనకుటుంబగౌరవమునకు హానికలుగనని భీతిలి సుభ వివాహమునకై కలకత్తానగరమునకు పోవనిశ్చయించెను.

కలకత్తాప్రయాణము సుభ దుఃఖమును మరింత హెచ్చుచేసెను. ఆమె తనజన్మభూమికి, చెలులకు దూరమగుట గోరుచుట్టుమీద రోకటిపోటువలెనుండెను. ఏమియునుచేయజాలక తనప్రేమనువారికితెలియచెప్పుటకు వారివద్ద శలవుగైకొనుటకు పోయెను. అనుదినము తాను ఎక్కడకూర్చొని తనచెలులతోను ప్రతాపునితోను ఆనందముగా కాలముపుచ్చుచుండెనో అట్చటికేగి ప్రతాపునిగాంచెను. అంతట ప్రతాపుడు 'ఓహో సు— నీకుమొగుడువచ్చాడుటకాదు, పెండ్లిఅవుతుందిట. నన్నుమాత్రముమరచిపోకుము'అని పరిహాసముగాఅనెను. సుభ భోయవానివలజిక్కినగువ్వవలెబిక్కమొగమువైచి 'నీకేమిచేసేను నేను'అన్నట్లుగాచూచెను. తరువాతచిన్నతనమునుండిపెంచిన ఆవులవద్దనుండి, పిల్లిపిల్లవద్దనుండి శలవుగైకొని తనదుఃఖాశ్రువులచే వాటిసిబుజ్జగించెను.

## 3

సుభకు పెండ్లివారువస్తారని తల్లి తలదువ్వి జడవేసింది. జడలో పూవులు, మెడలో ఇన్నినగలు, పట్టుదుస్తులు ఆమె సహజసౌందర్యాన్ని కప్పివేస్తూన్నాయి. కలకత్తాప్రయాణమే యిష్టములేని సుభకు ఇవన్నియు నెక్కడ,... ఆనందమా? లేదు, ఆమెకండ్లనుండి దుఃఖాశ్రువులు ధారలుగాకారుచునేయుండెను. అదిచూచి 'పెండ్లికూతురు చూపులకు వస్తూంటే ఇదేమిపని? అశుభము' అని తల్లి కూకలిడెను.

తల్లిదండ్రులకిద్దరకు ఆదుర్దా, పెండ్లికొడుకు యేమంటాడో చేసుకుంటాడోలేదో అని. ఇంతలో పెండ్లికుమారుడు తనస్నేహితునితోవచ్చేడు. తనకుకాబోవుపిల్లనుచూచాడు. కండ్లనుండి రాలుతూఉన్న భాష్పములు పరిశీలించకపోలేదు. వాటినిచూచి అమాయికపుపిల్లఅనుకున్నాడు. ఏలాగో ఆఖరుకి సరే నచ్చింది'అన్నాడు.

మంచిరోజుచూచి ముహూర్తముపెట్టేరు. సుభకుపెండ్లిచేసేరు ఆఖరుకి. తలిదండ్రులు తమకేదోపెద్ద బరువువదలింది అనుకున్నారు. వారికి ఇహానికిపరానికి మోక్షమువచ్చిందనుకున్నారు. చందీపూరు వచ్చేరుతిరిగి.

పెండ్లిఅవగానే మొగుడుతీసుకువెళ్లేడు సుభని. తీసుకువెళ్లగానే తెలిసింది మూగదని సుభ. ఆమె తప్పేమియులేదు. ఆమె యెవ్వరినిమోసముచేయలేదు. ఎవరూతెలుసుకోలేకపోయినా ఆమె కళ్లేచెప్పాయి ఆమె మూగదని ఆవేళ. ఇదివెల్లడిఅయిన కొలదిరోజులలోనే మళ్లీచేసున్నాడు ఆతడు మరోపిల్లని.

అగాధమైన నేత్రములలో, ఆచూపులలో, ఆవిషాదహృదయములో ఏమున్నదో ఎవరికి తెలియదు. అగాధములో తెరంగిన పరమేశ్వరునికితప్ప. ఎల్లప్పుడూ సుభను ఏదోవేధిస్తూనేయుండును.

—రవీంద్రకవిచంద్రుని కథలనుండి.

# ప్రసవము

ఆలూరు రామచంద్రయ్యగారు బి.యె.

తొలిసారి గర్భిణియగు స్త్రీ ప్రసవించువరకును తనకేమి సంభవింపనున్నదో యని వెతజెందును. కాని తప్పించుకొనుటకు వీలులేనందున ఎట్టకేలకు ధైర్యమువహించును. వెనుకటిప్రకరణమున (దసరాసంచికలో) సూచింపబడిననియమముల పాటించుస్త్రీ ఎట్టిభయమునుచెందపనిలేదు. ప్రసవవేదన నరములయొక్కపటుత్వమునననుసరించియుండును. ప్రసవానంతరముకల్గునొప్పు లుపశమింపగనే ఆమెభయముతీరును. మరల ఆవిషయమై ఆమె తలవను కూడ తలవదు. కొందరుస్త్రీలు యితరులకంటె కొంతసేపు అధికముగ వేదనజెందుదురు.

ఎనిమిదవనెలమొదలు తొమ్మిదవనెలవరకు గర్భమందొకవిధమైన ఆరాటముకల్గును. ఇది ప్రసవమును సూచించుచున్నదని కొందరు నమ్ముదురు. కాని అది కృత్రిమబాధయే. అందుమూలమున స్త్రీప్రసవమునకు తగుయేర్పాట్లుచేసికొనుట కవకాశమేర్పడును. ప్రసవకాలము సాధారణముగ నలుబదివారములుండును. గర్భధారణ యెప్పుడైనది స్త్రీయే తీర్మానింపదగియున్నది. గర్భముకలిగిన సుమారు 275 లేక 280 దినములకు ప్రసవించుట సహజమైయున్నది. కొందఋస్త్రీలు ఋతుస్రావదినముల లెక్కపెట్టుకొనియుందురు. ఇది మిక్కిలి ఉపయోగకరము.

ప్రసవమగుటకు రెండువారములకుముందు గర్భము కొంతక్రిందికిజారి ఊపిరియాడుటకు సులభమగును. మూత్రము తనంతటస్రవించుట కారంభమగును. ఇందులకుకారణము గర్భము మూత్రాశయముపై నొత్తిడిగల్గించుటయే. ఒకొక్కప్పుడు భేదులును కలుగును. ఇది మంచిది. లేనిచో మలబద్ధకములేనియట్లు జాగ్రతపడవలెను.

జలకుంభముపగిలినతోడనే రుధిరముకనుపడును. తోడనేస్త్రీ పడకనుజేరి వైద్యుని పిలిపింపవలెను. వైద్యుడు కొన్నిప్రశ్నలవైచిగాని పరీక్షజేసిగాని ప్రసవసమయము నిర్ణయింపగలడు. ప్రసవించుస్త్రీ అధైర్యముచెందరాదు. నొప్పులు వీపునకడుగుభాగమున నుండును. మంచిరూపము, సంతసమొనగూర్చు ప్రవర్తన, మంచిమాటలు, ఓర్పు, పరిశుభ్రత, అనుభవమునుగలదాదిని నియమింపవలెను. ప్రసవవేదన అనుభవించినవారికే తెలియును. ఇది ఉండిఉండికలుగుటచేత తీవ్రముగనుండును. బాధ నుపశమింపుటకుగాను ఒక త్రాటినో, తువాలునో మంచముకాలికికట్టి దానిని ఆమె ఆధారముగలాగవచ్చును. పడకపై మైనపుగుడ్డ (Mackintosh) పరచినమంచిది. ప్రసవానంతర మీగుడ్డను తీసివేయవలెను. ప్రసవపు గదిని శుభ్రముగనుంచి, బిడ్డకుకావలసిన గుడ్డలు, కత్తెర, కార్బాలికుసబ్బు, 'సానిటాస్' ద్రావకము, మెత్తనిదారము, సూదులు, ఫ్లానలుగుడ్డ, వేసలీను, చన్నీరు, వేడినీరు, శుభ్రమైనతువాలు మొదలగువాటిని దాది సిద్ధపఱచవలెను. ఆమె తనపనిని చక్కగ

నిర్వహింపగలిగినదియైయుండి స్త్రీప్రసవించునపుడు ఆమెకు ధైర్యమును సంతోషమును కల్గించుమాటలు చెప్పవలెను. వైద్యునితప్ప నితరులను గదిలోనికి రానివ్వకూడదు. కావలసినవస్తువుల నడుగుటతప్ప స్త్రీయెట్టిపనిచేయక విశ్రాంతిగైకొనవలెను.

ప్రసవమును మూడుభాగములుగ విభజింపవచ్చును. (1) గర్భాశయముపెద్దదగుచు పిండము జననమార్గమునబడుట. అంతవరకు శిశువు జలకుంభమునందు పెరుగును. ఇది పిండమునకు హాయిగూర్చును. (2) ప్రకృతియొక్కయేర్పాటుచే శిశువుప్రసవించుట. (3) ప్రసవానంతరము వెలువడుమాయ **(Placenta)** మొదలగునవి. దీనిని దాది నిర్మూలము చేయవలెను.

ప్రసవమునకుపూర్వము వైద్యుడామెను పరీక్షించి శిశువేరీతియుండునది గ్రహింపవలెను. నొప్పిని శమింపజేయుటకుగాను లేచి మెల్లగనడువమని వైద్యుడుచెప్పిన అట్లుచేయవచ్చును. పుష్టినికలిగించు ఆహారమేదియైన తీసికొనవచ్చును. ఆరాటముగనుండినయెడల మంచినీరుగాని సోడానీరుగాని త్రాగవచ్చును. పిమ్మట కావలసినయెడల వేడిపాలు పుచ్చుకొనవచ్చును. గర్భాశయము వికసించునపుడు కొందటికి దేహమునందుచలిబుట్టును. అపుడు వేడిపాలుత్రాగుట మంచిది.

ప్రసవవేదన అవశ్యముగ అనుభవింపవలసినదే. బాధలేనిచో ప్రసవించుట కష్టము. కొందరికి ఆయుధములచే శిశువును బయటికితీయవలసివచ్చును. జననమార్గము చిన్నదగుటచే ప్రసవకాలమధికముగను కష్టముగనున్న **(Forceps)** అను ఆయుధములతో శిశువును తీయుదురు. ప్రసవమొక్కసారిగాక ఉండిఉండియగును. మొట్టమొదట శిరసును, పిమ్మట మరికొంతసేపటికి దేహమును బయటపడును.

శిశువుపుట్టగనే అన్నియు సరియైనస్థితిలోనున్నదాయని వైద్యుడుగమనించును. శిశువును కొంతకాలము వెలకిలపరుండబెట్టిన ఊపిరి సుళువుగఆడును. బొడ్డునుకోసి మాతాశిశువుల వేరుపర్చవలెను.

శిశువువెనుక మాయమొదలగునవి వెలువడును. ఇందువలన బాధయుండదు. బాధయంతయు శిశువు ప్రసవించుటతోడనే తీరిపోవును. అడుగుభాగములందుమాత్రము కొద్దిగ నొప్పియుండును. మాయనుపూడ్చి పిమ్మట తల్లినిగూర్చిశ్రద్ధతీసికొనవలెను. గర్భాశయము యథాస్థితికిని పూర్వపరిమాణమునకును వచ్చుటకు కట్టుకట్టవలెను.

ఇక తల్లికికావలసినది విశ్రాంతి. ఆమె పరుండియేయుండవలెను. గంజియో, వేడిపాలో, తేలికయై జీర్ణింపదగినఆహారమో తీసికొనవలెను. మాంసాహారము పనికిరాదు. 4, 5 దినములు పాలుగాని, లఘువగు ఇతరఆహారముగాని ఇవ్వక లంకణములుకట్టుట అప్రశస్తము. ప్రసవమైన 3, 4 దినములలో విరేచనముకానిచో ఆముదము కొద్దిగ నివ్వవలెను. 7, 8 దినములవరకు మంచముపై పరుండియే అన్నికార్యములు జరిగించవలెను.



చీనాకాంత, ఆమెచిన్నారికొడుకు

*Photo by Messrs M. Doss & Bros, Madras.*



*Photo by The Universal Studio, Madras.*

'వెన్న ముద్దకు రూపు వెట్టిన మాడ్కి
నున్న మెత్తని మేననొప్పెడు వాఁడు'

లేనిచో గర్భకోశము యథాస్థితికిని పూర్వపరిమాణమునకునురాక క్రిందికిదిగబడి పెద్దదిగనిల్చి పోవును. మఱియు లేచికూర్చుండునప్పుడును నడుచునప్పుడును గర్భకోశమునుండి రక్తము స్రవించి హానికల్గించును. నెలపురుడు తీరువఱకును విశ్రాంతిగైకొనుటమంచిది. మాటలు, సందడిలేనిచోట విశ్రాంతిగైకొనవలెను. జలుబు, పడిశెముమొదలగునవి తల్లిఆరోగ్యమును చెరచును. పడక మనసునకునచ్చినదిగనుండవలెను. అధోభాగములను దినమునకు రెండు సార్లు అప్పటమగుసబ్బుతో వేడినీటితో కడుగవలెను. తల్లికి శిశువాత్సల్యము హెచ్చు. కాబట్టి శిశువునెత్తుకొనవచ్చును. మాయపుట్టినతోడనే లోకియా (Lochia) అను ద్రవ పదార్థము గర్భాశయమునుండి 14 దినములు లేక 3 వారములవరకు స్రవించుచుండును. ఇది మొదట రక్తవర్ణముగనుండి, పిమ్మట పసుపు, ఆకుపచ్చరంగుగ మారును. ఇదిపూర్తిగ స్రవించుట మంచిది. కొంత బలముసంపాదించినవెనుక స్త్రీ మోకాళ్లపై నానియే మూత్ర విసర్జనయొనర్పవలెను. ఇట్లుచేయుటచే అధోమార్గము శుభ్రపఱుపబడును. సానిటాన్ ద్రావకముతో కడుగుచుండుటయు మంచిది. ప్రసవానంతరము కలుగునొప్పులవలన గర్భాశయమునందుండు మలినపదార్థములన్నియు బయటపడును. అట్లుపడుటయే ఆరోగ్యకరము.

తల్లికి బిడ్డ పాలుత్రాగుటచే కొంతబరువుతగ్గి శాంతిచేకూరును. అధికరక్తస్రావము నిలచును. పాలు అమితముగనున్నచో పాలజ్వరము మొదలగునవివచ్చును. కాబట్టి ఎంత శీఘ్రముగ బిడ్డకుపాలిచ్చుటకారంభించిన అంతమంచిది. భోజనానంతరము పాలిచ్చుటచే జీర్ణశక్తికలుగును. ఏకారణముచేనైనను తల్లిపాలు బిడ్డకివ్వకూడనిచో ఆపాలను పిండివేయవలెను. బెల్లడోనాప్లాస్టరును వేసినచో ఈఫలితము పొందనగును. బిడ్డలకు తల్లిపాలు యిచ్చువరకును మరల గర్భముధరింపదనుట కల్ల. కాని యేతల్లిగాని బిడ్డకు 10, 11 నెలలకుపిమ్మట పాలివ్వరాదు. అట్లిచ్చినచో తల్లికి చెడుపుచేయును.

సంతానసంపదతోసాటియగుసంపదవేరొండుయుండబోదు. ఎన్నిసౌఖ్యములబొందియు సంతానసంపదలేనిచో అట్టిదంపతులకు సర్వము కొరతగనేయుండును. బాలుర మృదు మధురోక్తులు, ఆటపాటలు, నవ్వులు, ముద్దులు యెట్టికఠినాత్మునిగుండెనైనను కరగించును. ఎట్టికష్టములున్నను అవి కాన్పింపవు. బిడ్డలవలన దంపతులైక్యమై అనురాగాంబుధియందు నోలలాడుచుందురు.

## గృహలక్ష్మి

శ్రీమతి పాటిబండ వేంకటఅలమేలుమంగతాయిగారు

గృహిణియటన్న పంకజనియే ! పఱువాతను మేలుకాంచి ప్ర
త్యహ మిలుదిద్దితీర్చి విలువౌవలువల్ ధరియించి తేనెలూ
రుహితములాడుచున్ గృహపురోమహినిల్చి శుభమ్ముసేయు న
య్యహిమకరప్రకాండునుదయాగమనమ్ముల లేతనవ్వులన్ !!

# అజీర్ణము

వి. వి. యస్. ఆరాధ్య గారు

భయంకర వ్యాధులలో నిదియొకటి. ఇది సామాన్యముగా ధనవంతులగు జనులలోనే - బీదజనులలో క్షయరోగము వలె - వ్యాపించియున్నది. ధనవంతులైనను ధనహీనులైనను మితముగా భుజించక తమ అగ్ని (జీర్ణశక్తి)ని గుర్తెరుగకగాని, జిహ్వాచాపల్యమున గాని పశువులవలె అమితముగా భుజించి జీర్ణించుకొనజాలక కుడిచికూర్చుండి యీ ఘోర వ్యాధి పాల్పడియెదరు. ఈరోగము నాధారము చేసికొనియె అగ్నిమాంద్యము, ఆధ్మానము, అరుచి, జ్వరము, వాంతులు, శూల, విరేచనములు, యింకను ప్రాణహరములగు, వాంతిభేది (Cholera) అలసక, విలంబి కాదులు కల్గును. శిశువులకు గల్గు వ్యాధులలోనను ప్రధానవ్యాధి యీయజీర్ణమే. దీనిని కారణముగా చేసికొనియే యితర వ్యాధులన్నియు (వాంతులు, విరేచనములు, పారిభద్ర (Rickets) కాదులు) కల్గును. కాన శిశువులకుఅజీర్ణకరపదార్థ సేవనచేయరాదు. చేయుటచే అజీర్ణదోషమునకాశ్రయమై, దుష్టమైన క్షీరమును, శిశువులకిచ్చుట సంభవించును. అట్లును శిశువు లీరోగము వాతబడుదురు. గర్భిణిలుగా నున్న స్త్రీలుకూడా తమపిల్లలకు పాలనివ్వరాదు. ఇచ్చినచో అజీర్ణమునకల్గించును.

కారణములు:—మందాగ్నికలమనుజులు సరియగు ఆహారవిహారముల నవలంబింపకుండుట, అగ్నియున్నను అధికముగా భుజించుట, అధికజలపానము చేయుట, ప్రమాణరహితముగా కాలనియమము లేక భుజించుట, మలమూత్రాదివేగముల నడ్డగించుట, లేక మలబంధము (Constipation) మొదలగు వ్యాధులుండుట, నిద్రసరిగా లేకుండుట (పగటినిద్ర, రాత్రిజాగరణ), ఈర్ష్య, భయము, క్రోధము మొదలగు మానసికవికారములుగలప్పుడు భుజించుట, వ్యాయామాదులు చేయక తిని కూర్చుండుట మొదలగు కారణములచే భుజించిన యాహారము జీర్ణముకాక అజీర్ణరోగమును కల్గించును. క్షీరమును మాత్రమే సేవించు శిశువులకైననో సకాలమునను ఆకలియైనప్పుడు పాలివ్వకను, అవసరము లేనప్పుడు వెంటవెంటనే పాలిచ్చుటచేతను ఏడ్చినప్పుడెల్లా పాలకొరకే యని మాతురాంధ్రగు తల్లులు కొందరు పాలిచ్చుటచేతను యిట్టివ్యాధికల్గుచున్నది.

స్వరూపము:—శరీరము బరువుగా నుండుట, నోట నీరూరుట, భుజించిన ఆహారము ననుసరించి తేపులువచ్చుట (ఆపదార్థముయొక్క గంధము, రుచిగల్గియుండుట) దప్పిక, తాపము, పుల్లత్రేపులు, చెమట, కడుపుబ్బరము, శూల, శరీరమంతటను నొప్పి, అన్నద్వేషము, హృదయమున బరువుగానుండుటయు సామాన్య లక్షణములు. శిశువులకు విరేచనములు, లేకవమనము, లేక రెండునుకూడా కల్గును.

ఉపద్రవములు:—చికిత్సించక ఉపేక్షించినచో, మూర్ఛ, ప్రలాపము, వాంతి, నోట నీరూరుట, చిక్కిపోవుట, లేక ఒకప్పుడు మరణముగాని సంభవించును.

భేదములు : ప్రత్యేకలక్షణములు:—ఇందు అనేక భేదములున్నను ప్రధానముగా నాల్గుగా విభజింపబడియున్నవి. వీటిని పైలక్షణములచేతనే గాక ఒక్కొకదాని కొకప్రత్యేకలక్షణముండుటచే తేలికగా తెలుసుకొనవచ్చును.

1. ఆమాజీర్ణము:—కఫదోషముచే జనించిజీర్ణమే కాక అపక్వముగానేయున్న ఆహారపదార్థములుగల్గి త్రేపులు ఎక్కువగా గలది.

2. విదగ్ధం:—పిత్తముచే జనించి కొంతపక్వమై కొంతసరిగా పక్వముగాకయున్న ఆహారముగల్గి కడుపులో బాధ ఎక్కువగా గలది.

3. విష్టబ్ధం:—వాతమువలన ఆహారము పక్వమైనను కాకపోయినను స్తంభించిపోయి శరీరమంతట నొప్పి ఎక్కువగాగలది.

4. రసశేషాజీర్ణం:—పక్వముగాని యన్నరసము అట్లేయుండి ఆవలింతలెక్కువగలది.

ఈ అజీర్ణభేదములకు తేలికయగు ప్రధాననివారణోపాయ మొక్కొకటి వ్రాసెదను.

1. ఆమమున:—వేడినీరు త్రాగుట.

2. విదగ్ధమున:—పొట్టమీద ఆవిరిచేకాచుట.

3. విష్టబ్ధమున:—విరేచనము, వస్తి (Enema) చేయుట.

4. రసశేషమున:—భోజనముచేయకుండగనే నిద్రించుట మొదలగు క్రియలుచేసిన రోగముకల్గినవెంటనే శమించును. ఇట్టివ్యాధి ప్రవేశించిన తదుపరిచికిత్సించుకొనుటకంటె రాకుండ జేసుకొనుటయే ప్రాజ్ఞులలక్షణము.

అజీర్ణవ్యాధినివారణోపాయములు:

1. శారీరక, మానసికక్రియలను నియమానుసారము నిర్వర్తించుట.

2. మితముగా, అన్నపానముల సేవించుట కుక్షియొక్క రెండుభాగములను ఆహారపదార్థములతోడను ఒకభాగము జలముతోను నింపి మిగతా ఒకభాగమును వాయుచలనార్థము వదలవలయును.

3. అజీర్ణకరములగు ఆహారములనగ్ని ననుసరించి జీర్ణమగునంతవరకె భుజించుట.

4. వ్యాయామము చేయుట.

5. దంతములను నోటిని శుభ్రము గానుంచుకొనుట. ఈకాలములో దంతవ్యాధులవలననె అజీర్ణరోగము కల్గుచున్నదని అనేకమంది వైద్యుల అభిప్రాయము.

6. ఆకలిగలప్పుడే, కాలనియమము ననుసరించి భుజించుట.

7. మలమూత్రాదులు సరిగా ప్రవర్తించునట్లు చూచుట.

8. సరిగా నిద్రించుట (రాత్రినిద్రించుట, పగలు నిద్రింపకుండుట)

9. అహితమైన పదార్థముల (పాసిన, కుళ్లిన, చెడినపదార్థముల) సేవింపకుండుట.

10. భుజించునప్పుడు మానసికవికారములకు చోటివ్వక మానియై తదేకచిత్తుడై భుజించుట.

11. శిశువులకు నియమితకాలమున జీర్ణమగునంతవరకె పాలనిచ్చుట.

12. తేలికగా జీర్ణమగు ఆహారములనే భుజించుట.

ఇట్టి నియమములచే అజీర్ణమురాకుండ కాపాడుకొనవచ్చును. ఎంత ప్రయత్నించినను ఒకప్పుడైనను జిహ్వాచాపల్యమున ఎక్కువభుజించక యుండజాలము గాన జీర్ణము కాని ఆమపదార్థము రోగస్వరూపమును జెందక పూర్వమే గాని లేక చెందునని తోచినగాని ముందుచెప్పబోవు ఒక్కొకద్రవ్యదుర్గుణహరములగు ఇతరద్రవ్యములను భోజనానంతరమున గాని, ఆద్రవ్యముతో కూడా గాని ఉపయోగించినచో అజీర్ణరోగమును కలుగనీయక త్వరలో జీర్ణింపచేయును. ఇట్టిద్రవ్యముల నేకములున్నను సామాన్యముగా మనము నిత్యము ఆహారముగా నుపయోగించు పదార్థములవల్ల కల్గుదోషముల హరించుటకు ఆహారపదార్థముల సమ్మేళనము తోనే చికిత్సను వ్రాయుచున్నాడను. ఆహారద్రవ్యముల మార్పుతోనే ఆరోగ్యముబడయుటకు తగిన ఇట్టి గృహవైద్యము ప్రతికాంతామణియు తెలుసుకొనియున్నచో వైద్యునియవసరమేలేకుండ తనసంతతిని ఆయురారోగ్యవంతులను గానుంచగల్గునని నమ్ముచున్నారము.

ఆహారపదార్థములందలి ప్రత్యేకద్రవ్యదోషహారములగు నితరద్రవ్యములు:

ఆహారద్రవ్యములు...దోషహారద్రవ్యములు

ధాన్యములు:—

గోధుమలు...దోసకాయ, తెల్లఉత్తరేణిక్షారం.

కొఱ్ఱలు...పెండలం, జీలకఱ్ఱ, మిరియాలు, చందనం, గెనుసుగడ్డలు.

యవలు...తెల్లఉత్తరేణిక్షారం, నువ్వులనూనె.

వరిబియ్యం...పేలపిండి, నెయ్యి, దానిమ్మపండ్ల రసం, బెల్లం, పాలు, నీరు.

ఫలములు:—

అరటిపండు...మామిడికాయ, నెయ్యి, పోగడపండు, మిరియాలు.

టెంకాయ...బియ్యం, బియ్యపుకుడితి, నిమ్మపులుసు.

మామిడిపండు...పాలు, సౌవర్చలవణం, సైంధవలవణం, వరివేరుకషాయం, శొంఠిపిప్పళ్లు, మిరియాలు.

నారింజపండు...బెల్లం, కొఱ్ఱలు.

కరబూజా...వేడినీళ్లు.

పనస...అరటిపండు, మామిడిపప్పు, అల్లం, మిరియాలు, జీలకఱ్ఱ.

తాటిపండు, తేగలు...బియ్యం, పోగడపండు.

తాటిముంజలు...మామిడికాయ.

దానిమ్మపండు...పోగడపండు.

ఉశిరిక...ఆవాలు, పోగడపండు.

మాదీఫలం...పోగడపండు, ఆవాలు, లవణం.

పోగడపండు...పోగడవేరు.

ఇప్పపండ్లసారాయి...వేపగింజలు.

మారేడుపండ్లు...వేపగింజలు, శొంఠిచూర్ణం.

చిట్టీతపండ్లు...వేపగింజలు.

ఖర్జూరపుపండ్లు...వేపగింజలు, తుంగముస్తలు నువ్వులనూనె.

ద్రాక్షపండ్లు...తుంగముస్తలు,

వెలగపండ్లు...వేపగింజలు, పెద్దసోపు.

అత్తికాయలు...శొంఠిచూర్ణము, పాలు, నీరు.

జువ్వి, మఱ్ఱి...శొంఠిచూర్ణము, పాలు, నీరు.

రేగుపండు...వేడినీళ్లు.

నేరేడుపండు...శొంఠి.

నిమ్మపండ్లు...కొఱ్ఱలు.

షరా: అన్నిఫలములకు గొంటివిత్తులు.

పప్పువస్తువులు:—

మినుములు...ఖండశర్కర, తెల్లఉత్తరేణిక్షారం, నిమ్మవేరు.

కందులు...పిప్పళ్లు, వాము, నీరు, నెయ్యి, చింతపండు, పుల్లనీళ్లు.

పచ్చపెసలు...తేనె, చక్కెర.

ఉలవలు...నువ్వులనూనె, నెయ్యి, చింతపండు,

శనగలు...తెల్లఉత్తరేణిక్షారం (బూడిద).

పెసలు...తెల్లఉత్తరేణిక్షారం, నువ్వులనూనె.

బఠాణీలు...తెల్లఉత్తరేణిక్షారం, శొంఠి.

అనుములు...జీలకఱ్ఱ, మిరియాలు, ఉప్పు.

షరా:—అన్నిపప్పులకు—పిప్పళ్లు, వాము, నీరు, నెయ్యి, చింతపండు, పుల్లనీళ్లు.

శాకములు:—

గోరుచిక్కుడు...అల్లం, శొంఠి, తేనె, నెయ్యి.

తామరతూండ్లు...తుంగముస్తలు, నువ్వులనూనె

కాకరకాయలు...ఆవాలు, మోదుగక్షారం, పెద్దములక, కాకర, దోస,

వంకాయలు...ఆవాలు, నెయ్యి.

పచ్చిమిరపకాయలు...నిమ్మపులుసు, ఉప్పు, ఉల్లి.

ముల్లంగి...ఆవాలు.

సొరకాయలు ..ఆవాలు, మోదుగక్షారం.

పొట్లకాయలు...ఆవాలు, మోదుగక్షారం, పెద్దములక, కాకర, దోస, సాంబారుకారం.

చుక్కకూర...ఆవాలు.

చక్రవర్తికూర...చంద్రచక్కపొడి, కషాయం.

బచ్చలికూర...మిరియాలు, జీలకఱ్ఱ,

ఆవకూర...చంద్రచక్కపొడి, కషాయం.

చంచలికూర...చంద్రచక్కపొడి, కషాయం.

కరివేపాకు...నెయ్యి, వెన్న.

కంద...బెల్లం, నెయ్యి, చింతపండు.

గెనుసుగెడ్డ...చక్కెర.

అవిశాకు...ఆవుపాలు.

అరటికాయ...మిరియాలు, జీలకఱ్ఱ, నెయ్యి.

చామగడ్డ...చింతపండు.

చిక్కుడు...గుల్బందు.

మామిడికాయ...ఉప్పు, జీలకర్ర, కలినీళ్లు.

ఊరలగడ్డ...బియ్యపుకుడితి,అల్లం,పుదీనా, నిమ్మ పులుసు.

దొండకాయ...పెద్దములక, కాకర, దోస.

చిన్నములకి...పెద్దములక, కాకర, దోస.

తోటకూర...తెల్లగడ్డ, ఆవాలు.

ములగకూర...పుల్లనీళ్లు, పెరుగు, తాటికల్లు.

చిర్రికూర...పుల్లనీళ్లు, పెరుగు, తాటికల్లు.

అల్లం...బాదాము, నెయ్యి.

ఆగాకర...నిమ్మపులుసు, నెయ్యి, మాంసము.

దోసకాయ...సొంఠి, తేనె, ఉప్పు.

ఉల్లి...ఉప్పు, ఆవునెయ్యి, పాలు.

గోంగూరతోటకూర...మిరియాలు, జీలకర్ర, అల్లం.

పరా: పైపత్ర, పుష్ప, ఫల, మూలాదులన్నిటికి నువ్వుచెట్లక్షారం (బూడిద) మంచిది.

మాంసములు:—

మత్స్యములు...మామిడిపండు, నువ్వులనూనె, నిప్పులో కాల్చినచేప.

మాంసము...మామిడిపప్పు, వేడినీళ్లు, ఆవాలు.

పావురం...గుమ్మడివేరు, సౌవర్చలవణం, జలం.

నెమలి...గుమ్మడివేరు, సౌవర్చలవణం, జలం.

కపింజలం...గుమ్మడివేరు, సౌవర్చలవణం, జలం

నక్క...నువ్వులనూనె.

ఉడుము...నువ్వులనూనె.

చిరతపులి...నువ్వులనూనె.

పంది...యవక్షారం.

తాబేలు...యవక్షారం.

తోడేలు...బూరుగుబంక, పండ్లు, ఆకులు.

చమురుపదార్థములు:—

నెయ్యి...వేడినీరు, నిమ్మపులుసు, మిరియాలు, మజ్జిగ.

తైలములు...కాంజికం (పుల్లనీళ్లు), పెసరపిండి.

నువ్వులనూనె...కాంజికం.

పాలు:—

ఆవుపాలు...మజ్జిగ, వేడిమీగడ.

గేదెపాలు...సైంధవం, శంఖభస్మం.

చెరుకుపాలు...అల్లపురసం, మోదుగక్షారం.

ద్రవద్రవ్యములు:—

సారాయి...తేనె, నీరు.

నిమ్మరసం...ఉప్పు.

కాఫీ...ఆవునెయ్యి, చక్కెర.

పుల్లనీళ్లు...మజ్జిగ, ఉప్పు, చక్కెర.

మజ్జిగ...ఉప్పు.

ఎనుముపెరుగు...శంఖభస్మం.

ఎనుము మజ్జిగ...శంఖభస్మం.

కొబ్బరినీళ్లు...సముద్రపునురుగు.

తేనీరు...పాలు, చక్కెర.

ఇతరద్రవ్యములు:—

చారపప్పు...కరకపిందెలు, బెరడు.

ఉప్పు...బియ్యంకడుగు, మజ్జిగ, పుల్లనీళ్లు, ములకకాయ, చింతపండు, నెయ్యి, పులుసు, తేనె, కలినీళ్లు.

శర్కర...తుంగముస్తలు.

గసగసాలు...తేనె, రూమామస్తకి.

వెల్లుల్లి...పాలు.

పిప్పళ్లు...శొంఠి, పాలు, నీళ్లు.

మిరపకాయలు...పులుసు.

చింతపండు...నువ్వులనూనె.

మిరియాలు...వెన్న, నెయ్యి.

కర్పూరం...సముద్రపునురుగు.

వక్కలు...సముద్రపునురుగు.

ఆకులు...సముద్రపునురుగు, పుల్లనీళ్లు, పెరుగు, తాటికల్లు.

కుంకుమపువ్వు...సముద్రపునురుగు.

జాజికాయ...సముద్రపునురుగు.

జాపత్రి...సముద్రపునురుగు, వెలగబంక.

కస్తూరి...సముద్రపునురుగు.

ఆవాలు...పుల్లనీళ్లు, పెరుగు, తాటికల్లు.

ఇంగువ...దానిమ్మపండు, బాదమునూనె.

విరేచనద్రవ్యాలు...తుంగముస్తలు.

చింతపండు...సున్నం.

నువ్వులు...తేనె.

పక్వద్రవ్యములు:—

పిండివంటలు...నీళ్లు. వేడినీళ్లు, వాము, జలము, పుల్లనీళ్లు, లవణం.

అటుకులు...వాము, జలం, వేడినీళ్లు.

పెసరపులగం...సైంధలవణం.

ఫేణి...లవంగాలు.

అప్పడం...మునగవిత్తులు.

లడ్డూలు మొదలయినవి...మోగి.

చక్కిలాలు, మండిగలు...శొంఠి.

క్షీరాన్నము...పెసరపప్పు.

మాషాన్నము...ఖండశర్కర.

పైవిధముగా ఆహార, విహారసేవన చేయనిచో మందాగ్నికలవారికి లేక అతిభోక్తలను సేవించిన ఆహారములు జీర్ణము కావు. అట్టివి అజీర్ణరోగమును కల్గించనిచో ఈక్రింది సూచించిన రోజులకు జీర్ణమగును:—

నెయ్యి 5-రోజులకు.
నూనెలు 12-రోజులకు.
పాలు 15 లేక 20 రో॥
పెరుగు 10 లేక 20 రో॥
అన్నము 7 రో॥
మాంసము 1 నెల

వరకును అట్లేయుండి క్రమముగాజీర్ణమగును. భుజించిన ఆహారము జీర్ణమైనదని యీక్రిందివిధముగా తెలియవచ్చును.

జీర్ణాహారలక్షణము:—

తేపులు వాసనలేక రుచిలేకుండాయుండుట, మలమూత్రాదులు సరిగా ప్రవర్తించుట, శరీరముచులకనగా ఉండి ఆకలి, దప్పులుకలుగుచుండుట.

# స్త్రీప్రశంస

చేబోలు చంద్రశేఖరశర్మగారు

మ. మాయాకల్పనజాయమానజగతీమానుష్యధాత్రప్రద
త్తాయుర్దాయము వెళ్లబుచ్చుటకు ఫుల్లాబ్జాతపత్రేక్షణా
శ్రేయఃప్రాంచినభావమేయగును నాస్తిక్యంబునద్దానికిన్
జేయంబూనిన ఘోరకష్టయుతదుస్సేవ్యంబుగాకుండునే.

సీ. పరమేష్ఠిసాక్షిగా భర్తనురక్తయై కష్టసౌఖ్యములచేఁ గరగికరగి
గ్రంథావలోకనకలితకాలమునందు సహజవిద్యాచిత్తసరణిగలిగి
సౌశీల్యరాజతాచరణశోభితముతో గుణవిశేషములతోఁగొమరుమిగిలి
కామార్థధర్మమోక్షములనాల్గింటిని గడపుచుభర్తతోఁగలసిమెలసి

గీ. కాపురముజేసి జీవితకాలయాత్ర
గడుపనెంచిన సుకుమారకాంతతోడ
చతురవిద్యాసమేతుఁడౌ చారుమూర్తి
కాపురముజేయుకన్న స్వర్గంబుగలదె?

చ. సకలకళాప్రవీణుఁడయి సర్వదిగంతయశోవిభాసుర
ప్రకటకవిత్వతత్వకవిరాజవిరాజితుఁడయ్యు భార్య తా
వికటమనస్కయైన సరవింజెడుఁగీరితి గాన కాంతకున్
సకలసుశీలసంపదసశాస్త్రసరక్తిని నొప్పనొప్పగున్.

# వైదికయుగము : స్త్రీలు

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

మన హిందువులు తొలుతనుండియు స్త్రీల స్వాతంత్ర్యమును జెడఁగొట్టి పురుషులనే యన్నివిషయములందు నెక్కువవారినిగాఁ బరిగణించుచు, స్త్రీ యెల్లప్పుడును గృహకృత్యములను నిర్వహించుచుఁ బురుషులకు దాస్యమొనర్చుచుఁ గాలముగడుపవలెనని నియమించిరనియు, స్త్రీలకు విద్యాదివిషయమున శిక్షణమును, బురుషులతోడి సరిసమానమగు హక్కులను లేకుండఁజేసిరనియు, నీయన్యాయ మనాదినుండియు వచ్చుచున్నదనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారను సంగతి మనమెఱుఁగనిది కాదు.

కాని పరిశీలించి యొకపరి వైదికయుగమువంక దృష్టినిబోనిచ్చి, ఆయుగధర్మముల నెఱుంగ నేకైకసాధనమగు వైదికవాఙ్మయమును బరిశీలించినచో స్త్రీపురుషుల కిర్వురకును సమానమగు హక్కుకలదనియు అప్పటివారు స్త్రీని పురుషునివలెను, బురుషుని కంటె నెక్కువగనుగూడ గౌరవించిరనియు గ్రహింపలేకపోము.

తైత్తిరీయసంహితలో (6-1-8) నున్న "అర్ధోహవా ఏష ఆత్మనో యత్పత్నీ" అను మంత్రమునుబట్టి పురుషుని శరీరములో వనిత యర్ధభాగమనియు, భార్యయున్ననేగాని పురుషునికి నిజమగు పురుషత్వము సిద్ధింపఁజాలదనియుఁ దెలియుచున్నది. ఈశ్రుతుల ననుసరించియే యేర్పడిన స్మృతులుకూడఁ బైయర్థమును బలపఱచుచున్నవి. చూడుఁడు—

" ఏతావానేవ పురుషో యజ్జాయాత్మా ప్రజేతిహ।
విప్రాః ప్రాహు స్తథాచైత ద్యోభర్తాసాస్మృతాంగనా॥

[మనుస్మృతి. 9-వ అధ్యాయము]

భార్యాభర్తలి ద్దేకశరీరమట్లుండవలెను కావుననే వారియైక్యముకూడ "జంపతీ: దంపతీ" అను పదములందుఁగూడ విడఁదీయ వీలులేని పదగుంఫము, అర్థగాంభీర్యమును మూర్తీభవించియున్నవి.

" మాతా పూర్వరూపమ్-పితోత్తర రూపమ్, మాతృదేవోభవ-పితృదేవోభవ " అను నారణ్యకవచనములనుండి తండ్రికంటెఁ దల్లికే గౌరవమెక్కుడొసంగఁబడినదనియును దానఁ బురుషునికంటె స్త్రీకిఁగల గౌరవమధికమని తెల్లమగుచున్నదనియు మనము నిశ్చయింపవచ్చును.

మఱియు నింద్రాణితో సమానయగు సౌభాగ్యసంపన్నయు, నదితితో సమానయగు పరాక్రమవంతులగుఁ బుత్రులఁగనిన మాతయు వేఱొకరులేరు. తైత్తిరీయబ్రాహ్మణమునందు "మమ పుత్రాః శత్రుహణః। అథోమేదుహితా విరాట్, ఉతాహమస్మి సంజయా।" అని యదితి వాక్యమొకచోఁగలదు. నాపుత్రులు శత్రువులనందఱిని సంహరింప

గల మహాశూరులనియు, నాపుత్రిక స్త్రీసమాజమునఁ బేరుగాంచి ప్రసిద్ధయై ప్రకాశించుచున్నదనియు, నేనుకూడ నన్నికార్యములయందును యశస్సును, విజయమునుబొందుదాననని ఈదీనియభిప్రాయము.

వైదికయుగమునందలి స్త్రీలు రణకుశలలనియు, విదుషీమణులనియు మనమెఱుంగనగును. సులభ-మైత్రేయి, బడబ, గార్గి, వాచక్నవి మొదలగుమహిళామణులు విద్యలయందనర్గళమగు పాండిత్యమును సంపాదించి బ్రహ్మజ్ఞానచర్చ మొదలగు గహనములగు విషయములందును పురుషులతోసరిసమానముగ వాదప్రతివాదములను సల్పుచుండెడివారు. అందు బ్రహ్మవాదినికిఁ జాలగౌరవముకలిగినట్లు తెలియవచ్చుచున్నది.

విశ్వలయను నారీమణి చాలయుద్ధకుశలతగలది. ఒకపు డొకయుద్ధమందామెపాదము తెగిపోయెను. అపుడు దేవవైద్యులగు అశ్వినీకుమారులు చికిత్సయొనరించిరి. ఈవిషయము ఋగ్వేదమునఁగలదు. [చూ. ఋ. మం. 10-39-8]

ముద్గలాని యను [ముద్గలుని వనితయేమో] నొక రమణీమణి సారథ్యమున (రథము నడుపుటయందు) మిగుల కీర్తినిగడించెనని ఋగ్వేదము. [చూ. ఋ. మం. 10-102-2]

కాన వేదకాలమునందలి స్త్రీలుకూడ రణకుశలలనియు, పండితలనియు, వీరమాతలనియు, వీరపత్నులనియు వీనివలనఁ దెలియుటచేఁ దొలుతనుండియు స్త్రీలపట్లన్యాయ్యము లేదని మనము విచారింపనక్కఱలేదు. వేదకాలానంతరము దమయంతి-సీత-సావిత్రి-సత్యభామ మొదలగు వనితామణులు మనభారతభూమి నవతరించిరి. అధునాతనయుగమునందును ఆక్రమమునననుసరించియే పరమపూజ్యలగు రాజమాత జిజాభాయి, రాణీ తారాభాయి, దేవి అహల్యాభాయి, రణరమణియగు ఝాన్సీలక్ష్మిభాయి మొదలగువారితిహాసములకెక్కి యాచంద్రతారార్కము తమకీర్తినినిలుపుకొనుచున్నారు.

సతీపతు లొండొరులవిషయమై యాయుగముననెట్లు ప్రవర్తించెడివారో, వారిపరస్పరప్రేమయెట్టిదో యించుక నిరూపించుట ప్రకృతోపయోగకరము కాకపోదు.

అక్ష్యౌ నౌ మధుసంకాశే అనీకే నౌ సమఞ్జనమ్ ।
అన్తః కృణుష్వ మాం హృది మన ఇన్నౌ సహాసతి ॥

[అథర్వవేదము 7-వ కాండ 37-వ సూక్తము]

[అర్థము నౌ-మాయిరువురియొక్క [అనగా భార్యాభర్తలయొక్క] అక్ష్యౌ-కన్నులు, మధుసంకాశే-తేనెవలె తీయనివై యుండుగాక ! నౌ-మాయిరువురియొక్కయు, అనీకే-కనుగొలుకులు, సమంజనమ్-ఉత్తమమగుఁ గాటుకతోఁగూడినవగుగాక ! పతియనునపుడు (భార్యతో) హృది-నీయొక్క (భార్యయొక్క) హృదయమునందుమాం అంతః-నాయొక్క (మగనియొక్క) హృదయమును కృణుష్వ-ఉంచుమా ! అనియు భార్యయనునపుడు, హృది-నీయొక్క (మగనియొక్క) హృదయమునందు, మామన్తః-నాయొక్క (భార్య

యొక్క) హృదయమును, కృణుష్వ-ఉంచుమా? అనియు సమన్వయించుకొనవలెను. నౌ-మాయిరువురి యొక్కయు, మనః-మనస్సు, ఇతీ-ఎల్లప్పుడును సహా-కలిసి (అన్యోన్యముసుపొంది) అసతి-ఉండును గాక!

తా. భార్యాభర్తల యిరువురిచూడ్కులును అన్యోన్యావలోకనమున ప్రేమసుధాంబువులను జిమ్ముచుండవలెను. ఒకరింజూచినచో నింకొకరికానందము కల్గుచుండవలెను. ఎన్నడును ఒకరియవలోకనమువలన రెండవవారి క్రోధము-ద్వేషభావము-అసహిష్ణుత కలుగకూడదు. ఇరువరినేత్రములును నిర్దుష్టములై పవిత్రమగు కాటుకచేతనేగాక జ్ఞానమను కాటుకచేఁగూడఁ బవిత్రత కలిగించుకొనవలయును.]

పతి యుత్తమమగు తనహృదయమున నన్యకాంతను జొరనీయక తనధర్మపత్నికే స్థానమొసంగవలయును. పత్నికూడ తనహృదయమున పతికేతప్ప మఱొకనికి స్థానమీయరాదు. మఱియు దంపతులహృదయములు రెండునేకమై భేదములేకయుండవలెను. ఏవిషయమందైనను యిరువురిమానసమునొక్క రీతిగనేయుండవలెను.

ఈమీంది మంత్రమునుబట్టి దంపతులయొక్క సద్ధర్మము సువ్యక్తమగుచున్నది. గృహస్థాశ్రమమునకు దంపతులే ముఖ్యాదర్శముగా నిరూపింపఁబడినది. సహృదయులగు పాఠకులు ఈధర్మమును పఠించుమాత్రముననేగాక ఆచరించుటయందును శ్రద్ధవహించినచో గృహస్థాశ్రమమున నెట్టిచింతలునుకలుగక ఆనందమేకలుగఁగలదు.

పైని చెప్పినచొప్పున స్త్రీకిఁ బురుషునితోఁబాటుగ నన్నివిషయములందునధికారమున్నట్లు తెలియుచున్నది. కాని యప్పటి స్త్రీలు అట్టిసమానమగు గౌరవమును బొందుచుండినను "మనకంటెఁ బురుషుని యెక్కువఁదనమేమికలదు?" అనుతలంపుననుండలేదు. భార్య పతియెడల నమితగౌరవముకలిగి యతఁడుధరించు వస్త్రములను స్వయముగ దారముతీసి తయారుచేసెడిది.

అభిత్వా మనుజాతేన దధామి మమ వాససా।

యథాసో మమ కేవలో నాన్యాసాం కీర్తయాశ్చవ॥

[అధర్వవేదము 7-వ కాండ 38-వ సూక్తము]

అవః-పత్ని వస్త్రమును దయారుచేసినపుడుగాని, భర్తకిచ్చునపుడుగాని యనుకొనుమాటలివి-అర్థము-మమ-నాయొక్క, మనుజాతేన-ఆలోచన (చింతన) తోఁగూడఁదయారుచేసిన, వాససా-వస్త్రముచే, త్వాం-నిన్ను (భర్తను) అభిదధామి-బంధించుచున్నాను. యథా-ఎట్లనఁగా, (అనఁగా ఆయాలోచన మేమనఁగా) మమ-నాకొఱకే, కేవలః- కేవలుఁడవై, అనఁగా నాకొఱకే అయినవాఁడవు అసః-అగుమా! అన్యాసాం-ఇతరస్త్రీలయొక్క (పేరును) చనకీర్తయాః-స్మరింపకుండుమా!

తా. ధర్మపత్ని పతికొఱకై వస్త్రమును దయారుచేయునపుడు తనయాంతరంగికమగు ప్రేమతోఁగూడ దారమల్లును. అపుడామె "నేనెట్లు ప్రేమపూర్వకముగ భర్తకొఱకు దీనిని తయారుచేయుచున్నానో, అట్లే యతఁడును ఇతరస్త్రీలయొక్క పేరునుగూడ స్మరింపక నాయందే యనురాగముగల్గి యుండవలయు"నని ఆమె యనుకొనును. దీనింబట్టి పత్నికిఁ పతియెడఁగల యనురాగము, భక్తి, గౌరవము సువ్యక్తముకాఁగలదు.

"భూషా లజ్జేవ యోషితామ్" అనఁగా వనితకు సిగ్గనునదియే గొప్పయలంకారము. ఎంతటి నమ్రతకలదియైనను, విదుషియైనను, వీరవనితయైనను వనిత నిర్లజ్జయై చరించినచో గౌరవముండదు. ఇచట అలంకారశాస్త్రవిషయమైన ఒకచిన్నమాట యుపయుక్తమగు టచే వ్రాయుదునుకాన క్షమింపవలెను.

వేదములుచేయు పనియేమనగా మంచినుపదేశించుట-చెడ్డనుండి మరల్చుట. పురాణములుచేయుపనియు ఇంతియే. కావ్యములుచేయు పనికూడనిదియే. అన్నియునొక్కపనినే చేసినచో (అన్నింటి ప్రయోజన మొక్కటేయైనచో) ఈపురాణములు, ఈకావ్యములెందులకు? ఒక్కవేదమేచాలదా? అని ఒకప్రశ్నగలుగును. కావ్యములుకూడఁగావలెనను ఆలంకారికులేమని జబాబిచ్చిరనఁగా—వేదము గవర్నమెంటువారి ఆక్టువలె ఆపని చేసితీరవలెను ఈపని విడువకతీరదు అని నియమించి ఈరీతిగాఁజేయనివారికి గవర్నమెంటువారు శిక్ష విధించినట్లు మహాపాతకమనే శిక్షనువిధించును. ఇఁకపురాణములో స్నేహితుఁడు "ఈరీతిని నడిచిన మహానుభావులిట్లు నశించిపోయిరి. చూచితివా? ఆరీతినినడచిన నష్టమున్నది. కాన నామాటవిని యీరీతిననడుచుకోవలెను" అని చెప్పినరీతిని కారణపూర్వముగ ప్రవర్తనను తెలుపును. కాని వేదములవలెవిధించవు. అంతకంటెనిదికొంత మృదులమార్గము.

ఇక కావ్యములన్ననో "ఈపనిచేయవలెను-ఈపనిచేయరాదు" అని వాచాచెప్పవు. వనిత తనయభిప్రాయమును మగనికి మాటలతోఁదెలియపఱుపక తనచేష్టలవలననే తెలియఁజేయునట్లు, కావ్యము వ్యంగ్యమర్యాదతో సరసముగఁ దెలియఁజేయును. కావ్యము కాంతవంటి దగుటచే దానికి గౌరవముగలిగెను. స్త్రీలకు లజ్జయుండుటఁబట్టియే కావ్యము తన ప్రయోజనముకొఱకు వెదకుకొనుచుఁబోవలసివచ్చెను. స్త్రీ లజ్జనేవిడిచినచో మాయాలంకారికుల కంతటియాయాస మవసరమేలేకయుండెడిది. కాన వనితలకు సిగ్గేభూషణమని తేలినది. స్త్రీలు దారిలోనెదురుపడినపుడు స్త్రీ తలయెత్తుకొని చరచరనడువగా పురుషుఁడు తల వంచుకొని (సిగ్గుచే) మందగమనమున నడచినచో అది హృదయంగమముగనుండునో విరసముగనుండునో యూహింపుఁడు.

వైదికయుగమునఁగూడ స్త్రీలు తాము పురుషులతోసమానలమని గర్వించి తమ ధర్మములనుల్లంఘించి యెఱుంగరు. తమయాచారమును, గౌరవమును గాపాడుకొనిన పిదపనే వారివిద్యలుశోభించును. నిర్మర్యాదగనుండి యెంతటిపాండిత్యము సంపాదించినను మచ్చ కలుగకమానదు. వారి నందఱును గర్హింతురు.

"ప్లామోగియను నొకపురుషుఁడుకలఁడు. ఒకానొకకారణమున నతనికి స్త్రీత్వము సంభవించెను. అతఁడు స్వరూపమున స్త్రీయైనను మనస్సునఁగల తొల్లింటిపురుషవాసన నశింపలేదు. కావుననతఁడు వీధిలోనడచునపుడు స్త్రీలవలెఁదలవంచుకొని మెల్లమెల్లగనడుగు లిడుచుఁ దనపాదములుకూడఁ గన్పడకుండునట్లు కుచ్చెళ్లుసరుదుకొని నడువక పురుషులవలెఁ

దలనుపై కెత్తియే పురుషులవలె గాంభీర్యముతో దూరదూరముగ నడుగులిడుచు నడుచు చుండెను. ఆసమయమున నతనికిఁ దానొకస్త్రీనను జ్ఞానమే లేకుండ నశించియుండవలెను. మార్గమధ్యమున నతనికిఁ జిరపరిచితుఁడగు నొకమిత్రుఁ డిట్లుప్రయోగిప్రవర్తించుట నగుబాటగుననియెంచి

"అధః పశ్యస్వ మోపరి సంతరాం పాదకౌ హర।
మా తే కశప్లకౌ దృశన్ స్త్రీహి బ్రహ్మా బభూవిథ॥"

[చూ. ఋ. మం. 8-34-19]

అని మీఁదఁజెప్పినట్లు స్త్రీధర్మముల నుపదేశించెను.

కాన వైదికయుగమునందును స్త్రీలు గౌరవమునుబొంది యన్నివిషయములందును పాండిత్యమును సంపాదించినను మహిళాలోకమునకు విరుద్ధములగు ధర్మములననుష్ఠింపక తమకుచితమగు రీతినే ప్రవర్తించిరని యెఱుంగవలెను. ఇప్పటి మహిళామణు లీయంశమును గుర్తించి ప్రాచీనవనితల మార్గమునుద్రొక్కి-నచో అభివృద్ధికలుగకపోదు.

# తపస్విని

సహదేవ సూర్యప్రకాశరావు గారు

ఏమి ఏమి
పూలనోములు నోచినావోయి ఇంత
మిసిమిమెత్తనిహృదయమ్ము, కుసుమలలిత
జీవితము; దొరకించుకొన్నావు సఖుడ
వీవె, ప్రణయతపస్వివీవే నిజమ్ము.
ఓయమాయికుడా! చాలునోయి, గుండె
లురులజేయునోయీ, నీనిషూర్పులవము.
ఎవరెఱుంగుదురోయి, ఈయెదలుచదల
కదలికదలి విహరించు మృదులపదము.
ఎవనికై తపియించిపోయితినో నేను
అతడెలభియింప విడతునా? అసురసంజ
చివురుతొలిమంచు తీవసజ్జకపుచాయ
ప్రిదులగా నను నేనెయర్పించుకొనక.
చనవులివమిన చూపులేశాలనెపుడు
చివురుజూపెనో నీయెట్టజీరకనులు
అపుడెరాగిల్లి నాహృదయమ్ము వలపు
పూలజల్లుల 'నిట్టూర్చి'తూలెనోయి.
అసలునీమీదనిల్పిన యాసకొసల
జారిపడిన స్వప్నాలలేశాలెనన్ను
ముంచుకొనిపోవు, నాశరీరాంచలములు
కుంచుకొనిపోవు, కునుకుదృగంచలములు.
ఏమియునుకోరుకోలేదు, ఇప్పుడపుడు
త్వన్మధురదర్శనామూల్యభాగ్యమొకటి
దక్క నన్యమ్ము వలదు, సుధాపునీత
మృదులరాగమ్ముతోనేది యీడువచ్చు.
అవునులే, లేశమేని శోకాతిరేక
మాచికోలేము, లోకమే అతిచిరాను
భూతగీతితో నర్తించిపోవు, మాన
గతిని రేయితో సుప్తజీవితముగడచు.
ఏదియెటులైన గానిమ్ము, ఇరువురమ్ము,
సోగవెన్నెల శాల్మలీసుమములట్లు
ప్రేమసీమాంతముల పిసాళించినాము.
ఎన్నటికినేని నీదాననే నిజమ్ము.

—'వకుళమాల' నుండి.

# విద్యావంతుని లక్ష్యము

శ్రీమతి వి.యస్. నారాయణి అమ్మగారు

వర్తమానకాలమందలి ప్రాపంచికపరిస్థితులు ప్రతివిషయమునందును కలగుండువెట్టుచున్న సంగతి సర్వజనవిదితము. సాంఘికమతాచారవ్యవహారసాంప్రదాయములు విషమపరిస్థితులపాలై ప్రచలించుచున్నవి. మానవమండలియందు ప్రబలుచున్న వివిధవర్ణభేదములు ప్రశాంతవిదూరములై పరిణమించి దేశమందలి యైక్యమత్యము నంతర్ధానమొనర్చుచున్నవి. తపోధనముచే యోగీశ్వరులు స్వర్గపదవికి పాటుపడునట్లు మహాత్ముడు మొదలుగాగల యోధానయోధులు సత్యాగ్రహదీక్షచే స్వరాజ్యమునుసాదించుట కహర్నిశలు పాటుపడుచున్నారు. ఇట్టివిషమావస్థలందు విద్యావిజ్ఞానసంజనితములగుసానుభూతి, సుహృద్భావము, అనునీరెండే మానవమండలికి సర్వశరణ్యములు.

వర్తమానకాలమున విద్యావంతునిలక్ష్యము ఉద్యోగము; స్వార్థపరతంత్రతయే పరమార్థమని నవీనవిద్యావంతులునమ్మినను మానవజీవిత సందిగ్ధసమస్యలం దించుకంత, సుహృద్భావము తనకుతానె, జనించును. ఆభావమే భిన్నాభిప్రాయమును భిన్నమొనర్చి పరస్పరసదభిప్రాయమును పెంపొందింపజేయును. మరివిద్యావిజ్ఞానరాహిత్యమువలన గలుగుఫలమేమి? అదికేవలము స్వశ్రేయమునే స్మరింపజేయుచుండును; తన్మూలమున మానవసంఘమున భిన్నాభిప్రాయములు, స్పర్ధలుప్రబలి కొన్నిసమయములందు విద్యావిశిష్టుల విజ్ఞానచంద్రికలనుకూడ తారుమారొనర్చి ప్రాపంచికకల్లోలమున కాలవాలమగుచున్నది. ప్రస్తుతము దేశమున మహామారివలె ప్రబలియున్న, కార్మికసమస్యకుకూడ, పరస్పరభావసంగ్రహణరాహిత్యమే కారణము. "తానుబట్టిన కుందేటికి మూడేకాళ్లని" వాదించు విపరీతవాదములు కేవలము ఆదర్శవిద్యావిహీనసంజనితములనియనకతప్పదు. విద్యావంతుడు విద్యావిహీనునివలె, అట్టివెట్టినమ్మకమునేబట్టి యుట్టూతలూగదొడంగక, మానవాభ్యుదయమున కాశించుచుండును.

విద్యావిశిష్టుడు మానవనైతికాశయమును చేటికవలె చేయూతనొసగి యభివృద్ధినొందింపజేయును. అల్పజ్ఞానులు, నైతికాదర్శములు, మానవునికుపకరింపవని, సాంఘికసాంప్రదాయములని యెంతురు. వారివ్యక్తియాదర్శము సంఘాశయమును దాటిపోజాలదు. సముచితానుచితవిచక్షణసైతము వారికానిర్ణయమునననుసరించియే యుండును. మఱియువారు మీ ప్రతివిషయమునందును, తమ ఆత్మవిజ్ఞానమునుపయోగింపక, సంఘసంప్రదాయకముగ చరింతురు. కావుననే వారిని సముదారభావాతిశయులుకారనియు కేవలము సంకుచితబుద్ధులనియు ప్రవచింపవలసివచ్చుచున్నది.

విద్యావంతుడును, విద్యయు, వ్యక్తుల నుత్కృష్టజీవనులంజేయుటకెంతయు దోహదమొనరించును. కావున విద్యయతిశయించుకొలది వ్యక్తిత్వమును, తదనుగణ్యముగ ప్రజ్వరిల్లును.

విద్యావంతులలో చాలమంది, తమవిద్యాజ్ఞానకౌశలమును కార్యాచరణయందు దుర్వినియోగపరతురు. అట్టివారు విద్యావంతులనదగరు. సర్వమానవసౌభ్రాతృత్వమే విద్యావంతుని లక్షణము. మఱియు నదియే ఆతనిలక్ష్యము. పరులకష్టసుఖములందతడు పాల్గొని అవి తనకష్టసుఖములేయని యెంచును. అరిషడ్వర్గమును తనశత్రులవలె భావించి దరికిజేరనియ్యకుండును. సర్వమానవకళ్యాణముననును ప్రపంచసౌభాగ్యమునకును తనశక్తినంతయునుపయోగించి అతడు కృతార్థుడగును.

త్యాగము, మానవసేవ విద్యావిజ్ఞానమునకాదర్శములు. విద్యావిశిష్టుడెల్లపుడట్టియాదర్శములననుసరించుటకాసక్తుడగుటయేగాక తన మనోవాక్కాయకర్మల నేకీకృతమొనరించి చరించును. శాస్త్రజ్ఞానముకొన్ని

సమయములందు మానవమండలికి మిక్కిలికీడుకలిగించును. కానది మానవకళ్యాణమున కత్యంతానుకూలముగ నుండదు. ప్రజాసౌభాగ్యమునకు లౌకికసుహృద్విజ్ఞానమే కడుంగడు ప్రయోజనకారి. అట్టి జ్ఞానమలవరుచుకొనుటయే విద్యయొక్క పరమార్థము; విద్యావంతునియొక్క లక్ష్యము.

కాన విద్యాసముపార్జనమొనరించిన భారతసోదరసోదరీమణులు, విజ్ఞానదరిద్రమగు మానవసంఘమందు తమ లౌకికసుహృద్విజ్ఞానమించుకంత ప్రబలునట్లుజేసినచో నదియే ఆదర్శప్రాయమై ప్రజలలో పరస్పర సదభిప్రాయము పరిపాటియొనర్చి క్రమమున పెంపొందింపజేయును. అట్టిమానవసంఘ మనవరతము సౌభాగ్య వీచికల నోలలాడుననుటకు సందియమేమి?

## జటప్రోలుసంస్థానాధీశ్వరి

కొప్పరపు సుబ్బారావుపంతులుగారు

[‘రోషనారా’నాటకకర్తలును, గుంటూరుమిషన్ ట్రెయినింగుస్కూలు ప్రధానాంధ్ర పండితులును అగు కొప్పరపు సుబ్బారావుపంతులుగారు జటప్రోలుసంస్థానమునుసందర్శించి నపుడు ఆసంస్థానమును ప్రస్తుతముపాలింపుచున్న శ్రీమతి సురభి వేంకటరత్నమాంబ మహా రాజావారిని సంబోధింపుచు చెప్పిన పద్యములు.]

“పుడమి రాజులకొఱకయి పుట్టలేదు
పుడమికొఱకయి రాజులుపుట్టి రంచుఁ
దెలుపు హైందవధర్మసూక్తికి స్వయముగ
వ్యాఖ్యనిర్మించితమ్మ! నీపాలనమున.
తాను దలపెట్టినట్టి యుత్తమపుబనుల
నొక్కటియు విడువక పూర్తియొనరించితివి
తల్లి! నీప్రియభర్త యింద్రపురినింకఁ
జిత్తశాంతిని వహించి చెలఁగు నిజము!
అలమహారాష్ట్రరాజ్యమ్ము నేలిన ‘యహ
ల్యాబాయి’ మీవంటియతివకాదె!

అల్లఝాన్సీరాజ్ఞియై పేరుగొన్న ‘ల
క్ష్మీబాయి’ మీవంటి మెలతకాదె
అలబుందేల్ ఖండరాష్ట్రాధీశ్వరియైన ‘దు
ర్గావతి’ మీవంటి గరితగాదె!
అలబిజాపురరాజ్ఞియై కీర్తిగన్నట్టి
‘చాంద్ బీ’ మీవంటిచానకాదె!
వారువారుఁ బాలించిన వానికన్న
నమ్మ! జటప్రోలు చిన్నదే యగునుగాక
దయకు, ధర్మంబునకు, రాజ్యదక్షతకును
జిన్నపెద్ద విభేదంబు సేయునెవఁడు?

నీరసమై, నివాతమయి, నిర్జలమైన యెడారియందు నిం
డారు సరస్సువోలె కనులారఁగఁ గంటిని తల్లి! మాతృభా
షారతి, హైందవత్వము, నిజాశ్రితరక్షణ, దైవభక్తి, గం
భీరయశంబు బెంపెసఁగు మీఘనరాజ్యము నీనిజాములో.

—గోలకొండ.

# శ్రీమతి మదమంచి అనంతమ్మగారి కవిత్వము

పాటిబండ మాధవశర్మగారు

నిరుపమమును, నీరంధ్రమును అగుకవనము రచించు నేటియాంధ్రమహిళలో శ్రీమతి అనంతమ్మగారొకరు. శ్రీమతుల అద్భుతకవితాత్మను వెల్లడించుటకే యీవ్యాసముద్దిష్టము. విమర్శనకుపాల్పడినవారి వ్యాసములు రెండు. ఒకటి 'సీతమ్మపెండ్లి'; రెండు 'మాంచాల.'

ఈకవయిత్రికి ప్రయుక్తభాషయే జీవగఱ్ఱ. మాంచాలలోని పరిభాష కవిసార్వభౌముని ప్రతిఫలనము. పల్నాటికాంత పౌరుషమునకు ప్రతినిధి. సీతమ్మపెండ్లి యమృతధార. సనాతనసాంప్రదాయము లసమగ్రముగ సంగ్రహించినారు. ఆధునికాలంకారముల నందందతికించుకున్నారు. కవిత యుభయతారకమైనది. ప్రాతసారాయమును ప్రాతసీసాలోనే పోసినారు. మోసములేదు.

రసచర్చలో కళానుభూతిగోల్పోవు విమర్శకునకన్న రసజీవనుడగు జానపదునకు వీరి కవితకఁడుగూర్చును. నిజమునకు పామరుఁడుమెచ్చిననే యది కవిత. పండితుఁడు మెచ్చునది కృత్రిమకవిత. పామరుఁడుమెచ్చినది నైజకవిత. శ్రీమతి అనంతమ్మగారి కవిత జానపదుని సుకుమారహృదయమును దనించికరగించును. అది వారికవితలోని వ్యాపారరహస్యము. రచనయొక్క ఔత్కృష్ట్యము భావములో, భాషలో, వృత్తములో, ఇతివృత్తములోనుండును. అనంతమ్మగారికవితలో నివియన్నియు పరిణతములైనవి.

ఏ కవనముజదివి పాఠకుఁడు కవితోడను, పాత్రతోడను సహానుభూతిగాంచునో అదియే కవిత. అనగా కవిగాని, పాత్రగాని, ఏడ్చినచో పాఠకుడేడ్వవలయును. క్రోధించిన క్రోధింపవలయును. నవ్విన నవ్వవలయును. అది.

సీతమ్మపెండ్లి యొకకథనము (Narration). ఇందు పాఠకునకు కవితో సహానుభూతి. మాంచాలలో పాఠకునకు పాత్రతో సహానుభూతి. సీతమ్మపెండ్లిలో పఠిత కనీసమైదుసార్లు అయినను ఉబికిచల్లారును. పాఠకునకట్టి యుద్రేకముగలిగించుశక్తి రచనావైఖరిలోనున్నది. అది రచయితలోనున్నది. ఇతివృత్తమున కనుగుణమగువృత్తము, వృత్తమునకనురూపమగు శైలి ఇవియే వీరిలోగమనింపదగినవి.

సీతమ్మపెండ్లి ప్రక్క మాంచాలనుంచి చూచినచో రెంటికిని రెండుయుగములకు, రెండు వ్యక్తులకు ఉన్నయంతరము గోచరించును. సీతమ్మపెండ్లిలో అమృతమువర్షించినది. మాంచాలమాటలలో అగ్నిజ్వలించినది. సీతమ్మపెండ్లిలో భక్తి. మాంచాలలో పౌరుషము. సీతమ్మపెండ్లిలో పూలవాన. మాంచలబోధలో పిడుగులు. సీతమ్మనవ్వులో చిరుతవెన్నెలలు. మాంచాలచూపులో బడబాగ్నిశిఖలు. వెన్నెలలగురియించిన యనంతమ్మగారే వేడిగురియించిరి. అదియు సరసముగ, సమంజసముగ, సంపూర్ణముగ. అదియే కవయిత్రిప్రతిభ.

మాంచాలశాపము కవిసార్వభౌముని రచనకు స్మృతికరణము.

"నాగులేటిని పేగులు దోగునాడు

... ..................

బాలచంద్రుని రక్తసంప్లావితమయి

భూతధాత్రి పరిశ్రాంతి బొందునాడు"

—మాంచాల.

శివ శివా! శివ శివా!—ఇట్టితలంపులు మాంచాల నావేశించియేయుండవలయును. కరాళనైరాశ్యమునమున్గ మాంచాల యాహ్వానించిన భయంకరభావపిశాచములే పల్నాటి పతనముగావించియుండవలె! ఇందుకవయిత్రి ప్రతిభ సహస్రధాప్రకటితము.

భర్తక్షుద్రవ్యామోహమునకు గురియై సమరపరాఙ్ముఖుడగుటగాంచిన ఆమె యభిమానము ముందుపాతివ్రత్యభావము సుంతసడలినది. కాగానీమె "ధీరురాలు" అని కవయిత్రి ధైర్యముగాబలికినది.

సీతమ్మపెండ్లి ఆంధ్రవనితలు కంఠస్థముచేసి వివాహసందర్భములలో బాడినచో మనోహరముగా నుండవచ్చును. శ్రీమతి అనంతమ్మగారు తమకవితకింకను మెరుగుబెట్టుకొని ఆంధ్రభారతీసేవ నేమరక యాంధ్రలోకమునకుకీర్తిదెచ్చుచు చిరకాలము వర్ధిల్లుదురుగాక!

# ప్రణయమేళ

జనమంచి కామేశ్వరరావుగారు

౧

వెన్నెలవిందులు
కన్నులవెలుగై,
సెలయేటిపాటలు
చెవులకువిందై
వలపుల పులకలు
మొలకల నెత్తగ,
బిగికౌగిలింతల
మెలంగుచుండిరి.
ఆకులగలగలతో
చలిగాలి వీచులతో
ప్రేమకువరదలు హెచ్చె
ముద్దులతరగలువచ్చె
ఒదవినపారవశ్యములో
తనువులమాటే మరచిరి.

౨

నాకలోకంలో
నందనంనడుమ
అచ్చరలందరు
నృత్యంజేసిరి
అంబరపుష్పిత
సుందరహారం
మన్మథనాథుని
ఒడిలోహారం
మెరపుపోలికనె
ప్రియులనుచేరెను.

౩

వెలదివెన్నెల
ప్రియునినవ్వుల
ప్రేమవెలుగులు
మింటికిమంటికి
వెల్లలువేసెను.
ఆప్రణయమేళలో
ప్రేమలీలలో
భువియేదివిగాపోల్చెను
చంద్రుడు పకపకనవ్వెను
కలువలు కలకల్లాడెను
కోయిల గానంచేసెను.

# ఛాయాచిత్రం

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

“ఊరికేఎందుకల్లానవ్వడం. ఎందుకొచ్చిన నవ్వో అది”అని డ్రాయరుమీదున్న అద్దంచూసుకుంటూన్న శకుంతల వెనక్కు తిరిగిఅంది.

“బాగుంది, నవ్వితేతప్పా ఏమిటి?” అని కుర్చీలో ఊసుపోకపుస్తకం తిరగేస్తూన్న రామారావు చిరునవ్వుతో అన్నాడు.

“తప్పా, తప్పన్నరానా? అనవసరంగానవ్వితే తప్పుగాదూమరి.”

“అవసరమో అనవసరమో నీకుతెలుసా? ఊరికేగిల్లి జగడంపెట్టుకోడానికిగానీ.”

“పాపం, మీతో జగడమాడకపోతే జరిగేదెలాగా.”

“జరుగుతుందో జరగదో, అంత నారాయణాఅంటేనే పాపమైతేఇంకావిలా, ఇలాఅయితేఅసలీమాటు రానేరాను.”

“ఇక నేం, ఇకోటిదొరికింది బెదిరింపు, రానని మాటినిగించుకోడం, రారుపాపం.”

“మరిఇలాఅయితే ఎవరొస్తారు? నవ్వితేతప్పే.”

“కోప్పడతారేం, తప్పాఅని దీర్ఘంతీస్తారుగదా, తప్పోఒప్పో మీచేతేరూపిస్తా. అసలు నేనీగదిలోకొచ్చి అద్దంచూసుకుంటూంటే నవ్వడంఎందుకూ?”

“నీవు ఉడుక్కుంటావుగానీ, ఏంచేసినా నిన్నుగురించే చేస్తున్నారని నువ్వెందుకనుకోవాలి? నవ్వితే నిన్నేచూసి నవ్వారనుకోడంఎందుకూ.”

“స్పష్టంగాకనిపిస్తూంటే అనుకోడమేమిటి? పోనీనన్నుచూసికాదన్నారుగదా, ఎందుకోచెప్పండిమరి.”

“ఎందుకా, మొన్నమాస్కూల్లో ఏదోతలనొప్పిగాఉంటే పిల్లలతోమాట్లాడకుండాకుర్చీలోకూచున్నా.”

“పాపంతలనొప్పా? ఎవరికన్నాఎరగనివాళ్లకిచెప్పండి. దూర్వాసమహర్షి అటూ మనం ఇటూనాయె. సరేలెండి చెప్పండి.”

“అయ్యా, బాబో. ఆడవాళ్లు చదువుకోడం తంటాగానేఉంది. సరేలేనీమాటలకేంగాని, ఇంతలోకే ఓఅమ్మాయి లేచిపాఠం చెప్పరాఅండీ, అనిఅంది. నేను భీష్మించుకొనే కూచున్నాను. మళ్లీ ఆ అమ్మాయే లేచి ఏమండీ మాట్లాడరాఅంది. అప్పటికీ నేమాట్లాడలేదు. వెంటనే ఆఅమ్మాయి దబదబా నాడ్రాయరు దగ్గిరకొచ్చి మేష్టారండీ, పచ్చా, పండా, అని రెండు వేళ్లూచూపించింది.”

ఇకపైసంగతిచెప్పనియ్యకుండా నేనవ్వింది శకుంతల. రామారావు తననవ్వునుగంభీరంగాఆపుకొని“నువ్వెందుకు ఇప్పుడునవ్వడం”అని అడిగాడు.

“మీరుచెప్పినకథ వింటేనవ్వొచ్చింది. ఇంతకూమీరు పచ్చన్నారా పండన్నారా?”

“కథా, పాపం. ఇదినిజంగాజరిగింది. అదినాకుజ్ఞాపకంవచ్చి నవ్వాను. వింటేనే నీకింతనవ్వువస్తే అసలు నిజంగా జరిగినప్పుడు చూసినా కెంతనవ్వురావాలో ఆలోచించు. ఊరికే అనవసరంగా మాటలువచ్చాగదా అని మాట్లాడితేసరా”.

“ఏం, బాణాలుబాగాపదునెట్టారాఏం. ఈశ్వరుడితపస్సుపాడుచేయడానికేనా పోతున్నారు. జాగ్రత్తసుమండీ ఆయన మూడోకన్ను తెరవగలడు” అని వేళాకోళం ఆడి వెళ్లిపోయిందిశకుంతల.

రామారావు చిన్నవాడే అయినా పెద్దపరీక్షల్లో జయంపొందాడు. మంచియోగ్యమైన ప్రవర్తనకుతోడు రూపసికూడాను. చమత్కారంగా మాట్లాడకపోయినా చక్కగా మాట్లాడుతాడు. క్రౌర్యము అనేది ఇతని హృదయంలోలేదు. మొగమోటంతో కూడిన దాక్షిణ్యం ఇతని సహజస్వభావము.

శకుంతల ఇతని భార్య. బాగా చదువుకున్నది. అంటే తెలుగు చదువు. శ్రావ్యమైన శారీరం. సుందరమైన శరీరమూను. చమత్కారంగా ఇతరులకి నవ్వు పుట్టించేట్లు మాట్లాడుతుంది. తల్లిదండ్రుల కేకపుత్రిక. అల్లారు ముద్దుగా పెంచుకుంటూ పంచప్రాణాలూ ఈ అమ్మాయిమీదే పెట్టుకోడంమూలాన శకుంతలకి కాపరం వెళ్ళే యీడొచ్చినా ఇదిగో అనీ, అదిగో అనీ, వచ్చే పండగదాకా అనీ వాయిదా వేస్తూ చనువుగల మేనల్లుడే గనుక సమాధానం చెపుతూ ఇంటిదగ్గిరే అట్టే బెట్టుకున్నారు. రామారావుకి శకుంతల అంటే ఎంతో ఇష్టం. అయితే ఏంచేస్తాడు? మేనమామతో ముఖ్యప్పట్టుపట్టలేక శనిఆదివారాల్లో వస్తూంటాడు. ఇక్కడ శకుంతల మాట్లాడే మధురమైన మాటలచేతా, అత్యంత ప్రేమమూలాన్నీ, చేసే పరిహాసాలవల్లా ఎంతో ఆనందాన్ని పొందుతూండేవాడు. ఇంతెందుకని తనకు శకుంతల భార్యగావడం తనపూర్వజన్మసుకృతవిశేషంవల్ల అని అనుకుంటూండేవాడు.

కాని ఇతనికో అభిప్రాయం చాలాకాలంనుంచీ ఉంది. శకుంతల ఛాయాచిత్రం అస్తమానమూ తన దగ్గిర ఉంచుకోవాలని. అయితే ఆమెకు ఫోటో లేదు. కనక తన అభిప్రాయం శకుంతలతో చెప్పి ఫోటో తీయించుకోమన్నాడు. కాని ఆపిల్ల అంగీకరించలే. ఒకసారి ఆ అమ్మాయి ఉపాధ్యాయుడు చెప్పాడట ఫోటోలు తీయించుకుంటే ముఖం క్షీణించిపోతుందని. కాబట్టే గాంధీమహాత్ముడు ఫోటోలు తీయించుకోడం పాశ్చాత్య శాస్త్రసమ్మతం గాదనే అభిప్రాయంతో తనఫోటో ఎవళ్ళనీ తియ్యనిచ్చేవాడు గాదని ఉదాహరణం చెప్పేరట ఉపాధ్యాయులు శకుంతలకు. పాపం ఆ అమ్మాయి నమ్మింది. అయితే మహాత్ముడు ఫోటో తీయించుకోకపోతే ఇన్ని ఫోటోలు ఎల్లా వచ్చినవి అనే సందేహంతోచిందిట గాని పాఠంతొందరలో ఆయన సరిగ్గా చెప్పలేదట. అందుకోసం ఆ నిషేధబీజం దృఢంగా మనస్సులో నాటి ససేమిరా అంటే ససేమిరా అంటుంది. పాపం, రామారావు పెళ్ళప్పుడు తీయించుకుందామంటే చిన్నతనం అవడంచేత, పల్లెటూరిదాకా ఛాయాచిత్రాలు పెళ్ళిళ్ళల్లో తీయించుకునే నాగరికత పాకలేదు. గనక నలుగురిచేతా నాలుగు పంచరత్నాలు రాయించి వధూవరుల ఫోటోలతో ఓచిన్న పుస్తకంలా తయారుచేద్దామనే మహోద్దేశ్యం కలిగింది కాదు. పోనీ తనకు జ్ఞానం వచ్చిందికదా ఇప్పుడు తీయించుకుందామంటే శకుంతలను ఒప్పించేట్లు మాట్లాడడంచేతగాకపోయె. ఒకవేళ తనపక్కన కూచోడానికో నుంచోడానికో సిగ్గుపడుతున్నది కాబోలనితనొక్కత్తెను దిగమన్నా నాకొద్దంటే ఒద్దంటుంది. ఆఁ ఆమాత్రం తనమాటవిందాంఅనుకొని సాహసంచేసి ఓనాడు ఓఫోటోగ్రాఫరుని జట్కామీద తీసుకొస్తే నానా చివాట్లూ పెట్టి కసిరి ఆతన్ని పొమ్మంది. పుట్టెకోబుద్ధి జిహ్వాకోరుచీ అన్నట్లు రామారావుకి శకుంతలఫోటో అంటే ఎంత ఇష్టమో ఆమెకంత అయిష్టం.

ఓనాడు పాపం ఫోటో తీయించుకోమని ఎంతోసేపు బతిమాలేడు శకుంతలని.

“ఫోటోలు తీయించుకోడం చాలాపొరబాటు, అందులో చాలా నష్టాలున్నవి.” అంది శాంతంగానే. నిజంగా శకుంతల మాట్లాడితే తగినట్లు రామారావు సమాధానంచెప్పలేడు ఉద్యోగంచేస్తున్నాడన్నమాటేగాని.

“అయితే ఫోటోలు తీయించుకోడం తప్పన్నావుగదా, మఱి మహాపురుషులదర్శనంఎల్లా?” అని అడిగాడు రామారావు.

“ఏంచూడకపోతే? వారిజీవితంవింటేచాలదూ.”

“చాలుగాని, మహాత్మాజీజీవితం విన్నమనస్సుకీ, జీవితంవిని ఆమహాపురుషుని ప్రశాంతవిగ్రహాన్నిచూసిన మనస్సుకీ తేడా ఏమీ లేదంటావా?.”

ఈమాటకేమీసరైన సమాధానం చెప్పలేకపోయింది. అయితే యుక్తితో తనపంతం నెగ్గించుకోవాలని “మహాత్ములకీ నాకూ పోలికా ఏం, అల్లాంటివారు తీయించుకుంటే ప్రయోజనం ఉంది. నావంటివారికెందుకు?” అని నవ్వింది.

"బాగుంది. దోవకేవచ్చావు. మహాత్మునిదర్శనం విషయమై ప్రపంచం ఎంతభక్తీ, ప్రేమా, గౌరవం, చూపిస్తున్నదో నీవిషయంలో నాకంతే."

"చాల్లెండి, పిచ్చాఏమిటి? లోకంలోజనులందరికీ మహాత్ముడు కనిపించడానికవకాశంలేదుగనక ఆయన ఫోటో అందరికీ అవసరమైంది. మీకొక్కరికీకావాలసిన నేను కనిపిస్తూనే ఎదురుగాఉంటే ఫోటోఎందుకండీ, తోచదాఏమిటీ, యీ ఆర్భాటాలులేకపోతే."

ఈమాటతో రామారావు సమాధానంచెప్పలేక ఉక్కిరిబిక్కిరి అయినాడు. ఏంచెపుతాడుపాపం. తనకుకావలసిన తన అర్ధాంగి శకుంతల ఎప్పుడూ తనదగ్గిరే ఉంటూంటే ఫోటోఎందుకూ నిజంగా ఆలోచిస్తే. కాని ఫోటోతియ్యాలనిఉంది. కారణంలేనివాంఛ బలంగాఉంది. పాపం చివరకువిసిగి "అబ్బ! ఊరికేప్రశ్నలు వేసి నన్ను చంపకు. ఇంతకూ నాప్రార్థన మంగీకరిస్తావాలేదా?" అని అన్నాడు.

"చేతగాకపోతేసరి యిల్లామొదలెట్టడం. ప్రార్థనఏమిటీ, అంగీకరించడంఏమిటి? పోనీ ఓమాసం ముందుగా అర్జీదాఖలుచేసుకోకపొయ్యారూ? మీకోరిక అర్థంలేనిది. సకారణంగా మీరుచెప్పితే నేవినకపోతే అప్పుడంటేబాగుంటుందిగాని యిదేమిటి అడ్డదిడ్డంగా మాట్లాడటం" పాపం రామారావు ఏమీఅనలేక మళ్లీ వెళ్లిపోయినాడు.

సంక్రాంతివచ్చింది. శకుంతల ఎదిగినపిల్లఅయినా తల్లిదండ్రులకు చిన్నపిల్లలాగానేఉంది. అందుచేత బొమ్మలుపెట్టింతామనుకున్నారు. రామారావుకిపండుగకురమ్మని ఉత్తరంవ్రాశారు.

రామారావు ఇక రెండు మూడురోజులకు వెళ్లుతాననగా ఇటు వసంతవాడశర్మగారికీ, అటు భీమడోలు విశ్వనాధంగారికీ తనకు చేతికెమెరాకావాలనీ ఫలానారోజుకితెస్తేసంతోషిస్తాననీ ఉత్తరాలువ్రాసిస్వయంగా పోస్టులోపడేశాడు. స్నేహంఅంటే మరేమిటీ, సరిగా ఉత్తరాలు చేరడంతోటె సమయానికిటు శర్మగారూ, అటువిశ్వనాధంగారూను కెమెరాలతో రామారావుకు ప్రత్యక్షమైనారు. శర్మగారిదాంలో ఫిలిము లేకపోతే ఆనాడే ఊరంతా తిరిగితిరిగి ఓచేడ ఎక్కువైనాకొని సూటుకేసులో రెండూ జాగ్రత్తగా పెట్టి అత్తారింటికి వెళ్లాడు. శకుంతల సమయానికెదురువచ్చి చేతులోఉన్న పెట్టెచూసి "ఇదేమిటీ?ఎన్నడూలేందిపెట్టెతెచ్చారే" అంది.

"ఎన్నడూలేదుగనకనే ఇప్పుడు తేవాల్సొచ్చింది." అని చిరునవ్వుతో అన్నాడు. పాపం అందులో ఉన్న అర్థం శకుంతల గ్రహించలేదు.

మర్నాడు శకుంతల బొమ్మలనోముకి ఊళ్లోపేరంటానికి పిలవడానికి పొద్దున్నే తలంటి పోసుకున్నది. సాయంకాలం ఊళ్లోపిలవడానికిపోవాలిగా అందుకని రెండుగంటలదగ్గిరనుంచే ముస్తాబైంది. నూనెరాచు కోకుండానే తలచిక్కుతీసుకుని వాలుజడ వదులు వదులుగా వేసుకుంది. అంచులదగ్గిర లేసుతోకుట్టిన పైట పావడాకట్టుకుంది. కళ్లకు లేతగా కాటుక చెవులకు లోలకులూ ముఖానబొట్టూను, మెళ్లో కొత్తగా మూడు పేటలుగాచేయించిన గడియారపుగొలుసూ వేసుకొని దిద్దుకునేసరికి మూడుగంటలుదాటింది. ఓమాటు ఆపళంగానే గదిలోకూర్చున్న రామారావుదగ్గిరకిపోవాలని దబదబావెళ్లింది.

రామారావు తనప్రయత్నంలోఉన్నాడు. విశేషించి ఫోటోనుగురించి సావధానంగాఉన్నాడు గనక రెండుకెమెరాలు సిద్ధంచేసుకొని కూచున్నాడు. శకుంతలదగ్గిరికిపోయి "ఓహోకొత్తదేమిటో తెచ్చారే"అని దాన్నిచేత్తో తీసుకుంది. "ఇదేమిటోతెలుసా" అన్నాడు రామారావు. "ఏమిటిచెప్పండి." అని తేరిపార చూసింది. "ఇదోగమ్మత్తు. ఏమనుకున్నావేమిటి, పల్లెటూరిలోకూచుని గొబ్బెమ్మలు చేయడమనుకున్నావా?

నేనేమనుకుంటే అగిమూరంగాఉన్న నీవు తెలుసుకోవచ్చు. అట్లాగే నువ్వేమనుకుంటే నేనుదూరానఉన్నా తెలుసుకుంటాను. అసలు నువ్వుబొమ్మలనోము నోచుకుంటావని మీనాన్న ఉత్తరమేరాయలేదు. నేనే సంతోషకనుక్కొనివచ్చాను. దీన్ని నీక్కూడాచూపిద్దామని తీసుకొచ్చాను. బాగుంటే మనంకూడా తెప్పించుకుందాంలే. ఏంభాగ్యమా" అన్నాడు. "నిజంగానా? అయినామనకెందుకులెండి, అంతకరీదుపెట్టి. బస్తీలో చాలాచిత్రాలుంటాయండీ, సరేగానీ మీమాట ఎంతనిజమో చూద్దాము. నేనిప్పుడేమనుకున్నానో చెప్పండి." అన్నది. "ఓ యింత దగ్గిరగాఉంటే ఏలాగా కాస్తదూరంగాఉండి ఏమేనాతలచుకో కదలగూడదుసుమా. నేచెప్పలేకపోతే అప్పుడు." అన్నాడతడు.

వెంటనే శకుంతలపైటా ఆదీసవరించుకొని రామారావుకు కొంచెందూరంగా నిలబడ్డది. రామారావు కెమెరాను కిందికీమీదికీతిప్పి సరీగ్గా శకుంతల పడేట్టుగానొక్కాడు. రెండోకెమెరాకూడాతీసి దాంలోకూడా నొక్కాడు. "చెప్పరేం?" అంది శకుంతల. కాసేపు కళ్లుమూసుకొని తెరచి "నీవు పేరంటానికి ఊళ్లో వాళ్లని పిలుద్దామనుకొని వెళ్లబోతున్నావు" అనిచెప్పాడు. "అబ్బా, అదికాదులెండి. అబద్ధాలు. ఏవోకొయ్యాలు తెచ్చి" అని వేళాకోళంచేసి మూలాన్ని వెళ్లిపోయింది.

మళ్లీపదిహేనురోజులకల్లా శర్మగారిచేతా విశ్వనాథంగారిచేతా ఆఫీసుపనులు కడిగించి జాగ్రత్తగా మంచిచట్రంకట్టించి శకుంతలదగ్గిరకు శనిఆదివారాల్లో వచ్చాడు.

"నేనోమనిషిని చూపుతాను, నువ్వు ఎరిగున్నవాళ్లనే. గుర్తుపట్టుతావా?" అన్నాడు శకుంతలదగ్గిరకు రాగానే రామారావు.

"అప్పుడే చత్వారంవచ్చిందనుకున్నారా ఏం?" అన్నది నవ్వుతూ.

"ప్రతిసారీ ఇల్లాగే చమత్కారంగా దబాయిస్తావు. గుర్తుపట్టలేకపోతేనో."

"అబ్బ! చూపిద్దురూ, నేపట్టగలనుగా" అంది. రామారావు తనపెట్టెలోఫోటో ఒకటితీసి ముందుచూపించాడు. శకుంతల కళ్లువిప్పి బాగాచూచింది. తాను బొమ్మలనోమునాడు ఉన్న ఆకారంజ్ఞాపకంవచ్చింది. వెంటనే కోపంవచ్చింది. ఇదిగ్రహించి రామారావు రెండోదిచూపించాడు. అప్రయత్నంగా చిరునవ్వు సిగ్గుతో కలిసింది శకుంతలకు. "ఎక్కడిది" అని అడిగింది.

"ఎక్కడిదైతేగాని, అప్పటికీ ఇప్పటికీ నీముఖం ఏమీక్షీణించలేదే" అని వేళాకోళమాడాడు రామారావు మందస్మితంచేస్తూను.

## "గృహలక్ష్మి పరమధన్య"

ఆకుండి వేంకటశాస్త్రిగారు

"తలనంటిమేనఁ జొబ్బిలఁగఁజమురువ్రాసి
సకలాంగములుదిద్ది చక్కనొత్తి
జలకముల్ గోర్వెచ్చజలకముచేనార్చి
తడియోవ కర్ణరంధ్రములనూది
చలువసన్నపుఁ బుట్టములమేనఁదడియొత్తి
పట్టుపొత్తుల మెత్తపడకనునిచి
నునుపైనకాటుకకనుదమ్ముల ఘటించి
బొమలుదీరిచి చుక్కబొట్టుఁబెట్టి
పొదిగిటనుజేర్చి పాలిచ్చి బుజ్జగించి
కెంపురవచెక్కడంపునిద్దంపుసొంపు
నింపునుయ్యేలలోన నిద్రింపుమనుచు
పాటబాడెడు" గృహలక్ష్మి పరమధన్య.

# అనంతలీల

అల్లంరాజు రంగనాయకులుగారు

ప్రకృతిసుందరి, జీవితేశ్వరవియోగ
దుఃఖపూరితాంభోనిధి దోఁగలేక
చెలియకోయిలజతగూడి కలతెరంగ
శేషముగఁదెల్పి విలపించి సిగ్గువిడిచి.

"పడతి! నానాథుఁ డంబరపథవిహారి
మలయపవనోర్మిడోలికానిలయమూర్తి
విశ్వజీవనవర్తి వివేకమూర్తి
అతనితోఁడెచ్చి పరితాప మడఁతువమ్మ?"
అనగ, పికము గొంతెత్తి దిగంతరములు
మారుమ్రోగగ, జగమెల్ల మధురగాన
ఝురులునిండింప, మ్రోడులు శిరసులెత్తి
చివురులెత్త, వసంతుండు చేరవచ్చి.

వివిధసుమజాల మర్పించి విమలసౌర
భములతనులతనించి ప్రేమమునముంచి,
"సాధ్వి! నీప్రియుఁడరుదెంచుజాడఁ దెలుప
దూతగాఁబంచినాఁడమ్మ తొలుతనన్ను!"
అనగ నప్పుడు, సఖిహృదయాంచలముల
నవ్యమోదసుధాధార నాట్యమాడి
నట్లుతోఁచ, నొక్కింతధైర్యంబునొంది
కడలనెమకంగ మొదలిడె కాంతురాక!

కలువపూవులు వంచిన తలలనెత్త
పక్షు లాకాశవీథుల బయలువెడల
జంతుసంతతి నిశ్వాసచయము తగ్గ
గీష్ముఁడరిగె భానూజ్జ్వలగృహమునుండి!

తానంతనీలాభ్రహర్మ్యరాజ
ప్రాంగణమ్మున ముత్యాలరచ్చవోలె
చలువపందిరి పొడసూపె; చదలదివ్య
పద్మనయనలు పవడంపుపట్టుపాన్పు

వితతిబరపించి, చుక్కలవిరులదారి
సరళముగఁజేసి, ధవళచామరకలితక
రాబ్జలై, యీశ్వరుని యండకరిగినిలువ
మొరసెదుందుభి భువనాలు పులకలెత్త!

తరళసౌదామనీరాజి మెరయుచుండ,
చలువతెమ్మెర తెరువులఁ దెలుపుచుండ,
నీలనీరదరథముపై నిఖిలలోక
భారవహనుండు కూర్చుండి ప్రకృతిభామి
నీమణీధర్మనోత్సాహనిభృతహృదయ
సాగరుండౌచు వినువీథికేగుదెంచి,
అమృతపూర్ణప్రవాహంపుటలలనడుమ
పయన మొనరించి, నగములపజ్జవిడిసి,

వన్యభూముల విహరించి, పట్టరాని
పరువువారుచు పొలముల పత్తనముల
పొంగిపొరలుచుఁ దిరుగాడిభువనమెల్ల
తిరిగి వేసారి ప్రేయసి సరసజేరె!
బీటవారినప్రియురాలి పేదహృదయ
మమృతహృదయాన హత్తింపనయ్యెబోలు!
నిత్యనూతనకల్యాణనిలయయగుచు
పచ్చమేల్పట్టువసనమ్ము ప్రకృతిదాల్చె!
రాగమయమైన హృదయేశు కౌగిలింత
లక్షయసుఖాంబునిధి ముంచనయ్యెనేమొ!
విధివిరామములేకుండ వివశయగుచు
కుముదినీకాంత రేయంత కులుకుచుండె!!

జ్ఞానమయమైన లోకేశుగానరవము
వినఁగఁబడిమోఁ గాఁబోలు! నెమ్మనమువిచ్చి
స్వాదుసుస్వరప్రణయప్రభాతగీత
మాలపింపఁగ దొడఁగె విహంగకులము!!!

నరలేని బ్రహ్మచర్యము నాశ్రయించె;
నాపరమేశ్వరుండంత వరాహ
రూపుఁడై ధరణి నారూఢిగానెత్తె;
నాదేవుఁ డట నారదావతారంబు
పొందుఁగా ధరియించి బహుకర్మబాధ
తప్పించు వైష్ణవతంత్రంబుఁజెప్పి
మెప్పుఁగా జనులకు మేలుగావించె;
హరియట ధర్మభార్యాసంగమందు
నరులెన్నదగు నరనారాయణాఖ్య
తోడ జన్మించి పొందుగఁ ఘోరతపము
నోడకఁగావింపుచుండె; నావెనుక
నరుదుగాఁ గపిలుఁడై యాసురియనెడు
వరవిప్రునకుఁ జెప్పె వరుససాంఖ్యంబు;
అనసూయ యందత్రి కంతమీఁదత్తను
దనయుఁడై యాత్మతత్త్వము నలర్కునకుఁ
బ్రహ్లాదముఖులైన భక్తులకెల్ల
నాహ్లాదముగఁజెప్పె; నాకూతియందు
నటయజ్ఞుఁడనఁబుట్టి యమముఖ్యదేవ
పటలంబుతోడ నిర్భయవృత్తి మెఱయ
మలయుస్వాయంభువమన్వంతరమున
మెలుకువగాఁబ్రోచె; మేరుదేవికిని
నాభికి ఋషభుఁ డన్నామధేయమునఁ
బ్రాభవంబెసఁగ భూభాగంబునందు
విరివిగా నుదయించి విద్వజ్జనులకుఁ
బరమరహస్యమేర్పడఁజెప్పె; నవల
పృథుచక్రవర్తియై పృథ్వినీక్షించి
ప్రథితోరుధేనురూపంబుగాఁజేసి
పొరిది సమస్తవస్తువులను బిదికె;
మఱియచటఁ జాక్షుషమన్వంతరమున
సరసపాఠీనమై సస్యాళితోడఁ
బరిపూర్ణమగునావపై నెక్కించి
మహిని వైవస్వతమనువనువాసి
రహిమీఱగాను సంరక్షించెఁ, బిదప
మహిమమీఱ సముద్రమథనకాలమున
మహిని ధన్యంబైన మంథరాచలము
జలధిలోఁగ్రుంగెడి సమయంబునందుఁ
దలకొని కమఠావతారంబుదాల్చి
యాసద్గిరిని మూఁపునందు ధరించి
వాసిగా సర్వదేవతల రక్షించె;
నపుడె ధన్వంతరియన నుద్భవించి
విపులభేషజవృత్తి విబుధులఁబ్రోచె;
సహజంబుగానట్టి సమయంబునందె
యహహాయనుచు నిర్జరాసురుల్ భ్రమయ
నసమానమోహిని యాకృతిదాల్చి
యసురులవంచించి యమరసంతతికిఁ
దలఁగక నమృతంబు దాఁబంచియిచ్చె;
చెలఁగుచునట నారసింహరూపమున
ఘనశౌర్యమున హేమకశిపునిద్రుంచె;
ననువొంద నట వామనాకృతిదాల్చి
బలిని భూమినిమూఁడుపదముల వేఁడి
కొలిచి త్రిజగమునిక్కన నాక్రమించెఁ;
గడఁకతో నంత భార్గవరాముఁడగుచు
నుడుగక కార్తవీర్యుని సంహరించి
గురుశక్తి నదిమొదల్ కుమతభూపతుల
నిరువదియొక్క మాఱల సంహరించె;
వ్యాసుఁడై జనియించి యటమీఁదసకల
భూసురావళి నెల్లబ్రోవఁదలంచి
సలలితవేదవృక్షమునకు శాఖ

లలర నేర్పఱచెఁ; దానటుమీఁదఁ జెలఁగి
దశరథాత్మజుఁడన ధరణిపైఁబుట్టి
దశకంఠముఖదైత్యతతులఁ జెండాడి
జగతి కోదండదీక్షాగురుండనఁగఁ
బొగడొందె శౌర్యవిస్ఫురణంబుతోడ;
నామీఁద రామకృష్ణాభిధానముల
భూమిపై జనియించి భూభారమణఁచెఁ;
దగలక కలియుగాద్యవసరమందు
నిలను దానవుల మోహితులఁజేయుటకు
మహిని వింశతితమమంజురూపమున
మహనీయబుద్ధనామంబు వహించు;
నంచితంబుగ గీటకాదిదేశముల
సంచరింపుచు యుగసంధిని నృపులు
చోరులై తిరుగ విష్ణుయశుఁడనంగ
సారంగుఁడైనట్టి జగతీసురునకు
నొనరంగఁగల్కియై యుద్భవంబొందు"
ననిచెప్పి సూతుండిట్లనియె వెండియును:
"వనవార్ధిఁ బొడముకాల్వలచందమునను
హరికళ లట్లనంతావతారముల
ధరియించి కుమతిసంతతుల దండించి
ధరణి సాధువర్తనుల పాలించు
నరదేవబ్రహ్మదులైనసాధువులు
నరయఁగా హరికళాంశాంశసంభవులు
అటుఁగాన జగముల కసురులబాధ
ఘటియించినపుడు లోకములఁ బ్రోచుటకు
నాహరి యుగయుగంబందు జన్మించి
బాహుళ్యమహిమ లేర్పడఁజూపు నట్టి
హరిజన్మకథనంబు లతిభక్తితోడ
సరసులై వ్రాసిన చదివిన వినిన
శోకంబునశియించు, సుఖముదీపించు,
ప్రాకటంబగు మోక్షపదము సిద్ధించు,
ధర నరూపుఁడు నేకతనుఁడైన యాత్మ
అరయ జీవాత్మయానట్టి జీవునకు
మగఁటిమిగుల విష్ణుమాయాప్రపంచ
మగు మహాదాదిరూపావళిచేత
మహనీయమైన యాత్మస్థానమందు
విహితకర్మములకై విరచితంబగుచు
ననువొందు నీస్థూలమాకాశమందు
దనరుచుజలదంబు దట్టమైయున్న
కరణి జీవునియందుఁ గాయంబుచాల
మెరయుచుఁదానునిర్మితమగుచుండు
పరఁగ నాస్థూలరూపముగప్పుచున్న
నరసిచూడ నదృశ్యమగువస్తువగుట
చేత వ్యక్తముగాక చిన్మాత్రమగుచు
నాతతహస్తపాదాదులులేక
నున్నట్టియాత్మ కొండొక్కరూపంబు
పన్నుగాఁ రుచ్చింపఁబడి యొప్పుచుండు;
నరుదుగాసూక్ష్మజీవాత్మునివలనఁ
గరమొప్పనుత్క్రాంతి గమనానుగమన
సరణులచేఁ బునర్జన్మంబుదోఁచు
నరయఁగా నది యవిద్యాప్రపంచంబు
మటిస్వస్వరూపసమ్యగ్జ్ఞానియైన
తరినవిద్యనశియించుఁ దదనంతరమున
లలితసద్విద్యాబలమున జీవుండు
నలఘుత్వపరమేశ్వరాఖ్యవహించి
నపు డవిద్యాకృతమైన స్థూలమును
గపటసూక్ష్మంబులఁ గారణంబనెడి
తనువులు మూఁడాత్మతత్వవిజ్ఞాన
ఘనవీతిహోత్రదగ్ధంబు తానవల
నమరకాష్ఠములేని యగ్నిచందమున
విమలుఁడై జీవుండు వెలుఁగుచుఁదాను
నుపరతుఁడగుచు సర్వోత్తమమైన




శ్రీమతులు టి. పి. రాజలక్ష్మి కన్య; లీలా కన్య

(ఉషాసుందరి ఫిలుములో నట్టువరాండ్రు)

*Courtesy of the Associated Films Ltd.*

నొనరంగభావించి యుగధర్మములకు
ఘనతరమైనట్టి కాలవేగమునఁ
బొరిపొరిసంకరంబులుగల్గుననుచు
నరుదుగా యుగయుగమందునందఱును
కడముట్ట యజనాదికర్మంబులెపుడు
నడపించుటకు వ్యాసనారాయణుండు
ఆదియందొకటిగా నమితమైయున్న
వేదరాశిని దాను విశదంబుజేసి
నరవితో ఋగ్యజుస్సామంబులనఁగ
నరయనథర్వంబుననఁగ నీనాల్గు
నామముల్‌గలిగిన నాల్గువేదములఁ
దామహాప్రజ్ఞతోఁ దగవిభజించి
యరయ పురాణేతిహాసంబులెల్ల
నరసపంచమవేదసంజ్ఞగాఁజెప్పె,
శీలంబుగలవ్యాసశిష్యులలోను
పైలుండు ఋగ్వేదపఠనంబుసేసె,
సలలితభక్తి వైశంపాయనుండు
విలసితంబుగ యజుర్వేదంబుచదివె,
మెఱసిసామంబు జైమినియభ్యసించె,
మఱియథర్వంబు సుమంతుండునేర్చె,
నలఘుపురాణేతిహాసంబులెల్ల
నలరారఁగా రోమహర్షణుండనెడు
మాతండ్రిభరియించె, మఱియునావెనుక
ఖ్యాతిగాఁదమశిష్యగణములకెల్ల
తమతమవేదముల్‌ తాముభాగించి
క్రమముగాఁజెప్పిరి కడముట్ట, నిటుల
వారుసెప్పిరి మఱి వారిశిష్యులకు,
వారుబోధించిరి వారిశిష్యులకు,
నీరీతివేదంబు లెల్లభూసురుల
కారూఢిలబ్ధంబులై భూతలమున
సర్వకాల మనేకశాఖలతోడ
నుర్వీసురాదులం దొప్పెవేదములు.
అవని మేధానిధులై నవిప్రులకు
ప్రవిమలవేదముల్‌ ప్రాప్తంబులయ్యె,
ననధికారులుగాన నతివలు, శూద్ర
జనులు వేదంబులు చదువరాదనుచు
వారు తరింప నుపాయంబుగాఁగ
భారతాఖ్యాన మేర్పడఁజెప్పి, మఱియు
నదిభూతహితముగాదనుసందియంబు
మదిగల్గి తగినసమ్మతముదోఁచకను
తనచిత్తమున భూతదయప్రకాశింపఁ
దనలోనతాను వితర్కించెనిట్లు:
నిగమముల్‌వరుసగా నేనేర్పరించి
తగవిప్రతతికి హితంబుజేసితిని,
చక్కఁగా స్త్రీశూద్రజనహితంబుగను
దక్కక శ్రీభారతంబు జేసితిని,
యాత్మసంతోషింప దందుచే, మఱియు
నాత్మలోగలయీశుఁడైన నాపనికి
సంతసింపకనుండు జాడతోఁచినది
వింతయిదేమని వెఱఁగంది మఱియు
నాభగవంతున కానందముగను.
శ్రీభాగవతరీతిఁ జెప్పకుండితిని
గనుకనాకీచింత కల్గెనోయనుచు
ననుమానపడుచున్న యవసరంబునను

—వ్యాసునికడకు నారదుండువచ్చుట—

దనచేత వల్లకీతంత్రచయమున
ననఘనారాయణాష్టాక్షరీమంత్ర
సారంబు ఘోషింప సకలయోగీంద్రు
లారవంబునఁజొక్క యానందమొందఁ
గపిలజటాజూటకాంతిపుంజంబు
తపనబింబంబు చందంబునవెలుఁగఁ
దనులగ్నతులసికాదామసౌరభము

మొనసిదిగంతరమ్ముల నిండుచుండ
సరసశరచ్చంద్రచంద్రికమాడ్కి-
తెఱఁగొప్ప విమలమూర్తిప్రభల్ మెఱయ
గగనమార్గమునుండి గానధురీణుఁ
డగునారదుఁడురాఁగ నావ్యాసమౌని
ఎనలేనిప్రీతితో నెదురుగాఁబోయి
యనిమిషమునిని నిజాశ్రమంబునకుఁ
దోడుకవచ్చి పొందుగఁబూజసేయ
వేడుకసురమౌని వీక్షించియతని
పరఁగవీణెతంత్రి పట్టిమీటుచును
జిరునవ్వునగుచు మచ్చికనిట్టులనియె:
వ్యాసమునీశ్వర! వరతపోనిధివి,
భాసురాత్ముఁడవు, శ్రీపతియంశజుడవు,
నిరుపమవేదార్థనిర్ణేతవిలను,
పరమపావనుఁడవు, పండితాగ్రణివి
కావున నొకచింత గలదె నీమదికి;
భావించియిపుడు నీభావంబుజూడ
నొకచింతబొడమిన ట్లున్నదేమనిన
నకుటిలుఁడై వ్యాసుఁ డతనికిట్లనియె:
బ్రహ్మాత్మజుండవు, పావనాత్ముఁడవు,
బ్రహ్మపదానందభరితచిత్తుఁడవు,
హరిభక్తుఁడవు, పంకజాప్తునికరణిఁ
జరియింపుచుందువు సర్వలోకముల,
నదిగాక సకలజనావళిలోను
పొదుపుగాఁగరువలిపోల్కి-నుండుదువు,
సర్వశాంతుఁడవు, నిశ్చలయోగనిధివి,
సర్వజ్ఞుఁడవుగాన సకలంబునీకుఁ
దెలిసియున్నదిగదా దేవమునీంద్ర!
యెలమినాకొఱంత నీ వెఱిగింపుమనిన
మనమునహర్షించి మచ్చికమెఱయ
ననిమిషమునినాథుఁ డతనికిట్లనియె:

వినుము ద్వైపాయన! విశదంబుగాను
జనహితార్థంబుగా సకలంబుదెలసి
కర్మముల్ సాంగంబుగావచించితివి
ధర్మశాస్త్రములనుదగరచించితివి,
యందందుహరికథ లంతింతజెప్పి
సందునమెచ్చునే యామహామహుఁడు?
గుణవిశేషముల మిక్కుటముగానీవు
గణుతించిపొగడిన గల్గునేకొఱంత?
యైనమంచిది యిప్పుడందుకేమాయె
నానీరజాక్షులీలావళులెల్ల
బాహుళ్యముగఁజెప్పు భక్తిదీపింప
నాహరిదివ్యనామాంకితకృతులు
కనకరత్నావళి కైవడినుండు,
దనుజారినామాంకితములేనికృతులు
ఘనవిచిత్రార్థసంగములయియున్న
నొనరప్రకాశింప వుర్విమీఁదటను;
అపశబ్దములుగుంపులై గూడియున్న
కపటనాటకసూత్రకలితుఁడై నట్టి
హరిచరిత్రంబులు ఘోరాఘంబునణఁచు
సరసులై యదివ్రాసి చదివినవారు
ఘనపుణ్యులై దుఃఖకంధిదాఁటుదురు
కనుక నీవిపుడు భాగవతగ్రంథంబు
జగతిపైఁజేసిన సకలమానవులు
తగనిదివినినంత ధన్యులయ్యెదరు.
కరమొప్ప నిర్గతకర్మమై మఱియు
నిరుపాధికంబునై నిర్మలంబైన
జ్ఞానంబుమదిని నిశ్చలమైనగాని
యానందమయుఁడైన హరిభక్తిలేక
యున్నప్రకాశింప దుత్తమచరిత
పన్నఁగానదిగాక ఫలవాంఛచేతఁ
బూరిపొరిచేసిన పుణ్యకర్మములు

హరి కర్పితములు జేయకనుండిరేని
సరసంబులై ప్రశస్తములుగావవియు
నరయఁగా జ్ఞానకర్మాదులెన్నయిన
పరభక్తిలేమిచే వ్యర్థంబులగును,
హరిలీలలెఱుఁగక నజ్ఞానియగుచు
బహుశాస్త్రములను తప్పకజూచిచూచి
గహిమీఱ నర్థాంతరములఁగల్పించు
నరుఁడు పృథారూపనామభేదముల
ధరణిలోపల పృథగ్ధర్మనుండైన
వానిచిత్తము ఘనవాయువుచేతఁ
బూనిత్రిప్పంబడిపోయి తోయముల
నానాగతులఁజను నావచందమునఁ
దాను భవాంబోధి దరియింపలేక
వాసనాబద్ధుఁడై బహుసంశయముల
గాసిబొందుచునుండు కామ్యకర్మముల
యందునురక్తి మహావృద్ధిబొంద
పందలైనటువంటి ప్రాకృతజనులఁ
గూర్చి మహాతత్త్వగూఢార్థములను
దీర్చిచెప్పితివీవు తెలిసినకతన
దానిచే నీయాత్మధన్యతనొందె,
గానిపామరులకు గతిజూపలేదు
అదియెటులన్న నే నాచందమెల్ల
విదితంబుగా నీకు వినుపింతువినుము
క్రమముగా నిఁకవచ్చు కలియుగమందు
మమకారయుక్తులై మానవులెల్ల
తమతనూభవవిత్తదారాదికముల
ననురక్తిగాఁజూతు రంతియేగాని
పరమార్థములను దప్పకచూడఁబోరు
మఱికొందఱందులో మహిమలుకోరి
చెనఁటులై గురుసేవ చేయనోపకను
దనరఁదమంతనే తత్త్వశాస్త్రములు
చదువుదు రాతత్త్వసారంబువారి
మదిగోచరింప దేమాడ్కిఁజూచినను
గాన డంబమునకై గ్రంథముల్ జూచి
నానార్థములను నిర్ణయముగాఁదెలిసి
యాయర్థములను శిష్యాళికిఁజెప్పి
మాయలోఁదోతురు మఱికొందఱిలను
కర్మంబు లలసులై గానింపలేక
ధర్మముల్ విడచి పృథగ్ధర్మలగుచు
దుర్మార్గులగుదురు తొడరికొందఱును
ధర్మముల్నఱుపరు ధనముకాంక్షించి
లౌకికులై మహాలక్ష్మినిగోరి
యాకల్మివచ్చిన హర్షమొందుచును
ధనమదతిమిరంబు దట్టమైనిండి
కనులగప్పినవేళ ఘనసాధుజనులు
తమచెంతనుండిన తామట్టిఘనుల
నమరగాఁగనలే కహంకారమునను
గామలోభాదిమృగంబులు మెలఁగు
నామహాఘోరభవారణ్యమందు
నులుకుచుఁ దారాడుచుందురుగాని
యలధర్మశాస్త్రంబు లరయరావెనుక
నిటువంటిమూఢు లనేకులైయుందు
రటుగాన వేదశాస్త్రాదులయందుఁ
దగుధర్మజాలముల్ తత్త్వశాస్త్రములు
జగతిపైఁబెక్కుఱు సాధింపలేరు
నీవుచెప్పిన తత్త్వనిర్ణయంబులను
భావించికొందఱు పండితోత్తములు
పరముగాంతురు, సరిపామరులెల్ల
తరియించురీతిఁ జిత్తమున నూహించు
పరభూతదయతోడ వసుమతిమీఁద
హరికళాజాతుఁడవై లోకములను
వాసికెక్కిన మహావరపుణ్యఖనివి,

యీసలనిరసించినట్టి ధన్యుఁడవు,
వరవిరక్తుఁడవు, పావనచరిత్రుఁడవు,
సరసచిత్తుఁడవు, విజ్ఞానచక్షుఁడవు,
సత్యవ్రతుఁడవు, నిర్జరపూజితుఁడవు,
సాత్యవతేయ! యీసంశయంబెల్ల
హరికథల్ విరచింపుమందుచే సకల
నరులుతరింతురు నానావిధముల.
నారీతియెటులన్న హరికథావళుల
సారజ్ఞులై వ్రాసి చదివిన వినిన
పరమభక్తులు మోక్షపదముజెందుదురు
సరిగదా, యదిగాక జడులైనగాని
లాలితకృష్ణలీలల వినోదముగ
నాలకించిన కృష్ణుఁడాకర్ణదిశల
యందుఁ బ్రవేశించి యందుండివారి
డెందంబులందుఁ దాఁకొనినిలచి
గురుతుగా దోషభోగ్యుఁడుగాన వారి
దురితబృందములెల్లఁ దొలఁగించిమీఁది
జన్మంబులకునైన శాంతిఁబుట్టించి
చిన్మయాత్మజ్ఞానసిద్ధిగావించు
గావున మూఢుల కడతేర్చుకొఱకు
వావిరి హరిమహాత్మ్యములెల్లపొగడు
మనవిని మందస్మితాస్యుఁడై వ్యాసుఁ
డనిమిషమునికి నెయ్యమున నిట్లనియె:
సురమునిచంద్ర! భాసురభక్తిసాంద్ర!
కరుణాసమేత! లోకైకవిఖ్యాత!
యెఱుఁగనేర్చినవార లెల్లకర్మముల
వరుసఁగావిడిచి యవ్వలజ్ఞానులగుచు
పరమహరిస్వరూపము గందురందు
కొఱకు నామదిలోను గొదువలేదిపుడు
ధరనుధర్మములను దత్త్వశాస్త్రంబు
లరసి తన్మార్గంబులందుఁజొచ్చుటకుఁ
గలిదోషములచేతఁ గఱవులచేతఁ
గలిమిలేములచేతఁ గక్షలచేత
నతికామమోహాలోభాదులచేత
నల్పాయువులచేత నాశలచేత
స్వల్పబుద్ధులచేత శక్తులుగాని
సంసారులు ముక్తిసాధించుకొఱకు
హంసస్వరూపుఁడైనట్టి యీశ్వరుని
ఘనలీల తెల్పు తక్కక సన్న దేవ
మునియిటులనియె సమ్మోదంబుతోడ:
వినుము వేదవ్యాస! విశదంబుగాను
జనుఁడెవ్వఁడైన నీజగతిమీఁదటను
దనకులధర్మమంతయు నిరసించి
పనిబూని హరిపదభక్తిసల్పగను
ఆభక్తి పరిపక్వమైగాక దేహ
మీభూమిపైఁబడ్డ నీశ్వరభక్తి
తానిల్చి వానిమీఁదటిజన్మమందు
నైననుసిద్ధించు, నాహరిసేవ
విడిచినకులధర్మవితరణంబులను
కడతేర్చునేజన్మ కర్మవారిధిని?
అటుగానమతిమంతుఁడైనట్టివాఁడు
ఘటకుఁడైనటువంటి కమలలోచనుని
సేవాప్రయత్నంబు చేయఁగావలయు
నావేళ కాలకర్మానుసారముగ
మొనయుచు సుఖదుఃఖములుఘటించినను
ఘనతరధైర్యసంగతుఁడుఁగావలయు
నంతియేగాని శ్రీహరిపాదసేవ
నెంతటికైన దానెడఁబాయరాదు
పరఁగసంతతమ్మును ప్రకృతిపంకమునఁ
బొరలుజీవుల కెద్దిపొందరాకుండు
నామేలుసిద్ధించు హరిభక్తిచేత,
శ్రీమాధవుని సేవ చేసినవాఁడు

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి ఆచూరి లీలావతీదేవిగారు

వెన్నెలచూద్దాము
వస్తావా?
ఏమివెన్నెల?
పండువెన్నెల—
ఏమిపండు?
అరటిపండు—
ఏమిఅరటి?
బొంతరటి—
ఏమిబొంత?
పక్కబొంత—
ఏమిపక్క?
తలపక్క—
ఏమితల?
బోడితల—
ఏమిబోడి?
ఆవుబోడి—

ఏమిఆవు?
తెల్లఆవు—
ఏమితెల్ల?
బల్లతెల్ల—
ఏమిబల్ల?
గాలిబల్ల—
ఏమిగాలి?
పైరుగాలి—
ఏమిపైరు?
జొన్నపైరు—
ఏమిజొన్న?
మొక్కజొన్న—
ఏమిమొక్క?
గడ్డిమొక్క—
ఏమిగడ్డి?
పచ్చగడ్డి—

ఏమిపచ్చ?
ఆకుపచ్చ—
ఏమిఆకు?
అడవిఆకు—
ఏమిఅడవి?
కారడవి—
ఏమికారు?
మబ్బుకారు—
ఏమిమబ్బు?
పాడుమబ్బు—
ఏమిపాడు?
నేర్పిపాడు—
ఏమినేర్పి?
విద్యనేర్పి—
ఏమివిద్య?
స్త్రీవిద్య—

౨. వినోదకథ

## కోతి: ఈగ

శ్రీమతి దరిశి సుబ్బలక్ష్మమ్మగారు

ఒకకోతి ముచ్చటగా ఈగను పెండ్లియాడెను. సంతోషముగానుండిరి. ఒక రోజున ఆహారముకొరకు కోతి జొన్నల నిమిత్తం చేనుకువెళ్లెను. ఈగ బెల్లంకొరకు దుకాణమునకు వెళ్లెను. తిరిగితిరిగి కొంచెంసేపటికి బెల్లంకొంతచేర్చి తనమగనిరాక కెదురుచూచుచుండెను ఈగ. చేనుకాపరివుండుటచే కోతి త్వరగారాజాలకపోయెను. అంత ఈగ ఏడ్చిఏడ్చి ఏటికివెళ్లి రెండు లత్తగవ్వలుతెచ్చెను. వాటినిండా కండ్లనీళ్లురాల్చి కోతిరాగానే తనదుఃఖమును చెప్ప-

కొని ఆలత్తగవ్వలుచూపి కాళ్లుకడుగుకొనుమని చెప్పెను. కోతి విచారపడి తాను తెచ్చిన జొన్నలు ఆబెల్లంతోచేర్చి ఈగకుపెట్టి తానుతిని సంతోషింపచేసి ముద్దుపెట్టుకొనపోయెను. ముద్దుతోకూండా ఈగ కోతిముక్కులోకి పోయెను.

## పెద్దమ్మ ప్రభావము

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

ఒకగ్రామమున బ్రాహ్మణుడొకడు చిన్నికుటీరమున భార్యతో కాపురముండెను. ఆయనకు పెద్దమ్మ చాలదగ్గరచుట్టము. ఎప్పుడును ఆబ్రాహ్మణుని విడుచుటలేదు. వ్యాయవారమే ఆతని జీవనోపాధి. ఒకనాడుదయమున మామూలుప్రకారము ఆతడు చెంబుచేబూని వ్యాయవారమునకేగెను. ఆనాడుదొరకిన బియ్యము పట్టుకొని మిట్టమధ్యాహ్నము మిక్కుటమగుఎండలో ఇంటికిపోవుచుండగా ఆపట్టణపురాజు మేడమీదనుండి చూచి "అయ్యో, పాపము! ఈబీదబ్రాహ్మణుడు తిండికిలేక తీవ్రమగుఎండలోపోవుచున్నా"డని జాలిచెంది, ఆబ్రాహ్మణునిపిలిపించి "ఏల ఇంతఎండలోపోవుచుంటి"వని యడిగెను. "రాజా! కడుపుకులేక అందరిని యాచించి ఈబియ్యమును గొనిపోవుచుంటిని" యని అతిదీనముతోనుడివెను. రాజు ఎంతయోజాలిజెంది ఒక వెయ్యిరూపాయలను ఇచ్చి "ఇవిపెట్టితినుము. కష్టపడి వ్యాయవారముయెత్తవల"దని చెప్పిపంపెను. మరునాడును యథాప్రకారము ఆబ్రాహ్మణుడు చెంబుచేతబట్టివచ్చుచుండెను. రాజుచూచి "ఏమయ్యా! నిన్న వెయ్యి రూపాయలు ఇచ్చితినే తిరిగినేడే ముష్టికిబయలుదేరితివి. అప్పుడేఅయిపోయెనా?" యన "అయ్యా! నాకర్మము మీరొసగినరూపాయలు నాకుతెలియకుండగనే పోయిన"వని చెప్పెను. రాజు తిరిగి వెయ్యిరూపాయలు యిచ్చి "ఇంక సౌఖ్యముగానుండు"మని చెప్పిపంపెను. మరునాడుకూడ తిరిగిబ్రాహ్మణుడువ్యాయవారమునకుబయలుదేరి వచ్చుచుండెను. రాజుచూచి "ఇదేమి? ఆశ్చర్యము. నిన్నవెయ్యి, మొన్నవెయ్యిఇచ్చినను ఈబ్రాహ్మణుడు ఇంకను ముష్టిమానలేదు" అని బ్రాహ్మణునిపిలిచియడుగ ఈరూపాయలుకూడపోయెనని దీనముఖుడైనుడివెను. ఇది ఏమోచోద్యముగానుండెనని మరల వెయ్యిరూపాయలనొసగి "ఈసారిఎటులపోవుచుండెనోకనుగొనెదను. నేను ఈరాత్రి మీయింటిలోపరుండెదన"ని జెప్పి ఆబ్రాహ్మణునిబంపెను. రాజు అన్నమాటతప్పకుండ ఆరాత్రి వారింటికిపోయి వారిని నిద్రపొమ్మని తాను కాళ్లు రెండు వీధిగుమ్మమునకు అడ్డుగానిడుకొని నిద్రపోవక కూర్చొనెను. అంతలో పెద్దమ్మ చేటచేబూని రెండవచేతితో చీపురుకట్టపట్టుకొని తొందరగావచ్చి త్రోవయిమ్మని రాజును గద్దరించెను. ఆరాజు "నీవెవ్వరవు? ఎందుకుత్రోవయిచ్చుట, నేనివ్వను. ఎటులపోవుదువో పొమ్మ" అనెను. ఆమె "నేనుపెద్దమ్మను. వీనికినీవిచ్చినసొమ్మును నిన్నమొన్నతుడచితీసుకుంటిని; నేడుకూడతీసుకొనుటకు వచ్చితిని. వీనికేమియు ముట్టనివ్వను. నిర్భాగ్యుడు, ఇంకను వీనిపని అయినదా? అడవిలోవిడచి కాలుచేతులు విరగగొట్టించి యెంతయోచేయవలసియున్నది. కాన త్వరగా త్రోవయిమ్ము" అని త్వరపడెను. క్షణములోనే రాజాలోచించి "నీవు ఆబ్రాహ్మణుని ఏమిచేయదలచితివో అన్నియునన్నుచేయుము. ఇటుపై ఆబ్రాహ్మణుని జోలికిపోకుము." "సరే ఆలాగైన నిన్నేపొంది ఏమేమిచేసెదనోచూచుకొమ్ము. ఇదో,పోవుచుంటి"నని వెడలిపోయెను. ఆవెయ్యి ఆబ్రాహ్మణునకు దక్కెను. రాజు ఇంకనుకొంతసొమ్ము ఇచ్చెను. దానితో ఆబ్రాహ్మణుడు సుఖజీవనముచేయుచుండెను. రాజు పెద్దమ్మవచ్చి తన్ను ఎటులపొందుననిఆలోచించుచుండెను. మంత్రిగారికి పరరాజుయుద్ధమునకువచ్చెనని కబురువచ్చెను. మామూలుగఓడింపవచ్చునని రాజు ధైర్యముతోనుండెను. కాని చివఱకు శత్రురాజు ఈరాజును ఓడించి అడవులకుతరిమెను. అప్పుడారాజు ఇదంతయు పెద్దమ్మప్రభావమని యనుకొనెను. ఆనాడట్లు తలపోయుచుండగా ఇంకొకరాజ్యములో దొంగలుపడి సొమ్ము, నగలు దోచు

కొని ఆసొత్తుతో పాటిపోవుచుండిరి. పెద్దమ్మచేతలకు రాజు చాలాఆశ్చర్యపడెను. అన్నంతయు చేసితీరెనని అనుకొనెను. దొంగిలించినదొంగలను రాజభటులు తరుముకొచ్చిరి. ఆదొంగలు భయపడి అడవులంటబడి పారిపోవుచు రాజ్యముగోలుపోయి అడవులంటద్రిమ్మరుచున్న రాజుముందఱ ఆసొత్తును పడవైచి పరుగిడిరి. వెనక వచ్చుచున్న రాజభటులు ఈరాజువద్ద నగలుచూచి వీడే దొంగయనిపట్టుకొని తమఏలికకడకు గొంపోయి నిలబెట్టిరి. ఆరాజు విచారణలేకనే కాళ్లుచేతులు ఖండింపుడని ఉత్తరువిచ్చెను. ఆరాజభటులు తమఏలిక యాజ్ఞానుసారముగ అతని కాళ్లుచేతులు త్వరలోనే ఖండించివేసిరి. ఆయడవిలో పడి ఆరాజు మొరబెట్టుచు బాధకోర్వలేక ఏడ్చుచుండెను. ఎవ్వరోమునివరుడు అటులబోవుచు ఈమొఱవిని దగ్గరకువచ్చి ఏమిసంగతియనియడిగెను. ఆరాజు తన సంగతినంతను ఆమునిసత్తమునితో చెప్పెను. ఆముని మంచి తపశ్శాలియగుటచే పసరురాసి కాళ్లుచేతులు రప్పించెను. ఇప్పుడువలదు నాకు నేను కోరునపుడు నాకరచరణములు వచ్చునటులప్రసాదింపుమని రాజు ప్రార్థించెను. అటులనే ఆమునిసత్తముడు అవుగాకయనినుడివెను. ఈరాజు రాజ్యమునాక్రమించుకొనిన పరరాజువద్దకు పెద్దమ్మ, ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి వచ్చి మాముగ్గురిలో ఎవ్వరధికులనియడిగెను. ఆరాజునకేమియుతోచక ఆలోచించుచుండెను. అప్పుడామువ్వురమ్మలును రాజునుచూచి "సరే వారము గడువిచ్చితిమి. నీవుగాని, నీరాజ్యములో ఎవ్వరైననుసరే చెప్పవలయును. లేకున్న నీరాజ్యములాగుకొని నిన్ను నాశనముచేసెద"మని తెల్పి వెళ్లిరి. వారముగడచెను, ఎవ్వరు చెప్పలేకుండిరి, దేశదేశములనుండి పండితులువచ్చిరిగాని ఎవ్వరికిని ప్రత్యుత్తరము స్ఫురించలేదు. ఎవ్వరైనను ఈప్రశ్నకు జవాబుయిచ్చినచో అర్ధరాజ్యమిచ్చెదనని రాజు ప్రకటించెను. మనకుంటిరాజు డేకుకొనుచు తిండికిలేక, దారితెలియక తనరాజ్యమునకే వచ్చెను. కోటగుమ్మమువద్దపడిన విస్తళ్లలోని అన్నము ఏరుకొని తినుచుండెను. ఆసమయముననే కోటలోకి వచ్చేజనము పోయేజనము మహాసందడిగానుండెను. రాజుజీవితము సందిగ్ధావస్థలోనుండెను. ఈసందడివిని ఈకుంటి ఏమిసమాచారమని ఎవ్వరిని అడిగినను ఎవ్వరును చెప్పరైరి. బీదలను ఎవ్వరులక్ష్యపెట్టుదురు? ఒక జవ్వని ఆకోటలోనుండివచ్చుచుండెను. ఈకుంటిఊరకొనక "అమ్మా! ఏమిటీఇదంతయు"ననిఅడిగెను. "నీకెందుకు ఈసంగతులు, నువ్వేమైనచెప్పగలవా? ఛీపో" అని పోబోవుచుండెను. "అటులగాదు సంగతేమొచెప్పు"మని వేడుకొని ఆజవ్వనిని నడువనియ్యడయ్యెను. ఆజవ్వని చివరకంతయుజెప్పి నీవుచెప్పగలవుకాబోలునని పరిహాసముచేసెను. అవును నేనుచెప్పెదను రాజుగారితోచెప్పుమనినొక్కిచెప్పెను. ఆబాలిక పకపకనవ్వి "కొమ్ములు తిరిగినవారు చెప్పలేకవెడలిపోవుచున్నారు; నీవాచెప్పేవాడివి"యని వెడలనుండెను. నేనుచెప్పితీరెదనని గట్టిగా చెప్పెను. ఆబాలిక కొంతనిదానించి కోటలోనికి కబురంపెను. క్షణములో ప్రాణముపోవనున్న ఆరాజునకీమాటలు అమృతప్రాయముగానుండెను. కాన తక్షణము ఆకుంటిరాజును ఆహ్వానించి అభ్యంగనముచేయించి నూతనవస్త్రములను ధరింపజేసెను. ఆకుంటిరాజు బంగారపుగొలుసులు చేయించమనిచెప్పెను. ఎందులకో ఎవ్వరికిని తెలియలేదు. వెంటనేచేయించితెచ్చిరి. ఆపరరాజు కొంచెము ధైర్యమువహించియుండెను. ఇంతలోనే ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, పెద్దమ్మ వచ్చిరి. ఆపరరాజు ముగ్గురకు నమస్కారముచేసి నేనుచెప్పలేను నాతరపున ఆయనచెప్పునని ఆరాజునుచూపించెను. మాకెవ్వరైననుసరేయని ఈరాజువద్దకువచ్చిరి. ముందామునియిచ్చిన కాళ్లుచేతులు తెప్పించుకొని ఠీవిగ సింహాసనముమీద నిర్విచారముగాకూరుచున్న రాజును గాంచి ఈముువ్వురమ్మలును మాలో ఎవ్వరధికులని అతనినిప్రశ్నించిరి. అంతకుముందే పురమాయించిన రాజభటులను సంజ్ఞచేసి ధనలక్ష్మిని, ధాన్యలక్ష్మిని బంగారపుగొలుసులతో చెరియొక స్తంభమునకు తనయెదుట బంధింపజేసెను. రాజు సింహాసనముదిగి పెద్దమ్మకునమస్కారముచేసి "అమ్మా! తల్లీ! ముగ్గురిలో నీవేయెక్కువ; నిన్నుమించినవారెవ్వరునులేరు. నీవుతలచిన అణువు మేరువుగాను మేరువు అణువుగానుచేయగలవు. బలేసామర్థ్యముగలదానవు.

కాన దయయుంచి ఇచ్చటనుండితిరిగిచూడక వెళ్లుము. తల్లీ!" యనిప్రార్థించెను. పెద్దమ్మ చిరునవ్వునవ్వుకొనుచు తన్నే గొప్పదానవనుటచే అధికానందముతో వెడలిపోయెను. ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి కోపగించిపోవుదమన్నను బంగారు గొలుసులతో కట్టివేయబడుటచే వారునిలచిపోయిరి. వాళ్లుఉండవలసినవారేగదా? పరరాజు ఈచమత్కారముగాంచి సంతసించి అర్ధరాజ్యమనినను పూర్తిగారాజ్యమేయిచ్చి, తనప్రాణమునిలిపినందుకు కృతజ్ఞతను చూపి వెడలిపోయెను. ఈరాజు తనసంగతితలచుకొని పెద్దమ్మయొక్క సామర్థ్యమునకు మిక్కిలి అద్భుతపడసాగెను. పెద్దమ్మ ప్రభావము సామాన్యమా? అప్పుడుతాను అడవులబట్టుటయు, నేడుమరల అప్రయత్నముగ సింహాసనాసీనుటగుటయు ఆనాడుపెద్దమ్మ చేసినబాసయేయనిగ్రహించి పెద్దమ్మప్రభావమునకు మిక్కిలిఆక్కజపడెను. పెద్దమ్మ ఆవహించ ఆమెబారినుండితప్పించుకొనుటకు ఎంతటి ధీమంతునకును శక్యముకాదు.

3. నీతికథ

## అంతరాత్మ

యు. వేంకటనరసుగారు

(బాలహృదయమును ప్రదర్శించు చిన్నకథ)

చాలాకాలముక్రిందట ఒకచిన్నవూళ్లో నారాయణబాబు అనేఒకరైతువుండేవాడు. రైతంటే ఈకాలంలోని కేవలం చదువుసంధ్య మాకెందుకని......వడిగల రెండెద్దులగట్టుక మడిదున్ని బ్రతికే మందమతిరైతుబిడ్డకాడు. మరేమంటె 'భారతం' 'భాగవతం' యీలాంటి సద్గ్రంథాల్ని శ్రద్ధగా చదివి అర్థంచేసుకొని సంతోషించి ఇతరులగ్గూడా చెప్పగలవాడు. మనశ్శాంతితో మంచి సెబ్బరా యెఱిగి కూడినమట్టుకు లోకులకి మేలుజేద్దామనేవాడు కాని గ్రామకలతలుగల్పించి తన బొజ్జ పెంచుకున్న పెద్దమనిషి కాడు.

ఆయనభార్య కూడ భర్తకు వన్నెదెచ్చే గృహలక్ష్మి దొడ్డయిల్లాలు. జానకమ్మ.

ఈయుత్తమ దంపతుల పూర్వపుణ్యాఫలంగా ఒకకొడుకు పుట్టినాడు చక్కదనాల్తో. ఆఅబ్బాయిపుట్టిన రోజునుంచి వాళ్లయింట్లో పాడిపంట హెచ్చిల్లడంచూచి వానికి "ముద్దుకృష్ణు"డని పేరుంచినారు. కాని ఆపాపాయితల్లి జానకి 'ముద్దుకిట్టూ,' 'కిట్టిబాబూ' అనే ఎప్పుడూ పిలుస్తూవుండేది.

ఒకనాటి ఉదయము నారాయణబాబు చల్దితిని తోటకత్తి పుచ్చుకొని జానకమ్మచేతి ఆకుమడుపులందుకొని నోటిలో నొకటిరెండు పోకచెక్కలు వేసికొని పటపటలాడిస్తూ బయల్దేరినాడు తోటకు——

అంతవరకు కుక్కపిల్లతో ఆడుకుంటూవున్న ముద్దుకిట్టు "నాన్న! నేనువత్తానేతోటకు" అంటు గునుకు పరుగున కాలిగజ్జెలగల్లుగల్లుతో వెళ్లి తండ్రిగారి చిట్టివేలుపట్టుకొన్నాడు. అంతలో కిట్టుస్నేహితుడు కుక్కపిల్ల కూడ గంతులేస్తూవెళ్లి కిట్టుకాలు నాకింది.

'నాన్న! కుక్క కూడా తోటకువత్తాందె' అన్నాడాఅబ్బాయి తండ్రిముఖంచూచి నవ్వుతూ. ఈలా వారు మాటాడుతూ కొంతదూరం వెళ్లేసరికి వెనుకకుతిరిగి కిట్టువేటకుక్క కాకినిచూచి భయపడి మొఱుగుతూ పరుగెత్తింది ఇంటివైపు.

తోటజేరిన కాసేపటికి 'కిట్టూ! నీవింటికి వెళ్ళమ్మ! నాకుచాలాపనివుంది' అన్నాడు నారాయణబాబు. 'ఆ—నాకాజాంపండు కోతిత్తెవెడతా' అన్నాడు చిట్టిబాబు. తండ్రి బాగామాగిన రెండుపెద్దజేమపండ్లనుకోసి ఆయబ్బాయిచేతికిచ్చి తోటగుమ్మమువరకు తోడుకోనివచ్చి యింటికి పొమ్మని వదలిపోయినాడు.

కిట్టు, తండ్రితోకూడా ప్రతిదినమువాళ్లయింటికి కూతవేటుదూరములోఉన్న ఆతోటకువచ్చి ఒంటరిగాపోవటంచేత అలవాటుపడిందిగనక ఒకపండుతింటూ ఒకటిచేత పట్టుకొని కులాసాగా ఇంటికి తిరిగివస్తూవున్నాడాఅయిదేండ్ల యీడుదాటిన అబ్బాయి.

అది శరత్కాలపు మొగుదల. భూమి అంతా పచ్చనిపచ్చికతో వింతవింతరంగుపూలతో చూచేవారికి మనోహరంగా ఉంది. నులివెచ్చని బాలాతపము ఒంటికి హాయిగా వీస్తూవుంది. దారి పొడుగున నీటిపడియల చుట్టూ ఉన్న గడ్డిమొక్కపూలమీద గుంపులుగుంపులుగా వ్రాలిఉన్నాయి సీతాకోకచిలుకలు, చిట్టితుమ్మెదలు, కొన్ని తేనెటీగలు తుమ్మెదల్నికట్టి పాఠశాల అల్లరిపిల్లలలాగా జోరబడి యాపూలమీదవ్రాలి కమ్మని విరితేనె జుర్రుకుంటూవున్నాయి.

ఈదృశ్యమంతా చిట్టికిట్టు కెంతో ఉల్లాసం కల్పించడంచేత ఓచిన్నకఱ్ఱ దారిప్రక్కన ఉండగా పుచ్చుకొని దానితో ఆడాడవ్రాలియున్న సీతాకోకచిలుకలగుంపుల్ని ఎగురకొడుతూ వానితోబాటు గంతులేస్తూ నవ్వుతూ అవి వ్రాలిన చోటికల్లా పరుగెత్తి ఆడుకొంటూ వస్తూవున్నాడు.

ఈలావచ్చేచోట ఒకచిన్నినీటిపడియలో అల్లిపూలు పచ్చనినాచుమధ్య వికసించి అందంగా అగుపడుతుండగా కలువా డాపూలుకోద్దామని గుంటదాపునకు మెల్లగా వెళ్ళినాడు.

అప్పుడె ఆపడియలోనుంచి వెడలివచ్చి నేలమీద నాడుకొంచున్న ఓతామేటిపిల్లవానినిజూచి జడిసిపోయి తటాలున తనఅంగాల్ని వీపుచిప్పలోకి లాక్కొనిరాయిలాగా ముడుక్కుందిపాపం!

ఆవింతజంతువుని కిట్టు నిదానంగా వంగిచూచి దానిచితుకగొట్టివేద్దామని బుద్ధిపుట్టి చేతిలోని పొట్టికఱ్ఱ పైకెత్తినాడు. "ఆ.ఆ. ఆగు. అదిపాపము. నోరులేనిజంతువుల్ని హింసపెట్టవద్దు" అని ఒకవాక్యముహటాత్తుగా వినవచ్చింది కిట్టుకు. కిట్టు ఎత్తినహస్తం. అట్టె స్తంభించడంచేత ఆమాటపల్కినదెవరా? యనికన్నులు పెద్దవి చేసి ఆలోచనాపూర్వకంగా అన్నివైపులా పరికించినాడు. తిరిగి అదేవాక్యం వినవచ్చింది. కాని అది వాని హృదయంలోనుంచే చెప్పబడినట్టు గట్టిగా కిట్టుకు తట్టింది.

ఇట్లు క్షణకాల మాబాలుడు నిర్విణ్ణుడైనిలచి చేతికఱ్ఱ జాఱవిడచి గడ్డపుసుక్కిళ్ళతో వెఱ్ఱిమొగంతో ఇంటికి వస్తూన్నాడు.

వచ్చే కృష్ణునితీరు దూరమునుండియె జానకి కనిపెట్టి ఎదురుగావెళ్లి 'ఏమిరా? నాయనా! ఇట్లున్నా' వని వాని చంకకెత్తుకొని బుజ్జగిస్తూ ఇంటిలోకి తీసుకొనివెళ్లింది కారణం తెలుసుకోను.

చిట్టిబాబు గుటకలు మ్రింగుతూ చిలుకలాగా తా బేటికతఅంతా చెప్పి "అమ్మా! అదియెవరే? ఆ. ఆగు. అదిపాపం. నోళ్లేంజంతుల్ని హింసెట్టూ"ద్దని చెప్పింది అని ఆత్రంగా అడిగినాడు.

అంతవరకు కిట్టుచెప్పినకతఅంతా వింటుండిన ప్రేమస్వరూపిణియు విద్యావతియైన ఆతల్లి ఆణిముత్యాల వంటి అశ్రుబిందువులు రాల్చుతు డగ్గుత్తికతో 'నాచిట్టితండ్రీ! అదియే అంతరాత్మ' అనిచెప్పింది.

దానికి కిట్టిబాబు 'అమ్మా! అంతరాత్మంటె దేవురంటివే మానాన్నతో ఓనాడు.' అని అన్నాడు. ఆమాటకి తటాలున జానకి కిట్టును అమాంతంగాయెత్తి ముద్దుబెట్టుకొని 'నావరాలకుప్పా! నీకామాట జ్ఞప్తి యున్నదా?' అనింది పులకాంకురములతో.

తల్లి—అంతరాత్మయె దేవుడని పెద్దలు చెప్పతారు. ఆయన అన్నిటి హృదయాల్లో ఉంటాడు.

కిట్టు—ఉండి ఓర్నికొట్టొద్దని చెప్తారా?

తల్లి—నాయనా! చెప్తాడు. ప్రతికార్యం చేయబోయేటప్పుడు యీపనిచేయవద్దు, ఇది మంచిపని, చేయుము, ఇది పుణ్యం, యిది పాపమని అందరిఆత్మల్లోఉండి హెచ్చరిక చేస్తుంటాడు. ఆవాక్యముశ్రద్ధతో విని నీవు దానిచొప్పున చేయుచుందువేని నీకాపరమాత్మ మఱింత స్పష్టముగాచెప్పిమంచిమార్గానికి త్రిప్పును.

కిట్టు—ఆమాత నే వినమంటె?

తల్లి—వినక అలక్ష్యంచేసితివేని ఒకటిరెండుతూరులు చెప్పి తరువాతచెప్పడం మానేస్తాడు పరమాత్మ.

కిట్టు—అమ్మా! నేనెప్పుడు అంతరాత్మ చెప్పినట్టువిని పెద్దవాణ్ణైనన్నదంలు బుద్ధిమంతులంతాలుగా దూ?

తల్లి—నాచిట్టితండ్రి బుద్ధిమంతుడవై వెయ్యేండ్లు బ్రతుకుము.

కిట్టు—ఐతేమానేకాని నాకెందుకమ్మా! దాని చంపాలని బుద్ధి పుట్టింది.?

తల్లి—నాయనా! నీకాబుద్ధి చెడుసావాసముచే పుట్టింది. మీనాన్నగారితో చెప్పి బడికిపంపులాగు చేస్తాను. బాగుగా చదువుకుంటావు కదూ?

కిట్టు—అమ్మా! చదువుకుంటానే.

ఆ. అంతరాత్మజెప్పు ననపాయమగుత్రోవ
విద్యచెప్పునెపుడు వినయవృత్తి
చెదువుకున్న తల్లిసర్వంబుజెప్పును
దల్లికంటె బ్రజకు దైవమెవరు?

౮. పాటలు

## తేలుపాట

(సంపాదకురాలు) శ్రీమతి చేబోలు లక్ష్మీనరసమ్మగారు

మోసకారితేలు,
ఏమూలదానిబారూ
వంకకనులపడగ
చీకట్లోదానినడకా
గుంపు, గుంపులతోక,
దానిచివరముల్లువంకా
ఎఱ్ఱతెలుపోటు,
ఇంకేమనందునగీటూ
కర్రబాయుబళ్లు
ఇకకానరావుకళ్లూ.

## జోలపాటలు

(సంపాదకురాలు) శ్రీమతి నా. వి. సరళాదేవిగారు

శ్రీరామ! జయరామ! శృంగారరామ!
కారుణ్యరఘురామ! కళ్యాణరామ!
కొండలలోవున్నారు గోవిందరామ!
అష్టదిక్కులరామ! అయోధ్యరామ!

ముత్యాలుకూర్చిన్న ముక్కాలపీట
రుద్రుడుమీనాన్న కూర్చుండాతగును

రారా! గాజులసెట్టీ! రత్నాలసెట్టీ!
కొల్లగాజులసెట్టీ! రమ్మిమావాడ

౧
అయోధ్యరాములు దప్పికొన్నారు
పంపవే కౌసల్య! పాలకావిళ్లు
పాలకావిళ్లమ్మ చల్లకావిళ్లు
గోవర్ధనకృష్ణమ్మ చిన్ని అబ్బాయి.

౨
పచ్చలుచెక్కిన్నా పట్టెమంచమ్ము
పార్వతీ మీతల్లి పాలివ్వతగును

౩
గాజులసెట్టి మావాడలకువస్తే
గాజులకుపోర్లెట్టు గారాబుపట్టీ.

# పొలిపదము

['ఒలియ: ఒలియో: ఒలియా: రా, వేలుగలవాడ! రారపొలిగాడా!' అను అనుపల్లవితో కుప్పనూర్పుడు కల్లములందు పాడబడుపదమును సేకరించి ప్రచురణార్థ మాకనుగ్రహింప భాషాభిమానులను గతమాసము మాపత్రికాముఖమున గోరియుంటిమి. మాకోరికమన్నించి ముప్వురువిద్యాధికు లాపదమును సేకరించి మాకు బంపిరి. 'పొలిపదము' 'పొలిగేయము' సేకరించిపంపిన మిత్రులు తూర్పుగోదావరిమండలము వారు. 'పొలిపాటలు' అను శీర్షికతో పేర్కొనబడిన రెండవపదమును సేకరించిపంపిన శ్రీయుత కొసరాజు రాఘవయ్య చౌదరిగారు గుంటూరుమండలమువారు. ఈపదములు వేరువేరుగానున్న కారణమున మాటిని ప్రచురించుచున్నాము. ఈతొలి పొలిపదమును పంపినమిత్రులు తమలేఖలో నిట్లు వ్రాసిరి: "జనవరి నెల గృహలక్ష్మి సంక్రాంతిసంచికలో తమరు ప్రచురించినప్రకారము నేనిందుతో జతపఱచిన 'పొలిపదము'ను మాస్వగ్రామము లోని కొందఱు కాపుసోదరులవలన గ్రహించితిని. వారు బొత్తిగా చదువురానివారై యుండుటనుబట్టి ఇందు కొన్ని అపస్వరములుండవచ్చునని తలచెదను. కొన్ని శబ్దములు, అపస్వరములు సవరించినాను. తమరింకొక సారి దీనిని పరిశీలింపకోరుచున్నాను. ఈపదమునుగూర్చి మాగ్రామములోని కాపుసోదరులనడుగ మిక్కిలి ఆశ్చర్యపూర్వకహృదయములతో ఒకనాటిరాత్రి వారందరునొకచోకలసికొని నన్నాచోటికిదోడ్కొనిపోయి నాకీపదమును జదివివినిపించిరి. అప్పుడు కొందఱుముసలులనడుగ వారీపదమునుగూర్చి ఇట్లనిరి. 'పూర్వము మాచిన్నతనములో పంటలు బాగుగబండెడివి. పెద్దపెద్ద వరిచేలునూర్చుచుండెడివారము. రాత్రులందు నిద్ర రాకుండ ప్రతివరికళ్లమునను 20, 30 లంకుల ఎడ్లను, పోతులను తోలుట కీపదము మంచిఊతగానుండెడిది. ఇప్పు డాపంటలేలేవు. నానాటి కీపదములూ మఱచిపోవుచున్నాము. ఈపదము విఘ్నేశ్వరునిగూర్చి పాడుదురు. ఆదేవుడే శుభములగూర్చుదేవుడని మాకాపుసోదరులందరును ఏపనిప్రారంభించినను మొదట విఘ్నేశ్వరుని ప్రార్థించెదరు. ఇప్పటికిని వరికళ్లములందు విఘ్నేశ్వరునినిల్పి వరిచేనునూర్పుడి పూర్తియై ధాన్యము ఇంటికిదెచ్చుకొనువఱకు ఆవిఘ్నేశ్వరునిపూజించుచుందురు. ఇట్టిపదము ఆసమయములందు మంచిఉత్సాహము కలుగజేసి పనివాండ్రకు హెచ్చరికతో పనిచేయునట్లుచేయును. పాటలో పూలగుర్తులు ఉన్నచోట్ల ఏవియో కొన్నిపంక్తులు లోపించెననితోచెడిని. ఇందుప్రతిపాదమునకుచివర మొదటి రెండుపంక్తులు పల్లవిగా పాడవలెను. 'ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో' అనుచరణము మొదలు తుదివఱకు పల్లవి అవసరములేదనియు, నూర్చుటకు ఏర్పరచుకొనిన కుప్పయావత్తు నలిగిపోయినపిమ్మట పశువులను వరికళ్లములోనుండి బయటకుతీసికొనిపోవునపుడు ఈపంక్తులు పాడుదురనియు తెలియుచున్నది."]

పొలియన్న పొలియో! వెయివేలుగలపొలియో!
వెయివేలకు వెయివేలు నూర్చగలపొలియో!

నడియాకసంమెఱసి నల్లమెలట్టింది
తూర్పునబట్టింది తుమ్మెదలమోత
పడమటనుబట్టింది పావురాలమోత
ఆవాన యీవాన కలసికురిసింది
బేగిరావులగెడ్డ తెఱచిపాఱింది

గొంటుగంత మెలట్టి గుంటలేనిండేయి
చేటంత మెలట్టి చెఱువులేనిండేయి
నిండిందిమనచెఱువు నింపాదిగాను
అడవివార పెదచెఱువు వెంటనేనిండింది
వేసింది ఆచెరువు ఏడుకన్నాలు.

* * * * * *

రాగితూములసీట రాజనాలుపండె
కంచుతూములసీట కార్తికాలుపండె
వెండితూములసీట వెఱడాలుపండె
చినకాడి పెదకాడి కాపులిద్దరుగా
వారెంచిపూసేరు ఎల్లెడ్ల
అల్లుడుమామలు ఎల్లెడ్లు
ఒన్నెకఱ్ఱమేడి, ఓదికఱ్ఱకాడి
నల్లతుమ్మనాగలి, చంద్రపటికోల
తూర్పునకుసాలొడచి పడమరకుదున్నె
దక్షిణపుకూలీలు దమ్ముచేసేరు
పడమటకూలీలు పట్టితోలేరు
ఉత్తరమునకూలీలు ఊడ్చివెళ్లేరు.

* * *

వినాయక! గణనాయక! విఘ్నేశ్వరుండు:
ఆవినాయకు డనువాడెటువంటివాడు?
దొప్పచెవులవాడు, దోనెకడుపువాడు
మిట్టనొసలవాడు, మిడిగుడ్లవాడు.
ఆవినాయకునకు ఏమిలంచాలు?
చప్పిడి వుండ్రాళ్లు, చలిమిడి, వడపప్పు,
ఖండించినచెఱకులు, గానుగచిమ్మిలి,
దొప్పతోతేనెలు, దోరావుపాలు,
మధురమగుతేనెలు, మాధిఫలములు
అవి మావినాయకునకు అనుకూలపూజ.
మనపాలానవినాయకునకు మరియేమిపూజ?
మనగట్టుమీద వినాయకు గంధాలపూజ.
మళ్లీమనవినాయకునకు మఱియేమిపూజ?
ముంతమామిడిపళ్లు, బొంతరటిపండ్లు,
చిప్పతోగంధాలు, శిరిశనగపప్పు,
కొట్టినచెఱుకులు, కొమ్మరటిపండ్లు
నఱికినచెఱకులు, నల్లరటిపండ్లు.

ఎడ్లునూర్చంగ ఏకరాసులు
పడ్డలునూర్చంగ పర్వతాలపోగు
పోతులునూర్చంగ పోగుమండీలు
దూడలునూర్చంగ ధూళిరాసులు.
పొలిగలసీతవైతే మాపోతుమీదికిరమ్ము.
మాచేనుప్రక్కను రావియొకటుండె
రావెక్కిమాసీత రాగాలుదీసె
మాచేను మాఱుదల మఱ్ఱియొకటుండె
మఱ్ఱెక్కిమాసీత మఱిరాగదీసె
మాచేనువెనకాల జువ్వొకటియుండె
జువ్వెక్కిమా సీతజూదమాడింది
పొలియన్నశబ్దమ్ము మాపొలములోగలదు.

* * *

ఏర్చికట్టేడు ఎల్లెడ్లబంతి
ప్రొద్దున్నకట్టేడు బొల్లెడ్లబంతి
వెండికన్నెలకట్టేరు ఎల్లెడ్లబంతి
పయిడికన్నెలకట్టేరు పైయెడ్లబంతి
బొడ్డుకన్నెలకట్టేరు బొల్లెడ్లబంతి
కంచుకన్నెలకట్టేరు కర్రెడ్లబంతి
బద్దికన్నెలకట్టేరు పుల్లెడ్లబంతి

* * *

ఆనితొక్కను స్వాములు హస్తములమొయ్య
ఆనితొక్కినస్వాములకు ఏమిలంచాలు?
ఆనితొక్కిన స్వాములకు మురిడీలగొలుసులు
ఆనితొక్కినస్వాములకు కొమ్ములకుతొళ్లు
ఆనితొక్కినస్వాములకు దండగడియాలు
ఆనితొక్కినబోడెడ్లకు బొడ్డుగంటలు.

* * *

ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో!
మనకర్రెడ్లబంతిమీద ఉయ్యాల!

ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనబోడెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనదామెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనపై యెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనఎల్లెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనపుల్లెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనపోడెడ్లబంతిమీద ఉయ్యాల!
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనదోరెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనమైలెడ్లబంతిమీద ఉయ్యాల !
ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యాలో !
మనబట్టెడ్లబంతిమీద ఉయ్యాల !

* * *

## పొలిపాట

(సంపాదకులు) కొసరాజు రాఘవయ్యచౌదరిగారు

ఒలియ: ఒలియో: ఒలియా: రా, వేలుగలవాడా! రార! పొలిగాడా!

అనుపల్లవి రెండేసిచరణముల కొకసారి పాడుచుండవలెను.

ఊరికి ఉత్తరానా ఊడలామఱ్ఱి
ఊడలామఱ్ఱిక్రింద ఉత్తముడిచవికె
ఉత్తుముడిచవికెలో రత్నాలపందిరి
రత్నాలపందిట్లో ముత్యాలకొలిమి
గిద్దెడుముత్యాల గిలకలాకొలిమి
అరసోలముత్యాల అమరినా కొలిమి
సోలెడుముత్యాల చోద్యంపు కొలిమి
తవ్వెడుముత్యాల తరిచినాకొలిమి
మానెడుముత్యాల మలచినాకొలిమి
అడ్డెడుముత్యాల అలరినాకొలిమి
తూమెడుముత్యాల తూగెనేకొలిమి
చద్దిఅన్నముతినీ సాగించుకొలిమి
ఉడుకుఅన్నముదినీ ఊదెనేకొలిమి
పాలఅన్నముదినీ పట్టెనేకొలిమి
ఊదేటితిత్తులూ ఉరుములామోలు
వేసేటిసంపెట్లు పిడుగులామోలు
లేచేటిరవ్వలు మెరుపులామోలు
చుట్టున్నకాపులు చుక్కలామోలు
నడుమకమ్మరిబిడ్డ చంద్రుణ్ణిమోలు
... ... ... ...
నెయిబోసిగొడ్డళ్లు నేర్పులెక్కించి
పాలుబోసిగొడ్డళ్లు పదునులెక్కించి
సిర్బోసిగొడ్డళ్లు నునుపులెక్కించి
పోయిరే అన్నలు అడవిమార్గాన
పోయేటి అన్నలకు యేయేమిచద్ది
అడవిచిక్కుడుకాయ అలచందపప్పు
పచ్చజొన్నన్నంబుపై యావులపెరుగు
మొలమడొడ్డన్నంబు యెల్లావులపెరుగు
బుడమడొడ్డన్నంబు బుర్రియావులపెరుగు
పోయిరే అన్నలూ అడవిమార్గాన
మూడామడలుబోయి ములకాలగొట్టి
నాలుగామడలుబోయి నాగళ్లుగొట్టి

ఏడామడలుబోయి యేడికలుకొట్టి
పదియామడాబోయి పాపటముగొట్టి
కొట్టినాసామాను బళ్లకెత్తేరు
పోయినమార్గాన ఊరుజేరేరు
పోయెనే ఆబండి బ్రాహ్మణావీధికె
బాపనారక్కప్ప పట్టెనివ్వాళి

... ... ... ...

కంసలావారింటికాడ ఆబండి

... .. ... ...

తెచ్చినాసామాను దించిరావీధి
చేసిరీనాగళ్లు చేలుదున్నంగ
కోసిరీగొఱ్ఱులకు కొండ్రదున్నంగ

... ... ... ...

దణ్యాలపగ్గాలు దబ్బునాలాగి
దూలాలపైగొర్లు దుమ్ముదులేృరు
వేసెనేకోఁటేళ్లు విత్తులేయంగ
పోయెనేకోఁటేళ్లు చేనుమందటికె

... ... ... ...

తూర్పునాఒకవాన తుమ్మెదలమ్రోత
పడమటాఒకవాన పట్టికురవంగ
ఉత్తరానొకవాన ఉరిమికురవంగ
దక్షిణానొకవాన దాగికురవంగ
యీవానఆవాన యేకజడివానా
ఏవిలీచేనుకూ యెదవానలాయె
శ్రీరాముడుగొఱ్ఱుబట్ట సీతయెదబెట్ట
రఘురాముడుగొఱ్ఱుబట్ట రంభయెదబెట్ట
సీతబెట్టినయెదా శ్రీముత్యములుబండు
రంభబెట్టినయెదా రాజనాల్ బండు
వెండితూములక్రింద వెల్లడముబండు
పమిడితూములక్రింద పాలంకిబండు
రాగితూములక్రింద రాజనాల్ బండు

... ... ... ...

వెండిపిడికొడవళ్లు వెయివేలుజేసు
పమిడిపిడికొడవళ్లు పదివేలుజేసు
రాగిపిడికొడవళ్లు లక్షలకుజేసు
కోసేటిగుప్పిలి వేసేటిబెదె
వేసేటికుప్పలు చుక్కలమోలు

... ... ... ...

మాచేనుమందట మారేళ్లుగలవు
మారేళ్లపూపత్రి మాగణపతికిపూజ
మాచేనుమందట మామిళ్లుగలవు
మామిళ్లపూపత్రి మాగణపతికిపూజ

... ... ... ...

ఒలే! ఒలియః ఓలియోః ఒలియాః
రా, వేలుగలవాడా! రారా, పొలిగాడ!
రావేలుపోవేలు రాశిపదివేలు
రావేలునీదయ్యా రాశిమాదయ్యా
పదివేలుగలవాడ! రార,పొలిగాడా!
పదివేలునీదయ్యా పంటమాదయ్యా
నూర్వేలుగలవాడ! రార,పొలిగాడా!
నూర్వేలునీదయ్య నూగుమాదయ్యా
వెయ్యేలుగలవాడ! రార, పొలిగాడా!
వెయ్యేలునీదయ్యా వెన్నుమాదయ్యా
కోటివేల్లలవాడ! రార, పొలిగాడా!
కోటివేల్నీదయ్యా కొండ్రమాదయ్యా

... ... ... ...

పోయెనేపొలిగాడు పొన్నూరుదాటి
వచ్చెనేపొలిగాడు వరగాణిబాట
వామెక్కిపొలిగాడు వాలలాడంగా
కుప్పెక్కిపొలిగాడు కూకలేయంగ
మట్టెక్కిపొలిగాడు మాటలాడంగ
జువ్వెక్కిపొలిగాడు జూదమాడంగ

పోతెక్కిపొలిగాడు బొబ్బటిల్లంగ
రాసెక్కిపొలిగాడూ రంపటిల్లంగ
పొలిగాడుగొట్టంగ పోగాయెరాశి
గాలిగాడుగొట్టంగ గనుమాయెరాశి
పెయ్యిలూద్రొక్కంగ పెదిగెనేరాశి
యెద్దులూద్రొక్కంగ యెదిగెనేరాశి
దున్నలూద్రొక్కంగ దిన్నాయెరాశి
కోడెలూద్రొక్కంగ కొనసాగెరాశి
కొండవీటికొండల్లె గొప్పాయెరాశి
మంగళాగిరివల్లె మణిగెమారాశి
తిరుపతికొండల్లె తీరెనేరాశి
రామలక్ష్మణులట్లు రాసులూగలవు.

## పొలిగేయము

(సంపాదకులు) తాతపూడి సత్యనారాయణమూర్తిగారు

పొలీః పొలోః ఎయ్యేలుగలరా, పొలి!

అను అనుపల్లవిని ప్రతిచరణము తుదినిపాడవలెను

'ఒలియః ఒలియోః ఒలియోః
రా, వేలుగలవాడా! రా, పొలిగాడా!'
పొలి,
వెయ్యేలుగలరా, పొలి
ఎయ్యేలుకెయ్యేలు ఎనబనూరేలు!
పొలీః పొలోః ఎయ్యేలుగలరా, పొలి!
పోల్నాటికాపోరు ఎటువంటివారు?
గుండుపోగులవారు, గుఱ్ఱాలవారు,
దొప్పచెవులవారు, దోలికడుపోరు
చెంపతలపాగాలు, చేతిరుమాళ్లు.
ఆయేరోసికాపోడు ఏమనిమ్రొక్కె?
నెలకిమూడొర్షాలు కురమనీమ్రొక్కె,
ఆ దక్షిణంమెరసిందో దరినిగరిదెల్లి,
వడ్డాదికొండాను, లొడ్డెవర్షంబు,
మాడుగొల్లుకొండాకు మల్లెవర్షంబు,
తూర్పువర్షంబు తూలకురిసేను
పడమటివర్షాలు పట్టికురిశేను,
ఆయడివారపెదచెర్వు అదిచాలనిండె;
ముత్యాలయాచెర్వు మూడుమదువులుగా,
వజ్రాలయాచర్వు వాలుగమ్ములుగా,
ఆపొలన్నశబ్దమన్నో మనపోల్నాటగలదు,
ఆబలభద్రుడిచ్చిన ఒకబద్దిపలుపు,
నారాయుడిచ్చిన ఒకనారమోకు;
జీలుగానాగలి, జిల్లేడుమేడి,
మువ్వలామునకాలి, గవ్వల్లకాడి;
ఎల్లేడుకాపోడు చేనున్నకడకి;
ఏశేడుకాపోడు ధరణిపైనింక;
ఏసినయిత్తనము ధరణిపైమొలచి;
మూడురోజులకి మొక్కములికేరుపడెను;
ఆ అయిదురోజులకిమొక్కొ ఎంతేరుపడెను;
మూడునెలలకుపంట మూలకొచ్చెనుగా;
పొలీః పొలోః ఎయ్యేలుగలరా, పొలి!

## విద్యాభూషణము

శ్రీమతి కురుగంటి వేంకటలక్ష్మమ్మగారు

సీత, దమయంతి మొదలగు సతులుచదివి
సత్సతులటంచు పేర్గాంచిచాలగాను
మగలప్రేమకు పాత్రులై మనగలేదె,
విద్యయేభూషణముగాదె వెలదికెపుడు?
దేశహితైభిలాషి సాధ్వీమతల్లి
అన్నపూర్ణమ్మచదివి తానధికఖ్యాతి
పుడమినార్జించిచనలేదె పుణ్యగతికి,
విద్యయేభూషణముగాదె వెలదికెపుడు?

# వంకాయ

క. వంకాయవంటి కూరయుఁ
బంకజముఖి సీతవంటిభామామణియున్
శంకరునివంటి దైవము
లంకాధిపువైరివంటి రాజునుగలఁడే.

అను వంకాయను ప్రస్తుతించు చాటుపద్యము వంకాయశాకమువలెనే ఆంధ్రదేశమున సర్వవ్యాపన మందియున్నది. వంకాయ నిజముగ శాకరాజము. స్త్రీలలో సీత, దైవములలో శంకరుడు, రాజులలో రాముడు ఎట్లు గణ్యులో కూరలలో వంకాయ అట్టిది.

వంకాయను సంస్కృతమున వార్తాకమనియు; అరవమున కత్తిరికాయనియు; మళయాళమున వళిదినం కాయ యనియు; తులు, కన్నడభాషలలో బదినేకాయయనియు; హింది, ఉరుదూ భాషలలో బైగాన్ అనియు; మహారాష్ట్రమున వాంగీయనియు; బెంగాలీభాషయందు బెగన్ అనియు; గుజరాతిలో వింగి వెంగ్ని లేక రిగ్నింయనియు; ఓఢ్రభాషలో బండినో యనియు; బర్మన్ భాషలో క్యాంతియనియు; అరేబియాలో భిండియనియు; ఇటలీభాషలో మెలన్‌గోల్ యనియు; పోర్చుగీసులో బెరింగేలుయనియు; స్పానిష్ భాషలో అల్ బెరింగినీ, బెరింగానయనియు; జర్మనుభాషలో యియల్‌ఫ్రూట్ యనియు; ఫ్రెంచిభాషలో అబిరిగినీ యనియు; అమెరికనులు ఎగ్‌ఫ్రూట్ యనియు; ఆంగ్లమున బ్రింజాల్ యనియు; లాటిన్ భాషలో సోలనం మెలంగినా (Solanam Melongena) యనియు నందురు.

ప్రపంచమందలి ప్రధానభాషలన్నిటియందును వంకాయ కిట్లునామము లమరియుండుటచే నిది ప్రపంచ మందలి సమస్తజాతులవారిచేతను ఉపయోగింపబడుచున్నదని తేలుచున్నది. వంకాయలో పెక్కురకములు గలవు. అయితే ఒక్కొక్కప్రాంతమున ఒక్కొక్కతావున పెంచబడు వంకాయలకు చిరప్రసిద్ధి. బెజవాడ ప్రాంతమున బాపట్లవంకాయలకు హెచ్చు చెలామణి. బెంగుళూరుప్రాంతమున మైసూరువంకాయలు ప్రసిద్ధములు. రాజమహేంద్రవరము, కాకినాడ ప్రాంతములలో జేగురుపాడు, కుమారదేవము వంకాయలకు వన్నె మాలిన చెలామణి. గుంటూరు, వంగవోలు ప్రాంతమున మెట్టభూములలో పైరుపెట్టబడు ముండ్లవంకాయలు మిక్కిలి రుచిగా నుండును. వీనికి కర్పూరపువంకాయలనిపేరు. అరటిపండ్లలో కర్పూరపు చక్రకేళీలవలె వంకాయలలో కర్పూరపువంకాయలు రుచిరములు.

పెరుగుభూమినిబట్టియేగాక కాయయొక్క ఆకారమునుబట్టికూడ వంకాయలలో పెక్కురకములు గలవు. లావుపాటివి, పొడుగుపాటివి, గుండ్రపాటివి, సన్నటివి, పొట్టివి. ఇట్లు పెక్కురకములు. వంకాయ రంగులలోగూడ విశేషవిభేదములు గలవు. తెల్లటివి, నల్లటివి, ఎఱ్ఱటివి, పచ్చటివి, నీలివి, మిశ్రమ వర్ణములు గలవి ఇత్యాదిగాగలవు. ఇవి పెంచబడు ప్రదేశముయొక్క సారమునుబట్టి అచ్చటిశీతోష్ణస్థితుల అనుకూల్యమునుబట్టి వంకాయలలో చిన్నపెద్దరకములు గలుగుచున్నవి. కొన్నిప్రదేశములలో వంకాయలు సొరకాయలంతలుగా ఎదుగుట గలదు. వంగదేశమున వంకాయలు బెంకాయలవలె నుండును. వీనిపెను ఒక్కొకవంకాయ తూగు మిక్కిలి పెద్దరకములును గలవు. ఉదకమండలము, బెంగుళూరులలో అప్పుడప్పుడు జరుగు ఫలపుష్పశాకప్రదర్శనములందు పెక్కురకముల ఆకారముగల వంకాయలను చూడనగును. అయితే చిత్రవిచిత్రమైన



పాలబుగ్గలు



జపమా? ఎంగిలియా?

—ఛాయాచిత్రగ్రాహకులు యస్. కృష్ణమాచారిగారు



రాజమండ్రి: గోదావరివంతెన

—ఛాయాచిత్రగ్రాహకులు ఆదుర్తి రాజారావుగారు

ఆకారములు, వింతవింతలైన రంగులు గల వంకాయలు ప్రదర్శనశాలలందు కనులపండువుగా చూచియానందించుటకేగాని కూరవండినచో గుంటూరుప్రాంతపు మెట్టవంకాయకూర ముందు దిగదుడుపుగా నుండును. ఇది స్వానుభవమున చెప్పుమాట. మెట్టవంకాయలలో మేలితరమది సార్థకనామముగలది కర్పూరపువంకాయ.

నీరుకట్టి పెంచువంకాయలు రుచికి బాగుగా నుండకపోయినను విరివిగ లభ్యమగుటచే వ్యాపారమునకు తగినవి. పట్టణప్రాంతములయందును రైలుస్టేషనులసమీపములందును వంగపెరడుల సేద్యముచేయువారికి దంపమెట్టవ్యవసాయములకంటె మిగుల లాభకారిగ నుండును. మద్రాసు మార్కెట్టులో తెల్లవారుసరికి కొండలవలె వంకాయమూటలు రైలునుండి తెచ్చిపేర్చుదురు. ఈ మూటలన్నియు మూడునాలుగు గంటల కాలములో చెల్లిపోవును. ఇట్లు వంకాయలు ఏఊరి మార్కెట్టునందైనను విశేషముగనే చెల్లిపోవుచుండును. కావుననే కూరలమార్కెట్టులకు సాధారణముగ వంకాయవలె మఱియొక కూర దిగుమతికావడములేదు. ఏకూర లభించకపోయినను వంకాయలు సంవత్సరముపొడుగునను- ఆషాఢమాసమునందుగూడ- పల్లెగ్రామము లందును లభించుచున్నవి. శుభాశుభములకు వంకాయకూర ప్రధానపదార్థము.

సర్వకాలములందును దొరకునవియే యైనను వంకాయలను వరుగుగా తయారుచేసి నిలువచేసికొను ఆచారముకూడ కొన్నిప్రాంతములందుగలదు. వంకాయకంటె వంగవరుగును కొందరు హెచ్చుగ ప్రేమింతురు. శబరిలంకలలోని పొగాకు ప్రసిద్ధివలెనే కోనసీమ గోదావరిలంకలలోని పెద్దవంకాయలవరుగు అతిశ్రేష్ఠమైనది. గోదావరిజిల్లాలోని ఆత్రేయపురపు వంగవరుగు ప్రసిద్ధి ఉత్తరసర్కారులలో నందఱెఱిగినదే, లంక భూములలో పెరిగిన వంకాయలవరుగు పుఱుగుపడుటకు పెట్టినదిపేరు. కూరకు మెట్టవరుగు శ్రేష్ఠము. మాగాణివంకాయలకంటె మెట్టవంకాయ త్వరగ పచనమగును.

'వార్తాకం కోమలం పథ్యం' యని శాస్త్రకారుని వచనము. అనుభవమున ఆరోగ్యమునకు లేతవంకాయయే శ్రేష్ఠమని తేలినది. శాస్త్రకారులుకూడ ఆమాటనే నిర్ధారించుచున్నారు. కావుననే నాటు వైద్యులు రోగులకు వంగపిందెలను పథ్యముగ వాడెదరు. 'వంకాయతోటలోనిది: అరటికాయ బజారులోనిది' అనుసామెత ఎల్లరకు తెలిసినదే. వంకాయ చెట్టునుండి కోసినపిమ్మట ఎంతత్వరలో పచనముచేసిన అంతమంచిది.

వైద్యశాస్త్రమున వాకుడు, ములక, తెల్లములక, జాతిముండ్లవంకాయలు ప్రసిద్ధములైనవి. అయితే వీటిని యెవరును పెంచిపోషింపకపోయినను పొలములలోను కంచెలలోను విశేషముగ పెరుగుచున్నవి. ఇవి నేలమీద గుబురుగ అల్లుకొను వంగజాతి. కఫసంబంధమైన జాడ్యములకుగాను చేయబడు పెక్కుఔషధరాజములలో వీటివేరు కలియుచున్నది. ఈ చిట్టివంగపండ్లను చితుకకొట్టి విత్తులను తీసి యెండబెట్టి జిల్లేడాకులలోపోసి పొగచుట్టలనుచుట్టిపొగపీల్చిన కాసశ్వాసరోగములకు మంచిమందు. ఈలేత కాయలకూర రోగులకు పథ్యకారి. ములకజాతివంకాయకు సంస్కృతమున బృహతీయనియు; తెల్లములకకు లక్ష్మణాయనియు, వాకుడుకు కంటకారి యనియు నామములు. వీటిలో లక్ష్మణా (తెల్లములక)యను మూలిక గర్భధారణకు మేలైనదని శాస్త్రమునందుగలదు. ఇది కంటిజబ్బులకు కూడ చాలమంచిది.

వంకాయ ఉష్ణవీర్యముగలది. ఉష్ణవ్యాధులుగలవారికిని, చర్మవ్యాధులు గలవారికిని ఇదియంత మంచి కూరగాదు. వంకాయ వాతము, కఫము, క్రిమి, కుష్టము, జ్వరము, కాసము వీటిని శమింపజేయును. బలము కలిగించును. శుక్రమును, అగ్నిని వృద్ధిపఱచును. నిద్రను పుట్టించును. రుచి కలిగించును. నేత్రములకు హితకరమైనది. వంకాయ పుష్టిని కలిగించి కఫపిత్తములను శమింపచేయునని చరకసంహితయందు చెప్పబడియున్నది. వాతమును వృద్ధిచేయునని హారీతసంహితయందును రాజనిఘంటువునందును కలదు, వంగజాతిలో కోడిగుడ్డువలె

నుండు తెల్లటిది అన్నిటికంటె గుణమునందు శ్రేష్ఠమైనదని వైద్యశాస్త్రము చాటుచున్నది. ఇది ముఖ్యముగ మూలరోగమునకు శ్రేష్ఠమైన శాకపాకమని ఆయుర్వేదవైద్యుల మతము. ఈజాతి వంగచెట్లకే ఆంగ్లభాషలో ఎగ్ ప్లాంట్ (Egg Plant) యనిపేరు.

వంకాయ సమూలము మధురమే. అందులో వంకాయ తొడిమరుచి చెప్పతరముకానిది. గొప్పరుచిని రూపించిచెప్పవలసివచ్చినపుడు వంకాయ ముచికవలె రుచియైనదని ఉపమానము తెచ్చిచెప్పుట వాడుకయైనది. వంకాయముచికయొక్క రుచిప్రాశస్త్యమును కవులు గ్రంథస్థము చేసియున్నారు.

రుచిత్వము చేతను, శుచిత్వముచేతను, హితమగుటచేతను కాయకూరలలో ప్రథమస్థానమును పొందియున్న వంకాయను పచనముచేయుటలో ఆంధ్రస్త్రీలు సరియైన మార్గము నవలంబింపక దాని రుచిత్వమును, శుచిత్వమును, హితత్వము చెడగొట్టుచున్నారు. వంకాయలను తరిగి వండి వార్చి పిమ్మట తాళింపుపెట్టుటయే తెలుగుస్త్రీ లవలంబించు వార్తాకపచనవిధానము. ఇది మిక్కిలి లోపభూయిష్టము. వండివార్చిన వంకాయ వట్టి చెత్తతో సమానము. వంకాయలోనుండు ద్రవ్యగుణము వార్చిననీటివెంటపోవుచున్నది. మిగులునది పిప్పి. ఈపిప్పిలో వంకాయయొక్క మంచిగుణ మొక్కటియు నుండదు. లోపభూయిష్టమగు ఈపచనవిధానము వెంటనే విడనాడవలయును. వంకాయను పచనముచేయు ప్రశస్తవిధానమును, అందలి పాకభేదములను క్రమముగ గృహలక్ష్మిలో వెలువరింతుము.

# విశ్వగానము

కస్తూరి రాజామాణిక్యము గారు

కవికుమారుడనేను! నాగానమునకు
అశ్రువులురాల్చి, విశ్వమే అవశమగును!

* * * *

మలయానిలములోన మాధురుల్ చిమ్మెద విశ్వమా, నీవు ద్రవించిపొమ్ము!
కరుణాశ్రుకణములో గానమ్మొనర్చెద కఠినపాషాణమా, కరగిపొమ్ము!
తరుణానురాగగీతా లాలపింతును చిన్నినాలతలు, పుష్పితలుకండు!
విశ్వమోహనుడనై వేణువూదెదనేను వెన్నెలా, పాటలో విరిసిపొమ్ము!
చిన్నిపూవా, సుధావికాసితవుకమ్ము!
విమలతారా, కళాదరస్మితముఁ జిమ్ము!
మధురచంద్రా, సుధాపరీమళములల్లు!
కలతలెఱుగని నాపాట కరగిపోయి.

౧

కమలినీగంధబంధురవిమలమంద
మందమలయానిలములోన మాటునంది
పూవు పొదరిండ్లలోసుధాభావలలిత
వినుతసంగీతములను పాడునదినేనె!

౨

సాంధ్యరాగారుణితనదీసలిలములను
శోణడిండీరకుసుమమాలానతుండ
నై, సమాలోలమగుచు హోరనుతరంగ
డోలికలలోన పాటపాడునది నేను!

3

అమలవాసంతికాచ్ఛాయ లలమువేళ
లేజివుఱుటాకు మిలమిలల్ గాజువారు
మృదులతారుణ్యవిభ్రమోన్మీలమైన
ఏమహీజాంతరమునుండియేని మధుర
కోమలకుహూనినాదముల్ కురిసెనేని,
విమలసంగీత మధువులు విరిసెనేని,
పాడుచున్నాను నేనని, భావలహరి
తేలివచ్చితినేనని, తెలిసికొనుడు!

4

బాలభాస్కరకిరణాలు మలయపవన
చలితతరుపత్రములపైన జారునపుడు,
ఏలతాబాలికలచెంతనేని మీరు
మోహనపరిమళముల బంధురములైన
చిన్నిపూలలో ప్రేమసుస్నిగ్ధగళము
ఝుమ్మనుచు పాడుచున్న నాదమ్మువినిన
ఎవ్వరనుకొన్నవారలో ఏమొకాని-
విశ్వకళ్యాణమధువుకై విభ్రమించి
పాడుచున్నాను నేనని, భావలహరి
తేలివచ్చితి నేనని, తెలిసికొనుడు!

* * *

దరిలేని ఆనందసరసియొడ్డునను
దారుణతమవిషాదము క్రమ్మువేళ,
కళ్యాణవల్లరీగానమ్మునందు,
మృత్యుదంష్ట్రిచ్ఛాయ బెదరించునపుడు,
పాడెద నిటులనే పాడెదనేను!
పాటలో పుట్టితి! పాటలోపెరిగి,
పాటలోనే నేను వాడిపోయెదను!
ప్రకృతిలావణ్యరశ్ములు పరిమళించు
మాధురీధామములు నాకు మందిరములు!
తారకలలో, స్రవంతులహోరులోన,
సాంధ్యరాగములో, నిశాకాంతిలోన,
వెన్నెలలో, ప్రభాతపు మెఱుగులోన-
మానవునిచేత మలినము కానిచోట
అమృతసందేశగీతము లల్లుకొనిన
పాడుచున్నాను నేనని, భావలహరిఁ
దేలివచ్చితి నేనని, తెలిసికొనుడు!

* * *

కవికుమారుడ నేను! నాగానమునకు
అశ్రువులురాల్చి, విశ్వమే అవశమగును!

## ప్రశస్తచిత్రమునకు

ఏబది రూపాయిల బహుమానము

గృహలక్ష్మి ముఖపత్రముపై చిత్రించుటకు చిత్రములు కావలసియున్నవి. ఆ చిత్రములు గృహలక్ష్ముల ప్రజ్ఞను, ప్రతిభను ప్రదర్శించునవిగా నుండవలయును. స్త్రీ రచితములగు చిత్రములు ప్రథమపరిశీలనమునందును. ప్రశస్తచిత్రమునకు ఏబది రూపాయిల బహుమాన మీయబడును. చిత్రములు ప్రజోత్పత్తి సంవత్సరాదిలోపున మాకు చేరవలయును.

—సంపాదకుడు.




ఆకుండి లక్ష్మీనారాయణశాస్త్రిగారు

తులసిఆకు, పొన్నగంటిఆకు, నల్లతుమ్మాకు, సన్నకసింతాకు, మారేడాకు, యివి వేరువేరుగా ఆవునేతితో వేచి కట్టిన కంటిరెప్పలనొప్పులు, పుసికట్టుట, కన్నునీరుకారుట, మెరమెరలాడుట, పోటు, మంట, యివన్నియు నిస్సందేహముగా మానును.

*    *    *    *    *

మానిపసపు, గైరికము, తుంగముస్తెలు, యివి మేకపాలతో నూరి కనులకుబెట్టిన సమస్తమైన కంటివ్యాధులు నివారణయగును.

*    *    *    *    *

నల్లమందు మాడఎత్తు, పటిక ఒకచిన్నము, గంజాయివిత్తులు ఒకచిన్నము, లవంగములు ఒకచిన్నము యివి చనుపాలతో వండి కనులకు పట్టువేసిన సమస్తమైన కంటిబాధలు తొలగును.

*    *    *    *    *

కరక్కాయయు, శిలాజిత్తును, ఎర్రరంగు సుద్దరాయియు, సైంధవలవణమును, మ్రానిపసపు, ఇవి సమముగానీటితో నూరి కనులకుబెట్టిన అభిష్యంతరోగములు సమూలము హరించును.

*    *    *    *    *

చంటిపిల్లలకు కనులలో కూనలు బయలుదేరినను, అంటుకొనుచున్నను, కలిగినను, లక్క, మ్రానిపసపు, ఎర్రరంగుగల మణిశిల, వాయువిళంగములు, ఎర్రసుద్దరాయి, వీటిని సమముగా చనుబాలతో నూరివేసిన తప్పక నయమగును.

# యజ్ఞము

శ్రీమతి రొక్కం సుందరమ్మగారు

'మహాయజ్ఞ' మనుపదమునకుగల భావము మనము తెలిసికొనవచ్చును. సాధ్యమైనంత యెక్కువమంది, సాధ్యమైనంతసులభముగా, సాధ్యమైనన్ని యెక్కువజీవులక్షేమముగోరి చేయుపనియేదో అదియే మహాయజ్ఞము. అందుచే ఏదోయొకప్రయోజనమును మనసులోనుంచుకొని అందుకై మరియొకరికెవ్వరికిగాని అశుభముగోరుట యజ్ఞముకాజాలదు. భగవద్గీతకూడ యజ్ఞమని చెప్పుటకువీలులేని కర్మయంతయు బానిసతనముక్రిందికే వచ్చునని నుడువుచున్నది. మనయనుభవముగూడ దీనిని ధృవపరచుచున్నది.

భగవంతునిబానిసలు మానవులు. ఇట్లు యజ్ఞము మనతోబాటుగనే పుట్టినదగుటచే బ్రతికియున్నంతకాలము మనమప్పువీడి యున్నవారమేయగుదుము. బ్రతికియున్నంతకాలము ప్రపంచసేవగావించుట మనవిధియగును. బానిసలు తమయజమానులిచ్చు అన్నవస్త్రాదులతో కాలక్షేపము చేయువిధముగనే, మనముగూడ కృతజ్ఞులమై యావిశ్వేశ్వరుడొసగిచ్చుదానిని గ్రహింపవలయును. అదియైనను మనహక్కులకు ఫలితమని మనమనుకొనరాదు. అందుచే మనకది లభింపకయేపోయినను మనయజమానిని మనమునిందింపగూడదు. ఈశరీరమతనిది. దీనిని పోషించుటకాని, యావల పారవేయుటగాని అతనియిష్టము. దీనిని గూర్చి మనము విచారింపవలసిన యక్కరలేదు. జాలిపడదగినదియుగాదిది. అట్లుకాక పోవుటయేకాక యిదియొక సహజమైనస్థితి. అందుచే సంతసింపదగినది, కోరుకొనదగినది. భగవత్సృష్టిలోమనకు తగినస్థానమేదియను సంశమును మనమురవ్వంత తెలిసికొన్నచో నిది స్పష్టము. బలీయమగు విశ్వాసముగలవాడే యీమహానంద మనుభవింపగలుగును. "నిన్ను గూర్చి నీవాలోచించుకొనవలసిన యవసరము రవ్వంతయైనను లేదు. అదియంతయు నీశ్వరునికే విడిచిపెట్టుము." అనియే యన్నిమతములును శాసించుచున్నట్లుతోచును.

స్వార్థత్యాగము. కాని దీనికెవ్వరును భయపడవలసిన అవసరములేదు. నిష్కల్మషమగు హృదయముతో ఇతరులకుసేవజేయువాడు అట్టిసేవకుగలయవసరముగూర్చి మరింత యెక్కువగా తెలిసికొనగలడు. అతనివిశ్వాసము నిరంతరముగ నెక్కువయగుచునేయుండును. తనజన్మయెట్టిదో గుర్తెరుగజాలనివాడు, స్వప్రయోజనమును విడిచిపెట్టుకొనుటకు సిద్ధపడలేనివాడు సేవయొనరింపజాలడు.

ఒకవేళ అతడట్టిసేవకు దిగినను, స్వార్థపరత్వము దానినంటుకొనియేయుండును. కాని యింతటి కఠినులకు స్వార్థపరులు మిక్కిలియరుదు. తెలిసియో, తెలియకయో, మనమందరమును ఏదో స్వార్థరహితమగు నొకసేవయొనరించుచునే యుందుము. ఇట్టి సేవాధర్మములను బుద్ధిపూర్వకముగనే నిర్వర్తించుట మనమభ్యసించిన వాడు సేవయొనరింపవలయునను మనయాశ రోజుకురోజు ఎక్కువగుచుండును. మనయానందమునకేగాక నిఖిలప్రపంచకల్యాణమునకుగూడ నది సాధనమగును.

—మహాత్మగాంధి.

# త్యాగదీక్ష

కందుకూరి రామభద్రరావుగారు

తనకుధర్మమునాతోఁచుదానినమ్మి
కొంపవిడనాడి యొకపూరిగుడిసెలోన
నన్యసీమను గాపురమామెయుండె
దేశస్వాతంత్ర్యమున కెంతదీక్షొ కాని!
కప్పుకొనుటకునైన వల్కలములేక
ఎదిరిబాధకుఁ జిత్తముచెదరనీక

నిర్మలత్వముదెలిపెడి నియతితోడ
పంతమున నూలురాట్నానవడుకుచుండె.
చెక్కిలినినొక్క పాల్గారు చిన్నికొడుకు
కడుపుమండించు క్షుద్బాధకతనఁ, దల్లి
కడకుఁగన్నీరు కాల్వలై కారవచ్చి,
"అమ్మ! అన్నముపెట్టు" మంచరవదొడఁగె.



ఈత్యాగిని దేశముకొఱకు ఇల్లువిడచినది. పరులపంచలకువలసవచ్చినది. ఇంట గుప్పెడునూకలైనను లేవు. నులిమివేయుచున్న ఆకలిచిచ్చునకు నుచ్చుఅయి ఆమెకుమారుడు విజయసింగు 'అమ్మా! అన్నము' అనుచున్నాడు. దీక్షాచక్రముత్రిప్పుచున్న చేతులతో చిన్నిబిడ్డను లాలించుచు ఆమాతృదేవి 'నాయనా! ఇదిగో మనపాలిటి అన్నపూర్ణ!' అని రాట్టమును చూపినది. ఈగుజరాతి స్త్రీయొనర్చిన ఈత్యాగమునకు కలుగు అమృతఫలమెట్టిదిగానుండునో?

—బొంబాయి క్రానికల్.

చిఱుతపాపకుఁ బట్టెడోగిరముపెట్ట
పిడికెడును గింజలింట లేకడలి తల్లి
పొంగిపొరలెడి దుఃఖముమ్రింగుకొనుచు
నక్కుననుఁజేర్చి సుతునితోననునయమున
"బాబు! చూడదిగో! మనభాగ్యసీమ;
ఊరుకొనుమయ్య రవ్వంతయోర్పుబట్టి

బువ్వపెట్టును మన" కంచుపొంతనున్న
రాట్నమునుజూపె నశ్రుధారలుస్రవింప.
కనినగూరిమి కన్నీరుగాంచెకాని
తనదుసౌఖ్యము, కన్నపుత్రకునిసుఖము
నన్నియునుగూడబలివెట్టె; ఆమెయిపుడు
మాతృదైవార్చనానుగ్నమానసాబ్జ.

# న్యూజిలాండు స్త్రీలు

న్యూజిలాండు దక్షిణపసిఫిక్ మహాసముద్రమునందలి ద్వీపములలో నొకటి. వైశాల్యము 102,250 చతురపుమైళ్లు. జనాభా 1320,000. ఆదేశమున 18,004,000 యకరముల భూమి సేద్యముచేయబడుచున్నది. ఓట్సు, బార్లీ, గోధుమలు ఇవి ముఖ్యముగా సేద్యముచేయబడుచున్నవి. గెడ్డగా చేయబడిన మాంసము, ఉన్ని, వెన్న, గొఱ్ఱెచర్మము ఇవి ఆదేశమునుండి ఇతరదేశములకు విరివిగ ఎగుమతిచేయబడువస్తువులు. దిగుమతులలో బట్టలు, మోటారుకారులు, సైకిళ్లు, పొగాకు, మందులు ముఖ్యమైనవి. రాక్షసిబొగ్గు, బంగారము, వెండి ఈగనులు త్రవ్వబడి వ్యాపారము నడపింపబడుచున్నది. ఇనుము, రాగి.



మారీ కాంతల నాట్యము

అంగాభినయము మారీలంతగా ప్రేమించరు. చేతులలో బంతులుపెట్టుకొని చేయబడు నృత్యము వారికి మిగుల ఇష్టమైనది, 'రాపో' అను చెట్టుఆకులతో అందముగా చేయబడిన బంతులను చేతులతో పట్టుకొని వరుసగా నిలబడి నడుమ నడుమ ఈ బంతులచే శిరోభాగమును, వక్షస్థలమును, భుజమూలములను తాకుచు ఈ కాంతలు నాట్యముచేయుదురు.

మాంగనీసు గనులుకూడగలవు. గొఱ్ఱెలమందలనుపెంచుటప్రధానపరిశ్రమ. ఈపరిశ్రమమూలమున ఉన్ని, గెడ్డగా చేయబడిన మాంసపు వర్తకము కలిగినది. న్యూజిలాండు ద్వీపము చుట్టు ప్రక్కలగల చిన్నద్వీపములనుండి బనానాజాతి అరటిపండ్లు, ముత్యపుచిప్పలు, నారింజపండ్లు, సీమవంకాయలు ఎగుమతిచేయబడును. న్యూజిలాండు ద్వీపమునకు రాజధాని వెల్లింగ్టన్ పట్టణము. ఆపట్టణపు జనాభా 107,500.

న్యూజిలాండుద్వీపపు శీతోష్ణస్థితి మిక్కిలి చక్కనిది. ఆదేశమునందలి మరణ సంఖ్య ప్రపంచమందలి మిగిలిన ఏదేశమునందలి మరణసంఖ్య కంటెను మిక్కిలితక్కువ. ఆదేశీయులు తెలివైనవారు, పనిశ్రద్ధగలవారు. ఆత్మవిశ్వాసము, అడకువ వారి ముఖ్య గుణములు. పోలీసు సిబ్బంది ఆదేశమున మిక్కిలి తక్కువ. దొమ్మి పోట్లాటలు జరుగుట అరుదు. త్రాగుబోతుతనము గలదుగాని అందువలన గలుగు అత్యాచరములు చెప్పదగినంత హెచ్చుగావు.

న్యూజిలాండు ద్వీపమునకు రెండుశతాబ్దుల పూర్వమునుంచి ఐరోపియనులు వలస పోవుచున్నారు. ఆ ద్వీపమునందలి ఆదిమనివాసులను 'మారీ' లందురు. శరీరనిర్మాణ ముననేమి, భాషయందేమి, వర్తనము వలననేమి 'మారీ'లు తూర్పు పొలినీషియనులను పోలియుందురు. కుండలుచేయుట, లోహపాత్రలు చేయుట, వ్రాయుట మొదలగు పనులుగూడ వారికి నూట ఏబది వత్సరముల పూర్వమువఱకు తెలియదు. వారు నరమాంసభక్షకులుగా నుండిరి. స్త్రీ పురుషు లెల్లరకు పచ్చబొట్టు పొడిపించుకొను ఆచారము బహుప్రచారములో నున్నది. అన్యోన్యజాతి వైరములు కలిగినప్పుడు వారు చూపు ధైర్య సాహసములు నిరుపమానములు. క్రొత్తవిషయము నేర్చుకొనుటయందు, వారిబుద్ధి యెప్పుడును ముందడుగునే వేయుచుండును. కావుననే వలసవచ్చిన ఐరోపియనులు మారీలను చేరదీసి ఆరోగ్యమార్గములనుపదేశించి చదువను వ్రాయనునేర్పి వారికి వ్యవసాయమునందు రుచిపుట్టించి వారిని మంచిపౌరులుగ చేసియున్నారు.



మారీ స్త్రీ లదుస్తులు

మెడమొదలు మోకాళ్లవఱకు వేలాడు లంగాలు ఈ దేశపు స్త్రీల ముఖ్యదుస్తులు. నారతో నేయబడిన శాలువలు వలెవాటుగ వేసికొందురు. వలెవాటుగ వేసికొను ఈ నారబట్టపై వారు వివిధవర్ణములుగల పక్షిరెక్కలతో వింత వింత యలంకారములనుగూర్తురు. అవి చూచుటకు మిక్కిలి ఆకర్షణీయముగనుండును.

మారీస్త్రీలు స్నేహపిచ్చులమైన హృదయముగలవారు. గ్రామమునందలి స్త్రీలందఱును తఱుచుగ నొకచోగూడి పిచ్చయు పాటియు చెప్పుకొనుటకు ముచ్చటపడుచుందురు. ఆస్త్రీలిట్లు సమావేశమగుటకు వీలుగనుండుటకై ప్రతిగ్రామమునందును ఒకమందిరము

ప్రత్యేకముగా నిర్మింపబడియుండును. ఆమందిరమును స్త్రీలు తమ పనితనమునంతనుజూపి అలంకరింతురు. ఆమందిరమునందలి స్తంభములు, గుమ్మములు, తలుపులు దారునిర్మితములే. ఆకర్రలపై వింతవింతబొమ్మలు చెక్కబడియుండును. తెరచిననోళ్లతో, జాపిననాలుకలతో అబొమ్మలు వికృతములయ్యు వింతఅందము నిచ్చుచుండును.

మావోరీస్త్రీలు, పురుషులు పచ్చాకుపొడిపించుకొందురు. పచ్చాకు విస్తారము మొగములందే వింతవింతల ఆకారమున పొడిపించుకొందురు. తమదేశమునకు వలస వచ్చిన ఐరోపియనుల సాంగత్యమువలన మావోరీపురుషు లిప్పుడిపుడు పచ్చాకుపొడిపించుకొను ఆచారమును మానివేయుచున్నారు. స్త్రీలుమాత్రము ఈయాచారమునింకను విడనాడలేదు.



పరస్పరాభివందనములు

హిందువులు నమస్కారములచేతను, మహమ్మదీయులు సలాములచేతను, పాశ్చాత్యులు కరస్పర్శలచేతను పరస్పరాభివందనముల తెలుపుకొనునట్లే మావోరీలు ఒండొరుల ముక్కులను ముట్టుకొని చేతులనంటి పరస్పరాభివందనములను తెలుపుకొందురు. ఇరువురు మావోరీస్త్రీలు పరస్పరాభివందనము తెలుపుకొనుట పైపటమునచూపబడినది.

ఆదేశమున ఫోర్మమ్ అనునొక వృక్షముగలదు. దానియాకులు అయిదు మొదలు ఎనిమిదడుగుల పొడుగుగా నుండును. ఈ ఆకులనుండి నారదీసి బట్టలనేయుటయందును, చేపలవలలుతయారు చేయుటయందును, చాపలు అల్లుటయందును విరివిగ నుపయోగింతురు. ఈనారను ఈపనులయం దుపయోగించుటలో మావోరీస్త్రీలు చేయితిరిగినవారు.

మావోరీస్త్రీలు క్రీడాప్రియులు. జాతీయములగు ఆటలు వారికి పెక్కుగలవు. నాట్యములుగూడ వారివి పెక్కు తెఱగులుగనుండును. వారినాట్యములలో మిక్కిలి ప్రాచీనకాలమునుండియు నున్న దానికి 'పాయిల్' నృత్యమనిపేరు. ఇందు స్త్రీలు వరుసగా ఒకరివెనుకనొకరుకూర్చుందురు. సరిసంఖ్యగలవారందరునునొక ప్రక్కకును బేసిసంఖ్యవారందఱును నొకప్రక్కకునుతిరిగియుందురు. పాడబడుపాట కనుగుణముగ ఈస్త్రీలుతమచేతిలోని రాపోఆకులబంతులను నేలమీదత్రిప్పుచు తాటించుచుందురు.

మావోరీస్త్రీలు పురుషులతో సమానమైనశౌర్యమును ప్రదర్శింపగలవారు. జ్ఞాతివైరము లప్పుడు స్త్రీలుకూడ కర్ర ఈటెను ధరించి ఎదిరించినవారితో పోరి వారిని చంపగలిగిన-చో ఆశవమును తెచ్చి పచనముచేసి పంక్తిగుడుచుచుండిరి. ఈయాచరమిప్పుడు పూర్తిగనశించిన దనియే చెప్పవచ్చును.

న్యూజిలాండుదేశమునఉష్ణజలగుండములులేయుచు. మావోరీస్త్రీలువానియందుస్నానము చేతురు. తమ బాలబాలికలచే నందు స్నానముచేయింతురు. ఆఉష్ణజలము ఆరోగ్యవర్ధకమని వారినమ్మకము. చిత్రమేమన ఈఉష్ణజలగుండములు ఎక్కడనో ఒక్క-చోటనే మిక్కిలి ఉష్ణముగానుండును కాని సర్వసాధారణముగ స్నానయోగ్యమగు ఉష్ణజలముకలవిగానే యుండును. తమనారబట్టలను ఉడకబెట్టవలసిన అవసరములేకుండగనే మావోరీస్త్రీలు తమకు ప్రకృతి అనుగ్రహించిన ఈఉష్ణజలగుండములందు తడపి ఉదికి పరిశుభ్రముచేసికొందురు.

రక్తపుష్టిచే రాటుదేరి దృఢకాంతిని విరజిమ్ము లిమశరీరపుఛాయకు మావోరీస్త్రీలు ముత్యముచిప్పలదండలధారణముతో వన్నెబెట్టుదురు. శిరమునకుచుట్టును ముత్యపుచిప్పల దండలనేకట్టుకుందురు. నల్లనిశిరోజములతో చుట్టబడిన తెల్లనిముత్యపుచిప్పలదండ పోటీపడి మావోరీస్త్రీ ముఖసౌందర్యమును రెట్టించును.

## పరిహాసింతువననుగాంచి పక్షిరాజ!

శ్రీ దేవులపల్లి సత్యవతమ్మగారు

అంబరంబుననిన్గాంచి హర్షమంది
యెగురవలెనంచు నెంచితి నెగురలేక
ధైర్యమంతయుగోల్పోయి ధరణిలోన
పంజరాబద్ధశుకమునైబట్టుబడితి
పరిహాసింతువననుగాంచి పక్షిరాజ!

దుఃఖసంద్రానమునుగుచు దొప్పదోగి
కన్నుగవనశ్రువుల్నింప తెన్నులేక
నాకులేను రెక్కలు నీకులేవు
యెగురలేనంచునవ్వుచు నెంచినీవు
పరిహాసింతువననుగాంచి పక్షిరాజ!

నీదుసహచరీగణముతో నేర్పుమెయిని
పరుగులెత్తెద వెంతటిపృథులశక్తొ
నాదునెచ్చెలులనుగూడి నయముగాను
పరుగులెత్తగలేకను బడితినేను
పరిహాసింతువననుగాంచి పక్షిరాజ!

పక్షివయ్యునుస్వేచ్ఛను బడసితయ్య
సఖులతోడను నీవెంత సంబరముగ
ముచ్చటచెప్పకొంచును మురియుచుందు
వరయ నీవెంతధన్యవు హంసరాజ!

అలరుమధుఫలరసముల నానియాని
యూగుచుందువు బొంపపుటూయలలను
గగనతలవియద్గంగ గతులలోన
ఈదులాడుచునీవెంత నింపుగుల్కు
పరిహాసింతువనన్గాంచి పక్షిరాజ!

గర్వపడకుము నేనెంతొఘనుడననుచు
దైవయోగంబునెవ్వరు దాటగలరు
దేశసేవయుసేయంగ దిటవులేక
సిగ్గుచేతనుదలవంచి చెన్నుదొరగు
పరిహాసించకునన్గాంచి పక్షిరాజ!

## భారతీయ బాలాత్వము మేలుకొన్నది:—

'ఫిల్మ్ ఇన్ న్యూస్'అను పత్రికలో శ్రీయుత పి.ఆర్. చటర్జీగారిట్లు వ్రాయుచున్నారు:—

"బంధాలకు, కిటికీ తెఱలకు ఆవల "ఓహో!" యని చేయెత్తి పిలుచుచు, ఉషోదయపువేళయందలి సంజవెలుతురు బాలికల మందిరాభ్యంతరములపై వ్రేలాడు కిటికీ తెఱలలో మిలమిల మెఱయుచున్నది. గృహమే ఆమెకు ఉచితమైన జీవనమండలముగా నుండెడిది. కాని నేడు సువిశాలప్రపంచకము ఆమె సహవాసమునకు నాకు హక్కు కలదని పలుకుచున్నది. నక్షత్రాలు, మెఱయుచున్న ఆకాశము, తెఱచుకొనియున్న బయళ్లు, చల్లనై నవోల్లాసదాయకములైన నదులు, తమ ఆనందములో ఒకకొంత ఇచ్చుటకని, వారిని ఆహ్వానము చేయుచున్నవి. ఒకానొక క్రొత్తవెలుతురు శతాబ్దములనుండి ఘనీభవించిన చీకటిరాసులను భేదించుచు, దినదినము భిన్నభిన్నములై కూలిపోవుచున్న యుగవయోవృద్ధములైన ఆచారములపై తళతళలాడుచున్నది. సత్యజ్యోతిస్సును మఱుగుపరచివేసి, మెల్లని అధ్యాత్మికమరణముయొక్క నిర్జీవనిరుత్సాహమును, బలహీనతయును సమకూర్చిన అజ్ఞానావృతమును, ఆత్మవిస్మృతిమయమును, ఐన ప్రపంచకమిప్పుడు సజీవమైన క్రియోత్సాహము, అశాంతి, కలదానిగా అతివేగముగా మారిపోవుచున్నది. నిరంతరతమోబంధురమైన వారిప్రపంచకములో చివరకు నవజీవనముయొక్క ద్వారావరణము లేచినది. దాని వెలుతురుయొక్క విభ్రమజ్వలనము మరణించుచున్న భారతీయబాలాత్వమును ఉజ్జీవింపజేసినది. దుందుభిధ్వానముయొక్క ప్రబలమైనపిలుపు వారికి వినబడినది. మృత్యుగుహాభ్యంతరమునుండి వెలువడి, స్వేచ్ఛయొక్క ఆనందము స్పష్టముగా వ్రాయబడియున్న దరహాసితవదనాలతో, అదిగో! వారందరునువచ్చుచున్నారు."

—కస్తూరి రాజామాణిక్యము.

## కార్జెము : ప్లీహము : వీని జాగ్రత:—

మానవశరీరమునందలి ముఖ్యావయవములలోనివగు కార్జెము: ప్లీహము (Liver: Spleen) ల యొక్క జాగ్రతనుగూర్చి డాక్టరు బి. పాత్రాగారిట్లు తెలుచున్నారు:—

"నిద్రనుంచి మెలుకువరాగానే ప్రతివాడును కాళ్లును, చేతులు చాచుకొని వెల్లకితలపరుండి తర్వాత వెంటనే వాటిని ముణుచుకొని రెండుచేతుల ముణుకులతో కార్జెము, ప్లీహములను అణచిపెట్టి యుంచవలెను. పిమ్మట చేతులను వదులుచేసి వాటిని బాగా చాచవలెను. ఈ రీతిగా నాలుగైదు పర్యాయములు చేసి, వత్తికిలి వకప్రక్కకు తిరిగి పరుండవలెను. తరువాత ఒకప్రక్కనుంచి మరియొకప్రక్కకు ఆరేడు పర్యా

యములు మార్చుచుండవలెను. పిమ్మట బద్ధకముపోగొట్టుకొని, బోరగిల రెండునిమిషములవరకు పరుండి వెంటనే ప్రక్కనుంచి లేవవలెను. పైని వివరించిన ప్రకారము శరీరచలనములు చేసినచో, మొదట అన్నిటి కంటెను శరీరమందుండెడి చెడుపదార్థములు సులభముగా పైకిపోవునట్లుగను; కాలెజము, ప్లీహముల చలనములను కూడా వృద్ధియగునట్లును చేయును. మరియు కాలెజము ప్లీహముల యొక్క సమస్తదోషములను, అక్రమములను బాపుచేయును. ఇంతకుపూర్వమే అవి అనారోగ్యస్థితిలో నుండినట్లయిన, యీపద్ధతి మరియే యితర ఔషధసహాయము లేకయే యా రోగమును మాన్పును. ప్లీహ లివరు సంబంధ రోగములనుండి చాలకాలమునుండి బాధపడుచున్న పెక్కురోగుల నీపద్ధతివలననే కుదిర్చితిని. లివరు, ప్లీహముల బాధలేని వారీ పద్ధతిని ప్రతిరోజును చేయనవసరములేదు. కాని వారమునకు ఒకటి రెండు పర్యాయములు నీపద్ధతిని అవలంబించిన చాలును. నిద్రనుండి లేవగానే బోర్లగిలి కొంత కాలము పరుండవలెను."

—గుమ్మలూరి సత్యనారాయణ.

## సౌందర్యవంతులే మేధావంతులగు బిడ్డలను గనియెదరు:—

కవితిలక పులవర్తి కమలావతీదేవిగారిట్లువ్రాయుచున్నారు:—

"ప్రపంచమున నందమగుబిడ్డలు పుట్టవలయునన్నచో గర్భవతులై యున్నతతి సుందరాకారులగువారిని గాంచుటయు నందమగు బొమ్మలయందే ధ్యానముంచుటయు నన్నసంగతి నందరెఱింగినదే. ఇక మేధావంతులగు బిడ్డలజననముగూర్చి. మిక్కిలిసుందరాకారులగుదంపతులకు మేధావంతులు తప్పక పుట్టెదరని పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారట. జేమ్సులేమను అనునాయన తన గ్రంథమున నిట్లు వ్రాసియున్నాడు: సౌందర్యవతులవలననే మేధావంతు లుత్పన్నమైరనుటకు మనమొక్కపర్యాయము గతచరిత్ర పుటల ద్రిప్పి చూచినచాలును. మేధావంతుడగు మూడవ నెపోలియను ప్రపంచసుందరులలో నగ్రతమురాలని ప్రఖ్యాతివహించిన హార్టెన్సుబౌహార్నిసు కుమారుడు. 'రైవల్సు', 'స్కూలుఫర్ స్కాండలు' అను గొప్పనాటకములరచియించి సారస్వతమున ఖండాంతరయశముసంపాదించిన షెరిడనుమహాకవి అత్యధికసౌందర్యవతియగు నొకనాటకపాత్రధారిణి కొమరుడు. ఫ్రాంసుదేశమునందలి సేనలకు మహానాయకుడై చరిత్రవిఖ్యాతినందిన ఫ్రెంచిజెనరలుమార్షలు డిమూర్సు సుందరీవతంసములచేతనే సుందరియని పొగడబడిన అరోరాకోయింగ్సుమార్కు అను సుదతీరత్నమునకు కన్నకొడుకు. సౌందర్యము ఆరోగ్యమునకు చిహ్నము. కావున కట్నముల కాసపడక సౌందర్యవంతుల బిడ్డల బెండ్లియాడి మేధావంతులగుబిడ్డల కనవలయును."

## అల్యూమినము పాత్రలు మంచివే:—

1930 సెప్టంబరుమాసపు గృహలక్ష్మిసంచికలో పుష్పచయము శీర్షకక్రింద 'కుండలే ఆరోగ్యప్రదములు' అను విషయమును ప్రస్తావించుచు అల్యూమినము పాత్రలనుగూర్చి ప్రతికూలాభిప్రాయము వెలువరింపబడినది. డిసెంబరుమాసపు 'ది ఇండియన్ అండ్ ఈస్టరన్ డ్రగ్గిస్టు' అను పత్రిక అల్యూమినముపాత్రలుమంచివేయని క్రింది విషయములను ప్రచురించుచున్నది:—

"శుచిత్వమే ప్రధానస్థానము బడయుటకును, వండబడిన పదార్థము ఎంతమాత్రము లోహమిశ్రితము కాకుండుటకును వంటయిండ్లయందు అల్యూమినము పాత్రలు తప్పక ఉండవలయును. ప్రపంచమునందలి అన్నిదేశములందును పరిశుభ్రమైన వంటయిండ్లలోనెల్ల అల్యూమినముపాత్రలే గానవచ్చుచున్నవి.

అల్యూమినము పాత్రలు వాడువారికి ప్రోత్సాహముకలుగునట్లుగ బ్రిటీషుమెడికలుజర్నలు ఇట్లువ్రాయుచున్నది. ‘బంగారము, ప్లాటినము ఈలోహముల పాత్రలను తరువాత పచనకృత్యములకు అల్యూమినము పాత్రలే శ్రేష్ఠమైనవి. అల్యూమినము పాత్రలు వెండిపాత్రలకంటె మంచివి. అల్యూమినము వంటయింటికి వన్నెనైన లోహము. మానవుడు ఆదిమకాలమున మట్టికడవచేసి దానిని ఎండలోఎండించి వాడినాడు. భూగర్భమున ఎనిమిదింట ఒకపాలు అల్యూమినము కలదని నిర్ధారణచేయబడినది. కాబట్టి ఆదిమమానవుడు మట్టికడవచేసినపుడు అందులో ఏదియోఒక ఆకారమున ఎనిమిదవవంతు అల్యూమినము ఉండెననుట నిశ్చయము. ఒక్కొక్కతావున మట్టిలో అల్యూమినము హెచ్చుభాగములుగ నుండును. అట్టిమట్టిలో నుండియే అల్యూమినము తీయుదురు. ఆమట్టిని ప్రత్యేకము బాక్సైట్ మట్టి అందురు. బాక్సైట్ మట్టి ప్రపంచమున పలుదేశములందు గలదు. అల్యూమినము మట్టిలో ఎనిమిదింట ఒకభాగముగనుంట మట్టిలోపెరుగు వృక్షములు ఇచ్చుపండ్లయందు, పాదులు ఇచ్చుకాయలయందు, మట్టిలోపెరుగుగడ్డి తినుటచే ఆవులుఇచ్చుపాలయందు అంతోయింతో అల్యూమినము ఉండును. ఆదికాలమునుండి మానవుడు తినుటకు ఉపయోగించిన ఆహారమునందేమి, త్రాగుటకు పయోగించిన జలమునందేమి అల్యూమినము కలసియేయున్నది. ఇట్లు సమస్తపదార్థములందును అంతర్లీనమై యుండిన అల్యూమినములోహమును శాస్త్రవేత్తలు చిరపరిశోధనముసల్పి దానిని పదార్థములనుండి వేఱుపఱచి రూపసిద్ధినిచ్చి రజితకాంతులను గ్రక్కు అల్యూమినములోహమును తయారుచేసినారు”

—యస్. శేషగిరిరావు.

ఇట్లు అల్యూమినముపాత్రలనుగూర్చి అభిప్రాయభేదములు పరిశోధకమహాశయుల లోననే గనిపించుచున్నవి. పరిశోధన తేలువఱకు ప్రజలు వేచియుండుట లెస్స.

## స్త్రీలకర్తవ్యము:—

జనవరి 12-వ తేదీని లాహోరునగరమున కూడిన పంచమఅఖిలభారతవర్షీయస్త్రీల సభకు అధ్యక్షతవహించి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు తమ ప్రారంభోపన్యాసమును ఉత్తేజకరములగు క్రిందిమాటలలో ముగించినారు:—

“హిందూదేశము నేడొక ఉజ్జీవతరంగముతో ముంచివేయబడియున్నది. హిందూదేశమున స్త్రీపురుషులెల్లరు ప్రబోధింపబడియున్నారు. రేకెత్తినఈజాతీయతను పచ్చముపాడుచేయుట స్త్రీలమగు మనపనికాదు. రేకెత్తిన ఈజాతీయతను సవ్యమైనచాలులో నడపించుటయే మనపని. దౌర్జన్యము, అన్యాయము, పౌరసత్వహక్కుల భంగము, జన్మహక్కుల నిరోధము కలిగినపుడు మనము ప్రతిఘటించి తీరవలయును. ఆత్మవిశ్వాసము, ధైర్యగరిమ, పరార్థప్రవణమైనబుద్ధి మనసంతానమునకు హత్తించుటకై మనము ప్రయత్నింపవలయును. తెలివితో సేవించుటకును, తెగువతో అర్పించుటకును ఎల్లవేళల మనసంతానము సంసిద్ధమై యుండవలయును. జాతీయనిర్మాణకృత్యమున స్త్రీలు పౌరులుగ, భార్యలుగ, మాతలుగనుండి తమ పనులను సక్రమముగను సశ్లాఘ్యముగను నిర్వహించియుండిరను సంగతి మనము మఱువరాదు. మనము పుట్టినది సృష్టిచేయుటకుగాని భ్రష్టముచేయుటకుగాదు; ప్రేమించుటకుగాని ద్వేషించుటకుగాదు; అలంకరించుటకుగాని వికృతమొనర్చుటకుగాదు; శాంతి గొనివచ్చుటకుగాని సమరము రేపుటకుగాదు. కావున మనము సృష్టింతము, ప్రేమింతము, అలంకరింతము, శాంతిగొనివత్తము.”

**దమయంతి:—**

భారతపతివ్రతాతిలకములలో నొకతెయగు 'దమయంతి' దయనీయచరిత్రమిందు ప్రౌఢమగు గద్యమున రచియింపబడినది. రచయితలు వేంకటరామకృష్ణకవులు. ఇది శ్రీనాథుని శృంగార నైషధమునుండి గ్రహింపబడినది. ఇట్టి వచనగ్రంథములు విద్యార్థులకు బాల్యముననే ప్రౌఢప్రబంధములతో పరిచితి సంపాదించుటకు వీలు కల్గించును. ఈ కావ్యము నాలుగైదు ఆఱు ఫారములలోని విద్యార్థులకు పఠనీయగ్రంథముగ నుంచదగియున్నది. విద్యాశాఖాధికారులు ఆదరింతురుగాక! గ్రంథము డెమ్మీ సైజున 108 పుటలు. వెల రు 0-8-0 మాత్రము. గ్రంథమువలయువారు కవితావిలాసము, పిఠాపురము అను చిరునామాకు వ్రాయవలెను.

**రాసిలస్:—**

ఇది ఆంగ్లగ్రంథకారుఁడగు 'సామ్యెల్ జాన్సన్' అను నతని ఇంగ్లీషు కథకు తెలుగుసేత. తెనిగించినవారు సుప్రసిద్ధగ్రంథానువాదకులు, విద్వత్కవులునగు కూచి నరసింహముపంతులుగారు. వీరీగ్రంథమునందు వ్రాసిన ఉపోద్ఘాతమున "అన్నియుత్తమపదార్థములును నొకదేశమువారి పాలేచేయుటకు భగవంతుఁడు పక్షపాతిగాఁడు......షేక్స్పియరువంటి కవిచక్రవర్తుల భావములు మా భాషలోనికిఁ దీసికొనివచ్చు నావశ్యకత మాకులేదు అను వెఱ్ఱులుందురని నేననుకొనను." అని మిక్కిలి మోదావహముగా యుక్తియుక్తముగా మంచిమంచి యితరభాషాకావ్యములను భాషాంతరీకరించు నావశ్యకతనుగూర్చి ప్రసంగించిరి. తఱచుగా కథలయందుండదగిన అద్భుతసంఘటనములు ఈగ్రంథమునందంతగా లేవు కాని ఉన్నతాదర్శములును, ఉన్నతభావవిస్ఫురణమును అన్నియెడలను బొందిపొసగియున్నవి. భాషాభిమానులీగ్రంథము నర్హరీతిని గౌరవింతురుగాక! వెల 14 అణాలు. క్రౌను సైజున 272 పుటలు. వలయువారు గ్రంథకర్తగారి పేర పిఠాపురమునకు వ్రాయవలయును.

—దివాకర్ల సోమసుందరశర్మ

**గ్రహస్ఫుటగణిత స్వబోధిని:—**

ఇయ్యది గ్రహతారాదిస్థితిగతులను దెల్పు జ్యోతిషగ్రంథము. జాతకభాగమునకుమాత్ర ముపయోగపడు రీతి నియ్యది రచియింపబడినది. ఇది శ్రీయుత చెంగల్వ రామకృష్ణయ్యగారిచే రచియింపబడి, పి. నటేశ మొదలియారుగారిచేఁ బ్రకటింపబడినది. ఇందు 'దృక్సిద్ధమున సాధించుట యుత్తమమార్గమగుటంబట్టి అందులకుపయోగపడునట్లు' అను పీఠికావిషయమును జూచిన నిది దృక్సిద్ధమునకు సరిపడునట్లు వ్రాయబడినదని తోఁచెడిని. మఱియు 8-వ పుటలో 'సౌరమానము, చాంద్రమానము' అనుటంబట్టి యాయామానములకుఁగూడ సరిపడునట్లూహింపవలసియున్నది. కాని ఇందు చిత్రి, వైయాసి, మొదలగు మాసనామముల నుపయోగించి, చాంద్రమానమున నుపయోగించు చైత్రము, వైశాఖమున్నగు మాసనామములఁ జూపకుండుటకుఁ గారణమేమియైయుండునో? మఱియు నియ్యది దృక్సిద్ధాంత, సౌరమాన, చాంద్రమానాభిమానులనఁదఱను దృప్తిపరచుటకిట్లు వ్రాయబడియుండనోపు. ఇందు భాషాదోషములుకూడ కొన్ని కన్పట్టుచున్నవి. కాని, భాషమాటయెట్లున్నను సులభశైలిని వ్రాయబడి చక్కని గ్లేజుకాగితములపై ముద్రింపబడియున్నది. వలయువారు 'పి. నటేశ మొదలియారు, 49. తులసింగ మొదలివీధి, పెరంబూరుపోస్టు, మద్రాసు' అని వ్రాసినబడయగలుదురు. వెల రు 1-0-0 మాత్రమే.

—పండిత వేదుల సూర్యనారాయణశాస్త్రి

**భారతీయచిత్రకళ:—**

ఆంధ్రగ్రంథమాలలో పదమూడవ గ్రంథము. భారతిలో ప్రతిమాసము ప్రచురింపబడుచున్న వ్యంగ్యచిత్రములమూలమున ఆంధ్రులకు చిరపరిచితులైన తలిశెట్టి రామారావుగారు బి. యె., బి. యల్. ఈగ్రంథ

మునకు కర్తలు. చిత్రకళావిషయమునకు సంబంధించిన తెలుగుగ్రంథములలో నీ 'భారతీయచిత్రకళ' యను గ్రంథము మొదటిది. భారతిప్రథమసంపుటమున శ్రీయుత భమిడిపాడి రామసోమయాజులుగారు చిత్రకళను గూర్చి కొన్ని ప్రవేశకవ్యాసములను ప్రచురించియున్నారు. కాని వానికి గ్రంథరూపము సిద్ధించినటులగానము. ఈతరగతిగ్రంథములలో నిది మొదటిదిగావున గ్రంథకర్తగారు ప్రత్యేకము ప్రశంసింపదగియున్నారు. ఈయుత్తమగ్రంథమునకు దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు పీఠిక వ్రాసియున్నారు. అందువారిట్లు లిఖించిరి. "భారతీయచిత్రకళను రచించిన శ్రీరామారావుగారు భారతీయచిత్రకళయొక్క వృద్ధిక్షయములను, ఔన్నత్యమును సప్రమాణముగ వారీగ్రంథమునందు వివరించి చిత్రకళాభ్యుదయమున కుపకారమొనరించిరి. ఈగ్రంథమునందు చిత్రలేఖనోదయము, బౌద్ధయుగము, అజంతాగుహలు, బాఘ్‌చిత్రములు, మొగలు చిత్రలేఖనము, రాజపుత్రలేఖనము మొదలగు విషయములకు సంబంధించినవి పండ్రెండు అధ్యాయములుగలవు. అజంతా చిత్రములకు సంబంధించిన పటములును వర్ణచిత్రములును భారతచిత్రకళాచరిత్రను విశదముచేయుచున్నవి." పెక్కులగు ఇతర చిత్రములతోడను గ్రంథమున గ్రంథకర్తగారి చిత్రముగూడగలదు. చక్కని గ్లేజుకాగితములు. క్రౌనుసైజున ౨౦౫ పుటలు. వెల రు ౧-౦-౦. వలయువారు ఆంధ్రగ్రంథమాలాసంపాదకులు; 6, 7 తంబుచెట్టివీధి; జి.టి. మద్రాసు అను చిరునామాకు వ్రాయవలెను.

## ఆత్మకథ: ద్వితీయసంపుటము:—

ఆంధ్రగ్రంథమాలలో పదునాలగవగ్రంథము. గాంధిమహాత్ముని ఆత్మకథకు అనువాదము. ప్రథమసంపుటము ప్రచురింపబడిన ఒక్కసంవత్సరములోనే మూడుముద్రణము లందినది. ప్రథమసంపుటమునకువలె నీద్వితీయసంపుటముగూడ ప్రజాదరణముబడయుననుటలో సందియమించుకంతయులేదు. లోకోత్తరపురుషుడగు మహాత్ముని స్వీయచరిత్ర ఆంధ్రానువాదము మధురకవితావిలాసులగు శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి చేతులబడి చెన్నునొందినది. దక్షిణాఫ్రికాసత్యాగ్రహప్రస్థానముతో ప్రారంభమై రౌలటుశాసనసత్యాగ్రహప్రస్థానముతో పర్యవసితమైన తదవలి మహాత్మునిజీవితము నీగ్రంథము ప్రదర్శించుచున్నది. ఈద్వితీయసంపుటము ఆంధ్రభాషయందు ప్రచురించుటకు ఇంతకుమున్నే వలయుప్రయత్నములు చేయబడినను దేశావృతమైన అశాంతియును, ఆంధ్రగ్రంథమాలాసంపాదకులగు దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారి నిర్బంధమును ప్రతిబంధకములైనవి. పంతులువారు బయటికివచ్చినతోడనే పరిశ్రమించి ఈగ్రంథము నాంధ్రులకు ప్రసాదించినారు. 'ఆంధ్రలోక మీయమూల్యమైన ఆత్మకథనాదరించి పారాయణముచేసి ఆత్మోద్ధరణమును బడయునుగాత!' మని కోరుచున్నాము. గ్రంథము క్రౌనుసైజున 450 పుటలు. చక్కని గ్లేజుకాగితములు. గ్రంథమున మహాత్ముని ఛాయాపటముకూడ గలదు. వెల రు ౧-౦-౦ మాత్రము. వలయువారు ఆంధ్రగ్రంథమాలాసంపాదకులు; 6, 7 తంబుశెట్టివీధి; జి.టి. మద్రాసు అను చిరునామాకు వ్రాయవలెను.

## సనాతనధర్మము:—

రాజమహేంద్రవర హిందూసమాజము వారిచే ప్రచురింపబడిన మతవిషయిక గ్రంథము. సనాతనధర్మమును గూర్చిన విషయములు శ్రుతిస్మృత్యాదిప్రమాణములతో విపులముగ వివరింపబడినవి. నేటి వారికి తమ మతమును గూర్చిన విజ్ఞానము బొత్తిగ లేకున్నది. అట్టివారు సనాతనధర్మముయొక్క సముచితమైన ఆదేశములను సులభముగ గ్రహించుటకు ఈగ్రంథము మిక్కిలి సహకారికాగలదు. విశేషపరిశ్రమచేసి ఈగ్రంథమును తయారుచేసిన శ్రీమాన్ ముడుంబి రామానుజాచార్యులవారికిని, వ్యయమునకు సంకోచింపక దీనిని ముద్రించిన హిందూసమాజమువారికిని మాఅభివాదములు. ఆంధ్రులీగ్రంథమును ఉచితరీతిని గౌరవింతురుగాక! గ్రంథము క్రౌనుసైజున 300 పుటలు. అట్టబైండు. వెల రు. ౧-౦-౦. కార్యదర్శి, హిందూసమాజము, రాజమహేంద్రవరము అను చిరునామాకు వ్రాసిన గ్రంథము బడయగలరు.

శ్రీవివేకానందస్వామిజీవితము: ప్రథమభాగము:—

ఆర్ష మత ప్రచారమునకై అపారపారావారము నుత్తరించి పశ్చిమఖండములకుబోయి భారతవర్షజ్ఞానౌన్నత్యమును ప్రపంచమునందలి పలుదేశములవారిచే గుర్తింపచేసిన కులవిస్తారకుడు వివేకానందస్వామిజీవిత చరిత్రమునకు ఆంధ్రానువాదము. ఇది ప్రథమభాగము. ఇందు వివేకానందునిజననము మొదలు అతడు ప్రపంచ మహాసభకు అరుగ ప్రయత్నమువఱకు గల స్వామిచరిత వర్ణితము. రచయిత బులుసు వేంకటేశ్వర్లుగారు. భారతకీర్తికి రక్షకుడును, భారతప్రతిభకు ప్రదర్శకుడునునగు స్వామివారి జీవితము అవశ్యపఠనీయము. కావున ఆంధ్రులీగ్రంథమును బాగుగనాదరించి గ్రంథకర్తకువలయు ప్రోత్సాహమును కలిగించి వారిచే స్వామివారి జీవితము రెండవభాగమునుకూడ ప్రచురించునట్లు చేయుదురుగాక! గ్రంథము డెమ్మీసైజున 260 పుటలు. వెల రు 1-8-0. దొరుకుచోటు: బులుసు వేంకటశ్రీరామమూర్తిగారు; కాకినాడ.

మోహనమురళి:—

కృష్ణపరమాత్మని కీర్తించుగేయములుగల చిన్నగ్రంథము. పుటలు 18. వెల 0—1—0. ప్రకాశకులు పి.డి. మల్లిఖార్జున్‌గారు. భగవద్భక్తులాదరింపగల గ్రంథము. వలయువారు ప్రకాశకులపేర పశ్చిమగోదావరి జిల్లా, ద్వారకాతిరుమలకు వ్రాయవలెను.

శ్రీముకుందశతకము:—

శ్రీవేణుగోపాలభక్తలీలామృతలహరీగ్రంథమాల చతుర్థపుష్పము. 'ధాత్రిమార్తేరుపురవాస! దాసవింద! ఆర్తత్రాణపరాయణా! హరిముకుంద! అనుమకుటముగల సీసపద్యశతకము. డెమ్మీసైజున 30 పుటలు. పీచు కాగితములు. గ్రంథకర్త వెలగల సుబ్బారెడ్డిగారు. వెల ప్రతిఒక్కంటికి 0-2-0. దొరుకుచోటు వేణుగోపాల భజనసమాజము, మారుటేరు, పశ్చిమగోదావరిజిల్లా.

కలికాలపుకథలు:—

మొదటిభాగము. గ్రంథకర్త కలగ సత్యనారాయణగారు. శకుంతల, మాఆవిడా మొగలిపువ్వా, బ్రతుకు తెరువులేకపోతే బడిపంతులు, మరదలమాడ, జానకి, సవతితల్లిప్రేమ, అల్లుళ్లంతా, తొలిసారికాపరం అను ఎనిమిది కథలు వాడుక భాషలో స్త్రీలకు పిల్లలకు సులభముగ అర్థమగునటుల వ్రాయబడినవి. నవ్వుపుట్టించు ఘట్టములు కథలయందచ్చటచ్చటగలవు. గ్రంథము క్రౌనుసైజున 152 పుటలు. వెల 0-12-0. వలయువారు గ్రంథకర్తపేర వీరభద్రపురము, రాజమండ్రి వ్రాసిన బడయగలరు.

కన్నాలదొరకను:—

గజదొంగ వైరాగ్యము అని ఈగ్రంథమునకుమఱియొక నామము. కర్త వెలగల సుబ్బారెడ్డిగారు. వీరు బాలబ్రహ్మచారులనియు సహజకవులనియు తెలుపబడినది. మతవిషయములిందు నాటకరూపమున ప్రదర్శింపబడినవి. గ్రంథము డెమ్మీసైజున 48 పుటలు. పీచుకాగితములు. వెల ప్రతి ఒక్కంటికి 0-8-0. ఈపుస్తకము శ్రీవేణుగోపాలభక్తలీలామృతలహరీగ్రంథమాల అష్టమపుష్పము. దొరుకుచోట: శ్రీవేణుగోపాలభజనసమాజము, మారుటేరు, పశ్చిమగోదావరిజిల్లా.

భక్తలోలశతకము:—

తేటగీతముల శతకము. కొల్వబడిన దేవుడు శంకరుడు. శతకకర్త బొడ్డు బాపిరాజుగారు. వారీశతకమును తల్లిదండ్రులకు కృతినిచ్చి పితౄణమును మాతౄణమును ఒకభంగి ఈగిరిన్నారు. గ్రంథము క్రౌనుసైజున 24 పుటలు. వెల తెలపబడలేదు. కోరువారు గ్రంథకర్తపేర ఆదివారపుపేట, ఏలూరువ్రాయునది.

## డిసెంబరు

20:—'తమ ప్రేమపాత్రములు జైలులందు కృశించుచుండ స్త్రీలు పరదాయందుండదగదు. వారు పరదా వెంటనేత్యజింపవలెను' అని స్వరూపరాణినెహ్రూగారు కలకత్తాలోఅల్బర్టుభవనమున నారీసత్యాగ్రహ సమితివారి గౌరవపత్రమునకు బదులు పుచ్చుచు నుపదేశించిరి.

—బొంబాయి సమరసంఘమున కధ్యక్షురాలుగానుండి జైలుకేగిన గమాభాయికద్దర్ సతిగారును, సత్యాగ్రహబులెటిన్పత్రికకు సంపాదకురాలుగానుండి జైలుకేగిన దిల్షిథుసయ్యదుకన్యగారును విడుదలయైరి.

21:—శ్రీమతి జయంతి సూరమ్మగారు వేలూరు స్త్రీల జెయిలులో ఆరునెలలశిక్ష ననుభవించి విడుదలయై బరంపురము చేరిరి.

—పెద్దాపురము ఊరిబయలునఉన్న బొక్కా నారాయణమూర్తిగారి తోటలో జరిగిన కాంగ్రెసు అభిమానుల ధమర్మాసనసంతర్పణసందర్భమున జరిగిన లాఠీప్రయోగములో శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారికి దెబ్బలు తగిలెను.

—కృష్ణాజిల్లా గన్నవరంతాలూకా కానులపాడు గ్రామవాస్తవ్యులు ఎల్లాప్రెగడ పెదరామయ్యగారి ద్వితీయపుత్రుడు అంకరాజుపంతులుగారికిని, బాపట్ల కాపురస్థులు పొత్తూరి సీతయ్యగారి కుమారుడు నరసింహారావుగారి తృతీయపుత్రిక బాలవితంతువు, శ్రీమతి సీతారామునకును రేపల్లెలో వివాహము జరిగినది. పెండ్లికుమారునివయస్సు 33 సంవత్సరములు. బాలురపాఠశాల హెడ్మాస్టరు. పెండ్లికూతునకు 19 సంవత్సరములవయస్సు సంగీతము బాగుగపాడగలదు. ఈమె తండ్రిగారు బాపట్లగరల్సుస్కూలు సంగీతవిద్వాంసులు. ఉభయులార్వేలనియోగులు.

22:—లక్నోలో శ్రీమతి శాంతాదేవిగారిని వెనుక నొకసారి అరెస్టుచేసిరి గాని అపుడు సాక్ష్యము లభింపనందున విడుదలచేసిరి. ఇపుడీమెకు మూడునెలలు విడఖైదు వేయబడెను. ఈమెకు 5 యేండ్లవయసుగల కుమార్తెగలదు. ఈబిడ్డకూడ తల్లితోపాటు ఎటవా చెరసాలలోనేయున్నది.

23:—శ్రీమతి కమలానెహ్రూగారితల్లియు పండితజవహరలాలు నెహ్రూగారి అత్తగారునునగు శ్రీమతి రజపతి కౌలుసతిగారికి ఢిల్లీలో ఆరుమాసములశిక్ష విధింపబడెను. ఏక్లాసు ఈయబడెను.

24:—బోర్సదు ఆశ్రమమునందలి సభ్యురాండ్రగు శ్రీమతి లక్ష్మీబెన్, గోదావరిబెన్ గార్లకు పిక్కెటుచేసినందుకు $1\frac{1}{2}$ నెలలుశిక్ష 30 రూపాయిల జరిమానా, జరిమానా చెల్లింపనిచో 15 రోజులు అధికముగా శిక్ష విధింపబడెను.

25:—కలకత్తాలో బ్రహ్మసమాజబాలికావసతిగృహమును పోలీసువారు సోదాచూచి స్కాటిష్ చెర్చి కాలేజిలో రెండవతరగతివిద్యార్థిని కమలాచటర్జీగారిని పోలీసుస్టేషనుకుగొనిపోయి అరగంటసేపు ప్రశ్నించి వదలివేసిరి.

26:—శ్రీమతులు పొణకా కనకమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మగార్లు వేలూరు స్త్రీలజైలునుండివిడుదలయైరి.

27.—బరంపురనివాసినులును స్వదేశీయుద్యమప్రచారకురాండ్రునునగు శ్రీమతులు ఆదుర్తి లక్ష్మీదేవి, మంత్రాల రామసీతమ్మ, యల్లాయి సూరమ్మగార్లకు 144-వ సెక్షనుక్రింద ఉపన్యాసము లీయకుండుటకు నోటీసు ఈయబడెను.

28:—

29:—బొంబాయిలో 19-వ సమరసంఘాధ్యక్షురాలు శ్రీమతి స్నేహలతాహజ్రత్ సతి, కార్యదర్శిని వీర బాలాకార్ సతిగార్లు క్రిమినలులాసవరణచట్టముక్రింద చెరితొమ్మిదిమాసముల శిక్ష విధింపబడిరి.

30:—బెజవాడ భారతమహిళాసంఘమువారి వార్షికసభ శ్రీమతి చంద్రమసతిగారి అధ్యక్షతను జరిగెను.

31:—పెద్దాపురమునందు వనసంతర్పణ సమయమున నిటీవల జరిగిన లాఠీప్రయోగ సంస్మరణార్థమై వైకుంఠ ఏకాదశిరోజున స్త్రీలు పురుషులు ఉపవాసముండవలెనని తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసుసంఘాధ్యక్షురాలగు శ్రీమతి పెద్దాద కామేశ్వరమ్మగారు గావించిన విన్నపమనుసరించి ఏలూరునందు శ్రీమతులు సత్తిరాజు శ్యామలాంబ, ముల్పూరు చుక్కమ్మ, శృంగారకవి లక్ష్మీనరసమ్మగార్లు, తదితరులు మరికొందరును ఉపవసించిరి.

## జనవరి

1:—పండితజవహరిలాలు నెహ్రూగారి భార్యయగు శ్రీమతి కమలా నెహ్రూగారిని అలహాబాదులో క్రిమినలులా అమెండుమెంటుఆక్టు 17–వ సెక్షను ప్రకారము అరెస్టుచేసిరి.

2:—అలహాబాదులోఅరెస్టుఅయిన కమలా నెహ్రూగారిస్థానే ఉమా నెహ్రూగారిని డిక్టేటరుగానియమించిరి.

3:—అలహాబాదులో శ్రీమతి కమలా నెహ్రూగారికి క్రిమినలులాసవరణ చట్టముక్రిందను, అక్రమప్రోత్సాహపు ఆర్డినెన్సుక్రిందను 6 మాసముల విడిఖైదు విధింపబడెను.

4:—శ్రీమతి సేనుగుప్తసతిగారు ఢిల్లీచెరసాలలో కళ్లజబ్బువలన బాధపడుచున్నట్లు తెలియుచున్నది.

—విశాఖపట్టణమున జరిగిన స్వదేశీవస్తుప్రదర్శనములలో శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారి కళాచిత్రములు ప్రముఖస్థానము వహించెను.

5:—శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారు అహమ్మదాబాదులో ఖద్దరుభాండార ప్రారంభోత్సవము జరిపిరి.

6:—శ్రీమతి మీరాబెనుగారు ప్రకటించుచున్న 'న్యూసుఆఫ్ ఇండియా' పత్రికాప్రచురణము విరమించిరి. 'ఖద్దరుప్రచారముకొరకు మాత్రమే పనిచేయదలచితి' మని వారు ప్రకటించిరి.

7:—అలహాబాదులో పండితమోతీలాలు నెహ్రూగారు తమకోడలు కమలా నెహ్రూగారిని జైలులోచూచిరి.

8:—మధ్యమాగాణములందలి స్త్రీఖైదీలగు పట్వర్ధనసతి, జోషీసతి, దండేకరుసతిగార్లు అమరావతినుండి నాగపూరు సెంట్రలుజెయిలుకు మార్చబడిరి.

9:—మదరాసులో విదేశీగుడ్డల అంగళ్లు పికెటింగు చేసినందులకు అరెస్టుచేయబడిన వాలంటీరులలో శ్రీమతి అంజలి అమ్మాళ్ గారను స్త్రీగలదు.

—కలకత్తా బుర్రాబజారు విదేశవస్త్రాలయములపికెటింగునకై అరెస్టుచేయబడిన శ్రీమతి యోగీశ్వరీదేవిగారి విచారణసమయమున ఆమె న్యాయవాది కోర్టువారితో ఉత్తరవిభాగపు డిప్టీకమీషనరు యోగీశ్వరీదేవి చేయిపట్టుకొని విఱిచి అనవసరబలప్రయోగముచేసెనని తెల్పెను. కోర్టువారు ఆమెచేతిమీది గాయములనుచూచి ఆమె పిటీషను కమీషనరుకు బంపిరి. ఈలోగా ఆమెను జామీనుమీద వదలుటకు కోర్టువారంగీకరించిరి గాని ఆమె నిరాకరించెను.

10:—శ్రీమతి అంజలి అమ్మాళ్ గారికి ఆరుమాసములశిక్ష విధింపబడెను.

—కరాచిసత్యాగ్రహసంఘనియంత్రియగు శ్రీమతి కికిబేన్ గారి సింధుసత్యాగ్రహబులెటినుప్రచురణము చేసినందులకు అరెస్టుచేసిరి.

—కమలా నెహ్రూగారు అలహాబాదునుండి లక్నో జైలుకు మార్చబడిరి.

11:—కురదబెన్ నాగోజీకుమారి డోల్కాసమీపమున సగోదాగ్రామములో అరెస్టుచేయబడెను. ప్రస్తుతోద్యమములోచేరి ఆమె అరెస్టగుటకిది మూడవసారి.

12:—కలకత్తాలో శ్రీమతులు సుషమాపలీట్, వీరరాణిదేవిగార్లకు పీనలుకోడు 283 క్రింద రు 100 జరిమానాయు, జరిమానా చెల్లింపనిచో నాలుగుమాసముల విడిఖైదును విధింపబడెను.

13:—చెన్నపురిలో గిడ్డంగివీధియందు విదేశవస్త్రదుకాణముల పికెటింగు జరిగినది. శ్రీమతి వి. శకుంతలాదేవి (కలకత్తావద్దనున్న ఆడ్రాపట్టణవాస్తవ్యురాలు)గారు నాయకత్వమువహించిరి. పికెటింగుచేసిన వాలంటీయరులలో విప్రవరవాస్తవ్యులును ఇపుడు చెరసాలలోనున్న వారునుఅగు శ్రీయుత పి. కృష్ణమూర్తిగారి భార్యయు, శ్రీమతి పి. అంజలక్ష్మమ్మ అనువారును ఇరువురుస్త్రీలు గలరు.

—చెన్నగర ఆరోగ్యశిశువారప్రదర్శనప్రారంభము.

14:—షికార్పూరు ప్రథమమహిళానియంతయగు శ్రీమతి గంగాదేవిగారు రెండునెలల కఠినశిక్ష ననుభవించి సింధుహైదరాబాదుజయిలునుండి విడుదలయెరి.

15:—శ్రీమతి కుర్షద్ బెన్ నౌరోజీగారికి (దాదాభాయినౌరోజీ మనుమరాలు) నాలుగునెలల విడిఖైదు, రు 150 జరిమానా, చెల్లింపనిచో మరిఒకటిన్నరమాసములఖైదువిధింపబడెను. 'ఏ' తరగతి ఈయబడెను.

16:—ఢిల్లీకాంగ్రెసుసంఘనాయకురాలైన శ్రీమతి వాసంతీదేవిగారు సత్ప్రివర్తనకై ఆరునెలలకు రు 2000 జామీను చూపవలయుననియు లేక ఆరునెలల విడిఖైదు ననుభవించవలయుననియు మేజస్ట్రీటు విధించెను. ఆమె జైలుకే పోవుట కంగీకరించెను.

17:—కలకత్తాలో ఇరువురు భట్టియాస్త్రీలు శ్రీమతులు ముంగాదేవి, లీలావతిదేవిగార్లు పోలుకోడ్డు 283 సెక్షనుక్రింద విదేశవస్త్రములుమోయుచున్న కూలీలను నిరోధించినందులకయి చెర రు 100 ల జరిమానా, జరిమానా చెల్లింపనిచో చెరి నాలుగుమాసముల విడిఖైదు విధింపబడిరి.

—శ్రీమతి కాత్యాయనీఅమ్మాళ్ గారు విధింపబడిన రెండుమాసములశిక్షను అనుభవించినపిమ్మట కాలికట్టుజయిలునుండి విడుదలయైరి. ఆమె వెంటనే స్వగ్రామమగు త్రిచూరునకు బయనమైరి.

18:—నవాబ్‌గంజిలో సుమంగల్ ఛటర్జీగారు బందురయూనియనబోర్డు అధ్యక్షుడైన జతీంద్రబణిక్ గారి గృహమున వారి రాజీనామానపేక్షించి నిరాహారదీక్ష బూనిరి. వారిని పోలీసులు అరెస్టుచేసిరి. అప్పటినుండి ఛటర్జీగారి తల్లి అచటనే నిరాహారయైయున్నది.

19:—కలకత్తాలో శ్రీమతి సుహాసినీదేవిగారికి రు 50 ల జరిమానా, జరిమానాచెల్లింపనిచో ఒకమాసము ఖైదు దేవిగారు ఖైదుకుబోవుటకే నిశ్చయించిరి.

—శ్రీమతి భోగరాజు వీరవెంకమ్మగారు వేలూరుచెఱసాలలో ఆరునెలల ఏక్లాసుశిక్షననుభవించి విడుదలయై స్వగ్రామమగు ఏలూరుచేరిరి.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జినువదలి కాగితమునకు ఒక తట్టుననే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు



**జెయిలులో భార్య ఛాయాపటము చూచిన ఆమెతో మాట్లాడినట్లే:—**

జబ్బులపురమున లక్ష్మణసింగు అనున్యాయవాది జాతీయోద్యమమునజేరి శ్రీకృష్ణ జన్మస్థానమున కేగినాడు. కాండ్వా సబ్ జెయిలులో ఆతడుండగా ఆతనిభార్య-ఆమెవిదుషి-తానువ్రాసినపద్యముల సంపుటిని తనభర్తకు ఈయవలసినదిగా జెయిలు సూపరింటెండెంటు గారికిబంపెను. ఆసంపుటిలో ఆమెఛాయాపటముకూడ నుండెను. ఛాయాపటముచూచుట ఆవ్యక్తితోమాట్లాడినట్లేయగునని ఒకక్రొత్తసిద్ధాంతమును ఏర్పఱచి ఆజెయిలు సూపరింటెండెంటుగారు ఆవిదుషిపద్యములసంపుటిని ఆమెభర్తకుఈయనిరాకరించిరి. దీనినిగూర్చి విమర్శించుట అనవసరము.

**పంచమ అఖిలభారతవర్షీయ స్త్రీలసభ: అధ్యక్షురాలి ఉపన్యాసము:-**

గతమాసము 12-వతేదీని లాహోరునగరమునగూడిన పంచమఅఖిలభారతవర్షీయ స్త్రీలసభకు అధ్యక్షతవహించి శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు బాలబాలికలవిద్యాభివృద్ధికై భారతదేశమునందు నేడుగావింపవలసిన ప్రబలప్రయత్నములనుగూర్చి ప్రసంగించిరి. భారతదేశమున పూర్వకాలమునందు స్త్రీలు పురుషులతో సమానబాధ్యత, గౌరవము వహించియుండిరనియు, ఆకాలమున విద్య ఎల్లవారి అందుబాటుననుంచబడెననియు శ్రీమతిగారు సముచితముగచాటిరి. నేటికాలమున భారతస్త్రీల విద్యాభివృద్ధినిమిత్తము క్రైస్తవ మిషనరీలుచేయుచున్న సేవ కొనియాడిరి. భారతదేశమునందలి వివిధరాష్ట్రములవారు తమ తమ బడ్జెట్టులలో స్త్రీలవిద్యాభివృద్ధినిమిత్తము విశేషధనమును ప్రత్యేకింప హెచ్చరించిరి. శ్రీమతిగారు నిర్బంధప్రాథమికవిద్యాప్రవేశమునుగూర్చియు, బాలికలకొఱకు ప్రత్యేకముగ ఉన్నతపాఠశాలలు స్థాపించుటనుగూర్చియు, బాలబాలికలకు నైతికశారీరకవిద్యాప్రదానమునుగూర్చియు సూచనలుగావించిరి. ఘోషాదురాచారము, అతిబాల్యవివాహములు, ఉపాధ్యాయినులులేమి మొదలగుప్రతిబంధకములచే స్త్రీవిద్యయెట్లు ద్రుతగమనమును పొందజాలక కుంటుచున్నదో వివరించిరి. శారదాచట్టమును అమలులోపెట్టునట్లుచూచుట,

ఘోషాదురాచారమును తొలగించుట, నడుచుచున్న బాలికాపాఠశాలలకు మాటాకుహ త్తిం చుట మొదలగుకార్యములను నిర్వహించుటకు స్త్రీలు ముందునకురావలయునని వారు హెచ్చరించిరి. ఈహెచ్చరిక గమనింపబడునని యే నమ్ముచున్నాము. ఏమందురా? జాతీయతానిర్మాణమున తాముకూడ తమపనిని నిర్వహింపవలయునను కుతూహలము నేటిభారత స్త్రీలయందు ప్రస్ఫుటముగ గానవచ్చుచున్నది. భారతమాతసేవచేయుటకు ఆమెపుత్రికలమగు మనమందరమును చేతులుకలపవలయునని సభికురాండ్రను హెచ్చరించుచు శ్రీమతిగారు తమఉపన్యాసమునకు స్వస్తిచెప్పిరి.

స్త్రీ నై పు ట్టు ట చే త నే:—

జనవరి మొదటివారమున వెలువడిన బొంబాయిగవర్నమెంటువారి గెజెట్టులో ఆరాజధానివిద్యాశాఖలోపనిచేయువారి జీతములస్కీము ప్రచురింపబడినది. ఆస్కీముప్రకారము ఒకటేమో స్తరుపనిచేయు స్త్రీపురుషులలో స్త్రీకంటె పురుషునకు హెచ్చుజీతము నిర్ణయింపబడినది. పురుషుని గరిష్ఠమగుజీతము 1500 కాగా స్త్రీ గరిష్ఠమగుజీతము 1000 మాత్రమే. పనియేమో సమానమే. జీతముదగ్గిర స్త్రీపురుషభేదములు. శక్తిసామార్థ్యములనుబట్టిగాక స్త్రీపురుషభేదములనుబట్టి ఇట్లుజీతముల నిర్ణయముజరిగినది. విద్యాశాఖ ప్రజాయత్తమైనది. దానిశిరముపై ప్రజాప్రతినిధి అధిష్ఠించియున్నాడు. అయినను ఈఅన్యాయమేర్పడినది. ఏమనగలము?

అ ఖి ల భా ర త జ ం తు హిం ం సా ని వా ర క స భ :—

జనవరి 17-వ తేదీని శ్రీరంగమునగూడిన అఖిలభారతజంతుహింసానివారకసభకు అధ్యక్షతవహించి శ్రీమతి బిసెంటమ్మగారు తమ అధ్యక్షోపన్యాసమున నిట్లునుడివిరి. "నాకు నలుబదిరెండేండ్ల వయస్సున నేను శాకాహారపద్ధతిని స్వీకరించితిని. ఇప్పటివరకు నేను తిరిగి మత్స్యములను మాంసమును తాకలేదు. కాబట్టి నాజీవితకాలములో నేను సగకాలము కేవలము శాకములతోడనే కాలక్షేపముచేసితినన్నమాట. మత్స్యములకు మాంసములకు అలవాటుపడినవారుకూడ తలచినచో దీక్షకలిగినచో తమఅలవాటును మానివైచి శాకములతోడనే ఉసురులునిలుపుకొనవచ్చునని నిరాఘాటముగ చెప్పవచ్చును." మాంసాహారులీవిషయమును గమనింతురుగాక!

చె న్న న గ ర ఆ రో గ్య శి శు వా ర ప్ర ద ర్శ న ము: వి దే శ పు డ బ్బా పా లు:—

విదేశపుడబ్బాపాలమూలమున హిందూదేశమునకుకలుగుచున్న చెడుపులు రెండు. ఒకటి: ఈదేశమునందలి ధనమును విదేశములపాలుజేయుట. రెండు: దేశమున శిశుమరణములసంఖ్యను వృద్ధిచేయుట. ఈ అరిష్టములరెండింటిని మనపెద్దలు పెదవిమెదపినపుడెల్ల స్మరించుచునేయున్నారు. కాని కార్యాచరణావసరమున ఈ అరిష్టద్వయస్మరణము అదృశ్యమగుచున్నది. స్వదేశీయోద్యమము ఇంతతీవ్రరూపముననున్న ఈసమయమునగూడ చెన్న

నగరఆరోగ్యశిశువారప్రదర్శనములో ఈవిదేశపుడబ్బాపాలదుకాణములు ప్రముఖస్థానము వహించినవి. దేశముయొక్క ఐశ్వర్యమునకు దిగతీతసాధనము లగుమాటయటుంచుడు. ఇవి శిశువుల ఆరోగ్యమునకు వేరుపురుగులై యున్నవి. అయినను మనపెద్దలు మొగమోటమునకో ఏమో వీనికి ఈఆరోగ్యశిశువారప్రదర్శనములో చోటిచ్చిరి. చోటిచ్చుటయేకాదు గ్లాక్సో, లాక్టోజిన్, హార్లిక్సు, మెల్లిన్సుమొదలగు డబ్బాపాలప్రదర్శనములకు బహుమానములనుగూడ నిచ్చిరి. ఈబహుమానము లిచ్చుట హిందూదేశమున శిశుమరణములు ఇప్పుడున్నట్లే ఇంకను ఉండుగాకయని కోరుటయే.

**మఱియొక విమర్శనీయాంశము:—**

ఈ ఆరోగ్యశిశువారప్రదర్శనసందర్భమున విమర్శింపదగిన అంశము డబ్బాపాల దుకాణములకు ప్రవేశమిచ్చిన దొకటియే కాదు. లక్ష్మీరతన్ కంపెనీ, రత్నముకంపెనీ వారి సానిటరీఇన్‌స్టలేషన్సు ప్రదర్శింపబడినవి. ఇవి ఆశింపదగినవేయగుగాక రోజునకు నాలుగు పైసల సంపాదనగల సగటుభారతీయుడు వీనిని తనజన్మమధ్యమునందెప్పుడైన పొందగలుగునా? సామాన్యులకు అందిపొందరాని ఇట్టివానియొక్క ప్రదర్శనమువలని లాభమేమి? తన సంపాదనకు తగినవిధమున తనకుటీరమున సగటుభారతీయుడు సమకూర్చుకొనగలిగిన సానిటరీఇన్‌స్టలేషన్సు ప్రదర్శించుట ప్రయోజనకరమై జనసమ్మతమగునుగాని విశేషధనైక సాధనము లగువానికి ప్రదర్శనమున తావిచ్చిలాభమేమి? మఱిఇక ప్రదర్శింపబడిన ప్రసూతి గృహపరికరములనుగూర్చి ఆలోచించుచో ఆశ్చర్యముకలుగకమానదు. ప్రదర్శనశాలయందు ప్రదర్శింపబడిన రీతిని ప్రసూతిగృహము ఏర్పఱచుటకు అధమము ఒక్కసంచి రూపాయిలైనను కావలయును. సామాన్యసంసారుల ఇండ్లలో సాధారణముగ పదిపదిహేనురూపాయిలతో పురుడువెళ్లును. ఈప్రదర్శనశాలయందు చూపినపద్ధతి నవలంబించినచో ఆపది పదిహేనురూపాయిలు ఒక్కకాటన్‌లింటునకే సరిపోవు. ప్రదర్శనము ప్రజాహితమునకనిపేరు. ప్రదర్శింపబడినవి సామాన్యప్రజలుస్వప్నమునందైన పొందజాలనివస్తువులు. ఈలోపములుఎంత త్వరలోసవరింపబడిన అంతమంచిది. సవరింపబడక గతానుగతికముగ గొఱ్ఱెదాటువలె ఏటేట ఈఆరోగ్యశిశువారప్రదర్శనములు నడుచుచుండుచో ఇవి ఈదరిద్రభారతదేశమున ప్రదర్శనములుగనే నిలిచిపోవును. అట్లునిలిచిపోవుటచే కలుగగలప్రయోజనము కాసంతైనయుండదు.

**కంచెయే చేనుమేయుచున్నది:—**

ఏబదిఏండ్లు నిండినవి. ఈసగము ఆయుర్దాయమును ఆతడు సంఘసంస్కర్తగా, ప్రజాహితజీవనుడుగా పేరుపొందినాడు. బాదాసాతాలూకాకు సత్యాగ్రహనియంతగానుండి కారాగారమునకు పోయివచ్చినాడు. బాధ్యత యెఱిగినవాడు. ఇంతకును ఆతనిభార్య బతికియున్నది. కాగా ఇప్పుడాతడు పదునాలుగేండ్లబాలికను పెండ్లియాడ ప్రయత్నపడుచున్నాడు. ఒకరికి ఒజ్జబంతులుగా నుండవలసిన సంఘసంస్కర్తలు ఇట్లుచేయుట కంచెయే

చేనుమేసినట్లగును. ఆబాలికకు తలిదండ్రులులేరు. పినతండ్రి సంరక్షణలోనున్నది. ఈముదుసలిచే మూఁడుముళ్లు వేయించుకొనుటకు ముక్కుపచ్చలారని ఆముద్దుబాలిక ఎంతమాత్రము ఇష్టపడుటలేదు. బొందాసాయువకమండలి వారీఅసమవివాహము జరుగకుండ చేయుటకు దృఢనిశ్చయులై యున్నారు. యువకమండలివారు ఆముద్దుబాలిక నీముదిగొడ్డుబారినుండి తప్పించుటలో కృతార్థులగుదురుగాక యని కోరెదము.

శిశుహంతకురాండ్ర శిక్షలయందు మార్పు:—

హిందూదేశమున శిశుహత్యలు, వానికి సంబంధించిన సమస్యలనుగూర్చి డిసెంబరు మాసపు గృహలక్ష్మియందు సంపాదకీయవ్యాసమున చర్చించియుంటిమి. శిశుహంతకురాండ్ర శిక్షానిర్వహణములో సేవాసదనములు, శరణాలయములు చేయగల సహాయమును అందు సూచించితిమి. బొంబాయి గవర్నమెంటువారు ఇంతకు పూర్వమే శిశుహంతకురాండ్రను సామాన్యఖైదీలతోబాటు మామూలు జెయిలునందుంచక ప్రత్యేకముగ శరణాలయములందును, సేవాసదనములందును ఉంచుచున్నారు. ఈపద్ధతిని ఇవుడు మన చెన్నరాజధాని ప్రభుత్వము వారుకూడ చేకొనిరని తెలుపుటకు సంతసించుచున్నాము. శిశుహత్యలకై శిక్షింపబడు స్త్రీలు వారికి ఇష్టమగుచో మదరాసు సేవాసదనము వారి రక్షణకు పోవచ్చును. అక్కడఉండునంత కాలమును వారికి నెలకు పదిరూపాయిల భత్యమీయబడును. సేవాసదనము వారు చేర్చుకొనుటకు ఇష్టపడని స్త్రీలును, సేవాసదనమున చేరుటకు ఇష్టములేని స్త్రీలును సాల్వేషనుఆర్మీవారి సంరక్షణక్రింద నుంచబడుదురు. మదరాసురాజధానియందు స్త్రీల విషయములలో బాగుగపనిచేయుచున్న ఉత్తమ సంస్థలలో మొదటిదగు సేవాసదనము వారికి ఈ స్త్రీల జాగ్రతవిషయమున ప్రథమగణ్యత ఇచ్చినందుకు ప్రభుత్వమువారిని మేము మనఃపూర్వకముగ నభినందించుచున్నాము.

అఖిలఆసియా స్త్రీలసభ:—

జనవరిమాసపు 19-వతేదీని లాహోరునగరమునప్రారంభమై అఖిలఆసియాస్త్రీలసభ 24-వతేదీని ముగిసినది. ఎఱవాడచెరసాలయందు నిర్బంధింపబడియున్న శ్రీమతి సరోజినీదేవిగారీసభకు అధ్యక్షురాలుగాఎన్నుకొనబడినది. ఆమె రావీలులేదుగావున సభజరిగిన ఆఱు దినములు ఆఱుగురుస్త్రీలు అధ్యక్షతవహించి సభాకార్యనిర్వహణముగావించిరి. సింహళద్వీప ప్రతినిధురాలు శ్రీమతి బాండర్నాయకుగారు 19-వతేదీని, బర్మాప్రతినిధురాలు మిఔంగు కన్య 20-వతేదీని, జపానుప్రతినిధురాలు మాడేమ్‌హోషిగారు 21-వతేదీని, ఆఫ్ఘనిస్థానపుప్రతినిధురాలు యమ్. కమలాఉడ్డీన్‌గారు 22-వతేదీని, మన ముత్తులక్ష్మిరెడ్డిగారు 23-వతేదీని, పారశీకదేశపుప్రతినిధురాలు శ్రీమతి ఫాజ్‌దార్‌సతి 24-వతేదీని అధ్యక్షతవహించిరి. కపర్థలా మహారాణిగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు. ఈ సభావృత్తాంతములు పూర్తిగ పైమాసపు సంచికలో ప్రచురింతుము.

# సంక్రాంతి గృహలక్ష్మి

## ౧

ఆర్యా, వందనములు

తమరుపంపిన గృహలక్ష్మి జనవరిసంచికను నేడేకాంచితిని. అందలి వీరాంగనయనబడు త్రివర్ణచిత్రము మానవహృదయము నాకర్షింపగలదై యున్నది. దృష్టివైభవము రసమయమై ప్రత్యేకశోభనువ్యక్తీకరించుచున్నది. చిత్రించిన చిత్రకారులును, ప్రచురించిన పత్రికాసంపాదకులును వందనీయులు. పవిత్రజీవితాదర్శమునకు, ప్రేమకు ప్రాణములను శరీరములను ధారపోయుటకు జంకని భారతరమణీమణులకు శిరోమణియన దగినదియు నాంధ్ర వెలమ వీరకులమున నుద్భవించినదియు దామెర రమణమ్మదేవిచరిత మీచిత్రమును శోభింపజేయుచున్నది. వీరవిహారము సలుపగడంగుచున్న భారతనారీలోకమున కీప్రదర్శనములు ప్రోత్సాహకరము

కు సందియములేదు.

వడలి
1—1—31

ఇట్లు,
తురగా వేంకటరామయ్య.

## ౨

శ్రీగృహలక్ష్మిసంపాదకులకు

'మదమంచి' వారు సమ్మతితోడఁజూపిన
'సంక్రాంతిరంగాల' సౌరునరసి
'సామవేదుల' వారి 'సంక్రాంతి: వస్త్రాల'
కూరుపులోగల్గు తీరుఁజూచి
'కస్తూరి' వారి 'సంక్రాంతి సంగీత' సు
ధాపూరములలోని తీపిఁగ్రోలి
'తులసమ్మ' గారి ముద్దులుఁగులుక్కు సంసారి
కంబగుకథలోని కల్పనఁగని
లలిఁ 'బల్లెటూరుపిల్ల' మహత్వమంతయు
విప్పిచెప్పినపలుక్కు విరులఁగాంచి
'తటికుండ వేంకమాంబ' రచియించిన భాగ
వతభాగికవనంపు ఫక్కి నేర్చి

'వెలివోలు' వారెంతొ సులభశైలినివ్రాయు
సంక్రాంతివర్ణనాసరణిమునిఁగి
ఉత్తరాయణపుమహోత్సవసహజవ
ర్ణనలెల్లతిలకించుకొనుచుఁబ్రీతి
'సావిత్రిదేవి' వ్యాసపఠనమొసంగెడు
దివ్యహర్షాంబుధిఁ దేలిపోయి
చక్కగానమరిన 'సంక్రాంతినాఁటివి
శేషంబు' చదివి హర్షించుకొనుచు
ఆర్య! నిన్నను మీరునాకంపినట్టి
రమ్య 'సంక్రాంతి గృహలక్ష్మి' రాత్రిఁజదివి
మురిసిపోయి లేఖాముఖమున మదీయ
సంతసంబంతయిటు విరజల్లుచుంటి.

విజయనగరము.
1—1—31.

ఇట్లు,
ఓలేటి సీతారామమూర్తి.

## ౩

ఈనెలపత్రిక మిగులయుత్సాహజనకముగానుండి పఠితలమనమానందతరంగములనూగులాడచేయుచున్నది. వనితామణులకు ప్రీతికరమగు నీసంక్రాంతిపర్వముయొక్క తత్త్వము వెల్లడించు గద్యపద్యవ్యాసరాజములచే నొప్పుమీయీపత్రిక ఇతోధికాభివృద్ధులదనరారునట్లు కాలమూర్తి యనుగ్రహించుగాకయని ప్రార్థింతును.

ఏలూరు
1—1—31

ఇట్లు
బొడ్డు బాపిరాజు.

౪

ఆర్యవర్యా,

తమరంపిన గృహలక్ష్మి సంక్రాంతిసంచికయందు మిక్కిలి యానందనిమగ్నురాలనైతిని. ఈసంక్రాంతి సంచిక ప్రతిస్త్రీరత్నము చదువదగినవిషయములతో నలరారుచు వీరాంగనముఖచిత్రముతో ముద్దులుమూట గిట్టుచున్నయది.

రాజమండ్రి
1—1—31

ఇట్లు
పులవర్తి కమలావతీదేవి.

౫

భ్రాతృవర్యా,

జనవరి నెల గృహలక్ష్మిని వందనములతో నందుకొంటిని. సమయోచితములగు వ్యాసపద్యావళులతో వెలువడుచున్న గృహలక్ష్మి బాల నానాటికి మాగృహలక్ష్ములకు ప్రియతమమగు బిడ్డయగుచున్నది. సంక్రాంతి విశేషములతో సంక్రాంతికిముందు వెలువడిన గృహలక్ష్మి పిన్నపెద్దలకందరకాహ్లాదమును గూర్చుచున్నది. ఇట్టి పత్రికారత్నమును ప్రసాదించిన తామాంధ్రనారీమణుల కృతజ్ఞతకు పాత్రులు.

బాపట్ల
3—1—31

ఇట్లు
కనుపర్తి వరలక్ష్మమ్మ.

౬

గృహలక్ష్మియను నాంధ్రమాసపత్రిక జనవరిమాసమున ప్రచురించినసంక్రాంతిసంచిక మాకార్యాలయము నలంకరించినది. సంచికయందు సంక్రాంతికిసంబంధించిన యనేకవ్యాసములు పద్యగద్యాత్మికముగనుండి పాఠకులకానందదాయకములుగనున్నవి. పలువురు విదుషీమణులు వ్రాసినపద్యాదికములు కడుంగడు హృదయంగమములుగనుండుటముదావహము. సంచికయందనేకఛాయాచిత్రములతోపాటు రెండుచక్కని త్రివర్ణచిత్రములునుగలవు. 'వీరాంగన' చాలభావగర్భితమయి మనోహరముగనున్నది. 'సంఘసేవకురాలి, త్రివర్ణచిత్రము ప్రశంసాపాత్రము. 'తుదనాలోచన'యనుశీర్షికక్రింద రచితమయిన సంపాదకీయములు మహిళాజనోద్యమ విస్తృతిని ప్రకటించుచు చక్కని యూహాపూరితాభిప్రాయములతో నిండియుండుట పాఠకజనములకెంతయు మేలుగూర్చుననుటకు సందియములేదు. పండుగరాకపూర్వమే భావనాబలమున పండుగనుగల్పించి యిన్ని మనోహరవ్యాసములరచనకు కైదోడునొసంగిన యాంధ్రకవితావిలాసమునకు చేయిమోడ్చుచు నాంధ్రమహిళాజనసేవ నింతయనూనవిధానమున నిర్వహించుచున్న గృహలక్ష్మికితోభివృద్ధిని కాంక్షించుచున్నారము.

7—1—31.

సమదర్శిని.

౭

ఆర్యా,

తమగృహలక్ష్మి సంక్రాంతిసంచికచూచి యత్యధికానందమునొందితిని. దానిలోని గద్యపద్యవ్యాసములన్నియు సంక్రాంతిపండుగకు సంబంధించినవై హృద్యములై యున్నవి. 'దండుగలమారిపండుగ' పద్యములు చదువుచున్నప్పుడు మిగులఆనందముకలిగినది. 'శారదలేఖలు' ఆంధ్రనారీమణులకు ఈసంక్రాంతిపండుగకు

ఆరోగ్యాదివిషయములలోగల సంబంధములను వెల్లడించుచు చక్కగానున్నది. వేయేల? సంక్రాంతిసంచిక సర్వజనపఠనార్హము.

పల్లెపాలెం }
8—1—31. }

ఇట్లు
పాలెపు వెంకటరత్నము.

౮

బాబూ, వందనములు

సంక్రాంతిసంచిక మనోహరముగానున్నది. సంపాదకీయము పఠనీయము. శారదలేఖ యుత్కృష్టభావపూరితముగానున్నది. ఒక్కమాటలో వ్యాసములన్నియు హృద్యములనిన చాలును.

తెల్రప్రోలు }
10—1—31 }

ఇట్లు
పాటిబండ మాధవశర్మ.

౯

ఆర్యవర్యా! వందనములు

దయతోతమరంపిన 'గృహలక్ష్మి' సంక్రాంతిసంచికను కృతజ్ఞతాపూర్వకముగ నందుకొని సాకల్యముగ దిలకించి పులకించితిని. ప్రథమత్రివర్ణచిత్రమగు 'వీరాంగన' మనప్రాచీనహిందూసుందరీమణుల పవిత్రతరపౌరుషబలపరాక్రమముల ప్రస్ఫుటముగ ప్రకటించుచు, తన్నారీమణుల ప్రవిమలయశశ్చంద్రికల నుర్వింబర్వజేయుచు సంస్మరణీయుల గావించుచున్నది. అపరశారదవ్రాయుచున్న 'శారదలేఖలు' ఈసంక్రాంతిపండుగలో నిగూఢములై యున్న పారిశుద్ధ్యము, కళానైపుణ్యము, దేహపరిశ్రమము, నృత్తగీతాదిగానాభినివేశము, మున్నగు పరమోత్కృష్టములగు నారోగ్యసూత్రములను కన్నులయెదుటబెట్టుచు, మన శ్రేయోభిలాషులైన పండుగకర్తలగు మనపూర్వుల ప్రతిభావిశేషములను వ్యక్తీకరించుచున్నది. శ్రీయుత బొడ్డు బాపిరాజుగారు 'సంక్రాంతిపర్వ'మనుశీర్షికక్రింద వ్రాసినపద్యములు సహజమగు భాషలో గడుంగడురమణీయములై పండుగనిజస్వరూపము నిప్పుడే కన్నులగట్టుచున్నవి. సంక్రాంతినిగురించి వ్రాసిన తక్కుంగల గద్యపద్యవ్యాసములును మిగుల సొంపుగానున్నవి. శ్రీమతి మైదవోలు పద్మావతిగారి 'త్యాగిని' కఠినహృదయములసహితము కరగింపజాలినదై విశేషదేశాభిమానబీజాంకురమును హృదయక్షేత్రమున నాటుచున్నది. 'దీక్షావస్త్రముల'ను వ్యాసము ఖద్దరువస్త్రధారణావశ్యకతను దేశీయులకు ప్రబోధించుచుచున్నది. 'పల్లెటూరిపిల్ల' గంభీరభావసమన్వితమై వ్రాలుచున్నది. ముఖ్యముగ నీసంచికను వన్నెదెచ్చుచు మకుటప్రాయముగనున్న తరికొండ వేంకమాంబగారి ద్విపదభాగవతము ప్రకటింపబడుట మహాభాగ్యము.

7—1—31
రుద్రంకోట

ఇట్లు
కొత్తపల్లి నరసయ్య.

౧౦

అయ్యా,

గృహలక్ష్మి సంక్రాంతిసంచికలోని వ్యాసములును, కథలును చాలా ఆహ్లాదకరముగా వ్రాయబడినవి. చదువుటకెంతయు ఉత్సాహకరముగా ఉన్నవి. వీరాంగన వీరమాతయే! గృహలక్ష్మిని ఎల్లరును గౌరవింతురుగాక!

యిరగవరం }
16—1—31 }

ఇట్లు
నందూరి రామచంద్రరావు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్
బళ్లారి: వి. రాజుమొదలియార్ & సన్సు, బ్రాహ్మణవీధి.
నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.
బెజవాడ: నామల అంతోని.
మచిలీపట్టణము: కె. బాలకృష్ణ
తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్
హైదరాబాదు: ఎస్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడు,(మన ప్రాంతపు 1రూ ఉస్మానియారూ 1-3-0అగును)
అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.
నిడదవోలు: శాస్త్రి బ్రదర్స్, న్యూస్ ఏజంట్సు.
చికాకోలు: తాటిగడప మాణిక్యరావుగారు.
పాలకొల్లు: వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపల్లు.
ఎలమంచిలి: మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి.
కాకరపల్లు: కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల.
విజయనగరం: కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి.
రామచంద్రపురం: సి. జి. శాస్త్రి & కంపెనీ,
గుడివాడ: సీతారాం అండు కంపెనీ.
కొవ్వూరు: జి. వి. రామరావుగారు.
ఏలూరు: ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట.
రాజమండ్రి: ఎస్. బి.కృష్ణరావుగారు
తాడేపల్లిగూడెం: కాశిరాజు శ్రీరాములుగారు
బరంపురం: గోనియశెట్టిగారు, గొల్లపల్లి
కొల్లూరు: కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల.
గుంటూరు: పత్రి వేంకటహనుమంతరావుగారు, బ్రాడిపేట.
కాకినాడ: గడ్డా బ్రదర్స్, రామరావుపేట.
పిఠాపురం: యెం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం.
మదరాసు: కస్తూరి రాజామాణిక్యముగారు

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.